## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120012726

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit,<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీ

శ్రీ వేదవ్యాస మహర్షి ప్రణీతము

# శ్రీ మత్స్య మహాపురాణము

[అనేక శ్రౌతస్మార్త ధర్మసంగ్రహాత్మకము]

## ఆంధ్రానువాద సహితము

[ప్రథమ సంపుటము]


అనువాదకులు :

శ్రీ పాతూరి సీతారామాంజనేయులు ఎం. ఏ.,

(తెలుగు-సంస్కృతము)



ప్రకాశకులు :

వేంకటేశ్వర ఆర్షభారతి ట్రస్ట్

గురుకృప

1-10-140/1 అశోక్‌నగర్ హైదరాబాద్ 500020



# శ్రీమత్స్య రూప నారాయణ స్తుతి

ప్రళయ పయోధి జలే
ధృతవానసి వేదమ్ ।
విహిత వహిత్ర చరిత్ర మఖేదమ్ ।
కేశవ! ధృత మీన శరీర!
జయ జగదీశ! హరే!

తా. మీనరూపము ధరించిన కేశవా! పూర్వతర కల్పమునందు సృష్టి ప్రక్రియలో ఉపయుక్త వేదములు సహాయముగా ఉండెను. కల్పావసానమున అవి ప్రళయ మహాసాగర జలములో [illegible] మరల జరుగవలసిన సృష్టిలో బ్రహ్మకు ఈ శబ్దరాశి అందకపోవును. అట్టి స్థితి రాకుండ నీవు ఈ అవతారము దాల్చితివి. ఓడయందు సరకులు నిలిపి కాపాడినట్లు నీవయినే వేదముల నీవు అనాయాసముగ కాపాడితివి. ఈ మహాకార్యము నీకు తప్ప మరి ఎవరికి సాధ్యము! కావున! హరీ! నీవు సర్వోత్కృష్టుడవయి వర్ధిల్లుచున్నావు. ఇట్టి నీకు వందనములు.

(జయదేవుడు-గీత గోవింద కావ్యము)

ఓమ్

# శ్రీ మత్స్య మహాపురాణము

## పురాణములు-వాని లక్షణము - విశిష్టత.

భారతీయుల చిత్తవృత్తులు అన్నియును ఐహికము వైపునకు కంటె ఆముష్మికము వైపునకు ఎక్కువ మ్రొగ్గుతో సాగుచు ఉండుట అతి ప్రాచీన కాలమునుండి నేటివరకును అవిచ్ఛిన్నముగ సాగివచ్చుచున్న విషయము. ఇకముందు కూడ ఈ విధానము ఇట్లే ఏనాటి వరకయినను కొనసాగుచుండును. ఇందు ఏమాత్రమును సందియములేదు.

'ఐహిక జీవనమునందలి ప్రతి ఒక అంశమును ఈ ఐహిక జీవనమునకు తరువాత పారలౌకిక జీవనమందలి సుఖలబ్ధికి ఏమాత్రమును విరుద్ధము కారాదు.' అనునది మనవారి ముఖ్యోద్దేశము. మన పూజ్య ఋషులును తాము ప్రవచించిన సర్వ ధర్మములను ఇందులకు తగినట్లుగనే మనకు ఆదేశించియు ఉపదేశించియు మనలను ఉత్తమమగు మార్గమున నడిపించిరి; నడిపించుచు ఉన్నారు. అనాదిగా మన దేశమునందలి శిష్టులు అందరును ఆయా ధర్మములను తాము ఆ దృష్టితోనే అనుష్ఠించుచు మానవ సమాజమునకు మార్గదర్శకులుగా ఉండుచు వచ్చిరి. పురాణ వాఙ్మయము ఈ పర మార్థ దృష్టి ప్రధానమగు భారతీయ ధర్మదృష్టికి నిదర్శనములును ధర్మ ప్రవృత్తికి ఆలంబనములును అయి ప్రకాశించు చున్నవి. కనుకనే శ్రీ వ్యాస భగవానులు :

"అష్టాదశ పురాణానాం। నామధేయాని యః పఠేత్।
త్రిసంధ్యం జపతే నిత్యం। సోఽశ్వమేధఫలం లభేత్."

"ప్రతి దినమునను ప్రాతర్మధ్యాహ్న సాయం సంధ్యాకాలముల మూడింటియందును అష్టాదశ మహా పురాణముల నామధేయములను పఠించుచు-జపించుచు-ఉండువారు అశ్వమేధయాగము ఆచరించినందున పొందదగిన ఫలమును పొందుదురు." (మార్కం. పురా.) అని పలికిరి.

ఐహికములును ఆముష్మికములును అగు సర్వ సుఖములను మానవ సమాజమునకు మాత్రమేకాదు-సర్వ ప్రాణులకును-సంపన్నమగునట్లు చేయుటలో శ్రుతులతోను స్మృతులతోను పాటుగ పురాణములకు కూడ ప్రామాణ్యము కలదు. అని స్మృతిపురాణ-వచనములు అనేకములు మాత్రమేకాక ఛాందోగ్య బృహదారణ్యకోపనిషద్వచనములుకూడ తెలుపుచున్నవి.

'ఇతి-హ-ఆస-' 'ఈ విధముగా జరిగి ఉండెనట.' అని ఈవిధముగా ఆరంభించి ప్రాచీన కాలమున జరిగిన విషయములను ప్రతిపాదించునవి ఇతిహాసములు; 'మొదట ఇటువంటి స్థితి ఉండగా దానినుండి ఈఈ విధముల సృష్టి జరిగెను. దానినుండి ఈ దృశ్య ప్రపంచము రూపొందెను. అది ఇట్లు స్థితి నంది-ఇట్లు లయమునంది తన మూల తత్త్వమును చేరును.' అని ప్రతిపాదించునవి పురాణములు. అని ఉపనిషద్ (ఛాం-7అ. 1 ప్రపా; బృహ. 2అ; 4 బ్రా.) వచనములబట్టియును వానిపై శ్రీ శంకర భగవత్పాదుల భాష్యమును బట్టియును తెలియుచున్నది.

కాగా సృష్టికి పూర్వపు స్థితితో ఆరంభించి సృష్టిస్థితి లయముల ప్రక్రియలను-స్థితి కాలమునందలి లోక ప్రవృత్తికి కావలయు ధర్మముల స్వరూపమును-సర్వ ప్రకృతియు లయము పొందినపుడు ఈ జగత్తులన్నియు పరమాత్మ తత్త్వముతో ఒకటియగు ప్రకారమును-తెలుపుటతోపాటు సర్వ ప్రాణులును ఆయా సాధనములతో పరమాత్ముని అను గ్రహమును పొంది జనన మరణ పరంపరా రూపమగు సంసార బంధమునుండి మోక్షమునందు విధానము ఇది. అని ప్రతిపాదించుట పురాణములు చేయు ముఖ్యకృత్యము.

ఇతిహాసములు ఏదోయొక వృత్తాంత విశేషమును మాత్రము కథారూపమున ప్రతిపాదించుచు ప్రాసంగికముగా ఐహికాముష్మిక ధర్మములను కూడ అందజేయును.

అని దీనినిబట్టి తెలియుచున్నది.

ఈ చెప్పిన వానిలో ఇతిహాస లక్షణములు భాగవతాది పురాణములయందును పురాణముల లక్షణములు భారతేతిహాసమునందును కనబడుచున్నను 'ఇతిహాసము' అను పదము శ్రీమన్మహాభారతమునందును 'పురాణములు' అను నామము శ్రీమద్భాగవతాదులయందును రూఢమయి ఉన్నది.

అంతియేకాదు; ఇతిహాస పురాణముల వలన శ్రుతి వచనములకును అవి ప్రతిపాదించు అనేక ప్రామాణికాంశములకును ఎంతయో బలము నమకూడును. ఈ విషయమును ఈక్రింది 'మను' వచనము తెలుపుచున్నది.

"బిభే త్యల్పశ్రుతా ద్వేదో మా మయం ప్రహరే దితి।
ఇతిహాస పురాణాభ్యాం వేదా న్సముపబృంహయేత్."

ఇతిహాస పురాణములను సరిగా అధ్యయనము చేయక అల్పముగా శాస్త్రాధ్యయనము చేసినవాని వలననుండి 'ఇతడు నన్ను దెబ్బకొట్టునేమో!' (శ్రుతికి అనుచితములగు అర్థములను కల్పించునేమో!) అని వేదము భయపడునట. కనుక శ్రుతికి కలుగు అటువంటి భయము పోగొట్టవలయుననినచో ఆయా వేదాంగ శాస్త్రములను అధ్యయనము చేయుటతోపాటు ఇతిహాస పురాణములను కూడ సరిగా అధ్యయనము చేసి వాటి అర్థములను శాస్త్రబలముతో సరిగా గ్రహించి వీటి బలముతో వేద ప్రతిపాదితార్థమును పోషించవలయును."

ఈ శ్లోకమున మనువు పేర్కొనినవి ఋషి-ముని-ప్రోక్తములగు శ్రీ భాగవత-భవిష్యదాది మహాపురాణములును భారతేతిహాసమును-అంతేకాని ఛాందోగ్య బృహదారణ్యకములందు పేర్కొనిన వైదిక పురాణేతిహాసములుకావు.

ఆపస్తంబాది మహామునులు తాము రచించిన ధర్మ సూత్రములందు భవిష్యాది పురాణములలోనివి అని పేర్కొని ఆయా విషయిక నియమములను ప్రతిపాదించు శ్లోకములను వచనములను ఉదాహరించి ఉన్నారు. దీనినిబట్టి కూడ పురాణములందు ప్రతిపాదింపబడిన ధర్మములకు ఎంతయో ప్రామాణ్యము కలదను అంశమును పురాణ రచనల ప్రాచీనతయు నిరూపింపబడుచున్నది.

శ్రీ శంకర భగవత్పాదాదులగు ప్రస్థాన ప్రవర్తకాచార్యులు తమ భాష్యాదులందు-బ్రహ్మసూత్రములందును ఉపనిషత్తులయందును ప్రతిపాదింపబడిన విషయములకు సమర్థకములుగా-భారతమునుండియు పురాణములనుండియు ఆయా సందర్భములందు ఆయా వచనములను ఉద్ధరించుటను బట్టియు శ్రుతి వచనములను సమర్థించుటకు పురాణేతిహాస వచనములు ఎంతగా ప్రామాణికములుగా ఉపయోగించునో తెలియును.

పురాణములు ధర్మములను ప్రతిపాదించు రీతిలో ఒక విశిష్టత యున్నది. శ్రుతులును స్మృతులును పురాణములును ఇతిహాసములును ధర్మమును ప్రతిపాదించుటలో సమాన యోగ్యత కలవి కావచ్చును. ఐనను ఇందు శ్రుతులు ప్రభు సమ్మితములనబడును. ప్రభువు ప్రజలకు 'మీరు ఈవిధముగ ప్రవర్తించవలయును. లేనియెడల దండింపబడుదురు.' అని శాసించును. శాసింపబడినట్లు నడచుటవలన ప్రయోజనము ఏమి? నడువనియెడల కలుగు హాని ఏమి? అను విషయములను ప్రజల హృదయములకు ఎక్కునట్లు ప్రభువు వారికి బోధించడు. అదే విధముగ శ్రుతులును 'సత్యం వద' 'ధర్మం చర' ఈ మొదలగు రూపమున ధర్మాచరణమును విధించును. ఆచరించకపోవుటచే కలుగు పాపము ఇట్టిదని తెలిపిన తెలుపును; లేకున్న లేదు. అంతియేకాని ఈ ధర్మాచరణము వలన లోక వ్యవహారగతిలో కలుగు మేలు కాని విరుద్ధాచరణము వలన కలుగు కీడుగాని ఇది-యని శ్రుతులు వివరించవు. స్మృతులును శ్రుతులవలెనే ధర్మ ప్రతిపాదనము చేయును. కాని పురాణములు చేయు ధర్మ ప్రతిపాదన ప్రకారము ఇట్టిదికాదు అవి సమ్మితులు తమ మిత్రు

ఇతిహాసములు ఏదోయొక వృత్తాంత విశేషమును మాత్రము కథారూపమున ప్రతిపాదించుచు ప్రాసంగికముగా ఐహికాముష్మిక ధర్మములను కూడ అందజేయును.

అని దీనినిబట్టి తెలియుచున్నది.

ఈ చెప్పిన వానిలో ఇతిహాస లక్షణములు భాగవతాది పురాణములయందును పురాణముల లక్షణములు భారతేతిహాసమునందును కనబడుచున్నను 'ఇతిహాసము' అను పదము శ్రీమన్మహాభారతమునందును 'పురాణములు' అను నామము శ్రీమద్భాగవతాదులయందును రూఢమయి ఉన్నది.

అంతియేకాదు; ఇతిహాస పురాణముల వలన శ్రుతి వచనములకును అవి ప్రతిపాదించు అనేక ప్రామాణికాంశములకును ఎంతయో బలము నమకూడును. ఈ విషయమును ఈక్రింది 'మను' వచనము తెలుపుచున్నది.

"బిభే త్యల్పశ్రుతా ద్వేదో మా మయం ప్రహరే దితి।
ఇతిహాస పురాణాభ్యాం వేదా న్సముపబృంహయేత్."

ఇతిహాస పురాణములను సరిగా అధ్యయనము చేయక అల్పముగా శాస్త్రాధ్యయనము చేసినవాని వలననుండి 'ఇతడు నన్ను దెబ్బకొట్టునేమో!' (శ్రుతికి అనుచితములగు అర్థములను కల్పించునేమో!) అని వేదము భయపడునట. కనుక శ్రుతికి కలుగు అటువంటి భయము పోగొట్టవలయుననినచో ఆయా వేదాంగ శాస్త్రములను అధ్యయనము చేయుటతో పాటు ఇతిహాస పురాణములను కూడ సరిగా అధ్యయనము చేసి వాటి అర్థములను శాస్త్రబలముతో సరిగా గ్రహించి వీటి తోడ్పాటుతో వేద ప్రతిపాదితార్థమును పోషించవలయును."

ఈ శ్లోకమున మనువు పేర్కొనినవి ఋషి-ముని-ప్రోక్తములగు శ్రీ భాగవత-భవిష్యదాది మహాపురాణములును భారతేతిహాసమును-అంతేకాని ఛాందోగ్య బృహదారణ్యకములందు పేర్కొనిన వైదిక పురాణేతిహాసములుకావు.

ఆపస్తంబాది మహామునులు తాము రచించిన ధర్మ సూత్రములందు భవిష్యాది పురాణములలోనివి అని పెక్కు విషయిక నియమములను ప్రతిపాదించు శ్లోకములను వచనములను ఉదాహరించి ఉన్నారు. దీనినిబట్టి కూడ పురాణములందు ప్రతిపాదింపబడిన ధర్మములకు ఎంతయో ప్రామాణ్యము కలదను అంశమును పురాణ రచనల ప్రాచీనతయు నిరూపింపబడుచున్నవి.

శ్రీ శంకర భగవత్పాదాదులగు ప్రస్థాన ప్రవర్తకాచార్యులు తమ భాష్యాదులందు-బ్రహ్మసూత్రములందును ఉపనిషత్తులయందును ప్రతిపాదించబడిన విషయములకు సమర్థకములుగా-భారతమునుండియు పురాణములనుండియు ఆయా సందర్భములందు ఆయా వచనములను ఉద్ధరించుటను బట్టియు శ్రుతి వచనములను సమర్థించుటకు పురాణేతిహాస వచనములు ఎంతగా ప్రామాణికములుగా ఉపయోగించునో తెలియును.

పురాణములు ధర్మములను ప్రతిపాదించు రీతిలో ఒక విశిష్టత యున్నది. శ్రుతులును స్మృతులును పురాణములును ఇతిహాసములును ధర్మమును ప్రతిపాదించుటలో సమాన యోగ్యత కలవి కావచ్చును. ఐనను ఇందు శ్రుతులు ప్రభు సమ్మితములనిరి. ప్రభువు ప్రజలను 'మీరు ఈవిధముగ ప్రవర్తించవలయును. లేనియెడల దండింపబడుదురు.' అని శాసించును. శాసనాజ్ఞాపించినట్లు నడచుటవలన ప్రయోజనము ఏమి? నడువనియెడల కలుగు హాని ఏమి? అను విషయములను ప్రజల హృదయములకు ఎక్కునట్లు ప్రభువు వారికి బోధించడు. అదే విధముగ శ్రుతులును 'సత్యం వద' 'ధర్మం చర' ఈ మొదలగు రూపమున ధర్మాచరణమును విధించును. ఆచరించకపోవుటచే కలుగు పాపము ఇట్టిదియని తెలిపిన తెలుపును; తెలుపకున్న లేదు. అంతియేకాని ఈ ధర్మాచరణము వలన లోక వ్యవహారగతిలో కలుగు మేలు కాని విరుద్ధాచరణము వలన కలుగు కీడుగాని ఇది-యని శ్రుతులు వివరించవు. స్మృతులును శ్రుతులవలెనే ధర్మ ప్రతిపాదనము చేయును. కాని పురాణములు చేయు ధర్మ ప్రతిపాదన ప్రకారము ఇట్టిదికాదు అవి సన్మిత్రులు తమ మిత్రు

౫. భూమ్యాదుల సంస్థానము: అనగా భూగోళ-ఖగోళ (జ్యోతిస్సుల) వ్యవస్థలు; తత్తద్ద్వీప-వర్ష-ఖండములందలి ప్రధాన పర్వత సముద్ర నద్యాదికమును భారతవర్షమునందలి నదీ పర్వత సముద్రాదికమును పవిత్ర తీర్థక్షేత్రాదికమును వాని మాహాత్మ్యమును భగవదవతార వృత్తాంతములను ప్రతిపాదించుటయు ఖగోళ (నక్షత్ర గ్రహాది జ్యోతిర్గోళ) వ్యవస్థ ప్రతిపాదనమును.

ఇందు 1. మన్వంతరాది రూపమున కాలవ్యవస్థను యుగధర్మ ప్రవృత్తిని ఎరుగుటయు తత్తత్త్వమును విచారించుటయు భగవంతుని కాలరూపునిగా ఉపాసించుట యగును. 2. భూగోళ వ్యవస్థా జ్ఞాన-తద్విచారణములు భగవానుని దేశరూపునిగా ఉపాసించుట యగును. జ్యోతిర్గోళములు కాల నియమానుసారము సంచరించును. భూమివలెనే తమ తమ స్థానములందుండి తాము కర్మదేవాదులకు ఆశ్రయ స్థానములయి యుండును. వానినుండి కాంతియు కాలక్రమమున విశ్వమున వ్యాపించి అందలి ప్రాణులపై పదార్థములపై తమ ప్రభావమును చూపును. ఇట్లు దేశకాలాత్మకరూప ద్వయముతో నున్న ఖగోళపు తత్త్వమును ఎరిగి విచారించుట భగవానుని దేశ కాలరూపునిగా ఉపాసించుట యగును.

౫. వంశాను చరితము: ఆయా రాజవంశములందు జనించిన రాజుల పాలనము మొదలగు వాటిని గూర్చిన కథలను ప్రతిపాదించుట.

'ప్రతిసర్గము' అనగా ప్రళయము అనియు అర్థము; కావున పురాణములందు సృష్టిక్రమ ప్రతిపాదనముతోపాటు ప్రళయక్రమమును తెలుపబడును.

మహాపురాణములు అన్నియు శివునిగాని విష్ణునిగాని పరమ దైవతముగా ప్రతిపాదించుచు ఉన్నవి. శ్రీదేవీ భాగవతములో శక్తి తత్త్వమును పరమార్థ తత్త్వముగా ప్రతిపాదించుట జరిగినది. ఈ శక్తితత్త్వము పరమాత్మ తత్త్వముతో అవిభాజ్యమైన ఇచ్ఛాశక్తి రూపమైనది. కనుక శివకేశవుల భేదభావనకు ఏ మాత్రమును ఆస్పదములేని పరమాత్మ తత్త్వమే శ్రీదేవీ భాగవతములో ప్రతిపాదింపబడి ఉన్నది.

సాత్త్వికములు రాజసములు తామసములు అని పురాణములు గుణభేదమును అనుసరించి విభజింపబడి ఉన్నట్లు కొందరు సంప్రదాయజ్ఞులు చెప్పుచున్నారు. ఈ విషయములో గ్రహించబడిన గుణత్రయమును పరమాత్ముడు సృష్టి స్థితి లయములను నిర్వహించుటకు మూర్తిత్రయములో నిలిపిన ఆనంద-ప్రవృత్తి-నివృత్తిరూపములగు మూడు గుణములే కాని సులభాగ మోహరూపములగు లౌకిక సత్త్వ రజస్తమస్సులు కావు.

ఈ పురాణములకు అన్నిటికి కర్త శ్రీవేదవ్యాస మహాముని అని సంప్రదాయాగతముగా సిద్ధించిన విషయము. "అష్టాదశ పురాణానాం కర్తా సత్యవతీ సుతః" అని చెప్పబడిన శ్రీకృష్ణ ద్వైపాయన వ్యాస భగవానుడు ఈయనయే.

ఈ మహాముని వీటిని రచించిన స్థానము భూలోకములో అంతటిలో మొట్టమొదటి విద్యాపీఠము ఐన శ్రీబదరికాశ్రమము. దానియందలి మొదటి గురుశిష్యులు ధర్ముని పుత్త్రులైన నరనారాయణులు. కనుకనే ఈ రెండంశములను స్మరింపజేయుచు శ్రీవ్యాసులు భారతేతిహాసారంభములోను పురాణముల ఆరంభములోను

"నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్ ।
దేవీం సరస్వతీం చైవ తతో జయ ముదీరయేత్."

"నరోత్తములగు నరనారాయణులను సరస్వతీదేవిని నమస్కరించిన తరువాతనే 'జయం' అను పేరగల ఈ ఇతిహాస పురాణములను ప్రవచించవలెను."

అని శిష్యులను ఆదేశించినారు. ఈ పురాణములను ఇతిహాసమును లో(రో)మహర్షణుడు (రౌమహర్షణి) అను సూత మహాముని-వ్యాస శిష్యుడు-నైమిశారణ్యములో ద్వాదశ వార్షిక బ్రహ్మ సత్రయాగ ప్రసంగమున కూడిన మునులకు వినిపించినాడు. క్రమముగా అవి లోకములో ప్రచారము పొందినవి

ఈ పై శ్లోకములో పేర్కొన బడిన సరస్వతీదేవియే కాశ్మీరములోని శ్రీశారదాదేవియును తరువాత శ్రీశంకర భగవత్పాదుల చేత ఆయా జగద్గురు పీఠములలో ఆరాధనీయగా నిలుపబడిన శ్రీశారదాదేవియును అని ఊహించవచ్చును.

## జయశబ్దము సూచించు అర్థమును-పురాణములు ఇచ్చు సందేశమును.

వేదశాస్త్రములు విధించినట్లు సత్కర్మములను ఆచరించి మానవులు సర్వభూతములకును క్షేమమును ఇహపర సుఖములను చిత్తశుద్ధిద్వారమున మోక్షసాధనాధికారమును మోక్షమును కూడ సిద్ధింపచేసికొనవలయును. అనునది పురాణములు అందించు సందేశము. ఈ అంశమును పై శ్లోకములోని 'జయ' పదము సూచించును.

'జయ' పదమును తల్లక్రిందుగా చదివినచో 'యజ' అగును. 'యజించుము!' 'దేవతలను ఆరాధించుము!' అనియు 'ఇజ్యతే' 'యజించబడువాడు.' 'విష్ణువు' అనియు అర్థములు. యజ్ఞములలో ప్రధానముగా ఆరాధనీయతత్త్వము అయిన ప్రజాపతి సప్తదశ దేవతాత్మకము. ఈ తత్త్వమును శ్రుతి 'ఆశ్రావయ' 'అస్తు శ్రౌషట్' 'యజ' 'యేయజామహే' 'వౌషట్' అను అక్షరములతో తెలుపుచు ఉన్నది. ఈ శ్రౌత ప్రజాపతిని ఆరాధించుట ద్వారమున ఆరాధింపబడు ప్రధాన తత్త్వము శ్రీమహావిష్ణువే. ఈ అంశమును:

"చతుర్భిశ్చ చతుర్భిశ్చ ద్వాభ్యాం పంచభి రేవచ।
హూయతే చ పున ర్ద్వాభ్యాం -స మే విష్ణుః ప్రసీదతు"

"నాలుగు-నాలుగు-రెండు-ఐదు-రెండు-వీటితో హోమమున అర్చన చేయబడు విష్ణువు నన్ను అనుగ్రహించవలెను."

శ్రీమన్మహాభారతమ్.

అని శ్రీవ్యాస భగవానులు చెప్పినారు.

ఈ అంశము శ్రీమద్రామాయణములో అరణ్యకాండమున 12వ సర్గలో కూడ చెప్పబడి ఉన్నది.

'అగ్నిముఖా వై దేవాః' 'అగ్నిమీళే పురోహితమ్' అని శ్రుతి. మానవులు అందించు హవిస్సు దేవతలకు అగ్ని ద్వారముననే అందును. యజ్ఞము చేత తృప్తి పొంది దేవతలు అనుగ్రహింతురు. పర్జన్యుడు అనుగ్రహించి వర్షించును. సోముడు అనుగ్రహించి ఓషధులను ఫలింప చేయును. దానివలన అన్నము సిద్ధించును. అన్నము వలన ప్రాణుల ఉత్పత్తి వృద్ధులు జరుగును. ఇక్కడ ప్రాణశక్తి రూపుడయిన అగ్ని హవిస్సును హుతముచేసి దాని సారభూతతత్త్వమును దేవతలకు ఆహారముగా అందించుచున్నాడు. సోముడు ఓషధీరూపముతో పరిణామము పొంది ప్రాణికోటులకు ఆహారము సమకూర్చును. ఈ విధముగా 1. అగ్నియు 2. సోముడును 1. 'అత్త' 'తినువాడు' 2. 'ఆద్యము' 'తినబడునది' అను రెండు రూపములలో లోకప్రవృత్తికి కారణభూతు లగుచున్నారు. ఈ విధముగా అగ్నీషోమీయ తత్త్వము పరమాత్మని విరాడ్ దేహములో ప్రధానాంశము అగుచున్నది. ఈ అంశము కొంతనిగూఢముగా శ్రుతులలోను పురాణములలోను ఇతిహాసములలోను చెప్పబడి ఉన్నది. (చూ. బృహ. అ. 1-బ్రా-కండిక-6; ప్రశ్నో. ప. ప్రశ్న. 1-4)

ఈ అగ్నీషోముల సమాహార-(కలిసిన)-రూపము ఆదిత్యుడు; అతడు ప్రకాశించుచుండు పగటి కాలములో అగ్నియు చంద్రుడును తమ ప్రకాశము చూపజాలరు. కాని సూర్యుడు తనలోని అగ్న్యంశముతో భూతములకు ప్రాణశక్తిని అందించును. కాని అందుచేత భూతములకు తాపమును శ్రమమును కలుగును. రాత్రి వేళలలో సోముడు భూతములకు తాపమును శ్రమను పోగొట్టి జీవనశక్తిని ఇచ్చి పోషించును. అగ్నియు సోముడును రాత్రులలో తమ ప్రకాశమును బాగుగా చూపగలుగుట ప్రత్యక్ష గోచరము. కనుకనే పరమాత్మ భావనతో ఆదిత్యుని భారతీయులు ఉపా

సించెను. ఈ సూర్యుడే ప్రాణుల శరీరములలో ముఖ్య ప్రాణతత్త్వరూపముతో ఉన్నాడు. అని ఛాందోగ్యోపనిషత్ప్రథమాధ్యాయములో చెప్పబడి ఉన్నది. రవి అగ్నీషోమ తత్త్వరూపుడు అను అంశము బ్రహ్మపురాణములో 32-179 అధ్యాయములలో చెప్పబడి ఉన్నది.

ప్రజాపతి పరంపరలోనివారైన ప్రచేతులకు సోముడు తన కన్య అయిన మారిషను ఇచ్చి వివాహము చేయగా వారికి జన్మించిన దక్షుని వలన లోకములో ప్రజావృద్ధి జరిగినది. ఈ వృత్తాంతము బ్రహ్మపురాణము-శ్రీమద్భాగవతము మొదలైన పురాణములలో ప్రతిపాదింపబడి ఉన్నది. ఇందులో ప్రచేతులు ఆదిత్యునకును మారిష సోమునకును ప్రతీక.

ఇటువంటి అగ్నీషోమీయ తత్త్వము ప్రజలకు క్షేమము కలిగించునట్లు చూచుటయే యజ్ఞముల ప్రధానోద్దేశ్యము.

"దేవా న్భావయతానేన తే దేవా భావయంతు వః ।
పరస్పరం భావయంతః శ్రేయః పర మవాప్స్యథ."

"అన్నా ద్భవంతి భూతాని పర్జన్యా దన్నసంభవః।
యజ్ఞా ద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః."

"కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవమ్।
తస్మా త్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్."

ఇత్యాది భగవద్గీతావచనములు ఈ విషయమునే ప్రతిపాదించుచున్నవి.

ఈవిధముగా 1. ప్రాణులకు క్షేమము సమకూర్చు యజ్ఞ ప్రాశస్త్యమును 2. దానిలో ఆరాధింపబడు ప్రధానతత్త్వమును 3. యజ్ఞమును ఆచరించుట కర్తవ్యము అను ఉపదేశమును 'జయ' పదములో ఇమిడి ఉన్నది.

ఇది కాక అక్షరములు సంఖ్యలను సూచించు సంప్రదాయానుసారము-జ=8; య=1; దీనిని కుడినుండి ఎడమకు చదువగా 18; ఈ సంఖ్య సప్తదశ సంఖ్యా ప్రతిపాదక యజ్ఞాత్మక ప్రజాపతి(17)ని యజ్ఞములో ప్రధానముగా ఆరాధ్యతత్త్వము అగు విష్ణు (1) నికలిపిన మొత్తము సంఖ్య అగును. ఇది వ్యాసరచిత పురాణముల సంఖ్యనుకూడ తెలుపుచున్నది.

పురాణములు-మహాపురాణములు-ఉపపురాణములు అని-రెండు విధములు. అందు మహాపురాణములు:

శ్లో. 'మద్వయం భద్వయం చైవ బ్రత్రయం వచతుష్టయమ్ ।
అనాపకూస్కలింగాని పురాణాని పృథక్ పృథక్.'

'మ' తో ఆరంభమగు పేరులుగల మార్కండేయ మత్స్యపురాణములు రెండు; 'భ' తో ఆరంభమగు నామము కలిగి భవిష్య-భాగవత పురాణములు రెండు; 'బ్ర' తో ఆరంభమగు పేరులతో బ్రహ్మ-బ్రహ్మాండ- బ్రహ్మవైవర్త పురాణములు మూడు; 'వ' తో మొదలగు నామములు కల విష్ణు వారాహ వామన వాయు పురాణములు నాలుగు; 'అ' 'అగ్ని' - 'నా' 'నారద' 'ప' 'పద్మ' 'కూ' 'కూర్మ' 'స్క' 'స్కంద' 'లిం' లింగ 'గా' 'గారుడ' పురాణములు ఆరు; ఇవి 18 మహాపురాణములు. వీని యొక్కటి శ్లోక (గ్రంథ) సంఖ్య :

| క్ర.నం. | పురాణనామము | నారదపురాణానుసారి శ్లోక నం. | శ్రీదేవీభాగవతానుసారి శ్లోక నం. | మత్స్యపురాణానుసారి శ్లోక నం. | విశేషము |
|---|---|---|---|---|---|
| 1. | బ్రహ్మ | 10000 | 10000 | 10000 | |
| 2. | పద్మ | 55000 | 55000 | 55000 | |
| 3. | విష్ణు(ధర్మోత్తరముతో) | 23000 | 23000 | 23000 | |
| 4. | శివ | 24000 | | (24000) | ఇది మత్స్యపురాణమున చెప్పబడలేదు. |
| 5. | దేవీభాగవత | 18000 | 18000 | 18000 | |
| 6. | నారదీయ | 25000 | 25000 | 25000 | |
| 7. | మార్కండేయ | 9000 | 9000 | 9000 | |
| 8. | అగ్ని | 16000 | 16000 | 16000 | |
| 9. | భవిష్య | 14000 | 14500 | 14500 | ప్రస్తుతము ఇందు 27500 శ్లో. కనబడుచున్నవి. |
| 10. | బ్రహ్మవైవర్త | 18000 | 18000 | 18000 | |
| 11. | లింగ | 11000 | 11000 | 11000 | |
| 12. | వారాహ | 24000 | 24000 | 24000 | |
| 13. | స్కాంద | 81000 | 81000 | 101000 | |
| 14. | వామన | 10000 | 10000 | 14000 | |
| 15. | కూర్మ | 17000 | 17000 | 17000 | |
| 16. | మత్స్య | 15000 | 14000 | 14500 | |
| 17. | గారుడ | 19000 | 19000 | 19000 | |
| 18. | బ్రహ్మాండ | 12000 | 12100 | 12200 | |
| | వాయు | | 24600 | 12000 | ఇది నారదపురాణమున చెప్పబడలేదు. |
| | మొత్తము | 400100 | 401200 | 402200 | |

ఉపపురాణములు : 1. సనత్కుమారము 2. నారసింహము 3 నారదము 4. శైవము 5. దౌర్వాసము 6. కాపిలము 7. మానవము 8. ఔశనసము 9. వారుణము 10. కాళికము 11. సాంబము 12. నందికృతము 13. సౌరము 14. పారాశరము 15. ఆదిత్యము 16. మాహేశ్వరము 17. శ్రీమద్భాగవతము 18. యోగవాసిష్ఠము. ఈ ఉపపురాణముల నామముల విషయమున మతభేదమును కలదు. వీనిలో మహాపురాణములలో ఉన్నవే కొన్ని ఈ ఉపపురాణములలో కనబడుచున్నవి. వీని విషయమున కలుగు సందేహములను సంప్రదాయజ్ఞుల వలన తీర్చికొనదగును.

పురాణములు సాధారణముగా విష్ణునిగాని శివునిగాని పరదైవతముగా ప్రతిపాదించును.

పురాణములు ఈ గుణభేదము ననుసరించి సాత్త్వికరాజస తామస భేదమున విభజింపబడినట్లు సంప్రదాయజ్ఞులు చెప్పుచున్నారు. ఈ విషయమున గ్రహింపబడిన గుణత్రయమును పరమాత్మ తాను సృష్టి స్థితిలయముల నిర్వహించుటకై మూర్తిత్రయమందు నిలిపిన ప్రవృత్తినివృత్త్యానందరూపములగు గుణత్రయమే కాని సుఖరాగ మోహరూపములగు లౌకిక సత్త్వరజస్తమో గుణములు కావు. అని లోగడ అనుకొంటిమి.

ఇటువంటి ఈ మూడు గుణములలో ఏ ఒకటియు ప్రాధాన్యము వహించక సమతాస్థితిలో అవిభక్తావస్థలో ఉండు ఉనికియే 'ప్రకృతి' అనబడును. ఇది వివిధవ్యక్తి సమష్టియగు 'మాయ'; మాయను ఉపాధిగా చేసికొనియు దానికి తాను అధీనుడుగాక దానినే తన యధీనమునందుంచుకొనిన పరమేశ్వరుని లీలావిలసితములే జగత్సృష్టి స్థితి లయాత్మక ప్రకృతి పరిణామములన్నియును. ఈ విచిత్రప్రకృతి పరిణామవర్ణనమును-ఈ విశ్వప్రవృత్తి దశాకాలమున ధర్మ రక్షణార్థము పరమాత్ముడు దాల్చు అవతారముల వర్ణనమును-పురాణముల యందు ప్రధానప్రతిపాద్య విషయము.

కావున ఇవి పురాణములు సకల శాస్త్రసారములు.

ఇవి సద్వినియోగమును అందినచో లోకక్షేమంకరములు. సద్వినియోగమును అందక కొందర స్వార్థమునకు మాత్రము ఉపయోగపడు కథల పుట్టగా చూడబడినపుడు 'పుక్కిటి పురాణములు' అనబడుచున్నవి. 'వాడు ఏమేమో పురాణము చెప్పుచు నా ప్రాణములు తీయుచున్నాడు.' 'నీ పురాణముతో నాకు పనిలేదు.' —ఇటువంటి వ్యవహారము ఇందుచేతనే ఏర్పడినది.

కనుక ఈ వాఙ్మయపు యథార్థ స్వరూప ప్రయోజనములను ఎరిగి ధర్మమార్గమున నడుచుటయు చిత్తవృత్తులను సరియగు మార్గములో నడిపించుకొనుటయు కర్తవ్యము.

ఈ సదుద్దేశముతోనే 'శ్రీ వేంకటేశ్వర ఆర్షభారతీ ట్రస్ట్' అష్టాదశపురాణముల సంస్కృత మూలమును తెలుగు అనువాదముతో ఆంధ్రులకు అందజేయుటకు పూనుకొనినది. ఈ ప్రయత్నము వలన ఆంధ్రజనులు సదుపయోగము పొందవలయునని ఈ ట్రస్టు పక్షమున ఆశించు

హైదరాబాద్, సజ్జన విధేయుడు

28-9-1986 పాతూరి సీతారామాంజనేయులు.

శ్రీగురుభ్యో నమః.

# శ్రీ మ త్స్య మ హా పు రా ణ ము.

## విషయ ప్రవేశిక—ఆవశ్యక వివరణములు.

## శ్రీమత్స్యమహాపురాణప్రశస్తి.

### పురాణములు భగవదుపాసనమునకు సోపానములు.

సృష్టిలో జరుగు అన్ని పరిణామములకును హేతువులగు వానిలో కాలముకూడ ఒకటి. అది అనంతము. భగవంతుడు విరాడ్రూపమున కాలమునందే ఉండును. అయినను ఆతడు దానికి అతీతుడు. ఈ అనంతుడే ఆదిశేషుడు. ఇతడు సమస్త భూ(విశ్వ) భారమును మోయుచున్నాడు. అనగా విశ్వము కాలమునందే నిలిచియున్నది. శ్రీ మహా విష్ణువు అతనిపై శయనించి యుండును. అయినను అతడు అతనికి అతీతుడయి స్వామి అయి ఉండును. శ్రీవిద్యా సంప్రదాయమునందును మూలాధారాది సహస్రారాంత చక్ర సముదాయమున శ్రీదేవి అనంతకాల రూపగానే ఉపాసింప బడుచున్నది. (చూ. సౌందర్యలహరి-శ్లో. 14; ఋగ్వేద 1 మం. 164 సూ.) అజపా గాయత్రీ తత్త్వమును ఇదియే.

పురాణములు ఇట్టి కాల పరిణామములగు ఆయా యుగములయందు జరుగు వృత్తాంతములను తెలుపుచు మానవులయు-తదితర సకల జీవులయు-జీవన స్థితికి ఆవశ్యకములగు సకల ధర్మములను తెలుపుచు సకల వేదవేదాంగ వేదాంతాగమ సారభూతములుగా ఉన్నవి.

ఇంతియ కాదు. పురాణములు పరాత్పరుని దృశ్య ప్రపంచాత్మక రూపమును సమగ్రముగా వివరించును. దీనికే 'విరాడ్రూపము' అని శ్రుతులయందును శాస్త్రములయందును వ్యవహారము. ఈ విరాట్స్వరూపోపాసనము పర మాత్మని ఉపాసించుటకు సాక్షాన్మార్గము అనియు-ఆ విరాట్స్వరూపమును ప్రతిపాదించు వాఙ్మయమును అధ్యయనము చేయుట శబ్దాత్మక పరబ్రహ్మ తత్త్వమును ఉపాసించుటయే అగుననియు శ్రీమద్భాగవత ద్వితీయ స్కంధము తెలుపు చున్నది. సమస్త వేదాగమ సారములగు పురుషసూక్తము-రుద్రాధ్యాయము-శ్రీవిష్ణు సహస్ర నామస్తోత్రము-ఈ విరాట్స్వరూ పమును ప్రతిపాదించుచు ఉపాసకులకు ముక్తి సాధనములయి నాలుగు ఆశ్రమముల వారిచేతను ఉపాసింపబడుచున్నవి. ఇటువంటి విరాట్తత్త్వమును సరళ మార్గమున తెలుపునవి అగుటచేతను భగవంతుని తత్త్వమును ఆ మహానుభావుని అనంత శక్తి వైశిష్ట్యమును అపార కరుణా పరత్వమును ప్రతిపాదించునవి అగుటచేతను పురాణ సాహితీ పరంపర భగవదుపా సనకు సుఖతరమును సులభతరమును అగు సోపాన పరంపరగాను పరమ పురుషార్థ సాధన సామగ్రీ నిధానములుగాను ఉన్నవి. కనుకనే ఇవి ఆబాలగోపాలము సర్వజనులకును సమాదరణీయములుగా ఉన్నవి.

లోగడ పురాణములకు ఉండు పంచలక్షణములను తెలిసికొనియున్నాము.

వీనియందు ప్రసక్తానుప్రసక్తముగ ధర్మము అర్థము కామము మోక్షము అను నాలుగు పురుషార్థములను మానవులు సాధించుటకును ఇష్టప్రాప్తిని అనిష్ట నివృత్తిని సాధించుటకును కావలసిన యంశములును భగవదవతారములును దేవాసుర సంగ్రామములును ప్రతిపాదింపబడును. దీనికి అనుగుణముగ వీనియందు వర్ణాశ్రమాచార ధర్మములును ప్రతిపాదింపబడును.

వీని సహాయమున మానవులు ధర్మమునకు హాని కలుగకుండ అర్థమును సంపాదించవలయును. ఆ అర్థ మును వినియోగించుచు ఇహపరసుఖ విఘాతుకము కాని విషయ సుఖములను అనుభవించవలయును. ఈ విధమున కామ పురుషార్థమును సాధించుచు అదే అర్థముతో ధర్మము ననుసరించి ఇహపర సుఖములను సాధించుకొనవలయును.

క్రమముగ ప్రపంచ ప్రవృత్తియందలి గుణదోషములను మానవులు విచారణము చేయుదురు. సంసారమునుండి విరక్తులగుదురు. జనన మరణ ప్రవాహ రూపమగు సంసారపు బంధమునుండి ముక్తినంద వాంఛింతురు. తత్సిద్ధికై వారు భగవంతునుపాసింతురు. తుదకు అట్టి ముక్తియను పరమ పురుషార్థమును సాధింతురు. అనునది పురాణములను మనకు అందజేసిన ఋషుల సత్సంకల్పము.

ప్రపంచమును భగవద్రూపముగనే చూచి అందలి జడచేతన పదార్థములను అన్నింటిని భగవద్విభూతులుగనే భావించి ఉపాసించుట భగవదుపాసనా రూపవిశేషము. ఇందలి ప్రథమ సోపానముగా ఈ ప్రపంచమును దేశాత్మకము గను కాలాత్మకముగను దేశకాలోభయాత్మకముగను ఉపాసించవలయును. సచ్చిదానంద మూర్తియగు పరమాత్మని విశ్వాత్మక జగదంతర్యామిగాను సకల జగద్రూపునిగాను గుర్తించి సర్వమును అతని దివ్య కళామయమునుగా భావించి యుపాసించవలయును.

దీనికి అనుగుణముగానే పురాణములయందు రెప్పపాటు మొదలుగా కల్ప పరిమాణమువరకు గల కాల వ్యవస్థయు మన్వంతర పరిమాణములును యుగధర్మ ప్రవృత్తులును మన్వంతర భేదములచే లోకప్రవృత్తి విశేషములును వర్ణింపబడుచున్నవి. ఇది కాలాత్మకమగు భగవద్రూపము.

పురాణములయందు ప్రతిపాదింపబడు భూగోళ వ్యవస్థయంతయు దేశాత్మకమగు భగవద్రూపము.

ఖగోళ వ్యవస్థయంతయు దేశకాలోభయాత్మకమగు భగవద్రూపము.

భగవంతుని ఈమూడు రూపములలో ఉపాసించుటకు పురాణములు సామగ్రి నందజేయుచున్నవి.

ఇది పారమార్థిక దృష్టితో చేయు విచారణము.

ఇది ఎట్లున్నను ఈ విధముగ ప్రపంచమును దేశ-కాల-తదుభయ-రూపముగ తెలిసికొనుటచే ప్రపంచ విషయక మగు విజ్ఞానము పెరుగును. దానిచే మానవులకు లౌకిక వ్యవహారజ్ఞానమును అనుభవమును వృద్ధిచెందును.

ఇది పురాణములయందలి కొన్ని ప్రధానాంశముల ప్రయోజనము.

మరియొక యంశము పురాణములలో మానవులను తత్త్వ విచారణోన్ముఖులనుగా చేయునదియు లోకప్రవృత్తిలో నారి వారి వ్యవహార జ్ఞానమును పెంచి వారిని సన్మార్గ ప్రవృత్తికి కొనిపోవునదియు కలదు. అది దేవాసుర సంగ్రామ వృత్తాంత ప్రతిపాదనము.

ఈ దేవాసుర సంగ్రామ వృత్తాంతములను ఉన్నవి ఉన్నట్లుగ గ్రహించి అసురులను దుష్టులనుగాను దేవతలను ఉత్తములనుగాను భావించి దేవతలయందు భక్తిశ్రద్ధలను పెంచుకొనుటయు సకల దేవతానాథునిగా పరమాత్మ నుపాసించుటయు ఒక పద్ధతి.

అంతటితో తీరకుండక ఈ దేవాసుర సంగ్రామ వృత్తాంతముల వెనుకనున్న తాత్త్వికార్థమును విచారణచేసి గ్రహించుచు వాని మూలమున భగవత్తత్త్వ వాస్తవరూపమును గ్రహించి పరమాత్మ నుపాసించుట మరియొక పద్ధతి.

ఇందు మొదటి పద్ధతి సర్వసాధారణముగా ఆస్తికులు అందరును పాటించుచున్నదే; కావున దానిని గూర్చి అంతగా విచారణము చేయవలసిన అవశ్యకత లేదు.

రెండవ విధముగ దానిని ఆలోచింతము. ఇందులకై ఉదాహరణముగా వృత్రాసుర కథను తీసికొనవచ్చును. ఇందు ఇంద్రుడు సూర్య ప్రకాశమునకును వృత్రుడు సూర్య ప్రకాశము చొరని ప్రదేశములందు ప్రకృతి వశమున ఏర్పడు దోషమునకును ప్రతినిధులుగా గ్రహింపవచ్చును.

రూపము-చూచుట - ఆహారము పక్వ(జీర్ణ)మగుట-పిత్తము-వేడిమి - మేధ-దేహవర్ణము-బలము-ఛాయ-తేజము-కౌర్యము-ఇవి యన్నియు తేజోభూతము వలన కలుగు లక్షణములు.

రసనము (రుచిని గ్రహించు యోగ్యత) చెమట-తడి-వన-ద్రవము-రక్తము-శుక్రము-మూత్రము-ఇట్టి ద్రవ్యరాశి యంతయు జలభూతము వలన కలుగు లక్షణములు.

ఘ్రాణేంద్రియము (గంధగ్రహణ యోగ్యత) వెంద్రుకలు-గోళ్లు-ఎముకల సమూహము-ధైర్యము-గౌరవము (బరువు)-స్థిరత్వము-ఇవి యన్నియు పృథివీభూతము వలన కలిగిన లక్షణములు.

ఈ చెప్పినవానిలోను-మృదువులగు అంశములు - అనగా-త్వక్-మాంసము - హృదయము - నాభి-పసుట-మజ్జ-యకృత్-క్లోమము-గుదము-ఆమాశయము-ఇవి మాతృదేహమునుండి లభించినవి.

దృఢాంశములగు పృథివీభూత లక్షణము లన్నియు పితృదేహమునుండి లభించినవి.

స్నాయువులు (నులినరములు)-శుక్రము-సిరలు-ఇవి ఆ దేహికి తన దేహమునుండి లభించినవి.

ఈ విధముగ పంచ భూతముల అనుగ్రహమున మాతృ పితృదేహ జాతములును స్వదేహమున స్వయంసిద్ధము లును అగు ఆయా తత్త్వములను బట్టియే ఆయా మానవుల మానస సంస్కారములు ఉండును. వానియందు ఉండు దోష ములను తొలగించుకొనుటకును సల్లక్షణములను మరింత వృద్ధిపరచుకొనుటకును క్రియాయోగము మొదలగు ఉపాసనా విధానములు ఉపయోగించును.

పురాణములయందు ఈ ఉద్దేశముతోనే ఆయా విషయములు ప్రతిపాదింపబడుచున్నవి.

ఇట్టి సకల పురుషార్థ సాధనములగు పురాణములలో శ్రీమత్స్య మహాపురాణపు ప్రాశస్త్యము ఎన్నదగినది. ఇందు పురాణ లక్షణములన్నియు సమగ్రముగ నున్నవి. వానికి తోడు జ్ఞానము-భక్తి-శ్రౌతస్మార్త నిత్యనైమిత్తిక కామ్యకర్మాను ష్ఠానోపయోగులగు అనేకాంశములు క్రియాయోగాత్మకమగు ఉపాసనము పరమాత్మని దేశకాల తదుభయరూపునిగా ఉపా సించుటకు అవశ్యకములగు భూగోళ-యుగ-ఖగోళ వ్యవస్థా విషయకాంశములు లోకప్రవృత్తి సాధకములగు రాజ ధర్మాదికము మొదలగునవి చక్కగా తెలుపబడినవి.

శాస్త్రమునకు సంబంధించిన అనేక విషయములందును ఇందు ప్రతిపాదింపబడిన యంశములు వేదమూలకము లను ఋషి పరంపరాగతములును అగుటచే సమస్త ధర్మశాస్త్ర నిబంధకారులును భాస్కరరాయాద్యుపాసక పుంగవులును తమ రచనలలో ఆయా సందర్భములందు ఈ మహాపురాణమునందలి వచనములను ప్రమాణములుగా గ్రహించియున్నారు. ఇందు ప్రతిపాదింపబడిన గోత్రప్రవర ఖండమందలి అంశములను ప్రామాణికములుగా సంస్కార కౌస్తుభాది నిబంధ కారులు గ్రహించియున్నారు. శ్రీకమలాకరభట్టు తాను రచించిన శాంతి కమలాకర శాంతిరత్నాదులయందు ఈ మత్స్య పురాణ వచనములను ఆయా సందర్భములలో ఉద్ధరించెను. అతడు వాస్తు పూజా విధానమున గ్రహించిన ఏకాశీతిపద-చతుష్షష్టి పద-వాస్తుమండలములందలి దేవతా వ్యవస్థయంతయు ఈ మత్స్య పురాణము సందలిదే. ఈ విషయమున శ్రీవిష్ణు రహస్యోత్తరమున వేరు లభించు ప్రతులలో గ్రంథభ్రంశమువలననో మరి ఏ హేతువుననో చాల అస్తవ్యస్తతలు కన బడుచున్నవి.

ఇందు ఆయా సందర్భములలో తెలుపబడిన దేవతా స్తోత్రాదికము తత్త్వ ప్రతిపాదకముగుటతోపాటు ఉపాసనా విషయకమయి యున్నది. శ్రీదేవీ స్థానాష్టోత్తరనామములు- శివనామ త్రిశతి-మాతృకా సంఖ్యాక శివనామావళి - శివనామ సప్తతి- వీరకకృత గౌరీస్తుతి-సావిత్రీకృతయమస్తుతి ఇందు మిగుల విలక్షణమయినవి.

ఈ పేర్కొనిన అంశములన్నియు పఠితలకు జిజ్ఞాసువులకు అందజేయుటకు ఇట యథాశక్తి యత్నము చేయబడి నది.

ఇందుగల మరికొన్ని విలక్షణాంశములు :

1. కాలనేమియను అసురుని నాస్తికతాదృష్టిగల కేవల వైజ్ఞానికులకు ప్రతినిధిగా నిరూపించుట.

2. అధర్మపూర్ణమగు కలియుగము అయిన తరువాత కేవల ధర్మపూర్ణమగు కృతయుగము వచ్చు విధము తెలుపుటలో ఆధునికులు కొందరు అనుచున్న 'Dialectics' అనబడు ప్రక్రియను నిరూపించుట.

3. బలి చక్రవర్తిని దానవుడను దృష్టితో కాక అతని మహత్తను చాల గొప్పగా చూపుటలోని నిష్పాక్షికత.

4. కల్పభేద ప్రతిపాదనములోని యుక్తియుక్తత-మొదలగునవి.

కొన్ని సందేహములకు సమాధానములు ఈ మహా పురాణమునుండి లభించును.

1. కర్ణుడు అంగరాజ పుత్త్రుడును సూత పుత్త్రుడును ఎట్లయ్యెను? కర్ణుని తన దగ్గరకు తీసికొనిన సూతుడు వాస్తవముగా ఎవరు?

2. భారతమున ఆదిపర్వమున పేర్కొనబడిన 'బలి' అను రాజు ఎవరు?

3. శ్రీదేవీ సప్తశతియందలి అనేక సంశయములకు ఇందలి తారకాసుర మధుకైటభ వధకథ సమాధానము ఇచ్చును. అవి అన్నియు వివరించుటకు ఇది సమయము కాదు.

సాంప్రదాయికములగు కొన్ని అంశములు ఇందు విలక్షణముగా విశిష్టముగా వర్ణింపబడినవి :

1. అగ్నివంశ వర్ణనము 2. శ్రాద్ధకల్పము 3. అంధకాసురవధ సందర్భమున శైవ-నారసింహశక్తుల ఆవిర్భావము 4. పాద్మకల్ప వృత్తాంతపు సృష్టి సందర్భములో ప్రతిపాదించిన షోడశ ఋత్విక్కులకును ప్రజాపతి దేహావయవత్వ నిరూపణమునకు శ్రౌత సంప్రదాయమున గల ప్రాముఖ్యము.

కథా ప్రతిపాదనములో వైలక్షణ్యము- వర్ణనా సౌందర్యముగల తావులు :

1. నరసింహావతారము - ఆనాటికి ప్రహ్లాదుడు ఐదేండ్ల పసివాడుగా కాక బలి-తత్పుత్త్రులు కూడ చాల వయస్సు కలవారుగా చెప్పుట-పీతత్పృసంగమందలి వర్ణనములు; 2. పురూరవసుడను మద్రరాజు దర్శించిన ఇరావతీ నద్యాది వర్ణనములు; 3. పీరకబాలక్రీడలు మొదలగునవి.

ఈ పురాణమున అనుసరింపబడిన విషయ ప్రతిపాదన ప్రణాళిక ప్రత్యేకముగ అధ్యయనము చేయవలసిన యంశము. దీనియందు ప్రతిపాద్యాంశములన్నియు పరమ ప్రయోజనదృష్టితో విలక్షణమగు ఆనుపూర్వీ వైశిష్ట్యముతో అమర్పబడినవి.

## శ్రీ మత్స్యమహాపురాణ ప్రతిపాదిత విషయములు- అధ్యాయక్రమమున :

1-10. సర్గ-ప్రతిసర్గ-వంశ-మన్వంతర వృత్తాంతములు 11-12. వంశానుచరితముగా సూర్యవంశ వర్ణనము 13-22. సూర్యునకును చంద్రునకును శ్రాద్ధ దేవత్వము వచ్చిన విధము తెలుపు ప్రసంగమున శ్రాద్ధకల్ప-పితృదేవతా చరిత ప్రతిపాదనము 23-50. వంశానుచరితము. చంద్రవంశ వర్ణనము 51. అగ్నివంశ వర్ణనము (శ్రౌతాగ్నుల ఉత్పత్తి వినియోగ వివరణము) 52-110. క్రియా యోగ ప్రతిపాదనము 111-122. భువనకోశ వ్యవస్థయందు-భూగోళసంస్థాన వర్ణనము 123-126. భువనకోశ వ్యవస్థయందు- ఖగోళ (జ్యోతిః) సంస్థానవర్ణనము 127-139 'త్రైపురము' అను దేవాసుర సంగ్రామమనబడు త్రిపురాసుర సంహార కథ 140. అమావాస్యాదులయందు పితరులకు తృప్తి కలుగు విధము 141-144. యుగపరిమాణ-యుగధర్మాది కథనము 145-159. తారకాసుర సంహార కథా ప్రతిపాదనము 160-162. నరసింహావతార

వృత్తాంతము 163-170. పద్మకల్ప సృష్టిక్రమ వృత్తాంతము 171-177. విష్ణుమహిమ ప్రతిపాదన రూపమగు కాలనేమి వధము (తారకామయ సంగ్రామము) 178. అంధకాసుర వధము 179-184. వారాణసీ మాహాత్మ్యము 185-193. నర్మదా మాహాత్మ్యము 194-201. గోత్రప్రవర వివరణము 202. ధర్మవంశ వివరణము 203. పితృగాథా 204. ఉభయతోముఖీ గోదానము 202. కృష్ణాజినదానము 206. వృషోత్సర్జన వృషభ లక్షణము 207-213. సావిత్ర్యుపాఖ్యానము 214-242. రాజధర్మములు 243-245. వామన చరితము 246-247. వరాహావతార చరితము 248-250. అమృత మథనము 251-256. వాస్తుశాస్త్రము 257-269. క్రియాయోగ విధానమున దేవాలయాది నిర్మాణము-ప్రతిమాది లక్షణములు 270-272. శివిష్క్రావాణామ కీర్తనము 273-288. క్రియాయోగ విధానమున షోడశమహాదాన విధానము 289. కల్పనామాను కీర్తనము 290. శ్రీమత్స్యమహాపురాణ ప్రతిపాదిత విషయానుక్రమణి.

## శ్రీమత్స్యమహాపురాణ విషయ ప్రతిపాదన ప్రణాళీ.

ఈ విధమున ప్రతిపాదింపబడిన విషయక్రమము మానవజీవన ప్రవృత్తికి ఏ విధముగ సహాయపడునో యోజింపవలసియున్నది.

ప్రపంచమంతయు అగ్నిషోమాత్మకము. ఇందు అగ్ని 'అత్త' అనగా తినువాడు; సమస్త సృష్టి యందలి సకల భోగ్య వస్తుజాలమును ఆయా జీవులు అనుభవించుటకు సాయపడు తత్త్వము 'అగ్ని' తత్త్వము; భోగ్యవస్తు సముదాయము అంతయు 'సోమ' తత్త్వము; ఇది 'అద్యము' తినబడునది; అనుభవించబడునది.

1. 'అత్తా' 2. 'అద్యమ్' అను రెండు పదములును అద్ (అద-భక్షణే) అను ధాతువునుండి- 1. తృచ్-2. ణ్యత్-ప్రత్యయములు చేరుటచే ఏర్పడినవి.

ఈ అగ్ని- సోమ-తత్త్వములు రెండును సంసారగతిని నిరంతర గతితో కొనసాగించుచు పోవుచుండును. దీని మూలమున 'ఆత్మ' 'శివతత్త్వము'ను అంది జననమరణ ప్రవాహమున కొట్టుకొని పోవుచుండును.

ఈ ప్రవాహగతిలో అతడు మాయాబద్ధుడై స్వార్థమునకు వశుడయి ప్రపంచ వ్యవహార నిర్వహణమునకై ఎన్నియో పనులు చేయుచుండును.

అందు కొన్ని పాపజనకములు; కొన్ని పుణ్య జనకములు; కొన్ని విహితములు; కొన్ని అవిహితములు; కొన్ని నిషిద్ధములు; అట్టివానిలో నిషిద్ధ కర్మాచరణమున కలుగు దోషమును పోగొట్టుకొనుటయు సాధ్యమయినంతవరకు అట్టి నిషిద్ధ కర్మములను ఆచరింపకయే యుండుటయు మానవుని కర్తవ్యము.

అట్లు సజ్జీవనము జీవించుచు భగవత్తత్త్వము నెరిగి పర్యవసానమున ప్రవృత్తి మార్గమునుండి నివృత్తి మార్గమునకు ఉన్ముఖుడై ముక్తిని సిద్ధింపజేసికొనుట మానవుల కర్తవ్యము.

దానికై వలయు సకల సామగ్రిని ఈ శ్రీమత్స్యమహాపురాణము క్రమబద్ధమగు ప్రణాళికతో అందజేయుచున్నది.

ఇట్టిది స్పష్టముగ కనబడుచుండ నేటివారు కొందరు-మనవారు కూడ- ఈ పురాణ రచనములకు అర్వాచీనతను అశాస్త్రతను అంటగట్టుటయు ఆయా చారిత్రక రాజవంశముల పాలన కాలమున లౌకిక ప్రయోజనములను దృష్టిలో నుంచుకొని ఎవరో రచించిరనియు లేదా తిరుగ వ్రాసిరనియు తమ అపరిపక్వ బుద్ధివిలసిత ఫలముగా నిర్ణయించుటకు శోచనీయము.

## దేవాసుర సంగ్రామములు

అందు: శ్రీ మత్స్యమహాపురాణమున 47వ అధ్యాయమున పేర్కొనబడిన దేవాసుర సంగ్రామములు మొత్తము పన్నెండు.

1. మొదటిదగు 'నారసింహము' 160-161-162 అధ్యాయములందు ప్రతిపాదింపబడినది.

2. రెండవది 'వామనము'; ఇది 213-244-245 అధ్యాయములందు తెలుపబడినది.

3. మూడవది 'వారాహము'; ఈ దేవాసుర సంగ్రామము 246-247వ అధ్యాయములందు నిరూపింపబడినది.

4. నాలుగవది 'అమృత మంథనము'; ఇది 248-249-250- ఈ అధ్యాయములందు ఉపవర్ణింపబడినది.

5. ఐదవది 'తారకామయము' అను దేవాసుర సంగ్రామము; ఇది 171-172-173-174-175-176-177 అధ్యాయముల యందు వివరింపబడినది.

6. ఆరవది 'ఆడీ బక(వధ)ము' అను దేవాసుర సంగ్రామము; ఇది 155వ ఆధ్యాయమున తెలుపబడినది; ఈ సంగ్రామమున జరిగినట్లు తెలుపబడిన మరికొన్ని సంఘటనము లీ యధ్యాయమున ఆడి వధ సందర్భములో ప్రతిపాదింప బడలేదు. ఇది ఇంకను పరిశీలింపవలసిన విషయము.

7. ఏడవది 'త్రైపురము' 'త్రిపురాసుర సంహారము' అను దేవాసుర సంగ్రామము; ఇది 127వ అధ్యాయము మొదలు 139వ అధ్యాయమువరకు విస్తృతముగా వర్ణింపబడినది.

8. ఎనిమిదవది 'అంధకాసురవధము' అను దేవాసుర సంగ్రామము; ఇది 178వ అధ్యాయమున నిరూపింప బడినది.

9. తొమ్మిదవది 'వృత్రవధము' అను సంగ్రామము; ఇది శ్రీమత్స్యమహాపురాణమున వర్ణింపబడలేదు.

10. పదియవది 'ధ్వాత్రము'; ఇదియు ఇందు ప్రతిపాదింపబడలేదు.

11. పదునొకొండవది 'హాలాహలము' అను దేవాసురసంగ్రామము; ఇది అమృతమంథన సమయమున ఉద్భ వించిన హాలాహలము కారణముగా జరిగిన దేవదానవనాశ రూపమయినదో మరి ఏదో తెలియదు.

12. పన్నెండవది 'కోలాహలము' అను దేవాసుర సంగ్రామము; ఇది ఈ మత్స్యమహాపురాణపు నలువది ఏడవ అధ్యాయమునందే వివరింపబడినది.

ఇందు ప్రతిపాదింపబడిన దేవాసుర సంగ్రామములు సృష్టి పరిణామక్రమములో జరిగిన అనేకములగు దశలను పరోక్షమగు విధానమున చెప్పుచున్నవి.

కాలనేమియను అసురుని కథ ఇట్టివానికి ప్రధానోదాహరణము.

అంధకుని చంపుటకుపూని ఘోర రూపముదాల్చిన పరమేశ్వరుని చెమట నుండి వాస్తు పురుషుడు జన్మించెనట; (251 అ.) ఇదియేమి పిచ్చి కథ!

ఇందలి యాథార్థ్యము వాస్తు పురుషుని దేహావయవములపై ఎక్కి కూర్చుండిరని చెప్పబడిన దేవతలు ఎవ రెవరో చూచినచో స్పష్టమగును.

అంధకుడు ఆయా ఋతువులందు చెలరేగు సవాతవృష్టులకు (గాలివానలకు) ప్రతీకము; ఆయా సమయము లందు వృష్టులను కలిగించుటకును కలిగించకపోవుటకును అతివృష్ట్యనావృష్టులకును హేతువులగు పవనముల (Monsoons) ప్రవృత్తియే ఈ 'అంధక'దానవుడు; 'అంధ' శబ్దముతో సంబంధము కలదియే ఆంధికా- ఆంధీ(తుఫాను); వృష్టితో పాటుగనే ఈ అంధకముల విజృంభణమునకుకూడ ఈ వర్షప్రద పవనములే కారణము గదా! ఇది ఈశాన్యము నుండి నైరృతమునకో నైరృతమునుండి ఈశాన్యమునకో వీచుచుండును. వీని ప్రవృత్తులవలన కలుగు వర్షములవలన మానవ జీవనము చక్కగ కొనసాగును. కాని వీని అస్తవ్యస్త ప్రవృత్తిచే కలుగు ఈ అంధకములవలన మానవ జీవన ప్రవృత్తికి ఎన్నియో హానులును కలవు కదా. వీని నుండి రక్షించుకొనుటకు తగిన గృహములను మానవులు నిర్మించుకొనవల

యును. ఆ విషయము దృష్టి యందుంచుకొనియే చతుష్షష్టి పదవాస్తునందుకాని ఏకాశీతి పదవాస్తునందుకాని వాస్తు పురుషుని దేహము-వాని శిరస్సు ఈశాన్యమునకును పాదము నైరృతమునకును నున్నట్లు భావన చేయవలెనని చెప్పబడి నది.

ఈ వాస్తు పురుషుని అవయవములను త్రొక్కి పట్టిన దేవతల నామములుకూడ- పాప-రోగ-శోష-మొదలగున వన్నియు-ఈ విషయమునే సూచించుచున్నవి.

ఏ దేవతల స్థానమున ద్వారములుండవలయును ? ఏ దేవతల స్థానమున ద్వారములుండరాదు ? అను నిర్ణయము కూడ ఈ యంశమునే స్పష్టము చేయుచున్నది.

వాస్తు యంత్రమున ఉన్నట్లు చెప్పబడిన దేవతలు అందరును ఏమి? అనునది వారివారి నామముల రూపనిష్పత్తిని బట్టి కలుగు అర్థములు పరిశీలించినచో స్పష్టమగును.

అది యంతయు సమగ్రముగ ఇట్లు వివరించుచుపోయినచో గ్రంథ విస్తరమగును. ఏమయినను 'అంధకాసుర వధము' మన పూర్వులు వానగాలులు-గాలివానలు-వంటి ప్రకృత్యుపద్రవములపై అదుపు సంపాదించుటకు చేసిన యత్నమును తెలుపును. వాస్తూత్పత్తి కథలోని అంతరార్థమును ఇప్పటికే తెలిసికొనియున్నాము.

ఏమయినను దేవాసుర సంగ్రామముల యందలి అంతర్యమును పరిశీలనాత్మకముగ యోజించవలయును. దానిచే సత్యము తెలియును. వృత్రవధ తత్త్వాదికమును శ్రీమాన్ ఏక్కిరాల కృష్ణమాచార్యులు మొదలగువారు సవివేచనముగ [illegible] అందించినారు. స్వర్గనరకాదికమును గూర్చియు వారు చెప్పిన యంశములు సయుక్తికములు శాస్త్రీయములై ప్రామాణికములుగా స్వీకార్యములు.

ఆ మార్గమున ఇంకను ఆలోచించగలిగినచో మరింత మేలు.

ఈ మాత్స్యమందు ఈయబడిన స్తోత్రాదికము :

1. దమనకు శ్రీదేవి చెప్పిన స్త్రీయాష్టోత్తర శత స్థాన నామములు-13 అ
2. శుక్రకృత శివస్తుతి-47 అ.
3. దేవతాకృత శివస్తుతి-136 అ.
4. వీరకకృత దేవీస్తుతి-157 అ.
5. బ్రహ్మకృతా శివస్తుతిః-192 అ.
6. సావిత్రీకృతా యమస్తుతిః-211 అ.
7. బ్రహ్మకృతా వామనస్తుతిః-244 అ.
8. దేవదానవకృతా విష్ణుస్తుతిః-248 అ.
9. దేవదానవకృతా శంకరస్తుతిః-248 అ.
10. సర్వపాపక్షయకరములగు ఉగ్రాయుధ జనమేజయ వృత్తాంత శ్లోకములు-49 అ.
11. అంధకవధే శైవనారసింహమాతృకోత్పత్తిః-178 అ.
12. అదితికృతా విష్ణు స్తుతిః-వామనావతారే-243 అ.
13. భూదేవీకృతా విష్ణుస్తుతిః-వరాహావతార కథాయామ్-247 అ.
14. దేవతలు చేసిన బ్రహ్మస్తుతి-158 అ.

15. రతీదేవి చేసిన బ్రహ్మస్తుతి-153 అ.

16. దేవతలు చేసిన కుమార స్తుతి-158 అ.

## ప్రకృతి వికృతి హోమవ్రతాదులు-శ్రౌత సంప్రదాయమున యాగములు.

ప్రకృతి యాగములు వికృతి యాగములు అని యాగములు రెండు విధములు. అన్ని యంశములును సమగ్రముగాను సరళముగాను ఉండు యాగములు ప్రకృతి యాగములు. ఈ ప్రకృతి యాగములకు గల ప్రక్రియా మంత్రోపకరణాదికమున కొలది మార్పులు చేర్పులు చేయుటతో నిర్వహింపబడు యాగములు వికృతి యాగములు. అట్లే ఈ మత్స్యపురాణమందును శాంతి విధానములు వ్రతములు మొదలగు వాని ప్రక్రియలును ఈ రెండు విధములుగానున్నవి.

ఉదా : అయుత హోమము ప్రకృతి హోమము-లక్షహోమ-కోటి హోమములు వికృతి హోమములు.

వ్రతములందును ఇట్టి పద్ధతి కలదు. పర్వత దాన-గుడాది ధేను దాన వ్రతములయందును ఇట్లు ప్రకృతి వికృతి ప్రక్రియ గోచరించును. ఇది ఈ పురాణ రచన మీమాంసా శాస్త్ర సంప్రదాయానుసారముగ జరిగెనని చెప్పుటకు ప్రమాణము.

కుండ-మండప-వేది-యోని ప్రభృతి హవనాంగముల లక్షణము విషయమునకూడ కమలాకర భట్టాది నిబంధ కారులందరును ఈ శ్రీ మత్స్యమహాపురాణ వచనములనే తమ నిబంధములందు ప్రమాణములుగా గ్రహించి ఉదాహరించియున్నారు.

ఇందు ప్రతిపాదించిన ఏవిషయముగాని అస్పష్టతకు ఏమాత్రము అవకాశములేనిదై సుస్పష్టముగ విషయమును అవగతము చేయుచుండుట ఈ మహాపురాణమునందలి విశిష్టత.

## పురోడాశః-చరుః.

చరుః-హవ్యపాకే చరుః పుమాన్-అమరః; కాం. 2. బ్రహ్మ-2 శ్లో.

'అనవస్రావితాంతరూష్మపాక ఓదన శ్చరుః. ఇతి యాజ్ఞికాః. మీమాంసకైరపి త్రివృచ్చర్వధికరణే (      ) అన్న పరత్వం చరు శబ్దస్యాభ్యుపగతమ్; ఉగవాదిభ్యో యత్. (పా5-1-2) ఇతి సూత్రే కైయటస్తు స్థాలీవాచీ చరు శబ్దః- తాత్స్థ్యా దోదనే భాక్తః ఇత్యాహ;' అత్తెసరు పెట్టి-లోని ఆవిరి బయటికి పోకుండ వండిన అన్నము.

పురోడాశః-(Apte) A Sacrificial oblation made of ground rice and offered in Kapalas.

ఈ మత్స్యపురాణమునందు మరియొక విశేషము కలదు: మన వాఙ్మయమునందలి అనేక కథలును దేవతా స్తుతిరూప రచనలందలి విషయములును దేవతా నామములును రహస్యార్థగర్భితములు. ఆ కథలును సంఘటనలును పదములును ఇచ్చు బాహ్యార్థము ఒకటి కాగా దానిచే ఎరుగవలసిన తాత్త్వికార్థము మరియొకటిగా నుండుటయే వీనియందలి విశిష్టత.

'బ్రహ్మ' తాను గాయత్రిని (సరస్వతిని) సృజించెను. అట్లు తన పుత్త్రియగు ఆమెతో సంగమించెను. ఇది సముచితమా? అని ప్రశ్న కలుగును. దీనియందలి తాత్త్వికార్థమును కూడ ఇచట పురాణమే చెప్పుచున్నది. ఇట్లే ఈ పురాణమునందు ఎన్నియో విషయముల వెనుక తాత్త్వికార్థములు కలవు. వాని నన్నిటిని ఇట్లే విచారించుకొని తెలిసికొనవలయుసని ఈ పురాణము గాయత్రీ బ్రహ్మ సంగమ విషయమున ఇచ్చిన వివరణముతో మనకు సూచించుచున్నది.

బ్రహ్మకు ఐదు ముఖములు ఉండుట- అవి ఒక్కొక్కటి ఒక్కొక్క భంగిలో ఉండుట- మొదలగునవి ఇటువంటివే.

ఇటువంటివి మన ఆర్ష వాఙ్మయమున ఎన్నియో కలవు. వానిని ఉపాసనముగా గ్రహించి విషయములను సరిగా అవగాహన చేసికొని తత్ప్రయోజనము పొందుట జన్మ సాఫల్య హేతువు. కాని మన ఆర్ష వాఙ్మయమును - వైదిక వాఙ్మయమును సంప్రదాయమును బట్టి అవగాహనము చేసికొని జిజ్ఞాసువుల కొఱకు వ్యాఖ్యానించు పెద్దలు లభించుట దుర్లభమయిన కాలమిది. సత్యపు యథార్థ సమన్వయమే తన రూపముగా సత్య స్వరూపుడయిన నారాయణుడు [illegible] వైదిక శ్రద్ధామాత్ర సాధ్యుడయి గురు పరంపరలో అనుస్యూతముగా నిలిచియుండును. అట్టి సత్య సమన్వయ సంప్రదాయమే అనాదినుండి మన ఆర్షవాఙ్మయరూపము. ఇది వైదిక వాఙ్మయపు యథార్థ తత్త్వమును తన యందు క్రమముగా పదిలపరచి యుంచికొనినది. అట్టి సంప్రదాయమును సంపూర్ణముగా గ్రహింపక-అనుసరింపక-ఎంతటి విషయమును ఎంతగా గ్రహించినను ఎన్ని శాస్త్రములను అధ్యయనము చేసినను ఎంతటి మేధాబల విన్యాసముల సాధించినను సునిశ్చితమయిన ఆర్ష వైదిక సత్యమును దాని వాస్తవ రూపములో కోమలముగా గ్రహించి పొదివి పట్టుకొనుట సాధ్యపడదు.

పాశ్చాత్త్య సంస్కృతముల తీవ్ర మరుత్ప్రవాహములలో ఆలోచనలు కొట్టుకొనిపోవుచుండగా అందని సంప్రదాయమును అందుకొన శ్రమింపజాలకయు వివిధ హేతువులచే తమకు సాంప్రదాయిక విషయములయం దభినివేశము అనుమానము ఉండుటచే ఆర్ష వైదిక వాఙ్మయపు తత్త్వమును వ్యాఖ్యానించుటకు ఇట్టెందఱో భారతీయ మేధావులు ప్రయత్నించుచున్నారు. వీరి సంప్రదాయాభిమానము అభినందనీయమే. కాని ఇట్టి వారు చేయు మేధాబల విన్యాసముల వలన సత్యనారాయణునికి జరుగు ద్రోహమును వీరు గ్రహించుట అత్యావశ్యకము.

"బిభే త్యల్పశ్రుతా ద్వేదో మా మయం ప్రహరే దితి ।
ఇతిహాస పురాణాభ్యాం వేదా న్సముపబృంహయేత్."

"ఇతిహాస పురాణములను సరిగా అధ్యయనము చేయక అల్పముగా శాస్త్రాధ్యయనము చేసిన వాని వలన నుండి 'శ్రుతుడు నన్ను దెబ్బ కొట్టునేమో!' ('శ్రుతి'కి అనుచితములగు అర్థములను కల్పించునేమో!') అని వేదము భయపడును."

పాశ్చాత్త్య విజ్ఞానము ప్రాపంచిక వాస్తవములను చూచు దృష్టి- దాని తార్కిక భూమిక (Premise) దాని మార్గము-వేరు; మన సంప్రదాయ విషయములకు వలయు దృష్టి-తార్కిక భూమిక-విచారణ మార్గము-వేరు. వీటిని త్వరపడి మేళవింప యత్నించుటలో సత్యమున కెంతయో ప్రమాదము వాటిల్లును.

శ్రీమత్స్య మహాపురాణమునందలి మరికొన్ని వైలక్షణ్యములు :

1. ఇందలి భాష చాల ప్రాచీనము. శబ్దరూపములు పాణినీయ వ్యాకరణము వలన లభించు లక్షణములకు అతీతములగునవి కొన్ని కలవు; ఛందోభంగమును లెక్కపెట్టని కూర్పు చాల తావులందు కనబడును.

2. శైలి సరళము-సరసము-మధురము - చిన్న చిన్న పదములతో వాక్యములు కూర్చబడి వానిచే అధిక విషయము అత్యంత స్పష్టముగా ప్రతిపాదింపబడును. కూర్పులో శిథిలత ఎచ్చటను కానరాదు.

3. సంధి వైలక్షణ్యము. "యదేనా మాత్మనోదీర్ణాం తనయాం సముపేక్షసే." (వృషపర్వాణం ప్రతి శుక్రస్య వచనమ్ .

ఇచట 'ఆత్మనః+ఉదీర్ణాం>ఆత్మన+ఉదీర్ణాం>ఆత్మనోదీర్ణామ్' అంతేకాని- 'ఆత్మనా+ఉదీర్ణాం' అని ఉద్దిష్టము కాదు: యతః+ఉత్పాతాః>యతోత్పాతాః (120 అ; 36 శ్లో.)

ఇట్టి కొన్ని ఉదాహరణములు విజ్ఞులు విశ్లేషణాత్మక దృష్టితో ఆయా యెడల తామే గ్రహింప యత్నింతురు గాక.

4. సమాస వైలక్షణ్యము.

5. కారక వైలక్షణ్యము.

6. వాక్యాంతర్గత వాక్యములు.

7. ఆర్షరూపములు-'భరథః' మొదలగునవి; గృహ్య(గృహీత్వా)

8. విలక్షణములగు అర్థములందు ప్రయోగించబడిన పదములు : స్పష్టం-భవ్యం- 'సరస్వతి' అను అర్థమున 'యా రూపార్థవతీ పత్నీ బ్రహ్మణః.' (170 అ.) మొదలగునవి. వీనిలో కొన్ని వివరణములలో ఈయబడినవి.

9. తెలుగు పదములే సంస్కృతమునకు చేరెనేమో అనుకొనదగిన ప్రయోగములు : శాఖా = చెక్క (తలుపు చెక్కలు అను అర్థములో); కటి = గడియ — ఈ మొదలగునవి.

10. పాణినీయ వ్యాకరణమునందలి పారిభాషిక పదమునకు అర్థమును సరిగా గ్రహించుటకు స్ఫోరకముగా ఉపయోగించు 'పురుష'పద ప్రయోగము.

11. విలక్షణములగు నిర్వచనములు : ఉషా-వ్యుషా-ఉషః-కుహూ-'యమ' పర్యాయ పదములు - మొదలగునవి.

12. ఛందోభంగకరములగు శబ్ద ప్రయోగములు : 'వేధసాం వత్యే' (130అ. 24 శ్లో.) అని అనుష్టుప్ శ్లోకపు సమపాదాంతమున ప్రయోగము; 'వేధసాం వతే' అనినచో అర్థము సరిపోదు; ఛందస్సునకు సరిపోవును. ఇట్టివి ఇంకను చాల గలవు. అయినను వీనిని ఆర్షరూపములుగా ఆర్షమగు ఛందోభంగానుమతిగా గ్రహించి యథాతథ రూపమును గ్రహించుట జరిగినది.

ఇట్టి వైలక్షణ్యములు ఇంకను కలవు. వానిని అచ్చటచ్చట సూచించుట జరిగినది. మిగిలిన వానిని విజ్ఞులు ఊహించుకొనగలరు. ఇవి అన్నియు సంస్కృత మూలమును చదివి అవగాహనము చేసికొనువారిని దృష్టిలో ఉంచుకొని చెప్పుట.

ఇందు పూర్వ మీమాంసా - వైశేషిక దర్శన తత్త్వములు ఆయా సందర్భములలో చాల సుకుమారముగా పాటింపబడినవి. సృష్టి ప్రక్రియను నిరూపించు సందర్భములలో వైశేషిక దర్శన తత్త్వములును సంప్రదాయములును-ధర్మశాస్త్ర విషయములను పూజా హోమాది ప్రక్రియలను నిరూపించునపుడు పూర్వ మీమాంసాశాస్త్ర సంప్రదాయములును గోచరించుచుండును.

40వ అధ్యాయమునందు "ఈ లోకమునందు శ్రాద్ధకర్తలు తమ పితరులను ఉద్దేశించి జరిపిన శ్రాద్ధములు ఉద్దిష్టులగు పితరులకు ఆ శ్రాద్ధ మంత్రములే అందజేయును." అనుటకు సమర్థకముగా "యథా గోషు ప్రతిష్ఠాసు (ప్రణష్టాసు) వత్సో విందతి మాతరమ్." 78 శ్లో.

"తప్పిపోయిన తన తల్లిని అనేక ధేనువుల నడుమ ఎచ్చట నున్నను గోవత్సము గురుతించినట్లు" అని చెప్పబడినది.

ఇది "ప్రణష్టమాతృ-గోవత్సన్యాయము" అను మీమాంసకుల లౌకిక న్యాయము అనవచ్చును.

143వ అధ్యాయమున "పాపిష్ఠమగు కలియుగమునుండి ధర్మమయమగు కృతయుగ మవతరించును." అనుటను సమర్థించుటకై 96-97 శ్లోకములలో

"యథా దావ ప్రదగ్ధేషు తృణేష్వేవాపరం తృణమ్ ।
వనానాం ప్రథమం వృష్ట్యా తేషాం మూలేషు సంభవః."

"దావాగ్నిచే దగ్ధములయిన వనగత తృణ మూలములందుండియే దవాగ్నికి తరువాత కురిసిన మొదటి వానతో మరల వాని మొలకలు లేచినట్లు."

అనుచు "దావదగ్ధ తృణప్రరోహ న్యాయము" అను మీమాంసకుల లౌకిక న్యాయము అనదగినది ఈయబడినది.

144వ అధ్యాయమున సత్యము మొదలగువాని లక్షణములు చాల నిక్కచ్చిగా శాస్త్రీయముగా అన్యూనానతిరిక్తముగా (అవ్యాప్తి-అతివ్యాప్తి-అసంభవము-అను లక్షణ దోషములు రాకుండ) చెప్పబడినవి.

ఈ అధ్యాయమునందే "అవ్యక్తాది విశేషాంతే వికారే" అని చెప్పబడినది.

వైయాకరణాదులు చెప్పిన 'ద్రవ్య-గుణ-కర్మ-సామాన్య'ములను మాత్రమే కాక 'విశేషము' అను దానిని కూడ 'పదమునకు అర్థము'గా చెప్పిన కణాదమతమును ఇచట స్మరించుకొనవచ్చును.

ఇట్లు ఈ పురాణమున మీమాంసా వైశేషికాదిశాస్త్ర సంప్రదాయములు పలుతావుల కనబడును.

ఈ అనువాదమునకై ప్రధానముగా గ్రహించిన మూలప్రతి క్రీ. శ. 1877లో శ్రీ పువ్వాడ వేంకటరావుగారు ముద్రించిన తెలుగుప్రతి. ఇందు ముద్రణ దోషములు అధికముగా ఉన్నవి. ఐనను దీనియందు ఉన్న పాఠములు చాలవరకు ప్రామాణికముగా గ్రహింపదగినవి. ఇదికాక 'నందలాల్-మోర్' సంపాదకత్వములో ముద్రితమయిన నాగరీ లిపి ప్రతియు-'శ్రీ చాము రాజేంద్ర గ్రంథమాల'లో కన్నడానువాదముతో కన్నడ లిపిలో ముద్రించబడిన ప్రతియు సంప్రతించుట జరిగినది. కాని ఈ రెండింటిలోను పాఠ సౌష్ఠవము విషయమున కన్నడ ప్రతి కొంత మేలు.

శ్రీ పువ్వాడ వారి ప్రతిలో ముద్రణమున పదములకు నడుమ వ్యవధానము (Spacing) ఏ మాత్రమును లేని దంజాదుమూన ముద్రణము. పైగా దీని మూలప్రతి నాగరీలిపి ప్రతియనియు దానినుండి తెలుగు వ్రాసికొనుటలో లేఖన దోషములు చాల దొరలినవనియు తోచు తావులు చాల కలవు. ఉదాహరణమునకు- తయోక్తం ('తథోక్తం' అనుటకు) 'ఖస్వపః' (స్వప్నపః-అనుటకు) దుఃఖగాహం-('దురవగాహం' అనుటకు) మొదలగునవి.

ఇట్టివి యథాశక్తిగా గమనించి సరిచేయుట జరిగినది.

అప్పటికిని చాల క్లిష్టమయిన తావులు ఎన్నియో వచ్చినవి. ఉన్న పాఠము అన్వయమునకు రాదు; అట్టి చోట్ల సముచితమని తోచిన అక్షరమును- అక్షర సముదాయమును బ్రాకెట్‌లో ఇచ్చుట జరిగినది.

ప్రాచీన భారతీయ వాఙ్మయమును చదువుటకు అవశ్యకములగు ప్రాథమికాంశములును విశేష జిజ్ఞాసాపాత్రము లగు మరికొన్ని అవశ్యకాంశములును జిజ్ఞాసువుల ఉపయోగమునకై ఇకమీదట ఈయబడుచున్నవి.

ఇవికాక మరికొన్ని విషయములు ఎక్కడి కక్కడ అనువాదముతో పాటే ప్రధాన విషయమునందో Foot Notes గానో ఇచ్చుటయు జరిగినది.

ఇవి అన్నియు పురాణ ప్రతిపాదిత విషయమును సరిగా అవగాహనము చేసికొనుటకు సహాయకమగునని ఆశ.

శ్రీ సద్గురువుల కృపతో జరిగిన ఈ చిన్న పని జిజ్ఞాసువులగు పఠితలకు సరిగా ఉపయోగపడుటయే ఈ అనువాదమునకు మిగులు వాస్తవ ఫలము.

ఏ రచననైనను ప్రశంసించదలచినను అభిశంసించదలచినను మొదట దానియందు ప్రతిపాదితమయిన విషయపు వాస్తవ స్వరూపమును తెలిసికొనుట అవశ్యకము. అందులకే ఈ ప్రయత్నము అంతయును.

విజ్ఞులు ఇందలి గుణములు మాత్రము గ్రహించి దోషములను మన్నింతురు గాక!

# ఆవశ్యక వివరణము.
# ప్రాచీన భారతీయుల సంఖ్యాది పరిభాషలు.

## భారతీయ సంఖ్యా పరిభాషా.

భాస్కరాచార్యులు లీలావతీ గణితములో భారతీయ సంఖ్యా పరిభాష ఇట్లు చెప్పినారు:

'ఏక దశ శత సహస్రా-
యుత లక్ష ప్రయుత కోటయః క్రమశః।
అర్బుద మబ్జం ఖర్వ ని-
ఖర్వ మహాపద్మ శంకవ స్తస్మాత్.
జలధి శ్చాంత్యం మధ్యం-
పరార్ధ మితి దశగుణో త్తరాః సంజ్ఞాః।
సంఖ్యాయాః స్థానానాం-
వ్యవహారార్థం కృతాః పూర్వైః.'

'ఏకం (ఒకటి)-1; దశ (పది)-10; శతం (నూరు-వంద) 100; సహస్రం (వేయి)-1000; అయుతం (పది వేలు)-10000; లక్షం (లక్ష-నియుతము)-100000; ఇట్లే ప్రయుతం (పది లక్షలు)- కోటి- అర్బుదం- అబ్జం (పద్మం)- ఖర్వం- నిఖర్వం- మహాపద్మం- శంకుః- జలధిః (సముద్రము)- అంత్యం-మధ్యం-పరార్ధం- అని ఒకదానికి మరియొకటి పదిరెట్లు అగు సంఖ్యలను వ్యవహారార్థమయి పూర్వులు ఏర్పరచి యున్నారు.'

## ప్రాచీన భారతీయమానములు
## ధాన్యపు కొలతలు ఒక (ప్రాంతమున)

4 గిద్దలు-1 సోల; 2 సోలలు-ఒక తవ్వ (సేరు); 2 తవ్వలు-1 మానిక; 40 మానికలు-అంకె(డె)ము; 2 అంకెములు-నలక; 2 నలకలు-ఏదుము; 2 ఏదుములు-1 పందుము; 2 పందుములు-పుట్టి; ఇందు-ఏఁదుము (ఏను+తూము(లు); పది+తూములు>పందుము; కాగా-తూము అనగా 32 మానికలు=64 శేరులు.

భాస్కరాచార్యులు : హస్తము (మూర) వెడల్పు-పొడవు-మందము-కలిగి 12 కోణములు గల రూపమునకు ఘనహస్తము అని పేరు; ధాన్యాదికము కొలుచుటలో ఈ ఘనహస్తమును 'మాగధఖారికా' అందురు: ఖారికాషోడశాంశము ద్రోణము; ద్రోణచతుర్థాంశము ఆఢకము; ఆఢకచతుర్థాంశము ప్రస్థము; ప్రస్థచతుర్థాంశము కుడవము-అనినారు.

## మరియొక విధముగ

ఎనిమిది ముష్టులు (పిడికిళ్లు) 1 కుంచి; ఎనిమిది కుంచులు 1 పుష్కలము; నాలుగు పుష్కలములు ఆఢకము.

## మరియొక విధముగా

ఇరువది ఖారీలు 1 వాహము; పది ఖారీలు 1 శవికా: ఐదు ఖారీలు 1 ప్రవర్తము.

ముడిచిన అరచేయి 1 ముష్టి; నాలుగు ముష్టులు 1 కుడవ(శ)ము; నాలుగు కుడవములు 1 ప్రస్థము; నాలుగు

ప్రస్థములు 1 ఆఢకము; ఎనిమిది ఆఢకములు 1 ద్రోణము; రెండు ద్రోణములు 1 శూ(సూ)ర్పము; సార్ధ ($1\frac{1}{2}$) సూర్పము 1 ఖారి: రెండు ద్రోణములనే గోణీ (గోనె) అందురు. ఇదియే భారము (బారువ) అనియు వ్యవహరింపబడును. నాలుగు భారములు 1 వాహము. ఆఢకము $=1/4$ ద్రోణము.

## ప్రాచీన దైర్ఘ్యమానము

ఒకదాని ప్రక్కను మరియొకటిగా అడ్డముగా త్రిప్పి ఉంచిన ఎనిమిది ప్రమాణపులావుగల యవలు-(వాని నడిమి భాగపులావు) ఆక్రమించు ప్రదేశము 1 అంగుళము; 24 అంగుళములు 1 హస్తము; 12 అంగుళములు 1 వితస్తి; ఇదియే శిల్పములో తాల ప్రమాణము అనబడును; నాలుగు హస్తము (మూర)లు 1 దండము; 2000 దండములు 1 క్రోశము; 4 క్రోశములు 1 యోజనము; 10 హస్తములు 1 వంశము (వెదురుగడ ప్రమాణము); 20 వంశముల పొడవు- అంతియ వెడల్పుగల- సమ చతుర్భుజక్షేత్రము నివర్తనము. (యోజనము $=$ 32000 హస్తములు)

## మరియొక విధముగా

4 హస్తములు 1 ధనువు (1 దండము); 1000 ధనువులు 1 క్రోశము; 2 క్రోశములు గవ్యూతి (గోమతము-గోరుతము); 4 క్రోశములు 1 యోజనము. ($=$ 16000 హస్తములు.)

## పూర్వపు తూకములు (ఒక ప్రాంతమున)

24 తులములు 1 సేరు; 5 సేరులు $=$ నాలుగు నవాసేరులు-1 వీసె; 2 వీసెలు 1 ఎత్తు (కట్టు-ధడియము); 8 వీసెలు-1 మణుగు; 20 మణుగులు 1 పుట్టి (బారువ); 3 తులములు 1 పలము; 40 పలములు 1 వీసె.

## ఈ చెప్పిన అంశములకు మూలవచనములు:

### ధాన్యపు కొలతలు.

'ధాన్యేఙ్గులైః హస్తోన్మితై ర్వితస్తి దైర్ఘ్యపిండై-
ర్యద్ద్వాదశాస్రం ఘనహస్త సంజ్ఞం।
ధాన్యాదికే య ద్ఘనహస్తమానం
శాస్త్రోదితా మాగధ ఖారికా సా.
ద్రోణస్తు ఖార్యాః ఖలు షోడశాంశః
స్యా దాఢకో ద్రోణ చతుర్థ భాగః।
ప్రస్థ శ్చతుర్థాంశ ఇహాఢకస్య
ప్రస్థాంఘ్రి రాద్యైః కుడవః ప్రదిష్టః.'
'వాహో ద్వింశతిఖారీభి ర్ద్విపికా స్యా దనేన (ద్ధశైవ) తు।
ప్రస్థా పంచఖారీభి సస్యమానే ప్రకీర్తితః.
పలం ప్రకుంచకం ముష్టిః కుడవ స్తచ్చతుష్టయం।
చత్వారః కుడవాః ప్రస్థ శ్చతుః ప్రస్థ మథాఢకమ్.
అష్టాఢకో భవే ద్ద్రోణో ద్విద్రోణః సూర్ప ఉచ్యతే.

సార్ధసూర్పో భవే త్ఖారీ ద్విద్రోణా గోణ్యుదాహృతా.
తామేవ భారం జానీయా ద్వాహో భారచతుష్టయమ్.' (అమరసు

అన్యథా

'అష్టముష్టి ర్భవేత్ కుంచిః కుంచయోఽష్టౌ తు పుష్కలం ।
పుష్కలాని తు చత్వారి ఆఢకః పరికీర్తితః.'

## దైర్ఘ్యమానమ్.

'భాస్కరః :

యవోదరై రంగుళ మష్టసంఖ్యైః
హస్తోఽంగుళై ష్షడ్గుణితై శ్చతుర్భిః ।
హస్తై శ్చతుర్భి ర్భవతీహ దండః
క్రోశః సహస్రద్వితయేన తేషామ్.
స్యా ద్యోజనం క్రోశచతుష్టయేన
తథా కరాణాం దశకేన వంశం ।
నివర్తనం వింశతివంశసంఖ్యైః
క్షేత్రం చతుర్భిశ్చ భుజై ర్నిబద్ధమ్.'

కిష్కు = 1 జేన లేదా 1 మూర;

వితస్తిర్ద్వాదశాంగుళమ్.
కిష్కుర్ద్వయోర్వితస్త్యోచ స్రవకోష్ఠకరేఽపిచ;
ధన్వంతర సహస్రం తు క్రోశః-క్రోశద్వయం పునః ।
గవ్యూతం- స్త్రీ తు గవ్యూతి గ్గోరుతం గోమతం చ తత్.

ఇతి వాచస్పతిః.

'ధను ర్హస్తచతుష్టయమ్'
'ద్వాభ్యాం ధనుఃసహస్రాభ్యాం గవ్యూతిః పుంసి భాషితః.'

ఇతి శబ్దార్ణవః.

## తాలశబ్దార్థము

మత్స్యపురా-మూర్తి లక్షణాధ్యాయము; తాలశబ్దార్థః
"ప్రాదేశ తాల గోకర్ణా స్తర్జన్యాదియుతే తతే."

అమరకోశః- ద్వితీయ కాండః- మనుష్యవర్గః - 83 శ్లో.

(అత్ర సుధా వ్యాఖ్యా-)
తర్జన్యాది సహితే విస్తృతేఽంగుష్ఠే క్రమేణేకైకమ్.

అంగుష్ఠ తర్జన్యోః దైర్ఘ్యం-బొటన[వేలిని చూపుడు[వేలిని రెండు వైపులకు చాచగా-[ప్రాదేశము; అంగుష్ఠ మధ్యమాంగుళ్యోః దైర్ఘ్యం - బొటన[వేలిని నడిమి[వేలిని చాచగా-తాలము; అంగుష్ఠానామికయో దైర్ఘ్యం-బొటన[వేలిని అనామికను చాచగా-గోకర్ణము; అనబడును; బొటన[వేలిని చిటికెన[వేలిని చాచగా అగు పొడవునకు పేరు ఈయబడలేదు.

## కొన్ని శబ్దముల అర్థములును-వ్యుత్పత్తులును :
## విట్పతి శబ్దార్థము (16అ. 11శ్లో)

([ఇచ్చట అనువాదములో ఇచ్చిన అర్థముతోపాటు ఈ యర్థమును కూడ [ప్రధానముగానే [గ్రహించవలెను.)

[శ్రాద్ధమున భోక్తలుగ భుజింపజేయ బడదగినవారిలో విట్పతి యొకడు. విట్పతి అనగా అల్లుడు. 'విష్' అనగా కూతురు; విషః- పతిః=విట్పతిః; కుమార్తెకు భర్త.

విట్పతిః- విషః- కన్యాయాః పతిః-జామాతా ఇతి జటాధరః;
"మాతామహం మాతులం చ స్వ[స్రీయం శ్వశురం గురుమ్ ।
దౌహి[త్రం విట్పతిం బంధుం ఋత్విగ్యాజ్యౌ చ భోజయేత్". మను-3-148.

## '[భ్రూణ' శబ్దార్థము.

'[భ్రూణః' అనగా-షడంగ వేదాధ్యేతా; అని హరదత్త పండితుడు; ఆపస్తంబ ధర్మ సూత్రములు-1 [ప్రశ్న-19 కండికా-15 సూత్రవ్యాఖ్య చూచునది; ఈ శబ్దమునకు వాడుకలో మరియొక యర్థమున్నది. కనుక ఇచట ఇట్లు వివరించబడినది.

## 'మత్స్య' శబ్దార్థము

'మ' అను ఏకాక్షర శబ్దమునకు జలము అని అర్థము; ఇది 'మన్' అను ధాతువునుండి 'న్' కార లోపముచే-'గమ్' ధాతువునుండి 'గ'వలె నిష్పన్నము;

'మన' ఇత్యేవ యో ధాతు రపా మర్థే [ప్రకాశతే;
అపాం విదారణా చ్చైవ మందరః స నిగద్యతే. (మత్స్య-121-శ్లో. 60-61)

అప్పులను - జలములను-విదరణము-చీల్చుట-చేయుచున్నది కావున 'మందరము' అని అర్థము; అనగా ఈ శబ్దము [illegible] -దర-అని విభజించవలెను; అనగా 'మ' అను ఏకాక్షర శబ్దమునకు 'జలము' అని అర్థమని తెలియుచున్నది.

'మే' 'జలే' తిష్ఠతీతి- నీటియందు ఉండునది; మ+త్య>మ-త్-(స్) య>'మత్స్య' అగును; ఇచట సకారము (స్) ఆగమముగా వచ్చినది.

ఇంకరి 'మ' 'జ' గా మారగా వర్ణ వ్యత్యయముచే 'మజ్దా' (Mzda) అగును. పార్సీవారి ఈ (Ahur) Mazda [illegible] -రియని ఊహించవచ్చును. ఈ విధముగా-నార+అయన>నారాయణ

స్రీరు తన కాశ్రయముగా గలవాడు-జీవులకు ఆశ్రయమయినవాడు-అను అర్థమునిచ్చు 'నారాయణ' శబ్దముతో మత్స్య శబ్దము సమానార్థకమగును.

## 'అంబర' శబ్దార్థము

పై హేతువులచే 'జలము' అను అర్థమును ఇచ్చు 'మ' వర్ణ వ్యత్యయముచే 'అమ్' (మ్+అ=మ) అగును. 'అమ్' = జలం; వృణోతి-నీటిని తనతో కప్పివేయునది-అను వ్యుత్పత్తిచేత అమ్+వర>అమ్బర (వ్>బ్) అగును; ఈ శబ్దము నీరు-ఆకాశము అను అర్థములలో సరిపోవును.

## 'అభ్ర' శబ్దార్థము

అపో-బిభర్తి-నీటిని భ(ధ)రించునది; అప్+భ్ర>అబ్+భ్ర>అభ్ర (బకారము లోపించగా) అగుచున్నది; (చూ.ఛాందో.శాం. భాష్య-5 అ. 10 ఖం-5.)స+భ్ర (భ్రంశ్)>అభ్ర-అని మూలమునందు (అ. 124; శ్లో. 35) ఉన్నది.

## ఒకే శబ్దమునకు ప్రకరణానుసారము విభిన్నార్థములు.

24 అ. శ్లో 51 లో-'ధర్మైకశరణః'-అనుదానిని-షష్ఠీ తత్పురుష సమానముతో'ధర్మ-ఏక-శరణ' = ధర్మమునకు ఒకే ఒక ఆశ్రయము అనియు బహువ్రీహి సమానముతో ధర్మము (తనకు) ముఖ్యమగు ఆశ్రయముగా కలవాడు అనియు రెండు విధములను వ్యుత్పత్తులతో వచ్చు అర్థములును ప్రకరణమున సరిపడుచునేయున్నవి. ఇట్లే ఆర్ష వాఙ్మయమునందు ఆయా పదములకు ఆయా యర్థములను ప్రామాణికముగా సయుక్తికముగా యోజించు కొని విషయములను గ్రహించుకొనవలయును.

## 'మర్త్య' శబ్దార్థము

'మర్త్యులు' అనగా మరణించు స్వభావము కలవారు అనువ్యుత్పత్తి ప్రసిద్ధముగా వినబడుచున్నది. అట్లయినచో ఎవరు మాత్రము మర్త్యులు కారు? ఏదో యొకనాటికి దేవతలకును మరణము కలదు; కాని ఇది యోగరూఢము అన వచ్చును. కాని ఆర్ష వాఙ్మయమున 'మర' శబ్దమునకు విశిష్టార్థము కలదు. దానినుండి శబ్ద పరిణామ ప్రక్రియననుసరించి ఈ శబ్దమునకు సమంజసమగు అర్థమును చెప్పుకొనవచ్చును.

'మర' పదము ఐతరేయోపనిషత్తులో నున్నది. (ఐత-1-2)

"పృథివీ- మరః; మ్రియంతేఽస్మిన్ భూతానీతి." "దీనియందు (ఉండు) ప్రాణులు మరణించును కావున-పృథివికి 'మరము' అని వ్యవహారము" అని శ్రీశంకరులు; కాని 'మర' శబ్దము అవ్యుత్పన్నమేమో అనిపించును. ఏల యన-'మరీచి' శబ్దమునకు తేజః కిరణము అర్థము; మరే-అంచతీతి మరీచిః-మరమునందు ప్రకాశించునది కాగా 'మర' శబ్దమునకు పారదర్శకముకాని (Non-transparent) తలము అని అర్థము అయి ఉండవచ్చును.

కాగా మర + త్య>మర్ (అ) + త్య>మరమునందు ఉండువారు. అని మర్త్య శబ్దమునకు అర్థమని తలచవచ్చును.

## ప్రజాపతులు-వారి పేరులకు అర్థములు.

ఈ చెప్పిన హేతువులచేతనే మరీచి-పులస్త్య-పులహ - క్రతు- ప్రభృతి ప్రజాపతుల నామములు సృష్టికి మూలభూతములగు తత్త్వములను చెప్పు పదములని యూహింప వీలగుచున్నది.

పులస్త్య< పురస్-త్య = మొదటగా ఉన్నవాడు; పులహ<పురస్+అ>పురహ్-అ; మొదటగా ఉన్నవాడు; క్రతు = క్రియా (స్పందా)త్మక తత్త్వము-ఇత్యాదిగా అర్థములు వ్యుత్పత్తిచే ఏర్పడునని తోచుచున్నది. విచారణ చేసి తత్త్వము నెరుగ యత్నించుట కర్తవ్యము.

## గణదేవతల విషయము

### సాధ్యులు

వీరు 'గణదేవతలు' - అనగా కొందరు కలిసి ఒక వర్గముగా గ్రహింపబడి సమష్టిగా ఆరాధింపబడువారు; వీరు పన్నెండు మందియని అగ్ని పురాణమునందును ఇతరత్రను కలదు. మత్స్య పురాణమునందు మాత్రము రెండు చోట్ల రెండు విధములుగా వీరి పేరులున్నవి. వహ్ని (అగ్ని) పురాణమున గణభేదనామాధ్యాయమున-

> మనో మంతా తథా ప్రాణో భరోఽపానశ్చ వీర్యవాన్ ।
> నిర్భయో నరకశ్చైవ దంశో నారాయణో వృషః ।
> ప్రభుశ్చేతి సమాఖ్యాతాః సాధ్యా ద్వాదశ దేవతాః.
>
> అని కలదు. (అని వాచస్పత్యము.)
> భరః (నరః) నిర్భయః (వినిర్భయః) నరక (నయ) అని పాఠాంతరములు;

మత్స్య పురాణమున 202వ అధ్యాయమున

> 'మనో మనుశ్చ ప్రాణశ్చ నరో జాతశ్చ వీర్యవాన్ ।
> చిత్తహార్యోఽయనశ్చైవ హంసో నారాయణ స్తథా ।
> విభుశ్చాపి ప్రభుశ్చైవ సాధ్యా ద్వాదశ కీర్తితాః.'

అని యున్నది.

ప్రజాపతికి సృష్టి సాధన భూతులగు దేవతాతత్త్వములు 'సాధ్యులు' అని సంప్రదాయజ్ఞుల వచనము.

మత్స్య పురాణమున 170వ అధ్యాయమున వీరి పేరులు 15-16 అగునట్లు వేరు విధముగా నున్నది. హేతువు విచార్యము.

### రుద్రులు

రుద్రులు వాయువులకు కూడ తండ్రులని ఋగ్వేదమున స్తుతించబడియున్నారు. రుద్ర శబ్దమునకు నిర్వచనములు సంప్రదాయమునందు అనేక విధములుగా నున్నవి. వీరు పదునొకండు మంది. వీరు విశ్వరక్షకులు; గణదేవతలు; మహాశక్తి సంపన్నులు; నిగ్రహానుగ్రహ సమర్థులు; యజురారణ్యకమున ప్రథమ ప్రశ్నమునందలి సప్తదశానువాకమునందలి మంత్రముల యర్థమును విచారణ చేయగా అట వాయుదశా విశేషములను పదునొకంటిని ఏకాదశ రుద్రులనుగా భావన చేసి ఉపవర్ణించినట్లు కనబడుచున్నది. ఆపస్తంబ ధర్మసూత్రాదులందలి రుద్రదేవతాక మంత్రముల వినియోగ విధమును చూడగా స్థాన పవిత్రతమ కాపాడు సకల జగద్వ్యాపి సకల వస్త్వాత్మకతత్త్వమునుగా రుద్రుని మన పూర్వు లుపాసించినట్లు కనబడును. అతడు సక లౌషధీ సంచయమును తన వశమున నిలుపుకొని లోకరక్ష సేయుచుండును. యజురారణ్యకాను సారము ఏకాదశ రుద్రుల నామములును ఇట్లున్నవి. 1. ప్రభ్రాజమానులు 2. వ్యవదాతులు 3. వాసుకి వైద్యుతులు . రజతులు 5. పరుషులు 6. శ్యాములు 7. కపిలులు 8. అతిలోహితులు 9. ఊర్ధ్వులు 10. అవపతంతులు 11. వైద్యుతులు.

ఇవి యన్నియు వారి లక్షణములను తెలుపునవిగా కనబడుచున్నవి. ఏలయన 1. విశేషముగా ప్రకాశించువారు 2. మిక్కిలి తెల్లనివారు మొదలగునవి ఈ నామములకు అర్థములు.

ఇక పురాణ వాఙ్మయమున వీరి పేరులు వేరువేరుగా కనబడుచున్నవి. శ్రీమత్స్య మహాపురాణమున నూట ఏబది రెండవ యధ్యాయమున 19వ శ్లోకము:

కపాలీ పింగళో భీమో విరూపాక్షో విలోహితః ।
అజేశః శాసన శ్శాస్తా శంభు శ్చండః కుశ స్తథా.

అందే 170వ అధ్యాయమునందు-

నిర్ఋతిశ్చైవ శంభుర్వై తృతీయ శ్చాపరాజితః ।
మృగవ్యాధః కపర్దీ చ దహనోఽథ ఖరశ్చ వై.
అహిర్బుధ్న్యశ్చ భగవా న్కపాలీ చాపి పింగళః ।
సేనానీశ్చ మహాతేజా రుద్రా స్త్వేకాదశ స్మృతాః.

మత్స్య పురాణమున ఐదవ అధ్యాయములో

అజైకపా దహిర్బుధ్న్యో విరూపాక్షోఽథ రైవతః ।
హర్యశ్వో (హరశ్చ) బహురూపశ్చ ప్రబలశ్చ సురేశ్వరః.
సావిత్రశ్చ జయంతశ్చ పినాకీ చాపరాజితః ।
ఏతే రుద్రాః సమాఖ్యాతా ఏకాదశ గణేశ్వరాః.

మరియొక చోట ఈ రుద్రుల పేరులు ఇట్లున్నవి:

"అజైకపా దహిర్బుధ్న్యో విరూపాక్షః సురేశ్వరః ।
జయంతో బహురూపశ్చ త్ర్యంబకోఽప్యపరాజితః ।
వైవస్వతశ్చ సావిత్రో హరో రుద్రా ఇతి స్మృతాః."
ఇతి జటాధరః. ఇతి శబ్దకల్పద్రుమే వాచస్పత్యేచ.

ఈ శబ్దకల్పద్రుమ వాచస్పత్యములందే- ఈ రుద్రనామములు శ్రీమన్మహా భారతమునందు ఇట్లున్నవని వ్రాయబడియున్నది: 1. అజః- 2. ఏకపాత్ 3. అహిర్బుధ్న్యః 4. పినాకీ 5. అపరాజితః 6. త్ర్యంబకః 7. మహేశ్వరః 8. వృషాకపిః 9. శంభుః 10. హరః 11. ఈశ్వరః- అని మహా భారతమున దానధర్మ పర్వమునందు కలదు. అని.

గరుడ పురాణమునందు :

అజైకపా దహిర్బుధ్న్యి స్త్వష్టా రుద్రశ్చ వీర్యవాన్ ।
త్వష్టుశ్చా ప్యాత్మజః పుత్రో విశ్వరూపో మహాతపాః.
హరశ్చ బహురూపశ్చ త్ర్యంబక శ్చాపరాజితః ।
వృషాకపిశ్చ శంభుశ్చ కపర్దీ రైవత స్తథా ।
ఏకాదశైతే కథితా రుద్రా స్త్రిభువనేశ్వరాః. (6 అ.)

ఇందు 'త్వష్టా' అనుదానికి మారుగా 'కృత్తివాసాః' అని అగ్ని పురాణమున కనబడుచున్నది.

ఇట్లు ఈ పౌరాణిక రుద్రుల నామములు పదునొకండును ఈషదీషద్భేదముతో కనబడుచున్నవి. కాని ఇందు ఏపురాణమునందలి ఏఏ నామములు ప్రామాణికములు? ఏవి అప్రామాణికములు? అనికాదు విచారణ చేయవలసినది;

ఈ రుద్రులేకాని ఆదిత్యులేకాని సాధ్యమరుత్ ప్రభృతి దేవతలేకాని- ఈ దేవతల తాత్త్విక రూపము ఈ ప్రపంచ ప్రవృత్తిలో ఏమి ఆయియుండును? సృష్టియందలి ఏ మూర్తామూర్త తత్త్వములను మన పూర్వులు ఈ పేరులతో చెప్పిరి? అని విచారణ చేయవలెను. ఆ వాస్తవికతా దృక్కుతో ఆయా విషయములను ఎరిగి ఆస్తికతా బుద్ధితో వానిని విశ్వసించి ఆయా దేవతల నారాధించవలయుచు. అంతేకాని దేనిని కాని అవిచారితముగ విశ్వసించుట కాని-మొదలే వానిని నమ్మని దృక్కుతో చూచుట కాని-ఈ రెండును అనుచితములే.

## విశ్వే దేవులు

'విశంతి కర్మసు- ఇతి విశ్వే' 'ఆయా కర్మానుష్ఠానములందు ఆరాధ్యులుగా ప్రవేశమును పొందియున్నవారు' అని అమరకోశ సుధా వ్యాఖ్యయందు 'విశ్వ' నామ నిర్వచనము; వీరు పదిమందియని పురాణములందున్నది. కాని ఆయా కర్మానుష్ఠానములందు ఈ పదిమంది నుండి ఇద్దరనిద్దరను మాత్రమే గ్రహించి ఆరాధించుచుందురు. వీరు 'విశ్వా' అనునామెకు పుత్త్రులని పురాణములలో చెప్పబడినది.

వీరి నామములు :

వసుః సత్యః క్రతు ర్దక్షః కాలః కామో ధృతిః కురుః।
పురూరవా మాద్రవాశ్చ విశ్వేదేవా దశ స్మృతాః. (ప్రకీర్తితాః).

సప్త మరుత్తులు - (మత్స్య - సృష్ట్యధ్యాయమున)

"ఆవహః ప్రవహశ్చైవ సంవహ శ్చోద్వహ స్తథా।
వివహాఖ్యః పరివహః పరావహ ఇతి స్మృతాః."

వీరి ఉనికి బ్రహ్మాండమునందు ఏఏ పొరలలో ఎచ్చటెచ్చట కలదోకూడ కూడ మన ఆర్ష వాఙ్మయమున చెప్పబడినది.

## ద్వాదశాదిత్యులు.

'ఆదిత్యులు' అను పదము రూఢముగా పండ్రెండు మాసములకు అధిపతులగు సూర్యదేవతాభేదములను చెప్పును. అనగా సూర్యుడొక్కడేయయినను ఆయా మాసములందు రవి పొందు దశా విశేషములు ఇవి యని స్పష్టము. వారిపేరులు:

ధాతా మిత్రోఽర్యమా రుద్రో వరుణః సూర్య ఏవచ।
భగో వివస్వాన్ పూషా చ సవితా దశమః స్మృతః॥
ఏకాదశ స్తథా త్వష్టా విష్ణు ర్ద్వాదశ ఉచ్యతే.

మత్స్య పురాణమున భువనకోశ ప్రకరణమున జ్యోతిర్వ్యవస్థయందు చెప్పినదానిని బట్టి వీరి నామములును వీరి క్రమమును ఇది:

1. ధాతా 2. అర్యమన్ 3. మిత్రః 4. వరుణః 5. ఇంద్రః 6. వివస్వాన్ 7. పర్జన్యః 8. పూషన్ 9. హంసః 10. భగః 11. త్వష్టా 12. విష్ణుః.

ఆరణ్యక శ్రుతియందు (-ప్రశ్న-2) ఒకచోట

"మిత్రశ్చ వరుణశ్చ దాతా చార్యమాచ (హంస) అంశశ్చ ఇంద్రశ్చ వివస్వాంశ్చ"

అని ఏనిమిది నామములే కనబడుచున్నవి.

ఇది రుద్ర వసు విశ్వేదేవాదిత్యాదుల పేర్లను దక్షాదులగు ప్రజాపతుల పేర్లను ఒకచోట వచ్చినవే మరి

యొక చోటను కన-బడుచున్నవి. వీని నిరుక్తార్థమును వీని తాత్త్వికార్థమును ఎరిగినచో ఇట్టి సంమిశ్రణమునకు హేతువు తెలియగలదు. విచారించనిచో అంతయు గందరగోళమే.

## పురాణ కథలలో కొన్ని చమత్కారములు:

ఈ ద్వాదశాదిత్యులలో మిత్రుడు అనగా ఉదీయ మాన సూర్యుడు; 'వరుణుడు' అస్తంగచ్ఛత్సూర్యుడు; వీరు ఇరువురును లేదా సూర్యుని ఈరెండు దశలును ఏకకాలమున ఉండునవికావు; దీనిని దృష్టియందుంచుకొని అగస్త్యోత్పత్తి కథలో (అ. 61) ఊర్వశి మిత్రావరుణులను ఇరువురను ఒకేమారు సంతోషపెట్టజాలక పోయెనని చెప్పబడినది. ఈ కథయందు 'ఊర్వశియు' సృష్టియందలి తేజో విశేషాత్మిక యగు ఒకానొక శక్తియేయని వేద పురాణ కథలయందలి సన్నివేశములబట్టి తెలియును.

## పితృగణముల విషయము.

హరి వంశమునందు ఈ శ్లోకము కలదు:

"అమూర్తానాంచ మూర్తానాం పితౄణాం దీప్తతేజసామ్।
నమస్యామి సదా తేషాం ధ్యాయినాం యోగచక్షుషా."

"అమూర్తులను-మూర్తులను (రూపములేనివారును-రూపము కలవారును) దీపించు తేజస్సు కలవారును యోగ శక్తి సంపన్నమగు నేత్రముతో ధ్యానసిద్ధ దృష్టితో (పరోక్ష విషయములను గూడ ప్రత్యక్షమున ఉపస్థితములయి యున్న వానినిగా) చూచువారును ఇట్టి యోగచక్షువుకల వారిచే ధ్యానింపబడువారును అగు పితరులను సదా నమస్కరింతును."

ఈ పితరులును గణదేవతలే-వీరు ఒక్కొక్క గణమున ఏడేసి మంది చొప్పున ఏడు గణములుగా నున్నారు. ఇందును అమూర్త గణములు మూడు : 1. వైరాజులు 2. అగ్నిష్వాత్తులు 3. బర్హిషదులు; మూర్తగణములు నాలుగు : 1. సోమపులు 2. హవిష్మంతులు 3. ఆజ్యపులు 4. సుకాలినులు; ఇందును వైరాజులను పితరుల కన్య పార్వతీమాతయగు 'మేనా'.

కౌశికవంశీయ విప్రకుమారులు-పితృనుగ్రహమందుట.

కౌశిక వంశీయులగు విప్రకుమారులు ఏడుమంది పితరుల యనుగ్రహమందిన వృత్తాంతము శ్రీమత్స్యమహా పురాణమున శ్రాద్ధ కల్పాధ్యాయములందు (అ. 20-21) కలదు. వీరి విషయము హరివంశమున - హరివంశపర్వమున ఇరువది మూడవ అధ్యాయమున ఇట్లున్నది:

శ్లో. 17. జ్ఞాన ధ్యాన తపః పూజా వేద వేదాంగ పారగాః ।
స్మృతిమంతోఽత్ర చత్వార స్త్రయస్తు పరిమోహితాః.

ఇరువది నాలుగవ యధ్యాయమున ఇట్లు చెప్పబడినది:

శ్లో. 20. సప్త వ్యాధా దశార్ణేషు మృగాః కాలాంజనే గిరౌ ।
చక్రవాకాః శరద్వీపే హంసా స్సరసి మానసే.

21. యే స్మ జాతాః కురుక్షేత్రే బ్రాహ్మణా వేదపారగాః ।
ప్రస్థితా దీర్ఘ మధ్వానం యూయం తేభ్యోఽపసీదత.

(అ. 24-శ్లో. 20-21) "మొదట ఎవరు కురుక్షేత్రమునందు వేదపారంగతులగు బ్రాహ్మణులుగా జన్మించిరో- వారే తరువాత క్రమముగా దశార్ణ దేశములందు ఏడుమంది వ్యాధులుగా - కాలాంజన (కాలంజర) పర్వతమునందు ఏడు

మృగములు (లేళ్లు)గా-శరద్వీపమునందు చక్రవాక పక్షులుగా-మానస సరస్సునందు హంసలుగా (కడపటి జన్మమున పాంచాలదేశ రాజధానీ నగరమునందు బ్రాహ్మణ కుమారులుగా మంత్రి కుమారులుగా) జన్మించిరో (వారిలో కొందరు పూర్వజన్మ స్మృతి జన్మసిద్ధముగానే కలిగియుండి) దీర్ఘ మార్గమున (మహాప్రస్థాన విధానమున) బయలుదేరిపోయి యున్నారు. (మిగిలిన) మీరును వారిని కలియుటకై శ్రమ పడుడు."

(అ. 23-17 శ్లో.) ఈ కౌశిక పుత్త్రుల ఏడు మందిలో నలుగురు పూర్వజన్మస్మృతి కలవారు; ముగ్గురు వరి మోహితులు; ఏమయినను వీరు అందరు జ్ఞాన ధ్యాన తపః పూజలయందును వేదవేదాంగములందును పారంగతులే (తుద వరకు చేరినవారే) కాని సామాన్యులు కారు."

## గణదేవతా విశేషములు-వారి సంఖ్య:

"ఆదిత్య విశ్వ వసవ స్తుషితాఽఽభాస్వరాఽనిలాః ।
మహారాజిక సాధ్యాశ్చ రుద్రాశ్చ గణదేవతాః."
(అనియమరకోశ స్వర్గవర్గము)

వీరి సంఖ్య అమరసుధా వ్యాఖ్యయందు ఇట్లున్నది :

"ఆదిత్యా ద్వాదశ ప్రోక్తా విశ్వేదేవా దశ స్మృతాః ।
వసవ శ్చాష్టసంఖ్యాతాః షట్త్రింశ త్తుషితా మతాః.
ఆభాస్వరా శ్చతుః షష్టి ర్వాతాః పంచాశదూనకాః ।
మహారాజికనామానో ద్వే శతే వింశతి స్తథా ।
సాధ్యా ద్వాదశ విఖ్యాతా రుద్రా ఏకాదశ స్మృతాః."

తా. ఆదిత్యులు-12; విశ్వేదేవులు-10; వసువులు-8; తుషితులు-36; ఆభాస్వరులు-64; మరుతులు-49; మహారాజికులు-220; సాధ్యులు-12; రుద్రులు-11; మొత్తము 422 మంది.

## సంఖ్యలతో సంబంధించిన శబ్దములు

## ముప్పది ముగ్గురు దేవతలు

ఆదిత్యులు12+రుద్రులు 11+ వసువులు 8+ఇంద్రప్రజాపతులు లేదా పదిమంది విశ్వేదేవతలలో ఇద్దరిద్దరు లేదా అశ్వి దేవతలు ఇద్దరు కలిసి ముప్పదిమూడు.

ఈ చెప్పిన క్రమమున ఊహించుటకు శతపథ బ్రాహ్మణము సందలి (14 కాం. 8అ. 1 బ్రా. 36) కండికా వచనము సాధకము; కాని ఇందే (13 కాం. 6 అ. 3 బ్రా. 4 కండికా) "అష్టౌ వసవః ఏకాదశరుద్రాః ద్వాదశాదిత్యాః-తే ఏకత్రిగ్ంశత్- ఇంద్రశ్చైవ-ప్రజాపతిశ్చైవ త్రయస్త్రిగ్ం శత్." అని యున్నది. దీనినిబట్టి చివరి ఇద్దరును ఇంద్రప్రజాపతులు-అని గ్రహించవలెను. ఇది పరమ ప్రమాణవచనము.

## ఊర్ధ్వలోక సప్తకమ్

అధ్యాయము-61. (మత్స్య)

భూర్లోకోఽథ భువర్లోకః స్వర్లోకోఽథ మహ ర్జనః ।
తప స్సత్యం చ సప్తైతే దేవలోకాః ప్రకీర్తితాః.

## అధోలోక సప్తకమ్

అతలం వితలం చైవ సుతలం చ తలాతలమ్ ।
రసా మహాతలే చైవ పాతాల మితి సప్త చ ।
అధోలోకాస్తు సప్తైతే పురాణేషు ప్రకీర్తితాః.

## ముఖశబ్దార్థము

మత్స్య-159 అ. కుమారస్వామి చరితమున ఈ 'ముఖ'పదము కలదు.

1. ముఖమ్ 2. హృదయమ్ 3. రహస్యమ్ 4. ఉపనిషత్. ఇందు

1. ముఖమ్ అనునది ఆయా దేవతల మహిమములను తెలుపుచు వారికి సంబంధించిన వృత్తాంతములను దెలుపు ఉపాఖ్యాన విశేషముల రూపముననుండు వాఙ్మయము; ఉదా: స్కందముఖమ్-మత్స్య-159 అధ్యాయము; 2. హృదయమ్; ఆయాదేవతల స్వరూప లక్షణాదికమును తెలుపు వాఙ్మయము; 3. రహస్యము కూడ ఇంచుమించుగ హృదయము వంటిదే; 4. ఉపనిషత్ - తత్తద్దేవతా విషయక తత్త్వ వివేచనా పరమగు వాఙ్మయ విశేషము.

## మత్స్య. వ్రతాధ్యాయము-పంచరత్నములు

ఆయా వ్రతాదులందు వినియోగించవలసిన పంచరత్నముల విషయములో-

"పంచ మహాభూతాత్మికా పంచరత్నాత్మికా వా వైజయంతీ మాలా-ఉక్తం చ విష్ణుపురాణే-
పంచరూపా తు యా మాలా వైజయంతీ గదాభృతః (తా)
సా భూత హేతుసంఘాతా భూతమాలా భవే ద్ద్విజః ఇతి.
అత్ర పంచరూపేతి పదం ముక్తా మాణిక్య మరకతేంద్రనీల వజ్ర సమాన వర్ణేతి వ్యాచక్షతే - విష్ణురహస్యేఽపి-

పృథివ్యా నీలసంజ్ఞాన మద్భ్యో ముక్తాఫలాని చ ।
తేజసః కౌస్తుభో జాతో వాయో ర్వైదూర్య సంజ్ఞకమ్ ।
పుష్కరా త్పుష్పరాగస్తు వైజయంత్యా హరే రిమే. ఇతి"
అని సంప్రదాయజ్ఞుల వచనము.

వైజయంతి యను మహావిష్ణు వక్షః స్థితమగు మాల పంచ మహాభూతాత్మకము అథవా పంచరత్నాత్మకము; గదాధారి యగు మహావిష్ణువు ధరించు 'వైజయంతిమాల' పంచ(రత్న)రూప; అది మహాభూత సంఘాత(సముదాయ)రూప; కావున అది భూతమాల యనదగి యున్నది; అని విష్ణుపురాణవచనము; ఇందు 'పంచరూపా' అనగా ముత్తెములు మాణిక్యములు మరకతములు ఇంద్రనీలములు వజ్రములు-ఈ రత్నములు-వీని వన్నెలు కలది-యని పెద్దలు వివరించుచున్నారు. విష్ణు రహస్యమను గ్రంథమునందును "ఇంద్ర నీలము పృథివినుండి ముత్తెములు జలమునుండి కౌస్తుభము తేజస్సునుండి వైదూర్యము వాయువునుండి పు(ష్ప)ష్యరాగము ఆకాశమునుండి జనించినవి. ఇవియే శ్రీహరి వైజయంతీ మాలయందలి రత్నములు." అని యున్నది. కనుక పంచరత్నములు అనగా ఈ ఐదును అని గ్రహించవలయును.

## సౌభాగ్యాష్టకమ్

ఇక్షవ స్తవరాజశ్చ నిష్పావో జాతిధాన్యకమ్ ।

వికారవచ్చ గోక్షీరం కుసుంభకుసుమం తథా ।
లవణం చాష్టమం చాత్ర సౌభాగ్యాష్టక ముచ్యతే.

1. చెరకు 2. యవలు మొదలగువానినుండి తీసిన చక్కెర (వెదురునుండి తీసిన చక్కెర అని కొందరు) (Glucose) 3. బొబ్బరలు 4. జాజికాయ 5. ధనియాలు 6. విరిగిన ఆవు పాలు; 7. కుంకుమ పూవు 8. ఉప్పు.

## చతుర్దశ మన్వంతరాణి:

ఇహ ఖలు బ్రహ్మకల్పే చతుర్దశ మనవః క్రమశః క్రమంతే; తద్యథా-
స్వాయంభువో మనుః పూర్వం తతః స్వారోచిషో మనుః ।
ఔత్తమ స్తామసశ్చైవ రైవత శ్చాక్షుష స్తథా.
షడేతే మనవోఽతీతా అథ వైవస్వతో మనుః ।
సావర్ణాః పంచ రౌచ్యశ్చ భౌచ్య(త్య) శ్చాగామిన స్త్వమీ.
తత్ర సవర్ణాయాః సంబంధినః సుతాః పంచాపి సావర్ణాః-సావర్ణయో మనవః.

ఇంతవరకును వివరించినవేకాక- సప్తధాన్యములు- అష్టధాన్యములు-అష్టాదశధాన్యములు- పంచ బిల్వములు మొదలగునవి ఎన్నియో పదములు-వివరణమును కోరునవి-యున్నవి. అవి జిజ్ఞాసువులు సంప్రదాయజ్ఞులవలన తెలిసి కొన ప్రార్థన.

## శ్రీమత్స్య మహాపురాణము
## ఆయా అధ్యాయములందలి విశేషాంశములు:

1. అ. శ్లో. 9-10 ఋషులు సూతుని నాలుగు ప్రశ్నము లడిగిరి: 1. భగవానుడు మత్స్య రూపమునంది జగములను ఎట్లు సృష్టించెను? 2. శివుడు భైరవుడు ఎట్లయ్యెను? 3. శివుడు పురారి (త్రిపుర శత్రువు) ఎట్లయ్యెను? 4. ఆ వృషభ ధ్వజుడు కపాలి ఎట్లయ్యెను? ఈ ప్రశ్నములకు సమాధానములు అచ్చటచ్చట చెప్పబడినవి. గమనించవలెను.

శ్లో. 21. 'కేశవాన్' ఇది 'కః-శవాన్' 'ఎవరవు నీవు?' అని అర్థము కాదు; కమ్-జలము; కే-జలే; నీటియందు శవతి-ఉండును;కావున కేశవాన్ (కేశవాన్); మత్స్యము-అని యర్థము.

2 అ. 1 శ్లో. ఉత్తర క్షయః-ప్రలయః; అస్యైవ ప్రతిసర్గః-ఇత్యపి వ్యవహారః; ప్రతిసర్గ శబ్దమునకు ప్రళయము అనియు అర్థము కలదు; ఇట్లు ఉత్తరక్షయ-ప్రళయ-ప్రతిసర్గ శబ్దములు పర్యాయములు.

శ్లో. 8. ప్రళయకాలీన సప్త మేఘముల నామములు:

సంవర్తో భీమనాదశ్చ ద్రోణ శ్చేంద్రో వలాహకః ।
విద్యుత్పతాకః శోణస్తు సప్తైతే లయవారిదాః.

అర్థము స్పష్టము.

3 అ. 5 శ్లో. మానసులు అగు సుతులు: మనసః-సంకల్పాత్; మనస్సునుండి-అనగా సంకల్పము (ఇచ్ఛాశ క్తి త్త్వము)నుండి జనించినవారు;

వేదాభ్యాస రతస్యాస్య ప్రజాకామస్య మానసాత్ ।
మనసః పూర్వసృష్టా వై జాతా స్తేనైవ మానసాః.

వేదాభ్యాస నిరతుడగు బ్రహ్మదేవుని మానసమునుండి (సంకల్ప వికల్పాత్మక చిత్తవృత్తినుండి) ప్రవర్తిల్లిన మనస్సు (సంకల్పము)నుండి మొదటగా సృష్టింపబడినవారు కావున మరీచ్యాదులు 'మానసులు' అగు పుత్త్రులు అయిరి.

15-23 శ్లో. 'సృష్టం' అనెడు పదము ఇచట 'ప్రకృతి' అను అర్థమున ప్రయోగింపబడినది. 15లో-

'ఏతై రేవ సమం సృష్టం కరోతి వికరోతిచ.'
సృష్టం-ప్రకృతిః; ఏతైరేవ సమం- ఏతైరేవ
తత్త్వైః సహ; కరోతి- ప్రవర్తతే; పరిణమతే;
వికరోతి- ప్రవర్తయతి; పరిణమయతి చ; ఇత్యర్థః.
23లో-'మనః సృష్టం వికురుతే నోద్యమానం సిసృక్షయా.'
సృష్టం-ప్రకృతిః; సిసృక్షయా-స్రష్టుమీ త్యాకారయా భగవతః
ఇచ్ఛయా; నోద్యమానం-ప్రేర్యమాణం సత్; మనః-
సంకల్ప వికల్పాత్మకాం చిత్తవృత్తిం; వికరోతి-ప్రవర్తయతి; పరిణమయతి; ఇత్యర్థః.

4 అ-శ్లో. 23; 'భరతః'; లభించు ప్రతులలో ఇచట 'భరతః' అనియున్నది; కాని ఆ పదమునకుగల అర్థమునకు ఇచట ప్రసక్తిలేదు; బిభర్తి-భరించును; పోషించును; అను అర్థమున వ్యుత్పన్నమగు 'భరతః' (త-ప్రత్యయము) అను అర్ష రూపమునకు 'అగ్ని' 'ప్రజాపతి' అని అర్థములు; 2వ అర్థముతో ఈ రూపమే ఇచట గ్రహించబడినది.

22-శ్లో. ఋషుల ప్రశ్నమున 'యద్వంశే' అనియున్నది. 'యద్' ఇచట సర్వనామముకాదు; 'యదు' అని యర్థము; 'యదువంశే' అన్నచో ఛందోభంగము; కనుక రూప వికృతితో 'యద్' అని కాని ఛందోభంగముతో 'యదు' కాని ఇక్కడ అంగీకరించవలసినదే.

7 అ-15 శ్లో. 'భవ్యం'-రూపమ్ః ప్రతిమా; అను అర్థమున ఈ పదము ఇచట ప్రయోగింపబడినది.

'కామనామ్నా హరే ర్భవ్యం స్నాపయే ద్గంధవారిణా.'
'గంధోదకేన (పన్నీటితో) హరేః భవ్యం-ప్రతిమాం-
కామనామ్నా-'మన్మథరూపం హరిం' ఇత్యుద్దిశ్య;
స్నాపయేత్-స్నానం కారయేత్; ఇత్యర్థః.

శ్లో-36. ఈ శ్లోకపు ఉత్తరార్ధమునకు ప్రకృత ప్రకరణముతో సంబంధము కుదురదు.

శ్లో. 58. 'శృత్వా' అనునది సరియగు రూపము; 'శ్రుత్వా' అను రూపముకాదు; 'చీల్చబడి' అని అర్థము;

ఏవ మేకోనపంచాశ చ్ఛృత్వా తే (మారుతాః) రుదితా భృశమ్.'
'ఏవం-శృత్వా (చీల్చబడి); నిష్పన్నాః; ఏకోనపంచాశత్-
సంజాతాః; తే- మారుతాః; భృశం-అతీవ; రుదితాః-ఇత్యర్థః.

11 అ. 30 శ్లో. 'తేజోహ్రుతం' - తేజసి హ్రుతం; తేజస్సు విషయమున; అపహరించబడిన; తక్కువ చేయ బడిన; లేదా-హ్రుతం-హ్రాసితం; తేజః యస్య సః; తక్కువ చేయబడిన తేజస్సు కలవాడు.

'త్వష్టృ' పదము వాస్తవమున 'తష్టృ' అనునది; తక్ష్+తృ (చ్)>తష్+తృ>తష్-టృ>తష్టృ); అగును; చెక్కెడువాడు అని యర్థము; ఇతడు దేవతల మొదటి వర్ధకి (వడ్లంగి); ఆది ప్రజాపతులలోనివాడు.

'నాసత్యౌ' (అశ్వి దేవతలు); ఈ విషయమున పురాణములలో ఇచ్చుచున్న కథ జుగుప్సాకరముగా నున్నది; ఇందలి సత్యా సత్యములు కాని తర్క సంగతమగు రహస్యార్థము కాని విచారించదగినదికాదు; కాని శబ్ద పరిణామమును

ఇట్లూహించవచ్చును; అనస్+త్యా>నాస్-త్యా ('అన'లోని 'అ' లోపించి-'న' లో చేరి'నా' ఐనది; నాస్+(అ)+త్యా> నాసత్యా-అగును. అనస్-అనగా బండి; అశ్విదేవతలు త్రిభుజాకారపు బండియందున్నట్లు కనబడుదురు; అనుట వేదాదికమందు ప్రసిద్ధము; దృష్టికిని అట్లే గోచరించును; కనుక 'నాసత్య' శబ్దమునకు యాస్కాచార్యులు చెప్పినది ఎట్లున్నను ఈ విధమగు శబ్ద రూప పరిణామము సమంజసమని తోచుచున్నది.

ఇచ్చటనే 'దస్రోష్ఠ సంజాతౌ' అని వీరిని గూర్చి మరియొక పదము; 'దస్రము' అనగా అశ్వము; 'ఓష్ఠము' అనగా పెదవి అను అర్థములు ఎట్లున్నను-వహ (వహ-ప్రాపణే-ఒకచోటినుండి మరియొక చోటికి తీసికొనిపోవుట); ఈ 'వహ' ధాతువునుండి కర్మార్థమున 'థ' ప్రత్యయముచే వహ్+థ) ఉహ్+థ>ఉష్+థ>ఓష్+ఠ-కాగా 'ఓష్ఠ' శబ్దము ఏర్పడును; బండియని యర్థము; ఇట్లు 'దస్రోష్ఠము' అనగా గుర్రములచే లాగబడు బండి; దానినుండి పుట్టిన వారని అర్థము.

56. శ్లో. 'పవిత్రకమ్'-దండము; దండమును ధరించిన బ్రహ్మచారులు మొదలగువారు పవిత్రకులు.

26-34 శ్లోకములు; ఈ సందర్భములో శ్రీదేవీ భాగవతమునందును-లభించు మత్స్యపురాణపు ప్రతులందును 'మేరుదేశము' అని యున్నది; భూలోకమునందు మేరుదేశము అనునది ఊహించుటకంటె దీనిని 'మరుదేశము' అని గ్రహించుట సమంజసతరము; కనుక ఆ పాఠమే ఇచట గ్రహించబడినది.

12 అ. 15 శ్లో.
'ఏవం పురూరవాః పుంసో రభవ ద్వంశవర్ధనః.'

ఇచ్చట 'పుంసోః' అనగా 'తనకు జన్మకారణులగు వారికి' అని అర్థము; పురూరవసునకు తల్లి- స్త్రీత్వమునందిన ఇలుడు: ఇతడు సూర్యవంశీయుడు: ఈ పురూరవసుని తండ్రి బుధుడు చంద్రవంశీయుడు: అతడు ఈ ఇరువురకును వంశవర్ధనుడు-వంశమునకు వృద్ధిని-శుభమును-ఆనందమును-కలిగించువాడు. (సూతేః సః ప్రసవే పుమాన్. పుంస్ = సవితా; జన్మకారణుడు)

15 అ. 7 శ్లో. 'వదతాం వరః'; వదంతః- వ్యక్త (స్పష్ట) వాక్కులతో మాటలాడగలవారు; పురుషులు (మానవులు); వారిలో వరః- శ్రేష్ఠుడు; 'పురుషోత్తముడు'అని అర్థము.

15 అ. 31 శ్లో. 'అగ్నిషోమయమాభ్యామ్' 'యములు' అనగా 'జంటగా నున్నవారు'; అగ్నిషోములు' అనెడు దేవతా ద్వంద్వమునకు (దేవతల జంటకు) అని అర్థము.

16 అ; 27 శ్లో. మేక్షణమ్; మిషు- సేచనే; భ్వాది; 'ల్యుట్' ప్రత్యయము; మిష్+అన>మేక్ష్+అన>మేక్షణమ్; ఇది ఆర్షరూపము; ద్రవద్రవ్యమును చిలుకరించుటకు ఉపయోగించు సాధనము; శ్రౌత సంబంధి.

## చండ శబ్దార్థము (శ్రాద్ధకల్పము)

'చండీ' 'చండ' శబ్దములు రెండును 'చడి' కోపే అను ధాతువునుండి నిష్పన్నములు అనియు అందుచే 'కోపముచే తీవ్రమగు స్వభావముకల'- అని ఈ శబ్దములకు అర్థము అనియు వాడుకలో నున్నది. కాని మత్స్యపురాణములో ఇరువదియొకటవ అధ్యాయమున (శ్రాద్ధకల్పమున)ఈ శబ్దము 'శౌండః' 'నేర్పరి' 'కుశలుడు' అనునర్థమున ప్రయోగింపబడినది. దీనిని బట్టి ఈ రూపము 'చడి' ధాతువునుండి నిష్పన్నమగుట మాత్రమేకాక సంస్కృతమునందే శౌండ శబ్దమునుండి వర్ణ వికృతిచే ఏర్పడినదియు కలదు అని చెప్పవచ్చును. శ-చ-హల్లులు తాలవ్యములు; అచ్చులలో 'ఔ' కంఠోష్ఠ్యము కాగా 'అ' కంఠ్యము. ఇటు ఈ రూపమునకు భాషాశాస్త్రీయ వ్యుత్పత్తి చెప్పవచ్చును

## 'స్వధా'శబ్ద వ్యుత్పత్తి (శ్రాద్ధకల్పము)

పితృదేవతోద్దేశక కర్మములందు 'స్వధా' శబ్దమును దేవతారాధన విషయక కర్మానుష్ఠానములందు 'స్వాహా' శబ్దమును మానవులకు అన్నదానాదికము చేయునపుడు 'హంత' శబ్దమును వినియోగించవలెను. అనుట ఆర్ష సంప్రదాయము. వీనినే 'స్వాహా'కార 'స్వధా'కార 'హంత'కారములందురు.

ఇందు 'స్వధా' శబ్దమును 'నాందీ' 'వృద్ధి' 'శుభ' శ్రాద్ధమునందు వినియోగించరాదు. దానికి మారుగా 'స్వదితమ్' అను శబ్దమును వినియోగించవలెను. అని మత్స్యమహాపురాణము శ్రాద్ధకల్పమున చెప్పుచున్నది. వ్యుత్పత్తిచే ఈ రెండు శబ్దములును సమానార్థకములే.

వ్యుత్పత్తి : 'సు' అను ఉపసర్గముపై అద-(అద్) ధాతువునుండి 'క్త' (త) ప్రత్యయము చేరగా ఇట్ (ఇ) ఆగమము కాగా సు-అద్-ఇ-త > 'స్వదిత' అగును. 'చక్కగా తినబడినది అగుగాక!' అని అర్థము.

సు-అద్+అస్ (భావార్థమున) > స్వదస్ > స్వదహ్ (స్>హ్) > స్వధా అగును. హకారమహాప్రాణాంశము దకారములో చేరినది- కనుక రెండు శబ్దములకును వ్యుత్పత్తియు అర్థమును ఒక్కటియే. శుభాశుభ కర్మభేదమును బట్టి రూపభేదముతో ఈ శబ్దములకు వినియోగమున భేదము.

## గాథాః (గాథలు)

'గాయతి చోదితాః మంత్రాః- గాథాః' అని యజురారణ్యక భాష్యమున శ్రీ సాయనాచార్యులు. దీనికి వివరణము : 'గాయతి- అయం ఇత్థం గాయతి- ఇతిరూపైః వాక్యైః- చోదితాః విహితాః యే మంత్రాః- తాః గాథాః.'

ఈతడు ఇట్లు గానము చేయుచున్నాడు. అను ఇటువంటి వాక్యములతో చోదితములు- విహితములు- (చోదన అనగా విధి) అగు మంత్రములు 'గాథ'లు. గై-శబ్దే అను ధాతువునుండి 'థ' ప్రత్యయమును- స్త్రీత్వమున 'ఆ'ప్రత్యయమును.

## నారాశంస్యః.

ఈ 'నారాశంస్యః' శబ్దము 'నారాశంసీ'ప్రాతిపదికమునకు ప్రథమా బహువచన రూపము; 'నరాశంస'అను పదమును అనుసంధానముచేసి గ్రథనము (కూర్పు) చేయబడిన మంత్రములు 'నారాశంస్యః' 'నారాశంసీ మంత్రములు' అని యజురారణ్యక భాష్యమున సాయణాచార్యులు.

'హోతా యక్ష న్నరాశంసగ్ం'
ఇత్యాది రూపాః 'నరాశంస' పదేన గ్రథితాః మంత్రాః నారాశంస్యః ఇతి.

## కుతప శబ్దార్థము (శ్రాద్ధకల్పము)

ఈ విషయము మత్స్యమహాపురాణమున 22వ అధ్యాయమున శ్రాద్ధకల్పమున ఉన్నది. అచట కొంత వివరణము ఈయబడియున్నది. 'పాపము' కుత్సితము (నిందితము) అనబడును. ఈ చెప్పిన మధ్యాహ్నము ఖడ్గపాత్రము నేపాల కంబళము దీపము దర్భలు తిలలు గోవులు దౌహిత్రుడు(పుత్రీపుత్రుడు)అను ఎనిమిదియు కుత్సితమును సంతాపము నొందించును (సమ్-సమ్యగ్గముగా- తపింప- దహించ- జేయును) కావున వీనికి 'కుతప' అని వ్యవహారము. అని శ్లోకమునకు అర్థము. కు(త్సిత)+తప > కుతప.

కాని ఖడ్గ పాత్రము—నేపాల కంబళము-వంటి అర్థములలో ఈ శబ్దము ఈ వ్యుత్పత్తితో ఏర్పడినది కాదనియు మరి ఏదో భాషనుండి గ్రహింపబడియుండును. అనియు తోచును. మధ్యాహ్నము అను అర్థమున మాత్రము కుః- భూమిః- తప్యతే- అస్మిన్- కాలే- ఈ సమయమునందు భూమి తపింప (వేడెక్కునట్లు) చేయబడును. కావున 'కుతపము' అని చెప్పుట సమంజసము.

## షడశీతిముఖము (శ్రాద్ధకల్పాధ్యాయములు)

ఇది పుణ్యకాల విశేషము. దీని విషయము సూర్యసిద్ధాంతమునందు ఇట్లున్నది : (మానాధ్యాయః - శ్లో. 4.5.)

"తులాది షడశీత్యహ్నాం షడశీతిముఖం క్రమాత్ ।
త చ్చతుష్టయ మేవ స్యాత్ ద్విస్వభావేషు రాశిషు.
షడ్వింశే ధనుషో భాగే ద్వావింశేఽనిమిషస్యచ ।
మిథునాష్టాదశే భాగే కన్యాయాస్తు చతుర్దశే."

"రవి ఒక్కొక్క దినమునకు ఒక్కొక్క భాగ చొప్పున 360 దినములలో పండ్రెండు రాసులందు సంచరించును. రాశికి 30 భాగలు (Degrees); సూర్యుడు తులారాశియందు ప్రవేశించినది మొదలు ప్రతియొక ఎనుబది యారు దినముల(భాగల)సంచారమునకు ఒకసారి ఈషడశీతిముఖము అను పుణ్యకాలము వచ్చును; (షడశీతి = షట్ + అశీతి = 86); ఇట్లు ఈ పుణ్యకాలము ద్విస్వభావరాసులగు ధనుర్మీన మిథున కన్యారాసులలో రవియున్నకాలమున ఏర్పడును. అనగా తులా ప్రథమభాగ నుండి 86వ భాగ అనగా ధనువునందలి 26వ భాగయగును; దానినుండి 86 భాగ-మీనమునందలి 22వ భాగయగును; దానినుండి 86వ భాగ-మిథునమునందలి 18వ భాగయగును; దానినుండి 86వ భాగ-కన్య యందలి 14వ భాగయగును. ఇవి శ్రాద్ధాచరణ యోగ్యకాలములు.

ఇట్లు రవి తులయందు ప్రవేశించినది మొదలు నాలుగు షడశీతిముఖములకును 86 × 4 = 344 భాగలు (దినములు) అగుచున్నవి. ఇక సంవత్సరములో (భచక్రమునకు సంబంధించిన 360 భాగలలో) 14 భాగలు (దినములు) మిగిలి యుండును. ఈ పదునాలుగు దినములుకూడ అత్యంత పుణ్యదినములు. శ్రాద్ధాదులకు యోగ్యములు.

## గజచ్ఛాయ

ఇదియును శ్రాద్ధోచితమగు పుణ్యకాల విశేషము.

"సైంహికేయో యదా భానుం గ్రసతే పర్వసంధిషు ।
గజచ్ఛాయా తు సా ప్రోక్తా తత్ర శ్రాద్ధం ప్రకల్పయేత్."

పర్వసంధి యనగా పూర్ణిమా-కృష్ణ ప్రతిపత్‌లకును-అమావాస్యా-శుక్లప్రతిపత్‌లకును సంధికాలము; ఇట్టి అమావాస్యాశుక్లప్రతిపత్ సంధిరూపమగు కాలమున రాహువు రవిని పట్టినచో అట్టి పుణ్యకాలము "గజచ్ఛాయ" అనబడును. ఇందు శ్రాద్ధాచరణము అత్యంత పుణ్యప్రదము.

## విష్టి

తిథి వార నక్షత్ర యోగ కరణములు కాలపు పంచాంగములు; చంద్రసూర్యుల పరస్పర దూరముపై గణించబడునది యోగము; తిథి భుక్తిననుసరించి గణన చేయబడునది కరణము; ఇందు ఒక్కొక్కటి 30 గడియలు(12 గం)ఉండును కరణములు 11; ఇందు ఏడవది 'భద్రా' కరణము; దీనికే విష్టి అని పేరు. ఇది యంతయు దోషప్రదమే. (తిథి ప్రమాణమును బట్టి కరణ పరిమాణము మారవచ్చును.)

పిట్లన-ఇందలి మొదటి 5 గడియలు కార్యధ్వంసము-తరువాత 1 గడియ మరణము-తరువాత 11 ధననాశము-తరువాత 4 బుద్ధినాశము- తరువాత 6 కలహము తరువాత 3 సర్వనాశము కలిగించును.

ఈ విష్టిపురుషుని ఉత్పత్తికథ ఈ మత్స్యపురాణమున 11వ అధ్యాయమున నున్నది.

ఇట్లయినను ఇది శ్రాద్ధమాచరించ యోగ్యమగు మహా పుణ్యకాలము.

23 అ. శ్లో. 47. ఇందు చంద్రునకు పాపగ్రహత్వము చెప్పబడినది.

25 అ. 50 శ్లో. శుక్రవచనము :

'వధేన య స్తేన మే జీవితం స్యాత్.'

'యత్-తేన జీవితం మే వధే స్యాత్.'

'ఏలయన-అతనితో (నీవు-దేవయాని) జీవించుట నా వధతోనే జరుగును.'

63 శ్లో. 'వత్స్యతి మత్సమీపే:' నా సమీపమున నివసించును.' అని మాత్రమే అర్థముకాదు; సమీపము అను అర్థమున 'అంత' శబ్దము కలదు; కావున ఇకమీదట ఇతడు నాకు 'అంతేవాసి'-శిష్యుడు అగును. అని యర్థము.

26 అ. 17 శ్లో. కచుడు దేవయానితో-

గురుపుత్రీతి కృత్వాఽహం ప్రత్యాచక్షే; న దోషతః.

ఇందు-గురుపుత్రీతి కృత్వా-

అనునది 'గురుపుత్రివనుటం జేసి' అను తెలుగు రూపమునకు మూలము; మరియు-'దోషతః' అను 'పంచమ్యర్థక తసిల్' సాహచర్యముచే'పట్టి' యను పంచమీ విభక్త్యర్థక రూపమును 'చేసి' యనునదియును ఇంచుమించు సమానార్థకములని తోచును.

32 అ. 70 శ్లో.

'తమేవాసురధర్మం త్వ మాస్థితా న బిభేషి మామ్.'

పంచమ్యర్థక ద్వితీయా కారక విశేషము;

మాం న బిభేషి-మత్ (నావలననుండి) న బిభేషి-

(భయపడుచున్నదానవు కావు) అను అర్థములో.

40 అ. శ్లో. 1. ఆచార్యకర్మా-బ్రహ్మచారీ; యః-ఆచార్యే-కర్మ-వ్రతం-అధ్యయనవ్రతం-కరోతి- ఆచరతి-సః.

43 అ. 30 శ్లో. 'ప్రతిస్రోతః' సముద్రములో వచ్చు పోటు (Tide)

29 శ్లో. మహా+అహి-మత్-ఈ> మహా+అహి+ష్-మత్+ఈ>మాహిష్మతీ (మహా>మా) కర్కోటక సుతుడు-అగు మహాఽహి-గొప్పనాగుడు-తనకు అధిపతిగా కలది.

43 అ. 7-8 శ్లో. 'జి' ధాతువునుండి నిష్పన్నమగు 'జిత్' అనునది 'జి' అను రూపముతోకూడ కలదు; సహస్రజిత్; సహస్రజి; శతజిత్; శతజి; ఇట్లుండగా ఇంద్రజిత్-ఇంద్రజి అగుననుటకు చిన్నయసూరి తత్సమ ప్రకరణమున ఈ రూపము తత్సమత్వముచే వచ్చెనని వ్రాయుట అనావశ్యకమనవచ్చును.

43 అ. 35 శ్లో. 'అతి చలం-మిగుల చంచలము' అని అర్థము కాదు; చలం-అతీతాః-చంచలత్వమును అతిక్రమించినవి; నిశ్చలములు; స్తిమితములు-అని యర్థము.

44వ అధ్యాయము; ఇందు 34 శ్లో. తరువాత

'నాహం ప్రసూతా పుత్రేణ'

అను శ్లోకమునకు తరువాత 'భార్యా మువాచ'

ఇత్యాది శ్లోకము అన్ని ప్రతులయందును కనబడుచున్నది: కాని ఇది అన్వయమునకు సరిపోదు; కనుక ఇట ఇది అన్వ యానుసరణముగా 'భార్యా మువాచ' ఇత్యాది శ్లోకమునకు తరువాత చేర్చబడినది.

44 అ. 58 శ్లోకమున 'సహప్రజా' అను పాఠము 'సహ ప్రజాః' అని సవరించబడినది; ఇది 'సుప్రజాః' వలె సకారాంతమగు ఆర్షరూపము.

44 అ. 71 శ్లో. 'అథ' అనునది 'సు' అను అర్థమున:

'రథానా మథ ఘోషాణామ్;'

'అథఘోషాణామ్'='సుఘోషాణామ్'

'శోభనమగు ధ్వనులు కలిగిన' 'రథానామ్' 'రథములయొక్క' అని యర్థము.

45 అ. వృష్ణికి కుమారుడు దేవమీఢ్వాన్; అని 45వ అధ్యాయమునందలి 1-2 శ్లోకములు చెప్పుచున్నవి. కాని మరల 46వ అధ్యాయారంభమునందలి 1వ శ్లోకమున 'ఐక్ష్వాకీ' అనునామె శూరుడగు అద్భుతమీఢుషుని కనెను. అను అర్థమునిచ్చు 'ఐక్ష్వాకీ జనయామాస శూర మద్భుత మీఢుషమ్.' అను పంక్తి ప్రతులయందు కనబడుచున్నది; ఆలో చింపగా ఇచట 'దేవమీఢుషు'నకు 'ఐక్ష్వాకి' యందు కలిగిన కుమారుడు శూరుడు; కావున ఇచట 'అద్భుతమీఢుషమ్' అను ద్వితీయా-విభక్త్యంత రూపము కాక 'అద్భుత మీఢుషః' అను పంచమీ విభక్త్యంత రూపము ఉండదగును. 'జీమూతవాహన' శబ్దమును ఛందోఽనుకూలతకై 'మేఘవాహనుడు' అనినట్లు ఇచట ఛందోఽనుకూలతకై 'దేవమీఢుషః' అనునది 'అద్భుతమీఢుషః' అని గ్రహింపబడియుండును. ఇచట ప్రాత ప్రతులను అనుసరించి 'అద్భుతమీఢుషమ్' అను రూపము ఈయబడినను దీనిని 'అద్భుతమీఢుషః' అనియే చదువుకొనవలయును.

46 అ. 6 శ్లో.

'ధర్మశారీరః=ధర్మాత్మా; శారీరః-(శరీరం అస్య అస్తీతి-ఆత్మా;

'శారీరక మీమాంసా' 'ఆత్మ తత్త్వ విషయక మీమాంసా.'

47 అ. 133 శ్లో. హర్యక్షః-కుబేరుడు; ఇచటనే 'అంధనః పత్యే' అను నర్థమున 'అంధనః పతే' అని ప్రతు లలో కనబడుచున్నది; కాని ఛందోభంగమును సహించి 'పత్యే' అని చదువుకొనుట సమంజసము.

47వ అధ్యాయమున చెప్పబడిన దేవాసుర సంగ్రామములు పండ్రెండు; వాటి స్వరూపమును తత్ఫలితములగు సంఘటనములును మత్స్యపురాణమున చెప్పబడినవి; ఇవియే విషయములుగాని ఇక్కడ పేర్కొనబడిన యుద్ధములలో కొన్నిటి (ఉదా: ఆడీ బక-ఆడీవధ) నామములు కాని ఇతర పురాణములలోను వచ్చుచున్నవి. కాని అచ్చట తద్వివ రణము వేరు విధముగా నున్నది; ఈ మత్స్య పురాణమునగూడ పాఠములు కాలక్రమమున గందరగోళముగ మారినందున కొన్ని యుద్ధములను గూర్చిన వివరణములు మూలములో చెప్పనేలేదేమో యనిపించును. కాని పూర్వోత్తరముల జాగ్రత్తతో పరిశీలించి పాఠములను పునర్నిర్మాణము చేసినచో అన్ని యంశములును ఇందు చాల సరిగా చెప్పబడినట్లు తెలియును.

47 అ. 58-63 శ్లో. హిరణ్యకశిపుని రాజ్యకాలము-107280000÷360=2980000 దివ్యవర్షములు; బలి పాలనకాలము=2070000÷360 = 5750 దివ్యవర్షములు; ఇది నియుతాని వింశతిః + ఏకాయుతం + షష్టిర్వై సహస్రాణి = 2000000+10000+60000 = 2070000.

భూర్లోకోఽథ భువర్లోకః స్వర్లోకోఽథ మహర్జనః ।
తపః సత్యంచ సప్తైతే దేవలోకాః ప్రకీర్తితాః. (మత్స్య-61 అ.)

అను ప్రమాణము ననుసరించి భూర్లోక-భువర్లోక-సువర్లోక-మహర్లోకముల నాలుగింటిలో మహర్లోకము చివరది; కావున 'మహాంతేషు చతుర్షు; మహర్లోకము కడపటిదిగా నాలుగు లోకములు; అటులే మహర్లోక-జనలోక-తపోలోక-సత్యలోకములు అను నాలుగు లోకములలో చివరది సత్యలోకము కావున 'సత్యాంతేషు చతుర్షు'అనుట సరిపోవుచున్నది.

47-48 అధ్యాయములలో ఉత్తమములు ఉదాత్తములును అగు విషయములు ఎన్నియో యున్నవి. వీనిలో బలి చక్రవర్తి మహత్తయు ఉతథ్యవృత్తాంతమును కక్షీవదాదుల వృత్తాంతమును మిగుల ప్రధానములు.

48వ అధ్యాయమున కర్ణుడు అంగరాజపుత్త్రుడును సూతపుత్త్రుడును ఎట్లయ్యెను? అను ప్రశ్నమునకు సమాధానము ఈయబడినది. దానిని ఇట్లు వివరించవచ్చును. యయాతి కుమారులలో 'అనువు' అను వాని వంశమున బృహద్భానుని పుత్త్రుడు బృహన్మనసుడు; అతని భార్యలు ఇరువురలో యశోదాదేవియందు జయద్రథుడు అతనికి బృహద్రథుడు అతనికి జనమేజయుడు అతనికి అంగుడు కుమారులయిరి; ఈ బృహన్మనసునకే అతని రెండవ భార్యయందు విజయుడు అతనికి బృహత్ అతనికి బృహద్రథుడు అతనికి సత్యకర్మన్ అతనికి సూతుడు కుమారులయిరి. ఇట్లు బృహన్మనసునినుండి ఐదవతరమువాడు అంగుడు; ఈ బృహన్మనసునినుండియే ఆరవతరమువాడు సూతుడు; అంగునకును సంతతి లేదు; బృహన్మనసుని జ్యేష్ఠ భార్యాసంతతివాడగుటచే అంగునకు రాజ్యముండెను సూతునకు లేదు. అతడు బహుశః క్షత్త్రియ ధర్మములోని అంశముగా రథనిర్మాణముతో జీవనము చేయుచు ధనాఢ్యుడై యుండవచ్చును. ఇతనికి లభించిన కర్ణుని ఈతని పెదనాయన (తరముల వరుసలో) అగు అంగుడు చేరదీసి తన రాజ్యము నీతని కిచ్చెను. ఇట్లు కర్ణుడు సూత పుత్త్రుడును అంగపుత్త్రుడును అయ్యెను.

మొత్తము మీద సూతుడు చంద్రవంశ్యుడగు క్షత్త్రియుడే కాని రథచోదక జాతీయుడు కాదు.

48 అ. 55 శ్లో. అభ్యపద్యత-స్త్రీని పొందెను; కూడెను.

48 అ. 39 శ్లో. సంబభూవ-(స్త్రీని) పొందెను-

48 అ. 79 శ్లో. యత్ (ఎందువలన ననగా) అను నర్థమున ఛందో నిర్వహణమునకై 'యది' అనురూపము: "ప్రాశితం దధి యద్యగ్రే (యత్+అగ్రే=యదగ్రే); యత్-యస్మాత్-ఏ హేతువువలన; అగ్రే-మొదటగా; దధి-పెరుగు; ప్రాశితమ్-ప్రాశనము చేయబడినదో (ఆ హేతువువలన); ఇంతేకాని యది-అయినచో-అను నర్థమునకు ఇచట ప్రసక్తి లేదు.

48 అ. 92 శ్లో. 'క్షయమ్' ఇది 'స్థానమ్' అను అర్థములో నున్నది. ఇది అమరకోశమున చెప్పబడిన యర్థమే కాని ఈ పదమునకు ఈ యర్థమున లోక సంస్కృతమున ప్రయోగములు తక్కువ.

49 అ. శ్లో॥ 'రేతోధా పుత్త్రం నయతి పరేతం చ యమక్షయాత్.'

ఇచట 'రేతోధాః' అను ప్రథమావిభక్త్యేక వచనరూపము 'రేతోధసం- అను ద్వితీయావిభక్త్యేక వచన రూపపు అర్థమున వాడబడినది.

49 అ. 31 శ్లో. 'తుష్టువుః' అను పరస్మైపదరూపము 'తుష్టువిరే' అను ఆత్మనేపది కర్మణ్యర్థక రూపపు అర్థములో వాడబడినది.

50 అ; 40 శ్లో. అపధ్యాతః-అనహించుకొనబడినవాడు.

51 అధ్యాయమున విచారణీయాంశములు అనేకములు గలవు:

1. 'బ్రహ్మోదనాగ్నిః' అనునది ఎంతగా శాస్త్రీయమో 'బ్రహ్మోదరాగ్నిః' అను రూపముకూడ అంతగా ప్రామాణికమే యని తోచును.

'బ్రహ్మణ ఉదరణమసి-బ్రహ్మణ ఉదీరణమసి.'

అని యజురారణ్యక శ్రుతి; ఉదరణ-ఉదీరణ-శబ్దములు-వాక్కు-పలుకు-అను అర్థమును చెప్పను. వైద్యుతాగ్ని వెలువడు

నపుడు దానితోపాటు ధ్వనియును ఉత్పన్నమగును. అది బ్రహ్మ (ప్రజాపతి) నోటినుండి వెలువడు ఉదరణము (ఉదీరణము); వ్యుత్పత్తి ననుసరించి ఉదరశబ్దము కూడ ఈ రెండు శబ్దములతో సమానార్థకమే యగును.

2. ఈ అధ్యాయమున ప్రతిపాదింపబడిన అగ్నులు మొత్తము నలువది తొమ్మిది మంది; ఇందు 1- పావక 2. పవమాన 3. శుచులు 4. వైద్యుత 5. నిర్మథ్య 6. సౌరులు 7. సహరక్షః 8. కవ్యవాహ 9. హవ్యవాహులు-అను తొమ్మిదిమందియు మొదటిదశలోని వారు. రెండవదశలో పావకునకు 10. శరత 11. వైశ్వానరులు; పవమానునకు 12. 13. సభ్యావసథ్యులు; శుచికి 14-29. పదునారుమంది ధిష్ణ్యాగ్నులు జనించిరి; ఇక మూడవదశలో పావకునకు 30-35. ఆరుమందియు శుచ్యగ్నికి 36-49 పదునాలుగుమందియు జనించిరి. ఇట్లు వీరు మొత్తము నలువది తొమ్మిదిమంది.

కాని **'Matsya Purana-A Study'(By Agarwal)**లో శుచికి 30-35 పావకునకు 36-41 పవమానునకు 42-49 అని యున్నది. ఇది మూలమునకు విరుద్ధమని తోచును. దీని నిర్ణయము శ్రౌత సంప్రదాయమును సమగ్రముగ నెరిగిన పెద్దలు చేయదగినది.

3. అభిమానినీ దేవతా; (స్త్రీలింగమున); అభిమాని దైవతమ్ (నపుంసకలింగమున); అభిమానీ దేవః (పుంలింగమున). ఈ ప్రయోగమునకు రెండు విధములగు వ్యుత్పత్తులను-వానిని బట్టి అర్థములను-చెప్పవచ్చును. రెండును ప్రామాణికములేయని తద్జ్ఞులు సమ్మతించినారు. 1. అయం పదార్థో మత్సంబంధీ-అయం పదార్థో మమ అధిష్ఠానం-ఆధారః-ఆశ్రయో వా; అహం ఇమం పదార్థం ఆశ్రిత్య వర్తమానా సతీ- ఉపాసకానాం తత్తత్ఫలాని దదామీతి యా దేవతా అభితః మనుతే సా తత్పదార్థాభిమానినీ దేవతా ఇత్యేకం నిర్వచనమ్. 2. అస్మిన్ పదార్థే ఇయం దేవతా అధిగతా-వ్యాప్య స్థితా-ఇయం ఆరాధితా సతీ-ఉపాసకానాం తత్తత్ఫలాని దదాతి-ఇతి యా దేవతా తత్త్వజ్ఞైః మన్యతే-సా తదభిమానినీ దేవతా ఇతి అన్యత్ నిర్వచనమ్; ఈ నిర్వచనముల యర్థము. 1. ఈ పదార్థము నాకు సంబంధించినది; ఈ పదార్థము నాకు అధిష్ఠానము (ఆధారము-ఆశ్రయము); నేను ఈ పదార్థమును ఆశ్రయించుకొనియుండి ఉపాసకులకు ఆయా ఫలములను ఇత్తును; అని ఏ దేవత ఆయా జడ చేతన పదార్థముల విషయమున సమగ్రముగ తలచునో ఆ దేవత ఆ పదార్థమునకు అభిమానిని యగు దేవత; 2. ఈ పదార్థమునందు అంతటను ఈ దేవత వ్యాపించియున్నది; ఈమె ఆరాధింపబడినదియగుచు ఉపాసకులకు ఆయా ఫలములను ఇచ్చును; అని తత్త్వజ్ఞులచే తలచబడు దేవత తత్పదార్థాభిమానిని యగు దేవత.

4. ధిష్ణ్య శబ్దార్థము. 'ధిష్ణ్యమ్-ప్రాణాభిమానీ దేవః;'
ఋక్: "అగ్నే దివో అర్ణ మచ్ఛా జిగా-
స్యచ్ఛా దేవీ ఊచిషే ధిష్ణ్యా (ష్ణియా) యే।
యా రోచనే పరస్తాత్ సూర్యస్య
యా శ్చావస్తా దుపతిష్ఠంత ఆపః."

(ఋగ్వేద 3-22-3)

"ధియం బుద్ధ్యుపహితం దేహం ఉష్ణంతి-ఉష్ణీ
కుర్వంతి- ఇతి- ధిష్ణ్యాః- ప్రాణాభిమానినో
దేవాః. ఇతి తద్భాష్యే సాయనః".

5. పంచాగ్నయః 1. గార్హపత్యః 2. ఆహవనీయః 3. దక్షిణాగ్నిః 4. సభ్యః 5. ఆవసథ్యః ఇతి;

1. గార్హపత్యః: గృహపతినా సంయుక్తోఽగ్నిః గార్హపత్యః; యోఽగ్ని ర్యజమానేన తత్పిత్ర

పితామహాదిక్రమేణ కులధనతయా లబ్ధో దాయరూపేణ- సోఽసౌ గార్హపత్యః 2. ఆహవనీయ స్త్వతిథీనా మగ్నిః; ఆహూయతేఽస్మి న్నతిథిభి రితి; 3. దక్షిణాగ్నిః

3. అస్యైవ లౌకికాగ్ని రి త్యపి వ్యవహారః; అయమగ్నిః ప్రాయశ్చిత్తాభిచారిక శాంతికపౌష్టికాదిషు వినియుజ్యతే; అస్యైవాన్వాహార్యవచన ఇత్యపి వ్యవహారః; అన్వాహార్యం నామ మాసిక శ్రాద్ధ విశేషః; ఇత్యమరః; తదర్థం పాకోఽస్మిన్ క్రియతే ఇత్యన్వాహార్యవచనః.

అత్ర విషయే ఆపస్తంబః: ఆపస్తంబ ధర్మ సూత్రమ్ (2-7-2); యోఽతిథీనామగ్నిః స ఆహవనీయో- యః కుటుంబే స గార్హపత్యో-యస్మిన్ పచ్యతే సోఽన్వాహార్యవచనః- ఇతి.

అస్య హరదత్త వృత్తిః: యోఽతిథీనాం జాఠరోఽగ్నిః -స ఆహవనీయః; తత్ర హి హూయతే; యః కుటుంబే-గృహేఽగ్నిరౌపాసనః- స గార్హపత్యః-నిత్య ధార్యత్వాత్; యస్మిన్పచ్యతే లౌకికాగ్నౌ సోఽన్వాహార్యవచనః-దక్షిణాఽగ్నిః; తత్ర హ్యన్వాహార్యం పచ్యతే: అన్వాహార్యంనామ-దర్శపూర్ణమాసేష్టౌ ఋత్విజాం దక్షిణాత్వేన యద్దేయ మన్నం తత్; ఇతి.

గార్హపత్యాగ్నిరేవ యదా కుండాంతరే ఆనీయ సంస్క్రియతే సంస్కారవిశేషేణ- తదా తస్య దక్షిణాగ్నిరితి సంజ్ఞా; తదర్థ మానయనదశాయాం తస్య 'ఆనాయ్య' ఇతి వ్యవహారః.

## శాంతిరత్నే కమలాకరభట్టః

స్మార్తాగ్నే ర్ద్వైవిధ్యమ్: స్మృతిప్రోక్త కర్మానుష్ఠానేషు వినియుజ్యమానోఽగ్నిః స్మార్తాగ్నిః; స ద్వివిధః: "స్మార్తాగ్ని ర్ద్వివిధో జ్ఞేయో గృహ్యః పౌరుష ఇత్యపి। యస్మి న్వివాహం కురుతే సోఽగ్ని గృహ్య ఇతి స్మృతః. జాతకర్మాది సిద్ధ్యర్థం యో వ్యాహృతిభి రాహృతః। సోఽగ్నిః పౌరుష ఇత్యుక్తః శాలాగ్ని ర్లౌకిక స్తథా." ఇతి.

ఆహితాగ్నిః: ఆహితాగ్నిర్నామ సః- యేనాధానేన శ్రౌతకర్మ సంపాదనార్థం నిష్పాదితః; స చ మూలతః త్రిధా: గార్హపత్యః- ఆహవనీయః- దక్షిణాగ్ని శ్చేతి; తేషాం వినియోగః: గార్హపత్యే హవీంషి శ్రపయతి- ఆహవనీయే జుహోతి-దక్షిణాగ్నౌ వన్వాహార్యం పచతి; ఏతేషామేవ 'వైతానికాగ్నయః' ఇతి శాస్త్రేషు వ్యవహారః.

ఆహితాగ్న్యనాహితాగ్ని క్రియమాణ కర్మణోః భేదః: పుత్రేష్టిః- పుత్రజననోత్తరం ఆహితాగ్నినా క్రియమాణా ఇష్టిః; తేనైవాహితాగ్నినా 'పుత్రో మే భూయా ది'తి కామనయా క్రియమాణా ఇష్టిః పుత్రకామేష్టిః యా ఆహితాగ్నేః పుత్రేష్టిః- సైవ అనాహితాగ్నేః జాతకర్మ.

## చరు-పురోడాశయోర్ భేదః

ఏవమేవ య ఆహితాగ్నేః హవనే కర్మణి వినియోగార్థం పురోడాశః- స ఏవ అనాహితాగ్నేః చరుః స్మార్తేషు కర్మసు వినియోగార్థమ్.

## షోడశ ర్త్విజః (పదునారుమంది ఋత్విజులు):

శ్రీ మత్స్యమహాపురాణమున పదునారుమంది ఋత్విజులను ఇట్లు పేర్కొనబడినారు: (అధ్యా-166)

7. బ్రహ్మాణం ప్రథమం వక్త్రాత్। ఉద్గాతారం చ సామగమ్।
హోతార మపి చాధ్వర్యుం। బాహుభ్యా మసృజ త్ప్రభుః.

8. బ్రహ్మణో బ్రాహ్మణాచ్ఛంసిం। ప్రస్తోతారం చ సర్వశః।
తౌ మైత్రావరుణం పృష్ఠాత్। ప్రతిప్రస్థాతార మేవ చ.

9. ఉదరా త్ప్రతిహర్తారం। పోతారం చైవ పార్థివ।
అచ్ఛావాక మథోరుభ్యాం నేష్టారం చైవ పార్థివః

10. పాణిభ్యా మథ చాగ్నీధ్రం। సుబ్రహ్మణ్యం తు జానుతః।
గ్రావస్తుతం తు పాదాభ్యాం। ఉన్నేతారం చ యాజుషమ్.

11. ఏవమేవైష భగవాన్ షోడశైవ జగత్పతిః।
ప్రవర్త్యాన్ సర్వయజ్ఞానాం। ఋత్విజోఽసృజ దుత్తమాన్.

తా. భగవానుడగు జగత్పతి ప్రజాపతిరూపుడై ఆ ప్రజాపతికి గల ఆయా అవయవములనుండి సర్వయజ్ఞ ప్రవృత్తి హేతుభూతులగు పదునారుమంది ఋత్విజులను జనింపజేసెను. ఎట్లన-వక్త్రమునుండి 1. బ్రహ్మను 2. ఉద్గాతను-బాహువులనుండి 3. హోతను 4. అధ్వర్యుని-బ్రహ్మ (హృదయము) నుండి 5. బ్రాహ్మణాచ్ఛంసిని 6. ప్రస్తోతను-పృష్ఠమునుండి 7. మైత్రావరుణుని 8. ప్రతిప్రస్థాతను-ఉదరమునుండి 9. పోతను 10. ప్రతిహర్తను- ఊరువులనుండి 11. అచ్ఛావాకుని 12. నేష్టను-పాణుల (కరముల)నుండి 13. అగ్నీధ్రుని-జానువులనుండి 14. సుబ్రహ్మణ్యుని-పాదముల నుండి 15. గ్రావస్తు(త్)తుని 19. ఉన్నేతను- సృజించెను.

శ్రీమత్స్య మహాపురాణమున 166 వ అధ్యాయమున చెప్పబడిన పదునారుమంది ఋత్విజులలో బ్రహ్మ-ఉద్గాత-హోత-అధ్వర్యుడు-అను నలుగురును ముఖ్యులు; బ్రహ్మకు బ్రాహ్మణాచ్ఛంసి-పోత-అగ్నీధ్రుడు అనువారును ఉద్గాతకు ప్రస్తోత-ప్రతిహర్తా - సుబ్రహ్మణ్యుడు అనువారును హోతకు మైత్రావరుణాచ్ఛావాక గ్రావస్తుతులును అధ్వర్యునకు ప్రతిప్రస్థాత-నేష్ట-ఉన్నేత-అనువారును యజ్ఞ నిర్వహణమునందు సహాయులు; (చూ. ఆశ్వలాయన శ్రౌతసూత్రములు-పూర్వషట్క - 4 అధ్యాయారంభము); ఇందు మొట్టమొదట స్నాతకుడు (గురుకులమున వేద విద్యాధ్యయనము ముగించి తత్సమాప్తి వ్రత స్నానమును ఒనరించుకొనిన బ్రహ్మచారి) కాని-బ్రహ్మచారి (గురుకులమున ఇంకను వేద విద్యాభ్యాసము చేయుచున్నవాడు) కాని విద్యాధ్యయనము ముగించి ఉపకుర్వాణ బ్రహ్మచారిగా నున్న యాతడు కాని మరెవ్వరైనను దీక్షితుడు (దీక్షాగ్రహణ పూర్వకముగా యజ్ఞములు ఒనరించియుండిన గృహస్థుడు) కాని 'ఉన్నేత'ను దీక్షితునిగా చేయును; ఉన్నేత-అధ్వర్యునకై నేష్టను బ్రహ్మకై అగ్నీధ్రుని ఉద్గాతకై సుబ్రహ్మణ్యుని హోతకై గ్రావస్తుత్‌ను దీక్షితులనుగా చేయును. నేష్ట-అధ్వర్యునకై ప్రతిప్రస్థాతను బ్రహ్మకై పోతను ఉద్గాతకై ప్రతిహర్తను హోతకై అచ్ఛావాకుని దీక్షితులనుగా చేయును; ప్రతిప్రస్థాత-అధ్వర్యుని-బ్రహ్మకై బ్రాహ్మణాచ్ఛంసిని ఉద్గాతకై ప్రస్తోతను హోతకై మైత్రావరుణుని దీక్షితులనుగా చేయును; అధ్వర్యుడు గృహపతిని బ్రహ్మను ఉద్గాతను హోతను దీక్షితులనుగా చేయును. (శతపథ బ్రాహ్మణము-మధ్యమకాండము-ప్రథమాధ్యాయము-ప్రథమ బ్రాహ్మణము.)

శ్రీమత్స్య మహాపురాణమున యజ్ఞాత్మక బ్రహ్మదేహావయవములుగా పేర్కొనిన ఋత్విజుల క్రమమును చివరి నుండి ('ఉన్నేత'నుండి) చూచినచో ఈ క్రమములోని ఉచితత్వము అవగతము అగును.

విశేషము: శతపథ బ్రాహ్మణమును మత్స్య పురాణోక్త యజ్ఞ బ్రహ్మవయవభూత ఋత్విక్సంస్థానమును అనుసరించి బ్రహ్మకు సహాయులు బ్రాహ్మణాచ్ఛంసి పోత్రాగ్నీధ్రులు కాగా ఆశ్వలాయన శ్రౌతసూత్రములలో బ్రాహ్మణాచ్ఛంస్యాగ్నీధ్రపోతలు అనియున్నది. మిగిలినదంతయు అన్నిట సమానమే.

ఋగ్వేదమున (చూ. ఈ మత్స్య. పుట. 219) ఋక్కులో పేర్కొనబడిన ఋత్విజులు: 1. హోతా 2. పోతా 3. నేష్టా 4. ప్రశాస్తా 5. అధ్వర్యుః 6. బ్రహ్మా 7. గృహపతిః 8. అగ్నీధ్రః 9. ఆత్రేయః.

ఆశ్వలాయన శ్రౌతసూత్రములయందు (ఉత్తర షట్కము. 6వ అధ్యాయము-9వ ఖండము) యజ్ఞ ప్రవర్తకులుగా ఇరువది ఇద్దరు పేర్కొనబడినారు. 1. ప్రస్తోతా 2. ఉద్గాతా 3. ప్రతిహర్తా 4. హోతా 5. బ్రహ్మ 6. మైత్రావరుణః 7. బ్రాహ్మణాచ్ఛంసీ 8. అధ్వర్యుః 9. ఉపగాతా 10. ప్రతిప్రస్థాతా 11. నేష్టా 12. పోతా 13. అచ్ఛావాకః 14. ఆగ్నీధ్రః 15. ఆత్రేయః 16. సదస్యః 17. గృహపతిః 18. గ్రావస్తుత్ 19. వైకర్తః 20. ఉన్నేతా 21. శమితా 22. సుబ్రహ్మణ్యః.

శ్రీమత్స్య మహా పురాణమున 166వ అధ్యాయములో గ్రహింపబడక ఆశ్వలాయన శ్రౌతసూత్రములలో గ్రహింపబడినవారు: ఉపగాతా-ఆత్రేయః-సదస్యః-గృహపతిః-వైకర్తః-శమితా.

మత్స్యపురాణపు 51వ అధ్యాయములో పేర్కొనబడినవారు: 1. బ్రహ్మ 2. గృహపతిః 3. ఆగ్నీధ్రః 4. హోతా 5. ప్రశాస్తా 6. బ్రాహ్మణాచ్ఛంసీ (సః) 7. పోతా 8. నేష్టా 9. అచ్ఛావాకః 10. మార్జారీయః; ఇందు బ్రహ్మకు సహాయులు-బ్రాహ్మణాచ్ఛంసీ-పోతా-ఆగ్నీధ్రః-అనువారు; నేష్ట-అధ్వర్యునకు సహాయుడు; అచ్ఛావాకుడు-హోతకు సహాయుడు.

ఈ యజ్ఞ ప్రవర్తకులు నిర్వహించు యజ్ఞీయ ప్రక్రియాంశములు సంప్రదాయమున తెలిసికొనవలయును.

## ప్రజాపతి శబ్దార్థము.

లోక వ్యవహార వ్యవస్థలోని యంశములును లోక వ్యవహార వ్యవస్థా ప్రవర్తకులును మన ప్రాచీన వాఙ్మయమున ప్రజాపతి శబ్దముచే గ్రహింపబడినట్లు తెలియుచున్నది. సంవత్సరః ప్రజాపతిః-యజ్ఞః ప్రజాపతిః-మరీచ్యాదయః ప్రజాపతయః- చతుర్దశమనవః ప్రజాపతయః ఇత్యాదికము.

ప్రజలు అనగా ప్రాణులు అన్నియును; వాని జీవన ప్రవృత్తులను వ్యవస్థితము చేయు తత్త్వములు అన్నియు-అవి మూర్తములు ఐనను- అమూర్తములు ఐనను- చేతనములు అయినను- కాకున్నను ప్రజాపతులే. ఏలయన వీరు ప్రజా (జీవన) ప్రవృత్తిని రక్షింతురు.

## త్రింశత్ (ముప్పది) సంస్కారములు-పాఠపరిష్కారము.

శ్రీమత్స్యమహాపురాణపు ఏబది రెండవ అధ్యాయము క్రియాయోగవిధిని తెలుపును. మానవుడు సత్కర్మానుష్ఠానముచే చిత్తశుద్ధిని జ్ఞానమును పొందవలయును. తద్ద్వారమున ముక్తినందవలయును. అని ఇందు చెప్పబడినది. ఇచట ప్రాసంగికముగా మానవుని శిష్టునిగా చేయుటకు ఉపకరించు సంస్కారములు ముప్పదియని చెప్పబడినది. అవి ఏవి? అనునది ఇట స్పష్టముగా లేదు.

భవిష్య మహాపురాణమున బ్రాహ్మ పర్వమున ద్వితీయాధ్యాయమున చత్వారింశత్సంస్కారములు పేర్కొనబడినవి. అవి వరుసగా ఇవి: 1. గర్భాధానము. (ఈ సంస్కారము దంపతులకు పుట్టబోవు కుమారుడు శిష్టుడు కావలెనను సంకల్పముతో చేయునది కావున ఇది కుమారునకు అన్వయించునేకాని దంపతులకు కాదు.) 2. పుంసవనము (పుట్టబోవు-పుం-పురుష-సంతానము ఉత్తముడు కావలెనని జరుపు- సవనము-దేవతారాధనము) 3. సీమంతోన్నయనము 4. జాతకర్మము 5. అన్నప్రాశనము 6. చూడా కర్మము 7. ఉపనయనము 8-9-10-11. నాలుగు బ్రహ్మవ్రతములు 12. స్నానవ్రతము 13. సహధర్మచారిణిని కూడుట (వివాహము) 14-15-16-17-18 దేవపితృ మనుష్యభూత బ్రహ్మ యజ్ఞములు అనెడు పంచయజ్ఞములు 19. అష్టకా కర్మము 20. పార్వణశ్రాద్ధము 21. శ్రావణీ 22. ఆగ్రహాయణీ 23. చైత్రీ 24. ఆశ్వయుజీ 25-31 సప్తపాక యజ్ఞములు 32. అగ్న్యాధానము-దానికి సంబంధించిన సత్క్రియలును 33. అగ్నిహోత్రము 34. దర్శపౌర్ణమాసములు 35. చాతుర్మాస్యములు 36. నిరూపణము 37. పశుబంధము

38. సౌత్రామణి 39. సప్తహవిర్యజ్ఞములు-వాటి సత్క్రియలు 40. అగ్నిష్టోమము-అత్యగ్నిష్టోమము-ఉక్థ్యము-షోడశి-వాజపేయము-అతిరాత్రము-అప్తోర్యామము-అను సప్త సోమసంస్థలు; ఇవి నలువది.

కాని మత్స్యపురాణమున మూలమున ఈ సందర్భములో:

"ద్వింశతి తథా చాష్టౌ యే సంస్కారాః ప్రకీర్తితాః."

అని ఇంచుమించుగా ఇదే రూపముతో చాల ప్రతులలో కనబడుచున్నది. ద్వింశతి-22+అష్టౌ-8=30. కాని పై భవిష్య పురాణ ప్రమాణమును బట్టి ఇచట 'ద్వాత్రింశతి'- అని యుండదగును. అపుడు 32+8=40 యగును. ఇచట 'ద్వింశతి' లేదా 'ద్వాత్రింశతి' ఆర్ష (శిష్ట) రూపము.

54 అ. 9 శ్లో. 'సితపక్షే చ విధితః సోమో మూలేన సంయుతః.' అని మూల ప్రతులయందలి పాఠము; ఈ 'సిత' (శుక్ల) పక్షము చైత్రమాసమునందు రావలయును. 'చిత్రా నక్షత్రేణ యుక్తా పౌర్ణమాసీ అస్మిన్ మాసే ఇతి చైత్రః'. 'చిత్రా నక్షత్రముతో చంద్రుడు కూడియుండు పూర్ణిమాతిథి ఈ మాసమునందు ఉండును. కావున ఇది చైత్ర మాసము.' ఒక నక్షత్రము ఎక్కువ తక్కువ అయినను చైత్రమున బహుళ పక్షముననే తప్ప శుక్ల పక్షమున మూల నక్షత్రము రాదు. కావున ఇచట 'సితి పక్షే' (కృష్ణపక్షమున) అని ఉండవలయును. పఠితలు 'సిత పక్షే' అని కాక 'సితిపక్షే' అని చదువుకొందురుగాక !

66 అ. సరస్వతీ మూర్త్యష్టకము :

లక్ష్మీ-ర్మేధా- ధరా- పుష్టి- ర్గౌరీ- తుష్టిః- ప్రభా-మతిః।
ఏతాభిః పాహి చాష్టాభి స్తనుభి ర్మాం సరస్వతి॥

సరస్వతిని ఈ రూపములలో భావన చేయుట సకలార్థ సిద్ధి ప్రదము.

72 అ. 17 శ్లో. ప్రక్షిప్య-విస్తరించి; దీనికి విలోమముగా-సంక్షిప్య-సంకోచించి-తగ్గించి.

74. అ. శ్లో. బైడాలవ్రతమ్:

యస్య ధర్మధ్వజో నిత్యం శక్రధ్వజ ఇవోచ్ఛ్రితః।
ప్రచ్ఛన్నాని చ పాపాని బైడాలం నామ తద్వ్రతమ్.

ఈ శ్లోకము వంచకుల స్వరూపమును స్పష్టము సేయుచున్నది.

92. అ. 86-87 శ్లో.

యత్నః-యోగ్యతా; శక్తిః- అను అర్థమున:
యస్తు పీడాకరో నిత్య మల్పవిత్తస్య వా గ్రహః।
తం చ యత్నేన సంపూజ్య శేషాన ప్యర్చయే ద్గ్రహాన్.

92 అ. 87-88. ధర్మ తత్త్వము :

గ్రహా గావో నరేంద్రాశ్చ। బ్రాహ్మణాశ్చ విశేషతః।
పూజితాః పూజయం త్యేతే। నిర్దహం త్యవమానితాః.

98 అ. 59 శ్లో. ఈ శ్లోకమున 'సా స్యా త్ప్రీతిరితి శ్రుతా.' అనియున్నది. కాని ఇది. ప్రకృతార్థమున సరిపోవలయు ననిన- 'సా స్యా త్ప్రీతీ రతేః స్మృతా.' అని యుండవలెను. పఠితలు ఈ పాఠమునే గ్రహింతురుగాక।

111 అ. మొదలు 122 అ. వరకు గల భువనకోశాధ్యాయములందలి భూగోళ సంస్థానమున :

120 అ. శ్లో. 'మోదతే'- అను మోదతే- అనుభవించి మోదించును-అను నర్థమున;

అప్సరోఽనుగతో రాజా। మోదతే హ్యలకాధిపః।
కైలాసపాద సంభూతం పుణ్యం శీతజలం శుభమ్.

ఇచట 'అలకాధిపః శీతజలం మోదతే' అని అన్వయము; ఇచట జలమునకు కర్మత్వము; 'మోదతే' అకర్మక క్రియ యైనను పైయర్థమున సకర్మక క్రియగా గ్రహించవలెను.

122వ అ. 13 శ్లో. ఛందో విశేషము :

ద్వీపేన పుష్కరేణాసౌ। వృత శ్చేక్షురసోదక-।
సముద్రేణ మహాభాగో। గోమేద ద్విగుణేన తు.

ఈ శ్లోకమున పూర్వార్ధము అంతటితో తెగిపోక ఉత్తరార్ధముతో అదుకుపడియున్నది.

## ద్వీప-సముద్ర-క్రమము:

1 జంబూద్వీపము-క్షారసముద్రము 2. శాకద్వీపము-క్షీర సముద్రము 3. కుశద్వీపము-సురా సముద్రము 4. క్రౌంచద్వీపము-ఘృత సముద్రము 5. శాల్మల ద్వీపము-దధి సముద్రము 6. గోమేద ద్వీపము-స్వాదూదక సముద్రము 7. పుష్కర ద్వీపము-ఇక్షురస సముద్రము.

## బ్రహ్మాండ పురాణము-శ్రీమద్భాగవతము-భూగోళ వ్యవస్థ.

బ్రహ్మాండ పురాణమున అనుషంగ పాదపు పంచదశాధ్యాయాదికమును శ్రీమద్భాగవత పంచమ స్కంధమున 18-19-20 అధ్యాయములును ఇందులకై చూడవచ్చును.

ఆర్యావర్తము : పతంజలి మహాముని వ్యాకరణ మహాభాష్యమున అర్యావర్తపు అవధులను ఇట్లు తెల్పిరి:

"కః పున రార్యావర్తః? ప్రాగాదర్శాత్- ప్రత్య క్కాలకవనాత్-
దక్షిణేన హిమవంతమ్- ఉత్తరేణ పారియాత్రమ్."

బ్రహ్మావర్తము :

"సరస్వతీ దృషద్వత్యో ర్దేవనద్యో ర్యదంతరమ్।
తం దేవనిర్మితం దేశం బ్రహ్మావర్తం విదు ర్బుధాః." ఇతి మనుః.

అపరాంతము :

అపరాంతాస్తు పాశ్చాత్త్యా స్తే చ సూర్యారకాదయః-ఇతి
యాదవః (కోశః); అపర-అంత-స్థ=పడమటి అవధియందుండువారు.

మధ్య దేశము :

హిమవద్వింధ్యయో ర్మధ్యం। యత్ ప్రా గ్వినశనాదపి। ప్రత్యగేవ ప్రయాగాచ్చ మధ్యదేశః ప్రకీర్తితః. ఇతి మనుః (2-21) వినశనమ్- కురుక్షేత్రమ్; మధ్యదేశస్తు మధ్యమః; ఇత్యమరః.

ఆర్యావర్తము (మనుః) :

ఆసముద్రాత్తు వై పూర్వా దాసముద్రాత్తు పశ్చిమాత్।
తయోరేవాంతరం (హిమవద్వింధ్యయోర్) గిర్యో-

రార్యా వర్తం విదు ర్బుధాః.' (2-22).
ఆర్యావర్తః పుణ్యభూమి ర్మధ్యం వింధ్య హిమాగయోః. ఇత్యమరః.

ప్రాచ్యదేశము-ఉదీచ్య దేశము: శరావత్యాస్తు యోఽవధేః।
దేశః ప్రాగ్దక్షిణః ప్రాచ్య ఉదీచ్యః పశ్చిమోత్తరః. ఇత్యమరః (ద్వి.కాం-భూవర్గము);

ఈ విషయమున పరంపరాగతమగు శ్లోకము ఇట్లున్నది:
'ప్రాగుదంచౌ విభజతే హంసః క్షీరోదకం యథా।
విదుషాం శబ్దసిద్ధ్యర్థ్యం సా నః పాతు శరావతీ.' ఇతి.

ప్రత్యంతము-ప్రతిగతః అంతం- (ఆశ్రితః- ప్రతిగతః- ఇతి పర్యాయౌ) ఇతి ప్రత్యంతం; 'ప్రత్యంతో మ్లేచ్ఛదేశః స్యాత్' ఇత్యమరః; శిష్టాచారరహితఖశాది దేశస్య నామ-ఇత్యమర సుధావ్యాఖ్యా.
"చాతుర్వర్ణ్యవ్యవస్థానం యస్మిన్ దేశే న విద్యతే।
తం మ్లేచ్ఛవిషయం ప్రాహు; రార్యావర్త మతః పరమ్."
ఇతి పరంపరాగతః శ్లోకః.

వేదాది సంప్రదాయానుగత శిష్టాచార సహితాః
ఆర్యాః; ఆర్యా స్త్రైవర్ణికాః ఇతి హరదత్తః.

వస్తుతస్తు మ్లేచ్ఛశబ్దో మ్లిష్టశబ్దేన సంబద్ధః; అస్పష్టాఽసంస్కృత శబ్దఘటిత భాషావ్యవహర్తృ జనవాచీ; న మ్లేచ్ఛితవై- నాపభాషితవై-ఇతి పాతంజలే భాష్యే.

## వర్షము-భారతవర్షము.

వర్షము అనగా స్థానము :
వర్షం స్థానం విదుః ప్రాజ్ఞాః; ఇమం లోకం చ భారతమ్।
ఉత్తరం య త్సముద్రస్య। హిమాద్రే శ్చైవ దక్షిణమ్. ఇతి భారవిః.

మత్స్యే తు-వర్షం త ద్భారతం నామ। భారతీ యత్ర సంతతిః. ఇతి.
ముకుటే తు-అత ఏవ సామాన్య విశేషభావాత్ జంబూద్వీపే- తదేకదేశే చ 'భారత' ప్రయోగః; ప్రకరణాదిభిస్తు తదవగమః. యథా- 'ఏత దూఢగురుభారః భారతం వర్ష మద్య మమ వర్తతే వశే.' ఇతి మాఘః. (14 సర్గ; 5శ్లో.) తథా-'ఏతేనభారత మిలావృతవ ద్విభాతి.' ఇతి చ. (4సర్గ;31శ్లో.)

అన్యాన్యపి వర్షాణి-యథా:
"స్యా ద్భారతం కింపురుషం। హరి-వర్షం చ దక్షిణాః।
రమ్యం హిరణ్మయకురూ। సుమేరో రుత్తరా స్త్రయః.
భద్రాశ్వకేతుమాలౌ తు। ద్వౌ వర్షౌ పూర్వపశ్చిమౌ,
ఇలావృతం తు మధ్యస్థం। న (సు) మేరు ర్యత్ర తిష్ఠతి. ఇతి వాచస్పతిః.

పై వానిలోని సంస్కృత వచనములకు తెలుగు:

"ఆర్యావర్తమనగా ఏది మరి? 'ఆదర్శ' (మనుప్రదేశ) మునకు తూర్పున - కాలకవనమునకు పడమటగా-హిమవంతమునకు దక్షిణమున-పారియాత్ర పర్వతమునకు ఉత్తరమున-ఉండునది: అని పతంజలి భాష్యవచనము.

సరస్వతీ-దృషద్వతులు అను దేవ (వేదములాదిగా ప్రాచీన వాఙ్మయమున పేర్కొనబడి ఈనాడు అంతర్వాహినులయియున్న) నదుల నడుమ నున్నదియు దేవతలచే (వేదాది వాఙ్మయమున) నిర్మితమును అగు దేశమునే బ్రహ్మావర్తము అని తెలిసినవారు తలచుచున్నారు. అని మను వచనము.

'సూర్యారికులు' మొదలగు భారతదేశపు పడమటి అంచులలో ఉండువారు అపరాంత జనులు-అని యాదవ కోశవచనము.

హిమాలయమునకు దక్షిణమున వింధ్యమునకు ఉత్తరమున కురుక్షేత్రము (వినశనము)నకు తూర్పున ప్రయాగకు పడమట ఉండు దేశమునకు మధ్యదేశము అని వ్యవహారము.

హిమవద్వింధ్యములకును ప్రాక్పశ్చిమ సముద్రములకును నడుమనుండు దేశము ఆర్యావర్తము అని మను వచనము.

హిమవద్వింధ్యములకు నడుమనుండు పుణ్యభూమికి 'ఆర్యావర్తము' అని వ్యవహారము అని అమరవచనము.

('శరావతీనది' బహుశః ఈశాన్య నైరృత దిశలుగా ప్రవహించునది కావచ్చును); కనుక ఈ శరావతికి ప్రాగ్దక్షిణమున (ఆగ్నేయమున) ఉండు దేశము 'ప్రాచ్యము' అనియు ఈనదికి పశ్చిమోత్తరమున (వాయవ్యమున) ఉండు దేశము ఉదీచ్యము అనియు వ్యవహరింపబడును. అని అమరవచనము.

పాణినీయ వ్యాకరణ సూత్రములందు ప్రాచ్యోదీచ్య-దేశములు పేర్కొనబడినవి; తద్దేశీయులగు వైయాకరణులును పేర్కొనబడినారు; ఈ 'ప్రాచ్యోదీచ్య' దేశ వ్యవస్థకు శరావతీ నదియే అవధి; కావున 'హంస తాను తన యోగ్యతచే క్షీర నీర మిశ్రమును వివేచించి క్షీరమును నీరమును వేరువరచునట్లు ప్రాచ్యోదీచ్య దేశములను (వ్యాకరణ) విద్వాంసుల శబ్దరూప సిద్ధికై వేరువరచు శరావతీనది మమ్ములను రక్షించుగాక!' అని ఈ శ్లోకమునకు అర్థము.

అంతము (అంచు)ను ఆశ్రయించి (ప్రతిగతమయి) ఉండునది 'ప్రత్యంతము.' ప్రత్యంతము అనగా భారత దేశపు అంచులయందలి మ్లేచ్ఛ దేశము అని అమరసింహ వచనము; శిష్టాచార రహితమగు 'ఖశులు' మొదలగు జనులు నివసించు దేశము-అని అమరకోశ సుధా వ్యాఖ్యా వివరణము.

"ఏదేశమునందు చాతుర్వర్ణ్యవ్యవస్థ యుండదో అట్టి ప్రదేశమును మ్లేచ్ఛ దేశము అందురు; ఇట్టిది కాని శిష్ట జనాశ్రయ దేశము ఆర్యావర్తము." అని పరంపరాగతశ్లోకార్థము.

వేదాది సంప్రదాయమును అనుసరించియుండు శిష్టాచారముతో వ్యవహరించువారు ఆర్యులు; 'ఆర్యులు అనగా త్రైవర్ణికులు' అని ఆపస్తంబ ధర్మసూత్ర వ్యాఖ్యలో హరదత్తుల వచనము.

వాస్తవమున మ్లేచ్ఛ శబ్దము 'మ్లిష్ట' శబ్దముతో సంబంధముకలది; అస్పష్టములును శబ్ద సంస్కార రహితములును నగు శబ్దములతో ఘటితములగు భాషల వ్యవహరించువారిని ఈ మ్లేచ్ఛ శబ్దము తెలుపును; "మేము 'మ్లేచ్ఛనము' చేయకుందుముగాక! 'అపభాషణము' (సంస్కారరహిత భాషోచ్చారణము) చేయకుందుముగాక!" అని పతంజలి భాష్యవచనము.

'వర్షము' 'స్థానము' సమానార్థకములు అని ప్రాజ్ఞులు తలంతురు; (దక్షిణ) సముద్రమునకు ఉత్తరమున హిమవంతమునకు దక్షిణముననుండు ఈ లోకమంతయు 'భారత (వర్ష)ము' అని భారవివచనము.

'భారతీ' 'భరతసంబంధిని' యగు సంతతి ఎచట గలదో అది భారతవర్షము అని శ్రీమత్స్యమహాపురాణము.

"దేశ సామాన్య వాచకముగా జంబూద్వీపమును-దేశ విశేష వాచకముగా జంబూద్వీపమునందలి ఏకదేశమును (ఒక చిన్న అంశమగు భారతదేశమును) ఈ 'భారత' శబ్దము తెలుపును.' అని ముకుటుడు చెప్పెను.

ఇట ఇచ్చిన మాఘునిఉదాహరణములలో మొదటి దానిలో భారత వర్షము అనగా జంబూద్వీపము అనియు రెండవ దానిలోని 'భారత' శబ్దమునకు భారత దేశము అనియు అర్థములు.

"మేరువునకు దక్షిణదిశయందు భారత కింపురుష హరివర్షములును-ఉత్తరమున రమ్యక హిరణ్యక కురు వర్షములును తూర్పున భద్రాశ్వ వర్షమును పడమట కేతుమాల వర్షమును నడుమ సుమేరువునకు చేరువగా ఇలా వృతమును ఉన్నవి."

## భూగోళ విభాగ విషయమున భావనాత్రయము:

1. దేశ చతుష్టయ విభాగము: ఈ విభాగమున మహామేరువు (పామీరు పీఠభూమి) కేంద్ర స్థానీయము; ఈ దేశ చతుష్టయములో ఆసియా ఖండమందలి చాల భాగము చేరియున్నది.

2 సప్తద్వీప విభాగము: ఈ విభజనమునందు యావద్భూమండలమును చేరును.

3. నవవర్ష విభాగము: ఇది ప్రధానముగా జంబూద్వీపమునకు సంబంధించినది.

మత్స్య-బ్రహ్మాండ పురాణములందు సప్తవర్ష విభాగము గ్రహింపబడినది. అవి 1. భారతము 2. కింపురుషము 3. హరి 4. ఇలావృతము 5. రమ్యకము 6. హిరణ్యకము 7. కురు.

వీనికి ఇందలి పర్వతములను బట్టి నామములు: 1. హైమవతము 2. హైమకూటము 3. నైషధము 4. సౌమేర వము 5. నైలము 6. శ్వైతము 7. శార్ఙ్గవతము.

'ఉత్తరాః కురవః' (ఉత్తర కురువులు): కరోతీతి కురుః-కుర్వంతీతి కురవః - అను కర్తృవ్యుత్పత్తిచే 'కురు' శబ్దము నిష్పన్నమగును. 'శ్రౌతస్మార్తాది కర్మల ననుష్ఠించువారు' అని అర్థము; ఇట్టి కర్మానుష్ఠాతలు తమ కర్మానుష్ఠాన ఫలములగు పుణ్యలోకములను అనుభవించుట ముగిసిన 'ఉత్తర' కాలమున ఈ వర్షమునందు జన్మింతురు కావున ఈ దేశ భాగమునకు ఉత్తర కురువులు అను వ్యవహారము వచ్చియుండును.

124 అ. శ్లో. 7. 'భ్రమంత మనుపరియంతి । నక్షత్రాణి తు పూర్వవత్.' ఛందోభంగము ఆర్షము.

ఈ అధ్యాయమునందే 'త్రిపథగ' అనగా 'ఆకాశం-అంతరిక్షమ్' అని యర్థము. ఊర్ధ్వపథమున-(నిట్టనిలువుగా)-అధః పథమున- (క్రింది వైపునకు) - తిర్యక్ పథమున- (అడ్డముగా) మూడు మార్గముల వ్యాప్తి కలది.

అధ్యాయము: శిశుమార (శింశుమార) చక్ర వ్యవస్థ యజురారణ్యకమున ఇట్లున్నది:

ధర్మో మూర్ధానం- బ్రహ్మోత్తరా హను- ర్యజ్ఞో౽ధరా- విష్ణుర్ హృదయగ్ం- సంవత్సరః ప్రజనన- మశ్వినౌ పూర్వపాదా- వత్రి ర్మధ్యం- మిత్రావరుణా వపరపాదా- వగ్నిః పుచ్ఛస్య ప్రథమం కాండం- తత ఇంద్ర- స్తతః ప్రజాపతి- రభయం చతుర్థగ్మ్. ఇతి.

## ఖగోళ వ్యవస్థాధ్యాయము.

పంచ విభాగాః అహ్నః:

పగటి కాలపు ఐదు విభాగములు:

ప్రాతః- సంగవః- మధ్యాహ్నః- అపరాహ్ణః- సాయమ్- అహ్నో యే పంచదశ ముహూర్తాః- తే ఏకైకస్మిన్ విభాగే త్రయస్త్రయో ముహూర్తాః. సంగవ ఇతి తు ఉష ఆరంభస్యాపి సంజ్ఞా.

ఉషా నామ రాత్రిః-వ్యుషా నామ దివసః ఇతి మత్స్యే-123 అధ్యా.

దీనికి ప్రమాణముగా రామాయణమున ప్రయోగములు కలవు.

పగటికాలపు 30 గడియలను పదునైదు భాగములు చేయగా అగు రెండేసి గడియలును 15 ముహూర్తము లగును. ఇవి ఐదు భాగములుచేయగా అగు మూడేసి ముహూర్తములు ఒక్కొక్క భాగమగును; అవి వరుసగా 1. ప్రాతః 2. సంగవ(ము)ము 3. మధ్యాహ్నము-4. అపరాహ్ణము-5. సాయమ్-అనునవి.

ఇందు 'సంగవము' అనునది 'ఉషః' కాలమునకును పేరు.

ఇదికాక 'ఉషా' అనగా రాత్రి-వ్యుషా అనగా పగలు అని మత్స్యపురాణపు 123 అధ్యాయమున కలదు.

శీఖండమున పేర్కొన్న సూర్యరథవేగము:

తే. గీ. రెండు వేలును నిన్నూటరెండు యోజ-
నంబు లర్ధనిమేషమాత్రంబునందు
నంబరంబునఁ బారు తీవ్రాంశురథము
నిలిచె బహుకాల మిట్టిదే నియతిమహిమ.

కాశీ-ప్రథమా. 135 పద్య.

వచ. నిమేషార్ధమాత్రంబున రెండువేలు నిన్నూట రెండు
యోజనంబు లతిక్రమించినం జూచి. (కాశీ 3ఆ. 175వ.)

రవి మండల వ్యాసము 1 లక్షయోజనములు:

సీ. ఆకాశమధ్యస్థ మగు భానుబింబంబు
విను లక్షయోజన విస్తృతంబు.

కాశీ-3 ఆ. 180 వ.

## పంచాగ్ని విద్య-శ్రీమత్స్య మహాపురాణము (123 అ.)
## తద్వివరణమునకై
## ఈ పురాణమున నక్షత్రవీథీ-పథ-(మార్గ-స్థాన) ప్రతిపాదనము-
## యజ్ఞవేదికారూప నిష్పాదనము.

ఛాందోగ్యోపనిషత్తునందు పంచమాధ్యాయమున (3 నుండి 10 వరకు ఖండములు) పంచాగ్ని విద్యయును ఆ విద్యను ఉపాసించుటచే కలుగు ఫలమును కర్మానుష్ఠానమాత్ర పరాయణులు పొందు గతులును ఏ యుపాసనములును లేని జీవులు పొందు గతులును చెప్పబడినవి. అందు దేవయాన పితృయాణములును మధ్యమ యానమును చెప్పబడినవి.

ఆ విషయమే ఈ శ్రీమత్స్య మహాపురాణమునందలి ఖగోళ సంస్థానమును తెలుపు 123-124-125-126 అధ్యాయములందు ప్రతిపాదింపబడినది.

ఇందు 123వ అధ్యాయమునందలి 106 నుండి 116 వరకు గల శ్లోకములందు ప్రవృత్తి మార్గపరులయి గృహస్థులుగ నుండి కర్మానుష్ఠానము ప్రధానముగా నుండువారు పొందు పితృయాణ గతియును నివృత్తిమార్గపరులయి

పరతత్త్వోపాసనా పరాయణులగు వారు పొందు దేవయాన గతియు ప్రతిపాదింపబడినవి. ఈ రెండును లేనివారు జనన మరణ ప్రవాహరూప సంసార గతిలో నానా జీవులుగా పుట్టుచు చచ్చుచు నుండవలసినవారే. అని సంప్రదాయము.

దీనికి సంగ్రహరూపముగా ఆపస్తంబ మహర్షి తన ధర్మసూత్రములందు తన నాటికి ఆర్ష పురాణములందు ప్రసిద్ధములని రెండు శ్లోకములను ఉదాహరించియున్నారు. అవి ఇవి: (ఆప. ధర్మ. 2 ప్రశ్న-23 పటల- 3-4 సూ.)

"అష్టాశీతి సహస్రాణి యే ప్రజా మీషిర ఋషయః ।
దక్షిణే నార్యమ్ణః పంథానం తే శ్మశానాని భేజిరే."
"అష్టాశీతి సహస్రాణి యే ప్రజాం నేషిర ఋషయః ।
ఉత్తరేణార్యమ్ణః పంథానం తేఽమృతత్వం హి కల్పతే."

ఈ రెండు శ్లోకములను పై జెప్పిన ఛాందోగ్యోప నిషదంశమునకు భాష్యములో శ్రీశంకర భగవత్పాదులును ఉదాహరించినారు. ఈ శ్లోకద్వయమునకు వ్యాఖ్యానమే ఈ (మత్స్య-123-శ్లో. 106-116) శ్లోకములు.

ఇందలి దేవయాన పితృయాణ మధ్యయానములను తెలుపునవియే ఈ పురాణమునందలి 123వ అధ్యాయమున చెప్పబడిన నాగవీథ్యాదులగు తొమ్మిది నక్షత్ర వీథులును; అందలి మూడేసి వీథులతో ఏర్పడు 1. ఐరావతపథము 2. జార ద్గవపథము 3. వైశ్వానరపథము అను పథ(స్థాన-మార్గ) త్రయమును.

ఇందు 1. ఐరావతపథమే దేవయానమనబడు ఉత్తర మార్గము 2. జారద్గవపథము మధ్యమ మార్గము; 3. వైశ్వానరపథము పితృయాణము అనబడు దక్షిణమార్గము. ఈ శ్రీమత్స్య మహాపురాణమునందలి మార్గత్రయ వ్యవస్థ ఇచట చూపబడినది. (మత్స్య-123 అ. పటములో 'గో' 'జరద్గవ' తారుమారైనవి. దిద్దుకొన ప్రార్థన.).

దక్షిణా ద్వినివృత్తోఽసౌ విషువస్థో యదా రవిః । క్షీరోదస్య సముద్రస్యోత్తరతోపి దిశశ్చరన్. 49
మణ్డలం విషువేచాపి యోజనై స్తన్నిబోధత । త్రిస్రఃకోట్యస్తు సమ్పూర్ణం విషువస్యాపి మణ్డలమ్. 50
తథా శతసహస్రాణి వింశత్యేకాధికాపునః । శ్రావణే చోత్తరే కాష్ఠాం చిత్రభాను ర్యదా భవేత్. 51
గోమేదకస్య ద్వీపస్య ఉత్తరాం చ దిశం చరన్ । ఉత్తరాయాః ప్రమాణేతు కాష్ఠాయా మణ్డలస్యతు. 52
యోజనానాం ప్రసంఖ్యాతా కోటిరేకాతు సా ద్విజాః । అశీతి ర్నియుతానీహ యోజనానాం తథైవచ ।
అష్ట పంచాశతంచైవ యోజనా న్యధికానితు.
దక్షిణోత్తరమధ్యాని తాని విన్ద్యా ద్యథాక్రమమ్ । స్థానం జరద్గవం మధ్యే తథైరావతముత్తరమ్. 54
వైశ్వానరం దక్షిణతో నిర్దిష్టమిహ తత్త్వతః । నాగవీథ్యుత్తరావీథి రజవీథిస్తు దక్షిణే. 55
అశ్వినీ కృత్తికా యామ్యా నాగవీథి త్రయః స్మృతాః । రోహిణ్యార్ద్రా మృగశిరా గజవీథిరితి స్మృతా. 56
పుష్యాశ్లేషా పునర్వస్వో ర్వీథిరైరావతీ స్మృతా । తిస్రస్తు వీథయో హ్యేతా ఉత్తరో మార్గ ఉచ్యతే. 57
పూర్వఉత్తరఫల్గున్యౌ మఘాచైవార్షభీభవేత్ । పూర్వోత్తరా ప్రోష్ఠపదే గోవీథీ రేవతీ స్మృతా. 58
శ్రవణంచ శ్రవిష్ఠాచ వారుణం వా జరద్గవమ్ । ఏతాస్తు వీథయస్తత్ర మధ్యమో మార్గ ఉచ్యతే. 59
హస్తా చిత్రా తథా స్వాతీ అజ వీథిరితి స్మృతా । విశాఖా మైత్రమైన్ద్రంచ మృగవీథి రిహోచ్యతే. 60
మూలపూర్వోత్తరాషాడా వీథిర్వైశ్వానరీ స్మృతా । స్మృతా స్తిస్రస్తు వీథ్యస్తా మార్గేవై దక్షిణే పునః. 61

# 5. నక్షత్ర వీధులను-నక్షత్ర పథములను.

శ్రీమత్స్యమహాపురాణము - 122అ. 49-61శ్లో
ఇచ్చట ఏర్పడు సమాంతర చతుర్భుజము యజ్ఞవేదికా
రూపములో నుండుట గమనింపదగినది.

జారద్గవ పథము(స్థానము)




ఇందు ఉత్తర-దక్షిణ మార్గముల నట్టనడుమ మధ్య మార్గమున్నది. అగ్నికి అభిముఖులై కూర్చున్న యజమానునకు ముందు వెనుకల మధ్యమ మార్గమును కుడి - ఎడమలందు ఉత్తర దక్షిణ మార్గములును ఉండును.

ఈ మహాపురాణమున ఖగోళ సంస్థానాధ్యాయములందు ప్రతిపాదింపబడిన విషయము అంతయు ఛాందోగ్యోపనిషత్తునందు పైజెప్పిన భాగములందు ప్రతిపాదింపబడిన విషయమే అనుకొంటిమిగదా! అందు చెప్పబడిన పంచాగ్ని విద్యను ఎరుగవలయును. దానిచే సంసారపు నడక తెలియును. అనంతరము వారివారి సంస్కారమును బట్టి కొందరకు ప్రవృత్తి మార్గమునందు ఆసక్తి కలుగును; మరికొందరకు సంసార విషయమున జుగుప్స కలిగి నివృత్తి మార్గమునందాసక్తి జనించును. మొదటివారు గృహస్థులు; రెండవవారు *నైష్ఠిక బ్రహ్మచారులును వానప్రస్థులును సంన్యాసులును; వారికి కలుగు పితృయాణ దేవయానములనెడు రెండు గతులును-ఏదియు లేక ప్రాణి సాధారణ జీవనము జీవించు వారు పొందు గతియును ఛాందోగ్యమున ఇట చెప్పబడినవి.

వీనికి మూలభూతమగు పంచాగ్ని విద్య ఈ పురాణపు ఖగోళ సంస్థానాధ్యాయములందు ఎచట ఎట్లు నిరూపింపబడెనో తెలియవలయును. అందులకై మొదట ఉపనిషత్తునందలి పంచాగ్ని విద్యాదశాక్రమమును తెలియవలయును. ఇది శ్రీ భగవద్గీతయందు:కర్మము వలన యజ్ఞము-దానివలన పర్జన్యుడు-అతని వలన అన్నము-అన్నమువలన భూతములు (ప్రాణులు) జనించునని చెప్పినదియే.(చూ. భగవద్గీత. అ. 3; శ్లో. 14.)

శ్రద్ధా పూర్వకముగ ఇహలోకమున "యజమానులు" "యజనము చేయువారు"అగు గృహస్థులు సమంత్రకముగ చేయు హవనాదిక వైదిక కర్మఫలముగా జలములు ఆదిత్య రశ్ములచే గ్రహింపబడును. అవి ఆవిరి రూపమున అంతరిక్షమునకేగును. అచట అవి "సోమత్వము"ను "ఓషధీ రూప పరిణామ యోగ్యమగు దేవతాశక్తి తత్త్వరూపము"ను 2. "సోముడు" అనుగ్రహించగా ఈ "సోమత్వము" నుండి ఈ "అప్పులు" "పర్జన్యత్వము" నుందును; పర్జన్యునినుండి "వృష్టి" "వృష్టి" నుండి 3. "అన్నము" "అన్నము"నుండి 4. "రేతస్సు" "రేతస్సు" నుండి 5. "పురుషుడు" "దేహధారి" జనించును. అని దీని సారాంశము.

ఇచ్చట ఈ పంచాగ్ని విద్యయందలి దశా పంచకములో ఏతద్వివరణమునకై అంగ భూతములుగా ప్రథమ దశలో 1. ఈలోకము 2. ఆదిత్యుడు 3. ఆదిత్యరశ్ములు 4. అహస్సు 5. చంద్రముడు 6. నక్షత్రములు రెండవ దశలో 1. పర్జన్యుడు 2. వాయువు 3. అభ్రము (మేఘములు) 4. విద్యుత్ 5. అశని (పిడుగు) 6. హ్రాదుని (ఉరుములు) మూడవదశలో 1. పృథివి 2. సంవత్సరము 3. ఆకాశము 4. రాత్రి 5. దిశలు 6. అవాంతర దిశలు నాలుగవ దశలో 1. పురుషుడు 2. వాక్కు 3. ప్రాణము 4. జిహ్వ 5. చక్షుస్సు 6. శ్రోత్రము ఐదవ దశలో 1. యోషా (స్త్రీ) 2. ఉపస్థము 3. ఉపమంత్రణము 4. యోని 5. అంతఃకరణము (రేతస్సును స్త్రీగర్భమున నిలుపుట) 6. అభినందములు (ఆనందానుభవము) అను ముప్పది అంశములు గ్రహింపబడినవి. వీనిలో మొదటి పదునెనిమిదియు ఈ ఖగోళాధ్యాయమునందు మనోహరముగా వర్ణింపబడినవి. మిగిలిన పండ్రెండును సృష్టి విషయకాధ్యాయములందును ఇతరత్రను వచ్చుచునే యున్నవి.

ఇందలి నక్షత్ర గ్రహమండలములు-వాని పరిమాణము-పృథివినుండి వానికిని-వానిలో వానికి పరస్పరమును-కలదూరము వాని గమనము వ్యాసములు చుట్టుకొలతలు మొదలగునవి మనకు అభూత కల్పనలుగా కనబడును. కాని భూమిచుట్టు సూర్యుడు తిరుగును అనినను సూర్యునిచుట్టు భూమి తిరుగును అనినను ఈ ప్రాచీనాధునిక సిద్ధాంతముల వలన గణితముచే కలుగు గ్రహగమన విషయము ఒకే విధమగు సంఖ్యలను ఇచ్చుచున్నట్లే ఇందలి యోజనాది పరిమాణములు కూడ వానిని గ్రహించి ఆయా పద్ధతులచే గణితము చేసి చూచినచో ఏమి ఫలితమునిచ్చునో తెలియును. ఇది పరిశోధన పాత్రమగు విషయము; శ్రమతో కూడినపని. కాని ఉపాసనకు సంబంధించినంతవరకు ఇవియన్నియు

---

* బ్రహ్మచారులు 1. నైష్ఠికులు (పరతత్త్వోపాసన ప్రధానులు 2. ఉపకుర్వాణులు (వేదాధ్యయనాధ్యాపనాది ప్రవృత్తిపరులు) అని రెండు విధములనుందురు.

వాస్తవములుగానే గ్రహింపదగును. ఇందు కొన్ని తావులందలి సంఖ్యలు అభూత కల్పనలుగా కనబడుటకు హేతువులు-ప్రాచీనార్ష వాఙ్మయములో- వేదమునందును దానితో అనుబద్ధమగు బ్రాహ్మణాదులందును తప్ప మిగిలిన వానిలో-ముఖ్యముగా పురాణములలో-పాఠములు గందరగోళముగా మారుటయు-వానిని నిర్ధారించుటకు అనుకూలమగు సంప్రదాయము విచ్ఛిన్నమగుటయునని ఎరుగవలయును. ఉదాహరణమునకు ఈ పురాణమునందే భవిష్యద్రాజాను కీర్తనాధ్యాయమున సప్తర్షులు 27 నక్షత్రములలో సంచరించుటకగు సంవత్సరములను దివ్యమానములో తెలుపు సంఖ్య అన్ని ప్రతులందును అగమ్యముగా మారియున్నది. ఇది ఇంతవరకు చాలును.

పంచాగ్ని విద్యనెఱిగిన వారిలో రెండు విధములవారును-అది ఎరుగని వారును పొందు 1. పితృయాణ 2. దేవయాన 3. మధ్యమయానములను తెలుపుటయే ఈ అధ్యాయమునందలి నక్షత్ర-పథ-వీథీ (మార్గ-స్థాన) ప్రతిపాదనమునకు ప్రయోజనము. లేవ పటమును చూచునది. విషయము అవగతమగును.

ఇతర పురాణములలో ఈ వీథులు మొదలగు రూపమున నక్షత్రములు వేరు విధముగ విభజింపబడినవి. అందు 1. అశ్విని మొదలు తొమ్మిదేసి నక్షత్రములు ఒక్కొక్క మార్గముగా గ్రహించుట ఒక విధము. 2. భరణి మొదలుగా తొమ్మిదేసి గ్రహించుట మరియొక విధము. 3. గర్గమతము మరియొక విధముగ నున్నది. 1-2విధములలో నక్షత్ర చక్రము నడుమ సమబాహు-సమకోణ-($120\times3=360$ భాగలుకల) త్రిభుజము ఏర్పడును. అందు విశేషము ఏమియు కనబడదు. గర్గమతము ననుసరించి ఏ వ్యవస్థ ఏర్పడునో తెలియుట అసాధ్యము.

శ్రీ విష్ణు ధర్మోత్తర మహాపురాణము-ప్ర-ఖం. 85 అధ్యాయమున ఈ విషయమును చెప్పు శ్లోకములు (ఈ పురాణమున అనేక ప్రకరణములందలి శ్లోకముల వలెనే) అక్షర దోషములతో-గ్రంథపాతములతో-అస్తవ్యస్తముగానున్నవి. ఏమయినను వానిని కూర్చుకొనగా అందలి నక్షత్ర వీథీ వ్యవస్థ ఇట్లున్నది:

ఉత్తరోత్తరము : నాగవీథి :- భరణీ-కృత్తిక-స్వాతి
ఉత్తరమధ్యము : గజవీథి :- రోహిణీ-మృగశిర-ఆర్ద్ర
ఉత్తరదక్షిణము: ఐరావత వీథి :- పునర్వసు-పుష్య-ఆశ్లేష-మఖ.
మధ్యోత్తరము : ఋషభవీథి: :- పూర్వఫల్గుని-ఉత్తరఫల్గుని
మధ్యమధ్యము : గోవీథి :- పూర్వాభాద్ర-ఉత్తరాభాద్ర-రేవతి-అశ్విని
మధ్యదక్షిణము : జరద్గవ వీథి :- శ్రవణము-ధనిష్ఠ-శతభిషము.
దక్షిణోత్తరము : మృగవీథి :- హస్త-చిత్ర.
దక్షిణమధ్యము : అజవీథి :- విశాఖ-అనూరాధ.
దక్షిణదక్షిణము : వైశ్వానరవీథి :- జ్యేష్ఠ-మూల-పూర్వాషాఢ-ఉత్తరాషాఢ

ఇవి చూడగా ఈ పురాణమున దీనిని అమర్చినవారికి ఈ నక్షత్రవీథీ వ్యవస్థకు "సంహితా" "హోరా" (ముహూర్త-జాతకములు) అను జ్యోతిఃశాస్త్ర స్కంధద్వయమునందు శుభాశుభనిర్ణయము చేయుట తప్ప వేరొక అర్ష సంప్రదాయ ప్రయోజనము కలదను భావన దృష్టిలో లేదేమోః అనిపించును.

అదికాక ఇందు "వీథీ" "పథ" పదములు ఒకే అర్థమునందు వాడబడినవి. కనుక వారికి ఇచట ఈ రెంటికిని భేదము కలదను భావన యున్నట్లు కనబడదు.

కాని ఈ శ్రీమత్స్యమహాపురాణమునందు చెప్పబడిన విధమున వీథీ-పథ విభాగము చేయుటచే దేవయాన పితృయాణములు రెండును రెండు ప్రక్కల నుండగా నడుమ మరల రెండు వైపులను సర్వప్రాణి సాధారణమగు మధ్యమ మార్గము ఉండును. వీని విభాజక బిందువులను కలుపగా యజ్ఞ మహా వేదీరూపము ఏర్పడును.

దీని యర్థము ఇట్లు చెప్పుకొనవచ్చును: యజమానుడు యజ్ఞమాచరించుటకై కూర్చుండగా అతనికి ఎదురుగా అగ్నిహోత్రుడుండును. అతనికి ముందు వెనుకలను మధ్యమయానమును కుడి ఎడమలందు దేవయాన పితృయాణములును ఉన్నవి. అవి యజమానునకు "ఓయీ! నీవు కేవలము దంభమునకు ఈ దేవతారాధనము (యజ్ఞము) చేసితివో! నీకు ముందువెనుకలనున్న ఈ మార్గమే నీకు గమ్యము; పరమార్థమెరిగి నిష్కాముడవై ఇది చేసితివో! దేవయాన గతి ద్వారమున క్రమముక్తి; సకాముడవై యజించితివో 'పితృయాణ'మున చంద్రలోకమేగుదువు; జన్మావృత్తి నందుచుందువు." అను ఎచ్చరిక చేయుచుండును.

ఇట్లు మన ప్రాచీన ఋషులు యజ్ఞ వేదికారూప పరికల్పనమును ఈ నక్షత్ర వీథీ వ్యవస్థతో ఏర్పడిన దేవయాన పితృయాణ మధ్యయాన వ్యవస్థనుండియే నిష్పాదనము ఒనర్చిరని ఊహించవచ్చును.

123 అ; 20-33 శ్లో. ఈ శ్లోకములయందు చెప్పబడిన విషయము అంతయు 'రవి దేవనివాసమగు మేరువును నిరంతరమును ప్రదక్షిణించుచుండును.' అను సంప్రదాయమును అనుసరించి చెప్పబడినది. ఆ శ్లోకములు ఇవి:

తారకాసన్నివేశస్య దివి యావత్తు మణ్డలమ్. 19
పర్యాసనన్నివేశస్య భూమేర్యావత్తు మణ్డలమ్। పర్యాయ(వ)పరిమాణాభ్యాం భూమేస్తుల్యం దివం స్మృతమ్.
మేరోః ప్రాచ్యాం దిశాయాంతు మానసోత్తరమూర్ధని। వస్వోకసారా మహేంద్రపురీ హేమపరిష్కృతా. 21
దక్షిణేన పునర్మేరో ర్మానసస్యైవ పృష్ఠతః। వైవస్వతో నివసతి యమ స్సంయమనీపురే. 22
ప్రతీచ్యాంచ పునర్మేరో ర్మానసస్యైవ మూర్ధని। సుఖానామ పురీరమ్యా వరుణస్యాపి ధీమతః. 23
దిశ్యుత్తరాయాం మేరోస్తు మానసస్యైవ మూర్ధని। తుల్యా మహేన్ద్రపుర్యాస్తు సోమస్యాపి విభాపురీ. 24
మానసస్యోత్తరే పృష్ఠే లోకపాలా శ్చతుర్దిశమ్। స్థితా ధర్మవ్యవస్థార్థం ధర్మసంరక్షణాయ చ. 25

సూర్యసఞ్చారకథనమ్.

లోకపాలోపరిష్టాత్తు సర్వతో దక్షిణాయనే। కాష్ఠాగతస్య సూర్యస్య గతిం తస్య నిబోధత. 26
దక్షిణో(ణా)పక్రమే సూర్యః క్షిప్తేషురివ గచ్ఛతి। జ్యోతిషాం చక్ర మాదాయ సతతం పరిగచ్ఛతి. 27
మధ్యగ శ్చామరావత్యాం యదా భవతి భాస్కరః। వైవస్వతే సంయమనే ఉద్యంస్తత్ర ప్రదృశ్యతే. 28
సుఖాయా మర్ధరాత్ర్యాంతు విభాయా మస్తమేతిచ। వైవస్వతే సంయమనే మధ్యాహ్నేతు రవి ర్యదా. 29
సుఖాయా మథ వారుణ్యా ముత్తిష్ఠ న్సతు దృశ్యతే।విభాయా మర్ధరాత్రంతు మాహేన్ద్ర్యా మస్తమేతిచ. 30
సుఖాయా మథ వారుణ్యాం మధ్యాహ్నే చార్యమా యదా। విభాయాం సోమపుర్యాంతు ఉత్తిష్ఠతి విభావసుః. 31
రాత్ర్యర్ధ మమరావత్యా మస్తమేతి యమస్య చ। సోమపుర్యాం విభాయాంతు మధ్యాహ్నే చార్యమా యదా. 32
మాహేన్ద్ర్యా మమరావత్యా ముద్గచ్ఛతి దివాకరః। అర్ధరాత్రం సంయమనే వారుణ్యా మస్తమేతిచ. 33

# 4. 'కశ్యప' సూర్యుని మేరు ప్రదక్షిణము

మత్స్య- 123అ.; 21-33శ్లో
యజురారణ్యకము. 1 ప్రశ్నము.

వస్వోక పారా (అమరావతి)



సుఖా-సుసా

| | వస్వోక సారా- | సంయమనీ- | సుఖా- | విభా. |
|---|---|---|---|---|
| 1. | మధ్యాహ్నము. | ఉదయము. | అర్ధరాత్రము. | అస్తమయము. |
| 2. | ఉదయము. | అర్ధరాత్రము. | అస్తమయము | మధ్యాహ్నము. |
| 3. | అర్ధరాత్రము. | అస్తమయము. | మధ్యాహ్నము. | ఉదయము. |
| 4. | అస్తమయము. | మధ్యాహ్నము. | ఉదయము. | అర్ధరాత్రము. |

రవి ఏ ప్రాంతపు క్షితిజమునకు సమాంతరముగా నుండునో ఆ ప్రాంతపు వారికి రవి ఉదయించును. అట్టి రవ్యుదయస్థానమునకు 90° డిగ్రీలు ముందున్న వారికి ఈ రవి లంబరేఖలో కనబడును. కనుక అచ్చటి వారికి ఆ సమయము మధ్యాహ్నము; అంతకంటె 90° డిగ్రీలు ముందున్న వారికిని ఉదయస్థానపు వారికిని నడుమ 180° డిగ్రీలు దూరమయి మధ్యాహ్న స్థానము అడ్డముగా నుండును. కనుక వీరి కపుడు రవి అస్తమించుచు కనబడును. ఉదయస్థానమునకు 90° డిగ్రీలు తరువాత నున్న వారి క్షితిజము మీదకు రవి మరి 6 గంటల (15 గడియల) సేపటిలో పోవును; కనుక వారి కది అర్ధరాత్రము. ఈ విషయమే ఈ 14 శ్లోకములలో చెప్పబడినది.

తైత్తిరీయ యజురారణ్యకమున ప్రథమ ప్రశ్నమునందలి సప్తమానువాకమునందు 'కశ్యపుడు' అను సూర్యుడు సదా మేరువును విడువక ఉండును; దాని నతడు ఎల్లపుడు పరివర్తించుచుండును; అతని వలననే లోకయాత్రా ప్రవర్తకులగు మిగిలిన ఏడుమంది సూర్యులును 1. ఆరోగః 2. భ్రాజః 3. పటరః 4. పతంగః 5. స్వర్ణరః 6. జ్యోతిషీమాన్ 7. విభావసుః అను వారు తేజస్సును పొందుదురు. అని చెప్పబడినది. అతడే సర్వ జగత్కర్మసాక్షియై సమస్త విశ్వమును కనుపెట్టి చూచుచు అనుగ్రహించుచుండును.

(సర్వం- పరి) పశ్యతి- ఇతి- పశ్యకః; పశ్యకః- ఏవ- కశ్యపః- వర్ణవ్యత్యయేన.

సమస్త విశ్వమందలి ప్రతియొక తత్త్వమును సూక్ష్మమగు అనుగ్రహదృష్టితో చూచువాడు కావున 'పశ్యకః'. ఈ పశ్యక శబ్దమే ఆద్యంత వర్ణముల మార్పిడిచే 'కశ్యపః' అగును.

"కశ్యపః పశ్యకో భవతి- యః సర్వం పరిపశ్యతీతి సౌక్ష్మ్యాత్."

కృష్ణయజురారణ్యక- 1 ప్రశ్న-8 అనువాకము.

మత్స్య-123 అ. శ్లో. 19-33. ఈ శ్లోకములందు ప్రతిపాదింపబడిన కశ్యప సూర్యుని మహామేరు ప్రదక్షిణ విషయము అంతయు ఛాందోగ్యోపనిషత్తునందును ప్రతిపాదింపబడియున్నది:

"స యావ దాదిత్యః పురస్తా దుదేతా పశ్చా దస్తమేతా -ద్విస్తావ ద్దక్షిణత ఉదేతోత్తరతోఽస్తమేతా." (ఛాం. అ3. ఖం. 7. అను. 4.)

"స యావ దాదిత్యో దక్షిణత ఉదేతోత్తరతోఽస్తమేతా-ద్విస్తావ త్పశ్చా దుదేతా పురస్తా దస్తమేతా." (ఛాం. అ. 3. ఖం. 8-అను. 4.)

"స యావ దాదిత్యః పశ్చా దుదేతా పురస్తా దస్తమేతా-ద్విస్తావ దుత్తరత ఉదేతా దక్షిణోఽస్తమేతా." (ఛాం. అ. 3-ఖం 9. అను. 4.)

"స యావ దాదిత్య ఉత్తరత ఉదేతా దక్షిణతోఽస్తమేతా -ద్విస్తావ దూర్ధ్వ ఉదేతాఽర్వా జస్తమేతా." (ఛాం. అ. 3-ఖం. 10. అను. 4.)

ఈ శ్రుతి వచనములపై శ్రీ శంకర భగవత్పాదుల భాష్యమును దానిపయి ఆనంద జ్ఞానులవారి వ్యాఖ్యయును చాల స్పష్ట వివరణమును ఇచ్చుచు ఈ విషయమున పురాణ వచనములను శ్రుతి వచనములతో ఎట్లు సమన్వయపరచుచు విచారింపవలయునో నిరూపించుచున్నవి.

యుగావయవములగు పంచ సంవత్సరములు.

124-140 అధ్యాయములందును త్రిపురాసుర సంహార కథయందును 'ఐదేసి సంవత్సరములు ఒక్కయుగము' అను భావనకు చెందిన యుగపు అవయవములగు పంచ సంవత్సరముల విషయము తెలిసికొనదగియున్నది.

ఇది మొదట 'పంచ సంవత్సరమయ యుగాధ్యక్షం ప్రజాపతిమ్' అని వేదాంగ జ్యోతిషమునందు కనబడు చున్నది.

శ్రీమద్భాగవతమునందు పంచమ స్కంధమున ద్వావింశాధ్యాయమున ఏడవ వచనమున:

"అథ చ యావ న్నభోమండలం సహ ద్యావాపృథివ్యో ర్మండలాభ్యాం కార్త్స్న్యేన సహ భుంజీత- తం కాలం సంవత్సరం పరివత్సర మిడావత్సర మనువత్సరం వత్సర మితి భానో ర్మాంద్య శైఘ్ర్య గతిభిః సమామనంతి. 7."

మత్స్యపురాణమునందు 124వ అధ్యాయమునందును-త్రిపురాసుర సంహార కథయందలి పరమేశ్వర రథ నిర్మాణ కథయందు 13iవ అధ్యాయమునందును 'అరాః సంవత్సరాః పంచ' అనియు 140వ అధ్యాయమున-

"తేషు సంవత్సరో హ్యగ్నిః సూర్యస్తు పరివత్సరః।
సోమ స్త్విద్వత్సర శ్చైవ వాయుశ్చైవానువత్సరః।
రుద్రస్తు వత్సర స్తేషాం పంచాబ్దా యే యుగాత్మకాః."

అనియు నున్నది.

పైవానిలో శ్రీమద్భాగవత వచనముపై శ్రీధరస్వామి వ్యాఖ్య:

"మండలాభ్యాం సహ భుంజీత- స- హ- న హి సూర్యః- యదా శుక్లప్రతిపది సంక్రాంతి ర్భవతి- తదా- సౌరచాంద్రయో ర్మాసయో ర్యుగప దుపక్రమో భవతి- స- సంవత్సరః- తతః సౌరమానేన వర్షే షట్ దినాని వర్ధంతే- చాంద్రమానేన షట్ దినాని హ్రసంతీతి- ద్వాదశదిన వ్యవధానా దుభయో రగ్ర పశ్చాద్భావో భవతి; ఏవం పంచ వర్షాణి గచ్ఛంతి; తన్మధ్యే ద్వౌ మలమాసౌ భవతః; తతః పునః షష్ఠః సంవత్సరో భవతి; త దేవ మవాంతరభేదేన సంవత్సరాది పంచకం సమామనంతి."

ఈ విషయమయి 'మల మాసత త్త్వమ్' అను ధర్మ నిబంధ గ్రంథమున:

'శకాబ్దాత్ పంచభిః శేషాత్ సమాద్యాదిషు వత్సరాః।
సంపరీదానుపూర్వాశ్చ। తథోదాపూర్వకా మతాః. ఇతి.'

(వాచస్పత్యమునుండి)

ఈ సంవత్సరాది పంచ సంవత్సరములయందును చేయదగిన దానములును తత్ఫలములును విష్ణు ధర్మోత్తరమున:

"సంవత్సరే తథా దానం తిలస్య చ మహాఫలం।
పరిపూర్వే తథా దానం యవానాం చ ద్విజోత్తమాః।
ఇదా పూర్వేఽన్నవస్త్రాణాం ధాన్యానాం చానుపూర్వకే।
ఉదా సంవత్సరే దానం రజతస్య మహాఫలమ్. ఇతి."

మరియు మలమాస తత్త్వమునందే

"జ్యోతిర్విద స్త్విజ్యమధ్యాత్ ప్రభవాదేశ్చ సంభవమ్।
ఊచు స్తద్వ త్సమాద్యాది వర్షాణామపి సంభవమ్. ఇతి."

ఇందు గమనింపవలసిన యంశములు:

1. శ్రీమద్భాగవతమునందును శ్రీమత్స్యమహాపురాణమునందును యుగాంగములగు ఐదు సంవత్సరముల పేరులును 1. సంవత్సరము 2. పరివత్సరము 3. ఇడా (దా) వత్సరము 4. అనువత్సరము 5. వత్సరము అనియున్నది. (మత్స్యపురాణమున మూడవది ఇద్వత్సరము అనియున్నది. ఇది ఛందోఽనుకూలతకై 'ఇదా' అనుటకు మారు 'ఇద్' అనుట కావచ్చును); పరివత్సరము అనెడు పదము కేవలము 360 అహోరాత్రములతో అగు సంవత్సరము అను అర్థముతో కూడ ఆర్ష వాఙ్మయమున కనబడుచున్నది.

2. ఇక విష్ణు ధర్మోత్తరమునందును మలమాస తత్త్వమునందును ఐదవదాని పేరు ఉదావత్సరము అని యున్నది.

3. జ్యోతిశ్శాస్త్ర తత్త్వానుసారము వీని వివరణమునకై శ్రీధరస్వామివారు ఇచ్చిన దాని యర్థము: 'చాంద్రమానము ననుసరించి చైత్ర శుక్ల ప్రతిపత్ తిథియు సౌరమాసము ననుసరించి సూర్యుని రాశి ప్రవేశమును ఒకేమారు ఏ సంవత్సరమున జరుగునో అది 1. సంవత్సరము దాని తరువాత వచ్చు నాలుగు సంవత్సరములకును వరుసగా పైని చెప్పిన పేరులు వర్తించును. ఏలయన- ఇందు మొదటిదగు 'సంవత్సరము'నకు తరువాత నుండి క్రమముగా సౌరమాన సంవత్సరమున ప్రతిఏట ఆరేసి దినములు పెరుగుటయు చాంద్రమాన మానమున ఆరేసి దినములు తగ్గుటయు జరుగుచు ఒక్కొక్క ఏడాదిలో పన్నెండేసి దినముల భేదము ఏర్పడును. ఇట్లు సాగిపోవు ఐదేండ్ల కాలములో రెండు మల (సూర్యుని రాశి ప్రవేశములేని) మానములు వచ్చును. ఇవియే అధిక మానములు.'

4. ఇక 'మలమాస తత్త్వ'మను నిబంధ గ్రంథము ఇట్లు చెప్పుచున్నది: శాలివాహనశక సంవత్సర సంఖ్యను ఐదుచే భాగించగా వచ్చు శేషము 1 అయినచో ఆ వర్షమును సంవత్సరము-2 అయినచో పరివత్సరము 3 అయినచో ఇదా వత్సరము 4 అయినచో అనువత్సరము 5 అయినచో ఉదావత్సరము అని ఎరుగవలయును.

5. దీనినిబట్టి శాలివాహన శకారంభము ఈ ఐదింటిలో 'సంవత్సరము'తో (సౌర చాంద్రమానముల ఆరంభము ఒకే దినమున అయిన ఏట) అయ్యెనని తెలియును. మన అనుభవమును బట్టి ఈ శాలివాహన శకము ఒకానొక 'ప్రమాది' నామ సంవత్సరమున ఆరంభమయినది.

6. 'జ్యోతిర్విదః' అను 'మల మాసతత్త్వ' శ్లోకము మరియొక సూక్ష్మ విషయమునుకూడ చెప్పుచున్నది: అదియేమనిన: ప్రభవ మొదలగు అరువది సంవత్సరములలో మొదటిదగు ప్రభవ సంవత్సరముకాని పంచ సంవత్సరములలో మొదటిదగు 'సంవత్సరము'కాని "ఇజ్య" మధ్యముతో ఆరంభమగును. ఇజ్యుడు అనగా బృహస్పతి; ఏడాదికి ఒకటి చొప్పున రాశి సంచారము చేయు బృహస్పతి తాను చేయు రాశి సంచారములో ఒకరాశికి ఇంచుమించుగా నట్టనడుమ (అనగా ఆ రాశిలో 15 భాగలు ఇంచుమించుగా గడచి) ఉండగా ఆరంభమగును.

ఈ యంశము ఈ రాబోవు ప్రభవ (1987 క్రీ. శ.) సంవత్సరారంభమున సరిగా నున్నదని గమనించ వచ్చును.

బార్హస్పత్యమానము అనగా బృహస్పతి రాశి సంచారముపై ఆధారపడిన గణనము.

చాంద్రమాన సౌరమాన బార్హస్పత్యమానములకు గల పరస్పర సంబంధము ఇట్టిది. ఇది ఏమాత్రమును త్రోసివేయరాని గణితశాస్త్రమును అనుసరించి సరిపోవుచున్న విషయము. పుక్కిటి పురాణము కాదు.

మన పూర్వులు చెప్పిన విషయములలో కొన్ని మన హేతువాదాభాసములకు సరిపోవుచున్నట్లు కనబడకున్నను వాని వెనుక నున్న తత్త్వమును సరియగు హేతువులతో ఆలోచించవలయును.

131 అ.

"చతుర్భి శ్చిత్రితం షడ్భి ర్ధనుః సంవత్సరోఽభవత్।
అజరా జ్యాఽభవచ్చాపి సాత్త్వికీ ధనుషో దృఢా."

చతుర్భిః షడ్భిః $=4\times6=24$ పక్షములతో; అజరా-(అ) శిథిలా; దీనికి హేతువును ప్రతీకతయు 40వ శ్లోకమునందు:

"కాలో హి భగవాన్ రుద్ర స్తం చ సంవత్సరం విదుః।
తస్మా దుమా కాలరాత్రీ ధనుషో జ్యాఽజరాఽభవత్."

అని చెప్పబడినది; దీనిని బట్టియే కాలరాత్రి పైకి తామసిగా కనబడుచున్నను వాస్తవమునస్సాత్త్వికియని తెలియుచున్నది.

131 అ. 29 శ్లో. "చాతుర్హోత్ర ప్రయోజకాః చతుర్వర్ణాః."

చాతుర్హోత్రియములు అను యజ్ఞ విశేషములు కలవు; వీనియందు బ్రహ్మయును అధ్వర్యుడును కాక హోతతో మొదలుగా 1. హోత 2. అగ్నీద్రుడు 3. ప్రతిప్రస్థాత 4. మైత్రావరుణుడు అను నలుగురు ఋత్విజులు మాత్రము ఉందురు. వీరిలో బ్రహ్మ-అధ్వర్యుడు-హోత-ఈ ముగ్గురును ముఖ్యులు; బ్రహ్మకు అగ్నీద్రుడును అధ్వర్యునకు ప్రతి ప్రస్థాతయు హోతకు మైత్రావరుణుడును సహాయులు. హోత మొదలుగా ఈ నలుగురు మాత్రమే ప్రయోజకులుగా (యాగ ప్రయోగ నిర్వాహకులుగా) ఉండు యాగములకు శాస్త్రమునందు 'చాతుర్హోత్రియములు' అని వ్యవహారము.

ఈ శ్లోకమున ఈ నలుగురును 'చతుర్వర్ణాః' అనుటచే వీరు వరుసగా బ్రాహ్మణాది చతుర్వర్ణములకును సంకేతభూతులు అని గ్రహించవలసియున్నది.

133 అ. శ్లో. 63. మంజువాక్-చిలుక; 'పంజరే మంజువాగ్యథా.'

135 అ. శ్లో. 23. సకాశము-(సమీపము) అను నర్థమున 'సంకాశమ్'-ప్రయోగింపబడినది.

'సాగరేశ్వర సంకాశ ముత్పపాత పురం వరమ్.'

140 అ. 5-6 శ్లో. ఇందు "మండల" శబ్దము 'భాగ' (Degree) అను అర్థమున ప్రయోగింపబడినది.

## సనత్కుమారుడు-స్కందుడు.

మత్స్యపురాణమునందును మరి ఇతర పురాణములందును ఈ ఇరువురిలో ఒకరు వక్తగా నో శ్రోతగానో ఉన్నట్లు చెప్పుట కనబడుచుండును. వీరితోపాటు సనక సనందన సనత్సుజాతులును వినబడుచుందురు. వీరందరున నివృత్తి మార్గ ప్రవర్తకులగు బ్రహ్మ మానస పుత్త్రులని సంప్రదాయమున తెలియుచున్నది. స్కందుడు శివకుమారుడగ కార్తికేయ భగవానుడని పురాణములు చెప్పుచున్నవి. స్కంద సనత్కుమారులు ఇరువురును ఒక్కరేయని ఛాందోగ్యో: నిషద్వచనము.

"తస్మై మృదిత కషాయాయ (నారదాయ) తమసస్పారం దర్శయతి భగవాన్ సనత్కుమారః; తం స్కంద ఇత్యాచక్షతే." (ఛాందోగ్య-7-26-2.)

ఇది ఎట్లుః ఆలోచించగా శబ్ద వ్యుత్పత్తిచే సనక-సనందన-సనత్కుమార-సనత్సుజాత-స్కందులు అందరుః ఏకరూపులే. లోకమున (నివృత్తి) ధర్మ ప్రవర్తనమునకై భిన్నరూపులై వ్యవహరించుచుందురు. అని తెలియుచున్నది.

సనాత్-అను అవ్యయమునకు 'సదా' 'ఎల్లప్పుడు' అని అర్థము.

1. సనాత్-క > సనత్-క > సన(త్)-క = సనక.

2. సనాత్-నందన > సనత్-నందన > సన(త్)-నందన > స(న)-నందన సనందన.

3. సనాత్-కుమార > సనత్-కుమార = సనత్కుమార.

4. సనాత్-సుజాత > సనత్-సుజాత-సనత్సుజాత.

5. సనత్-క > (వర్ణ వ్యత్యయముచే) స్ (అ) క-న్-త్-అ > స్-కన్-ద్-అ > స్కంద.

ఇందు 'క' అల్పార్థకము కావున 'బాల' అను అర్థమును తెలుపును. జాత-కుమార-నందన శబ్దములు సమానార్థకములేకదా. 'సు' అనగా 'శోభన' 'మంచి' అని అర్థము.

ఇట్లు అంతయు సరిపోయినది.

141 అ; (శ్లో 48.) 'అథ' ఈ పదము ఇచట ప్రణవముతో సమానార్థకముగాను మంగళార్థకముగాను ఉన్నది.

141 అ. 'సకృత్పూర్వకమ్' అను పదము 'అదియే మొదటిసారిగా' 'వారికి ఎవరినుండియు ఉపదేశము లేకుండ' అను అర్థముతో ఉన్నది.

141 అ. ధ్రువ వర్షము = 9090 మానవ సంవత్సరములు; సప్తర్షి వత్సరము = 3030 మానవ సంవత్సరములు. (దీని ననుసరించి మానవమానమున 8 సం. 5 మా. = 1 ధ్రువాహోరాత్రము; మానవమానవు 25 సం. 3 మా = 1 సప్తర్ష్యహోరాత్రము).

ఇక శ్రీమత్స్యమహాపురాణమును (అథవా ఆర్ష వాఙ్మయమును) సరిగా అవగాహనము చేసికొనుటతో ఉపకరించు కొన్ని ముఖ్యాంశముల వివరణములు:

## వేదము-దశాత్రయము (మత్స్య-141 అ.)

వేదము మూడు దశలలో నుండును: 1. విజ్ఞాతము 2. దృష్టము 3. శ్రుతము. ఋషులు వేదమును అంతటిని "విజ్ఞాతము" 'తమ అనుభూతియందు గోచరమగునది'గా చేసికొనిరి. ఇది మొదటిదశ; ఇందు వైదిక వాక్కు పరావరా-పరా-పశ్యంతీ-వాగ్ దశలయందుండును. అనంతరము వారు ఆవేదమును స్పష్టముగా తత్తదర్థ ప్రతిపాదక శబ్దరూపమునను ఆ శబ్దములచే ప్రతిపాదితమగు అర్థరూపమునను వివిక్తముగా-విడివిడిగా - దర్శించిరి. ఇది రెండవదశ; ఈ దశయందు వైదికవాక్కు మధ్యమా వాగ్ దశయందుండును. తదనంతరము వారు ఆ శబ్దరాశిని స్పష్టముగా నుచ్చరించిరి. అధికారులగు వారికి అందజేసిరి. ఆ ఋషులు అందజేసిన దానిని ఆయా అధికారి జనులు తమ చెవులతో 'శ్రుతము' 'వినబడినది'గా చేసికొనిరి. ఇది మూడవదశ; ఈ దశయందు వైదిక వాక్కు వైఖరీ వాగ్ దశయందుండును. ఇట్టి దశాత్రయము కలది కావున వైదిక వాగ్రాశికి 'త్రయీ' అను వ్యవహారము సంపన్నమగుచున్నది.

లౌకికమగు భాషకును ఈ మూడు దశలును ఉన్నవి. ఐనను తాత్త్విక విచారణ పూర్వకముగా మానవులకు ఇహపర సుఖములను సాధించు వైదిక వాఙ్మయమునందు మాత్రమే త్రయీ పదము రూఢమయినది. ఋక్ సామ యజుర్ వేదములకు మూడిటికిని 'త్రయీ' అని వ్యవహారము అనుట మరియొక విధమయినది.

## మానవ పితృ దివ్య మానములు. (141 అ.)

వీని విషయము శ్రీవిష్ణు ధర్మోత్తర ద్వితీయ ఖండమందలి 168వ అధ్యాయమున (పైతామహ సిద్ధాంత వచనము) ఇట్లున్నది:

1. అర్కభాగభోగః సౌరాహోరాత్రః;

2. తిథిశ్చ చాంద్రః;

3. అర్కోదయా దుదయా త్సావనః;

4. చంద్ర నక్షత్ర భోగో న(నా) క్షత్రమ్ (త్రః);

5. సావనోఽహోరాత్రో నరాణామ్; తేషా మర్కం దినమ్; వ్యర్కా రాత్రిః;

6. చాంద్రమానః పితౄణామహోరాత్రమ్; తేషాంకృష్ణాష్టమ్యా మర్కోదయః; అమావాస్యాయాం మధ్యాహ్నః; శుక్లాష్టమ్యా మ స్తమయః; పౌర్ణమాస్యా మర్ధరాత్రమ్;

7. అర్కభగణభోగో దివ్యోఽహోరాత్రః; తేషా మర్కస్య మేషప్రవేశే సూర్యోదయః; కర్కటప్రవేశే మధ్యాహ్నః; తులాప్రవేశేఽ స్తమయః; మకరప్రవేశేఽర్ధరాత్రః.

## ఈ వచనముల వివరణము:

1. భ(నక్షత్ర) చక్రమునందలి 360 భాగలలోనుండి రవి దినము 1కి 1 భాగ చొప్పున ముందునకు పోవు చుండును. ఈ రవికిగల 1 భాగ గమనము ఒక సౌరాహోరాత్రము.

2. అమావాస్యనాడు ఒక నిర్దిష్ట సమయమున సూర్యచంద్రులు ఇరువురును భ(నక్షత్ర-రాశి) చక్రమునందలి ఒకే రాశిలో-ఒకే భాగలో-ఒకే లిప్తలో-సరిగా ఒకే బిందువున ఉందురు. అప్పటినుండి వారిద్దరికి నడుమ దూరము 180 భాగలవరకు పెరుగుచుపోవును; మరల తగ్గుచు వచ్చును. ఈ దూరము ఒక్కొక్క 12 భాగలు ఒక్కొక్క తిథి పరిమాణము; ఈ దూరము పెరుగుచుపోవు 15 విభాగములు ($15 \times 12 = 180$ భాగలు) శుక్లపక్షము; తగ్గుచువచ్చు 15 విభాగములు కృష్ణపక్షము; ఇట్టి ఒక్కొక్క (12భ.) విభాగము ఒక్కొక్క తిథి; ఈ తిథికే చాంద్రాహోరాత్రమని పేరు.

3. సూర్యోదయమునుండి సూర్యోదయమువరకు అగుకాలము సావనాహోరాత్రము.

4. చంద్రుడు భచక్రమునందలి 27 నక్షత్రముల (12 రాసుల)లో ఒక్కొక్క నక్షత్రమును అనుభవించు (1 నక్షత్రముతో $=$ 13 భాగల 20 లిప్తలతో కూడియుండు) కాలము నాక్షత్రాహోరాత్రము.

5. ఇందు సావనాహోరాత్రమే మానవమానపు అహోరాత్రము. ఈ సావనాహోరాత్ర కాలపరిమితిలో రవి భచక్రములో 1 భాగ అంతదూరము ముందునకు సాగును; సూర్యునితో కూడిన భచక్రమంతయు భూక్షితిజమును క్రమముగ తాకుచు భూమిచుట్టును ఒకసారి ప్రదక్షిణించినట్లు కనబడును; ఈ గమన క్రమములో భచక్రపు ఏ అంశము భూగోళపు తూర్పు క్షితిజము (Eastern Horizon)ను తాకునో ఆ భచక్రాంశము 'లగ్నము' అనబడును; భూగోళ కపాలాంశములపై సూర్యుని ఉనికినిబట్టి సూర్యోదయాస్తమయములును మధ్యాహ్నార్ధరాత్రములును ఏర్పడును.

ఇట్లు భూమండలమునందు ద్రష్ట (చూచుచున్న మానవుడు) ఉన్న స్థానమును బట్టి తూర్పు క్షితిజముపై రవి ఉన్న సమయము సూర్యోదయము; ఈ తూర్పు క్షితిజమునకు పైగా రవి 90 భాగల దూరమునకు వచ్చినప్పుడు మధ్యాహ్నము; రవి పశ్చిమ క్షితిజమునకు సరిగా (తూర్పు క్షితిజమునుండి 180 భాగల దూరములో నున్నప్పుడు అస్తమయము; అచ్చటి నుండి మరి 90 భాగల (తూర్పు క్షితిజమునుండి 270 భాగల) దూరములో ఉండగా అర్ధరాత్రము.

# 1. మానవమానము - అహోరాత్రవ్యవస్థ




ఇది మానవాహోరాత్ర స్వరూపము.

6. చాంద్రమానముచే ఏర్పడు మానవమానము పితృమానముచే ఒక అహోరాత్రమగును. ఇంత అవధిలో రవి ఇంచు మించుగా ఒక రాశి (30 భాగల) దూరము ముందునకు సాగును. ఈ మానము ననుసరించి మానవమాన కృష్ణపక్షాష్టమినగము గడచినప్పుడు రవిచంద్రులనడుమ దూరము అపసవ్యగతిలో 270 భాగలు ఉండగా పితృమాన సూర్యోదయమగును; అమావాస్యనాడు మధ్యాహ్నమగును; శుక్లాష్టమి నగము గడచిన తరువాత సూర్యాస్తమయము; పూర్ణిమనాడు అర్ధ రాత్రమగును.

# 2. పితృమానము-అహోరాత్ర వ్యవస్థ




మానవమానానుసారముగ

1 కృష్ణపక్షాష్టమీ మధ్య కాలపు చంద్రుడు-రవి నుండి 270°లో

2 అమావాస్యాంతమున చంద్రుడు రవి నుండి 0°లో

3 శుక్లపక్షాష్టమీ మధ్య కాలపు చంద్రుడు రవి నుండి 90°లో

4 పూర్ణిమాంత చంద్రుడు-రవి నుండి 180°లో

7. రవి భ(నక్షత్ర) చక్రమునంతను ఒకమారు చుట్టి వచ్చుటకగు (సౌరమాన ద్వాదశ మాస) కాల మానానుసారము ఒక అహోరాత్రము; ఇందు రవి మేష ప్రవేశమున దివ్యమాన సూర్యోదయము; కర్కాట మధ్యాహ్నము; తులాప్రవేశమున దివ్యమాన సూర్యాస్తమయము; మకర ప్రవేశమున మధ్యరాత్రమగును.

# ౩. దివ్యమానమున అహోరాత్ర వ్యవస్థ




1. రవి మేష ప్రవేశముతో దివ్యమాన సూర్యోదయము.
2. రవి కర్కాట ప్రవేశముతో దివ్యమాన మధ్యాహ్నము.
3. రవి తులా ప్రవేశముతో దివ్యమాన రవ్యస్తమయము.
4. రవి మకర ప్రవేశముతో దివ్యమాన మధ్యరాత్రము.

## జ్యోతిర్గణితములో వీని ఉపయోగము.

ప్రాచీన భారతీయుల సిద్ధాంత గ్రంథములయందు ఆయా గ్రహముల మహాయుగ భగణములను (12000 దివ్య వర్షములలో గ్రహము ఎన్నిమారులు మొత్తము భచక్రమును చుట్టివచ్చునో అవి) చెప్పిరి. పైతామహాది సిద్ధాంతములలో కల్ప (12000000 దివ్య వర్షముల) భగణములను చెప్పిరి. దివ్యవర్షములను మానవ వత్సరములుగా మార్చి కొని-ఇన్ని భచక్రా వృత్తులకు ఇన్ని సంవత్సరములు పట్టినచో - ఒక భచక్రా వృత్తికి ఎంతకాలము పట్టును? అను త్రైరాశికము (Direct Proportion) చే గ్రహపు 1 భచక్రావృత్తికగు సగటు కాలపరిమితిని కొన్ని దశాంశములవరకు కచ్చితముగా కనుగొనవచ్చును.

## అష్టకాః-అన్వష్టకా.

మార్గశీర్ష పుష్యమాఘ ఫాల్గున మాసముల కృష్ణపక్షములందలి సప్తమి-అష్టమి-నవమి-ఈ మూడు తిథుల సముదాయమునకు 'అష్టకాః' అను వ్యవహారము; వీనియందలి నవమిని 'అన్వష్టకా' అందురు.

141 అ. శ్లో-53; 'దర్శనై స్తారకాదిభిః' : అంతరిక్షమందలి తారకలు అవి అచ్చటి సన్నివేశము (అమరిక)తో విచిత్రములును విలక్షణములును అయి భగవదుపాసనకో లోకమున ధర్మమును ప్రవర్తిల్లజేయుటకో ఉపయోగించు కొన్ని అంశములను సూచించుచుండును. దీనిని ఋషులు తమ తపోబలముచే ఎరిగి అవి వేదమంత్రములుగా తమకు వినబడగా వానిని తమ శిష్యులు మొదలగువారికి అందించిరి. అని భావము. ఇట్టి మంత్రములు వేద వాఙ్మయమున ఎన్నియో కలవు. పురాణములందును ఈ నక్షత్ర సన్నివేశ మూలకములగు కథలు ఎన్నియో కలవు. ఈ విషయమున శ్రీ 'నారాయణ అయ్యంగార్' తాము రచించిన "Essays on Indo-Aryan Mythology" అను పుస్తకములో కొన్ని వివరణములు ఇచ్చినారు. మనవారు ఇంకను చాలమంది ఈ విషయమున చాల కృషిచేసి పుస్తకములు వ్రాసియున్నారు.

## 'ఆత్మ' పంచ విధములు.

అవ్యక్తాత్మా మహాంతాత్మా ఽహంకారాత్మా తథైవచ।
భూతాత్మా చేంద్రియాత్మాచ తేషాం తజ్జ్ఞానముచ్యతే.

మత్స్య-144 అ. శ్లో. 88-89.

ఈశ్వర తత్త్వాత్మకమగు 'ఆత్మ' తన శక్తులను క్రమముగ సంకుచితపరచుకొనుచు జగద్రూపమున పరిణమించు దశలలో ఇవి వరుసగా ఒకదానికంటె మరియొకటి స్థూలతరములు. వీనిలో 'భూతాత్మా' అనుచోట భూతములు అనగా సూక్ష్మభూతములు (భూత తన్మాత్రలు); ఈ ఆత్మ దశా పంచక విషయకమగు తాత్త్విక జ్ఞానమును-దానిని నిత్యానుభూతిలో ఉంచుకొనుటయు 'కల మహానుభావులు ఈశ్వరులు' మొదలగు శ్రేణులకు చెందినఋషులు అని శ్లోకార్థము. (చూ. అను వాద వివరణము)

ఋషులు ఐదు విధములుగా నుందురు. ఈ విషయమున సవివరణముగా నూట నలువది నాలుగవ అధ్యాయములోనే కలదు. అట చూచి తెలిసికొనునది.

144 అ; 79 శ్లో. 'ఋషి ర్హింసా గత్యో ర్ధాతుః'. కాని పాణినీయ ధాతు పాఠములో 'ఋషీ-గతౌ' అని మాత్రము కలదు; ఈ ధాతువునకు హింసార్థకత్వము చెప్పనిచో ఋష్టి-శబ్దము నిష్పన్నము కాదు; 'ఋష్టి' ఆయుధము కావున-ఇచట 'ఋషీ' ధాతువు హింసార్థకమే; A.A. Macdonells Vedic Grammarలో 'ఋష్'=Rush అని యున్నది. ఆతడే ఋక్-1 మం. 85 వ సూక్తమున 4వ ఋక్‌లో 'ఋష్టి' శబ్దవ్యుత్పత్తికై 'ఋష్=Thrust అని ఇచ్చెను. కనుక ఈ

మత్స్యపురాణములో ఇచ్చిన దానిని బట్టి ఇది పాణినీయేతర ధాతుపాఠములలోనిదని చెప్పవలెను. ఇది ప్రయోగములందు గల 'ఋష్టి' మొదలగు రూపముల సిద్ధికిని వాని అర్థమునకును సరిపోవును.

## కాలపు పంచాంగములు:

(1. తిథి-2 వార-3 నక్షత్ర 4 యోగ-5 కరణములు.)

2. వారము: గ్రహములలో రవి చంద్రకుజ బుధగురు శుక్ర శనులను ఏడుమందిని వరుసగా ఏడు దినములకు అధిపతులనుగా-అథవా-ఏడు దినములను ఈ ఏడు గ్రహములకు ప్రతీకములనుగా-గ్రహించి లెక్కించుట వార వ్యవస్థకు మూలము. ఇవి 1. ఆది(త్య) 2. సోమ 3. మంగళ 4. బుధ 5. గురు 6. శుక్ర 7. శనివారములు.

3. నక్షత్రము : 360° భాగలుగా అమరియున్న నక్షత్ర వృత్తము (భచక్రము)ను 27 నక్షత్రములుగా విభజించగా 'అశ్వని' మొదలుగా 'రేవతి' వరకు ఒక్కొక్కటి 13 భాగల 20 లిప్తల చొప్పున దూరమును ఆక్రమించి (13 భా. 20 లి.×27=360 భాగలు) యున్నవి. చంద్రుడు ఎంతకాలము ఇందలి ఒక్కొక్క నక్షత్రమున ఉన్నట్లు కనబడునో అది ఆ నక్షత్రపు కాలపరిమితిగా గణన చేయుదురు.

1. చంద్రుడు వలెనే రవియును (అట్లే ఇతర గ్రహములును) భచక్రమునందు సంచరించుచుండుట మనకు కనబడును. రవి ఒక్కొక్క దినమునకు ఒక్కొక్క భాగ వంతున ఈ భచక్రమున ముందునకు సాగుచుండును.

ఈ గమనములో ఒక సమయమున రవి చంద్రులు ఇద్దరును ఒకే స్థానమునకు వత్తురు. క్రమముగ వీరిరువుర నడుమ 180 భాగల దూరము ఏర్పడును. మరల అక్కడినుండి దూరము తగ్గుచువచ్చును. చివరకు ఇద్దరును ఒకే స్థానమునకు వత్తురు.

ఇట్లు ఇరువురును ఒకే స్థానమున ఉన్న తిథి అమావాస్య. (అమా=సహ; కూడ; ఒకేచోట కలిసి; వస్=ఉండు; అను అర్థముతో); ఇరువుర నడుమ 180 భాగల దూరమున్న తిథి పూర్ణిమ; శుక్ల ప్రతిపత్ మొదలు పూర్ణిమ వరకు 15+పూర్ణిమానంతరము కృష్ణ ప్రతిపత్ మొదలు అమావాస్యవరకు పదునైదు=30 తిథులు.

360 భాగలు÷30=12 భాగలు=720 లిప్తలు; కనుక సూర్యచంద్రుల నడుమ దూరపు భాగలను 12చే భాగించగా వచ్చు లబ్ధము గడచిన తిథులును-శేషముగా అగునది గడచుచున్న తిథియు అని ఎరుగవలెను.

4. యోగము : సూర్యుడు భచక్రమున తాను ఎంతవరకు నడచెనో చంద్రుడును అట్లే భచక్రమున ఎంత వరకు నడచెనో ఆరెండు గమనములను కూడగా (యోగము=కూడిక) అగు భాగల పరిమాణమును లిప్తలుగా మార్చి దానిని 800 లిప్తలతో (800 లి.=13 భా. 20 లి.) భాగించగా లబ్ధము గడచిన యోగములును శేషము గడచుచున్న యోగపు భుక్తియును అగును.

ఇవి విష్కంభము మొదలు వైధృతము వరకు 27.

5 కరణము : ఇది తిథిలో రెండవ భాగము; ఇవి దినము ఒకటికి రెండు చొప్పున ప్రవర్తిల్లును. ఇవి మొత్తము 11; (బవ మొదలు కింస్తుఘ్నము వరకు).

## యాగ హవనముల భేదము.

(కాత్యాయన శ్రౌత సూత్రములు; అ1; 2 పా. 5-6-7 సూత్ర.)

5. యజతి జుహోతీనాం కో విశేషః; 6. తిష్ఠద్ధోమా వషట్కార ప్రదానా యాజ్యాపురోనువాక్యావంతో యజతయః; 7. ఉపవిష్టహోమాః స్వాహాకార ప్రదానా జుహోతయః."

"యాగ-హవన-ములకు భేదము ఏమి? నిలుచుండియే హోమము (హవిర్దానము) చేయుటయు-అగ్నికి హవిస్సును అందించునపుడు 'వషట్ (వహతు=అగ్నిః ఏతత్ హవిః ఉద్దిష్టాందేవతాం నయతు=అగ్ని ఈ హవిస్సును ఇచట మంత్రముచే ఉద్దేశింప-పేర్కొ-న-బడిన దేవతకు అందజేయుగాక!) అను శబ్దమును ఉచ్చరించవలసినవియు ఈ 'వషట్' ఉచ్చారణమునకు ముందు 'యాజ్యా-పురోఽనువాక్యా' అను మంత్రములను కూడ పఠించవలసినవియు అగు హోమములు 'యాగములు'; కూర్చుండియే హవిర్దానము చేయవలసినవియు దేవతోద్దేశ్యక మంత్రమునకు కడపట 'స్వాహా' (సు=శోభనం=తిన్నగా; ఆవహ=ఈ హవిస్సును ఈ మంత్రముచే ఉద్దిష్టయగు దేవతకు అందజేయుమా! అగ్నీ!) అను శబ్దమును ఉచ్చరించవలసినవియు అగు హోమములు హవనములు."

ఈ వివరణమునననుసరించి ఈ శ్రీమత్స్యమహాపురాణమున ప్రతిపాదింపబడిన వానిలో ఆయత హోమాదికములు 'హవనములు'.

## చాంద్రమానమాసములు-నామసార్థకత:

చాంద్రమానమున మాసముల నామములు సార్థకములు; ఎట్లన- 1. చైత్రమాసము: చిత్రా నక్షత్రముతో చంద్రుడు కూడియుండు పూర్ణిమ ఈ మాసమునందుండును. ఇదే విధముగ-వైశాఖము 'విశాఖా' జ్యేష్ఠము 'జ్యేష్ఠ' ఆషాఢము 'ఆషాఢా' (పూర్వ-ఉత్తర) శ్రావణము 'శ్రవణ' భాద్రపదము భాద్రపద (పూర్వ-ఉత్తర) ఆశ్వయుజము 'అశ్వినీ' కార్తికము 'కృత్తికా' మార్గశిరము 'మృగశీర్ష' (మృగశిర) పుష్యము 'పుష్య' మాఘము 'మఘా' ఫాల్గునము 'ఫల్గుని' (పూర్వ-ఉత్తర) నక్షత్రములతో చంద్రుడు కూడియుండు పూర్ణిమలు ఆయా మాసములందుండుటతో ఏర్పడిన నామములే యని గ్రహించవలయును.

## నివర్తన-గోచర్మ-పరిమాణములు.

నివర్తనము - - మరుంతుర్లు [తెలుగు]

మన ప్రాచీన వాఙ్మయములో ఆయా శ్రౌతస్మార్త ప్రక్రియలందు ఈ పదములు ప్రదేశ పరిమాణ వాచకముగా ప్రయోగింపబడుచుండును. (ఉదా: మత్స్య-282 అ.) ఇచట ఈ పరిమాణము ఈ విధముగా నిర్వచింపబడినది:

"దండేన సప్తహస్తేన త్రింశద్దండం నివర్తనమ్ ।
త్రిభాగహీనం గోచర్మమాన మాహ ప్రజాపతిః." శ్లో. 15.

తా. ఏడు మూరలు దైర్ఘ్యము కలది ఒక దండము; అట్టి దండములు ముప్పది ఒక్కొక్క భుజముగాగల చతురస్రముతో అగు వైశాల్యము ఒక 'నివర్తనము;' ఇందలి మూడవ వంతు తగ్గించగా 'గోచర్మము' అని వీని మానము (కొలత)లను (మనువు-అథవా-స్వయంభూ) ప్రజాపతి నిర్ణయించెను.

ఇది చూడగా $7\times30\times7\times30=210\times210=44100$ చదరపు మూరలు=ఒక నివర్తనము అగును; ఇందలి మూడవవంతు అనగా $44100\div3=14700$ చదరపు మూరలు; నివర్తన పరిమాణములోనుండి దీనిని తగ్గించగా $44100-14700=29400$ చదరపు మూరలు 'గోచర్మ' పరిమాణము అని తోచును. కాని ఇది వర్గమూలమునకు రాని సంఖ్య. సాధారణముగా ఇట్టిది వైశాల్యముగా ఉండుటలేదు. ఇదియుగాక-ఈ విషయమున వసిష్ఠ వచనము (From Vinayak Sivaram Apte's Sanskrit-English Dictionaryలో) ఇట్లున్నది:

"దశహస్తేన వంశేన దశవంశాన్ సమంతతః।
పంచ చాభ్యధికాన్ దద్యా దేతద్ గోచర్మ చోచ్యతే."

తా. పది హస్తముల దైర్ఘ్యముకల దండము 'వంశము' అనబడును. ఇవి పదియు ఇంకను ఐదును$(10+5=15)$ అన్ని (నాలుగు) వైపులను కొలువగా (అగు చతురస్రముతో) అగు వైశాల్యము 'గోచర్మము' అనబడును.

అనగా 'గోచర్మము' $=10\times15\times10\times15=150\times150=22500$ చదరపు మూరలు అని తెలియుచున్నది.

'నివర్తనము' విషయమున భాస్కరాచార్యులు పది మూరలు పొడవు కలది వంశము; ఇరువది వంశముల భుజముతో ఏర్పడు చతురస్రముతో అగు వైశాల్యము 'నివర్తనము' అనెను. అనగా $10\times20\times10\times20=40000$ చదరపు మూరలు ఒక నివర్తనము.

ఇట్లు భాస్కరుడును మత్స్యపురాణమును చెప్పు నివర్తనములు కొంచెము భేదముతో నున్నవి.

అట్లే గోచర్మ పరిమాణమున కూడ ఆలోచింపవలెను:

మత్స్యపురాణానుసారము ఏడు మూరలు ఒక దండము; నివర్తనపు భుజమునకు ఇట్టివి ముప్పది యుండును. దానిలో మూడవవంతు (10 దండములు) తగ్గగా ఇరువది దండములు ఒక్కొక్క భుజముగా గల చతురస్రముతో ఏర్పడు వైశాల్యము గోచర్మము. అనగా గోచర్మము $=7\times20\times7\times20=140\times140=19600$ చదరపుమూరలు.

ఈ చెప్పిన వసిష్ఠ ప్రోక్త గోచర్మ పరిమాణముతో ఇది ఇంచుమించుగా సమానము.

రెండు హస్తములు $=1$ బ్రిటిష గజము; కనుక ఈ 19600 చ.మూ. $=19600\div4=4900$ చదరపు గజములు [ఎకరము (4840గ.) కంటె కొంచెమెక్కువ].

ఇందు నివర్తనము<ని+వృత్+అన (ల్యుట్); మరియు-ని-వృత్ $=$ మరలు; కనుక 'నివర్తనము' పూర్వకాలమున చెరువులనుండి పంట పొలముల సౌకర్యమునకై ఏర్పరచు ఒకవిధమగు అమరికకు పేరు; దీనిని బట్టియే సంస్కృతమున 'నివర్తనము'ను-తెలుగులో దీనితో సంబంధము కలదిగా 'మరుంతుర్లు' అను పదమును-ఏర్పడియుండును. ఇది తెలుగు శాసనములలో పొలపు కొలతను తెలుపు పదముగా కనబడుచున్నది.

చారిత్రక వాఙ్మయ పరిశోధకులు ఇందలి యాథార్థ్యమును నిర్ణయింతురుగాక!

'గోచర్మము' అను శబ్దమునందలి 'చర్మ' శబ్దము రూఢమగు 'తోలు' అను అర్థమునందు కాక 'మేయుట' 'మేయుటకు ఉపయోగించు పచ్చికబయలు' అను అర్థమున ఉన్నట్లు తోచును. 'చర $=$ గతి-భక్షణయోః' అని ధాతువు; 'చర్ (చర)+మన్ (ప్రత్యయము)>చర్మన్' అగును. 'దీనియందు గోవులు మొదలగునవి మేయును.' అను అధికరణ వ్యుత్పత్తి చెప్పుకొనవలయును. అనగా 'కొంత సంఖ్యగల గోవులకు పచ్చికబయలుగా చాలునంత ప్రదేశము' అని అర్థము కావలయును.

ఇట్లు 'నివర్తనమ్' అనునది 'పంట పొలము'నకు కావలయు నీటి సౌకర్యమును- 'గోచర్మ' పదము గోవులు మేయు అనుకూలతను-దృష్టియందుంచుకొని నిష్పన్నము చేసిన పదములు అయి ఉండును. అని ఊహించవచ్చును.

## ముగింపు

"శ్రౌతస్మార్త కర్మములయందు వానికి అంగములుగా వేదములందలి మంత్రములనే గ్రహింపవలయును." అనుటచే పురాణ గత వచనములు కర్మాంగములుగా శ్రౌతస్మార్తకర్మములందు గ్రహింపదగినవి కాకపోవచ్చును.

అయినను అవి తత్త్వ ప్రతిపాదకములుగ ఉండుట విషయమున వేదతుల్యములు.

ఇట్లు పురాణములకు గల ప్రామాణ్యమును కర్మకాండను ఉపాసనాకాండను జ్ఞానకాండను జనులకు అవి అందజేయుచున్న తీరును ఆలోచింపగా పురాణములయందలి ప్రతిపాద్య విషయములను యుక్తియుక్తముగా సంప్రదాయానుకూలముగా స్పష్టముగా ఎరుగుట ఆవశ్యకము.

ఈ ఉద్దేశ్యముతో ఆరంభించిన ఈ పనిలో అనువాదకుడు తను దాను 'జిజ్ఞాసువు అగు సాధారణ పఠిత'నుగా భావించి 'పఠితలకు ఆయా విషయములు నిస్సంశయముగా తెలియుటకు అనుకూలించును'. అని ఈ వివరణములు గ్రంథాదియందు ఇచ్చుట జరిగినది.

ఇందు కొన్ని విశేష జిజ్ఞాసతో ఈ పురాణమును పఠించువారికి మాత్రము ఉపయోగించునవి కావచ్చును.

వారి వారి అభిరుచిననుసరించి వానిని వారు ఉపయోగించుకొందురుగాక !

ఇందు వ్రాసిన యంశములు సంప్రదాయానుగతములయి ప్రామాణికములయి యున్నంతవరకు అందులకు శ్రీ మదుభయ వేదాంత ప్రవర్తక లక్ష్మణాచార్యాది గురువుల కరుణయే హేతువు; దొసగులకు అనువాదకుని అసమర్థతయే మూలము.

అని మనవి చేయు-

హైదరాబాదు.

ది. 17-10-1986. **అనువాదకుడు.**

ప్రీయతాం భగవా న్విష్ణు ర్మత్స్వరూపీ జనార్దనః।
వాచాపుష్పైః ప్రకృతయాఽత్యల్పయా సేవయాఽనయా.

ఓం తత్ సత్.

# విషయానుక్రమణిక

## క్రియా యోగము

| అధ్యాయము | విషయము | పుటసంఖ్య (నుండి) |
|---|---|---|



| అధ్యాయము | విషయము | పుటసంఖ్య (నుండి) |
|---|---|---|



భూమ్యాది సంస్థానము

శ్రీరస్తు

# శ్రీ మత్స్యమహాపురాణమ్

## ప్రథమోఽధ్యాయః.

## మత్స్యావతార కథనమ్.

శ్లో. శుక్లామ్బరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వవిఘ్నోపశాన్తయే. 1
యస్యాజ్ఞయా జగత్స్రష్టా విరిఞ్చిః పాలకో హరిః । సంహర్తా కాలరుద్రాఖ్యో నమ స్తస్మై పినాకినే. 2
నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్ । దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయేత్.3
అజోఽపి యః క్రియాయోగా న్నారాయణ ఇతి స్మృతః। త్రిగుణాయ త్రివేదాయ నమ స్తస్మై స్వయమ్భువే.4
దిక్కాలాద్యనవచ్ఛిన్నానన్తచిన్మాత్రమూర్తయే । స్వానుభూత్యేకమానాయ నమ శ్శాన్తాయ తేజసే. 5
సూత మేకాన్త మాసీనం నైమిశారణ్యవాసినః । మునయో దీర్ఘసత్రాన్తే పప్రచ్ఛు ర్దివ్యసంహితామ్. 6
ప్రవృత్తాసు పురాణానాం ధర్మ్యాసు లలితాసు చ । కథాసు శౌనకాద్యాస్త మభినన్ద్య ముహుర్ముహుః. 7
కథితాని పురాణాని యాన్యస్మాకం త్వయాఽనఘ । తాన్యేవామృతకల్పాని శ్రోతు మిచ్ఛామహే పునః. 8
కథం ససర్జ భగవా న్మత్స్యరూపిత్వ మాశ్రితః । భైరవత్వం భవస్యాపి పురారిత్వం నిగద్యతే. 9
కుతో హేతోః కపాలిత్వం జగామ స వృషధ్వజః । ఏతత్సర్వం సమాచక్ష్వ సూత విస్తరతః క్రమాత్. 10
త్వద్వాక్య స్యామృతస్యేవ న తృప్తి రిహ జాయతే।

శ్రీరస్తు

# శ్రీ మత్స్యమహాపురాణము

## ప్రథమాధ్యాయము-ఋషుల ప్రశ్నము-

## మత్స్యావతార కథనము.

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ । ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వవిఘ్నోపశాంతయే. 1
యస్యాజ్ఞయా జగత్స్రష్టా విరించిః పాలకో హరిః । సంహర్తా కాలరుద్రాఖ్యో నమ స్తస్మై పినాకినే. 2
అజోఽపి యః క్రియాయోగా న్నారాయణ ఇతి స్మృతః । త్రిగుణాయ త్రివేదాయ నమ స్తస్మై స్వయంభువే. 3
దిక్కాలాద్యనవచ్ఛిన్నానంతచిన్మాత్రమూర్తయే। స్వానుభూత్యేకమానాయ నమః శాంతాయ తేజసే. 4

(ఈ నాలుగు శ్లోకములును మూలములో 1-2-4-5 శ్లోకములుగా ఉన్నవి. ఏమయినను ఇవి మూలగ్రంథముతో సంబంధము కలవిగా తోచవు. 3వ సంఖ్యగల 'నారాయణం' అనుశ్లోకమును 6వ శ్లోకమునుండి తరువాతనున్న శ్లోకములను వ్యాసుడు రచించిన శ్లోకములును మూలముతో సంబంధముకలవియును అనిపించుచున్నది.)

1. తెల్లని వస్త్రము ధరించినవాడును [illegible] వర్ణమువంటి దేహవర్ణము కలవాడును నాలుగు భుజములు కలవాడును [illegible] ముఖము కలవాడును అగు విష్ణుని సర్వవిఘ్నములను ఉపశమించుటకు ధ్యానించ వలయును.

2. [illegible] బ్రహ్మ లోకములను సృష్టించువాడును హరి పాలించువాడును కాలరుద్రుడు అను దేవుడు [illegible] అనుభవమును ధరించిన అటువంటి శివునకు నమస్కారము.

3. [illegible] లేనివాడై యుండియు తాను చేయు క్రియల సంబంధమువలన నారాయణుడు (జలములు [illegible] కలవాడు) [illegible] ఆధారమైయున్నవాడు అని పలుకబడు (చెప్పబడు)చున్నాడో - మూడు గుణములు కల వాడును [illegible] తనంతటతానే ఉన్నవాడు) నకు నమస్కారము.

4. [illegible] కాలము మొదలగు వానిచే బద్ధి (ఇక్కడ ఇప్పుడు ఈ కాలమునందు ఉన్నాడు అని) నిర్ణయించ [illegible] మాత్రము స్వరూపముగాగలవాడై ఉపాసకుల తమ అనుభూతి మాత్రమే ప్రమాణముగా [illegible] తేజస్సునకు నమస్కారము.

నారాయణుని ఉత్తముడయిన నారాయణమునిని అటువంటివాడే అయిన నరమునిని సరస్వతీదేవిని వ్యాసమహా మునిని నమస్కరించి ఆటు తరువాత 'జయము' అను సంప్రదాయ సిద్ధము అయిన వ్యవహారముకల పురాణమును ప్రవచింపవలెను.

నైమిశారణ్యమున నివసించుచు ద్వాదశ వార్షిక (బ్రహ్మసత్రము అను దీర్ఘసత్రయాగము జరుపుచుండిన మహా మునులు [illegible] విరామకాలమున ఏకాంతమున ఏకాగ్రమనస్సుతో కూర్చుండియున్న సూతుడను కథకు సంనిధికి వెళ్లిరి. అంతవరకును ఆయన ఆ దీర్ఘసత్ర విరామ సమయములందు ధర్మమునుండి తొలగనివియు మనోహరములును అగు పురాణ కథలు వినిపించి యుండెను. మునులు ఆ కథలను ఆయన వానిని తమకు చెప్పిన విధమును మాటిమాటికిని మెచ్చుకొనిరి. తరువాత వారాయనను దివ్యమగు పురాణ సంహితా విషయమున ఇట్లు ప్రశ్నించిరి: అనఘా! మీరు మా కింతవరకును గొన్ని పురాణములు ప్రవచించితిరి. అవి అమృతముతో సమానముగా నున్నవి. ఇంకను వినవలెనని మాకు వేడుకగ నున్నది. భగవానుడు ఏవిధముగ ఏకారణమున మత్స్యరూపమును ధరించి సృష్టి చేసెను? భవు(శివు)నకు భైరవుడు అనియు పురారి అనియును పేరులు కలవుకదా! అవ్యక్తజన్మునకే కపాలి అనియు వ్యవహారము కలదుకదా! వీటికి హేతువు ఏమి? ఇది అంతయు విస్తరించి మాకు చెప్ప వేడుచున్నాము. మీ వాక్యములు సాక్షాత్ అమృతమేయని మాకనిపించుచున్నది. ఇంతవరకును ఎంతగ వినినను మాకు తృప్తి కలుగుటలేదు. అని పలికిరి.

సూతః: పుణ్యాం పవిత్ర మాయుష్య మిదానీం శృణుత ద్విజాః. 11
మాత్స్యం పురాణ మఖిలం య జ్జగాద గదాధరః । పురా రాజా మనుర్నామ చీర్ణవా న్పరమం తపః. 12
పుత్రే రాజ్యం సమారోప్య క్షమావా న్రవినన్దనః । మలయ స్యైకదేశే తు సర్వాత్మగుణసంయుతః. 13
సమదుఃఖసుఖో వీరః ప్రాప్తవా న్యోగ ముత్తమమ్ । బభూవ వరద శ్చాస్య వర్షాయుతశతే గతే. 14
వరం వృణీష్వేత్యువాచ ప్రీతాత్మా కమలాసనః । ఏవ ముక్తోఽబ్రవీ ద్రాజా ప్రణమ్య చ పితామహమ్. 15
ఏక మేవాహ మిచ్ఛామి త్వత్తో వర మనుత్తమమ్ । భూతగ్రామస్య సర్వస్య స్థావరస్య చరస్య చ. 16
భవేయం రక్షణాయాలం ప్రలయే సముపస్థితే । ఏవ మస్త్వితి విశ్వాత్మా తత్రైవాన్తరధీయత. 17
పుష్పవృష్టిశ్చ మహతీ ఖాత్పపాత సురార్పితా ।

అది విని సూతు డిట్లు చెప్ప నారంభించెను: బ్రాహ్మణులారా! సాక్షాత్ విష్ణువే చెప్పిన మత్స్యపురాణమును మీకు ఇప్పుడు చెప్పుచున్నాను. వినుడు. అది పుణ్యకరమును పవిత్రమును ఆయువును వృద్ధి చేయునదియును. పూర్వము సూర్యుని కుమారుడు అయిన మనువు అను రాజుండెడివాడు. ఆయన ఆత్మ సంస్కారమునకు కావలయుగుణములన్నియు కలవాడు. క్షమాగుణము కలవాడు. అతడు తన కుమారునకు రాజ్యము నప్పగించి మలయపర్వతముమీద నొక ప్రదేశమున ఉత్తమతప మాచరించెను. సుఖదుఃఖముల యందు సమదృష్టి కలిగి ఉత్తమ యోగసాధన నవలంబించెను. పదిలక్షల ఏండ్లు గడచిన తరువాత బ్రహ్మ వరమీయదలచి ప్రత్యక్షమయ్యెను. వరముకోరుకొమ్మని మనువుతో పలికెను. మనువు బ్రహ్మకు నమస్కరించి ఇట్లు పలికెను: "అన్నిటికంటెఉత్తమమగు ఒకేఒక వరము నేను మిమ్ము వేడుచున్నాను. ప్రళయము సంభవించినప్పుడు స్థిరములు చరములునగు ప్రాణులను రక్షించుటకు నేను శక్తిగలవాడను కావలయును." విశ్వమునకు ఆత్మరూపుడు అగు బ్రహ్మ అట్లే కానిమ్మని పలికి అక్కడనే అంతర్ధాన మందెను. దేవతలు కలిగించిన పూలవాన ఆకాశము నుండి పడెనుకూడ.

కదాచి దాశ్రమే తస్య కుర్వతః పితృతర్పణమ్. 18
పపాత పాణ్యో రుపరి శఫరీ జలసంయుతా । దృష్ట్వా త చ్ఛఫరీరూపం సదయోఽయం మహీపతిః. 19
రక్షణా యాకరో న్మత్స్యం స తస్మి న్కరకోదకే । అహోరాత్రేణ చైకేన షోడశాఙ్గుళవిస్తృతః. 20
సోఽభవా న్మను ముద్వీక్ష్య పాహిపాహీతి చాబ్రవీత్ । స త మాదాయ మణికే ప్రాహిణో జ్జలచారిణమ్. 21
తత్రాపి చైకరాత్రేణ హస్తత్రయ మవర్ధత । పునః ప్రాహా ర్తనాదేన సహస్రకిరణాత్మజమ్. 22
స మత్స్యః పాహిపాహీతి త్వా మహం శరణం గతః। తత స్స కూపే తం మత్స్యం ప్రాహిణో ద్రవినన్దనః.23
యదా న మాతిచక్రన్ద తదా మత్స్య స్సరోవరే । క్షిప్త స్స పృథుతా మాగా త్పున ర్యోజనసమ్మితామ్. 24
తత్రా ప్యాహ పున ర్దీనః పాహిపాహీతి తం నృపమ్ । తత స్స మనునా క్షిప్తో గఙ్గాయా మప్యవర్ధత. 25
యదా తా మఖిలాం తద్వత్తదాబ్ధౌ ప్రాక్షిపన్నృపః । తదా సముద్ర మఖిలం వ్యాప్యాసౌ సముపస్థితః. 26
తదా ప్రాహ మను ర్భీతః కోఽసి త్వ మసురేశ్వరః । అథవా వాసుదేవ స్త్వ మన్యథేదృ క్కథం భవేత్.27
యోజనాయుతవింశత్యా కస్య తుల్యం భవే ద్వపుః । జాత స్త్వం మత్స్యరూపేణ మాం ఖేదయసి కేశవ.28
హృషీకేశ జగన్నాథ జగద్ధామ న్నమోఽస్తు తే । ఏవ ముక్త స్స భగవా న్మత్స్యరూపీ జనార్దనః. 29
సాధుసాధ్వితి హోవాచ సత్యం జ్ఞాతం త్వయాఽనఘ । అచిరేణైవ కాలేన మేదినీ మేదినీపతే. 30
భవిష్యతి జలే మగ్నా సశైలవనకాననా । నౌ రియం సర్వదేవానాం నికాయేన వినిర్మితా. 31
మయా జీవనికాయస్య రక్షణార్థం మహీపతే । స్వేదాణ్డజోద్భిదా యే చ యే చ జీవా జరాయుజాః. 32
అస్యాం నిధాయ సర్వాం స్తా ననర్థా త్పాహి సువ్రత । యుగాన్తవాతాభిహతా యదా చలతి నౌ ర్నృప.33
శృఙ్గేఽస్మి న్మమ రాజేన్ద్ర నిధేహి త్వం చ మాన్యథా । తతో లయాన్తే సర్వస్యస్థావరస్య చరస్య చ. 34
ప్రజాపతి స్త్వం భవితా జగతః పృథివీపతే । ఏవం కృతయుగ స్యాదౌ సర్వజ్ఞో భగవా నృషిః. 35
మన్వన్తరాధిపశ్చాపి దేవపూజ్యో భవిష్యసి ॥

ఇతి శ్రీమత్స్యపురాణే మత్స్యమనుసంవాదే మత్స్యావతార
కథనం నామ ప్రథమోఽధ్యాయః.

ఒకానొకనాడు మనువు తన ఆశ్రమమున పితృతర్పణము చేయుచుండగా ఒక ఆడు చేప నీటితోకూడి అతని రెండుచేతులపై పడెను. ఆరాజు ఆచేపరూపమును చూచి దయకలిగి దానిని రక్షింపదలచి తన కమండలు జలములలో వైచెను. ఆ మత్స్యము ఒక అహోరాత్రములో పదునారంగుళముల పొడవు కలదై మొగమెత్తిమనువును చూచి రక్షించుము

ఇట్లు పలికి భగవానుడు అక్కడనే అంతర్ధానము పొందెను. మనువుకూడ పూర్వము సూచింపబడిన ప్రాణి ప్రళయము వరకును తనకు వాసుదేవుని అనుగ్రహము వలన కలిగిన యోగమును అవలంబించి అభ్యానము (మరలమరల అనుష్ఠించుట) చేయుచు ఉండెను. వాసుదేవుడు చెప్పిన సమయమున అట్లు జరుగగానే జనార్దనుడు కొమ్ముగల మత్స్యము రూపమున ప్రాదుర్భవించెను. ఆదిశేషుడు త్రాటిరూపమున ముని(మనువు)కడకు వచ్చెను. ఆధర్మవేత్త సర్వభూతములను లాగి దగ్గరకు తీసికొని సర్పపు త్రాటితో చేపకొమ్మున నావను కలిపికట్టెను. జనార్దనుని నమస్కరించి ఆ మత్స్యపు శృంగమునకు సమీపమున నిలిచెను. ఆ అవాంతర ప్రళయము గడిచిన తరువాత మనువు అడుగగా మత్స్యరూపుడు అగు యోగశాయి(విష్ణువు)పురాణమును ప్రవచించెను. ఋషిసత్తములారా! దానిని మీకు ఇప్పుడు చెప్పెదను వినుడు. ఇంతకు ముందు మీరు నన్ను అడిగిన సృష్టి మొదలగు విషయములను గూర్చియే అట్లే ఏకార్ణవమున ఉన్న మనువు కేశవుని ఇట్లు ప్రశ్నించెను: ప్రపంచపు ఉత్పత్తిని ప్రళయమును వంశమును మన్వంతరములను వంశాను చరితమును భువన విస్తారమును వివిధములగు దానములను ధర్మములను శాశ్వతమగు శ్రాద్ధకల్పమును వర్ణాశ్రమ విభాగమును ఇష్టములు పూర్తములు అను సత్కర్మములను దేవతల ప్రతిష్ఠలు మొదలగునవి ఇది ప్రతియొక్కటియు చెప్పవేడుచున్నాను.

మత్స్యః: మహాప్రళయకాలేతు ఏత దాసీ త్తమోమయమ్. 25
ప్రసుప్తమివ చాతర్క్య మప్రజ్ఞాత మలక్షణమ్ । అవిజ్ఞేయ మవిజ్ఞాతం జగత్స్థాస్ను చరిష్ణు చ. 26
తత స్స్వయమ్భూ రవ్యక్తః ప్రభవః పుణ్యకర్మణామ్ ।వ్యఞ్జయన్నేవ తచ్ఛీలం ప్రాదురాసీ త్తమోనుదః.27
అతీన్ద్రియః పరోఽవ్యక్తా దన్తర్యామీ సనాతనః।నారాయణ ఇతి ఖ్యాత స్స ఏష స్వయ ముద్బభౌ. 28

బ్రహ్మాణ్డసృష్టిః.

స్వాశరీర మభిధ్యాయ స్సిసృక్షు రఖిలం జగత్ । అప ఏవ ససర్జాదౌ తాసు వీర్య మవాసృజత్. 29
తదేవాణ్డం సమభవ ద్ధేమరూపం వరం మహత్ ।సంవత్సరసహస్రం త దనూర్యం తమసాఽఽవృతమ్.30
ప్రవిశ్యాన్త ర్మహాతేజా స్స్వయమే వాత్మసమ్భవమ్।ప్రవహాయ మాత్స్య మవ్యక్తం విష్ణుత్వ మగమ త్పునః.31
తదన్త ర్భగవా నేష సూర్య స్సమభవ త్పునః । ఆదిత్య శ్చాదిభూతత్వా ద్బ్రహ్మ బ్రహ్మపరత్వతః. 32
దివ్యం తదా సమభవ త్తదణ్డం శకలద్వయమ్ । సచాకరో ద్దిశస్సర్వా మధ్యే వ్యోమచ శాశ్వతమ్. 33
జరాయు మేత్వ సఞ్జాతా శ్శైలా స్తస్యాభవం స్తదా । యదుల్బం చాభవ న్మేఘాః స్రోతాంసి సరిత స్తథా. 34
సప్త సర్వే సముద్రాశ్చ నానారత్నసమన్వితాః । నద్యోఽథ నాద్యఽస్సఞ్జాతా స్స్రోతాంసి సరిత స్తథా. 35
సప్త సర్వే సముద్రాశ్చ తే పి నాన్తర్జలోద్భవాః । లవణేక్షుసురాద్యాశ్చ నానారత్నసమన్వితాః. 36
సిసృక్షు రభవ ద్దేవః ప్రజాపతి రరిన్దమః । యత్తేజ స్తత్ర తస్యైవ మార్తాణ్డ స్సమజాయత . 37
మృతేఽణ్డే జాయతే యస్మా న్మార్తాణ్డ స్తేన స స్మృతః।రజోగుణమయం యత్త ద్రూపం తస్య మహాత్మనః.
చతుర్ముఖ స్స భగవా నభూ ల్లోకపితామహః । యేన సృష్టం జగ త్సర్వం సదేవాసురమానుషమ్. 39
తమః వేహి రజోరూపం మహాత్తత్త్వము దాహృతమ్.
ఇతి శ్రీమత్స్యమహాపురాణేమత్స్యమనుసంవాదేమత్స్యప్రోక్తావాన్తరప్రళయాదికథనంనామ ద్వితీయోఽధ్యాయః.

## బ్రహ్మాండ సృష్టి

మనువుతో మత్స్యము ఇట్లు పలికెను : ఈ జరిగినది అవాంతర ప్రళయము. కాని ఈ కల్పాదికి ముందు) మహాప్రళయము జరిగిన సమయమున ఇది అంతయు చీకటితో నిండినదై స్థిరచరరూపమయిన ప్రపంచమంతయు గాఢనిద్ర యందు మునిగినట్లో అన్నట్లు తర్కప్రమాణములో ఎరుగరానిదిగా అనుభూతిలో గురుతింపరానిదిగా దీని లక్షణము ఇది

అని నిశ్చయించి చెప్పవీలుకానిదిగా అనుభవముతో తెలియ శక్యము కానిదిగా ఇంతవరకును అనుభవముతో తెలియబడనిదిగా ఉండెను. అంతట నామరూపములతో వ్యక్తముకానివాడు యజ్ఞాది పుణ్యకర్మలకు కారణుడు అగు స్వయంభూ పరమేశ్వరుడు తన ఆ స్వభావమును వ్యక్తముచేయుచు ఆ చీకట్లను పోగొట్టుచు సాక్షాత్కారమునందెను. అనగా ఇంద్రియములకు గోచరము కానివాడును ఈ అవ్యక్తముకంటె పరుడు (శ్రేష్ఠుడు)ను అంతర్యామి (సమస్త భూతములయందుండి వాటి చిత్తవృత్తులను తన అదుపునందుంచువాడు)యు సనాతనుడు (అతిప్రాచీనుడు శాశ్వతుడు)ను నారాయణుడు అని ప్రసిద్ధి పొందినవాడు అగు అపరమాత్మయే స్వయముగా ఉద్భూతుడు అయ్యెను. తనకు శరీరము కావలెనని సంకల్పించుకొనుచు సమస్త జగత్తును సృష్టింపదలచుచు మొదట జలములనే సృష్టించెను. వాటియందు వీర్యమును నిలిపెను. ఆ వీర్యమే గొప్పదియు పెద్ద పరిమాణము కలదియు అగు బంగారు గ్రుడ్డుగా అయ్యెను. అది వేల సంవత్సరముల కాలము పాటు సూర్యుడే లేనిదై చీకటితో ఆవరింపబడినదయి యుండెను. మహా తేజస్స్వరూపుడు అగు పరమాత్మ తననుండి పుట్టిన గ్రుడ్డులోపల ప్రవేశించి అవ్యక్తమగు మత్స్యరూపము వదలి మరల విష్ణుత్వమును పొందెను. (మత్స్యము-కేవలసత్-చిత్-ఆనంద రూప విష్ణువు-ప్రవేశించి యుండువాడు) దానిలోపల ఈ భగవానుడు మరల సూర్యుడయ్యెను. ఆదిభూతుడు కావున ఆదిత్యుడు వేదపఠుడగుటవలన బ్రహ్మయును అయ్యెను.

అంతట దివ్యమగు ఆ అండము రెండు ముక్కలయ్యెను. అతడు అన్ని దిక్కులను శాశ్వతమగు -అండమునడుమ ఆకాశమును నిర్మించెను. దానిమావి నాశ్రయించి లోపలివైపున పర్వతములు ఏర్పడెను. ఉల్బము (మావితో సంబంధించిన సీటిబుడగ) జల ప్రవాహములును నదులును నానారత్నములతో కూడిన సముద్రములును అయ్యెను. పరమాత్ముడగు ఆ దేవుడే ప్రజలను సృష్టింప సంకల్పించినందున శత్రువుల నణచి ప్రజలను రక్షించగల ప్రజాపతి అయ్యెను. అండము మృతము(చీలినది)అయిన తరువాత ఏర్పడినందున అతని ఆ తేజస్సునకు (సూర్యునకు) మార్తాండుడని పేరువచ్చెను. ఆ మహాత్ముని రజోగుణమయ మగురూపము లోకముల కన్నిటికిని పితామహుడు(తాత)అగు చతుర్ముఖ భగవానుడుగా అయ్యెను. దేవాసుర మనుష్యులతో నిండిన జగమంతయు ఆయన చేతనే సృష్టింపబడినది. ఈరజోగుణ ప్రధాన పరమాత్ముని రూపమే మహత్తత్త్వము అని చెప్పబడుచున్నది.

ఇది మత్స్యమహాపురాణమున మత్స్యమనుసంవాదమున మత్స్యరూప నారాయణుడు మనువునకు
అవాంతర ప్రళయాదికము నెరింగించుట అను ద్వితీయాధ్యాయము.

## తృతీయోఽధ్యాయః-బ్రహ్మణో జగదుత్పత్తిః.

మనుః: చతుర్ముఖత్వ మగమ త్కస్మాల్లోకపితామహః ।కథంచ లోకా నసృజ ద్బ్రహ్మ బ్రహ్మవిదాం వరః.1
మత్స్యః: తప శ్చచార ప్రథమ మమరాణాం పితామహః । ఆవిర్భూతా స్తతో వేదా స్సాఙ్గోపాఙ్గపదక్రమాః.2
పురాణం ధర్మశాస్త్రాణి ప్రథమం బ్రహ్మణా స్మృతమ్ । నిత్యశబ్దమయం పుణ్యం శతకోటిప్రవిస్తరమ్. 3
అనన్తరం తు వక్త్రేభ్యో వేదా స్తస్య వినిస్సృతాః । మీమాంసా న్యాయవిద్యాశ్చ ప్రమాణాష్టకసంయుతాః.4
వేదాభ్యాసరతస్యాస్య ప్రజాకామస్య మానసాత్ । మనసః పూర్వసృష్టా వై జాతాస్తేనైవ మానసాః. 5
మరీచి రభవ త్పూర్వం తతోఽత్రి ర్భగవా నృషిః ।అఙ్గిరా శ్చాభవత్పశ్చా త్పుల స్త్య స్తదనన్తరమ్. 6
తతః పులహనామా వైతతః క్రతు రజాయత । ప్రచేతాశ్చ తతః పుత్రో వసిష్ఠ శ్చాభవత్పునః. 7
పుత్రో భృగు రభూత్తత్ర నారదో పి చిరా దభూత్ ।దశైతా న్మనసా పుత్రా ఞ్జీవపుత్రా నజీజనత్. 8
తత్పుత్రానథ వ క్ష్యామి హ్యాత్మహీనా న్ప్రజాపతే । అఙ్గుష్ఠా ద్దక్షిణాద్దక్షః ప్రజాపతి రజాయత. 9
ధర్మస్తు నాభిదేశాత్తు హృదయా త్కుసుమాయుధః।భ్రూమధ్యా దభవ త్క్రోధో లోభ శ్చాధరసమ్భవః. 10
బుద్ధే ర్మోహ స్సమభ వదహఙ్కారా ద భూన్మదః।ప్రమోద శ్చాభవత్కణ్ఠా న్మృత్యు ర్లోచనయోర్నృప. 11

ఏతే నవ సుతారాజ న్కన్యా చదశమీ పునః । అఙ్గజాఇతివిఖ్యాతా దశమీ బ్రహ్మణ స్సుతాః. 12

## మూడవ అధ్యాయము

## బ్రహ్మనుండి వేదాదికము ఉత్పత్తి చెందుట

మనువు ఇట్లడిగెను: లోకపితామహుడగు బ్రహ్మ ఏల చతుర్ముఖు డయ్యెను? బ్రహ్మ (వేద)వేత్తలలో శ్రేష్ఠుడు అగు బ్రహ్మ లోకములను ఎట్లు సృష్టించెను?

మత్స్యము ఇట్లు చెప్ప నారంభించెను: దేవతలకును పితామహుడగు బ్రహ్మ మొదట తపస్సు ఆచరించెను. అంతట అంగములతో ఉపాంగములతో పదములతో క్రమముతో (ఘన జట మొదలగు వానితో) కూడ వేదములు అతనికి సాక్షాత్కరించెను. నిత్యశబ్దమయమును పుణ్యకరమును శతకోటి గ్రంథ (32 అక్షరములు గ్రంథము అని పరిభాష) విస్తరము కలది అగు పురాణమును ధర్మశాస్త్రములతోకూడ మొదట బ్రహ్మ స్మరించి (పూర్వ కల్పములందు తనకు తెలిసిన వానినే) కొనెను. తరువాత అతని ముఖముల (నోళ్ల) నుండి వేదములును ఎనిమిది (ప్రత్యక్షము అనుమానము ఉపమానము ఆగమము అర్థాపత్తి అసంభవము ఐతిహ్యము పురాణము) ప్రమాణములతో కూడ న్యాయ విద్యలు బయటకు వచ్చెను. వేదములను అవృత్తము చేయుచునే యున్నవాడును ప్రజలను సృష్టింప సంకల్పించిన వాడునగు అతని మానసమునుండి సంకల్పముచే మొదట సృష్టింపబడిన పుత్త్రులు మానస పుత్త్రులైరి. వారు వరుసగా- మరీచి అత్రి అంగిరుడు పులస్త్యుడు పులహుడు క్రతువు ప్రచేతుడు వసిష్ఠుడు భృగువు నారదుడు. వీరందరును జీవ పుత్త్రులు (తమ నుండి పుత్త్రులనుత్పన్నులనుచేసి జీవింప జేసినవారు. (వీరిలో నారదుని విషయ మాలోచింప వలెను.) ఆత్మ హీనులు (దేహము లేనివారు) అగు బ్రహ్మ పుత్త్రుల వెలిపెదను. బ్రహ్మ కుడి బొటన వ్రేలినుండి దక్షుడు (ఇతడు మాత్రము దేహము కలవాడు. సృష్టిని కొనసాగించి ప్రజాపతి ఐనవాడు.) నాభినుండి ధర్మము హృదయమునుండి మన్మథుడు కనుబొమ్మల నడుమనుండి క్రోధము క్రింది పెదవినుండి లోభము బుద్ధినుండి మోహము అహంకారమునుండి మనస్సు చెవినుండి ప్రమోదము (సంతోషము) కన్నులనుండి మృత్యువు అను కుమారులును అంగజ అనెడి కన్యయు కలిగిరి.

మనుః బుద్ధే ర్మోహో హ్యహఙ్కారా న్మనోఽభూ దితి కీర్తితమ్ ।
అహఙ్కారసుతః కోవా బుద్ధి ర్నామ కి ముచ్యతే. 13
మత్స్యః సత్త్వం రజ స్తమశ్చె వగుణత్రయ ముదాహృతమ్ । సమానస్థితి రేతేషాం ప్రకృతిః పరికీర్తితా. 14
కేచి త్ప్రధాన మిత్యాహు రవ్యక్త మపరే జగుః । ఏత్రైరేవ సమం సృష్టం కరోతి వికరోతి చ. 15
గుణేభ్యః క్షోభ్యమాణేభ్య స్త్రయో దేవా విజజ్ఞిరే । ఏకా మూర్తి స్త్రియో భాగా బ్రహ్మవిష్ణు మహేశ్వరాః.
సవికారా త్ప్రధానాత్తు మహత్తత్త్వం ప్రజాయతే । మహా నితి యతః ఖ్యాతి ర్లోకానాం జాయతే సదా. 17
అహఙ్కారస్తు మహతో జాయతే మానవర్ధనః । ఇన్ద్రియాణి తతః పఞ్చ వక్ష్యే బుద్ధి వశాని తు. 18
ప్రాదుర్భవన్తి చాన్యాని తథా కర్మవశాని తు । శ్రోత్రం త్వక్చక్షుషీ జిహ్వా నాసికా చ యథాక్రమమ్. 19
పాయూపస్థం హస్తపాదం వాక్చే తీన్ద్రియసఙ్గ్రహః శబ్ద స్స్పర్శశ్చ రూపంచ రసో గన్ధశ్చ పఞ్చమః. 20
ఉత్సర్గానన్ద నాదానగత్యాలాపశ్చ యాః క్రియాః । మన ఏకాదశం చైషాం కర్మబుద్ధిగుణాన్వితమ్. 21
ఇన్ద్రియావయవా స్సూక్ష్మా యాస్యమూర్తి మనీషిణః । శయన్తి యస్మాత్తన్మాత్రా శ్శరీరం తేన తత్స్మృతమ్.
శరీరయోగా జ్జీవశ్చ శరీరం రక్షతే బుధః । మన స్సృష్టం వికురుతే నోద్యమానం సిసృక్షయా. 23
ఆకాశం శబ్దతన్మాత్రా దభూ చ్ఛబ్దగుణాన్వితమ్ । ఆకాశవికృతే ర్వాయు శ్శబ్దస్పర్శగుణోఽభవత్. 24

వాయోశ్చ స్పర్శతన్మాత్రా త్తేజ ఆవిరభూ త్తతః । త్రిగుణం చ వికారేణ తచ్ఛబ్దస్పర్శరూపవత్. 25
తేజోవికారా దభవ త్తత ఆప శ్చతుర్గుణమ్ । రసతన్మాత్రసమ్భూతం శబ్దస్పర్శరసాత్మకమ్. 26
* భూమిస్తు గన్ధతన్మాత్రా దభూ త్పఞ్చగుణా తతః। ప్రాయో గన్ధగుణా సా తు బుద్ధి రేషాం గరీయసీ.27
ఏభి స్సమ్పాదితం భుఙ్క్తే పూరుషః పఞ్చవింశకః । ఈశ్వరో వాచకశ్చాపి జలాత్మా కథ్యతే బుధైః. 28
ఏవం షడ్వింశకం ప్రోక్తం శారీర మిహ మానవమ్ । సాఙ్ఖ్యం సఙ్ఖ్యాత్మకత్వాచ్చ కపిలాదిభిరుచ్యతే. 29

మనువు మరల ఇట్లడిగెను: బుద్ధికుమారుడు మోహము అహంకారపుత్త్రుడు మనస్సు అంటిరి. బుద్ధి అనగా ఏమి? అహంకార కుమారుడగు మనస్సు అనగా ఎట్టిది?

మత్స్యము ఇట్లు పలికెను: సత్త్వము రజస్సు తమస్సు అనునవి మూడు గుణములు. వీటి మూడిటి నమత్వస్థితిని ప్రకృతి ప్రధానము అవ్యక్తము అందురు. ప్రకృతి ఈ మూడు గుణములతోనే సృష్టి జరుపును. సృష్టిలోని పదార్థముల వరిణమింప జేయును. లయముకూడ పొందించును. క్షోభము (స్పందము) పొందిన మూడు గుణములనుండి ఒకే మూర్తి యగు ప్రకృతినుండి ముగ్గురు దేవతలు జనించిరి. వారే బ్రహ్మ విష్ణు మహేశ్వరులు. వికారము నొందని ప్రధానమునుండి మహత్తత్త్వము పుట్టును. దాని మూలముననే లోకములకు మహాన్ (దృష్టికి గోచరమగునంత పెద్ద పరిమాణము కలవి) అను ప్రసిద్ధి ఏర్పడును. మహత్‌నుండి మాన(గర్వ)మును వృద్ధిచేయు అహంకారము దానినుండి బుద్ధి వశములగు ఐదు జ్ఞానేంద్రియములు- త్వక్చక్షుః శ్రోత్ర జిహ్వాఘ్రాణములును కర్మ వశములగు ఐదు వాక్పాణిపాద పాయూపస్థములను కర్మేంద్రియములును జనించెను. వరుసగా స్పర్శము రూపము శబ్దము రసము గంధము అనునవి జ్ఞానేంద్రియములకు గోచరములగు విషయములు. వచనము ఆదానము గతి ఉత్సర్గము ఆనందము (ఆనందింప చేయుట) అనునవి కర్మేంద్రియములు చేయు పనులు. ఈ ఇంద్రియముల జ్ఞాన కర్మ లక్షణములుగల మనస్సు వీనితో పదునొకండవది. విద్వాంసులు మాత్రము దర్శింపగల సూక్ష్మములగు ఇంద్రియావయవములు పంచతన్మాత్రలను (పంచభూత సూక్ష్మాంశములను) ఆశ్రయించి ఉండును. అందుచేత ఈ ఇంద్రియ తన్మాత్రల సంఘాతము శరీరము అనబడును.

ప్రకృతి అపరమేశ్వరుని సృష్టి సంకల్పముచే ప్రేరింపబడినదగుచు పరమేశ్వరుని మనస్సు ప్రకృతిని పరిణమింప జేయును. శబ్ద తన్మాత్రనుండి శబ్ద గుణము కల ఆకాశమును అది పరిణమించగా శబ్దస్పర్శ గుణములుగల వాయువును అది పరిణమించగా శబ్ద స్పర్శరూప గుణములు కల అగ్నియు అది పరిణమించగా శబ్ద స్పర్శ రూపరసములుగల జలమును అది పరిణమించగా శబ్ద స్పర్శ రూప రసగంధములు గుణములుగాగల పృథివియు ఉత్పత్తి పొందెను. వీటి అన్నింటిలో బుద్ధి శ్రేష్ఠమయినది. ఐదు మహాభూత(సూక్ష్మ)ములు అహంకారము బుద్ధి అవ్యక్తము మనస్సుతో కూడ పదునొకండు ఇంద్రియములు ఇంద్రియ విషయములు అను ఇరువదినాల్గు తత్త్వములకు అతీతుడగు(ఇరువది ఐదవ)పురుషుడు (జీవుడు) ఈ ఇరువది నాల్గింటిచే సాధింపబడిన సుఖదుఃఖాదులను అనుభవించుచుండును. అంతర్యామి అగు ఈశ్వరునకు వాచకుడనియు జలాత్మ అనియును పేరులు. ఇతడిరువదియారవవాడు. అందుచే మానవశరీరము నాశ్రయించి చేయుతత్త్వ విచారణమును షడ్వింశకమందురు. ఇట్లు ఇది సంఖ్యా రూపము కావున దీనిని సాంఖ్యము అని కపిలుడు మొదలగు వారందురు. (సంఖ్యా అనగా జ్ఞానము అని అర్థము.)

ఏత త్తత్త్వా త్మకం కృత్వా జగ ద్దేవా నజీజనత్ । సావిత్రీం లోకసృష్ట్యర్థం హృది కృత్వా సమాస్థితః.30
తత స్తాం జపత స్తస్య భూత్వా దేహ మకల్మషమ్ । స్త్రీరూప మకరో దర్ధ మర్ధం పురుషరూపవత్. 31

సరస్వతీమోహాద్బ్రహ్మణః పఞ్చముఖోత్పత్తిః.

శతరూపా చ సఙ్ఖ్యాతా సావిత్రీ చ నిగద్యతే । సరస్వత్యథ గాయత్రీ బ్రహ్మాణీచపర న్తప. 32

---

* రూపం గన్ధగుణా క్ష్మాతు పరేషాం యా బలీయసీ.

తతః స్వదేహసమ్భూతా మాత్మజా మిత్యకల్పయత్ । స దృష్ట్వా వ్యథిత స్తత్ర కామబాణార్దితో విభుః. 33
అహో రూప మహో రూప మితి చాహ ప్రజాపతిః । తతో వసిష్ఠప్రముఖా భగినీమితి చుక్రుశుః. 34
బ్రహ్మా న కించి ద్దదృశే తన్ముఖాలోకనాదృతే । అహో రూప మహో రూప మితి ప్రాహ పునః పునః. 35
తతః ప్రణామనమ్రాం తు పునస్తా మవలోకయత్ । అథ ప్రదక్షిణం చక్రే సా పితు ర్వరవర్ణినీ. 36
పుత్రేభ్యో లజ్జితస్యాస్య తద్రూపాలోకనేచ్ఛయా । ఆవిర్భూత మతో వక్త్రం దక్షిణం పాణ్డుగండవత్. 37
విస్మయస్ఫురదోష్ఠం చ పాశ్చాత్త్యముదగా త్తతః । చతుర్థ మభవ త్పశ్చా ద్వామం కామశరాతురమ్. 38
తతోఽన్య దభవ త్తస్య కామాతురతయా తథా । ఉత్పతన్త్యా స్తదాకాశ మాలోకనకుతూహలాత్. 39
సృష్ట్యర్థం యత్కృతం తేన తపః పరమదారుణమ్ । తత్సర్వం నాశ మగమ త్స్వసుతోపగమేచ్ఛయా. 40
*తేనోర్ధ్వవక్త్ర మభవ త్పఞ్చమం తస్య ధీమతః । ఆవిర్భూతం చ తత్రైవ తద్వక్త్ర మపరం ప్రభోః. 41
స తు తా నబ్రవీ ద్బ్రహ్మా పుత్రా నాత్మసముద్భవాన్ । ప్రజా స్సృజధ్వం సమ్భూతా స్సదేవాసురమానుషాః. 42
ఏవ ముక్తా స్తతః సర్వే సస్సృజు ర్వివిధాః ప్రజాః । గతేషు తేషు సృష్ట్యర్థం ప్రణామావనతా మిమామ్. 43
ఉపయేమే స విశ్వాత్మా శతరూపా మనిన్దితామ్ । స బభూవ తయా సార్ధ మతికామాతురో విభుః. 44
సలజ్జాం చకమే దేవః కమలోదరమన్దిరే । యావదబ్దశతం దివ్యం యథాఽన్యః ప్రాకృతో జనః. 45
కాలేన మహతా తస్యా తదా పుత్రోఽభవ న్మనుః । స్వాయమ్భువ ఇతి ఖ్యాత స్స విరాడితి నశ్శ్రుతమ్. 46
తద్రూపగుణసామాన్యా దధిపూరుష ఉచ్యతే । వైరాజా యత్ర తే జాతాః బహవ స్సంశితవ్రతాః. 47
స్వాయమ్భువా మహాభాగా స్సప్త సప్త తథాపరే । స్వారోచిషాద్యా స్సర్వే తే బ్రహ్మతుల్యస్వరూపిణః. 48
ఔత్తమిప్రముఖా స్తద్వ ద్యేషాం త్వం సప్తమోఽధునా. 48½

ఇతి శ్రీమత్స్యమహాపురాణే మత్స్యమనుసంవాదే బ్రహ్మణో వేదాద్యుత్పత్తిర్నామ తృతీయోఽధ్యాయః.

బ్రహ్మ ఇట్లు షడ్వింశతి తత్త్వరూపమయిన జగత్తును సృష్టించిన తరువాత దేవతలను జనింపజేసెను. అతడు లోకసృష్టి జరుపు సంకల్పముతో సావిత్రీ తత్త్వమును హృదయమున నిలుపుకొని సమాధిస్థితుడయ్యెను. ఆ విద్యను జపించుచుండిన అతని దేహము నిష్కల్మషమయి సగము స్త్రీరూపమును సగము పురుషరూపమును అయ్యెను. ఆ స్త్రీరూపమునకే శతరూప సావిత్రి సరస్వతి గాయత్రి అని వ్యవహారము. తన దేహమునుండి ఉత్పన్నయైన ఆమెను అతడు తన కుమార్తె (ఆత్మజ) అనియు ఆయనయే వ్యవస్థ చేసెను. ఐనను ఆదేవుడు ఆమెను చూచిన తత్క్షణమే కామబాణములచే బాధనొంది ఎటువంటి రూపము! ఎటువంటి సౌందర్యము! అని ఆశ్చర్యముతో పలికెను. వసిష్ఠుడు మొదలగువారు అక్కా! అని అరచిరి; కాని బ్రహ్మ ఆమె మొగమును చూచు ఆసక్తిలో అది ఏమియు చూడలేదు. మాటిమాటికి ఎంత సౌందర్యము! అని పలుకసాగెను. అంతలో తనయెదుట తనకు నమస్కరించు ఆసక్తితో ఉన్న ఆ సావిత్రి అతనికి కనబడెను. అంతట ఆ ఉత్తమ స్త్రీ తన తండ్రికి ప్రదక్షిణము చేసెను.

ఆమె సౌందర్యమును మాటిమాటికిని తన కొడుకుల ఎదుట అవలోకన చేయుటకు సిగ్గుపడుచున్న ఆ బ్రహ్మకు వెంటనే తెల్లని చెక్కిళ్లు గల దక్షిణ ముఖమును ఆశ్చర్యములో వణకుచున్న పెదవులు కల పశ్చిమ ముఖమును [illegible] బాణములచే బాధపడుచున్న [illegible] ఉత్తర ముఖమును కలిగెను. అత డప్పటి [illegible] ఇదే మను కుతూహలముతో పైకి ఆకాశము పైకి [illegible] బ్రహ్మకు [illegible] ఊర్ధ్వ ముఖము ఉత్పన్నము అయ్యెను. అట్లు ఆ ప్రభువు [illegible] ముఖము [illegible] కూడ [illegible].

*[illegible]

తత స్స్వదేహ సమ్భూతా మాత్మజా మిత్యకల్పయత్ । స ఆస్తే వ్యథిత స్తత్ర కామబాణార్దితో విభుః. 33
అహో రూప మహో రూప మితి చాహ ప్రజాపతిః । తతో వసిష్ఠప్రముఖా భగినీమితి చుక్రుశుః. 34
బ్రహ్మా న కించి ద్దదృశే తన్ముఖాలోకనాదృతః । అహో రూప మహో రూప మితి ప్రాహ పునః పునః. 35
తతః ప్రణామనమ్రాం తు పునస్తా మవలోకయత్ । అథ ప్రదక్షిణం చక్రే సా పితు ర్వరవర్ణినీ. 36
పుత్రేభ్యో లజ్జితస్యాస్య తద్రూపాలోకనేచ్ఛయా । ఆవిర్భూత మథో వక్త్రం దక్షిణం పాణ్డుగండవత్. 37
విస్మయస్ఫురదోష్ఠం చ పాశ్చాత్త్యముదగా త్తతః । చతుర్థ మభవ త్పశ్చా ద్వామం కామశరాతురమ్. 38
తతోఽన్య దభవ త్తస్య కామాతురతయా తదా । ఉత్పతన్త్యా స్తదాకాశ మాలోక్యాచ కుతూహలాత్. 39
సృష్ట్యర్థం యత్కృతం తేన తపః పరమదారుణమ్ । తత్సర్వం నాశ మగమ త్స్వసుతోపగమేచ్ఛయా. 40
*తతోర్ధ్వవక్త్ర మభవ త్పఞ్చమం తస్య ధీమతః । ఆవిర్భూతం చ తత్రైవ తద్వక్త్రం మపరం ప్రభోః. 41
స తు తా న్బ్రవీ ద్బ్రహ్మా పుత్రా నాత్మసమ్భవా న్ప్రజా స్సృజధ్వం సమ్భూతా స్సదేవాసురమానుషాః.42
ఏవ ముక్తా స్తతః సర్వే ససృజు ర్వివిధాః ప్రజాః । గతేషు తేషు సృష్ట్యర్థం ప్రణమ్రమవదనా మిమామ్. 43
ఉపయేమే స విశ్వాత్మా శతరూపా మనిన్దితామ్ । స బభూవ తయా సార్ధ మతికామాతురో విభుః. 44
సలజ్జాం చకమే దేవః కమలోదరమన్దిరే । యావదబ్దశతం దివ్యం యథాఽన్యః ప్రాకృతో జనః. 45
కాలేన మహతా తస్య తద్వ త్పుత్రోఽభవ న్మనుః । స్వాయమ్భువ ఇతి ఖ్యాత స్స విరాడితి నశ్శ్రుతమ్. 46
తద్రూపగుణసామాన్యా దధిపూరుష ఉచ్యతే । వైరాజా యత్ర తే జాతాః బహవ స్సంశితవ్రతాః. 47
స్వాయమ్భువా మహాభాగా స్సప్తసప్త తథాపరే । స్వారోచిషాద్యా స్సర్వే తే బ్రహ్మతుల్యస్వరూపిణః. 48
ఉత్తమప్రముఖా స్తద్వ దేతేషాం సప్తమోఽధునా. 48½

ఇతి శ్రీమత్స్యమహాపురాణే మత్స్యమనుసంవాదే బ్రహ్మణో వేదాద్యుత్పత్తిర్నామ తృతీయోఽధ్యాయః.

బ్రహ్మ ఇట్లు షడ్వింశతి తత్త్వరూపమయిన జగత్తును సృష్టించిన తరువాత దేవతలను జనింపజేసెను. అతడు లోకసృష్టి జరుపు సంకల్పముతో సావిత్రీ తత్త్వమును హృదయమున నిలుపుకొని సమాధిస్థితుడయ్యెను. ఆ విద్యను జపించుచుండిన అతని దేహము నిష్కల్మషమయి సగము స్త్రీరూపమును సగము పురుషరూపమును అయ్యెను. ఆ స్త్రీరూపమునకే శతరూప సావిత్రి సరస్వతి గాయత్రి అని వ్యవహారము. తన దేహమునుండి ఉత్పన్నయైన ఆమెను అతడు తన కుమార్తె (ఆత్మజ) అనియు ఆయనయే వ్యవస్థ చేసెను. ఐనను ఆదేవుడు ఆమెను చూచిన తత్క్షణమే కామబాణములచే బాధనొంది ఎటువంటి రూపము! ఎటువంటి సౌందర్యము! అని ఆశ్చర్యముతో పలికెను. వసిష్ఠుడు మొదలగువారు అక్కా! అని అరచిరి కాని బ్రహ్మ ఆమె మొగమును చూచు ఆసక్తిలో అది ఏమియు చూడలేదు. మాటిమాటికి ఎంత సౌందర్యము! అని పలుకసాగెను. అంతలో తనయెదుట తనకు నమస్కరించు ఆసక్తితో ఉన్న ఆ సావిత్రి అతనికి కనబడెను. అంతట ఆ ఉత్తమ స్త్రీ తన తండ్రికి ప్రదక్షిణము చేసెను.

ఆమె [illegible] చూడవలెనను [illegible] చేయుటకు సిగ్గుపడుచున్న ఆ బ్రహ్మకు వెంటనే వెలవెల పోవుచున్న చెక్కిళ్లు కల దక్షిణ ముఖమును ఆశ్చర్యములో వణకుచున్న పెదవులు కల పశ్చిమ ముఖమును మన్మథ బాణములచే బాధపడుచున్న [illegible] ఉత్తర ముఖమును కలిగెను. అత డప్పటికి కామాతురుడై [illegible] ఆకాశమునకు ఎగురుచుండగా [illegible] ఇదే మను కుతూహలముతో పైకి ఆకాశము వైపు చూడవలెనను [illegible] బ్రహ్మకు ఐదవ [illegible] ఊర్ధ్వ ముఖము ఉత్పన్నము అయ్యెను. అట్లు ఆ ప్రభువు [illegible] తపము [illegible] పోయెను.

*పా: [illegible]

మత్స్య భగవానుడు ఇట్లు పలికెను : నేను చేసిన ఆది సృష్టి రజోగుణముచే ఉద్భవించినది. దివ్యమయినది. (లోక సాధారణమయినది కాదు.) అతీంద్రియము. ఇంద్రియములకు అందనిది. ఇంద్రియములకు గోచరించని శరీరము కలది. దివ్య తేజోమయము. దాని రూపము దివ్యమయినది. ఉత్తమమగు జ్ఞానముచే ఉత్పత్తి చెందినది. మర్త్యులు తమ మాంసపు కన్నులతో దానిని తుద వరకు (సంపూర్ణముగా) చూడజాలరు. సర్పములు ఆకాశమున సంచరించు వివిధ పక్షుల మార్గమును చూడజాలవు. అట్లే దివ్యులగు వారి మార్గమును వేదములే కాని మానవులు తెలిసికొన జాలరు. అందు వలన వారి తత్త్వమును విచారణ చేయుటయే మానవులకు శుభకరము.

సావిత్రిని పొందుట బ్రహ్మకు దోషము కాదు.

ఈ చతుర్ముఖుడు సర్వ విద్యలకు అధిష్ఠాత. సర్వ విద్యా రూపయగు ఈ గాయత్రి (శబ్దరూప) ఆతని శరీరము నుండి పుట్టినదనియు అందుచే కూతురనియు చెప్పబడుచున్నది. ఆ ఇద్దరకును మూర్తి (ఆకారము - శరీరము) ఉండు గాక-లేకుండుగాక : ఆ ఇద్దరును దంపతులే. ఇట్లు (విద్యాధిష్ఠాతయగు) బ్రహ్మ ఉన్నచోట (విద్యారూపిణిఅగు) సరస్వతి (భాషారూప - శబ్ద రూప కూడ) ఉండనే ఉండును. భారతి ఉన్నచోట బ్రహ్మ ఉండి తీరును. సూర్యుడులేని ఛాయ ఎక్కడను ఉండనట్లు గాయత్రి (సరస్వతి)యు బ్రహ్మ సమీపమును విడిచి ఉండదు. బ్రహ్మ వేదరాశి రూపుడు. సావిత్రి ఆతనిని ఆశ్రయించి ఉండును. కనుక బ్రహ్మ సావిత్రిని పొందెను. అనుటలో దోషము ఏ మాత్రమును లేదు. ఏలయన సావిత్రితో కలియనంతవరకును బ్రహ్మ అజ్ఞానముతో కూడి ఉండెను.

మన్మథాయ విరిఞ్చిదత్తశాప స్తత్పరిహారశ్చ.

స్వసుతోపగమా ద్బ్రహ్మశాప కుసుమాయుధమ్ । య న్మమాపీహ భవతా మన స్సంక్షోభితం శరైః. 12
*తత స్త్వాం కామః కోపేన రుద్రో భస్మీకరిష్యతి । తతః ప్రసాదయామాస కామదేవ శ్చతుర్ముఖమ్. 13
•న మా మకారణా చ్ఛప్తుం త్వమిహార్హసి మానద । అహ మేవంవిధ స్సృష్ట స్త్వయైవ చతురానన. 14
ఇంద్రియక్షోభజనక స్సర్వేషామేవ దేహినామ్ । స్త్రీపుంసో రభిచారేణ మయా సర్వత్ర సర్వదా. 15
క్షోభ్యం మనః ప్రయత్నేన త్వయా ప్రోక్తం పురా ప్రభో। కురు ప్రసాదం భగవ న్స్వశరీరాప్తయే పునః.16
బ్రహ్మోవాచ:వైవస్వతేఽన్తరే ప్రాప్తే యాదవాన్వయసమ్భవః।రామో నామ తదా మర్త్యో మత్సత్త్వబల మాశ్రితః.
అవతీర్య పురధ్వంసీ ద్వారకా మధివత్స్యతి । తద్భ్రాతు స్తత్సమో భూత్వా తదా పుత్త్రత్వ మేష్యసి. 18
ఏవం శరీర మాసాద్య భుక్త్వా భోగా నశేషతః । తతో భరతవంశాన్తే భూత్వా వత్సనృపాత్మజః. 19
విద్యాధరాధిపత్యం చ యావదాభూతసంప్లవమ్ । స్వయోనిం ధర్మతః ప్రాప్య *మత్సారూప్యం గమిష్యసి.20
ఏవం శాప ప్రసాదాభ్యాం ముదితః కుసుమాయుధః । శోకప్రమోదాభిహత స్స జగామ యథాగతమ్. 21

బ్రహ్మ మన్మథుని శపించి అనుగ్రహించుట.

తన కుమార్తెను తాను పొందుట కారణముగా బ్రహ్మ మన్మథుని శపించెను. మన్మథా ! నాయంతటి వాని మనస్సును కూడ నీవు నీ బాణములచే సంక్షోభింపజేసితివి. కావున రుద్రుడు నిన్ను కోపముతో భస్మము చేయును. అనగా మన్మథుడు బ్రహ్మను ఇట్లు అనుగ్రహింపజేసికొనెను: భగవన్ ! నీవు ఇక్కడ ఇప్పుడు ఇట్లు నన్ను అకారణముగా శపింపదగదు. మీరే నన్ను ఇట్టి వానినిగా - సర్వ ప్రాణులకు ఇంద్రియములను క్షోభింపజేయు వానినిగా - పుట్టించితిరి. ఈ చోట ఆ చోట అనక ఇప్పుడు అప్పుడు అనక ఎల్లప్పుడు ఎల్లచోట్ల హాని కలిగించు తలంపుతో ప్రయత్నించియైన నీవు స్త్రీ పురుషులమనస్సు కలత పరచవలయును. అని మునుపు మీరే నాతో పలికితిరి. మరల నాకు నా శరీరము లభించునట్లు అనుగ్రహము చేయ వేడుచున్నాను. అని మన్మథుడు వేడగా బ్రహ్మ ఇట్లు పలికెను : వైవస్వత మన్వంతరము

* తస్మాత్త్వద్దేహమచిరాద్రుద్రోభస్మీకరిష్యతి. • నమామకారణాచ్ఛప్తుం. * మత్సామీప్యం.

వచ్చినప్పుడు యదు వంశమున నా సత్త్వమును బలమును పూని రాముడు అను మానవుడు జన్మించును. అట్లవతరించిన అతడు శత్రుపురముల ధ్వంసము చేయు మహా శూరుడై ద్వారకయందు నివసించును. అప్పుడు నీవు అతని తమ్మునకు అతనితో సమడగు సుతుడవై జన్మింతువు. ఇట్లు శరీరమును పొంది అశేష భోగముల ననుభవింతువు. పిమ్మట భరత వంశము ముగియు కాలమున వత్సరాజునకు కుమారుడవై ధర్మానుసారము దేవయోనిని (జన్మమును) పొంది ప్రళయ కాలము వరకు విద్యాధరుల కధిపతివై యుండి తుదకు నా సారూప్యమును పొందెదవు.

ఇట్లు శాపము చేతను అనుగ్రహము చేతను శోకమును ప్రమోదమును పొంది మన్మథుడు తాను వచ్చిన మార్గ మున వెళ్లెను.

ఋషయః: దేహ_ప్తయ ఇతి ప్రోక్తో యదువంశే కామసమ్భవః। కథం చ దగ్ధో రుద్రేణ కిమర్థం కుసుమాయుధః.22
భరథస్యాసుతస్యాస్య కా చసృష్టిః పురాఽభవత్ । ఏత త్సర్వం సమాచక్ష్వ మూలత స్సర్వథా హి నః.23
సూతః: యా సా దేహార్ధసమ్భూతా గాయత్రీ బ్రహ్మవాదినీ । జననీ సుమనోదేవీ శతరూపా జితేన్ద్రియా. 24
రతి ర్మన స్తపోవృద్ధి రహోదిక్స న్తమ స్తథా । తతస్తు శతరూపాయాం సప్తాపత్యం వ్యజీజనత్. 25
యే మరీచ్యాదయః పుత్రా మానసా స్తస్య ధీమతః । తేషా మయ మభూ ల్లోక స్సర్వవిద్యాత్మకః పురా. 26

వామదేవకృత జరామరణరహిత జనసృష్టిః.

తతోఽసృజ ద్వామదేవం త్రిశూలవరధారిణమ్ । సనత్కుమారం చ విభుః పూర్వేషా మపి పూర్వజమ్. 27
వామదేవోపి భగవా నసృజ న్ముఖతో ద్విజాన్ । క్షత్రియా నసృజ ద్బాహ్వో ర్విట్ఛూద్రానూరుపాదయోః.28
విద్యుతోఽశనిమేఘాంశ్చ రోహితేన్ద్రధనూంషి చ । ఇన్ద్రాణాం చ ససర్జాదౌ వర్జన్యం చతతః వరమ్. 29
తత స్సాధ్యగణా నీశ స్త్రినేత్రా దసృజ త్పునః । కోటిత శ్చతురాశీతిం జరామరణవర్జితాన్. 30
వామదేవోఽసృజ ద్దేవా న్బ్రహ్మణా వినివారితః । నైవంవిధా భవే త్సృష్టి ర్జరామరణవర్జితా. 31
శుభాఽశుభాత్మికా యా తు సైవ సృష్టిః ప్రశస్యతే । ఏవం ససర్జ కల్పాదౌ సృష్టిస్థాణు రథోఽభవత్. 32

శౌనకాదిఋషు లిట్లనిరి : మన్మథుడు తన దేహమును మరల పొందుటకై యదువంశమున జన్మించునంటివి. కుసుమాయుధుడు ఏల ఎట్లు రుద్రునిచే దగ్ధుడు అయ్యెను? (తన భార్యనుండి) కుమారులే లేని ఈ భరథుని (బ్రహ్మ) నుండి ఏ సృష్టి మొదటగా జరిగెను? మాకు ఇది అంతయు మొదటి నుండి తప్పక చెప్పగోరెదము. అనగా సూతు డిట్లు చెప్ప నారంభించెను. బ్రహ్మదేహార్ధము నుండి జనించెనని నేను చెప్పిన గాయత్రి వేద విశారద. వందితులకును దేవతలకును తల్లియు ఆరాధ్యయగు దేవియును. శతరూప-(వందలకొలది రూపములు కలది); ఇంద్రియములను జయించినది. బ్రహ్మ ప్రజావతి శతరూపయందు రతి-మనస్సు-తపస్సు-వృద్ధి-అహస్సు (పగలు)-దిక్కు-తమస్సు (చీకటి) అను ఏడు మందినీ కనెను. సర్వ విద్యాత్మకమగు ఈలోకము బుద్ధి శాలియగు బ్రహ్మకు జనించిన మానస పుత్రులగు మరీచి మొదలగు వారికి సంబంధించినది అయ్యెను. అనగా వా రీ లోకమునకు ప్రజావతులుగా నయిరి.

తరువాత లోక విభుడగు బ్రహ్మ త్రిశూల శ్రేష్ఠమును ధరించినవాడును మొదటి వారికంటె మొదటి వాడును అగు వామదేవుని సనత్కుమారుని కూడ సృష్టించెను. భగవానుడగు వామదేవుడును తన ముఖమునుండి బ్రాహ్మణులను బాహువులనుండి క్షత్రియులను తొడలనుండి వైశ్యులను పాదములనుండి శూద్రులను సృష్టించెను. మెఱపులను పిడుగులను మేఘములను వంకరలేని ఇంద్ర ధనుస్సును ఇంద్రుడు మొదలగు వారిని వర్జన్యుని సాధ్యులు అను దేవ గణములను సృజించెను. తన మూడవ కంటినుండి జరామరణములు లేని ఎనుబది నాల్గు కోట్లమంది దేవతలను కూడ సృష్టించెను. అంతట బ్రహ్మ వామదేవునితో ఇట్లనెను. శుభా శుభములతో కూడి చావు ముసలితనములతో కూడిన సృష్టియే మేలయినది కాని ఇట్లు జరామరణములు లేనిదై ఉండరాదు. అని అతనిని వారించెను. కల్పాదియందు ఈశ్వరుడింత వరకు సృష్టించిన తరువాత అతని సృష్టి నిలిచిపోయెను.

స్వాయమ్భువో మను ర్ధీమాం స్తప స్తప్త్వాఽతిదు స్తరమ్ । పత్నీ మవాప తుష్టాత్మా హ్యనన్తాం నామ నామతః.33

స్వాయమ్భువమనుసన్తతిః.

ప్రియవ్రతోత్తానపాదౌ మను స్తస్యా మజీజనత్ । ధర్మస్య కన్యాం చతురాం సూనృతాం నామ భామినీమ్. 34
ఉత్తానపాద స్తనయాం ప్రాప మన్దరగామినీమ్ । అయంపతి రయంమత్తః కీర్తిమా న్ధ్రువమేవచ. 35
ఉత్తానపాదోఽజనయ త్సూనృతాయాం ప్రజాపతిః । ధ్రువో వర్షసహస్రాణి కృత్వా దివ్యతపః పురా. 36
దివ్యరూపం తతఃస్థాన మచలస్త్రాద్బ్రహ్మణో భువః । ఏనం తు పురతః కృత్వా ధ్రువం సప్తర్షయ స్స్థితాః. 37
ధన్యా నామ మనోః కన్యా ధ్రువా చ్ఛిష్టి మజీజనత్ । అగ్నికన్యా తు సుచ్ఛాయా శిష్టే రాధత్త వై సుతాన్. 38
రిపుం రిపుఞ్జయం వృత్రం వృకలం వృకతేజసమ్ । చాక్షుషం బ్రహ్మదౌహిత్ర్యాం వైరిణ్యాం స రిపుంజయః.
వీరణస్యాత్మజాయాం తు నడ్వలాయాం చ చాక్షుషః । జనయామాస తనయా న్దశ శూరా నకల్మషాన్. 40
ఊరుః పురు శ్శతద్యుమ్న స్తపస్వీ సత్యవా క్కవిః । అగ్నిష్టోమోఽతిరాత్రశ్చ సుదృష్టి రపరాజితః. 41
అభిమన్యుశ్చ దశమో నడ్వలాయాం తు చాక్షుషాః । ఊరుశ్చాజనయ త్పుత్రాన్నాగ్నేయ్యాం ధామసూత్రతాన్.
అఙ్గం సుమనసం స్వాతిం క్రతు మఙ్గిరసం శిబిమ్ । పితృకన్యా సునీథా వై వేన మఙ్గా దజీజనత్. 43

స్థిరబుద్ధి కలవాడగు స్వాయంభువ మనువు మిగుల దుస్తరమగు తపస్సాచరించి అనంత అను నామముకల భార్యను పొంది మనస్సున సంతుష్టి చెందెను. ఆ మనువు ఆమెయందు ప్రియవ్రతుడు ఉత్తానపాదుడు అను కుమారులను కనెను. ఉత్తానపాదునకు ధర్ముని కుమార్తెయగు సూనృత యనునామె భార్యయయ్యెను. ఆమె నేర్పరి. సౌందర్యవతి. ఇంపైన నెమ్మది నడక గలది. ఇతడు నాకు రక్షకుడు. ఇతడు నావలన కీర్తిశాలి కావలయును. అను భావము తన భర్తయందు కలది. (అయంపతి-అయంమత్తుడు-కీర్తిమాన్-ధ్రువుడు అను వారందరును ఉత్తానపాదుని కుమారులని కొందరు చెప్పుచున్నారు.) ఆమె యందు ఉత్తానపాదుడు ధ్రువుని కుమారునిగా పొందెను. పురాతనకాలముననే ఆ ధ్రువుడు దివ్య తపము ఆచరించి దివ్యమగు రూపమును బ్రహ్మ లోకమునకు దిగువగా స్థిర స్థానమును సంపాదించెను. ఈ ధ్రువుని ముందుంచుకొనియే సప్త మహర్షులు ఉన్నారు. ధ్రువునకు ధన్యయను మనుపుత్రియందు శిష్టి కుమారుడు అయ్యెను. శిష్టికి అగ్నిపుత్రియగు సుచ్ఛాయయందు రిపుడు రిపుంజయుడు వృత్రుడు వృకలుడు వృకతేజసుడు అను కుమారులు కలిగిరి. రిపుంజయునకు బ్రహ్మకు దౌహిత్రి అగు వైరిణి (వైరిణి) యందు చాక్షుషుడు కుమారు డయ్యెను. ఈతనికి వీరణుని కుమార్తెయగు నడ్వలయందు శూరులు పవిత్రులునగు ఊరువు పురుడు శతద్యుమ్నుడు తపస్వి సత్యవాక్ కవి అగ్నిష్టోముడు అతిరాత్రుడు సుదృష్టి అభిమన్యుడు అను పదిమంది కుమారులు కలిగిరి. ఊరువునకు ఆగ్నేయియందు అంగుడు సుమనసుడు స్వాతి క్రతువు అంగిరుడు శిబి అను కుమారులు కలిగిరి. పితరుల కన్యయగు సునీథ అను నామెయందు అంగునకు వేనుడు పుట్టెను.

వేన మన్యాయినం విప్రా మమన్థు స్తత్కరా దభూత్ । పృథుర్నామ మహాతేజా స్స పుత్రో ద్వా వజీజనత్.44
అన్తర్ధానం హవిర్ధానం శిఖణ్డినీ మజీజనత్ । హవిర్ధాన షడాగ్నేయ్యాం ధిషణా జ్ఞనయ త్సుతాన్. 45
ప్రాచీనబర్హిషం శుక్రం గయం కృష్ణం వ్రజాజినౌ । ప్రాచీనబర్హి ర్భగవా న్మహాత్మాఽఽసీ త్ప్రజాపతిః.46
హవిర్ధానాః ప్రజా స్తేన బహవ స్సమ్ప్రవర్తితాః । సువర్ణాయా మహాభాగా దశ భక్తసుతాః ప్రభో. 47
సర్వే ప్రాచేతసా నామ ధనుర్వేదస్య పారగాః । తత్రైవోపచితా వృక్షా బభు ర్లోకే సమన్తతః. 48
దేవాదేశా త్తపస్యన్తో హ్యదహ న్ప్రచేతసః । సోమకన్యాఽభవ త్పత్నీ మానసా నామ విశ్రుతా. 49
*తేభ్యస్తు దక్ష మేకం సా పుత్ర మగ్య్ర మజీజనత్ । దక్షా దనన్తరం వృష్టా వౌషధాం శ్చ సమన్తతః.50

అజీజన త్సోమకన్యాఽనన్యాం భద్రవతీం తథా । సోమాంశస్య చ తస్యాపి దక్షస్యామితకోటయః. 51
తాసాం తు విస్తరం వక్ష్యే లోకే యావ త్ప్రతిష్ఠితమ్ । ద్విపాదా శ్చైవ న్యేఽపి త్యేఽపి ద్బహుపదా జనాః.
*ఉలూకముఖా శ్శఙ్కుకర్ణాః కర్ణప్రావరణా స్తథా । *వ్యాఘ్రాననా స్తథా కేచి త్కేచిత్సిఙ్హాననా స్తథా. 53
శ్వసూకరముఖాః కేచి త్కేచి దుష్ట్రముఖా స్తథా । జనయామాస ధర్మాత్మా మ్లేచ్ఛా న్సర్వా ననేకశః. 54
సృష్ట్వా చ మానసా న్దక్ష స్త్రీస్త్రియః ప్రీత్యా మజీజనత్ । దేవాసురమనుష్యాది తాభ్య స్సర్వ మభూ జ్జగత్.55

ఇతి శ్రీమత్స్యమహాపురాణే మత్స్యమను సంవాదే బ్రహ్మణ స్స్వపుత్రీగమనదోషాభావ కథనం నామ చతుర్థోఽధ్యాయః.

అన్యాయియగు వేనుని విప్రులు మథించిరి. అతని చేతినుండి మహాతేజస్కుఁ డగు పృథువు కలిగెను. అతనికి శిఖండియందు అంతర్ధానుడు హవిర్ధానుడు అను కుమారులు కలిగిరి. హవిర్ధానునకు ఆగ్నేయియందు ప్రాచీనబర్హి శుక్రుడు గయుడు కృష్ణుడు ప్రజా జినుడు అను ఆరుగురు కుమారులు కలిగిరి. భగవానుడును మహాత్ముడునగు ప్రాచీనబర్హి ప్రజాపతి అయ్యెను. ఏలయన అతనిచేత హవిర్ధానులు అను పేర అనేకులగు ప్రజలు ప్రవర్తిల్ల జేయబడిరి. బంగారు గుఱ్ఱములు కలవారు మహాభాగులును భగవద్భక్తులును అగు పదిమంది అతని కుమారులు. వారికి అందరకును ప్రాచేతసులు అనిపేరు. వారందరు ధనుర్వేదము చివర వరకు నేర్చినవారు (ధనుర్వేదపు తత్త్వము నెరిగినవారు); ఒకప్పుడు భగవంతుని ఆదేశమున లోకమునందలి వృక్షౌషధీ జాతులను అగ్నిదహించెను. వాటిని ఈ ప్రాచేతసులు అంతట ప్రకాశించునట్లు చేసిరి. సోముని కన్యయగు మానస అనునామె వారికందరకు పత్ని అయ్యెను. ఆమె వారివలన పూజ్యుడగు దక్షుడను కుమారుని కనెను. అతని తరువాత నల్లని ఓషధులును అనన్య భద్రవతి అను కుమార్తెలును ఆమెకు సంతానమయ్యెను. సోమాంశమువలన కలిగిన ఆ దక్షునకు లెక్కలేనన్ని కోట్ల సంతానము కలిగెను. లోకమునందు నిలిచియున్న ఆ సంతాన విస్తరమును తెలిపెదను వినుము. రెండు పాదములు కలవారు అనేక పాదములు కలవారు కోతి మొగము వంటి మొగము కలవారు శంకువువంటి చెవులు కలవారు కప్పవడిన చెవులు కలవారు పులి మొగము వంటి మొగము వచ్చని మొగము కుక్కమొగము వంటి మొగము పంది మొగము వంటి మొగము ఒంటె మొగము వంటి మొగము కలవారు అనేకులు మ్లేచ్ఛులందరును అతనికి మానస సుతులుగా జనించిరి. అనంతరము ప్రీతి అను భార్యయందు చాలమంది స్త్రీలు అతనికి కూతులుగా కలిగిరి. ఆ స్త్రీలనుండియే దేవతలు అసురులు మనుష్యాది ప్రాణులు; వీరితో జగత్తంతయు నిండిపోయెను.

ఇది శ్రీమత్స్య మహా పురాణమున బ్రహ్మకు స్వపుత్రీగమన దోషము లేకపోవుట మొదలగు వృత్తాంతములు కల చతుర్థాధ్యాయము.

## అథ పంచమోఽధ్యాయః.

## దక్షసృష్ట్యాదివివరణమ్

ఋషయః: దేవానాం దానవానాం చ గన్ధర్వోరగరక్షసామ్ । ఉత్పత్తిం విస్తరేణాథ సూత బ్రూహి యథావిధి.1
సూతః: సఙ్కల్పా ద్దర్శ నాత్స్పర్శా త్పూ ర్వేషాం సృష్టి రుచ్యతే ।
దక్షా త్ప్రాచేతసా దూర్ధ్వం సృష్టి ర్మైథునసమ్భవా. 2
ప్రజా స్సృజే త్యథాదిష్టః పూర్వం దక్ష స్స్వయమ్భువా । యథైవ చ ససర్జాదౌ తథైవ శృణుత ద్విజాః. 3
యథా తు సృజత స్తస్య దేవర్షిగణపన్నగాః । తే వృద్ధి మగమం ల్లోకా స్తథా మైథునయోగతః. 4
దక్షః పుత్రసహస్రాణి పఞ్చాశద్వా వ్యజీజనత్ । తాంస్తు దృష్ట్వా మహాభాగా న్సిసృక్షు ర్వివిధాః ప్రజాః. 5
నారదః ప్రాహ హర్యక్షా న్దక్షపుత్రా న్సమస్థితాన్ । భూమేః ప్రమాణం తద్ జ్ఞాత్వా అత ఊర్ధ్వం సమాసతః. 6
తత స్సృష్టిం విశేషేణ కురుధ్వ మృషిసత్తమాః । తే తు తద్వచనం శ్రుత్వా ప్రయయు స్సర్వతోదిశమ్. 7

అద్యాపి న నివర్తన్తే సముద్రాదివ సిన్ధవః । హర్యశ్వాదిషు నష్టేషు పున ర్దక్షః ప్రజాపతిః. 8
వైరిణ్యామేవ పుత్త్రాణాం సహస్ర మసృజ త్ప్రభుః । శబలా నామ తే విప్రా స్సమేతా స్సృష్టిహేతవః. 9
నారదోఽనుగతః పశ్చాత్స పునః పూర్వవ త్సుతాన్। భువః ప్రమాణం సర్వత్ర జ్ఞాత్వా భ్రాతౄ న్పునఃపునః.
ఆగత్య చాథ సృష్టిం చ కరిష్యథ విశేషతః । తేపి తేనైవ మార్గేణ జగ్ము ర్భ్రాతృవ్య థా పురా. 11
తతః ప్రభృతి న భ్రాతుః కనీయా న్మార్గ మృచ్ఛతి। అన్విష్య దుఃఖ మాప్నోతి తేన తాం పరివర్జయేత్. 12
తత స్తేష్వపి నష్టేషు షష్టిం కన్యాః ప్రజాపతిః । వైరిణ్యాం జనయామాస దక్షః ప్రాచేతస స్తథా. 13
ప్రాదా త్స దశ ధర్మాయ కాశ్యపాయ త్రయోదశ । సప్తవింశతి సోమాయ చత స్రోఽరిష్టనేమయే. 14
ద్వే చైవ భృగుపుత్త్రాయ ద్వే కృశాశ్వాయ ధీమతే। ద్వే చైవాఙ్గిరసే తద్వ త్తాసాం నామాని విస్తరాత్. 15
శృణుధ్వం దేవమాతౄణాం ప్రజావిస్తర మాదితః । మరుత్వతీ వసు ర్జామీ రేవా భాను రరున్ధతీ. 16
సఙ్కల్పా చ ముహూర్తా చ సాధ్యా వై విశ్వభామినీ । ధర్మపత్న్య స్సమాఖ్యాతా స్తాసాం పుత్త్రా న్నిబోధత.

## పంచమాధ్యాయము.

## దక్షసృష్ట్యాది వివరణము.

ఋషులు సూతు నిట్లు ప్రశ్నించిరి: సూతా! దేవతలు దానవులు గంధర్వులు నాగులు రాక్షసులు మొదలగువారి ఉత్పత్తిని ఇకమీదట మాకు విస్తరించి చెప్ప వేడుచున్నాను.

సూతుడు ఇట్లు చెప్పనారంభించెను: దక్ష ప్రజాపతికంటె ముందు వారు చేసిన సృష్టి సంకల్పమున దర్శన మాత్రమున స్పర్శనము వలన జరిగెడిది. ప్రాచేతసుడగు దక్షుని మొదలుకొని సృష్టి స్త్రీపురుషుల సంయోగమువలన సంతానోత్పత్తి జరుగుటతో ఆరంభమయినది. స్వయంభువుని ఆజ్ఞానుసారము దక్షుడు సృష్టి జరిపిన విధము తెలిపెదను వినుడు. అతడు జరిపిన సృష్టిలో దేవతలు ఋషులు నాగులు మొదలగు వారందరును అన్ని ప్రాణులును మైథునము (స్త్రీ పురుషుల కూడిక) వలన జనించి వృద్ధి పొందిన విధమును తెలిపెదను. దక్షునకు మొదట ఏబదివేల మంది కుమారులు కలిగిరి. వారు వివిధ ప్రజలను సృష్టింపదలచియుండుటచూచి నారదుడు వారితో ఇట్లు పలికెను. ఋషి సత్తములారా! మీరు మొదట భూమి పరిమాణమెంతయో పూర్తిగా తెలిసికొని పిమ్మట దానియందు సరిపోవునంత మంది ప్రజలను సృష్టించుడు. వారు ఆ మాట విని అందులకై బయలుదేరి అన్నివైపులకు వెళ్ళిరి. సముద్రములోనికి పోయిన నదులు మరలిరానట్లు హర్యశ్వుడు మొదలగు ఆ దక్షుని కుమారులు ఇప్పటికిని మరలి రాకున్నారు. అంతట దక్షుడు వైరిణి అను భార్యయందు వేయిమంది కుమారులను కనెను. శబలులు అను పేరుగల ఆ దక్షపుత్త్రులు సృష్టికి హేతుభూతులై యుండిరి. నారదుడు వారికడకును వచ్చి మొదటి వలెనే ఇట్లు పలికెను. ఋషులారా! మీరు పోయి భూప్రమాణమును మీ అన్నల జాడను కూడ తెలిసికొనివచ్చి పిమ్మట సృష్టిని విశేషముగ ఆరంభించుడు. అనగా విని వారును అన్ని దిక్కులకును పోయిరి. కాని మరలి రాలేదు. అందుచేతనే లోకములో తప్పిపోయిన అన్నల జాడ కనుగొనుటకు తమ్ములు పోరు. అట్లు ఒకవేళ వెదకుటకు పోయినచో కీడు కలుగును. కనుక అట్లు చేయరాదు. శబలులు కూడను మరలి రాకపోగా ప్రాచేతసుడగు దక్షుడు వైరిణి యను భార్యయందు అరువదిమంది కూతుండ్రను కనెను. వారిలో పదిమందిని ధర్మునకును పదుముగ్గురను కశ్యపునకును ఇరువది యేడుమందిని సోమునకును నలుగురను అరిష్టనేమికిని ఇద్దరను భృగు పుత్త్రునకును ఇద్దరను కృశాశ్వునకును ఇద్దరను అంగిరసునకును ఇచ్చెను. ఈ దేవమాతల వలన జరిగిన ప్రజా విస్తరమును అదినుండి చెప్పెదను. వినుడు. మొదటి పదిమందియును మరుత్వతి వసువు జామి- రేవా భానువు అరుంధతి సంకల్ప ముహూర్త సాధ్యా విశ్వ అను వారు ధర్ముని భార్యలు.

విశ్వే దేవాంస్తు విశ్వా చ సాధ్యా సాధ్యా నజీజనత్ । మరుత్వత్యాం మరుత్వన్తో వసోస్తు వసవ స్తథా. 18

భానోస్తు భానవ స్తద్వ న్ముహూర్తాయాం ముహూర్తకమ్ ।
రేవాయాం ఘోషనామానో నాగవీథ్యస్తు జామిజాః. 19
పృథివీతలసమ్భూత మరుద్వత్యా మజాయత । సఙ్కల్పాయాం తు సఙ్కల్పో వసుసృష్టిం నిబోధత. 20

వసుసన్తతిః.

జ్యోతిష్మన్తస్తు తే దేవా వ్యాపకా స్సర్వతోదిశమ్ । వసవస్తే సమాఖ్యాతా స్తేషాం సర్గం నిబోధత. 21
ఆపో ధ్రువశ్చ సోమశ్చ ధర శ్చైవానిలోఽనలః । ప్రత్యూషశ్చ ప్రభాసశ్చ వసవోఽష్టౌ ప్రకీర్తితాః. 22
ఆపస్య పుత్త్రా శ్చత్వార శ్శాన్తో వై దణ్డ ఏవ చ । సామ్బోపి మణివక్త్రశ్చయజ్ఞరక్షాధికారిణః. 23
ధ్రువస్య కాలః పుత్త్రస్తు వర్చా స్సోమా దజాయత । ధరస్య మారుతస్యాపి ధర్మపౌత్త్రా వృభౌ స్మృతా. 24
కల్పానీక స్తతః ప్రాణో రమణ శ్శిశిరోపి చ । తతశ్చ హవ్యవాహస్య పుత్త్రత్రయ మభూ న్నృప. 25
శాఖస్తు ప్రథమ స్తేషాం విశాఖస్తు తతఃపరమ్ । అపత్యం కృత్తికానాం తు కార్తికేయ స్తత స్స్మృతః. 26
ప్రత్యూషస్య విభుః పుత్త్ర ఋషి స్త్రామస్య దేవలః । విశ్వకర్మా ప్రభాసస్య పుత్త్ర శ్శిల్పిప్రజాపతిః. 27
ప్రాసాదభవనోద్యానప్రతిమాభూషణాదిషు । అగారారామకూపేషు స్మృత స్సోఽమరవర్ధకిః. 28
అజైకపా దహిర్బుధ్న్యో విరూపాక్షోఽథ రైవతః । హర్యశ్వో బహురూపశ్చ ప్రబకశ్చ సురేశ్వరః. 29
సావిత్రశ్చ జయన్తశ్చ పినాకీ చాపరాజితః । ఏతే రుద్రా స్సమాఖ్యాతా ఏకాదశ గణేశ్వరాః. 30
కోటయ శ్చతురాశీతి స్తత్పౌత్త్రాశ్చాక్షయా స్స్మృతాః । దిక్షు సర్వాసు యే రక్షాం ప్రకుర్వన్తి గణేశ్వరాః. 31
పుత్త్రాః పౌత్త్రా స్స్మృతా శ్చైతే పురాణా గర్భసమ్భవాః.

ఇతి శ్రీమత్స్య మహాపురాణే మత్స్యమనుసంవాదే దక్షసృష్టికథనం నామ పఞ్చమోఽధ్యాయః.

విశ్వకు విశ్వదేవులు సాధ్యకు సాధ్యులు మరుత్వతికి మరుత్వతులు వసువునకు వసువులు భానువునకు భానువులు ముహూర్తకు ముహూర్తగణము రేవకు ఘోషులు అను దేవగణములు జామికి నాగవీథ్యాదులు అరుంధతికి వృథివీతలమునందలి ప్రాణి సమూహము సంకల్పకు సంకల్పుడు అను వారు పుట్టిరి.

వీరిలో వసువుల సృష్టిని తెలిపెదను వినుడు. వీరు జ్యోతిష్మంతులు (ప్రకాశము కలవారు.) అన్ని దిక్కులందును వ్యాపించువారు. అంతట వ్యాపించి వసించువారు కనుకనే వారికి వసువులు అని వ్యవహారము. వారి పేరులు ఆపుడు ధ్రువుడు సోముడు ధరుడు అనిలుడు అనలుడు ప్రత్యూషుడు ప్రభాసుడు అనునవి. వీరిలో ఆపునకు శాంతుడు దండుడు సాంబుడు మణివక్త్రుడు అను నలుగురు కుమారులు. వీరు యజ్ఞరక్షకు అధికారులు. ధ్రువునకు కాలుడు సోమునకు వర్చసుడు ధరునకు కల్పానీకుడు ప్రాణుడు అనువారు అనిలునకు రమణుడు శిశిరుడు అను ఇద్దరు అనలునకు శాఖుడు విశాఖుడు కార్తికేయుడు (కృత్తికలయందు) అను ముగ్గురును ప్రత్యూషునకు దేవలుడు అను సమర్థుడగు ఋషి ప్రభాసునకు విశ్వకర్మయను ప్రజాపతియగు దేవశిల్పియు కుమారులు. ఈ విశ్వకర్మ ప్రాసాదములు భవనములు ఉద్యానములు ప్రతిమలు ఆభరణములు గృహములు ఆరామములు కూపములు మొదలైన వాని నిర్మాణములలో దేవతలకు వడ్లంగి.

ధర్ముని సంతానమే యగు అజైకపాద్ అహిర్బుధ్న్యుడు విరూపాక్షుడు రైవతుడు హర్యశ్వుడు బహురూపుడు ప్రబకుడు సురేశ్వరుడు సావిత్రుడు జయంతుడు పినాకి అనువారు ఏకాదశ రుద్రులు. వీరు గణదేవతలు. వీరి బలగము ఎనుబదికోట్ల మంది కలరు. వీరు వారికి అధిపతులై అన్ని దిక్కులయందు నుండి లోకరక్ష చేయుదురు. గర్భము నుండి జనించిన ఆది సంతానరూపమగు ప్రజాపతి పుత్త్ర పౌత్త్రుల వివరణము ఇది.

ఇది శ్రీ మత్స్య మహా పురాణమున దక్షసృష్టికథనమను పంచమాధ్యాయము.

హొత్రాదిది సంతతి డెబ్బది ఏడు కోట్లమంది. వీరందరు మహాకాయులు మహాబలులు నానా రూపములు ధరించగలవారు. మహా శక్తి సంపన్నులు.

దనుః పుత్త్రశతం లేభే కశ్యపా ద్బలదర్పితమ్ । విప్రచిత్తిః ప్రధానోఽభూ ద్యేషాం మధ్యే మహాబలః. 16
ద్విమూర్ధా శకునిశ్చైవ తథా శమ్బరత స్తథా । మరీచి ర్మథనశ్చైవ ఇపో గర్గరవ స్తథా. 17
విద్రావణశ్చ ఫేనశ్చ కేతువీర్య శ్శతహ్రదః । ఇన్ద్రజి త్సత్యజిచ్చైవ వజ్రనాభ స్తథా మయః. 18
ఏకవక్త్రో మహాబాహు రజాక్ష స్తారక స్తథా । అసిలోమా విలోమా చ రిపు ర్బాణో మహాసురః. 19
స్వర్భాను ర్వృషపర్వా చ ఏవమాద్యా దనో స్సుతాః । స్వర్భానో స్సుప్రజా కన్యా శచీ చైవ పులోమజా. 20
ఉపధా చ మయస్యాపి తథా మన్దోదరీ కుహూః । శర్మిష్ఠా సున్దరీ చైవ చన్ద్రా చ వృషపర్వణః. 21
పులోమా కాలకా చైవ వైశ్వానరసుతే హితే । బహ్వపత్యే మహాసత్త్వే మారీచస్య పరిగ్రహే. 22
తయో ష్షష్టిసహస్రాణి దానవానా మభూ త్పదా । పౌలోమా న్కాలకేయాంశ్చ మారీచోఽజనయ త్పునః. 23
అవధ్యా యే నరాణాం వై హిరణ్యపురవాసినః । చతుర్ముఖా ల్లబ్ధవరా నిహతా విజయేన తే. 24
విప్రచిత్తి స్సింహికాయాం సైంహికేయ మజీజనత్ । హిరణ్యకశిపో ర్యే వై భాగినేయా స్త్రయోదశ. 25
వత్స శ్శల్యశ్చ రాజేంద్రో బలో వాతాపి రేవచ । ఇల్వలో నముచిశ్చైవ ససర్జోఽశ్వాఞ్జన స్తథా. 26
నరకః కాలనాభశ్చ సరమాణ స్తథైవ చ । అల్పవీర్యశ్చ విఖ్యాతా దనువంశస్య వర్ధనాః. 27
సంహ్లాదస్య తు దైత్యస్య నివాతకవచా స్సుతాః । అదాన్తా స్సర్వదేవానాం గన్ధర్వోరగరక్షసామ్. 28
యే హతా బల మాశ్రిత్య అర్జునేన రణాజిరే । షట్కన్యా జనయామాస తామ్రా నామాని మే శృణు. 29
శుకీ శ్యేనీ చ భాసీ చ సుగ్రీవా గృధ్రికా శుచిః । శుకీ శుకా నులూకాంశ్చ జనయామాస ధర్మతః. 30
శ్యేనం శ్యేనీ తథా భాసీ కురరాన ప్యజీజనత్ । గృధ్రీ గృధ్రా న్కపోతాంశ్చ పారావతవిహఙ్గమాన్. 31
హంససారసకారణ్డప్లవా న్ఛుచి రజీజనత్ । అజాంశ్చ మేషోష్ట్రఖరా న్సుగ్రీవా చాప్యజీజనత్. 32

దనువు అను కశ్యపుని పత్నియందు బలదర్పితులగు నూరుమంది కుమారులు కలిగిరి. మహాబల సంపన్నుడగు విప్రచిత్తి వీరిలో ముఖ్యుడు. ఇంకను ద్విమూర్ధ శకుని శంబరుడు మరీచి-మథనుడు ఇపుడు గర్గతరుడు విద్రావణుడు ఫేనుడు కేతువీర్యుడు శతహ్రదుడు ఇంద్రజిత్ సత్యజిత్ వజ్రనాభుడు మయుడు ఏకవక్త్రుడు మహాబాహుడు అజాక్షుడు తారకుడు అసిలోముడు విలోముడు రిపుడు బాణుడు స్వర్భానుడు వృషపర్వుడు మొదలగు వారు దనుపుత్త్రులు. స్వర్భానునకు సుప్రజా-పులోమునకు శచీ-మయునకు ఉపధా-మండోదరీ-కుహూ-అనువారు- వృషపర్వునకు శర్మిష్ఠ-సుందరి-చంద్ర అనువారు- పులోమ- కాలక అను ఇద్దరును వైశ్వానరునికి కుమార్తెలు. వీరు ఇరువురును హితకరులు గొప్ప బలము కల వారు బహు సంతానము కలవారును; వీరు మారీచుడు అను మునికి పత్నులైరి వీరివలన మారీచునకు పౌలోములు కాలకేయులు అను రాక్షసగణము జనించెను. వీరు నరులచేత చావకుండ బ్రహ్మవలన వరము పొందిరి. హిరణ్యపురము వారి నివాసము. వారు అర్జునుని చేతిలో మరణించిరి. విప్రచిత్తికి సింహికయందు సైంహికేయుడు కొడు కయ్యెను. హిరణ్యకశిపునకు మేనల్లుండ్రగు వత్సుడు శల్యుడు రాజేంద్రుడు బలుడు వాతాపి ఇల్వలుడు నముచి ససర్జుడు అశ్వాంజనుడు నరకుడు కాలనాభుడు సరమాణుడు అల్పవీర్యుడు అను పదుముగ్గురును దనువంశములోనివారే. వీరు దేవ గంధర్వోరగ రాక్షసులకు లొంగనివారు. వీరును బలశాలియగు అర్జునుని చేతిలో రణరంగమున మరణించిరి.

తామ్ర అనునామెకు శుకి-శ్యేని-భాసీ-సుగ్రీవా-గృధ్రికా-శుచి-అను ఆరుగురు కుమార్తెలు. శుకి-చిలుకలను గ్రుడ్ల గూబలను శ్యేని-డేగలను భాసి కురర పక్షులను గృధ్రి గ్రద్దలను పావురములను పావురపుజాతి పక్షులను కనెను. శుచి హంసలను బెగ్గురులను నీరు కోడులను నీరు కాకులను కనెను. సుగ్రీవ అను ఆమె మేకలను గొఱ్ఱెలను ఒంటెలను గాడిద లను కనెను. ఇది తామ్రా సంతానము.

ఏష తామ్రాన్వయః ప్రోక్తో వినతాయా నిబోధత । గరుడః పతతాం నాథ అరుణశ్చ పతత్రిణామ్. 33
సౌదామినీ తథా కన్యా యేయం నభసి విశ్రుతా । సమ్పాతిశ్చ జటాయుశ్చ అరుణస్య సుతా వుభౌ. 34
సమ్పాతిపుత్రాః బభ్రుశ్చ శీఘ్రగ శ్చాతివిశ్రుతః । జటాయుః కర్ణికారశ్చ శీఘ్రగామీ చ విశ్రుతః. 35
సారసో రజ్జుపాలశ్చ అరుణశ్చాపి తత్సుతః । తేషా మనన్త మభవ త్పక్షిణాం పుత్త్రపౌత్త్రకమ్. 36
సురసాయా స్సహస్రం తు సర్పాణా మభవ త్పురా । సహస్రశిరసాం కద్రూ స్సహస్రం నృప సువ్రత. 37
ప్రధానా స్తేషు విఖ్యాతా ష్షడ్వింశతి రరిన్దమాః । శేష వాసుకి కార్కోట శంఖైరావత కమ్బళాః. 38
ధనఞ్జయ మహానీల పద్మాశ్వతర తక్షకాః । ఏలాపుత్త్ర మహాపద్మ ధృతరాష్ట్ర* వలాహకాః. 39
శఙ్ఖపాల మహాశఙ్ఖ పుష్పదంష్ట్ర శుభాననాః । శఙ్ఖరోమా చ నహుషో వామనః పాణిని స్తథా. 40
కపిలో దుర్ముఖో వాపి పతంజలి రితి స్మృతాః । ఏషా మనన్త మభవ త్సర్పాణాం పుత్త్రపౌత్త్రకమ్. 41
ప్రాయశో యు త్పురా దగ్ధం జనమేజయమన్దిరే । రక్షోగణం క్రోధవశా సా త్వమాన మజీజనత్. 42
దంష్ట్రిణాం నియుతం తేషాం భీమః క్షయ మనీనయత్ ।
రుద్రాణాం చ గణం తద్వ ద్గోమహిష్యో వరాఙ్గనాః. 43
సురభి ర్జనయామాస కశ్యపా న్నృపతేః పురా । ముని ర్మునీనాం మహతాం గణ మప్సరసాం తథా. 44
తథా కిన్నరగన్ధర్వా నరిష్టాఽజనయద్బహూన్ । తృణవృక్షలతాగుల్మ మిరా సర్వ మజీజనత్. 45
విశ్వా తు యక్షరక్షాంసి జనయామాస కోటిశః। ఏతే కశ్యపదాయాదా శ్శతశోఽథ సహస్రశః. 46
ఏష మన్వన్తరే రాజ న్సర్గ స్స్వారోచిషే స్స్మృతః । తత స్త్వేకోనపఞ్చాశ న్మరుతః కశ్యపోఽదితేః. 47
జనయామాస ధర్మజ్ఞా న్సర్వా నమరవల్లభాన్. 47

ఇతి శ్రీమత్స్య మహా పురాణే మత్స్యమనుసంవాదే మత్స్యప్రోక్త
కశ్యపసన్తతికథనం నామ షష్ఠోఽధ్యాయః.

ఇక వినత సంతానమును వినుడు. పక్షులకు నాథులగు అరుణుడు (సూర్యుని రథమునకు సారథియగు ఆనూరుడు) గరుడుడును ఆకాశమున కనబడుచు ప్రసిద్ధురాలగు సౌదామిని (మెఱపు) అను కన్యయు కలిగిరి. అరుణునకు సంపాతి జటాయువులు సంపాతికి బభ్రువుడు అతి ప్రసిద్ధుడగు శీఘ్రగుడు జటాయువు కర్ణికారుడు విశ్రుతుడగు శీఘ్రగామి సారసుడు రజ్జుపాలుడు అరుణుడు అనువారు కుమారులు. ఈ పక్షులకు అనంతమగు పుత్రపౌత్త్రాది సంతానము కలిగెను.

సురస అను కశ్యప భార్యకు వేయేసి శిరసులు కల వేయి సర్పములు సంతానమయ్యెను.

కద్రువకు వేయి సర్పములు కలిగెను. వానిలో ఇరువది ఆరు మంది ప్రసిద్ధులు; వారు : శేషుడు వాసుకి కర్కోటకుడు శంఖుడు ఐరావతుడు కంబళుడు ధనంజయుడు మహానీలుడు పద్ముడు అశ్వతరుడు తక్షకుడు ఏలాపుత్త్రుడు మహాపద్ముడు ధృతరాష్ట్రుడు వలాహకుడు శంఖపాలుడు మహాశంఖుడు పుష్పదంష్ట్రుడు శుభాననుడు శంఖరోముడు నహుషుడు వామనుడు పాణిని కపిలుడు దుర్ముఖుడు పతంజలి అనువారు. వీరి పుత్త్ర పౌత్త్రాది సంతతి అనంతముగా అయ్యెను. వీనిలో చాలమంది జనమేజయుని సర్పయాగమున దగ్ధులైరి.

క్రోధవశ అనునామెకు అపరిమిత సంఖ్యగల రాక్షసులు జన్మించిరి. వారు అందరు కోరలు గలవారు. వారిలో లక్షమందిని భీముడు చంపెను.

సురభి అను కశ్యప పత్నికి రుద్రులగణమును గోవులు గేదెలును కలిగెను.
ముని అనునామెకు మహామునిగణమును అప్సరోగణమును కలిగెను.

అదిష్టకు కిన్నరులు గంధర్వులు అనేకులు గలిగిరి.

ఇర అను ఆమెకు తృణజాతులు వృక్షములు లతలు గుల్మములు (గుబురు పొదలు మొదలగునవి) సంతాన మయ్యెను.

విశ్వకు కోట్లకొలది యక్షరాక్షసులు కలిగిరి.

ఇట్లు కశ్యపునకు నూర్ల-వేల-లక్షల- కోట్లకొలది సంతతి కలిగెను. ఇది స్వారోచిష మన్వంతరమునందలి సృష్టి క్రమము. అనంతరము దితికి కశ్యపుని వలన నలువది తొమ్మిది మంది మరుత్తులను కుమారులు కలిగిరి. వారందరును ధర్మము ననుసరించి నడచువారును దేవతలకు ఇష్టులు నైరి.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున కశ్యప సంతతి అను షష్ఠాధ్యాయము.

## సప్తమోఽధ్యాయః-మరుదుత్పత్తిః.
## మదన ద్వాదశీ వ్రతమ్

ఋషయః: దితే పుత్త్రాః కథం జాతా మరుతో దేవవల్లభాః । దేవై ర్జగ్ముశ్చ
సాపత్న్యైః కస్మా త్సఖ్య మనుత్తమమ్. 1

సూతః: పురా దేవాసురే యుద్ధే హతేషు హరిణా శరైః। పుత్త్రపౌత్త్రేషు శోకార్తా గత్వా భూలోక ముత్తమమ్.2

శమన్తపఞ్చకే తీర్థే సరస్వత్యాస్తటే శుభే। భర్తు రారాధనపరా తప ఉగ్రం చచార హ. 3

సా దితి ర్దేవసన్త్రాస మృషిరూపేణ సువ్రతా । ఫలాహారా తపస్తేపే కృచ్ఛ్రచాన్ద్రాయణాదిభిః. 4

యావద్వర్షశతం సాగ్రం జ్వరశోక భయాకులా । తత స్సా తపసా తప్తా వసిష్ఠాదీ నపృచ్ఛత. 5

దిత్యై వసిష్ఠాద్యుక్త మదనద్వాదశీ వ్రతస్వరూపమ్.

కథయన్తు భవన్తో మే పుత్త్రశోక వినాశనమ్ । వ్రతం సౌభాగ్యఫలద మిహలోకే పరత్ర చ. 6

ఊచు ర్వసిష్ఠప్రముఖా మదనద్వాదశీవ్రతమ్ । యస్య ప్రభావా దభవ త్సుతశోకవివర్జితా. 7

ఋషయః: శ్రోతు మిచ్ఛామహే సూత మదనద్వాదశీవ్రతమ్ । సుతా నేకోనపఞ్చాశ ద్యేన లేభే పున ర్దితిః.8

సూతః: య ద్వసిష్ఠాదిభిః పూర్వం దిత్యై కథితపూర్వకమ్ । విస్తరేణ ప్రవక్ష్యామి మత్సకాశా న్నిబోధత.9

## సప్తమాధ్యాయము
## మరుదుత్పత్తి - మదన ద్వాదశీ వ్రతము

ఋషులు సూతు నిట్లు ప్రశ్నించిరి. దితి కుమారులు దేవతలకు సవతి తల్లి కుమారులును వారితో శత్రుభావము కలవారును కదా ! అట్టి దితి కుమారులగు మరుతులు దేవతలకు ప్రీతిపాత్రులై వారితో మిగుల మేలయిన స్నేహము నెట్లు చేసిరి ?

సూతు డిట్లు చెప్పెను : పూర్వము దేవాసుర యుద్ధమున హరి ప్రయోగించిన శరములతో దైత్యులు మరణించిరి. తన కుమారులును మనుమలును మరణించినందున దితి మిగుల దుఃఖించెను. ఆమె శోకార్తురాలయి ఉత్తమమగు భూలోకమునకు పోయెను. శుభమగు సరస్వతీ నదియొడ్డున శమంతపంచకమను తీర్థమున ఉండి ఆసక్తితో శ్రద్ధతో భర్త నారాధించుచు భయంకరమగు తపస్సు ఆచరించెను. ఆమె ఋషులందరవలె ఉత్తమ వ్రత నియమములను పాటించుచు కృచ్ఛ్రము చాంద్రాయణము మొదలగు ఆహార నియమములు పూని ఫలములే ఆహారముగా ఉండియు దేవతలకును భయమును కలిగించు తపస్సు ఆచరించెను. సమగ్రముగ నూరేండ్లు ఆమె ఇట్లు తపస్సు సాగించెను. జ్వరము చేతను భయము చేతను ఆకులురాలై తపస్సు వేడిమిచే తప్తురాలై వసిష్ఠుడు మొదలగు మహర్షులను ఇట్లడిగెను: తాము నాకు పుత్త్ర శోక వినాశకరమును ఇహపరలోకములందు సౌభాగ్య ఫలము నిచ్చునదియు అగు వ్రతమును నాకు ఉపదేశించుడు.

అనగా వసిష్ఠాది మునులు ఆమెకు మదన ద్వాదశీ వ్రతమును తెలిపిరి. దాని ప్రభావముననే ఆమెకు పుత్త్రశోకము లేకుండ పోయెను. అనగా విని శౌనకాదులు సూతుని ఇట్లడిగిరి: సూతా! దితి మరల నలువది తొమ్మిది మంది కుమారులను పొందగల ఫలమునిచ్చిన మదన ద్వాదశీ వ్రతమును వినవేడుచున్నాము. అనగా సూతుడిట్లనెను: వసిష్ఠాది మహర్షులు పూర్వము దితికి చెప్పియుండిన మదన ద్వాదశీ వ్రతమును విస్తరముగా చెప్పెదను; నా నుండి వినుడు.

చైత్రమాసే సితే పక్షే ద్వాదశ్యాం నియతవ్రతః । స్థాపయే దవ్రణం కుమ్భం సితతణ్డుల పూరితమ్. 10
నానాఫలయుతం తద్వ దిక్షుఖణ్డ సమన్వితమ్ । సితవస్త్రయుగచ్ఛన్నం సితచన్దన చర్చితమ్. 11
నానాభక్ష్య సమోపేతం సహిరణ్యం తు శక్తితః । తామ్రపాత్రం గుడోపేతం తస్యోపరి నివేశయేత్. 12
తస్మాదుపరి కామం తు కదళీదళసంస్థితమ్ । కుర్యా చ్ఛక్తిమయోపేతాం రతిం తస్య చ వామతః. 13
గన్ధం ధూపం చ దీపం చ నైవేద్యం చైవ కారయేత్ । తదభావే తదా కుర్యా త్కామకేశవయో ర్వపుః. 14
కామనామ్నా హరే ర్చ్యం స్నాపయే ద్గన్ధవారిణా । శుక్లపుష్పాక్షతతిలై రర్చయే న్మధుసూదనమ్. 15
కామాయ పాదౌ సమ్పూజ్య జఙ్ఘే సౌభాగ్యదాయ చ । ఊరూ స్మరాయేతి పున ర్మన్మథాయేతి వై కటిమ్. 16
స్వచ్ఛోదరాయే త్యుదరం బాహూ వజ్ఞ్చశరాయ వై । * హృదయం సర్వభూతాయ అనఙ్గాయే త్యురో హరేః. 17
ముఖం పద్మముఖాయేతి ప్రసూనధనుషే భ్రువౌ । నమ స్సర్వాత్మనే మౌళి మర్చయే దితి కేశవమ్. 18
తతః ప్రభాతే తం కుమ్భం బ్రాహ్మణాయ నివేదయేత్ । బ్రాహ్మణా న్భోజయే త్పశ్చా
త్స్వయం చాలవణవ్రతః. 19
భుక్త్వా తు దక్షిణాం దద్యా దిదం మన్త్ర ముదీరయేత్ । ప్రీయతా మత్ర భగవా న్కామరూపీ జనార్దనః. 20
హృదయే సర్వభూతానాం య ఆనన్దోఽభిధీయతే। ఉదయే సవితు స్స్నానం కృత్వా దానం విధీయతే. 21
అనేన విధినా సర్వం మాసి మాసి సమాచరేత్ । ఉపవాస్య త్రయోదశ్యా మర్చయే ద్విష్ణు మవ్యయమ్. 22
ఫల మేకం చ సమ్ప్రాశ్య ద్వాదశ్యాం భూతలే శయేత్ । తత స్త్రయోదశే మాసి ఘృతధేనుసమన్వితామ్. 23
శయ్యాం దద్యా దనఙ్గాయ సర్వోపస్కరసంయుతామ్ । కాఞ్చనం కామదేవం చ శుక్లాం గాం చ పయస్వినీమ్.
వస్త్రై ర్ద్విజం సపత్నీకం పూజ్య శక్త్యా విభూషణైః ।శయ్యాగవాదికం దద్యా త్ప్రీయతా మిత్యుదీరయన్. 25
హోమం శుక్లై స్తిలైః కుర్యా త్కామాయ కీర్తయన్ । గవ్యేన సర్పిషా దద్యా త్పాయసేనచ ధర్మవిత్. 26
విప్రేభ్యో భోజనం కుర్యా ద్విత్తశాఠ్యవివర్జితః। ఇక్షుదణ్డాం స్తతో దద్యా త్పుష్పమాలాశ్చ శక్తితః. 27
యః కుర్యా ద్విధినాఽనేన మదన * ద్వాదశీవ్రతమ్ । సర్వపాతకనిర్ముక్తః ప్రాప్నోతి హరిసాత్మతామ్. 28
ఇహలోకే + వరా న్పుత్రా న్సౌభాగ్యం శివ మశ్నుతే। య స్స్మర స్సంస్మృతో విష్ణు
రానన్దాత్మా మహేశ్వరః. 29

చైత్ర మాసమున శుక్ల పక్షమున ద్వాదశీ తిథినాడు వ్రత నియమములను పూని రంధ్రములు లేని కడవను తెల్లని బియ్యముతో నింపి నిలుపవలెను. స్థాపనము దానిపై రాగి పళ్లెరమును ఉంచవలెను. దానిపై తెల్లని గంధము పూయవలెను. తెల్లని వస్త్రముల జతతో దానిని కప్పవలెను. దానియందు నానా విధములగు ఫలములను చెరకు ముక్కలను నానా విధములగు భక్ష్యములను ఉంచవలెను. యథాశక్తిగ బంగారము కూడ ఉంచవలెను. నడుమ బెల్లము నుంచి దానిపై అరటి ఆకులు పరచి వానిపై మన్మథుని శక్తి రూపలగు దేవతలతో కూడిన రతీదేవిని అతనికి ఎడమ ప్రక్కను ప్రతిష్ఠించవలెను. అతనికి గంధ ధూపదీప నైవేద్యముల నర్పింపవలెను. ఇట్టివి అన్నియు సంభవము కాని యెడల

* స్వభావశాయేత్యుదరం.
* ద్వాదశీమిమామ్ + వరాన్పుత్రాన్సౌభాగ్యఫలమశ్నుతే.

మన్మథ విష్ణువుల ప్రతిమలను సిద్ధపరచవలెను. కాముని పేరితోనే హరి ప్రతిమను గంధజలముతో స్నానము చేయించవలెను. తెల్లని పూలతో అక్షతలతో నూవులతో పూజించవలెను. ఆ మంత్రములు:కామాయ నమః-పాదౌ పూజయామి; సౌభాగ్యదాయ నమః-జంఘే పూజయామి; స్మరాయ నమః-ఊరూ పూజయామి; మన్మథాయ నమః-కటిం పూజయామి; స్వచ్ఛోదరాయ నమః-ఉదరం పూజయామి; పంచశరాయ నమః-బాహూ పూజయామి; సర్వభూతాయ నమః-హృదయం పూజయామి; అనంగాయ నమః-ఉరః పూజయామి; పద్మముఖాయ నమః-ముఖం పూజయామి; ప్రసూనధనుషే నమః-భ్రువౌ పూజయామి; సర్వాత్మనే నమః-మౌళిం పూజయామి; అని ఇట్లు కామ నామమున విష్ణుని పూజించవలెను.

రెండవనాటి ఉదయమున ఆ కుంభమునంతటిని బ్రాహ్మణునకు దానమీయవలెను. పిమ్మట బ్రాహ్మణులను భుజింపజేసి యజమానుడు తానును లవణము లేని ఆహారమును భుజించవలయును. తరువాత ఈ యర్థమునిచ్చు మంత్రముచ్చరించుచు బ్రాహ్మణునకు దక్షిణ యీయవలెను. "ఈ వ్రతాచరణముచే కాముని రూపమున నున్నవాడును సర్వ భూతముల హృదయము లందునుండి ఆనందరూపుడని చెప్పబడువాడునగు విష్ణువు ప్రీతి నందుగాక!" సూర్యోదయ మయిన తరువాత స్నానము చేసియే ఈ దానము జరుపవలెను. ద్వాదశినాడు ఒక ఫలమును మాత్రము ఆహారముగ తిని నేలమీద పరుండి త్రయోదశినాడు ఇట్లు విష్ణుని పూజింపవలెను.

ఈ విధానమున ప్రతి మాసమునందును పండ్రెండు మాసములు జరుపవలెను. పదుమూడవ మాసమున నేతితో చేనువుతో కూడ సర్వోపకరణములతో ఉపస్కారములతో కూడిన శయ్యను మన్మథునకు అర్పించవలెను. ఎట్టిన బ్రాహ్మణ దంపతులను పూజించి ఆభరణములను వస్త్రములను ధరింపజేసి బంగారముతో చేసిన మన్మథుని ప్రతిమను తెల్లని పాడి యావును పై దెల్పిన శయ్యను నేతిని ఆవును వారికి 'ప్రీయతాం కామ రూపో హరిః' అని చెప్పుచు దానమీయవలెను. తెల్లని శుద్ధమైన నూవులతో 'కామాయ స్వాహా' అని చెప్పుచు హోమము చేయవలెను. ధర్మవేత్తయై యజమానుడు ధన వ్యయమునకు వెనుకాడక ఆవు నేతితో పాయసముతో బ్రాహ్మణులకు భోజనము పెట్టవలెను. తరువాత వారికి చెఱకు గడలను పూలమాలలను యథాశక్తి ఈయవలెను. ఈ విధానమున మదన ద్వాదశీవ్రతము నాచరించినవాడు మహా పాతకముల నుండి ముక్తుడయి విష్ణు సారూప్యమును పొందును. ఈ లోకమునందు శ్రేష్ఠులగు పుత్త్రులను సౌభాగ్యమును శుభమును పొందును. కామరూపియగు ఈ విష్ణువు ఆనందాత్ముడగు మహేశ్వరుడును కావున సుఖమును పొందగోరువారు మన్మథ రూపముతోనున్న ఈశ్వరుని స్మరించి పూజించవలెను.

సుఖార్థం కామరూపేణ స్మరే దద్గజ మీశ్వరమ్ । ఏత చ్ఛ్రుత్వా చకారేదం దితి స్సర్వ మశేషతః. 30
కశ్యపో వ్రతమాహాత్మ్యా దాగత్య పరయా ముదా । చకార చ కృశాం భూయో రూపయౌవనశాలినీమ్. 31
వరేణ చ్ఛన్దయామాస సా చ వవ్రే వరం పరమ్ । పుత్త్రం శక్రవధార్థాయ సమర్థ మమితౌజసమ్. 32
వరయామి మహాత్మానం సర్వామరనిషూదనమ్। ఉవాచ కశ్యపో వాక్య మిన్ద్రహన్తార మూర్జితమ్. 33
ప్రదిశా మ్యహ మేతేన కించైత త్క్రియతాం శుభే । ఆప స్తమ్బః కరో త్విష్టిం వ్రతియా మ్యద్య సువ్రతే. 34
విధాస్యామి తతో గర్భ మముం శక్రనిషూదనమ్ । ఆప స్తమ్బ స్తత శ్చక్రే పుత్త్రేష్టిం ద్రవిణాధికామ్. 35
ఇన్ద్రశత్రుం లభ స్వేతి జుహావ చ నవి స్తరమ్ । దేవైశ్చ యుయుదు ర్దైత్యా విముఖా శ్చైవ దానవాః. 36
దిత్యాం గర్భ మథాయుంక్త కశ్యపః ప్రాహ తాం పునః । త్వయా యత్నో విధాతవ్య
స్తస్మి న్గర్భే వరాననే. 37

దిత్యై కశ్యపప్రోక్తగర్భిణీధర్మాః.

సంవత్సరశతం త్వేక మస్మిన్నేవ తపోధనే । సన్ధ్యాయాం నైవ భోక్తవ్యం గర్భిణ్యా వరవర్ణిని. 38
న స్థాతవ్యం న గన్తవ్యం వృక్షమూలేషు సర్వదా । ఉపస్కరేషు న వసే న్ముసలోలూఖలాదిషు. 39

ఖలం న చావగాహేచ్చ శూన్యాగారం చ వర్జయేత్ । వల్మీకేషు న తిష్ఠేత నచోద్విగ్నమనా భవేత్. 40
విలిఖేన్న నఖై ర్భూమి మఙ్గారేణ న భస్మనా । న శయ్యాసు సమావిష్టే వ్యాయామం చ వివర్జయేత్. 41
న తుషాఙ్గారభస్మాస్థికపాలేషు సమావిశేత్ । వర్జయే త్కలహం లోకే గాత్రభఙ్గం తథైవ చ. 42
న ముక్తకేశా తిష్ఠేత నాశుచి స్స్యా త్కదాచన । న శయీతోత్తరశిరా న చాపరశిరాః క్వచిత్. 43
న వస్త్రహీనా నోద్విగ్నా న చార్ద్రచరణా సతీ । నామఙ్గళ్యాం వదే ద్వాచం న చ హాస్యాధికా భవేత్. 44
కుర్యాత్తు గురుశుశ్రూషాం నిత్యమాఙ్గళ్యతత్పరా । సర్వౌషధీభి రుష్ణేన వారిణా స్నాన మాచరేత్. 45
కృతరక్షా సుభూషా చ వాస్తుపూజనతత్పరా । తిష్ఠే త్ప్రసన్నవదనా భర్తృప్రియహితే రతా. 46
దానశీలా తృతీయాయాం పార్వత్యా నక్త మాచరేత్ । ఇతివృత్తా భవే న్నారీ విశేషేణ తు గర్భిణీ. 47
యస్తు తస్యా భవే త్పుత్త్ర శ్శీలాయుర్వృద్ధిసంయుతః । అన్యథా గర్భపతన మవాప్నోతి న సంశయః. 48
తథా త్వ మనయా వృత్త్యా గర్భే త్వం యత్న మాచర । స్వస్త్యస్తు తే గమిష్యామి
తథేత్యుక్త స్తయా పునః. 49
పశ్యతాం సర్వభూతానాం తత్రైవాన్తరధీయత । తత స్సా కశ్యపోక్తేన విధినా సమతిష్ఠత. 50

ఇది విని దితి ఈ వ్రతమునంతయు ఏమాత్రమును లోపము లేకుండ జరిపెను. వ్రత మాహాత్మ్యమువలన కశ్యపుడు ఆమె కడకు మిగుల సంతోషముతో వచ్చెను. చిక్కిపోయిన ఈమెను మరల ఎప్పటివలె రూప యౌవనములు కలదానినిగా చేసెను. వరము కోరుకొమ్మనెను. ఆమెయు ఇట్లు మేలైన వరమడిగెను. ఇంద్రుని చంపగల సమర్థుడును అమిత బలము కలవాడును మహాత్ముడు దేవతలందరను గూడ నశింపజేయువాడును అగు కుమారుడు నాకు కలుగవలెను. అని ఆమె కోరగా కశ్యపు డిట్లు పలికెను. నీవు ఎట్టి క్లిష్టమగు వ్రతముల నయినను అనుష్ఠించగలదానవు. నీవు చేసిన ఈ వ్రత మహిమతోనే నీకు ఇంద్రుని చంపు కుమారుని ఇచ్చుచున్నాను. కాని నీవు మరియొక పని చేయవలయును. అపస్తంబునిచేత ఇందులకై ఇష్టిని జరిపించుము. పిమ్మట నీయీ గర్భమును ఇంద్రుని చంపగల దానినిగా చేయుదును. అట్లే అపస్తంబుడు అధిక ద్రవ్యము వెచ్చించి పుత్త్రేష్టిని జరిపెను. అతడు ఇంద్రశత్రుని కుమారునిగా పొందుము. అని సవిస్తరముగా హోమము చేసెను.

అంతట కశ్యపుడు దితికి గర్భము కలిగించెను. ఆమెతో పిమ్మట అతడిట్లు పలికెను. నీవు ఈ గర్భము విషయమున యత్నము పూనవలసినది. నీవు తపోధనురాలవయి ఈ తపోవనమునందే యుండి ఒకనూరు సంవత్సరముల పాటు ఈ నియమములను పాటించవలెను. ఏమనగా-గర్భిణీస్త్రీ సంధ్యా సమయమునందు భుజించనేరాదు. ఎట్టి సమయమునందును చెట్టు మొదళ్ళ దగ్గరకు పోరాదు. రోలు రోకలి మొదలగు ఉపకరణములపై కూర్చుండరాదు. నీట మునుగరాదు. శూన్య గృహములలోనికి పోరాదు. పుట్టలపై కూర్చుండుట-నిలుచుండుట-రాదు. మనస్సున భయమును ఆవేశమును పొందరాదు. గోళ్ళతో బొగ్గులతో బూడిదతో భూమిని గీయరాదు. పరుపులపైని కూర్చుండరాదు. వ్యాయామము చేయరాదు. ధాన్యపుపొట్టు-బొగ్గులు-బూడిద-ఎముకలు-పుర్రెలు-వీనిపై కూర్చుండరాదు. ఒడలు విరుచుకొనుట కలహించుట తగదు. ఎట్టి సమయమునందును జుట్టు విరబోసికొని కాని అశుచిగా కాని ఉండరాదు. ఉత్తరమునకు పడమటకు తలపెట్టి నిదురించరాదు. వివస్త్రగా గాని దుఃఖావేశములతో గాని తడికాళ్ళతో గాని ఉండరాదు. అశుభములు మాటలాడరాదు. అధిక హాస్యములాడరాదు. ఎల్లప్పుడు శుభ వచనములతో నుండి పెద్దలను సేవించుచుండవలెను. అన్ని ఓషధులతో వేడినీటితో స్నానమాడవలెను. తన దేహరక్ష చేసికొనుచు చక్కని ఆభరణములు ధరించి శ్రద్ధతో గృహ పరిసరముల నలంకరించి ఉంచుకొనుచు గృహ దేవతల పూజించుచు సంతుష్టి నిండిన ముఖము కలదై భర్తకు ప్రీతి హితము కలిగించునదై ఆలోచించుచు మాటలాడుచు పనులు చేయుచు ఉండవలెను. దానములను చేయుచు శుక్లపక్ష తృతీయాదినమున గౌరిని పూజించుచు

నక్త వ్రతమును ఆచరించవలెను. ప్రతి స్త్రీయు ఇట్లే యుండవలెను. విశేషించి గర్భిణి ఇట్లు ఉండవలెను. ఆమెకు కలుగు కుమారుడు మంచి శీలము ఆయుర్వృద్ధి కలవా డగును. లేనిచో గర్భపతనము కలుగు నవకాశము గలదు. కనుక నీవు ఇట్లు నడచుకొనుచు గర్భము విషయములో ప్రయత్నపరురాలవై యుండుము. నీకు శుభమగును. వెళ్ళివత్తును. అని కశ్యపుడు పలుకగా దితియు 'సరే' అనెను. అంతట సర్వభూతములు చూచుచుండగానే కశ్యపు డచ్చటనే అంతర్ధానము నందెను.

అప్పటి నుండి దితియును కశ్యపుడు చెప్పిన విధమున నడుచుకొనుచుండెను.

బలభి త్స తథేన్ద్రో ౽పి దితేః పార్శ్వ ముపాగతః । విహాయ దేవసదనం తాం శుశ్రూషాపరః స్థితః. 51
దితే శ్ఛిద్రా౽ం తతః ప్రేప్సు రభవ త్పాకశాసనః । వినీతో౽భవ దవ్యగ్రః ప్రశాన్తవదనో బహిః. 52
ఆజ్ఞా మనుసర న్తస్యా మాత్మనా శుభ మాచరన్ । తతో వర్షశతాన్తే సా ఊనే తు దివసై స్త్రి౽భిః. 53
మేనే కృతార్థా మాత్మానం ప్రీత్యా విస్మితమానసా । అకృత్వా పాదయో శ్శౌచం శయానా ముక్తమూర్ధజా. 54
నిద్రాభరసమాక్రాన్తా దివా పరవశా క్వచిత్ । తత స్తద న్తరం లబ్ధ్వా ప్రవిశ్యాన్త శ్శచీపతిః. 55
వజ్రేణ సప్తధా చక్రే తం గర్భం త్రిదశాధిపః । తత స్సప్త సుతా జాతాః కుమారా స్సూర్యవర్చసః. 56
రుదన్త స్సప్త తే బాలా నిషిద్ధా దానవారిణా । భూయో౽పి రుదమానాం స్తా నేకైకం సప్తధా పునః. 57
చిచ్ఛేద వృత్ర౽హన్తా వై పున స్తదుదరస్థితః । ఏవ మేకోనపఞ్చాశ చ్ఛృత్వా తే రుదతా భృశమ్. 58
ఇన్ద్రో౽ నివారయామాస మా రుదధ్వం పునఃపునః । తతశ్చ చిన్తయామాస కిమేత దితి వృత్ర౽హా. 59
ధర్మస్య కస్య మాహాత్మ్య త్పున స్సఞ్జీవితా స్త్వమీ । విదిత్వా ధ్యానయోగేన మదనద్వాదశీఫలమ్. 60
నూన మేత త్పరిణత మత్ర వా కృష్ణపూజనాత్ । వజ్రేణ నిహతా స్సద్యో న వినాశ మిహాప్నుయుః. 61
ఏకో౽ప్యనేకతా మాప యస్మా దుదరగో హ్యయమ్ । అవధ్యా హ్యభవ న్నేతే తస్మా ద్దేవా భవన్తి చ. 62
తస్మా న్మారుద ఇత్యుక్త్వా రుదన్తో గర్భసంస్థితాః । మారుతా నామ తే నామ్నా భవన్తో మఖభాగినః. 63
తతః ప్రసాద్య దేవేశః క్షమస్వేతి దితిం పునః । అథాశా స్త్ర౽ం సమాస్థాయ మయైత ద్దుష్కృతం కృతమ్. 64
కృత్వా మరుద్గణై ర్దేవై స్సామాన్యం హి సురాధిపః । దితిం విమాన మారోప్య నిన్యే య స్ససుతా దివమ్. 65
యజ్ఞభాగభుజో జాతా మరుత స్తేన తే జనాః । తే జగ్ము రైక్యం చ సురైః కామం తే సురవల్లభాః. 66

ఇతి శ్రీమత్స్యమహాపురాణే మత్స్యమనుసంవాదే మరుదుత్పత్తౌ మదన
ద్వాదశీవ్రతం నామ సప్తమో౽ధ్యాయః.

తన శత్రువగు బలాసురుని చంపినవాడగు ఇంద్రుడును అట్టి తలంపుతోనే తన స్వర్గలోకమును విడిచి దితిని సేవింపగోరి ఆమె కడకు వచ్చెను. ఆమెలో ఏదయిన దోషము ఎప్పుడు కలుగునా యని అతడు గమనించుచుండెను. అందులకై అతడు బయటికి మాత్రము ప్రశాంత ముఖము కలవాడు ఏ ఇతర విషయములపై మనస్సు నుంచనివాడు వినయము కలవాడునై యుండెను. ఆమె ఇచ్చిన ప్రతియొక ఆజ్ఞను అనుసరించుచు శ్రుతికరణములతోను మంచి పనినే చేయుచు ఉండెను. ఇట్లు మూడునాళ్లు తక్కువగా నూరు సంవత్సరములు గడచెను. దితియు తాను కృతార్థురాలయినట్లు భావించుచు ప్రీతురాలయి మనస్సులో ఆశ్చర్యము నంద సాగెను. అట్టి స్థితిలో నిద్రాభారము తను ఆక్రమించగా పరవశురాలై కాళ్ల కడిగి కొనవలసి యున్నను కాళ్లు కడుగుకొనకయే జుట్టు విరియబోసికొని ఒకానొక చోట పండుకొనెను. అంతట ఈ అవకాశము దొ కినదే చాలునని ఆ దేవరాజు దితి గర్భములో ప్రవేశించెను. వజ్రముతో ఆమె గర్భమును ఏడుగా చీల్చెను. దానిచే సూర్యునివలె వర్చస్సు కల కోమలులయిన చిన్న పిల్లలు ఏడు మంది ఏర్పడిరి. ఆ బాలురు ఏడువ సాగిరి. ఏడువ వద్దనుచు ఇంద్రుడు వారిని నిషేధించెను. ఐనను వారు ఏడ్చుచునే ఉండిరి. వృత్రాసురుని చంపిన

వాడగు ఆ ఇంద్రుడు ఇంకను దితి గర్భమునందే ఉండి వారిని ఒక్కొక్కరిని ఏడేసి ముక్కలుగా నరకెను. ఇట్లు నలు వది తొమ్మిది మందిగా చీల్చబడిన ఆ శిశువులు ఇంకను ఏడ్చుచునే ఉండిరి. ఏడువ వద్దు (మా-రుదధ్వం) అని ఇంద్రుడు వారిని మాటి మాటికి వారింపసాగెను. ఇది ఏమి ? ఏ ధర్మానుష్ఠానము చేసిన మాహాత్మ్యము వలన ఇట్లు జరిగినది ? ఎంత చీల్చినను వీరు చావరే ! అని ఇంద్రుడాలోచించెను. అతడు ధ్యానయోగ బలమున ఇది మదన ద్వాదశీ వ్రతఫలమని తెలిసికొనెను. ఇది నిశ్చయముగా విష్ణు పూజనము వలన కలిగిన ఫలమే. ఇట్టి కృష్ణానుగ్రహము కలవారు వజ్రముతో దెబ్బ తినియును నాశము పొందరు. గర్భమునందలి శిశువు తానొకడై యుండియు అనేక ఖండములుగా చీల్చబడియు మరణించలేదు. వీరందరును మరల చీల్చబడియు చావక అవధ్యులై యున్నారు. అందువలన వీరు దేవతలుగా అగుదురు. వారు ఏడ్చుచుండగా ఏడువవద్దు (మా-రుద) అని గర్భమునందే ఉన్న ఈ శిశువులు వారింపబడినారు. కనుక వీరు 'మారుత' అను పేరితో ప్రసిద్ధులై (దేవతలై) యజ్ఞాంశములను అనుభవింతురు. అని ఇంద్రు డనెను.

తరువాత ఇంద్రుడు మరల మరల దితిని తను క్షమించు మని వేడుకొని ఆమెను అనుగ్రహింప జేసికొనెను. నేను శాస్త్ర విరుద్ధముగా నడచినందున ఆ దుష్కృతమునకు ఫలితముగా నేనే ఈ అవకాశము చేసికొన్నదాన నైతినని దితి తలచెను. ఇంద్రుడును మారుతులకు దేవతలతో సమానత్వమును కలిగించెను. దితిని ఆమె కుమారులను విమానముపై ఎక్కించి స్వర్గమునకు తీసికొని పోయెను. ఈ విధముగా మారుతులు అను దితి కుమారులు దేవతలై యజ్ఞ భాగములను (హవిస్సులను) అనుభవించగలవా రైరి. దేవతలతో సమానులైరి. దేవతలకు ప్రీతిపాత్రులు నైరి.

ఇది శ్రీ మత్స్య మహాపురాణమున మరుత్తుల ఉత్పత్తి యందు మదన ద్వాదశీ వ్రతము అను సప్తమాధ్యాయము.

## అష్టమోఽధ్యాయః.

### విరిఞ్చికృతపృథురాజ్యాభిషేకాదిః.

ఋషయః: ఆదిసర్గ స్త్వయా సూత కథితో విస్తరేణ నః । ప్రతిసర్గశ్చ యేతేషా మధిపాం స్తా న్వదస్వ నః.1

సూతః: యదాభిషిక్త స్సకలాధిరాజ్యే పృథుర్ధరిత్ర్యా మమరాధిపేన ।

తదౌషధీనా మధిపం చకార యజ్ఞవ్రతానాం తపసాం చ సోమమ్ 2

నక్షత్ర తారా ద్విజ వృక్ష గుల్మ లతా వితానస్య చ రుక్మగర్భమ్ ।

అపా మధీశం వరుణం ధనానాం రాజ్ఞాం ప్రభుం వైశ్రవణం చ తద్వత్. 3

విష్ణుం రవీణా మధిపం వసూనా మగ్నిం చ లోకాధిపతిం చకార ।

ప్రజాపతీనా మధిపం చ దక్షం చకార శక్రం మరుతా మధీశమ్. 4

దైత్యాధిపానా మథ దానవానాం ప్రహ్లాద మీశం చ యమం పితౄణామ్ ।

పిశాచరక్షః పశుభూతయక్ష వేతాళరాజ్ఞా మథ శూలపాణిమ్. 5

ప్రాలేయశైలం చ పతిం గిరీణా మీశం సముద్రం సరిన్నదీనామ్ ।

గన్ధర్వవిద్యాధర కిన్నరాణా మీశం పున శ్చిత్రరథం చకార. 6

నాగాధిపం వాసుకి ముగ్రవీర్యం సర్పాధిపం తక్షక మాదిదేశ ।

దిగ్వారణానా మధిపం చకార గజేన్ద్ర మైరావత నామధేయమ్. 7

సువర్ణ మీశం పతతాం హయానాం రాజాన ముచ్చైశ్శ్రవసం చకార ।

సింహం మృగాణాం వృషభం చకార ప్లక్షం పున స్సర్వవనస్పతీనామ్. 8

పితామహః పూర్వ మథాభ్యషిఞ్చ దేతాన్పున స్సర్వదిశాధినాథాన్ ।

పూర్వేణ దిక్పాల మథాభ్యషిఞ్చ న్నామ్నా సుధన్వాన మరాతికేతుమ్. 9

తతోఽధిపం దక్షిణత శ్చకార సర్వేశ్వరం శఙ్ఖపదాభిధానమ్ ।
సుకేతుమన్తం దిగధీశ మీశం చకార పశ్చా ద్భువనాణ్డగర్భః. 10
హిరణ్యరోమాణ ముదగ్దిగీశం ప్రజాపతి స్సోమపతించకార ।
అద్యాపి కుర్వన్తి దిశా మధీశా శ్శత్రుం వహన్తస్తు భువోఽభిరక్షామ్. 11
చతుర్భి రేభిః పృథునామధేయో నృపోభిషిక్తః ప్రథమం పృథివ్యామ్ ।
మన్వన్తరే చాధిగతే తథైవ వైవస్వతం చక్రు రిమం పృథివ్యామ్. 12
గతేఽన్తరే చాక్షుషనామధేయే వైవస్వతాఖ్యే చ పునః ప్రవృత్తే ।
ప్రజాపతి స్సోఽస్య చరాచరస్య బభూవ సూర్యాన్వయవంశచిహ్నః. 13

ఇతి శ్రీమత్స్యమహాపురాణే మత్స్యమనుసంవాదే విరిఞ్చికృత పృథు
రాజ్యాభిషేకాదికథనం నామాష్టమోఽధ్యాయః.

## అష్టమాధ్యాయము

## బ్రహ్మ పృథువు మొదలగు వారికి ఆయా ఆధిపత్యము లిచ్చుట

శౌనకాది ఋషులు సూతు నిట్లడిగిరి : అయ్యా! మీరు మాకు పరమాత్మ చేసిన ఆదిసర్గమును (ప్రథమసృష్టిని) తెలిపితిరి. దీని తరువాత చేసిన ప్రతి సర్గమును ఆ సృష్టియందలి ఆయా భూతములకును పదార్థములకును అధిపతులను విశదీకరింపుడు.

సూతుడు ఇట్లు చెప్పనారంభించెను : అమరాధిపుడగు బ్రహ్మ సకల ధరిత్రికి పృథువును అధిపతిగా చేసెను. అట్లే ఓషధులకు యజ్ఞ కర్మలకు తపస్సులకు సోముని-నక్షత్రములు తారలు పక్షులు వృక్షములు గుల్మము (పొద)లు లతలు మొదలగు వానికి హిరణ్య గర్భుని జలములకు వరుణుని ధనములకు రాజులకు కుబేరుని ఆదిత్యులకు విష్ణువను ఆదిత్యుని వసువులకు అగ్ని అను వసువును ప్రజాపతులకు దక్షుని దేవతలకు ఇంద్రుని దైత్యదానవులకు ప్రహ్లాదుని పితృ దేవతలకు యముని పిశాచములకు రక్షస్సులకు పశువులకు యక్ష భూత బేతాళములకు శూలపాణిని పర్వతములకు హిమవంతుని సరిత్తులకు (జల ప్రవాహములకు) నదులకు సముద్రుని గంధర్వులకు విద్యా ధరులకు కింనరులకు చిత్ర రథుని నాగులకు వాసుకిని సర్పములకు తక్షకుని దిగ్గజములకు ఐరావతమును పక్షులకు గరుడుని అశ్వములకు ఉచ్చైః శ్రవమును మృగములకు సింహమును వనస్పతు (పూయకయే కాయలు కాచెడు చెట్టు)లకు జువ్వి చెట్టును అధిపతులనుగా చేసెను. సుధర్ముని తూర్పునకు శంఖుని దక్షిణమునకు సుకేతుమంతుని పశ్చిమమునకు హిరణ్యరోముని ఉత్తరమునకు దిగధిపతులనుగా బ్రహ్మ అభిషేకించెను. వారు ఇప్పుడును (మత్స్యనారాయణుడు మనువునకు ఈ వృత్తాంతము చెప్పు నాటికి) ఈ నలుగురు దిక్పాలురును పృథుని మొదటి భూలోకాధిపతినిగా అభిషేకించిరి. ఆ మన్వంతరము గడచిన తరువాత సూర్య వంశజుడగు వైవస్వతుని భూలోకాధిపతినిగా చేసిరి. అనగా చాక్షుషమన్వంతరము గడువగా వైవస్వత మన్వంతరము ప్రారంభము కాగా సూర్య వంశమునకు పతాక వంటి వాడగు వైవస్వతుడు భూలోక చక్రవర్తిగా ప్రజా పతిగా అభిషిక్తుడయ్యె.

ఇది శ్రీ మత్స్య మహాపురాణమున మత్స్యమను సంవాదమున బ్రహ్మ పృథువు మొదలగు వారిని ఆయా అధిపతులనుగా అభిషేకించుట యను అష్టమాధ్యాయము.

## నవమోఽధ్యాయః.

## మన్వన్తరవివరణమ్

తతః ఏవం శ్రుత్వా మనుః ప్రాహ పునరేవ జనార్దనమ్ ।
పూర్వేషాం చరితం బ్రూహి మనూనాం మధుసూదన.

మత్స్యః మన్వన్తరాణి సర్వాణి మనూనాం చరితం చ యత్ ।
ప్రమాణం చైవ కాలస్య తదుత్పత్తిం సమాసతః. 2
ఏకచిత్తః ప్రశాన్తాత్మా శృణు మార్తాణ్డనన్దన । యామా నామ పురా దేవా ఆస్యన్ స్వాయమ్భువేఽన్తరే. 3
పూర్వే చ ఋషయ స్సర్వే యే మరీచ్యాదయ స్స్మృతాః । ఆగ్నీధ్ర శ్చాతిబాహుశ్చ పుత్త్రా స్సవన ఏవ చ. 4
జ్యోతిష్మా న్ద్యుతిమాన్ హవ్యో మేధా మేధాతిథి ర్వసుః । స్వాయమ్భువస్యైవ మనో ర్దశైతే వంశవర్ధనాః.5
ప్రతిసర్గ మమీ కృత్వా జగ్ము స్తే పరమం పదమ్ ।
ఏత త్స్వాయమ్భువం ప్రోక్తం స్వారోచిష మతః పరమ్. 6
స్వారోచిషస్య తనయా శ్చత్వారో దేవవర్చసః । నభో నభస్యః* ప్రసృతి ర్భరతః కీర్తివర్ధనాః. 7
దత్తో నిశ్చ్యవన స్తమ్భః ప్రాణః కాశ్యప ఏవచ । ఊర్వో బృహస్పతిశ్చైవ సప్త సప్తర్షయోఽభవన్. 8
తతో దేవాస్తు తుషితా స్స్మృతా స్స్వారోచిషేఽన్తరే । హవీన్ధ్ర స్సుకృతో మూర్తి రాపోజ్యోతి రయస్స్మయః.
వసిష్ఠస్య సుతా స్సప్త యే ప్రజాపతయ స్తదా । ద్వితీయ మేత త్కథితం మన్వన్తర మతఃపరమ్. 10
తృతీయం తు ప్రవక్ష్యామి తథా మన్వన్తరం శుభమ్ । మనుర్నా మోత్తమో యత్ర దశ పుత్రా నజీజనత్.
ఇష స్సహస్య ఊర్జశ్చ శుచి శ్శుక్ర స్తథైవ చ । మధుశ్చ మాధవ శ్చైవ నభస్యోఽథ నభ స్తథా. 13
సహః కనీయా నేతేషా ముదారః కీర్తివర్ధనః । భానవ స్తత్ర దేవా స్స్యు రూర్జా స్సప్తర్షయ స్స్మృతాః. 12
* కౌకరణ్డిః కురణ్డిశ్చ దాల్భ్యః శఙ్ఖః ప్రవాహణః । మితశ్చ సంమిత శ్చైవ సప్తైతే యోగవర్ధనాః. 14

## నవమాధ్యాయము
## మన్వంతర వివరణము

సూతుడు ఋషులకు ఇట్లు చెప్పనారంభించెను: మనువు (వత్యవ్రతుడు) మత్స్యనారాయణుడు చెప్పిన ఈ విషయమును విని ఆ స్వామితో ఇంకను ఇట్లు పలికెను: మధుసూదనా! పూర్వులగుమనువుల చరితమును నాకు వినిపింపుము. అని మత్స్యమూర్తి ఇట్లు పలికెను: సూర్యపుత్రా! అన్ని మన్వంతరములను మనువుల చరితమును మన్వంతర కాల పరిమాణమును వారి ఉత్పత్తిని సంక్షేపముగా అంతయు తెలిపెదను. ఏక చిత్తుడవయి ప్రశాంతమగు మనస్సుతో వినుము.

ప్రతి మన్వంతరమునకు మనువుల భేదమును బట్టి ఆ కాలమున ఆరాధ్యులగు దేవతలును వేదములను విద్యలను యజ్ఞాది కర్మానుష్ఠానములను ప్రవర్తిల్లజేసిన ఋషులును సృష్టిని సాగించిన మను పుత్త్రులును వేరు వేరుగా ఉందురు. అనువాదకుడు.)

స్వాయంభువ మన్వంతరమున యాములు అనువారు దేవతలు. లోగడ తెలిపిన మరీచి మొదలుగా నారదుని వరకును గల పది మందియు ఋషులు. ఆగ్నీధ్రుడు అతి బాహుడు పుత్త్రుడు సవనుడు(లు) జ్యోతిష్మాన్ ద్యుతిమాన్ హవ్యుడు మేధ మేధాతిథి వసువు అను పది మంది కుమారులు. వీరు ప్రతిసర్గమును పాంచ భౌతికములగు శరీరములు గల ఆయా ప్రాణి విశేషముల సృష్టిని జరిపి పిదప పరమ పదమున కేగిరి.

స్వారోచిషమనువునకు నభుడు నభస్యుడు ప్రసృతి భరతుడు అను నలుగురు కుమారులు. దత్తుడు నిశ్చ్యవనుడు స్తంభుడు ప్రాణుడు కాశ్యపుడు ఊర్వుడు బృహస్పతి అనువారు ఏడు మంది ఋషులు. తుషితులు అనువారు దేవతలు. వసిష్ఠుని కుమారులగు హవీంద్రుడు సుకృతుడు మూర్తి ఆపుడు జ్యోతి అయస్మయుడు అను ఏడుగురును సృష్టిని సాగించిన ప్రజాపతులు.

* ప్రసృతిర్భావనః.

* కౌకరణ్డిశ్చ కురణ్డిశ్చ దాల్భ్యః ప్రవాహణ స్స్మృతః

ఉత్తముడు మనువుగా ఉండగా ఆయన కుమారులు పది మందియు ప్రజాపతులు. వారు ఇషుడు సహస్యుడు ఊర్జుడు శుచి శుక్రుడు మధుడు మాధవుడు నభస్యుడు నభుడు నహుడు అనువారు. ఈ కడపటి వాడు ఉదారుడు చాల కీర్తి శాలియును. భానువులు అనువారు ఊర్జులు అను గణము వారు సప్తఋషులు. వారి పేరులు కౌకరండికుడు కురండి దాల్భ్యుడు ఖండి ప్రవాహణుడు మితుడు సంహితుడు అనునవి.

మన్వన్తరం చతుర్థం తు తామసం నామ విశ్రుతమ్ । ♦ కవిః వృథు స్తథా చాగ్ని రశ్వః కపిల ఏవ చ.
✦ తథైవ జన్యధీమన్తౌ మునయ స్సప్త తామసే । సాధ్యా దేవగణా యత్ర కథితా స్తామసేఽన్తరే. 16
అకల్మష స్తథా ధన్వీ తపోబల తపోధనౌ । తపోరతి స్తపస్యశ్చ సుతపాశ్చ పరన్తపః. 17
తపోద్యుతి స్తపోనాధ స్సర్వే సజ్గ్రామ విత్తమాః । తామసస్య సుతా స్సర్వే దశ వంశవివర్ధనాః. 18
వక్ష్యమస్య మనో స్తద్వ ద్రైవతస్యాన్తరం శృణు । దేవబాహు స్సుబాహుశ్చ వర్జన్య స్సోమపో మునిః.19
హిరణ్యరోమా సప్తాశ్వ స్సప్తైతే ఋషయస్స్మృతాః । దేవాశ్చ భూతరజస స్తథా ప్రకృతయ స్స్మృతాః. 20
అరుణ స్తత్త్వదర్శీ చ ధృతిమాణ్ హవ్యప స్స్వజిత్ । యుక్తో నిరుత్సుక స్సత్యో నిమేషోఽన్తః ప్రకాశకః.
ధర్మవీర్యబలోపేతా దశైతే రైవతాత్మజాః । చాక్షుషస్యాఽన్తరే దేవా లేఖా నామ వరిశ్రుతాః. 22
వసవోఽథ ప్రవాచాఽథ పారిసూవా దివౌకసః । చాక్షుషస్యాఽన్తరే ప్రోక్తా దేవానాం పఞ్చ యోనయః. 23
భృగు స్సుధామా విరజా స్సహిష్ణు ర్నాద ఏవ చ । వివస్వా నత్రినామా చ సప్త సప్తర్షయోఽపరే. 24
ఊరుప్రభృతయ స్తద్వ చ్చాక్షుషస్య సుతా దశ । ప్రోక్తాః స్వాయమ్భువేఽవంశే యే మయా పూర్వమేవ తు.
అన్తరం చాక్షుష స్యైత న్మయా తే పరికీర్తితమ్ । సప్తమం చ ప్రవక్ష్యామి య ద్వైవస్వత ముచ్యతే. 26
అత్రిశ్చైవ వసిష్ఠశ్చ కశ్యపో గౌతమ స్తథా । భరద్వాజ స్తథా యోగీ విశ్వామిత్రః ప్రతాపవాణ్. 27
జమదగ్నిశ్చ సప్తైతే సామ్ప్రతం యే మహర్షయః । సాధ్యా విశ్వే చ రుద్రాశ్చ మరుతో వసవోశ్వినౌ. 28
ఆదిత్యాశ్చ సురా స్తద్వ త్సప్త దేవగణా స్స్మృతాః । ఇక్ష్వాకుప్రముఖాశ్చాపి తస్య పుత్రాః స్మృతా భువి.29

నాలుగవది యగు తామసమన్వంతరమున కవి వృథువు అగ్ని అశ్వుడు కపిలుడు జన్యుడు ధీమాన్ అనువారు సప్తఋషులు. సాధ్యులు అను గణమువారు దేవతలు. అకల్మషుడు ధన్వి తపోబలుడు తపోధనుడు తపోరతి తపస్యుడు సుతపుడు తపోద్యుతి తపోనాథుడు అను తామసుని కుమారులు పది మందియు యుద్ధ విద్యల నెరిగిన వారిలో శ్రేష్ఠులును వంశవృద్ధి చేయు వారును ఐరి.

రైవత మన్వంతరమున దేవ బాహుడు సుబాహుడు పర్జన్యుడు సోమపుడు ముని హిరణ్యరోముడు సప్తాశ్వుడు అనువారు సప్త ఋషులు. భూతరజసులు అను గణము వారు దేవతలు. రైవతుని కుమారులు అరుణుడు తత్త్వ దర్శి ధృతిమాన్ హవ్యపుడు స్వజిత్ యుక్తుడు నిరుత్సుకుడు సత్యుడు నిమేషుడు అంతఃప్రకాశకుడు అనువారు పదిమందియు ధర్మము వీర్యము బలము కలవారు. వీరు ఆ మన్వంతరమున ప్రజావృద్ధి చేయువారు

చాక్షుష మన్వంతరమున లేఖులు వసువులు ప్రవాచులు పారిసూవులు దివౌకసులు అను ఏడు తెగల దేవత లుందురు. భృగువు సుధాముడు విరజుడు సహిష్ణుడు నాదుడు వివస్వాన్ అత్రి అనువారు సప్త ఋషులు. లోగడ (అధ్యా. 4) తెలిపిన ఊరువు పురుడు శతద్యుమ్నుడు తపస్వి సత్యవాక్ కవి అగ్నిష్టోముడు అతిరాత్రుడు సుద్యుమ్ని అభిమన్యుడు అను పది మందియు చాక్షుషుని కుమారులు ప్రజావృద్ధి చేయువారు.

---

♦ కావ్యః. ★ అహన్యహన్యనామానౌ
చేమే * భృగుర్వ రేణ్యశ్చ్యవనస్సప్తత్రోద్యతిరేవ

వైవస్వత మన్వంతరమున అత్రి వసిష్ఠుడు కశ్యపుడు గౌతముడు భరద్వాజుడు విశ్వామిత్రుడు జమదగ్ని అనువారు సప్త ఋషులు. సాధ్యులు విశ్వేదేవులు రుద్రులు మరుత్తులు వసువులు అశ్వినులు ఆదిత్యులు అను ఏడు దేవ గణములు ఉండును. ఇక్ష్వాకువు మొదలగు కుమారులు ప్రజావృద్ధి చేయువారు.

మన్వన్తరేషు సర్వేషు సప్త సప్త మహర్షయః । కృత్వా ధర్మవ్యవస్థానం ప్రయాన్తి పరమం పదమ్. 30
సావర్ణేస్తు ప్రవక్ష్యామి మనో ర్భావి తథాఽన్తరమ్ । అశ్వత్థామా శరద్వాంశ్చ కౌశికో గాలవ స్తథా. 31
శతానన్దః కాశ్యపశ్చ రామశ్చ ఋషయస్స్మృతాః । * ధృతి ర్వరీయా న్పవన స్సువర్ణో విష్ణురేవ చ. 32
చరిష్ణు రిజ్య స్సుమతిర్ బృహత్క్షత్త్రశ్చ వీర్యవాన్ । భావినో దశ సావర్ణే ర్మనోః పుత్త్రాః ప్రకీర్తితాః. 33
రౌచ్యాదయ స్తథాఽన్యేపి మనవ స్సంప్రకీర్తితాః । రుచేః ప్రజాపతేః పుత్త్రో రౌచ్యో నామ భవిష్యతి. 34
మను ర్భూతే స్సుత స్తద్వ ద్భౌత్యో నామ భవిష్యతి । తతస్తు మేరుసావర్ణి ర్బ్రహ్మసూను ర్మనుస్స్మృతః.
క్రతుశ్చ ఋతుధామా చ విష్వక్సేనో మను స్తథా । అతీతానాగతాశ్చైతే మనవ స్సప్త కీర్తితాః. 36
ద్విషష్టి ర్యుగసాహస్ర మేభి ర్వ్యాప్తా నరాధిప । సఙ్కీర్తితం సర్వ మిదం మయా తు పృథివీపతే. 37
స్వే స్వేఽన్తరే సర్వ మిద ముత్పాద్య సచరాచరమ్ । కల్పావసానే తే సర్వే ముచ్యన్తే బ్రహ్మణా సహ. 38
ఏతే యుగసహస్రాన్తే వినశ్యన్తి పునఃపునః । బ్రహ్మాద్యా విష్ణుసాయుజ్యం యాన్తి యాస్యన్తి వై ద్విజాః.

ఇతి శ్రీమత్స్యమహాపురాణే మత్స్యమను సంవాదే చతుర్దశ
మన్వన్తరానుకీర్తనం నామ నవమోఽధ్యాయః.

అన్ని మన్వంతరములందును ఏడేసి మంది మహర్షులు ధర్మ వ్యవస్థ చేసి పరమ పదమును చేరెదరు.

సావర్ణి మన్వంతరమున అశ్వత్థామ శరద్వాన్ కౌశికుడు గాలవుడు శతానందుడు కాశ్యపుడు రాముడు అనువారు సప్త ఋషులు. ధృతి వరీయాన్ పవనుడు సువర్ణుడు విష్ణుడు చరిష్ణుడు ఇజ్యుడు సుమతి బృహత్‌క్షత్త్రుడు వీర్యవాన్ అనువారు పది మంది సావర్ణి కుమారులును ప్రజావృద్ధి చేయువారు.

వీరు కాక రౌచ్యుడు మొదలగు మరికొందరు మనువులును కాబోవుదురు. రుచి అను ప్రజాపతికి కుమారుడు రౌచ్యుడు. భూతి అను ప్రజాపతికి కుమారుడు భౌత్యుడు. వీరును కాబోవు మనువులలోనివారు.

తరువాత బ్రహ్మకుమారుడగు మేరుసావర్ణి మనువు అగును.

క్రతువు ఋతుధాముడు విష్వక్సేనుడు అనువారు మరి ముగ్గురు మనువులు.

ఇట్లు గడచిన వారు ఆరు మందియు గడచుచున్న వైవస్వతమనువును రానున్న మనువులు ఏడు మందియు మనువులు చెప్పబడినారు. ఇట్లు మొత్తము పదు నలుగురు మనువులు.

వీరు వేలకొలది దేవ యుగముల కాలము తపమాచరించి ఆ శక్తిచే లోకసృష్టిని ప్రజాపాలనమును జరుపుదురు.

రాజా! ఇది యంతయు నీకు ఇట్లు తెలిపితిని.

ఈ మనువులు అందరును తమ తమ అంతరములలో చరాచర ప్రాణులతో నిండిన జగత్తును సృష్టించి పాలింతురు. తుదకు కల్పాంతమునందు బ్రహ్మతో పాటు ముక్తిని పొందుదురు.

(ఈ సృష్టియును కల్పమును ఒకటి మాత్రమే కాదు. సృష్టులును కల్పములును అనంతములు. ప్రతి సృష్టి యందును కల్పమునందును ఇట్లే బ్రహ్మలును మనువులును మరల మరల పుట్టుచు పోవుచుందురు. కనుక) వీరు వేలకొలది దేవ యుగములు ముగిసిన తరువాత మరల మరల నశించుచుందురు. ఆ క్రమములో బ్రహ్మ మనువులు మొదలగు వారు విష్ణు సాయుజ్యమును పొందుదురు. ఇక ముందును ఇట్లే పొందనున్నారు.

[ఇచ్చట సావర్ణి అను మనువులు ఐదు మంది. వీరిలో మొదట చెప్పిన సావర్ణి ఎవరో స్పష్టముగా చెప్పబడ

లేదు. మరియును మిగిలిన మనువులు కాని వారివారి అంతరములలో ఉండెడి సప్తఋషులును దేవతలును మనుపుత్త్రులును కాని చెప్పబడలేదు.]

ఇది శ్రీ మత్స్య మహాపురాణమున మత్స్యమను సంవాదమున మన్వంతరాను కీర్తనమను నవమాధ్యాయము.

## పృథ్వాదికృతధరణీ దోహనమ్.

## 10. దశమోఽధ్యాయః.

ఋషయః: బహుభి ర్ధరణీ భుక్తా భూపాలై శ్శ్రూయతే పురా ।
పార్థివాః పృథివీయోగా త్పృథివీ కస్య యోగతః. 1
కిమర్థం చ కృతా సంజ్ఞా భూమేః కిం పరిభాషితా । గౌ రితీయం చ విఖ్యాతా సూత కస్మా ద్బ్రవీహి నః.

బ్రాహ్మణకృతవేనమథనమ్.

సూతః: వంశే స్వాయమ్భువే త్వాసీ దఙ్గో నామ ప్రజాపతిః । మృత్యోశ్చ దుహితా తేనపరిణీతాతు దుర్ముఖా.
సునీథా నామ తస్యాభూ ద్వేనో నామ సుతః పురా । అధర్మనిరతః కామీ బలవా న్వసుధాధిపః. 4
లోకే ప్యధర్మకృజ్జాతః పరభార్యాపహారకః । మమన్థు ర్బ్రాహ్మణా స్తస్య బలా ద్దేహ మకల్మషాః. 5
తత్కాయా న్మథ్యమానాత్తు నిష్పేతు ర్మ్లేచ్ఛజాతయః । శరీరే మాతు రంశేన కృష్ణాఞ్జనసమప్రభాః. 6
పితు రఙ్గస్య చాంశేన ధార్మికో ధర్మకారకః । ఉత్పన్నో దక్షిణా ద్ధస్తా త్సధనుః * కవచీ శరీ. 7
దివ్యతేజోమయవపు స్సరత్న కనకాఙ్గదః । పృథురోమాఽభవ త్తస్మా త్తతః పృథు రజాయత. 8
స విప్రై రభిషిక్త స్సంస్తవః కృత్వాఽతిదుష్కరమ్ । విష్ణో ర్వరేణ సర్వస్య ప్రభుత్వ మగమత్ప్రభుః. 9
నిస్స్వాధ్యాయవషట్కారం నిర్ధనం వీక్ష్య భూతలమ్ । దగ్ధు మైచ్ఛత్తతః కోపా చ్ఛరే ణామితవిక్రమః. 10
తతో గోరూప మాస్థాయ భూః పలాయితు మైచ్ఛత । పృష్ఠతోఽనుగత స్తస్యాః పృథు ర్దీప్తశరాననః. 11

## దశమాధ్యాయము

## పృథువు మొదలగు వారు భూమిని గోవుగా చేసి పిదుకుట

ఋషులు సూతుని ఇట్లడిగిరి: పూర్వము రాజులెందరో భూమిని అనుభవించిరని వినుచున్నాము. పృథివిని పాలించిన వారు కావున పృథివీ శబ్దపు సంబంధముచే రాజులకు పార్థివులు అను పేరు ఏర్పడినది. పృథివి అనుశబ్దము మరి ఏ శబ్ద సంబంధముచే ఏర్పడినది? భూమికి ఆ పేరు ఏ అర్థమును తెలుపుటకయి పరిభాషగా (సంకేతముగా) చేయ బడినది? అట్లే భూమికి గౌః (గో) అను పేరును వచ్చినది కదా? ఇందులకు హేతువేమి? మాకు తాము తెలుపవేడెదము.

సూతుడు ఇట్లు చెప్ప నారంభించెను: స్వాయంభువమను వంశమున అంగుడను రాజు జన్మించెను. మృత్యుని కూతురు దుర్ముఖ అగు సునీథ అతని భార్య. వేనుడు అతని కుమారుడు. అతడు బలశాలి రాజై యుండియు ఎల్లప్పుడు అధర్మమునం దాసక్తి కలవాడు. కామపరుడు. లోకము నందును అధర్మమునే ఆచరించెడివాడు. పర భార్యలను అప హరించెడువాడు. బ్రాహ్మణులు అతని దేహమును బలము కొలది మథించిరి. మథింపబడుచుండిన అతని దేహము నుండి మ్లేచ్ఛజాతుల వారు ఉత్పన్నులయిరి. వారందరును తల్లి (అగు సునీథ) అంశమును బట్టి కాటుకవలె నల్లని దేహచ్ఛాయ కలవారు. ఆ వేనుని కుడిచేతి నుండి తండ్రియగు అంగుని అంశమును బట్టి ధర్మము నెరిగినవాడును ధర్మము నాచరించు వాడును ఆచరింపజేయు వాడును అగు వాడొకడు జనించెను. అతడు కవచమును ధనుర్బాణములను ధరించి ఉండెను. దివ్య తేజోమయ శరీరమును మంచి రత్నములు తాపటము చేసిన బంగారు భుజ కీర్తులును కలిగి ఉండెను. పృథు (లావగు)

---

* సశరో గదీ.

రోమములు కలవాడగుటచే అతడు పృథువన ప్రసిద్ధుడు అయ్యెను. విప్రులు అతనిని చక్రవర్తిగా అభిషేకించిరి. అతడు దుష్కరమగు తపస్సాచరించెను. విష్ణు వరముచే అతడు సర్వ జగత్తునకును ప్రభువుగా నయ్యెను. భూతలమున స్వాధ్యాయముగాని వషట్కారము (యజ్ఞక్రియలు) గాని ధనముగాని లేకుండుట చూచి కోపము కలిగి అమితమగు విక్రమము కల ఆ పృథుడు శరముతో భూమిని దహింప సంకల్పించెను. అంతట భూదేవి గోరూపమును ధరించి పారిపోసాగెను. ప్రజ్వలించుచున్న ధనువు ధరించి పృథుడు ఆమెను వెంట నంటెను.

తతః స్థిత్వైకదేశే తు కిం కరోమీతి సాఽబ్రవీత్ । పృథుర ప్యవద ద్వాక్య మీప్సితం దేహి సువ్రతే. 12

పృథ్వ్యాదికృతధరణీదోహనమ్.

సర్వస్య జగత శ్శీఘ్రం స్థావరస్య చరస్య చ । తథేతి చాబ్రవీ ద్భూమిం దుదోహ చ నరాధిప. 13
స్వకే పాణౌ పృథు ర్వత్సం కృత్వా స్వాయమ్భువం మనుమ్ ।
తదన్న మభవ ద్దుగ్ధం ప్రజా జీవన్తి యేన వై. 14
ఋషిభి ర్దుహ్యమానాయాం వత్స స్సోమ స్తథాఽభవత్ ।
దోగ్ధా బృహస్పతి రభూ త్పాత్రం వేదా స్తపో రసః. 15
దేవైశ్చ వసుధా దుగ్ధా దోగ్ధా మైత్ర స్తథాఽభవత్ । ఇన్ద్రో వత్స స్సమభవ త్క్షీర మూర్జస్కరం బలమ్. 16
దేవానాం కాఞ్చనం పాత్రం పితౄణాం రాజతం తథా । అన్తక శ్చాఽభవ ద్దోగ్ధా యమో వత్స స్స్వధా రసః.
ప్రవాళపాత్రం నాగానాం తక్షకో వత్సకోఽభవత్ । విషం క్షీరం తతో దోగ్ధా ధృతరాష్ట్రోఽభవ త్పునః. 18
అసురై రపి దుగ్ధేయ మాయసే శత్రుపీడనమ్ । పాత్రే మాయాం తథా వత్సః ప్రాహ్లాదిశ్చ విరోచనః. 19
దోగ్ధా * విమూఢ స్తత్రాసీన్మాయా యేన ప్రవర్తితా యక్షైశ్చ వసుధా దుగ్ధా పురాన్తర్ధాన మీప్సుభిః. 20
కృత్వా వైశ్రవణం వత్స మామపాత్రే మహీపతే । ప్రేతరక్షోగణై ర్దుగ్ధా ధరా రుధిర ముల్బణమ్. 21
రౌప్యనాభోఽభవ ద్దోగ్ధా సుమాలీ వత్స ఏవ తు । గన్ధర్వైశ్చ పున ర్దుగ్ధా వసుధా సాప్సరోగణైః. 22

అంతట భూదేవి ఒకానొక చోట నిలువబడి నేను నీకై ఏమి చేయవలయును? అని అడిగెను. సువ్రతా! (సత్కార్యములను చేయుదానా!) చరాచర రూపమయిన సర్వ జగత్తునకును శీఘ్రముగా కోరికలను తీర్చుము. అని పృథువు అనెను. భూదేవి సరే అనెను. పృథు చక్రవర్తి స్వాయంభువ మనువును దూడగా చేసి గోరూప యగు భూమిని తన చేతియందే పిడికెను. ఆ వచ్చిన క్షీరము ప్రజలు జీవించుటకు సాధనము అగు అన్నముగా అయ్యెను. బృహస్పతి దోగ్ధ (పిదుకువాడు) కాగా ఋషులు సోముని దూడనుగా చేసి వేదములనెడి పాత్రయందు పాలు పిదికిరి. ఆ పాలు తపస్సుగా అయ్యెను. దేవతలు భూమిని పిదికిరి. దోగ్ధ మైత్రుడను దేవుడు. ఇంద్రుడు దూడ. బంగారు పాత్ర... సామర్థ్యము నిచ్చు బలము క్షీరము పితరులు వెండి పాత్రలో భూమిని పిదికిరి. అన్తకుడు (ప్రాణులను అంతమొందించు వాడగు పితృరాజు) దోగ్ధ. యముడు (ప్రాణుల పుణ్యపాపముల నిర్ణయించి తదనుగుణముగా ఫలముల నిచ్చుదేవుడు) దూడ. స్వధా (కారముతో ఇచ్చు ద్రవ్యము) క్షీరము. నాగులు పగడపు పాత్రలో తక్షకుని దూడనుగా ధృతరాష్ట్రుడను నాగుని దోగ్ధనుగా చేసి విషము అను క్షీరమును భూదేవి నుండి పిదికిరి. అసురులును గోరూపయగు భూమిని పిదికిరి. వారిది ఇనుప పాత్ర. ప్రహ్లాదుని కుమారుడు విరోచనుడు దూడ. మాయలను ప్రవర్తిల్ల జేయువాడగు విమూఢుడను వాడు దోగ్ధ. శత్రువులను పీడించుట శత్రువులపై మాయ ప్రయోగించుట అనునవి పాలు. కుబేరుని దూడనుగా చేసి యక్షులు అను (కాలని మట్టి) పాత్రలోనికి అంతర్ధానము అను పాలను పిదికిరి. రౌప్యనాభుడు దోగ్ధగా సుమాలి దూడగా ప్రేతలును రక్షస్సులును భయంకరమగు రక్తమును పాలనుగా పిదికిరి.

* గింనూరాత।తాసీన్మాయా

వత్సం చిత్రరథం కృత్వా గన్ధాన్పద్మదళే తథా । దోగ్ధా వసురుచిర్నామ గానవేదస్య పారగః. 23
గిరిభి ర్వసుధా దుగ్ధా రత్నాని వివిధాని చ । ఔషధాని చ దివ్యాని దోగ్ధా మేరు ర్మహాబలః. 24
వత్సోఽభూద్ధిమవాం స్తత్ర పాత్రం శైలమయం పునః ।
వృక్షైశ్చ వసుధా దుగ్ధా క్షీరం ఛిన్న ప్రరోహణమ్. 25
పలాశపాత్రే దోగ్ధా తు సాలః పుష్పలతాకులః । ప్లక్షోఽభవ త్తతో వత్స స్సర్వ వృక్షవనాధిపః. 26
ఏవ మన్యైశ్చ వసుధా తథా దుగ్ధా యథేప్సితమ్ । ఆయుర్ధనం చ సౌఖ్యం చ పృథౌ రాజ్యం ప్రశాసతి. 27
న దరిద్ర స్తథా కశ్చి న్నరో వై న చ పాపకృత్ । నోపసర్గో * న వైరోక్తిః పృథౌ రాజ్యం ప్రశాసతి. 28
నిత్యం ప్రముదితా లోకా దుఃఖశోకవివర్జితాః । ధనుష్కోట్యా చ శైలేన్ద్రా నుత్సార్య స మహాబలః. 29
భూమణ్డలం సమం చక్రే లోకానాం హితకామ్యయా । నగరగ్రామదుర్గాణి న చాయుధధరా నరాః. 30
♦ పుత్రాదిభి ర్న దుఃఖం చ న త్వశాస్త్రస్య చాదరః । నానీతిమన్తః పురుషాః పృథౌ రాజ్యం ప్రశాసతి. 31
కథితాని చ పాత్రాణి తత్క్షీరం చ మయా తవ । యేషాం యేన రుచి స్తత్ర తేభ్యో దేయం విజానతా. 32
యజ్ఞశ్రాద్ధేషు సర్వేషు మయా తుభ్యం నివేదితమ్ ।
దుహితృత్వం గతా యస్మా త్పృథోః పృథ్వీ తతో మహీ. 33
తదానురాగయోగాచ్చ పృథివీ విశ్రుతా బుధైః. 34

ఇతి శ్రీ మత్స్యమహాపురాణే మత్స్యమనుసంవాదే పృథ్వాది
కృతధరణీదోహనం నామ దశమోఽధ్యాయః.

గంధర్వులును అప్సరోగణమును గాన వేద (సంగీత) తత్త్వము నెరిగిన వసురుచి దోగ్ధగా చిత్ర రథుడు దూడగా తామర పూరేకునందు సుగంధములనెడి పాలు పిదికిరి. పర్వతములును శైలమయమైన పాత్రలో హిమవంతుడు దూడగా మేరువు దోగ్ధగా రత్నములనెడి పాలను పిదికిరి. పూవులతో తీగలతో వ్యాప్తమైయున్న ఏపిచెట్టు దోగ్ధగా అన్ని చెట్లులకు వనములకు అధిపతియగు జువ్వి చెట్టు దూడగా మోదుగ ఆకుల పాత్రయందు ఛిన్న ప్రరోహణము (నరకినను మరల మొలచుట) అను క్షీరమును వృక్షములు పిదికెను.

ఈ విధముగనే ఇతరులును ఇతర ప్రాణులును తమ కోరికల కొలది భూమిని పిదికిరి. పృథుడు రాజ్యమును ఏలుచుండగా ప్రజలకు ధనము ఆయువు సౌఖ్యము కొరత లేకుండెను. దరిద్రుడు కాని పాపములు చేయువాడు కాని ఎవడును లేకుండెను. ఉపద్రవములుకాని వైరపు మాటలు కాని లేకుండెను. ప్రాణులన్నియును దుఃఖ శోకములు లేక మిగుల సంతోషముతో ఉండెను. ఆ మహాబలుడు లోకముల హితమును కోరి తన వింటికొనతో పర్వతములను (గ్రామము లను నగరములను దుర్గములను నిర్మించుటలో పంటలను పండించుటలో అడ్డము వచ్చినచో) దూరముగా నెట్టి వేసి భూమండలమును నగరములను గ్రామములను దుర్గములను సమములనుగా (సమతలము నందున్నవి) చేసెను. కొడుకులు మొదలగు చిన్నలవలన పెద్దలకు దుఃఖముగాని శాస్త్రాధ్యయనము లేని వానికి ఆదరముకాని లేకుండెను. పురుషులలో ఎవరును నీతి లేని వారు లేకుండిరి.

ఎవరికి ఎవరికి సంబంధించినవి ఏ పాత్రములో ఏ క్షీరములో నీకు తెలిపితిని. దానములు పూజలు చేయునపుడు ఆయా పాత్రలలో ఎవరికి ఏది ఇష్టమో ఎరిగి వారికి ప్రీతిగా వాటిని దానము చేయుటయో పూజాదులలో ఉపయోగించుటయో చేయవలెను. యజ్ఞములును శ్రాద్ధములును చేయునపుడు వీనిని పాటించవలెను.

---

✻ ద్విమూర్ధాత్రాసీన్మాయా * నచారోభూత్పృథౌ ♦ క్షయాతిశయదుఃఖంచ

ఈ చెప్పిన విధమున భూమి పృథువునకు కూతురుగా అయి ఆయన వాత్సల్యమును పొందినది కావున ఆమెకు పృథివి అను నామము ప్రసిద్ధికెక్కెను.

ఇది శ్రీ మత్స్య మహాపురాణమున మత్స్యమను సంవాదమున పృథువు మొదలగు వారు భూమిని పిదుకుట యను దశమాధ్యాయము.

## ఏకాదశోఽధ్యాయః.

### సూర్యవంశానువర్ణనమ్.

ఋషయః: ఆదిత్యవంశ మఖిలం వద సూత యథాక్రమమ్ ।
సోమవంశం చ తత్త్వజ్ఞ యథావ ద్వక్తు మర్హసి. 1
సూతః: వివస్వా న్కశ్యపా త్పూర్వ మదిత్యా మభవ త్పురా ।
తస్య పత్నీత్రయ మభూ త్సంజ్ఞా రాజ్ఞీ ప్రభా తథా. 2
రైవతస్య సుతా రాజ్ఞీ రైవతం సుషువే సుతమ్ ।
ప్రభా ప్రభాతం సుషువే త్వాష్ట్రీ సంజ్ఞా తథా మనుమ్. 3
యమశ్చ యమునా చైవ యమలౌ తౌ బభూవతుః । తత స్తేజోమయం రూప మసహన్తీ వివస్వతః. 4
నారీ ముత్పాదయామాస స్వశరీరా దనిన్దితామ్ । త్వాష్ట్రీ స్వరూపరూపేణ నామ్నా ఛాయేతి భామినీ. 5
కిం కరోమీతి పురత స్సంస్థితా తా మభాషత । ఛాయే త్వం భజ భర్తారం మదీయం చ వరాఙ్గనే. 6
అపత్యాని మదీయాని మాతృస్నేహేన పాలయ । తథేత్యుక్త్వా చ సా దేవ మగా త్కామాయ సువ్రత. 7
కామయామాస దేవోఽపి సంజ్ఞేయమితి చాదరాత్ । జనయామాస సావర్ణిం మనుం మానుషరూపిణమ్. 8
సవర్ణత్వాచ్చ సావర్ణో మనో ర్వైవస్వతస్య తు । తత శ్శనిం చ తపతీం విష్టిం చైవ క్రమేణ తు. 9
ఛాయాయాం జనయామాస సంజ్ఞేయమితి భాస్కరః । ఛాయా స్వపుత్రే త్వధికం స్నేహం చక్రే మనౌ తదా.
పూర్వో మను స్తతః క్షాన్తో యమ శ్చ క్రోధమూర్ఛితః । సన్తర్జయామాస తదా పాద ముద్యమ్య దక్షిణమ్.
శశాప చ యమం ఛాయా భక్ష్యతే క్రిమిసంచయైః । పాదోఽయ మేకో భవతః పూయశోణితవిస్రవః. 12
నివేదయామాస పితు ర్యమ శ్శాప మమర్షితః । నిష్కారణ మహం శప్తో మాత్రా దేవ సకోపయా. 13
బాలభావా న్మయా తస్యై మద్యత శ్చరణ స్సకృత్ । మనునా వార్యమాణాపి మమ శాప మదా ద్విభో. 14
ప్రాయేణ మాతా చాస్మాక మనయా స్నేహతో యతః । దేవోప్యాహ యమం భూయః కిం కరోమి మహామతే.
మౌర్ఖ్యా త్కశ్చిన మహే న్స్యా దథవా కర్మసన్తతేః । అనివార్యో భవస్యాపి కా కథాఽన్యేషు జన్తుషు. 16
కర్తారం కర్మపాకస్తు స క్రిమీ న్భక్షయిష్యతి । క్లేదం చ రుధిరం చైవ పుంసోఽయ మపనేష్యతి. 17

## ఏకాదశాధ్యాయము

### సూర్యవంశాను వర్ణనము

ఋషులు సూతునితో ఇట్లు పలికిరి: మీరు పురాణ తత్త్వమును ఎరిగినవారు. తాము మాకు సూర్యచంద్రవంశముల వృత్తాంతములను సంప్రదాయమున ప్రతిపాదింపబడిన విధమున యథా క్రమమున తెలుప వేడుచున్నాము.

సూతు డిట్లు చెప్పనారంభించెను: పూర్వము కశ్యప ప్రజాపతికి అదితి యందు సూర్యుడు కుమారుడుగా జనించెను. అతనికి సంజ్ఞా రాజ్ఞీ ప్రభా అనువారు ముగ్గురు భార్యలు. రేవతుని కూతురు రాజ్ఞి. ఆమె కుమారుడు రైవతుడు. ప్రభా కుమారుడు ప్రభాతుడు. త్వష్ట అను ప్రజాపతి కూతురు అగు సంజ్ఞకు వైవస్వతుడను మనువును యముడు యమున

అను కవలును కలిగిరి. సూర్యుని తేజోమయమగు రూపమును సహింపజాలక సంజ్ఞ తన శరీరము నుండి పవిత్రురాలును సుందరియు నగు స్త్రీని జనింపజేసెను. ఆమెయును సంజ్ఞరూపములో సమానమగు రూపము కలిగియుండెను: ఆమె పేరు ఛాయ. నేనిపు దేమి చేయవలయును? అనుచు తన ఎదుట నిలిచిన ఛాయతో సంజ్ఞ ఇట్లనెను: నీవు స్త్రీలలో ఉత్తమురాలవు. నీవు నా భర్తను భర్తగా గ్రహించియుండుము. నా సంతానమగు ఈ ముగ్గురను ప్రీతితో కాపాడుచుండుము. అని సంజ్ఞ కోరగా ఛాయ అంగీకరించి ధర్మము నాచరించు తలంపుతోనే సూర్యునికడకు పోయెను. అతడును ఆమెను సంజ్ఞనుగా తలచి ఆమెతోనే కామమున ప్రవృత్తుడయ్యెను. సూర్యునకు ఛాయ యందు మనుష్య రూపుడగు సావర్ణి మనువు పుట్టెను. అతడు తండ్రితో సమానముగా వర్ణము కలవాడు. కనుకనే అతనికా పేరు కలిగెను. పిమ్మట సూర్యునికి ఛాయ యందే శని తపతి విష్టి అను ముగ్గురు సంతానము కలిగిరి. ఛాయ తన పుత్రుడగు సావర్ణి మనువుపై అధికముగా ప్రేమ చూప సాగెను. దానిని సంజ్ఞ మొదటి కుమారుడగు వైవస్వతుడు (మనువు) సహించెను. కాని యముడు సహించక క్రోధో ద్రేకము చెందెను. అతడు తన కుడికాలు ఎత్తి చాయను బెదరించెను. నీ ఈ పాదము ఎల్లప్పుడును చీము రక్తము కారు చుండును. దానిని క్రిములు తినుచుండును. అని ఛాయ యముని శపించెను.

యముడును ఆ శాపమును సహించలేక సూర్యుని కడకు పోయి ఇట్లు పలికెను: దేవా! మా అమ్మ (ఛాయ) మా అన్నదమ్ముల-అక్కచెల్లెండ్ర-అందర యందును సమానముగా స్నేహ భావము చూపుటలేదు. అది సహించలేక నేను చిన్న తనపు స్వభావముచే ఒక్క మాటు కాలు ఎత్తితిని. కోపించి మా అమ్మ నన్ను శపించినది: వైవస్వతుడు వలదని బ్రతిమాలు చున్నను ఆమె వినలేదు. అది విని సూర్యుడు యమునితో "నాయనా! నీవు తెలియనివాడవు కావు. ఒక్కొక్కరికి తన మూర్ఖత్వము చేతను మరియొకరికి కర్మ వశమునను దుఃఖము కలుగుచుండును. ఈ రెండు విధములలో దేనిచేతనైనను దుఃఖమునసుభవించుట శివునకును తప్పించుకొనరానిది. ఇతరుల విషయము చెప్పవలసినదేమున్నది? జీవుల కర్మ విపాకము వారిని క్రిముల చేత భక్షింపజేయును. కర్మానుభవము వలన (పాపము అనెడి) చీము రక్తము కారుట క్షీణించి పోవును." అనెను.

ఏవ ముక్త స్తప స్తేపే యమ స్తీవ్రం మహాయశాః । గోకర్ణతీర్థే వైరాగ్యా త్ఫలమూలానిలాశనః. 18
ఆరాధయ న్మహాదేవం వర్షాణా మయుతాయుతమ్ । వరం ప్రాదా న్మహాదేవ స్సంతుష్ట శ్శూలభృ త్తదా. 19
వవ్రే స లోకపాలత్వం పితృలోకస్య పాలనమ్ । ధర్మాధర్మాత్మకస్యాపి జగతస్తు పరీక్షణమ్. 20
ఏవం స లోకపాలత్వ మగమ చ్ఛూలపాణినా । పితౄణా మాధిపత్యం చ ధర్మాధర్మస్య చానఘ. 21
వివస్వా నథ* త త్త్వజ్ఞ స్సంజ్ఞాయాః కర్మచేష్టితమ్ । త్వష్టు స్సమీప మగమ దాచచక్షే స రోషవాన్. 22

త్వష్టృకృతసూర్య తేజశ్శాతనమ్.

త మువాచ తత స్త్వష్టా సాన్త్వపూర్వం తదా వచః । తదాఽసహన్తీ భగవం స్తేజ స్తీవ్రం తమోనుదమ్. 23
బడబారూప మాస్థాయ ♦ త్వత్సకాశా దిహాగతా । నివారితా మయా సా చ త్వద్భయేన దివాకర. 24
యస్మా దవిజ్ఞాతమనా మత్సకాశం త్వ మాగతా । తస్మాన్మదీయం భవనం ప్రవేష్టుం న త్వమర్హసి. 25
ఏవముక్తా జగామాశు మరు దేశ మనిన్దితా । బడబారూప మాస్థాయ భూతలే సంప్రతిష్ఠితా. 26
తస్మా త్ప్రసాదం కురు మే యద్యనుగ్రహభా గహమ్ । అపనేష్యామి తే తేజః కృత్వా యన్త్రే దివాకర. 27
రూపం తవ కరిష్యామి లోకానన్దకరం ప్రభో । తథేత్యుక్త స్స రవిణా భ్రమౌ కృత్వా దివాకరమ్. 28
పృథ క్చకార త త్తేజ శ్చక్రం విష్ణోః ప్రకల్పయత్ । త్రిశూలం చాపి రుద్రస్య వజ్ర మింద్రస్య చాధికమ్.
దైత్యదానవసంహర్తు స్సహస్రకిరణాత్మకమ్ । రూపం చాప్రతిమం చక్రే త్వష్టా పద్భ్యామృతే మహత్. 30

---

* తద్జ్ఞాత్వా సంజ్ఞాయాః

♦ మత్సకాశం సమాగతా.

న విశాకారి సన్నోష్ఠం మయా రూపం రవేః పునః । అద్యాప్రభృతి దేవః హిచా న కశ్చి త్కారయే ద్రవేః. 31
యః కరోతి స పాపిష్ఠాం గతి మాప్నోతి నిన్దితామ్ । కుష్ఠరోగ మవాప్నోతి లోకేఽస్మి స్దుఃఖసంయుతః. 32
తస్మా న్న ధర్మకామార్థీ చిత్రే ష్వాయతనేషు చ । న కశ్చి త్కారయే త్పాదౌ దేవ దేవస్య ధీమతః. 33

సూర్యుడు పలికినది విని మహాయశశ్శాలియగు యముడు తీవ్రముగు తపస్సు నాచరించెను. అతడు గోకర్ణ తీర్థమున కోటి సంవత్సరముల పాటు వైరాగ్యమును పూని పండ్లు దుంపలు వేళ్లు గాలి ఆహారముగా శివుని ఆరాధించెను. త్రిశూల ధారి మహాదేవుడు సంతుష్టుడై వరము కోడుకొమ్మనెను. యముడును లోక పాలత్వమును పితృ లోకపాలనాధికారమును ధర్మాధర్మ స్వభావములతో సదచు జగములను నిరీక్షించుచుండుటయు కోరెను. శివుననుగ్రహమున యమునకీ మూడధికారములును లభించెను.

వాస్తవ స్థితిని ఎరిగి సూర్యుడును రోషము చెంది త్వష్టకడకుపోయి సంజ్ఞ చేసిన పని తెలిపెను. త్వష్ట అతనితో ప్రార్థనా పూర్వకముగా ఇట్లు పలికెను: భగవన్! ఆనాడు సంజ్ఞ చీకటులను పారదోలు నీ తీవ్ర తేజమును సహించలేనిదయి నీ కడనుండి బయలుదేరి ఆడు గుర్రపు రూపముతో నా కడకు వచ్చెను. నేను నీకు భయపడి ఆమెను నా ఇంటికి రావలదని వారించితిని. నీవు నీ భర్త హృదయమును ఎరుగక అతని అనుమతి లేక) నా దగ్గరకు వచ్చితివి. కనుక నీవు నా గృహమును ప్రవేశించదగదు. అని నేను అనగా ఆ సుగుణవతి భూలోకము నందలి మరు దేశమునకు పోయినది. ఆమె ఇప్పుడును అదే ఆడు గుర్రపు రూపముతో అచ్చట (తానుండదగిన చోటు దొరుకక తిరుగుచు) ఉన్నది. నేను నీయనుగ్రహము పొందదగిన వాడనని మీరు భావించినచో నన్ను అనుగ్రహించుడు. మీ దేహమును యంత్రము నందు ఉంచి మీ తీవ్ర తేజస్సును (కొంత) పోగొట్టుదును. మీ రూపము ప్రాణులకు ఆనందకరము అగునట్లు చేయుదును.

త్వష్ట మాటలను రవి అంగీకరించెను. త్వష్టయును భాస్కరుని తరిమెన పట్టు యంత్రమునందుంచి అతని తీవ్ర తేజస్సులో కొంత భాగము వేరు పరచెను. దానితో అతడు విష్ణుని చక్రమును శివుని త్రిశూలమును దైత్యదానవ సంహర్త అగు ఇంద్రుని వజ్రమును చేసెను.

అప్పటికిని త్వష్ట సూర్యుని రూపమును చూడజాలకపోయెను. అందుచే అతడు సూర్యుని కిరణములను ఇంకను తగ్గించి సహస్ర కిరణములు మాత్రమే కలిగిన సాటిలేని గొప్ప అందమైన రూపమును రవికి కలిగించెను.

[కిరణములను సంస్కృతమున కరములు పాదములు అని కూడ అందురు. ఈ చెప్పిన దానిని బట్టి త్వష్ట సూర్యుని పాదములను తీసివేసెను.]

అందుచేతనే నాటి నుండి తరువాత ఇప్పటికిని ఎవరును సూర్యునికి పాదములున్నట్లుగా అతని ప్రతిమను నిర్మింపజేయరాదు. అను నిషేధము ఏర్పడినది. ఒకవేళ అట్లు పాదములు గల రవి ప్రతిమ చేయించినచో ఆ పాపిష్ఠుడు నిందితమగు గతిని పొందును; కుష్ఠ రోగమును పొందును. ఈ లోకమున దుఃఖములను పొందును. కావున ధర్మమును కామమును కోరినవారెవ్వరును చిత్తరువుల యందును ఆలయములందును దేవ దేవుడును మహాబుద్ధి శాలియును నగు సూర్యునకు పాదములు నిర్మింపజేయరాదు.

తత స్స భగవా న్గత్వా భూలోక మమరాధిపః । కామయామాస కామార్తో ముఖమేవ దివాకరః. 34
అశ్వరూపేణ మహతా తేజసా చ సమావృతః । సంజ్ఞాచ మనసా క్షోభ మగమ ద్భయపీడితా. 35
నాసాపుటాభ్యా ముత్సృష్టః పరోఽయమితి శఙ్కయా ।
తస్య రేత స్తతో జాతా వశ్వినా వితి న శ్శ్రుతమ్. 36
దస్రౌ ప్రస్రోత్సంజాతౌ నాసత్యౌ నాసికాం గతౌ । జ్ఞాత్వా చిరార్చితం దేవం సన్తోష మగమ త్పరమ్. 37
విమానే నాగమ త్స్వర్గం పత్న్యా సహ ముదాన్వితః । సావర్ణోపి మను ర్మేరౌ ద్యాప్యాస్తే తపోధనః. 38
శని స్తపోబలా ద్గాయా గ్రహసామ్యం తతః పునః । యమునా తపతీ చైవ పున ర్నద్యౌ బభూవతుః. 39

విష్టి ర్ఘోరాత్మికా తద్వ త్కాలత్వేన వ్యవస్థితా । మనోర్వైవస్వతస్యాథ దశ పుత్రా మహాబలాః. 40
ఇళస్తు ప్రథమ స్తేషాం*పుత్రేష్టు సమజాయత । ఇక్ష్వాకుః కుశనాభశ్చ అరిష్టో ధృష్ట ఏవ చ. 41
నరిష్యన్తః కరూశశ్చ శర్యాతిశ్చ మహాబలః । పృషధ్రశ్చోఽథ నాభాగ స్సర్వే తే దివ్యమానుషాః. 42
అభిషిచ్య మనుః పుత్ర మిళం జ్యేష్ఠం స ధార్మికః । జగామ తపసే భూయో ♦ హిమవచ్ఛిఖరం పరమ్. 43
అథ దిగ్జయసిద్ధ్యర్థ మిళః ప్రాయా న్మహీ మిమామ్ ।
భ్రామ్య న్ద్వీపాని సర్వాణి క్ష్మాభృత స్సమ్ప్రసాధయత్. 44

సూర్యవంశ్యస్యైళస్య శరవణే స్త్రీరూపప్రాప్తిః.

జగామోపవనే శమ్భో రశ్వాకృష్టః ప్రతాపవాన్ । కల్పద్రుమలతాకీర్ణం నామ్నా శరవణం మహత్. 45
రమతే తత్ర దేవేశ స్సోమ స్సోమార్ధశేఖరః । ఉమయా సహిత స్తత్ర పురా శరవణే కృతః. 46
పున్నామ సత్త్వం యత్కిఞ్చి దాగమిష్యతి నో వనే । స్త్రీత్వ మేష్యతి తత్సర్వం దశయోజనమణ్డలే. 47

తరువాత అమరులకు అధిపతియగు భగవానుడు సూర్యుడు భూలోకమునకు పోయెను. అతడు మహాతేజస్సుతో క్రమ్మబడిన వాడును అశ్వ రూపమును ధరించినవాడును ఐ ఆమెకడకు పోయెను. ఆ దివాకరుడు కామార్తుడుగా ఉండి నందున ఆడు గుర్రపు రూపమున ఉన్న సంజ్ఞ ముఖమునే తన కామ ప్రవృత్తికి సాధనముగ చేసికొనెను. ఆమె తన భర్తను గుర్తించక అతడెవరో పరుడు అను భ్రాంతిచే మనస్సునందు భయముచే బాధనొంది కలవరపాటు చెందెను. ఆమె సూర్యుని వీర్యమును తన ముక్కు పుటముల ద్వారమున వదలివేసెను. ఇట్లు జరిగిన ఈ రేతఃస్రావమువలన పుట్టిన ఇద్దరు దేవతలే అశ్వినులు అని మనము (సంప్రదాయమున) వినుచున్నాము.

నాసికల (ముక్కుల) నుండి పుట్టినందున నాసత్యులు అనియు దస్రము (అశ్వము) యొక్క ఓష్ఠము (పెదవు)ల నుండి పుట్టుటచే దస్రులనియు అశ్వి దేవతలకు పేరు లేర్పడినవి.

తరువాత సంజ్ఞ తాను పూర్వము చాలకాలము క్రిందట అర్చించిన తన పతియే ఇతడని సూర్యుని గుర్తించి మరల సంతోషము నందెను. రవియు విమానముపై తన భార్యతో కూడ స్వర్గమునకు వెళ్లెను.

సూర్యునకు ఛాయయందు కలిగిన సూర్య సావర్ణి తపోధనుడుగా ఈనాటికిని మేరు పర్వతమునందున్నాడు. శని తపస్సాచరించి తన తపోబలమున గ్రహములతో సమానత్వము పొందినాడు.

యమున తపతి అను ఇద్దరు కన్యలును నదులైరి. విష్టి అను కన్య మాత్రము ఘోర రూపురాలు (మిగుల నల్లనిది). ఈమె కాల రూపురాలయి ఉన్నది.

వైవస్వత మనువునకు మహాబలులగు పదిమంది కుమారులు కలిగిరి. వారిలో మొదటివాడు ఇళుడు. ఇంకను ఇక్ష్వాకుడు కుశనాభుడు అరిష్టుడు ధృష్టుడు నరిష్యంతుడు కరూశుడు శర్యాతి పృషధ్రుడు నాభాగుడు అనువారు తొమ్మిది మంది. ధర్మమును ఎరిగి అనుష్ఠించు ధార్మికుడగు వైవస్వతుడు జ్యేష్ఠ పుత్రుని ఇళుని రాజ్యమునందభిషేకించి శ్రేష్ఠమగు హిమవచ్ఛిఖరమునకు (మహేంద్ర వనమునకు) పోయి అందరకంటె మిన్నగా తప మాచరింపసాగెను.

తరువాత దిగ్విజయమును సాధించుటకై ఆ ప్రతాపవంతుడగు ఇళుడు ఈ భూమియం దంతటను అన్ని ద్వీపముల యందును సంచరించుచు రాజులను అందరను తనకు లోబరచుకొనెను. ఆ దిగ్జయ యాత్రాక్రమములో అతడు *తన గుర్రము తీసికొనిపోగా శివుని ఉద్యానవనమునకు పోయెను ఆ ఉద్యానము కల్పవృక్షపులతలతో వ్యాప్తమయి

* పుత్రేష్ట్వా ♦ మహేన్ద్రవనమాలయమ్.

* ఇలుడు దిగ్విజయము కోరి అశ్వమును మంత్ర పూర్వకముగా వదలి అది భూమండలమందంతట తిరుగుచుండ తానును దాని వెంట పోవుచుండెను. ఆయశ్వము అట్లు పోవుచు శరవణములోనికి పోగా ఇలుడును దానిననుసరించి ఆ ఉద్యానములో ప్రవేశించెను. అని అర్థము.

ములయి యుండెను. ఆమె ముఖము నిండు చందురుని పోలియుండెను. ఆమె శరీరము అంత స్థూలముకాక సన్ననై యుండెను. ఆమె చూపులు ఒయ్యారపు కదలికలచే మెరయు చుండెను. అంతవరకు సంతానమును కని ఉండని యౌవనములో ఉండెను. ఆమె మేను బంగారు చాయతో ఉండెను. ఆమె హంసవలె నడచుచుండెను. కోరికల రేకెత్తించు రూపమును శృంగార గుణములును కలిగి యుండెను. ఆమె గోళ్ళ మొలకలు పలుచనై ఎర్రనయి యుండెను.

ఇటువంటి ఆ సుందరి ఇళ ఆ శరవణమను ఉద్యానమునందు అటునిటు తిరుగుచు తన మనస్సులో "నా నాయన ఎవరో! అమ్మ ఎవరో! సోదరులు ఎవ్వరో! ఎవరిని భర్తగా చేసి నన్ను అతనికి ఇచ్చిరో! భూలోకమున అతడు ఏ వర్ణము వాడో!" అని ఆలోచింపసాగెను. ఆమె ఇట్లాలోచించుచు తిరుగుచుండగా చంద్రుని పుత్రుడగు బుధుడు ఆమెను చూచెను. ఆమె సౌందర్యము అతనిని ఆకర్షించెను. కామము పీడింపగా ఆ ఉద్యానమునందే అతడామె యందు అనురాగము చెందెను.

[అతడు ఆమె విషయమున తన కోరిక తీర్చుకొనుటకై ఒక ఉపాయము చేసెను.]

బుధుడు ఒక విశిష్టమయిన రూపము ధరించెను. అతని చేతులయందు దండము కమండలువు పుస్తకమును ఉండెను. బ్రాహ్మణ రూపము శిఖ బంగారు కుండలములును దాల్చి ఉండెను. వేదము చెప్పుచుండెను. తమ చేతులందు వేణు దండములు ధరించి సమిధలు పుష్పములు కుశలు ఉదకము చేత పట్టుకొనియున్న అనేకులు అగు బ్రహ్మచారులు అతని వెంట నుండిరి. ఇట్టి రూపముతో పరివారముతో ఆ బుధుడు (ఇళ తప్పిపోగా ఆమె కొరకై) వెదకుచున్నవానివలె నటించుచు ఆ శరవణమున ఆమెను గట్టిగా పిలువసాగెను. బుధుడు ఆ శరవణమునకు వెలుపలనే (లోపలకు వచ్చినచో తానును స్త్రీగా మారునను భయమున చెట్ల గుబురు చాటున నుండి తడబాటు పడుచు ఆకస్మికముగా మందలింపు మాటలతో ఈ విధముగా పలుకసాగెను. "అగ్నిహోత్ర కాలముతో చేయవలసిన నాశుశ్రూష చేయక విడిచి నా ఇంటి నుండి ఎక్కడకు వెళ్ళితివి? నీవు విహరించు వేళ ఇప్పుడు ముగిసిపోయినది. ఓ సుందరీ! రమ్ము-రమ్ము! ఇంకను రాకున్నావు. కారణమేమి? సాయంకాలమున నీవు విహరింపదగిన సమయము గడచిపోవు చున్నది. నా ఇంటికి రమ్ము. వచ్చి ఇల్లు అలికి పూలతో అలంకరించుము."

ఈ మాటలు విని ఇళ ఇట్లు పలికెను. "తపోధనా! నేను ఈ విషయమంతయు మరచితిని. మీరు ఎవరో మీ కులమేమో శీలమేమో చెప్పవేడుచున్నాను."

బుధుడు మిగుల సౌందర్యవతియగు ఇళతో ఇట్లు పలికెను: "నేను కాముకుడు అను పేరుతో ప్రసిద్ధుడను. అనేకములగు విద్యల నెరిగిన వాడను. (కనుక) బుధుడను ప్రసిద్ధి వహించి యున్నాను. తేజస్వి (కాంతి గలవాడు-చంద్రుడు) అనువాని కులము (వంశము-ఇల్లు) నందు పుట్టిన వాడను. నా తండ్రి బ్రాహ్మణులకు (ద్విజులకు-అనగా పక్షులకు) అధిపతి (చంద్రుడు) [ఇట్లు పైకి తాను బ్రాహ్మణుడైనట్లును రహస్యార్థమున తాను చంద్రుని కుమారుడగు బుధుడనియు మాటలాడగా] ఆమె అతని ఆ మాటలు విని బుధుని గృహమునకు పోయి దాని యందు ప్రవేశించెను. అది మనోహరములగు స్తంభములతో వ్యాపింపబడి యున్నది. దివ్యములగు ముత్తెములు అంతట కూర్చబడి యున్నవి. ఇది యంతయు చూచి ఆ ఇళ ఆ ఇంటిలో ఉండుటవలన తాను కృతార్థురాలయ్యెనని తలచెను. ఎంతో మెచ్చదగిన ఇల్లు! ఎంతో మెచ్చదగిన రూపము. ఎంతో ప్రశంసింప దగిన ధనము. ఎంతో పొగడదగిన వంశము. ఎంతో కాలము-నుండియు ఇతడే నా భర్త. ఇతని లావణ్యము ఉత్తమమైనది. అని ఆమె సంతోషపడెను.

నాటి నుండియు చాలకాలము వరకు ఇళ ఇంద్రభవనము వంటిదిగా తనకు తోచుచు సర్వభోగములతో నిండిన ఆ ఇంటియందు ఆ బుధునితో కూడ విహరించి ఆనందించెను.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున మత్స్యమనుసంవాదమున సూర్యవంశ వర్ణనమున ఇళా
బుధసమాగమమను ఏకాదశాధ్యాయము.

## ద్వాదశోఽధ్యాయః.

ఇలాన్వేషణార్థ మిక్ష్వాకు ప్రభృతీనాం శరవణగమనమ్.

సూతః: అథాన్వేషన్తో రాజానం భ్రాతర స్తస్య మానవాః । ఇక్ష్వాకుప్రముఖా జగ్ము స్తదా శరవణాన్తికమ్.
తత స్తే దదృశు స్సర్వే బడబా మగ్రత స్స్థితామ్ । రత్నపల్యాణకిరణదీప్తకాయా మనుత్తమామ్. 2
పల్యాణప్రత్యభిజ్ఞానా త్సర్వే తే విస్మయం గతాః । అయం చన్ద్రప్రభో నామ వాజీ తస్య మహాత్మనః. 3
అగమ ద్బడబారూప ముత్తమం కేన హేతునా । తతస్తు మైత్రావరుణిం పప్రచ్ఛు స్తే పురోధసమ్. 4
కిమిత్యేత దభూ చ్చిత్రం వద యోగవిదాం వర । వసిష్ఠోఽప్యబ్రవీ త్సర్వం పశ్యాత ధ్యానచక్షుషా. 5
సమయ శ్శమ్భుదయితాకృత శ్శరవణే పురా । యః పుమా న్ప్రవిశే దత్ర స నారీత్వ మవాప్స్యతి. 6
అయ మశ్వోపి నారీత్వ మగా ద్రాజ్ఞా సహైవ తు । పునః పురుషతా మేతి యథాఽసౌ ధనదోపమః. 7
తథైవ యత్నః కర్తవ్య ఆరాధ్యాథ పినాకినమ్ । తత స్తే మానవా జగ్ము ర్యత్ర దేవో మహేశ్వరః. 8
తుష్టువు ర్వివిధై స్స్తోత్రైః పార్వతీపరమేశ్వరౌ । తా వూచతు రలఙ్ఘ్యోఽయం సమయః కిం తు సామ్ప్రతమ్.
ఇక్ష్వాకో రశ్వమేధేన యత్ఫలం స్యా త్తదాఽఽవయోః । దత్వా కిమ్పురుషో వీర స్స భవిష్య త్యసంశయః.

## ద్వాదశాధ్యాయము.

### ఇలుని వెదకుటకై ఇక్ష్వాకు ప్రభృతులు శరవణమునకు పోవుట.

సూతుడు ఋషులకు ఇంకను ఇట్లు చెప్పెను: అనంతరము వైవస్వత మను కుమారులగు ఇలుని సోదరులు ఇక్ష్వాకుడు మొదలగు వారు రాజగు ఇలుని వెదకుచు శరవణోద్యాన సమీపమునకు వెళ్ళిరి. వారికి అందరకు అచ్చట తమ ఎదుట ఒక ఆడు గుర్రము కనబడెను. దాని మేను రత్నములు తాపటము చేసిన పల్యాణము (జీను)తో ప్రకాశించు చుండెను. ఆ బడబ చాల ఉత్తమ మయినది. ఉత్తమ లక్షణములు కలది. వారు ఆ పల్యాణమును గుర్తించిరి. అది తమ రాజగు ఇలుని అశ్వమునకు సంబంధించినదే. అని తెలిసి వారాశ్చర్యపడిరి. ఇది ఆ మహాత్ముని (ఇలుని) చంద్రప్రభమను పేరు గల గుర్రమే. ఇది ఉత్తమ మగు బడబగా మారినది. ఇందుకు హేతువు ఏమి ? అని ఆలోచించిరి. తరువాత వారు తమ పురోహితుడగు వసిష్ఠునికడకు పోయి "అయ్యా! మీరు యోగవేత్తలలో శ్రేష్ఠులు. ఎందువలన ఈ విచిత్రము జరిగెనో తెలుపుడు " అని వేడిరి

వసిష్ఠుడును తన జ్ఞానమయ నేత్రముతో చూచి ఇట్లు చెప్పెను: "ఈ శరవణమున ప్రవేశించిన పురుష ప్రాణి స్త్రీత్వమును పొందును. అని పూర్వము పార్వతి ఈ ఉద్యానము విషయమున వ్యవస్థ చేసెను. దాని చేతనే (దీనిలో ప్రవేశించినందున) రాజుతో పాటుగానే ఈ అశ్వము గూడ స్త్రీత్వమును పొందినది. కుబేరునితో సమానుడగు ఈ ఇళ రాజు మరల పురుషుడగు నట్లుగా యత్నము చేయవలసి యున్నది. అందులకై పరమేశ్వరుని ఆరాధించి అనుగ్రహింప జేసికొనవలసి యున్నది."

అంతట ఆమను పుత్త్రులు మహేశ్వరుడు ఉన్న చోటికి పోయిరి. పార్వతీ పరమేశ్వరులను వివిధ స్తోత్రములతో స్తుతించిరి. వారు వీరితో ఇట్లు పలికిరి. "ఈ వ్యవస్థ దాటరానిది. కాని ప్రస్తుతమున ఇట్లు చేయుడు. ఇక్ష్వాకుడు అశ్వమేధము చేసి దాని ఫలమును మాకు అర్పణ చేయవలయును. దాని వలన ఇళ (మరల పురుషుడై) కింపురుషుడుగా అగును."

తథేత్యుక్త్వా తత స్తే తు జగ్ము ర్వైవస్వతాత్మజాః । ఇక్ష్వాకో రశ్వమేధేన ఇళా కిమ్పురుషోఽభవత్. 11
మాస మేకం పుమా న్వీర స్స్త్రీ చ మాస మభూత్పునః । బుధస్య భవనే *తిష్ఠ న్నిళా గర్భధరాఽభవత్.
అజీజన త్పుత్ర మేక మనేకగుణ సంయుతమ్ । బుధ ఉత్పాద్య తం పుత్త్రం స్వర్గమేవాగమ త్తతః. 13

ఇళస్య నామ్నా తద్వర్ష మిళావృత మభూ త్తదా । సోమార్కవంశయో రాజా ఐళోఽభూ ద్వంశవర్ధనః.14

స్త్రీరూపిణ ఇళస్య ఐళోత్పత్తిః.

ఏవం పురూరవాః పుంసో రభవ ద్వంశవర్ధనః । ఇక్ష్వాకో రర్కవంశస్య తథైవోక్త స్సహోదనాః. 15
ఇళా కిమ్పురుషత్వే చ సుద్యుమ్న ఇతి చోచ్యతే । పునః పుత్రత్రయ మభూ త్సుద్యుమ్న స్యాపరాజితమ్.
ఉత్కలోఽథ గయ స్తద్వ ద్ధరితాశ్వోఽథ వీర్యవాన్ । ఉత్కలస్యోత్కలా నామ గయస్య తు గయా మతా.
హరితాశ్వస్య దిక్పూర్వా విశ్రుతా కురుభి స్సహ । ప్రతిష్ఠానేఽభిషిచ్యాథ స పురూరవసం సుతమ్. 18
జగామేళో వ్రతం భోక్తుం దివ్యవర్షఫలాశనమ్ । ఇక్ష్వాకు రస్య దాయాదో మధ్యదేశ మవాప్నుయాత్. 19
నరిష్య న్తస్య పుత్రోఽభూ చ్ఛకో నామ మహాబలః । నాభాగస్యామ్బరీషస్తు ధృష్టస్య తు సుతత్రయమ్. 20
ధృష్టకేతు శ్చిత్రనాథో రణధృష్టశ్చ వీర్యవాన్ । ఆనర్తో నామ శర్యాతే స్తత్కన్యా చైవ దారికా. 21
ఆనర్తస్యాఽభవ త్పుత్రో రోచమానః ప్రతాపవాన్ । ఆనర్తో నామ దేశోఽభూ న్నగరీ చ కుశస్థలీ. 22
రోచమానస్య రేవోఽభూ ద్రేవా ద్రైవత ఏవ చ । కకుద్మాం శ్చాపరో నామ్నా జ్యేష్ఠః పుత్రశతస్య చ.23
రేవతీ తస్య సా కన్యా భార్యా రామస్య విశ్రుతా । కరూశస్య తు కారూశా బహవః ప్రథితా భువి. 24

ఆ మాట విని ఆ మనుపుత్రులందరును అట్లేయని వెళ్ళిరి. ఇక్ష్వాకుడు అశ్వమేధము చేసి తత్ఫలమును పార్వతీ పరమేశ్వరులకు అర్పించెను. ఇళ (ఇళుడు) కింపురుషుడయ్యెను. తరువాత ఆ వీరుడు ఒక మాసము పురుషుడుగా ఒక మాసము స్త్రీగా అయ్యెను. ఇళుడు ఇళగా బుధుని గృహమున ఉన్న కాలములో ఆమె గర్భము ధరించెను. ఆమెకు అనేక సద్గుణములు గల ఒక కుమారుడు కలిగెను. ఇట్లు (ఇళా గర్భమున) ఒక కుమారుడు కలిగిన తరువాత బుధుడు మరల స్వర్గ లోకమునకు పోయెను. ఇళ పేరట ఆ దేశ భాగమునకు ఇళావృత వర్షమను పేరు వచ్చెను. (ఇది బహూళః నేటి మంగోలియా) ఇట్లు ఇళ కుమారుడగు ఐళుడు చంద్ర సూర్య వంశముల రెంటి నుండియు పుట్టిన వాడై ఆ వంశములకు వృద్ధిని (అభివృద్ధిని శుభమును) కలిగించు వాడయ్యెను. అతని పేరు పురూరవసుడు. అతడు చంద్ర వంశమును వృద్ధి చేయువాడయ్యెను. ఇక్ష్వాకుడు సూర్యవంశకర్త అయ్యెను.

ఇళుడు కింపురుషుడుగా ఉన్న సమయమున అతనికి సుద్యుమ్నుడు అని పేరు. ఆ సుద్యుమ్నునకు శత్రువులచే ఓటమి నెరుగని వీరులగు ముగ్గురు కుమారులు కలిగిరి. వారిలో ఉత్కలుడు ఉత్కల దేశములకు గయుడు గయకు హరి తాశ్వుడు కురు జన పదములతో కూడిన తూర్పు దేశమునకు రాజులైరి.

ఇళుడు స్త్రీత్వమున తన కుమారుడగు పురూరవసుని ప్రతిష్ఠానము అను నగరము రాజధానిగా (ఆర్యావర్త భాగమునకు) రాజుగా అభిషేకించి తాను కంద మూల ఫలములాహారముగా వానప్రస్థవ్రతమును అనుష్ఠించుటకై వనమునకు ఏగెను.

ఇళుని సోదరుడగు ఇక్ష్వాకుడు మధ్యదేశమునకు (హిమాలయము వింధ్యము వినశనము ప్రయాగ ఈ నాలుగు ఎల్లలకు నడుమ ఉండు దేశమునకు) రాజయ్యెను. నరిష్యంతుని కుమారుడు శకుడు. నాభాగుని కుమారుడు అంబరీషుడు. ధృష్టునకు ధృష్టకేతుడు చిత్రనాథుడు రణధృష్టుడు అనువారు ముగ్గురు కుమారులు. ఆనర్తుడను కుమారుడును దారికా అను కన్యయును శర్యాతి సంతానము. ఆనర్తుని కుమారుడు ప్రతాపశాలియగు రోచమానుడు. అతని దేశము ఆనర్తము. అతని రాజధాని కుశస్థలి. ఆనర్తుని కుమారుడు రేవుడు. అతని కుమారుడు రైవతుడు. అతనికే కకుద్మాన్ అనియు పేరు. ఇతడు రేవుని కుమారులు నూరుమందిలో జ్యేష్ఠుడు రైవతుని కూతురు రేవతి బలరాముని భార్యగా ప్రసిద్ధురాలు. కరూశునకు చాలమంది కుమారులు కలిగిరి. వారు కారూశులు అను పేర ప్రసిద్ధులు. పృషధ్రుడు (పృషదశ్వుడేమో?) గోవధమువలన

వృషధ్రో గోవధా చ్ఛూద్రో గురుశాపా దజాయత । ఇక్ష్వాకువంశం వక్ష్యామి శృణుధ్వ మృషిసత్తమాః. 25
ఇక్ష్వాకోః కుక్షినామాఽభూ ద్వికుక్షి ర్నామ దేవరాట్ । జ్యేష్ఠః పుత్త్రశతస్యాసీ ద్దశ పఞ్చ చ తత్సుతాః 26
మేరో రుత్తరత స్తే తు తు జాతాః పార్థివసత్తమాః । చతుర్దశోత్తరం చాఽ శత మస్యాం తదాఽభవత్. 27
మేరో ర్దక్షిణతో యే వై రాజాన స్సంప్రకీర్తితాః । జ్యేష్ఠః కకుత్స్థనామాఽభూ త్తత్సుతశ్చ సుయోధనః. 28
తస్య పుత్త్రో వృథుర్నామ విశ్వగాశ్వః పృథో స్సుతః । ఇన్ద్ర స్తస్య చ పుత్త్రోఽభూ ద్యువనాశ్వ స్తతోఽభవత్.
శ్రావస్తశ్చ మహాతేజా వత్సక స్తత్సుతోఽభవత్ । నిర్మితా యేన శ్రావస్తీ గౌడదేశే ద్విజోత్తమాః. 30
వత్సా ద్విహర్షక శ్చాభూ త్కులాద స్తత్సుతోఽభవత్ । ధున్ధుమారత్వ మగమ ద్ధున్ధో ర్నాశేన యః పురా.
తస్య పుత్త్రా స్త్రయో జాతా దృఢాశ్వో దణ్డ ఏవ చ । కపిలాశ్వశ్చ విఖ్యాతో ధౌన్ధుమారిః ప్రతాపవాన్.
దృఢాశ్వస్య ప్రమోదస్తు హర్యశ్వ స్తస్య చాత్మజః । హర్యశ్వస్య నికుమ్భోఽభూ త్సంహతాశ్వ స్తతోఽభవత్.
అకృతాశ్వో రణాశ్వశ్చ సంహతాశ్వసుతా వుభౌ । యువనాశ్వో రణాశ్వాత్తు మాంధాతా తత్సుతోఽభవత్.
మాన్ధాతుః పురుకుత్సోఽభూ ద్ధర్మకేతుశ్చ పార్థివః । ముచుకున్దశ్చ *విఖ్యాత శ్చక్రవర్తీ ప్రతాపవాన్. 35
పురుకుత్సస్య పుత్త్రోఽభూ ద్వసుదో నర్మదాపతిః । సమ్భూతి స్తస్య పుత్త్రోఽభూ త్త్రిధన్వా చ తతోఽభవత్.
త్రిధన్వన స్సుతో జాత స్త్రైయారుణ ఇతి స్మృతః । తస్య సత్యవ్రతో నామ తస్మా త్సత్యరథ స్స్మృతః.
తస్య పుత్త్రో హరిశ్చన్ద్రో హరిశ్చన్ద్రస్య లోహితః । లోహితాచ్చ వృకో జాతో వృకా ద్బాహు రజాయత.
సగర స్తస్య పుత్త్రోఽభూ ద్రాజా పరమధార్మికః । ద్వే భార్యే సగరస్యాపి ప్రభా భానుమతీ తథా. 39
తాభ్యా మారాధితః •పూర్వ మౌర్వో వై పుత్త్రకామ్యయా ।
ఔర్వ స్తుష్ట స్తయోః ప్రాదా ద్యథేష్టం వర ముత్తమమ్. 40
ఏకా షష్టి సహస్రం తు సుత మేకం తథాఽపరా । జగృహే వేదకర్తారం ప్రభా ☆గృహ్ణా త్సుతా న్బహూన్.
ఏకం భానుమతీ పుత్త్ర మసృజద్యాఽసమఞ్జసమ్ । ఏకా షష్టిసహస్రం తు సుషువే సా రవిప్రభా. 42
ఖనన్తః పృథివీం దగ్ధా విష్ణునా యేన మార్గణే । అసమఞ్జస్య తనయో హ్యంశుమాన్నామ విశ్రుతః. 43

ఋషిసత్తములారా! ఇక్ష్వాకు వంశమును చెప్పబోవుచున్నాను వినుడు. ఇక్ష్వాకునకు కుక్షి-కుక్షికి వికుక్షి అను రాజశ్రేష్ఠుడు కలిగెను. ఇతడు కుక్షి పుత్త్రుల నూరుగురలో పెద్దవాడు. వికుక్షి కుమారులలో పదునైదుమందియే పర్వతపు టుత్తర దేశమునకు ప్రభువులైరి. (ఇచ్చట ఇక్ష్వాకు కుమారుడే వికుక్షియని కొన్ని ప్రతులలో కలదు.) వీరుకాక ఇంకను నూటి పదునాల్గుమంది వికుక్షి కుమారులు మేరువునకు దక్షిణపు దేశమును పాలించిరి. వీరిలో పెద్దవాడు కకుత్స్థుడు. అతని కొడుకు సుయోధనుడు. అతని కొడుకు వృథువు. అతని కొడుకు విశ్వగాఖుడు. అతని కొడుకు ఇంద్రుడు. అతని కొడుకు యవనాశ్వుడు. అతని కొడుకు శ్రావస్తుడు. అతని కొడుకు వత్సకుడు. శ్రావస్తుడు గౌడ దేశములో తనపేర శ్రావస్తీ నగరము నిర్మించెను. వత్సుని కొడుకు విహర్షకుడు. అతని కొడుకు కులాదుడు. అతడు దుందు అనువానిని చంపి నందున దుందుమారుడని ప్రసిద్ధి పొందెను. అతనికి దృఢాశ్వుడు దండుడు కపిలాశ్వుడు అను ముగ్గురు కుమారులు. దృఢాశ్వుని కుమారుడు ప్రమోదుడు. అతని కుమారుడు హర్యశ్వుడు. అతని కుమారుడు నికుంభుడు. అతని కొడుకు సంహతాశ్వుడు. అతనికి అకృతాశ్వుడు రణాశ్వుడు అను ఇద్దరు కుమారులు. రణాశ్వుని కుమారుడు యవనాశ్వుడు. అతని కుమారుడు మాంధాత. అతని కుమారులు పురుకుత్సుడు-ధర్మకేతుడు-ముచుకుందుడు శత్రుజిత్ అను వారు నలుగురు. పురుకుత్సుని కుమారుడు వసుదుడు. అతడు నర్మదకు పతి. అతని కొడుకు సంభూతి. అతని కొడుకు త్రిధన్వుడు. అతని కుమారుడు త్రైయారుణుడు. అతని కుమారుడు సత్యవ్రతుడు. అతని పుత్త్రుడు సత్యరథుడు. అతని

* విఖ్యాతశ్శత్రుజిచ్చ. •పూర్వమౌర్వాగ్నిః. ☆గృహ్య.

సుతుడు హరిశ్చంద్రుడు. అతని తనయుడు లోహితుడు. అతని కుమారుడు. వృకుడు. అతని కొడుకు బాహుడు. అతని పుత్త్రుడు సగరుడు. అతడు పరమ ధార్మికుడు. అతనికి ప్రభ భానుమతి అను ఇద్దరు భార్యలు. వారు పుత్త్రులను కనగోరి ఔర్వమునిని ఆరాధించిరి. అతడు మెచ్చి వారికి కోరిన వరములనిచ్చెను. ఆ వరప్రభావమున ప్రభకు అరువదివేలమంది కుమారులు కలిగిరి. భానుమతికి అసమంజుడు అను ఒకే కుమారుడు కలిగెను. వారిలో అరువదివేలమందియు భూమిని త్రవ్వుచు (కపిలరూపుడగు) విష్ణునిచే దగ్ధులైరి. అసమంజుని కుమారుడు అంశుమంతుడని ప్రసిద్ధినొందెను.

తస్య పుత్త్రో దిలీపస్తు దిలీపాత్తు భగీరథః । యేన భాగీరథీ గఙ్గా తప స్తప్త్వాఽవతారితా. 44
భగీరథస్య తనయో నాభాగ ఇతి విశ్రుతః । నాభాగస్యామ్బరీషోఽభూ త్సిన్ధుద్వీప స్తతోఽభవత్ 45
తస్యాయుతాయుః పుత్త్రోఽభూ దృతుపర్ణ స్తతోఽభవత్ । తస్య కల్మాషపాదస్తు సర్వకల్ప స్తతోఽభవత్.
తస్యానరణ్యః పుత్త్రోఽభూ న్నిఘ్న స్తస్య సుతోఽభవత్ । నిఘ్నపుత్త్రౌ వుభౌ జాతా వనమిత్ర రఘూ నృపౌ.
అనమిత్రో వన మగా ద్భవితా స కృతే నృపః । రఘో రభూ ద్దిలీపస్తు దిలీపా దజక స్తథా. 48
దీర్ఘబాహు రజా జ్జాత స్త్వజపాల స్తతోఽభవత్ । తతో దశరథో రాజా తస్య పుత్త్రచతుష్టయమ్. 49
నారాయణాంశజా స్సర్వే రామ స్తేష్వగ్రజోఽభవత్ । రావణాన్తకర స్తద్వ ద్రఘూణాం వంశవర్ధనః. 50
వాల్మీకి స్తస్య చరితం చక్రే భార్గవసత్తమః । తస్య పుత్త్రౌ కుశలవా విక్ష్వాకుకులవర్ధనౌ. 51
అతిథిస్తు కుశా జ్జజ్ఞే నిషధ స్తస్య చాత్మజః । నలస్తు నిషధా త్తస్మా న్నభా స్తస్మా దజాయత. 52
నభసః పుణ్డరీకోఽభూ త్క్షేమధన్వా తత స్స్మృతః । తస్య పుత్త్రోఽభవ ద్వీరో దేవానీకః ప్రతాపవాన్. 53
అహీనగ స్తస్య సుత స్సహస్రాశ్వ స్తతః పరః । తత శ్చన్ద్రావలోకస్తు తారాపీడ స్తతోఽభవత్. 54
తస్యాత్మజ శ్చన్ద్రగిరి ర్భానుచిత్ర స్తతోఽభవత్ । శ్రుతాయు రభవ త్తస్మా ద్భారతే యో నిపాతితః. 55
నలౌ ద్వావేవ విఖ్యాతౌ వంశే కశ్యపసమ్భవే । వీరసేనసుత స్తద్వ న్నైషధ శ్చాపరో మతః. 56
ఏవం వివస్వతో వంశే రాజానో భూరిదక్షిణాః । ఇక్ష్వాకు వంశప్రభవాః ప్రాధాన్యేన ప్రకీర్తితాః. 57

ఇతి శ్రీమత్స్యమహాపురాణే మత్స్యమనుసంవాదే సూర్యవంశవర్ణనం నామ ద్వాదశోఽధ్యాయః.

అంశుమంతుని కుమారుడు దిలీపుడు. అతని సుతుడు భగీరథుడు. అతడే తపస్సుచే గంగను భూమికి తెచ్చెను. కనుకనే గంగ భాగీరథియైనది. అతని కొడుకు నాభాగుడు. అతని కుమారుడు అంబరీషుడు అతని కుమారుడు సింధు ద్వీపుడు. అతని సుతుడు అయుతాయుడు. అతని పుత్త్రుడు ఋతుపర్ణుడు. అతని కొడుకు కల్మాషపాదుడు. అతని కుమారుడు సర్వకల్పుడు. అతని కొడుకు అనరణ్యుడు. అతని కుమారుడు నిఘ్నుడు. అతనికి అనమిత్రుడు రఘువు అను ఇద్దరు కుమారులు. రఘుని కుమారుడు దిలీపుడు. అతని కుమారుడు అజుడు. అతని సుతుడు దీర్ఘబాహువు. అతని పుత్త్రుడు అజపాలుడు. అతని కుమారుడు దశరథుడు, అతనికి నారాయణుని అంశవలన నలుగురు కుమారులు కలిగిరి. వారిలో జ్యేష్ఠుడు రాముడు. రావణుని అంతమొందించినవాడు అతడే. ఆయన రఘువుల వంశమునకు సమృద్ధిని శుభమును కలిగించినవాడు భృగువంశ శ్రేష్ఠుడగు వాల్మీకి అతని చరితమును రచించెను. ఇక్ష్వాకు వంశ వర్ధనులగు లవకుశులను ఇద్దరు అతని కుమారులు. కుశుని కుమారుడు అతిథి. అతని కుమారుడు నిషధుడు. అతని కుమారుడు నలుడు. అతని కుమారుడు నభుడు. అతని కుమారుడు పుండరీకుడు. అతని కొడుకు క్షేమధన్వుడు. అతని కుమారుడు వీరుడు ప్రతాపవంతుడునగు దేవానీకుడు. అతని కొడుకు అహీనగుడు. అతని కుమారుడు సహస్రాశ్వుడు. అతని కొడుకు చంద్రావలోకుడు. అతని కుమారుడు తారాపీడుడు. అతని కుమారుడు చంద్రగిరి. అతని సుతుడు భానుచిత్రుడు. అతని పుత్త్రుడు శ్రుతాయువు. భారతయుద్ధమున మరణించిన శ్రుతాయువు ఇతడే. కశ్యపవంశమున పుట్టి ప్రసిద్ధినొందిన నలులు ఇద్దరు. వారిలో ఒకడు వీరసేనుని కుమారుడు. మరియొకడు నిషధుని కుమారుడగుటచే నైషధుడనబడిన నలుడు.

వివస్వంతుని (సూర్యుని) వంశమున జన్మించి బంగారునాణెములనే బంగారమునే అనేకవిధ ద్రవ్యములనే దక్షిణలుగా ఇచ్చి భూరిదక్షిణలు యజ్ఞముల నాచరించి ప్రసిద్ధులయి లోకములకు మేలుచేసిన రాజులు వీరు. వీరిలోను ఇక్ష్వాకు వంశమున జన్మించిన వారే ప్రధానముగా ఇచట పేర్కొనబడినారు. (అనమిత్రుడు కృతయుగమున రాజగును.)

ఇది శ్రీమత్స్య మహాపురాణమున మత్స్యమను సంవాదమున సూర్య వంశ వర్ణనమను ద్వాదశాధ్యాయము.

## త్రయోదశోఽధ్యాయః.

### శ్రాద్ధకల్పః-పితృవంశానువర్ణనమ్.

మనుః భగవ న్ఛ్రోతు మిచ్ఛామి పితౄణాం వంశముత్తమమ్ ।
రవేశ్చ శ్రాద్ధదేవత్వం సోమస్య చ విశేషతః. 1
మత్స్యః: అహం తే కథయిష్యామి పితౄణాం వంశ ముత్తమమ్ ।
స్వర్గే పితృగణా స్సప్త త్రయ స్తేషా మమూర్తయః. 2
మూర్తిమన్తోఽథ చత్వార స్సర్వేషా మమితౌజసః । అమూర్తయః పితృగణా వైరాజస్య ప్రజాపతేః. 3
యజన్తి యా న్దేవగణా వైరాజా ఇతి విశ్రుతాః । దివి తే యోగవిభ్రష్టాః ప్రాప్తుం లోకా న్సనాతనాన్. 4
పున ర్బ్రహ్మదినాన్తే తు జాయన్తే బ్రహ్మవాదినః ।
సమ్ప్రాప్య తాం స్మృతిం భూయో యోగం సాఙ్ఖ్య మనుత్తమమ్. 5
సిద్ధిం ప్రయాన్తి యోగేన పునరావృత్తి దుర్లభామ్ । యోగినామేవ దేయాని తస్మా చ్ఛ్రాద్ధాని దాతృభిః. 6
ఏతేషాం మానసీ కన్యా పత్నీ హిమవతో మతా । మైనాక స్తస్య దాయాదః* క్రౌఞ్చ స్తస్య సుతోఽభవత్.
క్రౌఞ్చద్వీప స్స్మృతో యేన చతుర్థో ఘృతసంవృతః । మేనా తు సుషువే తిస్రః కన్యా యోగవతీ స్తతః. 8
ఉమైకవర్ణాఽపర్ణా చ తీవ్రవ్రతపరాయణాః । రుద్రస్యైకా భృగోశ్చైకా జైగిషవ్యస్య చాపరా. 9

## త్రయోదశాధ్యాయము.

### పితృవంశానువర్ణనము-వైరాజపితరుల చరితము.

మనువు మత్స్యనారాయణునితో ఇట్లు పలికెను : భగవన్! ఉత్తమమగు పితరుల వంశమును విన కుతూహల పడుచున్నాను. విశేషించి రవియు సోముడును శ్రాద్ధదేవులయిన వృత్తాంతమును వినగోరుచున్నాను.

మత్స్యనారాయణుడు ఇట్లు చెప్పనారంభించెను: అత్యంత ప్రధానమగు పితృవంశ వృత్తాంతమును నీకు తెలుపుదును. వినుము. స్వర్గలోకమునందు పితృదేవతాగణములు ఏడు కలవు. వీనిలో మూడు గణములు మూర్తి (రూపము) లేనివి. మరి మిగిలిన నాలుగును మూర్తి కలవి. ఈ ఏడు గణముల పితరులును ప్రాణులందరలో అమితమగు ఓజస్సు (సామర్థ్యము) కలవారు.

మూర్తిలేని పితరులు వైరాజుడు అను ప్రజాపతికి (కుమారులు) సంబంధించిన వారు. వీరు ద్యులోకమునందు ఉందురు. (మూర్తి లేని పితరులు బుద్ధితత్త్వదశలోనివారును అమూర్తములగు ఆకాశవాయు భూతములతో రూపొందినవారును. మూర్తి కల పితరులు మూర్తములగు తేజో భూతముతో కూడ నిర్మితమయిన శరీరము కలవారు. జలపృథివీ భూతములు కూడ కలిసి వారి దేహమును నిర్మించినచో వారును భూలోకమునందలి మనవంటి ప్రాణులలోనివారే అగుదురు కాని దేవతలు కారు.) వీరినే ఎల్లవారును ఆరాధించుచుందురు. వైరాజులు అని ప్రసిద్ధిపొందిన ఈ అమూర్తములైన పితృగణములవారు శాశ్వతములగు లోకములను పొందగోరి ఒకప్పుడు యోగసాధనము చేసి యోగమునుండి భ్రష్టులైనవారు. వీరిట్లు చాలకాలము పితృ దేవతలుగా నుందురు. కల్పావసానమైన తరువాత మరల సృష్టి ఆరంభము కాగానే వేదతత్త్వ

---

* క్రౌఞ్చ స్తస్యాగ్రజోఽభవత్.

జ్ఞులుగా జన్మింతురు. వారపుడు తమ పూర్వ స్మృతి కలిగియుండి యోగసాధనమునకై సంకల్పింతురు. సర్వోత్తమమగు సాంఖ్యయోగమును ఆశ్రయించి పునరావృత్తి (మరల సంసారములోనికి వచ్చుట) లేని శాశ్వతగతిని పొందుదురు. ఇట్లు పితరులు యోగిరూపులు అని తెలియుచున్నది. కనుక లోకమునందు మానవులు కూడ శ్రాద్ధమునందు చేయు ఏదానము నైనను యోగము నెఱిగి అనుష్ఠించువారికే చేయవలెను.

ఈ పితరుల మానసీ (మనస్సంకల్పముచేతనే కలిగిన) కన్య మేన అనునామె. ఆమె హిమవంతుని పత్ని యైనది. హిమవంతుని కుమారుడు మైనాకుడు. అతని కొడుకు క్రౌంచుడు. అతని పేరుతోనే ఘృత సముద్రముతో చుట్టబడిన క్రౌంచద్వీపము ఏర్పడినది. ఇది ద్వీపములలో నాలుగవది.

'మేన'కు ముగ్గురు కుమార్తెలు కలిగిరి. వారు ఉమ-ఏకపర్ణ-అపర్ణ-అనువారు. వారు ముగ్గురును యోగసిద్ధి కలవారు. తీవ్రవ్రత పరాయణలు. తమ తపస్సుచే సర్వలోక జనులకంటె గొప్పవారు అగువీరిలో హిమవంతుడు ఉమను రుద్రునకును ఏకపర్ణను భృగువునకును అపర్ణను జైగిషవ్యునకును ఇచ్చి వివాహము చేసెను.

దత్తా హిమవతా బాలా స్సర్వలోకతపోధికాః ।
ఋషయః: కస్మా ద్దాక్షాయణీ పూర్వం దదాహాత్మాన మాత్మనా. 10
హిమవద్దుహితా తద్వ త్కథం జాతా మహీతలే । శఙ్కరస్య కృతాఽవజ్ఞా కథం వై బ్రహ్మసూనునా. 11
సంహరన్తీ కిముక్తాఽసౌ సుతా వా బ్రహ్మసూనునా । దక్షేణ లోకజననీ సూత విస్తరతో వద ।
సూతః: దక్షస్య యజ్ఞే వితతే ప్రభూతవరదక్షిణే. 12
♦ సమాగతేషు దేవేషు ప్రోవాచ పితరం సతీ । కిమర్థం తాత భర్తా మే యజ్ఞేఽస్మి న్న నిమన్త్రితః. 13
అయోగ్య ఇతి తా మాహ దక్షో యజ్ఞేషు శూలభృత్ । ఉపసంహారకో రుద్ర స్తేనామఙ్గళభా గయమ్. 14
చుకోపాథ సతీ దేహం త్యక్ష్యామీతి తదుద్భవమ్ । దశానాం త్వం చ భవితా పితౄణా మేకపుత్త్రికః. 15
త్వత్కృతే త్వశ్వమేధశ్చ రుద్రాద్వై నాశ మేష్యతి । ఇత్యుక్త్వా యోగ మాస్థాయ స్వదేహోద్భవతేజసా. 16
నిర్దహన్తీ తదాత్మానం సదేవాసురకిన్నరైః । కిం కి మేత దితి ప్రోక్తా గన్ధర్వగణగుహ్యకైః. 17
ఉపగమ్యాబ్రవీ ద్దక్షః ప్రణిపత్యాథ దుఃఖితః । త్వ మస్య జగతో మాతా జగత్సౌభాగ్యదేవతా. 18
దుహితృత్వం గతా దేవి మమానుగ్రహకామ్యయా । న త్వయా రహితం కించి ద్బ్రహ్మాణ్డేఽస్తి చరాచరమ్.
ప్రసాదం కురు ధర్మజ్ఞే మా మాం త్యక్తు మిహార్హసి । ప్రాహ దేవీ యథారబ్ధం తత్కార్యం మే న సంశయః.
కిం త్వవశ్య మహం మన్యే హతో యజ్ఞశ్చ శూలినా । ప్రసాద్య లోకసృష్ట్యర్థం తపః కార్యం మమాన్తికే.
ప్రజాపతి స్త్వం భవితా దశానాం మఙ్గళప్రదః । మదంశేనాఙ్గనా ష్షష్టి ర్భవిష్య న్త్యఙ్గజా స్తవ. 22
మత్సన్నిధౌ తపః కుర్వ న్ప్రాప్స్యసే యోగ ముత్తమమ్ । ఏవ ముక్తోఽబ్రవీ ద్దక్షః కేషు కేషు మయాఽనఘే.
తీర్థేషు చ త్వం ద్రష్టవ్యా స్తోతవ్యా కైశ్చ నామభిః । దేవీ: సర్వదా సర్వభూతేషు ద్రష్టవ్యా సర్వతో భువి.
సప్తలోకేషు యత్కిఞ్చి ద్రహితం న మయా హి తత్ । తథాపి యేషు స్థానేషు ద్రష్టవ్యా సిద్ధి మీప్సుభిః. 25
స్మర్తవ్యా భూతికామైర్వా తాని వక్ష్యామి తత్త్వతః ।

శౌనకాది ఋషులు సూతుని ఇట్లడిగిరి: "పూర్వము దాక్షాయణి (దక్షుని కూతురు అగు సతి) తన దేహమును తానే ఏల కాల్చుకొనెను? ఆమె భూతలమున హిమవంతుని కూతురుగా ఎట్లు జన్మించెను? దక్షుడు బ్రహ్మమానస సుతుడై యుండియు శంకరుని ఎట్లు ఏల అవమానించెను? తన కూతురును లోక జననియు అగు సతి తన దేహమును కాల్చుకొను నప్పుడు దక్షుడు ఏమనెను? మాకు విస్తరించి చెప్పుడు."

సూతుడు ఋషులతో ఇట్లు పలికెను: అధిక సంఖ్యగల శ్రేష్ఠములగు దక్షిణలతో దక్షుడు యజ్ఞమును వితతము (శ్రౌతకల్పమున చెప్పిన విధమున జరుపబడునది) చేయుచుండెను. (శివుడు తప్ప మిగిలిన) దేవతలు అందరును యజ్ఞమునకు వచ్చియుండిరి. అపుడు సతీదేవి తన తండ్రిని "నాయనా! ఈ యజ్ఞమునకు నా భర్తను ఏల పిలువలేదు?" అని అడిగెను. శూలధారి యగు రుద్రుడు నీ భర్త యజ్ఞములందు వచ్చుటకు యోగ్యుడు కాడు. అతడు సృష్టిని ఉపసంహరించు (నశింపజేయు) వాడు. అందుచేత అతడు అశుభములను ఆశ్రయించి యున్నవాడై యాడు. (శుభములకు పనికిరాడు.) అని దక్షుడు పలికెను. అంతట సతి కోపించెను. నీవలన ఉత్పన్నమైనందున నా ఈ దేహమును విడిచెదను. అని ఆమె పలికెను. నీవు పదిమంది తండ్రులకు ఒక్కడవే కుమారుడవు అయ్యెదవు. నీవు చేసిన ఈ దోషమునకు ఫలముగా నీ ఈ అశ్వమేధము రుద్రుని చేతిలో నాశమునందును. అని పలికి సతీదేవి యోగమును పూని తన దేహమునుండి ఉత్పన్నమయిన అగ్నితోనే తన శరీరమును దహింపజేసికొనుచుండెను. అది చూచి దేవతలు అసురులు గుహ్యకులు కిన్నరులు గంధర్వులును దక్షునితో ఇది ఏమి? (ఇట్లు జరుగనిచ్చితివి?) అనిరి. అంతట దక్షుడు ఆమె దగ్గరకు వచ్చి దుఃఖించుచు నమస్కరించి ఇట్లు పలికెను: "నీవు ఈ జగత్తునకు మాతవు. జగత్తులకు సౌభాగ్య దేవతవు. నన్ను అనుగ్రహించు తలంపుతోనే నీవు నాకు పుత్త్రికవయితివి. నీవు లేనిది నీవు కానిది ఈ బ్రహ్మాండమునందు చరము కాని అచరము కాని (కదలునది కదలనిది) అగు ఏపదార్థమును లేదు. నీవు ధర్మము నెరిగినదానవు. నన్ను అనుగ్రహించుము. నన్ను విడువవలదని వేడుచున్నాను."

దేవి దక్షునితో ఇట్లు పలికెను: "నేను ఏమి చేయ సంకల్పించి ఆరంభించితినో అది నేను చేసియే తీరుదును. అందు సందేహములేదు. దేవి వస్తుస్థితిలో ఇచ్ఛాదిశక్తిత్రయ స్వరూపురాలు-ఇచ్ఛ అనగా సంకల్పము. ఆమె తాను సంకల్పించిన దానిని తన జ్ఞానశక్తితో ఆలోచించి క్రియా శక్తితో నిర్మాణము చేయును. అని తత్త్వమున అర్థము.) (నీవు నన్ను భక్తితో ప్రార్థించుచున్నావు.) కాని నా సంకల్పానుసారము శివుని చేతిలో నీ యజ్ఞము నాశము కాక తప్పదు. నన్ననుగ్రహింప జేసికొని నా దయచే లోక సృష్టిని సాధించుటకై నీవు నా సన్నిధిలో ఉండి తపస్సు ఆచరించుము. పదిమంది ప్రజాపతులలోను నీవు శుభకరుడవు అయ్యెదవు. నా అంశముతో నీకు అరువదిమంది కూతుండ్రు కలిగెదరు. నా సన్నిధిలో తపమాచరించినచో నీవు ఉత్తమమగు యోగసిద్ధిని పొందెదవు."

దేవి మాటలు విని దక్షు డామెతో "ఏయే తీర్థములందు నీవున్నట్లు భావించి నిన్ను దర్శించవలెను? ఏ నామములతో నిన్ను స్తుతి చేయువలెను?" అనెను.

దేవి ఇట్లు పలికెను: సర్వకాలములందును భూమియందలి (భూమిపై) సర్వ ప్రదేశములందు సర్వభూతములందును నేనున్నట్లు దర్శించవలయును. ఏలయన సప్తలోకములందును ఏయే వస్తువులు కలవో వానిలో ఏయొక్కటియు నేను లేనిదియు నేను కానిదియు లేదు. ఐనను తాము కోరిన ఫలములు సిద్ధింపగోరినవారు కాని అభ్యుదయమునో నిశ్శ్రేయసమునో కోరినవారు (ఇహ-పరసుఖముల కోరినవారు) కాని ఏయే స్థానములందు నన్ను (ఏరూపమున) స్మరింపవలెనో వానిని వాస్తవ స్థితిలో చెప్పుచున్నాను.

దక్షాయ దేవ్యా ప్రోక్తస్వీయాష్టోత్తరశతస్థానాని.

వారాణస్యాం విశాలాక్షీ నైమిశే లిఙ్గధారిణీ. 26
ప్రయాగే లలితా దేవీ కాముకా గన్ధమాదనే । మానసే కుముదా నామ విశ్వా విశ్వేశ్వరే విదుః. 27
మా నామ విశ్వకాయాం తు ఇచ్ఛాయాం మదనోత్కటా । గోమన్తే గోమతీ నామ మన్దారే కామచారిణీ. 28
మదోత్కటా చైత్రరథే జయన్తీ హస్తినాపురే । కన్యాకుబ్జే తథా గౌరీ రమ్భా మలయపర్వతే. 29
సత్యా హిమవతః పృష్ఠే గోకర్ణే భద్రకర్ణికా । స్థాణ్వీశ్వరే భవానీతి బిల్వకే బిల్వపత్రికా. 30
శ్రీశైలే మాధవీ నామ భద్రా భద్రేశ్వరే తథా । జయా వరాహశైలే తు కమలా కమలాలయే. 31

ష్కరే పురుహూతేతి కేదారే మార్గదాయినీ । రుద్రకోట్యాం తు రుద్రాణీ కాళీ కాళఞ్జరే గిరౌ. 32
హాలిఙ్గేతు కపిలా మకుటే మకుటేశ్వరీ । సాలగ్రామే మహాదేవీ శివలిఙ్గే శివప్రియా. 33
మాయాపుర్యాం కుమారీ తు సన్తతా లలితే తథా । ఉత్పలాక్షే సహస్రాక్షీ హిరణ్యాక్షీ మహోత్పలే. 34
యాయాం మఙ్గళా నామ విపులా పురుషోత్తమే । విపాశాయా మమోఘాక్షీ పాటలా పుణ్డ్రవర్ధనే. 35
నారాయణీ సుపార్శ్వేతు త్రికూటే భద్రసున్దరీ । విపులే విపులా నామ కల్యాణీ మలయాచలే. 36
కోట్యక్షీ కోటితీర్థే తు సుగన్ధా మాగధే వనే । కుబ్జామ్రకే త్రిసన్ధ్యా తు గఙ్గాద్వారే రతిప్రియా. 37
వకుణ్డే సునన్దా చ నన్దినీ దేవికాతటే । రుక్మిణీ ద్వారవత్యాం తు రాధా బృన్దావనే వనే. 38
దేవకీ మథురాయాం తు పాతాళే పరమేశ్వరీ । చిత్రకూటే తథా సీతా విన్ధ్యే విన్ధ్యనివాసినీ. 39
సహ్యాద్రా వేకవీరాతు హరిశ్చన్ద్రేతు చన్ద్రికా । రమణా రామతీర్థేతు యమునాయాం మృగావతీ. 40
కరవీరే మహాలక్ష్మీ రుమాదేవీ వినాయకే । ఆరోగ్యా వైద్యనాథేతు మహాకాళే మహేశ్వరీ. 41
అభయా శుక్లతీర్థే తు సృత్రిర్వా విన్ధ్యకన్దరే । మాణ్డవ్యే మాణ్డకీనామ స్వాహా మాహేశ్వరే పురే. 42
ఛాగలాణ్డే ప్రచణ్డాచ చణ్డికాఽమరకణ్టకే । సోమేశ్వరే వరారోహా ప్రభాసే పుష్కరావతీ. 43
దేవమాతా సరస్వత్యాం పారావారతటే మతా । మహాలయే మహాభాగా పయోష్ణే పిఙ్గళావతీ. 44
సింహికా కృతశౌచే తు కార్తికేయే *యశస్కరీ । ఉత్పలావర్తకే లోలా సుభద్రా సిన్ధుసఙ్గమే. 45
మాతా సిద్ధవనే లక్ష్మీ రనఙ్గా భరతాశ్రమే । జాలన్ధరే విశ్వముఖీ తారా కిష్కిన్ధపర్వతే. 46
దేవదారువనే పుష్టి ర్మేధా కాశ్మీరమణ్డలే । ♦ఉమాదేవీ హిమాద్రౌ తు షష్ఠే వస్త్రేశ్వరీ తథా. 47
కపాలమోచనే శుద్ధి ర్మాతా కాయావరోహణే । శఙ్ఖద్వారే ధ్వనిర్నామ ధృతిః పిణ్డారకే తథా. 48
కలాతు చన్ద్రభాగాయా మచ్ఛోదే శూలధారిణీ । వైణాయా మమృతా నామ బదర్యా మూర్వశీ తథా. 49
ఓషధీ చోత్తరకురౌ కుశద్వీపే కుశోదకీ । మన్మథా హేమకూటే తు కుముదే సత్యవాదినీ. 50
అశ్వత్థే వన్దనీయాతు (ని) విధి ర్వైశ్రవణాలయే । గాయత్రీ వేదవదనే పార్వతీ శివసన్నిధౌ. 51
దేవలోకే తథేన్ద్రాణీ బ్రహ్మాంగేతు సరస్వతీ । సూర్యబిమ్బే ప్రభానా మ మాతౄణాం వైష్ణవీ తథా. 52
అరున్ధతీ సతీనాంతు రామాసుచ తిలోత్తమా । చిత్తే బ్రహ్మకలా నామ శక్తి స్సర్వశరీరిణామ్. 53

దక్షునకు శ్రీదేవి తన అష్టోత్తర శతస్థానములను తెలుపుట

1. వారాణసియందు విశాలాక్షి-2. నైమిశమున లింగధారిణి-3. ప్రయాగయందు శ్రీలలితాదేవి-4. గంధమాదన (పర్వత)మున కాముక-5. మానససరః క్షేత్రమున కుముద-6. విశ్వేశ్వరమున విశ్వ-7. విశ్వకయందు మా(లక్ష్మి)-8. ఇచ్ఛాక్షేత్రమున మదనోత్కట-9. గోమంతమున గోమతి-10. మందారమున కామచారిణి-11. చిత్రరథమున మదోత్కట-12. హస్తినాపురమున జయంతి-13. కాన్యకుబ్జమున గౌరి-14. మలయపర్వతమున రంభ-15. హిమవత్పర్వత సానువునందు నంద-16. గోకర్ణమున భద్రకర్ణిక-17. స్థాణ్వీశ్వరమున భవాని-18. బిల్వకమున బిల్వపత్రిక-19. శ్రీశైలమున మాధవి-20. భద్రేశ్వరమున భద్ర-21. వరాహశైలమున జయ-22. కమలాలయమున కంబళ-23. పుష్కరక్షేత్రమున పురుహూత-24. కేదార క్షేత్రమున మార్గదాయిని-25. రుద్రకోటియందు రుద్రాణి-26. కాలంజర పర్వతమున కాళి-27. మహాలింగక్షేత్రమున కపిల-28. మకుట క్షేత్రమున మకుట-29. సాలగ్రామక్షేత్రమున మహాదేవి-30. శివలింగక్షేత్రమున శివప్రియ-31. మాయాపురి (జగన్నాథక్షేత్రము) యందు కుమారి-32. లలితమునందు సంతత-33. ఉత్పలాక్షమున సహస్రాక్షి-34. మహోత్పలమున హిరణ్యాక్షి-35. గయయందు మంగళ-36. పురుషోత్తమమున

---

* తుళాజస్కరీ. ♦ భీమాదేవీ.

విపుల-37. విపాశా నదీక్షేత్రమున అమోఘాక్షి-38. పుండ్రవర్ధనమున పాటల-39. సుపార్శ్వమున నారాయణి-
40. త్రికూట (పర్వత)మున భద్రసుందరి-41. విపులక్షేత్రమున విపుల-42. మలయాచలమున కల్యాణి-43. కోటి
తీర్థమున కోట్యాక్షి-44. మాగధవనమున సుగంధ-45. కుబ్జామ్రకక్షేత్రమున త్రిసంధ్య-46. గంగాద్వారము (హరిద్వారమున
రతిప్రియ-47. శివకుండ తీర్థమున సునంద-48. దేవికానదీతటమున నందిని-49. ద్వారకయందు రుక్మిణి-50. బృందా
వనమున రాధ-51. మథురయందు దేవకి-52. పాతాళమున పరమేశ్వరి-53. చిత్రకూటమున సీత-54. వింధ్యమున
వింధ్యవాసిని-55. సహ్యపర్వతమున (పడమటి కనుమలు) ఏకవీర-56. హరిశ్చంద్రమున చంద్రిక-57. రామతీర్థమున
రమణ-58. యమునాతీరమున మృగావతి-59. కరవీరమున మహాలక్ష్మి-60. వినాయకమున ఉమ-61. వైద్యనాథమున
ఆరోగ్య-62. మహాకాళమున మహేశ్వరి-63. శుక్లతీర్థమున అభయ-64. వింధ్య కందరమున స్మృతి-65 మాండవ్యమున
మాండకి-66. మహేశ్వరపురమున స్వాహా-67. ఛాగలాండమున ప్రచండ-68. అమరకంటకమున చండిక-69. సోమే
శ్వరమున వరారోహ-70. ప్రభాసమున పుష్కరావతి-71. సముద్రతీరమునందు సరస్వతీతీరమున దేవమాత-72 మహా
లయమున మహాభాగ-73. పయోష్ణమున పింగళావతి-74. కృతశౌచ క్షేత్రమున సింహిక-75. కార్తికేయ క్షేత్రమున
యశస్కరి-76. ఉత్పలావర్తకమున లోల-77. సాగర సంగమమున సుభద్ర-78. సిద్ధవనమున లక్ష్మీమాత-79. భరతా
శ్రమమున అనంగ-80. జాలంధరమున విశ్వముఖి-81. కిష్కింధ పర్వతమున తార-82. దేవదారువనమున పుష్టి-
83. కాశ్మీరమండలమున మేధ-84. హిమాద్రియందు ఉమాదేవి-85. షష్ఠక్షేత్రమున వస్త్రేశ్వరి-86. కపాలమోచనమున
శుద్ధి-87. కాయావరోహణమున మాత-88. శంఖద్వారమున ధ్వని-89. పిండారకమున ధృతి-90. చంద్రభాగాతీరమున
కల-91. అచ్ఛోదమున శూలధారిణి-92. వైణాక్షేత్రమున అమృత-93. బదరీక్షేత్రమున ఊర్వశి-94. ఉత్తరకురువు
లందు ఓషధి-95. కుశద్వీపమునందు కుశోదకి-96. హేమకూటమున మన్మథ-97. కుముదమున సత్యవాదిని-98. అశ్వత్థ
మున వందనీయ-99. వైశ్రవణాలయమున(ని)విధి-100. వేదవదనమున గాయత్రి-101. శివసంనిధియందు పార్వతి-
102. దేవలోకమునందు ఇంద్రాణి 103. బ్రహ్మశరీరమున సరస్వతి-104. సూర్యబింబమునందు ప్రభ-105 సప్త
మాతృకలయందు వైష్ణవి-106. పతివ్రతలయందు అరుంధతి-107. సుందరులగు స్త్రీలయందు తిలోత్తమ-108. సర్వ
ప్రాణుల చిత్తములందును బ్రహ్మకలయను శక్తి.

ఏతదుద్దేశతః ప్రోక్తం నామాష్టశత ముత్తమమ్ । అష్టోత్తరంచ తీర్థానాం శతమేత దుదాహృతమ్. 54
యస్స్మరే చ్ఛృణుయాద్వాపి సర్వపాపైః ప్రముచ్యతే । ఏషు తీర్థేషు యః కృత్వా స్నానం పశ్యతి మాం నరః.
సర్వపాపవినిర్ముక్తః కల్పం శివపురే వసేత్ । యస్తు మత్పరమః కాలం నయ త్యేతేషు మానవః. 56
స హిత్వా బ్రహ్మసదనం పద మభ్యేతి శాఙ్కరమ్ । మన్నామాష్టశతం యస్తు శ్రావయే చ్ఛివసన్నిధౌ. 57
తృతీయాయా మథాష్టమ్యాం బహుపుత్త్రో భవే న్నరః । గోదానే శ్రాద్ధదానే వా అహన్యహని వా పునః.58
దేవతార్చావిధౌ విద్వా న్పఠ న్బ్రహ్మాధిగచ్ఛతి । సూతః: ఏవం వద న్తీ సా తత్ర దదాహాత్మాన మాత్మనా.59
స్వాయమ్భువోఽపి కాలేన దక్షః ప్రాచేతసోఽభవత్ । పార్వతీ చాభవద్దేవీ శివదేహార్ధధారిణీ. 60
మేనాగర్భసముత్పన్నా భుక్తిముక్తిఫలప్రదా । అరున్ధతీ జప న్త్యేత దవాప్తా యోగముత్తమమ్. 61
పురూరవాశ్చ రాజర్షి ర్లోకానిష్టా నగాత్పరాన్ । యయాతిః పుత్త్రలాభం చ ధనలాభంచ భార్గవః. 62
తథాన్యే దేవదైత్యాశ్చ బ్రాహ్మణాః క్షత్త్రియా స్తథా । వైశ్యాశ్శూద్రాశ్చ బహవ స్సంస్మృత్వా సిద్ధిం యథేప్సితమ్.
యత్రైత ల్లిఖితం తిష్ఠే త్పూజ్యతే దేవసన్నిధౌ । న తత్ర శోకో దౌర్గత్యం కదాచిదపి జాయతే. 64

ఇతి శ్రీమత్స్యమహాపురాణే మత్స్యమనుసంవాదే గౌరీనామాష్టోత్తర
శతకథనం నామ త్రయోదశోఽధ్యాయః.

ఇట్లు ఇచ్చట శ్రీదేవి నామములను నూట ఎనిమిదింటిని పేర్కొనుట మాత్రము (వాటి అర్థములతో శ్రీదేవీ తత్త్వమును వివరించకయే) ఐనది. ఈ పేర్కొన్న నూట ఎనిమిది తీర్థక్షేత్రములను విన్నను స్మరించినను సర్వ పాపములనుండి ముక్తి లభించును ఈ తీర్థములయందు స్నానముచేసి నన్ను దర్శించినవారు సర్వపాపముక్తులై కల్పమంతకాలమును శివపురమున వసింతురు. నాయందు తత్పరత కలిగి ఈ క్షేత్రములందు నివసించువారు బ్రహ్మలోకమును గూడ దాటి శివలోకమును చేరుదురు శుక్లపక్షమున తృతీయయందుగాని అష్టమినాడుగాని శివ సన్నిధియందు నా ఈ అష్టోత్తర శత నామములను వినిపించినవారు బహుపుత్త్రవంతులగుదురు. గోదాన శ్రాద్ధ దాన కాలములందుగాని అను దినమునసుగాని దేవతార్చనా సమయమునగాని దీనిని పఠించు వివేకులు బ్రహ్మపదమును పొందుదురు.

ఇట్లు పలుకుచునే శ్రీ సతీదేవి తన దేహమును స్వయముగా దహించుకొనెను. (చిత్స్వరూపగా అయ్యెను.)

మొదట స్వయం భూ బ్రహ్మయొక్క దక్షిణాంగుష్ఠమునుండి జనించి స్వాయంభువుడనబడిన ఈ దక్షుడే (తన కుమార్తెయగు సతీదేవి శాపముచే) ప్రచేతసులనబడు పదిమందికి కుమారుడుగా దక్షుడై (మరల) పుట్టెను. సతీదేవియు పార్వతియై పుట్టి శివుని అర్ధాంగమునకు స్వామినియయ్యెను. ఈ రెండవ జన్మమున ఆమె మేన గర్భమున దు జనించి భుక్తి ముక్తి ఫలప్రదయైనది. అరుంధతి ఈ విషయమును (ఈ అష్టోత్తర శత నామములను) జపించుచు ఉత్తమ యోగసిద్ధి పొందెను. రాజర్షియగు పురూరవుడును ఇష్టములును ఉత్తమములును అగు లోకములు పొందెను. భార్గవు (ని అలు)డు అగు యయాతియు పుత్త్రలాభమును ధనలాభమును పొందెను. ఇట్లే ఇతరులగు దేవతలును దైత్యులును బ్రాహ్మణ క్షత్త్రియ వైశ్య శూద్రులును ఈ నామాష్టోత్తర శతకమును స్మరించి తమ ఇష్టముల సిద్ధింపజేసికొనిరి. ఇది వ్రాయబడియున్న చోటును దేవ సన్నిధిలో ఇది పఠింప-పూజింప-బడు చోటునను శోకముగాని దారిద్ర్యముగాని ఎన్నడును కలుగదు

ఇది శ్రీ మత్స్యమహా పురాణమున మత్స్యమను సంవాదమున
శ్రీ గౌరీనామాష్టోత్తర శత కథనమను త్రయోదశాధ్యాయము.

## చతుర్దశోఽధ్యాయః.

### పితృవంశీయాచ్ఛోదోపాఖ్యానమ్.

సూతః: లోకా స్సోమపథానామ యత్ర మారీచనన్దనాః । వర్తన్తే దేవపితరో యా న్దేవా భావయన్త్యలమ్. 1
అగ్నిష్వాత్తా ఇతి ఖ్యాతా యజ్వానో యత్ర సంస్థితాః । అచ్ఛోదానామ తేషాంతు మానసీ కన్యకా నరిత్. 2
అచ్ఛోదంనామచ సరః పితృభి ర్నిర్మితంపురా । అథతత్ర తపశ్చక్రే దివ్యం వర్షసహస్రకమ్. 3
ఆజగ్ముః పితరస్తుష్టాః కిల దాస్యామ తే వరమ్ । దివ్యరూపధరా స్సర్వే దివ్యమాల్యానులేపనాః. 4
సర్వే యువానో బలినః కుసుమాయుధసన్నిభాః । తన్మధ్యే మావసుంనామ పితరం వీక్ష్య సాఙ్గనా. 5
వవ్రే వరార్థినీ సఙ్గం కుసుమాయుధపీడితా । యోగభ్రష్టాతు సా తేన వ్యభిచారేణ భామినీ. 6
ధరా మస్పృశతీ పూర్వం పపాతాథ భువస్తలే । తథాచ మావసుర్యస్మా దిచ్ఛాం చక్రే న తాం ప్రతి. 7
ధైర్యేణ తస్య సాలోకే అమావాస్యేతి విశ్రుతా । పితౄణాం వల్లభా తస్మా ద్దత్తస్యాక్షయకారకా. 8
అచ్ఛోదాఽధోముఖీ దీనా లజ్జితా తపసఃక్షయాత్ । సా పితౄ న్ప్రార్థయామాస పునరాత్మసమృద్ధయే. 9
విలజ్జమానా పితృభి రిదముక్తా తపస్వినీ । భవిష్యదర్థ మాలోక్య దేవకార్యంచ తేతదా: 10
ఇదమూచు ర్మహాభాగాః ప్రసాదా చ్ఛుభయా గిరా । దివి దివ్యశరీరేణ యత్కిఞ్చి త్క్రియతే బుధైః. 11
తేనైవ తత్కర్మఫలం భుజ్యతే వరవర్ణిని । సద్యః ఫలన్తి కర్మాణి దేవత్వే ప్రేత్య మానుషే. 12

యస్మాత్త్వం పుత్త్రి! తపసా ప్రాప్స్యసే ప్రేత్య తత్ఫలమ్ । అష్టావింశే భవిత్రీ త్వం ద్వాపరే *మీనయోనిజా.
వ్యతిక్రమ్య పితౄణాం త్వం కష్టం కుల మవాప్స్యసి । తస్మాద్రాజ్ఞో వసోః కన్యా త్వమవశ్యం భవిష్యసి. 14
కన్యాభూత్వా౽పి లోకాన్స్వాన్ పునః ప్రాప్స్యసి దుర్లభాన్ । పరాశరస్య వీర్యేణ సుతమేక మవాప్స్యసి. 15
ద్వీపేతు బదరీప్రాయే బాదరాయణ మచ్యుతమ్ । స వేద మేకం బహుధా విభజిష్యతి తే సుతః. 16
పౌరవస్యాత్మజౌ ద్వౌతు సముద్రాంశస్య శన్తనోః । విచిత్రవీర్యతనయ స్తథా చిత్రాఙ్గదో నృపః. 17
ఇమావుత్పాద్య తనయౌ క్షేత్రియా వస్యధీమతః । ప్రౌష్ఠపద్యష్టకారూపా పితృలోకే భవిష్యసి. 18
నామ్నా సత్యవతీ లోకే పితృలోకే తథా౽ష్టకా । ఆయురారోగ్యదా నిత్యం సర్వకామఫలప్రదా. 19
భవిష్యసి పరేలోకే నదీత్వం చ గమిష్యసి । పుణ్యతోయా సరిచ్ఛ్రేష్ఠా లోకే ష్వచ్ఛోదసంజ్ఞితా. 20
ఇత్యుక్త్వా సగణస్తేషాం తత్రైవాన్తరధీయత । సా౽ప్యవాప సుచారిత్రఫలం యత్కథితం పురా. 21

ఇతి శ్రీమత్స్యమహాపురాణే మత్స్యమనుసంవాదే పితృవంశీయాచ్ఛోదో
పాఖ్యానవర్ణనం నామ చతుర్దశో౽ధ్యాయః.

## చతుర్దశాధ్యాయము

(పితరుల కన్యయగు అచ్ఛోద చరితము.) అగ్నిష్వాత్తపితరుల చరితము

[పురాణములందును శాస్త్రములందును చెప్పబడిన పితృదేవతలు ఏడు గణములుగా ఉన్నారు. వీరిలో మూడు మూర్తిలేని గణములు. ఆ గణముల పేర్లు 1. వైరాజులు 2. అగ్నిష్వాత్తులు 3. బర్హిషదులు; మూర్తి కలవి నాలుగు గణములు. 1. సుకాలినః 2. హవిష్మంతః 3. ఆజ్యపాః 4. సోమపాః. వీరిలో మొదటి గణము విషయము పదుమూడవ అధ్యాయమున చెప్పబడినది. ఈ అధ్యాయమున రెండవ గణమువారి విషయము చెప్పబడును.

[ప్రతి గణము విషయమున ను తెలియవలసిన విషయములు-1. ఆ గణము వారు నివసించు లోకము. 2. ఆ గణము పేరు. 3. వారి తండ్రి నామము 4. ఆ గణము వారిని ఆరాధించు వారు. 5. వారి మానసీకన్యా నామము.]

సోమ పథము లను లోకములు గలవు. వీనియందు మరీచి అను ప్రజాపతికి కుమారులు అగు పితృదేవతలు నివసింతురు. వీరిని దేవతలు ఆరాధింతురు. ఈ పితరులకు అగ్నిష్వాత్తులు అని పేరు. (అగ్నిషు-ఆత్త=అగ్నులయందు సమగ్రముగా హవిస్సు వేల్చి యజ్ఞములను చేసినవారు.) వీరందరును యజ్వలు-యజ్ఞములను చేసినవారు.

వారి మానసపుత్త్రి అచ్ఛోదా అను ఆమె. ఆమె నదీరూపురాలు ఐనది. పూర్వము పితృదేవతలు అచ్ఛోదమను సరస్సును సృష్టించిరి. ఆ సరస్తీరమున ఈమె వేయి దివ్య సంవత్సరముల కాలము తపస్సు ఆచరించెను. పితరులు సంతుష్టులై ఆమె కడకు వచ్చిరి. నీకేమి వరము కావలెనో ఇత్తుము. కోరుకొనుము-అనిరి. వారందరును దివ్యములగు రూపముల ధరించినవారు దివ్యములగు మాలికలు పుష్పములు దాల్చినవారు. దివ్యగంధములు పూసికొనినవారు. యువకులు; బలశాలురు; మన్మథుని పోలినవాడు. వారిలోనుండి 'మావసుడు' అను పితరుని ఆమె కామపరవశురాలై వరునిగా కోరుకొనెను. ఆ సుందరి ఈ వ్యభిచార దోషముచేత యోగభ్రష్టురాలయ్యెను. అంతవరకును దేవభావమున భూమిని తాకకయున్న ఆమె భూస్థలిపై పడిపోయెను.

కాని మావసుడు ఆ అచ్ఛోదను కామించక ధైర్యముతో ఉండెను. అందుచే ఆమె 'మావస్య' (మావసునికి ప్రియురాలు) కాలేదు. కనుక ఆమెకు 'అమావస్య' అను పేరు వచ్చెను (మావస్యకానిది) తన తపస్సుచే పితరులను మెప్పించినందున ఈ అచ్ఛోద లేదా అమావాస్య పితృదేవతలకు ఇష్టురాలు మాత్రమయినది. అందుచే అమావస్యా (అమావాస్యా) తిథియందు పితరులకు అర్పించినది అక్షయమగును. అనంతఫలమును ఇచ్చును.

---

* మత్స్య.

తన తపస్సు తన ఈ దోషము చే క్షీణించుటవలన అచ్ఛోద దీనురాలయి ముఖము వంచుకొని సిగ్గుపడుచు తాను మరల తన తపస్సును సమృద్ధి నొందించుకొనుటకై ఉపాయమును తెలుపవలసినదిగా తన తండ్రులగు పితరులను వేడుకొనెను. ఆ మహాభాగులు అనుగ్రహము కలవారైరి. వారు జరుగబోవు విషయములను దేవకార్యమును (తమ ధ్యాన దృష్టితో) దర్శించిరి. శుభమగు వాక్కుతో వారు ఆ తపస్విని (తపోవంతురాలు-జాలిపడదగిన దీనురాలు) తో ఇట్లు పలికిరి: సుందరియగు పుత్రీ! వివేకవంతులగు వారు (భూలోక సంబంధి కానటువంటి) దివ్య శరీరముతో చేసిన ఏ కర్మమునకైనను ఫలమును వారు అదే శరీరముతో అనుభవింతురు. మానుష శరీరముతో నున్నవారు మాత్రము తాము చేసిన కర్మల ఫలములను (కొన్నిటిని) ఆ దేహమును విడిచిన తరువాత అనుభవింతురు. (నీవు మనుష్య స్త్రీగా అయి యున్నావు. కనుక) నీవు తపస్సు ఆచరించినచో దాని ఫలమును నీవు ఈ దేహమును విడిచిన తరువాత (మరియొక జన్మములో కాని దేవలోకమునకాని) అనుభవింతువు.

ఇప్పుడు నీవు నీ తండ్రుల విషయమున వ్యతిక్రమము (నియమము తప్పి కామ బుద్ధిని చూపుట) చేసితివి. కనుక ఇరువది ఎనిమిదవ ద్వాపరయుగమున చేప కడుపున జన్మించి నీచమగు కులమును చేరుకొందువు. ఇది జరుగుటకై నీవు తప్పక వసుడను రాజునకు కూతురవు అగుదువు. కన్యగా ఉండి (కన్యాత్వము చెడకయే) చివరకు మరల దుర్లభములగు నీలోకములను నీవు చేరెదవు. ఎట్లన-పరాశరుని వీర్యముతో ఒక కుమారుని కనెదవు. అతడు సాక్షాత్ అచ్యుతు (నారాయణు) డే. బదరీవృక్షములు తరచుగా కల ద్వీపమున జనించుటచే అతనికి బాదరాయణుడు అని వ్యవహారము కలుగును. ఆ నీకుమారుడు ఒకటిగా అయి యున్న వేదమును నాలుగుగా విభజించును. సముద్రుని అంశచేత జనించిన పూరు వంశీయుడైన శంతనుని వలన చిత్రాంగదుడు విచిత్రవీర్యుడు అను కుమారులను ఇద్దరను కనెదవు. భూలోకమున నీకు సత్యవతి అనిపేరు. పితృలోకమున నీకు అష్టకా అనిపేరు. అచట నీవు ప్రౌష్ఠపదీ-అష్టకా-(భాద్రపద శుక్ల పూర్ణిమ గడచిన వెంటనే వచ్చు నష్టమీ తిథి) రూపముతో ఉందువు. నీవు పర (పితృ) లోకమునందుండి ప్రాణులకు ఆయురారోగ్యములను కోరిన ఫలములను ఇత్తువు.

నీవు భూలోకమున నదీ రూపమును పొంది అచ్ఛోద అను పేర పుణ్యజలములుగల నదీ శ్రేష్ఠవైయుందువు.

ఇట్లు పలికి ఆ పితృగణము అచ్చటనే అంతర్ధానమును పొందిరి. ఆ అచ్ఛోదయను పితృ కన్యయును వారిచే ఇంతవరకును చెప్పబడిన సత్కర్మ ఫలమును పొందెను.

ఇది శ్రీమత్స్య మహాపురాణమున మత్స్యమను సంవాదమున
పితృకన్యయగు అచ్ఛోద చరితమను చతుర్దశాధ్యాయము.

## పంచదశోఽధ్యాయః.

### దానవాదిపితృగణాః.

సూతః: విభ్రాజా నామతోఽన్యేతు దివి సన్తి సువర్చసః । లోకా బర్హిషదో యత్ర పితర స్సన్తి సువ్రతాః. 1
యత్ర బర్హిణయుక్తాని విమానాని సహస్రశః । సఙ్కల్పబర్హిషో యత్ర తిష్ఠన్తి ఫలదాయినః. 2
తత్రాభ్యుదయశాలాసు మోదన్తే శ్రాద్ధదాయినః । యాన్దానవాసురగణా గన్ధర్వాప్సరసాం గణాః. 3
యక్షరక్షోగణాశ్చైవ యజన్తి దివి దేవతాః । పులస్త్యపుత్త్రా శ్శతశ స్తపోయోగ*బలాన్వితాః. 4
మహాత్మానో మహాభాగా భక్తానా మభయప్రదాః । ఏతేషాం †పీవరీ కన్యా మానసీ దివి విశ్రుతా. 5
యోగినీ యోగమాతాచ తపశ్చక్రే సుదారుణమ్ । ప్రసన్నో భగవాంస్తస్యా వరం వవ్రే చ సా హరేః. 6
యోగవన్తం సురూపంచ భర్తారం విజితేన్ద్రియమ్ । దేహి దేవ ప్రసన్న స్త్వం యది మే వదతాంపర. 7

* సముదితాః. † బదరీ.

ఉవాచ దేవో భవితా వ్యాసపుత్త్రో యదా శుకః । భవిత్రీ తస్య భార్యా త్వం యోగాచార్యస్య సువ్రతే. 8
భవిష్యతిచ తే కన్యా కృత్తి ర్నామ్నాచ యోగినీ । పాఞ్చాలాధిపతే ర్దేయా మానుషస్య త్వయా తదా. 9
జననీ బ్రహ్మదత్తస్య యోగసిద్ధాశ్చ యత్సుతాః । కృష్ణో గౌరః ప్రభు శ్శమ్భు ర్భవిష్యన్తిచ తే సుతాః. 10
మహాత్మానో మహాభాగా గమిష్యన్తి వరంపదమ్ । తానుత్పాద్య పునర్యోగా త్స్వవరా మోక్ష మేష్యసి. 11

ద్విజాదిపితృగణగణనమ్.

సూతః: యేమూర్తిమన్తః పితరో వసిష్ఠస్య సుకాలినః । నామ్నాతు మానసాస్సర్వే సర్వే తే ధర్మమూర్తయః 12
జ్యోతిర్భాసిషు లోకేషు యేవసన్తి దివఃపరమ్ । విరాజమానాః క్రీడన్తి యత్ర తే శ్రాద్ధదాయినః. 13
సర్వకామసమృద్ధేషు విమానేష్వపి పాదజాః । కింపునః శ్రాద్ధదా విప్రా భక్తిమన్తః క్రియాన్వితాః. 14
గౌర్నామ కన్యా తేషాంతు మానసీ దివి రాజతే । శుక్రస్య దయితా పత్నీ సాధ్యానాం కీర్తివర్ధనీ. 15

## పంచదశాధ్యాయము

### దానవాదులును నాలుగు వర్ణములవారును అర్చించు పితరుల వృత్తాంతము.

### (బర్హిషద్-సుకాలి-హవిష్మత్-ఆజ్యప-సోమప-పితరుల చరితము)

సూతుడు ఇంకను ఇట్లు చెప్పనారంభించెను : ద్యులోకమునందు శోభనమగు వర్చస్సు (కాంతి) కలిగిన మరి కొన్ని లోకములు గలవు. వాని పేరు విభ్రాజములు. వానియందే సువ్రతులు (ఉత్తమ నియమానుష్ఠాన పరులు) అగు బర్హిషదులు అను పితరులు నివసింతురు. వానియందు నెమళ్ళచే మోయబడు విమానములు వేలకొలదిగా ఉండును. ఈ పితరులు వానియందు కూర్చుండి సంచరింతురు. (బర్హి-సద్ = బర్హిషద్ = నెమిళ్ళపై కూర్చుండువారు.) ఆ లోకముల యందలి పితృ దేవతల విషయములో చక్కగా ఆచరింపబడిన యజ్ఞములు (శ్రాద్ధములు) (బర్హిస్ = యజ్ఞము) విశేషముగా ఫలములను ఇచ్చునవియగును. వారినుద్దేశించి శ్రాద్ధములను ఆచరించిన వారు అభ్యుదయ శాలల (ప్రాపంచిక సుఖముల నిచ్చెడు గృహముల) యందు ఆనందింతురు. వీరిని అసుర దానవ గంధర్వాప్సరో యక్షరక్షో గణముల వారును ద్యులోకమునందలి దేవతలును ఆరాధింతురు. వీరు పులస్త్య ప్రజాపతి కుమారులు. తపస్సుచేతను యోగసాధనము చేతను కలిగిన నూర్లకొలది శక్తులు కలవారు. మహాత్ములును మహాభాగులును భక్తులకు అభయమును ఇచ్చువారును. వీరి మానసీకన్య పీవరి అను పేరుతో ద్యులోకమున ప్రసిద్ధయైయున్నది. ఈమె యోగమునకే తల్లి అనదగిన యోగిని. ఈమె మిక్కిలి భయంకరమగు తపస్సాచరించెను. భగవానుడగు హరి ఆమె ననుగ్రహించెను. పురుషోత్తమా! నీకు నా యందు అనుగ్రహము కలిగినచో నాకు యోగసిద్ధి కలవాడును సుందరుడును విజితేంద్రియుడును అగు భర్తను ఇమ్ము! అని ఆమె వరము కోరెను. హరి ఇట్లు పలికెను. "ముందుముందు వ్యాసునకు శుకుడను కుమారుడు కలుగును. అతడు యోగాచార్యుడు. నీవు ఆచరించిన ఈ సుతపోవ్రతమునకు ఫలముగా నీకు అతడు భర్తయగును. యోగిని కాగల కృత్తి అను కూతురు నీకు కలుగును. నీవామెను మానవుడగు పాంచాల దేశరాజునకు ఇమ్ము. ఆమెకు బ్రహ్మదత్తుడను కుమారుడు కలుగును. అతనికిని యోగసిద్ధులగు కుమారులు కలుగుదురు. నీకు కృష్ణుడు గౌరుడు ప్రభుడు శంభుడు అను కుమారులు కలుగుదురు. వారు మహాత్ములును మహాభాగులునై పరమపదమును చేరుకొందురు. ఇట్టి కుమారులకు తల్లివై నీవు నీ భర్తతో కూడ మోక్షమును పొందుదువు."

ఇది అమూర్తులు-(మూర్తి లేనివారు) అగు పితృ దేవతా గణముల విషయము.

[ఇచట మూలములో పండ్రెండవ శ్లోకమున మొదట "అమూర్తిమంతః" అని యున్నది. ఇది తప్పు. 'యే మూర్తి మంతః' అని ఉండవలెను. అనువాదకుడు.] ఇక మూర్తి మంతులగు పితృదేవతల విషయము. సుకాలిన్ అను పేరుగల పితృదేవతల గణమువారు వసిష్ఠుని మానసపుత్త్రులు. వారందరును ధర్మమూర్తులు. వారు ద్యులోకమునకు పైగా

ఉన్న 'జ్యోతిర్భాసి' (నక్షత్రాది జ్యోతిస్సులతో ప్రకాశించు) లోకములందు నివసింతురు. తమ పూర్వులనుద్దేశించి శ్రాద్ధములను జరిపిన శూద్రులైనను ఈ లోకములందు విమానములపై ప్రకాశించుచు క్రీడించుచు వివిధ భోగములను అనుభవించుచుందురు. ఇక భక్తిమంతులై సరిగా కర్మలను అనుష్ఠించువారై శ్రాద్ధములను జరుపు బ్రాహ్మణుల విషయము చెప్పవలసినదేమున్నది? గౌః అను పేరుకల వారి మానసపుత్త్రి ద్యులోకమున ప్రకాశించుచుండును. ఆమె శుక్రునకు ప్రియ భార్యయయ్యెను. ఆమె సాధ్యులను దేవతలకు కీర్తిని వర్ధిల్లజేయునది. (ఈ పితృదేవతా గణమును విప్రులారాధింతురు.)

మరీచిగర్భా నామ్నాతు లోకా మార్తాణ్డ మండలే । పితరో యత్ర తిష్ఠన్తి హవిష్మన్తోం గిరస్సుతాః. 16
తీర్థశ్రాద్ధప్రదా యాన్తి యే చ క్షత్త్రియసత్తమాః । రాజ్ఞాంతు పితరస్తేవై స్వర్గమోక్షఫలప్రదాః. 17
ఏతేషాం మానసీ కన్యా యశోదా లోకవిశ్రుతా । పత్నీ హ్యంశుమతః శ్రేష్ఠా స్నుషా పఞ్చజనస్యతు. 18
జననీచ దిలీపస్య భగీరథపితామహీ । లోకాః కామదుహానామ కామభోగఫలప్రదాః. 19
సుస్వధా నామ పితరో యత్ర తిష్ఠన్తి సువ్రతాః । ఆజ్యపా నామ లోకేషు కర్దమస్య ప్రజాపతేః. 20
పులహస్యచ దాయాదా వైశ్యా స్తా న్భావయన్తిచ । యత్ర శ్రాద్ధకృతస్సర్వే పశ్యన్తి యుగపద్గతాః. 21
మాతృభ్రాతృపితృష్వస్రు సఖిసమ్బన్ధిబాంధవాః । అపిజన్మాయుతై ర్దృష్టా ననుభూతా న్సహస్రశః. 22
ఏతేషాం మానసీకన్యా విరజానామ విశ్రుతా । యా పత్నీ నహుషస్యాసీ ద్యయాతే ర్జననీ తథా. 23
ఏకాష్టకాఽభవత్పశ్చా ద్బ్రహ్మలోకం గతాసతీ । త్రయఏతే గణాఃప్రోక్తా శ్చతుర్థంతు వదామ్యహమ్. 24
లోకాస్తు మానసా నామ్నా బ్రహ్మణః పురి సంస్థితాః । ఏతేషాం మానసీకన్యా నర్మదానామ విశ్రుతా. 25
సోమపా నామ పితరో యత్ర తిష్ఠన్తి శాశ్వతాః । ధర్మమూర్తిధరా స్సర్వే పరతో బ్రహ్మణ స్స్మృతాః. 26
ఉత్పన్నా స్స్వధయా తేతు బ్రహ్మత్వం ప్రాప్య యోగినః ।
కృత్వా సృష్ట్యాదికం సర్వం మానసే సామ్ప్రతం స్థితాః. 27
నర్మదానామ తేషాంతు కన్యా తోయవహా సరిత్ । భూతాని యా పావయతి దక్షిణాపథగామినీ. 28

సూర్యమండలమునందు 'మరీచి గర్భములు' (తమ అంతర్భాగమునందు కిరణములు కలవి) అను లోకములు గలవు. అంగిరః ప్రజాపతికి పుత్త్రులగు బర్హిష్మంతులను పితృ దేవతలు ఈ లోకములందు వసింతురు. తీర్థ శ్రాద్ధములను జరుపు క్షత్త్రియ శ్రేష్ఠులు ఈ లోకములకు పోవుదురు. ఈ పితరులు క్షత్త్రియులకు స్వర్గ మోక్షఫలములను ఇత్తురు. వీరి మానసపుత్త్రి యశోద అను పేర లోకప్రసిద్ధురాలు. ఈమె పంచ జనుని కుమారుడగు అంశుమంతుని భార్య. దిలీపుని తల్లి. భగీరథుని నాయనమ్మ.

కోరిన భోగఫలములను ఇచ్చు 'కామదుఘములు' అను లోకములు కలవు. సత్కర్మములను అనుష్ఠించువారగు ఆజ్యపులు అను పితృదేవతలు ఈలోకములందు వసింతురు. వీరు కర్దమ ప్రజాపతి కుమారులును పులహుని కుమారులును. వీరిని వైశ్యులారాధింతురు. వీరిని ఆరాధించినవారు ఈ లోకములకు పోయి అచ్చట తమ పూర్వప్పుతులగు తల్లులు సోదరులు మేనత్తలు మిత్రులు వియ్యాలవారు ఇతర బంధువులు మొదలగువారు అప్పటికి పదివేల జన్మలను ఎత్తిన వారైనను వేలకొలది ఏయే విధములుగా వారిని తాము చూచి అనుభవము పొందియున్నారో అదే విధములుగా వాడిని చూడగలుగుదురు. వీరి మానసపుత్త్రి విరజ అను పేర ప్రసిద్ధురాలు. ఈమె తరువాత నహుషుని భార్య- యయాతికి తల్లి- అయ్యెను. ఈమె బ్రహ్మలోకమునకు చేరిన తరువాత 'ఏకాఽష్టక' అను పేర ప్రసిద్ధురాలయ్యెను. ఇట్లు మూర్తిమంతములగు మూడు పితృగణముల వృత్తాంతము చెప్పటయైనది నాలుగవ గణము విషయము వినుడు.

బ్రహ్మదేవుని నగరమునందు మానసములు అనులోకములు కలవు. నర్మద అను మానసపుత్త్రికి తండ్రులగు సోమపులు అను పితృదేవతలు ఈ లోకములందు నివసింతురు. వీరు అందరును ధర్మమూర్తిని ధరించినవారు. శాశ్వతులు.

బ్రహ్మకు వైస్థానమునందుండువారు. వీరు 'స్వధ'నుండి జనించిరి. యోగసిద్ధిచే బ్రహ్మత్వమును పొందిరి. సృష్టి మొదలగు వ్యాపారములను నిర్వహించి ఇప్పుడు మానస లోకములందున్నారు. వారి మానసపుత్రియగు నర్మద నీటిని ప్రవహింపజేయుచు నదిగానైనది. ఆమె దక్షిణాపథము (వింధ్యకు దక్షిణమునందు ఉన్న భారతదేశము) నందు ప్రవహించుచు ప్రాణులను పవిత్రులనుగా చేయుచున్నది.

తేభ్య స్సర్వేతు మనవః ప్రజాసర్గేషు నిర్మితాః । జ్ఞాత్వా శ్రాద్ధాని కుర్వీత ధర్మభావేపి సర్వదా. 29

* తేభ్య ఏవ పునః ప్రాప్తుం ప్రసాదా ద్యోగసన్తతిం । పితౄణా మాదిసర్గేతు శ్రాద్ధమేవ వినిర్మితమ్. 30

శ్రాద్ధే దేయాదేయవస్తువివరణమ్.

సర్వేషాం రాజతం♦పాత్రంపితౄన్ప్రీణాతి సర్వదా । దత్తం స్వధా పురోధాయ పితౄనుద్దిశ్య సర్వదా. 31

అగ్నీషోమయమాభ్యాంతు కార్య మాప్యాయనం బుధైః । అగ్న్యభావేపి విప్రస్య పాణావథ జలేపివా. 32

అజాకర్ణేశ్వకర్ణేవా గోష్ఠేవాథ శివాన్తికే । పితౄణా ముత్తమం స్థానం దక్షిణా దిక్ప్రశస్యతే. 33

ప్రాచీనావీత ముదకం తిలా స్సవ్యాఙ్గ మేవచ । దర్భా మాంసంచ పాఠీనం గోక్షీరం మధురో రసః. 34

★ ఖడ్గవార్ధ్రీణమిషంచైవ మధుశ్యామాక శాలయః । యవ నీవార ముద్గేక్షుగుడపుష్ప ఘృతానిచ. 35

వల్లభాని ప్రశస్తాని పితౄణామేవ సర్వదా । గ్రాహ్యాణ్యేతాని; వక్ష్యామి శ్రాద్ధే వర్జ్యాని యాని చ. 36

మసూర చణనిష్పావ రాజమాష కుళుత్థకాః । పద్మబిల్వార్క ధుత్తూర పారిభద్రాటరూషకాః. 37

న దేయాః పితృకార్యేషు పయశ్చాజావికం తథా । కోద్రవోద్దాలకరక కపిత్థమధుకాతసీ. 38

ఏతాన్యపి న దేయాని పితృభ్య శ్శ్రియమిచ్ఛతా । పితౄన్ప్రీణాతి యో భోక్తా తే పునః ప్రీణయన్తి తమ్. 39

ఇచ్ఛన్తి పితరస్తుష్టిం స్వర్గారోగ్యం ప్రజాః ఫలమ్ । దేవకార్యా దపి పునః పితృకార్యం విశిష్యతే. 40

దేవతానాం పితౄణాంతు పూర్వమాప్యాయనం స్మృతమ్ ।
శీఘ్రప్రసాదా స్త్వక్రోధాః ప్రశాన్తా స్స్థిరసౌహృదః. 41

శాన్తాత్మాన శ్శౌచపరా స్సతతం ప్రియవాదినః । భక్తానురక్తా స్సుఖదాః పితరః పూర్వదేవతాః. 42

హవిష్మతా మాధిపత్యే శ్రాద్ధదేవో రవి స్స్మృతః । ఏతద్వ స్సర్వమాఖ్యాతం పితృవంశానుకీర్తనమ్. 43

పుణ్యం పవిత్ర మాయుష్యం కీర్తనీయం సదా నృభిః. 44॥

ఇతి శ్రీమత్స్యమహాపురాణే మత్స్యమనుసంవాదే ద్విజాదిపితృగణ
గణనం నామ పఞ్చదశోఽధ్యాయః.

ప్రజాపతులు తాము చేసిన ప్రజా సృష్టులలో ఈ పితృదేవతల నుండియే మనువులనందరను సృజించిరి. ఈ విషయమును ఎరిగి జనులు ఏ యజ్ఞయాగాది ధర్మము నైనను ఆచరించినను ఆచరించకున్నను ఎల్లప్పుడును శ్రాద్ధములను మాత్రమాచరించవలెను. వారి అనుగ్రహమువలననే మరల ప్రజలు యోగసిద్ధిని నిరంతరముగా (అవిచ్ఛిన్నముగా) పొందగలరు. ఏలయన ఆదిసృష్టియందు జనులు అనుష్ఠింపవలసిన కర్మముగా పితృశ్రాద్ధమే విధింపబడినది.

అన్ని వర్ణములవారు పెట్టు శ్రాద్ధములందును రజత (వెండితో చేసిన) పాత్రమే పితృప్రీతికరము. (పితృదేవతలనుద్దేశించి సమర్పించు ఏపదార్థమునైనను ఏవర్ణము వారైనను రజత పాత్రమునందే సమర్పించవలెను.) పితరుల నుద్దేశించి ఏది సమర్పించినను స్వధాకార పూర్వకముగా ఈయవలెను. సంప్రదాయమును ఎరిగినవారు అగ్నీషోములకును యమునకును (అగ్నిష్వాత్తులకు అని మరియొక విధముగ పాఠము) శ్రాద్ధదానముచే తృప్తిని కలిగించవలెను. ఇది అగ్ని

* సర్వంపాత్రేభ్య ఏవస్యాచ్ఛ్రాద్ధమేవవినిర్మితమ్. ♦ పాత్రమథవారాజతాన్వితమ్.
★ ఖడ్గలోహామిషంచైవ.

యున్నచో అగ్నియందును లేనిచో విప్రుని చేతియందో జలమునందో మేక చెవియందో గుర్రపు చెవియందో గోవులు నిలుచు స్థానమునందో శివ సన్నిధియిందో చేయవచ్చును. దక్షిణదిశ పితరులకు ప్రశస్తమయిన స్థానము (దిక్కు).

ప్రాచీనావీతము (కుడి భుజము మీదకు ధరించిన యజ్ఞోపవీతము) ఉదకము నూవులు సవ్యేతరమయిన (ఎడమవైపు) అవయవము దర్భలు కూర్మమాంసము ఆవుపాలు మధురరస ద్రవ్యములు ఖడ్గమృగపు మాంసము తేనె చామలు అను వడ్ల బియ్యము వరిబియ్యము యవలు నివ్వరి బియ్యము పెసలు చెరకు బెల్లము పూవులు నేయి ఇవి ఎల్లపుడును పితృ దేవతలకు ప్రియములైనవియు ప్రశస్తములైనవియును. కనుక శ్రాద్ధమున ఇవి గ్రహింపదగినవి. విడువదగినవి - ప్పెదను- వినుము. చిరుసెనగలు సెనగలు అనుములు బొబ్బరలు ఉలవలు తామరపూవు బిల్వము జిల్లేడు ఉమ్మెత్త వేప అడ్డసరము మేకల గొర్రెలపాలు కొర్రలు అడవి కొర్రలు దానిమ్మ వెలగ ఇప్ప అవిసి గింజలు ఇవి శ్రాద్ధమునందు వినియోగించకూడదు. అట్లు చేయుటచే వారి అనుగ్రహము కలుగదు. శోభ సిరి తగ్గును. భక్తిచే పితరులను తృప్తిపరచిన వానిని పితరులును సంతృప్తి పరతురు. పితరులు తుష్టి చెందినచో వారు కర్తకు గూడ తుష్టిని స్వర్గమును ఆరోగ్యమును సంతానమును ఫలముగా ఇత్తురు.

దేవకార్యముకంటెను పితృకార్యము విశిష్టతరమయినది. దేవతలను తృప్తిపరచుటకంటెను ముందు పితరులను తృప్తి పరచవలయును. పితృదేవతలు శీఘ్రముగా అనుగ్రహించు వారును క్రోధము లేనివారును మిగుల శాంతులును స్థిరముగా నిలిచియుండు సుహృద్భావము (అనుగ్రహము) కలవారును శుద్ధ సత్త్వగుణ ప్రధానమగు చిత్తవృత్తి కల వారును దేహమునను చిత్తమునను శుచిత్వమునందు శ్రద్ధ కలవారును ఎల్లప్పుడు ప్రీతికరముగా మాటలాడువారును భక్తులయందు ప్రీతికలవారును వారికి సుఖమును ఇచ్చువారును ఐయున్నారు. ఇంతఏల? వారు దేవతలలో మొదటివారు.

సూర్యుడు హవిష్మంతులు అను పితృదేవతల ఆధిపతిత్వము కలవాడును శ్రాద్ధ కర్మానుష్ఠానమునకు అధిష్ఠాన దేవతయునై యున్నాడు.

మహర్షులారా! మీకు నేను పితృవంశాను కీర్తనము అంతయు చెప్పితిని. ఇది పుణ్యకరము-పవిత్రమయినది. ఆయుష్యమును వృద్ధిచేయునది. మానవులు ఎల్లప్పుడును కీర్తింపదగినది.

ఇది శ్రీ మత్స్యమహా పురాణమున మత్స్యమను సంవాదమున పితృగణ
గణనమను పంచదశాధ్యాయము.

## షోడశోఽధ్యాయః.

### శ్రాద్ధకల్పే నిమంత్రణాది కథనమ్.

సూతః: శ్రుత్వైతత్సర్వమఖిలం మనుః ప్రపచ్ఛ కేశవమ్ । శ్రాద్ధకాలంచ వివిధం శ్రాద్ధభేదం తథైవచ॥ 1
శ్రాద్ధేషు భోజనీయా యే యేచ వర్జ్యా ద్విజాతయః । కస్మి న్వాసరభాగేవా పితృభ్య శ్శ్రాద్ధమారభేత్. 2
కస్మిన్దత్తం కథం యాతి శ్రాద్ధంచ మధుసూదన । విధినా కేన కర్తవ్యం కథం ప్రీణాతి తత్పితౄన్. 3
మత్స్యః: కుర్యా దహరహ శ్శ్రాద్ధ మన్నాద్యేనోదకేనవా । పయో మూలఫలై ర్వాపి పితృభ్యః ప్రీతిమాహరేత్.
నిత్యం నైమిత్తికం కామ్యం త్రివిధం శ్రాద్ధముచ్యతే । నిత్యం తావ త్ప్రవక్ష్యామి అర్ఘ్యావాహనవర్జితమ్. 5
అదైవతం విజానీయా త్పార్వణం పర్వసు స్మృతమ్ । పార్వణం త్రివిధం ప్రోక్తం శృణు తావ న్మహీపతే. 6

పార్వణశ్రాద్ధే నియోజ్యబ్రాహ్మణాః.

పార్వణే యే నియోజ్యాస్తు తాన్ఛృణుష్వ నరాధిప । పఞ్చాగ్ని స్స్నాతకశ్చైవ త్రిసువర్ణ షడఙ్గవిత్. 7
శ్రోత్రియ శ్శ్రోత్రియసుతో విధివాక్యవిశారదః । సర్వజ్ఞో వేదవిత్సత్రీ జ్ఞాతవంశకులాన్వితః. 8
పురాణవేత్తా ధర్మజ్ఞ స్స్వాధ్యాయజపతత్పరః । శివభక్తః పితృపర స్సూర్యభక్తోఽథ వైష్ణవః. 9

బ్రహ్మణ్యో యోగవిచ్ఛాన్తో యుజ్ఞీతాత్మా సుశీలవాన్ । భోజయేచ్చాపి దౌహిత్రం యత్నత శ్శ్వశురం గురుమ్.
విట్పతిం మాతులం బన్ధు మృత్విగాచార్యసోమపాన్ ।
యశ్చ వ్యాకురుతే వాచం యశ్చమీమాంసతేఽధ్వరమ్. 11
సామస్వరవిధిజ్ఞశ్చ పఙ్క్తిపావనపావనాః । సామగో బ్రహ్మచారీచ దేవభక్తోఽథ బ్రహ్మవిత్. 12
యత్రైతే భుఞ్జతే శ్రాద్ధే తదేవ పరమార్థవత్ । ఏతే యోజ్యాః ప్రయత్నేన వర్జనీయాన్నిబోధ మే. 13

పార్వణశ్రాద్ధే వర్జ్యబ్రాహ్మణాః.

పతిత స్తత్సుతః క్లీబః పిశునవ్యఙ్గిరోగిణః । కునఖీ శ్యావద న్తస్తు కుణ్డగోళశ్చ పాలకాః. 14
పరివిత్తి ర్నియుక్తాత్మా మత్తోన్మత్తశ్చ దారుణః । బైడాలబకవృత్తిశ్చ దమ్భీ దేవలకాదయః. 15
కృతఘ్నా నాస్తిక స్తద్వ న్మ్లేచ్ఛదేశనివాసినః । త్రిశంకుబర్బరోఢ్రాన్ధ్రచీనద్రవిడకౌఙ్కణాన్. 16
వర్జయే ల్లిఙ్గిన స్సర్వా న్ఛ్రాద్ధకాలేషు ధర్మవిత్ । సర్వేతే శ్రాద్ధకాలేతు త్యాజ్యావై బ్రహ్మవాదిభిః. 17

## షోడశాధ్యాయము

### శ్రాద్ధ కల్పము-నిమంత్రణాదివిధి.

సూతుడు ఋషులకు ఇంకను ఇట్లు చెప్పనారంభించెను. ఈ విషయమంతయు నిరవశేషముగా విని మనువు కేశవుని మరల ఇట్లు ప్రశ్నించెను. "శ్రాద్ధమును జరుపదగిన వివిధమగు కాలవిశేషమును వివిధములగు శ్రాద్ధ విశేషములను శ్రాద్ధమునందు భుజింపజేయదగిన వారిని భుజింపజేయదగనివారిని పితృ శ్రాద్ధ మాచరింపదగిన కాలమును ప్రదేశములను పితృదేవతలు ప్రీతి చెందుటకై శ్రాద్ధమాచరింపవలసిన విధానమును ఈ విషయములను అన్నిటిని నాకు తెలుపుడు."

మత్స్య నారాయణుడిట్లు మనువుతో చెప్పనారంభించెను. అన్నము మొదలగు పదార్థములతో కాని ఉదకముతో గాని ప్రతిదినమునను శ్రాద్ధమును చేయవలెను. అన్నము లభ్యముకాని పక్షమున పాలు-పండ్లు-దుంపలు-వీనితోనైన శ్రాద్ధము జరిపి పితరులకు ప్రీతి కలిగించవలెను.

నిత్యము నైమిత్తికము కామ్యము అని శ్రాద్ధము మూడు విధములు మొదటిది ప్రతిదినమును చేయవలసినది. మొదట దీనిని తెలిపెదను. దీనియందు అర్ఘ్యము ఆవాహనము విశ్వదేవార్చనము ఉండనక్కరలేదు.

నిమిత్తము అనగా కాలవిశేష రూపమయిన హేతువు. ఆయా కాలవిశేషములందు చేయవలసినది నైమిత్తిక శ్రాద్ధము. ఇది మరల పార్వణశ్రాద్ధము సాధారణ శ్రాద్ధము అభ్యుదయ శ్రాద్ధము అని మూడు విధములు-వీనిలో శుక్లకృష్ణ పక్షములందలి చతుర్థినాడును అష్టమినాడును పూర్ణిమ అమావాస్యలయందును చేయవలసినది పార్వణ (పర్వదినములలో చేయదగిన) శ్రాద్ధము. (ఇచట పార్వణ శ్రాద్ధము మూడు విధములు అని మూలములో ఉన్నది. కాని సందర్భమునుబట్టి ఇది నైమిత్త శ్రాద్ధము అని ఉండవలెను.) శ్రాద్ధమునందు చేయవలసినవి మూడు-హోమము-బ్రాహ్మణభోజనము-పిండదానము అనునవి. అని ఆపస్తంబధర్మ సూత్ర వ్యాఖ్యానములో హరదత్తులవారు చెప్పినారు. ఆప-ధర్మ-ప్రశ్న-1. పటల-7-కండికా-16: సూత్రం-2: తర్పణము పిండదానములో చేరును. ఆవాహనాదికము బ్రాహ్మణ భోజనములో చేరును. హోమము తెలిసినదే. వానిలో భోజనమునకై పిలువదగిన బ్రాహ్మణులను తెలిపెదను-వినుము. పంచాగ్ని హోత్ర కర్మములను అనుష్ఠించువాడు (1. అన్వాహార్యపచన లేక దక్షిణ- 2. గార్హపత్య- 3. ఆహవనీయ- 4. సభ్య- 5. ఆవసథ్య-అనునవి పంచాగ్నులు) వేదాధ్యయనము యథాశాస్త్రముగా ముగించి స్నానవ్రతము జరుపుకొనినవాడు త్రిసుపర్ణములను (ఋగ్వేదమునందలి 'చతుష్కపర్దా' ఇత్యాదిగా మూడు ఋక్కులను గాని యజుర్వేదమునందలి 'బ్రహ్మమేతుమాం' మొదలగు మూడు అనువాకములుగాని) అధ్యయనము చేసినవాడు

ఆరు వేదాంగములను అధ్యయనము చేసినవాడు శ్రోత్రియుడు (వేదమును బాగుగా అధ్యయనము చేసినవాడు) శ్రోత్రియుని కుమారుడు (వేదశాస్త్రములందలి) విధి వాక్యము (లర్థము)లను బాగుగ ఎరిగినవాడు అన్ని విషయములను ఎరిగినవాడు సత్రయాగములను ఆచరించినవాడు అందరకును తెలిసిన ప్రసిద్ధకులమున వంశమున పుట్టినవాడు పురాణములను ధర్మ శాస్త్రములను ఎరిగినవాడు స్వాధ్యాయములను ఎల్లప్పుడును శ్రద్ధతో చేయుచుండువాడు శివభక్తుడు పితృభక్తుడు సూర్య భక్తుడు విష్ణుభక్తుడు బ్రహ్మతత్త్వమును ఎరిగినవాడు యోగవిద్య నెరిగినవాడు శాన్తుడు ఆత్మయోగము నెరిగినవాడు మంచి శీలము కలవాడు దౌహిత్రుడు తన భార్యకు తండ్రి తన గురుడు తన కులమువారిలో పెద్ద-వీరినే ఆంధ్రదేశమున సభాపతి అందురు-కులపుపెద్ద-మేనమామ బంధువు ఋత్విక్ ఆచార్యుడు (ధర్మశాస్త్రాదికమును బోధించగలవాడు) సోమ యాజీ వాక్కును (భాషలను) వ్యాకరించగలవాడు (వ్యాకరణ తత్త్వమును ఎరిగినవాడు-A great linguist) యజ్ఞ ప్రక్రియను శాస్త్రీయముగా చర్చించి వివరించగలవాడు సామవేద స్వర ప్రక్రియను బాగుగా ఎరిగినవాడు ఇట్టి పంక్తిని పావనము చేయువారిలో శ్రేష్ఠులు. సామవేదము నేర్చినవాడు బ్రహ్మచారి భగవద్భక్తుడు బ్రహ్మతత్త్వవేత్త ఏ శ్రాద్ధమున భుజింతురో ఆ శ్రాద్ధము సార్థకమయి పరమార్థఫలమును ఇచ్చును. కనుక శ్రాద్ధమునందు భోక్తలుగా ఇట్టివారినే నియమించవలెను.

ఇక భోక్తలుగా పిలుచుటలో విడువవలసినవారిని తెలిపెదను. వినుము. పతితుడు పతితుని కుమారుడు నపుంసకుడు కొండెములు చెప్పువాడు అంగహీనుడు రోగి పుప్పి గోళ్ళవాడు పచ్చవారిన దంతములు కలవాడు స్త్రీకి భర్త ఉండగాగాని మరణించిన తరువాత గాని పరునివలన పుట్టినవాడు గుర్రములను పోషించి జీవించువాడు అన్నకు పెండ్లి కానిదే పెండ్లి చేసికొన్నవాడు లేదా తన కంటెముందే పెండ్లి చేసికొన్నవాని అన్న తనకు తానై కోరి ఇతరుల సేవకు పాల్పడి జీవించువాడు త్రాగుడు మొదలైనవానిని ఉపయోగించి మత్తతలో ఉండువాడు వెర్రివాడు క్రూరుడు పిల్లివలె కొంగవలె మోసముచే జీవించువాడు కపటి గొప్పలు చెప్పుకొనువాడు పూజారి కృతఘ్నుడు నాస్తికుడు మ్లేచ్ఛ దేశములలో నివసించు (చిన) వాడు త్రిశంకు బర్బర ఉత్కల ఆంధ్ర చీన ద్రవిడ కొంకణ దేశములవారు తన సంప్రదాయ చిహ్నములను ఎల్లప్పుడు ధరించి తిరుగువారు ఇట్టివారిని కర్మానుష్ఠాన ధర్మమును ఎరిగినవారు శ్రాద్ధమున భోక్తలుగా నియమించకూడదు. వేదతత్త్వము నెరిగి కర్మల ననుష్ఠించువారు వీరిని అందరను శ్రాద్ధ సమయములందు భోక్తలనుగా పిలువక విడువవలయును.

## శ్రాద్ధనిమన్త్రణాదివిధిః.

పూర్వేద్యు రపరేద్యుర్వా వినీతాత్మా నిమన్త్రయేత్ । నిమన్త్రితాంస్తు పితర ఉపతిష్ఠన్తి తా న్ద్విజాన్. 18
వాయురూపాశ్చ గచ్ఛన్తి తథాసీనా నుపాసతే । దక్షిణం జాను మాలభ్య త్వం మయాఽత్ర నిమన్త్రితః. 19
ఏవం నిమన్త్ర్య నియమం శ్రావయే త్పితృభక్తిమాన్ । అక్రోధనై శ్శౌచపరై స్సతతం బ్రహ్మవాదిభిః. 20
భవితవ్యం భవద్భిస్తు మయా చ శ్రాద్ధ*కారిణా ।
పితృయజ్ఞం తు నిర్వర్త్య పార్వణస్య తు యోఽగ్నిమాన్. 21
పిణ్డాన్వాహార్యకం కుర్యా చ్ఛ్రాద్ధ మిన్దుక్షయే తథా । గోమయే నానులిప్తే తు దక్షిణాప్రవణావనౌ. 22
శ్రాద్ధం సమారభే ద్భక్త్యా గోష్ఠే వా జలసన్నిధౌ । అగ్నిమా న్నిర్వపే త్పిత్ర్యం చరుం వా సమముష్టిభిః.
భవితవ్యం భవద్భిశ్చ సావధానైః పరన్తప । పితృభ్యో నిర్వపామీతి సర్వం దక్షిణతో న్యసేత్. 24
అభిఘార్య తతః కుర్యా న్నిర్వాపత్రయ మగ్రతః । తే వితస్త్యాయతాః కార్యా శ్చతురఙ్గులవిస్తృతాః. 25
దర్వీత్రయం ప్రకుర్వీత ఖాదిరం రజతాన్వితమ్ । రత్నిమాత్రం పరిశ్లక్ష్ణం హస్తాగ్రాకార ముత్తమమ్. 26
ఉదపాత్రం చ కాంస్యం తు మేక్షణం తు సమిత్కుశాన్ । తిలపాత్రాణి సద్వాసో గన్ధధూపానులేపనమ్. 27
ఆహరే దపసవ్యం తు సర్వం దక్షిణత శ్శనైః । ఏవ మాసాద్య తత్సర్వం భవనస్యాగ్రతో భువి. 28

గోమూత్రేణ తు లిప్తాయాం గోమయేన తు మణ్డలమ్ । అక్షతాభి స్సపుష్పాభి స్సమభ్యర్చ్యాపసవ్యవత్. 29
విప్రాణాం క్షాలయే త్పాదా వభివన్ద్య పునఃపునః । ఆసనేషూపక్లప్తేషు దర్భవత్సు విధానతః. 30
ఉపస్పృష్టోదకా న్విప్రా నుపవేశ్యానుమన్త్రయేత్ । ద్వౌ దైవే పితృకార్యే త్రీ నేకైక ముభయత్ర వా. 31

శ్రాద్ధమునకు ఒకనాడుగాని రెండునాళ్ళుగాని ముందుగా భోక్తలగు బ్రాహ్మణులను వినయముతో నిమంత్రణము-నేను అనుష్ఠించు శ్రాద్ధమునందు మీరు భోక్తలుగా ఉండవలెనని ప్రార్థన-చేయవలెను. చేసి అంగీకరింపజేసి తన ఇంటికి పిలిచికొనిరావలెను. అట్లు నిమంత్రించినచో పితృదేవతలు ఆ బ్రాహ్మణులందు ప్రవేశించి నిలుతురు. పితృదేవతలు వాయురూపులయి ఆ బ్రాహ్మణుల దగ్గరకు పోవుదురు. వారు భోజనమునకై కూర్చుండినప్పుడు వారియందుండి వారితో పాటు తాము కూర్చుందురు.

శ్రాద్ధకర్త భోక్తయొక్క కుడి మోకాటిని తాకుచు 'అయ్యా! ఈ శ్రాద్ధమునందు భోక్తగా నేను మిమ్ములను నిమంత్రించుచున్నాను. అని నిమంత్రించవలెను. తరువాత అతడు పితృదేవతలయందు భక్తితో ఈ నియమమును వారికి వినిపించవలెను. "మీరు ఈ శ్రాద్ధకాలములో ఆరంభమునుండి చివర వరకును క్రోధము విడిచి శౌచము కలిగి దేవతా తత్త్వ విషయమునే మాటలాడుచు ఉండవలెను. మీరే కాదు. శ్రాద్ధ కర్తనగు నేనును అట్లే యుండవలెను." అని ఈ నియమ మంత్రమునకు అర్థము.

పార్వణ శ్రాద్ధమును జరుపు నిత్యాగ్నిహోత్రియగు గృహస్థుడు అమావాస్య మొదలగు పర్వములయందు యథా విధిగా పితృయజ్ఞమును జరిపి పిండముల అన్వాహార్యకమును-పితరులకు పిండములను ఆహారముగా సమర్పించుటను-నిర్వర్తించవలెను.

శ్రాద్ధమును జరుపవలసిన ప్రక్రియాక్రమము ఇది. గోశాలాప్రదేశమున గాని సరస్సులు నదులు మొదలగు జల సమీపమునందుగాని దక్షిణము వైపునకు వాలుగా ఉన్న ప్రదేశములను గోమయముతో అలికి అచ్చట భక్తితో శ్రాద్ధ మాచరించుట ఆరంభించవలెను. అగ్నిహోత్రమును ఏర్పరచుకొనవలయును. చరువును (పితృదేవతలకు అర్పించుటకై పక్వము చేసిన పదార్థమును) సమ పరిమాణము కల పిడికిళ్ళుగా పాత్రయందు వడ్డించుకొనవలెను. "అయ్యా! ఇది పితృ దేవతలకై వడ్డించుచున్నాను. మీరును నేనును సావధానతతో ఉండవలయును!" అని భోక్తలను ప్రార్థించుచు అదియంతయు దక్షిణమున ఉంచవలెను: తరువాత దానిపై నేతితో అభిఘారణము చేసి దానియందు మూడు వర్థనలను చేయవలెను. ఆ వడ్డించు చరు పిండ పరిమాణము పన్నెండు అంగుళముల పొడవుతో నాలుగంగుళముల వెడల్పు నాలుగు అంగుళముల మందము కలిగి ఉండవలెను. (1 భారతీయాంగుళము = $^{3}/_{4}$ బ్రిటిష అంగుళము.) చంద్రకొయ్యతో మూడు దర్వులను (త్రెడ్డులను) చేయవలెను. వాటిలో వెండి రేకు సమర్చవలెను. అవి పిడికిలి మూసిన మూరపొడవున నున్నవై చేతిముందు భాగవు ఆకారములో ఉత్తమమై ఉండవలెను. కంచుతో చేసిన నీటి పాత్ర-మేక్షణము వైదిక కర్మము లందుపయోగించు ద్రవమును వడ్డించు ఉపకరణము) సమిధలు-కుశలు-తిలపాత్రములు-మడుగు వస్త్రములు గంధములు ధూపద్రవ్యములు అనులేపనములు (పూసికొను సుగంధ వస్తువులు) ఈ మొదలగునవి సేకరించుకొనవలెను. వీటిలో ప్రతి ఒక్కటియు అపసవ్యముతో నెమ్మదిగా దక్షిణపు వైపుగా తెచ్చుకొని ఉంచుకొనవలెను.

ఇట్లు ఈ వస్తువులలో ప్రతి ఒక్కటియు సమకూర్చుకొని తన భవనమునకు (ఇంటికి) ముందు ప్రదేశమున గోమూత్రముతోను గోమయముతోను అలికిన చోట గోమయముతో మండలము చేయవలెను. ఆ ప్రదేశమున అపసవ్య ముతో బ్రాహ్మణులను అక్షతలతోను పుష్పములతోను అర్చించవలెను. తరువాత వారిని మాటిమాటికి అభివందనము చేసి వారి పాదములను ప్రక్షాళనము చేయవలెను. తమ పాద ప్రక్షాళనానంతరము ఆ బ్రాహ్మణులు ఆచమనము ఉదకోపస్పర్శనము చేయవలెను. అట్టి వారిని చక్కగా అమర్చబడి దర్భలు పరచిన ఆసనములపై శాస్త్ర విధానమున కూర్చుండబెట్టి అనుమంత్రణము (మరల ఆహ్వానించుట-దయచేయుడు-కూర్చుండుడు అనుట) చేయవలెను. విశ్వేదేవ స్థానమున

ఇద్దరను- పితృ స్థానమున ముగ్గరను-సంభవము కాని యెడల రెండు స్థానములలోను ఒక్కొక్కరినే కాని-భుజింపజేయ వలెను. శ్రాద్ధకర్త తాను ఎంత ధనవంతుడైనను ఇంతకంటె ఎక్కువ మందిని శ్రాద్ధమున భోక్తలుగా చేసి భుజింప జేయరాదు.

భోజయే దీశ్వరోఽపీహ న కుర్యా ద్విస్తరం బుధః । దేవపూర్వం నియోజ్యాథ విప్రా నర్ఘ్యాదినా బుధైః.
అగ్నౌ కుర్యా దనుజ్ఞాతో విప్రై ర్విప్రో యథావిధి । స్వగృహ్యోక్తవిధానేన కాంస్యే కృత్వా చరుం తతః.
అగ్నీషోమయమాభ్యాం తు కుర్యా దాప్యాయనం బుధః ।

దక్షిణాగ్నౌ ప్రణీతే చ య ఏకాగ్ని ర్ద్విజోత్తమః. 34
యజ్ఞోపవీతీ నిర్వృత్య తత్ర పర్యుక్షణాదికమ్ । ప్రాచీనావీతినా కార్య మేతత్సర్వం విజానతా. 35
షడ్వై తస్మా ద్ధవిశ్శేషా త్పిణ్డా న్కృత్వా తథోదకమ్ । దద్యా దుదకపాత్రం తు సతిలం సవ్యపాణినా. 36
కృత్వాఽపసవ్యం ఉత్త్రైత ద్దర్భయుక్తో విమత్సరః । విధాయ లేఖాం యత్నేన నిర్వపే దవనేజనమ్. 37
దక్షిణాభిముఖః కుర్యా త్కరే దర్వీం విధాయ వై । నిధాయ పిణ్డ మేకైకం సర్వా న్దర్భోపరి క్రమాత్. 38

పిణ్డప్రదానాదివిధిః.

నినయే దథ దర్భేషు నామగోత్రానుకీర్తనైః । తేషు దర్భేషు స్వం హస్తం నిమృజ్యా ల్లేపభాగినామ్. 39
తథైవ చ తతః కుర్యా త్పునః ప్రత్యవనేజనమ్ । షడ్జా నేతా న్నమస్కృత్య గన్ధధూపార్హణాదిభిః. 40
ఏవ మావాహ్య తత్సర్వం వేదమన్త్రై ర్యథోదితైః । ఏకాగ్నే ర్హ్యేక ఏవ స్యా న్నిర్వాపోదర్వికా తథా. 41
తతః కృత్వా న్తరై ర్దద్యా త్తత్పత్నీభ్యః కుశా న్బుధః । తద్వ త్పిణ్డాదికం కుర్యా దావాహనవిసర్జనమ్. 42
తతో గృహీత్వా పిణ్డేభ్యో మాత్రా స్సర్వాః క్రమేణ తు ।
తానేవ విప్రా న్ప్రథమం ప్రాశయే ద్యత్నతో నరః. 43
యస్మా దగ్నౌ ధృతా మాత్రా భక్షయన్తి ద్విజాతయః ।
అన్వాహార్యక మిత్యుక్తం తస్మా దన్నం న భక్షయేత్. 44
పూర్వం దత్వా తు తద్ధస్తే సపవిత్రం తిలోదకమ్ । తత్పిణ్డాగ్రం ప్రయచ్ఛేత్తు స్వధైషామ స్త్వితి బ్రువన్. 45
వర్ణయ న్భోజయే దన్న ముష్ణం పూతం చ సర్వదా ।
వర్జయేత్తు త్వరాం క్రోధం స్మర న్నారాయణం హరిమ్. 46
తృప్తా న్జ్ఞాత్వా తతః కుర్యా ద్వికిరం సర్వ మన్తికే । సోదకం చాన్న ముద్ధృత్య సలిలం ప్రక్షిపే ద్భువి. 47
ఆచాన్తేషు పున ర్దద్యా జ్జలపుష్పాక్షతోదకమ్ । స్వస్తివాచనికం సర్వం పిణ్డోపరి సమాచరేత్. 48
దేవాద్యన్తం ప్రకుర్వీత శ్రాద్ధనాశోఽన్యథా భవేత్ । విసృజ్య విప్రా న్ప్రణత స్తేషాం కృత్వా ప్రదక్షిణమ్.
దక్షిణాం దిశ మాకాఙ్క్ష న్పితౄ న్యాచేత మానవః । దాతారో నోఽభివర్ధన్తాం వేదస్సన్తతిరేవ నః. 50
శ్రద్ధా చ నో మా వ్యగమ ద్బహు దేయంచ నోఽస్త్వితి । అన్నం చ నో బహు భవే దతిథీంశ్చ లభేమహి.
యాచితారశ్చ న స్సన్తు మా చ యాచిష్మ కంచన । ఏతచ్చ సతతం ప్రోక్త మన్వాహార్యం తు పార్వణమ్.
యథేన్దుసంక్షయే తద్వ దన్యత్రాపి నిగద్యతే । పిణ్డాంస్తు గోఽజవిప్రేభ్యో దద్యా దగ్నౌ జలేపి వా. 53
విప్రాగ్రతో వా వికిరే ద్వయోభిరథవాఽఽశయేత్ । పత్నీ తు మధ్యమం పిణ్డం ప్రాశయే ద్వినయాన్వితా.
ఆధత్త పితరో గర్భం కుమారం పుష్కరస్రజమ్ । యథేహ పురుషో సది త్యన్నం ప్రస్తానవర్ధనమ్. 55

తావ న్నిర్వాపణం విద్వా న్యావ ద్విప్రా విసర్జితాః । వైశ్వదేవం తతః కుర్యా న్నిర్వృత్తే పితృకర్మణి. 56
ఇష్టైః సహ తత శ్శాన్తో భుఞ్జీత పితృసేవితమ్ । పున ర్భోజన మధ్వానం యాన మాయాసమైథునమ్. 57
శ్రాద్ధకృ చ్ఛ్రాద్ధభుక్చైవ సర్వ మేత ద్వివర్జయేత్ । స్వాధ్యాయం కలహం వైరం దివా సుప్తం చ సర్వదా.
అనేన విధినా శ్రాద్ధం త్రి రబ్దస్యేహ నిర్వపేత్ । కన్యాకుమ్భవృషస్థేఽర్కే కృష్ణపక్షే తు సర్వశః. 59
యత్ర యత్ర ప్రదాతవ్యం సపిణ్డీకరణాత్మకమ్ । తత్రానేన విధానేన దేయ మగ్నిమతా సదా. 60

ఇతి శ్రీమత్స్యమహాపురాణే మత్స్యమనుసంవాదే శ్రాద్ధకల్పే
నిమన్త్రణాది కథనం నామ షోడశోధ్యాయః.

శ్రాద్ధకర్తయగు విప్రుడు భోక్తలుగా కూర్చున్న విప్రులను అర్ఘ్యము మొదలగు వాటితో దేవ పూర్వకముగా (మొదట విశ్వ దేవ స్థానమున తరువాత పితృ స్థానమున) అర్చనము జరుపవలెను. తరువాత ఆవిప్రుల అనుమతి పొంది తరువాత చరువు (హోమమునకై ఉంచిన ద్రవ్యము)ను కంచు పాత్రలోనికి తీసికొని దానిని తన గృహ్య సూత్రములందు చెప్పబడియున్న విధమున అగ్నౌకరణము చేయవలయును. సంప్రదాయమును ఎరిగిన వాడు (అగు గృహస్థుడు) ఈ అగ్నౌకరణముచే అగ్నీషోమయములకు తృప్తి కలిగించవలయును. శ్రాద్ధకర్తయగు ద్విజోత్తముడు ఏకాగ్ని (వాన ప్రస్థుడు) ఐనచో దక్షిణాగ్నిని (దీనినే అన్వాహార్య పచనాగ్నియనియు లౌకికాగ్ని అనియు వ్యవహరింతురు.) ప్రణయనము (ప్రజ్వలనము) చేసి దానియందు ఈ అగ్నౌకరణము జరుపవలెను. ఈ సందర్భములో పర్యుక్షణము అమంత్రకముగా ఏ ఇతర ప్రక్రియ లేకుండ అగ్నిహోత్రుని చుట్టును నీటిని చిలుకరించుట) మొదలగునవి యజ్ఞోపవీతి (ఎడమ భుజము మీదుగా సవ్యముగా జందెముధరించినవాడు) అయి చేయవలెను. మిగిలినది అంతయు ప్రాచీనావీతి (కుడి భుజము మీదుగ జందెముధరించినవాడు-అప సవ్యముగా) అయి చేయవలెను.

అగ్నౌకరణము చేయగా మిగిలిన హవిః శేషము నుండి ఆరు పిండములను చేయవలెను. ఎడమ చేతితో సూపులతో కూడిన ఉదక పాత్రను పట్టుకొనవలెను. పిమ్మట అపసవ్యము చేసికొని దర్భలతో రేఖను (నిలువుగా దక్షిణాగ్రములుగా దర్భలను పరచుట) చేయవలెను. పిమ్మట చేతితో దర్విని పట్టుకొని దానితో ఆ చోటు అవనేజనము (నీటితో తడుపుట) చేయవలెను. ఇది యంతయు దక్షిణ ముఖముగా తిరిగియే చేయవలెను. తరువాత దర్భలపై ఒక్కొక్క పిండమునే వారివారి నామ గోత్రములను చెప్పుచు ఉంచవలెను. తరువాత లేపభాక్కుల (చేతికి అంటుకొనిన పిండపు అంటు అర్పించుటతోనే తృప్తిపడవలసిన వారు.) నిమిత్తమై శ్రాద్ధకర్త ఆదర్భల పై తన చేతులను కొద్ది నీటితో కడుగుకొనవలెను. తరువాత మరల ప్రత్యవనేజనము (మరల నీటితో తడుపుట) చేయవలెను. గంధ ధూపములు దీపము నైవేద్యము మొదలగు అర్చనలతో పిండములను అర్చించి వాటిని నమస్కరించవలెను. ఇది యంతయు వారివారి గృహ్య సూత్రములందు చెప్పబడిన విధమున బ్రాహ్మణులందు విశ్వదేవులను పితృదేవతలను ఆవాహనము చేసి జరుపవలెను. ఏకాగ్నియగు (వాన ప్రస్థుడగు) శ్రాద్ధకర్త మాత్రము దర్వితో ఒకే వర్ధన చేసిన చాలును.

ఇట్లు పురుషులగు పితరులకు పిండదానము చేసిన తరువాత వారి పత్నులకు దర్భలు మొదలైన వాటిని ఆ పిండములు మొదలైన వానిని ఆవాహనమును విసర్జనమును జరుపవలెను. తరువాత పిండముల నుండి అల్పాంశములను తీసికొని ప్రతియొక భాగమును భోక్తలచే తినిపించవలెను.

ద్విజులయినవారు అగ్నియందు వేల్చగా మిగిలిన శేషమునే (అగ్నౌకరణము కాని హోమము కాని చేసిన తరువాతనే) ఆహారమును తిందురు. కావున అట్టి అగ్ని హవన శేషమునకు అన్వాహార్యకము అని పేరు. కనుక భోక్తలకు హవన శేషము కాని అన్నమును తినిపించరాదు.

మొదట భోక్తల హస్తమున పవిత్రముతో కూడ తిలోదకమును విడువవలెను. తరువాత ఆ పిండమాత్రను (పిండపుతునుకను) 'స్వధా ఏషాం అస్తు' అని చెప్పుచు వారి చేతియందుంచవలెను.

ఎల్లప్పుడును అన్నము పవిత్రముగాను ఉష్ణముగాను ఉండునట్లు చూచి ఆ విషయమును వర్ణించుచు భోక్తలచే భుజింపజేయవలెను. త్వరపెట్టుట కాని క్రోధము కాని లేకుండ హరినామస్మరణ చేయుచు భోక్తలను భుజింపజేయవలెను.

వారు భుజించి తృప్తి నొందినట్లు తెలిసిన తరువాత వికిరాన్నమును వారి దగ్గర (సమంత్రకముగా) ఉంచవలెను. ఉదకముతో కూడ అన్నము తీసికొని నీటిని మాత్రము భూమిపై వదలవలెను.

వారు (భుజించి హస్తములు పాదములు కడుగుకొని) ఆచమించిన తరువాత మరల జలముతో కూడిన పుష్పములను అక్షతోదకమును వారి హస్తములందు వదలవలెను.

ఈ స్వస్తి వాచనికము (శుభమును కలిగించుటకై చేయు ప్రక్రియ) అంతయు పిండముల మీద చేయవలెను. శ్రాద్ధ ప్రక్రియ అంతయు విశ్వేదేవులతో ఆరంభించి వారితోనే ముగియునట్లు జరుపవలెను. లేనిచో శ్రాద్ధ నాశము జరుగును.

భోక్తలగు బ్రాహ్మణులకు వీడ్కోలు చెప్పవలెను. వారికి ప్రదక్షిణము చేయవలెను. తరువాత దక్షిణ దిశగా తిరిగి పితృ దేవతలను ఉద్దేశించి ఇట్లు వేడుకొనవలెను. "(తమంతట తామే ఇచ్చు) మా దాతలు వృద్ధి నొందుదురు గాక ! మా వేద సంతతి (పరంపర) వర్ధిల్లుగాక ! మా చిత్తములందు శ్రద్ధ (ఆస్తికతా బుద్ధి) తొలగక నిలిచియుండుగాక ! మేము అధికముగా దానము చేయుదుముగాక ! మాకు అన్నము అధికముగా లభించుగాక ! (మా ఆతిథ్యము అందుకొనుటకు) అతిథులును మాకు లభింతురుగాక ! మమ్ములను యాచించు వారు (చాల మంది) ఉందురుగాక ! మేము ఎవ్వరిని యాచింపకుందుముగాక ! అయాచితముగా వచ్చిన దానితో తృప్తి నొందెదము గాక !)"

ఇది అన్వాహార్య పూర్వకమగు పార్వణ శ్రాద్ధ విధానము. ఈ ప్రక్రియ అమావాస్య నాడు జరుపవలసిన శ్రాద్ధమునకు సంబంధించినది. ఇతర పర్వ దినములందును పార్వణ శ్రాద్ధము ఇట్లే జరుపవలెను.

శ్రాద్ధము అంతయు ముగిసిన తరువాత పిండములను గోవులకో మేకలకో బ్రాహ్మణులకో తినుటకు ఈయవలెను. లేదా అగ్నిలోనో నీటిలోనో వేయవలెను. బ్రాహ్మణుల ముందయినను వెదజల్లవలెను. పక్షులకైన ఆహారముగా వేయవలెను. శ్రాద్ధ కర్తయొక్క భార్య మాత్రము నడిమి పిండమును వినయముతో తినవలెను. తినునప్పుడు "ఓ పితృదేవతలారా ! నా గర్భమున పద్మ మాలికల ధరించు కుమారుని కలుగజేయుడు." భోక్తలగు బ్రాహ్మణులకు వీడ్కోలు చెప్పి పంపువరకు ఉచ్ఛేషణమును (ఎంగిళ్ళను) ఉంచవలెను. (తరువాత అది తీసి శుద్ధి చేయవచ్చును.)

ఇట్లు పితృ కార్యము ముగిసిన తరువాత వైశ్వ దేవమును జరుపవలెను. తరువాత కర్త తన ఇష్టులతో కలిసి పితృ శేషమును భుజించవలెను శ్రాద్ధ దినమున శ్రాద్ధకర్తగాని శ్రాద్ధమున భోక్తగా ఉండువారు కాని ఈ చెప్పబోవు వానిని చేయరాదు: మరల భోజనము చేయుట-దారి ప్రయాణము చేయుట-వాహనములపై పయనించుట-శ్రమ కలిగించు పనులు-స్త్రీ సంగమము-స్వాధ్యాయము-కలహము-విరోధపు పనులు-పగటి నిద్ర- ఇవి చేయకూడదు.

ప్రత్యాబ్దిక శ్రాద్ధమును కూడ ఇదే విధముగా జరుపవలెను. సూర్యుడు కన్యా కుంభ వృషభ రాసులలో ఉండగాను ఏ కృష్ణ పక్షమునందే కాని సపిండీకరణము జరుపు సందర్భములందు కాని అగ్నిమంతుడు అగువాడు (సంన్యాసి కాక మిగిలిన ఆశ్రమముల వారు) ఇట్లే శ్రాద్ధము జరుపవలెను.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున మత్స్యమను సంవాదమున శ్రాద్ధ కల్పమున నిమంత్రణాది కథనమను షోడశాధ్యాయము.

## సప్తదశోఽధ్యాయః.

### సాధారణశ్రాద్ధకాలనిర్ణయః.

సూతః: అతఃపరం ప్రవక్ష్యామి విష్ణునా యదుదీరితమ్ । శ్రాద్ధం సాధారణం నామ భుక్తిముక్తిఫలప్రదమ్.

అయనే విషువే యుగ్మే సామాన్యే చార్కసంక్రమే । అమావాస్యాష్టకా చైవ కృష్ణపక్షచతుర్దశీ. 2
ఆర్ద్రామఘారోహిణీషు ద్రవ్యబ్రాహ్మణసన్నిధౌ । గజచ్ఛాయావ్యతీపాతే విష్టివైధృతివాసరే. 3
వైశాఖస్య తృతీయాయాం నవమ్యాం కార్తికస్య తు । పఞ్చదశ్యాం తు మాఘస్య నభస్యేచ త్రయోదశీ. 4
యుగాదయ స్స్మృతా హ్యేతే దత్తస్యాక్షయకారకాః । తథా మన్వన్తరాదౌ చ దేయం శ్రాద్ధం విజానతా. ౫
అశ్వయుక్చుక్లనవమీ ద్వాదశీ కార్తికే తథా । తృతీయా చైత్రమాసస్య తథా భాద్రపదస్య చ. 6
అమావాస్యా ఫాల్గునస్య పౌషస్యైకాదశీ తథా । ఆషాఢస్యాపి దశమీ మాఘమాసస్య సప్తమీ. 7
శ్రావణే చాష్టమీ కృష్ణా తథాషాఢేచ పూర్ణిమా । కార్తికీ ఫాల్గునీ చైత్రీ జ్యైష్ఠీ పఞ్చదశీ తథా. ౮
మన్వన్తరాదయశ్చైతా దత్తస్యాక్షయకారకాః । యస్మాన్మన్వన్తరస్యాదౌ రథ మాప దివాకరః. 9
మాఘమాసస్య సప్తమ్యా మథ సా రథసప్తమీ ।
పానీయమ ప్యత్ర తిలై ర్విమిశ్రం దద్యా త్పితృభ్యః ప్రయతో మనుష్యః. 10
శ్రాద్ధం కృతం తేన సమా స్సహస్రం రహస్య మేత త్పితరో వదన్తి ।
వైశాఖ్యా ముపరాగేషు రథోత్సవమహాలయే. 11
తీర్థాయతనగోష్ఠేషు ద్వీపోద్యానగృహేషు చ । వివిక్తేషూపలిప్తేషు శ్రాద్ధం దేయం విజానతా. 12

## సప్తదశాధ్యాయము

### సాధారణ శ్రాద్ధ విధానము-అభ్యుదయిక శ్రాద్ధ విధానము

సూతుడు ఋషులతో ఇంకను ఇట్లు చెప్పనారంభించెను. (ఇంతవరకు నేను మీకు మూడు విధములగు నైమిత్తిక శ్రాద్ధములలో మొదటిదగు పార్వణ శ్రాద్ధపు విధానమును తెలిపితిని.) ఇకమీదట మత్స్యరూప నారాయణుడు మనువునకు చెప్పిన సాధారణ శ్రాద్ధ విధానము తెలిపెదను. (ఇది నైమిత్తిక శ్రాద్ధములలో రెండవది.) దీని వలన భుక్తి ముక్తులు లభించును.

(ఈ శ్రాద్ధము జరుపవలసిన కాలమును-దేశమును) ఉత్తరాయన దక్షిణయన ప్రవేశ పుణ్యకాలములును రెండు విషువ దినములును (రాత్రింబవళ్ళ ప్రమాణము సమముగా ఉండు దినములు) సూర్యుడు ఆయారాశులయందు ప్రవేశించు దినములును అమావాస్య అష్టకా (మాసమున కృష్ణపక్ష సప్తమీ) కృష్ణపక్ష చతుర్దశీ తిథులును ఆర్ద్రామఘా రోహిణీ నక్షత్ర దినములును శ్రాద్ధమునకు యోగ్యములగు ద్రవ్యములును యోగ్యులగు బ్రాహ్మణులును లభించిన దినములును గజచ్ఛాయా వ్యతీపాత్ విష్టి వైధృతి యోగములున్న దినములును యుగాది మన్వంతరాది దినములును అనెడి ఈ దినములందు జరిపిన శ్రాద్ధము అక్షయమగును. (అనంత ఫలమును ఇచ్చును.) (వీనిలో గజచ్ఛాయావ్యతీపాత విష్టి వైధృతి యోగములు జ్యోతిశ్శాస్త్రమునుండి తెలియవలెను.) వైశాఖ తృతీయా కార్తిక నవమీ మాఘ పంచదశీ భాద్రపద త్రయోదశీ-ఇవి యుగాదులు. అశ్వయుజ శుక్లనవమీ కార్తిక ద్వాదశీ చైత్ర తృతీయా భాద్రపద తృతీయా ఫాల్గునామావాస్యా పుష్యైకాదశీ ఆషాఢ దశమీ మాఘ సప్తమీ శ్రావణ కృష్ణాష్టమీ ఆషాఢ పూర్ణిమా కార్తిక ఫాల్గున చైత్ర జ్యేష్ఠ పూర్ణిమలు మన్వంతరాది దినములు. (ఇచట కొన్ని తిథుల విషయమున పక్షమును చెప్పలేదు. మరియు పంచాంగములలో మన్వంతరాదులు ఈ విధముగా నున్నవి. కార్తిక శుక్ల ద్వాదశీ స్వాయంభువ-అశ్వయుజ శుక్లనవమీ స్వారోచిష-చైత్ర శుక్ల తృతీయా-ఉత్తమ-భాద్రపద శుక్ల తృతీయా తామస-పుష్య శుక్లైకాదశీ రైవత-ఆషాఢ శుక్లదశమీ చాక్షుష-మాఘశుక్ల సప్తమీ వైవస్వత-శ్రావణామావాస్యా అగ్నిసావర్ణి-ఫాల్గున పూర్ణిమా బ్రహ్మసావర్ణి-కార్తిక పూర్ణిమా దక్షసావర్ణి-భాద్రపద కృష్ణాష్టమీ సూర్యసావర్ణి-ఆషాఢ కృష్ణాష్టమీ-రుద్రసావర్ణి-జ్యేష్ఠ పూర్ణిమా భౌత్య-చైత్ర శుక్ల పూర్ణిమా రౌచ్య].

వీనిలో వైవస్వత మన్వంతరాదియగు మాఖ శుక్ల సప్తమీ తిథినాడు సూర్యుడు తన రథమును ఆరోహించెను. [సంపాదించుకొనెను.] కనుక దీనికి రథ సప్తమీయని వ్యవహారము ఏర్పడినది. ఈ దినమున మనుష్యుడు ప్రయతుడై [దేహమున చిత్తమున శుచియై] తిలలతో మిశ్రితమయిన ఉదకమును మాత్రమైనను పితృ దేవతల నుద్దేశించి అర్పించినచో వేయి సంవత్సరముల కాలము శ్రద్ధతో యథావిధిగ శ్రాద్ధము పెట్టినంత ఫలము కలుగును. వైశాఖామావాస్య నాడును గ్రహణ దినములందును ఉత్సవ దినములందును మహాలయ దినములందును తీర్థములందును క్షేత్రములందును గోవులు నిలుచు ప్రదేశములందును ద్వీపములందును ఉద్యాన గృహములందును [ఉద్యానవనములు వేరు.] లేదా ఉద్యాన వనములందును తనకు అనుకూలమయిన గృహములందును వివిక్తమగు [ఎట్టి అపవిత్రతకును కలవరపాటునకును అవకాశము కలుగనీయని] ప్రదేశమునందును చక్కగా అలికి ఆ ప్రదేశమున శ్రాద్ధము జరుపుట శాస్త్రమును సంప్రదాయమును ఎరిగిన వారు చేయవలసిన పని.

విప్రా న్పూర్వేఽపరే చాహ్ని వినీతాత్మా నిమన్త్రయేత్ । శీలవ్రత గుణోపేతా న్వయోరూపసమన్వితాన్.

సాధారణశ్రాద్ధే విశ్వేదేవాద్యర్చావిధిః.

ద్వౌ దైవే పితృకార్యే త్రీ నేకైక ముభయత్ర వా, భోజయే త్సుసమృద్ధోఽపి న ప్రసజ్యేత విస్తరే. 14
విశ్వా న్దేవా న్యవైః పుష్పై రభ్యర్చ్యాసనపూర్వకమ్ ।
పూరయే త్పాత్రయుగ్మం తు స్థాప్య దర్భపవిత్రకమ్. 15
శన్నో దేవీ త్యపః క్షిప్త్వా యవోఽసీతి యవా నపి । గన్ధపుష్పైశ్చ సమ్పూజ్య విశ్వే దేవం ప్రతి న్యసేత్.
విశ్వేదేవాస ఇత్యాభ్యా మావాహ్య వికిరే ద్యవాన్।
గన్ధపుష్పై రలఙ్కృత్య యా దివ్యేత్యర్ఘ్య ముత్సృజేత్. 17
అభ్యర్చ్య తాభ్యా ముత్సృష్టః పితృయజ్ఞం సమారభేత్ ।
దర్భాసనాని కృత్వాఽఽదౌ త్రీణి పాత్రాణి పూరయేత్. 18
సపవిత్రాణి కృత్వాదౌ శ న్నో దేవీ త్యపః క్షిపేత్ । తిలోఽసీతి తిలా న్క్షిప్త్వా గన్ధపుష్పాదికం పునః. 19
పాత్రం వనస్పతిమయం తథా పర్ణమయం పునః । జలజం చాపి కుర్వీత తథా సాగరసమ్భవమ్. 20
సౌవర్ణం రాజతం వాపి పితౄణాం పాత్ర ముచ్యతే । రజతస్య కథా వాపి దర్శనం దాన మేవ చ. 21
రాజతై ర్భాజనై రేషా మథవా రాజతాన్వితైః । వార్యపి శ్రద్ధయా దత్త మక్షయాయోపకల్పతే. 22
తథార్ఘ్యపాత్రే పిణ్డేపి పితౄణాం రాజతం మతమ్ । శివనేత్రోద్భవం యస్మా త్తత స్త త్పితృవల్లభమ్. 23
అమఙ్గళం తద్యత్నేన దేవకార్యేషు వర్జయేత్ । ఏవం పాత్రాణి సఙ్కల్ప్య యథాలాభం విమత్సరః. 24
యా దివ్యేతి పితు ర్నామ గోత్రై ర్దర్భకరో న్యసేత్ ।
పితౄ నావాహయిష్యామి తథేత్యుక్తస్తు తైః పునః. 25
ఉశ న్తస్త్వా తథాఽఽయంతు ఋచా ప్యావాహయే త్పితౄన్ ।
యా దివ్యేత్యర్ఘ్య ముత్సృజ్య దద్యా ద్గన్ధాదికం తతః 26
వస్త్రోత్తరం దేవపూర్వం గత్వా సంస్రవణాదితః । పితృపాత్రే నిధాయాథ శేష ముత్తరతో న్యసేత్. 27
పితృభ్య స్థానమసీతి నిధాయ పరిషేచయేత్ । తత్రాపి పూర్వవ త్కుర్యా దగ్నికార్యం విమత్సరః. 28
ఉభాభ్యామపి హస్తాభ్యా మాహృత్య పరివేషయేత్ । ప్రశాన్తచిత్త స్సతతం దర్భపాణి రశేషతః. 29

శ్రాద్ధకర్త శ్రాద్ధమునకు ఒకదినము ముందుగా గాని రెండునాళ్లు ముందుగాగాని మంచిశీలము సత్కర్మానుష్ఠానము సద్గుణములు కలిగిన వారిని తగిన వయస్సు రూపము కలవారిని శ్రాద్ధమున భోక్తలుగా నిమంత్రించవలెను.

విశ్వేదేవస్థానమున ఇద్దరను పితృ స్థానమున ముగ్గురిని మాత్రమే భుజింపచేయవలెను. లేదా ఒక్కొక్క స్థానమునకు ఒక్కొక్కరైనను చాలును. కర్త తానెంత ధనవంతుడైనను అంతకంటె ఎక్కువమందిని పిలువరాదు.

మొదట విశ్వేదేవులకు ఆసనమునిచ్చి వారిని యవలతో పుష్పములతో పూజించవలెను. దర్భపవిత్రములను ధరించి రెండు పాత్రలను జలముతో నింపవలెను. 'శన్నోదేవీః' అను మంత్రముతో నీటిని ఆ పాత్రలలో పోయవలెను. 'యవోఽసి' అను మంత్రముతో పాత్రలో యవల వేయవలెను. గంధ పుష్పములతో పాత్రలను పూజించి విశ్వేదేవులముందుంచవలెను. 'విశ్వేదేవాసః' అను మంత్రముతో విప్రులయందు విశ్వేదేవతల నావాహనము చేయవలెను. తరువాత వారిమీద యవలను విదలించవలెను. తరువాత బ్రాహ్మణులను గంధ పుష్పములతో అలంకరించి 'యా దివ్యాః' అను మంత్రముతో వారిచేతుల యందర్ఘ్యము విడువవలెను. మరల వారిని అర్చించి వారినుండి వీడ్కోలు అనుమతి పొందవలెను. పిమ్మట పితరులను అర్చించుటకు రావలెను. దర్భలతోడి ఆసనములను పితృస్థానమునందలి బ్రాహ్మణులకు వేయవలెను. వీరిముందున్న మూడు పాత్రలను నీటితో నింపవలెను. పవిత్రములను ధరించవలెను. 'శన్నోదేవీః' అను మంత్రముతో పాత్రలయందు నీటిని పోయవలెను. 'తిలోఽసి' అను మంత్రముతో పాత్రలందు తిలలను వేయవలెను. గంధ పుష్పాదులను కూడ పాత్ర లలో వేయవలెను. ఈ అర్ఘ్య పాత్రములు రావివంటి వనస్పతుల కొయ్యతో చేసినవి కాని ఆకుల దొన్నెలు కాని సముద్రమునుండి లభించు శంఖము మొదలైనవి కాని అయియుండవలెను. లేదా వెండిదో బంగారపుదో కావచ్చును. రజతము అను మాటయు రజతమును చూపుటయు దానము చేయుటయు పితృప్రీతికరము. వెండి పాత్రలతో కాని వెండి కలిసిన లోహపు పాత్రలతోకాని శ్రద్ధతో పితరులకు ఇచ్చినది అక్షయమై అనంతఫలము నిచ్చును. అర్ఘ్యముంచుటకును విడుచుటకును కాని పిండముల నుంచుట మొదలగు పనులలో కాని పితృదేవతలకు వెండి చాల ప్రీతికరమైనది.

వెండి శివుని కంటినుండి పుట్టినది. కనుకనే అది పితృ ప్రీతికరము. అది శుభకరము మాత్రము కాదు. కనుక దానిని దేవ కార్యములందు ఉపయోగింపరాదు.

ఈ విధముగా తనకు లభించునంతలో (శ్రాద్ధమునకై) పాత్రలను సమకూర్చుకొనవలెను. మత్సరము మొదలగు మనోదోషము లేమియు లేకయుండవలెను. 'యా దివ్యాః' అను మంత్రముతో పితరుల నామ గోత్రములను చెప్పుచు దర్భలను చేతపట్టుకొని 'పితరులను మీయందు ఆవాహనము చేయుచున్నాను.' అను అర్థమునిచ్చు మంత్రముతో ఆదర్భ లను బ్రాహ్మణుల చేతియందుంచవలెను. ఆసమయములో 'మీయందావాహనము చేయుచున్నాను.' అని కర్త అనగా 'తథా' 'అట్లే కానిమ్ము.' అని ఆ విప్రుడనును. 'ఉశంతస్త్వా' అను మంత్రముతో కాని 'ఆయంతు' అను మంత్రముతో కాని వారియందు పితరులను ఆవాహనము చేయవలెను. 'యా దివ్యా' అను మంత్రముతో వారిచేతిలో అర్ఘ్యమును విడువవలెను. గంధ పుష్పవస్త్రములీయవలెను. అర్ఘ్యము మొదట విశ్వేదేవులకు-తరువాత పితరులకు. సంస్రవ మంత్రము కూడ చెప్పుచుండవలెను. అర్ఘ్యమును విడిచిన తరువాత న్యుబ్జుడై [ముందునకు వంగినవాడై] ఆ అర్ఘ్యపాత్రలను భోక్తకు ఉత్తరముగా ఉంచవలెను. 'పితృభ్యః స్థానమసి' అను మంత్రముతో ఆ పాత్రలను భోక్తకు పడమ దిక్కుగా శుచి ప్రదేశమున ఉంచి వానిని నీటితో పరిషేచనము చేయవలెను.

ఈ సాధారణ శ్రాద్ధమందు కూడ పార్వణ శ్రాద్ధమునందు వలెనే నిర్మలచిత్తుడై అగ్ని(గ్నౌ)కరణమును జరుప వలెను. తరువాత ప్రశాన్త చిత్తుడై నిరంతరముగా దర్భలను చేత ధరించియేయుండి రెండు చేతులతోను పదార్థములను అన్నిటిని తెచ్చి భోక్తల పాత్రలయందు వడ్డించవలెను.

సాధారణశ్రాద్ధే దేయమాంసభేదాః.

గుణైస్తు సూపశాకాద్యైః నానాభక్ష్యైః స్తథైవచ ।

అన్నంతు సదధి క్షీరం గోఘృతం శర్కరాన్వితమ్. 30

మాసం ప్రీణాతివై సర్వా న్పితౄ న్నిత్యాహ కేశవః ।
ద్వౌ మాసౌ మత్స్యమాంసేన త్రీన్మాసాన్ హారిణేన తు. 31
ఔరభ్రేణాథ చతుర శ్శాకునేనాథ పఞ్చకమ్ । షణ్మాసాం శ్ఛాగమాంసేన తృప్యన్తి పితరస్తథా. 32
సప్త లోహస్య మాంసేన అష్టౌ వైణేయజేన తు । పృషతస్య తు మాంసేన తృప్తి ర్మాసా నవైవ తు. 33
దశమాసాంస్తు తృప్యన్తి వరాహమహిషామిషైః । శశకూర్మకయోర్మాంసం మాసా నేకాదశైవతు. 34
సంవత్సరంతు గవ్యేన పయసా పాయసేన తు । రౌరవేణ తు తృప్యన్తి మాసా న్పఞ్చదశైవతు. 35
వార్ధ్రీణసస్య మాంసేన తృప్తి ర్ద్వాదశవార్షికీ । కాలశాకేనవాఽనన్త్యం ఖడ్గమాంసేన చైవతు. 36
యత్కించి న్మధునా మిశ్రం గోక్షీరఘృతపాయసమ్ । దత్తమక్షయ మిత్యాహుః పితరః పూర్వదేవతాః. 37

శ్రాద్ధే అభిశ్రవణాదివిధిః.

స్వాధ్యాయం శ్రావయే త్పిత్ర్యం పురాణాన్యఖిలాని చ । బ్రహ్మవిష్ణ్వర్కరుద్రాణాం స్తవాని వివిధానిచ.
ఇన్ద్రాగ్నిసోమసూక్తాని పావమానాని శక్తితః । బృహద్రథన్తరం తద్వ జ్జ్యేష్ఠసామ సరౌహిణమ్. 39
తథైవ శాన్తికాధ్యాయం మహాబ్రాహ్మణమేవచ । మణ్డలబ్రాహ్మణం తద్వ త్ప్రీతికారిచ యత్పునః. 40
పితౄణా మాత్మనశ్చాపి తత్సర్వం సముదీరయేత్ ।

పితృ దేవతలను ఉద్దేశించి భోక్తలచే భుజింపజేయు అన్నము శుచియై రుచికల మంచి ఆహారమునకు ఉండవలసిన అన్ని గుణములను కలిగి ఉండవలెను. నానా విధములగు భక్ష్యములతో చేరి ఉండవలెను. పప్పు ఆకు కూరలు కాయ గూరలు ఉండవలెను. పదార్థములన్నియు చాల రుచికలవై ఉండవలెను. ఆవు పాలు ఆవు నేయి శర్కర ఉండవలెను. ఇటువంటి అన్నమును మాంసమును పితరులకు తృప్తి కలిగించును. అని సాక్షాత్ విష్ణువే చెప్పెను. మాంసములలో మత్స్య మాంసము రెండు మాసముల పాటు లేడి మాంసము మూడు మాసములపాటు పొట్టేలు మాంసము నాలుగు మాసముల వరకు పాలపిట్ట మాంసము ఐదు మాసముల వరకు మేక మాంసము ఆరు మాసముల వరకు ఎఱ్ఱ మేక మాంసము ఏడు మాసముల వరకు ఇఱ్ఱి మాంసము ఎనిమిది మాసముల వరకు తెల్లని మచ్చలు గల ఇఱ్ఱి మాంసము తొమ్మిది మాసముల వరకు అడవి పంది-అడవి దున్న-మాంసములు పది మాసముల వరకు తాబేటి మాంసములు పదునొకండు మాసముల వరకు ఆవు పాలతో చేసిన పాయసము సంవత్సరము వరకు రురు మృగపు మాంసము పదునైదు మాసముల వరకు పొడవు చెవులు గల అడవి మేక మాంసము పన్నెండు సంవత్సరముల వరకు ఖడ్గ మృగపు మాంసము కాని బలుసాకు కూరగాని అనంతకాలము వరకు పితరులకు తృప్తి కలిగించును. కాని ఆవు పాలతో వండి తేనె కలిపి ఆవు నేతితో సంస్కరించిన పాయసము పితృదేవతలనుద్దేశించి పెట్టినచో అక్షయమై యుండును. అని పితృ దేవతలే స్వయముగా చెప్పిరి. [దీనిని బట్టి శ్రాద్ధములయందు ఈ చెప్పిన విధమగు పాయసముతో భోక్తలను భుజింపజేయుట సర్వోత్తమమని తెలుచున్నది.]

భోక్తలు భుజించు సమయమున వేదము నుండి పితృదేవతా విషయమును ప్రతిపాదించు అనువాకములను మంత్రములను సమస్తములగు పురాణములను బ్రహ్మ విష్ణు సూర్య రుద్రుల వివిధ స్తోత్రములను ఇంద్రుడు అగ్ని సోముడు దేవతలుగా గల సూక్తములను పవమాన సూక్తములను బృహద్రథంతరము రౌహిణము జ్యేష్ఠము అనబడు సామవేద భాగములను శాంతికాధ్యాయము [వేదమునందల్లి భాగము]ను మహాబ్రాహ్మణము మండల బ్రాహ్మణము అను వేద భాగములను పఠించుచు వారికి వినిపించుచుండవలెను. ఇంతేకాదు. తనకును పితరులకును ఏయే స్తోత్రములు పురాణాదులు వేద భాగములు మొదలైనవి ప్రీతికరములో అవి ఏవైనను పఠించి వినిపించవలెను. [దీనినే అభిశ్రవణము అందురు.]

భుక్తవత్సు తతస్తేషు భోజనోపాన్తికే నృప. 41
సార్వవర్ణిక మన్నాద్యం కసీయాంసావధారణాత్ । సముత్సృజే ద్భుక్తవతా మగ్రతో వికిరే ద్భువి. 42
అగ్నిదగ్ధాస్తు యే జీవా యేఽప్యదగ్ధాః కులే మమ। భూమౌ దత్తేన తృప్యన్తు తృప్తా యాన్తు పరాం గతిమ్.
యేషాం న మాతా న పితా న బన్ధు ర్న గోత్రశుద్ధి ర్నతథాగతేషు ।
తత్తృప్తయేఽన్నం భువి దత్త మేత త్ప్రియాన్తు లోకాయ సుఖాయ తద్వత్. 44
అసంస్కృతప్రమీతానాం త్యాగినాం కులయోషితామ్ । ఉచ్ఛిష్టభాగధేయస్య దర్భేషు వికిరేచ్చయః. 45
తృప్తాన్జ్ఞాత్వోదకం దద్యా త్సకృ ద్విప్రకరే తదా । ఉపలిప్తే మహీపృష్ఠే గోశకృన్మూత్రవారిణా. 46
నిధాయ దర్భా న్విధివ ద్దక్షిణాగ్రా న్ప్రయత్నతః । సర్వవర్ణేన చాన్నేన పిణ్డాంస్తు పితృయజ్ఞవత్. 47
అవనేజనపూర్ణంతు నామగోత్రేణ మానవః । గన్ధధూపాదికం దద్యా త్కృత్వా ప్రత్యవనేజనమ్. 48
కృత్వాపసవ్యం సవ్యేన ప్రణిపత్య ప్రదక్షిణమ్ । పిత్ర్య మానీయ తత్కార్యం విధివ ద్దర్భపాణినా. 49
దీపప్రజ్వలనం తద్వ త్కుర్యా త్పుష్పార్చనం బుధః। అథాచాన్తేషు చాచమ్య దద్యాదాప స్సకృత్సకృత్.
తథా పుష్పాక్షతః పశ్చా దక్షయ్యోదకమేవచ । సతతం నామగోత్రేణ దద్యా చ్ఛక్త్యా చ దక్షిణామ్. 51
గోభూహిరణ్యవాసాంసి భవ్యాని శయనాని చ । దద్యాద్యదిష్టం విప్రాణా మాత్మనః పితురేవచ. 52
విత్తశాఠ్యేన రహితః పితృభ్యః ప్రీతి మాహరేత్ । తత స్స్వధావాచనికం విశ్వేదేవేష్వథోదకమ్. 53
దత్వాశీః ప్రతిగృహ్ణీయా ద్ద్విజేభ్యః ప్రాఙ్ముఖో బుధః । ప్రీతా నః పితర స్సన్తు సన్త్విత్యుక్తః పునర్ద్విజైః.
గోత్రం తథా వర్ధతాం న స్తథేత్యుక్తశ్చ తైః పునః । దాతారో నోఽభివర్ధన్తా మితిచైవ ముదీరయన్. 55
ఏతాస్సత్యాశిషస్సన్తు సన్త్విత్యుక్తశ్చ తైః పునః । స్వస్తివాచనికం కుర్యా త్పిణ్డా నుద్ధృత్య భక్తితః. 56
ఉచ్ఛేషణంతు తత్తిష్ఠే ద్యావ ద్విప్రా విసర్జితాః । తతో గృహబలి కుర్యా దితి ధర్మో వ్యవస్థితిః. 57
ఉచ్ఛేషణం భూమిగత మజిహ్మస్యాశఠస్యచ । దాసవర్గస్య తత్పిత్ర్యం భాగధేయం ప్రచక్షతే. 58
పితృభి ర్నిర్మితం పూర్వ మేత దాప్యాయనం తదా । అపుత్రాణాం సపుత్రాణాం స్త్రీణామపి నరాధిప. 59
తత్రస్థా న్నగతఃస్థిత్వా పరిగృహ్యోదపాత్రకమ్ । వాజేవాజే ఇతి జప న్కుశాగ్రేణ విసర్జయేత్. 60
బహిఃప్రదక్షిణం కుర్యా త్పాదా న్స్పృష్ట్వా త్వనువ్రజేత్। బన్ధువర్గేణ సహితః పుత్రభార్యాసమన్వితః. 61
నివృత్య ప్రణిపత్యాథ ప్రపూజ్యాగ్నిం సమన్త్రవత్ । వైశ్వదేవం ప్రకుర్వీత నైత్యకం బలిమేవచ. 62
తతస్తు వైశ్వదేవాన్తే సగోత్రసుతబాన్ధవః । భుంజీతాతిథిసంయుక్త స్సర్వం పితృనిషేవితమ్. 63
ఏతచ్చానుపనీతోపి కుర్యా త్సర్వేషు పర్వసు । శ్రాద్ధం సాధారణం నామ సర్వకామఫలప్రదమ్. 64
భార్యావిరహితోఽప్యేత త్ప్రవాసస్థోపి శక్తిమాన్ । శూద్రోఽప్యమన్త్రవత్కుర్యా దనేన విధినా బుధః. 65

ఇట్లు భోక్తలు భుజించిన తరువాత ఆ భోజన సమీపమున భోజనపు ఆకులలో [పాత్రలలో] మిగిలిన అన్నము మొదలగు అన్ని పదార్థముల నుండియు చాల కొంచెము కొంచెము అంశమును ఎత్తి తీసికొని భోక్తల ముందు భాగమున నేలపై వెదజల్లినట్లు వేసి ఉచ్ఛిష్ట భాక్కులకొరకై దానిని విడువవలెను. వికిర పిండమును అక్కడ ఉంచ వలెను. ఉంచుచు ఈ అర్థమును ఇచ్చు మంత్రమును చెప్పవలెను: "నా వంశమున పూర్వులలో ఎవరైన అగ్నిచే దహింప బడినవారు గాని (మరణానంతరము) అగ్నిచే దహనసంస్కారము పొందనివారు గాని తల్లిదండ్రులు బంధువులు గోత్ర శుద్ధి లేనివారు గాని ఎవరైన నున్నచో వారును-కుల స్త్రీలై యుండియు ఎవరును పట్టించుకొనకపోవుటచే మరణించిన

తరువాత ఏ [పైతృక] సంస్కారములను పొందని స్త్రీలెవరైన నున్నచో వారును నేను భూమిపై వేసిన ఈ వికిరాన్నముతో తృప్తి చెంది ఉత్తమగతిని పొందుదురు గాక!"

భోక్తలు తృప్తిగా భుజించినారని తెలిసికొనిన తరువాత వారి చేతులందు ఒక మారుగా మాత్రమే నీరు (ఉత్తరాపోశనమునకై) వేయవలెను. తరువాత గోమూత్ర గోమయములతో అలికిన నేలపై దక్షిణపు కొనలుగా దర్భలను పరచవలెను. వానిపై అన్ని పదార్థములతో కలిపి చేసిన పిండములను పితరుల నామగోత్రములతో అవనేజన పూర్వకముగా [నీటితోను నేతితోను తడిపి శుద్ధి చేసి] ఉంచవలయును. అపసవ్యముతో పిండములను దర్భలపై ఉంచవలెను. సవ్యముగా చేసికొని వాటిని ప్రదక్షిణించి నమస్కరించవలెను. ఈ పిండములు ఆయా పితరులకు చెందుగాక అని మంత్రమును చెప్పవలెను. తరు వాత దర్భలను చేత ఉంచుకొని యథావిధిగా పిండములకు ధూపదీప పుష్ప నైవేద్యములతో అర్చన చేయవలెను.

పిమ్మట [భోక్తలు పాత్రల దగ్గర నుంచి లేచి కాలుచేతులు కడుగుకొని] ఆచమనము చేయుదురు. కర్తయు ఆచమనము చేయవలెను. అపుడు వారికి ఒక్కొక్కమారు మాత్రమే హస్తముపై నీరు వేయవలెను. పూవులను అక్షతలను అక్షయ్యోదకమును వారి చేతులయందు వదలవలెను. తన గోత్ర నామములను చెప్పుచు (ఈ గోత్రమున పుట్టి ఈ నామము గల నేను ఇచ్చుచున్నాను అనుచు) తన శక్తికొలది తనకును ఆ బ్రాహ్మణులకును తన పితరులకును ప్రీతికరమైనవి- గోవు-భూమి-బంగారము-వస్త్రములు-మంచి పడకలు-ఏవైనను దక్షిణగా ఈయవలెను. తన శక్తికి తగినట్లు ధన లోభము చేయక దక్షిణలనీయవలెను. ఇచ్చినచో పితరులకు తృప్తి కలుగును. కనుక ఆ విధముగా చేసి పితృదేవతలను తృప్తి పరచవలయును.

తరువాత పితృదేవతా స్థానమున భుజించిన బ్రాహ్మణుల దగ్గర స్వధావాచనికమును ('స్వధోచ్యతాం' ఇత్యాది మంత్రమును పఠించుట) విశ్వేదేవస్థానమున భుజించిన బ్రాహ్మణుల దగ్గర ఉదక దానమును జరుపవలెను. తరువాత సంప్రదాయమును ఎరిగి కర్త తూర్పు ముఖముగ కూర్చుండి వారి నుండి ఆశీస్సుల గ్రహింపవలెను. 'పితృ దేవతలు మా యందు ప్రీతికల వారగుదురు గాక!' అని కర్త అనగా 'అగుదురు గాక!' అని బ్రాహ్మణులు అందురు. 'అస్మద్గోత్రం వర్ధతామ్' 'మా గోత్రము వర్ధిల్లుగాక!' అని కర్త అనగా 'అట్లే అగుగాక!' అని భోక్తలు అందురు. లోగడ చెప్పినట్లు 'మాకు అడుగకయే ఇచ్చు దాతలు ఉందురుగాక!' ఇత్యాది మంత్రమును కర్త చెప్పవలెను. 'ఈ ఆశీస్సులు సత్యములు అగుగాక!' అని భోక్తలు అందురు. పిమ్మట భక్తితో పిండములను ఎత్తి ఉంచి స్వస్తి వాచనికము జరుపవలెను.

భోక్తలగు బ్రాహ్మణులు ఇంటియందు ఉన్నంతవరకును ఎంగిళ్లు తీయరాదు. తరువాత తీయవలెను. అట్లు వారు తినిన ఎంగిళ్లు తీసి పిమ్మట గృహబలిని (వైశ్వదేవమును చేయవలెను. అని ఇట్లు ధర్మ వ్యవస్థ చేయబడియున్నది.

భోక్తలు భుజించునపుడు భూమిపై పడిన ఉచ్ఛేషణము (మిగిలిన పదార్థము) శ్రాద్ధకర్త ఇంటిలో ఊడిగము చేయువారితో కపటము కొంటెతనములేని సేవకులకు పితృశేషముగా తినుటకు ఈయవలెను. అని పెద్దలు చెప్పుచున్నారు.

ఈ చెప్పిన విధముగా జరిపిన శ్రాద్ధకర్త వంశములోను బంధుమిత్రాది జనములోను పుత్రులున్నవారికిని లేని వారికిని అట్టి స్త్రీలకును (పూర్వము మరణించియున్న వారికి) అందరకును తృప్తి కలిగించును. అని పూర్వము పితృదేవతా గణమువారు వ్యవస్థ చేసియున్నారు.

(ఇక ఈ శ్రాద్ధప్రక్రియ అంతయు ముగిసిన తరువాత భోక్తలగు బ్రాహ్మణులకు వీడ్కోలు చెప్పుట ఎట్లనిన) శ్రాద్ధకర్త భోక్తలు భుజించిన ప్రదేశమున శ్రాద్ధము జరిపిన ప్రదేశమున నిలువబడి చేత ఉదకపాత్రమును పట్టుకొని యుండి 'వాజే వాజే' ఈ మొదలగు మంత్రమును చెప్పుచు దర్భకొనతో వారిని తాకుచు వారిని విసర్జించ (వీడ్కోలుచెప్ప) వలెను. వారిని ప్రదక్షిణించి వారి పాదములను స్పృశించవలెను. వారు బయలుదేరి పోవుచుండ వారివెంట కొంతదూరము

పుత్త్రి భార్యా బంధువర్గముతోకూడ పోవలెను. తరువాత వారికొకమారు నమస్కరించి వెనుకకు మరలివచ్చి అగ్నిని పూజించి వైశ్వదేవమును నిత్యబలిని జరుపవలెను. తరువాత పితృశేషమును శ్రాద్ధకర్త తన సగోత్రులతో సుతులతో బాంధవులతో అతిథులతోపాటుగ తానును భుజించవలెను.

ఈ విధమగు శ్రాద్ధము అన్ని పర్వములయందును (ఈపైని చెప్పిన వానిలో ఏ పర్వమునందైనను) జరుపవలెను. జరుపవచ్చును. దీనిని ఉపనయనము కానివాడైనను భార్యలేనివాడైనను విదేశమునందు ఉన్నవాడైనను శక్తియున్నచో (తనశక్తికి తగినట్లు) చేయవలెను. శూద్రుడైనను మంత్రహీనముగా ఇదే ప్రక్రియతో శ్రాద్ధము జరుపవలెను. ఇది సాధారణ శ్రాద్ధవిధానము.

ఆభ్యుదయికశ్రాద్ధనిర్ణయః.

తృతీయ మాభ్యుదయికం వృద్ధిశ్రాద్ధం తదుచ్యతే । ఉత్సవానన్దసమ్భారే యజ్ఞోద్వాహాదిమఙ్గళే. 66
మాతరః ప్రథమం పూజ్యాః పితర స్తదనన్తరమ్ । తతో మాతామహా రాజ న్విశ్వేదేవా స్తథైవచ. 67
ప్రదక్షిణోపచారేణ దధ్యక్షతఫలోదకైః । ప్రాఙ్ముఖో నిర్వపేత్పిణ్డా న్దూర్వయాచ కుశైర్యుతాన్. 68
సమ్పన్నమి త్యభ్యుదయే ప్రీయతా మిత్యుదీరయేత్ । యుగ్మా ద్విజాతయః పూజ్యా వస్త్రకార్తస్వరాదిభిః.
తిలార్థేతు యవైః కార్యం నాన్దీశబ్దానుపూర్వకమ్ । మఙ్గళ్యాన్యపి సర్వాణి పాఠయే ద్విజపుఙ్గవాన్. 70
ఏవం శూద్రోపి సామాన్యం వృద్ధిశ్రాద్ధేపి సర్వదా । నమస్కారాది మన్త్రేణ కుర్యాన్మన్త్రం వినా బుధః.
దానప్రదానం శూద్రస్య ఇత్యాహ భగవాన్ప్రభుః । దానేన సర్వకామాప్తి స్తస్య సఞ్జాయతే యతః. 72

ఇతి శ్రీమత్స్యపురాణే మత్స్యమనుసంవాదే శ్రాద్ధకల్పే
సాధారణశ్రాద్ధాదివిధిర్నామ సప్తదశోధ్యాయః.

మూడవ నైమిత్తిక శ్రాద్ధమునకు ఆభ్యుదయికము అనిపేరు. దానికే వృద్ధి (శుభ) శ్రాద్ధమనియు పేరు గలదు.

ఉత్సవములు మొదలగు ఆనందకరమగు కార్యములు జరుపునపుడును యజ్ఞములు వివాహములు మొదలగు శుభ కార్యముల సమయములందును ముందుగా ఈ ఆభ్యుదయిక శ్రాద్ధమును జరుపవలయును.

దీనియందు మాతృపితామహీప్రపితామహ్యాది స్త్రీలను మొదట పూజించవలెను. పితృ పితామహాదులను తరువాత పూజించవలెను. తరువాత మాతామహుడు మొదలగు వారిని పిమ్మట విశ్వేదేవులను పూజించవలెను. ప్రదక్షిణముగా [సవ్యముగా] ఆయా ఉపచారములు జరుపవలెను. [ఈ వృద్ధి శ్రాద్ధమునందు అపసవ్యము చేసికొనకూడదు]. పెరుగు అక్షతలు ఫలములు ఉదకము మొదలగునవి వినియోగించవలెను. [తిలలు కూడదు]. తూర్పు మొగముతో పిండములను నిర్వపణము చేయవలెను. [దక్షిణముఖము కూడదు]. 'సంపన్నం' అనియు 'ప్రీయతాం' అనియు మాత్రము చెప్పవలెను. [స్వధాఅని చెప్పరాదు]. సరి సంఖ్యలోనే [బేసి సంఖ్యకూడదు]. బ్రాహ్మణులను అర్చించ [భుజింపజేయ]వలెను. వస్త్రములు బంగారు మొదలగునవి వారికిచ్చుటకును కర్మానుష్ఠానములోను వినియోగించవలెను. [వెండిపాత్రలు-దర్భలు కూడదు.] తిలలకు మారుగా యవలను ఉపయోగించుచు నాందీ శబ్దముతో ఈ కార్యమును జరుపవలెను. శుభమునకు సంబంధించిన మంత్రములను స్తోత్రములను పఠించి బ్రాహ్మణులకు వినిపింపవలెను. [పిత్ర్యములగు వేదభాగములు కూడదు.] ఇది ద్విజులు వృద్ధి-నాందీ-శ్రాద్ధము-జరుపవలసిన విధానము. శూద్రులుకూడ పైవారివలెనే నమస్కారపూర్వకమయిన మంత్రములతోను ఇతర మంత్రములేవియు లేకుండగను ఈ వృద్ధిశ్రాద్ధము జరుపవలెను. కాని శూద్రులు భోజనాదికము లేకుండ ఆయా పదార్థములను దానము చేయుటతోనే జరుపవలెనని భగవానుడు ప్రభువు అగు నారాయణుడు చెప్పెను. ఏలయన శూద్రునకు దానమాత్రముతోనే అన్ని కోరికలు ఫలించును.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున మత్స్యమను సంవాదమున శ్రాద్ధకల్పమున సాధారణాభ్యుదయిక
శ్రాద్ధ విధాన కథనమను సప్తదశాధ్యాయము.

# అష్టాదశోఽధ్యాయః.

## బ్రాహ్మణాదీనా మాశౌచనిర్ణయ-ఏకోద్దిష్టాదివిధిశ్చ.

సూతః : ఏకోద్దిష్ట మథో వక్ష్యే యదుక్తం చక్రపాణినా ।
మృతే పుత్త్రై ర్యథా కార్య మాశౌచం చ పితర్యపి. 1
దశాహం శావ మాశౌచం బ్రాహ్మణేషు విధీయతే । క్షత్త్రియేషు ద్వాదశాహం పక్షో వైశ్యేషు చైవ హి. 2
శూద్రేషు మాస మాశౌచం సపిండేషు విధీయతే । నైశం చాకృతచూడస్య త్రిరాత్రం పరతః స్మృతమ్. 3
జననే ష్వేవమేవం తు సర్వవర్ణేషు సర్వదా । అస్థిసంచయనా దూర్ధ్వ మంగస్పర్శో విధీయతే. 4
ప్రేతాయ పిండదానం తు ద్వాదశాహం సమాచరేత్ ।
పాథేయం తస్య తత్ప్రోక్తం యతః ప్రీతికరం మహత్. 5
తస్మా త్ప్రేతపురం ప్రేతో ద్వాదశాహేన నీయతే । గృహపుత్త్రకళత్రాది ద్వాదశాహం ప్రపశ్యతి. 6
తస్మా న్నిధేయమాకాశే దశరాత్రం పయ స్తథా । ప్రేతతాపోపశాంత్యర్థ మధ్వశ్రమవినాశనమ్. 7
ఏకాదశాహే విప్రాణాం ద్విజా నేకాదశైవ తు । క్షత్త్రాది సూతకాంతే తు భోజయే దయుతం ద్విజాన్. 8
ద్వితీయేఽహ్ని పున స్తద్వ దేకోద్దిష్టం సమాచరేత్ । ఆవాహనాగ్నౌకరణే దేవహీనం విధానతః. 9
ఏకం పవిత్ర మేకార్ఘ్య మేకః పిండో విధీయతే । ఉపతిష్ఠతా మిదం దేయం పశ్చాచ్చైవ తిలోదకమ్. 10
స్వదితం వికిరే బ్రూయా ద్విసర్గే చాభిరమ్యతామ్ । శేషం పూర్వవ దత్రాపి కార్యం వేదవిదో విదుః. 11
అనేన విధినా సర్వ మనుమాసం సమాచరేత్ । సూతకాన్తే ద్వితీయేహ్ని శయ్యాం దద్యా ద్విచక్షణః. 12

# అష్టాదశాధ్యాయము.

## ద్విజాదులకు ఆశౌచాదికము-ఏకోద్దిష్టాది శ్రాద్ధవిధి.

సూతుడు మహర్షులకు ఇంకను ఈ విధముగా చెప్ప నారంభించెను: మత్స్యరూపుడగు నారాయణుడు మనువునకు చెప్పినట్లు తండ్రి మరణించినపుడు పుత్త్రులు చేయవలసిన ఏకోద్దిష్ట శ్రాద్ధ విధానమును ఆశౌచము పాటించవలసిన నిర్ణయమును తెలిపెదను.

మృతాశౌచము బ్రాహ్మణులకు పది దినములు క్షత్రియులకు పండ్రెండు దినములు వైశ్యులకు పదునైదు దినములు శూద్రులకు ముప్పది దినములు పాటించవలసియుండును. (పదునొకండవ-పదుమూడవ-పదునారవ-ముప్పదియొకటవ-దినములందు స్నానము చేసిన వీరి కందరకు శుద్ధి యగును.) చూడాకర్మ జరుగని (మూడేండ్లు నిండని) శిశువు మరణించినచో ఒక దినము మూడేండ్లు నిండినది మొదలు ద్విజులకు ఉపనయనమును ఇతరులకు వివాహమును కానంత వరకు మూడు దినములు మృతాశౌచము.

జాతాశౌచము (పురుడు) కూడ ఆయా వర్ణముల వారికి పైని చెప్పినట్లు పది-పండ్రెండు-పదునైదు-ముప్పది-దినములే అని తెలియవలెను.

తండ్రి మొదలగువారు మరణించినపుడు దహనము జరిపి పిమ్మట అస్థి సంచయనము (దహనము చేయగా ఏర్పడిన భస్మమునుండి ఎముకలను ప్రోగుచేయుట) జరిగిన తరువాతనే అంగస్పర్శము (మరణించిన వాని పుత్త్రుడు మొదలగు శ్రాద్ధకర్తలను అతని సన్నిహిత జ్ఞాతులైనను తాకుట) జరుగవలెనని శాస్త్రము విధించుచున్నది.

తరువాత పండ్రెండు దినముల వరకు ప్రేతమునకు పిండదానము చేయుచుండవలెను. ఏలయన పరలోకమునకు పోవు ప్రేతమునకు ఆ పిండములు దారి బత్తెముగా అయి చాల ప్రీతిని కలిగించును. ఈ పిండదానముచే సంతృప్తి

చెందును ప్రేతము పండ్రెండు దినములు ముగియునటికి ప్రేతములు చేరవలసిన లోకమునకు తీసికొనిపోబడును. (చేర్చ బడును.) మరణించిన ప్రాణి [ప్రేతము] ఈ పండ్రెండు దినములును తాను మరణించక మునుపు తనవిగా నుండిన ఇల్లు పొలము పుత్త్రులు భార్య మొదలగునవి చూచుచునే ఉండును. [వీరు తన కొరకై దారి బత్తెముగా ఏమయిన సుఖ సాధనమును సమకూర్తురా లేదా యను చింతతో ఉండును.] అందుచేతనే పది దినములవరకు శూన్యమునందు వ్రేలాడు నట్లుగా ప్రేతము నుద్దేశించి నీటితో [పాలతో] నిండిన పాత్రము ఉంచెదరు. దీనివలన ఆ ప్రేతమునకు తాపోపశాంతియు మార్గాయాసశాంతియు కలుగును.

పదునొకండవనాడు బ్రాహ్మణులు పదునొకండు మంది బ్రాహ్మణులను భోక్తలుగా ఉంచి శ్రాద్ధము జరుపవలెను. ఇట్లే క్షత్త్రియులును వైశ్యులును శూద్రులును వారి వారి ఆశౌచము ముగిసిననాడు బేసి సంఖ్యలో భోక్తలను భుజింపజేయ వలెను. [శూద్రులు ఆహార పదార్థ దానము మాత్రమే చేయవలెను.]

ఆశౌచము ముగిసిన రెండవనాడు (పదునొకండవ-పదుమూడవ-పదునారవ-ముప్పది యొకటవ దినములలో ప్రేతము నుద్దేశించి ఏకోద్దిష్టమును జరుపవలెను. [ఏక-ఉద్దిష్ట = ప్రేతమును మాత్రమే ఉద్దేశించి-వారి పై వారినిగాని విశ్వే దేవులను గాని ఉద్దేశించక-చేయు శ్రాద్ధము అని అర్థము.] దీనియందు ఆవాహనము అగ్నౌకరణము యథావిధానముగా ఉండును. విశ్వేదేవులకు అర్చన యుండదు. ఒకే పవిత్రము ధరించుట ఒకే అర్ఘ్యము వదలుట ఒకే పిండము వేయుట దీనియందు విధింపబడును. దీనిలో 'ఇదం ఉపతిష్ఠతు.' ఇది ఈ ప్రేతమునకై సన్నిహితమై ఉండుగాక!" అని మాత్రమే చెప్పవలెను. [స్వధా అని చెప్పకూడదు.] పిండదానము తరువాత తిలోదకము ఈయవలెను. వికిరపిండము ఇచ్చు సమ యమున 'స్వదితం' 'చక్కగా తినబడినది' అనియు-బ్రాహ్మణులకు వీడ్కోలు చెప్పునపుడు 'అభిరమ్యతామ్' 'సుఖము ఆనందమును పొందుగాక!' అనియు చెప్పవలెను. ఇవి కాక మిగిలిన ప్రక్రియలన్నియు లోగడ అయా శ్రాద్ధముల విషయ మున చెప్పినట్లే ఈ ఏకోద్దిష్టమునను చేయవలెను.

ఈ విధముగా ఏకోద్దిష్టమును ప్రతి మాసమునందును జరుపుచుండవలెను. [వాస్తవమున సపిండీకరణము సంవ త్సరాంతమున జరుగవలెను. అంతవరకును మరణించిన జీవునకు 'ప్రేతము' అను వ్యవహారమే యుండును. కాని పితృ దేవత్వము రాదు. అంతవరకును చేయు పితృకార్యము అతనిని ఒక్కనికే ఉద్దేశించి చేయుదురు. కావున ఇది ఏకోద్దిష్టము.]

కాంచనం పురుషం తద్వత్ ఫలవస్త్రసమన్వితమ్ । సంపూజ్య ద్విజదాంపత్యం నానాభరణభూషణైః. 13
వృషోత్సర్గం ప్రకుర్వీత దేయా చ కపిలా శుభా । ఉదకుంభశ్చ దాతవ్యో భక్ష్యభోజ్యసమన్వితః. 14
యావదబ్దం నరశ్రేష్ఠః సతిలోదకపూర్వకమ్ । తత స్సంవత్సరే పూర్ణే సపిండీకరణం భవేత్. 15
సపిండీకరణా దూర్ధ్వం ప్రేతః పార్వణభా గ్భవేత్ । వృషోత్సర్గం సుతః కుర్యాత్ పిత్రో శ్చైకాదశేహని.
అథవా పుణ్యదివసే విధినా వృష ముత్సృజేత్ । వృషోత్సర్గం సుతో మాసి కుర్యా దేకాదశేఽహని. 17
సహోమం విధివచ్చైవ పితర్యపిచ జీవతి । వృద్ధిపూర్వేషు యోగ్యశ్చ గృహస్థశ్చ భవేత్తతః. 18
సపిండీకరణశ్రాద్ధం దేవపూర్వం నియోజయేత్ । పితౄనేవాశయేత్తత్ర పృథక్ప్రేతం వినిర్దిశేత్. 19
గంధోదకతిలైర్యుక్తం కుర్యాత్పాత్రచతుష్టయమ్ । అర్ఘ్యార్థం పితృపాత్రేషు ప్రేతపాత్రం ప్రసేచయేత్. 20
తద్వత్సంకల్ప్య చతురః పిండా న్పిండప్రద స్తథా । యే సమానా ఇతి ద్వాభ్యా మంతంతు విభజే త్త్రిధా.
చతుర్థస్య పునః కార్యం నకదాచి దతో భవేత్ । తతః పితృత్వ మాపన్న స్సర్వతః పుష్టిమాగతః. 22
అగ్నిష్వాత్తాదిమధ్యత్వం ప్రాప్నో త్యమృతముత్తమమ్ । సపిండీకరణాదూర్ధ్వం తస్మైతస్మా న్న దీయతే.23

పిత్రాదిష్వేవ దాతవ్యం తత్పిణ్డో యేషు సంస్థితః । తతఃప్రభృతి సఙ్క్రాన్తా వుపరాగాదిపర్వసు. 24
త్రిపిణ్డ మాచరే చ్ఛ్రాద్ధ మేకోద్దిష్టం మృతాహని । ఏకోద్దిష్టం పరిత్యజ్య మృతాహేన్య త్సమాచరేత్. 25
తథైవ పితృహా స స్యా న్మాతృభ్రాతృవినాశకః। మృతాహే పార్వణం కుర్వ న్నధోఽధో యాతి మానవః.
సమ్పర్కా త్వ్యాకులీ భావః ప్రేతేషుతు యతో భవేత్ । ప్రతిసంవత్సరం తస్మా దేకోద్దిష్టం సమాచరేత్.27
యావదబ్దంచ యోదద్యా దుదకుమ్భం విమత్సరః । ప్రేతాయాన్నసమాయుక్తం సోఽశ్వమేధఫలం లభేత్.
ఆమశ్రాద్ధం యదా కుర్యా ద్విధిజ్ఞ శ్శ్రాద్ధద స్తథా । తేనాగ్నౌకరణం కుర్యా త్పిణ్డాం స్తేనైవ నిర్వపేత్.
త్రిభి స్సపిణ్డీకరణా న్మాసకత్రితయం పితా । యదా ప్రాప్స్యతి కాలేన తదా ముచ్యేత బన్ధనాత్. 30
ముక్తోపి లేపభాగిత్వం ప్రాప్నోతి కుశమార్జనాత్ । లేపభాజ శ్చతుర్థాద్యాః పిత్రాద్యాః పిణ్డభాగినః.
పిణ్డద స్సప్తమ స్తేషాం సాపిణ్డ్యం సాప్తపౌరుషమ్. 31॥

ఇతి శ్రీమత్స్యమహాపురాణే మత్స్యమను సంవాదే శ్రాద్ధకల్పే సపిణ్డీకరణాది
శ్రాద్ధవిధిర్నామాష్టాదశోఽధ్యాయః.

ఆశౌచము తీరిన తరువాత రెండవ దినమున [విప్రులు 11వ-క్షత్రియులు 13వ-వైశ్యులు 16వ-శూద్రులు 31వ దినములందు] సంప్రదాయము నెరిగి శ్రాద్ధకర్త ప్రేత నుద్దేశించి అతని సుఖమునకై శయ్యను బంగారు ప్రతిమను ఫలములను వస్త్రములను బ్రాహ్మణ దంపతులకు-వారిని నానాఽఽభరణ భూషణములతో అలంకరించి పూజించి-దానము ఈయవలెను. వృషోత్సర్జనము-ఆబోతును విడుచుట-చేయవలెను. కపిలగోవును దాన మీయవలెను. భక్ష్యభోజ్యములను ఉదకుంభమును దానము చేయవలెను. ఇట్లు సంవత్సరము నిండువరకు ఆయా దానములును శ్రాద్ధములును తిలోదక పూర్వకముగా ఆయా సమయములందు జరుపుచుండవలయును. సంవత్సరము నిండిన తరువాత సపిండీకరణము జరువ వలెను. సపిండీకరణము జరిగిన తరువాతనే మరణించిన వ్యక్తికి ప్రేతత్వము తీరి పార్వణమునకు [పార్వణశ్రాద్ధము నందు చేయు ఆయా పిండదానాదికమును గ్రహించుటకు] అర్హుడగును.

తల్లిదండ్రులు మరణించినపుడు పదునొకండవ దినమున కుమారుడు వారి సుఖము నుద్దేశించి వృషోత్సర్గము చేయవలెను. లేదా ఏదైన పుణ్య సమయమునందైనను ఇది చేయవచ్చును.

కుమారుడు ఇది తల్లి విషయములో ఆమె మరణించిన తరువాత పదునొకండవ దినమునగాని మరేదైన పుణ్యదిన మున గాని చేయవలెను. తండ్రి విషయమున అతని పుణ్యమునకై అతడు జీవించియుండగా కూడ వృషోత్సర్గము చేయ వచ్చును. ఇవి ఈ విధముగా జరుపుట వలన గృహస్థుడు [మరణించిన వారి కుమారులు మొదలగువారు] వృద్ధిపూర్వక ములగు కృత్యములను [నాందీశ్రాద్ధమును జరిపి చేయవలసిన వివాహాది శుభకార్యములను] జరుపుటకు యోగ్యుడగును.

సపిండీకరణ శ్రాద్ధమున మొదట విశ్వేదేవులకును తరువాత పితరులకును ఆవాహనము అర్చనము భోజనము మొదలగునవి జరుపవలెను. అందునను పితరులు అనగా అప్పటికి పితృత్వమును పొందియున్న వారిని మాత్రమే గ్రహించ వలెను. ప్రేతను వేరుగా పేర్కొనవలెను. పితృస్థానమునందు నాలుగు పాత్రలను [అర్ఘ్యమునకు] ఉంచి గంధములు తిలలు ఉదకము మొదలగువానితో వేరు వేరుగా [అప్పటికి పితృత్వము పొందియున్న మూడు తరముల వారికి మూడు-ప్రేతకు ఒకటి-మొత్తము నాలుగు] నింపవలెను. తరువాత ప్రేతపాత్రయందలి గంధతిలలతో కూడిన ఉదకమును మూడు భాగములుగా మిగిరిన మూడు పాత్రలయందు కలిపి వేయవలెను. అదే విధముగా పితరులకు ముగ్గురకు మూడును-ప్రేతకు ఒకటియు-మొత్తము నాలుగు పిండములను చేయవలెను. 'యే సమానా' అని ఆరంభమగు రెండు ఋక్కులతో నాలుగవ పిండమును మూడుగా విభజించవలెను. ఆ ఖండములను పితరులకు ఉద్దేశించిన పిండములతో కలుపవలెను. ఇంతేకాని నాలుగవ పిండమునకు అంతకంటె వేరు వినియోగము లేదు. ఈ సపిండీకరణము జరుపుటతో ఈ మరణించిన జీవుడు ప్రేతత్వము వదలి పితృత్వమును పొందును. అన్ని విధముల పుష్టిని [శుభమును] పొందును.

అగ్నిష్వాత్తాది పితృదేవతల దగ్గర ఉత్తమము అమృతము [శాశ్వతము] అగు స్థానమును పొందును. అందుచేతనే సపిండీకరణము జరిగిన తరువాత ఈ మరణించిన వ్యక్తికి వర్గత్రయములోని వాడుగానే కాని ఆతనికి వేరుగా పారలౌకిక పితృకార్యములు జరుపబడవు. ఏలయన అతని పిండము తనపైపెద్దల పిండములోనికి చేరినది. కనుక ఇతడును వారిలో ఒకడుగా ఐనాడు.

అది మొదలుకొని సంక్రాంతి-చంద్రగ్రహణము మొదలగు విశిష్ట పర్వములందును అతడు మరణించిన దినమున ప్రతి సంవత్సరమును పిండత్రయముతో శ్రాద్ధము జరుపవలెను. [మరణించిన పెద్దలకు] ఇదే విధముగ మృతదినమునను ఆశౌచదినములందును ఏకోద్దిష్ట శ్రాద్ధమునే ప్రేత నుద్దేశించి చేయవలెను. కాని అంతకుమించి అతనికి పితృత్వమును భావనచేసి పార్వణ శ్రాద్ధము మొదలగునవి చేయరాదు. అట్లు చేసినవాడు తల్లిదండ్రులను సోదరులను చంపినందువలన కలుగు పాపమును పొందును. ప్రేతలుగా నున్నవారు తనకు పితరులతో [గాని ఇతరులతోగాని] సంపర్కము కలిగినచో కల వరము చెందుదురు. కనుక వారికి ఏకోద్దిష్టమునే [వారిని ఒక్కరిని మాత్రమే ఉద్దేశించి చేయు శ్రాద్ధమునే] జరుపవల యును. కాని ఇతరులతో కలిపి జరుపరాదు. మృతదినములందు పార్వణ శ్రాద్ధమును జరిపిన మానవుడు క్రిందికి క్రిందికి పతితుడగును. కనుక సంవత్సరము నిండు వరకు ఏకోద్దిష్టమునే జరుపవలయును. [ఇచట మూలమున 'ప్రతి సంవత్సరం' అని యున్నది. దీనికి 'సంవత్సరే సంవత్సరే=ప్రతి సంవత్సరం' అని వీప్సార్థమునకాక 'సంవత్సరే= ప్రతి సంవత్సరం' అని సప్తమ్యర్థమున మాత్రమే అవ్యయీ భావమును చెప్పవలెను. లేనిచో సంప్రదాయవిరుద్ధమగును.]

సంవత్సరము నిండువరకు మరణించిన వారి (ప్రేతల) నుద్దేశించి ఉదకుంభమును అన్నమును దానము చేయు వారికి అశ్వమేధయాగము చేసినచో కలుగునంత ఫలము కలుగును.

శాస్త్ర విధానానుసారము కర్మములను ఆచరించుట ఎరిగిన శ్రాద్ధకర్త అన్న శ్రాద్ధమును కాక ఆమశ్రాద్ధమును జరుపునప్పుడు అగ్నౌకరణము కాని పిండదానముగాని ఆమ పదార్థములతోనే చేయవలెను కాని పక్వద్రవ్యములతో చేయ రాదు.

ప్రేతకు తనకు పై వారితో సపిండీకరణము జరుపగానే అతడును పితృవర్గత్రితయములో ఒకడగు స్థితిని పొందును. అప్పటినుండి అతడు ప్రేతత్వ బంధనమునుండి ముక్తి పొందును.

ఇట్లు ముక్తుడైనవాడు కూడ తన వంశమువారిలో తన కుమారుడు కాక మిగిలిన వారినుండి లేపమును [పిండ ములు పెట్టినప్పుడు మిగిలిన అంటును] ఆహారముగా పొందదగినవాడు అగును. ఈ లేపము కుశమార్జన పూర్వకముగా అందును.

దీనికి కారణము ఏమన మూడు తరములు దాటి నాలుగవ తరమునుండి పై వారు లేపభాక్కులు. పితృపితా మహప్రపితామహులు పిండభాగులు. ఏడు తరములవరకు ఎవరైనను తమ పూర్వులకు పిండములు వేయవచ్చును. ఏల యన సపిండత్వము ఏడు తరములవరకు నిలుచును.

[ఈ పై వాక్యములకు చాల వివరణము కావలెను. ఎట్లన రామశర్మ అనువాడు తన తండ్రికి ఆబ్దికము జరుపు చున్నాడు. ఇతనికి పితృపితామహ ప్రపితామహులు పిండభాగులు. ప్రపితామహుని తండ్రియు పైవారును తన వంశము లోనే పీడి నరితరమునకు చెందిన వారును ఈ రామశర్మ చేయు శ్రాద్ధమున లేపభాక్కులు. కాని ఈ లేపభాగులు ఈ రామ శర్మకు పైతరమువారు కొందరు జీవించియుండి వారు తమ తండ్రికి జరుపు శ్రాద్ధమున పిండభాగులుగా ఉండవచ్చును. వంశమూల పురుషునికి ఇద్దరు అంతకంటె ఎక్కువ మంది కుమారులుండినచో వారిలో జ్యేష్ఠుని మనుమలును కనిష్ఠుని కుమారులును ఒక వయస్సు వారు అగుట సంభవించును. ఇట్లే తరములు గడచిన కొలది ఒక వ్యక్తియే ఒకరు జరుపు శ్రాద్ధమున పిండ భాగి అగుటయు మరియొకరు శ్రాద్ధమున లేపభాగి అగుటయు జరుగును. అట్లే ఒకమృతునికి కుమారులుగాని

నన్నిహిత జ్ఞాతులు కాని లేనపుడు అతని మూల పురుషుని నుండి ఏడు తరములకులోగా పై చెప్పిన పద్ధతిలో అగువారు ఎవరైనను ఇతనికి కర్మలు జరిపి ప్రేతత్వము నుండి ముక్తి కలిగింపవచ్చును.]

ఇది శ్రీమత్స్యమహాపురాణమున మత్స్యమను సంవాదమున ఏకోద్దిష్ట శ్రాద్ధాది విధానము అను పదునెనిమిదవ అధ్యాయము.

## ఏకోనవింశోఽధ్యాయః.

### ద్విజాదికృతశ్రాద్దేన పితృతృప్తివిషయః.

ఋషయః : కథం కవ్యాని దత్తాని హవ్యాని చ జనైరిహ। గచ్ఛన్తి పితృలోకస్థా న్ప్రాపకః కోఽత్ర గద్యతే.
యది మర్త్యో ద్విజో భుంక్తే హూయతే యది చానలే । శుభాశుభాత్మకం ప్రేతదత్తం తద్భుజ్యతే కథమ్. 2
సూతః : వసూ న్వద న్తిచ పిత్యా నుద్రాంశ్చైవ పితామహా౯ ।
ప్రపితామహాం స్తథాదిత్యా నిత్యేవం వైదికీ శ్రుతిః. 3
నామగోత్రే పిత్యాణాంతు ప్రాపకం హవ్యకవ్యయోః। శ్రాద్ధస్య మన్త్రా శ్శ్రద్ధాచ ఉపయోజ్యాశ్చ భక్తితః.
అగ్నిష్వాత్తాదయ స్తేషా మాధిపత్యే వ్యవస్థితాః । నామగోత్రం కాలదేశాః భవాన్తరగతానపి. 5
ప్రాణినః ప్రీణయన్త్యేతే తదాహారత్వ మాగతా౯ । దేవో యది పితా జాత శ్శుభకర్మానుయోగతః. 6
తస్యాన్న మమృతం భూత్వా దివ్యత్వే వ్యనుగచ్ఛతి । దైత్యత్వే భోగరూపేణ పశుత్వేచ తృణం భవేత్.
శ్రాద్ధాన్నం వాయురూపేణ సర్పత్వే వ్యుపతిష్ఠతి । పానం భవతి యక్షత్వే గృధ్రత్వేఽపి తథామిషమ్. 8
దనుజత్వే తథా మాయా ప్రేతత్వే రుధిరోదకమ్ । మనుష్యత్వేన్నపానాని నానాభోగరసం భవేత్. 9
రతిశ్శక్తి స్త్రియః కాన్తి ర్భోజ్యం భోజనశక్తితా । దానశక్తి స్సవిభవరూప మారోగ్య మేవచ. 10
శ్రాద్ధపుష్ప మిదం ప్రోక్తం ఫలం బ్రహ్మసమాగమః ।
ఆయుఃపుత్రాన్ధనం విద్యాం స్వర్గం మోక్షం సుఖాని చ. 11
రాజ్యంచైవ ప్రయచ్ఛన్తి ప్రీతాః పితృగణా నృణామ్ । శ్రూయతేచ పరంమోక్షం ప్రాప్తాః కౌశికసూనవః.
పంచభి ర్జన్మసమ్బన్ధైర్గతా విష్ణోః పరం పదమ్. 12

ఇతి శ్రీమత్స్యమహాపురాణే మత్స్యమనుసంవాదే శ్రాద్ధకల్పే ద్విజాదిదత్త శ్రాద్ధఫలానుభవకథనం నామైకోనవింశతితమోఽధ్యాయః.

## పందొమ్మిదవ అధ్యాయము.

### శ్రాద్ధముచే పితరులకు తృప్తి కలుగు విధము.

ఋషులు సూతుని ఇట్లు ప్రశ్నించిరి: "లోకమున పితృ కర్మలయందు పితృదేవతలను ఉద్దేశించి జనులు ఇచ్చిన కవ్యములును (పితృ దేవతలకు ఇచ్చిన ద్రవ్యములు అన్నము మొదలైనవి) హవ్యములును [విశ్వేదేవులు మొదలగు వారిని ఉద్దేశించి ఇచ్చిన ద్రవ్యములు అన్నము మొదలగునవి] పితృలోకమునందున్న పెద్దలకుగాని పితృదేవతలు మొదలగు వారికి గాని ఎట్లు చేరును? ఈ పదార్థముల వలన కలుగు తృప్తిని అచ్చటికి చేర్చువారు ఎవరు? ఇక్కడ ఈ పదార్థములను తినువారును అనుభవించువారును మానవులగు బ్రాహ్మణులు గదా: హోమము చేయునది అగ్ని హోత్రమునందు కదా: ప్రేతలనుద్దేశించి ఇచ్చిన ఈ పదార్థములు శుభాశుభ రూపులై పుణ్యమో పాపమో చేసియుండి ఈ లోకమును విడిచిపోయి ఉన్న ఆ ప్రేతలు ఏ విధముగా అనుభవింతురు?"

సూతుడు ఆ ఋషులతో ఈ విధముగా చెప్పనారంభించెను : పితృ శ్రాద్ధములను ఆచరించు ప్రక్రియలో పితను

మాతను వసు రూపులనుగా పితామహుని పితామహిని రుద్రరూపులనుగా ప్రపితామహుని ప్రపితామహిని ఆదిత్య రూపులనుగా చెప్పుదురు. ఇట్లని శ్రుతి ప్రమాణము. వారిని వారిని ఈఈ రూపములతో ఉన్నట్లు పేర్కొనుటతోబాటు పితరుల నామమును గోత్రమును కూడ చెప్పుదురు. ఇవియే శ్రాద్ధకర్త ఇచ్చిన హవ్యకవ్యములను ఆయా పితరులకు చేర్చును. ఇదికాక శ్రాద్ధపు మంత్రములను శ్రద్ధను భక్తి పూర్వకముగ శ్రాద్ధమున ఉపయోగించవలెను. అగ్నిష్వాత్తులు మొదలగు పితృదేవతా గణములవారు పితరులకును వారినుద్దేశించి ఇచ్చిన ద్రవ్యములకును అధిపతులైయుందురు. పితరుల నుద్దేశించి చెప్పిన ఈ వసురుద్రాదిత్య రూప నిర్దేశములును వారికి ఆహారముగా ఇచ్చిన దానిని వారికి అందజేసి తృప్తి కలిగించును.

ఎట్లన—ఒకానొక శ్రాద్ధకర్తయొక్క తండ్రి తన శుభకర్మ బలమువలన దేవత్వమును పొందెను. అనుకొందము. ఈ లోకమునందలి అతని కుమారుడు అతనినుద్దేశించి ఇచ్చిన అన్నము అమృతమై దేవత్వములో ఉన్న ఆ తండ్రికి చేరును. ఆ తండ్రియే రాక్షసుడైయున్నచో ఈ కుమారుడు శ్రాద్ధమున ఇచ్చిన అన్నము అతనికి తగిన భోగముగా అందును. పశువుగా ఉన్నవానికి గడ్డియై అందును. పామయియున్న వానికి గాలియై చేరును. యక్షులైయున్న పితరులకు పానీయమై గ్రద్దగానున్న వారికి మాంసమయి దనుజులైయున్న వారికి మాయగా అయి పిశాచములుగా అయియున్న పితరులకు రక్తపానీయమయి మనుష్య జన్మము పొందియున్న పితరులకు అన్నము పానము భోగము రసద్రవ్యములునయి వారివారికి చేరును.

ఆనందానుభవము శక్తి స్త్రీలు కాంతి భోజ్యద్రవ్యములు భుజించు శక్తి దానము చేయు శక్తి విభవము రూపము ఆరోగ్యము ఇవి అన్నియు శ్రాద్ధపు పూవులు-బ్రహ్మత్వ ప్రాప్తి ఫలము. మానవులు జరిపిన శ్రాద్ధమువలన ప్రీతినొందిన పితృదేవతలు శ్రాద్ధకర్తకు ఆయువును పుత్రులను ధనమును విద్యను స్వర్గమును మోక్షమును సుఖములను రాజ్యమును కూడ ఇత్తురు. కౌశిక గోత్రమునందలి బ్రాహ్మణులు (లేదా కౌశికుని కుమారులు) శ్రాద్ధముచే పితృదేవతలకు తృప్తి కలిగించినందువలన తత్ఫలితముగా ఐదు జన్మలతోనే మోక్షమును పొంది విష్ణు స్థానమును చేరుకొనిరి. అని పరంపరతో వినబడుచున్నది.

ఇది శ్రీ మత్స్యమహాపురాణమున మత్స్యమను సంవాదమున శ్రాద్ధముచే పితరులకు తృప్తి కలుగు విధము అను పందొమ్మిదవ అధ్యాయము.

## వింశోఽధ్యాయః

### కౌశికదాయాదకృతశ్రాద్ధాత్తేషాం విష్ణులోకప్రాప్తిః.

ఋషయః : కథం కౌశికదాయాదాః ప్రాప్తాస్తే యోగముత్తమమ్ ।
పఞ్చభిర్జన్మసమ్బన్ధైః కథం కర్మక్షయోఽభవత్. 1
సూతః: కౌశికో నామ ధర్మాత్మా కురుక్షేత్రే మహానృషిః । నామతః కర్మత స్తస్య సుతా స్సప్త నిబోధత.
స్వసృపః : క్రోధనో హింస్రో పిశునః కవిరేవచ । వాగ్దుష్టః పితృవర్తీచ గర్గశిష్యా స్తదాఽభవన్. 3
పితర్యుపరతే తేషా మభూ ద్దుర్భిక్షముల్బణమ్ । అనావృష్టిశ్చ మహతీ సర్వలోకభయఙ్కరీ. 4
గర్గాదేశా ద్వనే దోగ్ధ్రీం చరతస్తే తపోధనాః । భక్ష్యామ కపిలా మేతాం వయం క్షుత్పీడితా భృశమ్. 5
ఇతి చిన్తయతాం పాప మనుం ప్రాహ తదానుజః । యద్యవశ్యమియం వధ్యా శ్రాద్ధరూపేణ యోజ్యతామ్.
శ్రాద్ధే నియోజ్యమానేయం పాపం నశ్యతి నో ధ్రువమ్ । తతః కుర్వ న్ననుజ్ఞాతః పితృవర్తీ తదానుజః.7
చక్రే సమాహిత శ్శ్రాద్ధ ముపయుజ్యచ తాం పునః ।
ద్వౌ దైవే భ్రాతరౌ కృత్వా పిత్ర్యే త్రీన వ్యనుక్రమాత్. 8

తథైక మతిథిం కృత్వా శ్రాద్ధద స్స్వయమేవతు । చకార మన్త్రివ చ్ఛ్రాద్ధం స్మర న్పితృపరాయణః. 9
వినా గాం వత్స ఏకోపి గురవే తు నివేదితః । వ్యాఘ్రేణ నిహతా ధేను ర్వత్సోఽయం ప్రతిగృహ్యతామ్.
ఏవం సా భక్షితా ధేను స్సప్తభి స్తై స్తపోధనైః । వైదికం బలమాశ్రిత్య క్రూరకర్మణి నిర్భయైః. 11

## ఇరువదవ అధ్యాయము.

### కౌశిక వంశీయులు శ్రాద్ధఫలముగా విష్ణులోకమును పొందుట.

ఋషులు సూతునిట్లు ప్రశ్నించిరి: "కౌశిక వంశీయులు తాము జరిపిన శ్రాద్ధమునకు ఫలముగా ఉత్తమమగు యోగమును ఎట్లు పొందగలిగిరి? ఐదు జన్మముల సంబంధముతోనే వారికి కర్మక్షయము కలిగి విష్ణులోక ప్రాప్తి ఎట్లు కలిగెను?"

సూతుడు వారికి ఇట్లు చెప్పనారంభించెను: పూర్వము కురుక్షేత్రమునందు కౌశికుడు అను ధర్మాత్ముడగు మహర్షి యుండెడివాడు. అతనికి ఏడుమంది కుమారులు ఉండిరి. వారు తమ పేరులకు తగిన కర్మలను ఆచరించెడివారు. ఎట్లన-స్వసృపుడు-క్రోధనుడు-హింస్రుడు-పిశునుడు-కవి-వాగ్దుష్టుడు-పితృవర్తి-అని వారి పేరులు. (తన ఇష్టమునననుసరించి నడుచుకొనువాడు-కోపస్వభావము కలవాడు-ఇతరులకు అకారణముగా బాధ కలిగించువాడు-చాడీలు చెప్పువాడు-కవిత్వము అల్లగలవాడు-చెడునోటివాడు-తండ్రియందు భక్తితోనడుచుకొనువాడు) వీరు అందరును గర్గమునికి శిష్యులయి విద్యలనభ్యసించిరి. కొంతకాలమునకు వీరి తండ్రి మరణించెను. పిమ్మట ఒకప్పుడు భయంకరమగు కరవువచ్చెను. సర్వలోకములకు భయంకరమగు దీర్ఘకాలికమగు అనావృష్టి [వరపు-వానలు కురియకపోవుట] ఏర్పడెను. ఈ ఏడుగురు తపోధనులును గర్గుని ఆజ్ఞచే ఆమునియొక్క పాడియావును మేపుచుండగా వారిలో కొందరు "మనము ఆకలితో చాల బాధపడుచున్నాము. ఈకపిల గోవును చంపి తిందము." అనిరి. వారిలో కడపటివాడు ఇది పాపకరమనిచెప్పెను. ఒకవేళ మనము దీనిని చంపితినుట తప్పనిసరిఐనచో పితృశ్రాద్ధము జరుపుదము. దానిలో దీనిని వినియోగించి తిందము. ఆ విధముగాచేసి తినినచో మనకు పాపము అంటదు. గోవధపాపము నశించును. అనికూడ అతడు [పితృవర్తి] పలికెను. మిగిలిన వారు అతని మాట నరేయనిరి. వారి అనుమతితో అతడు శ్రద్ధతో శ్రాద్ధము జరిపెను. ఆ శ్రాద్ధమునందు ఆ గోవును అన్నమునకు మారుగా ఉపయోగించెను. పితృస్థానమునందు ముగ్గురను దైవస్థానమునందు ఇద్దరను తన సోదరులనే అర్చించి భోక్తలుగా కూర్చుండబెట్టి భుజింపజేసెను. మరియొకనిని అతిథిగా గ్రహించి భుజింపచేసెను. తాను శ్రాద్ధకర్త అయి శ్రాద్ధమును ఆ పితృభక్తిపరాయణుడు మంత్రపూర్వకముగా శ్రాద్ధము జరిపెను.

తరువాత వారు గోవులేకుండ దూడను ఒక్కదానినే గురునకు అప్పగించిరి. ఆవును పులి చంపినది. ఈ దూడను మాత్రమే తీసికొనుడు. అని అప్పగించిరి. ఇట్లు ఆ తపోధనులు ఏడుగురును వేదవిధిని బలముగా[ప్రమాణముగా] ఆశ్రయించి నిర్భయులై క్రూరకర్మము జరిపి గోవును తినిరి.

తతః కాలాచ్చ కృష్టాస్తే వ్యాధా దాశపురేఽభవన్ । జాతిస్మరత్వం ప్రాప్తాస్తే పితృభావేన భావితాః. 12
యత్కృతం క్రూరకర్మాపి శ్రాద్ధరూపేణ తైస్తదా । తేన తే భవనే జాతా వ్యాధానాం క్రూరకర్మణామ్.
పితౄణాంచైవ మాహాత్మ్యా జ్జాతా జాతిస్మరాస్తు తే । తేన వైరాగ్యయోగేన అస్థాయానశనం పునః. 14

కౌశికదాయాదానాం మృగాదిజన్మాన్తరప్రాప్తిః.

జాతిస్మరా స్సప్తజాతా మృగాః కాలఞ్జరే గిరౌ । నీలకణ్ఠస్య పురతః పితృభా వానుభావితాః. 15
తత్రాపి జ్ఞానవైరాగ్యా త్ప్రాణానుత్సృజ్య ధర్మతః । లోకైరవేక్ష్యమాణాస్తే తీర్థతోఽనశనేన తు. 16
మానసే చక్రవాకాస్తే సంజాతా స్సప్త యోగినః । నామతః కర్మత స్సర్వా న్శృణుధ్వం ద్విజసత్తమాః.
సుమనాః కుముద శ్శుద్ధ శ్ఛిద్రదర్శీ సునేత్రకః । అనేత్ర శ్చాంశుమాంశ్చైవ సప్తైతే యోగపారగాః. 18

యోగభ్రష్టా స్త్రయస్తేషాం బభూవు స్స్వల్పచేతనాః । దృష్ట్వావై భ్రాజనామాన ముద్యానే స్త్రీభి రన్వితమ్.
క్రీడన్తం వివిధై ర్భావై ర్మహాబలపరాక్రమమ్ । పాఞ్చాలాన్వయసమ్భూతం ప్రభూతబలవాహనమ్. 20
రాజ్యకామోఽభవత్త్వేక స్తేషాం మధ్యే జలౌకసామ్ । పితృవర్తీచ యో విప్రశ్శ్రాద్ధకృ త్పితృవత్సలః.
అపరౌ మన్త్రిణౌ దృష్ట్వా ప్రభూతబలవాహనౌ । మన్త్రిత్వే చక్రతు శ్చేచ్ఛా మస్మిన్మర్త్యే ద్విజోత్తమాః.
తన్మధ్యే యే తు నిష్కామా స్తే బభూవు ర్ద్విజోత్తమాః। వైభ్రాజపుత్రస్త్వేకోఽభూ ద్బ్రహ్మదత్త ఇతి స్మృతః.
మన్త్రిపుత్త్రౌ తథోభౌచ కణ్డరీకసువాలకౌ । బ్రహ్మదత్తోఽభిషిక్తస్స న్పురోహితవిపశ్చితా. 24
పాంచాలరాజో విక్రాన్త స్సర్వశాస్త్రవిశారదః । యోగవి త్సర్వజన్తూనాం రుతవేత్తాఽభవత్తదా. 25

తరువాత కొంతకాలమునకు వారు కాలునకు వశులై మరణించిరి. మరు జన్మమున వారు దశార్ణదేశ రాజధాని యగు దశపురమున వ్యాధులు [బోయవారు]గా పుట్టిరి. పితృ శ్రాద్ధము శ్రద్ధతో జరిపిన శ్రద్ధాభావముతో భావితులై [సంస్కారముపొంది]నందున పూర్వజన్మ స్మరణము వారికి కలిగియుండెను. వారు చేసిన క్రూరకర్మకు ఫలముగా క్రూర కర్ములగు బోయల ఇంట జన్మించిరి. వారు వైరాగ్యముతో తమ జీవితము గడపిరి. అనశన (నిరాహార) వ్రతముతో దేహమువదలి తరువాత జన్మములో కాలంజరపర్వతమున పూర్వజన్మ స్మృతికల లేళ్లుగా జన్మించిరి. అచటను వారు శివుని సన్నిధిలో జ్ఞానవైరాగ్యములతో ధర్మముతో జీవించి తుదకు దేహమువదలిరి. వారు ఈమృగ జన్మమున తీర్థవాసము తోను అనశన వ్రతముతోను దేహత్యాగము చేయుటను అచటిజనులు అందరును ప్రత్యక్షముగా చూచిరి. తరువాత వారు మానస సరస్సులో యోగులగు చక్రవాక పక్షులుగా జన్మించిరి. వారి పేరులు ఈ జన్మములో సుమనుడు-కుముదుడు-శుద్ధుడు-ఛిద్రదర్శి-సునేత్రుడు-అనేత్రుడు-అంశుమంతుడు [మంచి మనస్సు కలవాడు-లోకమునకు సంతోషము కలిగించువాడు-నిర్మలుడు-ఇతరుల దోషములను ఎత్తి చూపువాడు-మంచిని చూచువాడు-ఏమియు చూడనివాడు-కిరణ ప్రకాశము కలవాడు] అనునవి సార్థకములై యుండెను. వారు తమ పేరునకు తగినట్లు కర్మల నాచరించుచుండిరి. వీరు ఏడుమందియు యోగతత్త్వము నెరిగినవారయి యుండిరి. కాని వారిలో ముగ్గురు యోగభ్రష్టులయి తక్కువ బుద్ధి శక్తి కలవారయియుండిరి.

ఒకనాడు వారు పాంచాల దేశరాజగు వైభ్రాజుడను నతనిని చూచిరి. ఆ రాజు ఒక ఉద్యానవనమున భార్యలతో కూడి వివిధ విలాసభావములతో విహరించుచుండెను. అతడు మహాబలపరాక్రమములు కలవాడు. అధికమగు పరివార మును వాహనములును కలవాడు.

ఈ కౌశిక కుమారులలో కడపటివాడు తండ్రియందు భక్తి కలవాడయి యుండి భక్తితో శ్రద్ధతో పితృశ్రాద్ధ మును జరిపిన పితృవర్తి అను నాతడు] ఈ రాజును చూచి తానును రాజు కావలెనని సంకల్పించెను. మిగిలిన వారిలో ఇద్దరు అధికమగు పరివారమును వాహనములును కలిగియున్న రాజమంత్రులను ఇద్దరను చూచి తామును అట్లు మంత్రులు కావలెనని కోరుకొనిరి. [వీరు ముగ్గురును యోగభ్రష్టులు] మిగిలిన నలుగురును ఏమియు కోరుకొనలేదు.

తరువాత జన్మమున పితృవర్తి అను నాతడు ఈ వైభ్రాజుడను పాంచాల రాజునకు కుమారుడయి బ్రహ్మదత్తు డను పేర పుట్టెను. మిగిలిన వారు ఇద్దరును కండరీక సువాలకులు అను పేర వైభ్రాజుని మంత్రికి కుమారులైరి. ఏ కోరి కలు లేని నలుగురును బ్రాహ్మణులై పుట్టిరి.

కొంతకాలమునకు పండితుడగు పురోహితునిచేత బ్రహ్మదత్తుడు పాంచాల రాజుగా పట్టాభిషిక్తుడయ్యెను. అతడు విక్రమము కలవాడు. సర్వశాస్త్ర విశారదుడు. యోగము నెరిగినవాడు. సర్వప్రాణుల ధ్వని విశేషములను ఎరిగినవాడు.

తస్యరాజ్ఞోఽభవద్భార్యా దేవలస్యాత్మజా శుభా । సన్నతిర్నామ విఖ్యాతా కపిలా యాఽభవత్పురా. 26
పితృకార్యే నియుక్తత్వా దభవ ద్బ్రహ్మవాదినీ। తయా చకార సహిత స్స రాజ్యం రాజనన్దనః. 27

కదాచి దుద్యానగత స్తయా సహ స పార్థివః । దదర్శ కీటమిథున మనఙ్గకలహాకులమ్. 28

కీటమిథునసంవాదః.

పిపీలికా మనునయ స్త్వరితః కీటకాముకః । పఞ్చబాణాభితప్తాఙ్గ స్సగద్గద మువాచ హ. 29

న త్వయా సదృశీ లోకే కామినీ విద్యతే క్వచిత్ । మధ్యే క్షామాఽతిజఘనా బృహద్వక్షోరుగామినీ. 30

సువర్ణవర్ణా సుశ్రోణీ మద్భక్తా చారుహాసినీ । సులక్షనేత్రరదనా గుడశర్కరవత్సలా. 31

భోక్ష్యసే మయి భుక్తే త్వం స్నాసి స్నాతే తథా మయి । ప్రోషితే సతి దీనా త్వం క్రుద్ధేపి భయచంచలా.

కిమర్థం వద కల్యాణి సరోషవదనా స్థితా । సా తమాహ సకోపా తు కిమాలపసి మాం శఠ. 33

త్వయా మోదకచూర్ణంతు మాంవిహాయాభిలష్యతా । ప్రమత్తేన వ్యతిక్రాన్తే దినేఽన్యస్యా స్సమర్పితమ్.

పిపీలికః : త్వత్సాదృశ్యా న్మయా దత్త మన్యస్యా వరవర్ణిని । తదేక మపరాధం మే క్షన్తు మర్హసి భామిని.

నైతదేవం కరిష్యామి పునఃక్వాపిహ సువ్రతే । స్పృశామి పాదౌ సత్యేన ప్రసీద ప్రణతస్య మే. 36

సూతః : ఇతి తద్వచనం శ్రుత్వా సాప్రసన్నాఽభవ త్తతః। ఆత్మాన మర్పయామాస మోహనాయ పిపీలికా.

బ్రహ్మదత్తో వ్యశేషంతద్జ్ఞాత్వా విస్మయమాగమత్ । సర్వస త్త్వరుతజ్ఞత్వా త్ప్రభావా చ్చక్రపాణినః.

ఇతి శ్రీమత్స్య మహాపురాణే మత్స్యమనుసంవాదే స్వప్నపాదికృతశ్రాద్ధ
ఫలానుభవథనం నామ వింశతితమోఽధ్యాయః.

కౌశిక పుత్త్రులు జరిపిన శ్రాద్ధమున ఉపయోగింపబడినదగు గర్గుని కపిలగోవును ఈ కాలమున దేవలుడను రాజునకు కుమార్తెగా సన్నతి అను పేరుతో జన్మించెను. పితృకార్యమున ఉపయోగింపబడిన ఫలమున ఆమె వేదతత్త్వ వేత్త్రి యయ్యెను. విభ్రాజరాజు పాలనము చేయుచుండెను.

ఒకనాడు బ్రహ్మదత్తునకు ఉద్యానవనమున కామ ప్రవృత్తి హేతువుగా కలహించుకొనుచున్న చీమల దంపతులు కనబడెను. మగచీమ కామబాణముల తాకిడిచే తన శరీరము కంపించుచుండ డగ్గుత్తికతో సరిగా మాట రాకపోగా ఆడు చీమను బ్రతిమాలుచు ఇట్లు పలికెను: "నీతో సమానురాలగు స్త్రీ లోకమునందు ఎవ్వతెయు ఎక్కడను లేదు. నీ నడుము సన్ననిది. నీ కటి ప్రదేశము విశాలమయినది. నీ వక్షోజములు చాల పెద్దవి. నీ నడక ధీరమయినది. నీది బంగారు ఛాయ. నీ పిరుదులు చక్కనివి. నా యందు భక్తి కలదానవు. చక్కని చిరునవ్వు చక్కగా కనబడు కన్నులు దంతములు కలదానవు. నీకు బెల్లము మీదను చక్కెర మీదను ప్రీతి ఎక్కువ. నేను భుజించనిదే నీవు భుజించవు. నేను స్నానము చేయనిదే స్నానమాడవు. నేను దూర దేశమునకు పోయినచో నీవు దీనురాలై యుందువు. నేను కోపించినచో భయముతో వణకిపోదువు. కల్యాణీ! ఇట్టి నీవు ఇపుడు ముఖమున రోషముతో ఏల ఉన్నావు?"

మగచీమ మాటలు విని ఆడుచీమ కోపముతో ఇట్లు పలికెను: "ఇతరుల మనస్సును నొప్పించువాడా! నీవు నన్నెందులకు వలుకరింతువు? [వలుకరించకుము.] నీవు నిన్నటి దినమున చాల మత్తతతో లడ్డు పొడిని నాకు ఈయక మరియొక ఆడుచీమను అభిలషించి ఆమెకు ఇచ్చినావు."

మగచీమ మరల ఇట్లు పలికెను: "ఓ సుందరీ! నీ పోలికతో ఉండుటచే తెలియక నేను ఆ లడ్డు పొడి వేరొక చీమకు ఇచ్చితిని. నీవు కోపింపకుము. నీవు నేను చేసిన ఈ ఒక అపరాధమును క్షమింపుము. ఈ జీవితములో మరి ఇంకెప్పుడును ఇటువంటి తప్పు చేయను. సత్యము ప్రమాణముగా నీ పాదములు పట్టుకొనుచున్నాను. నమస్కరించు చున్నాను. నన్ననుగ్రహించుము."

ఇట్లు పలికిన మగచీమ మాటలు విని ఆ ఆడుచీమ కోపము విడిచి ప్రసన్నురాలయ్యెను. తన్ను తాను ఆమె తన ప్రియునకు సమర్పించుకొనెను.

బ్రహ్మదత్తుడును ఈ విషయమంతయు ఎరిగి ఆశ్చర్యము పొందెను. విష్ణుదేవుని అనుగ్రహమున సర్వప్రాణుల ధ్వనులను వాటి అర్థమును అతడు ఎరిగియుండుటయే ఇందులకు హేతువు.

ఇది శ్రీమత్స్య మహాపురాణమున మత్స్యమను సంవాదమున శ్రాద్ధ ఫలానుభవ కథనమను ఇరువదవ అధ్యాయము.

## ఏకవింశోఽధ్యాయః.

### చక్రవాకచతుష్టయస్య బ్రాహ్మణజన్మప్రాప్తిః.

ఋషయః :కథం స త్త్వరుతజ్ఞోఽభూ ద్బ్రహ్మదత్తో ధరాతలే। తేచాభవ న్కస్య కులే చక్రవాకచతుష్టయమ్.
సూతః : తస్మిన్నేవ పురే జాతా తే తు చక్రాహ్వయా స్తదా ।
వృద్ధద్విజస్య దాయాదా విప్రా జాతిస్మరా ద్విజాః. 2
ధృతిమాం స్తత్త్వదర్శీచ విద్యాచణ్డ స్తథోత్సుకః । నామతః కర్మతశ్చైతే సుదరిద్రస్య తే సుతాః. 3
తపసే బుద్ధి రభవ త్తదా తేషాం ద్విజన్మనామ్ । యాస్యామః పరమాం సిద్ధి మిత్యూచుస్తే ద్విజోత్తమాః.4
తత స్తద్వచనం శ్రుత్వా సుదరిద్రో మహాతపాః । ఉవాచ దీనయా వాచా కిమే తదితి పుత్త్రకాః. 5
అధర్మకామా న్విధివ త్పితా తా నభ్యచోదయత్ । వృద్ధం పితర ముత్సృజ్య దరిద్రం వనవాసినః. 6
కోను ధర్మోత్ర భవితా మర్త్యః కాం గతి మేతి హి । ఊచుస్తే కల్పితా వృత్తి స్తవ తాత వదస్వ మే. 7
వృత్త మేత త్పురో రాజ్ఞ స్స తే దాస్యతి పుష్కలమ్ । ధనం గ్రామసహస్రాణి ప్రభాతే పఠత స్తదా. 8
యే విప్రముఖ్యాః కురుజాఙ్గలేషు వ్యాధా స్తథా దాశపురే మృగాశ్చ ।
కాలంజరే సప్త చ చక్రవాకా యే మానసే తే వయ మత్ర సిద్ధాః. 9
ఇత్యుక్త్వా పితరం జగ్ము స్తే వనం తపసే పునః । వృద్ధోఽపి రాజభవనం జగామాత్మార్థసిద్ధయే. 10

## ఇరువదియొకటవ అధ్యాయము.

### కౌశిక పుత్త్రులకు బ్రహ్మలోకప్రాప్తి.

ఋషులు సూతునితో నిట్లు పలికిరి: "భూలోకమునందలి ఇందరిలో ఈ బ్రహ్మదత్తుడు ఒకడు అపురూపముగా ఎట్లు ఆయా ప్రాణుల ధ్వనులను వాటి అర్థములను తెలిసికొనగలవాడయ్యెను? ఈ ఏడు చక్రవాక పక్షులలో ఈ ముగ్గురును కాక మిగిలిన నలుగురును ఎవరి వంశమునందు జన్మించిరి?"

సూతుడు ఇట్లు చెప్ప నారంభించెను: బ్రహ్మదత్తుడు ఉండెడి ఆ పాంచాల రాజధానీపురమునందే విద్యాచండుడను వృద్ధ బ్రాహ్మణు డుండెను. అతడు తన పేరునకు తగినట్లు సకల విద్యలయందు చాల సమర్థుడగు విద్వాంసుడు. ఆయా విషయములను తెలిసికొనవలెనను జిజ్ఞాసయు కుతూహలమును కలవాడు. చాల దరిద్రుడు. ఆపదలలోను కలతపడని సుస్థిరనిశ్చయము కలవాడు. విద్యల తత్త్వమును ప్రపంచ తత్త్వమును భగవత్తత్త్వమును ఎరిగినవాడు. ఈ వైరాగ్యము గల నాలుగు చక్రవాక పక్షులును ఆ బ్రాహ్మణునికి కుమారులుగా జన్మించిరి. వీరు పూర్వజన్మ స్మరణము కలిగి ఉండిరి. వారికి నలుగురకును తపస్సు చేసికొనవలెనను సంకల్పము కలిగెను. మేము తప స్సాచరించి ఉత్తమసిద్ధిని పొందదలచి ఉన్నాము. అని వారు తమ తండ్రితో పలికిరి. ఆ మాట విని మహా తపస్సంపన్నుడగు ఆ విద్వాంసుడు దీనవచనములతో ఇట్లు పలికెను: "నాయనలారా! ఇది ఏమి? మీకు కలిగిన ఈ సంకల్పము ధర్మానుకూలమయినది కాదు. వృద్ధుడును దరిద్రుడును అగు తండ్రిని వదలిపోవుటచే మీకు లభించు ధర్మము ఏమున్నది? దీనివలన ఏ మానవునకుగాని ఏ సద్గతి లభించును?"

కుమారులు తండ్రితో ఇట్లనిరి: "నాయనా! నీకు తగిన జీవనవృత్తి [భగవంతునిచే] ఏర్పరుపబడియే యున్నది కదా! మా ఈ వృత్తాంతమును రాజునకు తెలుపుము. అతడు నీకు పుష్కలముగా ఇచ్చును. ఉదయకాలమున వేదాదికమును పఠించునట్లు ఏర్పాటుచేసి రాజు నీకు వేలకొలది గ్రామములను జీవనమునకై ఈయగలడు. మొదట కురుక్షేత్రమునందు సప్త బ్రాహ్మణులుగా తరువాత దశపురమునందు వ్యాధులుగా పిమ్మట కాలంజరపర్వతమున లేళ్లుగా అటుపిమ్మట మానస సరస్సునందు చక్రవాక పక్షులుగా జన్మించిన మేము ఈ జన్మమున ఇట్లు జన్మించి సిద్ధి పొందనున్నాము."

ఇట్లు తండ్రితో పలికి వారు తమ సంకల్పము ననుసరించి తపస్సు ఆచరించుటకు వనమునకు పోయిరి. వృద్ధ బ్రాహ్మణుడగు విద్యాచండుడును తన కుమారులు చెప్పినట్లు రాజు దగ్గర తన పనిని చూచుకొనుటకు రాజసభకు పోయెను.

అణుహో నామ విభ్రాజః పాఞ్చాలాధిపతిః పురా । పుత్రార్థీ దేవదేవేశం హరిం నారాయణం ప్రభుమ్. 11
ఆరాధయామాస విభుం తీవ్రవ్రతపరాయణః । తతః కాలేన మహతా తుష్ట స్తస్య జనార్దనః. 12
వరం వృణీష్వ భద్రం తే హృదయే నేప్సితం నృప । ఏవముక్తస్తు దేవేన వవ్రే వర మనుత్తమమ్. 13
పుత్రం మే దేహి దేవేశ మహాబలపరాక్రమమ్ । పారగం సర్వశాస్త్రాణాం ధార్మికం యోగినాం వరమ్.
సర్వసత్త్వరుతజ్ఞం మే దేహి యోగిన మాత్మజమ్ । ఏవ మస్త్వితి విశ్వాత్మా తమాహ పరమేశ్వరః. 15
పశ్యతాం సర్వదేవానాం తత్రైవాన్తరధీయత । తతస్స తస్య పుత్రోఽభూ ద్బ్రహ్మదత్తః ప్రతాపవాన్.16
సర్వసత్త్వానుకమ్పీచ సర్వసత్త్వబలాధికః । సరస్వత్త్వరుతజ్ఞశ్చ సర్వసత్త్వేశ్వరేశ్వరేశ్వరః. 17

బ్రహ్మదత్తసన్నతిసల్లాపః.

అహసద్యేన *యోగాత్మా సపిపీలికరాగతః । యత్ర తత్కీటమిథునం రమమాణ మవస్థితమ్. 18
తతస్సా సన్నతి ర్దృష్ట్వా తం హసన్తం సువిస్మితా ।
కిమ ప్యాశఙ్క్య మనసా త మపృచ్ఛ న్నరేశ్వరమ్. 19
సన్నతిః: అకస్మా దతిహాస స్తే కిమర్థ మభవ న్నృప ।
హాస్య హేతుం న జానామి య దకాలే కృతం త్వయా. 20
సూతః : అవద ద్రాజపుత్రోఽపి సపిపీలికభాషితమ్ । రాగాదేవ సముత్పన్న మేత ద్ధాస్యం వరాననే. 21

(బ్రహ్మదత్తుని జన్మ వృత్తాంతము) : పూర్వము విభ్రాజవంశమున పుట్టిన అణుహుడు అను రాజుండెను. అతడు పాంచాల దేశరాజు. అతడు పుత్రులను కోరి ప్రభుడును విభుడును దేవదేవులకు కూడ ఈశుడును అగు నారాయణుని తీవ్ర వ్రతపరాయణుడై ఆరాధించెను. అట్లు ఆరాధించగా చాల కాలమునకు జనార్దనుడు అతని విషయమున సంతుష్టుడు అయ్యెను. నాయనా! రాజా! నీ హృదయమునందు ఈప్సితమయియున్న వరమును కోరుకొనుము. అని విష్ణువు పలుకగా రాజు మిగుల ఉత్తమమగు వరమును ఇట్లు కోరుకొనెను. "దేవేశా! నాకు మహా బలపరాక్రముడగు కుమారుని ఇమ్ము. అతడు సర్వశాస్త్రములు తుదముట్ట చదివి వాని తత్త్వ మెరిగినవాడును ధార్మికుడును యోగియు యోగిశ్రేష్ఠుడును సర్వ ప్రాణుల ధ్వనులను వాటి యర్థములను నెరిగినవాడునై యుండవలెను." అని కోరగా పరమేశ్వరుడును సర్వ విశ్వరూపుడును సర్వ విశ్వములకు ఆత్మభూతుడును అగు విష్ణువు అట్లే యగుగాక!' అని అణుహునకు వరము నిచ్చి సర్వదేవతలును చూచుచుండ అచ్చటనే అంతర్ధానము పొందెను.

తరువాత అతనికి ప్రతాపవంతుడగు బ్రహ్మదత్తుడు కుమారుడుగా కలిగెను. అతడు సర్వప్రాణులయందు దయ కలవాడు. బలమునందు సర్వప్రాణులలో అధికుడు. అన్ని ప్రాణుల ధ్వనులను వాటి అర్థమును ఎరుగగలవాడు. సర్వప్రాణులకు అధిపతులగు వారికి అధిపతి. అంతేకాక అతడు యోగముతో సంస్కరింపబడిన ఆత్మకలవాడు. అందు

* ధర్మాత్మా

చేతనే చీమలజంట రమించుచున్నచోట తానున్నప్పుడు అవి అనురాగ వశమున చేసిన సంభాషణమును విని ఆశ్చర్యపడి నవ్వెను.

అంతట అప్పుడు అచ్చటనేయున్న అతని భార్య సన్నతి అతని నవ్వును చూచి చాల ఆశ్చర్యపడెను. కాని మనస్సులో ఏదో సందేహము కలిగి ఆనరేశ్వరుని ఇట్లు ప్రశ్నించెను: "రాజా! మీరెందులకు నవ్వితిరి? ఇచట అందులకు తగిన హేతువు ఏమియు కనబడుటలేదు. ఇది నవ్వుటకు తగిన సమయమును కాదు."

సన్నతిమాటవిని రాజు చీమలదంపతుల సంభాషణ వృత్తాంతమును తెలిపి అనురాగపూర్వకమయిన చీమల సంభాషణము విని నాకు నవ్వు వచ్చినది. ఇంతకంటె ఈ నవ్వునకు వేరుగ కారణము ఏమియు లేదు. నీవు ఇంతగా ఆశ్చర్యపడవలసిన పనిలేదు. అని సన్నతితో పలికెను.

న చాన్య త్కారణం కిఞ్చి ద్దాస్య హేతో స్సువిస్మితే। న చామన్యత తద్దేవీ పైపీలిక మిదం వచః. 22
అహమే వావహసితా న జీవిష్యే త్వయాఽధునా। కథం పిపీలికాలావం మర్త్యో వేత్తి నరేశ్వర. 23
త్వయాఽహ మేవ హి కథం హసితా కి మతఃపరమ్। తతో నిరుత్తరో రాజా జిజ్ఞాసు స్త త్పురో హరేః.

బ్రహ్మదత్తస్య ప్రభాతే వృద్ధద్విజదర్శనమ్.

ఆస్థాయ నియమం తస్థౌ సప్తరాత్ర మకల్మషః। స్వప్నే ప్రాహ హృషీకేశః ప్రభాతే పర్యట న్పురి. 52
వృద్ధద్విజో య స్త్వద్వాక్యం సర్వం జ్ఞాస్య త్యశేషతః।
ఇత్యుక్త్వాఽన్తర్దధే విష్ణుః ప్రభాతేఽథ నృపః పురాత్. 26
నిర్గచ్ఛ న్మన్త్రి సహిత స్సభార్యో వృద్ధ మగ్రతః।
తత స్తం వృద్ధ మాయాన్తం స నృప స్సన్దదర్శ హ. 27
బ్రాహ్మణాః యే విప్రముఖ్యాః కురుజాఙ్గలేషు వ్యాధా స్తథా దాశపురే మృగాశ్చ।
కాళఞ్జరే సప్త చ చక్రవాకా యే మానసే తే వయ మత్ర సిద్ధాః. 28
సూతః: ఇత్యాకర్ణ్య వచ స్తాభ్యాం స ప్రపాత శుచా తతః।
జాతిస్మరత్వ మగమ త్తౌ చ మన్త్రివరావుభౌ. 29
కామశాస్త్రప్రణేతా చ బాభ్రవ్యశ్చ సుపాలకః। పఞ్చాలా ఇతి దేశేషు విశ్రుత స్సర్వశాస్త్రవిత్. 30
కణ్డరీకో ఽపి ధర్మాత్మా వైద్యశాస్త్ర ప్రవర్తకః। భూత్వా జాతిస్మరౌ శోకా త్పతితా వగ్రత స్తదా. 31
తే వయం* యోగవిభ్రష్టా హా గతాః కర్మబన్ధనాః। ఏవం విలప్య బహుశ స్త్రయ స్తే యోగపారగాః. 32
విస్మయా చ్ఛ్రాద్ధమాహాత్మ్య మభినన్ద్య పునః పునః। తత స్తస్మై ధనం దత్వా ప్రభూతగ్రామసంయుతమ్.
విసృజ్య బ్రాహ్మణం తం చ వృద్ధం ధనముదాన్వితమ్।
ఆత్మీయం నృపతిః పుత్త్రం నృపలక్షణసంయుతమ్. 34
విష్వక్సేనాభిధానం తు రాజా రాజ్యేఽభ్యషేచయత్। మానసే మిళితా స్సర్వే తత స్తే యోగినాం వరాః.
బ్రహ్మదత్తాదయ స్తస్మిన్ ప్రీత్యాభక్త్యా విమత్సరాః। సన్నతి శ్చాపద దృష్ట్వా మయైతత్కాల కారితమ్. 36
రాజ న్యోగఫలం సర్వం య దేత దభిలక్ష్యతే। తథేతి ప్రాహ రాజా తు పున స్తా మభ్యనన్దయత్. 37
త్వత్ప్రసాదాదిదం సర్వం మయైత త్ప్రాప్యతే ఫలమ్।
తత స్తే యోగ మాస్థాయ సర్వ ఏవ మనోమయమ్. 38
బ్రహ్మకందేహేన పరమం పద మాపు స్తపోబలాత్। ఏవ మాయు ర్ధనం విద్యాం స్వర్గం మోక్షం సుఖాని చ.

---

* యోగవిభ్రష్టాః కాలగతాః

ప్రయచ్ఛన్తి సుతా నారాజ్యం నృణాం ప్రీతాః పితామహాః ।
యఇదం పితృమాహాత్మ్యం బ్రహ్మదత్తస్య చ ద్విజాః. 40
ద్విజేభ్యః శ్రావయేద్యో వా శృణోత్యథ పఠేత వా । కల్పకోటిశతం సాగ్రం బ్రహ్మలోకే మహీయతే. 41

ఇతి శ్రీమత్స్యమహాపురాణే మత్స్యమనుసంవాదే శ్రాద్ధకల్పే పితృమాహా
త్మ్యాత్స్వస్రుపాదీనాం జన్మాన్తరే బ్రహ్మలోకప్రాప్తి
కథనం నామైకవింశతితమోఽధ్యాయః.

కాని సన్నతి బ్రహ్మదత్తుని మాటను నమ్మలేదు. ఈ నవ్వు చీమల దంపతుల సంభాషణమువలన కలిగిన దను విశ్వాసము ఆమెకు కలుగలేదు. నీవు నా విషయమునందే నవ్వితివి. నాపై అనురాగము లేని నీతో నేను జీవించను. రాజా! మానవులకు చీమల మాటలను విని అర్థము చేసికొను శక్తి ఎట్లుండును? ఏ విధముగా ఆలోచించినను నీవు నా విషయముననే నవ్వితివి. ఇంతకంటె మరి ఏమియు కారణములేదు- అని ఆమె రాజుతో పలికెను. ఆ మాటలకు బ్రహ్మ దత్తుడు ఏమియు సమాధానము ఈయలేకపోయెను. అతడు ఈ విషయమును విష్ణుదేవుని ముందే (విష్ణుదేవునినుండియే) తెలిసికొన గోరెను. అందులకై అతడు నిష్కల్మషమగు మనస్సుతో ఏడు దినములు నియమమును పూని హరిధ్యానము చేసెను. స్వప్నములో అతనికి విష్ణు దేవుడు సాక్షాత్కరించి ఇట్లు పలికెను: నీవు ప్రభాతకాలమున నగరమున సంచ రించుము. అప్పుడు నీకొక వృద్ధ బ్రాహ్మణుడు కనబడును. అతడు నీ వాక్యమును అంతయు తెలిసికొని తగిన సమా ధానము ఈయగలడు. ఇట్లు పలికి విష్ణువు అంతర్ధానము నందెను.

తెల్లవారిన తరువాత ఉదయమున రాజగు బ్రహ్మదత్తుడు భార్యయగు సంనతితోను ఇద్దరు మంత్రులతోను కలిసి పురమునుండి వెలుపలికి పోవుచుండగా అతని ఎదుట వృద్ధ బ్రాహ్మణుడు కనబడెను. అతడును తన వైపునకే వచ్చుట ఆరాజు గమనించెను.

అంతలో బ్రాహ్మణుడు తన రాజుకడకు వచ్చి ఇట్లు పలికెను. "కురుక్షేత్రమునందు బ్రాహ్మణులుగా మొదటి జన్మమునందు పుట్టిన వారే తరువాత దశపురమున వ్యాధులుగా జన్మించిరి. వారే తరువాత కాలంజర పర్వతమున లేళ్ళుగా జన్మించిరి. పిమ్మట మానస సరస్సునందు చక్రవాక పక్షులుగా జన్మించిరి. ఆమేమే ఇపుడు ఇక్కడ యోగసిద్ధిని పొందుచున్నాము."

ఈ మాటను వినుచునే రాజు పూర్వ జన్మ స్మృతి కలిగి శోకముతో క్రింద పడెను. మంత్రులు ఇద్దరును అదే విధముగా పూర్వజన్మ స్మరణము కలిగి క్రింద పడిపోయిరి.

ఈ ఇద్దరిలో సువాలకుడు బాభ్రవ్య గోత్రమున పుట్టినవాడు. 'పంచాలము' అను జనపదములందు (పాంచాలము అని కాదు.) అనేక శాస్త్రములు ఎరిగిన పండితుడుగా ప్రసిద్ధుడు. లోకమున కామశాస్త్రమును లోకమున ప్రవర్తింప జేసినవాడు. నిర్మలచిత్తము కలవాడగు కండరీకుడు అను రెండవ మంత్రి లోకమున వైద్యశాస్త్రమును ప్రవర్తింపజేసెను.

ఇట్లు ఈ యోగపారంగతు లగు ముగ్గురును అనేక విధముల విలపించిరి. తాము పూర్వ జన్మమునందు శ్రాద్ధము యొక్క మహిమయే ఇది అని గుర్తించి ఆశ్చర్యపడుచు ఆ మహిమను మాటిమాటికి అభినందించిరి.

అనంతరము వారు ఆ వృద్ధ బ్రాహ్మణునకు సమృద్ధమయి ధనవంతములగు గ్రామములను ధనమును ఇచ్చిరి. ధనముతోను సంతోషముతోను కూడిన వానినిగా చేసి వారా బ్రాహ్మణునికి వీడ్కోలు చెప్పి పంపివేసిరి.

తరువాత రాజగు బ్రహ్మదత్తుడు సమస్త రాజ లక్షణములతో కూడిన తన కుమారుని రాజ్యమునందు అభి షేకించెను. తరువాత ఆ యోగి శ్రేష్ఠులగు బ్రహ్మదత్తాదులు అందరును మత్సరము మొదలగు అవగుణములు లేనివారయి తమకు గల పితృభక్తిచే గలిగిన ఈ సత్ఫలితమును పొంది అందరును పరస్పరము మానస సరస్సునందు కలిసికొనిరి.

అది ఎట్లు జరిగెను అనిన- వృద్ధ బ్రాహ్మణుని వచనమును విని బ్రహ్మదత్తుడు క్రింద పడగానే అది చూచి రాణియగు సన్నతి-రాజా! ఇది యంతయు ఇట్లు జరుగుటకు నేనే హేతువనైతిని. ఏపే కోరికలైనను యోగసిద్ధికి ఫలముగా లభించును-అనెను. "అది నిజమే." అని రాజనెను. ఇందు నీ దోషము లేదు సరేకదా! నీవు నాకు మేలే చేసితివని రాజామెను మెచ్చుకొనెను. నీ అనుగ్రహము వలననే నాకీ మహాఫలము లభించె నని అతడామెతో పలికెను.

తరువాత ఆ బ్రహ్మదత్తుడును అతని మంత్రులగు కండరీక సుబాలకులును మనోమయమగు యోగమును పూనిరి. బ్రహ్మరంధ్ర మార్గమున ప్రాణములను వదలిరి. తమ తపోబలమున వారెట్లు పరమపదమును-విష్ణుస్థానమును పొందిరి.

పితృ పితామహ ప్రపితామహాది పితృదేవతలు మానవులకు ఈ విధముగానే ఆయువును విద్యను ధనమును స్వర్గమును మోక్షమును అన్ని సుఖములను సుతులను రాజ్యమును కూడ ఇత్తురు.

పితృ దేవతా మహిమమును బ్రహ్మదత్తుని చరిత్ర మాహాత్మ్యమును శ్రాద్ధకాలమున బ్రాహ్మణులకు వినిపించినను తాము వినినను చదివినను నూరుకోట్ల కల్పముల కాలము బ్రహ్మలోకమునందు సుఖింతురు.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున మత్స్యమను సంవాదమున బ్రహ్మదత్తాదుల
బ్రహ్మలోక ప్రాప్తి అను ఇరువది యొకటవ యధ్యాయము.

## ద్వావింశోఽధ్యాయః.

## పితృప్రీతికర తీర్థకాలకథనమ్.

ఋషయః : కస్మి న్కాలే చ త చ్ఛ్రాద్ధ మనన్తఫలదం భవేత్ ।
కస్మి న్వాసర భాగే తు శ్రాద్ధకృచ్ఛ్ర సమాచరేత్। తీర్థేషు కేషు చ కృతం శ్రాద్ధం బహుఫలం భవేత్ .1
సూతః: అపరాహ్ణే తు సమ్ప్రాప్తే హ్యభిజి ద్రౌహిణోదయే ।
యత్కించిద్దీయతే తత్ర త దక్షయ ముదాహృతమ్. 2
తీర్థాని యాని శస్తాని పితౄణాం వల్లభాని చ । నామత స్తాని వక్ష్యామి సజ్క్షేపేణ ద్విజోత్తమాః. 3

పితృతృప్తికరగయాదితీర్థకథనమ్.

పితృతీర్థం గయా నామ సర్వతీర్థవరం శుభమ్ । తత్రాస్తే దేవదేవేశ స్స్వయ మేవ పితామహః. 4
తత్రైషా పితృభి ర్గీతా గాథా భాగ మభీప్సుభిః। ఏష్టవ్యా బహవః పుత్రా యద్యేకోఽపి గయాం వ్రజేత్. 5
యజేత వాశ్వమేధేన నీలం వా వృష ముత్సృజేత్ । తథా వారాణసీ పుణ్యా పితౄణాం వల్లభా సదా. 6
తత్రావిముక్తసాన్నిధ్యం భుక్తిముక్తిఫలప్రదమ్ । పితౄణాం వల్లభం తద్వ త్పుణ్యం చ విమలేశ్వరమ్. 7
పితృతీర్థం ప్రయాగం తు సర్వకామఫలప్రదమ్ । వటేశ్వరం తు సుభగం సర్వకామఫలప్రదమ్. 8
వటేశ్వరస్తు భగవా న్మాధవేన సమన్వితః । యోగనిద్రాశ్రయ స్తద్వ త్సదా వసతి కేశవః. 9
దశాశ్వమేధికం పుణ్యం గఙ్గాద్వారం తథైవచ । నన్దాథ లలితా తద్వ త్తీర్థం మాయాపురం శుభమ్. 10
తీర్థం బ్రహ్మసర స్తద్వ చ్ఛతద్రుసలిలే హ్రదః । తీర్థం తు నైమిశం నామ సర్వతీర్థఫలప్రదమ్. 11
గఙ్గోద్భేదం తు గోమత్యాం యత్రోద్భూత స్సనాతనః । తథా యజ్ఞవరాహస్తు దేవదేవశ్చ శూలభృత్. 12
యత్ర తత్కాఞ్చనం ద్వార మష్టాదశభుజో హరః । నేమిస్తు హరిచక్రస్య శీర్ణా యత్రాభవ త్పురా. 13
తదేవ నైమిశారణ్యం సర్వతీర్థనిషేవితమ్ । దేవదేవస్య తత్రాపి వారాహస్య చ దర్శనమ్. 14
యః ప్రయాతి స పూతాత్మా నారాయణపదం వ్రజేత్ । కృతశౌచం మహారణ్యం సర్వపాపనిషూదనమ్.
యత్రాస్తే నరసింహస్తు స్వయమేవ జనార్దనః । తీర్థ మిక్షుమతీ నామ పితౄణాం వల్లభం సదా. 16
సఙ్గమే యత్ర తిష్ఠన్తి గఙ్గాయాః పితర స్సదా ।

# ఇరువది రెండవ అధ్యాయము

## శ్రాద్ధము జరుపదగిన తీర్థక్షేత్రములును-కాలమును

ఋషులు సూతుని ఇట్లు ప్రశ్నించిరి : "ఏ సమయమునందు-అనగా పగటి ఏ అంశమునందు శ్రాద్ధకర్త శ్రాద్ధము జరిపినచో అనంతమగు ఫలము లభించును? ఏ తీర్థములందుకాని క్షేత్రములందుగాని శ్రాద్ధము జరిపినయెడల బహుఫలము లభించును? తెలుప వేడుచున్నాము."

సూతుడు ఇట్లు చెప్ప నారంభించెను : అభిజిన్ముహూర్తము రౌహిణ ముహూర్తము ఉదయించు సమయము అగు అపరాహ్ణ కాలమున జరిపిన శ్రాద్ధము అనంతమగు ఫలమును ఇచ్చును.

పితృదేవతలకు ప్రీతికరములగు తీర్థములను క్షేత్రములను పేర్కొని వాటిని గూర్చి సంక్షేపముగా తెలుపుచున్నాను.

గయా తీర్థము పితృ తీర్థములన్నిటిలో మేలయినది. శుభకరమయినది. అక్కడ దేవదేవులకును ఈశుడు అగు బ్రహ్మస్వయముగా సన్నిహితుడై యుండును. తమ పితృభాగమగు కవ్యమును అనుభవింపగోరు పితృదేవతలు గానము చేసిన గాథ (యొక్క అర్థము) ఈ విధముగా నున్నది: "పితరులు అనేకులగు పుత్రులు కలుగవలెనని కోరుకొనవలెను. ఏలయన వారిలో ఒకడైన గయకు పోయి పితృ శ్రాద్ధము జరుపునేమో: అశ్వమేధ యాగమునైన జరుపునేమో! నీల వృషభమును విడుచునేమో!" వారాణసి సదా పితరులకు ప్రియమయినది. దానిని ఎన్నడును పార్వతీ పరమేశ్వరులు విడువనందున దానిని అవిముక్త క్షేత్రము అందురు. వారి నిరంతర సన్నిధి వలన అది భుక్తి ముక్తి ఫలములను శ్రాద్ధకర్తకు ఇచ్చును. విమలేశ్వరము ప్రయాగ కటీశ్వరము అను క్షేత్రములును పితరులకు ప్రియములైనవి పుణ్యకరములైనవి సర్వ కామములను తీర్చునవి. వటేశ్వర క్షేత్రమునందు వటేశ్వరుడను శివుడు యోగనిద్రతో శయనించియుండు కేశవునితో కూడి నివసించును. దశాశ్వ మేధము-గంగా ద్వారము (హరిద్వారము) నందా లలితాతీర్థములు మాయాపురము (జగన్నాథపురి) బ్రహ్మసరమను తీర్థము శతద్రు (సట్లజ్) జలపుమడుగు గంగాగోమతీ సంగమ స్థానము నైమిశము పితృప్రీతికరములు గంగాగోమతీ సంగమమున శాశ్వతుడగు యజ్ఞవరాహ విష్ణుడును శూలధారియగు శివుడును సన్నిహితులైయుందురు అచట బంగారుద్వారము కలదు. అచటి శివుడు అష్టాదశభుజుడు. విష్ణుచక్రపు నేమి (అంచు) శీర్ణము (శిథిలము) అయిన స్థలమే నైమిశము. ఈ క్షేత్రమునందు యజ్ఞ వరాహ మూర్తిని దర్శించినచో విష్ణులోకమును పొందును. కృతశౌ... మను మహారణ్యము సర్వపాప నాశకము. అచట సాక్షాత్ నారాయణుడు నరసింహ రూపమున నున్నాడు. ఇక్షుమతీగంగా సంగమము పితృప్రియమగు తీర్థము. అచట పితృదేవతలు ఎల్లప్పుడును నివసించుచుందురు.

కురుక్షేత్రం మహాపుణ్యం సర్వతీర్థసమన్వితమ్. 1'
తథాచ సరయూః పుణ్యా సర్వదేవనమస్కృతా । ఇరావతీ నదీ తద్వ త్పితృతీర్థాధివాసినీ. 1{
యమునా దేవికా కాళీ చన్ద్రభాగా దృషద్వతీ । నదీ వేణుమతీ పుణ్యా పారా వేత్రవతీ తథా. 1'
పితౄణాం వల్లభా హ్యేతా శ్శ్రాద్ధే కోటిగుణా మతాః ।
జమ్బూమార్గం మహాపుణ్యం యత్ర మార్గో హి లక్ష్యతే. 2
అద్యాపి పితృతీర్థం త త్సర్వకామఫలప్రదమ్ । నీలకుణ్డ మితి ఖ్యాతం పితృతీర్థం ద్విజోత్తమాః. 2
తథా భద్రసరః పుణ్యం సరో మానస మేవ చ । మన్దాకినీ తథా చ్ఛోదా విపాశాథ సరస్వతీ. 2
పూర్వం మిత్రపదం తద్వ ద్వైద్యనాథం మహాఫలమ్। శి(క్షి)ప్రానదీ మహాకాలం తథా కాళఞ్జరం శుభమ్. 2
వంశోద్భేదం ఫలోద్భేదం గఙ్గోద్భేదం మహాఫలమ్ । భద్రాస్పదం విష్ణుపదం నర్మదాద్వార మేవ చ. 2
గయాపిణ్డప్రదానేన సమా న్యాహు ర్మహర్షయః । ఏతాని పితృతీర్థాని సర్వపాపహరాణి చ. 2

స్మరణా దపి లోకానాం కిము శ్రాద్ధకృతాం నృణామ్ । ఓఙ్కారం పితృతీర్థం చ కావేరీ కపిలోదకమ్. 26
సమ్భేద శ్చణ్డవేగాయా స్తథైవామరకణ్టకమ్ । కురుక్షేత్రా చ్ఛతగుణం తస్మి న్స్నానాదికం భవేత్. 27
శుక్లతీర్థం చ విఖ్యాతం తీర్థం సోమేశ్వరం పరమ్ । సర్వవ్యాధిహరం పుణ్యం శతకోటిఫలాధికమ్. 28
శ్రాద్ధదానే తథా బ్రహ్మ న్స్వాధ్యాయం జలసన్నిధౌ । కాయావరోహణం నామ తథా చర్మణ్వతీ నదీ. 29
గోమతీ చారుణా తద్వ త్తీర్థ మౌశనసం పరమ్ । భైరవం భృగుతుఙ్గం చ గౌరీతీర్థ మనుత్తమమ్. 30
తీర్థం వైనాయకం నామ వస్త్రేశ్వర మతః పరమ్ । తథా పాపహరం నామ పుణ్యా చ తపతీ నదీ. 31
భూతిదా చ పయోష్ణీ చ పయోష్ణీసఙ్గమ స్తథా । మహోమ్బోధిః పాటలా చ నాగతీర్థమవన్తికా. 32
తథా వేణునదీ పుణ్యా మహాకాలం తథైవచ । మహారుద్రం మహాలిఙ్గం దశార్ణాచ నదీ శుభా. 33
శతరుద్రా శతాహ్వా చ తథా విశ్వపదం పరమ్ । అఙ్గారవాహికా తద్వ న్నదౌ తౌ శోణఘర్ఘరౌ. 34
కాళికా చ నదీ పుణ్యా వితస్తాచ నదీ తథా । ఏతాని పితృతీర్థాని శస్యన్తే స్నానదానయోః. 35
శ్రాద్ధ మేతేషు యద్దత్తం తదనన్తఫలప్రదమ్ ।

కురుక్షేత్రము మహాపుణ్యకరము. అచట సర్వతీర్థములు చేరియుండును. సరయూనది పుణ్యకరమయినది. సర్వదేవతలకును అది పూజ్యమయినది ఇరావతీ- యమునా-దేవికా-కాశీ-చంద్రభాగా-దృషద్వతీ-వేణుమతీ-పారా-వేత్రవతీ నదులును పితరులకు ఇష్టములైనవి. ఇచట శ్రాద్ధము జరుపుటచేత కోటిరెట్లు ఫలితము గలుగును.

వేటికిని మహామార్గము కనబడు జంబూ మార్గము నీలకుండము భద్రసరము మానస సరస్సు అచ్ఛోదానది-మందాకిని-విపాశా (బియాస్)-సరస్వతీ-మిత్రపదము-వైద్యనాథము-శిప్రా (క్షిప్రా) నది-(ఉజ్జయినిదగ్గర) మహాకాలక్షేత్రము కాలంజరము (పర్వతము) వంశోద్భేదము ఫలోద్భేదము-గంగోద్భేదము- భద్రాస్పదము విష్ణుపదము నర్మదాద్వారము (నర్మదా సాగర సంగమము) ఈ ప్రదేశములందు పితరులకు పిండదానము చేసినచో గయలో పిండదానము చేసినట్లగును. ఈ పితృతీర్థములు స్మరణమాత్రముననే జనుల సర్వపాపముల హరించును. శ్రాద్ధమువలన కలుగు ఫల మింతయని చెప్పనేల? ఓంకారము పితృతీర్థము కావేరీ-కపిలా-చండవేగా నదీ సాగర సంగమము-అమరకంటకము-వీటియందు స్నానము కురుక్షేత్ర తీర్థములందు స్నానము కంటెను నూరురెట్లు ఎక్కువ ఫలము నిచ్చును. శుక్లతీర్థ సోమేశ్వర తీర్థములందు శ్రాద్ధము జరిపినను స్వాధ్యాయము చేసినను సర్వవ్యాధులును నశించును. ఇతర క్షేత్రములందు కంటె నూరుకోట్ల రెట్లు ఎక్కువ పుణ్యము కలుగును.

కాయావరోహణక్షేత్రము చర్మణ్వతీ గోమతి అరుణ-ఔశనస తీర్థము భైరవము భృగుతుంగము గౌరీతీర్థము వైనాయక తీర్థము వస్త్రేశ్వర తీర్థము పాపహరమను తీర్థము తపతీనది-భూతిదా-పయోష్ణీ-పయోష్ణీ సంగమము మహాంభోధి తీర్థము పాటలాతీర్థము నాగ తీర్థము అవంతికా-వేణునదీ-మహాకాలము-మహారుద్రము-మహాలింగము దశార్ణానది-శతరుద్రాశతాహ్వానదులు-విశ్వపదము-అంగారవాహికానది-శోణ-ఘర్ఘరము లను నదములు-కాళికా వితస్తానదులు-ఈ పితృ తీర్థములు స్నానదానములందు ప్రశస్తములు. ఈ తీర్థక్షేత్రములందు శ్రాద్ధము జరిపినచో అనంతపుణ్యము లభించును.

ద్రోణీ వటనదీ ధారా సరి ద్వీరనదీ తథా. 36
గోకర్ణం గజకర్ణంచ తథాచ పురుషోత్తమమ్ । ద్వారంచ కర్ణద్వారంచ కృష్ణతీర్థం సరస్వతీ. 37
నదీ మణిమతీ నామ తథాచ గిరికర్ణికా । ధూతపాపం తథా తీర్థం సముద్రో దక్షిణ స్తథా. 38
ఏతాని పితృతీర్థాని శ్రాద్ధ మానన్త్య మశ్నుతే । తీర్థం మేఖలకం నామ స్వయమేవ జనార్దనః. 39
యత్ర శార్ఙ్గధరో విష్ణు ర్మేఖలాయా మవస్థితః । తథా మన్దోదరీతీర్థం తీర్థం వంశనదీ తథా. 40
తథా చామరవాదంచ మహీ శాలనదీ తథా । చిత్రకూటంచ మర్కోటం తథా జన్మేశ్వరం మహత్. 41
అర్జునం త్రిపురంచైవ సిద్ధేశ్వర మతఃపరమ్ । శ్రీశైలం శాంకరం తీర్థం నారసింహ మతః పరమ్. 42

మహేన్ద్రంచ తథా పుణ్యం తథా శ్రీశఙ్కసంజ్ఞితమ్ । ఏతేష్వపి దద చ్ఛ్రాద్ధ మనన్తఫల మశ్నుతే. 43
దర్శనాదపి చైతాని సద్యః పాపహరాణి వై । తుఙ్గభద్రా నదీ పుణ్యా త్రిసన్ధ్యాతీర్థ ముత్తమమ్. 44
ఏతత్తీర్థం మహాపుణ్యం తథా భీమనదీ సరిత్ । భీమేశ్వరం కృష్ణవేణీ కావేరీ వఞ్జులా నదీ. 45
నదీ గోదావరీ పుణ్యా త్రిసన్ధ్యాతీర్థ ముత్తమమ్ । తీర్థం త్ర్యమ్బకం నామ సర్వతీర్థనమస్కృతమ్. 46
యత్రాస్తే భగవా నీశ స్స్వయమేవ త్రిలోచనః । శ్రాద్ధ మేతేషు తీర్థేషు దత్తం కోటిగుణం భవేత్. 47
స్మరణాదపి పాపాని నశ్యన్త్యాశు తథా ద్విజాః । శ్రీపర్ణా చ నదీ పుణ్యా దానతీర్థ మనుత్తమమ్. 48
తథా వంశనదీ ధారా శివా ధారా తథైవ చ । భావతీర్థం చ విఖ్యాతం పఞ్చతీర్థంచ శాశ్వతమ్. 49
పుణ్యం రామేశ్వరం తద్వ దేలాపుర మలమ్పురమ్ । అఙ్గభూతిచ విఖ్యాత మాపాణ్డర మలమ్బుకమ్. 50
నామ్నా ఽనోకేశ్వరం తద్వ దేకామ్రక మతఃపరమ్ । గోవర్ధనం హరిశ్చన్ద్రం సరః పుణ్యం పృథూదకమ్. 51
సహస్రాక్షం హిరణ్యాక్షం తథాచ కదళీ నదీ । రామచిత్రా ఽజితాచైవ తథా సౌమిత్రిసఙ్గమమ్. 52
ఇన్ద్రకీలం మహానాదం తథా చ ప్రియమాలకమ్ । ఏతాన్యపి సదా శ్రాద్ధప్రశస్తా న్యధికాని తు. 53
ఏతేషు సర్వదేవానాం సాన్నిధ్యం విదితం యతః । దానం చైతేషు సర్వేషు భవే త్కోటిప్సితాధికమ్. 54
బాహుదా చ నదీ పుణ్యా తథా సిద్ధవనం శుభమ్ । తీర్థం పాశుపతం నామ నదీ పర్వతికా తథా. 55
శ్రాద్ధ మేతేషు సర్వేషు దత్తం కోటిశతోత్తరమ్ ।

ద్రోణీనది-వటనది-ధారానది-పీరనది-గోకర్ణము-గజకర్ణము-పురుషోత్తమక్షేత్రము (జగన్నాధము)-ద్వారము-కర్ణద్వారము-కృష్ణతీర్థము-సరస్వతీ-మణిమతీ గిరికర్ణికానదులు ధూతపాప తీర్థము-దక్షిణ సముద్రము-ఈ పితృతీర్థము లందు చేసిన శ్రాద్ధము అనంతమగును. మేఖలకమను తీర్థమునందు సర్వాంతర్యామియు శార్ఙ్గధరుడునగు జనార్దనుడు స్వయముగా ఎల్లప్పుడు మేఖలయందు సంనిహితుడై యుండును. (మేఖల = పర్వతపు నిలువుటెత్తులో నడుమ భాగము) మండోదరీ తీర్థము వంశనదీ తీర్థము అమరనాధము మహీశాలనది-చిత్రకూటము మర్కోటము జన్మేశ్వరము అర్జునము త్రిపురము సిద్ధేశ్వరము శ్రీశైలము శాంకరతీర్థము నారసింహతీర్థము మహేంద్రము శ్రీశంకుక్షేత్రము-వీటిని దర్శించినను వెంటనే పాపములన్నియు నశించును. వీటియందు జరుపబడిన శ్రాద్ధము అనంత ఫలమును ఇచ్చును.

తుంగభద్రానది-త్రిసంధ్యాతీర్థము-భీమనదీ-భీమేశ్వర క్షేత్రము-కృష్ణవేణీ-కావేరి-వంజులానది గోదావరి త్ర్యంబక తీర్థము ఇవి ప్రశస్తములగు పితృప్రీతికర తీర్థములు. త్ర్యంబక తీర్థమునందు ఎల్లప్పుడును త్ర్యంబక శివుడు సంనిహితుడై యుండును. వీటిని స్మరించినను పాపములు వెంటనే నశించును. ఇచట చేసిన శ్రాద్ధము కోటిరెట్లు ఫలమును ఇచ్చును.

శ్రీపర్ణానది-వంశనదీ శివానది-భావతీర్థము-పంచతీర్థము రామేశ్వరము-ఏలాపురము అలంపురము అంగభూతి క్షేత్రము ఆపాణ్డురము-అలంబుకము అనోకేశ్వరము ఏకామ్రక్షేత్రము గోవర్ధనము హరిశ్చంద్రము-పృథూదక సరస్సు-సహస్రాక్షము హిరణ్యాక్షము కదళీనది-రామచిత్ర-అజితానది-సౌమిత్రిసంగమము-ఇంద్రకీలము మహానాదము ప్రియ మాలము-ఇవి శ్రాద్ధము జరుపుటకు ప్రశస్తములు-అధిక ఫలప్రదములు. వీటియందు దేవతలు ఎల్లప్పుడు సంనిహితులయి యుందురు. వీటియందు గానము చేసినచో కోరిన కోరికలు కోటిరెట్లుగా ఫలించును.

తథైవ పితృతీర్థంతు యత్ర గోదావరీ నదీ. 56
యుతా లిఙ్గసహస్రేణ సర్వాన్తరజలావహా । జామదగ్న్యస్య తీర్థంతు క్రమా దాయ రనుత్తమమ్. 57
ప్రతీకస్య భయా ద్భిన్నా యత్ర గోదావరీ నదీ । తత్తీర్థం హవ్యకవ్యానా మప్సరోయుగసంజ్ఞితమ్. 58
శ్రాద్ధాగ్నికార్యదానేషు తథా కోటిశతాధికమ్ । తథా సహస్రలిఙ్గంచ రాఘవేశ్వర ముత్తమమ్. 59
ఇన్ద్రఫేనా నదీ పుణ్యా యత్రేన్ద్రః పతితం పురా । నిహత్య నముచిం శక్ర స్తపసా స్వర్గ మాప్తవాన్. 60
తత్ర దత్తం నరై శ్శ్రాద్ధ మనన్తఫలదం భవేత్ । తీర్థంతు పుష్కరం నామ సాలగ్రామం తథైవచ. 61

శోణపాశశ్చ విఖ్యాతో యత్ర వైశ్వానరాలయమ్ । తీర్థం సారస్వతం నామ స్వామితీర్థం తథైవచ. 62
మలందరా నదీ పుణ్యా కౌశికీ చన్ద్రికా తథా । విదర్భాచ తథా వైరా పయోష్ణీ ప్రాఙ్ముఖా పురా. 63
కావేరీ చోత్తరా కార్యా తథా జాలన్ధరో గిరిః । ఏతేషు శ్రాద్ధతీర్థేషు శ్రాద్ధ మానన్త్య మశ్నుతే. 64
లోహదణ్డం తథా తీర్థం చిత్రకూట స్తథైవచ । విన్ధ్య యోగేశ్వరం గఙ్గా తథా నద్యా స్తటం శుభమ్. 65
కుబ్జామ్రకంతు తత్తీర్థ మూర్వశీపుళినం తథా । సంసారమోచనం తీర్థం తథైవ ఋణమోచనమ్. 66
ఏతేష్వపిచ తీర్థేషు శ్రాద్ధ మానన్త్య మశ్నుతే । అట్టహాసం తథా తీర్థం గౌతమేశ్వర మేవచ. 67
తథా వసిష్ఠతీర్థం తు హారీతంతు తతఃపరమ్ । బ్రహ్మావర్తం కుశావర్తం హయతీర్థం తథైవ చ. 68
పిణ్డారకంచ విఖ్యాతం శఙ్ఖోద్ధారం తథైవచ । ఘంటేశ్వరం బిల్వకంచ నీలపర్వత మేవచ. 69
సుగ్రీవం ధరణీతీర్థం రామతీర్థం తథైవచ । అశ్వతీర్థంచ విఖ్యాత మానన్త్యం శ్రాద్ధదానయోః. 70
తీర్థం వేదశిరో నామ తథైవౌఘవతీ నదీ । తీర్థం చ వసుధం నామ ఛాగలాణ్డం తథైవచ. 71
ఏషు శ్రాద్ధప్రదాతారః ప్రయాన్తి పరమం పదమ్ । తథాచ బదరీతీర్థం గణతీర్థం తథైవచ. 72
జయన్తం విజయంచైవ శుక్రతీర్థం తథైవచ । శ్రీపతేశ్చ తథా తీర్థం తీర్థం రైవతకం తథా. 73
తథైవ శారదా తీర్థం భద్రకాళేశ్వరం తథా । వైకుణ్ఠతీర్థంచ పరం భీమేశ్వర మథాపివా. 74
ఏషు శ్రాద్ధప్రదాతారః ప్రయాన్తి పరమాం గతిమ్ । తీర్థం మాతృగృహం నామ కరవీరం తథైవచ. 75
జలేశ్వరం చ విఖ్యాతం గౌరీశిఖర మేవచ । లకుటీశస్య తీర్థంతు కర్దమాలం తథైవచ. 76
దణ్డిముణ్డికరం తద్వ త్పుణ్డరీకపురం తథా । సప్తగోదావరం తీర్థం సర్వతీర్థేశ్వరేశ్వరమ్. 77
తత్ర శ్రాద్ధం ప్రదాతవ్య మనన్తఫల మీప్సుభిః । ఏష తూద్దేశతః ప్రోక్త స్తీర్థానాం సఙ్గమో మయా. 78
వాగీశోపి న శక్నోతి గదితుం కిము మానవః । సత్యం తీర్థం దయా తీర్థం తీర్థ మిన్ద్రియనిగ్రహమ్. 79
వర్ణాశ్రమాణాం గేహేపి తీర్థం సమ ముదాహృతమ్ । ఏషు తీర్థేషుయచ్ఛ్రాద్ధం తత్కోటిగుణ మిష్యతే. 80
యస్మా త్తస్మా త్ప్రయత్నేన తీర్థశ్రాద్ధం సమాచరేత్ ।

గోదావరీ నదీ సమీపమునందలి పితృతీర్థమను తీర్థము చాల ప్రశస్తమయినది. ఇచ్చట గోదావరి నది అన్ని చోటులందు కంటె చాల లోతుగా ప్రవహించుచు వేయి శివలింగములతో కూడి ఉన్నది. ఈ తీర్థమునకే జామదగ్న్య తీర్థము అని నామాంతరము; ఇది శ్రాద్ధ కర్తలకు సర్వోత్తమమగు దీర్ఘాయువును ఇచ్చును. ఇచ్చటనే గోదావరీ నది ప్రతీకురమ ఋషివలన భయముచే చీలినది. ఇది దేవతలనుద్దేశించి హవ్యములను ఇచ్చుటకును పితృ దేవతల నుద్దేశించి కవ్యములను ఇచ్చుటకును కూడ ప్రశస్తమయినది. అందుచే దీనికి అప్సరోయుగ తీర్థము అని పేరు, ఇచట శ్రాద్ధములు కాని అగ్ని కార్యములు కాని (యజ్ఞ హోమాదికము కాని) దానములు కాని చేసినచో నూరు కోట్ల రెట్ల పుణ్యము లభించును.

సహస్రప లింగ క్షేత్రమును రాఘవేశ్వర క్షేత్రమును పితృ కార్యములకు ప్రశస్తములు. ఇంద్రసేనా నది పితృ శ్రాద్ధము విషయమున పుణ్యకరము. పూర్వము నముచి దానవుని చంపినందున పతితుడైన ఇంద్రుడు ఇచట తపస్సాచరించి పుణ్యము సంపాదించి స్వర్గమును పొంద గలిగెను. ఇచ్చట మానవులు శ్రాద్ధము జరిపినచో అనంత ఫలము కలుగును.

పుష్కర తీర్థము సాల గ్రామ తీర్థము శోణ పాదము వైశ్వానరుడను పేరుగల అగ్ని విశేషమునకు స్థానమగు వైశ్వానరాలయ తీర్థమును దాని సమీపమందలి సారస్వత తీర్థము స్వామి తీర్థము మలందరానదీ కౌశికినది చంద్రికానది విదర్భానది వైరానది పూర్వము ప్రాఙ్ముఖ ప్రవాహముతో నుండిన పయోష్ణినది ఉత్తర వాహినిగా నున్న కావేరి జాలంధర పర్వతము - ఈ ప్రదేశము లందు జరిపిన పితృ శ్రాద్ధము అనంత ఫలము నిచ్చును. లోహదండ తీర్థము చిత్రకూటము

## పితృప్రీతికర దేశకాలములు-22అ.

వింధ్య-యోగేశ్వరము గంగానదీ తటము కుబ్జామ్రకము ఊర్వశీ పులినము సంసార మోచన తీర్థము ఋణమోచన తీర్థము అశ్వశిరము గౌతమేశ్వరము వసిష్ఠ తీర్థము హారీతము బ్రహ్మావర్తము కుశావర్తము హయతీర్థము పిండారకము శంఖోద్ధారము ఘంటేశ్వరము బిల్వకము నీల పర్వతము సుగ్రీవము ధరణీతీర్థము రామతీర్థము అశ్వతీర్థము వేదశిర స్తీర్థము ఉద్వవతీనది వసుదతీర్థము ఛాగలాండము బదరీతీర్థము గణతీర్థము జయంతము విజయము శుక్రతీర్థము శ్రీపతితీర్థము రైవతకతీర్థము శారదాతీర్థము భద్రకాళేశ్వరము వైకుంఠతీర్థము భీమేశ్వరము మాతృగృహతీర్థము కరవీరతీర్థము జలేశ్వరము గౌరీ శిఖరము లకులీశము కర్దమాలము దండిముండికరము పుండరీకపురము సప్తగోదావరము - ఇవన్నియు పితృ శ్రాద్ధమునకు ప్రశస్తములగు తీర్థరాజములు. పేరులు మాత్రమే గ్రహించి (వాటి మహిమములను విస్తరింపక) కొన్ని కొన్ని పితృ తీర్థములను మీకు తెలిపితిని. అన్నిటిని సంపూర్ణముగా తెలుపుట బ్రహ్మకు కూడ సాధ్యము కాదు.

ముఖ్యముగా సత్యము దయ ఇంద్రియ నిగ్రహము - ఇవి అత్యుత్తమములగు తీర్థములు. ఇవి కలిగి తమ వర్ణాశ్రమ ధర్మములను అనుసరించి నడచుకొను వారికి ఇంటియందే పితృ తీర్థస్నానము ఉండును.

ఏమయినను ఈ చెప్పిన తీర్థములందు శ్రాద్ధము చేసినచో కోటిరెట్లు పుణ్యము కలుగును. కనుక సర్వ విధముల ప్రయత్నించి తీర్థ శ్రాద్ధమును జరుపవలయును.

### శ్రాద్ధకాల నిర్ణయః.

ప్రాతఃకాలే ముహూర్తాం స్త్రీ న్పూర్వాహ్ణో తావదేవతు. 81
మధ్యాహ్న స్త్రిముహూర్త స్స్యా దపరాహ్ణ స్తతఃపరమ్ ।
సాయాహ్న స్త్రిముహూర్త స్స్యా చ్ఛ్రాద్ధం తత్ర న కారయేత్. 82
రాక్షసీ నామ సా హోరా గర్హితా సర్వకర్మసు । అహ్నో ముహూర్తా విఖ్యాతా దశపఞ్చ సర్వదా. 83
తత్రాష్టమో ముహూర్తో య స్స కాలః కుతపః స్మృతః। మధ్యాహ్నే సర్వదా యస్మా న్మన్దీభవతి భాస్కరః. 84
తస్మా దనన్తఫలద స్తదారమ్భో భవిష్యతి। మధ్యాహ్నః ఖడ్గపాత్రం తు తథా నేపాలకమ్బళః. 85
దీపో దర్భా స్తిలా గావో దౌహిత్ర శ్చాష్టమః స్మృతః । పాపం కుత్సిత మిత్యాహు స్తస్య సన్తాపకారిణః. 86
అష్టా వేతే యత స్తస్మా త్కుతపా ఇతి విశ్రుతాః ।
ఊర్ధ్వం ముహూర్తా త్కుతపా ద్య న్ముహూర్తచతుష్టయమ్. 87
ముహూర్తపఞ్చకం చైతా స్స్వధాభవన మిష్యతే । విష్ణో ర్దేహసముద్భూతాః కుశాః కృష్ణా స్తిలా స్తథా. 88
శ్రాద్ధస్య రక్షణాయైమే తత్రాహు ర్దివి దేవతాః । తిలోదకాంజలి ర్దేయో జలస్థై స్తీర్థవాసిభిః. 89
సదర్భహస్తే నైకేన శ్రాద్ధ మేవ మిష్యతే । పుణ్యం పవిత్ర మాయుష్యం సర్వపాపవినాశనమ్. 90
పురా మత్స్యేన కథితం తీర్థశ్రాద్ధానుకీర్తనమ్ ।
శృణోతి యః పఠేద్వాపి శ్రీమా న్సంజాయతే నరః. 91
శ్రాద్ధకాలేచ కర్తవ్యం తథా తీర్థనివాసిభిః । సర్వపాపోపశాన్త్యర్థ మలక్ష్మీనాశనంపరమ్. 92
ఇదం పవిత్రం యశసాం నిదాన మిదం మహాపాపహరం చ పుంసామ్ ।
బ్రహ్మార్కరుద్రై రభిపూజితంచ శ్రాద్ధస్య మాహాత్మ్య ముశన్తి తద్జ్ఞాః. 93

ఇతి శ్రీమత్స్య మహాపురాణే మత్స్యమనుసంవాదే శ్రాద్ధకల్పే పితృప్రీతికర
తీర్థకాలకథనం నామ ద్వావింశతితమోఽధ్యాయః.

పగటి కాలము మొత్తము పదునైదు ముహూర్తము లగును. వరుసగా ప్రాతఃకాలము పూర్వాహ్ణము మధ్యాహ్నము అపరాహ్ణము సాయాహ్నము - ఇవి ఒక్కొక్కటి మూడేసి ముహూర్తములు. సాయాహ్నమునకు రాక్షసీ హోరా అనియు పేరున్నది. ఆ సాయాహ్నకాలమునందు శ్రాద్ధము జరుపరాదు. ఏలయన రాక్షసీహోరా ఏ కర్మములకును పనికిరాదు. వీనిలో ఎనిమిదవ ముహూర్తమునకు కుతప కాలమని శాస్త్రమున పేరు. మధ్యాహ్న కాలమున ఏ సమయము నుండి రవి చల్లదనము పొందునో అప్పటినుండి సాయాహ్న మారంభమగు లోపల శ్రాద్ధము జరిపిన వారికి రవి అనంత ఫలము ఇచ్చును.

ఇదియును కాక - మధ్యాహ్నకాలము ఖడ్గము నుంచు పాత్రము (ఒర) నేపాళ దేశమున నేసిన కంబళము దీపము దర్భలు తిలలు గోవులు దౌహిత్రుడు - ఈ ఎనిమిదింటికిని కుతపము అని పేరు. కుతపము అను శబ్దము నందలి కు - అనగా కుత్సితము - పాపము అని అర్థము. తపము అనగా దానిని తపింప చేయునది.

ఇదియును కాక పగటి ముహూర్తములలో ఎనిమిదవది అగు కుతప ముహూర్తమును దాని తరువాత వచ్చు నాలుగు ముహూర్తములును-మొత్తము ఈ అయిదు ముహూర్తములకు స్వధా భవనములు అని వ్యవహారము.

దర్భలును నల్లని నువ్వులును విష్ణు శరీరము నుండి ఉత్పన్నమయినవి. శ్రాద్ధము శుభ ఫలమును ఈయవలెననినచో శ్రాద్ధమున వీనిని వినియోగించవలయును. అని ద్యులోక నివాసులగు పితృ దేవతలు స్వయముగా చెప్పిరి. కనుక శ్రాద్ధము లందును చేతియందు (ఒక చేతిలోనే)దర్భలు ధరించి తిలోదకమును పితరుల నుద్దేశించి ఈయవలెను.

పూర్వము మత్స్య రూపుడగు నారాయణుడు మనువునకు చెప్పిన శ్రాద్ధాను కీర్తనము పుణ్యకరము - పవిత్రము- ఆయుః వర్ధిదము - సర్వ పాపములను నశింపజేయునది. దీనిని చదివినను వినినను నరుడు శ్రీ మంతుడగును. తీర్థ శ్రాద్ధ సమయమున దీనిని తప్పక చదువుటయో వినుటయో చేయవలెను. దాని వలన అశుభము - నశించును. ఇది పవిత్ర మయినది. కీర్తికలుగుటకు మూల కారణ మయినది. మహా పాప హరము. ఈ శ్రాద్ధ మాహాత్మ్యము బ్రహ్మార్కరుద్రులు కూడ ఆదరించునది. అని దాని తత్త్వము నెరిగిన వారు చెప్పుచున్నారు.

ఇది శ్రీ మత్స్యమహా పురాణమున మత్స్యమను సంవాదమున శ్రాద్ధ యోగ్య
దేశ కాలాను కీర్తనము అను ఇరువది రెండవ అధ్యాయము.

## త్రియోవింశోఽధ్యాయః.

## చన్ద్ర వంశవర్ణనప్రారమ్భశ్చన్ద్రోత్పత్తిశ్చ.

ఋషయః: సోమః పితౄణా మధిపః కథం శాస్త్రవిశారద। తద్వంశ్యా యే చ రాజానో బభూవుః కీర్తివర్ధనాః.
సూతః: ఆదిష్టో బ్రహ్మణా పూర్వ మత్రిః స్సర్గవిధౌ పురా ।
అనుత్తమం నామ తప స్సృష్ట్యర్థం తప్తవా న్ప్రభుః. 2
యదానన్దకరం బ్రహ్మ జగతః క్లేశనాశనమ్ । బ్రహ్మవిష్ణ్వర్కరుద్రాణా మభ్యన్తర మతీన్ద్రియమ్. 3
శాన్తిక్బ్ చ్ఛాన్తమనసాం త దత్రినయనే స్థితమ్ । మహాన్తం తపసో విప్రాః పరమానన్దకారకమ్. 4
కస్మా దుమాపతి స్సార్ధ ముమయా తదధిష్ఠితమ్ ।
తద్దృష్ట్వా చాష్టమాంశేన తస్మా త్సోమోఽభవ చ్ఛిశుః. 5
అథ సుస్రావ నేత్రాభ్యాం త త్తేజ శ్చామ్బుసమ్భవమ్ ।
దీపయ న్విశ్వ మఖిలం జ్యోత్స్నయా సచరాచరమ్. 6
తద్దిశో జగృహుర్ధామ స్త్రీరూపేణ సుతేచ్ఛయా । గర్భో భూత్వోదరే తాసా మాస్థిత శ్చాయుతత్రయమ్. 7
ఆశాస్తం ముముచు ర్గర్భ మశక్తా ధారణే తతః । సమాదాయాథ తం గర్భ మేకీకృత్య చతుర్ముఖః. 8

యువాన మకరో ద్బ్రహ్మ సర్వాయుధధరం నరమ్ । స్యన్దనేఽథ సహస్రాశ్వే దేవశక్తిమయే ప్రభుః. 9
ఆరోప్య లోక మనయ దాత్మన స్స పితామహః । తతో బ్రహ్మర్షిభిః ప్రోక్త మస్మత్స్వామీ భవత్వయమ్.
ఋషిభి ర్దేవగన్ధర్వై రోషధీభి స్తథైవచ । తుష్టువు స్సోమదైవత్యైర్బ్రహ్మాద్యా మన్త్రసజ్ఞ్రహైః. 11
స్తూయమానస్య తస్యాభూ దధికో ధామసఞ్చయః । తేజోవితానా దభవ ద్భువి దివ్యౌషధీగణః. 12
తద్దీప్తి రధికా తస్మా ద్రాత్రౌ భవతి సర్వదా । తదోషధీశ స్సోమోఽభూ ద్ద్విజేశశ్చ నిగద్యతే. 13
వేదధామరసశ్చాపి యదిదం చన్ద్రమణ్డలమ్ । క్షీయతే వర్ధితం చైవ శుక్లే కృష్ణేచ సర్వదా. 14
వింశతిశ్చ తథా సప్త దక్షః ప్రాచేతసో దదౌ । రూపలావణ్యసంయుక్తా స్తస్మై కన్యా స్సువర్చసః. 15

## ఇరువది మూడవ అధ్యాయము

## చంద్రవంశ వర్ణనము-చంద్రోత్పత్తి మొదలగు వృత్తాంతములు.

ఋషులు సూతునితో ఇట్లు పలికిరి: సూతా: మీరు సర్వ పురాణ శాస్త్రములను బాగుగా ఎరిగిన వారు. సోముడు పితరులకు అధిపతి ఎట్లు అయ్యెను? అతని వంశమునందు లోకమున తమ కీర్తిని వృద్ధి చేసికొన గలిగిన రాజులు ఎవరెవరు జన్మించిరి?

సూతుడు ఇట్లు చెప్ప నారంభించెను: బ్రహ్మ మానస పుత్రుడును ప్రజా పతియును అగు అత్రి మిగుల సమర్థుడు. అతనిని బ్రహ్మ ఆదేశించగా అతడు లోక సృష్టిని కొనసాగించుటకై సంకల్పించి సర్వోత్తమమగు తపస్సాచరించెను.

పరబ్రహ్మ తత్త్వము లోకముల కన్నిటికిని క్లేశమును నశింపజేయునది. ఆనందమును కలిగించునది. బ్రహ్మ విష్ణు రవి రుద్రులకును అంతరంగ రూపమయినది. ఇంద్రియములకు గోచరించనిది. శాంతమగు మనస్సు కల వారిని శాంతి నొందించునది: గొప్ప వాటికంటెను గొప్పది. తపస్సు వలన కలిగెడి పరమానందమును కలిగించునది. ఇట్టి తత్త్వము అత్రి మహాముని తపోమహిమచే అతని కన్నుల యందే నిలిచియుండెను.

దానిని చూచి ఉమాపతి యగు శివుడు ఉమతో కూడి జలమునుండి సంభవమయిన తన ఎనిమిదవ అంశముచే ఆ అత్రి నేత్రమును ఆశ్రయించెను. తత్ప్రభావమున కలిగిన ఆనంద బాష్పముల వెంట జలములనుండి పుట్టిన ఆ శివుని అష్ట మాంశమగు తేజస్సు అత్రి మహాముని నేత్రములనుండి స్రవించెను. దాని నుండియే సోముడు అను శిశువు ఏర్పడెను. ఆ శిశువు తన వెన్నెలలచే చరాచర ప్రాణులతో నిండిన సమస్త విశ్వమును ప్రకాశింప జేయుచుండెను.

దిక్కులు తాము పుత్రుని కనగోరి స్త్రీ రూపమును ధరించి ఆ తేజస్సును తమయందు నిలుపుకొనెను. అది గర్భము అయి వారి ఉదరముల యందు మువ్వది వేల సంవత్సరముల పాటు ఉండెను. అంతట దిక్కులు ఆ గర్భమును ధరించలేక విడిచి వేసెను. చతుర్ముఖుడగు బ్రహ్మ అంతవరకు దిక్కుల యందు వ్యాపించియున్న ఆ తేజో రూప గర్భమును ఒకటిగా చేసి సర్వాయుధ ధరుడును యువకుడునగు నరునిగా రూపొందించెను. తరువాత మహా శక్తి శాలి యగు బ్రహ్మ దేవశక్తితో ఏర్పడి వేయి అశ్వములచే లాగబడు రథమునందు ఎక్కించి అతనిని తన లోకమునకు తీసి కొని పోయెను. అంతట ఋషులును బ్రహ్మర్షులును దేవతాత్మకములగు ఓషధులును దేవ గంధర్వులును ఈ యువకుడు మాకు ప్రభువగు గాక ! అని కోరుకొనిరి. బ్రహ్మ మొదలగు అచటి వారందరును సోమదేవతాకములగు మంత్ర సము దాయములతో అతనిని స్తోత్రము చేసిరి. వారట్లు స్తోత్రము చేసిన ప్రభావమున అతని తేజస్సమూహము ఇంకను అధిక మయ్యెను. ఆ తేజోరాశి నుండి భూలోకమునందలి దివ్యములగు ఓషధుల సముదాయము ఉత్పత్తి చెందెను. అందువలననే అతని నుండి ఏర్పడు దీప్తి (ప్రకాశము) రాత్రివేళయందు అధికమగుచుండును. ఇట్లు నాటి నుండి నేటి వరకును జరుగు చునేయున్నది. అందువలననే సోముడు ఓషధులకు అధిపతియనియు ద్విజులకు (ద్విజములకు-పక్షులకు) అధిపతియనియు వ్యవహరింపబడుచున్నాడు.

ఈ కారణము చేత చంద్రమండలము ఈ హేతువులచే వేదములకు స్థానమును రసాత్మకమును ఐ యున్నది. ఇది నిరంతరమును శుక్లపక్షమున వృద్ధి పొందుచు కృష్ణపక్షమున క్షీణించుచు ఉండును.

అనంతరము దక్షప్రజాపతి రూపమును లావణ్యమును కలవారును శోభనమగు వర్చస్సు కలవారును అగు తన ఇరువది ఏడుమంది కన్యలను సోమునకు ఇచ్చెను.

తతః పద్మసహస్రాణాం సహస్రాణి దశైవతు । తపశ్చచార శీతాంశు ర్విష్ణుధ్యానైకతత్పరః. 16
తత స్తుష్టస్తు భగవాం స్తస్మై నారాయణో హరిః । వరం వృణీష్వ చోవాచ పరమాత్మా జనార్దనః. 17
తతః ప్రావ్య వరం సోమ శ్శక్రలోకే ప్రజా మ్యహమ్ । ప్రత్యక్ష మేవ భోక్తారో భవన్తు మమ మన్దిరే. 18
రాజసూయే సురగణా బ్రహ్మాద్యా స్సన్తు మే ద్విజాః । రక్షఃపాల శ్శివోఽస్మాక మాస్తాం శూలధరో హరః.
తథేత్యుక్త స్సమాజగ్మ రాజసూయే తు విష్ణునా ।
హోత్రధ్వర్యూ గురుభృగూ హ్యుద్గాతాఽభూ చ్చతుర్ముఖః. 20
బ్రహ్మత్వ మగమ త్తస్య ఉపద్రష్టా హరి స్స్వయమ్ । సదస్యా స్సనకాద్యాస్తు రాజసూయవిధౌ స్మృతాః.
చమసాధ్వర్యవ స్తత్ర విశ్వేదేవా దశైవతు । త్రైలోక్యం దక్షిణా తేన ఋత్విగ్భ్యః ప్రతిపాదితమ్. 22
తత స్సమాప్తేఽవభృథే తద్రూపాలోకనేచ్ఛవః । కామబాణాభితప్తాంగ్యో నవ దేవ్యః ప్రపేదిరే॥ 23
లక్ష్మీ ర్నారాయణం త్యక్త్వా సినీవాలీచ కర్దమమ్। ద్యుతి ర్విభావసుం తద్వ త్పుష్టి ర్ధాతార మవ్యయమ్. 24
ప్రభా ప్రభాకరం త్యక్త్వా హవిష్మన్తం కుహూః పతిమ్ । కీర్తి ర్జయన్తం భర్తారం వసు ర్మారీచికశ్యపమ్. 25
ధృతి స్త్యక్త్వా పతిం దేవీ సోమమే వాభజం స్తదా । స్వకీయా ఇవ సోమోపి కామయామాస తా స్తదా. 26
ఏవం కృతాపచారస్య తాసాం భర్తృగణ స్తదా । న శశాకాపచారాయ శాపై శ్శస్త్రాదిభిః పునః. 27
తథాప్యరాజత విభు ర్దశధా భావయ న్దిశః । సోమః ప్రాప్యాథ దుష్ప్రాప మైశ్వర్య మృషిసత్కృతమ్. 28
సురలోకైకనాథత్వ మాప్త స్స తపసా తదా ।

తరువాత చంద్రుడు విష్ణుధ్యానైక తత్పరుడయి దశ సహస్ర పద్మ సహస్ర సంవత్సరములు ($10\times1000\times1000\times100000000$) తపమాచరించెను. నారాయణుడగు (సమస్త జీవులకు ఆశ్రయమగు) హరిభగవానుడు అతని తపస్సు విషయమున సంతుష్టి చెందెను. పరమాత్ముడగు జనార్దనుడు (జనులచే ప్రార్థింపబడు దేవుడు) వరము కోరు కొమ్మని చంద్రునితో ననెను. విష్ణుని వలన వరదానమును పొందిన చంద్రుడు ఆ భగవానుని ఇట్లు కోరెను. నేను ఇంద్ర లోకమునకును వెళ్ళగలుగ వలయును. (ఇంద్ర లోకమును జయించగలుగ వలయును.) నేను జరుపు రాజసూయ యాగమున దేవతలు అందరును ప్రత్యక్షముగా ఆ యజ్ఞమున ఇచ్చు హవిస్సులను భుజించవలయును. బ్రహ్మ మొదలగు వారు నా యజ్ఞమున ఋత్విక్కులగు బ్రాహ్మణులుగా కావలయును. లోకముల లయింపజేయగల దేవుడును శూలధారియునగు శివుడు ఆ యజ్ఞమున మాకు యాగ రక్షకుడై యుండవలయును. అని కోరగా విష్ణువు సరే యనెను.

చంద్రునకు విష్ణువు ఇచ్చిన వరప్రభావమున అతని రాజసూయయాగములో గురుడు హోతగా భృగువు అధ్వర్యుడుగా బ్రహ్మదేవుడు ఉద్గాతగా స్వయముగా హరి ఉపద్రష్టయగు బ్రహ్మగా సనకసనందనాది మహర్షులు సదస్యులుగా విశ్వేదేవతలు పది మందియు చమసాధ్వర్యువులుగా ఉండిరి. అతడు మూడు లోకముల రాజ్యమును ఋత్విక్కులకు దక్షిణగా దానము చేసెను. ఇట్లు యజ్ఞము ముగిసెను. అవభృథ స్నానము జరిగెను. ఆ సమయమున కాముని బాణములచే తమ శరీరములు తపింపగా తొమ్మిది మంది దేవులు అతనిని చూడగోరి వచ్చిరి. వారు ఎవరనగా-లక్ష్మీదేవి నారాయణుని-సినీవాలి అనునామె కర్దముని-ద్యుతి అనునామె విభావసుడను సూర్యుని-తుష్టి అనునామె అవ్యయుడగు ధాతను-ప్రభా అనునామె ప్రభాకరుడను సూర్యుని-కుహూ అనునామె తన పతియగు హవిష్మంతుని-కీర్తి అనునామె తన పతియగు జయంతుని-వసువను నామె తన భర్తయగు మారీచ (మరీచి కుమారుడగు) కశ్యపుని-ధృతి అనునామె తన పతియగు నంది అనునతనిని-విడిచి

సోముని ఆశ్రయించిరి సోముడును వారిని అందరను స్వకీయలనుగా (తాను ధర్మానుసారము పెండ్లాడిన భార్యలను వలె) స్వీకరించెను.

ఆయా దేవుల భర్తలు చంద్రుడు తమకు చేసిన అపచారమునకు ప్రతీకారముగా అతనిని శపించికాని అతనిపై శస్త్రాస్త్రములు ప్రయోగించికాని అతనికి అపచారము ఏమియు చేయజాలకపోయిరి. వారు తనకు ఎన్ని విధముల హాని కలిగింప యత్నించినను శక్తి సంపన్నుడగు ఆ చంద్రుడు పది దిక్కులను పది విధములుగా ప్రకాశింపచేయుచు వెలిగెను. ఇట్లు ఆ చంద్రుడు తన తపః ప్రభావముచేత ఋషులు కూడ ఆదరించెడు ఐశ్వర్యమును దేవలోకమునకు ఏకైకాధిపతిత్వమును పొందెను.

### చన్ద్రకృతతారాపహరణమ్.

కదాచి దుద్యానగతా మపశ్య దనేకపుష్పాభరణోపశోభామ్. 29
బృహన్నితమ్బ స్తనభారనమ్రాం పుష్పావతంసా మతిదుర్మదాంగీమ్ ।
భార్యాంచ తాం దేవగురో రనఙ్గబాణాభిరామాయతచారునేత్రామ్. 30
తారాం స తారాధిపతిః స్మరార్తః కేశేషు జగ్రాహ వివిక్తభూమౌ ।
సాపి స్మరార్తా సహ తేన రేమే తద్రూపకాన్త్యాహృతమానసైవ. 31
చిరం విహృత్యాథ జగామ తారాం విధు ర్గృహీత్వా స్వగృహం తతోఽపి ।
న తృప్తి రాసీ త్స్వగృహేఽపి తస్య తారానురక్తస్య సుఖాగమేషు. 32
బృహస్పతి స్తద్విరహాగ్నిదగ్ధ స్తద్ధ్యానదృష్ట్యేకమనా బభూవ ।
శశాక శాపం న చ దాతుమస్మై న మన్త్రశస్త్రాగ్నివిషైశ్చ తస్మై. 33
తస్యాపకర్తుం వివిధై రుపాయై ర్నైవాపచారైరపి వాగధీశః ।
స యాచయామాస తతస్తు దైన్యా త్సోమం స్వభార్యార్థ మనఙ్గతప్తః. 34
స యాచ్యమానోఽపి దదౌ న తారాం బృహస్పతే స్తత్సుఖపాశబద్ధః ।
మహేశ్వరేణాథ చతుర్ముఖేన సాధ్యై ర్మరుద్భి స్సహ లోకపాలైః. 35
దదౌ యదా తాం న కథఞ్చి దిన్దు స్తదా శివః క్రోధపరో బభూవ ।
యో వామదేవః ప్రథితః పృథివ్యా మనేకముద్రార్చితపాదపద్మః. 36

### పినాకిసోమయోర్యుద్ధమ్.

తత స్సశిష్యో గిరిశః పినాకీ బృహస్పతిస్నేహవశానుబద్ధః ।
ధనుర్గృహీత్వాఽజగవం పురారి ర్జగామ భూతేశ్వరసిద్ధజుష్టః. 37
యుద్ధాయ సోమేన విశేషదీప్త స్తృతీయనేత్రానలభీమవక్త్రః ।
సహైవ జగ్ము స్సగణేశకోట్యా వింశచ్చతుష్షష్టి రథాశ్వయుక్తాః. 38
యక్షేశ్వరః కోటి శతై రనేకై ర్యుతోఽన్వగా త్స్యన్దనసంస్థితానామ్ ।
వైతాళయక్షోరగకిన్నరాణాం పద్మేన చైకేన తథార్బుదేన. 39
లక్షై స్త్రిభి ర్ద్వాదశభీ రథానాం సోమోఽప్యగా త్తత్ర వివృద్ధమన్యుః ।
నక్షత్ర దైత్యాసురసైన్యయుక్త శ్శనైశ్చరాఙ్గారకవృద్ధతేజాః. 40
జగ్ము ర్భయం సప్త తథైవ లోకా శ్చేలుశ్చలద్ద్వీపసముద్రగర్భాః ।
స సోమమేవాభ్యగమ త్పినాకీ గృహీతదీప్తాస్త్రవిశాలవహ్నిః. 41

తథాభవ ద్భీషణభీమసోమ సైన్యద్వయస్యాపి మహాహవోఽసౌ ।
అశేషసత్త్వక్షయకృత్ప్రవృద్ధ స్తీక్ష్ణాయుధాస్త్రజ్వలనైకరూపః. 42
శస్త్రైస్తథాన్యోన్య మశేషసైన్యం క్షయోగమ త్తత్క్షణముగ్రతీక్ష్ణైః ।
పతన్తి శస్త్రాణి తథా బలాని స్వర్భూమిపాతాళతలం దహన్తి. 43
రుద్రః కోపా ద్బ్రహ్మశీర్షం ముమోచ సోమోపి సోమాస్త్ర మమోఘవీర్యమ్ ।
తయో ర్నిపాతేనచ దివ్యభూమ్యో రథాన్తరిక్షస్యచ భీతిరాసీత్. 44
తతస్తు యుద్ధే జగతః క్షయాయ ప్రవర్ధమానేచ పితామహోపి ।
అన్తఃప్రవిశ్యాథ కథంకథఞ్చి న్నివారయామాస సురై స్సహైవ. 45
అకారణం కిం క్షయకృజ్జనానాం సోమ త్వయాపీద మకా ర్యకార్యమ్ ।
యస్మా త్పరస్త్రీహరణాయ సోమ త్వయా కృతం యుద్ధ మిదం నిభీషమ్. 46
పాపగ్రహ స్త్వం భవితా జనేషు శాన్తోఽప్యలం నూన మభీప్సితంతే ।
భార్యా మిమా మర్పయ వాక్పతే స్త్వం న చావమానోఽస్తి పరస్వహారే. 47
సూతః:తథేతి చోవాచ హిమాంశుమాలీ యుద్ధా దపాక్రామ దతః ప్రశాన్తః ।
బృహస్పతి స్తామపి గృహ్య తారాం హృష్టో జగామ స్వగృహం సరుద్రః. 48

ఇతి శ్రీమత్స్యమహాపురాణే మత్స్యమనుసంవాదే చన్ద్రవంశానువర్ణనే
చన్ద్రోత్పత్త్యాదికథనం నామ త్రయోవింశతితమోఽధ్యాయః.

## చంద్రుడు తార నపహరించుట

ఒకమారు చంద్రునకు ఉద్యానవనములో దేవగురువగు బృహస్పతికి భార్యయగు తార కనబడెను. ఆమె అనేకములగు పుష్పములతోను ఆభరణములతోను ఉపశోభించుచుండెను. పెద్ద పిరుదులు కలిగి స్తనముల భారముచే వంగియుండెను. పుష్పములు శిరోలంకారముగా ధరించి యుండెను. మిగుల మదించిన దేహము కలదై యుండెను. మన్మథ బాణములవలె మనస్సునకు హాయి గొల్పుచు విశాలములును మనోహరములునైన కన్నులు కలిగియుండెను.

(దక్షుడు భార్యలుగా ఇచ్చిన) తారలకు (నక్షత్రములకు) (అప్పటికే) అధిపతిగా ఉన్న ఆ చంద్రుడు కామ పరుడై ఏకాంత ప్రదేశమున ఆమె దరి వచ్చెను. అతని రూపముచే కాంతిచే అప్పటికె తన మనస్సు హరింపబడి ఉన్న ఆ తార ఆ స్థితిలో కామ పీడితురాలయి అతనితో విహరించి ఆనందించెను. చాల సేపటివరకు ఆమెతో క్రీడించియు తృప్తినొందక చంద్రుడు అక్కడి నుండి తారను స్వగృహమునకు తీసికొని పోయెను. ఆమెవలన తనకు కలుగు సుఖము లందు అనురక్తుడగు ఆ చంద్రునకు స్వగృహమునందు కూడ ఆమెతో ఎంత కాలము కామ సుఖములనుభవించినను తృప్తి కలుగలేదు.

బృహస్పతియును తన భార్యయగు తారతోడి ఎడబాటు సహించలేక విరహాగ్నితో దగ్ధుడగుచు తన మనోధ్యానమున నిరంతరమును ఆమెనే చూచుచు బాధనొందుచుండెను. కాని అతడు చంద్రుని శపించుటచే కాని మంత్రములతో కాని శస్త్రములతో కాని అగ్నితో కాని విషాదికముతో కాని అపకారము చేయ జాలకపోయెను. తాను వాచస్పతి (వేదాది విద్యలకు అన్నింటికి అధిపతి) ఐయుండియు వివిధములగు ఉపాయములతోను అవ(భి)చారములతోను కూడ బృహస్పతి చంద్రునకు ఏమియు అపకారము చేయలేక పోయెను. అతడు కామ బాధచే తపించి దీనుడై తన భార్యను తనకిమ్మని చంద్రుని వేడుకొనెను. మహేశ్వరుడు చతుర్ముఖుడు సాధ్యులు మరుత్తులు లోకపాలురు మొదలగు వారు ఎవరు ఎవడు వేడినను తారాసుఖపాశములచే బద్ధుడైన ఆ చంద్రుడు తారను బృహస్పతికి తిరిగి ఈయలేదు.

ఈ కారణమున సదాశివునకు చంద్రునిపై తీవ్రమగు కోపము కలిగెను. అతడు సామాన్యుడా: వామదేవుడు (కోపించినచో ఎవరికిని అనుకూలుడు కాక హాని కలిగింప కలవాడు) అని లోకములందు ప్రసిద్ధుడు. అనేకములగు ముద్రలతో (భావ విశేష ప్రకటనములతో) అతని పాదపద్మములను ఎల్లవారును అర్చింతురు. పైగా ఆయనకు బృహస్పతి యందు స్నేహము అధికము. ఇట్టి సదాశివుడు త్రిపురాసుర సంహారి పినాకధనుర్ధారియగు పరమేశ్వరుడు జయముతప్ప ఓటమి నెరుగనీయని అజగవమను ధనుస్సు ధరించి చంద్రునితో యుద్ధమునకై బయలుదేరెను. అతని శిష్యులును విధేయులును అతనివెంట నుండిరి. భూతనాథులును సిద్ధులును అతనిని పరివేష్టించి వచ్చుచుండిరి. తృతీయ నేత్రము అగ్ని జ్వాలలను ప్రకటించుచుండ అతని ముఖము భయను గొల్పుచుండెను. ఇట్లాయన విశేషముగా దీపించు చుండెను. రథములతోను అశ్వములతొను కూడి గణేశులు ఇరువది అరువది నాలుగు కోట్లమంది (10000 000×20×64) శివుని వెంట బయలుదేరి వెళ్ళిరి. అదే విధముగా కుబేరుడును రథముల నెక్కిన వీరులు అనేక శతకోటి సంఖ్యలో తనకు తోడు రాగా శివునివెంట వెళ్ళెను. వేతాళులు యక్షులు ఉరగులు కిన్నరులు పద్మము అర్బుదము సంఖ్యలో (పద్మము = 1000000000, అర్బుదము = 100000000) కుబేరునివెంట నుండిరి. సోముడును అధికమగు కోపముతో మూడు పంద్రెండు లక్షల రథములపై నక్షత్రులు దైత్యులు అసురులు తనవెంట వచ్చుచుండ శనైశ్చరుడు అంగారకుడు తన తేజస్సును వృద్ధిపరచుచుండ యుద్ధమునకు వచ్చెను. ఈ భయంకర యుద్ధోద్యమమునకు సప్తలోక ములును భయమునందెను. సముద్రములు అన్నియును వాని నడుమనున్న సమస్తద్వీపములును అత్యంతముగా చలించు చుండెను. ప్రజ్వలించుచున్న అస్త్రముల నుండి విశాలములగు వహ్ని జ్వాలలు దిక్కుల వ్యాపించుచుండ పినాకధారియగు శివుడు సోముని ఎదుర్కొనెను.

అంతట భీముని (శివుని)-సోముని-భయంకర సేనలకు రెండింటికిని మహాయుద్ధము జరిగెను. ఆయుద్ధము సమస్త ప్రాణులకును నాశము కలిగించునదియు మిగుల క్రమక్రమముగా వృద్ధి పొందుచు పోవుచున్నదియు తీక్ష్ణములగు ఆయుధములనుండియు అస్త్రములనుండియు వెలువడు మంటలు దట్టమై కనబడుచున్నదియునై భయంకరముగా ఉండెను. పరస్పరము ప్రయోగించుకొనుచున్న భయంకర తీక్ష్ణ శస్త్రములతో ఇరుపక్షములవారి సేనయంతయు తత్ క్షణమే నాశము నొందసాగెను. సేనలపై పడుచుండిన శక్తి సంపన్నములగు ఆయుధములు ఆ సేననేకాక స్వర్గమర్త్య పాతాళ లోకములను కూడ కాల్చి వేయుచుండెను.

రుద్రుడు కోపించి బ్రహ్మశీర్షాస్త్రమును ప్రయోగించెను. సోముడు వ్యర్థము కాని శక్తిగల సోమాస్త్రమును వదలెను. వాటిని ప్రయోగించుటవలనను అవి పరస్పరము ఢీకొనుటవలనను ద్యుభూమ్యంతరిక్షములకు మూడింటికిని (ఈ మూడు లోకములందలి సకల భూతములకును) భయము గలిగెను.

ఇట్లు భీమ సోముల యుద్ధము క్రమక్రమముగా వృద్ధి పొందుచుండెను. లోకములు క్షయమునొందునట్లుండెను. ఇది చూచి లోక పితామహుడగు బ్రహ్మ ఎంతో శ్రమతో (దేవతలతో కూడ) లోపల ప్రవేశించి వారి యుద్ధమును నివా రించెను. బ్రహ్మ సోమునితో నిట్లు పలికెను: "సోమా! నీవిట్లు అకారణముగా భూతములకు నాశమును కలిగించు యుద్ధమునకు పూనితివి. ఇది చేయరాని దుష్కృత్యము. ఇది కాక నీవు పర స్త్రీహరణము అనెడు అకృత్యమునకు సంక ల్పించితివి. అందులకయియే నీవీ భయంకర యుద్ధమును చేయుచున్నావు. నీవు సహజముగ శాంత స్వభావుడవే కావచ్చును. కాని నీవు చేసిన ఈ దోషమునకు ఫలితముగా జనులయందు పాపగ్రహముగానే ప్రసిద్ధినొందుదువు. నీకు కలిగిన ఈ కోరిక (పరదార హరణవాంఛ) ఇంతటితో చాలింపుము. బృహస్పతి భార్యయగు తారను మరల అతనికి అప్పగించుము. పరుల ధనమును హరించిన వారు దానిని మరల దాని సొంతగాని కప్పగించుటలో అవమానము ఏమియు లేదు."

పితా మహుని మాటలు విని సోముడు సరేయని అంగీకరించెను. ప్రశాంతభావముతో యుద్ధము నుండి తొలగి పోయెను. బృహస్పతియును భార్యయగు తారను వెంట తీసికొని హర్షించుచు దుర్ధసితో కూడి స్వగృహమునకు పోయెను.

ఇది శ్రీ మత్స్యమహాపురాణమున మత్స్యమను సంవాదమున చంద్రవంశానువర్ణనమున చంద్రుని. ఉత్పత్తి మొదలగు వృత్తాంతములు అను ఇరువదిమూడవ అధ్యాయము.

## చతుర్వింశోఽధ్యాయః.

### బుధోత్పత్తిః.

సూతః: తత స్సంవత్సరస్యాన్తే ద్వాదశాదిత్యసన్నిభః । దివ్యపీతామ్బరధరో దివ్యాభరణభూషణః. 1
తారోదరా ద్వినిష్క్రాన్తః కుమార శ్చంద్రసన్నిభః । సర్వార్థశాస్త్రవి ద్ధీమా న్సర్వశాస్త్రప్రవర్తకః. 2
నామ్నా య ద్రాజపుత్రీయం విశ్రుతం గజవైద్యకమ్ ।
రాజ్ఞ స్సోమస్య పుత్త్రత్వా త్తస్య పుత్త్రో బుధస్స్మృతః. 3
జాతమాత్ర స్స తేజాంసి సర్వాణ్యే వాజయ ద్బలీ । బ్రహ్మాద్యా స్తత్ర చాజగ్ము ర్దేవదేవర్షిభి స్సహ. 4
బృహస్పతిగృహే సర్వే జాతకర్మోత్సవోద్యతాః । అపృచ్ఛంస్తే సురా స్తారాం కేన జాతః కుమారకః. 5
తత స్సా లజ్జితా తేషాం న కిఞ్చి దవద త్తదా । పునఃపున స్తదా పృష్టా లజ్జయన్తీ వరాఙ్గనా. 6
సోమస్యేతి చిరా దాహ తతోఽ గృహ్ణా ద్విధు స్సుతమ్।బుధ ఇత్యకరో న్నామ ప్రాదా ద్రాజ్యంచ భూతలే.7
అభిషేకం తతః కృత్వా యువాన మకరో ద్విభుః । గ్రహసామ్యం ప్రదాయాథ బ్రహ్మ బ్రహ్మర్షిసంయుతః.8
పశ్యతాం సర్వలోకానాం తత్రై వా న్తరధీయత । ఇలోదరేతు ధర్మిష్ఠం బుధః పుత్త్ర మజీజనత్. 9

పురూరవశ్చరితమ్.

అశ్వమేధశతం సాగ్ర మకరో ద్య స్స్వతేజసా ।.పురూరవా ఇతి ఖ్యాత స్సర్వలోక నమస్కృతః. 10

## ఇరువది నాలుగవ అధ్యాయము.

### బుధోత్పత్తి-పురూరవో-రజి-యయాతి వృత్తాంతములు.

సూతుడు ఋషులతో ఇంకను ఈ విధముగా చెప్పెను: సంవత్సరము గడచిన తరువాత తారా గర్భము నుండి కుమారుడు జనించెను. అతడు పండ్రెండు మంది ఆదిత్యుల తేజస్సులను పోలిన తేజస్సుతో దీపించుచుండెను. దివ్యమగు పీతాంబరమును ధరించియుండెను. దివ్యములగు ఆభరణములతో అలంకరించుకొని యుండెను. రూపమునందు చంద్రుని పోలియుండెను.

అతడు అర్థ శాస్త్రమును సమగ్రముగా ఎరిగినవాడు. చాల బుద్ధిశాలి. సర్వశాస్త్రములను ప్రవర్తిల్లజేసినవాడు. రాజ పుత్త్రీయము అను పేరున ప్రసిద్ధమయియున్న గజ వైద్యశాస్త్రము ఈ తారా పుత్త్రుడు ప్రవర్తిల్లజేసినదే. సోమునకు (చంద్రునకు) రాజా అనియు పేరుగలదు. చంద్రుని కుమారుడగుటచే ఇతడు రాజపుత్త్రుడు. అతడు ప్రవర్తిల్లజేసిన శాస్త్రము కనుక రాజ పుత్త్రీయము అని దానికి పేరు వచ్చెను. సర్వశాస్త్రముల నెరిగిన పండితుడు కావున బుధుడని అతనికి పేరు ప్రసిద్ధమయ్యెను.

అతడు పుట్టుకతోనే లోకములందలి సకల తేజస్సులను తన తేజస్సుతో జయించువాడును బలశాలియు నయి యుండెను. ఈతని జనన సమయమున బ్రహ్మదేవుడును దేవతలును దేవ ఋషులును బృహస్పతి గృహమునకు వచ్చిరి. అచ్చట వారందరును పుట్టిన కుమారునకు జాత కర్మమును జరుపుటకు పూనుకొనిరి. ఆ దేవతలందరును ఈ కుమారుడు ఎవరి వలన కలిగినవాడు ? అని తారను అడిగిరి. ఆమె సిగ్గుపడి ఏమియు మాటాడక యూరకుండెను. వారును మరల మరల అదే ప్రశ్నము నడుగసాగిరి. ఆ ఉత్తమాంగన సిగ్గుపడుచు చంద్రుని కుమారుడే అని చాల సేపటి తరువాత

సమాధానము అచ్చెను. అంతట ఆ కుమారుని చంద్రుడు తీసికొనెను. అతడు అతనికి బుధుడు అని నామకరణము చేసెను. భూలోకమునందు రాజ్యమును కూడ ఇచ్చెను. తరువాత అతనిని యువరాజునుగా చేసి అభిషేకము జరిపెను.

తరువాత బ్రహ్మ బృహస్పతులతో కూడి ఆలోచించి బుధునకు గ్రహత్వమును ఇచ్చి సర్వ లోకములును చూచుచుండ అచ్చటనే అంతర్ధానమునందెను.

బుధునకు లోగడ తెలిపినట్లు ఇలాగర్భమున కుమారుడు కలిగెను. అతడు పురూరవసుడు అను పేర ప్రసిద్ధుడయి సర్వలోక జనుల నమస్కారములను అందుకొను వాడయ్యెను. తన ప్రతాపముతో అతడు సమగ్రముగా నూరు అశ్వమేధ యాగములు చేసెను.

హిమవచ్ఛిఖరే రమ్యే సమారాధ్య జనార్దనమ్ । లోకైశ్వర్య మగా ద్రాజా* సప్తద్వీపాధిప స్తథా. 11
కేశిప్రభృతయో దైత్యాః కోటిశో యేన ఘాతితాః । ఊర్వశీ యస్య పత్నీత్వ మగమ ద్రూపమోహితా. 12
సప్తద్వీపా వసుమతీ సశైలవనకాననా । ధర్మేణ పాలితా తేన సర్వలోకహితైషిణా. 13
చామరగ్రాహిణీ కీర్తి స్సదా చైవాఙ్గవాహికా । విష్ణుప్రసాదా ద్దేవేన్ద్రో దదా వర్ధాసనం సదా. 14
ధర్మార్థకామా స్ధర్మేణ సమమే వాభ్యపాలయత్ । ధర్మార్థకామా స్తం ద్రష్టు మాజగ్ముః కౌతుకా త్పురా. 15
జిజ్ఞాసవ స్తచ్చరితం కథం పశ్యతి న స్సమమ్ । భక్త్యా చక్రే తత స్తేషా మర్ఘ్యపాద్యాదికం నృపః. 16
ఆసనత్రయ మానీయ దివ్యం కనక భూషణమ్ । నివేశ్యాథాకరోత్పూజా మీషద్ధర్మేఽధికాం పునః. 17
జగ్మతు స్తే తు కామార్థా వతికోపం నృపం ప్రతి । అర్థ శ్శాప మదా త్తస్మై లోభా త్త్వం నాశ మేష్యసి.18
కామోఽప్యాహ తవోన్మాదో భవితా గన్ధమాదనే । కుమారవన మాశ్రిత్య వియోగా (దూ)దుర్వశీభవాత్. 19
ధర్మోఽప్యాహ చిరాయు స్త్వం ధార్మికశ్చ భవిష్యసి । సన్తతి స్తవ రాజేంద్ర యావచ్చన్ద్రార్కతారకమ్.20
శతశో వృద్ధి మాయాతు న నాశం భువి యాస్యతి ।
ఇత్యుక్త్వాఽ న్తర్దధు స్సర్వే రాజా రాజ్యం త దాఽన్వభూత్. 21

ఆ పురూరవుడు మనోహరమగు హిమవత్పర్వత శిఖరమునందు (తపస్సు చేసి) శ్రీ మహావిష్ణుని మెప్పించెను. జనార్దనుని వరప్రభావమున లోకేశ్వరుడయ్యెను. భూలోకమునందలి సప్త ద్వీపములకును అధిపతి అయ్యెను. ఈతడు కేశి మొదలగు కోట్లకొలదిగా రాక్షసులను చంపెను. అతని రూపమును చూచి మోహితురాలయి ఊర్వశి అతనికి భార్య అయ్యెను. అతడు సర్వలోకములహితమును కోరి సప్త ద్వీపములతోను పర్వతములతో కాననముల (చిన్న అడవుల లేదా చెట్ల తోపుల) తోను కూడిన భూమిని అంతటిని ధర్మానుసారముగా పాలించెను. కీర్తి అతనికి వింజామరను పట్టి వీచెడి సేవికగా ఒడలు పట్టెడి సేవకురాలుగా అయ్యెను. విష్ణుని అనుగ్రహ ప్రభావమున దేవేంద్రుడు అతనికి తన అర్ధాసనమును ఇచ్చెను. ధర్మము అర్థము కామము అనెడి మూడు పురుషార్థములను ధర్మానుసారము సమభావముతో అతడు పాలించెను. పూర్వము ఒకానొకప్పుడు ధర్మార్థ కామములకు మూవురకు ఈతడు మనలను ముగ్గురను ఎట్లు సమానముగా చూచుచున్నాడో పరీక్షింపవలెనని కుతూహలము కలిగెను. అందుచే వారు అతని నడువడిని తెలిసికొనగోరి ఆ పురూరవుని కడకు వచ్చిరి. రాజపుడు బంగారు తొడుగుతోను అలంకారములతోను కూడిన దివ్యములగు పీఠములను తెప్పించి వారిని వాటిపై కూర్చుండబెట్టెను. భక్తి పూర్వకముగా అర్ఘ్యము పాద్యము మొదలగు వానితో వారిని పూజించెను. వారిని పీఠములపై కూర్చుండబెట్టి పూజించుటలో ఆ రాజు ధర్మమునందు అధికము అగు భక్తిని చూపెను. దానిచే కోపించి అర్థము నీవు లోభము చేత నశింతువు. అని పురూరవుని శపించెను. కామమును గంధమాదన పర్వతమున కుమార వనమునందు ఊర్వశితోడి వియోగము కారణముగా నీకు ఉన్మాదము కలుగును. అని అతనిని శపించెను. ధర్మము అతనితో ఇట్లు పలికెను : "నీవు దీర్ఘాయువవును ధార్మికుడవును అయ్యెదవు. నీ సంతానమును చంద్రార్క నక్షత్రములు ఉన్నంత

వరకును నూపుల కొలఁదిగా వృద్ధి పొందుచుండును. అది ఎన్నటికిని భూలోకమునందు నశించదు. ఇట్లు వలికి ధర్మార్థ కామములు పూరుడును అంతర్ధానము నందెను. ఆనాటి నుండియు ఆ పురూరవుడు రాజ్యమును ధర్మానుసారముగా ఆనుభవించెను.

అహన్యహని దేవేన్ద్రం ద్రష్టుం యాతి స రాజరాట్ । కదాచి దారుహ్య రథం దక్షిణామ్బరచారిణమ్. 22
సార్ధమర్కేణ సోఽపశ్య న్నీయమానా మథామ్బరే । కేశినా దానవేన్ద్రేణ చిత్రలేఖా మథోర్వశీమ్. 23
తం వినిర్జిత్య సమరే దధౌ బౌధి స్స్వపాణినా । బుధపుత్త్రేణ వాయవ్య మస్త్రం ముక్త్వా యశోర్థినా. 24
తదా శక్రోపి సమరే యేన వజ్రీ వినిర్జితః । మిత్రత్వ మగమ ద్దేవై రదా దిన్ద్రాయ చోర్వశీమ్. 25
తతః ప్రభృతి మిత్రత్వ మగమ త్పాకశాసనః । సర్వలోకాతిశాయిత్వం బల మూర్జం యశశ్శ్రియమ్. 26
ప్రాదా ద్వజ్రీ తు సన్తుష్టో గేయతాం భరతేన చ । సా పురూరవసః ప్రీత్యై గాయన్తీ చరితం మహత్. 27
లక్ష్మీస్వయంవరం నామ భరతేన ప్రవర్తితమ్ । మేనకా మూర్వశీం రమ్భాం నృత్యతేతి తదాఽదిశత్. 28
ననర్త సలయం తత్ర లక్ష్మీరూపేణ చోర్వశీ । సా పురూరవసం దృష్ట్వా నృత్యన్తీ కామపీడితా. 29
విస్మృతాఽభినయం సర్వం త త్పురా భరతోదితమ్ । శశాప భరతః క్రోధా ద్వియోగా దస్య భూతలే. 30
పఞ్చపఞ్చాశదబ్దాని లతా సూక్ష్మా భవిష్యసి । పురూరవాః పిశాచత్వం తత్రైవానుభవిష్యతి. 31
తత స్త మూర్వశీ గత్వా భర్తార మకరో చ్చిరమ్ । శాపాన్తే భరతస్యాథ (ఊ)ఉర్వశీ బుధసూనుతః. 32
అజీజన త్సుతా నష్టౌ నామత స్తా న్నిబోధత । ఆయుర్దృఢాయు రశ్వాయుర్ధనాయుశ్చ ధృతి ర్మతిః. 33
శుచి ర్వీర శ్శ్రుతాయుశ్చ సర్వే దివ్యబలౌజసః । ఆయుషో నహుషః పుత్త్రో వృద్ధశర్మా తథైవచ. 34
రజీ రసో విపాప్మాచ వీరాః పఞ్చ మహారథాః । రజేః పుత్త్రశతం జజ్ఞే రాజేయా ఇతి విశ్రుతాః. 35

రాజరాజగు ఆపురూరవుడు ప్రతి దినమునను స్వర్గమునకు పోయి దేవేంద్రుని దర్శించి వచ్చుచుండెడివాడు. అట్లు జరుగుచుండ ఒకనాడు ఆ రాజు దక్షిణాయన గతిలోనున్న సూర్యునితో పాటు దక్షిణపు ఆకాశమున నంచరించు చున్న తన రథమును ఆరోహించి పోవుచు దానవరాజగు కేశియను వాడు ఊర్వశిని చిత్రలేఖను కొని పోవుచుండుట చూచెను. బుధ పుత్త్రుడగు ఆపురూరవసుడు ఇంద్రుని కూడ జయించియుండిన ఆకేశిపై వాయ వ్యాస్త్రమును ప్రయోగించి వానిని జయించెను. ఇట్లతడు యుద్ధమున కేశి రాక్షసుని జయించి వానిని తన హస్తముతో పట్టివేసెను. తరువాత ఆ రాజు ఊర్వశిని ఇంద్రునికి ఒప్పగించెను. ఈ కారణముగా అతడు ఇంద్రాది దేవతలతో మైత్రిని సంపాదించెను. ఆనాడు మొదలుకొని దేవేంద్రుడు పురూరవునితో మైత్రిని అంగీకరించుటయే కాక అతని వయి ప్రీతి చెంది అతనికి సర్వ లోకాధికుడుగా నుండునట్లును బలమును సామర్థ్యమును యశస్సును ఐశ్వర్యమును శోభను భరతునిచే గానముచే కీర్తింప బడుటను వరముగా ఇచ్చెను. ఆ ఊర్వశియును నాటి నుండి పురూరవుని పూజ్యచరితమును పాడుచు ప్రీతి కలిగించు చుండెడిది. ఇట్లుండ ఒకనాడు దేవేంద్రుడు ఊర్వశీ మేనకా రంభలను భరతుడు రచించి ప్రవర్తిల్ల జేసిన లక్ష్మీ స్వయం వరమను నృత్య రూపకమును నృత్యమున నభినయించవలసినదిగా ఆజ్ఞాపించెను. అన్నృత్యాభినయ ప్రసంగములో ఊర్వశి లక్ష్మీ రూపము ధరించి లయాను గుణముగా నాట్యము చేయుచుండెను. ఆమె పురూరవసుని చూచుచు నాట్యము చేయుచు కామపీడితురా లయ్యెను. ఈ హేతువుచే నామె తనకు భరతుడు ఉపదేశించి యుండిన అభినయము అంతయు మరచెను. భరతుడును అందులకు కోపించి ఈ రాజుతోడి వియోగమున నీవు భూలోకమున మిగుల సన్నని తీగవై ఉందువని ఊర్వశిని-భూలోకమునందే ఊర్వశి తీగయై యున్న పరిసరములందే పిశాచమయియుండునని పురూ రవసుని శపించెను. వెంటనే ఊర్వశియును శాపానుసారము భూలోకమున శాపకాలమంతయు లతగా నుండి చాల

కాలమునకు శాపము తీరి ఆ పురూరవసుని తన పతిగా చేసి కొనెను. శాపావసానమున ఆమెకు పురూరవసునివలన ఎనమండ్రు కుమారులు కలిగిరి. వారు ఆయువు దృఢాయువు అశ్వాయువు ధనాయువు ధృతి మతి శుచి శతాయువు అను వారు. వీరందరును వీడలును దివ్యములగు బలమును సామర్థ్యమును కలవారు. వీరిలో ఆయువు అనునతనికి నహుషుడు వృద్ధశర్మ రజి-రసుడు విపాప్మ అను వారు కుమారులైరి. వారు ఐదుగురును మహారథులు అగు వీరులు. వారిలో రజికి నూరుగురు కుమారులు కలిగిరి వీరి కందరకును రాజేయులు అని ప్రసిద్ధి.

రజి రారాధయామాస నారాయణ మకల్మషమ్ । తపసా తోషితో విష్ణు ర్వరం ప్రాదా న్మహీపతేః. 36
దేవాసురమనుష్యాణా మభూ త్స విజయీ తదా । అథ దైవాసురం యుద్ధ మభూ ద్వర్షశతత్రయమ్. 37
ప్రహ్లాదశక్రయో ర్భీమం న కశ్చి ద్విజయీ తయోః। తతో దేవాసురైః పృష్టః ప్రాహ దేవ శ్చతుర్ముఖః.38
అనయో ర్విజయీ క స్స్యా ద్రజి ర్జేతేతి సోఽబ్రవీత్ । జయాయ ప్రార్థితో రాజా సహాయ స్త్వం భవస్వ నః.
దైత్యైః ప్రాహ యది స్వామీ వో భవామి తత స్త్వలమ్ । నాసురైః ప్రతిపన్నం త త్ప్రతిపన్నం సురై స్తదా.
స్వామీ భవ త్వ మస్మాకం సఙ్గ్రామే నాశయ ద్విషః । తతో వినాశితా స్సర్వే యేఽవధ్యా వజ్రపాణినా.41
పుత్త్రత్వ మగమ త్తుష్ట స్తస్యేన్ద్రః కర్మణా విభుః । దత్త్వేన్ద్రాయ తదా రాజ్యం జగామ తపసే రజిః. 42
రజిపుత్త్రై స్త దాచ్ఛిన్నం బలా దిన్ద్రస్య వైభవమ్ । యజ్ఞభాగం తు రాజ్యం చ తతో గుణబలాన్వితైః.
రాజ్యా ద్భ్రష్ట స్తథా శక్రో రజిపుత్త్రైర్నిపీడితః । ప్రాహ వాచస్పతిం దీనః పీడితోఽస్మి రజేస్సుతైః. 44
న యజ్ఞభాగో రాజ్యం చ రాజేయానాం బృహస్పతే । రాజ్యలాభాయ మే యత్నం విదధస్వ ధిషణాధిప. 45
తతో బృహస్పతి శ్శక్ర మకరో ద్బలదర్పితమ్ । గ్రహశాన్తి విధానేన పౌష్టికేన చ కర్మణా. 46
స గత్వా మోహయామాస రజిపుత్త్రా న్బృహస్పతిః । జైనాధర్మం సమాస్థాయ వేదబాహ్యం స వేదవిత్.
వేదమార్గపరిభ్రష్టాం శ్చకార ధిషణాధిపః । వేదబాహ్యా న్పరిజ్ఞాయ హేతువాదసమన్వితాన్. 48
జఘాన శక్రోఽథ రణే సర్వా న్ధర్మబహిష్కృతాన్ ।

రజి పాపనాశకుడగు నారాయణుని ఆరాధించెను. అతని తపమునకు మెచ్చి నారాయణుడు ఆ మహీపతికి వరము నిచ్చెను. తత్ప్రభావమున అతడు దేవతలను అసురులను కూడ జయించగలవాడయ్యెను.

ఇట్లుండ గొంత కాలమునకు దేవాసురులకు యుద్ధము సంభవించెను. అది మూడు నూరుల సంవత్సరములు ప్రవర్తిల్లెను. ప్రహ్లాదునకును ఇంద్రునకును జరిగిన ఆయుద్ధములో ఎంతకాలమునకును ఎవరికిని గెలుపు కలుగక యుద్ధము సాగుచునే యుండెను. అపుడు దేవాసురులు ఇరువురును చతుర్ముఖునికడకు పోయి మాలో ఎవరికి గెలుపు కలుగునని ప్రశ్నించిరి. ఈ ఇరువురిలో ఎవరు జయింతురు అని చెప్పగలను? రజి జయించును. అని బ్రహ్మ పలికెను. దైత్యులు రజి కడకు పోయి నీవు మాకు సహాయుడవు కమ్ము. అని అతనిని ప్రార్థించిరి. జయించిన తరువాత నేను మీకు అధిపతిగా ఉండుటకు అంగీకరించినచో నేను మీకు యుద్ధమున సాయము చేయుదునని రజి పలికెను. అది రాక్షసు లంగీకరింపలేదు. దేవతలు అందులకు ఒప్పుకొనిరి నీవు యుద్ధమున మా శత్రువుల నశింపజేయుము. తరువాత నీవే మా అధిపతివి కమ్ము - అని దేవత లనిరి. అంతట రజి అంతవరకును వజ్రపాణియగు దేవేంద్రునకును అవధ్యులుగా నుండిన రాక్షసులనందరను నశింపజేసెను. రజి తమకు చేసిన ఈ సాహాయ్యకృత్యమునకు మెచ్చి ఇంద్రుడు తానతనికి కుమారుడుగా ఉండ నంగీకరించెను. అంత - రజియును తన రాజ్యము నంతయు దేవేంద్రున కప్పగించి తాను తపస్సునకు పోయెను.

రజిపుత్త్రులు నూరుమందియు సద్గుణములును బలమును కలవారు. వారు తమ తండ్రి తపోవనమునకు పోయిన తరువాత ఇంద్రుని వైభవమును యజ్ఞభాగమును కూడ హరించిరి. ఇట్లు రజిపుత్త్రులచేత విశేషముగా బాధింప

అని ఇంద్రుడు రాజ్యభ్రష్టుడై పోయెను. అతడు తన గురువగు బృహస్పతి దగ్గరకు పోయెను. నేను రజిపుత్రులచేత మిక్కిలి పీడింపబడియున్నాను. నాకిపుడు రాజ్యము లేదు. యజ్ఞభాగమును లేదు. అవి రెండును ఇపుడు రజి కుమారులకే చెందియున్నవి. నీవు బుద్ధిమంతులలో ఉత్తముడవు. నాకు మరల నా రాజ్యము లభించుటకై యత్నము చేయ ప్రార్థించుచున్నాను. అని ఇంద్రుడు గురుని ప్రార్థించెను.

బృహస్పతి తన నీతి బలమునకు మంత్రబలమునకు ఇంద్రుని మరల బలదర్పితునిగా జేసెను. శాస్త్రవిధానము ననుసరించి అతడు గ్రహశాంతిని పౌష్టిక కర్మలను ఆచరించెను. అంతేకాక ఆ బృహస్పతి పోయి తన బుద్ధిబలమున రజిపుత్రులకు మోహ పెట్టెను. వారి బుద్ధిని మార్చెను. దానిచే వారు వేదబాహ్యులై అధర్మమును ఆశ్రయించిరి. ఇట్లు పండిత శ్రేష్ఠుడును వేదవేత్తయు అగు బృహస్పతి రాజేయులను వేద మార్గమునుండి పరిభ్రష్టులనుగా చేసెను. వారందరును వేద బాహ్యులుగా హేతువాదపరులుగా ఐరి. ఇది ఎరిగిన దేవేంద్రుడు ధర్మమార్గ బహిష్కృతులగు ఆ రజిపుత్రులనందరను చంపెను.

నహుషస్య ప్రవక్ష్యామి పుత్రాన్సప్తైవ ధార్మికాన్. 49
యతి ర్యయాతి స్సంయాతి రుద్భవః పాంచి రేవచ । సయాతి ర్మేఘసంయాతి స్సప్తైతే వంశవర్ధనాః. 50
యతిః కుమారభావేపి యోగీ వైఖానసోఽభవత్ । యయాతి రకరో ద్రాజ్యం ధర్మైకశరణ స్తదా. 51
శర్మిష్ఠా తస్య భార్యాఽభూ ద్దుహితా వృషపర్వణః । భార్గవస్యాత్మజా తద్వ ద్దేవయానీ చ సువ్రతా. 52
యయాతేః పఞ్చ దాయాదా స్తా న్ప్రవక్ష్యామి నామతః ।
దేవయానీ యదుం పుత్రం తుర్వసుం చాప్యజీజనత్. 53
తథా ద్రుహ్యు మనుం పూరుం శర్మిష్ఠాఽజనయ త్సుతాన్ । యదుః పూరుశ్చ భవత ఏషాం వై వంశవర్ధనౌ.
యయాతి ర్నాహుష శ్చాసీ ద్రాజా సత్యపరాక్రమః । పాలయామాస చ మహీ మీజే చ వివిధై ర్మఖైః. 55
అతిభక్త్యా పితౄ నర్చ్య దేవాంశ్చ ప్రయత స్సదా । అథాఽసృజ త్ప్రజా స్సర్వా యయాతి రపరాజితః.
స శాశ్వతీ స్సమా రాజా ప్రజా ధర్మేణ పాలయన్।జరా మార్ఛ న్మహాఘోరాం నాహుషో రూపనాశినీమ్. 57
జరాభిభూతః పుత్రా న్స రాజా వచన మబ్రవీత్ । యదుం పూరుం తుర్వసుం చ ద్రుహ్యుం చానుంచ పార్థివః.
యౌవనేన చ వః కామా న్యువా యువతిభి స్సహ ।విహర్తు మహ మిచ్ఛామి సాహ్యం కురుత పుత్రకాః. 59
తం పుత్రో దేవయానేయః పూర్వజో యదు రబ్రవీత్ । కిం సాహ్యం భవతః కార్య మస్మాభి ర్యౌవనేన తు.
యయాతి రబ్రవీ త్పుత్రా న్జరా మే ప్రతిగృహ్యతామ్।యౌవనేన త్వదీయేన చరేయం విషయా నహమ్. 61
యజతో దీర్ఘసత్రై ర్మే శాపా చ్చోశనసో మునేః । కామార్థః పరిహాణోద్య తప్తోహం తేన పుత్రకాః. 62
తాం స్వకేన శరీరేణ జరా మేకః ప్రశాస్తు వః।అహం తన్వాఽభినవయా యువా కామా నవాప్నుయామ్. 63
న తే తస్య ప్రతీత్యగృహ్ణ న్యదుప్రభృతయో జరామ్ । చత్వార స్తా న్స రాజర్షి రశపచ్చేతి నశ్శ్రుతమ్. 64
తమబ్రవీ త్తతః పూరుః కనీయా న్సత్యవిక్రమః । రాజ న్గృహీత్వాఽభినవం యౌవనం త్వం సుఖీ చర. 65
అహం జరాం తవాదాయ రాజ్యే స్థాస్యామి తేఽఽజ్ఞయా । ఏవ ముక్త స్స రాజర్షి స్తపోవీర్యసమాశ్రయాత్.
సఞ్చారయామాస జరాం తదా పుత్రే మహాత్మని । పౌరవేణాథ వయసా రాజా యౌవన మాస్థితః. 67
యాయాతేన ప్రవయసా రాజ్యం పూరు రకారయత్ । తతో వర్షసహస్రాన్తే యయాతి రపరాజితః. 68
అతృప్త ఇవ కామానాం పూరుం పుత్ర మువాచ హ । త్వయా దాయాదవానస్మి త్వం మే వంశకర స్సుతః.
పౌరవో వంశ ఇత్యేష ఖ్యాతిం లోకే గమిష్యతి । తత స్స నృపశార్దూలః పూరుం రాజ్యేఽభిషిచ్య చ. 70
కాలేన మహతా పశ్చా త్కాలధర్మ ముపేయివాన్ । పూరువంశం ప్రవక్ష్యామి శృణుధ్వ మృషిసత్తమాః.

యత్ర తే భారతా జాతా భరతాన్వయవర్ధనాః. 72

ఇతి శ్రీమత్స్యమహాపురాణే మత్స్యమనుసంవాదే చన్ద్రవంశానువర్ణనే యయాతిచరితే బుధాద్యుత్పత్తికథనం నామ చతుర్వింశోఽధ్యాయః.

ఇక నహుషుని కుమారులను పేరుకొందును. వారు యతి యయాతి సంయాతి ఉద్భవుడు పాంచి నయాతి మేఘ సంయాతి అను వారేడుమంది. వీరు ధార్మికులును వంశవృద్ధికరులును. యతి అనునాతడు చిన్నతనమునందే యోగియై వానప్రస్థుడయ్యెను. యయాతి ధర్మమునకు తాను ఆశ్రయమై ధర్మమును తానాశ్రయించి రాజ్యమును పాలించెను. వృషపర్వుడను దానవరాజు కుమార్తెయగు శర్మిష్ఠయు శుక్రుని కూతురగు దేవయానియు ఆతని భార్యలు. యయాతికి దేవయానివలన యదువు తుర్వసుడు అనువారును శర్మిష్ఠవలన ద్రుహ్యుడు అనువు పూరుడు అనువారును మొత్తము ఐదుమంది కుమారులు కలిగిరి. వీరైదుమందిలోను యదువు పూరుడు అనువారు ఇద్దరును వంశవృద్ధికరు లయిరి.

నహుషపుత్రుడగు ఈ యయాతి రాజుగా సత్యపరాక్రముడై (ధర్మము మొదలగు సత్త్వవృత్తులయందు పూనిక కలిగి) భూమిని పాలించెను. వివిధములగు యజ్ఞములతో దేవతల నారాధించెను. అతిభక్తితో ప్రయతుడయి (శరీరమునందును చిత్తమునను శుచియై) పితరులను దేవతలను కూడ అర్చించెను. అటువలెనే ప్రజలను అందరను శత్రువులవలన ఓటమి నెరుగని ఆయయాతి దృఢ బుద్ధితో పాలించెను.

ఇట్లు ఆ యయాతి ధర్మానుసారము ప్రజలను పాలించుచుండ మహాఘోరమును సౌందర్యమును దేహదార్ఢ్యమును నశింపజేయునదియు నగు వార్ధకము ఆతనిని ఆవేశించెను. ముసలితనము తను క్రమ్ముకొనగా నాతడు తన కుమారులగు యదుపూరుతుర్వసు ద్రుహ్యానువులను పిలిచి ఇట్లు పలికెను. "యౌవనముతో మీరు అనుభవించు కామ సుఖముల ననుభవింపవలెనను కోరికతో నున్నాను. కుమారులారా! నాకు ఈ విషయమున సాహాయ్యము చేయుడు." అనగా దేవయానీ జ్యేష్ఠ కుమారుడగు యదువు-యౌవనముతో మేము మీకు చేయదగిన సాహాయ్యము ఏమి?-అని ప్రశ్నించెను. యయాతి కుమారులతో ఇట్లు పలికెను. "నావార్ధకమును మీరు తీసికొనవలయును. మీ యౌవనముతో నేను విషయ సుఖములను అనుభవింతును. నేనింతవరకును దీర్ఘసత్రయాగములు (దీర్ఘకాలము దీక్ష వహించి ఆచరించవలసిన సత్రయాగములు) అనేకములు ఆచరించుచుండుటతోను శుక్రమహాముని ఇచ్చిన శాపముతోను ఈ వయఃపరిణామము (ముసలితనము) కలిగినది. ఐనను అది ఇంకను కామ సుఖములను కోరుచున్నది. నాయనా! నేను ఈ హేతువుచే తపించిపోవుచున్నాను. కనుక మీలో నెవరైన ఒకరు ఈ నావార్ధకమును తన శరీరముతో గ్రహించి స్వాధీనపరచుకొనవలెను. నేను సరిక్రొత్త శరీరమును పొంది దానితో వడుచువాడనై కామములను అనుభవింతును."

కాని యదువు మొదలగు కుమారులెవ్వరును తమ తండ్రియగు యయాతి యొక్క వార్ధకమును స్వీకరించలేదు. ఆ హేతువుచే ఆ రాజర్షి యదుతుర్వసు ద్రుహ్యానువులు అను నలుగురను శపించెను. అని పరంపరలో వినబడుచున్నది.

కాని వారిలో ఐదవ వాడగు పూరుడు సత్యవిక్రముడు (ధర్మ ప్రధానమగు ప్రవృత్తికి సత్యమని పేరు. దానియందు తన శక్తిని ప్రయోగించి ప్రవర్తిల్లు వాడు సత్యవిక్రముడు.) కావున అంతట తన తండ్రితో "తండ్రీ! నా అభినవ యౌవనమును నీవు తీసికొని సుఖములను అనుభవించుము. నీ ఆజ్ఞానుసారముగా నీవార్ధకమును గ్రహించి నీ అనుమతితో రాజ పదమునందు నిలిచియుందును. (రాజ్యమును పాలించుచుందును,) అనెను.

పూరుడు ఇట్లు చెప్పగానే రాజర్షియగు యయాతి తన తపస్సామర్థ్య బలమును ఆధారముగా చేసికొని తన దేహమునందలి ముసలితనమును మహాత్ముడు (ఉన్నతమగు మనస్సు కలవాడు) అగు పూరుని శరీరమునందు వ్యాపింపజేసెను. పూరుని వయస్సును తాను గ్రహించి యౌవనమును పొందెను. యయాతినుండి గ్రహించిన వార్ధకముతో పూరుడు రాజ్యమును పాలించెను.

ఇట్లు వేలకొలది సంవత్సరములు గడచెను. మహా పరాక్రమ శాలియగు యయాతి కామ సుఖముల విషయమున తృప్తి పొందలేదేమో! అసక్తుడై యుండి తన కుమారుడగు పూరునితో ఇట్లు పలికెను. "నేను నీ మూలముననే పుత్త్రిలు కలవాడ నయితిని. నా వంశమును నిలుపు కుమారుడవు నీవే. ఈ వంశమునకు లోకమున పౌరవవంశము అను ఖ్యాతి కలుగును."

ఇట్లు పలికి ఆ రాజశ్రేష్ఠుడు పూరుని రాజ్యమున అభిషేకించెను. చాలకాలము జీవించి అతడు-యయాతి-కాల ధర్మము నొందెను.

మునిశ్రేష్ఠులారా! ఇకమీదట పూరు వంశమును మీకు వివరించి తెలుపుదును. వినుడు. భరత వంశమును వృద్ధి చేయు భారతులు అనబడు పాండవ కౌరవులు ఆవంశమునందే సదా జన్మించిరి!

ఇది శ్రీమత్స్యమహాపురాణమున మత్స్యమను సంవాదమున చంద్రవంశాను వర్ణనమున
బుధోత్పత్తి మొదలగు వృత్తాంతములు అను ఇరువది నాలుగవ అధ్యాయము.

## పంచవింశతితమోఽధ్యాయః.

## యయాతిచరితే కచవృత్తాంత కథనమ్.

ఋషయః: కిమర్థం పౌరవో వంశ శ్శ్రేష్ఠత్వం ప్రాప భూతలే ।
జ్యేష్ఠస్యాపి యదో ర్వంశః కిమర్థం హీయతే శ్రియా. 1
అన్య ద్యయాతే శ్చరితం సూత విస్తరతో వద । యస్మా త్తత్పుణ్య మాయుష్య మభినన్ద్యం సురై రపి. 2
సూతః: ఏతదేవ పురా పృష్ట శ్శతానీకేన శౌనకః । పుణ్యం పవిత్ర మాయుష్యం యయాతిచరితం మహత్. 3
శతానీకః: యయాతిః పూర్వకోఽస్మాక మష్టమో యః ప్రజాపతేః ।
కథం స శుక్రతనయాం లేభే పరమరూపిణీమ్. 4
ఏత దిచ్ఛా మ్యహం శ్రోతుం విస్తరేణ తపోధన। ఆనుపూర్వ్యాచ్చ మే శంస పూరో ర్వంశధరా న్నృపాన్. 5
శౌనకః: యయాతి రాసీ ద్రాజర్షి ర్దేవరాజసమద్యుతిః । తం శుక్రవృషపర్వాణౌ వవ్రాతే వై యథా పురా. 6
త త్తేహం సమ్ప్రవక్ష్యామి పృచ్ఛతో రాజసత్తమ । దేవయాన్యాశ్చసంయోగం యయాతే ర్నాహుషస్య చ. 7
సురాణా మసురాణాం చ సమజాయత వై మిథః । ఐశ్వర్యా దథ సంఘర్ష స్త్రైలోక్యే సచరాచరే. 8
జిగీషయా తతో దేవాః ప్రవవ్రాఙ్గిరసం మునిమ్ । పౌరోహిత్యే చ యజ్ఞార్థే కావ్యం తూశనసం పరే. 9
బ్రాహ్మణౌ తావుభౌ నిత్య మన్యోన్యస్పర్ధినౌ భృశమ్ । తత్ర దేవా నిజఘ్ను ర్యా న్దానవా న్యుధి సఙ్గతాన్. 10
తా న్పున ర్జీవయామాస కావ్యో విద్యాబలాశ్రయాత్ । తత స్తే పున రుత్థాయ యోధయాఞ్చక్రిరే సురాన్. 11
అసురాస్తు నిజఘ్ను ర్యా న్సురా న్సమరమూర్ధని । న తా న్సఞ్జీవయామాస బృహస్పతి రుదారధీః. 12
న హి వేద స తాం విద్యాం యాం కావ్యో వేద వీర్యవాన్ । సఞ్జీవినీం తతో దేవా విషాద మగమ న్పరమ్. 13

## దేవప్రార్థనయా కచకృత శుక్రసమీపగమనమ్.

అథ దేవా భయోద్విగ్నాః కావ్యా దుశనస స్తతః ఊచుః కచ ముపాగమ్య జ్యేష్ఠం పుత్త్రం బృహస్పతేః. 14
భజమానా న్భజస్వాస్మా న్కురు సాహాయ్య ముత్తమమ్। యాఽసౌ విద్యా నివసతి బ్రాహ్మణేఽమితతేజసి. 15
శుక్రే తా మాహర క్షిప్రం భాగభాఙ్నో భవిష్యసి। వృషపర్వణ స్సమీపే తు శక్యో ద్రష్టుం త్వయా ద్విజః. 16
రక్షత్స దానవాం స్తత్ర న చ రక్షత్యదానవాన్ । త మారాధయితుం శక్తో నాన్యః పూర్వతమో మునే. 17
దేవయానీం చ దయితాం సుతాం తస్య మహాత్మనః। తా మారాధయితుం శక్తో నాన్యః కశ్చి ద్వృతే త్వయా. 18
శీలమాధుర్యదాక్షిణ్యై రాచారేణ దమేన చ। దేవయాన్యాం చ తుష్టాయాం విద్యాం సమ్ప్రాప్స్యసి ధ్రువమ్. 19

## ఇరువది ఐదవ అధ్యాయము
## యయాతి చరితమున కచ వృత్తాంత కథనము

ఋషులు సూతుని ఇట్లు ప్రశ్నించిరి. పూరుడు యయాతి కుమారులలో చిన్నవాడే యైనను అతని వంశము లోకమున శ్రేష్ఠమయినదిగా ఏల ప్రసిద్ధమయ్యెను? యదువు జ్యేష్ఠుడే యైనను అతని వంశము ఏల శోభలో తక్కువది అయ్యెను? కారణము తెలుపుడు. అంతే కాక యయాతి చరితమును కూడ ఇంకను విస్తరించి తెలుపుడు. అది పుణ్యకరమును ఆయుర్వృద్ధికర్మమును దేవతలు కూడ అభినందించునదియును.

సూతుడు ఈ విధముగా చెప్పెను. "ఋషులారా! మీరు అన్నట్లు ఈ యయాతి చరిత్రము పుణ్యకరమును పవిత్రమును ఆయుర్వృద్ధి కరమును చాల గొప్పదియును. పూర్వము శతానీకుడు (జనమేజయుని కుమారుడు) అడుగగా శౌనకుడు దీనిని అతనికి చెప్పెను.

ఎట్లన- ప్రజాపతినుండి ఎనిమిదవ తరమునకు చెందినవాడును మా పూర్వ పురుషుడును అగు యయాతి మిగుల సౌందర్యవతియు శుక్రుని కూతురును అగు దేవయానిని ఎట్లు వివాహ మాడెను ? తపోధనా? ఇదియంతయు సవిస్తరముగా వినవలెనని నాకు కుతూహలముగా ఉన్నది. యయాతి మొదలుకొని ఆనుపూర్వితో పూరుని వంశమును నిలిపిన రాజుల నందరను నాకు వివరింపుడు. అని శతానీకుడు శౌనకుని అడిగెను.

శౌనకుడు ఇట్లు చెప్పనారంభించెను: యయాతి రాజర్షి. దేవేంద్రునితో సమానముగా ప్రకాశించిన రాజు. శుక్రుడును వృషపర్వుడును అతనిని తమ అల్లునిగా చేసికొనిరి ఆ విధమును నీకు తెలిపెదను. రాక్షసగురుడగు శుక్రుని కూతురు దేవయాని. మానవలోకాధిపతియగు నహుషుని కుమారుడు యయాతి. వీరికిద్దరకును దంపతులుగా కలయిక ఎట్లు జరిగెను? అని నీవడిగితివి. రాజసత్తమా! మొదట నీకు అది తెలిపెదను.

చరాచరాత్మకమగు మూడు లోకములకు మేమే అధిపతులము. అను భావముతో ఈ విషయమున దేవతలకును అసురులకును పరస్పరము స్పర్ధ (పోటీ) ఏర్పడెను. వారు ఒక పక్షము వారు మరొక పక్షమువారిని జయించవలెనను తలంపుతో అంగిరసుని కుమారుడగు బృహస్పతిని దేవతలును కవి వంశీయుడగు ఉశనసుని (శుక్రుని) రాక్షసులును తాము జరిపెడి యజ్ఞములందు పురోహితులుగా నుండునట్లు ఏర్పరచుకొనిరి. ఆ బ్రాహ్మణులు ఇరువురును ఒకరిపై ఒకరు పోటీ పడుచుండిరి. యుద్ధములందు దేవతల చేతిలో మరణించిన దానవులను శుక్రుడు తన విద్యాబలము నాశ్రయించి పునర్జీవితులనుగా జేయుచుండెను. వారును మరల జీవించి లేచి దేవతలతో యుద్ధము చేయుచుండిరి. బృహస్పతియు ఉదారమగు బుద్ధి కలవాడే కాని తపోవిద్యావీర్యము కల శుక్రునకు తెలిసిన సంజీవనీవిద్య బృహస్పతికి తెలియకపోవుటచేత రాక్షసులచేతిలో మరణించిన దేవతలను తిరిగి బ్రదికింపలేకుండెను అందుచే దేవతలు మిగుల విషాదమును పొందుచుండిరి. వారు కావ్యుడగు ఉశనసునకు (శుక్రునకు) మిగుల భయపడుచు బృహస్పతిజ్యేష్ఠపుత్త్రుడగు కచునికడకు వచ్చి ఇట్లు పలికిరి: అయ్యా! మేము మిమ్ముల నాశ్రయించుచున్నాము. మాకు మీరు రక్షణమీయవలెను. మాకు మీరొక సహాయము చేయవలెను. అమిత తేజోవంతుడగు శుక్రునియొద్ద నున్న సంజీవనీ విద్యను శీఘ్రముగా సంపాదించి తెచ్చి మా కుపకారము చేయుడు. మేము నీకు మాతోపాటు యజ్ఞభాగమును అంగీకరింతుము. నీవా బ్రాహ్మణుని రాక్షస రాజగు వృషపర్వుని యొద్ద దర్శింపవచ్చును. అతడచ్చట నుండి రాక్షసులను రక్షించుచు రాక్షసులు కాని వారికి రక్షణ కలుగనీయ కున్నాడు. ఇంతకుముందు ఎవ్వరును అతనిని మెప్పించగలవారు లేకుండిరి. ఆ మహాత్మునకు దేవయానియను ప్రియపుత్త్రి కలదు. నీవు తప్ప ఆమెను ఆరాధించి మెప్పించగల వారు ఇంకెవ్వరును లేరు. నీ శీలము తీయని నడువడి ప్రీతిభావము ఆచారము ఇంద్రియనిగ్రహము వీటితో నీవామెను ఆరాధించి సంతుష్టురాలనుగా చేయుము. ఆమె సంతుష్టురాలయినచో నీవు నిశ్చయముగా ఆ విద్యను సంపాదింపగలవు."

తదేతుః కః కచః ప్రాయా ద్బృహస్పతిసుత స్సదా । తదాభిపూజితో దేవై స్సమీపం వృషపర్వణః ॥ 20

స గత్వా త్వరితో రాజ న్దేవై స్సమ్యాజితః కచః। అసురేన్ద్రపురే శుక్రం దృష్ట్వా వాక్య మువాచ హ. 21
కచః: ఋషే రఙ్గిరసః పౌత్త్రం పుత్త్రం సాక్షా ద్బృహస్పతేః।
నామ్నా కచ ఇతి ఖ్యాతం శిష్యం గృహ్ణాతు మాం భవాన్. 22
బ్రహ్మచర్యం చరిష్యామి త్వత్తోఽహం పరమం గురో। అనుమన్యస్వ మాం బ్రహ్మ న్సహస్రపరివత్సరాన్. 23
శుక్రః: కచ సుస్వాగతం తేఽస్తు ప్రతిగృహ్ణామి తే వచః।
అర్చయిష్యేఽహ మర్చ్యం త్వా మర్చితోఽస్తు బృహస్పతిః. 24

## కచకృతశుక్రశుశ్రూషా.

శౌనకః: కచస్తు తం తథేత్యుక్త్వా ప్రతిజగ్రాహ తద్వ్రతమ్।ఆదిష్టం కవిపుత్త్రేణ శుక్రేణోశనసా స్వయమ్.25
వ్రతస్య వ్రతకాలం స యథోక్తం వై గృహీతవాన్। ఆరాధయ న్నుపాధ్యాయం దేవయానిం చ భారత. 26
నిత్య మారాధయిష్యం స్తాం యువా యౌవనగోచరామ్।
గాయ న్నృత్యైశ్చ వాద్యైశ్చ దేవయానీ మతోషయత్. 27
సంశీలయ న్దేవయానీం కన్యాం సమ్ప్రాప్తయౌవనామ్।పుష్పైః ఫలైః ప్రేషణైశ్చ తోషయామాస భారత. 28
దేవయాన్యపి తం విప్రం నియమవ్రతధారిణమ్।లలనాఽదేహసంస్కారం రహః ప్రీత్యాఽవద త్తదా. 29
పఞ్చవర్షశతా న్యేవం కచస్య చరతో వ్రతమ్। తత్ర తీవ్రవ్రతం బుద్ధ్వా దానవా స్తం తదా కచమ్. 30
గా రక్షన్తం వనే దృష్ట్వా రహ స్యేక మమర్షితాః। జఘ్నుర్బృహస్పతే ర్ద్వేషా ద్విద్యా రక్షార్థమేవచ. 31
హత్వా సాలావృకేభ్యశ్చ ప్రాయచ్ఛం స్తిలశః కృతమ్। తతో గావో నివృత్తా స్తా అగోపా స్స్వం నివేశనమ్.
తా దృష్ట్వా రహితా గాస్తు కచే నాభ్యాగతా వనాత్। ఉవాచ వచనం కాలే దేవయా న్యథ భార్గవమ్. 33
దేవయానీ: హుతం చైవాగ్నిహోత్రం తే సూర్య శ్చాస్తఙ్గతః ప్రభో।
అగోపా శ్చాగతా గావః కచశ్చైవ న దృశ్యతే. 34
వ్యక్తం హతో మృతో వాపి కచ స్తాత భవిష్యతి। తం వినా న చ జీవామి వచ స్సత్యం బ్రవీమి తే. 35
శుక్రః: అయ మేహీతిశబ్దోఽయం మృతం సఞ్జీవయామి తమ్।
తత స్సఞ్జీవినీం విద్యాం ప్రయుజ్యాహ్వ కచ మాహ్వయత్. 36
ఆహూతః ప్రాదురభవ త్కచో దృష్ట స్స విద్యయా।

బృహస్పతి కుమారుడగు కచుడు దేవతల ప్రార్థన నంగీకరించి దేవతలు తను అభిపూజించుచుండ బయలు దేరి వృషపర్వునిరాజధానికి పోయి అచట శుక్రుని దర్శించి ఇట్లు పలికెను: "నేను అంగిరసుని మనుమడను-బృహస్పతి కుమారుడను. కచుడనువాడను. తాము నన్ను తమ శిష్యునిగా గ్రహింపవలెను. గురుకులమున వేయి సంవత్సరములైనను బ్రహ్మచర్య వ్రతమును ఆచరింపగలను. అందులకు నన్ననుమతించుడు." అనగా శుక్రుడును కచునకు ఆదరముతో స్వాగతము పలికి నాయనా! నీ కోరిక నంగీకరించుచున్నాను. నీవు అర్చనీయుడవు. కావున నిన్నర్చింతును. నిన్నర్చించి నచో బృహస్పతిని అర్చించినట్లే. అనెను. కచుడును కవిమునిపుత్త్రుడగు ఉశనసుడు (శుక్రుడు) స్వయముగా ఆదేశించిన బ్రహ్మచర్య వ్రతమును స్వీకరించెను. వ్రతకాలమంతయును గురువు చెప్పినట్లు పాటించుచు తన ఉపాధ్యాయుని దేవయానిని కూడ ఆరాధించుచుండెను.

కచుడు తానును యువకుడు. దేవయానియు యౌవనమందుండెను. అందుచే ఆమెను మెప్పింపగోరి అతడు నిరంతరమును గానము చేయుట నృత్యము చేయుట వాద్యములు మ్రోయించుట-ద్వారమున ఆమెను సంతోషపెట్టు చుండెను. ఆమె మనస్సును అనుసరించి నడుచుకొనుచు ఆమెకు ఇష్టములగు పూవులు పండ్లు తెచ్చి ఇచ్చుచు ఆమె

చెప్పిన పనులు చేయుచుండెను. ఆ విప్రుడు కచుడు ఇట్లు గురుకుల నియమములను అనుష్ఠించుచు తన దేహ సంస్కారమును కూడ మరచియుండెను. ఇట్టి కచునిపై ప్రీతి కలిగి దేవయాని అపుడపుడు ఏకాంతమున అతనితో మాటలాడుచుండెడిది.

ఇట్లు ఐదువందల సంవత్సరములు గడచెను. ఈ విషయమును రాక్షసులు తెలిసికొనిరి. అత డేదో సంకల్పముతో ఇట్లు తీవ్రమగు బ్రహ్మచర్య వ్రతమును పాటించుచున్నాడని వారు గుర్తించిరి. వారు బృహస్పతిపై పగ తీర్చుకోవలెననియు సంజీవని విద్య రక్షించుకొనవలెననియు సంకల్పించుకొనిరి. ఒకనాడు ఆకచుడు ఒంటిగా అడవిలో గోవులను కాచుచుండుట చూచి వారు అతనిని చంపిరి. నువ్వు గింజలంత ముక్కలు చేసిరి. వాటిని సాలావృకములను మృగములకు తినవేసిరి.

గోవులంతట సాయంకాలమున వులు తమ్ము కాచు కచుడు లేకయే తమ (శుక్రుని) ఆశ్రమమునకు పోయెను. కచుడు లేకయే వనము నుండి మరలివచ్చిన గోవులను దేవయాని చూచెను. కొంత సేపటి తరువాత ఆమె శుక్రుని కడకు పోయి ఇట్లు పలికెను. "తండ్రీ! సూర్యుడు అస్తమించినాడు. మీ అగ్నిహోత్రములందు హోమము ముగిసినది. గోపాలకుడు లేకయే గోవులు మరలివచ్చినవి. కచుడు మాత్రము కనబడుటలేదు. అతనిని ఎవరో చంపుటయో అతడు తానే కారణముననో మరణించుటయో జరిగినట్లు తోచుచున్నది. ఉన్నమాట చెప్పుచున్నాను. అతడు లేనిదే నేను జీవించజాలను."

అది విని శుక్రుడును "ఇదుగో! ఇదుగో! రమ్ము! అని పలికినంతనే కచుడు జీవించివచ్చును." అనుచు సంజీవనీ విద్యను ప్రయోగించెను. కచుని పిలిచెను. పిలిచిన వెంటనే అతడు ఆవిద్యకు అంది జీవించివచ్చి ఎదుట నిలిచెను.

స పున ర్దేవయాన్యోక్తః పుష్పాహారే యదృచ్ఛయా. 37
వనం యయౌ కచో విప్రాః పఠ న్బ్రహ్మ చ శాశ్వతమ్ ।
తతో ద్వితీయం తం హత్వా పునః కృత్వాచ చూర్ణవత్. 38
ప్రాయచ్ఛ న్బ్రాహ్మణాయైవ సురాయా మసురా స్తదా ।
దేవయాన్యథ భూయోఽపి పితరం వాక్య మబ్రవీత్. 39
పుష్పాహరప్రేషణకృ త్కచ స్తాత న దృశ్యతే । శుక్రః: బృహస్పతే ర్మృతః పుత్రో గతః ప్రేతగతిం కచః.
శుక్రః: విద్యయా జీవితోఽప్యేష పున స్తే కరవాణి కిమ్ ।
మైనం శుచో మా రుద దేవయాని న త్వాదృశీ మర్త్య మనుప్రశోచేత్. 41
యస్యా స్తవ బ్రహ్మగణాశ్చ సేంద్రాః సేన్ద్రాశ్చ దేవా వసవోఽశ్వినౌ చ ।
సురద్విషశ్చైవ జగత్తు సర్వ ముపస్థితా మత్తపసః ప్రభావాత్. 42
అశక్యోఽసౌ జీవయితుం ద్విజాతి స్సంజీవితో మ్రియతే చైవ భూయః ।
దేవయానీ : యస్యాఙ్గిరా వృద్ధతమః పితామహో బృహస్పతిశ్చాపి పితా తపోనిధిః. 43
న బ్రహ్మచారీ చ తపోధనశ్చ సదోత్థితః కర్మసు చైవ దక్షః ।
కచస్య మార్గం ప్రతిపత్స్యే న భోక్ష్యే ప్రియో హి మే తాత కచోఽభిరూపః. 44
శౌనకః: స త్వేవ ముక్తో దేవయాన్యా మహర్షి స్సంరమ్భేణ వ్యాజహారాథ కావ్యః ।
అసంశయం మా మసురా ద్విషన్తి యే మే శిష్యం తద్గతా స్సూదయన్తి. 45
అబ్రాహ్మణం కర్తు మిచ్ఛన్తి హా మే ఏభి ర్యథా ప్రస్తుతం దానవైర్హి ।
తత్కర్మణోఽప్యస్య భవే దిహాన్తః కం బ్రహ్మహత్యా న దహే దపీన్ద్రమ్. 46
న తేన హూతో విద్యయా చోపహూత శ్శనై ర్వాచం జఠరే వ్యాజహార ।
త మబ్రవీ త్కేన ఇహోపయాతో మమోదరే తిష్ఠసి బ్రూహి విప్ర. 47

ఉదరస్థకచశుక్రసంవాదః.

కచః : భవ త్ప్రసాదా న్న జహాతి మాం స్మృతి స్సర్వం స్మరేయం యచ్చ యథా చ వృత్తమ్ ।
న త్వేవ న స్యా త్తపసః క్షయో మే తతః క్లేశం ఘోరతరం సహామి. 48
అసురై స్సురాయాం భవతోఽస్మి దత్తో హత్వా దగ్ధ్వా చూర్ణయిత్వా చ కావ్య ।
బ్రాహ్మీం మాయాం త్వాసురీ త్వన్యమాయా త్వయి స్థితే కథమే వాతివర్తతే. 49
శుక్రః: కిం తే ప్రియం కరవాణ్యద్య వత్సే వధేన య త్తేన మే జీవితం స్యాత్ ।
నాన్యత్ర కుక్షే ర్మమ భేదనేన దృశ్యేత్ కచో మద్గతో దేవయాని. 50
దేవయానీ: ద్వౌ మాం శోకా వగ్నికల్పౌ దహేతాం కచస్య నాశ స్తవ చాభిఘాతః.
కచస్య నాశే మమ నాస్తి శర్మ తవోపఘాతే జీవితుం నాస్మి శక్తా. 51
శుక్రః: సంసిద్ధరూపోఽసి బృహస్పతే స్సుత యత్త్వాం భక్తం భజతే దేవయానీ ।
విద్యా మిమాం ప్రాప్నుహి జీవనీం త్వం న చే దిన్ద్రః కచరూపీ త్వ మద్య. 52
నివర్తేత పున ర్జీవ న్కశ్చి దన్యో మమోదరాత్ ।
బ్రాహ్మణం వర్జయిత్వైకం తస్మా ద్విద్యా మవాప్నుహి. 53
పుత్రో భూత్వా భావయిత్వా మమ త్వం తస్మా ద్దేహా త్తవ నిష్క్రాన్తి రస్తు ।
సమవాచక్ష చ్చాధర్మవతా మపేతాం గురో స్సకాశా త్ప్రాప్య విద్యాం సవిద్యః 54
భిత్త్వా కుక్షిం నిర్విచక్రమే విప్రః కచోఽభిరూపో దక్షిణం బ్రాహ్మణస్య ।
ప్రాలేయాద్రే శ్శుక్ల ముద్భిద్య శృఙ్గం రాత్ర్యాగమే పౌర్ణమాస్యా మివేన్దుః. 55
దృష్ట్వా చ తం పతితం బ్రహ్మరాశిం సంస్థాపయామాస తతః కచోపి ।
విద్యాం సిద్ధాం తా మవాప్యాభివాద్య తతః కచ స్తం గురు మిత్యువాచ. 56
కచః : ఋతస్య దాతార మనుత్తమస్య నిధిం నిధీనాం చ వరం వరాణామ్ ।
యే నాద్రియన్తే గురు మర్చనీయం పాపా న్లోకాం స్తే వ్రజ న్త్యప్రతిష్ఠాన్. 57

సురాయాశ్శుక్రదత్తశాపః.

శౌనకః : సురాపానా ద్వంచనాం ప్రాపయిత్వా సంజ్ఞా నాశం చేతనశ్చాపి ఘోరమ్ ।
దృష్ట్వా కచం చాపి తథాభిరూపం పీతం తథా సురయా మోహితేన. 58
సమన్యు రుత్థాయ మహానుభావ స్తదోశనా విప్రహితం చికీర్షుః ।
కావ్య స్స్వయం వాక్య మిదం జగాద సురాపానా ప్రత్యసంజాతశఙ్కః. 59
శుక్రః : యో బ్రాహ్మణోఽద్యప్రభృతీహ కశ్చి న్మోహా త్సురాం పాస్యతి మన్దబుద్ధిః ।
అపేతధర్మా బ్రహ్మహా చైవ స స్యా దస్మి న్లోకే గర్హిత స్స్యా త్పరే చ. 60
మయా చేమాం విప్రధర్మోక్తసీమాం మర్యాదాం చ స్థాప్య తాం సర్వలోకే ।
సన్తో విప్రా శ్శుశ్రువాంసో గురూణాం దేవలోకా శ్చోపశృణ్వన్తు సర్వే. 61
శౌనకః : ఇతీద ముక్త్వా స మహానుభావ స్తపోనిధీనాం నిధి రప్రమేయః ।
తా న్దానవాం శ్చైవ విమూఢబుద్ధీ నిదం సమాహూయ వచోఽభ్యువాచ. 62
శుక్రః : ఆచక్షే వో దానవా బాలిశాస్తు శిష్యః కచో వత్స్యతి మత్సమీపే ।
సఞ్జీవనీం ప్రాప్య విద్యా మమాయాం తుల్యప్రభావో బ్రా(బ)హ్మణో బ్రహ్మభూతః. 63

శౌనకః : గురో ర్వృషే స్వకాశే చ దశవర్షశతాని చ । అనుజ్ఞాతః కచో గన్తు మియేష త్రిదశాలయమ్.

ఇతి శ్రీమత్స్యే మహాపురాణే మత్స్యమనుసంవాదాన్తర్గత శౌనకశతానీక
సంవాదే చన్ద్రవంశానువర్ణనే యయాతిచరితే కచవృత్తాన్త
కథనం నామ పఞ్చవింశతితమోఽధ్యాయః.

మరల ఒకనాడు దేవయాని కోరగా ఆమె కొరకు పుష్పములను తెచ్చుటకై శాశ్వతమగు బ్రహ్మమును-వేదమును(ఏలయన అది పరబ్రహ్మమువలెనే శాశ్వతమును-ప్రతి సృష్టియందును తనంతట తాను నిష్పన్నమై బ్రహ్మాది ఋషులకు దర్శనమును ఇచ్చుచు లోకమున పరంపరాగతమయి వ్యాపించునదియును) పఠించుచు అరణ్యమునకు పోయెను. అంతట మరల రాక్షసులు రెండవమారు కచుని చంపి చూర్ణముగా చేసి దానిని మద్యములో కలిపి శుక్రునకు త్రావుటకై ఇచ్చిరి.

మరల దేవయాని తన తండ్రి కడకు పోయి తండ్రితో ఇట్లు పలికెను. "నాయనా, నేను పూలు తెమ్మని కచుని పంపితిని. ఆ పనికై వెళ్ళిన అతడు తిరిగి కనబడలేదు. బృహస్పతి పుత్త్రుడు కచుడు మృతుడై ప్రేతల గతికి పోయియుండును."

శుక్రుడు: "నేను అతనిని మరల విద్యతో జీవింపజేసినను నేను నీకు చేయు ఉపకారమేమున్నది? దేవయానీ! నీవు ఇట్లు శోకింపకుము. ఏడువకుము. ఐనను నీకు మాత్రము తక్కువ ఏమున్నది? ఇంద్రుని సేవించుచుండు దేవర్షులును బ్రహ్మర్షులును మునులును ఇంద్రాది దేవతలును వసువులును అశ్వినులును రాక్షసులందరును లోకమునందలి ప్రతియొక పదార్థమును నా తపఃప్రభావమున నీ సేవకై నీ ఎదుట నిలుచును. ఇట్టి నీవంటి ఆమె మర్త్యుని విషయములో శోకించుట తగినది కాదు. అదియును కాక ఈ బ్రాహ్మణుని జీవింపజేయుట సాధ్యముకాదు. ఒకవేళ జీవింపజేసినను అతడు మరల మరణించును."

దేవయాని: సాక్షాత్ ప్రజాపతియగు అంగిరసుడు లోకమునందలి వృద్ధతములలోనివాడు ఈ కచునికి తాతగారు. తపోనిధియగు బృహస్పతి ఇతని తండ్రి. బ్రహ్మచర్య వ్రతమును అనుష్ఠించుచున్నవాడు. తపోధనుడు. ఎల్లప్పుడు ఉన్నతమగు చిత్తవృత్తితో ఉండువాడు. కార్యములను ఎట్టివానినైనను నిర్వహించుటలో సమర్థుడు. చాల సుందరుడు. నాకు ఇష్టుడు. నేను కచుని మార్గమునే అనుసరింతును. భోజనము చేయను "

దేవయాని పలికిన మాటలు విని మహర్షియు కవి కుమారుడును అగు శుక్రుడు క్రోధావేశముతో ఇట్లు పలికెను: ఈ రాక్షసులు నా శిష్యునియందు పగపూని ఇట్లు చంపుచున్నారు. అనిన - వారు నన్నును ద్వేషించుచున్నట్లున్నది. దానవులు ఈ విధముగా చేయుచున్నారనిన-వారు బ్రాహ్మణులనే నశింపజేయదలచుచున్నట్లున్నది. వారు చేయదలచు-చేయు-ఈపని కూడ ఇంతటితోనే ముగియగలదు. బ్రహ్మహత్యా దోషము ఎవనిని కాల్చివేయకుండును? అది ఇంద్రుని కూడ విడువదు."

ఇట్లు పలికి శుక్రుడు విద్యతో కచుని పిలిచెను. దానితో అతడు బ్రదికెను. తరువాత అతనిని దగ్గరకు రమ్మని పిలిచెను. అతడు శుక్రుని ఉదరమందుండియే నెమ్మదిగా మాటలాడెను. శుక్రుడును కచునితో "విప్రా! ఎవరు చేసిన పనిచేత నీవు నా ఉదరములోనికి వచ్చి ఇక్కడ ఇట్లున్నావో చెప్పుము." అనెను.

కచుడు: అయ్యా! మీ అనుగ్రహమువలన పూర్వ స్మృతి జ్ఞానము నన్ను విడుచుటలేదు. ఏది ఎట్లు జరిగినదో అంతయు స్మృతియందు ఉన్నది. (ఇక్కడ నాకు కలుగుచున్న బాధను నా తపో మహిమతో పోగొట్టుకొనగలను. బయటకు రాగలను. కాని) నా తపోనాశము జరుగనీయరాదను తలంపుతో ఈ బాధను సహించుచు ఊరకున్నాను. రాక్షసులు నన్ను చంపి కాల్చి నీ మద్యములో కలిపి నీకు ఇచ్చినారు. మీరు ఇంతటివారు ఉండగా రాక్షసమాయ కాని మరి ఏ ఇతరుల మాయకాని వేదశక్తితో సిద్ధించిన బ్రాహ్మణ మాయను మించిపోగలదు?"

శుక్రుడు: "పుత్రీ! నా మరణము జరుగనిదే కచుడు జీవించుట జరుగదు. నా ఉదరము చీలనిదే నా పొట్టలోని ఈ కచుడు బయటకు వచ్చి కనబడు అవకాశము లేదు. ఈ రెంటిలో నీకు ఏది ప్రియమో తెలిపినచో అది చేయుదును."

దేవయాని: "నన్ను అగ్నివంటి రెండు శోకములు దహించుచున్నవి. వానిలో ఒకటి కచుని మరణము- రెండవది మీ నాశము. కచుని నాశము వలన నాధర్మము నశించును. మీరు మరణించినచో నేను బ్రదుకనే బ్రదుకజాలను."

శుక్రుడు (కచునితో): "బృహస్పతి కుమారా! నీవు భక్తితో దేవయానిని సేవించి ప్రతిఫలముగా నీవు ఆమె భక్తిని పొందగలుగుటచేత నీవు నీ యత్నములో సంపూర్ణముగా సిద్ధి పొందితివి. ఇదిగో! ఈ సంజీవనీ విద్యను నీకు అందించుచున్నాను. గ్రహింపుము. నీవు కచుని రూపములో నున్న ఇంద్రుడవు ఐనచో మాత్రము నీకు నేను ఈ విద్యనీయను. ఏలయనగా బ్రాహ్మణుడు తప్ప మరెవ్వడును నా ఉదరమునుండి పునర్జీవితుడయి బయటకు వచ్చు అవకాశము లేదు. నీవు బ్రాహ్మణుడవే కనుక నా కుమారుడవయి నానుండి విద్యను స్వీకరింపుము. అనంతరము ఆ విద్యా గ్రహణముతో దానిని భావనచేసి (ఆ మంత్రమునందు సిద్ధినిపొంది) తరువాతనే నీవు నా శరీరము నుండి వెలువలికి రావలెను."

ఇట్లు పలికి శుక్రుడు అధర్మపరులయి ప్రవర్తించువారి భేదమును (ధర్మపరులకును అధర్మపరులకును గల భేదమును) నిందించెను. అంతట కచుడు గురువగు శుక్రునినుండి సంజీవనీ విద్యను అందుకొని విద్యానహితుడై అతని దక్షిణకుక్షిని (ఉదరమును) చీల్చుకొని ఎప్పటి సుందరరూపముతో వెలువలికి వచ్చెను. అపుడతడు రాత్రి కాగానే హిమవత్పర్వతపు తెల్లని శిఖరపు చాటునుండి ఉదయించి పైకి వచ్చు పూర్ణిమా చంద్రునివలె ప్రకాశించెను. కచుడును పడియున్న వేదరాశివంటి శుక్రుని చూచి తన విద్యాబలముచే అతనిని మరల బ్రదికించి లేవదీసెను. ఇట్లు సిద్ధి పొందిన విద్యను సంపాదించుకొని కచుడు గురుని నమస్కరించి ఇట్లు పలికెను.

"సర్వోత్తమమగు బ్రహ్మచర్య వ్రతమును ప్రదానము చేసినవాడును నిధులలో గొప్ప నిధియు గొప్ప వారందరలో గొప్పవాడును పూజింపదగిన వాడును అగు గురుని ఎవరు ఆదరించరో-వారు అయోగ్యములును పాపానుభవమును కలిగించు నవియును అగు లోకములను పొందుదురు."

శుక్రుడు తాను సురాపాన ప్రభావమున రాక్షసులవలన వంచనకు పాత్రుడయ్యెను. తన చిత్తమునకు గల తెలివి అంతయు ఘోరమగు నాశమును పొందెను. మిగుల సుందరుడును యోగ్యుడును అగు కచుడు అజ్ఞానముచే మద్యముతో పాటు తనచేత త్రాగబడిన విషయము నాతడాలోచించెను. ఇందుచే ఆ మహానుభావునకు కోపము కలిగి అతడు లేచి నిలువబడెను. సురాపానము విషయమున ఏ సందేహమును లేని నిశ్చయము చేసికొనెను. ఆ కావ్యుడు ఉశనసుడు బ్రాహ్మణులకు హితము చేయగోరి స్వయముగా ఈ విధముగా పలికెను. "ఇది మొదలుకొని ఏ బ్రాహ్మణుడైన మందబుద్ధియై అజ్ఞానవశమున మద్యమును త్రావినచో అతడు ధర్మభ్రష్టుడై బ్రహ్మహత్యా పాపమును పొందును. ఇహ లోకమునందును పరలోకమునందును నిందితుడగును. బ్రాహ్మణులు ఆచరించవలసిన ధర్మము విషయములో నేను చెప్పిన అవధిని ధర్మవ్యవస్థను లోకమునందంతట విప్రులు నిలుపుకొందురుగాక! వేదములందును శాస్త్రములందును పెద్దల వచనములందును ప్రామాణ్య బుద్ధి కలవారును గురువుల నుండి వేదశాస్త్ర తత్త్వమును అధ్యయనము చేసిన వారును అగు విప్రులును దేవలోకమునందలి దేవతలును దేవర్షులును అందరును దీనిని వినుదురుగాక!"

మహానుభావుడును తపోనిధులలోగూడ ఇంత గొప్పది అని చెప్పనలవికాని గొప్పనిధియును అగు ఆ శుక్రుడు విమూఢ బుద్ధులగు దానవులను కూడ పిలిచి ఇట్లు పలికెను. "బాలిశులైన దానవులారా! మీకు ఒకమాట చెప్పుచున్నాను

వినుడు. నా శిష్యుడు అగు ఈ కచుడు నావలన మాయారహితమగు సంజీవనీ విద్యను సంపాదించి నాప్రభావముతో సమాన ప్రభావము కలిగి బ్రహ్మత్వమునే పొందిన బ్రాహ్మణుడై నా సమీపమున నుండును."

ఇట్లు కచుడు ఋషియు తన గురువును అగు శుక్రుని దగ్గర వేయి సంవత్సరములు ఉండి గురునినుండి అనుమతిని పొంది స్వర్గమునకు మరలిపోదలచెను.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున చంద్రవంశానువర్ణనమున యయాతి చరిత్రమున
కచ వృత్తాంత కథనము అను ఇరువదియైదవ అధ్యాయము.

## షడ్వింశతితమోఽధ్యాయః.
## కచ దేవయానీ సంవాదః.

శౌనకః : సమావృత్తం తు దత్తం తం విసృష్టం గురుణా తతః ।
ప్రస్థితం త్రిదశావాసం దేవయా న్యబ్రవీ దిదమ్. 1
దేవయానీ: ఋషే రఙ్గిరసః పౌత్త్రః వృత్తే నాభిజనేన చ । భ్రాజసే విద్యయా చైవ తపసా చ దమేన చ.
ఋషి ర్యథాఙ్గిరా మాన్యః పితు ర్మమ మహాయశాః ।
తథా మాన్యశ్చ పూజ్యశ్చ మమ భూయో బృహస్పతిః. 3
ఏవం జ్ఞాత్వా విజానీహి య ద్బ్రవీమి తపోధన । వ్రతస్థనియమోపేత యథా వర్తా మ్యహం త్వయి. 4
స సమావృత్తవిద్యో మాం భక్తాం న త్యక్తు మర్హసి । గృహాణ పాణిం విధివ న్మమ మన్త్రపురస్కృతమ్.
కచః: పూజ్యో మాన్యశ్చ భగవా న్యథా మమ పితా తవ । తథా త్వ మనవద్యాఙ్గి *పూజనీయోత్తమా శుచిః.
ఆత్మప్రాణైః ప్రియతమా భార్గవస్య మహాత్మనః । త్వం భద్రే ధర్మతః పూజ్యా గురుపుత్త్రి సదా మమ.
గురు ర్నిత్యం పూజ్యతమో మాన్య శ్శుక్రః పితా తవ ।
దేవయాని తథైవ త్వం నైవం మాం వక్తు మర్హసి. 8
దేవయానీ: గురుపుత్త్రస్య పుత్త్రో మే న తు త్వమసి మే పితుః ।
తస్మా న్మాన్యశ్చ పూజ్యశ్చ మమాపి త్వం ద్విజోత్తమ. 9
అసురై ర్హన్యమానే చ కచ త్వయి పునః పునః । తదాప్రభృతి యా వృత్తి స్తాం త్వం వేత్సి న వేత్సి మే.
సౌహార్దే చానురాగే చ వేత్థ మే భక్తి ముత్తమామ్ । న మా మర్హసి ధర్మజ్ఞ త్యక్తుం ♦భక్తాం మనోరమామ్.

## ఇరువది ఆరవ అధ్యాయము
## కచ దేవయానీ సంవాదము

శౌనకుడు శతానీకునితో ఇట్లు చెప్పెను: కచుడు ఇట్లు విద్యాధ్యయన సమాప్తి చేసి సమావర్తన వ్రతము జరిపి స్వగృహమునకు పోవుటకు తన గురుని అనుమతి నందెను. గురుడు అతనికి వీడ్కోలు చెప్పెను. అతడును దేవలోకమునకు పోవుటకు బయలుదేరెను. అపుడు దేవయాని కచునితో ఇట్లు పలికెను: "నీవు స్వయముగా అంగిరః ప్రజాపతికి పౌత్త్రుడవు. ఉన్నత వంశము మంచి నడువడి విద్య తపస్సు దమము కలిగి మిగుల ప్రకాశించుచున్నావు. మా తండ్రికి మహాయశుడగు అంగిరోమహర్షి పూజ్యుడైనట్లు మీ తండ్రి బృహస్పతి నాకు అట్లును అంతకంటె అధికముగా కూడ మాన్యుడును పూజ్యుడును. ఇది తెలిసి తపోధనా! నేను చెప్పుచున్న విషయము అర్థము చేసికొనుము. నీవు విద్యావ్రతము నందుండి ఆ నియమములు పాటించుచున్న నీ విషయములో నే నెట్లుంటినో నీవు ఎరుగుదువు. ఇపుడు నీవు విద్యాధ్యయ

---

* పూజనీయోత్తమోత్తమా. ♦ భక్తామనాగసమ్.

తము ముగించి సమావర్తనము చేసికొనినావు. నేను నీ భక్తురాలను. నన్ను నీవు విడుచుట తగదు. యథావిధిగా మంత్ర పూర్వకముగా నీవు నా పాణిగ్రహణము చేయుము."

కచుడు: "నీవు లక్షణవంతమయిన దేహము కలదానవగుటతోపాటు ఉత్తమురాలవును పవిత్రురాలవును. భగవానుడవగు మీ తండ్రివలె నీవును నాకు పూజ్యురాలవు. మహాత్ముడగు భార్గవు(శుక్రు)నకు నీవు వాని ప్రాణములవలె ఇష్టవు. గురుపుత్రివగుటచే పూజ్యురాలా! ధర్మము ననుసరించి నీవును సదా నాకు పూజ్యవు. నీకు తండ్రియు నాకు గురుడును అగు శుక్రకులవారు నాకు సదా పూజ్యులే కదా! కనుక నీవును నాకు అట్టిదానవే. కనుక దేవయానీ! నీవు ఇట్లు పలుకదగదు."

దేవయాని: "నాకు గురుడు (పూజ్యుడు) అగు అంగిరసుని కుమారుడగు బృహస్పతికి కుమారుడవే కాని నా తండ్రికి పుత్త్రుడవు కావు. కనుక నీవును నాకు మాన్యుడవును పూజ్యుడవును. అదియుగాక మాటిమాటికిని నిన్ను రాక్షసులు వధించగా నేను నీ విషయమున ఎట్లుంటినో నీవు ఎరుగుదువా-ఎరుగవా? సౌహార్దముగాగాని అనురాగముగాగాని నాకు నీ యందలి భక్తిని నీవు ఎరుగుదువు. నీవు ధర్మమును ఎరిగినవాడవు. నేను భక్తురాలను-సౌందర్యవతిని-నీ మనస్సును ఆనందపెట్టుదానను. నన్ను నీవు విడుచుట తగదు."

కచః: అనియోజ్యే నియోగే మాం నియుంక్ష్యసి శుభవ్రతే।ప్రసీద సుభ్రూ ర్మహ్యం త్వం గురో ర్గురుతరే శుభే.
యత్రోషితం విశాలాక్షి త్వయా చన్ద్రనిభాననే । తత్రాహ ముషితో భద్రే కుక్షౌ కావ్యస్య భామిని. 13
భగినీ ధర్మతో మే త్వం మైవం వోచ శుభాననే । సుఖేనాద్యుషితో భద్రే న మన్యు ర్విద్య తే మమ. 14
ఆపృచ్ఛే త్వాం గమిష్యామి శివ మస్తు చ మే పథి । అవిరోధేన ధర్మస్య కర్తవ్యోఽస్మి కథాన్తరే. 15
అప్రమత్తోత్థితా నిత్య మారాధయ గురుం మమ ।
దేవయానీ: యది మాం ధర్మకామార్థం ప్రత్యాఖ్యాస్యసి ధర్మతః. 16
తతః కచ న తే విద్యా సిద్ధి మేషా గమిష్యతి । కచః: గురుపుత్త్రీతి కృత్వాహం ప్రత్యాచక్షే న దోషతః.
గురుణా చాభ్యనుజ్ఞాతా కామ మేవం శ్రయస్వ మామ్ ।
ఆర్షం ధర్మం బ్రువాణో హి దేవయాని యథా త్వయా. 18
శప్తో నార్హోఽస్మి శాపస్య కామతోఽపి న ధర్మతః । తస్మా ద్భవత్యా యః కామో న తథా న భవిష్యతి. 19
ఋషిపుత్త్రో న తే కశ్చి త్కదా పాణిం గ్రహీష్యతి । ఫలిష్యతి న మే విద్యా త్వద్వచశ్చేతి త త్తథా. 20
అధ్యాపయిష్యామి చ యం తస్య విద్యా ఫలిష్యతి ।
శౌనకః: ఏవ ముక్త్వా నృపశ్రేష్ఠ దేవయానీం కచ స్తదా. 21
త్రిదశేశాలయం శీఘ్రం జగామ ద్విజపుఙ్గవః । తదాగమ మభిప్రేక్ష్య దేవా స్సేన్ద్రపురోగమాః. 22
బృహస్పతేశ్చ సదసి కచ మాహు ర్ముదాన్వితాః ।
దేవాః : య త్త్వ మస్మద్ధితం కర్మ కృతవా న్మహ దద్భుతమ్. 23
న తేజసా ప్రణశితా భాగభా క్త్వం భవిష్యసి. 234

ఇతి శ్రీమత్స్యమహాపురాణే మత్స్యమనుసంవాదాన్తర్గత శౌనకశతానీక
సంవాదే చన్ద్రవంశానువర్ణనే యయాతిచరితే దేవయానీ
కచసంవాదో నామ షడ్వింశతితమోఽధ్యాయః.

కచుడు: "నీవు శుభములగు కర్మములనే ఆచరించుదానవు. నియోగించకూడని పనిలో నీవు నన్ను నియోగించుచున్నావు. నాపై దయ చూపుము. (అనురాగమును కాదు.) నీవు సుందరివి కాదని నే ననలేదు. కాని నీవు శుభ

స్వరూపవు. కావున నీవు నాకు నా గురునికంటెను గురుతర(పూజ్యతర)వు. నీవు వసించిన శుక్రుని గర్భమునందే నేనును వసించితిని. కోపింపకుము. ధర్మముచే నీవు నాకు సహోదరివి. శుభాననా! నన్నిట్లు పలుకదగదు. నీ దయచే నే నిచట సుఖముగా ఉంటిని. నిజమే. నీ విట్లడిగితి వని నాకు నీపై కోపమును లేదు. నాకు సెలవు ఇమ్ము. పోయి వత్తును. నాకు మార్గమున శుభమగునట్లు దీవించుము. ఇకమీదట ఇతర విషయములందును ధర్మావిరుద్ధముగా నడుచు కొనునట్లు ఆశీర్వదించుము. ఏమరుపాటులేని పూనికతో నా గురుని నిత్యమును ఆరాధించుచుందును."

దేవయాని: "నీవు కేవలము ధర్మమునందే దృష్టినుంచి నా అనురాగమును తిరస్కరించుచున్నావు. కనుక నీకు ఈ విద్య సిద్ధి నీయదు."

కచుడు: "నీవు గురుపుత్త్రివి అను హేతువుచే నేను నిన్ను కాదంటినే కాని నీయందు దోషమున్నదని కాదు. ఒకవేళ మీ తండ్రి అనుమతించినచో నన్ను నీవు భర్తగా ఆశ్రయించినను నేను కాదనను. నేను చెప్పినది ఆర్షమగు ధర్మము. ఇట్టి నన్ను నీవు ధర్మ దృష్టితో నైనను కామదృష్టితోనే యైనను శపించుట న్యాయము కాదు. కనుక నీ కామ పురుషార్థము కూడ అది ధర్మానుకూలముగా నడువకపోవుగాక! (బ్రాహ్మణుడగు) ఋషిపుత్త్రుడు ఎవ్వడును ఎప్పుడును నిన్ను వివాహమాడకుండుగాక! నీ మాటచే నాకు ఈ విద్య ఫలింపకున్నను నేను దాని నుపదేశించిన వానికి ఫలించును."

దేవయానితో ఇట్లు పలికి వెంటనే కచుడు స్వర్గమునకై బయలుదేరిపోయెను. ఇంద్రాది దేవతలును కచుడు స్వర్గమునకు మరలి వచ్చిన సందర్భమున-బృహస్పతి సన్నిధిలో సభ జరిపి దానిలో సంతోషమున కచునితో ఇట్లనిరి: "నీవు చాల గొప్పదియు అద్భుతమును నగు హితమును మాకు ఆచరించితివి. కావున నీ తేజస్సు ఎన్నటికిని నశింప కుండును. నీకు యజ్ఞములందు భాగము ఉండును."

**ఇది శ్రీమత్స్య మహాపురాణమున చంద్రవంశాను వర్ణనమున యయాతి చరితమున దేవయానీ కచ సంవాదము అను ఇరువది ఆరవ అధ్యాయము.**

## సప్తవింశతితమోఽధ్యాయః.
## శర్మిష్ఠాదేవయాన్యోర్విరోధకారణమ్.

శౌనకః : కృతవిద్యే కచే ప్రాప్తే హృష్టరూపా దివౌకసః ।
కచా దధీత్య తాం విద్యాం కృతార్థా భరతర్షభ. 1
సర్వ ఏవ సమాగమ్య శతక్రతు మథాబ్రువన్ । కాల స్త్వ ద్విక్రమ స్యాద్య జహి శత్రూ న్పురందర. 2
ఏవ ముక్తస్తు సహితై స్త్రిదశై ర్దేవరా ట్తదా । తథేత్యుక్త్వ స్సుసంక్రుద్ధ స్సోఽపశ్య ద్విజనే స్త్రియః. 3
క్రీడ న్తీనాం తు కన్యానాం వనే చైత్రరథోపమే । వాయుభూత స్స వస్త్రాణి సర్వాణ్యేవా హ్యమిశ్రయత్. 4
తతో జలా త్సముత్తీర్య తా: కన్యా స్సహితా స్తదా। వస్త్రాణి జగృహు స్తాని యథా నాన్య దనేకశః. 5
తత్ర వాసో దేవయాన్యా శ్శర్మిష్ఠా జగృహే తదా । వ్యతిక్రమ మజాన న్తీ దుహితా వృషపర్వణః. 6
తత స్తయో ర్మిథ స్తత్ర విరోధ స్సమజాయత । దేవయాన్యాశ్చ రాజేన్ద్ర శర్మిష్ఠాయాశ్చ తత్కృతే. 7
దేవయానీ: యస్మా ద్గృహ్ణాసి మే వస్త్రం శిష్యా భూత్వా మమాసురి ।
సముదాచారహీనాయా న తే శ్రేయో భవిష్యతి. 8
శర్మిష్ఠా : ఆసీనం చ శయానం చ పితా తే పితరం మమ । స్తౌతి పృచ్ఛతి చాభీక్ష్ణం నీచస్థ స్సువినీతవత్. 9
యాచత స్త్వం చ దుహితా స్తువతః ప్రతి గృహ్ణతః ।
సుతాఽహం స్తూయమానస్య దదతో న తు గృహ్ణతః. 10
అనాయుధా సాయుధాయాం కిం త్వం కుప్యసి భిక్షుకి ।
లక్షణం ప్రతియోద్ధారం న చ త్వాం గణయా మ్యహమ్. 11

శౌనకః : సవిస్మయాం దేవయానీం సతాం సత్రాం చ వానసి ।
శర్మిష్ఠా ప్రాక్షిప త్కూపే తత స్స్వపుర మావ్రజత్. 12
హతేయ మితి విజ్ఞాయ శర్మిష్ఠా పాపనిశ్చయా । అనవేక్ష్య గతా తస్మా త్క్రోధవేగపరాయణా. 13

## ఇరువది ఏడవ అధ్యాయము

## శర్మిష్ఠా దేవయానీ విరోధకారణము

శౌనకుడు శతానీకునితో ఇట్లు చెప్పెను: కచుడు శుక్రుని వలన విద్యను సంపాదించికొని రాగా దేవతలు మిగుల సంతోషించి ఆ విద్యను కచునినుండి అధ్యయనము చేసి కృతార్థు లయిరి. తరువాత వారు అందరును ఇంద్రుని కడకు పోయి-ఇది మనము విక్రమము చూపదగిన సమయము. శత్రువులను చంపుదము-అనిరి. వారి మాటను వినుచునే క్రోధముతో చూచిన ఇంద్రునకు విజన ప్రదేశమున కుబేరుని *చైత్రరథమువంటి వనమున జలమున క్రీడించుచున్న రాక్షస కన్యలు కనబడిరి. అతడు వాయువుగా నయి వారి వస్త్రములను అన్నిటిని కలిపివేసెను. కొంత సేపటికి నీటినుండి పైకి వచ్చిన ఆ కన్యలు అందరును చాల వరకు ఒకరిది మరియొకరికి రాకుండునట్లు వస్త్రములను తీసికొని ధరించిరి. వారిలో వృషపర్వుని కూతురు శర్మిష్ఠ వస్త్రముల మార్పిడి గుర్తించలేక తాను దేవయాని వస్త్రమును తీసికొని ధరించెను. అంతట దాని నిమిత్తమై శర్మిష్ఠా దేవయానులకు విరోధము ఏర్పడెను.

దేవయాని: "నీవు రాక్షస కన్యవు నాకు శిష్యురాలవు ఐయుండి నా వస్త్రమును ధరించితివి. కనుక నీకు శ్రేయస్సు కలుగకుండుగాక!"

శర్మిష్ఠ: మా నాయన ఉన్నత స్థానమున కూర్చున్నప్పుడును పండుకొన్నప్పుడును ఆయనను మీ నాయన తాను క్రింద నిలువబడి మాటికిమాటికి వినీతుడై స్తుతించుచు యాచించుచు ఉండును. నీవు పొగడెడి-అడుగుకొనెడి-వాని కూతురవు. నేనో- పొగడబడెడి-యాచింపబడెడి-వాని కూతురను. నీవు నిరాయుధవు. నేను సాయుధను. బిచ్చగత్తెవు నీవు నాపై ఏమి కోపింతువు? నీకు సాటియగు ప్రతియోద్ధ (ఎదిరించి యుద్ధము చేయువాడు) లభించును లెమ్ము. నేను మాత్రము నిన్ను నా సరిదానిగా లెక్కింపను."

జరిగిన దానికి ఆశ్చర్యపడుచు దేవయాని వంగి తన వస్త్రమునకై పట్టుదలతో నుండెను. ఆమెను బావిలో త్రోసి శర్మిష్ఠ తన పురమునకు పోయెను. పాప సంకల్పము గలదియై ఆ శర్మిష్ఠ దేవయాని మరణించియుండునని తలంచుచు క్రోధవేగవశురాలయి తిరిగియైన చూడక అక్కడినుండి వెడలిపోయెను.

చేతవ్యం దేశ మభ్యాగా ద్యయాతి ర్నహుషాత్మజః । శ్రాన్తయుగ్యః శ్రాన్తహయో మృగలిప్సుః పిపాసితః.
నాహుషిః ప్రేక్షమాణోఽథ నదిపానే గతోదకే । దదర్శ కన్యాం తాం తత్ర దీప్తా మగ్నిశిఖా మివ. 15
తా మపృచ్ఛ త్స తత్రైవ కన్యా మమరవర్ణినీమ్ । సాన్త్వయిత్వా నరశ్రేష్ఠ స్సామ్నా పరమవల్గునా. 16
కా త్వం చారుముఖీ శ్యామా సుమృష్టమణికుణ్డలా । దీర్ఘం ధ్యాయసి చాత్యర్థం కస్మా చ్ఛోచసి చాతురా. 17
కథం చ పతితా హ్యస్మి న్కూపే వీరుత్తృణావృతే । దుహితా చైవ కస్య త్వం వద సర్వం సుమధ్యమే.18
దేవయానీ : యోఽసౌ దేవై ర్హతా న్దైత్యా నుత్థాపయతి విద్యయా ।
తస్య శుక్రస్య కన్యాఽహం స మాంనూనం న మన్యతే. 19
ఏష మే దక్షిణో రాజ న్పాణి స్తామ్రనఖాఙ్గుళిః । సముద్ధర గృహీత్వా మాం కులీన స్త్వం హి మే మతః.20
జానామి త్వాం చ శంసన్తి వీర్యవన్తం యశస్వినమ్ ।
తస్మా న్మాం పతితాం కూపా దస్మా దుద్ధర్తు మర్హసి. 21

శౌనకః : తా మథ బ్రాహ్మణీం స్త్రీంచ విజ్ఞాయ నహుషాత్మజః ।
గృహీత్వా దక్షిణే పాణా వుజ్జహార తతోఽవటాత్. 22
ఉద్ధృత్య చైనాం తరసా తస్మా త్కూపా న్నరాధిపః ।
ఆమన్త్రయిత్వా సుశ్రోణీం యయాతి స్స్వపురం యయౌ. 23

అంతలో నహుష పుత్త్రుడగు యయాతి వేటకై ఆ ప్రదేశమునకు వచ్చెను. అతడు మృగముల వెంటనంటిపోగా పోగా అతని రథపు గుర్రములును తానును అలసిపోయెను. దప్పిగొనెను. అతడు నీటికై వెదకుచు దగ్గరలో నీటిలొట్టి ఉండియు నీరులేని గోతిలో ప్రజ్వలించుచున్న అగ్నిజ్వాలవలె ఉన్న కన్యను దేవయానిని చూచెను. ఆ నరశ్రేష్ఠుడు మహా మనోహరమగుమాటలతో ఆమెను ఓదార్చుచు దేవకన్యవంటి ఆ దేవయానిని ఇట్లు ప్రశ్నించెను: "మనోహరముఖము చక్కని దేహచ్ఛాయ చక్కగా మెరుగు దీర్చిన మణికుండలములు కలిగి ప్రకాశించుచున్న నీవు ఎవరవు? ఏల చింతించుచు ఆతురురాలవయి శోకించుచున్నావు? తీగలతో గడ్డితో కప్పబడి ఉన్న ఈ గోతిలో ఎట్లు పడితివి? నీవు ఎవ్వరి కూతురవు? అంతయు నాకు విశదముగా చెప్పుము."

దేవయాని: "యుద్ధమున మరణించిన దానవులను తన విద్యతో బ్రతికించెడి శుక్రుని ఎరుగుదువు కదా! నే నాతని కూతురను. కాని ఆయన నన్ను లెక్క పెట్టుచున్నట్లు లేదు. నీవు ఉన్నత వంశమున జన్మించినవాడవని నాకు తెలియును. నీవు వీర్యవంతుడవును యశోవంతుడవును అని అందరును నిన్ను గురించి చెప్పుచున్నారు. కావున నీవు నన్ను అంటినను దోషము లేదు. ఇదుగో! ఎఱ్ఱని గోళ్లను వ్రేళ్లను కలిగి ప్రకాశించు నా కుడిచేయి. దీనిని గ్రహించి బావిలోనుండి నన్ను పైకి తీయుము."

యయాతి ఆమె బ్రాహ్మణ స్త్రీయని ఎరిగి ఆమె కుడిచేతిని పట్టి ఆ గోతినుండి ఆమెను పైకి తీసెను. తరువాత ఆమె దగ్గర సెలవు తీసికొని అతడు తన పురమునకు పోయెను.

దేవయానీ : త్వరితం చూర్ణికే గచ్ఛ సర్వ మాచక్ష్వ మే పితుః ।
నేదానీం తు ప్రవేక్ష్యామి నగరం వృషపర్వణః. 24
శౌనకః : సా త్వపి త్వరితం గత్వా చూర్ణికాఽసురమన్దిరమ్ ।
దృష్ట్వా కావ్య మువాచేదం కమ్పమానా విచేతనా. 25
ఆచచక్షే మహాభాగా దేవయానీ వనే హతా । శర్మిష్ఠయా మహాప్రాజ్ఞ దుహిత్రా వృషపర్వణః. 26
శ్రుత్వా దుహితరం కావ్య స్తదా శర్మిష్ఠయా హతామ్ ।
త్వరయా । నిర్యయౌ దుఃఖా న్మార్గమాణశ్చ తాం వనే. 27
బాహుభ్యాం సమ్పరిష్వజ్య దుఃఖితో వాక్య మబ్రవీత్। ఆత్మదోషై ర్నియచ్ఛన్తి సర్వే దుఃఖం సుఖం జనాః.
మన్యే దుశ్చరితం తేఽస్తి తస్యేయం నిష్కృతిః కృతా ।
దేవయానీ: నిష్కృతి ర్వాఽస్తు మా వాఽస్తు శృణుష్వావహితో మమ. 29
శర్మిష్ఠయా య దుక్తాఽస్మి దుహిత్రా వృషపర్వణః । సత్యం కిలేతి చ ప్రాహ హీనా చాస్మి న చాధికా.30
సుతాఽహం స్తూయమానస్య దదతోఽప్రతిగృహ్ణతః । ఇతి మా మాహ శర్మిష్ఠా దుహితా వృషపర్వణః.31
క్రోధసంరక్తనయనా దర్పపూర్ణాననా తతః । యద్యహం స్తువత స్తాత దుహితా ప్రతిగృహ్ణతః. 33
ప్రసాదయిష్యే శర్మిష్ఠా మిత్యుక్త శ్చాబ్రవీ త్పితా ।
శుక్రః. స్తువతో దుహితా న త్వం భద్రే న ప్రతిగృహ్ణతః. 34
అత స్త్వం స్తూయమానస్య దుహితా దేవయాన్యసి । వృషపర్వైవ తద్వేద శక్రో రాజా చ నాహుషః. 35

అచిన్త్యం బ్రహ్మ నిర్ద్వన్ద్వ మైశ్వరం హి బలం మమ. 36

ఇతి శ్రీమత్స్యమహాపురాణే మత్స్యమనుసంవాదాన్తర్గత శౌనకశతానీకసంవాదే చన్ద్రవంశానువర్ణనే
యయాతిచరితే దేవయానీ శర్మిష్ఠావిరోధాదికథనం నామ సప్తవింశతితమోఽధ్యాయః.

తరువాత ఆ దేవయాని ఘూర్ణికయను తన చెలిని చూచి నేను ఇక వృషపర్వుని పురము ప్రవేశించను. ఈ విషయమును నీవు పోయి మా తండ్రికి చెప్పుము అనెను. ఘూర్ణికయును త్వరితముగా పోయి వృషపర్వుని భవనమున శుక్రుని దర్శించి తెలివి తప్పి వణకుచు "ఓ మహాప్రాజ్ఞా! మహాభాగురాలగు దేవయానిని వృషపర్వుని కూతురగు శర్మిష్ఠ కొట్టినది." అని చెప్పెను. అది విని శుక్రుడు దుఃఖముతో ఆమెను వెదకుచు అడవికి పోయెను. అడవిలో ఆమె కనపడగానే అతడామెను కౌగిలించుకొని దుఃఖముతో ఇట్లు పలికెను: "ఎల్ల ప్రాణులును తమ దోషముల (కర్మముల) ఫలముగానే దుఃఖమునుగాని సుఖమునుగాని పొందుచుందురు. నీవు ఏదో దుష్కర్మమును చేసియుందువు. దానికి ఇది ప్రాయశ్చిత్తము ఐయుండును." అనగా "ఇది ప్రాయశ్చిత్తము కావచ్చును. కాకపోవచ్చును. నా మాట సావధానముగా వినుడు. వృషపర్వుని కూతురు శర్మిష్ఠ నేను తనకంటె హీనురాలనే కాని అధికురాలను కాదు అనినది. ఈ మాట నిజమేఅగునా? ఆమె తన కన్నులను క్రోధముతో మిగుల ఎఱ్ఱజేసి తీక్ష్ణముగను పరుషముగను మాట లాడినది. నీవు స్తుతించుచు యాచించుచు దానములు అందుకొనెడి వాని కూతురవు. నేను స్తోత్రములు అందుకొనుచు యాచింపబడుచు దానములు పట్టక ఉండెడి వాని కూతురను. అని శర్మిష్ఠ నన్ను తూలనాడినది. ఈ మాటలు పలుకునప్పుడు ఆమె మొగము ఎంత దర్పముతో నిండియున్నదనుకొనుచున్నావు! నేను నిజముగ స్తుతించుచు యాచించుచు దానములు ప్రతిగ్రహించుచు ఉండువాని కూతురనేమో నీవే చెప్పుము. అట్లయినచో నే నామెను వేడికొని అనుగ్రహింపజేసికొందును." అని దేవయాని పలికెను. అది విని శుక్రుడు ఇట్లనెను: "ప్రియపుత్రీ! నీవు స్తుతించుచు దానములు ప్రతిగ్రహించుచు ఉండువాని కూతురవు కావు. స్తుతింపబడువాని కూతురగు దేవయానివి నీవు. ఈ విషయము వృషపర్వునికే తెలియును. ఇంద్రునకును తెలియును. యయాతికిని తెలియును. ఊహింప అలవికానిదియు ఉత్పత్తి నాశములు అనెడి ద్వంద్వము లేక నిత్యమును ఈశ్వర సంబంధియునగు బ్రహ్మము (వేదము) నాకు గల బలము."

ఇది శ్రీమత్స్యమహాపురాణమున చంద్రవంశాను వర్ణనమున యయాతి చరితమున శర్మిష్ఠా దేవయానీ విరోధాది కథనము అను ఇరువది ఏడవ అధ్యాయము.

## అష్టావింశతితమోఽధ్యాయః.
## శుక్రదేవయానీసంవాదః.

శుక్రః: యః పరేషాం నరో నిత్య మతివాదాం స్తితిక్షతి। దేవయాని! విజానీహి తేన సర్వ మిదం జితమ్.1
య స్సముత్పతితం క్రోధం నిగృహ్ణాతి హయం యథా। స యన్తే త్యుచ్యతే సద్భి ర్న యో రశ్మిషు సజ్జతే.2
య స్సముత్పతితం క్రోధం నియచ్ఛతి చ ధర్మతః। దేవయాని విజానీహి తేన సర్వ మిదం జితమ్. 3
య స్సముత్పతితం కోపం క్షమయైవ నిరస్యతి। యథోరగ స్త్వచం జీర్ణాం స వై పురుష ఉచ్యతే. 4
యశ్చ భావయతే ధర్మం యోఽతిమాత్రం తితిక్షతి। యశ్చ తప్తో న తపతి భృశం సోఽర్థస్య భాజనమ్.5
యో యజే దశ్వమేధేన మాసి మాసి శతం సమాః। య స్తర్పయతి చాన్నేన తయో రక్రోధనో వరః. 6
యత్ కుమారాః కుమార్యశ్చ వైరం కుర్యు రచేతసః। న త త్ప్రాజ్ఞస్తు కుర్వీత విదుస్తే న బలాబలమ్. 7
దేవయానీ: వేదాహం తాత బాలాఽపి కార్యాణాం తు గతిం యతః।
క్రోధే చైవాతివాదే వా వేద చాపి బలాబలే. 8
శిష్యై ర్హ్యశిష్యవృత్తైర్హి న క్షన్తవ్యం బుభూషతా। అసత్సఙ్కీర్ణవృత్తేషు వాసో మమ న రోచతే. 9
పుంసో యే నాభినన్దన్తి వృత్తేనాభిజనేన చ। న తేషు నివసే త్ప్రాజ్ఞ శ్శ్రేయోఽర్థీ పాపబుద్ధిషు. 10

యే త్వేన మభిజానన్తి వృత్తేనాభిజనేన చ । తేషు సాధుషు వస్తవ్యం న వాస శ్శ్రేష్ఠ ఉచ్యతే. 11
త న్మే మథ్నాతి హృదయ మగ్నికామ ఇవారణిమ్ । వా గ్దురుక్తం మహాఘోరం దుహితు ర్వృషపర్వణః.
న తస్మా ద్దుష్టవచనం మన్యే లోకేషు త్రిష్వపి । య త్సపత్నశ్రియం దీప్తాం హీనశ్శ్రీః పర్యుపాసతే. 13
ఇతి శ్రీమత్స్యమహాపురాణే మత్స్యమనుసంవాదాన్తర్గత శౌనకశతానీకసంవాదే చన్ద్రవంశానువర్ణనే
యయాతిచరితే శుక్రదేవయానీ సంవాదకథనం నామాష్టావింశతితమోఽధ్యాయః.

## ఇరువది ఎనిమిదవ అధ్యాయము

## శుక్రదేవయానీ సంవాదము

శుక్రుడు ఇట్లనెను : "దేవయానీ ! ఎవడు ఇతరులు పలికిన అతివాదములను (అనరాని మాటలను) ఓర్చు కొనునో అతడే ఈ సమస్త విశ్వమును జయించిన వాడని ఎరుగుము. ఎవడు పైకి ఎగిరి వడుచున్న క్రోధమును గుర్రమును వలె నిగ్రహించి పట్టుకొనునో అతనిని సత్పురుషులు యంత (నియమించుకొనువాడు-సారథి) అని వ్యవహరింతురు. గుర్రము పగ్గములయందు చిక్కుకొనియుండును. (పగ్గములు లాగినచో గుర్రము నిలిచిపోవును. చిత్తమును నిగ్రహించినచో క్రోధము నిలిచిపోవును.) పైకి ఎగిరి పడుచున్న క్రోధమును ధర్మముచే నిగ్రహించినవాడే ఈ విశ్వమంతయు జయించినవాడు పైకి లేచుచున్న కోపమును కుబుసమును పాము దూరముగా త్రోసివేసినట్లు ఎవడు త్రో వేయునో వాడే పురుషుడు. ఎవడు ధర్మమును అనుష్ఠించునో ఎవడు మిగుల ఓర్పుతో ఉండునో ఎవడు ఇతరులు తపింపజేసినను తపించడో అతడే ప్రయోజనము (శుభము ను పొందును. నెలకు ఒకటి చొప్పున నూరేండ్లు అశ్వమేధములు చేసినవాని కంటెను నూరేండ్లు నిరంతరము అన్నదానము చేసిన వానికంటెను క్రోధమును అణచుకొన్నవాడే మేలు. విరోధము-ఓర్పు-అనువాని బలాబలములు తెలియనందున అవివేకముచే కుమారులును కుమారికలును (పసివారు) పరస్పరము కలహింతురు. కాని ప్రాజ్ఞులు అట్టిది చేయరు."

దేవయాని ఇట్లు పలికెను : "తండ్రీ ! నా వయస్సు చిన్నదైనను నాకు కార్యగతి (ఏ పని చేయవలెనో) తెలియును. క్రోధము అతివాదము అనువాని బలాబలములును నాకు తెలియును. తన శుభము కోరినవాడు ఎవ్వడును తన శిష్యుడు శిష్యుడుగా నడుచుకొనకపోవుటను సహించరాదు. సద్వర్తనము లేక ధర్మాధర్మముల సంకీర్ణపరచి నడుచు కొనువారి యొద్ద జీవించుట నాకిష్టముగాదు. సద్వర్తనము కలిగినవారిని మంచి వంశమున పుట్టిన వారిని ఎవరు తగినట్లు గౌరవించరో అటువంటి పాపబుద్ధులయొద్ద తన మేలుకోరిన ప్రాజ్ఞుడు నివసింపరాదు. ఎవరు తాము సద్వర్తనమును సద్వంశమును కలిగి అవి కలిగినవారిని గుర్తించి ఆదరింతురో అట్టి సాధుజనుల యొద్ద నివసించుట తగినపని. అదియే శ్రేష్ఠమగు నివాసము. ఇది ఇట్లుండగా వృషపర్వుని కూతురు పలికిన మహా ఘోరములగు దుర్వచనములు అగ్నిని నంపాదింపగోరిన వారు అరణిని మథించినట్లు నా హృదయమును మథించుచున్నవి. తన గొప్పతనము తరిగిపోవుచుండ ప్రజ్వలించుచున్న శత్రుల గొప్పతనమును ఆశ్రయించి ఇతడు జీవించుచున్నాడు అనిపించుకొనుట కంటె దుష్టవచనము (అపకీర్తికరమగు విషయము) లోకములో మరేదియు లేదని నా అభిప్రాయము."

ఇది శ్రీమత్స్యమహాపురాణమున చంద్ర వంశానువర్ణనమున యయాతి చరిత్రమున శుక్రదేవయానీ సంవాదము అను ఇరువది ఎనిమిదవ అధ్యాయము.

## ఏకోనత్రింశ త్తమోఽధ్యాయః.

## శుక్రవృషపర్వసంవాదః.

శౌనకః: తతః కావ్యో భృగుశ్రేష్ఠ స్సమన్యు రుపగమ్య హ ।
వృషపర్వాణ మాసీన మిత్యువాచ త్వరాన్వితః.

నాధర్మ శ్చరితో రాజ న్సద్యః ఫలతి గౌరివ । శనై రావర్త్యమానస్తు మూలాన్యపి నికృన్తతి. 2
సో హి నాత్మని పుత్త్రేషు న చే త్పశ్యతి నప్తృషు । పాప మాచరితం కర్మ త్రివర్గ మతివర్తతే. 3
ఫలత్యేవ ధ్రువం పాపం గురు భుక్త మివోదరే । యదా ఘాతయతా విప్రం కచ మాఙ్గిరసం తదా. 4
అపాపశీలం ధర్మజ్ఞం శుశ్రూషుం మద్గృహే రతమ్ । వధా దనర్హత స్తస్య వధాచ్చ దుహితు ర్మమ. 5
వృషపర్వ న్నిబోధ త్వం త్యక్ష్యామి త్వాం సబాన్ధవమ్ ।
స్థాతుం త్వద్విషయే రాజ న్న శక్ష్యామి త్వయా సహ. 6
అద్యైవం మాఽభిజానాసి దైత్యం మిథ్యాప్రలాపినమ్ । యత స్త్వ మాత్మనోదీర్ణాం దుహితాం సముపేక్షసే.
వృషపర్వా : స్వాధర్మ మమృషావాదం త్వయి జానామి భార్గవ ।
త్వయి సత్యం చ ధర్మం చ త త్ప్రసీదతు నో భవాన్. 8
యద్యస్మా నపహాయ త్వ మితో యాస్యసి భార్గవ । సముద్రం సమ్ప్రవిశ్యామ నాన్యదస్తి పరాయణమ్. 9
శుక్రః : సముద్రం ప్రవిశధ్వం వా దిశో వా వ్రజతాసురాః ।
దుహితు ర్నాప్రియం శ్రోతుం శక్తోఽహం దయితా హి మే. 10
ప్రసాద్యతాం దేవయానీ జీవితం హ్యత్ర మే స్థితమ్ । యోగక్షేమకర స్తేఽహ మిన్ద్రస్యేవ బృహస్పతిః.
వృషపర్వా : యత్కిఞ్చిచ్చాసురేన్ద్రాణాం విద్యతే వసు భార్గవ ।
భువి హస్తి గవాశ్వం చ తస్య త్వం మమ చేశ్వరః. 12
శుక్రః : యత్కిఞ్చి దస్తి ద్రవిణం దైత్యేన్ద్రాణాం మహాసురాః ।
తస్యేశ్వరోఽస్మి యది తే దేవయానీ ప్రసాద్యతామ్. 13

## ఇరువది తొమ్మిదవ అధ్యాయము

## శుక్ర వృషపర్వ సంవాదము

శౌనకుడు శతానీకునితో ఇట్లు చెప్పెను: తరువాత కవిమహామునికి కుమారుడును భృగువంశ శ్రేష్ఠుడును అగు శుక్రుడు మిగుల త్వరతో పోయి కొలువుదీరి యున్న వృషపర్వునితో ఇట్లు పలికెను: "రాజా! భూమిలో విత్తనము వేసినను వెంటనే ఫలించనట్లు ఆచరించిన అధర్మము కూడ వెంటనే ఫలించదు. మెల్లగా ఆవృత్తి చేయుచు పోగా అది వేళ్ళను కూడ పెకలించివేయును. తాను ఆచరించిన పాపకర్మము తనయందో తన కుమారులయందో మనుమలయందో మునిమనుమలయందో ఫలింపకున్నను మూడు తరముల దాటి తరువాతివారికైనను తగిలితీరును. తినిన బరువయిన ఆహారము ఉదరములో రోగముగా పరిణమించినట్లు పాపము కూడ ఫలించియే తీరును. ఆనాడు నీవు పుణ్యశీలుడును ధర్మజ్ఞుడును నా శుశ్రూష చేయుచు నా యింటిలో ఉన్నవాడును అంగిరసుని మనుమడును బ్రాహ్మణుడును ఏ విధముగను చంపరానివాడును అగు కచుని చంపించుటవలనను నా కూతును కొట్టించుట వలనను నేను నిన్నును నీ వారినెల్లరను కూడ విడిచివేయుచున్నాను. నీతో కలిసి నీ దేశమునందుండజాలను. నీవు ఇపుడు నన్నును మిథ్యాప్రలాపియగు అనినంత పనిని చేయజాలని దైత్యునిగా భావించుచున్నట్లున్నది. అందుచేతనే నీ పొగరుబోతు కుమార్తెను ఏమియు అనక ఊరకున్నావు."

వృషపర్వుడు ఇట్లనెను: "భార్గవా! నీవు స్వధర్మ పరుడవు. మృషలు పలుకవు. అని నాకు తెలియును. నీవు సత్యమునకును ధర్మమునకును ఆధారమవు. కనుక నీవు మమ్ముల ననుగ్రహింప వేడుచున్నాను. నీవు ఇపుడు మమ్ములను విడిచి వెళ్ళినచో మేము సముద్రములోనికి పోయి దాగవలసినదే. మాకంతకంటె వేరే దిక్కులేదు."

శుక్రుడు: "సముద్రములో ప్రవేశించినను సరియే. మీరందరును దిక్కులకు పారిపోయినను సరియే. నాకు మిగుల

ప్రీతిపాత్రురాలగు నా కుమార్తెకు అప్రియము జరిగె ననునది నేను వినజాలను. నా జీవితమునకు ఆధారమగు దేవయానిని నీవు అనుగ్రహింపజేసికొనినచో ఇంద్రునకు బృహస్పతివలె నేను నీ యోగక్షేమములను చూతును."

వృషపర్వుడు : "భార్గవా! ఈ భూలోకమున రాక్షసుల ఆస్తిగా ఏనుగులు గుర్రములు గోవులు ధనము మొదలయినది ఏది యేది గలదో దానికంతటికిని రాక్షసులకును నాకును నీవే ప్రభువవు."

శుక్రుడు : "రాక్షస రాజా! మహాసురులారా! మీరన్నట్లు దైత్యేంద్రుల ద్రవ్యమంతటికిని నేనే ప్రభుడననుట నిజమయినచో దేవయానిని బ్రతిమాలి ఆమెను అనుగ్రహింపజేసికొనుడు."

శౌనకః : తతస్తు త్వరిత శ్శుక్ర స్స రాజ్ఞా సహ మాయయౌ ।
ఉవాచ చైనాం సుభగే ప్రతిపన్నం వచ స్తవ. 14

శర్మిష్ఠాయా దాసీత్వ ప్రాప్తికథనమ్.

దేవయానీ : యది త్వ మీశితా తాత రాజ్ఞో విత్తస్య భార్గవ ।
నాభిజానామి తత్తేహం రాజా వదతు మాం స్వయమ్. 15

వృషపర్వా : యం కామ మభిజానాసి దేవయాని శుచిస్మితే ।
తత్తేహం సమ్ప్రవక్ష్యామి యద్యపి స్యా త్సుదుర్లభమ్. 16

దేవయానీ: దాసీంకన్యాసహస్రేణ శర్మిష్ఠా మభికామయే। అనుయాస్యతు మాం తత్ర యత్ర దాస్యతి మే పితా

వృషపర్వా : ఉత్తిష్ఠ ధాత్రి గచ్ఛ త్వం శర్మిష్ఠాం శీఘ్ర మానయ ।
యం చ కామయతే కామం దేవయానీ కరోతు తమ్. 18

శౌనకః : తతో ధాత్రీ తత్ర గత్వా శర్మిష్ఠా మిద మబ్రవీత్ । ఉత్తిష్ఠ భద్రే శర్మిష్ఠే జ్ఞాతీనాం సుఖ మావహ. త్యజతి బ్రాహ్మణ శ్శిష్యా న్దేవయాన్యా ప్రచోదితః । యం సా కామయతే కామం స కార్యోఽద్య త్వయానఘే. దాసీత్వ మభిజానాసి దేవయాన్యా స్సుశోభనే ।
శర్మిష్ఠా : యం చ కామయతే కామం కరవాణ్యహ మద్య తామ్. 21

మాగా న్మన్యువశం శుక్రో దేవయానీ చ మత్కృతే ।
శౌనకః : తతః కన్యాసహస్రేణ వృతా శిబికయా తదా. 22

పితు ర్నిదేశా త్త్వరితా నిశ్చక్రామ పురోత్తమాత్ । శర్మిష్ఠా : అహం కన్యాసహస్రేణ దాసీభిః పరివారితా.
అను త్వాం తత్ర యాస్యామి యత్ర దాస్యతి తే పితా ।
దేవయానీ: స్తువతో దుహితా చాహం యాచతః ప్రతిగృహ్ణతః. 24

స్తూయమానస్య దుహితా కథం దాసీ భవిష్యసి । శర్మిష్ఠా: యేన కేనచి దార్తానాం జ్ఞాతీనాం సుఖ మావహేత్.
అను యాస్యా మ్యహం తత్ర యత్ర దాస్యతి తే పితా । శౌనకః: ప్రతిశ్రుతే దాసభావే దుహిత్రా వృషపర్వణః.
దేవయానీ నృపశ్రేష్ఠ పితరం వాక్యమబ్రవీత్ । ప్రవిశామి పురం తాత హృష్టాస్మి ద్విజసత్తమ. 27
అమోఘం తవ విజ్ఞాన మస్తి విద్యాబలం చ తే । ఏవముక్తో ద్విజశ్రేష్ఠో దుహిత్రా సుమహాయశాః. 28
ప్రవివేశ పురే హృష్టః పూజిత స్సర్వదానవైః. 29

ఇతి శ్రీమత్స్యమహాపురాణే మత్స్యమనుసంవాదా న్తర్గత శౌనకశతానీకసంవాదే చన్ద్రవంశానువర్ణనే యయాతిచరితే శర్మిష్ఠాయాః దేవయానీదాసీత్వప్రాప్తికథనం నామైకోనత్రింశోఽధ్యాయః.

తరువాత వెంటనే శుక్రుడు త్వరితగమనముతో వృషపర్వునితో కలిసి దేవయాని ఉన్న చోటికి వచ్చి "పుత్రీ! దృష్టవంతురాలవు. రాజు నీ మాటను అంగీకరించినాడు." అనెను. దేవయానియు "తండ్రీ! భార్గవా! రాజ ధన

ముసకంతటికిని నీవు స్వామివి అగుదువో కాదో నాకేమి తెలియును? నీ మాట నేనెట్లు అంగీకరింతును? రాజా! నాతో స్వయముగా ఆ మాట చెప్పుమమ్మా." అనెను. వృషపర్వుడు: దేవయానీ! నీ హృదయము నిర్మలమయి నీవు ఒక చిరునవ్వు నవ్వినను మాకంతియే చాలును. నీవేది ఏది కోరిన నది ఎంత సుదుర్లభమయినను దానిని నెరవేర్చుదును. దేవయాని : "తన దాసీ కన్యా సహస్రముతో శర్మిష్ఠ నాకు దాసి కావలయును. నా తండ్రి నన్నెచ్చటికిచ్చిన నచ్చటి కామెయు నా వెంట రావలయును." వృషపర్వుడు : "దాదీ! నీవు పొమ్ము. శీఘ్రమే శర్మిష్ఠను పిలిచికొని రమ్ము. దేవయాని ఏది కోరిన నది ఆమె చేయవలయును.

వెంటనే దాది శర్మిష్ఠకడకు పోయి ఇట్లు చెప్పెను: అమ్మాయీ! శర్మిష్ఠా! లెమ్ము. మీ పుట్టింటి వారికి సుఖము కలిగించుము. దేవయాని ప్రేరణచే శుక్రుడు తన శిష్యులను విడుచుచున్నాడు. అందులకై నీవు ఇపుడు దేవయాని కోరిన దెల్ల చేయవలసియున్నది. నీవు ఎంతయో శోభనరూపురాలవు. ఐనను దేవయానికి దాసీత్వమును అంగీకరింపవలసియున్నది. శర్మిష్ఠ: "ఆమె ఏది కోరిన నేనిపు డది చేయుదును. నా మూలమున శుక్రుడుగాని దేవయాని కాని కోపింపకుండుట కావలయును."

వెంటనే తన తండ్రి ఆజ్ఞతో శర్మిష్ఠ వేయి మంది తన దాసీ కన్యలు తనవెంట రాగా పాలకి నెక్కి తన తండ్రి పురమునుండి బయలు వెడలెను. శర్మిష్ఠ దేవయానితో: "నేను నా దాసీ కన్యా సహస్రము నావెంట రాగా నిన్ను నీ తండ్రి ఇచ్చిన చోటికి నీ వెంట వత్తును." దేవయాని: "స్తుతించుచు యాచించుచు ప్రతి గ్రహించుచు ఉండువాని కూతురను నేను. స్తుతించబడు వాని కూతురవు నీవు నాకు దా వెట్లగుదువు?" శర్మిష్ఠ: "ఏ విధముగనైనను కన్య తన పుట్టినింటివారికి సుఖము కలిగింపవలెను కనుక నీ తండ్రి నిన్నెచ్చటి కిచ్చిన అచ్చటికి నీ వెంట వత్తును."

ఇట్లు వృషపర్వుని కూతురు తనకు దాసి యగుటకు అంగీకరించగా దేవయాని తన తండ్రితో ఇట్లనెను: "ద్విజ శ్రేష్ఠుడవగు తండ్రీ! నేను హర్షముతో పురములో ప్రవేశింతును. మీ విజ్ఞానమును విద్యాబలమును అమోఘమయినవి." తన కూతురు ఇట్లు పలికిన మీదట మిగుల గొప్పకీర్తి కల ఆ శుక్రుడు తను రాక్షసులు ప్రశంసించుచుండ వృషపర్వుని పురము ప్రవేశించెను.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున యయాతి చరితమున శర్మిష్ఠ దేవయానికి దాసియగుట యను
ఇరువది తొమ్మిదవ అధ్యాయము.

## త్రింశోఽధ్యాయః.
## దేవయానీవనవిహారః.

శౌనకః : అథ దీర్ఘేణ కాలేన తస్మిన్నేవ నృపోత్తమ । వనం తదేవ నిర్యాతా క్రీడార్థం వరవర్ణినీ. 1
తేన దాసీసహ స్రేణ సార్ధం శర్మిష్ఠయా తదా । తమేవ దేశం సమ్ప్రాప్తా యథాకామం చచార సా. 2
తాభి స్సఖీభి స్సహితా సర్వాభి ర్ముదితా భృశమ్ । క్రీడన్త్యోఽభిరతా స్సర్వాః పిబన్త్యో మధు మాధవే. 3
ఖాదన్త్యో వివిధా న్భక్ష్యా న్విదశన్త్యః ఫలాని చ । పునశ్చ నాహుషో రాజా మృగలిప్సు ర్యదృచ్ఛయా. 4
తమేవ దేశం సమ్ప్రాప్తో జలలిప్సు స్స కర్శితః । దదర్శ దేవయానీం చ శర్మిష్ఠాం తాశ్చ యోషితః. 5
పిబన్త్యో రమమాణాశ్చ దివ్యాభరణభూషితాః । ఉపవిష్టాంచ దదృశే దేవయానీం శుచిస్మితామ్. 6
రూపేణాప్రతిమాం తాసాం స్త్రీణాం మధ్యే వరాఙ్గనామ్ । శర్మిష్ఠయా సేవ్యమానాం పాదసంవాహనాదిభిః. 7

## ముప్పదియవ అధ్యాయము
## దేవయానీ వనవిహారము

శౌనకుడు శతానీకునితో ఇంకను ఇట్లు చెప్పెను: ఇట్లు చాలకాలము గడచెను. దేవయాని ఆ వృషపర్వుని పురమునందే నివసించుచుండెను. ఒకమారు ఆమహాసుందరి క్రీడార్థమయి తాను పూర్వము పోయిన వనమునకే వెళ్ళెను.

తన దాసీ సహస్రముతో శర్మిష్ఠయు ఆమెవెంట నుండెను. దేవయాని అప్పటి ప్రదేశమును చేరెను. ఆయా చెలికత్తె లందరతో కూడి మిగుల సంతోషముతో తన ఇచ్చవచ్చినట్లు విహరించెను. వారు అందరును ఆ వసంతర్తువులో చాల ఆనందముగా క్రీడించుచు మద్యమును త్రాగిరి. వివిధ భక్ష్యములను భక్షించుచు వివిధ ఫలములను తినుచుండిరి.

ఇంతలో నహుష పుత్త్రుడగు యయాతి దైవసంకల్పమున వేటకై వచ్చి అలసి నీటికై ఆ ప్రదేశమునకే వచ్చెను. అచ్చట ఆతనికి దేవయానియు శర్మిష్ఠయు వేయిమంది శర్మిష్ఠ దాసీజనమును కనబడిరి. వారందరును దివ్యాభరణములతో అలంకరించుకొని మద్యము త్రావుచు విలాసము లనుభవించుచుండిరి. వారందర నడుమ దేవయాని కూర్చుండి యుండెను. ఆమె చిరునవ్వు నిర్మలము. ఆమె రూపము సాటిలేనిది. ఆమె స్త్రీలలో ఉత్తమురాలు. శర్మిష్ఠ ఆమెకు పాదములొత్తుట మొదలగు సేవలు చేయుచుండెను.

యయాతిదేవయానీ సంవాదః.

యయాతిః: ద్వాభ్యాం కన్యాసహస్రాభ్యాం ద్వే కన్యే పరివారితే ।
గోత్రేచ నామనీ చైవ ద్వయోః పృచ్ఛా మ్యహం యతః. 8
దేవయానీ : ఆఖ్యాస్యా మ్యనుమోదస్వ వచనం మే నరాధిప ।
శుక్రో నా మాసురగురు స్సుతాం జానీహి తస్య మామ్. 9
ఇయం చ మే సఖీ దాసీ యత్రాహం తత్రగామినీ । దుహితా దానవేన్ద్రస్య శర్మిష్ఠా వృషపర్వణః. 10
యయాతిః: కథంచ తే సఖీ దాసీ కన్యేయం వరవర్ణినీ । అసురేన్ద్రసుతా సుభ్రూః పరం కౌతూహలం హి మే.
దేవయానీ : సర్వ ఏవ నరవ్యాఘ్ర విధాన మనువర్తతే । విధినా విహితం మత్వా మా విచిత్రం యథా నృప.
రాజవద్రూపవేషస్తే బ్రాహ్మీం* వాచాం బిభర్షి చ । కింనామా త్వం కుతశ్చాసి కస్య పుత్త్రోసి శంస మే. 13
యయాతిః : బ్రహ్మచర్యేణ కృత్స్నో మే వేద శ్శ్రుతిపథం గతః ।
రాజాఽహం రాజపుత్త్ర శ్చ యయాతిరితి విశ్రుతః. 14
దేవయానీ : కేనాప్యర్థేన నృపతే ఇమం దేశం సమాగతః ।
జిఘృక్షు ర్వారిజం కిఞ్చి దథవా మృగలిప్సయా. 15
యయాతిః : మృగలిప్సు రహం భద్రే పానీయార్థ మిహాగతః ।
బహుధా వ్యనుయుక్తోస్మి త దనుజ్ఞాతు మర్హసి. 16
దేవయానీ : ద్వాభ్యాం కన్యాసహస్రాభ్యాం దాస్యా శర్మిష్ఠయా సహ ।
త్వదధీనాస్మి భద్రం తే సఖా భర్తా చ మే భవ. 17
యయాతిః : స్యా దౌశనసి భద్రంతే న త్వా మర్హోఽస్మి భామిని । అవైవాహ్యాశ్చ రాజానో దేవయాని పితుస్తవ.
దేవయానీ : సంసృష్టం బ్రహ్మణా క్షత్త్రం క్షత్త్రంచ బ్రహ్మసంస్థితమ్ ।
ఋషిశ్చ ఋషిపుత్త్రశ్చ నాహుషాద్య భజస్వ మామ్. 19
యయాతిః : ఏకదేహోద్భవా వర్ణా శ్చత్వారోఽపి వరాననే ।
పృథగ్ధర్మాః పృథక్శౌచా స్తేషాం వై బ్రాహ్మణో వరః. 20
దేవయానీ : పాణిగ్రహో నాహుషాయం న పుమ్భి స్సేవితః పురా ।
త్వం పాణి మగ్రహీ రగ్రే వృణోమి త్వా మహం తతః. 21
కథం తు మే మనస్విన్యాః పాణి మన్యః పుమా న్స్పృశేత్ ।
గృహీత మృషిపుత్త్రేణ స్వయం వా ప్యృషిణా త్వయా. 22
యయాతిః : క్రుద్ధా దాశీవిషా త్సర్పా జ్జ్వలనా త్సర్వతో ముఖాత్ ।
దురాధర్షతరో విప్రః పురుషేణ విజానతా. 23

దేవయాని : కథ మాశీవిషా త్సర్పా జ్జ్వలనా త్సర్వతోముఖాత్ । దురాధర్షతరో విప్ర ఇత్యర్థే పురుషర్షభ.
యయాతిః : దశే దాశీవిష స్త్వేకం శస్త్రేణైకశ్చ వధ్యతే ।
హన్తి విప్ర స్సరాష్ట్రాణి పురాణ్యపిచ కోపతః. 25
దురాధర్షతరో విప్ర స్తస్మా ద్భీరు మతో మమ అతోఽదత్తాం హి పిత్రా త్వాం భద్రే న వివహామ్యహమ్.
శుక్రాభ్యనుజ్ఞాతస్య యయాతే ర్దేవయానీపరిగ్రహః.
దేవయానీ : దత్తాం వహసి పిత్రా త్వం మాం హి రాజ న్వృతో మయా ।
మా యాచతో భయం నాస్తి దత్తాంచ ప్రతిగృహ్ణతః. 27

యయాతి ఇట్లు పలికెను: "ఇచ్చట ఇద్దరు కన్యలున్నారు. ఒక్కొక్కరికి ఒక్కొక కన్యానహస్రము పరివారముగా ఉన్నది. కనుక నేను ఆ ఇద్దరి నామగోత్రములు తెలిసికొనగోరుచున్నాను. దేవయాని: "రాజా! చెప్పెదను. నామాటనే ప్రమాణముగా గ్రహింపుము. రాక్షస గురుడు శుక్రుడున్నాడే- అతని కూతురను నేను. ఇది నా పరిచయము. ఈమె నాకు చెలిగా ఉండు దాసి. నే నెచ్చటికి పోయిన అచ్చటికి వచ్చును. ఈమె దానవేంద్రుడగు వృషపర్వుని కూతురు." యయాతి: "ఈమె రాక్షసరాజు కూతురు. చక్కని కనుబొమలు (మొదలగు మహా సౌందర్య లక్షణములు) కలిగిన ఉత్తమస్త్రీ కదా ఈమె! ఈకన్య నీకు దాసి ఎట్లయినది? నాకు విన వేడుకగా ఉన్నది." దేవయాని: "రాజా! ప్రతి ఒకరును విధి విధించిన విధానమును అనుసరించి నడుచుకొనవలసినదే. అది ఎరిగినచో నీకు ఆశ్చర్యము కలుగదు. నీరూపమును వేషమును రాజునకువలె నున్నవి. బ్రాహ్మణుని వాక్కు కలిగి ఉన్నావు. నీ పేరు ఏమి? ఎక్కడివాడవు? నీ తండ్రి ఎవరు?" యయాతి: "బ్రహ్మచర్య వ్రతమున నేను వేదము అంతయు అధ్యయనము చేసితిని. నేను రాజను. రాజవంశమున పుట్టినవాడను. నా పేరు యయాతి." దేవయాని: "ఏదో పని మీదనే నీవీ ప్రదేశమునకు వచ్చియుందువు. నీటినుండి లభించుదాని నేదైన గ్రహింపగోరియా? వేట కోరియా?" యయాతి: "నేను వేటకై వచ్చి నీటికొరకు ఇక్కడకు వచ్చితిని. నీవడిగిన అన్ని ప్రశ్నలకును సమాధానము ఇచ్చితిని. నేను పోయివత్తును. అనుజ్ఞ ఇమ్ము." దేవయాని: "ఈ రెండు వేల దాసీ కన్యా జనముతోను దాసియగు శర్మిష్ఠతోను నీ అధీనురాల నగుచున్నాను. పూజ్యుడవగు నీవు నాకు మిత్రుడవును భర్తవును కమ్ము. యయాతి: "అగుగాక! నీవు శుక్రుని కూతురవు పూజ్యురాలవు. కోపింపకుము. నేను నిన్ను వివాహ మాడ అర్హుడను కాను. నీ తండ్రి క్షత్రియులతో వివాహ సంబంధమును అంగీకరించడు." దేవయాని: "బ్రహ్మము క్షత్త్రముతోను క్షత్త్రము బ్రహ్మముతోను పరస్పరము కలిసియే యున్నవి. (బ్రహ్మము-బ్రాహ్మణజాతి ప్రధానలక్షణములు; క్షత్త్రము-క్షత్త్రియజాతి ప్రధాన లక్షణములు) నీవు ఋషివి-ఋషిపుత్త్రుడవును. నహుష కుమారుడవు నీవు. ఇప్పుడయిన నీవు నన్ను పెండ్లాడుటకు అంగీకరించుము. యయాతి: "సుందరీ! నాలుగు వర్ణములును ఒక దేహమునుండి పుట్టినవే. కాని వాని ధర్మములును రూపములును వేరువేరు. ఈ నాలుగు వర్ణములవారిలో బ్రాహ్మణుడు శ్రేష్ఠుడు. (కనుక శ్రేష్ఠ వర్ణ స్త్రీని తక్కువ వర్ణపు పురుషుడు పెండ్లాడరాదు.) దేవయాని: "రాజా! ఈనా పాణిని ఇంతకుముందు ఏ పురుషుడును గ్రహించలేదు. మొట్టమొదట (బావిలోనుండి తీసినప్పుడు) నీవే అది పట్టుకొంటివి. అందుచేతనే నేను నిన్ను వరించుచున్నాను. ఋషి పుత్త్రుడవును స్వయముగా ఋషివి ఐన నీవు గ్రహించినది ఈచేయి. నేను అభిమానవతిని. అట్టి నాయీకరమును మరెవడుగాని ఎట్లు గ్రహింపదగుదురు? యయాతి: "కోరలనిండ విషము కలిగినదియు కోపించినదియు అగు సర్పము కంటెను-అన్నివైపులకును మంటలురేగుచున్న అగ్నికంటెను విప్రుడు స్పృశించి కలత పరచరానివాడు ఈ విషయము విజ్ఞులకు మాత్రమే తెలియును. దేవయాని: "పురుషశ్రేష్ఠా! ఇది యెట్లో తెలియగోరుచున్నాను. యయాతి: "పాము ఒక్కనినే కరచును. శస్త్రము ఒక్కనిని మాత్రము చంపును. కాని-కోపించిన బ్రాహ్మణుడు రాష్ట్రములను (గ్రామాదిజన నివాసస్థానములను) పురములను (రాజధానీస్థానములను) కూడ నశింపజేయగలడు. భయపడకుము. ఈ కారణముతోనే బ్రాహ్మణుడు పైచెప్పినవాటి అన్నిటికంటెను దురాధర్షతరుడు (స్పృశించికలతపరచరానివాడు) అని నేనంటిని. అందువలననే పూజ్యురాలవగు నిన్ను నీ తండ్రియే స్వయముగా ఇచ్చిననేకాని వివాహమాడను. దేవయాని:

"రాజా: నేనై స్వయముగా కోరినందునను మాతండ్రి స్వయముగా నన్ను నీకు ఇచ్చిన మీదటను నన్ను నీవు పెండ్లాడబోవుచున్నావు. అంతే కాని నీవు కోరుటలేదు. అడుగకయే ఇచ్చిన దానిని ప్రతిగ్రహించుట దోషము కాదు.

శౌనకః : త్వరితం దేవయాన్యాఽథ ప్రేషితా పితు రాశ్రమమ్ ।
సర్వం నివేదయామాస ధాత్రీ తస్మై యథాశ్రుతమ్. 28
శ్రుత్వైవ చ స రాజానం దర్శయామాస భార్గవః । దృష్ట్వైవ మాగతం విప్రం యయాతిః పృథివీపతిః.29
వవన్దే బ్రాహ్మణం కావ్యం ప్రాఞ్జలిః ప్రణత స్థ్సితః । తం చాథాభ్యవద త్కావ్య స్సామ్నా పరమవల్గునా.
దేవయానీ : రాజాఽయం నాహుష స్తాత దుర్గే మే పాణి మగ్రహీత్ ।
నమస్తే దేహి మా మస్మై లోకే నాన్యం పతిం వృణే. 31
శుక్రః : వృతోఽనయా పతి ర్వీర సుతయా త్వం మమేచ్ఛయా ।
గృహాణేమాం మయా దత్తాం మహిషీం నహుషాత్మజ. 32
యయాతిః : అధర్మో న స్పృశే దేవం పాపం మా స్యాచ్ఛ భార్గవ ।
వర్ణసఙ్కరజో బ్రహ్మ న్నితి త్వాం ప్రావృణో మ్యహమ్. 33
శుక్రః : అధర్మా త్త్వాం చ మోక్ష్యామి వరం వరయ చేప్సితమ్ ।
అస్మి న్వివాహే మా గ్లాని రహం పాపం తుదామి తే. 34
వహస్వ భార్యాం ధర్మేణ దేవయానీం శుచిస్మితామ్ । అనయా సహ సమ్ప్రీతి మతులాం త్వ మవాప్నుహి.
ఇయం చాపి కుమారీ తే శర్మిష్ఠా వార్షపర్వణీ। సమ్పూజ్యా సతతం రాజ న్న చైనాం శయనే హ్వయ. 36
శౌనకః : ఏవ ముక్తో యయాతిస్తు శుక్రే దత్వా ప్రదక్షిణమ్ ।
జగామ స్వపురం హృష్ట స్సోఽనుజ్ఞాతో మహాత్మనా. 37

ఇతి శ్రీమత్స్య మహాపురాణే మత్స్యమనుసంవాదా న్తర్గత శౌనకశతానీక
సంవాదే చన్ద్రవంశానువర్ణనే యయాతిచరితే యయాతికృత
దేవయానీగ్రహణం నామ త్రింశోఽధ్యాయః.

పిమ్మట వెంటనే దేవయాని తన దాదిని తన తండ్రి ఆశ్రమమునకు పంపెను. ఆమె శుక్రునితో తాను వినిన విషయము వినినట్లు చెప్పెను. వినిన వెంటనే శుక్రుడును వచ్చి రాజునకు దర్శన మిచ్చెను. ఇట్లు తన దగ్గరకు వచ్చిన విప్రుడు-వేదములందు మహాపండితుడు-కవిమహాముని కుమారుడు అగు శుక్రుని యయాతిరాజు నమస్కరించి దోసిలిపట్టి వినయముతో వంగి ఎదుట నిలువబడెను. శుక్రుడు అతనిని చల ఇంపైన నెమ్మది మాటలతో పలుకరించి మాటలాడెను.

దేవయాని: "ఈ రాజు నహుషపుత్రుడు. ఇతడు ఒకప్పుడు దుర్గ ప్రదేశము (తప్పించుకొని బయటపడ అలవి కాని ప్రదేశము)నందున్న నా చేతిని పట్టుకొనెను. (పాణిని గ్రహించెను.) నీకు వందనము. నన్ను ఇతని కిమ్ము. లోకమున నేను మరెవ్వరిని పతిగా వరించను." శుక్రుడు: "ఓ వీరా! నిన్ను ఈ నా కుమార్తె తానే వరించినది. అది నేను ఇష్టపడుచున్నాను. ఈమెను నేనే నీకు ఇచ్చుచున్నాను. నీ వీమెను గ్రహించి రాణిగా చేసికొనుము." యయాతి: "పూజ్య బ్రాహ్మణుడవగు భార్గవా! ఇట్లు చేయుట వలన నాకు అధర్మదోషము కాని వర్ణ సంకరము చేసిన పాపము కాని నా కంట కుండునట్లు నాకు వర మీయ ప్రార్థించుచున్నాను." శుక్రుడు: "ఇదే కాదు. నీ వింకేదయిన ఈప్సితవరమును కూడ కోరుకొమ్ము. ఇత్తును. నిన్ను అధర్మమునుండి విడిపించుచున్నాను. ఈ పెండ్లి వలన నీకు ఎట్టి హానియు కలుగదు. నీ పాపములను నేను ఖండించు(తెగనరకు)చున్నాను. ఈ శుచిస్మితయగు దేవయానిని ధర్మపత్నిగా గ్రహింపుము. ఇది

ధర్మమే కాని అధర్మము కాదు. ఈమెతో కూడి నీవు సాటిలేని సుఖ మనుభవింపుము. వృషపర్వుని కూతురగు ఈ కుమారి శర్మిష్ఠయు నీకు సతతము ఆదరణీయురాలే. కాని నీవు ఈమెను శయనమున గ్రహించరాదు.

ఇట్లు పలికిన శుక్రునకు ప్రదక్షిణము చేసి ఆ మహాత్ముని అనుమతి పొంది యయాతి హర్షముతో తన రాజధానికి వెడలెను.

ఇది శ్రీమత్స్య మహాపురాణమున చంద్రవంశానువర్ణనమున యయాతి చరితమున యయాతి దేవయానిని గ్రహించుట యను ముప్పదవ అధ్యాయము.

## ఏకత్రింశ త్తమోఽధ్యాయః.
## శర్మిష్ఠాయయాతిసంవాదః.

శౌనకః : యయాతి స్స్వపురం ప్రాప్య మహేన్ద్రపురసన్నిభమ్ ।
ప్రవిశ్యాన్తఃపురం తత్ర దేవయానీం న్యవేశయత్. 1
దేవయాన్యా శ్చానుమతే సుతాం తాం వృషపర్వణః । అశోకవనికాభ్యాశే గృహం కృత్వా న్యవేశయత్. 2
వృతాం దాసీసహస్రేణ శర్మిష్ఠా మాసురాయణీమ్ । వాసోభి రన్నపానై శ్చ సంవిభజ్య సుసంవృతామ్. 3
దేవయాన్యా తు సహిత స్స నృపో నహుషాత్మజః । విజహార బహూనబ్దా న్దేవవ న్ముదితో భృశమ్. 4
ఋతుకాలే తు సమ్ప్రాప్తే దేవయానీ వరాఙ్గనా । లేభే గర్భం ప్రథమతః కుమారం చ వ్యజాయత. 5
గతే వర్షసహస్రే తు శర్మిష్ఠా వార్షపర్వణీ । దదర్శ యౌవనప్రాప్తా ఋతుం సా కమలేక్షణా. 6
చిన్తయామాస ధర్మజ్ఞా త్వృతౌ ప్రాప్తే తు భామినీ । ఋతుకాలశ్చ సమ్ప్రాప్తో నచ కశ్చి త్పతి ర్వృతః. 7
కిం ప్రాప్తం కిఞ్చ కర్తవ్యం కథం కృత్వా కృతం భవేత్ ।
దేవయానీ యయాతిం సా వృతా సమ్ప్రాప్తయౌవనా. 8
యథా తయా వృతో భర్తా తథైవాహం వృణోమి తమ్ । రాజ్ఞా పుత్త్రఫలం దేయ మితి మే నిశ్చితా మతిః. 9
యదీదానీం స ధర్మాత్మా రహో మే దర్శనం వ్రజేత్ ।
శౌనకః : అథ నిష్క్రమ్య రాజాఽసౌ తస్మి న్కాలే యదృచ్ఛయా. 10
అశోకవనికాభ్యాశే శర్మిష్ఠాసహిత స్స్థితః । తమేకం రాహసం దృష్ట్వా శర్మిష్ఠా చారుహాసినీ. 11

## ముప్పది ఒకటవ అధ్యాయము
## శర్మిష్ఠా యయాతి సంవాదము

శౌనకుడు శతానీకునితో ఇంకను ఇట్లు చెప్పెను: యయాతి తన రాజధాని చేరెను. అది మహేంద్రుని అమరావతితో సమానమగునది. అతడు అంతఃపురమున ప్రవేశించి అందు దేవయానికి నివాసము ఏర్పరచెను. ఆమె అనుమతితో అతడు వృషపర్వుని కుమార్తెయగు శర్మిష్ఠకు అశోకోద్యానపు సమీపమున గృహమును నిర్మింపజేసి దానియందామెను వసింపజేసెను. ఆమెకు పరివారముగా ఆమె నాశ్రయించియుండు దాసీ సహస్రము కూడ అచ్చటనే ఆ అశోకోద్యానముసందే ఆమెతో పాటు వసించుచుండె రాజు వారికి వస్త్రములు అన్నపానములు వేరువేరుగ ఏర్పాటు చేయించి కనిపెట్టి యుండెను. నహుషాత్మజుడగు ఆ యయాతి రాజు దేవయానితో కూడి చాల ఏండ్లు దేవునివలె విహరించుచు మిగుల సంతోషించుచుండెను.

ఋతుకాలము రాగా ఉత్తమాంగనయగు దేవయాని మొదటిసారిగా గర్భవతి యయ్యెను. కుమారుని కనెను కమలనయనయగు వృషపర్వుని కూతురు శర్మిష్ఠయు వేయి సంవత్సరముల తరువాత యౌవనవతియై ఋతుదర్శనమున

పొందెను. లోకధర్మమును ఎరిగిన ఆశర్మిష్ఠ "నాకు ఋతుకాలము సంప్రాప్తమయినది. కాని నేను ఎవరిని పతిగా వరించి పొందియుండలేదుకదా! ఇపుడు ఏది తగినది? ఏమి చేయవచ్చును? ఎట్లు చేసిన ఈ ఋతువు సఫలమగును?" అని ఆలోచించి ఆమె తన మనసున యయాతినే తనకు ప్రాప్తించిన యౌవనమునకు తగిన పతినిగా వరించుకొనెను. "ఆమె (దేవయాని) తానై యయాతిని తన భర్తనుగా వరించినట్లే నేనును ఆతనినే నాభర్తనుగా వరింతును. రాజే నాకును పుత్రఫలమును ఈయదగినవాడు. అని నామదికి నిశ్చయముగా దోచుచున్నది. ఆరాజు ధర్మము నెరిగినవాడు. అతడు ఈ సమయమున ఏకాంతమున నాకు కనబడిన ఎంత బాగుగానుండును!" అని ఆమె తలచెను.

ఇంతలో అదే సమయమున రాజు కూడ దైవికముగా బయటికి వచ్చి అశోకోద్యాన సమీపమున శర్మిష్ఠ యున్న చోటికి దగ్గరలో వచ్చియుండెను. సహజముగనే చూచువారికి ఇంపుగొలిపెడి చిరునవ్వుమోము గల శర్మిష్ఠ రాజట్లు ఏకాంతమం దుండుట గమనించెను. అతడు ఉన్న వైపునకు పోయెను.

ప్రతిగమ్యాఞ్జలింకృత్వా రాజానం వాక్యమబ్రవీత్। శర్మిష్ఠా: సోమస్యేన్ద్రస్య విష్ణోశ్చ యమస్య వరుణస్య చ.
తవ వా నాహుష గృహే కః స్త్రియం ద్రష్టు మర్హతి । రూపాభిజనశీలాంహి త్వం రాజ న్వేత్సి మాం సదా.
సా త్వాం యాచేఽభి కామార్తా ఋతుం దేహి నరాధిప ।
యయాతిః : వేద్మి త్వాం శీలసమ్పన్నాం దైత్యకన్యా మనిన్దితామ్. 14
రూపంతు తే న పశ్యామి సూచ్యగ్రమపి నిన్దితమ్ । మమాబ్రవీ త్తదా శుక్రో దేవయానీం యదాఽవహమ్.15
నేయ మాహ్వాయితవ్యా తే శయనే వార్షపర్వణీ ।
శర్మిష్ఠా : న నర్మయుక్తం వచనం హినస్తి న స్త్రీషు రాజ న్న వివాహకాలే. 16
ప్రాణాత్యయే సర్వధనాపహారే పఞ్చానృతా న్యాహు రపాతకాని.
పృష్టాస్తు సాక్ష్యే ప్రవదన్తి యేఽన్యధా భవన్తి మిథ్యావచనా నరేన్ద్ర! 17
ఏకార్థతాయాం తు సమాహితాయాం మిథ్యావదన్తం హ్యనృతం హినస్తి ।
రాజా ప్రమాణం భూతానాం స వినశ్యే న్మృషా వదన్. 18
అర్థకృచ్ఛ్రమనుప్రాప్య న మిథ్యా వక్తు ముత్సహే । సమా వేతౌ మతౌ రాజ న్పతి స్సఖ్యాశ్చ యః పతిః.
సమం వివాహ మిత్యాహు స్సఖ్యా మేఽసి వతి ర్యతః. ।
యయాతిః : దాతవ్యం యాచమానస్య ఇతి మే వ్రతమాహితమ్. 20
త్వంచ యాచసి కామం మాం బ్రూహి కిం కరవాణి తే ।
శర్మిష్ఠా : అధర్మా త్పాహి మాం రాజ న్ధర్మం చ ప్రతిపాదయ. 21
త్వత్తోఽపత్యవతీ లోకే చరేయం ధర్మముత్తమమ్ । త్రయ ఏవాధనా రాజ న్భార్యా దాస స్తథా సుతః. 22
యం తే సమధిగచ్ఛన్తి యస్యైతే తస్య తద్ధనమ్ । దేవయాన్యా భుజిష్యాఽస్మి వశ్యాచ తవ భార్గవీ. 23
సా చాహం తు త్వయా రాజ న్భరణీయా భజస్వ మామ్ ।
శౌనకః: ఏవముక్త స్తయా రాజా తథ్యమి త్యధిజజ్ఞివాన్. 24
పూజయామాస శర్మిష్ఠాం ధర్మంచ ప్రతిపాదయన్ । స సమాగమ్య శర్మిష్ఠాం యథాకామ మవాప్యచ. 25
అన్యోన్యం చాపి సమ్పూజ్య జగ్మతు స్తౌ యథాగతమ్। తస్మిన్సమాగమే సుభ్రూ శ్శర్మిష్ఠా వార్షపర్వణీ.26
లేభే గర్భం ప్రథమత స్తస్మాచ్చ నృపసత్తమాత్ । ప్రజజ్ఞేచ తతః కాలే రాజ న్రాజీవలోచనా. 27
కుమారం దేవగర్భాభ మాదిత్యసమవర్చసమ్. 28

ఇతి శ్రీమత్స్యమహాపురాణే శౌనకశతానీక సంవాదే చన్ద్రవంశానువర్ణనే
యయాతిచరితే శర్మిష్ఠాయయాతిసంవాదో నామైకత్రింశోఽధ్యాయః.

అతనిని సమీపించెను. దోసిలి చేసి ఇట్లు పలికెను. "నహుష పుత్రా! సోముడు-ఇంద్రుడు-విష్ణువు-యముడు-వరుణుడు-నీవు- ఈ వీరి ఇండ్లయందలి స్త్రీని పరపురుషుడు ఎవ్వడు చూడనైన చూడగలడు? నేను గొప్ప వంశమున పుట్టినదాననని సౌందర్యవతినని నీకు మొదటి నుండియు తెలియును. ఇట్టి నేను కామార్తనై నిన్ను అభియాచించుచున్నాను. రాజా! నాకు ఋతుఫలము ఇమ్ము" యయాతి: "నీవు శీలసంపన్నవు. ఉత్తమ దైత్య వంశమున పుట్టితివి. నీలో దోష మేమియు లేదు నీ రూపమునందును సూదిమొనయంత కూడ దోషములేదు. ఇది యంతయు నాకు తెలియును. కాని నేనానాడు దేవయానిని వివాహమాడినప్పుడు శుక్రుడు 'నీవు ఈ శర్మిష్ఠను శయనముమీదకు పిలువరాదు.' అని నాతో చెప్పెను." శర్మిష్ఠ: "పరిహాసమున-స్త్రీ విషయమున పెండిండ్లు ప్రాణహాని సర్వధననాశము-ఈ సందర్భములందు ఆడెడి అసత్యము పాతకము కాదందురు. సాక్ష్యము చెప్పుమనినప్పుడు అన్యథాగా చెప్పినవారు అసత్యము చెప్పిన పాపము పొందుదురు. ఏకార్థత (ఆ కార్యము వలన కలుగవలసిన ప్రధాన ప్రయోజనము) దెబ్బ తినినపుడు మాత్రమే అసత్యము అసత్యమై అది చెప్పిన వానిని హింసించును." యయాతి: "అన్ని ప్రాణులకును రాజు ప్రమాణము. (అతడు నడచినట్లు అందరును నడతురు.) అట్టివాడు అసత్యము పలికినచో తానే నశించును. కావున ఎట్టి ప్రయోజనము కాని ధనముకాని నశించు పరిస్థితి వచ్చినను నేను అసత్యమాడజాలను." శర్మిష్ఠ: "రాజా! తన పతియు తన సఖిపతియు స్త్రీకి సములే. ఈ ఇద్దరిలో ఏఒకరు ఒకనిని పతిగా చేసికొనినను రెండవ వారును అతనినే పతిగా చేసికొనినట్లే. అని పెద్దలు చెప్పచున్నారు. నీవు నాసఖికి పతివి కదా!" యయాతి: "అడిగినవారికి అడిగినది ఈయవలయును. అని నావ్రతము-నీవు కామ ఫలమును కోరుచున్నావు. నేను నీకేమి ఉపకారము చేయవలెను?" శర్మిష్ఠ: "రాజా! నన్ను అధర్మము అంటకుండ కాపాడుము. ధర్మ ఫలము నాకు ఇమ్ము. నీవలన సంతానవతినై నేను లోకమున ఉత్తమ ధర్మము నాచరించగలుగ వలయును. రాజా! భార్య-దాసుడు-సుతుడు- ఈ ముగ్గురును తమకు తమ ధనము మీదగాని తమమీదగాని స్వత్వమున స్వాతంత్ర్యమును లేనివారు. వీరు ఎవరిని ఆశ్రయించినచో-అనగా వీరు ఎవరి ధనమైనచో-వీరును వీరి ధనమును-ఆ భార్య-దాసుడు-సుతుడు-అను ముగ్గుర స్వామికి చెందియుండును. ఇక్కడనో-దేవయాని నీ భార్యకదా! ఆమెకు తనపై స్వత్వము లేదు. ఆమె నీ యధీనమునందలిది. నేనామెకు దాసిని. కనుక నేనును నీ స్వాధీనమునందుండి నీవనుభవించ దగినదాననే. ఈ హేతువులచే నన్ను నీవన్ని విధముల భరించవలసిన వాడవే. (నేను భరింపబడవలసిన దానను భరింపబడునది భార్య. కావున నేనును నీకు భార్యనే.) కనుక నన్ను పొందుము."

యయాతి రాజు శర్మిష్ఠ చెప్పినది నిజమే యనెను. ఆమెధర్మజ్ఞతను అతడు మెచ్చుకొనెను. ఆమెకు ధర్మమున దానముగా ఇచ్చుటకు అంగీకరించెను. అతడామెతో సంగమించెను. తమతమ కోరికలను ఇరువురును తీర్చుకొనిరి ఒకరినొకరు మెచ్చుకొనిరి. ఎవరిత్రోవను వారు పోయిరి. ఈ సమాగమముతో వృషపర్వ పుత్రి శర్మిష్ఠ ఆ రాజశ్రేష్ఠుని వలన ప్రథమముగా గర్భవతియయ్యెను. యథాకాలమున ఆ పద్మలోచనకు కుమారుడు కలిగెను. వాడు దేవకుమారుడ వలెనుండెను. అతని వర్చస్సు ఆదిత్యుని వర్చస్సువలె నుండెను.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున చంద్రవంశానువర్ణనమున శర్మిష్ఠా యయాతి
సంవాద (సమాగమ) మను ముప్పదియొకటవ యధ్యాయము.

## ద్వాత్రింశోఽధ్యాయః.
## శర్మిష్ఠాదేవయాన్యోః పుత్త్రవిషయకసంల్లాపః.

శౌనకః : శ్రుత్వా కుమారం జాతంతు దేవయానీ శుచిస్మితా ।
చిన్తయామాస దుఃఖార్తా శర్మిష్ఠాంప్రతి భారత. 1

తతోఽభిగమ్య శర్మిష్ఠాం దేవయాన్యబ్రవీదిదమ్ ।

దేవయానీ : కిమిదం వృజినం సుభ్రూః కృతం తే కామలుబ్ధయా. 2

శర్మిష్ఠా : ఋషిః కశ్చి దిహాగత్య ధర్మాత్మా వేదపారగః ।

న మయా స వరః కామం ప్రార్థితో ధర్మసంహితమ్. 3

నాహ మన్యాయతః కామ మాచరామి శుచిస్మితే । తస్మాదృషే ర్మమాపత్య మితి సత్యం బ్రవీమి తే. 4

దేవయానీ : శోభనం భీరు సత్యం చే దథ సంజ్ఞాయతే ద్విజః ।

గోత్రనామాభిజనత శ్శ్రోతు మిచ్ఛామి తం ద్విజమ్. 5

శర్మిష్ఠా : ఓజసా తేజసా చైవ దీవ్యమానం రవిం యథా।తందృష్ట్వా మమ సంప్రష్టుం శక్తి ర్నాసీ చ్ఛుచిస్మితే.

దేవయానీ : యద్యేత దేవం శర్మిష్ఠే న మన్యు ర్విద్యతే మమ ।

అపత్యం యది తే లబ్ధం జ్యేష్ఠం శ్రేష్ఠాత్తు వై ద్విజాత్. 7

శౌనకః : అన్యోన్య మేవ ముక్త్వాచ సమ్ప్రహస్యచ తే మిథః । జగామ భార్గవీ వేశ్మ తథ్యమి త్యభిజానతీ.

యయాతి ర్దేవయాన్యాంతు పుత్రావజన యన్నృప । యదుంచ తుర్వసుంచైవ శక్రవిష్ణూ ఇవాపరౌ. 9

తస్మాదేవతు రాజర్షే శ్శర్మిష్ఠా వార్షపర్వణీ । ద్రుహ్యుం చానుంచ పూరుంచ త్రీన్కుమారా నజీజనత్. 10

తతః కాలే తు కస్మింశ్చి ద్దేవయానీ శుచిస్మితా । యయాతిసహితా రాజ న్జగామ రహితం వనమ్. 11

దదర్శచ తదా తత్ర కుమారా న్దేవరూపిణః । క్రీడమానా న్సుచీ న్సుద్ధా న్విస్మితా చేద మబ్రవీత్. 12

దేవయానీ : కస్యైతే దారకా రాజ న్దేవపుత్రోపమా శ్శుభాః। వర్చసా రూపతశ్చైవ దృశ్యన్తే సదృశా స్తవ.

శౌనకః : ఏవం పృష్ట్వాతు రాజానం కుమారా న్పర్యపృచ్ఛత ।

కిం నామదేయం గోత్రం వః పుత్రకాః కస్య వణ్ణితాః. 14

విబ్రూత మే యథా తథ్యం శ్రోతు మిచ్ఛామి తత్త్వహమ్ ।

తేఽదర్శయ న్ప్రదేశిన్యా త మేవ నృపసత్తమమ్. 15

శర్మిష్ఠాం మాతరం చైవ తస్యా ఊచుశ్చ దారకాః ।

## ముప్పది రెండవ యధ్యాయము

## శర్మిష్ఠా దేవయానుల సంభాషణము-యయాతికి శుక్రశాపము

ఎప్పుడును పవిత్రమగు చిరునవ్వుతో ఉండెడి దేవయాని శర్మిష్ఠకు కుమారుడు కలిగెనని విని దుఃఖముతో ఆర్తురాలయి శర్మిష్ఠ విషయమున ఏమేమో ఆలోచించెను. తరువాత ఆమె శర్మిష్ఠ ఉన్నచోటికి పోయి ఆమెతో ఇట్లు పలికెను. "చక్కని కనుబొమలుకల సుందరీ! నీవు కామ సుఖమునకు ఆసపడి ఎటువంటి పాపము చేసితివి!" శర్మిష్ఠ: "ధర్మాత్ముడును వేదపారంగతుడును కోరిన వరము లేవయిన ఈయగలవాడును అగు ఋషియొకడు ఇక్కడకు వచ్చెను. నేనతనిని ధర్మమునకు విరుద్ధము కాని కోరికను వేడితిని. శుచిస్మితా! నేను న్యాయవిరుద్ధమగు ఏకామవర మగు పనిని చేయుదానను కాను. ఆ ఋషివలననే నాకీ సంతానము కలిగినది. నేను నీకు సత్యమునే చెప్పుచున్నాను. (నీవు నా ఈ మాటలనమ్మి నిర్మలమగు చిరునవ్వు నవ్వుము.)" దేవయాని: "చాల మంచిదే. నీవు భయపడకుము! ఇదే నిజ మయినచో ఆ బ్రాహ్మణుని విషయము నీకు బాగుగ తెలిసియున్నచో అతని గోత్రము నామము వంశము అంతయు వినగోరుచున్నాను." శర్మిష్ఠ: "సూర్యునివలెఓజస్సు-తేజస్సు కలిగి ప్రకాశించుచుండుటచే అతనిని చూడగానే నేనతని నవి ఏవియు అడుగజాలకపోయితిని." దేవయాని: "ఇది ఇంతేయైనచో శర్మిష్ఠా! నీ మొదటి సంతానము వర్ణమున శ్రేష్ఠుడగు బ్రాహ్మణుని వలననే కలిగినది అనుచున్నావు కనుక నాకు కోపము ఉండదు."

శర్మిష్ఠా దేవయానులు ఇట్లు మాటలాడుకొని ఒకరిని చూచి మరొకరు నవ్వుకొనిరి. శర్మిష్ఠ మాటలు నిజమే

యను సమ్మికతో దేవయానియును తన గృహమునకు పోయెను.

ఇట్లు యయాతికి దేవయానియందు ఇంద్రుడు విష్ణువంటి యదుతుర్వసు లను ఇరువురు కుమారులు కలిగిరి. శర్మిష్ఠకు యయాతివలన ద్రుహ్యుడు అనువు పూరుడు అను ముగ్గురు కుమారులు కలిగిరి.

తరువాత ఒకానొక కాలమున శుచిస్మిత యగు దేవయాని యయాతితో కలిసి ఏకాంతోద్యానమునకు పోయెను. ఆమెకు అచ్చట దేవరూపులగు కుమారులు (ముగ్గురు) కనబడిరి. వారు శుచులును శుద్ధులునై యుండిరి. ఆడుకొనుచుండిరి. వారిని చూచి ఆశ్చర్యపడుచు దేవయాని యయాతితో ఇట్లనెను. "రాజా! ఈ కుమారు లెవ్వరివారు? వీరు దేవకుమారులవలె చక్కగా ప్రకాశించుచున్నారు. వర్చస్సులోను రూపమునందును నిన్ను పోలియున్నారు." ఇట్లు రాజా నడిగినపిమ్మట దేవయాని ఆ కుమారులనే ఇట్లడిగెను: "మీపేరులేమి? గోత్రము ఏమి? ఎవరి కుమారులు? మీరు పండితులు అన్ని విషయములు బాగుగా ఎరిగినవారు. నేనిది యంతయు వినగోరుచున్నాను. ఉన్నది ఉన్నట్లు వివరించి చెప్పుడు."

ఆ బాలురు తమ చూపుడు వ్రేలితో ఆ రాజసత్తమునే చూపిరి. శర్మిష్ఠ మా అమ్మ అనియు వారా దేవయానితో చెప్పిరి.

శౌనకః : ఇత్యుక్త్వా సహితా స్తేతు రాజాన ముపచక్రముః. 16
నాభ్యనన్దత తాన్రాజా దేవయాన్యా స్తదా న్తికే । క్రన్దన్త స్తేతు శర్మిష్ఠా మభ్యయు ర్బాలకా స్తదా. 17
శ్రుత్వాతు తేషాం బాలానాం సవ్రీడ ఇవ పార్థివః। దృష్ట్వాతు తేషాం బాలానాం ప్రత్యయం పార్థివం ప్రతి.
బుద్ధ్వాచ తత్త్వతో దేవీ శర్మిష్ఠా మిద మబ్రవీత్ ।
దేవయానీ : మదధీనా సతీ కస్మా దకార్షీ ర్విప్రియం మమ. 19
తమేవాసురధర్మంత్వ మాస్థితా న బిభేషి మామ్ । శర్మిష్ఠా:యదుక్త మృషి రిత్యేవం తత్సత్యం చారుహాసిని।
న్యాయతో ధర్మతశ్చైవ చరన్తీ న బిభేమి తే । యది త్వయా వృతో భర్తా వృతఏవ మయా తదా. 21
సఖీభర్తా హి ధర్మేణ భర్తా భవతి శోభనే । పూజ్యాऽసి మమ మాన్యాచ జ్యేష్ఠాచ బ్రాహ్మణీ హ్యసి. 22
త్వత్తోహి మే పూజ్యతమో రాజర్షిః కిం న వేత్థ తత్ ।
శౌనకః : శ్రుత్వా తస్యాస్తు తద్వాక్యం దేవయా న్యబ్రవీ దిదమ్. 23
రాజ న్నాద్యేహ వత్స్యామి విప్రియం మే త్వయా కృతమ్ ।
సహసాऽ పృత్థితాం శ్యామాం దృష్ట్వా తాం సాశ్రులోచనామ్. 24
తూర్ణం సకాశం కావ్యస్య ప్రస్థితాం వ్యథిత స్తదా। అనువవ్రాజ సమ్భ్రాన్తః పృష్ఠత స్సాన్త్వయ న్నృపః.
న్యవర్తత న సా చైవ క్రోధసంరక్తలోచనా । అవిబ్రువన్తీ కిఞ్చిత్సా రాజానం సాశ్రులోచనా. 26
అచిరా దేవ సమ్ప్రాప్తా కావ్యస్యోశనసోऽన్తికమ్ । సాతు దృష్ట్వైవ పితర మభివాద్యా గ్రతస్స్థితా. 27
అనన్తరం యయాతిస్తు పూజయామాస భార్గవమ్। దేవయానీ: అధర్మేణ జితో ధర్మః ప్రవృత్త మధరోత్తరమ్.
శర్మిష్ఠయా నివృత్తాऽస్మి దుహిత్రా వృషపర్వణః। త్రయోऽస్యాం జనితాః పుత్త్రా రాజ్ఞా తేన యయాతినా.
దుర్భగాయా మమ ద్వౌ తు పుత్త్రౌ తాత బ్రవీమి తే । ధర్మజ్ఞ ఇతి విఖ్యాత ఏష రాజా భృగూద్వహ।30
అతిక్రాన్తశ్చ మర్యాదాం కావ్యైతత్ కథయామి తే.

ఇట్లు పలికి వారందరును రాజు కడకు పోయిరి. కాని తాను దేవయాని ఎదుట ఉండుటచే అతడు వారిని ప్రీతితో అభినందించలేదు. (ముద్దు చేయలేదు.) అందుచే అప్పుడా బాలురు ఏడ్చుచు శర్మిష్ఠ కడకు పోయిరి. బాలుర మాటలు విని ఏడుపు విని రాజు సిగ్గుపడిన వాడువలె అయ్యెను. ఆ బాలురకు రాజు విషయమున గల ప్రత్యయమ (విశ్వాసము-ప్రీతి) చూచి వాస్తవ స్థితిని గుర్తించి దేవయాని శర్మిష్ఠతో ఇట్లు పలికెను: "నీవు నా అధీనమందుండుదాన వయి

కూడ నాకు ప్రీతికరము కాని పనిని చేసితి వేల? నీవు నీ స్వాభావికమగు అసురధర్మమునే ఆశ్రయించియున్నావు. కాని నాకు భయపడుచున్నావు కావు." శర్మిష్ఠ: "చారుహాసినీ! 'ఋషి' అని నీతో నేను చెప్పినది నిజమే. న్యాయమును ధర్మమును అనుసరించి నడుచుచున్నాను కావున నేను నీకు భయపడుటలేదు. నీవు భర్తను వరించినపుడే నేనును వరించితిని. స్త్రీకి తన సఖీ భర్త తనకును భర్తయగును. నీవు నాకు పూజ్యవు-మాన్యవు-జ్యేష్ఠురాలవు-బ్రాహ్మణివి. ఈ రాజర్షి నీకంటెను నాకు పూజ్యతముడు. నీకీ మాత్రము తెలియదా?"

శర్మిష్ఠ చెప్పినది విని దేవయాని ఇట్లు పలికెను: "రాజా! నీవు నాకు ప్రీతికరము కాని పని చేసితివి. నేను ఇక ఇక్కడ ఉండను." అని చట్టున లేచి ఆ సుందరి కన్నీరు కార్చుచు శుక్రుని దగ్గరకు పోవుటకై బయలుదేరెను. అది చూచి యయాతి మనస్సులో వ్యథనొందెను. వెంటనే అతడును కళవళ పడుచు ఆమెను బ్రతిమాలుచు ఆమె వెంటనే పోవసాగెను. దేవయాని వెనుకకు మరలలేదు. క్రోధముతో ఎర్రనైన కన్నులతో కన్నీరు కార్చుచు త్రోవలో రాజుతో ఏమియు మారుపలుకక త్వరితముగా కావ్యుడగు ఉశనసుని (శుక్రుని) కడకు చేరెను. ఆమె తండ్రిని దర్శించుచునే అతనికి అభివాదనము చేసి అతని ఎదుట నిలువబడెను. తరువాత వెంటనే యయాతియును భార్గవుని నమస్కరించెను. దేవయాని: "అధర్మము ధర్మమును జయించినది. క్రిందు మీదు-మీదు క్రిందు బనది. వృషపర్వుని కూతురు శర్మిష్ఠ నన్ను వెనుకకు నెట్టివేసినది. ఈ యయాతిరాజువలన ఆమెకు ముగ్గురు కుమారులు కలిగినారు. దుర్భగను (పెనిమిటి అనురాగమునకు నోచుకొననిదానను) అగు నాకు ఇద్దరు కొడుకులు మాత్రమే కలిగినారు. తండ్రీ! నామాట నిజము. భృగు వంశ శ్రేష్ఠుడవు నీవు. ఈ రాజు కూడ ధర్మజ్ఞుడు అని ప్రసిద్ధి పొందినవాడేకదా! తాను అట్టివాడయ్యు ఇంతటి నీకు అల్లుడయ్యును- ఇతడు మర్యాదను అతిక్రమించినాడు. అని నీకు చెప్పవలసివచ్చుచున్నది."

శుక్రః : ధర్మజ్ఞ స్త్వం మహారాజ! యోఽధర్మ మకృథాః ప్రియమ్. 31
తస్మా జ్జరా త్వా మచిరా ద్ధర్షయిష్యతి *మానద ।
యయాతిః : ఋతుంవై యాచమనాయా భగవ న్నస్యచేతసా. 33
దుహితు ర్దానవేన్ద్రస్య ధర్మ మేత త్కృతం మయా । ఋతుంవై యాచమానాయా న దదాతి పుమా న్వృతః.
భ్రూణహే త్యుచ్యతే బ్రహ్మ న్స చేహ బ్రహ్మవాదిభిః ।
ఋతుకామాం ప్రియాం యస్తు గమ్యాం రహసి యాచితః. 34
నోపైతి హి స ధర్మేషు భ్రూణహే త్యుచ్యతే బుధైః। ఇత్యేతాని సమీక్ష్యాహం కారణాని భృగూద్వహ! 35
అధర్మభయసంవిగ్న శ్శర్మిష్ఠా ముపజగ్మివాన్ । శుక్రః : నన్వహం ప్రత్యవేక్ష్య స్తే మదధీనోఽసి పార్థివ. 36
ధర్మలోపే ఫతత్యేవ మిథ్యా చరసి పార్థివ । మిథ్యా చరసి ధర్మం త్వం చౌర్యవానసి పార్థివ! 37
శౌనకః : క్రుద్ధేనోశనసా శప్తో యయాతి ర్నాహుష స్తదా ।
పూర్వం వయః పరిత్యజ్య జరాం సద్యోఽన్వపద్యత. 38
యయాతిః : అతృప్తో యౌవనే తస్యాం దేవయాన్యాం భృగూద్వహ ।
ప్రసాదం కురు మే బ్రహ్మ న్జరేయం న విశేత మామ్. 39
శుక్రః : నాహం వృథా వదామ్యేత జ్జరాం ప్రాప్తోసి పార్థివ ।
జరాం త్వేతాం త్వమన్యస్మై సంక్రామయ య ఇచ్ఛతి. 40

* దుర్జయ.

యయాతిః : రాజ్యభాక్స భవే ద్బ్రహ్మ న్పుణ్యభా క్కీర్తిభా క్తథా ।
యో మే దద్యా ద్వయః పుత్ర స్తద్భవా ననుమన్యతామ్. 41

శుక్రః : సఙ్క్రామయిష్యసి జరాం యథేష్టం నహుషాత్మజ ।
మా మనుధ్యాయ భావేన న చ పాప మవాప్స్యసి. 42

వయో దాస్యతి తే పుత్రో య స్స రాజా భవిష్యతి । ఆయుష్మా న్కీర్తిమాంశ్చైవ బహ్వపత్య స్తథైవ చ.

ఇతి శ్రీమత్స్యమహాపురాణే శౌనకశతానీకసంవాదే చన్ద్రవంశానువర్ణనే యయాతి చరితే యయాతే ర్జరాప్రాప్తికథనం నామ ద్వాత్రింశోఽధ్యాయః.

శుక్రుడు: "మహారాజా! నీవు ధర్మజ్ఞుడవు అయి ఉండియు అధర్మముపై ప్రీతి చూపినావు. కావున త్వరలో నిన్ను ముసలితనము బాధించును. నీవు అభిమానవంతుడవు కదా! దీని కిదే దండనము." యయాతి: "భగవన్! నేను సత్యమునందే మనస్సు నిలిపియుండువాడను. నిజమునే చెప్పుచున్నాను. దానవేంద్రుని కూతురు ఋతుఫలమును కోరగా నేను చేసిన ఈ పని ధర్మమే కాని అధర్మము కాదు. 'ఋతు ఫలము ఇమ్మని కోరుచు తానైవచ్చి వరించగా దానిని ఈయని పురుషునకు భ్రూణహత్యా దోషము అంటును.' అని వేదతత్త్వ వేత్తలు (మీవంటి వారే) చెప్పుదురుకదా! (భ్రూణుడు= షడంగములతో కూడ వేదమును అధ్యయనము చేసిన వాడు) 'ఋతుఫలమును కోరినదియును ప్రీతికరముగ ప్రవర్తించునదియు పొందదగినదియు అగు స్త్రీ ఏకాంతమున తను కోరగా ఆమెను పొందనివాడు భ్రూణహత్యా దోషము పొందు' నని ధర్మశాస్త్రములలో పండితులు చెప్పియున్నారు. భృగువంశశ్రేష్ఠా! ఈ మొదలగు హేతువులను బాగుగా పరిశీలించి ఆలోచించి అధర్మమునకు భయపడి నేను శర్మిష్ఠతో కూడితిని." శుక్రుడు: "రాజా! నీవు నా అధీనములోనివాడవు కదా! నా విషయము నీవు ఆలోచించనక్కరలేదా? ధర్మలోపము చేసినవాడు పతితు డగును. అను మాట నిజమే. కాని నీవు మిథ్యా ధర్మమును అనుష్ఠించువాడవు. (నీకు ప్రియమయిన పనిచేసి దానిని ధర్మమని పైకి చూపుచున్నావు.) మనస్సులో ఒకటి పెట్టుకొని చేసిన పనిని పైకి మరి ఒకటిగా చూపుచున్నావు. కనుక నీవు దొంగతనము చేసినవాడ వైనావు."

నహుష పుత్త్రుడు యయాతి క్రుద్ధుడైన శుక్రుని వలన ఈవిధముగా శాపము పొందినాడు. వెంటనే అతనికి మొదటి వయస్సుపోయి ముసలితనము క్రమ్మినది. యయాతి: "భృగూద్వహా! నేను ఈ దేవయాని విషయములో యౌవన సుఖములను పొందుటలో నాకు ఇంకను తృప్తి కలుగలేదు. నన్ను అనుగ్రహించుడు. ఈ ముసలితనము నన్ను క్రమ్మకుండునట్లు దయ చూపుడు." శుక్రుడు: "నేను పలికిన మాట వ్యర్థముకాదు. రాజా! ఈ జర నిన్ను క్రమ్మనే క్రమ్మినది. ఇష్టపడిన మరొకనికి ఇది నీవు సంక్రమింపచేయవచ్చును." యయాతి: "బ్రాహ్మణోత్తమా! నాకు తన యౌవనమును ఇచ్చిన కుమారుడు నా రాజ్యమునకును పుణ్యమునకును కీర్తికిని పాత్రుడు అగునట్లు తాము అనుమతించ వేడుచున్నాను." శుక్రుడు: "నహుషాత్మజా! నీ ఇష్టము వచ్చినవానికి ఎవ్వనికైనను నీవార్ధకమును సంక్రమింపజేయవచ్చును. భావములో నన్ను పిలుపుకొని నీవు ఈ పని చేసినచో నీకు ఏపాపమును అంటదు. నీకు యౌవనము ఇచ్చిన కుమారుడే రాజ్యమునకు అధికారియును అయుష్మంతుడును కీర్తిమంతుడును బహుసంతతిమంతుడును అగును."

ఇది శ్రీమత్స్యమహాపురాణమున చంద్రవంశానువర్ణనమున యయాతి చరితమున శర్మిష్ఠా దేవయానీ సంవాదము-యయాతికి శుక్రశాపము అను ముప్పదిరెండవ అధ్యాయము.

## త్రయస్త్రింశోఽధ్యాయః.

## పుత్రైస్సహ యయాతేర్జరాప్రదానమిని త్తక సంవాదః.

శౌనకః జరాం ప్రాప్య యయాతిస్తు స్వపురం ప్రాప్య చైవహి ।
పుత్రం జ్యేష్ఠం వరిష్ఠం చ యదుమి త్యబ్రవీద్వచః. 1

యయాతిః: జరా వలీ చ మాం పుత్ర పలితానిచ పర్యగుః। కావ్యస్యోశనస శ్శాపా న్న చ తృప్తోఽస్మి యౌవనే.

త్వం యదోః ప్రతిపద్యస్వ పాప్మానం జరయాసహ । యౌవనేన త్వదీయేన చరేయం విషయానహమ్. 3
పూర్ణే వర్షసహస్రేతు పునస్తే యౌవనం త్వహమ్ ।
దత్వా స్వం ప్రతిపత్స్యామి పాప్మానం జరయాసహ. 4
యదుః : జరాయాం బహవో దోషా పానభోజనకారితాః। తస్మాజ్జరాం న తే రాజ న్గ్రహీష్య ఇతి మే మతిః.
సితశ్మశ్రుధరో దీనో జరయా శిథిలీకృతః । వలీసన్నతగాత్రస్తు దుర్దర్శో దుర్బలః కృశః. 6
అశక్తః కార్యకరణే పరిభూత స్స యౌవనైః । సహోపజీవిభి శ్చైవ తజ్జరాం నాభికామయే. 7
సన్తి తే బహవః పుత్రా మత్తః ప్రియతరా నృప । జరాం గ్రహీతుం ధర్మజ్ఞ పుత్ర మన్యం బ్రవీహి వై.
యయాతిః : యస్త్వం మే హృదయాజ్జాతో స్వం వయో న ప్రయచ్ఛసి ।
తస్మా దరాజ్యభా క్తాత ప్రజా తవ భవిష్యతి. 9
యయాతిః : తుర్వసో! ప్రతిపద్యస్వ పాప్మానం జరయాసహ ।
యౌవనేన చరేయంవై విషయాంస్తవ పుత్రక. 10
పూర్ణే వర్షసహస్రే తు పున ర్దాస్యామి యౌవనమ్ । తథైవ ప్రతిపత్స్యామి పాప్మానం జరయాసహ. 11
తుర్వసుః : న కామయే జరాం తాత కామభోగప్రణాశినీమ్ । బలరూపా న్తకరిణీం బుద్ధిప్రాణవినాశినీమ్.12
యయాతిః : యస్త్వం మే హృదయా జ్జా తో వయ స్స్వం న ప్రయచ్ఛసి ।
తస్మా త్ప్రజా సముచ్ఛేదం తుర్వసో తవ యాస్యతి. 13
సజ్కీర్ణాచారధర్మేషు ప్రతిలోమేషు పుత్రక । పిశితాశిషు చాన్త్యేషు మూనం రాజా భవిష్యసి. 14
గురుదారప్రసక్తేషు తిర్యగ్యోనిగతేషుచ । మ్లేచ్ఛేషు పశుధర్మేషు పాపేషు ప్రసవిష్యసి. 15
శౌనకః : ఏవం తు తుర్వసుం శప్త్వా యయాతి స్స త మాత్మజమ్ ।
శర్మిష్ఠాయా స్సుతం జ్యేష్ఠం ద్రుహ్యుం వచన మబ్రవీత్. 16

## ముప్పదిమూడవ అధ్యాయము
## జరాప్రాప్తి విషయమున యయాతి-తత్పుత్త్రుల సంవాదము.

శౌనకుడు శతానీకునితో ఇంకను ఇట్లు చెప్పెను: ఇట్లు వార్ధకమును పొందిన యయాతి తన రాజధానిని చేరి తన పెద్ద కుమారుడును అందరలో మేలైనవాడును అగు యదుని పిలిచి ఇట్లు పలికెను. "కుమారా! కవి మునికుమారు డగు ఉశనసుని శాపమువలన నాకు శరీరము ముడుతలు పడినది; జుట్టు నరసినది. నాకో - యౌవనసుఖముల విషయమున ఇంకను తృప్తి కలుగలేదు. నీవు నా దోషమును ఆదోషమునకు ఫలమగు వార్ధక(లక్షణ)మును స్వీక రింపుము. నీ యౌవనముతో నేను విషయముల ననుభవింతును. వేయి సంవత్సరముల తరువాత మరల నీ యౌవనము నీకు ఇచ్చి నా పాపమును వార్ధకమును తీసికొందును." యదువు: "తండ్రీ! ముసలితనము కలిగినచో దానివలన పాన భోజనాది విషయములందు ఎన్నియో దోషములు ఏర్పడును. అందుచే నీ ముసలితనమును నేను తీసికొనను. ఇది నా నిశ్చయము. ముసలితనముచే దేహము శిథిలమగును. మీసములు తెల్లనివగును. శరీరము ముడుతలు పడును. వంగి పోవును. చూచుటకు బాగుగా నుండదు. చిక్కిపోవును. ఇట్టివాడు పనులు చేయుటకు అశక్తు డగును. యౌవనమునందున్న వారును తనపై ఆధారపడి జీవించువారును కూడ అవమానింతురు. అందుచే నాకు ముసలితనము ఇష్టముకాదు. నీకు నాకంటెను ప్రీతిపాత్రులగు కుమారులు ఇంకను చాలమంది ఉన్నారుగదా! వారిలో ఇంకెవ్వరినైన మీవార్ధకమును తీసి కొమ్మని అడుగుడు. మీరు అన్ని ధర్మములను ఎరిగినవారు." యయాతి: "నా హృదయమునుండి పుట్టినవాడవై ('హృదయాదధి జాయసే.' అని శ్రుతి.) ఉండియు నీవు నాకు నీవయస్సు నీయకున్నావు. కావున నాయనా! నీ సంతతికి

రాజ్యాధికారము లేకుండును." అని అతడు తుర్వసునితో ఇట్లనెను. "కుమారా! తుర్వసూ! నా పాపదోషమును వార్ధకమును కూడ గ్రహింపుము. నీ యౌవనముతో విషయ సుఖముల ననుభవింతును. వేయి సంవత్సరముల తరువాత తిరిగి నీ యౌవనమును నీకిత్తును. నా పాపదోషమును ముసలితనమును తీసికొందును." తుర్వసుడు: "తండ్రీ! వార్ధకము కామ సుఖానుభవములను తదితర భోగానుభవములను కూడ లేకుండ జేయును. బలమును రూపమును బుద్ధిని ప్రాణశక్తిని నశింపజేయును. కనుక నేనది గ్రహించ ఇష్టపడను." యయాతి: "నీవు నా హృదయమునుండి పుట్టిన వాడవై ఉండియు నీ వయస్సును నాకీయకున్నావు. కనుక నీ సంతతి తుదివరకు కొనసాగక సముచ్ఛిన్నమగును. నీవు సంకీర్ణమగు ఆచారములను ధర్మములను పాటించువారు ప్రతిలోమ జాతులవారు (తక్కువ వర్ణపు పురుషునకు ఎక్కువ వర్ణపు స్త్రీతో సంగమముచే కలిగినవారు) పచ్చిమాంసమునైన తినువారు అంత్య వర్ణములవారు (ఊరి చివర నివసించువారు)-ఇట్టి వారి నడుమ రాజ వగుదువు. ఇది నిశ్చయము. గురుపత్నితోనైన తిర్యక్-(పశుపక్ష్యాది)ప్రాణులతోనైన సంగమించువారు మ్లేచ్ఛులు (స్పష్టోచ్చారణము మొదలగు పవిత్ర రూపములేని భాషల మాటలాడువారు) పశువులవలె జీవించు-వ్యవహరించువారు పాపులు మొదలగు వారినడుమ ఉండుచు సంతతిని కనెదవు." తుర్వసుని ఇట్లు శపించి యయాతి శర్మిష్ఠకు పెద్దకొడుకగు ద్రుహ్యునితో ఇట్లు పలికెను.

యయాతిః : ద్రుహ్యో త్వం ప్రతిపద్యస్వ వర్ణరూపవినాశినీమ్ ।
జరాం వర్షసహస్రం మే యౌవనం సమ్ప్రయచ్ఛ తమ్. 17
పూర్ణే వర్షసహస్రే తు తే ప్రదాస్యామి యౌవనమ్॥ స్వం చాదాస్యామి భూయోఽపి పాప్మానం జరయాసహ.
ద్రుహ్యుః : న రాజ్యం న రథం నాశ్వం జీర్ణో భుంక్తే న చ స్త్రియః ।
నో రాగ శ్చాస్య భవతి న జరాం తే న కామయే. 19
యయాతిః : యస్త్వం మే హృదయాజ్జాతో వయః స్వం న ప్రయచ్ఛసి ।
తస్మా ద్ద్రుహ్యో ప్రియః కామో న తే సమ్పత్స్యతే క్వచిత్. 20
ఉడుపప్లవసన్తారో యత్ర నిత్యం భవిష్యతి । అరాజ్యభాగ్రభ్రష్టత్వం తత్ర ప్రాప్స్యసి సాన్వయః. 21
యయాతిః : అనో! త్వంప్రతిపద్యస్వ పాప్మానం జరయాసహ ।
ఏవం వర్షసహస్రంతు చరేయం యౌవనేన తే. 22
అనుః : జీర్ణ శ్శిశు రివాదత్తే కాలేఽన్న మశుచిర్యథా । న జుహోతిచ కాలేఽగ్నిం తాం జరాం నాభికామయే.
యయాతిః : యస్త్వం మే హృదయాజ్జాతో వయ స్స్వం న ప్రయచ్ఛసి ।
జరాదోష స్త్వయోక్తో య స్తస్మాత్త్వం ప్రతిపత్స్యసే. 24
ప్రజాశ్చ యౌవనం ప్రాప్తా వినశిష్య న్త్యనో తవ । అగ్నిప్రస్కన్దనమనా స్త్వంచా ప్యేవం భవిష్యసి. 25
యయాతిః : పూరో త్వం మే ప్రియః పుత్ర స్త్వం వరీయా న్భవిష్యసి ।
జరా వలీ చ మే తాత పలితానిచ పర్యగుః. 26
కావ్యస్యోశనస శ్శాపా న్నచ తృప్తోఽస్మి యౌవనే । పూరో త్వం ప్రతిపద్యస్వ పాప్మానం జరయాసహ.
కిఞ్చిత్కాలం చరేయం వై విషయా న్వయసా తవ । పూర్ణే వర్షసహస్రేవై ప్రతిదాస్యామి యౌవనమ్. 28
స్వంచైవ ప్రతిపత్స్యామి పాప్మానం జరయాసహ ।
శౌనకః : ఏవముక్తః ప్రత్యువాచ పూరుః పితర మంజసా. 29
యథాత్థ త్వం మహారాజ తత్కరిష్యామి తే వచః । ప్రతిపత్స్యామి తే రాజ న్పాప్మానం జరయాసహ. 30
గృహాణ యౌవనం మత్త శ్చర కామా న్యథేప్సితాన్ । జరయాఽహం ప్రతిచ్ఛన్నో వయోరూపధర స్తవ.

యౌవనం భవతే దత్వా చరిష్యామి యథేచ్ఛయా ।
యయాతిః : పూరో! ప్రీతోస్మి తే వత్స జరా మేతాం దదామి తే. 32
సర్వకామసమృద్ధాస్తే ప్రజా రాజ్యం భవిష్యతి. 324

ఇతి శ్రీమత్స్యమహాపురాణే శౌనకశతానీకసంవాదే చన్ద్రవంశానువర్ణనే
యయాతిచరితే యయాతితత్పుత్ర సంవాదో నామ
త్రయస్త్రింశోఽధ్యాయః.

"ద్రుహ్యూ! జర అనునది దేహపువర్ణమును రూపమును నశింపజేయునదియే. ఐనను వేయి సంవత్సరములపాటు నాజరను నీవు తీసికొని నీ యౌవనమును నాకు ఇమ్ము. వేయేండ్లు కాగానే నీ యౌవనమును నీకిత్తును. నా పాపదోషమును ముసలితనమును తిరిగి తీసికొందును " ద్రుహ్యుడు: "జరచే శిథిలుడయినవాడు రాజ్యమును రథమును అశ్వమును స్త్రీలను వేటిని కూడ అనుభవించజాలడు. వాటియందు ఇష్టము కూడ ఉండదు. కనుక నాకు అది ఇష్టము కాదు." యయాతి: "నీవు నా హృదయమునుండి పుట్టినవాడవై యుండియు నీవయస్సు నాకీయకున్నావు. కావున ద్రుహ్యూ! నీకు ఇష్టమగు ఏ కామమును (కోరికయు) నెరవేరకుండుగాక! నిత్యమును తెప్పలపై దాటియే వేరొక చోటికి పోవలసియుండు దేశమున రాజ్యభ్రష్టుడవై జీవింతువుగాక! నీ సంతతివారును ఇట్లే అయి రాజ్యాధికారము లేకుందురుగాక!" యయాతి: "అనూ! నా పాపదోషముతో కూడ నావార్ధకమును నీవు తీసికొనుము. నీ యౌవనముతో వేయేండ్లు విహరింతును." అనువు: "జరచే శిథిలుడయినవాడు శిశువు వలెను అశుచియేమో అన్నట్లును ఏదో సమయమున అన్నమును తినుచుండును. తగిన సమయములో అగ్నికి హోమము చేయజాలడు. కనుక జర నాకు ఇష్టముకాదు." యయాతి: "నాహృదయమునుండి పుట్టినవాడవై ఉండియు నీ యౌవనమును నాకీయకున్నావు. కనుక నీవు అనిన జరాదోషము నీకే ప్రాప్తించుగాక! నీ వంశము వారందరును యౌవనము రాగానే నశించుచుందురుగాక! నీవును నీవనినట్లే అగ్ని ప్రస్కందన మనస్కుడవు (అగ్నిమీదుగా దుముకుట యందు ఇష్టము కలవాడవు) అగుదువుగాక! (ఇది మహాదోషము)".

పిమ్మట యయాతి: "పూరూ! నీవు నా ప్రియపుత్రుడవు. అందరలో గొప్పవాడవు కూడ అయ్యెదవు. కవి మునికుమారుడగు ఉశనసుని శాపమువలన నన్ను ముడుతలును నరలును క్రమ్ముకొన్నవి. యౌవనముచే కలుగవలసిన తృప్తి నాకింకను కలుగలేదు. కనుక నీవు నాపాపదోషమును జరను గ్రహింపుము. నీవయస్సుతో కొంత కాలము విషయ సుఖముల ననుభవింతును. అట్లు నిండుగా వేయేండ్లున్న తరువాత నీ యౌవనము నీకిత్తును. నా పాప దోషమును వార్ధకమును నేను తీసికొందును." ఇట్లు పలికిన యయాతితో వెంటనే పూరు డీ విధముగా ననెను: "మహారాజా! నీవు చెప్పినట్లే చేయుదును. నీ పాపదోషమును వార్ధకమును నేను తీసికొందును. నానుండి యౌవనము గ్రహింపుము. ఈప్సితములగు కామము లనుభవింపుము. (ఇతరుల బలాత్కారముచే కాక) నా యథేచ్ఛతోనే నా యౌవనమును నీకిచ్చి నీవార్ధకముతో కప్పబడి నీవయస్సును రూపమును ధరించి వ్యవహరింతును."

అని పలుకగా యయాతి: "నాయనా! పూరూ! నేను నీ విషయమున ప్రీతుడనైతిని. నా ముసలితనమును నీకిత్తును. నీ ప్రజలు (సంతతివారు) సర్వకామ సమృద్ధులు అయ్యెదరు. నీకు (నీ సంతతి వారికికూడ) రాజ్యాధికారము ఉండగలదు."

ఇది శ్రీమత్స్యమహాపురాణమున చంద్రవంశానువర్ణనమున యయాతి చరిత్రమున
యయాతి-తత్పుత్ర సంవాదము అను ముప్పదిమూడవ అధ్యాయము.

# చతుస్త్రింశో௨ధ్యాయః.

## పూరుపట్టాభిషేచనమ్.

శౌనకః : ఏవ ముక్త స్స రాజర్షిః కావ్యం స్మృత్వా మహావ్రతమ్ ।
సఙ్క్రామయామాస జరాం తదా పుత్త్రే మహాత్మని. 1
పౌరవేణాథ వయసా యయాతి ర్నహుషాత్మజః । ప్రీతియుక్తో నరశ్రేష్ఠ శ్చచార విషయా న్ప్రియాన్. 2
యథాకామం యథోత్సాహం యథాప్రీతి యథాసుఖమ్ । ధర్మావిరుద్ధం రాజేన్ద్రో యథా௨ర్హతి స ఏవ హి. 3
దేవా న్తర్పయ ద్యజ్ఞై శ్శ్రాద్ధైస్తథా పితౄన్ । దీనా ననుగ్రహై రిష్టైః కామైశ్చ ద్విజసత్తమాన్. 4
అతిథీ నన్నపానైశ్చ విశశ్చ ప్రతిపాలనైః । ఆనృశంస్యేన శూద్రాంశ్చ దస్యూ న్నిగ్రహణేన చ. 5
ధర్మేణచ ప్రజా స్సర్వా యథావ దనురఞ్జయన్ । యయాతిః పాలయామాస సాక్షా దిన్ద్ర ఇవాపరః. 6
స రాజా సింహవిక్రాన్తో యువా విషయగోచరః । అవిరోధేన ధర్మస్య చచార సుఖ ముత్తమమ్. 7
స సమ్ప్రాప్య సుఖం కామాన్ తృప్తః ఖిన్నశ్చ పార్థివః । కాలం వర్షసహస్రంతు సస్మార మనుజాధిపః. 8
పరిచిన్త్య స కాలజ్ఞః కలాకాంక్షీ చ వీర్యవాన్ । పూర్ణం మత్వా స తం కాలం పూరుం పుత్త్ర మువాచహ. 9
న జాతు కామః కామానా ముపభోగేన శామ్యతి । హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే. 10
యత్పృథివ్యాం వ్రీహియవం హిరణ్యం పశవ స్స్త్రియః । *ఏకస్యాపి న పర్యాప్తం తస్మా త్తృష్ణాం పరిత్యజేత్.
యథాసుఖం యథోత్సాహం యథాకామ మరిన్దమ । సవితా విషయాః పుత్త్ర యౌవనేన మయా తవ. 11
పూరో ప్రీతో௨స్మి భద్రంతే గృహాణేదం స్వయౌవనమ్ ।
రాజ్యం చైవ గృహాణేదం త్వం హి మే ప్రియకృత్సుతః. 13
శౌనకః : ప్రతిపేదే జరాం రాజా యయాతి ర్నాహుష స్తదా ।
యౌవనం ప్రతిపేదేచ పూరు స్స్వం పునరాత్మజః. 14

# ముప్పది నాలుగవ అధ్యాయము.

## యయాతికి యౌవనప్రాప్తి-పూరు రాజ్యాభిషేకము.

శౌనకుడు శతానీకునకు ఇంకను ఇట్లు చెప్పెను: రాజర్షియగుయయాతి (తన కుమారుడగు) పూరుని సమాధానము విని (లోగడ శుక్రుడు చెప్పియున్నట్లు) మహావేదవ్రత సంపన్నుడగు కావ్యుని-శుక్రుని- స్మరించి మహాత్ముడగు (మహా మనస్కుడగు) పూరునియందు తన ముసలితనమును వ్యాపింపజేసెను. పూరుని యౌవనముతో తాను తన యోగ్యతకు తగి నట్లును తన కామమును ఉత్సాహమును ప్రీతిని సుఖమును అనుసరించియు ధర్మమునకు అవిరుద్ధముగా తనకు ప్రియములగు విషయసుఖములను అనుభవించి ప్రీతియుక్తుడయ్యెను. దేవతలను వారికి అర్హములగు యజ్ఞములతోను పితరులను శ్రాద్ధముల తోను దీనులను అనుగ్రహములతోను ద్విజసత్తములను వారికిష్టములగు కోరికలను తీర్చుటతోను అతిథులను అన్న పానములతోను వైశ్యులను వాణిజ్యము కనిపెట్టి చూచుటతోను శూద్రులను కరుణా భావనముతోను దొంగలను దోపిడి గాండ్రను నిగ్రహణము (దండించుట) తోను ప్రజలను అందరను ధర్మముతోను ఎవరికి తగినట్లు వారిని అనురంజింప (తృప్తినంద) జేయుచు సాక్షాత్ రెండవ ఇంద్రుడువలె యయాతి పాలించుచుండెను. ఆ రాజు సింహమువలె విక్రమము చూపుచు యువకుడై విషయ సుఖముల ననుభవించుచునే ధర్మమునకు అవిరుద్ధముగా ఉత్తమమగు సుఖమును అనుభ వించెను. ఆ యయాతి రాజు సుఖముగా ఆ యా కోరికలను అనుభవించి తృప్తి పొందెను. పొందుటతోపాటే వాటి

విషయమున (ఇవి ఎందులకు? ఎన్నాళ్ళు? అని) ఖేదముకూడ పొందెను. ఇంతలో వేయిఏండ్లు గడచెను. ఆత డదికూడ జ్ఞాపకము చేసికొనెను. అతడు కాలమును కాలతత్త్వమును ఎరిగినవాడు కావునను వీర్యవంతుడైనను కాలము ఎప్పుడెప్పుడు ముగియునా అని ఎదురు చూచుచున్నవాడు కావునను తాననిన వేయిఏండ్ల కాలము ముగిసెనని గుర్తించి పుత్త్రుడగు పూరునితో ఇట్లు పలికెను: "కామము కామములను అనుభవించుటచే ఎన్నటికిని ఉపశమించదు. హవిస్సుతో అగ్నివలె ఇంకను పెరుగుచునేయుండును. పుడమి మొత్తముపై గల వరియు యవలును బంగారును పశువులును స్త్రీలును అన్నియు కలిసినను ఒక్కనికి కూడ చాలవు. కావున తృష్ణను విడువవలెను. (అన్ని విధములగు) శత్రువులను అణచినవాడా! నేను నా సుఖమునకు కామమునకు ఉత్సాహమునకు తగినట్లు నేను నీ యౌవనముతో విషయసుఖముల ననుభవించితిని. ఇందు నీ యోగ్యత నాకు ఇంత ప్రీతి కలిగించినది. ఇదిగో! నీ యౌవనము తీసికొనుము. ఇదిగో! రాజ్యము కూడ తీసికొనుము. ఏలయన నాకు ప్రీతి కలిగించు పుత్త్రుడవు నీవు."

ఇట్లు పలుకుచునే యయాతి తన వార్ధకమును తీసికొనెను. పూరునకు తన యౌవనము మరల లభించెను.

రాజ్యేఽభిషేక్తుకామం తం పూరుం పుత్త్రం కనీయసమ్ । బ్రాహ్మణ ప్రముఖావర్ణా ఇదం వచన మబ్రువన్.

యయాతిపౌరసంవాదః.

ప్రకృతయః : కథం శుక్రస్య దౌహిత్రం దేవయాన్యా స్సుతం ప్రభో ।
జ్యేష్ఠం యదు మతిక్రమ్య రాజ్యం పూరోః ప్రదాస్యసి. 16
జ్యేష్ఠో యదు స్తవ సుత స్తుర్వసు స్తదనన్తరః । శర్మిష్ఠాయా స్సుతో ద్రుహ్యు స్తథాఽనుః పూరురేవచ. 17
కథం జ్యేష్ఠ మతిక్రమ్య కనీయా న్రాజ్య మర్హతి ।
ఏత త్సమ్బోధయామ స్త్వాం ధర్మం త్వ మనుపాలయ. 18
యయాతిః : బ్రాహ్మణప్రముఖా వర్ణా స్సర్వే శృణ్వన్తు మే వచః ।
జ్యేష్ఠం ప్రతి యథారాజ్యం న దేయం మే కథఞ్చన. 19
మమ జ్యేష్ఠేన యదునా నియోగో నానుపాలితః । ప్రతికూలః పితుర్యశ్చ న స పుత్త్ర స్సతాం మతః. 20
మాతాపిత్రోర్వచనకృ ద్ధితః పథ్యశ్చ య స్సుతః । స పుత్త్రః పుత్త్రవర్యశ్చ వర్తతే పితృమాతృషు. 21
యదునాఽహ మవజ్ఞాత స్తథా తుర్వసునాపిచ । ద్రుహ్యునా చానునా చైవ మయ్యవజ్ఞా కృతా భృశమ్. 22
పూరుణా మే కృతం వాక్యం మానితంచ విశేషతః ।
కనీయా న్మమ దాయాదో జరా యేన ధృతా మమ. 23
మమ కామ స్సచ కృతః పూరుణా పుత్త్రరూపిణా । శుక్రేణచ వరో దత్తః కావ్యేనోశనసా స్వయమ్. 24
పుత్త్రో య స్త్వనువర్తేత స రాజా పృథివీపతిః । భవన్తః ప్రతిజానన్తు పూరూ రాజ్యేఽభిషిచ్యతామ్. 25
ప్రకృతయః : యః పుత్త్రో గుణసమ్పన్నో మాతాపిత్రో ర్హిత స్సదా ।
సర్వశోఽర్హతి కల్యాణం కనీయానపి స ప్రభుః. 26
అర్హః పూరు రిదం రాజ్యం యః ప్రియః ప్రియకృత్తవ । వరదానేన శుక్రస్య న శక్యం వక్తు ముత్తరమ్. 27
శౌనకః : పౌరజానపదై స్తుష్టై రిత్యుక్తో నాహుష స్తదా ।
అభిషిచ్య తతః పూరుం రాజ్యే స్వం సుత మాత్మజమ్. 28
దత్త్వాచ పూరవే రాజ్యం వనవాసాయ దీక్షితః । పురాత్స నిర్యయౌ రాజా బ్రాహ్మణై స్తాపసై స్సహ. 29
యదోస్తు యాదవా జాతా స్తుర్వసో ర్యవనా స్సుతాః । ద్రుహ్యోస్సుతావై భోజాస్తు అనోస్తు మ్లేచ్ఛజాతయః.

పూరోస్తు పౌరవో వంశో యత్ర జాతోఽసి పార్థివ। ఇదం వర్షసహస్రం యో రాజ్యం కారయితుం వశీ.31

ఇతి శ్రీమత్స్యమహాపురాణే శౌనకశతానీకసంవాదే చన్ద్రవంశానువర్ణనే
యయాతిచరితే చతుస్త్రింశోఽధ్యాయః.

పూరుడు కడసారి కుమారుడే యైనను యయాతి అతనికే తన రాజ్యము నీయదలచెను. అది తెలిసి బ్రాహ్మణులు మొదలగు ఆయా వర్ణములవారు ఈ విధముగా పలికిరి: "ప్రభూ! శుక్రునికి దౌహిత్రుడును దేవయానికి కుమారుడును కొడుకులలో పెద్దవాడును అగు యదుని విడిచి రాజ్యమును పూరున కిచ్చుచున్నావు. ఇది ఎట్లు? క్రమముచే యదువు మొదటివాడు. తుర్వసుడు రెండవవాడు. శర్మిష్ఠ కుమారులలో ద్రుహ్యుడు అనుడు పూరుడు అనువారు క్రమముగా కుమారులు. పెద్దవానిని విడిచి కడసారి వాడు రాజ్యమునకు ఎట్లు అర్హుడగును? ఇది నీకు తెలియజేయుచు హెచ్చరించుచున్నాము. నీవు ధర్మమును అనుపాలనము చేయుట మంచిది."

యయాతి: "బ్రాహ్మణులు మొదలగు సర్వవర్ణములవారు అందరును నామాట వినగోరుచున్నాను. పెద్దవానికి ఏవిధముగను రాజ్యము ఈయగూడదని హేతువును చెప్పెదను. యదువు నా పెద్దకొడుకు అయి ఉండియు నానియోగమును అనుపాలించలేదు. అదియుకాక తండ్రికి ప్రతికూలుడగు పుత్రుడు పుత్రుడు కాదని విజ్ఞుల తలపు. తల్లిదండ్రులమాట పాటించుచు వారికి హితుడు అనుకూలుడు ఐయుండు కుమారుడే పుత్రుడును పుత్రులలో శ్రేష్ఠుడును ఐ తల్లిదండ్రులకు దగ్గరవాడై యుండును. యదువు తుర్వసుడు ద్రుహ్యుడు అనువు ఈ నలుగురును నన్ను లెక్కసేయలేదు. పూరుడు మాత్రము నామాటను అధికమగు ఆదరముతో పాటించినాడు. నాజరను తాను మోసికొనిన పూరుడే చిన్నవాడైనను నా ఆస్తిని అనుభవించుటకు అధికారి. పుత్రులలో మేటియై అతడే నాకోరికను తీర్చినాడు. అదికాక కవి మునికి కుమారుడు అగు ఉశనసుడు (శుక్రుడు) స్వయముగా "నిన్ను అనువర్తించు కుమారుడే నీతరువాత రాజు కాదగినవాడు." అని వరమును ఇచ్చియున్నాడు. కావున పూరుని రాజ్యమునం దభిషేకము చేయుటకు మీకభ్యంతరము లేదను విషయము స్పష్టముగా చెప్పగోరుచున్నాను." ప్రకృతులు (పౌరులు జానపదులు అగు ప్రజాజనము): "గుణ సంపన్నుడు మాతాపితరులకు ఎల్లప్పుడు మేలుసేయువాడు అగుకొడుకే ప్రతియొక విధమునను శుభమును పొంద అర్హుడు. కడగొట్టువాడైనను అతడే ప్రభువు. నీకు ప్రియము నాచరించి నీ ప్రీతికి పాత్రుడైనందున పూరుడే ఈరాజ్యమునకు అర్హుడు. ఈ విషయమున శుక్రుని వరదానము కూడ ఇట్లే యుండుటచేత మరేమియు పైమాట మేము చెప్ప నవకాశము లేదు."

పౌరులును జానపదులును నగు ప్రజాజనము సంతుష్టులై ఇట్లు పలుకగానే యయాతి పూరుని తన రాజపదమునం దభిషేకించెను. అతనికి తన రాజ్యమును అప్పగించెను. వనవాసమునకై దీక్ష తీసికొనెను. బ్రాహ్మణులును తాపసులును వెంటరాగా పురమును వెలువడి వనమున కేగెను.

యదుని సంతతివారు యాదవులును తుర్వసుని సంతతివారు యవనులును ద్రుహ్యుని సంతతివారు భోజ జాతీయులును అను సంతతివారు మ్లేచ్ఛ జాతులవారునునైరి. పూరుని సంతతివారు పౌరవులని ప్రసిద్ధి నొందిరి. ఈ వంశమునందే నీవు (శతానీకుడు) జనించి వేయి ఏండ్లపాటు రాజ్యము నేలువాడ వయినావు.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున చంద్రవంశాను కీర్తనమున యయాతి చరితమున
పూరురాజ్యాభిషేకమను ముప్పది నాలుగవ అధ్యాయము.

## పంచత్రింశోఽధ్యాయః.

## యయాతే ర్వనగమనమ్.

శౌనకః : ఏవం స నాహుషో రాజా యయాతిః పుత్ర మీప్సితమ్ ।
రాజ్యేఽభిషిచ్య ముదితో వానప్రస్థోఽభవ న్మునిః. 1

ఉషిత్వా వనవాసం స బ్రాహ్మణైస్సహ సంశితః । ఫలమూలాశనో దాన్తో యయాతిః స్వ రితో గతః. 2
స గత స్సుఖవాసంచ న్యవస న్ముదిత స్సుఖమ్ । కాలస్య నాతిమహత శ్శక్రేణ వినిపాతితః. 3
న్యపత త్ప్రచ్యుత స్స్వర్గా ద్ప్రాప్తో మేదినీతలమ్ । స్థిత ఆసీ దన్తరిక్షే స తదేతి శ్రుతం మయా. 4
తత ఏవ పునశ్చాపి గత స్స్వర్గమితి శ్రుతిః । రాజ్ఞా వసుమతా సార్ధ మష్టకేనచ వీర్యవాన్. 5
ప్రతర్దనేన శిబినా సమేత్య కిల సంసది । శతానీకః : కర్మణా కేన స దివం పునః ప్రాప్తో మహీపతిః. 6
కథ మిన్ద్రేణ భగవ న్పాతితో మేదినీతలే । సర్వ మేత దశేషేణ శ్రోతు మిచ్ఛామి తత్త్వతః. 7
కథ్యమానం త్వయా విప్ర దేవర్షిగణసన్నిధౌ । దేవరాజసమో హ్యాసీ ద్యయాతిః పృథివీపతిః. 8
వర్ధనః కిల వంశస్య విభావసుసమద్యుతిః । ●తస్య వి స్తీర్ణవంశస్య సత్యకీ ర్తే ర్మహాత్మనః. 9
చరితం శ్రోతు మిచ్ఛామి దివి చేహ చ సర్వశః ।
శౌనకః హన్త తే కథయిష్యామి యయాతే రుత్తమాం కథామ్. 10
దివి చేహచ పుణ్యార్థాం సర్వపాప్రమోచనీమ్ । యయాతి ర్నాహుషో రాజా పూరుం పుత్త్రం కనీయసమ్.
రాజ్యేఽభిషిచ్య ముదితః ప్రవవ్రాజ వనం తదా । అన్త్యేషు స వినిక్షిప్య పుత్త్రా న్యదుపురోగమాన్. 12
ఫలమూలాశనో రాజా వనేఽసౌ న్యవస చ్చిరమ్ । సంశితాత్మా జితక్రోధ స్తర్పయ న్పితౄదేవతాః. 13
అగ్నీంచ విధివ జ్జుహ్వా న్వానప్రస్థవిధానతః । అతిథీ న్పూజయన్నిత్యం వన్యేన హవిషా విభుః. 14
శిలోఞ్ఛవృత్తి మాస్థాయ శేషాన్నకృతభోజనః । పూర్ణం సహస్రం వర్షాణా మేవంవృత్తి రభూ న్నృపః.
అమ్బుభక్ష స్స మాసాం స్త్రీ నాసీన్నియతవాఙ్మనాః । తతశ్చ వాయుభక్షోఽభూ త్సంవత్సర మతన్ద్రితః.
పఞ్చాగ్నిమద్యే చ తప స్తేపే సంవత్సరం పునః । ఏకపాదస్థితో వాసీ త్షణ్మాసా ననిలాశనః. 17
పుణ్యకీర్తి స్తత స్స్వర్గం జగామావృత్య రోదసీ. ★ ★ ★ 128

ఇతి శ్రీమత్స్యమహాపురాణే శౌనకశతానీకసంవాదే చన్ద్రవంశానువర్ణనే
యయాతిచరితే పఞ్చత్రింశోఽధ్యాయః.

## యయాతి వానప్రస్థవ్రతానుష్ఠానము- అతనిస్వర్గప్రాప్తియు.

శౌనకుడు శతానీకునితో ఇంకను ఇట్లు చెప్పెను: ఇట్లు యయాతి తనకు ప్రీతిపాత్రుడగు పుత్త్రుని పూరుని రాజపదమునం దభిషేకించి ముదితుడై వానప్రస్థుడై మునిగా నయ్యెను. అతడు వనవాసమును జరిపి అచటి బ్రాహ్మణులతో పాటుగా ఫలమూలము లాహారముగా ఇంద్రియముల నిగ్రహించి తుదకు స్వర్గమున కేగెను. అతడచట సుఖవాసమును పొంది ముదితుడై సుఖముగా నుండెను. కొంతకాలమునకు ఇంద్రు డతనిని క్రిందికి పడద్రోసెను. అతడు స్వర్గమునుండి జారిపడెను. కాని భూమికి చేరలేదు. అప్పటిలో కొంతకాలమంతరిక్షమందే యుండి యజ్ఞ నంసత్‌నందు ఉండిన వసుమాన్ అష్టకుడు ప్రతర్దనుడు శిబి అను రాజులతో కూడి అటనుండియే మరల స్వర్గమున కేగెను. అని నేను పరంపరలో వినియున్నాను.

శతానీకుడు శౌనకు నిట్లడిగెను: భగవన్! "యయాతి పృథివీ పాలకుడుగా శ్రేష్ఠుడు. వంశమునకు వృద్ధిని (శుభమును సంతోషమును అభివృద్ధిని) కలిగించినవాడు. సూర్యుని ప్రకాశముతో అగ్నిప్రకాశముతో సమమగు ప్రకాశము కలవాడు. వంశమును విస్తరింపజేసినవాడు. వాస్తవమును నిర్మలమును నగు కీర్తిగలవాడు. మహామనస్కుడు. స్వర్గమునందును దేవర్షి గణముల ప్రశంసలందుకొనుచు వారి సన్నిధియందు దేవరాజసముడై వెలుగొందెను." అందురు గదా! అట్టి వాని నింద్రు డెట్లు ఏల స్వర్గమునుండి పడద్రోసెను? యయాతిచరితమునందలి ఈ యంశములన్నియు అతని ఐహిక పారలౌకిక వృత్తాంతమునందలి తత్త్వము నంతయు వినగోరుచున్నాను.

● తస్యానికీర్ణవంశస్య

శౌనకుడు శతానీకున కిట్లు చెప్పెను: నాయనా! యయాతి కథ ఉత్తమ మయినది. సర్వపాపములను పోగొట్టి పుణ్యమును కలిగించునది. అతని ఐహ లౌకిక పారలౌకిక వృత్తాంతమును తాత్త్వికముగా వివరింతును. వినుము.

నహుష పుత్త్రుడగు యయాతి తన కడపటి కుమారుడగు పూరుని రాజ్యమునం దభిషేకించి ముదితుడై వనమునకు ప్రవ్రాజితుడయ్యె నంటిని గదా! అంతకుముందే అతడు యదువు మొదలగు కుమారులను రాజ్యపు మేరల యందును అంతకు వెలువలను నిలిపెను. వనమునందు ఈరాజు వానప్రస్థుడుగా ఫలమూలములు ఆహారముగా ఇంద్రియ నిగ్రహము కలిగి అరణ్యమునందు చాల కాలముండెను. చిత్తమును తీక్ష్ణమొనర్చుకొని క్రోధమును జయించి పితృదేవతల తృప్తి నొందించుచు అగ్నియందు వానప్రస్థ విధానమున హోమాదికము జరుపుచుండెను. ఆ ప్రభువు వనములందు లభించు ఆహారాదికమును దేవతలకు నివేదించిన తరువాత ఆ హవిష్యమునే అతిథులకు ఆహారముగా నిచ్చి వారి నాదరించుచుండెను. శిలవృత్తి (పొలములు మొదలగుచోట్ల రాలిన ధాన్యకణముల నేరితెచ్చుట) ఉంఛవృత్తి (సేద్యపు పొలములలో రాలిన ధాన్యపు కంకులను ఏరితెచ్చుట) అవలంబించి దేవతలకు అతిథులకు పితరులకు వినియోగించగా శేషించిన ఆహారమునే తినుచుండెను. ఇట్లారాజు వేయి నిండు సంవత్సరములు జీవితము గడపెను. తరువాత మూడు మాసములు జలాహారుడై మనస్సును వాక్కును నియమించుకొనియుండెను. తరువాత సోమరితనము లేక సంవత్సరము పాటు వాయుభక్షు డయ్యెను. తరువాత సంవత్సరకాలము పంచాగ్ని మధ్యమున తప స్సాచరించెను వాయు వాహారముగా ఆరుమాసములు ఏకపాదస్థితుడై తపస్సు చేసెను. పుణ్యకీర్తియగు ఆ యయాతి తన ప్రకాశముతో రోదసులను (ద్యుభూలోకముల నడుమ ప్రదేశమును) నింపివేయుచు స్వర్గము చేరెను.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున చంద్రవంశాను కీర్తనమున యయాతి చరితమున
యయాతి వానప్రస్థ జీవితము-అతని స్వర్గప్రాప్తియను ముప్పదియైదవ యధ్యాయము.

## షట్త్రింశోఽధ్యాయః.
## శక్రయయాతి సంవాదః.

శౌనకః : స్వర్గతస్తు స రాజేన్ద్రో నివస న్దేవసద్మని । పూజిత స్త్రిదశై స్సాధ్యై ర్మరుద్భి ర్వసుభి స్తథా. 1
దేవలోకా ద్బ్రహ్మలోకం సఞ్చర న్పుణ్యకృ ద్వశీ । అవస త్పృథివీపాలో దీర్ఘకాల మితి శ్రుతిః. 2
స కదాచి న్నృపశ్రేష్ఠో యయాతి శ్శక్ర మాగమత్ । కథాన్తే తత్ర శక్రేణ పృష్ట స్స పృథివీపతిః. 3
శక్రః : యదా పూరు స్తవ రూపేణ రాజ న్జరాం గృహీత్వా ప్రచచార లోకే ।
తదా స రాజ్యం సమ్ప్రదాయైవ తస్మై త్వయా కిముక్తః కథయేహ సత్యమ్. 4
యయాతిః గఙ్గాయమునయో ర్మధ్యే కృత్స్నోఽయం విషయ స్తవ ।
మధ్యే పృథివ్యా స్త్వం రాజా భ్రాతరోఽన్త్యాధిపా స్తవ. 5
తే తే ధికాశ్నిష్టతమా స్తితిక్షవో తథా తితిక్షు శ్చాతితిక్షో ర్విశిష్టః ।
అమానుషేభ్యో మానుషశ్చప్రధానో విద్వాం స్తథైవావిదుషః ప్రధానః. 6
ఆక్రుశ్యమానో నాక్రోశే న్మన్యురేవం తితిక్ష్యతే । ఆక్రోష్టారం నిర్దహతి సుకృతం చాస్య విన్దతి. 7
నారున్తుద స్స్యా న్న నృశంసవాదీ న హీనతః పరమ ప్యాదదీత ।
యయా స్వవాచా పర ఉద్విజేత న తాం వదే దుశతీం పాపలోక్యామ్. 8
అరున్తుదం పరుషం తీక్ష్ణవాచం వాక్కంటకై ర్వితుద న్తం మనుష్యమ్ ।
విద్యా దలక్ష్మీకతమం జనానాం ముఖే నిబద్ధాం నిర్ఋతిం వహన్తమ్. 9
సద్భిః పురస్తా దభిపూజిత స్స్యా త్సద్భి స్తథా పృష్ఠతో నన్దిత స్స్యాత్ ।
సదా సతా మతివాదం తితిక్షే త్సతాం వృత్తం చాదదీ తార్యవృత్తః. 10

వాక్సాయకా వదనా న్నిష్పత న్తి తైరాహత శ్శోచతి రాత్ర్యహాని ।
పరస్య నామర్మసు నిష్పత న్తి తాన్పణ్డితో నావసృజే త్పరేషు. 11
నాస్తీదృశం సంవననం త్రిషు లోకేషు కిఞ్చన । యథా మైత్రీచ భూతేషు దానంచ మధురాచ వాక్. 12
* తస్మా త్సా న్త్వం సదా వాచ్యం న వదే త్పరుషం క్వచిత్ ।
పూజ్యా న్సమ్పూజయే దన్యా న్నాభిశాపం కదాచన. 13

ఇతి శ్రీమత్స్యమహాపురాణే శౌనకశతానీకసంవాదే చన్ద్రవంశానువర్ణనే
యయాతిచరితే షట్త్రింశోఽధ్యాయః.

## ముప్పది ఆరవ అధ్యాయము
## ఇంద్ర యయాతి సంవాదము

శౌనకుడు శతానీకునితో ఇంకను ఇట్లు చెప్పెను. రాజేంద్రుడగు యయాతి స్వర్గమును చేరి దేవభవనమునందు నివసింపసాగెను. అచట నతనిని దేవతలు సాధ్యులు మరుత్తులు వసువులు మొదలగువారు పూజించు (ఆదరించు)చుండిరి. అతడు పుణ్యమును ఆచరించినవాడును ఇంద్రియనిగ్రహము కలవాడును (కావున తన తపోబలమున సంపాదించిన పుణ్యలోకములలో) దేవలోక బ్రహ్మలోకములలో ఒకదానినుండి మరియొకదానికి సంచరించుచు చాలకాలము ఉండెను. అని పరంపరలో వినుచున్నాము. ఇట్లు ఒకప్పుడు ఆ నృపశ్రేష్ఠుడు యయాతి ఇంద్రలోకమునకు పోయెను. మాటల సందర్భములో ఇంద్రుడు యయాతిని ఇట్లు అడిగెను: "రాజా! పూరుడు నీ రూపమును గ్రహించి వార్ధకముతో లోకమున వ్యవహరించినందులకు సంతసించి నీవు నీరాజ్యము నతని కిచ్చినప్పుడు అతనికి ఏమి ఉపదేశించితివో నిజము చెప్పుము." యయాతి: "గంగా యమునా నదుల నడుమ నున్న ఈ దేశమంతయు నీ విషయము: (పరిపాలనలో ఉండు ప్రదేశము). ఈ భూభాగమున కంతటికి నీవు రాజవు. నీ అన్నలు నీరాజ్యపు అంచులందును వానికి అవతలను ఉండు దేశములను పాలింతురు.

"శిష్టులందరలో గొప్పవారును ఓర్పుగలవారును పురుషులలో అధికులు. ఎట్లన-ఓర్పు లేనివానికంటె అధికలవాడు విశిష్టుడు. మానుష ధర్మము లేనివారికంటె అధికలవాడును వివేకము లేనివానికంటె అధికలవాడును విశిష్టతరుడు. ఇతరులు చెడు మాటలాడినను తానట్టివి ఆడరాదు. ఇట్లున్నచో కోపము నిగ్రహింపబడును. ఆ కోపము ఆక్రోశించినవానినే నిర్దహించును. తిట్టు తినినవాని పాపము తిట్టినవానికి అంటును. ఇతరుల హృదయమునకు వ్రణము కలిగించు పనులు చేయరాదు. క్రూర వచనములు పలుకరాదు. హీనునినుండి ఎంత గొప్ప వస్తువునైన గ్రహింపరాదు. (తాను ఏది పలికిన ఇతరులు నొప్పిపడుదురో) ఇతరులు ఏది పలికినచో తన మదికి నొప్పి కలుగునో అట్టి దుర్వచనములు తానితరులను పలుకరాదు. అది పాపలోకములకు పోవుటకు కారణమగును. అరుంతుదుడు (ఇతరుల హృదయ వ్రణమును రేపెడి క్రూరపు పనులు చేయుచు అట్టి మాటలాడుచు నుండువాడు) అగు పురుషుడు తీక్ష్ణవచనములు పలుకువాడు మాటలనెడి ముండ్లతో ఇతరుని బాధించువాడు మనుష్యులందరలో అశుభస్వరూపులని తెలియవలెను. అట్టి వాడు తన ముఖమునందు నిర్ఋతిని (అలక్ష్మిని) కట్టుకొని మోయువాడే. సజ్జనులు తన ఎదుటను మెచ్చుకొనునట్లును వెనుకను ప్రశంసించునట్లును నడుచుకొనవలెను. సజ్జనులు ఒకవేళ నిందించినను ఓర్చుకొనవలెను. వారి నడువడిలో మంచివానిని తాను గ్రహించి పూజ్యమగు నడువడితో మెలగవలెను. (పరుష) వచనములు నోటినుండి వెలువడు బాణములు. వాటి దెబ్బ తినినవాడు రాత్రింబవళ్ళును శోకించుచుండును. అవి ఇతరుల హృదయ మర్మములందు తప్ప గ్రుచ్చుకొనవు. కనుక వివేకి యగువాడు వాటిని ఎవరిమీదను విడువరాదు. భూతములయందు మైత్రి ,సానుభూతి) దానము-మధుర వచనములు పలుకుట- ఈ మూటితో సదృశమగు సంవననము (ఇతరులను తనవైపు త్రిప్పుకొనునది) మరి ఏదియు లేదు. కనుక ఎల్లప్పుడును

నెమ్మదిగా మాటలాడవలయును. వరుషము లెక్కడ నెప్పుడు నాడరాదు. పూజ్యులగు ఇతరులను పూజించుచుండవలయును. అభిశాపవచనము లెన్నడు నాడరాదు."

ఇది శ్రీమత్స్యమహాపురాణమున చంద్రవంశానుకీర్తనమున యయాతి చరితమున
ఇంద్ర యయాతి సంవాదమున యయాతి పూరునకు బోధించిన నీతులు అను ముప్పదిఆరవ అధ్యాయము.

## సప్తత్రింశోఽధ్యాయః.

## యయాత్యష్టకసంవాదః.

ఇన్ద్రః : సర్వాణి కర్మాణి సమాప్య రాజ న్గృహా న్పరిత్యజ్య వనం గతోఽసి ।
పృచ్ఛామి త త్త్వాం నహుషస్య పుత్త్ర । కోఽన్య స్తుల్య స్తపసా తే యయాతే. 1
యయాతిః : నాహం దేవమనుష్యేషు న గన్ధర్వమహర్షిషు ।
ఆత్మన స్తపసా తుల్యం కఞ్చి త్పశ్యామి వాసవ. 2
ఇన్ద్రః : యదాఽవమంస్థాః సదృశ శ్శ్రేయసశ్చ పాపీయస శ్చాఽవిదితప్రభావః ।
తస్మా ల్లోకా హ్యన్తవన్త స్తవేమే క్షీణే పుణ్యే పతితో ఽస్యద్య రాజన్. 3
యయాతిః : సురర్షి గన్ధర్వనరావమానా త్క్షయం గతా మే యది శక్ర లోకాః ।
ఇచ్ఛేయం త త్సురలోకా ద్విహీన స్సతాం మధ్యే పతితుం దేవరాజ. 4
ఇన్ద్రః : సతాం సకాశే పతితోఽసి రాజం శ్చ్యుతః ప్రతిష్ఠాం యత్ర లబ్ధాఽసి భూయః ।
ఏవం విదిత్వా తు పునర్యయాతే న తేఽవమాన్యా స్సదృశా శ్శ్రేయసశ్చ. 5
శౌనకః : తతః ప్రహాయామరరాజజుష్టా త్పుణ్యా ల్లోకా త్పాత్యమానం యయాతిమ్ ।
సమ్ప్రేక్ష్య రాజర్షివరోఽష్టక స్త మువాచ వై ధర్మనిదాన గోప్తా. 6
అష్టకః : క స్త్వం యువా వాసవతుల్యరూప స్స్వతేజసా దీప్యమానో యథాఽగ్నిః ।
పత స్యుదీర్ణామ్బుధరాన్ధకారా త్ఖాత్ఖేచరాణాం ప్రవరో యథాఽర్కః. 7
దృష్ట్వా చ త్వాం స్వర్గపథా త్పతన్తం వైశ్వానరార్కద్యుతి మప్రమేయమ్ ।
కిన్ను స్వి దేత త్పతతీతి సర్వే వితర్కయన్తః పరిమోహితా స్స్మః. 8
దృష్ట్వాచ త్వాఽధిష్ఠితం దేవమార్గే మత్వాఽర్కవిష్ణుప్రతిమప్రభావమ్ ।
ప్రత్యుద్గతా స్త్వాం వయమేవ సర్వే త త్త్వం పాతే తవ జిజ్ఞాసమానాః. 9
న వాఽపి త్వాం ధృష్ణవః ప్రష్టు మగ్రే న చ త్వ మస్మా న్పృచ్ఛసి కే వయం స్మః ।
త త్త్వాం పృచ్ఛామి స్పృహణీయరూపం కస్య త్వం వా కింనిమిత్తం త్వ మాగాః. 10
భయం తు తే వ్యేతు విషాదమోహౌ త్యజాశు దేవేన్ద్రసమానరూప ।
త్వాం వర్తమానం హి సతాం సకాశే నాలం ప్రసోఢుం బలహాఽపి శక్రః. 11
సన్తః ప్రతిష్ఠా ద్యుసుఖచ్యుతానాం జయన్తి దేవామరరాజకల్ప ।
తే సఙ్గతా స్స్థావరజఙ్గమేశాః ప్రతిష్ఠిత స్త్వం సదృశేషు సత్సు. 12
ప్రభు రగ్నిః ప్రతపనే భూమి రావపనే ప్రభుః । ప్రభు స్సూర్యః ప్రకాశేచ సతాం చాభ్యాగతః ప్రభుః. 13

ఇతి శ్రీమత్స్యమహాపురాణే శౌనకశతానీకసంవాదే చన్ద్రవంశానువర్ణనే
యయాతిచరితే సప్తత్రింశోఽధ్యాయః.

# ముప్పది ఏడవ అధ్యాయము

## యయాతి స్వర్గభ్రంశము-యయాత్యష్టక సంవాదము.

ఇంద్రుడు యయాతితో ఇట్లనెను: "నహుషపుత్రా! యయాతి రాజా! గృహస్థుడుగా సర్వకర్మములను ముగించుకొని గృహములను విడిచి వానప్రస్థుడవయి వనమును చేరుకొంటివి. అందువలన నిన్నడుగుచున్నాను. తపస్సుచే నీకు సమానుడు మరి ఎవ్వరో చెప్పుము. యయాతి: "దానవా! దేవతలు మనుష్యులు గంధర్వులు మహర్షులు- ఈ ఎవ్వరి యందును తపస్సుచే నాకు సమానుడు మరి ఎవ్వడును కనబడడు." ఇంద్రుడు: "నీవు వారివారి వైయక్తిక ప్రభావమును ఎరుగకయే సమానులను అధికులను హీనులను కూడ అవమానించినావు. కావున ఇదిగో! ఈ నీలోకములన్నియు అంత వంతములు (ముగిసిపోయినవి) అగుచున్నవి. ఇప్పుడే పడిపోవుచున్నావు." యయాతి: "సురలను ఋషులను గంధర్వులను నరులను అవమానించినందున నాలోకములన్నియు క్షీణములయినచో ఇంద్రా! సురలోకమునుండి జారిపడియు సత్ జనుల నడుమ పడగోరుచున్నాను." ఇంద్రుడు: "యయాతిరాజా! నీవు జారియును సత్ జనుల నడుమనే పడుచున్నావు. మరల వారివలననే నిలుకడను పొందగలవు. ఈ విషయమును గుర్తునందుంచుకొని మరల ఎప్పుడును సమానులనుగాని అధికులనుగాని అవమానింపకుము."

అంతట దేవేంద్రుడే సాక్షాత్ అనుభవించు పుణ్యలోకమునుండి పడద్రోయబడుచున్న యయాతిని చూచి రాజర్షి వరుడును ధర్మమునకు మూలతత్త్వమును (వేదమును వేదమార్గమును) రక్షించువాడునగు అష్టకుడు అతనితో ఇట్లనెను: "నీవు ఎవరవు? యువకుడవు. ఇంద్రుని రూపమువంటి రూపముతో నున్నావు. స్వతేజముతో అగ్నివలె ప్రకాశించుచున్నావు. మేఘావరణముచే విజృంభించిన అంధకారముతో నిండిన ఆకాశమునుండి గ్రహ శ్రేష్ఠుడగు సూర్యుడు వలె పడుచున్నావు. అగ్నివలెను అర్కునివలెను ద్యుతి కలిగి ఇంతటివాడవు అన నలవికాని నీవు స్వర్గపథమునుండి పడుచుండుట చూచి ఈ పడుచున్నది ఏమియో అని అందరమును పరిమోహితులము (ఏమియు తెలియనివారము) అగు చున్నాము. స్వర్గమార్గము నధిష్ఠించియున్న నీవు రవి విష్ణుల ప్రభావమువంటి ప్రభావము కలిగియున్నావు. ఇట్టి నీవు పడుటకు కారణమగు తత్త్వము ఎరుగగోరి మేమందరమును లేచి నీకు ఎదురు వచ్చుచున్నాము. నిన్ను మేమే మొదట ప్రశ్నించుటకు సాహసించలేకున్నాము. నీవో- మమ్ములను మీరెవ్వరని అడుగుటయులేదు. కావున ముచ్చటగొలుపు రూపముగల నిన్ను నేనే ముందుగా ప్రశ్నించుచున్నాను. నీవు ఎవ్వరివాడవు? ఎందులకై నీవు వచ్చితివి? దేవేంద్ర సమాన రూపుడవు-గాని నీవు సామాన్యుడవుకావు. నీవు ఏమాత్రమును భయమును విషాదమును మోహమును (ఏమి చేయుటకును తోచకుండుటను) విడువుము. నీవిపుడు సత్‌జనుల దగ్గర నున్నావు. ఇంద్రుడు బలాసురునంతటివానిని చంపినవాడే అగుగాక! ఇట్టి నిన్ను అతడును ఏమియు ఎదిరింపజాలడు. అదియుగాక స్వర్గసుఖమునుండి భ్రంశము పొందిన వారికి నిలుకడ చోటయి సత్‌జనులు వర్తిల్లుచున్నారు. నీవో- దేవులతో దేవరాజుతో సమానుడవు. సజ్జనులును సత్ జనులును ఒకచోట పరస్పరము కలిసినచో స్థావరజంగమరూపమగు ప్రపంచమునకెల్ల ప్రభువులై దానిని రక్షించగలరు. నీవు ఇపుడు నీకు సాటివారగు సత్‌జనుల (మైనమా) యందు నిలుకడ పొందినావు. (కనుక భయపడకుము. చింతింపకుము.) వేడిమినిచ్చుటలో అగ్నియు బీజములను విత్తుటకు అనుకూలమగుటలో భూమియు ప్రకాశమునిచ్చుటలో రవియు అభ్యాగతులకు ఆశ్రయమునిచ్చుటలో సజ్జనులును సమర్థులు."

ఇది శ్రీమత్స్యమహాపురాణమున చంద్రవంశానువర్ణనమున యయాతి చరితమున యయాతికి స్వర్గభ్రంశము - యయాత్యష్టక సంవాదము అను ముప్పది ఏడవ అధ్యాయము.

## అష్టత్రింశో௨ధ్యాయః.

## యయాత్యష్టకసంవాదః.

యయాతిః : అహం యయాతి ర్నహుషస్య పుత్త్రః పూరోః పితా సర్వభూతావమానాత్ ।
ప్రభ్రంశిత స్సురసిద్ధర్షిలోకా త్పరిచ్యుతః ప్రపతా మ్యల్పపుణ్యః.

అహం హి పూర్వో వయసా భవద్భ్య స్తేనాభివాదం భవతాం న ప్రయుంజే ।
యో విద్యయా తపసా జన్మనా వా వృద్ధ స్స పూజ్యో భవతి ద్విజానామ్. 2
అష్టకః : అవాదీ స్త్వం వయసాస్మి ప్రవృద్ధ ఇతి వై రాజ న్నభ్యధికః కథంచిత్ ।
యో వై విద్వా న్వయసా సమ్ప్రవృద్ధ స్స ఏవ పూజ్యో భవతి ద్విజానామ్. 3
యయాతిః : ప్రతికూలం కర్మణాం పాప మాహు స్తద్వర్తినాం ప్రావణః పాపలోకః ।
సన్తోఽసతాం నానువర్తన్తి చైత ద్యథా చైషా మనుకూలా స్తథాఽనన్. 4
అభూద్ధనం మే విపులం మహద్వై విచేష్టమానో నాధిగన్తా తదస్మి ।
ఏవం ప్రధార్యాత్మహితే నివిష్టో యో వర్తతే స విజానాతి జీవమ్. 5
నానాభావా బహవో జీవలోకే దేవాధీనా నష్టచేష్టావిచారాః ।
తత్ర త్ప్రావ్య స హి హన్యేత ధీరో దిష్టం బలీయ ఇతి మత్త్వాత్మబుద్ధ్యా. 6
సుఖం హి జన్తు ర్యది వాపి దుఃఖం దైవాధీనం విన్దతే నాత్మశక్త్యా ।
తస్మా ద్దిష్టం బలవ న్మన్యమానో న సజ్జ్వరే న్నాపి హృష్యే త్కదాచిత్. 7
దుఃఖే న ముహ్యేత సుఖే న హృష్యేత్సమేన వర్తేత సదైవ ధీరః ।
తస్మాద్దిష్టం బలవ న్మన్యమానో న సజ్జ్వరే న్నాపి దూయే త్కదాచిత్. 8
భయే న ముహ్యే మ్యష్టకాహం కదాచి త్సన్తాపో మే మనసో నాస్తి కిఞ్చిత్ ।
ధాతా యథా మాం విదధాతి లోకే ధ్రువం తథాహం భవితేతి మత్వా. 9
సంస్వేదజా జరజాణ్డజోద్భిజా స్సరీసృపాః క్రిమయో యథాప్సు మత్స్యాః ।
తథాఽశ్మాన స్తృణకాష్ఠంచ సర్వం దిష్టక్షయే స్వాం ప్రకృతిం భజన్తే. 10
అనిత్యతాం సుఖదుఃఖస్య బుద్ధ్వా కస్మా త్సన్తాప మష్టకాహం భజేయమ్ ।
కింకుర్యాన్వై కిఞ్చ కృత్వా న తప్యే త్తస్మా త్సన్తాపం వర్జయా మ్యప్రమత్తః. 11

## ముప్పది ఎనిమిదవ యధ్యాయము

## యయాత్యష్టక సంవాదము.

యయాతి: "నేను యయాతి అనువాడను. నహుషుని పుత్త్రుడను. పూరుని తండ్రిని. సర్వభూతములను అవమానించినందున పుణ్యము తరిగి పదభ్రష్టుడబడి సురసిద్ధ ఋషిలోకమునుండి జారినవాడనగుచు పడుచున్నాను. వయస్సు చేత మీకంటె పూర్వుడను కావున మీకు నమస్కరింపకున్నాను. ద్విజాలలో (బ్రాహ్మణ క్షత్త్రియ వైశ్యులలో) విద్యచేగాని తపస్సుచేగాని జన్మచేగాని వృద్ధుడగువాడు పూజ్యుడు. అష్టకుడు: "రాజా! 'నేను వయస్సుచే చాల పెద్దవాడను.' అని నినుగూర్చి చెప్పితివి. ఏదోయొక విధముగా (మాకంటె) అత్యధికుడవే. ఎవడు తాను విద్వాంసుడును వయస్సు చేతను పెద్దవాడును నై యుండునో అతడు ద్విజాలలో తప్పక పూజ్యుడే." యయాతి: "కర్మములలో (ఇతరులకు) ప్రతి కూలమయినది పాపము అనబడును. దానిననుసరించువారికి పాపలోకమే గమ్యస్థానము. సత్పురుషులు అసత్పురుషులు అనుసరించెడు పాపకర్మమును అనువర్తించరు. వీరికి సత్పురుషులు అనుకూలురైనట్లు అసత్పురుషులుకారు. నాకు విస్తారమగు ధనము ఉన్నది. అది గొప్పది కూడను. యత్నముచేసినచో దానిని పొందక పోవుదునా? అని మనస్సున నిశ్చయము కలిగి ఆత్మ హితమునకై అభినివేశముతో యత్నించువాడు జీవుని తత్త్వమును అనుభవ సహితముగా తెలిసికొనగలడు. జీవలోకము నందలి జీవులు నానా రూపములలో నున్నారు. వీరందరును దేవునకు అధీనులు. తమతమ యత్నములందును అలోచనము లందును అస్వతంత్రులు. బుద్ధిమంతుడగువాడు అదృష్టము బలవత్తరమయినదని ఎరుగవలయును. తనకు అప్రియములగు

ఆయా అనుభవములు ప్రాప్తించినపుడు దుఃఖమునొందరాదు. జీవులు సుఖమును కాని దుఃఖమును కాని దైవమునకు అధీనులై పొందుదురే కాని తమ శక్తితో (స్వతంత్రతతో) కాదు. కావున దైవము బలవత్తరమని గురుతెరిగి ఎప్పుడును దుఃఖమునుగాని హర్షమునుగాని పొందరాదు. దుఃఖము ప్రాప్తించినచో మోహముగాని సుఖము ప్రాప్తించినపుడు హర్షమునుకాని పొందక విచారశీలుడై రెంటియందును సమభావముతో నుండవలయును. దైవము బలవత్తరమని ఎరిగి ఎట్టి స్థితియందును మనస్సున బాధనొందకుండవలయును. అష్టకా! నేను మాత్రము భయము ప్రాప్తించినను మోహము పొందను. ఏ సమయమందును నామనస్సునకు ఏమాత్రమును సంతాపము ఉండదు. సృష్టికర్త లోకమునందు ఎట్లు చేయునో నేను అట్లే యగుదునని నేను తలంతును. స్వేదజములు జరాయుజములు అండజములు ఉద్భిజ్జములు సరీసృపములు ప్రాకెడి (ప్రాణులు) క్రిములు మత్స్యములు మొదలగు ప్రాణులుకాని శిలలు తృణములు కాష్ఠములు ఇట్టివి ఏవి అయినను తమతమ అదృష్టమును అనుభవించుట ముగియగనే తమతమ స్వాభావికస్థితిని పొందును. సుఖదుఃఖములు రెండును అనిత్యములేయని నాకు తెలియును. ఇట్టి నేను ఏ హేతువుచే సంతాపమును పొందవలసియున్నది? జీవునకు ఏది చేసిన తరువాతను ఏది చేయుచున్నప్పుడును ఈ సంతాపము కలుగకుండును? (ఏది చేసిన తరువాతగాని ఏది చేయుచున్నప్పుడుగాని ప్రతివనివలన కలుగు ఫలముకూడ సుఖదుఃఖ సంమిశ్రితమే కావున ఏది చేయువానికిని దుఃఖము కలుగుట తప్పదు.) అందుచే నేను ఏమియు పొరపడక (అన్ని సందర్భము లందును) సంతాపమును పొందకయుందును.

శౌనకః : ఏవం బ్రువాణం నృపతిం యయాతి మథాష్టకః పునరేవాన్వపృచ్ఛత్ ।
మాతామహం సర్వగుణోపపన్నం యత్ర స్థితం స్వర్గలోకే యథాచ. 12

అష్టకః : యే యే లోకాః పార్థివేన్ద్ర ప్రధానా స్త్వయా భుక్తా యం చ కాలం యథా చ ।
త న్మే రాజన్బ్రూహి సర్వం యథావ త్క్షేత్రజ్ఞవ ద్భాషసే త్వం హి ధర్మమ్. 13

యయాతిః : రాజాహ మాసం భువి సార్వభౌమ స్తతో లోకా న్మహతాం సఞ్చరన్వై ।
తత్రావసం వర్షసహస్రమాత్రం తతో లోకం పరమ స్మ్యభ్యుపేతః. 14

తతః పురీం పురుహూతస్య రమ్యాం సహస్రద్వారాం శతయోజనాన్తామ్ ।
తత్రావసం వర్షసహస్రమాత్రం తతో లోకం పరమస్మ్యభ్యుపేతః. 15

తతో దివ్య మజరం ప్రాప్య లోకం ప్రజాపతే ర్లోకపతే ర్దురావమ్ ।
తత్రావసం వర్షసహస్రమాత్రం తతో లోకం పరమస్మ్యభ్యుపేతః. 16

దేవస్య దేవస్య నివేశనేచ విజిత్య లోకా నవసం యథేష్టమ్ ।
సమ్పూజ్యమాన స్త్రిదశై స్సమస్తై స్తుల్యప్రభావద్యుతి రీశ్వరాణామ్. 17

తథాఽవసం నన్దనే కామరూపీ సంవత్సరాణా మయుతం శతానామ్ ।
సహాప్సరోభి ర్విచర న్పుణ్యగన్ధా న్పశ్య న్నగా న్పుష్పితాం శ్చారురూపాన్. 18

తత్ర స్థితం మాం దేవసుఖేషు యుక్తం కాలేఽతీతే మహతి తతోఽతిమాత్రమ్ ।
దూతో దేవానా మబ్రవీదుగ్రరూపో ధ్వంసే త్యుచ్చై స్త్రిః ప్లుతేన స్వరేణ. 19

ఏతావన్మే విదితం రాజసింహ తతో భ్రష్టోహం నన్దనా త్క్షీణపుణ్యః ।
వాచోఽశ్రౌషం చాన్తరిక్షే సురాణాం సానుక్రోశా శ్శోచతాం మానవేన్ద్ర. 20

అహో కష్టం క్షీణపుణ్యో యయాతిః పతత్యసౌ పుణ్యకృత్పుణ్యకీర్తిః ।
*తానబ్రువం పాత్యమాన స్తతోఽహం సతాంమధ్యే నిపతేయం బ్రువన్తు. 21

* స్థానాద్భువం

తై రాఖ్యాతా భవతాం యజ్ఞభూమి స్సమీక్ష్య చేమాం త్వరిత ముపాగతోఽస్మి ।
హవిర్గన్ధై ర్దర్శితా యజ్ఞభూమి ర్ధూమాపాఙ్గం ప్రతిగృహ్య ప్రతీతః. 22

ఇతి శ్రీ మత్స్యమహాపురాణే శౌనకశతానీకసంవాదే చన్ద్రవంశానువర్ణనే
యయాతిచరితే యయాత్యష్టకసంవాదో నామాష్టత్రింశోఽధ్యాయః.

ఇట్లు చెప్పుచుపోవుచున్న యయాతి రాజును అష్టకుడు మరల అడిగెను: (యయాతి అష్టకునకు మాతామహుడు కావున ఏ విషయమునైన అడుగదగిన చనవు తనకు గలదు. అతడు సర్వ విషయములను ఎరిగియుండుటేకాక సర్వ సద్గుణములును గలవాడు. కావున ఏ విషయములనైనను విసుగులేకుండ చెప్పగలడు.) అష్టకు డిట్లడిగెను: "రాజేంద్రా! యయాతిరాజా! నీవు క్షేత్ర-క్షేత్రజ్ఞతత్త్వమును ఎరిగినవాడువలె ధర్మమును చెప్పుచున్నావు. ఇట్టి నీవు స్వర్గలోకము నందు ఎచ్చటనెచ్చట నుంటివో ఎట్లు ఉంటివో ఏయే ప్రధాన లోకముల ననుభవించితివో ఎంతకాలము అనుభవించితివో ఎట్లనుభవించితివో ఈ ప్రతియొక యంశమును వాస్తవ రూపమున నాకు తెలుపుము." యయాతి: "నేను భూలోకము నందు ఉన్నంతవరకును సార్వభౌముడనగు రాజుగా నుంటిని దేహత్యాగానంతరము 'మహత్' జనులు నివసించెడి లోకములందు సంచరింపసాగితిని. అచ్చట సహస్రవర్షము లుంటిని. తరువాత అంతకంటెను పైలోకములకు పోయితిని. తరువాత అచ్చటి నుండి ఇంద్రునినగరికి పోయినాను. అది రమ్యమయినది. అది వేయి వాకిండ్లు గలది. నూరు యోజనముల పరిధి కలది. దానియందు సహస్ర సంవత్సరము లుంటిని. తరువాత దానికంటె పైలోకములకు వెళ్లితిని. తరువాత లోక రక్షకుడగు ప్రజాపతి లోకమునకు వెళ్లితిని. అది దివ్యము. ఎన్నటికిని చెడనిది. దానిని చేరుట సుకరముకూడ కాదు. అచ్చటను నేను సహస్రవర్షములుంటిని. తరువాత దానికంటె పైలోకమునకు వెళ్లితిని. ఇట్లు ఏయే దేవుని లోకమున కైనను (నా పుణ్యబలముచే) దానిని జయించి వెళ్లితిని. కనుకనే వాటియందు నేను నా ఇచ్ఛ ననుసరించి నివసించితిని. లోకేశ్వరుల కాంతితో ప్రభావముతో తుల్యములగుద్యుతియు ప్రభావమును కలిగి అచ్చట నుండెడివాడను. సమస్త దేవత లును నన్నచ్చట సంపూజించు (సర్వోపచారములతో ఆదరించు) చుండెడివారు. అట్లు నేను నందనవనమునందు కామ రూపుడనై అయుతశత సంవత్సరములు $(10000 \times 100 = 1000000)$ ఉంటిని. అచ్చట మనోహరములగు రూపములు కలవియు పుష్పించినవియు అగు పుణ్య సుగంధములను (సుగంధవంతములగు మనోహర పుష్పములను) చూచుచు అప్సర సలతోకూడి సంచరించెడి వాడను. ఇట్లు దేవభోగములయందు ఆసక్తుడనై నేనచటనుండగా అవధి లేనంత అధికకాలము గడచెను. అంతలో భయంకర రూపుడగు దేవదూత యొకడు వచ్చి ప్లుతస్వరముతో'ధ్వంస[3]' (జారిపడుము!) అని మూడు మారులు బిగ్గరగా పనెను. రాజసింహా! నాకు ఇంత మాత్రమే తెలియును. వెంటనే నేను క్షీణపుణ్యుడనై నందనము నుండి జారిపడితిని. ఇంతేకాక అంతరిక్షమందు నాస్థితికై శోకించు దేవతల దయాపూర్ణమైన వాక్కులు నాకిట్లు వినబడెను: "అయ్యో! ఎంత కష్టము! ఇడుగో! ఈ యయాతి పుణ్యకర్మములు ఆచరించి పుణ్యమును సంపాదించినవాడు. పుణ్య కరమగు కీర్తికలవాడు. ఇట్టివాడు క్షీణపుణ్యుడై క్రింద పడుచున్నాడే!" ఏమైనను నేనచ్చటినుండి పదభ్రష్టయబడితిని. క్రిందకు పడుచునేయుంటిని. కనుక సత్‌జనుల నడుమ నేను పడవలెనని దీవించి పలుకుడని నేను వారిని వేడితిని. వారును మీయజ్ఞ భూమిని పేర్కొనిరి. నాకు వెంటనే ఇది కనబడినది. త్వరితముగా ఇటకు చేరితిని. ఎట్లన హవిర్గంధములే మీయజ్ఞ భూమిని నాకు చూపినవి. యజ్ఞ ధూమపు కొనను దాని సుగంధమును అందుకొని ఆనందితుడనైతిని."

ఇది శ్రీమత్స్యమహాపురాణమున చంద్రవంశానువర్ణనమున యయాతి చరితమున
యయాత్యష్టక సంవాదము అను ముప్పది ఎనిమిదవ అధ్యాయము.

## ఏకోనచత్వారింశోఽధ్యాయః.

## యయాత్యష్టకసంవాదః.

అష్టకః : యదాఽవస న్నన్దనే కామరూపీ సంవత్సరాణా మయుతం శతానామ్ ।
కిం కారణం కార్తయుగప్రధాన హిత్వా చ త్వం వసుధా మన్వపద్యః.

యయాతిః : జ్ఞాతి స్సుహృ త్స్వజనో వా యథేహ క్షీణే విత్తే మానవైస్త్యజ్యతే హి ।
తథా చ తత్ర క్షీణపుణ్యం మనుష్యం త్యజన్తి సద్య స్సేశ్వరా దేవసఙ్ఘాః. 2

అష్టకః : కథం తత్ర క్షీణపుణ్యా భవన్తి సంముహ్యతే తత్ర మనోఽతిమాత్రమ్ ।
కిం వా విశిష్టాః కస్య ధామోపయాన్తి తద్వై బ్రూహి క్షేత్రవి త్త్వం మతో మే. 3

యయాతిః : ఇమం భౌమం నరకం తే పతన్తి లాలప్యమానా నరదేవ సర్వే ।
తే కఙ్కగోమాయు ★ బిడాశనార్థం క్షితౌ వివృద్ధిం బహుధా వ్రజన్తి. 4

తస్మా దేత ద్వర్జనీయం నరేణ దుష్టం లోకే గర్హణీయంచ కర్మ ।
ఆఖ్యాతం తే పార్థివ సర్వమేవ భూయశ్చేదానీం వద తే కిం వదామి. 5

అష్టకః : యథాతు తా న్వితుదన్తే వయాంసి తథా గృధ్రాః శితికణ్ఠాః పతఙ్గాః ।
కథం భవన్తి కథం మా భవన్తి న భౌమ మన్యం నరకం శృణోమి. 6

యయాతిః : ఊర్ధ్వం దేహా త్కర్మణా జృమ్భమాణా ద్వ్యక్తం పృథివ్యా మనుసఞ్చరన్తి ।
ఇమం భౌమం నరకం తే పతన్తి నావేక్షన్తే వర్షపూగా ననేకాన్. 7

షష్టిం సహస్రాణి పతన్తి వ్యోమ్ని తథాఽశీతిం పరిసంవత్సరాణి ।
తాన్వై తుదన్తే పతతః ప్రపాతం భీమా భూమౌ రాక్షసా స్తీక్ష్ణదంష్ట్రాః. 8

అష్టకః : యదేతాం స్తే సమ్పతన్త స్తుదన్తి భీమాకారా రాక్షసా స్తీక్ష్ణదంష్ట్రాః ।
కథం భవన్తి కథం మా భవన్తి కథమ్భూతా గర్భభూతా భవన్తి. 9

యయాతిః : అస్ర గ్రేతః పుష్పఫలానువృక్త మన్వేతి సద్యః పురుషేణ సృష్టమ్ ।
తథైతస్య రజ ఆపద్యతే వై గర్భభూత స్సముపైతి తత్ర. 10

వనస్పతీం శ్చౌషధీన్వై విశన్తి హ్యాపో వాయుం పృథివీం చాన్తరిక్షమ్ ।
చతుష్పదం ద్విపదం చాపి సర్వ మేవంభూతా గర్భభూతా భవన్తి. 11

## ముప్పది తొమ్మిదవ అధ్యాయము
## యయాత్యష్టక సంవాదము

అష్టకుడు: "కృతయుగపు వారిలో ప్రధానుడవగు యయాతీ: నీవు నందనవనమున కామరూపుడవయి నూరు పదివేల సంవత్సరములున్న తరువాత దానిని విడిచి భూలోకమునకు చేరుకొంటివిగదా! కారణమేమి?" యయాతి: "ఈ లోకములో మానవునకు ధనము క్షీణించిన తరువాత అతనిని అతని జ్ఞాతులును మిత్రులును స్వజనులును విడిచిపెట్టుదురు గదా! అట్లే ఆలోకములందు లోకపాలురును దేవ సంఘములును మనుష్యుని పుణ్యము నశించగానే అతనిని వదలి వేయుదురు." అష్టకుడు: "మానవు లచట క్షీణపుణ్యు లెట్లగుదురు? ఈ విషయమున నాకేమియు తెలియుటలేదు. ఏ విషయమున ఎంత విశిష్టులు (ఇచట పడిన తరువాత మరల) ఏలోకమును చేరుదురు? ఇది యంతయు నాకు చెప్పుము. నీవు క్షేత్ర తత్త్వమును (దేహము-దేహధారికి కలుగు ధర్మాధర్మఫలములు మొదలగునవి) ఎరిగినవాడవను విశ్వాసముతో అడుగుచున్నాను." యయాతి: "స్వర్గమునుండి ఈ భూలోకమును చేరుకొనిన జీవులు ఈ భౌమ (భూలోక సంబంధి) నరకమున పడుదురు. వారందరును రాజా! (తమకు కలిగిన ఈ స్థితికై) విలపింతురు. భూలోకమున పడి వారు అనేక విధముల ప్రాణులుగా వృద్ధిపొంది రాబందులు నక్కలు పిల్లులు మొదలగు ప్రాణులకు ఆహారమగుదురు. కావున మానవుడు ఈలోకములో దుష్టమును నిందనీయమును నగు కర్మమును చేయక విడువవలయును. నీవడిగిన

---

★ బిలాశనార్థం

దంతయును చెప్పితిరి. ఇపుడింకేమి చెప్పవలయును?" అష్టకుడు: "పావకర్ములను వారిని గ్రద్దలు నెమళ్ళు మొదలగు పక్షులు ఎట్లు బాధించును? ఈ నరక బాధలలో ఈ జీవులు ఎట్లు ఉందురు? ఎట్లు ఉందరు? భౌమమగు నరకమును గురించి ఇంకను వినగోరుచున్నాను." యయాతి: "ఈ దేహము కర్మను అనుసరించి రూపొందుచుండును. (ఎవరు చేసిన కర్మమునకు తగిన శరీరమును వారు పొందుదురు.) దేహమును విడిచిన తరువాత వారు దానిని బట్టియే పృథివి యందును ఆయా దేహములను ధరించి సంచరింతురు. స్వర్గమునుండి పడినవారును అట్లే ఈ భౌమ నరకమున వారు పడుదురు. అనేక సంవత్సరములపాటు మరల వెనుకకు తిరిగి చూడనైన లేకుందురు. పుణ్యలోకములనుండి భ్రష్టులైన వారు క్రిందికి పడుచు అరువదివేలఎనుబదిసంవత్సరములపాటు అంతరిక్షమునందే యుందురు. వారిని ఆ కాలములో వాడి కోరలుగల భయంకర రాక్షసులు పీడించుచుందురు." అష్టకుడు: "ఇట్లు ఆ భయంకర రాక్షసుల పీడలు అనుభవించిన తరువాత ఈ జీవులు ఏవి విధముల ఉందురు: ఎట్లుండరు? ఏయే స్థితుల పొంది ఈ జీవులు గర్భముగా రూపొందుదురు?" యయాతి: "(కొందరు జీవులు మానవులగుదురు. వారి విషయము.) పురుషుడు వదలిన రేతస్సు స్త్రీకి చెందిన పుష్ప ఫలముతో (రజోరక్తముతో) కలిసి స్త్రీ రక్తమున ప్రవేశించును. ఇట్లు జీవుడు మానవ రజస్సును చేరును. పిమ్మట అచ్చట గర్భముగా ఆగును. మరికొన్ని జీవులు వనస్పతులను ఓషధులను వాయువును నీటిని పృథివిని అంతరిక్షమును చతుష్పాత్ప్రాణులను ద్విపాత్ప్రాణులను-దీనిలో వేటినైనను ప్రవేశించును."

అష్టకః : అన్యద్వపు ర్విదధాతీహ గర్భ ముతాహోస్వి త్స్వేన కామేన యాతి ।
ఆపద్యమానో నరయోని మేతా మాచక్ష్వ మే సంశయం పృచ్ఛత స్త్వమ్. 12
శరీరభేదాదిసముచ్ఛ్రియాంశ్చ చక్షుశ్శ్రోత్రే లభతే కేన సంజ్ఞామ్ ।
ఏత త్త్వం న స్సర్వ మాచక్ష్వ పృష్టః క్షేత్రజ్ఞం త్వాం తాత మన్యామ సర్వే. 13
యయాతిః : వాయు స్సముత్కర్షతి గర్భయోని మృతౌ రేతః పుష్పఫలానుపృక్తమ్ ।
స తత్ర తన్మాత్రకృతాధికారః క్రమేణ సంవర్ధయతీహ గర్భమ్. 14
స జాయమానో విగృహీతగాత్ర స్సంజ్ఞా మధిష్ఠాయ తతో మనుష్యః ।
స శ్రోత్రాభ్యాం వేదయతీహ శబ్దం సర్వం రూపం పశ్యతి చక్షుషా తు. 15
ఘ్రాణేన గన్ధం జిహ్వయాఽథో రసంచ త్వచా స్పర్శం మనసా వేద భావమ్ ।
ఇత్యష్టకేహోపచితం హి విద్ధి మహాత్మనః ప్రాణభృత శ్శరీరే. 16
అష్టకః : య స్సంస్థితః పురుషో దహ్యతేవా నిఖన్యతే వాపి నిఘృష్యతే చ ।
అభావభూత స్స వినాశ మేత్య కథ మాత్మానం చేతయతే పరస్తాత్. 17
యయాతిః : హిత్వా సోఽసూ న్సుప్తవ న్నిష్టనిత్వా పురోధాయ సుకృతం దుష్కృతం చ ।
అన్యాం యోనిం పుణ్య పాపానుసారం హిత్వా దేహం విశతే రాజసింహ. 18
పుణ్యాం యోనిం పుణ్యకృతో విశన్తి పాపాం యోనిం పావకృతో వ్రజన్తి ।
కీటాః పతఙ్గాశ్చ భవన్తి పాపా న మే వివక్షాస్తి మహానుభావ. 19
చతుష్పదా ద్విపదా షట్పదాశ్చ తథాభూతా గర్భభూతా భవన్తి ।
ఆఖ్యాత మేత న్నిఖిలేన సర్వం భూయస్తు కిం పృచ్ఛసి రాజసింహ. 20
అష్టకః : కింస్వి త్కృత్వా లభతే తాత లోకా న్మర్త్య శ్శ్రేష్ఠాం స్తపసా విద్యయాచ ।
త న్మే పృష్ట శ్శంస సర్వం యథావ చ్ఛుభా న్లోకా న్యేన గచ్ఛే త్క్రమేణ. 21
యయాతిః : తపశ్చ దానం చ శమో దమశ్చ హ్రీ రార్జవం సర్వభూతానుకమ్పా ।
స్వర్గస్య లోకస్య వదన్తి సన్తో ద్వారాణి సప్తైవ మహాన్తి పుంసామ్. 22

నశ్యన్తి మానేన తమోభిభూతాః పుంస స్సదైవేతి వదన్తి సన్తః ।
అధీయమానః పణ్డితం మన్యమానో యోఽవిద్యయా హన్తి యశః పరస్య. 23
తస్యాన్తవన్తస్తు భవన్తి లోకా న చాస్య తద్బ్రహ్మ ఫలం దదాతి ।
చత్వారి కర్మాణ్యభయంకరాణి భయం ప్రయచ్ఛన్త్యయథాకృతాని. 24
మానాగ్నిహోత్ర ముత మానమౌనం మానే నాధీత ముత మానయజ్ఞః ।
న మానమాన్యో ముద మాదదీత న సన్తాపం ప్రాప్నుయా చ్చావమానాత్.
సన్త స్తతః పూజయ న్తీహ లోకే నాసాధవ స్సాధుబుద్ధిం లభన్తే. 25½
ఇతి దద్యా మితి యజ ఇత్యధీయ ఇతి వ్రతమ్ ।
ఇత్యేతాని భయా న్యాహు స్తాని వర్జ్యాని నిత్యశః. 26
యే చాశ్రయం మానయన్తే పురాణం మనీషిణో మానస మార్గరుద్ధమ్ ।
త న్నిఃశ్రేయ స్తైజసం రూప మేత్య పరాం శాన్తిం ప్రాప్నుయుః ప్రేత్య చేహ. 27

ఇతి శ్రీ మత్స్యమహాపురాణే శౌనకశతానీకసంవాదే చన్ద్రవంశానువర్ణనే
యయాతిచరితే ఏకోనచత్వారింశోఽధ్యాయః.

అష్టకుడు: "మానవ లోకమునందలి ఆ యా శరీరములను జీవులు పొందుటలో వారు తమ సంకల్పము ననుసరించి తాము కోరిన శరీరమును పొందుదురా? లేక మరిఏదైన హేతువు వారిని గర్భముగా (గర్భస్థ శిశువుగా) రూపొందించునా? నాకుగల ఈ సంశయమును తెలియగోరుచున్నాను. చెప్పుము. ఏ హేతువుచే హెచ్చు తగ్గులుగల వివిధ శరీరములను వానియందలి చక్షుశ్శ్రోత్రాదీంద్రియ భేదములను సంజ్ఞా (అనుభూతి) భేదమును పొందగలుగుదురు? నేను ప్రశ్నించిన ఈ విషయములన్నియు చెప్పుము. ఏలయన నీవు క్షేత్ర (శరీర సృష్టి) తత్త్వమును ఎరిగినవాడవని మేమందరము (అష్టక సోదరులు) అనుకొనుచున్నాము." యయాతి: "ఋతుకాలమునందు రేతస్సుతో రజస్సుతో సంపర్కము చెందిన గర్భయోనిని (గర్భము నిలిచియుండెడి ఉదరకోశమును) వాయువు లాగిపట్టి యుంచును. ఆ వాయువు ఆ గర్భకోశమునందు పంచ తన్మాత్రలకు తాను ఆశ్రయమైయుండి గర్భమును వృద్ధి పొందించును. అనంతరము జీవుడు వ్యక్తత పొందుచు అవయవములు స్పష్టములగుచురాగా అనుభవ జ్ఞానమును పొందుచు వచ్చును. క్రమముగ శ్రోత్రముతో శబ్దమును చక్షుస్సుతో రూపమును ఘ్రాణముతో గంధమును జిహ్వతో రసమును త్వక్కుతో స్పర్శమును మనస్సుతో భావమును తెలిసికొనును. అష్టకా! ఈ జీవ లోకములో దేహియొక్క (మానవుల)దేహవృద్ధి క్రమము ఈ విధముగ నుండును. అని ఎరుగుము." అష్టకుడు: "మరణించిన మానవుడు దహింపబడికాని పాతిపేయబడి కాని ప్రాణులచే తినబడికాని అభావమును పొంది నశించునుకదా! అతడు మరల తనుతాను చేతన పదార్థముగా ఎట్లు రూపొందించుకొనును?" యయాతి: "గాఢనిద్ర పోవువాడు గుర్రుపెట్టినట్లు మానవుడు మూలిగి ప్రాణములను విడుచును. అనగా ఈ దేహమును విడుచును. అతని సుకృత దుష్కృతములు మాత్రమతనికి ముందు ఉండి అతనిని తమవెంటగొని పోవును. తరువాత మరల నతడు తన పుణ్యపాపముల ననుసరించి లభించిన మరియొక (మాతృ పితృ) గర్భమును ప్రవేశించును. మహానుభావా! పుణ్యమును చేసినవారు పుణ్యయోనిని (జన్మమును) పాపము చేసినవారు పాప జన్మమును పొందురురు. అతి పాపులు కీటకములుగా పశులుగా అగుదురు. వాటిని వివరించి చెప్పశక్తి నాకులేదు. ఆయా భూతములు గర్భభూతులై (గర్భమునందలి శిశువులుగానై) మరికొందరు నాలుగు పాదములు-రెండు పాదములు-ఆరుపాదములు-కల ప్రాణి విశేషములుగా నగుదురు. నీవడిగిన ఈ విషయమంతయు ఏమియు వదలక చెప్పితిని. మరింకేమి యడుగుదువు?" అష్టకుడు: "తండ్రీ! మర్త్యుడు ఏమి చేసినచో-తపస్సును చేసియో-విద్యను ఆర్జించియో-శ్రేష్ఠములగు లోకమును పొందును? క్రమక్రమముగా ఉత్తరోత్తరము మేలగు లోకములను ఏ యుపాయముచే పొందవచ్చును? నేనడిగిన ఈ ప్రశ్నకు

సమాధానము ఉన్నదున్నట్లు చెప్పుము." యయాతి: "తపస్సు దానము శమము (అంతఃకరణ నిగ్రహము) దమము (బహిరింద్రియ నిగ్రహము) సిగ్గు బిడియము ఋజు (వంకరలేని) స్వభావము సర్వభూతములయందును దయ ఈ ఏడును మానవులకు స్వర్గలోకమునకు పోవు ద్వారములని వివేకులు చెప్పుదురు. మానవులు ఎల్లప్పుడును దురభిమానముచే అజ్ఞానము క్రమ్మగా నశింతురని పెద్దలు చెప్పుదురు. ఎవరు తాను విద్యలను అధ్యయనము చేసి తాను పండితుడయ్యెనని అహంకారపడుచు తన విద్యచే ఇతరుల కీర్తిని నశింపజేయునో అట్టివాని లోకములు (వాడు సుకృతము చేసి పుణ్య లోకములను సాధించుకొన్నను) అంతవంతములు (ముగిసినవి-నశించినవి) అగును. అంతేకాదు. అతడు అధ్యయనము చేసిన వేదము కూడ అతనికి ఫలము నీయదు. మానవునకు భయమును పోగొట్టి ఉత్తమ లోకములకు కొనిపోవు కర్మములు నాలుగును -అగ్నిహోత్రము-మౌనము-(తపస్సు) అధ్యయనము-యజ్ఞము- చేయవలసినట్లు చేయనిచో అధమలోక ప్రాప్తి భయమును కలిగించును. అవి 1. మానాగ్నిహోత్రము 2. మానతపస్సు 3. మానాధ్యయనము 4. మానయజ్ఞము అనునవి ఇతరులు ఆదరించగా హర్షమునందక అవమానించిరని సంతాపపడకయుండు వానిని సజ్జనులు ఈ లోకమందును పైలోకమందును పూజింతురు. కాని అసాధుజనులు సాధు బుద్ధిని పొందుట దుర్ఘటము. (అది స్వాభావికముగ కలుగవలెను.) ఈ ప్రయోజనమునకై దానము చేయుచున్నాను. ఇందులకై యజ్ఞము (దేవతారాధనము) చేయుచున్నాను. ఇందులకై అధ్యయనము చేయుచున్నాను. ఇందులకై వ్రతములను (వైదిక స్మార్త కర్మలను) అనుష్ఠించుచున్నాను. అని చేయు ఈ పనులన్నియు భయమును కలిగించునవి. కావున వాటిని ఎల్లప్పుడును అన్నివిధముల తప్పక విడువవలయును. ఎవరు తత్త్వము నెరిగినవారై పురాణము (అతి ప్రాచీనము శాశ్వతము) అగు ఆశ్రయమును పరమాత్మను తమ చిత్తవృత్తియందు స్థిరముగ నిలిపి ఆదరింతురో వారు తైజసమగు (స్వయంప్రకాశమగు) రూపమును పొంది నిఃశ్రేయసమును ఇహమునను పరమునను పరమశాంతిని పొందుదురు.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున చంద్రవంశాను కీర్తనమున యయాతి చరితమున
యయాత్యష్టక సంవాదమను ముప్పది తొమ్మిదవ యధ్యాయము.

## చత్వారింశోఽధ్యాయః.

## అష్టకాయ యయాత్యుపదిష్టగృహస్థాదిధర్మాః.

అష్టకః : చర న్గృహస్థః కథమేతి ధర్మా న్కథం భిక్షుః కథ మార్యకర్మా ।
వాన ప్రస్థః ప్రస్థితే సన్ని విష్టో బహూా న్యస్మి న్సంప్రతివేదయన్తి. 1
యయాతిః : ఆహూతాధ్యాయీ గురు కర్మ స్వచోద్యః పూర్వోత్థాయీ చరమే చోపశాయీ ।
మృదుర్దాన్తో ధృతిమా నప్రమత్త స్స్వాధ్యాయ శీల స్సిధ్యతి బ్రహ్మచారీ. 2
ధర్మాగమం ప్రాప్య ధనం యజేత దద్యా త్సదై వాఽతిథీ న్భోజయేచ్చ ।
అనాదదానశ్చ పరై రదత్తం సైషా గృహస్థోపనిష త్పురాణీ. 3
స్వవీర్యజీవీ వృజినా న్నివృత్తో దాతా పరేభ్యో న పరోపతాపీ ।
తాదృఙ్మని స్సిద్ధి ముపైతి ముఖ్యాం చరన్నరణ్యే నియతాహారచేష్టః. 4
అశిల్పజీవీ గుణవాంశ్చైవ నిత్యం జితేన్ద్రియ స్సర్వతో విప్రయుక్తః ।
అనోకశాయీ లఘు లిప్సమాన శ్చర న్దేశా నేకచర స్స భిక్షుః. 5
రాత్ర్యా యయా చాభిహతాశ్చ లోకా భవన్తి కామాభిజితా స్సుఖాశ్చ ।
తామేవ రాత్రిం ప్రయతేత విద్వా నరణ్యసంస్థో భవితుం యతాత్మా. 6
దశైవ పూర్వా న్దశ చాపరాం శ్చ జ్ఞాతీ న్సహాత్మాన మథైకవింశమ్ ।
అరణ్యవాసీ సుకృతం దదాతి ముక్త్వా త్వరణ్యే స్వశరీర ధాతూన్. 7

అష్టకః : కతిస్విద్దేవ మునయః కతి మౌనాని చాప్యుత ।
భవన్తీతి తదాచక్ష్వ శ్రోతు మిచ్ఛామహే వయమ్. 8

యయాతిః : అరణ్యే వసతో యస్య గ్రామో భవతి పృష్ఠతః ।
గ్రామేవా వసతోఽరణ్యం సముని స్స్యా న్నరాధిప. 9

అష్టకః : కథఞ్చి ద్వసతోరణ్యే గ్రామో భవతి పృష్ఠతః ।
గ్రామేవా వసతో రణ్యం కథం భవతి పృష్ఠతః. 10

యయాతిః : న గ్రామ్యా నుపయుఞ్జీత య శ్చారణ్యో ముని ర్భవేత్ :
తథాస్య వసతోఽరణ్యే గ్రామో భవతి పృష్ఠతః. 11

అనగ్ని రనికేతశ్చా ప్యగోత్రచరణో మునిః । కౌపీనాచ్ఛాదనం యావ త్తావదిచ్ఛేచ్చ చీవరమ్. 12
యావ త్ప్రాణాభిసన్ధానం తావ దిచ్ఛే చ్చ భోజనమ్ ।
తథాస్య వసతో గ్రామేఽరణ్యం భవతి పృష్ఠతః. 13

యస్తు కామా న్పరి త్యజ్య త్యక్త కర్మా జితేన్ద్రియః ।
ఆతిష్ఠేచ్చ ముని ర్మౌనం న లోకే సిద్ధి మాప్నుయాత్. 14
ధౌతదన్తం కృత్త నఖం సదా స్నాత మలఙ్కృతమ్ । అసితం సితకర్మస్థం కస్తం నార్చితు మర్హతి. 15
తపసా కర్శితః క్షామః క్షీణమాంసాస్థిశోణితః । న చ లోక మిమం జిత్వా లోకం విజయ తేఽపరమ్. 16
యదా భవతి నిర్ద్వ న్ద్వో ముని ర్మౌనం సమాస్థితః । అథ లోక మిమం జిత్వా కం వా విజయతే పరమ్.
ఆస్యేన తు యదాహారం గోవ న్మృగయతే మునిః । అథాస్య లోకపూర్వో య స్సోమృతత్వాయ కల్పతే.

ఇతి శ్రీమత్స్యమహాపురాణే శౌనకశతానీక సంవాదే చన్ద్రవంశానువర్ణనే
యయాతిచరితే గృహస్థాద్యాశ్రమధర్మ విచారో నామ
చత్వారింశోఽధ్యాయః.

## నలువదవ అధ్యాయము

## యయాతి అష్టకునకు గృహస్థాది ధర్మముల నుపదేశించుట

"బ్రహ్మచారి - గృహస్థుడు - సంప్రదాయానుసారముగ ఆ ఆశ్రమపు నియమములందు అభినివేశము కల వానప్రస్థుడు సంన్యాసి-వీరు ఎట్లు నడుచుకొనినచో ఆయా ఆశ్రమ ధర్మముల నాచరించిన పుణ్యమును ఫలమును పొంద గలుగుదురు? ఈ విషయమునందు అనేక విధముల(గు భేదముల) ఆయా ఋషులు చెప్పుచున్నారు." అని అష్టకుడడుగ యయాతి ఇట్లు చెప్పెను. "బ్రహ్మచారి గురువు పిలిచినప్పుడు వచ్చి అధ్యయనము చేయవలెను. అడుగనిదే చెప్పనిదే గురుని పనులు చేయవలెను. గురునికంటె ముందు మేల్కొనవలెను. గురుని తరువాత నిదుర పోవలెను. మృదు స్వభావము ఇంద్రియనిగ్రహము నిబ్బరము హెచ్చరిక స్వాధ్యాయము చేయుట-ఈ గుణములు కలిగియున్నచో అతని ఆశ్రమ ధర్మములు సిద్ధించును. ధర్మముచే ధనము నార్జించవలెను. దానితోనే యజ్ఞములు చేయవలెను. దానినే దానము చేయ వలెను. దానితోనే అతిథులను భుజింపజేయవలెను. ఇతరులు తమంతతాము ఈయనిదానిని తీసికొనరాదు. ఇది సంప్ర దాయాగతమయిన గృహస్థ ధర్మము. తన శ్రమతో జీవించవలెను. పాపము చేయరాదు. ఇతరుల కీయవలెను. ఇతరులను నొప్పించరాదు. ఆహారమునందును వేషమునందును నియమముల పాటించవలెను. ఇట్లు వానప్రస్థ ధర్మమును పాటించుముని ఉత్తమ (వానప్రస్థధర్మ) సిద్ధిని పొందును. విద్యలతో జీవనము గడుపరాదు. సద్గుణములు కలిగియుండవలెను. ఎలపుడు ఇంద్రియముల నిగ్రహించుకొనవలెను. అన్ని అనుభవములనుండియు విరక్తుడు కావలెను. ఏ స్థానము

నుండైనను పడుకొనవలెను. అత్యల్పములైన వానినే కోరవలెను. దేశములందంతట తిరుగుచుండవలెను. ఒంటరివాడై యుండవలెను. ఇది సంన్యాస ధర్మము. ఏ రాత్రియందు ఈ లోకములు నాకిక చాలుననియు కామములును సుఖములును నాచే జయింపబడినవి అనియును భావన కలుగునో ఆరాత్రియే వివేకవంతుడగు మానవుడు మనోనిగ్రహము పూని వాన్రప్రస్థుడగుటకు యత్నించవలయును. తాను వానప్రస్థుడై జీవించి శరీర ధాతువులను అరణ్యమునందు విడిచిన వాడు తన వంశమువారిలో తనకు ముందరి పదితరములవారికిని తన తరువాత రాబోవు పది తరములవారికిని తనకును తన సుకృతమును పంచగలుగును." అష్టకుడు: "మునులును మౌనములును ఎన్ని విధములో వినగోరుచున్నాము." యయాతి: "ఎవడు తాను అరణ్యమునందు నివసించుచున్నను గ్రామము తన వెనుకనే యుండునో ఎవడు తాను గ్రామమునందున్నను అరణ్యము తన వెనుకనే యుండునో అతడు ముని యనదగియున్నాడు." ఇది ఎట్లని అష్టకుడడుగ యయాతి: "అరణ్యమునందు మునిగా నున్నప్పుడు గ్రామములందు లభించు వానిని వేనిని ఉపయోగింపరాదు. అట్టివానికి గ్రామము తన వెనుక నున్నట్లగును. గ్రామమునందు తానున్నను అగ్నిహోత్రములను (కామముతో) ఆరాధించక ఇంటిని పట్టించుకొనక తన గోత్రము వేదశాఖ మొదలగు వానికి ప్రాముఖ్యమీయక కౌపీనమును (రహస్యాంగమును) కప్పునంత మాత్రము వస్త్రమును ప్రాణములు నిలుచునంత మాత్రమాహారమును ఉపయోగించుచుండు మునికి అరణ్యము తన వెనుక నున్నట్లగును. కామములను కామ్య కర్మములను విడిచి జితేంద్రియుడై మునియై మౌనమును (మనన ధర్మమును) పూనియున్నచో అట్టివాడు లోకమునందుండియు సిద్ధి పొందును. స్వచ్ఛపరుపబడిన దంతములు కత్తిరించబడిన గోళ్ళు కలిగి ఎల్లప్పుడును స్నానమాడి ఉండుచు అలంకరించుకొనియున్నను ఇవి ఏవియు లేక నల్లనివాడై (మలినుడై) యున్నను నిర్మలములగు నడువడులు కలిగియున్నచో అట్టివానిని ఎవరు అర్చింపతగరు? (ఎల్లవారును పూజింపవలసినదే.) తపస్సుచే కృశించి శుష్కించి మాంసము అస్థులు రక్తము క్షీణించియుండువాడు ఈలోకమును పరలోకమును కూడ జయించును. సుఖ దుఃఖములు శీతోష్ణములు మొదలగు ద్వంద్వములను జయించి మౌనము (మనన రూపమగు తపో ధర్మము)ను ఆశ్రయించి మునియై ఈ లోకమును జయించినవాడు మరి ఎవ్వరిని జయింపవలసియుండును? (అతడు సర్వమును జయించినట్లే.) మానవుడు తాను మునియై గోవువలె నోటితోనే ఆహారమును వెదకువాడగుచో అట్టి స్థితిలో లోకపూర్వుడు (సనాతనుడు) అగు పరమాత్ముడు ఇతనికి అమృతత్వము (మోక్షపదము)ను సిద్ధింపజేయును."

ఇది శ్రీమత్స్యమహాపురాణమున చంద్రవంశానువర్ణనమున యయాతి చరితమున
యయాత్యష్టక సంవాదము అను నలువదవ అధ్యాయము.

## ఏకచత్వారింశోఽధ్యాయః.

## యయాత్యష్టకాది సంవాదః.

అష్టకః : కతర స్త్వేతయోః పూర్వం దేవానా మేతి సామ్యతామ్ ।
ఉభయోర్ధావతో రాజన్సూర్యాచన్ద్రమసో రివ. 1
యయాతిః : అనికేతం గృహస్థేషు కామ వృత్తేషు సంయతః ।
గ్రామ ఏవ వన న్భిక్షు స్తయోః పూర్వతరం గతః. 2
అప్రావ్య దీర్ఘ మాయుశ్చ యః ప్రాప్తో వికృతిం చరేత్ ।
తప్యేత యది తత్కృత్వా చరే త్సోన్య త్తత స్తపః. 3
యద్వై నృశంసం త దపథ్య మాహు ర్య స్సేవతేఽధర్మ మనర్థబుద్ధిః ।
అర్థోప్యనీశ స్స తథైవ రాజం స్తదార్జవం స సమాధి స్త దార్యమ్. 4
అష్టకః : కేనాద్య హూతః ప్రహితోసి రాజ న్యువా స్రగ్వీ దర్శనీయ స్సువర్చాః ।
కుత ఆగతః కతమస్యాం దిశి త్వ ముతాహోస్వి త్పార్థివం స్థాన మస్తి. 5

యయాతిః : ఇమం లోకం నరకం క్షీణ పుణ్యః ప్రవిష్ట ఊర్ధ్వం గగనా ద్విప్రకీర్ణః ।
ఉక్త్వాహం వః ప్రపతిష్యా మ్యనన్తరం త్వరన్తి మాం బ్రహ్మణో లోకపా మే. 6
సతాం సకాశే తు వృతః ప్రపాత స్తే సఙ్గతా గుణవన్తస్తు సర్వే ।
శక్రాచ్చ లబ్ధో హి వరో మయైష పతిష్యతా భూమితలం నరేన్ద్ర. 7
అష్టకః : పృచ్ఛామి త్వాం మాప్రపత ప్రపాతే యది మే లోకాః పార్థివా స్సన్తి మేఽత్ర ।
యద్యన్తరిక్షే యది వా దివి స్థితాః క్షేత్రజ్ఞం త్వాం తస్య ధర్మస్య మన్యే. 8
యయాతిః : యావ త్పృథివ్యాం విహితం గవాశ్వం సహారణ్యైః పశుభిః పక్షిభిశ్చ ।
తావ ల్లోకా దివి తే సంస్థితా వై తథా విజానీహి నరేన్ద్రసింహ. 9
అష్టకః : తాం స్తే దదామి మా ప్రపత ప్రపాతే యే మే లోకా దివి రాజేన్ద్ర సన్తి ।
యే చా న్తరిక్షే యది వా దివి శ్రితా స్తా నాక్రమ క్షిప్ర మమిత్రసింహ. 10
యయాతిః : నా స్మద్విధో బ్రాహ్మణో బ్రహ్మవిచ్చ ప్రతిగ్రహే వర్తతే రాజముఖ్య ।
యథా ప్రదేయం సతతం ద్విజేభ్య స్తథాఽదదం పూర్వ మహం నరేన్ద్ర. 11
నాబ్రాహ్మణః కృపణో జాతు జీవే ద్యా చాపి స్యా ద్బ్రాహ్మణీ వీరపత్నీ ।
సోఽహం యదైవాకృత పూర్వం చరేయం వివిత్సమానః కిము తత్ర సాధు. 12
ప్రతర్దనః : పృచ్ఛామి త్వాం స్పృహణీయ రూప ప్రతర్దనోఽహం యది మే సన్తి లోకాః ।
యద్యన్తరిక్షే యది వా దివి శ్రితాః క్షేత్రజ్ఞం త్వాం తస్య ధర్మస్య మన్యే. 13
యయాతిః : సన్తి లోకా బహవ స్తే నరేన్ద్ర అప్యేకైక స్సప్త సప్తా వ్యహాని ।
మధుచ్యుతో ఘృతపృక్తా విశోకా స్తేనా న్తవన్తః ప్రతిపాలయన్తి. 14
ప్రతర్దనః : తాం స్తే దదామి మా ప్రపత ప్రపాతే యే మే లోకా స్తవ తే వై భవన్తు ।
యద్యన్తరిక్షే యదివా దివి శ్రితా స్తానాక్రమ క్షిప్ర మపేతమోహ. 15
యయాతిః : న తుల్యతేజా స్సుకృతం కామయేత యోగక్షేమం పార్థివ పార్థివ స్సన్ ।
దేవాదేశా ద్విపదం ప్రాప్య విద్వాం శ్చరే న్నృశంసం హి న జాతు రాజా. 16
ధర్మ్యం మార్గం చేతయానో యశస్యం కుర్యా త్తపోధర్మ మవేక్షమాణః ।
న మద్విధో ధర్మబుద్ధి స్సదైవ కుర్యా దేవం కృపణం మాం యథాత్థ. 17
కుర్యా మపూర్వం న కృతం యదాన్యై ర్వివిత్సమానః కిము తత్ర సాధు ।
బ్రువాణ మేవం నృపతిం యయాతిం నృపోత్తమో వసుమా న్నబ్రవీ త్తమ్. 18

ఇతి శ్రీమత్స్యమహాపురాణే శౌనకశతానీకసంవాదే చన్ద్రవంశానువర్ణనే
యయాతిచరితే యయాత్యష్టకాదిసంవాదో నామైక
చత్వారింశోఽధ్యాయః.

## నలువది ఒకటవ అధ్యాయము

### అష్టక ప్రతర్దనులు యయాతికి తమ పుణ్యలోకముల నిచ్చుట.

అష్టకుడు యయాతి నిట్లు ప్రశ్నించెను: "అయ్యా! మీరు చెప్పిన ఈరెండు విధములగువారును అంతరిక్షమున వరుగెత్తుచుండు సూర్యా చంద్రమసుల వంటివారు. (ఇద్దరును ప్రకాశస్వరూపులే) ఐనను ఈ ఇద్దరిలో ఎవరు మొదట దేవతలతో సామ్యమును పొందుదురు?" యయాతి: "గృహస్థుల నడుమనుండియు గృహమునందుండని వాడును

కామములయందు ప్రవర్తిల్లు వారినడుమ నుండియు ఇంద్రియముల నిగ్రహించుకొనుచు గ్రామములయందు నివసించుచునే సంన్యాసియునై యుండువాడే వీరిద్దరిలో ముందుగా దేవతా సామ్యమును పొందును. ఎక్కువ వయస్సు రాకున్నను తపోవంతునివలె జీవించువాడు మరియొక తపస్సాచరించ నక్కరలేదు. వయస్సు ఎక్కువగా వచ్చియును దానికి విరుద్ధముగా నడుచువాడు మరే తపస్సు చేసినను ప్రయోజనము లేదు. ఇతరులకు బాధ కలిగించునది అనుసరించరాని మార్గము. అనర్థమేదియో ఎరుగక అధర్మమును ఆశ్రయించిన వానికి అర్థము కూడ సిద్ధింపదు. ఇట్టి క్రూరత్వమును అధర్మమును విడిచి నడుచుటయే ఋజు ప్రవర్తనము-చిత్తస్థైర్యము-పెద్దలు మెచ్చునది." అష్టకుడు: రాజా! నీవు యువకుడవు; పూలమాలలు ధరించియున్నావు; చూడముచ్చటగా నున్నావు. గొప్ప వర్చస్సు గలవాడవు. ఇట్టి నిన్ను ఎవరు పిలిచి పంపగా వచ్చితివి? ఎక్కడినుండి వచ్చితివి? ఏ దిక్కునందు ఉందువు? నీకు పృథివిపై ఉండదగిన స్థానము ఏదయిన కలదా?" యయాతి: "నేను క్షీణపుణ్యుడనై ఊర్ధ్వలోకమునుండియు గగనమునుండియు వినరి వేయబడి ఈ నరకలోకమున ప్రవేశించితిని. మీకు మీరడిగినవి చెప్పిన తరువాత వెంటనే క్రిందికి పడెదను. అదిగో! బ్రహ్మ మొదలగు లోకపాలురు నన్ను త్వరపెట్టుచున్నారు. నరేంద్రా! నేను భూమి తలముపై పడబోవుచు సత్‌జనుల నడుమ పడునట్లుగా ఇంద్రుని వలన వరము పొందితిని. అట్లే గుణవంతులగు మీ అందరతో సంగతి నాకు లభించినది" అష్టకుడు: "అయ్యా! ప్రపాతమునందు పడకుము. నీవు ధర్మక్షేత్ర తత్త్వము నెరిగిన వాడవని నానమ్మిక. నిన్నొకటి ప్రశ్నించుచున్నాను. నాకు భూమ్యంతరిక్ష ద్యులోకములందు ఎచ్చటనైన నేను అనుభవింపదగిన పుణ్యలోకములు గలవా?" యయాతి: "రాజశ్రేష్ఠా! పృథివిపై గోవులు అశ్వములు అరణ్యములగు పశువులు పక్షులును ఎంత వరకుండునో అంత వరకు అనుభవింపదగిన పుణ్యలోకములు నీకు ద్యులోకమునందు గలవు." అష్టకుడు: "తండ్రీ! నీవు ప్రపాతమునందు పడవలసిన పనిలేదు. నాకు ద్యులోకమునందు గాని అంతరిక్షమునందుగాని కల పుణ్యలోకములన్నియు నీకు ఇచ్చుచున్నాను." యయాతి: "బ్రహ్మవేత్తయగు బ్రాహ్మణుడు తప్ప నా (మన) వంటివాడు దానమును ప్రతిగ్రహింపరాదు. అదికాక నేను ఎట్లు ఎట్లు దానము చేయవలెనో అట్లు ఇంతకు పూర్వము దానము చేసియున్నానే కాని ప్రతిగ్రహమెన్నడును చేయలేదు. బ్రాహ్మణుడు బ్రహ్మవేత్త తప్ప మరెవ్వరును-బ్రాహ్మణస్త్రీ కాని క్షత్రియ స్త్రీకాని దైన్యముతో దానము గ్రహింపరాదు. వివేకవంతుడనై యుండియు ఇదివరకెన్నడును చేయని పనిని నేనిపుడెట్లు చేయుదును? ఇది ఏమి బాగుగా నుండును?" ప్రతర్దనుడు: "రాజా! నా పేరు ప్రతర్దనుడు. నీవు మనోహరరూపుడవు. ధర్మక్షేత్ర తత్త్వము నెరిగినవాడవు. నాకు అంతరిక్షమునగాని ద్యులోకమునగాని అనుభవింపదగిన పుణ్యలోకములు గలవా? చెప్పుము." యయాతి: "రాజేంద్రా! మధువును స్రవించునవియు నేతితో తడిసినవియు శోకరహితములునగు అనంతలోకములు ఒక్కొక్కటి ఏడేసి దివ్యదినములు అనుభవింపదగినవి కలవు. అవి అన్నియు నీకై ఎదురు చూచుచున్నవి." ప్రతర్దనుడు: "తండ్రీ! నీవు వివేకశాలివి. నీవు ప్రపాతమునందు పడవలదు. నాకు అంతరిక్షమునందుగాని ద్యులోకమునందుగాని ఉన్న లోకములన్నియు నీకు ఇచ్చుచున్నాను." యయాతి: "తేజశ్శాలియగు వాడు తనకు సాటివాడగు తేజశ్శాలినుండి సుకృతమును ప్రతిగ్రహింపరాదు. రాజు రాజునుండి అతని యోగక్షేమములను తాను స్వీకరింపరాదు. దేవతల ఆదేశాను సారము విపత్తులనైన పొందవచ్చునుకాని వివేకియగు రాజు నింద్యమగు పనిని చెయరాదు. ధర్మ్యమగు మార్గమున కీర్తిప్రదమగు మార్గమును ఎరిగి ధర్మఫలమును పొందగోరి తపస్సునే చేయవలెను కాని నావంటి ధర్మజ్ఞుడు ఎట్టి సమయమునందును నీవు చెప్పినట్టి దీనమగు పనిని చేయరాదు. నేను వివేకవంతుడనై యుండి ఇదివరకు పెద్దలెవరును చేయని పనిని చేయుట ఏమి బాగుగా నుండును?" అని ఇట్లు పలుకుచున్న యయాతితో అష్టకుని సోదరులలో నొకడగు వసుమాన్ ఇట్లనెను.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున చంద్రవంశానువర్ణనమున యయాతి చరితమున
అష్టక ప్రతర్దనులు యయాతికి తమ పుణ్యలోకముల నిచ్చుటయను
నలువదియొకటవ అధ్యాయము.

## ద్విచత్వారింశోఽధ్యాయః.

## యయాతిచరిత సమాప్తిః.

వసుమాన్ : పృచ్ఛా మ్యహం వసుమా నౌషదశ్వి ర్యద్యస్తి లోకో దివి మహ్యం నరేన్ద్ర ।
యద్యన్తరిక్షే ప్రథితో మహాత్మన్ క్షేత్రజ్ఞం త్వాం తస్య ధర్మస్య మన్యే. 1
యయాతిః : యదన్తరిక్షే పృథివీ దిశశ్చ యత్తేజసా తపతే భానుమాంశ్చ ।
లోకా స్తావన్తో దివి సంస్థితా వై తే నాన్తవన్తః ప్రతిపాలయన్తి. 2
వసుమాన్ : తాం స్తే దదామి మా ప్రపత ప్రపాతే యే మే లోకా స్తవ తే వై భవన్తు ।
క్రీణీష్వైతాం స్తృణకేనాపి రాజ న్ప్రతిగ్రహ స్తేయది సమ్య క్ప్రదుష్టః. 3
యయాతిః : న మిథ్యాహం విక్రయం వై స్మరామి వృథా గృహీతం శిశుకా చ్ఛఙ్కమానః ।
కుర్యా న్న చైవాకృత పూర్వ మన్యై ర్వివిత్సమానో వసుమ న్న సాధు. 4
వసుమాన్ : తాన్త్వం లోకా న్ప్రతిపద్యస్వ రాజ న్మయా దత్తా న్యది నేష్టః క్రయ స్తే ।
నాహం తాన్వై ప్రతిగన్తా నరేన్ద్ర సర్వే లోకా స్తావకా వై భవన్తు. 5
శిబిః : పృచ్ఛామి త్వాం శిబి రౌశీనరోఽహం మమాపి లోకా యది సన్తి తాత ।
యద్యన్తరిక్షే యది వా దివి శ్రితాః క్షేత్రజ్ఞం త్వాం తస్య ధర్మస్య మన్యే. 6
యయాతిః : య త్త్వం వాచా హృదయే వాపి విద్వ న్పరీప్సమానా న్నావమంస్థా నరేన్ద్ర ।
తేనానన్తం దివి లోకా శ్శ్రితా స్తే విద్యు ద్రూపా స్స్వనవన్తో మహాన్తః. 7
శిబిః : తాం స్త్వం లోకా న్ప్రతిపద్యస్వ రాజ న్మయా దత్తా న్యది నేష్టః క్రయ స్తే ।
నచాహం తా న్ప్రతిపత్స్యేఽద్య దత్త్వా యస్మి న్గత్వా నానుశోచన్తి ధీరాః. 8
యయాతిః : యథా త్వ మిన్ద్ర ప్రతిమ ప్రభావ స్తే చాప్యనన్తా నరదేవ లోకాః ।
తథాద్య లోకే న రమేఽన్యదత్తే తస్మా చ్ఛిబే నాభినన్దామి వాచమ్. 9
అష్టకః : న చే దేకైకశో రాజన్ లోకా న్నః ప్రతినన్దసి ।
సర్వం ప్రదాయ భవతే గన్తారో నరకం వయమ్. 10
యయాతిః : యదర్హోఽహం త ద్వదధ్వం సన్త స్సత్యాదిదర్శినః ।
అహం తు నాభిగృహ్ణామి య త్కృతం న మయా పురా. 11
అష్టకః : అలిప్సమానస్య తు మే యదుక్తం న త త్తథాస్తీహ నరేన్ద్రసింహ ।
అస్య ప్రదానస్య యదేవ యుక్తం త త్త త్ఫలం తే భవితవ్యం భవిష్యమ్. 12
కస్యైతే ప్రతి దృశ్యన్తే రథాః పఞ్చ హిరణ్మయాః । యా నారుహ్య నరా లోకా నభివాఞ్ఛన్తి శాశ్వతాన్.
యయాతిః : భవతాం మమ చైవైతే రథా భాన్తి హిరణ్మయాః ।
ఉచ్చై స్సన్తః ప్రకాశన్తే జ్వలన్త్యోఽగ్నిశిఖా ఇవ. 14
ఆరుహ్యైతేమ గన్తవ్యం భవద్భిశ్చ మయాష్టక ।

## నలువది రెండవ అధ్యాయము

## అష్టక సోదరులు యయాతికి తమ పుణ్యలోకముల నిచ్చుట.

వసుమాన్: "మహాత్మా! నేను ఉషదశ్వుని కుమారుడను. నా పేరు వసుమాన్. నీవు ధర్మక్షేత్ర తత్త్వమును ఎరిగినవాడవను విశ్వాసముతో నిన్ను ప్రశ్నించుచున్నాను. నాకు అంతరిక్ష లోకములో కాని ద్యులోకములో కాని అనుభ

వింపదగిన పుణ్యలోకములు కలవా?" యయాతి: "సూర్యుడు తన తేజస్సుతో అంతరిక్షమునందును పృథివిమీదను దిక్కులను ఎంతమేర తపింప-ప్రకాశింప-చేయుచున్నాడో ఆలోకములన్నియును-అంత విస్తారము కలిగిన ద్యులోక స్థానములన్నియును అనన్తములైనవి నీవు అనుభవించదగినవి నీకు గలవు. అవి అన్నియు నీకొరకై ఎదురు చూచు చున్నవి." వసుమాన్: "అయ్యా! నాకుగల లోకములన్నియు నీకు దత్తము చేయుచున్నాను. తీసికొనుము. ప్రపాతములో పడకుము. ఒకవేళ నీవు వాటిని ప్రతిగ్రహించుట దోషమని తలచినచో చిన్న గడ్డిపోచనైనను వెలగా ఇచ్చి తీసికొనుము." యయాతి: "నేనెన్నడును మిథ్యా విక్రయముతో వస్తువును కొనినట్లు గాని పసివానినుండి ఆటలలోనైనను ఏ వస్తువును వెల ఈయక తీసికొన్నట్లుగాని స్మృతికి వచ్చుటలేదు. అట్టిది చేయుటకు నాకు భయము కలుగును. వివేక వంతుడనై యుండి నేను ఎవడును చేసియుండని పనిని చేయరాదు." వసుమాన్: "నీకు క్రయము ఇష్టము కానిచో నేను స్వేచ్ఛతో ఇచ్చుచున్న ఆ నా లోకములన్నిటిని తీసికొనుము. నేనా లోకములకు ఎన్నటికిని పోదలచుటలేదు. ఆ లోకములన్నియు నీవే." శిబి: "నేను ఉశీనరదేశాధిపతియగు శిబిని. నీవు ధర్మ తత్త్వజ్ఞుడవను నమ్మికతో నిన్నడుగు చున్నాను. అంతరిక్ష లోకములో కాని ద్యులోకములో కాని నాకు అనుభవించదగిన పుణ్యలోకములు గలవా?" యయాతి: "రాజా! నీవు యాచకులను ఎన్నడును వాక్కుతోగాని హృదయమున గాని అవమానింపలేదు. దానికి ఫలముగా నీకు ద్యులోకమునందు విద్యుద్రూపములును మనోహర ధ్వనితో (కీర్తితో) కూడినవియు అగు అనంతలోకములు కలవు. అవి చాల గొప్పవి." శిబి: "బుద్ధిమంతులగు వారు ఏ లోకములకు పోయి దుఃఖము నెరుగక సుఖింతురో అట్టి నా లోకములన్నియు నీకు ఇచ్చుచున్నాను. నీకు క్రయము ఇష్టముకానిచో క్రయము లేకయే అవి తీసికొనుము." యయాతి: "నీవు ఇంద్రునివలె మహా ప్రభావము కలవాడవు. నీ లోకములో!- అనన్తములైనవి. కాని ఇతరులు ఇచ్చినది అనుభవించుట నాకు ఆనందము కలిగించదు. కావున నీమాట నేను అంగీకరించజాలను." అష్టకుడు: "మాలో ఒక్కొక్కరము వేరువేరుగా ఇచ్చిన పుణ్యలోకములను తీసికొనుట నీకు ఇష్టముకానిచో మేము అందరమును మా మొత్తము లోకములను మీకిచ్చి మేము నరకమునకు పోవుదుము." యయాతి: "మీరు సత్యము మొదలగు ధర్మ తత్త్వమును ఎరిగినవారు. నేను దేనికి తగినవాడనో తెలుపుడు. నేను చేసియుండని పుణ్యఫలముల స్వీకరించుట మాత్రము నాకిష్టముకాదు." అష్టకుడు: "అయ్యా! ఒకరు ఇచ్చినది తీసికొనుట మీకిష్టములేక ఇట్లనుచున్నారు. కాని అట్లనవలదు. మేము చేసిన ఈ దానమునకు ఎంత ఫలము కలదో అదియంతయు నీకే చెందునుగాక! ఇంతేకాక నరులను తమపై నెక్కించి కొని శాశ్వతలోకములకు తీసికొనిపోవు ఐదు బంగారు రథములు కనబడుచున్నవి. ఇవి ఎవరివి?" యయాతి: "మండెడు అగ్నిశిఖలవలె పైపైపునకు ప్రజ్వలించుచు ప్రకాశించెడు ఈ ఐదు బంగారు రథములును మీ కొరకును నా కొరకును వచ్చియున్నవి. అష్టకా! మనమైదుగురమును వీనిపై నెక్కి వెళ్ళవలయును."

అష్టకః : ఆతిష్ఠస్వ రథం రాజ న్విక్రమస్వ విహాయసా. 15
వయమ ప్యత్ర యాస్యామో యదా కాలో భవిష్యతి ।

యయాతిః : సర్వై రిదానీం గన్తవ్యం సహ స్వర్గజితో వయమ్. 16
ఏష నో విరజాః పన్థా దృశ్యతే దేవసద్మనః ।

శౌనకః : తేఽధిరుహ్య రథం సర్వే ప్రయాతా నృపతే నృపాః. 17
ఆక్రామన్తో దివం భాభి ర్ధర్మేణావృత్య రోదసీ ।

అష్టకః : అహం మన్యే పూర్వ మేకోభిగన్తా సఖా చేన్ద్ర స్సర్వథా మే మహాత్మా. 18
కస్మా దేవం శిబి రౌశీనరోయం ఏకోత్యగా త్సర్వ వేగేన వాహాన్ ।

యయాతిః : అదదా ద్దేవయానాయ యావ ద్విత్త మతన్ద్రితః. 19
ఉశీనరస్య పుత్త్రోఽయం తస్మా చ్ఛ్రేష్ఠో హి వశ్శిబిః ।

దానం దమ స్సత్య మథో హ్యహింసా హ్రీ శ్శ్రీ స్తితిక్షా సతత మానృశంస్యమ్. 20

రాజ న్నేతా న్య ప్రమేయాణి రాజ్ఞి శిబౌ స్థితా న్యప్రతిమే సుబుద్ధ్యా ।
ఏవంవృత్తం హ్రీనిషేధో బిభర్తి తస్మా చ్ఛిబి రగ్రగన్తా రథేన. 21
శౌనకః : అథాష్టకః పునరేవాన్వపృచ్ఛ న్మాతామహం కౌతుకా దిన్ద్రకల్పమ్ ।
పృచ్ఛామి త్వాం నృపతే బ్రూహి సత్యం కుతశ్చ కశ్చాసి సుతశ్చ కస్య. 22
కృతం త్వయా యద్ధి న తస్య కర్తా లోకే త్వదన్యో బ్రాహ్మణః క్షత్త్రియో వా ।
యయాతిః: యయాతి రస్మి నహుషస్య పుత్త్రః పూరోః పితా సార్వభౌమ స్త్విహాఽఽసమ్. 23
గుహ్యం మన్త్రం మామకేభ్యో బ్రవీమి మాతామహోఽహం భవతాం ప్రకాశమ్ ।
సర్వా మిమాం పృథివీం నిర్జిగాయ ప్రస్థే బద్ధ్వా హ్యదదం బ్రాహ్మణేభ్యః. 24
మేధ్యా నశ్వా నేకశతా న్సురూపాం స్తదా దివః పుణ్యభాజో భవన్తి ।
అదా మహం పృథివీం బ్రాహ్మణేభ్యః పూర్ణా మిమా మఖిలాం సర్వరత్నైః. 25
గోభి స్సువర్ణైశ్చ ధనైశ్చ ముఖ్యై స్తత్రాసజ్గ శ్శతశ స్త్వర్బుదాని ।
సత్యేన మే ద్యౌశ్చ వసున్ధరా చ తథైవ చాగ్ని ర్జ్వలతే మానుషేషు. 26
న మే వృథా వ్యాహృత మేవ వాక్యం సత్యం హి సన్తః ప్రతిపూజయన్తి ।
సాధ్వష్టక ప్రబ్రవీమీహ సత్యం ప్రతర్దనం చౌషదశ్విం తథైవ. 27
సర్వే చ దేవా మునయశ్చ లోకా స్సత్యేన పూజ్యా ఇతి మే మనోగతమ్ ।
యో న స్స్వయం స్వర్గజితాం యథావృత్తం నివేదయేత్. 28
అనసూయు ర్ద్విజాగ్రేభ్య స్స భజే న్న స్సలోకతామ్ ।
శౌనకః: రాజ న్మహాత్మా స యయాతి రేవం స్వై ర్దౌహిత్రై స్తారితో మిత్రసాహః. 29
త్యక్త్వా మహీం పరమోదారకర్మా స్వర్గం గతః కర్మభి ర్వ్యాప్య పృథ్వీమ్ ।
ఏవం సర్వం విస్తరతో యథావ దాఖ్యాతం తే చరితం నాహుషస్య. 30
వంశోఽయ మస్య ప్రథితః కౌరవేయ యస్మి న్జాత స్త్వం మనుజేన్ద్రకల్పః. 30u

ఇతి శ్రీమత్స్యమహాపురాణే శౌనకశతానీకసంవాదే చన్ద్రవంశానువర్ణనే యయాతిచరితం నామ ద్విచత్వారింశోఽధ్యాయః. యయాతిచరితం సమాప్తమ్.

అష్టకుడు: "రాజా! నీరథమును అధిష్ఠించుము. ఆకాశమార్గమున పైకి పొమ్ము. సమయము వచ్చినప్పుడు మేమును మా రథములెక్కి అక్కడకు వత్తుము." యయాతి: "మనమందరమును ఒకేసారి స్వర్గమును జయించుకొంటిమి. కనుక అందరమును ఇప్పుడే పోవలయును. స్వర్గమునకు మీరు పోవలసిన నిర్మలమగు మార్గము కూడ ఇదుగో! కనబడుచున్నది."

అంతట వారందరును తమతమ రథములను అధిరోహించి తమ ధర్మములతో ద్యుభూలోకముల నడుమ ప్రదేశమును నింపుచు తమ కాంతులతో ద్యులోకమును క్రమ్మివేయుచు బయలుదేరిపోయిరి "మహాత్ముడగు ఇంద్రుడు ఎల్ల హేతువులచే నాకే మిత్రుడనియు అందరలో నేనే మొదట స్వర్గమును చేరుదుననియు అనుకొనుచుంటిని. కాని ఇప్పుడు ఔశీనరుడగు ఈ శిబి సర్వవేగముతో మన రథములను దాటి తాను ముందుగా వెళ్ళినాడు. ఇట్లేల జరిగినది?" అని అష్టకుడు యయాతిని ప్రశ్నించెను. యయాతి ఇట్లు పలికెను. "ఔశీనరుడు శిబి తనకు ధనమున్నంత వరకు ఏ మాత్రమును వెనుకాడక దానము చేయుచునేయుండెను. అదియే ఇందులకు హేతువు. అతడు మన అందరలో శ్రేష్ఠుడు. దానము దమము సత్యము అహింస హ్రీ (సిగ్గు బిడియములు) శ్రీ (సంపదయు-ముఖమున కాంతి కలిగి ఉండుటయు)

తితిక్ష (ద్వంద్వములను ఓర్చుట) అనృశంస్యము (క్రూరత లేకుండుట) ఈ సద్గుణములు శిబియందు అపరిమితములై యున్నవి. అతడు సాటిలేనివాడు. మంచి బుద్ధిశాలి (వివేకి). అదికాక బిడియపడుచు ఈ పని చేయరాదేమోయని వెను కాడుట అనెడు గుణము ఈ పైచెప్పిన సరుపడి కలవానిని కాపాడుచుండును. శిబి అట్టివాడు. కనుక అతడు తన రథ మును మనకంటె ముందు నడుపుకొని పోగలిగెను."

అంతట అష్టకుడు జిజ్ఞాసువై ఇంద్రతుల్యుఁడగు తన మాతామహుని ఇట్లు ప్రశ్నించెను: "రాజా! నేను నిన్నొకటి అడుగుచున్నాను నిజము చెప్పుము. నీవు ఎక్కడి నుండి (ఏ వంశము నుండి) వచ్చినవాడవు? ఎవరవు? ఎవరి కుమారుడవు? ఏలయన నీవు చేసినంత సుకృతమును లోకమందు మరియే బ్రాహ్మణుడు కాని క్షత్రియుడు కాని చేసియుండలేదు." యయాతి:" నన్ను యయాతి అందురు. నహుషుని కుమారుడను. పూరుని తండ్రిని. ఈ లోకమున సార్వభౌముడనై యుంటిని. స్పష్టముగా చెప్పుచున్నాను. మీకు మాతామహుడను. గుహ్యమగు మంత్రమును (తత్త్వమును) నా వారికి (మీకు) చెప్పుచున్నాను. ఈ భూమినంతటిని జయించితిని. శోభనమగు రూపము కలిగి అశ్వమేధమునకు యోగ్యములగు మంచి లక్షణములు కలిగిన అశ్వములను నూరిటిని ప్రస్థమునందు కట్టివేసి బ్రాహ్మణులకు దానముచేసితిని. అవి స్వర్గమును అనుభవించు పుణ్యమునకు పాత్రములయినవి. సర్వరత్నములతో గోవులతో బంగారములతో ముఖ్యములగు ఇతర ధనము లతో నిండిన ఈ భూమినంతటిని నూర్లఅర్బుదముల సంఖ్యగల ధనములనుగా బ్రాహ్మణులకు దానము చేసితిని: నా సత్య ముతో ద్యులోకముగాని భూమికాని మనుష్య లోకములందలి అగ్నికాని ప్రజ్వలించుచున్నవి. నేను వ్యర్థము అయథార్థ మునగు వాక్యము ఏదియు పలుకనేలేదు. సజ్జనులు సత్యమును ఆదరింతురుగదా! అష్టకా! ప్రతర్దనా! వసుమన్! మీకంద రకును చక్కగా సత్యము చెప్పుచున్నాను. సర్వ దేవులును సర్వ మునులును సర్వ లోకములును సత్యముతో (సత్యశబ్ద వాచ్యుడగు పరమాత్మ అను బుద్ధితో) పూజింపబడవలయును. అని నామనోగతమగు అభిప్రాయము. (ఇదియే యయాతి తన వారికి చెప్పదలచిన గుహ్య మంత్రము.)

స్వర్గమును స్వయముగా జయించిన మన ఈ వృత్తాంతమును అసూయా (దోషదృష్టి) రహితుడై ద్విజ శ్రేష్ఠులకు వినిపించు సద్దివాడు మనతో సాలోక్యమును పొందును."

శౌనకుడు శతానీకునితో చివరకు ఇట్లు చెప్పెను: రాజా! మహాత్ముడగు యయాతి ఇట్లు తన దౌహిత్రులచే తరింపజేయబడెను. అతడు మిత్రసాహుడు (మిత్రులను గెలుచుకొనువాడు. ఇతరులకు తన యందు మైత్రికలుగునట్లు చేసికొను సుగుణములు కలవాడు.) ఉదారములగు కర్మలను ఆచరించినవాడు. అతడిట్లు భూమిని విడిచి తన కర్మలతో భూమియందంతటను వ్యాపించి తుదకు స్వర్గమును చేరుకొనెను.

ఇట్లు నీకు విస్తరముగ యయాతి చరితమును యథాస్థితముగ చెప్పితిని. ఈ వంశము లోకమున ప్రసిద్ధి పొందినది. దానియందే నీవు జన్మించితివి.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున చంద్రవంశాను వర్ణనమున యయాతి చరితమున
యయాత్యష్టకాది స్వర్గప్రాప్తియను నలువది రెండవ అధ్యాయము.

## త్రిచత్వారింశోఽధ్యాయః.
## యదువంశానువర్ణనమ్.

సూతః: ఇత్యేత చ్ఛౌనకా ద్రాజా శతానీకో నిశమ్య తు । విస్మితః పరయా ప్రీత్యా పూర్ణచన్ద్ర ఇవాబభౌ.1
పూజయామాస నృపతి ర్విధివ చ్చాథ శౌనకమ్ । రత్నై ర్గోభి స్సువర్ణైశ్చ వాసోభి ర్వివిధై స్తథా. 2
ప్రతిగృహ్య తత స్సర్వం యద్రాజ్ఞా ప్రహితం ధనమ్ । దత్వా చ బ్రాహ్మణేభ్యశ్చ శౌనకోఽ న్తరధీయత.
ఋషయః: యయాతే ర్వంశ మిచ్ఛామ శ్రోతుం విస్తరతోఽనఘ ।
యదుప్రభృతిభిః పుత్రై ర్యథా లోకే ప్రతిష్ఠితః. 4

సూతః: యదో ర్వంశం ప్రవక్ష్యామి జ్యేష్ఠ స్యోత్తమతేజసః । విస్తరేణానుపూర్వ్యాచ్చ గదతో మే నిబోధత.
యదోః పుత్త్రా బభూవుర్హి పఞ్చ దేవసుతోపమాః । మహారథా మహేష్వాసా నామత స్తా న్నిబోధత. 6
సహస్రజి దథో జ్యేష్ఠః క్రోష్టు ర్నీలో బకో లఘుః । సహస్రజేస్తు దాయాద శ్శతజిన్నామ పార్థివః. 7
శతజేరపి దాయాదా స్త్రయః పరమకీర్తయః । హైహయశ్చ హయశ్చైవ తథా వేణుహయశ్చ యః. 8
హైహయస్య తు దాయాదో ధర్మనేత్రః ప్రతిశ్రుతః । ధర్మనేత్రస్య కున్తిస్తు సంహత స్తస్య చాత్మజః. 9
సంహతస్య చ దాయాదో మహిమా నామ పార్థివః । ఆసీ న్మహిమతః పుత్త్రో భద్రశ్రేణ్యః ప్రతాపవాన్.
వారాణస్యా మభూ ద్రాజా ప్రథితః పూర్వ మేవతు । భద్రశ్రేణ్యస్య పుత్త్రోభూ ద్దుర్దమో నామ పార్థివః. 11
దుర్దమస్య సుతో ధీమాన్ కనకో నామ వీర్యవాన్ । కనకస్య తు దాయాదా శ్చత్వారో లోకవిశ్రుతాః. 12
కృతవీర్యః కృతాగ్నిశ్చ కృతధర్మా తథైవ చ । కృతౌజాశ్చ చతుర్థోభూ త్కృతవీర్యాత్తు సోఽర్జునః. 13

కార్తవీర్యార్జునచరితమ్.

జాతః కరసహస్రేణ సప్తద్వీపేశ్వరో నృపః । వర్షాయుతం తప స్తేపే దుశ్చరం పృథివీపతిః. 14
దత్త మారాధయామాస కార్తవీర్యోఽత్రిసమ్భవమ్ । తస్మై దత్తా వరా స్తేన చత్వారః పురుషోత్తమః. 15
పూర్వం బాహుసహస్రం తు స వవ్రే రాజసత్తమః । అధర్మం చరమాణస్య సద్భిశ్చాపి నివారణమ్. 16
యుద్ధేన పృథివీం జిత్వా ధర్మేణైవానుపాలనమ్ । సఙ్గ్రామే వర్తమానస్య వధశ్చైవాధికా ద్భవేత్. 17

## నలువదిమూడవ అధ్యాయము

## యదువంశాను వర్ణనము.

సూతుడు ఋషులకు ఇట్లు చెప్పెను: ఇట్లు శౌనకుడు చెప్పిన యయాతి చరితమును విని శతానీకుడు అధికానందముతోపాటు ఆశ్చర్యమును పొంది పూర్ణచంద్రుడువలె ప్రకాశించెను. మరియు అనంతరము శౌనకుని శాస్త్రవిధానానుసారము గోవులతో సువర్ణములతో రత్నములతో వివిధ వస్త్రములతో పూజిం(ఆదరిం)చెను. రాజు తనకు పంపిన ధనమంతయు స్వీకరించి శౌనకుడు దానిని బ్రాహ్మణులకిచ్చి అంతర్ధానమునందెను.

అనగా విని ఋషులు సూతునితో ఇట్లనిరి: "అయ్యా! యయాతి వంశము యదువు మొదలగు ఆతని పుత్త్రులతో లోకమున ఎట్లు ప్రతిష్ఠితమయ్యెనో తెలుపవేడుచున్నాము."

సూతుడిట్లనెను: ఉత్తమ తేజశ్శాలియు యయాతికి జ్యేష్ఠపుత్త్రుడునగు యదుని వంశమును అనుపూర్వితో విస్తరముగా చెప్పెదను. వినుడు. యదువునకు దేవ కుమారులను పోలిన ఐదుగురు కుమారులు కలిగిరి. వారు మహాధానుష్కులు; మహారథులు. వారిపేరులు: సహస్రజిత్-క్రోష్టుడు-నీలుడు-బకుడు-లఘువు-అనునవి. సహస్రజితుని కుమారుడు శతజిత్. అతనికి హైహయ-హయ-వేణుహయులు ముగ్గురు కుమారులు. వీరిలో హైహయునికి ధర్మనేత్రుడు-అతనికి కుంతి-అతనికి సంహతుడు-అతనికి మహిముడు-అతనికి భద్రశ్రేణ్యుడు కుమారులు. ఈ భద్రశ్రేణ్యుడు పూర్వమే వారాణసియందు రాజుగా ప్రసద్ధుడై యుండెను. భద్రశ్రేణ్యుని కుమారుడు దుర్దముడు. అతని కుమారుడు కనకుడు. ఆతని కుమారులు లోకవిశ్రుతులగు కృత వీర్యుడు కృతాగ్ని కృతధర్ముడు కృతౌజుడు అను నలుగురు. కృతవీర్యుని కుమారుడు అర్జునుడు. అతడు వేయి చేతులు కలవాడుగా - సప్తద్వీపములకు అధిపతియగు రాజుగానయ్యెను. ఆ రాజు పదివేల సంవత్సరములపాటు ఇతరులు ఆచరించజాలని తపస్సును ఆచరించెను: కార్తవీర్యుడు అత్రి కుమారుడగు దత్తుని ఆరాధించెను. అతడు అతనికి నాలుగు వరములు కోరుకొమ్మనెను. ఆ రాజసత్తముడు సహస్ర బాహువులను- తా నధర్మము నాచరించుచున్నచో సత్పురుషులు దానినుండి తను నివారించుట-యుద్ధముతో పృథివిని జయించి ధర్మముననుసరించి దానిని పాలించుట-సంగ్రామమునందు తనకంటె అధికుని చేతిలో మరణము అను నాలుగు వరములను కోరెను.

తేనేయం పృథివీ సర్వా సప్తద్వీపా సపర్వతా । సప్తోదధిపరిక్షిప్తా క్షాత్త్రేణ విధినా జితా. 18
యుద్ధే బాహు సహస్రం వై ఇచ్ఛత స్తస్య ధీమతః । రథై ర్ధ్వజైశ్చ సంజజ్ఞే ఇత్యేవ మనుశుశ్రుమః. 19
దశ యజ్ఞ సహస్రాణి రాజ్ఞాం ద్వీపేషు వై తదా । నిరర్గళాని వృత్తాని శ్రూయన్తే తస్య ధీమతః. 20
సర్వే యజ్ఞా స్స్వావభృథా స్తస్యాసన్ భూరిదక్షిణాః । సర్వే కాఞ్చనయూపా స్తే సర్వే కాఞ్చనవేదికాః. 21
సర్వైర్దేవై స్సమం ప్రాప్తై ర్విమానై స్స్వై రలఙ్కృతః । గన్ధర్వై రప్సరోభిశ్చ నిత్యమే వోపశోభితః. 22
యస్య యజ్ఞే జగౌ గాథాం గన్ధర్వో నారద స్తథా । కార్తవీర్యస్య రాజర్షే ర్మహిమానం నిరీక్ష్య సః. 23
న నూనం కార్తవీర్యస్య గతిం యాస్యన్తి క్షత్త్రియాః । యజ్ఞై ర్దానై స్తపోభిశ్చ విక్రమేణ శ్రుతేన చ. 24
స హి సప్తసు ద్వీపేషు ఖడ్గీ చక్రీ శరాసనీ । రథీ ద్వీపా ననుచర న్యోగీ పశ్యతి తస్కరాన్. 25
పఞ్చాశీతి సహస్రాణి వర్షాణాం స నరాధిపః । సర్వరత్నై స్సుసమ్పూర్ణ శ్చక్రవర్తీ బభూవహ. 26
స ఏవ పశుపాలోఽభూ త్క్షేత్రపాల స్స ఏవ హి । స ఏవ వృష్ట్యా పర్జన్యో యోగిత్వా దర్జునోఽభవత్. 27
యోఽసౌ బాహు సహస్రేణ జ్యాఘాతకఠిన త్వచః । భాతి రశ్మి సహస్రేణ శారదేనేవ భాస్కరః. 28
ఏష నాగం మనుష్యాణాం మాహిష్మత్యాం మహాద్యుతిః ।
కర్కోటకసుతం జిత్వా పురం తత్ర న్యవేశయత్. 29
ఏష వేగం సముద్రస్య ప్రావృట్కాలే భజే(జ్యే)త వై । క్రీడన్నివ ముఖోద్భిన్న ప్రతి స్రోతో మహీపతిః.
లలనాః క్రీడితా స్తేన ప్రతి స్రగ్దామమాలికాః । యస్య భ్రుకుటి సన్త్రాసా చ్ఛఙ్కితాఽభ్యేతి నర్మదా. 31
ఏకో భుజసహస్రేణ జగ్రాహ స మహార్ణవమ్ । కరోత్యావృత్తవేగాం తు నర్మదాం ప్రావృడుత్థితామ్. 32
తస్య బాహు సహస్రేణ క్షోభ్యమాణే మహోదధౌ । భవన్త్యాలీననిశ్చేష్టాః పాతాళస్థా మహాసురాః. 33
స్థాలీకృత్య మహావీచిన్నక్రమీనమహాతిమిమ్ । మారుతావిద్ధఫేనౌఘ మావర్తాక్షి ప్తదుస్సహమ్. 34
కరో త్యాలోడయన్నేవ దోస్సహస్రేణ సాగరమ్ । మన్దరక్షోభచకితా హ్యమృతోత్పాదశఙ్కితాః. 35
తదాఽతిచలమూర్ధానో భవన్తి చ మహోరగాః । సాయాహ్నే కదళీఖణ్డా నివాత స్తిమితా ఇవ. 36

అతడు సప్తద్వీపములు పర్వతములు కలిగి సప్తసముద్రములనడుమ నున్న పృథివిని తన విక్రమముతో జయించెను. అతడు కోరుకొనినట్లు యుద్ధములయందు రథములుగా ధ్వజములుగా భుజసహస్రము ఉత్పన్న మయ్యెడిదని పరంపరలో వినుచుందుము. అతడాయా రాజుల ద్వీపములందు నిరాటంకముగా పదివేల యజ్ఞములను నిర్వర్తించెనని వినుచున్నాము. అతని సర్వ యజ్ఞములకు అవభృథములు (యజ్ఞ దీక్షాంతస్నానములు) జరిగెను. భూరిదక్షిణలతో కాంచన యూపము (యజ్ఞపశువును బంధించు స్తంభము)లతో కాంచన వేదికలతో ఆ యజ్ఞములు జరిగెను.

కార్యవీర్యార్జునునియజ్ఞములకు నారదుడను గంధర్వుడు వచ్చెడివాడు. అతడు తాను విమానములో రాగా అతని వెంట అనేక విమానములలో సర్వదేవతలు గంధర్వులు అప్సరసలును వచ్చెడివారు. ఆ విమానములలో ఆ దేవ జాతులతో ఉపశోభితుడగు నారద గంధర్వుడు కార్యవీర్యార్జునుని మహిమమును ఇట్లు కొనియాడుచు గాథను గానము చేసెడివాడు: 'తమ యజ్ఞములచేగాని దానములచేగాని తపస్సులచేగాని విక్రమముచేగాని శాస్త్రాధ్యయనముచేగాని క్షత్త్రియు లెవ్వరును కార్తవీర్యార్జునుడు పొందుగతిని పొందరు.' అని ఈ గాథకు అర్థము.

ఆ రాజు సప్తద్వీపములయందును రథమునారోహించి ఖడ్గము చక్రము ధనువు ధరించి యోగియై తస్కరులను కనిపెట్టెడివాడు. అతడు ఎనుబదియైదు వేల సంవత్సరములపాటు సర్వరత్న సంపూర్ణుడగు చక్రవర్తిగా ఉండెను. అతడే పశుపాలుడుగా క్షేత్రపాలుడుగా వర్షము కురియించుటతో పర్జన్యుడుగా యోగియై అర్జునుడుగా అయ్యెను. వింటి నారిని కఠోరముగా మోయించుచు వేయి బాహువులు కలిగి [illegible]

నట్లు వెలిగెడివాడు. మహా విజేతయగు ఆ అర్జునుడు మనుష్యుల నడుమనున్న నాగుడను కర్కోటక సుతుని జయించి అతని మాహిష్మతీ నగరమును తన రాజధానిగా చేసికొనెను. (మహి+అహి+మత్ = మహాహిష్మతీ = మాహిష్మతీ) అతడు [తన యోగశక్తిచే] నోటితోనే సముద్రపు పోటులను వెనుకకునెట్టియు చెదరగొట్టియు వర్షా కాలములో సముద్ర వేగమును తగ్గించెడివాడు. అతని కనుబొమముడికి భయపడి నర్మదా నది అతని కడకురాగా దానియందు విశిష్టములగు పూలమాలలను ధరించిన తన స్త్రీలను క్రీడింపజేసెడివాడు. తన వేయి చేతులతో సముద్రమును పట్టివేసెడివాడు. వర్షా కాలమున పొంగిన నర్మదకు వేగమును పొంగును తగ్గించెడివాడు. అతడు తన భుజ సహస్రముతో సముద్రమును కలత పరచుచుండగా పాతాళమున (సముద్రమునకు అడుగున)ఉన్న మహాఽసురులు భయముతో ముడుచుకొని కదలక మెదలక యుండెడివారు. అతడు సముద్రమును తన భుజ సహస్రముతో వస్త్రమును పట్టినట్లు పట్టుకొని అటుఇటు ఊపుచుండెడివాడు. అపుడు దానియందలి పెద్ద అలలును వానిలోని నక్రములును మీనములును తిమింగిలములును కలవరపాటు చెందెడివి. గాలియొత్తిడిచే నురుగు పైకి లేచెడిది. సుడులు మరింత భయంకరముగా రేగి దుఃసహములయ్యెడివి. అమృతమునుత్పత్తి చేయుటకై మందర పర్వతముతో సముద్రమును మథించుచున్నారేమో అను భ్రాంతి భయములతో మహాసర్పములు సాయాహ్నకాలమున గాలిలేని చోట కదలక యుండు అరటి గుబురులవలె కదలక నిలిచి యుండెడివి.

ఏష బద్ధ్వా ధనుర్జ్యాయా ముత్థితః పఞ్చభి శ్శరైః ।
లఙ్కాయాం మోహయిత్వా తు బలవా న్రావణం బలాత్. 37
నిర్జిత్య బద్ధ్వాఽతిరయం మాహిష్మత్యాం బబన్ధ చ । తతో గత్వా పులస్త్యస్తు అర్జునం సమ్ప్రసాదయన్.
ముమోచ రక్షః పౌలస్త్యం పులస్త్యేనేహ సాన్త్వితః । తస్య బాహుసహస్రస్య బభూవు ర్జ్యాతలస్వనాః. 39
యుగాన్తార్కసహస్రస్య ఆస్ఫోటా హ్యశనేరివ। అహో చిత్రం విధే ర్వీర్యం భార్గవోఽయం యదాచ్ఛినత్.
తద్వై సహస్రం బాహూనాం హైమతాలవనం యథా ।
య ద్భార్గవస్తు సఙ్క్రిద్ధో హ్యర్జునం శప్తవా న్ప్రభుః. 41
యస్మా ద్వనం ప్రదగ్ధం వై విశ్రుతం మమ హైహయ ।
తస్మా త్తే దుష్కరం కర్మ కృత మన్యో హరిష్యతి. 43
అర్జునో నామ కౌన్తేయ స్స చ రాజా భవిష్యతి । ఛిత్త్వా బాహుసహస్రం తే ప్రమథ్య తరసా బలీ. 43
తపస్వీ బ్రాహ్మణః కశ్చి త్త్వాం వధిష్యతి భార్గవః । తస్య రామ స్తదా త్వాసీ న్మృత్యు శ్శాపేన ధీమతః.
వర శ్చైవం తు రాజర్షే స్స్వయమేవ వృతః పురా । తస్య పుత్రశతం త్వాసీ త్తే చ తత్ర మహారథాః.
కృతాస్త్రా బలిన శ్శూరా ధర్మాత్మానో మహాబలాః । శూరసేనశ్చ శూరశ్చ వృష్ణిః కృష్ణ స్తథైవ చ. 46
జయధ్వజశ్చ వై కర్తా అవన్తేశ్చ విశామ్పతే । జయధ్వ జస్య పుత్రస్తు తాలజఙ్ఘో మహాబలః. 47
తస్య పుత్రశతాన్యేవ తాలజఙ్ఘా ఇతి శ్రుతాః । తేషాం పఞ్చ కులాః ఖ్యాతా హైహయానాం మహాత్మనామ్.
వీతిహోత్రాశ్చ పార్యాతా భోజాశ్చావన్తయ స్తథా । తుణ్డికేరాశ్చ విక్రాన్తా స్తాలజఙ్ఘా స్తథైవచ. 49
వీతిహోత్రసుతశ్చాపి ఆనర్తో నామ వీర్యవాన్ । దుర్జయ స్తస్య పుత్రస్తు బభూవామిత్రకర్శనః. 50
సద్భావేన మహారాజః ప్రజా ధర్మేణ పాలయన్ । కార్తవీర్యోఽర్జునో నామ రాజా బాహుసహస్రవాన్. 51
యేన సాగరపర్యన్తా ధనుషా నిర్జితా మహీ । య స్తస్య కీర్తయే న్నామ కల్య ఉత్థాయ మానవః. 52
న తస్య విత్తనాశ స్స్యా న్నష్టం చ లభతే పునః । కార్తవీర్యస్య యో జన్మ కథయే దిహ ధీమతః. 53
534
యథావత్స్విష్టపూతాత్మా స్వర్గలోకే మహీయతే.

ఇతి శ్రీమత్స్యమహాపురాణే చన్ద్రవంశానువర్ణనే కార్తవీర్యార్జునమహి
మానువర్ణనం నామ త్రి చత్వారింశోఽధ్యాయః.

బలశాలియగు అతడు లంకకుపోయి రావణుని మోహపరచి తన బలముచే ఐదు బాణములతో వానిని జయించి తన వింటి నారితో బంధించి మాహిష్మతికి తెచ్చి చెరలో నుంచెను. తరువాత పులస్త్యుడు పోయి బ్రతిమాలగా నతడు రావణుని విడిచెను. అతడు తన భుజసహస్రముతో చేసెడి జ్యాధ్వనులు ప్రళయకాలపు వేయిమంది సూర్యుల నుండి పడెడి పిడుగుల మ్రోతలవలె వినబడెడివి. కాని విధిశక్తి ఎంత బలవత్తరమును విచిత్రమును నైనది! ఆ బాహు సహస్రమును భార్గవుడగు పరశురాముడు బంగారు తాటితోపును నరకినట్లు నరకెనుగదా! మహా సమర్థుడగు భార్గవుడను మహాముని క్రుద్ధుడై అర్జునుని ఇట్లు శపించెను: "ఓ హైహయా! లోక ప్రసిద్ధమగు నా వనమును నీవు దహించితివి కావున నీవు చేసిన దుష్కరమగు సుకృతపు ఫలమునంతటిని మరియొక మానవుడు హరించును. అట్లు నీ సుకృతమును పొంది కౌంతేయుడగు అర్జునుడు (నీ పేరుగలవాడు) రాజగును. నా వంశమునందు పుట్టిన తపస్వి బ్రాహ్మణుడొకడు తన శక్తిచే నీ బాహుసహస్రమును ఖండించి నిన్ను వధించును." అని శపించెను. దానికి ఫలముగా ముందుకాలమున పరశురాముడతనికి మృత్యువయ్యెను. అర్జునుడు పూర్వము దత్తాత్రేయుని వలన కోరిన వరము కూడ ఇదియే.

ఈ కార్తవీర్యార్జునునకు నూరు మంది కుమారులు-వారందరును మహారథులును అస్త్ర విశారదులును ధర్మాత్ములను మహాబలులునునై యుండిరి. శూరసేనుడు శూరుడు వృష్ణి-కృష్ణుడు జయధ్వజుడు మొదలగువారు వీరిలో ముఖ్యులు. జయధ్వజుడు అవన్తి నగరమును నిర్మించెను. అతని కుమారుడు తాలజంఘుడు. అతనికి నూరుమంది కుమారులు కలిగిరి. వారికి తాలజంఘులని వ్యవహారము. వీరిలో ఐదుగురి వంశములు ప్రసిద్ధములు: వారు-శర్యాతికోవలోని వీతిహోత్రులు-భోజులు-అవంతులు-తుండికేరులు-తాలజంఘులు అనువారు. వీతిహోత్రుని కొడుకు అనర్తుడు. అతని కొడుకు దుర్జయుడు. అతడు శత్రు విజేతయై మహారాజై సద్భావముతో ధర్మముతో ప్రజలను పాలించెను.

యదువంశములో కృతవీర్యుని కొడుకగు అర్జునుడు ఇట్లు ప్రసిద్ధుడగు రాజు. అతడు సహస్ర బాహుడు. సాగర పర్యన్తమగు భూమిని అతడు తన ధనువుతో జయించెను. వేకువలో మేల్కొనగానే అతని పేరు తలచిన వానికి ధన నాశము కలుగదు. పోయినదియు తిరిగి దొరకును. అతని కథను చెప్పిన వాడును యజ్ఞములాచరించినవాడువలె పవిత్రుడై స్వర్గలోకమున పూజింపబడును.

ఇది శ్రీమత్స్య మహాపురాణమున చంద్రవంశాను వర్ణనమున యదువంశాను కీర్తనమున
కార్తవీర్యార్జున మహిమాను వర్ణనమను నలువది మూడవ అధ్యాయము

## చతుశ్చత్వారింశోఽధ్యాయః.
## అర్జునం ప్రతి ద్విజరూపసూర్యాగమనమ్.

ఋషయః : కిమర్థం తద్వనం దగ్ధం భార్గవస్య మహాత్మనః ।
కార్తవీర్యేణ విక్రమ్య సూత ప్రవద పృచ్ఛతామ్. 1
రక్షితా స తు రాజర్షిః ప్రజానా మితి న శ్శ్రుతమ్ః స కథం రక్షితా భూత్వా ప్రాదహ త్త త్తపోవనమ్. 2
సూతః : ఆదిత్యో ద్విజరూపేణ కార్తవీర్యముపస్థితః । తృప్తి మేకాం ప్రయచ్ఛస్వ ఆదిత్యోఽహం నరేశ్వర.
కార్తవీర్యః : భగవ న్కేన తే తృప్తి ర్భవిత్రీ వై దివాకర ।
కీదృశం భోజనం దద్మి శ్రుత్వా తు విదధామ్యహమ్. 4
ఆదిత్యః : స్థావరం దేహి మే సర్వ మాహారం దదతాం వర ।
తేన తృప్తో భవేయం వై సా మే తృప్తిర్హి పార్థివ. 5
కార్తవీర్యః : న శక్యా స్థావరా స్సర్వే తేజసా చ బలేనచ ।
నిర్దగ్ధుం తపతాం శ్రేష్ఠ త్వామేవ ప్రణమా మ్యహమ్. 6

ఆదిత్యః : తుష్ట స్తేఽహం శరాన్ దాస్యా మ్యక్షయా న్సర్వతోముఖాన్ ।
యే ప్రక్షిప్తా జ్వలిష్యన్తి మమ తేజస్సమన్వితాః. 7
ఆవిష్టా మమ తేజోభి శ్శోషయిష్యన్తి స్థావరాన్ । శుష్కా న్భస్మీకరిష్యామి తేన తృప్తి ర్నరాధిప. 8
సూతః : తత శ్శరాం స్తదాదిత్య స్త్వర్జునాయ ప్రయచ్ఛత ।
తతో దదాహ సమ్ప్రాప్తాన్ స్థావరా న్సర్వమేవ చ. 9
తథా గ్రామా్రశమాంశ్చైవ ఘోషాణి నగరాణి చ । తపోవనాని రమ్యాణి వనాన్యుపవనాని చ. 10
ఏవం సర్వం సమదహ త్తత స్సర్వాంశ్చ పక్షిణః । నిర్వృక్షా నిస్తృణా భూమిః కృతా ఘోరేణ తేజసా. 11
ఏతస్మిన్నేవ కాలే తు *భార్గవో జల మాస్థితః । దశవర్షసహస్రాణి తత్రాస్తే స మహానృషిః. 12
పూర్ణే వ్రతే మహాతేజా ఉదతిష్ఠ త్తపోధనః । సోఽపశ్య దాశ్రమం దగ్ధ మర్జునేన మహామునిః. 13
క్రోధా చ్ఛశాప రాజర్షిం కీర్తితం వో యథా మయా । క్రోష్టోః శృణ్వేహ రాజేన్ద్ర వంశ ముత్తమపూరుషమ్.
యస్యాన్వయేఽథ సమ్భూతో విష్ణు ర్వృష్ణికులోద్వహః ।

## నలుబది నాలుగవ అధ్యాయము

## కార్తవీర్యార్జున కథాశేషము-క్రోష్టువంశ కథనము.

ఋషులు సూతునిట్లు ప్రశ్నించిరి: కార్తవీర్యుడు ప్రజారక్షకుడని వినియుంటిమి. అటువంటివాడు విక్రమము చూపి మహాత్ముడగు భార్గవముని వనము నేల దహించెను?

సూతుడు ఋషులతో నిట్లు చెప్పనారంభించెను: ఆదిత్యుడు విప్రరూపమున కార్తవీర్యుని కడకువచ్చి 'నేనాదిత్యుడను. నాకు తృప్తి కలిగించుము.' అని కోరెను. నీకు దేనిచే తృప్తి కలుగును? నీకెట్టి భోజనము కావలెనో తెలిసిన నది ఏర్పరతునని కార్తవీర్యుడన నాకు స్థావర రూపమగు ఆహారమునేదైన నిమ్ము. దానిచే తృప్తి కలుగునని ఆదిత్యుడు పలికెను. వేడిమినిచ్చు వారిలో శ్రేష్ఠుడవగు నీకు నమస్కారము. నా తపస్సుచే కాని బలముచే కాని స్థావరములన్నిటిని కాల్చుట నాకు శక్యముకాదు. అని కార్తవీర్యుడన ఆదిత్యుడును నీ భక్తికి నీ మాటకు సంతోషించితిని. అక్షయములును సర్వతో ముఖములును (ఎటయిన ప్రసరించునవి) అగు బాణములు నీకిత్తును. అవి నీవు ప్రయోగించినపుడు వానియందు నా తేజస్సు ప్రవేశించి అవి మండి వృక్షాదిక స్థావరముల నెండించును. వాటిని నేను భస్మముచేసి తృప్తి పొందుదు ననెను. తరువాత నాతడు తానన్నట్లర్జునునకు శరములనిచ్చి వాటిమూలమున ఎండిన స్థావరములను కాల్చి వాటితోపాటు గ్రామములు ఆశ్రమములు పల్లెలు నగరములు రమ్యములగు తపోవనములు వనములు ఉపవనములు ఆయా తావులందలి పక్షులు మొదలగు అన్నింటిని కాల్చెను. సూర్యుని భయంకర తేజస్సుచే భూమిపై (అతడు కాల్చినంతమేర) వృక్షములు కాని గడ్డికాని లేకుండనయ్యెను. ఈ కాలముననే భార్గవుడను మహాఋషి ఆ ప్రదేశమునందలి నీటిలో నుండి తపస్సాచరించుచుండెను. అతడు పదివేల యేండ్లు వ్రతము పూని తపస్సుచేసి అది ముగియగానే పైకి వచ్చిచూచెను. తన ఆశ్రమమంతయు కార్తవీర్యుడు కాల్చెనని ఎరిగి క్రోధముపూని లోగడ చెప్పినట్లు ఆతనిని శపించెను.

ఇక క్రోష్టువంశము తెలిపెదను. దానియందన్ని తరములవారు నుత్తములు. ఆ వంశమందే వృష్ణివంశశ్రేష్ఠుడగు కృష్ణుడు జన్మించెను.

క్రోష్టుసన్తతిః.

క్రోష్టోరే వాభవ త్పుత్రో వృజినీవా న్మహారథః.
వృజినీవతశ్చ పుత్రోఽభూ త్స్వాహో నామ మహాబలః । స్వాహపుత్రోఽభవ ద్రాజా ఉషఙ్గో వదతాం వరః.
తతః ప్రసూతి మిచ్ఛన్వై ఉషఙ్గ స్సోఽగ్రమాత్మనః । చిత్రీ చిత్రరథశ్చాస్య పుత్రః కర్మభి రన్వితః. 17
అథ చైత్రరథిర్వీరో జజ్ఞే విపులదక్షిణః । శశిబిన్దు రితి ఖ్యాత శ్చక్రవర్తీ బభూవ హ. 18

అత్రానువంశశ్లోకోఽయం గీత స్తస్మి న్పురాఽభవత్ । శశబిన్దోస్తు పుత్రాణాం శతానా మభవ చ్ఛతమ్. 19
ధీమతాం చాభిరూపాణాం భూరిద్రవిణతేజసామ్ । తేషా మతిప్రధానానాం పృథుసత్త్వో మహాబలః. 20
పృథుశ్రవాః పృథుయశాః పృథుధర్మా పృథుఞ్జయః । పృథుకీర్తిః పృథుమనా రాజాన శ్శశబిన్దవః. 21
శంసన్తి చ పురాణజ్ఞాః పృథుసత్త్వ మనుత్తమమ్ । అనన్తరం సుయజ్ఞశ్చ ప్రజ్ఞస్య తనయోఽభవత్. 22
ఉశనా తు సుయజ్ఞస్య యోఽరక్ష త్పృథివీ మిమామ్ । ఆజహారాశ్వమేధానాం శత ముత్తమధార్మికః. 23
తితిక్షు రభవ త్పుత్ర ఔశన శ్శత్రుతాపనః । మరుత్త స్తస్య తనయో రాజర్షీణా మనుత్తమః. 24
ఆసీ న్మరుత్తతనయో వీరః కమ్బళబర్హిషః । పుత్రస్తు రుక్మకవచో విద్వా న్కామ్బళబర్హిషః. 25
విహత్య రుక్మకవచః పరా న్కవచధారిణః । ధన్వినో వివిధై ర్బాణై రవాప్య పృథివీ మిమామ్. 26
అశ్వమేధే దదౌ రాజ బ్రాహ్మణేభ్యస్తు దక్షిణామ్ । యజ్ఞే స రుక్మకవచః కదాచి త్పరవీరహా. 27
జజ్ఞిరే పఞ్చపుత్రాస్తు మహావీర్యా ధనుర్భృతః । రుక్మేషుః పృథురుక్మశ్చ జ్యామేఘః పరిఘో హరిః. 29
పరిఘంచ హరించైవ విదేహేఽస్థాపయత్పితా । రుక్మేషు రభవ ద్రాజా పృథురుక్మ స్తదాశ్రయః. 29
తేభ్యః ప్రవ్రాజితో రాజా జ్యామేఘోఽథ యదాశ్రమే । ప్రశాన్త శ్చాశ్రమస్థశ్చ బ్రాహ్మణే నావబోధితః. 30
జగామ ధను రాదాయ దేశ మన్యం ధ్వజీ రథీ । నర్మదాం నృప ఏకాకీ కేవలం వృత్తికామతః. 31
ఋక్షవన్తం గిరిం గత్వాఽభుక్త మన్యై రుపావిశత్ । జ్యామేఘ స్యాభవ ద్భార్యా శైబ్యా పరిణతా సతీ. 32
అపుత్రో న్యవస ద్రాజా భార్యా మన్యాం న విన్దత । తస్యాసీ ద్విజయో యుద్ధే తత్ర కన్యా మవాప సః. 33
భార్యా తూవాచ సన్త్రాసా త్కైషా కన్యా సులోచనా । భార్యార్థేతు సమానీతా కథయస్వేతి లమ్పటా. 34
భార్యా మువాచ సన్త్రాసం స్నుషేయం తే సువిశ్రుతా । ఏవముక్తా బ్రవీ దేనం కస్య చేయం స్నుషేతి చ. 35
నాహం ప్రసూతా పుత్రేణ నాన్యా పత్న్యభవ త్తవ । స్నుషాసమ్బన్ధక స్తేన కతమేన సుతేన తే. 36
జ్యామేఘః: యం త్వం జనిష్యసే పుత్రం తస్య భార్యా భవిష్యతి ।
తస్మా త్సా తపసోగ్రేణ కన్యాయాం సమ్ప్రసూయతే. 37
పుత్రం విదర్భం సుభగా శైబ్యా పరిణతా సతి । రాజపుత్రౌ చ విద్వాంసౌ స్నుషాయాం క్రథకైశికౌ. 38
లోమపాదం తృతీయం తు పుత్రం పరమధార్మికమ్ ।
తస్యాం విదర్భోఽజనయ చ్ఛూరా న్రణవిశారదాన్. 39
లోమపాదాత్మజః పుత్రో జ్ఞాతి స్తస్య చ ఆత్మజః ।
కైశికస్య చిదిః పుత్ర స్తస్మా చ్చైద్యా నృపా స్స్మృతాః. 40
క్రథో విదర్భపుత్రస్తు కున్తి స్తస్యాత్మజోఽభవత్ । కున్తే ర్వృష స్సుతో జజ్ఞే రణధృష్టః ప్రతాపవాన్. 41
ధృష్టస్య పుత్రో ధర్మాత్మా నివృత్తిః పరవీరహా । వరిష్ఠో నివృతేః పుత్రో నామ్నా స తు విదూరథః. 42
విదూరథస్య పుత్రోఽభూ ద్దశార్హో నామ వీర్యవాన్। దశార్హ పుత్రో వ్యోమస్తు వ్యోమా జ్జీమూత ఉచ్యతే।
జీమూతపుత్రో విమల స్తస్య భీమరథ స్స్మృతః. 43
సుతో భీమరథస్యాసీ త్స్మృతో నవరథః కిల । తస్య చాసీ ద్దృఢరథ శ్శకుని స్తస్య చాత్మజః. 44
తస్మా త్కరమ్భః కారమ్భో దేవరాతో బభూవ హ । దేవక్షత్రోఽభవ ద్రాజా దేవరాతా న్మహాయశాః. 45
దేవగర్భసమో జజ్ఞే దేవనక్షత్రనన్దనః । మధు ర్నామ మహాతేజాః మధోః పురువసు స్తథా. 46
ఆసీ త్పురువసోః పుత్రః పురుద్వా న్పురుషోత్తమః । జన్తు ర్జజ్ఞే హ వైదర్భ్యాం భద్రసేన్యాం పురుద్వతః
ఐక్ష్వాకీ చాభవ ద్భార్యా జన్తో స్తస్యా మజాయత । సాత్వత స్సత్త్వసంయుక్త స్సాత్వతాం కీర్తివర్ధనః. 48

ఇమాం విసృష్టిం విజ్ఞాయ జ్యామేఘస్య మహాత్మనః। ప్రజావానేతి సాయుజ్యం రాజ్ఞ స్సోమస్య ధీమతః. 49

క్రోష్టునికి మహారథుడగు వృజినీవాన్-అతనికి మహాబలుడగు స్వాహుడు-అతనికి పురుష శ్రేష్ఠుడగు ఉషంగుడు-అతనికి సార్థకనాముడగు చిత్రరథుడు-అతనికి వీరుడై విపుల దక్షిణలతో యజ్ఞములు చేసిన శశిబిందుడును కలిగిరి. అతడు గొప్ప చక్రవర్తి. అతనిగూర్చి అనుషంగ శ్లోకము ఈ యర్థమును ఇచ్చునది కలదు. 'శశిబిందునకు నూరునూరుమంది (10000) కుమారులు కలరు. వారందరు చాల పెద్దాంగులు సుందరులు. అధికమగు ధనమును తేజస్సును కలవారు. అతి ప్రధానులగు ఆ శశిబిందు పుత్త్రులలో ముఖ్యులు-మహాబలుడగు వృథు సత్త్వుడు-వృథుశ్రవుడు - వృథుయశుడు - వృథు ధర్ముడు-వృథుంజయుడు-వృథుకీర్తి-వృథుమనసుడు అనువారు. వృథుసత్త్వునకు ప్రజ్ఞుడు-అతనికి సుయజ్ఞుడు-అతనికి ఉశనుడు కలిగిరి. ఉశనుడు ఉత్తమ ధార్మికుడగు చక్రవర్తియై నూరశ్వమేధము లొనరించెను. అతనికి తితిక్షువు-అతనికి రాజర్షి శ్రేష్ఠుడగు మరుంతుడు అతనికి కంబళ బర్హిషుడు-అతనికి రుక్మకవచుడు కలిగిరి. ఈతడు యుద్ధమున కవచధారులగు శత్రులను ధనుర్ధరులను వివిధ బాణములతో చంపి భూమినంతటిని స్వాధీనము చేసికొని అదియంతయు ఒక యజ్ఞములో బ్రాహ్మణులకు దక్షిణగా ఇచ్చెను. అతనికి మహావీర్యులు మహాధనుర్ధరులునగు రుక్మేషువు-వృథురుక్ముడు-జ్యామేఘుడు-పరిఘుడు-హరి అను ఐదు మంది కుమారులు. వీరిలో పరిఘుని హరిని తండ్రి విదేశములకు పాలకులుగా పంపెను. రుక్మేషువు తండ్రిరాజ్యమునం దుండెను. వృథురుక్ముడు రుక్మేషు నాశ్రయించి యుండెను. వారిచే రాజ్యము నుండి వెడల గొట్టబడి జ్యామేఘుడు ప్రశాంతుడై ఒక యాశ్రమమందుండెను. ఒక బ్రాహ్మణుడు చేసిన బోధనముచే అతడు కేవలము జీవన వృత్తికై యుద్ధము చేయదలచి రథమునెక్కి ధనువును ధ్వజమును దాల్చి ఏకాకియై నర్మదాతీర దేశమునకుపోయెను. అచ్చట ఋక్షవంతమను పర్వతము ఇతరుల అనుభవములో లేకుండుట చూచి అచ్చట నివాసము నేర్పరచుకొనెను. అతనికి గొడ్రాలగు శైబ్య అను పతివ్రత భార్య. ఐనను అతడు మరియొక పెండ్లి చేసికొనకుండెను. అతడు ఒక మారు యుద్ధములో ఒక సుందరియగు కన్యను గెలిచి తెచ్చెను. ఆమెను చూచి శైబ్య 'ఈ సులోచనయగు కన్య ఎవరు? భార్యగా చేసికొనదలచి తెచ్చితివా? నాకు కుమారులు లేరు కావున ఈమె మనకు కోడలుగాజాలదు. నీకు మరియొక భార్యయు ఆమెకు కుమారులునులేరు. ఈమె మనకెట్లు కోడలగును? అనగా అతడు నీకు పుట్టబోవు కొడుకునకీమె భార్యయగుననెను. అపుడామె ఉగ్రతపము చేసి జ్యామేఘుని వలన విదర్భుడను కుమారునికనెను. ఈ కన్య అతనికి భార్యయయ్యెను. విదర్భునకు ఈమెయందు క్రథుడుకైశికుడురోమపాదుడు అను ముగ్గురు కొడుకులు కలిగిరి. వీరిలో రోమపాదునకు మనువు అతనికి జ్ఞాతి-కుమారులు. కైశికునకు చిది అనువాడు కుమారుడు. అతని వంశము వారికి చైద్యులని పేరు. క్రథుడను వానికి కుంతి అతనికి వృషుడు-అతనికి ధృష్టుడు-అతనికి నివృత్తి-అతనికి విదూరథుడు-అతనికి విమలుడు-అతనికి భీమరథుడు-అతనికి నవరథుడు-అతనికి దృఢరథుడు-అతనికి శకుని-అతనికి కరంభుడు-అతనికి దేవరాతుడు-అతనికి దేవక్షత్త్రుడు-అతనికి మధుడు-అతనికి పురువసుడు-అతనికి పురుద్వాన్-అతనికి విదర్భరాజ పుత్త్రియగు భద్రసేనియందు జంతుడు-అతనికి ఇక్ష్వాకురాజపుత్త్రియందు సాత్వతుడు కలిగిరి.

జ్యామేఘుని ఈ వంశవృద్ధిని వినినవాడు సంతానవృద్ధి కలిగి సోమునితో సాయుజ్యము పొందును.

సాత్వతా త్సత్త్వసమ్పన్నా త్కౌసల్యా సుషువే సుతాన్ ।
భాగినం భజమానంతు దివ్యం దేవావృధం నృపమ్. 50
అన్ధకంచ మహాభోజం వృష్ణించ యదునన్దనమ్ । తేషాం సర్గాశ్చ చత్వారో విస్తరేణైవ తాన్ఛృణు. 51
భజమానస్య సృఞ్జయ్యాం బాహ్యకాయాంచ బాహ్యకాః ।
సృఞ్జయస్య సుతే ద్వేతు బాహ్యకాస్తు తదాఽభవన్. 52
తస్య భార్యే భగిన్యౌ ద్వే సుషువాతే బహూ న్సుతాన్ । నిమించ కృమిలం చైవ వృష్ణిం పరపురఞ్జయమ్.
తే బాహ్యకాయాం సృఞ్జయ్యాం భజమానా ద్విజజ్ఞిరే । జజ్ఞే దేవావృధో రాజా బన్ధూనాం మిత్రవర్ధనః. 54

అపుత్త్రశ్చాభవద్రాజా చచార పరమం తపః । పుత్త్రః స్సర్వగుణోపేతో మమ భూయా దితి స్పృహన్.
సంయోజ్య మన్త్రమేవాద్యం పర్ణాశాజల మస్పృశత్ । సదోపస్పర్శనా త్తస్య చకార ప్రియ మాపగా. 56
కల్యాణత్వా న్నరపతే స్తస్మై సా నిమ్నగోత్తమా । చిన్తయాఽథ పరీతాత్మా జగామాథ వినిశ్చయమ్. 57
నాధిగచ్ఛా మ్యహం నారీం యస్యా మేవంవిధ స్సుతః ।
జాయేత తస్మా దద్యాహం భవామ్యథ సహవ్రజాః. 58
అథ భూత్వా కుమారీ సా బిభ్రతీ పరమం వపుః । జ్ఞాపయామాస రాజానం తా మియేష మహావ్రతః. 59
అథ సా నవమే మాసి సుషువే సరితాం వరా । పుత్త్రం సర్వగుణోపేతం బభ్రుం దేవావృధా న్నృపాత్.
అనువంశే పురాణజ్ఞా గాయన్తీతి పరిశ్రుతాః । గుణా న్దేవావృధస్యాథ కీర్తయన్తో మహాత్మనః. 61
యథైవ శృణుమో దూరా త్సంపశ్యామ స్తథాఽన్తికాత్ ।
బభ్రు శ్శ్రేష్ఠో మనుష్యాణాం దేవై ర్దేవావృధ స్సమః. 62
పురుషాః పంచషష్టిశ్చ షట్సహస్రాణి చాష్ట చ ।
ఏతేఽమృతత్వం సమ్ప్రాప్తా బభ్రో ర్దేవావృధా న్నృపాత్. 63
యజ్ఞదానపతి ర్వీరో బ్రహ్మణ్య స్సుదృఢవ్రతః । రూపవా న్సుమహాతేజా శ్శ్రుతవీర్యధర స్తథా. 64
సురనాభస్య దుహితా సుషువే చతుర స్సుతాన్ । కుకురం భజమానం చ సాగ్నిం కమ్బళబర్హిషమ్. 65
కుకురస్య సుతో వృష్ణిర్ వృష్ణేస్తు తనయో ధృతిః । కపోతరోమా తస్యాథ తైత్తిరి స్తస్య చాత్మజః. 66
తస్యాసీ త్తనయా పుత్త్ర న్సఖా విద్వా న్నలః కిల । ఖ్యాయతే తస్యనామ్నా స నన్దనోదరదున్దుభిః. 67
తస్మి న్ప్రవితతే యజ్ఞే అభిజాతః పునర్వసుః । అశ్వమేధం తు పుత్త్రార్థ మాజహార నరోత్తమః. 68
తస్య మధ్యేఽతిరాత్రస్య సభ్యమధ్యా త్సముత్థితః । అతస్తు విద్వా న్కర్మజ్ఞో యజ్వా దేవపునర్వసుః. 69
తస్యాసీత్ పుత్త్రమిథునం బభూవావర్జితం కిల । ఆహుక శ్చాహుకీ చైవ ఖ్యాతౌ మతిమతాం వరౌ. 70
ఇమాం శ్చోదాహర న్త్యత్ర శ్లోకాన్ ప్రతి త మాహుకమ్ ।
సోపాసంగా నుకర్షాణాం సధ్వజానాం వరూథినామ్. 71
రథానా మథ మోషాణాం సహస్రాణి దశైవ తు । నాసత్యవాదీ నాతేజా నాయజ్వా నాసహస్రదః. 72
నాశుచి ర్నాప్యవిద్వాన్హి యో భోజే ష్వభ్యజాయత । ఆహుకస్య భృతిం ప్రాప్తా నిత్యేతద్వై తదోచ్యతే. 73
ఆహుకశ్చా ప్యవన్తీషు స్వసారం చాహుకీం దదౌ। ఆహుకా త్కాశ్య దుహితా ద్వౌ పుత్త్రౌ సుషువే సతీ.74
దేవకం చోగ్రసేనంచ దేవగర్భసమా వుభౌ । దేవకస్య సుతా వీరా జజ్ఞిరే త్రిదశోపమాః. 75
దేవవా నుపదేవశ్చ సుదేవో దేవరక్షితః । తేషాం స్వసార స్సప్తాస న్వసుదేవాయ తా దదౌ. 76
దేవకీ శ్రుతదేవీ చ యశోదా చ యశోధరా । శ్రీదేవీ సత్యదేవీ చ సుతాపీ చేతి సప్తమీ. 77
నవోగ్రసేనస్య సుతాః కంస స్తేషాం తు పూర్వజః ।
న్యగ్రోధశ్చ సునామా చ కఙ్క శ్శఙ్కుశ్చ భూయసః. 78
సుతన్తూ రాష్ట్రపాలశ్చ బద్ధముష్టి స్సముష్టిదః । తేషాం స్వసారః పఞ్చాస న్కంసా కంసవతీ తథా. 79
సుతన్తూ రాష్ట్రపాలీ చ కఙ్కా చేతి వరాఙ్గనా । ఉగ్రసేన స్సహాపత్యో వ్యాఖ్యాతాః కుకురోద్భవాః. 80
భజమానస్య పుత్త్రోఽథ రథముఖ్యో విదూరథః । రాజాథ దేవ శ్శూరశ్చ విదూరథసుతోఽభవత్. 81
రాజాధిదేవస్య సుతౌ జజ్ఞాతే దేవసమ్మతౌ । నియమవ్రతప్రధానౌ తౌ శోణాశ్వ శ్వేతవాహనౌ. 82
శోణాశ్వస్య సుతాః పఞ్చ శూరా రణవిశారదాః । శమీచ గదశర్మాచ నికృత శ్శక్రశత్రుజిత్. 83

శమీపుత్రః ప్రతిక్షత్రః పరిక్షత్రి స్తదాత్మజః । పరిక్షత్రసుతో భోజో హృదిక స్తస్య చాత్మజః. 84
హృదికస్యాభవ న్పుత్రాదశ భీమపరాక్రమాః । కృతవర్మాఽగ్రజ స్తేషాం శతధన్వాచ మధ్యమః. 85
దేవార్హశ్చైవ నాభశ్చ భీషణశ్చ మహాబలః । అజాతో వనజాతశ్చ కనీయక కరమ్భకౌ. 86
దేవార్హస్య సుతోవిద్వా న్జజ్ఞే కమ్బళబర్హిషః । అసమఞ్జా స్సుత స్తస్య తమోజా స్తస్యచాత్మజః. 87
(అజాతపుత్రస్య సుతః ప్రజాయత మమాయకః । ) తమోజపుత్రా విక్రాన్తాస్త్రయః పరమకీర్తయః. 88
సుదంష్ట్రశ్చ సునాభశ్చ కృష్ణ ఇత్యంధకా మతాః । అన్ధకానా మిమంవంశం కీర్తయన్తి చ నిత్యశః. 89
ఆత్మనో విపులం వంశం ప్రజావా నాప్నుతే నరః. 89½

ఇతి శ్రీమత్స్యమహాపురాణే చన్ద్రవంశానువర్ణనే సహస్రజిత్క్రోష్టు వంశకథనం
నామ చతుశ్చత్వారింశోఽధ్యాయః.

సాత్వతునకు వాగి-భజమానుడు-దివ్యుడు దేవావృధుడు-అంధకుడు-వృష్ణి-మహాభోజుడు-అను ఏడుగురు కుమారులు కల్గిరి. వారిలో నలుగురి వంశములు విస్తరిల్లినవి. సృంజయుడను రాజునకు ఇద్దరు కుమార్తెలుండిరి. వారిద్దరును భజమానునకు భార్యలైరి. వారికి అనేకులు కుమారులు కలిగిరి. ఆ అక్కా-చెల్లెండ్రలో 'బాహ్యక' అను ఆమెకు జన్మించిన కుమారుల వంశమువారిని బాహ్యకులందురు. బాహ్యక కుమారులలో ముఖ్యులు నిమి-కృమిలుడు-వృష్ణి-అనువారు. దేవావృధుడను రాజు బంధుమిత్త్రుల కానందము కలిగించువాడు. అతనికి సంతతి కలుగకుండెను. సర్వగుణోపేతుడగు కుమారునిగోరి అతడుత్తమ తపస్సాచరించెను. అతడు ఆద్యమగు మంత్ర (ప్రణవ)మును అనుసంధానము చేయుచు పర్ణాశా నదీజలమును స్పృశించెను. (నదీ దేవతను అనుసంధానము చేయుచు జపించెను.) ఇట్లు నిరంతరమును ఉపస్పర్శనము చేయుచుండుటచేతను ఆరాజు శుభగుణములు కలవాడగుటచేతను ఆ నదీదేవత ప్రసన్నురాలై అతనికి ప్రియమును సమకూర్చగోరెను. ఆ దేవావృధుడును తన వలన అట్టి ఉత్తమ పుత్త్రుని కనగల స్త్రీ యెవ్వరును లభించుట లేదే యని చింతిల్లుచుండుటచే అది ఎరిగి పర్ణాశా నదీ దేవత తానే అతని వలన సంతానవతి కాగోరెను. ఆమె సుందరియగు కన్యగాఅయి రాజునకు తనుతాను తెలుపుకొనెను. రాజామెయందు అనురాగము కలవాడయ్యెను. ఆ దంపతులను సర్వగుణ సంపన్నుడగు బభ్రుడను కుమారుడు కలిగెను.

మహాత్ములగు ఈ దేవావృధ బభ్రులనెడి తండ్రి కొడుకులగూర్చి పురాణములయందు అనువంశ గీతము ఇట్లు వినబడుచున్నది: 'దూరమునుండి వినుచున్నట్లే సమీపమునుండి చూచుచున్నాము. ఏమనిన-బభ్రువు మనుష్యులలో శ్రేష్ఠుడు. దేవావృధుడు దేవతలతో సమానుడు ఈ మహాత్ములుపదేశించిన యోగము ననుష్ఠించి పదునాలుగువేల అరువదియైదుమంది మోక్షము పొందిరి.' బభ్రుడు యజ్ఞములు దానములు చేసినవాడు. వీరుడు-తత్త్వజ్ఞుడు-దృఢవ్రతుడు-రూపవంతుడు-మహాతేజశ్శాలి. శాస్త్రజ్ఞానము-వీరత్వము కలవాడు. అతనికి సురనాథుని కుమార్తెయందు కుకురుడు భజమానుడు అగ్ని కంబళబర్హిషుడు అను నలుగురు కుమారులు కలిగిరి. కుకురునకు వృష్ణి-అతనికి ధృతి-అతనికి కపోతరోముడు. అతనికి తైత్తిరి-అతని దౌహిత్రుడే ఇంద్రునికి మిత్రుడు విద్వాంసుడునగు నలుడు. నందనోద్యానమునందలి దుందుభి అతని పేరుతోనే 'నలము' అను పేర ప్రసిద్ధమయియున్నది. తైత్తిరి చేసిన యజ్ఞఫలముగా అభిజాతుడు అతని కొడుకయ్యెను. అభిజాతుడు పుత్త్రార్థమై అశ్వమేధము చేసెను. ఆ యజ్ఞపు అతిరాత్ర దీక్షయందు సభ్యాగ్నిహోతృని నుండి విద్వాంసుడు కర్మజ్ఞుడు యజ్వయగు పునర్వసుడు జన్మించెను. అతనికి ఆహుకుడు ఆహుకి అను కవలు పుట్టిరి. వారిద్దరును బుద్ధిమంతులలోకెల్ల గొప్పవారు. ఆహుకుని గూర్చి వైదిక పురాణములందు పెద్దలు ఈ శ్లోకములు చెప్పుదురు. "అమ్ములపొదులు ధనువులు మొదలైన పరికరములు ధ్వజములు కవచములు మొదలగు సాధనములతో నిండినరథములు-ఘంటలు మొదలగువాని మనోహర ధ్వనులతో కూడినవి-ఆహుకునకు పదివేలు గలవు. ఆహుకుని చేత

పోషితులగు ఆయా విద్యావంతులు శిల్పులు మొదలగువారిలో అసత్యవాది అతేజస్కుడు యజ్వ కానివాడు వేలకొలది ధనమును ఇతరులకు దానము చేయనివాడు అశుచి అవిద్వాంసుడు ఎవడును భోజ జనపదములందుండెడివాడు కాడు." ఈ ఆహుకుడు తన సోదరియగు ఆహుకిని అవంతి దేశరాజునకు ఇచ్చి పెండ్లి చేసెను. ఆహుకునకు కాశ్యుని కూతువలన దేవకుమారులను పోలిన దేవకుడు ఉగ్రసేనుడు అను కుమారులు కలిగిరి. వీరిలో దేవకునకు దేవులతో సమానులగు వీరలగు కుమారులు దేవవాన్ ఉపదేవుడు సుదేవుడు దేవరక్షితుడు అను వారలును దేవకి శ్రుతదేవి యశోద యశోధర శ్రీదేవి సత్యదేవి సుతాపి అను ఏడుగురు కుమార్తెలును కలిగిరి. అతడు ఈ కుమార్తెలను వసుదేవునకిచ్చి పెండ్లి చేసెను. ఉగ్రసేనునకు తొమ్మిదిమంది కుమారులు. వారు-కంసుడు-న్యగ్రోధుడు - సునాముడు కంకుడు - శంకుడు. సుతంతు-రాష్ట్రపాలుడు-శుద్ధముష్టి-సముష్టిదుడు-అనువారు. ఐదుగురు కుమార్తెలు: కంస-కంసవతి-సుతంతు-రాష్ట్రపాలి కంకా-అనువారు. ఇది కుకురు వంశమునకు చెందిన ఉగ్రసేనుడును అతని సంతతియును.

భజమానునకు విదూరథుడు-అతనికి రాజ్యాధిదేవుడు-అతనికి దేవసమానులు నియమవ్రతప్రధానులు అగు శోణాశ్వశ్వేతవాహనులనువారు కలిగిరి. శోణాశ్వునకు శూరులు రణ విశారదులునగు శమి-గదశర్మ నిక్పతుడు శత్రజిత్ శత్రుజిత్ అను ఐదుగురు కుమారులు. శమికి కుమారుడు ప్రతిక్షత్త్రుడు-అతనికి పరిక్షత్త్రుడు-అతనికి భోజుడు-అతనికి హృదికుడు కలిగిరి. హృదికునకు భీమ పరాక్రములగు పదిమంది కుమారులు కలిగిరి. వారిలో కృతవర్మ పెద్దవాడు శతధన్వుడు నడిమివాడు. మిగిలినవారు-దేవార్హుడు-నాభుడు-భీషణుడు-మహాబలుడు-అజాతుడు-వనజాతుడు-కనీయకుడు-కరంభకుడు అనువారు. దేవార్హునకు కంబళ బర్హిషుడు-అతనికి అసమంజుడు-అతనికి తమోజుడు అతనికి సుదంష్ట్రుడు సునాభుడు కృష్ణుడు అను ముగ్గురు కుమారులును కలిగిరి. ఇది అంధకవంశ క్రమము. దీనిని నిత్యము కీర్తించుచుండువాడు వంశవృద్ధి కలిగి విస్తరిల్లును.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున చంద్రవంశానువర్ణనమున సహస్రజిత్ క్రోష్టు వంశ కథనమను నలువది నాలుగవ అధ్యాయము.

## పంచచత్వారింశోఽధ్యాయః.

## వృష్ణివంశ కథనము.

సూతః: గాన్ధారీ చైవ మాద్రీచ వృష్ణిభార్యే బభూవతుః । గాన్ధారీ జనయామాస సుమిత్రం నన్దవర్ధనమ్. 1
మాద్రీ యుధాయుతం పుత్త్రం తతో వై దేవమీఢుషమ్ । అనమిత్త్రం శిబిం చైవ పఞ్చాత్ర కృతలక్షణాః.
అనమిత్రసుతో నిమ్నో నిమ్నస్యాపితు ద్వౌ సుతౌ । ప్రసేనశ్చ మహావీర్య శ్శక్తిసేనశ్చ తౌ వుభౌ. 3

స్యమన్తకోపాఖ్యానమ్.

స్యమన్తకం ప్రసేనస్య మణిరత్న మనుత్తమమ్ । పృథివ్యాం సర్వరత్నానాం రాజా చాసౌ వభూ న్మణిః. 4
హృది కృత్వా తు బహుశో మణిం త మభియాచితం । గోవిన్దో న చ తం లేభే శక్తోపి న జహార తమ్. 5
కదాచి న్మృగయాం యాతః ప్రసేన స్తేన భూషితః । యదా శబ్దం స శుశ్రావ బిలే సత్త్వేన పూరితే. 6
తతః ప్రవిశ్య స బిలం ప్రసేనో ఋక్ష మైక్షత । ప్రసేనం చ తదా ఋక్షః ఋక్షం చాపి ప్రసేనజిత్. 7
హత్వా ఋక్షః ప్రసేనం తు తత స్తం మణిమాదదౌ । అదృష్టస్తు హత స్తేన హ్యన్త ర్బిల మగా త్తతః. 8
ప్రసేనం తు హతం జ్ఞాత్వా గోవిన్దః పరిశఙ్కితః । గోవిన్దేన హతో వ్యక్తం ప్రసేనో మణికారణాత్. 9
గోవిన్దస్తు గతోఽరణ్యం మణిరత్నేన భూషితమ్ । తం దృష్ట్వా సజ్జిత స్తేన గోవిన్దః ప్రత్యువాచహ. 10
హన్మి చైనం దురాచారం శత్రుభూతం హి వృష్ణిషు । అథ దీర్ఘేణ కాలేన మృగయానిర్గతః ప్రభుః. 11
యదృచ్ఛయాచ గోవిన్దో బిలస్యాభ్యాశ మాగతః । తం దృష్ట్వా సుమహాశబ్దం స చక్రే ఋక్షరా డ్బలీ. 12

శబ్దం శ్రుత్వా తు గోవిన్దః ఖడ్గపాణిః ప్రవిశ్య చ । అపశ్య జ్జామ్బవన్తం తు ఋక్షరాజం మహాబలమ్. 13
తత స్తూర్ణం హృషీకేశో బిభ్ర ద్గాత్రం మహాబలమ్ । జామ్బవన్తం తు జగ్రాహ క్రోధసంర క్తలోచనః. 14
దృష్ట్వా చైనం తదా ఋక్షః కర్మభి ర్వైష్ణవైః ప్రభుమ్ । తత స్తుష్టస్తు భగవాన్వరేణైన మరోచయత్. 15
చక్రప్రహారేణ విభో త్వత్తోహం మరణం వృణే ।
కన్యా ప్రౌఢా మమ సుతా భర్తారం త్వా మవాప్నుయాత్. 16
యోఽయం మణిః ప్రసేనం తు హత్వా ప్రాప్తో మయా విభో ।
తత స్స జామ్బవ న్తం మణిం ప్రాదాచ్చ విష్ణవే. 17
తతస్తు జామ్బవన్తం తు హత్వా చక్రేణ స ప్రభుః । కృతకర్మా మహాబాహు స్సకన్యాం మణి మాహరత్.

## నలువది ఐదవ అధ్యాయము

## స్యమంతకోపాఖ్యానము - వృష్ణివంశకథనము.

సూతుడు ఋషులకు ఇంకను ఇట్లు చెప్పెను: వృష్ణికి గాంధారి మాద్రి అను ఇద్దరు భార్యలు. అతనికి గాంధారి యందు సుమిత్రుడు మాద్రియందు యుధాజితుడు దేవమీఢుడు అనమిత్రుడు శిబి అను ఐదుమంది కుమారులు కలిగిరి. అనమిత్రునకు నిమ్నుడు అతనికి ప్రసేనుడు శక్తిసేనుడు అను ఇద్దరు కుమారులు కలిగిరి. వీరిలో ప్రసేనుడు రత్నరాజమగు స్యమంతకమణిని సంపాదించెను. అది అతడు హృదయమున ధరించుట చూచి శ్రీకృష్ణుడడిగినను అతడది అతనికీయ లేదు. శక్తుడైయుండియు కృష్ణుడు దానిని బలమున హరించలేదు. ఒకమారు ప్రసేనుడు దానిని ధరించి వేటకై పోయి ఒక గుహలో జంతువేదియో చేసిన శబ్దము విని లోనికిపోగా అచటనతని కొక ఎలుగుబంటి కనబడెను. వారొకరినొకరు చూచుకొనిరి. ఋక్షము ప్రసేనుని చంపి మణిని హరించెను. మరణించినందున ప్రసేనుడు గుహలోనికి పోయినవాడు తిరిగిరాలేదు. మణికై గోవిందుడే ప్రసేనుని చంపియుండునని శక్తిసేనాదులు శంకించిరి. నా సోదరుడు మణిని ధరించి అడవికి పోవుట చూచి కృష్ణుడును అటకు వెళ్ళి ప్రసేనుని చంపెను. అని శక్తిసేనుడనెను. తాను చంపలేదని కృష్ణుడు మారుపలికెను. కాని వృష్ణివంశపువారికి శత్రువుగానున్న ఇతనిని చంపుదునని శక్తిసేనుడనెను. కొంత కాలమునకు తరువాత యాదృచ్ఛికముగా శ్రీకృష్ణుడు వేటకై పోవుటయు ఋక్షముండెడి బిలముకడకు చేరుటయు జరిగెను. అతనిని చూచి ఋక్షరాజు మహాశబ్దము చేసెను. అదివిని శ్రీకృష్ణుడు ఖడ్గపాణియై గుహలోనికి పోగా అతనికి జాంబవంతుడు కనబడెను. కృష్ణుడు క్రోధముతో కండ్లెర్రచేసి మహాబల నంపన్న శరీరుడగు జాంబవంతుని పట్టుకొనెను. అతని పనులనుబట్టి జాంబవంతుడు కృష్ణుని విష్ణునిగా గుర్తించెను. అందులకు నంతసించి కృష్ణుడు వరము కోరుకొనుమన నీచేతిలో చక్రప్రహారముతో నాకు మరణము కావలయునని జాంబవంతుడు కృష్ణుని వరమడిగెను. యుక్తవయస్సు వచ్చిన నాకుమార్తెను నీవు భార్యగా గ్రహించుము. ప్రసేనుని చంపి నేను గ్రహించిన ఈ మణిని కూడ తీసికొనుము. అని అతడు జాంబవతిని మణిని శ్రీకృష్ణునకర్పించెను. తరువాత ఆ ప్రభువు చక్రముతో జాంబవంతుని సంహరించి జాంబవతిని మణిని గ్రహించెను.

దదౌ సత్రాజితాయైనం సర్వసాత్వతసంసది । తేన మిథ్యాప్రవాదేన విముక్త స్స తథా విభుః. 19
తతస్తు యాదవా స్సర్వే వాసుదేవం తదాఽబ్రువన్ । అస్మాకం మనసి త్వాసీ త్ప్రసేనస్తు త్వయా హతః.
కేకయోఽసౌ దదౌ భార్యా దశ సత్రాజిత స్సుతాః । సముత్పన్నా స్సుతాస్తాసు సర్వలోకేషు విశ్రుతాః. 21
ఖ్యాతిమంతో మహాసత్త్వా భజ్గకారస్తు పూర్వజః । అథ తు వ్రతవతీ తస్మా ద్భజ్గకారాత్తు పూర్వజాత్. 22
సుషువే సా కుమారీస్తు తిస్రః కమలలోచనాః । సత్యభామా వరా స్త్రీణాం వ్రతినీవ దృఢవ్రతా. 23
తథా పద్మవతీ చైప తాశ్చ కృష్ణాయ తాం దదౌ । అనమిత్రా చ్ఛిని ర్జజ్ఞే కనిష్ఠా ద్వృష్ణినన్దనాత్. 24

సత్యకాం స్తస్య పుత్త్రిస్తు సాత్యకి స్తస్య చాత్మజః । సత్యవా న్యుయుధానశ్చ శినేర్నప్తా ప్రతాపవాన్.25
అసఙ్గో యుయుధానస్య ధుని స్తస్యాత్మజోఽభవత్ । ధునే రనత్వరః పుత్త్రి ఇతి శైన్యాః ప్రకీర్తితాః. 26
అనమిత్రాన్వయో హ్యేష వ్యాఖ్యాతో వృష్ణివంశజః । అనమిత్రస్య సంజజ్ఞే పృథ్వ్యాం వీరో యుధాజితః.27
అనౌ తు తనయౌ వీరౌ ఋషభః క్షత్త్రి ఏవ చ । ఋషభః కాశిరాజస్య సుతాం భార్యా మవిన్దత. 28
జయ స్తస్య జయన్త్యాం తు పుత్త్రి స్సమభవం స్తతః । సదాయజ్వాఽతివీరశ్చ శ్రుతవా నతిథిప్రియః. 29
అక్రూరం సుషువే తస్మా త్సదాయజ్వాఽతిదక్షిణః ।
రత్నాం కన్యాం చ శైబ్యస్య అక్రూర స్తా మవాప్తవాన్. 30

తరువాత శ్రీకృష్ణుడు స్యమంతకమణిని శక్తిసేనునకు (సత్రాజితునకు) సాత్వతుల సభయందు సమర్పించెను. ఇట్లు శ్రీకృష్ణుడు మిథ్యా ప్రవాదమునుండి ముక్తుడయ్యెను. ఇంతవరకును నీవే ప్రసేనుని చంపితివని మేము అనుకొంటిమని యాదవులందరును కృష్ణునితో ననిరి.

కేకయ రాజు తన పదిమంది కుమార్తెలను సత్రాజిత్తునకు ఇచ్చి పెండ్లి చేసెను. వారికి సర్వలోక ప్రసిద్ధులు మహా సత్త్వ సంపన్నులు నగు కుమారులు కలిగిరి. వారిలో భంగకారుడు పెద్దవాడు. అతనికి వ్రతవతి (వ్రతవతి) అను భార్యయందు సత్యభామ-వ్రతిని-పద్మవతి అను ముగ్గురు కుమార్తెలు కలిగిరి. సత్రాజిత్తు తన ఈ ముగ్గురు కన్యలను శ్రీకృష్ణునికిచ్చి పెండ్లిచేసెను.

వృష్ణి కుమారులలో కనిష్ఠుడగు అనమిత్రునకు శినియను కుమారుడు కలిగెను. అతని కుమారుడు సత్యవంతుడు-అతని కుమారుడు సాత్యకి. అతని కుమారుడు యుయుధానుడు. అతని కుమారుడు అసంగుడు. అతని కుమారుడు ధుని. అతని కుమారుడు అనత్వరుడు. ఇది శిని వంశక్రమము. వృష్ణి కుమారుడగు అనమిత్రుని వంశమునిట్లు వివరించుటయైనది. ఈ అనమిత్రునకే యుధాజితుడు ఋషభుడు క్షత్త్రిడు జయంతుడు మొదలగు కుమారులుండిరి. కాశి రాజపుత్త్రి ఋషభుని భార్య యయ్యెను. జయంతునకు జయంతియందు సదాయజ్వా-అతివీరుడు-శ్రుతవాన్-అతిథి ప్రియుడు అను కుమారులు కలిగిరి. అతిదక్షిణుడగు సదాయజ్వకు అక్రూరుడు కలిగెను. శైబ్యుని కుమార్తె రత్న అను నామె అక్రూరుని భార్య.

పుత్త్రా నుత్పాదయ త్తస్యా మేకాదశ మహాబలాన్ । ఉపలమ్భం సదాలమ్భ ముత్కలం చార్యమేవచ. 31
సితేతరం సదాపక్షం శత్రుఘ్నం చారుమేవచ । సుధర్మం ధర్మధృగ్ధర్మా వథ మౌనిం తథైవచ. 32
సర్వేచ ప్రతిహోతారో రత్నాయాం జజ్ఞిరే సుతాః. 33
అక్రూరా దుగ్రసేనాయాం సుతౌ ద్వౌ కులనన్దనౌ । దేవవా నుపదేవస్తు జజ్ఞాతే దేవసమ్మతౌ. 34
అశ్విన్యాం చ తతః పుత్త్రాః పృథు ర్విపృథు రేవచ । అశ్వత్థామా సుబాహుశ్చ సుపార్శ్వశ్చ గవేషణః.35
ధృష్ణు ర్నేమిః సువర్ణశ్చ ధర్మో ధర్మాతిరేవచ । అభూమి ర్బహుభూమిశ్చ శర్మిష్ఠాశ్రవణ స్తథా. 36
ఇమాం మిథ్యాభిశప్తిం యాం వేద కృష్ణా దపోహితామ్ । న స మిథ్యాభిశాపేన అభిశాపో స్తి కేనచిత్. 37

ఇతి శ్రీమత్స్యమహాపురాణే చన్ద్రవంశానువర్ణనే వృష్ణివంశకథనం నామ
పఞ్చచత్వారింశోఽధ్యాయః.

ఆమెయందు దతనికి మహాబలులగు పదునొకండుమంది కుమారులు కలిగిరి. వారు-ఉపలంభుడు-సదాలంభుడు-ఉత్కలుడు-ఆర్యుడు-సితేతరుడు-సదాపక్షుడు-శత్రుఘ్నుడు-చారుడు-ధర్మధృక్-ధర్ముడు-మౌని-అనువారు. అక్రూరునకు ఉగ్రసేనయందు దేవవాన్-ఉపదేవుడు అనువారును అశ్వినియందు పృథు-విపృథు-అశ్వత్థామ-సుబాహు-సుపార్శ్వ-

గవేషణ ధృష్ణ-నేమి-సువర్ణ-ధర్మ-ధర్మాతి-(శర్యాతి) అభూమి-బహుభూమి-శర్మిష్ఠ ఆశ్రవణ అను కుమారులును కలిగిరి.

శ్రీకృష్ణుడు తనకు కలిగిన మిథ్యాపవాదమును పోగొట్టుకొనిన ఈకథ వినినవానికి ఎవరివలనను మిథ్యాభిశాపములు సంభవింపవు.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున చంద్రవంశాను వర్ణనమున స్యమంతకోపాఖ్యానము-
వృష్ణివంశానుకథనమునను నలువదియైదవ అధ్యాయము.

## షట్చత్వారింశోఽధ్యాయః.

## చన్ద్రవంశాన్తర్గతశూరవంశః.

సూతః : ఐక్ష్వాకీ సుషువే శూరం ఖ్యాత మద్భుతమీఢుషమ్ ।
పౌరిష్యాం జజ్ఞిరే శూరా ద్భోజాయాం పురుషా దశ. 1
వసుదేవో మహాబాహుః పూర్వ మానకదున్దుభిః । దేవభాగ స్తతో జజ్ఞే తతో దేవశ్రవాః పునః. 2
అనాధృష్టి శ్శినిశ్చైవ నన్దశ్చైవ సస్సృంజయః । శ్యామసామీకసంయూపాః పంచ చాస్య వరాంగనాః. 3
శ్రుతకీర్తిః పృథాచైవ శ్రుతదేవీ శ్రుతశ్రవా । రాజాధి దేవీచ తథా పఞ్చైతా వీరమాతరః. 4
కృతస్యచ శ్రుతాదేవీ సుగ్రహం సుషువే సుతమ్ । కైకేయా చ్ఛ్రుతకీర్తేస్తు జజ్ఞే సోనువ్రతోనృపః. 5
శ్రుతశ్రవాపి చైద్యాంతు సునీథం సమపద్యత । బర్హిషా ద్ధర్మశారీర స్సమ్బభూ వారిమర్దనః. 6
అథ సఖ్యేపి వృద్ధస్య కున్తిభోజే పృథాం దదౌ । ఏవం కున్తీ సమాఖ్యాతా వసుదేవస్య సా పృథా. 7
వసుదేవేన సా దత్తా పాణ్డో ర్భార్యా హ్యనిన్దితా । పాణ్డోరర్థేన సా జజ్ఞే దేవపుత్రా న్మహారథాన్. 8
ధర్మా ద్యుధిష్ఠిరో జజ్ఞే వాయో ర్జజ్ఞే వృకోదరః । ఇన్ద్రా ద్ధనంజయశ్చైవ శక్రతుల్యపరాక్రమః. 9
మాద్రవత్యాం చ జనితా వశ్విభ్యా మితి శుశ్రుమః । నకుల స్సహదేవశ్చ రూపశీలగుణాన్వితౌ. 10
రోహిణీ పౌరవీ చైవ ఖ్యాత మానకదున్దుభేః । లేభే జ్యేష్ఠం సుతం రామం సారణం చ రణప్రియమ్. 11
దుర్గమం దమనం శుభ్రం పిణ్డకంచ మహాహనుమ్ । చిత్రాక్షేత్రే కుమార్యౌతు రోహిణ్యాం జజ్ఞిరే తథా. 12
దేవక్యాం జజ్ఞిరే శౌరే స్సుషేణః కీర్తిమానపి । ఉదాసీ భద్రసేనశ్చ ఋషిదాస స్తథైవచ. 13
షష్ఠో భద్రవిదేహాచ కంస స్సర్వా నపాతయత్ । ప్రథమా యా హ్యమావాస్యా వార్షికీతు భవిష్యతి. 14
తస్యాం జజ్ఞే మహాబాహుః పూర్వం కృష్ణః ప్రజాపతిః । అనుజా త్వభవత్కృష్ణా సుభద్రా కలభాషిణీ. 15

## నలువది ఆరవ అధ్యాయము

## యదువంశమున శూరవంశ వృత్తాంతము

సూతుడు ఋషులకు ఇంకను ఇట్లు చెప్పెను: వృష్ణికుమారులలో నొకడు * దేవమీఢ్వాన్ (దేవమీఢుష్). అతనికి ఐక్ష్వాకి (ఇక్ష్వాకు రాజపుత్రి) యందు శూరుడను కుమారుడు కలిగెను. పురుషుడను రాజు కూతురగు భోజయందు శూరునకు పదిమంది కుమారులు కలిగిరి. వారు వసుదేవుడు దేవభాగుడు దేవశ్రవసుడు అనాధృష్టి శిని నందుడు సృంజయుడు శ్యాముడు సామీకుడు సంయూపుడు అనువారు. ఐదుమంది కుమార్తెలు-శ్రుతకీర్తి-పృథ - శ్రుతదేవి-శ్రుతశ్రవ-రాజాధిదేవి అనువారును శూరునకు కలిగిరి. వీరందరును వీరమాతలు. వీరిలో శ్రుతదేవికి కృతుడను భర్తవలన సుగ్రహుడును శ్రుతకీర్తికి కైకేయుని వలన సునీథుడను కుమారుడును రాజాధిదేవికి బర్హిష్మని వలన ధర్మాత్ముడగు అరిమర్దనుడును

* ఇచట మూలములో దేవమీఢుషః అనుటకు మారుగా 'అద్భుత మీఢుషః' అని ఛందస్సున కనుకూలతకై ఋషులు వ్రాసిరి. కాని ముద్రిత ప్రతులలో ఇది శూర శబ్దమునకు విశేషణముగా అద్భుత మీఢుషమ్ అని యున్నది.

కలిగిరి. వృద్ధుడగు శూరుడు తన మిత్రుడగు కుంతిభోజునకు పృథను కూతుగా నిచ్చెను. ఇందుచే వసుదేవుని చెల్లెలగు పృథకు కుంతి అను పేరు వచ్చెను. తండ్రి యనంతరము వసుదేవుడు పృథను (కుంతిని) పాండున కిచ్చి పెండ్లి చేసెను. పాండునకు ఆమెయందు తరువాత ధర్మదేవుని వలన యుధిష్ఠిరుడు వాయువు వలన భీముడు ఇంద్రుని వలన అర్జునుడు రెండవ భార్య అగుమాద్రికి అశ్వినులవలన నకుల సహదేవులు కుమారులయిరి.

పూరువంశ సంజాతయగు రోహిణియందు వసుదేవునకు రాముడు సారణుడు దుర్దముడు దమనుడు శుభ్రుడు పిండకుడు మహాహనుడు అను కుమారులును చిత్ర-క్షేత్ర అను కుమార్తెలును కలిగిరి. దేవకియందు సుషేణుడు కీర్తిమాన్ ఉదాసి భద్రసేనుడు ఋషిదాసుడు భద్రుడు విదేహుడు అను కుమారులు కలిగిరి. వీరి నందరను కంసుడు చంపెను. కృష్ణుడును అతని చెల్లెలు సుభద్రయు దేవకికి కలిగినవారే. శ్రీకృష్ణుడు వర్షాకాలమునందలి మొదటి అమావాస్యనాడు (శ్రావణమాసమున) పుట్టెను.

దేవక్యా స్సుమహాతేజా జజ్ఞే శూరో మహాయశాః । సహదేవస్తు తామ్రాయాం జజ్ఞే శౌరికులోద్వహః. 16
ఉపాసంగధరం లేభే తనయం దేవరక్షితా । ఏకాం కన్యాంచ సుభగం కంస స్తా నభ్యఘాతయత్. 17
విజయం రోచమానంచ వర్ధమానంచ దేవలమ్ । ఏతే సర్వే మహాత్మాన ఉపదేవ్యాః ప్రజజ్ఞిరే. 18
అవగాహో మహాత్మాచ వృకదేవ్యాం వ్యజాయత । వృకదేవ్యా స్స్వయం జజ్ఞే నన్దకో నామ నామతః. 19
నవ్తకం దేవకీపుత్రిం మదనా సుషువే సుతమ్ । గవేషణం మహాభాగం సఙ్గ్రామే ష్వపరాజితమ్. 20
శ్రద్ధాదేవ్యా విహారేతు వనే విచరతా పురా । వైశ్యాయా మదదా చ్ఛౌరిః పుత్రిం కౌశిక మగ్రజమ్. 21
సుతౌ ద్వావథ రాజానౌ శౌరే రాస్తాం వరిగ్రహే । ముణ్డశ్చ కపిలశ్చైవ సుదేవోఽనగ్గజో బలీ. 22
జరోనామ నిషాదోఽభూ త్ప్రథమ స్స ధనుర్ధరః । సౌభద్రశ్చ భవశ్చైవ మహాసత్త్వౌ బభూవతుః. 23
దేవభాగాసుతశ్చాపి నామ్నాఽసౌ వుద్ధవ స్స్మృతః । వణ్డితం ప్రథమం ప్రాహుర్ దేవశ్రవస ముత్తమమ్. 24
ఐక్ష్వాకీ పుత్రి మలభ దనాధృష్టే ర్యశస్వినీ । నిర్ధూతశత్రు శ్శత్రుఘ్న శ్శ్రాద్ధ స్తస్మా దజాయత. 25
* గణ్డూషాయానపత్యాయ కృష్ణ స్తుష్ట స్సుతం దదౌ । సుచంద్రంతు మహాభాగం వీర్యవంతం మహాబలమ్ ।
జామ్బవత్యా స్సుతా వేతౌ ద్వౌచ సత్కృతలక్షణౌ. 26
చారుదేష్ణశ్చ సామ్బశ్చ వీర్యవన్తౌ మహాబలౌ । తన్త్రిపాలశ్చ తన్త్రిశ్చ నన్దనస్య సుతావుభౌ. 27
శమీకపుత్రా శ్చత్వారో విక్రాన్తా స్త్రిమహాబలాః । విరజశ్చ ధనుశ్చైవ శ్యామశ్చ సృఞ్జయ స్తథా. 28
అనపత్యోఽభవ చ్ఛ్యామ స్సృఞ్జయస్తు వనం యయౌ । జుగుప్సమానో భోజత్వం రాజర్షిత్వ మవాప్తవాన్. 29
కృష్ణస్య జన్మాభ్యుదయం యః కీర్తయతి నిత్యశః । శృణోతి మానవో నిత్యం సర్వపాపైః ప్రముచ్యతే. 30

ఇతి శ్రీమత్స్యమహాపురాణే చన్ద్రివంశానువర్ణనే శూరవంశాదికథనం నామ
షట్చత్వారింశోఽధ్యాయః.

ఇంకను వసుదేవునకు తామ్రయందు సహదేవుడు దేవరక్షితయందు ఉపాసంగధరుడును ఒక కుమార్తెయు కలిగిరి. ఈ కన్యను కంసుడు చంపెను. ఉపదేవియందు విజయుడు రోచమానుడు వర్ధమానుడు దేవలుడు ఉపదేవియందు అవగాహుడు నందకుడు వనవిహారమున తాను కూడిన వైశ్య జాతీయయగు శ్రద్ధాదేవియందు కౌశికుడు గవేషణుడు అనువాడను మరియొక భార్య (పేరు ఈయలేదు) యందు ముండుడు కపిలుడు అనువారును జరుడు సౌభద్రుడు భవుడు అను నిషాదులును దేవభాగయందు దేవశ్రవసుడని ప్రసిద్ధుడైన మహా పండితుడగు ఉద్ధవుడును కలిగిరి. (యశస్విని

యగు ఐక్ష్వాకి అను నామెను అనాధృష్టి అను వానివలన శత్రుఘ్నుడు కలిగెను. అతని కుమారుడు శ్రాద్ధుడు. (ఇది ఇచ్చట అప్రస్తుతము.)

శ్రీకృష్ణుడు అనపత్యుడగు గండూషుడను వానికి తన కుమారుడును బలవీర్య సంపన్నుడునగు సుచంద్రుడను వాని నిచ్చెను. శ్రీకృష్ణునకు జాంబవతియందు చారుదేష్ణుడు సాంబుడు అను కుమారులు కలిగిరి. నందనుడను వానికి తంత్రిపాలుడు తంత్రి అనువారు కుమారులు.

శమీకునకు మహాబలవిక్రమ సంపన్నులగు విరజుడు ధనువు శ్యాముడు సృంజయుడు అను నలుగురు కుమారులు కలిగిరి. వీరిలో శ్యామునకు సంతతి కలుగలేదు. సృంజయుడు వానప్రస్థు డయ్యెను. అతడు భోజుడుగా - లోక సుఖానుభవమున-ఉండుట కనహ్యపడి ఇట్లు రాజర్షి యయ్యెను.

శ్రీకృష్ణ భగవానుని జన్మాభ్యుదయమును అనుదినము కీర్తించువాడును వినువాడును సర్వపాపములనుండి విముక్తుడగును.

ఇది శ్రీమత్స్య మహాపురాణమున చంద్రవంశాను వర్ణనమున శూరవంశాను వర్ణనమును
నలువది ఆరవ అధ్యాయము.

## సప్తచత్వారింశోఽధ్యాయః.
## శ్రీకృష్ణవంశానువర్ణనమ్.

సూతః: అథ దేవో మహాదేవః పురా కృష్ణః ప్రజాపతిః । విహారార్థం స దేవేశో మానుషే ష్విహ జాయతే. 1
దేవక్యాం వసుదేవేన తపసా పుష్కరేక్షణః । చతుర్బాహుస్తు సఞ్జాతో దివ్యరూపోజ్జ్వల శ్రియా. 2
శ్రీవత్సలక్షణం దేవం దృష్ట్వా దివ్యైశ్చ లక్షణైః । ఉవాచ వసుదేవ స్తం రూపం సంహర వై ప్రభో. 3
భీతోఽహం దేవ కంసస్య తత స్త్వేత ద్బ్రవీమి తే । మమ పుత్రా హతా స్తేన జ్యేష్ఠాస్తే భీమవిక్రమ. 4
వసుదేవవచ శ్శ్రుత్వా రూపం సంహర దచ్యుతః । అనుజ్ఞాప్య తత శ్శౌరిం నన్దగోపగృహేఽనయత్. 5
దత్త్వైనం నన్దగోపస్య రక్ష్యతా మితి చాబ్రవీత్ । అతస్తు సర్వకల్యాణం యాదవానాం భవిష్యతి. 6
అయం తు గర్భే దేవక్యాం జాతః కంసం హనిష్యతి । ఋషయః: క ఏష వసుదేవస్తు దేవకీచ యశస్వినీ. 7
నన్దగోపశ్చ క స్త్వేష యశోదా చ మహావ్రతా । యో విష్ణుం జనయామాస యం చ తాతే త్యభాషత. 8
యా గర్భం జనయామాస యా చైనం చాభ్యవర్ధయత్ ।
సూతః: పురుషః కశ్యప స్త్వాసీ దదితిః స్త్రీచ యా స్మృతా. 9
బ్రహ్మణః కశ్యపశ్చాంశః పృథివ్యా స్త్వదితి స్తథా । అథ కామా న్మహాబాహు ర్దేవక్యాః స్సమపూరయత్. 10
యే తయా కాంక్షితా నిత్య మజాతస్య మహాత్మనః । సోఽవతీర్ణో మహీం దేవః ప్రవిష్టో మానుషీం తనుమ్.
మోహయ న్సర్వభూతాని యోగాత్మా యోగమాయయా । నష్టే ధర్మే తథా యజ్ఞే విష్ణు ర్వృష్ణికులే ప్రభుః.
కర్తుం ధర్మస్య సంస్థాన మసురాణాం ప్రణాశనమ్ । రుక్మిణీ సత్యభామా చ సత్యా నాగ్నజితీ తథా. 13
సుధామా చ తథా శైబ్యా గాన్ధారీ లక్షణా తథా । మిత్రవిన్దా చ కాళిన్దీ దవా జామ్బవతీ తథా. 14
సుసీమా చ తథా మాద్రీ కౌసల్యా విజయా తథా । ఏవమాదీని దేవీనాం సహస్రాణి తు షోడశ. 15

## నలువది ఏడవ అధ్యాయము.
## నారాయణుడు అవతారములెత్తుటకు హేతువును తెలిపెడు కథ.

సూతుడు ఋషులకు ఇట్లు చెప్పసాగెను: ఇది ఇట్లుండ నిండు. దేవుడును మహాదేవుడును ప్రజాపతియు దేవేశుడు నగు నారాయణుడు విహారార్థమయి ఈ లోకమునందు మానవుల నడుమ కృష్ణుడుగా జన్మించును. అవి మత్స్యమూర్తి

చెప్పినట్లే ఆయన వసుదేవుడు ఆచరించిన తపస్సునకు ఫలముగా దేవకియందు పద్మనేత్రుడు చతుర్భుజుడుగా దివ్యరూపుడుగా కాంతితో ఉజ్జ్వలుడుగా అవతరించెను. శ్రీవత్స లాంఛనము మొదలగు దివ్య లక్షణములు చూచి వసుదేవుడు 'ప్రభూ! నీ రూపము నుపసంహరింపుము. మహావిక్రములగు నా మొదటి కుమారు లందరను కంసుడు చంపెను. కనుక నేను వానికి భయపడుచున్నాను.' అని వసుదేవు డనగా అచ్యుతుడు తన దివ్యరూపము నుపసంహరించెను. తరువాత భగవానుని అనుజ్ఞతో వసుదేవుడు శ్రీకృష్ణుని నందగోపుని గృహమునకు చేర్చి ఇతనిని అతని కిచ్చి ఈ శిశువును కాపాడుమని కోరెను. ఇతని వలన సర్వ యాదవులకును శుభము కలుగును. దేవకీ గర్భ సంజాతుడగు ఈతడు కంసుని చంపును. అనియు వసుదేవుడు నందునితో ననెను.

ఇది విని ఋషులు సూతు నిట్లు ప్రశ్నించిరి: వసుదేవుని కాని నందుని కాని భగవానుడు నాయనా! అని పిలిచెను. దేవకి ఆయనను గర్భమున ధరించి కనెను. యశోద పోషించెను. ఇంత అదృష్టము పొందిన ఈ నలుగురును ఎవరు? అనగా సూతుడు వారి కిట్లు చెప్పెను: ఆది ప్రజాపతి దంపతులు అదితియు కశ్యపుడును మీకు తెలియును గదా! కశ్యపుడు బ్రహ్మాంశము. అదితి పృథివ్యంశము. మహాబాహుడు అగు నారాయణుడు దేవకి కోరికలను పూరించెను. (ఏలయన కశ్యపుడే వసుదేవుడు. అదితియే దేవకి.) ఎన్నడును జననము నెరుంగని ఆ మహాత్ముడును జనన మందెను. ఆ యోగాత్ముడు యోగమాయచే సర్వభూతములను మోహ పెట్టి తను తాను మానవునిగా చూపెను. యజ్ఞములను ధర్మమును నశించగా ఆ ప్రభువు వృష్ణివంశమునం దవతరించి ధర్మసంస్థాపనమును రాక్షస నాశమును జరిపెను. ఆయనకు రుక్మిణి సత్యభామ సత్యా నాగ్నజితి సుధామ శైబ్య గాంధారి లక్షణ మిత్రవింద కాళింది-దవ - జాంబవతి-సుసీమ-మాద్రి-కౌసల్యా-విజయ మొదలగు పదునారువేల మంది భార్య లుండిరి.

రుక్మిణీ జనయామాన పుత్త్రం రణవిశారదమ్ । చారుదేష్ణం మహాశూరం ప్రద్యుమ్నంచ మహాబలమ్. 16
సుచారుం భద్రచారుంచ సుదేష్ణం భద్రమేవచ । పరశు శ్చారుగుప్తశ్చ చారుభద్ర స్సుచారుకః. 17
చారుహాసః కనిష్ఠశ్చ కన్యా చారుమతీ తథా । జజ్ఞిరే సత్యభామాయాం భాను ర్భ్రమరపేక్షణః. 18
రోహితో దీప్తిమాంశ్చైవ తామ్రవక్త్రో జలన్ధరః । చత్వారో జజ్ఞిరే తేషాం స్వసారస్తు యవీయసః. 19
జామ్బవత్యా స్సుతో జజ్ఞే సామ్బ స్సమితిశోభనః । మిత్రవా న్మిత్రవిన్దశ్చ మిత్రవిన్దా వరాఙ్గనా. 20
మిత్రబాహు స్సునీతశ్చ నాగ్నజిత్యాః ప్రజా హి సా । ఏవమాదీని పుత్త్రాణాం సహస్రాణి నిబోధత. 21
అశీతిం చ సహస్రాణి వాసుదేవసుతా స్తథా । లక్ష మేకం తథా ప్రోక్తం పుత్త్రాణాంతు ద్విజోత్తమాః. 22
ఉపసఙ్గస్యతు సుతౌ వజ్ర స్సంక్షిప్త ఏవచ । భూరీన్ద్రసేనో భూరిశ్చ గవేషణసుతా వుభౌ. 23
ప్రద్యుమ్నస్య తు దాయాదో వైదర్భ్యాం బుద్ధిసత్తమః । అనిరుద్ధో రణేఽరుద్ధో యజ్ఞశ్చ మృగకేతనః. 24
కార్ష్ణ్యశ్వతనయా సామ్బా ల్లేభే పుత్త్రాం స్తరస్వినః । సత్యప్రకృతయో దేవాః పఞ్చ వీరాః ప్రకీర్తితాః. 25
తిస్రః కోట్యః ప్రవీరాణాం యాదవానాం మహాత్మనామ్ । షష్టి శ్శతసహస్రాణి వీర్యవన్తో మహాబలాః. 26
దేవాంశా స్సర్వ ఏవేహ ఉత్పన్నాస్తే మహౌజసః । దేవాసురే హతా యేచ అసురా యే మహాబలాః. 27
ఇహోత్పన్నా మనుష్యేషు బాధన్తే సర్వమానవాన్ । తేషా ముత్సాదనార్థాయ ఉత్పన్నో యాదవే కులే. 28
కులానాం శత మేకంచ యాదవానాం మహాత్మనామ్ । సర్వ మేత త్కులం యావ ద్వర్తతే వైష్ణవే కులే.
విష్ణు స్తేషాం ప్రణేతా చ ప్రభుత్వే చ వ్యవస్థితః । నిదేశస్థాయిన స్తస్య కథ్యన్తే సర్వయాదవాః. 30

రుక్మిణికి రణవిశారదులు మహాశూరులు మహాబలులు నగు చారుదేష్ణుడు ప్రద్యుమ్నుడు సుచారుడు భద్రచారుడు సుదేష్ణుడు భద్రుడు పరశుడు చారుగుప్తుడు చారుభద్రులు సుచారుకుడు చారుహాసుడు అను కుమారులును కడగొట్టుగా చారుమతి అనెడి కన్యయు కలిగిరి. సత్యభామయందు భానుడు భ్రమరపీక్షణుడు రోహితుడు దీప్తిమాన్ తామ్రవక్త్రుడు జలం

ధరుడు అను కుమారులును నల్గురు కుమార్తెలును కలిగిరి. జాంబవతికి యుద్ధ నిపుణుడగు సాంబుడును మిత్రవిందకు మిత్రవాన్ - మిత్రవిందుడు-నాగ్నజితికి మిత్రబాహు సునీతులు కుమారులైరి. ఈ మొదలగు కుమారులు వేలకొలదిగ శ్రీకృష్ణునకు కలిగిరి. వీరు మొత్తము ఒక లక్షయు ఎనుబదివేల మంది. వీరిలో ఉపనంగునకు వజ్రుడు సంక్షిప్తుడు. గవేషణునకు భూరీంద్రసేనుడు భూరి అనువారు-ప్రద్యుమ్ననకు వైదర్భియందు బుద్ధిశాలియు రణమునం దెదురులేనివాడు నగు అనిరుద్ధుడు యజ్ఞుడు మృగకేతనుడు అనువారును సాంబునకు కార్శ్యాకృష్ణి కూతువలన బలశాలురు సత్యస్వభావులు వీరులు దేవసదృశులునగు ఐదుగురు కుమారులు కలిగిరి. ఆనాడు యాదవులు మొత్తము మూడుకోట్ల మంది. వీరంద రును దేవాంశరూపులును మహాబలులును వీర్యవంతులును మహాతేజస్సంపన్నులును. పూర్వము దేవాసుర యుద్ధములందు మరణించిన అసురులు మరల మానవులందు జన్మించి ఇతర మానవుల నందరను బాధింపసాగిరి. వారిని నశింపజేయు టకై విష్ణువు యాదవవంశమున పుట్టెను. అతనికితోడుగా నున్న ఈ యాదవులు మహాత్ములు నూటొక్క ప్రధానవంశ ములవారు. ఈ వంశము వైష్ణవ వంశమే. వారికి విష్ణువు నాయకుడై వారిని నడపెను. ఇటు సర్వ యాదవులును శ్రీకృష్ణుని యాజ్ఞయందు నడచిరి.

ఋషయః: సప్తర్షయః కుబేరశ్చ యక్షో మాణిహర స్తథా । శాలాకి ర్నారదశ్చైవ సిద్ధో ధన్వన్తరి స్తథా. 31
ఆదిదేవ స్తథా విష్ణు రేభిర్వై సప్తదైవతైః । కిమర్థం సప్తికా భూత్వా స్మృతా స్సమ్భూతయః కతి. 32
భవిష్యాః కతి చైవాన్యే ప్రాదుర్భావా మహాత్మనః । బ్రహ్మక్షత్త్రేషు శాన్తేషు కిమర్థ మిహ జాయతే. 33
యదర్థ మిహ సమ్భూతో విష్ణు ర్వృష్ణ్యన్ధకోత్తమః ।
పునః పున ర్మనుష్యేషు త న్నః ప్రబ్రూహి పృచ్ఛతామ్. 34
సూతః: న్యస్య దివ్యాం తనుం విష్ణు ర్మానుషే ష్విహ జాయతే ।
యుగే తత్ర వరావృత్తే కాలే ప్రశిథిలే విభుః. 35
దేవాసురవిమర్దేషు జాయతే హరి రీశ్వరః । హిరణ్యకశిపౌ నిత్యం త్రైలోక్యం ప్రా క్ప్రశాసతి. 36
బలినాఽధిష్ఠితే చైవ పురా లోకత్రయే క్రమాత్ । సంఖ్య మాసీ త్పరమకం దేవానా మసురై స్సహ. 37
యుగాఖ్యా దశ సమ్పూర్ణా హ్యాసీ దత్యాకులం జగత్ । నిదేశస్థాయినశ్చాపి తయోర్దేవాసురాస్సమమ్. 38
మృధో బలివిమర్దాయ సమ్ప్రవృద్ధస్తు దారుణః । దేవానా మసురాణాం చ ఘోరక్షయకరో మహాన్. 39
ధర్తుం ధర్మవ్యవస్థానం జాయతే మానుషే ష్విహ । భృగో శ్శాపనిమిత్తంతు దేవాసురకృతే తథా. 40

దేవాసురయుద్ధప్రస్తావః.

ఋషయః : కథం దేవాసురకృతే వ్యాహారం ప్రాప్తవాం స్తతః ।
దేవాసురం యథా వృత్తం తన్నః ప్రబ్రూహి పృచ్ఛతామ్. 41

ఋషులు సూతునిట్లడిగిరి: కొందరు పెద్దలు "సృష్టులు అన్నియు సప్తికారూపమయినవి. అవి సప్తర్షులు కుబేరుడు మణిహరుడను యక్షుడు శాలాకి నారదుడు సిద్ధుడగు ధన్వంతరి-ఆదిదేవుడగు విష్ణువు అను సప్తదేవతలతోనే సమగ్ర మగుచున్నది." అని చెప్పుదురు. ఆ సృష్టులు ఎన్ని విధములు? ఆ మహాత్ముని ప్రాదుర్భావములు జరిగినవెన్ని? జరుగ నున్నవెన్ని? ఆ మహానుభావుడు శాంత స్వభావులగు బ్రహ్మ క్షత్త్రియ జాతులందును-అందునను వృష్ణ్యంధక వంశ శ్రేష్ఠుడై యాదవులందును ఏల జన్మించవలసివచ్చెను? మరల మరల మానవులలో ఆయన ఏల జన్మించవలసివచ్చెను? ఇట్లడుగగా సూతుడు ఋషులకిట్లు చెప్పసాగెను: నిజమే: విష్ణువు తన దివ్యదేహమును విడిచి (మరుగువరచి) ఈలోకమున మానవులందు జన్మించును. హేతువు చెప్పెదను. వినుడు. యుగధర్మము తల్లక్రిందులు కాగా కాల స్వభావము మిగుల శిథిలము కాగా దేవాసుర యుద్ధములు ప్రవర్తిల్లును. అట్టి సమయములందే ఈశ్వరుడగు హరి అవతరించును. ఎట్లన—

పూర్వము హిరణ్యకశిపుడును బలియు నను అసురులు లోకత్రయమును పాలించుచుండ ఆయా కాలములందు పది దివ్య యుగముల కాలము దేవాసురులకు మహా యుద్ధము జరిగెను. జగత్తులన్నియు అత్యాకులములయ్యెను. దేవతలు విష్ణుని నిదేశమునందును అసురులు బలి హిరణ్యకశిపుల నిదేశమునందును నిలిచి యుద్ధమును జరిపిరి. బలిని నశింప జేయుటకై జరిగిన యుద్ధము చాల భయంకరమును దేవతలకును అసురులకును నాశకరమును నయ్యెను. ఆ ప్రసంగమున కలిగిన భృగు శాపము నిమిత్తము కాగా శ్రీ నారాయణుడు మానవులం దవతరించుచుండును.

ఇట్లు చెప్పిన సూత వచనమును విని ఋషులిట్లు ప్రశ్నించిరి: దేవాసురుల యుద్ధము మూలమున విష్ణువు శాపము నేల పొందెను? దేవాసుర యుద్ధ మెట్లు జరిగి ఇట్టి స్థితికి హేతువయ్యెను? మాకు తెలుపుడు.

సూతః : తేషాం దాయనిమిత్తం తై స్సఙ్గ్రామస్తు సుదారుణః ।
వారాహాద్యా దశ ద్వౌచ చణ్డామర్కాన్తరే స్మృతాః. 42
నామతస్తు సమాసేన శృణుతైషాం విపక్షతామ్ । ప్రథమో నారసింహస్తు ద్వితీయశ్చాపి వామనః. 43
తృతీయస్తు వరాహశ్చ చతుర్థోఽమృతమన్థనః । సఙ్గ్రామః పఞ్చమశ్చైవ సఞ్జాత స్తారకామయః. 44
షష్ఠో హ్యాడీవధాఖ్యస్తు సప్తమ స్త్రైపుర స్తథా । అన్ధకారోఽష్టమ స్తేషాం నవమో వృత్రఘాతకః. 45
ధాత్రశ్చ దశమః ప్రోక్తస్తతో హాలాహలః స్మృతః । ప్రథితో ద్వాదశ స్తేషాం ఘోరః కోలాహల స్తథా. 46
హిరణకశిపు ర్దైత్యో నరసింహేన సూదితః । వామనేన బలీ బద్ధ స్త్రైలోక్యాక్రమణే పురా. 47
హిరణ్యాక్షో హతో ద్వంద్వే ప్రతివాదేతు దైవతైః । దంష్ట్రియా తు వరాహేణ సముద్రస్తు ద్విధా కృతః.
ప్రహ్లాదో నిర్జితో యుద్ధే ఇన్ద్రేణామృతమన్థనే । విరోచనస్తు ప్రాహ్లాది ర్నిత్య మిన్ద్రవధోద్యతః. 49
ఇన్ద్రేణైవ చ విక్రమ్య నిర్జిత స్తారకామయే । అశక్య ద్వసుదేవేషు నానసాద విరోచనః. 50
నిహతా దానవా స్సర్వే త్రైపుర్యే త్ర్యమ్బకేణ తు । అసురాశ్చపిశాచాశ్చ దానవాశ్చాన్ధకే వధే. 51
హతా దేవమనుష్యైశ్చ పితృభిశ్చైవ సర్వశః । సంసక్తో దానవై ర్ధాత్రో ఘోరో హాలాహలో మతః. 52
తదా విష్ణుసహాయేన మహేన్ద్రేణ నివర్తితః । తతో ధ్వజో మహేన్ద్రేణ మాయాచ్ఛన్నస్తు యోగవిత్. 53
ధ్వజలక్ష్మ సమావిశ్య విప్రచిత్తి స్సహానుజః । దైత్యాశ్చ దానవాశ్చైవ సంయత్తాః కృష్ణసంయుతాః. 54
జయకోలాహలే సర్వా దేవైః పరివృతా స్తథా । యజ్ఞస్యావభృథే దృష్టౌ శణ్డమర్కౌతుదైవతైః. 55
ఏతే దేవాసురా వృత్తా స్సఙ్గ్రామా ద్వాదశైవ తు । దేవాసురక్షయకరాః ప్రజానాంచ హితాయ వై. 56

అనగా సూతుడిట్లు చెప్పసాగెను: దాయభాగ నిమిత్తమున (త్రైలోక్యపాలనాధికారము ఎవరిదను విషయమున) దేవాసురుల నడుమ ★శండామర్కాంతరము వరకు పన్నెండు మారులు యుద్ధము జరిగినట్లు తెలుపబడియున్నది. ఇవి వరుసగా నారసింహము వామనము వరాహము అమృతమంథనము తారకామయము ఆడీవధము త్రైపురము అంధకారము వృత్రఘాతకము ధాత్రము హాలాహలము కోలాహలము అనునవి. వీనిలో నారసింహమున హిరణ్యకశిపుడు నరసింహునిచే చంపబడెను. వామనమున త్రివిక్రమమూర్తి యగు వామనునిచే బలి బంధింపబడెను. వరాహమున దేవతలతో హిరణ్యాక్షుడు చేసిన యుద్ధమున వరాహమూర్తి వానితో ద్వంద్వ యుద్ధమునాచరించి వానిని చంపెను. సముద్రమును రెండుగా చేసెను. అమృతమంథనమున ఇంద్రుడు యుద్ధమునందు ప్రహ్లాదుని జయించెను. తారకామయమున ప్రహ్లాద కుమారుడు విరోచనుడు నిత్యము నింద్రుని చంపు పూనికతో నుండుటయు ఇంద్రుడు విక్రమించి వానిని జయించుటయు జరిగినది. ఆడీవధమున విరోచనుడు వసువులనెడి దేవతల బాణములకు గురియయ్యెను. త్రైపురమున త్ర్యంబకుని

★ శండామర్కాంతరము అను పదమున కర్థము ఇచట అస్పష్టము. ఈ శండమర్కులు శుక్రుని కుమారులో శిష్యులో అని తోచును.

చేతిలో దానవులు అందరును మరణించిరి. అంధకారమున (అంధక-అర) (అంధకవధ యుద్ధమున) దేవతలును మనుష్యులును పితరులును అసురులును పిశాచులును దానవులను చాలవరకు చంపిరి. ధ్వాత్రమను యుద్ధము దేవదానవులకు జరిగినట్టిది. హాలాహలమనెడి యుద్ధము ఘోరమయినది. దీనియందు విష్ణుని సహాయునిగాగొని ఇంద్రుడు దీనిని ముగియజేసెను. ఈ యుద్ధముననే ఇంద్రుడు యోగవేత్తయు మాయతో మరుగుపడు శక్తి కలవాడునగు ధ్వజాదను వానిని జయించెను. ఇక పండ్రెండవదియగు (జయ) కోలాహల యుద్ధమున విప్రచిత్తి ధ్వజుని రూపము ధరించి (ధ్వజుని వలెనే మాయాచ్ఛన్నుడై) తన సోదరులతోను ఇతరులగు దానవులతోను అసురులతోను కూడి యుద్ధము చేసెను. దేవతలు కృష్ణునితో (విష్ణునితో) కూడి తమ శత్రువులను బంధించిరి. ఇట్లు యుద్ధములనెడు యజ్ఞములు ముగిసిన తరువాత దేవతలు అవభృథ (యజ్ఞ దీక్షాన్త) స్నానము చేసిరి. ఆ ప్రసంగమున వారు శండమర్కులను దర్శించిరి.

ఇట్లు దేవాసురుల నడుమ జరిగిన పండ్రెండు యుద్ధములును ఈ ఇరుపక్షములవారికిని నాశము కలిగించినను తుదకు దేవతలకు జయము లభించి ప్రజలకు హితకరములయ్యెను.

హిరణ్యకశిపూ రాజా వర్షాణా మర్బుదం విభో । ద్విసప్తతి స్తథాఽబ్దానాం నియుతా న్యధికానితు. 57
అశీతించ సహస్రాణి త్రైలోక్యైశ్వర్యతాం గతః । పర్యాయేణతు రాజాఽభూ ద్బలి ర్వర్షాయుతం పునః.
షష్టి ర్వర్షసహస్రాణి నియుతానిచ వింశతిః । బలే రాజ్యాధికారస్తు యావత్కాలం బభూవ హ. 59
తావత్కాలంతు ప్రహ్లాదో నివృత్తో హ్యసురై స్సహ । ఇన్ద్రాస్తు ఏతే విజ్ఞేయా అసురాణాంమహౌజసః. 60
దైత్య సంస్థ మిదం సర్వ మాసీ ద్దశయుగం పునః । త్రైలోక్య మిద మవ్యగ్రం మహేన్ద్రేణానుపాల్యతే.
అసమ్పన్న మిదం సర్వ మాసీ ద్దశయుగం పునః । ప్రహ్లాదస్య హృతే తస్మిం స్త్రైలోక్యే కాలపర్యయే.62
పర్యాయేణతు సమ్ప్రాప్తే త్రైలోక్యం పాకశాసనే । తతోఽసురా న్పరిత్యజ్య శుక్రో దేవా నగచ్ఛత. 63
యజ్ఞే దేవా నథ గతం దితిజాః కావ్య మాహ్వయన్ ।
కిం త్వ న్నో మిషతాం రాజ్యం త్యక్త్వా యజ్ఞం పునర్గతః. 64
స్థాతుం న శక్నుమో హ్యత్ర ప్రవిశామో రసాతలమ్। ఏవ ముక్తోఽబ్రవీ ద్దైత్యా న్విషణ్ణా న్సాన్త్వయ న్గిరా.
మాభీ ర్విధారయిష్యామి తేజసా స్వేన వోఽసురాః । మన్త్రా శ్చౌషధయశ్చైవ రసాశ్చ వసు యత్పరమ్.
కృత్స్నాని మయి తిష్ఠన్తి పాద స్తేషాం సురేశ్వరైః ।
తత్సర్వం వః ప్రదాస్యామి యుష్మదర్థే భృతం మయా. 67
తతో దేవాస్తు తాన్దృష్ట్వా భృతాన్కావ్యేన ధీమతా । సమ్మన్త్రయన్తి దేవా వై సంవిగ్నాస్తు జిఘృక్షయా.
కావ్యో హ్యసదృశం సర్వం వ్యావర్తయతి నో బలాత్ ।
సాధు గచ్ఛామహే తూర్ణం యావ న్నాధ్యాపయన్తి వై. 69
ప్రసహ్య హత్వా శిష్యాంస్తు పాతాళం ప్రాపయామహే । తతో దేవాస్తు సంరబ్ధా దానవా నుపసృత్య చ.70
తత స్తే వధ్యమానాస్తు కావ్యమే వాభిదుద్రువుః । తతః కావ్యస్తు తా న్దృష్ట్వా తూర్ణం దేవై రభిద్రుతాన్.
రక్షా కావ్యేన సంహృత్య దేవా స్తేఽథాసురార్దితాః। కావ్యం దృష్ట్వా స్థితం దేవా నిర్విశఙ్కాఽసురా న్జఘ్నుః.

శుక్రదానవసంవాదః.

తతః కావ్యోఽనుచిన్త్యాథ బ్రహ్మణో వచనం హితమ్। తా నువాచ తతః కావ్యః పూర్వవృత్త మనుస్మరన్.
త్రైలోక్యం వో హృతం సర్వం వామనేన త్రిభిః క్రమైః । బలిర్బద్ధో హతో జమ్భో నిహతశ్చ విరోచనః.

మహాసురా *ద్వాదశసు సజ్గ్రామేషు సురై ర్హతాః । తైస్తై రుపాయై ర్భూయిష్ఠం నిహతా వః ప్రధానతః. 75
కిఞ్చి చ్ఛిష్టా స్స యూయం వో యుద్ధం నాస్తీతి మే మతిః ।
నీతయో వో విధాతవ్యా ఉపాస్యాః కాలపర్యయమ్. 76
యాస్యామోఽథ మహాదేవం ప్రార్థితుం విజయావహమ్।అప్రతీపాం స్తతో మన్త్రా న్దేవాత్ప్రాప్య మహేశ్వరాత్.
యుద్ధ్యామహే పున ర్దేవాం స్తతః ప్రాప్స్యథ వై జయమ్। తత స్తే కృతసంవాదా దేవాదీంశ్చ తథాఽసురాః.
న్యస్తశస్త్రా వయం సర్వే నిశాన్నాహారవర్జినః । వయం తప శ్చరిష్యామ స్సంవృతా వల్కలై ర్వనే. 79
ప్రహ్లాదస్య వచ శ్శ్రుత్వా సత్యాభివ్యాహృతం తు తత్ । తతో దేవా న్యవర్తన్త విజ్వరా ముదితాశ్చ తే. 80

హిరణ్యకశిపుడు ఒక అర్బుదముమీద డెబ్బదిరెండు నియుతములమీద ఎనుబదివేల సంవత్సరములు త్రైలోక్యపాలకుడయ్యెను. ప్రహ్లాదుడును బలియు ఒక్కొక్కరు ఇరువది నియుతముల డెబ్బదివేల సంవత్సరములు త్రిలోకపాలకులయిరి. మహౌజస్సంపన్నులగు వీరు అసురులలో నుండి వచ్చిన ఇంద్రులు (అసురులైయుండియు త్రైలోక్యపాలనము చేసి ఇంద్రులైనవారు.) మరల పది దివ్యయుగముల పాటు ఈ త్రైలోక్యము అసురుల క్రింద నుండుటయు మరి అంతేకాలము అది ఇంద్రుని వశమయి అతని ఏలుబడిలో నుండుటయు ఇట్లు పర్యాయక్రమమున జరుగుచుండును. ఇట్టి పర్యాయములలో ఒకమారు దేవతలకు త్రైలోక్యపాలనాధికారము వచ్చినప్పుడు శుక్రుడు (తన శిష్యులగు) అసురులను విడిచి (జయోత్సవ రూపమున యజ్ఞము చేయుచున్న) దేవతలకడకు పోయెను. ఇది చూచి దైత్యులు శుక్రుని కడకు పోయి "అయ్యా! మేము జీవించియుండగనే మమ్ములను విడిచి మారాజ్యమును విడిచి దేవతల యజ్ఞమునకు పోవుచున్నారే! మేము ఇచట నిలువలేము. రసాతలమున ప్రవేశింతుము." అనిరి. అది విని శుక్రుడు విషణ్ణులగు దైత్యదానవుల నోదార్చుచు ఇట్లు పలికెను: "మీరు భయపడకుడు. మిమ్ములను నాతేజముచే మరల ఉద్ధరించగలను. మంత్రములు ఓషధులు రసద్రవ్యములు వివిధములగు (బంగారు మొదలగు) ధనములు నా యధీనమున సమృద్ధముగా నున్నవి. అవి మీ కొరకే నా దగ్గర దాచియుంచితిని. అదియంతయు మీ కిత్తును." నా దగ్గర నున్న ఈ వస్తు పంచయములో పాలుగప వంతు మాత్రమే దేవతలకు గలదు. అనెను.

ఈ విషయము తెలిసికొని దేవతలు భయపడిరి. వారందరును దైత్య దానవులకు ఆ ధనాదికము పోకుండ తామే అది గ్రహింపగోరిరి. శుక్రుడు మన కడ నున్న ధనమును కూడ బలాత్కారమున లాగికొనుచున్నాడు. దానిని దైత్య దానవులు తమ అధీనము చేసికొనక ముందే ఈ శుక్ర శిష్యులను చావగొట్టి పాతాళమునకు పంపుదము. అని ఆలోచనము చేసిరి. క్రోధావేశముతో వారు దానవుల కడకు పోయి వారిని చావగొట్టసాగిరి. దానవులు తాళలేక శుక్రుని కడకు పరుగెత్తుకొని పోయిరి. శుక్రు డది చూచి అసురులకు రక్ష కల్పించెను: దానితో అసురులే దేవతల బాధింపసాగిరి. కావ్యు డక్కడనే యుండుటయు అసురులు నిర్భయులుగా నుండుటయు చూచి దేవతలు వారిని విడిచి వెనుకకు మరలి వచ్చిరి.

తరువాత శుక్రుడు పూర్వము బ్రహ్మ చెప్పిన హితకరమగు వచనమును జ్ఞప్తికి దెచ్చికొని పూర్వ వృత్తాంతములను స్మరించుచు అసురులకును అవి జ్ఞాపకము చేయుచు ఇట్లు పలికెను: "మహాసురులారా! వామనుడు మూడడుగులతో మీ త్రైలోక్య రాజ్యమును హరించెను. బలిని బంధించెను. జంభుడును విరోచనుడును చంపబడిరి. పంద్రెండు సంగ్రామములయందును మహాసురులెందరో ఆయా యుపాయములతో సురల చేతిలో మరణించిరి. మీలో కొలది మంది మాత్రము మిగిలినారు. ఇపుడు యుద్ధము చేయరాదు. నీతిమార్గముల ననుసరించవలయును. కాలపు మార్పునకై ఎదురు చూడ వలయును. విజయము ఇప్పింపగలవాడు మహేశ్వరుడు. అతని కడకు పోయి అయనను ప్రార్థింతము. ఎదురులేని మంత్రముల నాయననుండి సంపాదింతము. అపుడు దేవతలతో పోరి జయము సంపాదింతము.

[శుక్రుని వచనమును విని ప్రహ్లాదాది దానవులు దేవతలతో ఒడంబడిక యొకటి చేసికొనిరి.] మే మందరమును ఆయుధములను వదలుచున్నాము. రాత్రులయందు ఆహారము కూడ తినము. వల్కలములను ధరించి వనమున తప మాచరింతుము. [మేము మరల వచ్చు వరకు మనకు యుద్ధము ఉండదు.]

ప్రహ్లాదుడు సత్యముతో శపథముచేసి చెప్పిన ఆ మాటను విని దేవతలు సంతాపము వదలి సంతోషము కలిగి యుద్ధ ప్రయత్నములనుండి నివృత్తు లయిరి. ఇట్లు దేవాసురు లిరువురును ఆయుధములు దూరముగా పారవయిచి సంతుష్టు లయిరి.

న్యస్తశస్త్రేషు నిర్వృత్తా స్తదా దేవాసురా స్తథా । తత స్తా నబ్రవీ త్కావ్యః కిఞ్చిత్కాల ముపాస్యథ. 81
నిరుత్సుకా స్తపోయుక్తాః కాలం కార్యార్థసాధకమ్ । పితు ర్మమాశ్రమస్థా వై సమ్ప్రతీక్ష్యత దానవాః. 82
తత్సంవిశ్యాసురా న్కావ్యో మహాదేవ మవద్యత ।

శుక్రకృతతపః.

శుక్రః: మన్త్రా నిచ్ఛా మ్యహం దేవ యే న సన్తి బృహస్పతౌ. 83
పరాభవాయ దేవానా మసురాణాం జయాయచ । ఏవముక్తోఽబ్రవీ ద్దేవో వ్రతం త్వం చర భార్గవ. 84
పూర్ణే వర్షసహస్రేతు కణధూమ మవాక్ఛిరాః । యది పశ్యసి భద్రం తే తతో మన్త్రా నవాప్స్యసి. 85
తథేతి సమనుజ్ఞాప్య శుక్రస్తు భృగునన్దనః । పాదౌ సంస్పృశ్య దేవస్య బాఢ మి త్య బ్రవీ ద్వచః. 86
వ్రతం చరామ్యహం దేవ త్వయాదిష్టోద్య వై ప్రభో । తతోఽనుసృష్టో దేవేన కుణ్డధారో హ్యధూమకృత్. 87
తదా తస్మి న్గతే శుక్రే హ్యసురాణాం హితాయ వై । మన్త్రార్థం తస్య వసతి బ్రహ్మచర్యం మహేశ్వరే.88
తం బుద్ధ్వా నీతిపూర్వంతు రాజ్యే న్యస్తం తదాఽసురైః । అస్మిం శ్ఛిద్రే తదామర్షా ద్దేవాస్తే సమభిద్రుతాః.89
ధన్వినోఽస్త్రాయుధా స్సర్వే బృహస్పతిపురస్సరాః ।
దృష్ట్వాఽసురగణా న్దేవాః ప్రగృహీతాయుధా మునే. 90
ఉత్పేతు స్సహసా తే వై సన్త్రస్తా స్తా న్వచోఽబ్రువన్ ।
న్యస్తశస్త్రేఽభయే దత్తే ఆచార్యే వ్రత మాస్థితే. 91
దత్త్వాఽభయం నో హ్యభయం సమ్ప్రాప్తా నో జిఘాంసయా ।
అనాచార్యా వయం దేవ స్త్యక్తశస్త్రా హ్యవస్థితాః. 92
చీరకృష్ణాజినధరా నిష్క్రియా నిష్పరిగ్రహాః । రణే విజేతుం దేవాశ్చ న శక్ష్యామః కథఞ్చన. 93
అయుద్ధేన ప్రపత్స్యామ శ్శరణం కావ్యమాతరమ్ । ప్రాపద్యన్త తతో భీతా స్తేభ్యోఽదా దభయం తు సా.
న భేతవ్యం న భేతవ్యం భయం త్యజత దానవాః । మత్సన్నిధౌ వర్తతాం వో న భీ ర్భవితు మర్హతి.95
తథా చాభ్యుపపన్నాం స్తా న్దృష్ట్వా దేవా అథాసురాన్ । అభిజఘ్నుః ప్రసహ్యైతే న విచార్య బలాబలమ్.
తత స్తా న్వధ్యమానాంస్తు దేవై ర్దృష్ట్వాఽసురాం స్తథా ।
దేవీ క్రుద్ధాఽబ్రవీ ద్దేవా ననిన్ద్రా న్వః కరో మ్యహమ్. 97
సంశ్రిత్య సర్వసమ్భారా నిన్ద్రబాహ్యచరాం స్తథా । తా న్స్తమ్భయ ద్యోగబలా ద్యోగయుక్తా తపోధనా.
తతస్తే స్తమ్భితం దృష్ట్వా ఇన్ద్రం దేవాస్తు మూకవత్ ।
ప్రాద్రవన్త తతో భీతా ఇన్ద్రం దృష్ట్వాతాఽవశీకృతాః. 99
గతేషు సురసఙ్ఘేషు శక్రం విష్ణు రభాషత । మాం త్వం ప్రవిశ భద్రం తే వధిష్యే తాన్ సురోత్తమ. 100

తరువాత శుక్రుడు అసురులతో "మీరు తహతహపడక తపస్సాచరించుచు కొంచెము కాలము ఓపిక పట్టుడు. కాలమే జరుగవలసిన పనులను చక్క పెట్టును. దానవు లందరును మా తండ్రి ఆశ్రమమం దుండి నాకై ఎదురుచూచు చుండుడు." అని వారిని నెమ్మది పరచి మహాదేవుని కడకు పోయెను. అత డీశ్వరునితో "దేవా! నాకు బృహస్పతికి తెలి యని మంత్రములు-దేవతలకు పరాజయమును దానవులకు జయమును కలిగించునవి - కావలయును." అనెను. అది విని మహాదేవుడు 'భార్గవా! నీవు తలక్రిందులుగా ఉండి వ్రత (నియమ) ముల ననుష్ఠించుము. వేయిఏండ్లు నిండునంకి నీకు కణధూమము దర్శన మిచ్చినచో నీకు సిద్ధి కలుగును. మంత్రములు లభించును.' అనెను. శుక్రుడును నరే యనెను. దేవా! నీవు ఆదేశించిన వ్రతము నాచరింతును. అని ఆ దేవుని పాదములంటి పలికెను. ఈశ్వరుని అనుమతితో *కుందధారుడై ధూమకృత్-కాక వ్రతము నారంభించెను.

ఇట్లు శుక్రుడు అసురుల వ్రతమునకై మంత్రముల కోరి మహేశ్వరునికడ బ్రహ్మచర్యము నాచరించుచుండుట దేవత లెరిగిరి. అసురులు శుక్రుని నీతిపూర్వకముగా రాజాధికారమునందు నిలిపిరనియు వారు తెలిసికొనిరి. ఈ అవకాశ ములో దేవతలు బృహస్పతిని ముందుంచుకొని ధనుర్ధరులై అస్త్రవిద్యాయుధములు ధరించి అసహనముతో కోపముతో అసురుల పైకి పోయిరి. ఇది చూచి వారు భయపడి దేవతలతో "దేవతలారా! మే మాయుధముల విడిచి యున్నాము. మా ఆచార్యుడు తపోవ్రతమునకై పోయి యున్నాడు. మీరు మా కభయ మిచ్చియు మమ్ము చంపదలచి వచ్చి యున్నారు. మా ఆచార్యుడు దగ్గర లేడు. మే మాయుధముల వదలి యున్నాము. నారబట్టలు కృష్ణాజినములు ధరించి నిష్క్రియు లమై ఏ సాధనములును పరివారమును లేక యున్నాము." అనిరి. ఐనను వారు వినలేదు. వా రపుడు 'మనము యుద్ధమున దేవతల జయించజాలము. యుద్ధము చేయలేనపుడు మనకు శుక్రుని మాతయే దిక్కు.' అని తలచి వా రామెను శరణు వేడిరి. ఆమె వారికి అభయ మిచ్చెను. దానవులారా! మీరు భయపడకుడు. భయపడకుడు. నా సంనిధిలో నుండగా మీరు భయపడవలసిన పనిలేదు. అనెను. అప్పటికిని విడువక దేవతలు బలాబలములు విచారించక బలము నుపయోగించి దానవులను చావగొట్టసాగిరి. అది చూచి దేవియగు శుక్రమాత క్రోధముతో దేవతలారా! మిమ్ములను ఇంద్రుడు లేనివారినిగా చేయుదు ననెను. సర్వ సంభారములతో సన్నద్ధులయిన దేవతలను ఇంద్రుని కూడ తపోధనయు యోగయుక్తయు అగు ఆమె స్తంభింపజేసెను. ఇంద్రుడును స్తంభించి మూగవాడువలె నయ్యెను. అది చూచి దేవతలు అవశులై ఇంద్రునితో కూడ విష్ణుని కడకు పోయిరి. విష్ణువు దేవ సంఘముల స్థితి చూచి ఇంద్రునితో 'సురోత్తమా! నీవు నన్ను ప్రవేశించి దాగి యుండుము. నే నసురుల నందర చంపుదు.' ననెను.

ఏవముక్త స్తతో విష్ణుం ప్రవివేశ పురన్దరః । విష్ణునా రక్షితం దృష్ట్వా దేవీ క్రుద్ధా వచోఽబ్రవీత్. 101
ఏష త్వాం విష్ణునా సార్ధం దహామి మఘవ న్బలాత్ ।
మిషతాం సర్వభూతానాం దృశ్యతాం వై తపోబలమ్. 102
తథాఽభిభూతౌ తౌ దేవా విన్ద్రవిష్ణూ బభూవతుః । కథం ముచ్యేవ సహితౌ విష్ణు రిన్ద్ర మభాషత. 103
ఇన్ద్రోఽబ్రవీ జ్జహి హ్యేనాం యావ న్నౌ న దహేత్ ప్రభో ।
విశేషా దభిభూతోఽస్మి త్వత్తోఽహమపి మా చిరమ్. 104
తత స్సమీక్ష్య విష్ణు స్స్వం స్త్రీవధా త్కృచ్ఛ్ర మాస్థితః ।
అభిధ్యాయ తత శ్చక్ర మాపదు త్తరణోత్తమమ్. 105
తతస్తు త్వరయా యుక్త శ్శీఘ్రకారీ భయాన్వితః ।
జ్ఞాత్వా విష్ణు స్తత స్తస్యాః క్రూరం దేవ్యా శ్చికీర్షితమ్. 106

* కుందధారుడు యాతన అనుభవించుచుండియు ధూమమును తన స్రోతస్సులలోనికి పోనీయక దానిని పరమాణువుల రూపమున దర్శించ యత్నించుట.

క్రుద్ధ స్స్వ మస్త్ర మాదాయ శిర శ్చిచ్ఛేద వై భయాత్ ।
తం దృష్ట్వా స్త్రీవధం ఘోరం చుక్రోధ భృగు రీశ్వరః. 107

భృగుదత్తవిష్ణుశాపో భృగుభార్యోజ్జీవనం చ

తతోఽభిశప్తో భృగుణా విష్ణు ర్భార్యావధే తదా । యస్మా త్తే జానతో ధర్మ మవధ్యా స్త్రీ నిషూదితా. 108
తస్మా త్త్వం సప్తకృత్వో హి మానుషేషూపపత్స్యతే । తత స్తేనాభిశాపేన నష్టే ధర్మే పునః పునః. 109
లోకస్య చ హితార్థాయ జాయతే మానుషేష్విహ । అనువ్యాహృత్య విష్ణుంచ తదాదాయ శిరో మునిః.110
సమానీయ తతః కాయ మసౌ గృహ్యేద మబ్రవీత్ ।
ఏష త్వాం విష్ణునా దేవి హతాం సన్ధారయా మ్యహమ్. 111
యది కృత్స్నో మయా ధర్మో జ్ఞాయతే చరితోఽపి వా । తేన సత్యేన జీవస్వ యది సత్యం బ్రవీమ్యహమ్.
తత స్తాం ప్రోక్ష్య శాన్తాభి రద్భి ర్జీవేతి సోఽబ్రవీత్ । తతోఽభివ్యాహృతే తస్య దేవీ సఞ్జీవితా తదా. 113
తతస్తాం సర్వభూతాని దృష్ట్వా సుప్తోత్థితా మివ । సాధు సాధ్వితి చక్రుస్తే వచసా సర్వతోదిశమ్. 114
ఏవం ప్రత్యాహృతా తేన దేవీ సా భృగుణా తదా । మిషతాం దేవతానాం చ తదద్భుత మివాభవత్. 115
అసమ్భ్రాన్తేన భృగుణా పత్నీ సఞ్జీవితా పునః । దృష్ట్వా చేన్ద్రో న లభత శర్మ కావ్యభయా త్పునః.116

ఇంద్రు డట్లే చేసెను. ఇంద్రుడు విష్ణునిచే రక్షితుడగుట చూచి శుక్రమాత కోపించి 'ఇంద్రా! నా తపోబలము ఎట్టిదో తెలియునా? సర్వభూతములు సాక్షిగా నేను విష్ణునితో కూడ నిన్ను దహింతును.' అనెను. ఇట్లు శుక్రమాత తిరస్కార పూర్వకముగా పలుకగా ఇంద్ర విష్ణు లిరువురును కలవరపడిరి. ఇపు డీమెనుండి ఎట్లు తప్పించుకొనవచ్చును? అని విష్ణు వింద్రునితో ననెను. ప్రభూ! ఆమె నన్నును నిన్నును దహించక మునుపే ఈమెను నీవు చంపుము. నేను నీ కంటెను ఎక్కువగా కలవరపడుచున్నాను. అని ఇంద్రు డనెను. అంతట విష్ణువు బాగుగా ఆలోచించెను. ఇంద్రుడును తానును ఆత్మరక్షణ మొనరించుకొనవలెనని స్త్రీ వధ చేయవలయును. లేనిచో తమకు కీడు తప్పదు. ఇట్టి ఇరకాటములో విష్ణువు పడెను. ఆపదుద్ధరణమునం దుత్తమమగు చక్రమును వెంటనే విష్ణువు స్మరించెను. అప్పుడును విష్ణువు త్వరపడసాగెను. చేయదలచిన పని త్వరగా చేయవలెను. లేనిచో తమకు కీడు కలుగునను భయము కలుగుచుండెను. ఆ దేవి చేయదలచిన క్రూరకర్మము ఎరిగి విష్ణువు క్రుద్ధుడై ఒకవైపు భయపడుచునే భృగుపత్నీ శిరమును ఖండించెను.

ఘోరమగు ఈ స్త్రీ వధమును చూచి భృగుముని క్రోధము చెందెను. అతడు చేతకానివాడు కాదు. తన భార్యా వధమునకు కోపించిన అతడు విష్ణుని శపించెను. 'నీవు స్త్రీ అవధ్యురాలను ధర్మము నెరిగియుండియు స్త్రీని వధించితివి. కావున నీవు ఏడుమారులు మనుష్యుల నడుమ మానవుడుగా జన్మింతువు.' అని ఆయన విష్ణుని అభి శపించెను. ఆ శాప ఫలముగా లోకమున ధర్మము నశించి నపుడెల్ల లోకహితమునకై శ్రీవిష్ణువు మనుష్యుడుగా లోకమున జనించుచుండును.

ఇట్లు పలికి భృగుముని వెంటనే తన పత్ని శిరమును తీసికొనెను. దానిని మిగిలిన శరీరముతో చేర్చెను. ఇట్లు పలికెను: 'దేవీ! విష్ణునిచేత చంపబడిన నిన్ను ఇదిగో! మరల ఒకటిగా కూర్చుచున్నాను. నేను ధర్మమును సమగ్రముగా ఎరిగినవాడ నైనచో ఆచరించినవాడ నైనచో నేను పలుకునది సత్యమే యైనచో ఆ సత్యముతో నీవు జీవింతువు గాక!" ఇటు పలికి మంత్రములతో శాంతి జరుపబడిన జలములతో ఆమె (శరీరము)ను ప్రోక్షించి 'జీవించుము.' అనెను. ఆమె అతని ఆ మాటతోపాటే జీవితురాలయ్యెను. నిదుర మేల్కాంచినట్లు లేచిన ఆమెను చూచి సర్వదిశలనుండియు సర్వభూతములును సాధువాదములు (చాల బాగుగా నున్నది అను పలుకులు) పలికిరి. ఇట్లు ఆ దేవిని ఆ సమయమున భృగు మహాముని జీవింపజేసెను. ఇది సర్వ దేవతలును చూచుచుండిరి. ఇది ఎంతయో ఆశ్చర్యకరమగు విషయ మయ్యెను. ఈ సందర్భములో భృగు మహాముని ఏ మాత్రమును కలవరపాటు చెందకుండుట మరియు ఆశ్చర్యకరము. ఇది చూచి

ఇంద్రుడు ఇకముందు శుక్రుని వలన మరింకేమి కీడు మూడునోయని మరింత భయపడెను. అతని మనస్సునకు శాంతియే లేకపోయెను.

శుక్రం ప్రతి ఇన్ద్రప్రేరితజయన్త్యాగమనమ్.

ప్రజాగరే తత శ్చేన్ద్రో జయన్తీ మిద మబ్రవీత్ । నశ్చిన్త్య మఘవా న్వాక్యం స్వాం కన్యాంపాకశాసనః.
ఏష కావ్యోఽప్యమిత్రాయ వ్రతం చరతి దారుణమ్ ।
తేనాహం వ్యాకులః పుత్రి కృతో మతిమతా భృశమ్. 118
గచ్ఛ సంశ్రావయస్వైనం శ్రమాపనయనై శ్శుభైః । తై స్తై ర్మనోఽనుకూలైశ్చ ఉపచారై రతన్ద్రితా.119
కావ్య మారాధయ స్వైనం యథా తుష్యేత్తు స ద్విజః ।
గచ్ఛ త్వం తస్య దత్తాఽసి ప్రయత్నం కురు మత్కృతే. 220
ఏవ ముక్తా జయన్తీ సా వచ స్సఙ్గృహ్య వై పితుః । అగచ్ఛ ద్యత్ర ఘోరం స తప ఆరభ్య తిష్ఠతి.
తం దృష్ట్వా సు పిబన్తం సాకణధూమ మవాఙ్ముఖం । యక్షేణ పాత్యమానం చ కుణ్డధారణయాతనామ్.122
దృష్ట్వా చ తం పాత్యమానం దేవీ కావ్య మవస్థితా । స్వ స్వరూపధరం దృష్ట్వా వపుషా వృత్తి మాస్థితా.
పిత్రా యథోక్తం వాక్యం సా కావ్యే కృతవతీ తథా । గీర్భి శ్చైవానుకూలాభి స్తువన్తీ వల్గుభాషిణీ. 124
గాత్రసంవాహనైః కాలే సేవమానా త్వచ సుఖైః । వ్రతచర్యానుకులాభి రుపాస బహులా స్సమాః. 125
పూర్ణే ధూమవ్రతే తస్మి న్ఘోరే వర్షసహస్రకే । వరేణ చ్ఛన్దయామాస కావ్యం ప్రీతోఽభవత్తదా. 126
మహేశ్వరః : ఏత ద్వ్రతం త్వయైకేన చీర్ణం నాన్యేన కేనచిత్ ।
తస్మాద్వై తపసా బుద్ధ్యా శ్రుతేనచ బలేన చ. 127
తేజసాచ సురా న్సర్వాం స్త్వమేకోఽభిభవిష్యసి । * యథాభిలషితం బ్రహ్మ న్విద్యతే భృగునన్దన. 128
ప్రతివత్స్యసి తత్సర్వం నానువాచ్యంతు కస్యచిత్ । సర్వాభిభావీ తేన త్వం భవిష్యసి ద్విజోత్తమ. 129
ఏతాన్ దత్వా వరాం స్తస్మై భార్గవాయ భవః పునః । ప్రజేశత్వంధనేశత్వ మవధ్యత్వం చ వై దదౌ.130
ఏతా న్లబ్ధ్వా వరా న్కావ్య స్సంప్రహృష్టతనూరుహః । హర్షా త్ప్రాదుర్బభౌ తస్య దివ్యస్తోత్రం మహేశ్వరే.
తథా తిర్యక్స్థితశ్చైవ తుష్టువే నీలలోహితమ్ ।

ఇంద్రునకు నిదురయే పట్టలేదు. అతడు అదే పనిగా ఆలోచించి ఒక నిర్ణయమునకు వచ్చెను. తన కూతురగు జయంతితో ఇట్లు పలికెను: "బిడ్డా! ఇదుగో! ఈ శుక్రుడు శత్రునాశమునకై దారుణ తపము ఆచరించుచున్నాడు. మహా బుద్ధిశాలియగు ఇతని వలన నెంతయో వ్యాకులుడ నగుచున్నాను. కనుక నీవు ఆతని కడకు పొమ్ము. అతని శ్రమమును పోగొట్టు శుశ్రూషలు చేసెదనునుము. నీవు ఏ మాత్రమును ఏమరుపాటుగాని సోమరితనము కాని లేక ఆయా ఉపచారము లతో ఇతనిని ఆరాధించుము. ఆ బ్రాహ్మణుని సంతోష పెట్టుము. నేను నిన్నతని కిచ్చుచున్నాను. నీవు వెంటనే పొమ్ము. నాపక్షమున ప్రయత్నము చేయుము."

ఇట్లు పలికిన ఇంద్రుని వచనము విని జయంతి సరేయని శుక్రుడు తపమాచరించుచున్న చోటికి పోయెను. అతనిని చూచెను. శుక్రుడు అవాఙ్ముఖుడై కణ ధూమమును త్రాగుచున్నట్లుండెను. యక్షుడు పెట్టుచున్న *కుండధారణ

---

* యచ్ఛ కిఞ్చిదపి.

అగ్నికుండమునందు ఘోరమగు అగ్ని కణములు కాలుచుండ దాని పెగ తగులునట్లు తల్లక్రిందులుగా వ్రేలాడ పట్టుకొని ఇదిగో దీనియందు పడవేయుచున్నానని భయపెట్టుచు ఆ పెగ వేడిమిని భరించునట్లు చేయుట కుండ ధారణ యాతన.

యాతనను అనుభవించుచుండెను. జయంతి ఇంకను దగ్గరకుపోయి చూచెను. ఇన్ని బాధలు పడుచుండియు కావ్యుడు స్వస్వరూపము ఏమాత్రము వికారము పొందక యుండెను. ఆమె అతనికి తాను చేయవలసిన శుశ్రూష చేయసాగెను. తన తండ్రి చెప్పిన విధమున ఆమె శుక్రునకు పరిచర్యలు చేసెను. ఆమె సహజముగనే మధురముగా మాటలాడు స్వభావము గలది. ఆమె శుక్రుని మనస్సునకు అనుకూలముగా మాటలాడుచుండును. ఆవశ్యకమయిన ఆయా సమయములందు అతనికి స్పర్శ సుఖము గలుగునట్లు గాత్ర సంవాహనము (కాలు సేతులు పెస్సు మొదలగునవి నొప్పి తీరునట్లు ఒత్తుట) లచే అతనికి హాయి కలిగించుచుండును. అతని వ్రతానుష్ఠానమున కనుకూలములగు ఆచరణలు ఆచరించుచుండును. ఇట్లు ఆమె చాల సంవత్సములు శుక్రుని సేవించెను.

ఇట్లు వేయి సంవత్సరములు నిండెను. శుక్రుని ధూమ వ్రతము ముగిసెను. శివుడు శుక్రుని వరము కోరు కొమ్మనెను. "ఈ వ్రతమును నీవు తప్ప మరియెవ్వరును ఆచరించలేదు. అందువలన తపస్సుచే కాని బుద్ధిబలముచే కాని శాస్త్ర జ్ఞానముచే కాని బలముచేకాని తేజస్సుచే కాని నీవు ఒక్కడవే దేవతలనందరను నీక్రింది వారినిగా చేసికొన గలవు. విప్రా! నీమనస్సునందు ఏఏ అభిలషితములు కలవో అవి ప్రతియొక్కటియు నీవు పొందెదవు. ఈ విషయము మరియెవ్వరికిని చెప్పకుము. ఈ వరముచే నీవు అందరను మించినవాడవు అగుదువు."

శివుడు శుక్రునకు ఈ వరములతో పాటు ప్రజాపతిత్వమును కుబేరత్వమును అవధ్యత్వమును కూడ వరములుగా ఇచ్చెను. ఇట్టి వరములు పొందిన శుక్రునకు సంతోషముచే శరీరమున రోమాంచము కలిగెను. హర్షవశమున అతనికి శివుని విషయమున దివ్యస్తోత్రము చిత్తమున స్ఫురించెను. అతడట్లు తలక్రిందులుగా ఉండియే శివుని ఈ విధముగా స్తుతించెను.

శుక్రకృతమహేశ్వరస్తుతిః.

శుక్రః: నమోఽస్తు శితికణ్ఠాయ కనిష్ఠాయ సువర్చసే. 132
లేలిహానాయ కావ్యాయ *వత్సరాయాన్ధసఃపత్యే । కపర్దినే కరాళాయ హర్యక్షవరదాయ చ. 133
సంస్తుతాయ స్తుతార్థాయ దేవదేవాయ రంహసే । ఉష్ణీషిణే సువక్త్రాయ సహస్రాక్షాయ మీఢుషే. 134
వసురేతాయ రుద్రాయ తపసే •కృత్తివాససే । *హ్రస్వాయ ముక్తకేశాయ సేనాన్యే రోహితాయ చ. 135
కవయే రాజవృక్షాయ తక్షకక్రీడనాయచ । సహస్రబాహవే చైవ సహస్రనయనాయచ. 136
సహస్రశిరసే చైవ బహురూపాయ వేధసే । హరాయ బహురూపాయ శ్వేతాయ పురుషాయచ. 137
గిరీశాయ మనోజ్ఞాయ చిత్రినే సుక్షతాయ చ । సన్నృప్తాయ సుహస్తాయ ధన్వినే భార్గవాయచ. 138

(ఈ స్తోత్రము శివత్రిశతీ నామాత్మకమయినది. ఇది పరమేశ్వరుని విరాట్స్వరూపమును సమస్త జగదాత్మకత్వమును సకల జగదధిష్ఠాతృత్వమును ప్రతిపాదించుచున్నది. ఇది సకలోపషత్సారమును నామత్రిశతీ రూపమై రుద్రాధ్యాయముతో సమానమునునై ఇహపరములందు సకల పురుషార్థములను సులభముగ సమకూర్చ గలిగియున్నది. దీని యర్థము నెరిగి దీనిని పారాయణము చేయుట సకలాభీష్ట ఫలదాయకము-అనువాదకుడు.) నల్లని కంఠము కలవాడు సూక్ష్మతమరూపుడు శోభనమగు తేజస్సు కలవాడు లయము చేయువాడు కావ్యస్వరూపుడు-సంవత్సరరూపుడు అన్నమునకు అధిపతి-జటాజూటము కలవాడు (దుష్టులకు) భయంకరుడు-హర్యక్షు (కుబేరు)నకు వరములొసగినవాడు చక్కగా స్తుతింపబడువాడు-స్తుతింపబడిన అన్ని అర్థములును తానైనవాడు-దేవదేవుడు-వేగరూపుడు-తలపాగ ధరించినవాడు-అందమయిన మోము కలవాడు-వేలకొలది ఇంద్రియములు కలవాడు-కోరికలను ఇచ్చువాడు-ధనమునకు బీజము వంటివాడు-దుష్టులను ఏడిపించువాడు తపోరూపుడు చర్మము వస్త్రముగా కలవాడు-చాలపొట్టివాడు-గొరగబడిన వెంట్రుకలు కలవాడు (మహాయతి) సేనాపతిరూపుడు ఎర్రనివాడు సూర్యరూపుడు-రాజవృక్షరూపుడు-తక్షకనాగుని క్రీడింపజేయువాడు-

* వత్సరాయపవసస్పతే. • చిత్ర. * ఈశాయముక్త.

వేలకొలది భుజములు కలవాడు వేలకొలది కన్నులు కలవాడు-వేలకొలది శిరస్సులు కలవాడు అనేక రూపములు కలవాడు-సృష్టిసేయువాడు లోకములను హరించువాడు-అనేక దేహములు కలవాడు-తెల్లనివాడు-సర్వభూతముల దేహముల యందును శయనించువాడు పర్యాప్తమునకు (వాక్కునకు) ఈశుడు మనోహరుడు - చిత్రముకలవాడు-శతులకు (దెబ్బ తినిన వానికి) మేలుచేయువాడు-చక్కగా తృప్తి నొందియుండువాడు-చక్కని హస్తములు కలవాడు ధనువు ధరించిన వాడు-భార్గవ స్వరూపుడునగు వానికి నీకు నమస్కారము.

నిషఙ్గిణేచ తారాయ ★సాక్షాయ క్షపణాయచ । తామ్రాయచైవ భీమాయ ఉగ్రాయచ శివాయచ. 139
మహాదేవాయ శర్వాయ విరూపాయ శివాయచ । హిరణ్యాయ వశిష్ఠాయ జ్యేష్ఠాయ మధ్యమాయచ. 140
బభ్రవేచ పిశఙ్గాయ పిఙ్గళాయారుణాయచ । పినాకినే ○చేషుమతే చిత్రాయ రోహితాయ చ. 141
దున్దుభ్యా యైకపాదాయ అహయే(అజాయ)బుధ్నియాయచ।మృగవ్యాధాయ(శ)సర్వాయ స్థాణవే భీషణాయచ.
బహునేత్రాయ పథ్యాయ సునేత్రా యేశ్వరాయచ । కపాలినే కవీరాయ మృత్యవే త్ర్యమ్బకాయచ. 143
వాస్తోష్పతే (తయే) పినాకాయ ముక్తయే కేవలాయచ।అరణ్యాయ గృహస్థాయ యతయే బ్రహ్మచారిణే.144
సాఙ్ఖ్యాయచైవ యోగాయ వ్యాధినే దీక్షితాయచ । +అన్తర్హితాయ శర్వాయ భవ్యేశాయ శమాయచ. 145

అమ్ముల పొదులు కలవాడు నక్షత్ర రూపుడు (ప్రణవ రూపుడు) ఇంద్రియములతో కూడినవాడు-లోకములను (దుష్టులను) నశింపజేయువాడు ఎర్రనివాడు భయంకరుడు తీవ్రరూపుడు శుభకరుడు మహాదేవుడు (దేవతలందరలో గొప్పవాడు) దుష్టులను హింసించువాడు వికృతరూపుడు శుభరూపుడు ప్రకాశించువాడు గొప్పవాడు పెద్దవాడు మధ్యముడు బభ్రువర్ణము వాడు పసిమి ఎక్కువ ఎరుపు తక్కువ కలిసిన వన్నెవాడు పసిమి తక్కువ ఎరుపు ఎక్కువ కలిసిన వర్ణమువాడు ఎర్రనివాడు పినాకధనువు కలవాడు బాణములు దాల్చినవాడు అనేక వర్ణములవాడు రోహిత (ముదురు ఎరుపు) వర్ణమువాడు దుందుభియందుండువాడు ఒకే పాదము కలవాడు జన్మములేనివాడు అహిర్ బుధ్నియుడు మృగములను వెంటాడు వ్యాధరూపమువాడు ప్రతియొకటియు తానైనవాడు కదలనివాడు భీతిగొలుపువాడు అనేక నేత్రములు కలవాడు హితము కలిగించువాడు శోభన నేత్రములు కలవాడు ఈశ్వరుడు కపాలము ధరించినవాడు ఒకే యొక వీరుడు మృత్యువు-మూడు కన్నులు కలవాడు గృహమున కధిపతియగువాడు పినాక ధనుస్స్వరూపుడు కేవలరూపుడు వానప్రస్థుడు గృహస్థుడు యతి బ్రహ్మచారి సాంఖ్యదర్శనము యోగదర్శనము నైనవాడు వ్యాధులు (బోయవారు) తన సేవగా కలవాడు దీక్ష స్వీకరించి యుండువాడు అంతర్ధానము నొందియుండువాడు హింస కలవాడు శుభమగు ఈశుడు శమస్వరూపుడు అగువానికి నమస్కారము.

రోహితే చేకితానాయ బ్రహ్మిష్ఠాయ మహర్షయే । చతుష్పదాయ మేధ్యాయ రక్షిణే శీఘ్రగాయచ. 146
శిఖణ్డినే కరాళాయ దంష్ట్రిణే విశ్వవేధసే । భాస్కరాయ ప్రదీప్తాయ దీప్తాయచ సుమేధసే. 147
క్రూరాయ వికృతాయైవ బీభత్సాయ శివాయచ । సౌమ్యాయ చైవ పుణ్యాయ ధార్మికాయ శుభాయచ. 148
అవధ్యాయామృతాయైవ నిత్యాయ శాశ్వతాయచ । వ్యావృత్తాయ యవిష్ఠాయ భరతాయచ రక్షసే. 149
క్షేమ్యాయ సహమానాయ సత్యాయచ ఋతాయచ । ●కాట్యాయ రాసభాయైవ శూలినే దివ్యచక్షుషే. 150
సోమపా యాజ్యపాయైవ ధూమపా యోష్మపాయచ । శుచయే వరిధానాయ సద్యోజాతాయ మృత్యవే. 151
పిశితాశాయ శర్వాయ మేఘాయ విద్యుత్యాయచ । వ్యావృత్తాయ వరిష్ఠాయ భరతాయచ రక్షసే. 152

రోహితవర్ణుడు చాల తెలివి కలవాడు బ్రహ్మజ్ఞులలో శ్రేష్ఠుడు మహర్షిరూపుడు-చతుష్పాదుడు పవిత్రుడు రక్షించువాడు శీఘ్రముగా పోవువాడు జుట్టు ముడి కలవాడు నిమ్నోన్నత రూపుడు కోరలు కలవాడు విశ్వముల సృష్టించువాడు

★ వక్షాయ. ○వసుమతే. + అనాహితాయ. ● కర్త్రేవరానవేచైవ.

కాంతుల నిర్మించువాడు తీవ్రముగా ప్రకాశించువాడు శోభనమగు గ్రంథధారణా సామర్థ్యము కలవాడు (శోభనమేధ కలవాడు) క్రూరుడు వికృతరూపుడు అనహ్యము గొలుపువాడు శుభుడు నెమ్మదితనము కలవాడు పుణ్యరూపుడు ధర్మము నెరిగినవాడు (ధర్మము ననుష్ఠించువాడు) శుభుడు-అవధ్యుడు అమృతుడు నిత్యుడు శాశ్వతుడు (నహజరూపుడు) తన లక్షణములు ఇంకెవరియందును లేనివాడు అందరికంటె కడగొట్టువాడు అంబర భరించువాడు రక్షఃస్వరూపుడు క్షేమము కలిగించువాడు ఎవరినైనను ఏదైనను నహించువాడు సత్యరూపుడు ఋతరూపుడు ముండ్లతో నిండిన దుర్గమ ప్రదేశములందుండువాడు రానభరూపుడు శూలి దివ్యనేత్రములు కలవాడు సోమపానము చేయువాడు ఆజ్యమును పానము చేయువాడు ధూమమును పానము చేయువాడు ఊష్మమును పానము చేయువాడు శుచిరూపుడు పరిధాన (ధరించు వస్త్రము) స్వరూపుడు తత్‌క్షణమే సాక్షాత్కరించువాడు మృత్యువును కలిగించువాడు పిశితము (పచ్చిమాంనము) ఆహారముగా తినువాడు శర్వుడు మేఘరూపుడు విద్యుద్రూపుడు అన్నిటినుండియు మరలియుండువాడు శ్రేష్ఠుడు అందరను పోషించువాడు రక్షించువాడు అగువానికి నీకు నమస్కారము.

త్రిపురఘ్నాయ ÷దీప్తాయ చక్రాయ రోమశాయచ । తిగ్మాయుధాయ దక్షాయ నమిద్ధాయ పులస్తయే. 153
రోచమానాయ చణ్డాయ స్థితాయ ఋషభాయచ । వ్రతినే యుఞ్జమానాయ శుచయే చోర్ధ్వరేతసే. 154
అసురఘ్నే మఖఘ్నాయ మృత్యుఘ్నే చాన్తకాయచ । కృశానవే ప్రశాన్తాయ వహ్నయే కింశిలాయచ. 155
రక్షోఘ్నాయ పశుఘ్నాయ విఘ్నాయ శ్వసితాయచ । అనాహతాయ సర్వాయ వ్యాపినే తాపనాయచ. 156
అనాశ్రితాయ దేవాయ నమిత్యధిష్ఠితాయచ । కృష్ణాయచ జయన్తాయ లోకానా మీశ్వరాయచ. 157
హిరణ్యబాహవేచైవ పాశాయచ నమాయచ । సుకన్యాయ సునస్యాయ ఈశానాయ సుచక్షుషే. 158
క్షిప్రేషవే సుధన్వాయ ప్రథమాయ శివాయచ । కపిలాయ పిశఙ్గాయ మహాదేవాయ ధీమతే. 159
మహాకామాయ దీప్తాయ రోదనాయ నహాయచ । దృఢధన్వినే కవచినే రథినేచ వరూథినే. 160

త్రిపురములను నంహరించువాడు ప్రకాశించువాడు చక్రస్వరూపుడు-రోమములతో నిండినవాడు-తీక్ష్ణములగు ఆయుధములు కలవాడు నమర్థుడు బాగుగా ప్రజ్వలించువాడు భక్తుల ఎదుట నిలుచువాడు బంగారువలె ప్రకాశించువాడు భయము గొలుపువాడు (భక్తుల నుద్ధరించుటకై) నిలువబడి యుండువాడు. ఋషభముని రూపుడు-వేదవ్రతముల ననుష్ఠించువాడు-పూనికతో నుండువాడు శుచియగువాడు ఊర్ధ్వరేతస్కుడు రాక్షసులను చంపువాడు యజ్ఞమును ధ్వంనము చేయువాడు మృత్యువును నంహరించినవాడు నర్వమును నమాప్తము చేయువాడు అగ్ని స్వరూపుడు ప్రశాంతుడు హవిస్సను మోసికొనిపోవువాడు కుత్సితములగు శిలలుకల ప్రదేశముల రూపమున నున్నవాడు-రక్షస్సుల చంపువాడు పశువుల (దుష్టజీవుల) చంపువాడు విఘ్నరూపుడు శ్వానరూపుడు అనాహత నాదస్వరూపుడు నర్వరూపుడు వ్యాపించియుండువాడు తపింపచేయువాడు (సూర్యాగ్నిరూపుడు) దేనిని ఆశ్రయించకయుండువాడు దివ్ ధాతువునకు అర్థముగా నుండువాడు నమితులను (యుద్ధములను-నమాజములను) అధిష్ఠించి యుండువాడు కృష్ణుడు జయంతుడు లోకములకు ఈశ్వరుడు హిరణ్యబాహుడు పాశరూపుడు నముడు శోభనములగు కన్యలు కలవాడు చక్కని పైరుల రూపమున నుండువాడు జీవాత్మకును అధిష్ఠాతయగువాడు చక్కని నేత్రములు కలవాడు శీఘ్రముగా పోవు బాణములు కలవాడు శోభనమగు ధనువు కలవాడు మొట్టమొదటివాడు పరమాత్మరూపుడు కపిలవర్ణుడు పింగళవర్ణుడు మహాదేవుడు బుద్ధిశాలి గొప్ప నంకల్పములు కలవాడు ప్రకాశింపజేయువాడు దుష్టుల నేడిపించువాడు అందరనోడించువాడు దృఢ ధనువు గలవాడు కవచము కలవాడు రథము కలవాడు వరూథము (ఒక విధమగు కవచము-రథభాగము) కలవాడు అగు నీకు నమస్కారము.

భృగునాథాయ శుక్రాయ గహ్వరేష్టాయ వేధసే । అమోఘాయ ప్రశాన్తాయఅమృతాయ వృషాయచ. 161
నమోస్తు తుభ్యం భగవ న్మహతే కృత్తివాససే । పశూనాం పతయే తుభ్యం భూతానాం పతయే నమః.162
ప్రణమ్యా ఋగ్యజుస్సామ్నే స్వాహాయచ స్వధాయచ । వషట్కారాత్మనే చైవ తుభ్య మర్థాత్మనే నమః.
స్రష్ట్రే ధాత్రే తథా కర్త్రే హర్త్రేచ కృపణాయచ । భూతభవ్యభవిష్యాయ తుభ్యం కర్మాత్మనే నమః.164
వసవేచైవ సార్థాయ రుద్రాదిత్యాశ్వినాయచ । నిర్గుణాయ గుణజ్ఞాయ వ్యాకృతాయ కృతాయచ. 165
స్వయమ్భువే ప్రజాయైవ అపూర్వప్రథమాయచ । ప్రజానాం పతయేచైవ తుభ్యం బ్రహ్మాత్మనే నమః.166
ఆత్మేశాయాత్మవశ్యాయ సర్వస్యాతిశయాయచ । సర్వభూతాత్మభూతాయ తుభ్యం భూతాత్మనే నమః. 167
నిర్గుణాయ గుణజ్ఞాయ వ్యాకృతాయాఽకృతాయచ । విరూపాక్షాయ మిత్రాయ తుభ్యం సాఙ్ఖ్యాత్మనే నమః.
పృథివ్యై చాన్తరిక్షాయ దివ్యాయచ మహాయచ । జనస్తపాయ సత్యాయ తుభ్యం లోకాత్మనే నమః. 169
అవ్యక్తాయ మహాన్తాయ భూతాదే రిన్ద్రియాయచ । ఆత్మజ్ఞాయ విశిష్టాయ తుభ్యం సర్వాత్మనే నమః. 170
నిత్యాయ చాత్మలిఙ్గాయ సూక్ష్మాయ చేతనాయచ । బుద్ధాయ విభవేచైవ తుభ్యం మోక్షాత్మనే నమః. 171
నమస్తే త్రిషు లోకేషు నమస్తే పరత స్త్రిషు । సత్యాన్తేషు మహాన్తేషు చతుర్షుచ నమోఽస్తుతే. 172
నామస్తోత్రే మయా హ్యస్మి న్యదపవ్యాహృతం భవేత్ ।
మద్భక్త ఇతి బ్రహ్మణ్య తత్సర్వం క్షన్తు మర్హసి. 173

భృగువంశ రక్షకుడు-శుక్రాచార్యరూపుడు-హృదయ గుహయందుండువాడు-శాస్త్ర విధానముల చేయువాడు సఫలుడు ప్రశాంతుడు అమృతస్వరూపుడు సర్వభూతములను అమృతముతో తడుపువాడు భగవానుడు గొప్ప పరిమాణము కలవాడు గజచర్మము వస్త్రముగా గలవాడు జీవులకు అధిపతి సకల భూతములచే నమస్కరింపబడువాడు ఋగ్యజుఃసామ స్వరూపుడు స్వాహాకారరూపుడు వషట్కారరూపుడు ఆత్మరూపుడు అవధిరూపుడు సృష్టించువాడు నిర్మించువాడు సర్వము చేయువాడు పాపముల హరించువాడు దయావరుడు దయనీయుడు (దీనుల రూపమున నుండువాడు) భూత వర్తమాన భవిష్యకాల రూపముల నుండువాడు కర్మరూపుడునగు నీకు నమస్కారము.

వసువులు సాధ్యులు రుద్రులు ఆదిత్యులు అశ్వినులు అను దేవతల రూపమున నుండువాడు నిర్గుణుడు త్రిగుణముల నెరిగినవాడు నామరూప విభాగము నొందినవాడు సృష్టిచేయబడిన ప్రపంచ రూపమున నుండువాడు తనకుతానై యుండువాడు (పుట్టిన) ప్రజల రూపముతో నుండువాడు పూర్వము ఎన్నడు లేనివాడు మొదటివాడు ప్రజాపతిరూపుడు బ్రహ్మరూపుడు తనకుతానే అధిపతియగువాడు తన అధీనమున తానుండువాడు అన్నిటిని అతిశయించినవాడు సర్వ భూతములకు ఆత్మయగు వాడు భూతరూపుడునగు నీకు నమస్కారము.

నిర్గుణుడు గుణముల (తత్త్వము)ను ఎరిగినవాడు నామరూపాది విభాగము నొందినవాడు వేటిచేతను చేయబడనివాడు (స్వయంసిద్ధుడు) వికృతములగు (వేసి సంఖ్యగల) కన్నులు కలవాడు ఎల్ల భూతములకు మిత్రుడు (ఉదయించు సూర్యరూపమున నున్నవాడు) సాంఖ్య తత్త్వరూపుడునగు నీకు నమస్కారము. పృథివి అంతరిక్షము ద్యులోకము మహర్లోకము జనస్తపస్సత్యలోకములునను లోకముల రూపముననుండు నీకు నమస్కారము. నామ రూపాది కముతో వ్యక్తము కానివాడు మహద్రూపుడు భూతములకు ఆదియగువాడు ఇంద్రియరూపుడు ఆత్మ తత్త్వము నెరిగిన వాడు అన్నిటికంటెను గొప్పవాడు సర్వతత్త్వ రూపుడునగు నీకు నమస్కారము. నిత్యుడు ఆత్మలింగరూపుడు సూక్ష్ముడు చేతనరూపుడు బోధము (జ్ఞానము) పొందినవాడు సర్వవ్యాపియగువాడు మోక్షరూపుడునగు నీకు నమస్కారము. మూడు లోకములయందు ఉండు నీకు నమస్కారము. వీటికి పైగా ఉండు మూడు లోకములయందు ఉండు నీకు నమస్కారము. సత్యలోకముతో ముగియు నాలుగు లోకములయందును మహాలోకముతో ముగియు నాలుగు లోకములయందును ఉండు నీకు నమస్కారము.

బ్రహ్మజ్ఞుడవగు పరమేశ్వరా: ఈ నామస్తోత్రమునందు నేనేదైన పొరబాటులు పలికినను ఇది పలికిన ఇతడు నాభక్తుడేకదా యను దయతో నన్ను క్షమించ ప్రార్థించుచున్నాను.

సూతః: ఏవ మాభాష్య దేవేశ మీశ్వరం నీలలోహితమ్ ।
బహ్వాత్రిప్రణత స్తస్మై ప్రాఞ్జలి ర్వాగ్యతోఽభవత్. 174
కావ్యస్య గాత్రం సంస్పృశ్య హస్తేన ప్రీతిమా న్భవః । నికామం దర్శనం దత్త్వా తత్రైవా న్తరధీయత.175
తత స్సోఽన్తర్హితే తస్మిన్ దేవే సానుచరే తదా । తిష్ఠన్తీం పార్శ్వతో దృష్ట్వా జయన్తీ మిద మబ్రవీత్.176

శుక్రజయన్తీసంల్లాపః.

శుక్రః: కస్య త్వం సుభగే కా వా దుఃఖితే మయి దుఃఖితా ।
మహతా తపసా యుక్తం కిమర్థం మాం జుగోపసి. 177
అనయా సంస్థితా భక్త్యా ప్రశ్రయేణ ★యమేన చ । స్నేహేన చైవ సుశ్రోణి ప్రీతోఽస్మి వరవర్ణిని. 178
కి మిచ్ఛసి వరారోహే కస్తే కామ స్సమృద్ధ్యతామ్ ।
త త్తే సమ్పాదయా మ్యద్య యద్యపి స్యా త్సుదుర్లభమ్. 179
ఏవ ముక్తాఽబ్రవీ దేనం తపసా జ్ఞాతు మర్హసి । చికీర్షితం హిమే బ్రహ్మం స్త్వం హి వేద యథాతథమ్.
ఏవ ముక్తోఽబ్రవీ దేనాం దృష్ట్వా దివ్యేన చక్షుషా । మయా సహ త్వం సుశ్రోణి దశ వర్షాణి భామిని.
సర్వభూతై రదృశ్యా త్వం సమ్ప్రయోగ మిహేచ్ఛసి । దేవి ఇన్దీవరశ్యామే వరార్హే వామలోచనే. 182
ఏవం వృణోమి కామం త్వాం యది చే ద్వల్గుభాషిణి । ఏవం భవతు గచ్ఛావో గేహం మే మత్తకాశిని.
తత స్స గృహ మాగత్య జయన్త్యాః పాణి ముద్వహత్ । తయా సమభవ ద్దేవ్యా దశ వర్షాణి భార్గవః.
అదృశ్య స్సర్వభూతానాం మాయయా సంవృతః ప్రభుః ।
కృతార్థ మాగతం జ్ఞాత్వా కావ్యం సర్వే దితే స్సుతాః. 185
అభిజగ్ము ర్గృహం తస్య ముదితా స్తే దిదృక్షవః । గతా యదా న పశ్యన్తి మాయయా సంవృతం గురుమ్.
లక్షణం తస్య తద్బుద్ధ్వా ప్రతిజగ్ము ర్యథాగతమ్ ।

శుక్రుడు దేవేశుడును ఈశ్వరుడును నీలలోహితుడు నగు శివునితో ఇట్లు పలికి బహువారములు మిగుల ప్రణామములు చేసి దోసిలియొగ్గి మౌనము వహించెను. శివుడును ప్రీతుడై శుక్రుని శరీరమును స్పృశించి మిక్కిలి స్పష్టముగా తన దర్శనమునిచ్చి అచ్చటనే అంతర్ధానమునందెను.

తన అనుచరులతో కూడ ఆ దేవుడంతర్ధానమునందిన పిమ్మట తన సమీపమందున్న జయంతిని చూచి శుక్రుడిట్లు పలికెను: సుందరీ! ఎవ్వరిదానవు! ఎవరవు? నాదుఃఖములో పాలువంచుకొనుచున్నావు. నేను మహా తపస్సాచరించుచున్న కాలములో నన్ను కాపాడుచుంటివి. ఇటువంటి భక్తి వినయము ఇంద్రియ నిగ్రహము స్నేహము నా విషయమున చూపుచుండిన నీపై నేను ప్రీతుడనయితిని. నీకేమి కావలయును? చెప్పుము. అది ఎంత దుర్లభమయినను నీకోరిక నెరవేర్చెదను. అనగా ఆమె 'అయ్యా! దివ్యమగు తపశ్శక్తిచే కలిగిన జ్ఞాననేత్రముతో చూచి నాకోరికను మీరే ఎరుగ ప్రార్థించుచున్నాను.' అనెను. శుక్రుడు దివ్యదృష్టితోచూచి 'భామినీ! పది ఏండ్లపాటు నీవు భూతములకు వేనికిని అదృశ్యురాలవై నాతో కలిసియుండ గోరుచున్నావు. నల్ల కలువపూలవంటి చాయయు ఉత్తమ సుందర రూపమును మనోహర నేత్రములును మధురమగు వాక్కును కలదానవగుటచే నేనును నిన్ను కామించుచున్నాను. నీకోరికను తీర్చెదను. ఇంటికి పోవుదము రమ్ము. అనెను. తరువాత శుక్రుడు స్వగృహమునకు వచ్చి జయంతిని పెండ్లాడెను. అట్లే

పదిఏండ్లు ఏ భూతములకును కనబడక జయంతితో కూడి దాంపత్యము ననుభవించుచుండెను.

ఇట్లుండగా దైత్యులును తమ గురువగు శుక్రుడు తపస్సునందు కృతార్థుడై తిరిగి వచ్చెనని ఎరిగిరి. వారు సంతోషమునంది ఆయనను చూడగోరి అతని ఇంటికి పోయిరి. కాని శుక్రుడు మాయచే కప్పబడియున్నందున అతడు వారికి కనబడలేదు. అతడు మాయచే మరుగుపడియున్నాడని గ్రహించిరిగి వారును మరలిపోయిరి.

దైత్యానాం కపటవేష గురుకృతవిద్యాభ్యాసః.

బృహస్పతిస్తు సంరుద్ధం కావ్యం జ్ఞాత్వా వరేణ తమ్. 187
ప్రీత్యర్థం దశ వర్షాణి జయన్త్యా హితకామ్యయా । గురు స్తద న్తరం లబ్ధ్వా దైత్యానా మిన్ద్రచోదితః. 188
కావ్యస్య రూప మాస్థాయ అసురా న్సముపాహ్వయత్। తత స్తా నాగతా న్దృష్ట్వా బృహస్పతి రువాచ హ.
స్వాగతం మమ యాజ్యానాం ప్రాప్తోఽహం వో హితాయ వై ।
అహం వోఽధ్యాపయిష్యామి విద్యా ప్రాప్తా తు యా మయా. 190
తత స్తే హృష్టమనసో విద్యార్థ ముపపేదిరే । పూర్ణే కావ్యా త్తత స్తస్మి న్సమయే దశవార్షికే. 191
సమయా న్తే దేవయానీ తతోత్పన్నా ఇతి శ్రుతిః । బుద్ధిం చక్రే తత స్సో వై యాజ్యానాం ప్రత్యవేక్షణే.
దేవి గచ్ఛామ్యహం ద్రష్టుం మమ యాజ్యా న్శుచిస్మితే । విభ్రా న్తప్రేక్షణే సాధ్వి ★త్రివర్ణాయతలోచనే.
ఏవ ముక్తా బ్రవీ దేనం భజ భక్తా న్మహావ్రత । ఏష ధర్మ స్సతాం బ్రహ్మ న్న ధర్మం లోపయామి తే.
తతో గత్వాఽసురా న్దృష్ట్వా దేవాచార్యేణ ధీమతా ।
వఞ్చితా న్కావ్యరూపేణ తతః కావ్యోఽబ్రవీత్తు తాన్. 195
కావ్యం మాం వో విజానీధ్వ మయ మాఙ్గిరసో విభుః।
వఞ్చితా ●ఖత యూయం తే సర్వే శృణుత దానవాః. 196
శ్రుత్వా తథా బ్రువాణం తం సమ్భ్రాన్తా స్తే తదాఽభవన్ ।
ప్రేక్ష న్త స్తా వుభౌ తత్ర స్థిరాసీనౌ శుచిస్మితౌ. 197
సమ్ప్రమూఢా స్తత స్సర్వే ప్రాబుధ్య న్త న కిఞ్చన । అబ్రవీ త్సమ్ప్రమూఢేషు కావ్య స్తా నసురాం స్తదా.
ఆచార్యో వో హ్యహం కావ్యో దేవాచార్యోఽయ మఙ్గిరాః।అనుగచ్ఛన్తు మాందైత్యా స్త్యజతైనం బృహస్పతిమ్.
ఇత్యుక్తా హ్యసురా స్తేన తావుభౌ సమవేక్ష్యచ । యథా పురా విశేషం తు నజానన్త్యుభయో స్తయోః. 200
బృహస్పతి రువాచైనా ననమ్భ్రాన్త స్తపోధనః ।
కావ్యో వోఽహం ♦గురు ర్దైత్యా మద్రూపోఽయం బృహస్పతిః. 201
సమ్మోహయతి రూపేణ మామకేనైష వోఽసురాః ।
శ్రుత్వా తస్య వచ స్తే వై సమేత్యోచు ర్వచో ధ్రువమ్. 202
అయం నో దశ వర్షాణి సతతం శాస్తి వై ప్రభుః । ఏష వై గురు రస్మాక మన్తరేప్సు రయం ద్విజః.
తత స్తే దానవా స్సర్వే ప్రణిపత్యాభివాద్యచ । వచనం జగృహు స్తస్య చిరాభ్యాసేన మోహితాః. 204
ఊచు స్త మసురా స్సర్వే క్రోధా త్సంర క్తలోచనాః ।
అయం గురు ర్యతోఽస్మాకం గచ్ఛ త్వం నాసి నో గురుః. 205
భార్గవో వాఙ్గిరోవాపి భగవా నేష నో గురుః । స్థితా వయం నిదేశేఽస్య సాధు త్వం గచ్ఛ మా చిరమ్.206
ఏవ ముక్త్వాఽసురా స్సర్వే ప్రాపద్య న్త బృహస్పతిమ్ ।

---

★ విస్తీ ● ఏవ యూయంవై ♦ రురెతాః కుహకో

శుక్రుడు శివునివలన వరములను పొంది వచ్చెననియు ఐనను జయంతికి మేలు చేయగోరి పదిఏండ్లపాటు మాయతో ఆవృతుడై మరుగువడియుండుననియు బృహస్పతి ఎరిగెను. ఈ అవకాశములో అతడు ఇంద్రుని ప్రేరణచే శుక్రుని రూపము ధరించి దైత్యులను తనకడకు పిలిచెను. వారు తనకడకు రాగా అతడు వారితో ఇట్లు పలికెను: "నాకు యాజ్యులు (యజ్ఞాదులు చేయింపబడువారు) అగు మీకు స్వాగతము. నేను మీకు మేలు చేయగోరి వచ్చినాను. నేను సంపాదించి తెచ్చిన విద్యలను మీచే అధ్యయనము చేయింతును." వారును సంతోషముతో విద్యాధ్యయనార్థము బృహస్పతిని ఆశ్రయించి యుండిరి.

కాలము గడచెను. పదిఏండ్లును నిండెను. ఆ సమయము ముగియునరికి జయంతీ శుక్రులకు దేవయాని జన్మించెనని పరంపరలో వినుచున్నాము.

అంతట శుక్రుడు తన యాజ్యులగు దానవుల మంచిచెడ్డలను విచారించగోరెను. నేను నా యాజ్యులను చూడబోయెదనని అతడు జయంతితో పలికెను. "మహాతపస్వీ! నీభక్తులను అనుగ్రహించుము. సజ్జనుల ధర్మము ఇదియే కదా! నేను నీ ధర్మమునకు లోపము కలుగనీయను. అని జయంతి పలికెను.

దేవాచార్యుడగు శుక్రుడు పోయి దానవులను దైత్యులను చూచెను. బృహస్పతి శుక్రరూపమున వారిని వంచించెనని అతడు ఎరిగెను. "దైత్యులారా! నేను శుక్రుడనని గురుతించుడు. ఇతడు వివిధ రూపములు ధరించుటలో సమర్థుడగు బృహస్పతి. ఇతడు మిమ్ము వంచించెను. నామాట వినుడు." అనెను. శుక్రుడు అట్లు పలుకుట విని దైత్యులు తడబాటు చెందిరి. వారు ఆ ఇరువురను చూచుచుండిరి. ఆ ఇరువురును పవిత్రమగు చిరునవ్వుతో స్థిరముగా కూర్చుండియుండిరి. వారందరును మిగుల మూఢ చిత్తులయిరి. వారికి ఏమియు అర్థము కాకపోయెను. అట్టి దైత్య దానవులను చూచి శుక్రుడు మరల "నేను మీ ఆచార్యుడనగు శుక్రుడను. ఇతడు దేవాచార్యుడు ఆంగిరసుడు (బృహస్పతి). మీరందరు నన్ను ననరించుడు. ఈ బృహస్పతిని విడువుడు." అనెను. అసురులును శుక్రుని ఈ మాటలు వినిరి. వారు ఇద్దరను గమనించి చూచిరి. ఎంత చూచినను వారికి ఆ ఇద్దరకు గల భేదము ఏమియు గోచరించలేదు. తపోధనుడగు బృహస్పతి ఏమాత్రము తడబడక దానవులతో ఇట్లనెను. "దైత్యులారా! మీ గురుడనగు శుక్రుడను నేనే. ఇతడు (వాస్తవ శుక్రుడు) నా రూపము దాల్చిన బృహస్పతి. ఇతడు ఇట్లు మిమ్ములను మోసపుచ్చుచున్నాడు." అంతట దానవులందరును తమలోతాము సంప్రతించుకొనిరి. అందరు కలిసి గట్టిగా ఇట్లనిరి: "ఇతడు పది సంవ్సరముల నుండి మనలను తన శిక్షణయందుంచుచున్నాడు. ఇతడే మనకు ప్రభువు (యోగక్షేమము కలిగింపగల సమర్థుడు.) ఇతడే మనకు గురువు. ఈ (రెండవ) బ్రాహ్మణుడు అవకాశము చూచుకొని వచ్చినవాడు." ఇట్లు పలికిన వారందరును మాయా శుక్రునికి చాగిలపడి నమస్కారము చేసిరి. చాల కాలమునుండి అలవాటు పడియున్నందున వారు సత్యమును గుర్తించలేకపోయిరి. అందుచే వారు బృహస్పతి మాటనే సత్యముగా గ్రహించిరి. వారు క్రోధముతో కండ్లెర్రజేసి శుక్రునితో ఇట్లు అనిరి: "ఇతడే మా గురువు. కనుక నీవు వెళ్ళిపొమ్ము. నీవు మాకు గురువవుకావు. ఈతడు శుక్రుడో బృహస్పతియో మాకు అక్కరలేదు. ఈ భగవానుడే మాగురువు. మేమందరమును ఇతని ఆజ్ఞయందే ఉంటిమి. ఉన్నాము. ఉందుము. నీవు ఇటనుండి తిన్నగా వెళ్ళిపొమ్ము. తడవు చేయకుము." అనిరి. ఇట్లు పలికి దానవులు అందరను బృహస్పతిని గురునిగా ఆశ్రయించి ఉండిరి.

యదా న ప్రతిపద్యన్త కావ్యేనోక్తం మహ ద్ధితమ్. 207
చుకోప భార్గవ స్తేషా మవలేపేన తేన తు । బోధితా మాయయా యస్మాన్న మాం భజథ దానవాః. 208
తస్మా త్ప్రణష్టసంజ్ఞావై పరాభవ మవాప్స్యథ ।
ఇతి వ్యాహృత్య తా న్కావ్యో జగామాథ యథాగతమ్. 209

శప్తాం స్తా నసురా న్జ్ఞాత్వా కావ్యేన స బృహస్పతిః ।
కృతార్థస్తు తదా హృష్ట స్స్వరూపం ప్రత్యపద్యత. 210
బుద్ధ్వాహతాసురా న్జ్ఞాత్వా తత్రైవాన్తరధీయత । తతః ప్రణష్టే తస్మింస్తు విభ్రాన్తా దానవాఽభవన్. 211

పున శ్శుక్రంప్రతి దానవాగమనమ్.

అహోధి గ్వఞ్చితా స్తేన పరస్పర మథాఽబ్రువన్ ।
పృష్ఠతోఽభి ముఖాశ్చైవ తాడితాఽఙ్గిరసేన తు. 212
వఞ్చితా స్సాధునా తేన స్వకృత్యేనతు మాయయా ।
తతస్తు పరిశుష్కాస్యా స్తమేవ త్వరితా యయుః. 213
ప్రహ్లాద మగ్రతః కృత్వా కావ్యస్యానుపదం పునః ।
తతః కావ్యం సమాసాద్య తేఽవతస్థు రవాఙ్ముఖాః. 214
ఆగతా న్స పున ర్దృష్ట్వా కావ్యో యాజ్యా నువాచ హ ।
మయా సమ్బోధితా స్సర్వే యస్మా న్మాం నాభినన్దథ. 215
తత స్తేనావమానేన గతా యూయం పరాభవమ్ ।
ఏవం బ్రువాణం శుక్రంతు బాష్పసన్దిగ్ధలోచనః. 216
ప్రహ్లాద స్తం తదోవాచ మాఽస్మాం స్త్వం త్యజ భార్గవ ।
స్వాశ్రయా న్భజమానాంశ్చ భక్తాంశ్చ భజ భార్గవ. 217
త్వ య్యదృష్టే వయం తేన దేవాచార్యేణ మోహితాః ।
భక్తా న్నార్హసి వై హాతుం తపోదీర్ఘేణ చక్షుషా. 218
యది న స్త్వం న కురుషే ప్రసాదం భృగునన్దన ।
అవజ్ఞాతా స్త్వయా హ్యద్య ప్రవిశామో రసాతలమ్. 219

తాను చెప్పిన అంతటి గొప్ప హితవచనమును దైత్యులు వినకపోవుటచేత శుక్రుడు వారిపై చాల కోపించెను. వారి గర్వము కూడ అతనికి కోపహేతువయ్యెను. "మాయా బలమున బృహస్పతి చేసిన బోధనములు విని మీరు నన్నాశ్రయింపకున్నారు. కావున దానవులారా! మీరు తెలివి కోల్పోయి పరాభవముల పాలగుదురుగాక!" అని పలికి శుక్రాచార్యుడు తాను వచ్చిన త్రోవను పోయెను.

శుక్రునిచేత దానవులు శపింపబడినట్లు తెలియగనే బృహస్పతి తాను కృతార్థుడయ్యెనని తలచి హర్షము పొందెను. అసురులు బుద్ధి కోల్పోయినమాట అతనికి సంతోషము కలిగించెను. వెంటనే అతడు స్వరూపము ధరించెను. అంతర్ధానము కూడ పొందెను.

అతడట్లు అంతర్ధానము పొందగా దైత్యులు విభ్రాంతులయిరి. అయ్యో! ఛీ! అతడు మనలను మోసగించెనే! అని ఒకరితో మరియొకరనసాగిరి. ఈ ఆంగిరసుడు (బృహస్పతి) మనలను వెనుకనుండియు ముందునుండియు దెబ్బ తీసెనే! అతడు తన మాయ చేష్టలతో మనలను మోసగించెనే! అని చింతించిరి. అంతట వారు చింతచే నోళ్ళెండిపోవు చుండ ప్రహ్లాదుని ముందుంచుకొని శుక్రుని అడుగుల వెంటనే బయలుదేరి అతడు వెళ్ళిన మార్గముననుసరించి పోయిరి. చివరకు శుక్రుని సమీపము చేరిరి. తలవంచుకొని అతని ముందు నిలువబడిరి.

మరల తన ఎదుటికి వచ్చిన తన యాజ్యులైన దానవులను చూచి శుక్రుడు వారితో నేనెంత హెచ్చరించినను "మీరందరును నామాటపై ఆదరము చూపక పోతిరి. నాపై మీరు చూపిన అవమాన దృష్టికి ఫలముగా మీరు అవమానము పొందితిరి." అనెను.

శుక్రాచార్యుడు ఇట్లు పలుకుచుండ ప్రహ్లాదుడు బాష్పములు క్రమ్మిన కన్నులతో ఇట్లు పలికెను: "భార్గవా! మీరు మమ్ములను విడువవలదు. మాకు మీరే ఆశ్రయము. మేము మిమ్ము ఆశ్రయించుచున్నాము. మీకు భక్తులము. ఇట్టి మాకు మీరు ఆశ్రయము ఇందు. మీరు మాకు కనబడని సమయములో దేవగురువు మమ్ములను మోసగించెను. మమ్ములను మాయలో పడవేసెను. తపస్సుచే దీర్ఘములగు నేత్రములుగల మీరు ఎంతవరకైన మీదృష్టి ప్రసారము చేయగలరు. మీరే మామనస్సులలోనికి చూడుడు. మేము మీ భక్తులము. మమ్ములను విడువవలదు. భృగునందనా! మీరు మమ్ముల ననుగ్రహింపనిచో-మీరు మమ్ములను అలక్ష్యముగా చూచినచో-మేము ఇప్పుడే రసాతలమును ప్రవేశింతుము.

జ్ఞాత్వా కావ్యో యథాతత్త్వం కారుణ్యా దనుకమ్పయా ।
ఏవం ప్రత్యనుసీతో వై తతః కోపం నియమ్య సః. 220

ఉవాచైనం ; శుక్రః : న భేతవ్యం న గన్తవ్యం రసాతలమ్ ।
అవశ్యం భావినో హ్యర్థాః ప్రాప్తా వో *మమ చాగ్రతః. 221

న శక్య మన్యథా కర్తుం దిష్టం హి బలవత్తరమ్ ।
సంజ్ఞా ప్రణష్టా వో యాజ్యాః కాలేన ప్రతిపత్స్యథ. 222

దేవై ర్జితా న కుత్రాపి పాతాళం ప్రతిపత్స్యథ । ప్రాప్తః పర్యయకాలో వ ఇతి బ్రహ్మాఽభ్యభాషత. 223
మత్ప్రసాదాచ్చ త్రైలోక్యం భుక్తం యుష్మాభి రూర్జితం ।
యుగాఖ్యా దశ సమ్పూర్ణా దేవా నాక్రమ్య మూర్ధని. 224
ఏతావదేవ వః కాలం బ్రహ్మ రాజ్యం ప్రభాషత । రాజ్యం సావర్ణికే తుభ్యం పునః కిల భవిష్యతి. 225
లోకానా మీశ్వరో భావ్య స్తవ పౌత్త్రః పున ర్బలిః । ఏవం కిల మిథః ప్రోక్తః పౌత్త్రస్తే విష్ణునా స్వయమ్.
తదా హృతేషు లోకేషు తా స్తా స్తస్యాభవ న్గిరః ।
యస్మా త్ప్రవృత్తయ శ్చాస్య నకాశా దభినన్దితాః. 227

తస్మా దనేన ప్రీతేన కృత్స్నం దత్తం స్వయమ్భువా ।
దేవరాజ్యే బలిర్భావ్య ఇతి మా మీశ్వరోఽబ్రవీత్. 228

తస్మా దదృశ్యో భూతానాం కాలాపేక్ష స్స తిష్ఠతి ।
ప్రీతేన చామరత్వం చ దత్తం తుభ్యం స్వయమ్భువా. 229

తస్మా న్నిరుత్సుక స్త్వం వై పర్యాయసహితోఽసురైః ।
న హి శక్యం మయా తుభ్యం పురస్తా ద్విప్రభాషితుమ్. 230

బ్రహ్మణా ప్రతిషిద్ధోఽహం భవిష్య జ్జానతాఽప్యభో ।
ఇమౌతు శిష్యౌ ద్వౌమహ్యం సమ్మతౌ వై బృహస్పతేః. 231

దైవతైః స్సహ సంయుక్తా సురాన్వై వారయిష్యథ । ఇత్యుక్తా హ్యసురా స్సర్వే కావ్యేనాక్లిష్టకర్మణా. 232
హృష్టా స్తథా యయు స్సర్వే ప్రహ్లాదేన సహాసురాః ।
అవశ్యం భావ్య మర్థంతు శ్రుత్వా శుక్రేణ భాషితమ్. 233

శుక్రాచార్యుడు యథార్థమును తెలిసికొనెను. అతడు సహజముగానే కరుణా స్వభావుడు. భూతములపై అనుకంప కలవాడు. ప్రహ్లాదాది దైత్యులను తన్నెంతగానో బ్రతిమాలిరి. అందుచే అతడు తన కోపము అణచుకొని

* మయి జాగ్రతి

ప్రహ్లాదునితో ఇట్లు పలికెను: "మీరు భయపడవలదు. రసాతలమునకు పోవలసిన పనిలేదు. అవశ్యము జరుగవలసిన విషయములు ఏవో మీకును జరిగినవి-నాకును జరిగినవి. దైవనిర్ణయము బలవత్తరము. దానిని మనము మార్చజాలము. నాయాజ్యాలగు మీకు దురదృష్టవశమున తెలివి తప్పినది. మరల తగిన కాలమున మీకు తెలివి వచ్చును. దేవతల చేతిలో మీరు ఓటమి పొంది పాతాళమునకు పోవలసిన ఆగత్యము ఎప్పటికిని రాదు. ఇప్పుడు మీకు ప్రతికూల సమయము వచ్చి ఇట్లు జరిగినది. అని బ్రహ్మ పలికియున్నాడు. నా యనుగ్రహమున మీరు శక్తి సంపత్సమృద్ధమైన త్రైలోక్యరాజ్యమును అనుభవించితిరి. పది దివ్య యుగములపాటు దేవతల శిరస్సులపై మీ పాదముల నిలువగలిగితిరి. మీ రాజ్యకాలము ఇంతమాత్రమే. అని బ్రహ్మ పూర్వము చెప్పియుండెను. మరల సావర్ణిక మన్వంతరమున నీకు (ప్రహ్లాదునకు) రాజ్యాధికారము వచ్చును. తరువాత మీ మనుమడు బలి మరల త్రిలోకములకును ఈశ్వరుడగును. ఈ విషయమును రహస్యమున మీ మనుమడైన బలితో స్వయముగా విష్ణువే చెప్పియుండెను. విష్ణువు తాను బలినుండి వంచనచే లోకములను హరించిన సమయమున అంతవరకు బలి తన పాలిత ప్రదేశములందన్నిట ప్రవర్తిల్లజేసిన లోకప్రవృత్తులను గూడ మోనముచే తీసివేసికొనెను. అందుచే ప్రీతుడై విష్ణువు ★బలికి ఈ వరమునిచ్చెను. అందుచే బలి మరల దేవరాజ పదము నలంకరించి తీరవలయును. అని ఈశ్వరుడే నాతో చెప్పియున్నాడు. అందుచేత బలి అంతవరకును ఏ భూతములకును అదృశ్యుడై మంచి కాలమునకు ఎదురు చూచుచుండును. అట్లే విష్ణువు నీకును అమరత్వమును వరముగనిచ్చియున్నాడు. అందుచే నీవు ఏమియు తహతహపడక పర్యాయక్రమములో (వంతుల ననుసరించి) దేవతల అధికారము తరువాత మీ అధికారకాలము వచ్చువరకు ఎదురు చూడవలయును. నేను నీముందు అసత్యము పలుకజాలను. ఈ విషయము నీతో ఇప్పటికే చెప్పవలసియుండెను. కాని బ్రహ్మ చెప్పవలదనుటచే నాకు ఈ భవిష్యత్ తెలిసియుండియు నీకు చెప్పియుండలేదు. ఈ నా శిష్యులిద్దరును (శండుడు మర్కుడు అనువారు) బృహస్పతికి ఆదరపాత్రులై యుండి దేవతలతో కలిసియుండి (మీకు నాశము కలుగనీయకుండునట్లు) దేవతలను వారింతురు."

అని ఇట్లు శుక్రుడు దానవులకు చెప్పెను. అతడు ఎట్టి క్లిష్టమయిన పనులనైనను సునాయాసముగా చక్కపెట్టగలవాడు. తప్పక జరిగి తీరెడి భవిష్యద్విషయములనే శుక్రుడు తమకు చెప్పెను. కనుక ప్రహ్లాదుడు మొదలగు దైత్యులందరును హర్షముతో వెడలిపోయిరి.

సకృ దాశంసమానాస్తు భయం శుక్రేణ భాషితమ్ ।
దంశితా స్సాయుధా స్సర్వే తతో దేవా స్సమాహ్వయన్. 234
దేవా స్తథాఽసురా న్దృష్ట్వా సఙ్గ్రామే సముపస్థితాన్ ।
సర్వే సమ్భృతసమ్భారా దేవా స్తా స్సమయోధయన్. 235
దైవాసురే తత స్తస్మి న్వర్తమానే శతం సమాః ।
అజయ న్నసురా దేవాం స్తతో దేవా స్త్వమన్త్రయన్. 236
యజ్ఞేనోపాసయామోఽద్య తతో జేష్యామహేఽసురాన్ ।
తత స్సమ్మన్త్రయన్దేవా శ్శణ్డామర్కౌ తు తా వుభౌ. 237
యజ్ఞేనోపాహ్వయిష్యామ స్త్వక్షతా నసురాన్ ద్విజాః ।
తతో గ్రహా గ్రహీష్యామ స్సహ జిత్వా తు దానవాన్. 238

★ బలి చక్రవర్తి తన పాలనకాలమున త్రిలోకములందును ఒక ఉత్తమమగు పాలన వ్యవస్థను నిలిపెను. విష్ణువు దేవతలకై బలినుండి త్రిలోకరాజ్యమును హరించెనేకాని బలి అతఃపూర్వము లోకములందు నిలిపిన ప్రవృత్తులకంటె మేలగు ప్రవృత్తులను దేవతలు కాని మానవులుకాని ఎవ్వరును ఏర్పరుపలేరు. కావున తరువాత దేవతలు బలి అంతకు మునుపు నడుపుచుండిన ప్రవృత్తులతోనే లోకపాలనను సాగించిరి. ఇది బలి గొప్పదనము. బలి ఇట్టి ఉత్తమ పాలకుడు గావున అతని విషయమున విష్ణువు ప్రీతుడై అతనికి ఉత్తమ వరములిచ్చుట ఆశ్చర్యకరముకాదు.

ఏవం కృత్వాఽభిసన్ధానం శణ్డామర్కౌ సురా నగుః ।
తతో దేవా జయం ప్రాప్తా దానవాశ్చ పరాజయమ్. 239
శణ్డామర్కౌ పరిత్యక్తౌ దానవా హ్యబలా స్తదా ।
ఏవం దైత్యాః పురా కావ్య ●కోపేనాభిహతా స్తథా. 240
దేవై ర్దైత్యాః పరాభూతా శ్శణ్డామర్కా వుపాశ్రితాః ।
కావ్యకోపాభిభూతాస్తే అనాధారాశ్చ సర్వతః. 241
నిరస్యమానా దేవైశ్చ వివిశుస్తే రసాతలమ్ । ఏవం నిరుద్య తై ర్దేవై ర్జితాః కృచ్ఛ్రేణ దానవాః. 242
ప్రహ్లాదస్య తు నిర్దేశే న స్థాస్యం త్యసురాశ్చ యే ।
మనుష్యవధ్యాం స్తా న్సర్వాన్ బ్రహ్మాఽభివ్యాహర త్ప్రభుః. 243

శుక్రుడు చెప్పినట్లు తమకు దేవతలవలన భయము రానున్నదని ఎరిగి దానిని వారించుకొనదలచి దైత్యులు కవచములను ఆయుధములను ధరించి దేవతలను యుద్ధమునకు ఆహ్వానించిరి. అది చూచిన దేవతలును ఆయా సామగ్రులను సమకూర్చుకొని దైత్యులతో తలపడిరి. ఈ దైవాసుర యుద్ధము నూరేండ్లు జరిగెను. దీనిలో తుదకు దైత్యులే దేవతలను గెలిచిరి. దేవతలోడిరి.

దేవతలు అందరును మంత్రాలోచనము చేసిరి. యజ్ఞముచే (భగవానుని) ఉపాసింతము. ఆ విధముగ దైత్యులను ఓడింతము. అని సంకల్పించిరి.

వారంతట శుక్ర శిష్యులగు శండామర్కులను బ్రాహ్మణులను పిలిచి "మనము యజ్ఞము జరుపుదము. తరువాత ఇప్పటికి యుద్ధమున గాయపడకుండిన దైత్యులనందరను యుద్ధమునకు పిలిచెదము. మనమందరము కలిసి దానవులను గెలిచి వారి ధనమును గెలిచికొందము." అనిరి. ఇట్లు మోసముతో ఒడంబడిక చేసికొని ★ శండామర్కులు దేవతల పక్షమునకు పోయిరి. దీనికి ఫలితముగా దేవతలు గెలిచిరి. దైత్యులోడిరి. శండామర్కులు తమ్ము విడిచి పోయినందున దానవులు బలహీనులైరి. ఇట్లు పూర్వము దైత్యులు శుక్రుని కోపము మూలమున దెబ్బతిని దేవతల చేతిలో పరాభవము నందిరి. అపుడు మరల వారు శండామర్కుల నాశ్రయించిరి.

దైత్యులు ఇట్లు కావ్యుని కోపముచే వ్యాప్తులై ఎచ్చటను ఏ ఆశ్రయమును లేనివారయిరి. దేవతలచే ముట్టడించబడి వారిచేతిలో ఓడిపోయి ఎన్నో క్లేశముల పాలయిరి. ప్రహ్లాదుని ఆజ్ఞకు లోబడి నడచుకొనని రాక్షసులందరును మానవుల చేతులలో కూడ మరణింతురని బ్రహ్మ పూర్వమే పలికియుండెను.

విష్ణో ర్భృగుశాపనిమిత్తకధర్మాద్యవతారాః.

తతః ప్రభృతి శాపేన భృగునైమిత్తికేన చ । జజ్ఞే పునః పున ర్విష్ణు ర్ధర్మే ప్రశిథిలే ప్రభుః. 244
కుర్వ న్ధర్మవ్యవస్థాన మసురాణాం నిబర్హణమ్ ।
ధర్మో నారాయణస్యాంశా త్సమ్భూత శ్చాక్షుషేఽన్తరే. 245
యజ్ఞం వై వర్తయామాసు ర్దేవా వైవస్వతేఽన్తరే ।
ప్రాదుర్భావే తత స్తస్య బ్రహ్మాప్యాసీ త్పురోహితః. 246

● శాపేనా

★ ఈ సందర్భమున దేవతలు జరిపిన యజ్ఞమును శండామర్కులు నిర్వహించిన విషయమే ఈ అధ్యాయమున ఏబది ఐదవ శ్లోకమున చెప్పబడియున్నది.

యుగాఖ్యాయాం చతుర్థాయా మాపన్నే ష్వమరేషు వై । హిరణ్యాక్షవధార్థాయ హిరణ్యకశిపో స్తథా. 247
ద్వితీయే నారసింహాఖ్యే ★రుద్రోఽప్యాసీ త్పురోహితః ।
బలి సంస్థేషు లోకేషు త్రేతాయాం సప్తమం ప్రతి. 248
తృతీయం వామనస్యార్థే ధర్మేణతు పురోయే ।
ఏతా స్తిస్ర స్స్మృతా స్తస్య దివ్యా స్సమ్భూతయ శ్శుభాః. 249
మానుషా స్సప్త యేఽన్యే తు శాపజా స్తా న్నిబోధత ।
త్రేతాయుగేఽథ ప్రథమే దత్తాత్రేయో బభూవ హ. 250
నష్టే ధర్మే చతుర్థోఽసౌ మార్కండేయః పురోహితః ।
పఞ్చమః పఞ్చదశ్యాంచ త్రేతాయాం సమ్బభూవహ. 251
మాన్ధాతా చక్రవర్తీతు తస్య రైభ్యః పురోహితః । ఏకోనవింశ త్రేతాయాం సర్వక్షత్రా న్తకృ ద్విభుః. 252
జామ దగ్న్య స్తథా షష్ఠో విశ్వామిత్రపురస్సరః । చతుర్వింశే యుగే రామో వసిష్ఠేన పురోధసా. 253
సప్తమో రావణస్యార్థే జజ్ఞే దశరథాత్మజః । అష్టమో ద్వాపరే విష్ణు రష్టావింశే పరాశరాత్. 254
వేదవ్యాస స్తథా జజ్ఞే జాతూకర్ణ్యపురస్సరః । కర్తుం ధర్మవ్యవస్థాన మసురాణాం నిబర్హణమ్. 255
కృష్ణో నవమకో జజ్ఞే తపసా పుష్కరేక్షణః । దేవక్యాం వసుదేవేన ద్వైపాయనపురస్సరః. 256
తస్మిన్నేవ యుగే క్షీణే సన్ధ్యాశిష్టే భవిష్యతి । కల్కి ర్విష్ణుయశా నామ పారాశర్యపురస్సరః. 257
దశమో భావిసమ్భూతో యాజ్ఞవల్క్యః పురోహితః ।
సర్వాంశ్చ భూతా న్పరిమితా న్పాషణ్డాంశ్చైవ సర్వతః. 258
ప్రగృహీతాయుధై ర్విప్రై ర్వృత శ్శతసహస్రశః । నిశ్శేషా న్శూద్ర రాజ్ఞస్తు తదా చాన్తం కరిష్యతి. 259
బ్రహ్మద్విష స్సవత్నాంస్తు సంహృత్యైవ తతః ప్రభుః ।
పఞ్చవింశే స్థితః కల్కి శ్చరితార్థ స్ససైనికః. 260
శూద్రా న్సంశోధయిత్వా తు సముద్రాన్తే చ వై స్వయమ్ ।
ప్రవృత్తచక్రో బలవా న్సంహారంతు కరిష్యతి. 261
ఉత్పాటయిత్వా వృషలా న్ప్రాయశ స్తా నధార్మికాన్ । తత స్తై ర్దానవైః కల్కి శ్చరితార్థస్ససైనికః.
ప్రజా స్సంశోధయిత్వాతు సముద్రాన్తే శయిష్యతి ।
అకస్మా త్కోపనాఽన్యోన్యం హనిష్య న్తీహ మోహితాః. 263
క్షపయిత్వా తతోఽన్యోన్యం భావితార్థేన చోదితాః । తతః కలౌ వ్యతీతేతు స దేవోఽన్తరధీయత. 264

**తరువాత అది మొదలుకొని భృగు శాపమును నిమిత్తముగా చేసికొని ప్రభువగు శ్రీ నారాయణుడు లోకమున ధర్మము మిగుల శిథిలమయినపుడెల్ల ధర్మవ్యవస్థను రాక్షస నాశమును కలిగించుటకై మరల మరల అవతారములను ఎత్తనారంభించెను. ఇట్లు అతడు అజుడు-జన్మము లేనివాడయ్యును జన్మము నందసాగెను.**

**వీనిలో మొదటిది ధర్మావతారము : చాక్షుష మన్వంతరమున నారాయణుడు అంశముతో ధర్ముడుగా అవతరించెను. అతని ప్రాదుర్భావ కాలమునందే ఆ చాక్షుష మన్వంతరమునందే దేవతలు యజ్ఞము నాచరించిరి. ఈ యజ్ఞము నందు బ్రహ్మ అధ్వర్యుడుగా నుండెను.**

**రెండవది నారసింహావతారము: నాలుగవ దివ్య యుగమునందు అమరులకు ఆపదలు కలుగగా హిరణ్యాక్ష**

★ రుద్రోప్యాసీత్పురోహితః

హిరణ్యకశిపులను వధించుటకై నారాయణుడు నారసింహుడయ్యెను. ఈ కాలమున దేవతలు జరిపిన యజ్ఞమున రుద్రుడు పురోహితుడు (అధ్వర్యుడు) అయ్యెను.

మూడవది వామనావతారము: సప్తమ మహాయుగపు త్రేతాయుగమున త్రిలోకములును బలి వశగతములు కాగా నారాయణుడు వామనుడుగా నవతరించెను. ఈ కాలమున దేవతలు జరిపిన యజ్ఞమున ధర్ముడు (మహాముని) అధ్వర్యుడు అయ్యెను.

ఇవి శ్రీ మహావిష్ణువునకు భృగుశాప నిమిత్తమున కలిగిన జన్మములలో మూడు. ఇవి దివ్యములగు (దేవతా తత్త్వ సంబంధులగు) అవతారములు. ఇవికాక మిగిలిన ఏడును మానుషములు.

నాలుగవది దత్తాత్రేయావతారము. ఇది ప్రథమ త్రేతా యుగమున జరిగెను. ఈ కాలమున దేవతలు జరిపిన యజ్ఞమునందు మార్కండేయుడు పురోహితుడయ్యెను.

పదునైదవ త్రేతాయుగమున జరిగిన మాంధాతృ చక్రవర్త్యవతారము ఐదవది. అతనికి రైభ్యుడు పురోహితుడయ్యెను.

పందొమ్మిదవ త్రేతాయుగమున జరిగిన పరశురామావతారము ఆరవది. ఈ విభుడు సర్వక్షత్త్రాంతకరుడు. ఇతడు జమదగ్ని కుమారుడు. విశ్వామిత్త్రు డితనికి పురోహితుడు.

ఇరువది నాలుగవ త్రేతాయుగమున రావణవధార్థమై దశరథ కుమారుడుగా జనించిన శ్రీ రాముని అవతారము ఏడవది. ఇతనికి వసిష్ఠుడు పురోహితుడు.

ఇరువది ఎనిమిదవ ద్వాపరయుగమున పరాశర పుత్త్రుడుగా జన్మించిన వేదవ్యాసుడు ఎనిమిదవ యవతారము. జాతుకర్ణ్యుడు ఈతనికి పురోహితుడు. ఈతడు ధర్మప్రతిష్ఠాపనమును అసురనాశమును జరుపుటకు హేతుభూతుడయ్యెను.

పద్మనేత్రుడగు శ్రీ నారాయణుడు ఇదే ఇరువది ఎనిమిదవ ద్వాపరమున దేవకీ వసుదేవుల కుమారుడగు కృష్ణుడుగా నవతరించెను. ఇది తొమ్మిదవ యవతారము. ఇతని పురోహితుడు ద్వైపాయన వ్యాసుడు.

ఈ కల్పమునందే యుగధర్మము క్షీణించగా కల్పసంధ్యాకాలమున విష్ణుయశుడు అనునాతనికి కల్కి అను పేర కుమారుడుగా శ్రీ నారాయణుడు జనించును. ఇది పదియవ యవతారము. ఇతనికి పారాశర్య వ్యాసుడు అగ్రేసరుడై యుండును. యాజ్ఞవల్క్యుడితని పురోహితుడు. ఆయుధములు ధరించిన లక్షల కొలది విప్రులీతనికి సేనగా నుందురు. ఈతడు దుష్టులగు అనేక భూతములను పాషండులను వేదములకు విప్రులకు శత్రువులగు నరులను శూద్రులగు వేదద్వేషులగు రాజులను అంతము నొందించును. సముద్రముల అంచులవరకు గల ఈ భూమండలమునందలి దుష్ట శూద్రులను నశింపజేయును. ఆ కాలమునందే జనులును దుష్టులగు వారు మోహితులై ఒకరిని మరియొకరు వధించుకొందురు. జరుగవలసిన భవితవ్యత ప్రేరించగా ఆ దుష్టులందరు నట్లు నశించగా ఇంతలో కలియుగము గడువగా ఆ కల్కి మూర్తి అంతర్ధానమునందును.

## కలిధర్మాః.

నృపే ష్వత ప్రణష్టేషు ప్రజానాం నగ్రహే త్తదా ।

రక్షణే తు నివృత్తే తు హత్వా చాన్యోఽన్య మాహవే. 265

పరస్పరం చ హత్వా తు నిరాక్రన్దా స్సుదుఃఖితాః । పురాణి హిత్వా గ్రామాంశ్చ తుల్యాత్వే నిష్పరిగ్రహాః.

ప్రణష్టాశ్రమధర్మార్థా నష్టవర్ణాశ్రమా స్తథా । అట్టశూలా జనపదా శ్శివశూలా శ్చతుష్పథాః. 267

ప్రమదాః కేశశూలిన్యో భవిష్యన్తి కలౌ యుగే । హ్రస్వదేహాయుష శ్చైవ భవిష్యన్తి వనౌకసః. 268

నదీపర్వతసేవిన్యో మూలపత్రఫలాశనాః । చీరచర్మాజినధరా స్సంకటం ఘోర మాశ్రితాః. 269
ఉత్పన్నవాదా స్స్వల్పస్వా బుద్ధివాదాల్పకాః ప్రజాః । ఏవం కష్ట మనుప్రాప్తాః కలౌ సఙ్కరకే తథా. 270
తదా క్షయం గమిష్యన్తి సార్ధం కలియుగే జనాః । క్షీణే కలియుగే తస్మిం స్తతః కృత మవర్తత. 271
ఇత్యేత త్కథితం సమ్య గ్దేవాసురవిచేష్టితమ్ । యదువంశ ప్రసంగేన సమాసా ద్వైష్ణవం యశః. 272
తుర్వసోస్తు ప్రవక్ష్యామి పూరో ర్ద్రుహ్యో రనో స్తథా. 272u

ఇతి శ్రీమత్స్యమహాపురాణే చన్ద్రవంశానువర్ణనే యదువంశే కృష్ణజన్మాది
కథనం నామ సప్తచత్వారింశోఽధ్యాయః.

యుగాంతమున ప్రజలను రక్షించు నిమిత్తమయి చివరకు రాజులందరును నశింతురు. వారిని రక్షించు వారెవ్వరును ఉండరు. వారు ఒకరిని మరియొకరు చంపుకొందురు. వారు మిగుల దుఃఖముల పాలగుటయే కాక అవి చెప్పుకొనుటకు దిక్కులేని వారగుదురు. అందరును ఒకరిని మరొకరు హింసించుకొనుచు సమముగా దుర్మార్గులగుటతో వారు తమ ఆస్తులు విడిచి పురములు గ్రామములు విడిచి పోవుదురు. ఆయా ఆశ్రమ ధర్మములకు కావలసిన వస్తువులే దొరుకక పోవును. వర్ణాశ్రమ ధర్మములు నశించును. జనపదములలో అన్నమును విక్రయింతురు. చతుష్పథము (నాలుగు వీథులును కలియు కూడలు)లలో వేదములు అమ్మెదరు. (ధనమునకు ఆశపడి వేద ధర్మములను అందరకును బహిరంగముగా ప్రవచింతురు.) స్త్రీలు తమ శీల పవిత్రతను అమ్ముకొందురు. ప్రజలు పొట్టిదేహములు కలవారు అల్పాయుష్కులు అడవులలో నదీ తీరములలో పర్వతములలో నివసించు వారగుదురు. వారలు చర్మములు ధరింతురు. ఘోరములగు సంకటముల పొందుదురు. అందరును వాదగొండులగుదురు. ఆస్తులు తగ్గిపోవును. బుద్ధి వాదములు చేయుదురు. అల్పబుద్ధులగుదురు. సంకర ప్రధానమగు కలియుగములో ప్రజలు ఇట్లు కష్టముల పొందుదురు. తుదకు కలియుగములో జనులిట్లు కష్టములు పడిపడి ఒకేమారు నాశము పొందుదురు. అంతట కృతయుగమారంభమగును.

ఇట్లు మీకు యదువంశమును తెలుపు ప్రసంగమున దైవాసుర యుద్ధమును చక్కగా చెప్పితిని. విష్ణుయశమును కూడ తెలిపితిని. ఇకమీదట తుర్వసు ద్రుహ్యానుపూరుల వంశమును తెలిపెదను.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున చంద్రవంశానువర్ణనమున యదువంశ కథనమున శ్రీకృష్ణావతార
ప్రసంగమున దైవాసుర యుద్ధాది కథనము భగవదవతార హేతు కథనమునను
నలువది యేడవ అధ్యాయము.

## గమనిక

(13వ అధ్యాయమున శ్రీదేవి దక్షప్రజాపతికి తన అష్టోత్తరశతస్థానములను తెలిపెను. వానిని శ్రీదేవీ పూజార్థమయి ఉపయోగించుటకు అనువుగా అవి అష్టోత్తరశతనామావళి రూపమున ఇచట ఈయబడు చున్నవి.

47వ అధ్యాయమున శుక్రుడు చేసిన శివస్తుతి త్రిశతీ నామ రూప మయినది. అదియు త్రిశతీనామావళీ రూపమున ఇచ్చట ఈయబడుచున్నవి. ఇవి రెండును ఉపాసకులకు ప్రయోజనకరములు.
—అనువాదకుడు.)

# శ్రీదేవ్య ష్టోత్తరశతస్థాన సంపుటితనామావళి

'ఓం' వారాణస్యాం విశాలాక్ష్యై 'నమః'
నైమిశే లింగధారిణ్యై
ప్రయాగే లలితాయై
గంధమాదనే కాముకాయై
మానసే(సరసి)కుముదాయై
విశ్వేశ్వరే విశ్వాయై
విశ్వకాయాం మాయై(లక్ష్మ్యై)
ఇచ్ఛాయాం మదనోత్కటాయై
గోమంతే గోమత్యై
మందారే కామచారిణ్యై. 10

చిత్రరథే మదోత్కటాయై
హస్తినాపురే జయంత్యై
కన్యాకుబ్జే గౌర్యై
మలయపర్వతే రమ్యాయై
హిమవత్సానుని నందాయై
గోకర్ణే భద్రకర్ణికాయై
స్థాణ్వీశ్వరే భవాన్యై
బిల్వకే బిల్వపత్రికాయై
శ్రీశైలే మాధవ్యై
భద్రేశ్వరే భద్రాయై. 20

వరాహశైలే జయాయై
కమలాలయే కంబళాయై
పుష్కరే పురుహూతాయై
కేదారే మార్గదాయిన్యై
చంద్రకోట్యాం రుద్రాణ్యై
కాళంజరగిరౌ కాళ్యై
మహాలింగే కపిలాయై
మకుటే మకుటేశ్వర్యై
సాలగ్రామే మహాదేవ్యై
శివలింగే శివప్రియాయై. 30

మాయాపుర్యాం కుమార్యై
లలితే సంతతాయై
ఉత్పలాక్షే సహస్రాక్ష్యై
మహోత్పలే హిరణ్యాక్ష్యై
గయాయాం మంగళాయై
పురుషోత్తమే విపులాయై
విపాశాయాం అమోఘాక్ష్యై
పుండ్రవర్ధనే పాటలాయై
సుపార్శ్వే నారాయణ్యై
త్రికూటే భద్రసుందర్యై. 40

విపులే విపులాయై
మలయాచలే కల్యాణ్యై
కోటితీర్థే కోట్యక్ష్యై
మాగధవనే సుగంధాయై
కుబ్జామ్రకే త్రిసంధ్యాయై
గంగాద్వారే రతిప్రియాయై
శివకుండే సునందాయై
దేవికాతటే నందిన్యై
ద్వారవత్యాం రుక్మిణ్యై
బృందావనే రాధాయై. 50

మథురాయాం దేవక్యై
పాతాళే వరమేశ్వర్యై
చిత్రకూటే సీతాయై
వింధ్యే వింధ్యనివాసిన్యై
సహ్యాద్రౌ ఏకవీరాయై
హరిశ్చంద్రే చంద్రికాయై
రామతీర్థే రమణాయై
యమునాయాం మృగావత్యై
కరవీరే మహాలక్ష్మ్యై
వినాయకే ఉమాదేవ్యై. 60

వైద్యనాథే ఆరోగ్యాయై
మహాకాళే మహేశ్వర్యై
శుష్కతీర్థే అభయాయై
విన్ధ్య కందరే స్మృత్యై
మాండవ్యే మాండక్యై
మాహేశ్వరే పురే స్వాహాయై
ఛాగలాండే ప్రచండాయై
అమరకంటకే చండికాయై
సోమేశ్వరే వరారోహాయై
ప్రభాసే పుష్కరావత్యై. 70
సముద్రతటే సరస్వత్యాం దేవమాత్రే
మహాలయే మహాభాగాయై
పయోష్ణే పింగళావత్యై
కృతశౌచే సింహికాయై
కార్తికేయే యశస్కర్యై(శాంకర్యై)
ఉత్పలావర్తకే లోలాయై
సింధుసంగమే సుభద్రాయై
సిద్ధవనే లక్ష్మ్యై మాత్రే
భరతాశ్రమే అనంగాయై
జాలంధరే విశ్వముఖ్యై. 80
కిష్కింధపర్వతే తారాయై
దేవదారువనే పుష్ట్యై
కాశ్మీరమండలే మేధాయై
హిమాద్రౌ ఉ(భీ)మాదేవ్యై
షష్ఠే వస్త్రేశ్వర్యై
కపాలమోచనే శుద్ధ్యై
కాయావరోహణే మాత్రే
శంఖద్వారే ధ్వన్యై
పిండారకే ధృత్యై
చంద్రభాగాయాం కలాయై. 90

అచ్ఛోదే శూలధారిణ్యై
వైణాయాం అమృతాయై
బదర్యాం ఊర్వశ్యై
ఉత్తరకురౌ ఓషధ్యై
కుశద్వీపే కుశోదక్యై
హేమకూటే మన్మథాయై
కుముదే సత్యవాదిన్యై
అశ్వత్థే(వృక్షే)వందనీయాయై
వైశ్రవణా(కుబేరా)లయే నిధయే
వేదవదనే(వేదారంభే)గాయత్ర్యై. 100

శివసన్నిధౌ పార్వత్యై
దేవలోకే ఇంద్రాణ్యై
బ్రహ్మశరీరే సరస్వత్యై
సూర్యబింబే ప్రభాయై
మాతృకాసు వైష్ణవ్యై
సతీషు అరుంధత్యై
రామాసు(స్త్రీషు)తిలోత్తమాయై
సర్వశరీరిణాం చిత్తే బ్రహ్మకలా
నామ్న్యై శక్తయే. 108

(ఈ చెప్పిన ఆ యా స్థానములందు ఈ చెప్పిన రూపములలో ఉన్న మహాతత్త్వము భగవచ్ఛక్తియే. అను భావనచేయుచు శ్రీదేవిని అర్చించవలయును. ఈ చెప్పినవానిలో తీర్థక్షేత్రములుగా నున్నవి నేడు ఎచ్చట ఏ పేరులతో నున్నవి-అను విషయము 'Sakta Pithas' అను గ్రంథమున చూడనగును.

98. నామమున - వందనీయా - వందనికా-బదనిక - అను పేరుతో వ్యవహరింపబడు అశ్వత్థ వృక్షాశ్రిత వృక్షవిశేషము అని తోచుచున్నది. ఇట్టిది ఓషధీ విశేషము కావున శక్తిరూపమగును. అనదగి యున్నది-అనువాదకుడు.)

## (47అ.) శుక్రప్రోక్త శివత్రిశతీనామావళి

ఓం శితికంఠాయ నమః
కనిష్ఠాయ
సువర్చసే
లేలిహానాయ
కావ్యాయ
వత్సరాయ
అంధసస్పతయే
కపర్దినే
కరాళాయ
హర్యక్షాయ. 10
వరదాయ
సంస్తుతాయ

స్తుతార్థాయ
దేవదేవాయ
రంహసే
ఉష్ణీషిణే
సువక్త్రాయ
సహస్రాక్షాయ
మీఢుషే
వసురేతాయ. 20
రుద్రాయ
తపసే
కృత్తివాససే
హ్రస్వాయ
వ్యుప్తకేశాయ
సేనాన్యే
రోహితాయ
కవయే
రాజవృక్షాయ
తక్షకక్రీడనాయ. 30
సహస్రబాహవే
సహస్రనయనాయ
సహస్రశిరసే
బహురూపాయ
వేధసే
హరాయ
బహురూపాయ
శ్వేతాయ
పురుషాయ
గిరీశాయ. 40
మనోజ్ఞాయ
చిత్రినే
సుక్షతాయ
సంతృప్తాయ
సుహస్తాయ
ధన్వినే
భార్గవాయ
నిషంగిణే
తారాయ
సాక్షాయ. 50
క్షపణాయ
తామ్రాయ
భీమాయ
ఉగ్రాయ
శివాయ
మహాదేవాయ
శర్వాయ
విరూపాయ
శివాయ
హిరణ్యాయ. 60
విశిష్టాయ
జ్యేష్ఠాయ
మధ్యమాయ
బభ్రవే
పిశంగాయ
పింగళాయ
అరుణాయ
పినాకినే
ఇషుమతే
చిత్రాయ. 70
రోహితాయ
దుందుభ్యాయ
ఏకపాదాయ అజాయ
అహయేబుధ్నియాయ
మృగవ్యాధాయ
సర్వాయ
స్థాణవే
భీషణాయ
బహునేత్రాయ
పథ్యాయ. 80
సునేత్రాయ
ఈశ్వరాయ
కపాలినే
ఏకవీరాయ
మృత్యవే
త్ర్యంబకాయ
వాస్తోష్పతయే
పినాకాయ
ముక్తయే
కేవలాయ. 90
అరణ్యాయ
గృహస్థాయ
యతయే
బ్రహ్మచారిణే
సాంఖ్యాయ
యోగాయ
వ్యాధినే
దీక్షితాయ
అంతర్హితాయ
శర్వాయ. 100
భవ్యేశాయ
శమాయ
రోహితే
చేకితానాయ
బ్రహ్మిష్ఠాయ
మహర్షయే
చతుష్పదాయ
మేధ్యాయ
రక్షిణే
శీఘ్రగాయ. 110
శిఖండినే
కరాళాయ
దంష్ట్రిణే
విశ్వవేధసే
భాస్కరాయ
ప్రదీప్తాయ
దీప్తాయ
సుమేధసే
క్రూరాయ
వికృతాయ. 120
బీభత్సాయ
శివాయ
సౌమ్యాయ
పుణ్యాయ
ధార్మికాయ
శుభాయ
అవధ్యాయ
అమృతాయ
నిత్యాయ

శాశ్వతాయ. 130
వ్యావృత్తాయ
యవిష్ఠాయ
భరతాయ
రక్షసే
క్షేమ్యాయ
సహమానాయ
సత్యాయ
ఋతాయ
కాట్యాయ
సభా(ఖా)య. 140
శూలినే
దివ్యచక్షుషే
సోమపాయ
ఆజ్యపాయ
ధూమపాయ
ఊష్మపాయ
శుచయే
పరిధానాయ
సద్యోజాతాయ
మృత్యవే. 150
పిశితాశాయ
శర్వాయ
మేఘాయ
విద్యుతా(త్యా)య
వ్యావృత్తాయ
వరిష్ఠాయ
భరతాయ
వక్షపే
త్రిపురఘ్నాయ
తీర్థాయ. 160
చక్రాయ
రోమశాయ
తిగ్మాయుధాయ
దక్షాయ
సమిద్ధాయ
పులస్తయే
రోచమానాయ
చండాయ
స్థితాయ
ఋషభాయ. 170
ప్రతినే
యుంజమానాయ
శుచయే
ఊర్ధ్వరేతసే
అసురఘ్నే
మఖఘ్నాయ
మృత్యుఘ్నే
అంతకాయ
కృశానవే
ప్రశాంతాయ. 180
వహ్నయే
కింశిలాయ
రక్షోఘ్నాయ
పశుఘ్నాయ
విఘ్నాయ
శ్వసితాయ
అనాహతాయ
సర్వాయ
వ్యాపినే
తాపనాయ. 190
అనాశ్రితాయ
దేవాయ
సమిత్యధిష్ఠితాయ
కృష్ణాయ
జయంతాయ
లోకానామీశ్వరాయ
హిరణ్యబాహవే
పాశాయ
నమాయ
సుకన్యాయ. 200
సునస్యాయ
ఈశానాయ
సుచక్షుషే
క్షిప్రేషవే
సుధన్వాయ
ప్రథమాయ
శివాయ
కపిలాయ
పిశంగాయ
మహాదేవాయ. 210
శ్రీమతే
మహాకామాయ
దీప్తాయ
రోదనాయ
సహాయ
దృఢధన్వినే
కవచినే
రథినే
వరూథినే
భృగునాథాయ. 220
శుక్రాయ
గహ్వరేష్ఠాయ
వేధసే
అమోఘాయ
ప్రశాంతాయ
అమృతాయ
వృషాయ
భగవతే
మహతే
కృత్తివాససే. 230
పశూనాంపతయే
భూతానాంపతయే
ప్రణవాయ
ఋచే
యజుషే
సామ్నే
స్వాహాయ
స్వధాయ
వషట్కారాత్మనే
అర్థాత్మనే. 240
స్రష్ట్రే
ధాత్రే
కర్త్రే
హర్త్రే
క్షమణాయ
భవద్భూతభవిష్యాయ

కర్మాత్మనే
వసవే
సాధ్యాయ
రుద్రాయ. 250
ఆదిత్యాయ
అశ్వినాయ
నిర్గుణాయ
గుణజ్ఞాయ
వ్యాకృతాయ
కృతాయ
స్వయంభువే
ప్రజాయై
అపూర్వాయ
ప్రథమాయ. 260
ప్రజానాంపతయే
బ్రహ్మాత్మనే
ఆత్మేశాయ
ఆత్మవశ్యాయ

సర్వస్యాతిశయాయ
సర్వభూతాత్మభూతాయ
భూతాత్మనే
నిర్గుణాయ
గుణజ్ఞాయ
అవ్యాకృతాయ. 270
అకృతాయ
విరూపాక్షాయ
మిత్రాయ
సాంఖ్యాత్మనే
పృథివ్యై
అంతరిక్షాయ
దివ్యాయ
మహాయ
జనాయ
తపాయ. 280
సత్యాయ
లోకాత్మనే

అవ్యక్తాయ
మహాంతాయ
భూతాదయే
ఇంద్రియాయ
ఆత్మజ్ఞాయ
విశిష్టాయ
సర్వాత్మనే
నిత్యాయ. 290
ఆత్మలింగాయ
సూక్ష్మాయ
చేతనాయ
బుద్ధాయ
విభవే
మోక్షాత్మనే
పూర్వత్రిమలోకేమస్థితాయ
వరతత్రిమలోకేమస్థితాయ
సత్యాంత్యేషన వ్రసులోకేమస్థితాయ
మహాంత్యేమచతుర్ష
లోకేమస్థితాయనమః. 300

ఇందు కొన్ని నామములు పునరావృత్తమయినవి. అట్టి వానికి వ్యుత్పత్తిననుసరించి అర్థబేదమును గ్రహించవలయును. ఇట్టిస్థితి ఆయా (నామ) స్తోత్రములందు సహజముగ కనబడుచున్న విషయమే.

## అష్టచత్వారింశోఽధ్యాయః.

## తుర్వసుప్రభృతీనాం సన్తతికథనమ్

సూతః : తుర్వసోస్తు సుతో గర్గో గోభాను స్తస్య చాత్మజః । గోభానో స్తు సుతో ధీరస్త్రిశరి శ్చాపరాజితః. 1
కరన్ధమస్తు త్రిశరే రసన్త స్తస్య చాత్మజః । దుష్యన్తః పౌరవ శ్చాసీ త్తస్య పుత్రో హ్యకల్మషః. 2
ఏవం యయాతిశాపేన జరాసఙ్క్రమితః పురా । తుర్వసోః పౌరవం వంశం ప్రవివేశ పురా కిల. 3
దుష్యన్తస్య తు దాయాదో వరూథో నామ పార్థివః । వరూథాత్తు తథాణ్డీర శ్చత్వార స్తస్య చాత్మజాః. 4
పాణ్డ్యశ్చ కేరళశ్చైవ చోళః ఫల్గు స్తథైవ చ । తేషాం జనపదా స్స్ఫీతాః పాణ్డ్యా శ్చోళాస్స కేరళాః. 5
దుర్హ్యోస్తు తనయ శ్శూరో బభ్రుస్సేతు స్తథైవ చ । సేతుపుత్రస్తు భద్రశ్చ గాన్ధార స్తస్య చాత్మజః. 6
ఖ్యాయతే యస్య నామ్నాసౌ గాన్ధారో విషయో మహాన్ । గాన్ధారదేశజా స్తత్ర తురగా వాజినాం వరాః. 7
గాన్ధారపుత్రో ధర్మస్తు ఘృత స్తస్యాత్మజోఽభవత్ । ఘృతాత్తు విదుమో జజ్ఞే ప్రచేతా స్తస్య చాత్మజః. 8
ప్రచేతసః పుత్రశతం రాజాన స్సర్వ ఏవ తే । మ్లేచ్ఛరాజ్యాధిపా స్సర్వే ఉదీచీం దిశ మాశ్రితాః. 9
అనోశ్చైవ సుతా వీరా స్త్రయః పరమకీర్తయః । సభానర శ్చాక్షుషశ్చ పరమేష్ఠి స్తథైవ చ. 10
సభానరస్య పుత్రస్తు విద్వాన్కోలాహలో నృపః । కోలాహలస్య ధర్మాత్మా సఞ్జయో నామ విశ్రుతః. 11
సఞ్జయస్యాభవ త్పుత్రో వీరో రాజా పురఞ్జయః । జనమేజయో మహారాజా పురఞ్జయసుతోఽభవత్. 12

జనమేజయస్య రాజర్షే ర్మహాశాలోఽభవత్సుతః । ఆసీ దిన్ద్రసమో రాజా ప్రతిష్ఠితయశా బభౌ. 13
మహామనా స్సుత స్తస్య మహాశాలస్య ధార్మికః । సప్తద్వీపేశ్వరో జజ్ఞే చక్రవర్తీ మహామనాః. 14
మహామనాస్తు ద్వౌ పుత్త్రౌ జనయామాస విశ్రుతౌ । ఉశీనరశ్చ ధర్మజ్ఞ స్తితిక్షుశ్చైవ తావుభౌ. 15

## నలువది ఎనిమిదవ అధ్యాయము

## తుర్వసుడు మొదలగువారి వంశము.

సూతుడు ఋషులకు ఇట్లు చెప్పనారంభించెను. యయాతి పుత్త్రుడగు తుర్వసునకు గర్గుడు అతనికి గోభానుడు అతనికి ధీరుడు అపరాజితుడునగు త్రిశరి అతనికి అనంతుడు అతనికి పూరు వంశీయుడగు అకల్మషుడైన దుష్యన్తుడును కుమారులయిరి. (అనంతుడు పూరు వంశీయుడగు దుష్యంతునే తన కుమారునిగా స్వీకరించెను.) ఇట్లు జరా సంక్రమణము హేతువుగా యయాతి శాపము పాలైన తుర్వసు వంశము పూరు వంశములో కలిసిపోయెను.

ఈ దుష్యంతునకు వరూథుడు అతనికి ఆండీరుడు అతనికి నలుగురు పాండ్యుడు కేరళుడు చోళుడు ఫల్గుడు అనువారును కుమారులయిరి. వీరి పాలిత జనపదములు పాండ్య కేరళ చోళములు చాల సమృద్ధితో నుండినవి.

యయాతికి ఇంకొక కుమారుడగు ద్రుహ్యునకు శూరుడు బభ్రువు సేతువు అనువారు కుమారులు. సేతునకు భద్రుడు అతనికి గాంధారుడు కుమారులు. ఈ గాంధారుని పేరనే గాంధారదేశము ప్రసిద్ధమయినది. ఆదేశపు గుర్రములు చాల మేలయినవి. అతనికి ధర్ముడు అతనికి ఘృతుడు అతనికి విదుముడు అతనికి ప్రచేతుడు కుమారులయిరి. ప్రచేతునకు నూరుమంది కుమారులు కలిగిరి. వారందరును ఉత్తర దిశయందలి రాజ్యములకు పాలకులయిరి.

యయాతికి మరియొక కుమారుడగు అనువునకు పరమ కీర్తిమంతులు వీరులునగు సభానరుడు చాక్షుషుడు పరమేష్ఠి అను ముగ్గురు కుమారులు. సభానరునకు విద్వాంసుడగు కోలాహలుడు అతనికి ధర్మాత్ముడగు సంజయుడు అతనికి వీరుడగు పురంజయుడు అతనికి మహారాజగు జనమేజయుడు ఆరాజర్షికి మహాశాలుడు కుమారులయిరి. అతడు మహాకీర్తిశాలియు ఇంద్రునితో సమానుడును. అతనికి ధార్మికుడగు మహామనస్కుడు కుమారుడు. అతడు సప్తద్వీపాధిపతియగు చక్రవర్తి. అతనికి ధర్మజ్ఞులగు ఉశీనరుడు తితిక్షుడు అనువారు పుత్త్రులు.

ఉశీనరస్య పత్న్యస్తు పఞ్చ రాజర్షిసమ్భవాః । భృశా నరా కృశీ దర్శా యాచ దేవీ దృషద్వతీ. 16
ఉశీనరా త్సుతా స్తాసు జజ్ఞిరేచ కులోద్వహాః । తపసో న్తేచ మహతో జాతా వృద్ధస్య ధార్మికాః. 17
భృశాయాంచ భృశః పుత్త్రో నరాయా నర ఏవచ । కృశ్యాః కృశిస్తు దర్శాయా స్సువ్రతో నామ విశ్రుతః.
దృషద్వత్యా స్సుతశ్చాపి శిబి రౌశీనరో నృపః । శిబేస్తు శిబయః పుత్త్రా శ్చత్వారో లోకవిశ్రుతాః. 19
వృషదర్భశ్చ సౌవీరః కేకయో భద్రక స్తథా । తేషాం జనపదా స్స్ఫీతాః కేకయా భద్రకా స్తథా. 20
సౌవీరాశ్చైవ పౌరాశ్చ భృశస్య కేకయా స్తథా । సౌవీరస్య సుతోఽమృష్టః కృశేస్తు కృశకా స్సుతాః. 21
నరస్య నరరాష్ట్రస్తు తితిక్షో స్తనయాన్ఛృణు । తితిక్షు రభవ ద్రాజా పూర్వస్యాం దిశి విశ్రుతః. 22
వృషద్రథ స్సుత స్తస్య తస్య *ఫేనోభవత్సుతః । •ఫేనస్య సుతపా జజ్ఞే సుతప స్తనయో బలిః. 23
జాతో మనుష్యయోన్యాం తు క్షీణే వంశే ప్రజేచ్ఛయా । మహాయోగీతు స బలి ర్బద్ధో యో విష్ణునా పురా.
పుత్త్రా నుత్పాదయామాస క్షేత్రజా న్పఞ్చ పార్థివాన్ । అఙ్గం సజ్జనయామాస వఙ్గం సుహ్మకమేవచ. 25
పుణ్డ్రం కలిఙ్గంచ తథా బాలేయం క్షత్త్రముచ్యతే । బాలేయా బ్రాహ్మణాశ్చైవ తస్య వంశకరాః ప్రభో. 26
బలయే బ్రహ్మణా దత్తో వరః ప్రీతేన ధీమతే । మహాయోగిత్వ మాయుశ్చ కల్పస్య పరిమాణకమ్. 27
సంగ్రామే చావ్యజేయత్వం ధర్మే మతి మనుత్తమామ్ । త్రైలోక్యదర్శనం చైవ ప్రాధాన్యం ప్రసవే తదా.

* సేనో.        • సేనస్య.

జయంవా(చా)ऽప్రతిమం యుద్ధే దర్మే తత్త్వార్థదర్శనమ్ । చతురో నియతా న్వర్ణా న్స వై స్థాపయితా ప్రభుః.
తేషాం వంశధరాః పఞ్చ అఙ్గవఙ్గా స్సుహ్మకాః । పుణ్డ్రాః కళిఙ్గాశ్చ తథా అఙ్గస్యచ నిబోధత. 30

రాజర్షి సుతలగు భృశ-నర-కృశి-దర్శ-దృషద్వతి-అను ఐదుమంది ఉశీనరుని భార్యలు. అతడు చాలకాలము చేసిన మహా తపఃఫలముగా అతనికి వార్ధకమున ఆ ఐదుగురియందు వరుసగా భృశుడు నరుడు కృశి-సువ్రతుడు-శిబి అను ఐదుమంది కుమారులు కలిగిరి.

వీరిలో శిబికి శిబులు అను పేరున లోక విశ్రుతులగు వృషదర్భుడు సౌవీరుడు కేకయుడు భద్రకుడు అను నలుగురు కుమారులు. వీరి పాలిత జనపదములు సర్వసమృద్ధములగు కేకయ-భద్రక - సౌవీర-పౌర-జనపదములు. వీరిలో భృశుని కుమారులు కేకయులని ప్రసిద్ధులయిరి. సౌవీరుని కుమారుడు అంబష్ఠుడు. కృశికుమారులు కృశకులు. నరుని కుమారుడు నరరాష్ట్రుడు. తితిక్షుడు తూరుపున రాజయ్యెను. అతనికి వృషద్రథుడు అతనికి ఫేనుడు అతనికి సుతపుడు అతనికి బలియనువారు కుమారులయిరి. (సుతపుడు దైత్యుడగు బలిని తన కుమారునిగా స్వీకరించెను.) ఇతడు మహాయోగి. పూర్వము విష్ణునిచే బంధింపబడిన బలియే ఇతడు. మనుష్యుడుగా అయిన బలి మానవ జాతియందలి తన వంశము నశించునట్లున్న సమయమున క్షేత్రజ్ఞులనుగా మానుషియగు తన భార్యయందు ఐదుమంది క్షత్త్రియ కుమారుల నుత్పాదించెను. వారు అంగుడు వంగుడు సుహ్మడు పుండ్రుడు కళింగుడు అనువారు. వీరు బలి సంతతిలోని క్షత్త్రియులు. వీరు కాక బలి సంతతివారు కొందరు బ్రాహ్మణులుగానై విప్ర వంశములను నిలిపి వృద్ధిచేసిరి. ఈ అంగుడు మొదలగు ఐదుమంది వంశములందు జన్మించి వారి వంశముల నిలిపిన వారికి అంగులు వంగులు సుహ్మలు పుండ్రులు కళింగులు అని పేరు. (వీరి జనపదములకును ఇదియే పేరు.)

పూర్వము బలి విషయమున బ్రహ్మ ప్రీతుడై అతనికి వరముల నొసగెను. వానిచే అతడు మహాయోగిత్వమున కల్పపరిమాణపు ఆయువును యుద్ధమున ఓటమి లేకుండుటయు ధర్మమునందు అత్యుత్తమ స్థిరబుద్ధియు త్రిలోకము లందలి సర్వవిషయముల చూచుట తన జాతి వారిలో ప్రధానుడగుట యుద్ధమున సాటిలేని గెలుపు ధర్మతత్త్వార్థమును దర్శించుట నాలుగు వర్ణముల వారిని వారివారి నియమములందు నిలుపుట అను యోగ్యతలను సంపాదించెను.

## దీర్ఘతమస ఉత్పత్త్యాదికథనమ్.

ఋషయః: కథం బలే స్సుతాః పఞ్చ జాతా స్తస్య మహాత్మనః ।
కింనామ్నీ మహిషీ తస్య జనితా కతమో మునిః. 31
కథం చోత్పాదితా స్తేన తన్నః ప్రబ్రూహి పృచ్ఛతామ్ । మాహాత్మ్యంచ ప్రభావంచ నిఖిలేన వదస్వ నః.
సూతః: ఉచథ్యోఽఙ్గిరసః పుత్త్రః ఖ్యాత ఆసీ దృషిః పురా ।
పత్నీవై మమతా నామ బభూవాస్య మహాత్మనః. 33
ఉచథ్యస్య యవీయాన్వై భ్రాతృపత్నీ మకామయత్ । తస్య చాసీ దవరజః పురోధా యో దివౌకసామ్. 34
బృహస్పతి ర్బ్రహ్మతేజా మమతా మేత్య కామతః । ఉవాచ మమతా తం తు దేవరం వరవర్ణినీ. 35
అన్తర్వత్న్యస్మి తే భ్రాతు ర్జ్యేష్ఠస్య చ విరమ్యతామ్ ।
అయం తు మే మహాగర్భః కుక్ష్యే త్తవ బృహస్పతే. 36
ఔచథ్యో భ్రాతృజన్యస్తే షడఙ్గం వేద ముద్గిరన్ । అమోఘరేతా స్త్వం చాసి న మాం యభితు మర్హసి. 37
అస్మి న్నేవం గతే కాలే యథా వా మన్యసే భవాన్ । ఏవ ముక్త స్తయా సమ్య గ్బృహస్పతిః.
కామాత్మనో మహాత్మాపి న స కామ మవారయత్ । సమ్బభూవాథ ధర్మాత్మా తయా సార్ధ మకామయా. 39
ఉత్సృజన్తం తు తద్రేతో గర్భస్థ స్సోఽభ్యభాషత । భో తాత కన్ష మేతద్ధి ద్వయో ర్నాస్తీహ సంస్థితిః. 40

అమోఘరేతా స్త్వంచాపి పూర్వం చాహ మిహాగతః । శశాప తం తతః క్రుద్ధ ఏవ ముక్తో బృహస్పతిః. 41
పుత్త్రిం జ్యేష్ఠస్య వై భ్రాతు గ్గర్భస్థం కామవా నృషిః । యస్మా త్త్వ మీదృశే కాలే సర్వభూతహితే స్థితే.
మా మేవ ముక్తవాం స్తస్మా త్తమో దీర్ఘం ప్రవేక్ష్యతి । తతో దీర్ఘతమా నామ శాపా దృషి రజాయత. 43
ఉత్పన్నో యో బృహత్కీర్తి ర్బృహస్పతి రివాపరః । ఊర్ధ్వరేతా స్తత స్సోఽథ వసన్వై భ్రాతు రాశ్రమే.
గోధర్మాన్ సౌరభేయాంస్తు ఋషభాత్ శ్రుతవాంస్తు సః । తస్య భ్రాతా పితుర్యో వై చకార భరణం తదా.
తస్మి న్నివసత స్తస్య యదృచ్ఛాఽఽగత్యగోవృషః । యజ్ఞార్థ మాహృతం బర్హి శ్చఖాద సురభీసుతః. 46
జగ్రాహ తం దీర్ఘతమా శ్శృఙ్గయో స్తం చతుష్పదమ్ । తేనాసౌ నిగృహీతస్తు న చచాల పదాత్పదమ్. 47
తతోఽబ్రవీ ద్వృష స్తం వై ముఞ్చ మాం బలినాం వర ।
న మయాఽఽసాదిత స్త్వాదృక్ బలవాంశ్చ వనే క్వచిత్. 48
భవతోఽత్ర సమం వాపి న హి మే బల మక్షయమ్ । ముఞ్చ తాతేతి చ పునః ప్రీత స్తేహం వరం వృణు.
ఏవ ముక్తోఽబ్రవీ దేనం జీవన్ న త్వం క్వ యాస్యసి ।
ఏష త్వాం న విమోక్ష్యామి పున స్త్వాహ చతుష్పదః. 50
ఋషభః నాస్మాకం విద్యతే తాత పాతకం స్తేయమేవ వా ।
భక్ష్యాభక్ష్యం తథాచైవ పేయాపేయం తథైవచ. 51
ద్విపదాం బహవో హ్యేతే ధర్మా నైతే గవాం స్మృతాఃకార్యాకార్యం న వైచిత్ర్యం గమ్యాగమ్యం తథైవ చ.
సూతః గవాం ధర్మం న వై శ్రుత్వా సమ్మ్యా న్తస్తు వినర్జితః ।
భక్త్యాన్నపానదానాత్తు గోపతిం తం ప్రసాదయత్. 53

ఋషులు సూతుని ఇట్లు ప్రశ్నించిరి: "మహాత్ముడగు బలికి మానుషి అగు భార్యయందు ఐదుగురు కుమారులు ఎట్లు కలిగిరి? అతని భార్య (అగు మనుష్యస్త్రీ) ఎవరు? వారిని ఆమెయందు కనిన ముని ఎవరు? ఎట్లు వారిని అతడు జన్మింపజేసెను? ఆ ముని మాహాత్మ్య ప్రభావములు ఎట్టివి? ఇది అంతయు మాకు తెలుపుము."

సూతుడు ఋషులకు ఇట్లు చెప్పసాగెను: పూర్వము అంగిరోముని కుమారుడు ఉచ (త) థ్యుడను ప్రసిద్ధుడగు ఋషి ఉండెను. ఈ మహాత్ముని భార్య పేరు మమత. ఇతని తమ్ముడును దేవగురువును బ్రహ్మతేజస్సంపన్నుడును అగు బృహస్పతి ఒకమారు తన వదినెను-ఈ మమతను-కామించెను. ఆమె ఇట్లనెను: "నేను నీకు వదినెను. గర్భవతిని. నా గర్భమునందున్న నీయన్న కుమారుడు షడంగ వేదవేత్త. ఇట్టి ఈ మహాగర్భము నీపై కోపించును. నీవును అమోఘ వీర్యుడవు. కనుక నీవు నన్ను కూడుట మంచిపనికాదు. కనుక తగని ఈ ప్రయత్నము మానుకొనుట మంచిది. ఈ సమయమునకు తగిన విషయము ఇది. నీవు ఏమనుకొనినను సరియే."

బృహస్పతి బ్రహ్మతేజస్సంపన్నుడే మహాత్ముడే కాని అతడు తన కామమును నిగ్రహించుకొనలేకపోయెను. అందుచే అతడు ధర్మాత్ముడై యుండియు కామములేని తన వదినెను కూడెను. సంయోగక్రమములో బృహస్పతి తన శుక్రమును మమతా గర్భమునందు విడుచు సమయమున ఆమె గర్భమునందున్న శిశువు ఇట్లు పలికెను: "తండ్రీ! నీవు చేయుచున్న ఈ పని చాల నీచమయినది. ఇచ్చటనో-ఇద్దరు ఉండుటకు అవకాశములేదు. నీ రేతస్సును వ్యర్థముకానిది. (అదియు సఫలమై శిశువు అగును.) కాని నేను ముందుగా ఇచటకు వచ్చి ఉన్నాను." ఈ శిశువు ఇట్లనగా బృహస్పతి క్రుద్ధుడయి అతనిని శపించెను. ఆ శిశువు తన అన్నగారి కుమారుడు. గర్భమునందున్న పసికందు. బృహస్పతి తానుమ ఋషి. ఐనను కాముకుడు. "ఇటువంటి సమయమున నన్ను వారించితివి కావున నీవు దీర్ఘ మగు తమస్సును (అంధత్వమును) ప్రవేశింతువు." అని అతడు అతనిని శపించెను.

తరువాత మమతకు శిశువు జనించెను. అతడు రెండవ బృహస్పతి వంటివాడు- మహాకీర్తి సంపన్నుడగు ఋషి-అయ్యెను. కాని ఈ శాపముచే అతడు దీర్ఘతముడు అనబడెను. అతడు ఊర్ధ్వరేతస్కుడు (బ్రహ్మచర్య ధర్మమున ఇంద్రియమును నిగ్రహించుకొనినవాడు.)

అతడు తన (తండ్రి) సోదరుని ఆశ్రమమునందు నివసించుచు ఒకమారు సురభి (కామధేనువు) వంశము వారికి సంబంధించిన గోధర్మములను ఒకానొక ఋషభము వలన వినెను. ఎట్లనగా—

ఈ దీర్ఘతముడు తన తండ్రికి సోదరుని పోషణలో అతని ఆశ్రమమున నివసించుచుండెను. ఒకనాడు దాని లోనికి దైవవశమున ఒక వృషభము వచ్చెను. యజ్ఞమునకై తెచ్చి ఉంచిన దర్భలను అది తినెను. దీర్ఘతముడు దాని కొమ్ములు బిగించి పట్టుకొనెను. అది కదలలేకపోయెను. "తండ్రీ! నన్ను విడువుము. నీవు బలశాలురలో గట్టివాడవు. ఈ వనమున నీవంటి బలశాలి నాకు మరెవ్వరును కనబడలేదు. నా అక్షయ బలమును నీ బలముతో సమానముకాదు. నీ బలమునకు నేను ప్రీతుడనైతిని. నన్ను విడువుము. నీకు వరముల నిత్తును." అని అది మునితోననెను. "నీవు ప్రాణము లతో నన్ను తప్పించుకొని పోలేవు. నేను నిన్ను విడువను. (నీవు మాదర్భలను తింటివి.)" అని ముని వృషభముతో ననెను. అంత వృషభము "నాయనా! మాకు ఇది దొంగతనము. ఇది చేయుట పాతకము. అనునది లేదు. ఇది భక్ష్యము- ఇది అభక్ష్యము-ఇది పేయము-ఇది అపేయము (త్రాగదగినది-త్రాగరానిది) అను నియమము మాకు లేదు. ఇవి అన్నియు మానవులకు మాత్రమే. ఇది చేయతగినది. ఇది చేయతగనిది. వీరిని కూడవచ్చును. వీరిని కూడరాదు. అను వ్యవస్థ కూడ మానవులకే కాని మాకు లేదు." అనెను.

దీర్ఘతముడు ఈ గోధర్మములను విని తడబాటు చెంది ఆ వృషభమును విడిచెను. దానికి భక్తి పూర్వకముగా అన్నపానములనిచ్చి దానిని అనుగ్రహింపజేసికొనెను.

ప్రసాదితే గతే తస్మిన్ గోధర్మాన్ భక్తిత శ్శ్రుతాన్ మనసైవ సమాదధ్యౌ తన్నిష్ఠ స్తత్పరాయణః. 54

తతో యవీయసః పత్నీం గౌతమస్యాభ్యపద్యత । తస్యావలేపం మత్వా తు నోనడ్వానివ న క్షమే. 55

గోధర్మంతు పరం మత్వా స్నుషాం తా మభ్యపద్యత ।

నిర్భర్త్స్య తాం తథా మూర్ధ్నా బాహుభ్యాం సమ్ప్రగృహ్యచ. 56

భావ్య మర్థం తు తం జ్ఞాత్వా మహాత్మా తా మువాచ హ ।

విపర్యయం తు తం బుద్ధ్వా మాహాత్మ్యే త్తమువాచ సా. 57

విపర్యయం తు త్వం లబ్ధ్వా అనడ్వా న్న నివర్తసే ।

గమ్యాగమ్యం న జానీషే గోధర్మా త్ప్రార్థయ న్స్నుషామ్. 58

దుర్వృత్తత్వా త్త్యజామ్యద్య గచ్ఛ్వాఽనేన కర్మణా ।

యస్మా త్త్వమంధో వృద్ధశ్చ భర్తవ్యో దురనుష్ఠితః. 59

కాష్ఠే సముద్గే ప్రక్షిప్య గఙ్గామ్భసి సముత్సృజత్ । త మూహ్యమానం వేగేన స్రోతసోఽభ్యాశ మాగతః. 60

అట్లు వృషభము అనుగ్రహముతో వెళ్ళిన తరువాత దీర్ఘతముడు తాను గోవృషభమునుండి భక్తితో వినిన గోధర్మములను తనకు పరమార్థముగా మహాశ్రయముగా భావించి వానినే ధ్యానింపసాగెను. అతని తమ్ముని పేరు గౌతముడు. అతని భార్యను ఈ దీర్ఘతముడు కలియగోరెను. ఆమె తనకు కోడలివంటిది. ఐనను అతడు గోధర్మములను శ్రేష్ఠములనుగా తలచి అట్లు సంకల్పించెను-(ఆమె అంగీకరించలేదు.) అది ఆమె గర్వము అని తలచెను. అతడది సహించ లేకపోయెను. అతడామెను బెదరించెను. ఆమె తలను తన బాహువులతో అదిమిపట్టెను. అతడు మహాత్ముడయ్యు జరుగవలసినది ఇట్లు ఉన్నదని నిశ్చయించి తన కోరిక ఆమెతో పలికెను: అతడు మహాత్ముడని ఆమెకు తెలియును.

కాని అతడు విపర్యయమునకు సిద్ధపడినాడు. (మానవుడయియుండి పశు ధర్మమునకు పాల్పడుట విపర్యయము-విరుద్ధ ధర్మము.) అది చూచి ఆమె అతనితో ఇట్లు పలికెను: "నీవు విపర్యయమునకు పూనితివి. ఎద్దువలె ప్రవర్తించుచున్నావు. ఎవరిని కలియవచ్చునో ఎవరిని కలియరాదో ఎరుగకున్నావు. వృషభ ధర్మము నవలంబించి కోడలిని పొందగోరు చున్నావు. నీ నడువడి మంచిదికాదు. నీవు గ్రుడ్డివాడవు. వృద్ధుడవు. నిన్ను మేము పోషించుచు కాపాడవలసిన మాట నిజమే. ఐనను నీ ప్రవర్తనము మంచిదికాదు. కావున నిన్ను విడుచుచున్నాము. ఇది నీ ఈ కర్మమునకు ఫలితము; పొమ్ము." అని పలికి ఆమె అతనిని కొయ్య పెట్టెలో ఉంచి కట్టివేసి గంగా జలములో విడిచెను.

బలిభార్యాయాం దీర్ఘతమస స్సన్తానోత్పత్తిః.

జగ్రాహ తం స ధర్మాత్మా బలి ర్వైరోచని స్తథా । అన్తఃపురే జుగోపైనం భక్ష్యభోజ్యైశ్చ తర్పయన్. 61
ప్రీతశ్చైనం వరేణాథ చ్ఛన్దయామాస వై బలిమ్ । తస్మాచ్చ స వరం వవ్రే పుత్త్రార్థ మసురోత్తమః. 62
సన్తానార్థం మహాభాగ భార్యాయాం మమ మానద । పుత్త్రా న్ధర్మార్థతత్త్వజ్ఞా నుత్పాదయితు మర్హసి. 63
ఏవ ముక్త స్స దేవర్షి స్తథాఽస్త్వి త్యుక్తవా న్ప్రభుః ।
తత స్స రాజా స్వాం భార్యాం సుదేష్ణాం నామ ప్రాహిణోత్. 64
అన్ధం వృద్ధం చ తం జ్ఞాత్వా న సా దేవీ జగామ హ ।
శూద్రీం ధాత్రేయికాం తస్మై అన్ధాయ ప్రాహిణో త్తదా. 65
తస్యాం కక్షీవదాదీంశ్చ శూద్రయోన్యా మృషి ర్వశీ జనయామాస ధర్మాత్మా శూద్రా నిత్యేవమాదికాన్.66
ఉవాచ తం బలీ రాజా దృష్ట్వా కక్షీవదాదికాన్ । అధీతా నృషిధర్మజ్ఞా నీశ్వరా న్బ్రహ్మవాదినః. 67
శుద్ధా న్ప్రత్యక్షధర్మాణ శ్శుచిమద్బుద్ధిసంయుతాన్ । మమైవమితి హోవాచ తం దీర్ఘతమసం బలిః. 68
నేత్యువాచ తత స్తం వై మమైవ మితి చాబ్రవీత్ । ఉత్పన్నా శ్శూద్రయోనౌ తు న తే క్షేత్రేఽసురోత్తమ.
అన్ధం వృద్ధం చ మాం జ్ఞాత్వా సుదేష్ణా మహిషీ తవ। ప్రాహిణో దవమానాన్మే శూద్రాం ధాత్రేయికాం నృప.70

దీర్ఘతముడట్లు గంగా ప్రవాహమున కొట్టుకొనిపోవుచుండెను. ఆ సమీపమునకు వచ్చియుండిన విరోచన పుత్త్రుడు ధర్మాత్ముడగు బలి అది చూచి అతనిని తీసికొనెను. అతడతనిని భక్ష్య భోజ్యములతో తృప్తినందించుచు తన అంతఃపురమునందు దాచెను. దీర్ఘతముడు ప్రీతుడై బలిని వరము కోరుకొమ్మనెను. ఆ అసురోత్తముడు పుత్త్రులు కావలెనని కోరెను. పూజ్యమునీ! నావంశము (మానవులలో) కొనసాగునట్లు నాభార్యయందు ధర్మార్థ తత్త్వజ్ఞులగు కుమారులను మీరు జన్మింపజేయవలయునని వేడెను. ఆ దేవర్షి సరేయనెను. తన భార్యలలో సుదేష్ణ యనునామెను మునికడకు పొమ్మనెను. ఆరాణి అతడు అంధుడును వృద్ధుడును అని ఎరిగి అతనికడకు పోవక తన దాది కూతురగు శూద్రస్త్రీని పంపెను. చిత్త నిగ్రహముకల ధర్మాత్ముడు ఆ దీర్ఘతముడు ఆమెయందు కక్షీవాన్ మొదలగు శూద్రులను జనింపజేసెను. వారందరును జాతిచే శూద్రులు. ఐనను వారందరును అధ్యయనము చేసినవారు. ఋషిత్వము నందినవారు. ఈశ్వరత్వము కలవారు. బ్రహ్మవాదులు (వేదవేదాంగ వేదాంత తత్త్వము నెరిగినవారు.) (శారీరకముగ్గను చిత్తమునను) శుద్ధులు. ధర్మమును సాక్షాత్కరించుకొనినవారు. శుచియగు బుద్ధికలవారు. ఇట్టి వీరిని చూచి బలి 'వీరు నా కుమారులే అగుదురా?' అని దీర్ఘతముని నడుగగా 'కాదు. నా కుమారులు.' అని అతడనెను. 'వీరు నావలన శూద్రయోనియందు జనించినారు. నీ భార్యయందు కలిగినవారు కారు.' అని జరిగినదంతయు రాజునకు ముని చెప్పెను.

తతః ప్రసాదయామాస బలి స్త మృషిసత్తమమ్ । బలి స్సుదేష్ణాం తాం దేవీం భర్త్సయామాస దానవః.71
పునశ్చైనా మలఙ్కృత్య ఋషయే ప్రత్యపాదయత్ । తాం స దీర్ఘతమా దేవీ మలఙ్కృతవతీం తదా. 72
దధ్నా లవణమిశ్రేణ అభ్యక్తం మధుకేన చ । లిహ మా మజుగుప్సన్తీ హ్యాపాదతలమస్తకమ్, 73

తత స్త్వం ప్రాప్స్యసే దేవి పుత్రాన్వై మనసేప్సితాన్ । తస్య సా తద్వచో దేవీ సర్వం కృతవతీ తదా (థా).
తస్య సాఽపాన మాసాద్య దేవీ పర్యహర త్తదా । తా మువాచ తత స్సోథ య త్తే పరిహృతం శుభే. 75
వినాఽపానం కుమారం తు జనయిష్యసి పూర్వజమ్ ।
సుదేష్ణా: నార్హసి త్వం మహాభాగ పుత్రం మే దాతు మీదృశమ్. 76
తోషితస్తు యథాశక్తి ప్రసాదం కురు మే ప్రభో । దీర్ఘతమాః: తవాపచారా ద్దేవ్యేష నాన్యథా భవితా శుభే.
దేవ్యపానం వినా జాతః పుత్ర స్తే దాస్యతే ఫలమ్ । తస్యాపానం వినాచైవ యోగ్యో భావీ భవిష్యతి. 78
తస్యా దీర్ఘతమాఽఙ్గేషు కుక్షౌ స్పృష్ట్వేద మబ్రవీత్ । ప్రాశితం దధి యద్వ్యగ్రే మమాఙ్గస్థం శుచిస్మితే. 79
తేన తే పూరితో గర్భః పౌర్ణమాస్యామివోడురాట్ । భవిష్యన్తి కుమారాస్తే పఞ్చ దేవసుతోపమాః. 80
తేజస్వినః పరాక్రాన్తా యజ్వానో ధార్మికాశ్చ తే । సూతః: అఙ్గాదఙ్గస్సుదేష్ణాయా జ్యేష్ఠపుత్రో వ్యజాయత.
వఙ్గ స్తథా కలిఙ్గస్తు పుణ్డ్రస్సుహ్మ స్తథైవచ । అఙ్గాదయస్తు పఞ్చైతే బలేః పుత్రాస్తు క్షేత్రజాః. 82
ఇత్యేతే దీర్ఘతమసా సుతా దత్తా స్తథా బలేః । ప్రతిష్ఠా మాగతా స్తస్య బ్రాహ్మణ్యం కారణం యతః. 83
తతో మానుషయోన్యాం స జనయామాస వై ప్రజాః ।

తరువాత బలి మరల ఆఋషి నత్తముని అనుగ్రహింపజేసికొని తన భార్యను చీవాట్లు వేసెను. ఆమెను అలంకరింపజేసి ఋషికి అప్పగించెను. నీవు నా శరీరమునందంతటను పెరుగు ఉప్పు ఇప్పతేనె పూసి ఆనహ్యావదక శరీరమంతయు నాకవలయును. అపుడు నీకు మనస్సునకు ఇష్టులగు కుమారులు కలుగుదురు. అని ముని సుదేష్ణతో, పలికెను. ఆమె అంతయు అట్లే చేసెను. కాని అపానప్రదేశమును నాకక విడిచెను. ఇందువలన నీకు జ్యేష్ఠుడు అపానము లేని కుమారుడు కలుగునని మునియనెను. "మహాభాగా! నిన్ను వేడుచున్నాను. నాకట్టి కుమారు నీయవలదు. నాయథాశక్తి నీమనస్సుప్తి కలిగించితిని. అనుగ్రహించుము." అని రాణి వేడగా "నీవు మంచిదానవే. కాని ఈ అపచారము వలన ఇది ఇట్లే జరుగును. అపానము లేనివాడయినను ఆ కలిగెడి పుత్రుడు యోగ్యుడే అగును." అని ముని ఆమె కుక్షిని తన చేతితో స్పృశించి మరల ఇట్లు పలికెను: "శుచియగు చిరునవ్వు కలదానా! నీవు మొదట నా అంగమందలి పెరుగు తింటివి. కావున నీ గర్భమునందు అది పూర్ణిమాతిథియందలి చంద్రుడువలె నిండినది. దాని ఫలితముగా నీకు దేవ కుమారులవంటి కుమారు లైదుగురు జనింతురు. వారు తేజోవంతులు-పరాక్రమవంతులు యజ్ఞములు చేయువారు ధార్మికులు నగుదురు."

పిమ్మట సుదేష్ణ అంగము (గర్భము)నుండి జ్యేష్ఠుడుగా అంగుడును వంగ కలింగ పుండ్ర సుహ్మలను మరి నలుగురును-ఐదుగురు బలి దైత్యునకు మానవియగు భార్యకు★ క్షేత్రజులుగా కుమారులు కలిగిరి. దీర్ఘతముడు బలికి ఇచ్చిన వీరందరును అతని బ్రాహ్మణ్య ప్రభావమున లోకమున ప్రతిష్ఠ నార్జించి గొప్పవారయిరి. ఇట్లు బలి తాను దైత్యుడయ్యు మానవ స్త్రీయందు సంతానమును కనెను.

తతస్తు దీర్ఘతమసం సురభి ర్వాక్య మబ్రవీత్. 84
విచార్య యస్మా ద్గోధర్మం తే ప్రమాణీకృతం ప్రభో । భక్త్యా ప్రవద్య యోఽస్మాకం తేన ప్రీతాస్మి తేనఘ.
తస్మా త్తుభ్యం తమో దీర్ఘ మాఘ్రాయాపనయా మ్యహమ్ ।
బార్హస్పత్యం తు విధివ త్పాప్మ య త్తిష్ఠతి త్వయి. 86
జరాం మృత్యుం తమశ్చైవ మాఘ్రాయాపనుదామి తే ।
సద్యో స్త్వాఘ్రాతమాత్రే తు హృతే తమసి వై మునేః. 87

★ భర్త ఉండగా అతని అనుమతితో కాని భర్త మరణించిన తరువాతనైనను అతని కుటుంబపు పెద్దల అనుమతితో కాని అతని భార్యయందు పరునివలన జనించిన కుమారులు క్షేత్రజులు.

ఆయుష్మా న్వపుషా చైవ చక్షుష్మాంశ్చ తతోఽభవత్। గవా హృతే తమసి వై గోతమస్తు తతోఽభవత్. 88
కక్షీవానపి గత్వాఽసౌ సహ పిత్రా గిరివ్రజమ్ । దృష్ట్వా పితు స్సమీపేవై ఉపాతిష్ఠ చ్చిరం తపః. 89
తతః కాలేన మహతా తపసా భావితస్తు సః ।
విధూయ* శూద్రాం తు తనుం బ్రాహ్మణ్యం ప్రాప్తవా న్ప్రభుః. 90
తతోఽబ్రవీ త్పితా తం వై పుత్రవా నస్మ్యహం త్వయా ।
సత్పుత్రేణతు ధర్మజ్ఞ కృతార్థోఽహం యశస్వినా. 91
ముక్త్వాత్మాన మసావేవ ప్రాప్తవా న్బ్రహ్మణః క్షయమ్ ।
బ్రాహ్మణ్యం ప్రాప్య కక్షీవా న్సహస్ర మసృజ త్సుతాన్. 92
కూశ్మాణ్డా గౌతమా స్తే వై సుతాః కక్షీవత స్స్మృతాః । ఇత్యేష దీర్ఘతమసో బలే ర్వైరోచనస్య చ. 93
సమాగమో వః కథిత స్సన్తతి శ్చోభయో స్తథా । బలి స్తా నభివాద్యాథ పఞ్చ పుత్రా నకల్మషాన్. 94
కృతార్థ స్సోపి ధర్మాత్మా యోగమాయాఽఽవృత స్స్వయమ్ ।
అదృశ్య స్సర్వభూతానాం కాలాపేక్షీ సవై ప్రభుః. 95

తరువాత సురభి (కామధేనువు) దీర్ఘతమునితో ఇట్లు పలికెను: "ప్రభూః నీవు గోధర్మమును ఉత్తమముగా భావించి దానిని ప్రమాణముగా తీసికొంటివి. నీవు మాయందు ప్రవత్తి పూర్వకమగు భక్తి చూపితివి. అందుచే నేను నీయందు ప్రీతి చెందితిని. నేను నిన్ను ఆఘ్రాణించి నీయందు బృహస్పతి శాపము చేతను అతని రేతఃసంసర్గ పాపము చేతను సంక్రమించిన దోషమును జరామృత్యువులను దీర్ఘమగు తమస్సును (దృష్టియందలి దోషమును) తొలగింతును." ఇట్లు పలికి సురభి దీర్ఘతముని ఆఘ్రాణించి (ముక్కుతో పీల్చివేసి) అతని యందలి ఈ దోషములన్నియు లాగి వేసెను. దానితో అతడు ఆయుష్మంతుడు వపుష్మంతుడు (సుందర శరీరుడు) చక్షుష్మంతుడు (చూడగలవాడు) అయ్యెను. గోవుచే అతని 'తమస్సు' హరింపబడినందున అతనికి "గో-తముడు" అను ప్రసిద్ధి వచ్చెను.

తరువాత 'కక్షీవాన్' తన తండ్రి (దీర్ఘతముని)తో కూడ గిరివ్రజమునకు పోయి అచ్చటనేయుండి చిరకాలము తపము నొనరించెను. అనంతరము అతిదీర్ఘకాలమునకు అతడు తపస్సుచే భావితుడై (సంస్కారమునంది) శూద్ర (సంస్కారముకల) శరీరమును విడిచి బ్రాహ్మణ్యమును పొందెను. అంతట తండ్రి దీర్ఘతము డతనితో "నాయనా! నేను నీచే పుత్రవంతుడనైతిని. నీవు సత్పుత్రుడవు. ధర్మజ్ఞుడవు. కీర్తిమంతుడవు. నీచే నేను కృతార్థుడనయితిని. నీవు ఈజీవుగా (ఈ దేహము కలవాడుగా) ఉండియే దేహమును (దేహమందలి సంస్కారములను) విడిచి బ్రహ్మయొక్క స్థానమును (బ్రాహ్మణ స్థానమును బ్రాహ్మణత్వమును) పొందితివి." అనెను.

కక్షీవాన్ ఇట్లు బ్రాహ్మణత్వమును పొందిన తరువాత అతనికి వేయిమంది కుమారులు కలిగిరి. వారికి కూశ్మాండులు గౌతములు అని నామము.

ఇట్లు మీకు దీర్ఘతమునికిని విరోచన సుతుడగు బలికిని సమాగమము కలుగుటయు ఇరువురి సంతానమును తెలిపితిని.

అనంతరము బలి అకల్మషులగు అంగుడు మొదలగు ఐదుమంది కుమారులను అభివాదము చేసి కృతార్థుడయ్యెను. ఆ ధర్మాత్ముడు తాను యోగమాయచే కప్పబడి ఏ భూతములకును కనబడనివాడయి రామన్న కాలమును ఎదురు చూచుచు ఉండెను.

---

* చాత్మనః కాయం

తత్రాఙ్గస్య తు దాయాదో రాజాఽఽసీ ద్దధివాహనః । దధివాహనపుత్రస్తు రాజా దధిరథ స్స్మృతః. 96
ఆసీ ద్దధిరథాపత్యం విద్వా న్ధర్మరథో నృపః । సహి ధర్మరథ శ్శ్రీమాం స్తేన విష్ణుపదే గిరౌ. 97
సోమ శ్శక్రేణ వై రాజ్ఞా సహ పీతో మహాత్మనా । సమో ధర్మరథస్యాపి పుత్ర శ్చిత్రరథః కిల. 98
తస్య చైత్రరథః పుత్ర స్తస్మా ద్దశరథః కిల । రోమపాద ఇతి ఖ్యాతో యస్య శాన్తా సుతాఽభవత్. 99
అథ దాశరథి ర్వీర శ్చతురఙ్గో మహాయశాః । ఋశ్యశృఙ్గ ప్రసాదేన జజ్ఞే స్వకులవర్ధనః. 100
చతురఙ్గస్య పుత్రస్తు పృథులాక్ష ఇతి స్మృతః । పృథులాక్షసుతశ్చాపి చమ్పో నామ బభూవ హ. 101
చమ్పస్య తు పురీ చమ్పా పూర్వం యా మాలినీ భవత్। పూర్ణభద్రప్రసాదేన హర్యఙ్గోఽస్య సుతోఽభవత్.
జజ్ఞే విభాణ్డకాచ్చాస్య వరణ శ్శత్రువారణః । అవతారయామాస మహీం మన్త్రై ర్వాహనముత్తమమ్. 103
హర్యఙ్గస్య తు దాయాదో జాతో భద్రరథః కిల । అథ భద్రరథస్యాసీ ద్బృహత్కర్మా జనేశ్వరః. 104
బృహద్భాను స్సుత స్తస్య తస్మా జ్జజ్ఞే బృహన్మనాః ।
బృహన్మనాస్తు రాజేన్ద్రో జనయామాసవై సుతమ్. 105
నామ్నా జయద్రథం వీరం యస్మా జ్జాతో బృహద్రథః ఆసీ ద్బృహద్రథస్యాపి విశ్వజి జ్జనమేజయః.
దాయాద స్తస్య చాఙ్గో వై యస్మా త్కర్ణోఽభవ న్నృపః ।
కర్ణస్య వృషసేనస్తు వృషసేని స్తదాత్మజః. 107
ఏతేఽఙ్గా త్క్రమశస్సర్వే రాజానః కీర్తితా మయా । విస్తరేణానుపూర్వ్యాచ్చ పూరోశ్చ శృణుత ద్విజాః.
ఋషయః : సూతాత్మజః కథం కర్ణః కథ మఙ్గస్య చాత్మజః ।
ఏత దిచ్ఛామహే శ్రోతు మత్యన్తకుశలో హ్యసి. 109
సూతః : బృహద్భానో స్సుతో జజ్ఞే నామ్నా రాజాబృహన్మనాః ।
తస్య పత్నీద్వయం హ్యాసీ చ్చైద్యస్య తనయే శుభే. 110
యశోదేవీచ సత్యాచ తయో ర్వంశ మిమం శృణు । జయద్రథంతు రాజానం యశోదేవీ వ్యజీజనత్. 111
సా బృహన్మనస స్సత్యా విజయం నామ విశ్రుతమ్ । విజయస్య బృహత్పుత్ర స్తస్య పుత్రో బృహద్రథః.
బృహద్రథస్య పుత్రస్తు సత్యకర్మా మహామనాః । సత్యకర్మసుతశ్చాపి సూత స్త్వతి(ధి)రథ స్స్మృతః.
యః కర్ణం ప్రతిజగ్రాహ తేన కర్ణస్తు సూతజః ।
ఏత ద్వ స్సర్వ మాఖ్యాతం య త్కర్ణం ప్రతి చోదితమ్. 114

ఇతి శ్రీమత్స్యమహాపురాణే చన్ద్రవంశానువర్ణనే తుర్వస్వాదిసన్తతికథనం
నామాష్టచత్వారింశోఽధ్యాయః.

వీరిలో అంగునకు దధివాహనుడు అతనికి దధిరథుడు అతనికి విద్వాంసుడగు ధర్మరథుడు కుమారులయిరి. ఇతడు చాల పూజ్యుడు. విష్ణుపదమను పర్వతమున ఇతడు దేవరాజగు ఇంద్రునితో కూడి సోమపానము చేసెను. అతనికి తండ్రితో సముడగు చిత్రరథుడు అతనికి చైత్రరథుడు అతనికి రోమపాదుడని ప్రసిద్ధుడును శాంతకు తండ్రియు అగు దశరథుడు (ఇతడు శ్రీరాముని తండ్రియగు దశరథునకు సనాముడేమో:) అతనికి ఋశ్యశృంగుని అనుగ్రహమున వంశ వర్ధనుడగు చతురంగుడు అతనికి పృథులాక్షుడు అతనికి పూర్వపు మాలినీ నగరమును చంపానగరి యని ప్రసిద్ధికి తెచ్చిన చంపుడు అతనికి పూర్ణభద్రముని అనుగ్రహమున హర్యంగుడు విభాండకుని దయవలన వారణుడు కుమారు లయిరి. ఈ వారణుడు శత్రువులను నిరోధించగల వీరుడు. మంత్రబలముతో ఉత్తమ వాహనమును (ఉచ్చైఃశ్రవమును)

భూమికి దిగి వచ్చునట్లు చేసెను. హర్యంగునకు భద్రరథుడు అతనికి బృహత్కర్మ అతనికి బృహద్భానుడు అతనికి బృహన్మనసుడు అతనికి జయద్రథుడు అతనికి జనమేజయుడు అతనికి అంగుడు అతనికి కర్ణుడు (కుంతికి కానీన సుతుడు) అతనికి వృషసేనుడు అతనికి వృషసేని కుమారులయిరి. ఇది అంగ వంశీయులగు రాజుల వరంపర. ఇక పూరు వంశమును వివరింతును.

అనగా ఋషులు సూతు నిట్లడిగిరి: "కర్ణుడు సూతుని కుమారుడని విందుము. ఇతడు అంగుని కుమారు డెట్లయ్యెను? నీవు ఇవి బాగుగ ఎరిగినవాడవు. చెప్పగలవాడవు. కావున నీనుండి వినగోరుచున్నాము."

సూతుడు ఋషులకు ఇట్లు చెప్పెను: లోగడ చెప్పిన బృహద్భానునకు బృహన్మనసుడు కుమారుడంటినికదా! అతనికి చైద్యుని కూతురు యశోదాదేవి-సత్య-అనువారు ఇద్దరు భార్యలు. యశోదాదేవికి జయద్రథుడును సత్యకు విజయుడును కుమారులయిరి. విజయునకు బృహత్ అనునతడు అతనికి బృహద్రథుడు అతనికి సత్యకర్మన్ అతనికి అతి(ధి)రథ సూతుడు కుమారులయిరి. ఈతడు కర్ణుని తన కుమారునిగా గ్రహించెను. ★అందుచే కర్ణునకు సూతపుత్రుడను ప్రసిద్ధి వచ్చెను.

మీరు కర్ణుని విషయమున ప్రశ్నించినదంతయు మీకు ఇట్లు తెలిపితిని.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున చంద్రవంశానువర్ణనమున తుర్వసుడు మొదలగువారి వంశముల వృత్తాంతములనెడు నలువది ఎనిమిదవ అధ్యాయము.

## ఏకోన పంచాశో౽ధ్యాయః.

## పూరువంశః.

సూతః : పూరోః పుత్రో మహాతేజా రాజాసీ జ్జనమేజయః ।
ప్రాచీన్వత స్సుత స్తస్య యః ప్రాచీ మకరోద్దిశమ్. 1
ప్రాచీన్వతసుతశ్చాపి మనస్యుశ్చ తతో౽భవత్ । రాజా వాతాయుధో నామ మనస్యో రభవ త్సుతః. 2
❋ దాయాద స్తస్య చాప్యాసీ చ్ఛుణ్డ్వర్నామ మహీపతిః ।
● శజ్ఞోర్బహువిదః పుత్ర స్సమ్పాతి స్తస్య చాత్మజః. 3
★ సమ్పాతేస్తు హ్యహంవాది ర్భద్రాశ్వ స్తస్య చాత్మజః । భద్రాశ్వస్యఘృతాచ్యాంతు దశాప్సరసి సూనవః.
ఋచేపుశ్చ విలేపుశ్చ కక్షేపుశ్చ తథైవచ । ఘృతేపుశ్చ విచేపుశ్చ స్థణ్డిలేపు ర్బలేపుచ(శ్చ). 5
ధర్మేపు స్సన్నతేపుశ్చ పుణ్యేపు శ్చేతి వై దశ । ఋచేపోర్జ్వలనా నామ భార్యాసై తక్షకాత్మజా. 6
తస్యాం సజ్జనయామాస అన్తినారం మహీపతిః । అన్తినారో మనస్విన్యాం పుత్రా న్జజ్ఞే వరాన్ఛుభాన్. 7
అమూర్తం నరపతిం వీరం త్రివానుం చాపి ధార్మికమ్ । గౌరీ కన్యా తృతీయాచ మాన్ధాతు ర్జననీ శుభా. 8
అసీ దంశోరథ సతీ యా౽స్మాత్ పుత్రా నజీజనత్ । బ్రహ్మవాదపరీతాంస్తు ఉపదానా తథాపిచ. 9
ఉపదానా సుతా న్లేభే చతురస్తు నిజాత్మజాన్ । దుష్యన్త మథదుష్యన్తం ప్రవీర మనఘం తథా. 10
చక్రవర్తీ తతో జజ్ఞే దుష్యన్తా త్సమితిఞ్జయః । శకున్తలాయాం భరతో యస్య నామ్నా తు భారతాః. 11
దుష్యన్తం ప్రతి రాజానం వాగువాచాశరీరిణీ । మాతా భస్త్రా పితుః పుత్రో యేన జాత స్స ఏవ సః. 12
భరస్వ పుత్రం దుష్యన్త సత్య మాహ శకున్తలా । రేతోధా స్త్రాయతే పుత్రః వరేతంచ యమక్షయాత్. 13
త్వం చాస్య ధాతా గర్భస్య నావమంస్థా శ్శకున్తలామ్ । భరతస్య వినష్టేషు తనయేషు పురా కిల. 14

❋ దాయాద స్తస్యచాప్యాసీద్ధున్ధుర్నామ ● దున్ధోర్బహువిదః ★ సంయాతేస్తు

★ ఈ విషయమున వివరణము అనుబంధములో చూడుడు.

పుత్త్రిణాం మాతృకోపేన యుగప త్సంక్షయే కృతే ।
తతో మరుద్భి రానీయ పుత్త్రి స్స తు బృహస్పతేః. 15
సఙ్క్రామితో భరద్వాజో మరుద్భి ర్భరతస్య చ ।

## నలువది తొమ్మిదవ అధ్యాయము

## పూరువంశము

సూతుడు పూరువంశ వృత్తాంతమును ఋషులకు ఇట్లు చెప్పెను: పూరునకు జనమేజయుడు అతనికి తూర్పు దెస నంతటిని పాలించిన ప్రాచీన్వతుడు అతనికి మనస్యుడు అతనికి వాతాయుదుడు అతనికి శంకుడు అతనికి బహువిదుడు అతనికి సంపాతి అతనికి అహంవాది అతనికి భద్రాశ్వుడు అతనికి ఘృతాచియను అప్సరసయందు ఋచేపు విలేపు కక్షేపు ఘృతేపు విచేపు స్థండిలేపు బలేపు ధర్మేపు సంతతేపు పుణ్యేపులను పదిమంది కుమారులు. వీరిలో ఋచేపునకు తక్షక పుత్త్రియగు జ్వలనయందు అంతినారుడు అతనికి మనస్విని అను భార్యయందు వీరుడగు అంశుడను నరపతియు ధార్మికుడగు త్రిహనుడును గౌరియను కన్యయు కలిగిరి. ఈ గౌరి మాంధాతృని తల్లి యయ్యెను. అంశునకు ఉపదానయను పత్నియందు బ్రహ్మవాదులగు రుష్యంతుడు దుష్యంతుడు ప్రవీరుడు అనఘుడు అను కుమారులు కలిగిరి. అతనికి యుద్ధవిజయియగు భరతుడు అను చక్రవర్తి కలిగెను. ఈతని పేరుననే ఈ వంశము వారికి భారతులను పేరు వచ్చెను. శకుంతల ఈతని తల్లి. (శకుంతలను దుష్యంతుడు తిరస్కరించినపుడు) అశరీరవాణి దుష్యంతుని ఉద్దేశించి ఇట్లనెను: "దుష్యంతా! తల్లి (వస్తువులను దాచు.) తోలుతిత్తి వంటిది. కుమారుడు తండ్రికి చెందినవాడు. అతడు తాను ఎవరివలన పుట్టెనో అతడే కాని వేరు కాదు. (కనుక కుమారుని వదలుట తన్నుతాను వదలుకొనుటయే యగును.) కనుక నీవు ఈ కుమారుని భరించుము. శకుంతల సత్యమే చెప్పినది. తనకు జన్మకారణముగా రేతస్సును (శుక్రమును-గర్భమును) నిలిపిన తండ్రిని యమలోకము(నందలి బాధల)నుండి సుతుడు కాపాడును. దుష్యంతా! (శకుంతలయందు) గర్భము నిలిపిన వాడవు నీవు. ఈ శకుంతలను అవమానించకుము." (ఈతనిని భరించుము. అని చెప్పబడినవాడు కనుక భరతుడు.)

పూర్వము భరతుని కుమారులు తమ తల్లి కోపమునకు గురియై ఒకేమారు అందరును నశించగా మరుత్తులు (దేవతలు) బృహస్పతి పుత్త్రుడగు భరద్వాజుని ఈ భరతునికి పుత్త్రునిగా సంక్రమింపజేసిరి.

### భరద్వాజోత్పత్తి స్తత్సన్తతిశ్చ

ఋషయః: భరతస్య భరద్వాజః పుత్త్రార్థం మారుతైః కథమ్. 16
సఙ్క్రామితో మహాతేజా స్త న్నో బ్రూహి యథాతథమ్ ।
సూతః: పత్న్యా మాసన్నసత్త్వాయా ముచథ్యే సంస్థితే భువి. 17
భ్రాతు ర్భార్యాం స దృష్ట్వా తు బృహస్పతి రువాచ తమ్ ।
ఉపతిష్ఠ స్వలఙ్కృత్య మైథునాయచ మే శుభే. 18
వినయో నోపదేష్టవ్య స్త్వయా మే వరవర్ణిని । ఏవ ముక్తాఽబ్రవీ దేన మ న్తర్వత్నీ త్వహం ప్రభో. 19
గర్భః పరిణతశ్చాయం బ్రహ్మ వ్యాహరతే గిరా । అమోఘరేతా స్త్వంచాపి ధర్మం చైవం విగర్హితమ్. 20
ఏవముక్తోఽబ్రవీ దేనాం స్వయమేవ బృహస్పతిః । నోపదేష్టవ్యో వినయ స్త్వయా మే వరవర్ణిని. 21
కర్షమాణః ప్రసహ్యైనాం మైథునాయోపచక్రమే । తతో బృహస్పతిం గర్భో ధర్షమాణ ఉవాచహ. 22
సన్నివిష్టో హ్యహం పూర్వ మిహ తావ ద్బృహస్పతే । అమోఘరేతా స్త్వం తాత నావకాశ ఇహ ద్వయోః.
ఏవ ము క్త స్స గర్భేణ కుపితః ప్రత్యువాచ హ ।
బృహస్పతిః: యస్మా త్త్వ మీదృశే కాలే సర్వభూతహితే సతి. 24

ప్రతిషేధసి యస్మాత్త్వం తమో దీర్ఘం ప్రవేక్ష్యసి । తతః కామం సన్నివృత్య తస్యానన్దం బృహస్పతిః.
తద్రేత స్త్వపత ద్భూమౌ నివృత్తం శిశుకోఽభవత్ ।
సద్యోజాతం కుమారం తు దృష్ట్వా తం మమతాఽబ్రవీత్. 26
గమిష్యామి గృహం స్వం వై భరస్వైనం బృహస్పతే ।
ఏవ ముక్త్వా ★గతాయాంతు పిత్రా త్యాగీకృతోఽప్యసౌ. 27
మాతాపితృభ్యాం త్యక్తంతు దృష్ట్వా తం మరుత శ్శిశుమ్ ।
జగృహుస్తే భరద్వాజం మరుతః కృపయాఽన్వితాః. 28
తస్మి న్కాలేతు భరతో బహుభిః క్రతుభి ర్విభుః । కామ్యనైమిత్తికై ర్యజ్ఞై రయజ త్పుత్రలిప్సయా. 29
యతస్స యజమానస్తు పుత్రం నాసాదయ త్ప్రభుః ।
తతః క్రతుం మరుత్స్తోమం పుత్రార్థం సముపాహరత్. 30
తేన తే మరుత స్తస్య మరుత్స్తోమేన తుష్టువుః । ఉపనిన్యు ర్భరద్వాజం పుత్రార్థం భరతాయ వై. 31
దాయాదోఽఙ్గిరస స్సూనో రౌరసస్తు బృహస్పతేః । సఙ్క్రామితో భరద్వాజో మరుద్భి ర్భరతం ప్రతి.32

ఋషులు సూతు నిట్లు ప్రశ్నించిరి: "మారుతులు భరతునికి పుత్త్రునిగా భరద్వాజు నెట్లు సంక్రమింపజేసిరో తెలుప వేడెదము."

సూతు డిట్లు చెప్పెను: ఉత(చ)థ్యుడు తన భార్య మమత గర్భవతిగా ఉండగా మరణించెను. అతని తమ్ముడు బృహస్పతి మమతను చూచి "సుందరీ! నీవు చక్కగా అలంకరించుకొని నాతో కలియుటకు సిద్ధవు కమ్ము. నీవు నా కేమియు కట్టుబాటు మాటలు (నీతులు) నేర్పవలదు." అనెను. మమత "ప్రభూ! నేను గర్భవతిని. గర్భము పరిణతమయి (ప్రసవమునకు సిద్ధమయి) యున్నది. ఆ శిశువు వేదమును చెప్పుచున్నది. నీవును వ్యర్థముకాని వీర్యము కలవాడవు. ఇటువంటి ధర్మము నిందిత మయినది." అనెను. కాని "నీవు నాకు సత్ప్రవర్తనము నుపదేశించ నక్కరలేదు." అని బృహస్పతి ఆమెను బలవంతముగా లాగి మైథునము నారంభించెను. అంతట గర్భము (శిశువు) బృహస్పతిని మందలించుచు "బృహస్పతీ! నేను ముందుగా ఇక్కడ ప్రవేశించితిని. నీవును అమోఘ రేతస్కుడవు. ఇక్కడ ఇద్దరకు తావు లేదు." అనెను. శిశువుతో బృహస్పతి "సర్వభూతములకు (ఆనందకర) హితకరమగు ఇటువంటి సమయమున నన్ను నిషేధించితివి. కావున దీర్ఘమగు తమస్సును (గ్రుడ్డితనమును) ప్రవేశింతువు." అనెను. అంతట అతడు తన కామమును ఆనందమును కూడ మరలించుకొనెను. అతని వీర్యము భూమిపై పడి వెంటనే శిశువయ్యెను. సద్యోజాతుడగు (వెంటనే పుట్టిన) ఆ శిశువును చూచి మమత బృహస్పతితో "నేను నా ఇంటికి పోవుచున్నాను. వీనిని భరించుము." అని పోయెను. బృహస్పతియు ఆ శిశువును వదలిపోయెను. ఇట్లు తల్లిదండ్రు లిద్దరును వదలిన శిశువును చూచి మరుత్తులు జాలి చెంది తీసికొనిరి. వాయువులచే భరింపబడినందున అతడు భరద్వాజు డనబడెను. (భరత్-వాయు> భరత్-వాజు> భరద్వాజ) ఆ కాలమునందే భరతుడు పుత్త్రులను కోరి కామ్యములును నైమిత్తికములు నగు యజ్ఞములతో దేవతల నారాధించెను. కాని అతనికి సంతతి కలుగలేదు. అంతట నతడు 'మరుత్స్తోమము' అను యజ్ఞము నాచరించి దానియం దతడు మరుత్తులను స్తుతించెను. దానికి ప్రీతులై వారు భరద్వాజుని తెచ్చి భరతునకు పుత్త్రునిగా ఇచ్చిరి. ఇతడు ఇట్లు వాస్తవమున అంగిరః పుత్త్రుడగు బృహస్పతికి కుమారుడు.

భరతస్తు భరద్వాజం పుత్రం ప్రాప్య తతోఽబ్రవీత్ ।
ఆదాయ త్వాం హితార్థాయ కృతార్థోఽహం త్వయా విభో. 33
పూర్వంతు వితథే తస్మి న్కృతే వై పుత్రజన్మని । తత స్త్వవితథో నామ భరద్వాజో నృపోఽభవత్. 34

★ గతా. పా తు గతాయాం సోఽపి తం త్యజత్.

తస్మాదేవ భరద్వాజా ద్బ్రాహ్మణాః క్షత్రియా భువి ।
ద్వ్యాముష్యాయణకౌలీనా స్స్మృతాస్తు ద్వివిధా హి తే. 35
తతో జాతేఽవ్యవితథే భరతోపి ★వనం యయౌ । భరద్వాజాభిధం పుత్త్రి మభిషిచ్య చ తం నృపః. 36
దాయాదోఽవితథ స్యాభూ ద్భవమన్యు ర్మహాయశాః ।
మహాభూతోపమాః పుత్త్రాశ్చత్వారో భవమన్యవః. 37
బృహత్క్షత్రో మహావీర్యో నరో గర్గశ్చ వీర్యవాన్ । నరస్య సఙ్కృతిః పుత్త్రి స్తస్య పుత్త్రౌమహాయశాః. 38
గురుశ్చ రన్తిదేవశ్చ సాఙ్కృతే స్తావుభౌ స్మృతౌ । గర్గస్య చైవ దాయాద శ్శిబి ర్విద్వా న్బభూవహ. 39
స్మృతా శ్శైబ్యా స్తతో గర్గ్యాః క్షత్త్రోపేతా ద్విజాతయః । ఆహార్యతనయశ్చైవ ధీమా నాసీ త్తరక్షుకః. 40
తస్య భార్యా విశాలాతు సుషువే పుత్త్రకత్రయమ్ ।
త్ర్యూషణం పుష్కరం చైవ కవిం చైవ మహాయశాః. 41
తరక్షుకసుతా హ్యేతే సర్వే బ్రాహ్మణతాం గతాః ।
కావ్యానాంతు సుతా హ్యేతే త్రయః ప్రోక్తా మహర్షయః. 42
గర్గాస్సఙ్కృతయః కావ్యాః క్షత్త్రోపేతా ద్విజాతయః। సంవృతాఙ్గిరసః పుత్త్రోః బృహత్క్షత్త్రశ్చ వక్ష్యతే.
బృహత్క్షత్త్రస్య దాయాదో హస్తీ నామ బభూవ హ ।
యేనేదం నిర్మితం పూర్వం పురంతు గజసాహ్వయమ్. 44
హస్తినశ్చాపి దాయాదా స్త్రయః పరమకీర్తయః । అజామీఢో వ్యమీఢశ్చ పురుమీఢ స్తథైవ చ. 45
అజామీఢస్య భార్యాస్తు తిస్రః కన్యాః కులోద్వహాః । నీలినీ ధూమినీ చైవ కేశినీ చైవ విశ్రుతాః. 46
స తాసు జనయామాస పుత్త్రాన్వై దేవవర్చసః । తపసోఽన్తే సుమహతో జాతా వృద్ధస్య ధార్మికాః. 47

తనకు పుత్త్రుడుగా లభించిన భరద్వాజునితో భరతుడు "విభూః నాకు హితకరుడవగు నీవు లభించుటచే కృతార్థుడ నయితిని." అని అతనిని ప్రశంసించెను. తనకు కుమారులు కలుగుట వితథము (వ్యర్థము-అసత్యము) అయి ఉన్నప్పుడులభించినందున భరతు డితనికి అవితథుడు (అసత్యము కానివాడు) అని పేరుంచి అతనిని తన రాజ్యమున పట్టాభిషిక్తుని చేసి తాను వనమునకు పోయెను. ✱ద్వ్యాముష్యాయణుడగు ఈ భరద్వాజుని వంశమున పుట్టినవారు కొందరు బ్రాహ్మణులును మరికొందరు క్షత్త్రియులు - ఇట్లు రెండు విధములవారు (లేదా ఈ రెండు జాతుల ధర్మముల ననుసరించువారు) జనించిరి.

ఈ అవితథుని కుమారుడు భవమన్యుడు. అతనికి వాయ్వాది మహాభూతములతో తుల్యులగు నలుగురుకుమారులు బృహత్క్షత్త్రుడు మహావీర్యుడు నరుడు గర్గుడు అనువారు కలిగిరి. నరునకు సంకృతి అతనికి గురుడు రంతిదేవుడు కుమారులు. గర్గుని కుమారుడు విద్వాంసుడగు శిబి. ఇతని కుమారులు శైబ్యులు గార్గ్యులు అను పేరున క్షత్త్రియ ధర్మము పాటించు బ్రాహ్మణు లయిరి. వీరిలో ఆహార్యునికి తరక్షుకుడు అతనికి విశాల అను భార్యయందు త్ర్యూషణుడు పుష్కరుడు కవి అనువారు కలిగి బ్రాహ్మణు లయిరి. కావ్యులు అను పేర ప్రసిద్ధులలో ఈ ముప్వురును మహర్షు లయిరి. గర్గులు సంకృతులు కావ్యులు వీరందరును క్షత్త్రధర్మముతో వర్తించు బ్రాహ్మణులు. వీరిలో సంవృతాంగిరుడు అను వతని కుమారుడు బృహత్క్షత్త్రుడు. అతని కుమారుడు హస్తి. అతని పేరుతోనే హస్తినాపురము నిర్మితమయ్యెను. ఇతనికి అజామీఢుడు వ్యమీఢుడు పురుమీఢుడు అను ముగ్గురు కుమారులు. అతనికి వంశోద్ధారికలగు నీలిని ధూమిని కేశిని అను ముగ్గురు భార్యలు. అతడు మహాతపస్సుచేసి తన వార్ధకమున భరద్వాజుని అనుగ్రహమున దేవవర్చసులగు ముగ్గురు కుమారులను పొందెను.

---

★ దివం.

✱ ఒకరికి జన్మించి మరొకరికి దత్తుడై కాని మరొక హేతువుచే కాని ఇద్దరు తండ్రులకు కుమారుడుగా ఐన ఒకే వ్యక్తి

భరద్వాజప్రసాదేన విస్తరం తేషు మే శృణు । అజామీఢస్య కేశిన్యాం కణ్వ స్సమభవత్కిల. 48
మేధాతిథి స్సుత స్తస్య తస్మా త్కాణ్వాయనా ద్విజాః ।
అజామీఢస్య ధూమిన్యాం బృహద్వా నభవ న్నృపః. 49
బృహ ద్బృహద్వతః పుత్రో బృహతశ్చ బృహన్మనాః ।
బృహన్మన స్సుతశ్చాపి బృహద్ధను రితి స్మృతః. 50
బృహద్ధనోర్ బృహదిషుః పుత్ర స్తస్య జయద్రథః । అశ్వజి త్తనయ స్తస్య సేనజి త్తస్యచాత్మజః. 51
అథ సేనజితః పుత్రా శ్చత్వారో లోకవిశ్రుతాః । రుచిరాశ్వశ్చ తవ్యశ్చ రాజా దృఢరథ స్తథా. 52
వత్స శ్చావన్తికో రాజా యస్య తే పరివర్తకాః । రుచిరాశ్వస్య దాయాదః వృథుసేనో మహాయశాః. 53
వృథుసేనస్య పారస్తు పారా న్నీపోథ జజ్ఞివాన్ । నీవస్త్యైకశతం చాసీ త్పుత్రాణా మమితౌజసామ్. 54
నీపా ఇతి సమాఖ్యాతా రాజాన స్సర్వ ఏవ తే । తేషాం వంశకర శ్శ్రీమా న్నీపానాం కీర్తివర్ధనః. 55
* కాశ్యప స్సమరో నామ సచేష్టసమరోఽభవత్ । నమరస్య ○ చరో భాను స్సుదర్శ ఇతి తే త్రయః. 56
పుత్రా స్సర్వగుణోపేతాః పారపుత్రః వృథుర్భవః । వృథోస్తు సువ్రతోనామ సువ్రతే నేహ కర్మణా. 57
జజ్ఞే సర్వగుణోపేతో విభ్రాజ స్తస్య చాత్మజః । విభ్రాజస్య తు దాయాద స్త్వణుహో నామ వీర్యవాన్. 58
బభూవ శుకజామాతా కృత్వాభర్తా మహాయశాః । అణుహస్య తు దాయాదో బ్రహ్మదత్తో మహీపతిః. 59
యుగదత్త స్సుత స్తస్య విష్వక్సేనో మహాయశాః । విభ్రాజః పున రాజాత స్సుకృతేనేహ కర్మణా. 60
విష్వక్సేనస్య పుత్రస్తు ఉదక్సేనో బభూవ హ ।
పాల్యాయ స్తస్య పుత్రస్తు తస్యాసీ జ్జనమేజయః. 61
ఉగ్రాయుధేన తస్యార్థే సర్వే నీపాః ప్రణాశితాః ।

వీరి వంశ విస్తరమును చెప్పెదను వినుడు: అజమీఢునకు కేశినియందు కణ్వుడు అతనికి మేధాతిథి కుమారు లయిరి. వీరికి కాణ్వాయనులని వ్యవహారము.

ఈ అజమీఢునకు ధూమినియందు బృహద్వాన్ అతనికి బృహత్ అతనికి బృహన్మనసుడు అతనికి బృహద్ధనువు అతనికి బృహదిషుడు అతనికి జయద్రథుడు అతనికి అశ్వజిత్ అతనికి సేనజిత్ అతనికి రుచిరాశ్వుడు కావ్యుడు దృఢరథుడు అవన్తి జనపద రాజగు వత్సుడు అను నలుగురు కుమారు లయిరి. రుచిరాశ్వునకు వృథుసేనుడు అతనికి పారుడు అతనికి నీపుడు అతనికి నూటొక్కమంది కుమారులు కలిగిరి. వీరిలో సమరుడు అను నతడు నీపుల వంశమును కీర్తివి వృద్ధి చేయువాడయ్యెను. అతనికి చరుడు భానుడు సుదర్శుడు కలిగిరి. పారునకు వృథుడు అతనికి సువ్రతుడు అతనికి విభ్రాజుడు అతనికి శుకుని అల్లుడును కృత్వా అను నామెకు భర్తయు అగు అణుహుడు అతనికి బ్రహ్మదత్తుడు అతనికి యుగదత్తుడు అతనికి విష్వక్సేనుడు కలిగిరి. ఇతడు సుకృతవశమున మరల జన్మించిన విభ్రాజుడు అని కీర్తి పొందెను. విష్వక్సేనునకు ఉదక్సేనుడు అతనికి పాల్యాయనుడు అతనికి జనమేజయుడు కలిగెను. ఇతని నిమిత్తమయి ఉగ్రాయుధుడు అను నతడు నీపులనందరను నశింపజేసెను.

ఋషయః : ఉగ్రాయుధః కస్య సుతః కస్య వంశే చ కథ్యతే. 62
కిమర్థం తేన తే నీపా స్సర్వే వై సంప్రణాశితాః ।
సూతః : ఉగ్రాయుధ స్సూర్యవంశ్య స్తప స్తేపే వరాశ్రమే. 63
స్థాణుభూతోఽష్టసాహస్రం తం భేజే జనమేజయః । తస్య రాజ్యం ప్రతిశ్రుత్య నీపానాం జగ్మివా న్ప్రభుః.

* కావ్యశ్చ ○ వరఃపారస్సదశ్వఇతి

ఉవాచ సాన్త్వం వివిధం జఘ్నతు స్తే హ్యుభావపి । హన్యమానా గతా నో చే త్యస్మాద్దేతో ర్న మే వచః.
శరణాగతదీక్షార్థం తస్మా దేవ శపామి వః । యది మేఽస్తి తవ స్తప్తం సర్వాన్తకకరోయమః. 66
తత స్త్వాకృష్యమాణాస్తు యమేన పురత స్తథా । కృపయా పరయాఽఽవిష్టో జనమేజయ మూచివాన్.67
అజానతా నిమా న్వీరాం స్త న్మే రక్షితు మర్హసి ।
జనమేజయః : అరే పాపా దురాచారా భవితారోఽస్య కిఙ్కరాః. 68
తథేత్యుక్త స్తతో రాజా యమేన యుయుధే చిరమ్ । వ్యాధిభి ర్నారకైః పాపై ర్యమేన సహ తా న్బలాత్.
విజిత్య మునయే ప్రాదా త్తదద్భుత మివాభవత్ । యమస్తుష్ట స్తత స్తస్మై ముక్తిజ్ఞానం దదౌ వరమ్. 90
సర్వే యథోచితం స్కృత్వా జగ్ము స్తే కృష్ణ మవ్యయమ్ ।
ఏషాం తు చరితం గృహ్య హన్యతే నావమృత్యుభిః. 71
ఇహలోకే పరేచైవ సుఖ మక్షయ మశ్నుతే । అజామీఢస్య నీలిన్యాం విద్వా ఞ్జజ్ఞే యవీనరః. 72
ధృతిమాం స్తస్య పుత్రో స్తు తస్య సత్యధృతి స్స్మృతః ।
అథ సత్యధృతేః పుత్రో దృఢనేమిః ప్రతాపవాన్. 73
దృఢనేమేస్సుతశ్చాపి సుధర్మా నామ పార్థివః । ఆసీ త్సుధర్మతనయ స్సార్వభౌమః ప్రతాపవాన్. 74
సార్వభౌమేతివిఖ్యాతః పృథివ్యా మేకరా డ్బలీ । తస్యాన్వవాయే మహతి మహాపౌరవనన్దనః. 75
మహాపౌరవపుత్రోస్తు రాజా రుక్మరథ స్స్మృతః । అథ రుక్మరథస్యాపి సుపార్శ్వోనామ పార్థివః. 76
సుపార్శ్వతనయశ్చాపి సుమతిర్నామ ధార్మికః । సుమతేరపి ధర్మాత్మా రాజా సన్నతిమానపి. 77
తస్యాపి సన్నతిమతః కృతోనామ సుతో మహాన్ । హిరణ్యనాభిన శ్శిష్యః కౌసల్యస్య మహాత్మనః. 78
చతుర్వింశతిధా యేన ప్రోక్తా స్తా స్సామ సంహితాః ।
సుతా స్తే ప్రాచ్యసామానః కార్తి ర్నామేహ సామగః. 79
కార్తే రౌగ్రాయుధస్యాసౌ మహాపౌరవవర్ధనః । విజితో యేన విక్రమ్య పృష స్తస్య పితామహః. 80
నీలో నామ మహారాజా పాఞ్చాలాధిపతి ర్బలీ । ఉగ్రాయుధస్య దాయాదః క్షేమ్యో నామ మహాయశాః.81
క్షేమ్యాత్సునీథ స్సంజజ్ఞే సునీథస్య నృపఞ్జయః । నృపఞ్జయాచ్చ విరథా ఇత్యేతే పౌరవా స్స్మృతాః. 82

ఇతి శ్రీమత్స్యమహాపురాణే చన్ద్రవంశానువర్ణనే పూరువంశ
కథనం నామైకోన పఞ్చాశోఽధ్యాయః.

ఋషులు ఇట్లడిగిరి: "ఉగ్రాయుధుడు ఏ వంశమున ఎవరి కుమారుడై జన్మించెను? ఏల అతడు నీపుల నందరను నశింపజేసెను?"

సూతుడు ఇట్లు చెప్పెను: ఉగ్రాయుధుడు సూర్యవంశజుడు. అతడు ఉత్తమమగు ఆశ్రమమున స్థాణుభూతుడై (కొయ్యవలె కదలక) వేయి ఏండ్లు తపస్సు చేసెను. నీపవంశీయుడగు జనమేజయుడు ఇతనిని తనకు కుమారుడగునట్లు వేడుకొని తన నీపవంశ రాజ్యము నతని కిత్తునని వాగ్దానము చేసెను. ఇందులకు ప్రతికూలత చూపవలదని అతడు నీపులను మంచిమాటలతో బ్రతిమాలి తాను వనమునకు పోయెను. కాని నీపులు ఊరకుండక ఈ ఉగ్రాయుధ జనమేజయుల నిద్దరను చంపవచ్చిరి-కొట్టిపోగిరి. అపుడు ఉగ్రాయుధుడు వారితో "మీరు అకారణముగా మమ్ములను చంపుచున్నారు. ఈ జనమేజయుడు నన్ను ఆశ్రయించినవాడు. ఆతనిని కాపాడదలచి చెప్పుచున్న నా మాట విని ఇతనిని-జనమేజయుని-విడువుడు." అనెను. వా రది వినలేదు. అంతట అతడు "మీరు నా మాట వినుటలేదు. కావున మిమ్ములను శపించుచున్నాను. నేను చేసిన తపః ఫలము ఏమయిన ఉన్నచో యముడు మిమ్ముల నందర నశింపజేయుగాక!" అనెను. వెంటనే వారి నంద

రను యముడు ముందునకు లాగికొని పోసాగెను. అది చూచి జాలిపడి ఉగ్రాయుధుడు "వీరు తెలియనివారు. ఈ వీరులు నా వారుగా భావించి వీరిని రక్షింప వేడుచున్నాను." అని జనమేజయునితో పలికెను. వెంటనే జనమేజయుడు యమకింకరులతో "పాపులగు దురాచారులారా! మీరు ఈ ఉగ్రాయుధునకు కింకరులు కండు." అని చెప్పి కింకరులగు వ్యాధులు నారకీయులగు పాపులు మొదలగు వారితోపాటుగా యమునితో పోరాడి వారి నందరను జయించి ఉగ్రాయుధునకు అప్పగించెను. అది చాల ఆశ్చర్యకరమగు విషయముగా నయ్యెను.

జనమేజయుని శక్తికి మెచ్చి యముడు అతనికి ముక్తిజ్ఞానమును వరముగా నిచ్చెను. తత్ఫలితముగా అందరును తగినట్లు ధ్యానమును పూని అవ్యయుడగు కృష్ణుని చేరిరి. (మోక్షము పొందిరి.)

ఈ ఉగ్రాయుధ జనమేజయ నీపుల ఆఖ్యానమును గ్రహించినవారు అపమృత్యువు పాలు గారు. ఇహపరసుఖముల నందుదురు.

అజామీఢునకు నీలినియందు యవీనరుడు అతనికి ధృతిమాన్ అతనికి సత్యధృతి అతనికి దృఢనేమి అతనికి సుధర్మన్ అతనికి సార్వభౌముడు (ఇది ఇతని బిరుదనామము) అతని వంశమున మహాపౌరవుడు (ఇది ఇతని బిరుదనామము) అతనికి రుక్మరథుడు అతనికి సుపార్శ్వుడు అతనికి సుమతి అతనికి సన్నతిమాన్ అతనికి కృతుడు కలిగిరి. ఇతడు కోసల దేశీయుడు మహాత్ముడు నగు హిరణ్యనాభిన్ అను మునికి శిష్యుడై సామ సంహితలను ఇరువది నాలుగు శాఖాభేదములతో ప్రవచించెను. అతని కుమారులకు 'ప్రాచ్యసామన్'లు అని ప్రసిద్ధి. వారిలో కార్తి అను నాతడు ప్రసిద్ధుడు. అతనికి ఉగ్రాయుధుడు. ఈతనికి మహాపౌరవవర్ధనుడు అని బిరుదనామము-(పూరువంశము వృద్ధి చేయువారిలో చాల గొప్పవాడు అని అర్థము.) ఈతడు తన విక్రమముతో పాంచాలాధిపతియు బలశాలియు వృషస్తుడు అను ప్రసిద్ధ రాజునకు పితామహుడు నగు నీలుడు అను నతనిని ఓడించి ఈ బిరుదము నందెను. ఇతనికి క్షేమ్యుడు ఇతనికి సునీథుడు అతనికి నృపంజయుడు కలిగెను. ఇతని వంశీయులకు నృపంజయులు అనియు విరథులు అనియు ప్రసిద్ధి. ఇది పౌరవవంశము.

ఇది శ్రీమత్స్య మహాపురాణమున చంద్రవంశాను వర్ణనమున పూరువంశ వర్ణనము అను
నలువది తొమ్మిదవ అధ్యాయము.

## పంచాశోఽధ్యాయః.

## అజామీఢవంశవర్ణనమ్.

సూతః : అజామీఢస్య నీలిన్యాం నీల స్సమభవ త్సుతః । నీలస్య తపసోగ్రేణ సుశాన్తి రుదపద్యత. 1
పురజిచ్చ సుశాన్తేస్తు పృథుశ్చ పురజి త్సుతః । భద్రాశ్వః పృథుదాయాదో భద్రాశ్వతనయా న్శృణు. 2
ముద్గలశ్చ జయశ్చైవ వారాహశ్చ పృథు స్తథా । యవీయా నతివిక్రాన్తః కపిలశ్చైవ పఞ్చమః. 3
పఞ్చానాం చైవ పఞ్చాలా స్తేషాం జనపదా స్స్మృతాః ।
పఞ్చానాం రక్షిణో హ్యేతే దేశానామితి న శ్శ్రుతమ్. 4
ముద్గలస్యాపి మౌద్గల్యాః క్షత్త్రోపేతా ద్విజాతయః । ఏతే హ్యఙ్గిరసః పక్షే సంస్థితాః కణ్వముద్గలాః. 5
ముద్గలస్య సుతో జజ్ఞే బ్రహ్మిష్ఠ స్సుమహాయశాః । ఇన్ద్రసేనో నామ్నాయ స్తస్య వధ్ర్యశ్వ స్తస్య చాత్మజః. 6
వధ్ర్యశ్వాన్మిథునం జజ్ఞే మేనకాయా మితి శ్రుతిః । దివోదాసస్తు రాజర్షి రహల్యా చ యశస్వినీ. 7
శరద్వతస్తు దాయాద మహల్యా సంప్రసూయత । శతానన్ద మృషిశ్రేష్ఠం తస్యాపి సుమహాతపాః. 8
తస్య సత్యధృతి ర్నామ ధనుర్వేదస్య పారగః । ఆసీ త్సత్యధృతే శ్శుక్ల మమోఘం ధార్మికస్య తు. 9

స్కన్నం రేత స్సత్యధృతే ర్దృష్ట్వా చాప్సరసం జలే ।
మిథునం తత్ర సఞ్జజ్ఞే తస్మి న్సరసి సంశ్రితమ్. 10
తత స్సరసి తస్మింస్తు క్రమమాణం మహీపతిః । దృష్ట్వా జగ్రాహ కృపయా శన్తను ర్మృగయాగతః.11
ఏతే శరద్వతః పుత్త్రాః ఔచథ్యా గౌతమాః పరే । అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి దివోదాసస్యవై ప్రజాః. 12

దివోదాససన్తతిః.

దివోదాసస్య దాయాదో ధర్మో మిత్రాయతి ర్నృపః । మైత్రాయణావరస్సోపి మైత్రేయస్తు తత స్స్మృతః.
ఏతే వంశధృతో దక్షాః క్షత్త్రిభేదాస్తు భార్గవాః । రాజా చైత్యవరో నామ మైత్రేయస్య సుత స్స్మృతః. 14
అథ చైత్యవరా ద్విద్వా న్సుదాస స్తస్య చాత్మజః ।

## ఏబదియవ అధ్యాయము
## పూరు వంశమున అజామీఢ-దివోదాస-చైద్య-శంతను వంశములును భవిష్యద్రాజ వంశములును

సూతుడు ఋషులకు ఇట్లు చెప్పసాగెను: అజామీఢునకు నీలినియందు నీలుడు, అతనికి మహా తపఃఫలముగా సుశాన్తి అతనికి పురజిత్ అతనికి పృథుడు అతనికి భద్రాశ్వుడు అతనికి ముద్గలుడు జయుడు వారాహుడు పృథుడు కపిలుడు కలిగిరి. వీరు ఐదుగురు ఐదు భాగములుగా నున్న పంచాల జనపదములకు పాలకు లయిరి. వీరిలో ముద్గలునకు మౌద్గల్యులు అను పేర ప్రసిద్ధులయిన క్షత్త్రధర్ములగు బ్రాహ్మణులు కుమారులై వంశవృద్ధి చేసిరి. వీరు సంవృతాంగిరసుని వంశమునందలి కాణ్వాయనుల కోవలోనివారై కణ్వ ముద్గలు లనబడిరి. ముద్గలునకు బ్రహ్మతత్త్వవేత్తలలో ఉత్తముడును మహాయశుడును నగు ఇంద్రసేనుడు అతనికి వంధ్యాశ్వుడు అతనికి మేనకయందు దివోదాసుడను రాజర్షియు యశస్వినియగు అహల్యయనను కవలు కలిగిరి. అహల్యకు శరద్వంతునివలన ఋషిశ్రేష్ఠుడగు శతానందుడు అతనికి సుమహాతపుడు అతనికి ధనుర్వేదపారగుడగు సత్యధృతి కలిగిరి. ధార్మికుడు అమోఘ రేతస్కుడునగు అతడు జలమునందుండి ఒక అచ్చరను చూడగా అతని రేతస్సు స్కన్నమయి ఆ సరస్సునందు పడెను. దానియందే ఆ రేతస్సువలన ఒక స్త్రీ శిశువును ఒక పురుష శిశువును జనించిరి. వేటకు వచ్చిన శంతనుడు ఆ పరిసరములందు తిరుగుచు అచట నడయాడుచున్న ఆ శిశువుల జంటను కృపతో తీసికొని కాపాడెను. (వీరే కృపుడు- కృపి-ద్రోణుని భార్య-అను వారు.) దివోదాసునకు మిత్రాయతి-మైత్రాయణుడు అనువారు వారిలో మిత్రాయతికి మైత్రేయుడు అతనికి చైత్యవరుడు అతనికి సుదాసుడు కలిగిరి.

అజామీఢా త్పున ర్జాతః క్షీణే వంశే తు సోమకః. 15
సోమకస్య సుతో జన్తు ర్హతే తస్మి న్ఛతంబభౌ : పుత్త్రాణా మాజమీఢస్య సోమకస్య మహాత్మనః. 16
మహిషీ త్వాజమీఢస్య ధూమినీ పుత్త్రగృద్ధినీ । పుత్త్రాభావే తప స్తప్త్వా శతవర్షాణి దుశ్చరమ్. 17
హుత్వాఽగ్నిం విధివ త్సమ్య క్పవిత్రీకృతభోజనా । అగ్నిహోత్రకుశేష్వేవ సుష్వాప సుమహావ్రతా. 18
తస్యాం విధూతపాపాయా మాజమీఢ స్సమేయివాన్ । క్షత్త్రం సఞ్జనయామాస ధూమవర్ణం శతాగ్రజమ్.19
ఋషి స్సంవరణో జజ్ఞే కురు స్సంవరణా త్తతః । యః ప్రయాగ మతిక్రమ్య కురుక్షేత్ర మకల్పయత్.20
కృష్ట్వైవ తు మహారాజో వర్షాణి సుబహూ న్యథ । కృష్యమాణ స్తత శ్శక్రః *తత స్తస్మై వరం దదౌ.
పుణ్యం చ రమణీయం చ కురుక్షేత్రం చ తత్స్మృతమ్ ।
తస్యాన్వవాయ స్సుమహాన్యస్య నామ్నా తు కౌరవాః. 22

కురోస్తు దయితాః పుత్త్రా స్సుధన్వా జహ్ను రేవ చ । పరిక్షిచ్చ మహాతేజాః ప్రజన శ్చారి మర్దనః. 23
సుధన్వనస్తు దాయాదః పుత్త్రో మతిమతాం వరః । చ్యవన స్తస్య పుత్త్రస్తు రాజా ధర్మార్థతత్త్వవిత్. 24
త్యాగశీలః క్రిమి ర్నామ ఈష్టే యజ్ఞా న్మహాతపాః ।
క్రిమేః పుత్త్రో మహావీర్యః ఖ్యాత ఇన్ద్రసమో విభుః. 25
చైద్యోపరిచరో వీరో వసుర్నామాన్తరిక్షగః । చైద్యోపరిచరా జ్జజ్ఞే గిరికా సప్త వై సుతాన్.  26

## చైద్యవంశః.

మహారథో మగధరా డ్విశ్రుతో యో బృహద్రథః । పుత్రశ్రవాః కుశశ్చైవ చతుర్థో హరివాహనః. 27
పఞ్చమశ్చ యజుశ్చైవ మత్స్యః కాలస్తు సప్తమః । బృహద్రథస్య దాయాదః కుశాగ్రో నామ వీర్యవాన్.
కుశాగ్రస్యాత్మజశ్చైవ వృషభో నామ విశ్రుతః । వృషభస్య తు దాయాదః పుష్పవా న్నామ పార్థివః. 29
పుష్పఃపుష్పవతశ్చైవ రాజా సత్యధృతి స్స్మృతః । సుధన్వా తస్య దాయాద స్తస్మా త్సర్వశ్చ జజ్ఞివాన్.
సర్వస్య భువనః పుత్త్ర స్తస్మా జ్జజ్ఞే బృహద్రథః । ద్వే తస్య శకలే కాలే (జాతే) జరయా సన్ధితశ్చసః.31
జరయా సన్ధితో యస్మా జ్జరాసన్ధస్తు స స్మృతః । జేతా స సర్వక్షత్త్రస్య జరాసన్ధో మహాబలః. 32
జరాసన్ధస్య పుత్త్రస్తు సహదేవః ప్రతాపవాన్ । సహదేవాత్మజ శ్శ్రీమా న్సోమవి త్సుమహాయశాః. 33
శ్రుతశ్రవా స్సోమవిదో మాగధాః పరికీర్తితాః ।

సుదాసునకు సంతతిలేక వంశము క్షీణించు సమయమున అజమీఢునకు సోమకుడను కుమారుడు కలిగెను. అతనికి జంతుడు అను కుమారుడు కలిగి సంతతి లేకయే హతుడయ్యెను. ఇట్టి స్థితిలో మరల సోమకునకు నూటొక్క-మంది కుమారులు కలిగిరి. అది ఎట్లు జరిగెననగా—ఆజమీఢుడు (అజమీఢుని కుమారుడు) అగు ఈ సోమకుని భార్య పేరు కూడ ధూమిని. ఈమె తనకు సంతానము లేకపోయినందున మరల సంతానముపై వాంఛ కలిగినదయి నూరు సంవత్సరములపాటు దుశ్చరమగు తపస్సాచరించెను. విధానము ననుసరించి అగ్నిని వేల్చెను. పవిత్రమగు హవిష్యా ద్యాహారమునే తినెను. ఉత్తమములగు వ్రతముల నియమముల పాటించుచు అగ్నిహోత్రమునకు అమర్చిన (వేదిక చుట్టునున్న) దర్భలయందే నిద్రించెను. ఇట్లామె విధూతపాప (పాపములను దూరము చేసికొన్నది) కాగా అట్టి ఆమెతో సంగమించిన ఈ ఆజమీఢుడగు సోమకునకు ఆమెయందు మొదట ధూమవర్ణుడగు కుమారుడు కలిగెను. ఆ పొగ రంగుతో తన తేజము అ(సం)వరింపబడినందున ఆ క్షత్త్రి ఋషి సంవరణుడనబడెను. ఆ తరువాత ఈ సంవరణునకు సోదరులుగా సోమకునకు మరి నూరుమంది కుమారులు కలిగిరి. సంవరణుని కుమారుడు కురువు. ఈ కురువు తమ పూర్వ రాజధానియగు ప్రతిష్ఠానము (ప్రయాగ) దాటి కురుక్షేత్రము వరకు రాజ్యము విస్తరింపజేసెను. ఎట్లన-అతడు అనేక సంవత్సరములపాటు తాను సేద్యముచేసి ఆ ప్రదేశమును పంట పొలమునుగా చేసెను. అందుచే దానికి కురు క్షేత్రము (కురురాజు చేసిన పంటచేను) అను పేరు వచ్చెను. పంటకు అనుకూలముకాని భూమిని తన కృషిచే పంట పొలముగా మార్చుటకతడు చేసిన యత్నమునకు మెచ్చి ఇంద్రుడు ఆ ప్రదేశము పుణ్యమును రమణీయమునగునట్లు వరమునిచ్చెను. అతనిబట్టి ఆ వంశము చాల గొప్పది. కావుననే ఆ వంశమువారికి కౌరవులను పేరు వచ్చెను. అతనికి సుధన్వన్ జహ్ను (హ్నో)వు పరీక్షిత్ ప్రజనుడు అనువారు కలిగిరి. సుధన్వునకు మతిమంతులలో శ్రేష్ఠుడు చ్యవనుడు అతనికి ధర్మార్థ తత్త్వవేత్తయు త్యాగశీలుడును మహాతపస్వియు యజ్ఞకర్తయు అగు 'క్రిమి' అతనికి ఇంద్రసముడు మహావీర్యుడు సమర్థుడు అంతరిక్షమునందు పయనించువాడు అగుటచే ఉపరిచరుడు అనబడు వసువనునతడు కుమారు డయ్యెను. ఇతడు చేది దేశరాజు కనుక చైద్యుడు. అతనికి గిరికయందు మహారథుడై మగధరాజుగా ప్రసిద్ధుడైన బృహ ద్రథుడు పుత్త్రశ్రవసుడు కుశుడు హరివాహనుడు యజువు మత్స్యుడు కాలుడు అను ఏడుగురు కుమారులు కలిగిరి.

వాటిలో బృహద్రథునకు కుశాగ్రుడు అతనికి వృషభుడు అతనికి పుష్పవాన్ అతనికి పుష్పుడు అతనికి సత్యధృతి అతనికి సుధన్వుడు అతనికి సర్వుడు అతనికి భువనుడు అతనికి బృహద్రథుడు అతనికి అతని భార్యలయందు జనించిన రెండు శకలములను 'జర' అనునామె సంధించుటచే కలిగిన జరాసంధుడు కలిగిరి. ఇతడు మహాబలుడై సర్వక్షత్రియవిజేత యయ్యెను. అతనికి సహదేవుడు అతనికి సోమవిత్ అతనికి శ్రుతశ్రవుడు కుమారులయిరి. ఇది మాగధుల వంశము.

యజు స్త్వజనయ త్పుత్త్రం సురథం నామ పార్థివమ్. 34
సురథస్యతు దాయాదో వీరో రాజా విడూరథః । విడూరథసుతశ్చాపి సార్వభౌమ ఇతి స్మృతః. 35
* సార్వభౌమా జ్జయత్సేనో రజత స్తస్య చాత్మజః ।
○ రజతస్య మహాభౌమ స్త్వయుతాయు స్తతోఽభవత్. 36
అక్రోధనోఽయుతాయోశ్చ తస్మా ద్దేవాతిథి స్స్మృతః । దేవాతిథేస్తు దాయాదో దక్ష ఏవ బభూవ హ. 37
దక్షా జ్జజ్ఞే భీమసేనో దిలీప స్తస్య చాత్మజః । దిలీపస్య ప్రదీపస్తు తస్య పుత్త్రా స్త్రియ స్స్మృతాః. 38
దేవాపి శ్శన్తనుశ్చైవ బాహ్లీకశ్చేతి తే తథా । బాహ్లీకస్య చ దాయాదా స్సప్త బాహ్లీశ్వరా స్స్మృతాః. 39
దేవాపిస్తు హ్యపధ్యాతః ప్రజాభి రభవన్మునిః ఋషయః : ప్రజాభి స్స కిమర్థం వై అపధ్యాతో నృపాత్మజః.
కో దోషో రాజపుత్త్రస్య ప్రజాభి స్సముదాహృతః ।
సూతః : కిలాసీ రాజపుత్త్రస్తు కుష్ఠీ తం నాభ్యపూజయన్. 41
కార్యే వై తత్ర దేవానాం క్షత్త్రం ప్రతి ద్విజోత్తమాః । భవిష్యం కీర్తయిష్యామి శన్తనోస్తు నిబోధత. 42
శన్తను స్త్వభవ ద్రాజా విద్వాంసో వై మహాభిషక్ । ఇమం చోదాహర న్త్యత్ర శ్లోకం ప్రతి మహాభిషక్.43
యం యం కరేణ స్పృశతి జీర్ణం రోగిణ మేవ వా । పున ర్యువా చ భవతి తస్మా త్తం శన్తనుం విదుః.

శన్తనువంశః.

ఏతదర్థం శన్తనుత్వం ప్రజాభి రిహ కీర్తితమ్ । తతోఽవృణో త్స భార్యార్థం శన్తను ర్జాహ్నవీం నృపః.
తస్యాం దేవవ్రతం నామ కుమారం జనయ ద్విభుః । కాలీ విచిత్రవీర్యం తు దాశేయాఽజనయ త్సుతమ్.
శన్తనో ర్దయితం పుత్త్రం శాన్తాత్మాన మకల్మషమ్ । కృష్ణద్వైపాయనశ్చైవ క్షేత్రే వైచిత్రవీర్యకే. 47
ధృతరాష్ట్రం చ పాణ్డుం చ విదురం చావ్యజీజనత్ ।

ఉపరిచరవసు కుమారులలో ఐదవవాడగు యజువునకు సురథుడు అతనికి విదూరథుడు అతనికి సార్వభౌముడు అతనికి జయత్సేనుడు అతనికి రజతుడు అతనికి మహాభౌముడు అతనికి అయుతాయువు అతనికి అక్రోధనుడు అతనికి దేవాతిథి అతనికి దక్షుడు అతనికి భీమసేనుడు అతనికి దిలీపుడు అతనికి ప్రదీపుడు అతనికి దేవాపిశంతను బాహ్లీకులను ముగ్గురు కుమారులు కలిగిరి. వీరిలో బాహ్లీకునకు ఏడుగురు కుమారులు (బాహ్లీకదేశపు రాజులు) బాహ్లీకేశ్వరు లనబడిరి. దేవాపిని ప్రజలు అనహించుకొనుటచే అతడు ముని యయ్యెను.

అనగా ఋషులు సూతు నిట్లడిగిరి: "రాజపుత్త్రుడగు ఆ దేవాపియందు ఏ దోషమున్నందున ప్రజలు అతనిని అనహించుకొనిరి?" అనగా సూతు డిట్లనెను. అతనికి బొల్లి (తెల్ల కుష్ఠు) వ్యాధి ఉండెను. అందుచే ప్రజలు అతనిని ఆదరముతో చూడక అనహించుకొనిరి. దీనికిని క్షత్త్రియుల విషయమున దేవతలు సంకల్పించిన ఒకానొక కార్యమే హేతువయ్యెను. అందుచే మహాభిషక్ అనియు శంతనుడనియు బిరుదనామములు గల రెండవ రాజపుత్త్రుడు రాజయ్యెను. ఏలయన అతడు మహావిద్వాంసుడు. అతని విషయమున ఈ పురాతన శ్లోకము చెప్పుదురు. "శిథిల శరీరుని కాని

* సార్వభౌమా జ్జయత్సేనః పచితి స్తస్య ○ పచితేస్తు

(వృద్ధుని కాని) రోగిని కాని అతడు ఎవరిని తన చేతితో తాకునో అతడు మరల యువకుడు అగును. అందుచే అతనిని "శంతనుడు-శం-సుఖమును; తనోతి-వృద్ధి చేయువాడు-అందురు." అతడు జాహ్నవిని వివాహమాడగా ఆమెయందు దతనికి దేవవ్రతుడను కుమారుడు కలిగెను. అతనికే పుత్త్రియగు 'కాలి'యందు శంతనునకు ప్రీతిపాత్రుడు శాంతాత్ముడు అకల్మషుడు నగు విచిత్రవీర్యుని క్షేత్రమున (భార్యలగు అంబిక-అంబాలికలయందు) ధృతరాష్ట్రుడు పాండుడు అను కుమారులను (శూద్రియందు) విదురుని కృష్ణద్వైపాయనుడు ఉత్పాదించెను.

ధృతరాష్ట్రస్తు గాన్ధార్యాం పుత్త్రాణాం జనయ చ్ఛతమ్. 48
తేషాం దుర్యోధనో జ్యేష్ఠ స్సర్వక్షత్త్రస్య స ప్రభుః ।
మాద్రీ రాజ్ఞః పృథా చైవ పాణ్డో ర్భార్యే బభూవతుః. 49
దేవదత్తా స్సుతాః పఞ్చ పాణ్డో రర్థే తు జజ్ఞిరే । ధర్మా ద్యుధిష్ఠిరో జజ్ఞే వాతా జ్జాతో వృకోదరః. 50
ఇన్ద్రా ద్ధనఞ్జయశ్చైవ శక్రతుల్యపరాక్రమః । విఖ్యాతౌ వై సుతౌ మాద్రీ సుషువే ద్విజసత్తమాః. 51
నకులం సహదేవం చ మాద్ర్యశ్విభ్యా మసూయత । పఞ్చైవ పాణ్డవేభ్యస్తు ద్రౌపద్యాం జజ్ఞిరే సుతాః. 52
ద్రౌపద్యజనయ జ్జ్యేష్ఠం ప్రతివిన్ధ్యం యుధిష్ఠిరాత్ । శ్రుతసేనం భీమసేనా చ్ఛతకీర్తిం ధనఞ్జయాత్. 53
చతుర్థం శ్రుతవర్మాణం నకులా త్సమ్ప్రసూయత । సహదేవా చ్ఛతానీకం ద్రౌపదేయాః ప్రకీర్తితాః. 54
తేభ్యః పరే పాణ్డవేయా షడేవాన్యే మహారథాః । హైడిమ్బో భీమసేనస్య పుత్త్రో జజ్ఞే ఘటోత్కచః. 55
సుభద్రాయాం తథా పార్థా దభిమన్యు రజాయత । యౌధేయం దేవకీ చైవ పుత్త్రం లేభే యుధిష్ఠిరాత్. 56
కాశ్యా జలధరా భీమా జ్జజ్ఞే వై సర్వగం సుతమ్ । సుహోత్రం తనయం మాద్రీ సహదేవా త్ప్రసూయత.
కరేణుమత్యాం చైద్యాయాం నిరమిత్రస్తు నాకులిః । అభిమన్యోః పరీక్షిత్తు పుత్త్రః పరపురఞ్జయః. 58
జనమేజయః పరీక్షితః పుత్త్రః పరమధార్మికః । బ్రహ్మాణం కారయామాస మఖే వాజసనేయకమ్. 59
స వైశమ్పాయనేనైవ శప్తః కిల మహర్షిణా । న స్థాస్యతీహ దుర్బుద్ధే తవైవ వచనం భువి. 60
యావ త్స్థాస్యతి లోకే త్వం తావదేవ ప్రవత్స్యసి । క్షత్త్రస్య విజయం జ్ఞాత్వా తతః ప్రభృతి సర్వశః.
అభిగమ్య స్థితాశ్చైవం నృపం చ జనమేజయమ్ । తతః ప్రభృతి శాపేన క్షత్త్రియస్య తు యాజినః. 62
క్షత్త్రస్య యాజినః కేచి చ్ఛాపా త్తస్య మహాత్మనః । పౌర్ణమాసేన హవిషా ఈజే తస్మి న్ప్రజాపతిమ్. 63
స వైశమ్పాయనేనైవ ప్రవిశ న్వారిత స్తతః । పరీక్షిత స్సుత స్సో వై పౌరవో జనమేజయః. 64
ద్వి రశ్వమేధ మాహృత్య మహావాజసనేయకః । ప్రవర్తయిత్వా తత్సర్వ మృషి ర్వాజసనేయకమ్. 65
వివాదే బ్రహ్మణా సార్ధ మభిశప్తో వనం యయౌ । జనమేజయా చ్ఛతానీక స్తస్మా జ్జజ్ఞే సువీర్యవాన్. 66
తత స్తం వై శతానీకం పుత్త్రం రాజ్యేఽభ్యషేచయత్ । అథాశ్వమేధేన తత శ్శతానీకస్య వీర్యవాన్. 67
జజ్ఞేఽధిసీమకృష్ణాఖ్య స్సామ్ప్రతం యో మహాయశాః ।
తస్మిన్ శాసతి రాజ్యం తు యుష్మాభి రిద మాహృతమ్. 68
దుష్కరం దీర్ఘసత్రం వై త్రీణి వర్షాణి పుష్కరే । వర్షద్వయం కురుక్షేత్రే దృషద్వత్యాం ద్విజోత్తమాః.

ధృతరాష్ట్రునకు గాంధారియందు దుర్యోధనాదులు నూరుగురును పాండునకు పృథ(కుంతి)యందు ధర్మవాయు దేవేంద్రులవలన యుధిష్ఠిర భీమార్జునులు మాద్రియందు అశ్విదేవుల వలన నకులసహదేవులు కుమారులయిరి. ఈ ఐదుగురికి ద్రౌపదియందు వరుసగా ప్రతివింధ్య శ్రుతసేన శతకీర్తి శ్రుతవర్మ శతానీకులు కలిగిరి. వీరుకాక ధర్మజునకు దేవకి అను నామెయందు యౌధేయుడు భీమునకు హిడింబయందు ఘటోత్కచుడు కాశిరాజ పుత్త్రియగు జలధరయందు సర్వగుడు అర్జునునకు సుభద్రయం దభిమన్యుడు నకులునకు చేదిరాజ పుత్త్రియగు కరేణుమతియందు నిరమిత్రుడు సహదేవునకు మాద్రి అను నామె యందు సుహోత్రుడు కుమారులయిరి. అభిమన్యునకు శత్రుధనవిజేతయగు పరీక్షిత్ అతనికి పరమ ధార్మికుడగు జనమేజయుడు కలిగిరి.

జనమేజయుడు ఒక యజ్ఞములో ✻వాజసనేయియగు బ్రాహ్మణుని బ్రహ్మగా వరించెను. అది చూచి సహించక వైశంపాయన మహర్షి జనమేజయుని నిట్లు శపించెను: "దుర్బుద్ధీ! నీ మాట ఈ లోకమునందు (నీ దేశమునందే) చెల్లక పోవుగాక! నీవు ఈ లోకమున జీవించియుండగనే దేశము విడిచి ప్రవాసమునకు పోదువుగాక!" అని మరియు జనమేజయునకు యజ్ఞాధికారములేదని అతనిని యజ్ఞములు చేయవలదని వైశంపాయనుడు వారించెను. ఈతనికి యాజులు (యజ్ఞములు చేయించినవారు) నశింతురనియు అతడు శపించెను. అయినను రాజిది లెక్కపెట్టలేదు. ఇందు క్షత్రియుడే గెలిచెనని కొందరు బ్రాహ్మణులు అతని నాశ్రయించి యుండిరి. కొందరు వైశంపాయన శాపమున నశించిరి. జనమేజయుడును పౌర్ణమాసేష్టితో ప్రజాపతిని (యజ్ఞేశ్వరుని) ఆరాధించెను. తరువాత నాతడు వాజసనేయక విధానముతోనే రెండుమారులు అశ్వమేధయాగము చేసెను. మహావాజసనేయు డనుకీర్తి పొందెను. కాని వైశంపాయనుతోడి వాదమున అతనిచే అభిశప్తుడై బ్రహ్మగా తన యజ్ఞములందుండిన వాజసనేయ బ్రాహ్మణునితో కలిసి అడవులకు పోయెను. జనమేజయుని కుమారుడు శతానీకుడు. అతడు మహావీర్యవంతుడు. జనమేజయుడు అతనిని రాజ్యమునందభిషేకించెను. శతానీకుడు చేసిన అశ్వమేధయాగ ఫలముగా అతనికి అధిసీమ కృష్ణుడను కుమారుడు కలిగెను. ఇప్పుడు అతడు పాలన సేయుచున్నాడు. అతని పాలన కాలములోనే మీరీ దుష్కరమగు దీర్ఘసత్రయాగము చేయుచున్నారు. ఇప్పటికిది మూడు సంవత్సరములు పుష్కర క్షేత్రమున జరిగినది. రెండేండ్లపాటు కురుక్షేత్రమున దృషద్వతీనదీ తీరమున జరిగినది. (ప్రస్తుతము నైమిశారణ్యమున జరుగుచున్నది.)

## భవిష్యద్రాజకథనమ్.

ఋషయః : ✻ భవిష్య చ్ఛ్రోతు మిచ్ఛామో భవతో రోమహర్షణ ।
పురా కిల యదేతద్వై వ్యతీతం కీర్తితం త్వయా. 70
యేషు వై స్థాస్యతి క్షత్ర ముత్పత్స్యన్తే నృపాశ్చ యే ।
తేషా మాయుః ప్రమాణంచ నామత శ్చైవ తా న్నృపాన్. 71
కాలం యుగప్రమాణం చ యుగదోషా న్యుగక్షయమ్। సుఖదుఃఖం యుగస్యాస్య ధర్మాధర్మ విచేష్టితమ్. 72
ఏతత్సర్వం ప్రసఙ్ఖ్యాయ పృచ్ఛతాం బ్రూహి నః ప్రభో ।
సూతః : యథా మే కీర్తితం పూర్వం వ్యాసే నాక్లిష్టకర్మణా. 73
భావ్యం కలియుగం చైవ తథా మన్వన్తరాణి చ । అనాగతాని సర్వాణి బ్రువతో మే నిబోధత. 74
అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి భావినో యే నృపా స్తథా । ఇక్ష్వాకో రన్వయే చైవ పౌరవే చాన్వయే చ యే. 75
యేషు సంస్థాస్యతే తద్వ ద్య దిక్ష్వాకుకులం స్మృతమ్। తా న్సర్వా న్కీర్తయిష్యామి భవిష్యే కథితా న్నృపాన్.
తేభ్యోఽపరే యేఽప్యన్యే చ ఉత్పత్స్యన్తే నృపాః పునః ।
క్షత్రియాః పౌరవా శ్శూద్రా స్తథాఽన్యే తు బహిశ్చరాః. 77
ఆన్ధ్రాః పౌణ్డ్రాః కళిఙ్గాశ్చ చూళికా యవనా స్తథా । కైవర్తాభీరశబరా యేచాన్యే మ్లేచ్ఛజాతయః. 78
పర్యాయతః ప్రవక్ష్యామి నామతశ్చైవ తా న్నృపాన్ । అధిసీమకృష్ణో యశ్చైషాం ప్రథమం వర్తతే నృపః.
తస్యాన్వవాయే వక్ష్యామి భవిష్యా న్కథితా న్నృపాన్ । అధిసీమకృష్ణపుత్రస్తు ●విచక్షు ర్భవితా నృపః.
గఙ్గయాతు హృతే తస్మి న్నగరే నాగసాహ్వయే ।
○ త్యక్త్వా విచక్షు ర్నగరం కౌసు(శా)మ్బ్యాం తు నివత్స్యతి. 81

---

✻ భవిష్యంశ్రోతుమిచ్ఛామః ప్రజానాం ● నృచకో భవితా ○ నృచకో నగరం త్యక్త్వా

★ శుక్లయజుశ్శాఖీయులను వాజసనేయులు అందురు.

భూరిశ్రేష్ఠ స్సుత స్తస్య తత శ్చిత్రరథ స్మృతః । భవిష్యా౽ష్టౌ సుతా స్తస్య మహాబలపరాక్రమాః. 82
శుచిద్రథ శ్చిత్రరథా ద్వృష్టిమాంశ్చ శుచిద్రథాత్ । వృష్టిమత స్సుషేణశ్చ భవిష్యతి పున ర్నృపః. 83
తస్మా త్సుషేణా ద్భవితా సునీథో నామ పార్థివః । నృపా త్సునీథా ద్భవితా ÷నృచక్షు స్సుమహాయశాః. 84
నృచక్షుషస్తు దాయాదో భవితా వై సుఖీలవః । సుఖీలవసుతశ్చాపి భావీ రాజా పరిప్లవః. 85
పరిప్లవసుతశ్చాపి భవితా సుతపా నృపః । మేధావీ తస్య దాయాదో భవిష్యతి నృపస్య తు. 86
మేధావిన స్సుత శ్చాపి భవిష్యతి పురఞ్జయః । కురుభావ్య స్సుత స్తస్య నిర్మమ స్తస్య చాత్మజః. 87
బృహద్రథో నిర్మమాద్వై వసుధామో బృహద్రథాత్ । వసుధామా చ్ఛతానీకో భవిష్యోదయన స్తతః. 88
భవిష్యోదయనా ద్వీరో రాజా భావీ మహీనరః । మహీనరాత్మజశ్చైవ దణ్డపాణి ర్భవిష్యతి. 89
దణ్డపాణే ర్నిరామిత్రో నిరామిత్రాత్తు క్షేమకః । అస్యానువంశశ్లోకో౽యం గీతో విప్రైః పురాతనైః. 90
బ్రహ్మక్షత్రస్య యా యోని ర్వంశో దేవర్షి సత్కృతః ।
క్షేమకం ప్రాప్య రాజానం సంస్థాస్యతి స వై కలౌ. 91
ఇత్యేష పౌరవో వంశో యథావ దిహ కీర్తితః । ధీమతః పాణ్డుపుత్రస్య అర్జునస్య మహాత్మనః. 92

ఇతి శ్రీమత్స్యమహాపురాణే చన్ద్రవంశానువర్ణనే పూరువం
శానుకీర్తనంనామ పఞ్చాశో౽ధ్యాయః.
చన్ద్రవంశస్సమాప్తః.

ఇది విని ఋషులు సూతునిట్లడిగిరి: "రోమహర్షణా! నీవు ఇంతవరకును గడచిన వృత్తాంతములు చెప్పితివి. ఇకమీదట భవిష్యద్వృత్తాంతములను నీనుండి వినగోరుచున్నాము. ఇకమీదట క్షత్రధర్మము ఎవరియందు నిలుచును? కాబోవు రాజులెవ్వరు? వారి ఆయుఃప్రమాణము వారి పేరులు కాలము-యుగ ప్రమాణము యుగదోషములు యుగక్షయము యుగములందలి సుఖదుఃఖ ధర్మాధర్మములు విచేష్టితములు ఇవి అన్నియు మాకు చెప్పవేడుచున్నాము."

సూతుడు ఋషులకు ఇట్లు చెప్పనారంభించెను: అద్భుతములను చేయగల మహానుభావుడు వ్యాసుడు నాకు చెప్పియున్న విధమున ఇక రాబోవుచున్న కలియుగమును మన్వంతరములను రానున్న విషయములను తెలిపెదను. ఇక్ష్వాకు పూరు వంశములందు రాబోవు రాజులను వీరుకాక ఆంధ్ర పౌండ్ర కళింగ ★చూళిక యవన కైవర్తాభీర శబరులు ఇతర మ్లేచ్ఛ జాతుల రాజులు ఈ మొదలగు శూద్ర జాతీయులు భారతదేశమునకు బయటినుండి వచ్చి ఈ దేశమును ఏలనున్న రాజులను క్రమమున పేర్కొందును. వినుడు.

ఇపుడు (ఈ పురాణ కథాకాలమున) పాలించుచున్న అధిసీమ కృష్ణునకు విచక్షుడు కుమారుడయి పాలన చేయును. అతని కాలమున హస్తినాపురము గంగలో కొట్టుకొనిపోగా అతడు కౌసుం (శాం) బిని రాజధానిగా చేసికొనును. అతనికి భూరిశ్రేష్ఠుడు అతనికి చిత్రరథుడు అతని ఎనిమిదిమంది కుమారులలో శుచిద్రథునకు వృష్టిమాన్ అతనికి సుషేణుడు అతనికి సునీథుడు అతనికి నృచక్షుడు అతనికి సుఖీలవుడు అతనికి పరిప్లవుడు అతనికి సుతపుడు అతనికి మేధావి అతనికి పురంజయుడు అతనికి కురుభావ్యుడు అతనికి నిర్మముడు అతనికి బృహద్రథుడు అతనికి వసుధాముడు అతనికి శతానీకుడు అతనికి భవిష్యోదయనుడు అతనికి మహీనరుడు అతనికి దండపాణి అతనికి నిరామిత్రుడు అతనికి క్షేమకుడు కుమారులగుదురు.

---

÷ నృచక్రస్సు

★ చూళికులు-పఠానులలో ఒక తెగవారు; యవనులు-గ్రీసు టర్కీ మొదలగు దేశములవారు; కైవర్తులు-పల్లెకారులు; ఆభీరాః-అహీర్ అనబడు జాతివారు; శబరాః-చెంచుబోయ మొదలగు జాతులవారు.

ఈ క్షేమకుని విషయమున పురాతనులు పలికిన గీతము ఇట్లున్నది: "దేవతలును ఋషులును సత్కరించు చుండిన బ్రహ్మక్షత్త్రి జాతుల బ్రాహ్మణుల-క్షత్త్రియుల-(బ్రాహ్మణ ధర్మమును అనుసరించి ప్రవర్తించి దానినుద్ధరించు క్షత్త్రియుల-క్షత్త్రి ధర్మమును పాటించు బ్రాహ్మణుల) ఏయోని (జన్మము) ఏవంశము (ఈ భారతదేశమున) కలదో అదియంతయు ఈ కలియుగమున క్షేమకరాజును ఆశ్రయించి వర్ధిల్లును."

ఋషులారా! మీకు ఇట్లు ఈ పౌరవవంశ చరితమును ఉన్నది ఉన్నట్లు వివరించితిని. దీనిలో ప్రధానుడుగాను ఈ చెప్పిన వంశమునకు ఒకమూల పురుషుడుగాను నున్న మహాత్ముడు అర్జునుడు.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున చంద్రవంశానువర్ణనమున పౌరవవంశానుకీర్తన మను
ఏబదియవ అధ్యాయము-చంద్రవంశ కథనము ముగిసినది.

## ఏకపంచాశోఽధ్యాయః.

## అగ్నివంశవర్ణనమ్.

ఋషయః: యే భూయాసు ర్ద్విజాతీనా మగ్నయః సూత సర్వదా ।
తా నిదానీం సమాచక్ష్వ తద్వంశం చానుపూర్వశః. 1

## ఏబది ఒకటవ అధ్యాయము.

## అగ్నివంశ వర్ణనము.

ఋషులు సూతుని ఇట్లు అడిగిరి: సూతా! ద్విజులు సర్వకాలములందును (ఆయా విహిత కాలములందు) ఆరాధింపవలసిన ఆయా అగ్నులను ఆ అగ్నుల వంశములను అను పూర్వితో (దేని తరువాత ఏది చెప్పవలెనో ఆ క్రమమున) చెప్ప వలసినదిగా గోరుచున్నాము.

సూతః: యోఽసా వగ్న్యభిమానీ తు స్మృతః స్వాయంభువేఽంతరే ।
బ్రహ్మణో మానసః పుత్త్రి స్తస్మా త్స్వాహాఽవ్యజీజనత్. 2

పావకం పవమానం చ శుచి మగ్నేశ్చ యే సుతాః ।
నిర్మంథ్యః పవమానోఽగ్ని ర్వైద్యుతః పావకః స్మృతః. 3

శుచి రగ్నిః స్మృతః సౌర స్స్వానాఖ్యా శ్చైవ తే త్రయః ।
పవమానాత్మజో యోఽగ్ని ర్హవ్యవాహః స ఉచ్యతే. 4

పావకిః సహరక్షస్తు కవ్యవాహః సుతః శుచేః । దేవానాం హవ్యవాహోఽగ్నిః *పిత్ర్యాణాం కవ్యవాహనః.
సహరక్షోఽసురాణాం తు త్రయాణాం తే త్రయోఽగ్నయః ।
ఏతేషాం పుత్త్రిపౌత్త్రి యే చత్వారింశ న్నవైవ తు. 6

అనగా సూతుడు ఋషులకు ఇట్లు చెప్ప నారంభించెను: స్వాయంభువ మన్వంతరమున జరిగిన సృష్టియందు మొదట అవ్యక్త తత్త్వమునుండి వ్యక్తమయిన అగ్ని యను భూతమునకు అధిష్ఠాతగా ఉండు అగ్నియను దేవత చెప్పబడెను. ఈ తత్త్వము అగ్న్యభిమాని దేవత యనబడును. (అగ్న్యభిమాని దేవతయనగా పంచ స్థూలభూతములలో ఒకటియగు అగ్ని అను పదార్థమును ఆశ్రయించి తాను ఉండి ఇది నాదియను నభిమానముతో వర్తించుచు అగ్నిని ఆరాధించిన వారికి ఆయా ఫలములను ఇచ్చుచు అగ్నియందు చేసిన హవనాది ప్రయోజనములను ఇంద్రాది దేవతలకు అందించుచు ఉండు దేవతా తత్త్వము అని యర్థము. అగ్నియందు వ్యాపించియుండు దేవతా తత్త్వము ఇదియని తలచబడు తత్త్వము అనియును అర్థము.) ఈ అగ్ని దేవునకు స్వాహా అను పత్నియందు 1. పావకుడు 2. పవమానుడు 3. శుచి యను ముగ్గురు

* ప్రథమం బ్రాహ్మణః స్మృతః ; బ్రహ్మణః సుతః.

కుమారులు కలిగిరి. వీరిలో పవమానుడు భూః-భువః-సువః-అను మూడు వ్యాహృతులలో మొదటి వ్యాహృతికి అర్థము అగు భూలోకమునకు సంబంధించిన అగ్నికి అధిష్ఠాత. అతని కుమారుడు 4. నిర్మథ్యాగ్ని (అరణులతో నిర్మథనము చేయుటచే ఉత్పన్నుడగు అగ్ని); పావకుడు అనునతడు భువః అను రెండవ వ్యాహృతికి అర్థమగు అంతరిక్ష లోకమునకు సంబంధించిన అగ్నికి అధిష్ఠాత; అతని కుమారుడు 5. వైద్యుతాగ్ని; శుచి అనునతడు సువః అను మూడవ వ్యాహృతికి అర్థమగు ద్యులోకమునకు సంబంధించిన అగ్నికి అధిష్ఠాత; అతని కుమారుడు 6. సౌరాగ్ని. (పవమాన-పావక-శుచుల కుమారుల ఈ రూపములు భౌతిక-జడ-రూపములు) ఇక ఈమూడు అగ్నుల దేవతాత్మక రూపములగు కుమారులు ఇట్లు చెప్పబడుచున్నారు. పవమానుని దేవతా తత్త్వాత్మక కుమారుడు 7. హవ్యవాహుడు (హవ్యములను దేవతలకు కొనిపోయి అందించువాడు); పావకుని దేవతా తత్త్వాత్మక కుమారుడు 8. సహరక్షుడు; శుచి అను అగ్నికి కలిగిన దేవతా తత్త్వాత్మక కుమారుడు 9. కవ్యవాహుడు (పితరులకు కవ్యము నందించువాడు) కావుననే హవ్యవాహుడు దేవతలకును సహరక్షుడు రాక్షసులకును కవ్యవాహుడు పితరులకును సంబంధించినవారు.

ఈ చెప్పిన పావక-పవమాన-శుచులను ముగ్గురకును కలిసి సాముదాయికమగు నామము సూనులు-(సూనులు అనగా తేజః కిరణములని అర్థమగు సంప్రదాయమున అర్థము.)

మూలతః ఉన్న ఈ ముగ్గురగ్నులకును కలిగిన సంతతియును ఈ ముగ్గురగ్నులును కలిసి మొత్తము నలుపది తొమ్మిదిమంది యగుదురు.

వక్ష్యామి నామత స్తా న్వై ప్రవిభాగేన త త్పృథక్ ।
పావకి ర్లౌకికో హ్యగ్నిః ప్రథమం బ్రాహ్మణః స్మృతః. 7
బ్రహ్మోదనా(రా)గ్ని స్తత్పుత్రో భరతో నామ విశ్రుతః ।
వైశ్వానరోఽన్యోఽస్యసుతో వహ న్హవ్యం మహారసమ్. 8
అమృతోఽథర్వణః పుత్రో మథితః పుష్కరా దధి ।
యోఽథర్వా లౌకికో హ్యగ్ని ర్దక్షిణాగ్ని స్స వై స్మృతః. 9
భృగోః ప్రజాతో వచనా ద్దక్షిణా(ధ్యఙ్ఞ)థర్వణ స్తథా ।
తస్మా త్స లౌకికో హ్యగ్నిః పాచ్యః సోఽథర్వణ స్తథా. 10
అథ యః పవమానస్తు నిర్మ(ం)థ్యోఽసౌ స ఉచ్యతే ।
స చ వై గార్హపత్యోఽగ్నిః ప్రథమం బ్రాహ్మణః స్మృతః. 11
తతః సభ్యావసథ్యౌ చ శంసన్యాస్తు సుతా వుభౌ ।

వారినందరను వేరువేరుగ వారివారి ప్రవృత్తి ప్రవిభాగముతో కూడ క్రమముగ చెప్పెదను.

ఈ చెప్పిన బ్రహ్మమానసపుత్త్రుడగు ప్రాథమికాగ్ని దేవుని తత్త్వ భేదమగు పావకుడను అగ్నికి 10. భరతుడను కుమారుడు కలిగెను. ఇతనికే ★బ్రహ్మోద(రా) నాగ్ని అనియు లౌకికాగ్ని అనియు దక్షిణాగ్ని అనియు వ్యవహారము. ఈ పావకాగ్నికే మరియొక కుమారుడు 11. వైశ్వానరుడు. ఇతడు హవ్యమనెడు మహారసమును ఆయాదేవతలకు వహించును. (కొనిపోవుచుండును.) భృగుని కుమారుడు దధ్యఙ్ అథర్వా అను ఋషి (దక్షిణాఽథర్వా అనియు మరియొక పాఠము) అతడు ప్రపంచము అను పుష్కర (పద్మ)మును మథించి ఈ అమృతమును (దక్షిణాగ్నిని) ఉత్పన్నమొనర్చెను. (అథర్వన్ అను ఋషికి కుమారుడు అంగిరుడు. ఇతడును అగ్న్యాత్మక తత్త్వముగా శ్రుతులలో ప్రసిద్ధుడు. ముఖ్యప్రాణ

★ ఇచట ఉదర-శబ్దము 'ఉదరణ' 'ఉదీరణ' శబ్దములతో సమానార్థకము. మాట-ఉచ్చారణము-వాక్కు అని అర్థము. బ్రహ్మణ ఉదరణమసి-బ్రహ్మణ ఉదీరణమసి-అని శ్రుతి.

తత్త్వమును 'అంగిరాః' అని ఉపనిషదృషులు చెప్పినారు. 'అథర్వాణః' 'అంగిరసః' అనువారు ఆథర్వణ మంత్రద్రష్టలుగా ప్రసిద్ధులు) ఈ దక్షిణాగ్నికే పాచ్యః-అన్వాహార్యపచనః ఇత్యాది వ్యవహారము సంప్రదాయమునం దున్నది. అన్వాహార్యమనగా దర్శపౌర్ణమాసాదీష్టులయందు ఋత్విక్కు-లకు దక్షిణగా ఇచ్చు అన్నము. అది దీనిపై పాకము చేయబడును కావున ఈ దక్షిణాగ్నికి అన్వాహార్యపచనః అని శాస్త్ర వ్యవహారము.

లోగడ చెప్పిన నిర్మథ్యాగ్నియగు పవమానుడు (త్రేతాగ్నులలో) గార్హపత్యాగ్ని స్థానీయుడు. అతనికి 12.సభ్యుడు 13. ఆవసథ్యుడు అను ఇద్దరు కుమారులు. వీరి తల్లి శంసని అనునామె.

యోఽసౌ హవనీయోఽగ్ని రభిమానీ ద్విజైః స్మృతః. 12
స వై షోడశ నద్యస్తు చకమే హవ్యవాహనః । కావేరీం కృష్ణవేణీం చ నర్మదాం యమునాం తదా. 13
గోదావరీం వితస్తాం చ చంద్రభాగా మిరావతీమ్ । విపాశాం కౌశికీం చైవ శతద్రూం సరయూం తథా. 14
సీతాం మనస్వినీం చైవ హ్రాదినీం ప్లావనీం తథా । తాసు షోడశధాఽఽత్మానం ప్రవిభజ్య పృథక్పృథక్.
తథా తు విహరం స్తాసు ధిష్ణ్యైశః సంబభూవ హ ।
స్వాభిచారా త్స్మృతో ధిష్ణ్య స్తాసూత్పన్నాస్తు ధిష్ణియాః. 16
ధిష్ణ్యేశా జజ్ఞిరే యస్మా త్తత స్తే ధిష్ణియాః (ష్ణ్యజాః) స్మృతాః ।
ఇత్యేతే వై నదీపుత్రా ధిష్ణ్యే ష్వేభ్యుపపేదిరే. 17
తేషాం విహరణీయాశ్చ ఉపస్థేయాశ్చ యే శ్రుతాః । అత్ర ధిష్ణ్యాని హవ్యానా మగ్నీనాం శృణుత క్రమమ్.

(పావకుడు-దక్షిణాగ్ని స్థానీయుడును పవమానుడు గార్హపత్యాగ్ని స్థానీయుడు నైనట్లే శుచి ఆహవనీయాగ్ని స్థానీయుడగును. అట్టి) ఆహవనీయాగ్న్యభిమానియగు దేవతయగు అగ్ని తాను యజ్ఞములందు స్థానము (ధిష్ణ్యము) సంపాదించుకొనగోరి తను దా నుత్పన్న మొనర్చుకొనదలచి కావేరి-కృష్ణవేణి-నర్మద-యమున-గోదావరి-వితస్త-చంద్రభాగ-ఇరావతి-విపాశ-కౌశికి-శతద్రూ-సరయూ-సీతా-మనస్విని-హ్లాదిని-ప్లావని-అను పదునారు నదులయందును తన రూపమును పదునారుగా విభజించి విహరించుచు అవియే తనకు ధిష్ణ్యములు (విహరణ స్థానములు) కాగా తాను ధిష్ణ్యేశుడు (ధిష్ణ్యములకు ప్రభువు) అనబడెను. ఇట్టి ఆహవనీయాగ్ని తన అభిచారము (అభితః-అంతటను; చారః సంచరణం-ప్రవృత్తి-చరించుట-తిరుగుట) వలననే తాను ధిష్ణ్యుడు అనియు వ్యవహరింపబడెను. అతడు విహరించిన స్థానము లన్నియు (నదులు) ధిష్ణ్యములైనవి. ఇట్లు ధిష్ణ్యములనబడు నదులయందు ధిష్ణ్యుడనబడు అగ్నివలన జనించిన పదునారు మంది కుమారులకును ★ధిష్ణియులు-ధిష్ణ్యజాలు అను వ్యవహారము కలిగెను. ఇట్లు పదునారుమంది ఆహవనీయ పుత్రులగు అగ్నులును నదీ పుత్రులై ఆ సంకేతము ననుసరించియే యాగశాలయందును ధిష్ణ్యములనబడు తత్షోడశనదీ సంకేత రూపములగు ఋత్విక్స్థానములందు స్థితిని సంపాదించుకొనిరి.★

---

★ 1. అంగిరసో ధిష్ణియై రగ్నిభిః-అని యజురారణ్యకము; తృతీయ ప్రశ్నము.

2. ఆర్య ఋషులు పూర్వకాలమున పవిత్రములుగా నెంచిన పదునారు నదులను తమ కర్మానుష్ఠానములందు సతతము స్మరించుటకు అనుకూలముగా ప్రవచించిన భావన ఇదియని తోచును. దీనికి అనుకూలముగావే యజ్ఞములందు ఋత్విజులును పదునారుమంది. వీరిలో ఎనిమిదిమందిని అగ్నిరూపులనుగా భావించి చెప్పిన ఋక్-ఋగ్వేదమున ఇట్లున్నది. 'తవాగ్నే హోత్రం తవ పోత్ర మృత్వియం। తవ నేష్ట్రం త్వమగ్నిదృతాయతః। తవ ప్రశాస్త్రం త్వ మధ్వరీయసి బ్రహ్మా చాసి గృహపతిశ్చ నో దమే'

ఋగ్వేద-2-1-2; 10-91-10.

ఈ ధిష్ణ్యాగ్నులు పదునారు మందియు ఉపస్థేయులు విహరణీయులు అని రెండు విధములుగా నున్నారు. వీరందరును హవిర్వాహులు (యజ్ఞములందు హుతమొనర్చిన హవిస్సును వహించుకొనిపోయి దేవతలకు అందజేయు)వారే. వీరిలో అందరకుగల స్థానములును ధిష్ణ్యములు అనను (ధిష్ణ్యం అనగా 'ధిష్ణ్యమోకో నివసనం స్థానావసథ వాస్తుచ' అను అమర ప్రామాణ్యమున గృహము-నిలుచు స్థానము అనియే అర్థము. ఐనను ఈ స్థానము-ఉపస్థేయము- నియతమగుటచే ఉప-తస్మిన్నేవ స్థానే-ఆస్థానమునందే-స్థేయాః-ఉంచబడవలసినవారు; విహరణీయాః-విహరణం -యథావశ్యకం స్థానాత్ స్థానం నయనం-అపి అర్హంతి-అవశ్యకతను బట్టి ఒక స్థానము నుండి మరియొక స్థానమునకు తీసికొని పోబడుటకును అర్హులగువారు) వీనికి స్థితిభేదమును బట్టి సంజ్ఞా భేదమును కలిగినది. ఈ సంజ్ఞాభేదానుసారము వీరి విషయమును క్రమముగా తెలిపెదను; వినుడు.

సమ్రాడగ్నిః కృశానుర్యో ద్వితీయోత్తరవేదికః । వితతాగ్నిముఖా హ్యేన ముపతిష్ఠంతి వై ద్విజాః. 19
*పరిషద్యః పవమానస్తు ☆ద్వితీయః సోఽనుదిశ్యతే ।
● ప్రతక్వాఽన్యో నభస్వాంస్తు చత్వాలేఽసౌవిభావ్యతే. 20
హవ్యసూదో హ్యసమ్మృష్టః శామిత్రేఽగ్నౌ విభావ్యతే.
ఋతధామా సువర్జ్యోతి రౌదుంబర్యః ప్రకీర్త్యతే. 21
బ్రహ్మజ్యోతిః సువర్ధామా బ్రహ్మస్థానే స ఉచ్యతే । అజైకపా దుపస్థేయః స వై శాలాసుఖీయకః. 22
2 అనుద్దేశ్యో హ్యహిర్బుధ్న్యః సోఽగ్ని ర్గృహపతిః స్మృతః ।
శంస్యస్యైతే సుతాః సర్వే ఉపస్థేయా ద్విజైః స్మృతాః. 23

వీరిలో మొదట ఉపస్థేయాగ్నులను తెలిపెదను. శ్రుతులయందు 'సమ్రాడసి కృశానుః' అని స్తుతించబడిన అగ్ని ద్వితీయోత్తరవేదియం దుండును. ద్విజులు యజ్ఞములందు అగ్నిముఖమును-యజ్ఞమును-వితతము చేయబోవుచు ఇతనిని స్తుతింతురు. 'పరిషద్యోఽసి పవమానః' అని శ్రుతులయందు స్తుతించబడిన అగ్ని రెండవ ఉపస్థేయాగ్ని; ఇతడు ధ్రువస్థలియం దుండును. 'ప్రతక్వాఽసి నభస్వాన్' అని స్తుతించబడు అగ్ని మూడవవాడు; ఇతడు చత్వాలమను శాలా భాగమందు స్థానము పొందియుండును. 'అసమ్మృష్టోఽసి హవ్యసూదః' అని శ్రుతులయందు స్తుతించబడు అగ్ని నాలుగవ ఉపస్థేయాగ్ని; ఇతడు శామిత్రశాలయం దుండును. 'ఋతధామాఽసి సువర్జ్యోతిః' అని శ్రుతులయందు స్తుతించబడు నతడు ఐదవ ఉపస్థేయాగ్ని; ఇతడు ఔదుంబరియను స్థానమునం దుండును; 'బ్రహ్మజ్యోతి రసి సువర్ధామా' అని శ్రుతులయందు స్తుతించబడు అగ్ని ఆరవ ఉపస్థేయాగ్ని; ఇతడు బ్రహ్మ స్థానమునందుండును. 'అజోఽస్యేకపాత్' అని శ్రుతులయందు స్తుతించబడు అగ్ని ఏడవ ఉపస్థేయాగ్ని; ఇతడు 'సుఖశాలా' అను స్థానమునం దుండును. 'అహిరసి బుధ్నియః' అని శ్రుతులయందు స్తుతించబడు అగ్ని ఎనిమిదవ ఉపస్థేయాగ్ని; ఇతడు 'గృహపతి' - 'యజమాన' స్థానమునం దుండును.

శంస్యుడు అనియు వ్యవహారముగల ఆహవనీయాగ్ని కుమారులలో ఉపస్థేయులనబడు అగ్న్యష్టకము విషయము ఇది.

తతో విహరణీయాంశ్చ వక్ష్యా మ్యష్ట చ తత్సుతాన్ ।
విభుః ప్రవాహణోఽగ్నీధ్ర స్తేషాం ధిష్ణ్యా స్తథా వరే. 24
విడీయంతే యథాస్థానం సౌత్యేఽహ్ని సవనే క్రమాత్ ।
పోత్రీయస్య సుతో హ్యగ్ని ర్వహ్ని ర్యో హవ్యవాహనః. 25

* వర్షన్యః ☆ ధ్రుపీ ; తృతీ ● పావకాగ్నిః సమూహ్యస్తు ఉత్తరః సోఽగ్ని రుచ్యతే ; పావకోఽన్యేను ముఖః సాః
2 అనిర్దేశ్యో ; అంతర్దిశ్యో

ప్రశాస్త్రగ్నిః ప్రచేతాస్తు తృతీయః శ్వాత్రనామకః ।
తుథోఽగ్ని ర్విశ్వవేదాస్తు బ్రాహ్మణాచ్ఛంసి రుచ్యతే. 26
3 ఉశిగగ్నిః కవి ర్యస్తు పోత్రగ్నిః స విభావ్యతే । అంభారి రగ్ని ర్బంభారి ర్నేష్ట్రీయః స విభావ్యతే. 27
అవస్యు ర్యో దువస్వాంస్తు అచ్ఛావాకీయ ఉచ్యతే। అష్టమః శుంధ్యు రగ్ని ర్యో మార్జాలీయః స ఉచ్యతే. 28
ధిష్ణ్యే ఆహరణా ¹హ్యేతే సోమే సేజ్యన్త వై ద్విజైః। తతో యః పావకో నామ్నా అధ్వర్యో ర్గర్భ ఉచ్యతే.

అతని కుమారులలో విహరణీయులనబడు మరి ఎనిమిదిమంది విషయము ఇక చెప్పెదను. ఏలయన యజ్ఞము వితతమగునప్పుడు ఆయా సుత్యాహస్సులయందు తమ తమ స్థానములందు నిలిచియుండువారు కొందరును స్థానాంతర నయనమునకు (ఒక చోటినుండి మరియొక చోటికి కాని పోబడుటకు) అర్హులగువారు కొందరునై ఈ అగ్నులు రెండు విధములుగా నుందురుగదా!

ఈ విహరణీయాగ్నులలో 'విభూరసి ప్రవాహణః' అని శ్రుతులయందు స్తుతించబడు అగ్ని విహరణీయాగ్నులలో మొదటివాడు. ఇతడు అగ్నీధ్ర స్థానీయుడు; 'వహ్నిరసి హవ్యవాహనః' అని శ్రుతులయందు స్తుతించబడు అగ్ని విశేషము విహరణీయాగ్నులలో రెండవవాడు; ఇతడు హోత్రియ స్థానీయుడు; 'శ్వాత్రోఽసి ప్రచేతాః' అని శ్రుతులయందు స్తుతించబడు అగ్ని విహరణీయాగ్నులలో మూడవవాడు. ఇతడు ప్రశాస్త్ర స్థానీయుడు. 'తుథోఽసి విశ్వవేదాః' అని శ్రుతులయందు ప్రశంసింపబడు అగ్ని విహరణీయాగ్నులలో నాలుగవవాడు; ఇతడు బ్రాహ్మణాచ్ఛంసిస్థానీయుడు. 'ఉశిగసి కవిః' అని శ్రుతులయందు ప్రశంసింపబడు అగ్ని విహరణీయాగ్నులలో ఐదవవాడు; ఇతడు పోత్రియ స్థానీయుడు; 'అంభారిరసి బంభారిః' అని శ్రుతులయందు ప్రశంసింపబడుఅగ్ని ఆరవ విహరణీయాగ్ని. ఇతడు నేష్ట్రీయ స్థానీయుడు; 'అవస్యు రసి దువస్వాన్' అని శ్రుతులయందు ప్రశంసింపబడు అగ్ని విహరణీయాగ్నులలో ఏడవవాడు; ఇతడు అచ్ఛావాకీయ స్థానీయుడు; 'శుంధ్యు రసి మార్జాలీయః' అని శ్రుతులయందు స్తుతించబడు అగ్ని విహరణీయాగ్నులలో ఎనిమిదవవాడు; ఇతడుమార్జా(లీ)రీయ స్థానీయుడు.

ద్విజులచేత సోమసంస్థ లనబడు యాగములందు గార్హపత్యాగ్నియందుండి ఆహరింపబడి యజ్ఞములందలి ఆహవనీయాగ్ని భేదములుగా ఉండి హవిర్వహనము (దేవతలకు హవిస్సును కొనిపోవుట) చేయు ధిష్ణ్యాగ్నుల స్పష్ట ప్రతిపాదన ప్రకారము ఇది.(ఇంతవరకు 13+16=29 అగ్నులయినారు.)

అగ్నిః సోఽవభృథే జ్ఞేయో వరుణేస సహేజ్యతే ।
హృద (చ్ఛ) య స్తత్సుతో హ్యగ్ని ర్జఠరేఽసౌ నృణాం పచన్. 30
మన్యుమాన్ జాఠరస్యాగ్నే ర్దేవపాగ్నిసుతః స్మృతః । వరస్పరోత్థితో హ్యగ్నిః స్తితో భూతాని నిర్దహేత్.
అగ్ని ర్మన్యుమతః పుత్త్రో ఘోరః సంవర్తకః స్మృతః । పిబన్నగ్నిః స వసతి సముద్రే బడబాముఖే.
సముద్రవాసినః పుత్త్రః సహరక్షో విభావ్యతే । సహరక్షః సుతః క్షామో గేహే 4 హ్యావసతే నృణామ్. 33
క్రవ్యాదాగ్నిః సుత స్తస్య పురుషా నత్తి వై మృతాన్ ।
ఏతే తు పావకస్యాగ్నే ర్ద్విజైః పుత్త్రాః ప్రకీర్తితాః. 34

అధ్వర్యుని కుమారుడు (అధ్వర్యు స్థానము నందుండువాడు) పావకుని కుమారుడు (పావకాగ్ని సంబంధి) అవభృథ స్నాన సమయమందు వరుణునితో పాటుగ ఆరాధించబడువాడునగు అగ్నియొకడు కలడుగదా! అతని కుమారుడు హృదయుడు; ఇతడు మానవుల జఠరమునందుండి వారి ఆహారమును పచనము చేయుచుండును. అతని కుమారుడు

3 అపాం యోనిః స్మృతశ్చాసౌ తోప్తుర్నామ విభావ్యతే; తే క్షత్తానామ.

4 కామో గృహే సంచరతే.

మన్యుమాన్; ఇతడు దేవపుదను అగ్నికి కుమారుడుగా (కూడ) చెప్పబడును. ఈ అగ్ని పరస్పర ఘర్షణముచే జనించి చెలరేగి ప్రాణులను దహించివేయును. అతని కుమారుడు సంవర్తకుడు; అతడు భయంకరుడు; ఇతడు బడబా ముఖ రూపమున సముద్రమునసుండి దానిని త్రాగుచుండును. అతని కుమారుడు సహరక్షుడు; అతని కుమారుడు క్షాముడు; ఇతడు నరుల గృహములయం దుండును. అతని కుమారుడు క్రవ్యాదాగ్ని; అతడు మరణించిన పురుషులను తినుచుండును.

పావకాగ్ని పుత్త్రులుగా ద్విజులు పేర్కొను అగ్నులు వీరు ఆరుగురు.

తతః శుచిస్తు యః సూర్యాద్గంధర్వై ర్వసురాహృతః।మథితో య స్త్వరణ్యాం తు సోఽగ్ని మగ్నిం సమింధతే.
ఆయుర్నామా తు భగవాన్ పశౌ యస్తు ప్రణీయతే ।
ఆయుషో మహిషః పుత్త్రః సహసో ○నామ తత్సుతః. 5 36
6 పాకయజ్ఞే ష్వభీమానీ హుతం హవ్యం భునక్తి యః ।
పుత్త్రోఽస్య సహస స్యాగ్ని రద్భుతస్తు మహాయశాః. 37
అద్భుతస్య సుతో వీరో దేవాంశస్తు మహాన్ స్మృతః● । ప్రాయశ్చిత్తే ష్వభిమానీ వివిధాగ్నిస్తు తత్సుతః.
వివిధాగ్నిసుతో హ్యర్కో వహ్నే స్తస్య సుతాష్టకమ్ । కామాదీష్టి ష్వభిమానీ రక్షోహాప్రకృచ్ఛ యః. 39
సురభి ర్వసుమర్యాదో 7హర్యశ్వశ్చైవ రుక్మవాన్। 8 ప్రవర్గ్యః క్షమవాం శ్చైవ ఇత్యష్టౌ చ ప్రకీర్తితాః.
శుచ్యగ్నేస్తు ప్రజా హ్యేషా అగ్నయశ్చ చతుర్దశ ।

పూర్వము గంధర్వులు సూర్యునినుండి తెచ్చిన వసురూపుడు శుచియను అగ్ని; (ఇతడు వారిచే పురూరవునకు ఈయబడిన తరువాత వృక్షములయందు దాగగా మరల ఆ రాజు వారి యుపదేశముచే) అరణియందు మథించగా ఉత్పన్నుడై అగ్నినుండి మరియొక యగ్ని అను క్రమమున ప్రజ్వలించుచు (లోకమున నీతడు నిర్మథ్యాగ్నిగానే) ఉన్నాడు. అతని నామము ★ఆయువు (ఇతడు ఊర్వశీ పురూరవసుల కుమారుడుగా ప్రసిద్ధుడనుట గమనింపదగినది.) ఈ అగ్ని భగవానుడు ఆహవనీయాగ్నిగా పశు యజ్ఞములందు ప్రణయనము చేయబడుచున్నాడు. అతని కుమారుడు మహిషుడు; అతని కుమారుడు సహసుడు; ఈతడు పాక యజ్ఞాభిమానియై వాటియందు వేల్చబడిన హవిస్సును అనుభవించుచుండును. ఈతని కుమారుడు మహాయశుడగు అద్భుతుడు. అతని కుమారుడు (మహాన్) గొప్పవాడు-పూజ్యుడు సర్వదేవాంశుడు అగు వీరుడు అనునతడు: (వీరుడను అగ్నికి కుమారుడు కంతుడు; కంతుని కుమారుడు కవియనునతడు.) ఈ వీరుడు అనునతడు ప్రాయశ్చిత్త కర్మానుష్ఠానాభిమానియై యుండును. అతని కుమారుడు వివిధాగ్ని; వివిధాగ్ని కుమారుడు అర్కుడు; ఈతని కుమారులు ఎనిమిదిమంది. వీరిలో మొదటివాడు కామ్యాదికములగు ఇష్టులకు అభిమానియై యుండు రక్షోహా (రక్షాంసి - హంతి - రాక్షసులను చంపువాడు) అను అగ్ని ఇంకను ప్రతికృత్ (ఇతరులు చేసిన అపకారములకు ప్రతీకారము చేయువాడు) సురభి-వసు మర్యాదుడు హర్యశ్వుడు రుక్మవాన్ ప్రవరుడు క్షమవాన్ అను వారును కలిసి వీరు మొత్తము ఎనిమిదిమంది.

---

○ సమనో ● "వీరస్యాగ్నేః సుతః కంఠః కంఠస్యాగ్నేః సుతః కవిః" అని ఒక పంక్తి ఉన్నది. దీనివలన శుచ్యగ్నిసంతానసంఖ్య పదునాలుగు కాక రెండు ఎక్కువై పదునారగును.

5 సంహితాగ్నిస్తు ; పుత్త్రోదవానాగ్నిస్తు.

6 సర్వస్మాదేవ లోకాచ్ఛహుతం హవ్యంబిభర్తి యః. 7 హయాస్యశ్చైవ ; 8 వరేణ్యః

★ ఊర్వశీ పురూరవసుల పేరులలోని సామ్యము గమనింపదగినది. పురు-ఉరువస్ >పురూరవస్; ఉ-రువస్-ఈ- (స్త్రీ వాచక ప్రత్యయము) >ఉర్(ఉ) వస్-ఈ >ఉర్వస్-ఈ >ఊరంసీ >ఊర్వశీ

ఈ పదునలుగురును శుచ్యగ్నికి సంతానమగువారు. (ఇట్లు మొత్తము అగ్నులు 29+6+14 = 49.)

ఇత్యేతే హ్యగ్నయః ప్రోక్తాః ప్రణీతా యే హి చాధ్వరే. 41
సమన్వితా విసర్గే యే యామైస్సహ సురోత్తమైః ।
స్వాయంభువేఽంతరే పూర్వ మగ్నయ స్తేఽభిమానినః. 42
ఏతే విహరణీయా యే చేతనాచేతనే ష్విహ । స్థానాభిమానినోఽగ్నిషు ప్రా గాసన్ హవ్యవాహనాః. 43
కామ్యనైమిత్తికే యజ్ఞే ప్రేతకర్మ స్వవస్థితాః । పూర్వమన్వంతరేఽతీతే మద్రైర్యామైశ్చ తైస్సహ. 44
ఏతే దేవగణైస్సార్ధం ప్రథమస్యాంతరే మనోః । ఇత్యేతా యోనయో హ్యుక్తాః స్థానాఖ్యా జాతవేదసామ్.
ఇత్యేవ తు ప్రసంఖ్యాతా స్సాంప్రతం నో గతే ష్విహ । మన్వంతరేషు సర్వేషు లక్షణం జాతవేదసామ్.
స్వారోచిషాదిషు జ్ఞేయం సావర్ణ్యంతేషు సప్తసు । మన్వంతరేషు సర్వేషు నానారూపప్రయోజనైః. 47
వర్తంతే వర్తమానైశ్చ యామైర్దేవైస్సహాగ్నయః। అనాగతైః సురైః సార్ధం వర్తంతేఽనాగతాగ్నయః.
ఇత్యేష నిచయోఽగ్నీనాం మయా ప్రోక్తో యథాక్రమమ్ ।
విస్తరే ణానుపూర్వ్యాచ్చ కి మన్య చ్ఛ్రోతు మిచ్ఛథ. 49

ఇతి శ్రీమత్స్యమహాపురాణే అగ్నివంశవర్ణనం నామ ఏకపంచాశోఽధ్యాయః.

ఈ విధముగా అధ్వరములందు ప్రణయనము చేయబడు అగ్నుల విషయము ప్రతిపాదింపబడినది. వీరందరును సృష్టికి ఆరంభమునందు నుండియు యాములు అనబడు దేవ శ్రేష్ఠులతో కూడియుందురు (ఏకభావము నొందియుందురు.) వీరందరును పూర్వము స్వాయంభువ మన్వంతరమునందును ఆయా వైదిక కర్మానుష్ఠానములకు అభిమానులై విహరణీయులై (అర్థము లోగడ చెప్పబడినది) సృష్టియందలి చేతనములు అచేతనములునగు పదార్థములయందు స్థానాభిమానులై ఆయా అగ్నులకు అభిమానులునై (ఈ స్థానమునకు వీరు అధిష్ఠాతలు అని విద్వాంసులచే భావన చేయబడువారై-ఈ స్థానము నాది-ఈ స్థానమునకు నేను అధిష్ఠాతను అను అభిమానము కలవారై) ఉండిరి.

ఇది యామదేవులలోని వారగు అగ్నుల విషయము. (ఆదికాలమున ప్రాయశ్చిత్తములును కామ్య కర్మానుష్ఠానములును ఆభిచారిక కర్మములును ఉండలేదు. అందుచే ఆనాటికి యాములు అను దేవతలు మాత్రమే ఉండిరి. తరువాత ఈ కామ్యాది కర్మల ప్రవృత్తి ప్రజాపతిభావనలోనికి రాగా వీనికి అభిమానులగు మద్రులు అనబడు దేవతల భావన కర్మ కాండములలో ప్రవేశించినది.) ఇట్లు ప్రథమ మన్వంతరము అతీతము కాగా కామ్య నైమిత్తికాది కర్మలయందును ప్రేత కర్మలయందును అభిమానులై యుండిన అగ్నులు ఏర్పడి యాములను దేవతలతోపాటు మ(ం)ద్రులనబడు అగ్నులయందును వీరు సమన్వయము పొందిరి.

ఇట్లు ఆయా జాతవేదసుల యోనులును (ఉత్పత్తి ప్రకారములును) స్థానాభిఖ్యలును (అధిష్ఠానమును బట్టి వచ్చిన నామములును) ప్రతిపాదింపబడినవి. ఈ విషయము గత మన్వంతరములయందు వలెనే వీరి విషయమున ప్రసంఖ్యాత (ప్రతిపాదిత) మయినది.

ఇదే విధముగ స్వారోచిష మన్వంతరము మొదలుకొని సావర్ణి మన్వంతరాంతముగా నుండు (స్వాయంభువము కాక మిగిలిన అన్ని) మన్వంతరములందును ఇంతవరకు గడచిన- గడచుచున్న- ఏడు మన్వంతరముల యందువలెనే నానారూప ప్రయోజనముల ననుసరించి అతీతులును వర్తమానులునగు ఆయా అగ్ని సంబంధులగు యామాది దేవ గణములతో కూడి ఆయా అగ్నులుందురు. ఇక అనాగత(రాబోవు) మన్వంతరములయందు రాబోవు ఆయా దేవ గణాంతర్భూతులగు వారితో కలిసి రాబోవు అగ్నులు ఉపాసింపబడుదురు.

ఈ విధముగా అగ్నుల వర్గము(ను వారి నామకర్మ ప్రవిభాగము)ను ఆనుపూర్వితో సవిస్తరముగా నేను ప్రతిపాదించితిని. మరి ఇంకను ఏమి వినగోరెదరో తెలుపుడు. అని సూతుడు ఋషులతో పలికెను.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున అగ్నివంశ వర్ణనము ఏబది ఒకటవ అధ్యాయము.

## ద్విపంచాశోఽధ్యాయః.

## కర్మయోగః.

ఋషయః : ఇదానీం ప్రాహ య ద్విష్ణుః పృష్టః పరమ ముత్తమమ్ ।
త్వ మిదానీం సమాచక్ష్వ ధర్మాధర్మస్య విస్తరమ్. 1
ఏవ మేకార్ణవే తస్మి న్మత్స్యరూపీ జనార్దనః । విస్తార మాదిసర్గస్య ప్రతిసర్గస్య చాఖిలమ్. 2
కథయామాస విశ్వాత్మా మనవే సూర్యసూనవే । కర్మయోగం చ సాఙ్ఖ్యం చ యథావ ద్విస్తరాన్వితమ్. 3
శ్రోతు మిచ్ఛామహే సూత కర్మయోగస్య లక్షణమ్ । యస్మా దవిదితం లోకే న కిఞ్చి త్తవ సువ్రత. 4
సూతః : కర్మయోగం ప్రవక్ష్యామి యథావ చ్ఛ్రుతిభాషితమ్ ।
జ్ఞానయోగ సహస్రా ద్ధి కర్మయోగః ప్రశస్యతే. 5
కర్మయోగోద్భవం జ్ఞానం తస్మా త్త త్పరమం పదమ్ ।
కర్మ జ్ఞానోద్భవం బ్రహ్మ న చ జ్ఞాన మకర్మణః. 6
తస్మా త్కర్మణి యుక్తాత్మా త త్త్వ మాప్నోతి శాశ్వతమ్ ।
వేదోఽఖిలో ధర్మమూల మాచార శ్చైవ తద్విదామ్. 7
అష్టా వాత్మగుణా స్తస్మి న్ప్రధానత్వేన సంస్థితాః । దయా సర్వేషు భూతేషు క్షాన్తి రప్యాతురస్య తు. 8
అనసూయా తథా లోకే శౌచ మన్త ర్బహి ర్ద్విజాః । అనాయాసస్తు కాయేషు మఙ్గల్యాచారసేవనమ్. 9
తథా ద్రవ్యే ష్వకార్పణ్య మర్థే ష్వాపార్జితేషు చ । తథాఽస్పృహా పరద్రవ్యే పరస్త్రీషు చ సర్వదా. 10
అష్టా వాత్మగుణాః ప్రోక్తాః పురాణస్య తు కోవిదైః । అయ మేవ క్రియాయోగో జ్ఞానయోగస్య సాధకః. 11
కర్మయోగం వినా జ్ఞానం కస్యచి న్నేహ దృశ్యతే । శ్రుతిస్మృత్యుదితం ధర్మ ముపతిష్ఠే త్ప్రయత్నతః.

## ఏబది రెండవ అధ్యాయము

## కర్మయోగము

ఋషులు సూతు నిట్లడిగిరి: "మనువు ప్రశ్నించగా మత్స్యరూప విష్ణువు అతనికి తెలిపిన పరమోత్తమమగు ధర్మాధర్మ విస్తరమును తెలుపుము. ఈ చెప్పిన విధమున ఏకార్ణవమయిన జలమునందుండిన మత్స్యరూప జనార్దనుడు సూర్యపుత్త్రుడగు మనువునకు మొదట ఆదిసర్గము ప్రతిసర్గము మొదలగునదంతయు-అనగా వంశ-మన్వంతర-వంశాను చరితములను కూడ-తెలిపియుండెను. అతడు వాటితోపాటు కర్మయోగమును సాంఖ్య (యోగ) మును ఉన్నదియున్నట్లు సవిస్తరముగ చెప్పియుండెను. అని వింటిమి. (వానిలో సర్గ ప్రతిసర్గ వంశమన్వంతర వంశాను చరితములను నీవలన వింటిమి.) ఇక ఇప్పుడు కర్మయోగ లక్షణమును వినగోరెదము. ఏలయన నీవు సువ్రతుడవు. (యథావిధిగ గురు శుశ్రూష చేసి అన్ని విషయముల నెరిగినవాడవు.) లోకమునందు నీకు తెలియనిది ఏ కొంచెమును లేదు."

సూతు డిట్లు చెప్పనారంభించెను: శ్రుతులయందు చెప్పబడిన విధమున మీకు కర్మయోగమును తెలిపెదను. (ఆది తెలిసికొనవలసినదే.) ఏలయన వేయి జ్ఞానయోగములకంటెను కర్మయోగము మేలయినది. కర్మయోగము ననుష్ఠించుట వలననే జ్ఞానము కలుగును. జ్ఞానమువలన పరమపదము-పరమాత్మ తత్త్వము-లభించును. కనుక కర్మము వలనను జ్ఞానము వలనను బ్రహ్మము లభించును. కర్మాచరణము లేనివానికి జ్ఞానము లభించదు. కావున కర్మయోగము

నాశ్రయించినవాడు శాశ్వత తత్త్వమును పొందును. వేదము అంతయును దాని తత్త్వమును ఎరిగినవారి ఆచరణమును ధర్మమునకు (ధర్మ కర్మల ననుష్ఠించుటకు) మూలము. ఆ ఆచారమునందును ఎనిమిది ఆత్మగుణములు ప్రధానములు. సర్వ భూతములయందు దయ-ఎన్ని బాధలయందును ఓర్పు లోకము విషయమున అసూయ (దోషారోపబుద్ధి) లేకుండుట-దేహమునను చిత్తమునను పవిత్రత-అక్కరలేని శ్రమ పడకుండుట-శరీరమున శుభలక్షణమును వేషమును కలిగియుండుట-లేని ద్రవ్యముల విషయమున కాని సంపాదించిన ద్రవ్యముల విషయమునకాని పిసినిగొట్టుతనము లేకుండుట- పర ద్రవ్యములందును పరస్త్రీల విషయమునందును కోరిక లేకుండుట (దయ-క్షాంతి-అనసూయ-శౌచము అనాయాసము-మంగళ్యాచార సేవనము-అకార్పణ్యము-అస్పృహ) అనునవి ఈ ఎనిమిది గుణములు. ఇట్టి సదుపదియే క్రియాయోగము-ఇది జ్ఞాన సాధకము. ఇది లేనిచో అది లేదు. ప్రయత్నపూర్వకముగా ప్రతియొకరును శ్రుతి స్మృతి ప్రోక్తమగు కర్మల నాచరించుచుండవలయును.

దేవతానాం పితౄణాం చ మనుష్యాణాం చ సర్వదా । *కుర్యా దహరహ ర్యజ్ఞై ర్దేవర్షిగణతర్పణమ్. 13
స్వాధ్యాయే నార్చయే☆ దృషీన్ హోమై ర్దేవా న్యథావిధి । పితౄ న్ఛ్రాద్ధే దద న్నన్నై భూతాని బలికర్మణా.
పఞ్చైతే విహితా యజ్ఞాః పఞ్చసూనాఽపనుత్తయే । ఖణ్డనీ పేషిణీ చుల్లీ జలకుమ్భీ ప్రమార్జనీ. 15
పఞ్చ సూనా గృహస్థస్య తేన స్వర్గం న గచ్ఛతి । తత్పాపనాశనాయాలం పఞ్చ యజ్ఞాః ప్రకీర్తితాః. 16
ద్వివింశతి తథా చాష్టౌ యే సంస్కారాః ప్రకీర్తితాః । తద్యుక్తోఽపి న మోక్షాయ య స్త్వాత్మగుణవర్జితః.
తస్మా దాత్మగుణోపేత శ్శ్రుతికర్మ సమాచరేత్ । గోబ్రాహ్మణానాం విత్తేన సర్వదా భద్రమాచరేత్. 18
గోభూహిరణ్యవాసోభి ర్గన్ధమాల్యాదికేన చ । పూజయే ద్బ్రహ్మవిష్ణ్వర్కరుద్రవస్వాత్మకం శివమ్. 19
వ్రతోపవాసై ర్విధివ చ్ఛ్రద్ధయాచ విమత్సరః । యోఽసా వతీన్ద్రియ శ్శాన్త స్సూక్ష్మోఽవ్యక్త స్సనాతనః.
వాసుదేవో జగత్సూతి స్తస్య సమ్భూతయో హ్యమీ । బ్రహ్మా విష్ణుశ్చ భగవా న్మార్తాణ్డో వృషవాహనః. 21
అష్టౌచ వసవ స్తద్వ దేకాదశ గణాధిపాః । ○ద్వాదశైవ తథాఽఽదిత్యాః పితరో మాతర స్తథా. 22
ఇమా విభూతయః ప్రోక్తా శ్చరాచరసమన్వితాః । బ్రహ్మాద్యా శ్చతురో మూల మవ్యక్తాధిపతే స్స్మృతాః. 23
బ్రహ్మణా చాథ సూర్యేణ విష్ణునాఽథ శివేన వా । అభేదా త్పూజితేన స్యా త్పూజితం సచరాచరమ్. 24
బ్రహ్మాదీనాం పరం ధామ త్రయాణా మపి సంస్థితమ్ ।
దేవమూర్తి రతః పూషా పూజనీయః ప్రయత్నతః. 25
తస్మా దగ్ని ద్విజముఖం కృత్వా సమ్పూజయే దిమాన్ ।
దానై ర్వ్రతోపవాసైశ్చ జపహోమాదినా నరః. 26
ఇతి క్రియాయోగపరాయణస్య వేదాన్తశాస్త్రస్మృతివత్సలస్య ।
వికర్మభీతస్య సదా న కిఞ్చి త్ప్రాప్య మస్తీహ పరే చ లోకే. 27

ఇతి శ్రీమత్స్యమహాపురాణే మత్స్యమనుసంవాదే కర్మయోగకథనం నామ
ద్విపఞ్చాశోఽధ్యాయః.

గృహస్థునకు ఇంటి పనులలో ప్రాణి హింసకు కారణములై పాపము కలిగించునవి ఐదు; అవి: కత్తిపీట-తిరుగలి-పొయ్యి-నీటికడవ-చీపురు అనునవి; వీనిని పోగొట్టుకొనుటకై అతడు హోమములచే దేవయజ్ఞము శ్రాద్ధములచే పితృయజ్ఞము వేదాధ్యయనముచే ఋషియజ్ఞము అన్నదానముచే మనుష్యయజ్ఞము భూతములకు బలి (నూకలు మొద లగునవి) వేసి భూత యజ్ఞము అను పంచయజ్ఞములను దేవర్షి పితృ తర్పణములను చేయవలెను. ముప్పది సంస్కారములు

* కుర్యాదహరహర్యజ్ఞైర్భూతర్షి ☆ నార్చన్మౌనీన్ ○ లోకపాలా గ్రహాశ్చైవ

పొందినవానికైనను ఈ చెప్పిన ఆత్మ గుణములు లేనిచో మోక్షమురాదు. తనకున్న ధనముతో గోబ్రాహ్మణులకు శుభము కలిగించవలెను. గోవులు భూమి హిరణ్యము వస్త్రములు గంధమాల్యములు మొదలగువానితో బ్రాహ్మణులను పూజించవలెను. బ్రహ్మ విష్ణు భాస్కర రుద్ర వసురూపుడగు శివుని (పరమాత్మను) యథావిధిగా శ్రద్ధాపూర్వకముగా మత్సరము లేకుండ (మరియొకరితో పోటీపడక) వ్రతములు ఉపవాసములు మొదలగునవి ఆచరించుచు అర్చించుచు ఉండవలెను. అతీంద్రియుడు శాంతుడు సూక్ష్ముడు అవ్యక్తుడు సనాతనుడు జగజ్జన్మకారణుడు నగు వాసుదేవుని నుండి రూపొందిన తత్త్వములే బ్రహ్మవిష్ణు శివ రవి వసుగణ రుద్ర గణాదిత్య గణములు సప్త పితృ గణములు సప్త మాతృకలును చరాచరములగు సర్వభూతములును. అవ్యక్త తత్త్వమగు పరమేశ్వరుడు అధిపతిగాగల ఈ విశ్వమునకు బ్రహ్మ విష్ణు శివ సూర్యులు వేళ్ళవంటివారు. కనుక వారిని పరస్పరము అభిన్నులనుగాను వారిని పరమేశ్వరునితో అభిన్నులనుగాను ఆరాధించినచో చరాచర విశ్వమును ఆరాధించుటయగును. బ్రహ్మాది మూర్తిత్రయమును రవియందు రూపొందియున్నారు. కనుక ప్రయత్నముతో విధి విధానమున రవి నుపాసించవలయును. అగ్నిముఖ ద్విజముఖములు చేసి (అగ్నియందు ఔపాసనము కాని దేవ సన్నిధిలో దీపము వెలిగించుటకాని చేసి బ్రాహ్మణుని పూజించి ఆతని నోటితో వేదమంత్రములు చెప్పించుచు) దాన వ్రతోపాసన జప హోమాదులతో రవి నారాధించవలెను.

ఇట్లు క్రియాయోగ పరాయణుడై వేదాంత శాస్త్రమునందును స్మృతి విధానములందును ఆసక్తి కలిగియుండు వానికి ఇహపర లోకములందు పొందరాని దేదియు లేదు.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున మత్స్యమను సంవాదమున కర్మయోగమను
ఏబది రెండవ యధ్యాయము.

## త్రిపంచాశోఽధ్యాయః.
## పురాణదాన వ్రతకథనమ్-
## పురాణసఙ్ఖ్యానుక్రమణికా.

ఋషయః : పురాణసఙ్ఖ్యా మాచక్ష్వ సూత విస్తరతః క్రమాత్ ।
దానవ్రత మశేషంచ యథావ దనుపూర్వశః. 1
సూతః : ఇదమేవ పురాణేఽస్మి న్పురాణపురుష స్తథా ।
యదుక్తవా న్స విశ్వాత్మా మనవే త న్నిబోధత. 2
శ్రీమత్స్యః : పురాణం సర్వశాస్త్రాణాం ప్రథమం బ్రహ్మణాస్మృతమ్ ।
అనన్తరంచ వక్త్రేభ్యో వేదా స్తస్య వినిర్గతాః. 3
పురాణ మేక మేవా సీ త్తదా కల్పాన్తరేఽనఘ । త్రివర్గసాధనం పుణ్యం శతకోటిప్రవిస్తరమ్. 4
నిర్దగ్ధేషుచ లోకేషు వాజిరూపేణవై మయా । అఙ్గాని చతురో వేదాః పురాణన్యాయవిస్తరః. 5
మీమాంసా ధర్మశాస్త్రంచ పరిగృహ్యాత్మసాత్కృతమ్ । మత్స్యరూపేణతు పునః కల్పాదా వుదకార్ణవే. 6
అశేష మేత త్కథిత ముదకాన్తర్గతేనచ । శ్రుత్వా జగాదచ మునీ న్ప్రతి దేవాం శ్చతుర్ముఖః. 7
ప్రవృత్తి స్సర్వశాస్త్రాణాం పురాణస్యాభవ త్తతః । కాలే నాగ్రహణం దృష్ట్వా పురాణస్య తతో నృప. 8
వ్యాసరూప మహం కృత్వా సంహరామి యుగేయుగే । చతుర్లక్షప్రమాణేన ద్వాపరే ద్వాపరే సదా. 9
తదష్టాదశధా కృత్వా భూలోకేఽస్మి న్ప్రకాశ్యతే । అద్యాపి దేవలోకేస్మిఞ్ శతకోటిప్రవిస్తరమ్. 10
తదర్థోఽత్ర చతుర్లక్షం సంక్షేపేణ నివేశితమ్ । పురాణాని దశాష్టౌచ సామ్ప్రతం తదిహోచ్యతే. 11
నామత స్తాని వక్ష్యామి శృణుధ్వ మృషిసత్తమాః ।

## ఏబది మూడవ అధ్యాయము

## పురాణ సంఖ్యానుక్రమము-పురాణ దాన వ్రతము.

పురాణముల గ్రంథ సంఖ్యను వాటిని దానము చేయుట అను వ్రత విధానమును సవిస్తరముగా నిరవశేషముగా మాకు దెలుపుమని ఋషులడుగ సూతుడు ఈ విషయమును పురాణ పురుషుడగు మత్స్యరూప జనార్దనుడు మనువునకు చెప్పిన విధముననే మీకు తెలిపెదనని ఇట్లు చెప్పనారంభించెను:

మత్స్యుడు మనువునకు ఇట్లు చెప్పెను: బ్రహ్మకు గల ఐదు ముఖములలో ఊర్ధ్వ ముఖమునుండి సర్వ శాస్త్రములకు ఆది భూతమగు పురాణము వెలువడెను. పిమ్మటనే (మిగిలిన) ముఖములనుండి వేదములు వెలువడెను. పూర్వకల్పమున మొదట పురాణము ఒక్కటియే యుండెను. అపుడది శతకోటి గ్రంథ పరిమాణము కలది (ముప్పది రెండక్షరముల సముదాయమునకు గ్రంథమని వ్యవహారము.) లోకములు నిశ్శేషముగ దగ్ధమైన తరువాత (ప్రళయా నంతరము) నేను హయ (గ్రీవ) రూపమున (ఆరు) వేదాంగములు నాలుగు వేదములు పురాణములు న్యాయవిస్తరము మీమాంస-ధర్మశాస్త్రము(లు) అను పదునాలుగు విద్యలను (శబ్దాత్మక నిత్య తత్త్వమును) పరిగ్రహించి నాస్వాధీనము చేసికొంటిని. మరల కల్పాదియందు మహా ప్రళయ సముద్రమున మత్స్యరూపమున నేను నీటియందేయుండి పలుకగా విని చతుర్ముఖుడు మునులకును అవి దేవతలకును ప్రవచించెను. ఇట్లు సర్వశాస్త్ర రూపమగు పురాణము లోకమున ప్రవర్తిల్లెను. కాని కాలక్రమమున దానిని జనులు సులభముగా గ్రహింపలేకపోవుట చూచి నేను ప్రతి మహా యుగమునందలి ద్వాపరయుగమునను వ్యాసరూపుడనై చతుర్లక్ష గ్రంథ పరిమాణమునకు సంగ్రహించి ఈ మొత్తమును పదునెనిమిదిగా విభజించి లోకమున ప్రకాశింపజేయుదును. దేవలోకమున మాత్రమది ఇప్పటికిని శతకోటి గ్రంథ పరిమితముగానే యున్నది. వాని వివరణమును వాటిని విభజించి దానము చేయవలసిన వ్రతవిధానమును తెలిపెదను.

బ్రహ్మణాఽభిహితం పూర్వం యావన్మాత్రం మరీచయే. 12
బ్రాహ్మం తద్దశసాహస్రం పురాణం పరికీర్తితమ్ । లిఖిత్వా తచ్చ యో దద్యా జ్జలధేను సమన్వితమ్. 13
వైశాఖే పౌర్ణమాస్యాంచ బ్రహ్మలోకే మహీయతే । ఏతదేవ యదా పద్మ మభూ న్హైరమయం జగత్. 14
తద్వృత్తాన్తాశ్రయం బ్రహ్మ పాద్మమిత్యుచ్యతే బుధైః । పాద్మంతు పఞ్చపఞ్చాశ త్సహస్రాణి నిగద్యతే.
తత్పురాణంచ యో దద్యా త్సువర్ణకమలాన్వితమ్ । జ్యేష్ఠమాసే తిలైర్యుక్తం సోఽశ్వమేధఫలం లభేత్.16
వారాహకల్పవృత్తాన్త మధికృత్య పరాశరః । యత్రాహ ధర్మా నఖిలాం స్తదుక్తం వైష్ణవం విదుః. 17
*త్రయోవింశతి సాహస్రం తత్పురాణం విదు ర్బుధాః । తదాషాఢేతు యో దద్యా ద్ఘృతధేనుసమన్వితమ్.
పౌర్ణమాస్యాం విశుద్ధాత్మా స పదం యాతి వైష్ణవమ్ । శ్వేతకల్ప ప్రసఙ్గేన ధర్మా న్వాయు రిహాబ్రవీత్.19
యదేత ద్వాయవీయం స్యా ద్రుద్రమాహాత్మ్యసంయుతమ్ ।

○ ద్వాదశైవ సహస్రాణి పురాణం తదిహోచ్యతే. 20
శ్రావణ్యాం శ్రావణే మాసి గుడధేనుసమన్వితమ్ । యో దద్యా ద్దధిసంయుక్తం బ్రాహ్మణాయ కుటుమ్బినే.
శివలోకే స పూతాత్మా కల్పమేకం వసే న్నరః । యత్రాధికృత్య గాయత్రీం వర్ణ్యతే ధర్మవిస్తరః. 22
వృత్రాసురవధోపేతం తద్భాగవత ముచ్యతే । సారస్వతస్య కల్పస్య కథా యా స్సు ర్నరాధిప. 23
తద్వృత్తాన్తోద్భవం లోకే తద్భాగవత ముచ్యతే । లిఖిత్వా తచ్చ యో దద్యా ద్ధేమసింహసమన్వితమ్. 24
పౌర్ణమాస్యాం ప్రోష్ఠపద్యాం స యాతి పరమం పదమ్ ।అష్టాదశసహస్రాణి పురాణం తత్ప్రకీర్తితమ్. 25

---

* విష్ణ్వాఖ్య మష్టసాహస్రంతత్పురాణంవిదుర్బుధాః ○ చతుర్వింశతిసాహస్రంపురాణం

* చతుర్వింశతిసాహస్రం

యత్రాహ నారదో ధర్మా న్బృహత్కల్పాశ్రయాం స్త్విహ ।
పఞ్చవింశత్సహస్రాణి నారదీయం త దుచ్యతే. 26
ఆశ్వయుజ్యాం పఞ్చదశ్యాం యో దద్యా ద్ధేనుసంయుతమ్ । పరాం సిద్ధి మవాప్నోతి పునరావృత్తిదుర్లభామ్.
యత్రాధికృత్య శకునీ న్ధర్మాధర్మవిచారణమ్ । వ్యాఖ్యాతం స్యాజ్జైమినయే పక్షిభి ర్ధర్మచారిభిః. 28
మార్కణ్డేయేన కథితం తత్సర్వం విస్తరేణ తు । పురాణం నవసాహస్రం మార్కణ్డేయ మిహోచ్యతే. 29
త త్ప్రయచ్ఛే ల్లిఖిత్వా య స్సౌవర్ణకరిసంయుతమ్ । కార్తిక్యాం పౌణ్డరీకస్య క్రతోశ్చ ఫలభా గ్భవేత్. 30
య త్త దీశానకల్పస్య వృత్తాన్త మధికృత్య చ । వసిష్ఠాయాగ్నినా ప్రోక్త మాగ్నేయం త త్ప్రచక్షతే. 31
లిఖిత్వా తచ్చ యో దద్యా ద్ధేమపద్మసమన్వితమ్ । మార్గశీర్ష్యాం విధానేన తిలధేనుయుగం తథా. 32
తచ్చ షోడశసాహస్రం సర్వక్రతుఫలప్రదమ్ । యః ప్రదద్యా న్నర స్సోథ స్వర్గలోకే మహీయతే. 33

బ్రహ్మ మరీచికి ప్రవచించినది బ్రాహ్మపురాణము. దీని గ్రంథ పరిమాణము పదివేలు. దీనిని లిఖించి వైశాఖ పూర్ణిమనాడు జలధేను సహితముగా దానమిచ్చినచో బ్రహ్మలోకప్రాప్తి యగును.

జగత్తు అంతయు జలమయమై పద్మముగా (జలస్థానముగా) నున్నప్పుడు బ్రహ్మ ప్రవచించినది పద్మ పురాణము. దీని గ్రంథ పరిమాణము ఏబదిఐదువేలు. దీనిని లిఖించి జ్యేష్ఠమాస పూర్ణిమనాడు సువర్ణ కమలముతోను తిలలతోను దానము చేసినచో అశ్వమేధ ఫలము లభించును.

పరాశరుడు వారాహ కల్ప వృత్తాంతము నాశ్రయించి అఖిల ధర్మములను ప్రవచించినది విష్ణు పురాణము. దీని గ్రంథ పరిమాణము ఇరువదిమూడు వేలు. దీనిని లిఖించి ఆషాఢ పూర్ణిమనాడు ఘృత ధేనువుతో దానమిచ్చినచో విష్ణు లోకము ప్రాప్తించును.

వాయుదేవుడు శ్వేత (వరాహ) కల్ప వృత్తాంతము నాశ్రయించి రుద్రమాహాత్మ్య ప్రధానముగా ప్రవచించినది వాయు పురాణము. దీని గ్రంథ సంఖ్య పండ్రెండు వేలు. దీనిని లిఖించి శ్రావణ పూర్ణిమనాడు పెరుగుతో బెల్లముతో ధేనువుతో కుటుంబియగు బ్రాహ్మణునకు దానము చేసినవాడు శివలోకమున ఒక కల్పకాల ముండును.

గాయత్రీ తత్త్వము నాశ్రయించి వృత్రాసుర వధతో కూడ సారస్వత కల్ప వృత్తాంత ప్రధానముగా ధర్మ విస్తరముమ వర్ణించినది భాగవత పురాణము. దీని గ్రంథ పరిమాణము పదునెనిమిదివేలు. దీనిని లిఖించి భాద్రపద పూర్ణిమనాడు బంగారు సింహముతో కూడ దానము చేసినచో పరమపదమును పొందును.

నారదుడు బృహత్కల్పాశ్రయములగు కథలను ప్రవచించినది నారద పురాణము. దీని గ్రంథ ప్రమాణము ఇరువదియైదువేలు. దీనిని లిఖించి ఆశ్వయుజ పూర్ణిమనాడు ధేనువుతో కూడ దానమిచ్చినచో పునరావృత్తి లేని దుర్లభమగు పరమ సిద్ధి పందును.

పక్షులను ఆశ్రయముగా చేసికొని ధర్మానుష్ఠాన పరములగు పక్షులు జైమినికి ధర్మాధర్మ విచారణమును వ్యాఖ్యానించినట్లు మార్కండేయుడు ప్రవచించినది మార్కండేయ పురాణము. దీని గ్రంథ పరిమాణము తొమ్మిదివేలు. దీనిని లిఖించి సువర్ణ గజముతోకూడ కార్తిక పూర్ణిమనాడు దానమిచ్చినచో యజ్ఞఫలము లభించును.

ఈశాన కల్పము నాశ్రయించిన వృత్తాంతములను అగ్ని వసిష్ఠునకు ప్రవచించినది ఆగ్నేయ పురాణము. దీని గ్రంథ పరిమాణము పదునారువేలు. దీనిని లిఖించి బంగరు పద్మముతో కూడ తిల ధేనువుతో కూడ మార్గశీర్ష పూర్ణిమనాడు దానము చేసినచో సర్వక్రతు ఫలము లభించి స్వర్గ సుఖములందును.

యత్రాధికృత్య మాహాత్మ్య మాదిత్యస్య చతుర్ముఖః । అఘోరకల్పవృత్తాన్తప్రసంగేన జగత్థ్సితిమ్. 34
మనవే కథయామాస భూతగ్రామస్య లక్షణమ్ । చతుర్దశసహస్రాణి తథా పఞ్చశతాని చ. 35
భవిష్యచరితప్రాయం భవిష్యం తదిహోచ్యతే । తత్పౌషమాసి యో దద్యా త్పౌర్ణమాస్యాం విమత్సరః.
* గుడధేనుసమాయుక్త మగ్నిష్టోమఫలం లభేత్ । రాథన్తరస్య కల్పస్య వృత్తాన్త మధికృత్య తు. 37
సావర్ణినా నారదాయ కృష్ణమాహాత్మ్య ముత్తమమ్ । యత్ర బ్రహ్మవరాహస్య చరితం వర్ణ్యతే ముహుః. 38
త దష్టాదశసాహస్రం ★ బ్రహ్మకైవర్త ముచ్యతే ।
యో దద్యా న్మాఘమాసే తు బ్రాహ్మణాయ కుటుమ్బినే. 39
పౌర్ణమాస్యాం స భవనం బ్రహ్మలోకే మహీయతే । యత్రాగ్నిలిఙ్గమధ్యస్థః ప్రాహ దేవో మహేశ్వరః. 40
య త్ర దీశానకల్పస్య వృత్తాన్త మధికృత్య చ । కల్పితం లైఙ్గ మిత్యుక్తం పురాణం బ్రహ్మణా స్వయమ్.
త దేకాదశసాహస్రం ఫాల్గున్యాం యః ప్రదాపయేత్ । తిలధేనుసమాయుక్తం సయాతి శివసాత్మతామ్. 42
అర్ధనారీశ్వరం దేవం కృత్వా దేయం తు తత్ఫలమ్ । మహావరాహస్య పున ర్మాహాత్మ్య మధికృత్యచ. 43
విష్ణునాఽభిహితం క్షోణ్యై త ద్వారాహ మిహోచ్యతే । మానవస్య ప్రసంగేన కల్పస్య మునిసత్తమాః. 44
చతుర్వింశత్సహస్రాణి త త్పురాణ మిహోచ్యతే । కాఞ్చనం గరుడం కృత్వా తిలధేనుసమన్వితమ్. 45
దద్యా చ్చైత్ర్యాం పౌర్ణమాస్యాం బ్రాహ్మణాయ కుటుమ్బినే ।
వరాహస్య ప్రసాదేన పద మాప్నోతి వైష్ణవమ్. 46
యత్ర మాహేశ్వరా న్ధర్మా నధికృత్యచ షణ్ముఖః । కల్పే తత్పురుషే వృత్తచరిత్రై రుపబృంహితమ్. 47
స్కాన్దం నామ పురాణం త న్నిర్మమే స త్రయోదశమ్ ।
సహస్రాణాం శతం చైక మితి మర్త్యేషు వర్ణతే. 48
పరిలిఖ్యచ యో దద్యా ద్ధేమశూల సమన్వితమ్ । స శైవం పద మాప్నోతి *నరో విచ్ఛిన్నబన్ధనః. 49
త్రివిక్రమస్య మాహాత్మ్య మధికృత్య చతుర్ముఖః । త్రివర్గ మభ్యధా త్తచ్చ వామనం త త్ప్రకీర్తితమ్. 50
○చతుర్దశసహస్రాణి కూర్మకల్పానుగం శివమ్ ।
యచ్చ త ద్విషువే దద్యా ద్వైష్ణవం యాత్యసౌ పదమ్. 51
యత్ర ధర్మార్థకామానాం మోక్షస్యచ రసాతలే । మాహాత్మ్యం కథయామాస కూర్మరూపీ జనార్దనః. 52
ఇన్ద్రద్యుమ్నప్రసఙ్గేన మునిభ్య శ్శక్రసన్నిధౌ । ♦కూర్మంతు షట్సహస్రాణి లక్ష్మీకల్పానుషఙ్గితమ్. 53
యో దద్యా దయనే కౌర్మం హేమకూర్మసమన్వితమ్ ।
గోసహస్ర ప్రదానస్య ఫలం సమ్ప్రాప్నుయా న్నరః. 54
శ్రుతీనాం యత్ర కల్పాదౌ ప్రవృత్త్యర్థం జనార్దనః । మత్స్యరూపేణ మనవే నరసింహోపవర్ణనమ్. 55
అధికృత్యాఽబ్రవీ త్సప్త కల్పవృత్తం మునీశ్వరాః । తన్మాత్స్యమితి జానీధ్వం సహస్రాణి చతుర్దశ. 56
●యుగాదౌ హేమమత్స్యేన ధేన్వాచైవ సమన్వితమ్।
అలఙ్కృతాయ విప్రాయ కాంస్యపాత్రం సకల్పకమ్. 57
యో దద్యా త్పృథివీ తేన దత్తా భవతి సా కిల । యదా చ గారుడే కల్పే విశ్వాణ్డా ద్గరుడోద్భవమ్. 58
అధికృత్యాఽబ్రవీ ద్విష్ణు ర్గారుడం త దిహోచ్యతే । త దష్టాదశ చైకంచ సహస్రాణీహ పఠ్యతే. 59
>సౌవర్ణహంససంయుక్తం యో దదాతి పుమా నిహ । సిద్ధిం స లభతే ముఖ్యాం శివలోకే చ సంస్థితిమ్.

---

* గుడకుమ్భ. ★ బ్రహ్మవైవర్త.

* ఉపరాగేగతేరవౌ. ○ పురాణందశసాహస్రం. ♦ సప్తదశసహస్రాణిలక్ష్మి.

● విషువే. > సౌవర్ణహంసమిథునసంయుక్తంవిషువేనరః

బ్రహ్మ మనువునకు ఆదిత్య మాహాత్మ్యము నాధారముగా చేసికొని అఘోర కల్ప వృత్తాంతమును భూత సమూహ లక్షణమును ప్రాసంగికముగా జగత్ స్థితిని వివేషించి భవిష్య వృత్తాంతమును చెప్పినది భవిష్య పురాణము. దీని గ్రంథ పరిమాణము పదునాలుగువేల ఐదువందలు. (ప్రకృతము లభించు భవిష్య పురాణమున ఇంచుమించుగా ఇరువది ఏడువేల శ్లోకములున్నవి.) దీనిని లిఖించి పుష్యమాస పూర్ణిమనాడు విమత్సరుడై గుడ దేనువుతో దానము చేసినచో అగ్నిష్టోమ యాగఫలము లభించును.

సావర్ణి మనువు నారదునకు రథంతర కల్ప వృత్తాంతమును ఆశ్రయించి ఉత్తమమగు కృష్ణ మాహాత్మ్యమును బ్రహ్మ వరాహ చరితమును చెప్పినది బ్రహ్మకై (వై) వర్తపురాణము. దీని పరిమాణము పదునెనిమిది వేలు. దీనిని లిఖించి మాఘ పూర్ణిమనాడు కుటుంబియగు బ్రాహ్మణునకు భవనముతో కూడ దానము చేసినచో బ్రహ్మలోక ప్రాప్తియగును.

మహేశ్వరు డగ్నిలింగమధ్యముననుండి ఈశాన కల్ప వృత్తాంతము నాశ్రయించి ప్రవచించినది లైంగ పురాణమని బ్రహ్మ స్వయముగా చెప్పెను. దీని పరిమాణము పదునొకండువేలు. దీనిని లిఖించి ఫాల్గున పూర్ణిమనాడు తిలలతోను నూవులతోను అర్ధ నారీశ్వరదేవుని ప్రతిమతోను దానము చేసినచో శివసాయుజ్యము కలుగును.

విష్ణువు భూమికి మానవకల్పము నాశ్రయించి మహా వరాహ మాహాత్మ్యమును చెప్పినది వారాహ పురాణము. దీని పరిమాణ మిరువదినాలుగువేలు. దీనిని వ్రాసి చైత్ర పూర్ణిమనాడు కుటుంబియగు బ్రాహ్మణునకు బంగారు గరుడునితో తిలలతో ధేనువుతో కూడ దానము చేసినచో వరాహదేవుని అనుగ్రహమున విష్ణు లోకము ప్రాప్తించును.

తత్పురుషకల్పవృత్తాంత మాశ్రయించి మాహేశ్వర ధర్మములను షణ్ముఖుడు (స్కందుడు) ప్రవచించినది స్కాందపురాణము. దీని గ్రంథ పరిమాణము లక్షపై ఒక వేయి శ్లోకములు. దీనిని వ్రాసి బంగరు శూలముతో కూడ దానము చేసిన మానవుడు బంధముక్తుడై శివలోకము నందును.

త్రివిక్రమ మాహాత్మ్యము నాధారముగా గొని కూర్మ కల్ప వృత్తాంతమును పురుషార్థములను బ్రహ్మ ప్రవచించినది వామన పురాణము. దీని గ్రంథ పరిమాణము పదునాలుగు వేలు. దీనిని వ్రాసి విషువ దినమున (రాత్రింబగళ్ళు సమముగానుండు దినమున) దానమిచ్చినవారు విష్ణుస్థాన మందుదురు.

కూర్మరూపు డగు జనార్దనుడు ఇంద్రసన్నిధియందు మునులకు ఇంద్రద్యుమ్నుని ప్రసంగము మూలముగా లక్ష్మీ కల్ప వృత్తాంతములతో నాలుగు పురుషార్థముల మాహాత్మ్యమును ప్రవచించినది కూర్మ పురాణము. దీని గ్రంథ పరిమాణము ఆరువేలు (పదునెనిమిదివేలని మరియొక మతము.) దీనిని వ్రాసి అయన ప్రవేశ పుణ్యకాలమున బంగరు కూర్మముతో కూడ దానమిచ్చిన మానవునకు వేయి గోవుల దానము చేసినంత ఫలము కలుగును.

కల్పాదియందు మత్స్యరూపుడగు జనార్దనుడు సత్యవ్రత మనువునకు సప్త (ఋషి) కల్ప వృత్తాంత మాధారముగా వేదముల ప్రవర్తిల్లజేయుటకై (కాలరూపుడగు) పురుషోత్తమ తత్త్వమును వర్ణించి చెప్పినది మత్స్యపురాణము. దీని గ్రంథ పరిమాణము పదునాలుగున్నర వేలు (లోగడ చెప్పబడిన) యుగాది దినమున బంగారు మత్స్యముతో ధేనువుతో అన్ని అమరికలు కల కాంస్య పాత్రముతోను కూడ దీని వ్రాతప్రతిని బ్రాహ్మణునకు అనేక భూషణములతో అతని నలంకరించి దానము చేసినచో భూమినంతటిని దానము చేసినంత ఫలము కలుగును.

గారుడ కల్పమున బ్రహ్మాండమునుండి గరుడు డుద్భవిల్లిన వృత్తాంతమును విష్ణువు ప్రవచించినది గారుడ పురాణము. దీని పరిమాణము పందొమ్మిదివేలు. దీనిని లిఖించి బంగారు హంసతో కూడ దానము చేసినచో సాలోక్యము కిగా శివలోకము లభించును.

బ్రహ్మా బ్రహ్మాణ్డమాహాత్మ్య మధికృత్యాఽబ్రవీ త్పునః ।
తచ్చ ద్వాదశసాహస్రం బ్రహ్మాణ్డం ద్విశతాధికమ్. 61
భవిష్యాణాంచ కల్పానాం శ్రూయతే యత్ర విస్తరః ।
తద్బ్రహ్మాణ్డపురాణంచ బ్రహ్మణా సముదాహృతమ్. 62
యో దద్యా త్త ద్వ్యతీపాతే చౌర్ణాయుస్వర్ణసంయుతమ్ । రాజసూయసహస్రస్య ఫల మాప్నోతి మానవః.
(యత్ర నన్దీశ్వర స్సాక్షా దృషిభిః పృష్టవా న్పురా । సృష్టిసంహారకర్తార మీశ్వరం యత్ర చోక్తవాన్.
దేవాసురాణాం సఙ్గ్రామం పురాణం శైవ సంజ్ఞితమ్ । చతుర్వింశతిసాహస్రం పురాణం తత్ప్రకీర్త్యతే.
మాఘమాసే చతుర్దశ్యాం కృష్ణపక్షే జనేశ్వర । శివవ్రతాయ దాతవ్యం త త్ప్రలేపాదిభోజనైః.
మన్వన్తరశతం సాగ్రం రుద్రలోకే మహీయతే) । చతుర్లక్ష మిదం ప్రోక్తం వ్యాసేనాద్భుతకర్మణా.
మత్పితు ర్మమ పిత్రాచ మయా తుభ్యం నివేదితమ్ । ఇదం లోకహితార్థాయ సంక్షిప్తం పరమర్షిణా. 64
ఇద మద్యాపి దేవేషు శతకోటిప్రవిస్తరమ్ । ఉపభేదా న్ప్రవక్ష్యామి లోకే యే సమ్ప్రతిష్ఠితాః. 65
పాద్మే పురాణే యత్ప్రోక్తం నరసింహోపవర్ణనమ్ । తచ్చాష్టాదశసాహస్రం నారసింహ మిహోచ్యతే. 66
నన్దాపురాణం తత్ప్రోక్తం సఙ్ఖ్యానమితి కల్ప్యతే । నన్దాయ యత్ర మాహాత్మ్యం కార్తికేయేన వర్ణ్యతే. 67
యత్ర సామ్బం పురస్కృత్య భవిష్యోపకథాత్మకమ్ । ప్రోచ్యతే తత్పునర్లోకే సామ్బమేవ శుచివ్రతాః. 68
ఏవమాదిత్యసంజ్ఞంచ తత్రైవ పరిగద్యతే । అష్టాదశేభ్యస్తు పృథ క్పురాణం యత్ర దృశ్యతే. 69
విజానీధ్వం ద్విజశ్రేష్ఠా స్తదేతేభ్యో వినిర్మితమ్ । పఞ్చాఙ్గాని పురాణస్య వ్యాఖ్యాన మితరత్స్మృతమ్.70
సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశమన్వన్తరాణిచ । వంశానుచరితం చేతి పురాణం పఞ్చలక్షణమ్. 71
బ్రహ్మవిష్ణ్వర్కరుద్రాణాం మాహాత్మ్యం భువనస్యచ । సంహారంచ ప్రదృశ్యేత పురాణే పఞ్చవర్ణకే. 72
ధర్మశ్చార్థశ్చ కామశ్చ మోక్షశ్చ పరికీర్త్యతే । సర్వేష్వపి పురాణేషు తద్విరుద్ధేషు యత్ఫలమ్. 73
సాత్త్వికేషు చ కల్పేషు మాహాత్మ్య మధికం హరేః । రాజసేషుచ మాహాత్మ్య మధికం బ్రహ్మణో విదుః.74
తద్వదగ్నేశ్చ మాహాత్మ్యం తామసేషు శివస్యచ । సఙ్కీర్ణేషు సరస్వత్యాః పితౄణాం చ నిగద్యతే. 75
ఇమ మష్టాదశానాంచ పురాణానా మనుక్రమమ్ । యః పఠే ద్ద్వ్యకవ్యేషు న యాతి భవనం హరేః. 76
అష్టాదశ పురాణాని కృత్వా సత్యవతీసుతః । భారతాఖ్యాన మతులం చక్రే తదుపబృంహితమ్. 77
లక్షేణైకేన తత్ప్రోక్తం వదార్థపరిబృంహితమ్ । వాల్మీకినాచ యత్ప్రోక్తం రామోపాఖ్యాన ముత్తమమ్.
బ్రహ్మణాభిహితం తచ్చ శతకోటిప్రవిస్తరమ్ । ఆహృత్య నారదశ్చైవ తేన వాల్మీకయే పునః. 79
వాల్మీకినాచ లోకేతు ధర్మకామార్థసాధనమ్ । ఏవం సపాదాః పఞ్చైతే లక్షా మర్త్యే ప్రకీర్తితాః. 80
పురాతనస్యోదరకస్య పురాణం తద్విదుర్బుధాః ।
ధన్యం యశస్య మాయుష్యం పురాణానా మనుక్రమమ్. 81
యః పఠే చ్ఛృణుయాద్వాపి సోపి యాతి పరాం గతిమ్ ।
ఇదం పవిత్రం యశసాం నిదాన మిదం పితౄణామపి వల్లభం స్యాత్. 82
ఇదంచ దేవేష్వమృతాయ నిత్య మిదం మహారోగహరం హి పుంసామ్. 82½

ఇతి శ్రీ మత్స్యమహాపురాణే మత్స్యమనుసంవాదే పురాణసఙ్ఖ్యానుక్రమణికాకథనం నామ
త్రిపఞ్చాశోఽధ్యాయః.

బ్రహ్మ బ్రహ్మాండ వృత్తాంతము నాశ్రయించి భవిష్య కల్ప వృత్తాంత విస్తరమును ప్రవచించినది బ్రహ్మాండ పురాణము. దీని పరిమాణము పండ్రెండువేల రెండువందలు. దీనిని లిఖించి వ్యతీపాతయోగమున ఉన్ని వస్త్రములతో బంగారముతో కూడ దానము చేసినచో వేయి రాజసూయముల ఫలము లభించును.

(నందీశ్వరుడు ఋషులకు శివుని సృష్టి సంహార కర్తనుగాను దేవాసుర సంగ్రామ వృత్తాంతమునుకూడ ప్రవచించినది శివ పురాణము. దీని గ్రంథ పరిమాణము ఇరువది నాలుగు (ఇరువదియైదు) వేలు. దీనిని లిఖించి మాఘ కృష్ణ చతుర్దశి (మహాశివరాత్రి) నాడు గంధాది ద్రవ్యములతో భోజనములతో కూడ దానము చేసినచో సంపూర్ణముగా నూరు మన్వంతరముల కాలము రుద్రలోక నివాసము సిద్ధించును.)

ఆశ్చర్యకర కర్మలు చేయ సమర్థుడగు వ్యాసుడు నేటికిని దేవలోకమునందు శతకోటి గ్రంథ పరిమాణము గల ఈ పురాణ (సముదాయ)మును లోక హితమునకై సంగ్రహించి నాలుగు లక్షల పరిమాణము గలదిగా చేసెను. దీనిని అతడు మాతంగ్రదికి చెప్పగా అతడు నాకు ప్రవచించగా నేను మీకు ప్రవచించితిని.

లోకమునందు ప్రతిష్ఠితములైయున్న ఉప పురాణముల సంఖ్య ప్రవచింతును. పాద్మ పురాణమునందు ప్రవచింపబడిన నరసింహ విషయ వర్ణనము కలది నారసింహ పురాణము. దాని పరిమాణము పదునెనిమిదివేలు. కుమార స్వామి నందునకు (శివ) మాహాత్మ్యమును ప్రవచించినది నందా పురాణము. సాంబుని గురించి భవిష్యోపాఖ్యాన రూపమున ప్రవచించినది సాంబ పురాణము. ఇట్లే ఆదిత్య పురాణమును గలదు. ఇట్లే అష్టాదశ పురాణములలో దేనికి సంబంధించిన వేరొక పురాణము కనబడునో అది ఈమూల పురాణమునుండి ఏర్పడిన ఉపపురాణమని ఎరుగ వలయును.

ఇవికాక పురాణములకు ఉండవలసిన పంచలక్షణములను పెద్దలు చెప్పియున్నారు. అవి-సర్గము-(ఆదిసృష్టి) ప్రతిసర్గము-(భూత పంచకసృష్టి) వంశము (ప్రజాపతుల సృష్టి) మన్వంతరములు-వంశానుచరితము (ప్రజాపతుల నుండి కొనసాగిన ఆయా రాజరాజర్షి మహర్ష్యాది పరంపర); ఇట్టి పంచలక్షణములుకల పురాణములందు బ్రహ్మ విష్ణు రుద్ర సూర్యుల మహిమమును భువన సృష్టి సంహారములును ధర్మార్థ కామమోక్షముల ప్రకారములును ప్రవచింపబడును. అన్ని పురాణములయందును (శాస్త్రములకు ప్రతికూలముగా నడచిన దుష్టులకు) ఏతద్విరుద్ధ ఫలము కూడ (ఉదాహరణములతో) చెప్పబడును. (పురాణములు సాత్త్వికములు రాజసములు తామసములు మిశ్రములునని నాలుగు విధములు) సాత్త్విక పురాణములందు విష్ణు మాహాత్మ్యము రాజసపురాణములందు బ్రహ్మ మహిమము తామసపురాణములందు అగ్ని శివుల మాహాత్మ్యము మిశ్రములయందు సరస్వతీ మహిమ పితృదేవతా మాహాత్మ్యములు చెప్పబడును. ఈ అష్టాదశ పురాణానుక్రమము దేవతా కార్యములందు పఠించినచో విష్ణులోక ప్రాప్తియగును.

వ్యాసుడు పదునెనిమిది పురాణములు రచించిన పిమ్మట వాటి యుపబలముచే కూర్చబడిన భారతేతిహాసమును లక్ష గ్రంథ పరిమాణముతో రచించెను. అది వధప్రధానమైనది. శతకోటి గ్రంథ పరిమాణముతో బ్రహ్మ రచించిన రామాయణమును నారదుడు బ్రహ్మ నుండి ఎరిగి వాల్మీకికి బోధించగా దాని నా ఋషి ధర్మార్థకామమోక్ష సాధకముగా రచించెను. ఇట్లు ఈ పురాణ వాఙ్మయము సపాదపంచ లక్ష (525000) గ్రంథ రూపమయ్యెను. ఉదర్కము (అభ్యుదయము)ను కలిగించు పురాతన (వృత్తాంత)మునకు సంబంధించినది కావున ఈ వాఙ్మయము 'పురాణము' అనబడుచున్నది.

ఈ పురాణానుక్రమము ధన్యతను యశమును ఆయువును కలిగించునది. దీనిని చదివినను వినినను పరమ పదము లభించును. ఇది పవిత్రము కీర్తికి మూలము పితృప్రీతికరము. దేవతలకును అమృతమువలె ప్రీతికరము. మానవులకు మహారోగహరము.

ఇది శ్రీ మత్స్యమహాపురాణమున మత్స్యమను సంవాదమున పురాణ సంఖ్యానుక్రమ పురాణ దాన వ్రతములను ఏబది మూడవ అధ్యాయము.

## చతుః పంచాశోఽధ్యాయః.

## నక్షత్రపురుషవ్రతమ్.

సూతః: అతఃపరం ప్రవక్ష్యామి దానధర్మా నశేషతః । వ్రతోపవాససంయుక్తా న్యథామత్స్యోదితా న్మనోః. 1
మహాదేవస్య సంవాదం నారదస్య చ ధీమతః । యథావృత్తం ప్రవక్ష్యామి ధర్మకామార్థసాధనమ్. 2
కైలాసశిఖరాసీన మపృచ్ఛ న్నారదః పురా । త్రిశూలిన మనఙ్గారి ముమార్ధాఙ్గధరం హరమ్. 3
నారదః: భగవ న్దేవదేవేశ బ్రహ్మవిష్ణ్విన్ద్రనాయక । శ్రీమదారోగ్య రూపాయు ర్భోగ్య సౌభాగ్య సమ్పదా. 4
సంయుక్త స్తవ విష్ణోర్వా పుమా న్భక్తః కథం భవేత్ । నారీవాఽవిధవా సర్వగుణసౌభాగ్యసంయుతా. 5
క్రమాన్ముక్తిప్రదం దేవ కిఞ్చి ద్వ్రత మిహోచ్యతామ్ ।
శ్రీఈశ్వరః: సమ్య క్పృష్టం త్వయా బ్రహ్మ న్సర్వలోకహితావహమ్. 6
వ్రతమప్యత్ర యచ్చాన్య త్తద్వ్రతం శృణు నారద । నక్షత్రపురుషం నామ వ్రతం నారాయణార్చనమ్. 7
పాదాది కుర్యా ద్విధివ ద్విష్ణునామాని కీర్తయన్ । ★ప్రతిమాం వాసుదేవస్య మూలర్క్షాద ప్రపూజయేత్. 8
చైత్రమాసం సమాసాద్య కృత్వా బ్రాహ్మణవాచనమ్ । సితపక్షేచ విధిత స్సోమో మూలేన సంయుతః. 9

## ఏబది నాలుగవ అధ్యాయము.

## నక్షత్రపురుష వ్రతము.

సూతుడిట్లు ఋషులకు చెప్పెను: ఇక మీదట (కర్మయోగ సంబంధులగు) దానములను ధర్మములను వ్రతములను ఉపవాసములను యథా శాస్త్రముగా సమగ్రముగా తెలిపెదను. ఇవి అన్నియు ధర్మకామార్థ సాధకములు. మహాదేవ నారద సంవాద రూపములగు వీటిని మత్స్యనారాయణుడు మనువునకు తెలిపెను.

పూర్వము ఒకప్పుడు త్రిశూలి మన్మథ శత్రువు ఉమాదేహార్ధ ధారి అగు హరుడు కైలాస శిఖరమున కూర్చుండి యుండ నారదుడు అతని నిట్లడిగెను : "భగవన్! నీవు దేవదేవేశుడవు-బ్రహ్మ విష్ణ్వింద్రులకును ఈశ్వరుడవు. నీ యందో విష్ణునందో భక్తి గల పురుషుడు కాని సువాసిని అగు స్త్రీకాని యథాసంభవముగా సిరి ఆయువు రూపము భోగములు సౌభాగ్యము సమృద్ధిగ పొందుటకు అనుకూలించునదై క్రమముగ ముక్తినికూడ ఇచ్చు వ్రతమేదయిన నున్నచో తెలుపుము." ఈశ్వరుడు నారదునకు ఇట్లు చెప్పెను: నారదా! నీవు అడిగిన ప్రశ్నము సర్వలోకహితకరమయినది. ఇట్టి వ్రతము ఒకటి కలదు. దీనికి నక్షత్రపురుషవ్రత మని పేరు. (పరమ పురుషుని శరీరమును నక్షత్ర రూపమున భావించి అర్చించుట); దీని యందు వాసుదేవుని ప్రతిమను పాదాదిగా నక్షత్ర నామములతో విష్ణు నామములు కీర్తించుచు అర్చించవలయును. చైత్ర మాస శుక్ల పక్షమున చంద్రుడు మూల నక్షత్రముతో కూడియున్ననా డీ వ్రతము చేయవలెను. మొదట (సంకల్ప పూర్వకముగా) బ్రాహ్మణులచే పుణ్యాహవాచనము జరిపించవలెను. పిమ్మట ఈ క్రింది విధమున పూజించవలెను.

మూలే నమో విశ్వధరాయ పాదౌ గుల్ఫౌ వనన్తాయచ రోహిణీషు ।
జఙ్ఘేతు పూజ్యే వరదాయ చైవ ద్వే జానునీ చాశ్వికుమార ఋక్షే. 10
పూర్వోత్తరాషాఢయుగే తథోరూ నమశ్శివాయే త్యభిపూజనీయమ్ ।
పూర్వోత్తరాఫల్గునయుగ్మకేచ మేఢ్రం నమః పఞ్చశరాయ పూజ్యమ్. 11
కటిం నమ శ్శార్ఙ్గధరాయ విష్ణో స్సమ్పూజయే న్నారద కృత్తికాసు ।
తథాఽర్చయే ద్భాద్రపదద్వయేచ పార్శ్వే నమః కేశినిషూదనాయ. 12

---

★ ప్రీత్యర్థం

కుక్షిద్వయం నారద రేవతీషు దామోదరాయేత్యభిపూజనీయమ్ ।
తథానురాధాసు చ మాధవాయ నమ స్తథోరస్స్థలమేవ పూజ్యమ్. 13
పృష్ఠం ధనిష్ఠాసు చ పూజనీయ మఘౌఘవిధ్వంసకరాయ తద్వత్ ।
శ్రీశఙ్ఖచక్రాసిగదాధరాయ నమో విశాఖాసు భుజాశ్చ పూజ్యాః. 14
హస్తేపి హస్తా మధుసూదనస్య నమోఽభిపూజ్యా స్మ చ కైటభారేః ।
పునర్వసావఙ్గుళిపర్వభాగా స్సామ్నా మధీశాయ నమోఽభిపూజ్యాః. 15
మఘజ్ఞనక్షత్రదినే నఖాని సమ్పూజయే న్మత్స్యశరీరిణశ్చ ।
కూర్మస్య పాదౌ శరణం వ్రజామి జ్యేష్ఠాసు కణ్ఠే హరి రర్చనీయః. 16
శ్రోత్రే వరాహాయ నమోఽభిపూజ్యే జనార్దనస్య శ్రవణేన సమ్యక్ ।
పుష్యే ముఖం దానవసూదనాయ నమో నృసింహాయ చ పూజనీయమ్. 17
నమోనమః కారణవామనాయ స్వాతీషు దన్తాగ్ర మథార్చనీయమ్ ।
ఆస్యం హరే ర్భార్గవనన్దనాయ సమ్పూజనీయం ద్విజ వారుణే తు. 18
నమోఽస్తు రామాయ మఘాసు నాసా సమ్పూజనీయా రఘునన్దనస్య ।
మృగోత్తమాఙ్గే నయనేఽభిపూజ్యే నమోస్తు తే రామ విఘూర్ణితాక్ష. 19
బుద్ధాయ శాన్తాయ నమో లలాటం చిత్రాసు సమ్పూజ్యతమం మురారేః ।
శిరోఽభిపూజ్యం భరణీషు విష్ణో ర్నమోస్తు విశ్వేశ్వర కల్కిరూప. 20
ఆర్ద్రాసు కేశాః పురుషోత్తమస్య సమ్పూజనీయా హరయే నమస్తే ।

1. విశ్వధరాయ నమః-మూలే పాదౌ పూజయామి; 2. అనన్తాయ నమః-రోహిణీషు-గుల్ఫౌ పూజయామి, 3. వరదాయ నమః-అశ్విన్యాం-జంఘే-జానునీచ పూజయామి; 4. శివాయ నమః-పూర్వాషాఢాసు ఉత్తరాషాఢాసుచ-ఊరూ పూజయామి; 5. పంచశరాయ నమః-పూర్వ ఫల్గున్యాం ఉత్తర ఫల్గున్యాంచ-మేఢ్రం పూజయామి; 6. శార్జ్ఞధరాయ నమః-కృత్తికాసు-కటిం పూజయామి; 7. కేశినిషూదనాయ నమః-పూర్వాభాద్రోత్తరాభాద్రయోః-పార్శ్వే పూజయామి; 8. దామోదరాయ నమః-రేవతీషు-కుక్షిద్వయం పూజయామి; 9. మాధవాయ నమః-అనూరాధాసు-ఉరఃస్థలం పూజయామి; 10. అఘౌఘ విధ్వంసకరాయ నమః-ధనిష్ఠాసు-పృష్ఠం పూజయామి; 11. శ్రీ శంఖ చక్రగదాసిధరాయ నమః-విశాఖాసు-భుజాన్ పూజయామి; 12. మధుకైటభారయే మధుసూదనాయ నమః-హస్తే-హస్తాన్ పూజయామి- 13. సామ్నాం అధీశాయ నమః-పునర్వసౌ-అంగుళీ పర్వభాగాన్ పూజయామి; 14. మత్స్యశరీరిణే నమః-ఆశ్లేషాసు-నఖాని పూజయామి; 15. కూర్మ రూపిణే హరయేనమః-జ్యేష్ఠాసు-కంఠం పూజయామి; 16. వరాహ రూపిణే జనార్దనాయ నమః-శ్రవణే-శ్రోత్రే పూజయామి; 17. దానవ సూదనాయ నరసింహాయ నమః-పుష్యే-ముఖం పూజయామి; 18. కారణ వామనాయ నమః-స్వాతీషు-దంతాగ్రం పూజయామి; 19. భార్గవ నందనాయ నమః-శతభిషక్షు-ముఖం పూజయామి; 20. రఘునందనాయ రామాయ నమః-మఘాసు-నాసికాం పూజయామి; 21. పరశురామాయ నమః-మృగశీర్షే-నేత్రే పూజయామి; 22. శాన్తరూపాయ బుద్ధాయ నమః-చిత్రాసు-లలాటం పూజయామి; 23. కల్కి రూపాయ నమః-భరణీషు శిరః పూజయామి; 24. పురుషోత్తమాయ నమః-ఆర్ద్రాసు-కేశాన్ పూజయామి-(ఇవి మొత్తము ఇరువది నాలుగు).

ఉపోషితేన ర్క్షదినేషు భక్త్యా సమ్పూజనీయా ద్విజపుఙ్గవా స్స్యుః. 21
పూర్ణే వ్రతే సర్వగుణాన్వితాయ వాగ్రూపశీలాయ చ సామగాయ ।
హైమీం విశాలాయతబాహుదణ్డాం ముక్తాఫలేన్ద్వోపలవజ్రజుష్టామ్. 22

గుడస్య పూర్ణే కలశే నివిష్టాం మర్చ్యాం హరే ర్వస్త్రయుగేన సహైవ ।
శయ్యాం తథోపస్కరభాజనాదియుక్తాం ప్రదద్యా ద్ద్విజపుఙ్గవాయ. 23
యచ్చాన్య దిష్టం కించిదిహాస్య దేయం తత్త ద్ద్విజా యాత్మహితాయ సర్వమ్ ।
మనోరథా న్నః సఫలా న్కురుష్వ హిరణ్యగర్భాచ్యుతరుద్రరూపిన్. 24
సలక్ష్మీకం సభార్యాయ కాఞ్చనం పురుషోత్తమమ్ । శయ్యాంచ దద్యా త్సర్వైర్విప్ర గ్రన్థిభేదవివర్జితామ్. 25
యథా న విష్ణుభక్తానాం వృజినం జాయతే క్వచిత్ । తథాఽనురూప మారోగ్య మర్ఘ్యం దద్యాచ్చ కేశవే.
యథా న లక్ష్మ్యా శయనం తవ శూన్యం జనార్దన।శయ్యా మమా ప్యశూన్యాతు(ఽస్తు)కృష్ణ జన్మని జన్మని.
ఏవం నివేద్య తత్సర్వం వస్త్రమాల్యానులేపనమ్ । నక్షత్రపురుషజ్ఞాయ విప్రాయాథ విసర్జయేత్. 28
భుఞ్జీతాతైలలవణం సర్వర్క్షేష్వ ప్యుపోషణమ్ । భోజనంచ యథాశక్త్యా విత్తశాఠ్యవివర్జితః. 29
ఇతి నక్షత్రపురుష మవాప్య విధివ త్స్వయమ్ । సర్వా న్కామా నవాప్నోతి విష్ణులోకే మహీయతే. 30
బ్రహ్మహత్యాదికం కిఞ్చి ద్యదత్రాముత్ర వా కృతమ్ ।
ఆత్మనా వాఽథ పితృభి స్తత్సర్వం నాశ మాప్నుయాత్. 31
ఇతి పఠతి శృణోతి వాఽథ భక్త్యా పురుషవరోఽత్ర త మజ్జనాచ కుర్యాత్ ।
కలికలువిదారణం మురారే స్సకలవిభూతిఫలప్రదం చ పుంసామ్. 32

ఇతి శ్రీమత్స్యమహాపురాణే మత్స్యమనుసంవాదాన్తర్గతేశ్వరనారదసంవాదే
నక్షత్రపురుష వ్రతకథనం నామ చతుఃపఞ్చాశోఽధ్యాయః.

ఇట్లు ఆయా నక్షత్ర దినములందు ఉపవాసముండి ఏ నక్షత్రమునాడు ఏ అవయవమును పూజించవలెనో ఆ అవయవమును ప్రధానముగా ఉద్దేశించి మిగిలిన సర్వావయవముల పూజను కూడ చేయుచుండవలెను. ఈ విధముగా పూజించుచు ఆ నక్షత్ర దినములందు బ్రాహ్మణులను భోజన దక్షిణా వస్త్రాదులతో పూజించవలెను.

ఇట్లు వ్రతము పూర్తియైన తరువాత సర్వ సద్గుణములును ఉత్తమమగు వాక్కు రూపము శీలము కలిగి సామవేదము నధ్యయనము చేసిన బ్రాహ్మణునకు ఈ చెప్పబోవు వానిని దానము చేయవలయును. 1. విశాలములయి పొడవయిన బాహుదండములు కలదియై ముత్తెములు ఇంద్రనీలమణులు వజ్రములు తాపటము చేసిన విష్ణు స్వర్ణ ప్రతిమను బెల్లముతో నింపిన పాత్రయందుంచి దానిని-గోవును-వస్త్రములను-ఆయా సాధన సామగ్రులతోను పాత్రలతోను కూడ మంచమును పడకను కూడ దానము చేయవలయును. ఇది కాక తనకు ఏదేది ప్రీతికరమో అది ఎల్ల తనహితమునకు గాను దానము చేయవలయును. "హిరణ్య గర్భ రూపా! అచ్యుతా! రుద్రరూపా! మా మనోరథములను సఫలము చేయుము." అను అర్థమిచ్చు మంత్రమును దానసమయమున పలుకవలెను. ఇట్లు బంగారుతో చేసిన విష్ణు ప్రతిమను లక్ష్మీ ప్రతిమతోకూడ భార్యతో కూడియున్న బ్రాహ్మణునకు (బ్రాహ్మణ దంపతులకు) దానమీయవలెను. ముడులు వగుళ్లు లేని మంచమును శయ్యను కూడ ఈయవలెను. విష్ణువునకు అర్ఘ్యమును కూడ ఈయవలెను. ఇట్టి విష్ణుభక్తులకు పాపములు తొలగును. ఏ పాపమును అంటదు. ఆరోగ్యము కలుగును. శయ్యా దానము చేయునప్పుడు "జనార్దనా! నీ శయనము లక్ష్మీదేవితో శూన్యము కానట్లే కృష్ణా! నాశయనము కూడ జన్మజన్మములందును శూన్యము కాకుండుగాక!" అను అర్థమిచ్చు మంత్రము చెప్పవలయును.

ఇట్లు వస్త్రములను మాల్యములను గంధద్రవ్యములను పై చెప్పిన వాటిని నక్షత్ర పురుషతత్త్వ మెరిగిన బ్రాహ్మణునకు దానమిచ్చి ఆతనిని వీడు కొనవలయును. ఈ ప్రతి నక్షత్ర దినమునందును ఉపవాసముండి తైలము లవణము (పులుపు కారము) లేని ఆహారము తినవలెను. ధనమున లోభము చూపక యథాశక్తిగ భోజనములు పెట్టవలెను.

ఇట్లు నక్షత్ర పురుష వ్రతమును సమాప్తము చేసినవారికి సర్వకామములు (సంకల్పములు) నెరవేరును. విష్ణులోక ప్రాప్తియగును. తాను కాని తన పెద్దలు కాని చేసిన బ్రహ్మ హత్య మొదలగు పాపములన్నియు నశించును.

ఈ వ్రత (విషయ) మును చదివినను వినినను వ్రతమును ఆచరించినను స్త్రీలకు కాని పురుషులకు కాని కలి దోషములన్నియు నశించును. సకలైశ్వర్యములు కలుగును. అన్ని కోరికలును తీరును.

ఇది శ్రీ మత్స్యమహాపురాణమున మత్స్యమను సంవాదమున నక్షత్ర పురుష వ్రతము
అను ఏబది నాలుగవ అధ్యాయము.

## పంచ పంచాశోఽధ్యాయః.
## ఆదిత్యశయన వ్రతమ్.

నారదః : ఉపవాసే ష్వశక్తస్య తదేవ ఫల మిచ్ఛతః ।
అనాయాసేన రోగాద్వా కిమిష్టం వ్రత ముచ్యతామ్. 1
శ్రీఈశ్వరః : ఉపవాసే ష్వశక్తానాం నక్తభోజన మిష్యతే ।
యస్మి న్వ్రతే తదవ్యస్తి శ్రూయతాంవై వ్రతం మహత్. 2
ఆదిత్యశయనం నామ యథావ చ్ఛఙ్కరార్చనమ్ । యేషు నక్షత్రయోగేషు పురాణజ్ఞాః ప్రచక్షతే. 3
యదా హస్తేన సప్తమ్యా మాదిత్యస్య దినం భవేత్ । సూర్యస్య వారే సంక్రాన్తి స్తిథిఃస్యా త్సర్వకామదా. 4
ఉమామహేశ్వరస్యార్చా మర్చయే త్సూర్యనామభిః । సూర్యార్చాం శివలిఙ్గంచ న గృహే పూజయే ద్యతః. 5
త్విషాంపతే శ్శివస్యాపి న భేదో దృశ్యతే క్వచిత్ ।
యస్మా త్తస్మా న్మునిశ్రేష్ఠ గ్రహేశంతు సమర్చయేత్. 6

## ఏబది ఐదవ అధ్యాయము.
## ఆదిత్యశయన వ్రతము.

నారదుడు ఈశ్వరు నిట్లు ప్రశ్నించెను: ఉపవాసములు చేయుటకు శక్తిలేని వారైకాని వ్యాధిబాధవలనకాని అనాయాసముగా ఇదే పైని చెప్పిన ఫలమును కోరువారు చేయదగిన వ్రతము నుపదేశించుము. అనగా ఈశ్వరు డిట్లు చెప్పెను: ఉపవాసము చేయ శక్తిలేనివారు నక్తము (పగలు ఉపవసించి రాత్రి భుజించుట) భుజించి చేయదగిన మహా వ్రతమును కలదు. చెప్పెదను; వినుము. ఈ వ్రతమునకు ఆదిత్య శయనమని పేరు. ఆయా నక్షత్రములు కల దినము లందు (సూర్యాభేదభావనతో) శంకరు నర్చించవలయును. సప్తమీతిథి-ఆదిత్యవారము-హస్తనక్షత్రము-సూర్యుడు ఏదేని రాశియందు ప్రవేశించుట-ఈ నాలుగు అంశములును కలిసిన దినమున ఈ వ్రతము చేసినచో అన్ని కోరికలును నెర వేరును. గృహమునందు సూర్యప్రతిమ శివలింగము ఈ రెంటిని పూజించరాదు. (ఏదో ఒకటి మాత్ర ముండవలెను.) ఆదిత్యుడు రవి శివులకు భేదములేదు. కనుక రవి నామములతో శివమూర్తిని (కాని లింగమును కాని) పూజించవలెను.

హస్తేచ సూర్యాయ నమోస్తు పాదా వర్కాయ చిత్రాసు చ గుల్ఫదేశమ్ ।
స్వాతీషు జఙ్ఘే పురుషోత్తమాయ ధాత్రే విశాఖాసుచ జానుదేశమ్. 7
తథాఽనురాధాసు నమోఽభిపూజ్య మూరుద్వయంచైవ సహస్రభానోః ।
జ్యేష్ఠా స్వనఙ్గాయ నమోస్తు గుహ్య మిన్ద్రాగ్నియ సోమాయ కటిం చ మూలే. 8
పూర్వోత్తరాషాఢయుగేచ నాభిం త్వాష్ట్రే నమ స్సప్తతురఙ్గమాయ ।
తీక్ష్ణాంశవేచ శ్రవణేచ కుక్షిం పృష్ఠం ధనిష్ఠాసు వికర్తనాయ. 9

వక్షస్స్థలం ధ్వాన్తవినాశనాయ జలాధిపర్క్షే ప్రతిపూజనీయమ్ ।
పూర్వోత్తరాభాద్రపదద్వయేచ బాహూ నమ శ్చణ్డకరాయ పూజ్యౌ. 10

సామ్నామధీశాయ కరద్వయంచ సమ్పూజనీయం ద్విజ రేవతీషు ।
నఖాని పూజ్యాని తథాశ్వినీషు నమోస్తు సప్తాశ్వధురన్ధరాయ. 11

కఠోరధామ్నే భరణీషు కణ్ఠం దివాకరాయే త్యభిపూజనీయమ్ ।
గ్రీవాగ్నిఋక్షేఽధర మమ్బుజేశం సమ్పూజయే న్నారద రోహిణీషు. 12

మృగోత్తమాఙ్గే దశనాః పురారే స్సమ్పూజనీయా రవయే నమస్తే ।
నమస్సవిత్రేతి చ శాఙ్కరేచ నాసాభిపూజ్యాథ పునర్వసౌచ. 13

లలాట మమ్భోరుహవల్లభాయ పుష్యేఽలకా వేదశరీరధారిణే ।
సార్పేఽథ మౌళిం విబుధ ప్రియాయ మఘాసు కర్ణావితి గోగణేశ. 14

పూర్వాసు గోబ్రాహ్మణనన్దనాయ నేత్రాణి సమ్పూజ్యతమాని శమ్భోః ।
అథోత్తరాఫల్గునివై భ్రువౌచ విశ్వేశ్వరాయేతి చ పూజనీయౌ. 15

నమోస్తు పాశాఙ్కుశ పద్మశూల కపాలఖడ్గేషు ధనుర్ధరాయ ।
గజాసురానఙ్గపురాన్ధకాది వినాశమూలాయ సమశ్శివాయ. 16

ఇత్యాది శస్త్రాణిచ పూజయిత్వా విశ్వేశ్వరాయేతి శిరోభిపూజ్యమ్ ।

1. సూర్యాయనమః-హస్తనక్షత్రే-పాదౌ పూజయామి; 2. అర్కాయనమః-చిత్రాసు-గుల్ఫౌ పూజయామి; 3. పురుషోత్తమాయ నమః-స్వాతీషు-జంఘే పూజయామి; 4. ధాత్రేనమః విశాఖాసు-జానునీ పూజయామి; 5. సహస్రభానవేనమః-అనురాధాసు-ఊరూ పూజయామి; 6. అనంగాయ ఇంద్రాయనమః-జ్యేష్ఠాసు- హ్యాం పూజయామి; 7. సోమాయనమః-మూలే-కటిం పూజయామి; 8. త్వష్ట్రే సప్తతురంగమాయనమః- పూర్వాషాఢోత్తరాషాఢయోః-నాభిం పూజయామి; 9. తీక్ష్ణాంశవేనమః శ్రవణే-కుక్షిం పూజయామి; 10. వికర్తనాయనమః-ధనిష్ఠాసు-పృష్ఠం పూజయామి; 11. ధ్వాంత వినాశనాయనమః-శతభిషక్షు-వక్షఃస్థలం పూజయామి; 12. చండకరాయనమః-పూర్వాభాద్రాసు ఉత్తరాభాద్రాసు-బాహూ పూజయామి; 13. సామ్నామధీశాయ నమః-రేవతీషు-హస్తౌ పూజయామి; 14. సప్తాశ్వధురంధరాయ నమః అశ్వినీషు-నఖాని పూజయామి; 15. కఠోరధామ్నేనమః-భరణీషు-కంఠం పూజయామి; 16. దివాకరాయనమః-కృత్తికాసు-గ్రీవాం పూజయామి; 17. అంబుజేశాయనమః-రోహిణీషు-అధరం పూజయామి; 18. రవయేనమః-మృగశీర్షే-దంతాన్ పూజయామి; 19. సవిత్రేనమః-ఆర్ద్రాసు-నాసికాం పూజయామి; 20. అంభోరుహవల్లభాయనమః-పునర్వసౌ-లలాటం పూజయామి; 21. వేదశరీరధారిణేనమః-పుష్యే అలకాన్ పూజయామి; 22. విబుధప్రియాయనమః-ఆశ్లేషాసు-శిరః పూజయామి; 23. గ్రహగణేశాయనమః మఘాసు-కర్ణౌ పూజయామి; 24. గోబ్రాహ్మణనందనాయనమః-పూర్వఫల్గునీషు-నేత్రాణి పూజయామి; 25. విశ్వేశ్వరాయనమః-ఉత్తర ఫల్గునీషు భ్రువౌ పూజయామి; అను ఈ మంత్రములతో ఆయా నక్షత్రములు గల దినములందు ఆయా అవయవములందు ప్రధాన భావనతో సర్వాంగ పూజను ప్రతిదినము నక్తవ్రత పూర్వకముగా జరుపుచుండవలెను. ప్రతి దినమునను శివుని ఉద్దేశించి ఈ చెప్పబోవు అర్థము కల మంత్రముతో స్తుతి చేయుచు శివుని శిరమున పూజ సేయవలెను: "పాశాంకుశ పద్మ శూలకపాల ఖడ్గబాణ ధనుర్ధారియు గజాసురుడు-మన్మథుడు-త్రిపురాసురులు-అంధకదానవుడు మొదలగువారి వినాశమునకు కారణమునగు శివునకు నమస్కారము."

భోక్తవ్య మత్రైవ మతైలశాక మమాంస మక్షార మభుక్తశేషమ్. 17
ఇత్యేవం ద్విజ నక్తాని కృత్వా దద్యాత్పునస్సర్వశః । శాలేయతండులప్రస్థ మౌదుమ్బరమయే ఘృతమ్. 18

సంస్థాప్య పాత్రే విప్రాయ సహిరణ్యం నివేదయేత్ । సప్తమే వస్త్రయుగ్మంచ పారణే త్వధికం భవేత్.
చతుర్దశేతు సమ్ప్రాప్తే పారణే నారదాష్టకే । బ్రాహ్మణా న్భోజయే ద్భక్త్యా గుడక్షీరఘృతాదిభిః. 20
కృత్వాఽథ కాఞ్చనం పద్మ మష్టపత్రం సకర్ణికమ్ । శుద్ధమష్టాఙ్గులం తద్వ త్పద్మరాగదళాన్వితమ్. 21
శయ్యాం సులక్షణాం కృత్వా విరుద్ధగ్రన్థివర్జితామ్ । సోపధానవితానాంచ స్వాస్తీర్ణవ్యజనాశ్రయామ్. 22
పాదుకోపానహచ్ఛత్ర చామరాసనదర్పణైః । భూషణైరపి సంయుక్తాం ఫలవస్త్రానులేపనైః. 23
తస్యాం నిధాయ తత్పద్మ మలఙ్కృత్య గుణాన్వితామ్ ।
కపిలాం వస్త్రసంయుక్తాం సుశీలాంచ పయస్వినీమ్. 24
హేమశృఙ్గీం రౌప్యఖురాం సవత్సాం కాంస్యదోహినీమ్ ।
దద్యా న్మన్త్రేణ పూర్వాహ్ణే ఽభిజి న్నాభిలఙ్ఘయేత్. 25
యథైవాదిత్యః శయన మశూన్యం తవ సర్వదా। కాన్త్యా ధృత్యా శ్రియా రత్యా తథా మే సన్తు వృద్ధయః. 26
యథా న దేవా శ్శ్రేయాంసం త్వదన్య మనఘం విదుః ।
తథా మా ముద్ధరాశేష దుఃఖసంసార సాగరాత్. 27
తతః ప్రదక్షిణీకృత్య ప్రణమ్యచ విసర్జయేత్ । శయ్యాగవాది తత్సర్వం ద్విజస్య భవనం నయేత్. 28

ఈ పూజా వ్రత దినములందు తైలము (మాంసాహారులు కూడ, మాంసము ఉప్పు, కారము-పులుపు, లేని భోజనము చేయవలెను. ఇది పదునాలుగు సంవత్సరములు చేయవలసిన వ్రతము-ప్రతి సంవత్సరమును వ్రతము కడపటి (ఇరువది ఐదవ) దినమున కుంచెడు మంచి వరిబియ్యమును మేడి పాత్రలో నేతిని బంగారమును బ్రాహ్మణునకు దానమీయవలెను. ఏడవ సంవత్సరపు వ్రతములో వస్త్రముల జతనుకూడ ఈయవలెను. పదునాల్గవ సంవత్సరపు వ్రతములో భక్తితో బ్రాహ్మణులకు గుడక్షీర ఘృతాదికముతో భోజనములు పెట్టవలెను. ఎనిమిది అంగుళముల వ్యాసముకల బంగారు పద్మమును ఎనిమిది రేకులు నడుమ దుద్దు కల దానిని చేయించవలయును. రేకులయందు పద్మరాగములు తాపటము చేయవలెను. ముడులు కాని ఎదురు నాలుకలు కాని లేని కొయ్యతో మంచము చేయించవలెను. దిండ్లు-చాందనీలు-వరపు విసనకర్రలు-పాదుకలు-చెప్పులు-గొడుగు-చామరములు కాలిపీటలు-అద్దములు-అలంకారములు-ఫలములు-వస్త్రములు-గంధ ద్రవ్యములు అమర్చవలెను. ఆ మంచముపై ఆ పద్మమును అన్ని అమరికలతో ఉంచవలెను. పొడువని కపిల గోవును పాలిచ్చు దానిని దూడ కలదానిని వస్త్రములతో బంగారు కొమ్ములతో వెండిగిట్టలతో అలంకరించవలెను. పాలు పిదుకు కంచు పాత్రతో కూడ ఈ యావును-పై సామగ్రిని బ్రాహ్మణునకు మధ్యాహ్నము గడువకుండ దానమీయవలెను. దానము ఇచ్చునపుడు ఈ యర్థము కల మంత్రము చెప్పవలెను: "ఆదిత్యా! నీ పడక ఎల్లప్పుడును కాంతితో నిబ్బరముతో శోభతో ఆనందముతో నిండియుండునట్లే నాకును ఈ అన్ని వృద్ధులును కలుగుగాక! దేవతలు కూడ నీకంటె మరెవ్వరిని పూజ్యునిగా తలచరు కావున (నీ వందర దేవతల కంటె గొప్పవాడవు కావున) నన్ను అశేష దుఃఖ సంసార సాగరమునుండి ఉద్ధరింపుము." పిమ్మట బ్రాహ్మణునకు ప్రదక్షిణము చేసి అతనిని పంపవలయును. ఈ దాన ద్రవ్యములను ఆ విప్రుని ఇంటికి చేర్చవలెను.

నైత ద్విశీలాయ న నాస్తికాయ కుతర్కదుష్టాయ వినిన్దకాయ ।
ప్రకాశనీయం వ్రత మిన్దుమౌళే ర్యశ్చాపి నిన్దా మధికాం విధత్తే. 29
భక్తాయ దాన్తాయచ గుహ్య మేత దాఖ్యేయ మానన్దకరం శివస్య ।
ఇదం మహాపాతకహృ న్నరాణా మప్యక్షయం వేదవిదో వదన్తి. 30

స బన్ధుపుత్త్రై ర్న బలై ర్వియుక్తః పత్నీభి రానన్దకర స్సురాణామ్ ।
నాప్నోతి రోగం నచ శోకదుఃఖం యా చాథ నారీ కురుతేఽతిభక్త్యా. 31
ఇదం వసిష్ఠేన పురాఽర్జునేన కృతం కుబేరేణ పురన్దరేణ ।
యత్కీర్తనాద ప్యఖిలాని నాశ మాయాన్తి పాపాని న సంశయోఽత్ర. 32
ఇతి పఠతి శృణోతి వా య ఇత్థం రవిశయనం పురుహూతవల్లభ స్స్యాత్ ।
అపినరకగతా న్పితౄ నశేషా నపి దివ మానయతీహ యః కరోతి. 33

ఇతి శ్రీమత్స్యమహాపురాణే మత్స్యమనుసంవాదాన్తర్గతేశ్వరనారదసంవాదే ఆదిత్యశయనవ్రత
కథనం నామ పఞ్చపఞ్చాశోఽధ్యాయః

ఈ వ్రతమును నాస్తికుడు కుతర్కి దుష్టుడు నిందకుడు అగువానికి చెప్పరాదు. ఇది విని వాడింకను అధిక నింద చేయును. ఇంద్రియ నిగ్రహము కల భక్తునకు చెప్పవలెను. ఇది శివున కానందకరము; పాతకహరము; అక్షయ పుణ్యప్రదము. దీని నాచరించిన స్త్రీకిని పురుషునకును బంధుపుత్త్ర పరివారములు దేవతాప్రీతి లభించును. రోగ శోక దుఃఖములు కలుగవు. దీనిని పూర్వము వసిష్ఠుడు అర్జునుడు కుబేరుడు ఇంద్రుడు చేసిరి. దీనిని కీర్తించినను పాపములు నశించును. దీనిని చదివినను వినినను ఇంద్రుడు ప్రీతి చెందును. ఆచరించినచో వాని పితరులు నరకము నందున్నను స్వర్గమునకు పోయి సుఖింతురు.

ఇది శ్రీమత్స్య మహాపురాణమున ఆదిత్యశయన వ్రతమను ఏబదియైదవ అధ్యాయము.

## షట్పంచాశోఽధ్యాయః.

## కృష్ణాష్టమీవ్రతమ్.

ఈశ్వరః : కృష్ణాష్టమీ మతో వక్ష్యే సర్వపాపప్రణాశనీమ్ ।
శాన్తి ర్ముక్తిశ్చ భవతి యథా పుంసాం విశేషతః. 1
శఙ్కరం మార్గశిరసి శమ్భుం పౌషేఽభిపూజయేత్ ।
మాఘే మహేశ్వరం దేవం మహాదేవం చ ఫాల్గునే. 2
స్థాణుం చైత్రే శివం తద్వ ద్వైశాఖే త్వర్చయే న్నరః। జ్యేష్ఠే పశుపతిః పూజ్య ఆషాఢే హ్యుగ్ర మర్చయేత్.
పూజయే చ్ఛ్రావణే శర్వం నభస్యే త్ర్యమ్బకం తథా । హర మాశ్వయుజే మాసి తథేశానంచ కార్తికే. 4
కృష్ణాష్టమీషు సర్వాసు *శక్త్యా సమ్పూజయే చ్ఛివమ్ । గోభూహిరణ్యవాసోభి శ్శివభక్తాశ్చ యోషితః. 5
గోమూత్రం గోఘృతం క్షీరం తిలాన్యథ కుశోదకమ్ । గోశృఙ్గోదకరీషార్కి బిల్వపత్రదధీని చ. 6
పఞ్చగవ్యంచ సమ్ప్రాశ్య శఙ్కరం పూజయే న్నిశి । అశ్వత్థంచ వటంచైవో దుమ్బరం ప్లక్షమేవచ. 7
పాలాశం జమ్బువృక్షంచ విదు ష్షష్ఠం మహర్షయః ।
మార్గశీర్షాదిమాసాభ్యాం ద్వాభ్యాం ద్వాభ్యామనుక్రమాత్. 8
ఏకైకం దన్తధవనం వృక్షే ష్వేతేషు భక్షయేత్ । దద్యా త్సమాప్తే దద్యాన్నం వితానధ్వజచామరమ్. 9
దేవాయ దద్యా ద్ఘణ్టాంశ్చ కృష్ణాం గాం కృష్ణవాససీ ।
○ద్విజానాం తామ్రకుమ్భాంశ్చ పఞ్చరత్న సమన్వితాన్. 10
గావః కృష్ణా స్సువర్ణాశ్చ వాసాంసి వివిధానిచ । అశక్తస్తు పున ర్దద్యా ద్గా మేకా మతిభక్తితః. 11
విత్తశాఠ్యం న కుర్వీత కుర్వన్ దోష మవాప్నుయాత్ । కృష్ణాష్టమీ ముపోష్యైవం సప్తకల్పశతత్రయమ్.

---

* భక్త్యా    ○ ద్విజానాముదకుమ్భాంశ్చ

పుమా న్స్వమ్పూజితో దేవై శ్శివలోకే మహీయతే. 124

ఇతి శ్రీమత్స్యమహాపురాణే మత్స్యమనుసంవాదాన్తర్గతేశ్వరనారద
సంవాదే కృష్ణాష్టమీవ్రతకథనం నామ షట్పఞ్చాశోఽధ్యాయః.

## ఏబదియారవ అధ్యాయము.

## కృష్ణాష్టమీవ్రతము.

ఈశ్వరుడు నారదునకు ఇట్లు చెప్పెను: ఇక కృష్ణాష్టమీ వ్రతమును తెలిపెద వినుము; ఇది సర్వపాప ప్రణాశకము; విశేషించి నరులకు ఇది శాంతిని ముక్తిని ఇచ్చును. దీనిని కృష్ణపక్షాష్టమినాడు చేయవలసినందున దీనికీ పేరు కల్గినది. మార్గశిరము మొదలు కార్తికము వరకు మార్గశిరమున శంకరుడు పుష్యమున శంభుడు మాఘమున మహేశ్వరుడు ఫాల్గునమున మహాదేవుడు చైత్రమున స్థాణుడు వైశాఖమున శివుడు జ్యేష్ఠమున పశుపతి ఆషాఢమున ఉగ్రుడు శ్రావణమున శర్వుడు భాద్రపదమున త్ర్యంబకుడు ఆశ్వయుజమున హరుడు కార్తికమున ఈశానుడు అను పేర్లతో పరమేశ్వరుని పూజించవలెను. శివభక్తులగు స్త్రీలను శివునితోపాటు గోభూహిరణ్య వస్త్రములతో అర్చించవలెను. ఈ వ్రతపు అష్టమీ తిథినాడు గోమూత్రము ఆవు నేయి ఆవు పాలు నూవులు దర్భలు వేసి ఉంచిన నీరు ఆవు కొమ్ములో పోసి ఉంచిన నీరు గోమయము తెల్ల జిల్లేడాకు మారేడాకు ఆవు పెరుగు వీటిని ఆహారముగా తీసికొని ఉండి రాత్రివేళ శివు నర్చించవలెను. మార్గశిరము మొదలు ప్రతి రెండేసి మాసములందు వరుసగా రావి-మర్రి-మేడి-జువ్వి-మోదుగ-నేరేడు పుల్లలతో పండ్లు తోముకొని ఆ చెట్లక్రింద భుజించుచుండవలెను. ఇట్లొక సంవత్సరము వ్రతము జరిపి ముగిసిన తరువాత పెరుగన్నము-చాందనీ-చామరము దండములు నల్లని గోవు నల్లని (రెండు) వస్త్రములు పంచరత్నములతో కూడ రాగి కడవను దేవున కర్పించి బ్రాహ్మణునకు దానము చేయవలెను. నల్లని గోవులను బంగారమును వివిధ వస్త్రములను కూడ బ్రాహ్మణులకు దాన మీయవలెను. శక్తిలేనివాడు ఒక గోవునైన అతిభక్తితో నీయవలెను. ధనమునకు లోభించినచో దోషము కలుగును. ఇట్లు ఉపవాస పూర్వకముగా కృష్ణాష్టమీ వ్రతమును జరిపినవారు ఏడువందల కల్పముల కాలము దేవతల పూజ లందుకొనుచు శివలోకమున సుఖింతురు.

ఇది శ్రీమత్స్య మహాపురాణమున కృష్ణాష్టమీవ్రతము అను ఏబది ఆరవ అధ్యాయము.

## సప్తపంచాశోఽధ్యాయః.

## రోహిణీచన్ద్రశయనవ్రతమ్.

నారదః : దీర్ఘాయురారోగ్య కులాభివృద్ధి యుక్తః పుమా న్సర్వగుణాన్వితస్స్యాత్ ।
ముహుర్ముహూ ర్జన్మని యేన సమ్య గ్వ్రతం సమాచక్ష్వ త దిన్దుమౌళే. 1

ఈశ్వరః : త్వయా సమ్యగిదం పృష్ట మముత్రాక్షయకారకమ్ ।
రహస్యం తవ వక్ష్యామి యత్పురాణవిదో విదుః. 2

రోహిణీచన్ద్రశయనం నామ వ్రత మిహోత్తమమ్ । తస్మి న్నారాయణస్యార్చా మర్చయే దిన్దునామభిః. 3

యదా సోమదినే *శుక్లా భవే త్పఞ్చదశీ క్వచిత్ । అథవా బ్రహ్మనక్షత్రం పౌర్ణమాస్యాం ప్రజాయతే. 4

తదా స్నానం నరః కుర్యా త్పఞ్చగవ్యేన సర్షపైః । ఆప్యాయస్వేతి చ జపే ద్విద్వా నష్టశతం పునః. 5

శూద్రోపి పరయా భక్త్యా పాషణ్డాలాపవర్జితః । సోమాయ వరదాయాథ విష్ణవేచ నమోనమః. 6

కృతజప్య స్స్వభవన మాగత్య మధుసూదనమ్ । పూజయే త్ఫలపుష్పైశ్చ సోమనామాని కీర్తయన్. 7

సోమాయ శాన్తాయ నమోస్తు పాదా వనన్తధామ్నేతి చ జానుజఙ్ఘే ।
ఊరుద్వయంచాపి జలోదరాయ సమ్పూజయే న్మేఢ్ర మనఙ్గబన్ధోః. 8

---

* యుక్తా

నమోనమః కామసుఖప్రదాయ కటి శ్శశాఙ్కాయ సదార్చనీయా ।
తథోదరం చాప్యమృతోదరాయ నాభి శ్శశాఙ్కాయ నమోఽర్చనీయః. 9
నమోస్తు చన్ద్రాయ ముఖం ప్రపూజ్యం దన్తా ద్విజానా మధిపాయ పూజ్యాః ।
ఆస్యం నమ శ్చన్ద్రమసేతి పూజ్య మోష్ఠౌ ○ కుముత్షణ్డవనప్రియాయ. 10
నాసాంచ నాథాయ తథౌషధీనా మానన్దబీజాయ పునర్భ్రువౌ చ ।
నేత్రద్వయం పద్మవిభంజనాయ ఇన్దీవరశ్యామకరాయ శౌరేః. 11
నమ స్సమస్తాధ్వరవన్దితాయ కర్ణద్వయం దైత్యనిషూదనాయ ।
లలాటమిన్దో రుదధిప్రియాయ కేశా స్సుషుమ్నాధిపతేఽభిపూజ్యాః. 12
శిర శ్శశాఙ్కాయ నమో మురారే ర్విశ్వేశ్వరాయేతి నమః కిరీటమ్ ।
పద్మప్రియే రోహిణి వామలక్ష్మి సౌభాగ్యసౌఖ్యామృత చారుకామే. 13
దేవీం సుసమ్పూజ్య సుగన్ధపుష్పై ర్నైవేద్యధూపాదిభి రిన్దుపత్నీమ్ ।

## ఏబది ఏడవ అధ్యాయము

## రోహిణీ చంద్రశయన వ్రతము

నారదుడు ఈశ్వరు నిట్లడిగెను: "చంద్రమౌళీ! మానవుడు ఏ వ్రత మాచరించినచో ఇహలోకమున నిరంతరముగా దీర్ఘాయురారోగ్య వంశాభివృద్ధి సర్వగుణ సమృద్ధులు పొందునో అట్టి వ్రతము నుపదేశింపుము." అనగా ఈశ్వరు డిట్లు తెలిపెను: నీవు చక్కగా అడిగితివి. పురాణవేత్తలు చెప్పెడి వ్రతము ఒకటి పరలోకమునందు కూడ అక్షయ ఫలము నిచ్చునది కలదు. అది చెప్పెదను. రోహిణీ చంద్రశయన వ్రత ముత్తమమయినది. ఈ వ్రతమున నారాయణ ప్రతిమను చంద్రనామములతో పూజించవలెను. పూర్ణిమా సోమవారముకాని రోహిణిలో పూర్ణిమకాని ఐననాడు (ద్విజులు) పంచగవ్యములతో ఆవపిండితో స్నానముచేసి 'ఆప్యాయస్వ సమేతు తే' అను మంత్రమును అష్టోత్తరశతము జపించవలెను. శూద్రులయినచో పాషండ (వేదవిరుద్ధములగు) వచనములు పలుకక ఇదే స్నానముచేసి వరదుడగు సోమునకును విష్ణునకును నమస్కారమను అర్థ మిచ్చు ఈ మంత్రమును అష్టోత్తరశతము జపించవలెను. పిమ్మట నదీతీరమునుండి స్వగృహమునకు వచ్చి చెప్పబోవు విధమున చంద్రనామములతో విష్ణుపూజ చేయవలెను.

1. సోమాయ శాంతాయ నమః -పాదౌ పూజాయామి; 2. అనంత ధామ్నే నమః జానునీ జంఘేచ పూజయామి; 3. జలోదరాయ నమః ఊరూ పూజయామి; 4. కామసుఖప్రదాయ నమః-మేఢ్రం పూజయామి; 5. శశాంకాయనమః - కటిం పూజయామి; 6. అమృతోదరాయ నమః - ఉదరం పూజయామి; 7. శశాంకాయ నమః - నాభిం పూజయామి; 8. చంద్రాయనమః - ముఖం పూజయామి; 9. ద్విజానా మధిపాయనమః-దంతాన్ పూజయామి; 10. చంద్రమసే నమః- ఆస్యం పూజయామి: 11. కుముదషండవన ప్రియాయనమః-ఓష్ఠౌ పూజయామి; 12. ఓషధినాథాయ నమః-నాసాం పూజయామి; 13. ఆనందబీజాయ నమః-భ్రువౌ పూజయామి; 14. ఇందీవర శ్యామకరాయ పద్మ విభంజనాయ నమః-శ్రోత్రే పూజయామి; 15. ఉదధి ప్రియాయ నమః-లలాటం పూజయామి; 16. సుషుమ్నాధిపతయే నమః-కేశాన్ పూజాయామి; 17. శశాంకాయ నమః-శిరః పూజయామి; 18. విశ్వేశ్వరాయ నమః-కిరీటం పూజయామి; అని ఇట్లు చంద్రనామములతో విష్ణుని అవయవములకు పూజ చేయవలయును. (ఇచట క్రమములో భుజములను పూజించు మంత్రము మూలగ్రంథములో కనబడుటలేదు) తరువాత "రోహిణి'ని లక్ష్మిగా భావనచేసి "సౌభాగ్య సౌఖ్యామృతమయమగు మనోహర శరీరముకల రోహిణీరూపలక్ష్మీ!" అని స్తుతించి దేవిని సుగంధపుష్ప ధూపదీప నైవేద్యాదులతో పూజించవలెను.

○ కుకౌమోద

సుప్త్వాచ భూమౌ పునరుత్థితేన స్నాత్వాచ విప్రాయ హవిష్యయుక్తః. 14
దేయః ప్రభాతే సహిరణ్యవారికుమ్భో మునః పాపవినాశనాయ ।
సమ్ప్రాశ్య గోమూత్ర మమాంస మన్న మక్షార మష్టావథ వింశతించ. 15
గ్రాసా న్స్వపేయ స్సర్పియుతా నుపోష్య భుక్త్వేతిహాసం శృణుయాన్ముహూర్తమ్ ।
కదమ్బనీలోత్పలకేతకాని జాతీసరోజం శతపత్రకంచ. 61
అమ్లానకజ్ఞా స్యథసిన్దువారం పుష్పం పున ర్నారద మల్లికాయాః ।
శుక్లంచ విష్ణోః కరవీరపుష్పం శ్రీచమ్పకం చన్ద్రమసః ప్రదేయమ్. 17
శ్రావణాదిషు సర్వేషు క్రమాదేతాని సర్వదా ।
యస్మిన్మాసే వ్రతాది స్స్యా త్తత్పుష్పై రర్చయేద్ధరిమ్. 18
ఏవం సంవత్సరం యావ దుపోష్య విధివ న్నరః । వ్రతాన్తే శయనం దద్యా ద్దర్పణోపస్కరాన్వితమ్. 19
రోహిణీచన్ద్రమిథునం కారయిత్వాతు కాఞ్చనమ్ । చన్ద్రం షడఙ్గులం కుర్యా ద్రోహిణీం చతురఙ్గులామ్. 20
ముక్తాఫలాష్టకయుతం శతనేత్రపటావృతమ్ । క్షీరకుమ్భోపరి పునః కాంస్యపాత్రాక్షతాన్వితమ్. 21
సువస్త్రే భూషణంచైవ తథా శయ్యంచ భోజనమ్ । దద్యా న్మన్త్రేణ పూర్వాహ్ణే శాలీక్షుఫలసంయుతమ్. 22
శ్వేతామథ సువర్ణాస్యాం రౌప్యఖురసమన్వితామ్ । సవస్త్రభాజనాం ధేనుం దద్యా న్మన్త్రేణ శోభనామ్ 23
భూషణై ర్ద్విజదమ్పత్యో రలఙ్కృత్య గుణాన్వితమ్ । చన్ద్రోయం విప్రరూపేణ సభార్య ఇతి కల్పయేత్.24
యథా న రోహిణీ కృష్ణ శయ్యాం సన్త్యజ్య గచ్ఛతి। సోమరూపస్య తే తద్వ న్మమాభేదోఽస్తు భూతిభిః.25
యథా త్వమేవ సర్వేషాం పరమానన్దముక్తిదః ।
భుక్తి ర్ముక్తి స్తథా భక్తి స్త్వయి చన్ద్రాస్తు మే దృఢా. 26
ఇతి సంసారభీతస్య ముక్తికామస్య చానఘ । రూపారోగ్యాయుషా మేత ద్విధాయక మనుత్తమమ్. 27
ఇదమేవ పితౄణాంచ సర్వదా వల్లభం మునే । త్రైలోక్యాధిపతి ర్భూత్వా సప్తకల్పశతత్రయమ్. 28
చన్ద్రలోక మవాప్నోతి విద్వా న్భూత్వా విముచ్యతే । నారీవా రోహిణీచన్ద్రశయనం యా సమాచరేత్. 29
సాపి తత్ఫల మాప్నోతి పునరావృత్తిదుర్లభమ్ ।
ఇతి పఠతి శృణోతివా య ఇత్థం మధుమథనార్చన మిన్దుకీర్తనేన. 30
మతిమపిచ దదాతి సోఽపి శౌరే ర్భువనగతః పరిపూజ్యతేఽమరౌఘైః. 30½

ఇతి శ్రీమత్స్యమహాపురాణే మత్స్యమనుసంవాదా న్తర్గతే-
శ్వరనారదసంవాదే రోహిణీచన్ద్రశయనవ్రతకథనం
నామ సప్తపఞ్చాశోఽధ్యాయః.

వ్రత దినమున హవిష్యాన్నమును (ఉప్పు కారము పులుపు తైలములేని ఆహారము-అదియును కేవలము బియ్యము గోపాటు పెసరపప్పుకాని సాత్త్వికములగు బీరవంటి కూరముక్కలు కాని కలిపి అత్తెసరు పెట్టి వండిన అన్నము) తిని నేలపైనే పండుకొనవలెను. తెల్లవారి లేచిన తరువాత స్నానము చేయవలెను. బ్రాహ్మణునకు బంగారముతో కూడ జలపాత్ర దాన మీయవలెను. (పగలంతయు) ఉపవాసముండి గోమూత్రము మాత్రము ఆహారముగా తీసికొనవలెను. (రాత్రి) (మాంసాహారులు) మాంసము ఉప్పు పులుపు కారములేని ఆహారము ఇరువదెనిమిది ముద్దలు తినవలెను. ముహూర్తకాలము ఇతిహాసము వినవలెను. చంద్రరూపవిష్ణుప్రీతిగా కడిమి-నల్లకలువ-మొగలి-జాజి-తామర-శతదళ పద్మము-వాడగన్నేరు - వాడని తామర - ప్రేంకణము-మల్లె-తెల్లని కరవీరము (ఎర్ర గన్నేరు ఆకులవంటి ఆకులుగల

చెట్టున పూచెడి తెల్లని పూలు) (కరవీరము) ఎర్రగన్నేరు-సంపెగ- ఈ పండ్రెండు విధములగు పూలు శ్రావణము మొదలుగా ఆయా మాసములం దేమాసమునందు వ్రతము చేయుదుమో ఆ మాసము వంతునకు వచ్చువానిని పూజ కుపయోగించుట శ్రేష్ఠము.

ఇట్లొక సంవత్సరము వ్రతము జరుపవలెను. అనగా పూర్ణిమా సోమవారము కాని (కార్తికమాసములో ఐనచో పూర్ణిమా రోహిణీ నక్షత్ర దినమునకాని ఆరంభించి తరువాత ప్రతి పూర్ణిమనాడును వరుసగ చేయవలయును. వ్రతము (సంవత్సరము) ముగిసిన తరువాత అద్దములు ఇతర పరికరములు అలంకారములు-పీటితో కూడ మంచము చేయించవలెను. ఆరంగుళముల చంద్రప్రతిమను నాలుగంగుళముల రోహిణీ ప్రతిమను బంగారుతో చేయించవలెను. (అంగుళము = ఎనిమిది యవగింజలు అడ్డముగా ఒకదాని ప్రక్కను ఒకటిగా పెట్టుటచే అగు పొడవు-3/4 (ఒరిగిన అంగుళము) ఎనిమిది ముత్తెములు రోహిణికి కంటి ఆవరణ వస్త్రమును పాల పాత్రపై అక్షతలు నింపిన కంచుపాత్రము-మంచి వస్త్రముల జత-భూషణము(లు)-శంఖము-భోజనము-తెల్లని బియ్యము-చెరకు-పండ్లు - మొగమున బంగారు బిళ్ల-వెండి గిట్టలు - వెండి కొమ్ములు పైని వస్త్రము-పాలు పిండు పాత్ర-దూడ-కల-పాడియావు-ఇవి అన్నియు ఉదయమున మంత్రపూర్వకముగా విప్రదంపతులకు దాన మీయవలెను. సర్వ లక్షణములు సర్వ సద్గుణములుకల ఆ విప్రదంపతులను అలంకరించి వారిని లక్ష్మీవిష్ణ్వాత్మకులైన రోహిణీచంద్ర రూపులనుగా భావించవలెను. "విష్ణూ! రోహిణీరూపయగు లక్ష్మి చంద్రరూపుడవగు నిన్ను విడిచివెళ్లనట్లే నాకును ఆయా ఐశ్వర్యములతో భేదము కలుగకుండు గాక! చంద్రా! నీవు సర్వ భూతములకు పరమానందప్రదుడవు. కనుక సంసారభీతుడనై ముక్తికాముడనైన నాకు నీ యందలి దృఢభక్తిచే భుక్తిముక్తులు కలుగు గాక!" అని ప్రార్థించవలెను.

ఇది రూపాయురారోగ్య ప్రదమగు ఉత్తమ వ్రతము. పితృదేవతా స్త్రీ ప్రీతికరము. దీని నాచరించినవారు ఇరువదియొక్క వందల కల్పముల కాలము త్రిలోకాధిపతియై బ్రహ్మజ్ఞానము పొంది ముక్తినందును. స్త్రీలు దీని నాచరించినను ఇదే ఫలము కలుగును.

దీనిని చదివినను వినినను ఉత్తమ జ్ఞానమును పొంది విష్ణులోకమున దేవతలచే పూజలందుకొనును.
ఇది శ్రీమత్స్యమహాపురాణమున రోహిణీ చంద్రశయన వ్రతమను
ఏబది ఏడవ అధ్యాయము.

## అష్టపంచాశోఽధ్యాయః.
## తటాకాదిప్రతిష్ఠావిధిః.

సూతః : జలాశయగతం విష్ణుమువాచ రవినన్దనః । తటాకారామకూపేషు వాపీషు నళినీషుచ. 1
విధిం పృచ్ఛామి దేవేశ దేవతాయతనేషుచ । కే తత్రచ ర్త్విజో నాథ వేదీ వా కీదృశీ భవేత్. 2
దక్షిణా బలయః కాల స్థాన మాచార్య ఏవచ । ద్రవ్యాణి కాని శస్తాని సర్వమాచక్ష్వ తత్త్వతః. 3
శ్రీమత్స్యః : శృణు రాజ న్మహాబాహో తటాకాదిషు యో విధిః ।
పురాణేష్వితిహాసోఽయం పఠ్యతే వదతాం వర. 4
ప్రాప్య పక్షం శుభం శుక్లం నాతీతే చోత్తరాయణే । పుణ్యేఽహ్ని విప్రకథితే కృత్వా బ్రాహ్మణవాచనమ్. 5
ప్రాగుదక్ప్రవణే దేశే తటాకస్య సమీపతః । చతుర్హస్తాం శుభాం వేదిం చతురశ్రాం(స్రాం) చతుర్ముఖామ్. 6
తథా షోడశహస్తశ్చ మండపశ్చ చతుర్ముఖః । వేద్యాశ్చ పరితో గర్తాఽరత్నిమాత్రా స్త్రిమేఖలాః. 7
నవ సప్తాథవా పఞ్చ నాతిరిక్తా నృపాత్మజ । వితస్తిమాత్రా యోనిస్స్యాత్ షట్సప్తాఙ్గుళవిస్తృతా. 8
గర్తా శ్చత్ర శస్తాస్స్యు స్త్రిపర్వోచ్ఛ్రితమేఖలాః । సర్వత స్సర్వవర్ణాస్స్యుః పతాకాధ్వజసంయుతాః. 9

అశ్వత్థోదుమ్బరప్లక్ష వటశాఖాకృతానితు । మణ్డపస్య ప్రతిదిశం ద్వారాణ్యేతాని కారయేత్. 10
శుభాస్తత్రాష్టహోతారో ద్వారపాలా స్తథాష్టవై । అష్టౌతు జాపకాః కార్యా బ్రాహ్మణా వేదపారగాః. 11
సర్వలక్షణసమ్పూర్ణో మన్త్రవి ద్విజితేన్ద్రియః । కులశీలసమాయుక్త స్స్థాపక స్స్యాద్ద్విజోత్తమః. 12
ప్రతిగర్తేషు కలశయజ్ఞోపకరణానిచ । వ్యజనం చామరే శుభ్రే తామ్రపాత్రం సువిస్తరమ్. 13

## ఏబది ఎనిమిదవ అధ్యాయము.

## తటాకాది ప్రతిష్ఠా విధానము.

సూతుడు ఋషులకు ఇట్లు చెప్పెను: తటాకములు ఆరామములు (తోటలు) బావులు దిగుడు బావులు సరస్సులు దేవాలయములు వీని ప్రతిష్ఠ జరుపు 1. విధానమును అచట కావలసిన 2. ఋత్విజులు 3. వేదికలు 4. దక్షిణలు 5. బలులు 6. కాలము 7. స్థానము 8. ఆచార్యుడు 9. ద్రవ్యములు ఏవి ఎట్టివిగా నుండవలెనో తెలుపుము. అని మనువు మత్స్యనారాయణు నడిగెను.

మత్స్యనారాయణుడిట్లు చెప్పెను: మహాబాహూ! రాజా! పురుషశ్రేష్ఠా! వినుము. ఈ విధానమంతయు (వైదికములగు) పురాణములయందు "ఇతిహాస" రూపమున ఇతి-హ-ఆస-; (ఉండెను అనికాదు-ఇది ఇట్లుండవలెను అని ఇచ్చట అర్థము.) అని చెప్పబడియున్నది. 6. (కాలము) ఉత్తరాయనము-శుక్లపక్షము- బ్రాహ్మణులు నిర్ణయించిన శుభ దినము ప్రశస్తములు. బ్రాహ్మణులచే స్వస్తి వాచనము జరిపించిన తరువాతనే ఈ ప్రతిష్ఠా కార్యము జరుపవలెను. 7. (స్థానము) తటాకము-(ఆరామము-కూపము-వాపి-దేవాలయము) సమీపమున తూర్పునకు ఉత్తరమునకు వాలుగా ఉన్న ప్రదేశము ప్రశస్తము. 3. (వేదికలు) నాలుగేసి మూరల భుజములతో చతురస్రముగా నుండు నాలుగు ముఖములు గల వేదికను పదునారు మూరల భుజములు గల చతుర్ముఖ మండపములో నిర్మించవలెను. వేదికకు చుట్టును మేఖలలతో కూడినవియు పిడిమూర భుజములు లోతునుగల గుంటలు తొమ్మిదికాని ఏడుకాని ఐదుకాని త్రవ్వవలెను. ఇవికాక పండ్రెండంగుళముల పొడవును ఆరేడంగుళముల వెడలుపునుగల యోని (అధోముఖత్రిభుజాకృతి వేది)- నాలుగు గుంటలు ఏర్పరచవలయును. ఈ గుంటలలో ప్రతిదానికి చుట్టును మూడు వరుసలలో ఎత్తైన మేఖలలు ఉండవలెను. (మేఖల=చుట్టును ఉండెడి గట్టు) అనేక వర్ణముల పతాకలును జెండాలను (తోరణములును) రావి మేడి జువ్వి మర్రి కొమ్మలతో చేసి అమర్చిన ద్వారములును మండపము చుట్టును ఏర్పరచవలెను. 2. (ఋత్విక్కులు మొదలగువారు) ఎనిమిది మంది ద్వారపాలురు-ఎనిమిది మంది హోతలు ఎనిమిది మంది జపకర్తలును వేదపారంగతులయిన బ్రాహ్మణు లుండవలెను. 8. [ఆచార్యుడు] సర్వ వైదిక లక్షణములు కలిగి మంత్రవేత్త జితేంద్రియుడు కులశీలవంతుడు నగు బ్రాహ్మణుడు ఆచార్యుడు(ప్రధాన ఋత్విక్)గా నుండవలెను. 9. (ద్రవ్యములు) ప్రతియొక గుంట దగ్గరను కలశములు యజ్ఞోపకరణములు (స్రుక్ స్రువములు దర్భలు మొదలగునవి) విసనకర్ర తెల్లని చామరములు వెడల్పయిన రాగిపాత్ర ఉండవలెను.

తత స్త్వనేకవర్ణాస్స్యు ర్బలయః ప్రతిదైవతమ్ । ఆచార్యః ప్రక్షిపే ద్భూమా వనుమన్త్రం విచక్షణః. 14
త్రిశ్చారత్నిమాత్రయూప స్స్యా త్క్షీరవృక్షవినిర్మితః । యజమానప్రమాణోవా సంస్థాప్యో భూతిమిచ్ఛతా. 15
హేమాలఙ్కారిణః కార్యాః పఞ్చవింశతిఋత్విజః । కుణ్డలానిచ హైమాని కేయూరకటకానిచ. 16
తథాఙ్గుళిపవిత్రాణి వాసాంసి వివిధానిచ । దక్షిణాశ్చ సమాస్సర్వా ఆచార్యే ద్విగుణం స్మృతమ్. 17
దద్యా చ్ఛయనసంయుక్త మాత్మనశ్చాపి యత్ప్రియమ్ । సౌవర్ణౌ కూర్మమకరౌ రాజతౌ మత్స్యదుణ్డుభౌ.
తామ్రౌ కుళీరమణ్డూకా వాయసశ్శింశుమారకః । ఏవమాసాద్య తత్సర్వ మాదావేవ విశామ్పతే. 19
శుక్లమాల్యామ్బర ధర శ్శుక్లగన్ధానులేపనః । సర్వౌషధ్యుదకస్నాత స్స్నాపితో వేదపుఙ్గవైః. 20
యజమాన స్సపత్నీకః పుత్త్ర పౌత్త్రసమన్వితః । పశ్చిమద్వారమాశ్రిత్య ప్రవిశే ద్యాగమణ్డపమ్. 21

తతోమఙ్గళశబ్దేన భేరీణాం నిస్వనేనచ । రజసా మణ్డలం కుర్యాత్పఞ్చవర్ణేన తత్త్వవిత్. 22
షోడశారం తతశ్చక్రం పద్మగర్భం చతుర్ముఖమ్ । చతురశ్రంచ పరితో వృత్తం మధ్యే సుశోభనమ్. 23
వేద్యాంచ పరితః కృత్వా గ్రహాన్ లోకపతీం స్తతః । విన్యసే న్మన్త్రితస్సర్వా న్ప్రతిదిక్షు విచక్షణః. 24
కూర్మాదీన్ స్థాపయేన్మధ్యే వారుణం మన్త్రిమాశ్రితః । బ్రహ్మాణంచ శివం విష్ణుం తత్రైవ స్థాపయేద్బుధః.
వినాయకంచ విన్యస్య కమలా మమ్బికాం తథా । శాన్త్యర్థం సర్వలోకానాం భూతగ్రామం న్యసేత్తతః. 26
పుష్పాక్షతఫలై ర్యుక్త మేవం కృత్వాఽధివాసనా । కుమ్భాంశ్చ రత్నగర్భాంస్తా న్వారిణా పరిపూరితాన్.

5. (బలులు) ప్రతియొక దేవతను ఉద్దేశించి అనేక వర్ణములు గల బలులు ఏర్పరచి అన్ని విషయములను ఎఱిగిన ఆచార్యుడు వాటిని మంత్రసహితముగా వేయవలెను. 9. (యూపము) యూపస్తంభము మూడు పిడిమూరల పొడవున గాని యజమానుని ఎత్తునగాని ఉండుట క్షేమప్రదము. (భూషణములు) ఇరువదియైదు మంది ఋత్విజులకును బంగారుతో కుండలములు భుజకీర్తులు చేతి కడియములు వ్రేళ్ళకు పవిత్రములు చేయించవలెను. వివిధములగు వస్త్రము లీయవలెను. దక్షిణలు అందరకును సమానముగాను ఆచార్యునకు మాత్రము ఒక్కొక్క ఋత్విజునకు ఇచ్చినదానికి ద్విగుణముగాను ఇచ్చుట కేర్పరచవలెను. వారి కింకను మంచము పరపు మఱింకేదైన తనకు నచ్చినది కాని బంగారుతో చేసిన కూర్మమకరములను వెండితో చేసిన చేపను నీటిపామును రాగితో చేసిన ఎండ్రి కప్ప నీటి కాకి శిశుమారము మత్స్యము ఇట్టివి కూడ చేయించవలెను.

1. ఇట్టివి సమకూర్చుకొనిన తరువాత యజమానుడును అతని భార్యయు సర్వౌషధీజలములతో విప్రులు పఠించు వేదమంత్రములతో స్నానమాడి తెల్లని వస్త్రములను తెల్లని గంధములను తాల్చి పుత్త్రి పౌత్త్రిలతో కూడి పడమటి ద్వారమునుండి యాగ మంటపమును ప్రవేశించవలయును. మంగళవాద్యములు మ్రోగుచుండ ఐదువన్నెల ముగ్గు పొడితో చతురస్రమును దాని నడుమ వృత్తమును దానిలోపల షోడశారచక్రమును దాని నడుమ పద్మమునందు బ్రహ్మను లిఖించ వలెను. ఇ ట్లలంకరించిన వేదిపై ఆయా దిక్కులందును స్థానములందును దిక్పాలకులను గ్రహములను ఆయా మంత్రము లతో నిలుపవలెను. వారుణ మంత్రములతో కూర్మము మొదలగు ప్రతిమలను త్రిమూర్తులను గణపతిని లక్ష్మిపార్వ(సర స్వతీ)తులను సర్వభూత గణములను నిలుపవలెను. మంటపమున (పీఠముపై) వస్త్రము పరచి దానిపై పుష్పాక్షతఫలము లను ఉంచి రత్నములతో జలములతో నిండిన కలశము లుంచి వాని నడుమనే పై విధముగా గ్రహాదులను నిలువ వలయును.

వస్త్రాదిభిరలఙ్కృత్య ద్వారపాలా న్సమన్తతః । జపద్వమితి తాన్బ్రూయా దాచార్య స్త్వధిపూజయేత్. 28
బహ్వృచౌ పూర్వతస్స్థాప్యౌ దక్షిణేన యజుర్విదౌ । సామగౌ పశ్చిమే తద్వ దుత్తరేణ అథర్వణౌ. 29
ఉదఙ్ముఖో దక్షిణతో యజమాన ఉపావిశేత్ । యజధ్వమితి తాన్బ్రూయా ద్యాజకా న్పునరేవతు. 30
ఉత్కృష్టమన్త్రిజప్యేన తిష్ఠధ్వమితి జాపకాన్ । ఏవమాదిశ్య తా న్సర్వా న్పర్యుక్ష్యాగ్నిం సమర్చయేత్.
జుహుయా ద్వారుణైర్మన్త్రై రాజ్యంచ సమిధ స్తథా । ఋత్విగ్భిశ్చైవ హోతవ్యం వారుణై రేవ సర్వతః. 32
గ్రహేభ్యో విధివద్ధుత్వా తథేన్ద్రాయేశ్వరాయచ । మరుద్భ్యో లోకపాలేభ్యో విధివ ద్విశ్వకర్మణే. 33
రాత్రిసూక్తం చ రౌద్రం చ పావమానం సుమఙ్గళమ్ ।
జపేర న్పౌరుషం సూక్తం పూర్వతో బహ్వృచః పృథక్. 34
శాక్తం రౌద్రం చ సౌమ్యం చ కూశ్మాణ్డం జాతవేదసమ్ ।
సౌరం సూక్తం జపేరం స్తే దక్షిణే తు యజుర్విదః. 35

వైరాజం పౌరుషం సూక్తం సౌవర్ణం రుద్రసంహితామ్ ।
శ్యైతంచ పఞ్చనిధనం గాయత్రం జ్యేష్ఠసామ చ. 36
వామదేవ్యం బృహత్సామ రౌరవంచ రథన్తరమ్ । గవాం వ్రతం వికర్ణంచ రక్షోఘ్నం వయనం తథా. 37
గాయేర న్సామగా రాజ న్పశ్చిమద్వార మాశ్రితాః ।
ఆథర్వణా శ్చోత్తరత శ్శాన్తికం పౌష్టికం తథా. 38
జపేర న్మనసా దేవ మాశ్రితా వరుణం ప్రభుమ్। పూర్వేద్యు రభితో ★మన్త్రై రేవం కృత్వాఽధివాసనమ్. 39
గజాశ్వరథవల్మీకా త్సఙ్గమహ్రదగోకులాత్ । మృద మాదాయ కుమ్భేషు ప్రక్షిపే చ్చత్వరా త్తథా. 40
రోచనాం యవసిద్ధార్థా న్గన్ధా న్గుగ్గులు మేవ చ । స్నపనం తస్యకర్తవ్యం పఞ్చగవ్యసమన్వితమ్. 41
ప్రత్యేకంతు మహామన్త్రై రేవం కృత్వా విధానతః । ఏవం క్షిపతి బాహ్యర్త్రై ర్విధియుక్తేన కర్మణా. 42

తరువాత ద్వారపాల ఋత్విక్కులను జాపకులను ఆచార్యుని హోతలను పూజించవలెను. ద్వారపాలురలో ఋగ్వేదులను ఇద్దరను తూర్పున యజుర్వేదులను ఇద్దరను దక్షిణమున సామవేదులను ఇద్దరను పడమట ఆథర్వణులను ఇద్దరను ఉత్తరమున కూర్చుండపెట్టవలయును. యజమానుడు తాను మంటపములో దక్షిణ దిశను ఉత్తరమునకు తిరిగి కూర్చుండవలెను. ద్వారపాలురను వేదపఠనము చేయుడనియు జాపకులను జపించుడనియు హోతలను యజనము చేయించుడనియు ఋత్విగ్వరణము చేసి ప్రార్థించవలెను.

తరువాత అగ్నికి పర్యుక్షణము చేసి అర్చించవలయును. గ్రహములను ఇంద్రుని ఈశ్వరుని మరుత్తులను లోకపాలురను విశ్వకర్మను ఉద్దేశించి వారుణ మంత్రములతో నేతితో సమిధలతో హోమము చేయవలెను. ఈ హోమకాలములోనే ద్వారపాలురలో ఋగ్వేదీయులు రాత్రి-రుద్ర-పవమాన-పురుష సూక్తములను పఠింతురు. యజుర్వేదులు శాక్త-రౌద్ర-సౌమ్య-కూశ్మాండ-జాతవేదస-సౌర-సూక్తములు పఠింతురు. సామవేదులు వైరాజ-పౌరుష-సౌవర్ణ-రౌద్ర-శ్యైత-పంచనిధన-గాయత్ర-జ్యేష్ఠసామ-వామదేవ్య-బృహత్సామ-రౌరవ-రథంతర-గవాంవ్రత-వికర్ణ-రక్షోఘ్న-వయన-సూక్తములు పఠింతురు. ఆథర్వణులు వరుణ దేవతాకములగు శాంతిక పౌష్టిక మంత్రములు పఠింతురు.

ఇంకను గజములు అశ్వములు రథములు నిలుచు ప్రదేశములనుండియు పుట్టనుండియు నదీసంగమ-హ్రద-గోకుల-ప్రదేశములనుండియు ఇండ్ల ముంగిళ్లనుండియు తెచ్చిన మృత్తికను కడవలలోవేసి వానియందు నింపిన నీటితో గోరోచనా యవ సిద్ధార్థ (తెల్ల ఆవలు) గంధ గుగ్గులు చూర్ణములతో పంచ గవ్యముతో ఆయా మంత్రములతో వరుణునకు యథావిధానముగ స్నపనము చేయించవలెను. ఇదంతయు తటాక ప్రతిష్ఠకు ముందటి దినమున చేయవలసిన ప్రక్రియ.

తతః ప్రభాతే విమలే సఞ్జాతేఽథ శతం గవామ్ । బ్రాహ్మణేభ్యః ప్రదాతవ్య మష్టషష్టిశ్చ వా పునః. 43
పఞ్చాశ దథ షట్త్రింశ త్పఞ్చవింశతి రేవచ । తత స్సాంవత్సరప్రోక్తే శుభే లగ్నే సుశోభనే. 44
వేదశబ్దై స్సగాన్ధర్వై ర్వాద్యైశ్చ వివిధైః పునః । కనకాలంకృతాం కృత్వా జలే గా మవతారయేత్.
45
సామగాయచ సా దేయా బ్రాహ్మణాయ విశాంపతే । పాత్రీ మాదాయ సౌవర్ణాం పఞ్చరత్నసమన్వితామ్.
తత్ర నిక్షిప్య మకర మత్స్యాదీంశ్చైవ సర్వతః । ధృతాం చతుర్భి ర్విప్రేన్ద్రై ర్వేదవేదాఙ్గపారగైః. 47
మహానదీజలోపేతాం దధ్యక్షతసమన్వితామ్ । ఉత్తరాభిముఖై ర్న్యస్తాం జలమధ్యేఽవతారయేత్. 48
ఆథర్వణేన సామ్నాచ పున ర్మామేత్యథైవచ । ఆపోహిష్ఠేతి మన్త్రేణ క్షిప్త్వాఽఽగత్య చ మణ్డపమ్. 49
పూజయిత్వా సద స్తత్ర బలిం దద్యా త్సమన్తతః । పున ర్దినాని హోతవ్యం చత్వారి మునిసత్తమాః. 50

★ రాత్రావేవం

చతుర్థే కర్మకర్తవ్యం దేయా తత్రాపి శక్తితః । దక్షిణా రాజశార్దూల వరుణస్య క్షమాపనమ్. 51
కృత్వాతు యజ్ఞపాత్రాణి యజ్ఞోపకరణాని చ । ఋత్విగ్భ్యస్తు సమం దత్వా మణ్డపం విభజేత్పునః. 52
హోమపాత్రీంచ శయ్యాంచ స్థాపకాయ నివేదయేత్ । తతస్సహస్రం విప్రాణా మథవాఽష్టశతం తథా. 53
భోజనీయం యథాశక్తి పఞ్చాశదథవా వింశతిః ।

ప్రతిష్ఠా దినమున ఉదయకాలమున బ్రాహ్మణులకు నూరుకాని అరువది ఎనిమిది కాని ఏబదికాని ముప్పది ఆరుకాని ఇరువదికాని గోవుల దానమీయవలెను. తరువాత జ్యోతిషికులు చెప్పిన శుభలగ్నమునందు వేద-గాన-వాద్య ధ్వనులనడుమ బంగారుతో అలంకరించబడిన గోవును (ఈ క్రొత్త తటాకపు) నీటిలో దింపి పిమ్మట దానిని సామ వేదియగు బ్రాహ్మణునకు దానమీయవలెను. పిమ్మట పంచరత్నములు తాపటము చేసిన బంగారు పాత్రలో మకర మత్స్యాది ప్రతిమలను వేసి వేదవేదాంగ పారంగతులైన నలుగురు విప్రులు దానిని పట్టుకొనగా దానిలో నదీ జలములు దధి-అక్షతలు నింపి ఉత్తరాభిముఖులైన ఆ విప్రులచే దానిని నీటిలో దింపించవలెను. అథర్వణసామ మంత్రములతో 'పునర్మామా' 'ఆపోహిష్ఠా' అను మంత్రములతో ఆపాత్రను నీటిలో పడవేసి మంటపమునకు వచ్చి సదస్సును (సదస్సు లోని పెద్దలను) పూజించి మంటపమునకు అన్ని దిక్కులందు బలి వేయవలెను.

తరువాత నాలుగు దినములు వరుసగా హోమము జరిపి నాలుగవనాడు కర్మ సమాప్తి జరుపవలెను. వరుణునకు (మంత్ర పూర్వముగ) క్షమాపణము చెప్పి యజ్ఞ పాత్రములను యజ్ఞోపకరణములను మండప సామగ్రిని దక్షిణలను ఋత్విజులకు సమముగా పంచవలెను. హోమ పాత్రను శయ్యను ఆచార్యునకు ఈయవలెను. తరువాత యథా శక్తిగా వేయి అష్టోత్తర శతము.ఏబది-ఇరువది-మంది బ్రాహ్మణులకు భోజనము పెట్టవలెను.

ఏవ మేష పురాణేషు తటాకవిధి రుచ్యతే. 54
కూపవాపీషు సర్వాసు తథా పుష్కరిణీషు చ । ఏష ఏవ విధి ర్దృష్టః ప్రతిష్ఠాసు తథైవచ. 55
మన్త్రతస్తు విశేష స్స్యాత్ప్రాసాదోద్యానభూమిషు । అయం త్వశక్తా వర్ధేన విధిర్దృష్ట స్స్వయమ్భువా. 56
అల్పే ష్వేకాగ్నివ త్కుర్యా ద్విత్తశాఠ్యా దృతే నృణామ్ ।
ప్రావృట్కాలే స్థితం తోయ మగ్నిష్టోమసమం స్మృతమ్. 57
శరత్కాలే స్థితం యత్స్యా త్తదుక్తఫలదాయకమ్ । వాజపేయాతిరాత్రాభ్యాం హేమన్తే శిశిరే స్థితమ్. 58
అశ్వమేధసమం ప్రాహుర్వసన్తసమయే స్థితమ్ । గ్రీష్మేప్యవస్థితం తోయం రాజసూయా ద్విశిష్యతే. 59
ఏతా న్మహారాజ విశేషధర్మా న్కరోతి యోఽత్యర్థవిశుద్ధబుద్ధిః ।
స యాతి రుద్రాలయ మాశు పూతః కల్పా ననేకా న్దివి మోదతేచ. 60
అనేకలోకా న్సమహర్జనాదీ న్భుక్త్వా పరార్ధద్వయ మఙ్గనాభిః । 61
సహైవ విష్ణోః పరమం పదం యః ప్రాప్నోతి తద్యోగఫలేన భూయః.

ఇతి శ్రీమత్స్యమహాపురాణే మత్స్యమనుసంవాదా న్తర్గతేశ్వరనారదసంవాదే
తటాక విధికథనం నామాష్టపఞ్చాశోఽధ్యాయః.

ఇది (వైదిక) పురాణములందు చెప్పియున్న తటాక ప్రతిష్ఠా విధానము. బావులు దిగుడు బావులు కోనేళ్ళు మొదలగు జలాశయ ప్రతిష్ఠలన్నిటియందు ఇదే విధానము. ప్రాసాదములు ఉద్యానములు భూమి ప్రతిష్ఠించుట దాన మిచ్చుట మొదలగు వానిలో మంత్రములు భేదించవచ్చును. శక్తిలేనివారు దీనిని సంక్షిప్త పరచి ఏకాగ్ని (వాస్తుపద్ధతు) వలెనైన జరుపవచ్చును. తనకు ధనము విషయమున శక్తి యుండియు కొరత చేయరాదు.

ఈ శాస్త్ర విధానమున ప్రతిష్ఠించిన జలాశయములలోని నీరు ప్రాణుల కుపయోగింపబడి వర్షాకాలము నందువయుక్తమై అగ్నిష్టోమమను యజ్ఞముచే కలుగు ఫలమును శరత్కాలమున ఉపయోగపడి ఉక్థ్య యజ్ఞఫలమును హేమంతమున ఉపయోగపడి వాజపేయ యజ్ఞఫలమును శిశిరమున ఉపయోగపడి అతిరాత్రయజ్ఞఫలమును వసన్తమున ఉపయోగపడి అశ్వమేధ ఫలమును గ్రీష్మమునకూడ ఉపయోగపడి రాజసూయముకంటె అధికఫలమును ఇచ్చును.

ధనము ఉన్నంతలో నిర్మల బుద్ధి కలిగి ఈ విశేష ధర్మముల నాచరించినవాడు పవిత్రుడై శివలోకమున కేగును. అనేక కల్పముల కాలము స్వర్గమున నానందించును. రెండు పరార్ధములపాటు తన ధర్మపత్నితో కూడ మహర్జనాది లోకములందు సుఖించి యోగసిద్ధులకు మాత్రము లభించు విష్ణు పరమపదమును కూడ పొందును.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున తటాక ప్రతిష్ఠా విధాన కథనమను
ఏబది ఎనిమిదవ అధ్యాయము.

## ఏకోనషష్టితమోఽధ్యాయః.

## ఆరామప్రతిష్ఠావిధిః.

ఋషయః : పాదపానాం విధిం సూత! యథావ ద్విస్తరా ద్వద ।
విధినా కేన కర్తవ్యం పాదపోద్యావనం బుధైః.1
యేచ లోకా స్స్మృతా స్తేషాం తానిదానీం వదస్వ నః । యత్ఫలం లభతే ప్రేత్య (నభూమినతటాకిషు). 2
తత్సర్వం శ్రోతు మిచ్ఛామో వక్తు మర్హసి సువ్రత ।
సూతః: పాదపానాం విధిం వక్ష్యే తథైవోద్యానభూమిషు. 3
తటాకవిధివ త్సర్వ మాసాద్య జగదీశ్వర । ఋత్విఙ్మండలసమ్భారా నాచార్యం స్థాపయేద్బుధః. 4
బ్రాహ్మణా న్పూజయేత్తద్వ ద్ధేమవస్త్రానులేపనైః । సర్వౌషధ్యుదకై స్సిక్త్వా విటపాన్తవిభూషితాన్. 5
వృక్షా న్మాల్యై రలఙ్కృత్య వాసోభి ర్వేష్టయేత్తతః । సూచ్యా సౌవర్ణయా కార్యం సర్వేషాం కర్ణవేధనమ్.6
అఞ్జనంచైవ దాతవ్యం తద్వద్ధేమశలాకయా । ఫలాని సప్త చాష్టౌవా కలధౌతాని కారయేత్. 7
ప్రత్యేకం సర్వవృక్షాణాం సప్తధాన్యాధివాసయేత్ । సప్తధాన్యే స్థితాన్కృత్వా వస్త్రగన్ధానులేపనైః. 8
ధూపానుధూపితా న్చైషాం స్తామ్రపాత్రై రధిష్ఠితాన్ ।
కుమ్భా న్సర్వేషు వృక్షేషు స్థాపయిత్వా నరేశ్వర. 9
సహిరణ్యా నశేషాంస్తా న్కృత్వా బలినివేదనమ్ । యథాస్వం లోకపాలానా మిన్ద్రాదీనాం విధానతః. 10
వనస్పతేశ్చ విధివ ద్ధోమః కార్యో ద్విజాతిభిః । తతశ్శుక్లామ్బరధరాం సౌవర్ణకృతశేఖరామ్. 11
సకాంస్యదోహనాం స్వర్ణశృఙ్గాఢ్యాం చ సుశీలినీమ్ । పయస్వినీం వృక్షమధ్యా దుత్సృజే ద్గాముదఙ్ముఖీమ్.12

## ఏబది తొమ్మిదవ అధ్యాయము

## ఆరామ ప్రతిష్ఠా విధానము-వృక్షారోపణ మహిమము.

వృక్షములను నాటి ఉద్యానవనము (ఆరామము)లను ప్రతిష్ఠించు (ప్రజల వినియోగమునకై నిలుపు) శాస్త్ర విధానమును దానివలన కలుగు ఫలమును తెలుపుమని మునులడుగ సూతుడిట్లు చెప్పనారంభించెను: వినుడు. తటాక ప్రతిష్ఠా విధానమునందు వలెనే సర్వ సంభారములను సమకూర్చుకొనవలెను. ఋత్విక్కులను ఆచార్యుని అట్లే నియమించు కొనవలెను. అట్లే పూజాలంకరణ సామగ్రితో వారిని అలంకరించి పూజించవలెను.

ప్రతిష్ఠించ-ప్రజలకు దత్తము చేయ-బోవు ఉద్యానమునందలి వృక్షములను సర్వౌషధుల-సర్వసుగంధముల-జలములతో తడుపవలెను. కొమ్మల చివరలను పూలమాలలతో వస్త్రములతో అలంకరించవలెను. బంగారు తీగతో చెవులు కుట్టవలెను. బంగారు కడ్డీలతో కాటుక పెట్టవలెను. ఏడెనిమిది బంగారు ఫలములను చేయించవలెను. అన్ని

చెట్లను సప్తధాన్యములయందు అధివాసము (మిశ్రిత ధాన్యములందు నిలుపుట) చేయవలెను. వస్త్రములతో గంధాను లేపనములతో అలంకరించి పొగవేసి తామ్ర పాత్రములందు నిలుపవలెను. అన్ని చెట్ల దగ్గరను (సీటితో) కరవలను బంగారును ఉంచి వాటి కన్నిటికిని ఇంద్రాది దేవతల నుద్దేశించి బలిని నివేదించవలెను. వనస్పతి దేవతలకును విప్రులచే హోమము జరిపించవలెను. తెల్లని వస్త్రముతో కప్పినది బంగారు శిరోలంకారము కలది బంగారు కొమ్ములు కలది పాలు పిదుకుటకు కంచుపాత్ర కూడ కలిగినదియగు పాడియావును ఉత్తరాముఖముగా చెట్ల నడుమగా విడువవలెను.

తతోఽభిషేకమన్త్రేణ వాద్యమఙ్గళగీతకైః । ఋగ్యజుస్సామమన్త్రైశ్చ వారుణై రభిత స్తథా. 13
తైరేవకుమ్భై స్స్నపనం కుర్యు ర్బ్రాహ్మణపుఙ్గవాః । స్నాతశ్శుక్లామ్బరధరో యజమానోఽభిపూజయేత్.14
గోభి ర్విభవత స్సర్వా నృత్విజ స్తా న్సమాహితః । హేమసూత్రై స్సకటకై రఙ్గుళీయైః పవిత్రకైః. 15
వాసోభి శ్శయనీయైశ్చ తథోపస్కరపాదుకైః । క్షీరేణ భోజనం దద్యా ద్యావద్దినచతుష్టయమ్. 16
హోమశ్చ సర్షపైః కార్యో యవైః కృష్ణతిలై రపి । పాలాశసమిధ శ్శస్తా శ్చతుర్థేఽహ్ని తథోత్సవః. 17
దక్షిణా చ పున స్తేభ్యో దేయా తత్ర స్వశక్తితః । యద్యదిష్టతమం కించి త్తత్తద్దద్యా దమత్సరః. 18
ఆచార్యే ద్విగుణం దత్వా ప్రణిపత్య క్షమాపయేత్ । అనేన విధినా యస్తు కుర్యా ద్వృక్షోత్సవం బుధః.19
సర్వా న్కామా నవాప్నోతి పదం చానన్త్య మశ్నుతే । యశ్చైకమపి రాజేన్ద్ర వృక్షం సంస్థాపయే న్నరః.
సోపి స్వర్గే వసే ద్రాజన్ *యావదిన్ద్రశతత్రయమ్ । భూతాన్భవ్యాం శ్చ మనుజస్తారయేద్ద్రుమసమ్మితాన్.
పరమాం సిద్ధిమాప్నోతి పునరావృత్తిదుర్లభామ్ । యఇదం శృణుయాన్నిత్యం శ్రావయేద్వాపి మానవః. 22
సోపి సమ్పూజితో దేవై ర్బ్రహ్మలోకే మహీయతే. 22u

ఇతి శ్రీమత్స్యమహాపురాణే మత్స్యమనుసంవాదే వృక్షారోపణ
మాహాత్మ్యకథనం నామైకోనషష్టితమోఽధ్యాయః.

తరువాత బ్రాహ్మణులు ఋగ్యజుస్సామ వేదములనుండి వరుణ దేవతాకములైన అభిషేక (స్నాన) మంత్రములతో మంగళవాద్య ధ్వనుల నడుమ యజమానుని స్నానము చేయించగా అతడు తెల్లని మడుగు వస్త్రములు ధరించి ఋత్విజులనందరను శ్రద్ధతో యథాశక్తిగా గోవులతో దక్షిణలతో బంగారుతో చేసిన చేతి మురుగులు ఉంగరములు పవిత్రములు వస్త్రములు సర్వసామగ్రితో కూడిన పరుపులు మంచములు పాదుకలు-ఇట్టి వానితో పూజించును. వారికి నాలుగు దినములవరకు పాలతో భోజనము పెట్టవలెను. నాలుగు దినములును ఆవలతో యవలతో నల్లని నూవులతో పలాశ సమిధలతో హోమము చేయవలెను. నాలుగవ దినమున ఉత్సవపు వేడుకలు జరుపవలెను. ఋత్విక్ బ్రాహ్మణులకు మరల యథాశక్తిగ దక్షిణలను తనకు తోచిన మరేదైన నీయవలెను. ఆచార్యు (ప్రధాన ఋత్విక్)నకు మాత్రము ఒక ఋత్విక్‌కు ఇచ్చినదానికి రెండింతలీయవలెను. అతనిని క్షమాపణము వేడుకొనవలెను.

ఈ విధానమున వృక్ష ప్రతిష్ఠోత్సవమును జరుపు వివేకికి అన్ని కోరికలు తీరును. అనంత ఫలము కలుగును. (ప్రజల నిమిత్తమయి) ఒక వృక్షము నాటినను అతడు ముగ్గురింద్రుల జీవితకాలము స్వర్గమందు సుఖించును. తనకు పూర్వపు-అనంతరపు తరములవారిని-తాను నాటిన చెట్లంత మందిని తరింపజేయును. పునరావృత్తి రహితమగు మోక్షమును పొందును.

ఈ కల్పమును వినిన-వినిపించిన-వాడు కూడ దేవతలచే పూజలందుకొనుచు బ్రహ్మలోకమున సుఖించును.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున వృక్షారోపణ మాహాత్మ్య కథనమను
ఏబది తొమ్మిదవ యధ్యాయము.

---

* యావదిన్ద్రాయుతత్రయమ్

## షష్టితమోఽధ్యాయః.
## సౌభాగ్యశయనవ్రతమ్.

శ్రీమత్స్యః : తథైవాన్య త్ప్రవక్ష్యామి సర్వకామఫలప్రదమ్।
సౌభాగ్యశయనం నామ యత్పురాణవిదో విదుః. 1
పురా దగ్ధేషు లోకేషు భూర్భువస్స్వర్మహాదిషు । సౌభాగ్యం సర్వభూతానా మేకస్థ మభవత్తదా. 2
తచ్చ వైకుణ్ఠమాస్థాయ విష్ణో ర్వక్షస్థలే స్థితమ్ । తతఃకాలేన మహతా పునస్సర్గవిధౌ నృప. 3
అహఙ్కారావృతే లోకే ప్రధానపురుషాత్మకే । స్పర్ధాయాంచ ప్రవృత్తాయాం కమలాననకృష్ణయోః. 4
లిఙ్గాకారా సముద్భూతా వహ్నిజ్వాలాఽతిభీషణా । తస్యాతిత ప్తస్యహరే ర్వక్షన స్తద్వినిస్సృతమ్. 5
యద్వక్షస్థల మాశ్రిత్య విష్ణో స్సౌభాగ్యమాస్థితమ్ । రసభూతం నతద్యావ దాప్నోతివసుధాతలమ్. 6
ఉత్క్షిప్త మన్తరిక్షాత్త ద్బ్రహ్మపుత్రేణ ధీమతా । దక్షేణ పీతమాత్రంతు రూపలావణ్యకారకమ్. 7
బలం తేజో మహజ్జాతం దక్షస్య పరమేష్ఠినః । శేషం యదపతద్భూమౌ వష్టధా తదజాయత. 8
తత స్త్వోషధయో జాతా స్సర్వ సౌభాగ్యదాయికాః । ఇక్షవ స్తవరాజశ్చ నిష్పావో జాతిధాన్యకమ్. 9
వికారవచ్చ గోక్షీరం కుసుమ్భకుసుమంతథా । లవణం చాష్టమం చాత్ర సౌభాగ్యాష్టక ముచ్యతే. 10
పీతం యద్బ్రహ్మపుత్రేణ యోగజ్ఞానవిదాపురా । దుహితా సాఽభవ త్తస్య యా సతీ త్యభిధీయతే. 11
లోకానతీత్య లావణ్యాల్లలితా తేనచోచ్యతే । త్రైలోక్యసున్దరీ మేనా ముపయేమే పినాకభృత్. 12
సా సౌభాగ్యమయీ దేవీ భుక్తి ముక్తి ఫలప్రదా । తామారాధ్య పుమాన్నార్యానారీవా కింనవిన్దతి. 13
మనుః : కథమారాధనం తస్యా జగద్ధాత్ర్యా జనార్దన । యద్విధానం జగన్నాథ తత్సర్వంత్వం వదస్వ మే.

## అరువదవ అధ్యాయము.
## సౌభాగ్య శయన వ్రతము.

మత్స్య నారాయణుడు ఇట్లు చెప్పెను: ఇట్టిదే మరియొక వ్రతమును చెప్పెదను. వినుము. సౌభాగ్యశయన వ్రతమని దానిని పురాణవేత్తలందురు. అది సర్వ కామఫలదము.

పూర్వము ప్రళయకాలమున భూర్భువః సువరాది లోకములన్నియు దగ్ధములు కాగా సర్వభూతముల సౌభాగ్యము ఒకచో చేరి ఒకటిగానై వైకుంఠమున కేగి విష్ణు వక్షమున నిలిచెను. మరల చాలకాలమునకు సృష్టి ఆరంభము కాసాగెను. ప్రధాన పురుషాత్మకమగు లోకమంతయు మాయాకృతమయిన అహంకారముతో ఆవృతమయి యుండెను. బ్రహ్మ విష్ణులకు (తమ తమ గొప్పతనము విషయములో) పోటి ఏర్పడెను. *అపుడు లింగాకృతితో మహాభయంకర వహ్నిజ్వాల ఉద్భవించెను. దాని వేడిమితో మిగుల కాగిన విష్ణు వక్షమునుండి అంతవరకు కచట నిలిచిన సౌభాగ్యఘనము కరగి బయటికి వచ్చెను. అది ఆచటినుండి లేచి ఎగిరినది. అది భూమికి చేరులోపలనే అంతరిక్షమునం దుండగనే బ్రహ్మ మానసపుత్రుడును బుద్ధిశాలియు నగు దక్షుడు దానిని త్రాగెను. వెంటనే అతడు రూపలావణ్యబలతేజోవంతు డయ్యెను. దానిలో కొంత మిగిలినదై (చిందినదై) సర్వసౌభాగ్యదాయకములగు ఎనిమిది ఓషధులుగా నయ్యెను. 1. చెరకు 2. యవలు మొదలగువాని నుండి చేసిన చక్కెర (Glucose) 3. జాజికాయ 4. ధనియాలు 5. విరిగిన ఆవుపాలు 6. కుంకుమ పూవు 7. బొబ్బరలు 8. ఉప్పు అను ఈ ఎనిమిదిటికిని సౌభాగ్యాష్టకము అని పేరు. ఇవియే ఆ ఓషధులు. పీటిని పానము చేసిన దక్షుని కూతురే సతీదేవి అతిలోక లావణ్యవతి; కనుకనే ఆమెకు లలిత అని పేరు. ఆమెను శివుడు పెండ్లాడెను. ఆమె సౌభాగ్యమయియు భుక్తి ముక్తిప్రదాయినియు; ఆమె నారాధించిన స్త్రీకి కాని పురుషునకు కాని ఏమి లభింపకుండును? అనగా విని మనువు ఆ జగద్ధాత్రిని ఆరాధించు విధానమును తెలుపుమని యడుగగా మత్స్య నారాయణు డిట్లు చెప్పెను:

---

* ఇది బ్రహ్మదేవుని రజోగుణవ్యాప్తిచే కలిగిన తపః ప్రభావము.

శ్రీమత్స్యః : వసన్తమాస మాసాద్య తృతీయాయాం జనప్రియ ।
శుక్లపక్షస్య పూర్వాహ్ణే తిలైస్స్నానం సమాచరేత్. 15
తస్మిన్నహని సాదేవీ కిల విశ్వాత్మనా సతీ। పాణిగ్రహణికై ర్మన్త్రై రుదూఢా వరవర్ణినీ. 16
తయా సహైవ దేవేశం తృతీయాయా మథార్చయేత్। ఫలై ర్నానావిధైః పుష్పై ర్ధూపనైవేద్యసంయుతైః. 17
ప్రతిమాం పఞ్చగవ్యేన తథా గన్ధోదకేనచ । స్నాపయిత్వాఽర్చయే ద్గౌరీం చన్ద్రశేఖరసంయుతామ్. 18
నమోస్తు పాటలాయైచ పాదౌ దేవ్యాః శివస్యచ । శివాయేతిచ సఙ్కీర్త్య జయాయై గుల్ఫయోర్ద్విజ. 19
త్ర్యమ్బకాయేతి రుద్రస్య భవాన్యై జఙ్ఘయోర్యుగమ్ । శివం భద్రేశ్వరాయేతి విజయాయైచ జానునీ. 20
సఙ్కీర్త్య హరికేశాయ తథోరూ వరదే నమః । ఈశానాయా ఇతి కటిం శఙ్కరాయేతి శఙ్కరమ్. 21
కుక్షిద్వయంచ కౌశిన్యై శూలినం శూలపాణయే । మఙ్గళాయై నమస్తుభ్య ముదరం చాభిపూజయేత్. 22
సర్వాత్మనే నమస్తుభ్య మీశాన్యైచ కుచద్వయమ్ । శివం వేదాత్మనే తద్వ ద్రుద్రాణ్యై కణ్ఠమర్చయేత్. 23
త్రిపురఘ్నాయ విశ్వేశ మనన్తాయై కరద్వయమ్ । త్రిలోచనాయేతి హరం బాహూ కాలానలప్రియే. 24
సౌభాగ్యభవనాయేతి భూషణాని సమర్చయేత్ । స్వాహాస్వధాయైచ ముఖ మీశ్వరాయేతి శూలినమ్. 25
అశోకమధువాసిన్యై పూజ్యా వోష్ఠౌ విభూతిదౌ । స్థాణవేతి హరం తద్వ దాస్యం చన్ద్రముఖప్రియే. 26
నమోర్ధనారీశ హర మఖిలాఙ్గీతి నాసికామ్ । నమ ఉగ్రాయ లోకేశం లలితేతి పునర్భ్రువౌ. 27
శర్వాయ పురహన్తారం వాసవ్యై తు తథాలకాన్ । నమశ్శ్రీకణ్ఠనాథాయ శివం కేశాం స్తథార్చయేత్. 28
భీమోగ్రసమరూపిణ్యై శిర స్సర్వాత్మనే నమః । శివమభ్యర్చ్య విధివ త్సౌభాగ్యాష్టక మగ్రతః. 29
స్థాపయేజ్జాతినిష్పావ కుసుమ్భ క్షీర ధాన్యకాన్ । తవరాజేక్షులవణం కుసుమ్భక మథాష్టకమ్. 30
దత్తం సౌభాగ్యకృ ద్యస్మా త్సౌభాగ్యాష్టక మిత్యత । ఏవం నివేద్య తత్సర్వ మగ్రతశ్శివయోస్తతః. 31
చైత్రే శృఙ్గోదకం ప్రాశ్య స్వపే ద్భూమా వరిన్దమ ।

వసంత మాసారంభమున చైత్ర శుక్ల తృతీయా తిథియందు ఉదయమున నూవులతో (నూవుపిండితో నూవుల నూనెతో) స్నానము చేయవలెను. ఆనాడు ఆమె విశ్వాత్ముడగు పరమేశ్వరుని నమంత్రకముగా పెండ్లాడెను. కనుక ఆనాడు శ్రీలలితా పరమేశ్వరుల ప్రతిమలను గంధోదకముతోను పంచగవ్యములతోను స్నానము చేయించి వారిని నానా విధ ఫలపుష్పగంధ ధూపదీపములతో అర్చించవలెను.

మంత్రక్రమము : 1. పాటలాయై నమః - శివస్య దేవ్యాశ్చ పాదౌ పూజయామి; 2. జయాయై-శివాయచ నమః-గుల్ఫౌ పూజయామి; 3. భవాన్యై-త్ర్యంబకాయచ నమః-జంఘే పూజయామి; 4. విజయాయై-భద్రేశ్వరాయచ నమః-జానునీ పూజయామి; 5. వరదాయై-హరికేశాయ నమః-ఊరూ పూజయామి; 6. ఈశానాయై-శంకరాయ నమః-కటిం పూజయామి; 7. కౌశిన్యై-శూలపాణయే నమః-కుక్షిద్వయం పూజయామి; 8. మంగళాయై - మంగళాయ నమః - ఉదరం పూజయామి; 9. ఈశాన్యై-సర్వాత్మనేచ నమః - కుచద్వయం పూజయామి; 10. రుద్రాణ్యై - వేదాత్మనేచ నమః-కంఠం పూజయామి; 11. అనన్తాయై-త్రిపురఘ్నాయ నమః-కరౌ పూజయామి; 12. కాలానలప్రియాయై-త్రిలోచనాయ నమః-బాహూ పూజయామి; 13. సౌభాగ్యభవనాయై-సౌభాగ్యభవనాయ నమః - భూషణాని పూజయామి; 14. స్వాహాస్వధాయై - ఈశ్వరాయచ నమః-ముఖం పూజయామి; 15. అశోకమధువాసిన్యై-అశోకమధువాసినే నమః-ఓష్ఠౌ పూజయామి; 26. చంద్రముఖప్రియాయై-స్థాణవేచ నమః-ఆస్యం పూజయామి; 17. అఖిలాంగ్యై-అర్ధనారీశ్వరాయ నమః-నాసికాం పూజయామి; 18. లలితాయై-ఉగ్రాయచ-నమః-భ్రువౌ పూజయామి; 19. వాసవ్యై-శర్వాయ నమః-అలకాన్ పూజయామి; 20. శ్రీకంఠనాథాయై - శ్రీకంఠనాథాయ నమః-కేశాన్ పూజయామి; 21. భీమోగ్రసమరూపిణ్యై-సర్వాత్మనే నమః-శిరః పూజయామి.

ఇట్లు పూజించి సౌభాగ్యాష్టద్రవ్యములను ఏనిమిదింటిని లలితా పరమేశ్వరులముందుంచి నివేదించి ఉత్తరపూజ జరుపవలెను. గో శృంగోదకమును మాత్రము త్రాగి ఉపవాస ముండి భూమియందే శయనించి రాత్రి గడుపవలెను.

పునః ప్రభాతేతు తథా కృతస్నానజప శ్శుచిః. 32
సమ్పూజ్య ద్విజదామ్పత్యం మాల్యవస్త్రవిభూషణైః । సౌభాగ్యాష్టకసంయుక్తం సువర్ణప్రతిమాద్వయమ్.33
ప్రీయతామత్ర లలితా బ్రాహ్మణాయ నివేదయేత్ । ఏవం సంవత్సరం యావ త్తృతీయాయాం సదా మునే.
ప్రాశనే దానమన్త్రేచ విశేషం తన్నిబోధమే । గోశృఙ్గోదక మాద్యే స్యా ద్వైశాఖే గోమయం పునః. 35
జ్యేష్ఠే మన్దారపుష్పంచ బిల్వపత్రం శుచౌ స్మృతమ్ । శ్రావణే దధి సమ్ప్రాశ్యం నభస్యేతు కుశోదకమ్.
క్షీర మాశ్వయుజే మాసి కార్తికే పృషదాజ్యకమ్ ।
మార్గశీర్షే గోమూత్రం పౌషే సమ్ప్రాశయే ద్ఘృతమ్. 37
మాఘే కృష్ణతిలాం స్తద్వ త్పఞ్చగవ్యంచ ఫాల్గునే । లలితా విజయా భద్రా భవానీ కుముదా శివా. 38
వాసుదేవీ తథా గౌరీ మఙ్గళా కమలా సతీ । ఉమాచ దానకాలే తు ప్రీయతా మితి కీర్తయేత్. 39
మల్లికాశోక కమల కదమ్బోత్పల మాలతీః । కుబ్జకం కరవీరంచ బాణ మమ్లాన కుఙ్కుమమ్. 40
సిన్దువారంచ సర్వేషు మాసేషు క్రమశ స్స్మృతమ్ । జపా కుసుమ్భకుసుమం మాలతీ శతపత్రకమ్. 41
యథాలాభం ప్రశస్తాని కరవీరంచ సర్వదా । ఏవం సంవత్సరం యావ దుపోష్య విధివ న్నరః. 42
స్త్రీ కుమారీ పుమాన్వాపి శివం చాభ్యర్చ్య భక్తితః । వ్రతాన్తే శయనం దద్యా త్సర్వోపస్కరసంయుతమ్.
ఉమామహేశ్వరం హైమం వృషభంచ గవా సహ । స్థాపయిత్వాఽథ శయనే బ్రాహ్మణాయ నివేదయేత్.
అన్యాన్యపి యథాశక్తి మిథునా న్యమ్బరాదిభిః । ధాన్యాలఙ్కారగోదానై రభ్యర్చ్య వినిమన్త్రితమ్. 45
విత్తశాఠ్యేన రహితః పూజయే ద్గతవిస్మయః । ఏవం కరోతి య స్సమ్య క్సౌభాగ్యశయనవ్రతమ్. 46
సర్వా న్కామా నవాప్నోతి పదం చానన్త్య మశ్నుతే ।
ఫలస్యైకస్య * నాత్యాగ మేతత్కుర్వ న్సమాచరేత్. 47
యతః కీర్తి మవాప్నోతి ప్రతిమాసం నరాధిప । సౌభాగ్యారోగ్య రూపాయు ర్వస్త్రాలఙ్కార భూషణైః. 48
న వియుక్తో భవే ద్రాజ్యా ద్వర్షార్బుద శతత్రయమ్ । యస్తు ద్వాదశవర్షాణి సౌభాగ్యశయనవ్రతమ్. 49
కరోతి సప్త చాష్టౌవా శ్రీకణ్ఠభవనేఽమరైః । పూజ్యమానో వసే త్సమ్య గ్యావ త్కల్పాయుతం నరః. 50
నారీవా కురుతే యాత్ర కుమారీ వా నరేశ్వర । సాఽపి తత్ఫల మాప్నోతి దేవ్యనుగ్రహలాలితా. 51
శృణుయాదపి యశ్చైత త్ప్రదద్యా దథవా మతిమ్ । సోపి విద్యాధరో భూత్వా స్వర్గలోకే చిరం వసేత్.52
ఇదమిహ మదనేన పూర్వమిష్టం శతధృతినా కృతవీర్యసూనునా చ ।
కృతమథ వరుణేన నన్దినాఽన్యైః కిము జననాథ తదద్భుతం మహ త్స్యాత్. 53

ఇతి శ్రీమత్స్యమహాపురాణే మత్స్యమనుసంవాదాన్తర్గతేశ్వరనారద-
సంవాదే సౌభాగ్యశయనవ్రతకథనం నామ షష్టితమోఽధ్యాయః.

తెల్లవారిన తరువాత (చవితినాడు) స్నానజపములుచేసి శుచియై వస్త్రమాల్య విభూషణములతో విప్ర దంపతులను పూజించి లలితా పరమేశ్వరుల ప్రతిమలను సౌభాగ్యాష్టకమును 'లలితా ప్రీయతాం' అని వారికి దాన మీయవలెను. ఇట్లు ప్రతి మాసమున సంవత్సరము పొడవున చేయవలెను. ఉపవాసమునాడు తీసికొనవలసిన ఆహారమునను దానమంత్రమునను భేద ముండును. ఎట్లనగా- చైత్రమాసమున గో శృంగోదక మాహారము-'లలితాప్రీయతాం'మంత్రము. - వైశాఖ

---

* చత్యాగమేత

మున గోమయ మాహారము-'విజయా ప్రీయతాం' మంత్రము; జ్యేష్ఠమున మందారపుష్ప మాహారము - 'భద్రా ప్రీయతాం' మంత్రము; ఆషాఢమున బిల్వపత్రము ఆహారము-'భవానీ ప్రీయతాం' మంత్రము; శ్రావణమున పెరు గాహారము-'కుముదా ప్రీయతాం' మంత్రము; భాద్రపదమున కుశోదక మాహారము-'శివా ప్రీయతాం' మంత్రము; ఆశ్వయుజమున క్షీర మాహారము-'వాసుదేవీ ప్రీయతాం' మంత్రము; కార్తికమున పృషదాజ్యము (మీగడ పెరుగు) ఆహారము - 'గౌరీ ప్రీయతాం' మంత్రము; మార్గశిరమున-గోమూత్ర మాహారము-'మంగళా ప్రీయతాం' మంత్రము; పుష్యమున నేయి ఆహారము-'కమలా ప్రీయతాం' మంత్రము; మాఘమున నల్ల నువ్వులు (నువ్వుల పొడి) ఆహారము; 'సతీ ప్రీయతాం' మంత్రము; ఫాల్గునమున పంచగవ్య మాహారము-'ఉమా ప్రీయతాం' మంత్రము; చైత్రాదిమానములందు వరుసగా మల్లె-అశోకము-తామర-కడిమి-కలువ-మాలతి-కుబ్జకము (గొజ్జంగి) కరవీరము (ఎర్రగన్నేరు జాతి ఎర్రని తెల్లని పూలు) దెల్లి-వాడగన్నేరు-కుంకుమ పూవు-త్రేంకణము-ఈ పూవులతో పూజించవలెను. జపాపుష్పము - కుంకుమపూవు-మాలతి - నూరు రేకుల తామర-కరవీరము పూలు ఎప్పుడును ప్రశస్తములే.

ఇట్లు పండ్రెండు మాసములందును భక్తితో పూజించవలెను. వ్రతము ముగిసిన తరువాత ఉమా మహేశ్వర ప్రతిమను సర్వసామగ్రీయుక్తమయిన క్రొత్త మంచముపై నుంచి వానిని బ్రాహ్మణ దంపతులకు దాన మీయవలెను. యథాశక్తిగ మరికొందరు బ్రాహ్మణ దంపతులకు వస్త్రములు ధాన్యము ఆభరణములు గోవులు మొదలైనవి దాన మీయవలెను. ధనమునకై లోభించరాదు. అహంకారముతో చేయరాదు.

ఇట్లు చేసిన స్త్రీకాని పురుషుడు కాని కుమారి కాని అన్ని కోరికలును తీరి అనంతఫల మందుదురు. కీర్తి సౌభాగ్యారోగ్యరూపాయుర్వస్త్రాలంకరణ భూషణములు లభించును. మూడువందల అర్బుదముల సంవత్సరములు రాజత్వ మందును. ఇట్టి వ్రతమున వరుసగా పండ్రెండేండ్లు కాని పదునెనిమిదేండ్లయినను చేసినవారు పదివేల కల్పముల పాటు దేవతల సేవల నందుకొనుచు కైలాసమున వసింతురు.

దీనిని వినినను వినిపించినను వారికి కూడ విద్యాధరత్వమును స్వర్గలోక చిరనివాసమును లభించును.

దీనిని పూర్వము బ్రహ్మదేవుడు కార్తవీర్యార్జునుకు వరుణుడు-నంది-వీరు చేసిరి. మిగిలినవారి మాట చెప్పవలసిన పనియే లేదు.

ఇది శ్రీమత్స్య మహాపురాణమున సౌభాగ్యశయన వ్రతమను అరువదియవ అధ్యాయము.

## ఏకషష్టితమోఽధ్యాయః.
## అగస్త్యోత్పత్త్యాది కథనమ్.

నారదః : భూర్లోకోఽథ భువర్లోక స్స్వర్లోకోథ మహర్జనః । తప స్సత్యంచ సప్తైతే దేవలోకాః ప్రకీర్తితాః. 1
పర్యాయేణతు సర్వేషా మాధిపత్యం కథం భవేత్ । ఇహలోకే శుభం రూప మాయురారోగ్య మేవచ. 2
లక్ష్మీశ్చ విపులా నాథ కథం స్యా త్పురసూదన । ఏతన్మే భగవ న్సర్వంయథావ ద్వక్తు మర్హసి. 3

అగ్నిమారుతయోరిన్ద్రదత్తశాపః.

ఈశ్వరః : పురా హుతాశనస్సార్ధం మారుతేన మహీతలే । ఆదిష్టః పురుహూతేన వినాశాయ సురద్విషామ్.
నిర్దగ్ధేషు తతస్తేన దానవేషు సహస్రశః । * తారకః కమలాక్షశ్చ కాలదంష్ట్రఃపరావసుః. 5
విరోచనశ్చ సఙ్గ్రామా దపయాతా స్తపోధన । అన్తస్సముద్ర మావిశ్య సన్నివేశ మకుర్వత. 6
అశక్తా ఇతి తేఽప్యగ్నిమారుతాభ్యా ముపేక్షితాః । తతః ప్రభృతి వై దేవా న్మనుష్యా న్సహభుజఙ్గమాణ. 7
సమ్పీడ్యచ మునీ న్సర్వా న్ప్రవిశన్తి పునర్జలమ్ । ఏవం యుగసహస్రాణి దానవాః పఞ్చ సప్తచ. 8

జలదుర్గగతా బ్రహ్మ స్పీడయన్తి జగత్త్రయమ్ । తతః పున రథో వహ్నిమారుతా వమరాధిపః. 9
ఆదిదేశాచిరా దమ్బునిధి రేష విశోష్యతామ్ । యస్మా దస్మద్ద్విషాం చైవ శరణం వరుణాలయః. 10
తస్మా దృవద్భ్యామద్యైవ శోషమేష ప్రణీయతామ్ । తా వూచతు స్తత శ్శక్ర ముభౌ తౌ బలసూదనమ్.
అధర్మ ఏష దేవేన్ద్ర సాగరస్య విశోషణమ్ । యస్మా జ్జీవనికాయస్య మహత స్సంక్షయో భవేత్. 12
తస్మా న్న పావం భూయిష్ఠ ముత్సహేతాం పురన్దర । యస్య యోజనమాత్రేపి జీవకోటిశతాని వై. 13
నివసన్తి సురశ్రేష్ఠ స కథం నాశ మర్హతి । ఏవ ముక్త స్సురేన్ద్రస్తు కోపా త్సంరక్తలోచనః. 14
ఉవాచేదం వచో రోషాదుద్వమన్నివ పావకమ్ । న ధర్మాధర్మ సంయోగం ప్రాప్నువ న్త్యమరాః క్వచిత్.
భవతోస్తు విశేషేణ మాహాత్మ్యే నావతిష్ఠతోః । మదాజ్ఞాలఙ్ఘనం యస్మా న్మారుతేన సమన్వితః. 16
మునిత్రాణనహింసాది వరిగృహ్య న కిం కృతమ్ । ధర్మార్థశాస్త్రరహితం శత్రుం ప్రతి విభావసో. 17
తస్మా దేకేన వపుషా మునిరూపేణ మానుషే । మారుతేన సమం లోకే తవ జన్మ భవిష్యతి. 18
యదాచ మానుషత్వేచ తవ గణ్డూషశోషితః । భవిష్యత్యుదధి ర్వహ్నే తదా దేవత్వ మాప్స్యసి. 19
ఇతీన్ద్రశాపా త్పతితౌ తత్క్షణా త్తౌ మహీతలే । అవాప్తా వేకదేహేన కుమ్భజన్మ తపోధన. 20

అగస్త్యోత్పత్తిః

మిత్రావరుణయో ర్వీర్యా ద్వసిష్ఠస్యానుజోఽభవత్ । అగస్త్య ఇత్యుగ్రతపా స్సమ్బభూవ పునర్మునిః. 21

## అరువది ఒకటవ అధ్యాయము

## అగస్త్యోత్పత్తి-అగస్త్య పూజా విధానము

నారదుడు ఈశ్వరు నిట్లడిగెను: "ఇహలోకమున శుభమగు రూపమును ఆయువును ఆరోగ్యమును ఐశ్వర్యమును పరమున క్రమముగా భూర్లోక భువర్లోక స్వర్లోక మహర్‌లోక జనలోక తపోలోక సత్యలోకము లనెడి ఊర్ధ్వలోకములను పొంది సుఖించుటకు సాధనమగు విధానమును ఉపదేశింప వేడుచున్నాను."

ఈశ్వరుడు నారదునకిట్లు చెప్పెను: పూర్వము ఇంద్రుడు అగ్ని వాయువులను అసుర నాశము చేయవలసినదిగా ఆజ్ఞాపించెను. వారును వేలకొలదిగా దానవులను దహించిరి. తారకుడు కమలాక్షుడు కాలదంష్ట్రుడు పరావసువు విరోచనుడు సంగ్రామమునుండి తప్పించుకొనిపోయి సముద్రాంతర్భాగమున నివసింపసాగిరి. వీరు చేతకానివారు కదా! యని అగ్ని వాయువులు వారిని కాల్చక విడిచిరి. నీటినుండి వారందరును దేవ మనుష్య నాగులను మునులను బాధించి మరల నీటిలో ప్రవేశించుచుండిరి. ఇట్లు పండ్రెండు వేల యుగములు లోకత్రయమును ఈ జలదుర్గమునం దుండి బాధించిరి.

అంతట దేవేంద్రుడు అగ్ని వాయువులను మరల పిలిచి 'ఈ దేవ శత్రువులకు సముద్రము ఆవాసముగా నున్నది. కనుక మీరు ఈ సముద్రమును ఎండింపజేయుడు. అని కోరెను. వారును "ఇంద్రా! సాగరమును శోషింపజేయుట ఎంతో అధర్మము. ఏలయన అందుచే వానియందలి ప్రాణులకు ఎన్నిటికో నాశము కలుగును. సముద్రమునందే కాదు-సముద్రమునకు యోజనముల దూరమునకూడ దాని నాధారముగా చేసికొని వందలకొలది ప్రాణులు జీవించుచున్నవి. ఇట్టిదాని నెండింపజేయుట తగునా? ఇట్టి పాపము మేము చేయలేము." అనిరి. ఈమాట విని ఇంద్రుడు కోపముతో కన్నులెర్రజేసి నిప్పులే క్రక్కుచున్నాడేమో అన్నట్లు చూచుచు రోషవచనములు ఇట్లు పలికెను: "దేవతలకు పాపమంటుట ఎక్కడనులేదు. విశేషించి మహా మహిమ వంతులగు మీకు అట్టిది లేనేలేదు. ఐనను మీరు నా ఆజ్ఞను ఉల్లంఘించితిరి. దీనిచేత మునులకు హింస దానవులకు రక్షణ మొదలగు దోషములెన్నియో సంభవించును. ఇది ధర్మార్థ శాస్త్ర విరుద్ధము. కనుక మీరు ఇద్దరును మానవలోకమున ఒకేఒక మానవ దేహముతో మునులుగా జన్మింతురుగాక! అందునను అగ్నీ! నీవు అప్పుడు కూడ నీ పుక్కిటితో సముద్రమును ఎండింపజేయుదువు. అపుడు మరల నీకు దేవత్వము

లభించును." అనగానే అగ్ని వాయువులు ఇద్దరును భూతలమునకు వచ్చిపడిరి. మిత్రా వరుణుల (మిత్రుడు వరుణుడు అను జంట దేవతల) వీర్యమువలన కుంభమునుండి ఒకే దేహముతో జన్మించిరి. అగ్నిదేవుడు అగస్త్యమునిగా వసిష్ఠునికి తమ్ముడై జన్మించెను.

నారదః: సమ్భూత స్స కథం భ్రాతా వసిష్ఠస్యాభవ న్మునిః ।
కథంచ మిత్రావరుణౌ పితరౌ తస్య తౌ స్మృతౌ. 22
జన్మ కుమ్భా దభూచ్చాస్య కథంవా పురసూదన । ఏత దాచక్ష్వ భగవ న్యథావ ద్విబుధోత్తమ. 23
ఈశ్వరః: పురా పురాణపురుషః కదాచి ద్గన్ధమాదనే । భూత్వా ధర్మసుతో విష్ణు శ్చచార విపులం తపః 24
తపసా తస్య భీతేన విఘ్నార్థం ప్రేషితా వుభౌ । శక్రేణ మాధవానఙ్గా వప్సరోగణసంయుతౌ. 25
యదా న గీతవాద్యేన నాఙ్గహారాదినా హరిః । న కామమాధవాభ్యాం చ ★విషయా న్ప్రీతిచక్రమే. 26
తదా కామమధుస్త్రీణాం విషాద మగమద్గణః । సంక్షోభాయ తత స్తేషాం స్వోరుదేశా న్స రాగ్రజః. 27
నారీ ముత్పాదయామాస త్రైలోక్యజనమోహినీమ్ । సంక్షుబ్ధా స్తు తథా దేవా స్తథైవచ సురావుభౌ. 28
అప్సరోభి స్సమక్షం హి దేవాం స్తా న్స్రబ వీ ద్ధరిః । ఊర్వశీతిచ నామ్నేయం లోకే ఖ్యాతిం గమిష్యతి. 29
తతః కామయమానేన మిత్రేణాహూయ చోర్వశీ । ఉక్తా మాం రమయస్వేతి బాఢ మి త్యబ్రవీచ్చ సా.
గచ్ఛన్తీ ప్రాన్తరే తస్మిన్ స్తోక మిన్దీవరేక్షణా । వరుణేన వృతా పశ్చా ద్వరుణం నాన్వమన్యత. 31
మిత్రేణాహం వృతా పూర్వ మద్య భార్యా న తే ప్రభో ।
ఉవాచ వరుణ శ్చిత్తం మయి విన్యస్య గమ్యతామ్. 32
గతాయాం బాఢ మిత్యుక్త్వా మిత్ర శ్శాప మదా త్తదా ।
గచ్ఛ త్వం మానుషే లోకే భజ సోమసుతాత్మజమ్. 33
భజస్వేతి యతో వేశ్యాధర్మ ఏష త్వయా కృతః । జలకుమ్భే తతో వీర్యం మిత్రేణ వరుణేన చ. 34
ప్రక్షిప్త మథ సఞ్జాతౌ ద్వావేవ మునిసత్తమౌ । నిమిర్నామ నృపః పూర్వం స్త్రీభి ర్ద్యూత మదీవ్యత. 35
తదన్తరే జగామాథ వసిష్ఠో బ్రహ్మణ స్సుతః । తస్య పూజా మకుర్వంస్తు శశాప స ముని ర్నృపమ్. 36
విదేహ స్సమ్భవస్వేతి శప్త స్తేనాప్యసౌ మునిః । అన్యోన్యశాపాచ్చ తయో ర్విశరీర విచేతసోః. 37
జగ్మతు శ్శాపనాశాయ బ్రహ్మాణం పద్మసమ్భవమ్ । అథ బ్రహ్మసమాదేశా ల్లోచనే ష్వవసన్నిమిః. 38
నిమేషాఃస్యుశ్చలోకానాం తద్విశ్రామాయ నారద । వసిష్ఠోఽప్యభవ త్తస్మిన్ జలకుమ్భేతు పూర్వవత్. 39
తత శ్శ్వేత శ్చతుర్బాహు స్సాక్షసూత్రకమణ్డలుః । అగస్త్య ఇతి శాన్తాత్మా బభూవ ఋషిసత్తమః. 40
మలయస్యైకదేశే తు ♦వైఖానసవిధానతః । సభార్య స్సంవృతో విప్రై స్తప శ్చక్రే సుదుష్కరమ్. 41

ఈశ్వరుడిట్లు చెప్పగా నారదుడు 'అగస్త్యుడు కుంభమునుండి ఎట్లు జన్మించెను? వసిష్ఠునకు తమ్ముడెట్లయ్యెను? వీరికి మిత్రావరుణులెట్లు తండ్రులైరి? ఇదంతయు తెలుపుము.' అని వేడెను. ఈశ్వరుడిట్లు చెప్పెను: ఒకానొకసమయమున పురాణ పురుషుడగు విష్ణుడు ధర్ముని కుమారుడగు నారాయణుడను మునియై గంధమాదన పర్వతమున విస్తృత తప మాచరించెను. అతని తపమునకు భయమందిన ఇంద్రుడు అతని తపము భగ్నమొనర్పగోరి వసంతుని మన్మథుని వారి కప్సరాగణములు తోడుగా అటకు పంపెను. వారు ప్రయోగించిన నాట్యగీత వాద్యములతోగాని వసంత మన్మథుల ప్రవృత్తులతోకాని ఆముని విషయ సుఖముల వైపునకు ప్రవృత్తుడు కాలేదు. తమ యత్నములు వమ్ముకాగా వారందరును విషాదమందిరి. వారి నింకను కలత పరచదలచి నారాయణముని తన తొడలనుండి త్రైలోక్య జన మోహినియగు

---

★ విషయాన్ప్రతిచక్షుషోః ♦ వైశ్వానరవిధానవిత్

యువతిని జనింపజేసి చూపెను. చూచి వారును కలతపడిరి. నా ఊరువులనుండి జనించినందున ఈమెకు ఊర్వశియను నామమున ప్రసిద్ధయై (అప్సరయై) యుండునని నారాయణముని వసంత మన్మథులకును అప్సరలకును ఇతర దేవతలకును చెప్పెను.

ఆమెను చూచి కామ వశీభూతుడై మిత్రుడు (ఉదయించు సూర్యునకు అభిమాని యగు దేవత) తన్నానందింప జేయుమని ఊర్వశిని కోరెను. ఆమె యంగీకరించెను. నల్లకలువలవంటి కన్నులుకల ఆ సుందరి అతని వెంట కొంచెము దూరము పోగానే వరుణుడు (అస్తమించు సూర్యున కభిమానియగు దేవత) ఆమెను చూచి అతడును ఆమెను తన్నానందింపజేయుమని కోరెను. నన్ను ముందుగా మిత్రుడు వరించెను కావున నేనిప్పుడు అతనికి భార్యగానున్నాను. (అతని కోరిక తీర్చువరకు) నేను నీకోరిక తీర్చజాలనని యామె వరుణుని కోరిక అంగీకరించకపోయెను. అట్లయినచో నీవు నీచిత్తమునైన నాయందు నిలిపి పొమ్మని వరుణుడు పలికెను. ఊర్వశి నరేయని మిత్రునితో వెళ్ళెను. నీవు చేసిన ఈపని వేశ్యాధర్మము. కావున నీవు భూలోకమునకుపోయి అచట సోముని పౌత్త్రుని (కి భార్యవై అతనిని) ఆశ్రయింతువు. అని మిత్రుడామెను శపించెను. (అతడును ఆమెతో సుఖించలేదు.) (ఊర్వశీ విషయకమయిన కామ వశమున స్థానము తప్పిన) తమ వీర్యమును మిత్రావరుణులు ఇద్దరును (అపుడచట లభించినయొక) జలకుంభమున నిలిపిరి. (దానినుండి) లోగడ చెప్పిన ముని సత్తములు వసిష్ఠాగస్త్యులు జనించిరి.

★పూర్వము ఒకనాడు నిమి అనురాజు తన భార్యలతో జూదమాడుచుండెను. అట్టి సమయమున బ్రహ్మ మానసపుత్త్రుడు వసిష్ఠుడచటికి పోయెను. నిమి అతనిని ఆదరించలేదు అందుచే నీవు విదేహుడవు (దేహము లేనివాడవు) కమ్ము-అని వసిష్ఠుడు నిమిని శపించెను. నిమికూడ వసిష్ఠుని శపించెను. దానిచే నిమి విదేహుడయ్యెను. వసిష్ఠుడు చేతస్సు (చిత్తవృత్తి ప్రవృత్తులు) లేనివాడయ్యెను. (ఇద్దరును ఇట్లు కావలసియుండగా) శాపనాశమునకై ఇరువురును బ్రహ్మ కడకు పోయిరి. బ్రహ్మదేవుని ఆదేశమున నాటినుండి 'నిమి' (భూలోక జీవుల) కన్నులయందు నివసింపసాగెను. అతని విశ్రాంతికై అప్పటినుండి మానవులు మొదలగు ప్రాణులకు నిమే(మి)షములు ఏర్పడెను. (నిమి-శ = నిమిః శేతే అస్మిన్-'నిమి' దీనియందు శయనించును కనుక నిమిశ-నిమేశ >నిమిష-నిమేష) (బ్రహ్మదేవుని ఆజ్ఞచేతనే) వసిష్ఠుడును జల కుంభమునందు చేరి లోగడ చెప్పినట్లు మిత్రావరుణుల కుమారుడయ్యెను. అతనితోపాటు ఆకడవనుండియే తెల్లనిమేని చాయ నాలుగు బాహువులు జపమాల కమండలువు కలిగి శాంతాత్ముడగు అగస్త్య మహర్షి ఉద్భవించెను. ఆయన మలయ పర్వత భాగమున తన భార్యతోకూడి విప్రపరివృతుడయి వైఖానస (వానప్రస్థ) విధానముతో దుష్కరమగు తప మాచరింపసాగెను.

తతః కాలేన మహతా *తారకాది నిపీడితమ్ । జగద్వీక్ష్య స కోపేన పీతవా న్వరుణాలయమ్. 42
విద్వత్పృద్ధిక్షయకృతో మృత్యు రన్యో విధాయ చ । కాలకూటం వృథా చక్రే శ్వేతకేతో ర్న తృప్తికృత్.
తతోఽన్యే వరదా స్సర్వే బభూవు శ్శఙ్కరాదయః । బ్రహ్మా విష్ణుశ్చ భగవా న్వరదానాయ జగ్మతుః. 44

* కాలకాది

మొదట బ్రహ్మ మానసపుత్త్రుడుగా చెప్పబడిన వసిష్ఠుడుమరల మిత్రావరుణుల కుమారుడై అగస్త్యునితో పాటు ఎట్లు జన్మించెనను ప్రశ్నకు ఈ ఉపాఖ్యానము సమాధానముగా నున్నది. ఛాందోగ్యోపనిషత్తునందు వసిష్ఠ పదముతో చెప్పబడిన ముఖ్య ప్రాణతత్త్వమునకును వసిష్ఠుడు బ్రహ్మ మానసపుత్త్రుడనుటకును వాయుదేవుడే ఇంద్రశాపమున జలకుంభమునుండి వసిష్ఠుడుగా పుట్టెననుటకును వేదాంత శాస్త్రానుసారము సమన్వయము కూడ ఈ కథవలన కుదురుచున్నది. ఇదియంతయు తత్త్వ విచారణ మార్గమున ఆలోచించుటచే తెలియవలసిన విషయము. పురాణములు ఇట్లు సర్వవిధ విజ్ఞానమును అందించుచున్నవి.

వరం వృణీష్వ భద్రం తే యదభీష్టం భవే న్మునే ।
అగస్త్యః: యావ ద్బ్రహ్మసహస్రాణాం పఞ్చవింశతికోటయః. 45
వైమానికో భవిష్యామి దక్షిణాచలవర్త్మని । మద్విమానోదయే కుర్యా ద్యః కశ్చి త్పూజనం మమ. 46
స సప్తలోకాధిపతిః పర్యాయేణ భవిష్యతి । ఈశ్వరః: ఏవమస్త్వితి తేఽప్యుక్త్వా జగ్ము ర్దేవా యథాగతమ్.
తస్మా దర్ఘ్యః ప్రదాతవ్యో హ్యగస్త్యస్య సదా బుధైః ।
నారదః: కథ మర్ఘ్యప్రదానంతు కర్తవ్యం తస్య వై ప్రభో. 48
విధానం య దగస్త్యస్య పూజనం తద్వదస్వ మే ।
ఈశ్వరః: ప్రత్యూషసమయే విద్వా న్కుర్యా దస్యోదయే సతి. 49
స్నానం శుక్లతిలై స్తద్వ చ్ఛుక్లమాల్యామ్బరో గృహీ । స్థాపయే దవ్రణం కుమ్భం మాల్యవస్త్రవిభూషితమ్.
పఞ్చరత్నసమాయుక్తం ఘృతపాత్రేణ సంయుతమ్ ।
అఙ్గుష్ఠమాత్రం పురుషం తథైవ సౌవర్ణ మత్యాయతబాహు దణ్డమ్. 51
చతుర్భుజం కుమ్భముఖే నిధాయ ధాన్యాని రత్నామ్బర సంయుతాని ।
సకాంస్యపాత్రాక్షతశుక్తియుక్తం మన్త్రేణ దద్యా ద్ద్విజపుఙ్గవాయ. 52
ఉత్క్షిప్య లమ్బోదరదీర్ఘబాహు రనన్యచేతా★ఽయ ముదఙ్ముఖ స్సన్ ।
శ్వేతాంచ దద్యా ద్యది శక్తిరస్తి రౌప్యైం ఖురై ర్హేమముఖీం సవత్సామ్. 53
ధేనుం తతః క్షీరవతీం ప్రణమ్య సవత్సఘణ్టాభరణాం ద్విజాయ ।
*ఆసప్తరాత్రా దుదయేఽర్ఘ్య మస్య దాతవ్య మేత త్సకలం నరేణ. 54
యావ త్సమా స్సప్త దశాథవా స్యు రథోర్ధ్వమప్యత్ర వదన్తి కేచిత్ ।
కాశపుష్పప్రతీకాశ హ్యగ్నిమారుత సమ్భవ. 55
మిత్రావరుణయోః పుత్ర కుమ్భయోనే నమోఽస్తు తే ।
త్ర్యబ్దం చ ♦ఫలత్యాగ మేవం కుర్వన్న హీయతి. 56
హోమం కుర్యా త్తతః పశ్చా ద్వర్జయే న్మనసా ఫలమ్ । అనేన విధినా యస్తు పుమా నర్ఘ్యం నివేదయేత్.
ఇమం లోక మవాప్నోతి రూపారోగ్యసమన్వితః । ద్వితీయేన భువర్లోకం స్వర్లోకంచ తతః పరమ్. 58
సప్త లోకా నవాప్నోతి సప్తార్ఘ్యా న్యః ప్రయచ్ఛతి ।
ఇతి పఠతి శృణోతి వా య ఏత ద్వసుయుగళాంగభవస్య సమ్ప్రదానమ్. 59
మతిమపిచ దదాతి సోఽపి విష్ణో ర్భవనగతః పరిపూజ్యతేఽమరౌఘైః. 59½

ఇతి శ్రీ మత్స్యమహాపురాణే మత్స్యమను సంవాదాన్తర్గతేశ్వరనారదసంవాదే
అగస్త్యోత్పత్తి తత్పూజాదికథనం నామైక షష్టితమోఽధ్యాయః.

ఇట్లు చాలకాలము గడచెను. ఈ అగస్త్యుడు తారకాది దానవులు జగములను పీడించుట చూచి కోపవశమున సముద్రమును త్రాగివేసెను. వింధ్య పర్వతవృద్ధిని ఆటంకపరచెను. రెండవ మృత్యువును సృష్టించెను. కాలకూట విషమును వ్యర్థమయ్యిన దానినిగా (శక్తిహీనమగునట్లు) చేసెను. శ్వేతకేతువను వాతని చంపెను. ఇట్టి మహాకార్యములు చేసినందున సంతసించి శంకరుడు బ్రహ్మ విష్ణువు మొదలగువారు అగస్త్యునకు వరమీయదలచివచ్చి "మునీ! నీకభీష్టమగు వరమేదియో కోరుము. ఇత్తుము." అనిరి. అగస్త్యుడిట్లు వరము కోరెను. "ఇరువదియైదు కోట్ల సంవత్సరముల కాలము

★యమద్దిఙ్ముఖస్సన్ *ఆసప్తరాత్రోదయమూర్ధ్వమస్య ♦ఫలైర్యోగమేవం.

నేను దక్షిణ (మలయ) మార్గమున వైమానికుడనై (అంతరిక్షమున వెలుగు జ్యోతిర్గోళమనై) ఉండవలయును. నావిమానము (జ్యోతీరూపము) ఉదయించినపుడు నన్ను పూజించినవాడు క్రమముగా భూర్లోకమాదిగా ఏడు ఊర్ధ్వ లోకములకు అధిపతి (వాటియందు సుఖించుటకు అధికారి) కావలయును." అని కోరగా అట్లే యగునని వరమిచ్చి ఆదేవతలు వచ్చిన త్రోవను వెళ్ళిరి. కావున ఈ విషయము నెరిగి వివేకులై జనులు అగస్త్యునకు అర్ఘ్యమునీయవలెను.

ఈశ్వరు డిట్లు చెప్పగా విని నారదుడు అగస్త్యునకు అర్ఘ్య మిచ్చుటకును పూజ సేయుటకును కల విధాన మేదో తెలుపుమని ఈశ్వరుని ప్రార్థించగా ఆ దేవు డిట్లు చెప్పెను: ప్రభాతకాలమున అగస్త్య నక్షత్రము ఉదయించు వేళకు సంప్రదాయ మెరిగిన గృహస్థుడు నిద్ర మేల్కాంచి తెల్లని నూవులతో (నూవుపిండితో నూవులనూనెతో) స్నాన మాడ వలయును. తెల్లని పూలను వస్త్రములను ధరించవలెను. పూలను వస్త్రములను చుట్టును చుట్టి అలంకరించిన కలశమును (నీటితో నింపి) నిలిపి దానియందు పంచరత్నములను (ముత్యము పగడము మొదలగునవి) వేయవలెను. దాని దగ్గర ఒక నేతి పాత్ర ఉంచవలెను. బంగారుతో బొటనవ్రేలంత పరిమాణము కలిగి పొడవయిన నాలుగు బాహువులుకల పురుషుని ప్రతిమ చేయించి ఆ ఘృతపాత్ర దగ్గర ఉంచవలయును. ఆ ప్రతిమతోపాటు ధాన్యములు రత్నములు నూతన వస్త్రములు కంచుపాత్రము అక్షతలు ముత్తెపు చిప్పలు చేర్చవలెను. ఇవన్నియు మంత్రపూర్వకముగా దానము చేయవలెను. ఈ దానము చేయునపుడు దాత ఉత్తరాభిముఖుడై తన దీర్ఘబాహువులను పైకెత్తవలయును. అనన్యచిత్తుడై యుండవలయును. శక్తియున్నచో తెల్లని వన్నె కలిగి వెండి గిట్టలు బంగరు మొగపువట్టె మెడలో గంటలు మువ్వలు కలిగి దూడకల పాడి యావును కూడ దానము చేయవలెను. ఇట్లు ఆగస్త్యోదయదినము మొదలు ఏడు దినములు ఈ విధ మగు దానముతోపాటు అర్ఘ్యము నగస్త్యున కీయవలయును.

ఇట్లు వరుసగా పదునేడు సంవత్సరములు చేయవలయును. అంతకంటె ఎక్కువ కాలము వరకు కూడ చేయవలయు(వచ్చు)నని కొందరందురు.

ఫలత్యాగమంత్రము: "తెల్లపూవువంటి దేహప్రకాశము కలిగి అగ్నిమారుతుల వలన జనించినవాడవై మిత్రావరుణదేవుల పుత్త్రుడవై జలకుంభమునుండి ఉత్పన్నుడవైన అగస్త్యా! నీకు నమస్కారము."

సంప్రదాయ మెరిగి ప్రతి ఏడు ఇట్లర్ఘ్యము నీయవలెను. తరువాత హోమము జరిపి మనః పూర్వకముగా ఫలత్యాగము చేయవలెను.

ఈ విధానానుసారము అగస్త్యునకు అర్ఘ్యము నర్పించు పురుషుడు ఈ భూర్లోకమున రూపాయురారోగ్యములతో సుఖించును. తరువాత క్రమముగ భువర్లోకము మొదలగు ఊర్ధ్వలోకములను అన్నిటిని పొంది అచ్చటను సుఖించును.

అష్టవసువులలోని వారగు అగ్నిమారుతుల అంశవలన జనించిన (వారి కుమారుడేయగు) అగస్త్యుని అర్ఘ్యదాన విధానమును చదివినను వినినను ఉత్తమ జ్ఞానమును పొంది విష్ణులోకమును చేరి అచట దేవతలచేత పూజల నందుకొనును.

ఇది శ్రీమత్స్య మహాపురాణమున అగస్త్యోత్పత్తి తదర్ఘ్య తత్పూజా విధానమను
అరువది యొకటవ అధ్యాయము.

## ద్విషష్టితమోఽధ్యాయః.
## అనన్తతృతీయావ్రతమ్.

మనుః : సౌభాగ్యారోగ్యఫలదమముత్రాక్షయకారకమ్ । భుక్తిముక్తి ప్రదం దేవ తన్మే బ్రూహి జనార్దన. 1
శ్రీమత్స్యః : య దుమాయాః పురా దేవ ఉవాచాన్ధక సూదనః । కైలాసశిఖరాసీనో దేవ్యా పృష్ట స్తదా కిల.
కథాసు సంప్రవృత్తాసు ధర్మ్యాసు లలితాసు చ । త దిదానీం ప్రవక్ష్యామి భుక్తిముక్తిఫలప్రదమ్. 3
ఈశ్వరః : శృణుష్వావహితా దేవి తథైవానన్తపుణ్యకృత్। నరాణా మథ నారీణా మారాధన మనుత్తమమ్.
నభస్యే వాఽథ వైశాఖే మాఘేవా మార్గశీర్షకే । శుక్లపక్షతృతీయాయాం స్నాతస్స న్గౌరసర్షపైః. 5

గోరోచనాంచ గోమూత్రం కృష్ణ గోశకృతం తథా । దధిచన్దనసమ్మిశ్రం లలాటే తిలకం న్యసేత్. 6
సౌభాగ్యారోగ్యకృత్తస్మా త్తత్సదా లలితాప్రియమ్ । ప్రతిపక్షం తృతీయాసు దధానః పీతవాససీ. 7
ధారయే దథ రక్తాని నారీచే త్పతిసంయుతా । విధవా వా త్వరక్తాని కుమారీ శుక్లవాససీ. 8
దేవీంచ పఞ్చగవ్యేన తతః క్షీరేణ కేవలమ్ । స్నాపయే న్మధునా * తద్వ త్పుష్పగన్ధోదకేనతు. 9
పూజయే చ్ఛుక్లపుష్పైస్తు ఫలై ర్నానావిధై రపి । ధాన్యకైర్జీరలవణై ర్గుడక్షీరఘృతాన్వితైః. 10
శుక్లాక్షతతిలై రర్చాం తతో దేవీం సమర్చయేత్ । పాదా ద్యభ్యర్చనం కుర్యా త్ప్రతిపక్షం వరాననే. 11

## అరువది రెండవ అధ్యాయము.

## అనంత తృతీయా వ్రతము

సౌభాగ్యారోగ్య ఫలప్రదమును పరలోకమున అక్షయఫల మిచ్చునదియు భుక్తి ముక్తిప్రదమును నగు వ్రతమును నాకు తెలుపుమని మనువు అడుగగా మత్స్యనారాయణు డిటులు చెప్పెను. పూర్వము అంధకాసురహంతయగు పరమేశ్వరుని ఉమాదేవి యడుగ కైలాస శిఖరమం దాసీనుడై యున్న ఈశ్వరుడు ధర్మమునకు అనుకూలములును లలితములును అగు ప్రసంగముల నడుమ చెప్పిన వ్రతము ఒకటి కలదు. దానిని చెప్పెద; వినుము.

ఈశ్వరుడు ఉమకు ఇటులు చెప్పెను: నరులకు కాని నారులకు కాని అనంత పుణ్యఫలమును ఇచ్చు అత్యుత్తమమగు వ్రతము ఒకటి కలదు; అవహితురాలవయి వినుము. భాద్రపద వైశాఖ మాఘ మార్గశీర్ష మాసములలో దేనియందైన శుక్ల తృతీయనాడు తెల్లని ఆవాలతో (ఆవపిండితో ఆవనూనెతో) స్నానము చేయవలెను. గోరోచనము గోమూత్రము నల్లని ఆవు గోమయము పెరుగు చందనము-ఇవన్నియు కలిపిన తిలకమును నుదుట ధరించవలయును. ఏలయన ఈ తిలకము సదా లలితా ప్రీతికరమును సౌభాగ్యారోగ్యకరమును. తరువాత పట్టు వస్త్రములు ధరించవలయును. ముత్తైదువలు ఎర్రని వస్త్రములను విధవయైనచో ఎర్రనివి కాని వస్త్రములను కన్యలైనచో తెల్లని వస్త్రములను ధరించవలయును. దేవిని వరుసగా పంచగవ్యముతో కేవలము గోక్షీరములతో తేనెతో పన్నీటితో స్నానము చేయించవలెను. తెల్లని పూవులతో తెల్లని అక్షతలతో తెల్లని పూవులతో పూజించవలయును. నానావిధ ఫలములు జీలకర్ర ధనియాలు ఉప్పు బెల్లము పాలు నేయి నివేదించవలయును.

వరదాయై నమః పాదౌ తథా గుల్ఫౌ శ్రియై నమః । అశోకాయై నమో జఙ్ఘే పార్వత్యై జానునీ తథా. 12
ఊరూ మఙ్గళకారిణ్యై వామదేవ్యై తథా కటిమ్ । పద్మోదరాయై జఠర మురః కామశ్రియై నమః. 13
కరౌ సౌభాగ్యదాయిన్యై బాహూ హరముఖశ్రియే । ముఖం దర్పణవాసిన్యై స్మరదాయై స్మితం నమః. 14
గౌర్యై నమ స్తథా నాసా మతులాయై చ లోచనే । తుష్ట్యై లలాటఫలకం కాత్యాయన్యై నమ శ్శిరః. 15
నమో గౌర్యై నమో ధృత్యై నమః కాన్త్యై నమ శ్శ్రియై । రమ్భాయై లలితాయైచ వామదేవ్యై నమోనమః.
ఏవం సమ్పూజ్య విధివ దగ్రతః పద్మ మాలిఖేత్ । పత్రై ర్ద్వాదశభి ర్యుక్తం కుఙ్కుమేన సకర్ణికమ్. 17
పూర్వేతు విన్యసే ద్గౌరీ మపర్ణాంచ తతః పరే । భవానీం దక్షిణే తద్వ ద్రుద్రాణీంచ తతః పరే. 18
విన్యసే త్పశ్చిమే సౌమ్యాం తథా మదనవాసినీమ్ ।
వాయవ్యే పాటలా ముగ్రా ముత్తరేణ తథాఽప్యుమామ్. 19
సాధ్యాం సత్యాం శుభాం సౌమ్యాం మఙ్గళాం కుముదాం సతీమ్ ।
రుద్రంచ మధ్యే సంస్థాప్యలలితాం కర్ణికోపరి. 20
కుసుమై రక్షతై ర్వాపి నమస్కారేణ విన్యసేత్ । గీతమఙ్గళనిర్ఘోషం కారయిత్వా సువాసినీః. 21
పూజయే ద్రక్తవాసోభీ రక్తమాల్యానులేపనైః । సిన్దూరం స్నానచూర్ణంచ తాసాం శిరసి దాపయేత్. 22

సిన్దూరం కుఙ్కుమస్నాన ముపదిష్టం యత స్తతః । తథోపదేష్టారమపి పూజయే ద్యత్నతో గురుమ్. 23
నమ్పూజ్యతే గురు ర్యత్ర సర్వా స్తస్య ఫలాః క్రియాః ।

పాదాది పూజా మంత్రములు: 1. వరదాయై నమః పాదౌ పూజయామి; 2. శ్రియై నమః గుల్ఫౌ పూజయామి; 3. అశోకాయై నమః జంఘే పూజయామి; 4. పార్వత్యై నమః జానునీ పూజయామి; 5. మంగళకారిణ్యై నమః ఊరూ పూజయామి; 6. వామదేవ్యై నమః కటిం పూజయామి; 7. పద్మోదరాయై నమః జఠరం పూజయామి; 8. కామశ్రియై నమః ఉరః పూజయామి; 9. సౌభాగ్యదాయిన్యై నమః కరౌ పూజయామి; 10. హరముఖశ్రియే నమః - బాహూ పూజయామి; 11. దర్పణ వాసిన్యై నమః-ముఖం పూజయామి; 12. స్మరదాయై నమః స్మితం పూజయామి; 13. గౌర్యై నమః నాసికాం పూజయామి; 14. అతులాయై నమః నేత్రే పూజయామి; 15. తుష్ట్యై నమః లలాట ఫలకం పూజయామి; 16. కాత్యాయన్యై నమః-శిరః పూజయామి; గౌరికి ధృతికి కాళికి శ్రీకి రంభకు లలితకు వామదేవికి నమస్కారము. అని ఇట్లు పూజించవలెను.

పూజకు ముందే ఆయా దేవతలను కూర్చుండపెట్టవలసిన విధానమును స్థానములును ఏవి యనిన- మొదట కుంకుమతో పండ్రెండు రేకులును నడుమ దుద్దుకల పద్మము ముగ్గుగా వేయవలెను. దానిపై తూర్పున గౌరిని అపర్ణను-దక్షిణమున భవానిని రుద్రాణిని-పడమట సౌమ్యను మదనవాసినిని-వాయవ్యమున పాటలను ఉగ్రను- ఉత్తరమున ఉమా సాధ్యా సత్యాశుభా సౌమ్యా మంగళా కుముదా సతీ-దేవులను నడుమ కర్ణికపై రుద్రుని స్థాపించవలయును. అట్లు నిలుపునపుడు వారిపై కుసుమములను అక్షతలను ఉంచి (ఆవాహయామి స్థాపయామి పూజయామి అనుచు) నమస్కరించుచుండవలయును.

ఇట్లు మొదట ఆవాహనము తరువాత పైని చెప్పినట్లు పూజనము నివేదనము ఐన తరువాత మంగళవాద్యములు మ్రోగుచుండ ముత్తైదువలను రావించి ఎర్రని వస్త్రములతో ఎర్రని పూలతో ఎర్రని గంధ ద్రవ్యములతో వారిని పూజించవలెను. సిందూర కుంకుమ కుసుమ చూర్ణములతో స్నానము చేయించవలయునని శాస్త్రమున చెప్పబడియున్నది. కావున వారి శిరస్సుపై సిందూరమును కుంకుమమును వేయవలయును. తనకు మంత్రోపదేశము చేసిన గురునికూడ యత్నపూర్వకముగా పూజించవలయును. గురువునకు అర్చన చేసిన సమస్త క్రియలు సఫలము లగును.

నభస్యే పూజయే ద్గౌరీముత్పలై రసితై స్సదా. 24
ఆశ్వినే బన్ధుజీవైశ్చ కార్తికే శతపత్రకైః । జాతీపుష్పై ర్మార్గశీర్షే పౌషే పీతైః కురణ్టకైః. 25
కున్దకుఙ్కుమపుష్పైశ్చ మాఘే దేవీం సమర్చయేత్ । సిన్దువారేణ జాత్యావా ఫాల్గునే పూజయే దుమామ్.
చైత్రే తు మల్లికాశోకై ర్వైశాఖే గన్ధపాటలైః । జ్యేష్ఠే కమలమన్దారై రాషాఢేచ జపామ్బుజైః. 27
కదమ్బైరథ మాలత్యా శ్రావణే పూజయే త్సదా । గోమూత్రం గోమయం క్షీరం దధి సర్పిః కుశోదకమ్.
బిల్వపత్రార్కపుష్పంచ యవా గోశృఙ్గవారిచ । పఞ్చగవ్యంచ బిల్వంచ ప్రాశయే త్క్రమశ స్సదా. 29
ఏత ద్భాద్రపదాద్యంతు ప్రాశనం క్రమశ స్స్మృతమ్ । ప్రతిపక్షంచ మిథునం తృతీయాయాం వరాననే. 30
భోజయిత్వాఽర్చయే ద్భక్త్యా వస్త్రమాల్యానులేపనైః ।
పుంసః పీతామ్బరం దద్యా త్స్త్రియః కౌసుమ్భవాససీ. 31
నిష్పావ జాజీ లవణ మిక్షుదణ్డం గుడాన్వితమ్ । నార్యా దద్యా త్ఫలం పుంస స్సువర్ణోత్పలసంయుతమ్.
యథా న దేవి దేవ స్త్వాం పరిత్యజ్యేహ గచ్ఛతి । తథా మా ముద్ధరాశేషదుఃఖసంసారసాగరాత్. 33
కుముదా విమలా నన్దా భవానీ వసుదా శివా । లలితా కమలా గౌరీ సతీ రమ్భాచ పార్వతీ. 34

నభస్యాదిషు మాసేషు ప్రీయతా మిత్యుదీరయేత్ ।

భాద్రపదాదిగా పండ్రెండు మాసములందును పూజకు పుష్పములు ఉపవాసమునాడు ఆహారముగా తీసికొన వలసిన ద్రవ్యము దాన సమయమున చెప్పు మంత్రము వేరు వేరుగా నుండును. ఎట్లన-

| మాసము: | పూజా పుష్పములు: | ఆహారము: | మంత్రము: |
|---|---|---|---|
| భాద్రపదము | నల్ల కలువలు | గోమూత్రము | కుముదా ప్రీయతామ్ |
| ఆశ్వయుజము | మంకెన | గోమయము | విమలా ప్రీయతామ్ |
| కార్తికము | నూరు రేకుల తామర | ఆవు పాలు | నందా ప్రీయతామ్ |
| మార్గశిరము | జాజి | ఆవు పెరుగు | భవానీ ప్రీయతామ్ |
| పుష్యము | పచ్చ గోరంట | ఆవు నేయి | వసుధా ప్రీయతామ్ |
| మాఘము | మొల్ల లేదా కుంకుమ పూవులు | దర్భలు వేసిన నీరు | శివా ప్రీయతామ్ |
| ఫాల్గునము | ప్రేంకణము లేదా జాజి | మారేడు దళములు | లలితా ప్రీయతామ్ |
| చైత్రము | మల్లిక లేదా అశోకము | తెల్ల జిల్లేడు పూలు | కమలా ప్రీయతామ్ |
| వైశాఖము | సంపెగ-పాటల | యవలు వేసిన నీరు | గౌరీ ప్రీయతామ్ |
| జ్యేష్ఠము | కమలము-మందారము | ఆవు కొమ్ములో పోసి ఉంచిన నీరు | సతీ ప్రీయతామ్ |
| ఆషాఢము | జపాకుసుమ-పద్మములు | పంచగవ్యము | రంభా ప్రీయతామ్ |
| శ్రావణము | కడిమి-మాలతి | బిల్వఫలము | పార్వతీ ప్రీయతామ్ |

ప్రతిమాస శుక్లపక్ష తృతీయాతిథినాడును బ్రాహ్మణ దంపతులను భక్తితో వస్త్ర పుష్ప గంధములతో అర్చింపవలెను. పురుషులకు పచ్చని వస్త్రము లీయవలెను. (పురుషులకు దోవతి ఉత్తరీయము కాని రెండు దోవతులను కాని-స్త్రీలకు చీరను రవిక గుడ్డను-ఇద్దెవరికైనను రెండు వస్త్రము లీయవలెను.) స్త్రీలకు బొబ్బరలు జాజికాయ లవణము చెరకుగడ బెల్లమును పురుషులకు ఈ పదార్థములతోపాటు బంగారు కలువపూవును కూడ ఈయవలెను. ఇవి ఇచ్చునపుడును శయనము మొదలగునవి ఇచ్చునపుడును దేవిని "దేవీ! పరమేశ్వరుడు ఎన్నడును నిన్ను విడువక సుఖింపజేయుచున్నట్లే నీవును నన్ను సంసార సాగరమునుండి తరింపజేసి సుఖింపజేయుము." అని ప్రార్థించవలెను.

వ్రతాన్తే శయనం దద్యా త్సువర్ణకమలాన్వితమ్. 35
మిథునాని చతుర్వింశద్ద్వాదశాథ సమర్చయేత్ । అష్టౌ షడ్వా యథా పున రనుమాసం సమర్చయేత్. 36
పూర్వం దత్వాఽథ గురవే శేషా నభ్యర్చయే త్తతః । ఉక్తాఽనన్తతృతీయైషా సదాఽనన్తఫలప్రదా. 37
సర్వపాపహరా దేవీ సౌభాగ్యారోగ్యవర్ధనీ । న చైనాం విత్తశాఠ్యేన కదాచిదపి లఙ్ఘయేత్. 38
నరో వా యది వా నారీ విత్తశాఠ్యా త్పతత్యధః । గర్భిణీ సూతికా నక్తం కుమారీ వాఽథ రోగిణీ. 39
యదా శుద్ధా తదా తేన కారయే త్ప్రక్రమశ స్సదా । ఇమా మనన్తఫలదాం య స్తృతీయాం సమాచరేత్. 40
కల్పకోటిశతం సాగ్రం శివలోకే మహీయతే । విత్తహీనోఽపి కుర్వీత వర్షత్రయ ముపోషణమ్. 41
పుష్పై ర్మన్త్రవిధానైశ్చ సోపి తత్ఫల మాప్నుయాత్ । నారీ వా కురుతే యా తు కుమారీ విధవా తథా.

* వ్రతమిన్దని

సాఽపి తత్ఫల మాప్నోతి గౌర్యనుగ్రహలాలితా ।
ఇతి పఠతి శృణోతి వా య ఇత్థం గిరితనయా*వ్రత మష్టగలోకసంస్థమ్. 43
మతిమపిచ దదాతి సోఽపి దేవై రమరవధూజనకిన్నరైశ్చ పూజ్యః. 43½

ఇతి శ్రీమత్స్యమహాపురాణే మత్స్యమనుసంవాదే అనన్తతృతీయావ్రతకథనం
నామ ద్విషష్టితమోఽధ్యాయః.

వ్రతము ఇట్లు పంద్రెండు మాసములు జరిగి ముగిసిన తరువాత మంచము పరపు మొదలయినవి బంగారు కమలముతో కూడ విప్ర దంపతులకు ఈయవలెను. ఇదిగాక ప్రతి మాసమునను విప్ర దంపతులను యథాశక్తిగా ఇరువది నాలుగు మందిని కాని పంద్రెండు మందిని కాని ఎనిమిది మందిని కాని ఆరు మందిని కాని అర్చించవలెను. (వారికి పుష్పగంధ తాంబూల దక్షిణాదికము నీయవలెను.) ఇట్లు అర్చించునపుడు మొదట తన గురుని పిమ్మట మిగిలినవారిని అర్చించవలెను.

దేవీ: ఈ చెప్పిన అనంత తృతీయావ్రతము సదా అనంతఫలప్రదము సర్వపాపహరము; సౌభాగ్యారోగ్యవృద్ధి కరము. దీనిని స్త్రీలు కాని పురుషులు కాని ఎవరైనను చేయవచ్చును. కాని తనకు శక్తి యున్నంతలో ధనమున లోభము చూపరాదు. చూపినచో అధః పతితు లగుదురు.

ఈ వ్రతమును చేయుట స్త్రీ గర్భిణి రోగిణి కుమారియైనను చేయవచ్చును. పగలే కాదు; రాత్రి (ప్రదోషకాలమున-రాత్రి ఎక్కువ గడువకుండ) చేయవచ్చును. ప్రసవించుట మొదలయిన కారణములచే అశుచిత్వము వచ్చినపుడు శుద్ధి అయిన తరువాత చేయవలెను.

అనంత ఫలప్రదమగు ఈ అనంతతృతీయావ్రతమును ఆచరించినవాడు కల్పకోటి శతములపాటు (పూర్తిగా) శివలోకమున సుఖించును. ధనము లేనివాడు మూడు సంవత్సరములు మాత్రమయిన ఆయా మాస శుక్ల తృతీయనాడుపవాసముండి పూవులతో మంత్రములతో యథాశక్తిగ దొరకిన ద్రవ్య నివేదనముతో ఈ వ్రతమును జరిపినచో నమగ్రఫలమును పొందును. దీనిని కన్య కాని విధవకాని చేసినను గౌరీకృపచే వ్రతము ఫలించును.

దీనిని చదివినను వినినను ఉత్తమ జ్ఞానము శివలోక ప్రాప్తి అచట కిన్నరాది దేవగణములచే పూజలు లభించును.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున మత్స్యమను నంవాదాంతర్గత పార్వతీశ్వర నంవాదమున
అనంత తృతీయావ్రతమను అరువది రెండవ అధ్యాయము.

## త్రిషష్టితమోఽధ్యాయః.
## రసకల్యాణతృతీయావ్రతమ్

ఈశ్వరః : అథాన్యామపి వక్ష్యామి తృతీయాం పాపనాశనీమ్ ।
రసకల్యాణినీ మేతాం పురాకల్పవిదో విదుః. 1
మాఘమాసేతు సమ్ప్రాప్తే తృతీయాం శుక్లపక్షకే । ప్రాత ర్గవ్యేన పయసా తిలైః స్నానం సమాచరేత్. 2
స్నాపయేన్మధునా దేవీం తథైవేక్షురసేనచ । గన్ధోదకేనతు పునః పూజయే త్కుఙ్కుమేన వై. 3
దక్షిణాఙ్గాని సమ్పూజ్య తతో వామాని పూజయేత్। లలితాయై నమో దేవ్యాః పాదం గుల్ఫంచ పూజయేత్. 4
జఙ్ఘాం జానుం తథేశాన్యై తథైవోరుం శ్రియై నమః । మదాలసాయైతు కటి మపర్ణాయై తథోదరమ్. 5
స్తనం మదనవాసిన్యై ప్రమథాయై చ కన్ధరామ్ । తథా భుజాగ్రం మాధవ్యై కమలాయై శుచిస్మితే. 6

భ్రూలలాటంచ రుద్రాణ్యై శఙ్కరాయై తథాఽలకాన్ । మకుటం విన్ధ్యవాసిన్యై పునః కాన్త్యై తథాఽలకాన్.
మదనాయై లలాటంతు మోహనాయై పునర్భ్రువమ్ । నేత్రం చన్ద్రార్ధధారిణ్యై తుష్ట్యైచ వదనం పునః. 8
ఉత్కణ్ఠిన్యై నమః కణ్ఠ మమృతాయై నమః స్తనమ్ । అభయాయై నమోబాహుం విశోకాయై నమః కరమ్.
హృదయం మన్మథభద్రాయై పాటలాయై తథోదరమ్ । కటిం సురతవాసిన్యై తథోరుం త్ర్యమ్బకప్రియే.
జానుజఙ్ఘే నమో గౌర్యై గాయత్ర్యై గుల్ఫ మర్చయేత్ । ధరాధరాయై పాదంతు విశోకాయై నమశ్శిరః.11
నమో భవాన్యై కామిన్యై వాసుదేవ్యై జగచ్ఛ్రియై । ఆనన్దదాయై నన్దాయై సుభద్రాయై నమో నమః. 12
ఏవం సమ్పూజ్య విధివ ద్ద్విజదామ్పత్య మర్చయేత్ । భోజయిత్వాఽన్నపానేన మధురేణ విమత్సరః. 13
సలడ్డుకం వారికుమ్భం శుక్లామ్బర యుగద్వయమ్ । దత్వా సువర్ణకమలం గన్ధమాల్యై రథార్చయేత్. 14
ప్రీయతా మత్ర కుముదా గృహ్ణీయా ల్లవణవ్రతమ్ । అనేన విధినా దేవీం మాసిమాసి సమర్చయేత్. 15

## అరువది మూడవ అధ్యాయము.
## రసకల్యాణ తృతీయావ్రతము.

ఈశ్వరుడు పార్వతికి ఇట్లు చెప్పెను: పాపనాశకమగు మరియొక తృతీయా వ్రతమును తెలిపెదను. పురాణములందు రసకల్యాణినీతృతీయావ్రతమని దీనికి పేరు.

మాఘ శుక్ల తృతీయా తిథినాడు ఉదయమున ఆవుపాలతోను నూవుల (నూవు పిండి-నూవులనూనె)తోను స్నానము చేయవలయును. దేవిని తేనెతో చెరకు రసముతో పన్నీటితో స్నానమాడించి కుంకుమముతో పూజించవలెను. పూజను పాదాది శిరోఽంతముగా మొదట కుడి అవయవములను తరువాత ఎడమ అవయవములను పూజించవలెను.

పూజామంత్రము: 1. లలితాయైనమః (దక్షిణ) పాదం పూజయామి: దక్షిణ గుల్ఫం పూజయామి; 1. ఈశాన్యై నమః-దక్షిణ జంఘాం పూజయామి; దక్షిణ జాను పూజయామి. 3. శ్రియైనమః-దక్షిణోరుం పూజయామి; 4. మదాలసాయై నమః దక్షిణ కటిం పూజయామి; 5. అపర్ణాయైనమః-దక్షిణోదరం పూజయామి; 6. మదనవాసిన్యైనమః దక్షిణ స్తనం పూజయామి; 7. ప్రమదాయైనమః దక్షిణ కంధరాం పూజయామి; 8. మాధవ్యైనమః దక్షిణ భుజాగ్రం పూజయామి; వామ భుజాగ్రం పూజయామి; 9. కమలాయైనమః దక్షిణభ్రువం పూజయామి; వామభ్రువం పూజయామి; 10. చంద్రార్ధ ధారిణ్యైనమః-దక్షిణనేత్రం పూజయామి; వామనేత్రం పూజయామి; 11. తుష్ట్యైనమః-ముఖం పూజయామి; 12. ఉత్కంఠిన్యైనమః వామకంఠం పూజయామి; 13. అమృతాయైనమః-వామ స్తనం పూజయామి; 14. అభయాయై నమః-దక్షిణబాహుం పూజయామి; వామబాహుం పూజయామి; 15. విశోకాయైనమః దక్షిణకరం పూజయామి; వామ కరం పూజయామి; 16. మన్మథ భద్రాయైనమః - హృదయం పూజయామి; 17. పాటలాయైనమః-వామోదరం పూజయామి; 18. సురత వాసిన్యైనమః-వామకటిం పూజయామి; 19. త్ర్యంబకప్రియాయై నమః వామోరుం పూజయామి; 20. గౌర్యైనమః-వామజాను-వామ జంఘాంచ పూజయామి; 21. గాయత్ర్యై నమః-వామగుల్ఫం పూజయామి; 22. ధరాధరాయైనమః-వామపాదం పూజయామి; 23. విశోకాయైనమః-★శిరః పూజయామి;

భవాని-కామిని-వాసుదేవి-జగచ్ఛ్రీ-ఆనందదా నందా-సుభద్రా-శబ్ద వాచ్యురాలగు దేవికి నమస్కారము; అని ఇట్లు యథావిధిగ దేవిని పూజించి విప్రదంపతులను ఆదరించవలెను. మత్సరము మొదలగు భావవికారము లేవియు లేకుండ చిత్తశుద్ధితో వారికి మధురములగు అన్న పానీయములను లడ్డులను ఉదక కలశమును రెండు తెల్లని వస్త్రములను ఈయవలయును. బంగారు కమలమును గంధమాల్యములను అర్పించి అర్చించవలయును. దానము నిచ్చునపుడు

★ మూలములో అంగ పూజా మంత్రములకు కొన్నిటికి వామ దక్షిణాంగములకు వేరువేరుగా మంత్రమున్నది. కొన్నిటికిలేదు. లేనిచోట్ల రెండు పార్శ్వములకును ఒకే మంత్రమును అనువాదకుడు అచ్చుట జరిగినది.

'కుముదా ప్రీయతామ్' అను మంత్రమును చెప్పవలెను. లవణ వ్రతమును (ఉప్పులేని ఆహారమును తినుట) పాటించవలెను. ఈ విధానముతో దేవిని ప్రతిమాసమునను అర్చించుచుండవలెను.

లవణం వర్జయే న్మాఘే ఫాల్గునే తు గుడం పునః। తవరాజం తథా చైత్రే వర్జ్యంతు మధు మాధవే. 16
పానకం జ్యేష్ఠమాసేతు తథాషాఢేతు జీరకమ్ । శ్రావణే వర్జయే త్క్షీరం దధి భాద్రపదే తథా. 17
ఘృత మాశ్వయుజే తద్వ దూర్జే వర్జ్యంచ మాక్షికం। ధాన్యకం మార్గశీర్షేతు పౌషే వర్జ్యాతు శర్కరా.18
వ్రతాన్తే కరకం పూర్ణం మాసేమాసే తు దాపయేత్ । దద్యాద్ద్వికాలవేళాయాం భక్ష్యపాత్రేణ సంయుతాః.
లడ్డుకాశ్శోకవర్తీశ్చ సంయావ మథ పూరికాః । ఘాటికా ఘృతపూరాంశ్చ పిష్టాపూపాంశ్చ మణ్డకాన్. 20
క్షీరం శాకంచ దధ్యన్న మిణ్డుర్యః శోకవర్జితః । మాఘాదిక్రమశో దద్యా దేతాని కరకోపరి. 21
కుముదా మాలతీ గౌరీ రమ్భా భద్రా జయా శివా । ఉమా రతీ సతీ తద్వ న్మఙ్గలా రతిలాలసా. 22
క్రమా న్మాఘాది సర్వత్ర ప్రీయతామితి కీర్తయేత్ । సర్వత్ర పఞ్చగవ్యంచ ప్రాశనం సముదాహృతమ్.
ఉపవాసీ భవే న్నిత్య మశక్తౌ నక్త మిష్యతే ।

ఆయా మాసములందు విడువవలసిన ఆహారములు: మాఘమున లవణమును ఫాల్గునమున బెల్లమును చైత్రమున తవరాజమును (యవలు మొదలగు వానినుండి తీసిన చక్కెర) వైశాఖమున తేనెను-జ్యేష్ఠమున పానకమును ఆషాఢమున జీలకర్రను శ్రావణమున పాలను భాద్రపదమున పెరుగును ఆశ్వయుజమున నేతిని కార్తికమున పుట్ట తేనెను మార్గశిరమున ధనియాలను పుష్యమున చక్కెరను విడువవలెను.

వ్రత విధాన పూజ కాగానే ప్రతి మాసమునను నిండు కరకమును (గరిగ అనెడు ఒక విధమైన మట్టిపాత్ర) భక్ష్య పాత్రమును ఆనాటి సాయం సంధ్యా కాలమున దానము ఈయవలెను. ఎట్లనగా కరకముపైని భక్ష్యపాత్రను ఉంచవలెను. ఆ భక్ష్య పాత్రయందు మాఘమాసమున లడ్డులు-ఫాల్గునమున శోకవర్తులు చైత్రమున సంయావము (గోధుమ రవ్వను పాలతో చక్కెరతో ఉడికించిన వంటకము) వైశాఖమున పూరీలు జ్యేష్ఠమున ఘాటికలు ఆషాఢమున ఘృతపూరము (బాదుషా అని ఈనాటి పేరు) శ్రావణమున బూరెలు భాద్రపదమున మండిగలు (గోధుమతో చేయు పిండివంట) ఆశ్వయుజమున పాలు కార్తికమున ఆకుకూర మార్గశిరమున పెరుగన్నము పుష్యమున శోకములేని ఇండు అను వంటకము-ఇవి నింపవలెను. (వీటిలో శోకవర్తికలు-శోకము-ఇండు-ఘాటికలు అనునవి ఈనాడు అంతగా తెలియనివి. ఆయా దేశ భాగములలో వేరువేరు పేరులుండవచ్చును. పెద్దలవలన తెలిసికొనవలెను. తెలియనిచో వీటికి మారుగా మరేదైన మధుర పదార్థము ఉంచవచ్చును.)

దానము ఇచ్చునపుడు మాఘమున 'కుముదా ప్రీయతాం'- ఫాల్గుణమున 'మాలతీ ప్రీయతాం' చైత్రమున 'గౌరీ ప్రీయతాం' వైశాఖమున 'రంభా ప్రీయతాం' జ్యేష్ఠమున 'భద్రా ప్రీయతాం' ఆషాఢమున 'జయా ప్రీయతాం' శ్రావణమున 'శివా ప్రీయతాం' భాద్రపదమున 'ఉమా ప్రీయతాం' ఆశ్వయుజమున 'రతిః ప్రీయతాం' కార్తికమున 'సతీ ప్రీయతాం' మార్గశిరమున 'మంగళా ప్రీయతాం' పుష్యమున రతిలాలసా ప్రీయతాం' అను మంత్రమును చెప్పవలెను.

అన్ని మాసములందును వ్రతదినమున పంచగవ్యము ఆహారముగా ఉపవాస ముండవలెను. శక్తి లేనివారు పగలు ఉపవసించి నక్తమున (రాత్రి కాగానే) భుజించవచ్చును.

పునర్మాఘేతు సమ్ప్రాప్తే శర్కరాం కరకోపరి: 24
కృత్వాతు కాఞ్చనీం గౌరీం పఞ్చరత్నసమన్వితామ్ । హైమ మఙ్గుష్ఠమాత్రంచ సాక్షసూత్రకమణ్డలుమ్.
చతుర్భుజా మిన్దుయుతాం సితనేత్ర పటావృతామ్ । తద్వ ద్గోమిథునం శుక్లం సువర్ణాఢ్యం సితామ్బరమ్.
సవస్త్రభాజనం దద్యా ద్భవానీ ప్రీయతా మితి । అనేన విధినా యస్తు రసకల్యాణినీవ్రతమ్. 27

కుర్యా త్స సర్వపా పేభ్య స్తత్క్షణాదేవ ముచ్యతే । నవార్బుదసహస్రంతు న దుఃఖీ జాయతే నరః. 28
అగ్నిష్టోమసహస్రేణ యత్ఫలం త ద వాప్నుయాత్ । నారీవా కురుతే యాతు కుమారీవా వరాననే. 29
విధవావా వరాకీవా సాపి తత్ఫలభాగినీ । సౌభాగ్యారోగ్యసమ్పన్నా గౌరీలోకే మహీయతే. 30
ఇతి పఠతి య ఇత్థం య శ్శృణోతి ప్రసఙ్గా త్సకలకలుషముక్తః పార్వ తీలోక మేతి ।
మతిమపిచ నరాణాం యో దదాతి ప్రియార్థం విబుధపతిజనానాం నాయక స్స్యా దమోఘః. 31

ఇతి శ్రీమత్స్యమహాపురాణే మత్స్యమనుసంవాదే రసకల్యాణినీ
తృతీయావ్రతకథనం నామ త్రిషష్టితమోఽధ్యాయః.

(ఇట్లు మాఘమాసము మొదలు పుష్యమాసము వరకు చేసిన తరువాత) మరల మాఘమాసము రాగానే ఈ చెప్పబోవు విధమున దానము చేయవలెను. బొటనవ్రేలి పరిమాణముతో బంగారు గౌరీ ప్రతిమ చేయించవలెను. దానికి పంచరత్నములు తాపటము చేయవలెను. జపమాలయు కమండలువును ప్రతిమకు చేతియం దుండవలెను. చతుర్భుజములు శిరమున చంద్రరేఖ తెల్లని వస్త్రపు మేలిముసుగు ఉండవలయును. కరక(గరిగ)పాత్రలో చక్కెర పోసి పాత్రపై భాగమున ఈ గౌరీ ప్రతిమ నుంచవలెను. అట్లే గోమిథున (ఆవు-ఎద్దు) ప్రతిమను తెల్లని రంగుతో (వెండితో) చేయించి బంగారు అలంకారములు తెల్లని వస్త్రపు పైకప్పడముతో చేయించవలయును. వస్త్రములను పాత్రములను వీటికి తోడుగా చేర్చవలయును. ఇవి అన్నియును 'భవానీ ప్రీయతామ్' అను మంత్రముతో ఆచార్యునకు దానము చేయవలయును.

ఈ విధానముతో ఈ రసకల్యాణినీ తృతీయావ్రతమును చేయువాడు తత్క్షణమున సర్వపాపములనుండి ముక్తుడగును. తొమ్మిదివేల అర్బుదముల సంవత్సరముల కాలము ఏ దుఃఖముల నెరుగక సుఖించును. వేయి అగ్నిష్టోమముల వలన కలుగు ఫలము నందును. స్త్రీలలో కూడ కన్యగాని సువాసిని కాని విధవ కాని అమాయికురాలు కాని ఎవరు చేసినను ఇంత ఫలమును పొంది సౌభాగ్యారోగ్య సంపన్నలై గౌరీలోకమున ఆదరపాత్రమై సుఖించును.

దీనిని చదివినను వినను సకల కలుషముక్తుడై గౌరీలోకము చేరును. ఉత్తమ జ్ఞానము పొందును. దేవతలకును నాయకుడై ఎల్లరకును అజయ్యు డగును.

ఇది శ్రీమత్స్య మహాపురాణమున రసకల్యాణినీ తృతీయావ్రతమను
అరువది మూడవ అధ్యాయము.

## చతుఃషష్టితమోఽధ్యాయః.
## ఆర్ద్రానన్దతృతీయావ్రతమ్.

ఈశ్వరః: తథైవాన్యాం ప్రవక్ష్యామి తృతీయాం పాపనాశనీమ్ ।
నామ్నా లోకే తు విఖ్యాతా మార్ద్రానన్దకరీ మిహ. 1
యదా శుక్లతృతీయాయా మషాఢర్క్షం భవే త్క్వచిత్ । బ్రహ్మర్క్షంతు మఘర్క్షంవా హస్తో మూలర్క్ష మేవచ.
దర్భగన్ధోదకై స్స్నానం తదా సమ్య క్సమాచరేత్ । శుక్లమాల్యామ్బరధర శ్శుక్లగన్ధానులేపనః. 3
భవానీ మర్చయే ద్భక్త్యా శుక్లపుష్పై స్సుగన్ధిభిః । మహాదేవేన సహితా ముపవిష్టాం మహాసనే. 4
వామదేవ్యై నమః పాదౌ శఙ్కరాయ నమో హరమ్ । జఙ్ఘే శోకవినాశిన్యై ఆనన్దాయ నమః ప్రభో. 5
రమ్భాయై పూజయే దూరూ శివాయచ పినాకినః । ఆనన్దిన్యై కటిం దేవ్యా శ్శూలినం శూలపాణయే. 6
మాధవ్యై చ తథా నాభి మథ శమ్భో ర్భవాయ వై । స్తనా వానన్దకారిణ్యై శఙ్కర స్యేన్దుమౌళయే. 7
ఉత్కణ్ఠిన్యై నమః కణ్ఠం నీలకణ్ఠాయవై హరమ్ । కరా వుత్పలధారిణ్యై భద్రాయ జగతాం పతేః. 8
బాహూచ పరిరమ్భిణ్యై నృత్తశీలాయ వై హరమ్ । దేవ్యా ముఖం విలాసిన్యై వృషేశాయ పున ర్విభోః. 9

స్మితంచ స్మరలీ లాయై విశ్వవక్త్రాయవై విభుమ్ । నేత్రే మదనవాసిన్యై విశ్వధామ్నేతి శూలినమ్. 10
భ్రువౌ నృత్తప్రియాయైచ తాణ్డవేశాయ శూలినమ్ । దేవ్యా లలాట మిన్ద్రాణ్యై హవ్యవాహాయ వై విభోః.
స్వాహాయై మకుటం దేవ్యా విభో ర్గఙ్గాధరాయ వై । విశ్వకాయౌ విశ్వముఖౌ విశ్వపాదకరౌ శివౌ. 12
ప్రసన్నవదనౌ వన్దే పార్వతీపరమేశ్వరౌ ।

## అరువది నాలుగవ అధ్యాయము

## ఆర్ద్రానంద తృతీయావ్రతము

ఈశ్వరుడు గౌరి కిట్లు చెప్పెను: ఇట్టిదియే పాపనాశనియగు మరియొక తృతీయా వ్రతమును చెప్పెదను. దీనికి లోకమున ఆర్ద్రానందకర తృతీయా వ్రతమని ప్రసిద్ధి. శుక్లపక్షమున తదియనాడు ఆషాఢా ద్వయముకాని రోహిణీ మృగాహస్తమూల నక్షత్రములలో నేదైన కాని ఉన్న దినమున యజమానుడు దర్భలతో పవిత్రమయిన సుగంధ జలములతో స్నాన మాడవలెను. తెల్లని వస్త్రములను తెల్లని పుష్పములను తెల్లని సుగంధపు పూతలను తాల్చవలెను. భవానీ మహాదేవులను మహాసనమున నిలిపి సుగంధవంతములగు తెల్లని పూవులతో పూజించవలెను.

పూజా మంత్రము: 1. వామదేవ్యై నమః శంకరాయ నమః-హరస్య పాదౌ పూజయామి; 2. శోక వినాశిన్యై నమః ఆనందాయ నమః ప్రభోః-జంఘే పూజయామి; 3. రంభాయై నమః శివాయ నమః- పినాకినః ఊరూ పూజయామి; 4. ఆనందిన్యై నమః శూలపాణయే నమః-శూలినః దేవ్యాశ్చ కటిం పూజయామి; 5. మాధవ్యై నమః భవాయ నమః - శంభోః నాభిం పూజయామి; 6. ఆనందకారిణ్యై నమః ఇందుమౌళయే నమః-శంకరస్య స్తనౌ పూజయామి; 7. ఉత్కంఠిన్యై నమః-నీలకంఠాయ నమః-హరస్య కంఠం పూజయామి; 8. ఉత్పలధారిణ్యై నమః-రుద్రాయ నమః-జగతాం పతేః కరౌ పూజయామి; 9. పరిరంభిణ్యై నమః నృత్తశీలాయ నమః-హరస్య బాహూ పూజయామి; 10. విలాసిన్యై నమః-వృషేశాయ నమః-విభోః దేవ్యాశ్చ ముఖం పూజయామి; 11. స్మరలీలాయై నమః విశ్వవక్త్రాయ నమః-విభోః స్మితం పూజయామి; 12. మదనవాసిన్యై నమః విశ్వధామ్నే నమః శూలినః నేత్రే పూజయామి; 13. నృత్తప్రియాయై నమః తాండవేశాయ నమః-శూలినః భ్రువౌ పూజయామి; 14. ఇంద్రాణ్యై నమః హవ్యవాహాయ నమః-దేవ్యాః విభోశ్చ లలాటం పూజయామి; 15. స్వాహాయై నమః గంగాధరాయ నమః-దేవ్యాః విభోః మకుటం(శిరః)పూజయామి.

విశ్వము తమ శరీరమై అన్ని వైపులకు తమ ముఖములును పాదములును కరములును కలిగి ప్రసన్నములైన ముఖములు కలవారగు పార్వతీ పరమేశ్వరులను నమస్కరించుచున్నాను.

ఏవం సమ్పూజ్య విధివ దగ్రత శ్శివయోః పునః. 13
పద్మోత్పలాని రజసా నానావర్ణాని కారయేత్ । శఙ్ఖచక్రే సకటకే స్వస్తికాఙ్కుశచామరాః. 14
యావన్తః పాంసవస్తత్ర రజసః పతితా భువి । తావద్వర్షసహస్రాణి శివలోకే మహీయతే. 15
చత్వారి ఘృతపాత్రాణి సహిరణ్యాని శక్తితః । దత్వా ద్విజాయ కరక ముదకాన్నసమన్వితమ్. 16
ప్రతిపక్షం చతుర్మాసం యావదేవం సమర్చయేత్ । తతస్తు చతురో మాసా న్పూర్వవ త్కరకోపరి. 17
చత్వారి సక్తుపాత్రాణి తిలపాత్రా ణ్యనన్తరమ్ । గన్ధోదకం పుష్పవారి చన్దనం కుఙ్కుమోదకమ్. 18
దుగ్ధం మధు ఘృతం చైవ గోశృఙ్గోదక మేవచ । పుష్పోదకం తథా వారి కృష్ణచూర్ణసమన్వితమ్. 19
ఉశీరసలిలం తద్వ ద్యవచూర్ణోదకం తతః । తిలోదకంచ సమ్ప్రాశ్య వసే న్మార్గశిరాదిషు. 20
మాసేషు పక్షద్వితయం ప్రాశనం సముదాహృతమ్ । సర్వత్ర శుక్లపక్షాణి ప్రశస్తాని సదార్చనే. 21

**ఇట్లు పార్వతీ పరమేశ్వరులను యథావిధిగా పూజించి మరల వారిముందు ముగ్గు పొడితో పద్మములు కలువలు శంఖచక్రములు కడియములు శంఖచక్రములు చామరములు అంకుశములు ముగ్గులు వేయవలెను. అప్పటి భూమిపై**

న్ని ముగ్గు ధూళికణములు పడునో అన్ని వేల ఏండ్లు యజమానుడు శివలోకమున ఆదరపాత్రుడై యుండును. తరువాత అచ్చట బ్రాహ్మణునకు యథాశక్తిగా నాలుగు నేతి పాత్రలను అన్నపానీయములను బంగారమును కరక (గరెగ అను మట్టి పాత్ర) పై నాలుగు సక్తు (పేల పిండి) పాత్రలను నాల్గు తిల పాత్రలను కూడ ఉంచి అవియును దాన మీయవలెను. ఇట్లు నాలుగు మాసములు ప్రతి శుక్లపక్షమునందును చేయుచుండవలయును. మార్గశిరము మొదలు కార్తిక మాసము వరకు పండ్రెండు మాసములలో వరుసగా ఈ మంచి గంధము వేసిన నీరు-పుష్పములు(గులాబీల వంటివి) వేసిన నీరు-చందనము కుంకుమపూవు వేసిన నీరు-పాలు-తేనె-నేయి-గో శృంగములో పోసిన నీరు-పుష్పజలము-నల్ల (నూవుల) పొడి కలిపిన నీరు-వట్టి వేళ్ల వేసిన నీరు-యవల పొడి వేసిన నీరు-నూవులు వేసిన నీరు ఆ వ్రత దినములందు రెండు పక్షములలో దేనియందయినను ఆహారముగా ఉపవసింపవలెను. వ్రతమునకు శుక్లపక్షమే చాల మంచిది.

దానకాలేచ సర్వత్ర మన్త్ర మేత దుదీరయేత్ । గౌరీ మే ప్రీయతా మద్య అఘనాశాయ మంగళా. 22
సౌభాగ్యాయాఽస్తు లలితా భవానీ సర్వసిద్ధయే । సంవత్సరాన్తే లవణం కుసుమ్భం కుఙ్కుమం తథా. 23
చన్దనం నేత్రవట్టంచ సహిరణ్యామ్బుజేన చ । ఉమామహేశ్వరం హైమం తద్వ దిక్షుఫలై ర్వృతమ్. 24
స్వాస్తరావరణాం శయ్యాం సోపధానాం నివేదయేత్ । సపత్నీకాయ విప్రాయ గౌరీ మే ప్రీయతా మితి. 25
ఆర్ద్రానన్దకరీ నామ తృతీయా పాపనాశనీ । యా ముపోష్య నరో యాతి శమ్భో స్త త్పరమం పదమ్. 26
ఇహలోకే వరానన్దం ప్రాప్నోతి ధనసమ్పదమ్ । ఆయురారోగ్యసన్తత్యా న క్వచి చ్ఛోక మాప్నుయాత్. 27
య ఇదం శృణుయా న్నిత్యం శ్రావయే ద్వాపి మానవః । నారీవా కురుతే యా తు కుమారీ విధవాఽపివా.
సాఽపి తత్ఫల మాప్నోతి దేవ్యనుగ్రహలాలితా । ప్రతిపక్ష ముపోష్యైవం మన్త్రార్చన విధానవిత్. 29
రుద్రాణీలోక మాప్నోతి పునరావృత్తిదుర్లభమ్ । శక్రలోకే స గన్ధర్వైః పూజ్యతేఽబ్దాయుతత్రయమ్. 30

ఇతి శ్రీమత్స్యమహాపురాణే మత్స్యమనుసంవాదే ఆర్ద్రానన్దతృతీయా
వ్రతకథనం నామ చతుష్షష్టితమోఽధ్యాయః.

దాన కాలమున "ఇపుడు గౌరి నాయందు ప్రీతురాలై మంగళ (శుభకరురాలు) పాపనాశమును లలిత సౌభాగ్యమును భవాని సర్వసిద్ధులను కలిగించుగాక!" అను అర్థ మిచ్చు మంత్రము చెప్పవలెను.

ఇట్లు సంవత్సరమయిన తరువాత లవణము కుంకుమపూవు చందనము నేత్రపటము (కండ్లపై ధరించు మునుగు వస్త్రము) బంగారు తామరపూవు చెరకుగడ-పండ్లు - ఉమా మహేశ్వర ప్రతిమ-పరపులతోను ఇతర పరికరముల లతోను కూడిన మంచము బ్రాహ్మణ దంపతులకు "గౌరీ మే ప్రీయతామ్" అను మంత్రముతో దానము చేయవలెను.

ఈ ఆర్ద్రానందకర తృతీయా వ్రతము పాపనాశకము; దీనియం దుపవాసముతో వ్రతము చేసినవారు ఇహలోకమున ధనసంపత్తి ఆయురారోగ్యసంతతి పరమానందములు పొంది శోకరహితులై పరమున శంభులోకమును పొందుదురు.

దీనిని వినినను చదివినను ఆచరించినను సువాసినియు కన్యయు విధవయు అయినను దేవ్యనుగ్రహపాత్రమయి ఈ చెప్పిన ఫలమునందును. ప్రతిపక్షమునందును మంత్రార్చన విధానము ననుసరించి ఉపవసించి వ్రతము చేసినవారు పునరావృత్తి రహితమగు రుద్రాణీలోకము పొందుదురు. ఇంద్రలోకమున ముప్పదివేల సంవత్సరములు గంధర్వులచే పూజింపబడుదురు.

ఇది శ్రీమత్స్య మహాపురాణమున ఆర్ద్రానందకర తృతీయా వ్రతమను అరువది నాలుగవ అధ్యాయము.

## పంచషష్టితమోఽధ్యాయః.

## అక్షయతృతీయా వ్రతమ్.

ఈశ్వరః : అథాన్యామపి వక్ష్యామి తృతీయాం సర్వకామదామ్ ।
యస్యాం దత్తం హుతం జప్తం సర్వం భవతి చాక్షయమ్. 1.

వైశాఖశుక్లపక్షేతు తృతీయాయా ముపోషితః । అక్షయం ఫల మాప్నోతి సర్వస్య సుకృతస్యచ. 2
సా తథా బ్రహ్మణోపేతా విశేషేణతు పూజితా । తత్ర దత్తం హుతం జప్తం సర్వ మక్షయ ముచ్యతే. 3
అక్షయా సన్తతిస్తు స్యా త్తస్యాం సుకృత మక్షయమ్ । అక్షయైః పూజ్యతే విష్ణు స్తేన సాప్యక్షయా స్మృతా.
అక్షతైస్తు నర స్స్నాతో విష్ణో ర్దత్వా తథాఽక్షతాన్ ।
విప్రేషు దత్వా తానేవ తథానక్తాం త్సుసంస్కృతాన్. 5
తదన్నభు జ్మహాభాగ ఫల మక్షయ మశ్నుతే । ఏకామప్యుక్తవ త్కృత్వా తృతీయాం విధివ న్నరః. 6
ఏతా మనుతృతీయాయాం సర్వాసాంతు ఫలం లభేత్ ।
తృతీయాయాం సమభ్యర్చ్య సోపవాసో జనార్దనమ్. 7
రాజసూయఫలం ప్రాప్య గతి మగ్ర్యాంచ విన్దతి. 7½

ఇతి శ్రీమత్స్యమహాపురాణే మత్స్యమనుసంవాదే అక్షయతృతీయా
వ్రతకథనం నామ పఞ్చషష్టితమోఽధ్యాయః.

## అరువది ఐదవ అధ్యాయము

## అక్షయ తృతీయా వ్రతము

ఈశ్వరుడు పార్వతికి ఇట్లు చెప్పెను: సర్వకామప్రదమగు మరియొక తృతీయా వ్రతమును చెప్పెదను. ఈ తృతీయా దినమున చేసిన దానము హోమము జపము ఏదియైనను అక్షయ ఫలప్రద మగును.

వైశాఖ శుక్ల తృతీయాతిథి బ్రహ్మదేవునితో చేరియుండునది. అందుచే విశేషించి పూజ్యమయినది. కనుక ఈనాడు ఉపవసించి ఏ పుణ్యకర్మ మాచరించినను అక్షయఫలము లభించును. ఈ తిథినాడు క్షయములేని శాశ్వతోపాసకులచే విష్ణువు పూజింపబడును. కావుననే దీనికి అక్షయ తృతీయ యని పేరు. ఈనాడు అక్షతోదకముతో స్నానము చేసి వాటిని విష్ణునిపై ఉంచి అర్చించి వాటిని చక్కగా సంస్కరించి బ్రాహ్మణులకు దానముచేసి వాటి అన్నమునే తినినచో ఈ చెప్పిన ఫలము తప్పక లభించును.

ఇట్లు ఒక వైశాఖ శుక్ల తృతీయనాడైనను మానవుడు యథావిధిగా ఈ చెప్పినట్లు చేసి దాని తరువాత వచ్చు ప్రతి శుక్ల తృతీయయందును పంద్రెండు మాసముల శుక్ల తృతీయలందును ఉపవసించి విష్ణుని అర్చించినచో రాజసూయ యాగముచేసినంత ఫలమునంది ముక్తి నందును. [అక్షతలు అనగా ఏ మాత్రమును విరుగక శక్తి తరుగక నిలిచి యున్న బియ్యము-అవి వరి ధాన్యమునుండి కాని యవలనుండి కాని గోధుమలనుండి కాని తీసినవి కావచ్చును. ఇట్టి వరి బియ్యముతో కాని యవల గోధుమల పిండితో కాని సిద్ధపరచిన ఆహారము అక్షతాన్నము.]

ఇది శ్రీమత్స్య మహాపురాణమున అక్షయ తృతీయా వ్రత కథనమను అరువది ఐదవ అధ్యాయము.

## షట్షష్టితమోఽధ్యాయః.

## సారస్వతవ్రతమ్.

మనుః : అధునా భారతీ కేన వ్రతేన మధుసూదన । తథైవ జ్ఞానసౌభాగ్యమతి విద్యాసుకౌశలమ్. 1
అభేదశ్చాపి దమ్పత్యో స్తథా బన్ధుజనస్య చ । ఆయుష్యం విపులం పుంసాం తన్మే కథయ మాధవ. 2
శ్రీమత్స్యః : సమ్య క్పృష్టం త్వయా రాజ న్ఛృణు సారస్వతం వ్రతమ్ ।
యస్య సఙ్కీర్తనాదేవ సా తుష్యతి సరస్వతీ. 3
యో యద్భక్తః పుమా న్కుర్యా దేతద్వ్రత మనుత్తమమ్। తద్వాసరాదౌ సమ్పూజ్య విధానేన సమారభేత్.
అథవాఽఽదిత్యవారేణ గ్రహతారాబలేన చ । పాయసం భోజయే ద్విప్రా న్కృత్వా బ్రాహ్మణవాచనమ్. 5

శుక్లవస్త్రాణి దత్వాతు సహిరణ్యాని శక్తితః । గాయత్రీం పూజయే ద్భక్త్యా శుక్లమాల్యానులేపనైః. 6
యథా న దేవి భగవా న్బ్రహ్మా లోకపితామహః । త్వాం పరిత్యజ్య సన్తిష్ఠే త్తస్మా న్భవ వరప్రదా. 7
వేదశాస్త్రాణి సర్వాణి నృత్తగీతాదికం చ యత్ । త్వదధీనం యథా దేవి తథా మే సన్తు సిద్ధయః. 8
లక్ష్మీ ర్మేధా వరా పుష్టి ర్గౌరీ తుష్టిః ప్రభా మతిః । ఏతాభిః పాహి చాష్టాభి స్తనుభి ర్మాం సరస్వతి. 9

## అరువది ఆరవ అధ్యాయము.

## సారస్వత వ్రతము.

మనువు మత్స్య నారాయణునితో ఇట్లనెను: సరస్వతికి సంబంధించిన ఏవ్రతముచేత జ్ఞానము సౌభాగ్యము విద్యలయందు అత్యంత కౌశలము దంపతుల నడుమను బంధుజనములోను అభేద భావము విపులమగు ఆయుష్యము లభించునో దానిని నాకు తెలుపుము. అని ఇట్లడుగగా నారాయణుడిట్లనెను: రాజా: నీవు చక్కగా అడిగితివి. సారస్వత వ్రతమును తెలిపెదను. దీనిని కీర్తించినంత మాత్రముననే సరస్వతి సంతుష్టయగును.

ఈ వ్రతమును చేయదలచిన భక్తుడు ఆ దినారంభమున యథా శాస్త్ర విధానమున ఆరంభించి పూజ చేయ వలయును. లేదా ఆదిత్యవారమున గ్రహ తారాబల యుక్తదినమున బ్రాహ్మణులచే పాయసమును భుజింపజేసి వారిచేత స్వస్తి పుణ్యాహవాచనము జరిపించవలెను. వారికి తెల్లని వస్త్రములను బంగారును ఈయవలెను. తరువాత భక్తితో తెల్లని పూవులతో సుగంధపు పూతలతో గాయత్రిని పూజించవలెను.

"దేవీ! లోకపితామహుడు భగవానుడు అగు బ్రహ్మ సదా నిన్ను విడిచియుండడు. అట్టి నీవు నాకు వర ప్రదురాలవుకమ్ము. సర్వ వేదశాస్త్రములును నృత్తగీతాది విద్యలును నీ అధీనములు. అట్టి నీకృపవలన నాకును వాని యందు సిద్ధులు కలుగుగాక: సరస్వతీ: లక్ష్మీ-మేధా-వరా (వాక్తత్వము) పుష్టి-గౌరి-తుష్టి-ప్రభా-మతి-అను ఈ ఎనిమిది శరీరములతో కూడిన నీవు నన్ను రక్షించుము." అని దేవిని ప్రార్థించవలయును.

ఏవం సమ్పూజ్య గాయత్రీం వీణాక్షమణిధారిణీమ్ । శుక్లపుష్పాక్షతై ర్భక్త్యా సకమణ్డలుపుస్తకామ్. 10
మౌనవ్రతేన భుఞ్జీత సాయం ప్రాతశ్చ ధర్మవిత్ । పఞ్చమ్యాం ప్రతిపక్షంచ పూజయేచ్చ సువాసినీమ్. 11
తథైవ తణ్డులప్రస్థం ఘృతపాత్రేణ సంయుతమ్ । క్షీరం దద్యా ద్ధిరణ్యంచ గాయత్రీ ప్రీయతా మితి. 12
సన్ధ్యాయాంచ తథా మౌన మేత త్కుర్వ న్సమాచరేత్ ।
నా న్తరా భోజనం కుర్యా ద్యావ న్మాసా స్త్రయోదశ. 13
సమాప్తేతు వ్రతే దద్యా ద్భోజనం శుక్లతణ్డులైః । పూర్ణం సవస్త్రయుగ్మంచ గాంచ విప్రాయ కోటనమ్. 14
దేవ్యా వితానఖణ్డంచ సితనేత్రపటావృతామ్ । చన్దనం వస్త్రయుగ్మం చ దద్యాన్నకరకం పునః. 15
తతోపదేష్టారమపి భక్త్యా సమ్పూజయే ద్గురుమ్ । విత్తశాఠ్యేన రహితో వస్త్రమాల్యానులేపనైః. 16
అనేన విధినా యస్తు కుర్యా త్సారస్వతం వ్రతమ్ । విద్యావా నర్థసంయుక్తో రక్తకణ్ఠశ్చ జాయతే. 17
సరస్వత్యాః ప్రసాదేన బ్రహ్మలోకే మహీయతే । నారీవా కురుతే యాతు సాపి తత్ఫలభాగినీ. 18
బ్రహ్మలోకే వసే ద్రాజ న్యావత్కల్పాయుతత్రయమ్ ।
సారస్వతం వ్రతం యస్తు శృణుయా దపి యః పఠేత్. 19
విద్యాధరపురే సోఽపి వసే త్కల్పాయుతత్రయమ్. ౯౬౪

ఇతి శ్రీమత్స్యమహాపురాణే మత్స్యమనుసంవాదే సారస్వత వ్రతకథనం నామ షట్షష్టితమోఽధ్యాయః.

పీణాక్షమాలా కమండలు పుస్తకధారిణియగు గాయత్రిని తెల్లని పూవులతో తెల్లని అక్షతలతో పూజించవలెను. సంప్రదాయ ధర్మమును ఎరిగి యజమానుడు ప్రతిపక్షమున పంచమినాడు సాయం ప్రాతఃకాలములందు దేవిని పూజించి సువాసినిని పూజించి మౌన వ్రతము పాటించి (హవిష్యమును) భుజించవలయును. కుంచెడు బియ్యమును ఘృతపాత్రమును పాలను బంగారమును ఆ ముత్తైదువకు "గాయత్రీ ప్రీయతామ్" అను మంత్రముతో దానమీయవలెను. ఈ వ్రత దినమునందు సంధ్యా కాలమునందు మౌనవ్రతమును పాటించవలయును. ఇట్లు పదుమూడు మాసములు జరుపవలెను. ఈ వ్రతకాలములో నియత కాలములందు నియత భోజనము తప్ప నడుమ ఏ ఆహారమును భుజించరాదు.

ఇట్లు వ్రతము ముగిసిన తరువాత తెల్లని బియ్యముతో నిండిన పాత్రలును వస్త్రముల జతను తెల్లని కంటి ఆవరణ వస్త్రముతో కూడ చక్కని గోవును దేవిని పూజించిన మండపపు చాండినీనుంచి తీసిన ముక్కను చందనమును అంగవస్త్రముల జతను పెరుగన్నముతో నిండిన గరిగ పాత్రను కూడ దానముగ ఈయవలయును. తరువాత తనకు ఉపదేష్టయగు గురుని భక్తితో వస్త్ర మాల్య సుగంధ ద్రవ్యములతో పూజించవలయును. ఏ విషయమునను ధనమునకు లోభము చూపరాదు.

ఈ విధానము ననుసరించి సారస్వత వ్రతము నాచరించువాడు విద్యావంతుడును ధనవంతుడును మధురమగు కంఠము కలవాడునునగును. సరస్వతీ ప్రసాదమున బ్రహ్మలోకమున సుఖించును. దీనిని స్త్రీ ఆచరించినను ఈ ఫలమును పొందును. ముప్పదివేల కల్పములంతకాలము బ్రహ్మలోకమున వసించును. ఈ సారస్వత వ్రతమును వినినను చదివినను అట్టివారు కూడ ముప్పదివేల కల్పముల కాలము విద్యాధర లోకమున వసింతురు.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున సారస్వత (గాయత్రీ) వ్రతము అను
ఆరువది ఆరవ అధ్యాయము.

## సప్తషష్టితమోఽధ్యాయః.
## గ్రహణస్నానవిధిః.

మనుః: చన్ద్రాదిత్యోపరాగేషు య త్స్నాన మభిధీయతే ।
తదహం శ్రోతు మిచ్ఛామి ద్రవ్యమన్త్రవిధానతః. 1
శ్రీమత్స్యః: యస్య రాశిం సమాక్రమ్య భవే ద్గ్రహణ★సమ్భవః ।
తత్ర స్నానం ప్రవక్ష్యామి మన్త్రౌషధవిధానతః. 2
చన్ద్రోపరాగే సమ్ప్రాప్తే కృత్వా బ్రాహ్మణవాచనమ్ ।
సమ్పూజ్య చతురో విప్రా ఞ్ఛుక్ల మాల్యానులేపనైః. 3
పూర్వమేవోపరాగస్య సమాసా ద్యౌషధీగణమ్ । స్థాపయే చ్చతురః కుమ్భా నవ్రణా న్సాగరానివ. 4
రథాశ్వగజవల్మీక సఙ్గమహ్రద గోకులాత్ । రాజద్వారప్రదేశాచ్చ మృద మానీయ నిక్షిపేత్. 5
పఞ్చగవ్యంచ కుమ్భేషు శుద్ధముక్తాఫలాని చ । రోచనాం పద్మశఙ్ఖౌచ పఞ్చరత్నసమన్వితౌ. 6
స్ఫటికం చన్దనం శ్వేతం తీర్థవారి ససర్షపమ్ । గజదన్తం కుముదం తథైవోశీరగుగ్గులు. 7
ఏతత్సర్వం వినిక్షిప్య కుమ్భే ష్వావాహయే త్సురాన్ ।

## ఆరువది ఏడవ అధ్యాయము.
## గ్రహణ స్నాన విధి.

మనువు మత్స్యదేవునిట్లు ప్రార్థించెను. చంద్ర సూర్యగ్రహణములు సంభవించినపుడు స్నానము చేయవలయునని శాస్త్రము విధించుచున్నది కదా: దాని విధానమును అందు వినియోగించవలసిన ద్రవ్యములను మంత్రములను

★సమ్ప్లవః.

మీనుండి వినగోరుచున్నాను. అనగా నారాయణుడతనికి ఇట్లు తెలిపెను:

ఏ రాశియందు గ్రహణము సంభవించునో ఆ రాశి వారు చేయవలసిన స్నానపు విధానమును మంత్రములను ద్రవ్యములను తెలిపెదను; వినుము. చంద్ర సూర్యగ్రహణములు జరుగబోవుచున్నవి అనగా ముందుగానే బ్రాహ్మణులచే స్వస్తి వాచనమును జరిపించుకొనవలయును. నలుగురు బ్రాహ్మణులను ఎన్నగా శుక్ల వస్త్రములతో శుక్ల గంధ ద్రవ్యములతో సంపూజించవలయును. గ్రహణమునకు ముందుగానే దర్భాదికమగు ఓషధులను సంపాదించుకొనవలయును. రంధ్రములు లేని నాలుగు కడవలను నాలుగు సముద్రములను వలె నాలుగుచోట్ల వేరువేరుగా నిలుపవలెను. రథములు అశ్వములు గజములు గోవులు నిలుచు తావులనుండియు పుట్టలు నదీ ద్వయ సంగమ-నదీ సాగర సంగమ ప్రదేశముల నుండియు పెద్ద హ్రదములనుండియు రాజద్వార ప్రదేశములనుండియు మట్టిని తెచ్చి వాటియందు వేయవలెను. పంచ గవ్యములను మంచి ముత్తెములను గోరోచనమును పద్మములను శంఖములను పంచరత్నములను స్ఫటికమును తెల్ల చందనమును తీర్థజలములను తెల్ల ఆవాలను ఏనుగ దంతమును కలువపూలను పట్టి వేళ్ళను గుగ్గిలమును కూడ వాని యందు వేయవలయును. పిమ్మట ఈ మంత్రములతో ఆయా దేవతలను ఆ నాలుగు కడవలలోనికి ఆవాహనము చేయ వలయును. (వచ్చి వాటియందు నిలువవలసినదిగా పిలువవలయును.)

సర్వే సముద్రాస్సరిత స్తీర్థాని జలదా నదాః. 8
ఆయాన్తు యజమానస్య దురితక్షయకారకాః । యోఽసౌ వజ్రధరో దేవ ఆదిత్యానాం ప్రభుర్మతః. 9
సహస్రనయన శ్చన్ద్రగ్రహపీడాం వ్యపోహతు । ముఖం య స్సర్వదేవానాం సప్తార్చి రమితద్యుతిః.10
చన్ద్రోపరాగ★సమ్భూతాం గ్రహపీడాం వ్యపోహతు । యః కర్మసాక్షీ భూతానాం ధర్మో మహిషవాహనః.
యమ శ్చన్ద్రోపరాగోత్థపీడా మత్ర వ్యపోహతు । రక్షోగణాధిప స్సాక్షా త్ప్రళయానలసన్నిభః. 12
ఖడ్గహస్తోఽతిభీమశ్చ✱గ్రహపీడాం వ్యపోహతు । ఖడ్గపాశధరో దేవస్సదా మకరవాహనః. 13
సజలాధిపతి శ్చన్ద్రగ్రహపీడాం వ్యపోహతు । ప్రాణరూపేణ యో లోకా న్పాతి కృష్ణమృగప్రియః. 14
వాయు శ్చన్ద్రోపరాగోత్థాం గ్రహపీడాం వ్యపోహతు । యో ఽసౌ నిధిపతి ర్దేవః ఖడ్గశూలగదాధరః. 15
చన్ద్రోపరాగసమ్భూతాం గ్రహపీడాం వ్యపోహతు । యోఽసావిన్దుధరో దేవః పినాకీ వృషవాహనః. 16
చన్ద్రోపరాగపాపాని శీఘ్రం నాశయ శంకర । త్రైలోక్యే యాని భూతాని స్థావరాణి చరాణి చ. 17
బ్రహ్మవిష్ణ్వర్కయుక్తాని తాని పాపం హరన్తు మే ।

అన్ని సముద్రములును నదులును తీర్థములును మేఘములును నదములును ఈ యజమానునకు దురితమును నశింపజేయుటకై ఈ కలశములలోనికి వచ్చుగాక: వజ్రధరుడు ఆదిత్యులకు ప్రభువు సహస్రనయనుడు అగు ఇంద్రుడు గ్రహపీడను పోగొట్టుగాక: సర్వదేవతలకు ముఖము వంటివాడు అమిత ప్రకాశము కలవాడు అగు అగ్ని చంద్ర గ్రహణము వలన కలిగిన పీడను పోగొట్టుగాక: ప్రాణుల కర్మలకు సాక్షి మహిష వాహనుడు ధర్మదేవుడు అగు యముడు చంద్రగ్రహణము వలన కలిగిన పీడను తొలగించుగాక: రాక్షస గణాధిపతియు సాక్షాత్ ప్రళయాగ్ని వంటి వాడు ఖడ్గహస్తుడు అతి భయంకరుడు అగు నిర్‌ఋతి గ్రహ బాధను తొలగించుగాక: ఖడ్గ పాశధరుడు మకర వాహనుడు జలాధిపతియగు వరుణుడు చంద్రగ్రహణ గ్రహపీడను తొలగించుగాక: ప్రాణరూపుడై యుండి లోకములను రక్షించు వాడు కృష్ణమృగము (నల్లని లేడి)యందు ప్రీతి కలవాడువగు వాయువు చంద్రగ్రహణమువే కలిగిన గ్రహపీడను పోగొట్టు గాక: నిధిపతియు ఖడ్గశూల గదాధరుడునగు కుబేరుడు చంద్రగ్రహణము వలన కలిగిన గ్రహపీడను పోగొట్టుగాక: చంద్రధరుడు పినాకధారి వృషభ వాహనుడు అగు శంకరుడు చంద్రగ్రహణ పాపముల నశింపజేయుగాక: త్రిలోకముల యందున్న స్థిరచర భూతములు బ్రహ్మ విష్ణు సూర్యాది దేవతలు అందరును గ్రహణ పాపములను పోగొట్టుగాక:

★ సముత్థామగ్నిః పీడాం ✱ రక్షఃపీడాం

ఏవ మామన్త్రితైః కుమ్భై రభిషిక్తో గుణాన్వితైః. 18
ఋగ్యజుస్సామమన్త్రైశ్చ శుక్లమాల్యానులేపనైః । పూజయే ద్వస్త్రగోదానై ర్బ్రాహ్మణా నిష్టదేవతాః. 19
ఏతానేవ తతో మన్త్రా న్నాలి ఖ్య కరకాన్వితాన్। స్థాపయేయుశ్చ తైఃకుమ్భై ర్యజమానం ద్విజోత్తమాః.20
వస్త్రఖణ్డేఽథవా పట్టే హేమరత్న సమన్వితాన్ । యజమానస్య శిరసి నిదధ్యు స్తే ద్విజోత్తమాః. 21
తతోఽతివాహయే ద్వేలా ముపరాగానుగామినీమ్ । ప్రాఙ్ముఖః పూజయిత్వా తు నమస్య న్నిష్టదేవతాః. 22
చన్ద్రగ్రహే వినిర్వృత్తే కృతగోదానమఙ్గళః । కృతస్నానాయ తద్వస్త్రం బ్రాహ్మణాయ నివేదయేత్. 23
అనేన విధినా యస్తు గ్రహణస్నాన మాచరేత్ । న తస్య గ్రహపీడా స్యా న్నచ బన్ధుజనక్షయః. 24
పరమాం ○శుద్ధి మాప్నోతి క్షేమ మారోగ్య ముత్తమమ్ ।
సూర్యగ్రహే సూర్యనామ సదా మన్త్రేషు కీర్తయేత్. 25
అధికం పద్మరాగంచ కపిలాంచ సుశోభనామ్ । ప్రయచ్ఛే ద్విత్తసమ్పన్న శ్చన్ద్రసూర్యోపరాగయోః. 26
య ఇదం శృణుయా న్నిత్యం శ్రావయేద్వా సమాహితః । సర్వపాపవినిర్ముక్త శ్శివలోకే మహీయతే. 27

ఇతి శ్రీమత్స్యమహాపురాణే మత్స్యమనుసంవాదే చన్ద్రసూర్యోప
రాగస్నానవిధికథనం నామ సప్తషష్టితమోఽధ్యాయః.

ఈ విధముగా పూర్వముగా మంత్రింపబడిన సర్వగుణ సమన్వితములగు కుంభములలోను ఋగ్యజుస్సామ మంత్రములతోను స్నానము చేయించుకొని యజమానుడు తెల్లని పూవులతోను తెల్లని సుగంధములతోను వస్త్రదాన గోదానములతోను బ్రాహ్మణులను ఇష్టదేవతలను పూజించవలయును.

తరువాత ఈ మంత్రములనే (పత్రములపై) వ్రాసి కరక (గరిగ) యందుంచి వాటితోపాటు బంగారును రత్నములను చేర్చి యజమానుని వస్త్ర ఖండమునందు కాని పట్టముమీద (జంపకానావంటి దానిమీద) కాని ఆకడవలతో కూడ యజమానుని కూర్చుండ పెట్టుదురు. తరువాత ఆ మంత్రలేఖనములతో కూడిన గరిగను యజమానుని తలమీద ఉంచుదురు.

తరువాత యజమానుడు ప్రాఙ్ముఖుడై దేవతలను పూజించి నమస్కరించుచు చంద్రగ్రహణ కాలమునంతటిని గడపును.

చంద్రగ్రహణము విడిచిన తరువాత గోదానము అనెడు శుభమును (కేశఖండనమును) జరిపించుకొనవలెను. స్నానము చేసియున్న బ్రాహ్మణునకు తానంతవరకు కూర్చుండియున్న వస్త్రమును ఈయవలెను.

ఈ విధానము ననుసరించి గ్రహణ స్నానము చేసిన వానికి గ్రహపీడ కలుగదు. వాని బంధుజనులకును కీడు కలుగదు. ఉత్తమ శుద్ధిని ఉత్తమమగు క్షేమారోగ్యములను పొందును.

సూర్య గ్రహణమునందు ఎల్లప్పుడును మంత్రములతోపాటు సూర్య నామములను కీర్తించవలెను. చంద్ర సూర్యోపరాగ (గ్రహణ)ములందు పద్మరాగమును ప్రశస్తమగు కపిలగోవును కూడ విత్త సంపన్నుడైనచో దానము చేయవచ్చును.

దీనిని చదివినను వినినను సర్వపాప విముక్తుడై శివలోకమునందు సుఖించును.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున చంద్ర సూర్యగ్రహణ స్నానవిధి కథనమ
అను అరువది ఏడవ అధ్యాయము

○ సిద్ధిమాప్నోతిపునరావృత్తిదుర్లభామ్

## అష్టషష్టితమోఽధ్యాయః.

## సప్తమీస్నపనవ్రతమ్-మృతవత్సాదిశాంతిః.

నారదః : కి ముద్వేగాద్భుతే కృత్య మలక్ష్మీః కేన హన్యతే । మృతవత్సాభిషేకాదికార్యేషు చ కిమిష్యతే. 1
పురా కృతాని పాపాని ఫల న్త్యస్మిం స్తపోధన । రోగదుఃఖాదిరూపేణ తథైవేష్టవధేన చ. 2
తద్వినాశంచ వక్ష్యామి సదా కల్యాణకారకమ్ । సప్తమీస్నపనం నామ జనపీడావినాశనమ్. 3
బాలానాం మరణం యత్ర క్షీరపానాం ప్రదృశ్యతే । తద్వ ద్వృద్ధనరాణాంచ యౌవనేచాపి వర్తతామ్. 4
శాన్తయే తత్ర వక్ష్యామి మృతవత్సాదికే చ యత్ । ఏతదే వాద్భుతోద్వేగచిత్తభ్రమవినాశనమ్. 5
భవిష్యతిచ వారాహే యత్ర కల్పే తపోధన । వైవస్వతంచ తత్రాపి యత్రాన్తర మనుత్తమమ్. 6
భవిష్యతిచ తత్రాపి పఞ్చవింశతిమం తథా । కృతం నామ యుగం తత్ర హైహయాన్వయవర్ధనః. 7
భవితా నృపతి ర్వీరః కృతవీర్యః ప్రతాపవాన్ । స సప్తద్వీప మఖిలం పాలయిష్యతి మణ్డలమ్. 8
యావద్వర్షసహస్రాణి సప్తసప్తతి నారద । జాతమాత్రంతు తత్రాపి యావత్పుత్రశతం తథా. 9
చ్యవనస్యతు శాపేన వినాశ ముపయాస్యతి। సహస్రబాహుశ్చ తతో భవితా తస్య వై సుతః. 10
సంయుత శ్శఙ్ఖచక్రాదిచక్రవర్తిత్వలక్షణైః । కృతవీర్య స్తదాగత్య సహస్రాంశుం దివాకరమ్. 11
ఉపవాసవ్రతై ర్దివ్యై ర్వేదసూక్తైశ్చ నారద । పుత్రస్య జీవనాయాలం మేతత్స్నాన మవాప్స్యతి. 12
కృతవీర్యేణవై పృష్ట ఇదం వక్ష్యతి భాస్కరః । అశేషదుఃఖశమనం కలికల్మషనాశనమ్. 13

## అరువది ఎనిమిదవ అధ్యాయము.

## సప్తమీ స్నపన వ్రతము.

నారదుడు ఈశ్వరుని ఇట్లు ప్రశ్నించెను: ఉద్వేగము (భయముచు కలవరపాటును) కలిగించు అద్భుత విషయములు సంభవించినపుడు ఏమి చేసినచో వాటివలన సంభవించు అశుభము నశించును? శిశు మరణము అభిషేకము మొదలగు కార్యములందు (అశుభ నివారణము శుభవృద్ధి కలుగుటకు) ఏమి చేయవలయును?

ఈశ్వరుడు ఇట్లు చెప్పెను: నారదమునీ! పూర్వ జన్మమున చేసిన పాపములు ఈ జన్మమున రోగములు ఇతర దుఃఖములు ఇష్టజనుల మృతి మొదలగు రూపమున ఫలించును. అవి నశించి శుభము కలిగించు విధానమును చెప్పెదను. బాలురును పాలు త్రాగు శిశువులు వృద్ధులు యౌవనస్థులు ఆకస్మికముగ మరణించుట - మరణించిన శిశువులు జన్మించుట ఆశ్చర్యకరములు భయాకులత్వమును కలిగించునవి అగు సంఘటనలు జరుగుట మొదలగు జనపీడలను నశింపజేయు 'సప్తమీస్నపనము' అను శాంతి ప్రక్రియ కలదు.

రాబోవు వరాహకల్పమున వైవస్వత మన్వంతరమున ఇరువది ఏనిదవ మహాయుగమున హైహయ వంశమున కృతవీర్యుడను రాజు పుట్టి డెబ్బదిఏడు వేల సంవత్సరములపాటు సప్తద్వీపసహిత భూమండలమును పాలించును. చ్యవనుని శాపమున అతని నూరుగురు కుమారులు పుట్టిన వెంటనే మరణింతురు. అతనికే సహస్రబాహుడు కాబోవు కుమారుడు (అర్జునుడు) శంఖచక్రాది (రేఖారూప) చక్రవర్తిత్వ లక్షణములతో పుట్టును. ఈ పుత్రుడు (చ్యవన శాపముచే మరణించక) జీవించుటకై కృతవీర్యుడు సూర్యుని అడుగగా అతడు అతనికి ఉపవాస వ్రతములతో వేదసూక్త పారాయణము మొదలగు వానితో కూడిన ఈ సప్తమీ స్నపనమును స్నాన విధానమును తెలుపును. సూర్యుడు అతనికి చెప్పబోవు ఈ ప్రక్రియ అశేష దుఃఖ శాంతిని కలిగించి కలి కల్మషములను నశింపజేయును.

సూర్యః : అలంక్లేశేన మహతా పుత్త్ర స్తవ నరాధిప । భవిష్యతి చిరంజీవీ కలికల్మషనాశనమ్. 14
సప్తమీస్నపనం వక్ష్యే సర్వలోకహితాయ వై । జాతస్య మృతవత్సాయాః సప్తమే మాసి నారద. 15
అథవా శుక్లసప్తమ్యా మేతత్సర్వం ప్రశామ్యతి । గ్రహతారాబలం లబ్ధ్వా కృత్వా బ్రాహ్మణవాచనమ్. 16
బాలస్య జన్మనక్షత్రతిథిదేవా న్యజే ద్బుధః । తద్వ ద్వృద్ధనరాణాంచ కృత్యం స్యా దితరేషు చ. 17
గోమయే నానులిప్తాయాం భూమా వేకాగ్రవ త్తదా । తణ్డులై రక్తశాలేయై ర్బహుగోక్షీరసంయుతైః. 18
నిర్వాపే త్సూర్యరుద్రాభ్యాం తన్మన్త్రాభ్యాం విధానతః ।
కీర్తయే త్సూర్యదైవత్యం సప్తార్చిశ్చ ఘృతాహుతీః. 19
జుహుయా త్సూర్యసూక్తేన తద్వ ద్రుద్రాయ నారద ।
హోతవ్యా స్సమిధ స్తత్ర తథైవార్కపలాశయోః. 20
యవకృష్ణతిలైర్హోమః కర్తవ్యోఽష్టశతం పునః । వ్యాహృతీభి రథాజ్యేన తథైవాష్టశతం పునః. 21
హుత్వా స్నానంచ కర్తవ్యం మఙ్గళాఙ్గేన ధీమతా । విప్రేణ వేదవిదుషా విధివ ద్దర్భపాణినా. 22
స్థాపయిత్వాఽథ చతురః కుమ్భా న్కోణేషు శోభనాన్ ।
పఞ్చమఞ్చ పున ర్మధ్యే దధ్యక్షతసమన్వితమ్. 23
స్థాపయే ద్రవణం కుమ్భం సప్తార్చే నాభిమన్త్రితమ్ । సౌరభ్యేణాథ తోయేన పూర్ణా న్పల్లవసంయుతాన్. 24
సర్వా న్సర్వౌషధియుతా శ్ఛ్వేతదూర్వాఫలాయుతాన్ ।
పఞ్చరత్నైశ్చ సంయుక్తా న్వాసోభిః పరివేష్టితాన్. 25
గజాశ్వరథవల్మీక సఙ్గమహ్రదగోకులాత్ । సంశుద్ధమ్మృద మాదాయ సర్వేష్వథ నిధాపయేత్. 26
చతుర్ష్వథచ కుమ్భేషు పఞ్చమంచాపి మధ్యమమ్ । వేష్టయేద్వస్త్రయుగ్మేన సౌరాన్మన్త్రా నుదీరయేత్. 27
సప్తభిశ్చాథ నారీభి రవ్యఙ్గాఙ్గీభి రేవచ । పూజితాభి ర్యథాశక్త్యా మాల్యవస్త్రవిభూషణైః. 28
సవిప్రాభిశ్చ కర్తవ్యం మృతవత్సాభిషేచనమ్ ।

సూర్యు డిట్లు చెప్పెను: రాజా! (కృతవీర్యా!) నీవు ఎక్కువ క్లేశము పొందవలసిన పని లేదు. నీ కుమారుడు చిరంజీవి కాగలడు. కలికల్మషనాశకమగు సప్తమీ స్నపనము (సప్తమినాడు స్నానము చేయించుట) అను స్నాన ప్రక్రియను సర్వలోక హితమునకై చెప్పెదను.

[కాలము] మరణించిన శిశువులు పుట్టుట పాలు త్రాగెడి శిశువులకు మరణాంతమగు వ్యాధులు కలుగుట మొదలగునవి సంభవించినపుడు తల్లి గర్భవతియైన ఏడవ మాసమునగాని బిడ్డని శైశవమున శుక్లపక్ష సప్తమినాడు కాని శిశువునకు గ్రహతారాబలములు బాగుగా నున్న దినమున కాని బాలుని జన్మతిథి జన్మనక్షత్రములందు కాని శాస్త్ర సంప్రదాయముల నెరిగి దేవతల నారాధించవలయును. వృద్ధులు యువకులు మొదలగు వారికి ఆకస్మికముగ మరణాంతక వ్యాధులు ఉపద్రవములు కలిగినను అద్భుతములు సంభవించినను ఈ సప్తమీ స్నపనము జరుపవలెను.

[స్థానము] గోమయముతో అలికిన ప్రదేశమున (స్థితి) ఏకాగ్రభావముతో ఈ సప్తమీ స్నపనము చేయవలెను. (ద్రవ్యములు) ఎఱ్ఱని వడ్లనుండి చేసిన బియ్యముతో ఎక్కువ పరిమాణముగల ఆవుపాలతో మొదట సూర్యదేవతాకములు రుద్రదేవతాకములు నగు మంత్రములతో అగ్నిలో ఆహుతులను వేల్చవలెను. తరువాత సూర్యదేవతాకములును రుద్రదేవతాకములు అగు సూక్తములతో వేరు వేరుగ ఈ ఇద్దరు దేవతల నుద్దేశించి (ప్రతి ఋక్కుతోను స్వాహా అని పలుకుచు) నేతితో తడిపిన జిల్లేడు-మోదుగ సమిధలతోను యవలతోను నల్లని నువ్వులతోను నేతితో నూటఎనిమిదేసి సారులు ఆహుతులు వేయవలెను.

తరువాత మంగళ పవిత్ర ద్రవ్యములతో మంగళ స్నానము జరుపుకొని యజమానుడు మంగళాలంకారములు వస్త్రములు ధరించి మంగళ శరీరుడు కావలెను. వేదవిదుడు దర్భ పవిత్రపాణి యగు బ్రాహ్మణుని నాలుగు కోణము లందును రంధ్రములు లేని నాలుగు (మామిడి పల్లవములు మొదలగునవి అలంకరించిన) మంగళ కలశములను స్థాపింప జేయవలెను. నాలుగింటికి నడుమ రంధ్రములేని మరియొక (ఐదవ) కలశమును నిలుపవలెను. దానియందు పెరుగును అక్షతలను వేయవలెను. (అక్షతము-దెబ్బ తిననిది; నడుమ విరుగకుండునట్లు జోటిలో దంచి చేసిన బియ్యము అక్షతలు; అంతేకాని వేరు విధమగునవి కావు.) దీనిని అగ్నిదేవతాకములగు మంత్రములతో అభిమంత్రించవలెను. ఈ ఐదిటిని సుగంధజలముతో నింపవలెను. వాటియందు రావి మామిడి జువ్వి మొదలగు చిగుళ్లను అన్ని విధములగు ఓషధులను (శృంగము మొదలగునవి) తెల్ల గరికను ఫలములను కూడ వేయవలెను. పంచరత్నములను కూడ వేయవలెను. నూతన వస్త్రములతో చుట్టవలెను. ఏనుగలు గుర్రములు రథములు గోవులు మొదలగునవి తిరుగు స్థలములనుండి పుట్టనుండి నదీద్వయ-నదీసాగర-సంగమ ప్రదేశములనుండి సంపాదించిన శుద్ధమగు (జల్లించిన) మట్టి కూడ వానితో వేయవలెను. నడుమనున్న ఐదవ కలశమును మాత్రము రెండు వస్త్రములతో చుట్టవలెను. అంతట సూర్యదేవతాకములగు మంత్రము లను పఠించవలయును. అంగ వైకల్యములేని ఏడుమంది ముత్తైదువలను ఏడుమంది బ్రాహ్మణులను యథాశక్తిగా పూలతో వస్త్రములతో అలంకరణములతో సంపూజించి వారిచేత మరణించునంత దురంతములగు వ్యాధులకు లోనై బాధ పడుచున్న ఈ శిశువును (బాలుడుకాని బాలికకాని) స్నానము చేయించవలెను.

దీర్ఘాయురస్తు బాలోఽయం జీవవత్సా చ భామినీ. 29
ఆదిత్య శ్చన్ద్రమా స్సార్ధం గ్రహనక్షత్రమణ్డలైః । శక్రశ్చ లోకపాలాశ్చ బ్రహ్మ విష్ణు ర్మహేశ్వరః. 30
ఏతే చాన్యేచ దేవౌఘా స్సదా పాన్తు కుమారకమ్ । మాత్రాఽశనిర్మా హుతభుఙ్మాచ బాలగ్రహాః క్వచిత్.
పీడాం కుర్వన్తు మా మాతు ర్జనకస్య జనస్య వై । తత శ్శుక్లామ్బరధరా కుమారపతిసంయుతా. 32
పద్మజం పూజయే ద్భక్త్యా సదస్యాంశ్చ గురూన్పునః । కాఞ్చనేంచ తతః కృష్ణతిలపాత్రోపరి స్థితామ్. 33
ప్రతిమాం ధర్మరాజస్య గురవేతు నివేదయేత్ । వస్త్రకాఞ్చనరత్నాద్యై ర్భక్ష్యై స్సఘృతపాయసైః. 34
పూజయేద్బ్రాహ్మణాం స్తద్వ ద్వి త్తశాఠ్యవివర్జితః । భుక్త్వాచ గురుణా చేయముచ్చార్యా మన్త్రసన్తతిః. 35
దీర్ఘాయు రస్తు బాలోఽయం యావద్వర్షశతం సమాః । యత్కిఞ్చి దస్య దురితం క్షిప్తం త ద్బడబానలే.
బ్రహ్మ రుద్రో వసు స్స్కన్దో విష్ణు ర్దేవో హుతాశనః । రక్షన్తు సర్వదుఃఖేభ్యో వరదా స్సన్తు సర్వదా. 36
ఏవమాదీని వాక్యాని వదన్తం పూజయే ద్గురుమ్ ।
శక్తితః కపిలాం దద్యా త్ప్రణిపత్య విసర్జయేత్. 38
చరుంచ పుత్రి సహితా ప్రణమ్య రవిశఙ్కరౌ । హుతశేషం తదాఽశ్నీయా దాదిత్యాయ నమోఽస్త్వితి. 39
ఇదమే వాద్భుతోద్వేగదుస్స్వప్నేషు చ శస్యతే । కర్తు ర్జన్మాదిఋక్షాణాం దేవా న్సమ్పూజయే త్తదా. 40
శాన్త్యర్థం శుక్లసప్తమ్యా మేవం కుర్వ న్న సీదతి । న చావేన విధానేన దీర్ఘాయు రభవ న్నృపః. 41
సంవత్సరాణాం ప్రయుతం శశాస పృథివీ మిమామ్ । పుణ్యం పవిత్రమాయుష్యం సప్తమీస్నపనం రవేః.
కథయిత్వా ద్విజశ్రేష్ఠం తత్రైవా న్తరధీయత । ఆరోగ్యం భాస్కరా దిచ్ఛే ద్ద్రవ్య మిచ్ఛే ద్ధుతాశనాత్. 43
ఈశ్వరా జ్జ్ఞాన మన్విచ్ఛే ద్గతి మిచ్ఛే జ్జనార్దనాత్ ।
ఏత న్మహాపాతక నాశనం స్యా దవ్యక్షయం వేదవిదో వదన్తి. 44
శృణోతి యశ్చైన మనన్యచేతా స్తస్యాపి సిద్ధిం మునయో వదన్తి 44॥

ఇతి శ్రీమత్స్య మహాపురాణే మత్స్యమను సంవాదే సప్తమీస్నపన
వ్రతకథనం నామాష్టషష్టితమోఽధ్యాయః.

స్నాన సమయమున ఆచార్యుడు ఈ అర్ఘ్య మిచ్చు మంత్రములను పలుకవలయును. "ఈ బాలుడు (బాలిక) దీర్ఘాయువగుగాక: ఈ స్త్రీ (మాత) జీవించిన శిశువు కలది యగుగాక: ఆదిత్యుడు చంద్రుడు గ్రహములు నక్షత్ర మండలములు ఇంద్రుడు లోకపాలురు బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ఇతర దేవతలును ఈ కుమారకుని (కుమారికను) సదా రక్షింతురు గాక: ఇచట పిడుగుకాని అగ్నికాని బాలగ్రహములుకాని ఈ శిశువునకును తల్లిదండ్రులకును ఏ పీడను కలుగ నీయకుందురు గాక:"

తరువాత ఈ శిశుమాత శిశువుతోను భర్తతోను కూడి బ్రహ్మదేవుని-సభయందలి పెద్దలను గురువులను పూజించవలెను. తరువాత ఒక తామ్ర పాత్రయందు నల్లని నూవులను నింపి దానిపై బంగారు (యమ) ధర్మరాజ ప్రతిమను ఉంచి దానినంతటిని గురువునకు సమర్పించవలెను. పిమ్మట వస్త్రములు బంగారు రత్నములు ఇచ్చి పిండివంటలు నేతి పాయసములు-వీనితో బ్రాహ్మణులను భుజింపజేసి పూజించవలయును. గురుని కూడ భుజింపజేయవలెను.

అపుడు గురువు ఈ యర్ఘ్యమునిచ్చు మంత్రములను పలుకవలయును: "ఈ బాలుడు (బాలిక) దీర్ఘాయువగుగాక: నూరేండ్లు నిండుగా జీవించుగాక: ఈ శిశుని పాపమంతయు బడబానలములో పడుగాక: బ్రహ్మ రుద్ర వసు స్కందవిష్ణు మాతాశకునులు ఈ శిశువును అన్ని దుఃఖములనుండి కాపాడుచు వరముల నిత్తురుగాక:" ఈ మొదలగు వాక్యములు మంత్ర రూపమున పలికిన గురుని యథాశక్తిగ సమ్మానించి శక్తియున్నచో కపిల గోదానము చేసి నమస్కరించి వీడ్కొనవలయును.

తరువాత శిశుమాత శిశువుతో కూడి రవి శంకరులను నమస్కరించి హోమము చేయగా మిగిలిన 'చరు' ద్రవ్యమును 'ఆదిత్యాయ నమోఽస్తు' అనుచు భుజించవలయును. (చరువు-ఆవిరి బయటికి పోనీయక ఆ తేనరుతో పాలతోనో నేతితోనో నీటితోనైన వరిబియ్యపు-గోధుమ నూక-యవలనూక-వీనిలో దేనితోనైన చేసిన అన్నము.)

ఈ విధానము ఆశ్చర్యకరములగు అపురూపపు సంఘటనలు జరిగినపుడు-కలవరపాటు భయము కలిగించు సంఘటనములు దుస్స్వప్నములు సంభవించినపుడు కూడ ప్రశస్తమయినది. యజమానుని జన్మ నక్షత్రము మొదలగునవి కల దినమున ఆయా నక్షత్రాధిదేవతలను పూజించవలయును. లేదా శుక్లపక్ష సప్తమినాడైనను ఈ శాంతి జరుపవచ్చును. (అందుచేతనే దీనికి సప్తమీ స్నపనమని పేరు.) దానివలన ఉపద్రవములు శాంతించును. శుభము కలుగును.

కృతవీర్యుడు సూర్యుని ఉపదేశానుసారము ఈ శాంతిక స్నానము తన కుమారునకు జరిపించుటచేతనే అతడు (అర్జునుడు) దీర్ఘాయుష్మంతుడై లక్ష సంవత్సరము లీ పృథివిని పాలించెను.

అని ఇట్లు సప్తమీ స్నపన ప్రక్రియను కృతవీర్యునకు తెలిపి రవి అంతర్ధానమునందెను.

రవినుండి "ఆరోగ్యమును అగ్నినుండి ద్రవ్యమును ఈశ్వరుని నుండి జ్ఞానమును విష్ణునినుండి సద్గతిని కోరవలయును-(పొందవలయును.)

ఈ స్నాన విధానము మహాపాతకనాశనము; అక్షయ ఫలప్రదము; అని వేదతత్త్వ వేత్తలు చెప్పుదురు. అనన్య చిత్తులై దీనిని వినిన వారికి కూడ దీనిని యథా విధానముగ ఆచరించిన ఫలము కలుగునని మునులు చెప్పుచున్నారు.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున సప్తమీ స్నపన విధానమను
అరువది ఎనిమిదవ అధ్యాయము.

## ఏకోనసప్తతితమోఽధ్యాయః.

## కల్యాణభీమద్వాదశీవ్రతమ్.

మనుః : కథ మారోగ్య మైశ్వర్య మనన్త మమరేశ్వర । స్వల్పేన తపసా దేవ భవే న్మోక్ష ప్రదా నృణామ్
కి మజ్ఞాతం మహాదేవ త్వత్ప్రసాదా దధోక్షజ । అల్పకేనాపి తపసా మహాఫల మిహోచ్యతామ్. 2

శ్రీమత్స్యః : పురా రాథన్తరే కల్పే పరిపృష్టో మహాత్మనా ।
మన్దరస్థో మహాదేవః పినాకీ బ్రహ్మణా స్వయమ్. 3
ఇతి పృష్ట స్సవిశ్వాత్మా బ్రహ్మణా లోకభావనః । ఉమాపతి రువాచేదం మనసః ప్రీతికారకమ్. 4
ఈశ్వరః : అస్మా ద్రాథన్తరా త్కల్పా త్త్రయోవింశతిమే యదా ।
వారాహో భవితా కల్ప స్తస్య మన్వన్తరే శుభే. 5
వైవస్వతాఖ్యే సఞ్జాతే సప్తమే సప్తలోకకృత్ । ద్వాపరాఖ్యం యుగం తచ్చ సప్తవింశ త్తమం యదా. 6
తస్యాన్తే సుమహాతేజా వాసుదేవో జనార్దనః । భారావతరణార్థాయ త్రిధా విష్ణు ర్భవిష్యతి. 7
ద్వైపాయనో ముని స్తద్వ ద్రౌహిణేయోఽథ కేశవః । కంసారిః కేశిమథనః కేశవః క్లేశనాశనః. 8

# అరువది తొమ్మిదవ అధ్యాయము.

## కల్యాణ భీమ ద్వాదశీ వ్రతము.

మనువు మత్స్యనారాయణు నిట్లడిగెను: దేవేశ్వరా! దేవా! మానవులకు స్వల్పమగు తపస్సుతోనే అనంతమగు ఆరోగ్యము ఐశ్వర్యము మోక్షము కలుగు నుపాయమును తెలుపుము. నీకు తెలియనిదేదియు లేదు. అనగా నారాయణు డిట్లతనికి తెలిపెను. పూర్వము రాథంతర కల్పమున మందర పర్వతమున నున్న పినాకధారియగు మహాదేవుని భగవానుడు సాక్షాత్ బ్రహ్మదేవుడు ఈ విషయమును అడుగగా అతడతనికి మనఃప్రీతికారకమగు ఈ విషయము ఇట్లు చెప్పెను: బ్రహ్మా! ఇపుడు జరుగుచున్న ఈ రథంతర కల్పమునుండి ఇరువది మూడవ కల్పమున వారాహకల్పము వచ్చును దానిలో ఏడవదగు వైవస్వత మన్వంతరమున ఇరువది ఏడవ ద్వాపరయుగపు తుదలో మిగుల మహాతేజస్కుడు వాసుదేవుడు నగు (సర్వమునందు తానుండుచు సర్వమునందు తానుండు) జనార్దనుడు విష్ణువు లోక (భూ) భారమును దించుటకు మూడుగానై ద్వైపాయనముని-బలరాముడు-కృష్ణుడు-అని ముగ్గురుగా అగును. కృష్ణునకే కేశవుడు కంసారి కేశి మథనుడు అని ప్రసిద్ధి. ఆ మహానుభావుడు క్లేశము లన్నిటిని నశింపజేయువాడు.

పురీ ద్వారవతీ నామ సామ్ప్రతం యా కుశస్థలీ । దివ్యానుభావసంయుక్తా సా నివాసాయ శార్ఙ్గిణః. 9
త్వష్టా మమాజ్ఞయా బ్రహ్మ న్కరిష్యతి జగత్పతేః । తస్యాం కదాచి దాసీన స్సభాయాం చామితద్యుతిః.
భార్యాభిర్వృష్ణిభి ర్భూయో సుహృద్భిరివ దక్షిణైః । కురుభి ర్దేవగన్ధర్వై స్సహితః కైటభార్దనః. 11
ప్రవృత్తేషు పురాణేషు ధర్మసంవాదినీషు చ । కథాన్తే భీమసేనేన పరిపృష్టః ప్రతాపవాన్. 12
త్వయా పృష్టస్య ధర్మస్య రహస్యస్యాస్య భేదకృత్ । భవితా న తదా బ్రహ్మ న్కర్తా చైవ వృకోదరః.13
ప్రవర్తకోఽస్య ధర్మస్య పాణ్డుసూను ర్మహాబలః । యస్య తీక్ష్ణో వృకో నామ జఠరే హవ్యవాహనః. 14
మయా దత్త స్స ధర్మాత్మా తేన చాసౌ వృకోదరః । మతిమా న్దానశీలశ్చ నాగాయుతబలో మహాన్. 15
భవిష్య త్యజర స్సాక్షా త్కన్దర్ప ఇవ మూర్తిమాన్ । ధార్మికస్యాప్యశక్తస్య తీవ్రాగ్నిత్వా దుపోషణే. 16
ఇదం వ్రత మశేషాణాం వ్రతానా మధికం యతః । కథయిష్యతి విశ్వాత్మా వాసుదేవో జగద్గురుః. 17
అశేషయజ్ఞఫలద మశేషాఘవినాశనమ్ । అశేషదుఃఖశమన మశేషామరపూజితమ్. 18
పవిత్రాణాం పవిత్రం య న్మఙ్గళానాంచ మఙ్గళమ్ । భవిష్యాణాం భవిష్యంచ పురాణానాం పురాతనమ్.19
వాసుదేవః : యద్యష్టమీ చతుర్దశ్యో ర్ద్వాదశీష్వపి భారత । అన్యేష్వపి దినర్క్షేషు నశక్త స్త్వ ముపోషితుమ్.
తతః పుణ్యా మిమాం భీమ తిథిం పాపప్రణాశనీమ్ । ఉపోష్య విధినాఽనేన గచ్ఛే ద్విష్ణోః పరం పదమ్.

దివ్యములగు అనుభావములకల ఈనాటి (మత్స్యనారాయణుడు మనువునకు ఈ విషయమును చెప్పిన కాలమునందలి) కుశస్థలీపురిని జగత్పతియగు నాయాజ్ఞచే (దేవశిల్పి) త్వష్ట శార్ఙ్గ ధనుర్ధారియగు శ్రీకృష్ణభగవానుని

నివాసమునకై ద్వారవతీ పురియను పేర నిర్మించును. కైటభాంతకుడగు శ్రీకృష్ణుడు ఒకానొక సమయమున ఆ ద్వారక యందు సభయందాసీనుడు అగును. అమిత ప్రకాశుడగు ఆయనను తన పత్నులను వృష్ణిజాతీయులగు క్షత్రియులను మిగుల ప్రియులగు మిత్రులును కురు వంశీయులగు క్షత్రియులును దేవతలును గంధర్వులును దేవ గంధర్వులును పరివేష్టించియుందురు. ఆసభలో పురాణములును ధర్మమున కనుకూలములగు కథా ప్రవృత్తులును సాగుచుండ మాటలనడుమ ప్రతాపవంతుడగు శ్రీకృష్ణుని భీమసేనుడు ఇపుడు నన్ను (మత్స్యనారాయణుని) నీవు (మనువు) అడిగిన ఈ రహస్యమును భేదించు ప్రశ్నమును ప్రశ్నించును. తరువాత ఆ భీమసేనుడే ఈ ధర్మము (వ్రతము) ను ఆచరించు వాడును ఆధర్మమును లోకమున ప్రవర్తింపజేయువాడును అగును.

ఆ భీమసేనుడు పాండు రాజకుమారుడు-మహాబలుడు; ఆ ధర్మాత్మునకు నేను వృకము అను పేరుగల జఠ రాగ్నిని ఇత్తును. అందుచే అతనికి వృకోదరుడను పేరు ప్రసిద్ధమగును. అతడు బుద్ధిశాలియు దానశీలుడును పదివేల ఏనుగుల బలమంత బలముగల గొప్పవాడును వార్ధకము మొదలగు లోపములు లేనివాడును సాక్షాత్ రూపొందిన మన్మథుని వంటివాడును; ఐనను ఆతడు ధార్మికుడై ఉండియు తీవ్రమగు జఠరాగ్ని దీప్తి కలవాడగుటచే ఉపవాసము చేయుటకు శక్తిలేనివాడు.

అతనికి విశ్వాత్ముడును లోకగురుడును అగు వాసుదేవుడు (శ్రీకృష్ణుడు) అన్ని వ్రతములలో గొప్పదియగు ఈ వ్రతము తెలుపును. ఇది సమస్త యజ్ఞముల ఫలము నిచ్చునది-సర్వపాపరాసుల నశింపజేయునది-అశేష దుఃఖముల శమింపజేయునది-సకల దేవతల పూజలనందుకొనునది. పవిత్రములగు వానిలో పవిత్రమును-శుభములగు వానిలో శుభ మగునదియు భవిష్యములగు వానిలో భవిష్యము (ఇంకముందెంత కాలమువరకైన లోకమున ప్రచారములో నుండునది) పురాతనములగు వానిలో పురాతనమయినది (ఎంతో కాలమునుండి లోకమున ప్రచారమునందున్నది.

మాఘమాసస్య దశమీ యదా శుక్లా భవే త్తదా । ఘృతే నాభ్యఞ్జనం కృత్వా తిలైః స్నానం సమాచరేత్. 22
తథైవ విష్ణు మభ్యర్చ్య నమో నారాయణేతి చ । కృష్ణస్య పాదౌసమ్పూజ్య శిర స్సర్వాత్మనే నమః. 23
వైకుణ్ఠాయేతి వై కణ్ఠ మురః శ్రీవత్సధారిణే । శఙ్ఖినే చక్రిణే తద్వ ద్గదినే వరదాయ చ. 24
సర్వం నారాయణస్యైవం సమ్పూజ్యాఽఽవాహయే త్క్రమాత్ ।
దామోదరాయే త్యుదరం మేఢ్రం పఞ్చశరాయ వై. 24
ఊరూ సౌభాగ్యనాథాయ జానునీ భూతధారిణే । నమోఽతులాయవై జఙ్ఘే పాదౌ విశ్వసృజే నమః. 29
నమో దేవ్యై నమ శ్శాన్త్యై నమో లక్ష్మ్యై నమశ్శ్రియై ।
నమః పుష్ట్యై నమ స్తుష్ట్యై నమో ధృత్యై నమో నమః. 27
నమో విహఙ్గనాథాయ వాయువేగాయ పక్షిణే । విషప్రమథనాయేతి గరుడం చాభిపూజయేత్. 28
ఏవం సమ్పూజ్య గోవిన్ద ముమాపతివినాయకౌ । గన్ధమాల్యై స్తథా ధూపై ర్భక్ష్యై ర్నానావిధై రపి. 29
గవ్యేన పయసా సిద్ధాం కృసరా మథ వాగ్యతః । సర్పిషా సహ భుక్త్వా తాం గత్వా శతపదం బుధః. 30
న్యగ్రోధం దన్తకాష్ఠం స్యా దథవా ఖాదిరం బుధః । గృహీత్వా ధావయే ద్దన్తా నాచాన్తః ప్రాగుదఙ్ముఖః
బ్రూయా త్సాయన్తనీం కృత్వా సన్ధ్యా మస్తమితే రవౌ ।
నమో నారాయణాయేతి త్వామహం శరణం గతః. 32
ఏకాదశ్యాం నిరాహార స్సమ్య గభ్యర్చ్య కేశవమ్ । రాత్రించ సకలాం స్థిత్వా స్నానంచ పయసా తతః
సర్పిషావాపి హవనం హుత్వా బ్రాహ్మణపుఙ్గవైః । సహైవ పుణ్డరీకాక్ష ద్వాదశ్యాం క్షీరభోజనమ్. 34
కరిష్యామి యతాత్మాఽహం నిర్విఘ్నం కురు మే వ్రతమ్ । ఏవముక్త్వా స్వపేద్భూమౌ వితిహాసకథాం పునః

వాసుదేవుడు భీమసేనునకు ఇట్లు చెప్పెను: నీవు అన్ని అష్టమీ ద్వాదశీ చతుర్దశీ తిథులయందును ఇతరములగు శుభ నక్షత్ర తిథులయందును ఉపవసించి వ్రతము అనుష్ఠించుటకు శక్తి లేనివాడవయినచో ఈ పాప ప్రణాశకమగు మాఘ శుక్ల దశమ్యేకాదశీ ద్వాదశీ తిథుల యందయిన ఈ చెప్పబోవు విధానమున వ్రతము చేసినచో విష్ణుస్థానము నందగలవు.

శ్రీకృష్ణుడు భీమసేనునకు ఇట్లు చెప్పెను: (ఈవ్రతము మూడునాళ్ళు-మాఘ శుక్ల దశమ్యేకాదశీ ద్వాదశీ తిథులయందు-దీక్షతో నుండి చేయవలసినది. అందు మొదట దశమినాటి కృత్యము) మాఘ శుక్ల దశమినాడు నేతితో అభ్యంజనము చేసికొని నూవుల (పిండి)తో స్నానము చేయవలెను. ఈ చెప్పబోవు మంత్రములతో విష్ణుని పూజించ వలయును. మొదట విష్ణుని పాదములను పూజించవలయును. పిమ్మట-1. సర్వాత్మనేనమః శిరః పూజయామి; 2. వైకుంఠాయనమః కంఠం పూజయామి; 3. శ్రీవత్సధారిణేనమః ఉరః పూజయామి; 4. దామోదరాయనమః ఉదరం పూజయామి; 5. పంచశరాయనమః మేఢ్రం పూజయామి; 6. సౌభాగ్యనాథాయనమః ఊరూ పూజయామి; 7. భూత ధారిణేనమః జానునీ పూజయామి; 8. అతులాయనమః జంఘే పూజయామి 9. విశ్వసృజేనమః పాదౌ పూజయామి.

ఈ మంత్రములతో నారాయణుని ప్రతియొక అవయవమును పూజించవలెను. ఈ పూజకు ముందుగా శంఖినే నమః చక్రిణేనమః గదినేనమః వరదాయనమః-ఇత్యాది మంత్రములతో విష్ణుని ఆవాహనము చేయవలెను.

శ్రీదేవ్యైనమః-శాంత్యైనమః-లక్ష్మ్యైనమః-శ్రియైనమః-పుష్ట్యైనమః-తుష్ట్యైనమః-ధృత్యైనమః-ఇత్యాది మంత్రము లతో లక్ష్మిని పూజించవలెను.

విహంగనాథాయనమః- వాయువేగాయనమః-పక్షిణేనమః- విషప్రమథనాయనమః-ఇత్యాది మంత్రములతో గరుడుని పూజించవలెను.

ఇట్లు గోవిందుని (లక్ష్మిని-గరుడుని) శివుని వినాయకుని నానావిధ గంధమాల్య ధూపదీప భక్ష్యములతో పూజించవలయును. ఆవుపాలతో వండిన పులగమును నేతితో మౌనముగా భుజించవలెను. నూరడుగులు నడువవలెను. సాయంకాలము కాగానే మర్రి ఊడను కాని చంద్రపుల్లను కాని ఉపయోగించి దంతధావనము చేసి తూర్పుగానో ఉత్తరముగానో తిరిగి కూర్చుండి ఆచమించవలెను. పిమ్మట సూర్యాస్తమయము కాగానే సాయం సంధ్యను ఉపాసించ వలయును. నమో నారాయణాయ-అహంత్వాం శరణంగతః-(నేను నిన్ను శరణు చొచ్చుచున్నాను.) అని ప్రార్థించి భూమిపై నిద్రించవలెను.

(ఏకాదశీ దినకృత్యము) ఏకాదశినాడు నిరాహారుడై యుండి లెస్సగా కేశవుని అభ్యర్చించవలెను. (పిమ్మట విష్ణుని ఇట్లు ప్రార్థించవలెను.) "నేను ఈ రాత్రియంతయు గడపి (రేపుదయము) స్నానమాడుదును. పాలతోగాని నేతితో గాని (నిన్నుద్దేశించి) హోమము చేయుదును. బ్రాహ్మణులతో కూడ క్షీరముతో భోజనము చేయుదును. ఇట్లు నియత మనస్కుడనై నీ వ్రతము చేయుదును. ఆ వ్రతమును నిర్విఘ్నము చేయుము." అని ఇట్లు ప్రార్థించి కడపట ఇతి హాస కథను విని భూమిపై పరుండవలెను.

శ్రుత్వా ప్రభాతే సఞాతే నదీం గత్వా విశాం పతే । స్నానంకృత్వా మృదా తద్వ త్పాషణ్డానపి వర్జయేత్.
ఉపాస్య సన్ధ్యాం విధివ త్కృత్వాచ పితృతర్పణమ్ ।
ప్రణమ్యచ హృషీకేశ మమలం చార్కమీశ్వరమ్. 37
గృహస్య పురత శ్శక్త్యా మణ్డపం కారయే ద్బుధః । దశహస్త మథాష్టౌవా తత్ర కుర్యా ద్విశాం పతే. 38
చతుర్హస్తాం శుభాం కుర్యా ద్వేదీ మరినిషూదన । చతుర్హస్త ప్రమాణంచ విన్యసే త్తత్ర తోరణమ్. 39
ప్రలమ్బ్య కలశం తత్ర మాషమాత్రేణ సంయుతమ్ । ఛిద్రేణ జలసమ్పూర్ణ మధః కృష్ణాజినే స్థితః. 40
తస్య ధారాం చ శిరసా ధారయే త్సకలాం నిశామ్ । ధారాభి ర్భూరిభి స్తుల్యం ఫలం వేదవిదో విదుః. 41

యస్మా త్తస్మా త్కురుశ్రేష్ఠ ధారా ధార్యాస్తు శక్తితః । తథైవ విష్ణో శ్శిరసి క్షీరధారాం ప్రదాపయేత్.42
అరత్ని మాత్రం కుణ్డంచ కృత్వా తత్తు త్రిమేఖలమ్ ।
యోనిచక్రంతు తత్కృత్వా బ్రాహ్మణై ర్యవసర్పిషి. 43
తిలాశ్చ విష్ణుదైవత్యై ర్మన్త్రై రేకాగ్నివ త్తథా । కృత్వాచ వైష్ణవం సమ్య క్చరుం గోక్షీరసంయుతమ్.44
మాషమాత్ర ప్రమాణంతు ధారా మాజ్యస్య పాతయేత్ । జలకుమ్భా న్మహావీర స్థాపయిత్వా త్రయోదశ.
భక్ష్యై ర్నానావిధై ర్యుక్తా న్సితవస్త్రై రలఙ్కృతాన్ ।
యుక్తా నౌదుమ్బరైః పత్రైః పఞ్చరత్న సమన్వితాన్. 46
చతుర్భి ర్బహ్వృచై ర్హోమ స్తత్ర కార్యో హ్యుదఙ్ముఖైః । రుద్రజాప శ్చతుర్భిశ్చ యజుర్వేదపరాయణైః.
వైష్ణవానిచ సామాని చతుర స్సామవేదినః । అరిష్టవర్గసహితా నభితః పరిపాఠయేత్. 48

(ద్వాదశీ దిన కృత్యము) ద్వాదశినాడు ఉదయమున నదికిపోయి మృత్తికతో స్నానముచేసి వేదబాహ్యుల నెవరిని చూడక తాకక వారితో మాటలాడక సంధ్యావందనమును పితృ తర్పణమును చేయవలెను. నారాయణుని సూర్యుని ఈశ్వరుని నమస్కరించవలెను. ఇంటిముందు యథాశక్తిగ మంటపమును (పందిరిని) ఎనిమిది మూరలు కాని పది మూరలు కాని భుజముండునట్లు చతురస్రముగా నిర్మించి దాని నడుమ నాలుగు మూరల కొలతతో చతురస్రా కారపు చక్కని వేదిక (అరుగు) నిర్మించవలెను. అంతే కొలతగల తోరణమును కూడ దానిపై చుట్టును కట్టవలయును. ఆ వేదిక నడుమ పైనుండి వ్రేలాడునట్లు జలపూర్ణమై మినుప గింజంత రంధ్రముకల కడవను వ్రేలాడదీయవలయును. దానినుండి పడు ఉదకధారను రాత్రియంతయు యజమానుడు కృష్ణాజినముపై కూర్చుండి తన తలపై పడునట్లు చేసికొనవలెను. ఇట్లు అనేక జలధారలు పడుటచే విస్తారమగు ఫలము కలుగునని వేదవేత్తలు చెప్పుదురు. అట్లే వ్రతదిన మున విష్ణుని శిరముపై ఈ కలశము నుండి గోక్షీరధారపడునట్లు చేయవలెను.

పిడికిమూర కొలతతో చతురస్రపు కుండమును దానిచుట్టును మూడు మేఖలలను (అంచులను) చేయవలెను. దాని ముందు యోనిచక్రమును ఏర్పరచవలయును. బ్రాహ్మణులు విష్ణు దైవత్యములగు మంత్రములతో ఏకాగ్ని విధాన మున విష్ణుని ఉద్దేశించి ఆజ్యాహుతులను వేయవలయును. హోమమునకు యవలు నేయి తిలలు ఆవుపాలతో నేతితో వండిన చరువును ఉపయోగించవలయును. ఆహుతులు మినుప గింజంత పరిమాణముతో ఉండవలయును. హోమస్థానము నందు పదుమూడు జలకలశములను నిలుపవలయును. వాటిపై నానా విధములగు భక్ష్యముల నుంచవలయును. పంచ రత్నములతో మేడి చిగురాకులతో తెల్లని క్రొత్త వస్త్రములతో వాటినలంకరించవలయును. నలుగురు ఋగ్వేదీయులు ఉత్తరముఖులై కూర్చుండి హోమము చేయవలయును. నలుగురు యజుర్వేదీయులు రుద్రమంత్ర జపము చేయవలయును. నలుగురు సామవేదులు విష్ణుదేవతాక సామమంత్రములు పఠించుచుండవలయును. వీరందరు శుభ లక్షణములు శుభ వస్త్ర ధారణము కలిగి శుభద్రవ్యములు దగ్గరనుంచుకొని యుండవలయును.

ఏవం ద్వాదశ తా న్విప్రా న్వస్త్రమాల్యానులేపనైః । పూజయే దఙ్గులీయైశ్చ కటకై ర్హేమభూషణైః. 49
వాసోభి శ్శయనీయైశ్చ విత్తశాఠ్యవివర్జితః । ఏవం క్షపాఽతినేయా చ గీతమఙ్గళనిస్స్వనైః. 50
ఉపాధ్యాయస్య చ తతో ద్విగుణం సర్వమేవ తత్ । తతః ప్రభాతే విమలే సముత్థాయ త్రయోదశ. 51
గావో దద్యా త్కురుశ్రేష్ఠ సౌవర్ణశృఙ్గసంయుతాః । పయస్విన్య శ్శీలవత్యః కాంస్యదోహసమన్వితాః. 52
రౌప్యఖురా స్సవస్త్రాశ్చ చన్దనే నాభిషేచితాః । తాశ్చ తేషాం తతో దద్యా ద్భక్ష్యభోజ్యసమన్వితాన్. 53
కృత్వాచ బ్రాహ్మణా న్సర్వా న్భక్త్యా పరమయా యుతః। భుక్త్వా చాక్షారలవణ మాత్మనా చ విసర్జయేత్,
అనుగమ్య పదాన్యష్టౌ పుత్త్రభార్యాసమన్వితః । ప్రీయతామత్ర దేవేశః కేశవః క్లేశనాశనః 55

శివస్య హృదయం విష్ణు ర్విష్ణోశ్చ హృదయం శివః ।
యథాఽన్తరం న పశ్యామి తథా మే స్వస్తి రాయుషి. 56
ఏవ ముచ్చార్య తా న్కుమ్భా న్గావశ్చ శయనాని చ ।
వాసాంసిచైవ సర్వేషాం గృహాణి ప్రాపయే ద్బుధః. 57
అభావే బహుశయ్యానా మేకామపి సుసంస్కృతామ్ ।
శయ్యాం దద్యా ద్ద్విజాతీనాం సర్వోపస్కరసంయుతామ్. 58
ఇతిహాసపురాణాని వాచయిత్వాఽతివాహయేత్ । తద్దినం ద్విజశార్దూల య ఇచ్ఛే ద్విపులాం శ్రియమ్. 59

ఇట్లు పూజా-జప-హోమ-ప్రక్రియ ముగిసిన తరువాత వస్త్ర-మాల్య - గంధానులేపనములతోను స్వర్ణాంగుళీయ-కటక-హేమభూషణములతోను మంచములతో పరుపులతోను శక్తికి లోపము రానీయక ఆ పండ్రెండు మంది విప్రులను పూజించవలెను. ఆచార్యునకు మాత్రము ఋత్విక్కులలో ఒక్కొక్కరికి ఇచ్చిన దానికి రెట్టింపు దక్షిణాదికము ఈయవలెను.

తరువాత ఆ రాత్రి గీత వాద్యవినోదములతో గడుపవలెను. తెల్లవారిన తరువాత (త్రయోదశినా డుదయమున) ఈ పదుముగ్గురకును (గాని మరి పదుముగ్గురు బ్రాహ్మణులకుగాని) పదుమూడు పాడియావులను దాన మీయవలెను. అవి బంగారు కొమ్ములు వెండి గిట్టలు పాలు పిదుకుటకు కంచుపాత్రలు నూతన వస్త్రపు కప్పడములు కలవై పొడువక తప్పిపోక మంచి స్వభావము కలవై యుండవలెను. వాటిని చందనముతో అభిషేకించి దానము ఈయవలెను. పిమ్మట వారిని భక్ష్యభోజ్య సమన్వితముగా భుజింపజేసి తానును ఉప్పు పులుపు కారములేని యాహారము భుజించి వారిని వీడ్కొని తన భార్యాపుత్త్రులతో కూడ ఎనిమిది అడుగులు కూడవెళ్లి వారిని సాగనంపవలయును. "క్లేశముల నశింపజేయువాడును దేవేశుడు నగు కేశవుడు నేను జేసిన ఈ వ్రతముచే ప్రీతి నొందుగాక! శివుని హృదయ(తత్త్వ)ము విష్ణువు-విష్ణుని హృదయ(తత్త్వ)ము శివుడు; ఇట్లు వా రిరువుర నడుమ నేను అభేదమును భావన చేయుచున్నాను. కావున నాకు శుభమగు ఆయువును శుభములును కలుగుగాక!" అని పలుకుచు ఆ కుంభములను గోవులను శయనీయములను వస్త్రములను ఆయా బ్రాహ్మణుల ఇండ్లకు పంపవలయును. శక్తిలేని యజమానుడు అందరకును (బ్రాహ్మణులకు) కలిసి ఒకే శయ్యవైన సామగ్రులతో అలంకరించిన దానిని ఈయవలెను.

ఆ దినము అంతయు ఇతిహాస పురాణ కథాశ్రవణములతో గడుపవలయును. ఇట్లు చేసినచో విపులమగు సంపత్ భాగ్యములు కలుగును.

తస్మా త్సత్త్వం సమాలమ్బ్య భీమసేన విమత్సరః ।
కురు వ్రత మిదం సమ్యక్స్నేహా ద్గుహ్యం మయేరితమ్. 60
త్వయా కృత మిదం వీర త్వన్నామాఖ్యం భవిష్యతి । సా భీమద్వాదశీ హ్యేషా సర్వపాపప్రణాశనీ. 61
యా తు కల్యాణినీ నామ పురాకల్పేషు పఠ్యతే ।
త్వ మాదికర్తా భవ సౌకరేఽస్మి న్కల్పే మహావీరవర ప్రదానే. 62
యస్మా త్స్మర సీ్కర్తన మప్యశేషం వినష్టపాప స్త్రిదశాధిప స్స్యాత్ ।
కృత్వాచ యా మప్సరసా మదీశా వేశ్యా కృతా హ్యన్యభవాన్తరేషు. 63
ఆభీరకన్యాతు కుతూహలేన సైవోర్వశీ సమ్ప్రతి నాకపృష్ఠే ।
జాతాఽథ సా వైశ్యకులోద్భవాపి పులోమకన్యా పురుహూతపత్నీ. 64

తత్రాపి తస్యాః పరిచారికేయం మమ ప్రియా సమ్ప్రతి సత్యభామా ।
స్నాతః పురా మణ్డల మేష తద్వ త్తేజోమయం వేదశరీర మాప. 65
అస్యాంచ కల్యాణతిథౌ వివస్వా న్సహస్రధారేణ సహస్రరశ్మిః ।
ఇదమేవ కృతం మహేన్ద్రముఖ్యై ర్వసుభిర్దేవసురారికోటిభిశ్చ. 66
ఫలమస్య న శక్యతేఽభివక్తుం యది జిహ్వాయుతకోటయో ముఖే స్యుః ।
కలికలుషవిదారిణీ మనన్తా మితి కథయిష్యతి యాదవేన్ద్ర సూనుః. 67
అపి నరకగతా న్పితౄ్ఞ నశేషా నల ముద్ధర్తు మిహైవ యః కరోతి ।
య ఇద మనుశృణోతి చాతిభక్త్యా పరిపఠతీహ పరోపకార హేతోః. 68
తిథి మిహ సకలార్థదాం నరేన్ద్ర స్స చ చతురాననసామ్యతా ముపైతి ।
కల్యాణినీ నామ పురాఽబ్జగర్భా ద్యా ద్వాదశీ మాఘదినేఽభిపూజ్యా.
సాపాండుపుత్త్రేణకృతా భవిష్య త్యనన్తపుణ్యాఽనఘభీమపూర్వా. 69॥

ఇతి శ్రీమత్స్యమహాపురాణే మత్స్యమనుసంవాదే కల్యాణభీమద్వాదశీ వ్రత
కథనం నామైకోనసప్తతితమోఽధ్యాయః.

కావున భీమసేనా! నీవు మత్సరములేక (ఇతరులతో పోటీ చేయు తలంపులేక) సత్త్వగుణము నవలంబించి లెస్సగా ఈ వ్రతము నాచరింపుము. ఈ వ్రత మతి రహస్యమయినను నీ యందలి స్నేహముచే నేను నీ కిది తెలిపితిని. నీవు దీని ననుష్ఠించుటచేత సర్వపాప ప్రణాశనమగు ఈ వ్రతమునకు భీమ ద్వాదశీ వ్రతమను పేరు ప్రసిద్ధ మగును. పూర్వ కల్పములందు కల్యాణినీ వ్రతమని ప్రసిద్ధమయి ఇష్టవరప్రదమగు దీనికి నీవు ఈ వారాహ కల్పమున ఆదికర్తవు (మొదట చేసినవాడవు) కావలయును. ఏలయన ఈ వ్రతకల్పము అంతయు కీర్తించినను స్మరించినను అతడు కూడ దేవేంద్రుడగును. కుతూహలముతో (దీనిని చేసినచో ఏ ఫలము కలుగునో చూతమని) ఒకానొక ఆభీర (అహీరులను గోపాలకుల) కన్య జన్మాంతరమునందు ఈ వ్రతముచేసి దేవవేశ్యలలో శ్రేష్ఠయగు ఊర్వశి యయ్యెను. ఒకానొక వైశ్య కన్య దీని నాచరించి మరియొక జన్మమున పులోముని కూతురై ఇంద్రుని భార్యయగు శచి యయ్యెను. ఆ జన్మమున ఆమెకు పరిచారికగా నున్న యామె ఇపుడు నా భార్య సత్యభామగా నైనది. పూర్వము ఈ శుభ తిథియందు సహస్ర రంధ్రములుకల కలశపు జలధారలతో స్నాన మాడిన పుణ్యపు ప్రభావమున సూర్యుడు వేదాత్మక శరీరరూపమగు తేజో మయ మండలమును పొందగలిగెను.

ఇపుడు మహేంద్రుడుగా వసువులుగా గణదేవతలుగా దేవకోటులుగా రాక్షసశ్రేష్ఠులుగా నున్నవారు కూడ ఒకప్పుడు ఈ వ్రతము నాచరించినవారే.

నోటియందు పదివేల కోటుల నాలుకలున్నను దీని మహిమము చెప్పుట సాధ్యము కాదు. ఇది కలికలుష నాశ కము. అనంత పుణ్యప్రదము. అని ఇట్లు శ్రీకృష్ణుడు భీమసేనునకు చెప్పెను.

దీని నాచరించినవాడు తమ పితరులను అంతరను నరకమునుండి ఉద్ధరించినవా రగుదురు. సకలార్థప్రదమగు ఈ ద్వాదశీ వ్రత మహిమమును వినినవాడును చదివి ఇతరులకు పరోపకారబుద్ధితో వినిపించినవాడును బ్రహ్మత్వము పొందును.

పూర్వ కల్పములందు కల్యాణినీ ద్వాదశీ వ్రతమను పేర బ్రహ్మదేవునిచే లోకమున ప్రవర్తిల్ల చేయబడిన ఈ వ్రతము వాసుదేవుని ఉపదేశముచే భీమసేనునిచేత చేయబడి అనంత పుణ్యప్రదమయి భీమ ద్వాదశీ వ్రతమని ప్రసిద్ధ మగును.

ఇది శ్రీమత్స్య మహాపురాణమున కల్యాణినీ భీమ ద్వాదశీ వ్రత కథనమను అరువది తొమ్మిదవ అధ్యాయము.

## సప్తతితమోఽధ్యాయః.

## అనఙ్గశయనవ్రతమ్.

బ్రహ్మా : వర్ణాశ్రమాణాం ప్రభవః పురాణేషు మయా శ్రుతః ।
సదాచారాశ్చ భగవన్ ధర్మశాస్త్ర వినిశ్చయాః. 1
పుణ్యస్త్రీణాం సదాచారం శ్రోతు మిచ్ఛామి తత్త్వతః । పతివ్రతానాం దేవేశ చరితం పరికీర్తయ. 2
ఈశ్వరః : యస్మిన్నేవ యుగే బ్రహ్మ న్సహస్రాణి చ షోడశ ।
వాసుదేవస్య భార్యాణాం భవిష్య న్త్యమ్బుజోద్భవ. 3
తాభి ర్వసన్తసమయే కోకిలాళికులాకులే । పుష్పితోపవనోత్ఫుల్ల కల్హారసరస స్తటే. 4
నిర్భరాపానగోష్ఠీషు ప్రసక్తాభి రలంకృతః । కురఙ్గనయన శ్శ్రీమాన్మాలతీకృతశేఖరః. 5
గచ్ఛ న్సమీపమార్గేణ సామ్బః పరపురఞ్జయః । సాక్షాత్కన్దర్పరూపేణ సర్వాభరణభూషితః. 6
అనఙ్గశరతప్తాభి స్సాభిలాషాభి రీక్షితః । ప్రవృద్ధో మన్మథ స్తాసాం భవిష్యతి యదాఽఽత్మని. 7
తదాఽవేక్ష్య జగన్నాథ స్సర్వతో జ్ఞానచక్షుషా । శాపం వక్ష్యతి తా స్సర్వా వో హరిష్యన్తి దస్యవః. 8
మత్పరోక్షం యతః కామా త్ప్రాప్త మీదృగ్విచేష్టితమ్। తదా ప్రసాదితో దేవ ఇదం వక్ష్యతి శార్ఙ్గభృత్. 9

కృష్ణశాపా త్తత్పత్నీనాం వేశ్యాత్వప్రాప్తిః.

తాభి శ్శాపాభితప్తాభి ర్భగవాన్భూతభావనః । ఉత్తారభూతం దాసీత్వం సమదా ద్బ్రాహ్మణః ప్రియమ్. 10
ఉపదేక్ష్య త్యథాత్మానం భావికర్మణి కారకమ్ । భవతీనాం ముని ర్దాల్భ్యో యద్వ్రతం కథయిష్యతి. 11
తదేవోత్తారణాయాలం దాసీత్వేఽపి భవిష్యతి ః ఇత్యుక్త్వాతాః పరిత్యజ్య * గతోఽన్తర్ధాన మీశ్వరః. 12

## డెబ్బదియవ అధ్యాయము.

## అనంగశయన వ్రతము.

బ్రహ్మదేవుడు ఈశ్వరు నిట్లడిగెను. భగవన్! (వైదిక) పురాణములయందు చెప్పబడియున్న వర్ణాశ్రమముల ఉత్పత్తిని ధర్మశాస్త్రములయందలి ఆచార నిర్ణయములను సదాచారములను కూడ వింటిని. పుణ్య స్త్రీలు పాటించవలసిన సదాచారమును పతివ్రతల సదాచారమును వినగోరుచున్నాను. నా కవి తెలుపుము.

ఈశ్వరు డతనికి ఇట్లు చెప్పెను: ముందు రాబోవు యుగమున శ్రీకృష్ణునకు పదునారువేల మంది భార్య లగుదురు. ఆ కాలమున ఒకానొక వసంతర్తువునందు కోయిలల-తుమ్మెదల గుంపులు దట్టమయి ధ్వనులు చేయుచుండ పూచిన ఉద్యానముల నడుమ వికసించిన ఎఱ్ఱ కలువలతో నిండిన సరస్సు నొద్దున ఉన్న శ్రీకృష్ణ భార్యల పదునారువేల మందికి సమీపముగా కృష్ణ కుమారుడు సాంబుడు పోవుట జరుగును. అతడు లేడి కన్నులవంటి చంచలములు మనోహరములు నగు కన్నులు కలవాడు; మాలతీ పుష్పములతో కేశపాశము నలంకరించుకొనినవాడు. మద్యపానగోష్ఠులయందు దట్టముగా మునిగియున్న స్త్రీలు ఆతని చుట్టు పరివేష్టించి యుండి అతని నలంకరించి యుందురు. ఆతడును సర్వాభరణములతో అలంకరించబడి సాక్షాత్ మన్మథునివలె నుండును. అతనిని శ్రీకృష్ణపత్ను లందరును మన్మథబాణ తాపముచే వాంఛాపూర్వకముగా చూతురు. వారి మనస్సులందు కామ మధికమగుటను భగవానుడు జ్ఞాననేత్రముతో చూచి "నేను లేని చోట మీరు కామముచే ఇట్లు ఆచరించితిరి కావున మిమ్ము దోపిడిగాండ్రు హరింతురు." అని శపించును.

శాపముచే అభిశాపము చెంది వారందరును సర్వభూతముల సృజించి పోషించువాడు శార్ఙ్గధారియగు కృష్ణ భగ

* గతేద్వారవతీశ్వరే

వానుని వేడికొని అనుగ్రహింపజేసికొందురు. "మీరు ఈ శాపమునుండి తరించుటకు మీకు దాసీత్వము ప్రాప్తించును. నేను రాబోవు పనులు ఏవి ఎట్లు జరుగనున్నవో అట్లు చేయువాడను. ఇకముందు దాల్భ్యుడు అను బ్రాహ్మణుడు మీకు ప్రీతికరమగు వ్రతమును దేని నుపదేశించునో దాని నాచరించుడు. అది మిమ్ములను మీ దాసీత్వమునుండి తరింప జేయగలుగును." అని ప్రీతితో భగవానుడు వారికి ఉపదేశించి వారిని విడిచి అంతర్ధానము నందును.

తతః కాలేన మహతా భారావతరణే కృతే । నివృత్తే మౌసలే తద్వత్కేశవేఽపి దివం గతే. 13
శూన్యే యదుకులే సర్వే చోరైరపి జితేఽర్జునే । హృతాసు కృష్ణపత్నీషు దానభోగ్యాసు చాంబుధౌ. 14
తిష్ఠత్సు దుఃఖదౌర్భాగ్యసన్తప్తాసు చతుర్ముఖ । ఆగమిష్యతి యోగాత్మా దాల్భ్యో నామ మహాతపాః. 15
తా స్త మర్ఘైశ్చ సమ్పూజ్య ప్రణిపత్య పునఃపునః లాలప్యమానా బహుశో బాష్పపర్యాకులేక్షణాః. 16
స్మరన్త్యో వివిధా న్భోగా న్దివ్యమాల్యానులేపనా న్ । భర్తారం జగతా మీశ మనన్త మపరాజితమ్. 17
దివ్యానుభావాంచ పురీం నానారత్నగృహాణి చ । ద్వారకావాసిన స్సర్వా న్దేవభూతాన్కుమారకా న్. 18
ప్రశ్న మేత త్కరిష్యన్తి మునే రభిముఖం స్థితాః ।
స్త్రియః : దస్యుభి ర్భగవ న్సర్వాః పరిభుక్తా వయం బలాత్. 19
స్వధర్మచ్యవనేఽస్మాక మస్మి న్న శ్శరణం భవా న్ । ఆదిష్టోఽసి పురా బ్రహ్మ న్కేశవేనచ ధీమతా. 20
కస్మా దీశేన సంయోగం ప్రాప్య వేశ్యాత్వ మాగతాః ।
వేశ్యానామపి యో ధర్మ స్తన్నో బ్రూహి తపోధన. 21
కథయిష్యతి తత్తాసాం యద్దాల్భ్య శ్చకితాననః । దాల్భ్యః : జలక్రీడావిహారేషు పురా సరసి మానసే. 22
భవతీనాం సగర్వాణాం నారదోఽభ్యాశ మాగమత్ । హుతాశనసుతా స్సర్వా భవన్త్యోఽప్సరసః పురా. 23
అప్రణమ్యావలేపేన పరిపృష్ట స్స యోగవిత్ । కథం నారాయణోఽస్మాకం భర్తా స్యా దిత్యుపోషణమ్. 24
తస్మా ద్వ్రతప్రదానం చ శాపశ్చాయ మభూ త్పురా । శయ్యాద్వయప్రదానేన మధుమాధవమాసయోః. 25
సువర్ణోపస్కరాస్సర్వాః ప్రదేయా శ్శుక్లపక్షయోః । భర్తా నారాయణో నూనం భవిష్య త్యన్యజన్మని. 26
యదకృత్వా ప్రణామం మే రూపసౌభాగ్యమత్సరాత్ । పరిపృష్టోఽస్మి తేనాశు వియోగో వో భవిష్యతి. 27
చోరైరపహృతా స్సర్వా వేశ్యాత్వం సమవాప్స్యథ । ఏవం నారదశాపేన కేశవస్యచ ధీమతః. 28
వేశ్యాత్వ మాగతా స్సర్వా భవన్త్యః కామమోహితాః । ఇదానీమపి యద్వక్ష్యే తచ్ఛృణుధ్వం వరాఙ్గనాః. 29

తరువాత చాలకాలమునకు శ్రీకృష్ణ భగవానుడు భూభారావతారణముచేసి మౌసల (ఇనుపరోకలి పొడినుండి ఉత్పన్నమైన తుంగదుబ్బులతో యాదవులు పరస్పరము చేసికొనిన) యుద్ధమునకు తరువాత తాను వైకుంఠము చేరును. యదుకులమున వీరులు లేకపోగా అర్జునుని జయించి దోపిడిగాండ్రు కృష్ణపత్నుల నపహరించి దాసీత్వమునకు పాలుపరతురు. వారు దుఃఖముచేతను దురదృష్టముచేతను సంతాపము చెంది సముద్ర తీరమున నుండగా యోగాత్ముడగు దాల్భ్యుడను మహాతపస్వి అచ్చటికు వచ్చును. వా రతనిని అర్ఘ్యపాద్యాదులతో పూజించి పునః పునర్నమస్కారము అర్పింతురు. బాష్ప వ్యాప్తములయిన కన్నులతో వా రనేక విధములుగా ఏడ్చుచు (తా మదివఱకు అనుభవించిన) దివ్య భోగములను దివ్య మాల్యానుగంధానులేపనములను లోకేశుడు అనంతుడు పరాజయము నెరుగనివాడు నగు తమ పతిని దివ్య లక్షణ ములుగల తమ ద్వారకాపురిని అచటి నానా రత్న గృహములను దేవ సదృశులై యుండి అప్పుడు దేవత్వమునే పొందిన ద్వారకావాసులగు కుమారకులను తలచుచు దుఃఖించుచు ఆ ముని కెదురుగా నిలిచి ఇట్లు ప్రశ్నింతురు.

"భగవన్! మేమందరమును దస్యులచే బలాత్కారమున అనుభవించబడితిమి. మాకు కలిగిన ఈ ధర్మ భ్రంశములో మీరే మాకు దిక్కు అగుదురని పూర్వమే శ్రీకృష్ణభగవానుడు మాకు ఆదేశించియున్నాడు. భగవానునకు

వత్సలమగు మేము వేశ్యాత్వమును పొందుటకేమి హేతువు? తపోధనా! వేశ్యలకు ఆచరణీయమగు ధర్మమేదియో మాకు తెలుపుము." అని అడుగగా ఆశ్చర్యచకితమయిన ముఖముతో దాల్భ్యుడు వారితో నిట్లనును: "పూర్వము మీరందరును అగ్ని పుత్రికలగు అప్సరసలుగా ఉంటిరి. ఒకప్పుడు మీరు మానస సరస్సున జలక్రీడా విహారములందుండగా నారదుడు మీకడకు వచ్చెను. మీరు గర్వముచే అతనిని నమస్కరించకయే 'మాకు నారాయణుడు పతియగు ఉపాయము ఏమ'ని అడిగితిరి. మధు (చైత్ర). మాధవ (వైశాఖ) మాసములందు బంగారు అలంకరణములతో సర్వ పరికరములతో మంచములను పడకలను (ఒక్కొక్క మాసమునందొక్కొక్కటిగా) ఉపవాస సహితమగు వ్రతాచరణముతో దానము చేసినచో నారాయణుడు పతియగునని ఉపదేశించి ఆముని రూప సౌభాగ్య గర్వముచే నన్ను నమస్కరింపకయే ఈ విషయము అడిగితిరి కావున మీకు నారాయణునితో వియోగము శీఘ్రకాలములోనే కలుగును. చోరులచే అపహరింపబడి మీరు వేశ్యాత్వమును పొందుదురు. అని శపించును. ఇట్లు నారద శ్రీకృష్ణుల శాపముచే మీరు కామ మోహితులయి వేశ్యాత్వమును పొందితిరి. ఉత్తమ స్త్రీలారా! నేనిపుడు చెప్పునది వినుడు.

పురా దైవాసురేయుద్ధే హతేషు శతశ స్సురైః । దానవాసురదైత్యేషు రాక్షసేషు తత స్తతః. 30
తేషాం నారీసహస్రాణి శతశోఽథ సహస్రశః । పరిణీతాని యాని స్యు ర్బలా ద్భుక్తాని యాని తు. 31
తాని సర్వాణి దేవేశః ప్రోవాచ వదతాం వరః । వేశ్యాధర్మేణ వర్తధ్వ మధునా నృపమన్దిరే. 32
భక్తిమత్యో వరారోహా స్తథా దేవకులేషు చ । రాజానస్స్వామినస్తుభ్యం సూతకం చాపి తత్సమమ్. 33
భవిష్యతిచ సౌభాగ్యం సర్వాసామపి శక్తితః । యః కశ్చి చ్ఛుల్క మాదాయ గృహమేష్యతి వై సదా. 34
అచ్ఛద్మనైవోపచార్య స్సతదాఽన్యత్ర దామ్భికాత్ । దేవతానాంచ విప్రాణాం పుణ్యేఽహ్ని సముపస్థితే. 35
గోభూహిరణ్యధాన్యాని ప్రదేయాని చ శక్తితః । బ్రాహ్మణేభ్యో వరారోహాః కార్యాణి వివిధానిచ. 36
యచ్చాన్యచ్చ వ్రతం సమ్య గుపదేక్ష్యా మ్యహం తతః । అవిచారేణ సర్వాభి రనుష్ఠేయం చ తత్పునః. 37
సంసారోత్తారణా యాలం ఏత ద్వేదవిదోవిదుః । యదా సూర్యదినే హస్తః పుష్యోవాథ పునర్వసూ. 38
భవేత్సర్వౌషధిస్నానం సమ్యఙ్నారీ సమాచరేత్ । తదా పఞ్చశరస్యాపి సన్నిధానత్వ మేష్యతి. 39
అర్చయే త్పుణ్డరీకాక్ష మనఙ్గ స్యానుకీర్తనైః ।

పూర్వము దేవాసుర యుద్ధములందు దేవతల చేతులలో వందలకొలదిగా దానవులు అసురులు దైత్యులు రాక్షసులు మరణించిరి. వారి స్త్రీలు వేలకొలదిమంది వీరిచే హరించబడి బలాత్కారమున పెండ్లాడబడుటయో అనుభవించబడుటయో జరిగెను. వారితో పురుషోత్తముడగు దేవేంద్రుడిట్లనెను-మీరిక మీదట (భూలోకమున) రాజమందిరములందును దేవమందిరములందును భక్తిమతులై వేశ్యా ధర్మముతో నుండుడు. (అచటి) రాజులే మీకు యజమానులగుదురు. వారికి వచ్చిన ఆశౌచములు మొదలగునవి మీకును వర్తించును. మీకందరకును యోగ్యతానుసారము సౌభాగ్యము (బదువతనము) ఉండును. కపటి కాని ఎవడు శుల్కము (వెల) తీసికొని మీకడకు వచ్చినను అతనికి మీరు కపటము లేకుండ ఉపచారము చేయవలయును. పుణ్య దినములందు దేవతలకును బ్రాహ్మణులకును గో భూ-హిరణ్య-దానములు చేయవలయును. బ్రాహ్మణులకు మీచేతనైన కార్యములు (నృత్యము-సంగీతము మొదలగునవి) చేయవలయును. ఇదికాక నేను మీకొక వ్రతము నుపదేశింతును. దానిని మీరు ఏమాత్రమును వెనుకముందులు విచారించక అనుష్ఠించవలయును. దానిచే మీరు సంసారమును తరింతురు. ఆదిత్యవారమున హస్త పుష్య పునర్వసులలో నేదైన నక్షత్రముండగా (మీజాతి వారు) సర్వౌషధులతో స్నానమాడి మన్మథుని సన్నిధానము (ప్రతిమా ప్రతిష్ఠాపనము) ఏర్పరచుకొని మన్మథ నామములతో విష్ణు నర్చించవలయును

కామాయ పాదౌ సమ్పూజ్య జఙ్ఘే వై మోహకారిణే. 40
మేఢ్రం కన్దర్పనిధయే కటిం ప్రీతిమతే నమః । నాభిం సౌఖ్యసముద్రాయ వాసవాయ తథోదరమ్. 41
హృదయం హృదయేశాయ స్తనా వానన్దకారిణే । ఉత్కణ్ఠాయచ వై కణ్ఠ మాస్య మాహ్లాదకారిణే. 42
వామాఙ్గం పుష్పచాపాయ పుష్పబాణాయ దక్షిణమ్ । నమోఽనఙ్గాయవై మౌళిం విలోలాయేతి మూర్ధజాన్.
సర్వాత్మనే శిర స్త ద్వ ద్దేవదేవస్య పూజయేత్। నమ శ్శివాయ శాన్తాయ పాశాఙ్కుశధరాయ చ. 44
గదినే పీతవస్త్రాయ శఙ్ఖచక్రధరాయచ । నమో నారాయణాయేతి కామదేవాత్మనే నమః. 45
నమశ్శాన్త్యై నమః ప్రీత్యై నమో రత్యై నమో నమః । నమః పుష్ట్యై నమ స్తుష్ట్యై నమ స్సర్వార్థసమ్పదే.
ఏవం సమ్పూజ్య గోవిన్ద మనఙ్గాత్మాన మీశ్వరమ్। గన్ధై ర్మాల్యై స్తథా ధూపై ర్నైవేద్యై శ్చైవ కామినీ. 47
తత ఆహూయ ధర్మజ్ఞం బ్రాహ్మణం వేదపారగమ్ । అవ్యఙ్గావయవం పూజ్య గన్ధపుష్పార్చనాదిభిః. 48
శాలేయం తణ్డులప్రస్థం ఘృతపాత్రేణ సంయుతమ్ । తస్మై విప్రాయ సా దద్యా న్మన్మథః ప్రీయతామితి.
యథేష్టాహారభుక్తేతు తమేవ ద్విజసత్తమమ్ । రత్యర్థం కామదేవోఽయ మితి చిత్తేన ధార్యతామ్. 50
యద్య దిచ్ఛతి విప్రేన్ద్ర స్తత్త త్కుర్యా ద్విలాసినీ । సర్వభావేన చాత్మాన మర్పయే త్స్మితభాషిణీ. 51
ఏవ మాదిత్యవారేణ సదా తద్వ త్సమాచరేత్ । తణ్డులప్రస్థదానంచ యావన్మాసా స్త్రయోదశ. 52

**పూజామంత్రములు:** 1. కామాయనమః-పాదౌ పూజయామి; 2. మోహకారిణేనమః-జంఘే పూజయామి; 3. కందర్ప నిధయేనమః-మేఢ్రం పూజయామి; 4. ప్రీతిమతేనమః-కటిం పూజయామి; 5. సౌఖ్య సముద్రాయనమః నాభిం పూజయామి; 6. వాసవాయనమః ఉదరం పూజయామి; 7. హృదయేశాయనమః-హృదయం పూజయామి; 8. ఆనందకారిణేనమః- స్తనౌ పూజయామి; 9. ఉత్కంఠాయనమః-కంఠం పూజయామి; 10. ఆహ్లాదకారిణేనమః-ఆస్యం పూజయామి; 11. పుష్పచాపాయనమః-వామాంగం పూజయామి; 12. పుష్పబాణాయ నమః-దక్షిణాంగం పూజయామి; 13. అనంగాయనమః - మౌళిం పూజయామి; 14. విలోలాయనమః-కేశాన్ పూజయామి; 15. సర్వాత్మనేనమః-శిరః పూజయామి; (ఇది అంగపూజ).

గదాధరుడు-పీతవస్త్రుడు-శంఖచక్ర ధరుడు - మన్మథాత్ముడునగు నారాయణునకు నమస్కారము. శాంతి-ప్రీతి-రతి-పుష్టి-తుష్టి-సర్వార్థసంపద్ రూపయగు లక్ష్మికి నమస్కారము.

ఇట్లు మన్మథాత్మకుడు ఈశ్వరుడగు గోవిందుని గంధమాల్య ధూపదీప నైవేద్యములతో ఈ స్త్రీలు పూజించవలెను. తరువాత ఆమె ధర్మజ్ఞుడు వేదపారంగతుడు అంగవైకల్యములేనివాడు నగు బ్రాహ్మణుని పిలిపించి గంధ దీపాద్యర్చనలతో అతనిని పూజించి కుంచెడు మంచి రాజనాల వరి బియ్యమును నేతితోడి పాత్రను 'మన్మథః ప్రీయతామ్' అనెడు మంత్రముతో దానముచేసి ఈ పదార్థములు మీయభీష్ట భోజనమునకు సరిపోవుగాకః యని భక్తితో పలుకవలెను. రతిదేవికి ఆనందము కలిగించు మన్మథుడే ఈ బ్రాహ్మణుడని భావన చేయుచు ఈ విలాసిని ఆ విప్రుని మనస్సునకు ప్రీతికరముగా అతడు కోరినట్లు సర్వభావముతో ఆత్మార్పణముచే నృత్య గీతాది విలాసములతో ఆతనిని సంతోషపెట్టవలయును. ఇట్లు ప్రతి ఆదివారమునాడును పదుమూడు మాసములు విడువక వ్రతము చేయవలయును.

తత స్త్రయోదశే మాసే సమ్ప్రాప్తే తస్య భామినీ। విప్రస్యోపస్కరై ర్యుక్తాం శయ్యాం దద్యా త్సలక్షణామ్.
సోపధానకవిశ్రామాం సాన్తరావరణాం శుభామ్ । ప్రదీపోపానహచ్ఛత్రపాదుకాసనసంయుతామ్. 54
సపత్నీక మలఙ్కృత్య హేమసూత్రాఙ్గుళీయకైః । సూక్ష్మవస్త్రై స్సకటకై ర్ధూపమాల్యానులేపనైః. 55
కామదేవం సపత్నీకం గుడకుమ్భోపరి స్థితమ్ । తామ్రపాత్రాసనగతం హేమసూత్రపటావృతమ్. 56
సకాంస్యభాజనోపేత మిక్షుదణ్డసమన్వితమ్ । దద్యా దనేన మన్త్రేణ తథైకాం గాం పయస్వినీమ్. 57

యథాన్తరం న పశ్యామి కామకేశవయో స్సదా । తథైవ సర్వకామా ప్తిరస్తువిష్ణో సదా మమ. 58
యథా న కామినీ దేహా త్ప్రియాతి తవ కేశవ । తథా మమాపి దేవేశ శరీరేషు కురు ప్రభో. 59
తథాచ కాఞ్చనం దేవం ప్రతిగృహ్య ద్విజోత్తమః ।
*కోఽదా త్కామో దదాతీతి వైదికం మన్త్ర ముచ్చరేత్. 60
అనఙ్గః ప్రతిగృహ్ణాతి అనఙ్గోవై దదాతి చ । అనఙ్గ స్తారకోభాభ్యా మనఙ్గాయ నమోనమః. 61
తతః ప్రదక్షిణీకృత్య విసృజ్య ద్విజపుఙ్గవాన్ । శయ్యాగవాదికం సర్వం బ్రాహ్మణస్య గృహం నయేత్. 62
తతఃప్రభృతి యోఽన్యోవై రత్యర్థం గృహ మాగతః । న మాన్య శ్చోపచారేణ న సమ్పూజ్యో భవే త్తదా.
ఏవం త్రయోదశం యావ న్మాస మేకం ద్విజోత్తమమ్ ।
తర్పయేత యథాకల్పం ప్రోషితేస్యం సమర్చయేత్. 64
తదనుజ్ఞయాచ వస్తవ్యం యావ దద్భాగమో భవేత్ । ఆత్మనోఽపి తథా విఘ్నో గర్భసూతకరాజతః. 65
దైవోవా మానుషో వా స్యా దుపరాగేణ పాతతః । సా వత్సరా న్నష్ట పఞ్చ చాష్ట సఙ్ఖ్య సమాపయేత్. 66
తథాపిచ ద్విజం దేవం యథాశక్త్యా సమర్చయేత్ ।

పదుమూడవ మాసమున బ్రాహ్మణ దంపతులను బంగారు గొలుసులు యజ్ఞోపవీతము ఉంగరములు కడియములు మురుగులు సన్నని వస్త్రములు గంధమాల్యాను లేపనములు-ఇట్టివానితో అలంకరించి వారికి శయన దానము చేయవలెను. వారికి అన్ని పరికరములతో కూడిన మంచము-దిండు-పరపు-పరపుపై కప్పు దుప్పటి-ఆనుకొనుదిండు-ప్రదీపము-చెప్పులు-గొడుగు-పాదుకలు-పీట-ఇట్టి వన్నియు చేర్చిన విలక్షణమయిన శయ్యను దానము చేయవలెను. ఒక కడవలో బెల్లము నింపి దానిపై తామ్ర పాత్ర నిలువవలెను. దానిపై ఆసనము సమర్చి దానిపై రతీ మన్మథుల (బంగారు) ప్రతిమలను బంగారు సరిగగల వస్త్రములు కట్టిన వానిని ఉంచవలెను. కంచు పాత్రను చెరకు గడను కూడ వాటితో పాటు చేర్చి పాడియావును ఇవన్నియు కూడ ఆ విప్ర దంపతులకు దానమీయవలెను.

దాన మంత్రమునకు అర్థము: మన్మథ విష్ణువుల నడుమ నేను అభేదము భావించుచు (నారాయణుని) సేవించుచున్నాను కావున నారాయణా! నాకు అన్ని కోరికలు నెరవేరుగాక! కేశవా! నీ దేహమునుండి నీకామిని (లక్ష్మి) వేరు కానట్లే నాకును అన్ని కోరికలును (కామములు) తీరుగాక! ఈ దానమును ప్రతిగ్రహించువాడును దానఫలమును ఇచ్చువాడును మన్మథుడే. విప్రా! దానము గ్రహించు నిన్నును ఇచ్చు నన్నును తరింపజేయువాడును మన్మథుడే. అట్టి మన్మథునకు నమస్కారము. (ఇచట కామో దాతా-ఇత్యాది వేదమంత్రమును చెప్పవలెను.)

తరువాత ఆ విప్రదంపతులను ప్రదక్షిణించి వారిని వారి గృహమునకు పంపి పిమ్మట ఈ దానమిచ్చిన వన్నియు వారి ఇంటికి చేర్చవలెను.

అది మొదలు తమ ఆనందమునకై తమ ఇంటికి ఎవరు వత్తురో వారిని ఉపచారములతో ఆనందపరచవలెను.

లోగడ చెప్పిన పదుమూడు మాసముల క్రమములోను ఒక బ్రాహ్మణుని మాత్రమే అర్చించవలెను. ఒక వేళ అతడు ఆ నడుమ దేశాంతరము పోయినచో అతని అనుమతితో మరియొక బ్రాహ్మణుని అర్చించవచ్చును.

తాను గర్భవతి యగుట-తనకు పురుడువచ్చుట-తన రాజునకు ఆశౌచమువచ్చుట-ఇతరములగు దైవిక హేతువులు-మానుషములైన హేతువులు-గ్రహణములు-వ్యతీపాతము మొదలగు దోషములు-వీనిచే వ్రతమున విఘ్నము సంభవించినను ఎనిమిది-ఐదు-ఎనిమిది-ఈ క్రమమున ($8+5=13$) మొత్తము పదుమూడు మాసములగునట్లు కొన్ని సంవత్సర

ములపాటు ఈ వ్రతమును ఆమె చేయుచుండవలెను. ఏ విఘ్నము వచ్చినను బ్రాహ్మణుని (మన్మథ) దేవుని యథా శక్తిగా అర్చించుచునే యుండవలెను.

ఏతద్ధి కథితం సమ్య గ్వ్రతీనాం విశేషతః. 67
స్వధర్మోఽయం యతో భావ్యో వేశ్యానా మిహ సర్వదా। పురుహూతేన యత్ప్రోక్తం దానవేషు పురా మయా.
తదిదం సామ్ప్రతం సర్వం భవతీ ష్వనుయుజ్యతే। సర్వపాపప్రశమన మనన్తఫలదాయకమ్. 69
కల్యాణినీనాం కథితం త త్కురుధ్వం వరాఙ్గనాః।
కరోతి యాఽ శేష మఖణ్డ మేత త్కల్యాణినీ మాధవలోకసంస్థా. 70
సా పూజితా దేవగణై రశేషై రానన్దకృ త్స్థాన ముపైతి విష్ణోః।
శ్రీమత్స్యః : తపోధన స్సోఽవ్యభిధాయ చైత దనఙ్గదానవ్రత మఙ్గనానామ్. 71
స్వస్థాన మేష్యంత్యథతాస్సమస్తా వ్రతం చరిష్యన్తి చ దేవయోనే. 71½

ఇతి శ్రీమత్స్యమహాపురాణే మత్స్యమనుసంవాదే అనఙ్గశయనవ్రతకథనం నామ సప్తతితమోఽధ్యాయః.

(దాల్భ్య వచనము) కృష్ణ పత్నులారా! పూర్వము దేవేంద్రుడు రాక్షస స్త్రీలను భూలోకమున వేశ్యలుగా బుట్టుదని వారికి చెప్పిన స్వధర్మము ఇది; ప్రకృతమున మీరును ఈ వ్రతమునే అనుష్ఠించ వలయును. ఇది సర్వపాప ప్రశమనము; అనన్త ఫలదాయకము; 'కల్యాణినులు' అను (వేశ్యా) స్త్రీలకు విధించబడిన వ్రతము ఇది; దీనిని మీరును ఆచరించుడు. దీనిని అఖండముగా-ఎడతెగక ఆచరించిన 'కల్యాణిని' విష్ణు లోకమున వసించును. అచట ఆమె అశేష దేవ గణముల పూజల నందుకొనును.

మత్స్యుడు చివరకు ఇట్లు చెప్పెను-ఆ దాల్భ్యముని కృష్ణ పత్నులకు పదునారు వేల మందికిని ఇట్లు ఈ ఆనంద శయన దాన వ్రతమును ఉపదేశించి తన స్థానమునకు మరలి పోవును. వారును ఈ వ్రతమును అట్లే ఆచరింతురు.

ఇది శ్రీ మత్స్య మహా పురాణమున అనంగశయన వ్రతము అను డెబ్బదవ అధ్యాయము.

## ఏకసప్తతితమోఽధ్యాయః.

## అశూన్యశయనవ్రతమ్.

బ్రహ్మః భగవ న్పురుషస్యేహ స్త్రియాశ్చ విరహాదికమ్। రోగవ్యాధిభయం దుఃఖం న భవే ద్యేన తద్వద.1
ఈశ్వరః: శ్రావణస్య ద్వితీయాయాం శుక్లాయాం మధుసూదనః। క్షీరార్ణవే సలక్ష్మీక స్సదా వసతి కేశవః.
తస్యాం సమ్పూజ్య గోవిన్దం సర్వా న్కామా న్సమశ్నుతే। గోభూహిరణ్యదానాని సప్తకల్పశతాయుతమ్.3
అశూన్యశయనం నామ ద్వితీయా సా ప్రకీర్తితా। తస్యాం సమ్పూజయే ద్విష్ణు మేభి ర్మన్త్రై ర్విధానతః. 4
శ్రీవత్సధారిన్ శ్రీకాన్త శ్రీవాస శ్రీపతేఽవ్యయ। గార్హస్థ్యం మా ప్రణాశం మే యాతు ధర్మార్థకామద. 5
అగ్నయో మా ప్రణశ్యన్తు దేవతాః పురుషోత్తమ। పితరో మా ప్రణశ్యన్తు మాఽస్తు దామ్పత్యభేదనమ్. 6
లక్ష్మ్యా వియుజ్యసే దేవ న కదాచి ద్యథా భవాన్। తథా కళత్రసమ్బన్ధో దేవ మామే వియుజ్యతామ్. 7
లక్ష్మ్యా న శూన్యం వరద యథా తే శయనం సదా। శయ్యా మమాప్యశూన్యాతు (స్తు) తథైవ మధుసూదన.
గీతవాదిత్రనిర్ఘోషం దేవదేవస్య కారయేత్। ఘణ్టా భవే దశక్తస్య సర్వవాద్యమయీ యతః. 9

## డెబ్బది ఒకటవ అధ్యాయము.

## అశూన్యశయన వ్రతము.

బ్రహ్మ ఈశ్వరుతోనిట్లనెను. భగవన్! స్త్రీ పురుషులకు విరహ-వ్యాధి-రోగ-భయ దుఃఖములు కలుగకుండు ఉపాయమును తెలుపు మనగా ఈశ్వరుడిట్లు చెప్పెను: నారాయణుడు లక్ష్మీ సమేతముగా క్షీరసాగరమున నిరంతరము వసించు

చుండునుగదా! ఆయనను శ్రావణ శుక్ల ద్వితీయ నాడు అర్చించినచో అన్ని కోరికలును నెరవేరును. అశూన్యశయన ద్వితీయ అనబడు ఈనాడు గోవిందుని కల్పోక్త విధానముతో సంపూజించి గోభూహిరణ్య దానములు చేసినవారు డెబ్బది వేల కల్పముల కాలము సుఖింతురు.

ప్రార్థనామంత్రము: శ్రీవత్సధారిన్! శ్రీకాంతా! శ్రీవాసా! అవ్యయా! శ్రీపతీ! ధర్మార్థ కామప్రదా! నాగార్హస్థ్యము హాని చెందకుండుగాక! మా దాంపత్యము భంగము నొందకుండుగాక! మా అగ్నులు దేవతలు పితృదేవతలు పితరులు హాని నొందకుందురు గాక! మదుసూదనా! నీకు వలెనే నాకును కళత్రముతో నిత్యసంబంధ ముండుగాక! నీ శయన మెల్లప్పుడు అశూన్యమయి యుండునట్లే నా శయనముకూడ అశూన్యమై యుండుగాక! పూజా సమయమున గీతవాద్యముల విని పించవలెను. ఇందులకు శక్తి లేనివారు ఘంటానాదమే చేయవచ్చును. ఏలయన ఘంట సర్వ వాద్యరూపమయినది.

ఏవం సమ్పూజ్య గోవిన్ద మశ్నీయా త్తైలవర్జితమ్ । నక్త మక్షారలవణం యావ ద్యామచతుష్టయమ్. 10
తతః ప్రభాతే సంజాతే లక్ష్మీపతిసమన్వితామ్ । దీపాన్నభాజనై ర్యుక్తాం శయ్యాం దద్యా ద్విలక్షణామ్. 11
పాదుకోపానహచ్ఛత్ర చామరాసనసంయుతామ్ । అభీష్టోపస్కరై ర్యుక్తాం శుక్లమాల్యానులేపనామ్. 12
సోపధానకవిశ్రామాం ఫలై ర్నానావిధై ర్యుతామ్ । తథాభరణగన్ధైశ్చ యథాశక్త్యా సమన్వితామ్. 13
అవ్యఙ్గాఙ్గాయ విప్రాయ శ్రోత్రియాయ కుటుమ్బినే । దాతవ్యా వేదవిదుషే* సర్వక్రతుకృతే క్వచిత్. 14
తత్రోపవేశ్య దామ్పత్య మలఙ్కృత్య విధానతః । పత్న్యాస్తు భాజనం దద్యా ద్భక్ష్యభోజ్యసమన్వితమ్. 16
బ్రాహ్మణస్యాపి సౌవర్ణీ ముపస్కరసమన్వితామ్ । ప్రతిమాం దేవదేవస్య ప్రదద్యా ద్దక్షిణాన్వితామ్. 15
ఏవం యస్తు పుమా న్కుర్యా దశూన్యశయనం హరేః । విత్తశాఠ్యేన రహితో నారాయణపరాయణః. 17
న తస్య పత్న్యా విరహః కదాచిదపి జాయతే । నారీ వాఽవిధవా బ్రహ్మ న్యావ చ్చన్ద్రార్కతారకమ్. 18
న విరూపం న శోకార్తం దామ్పత్యం జాయతే క్వచిత్ । న పుత్రపశురత్నాని క్షయం యాన్తి పితామహ.
సప్తకల్పసహస్రాణి సప్తకల్పశతానిచ । కుర్వ న్నశూన్యశయనం విష్ణులోకే మహీయతే. 20

ఇతి శ్రీమత్స్యమహాపురాణే అశూన్యశయనద్వితీయావ్రతకథనం నామైకసప్తతితమోఽధ్యాయః.

ఇట్లు గోవిందుని పూజించి పగలు ఉపవసించి ఆ రాత్రి (నక్తం) తైలము-ఉప్పు-(పులుపు)-కారము లేని ఆహారము తిని ఆ రాత్రి గడుపవలెను. తెల్లవారిన తరువాత కుటుంబియు వేదపండితుడును శ్రోత్రియుడును సర్వ క్రతు కర్తయు ఎక్కడను ఏ లోపములేనివాడును అంగ వైకల్యము లేనివాడును అగు విప్రునకు లక్ష్మీనారాయణ ప్రతిమను దీపములను అన్నపు పాత్రములను మంచమును పరపులను దిండ్లను ఆనుకొను దిండ్లను పాదుకలను చెప్పులను గొడుగులను చామరములను ఆసనములను ఇంకను ఇష్టములగు సాధన సామగ్రులను తెల్లని గంధపు పూత సామగ్రులను పూలలను (దండల)ను దానము చేయవలయును. ఆ బ్రాహ్మణుని అతని పత్నిని మంచముపై కూర్చుండపెట్టి శాస్త్రోక్త విధానమున అలంకరించి పత్నికి భక్ష్య భోజ్య సమన్విత పాత్రను పతికి సర్వసామగ్రీ యుక్తమగు లక్ష్మీ నారాయణుల బంగారు ప్రతిమను చేతికీయవలెను.

ధనమునకై లోభించక యథాశక్తిగా కల్ప విధానముగా నారాయణుడే దిక్కని ఈ అశూన్య శయనవ్రతము చేయువారు దాంపత్యమున వియోగము లేకుండ ఆచంద్రతారార్కము వైరూప్యము శోకము లేక సుఖింతురు. వారికి పశుపుత్ర ధన నాశమును కలుగదు. ఏడువేల ఏడువందల కల్పములపాటు వారు విష్ణులోకమున సుఖింతురు.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున అశూన్య శయన వ్రతమను
డెబ్బది ఒకటవ అధ్యాయము

---

*భావేనాఽపతితాయచ

## ద్విసప్తతితమోఽధ్యాయః.

## అఙ్గారకవ్రతమ్.

ఈశ్వరః : శృణు చాన్యద్భవిష్యం యద్రూపసమ్పత్ప్రదాయకమ్ ।
భవిష్యతి యుగే బ్రహ్మన్ ద్వాపరాన్తే పితామహ. 1
పిప్పలాదేన కథితం యుధిష్ఠిరపురో మహత్ । తపస్తం నైమిశారణ్యే పిప్పలాదం మహామునిమ్. 2
అభిగమ్య తథా చైనం ప్రశ్న మేత త్కరిష్యతి । యుధిష్ఠిరో ధర్మసూను ర్ధర్మయుక్తం తపోనిధిమ్. 3
యుధిష్ఠిరః : కథ మారోగ్య మైశ్వర్య మపి ధర్మేమతి స్తథా । అవ్యఙ్గతా శివే భక్తి ర్విష్ణావపి భవే త్కథమ్.
ఈశ్వరః : తస్యోత్తర మిదం బ్రహ్మ న్పిప్పలాదస్య ధీమతః ।
శృణుష్వ యద్వక్ష్యతి స ధర్మపుత్త్రాయ ధార్మికః. 5
పిప్పలాదః : సాధు పృష్టం త్వయా భద్ర ఇదానీం కథయామి తే ।
అఙ్గారవ్రత మిత్యేత త్సర్వం వక్ష్యామి తే నృప. 6
అత్రా ప్యుదాహర న్తీమ మితిహాసం పురాతనమ్ । విరోచనస్య సంవాదం భార్గవస్యచ ధీమతః. 7

## డెబ్బది రెండవ అధ్యాయము.

## అంగారక వ్రతము.

ఈశ్వరుడిట్లు చెప్పెను: బ్రహ్మా! రూప సంపదలనొసగు మఱియొక భవిష్య (ముందటి కాలమునకు పనికి వచ్చు) వ్రతము చెప్పెదను; వినుము. నైమిశారణ్యమున తపస్సాచరించుచుండు తపోనిధియు ధర్మయుక్తుడునగు పిప్పలాదమునికడకు పోయి ధర్మపుత్త్రుడగు యుధిష్ఠిరుడు ఆరోగ్యైశ్వర్యములు ధర్మమందు స్థిరబుద్ధి అవికలాంగత్వము శివ విష్ణులయందు ధ్రువభక్తి కలుగు నుపాయము తెలుపుమని అతనిని వేడును. పిప్పలాదుడతనికిట్లు చెప్పును: రాజా! చక్కగా అడిగితివి. అంగారక వ్రతమనునది కలదు. నీకదియంతయు చెప్పెదను. ఈ విషయమున విరోచన భార్గవ సంవాదమను ఇతిహాసము పరంపరలో వినబడుచున్నది.

ప్రహ్లాదస్య సుతం దృష్ట్వా ద్వ్యష్టవర్షాకృతిం కృతీ । రూపేణాప్రతిమం కాన్త్యా ప్రహస న్భృగునన్దనః 8
సాధు సాధు మహాబాహో విరోచన శివం తవ । తత్తదా హ స్మితం దృష్ట్వా పప్రచ్ఛ సురసూదనః. 9
బ్రహ్మ న్కిమర్థ మేత త్తే హాస్య మాకస్మికం కృతమ్ ।
సాధు సాధ్వితి చోక్త్వా మాం సర్వం చైత ద్వదస్వమే. 10
తమేవంవాదినం శుక్ర ఉవాచ వదతాం వరః । విస్మయా ద్వ్రతమాహాత్మ్య దేత ద్ధాస్యం కృతం మయా.

### అఙ్గారకోత్పత్తిః.

పురా దక్షవినాశాయ కుపితస్య త్రిశూలినః । అపత ద్భీమవక్త్రస్య స్వేదబిన్దు ర్లలాటజః. 12
భిత్త్వా స సప్తపాతాళం నిర్దహ న్సప్తసాగరాన్ । అనేకవక్త్రనయనో జ్వలజ్జ్వలనభీషణః. 13
వీరభద్ర ఇతి ఖ్యాతః *కరపాదాయు తాయుధః । కృత్వాఽసౌ యజ్ఞమథనం పున ర్భూతల మాశ్రితః. 14
త్రిజగ న్నిర్దహన్భూయ శ్శివేన వినివారితః । కృతం త్వయా వీరభద్ర దక్షయజ్ఞవినాశనమ్. 15
ఇదానీ మల మేతేన లోకదాహేన కర్మణా । శాన్తిప్రదాతా సర్వేషాం గ్రహాణాం మధ్యగో భవ. 16
ప్రపేక్ష్య తే జనాః పూజాం కరిష్యన్తి వరా న్మమ । అఙ్గారక ఇతి ఖ్యాతిం గమిష్యసి ధరాత్మజ. 17
దేవలోకే ద్వితీయంతు తవ రూపం భవిష్యతి । యేచ త్వాం పూజయిష్యన్తి చతుర్థ్యాం తు దినే నరాః. 18

---

* కరపాదాయుతావృతః

రూప మారోగ్య మైశ్వర్యం తేష్వనన్తం భవిష్యతి । ఏవ ముక్త స్తదా శాన్తి మగమ తామ్రరూపధృత్.19
సజ్జాత స్తత్క్షణా ద్రాజ న్గ్రహత్వ మగమ త్పునః ।

ఎట్లనగా-ఒకమారు రాక్షసేంద్రుడు భృగు నందనుడు శుక్రుడు రూపమునను కాంతియందును నిరుపమానుడును పదునారేండ్ల ప్రాయమువాడును ప్రహ్లాద పుత్త్రుడునగు విరోచనుని చూచి నవ్వుచు-బాగు-బాగు-మహాబాహూ! విరోచనా! నీకు క్షేమమా! అనెను. విరోచనుడతని చిరునవ్వు చూచి విప్రా! నన్ను చూచి అకారణముగా నీవేల నవ్వితివి? బాగు బాగనియు పలికితివి! ఏల? ఇదంతయు నాకు తెలుపుమనగా పురుషోత్తముడగు శుక్రుడతనికిట్లనెను: వ్రతమాహాత్మ్య విషయమై ఆశ్చర్యముతో నవ్వితిని. పూర్వము దక్ష వినాశమునకై కుపితుడై భయంకర ముఖుడైన త్రిశూలి లలాటము నుండి స్వేదబిందువులు క్రింద పడెను. వాటినుండి సప్తపాతాళముల భేదించుచు సప్తసాగరముల దహించుచు అనేక వక్త్రనయనుడును మండెడు అగ్నివలె భీషణుడును పదివేల కరములు పాదములు ఆయుధములుగా కలవాడేమో యన దగిన వీరభద్రుడనునతడు జనించెను. అతడు యజ్ఞ ధ్వంసముచేసి మరల భూతలము చేరెను. అతడు మరల త్రిజగముల నిర్దహించనుండ శివుడది వారించెను. వీరభద్రా! నీవు దక్షయజ్ఞ వినాశము చేసితివి. ఈ లోకదాహకృత్యం మిక చాలును. (లోక) శాంతి ప్రదాతవయి సర్వగ్రహములలో నొకడవగుము. నావరమున జనులు విస్తరించి నీపూజ జరుపుదురు. భూమి (పైపడిన స్వేద బిందువుల) నుండి పుట్టిన నీవు అంగారకుడు (అంగార-క = నిప్పుకణిక-వలె-ఉన్నవాడు) అని ఖ్యాతి నొందుదువు. నీరెండవ రూపము దేవ (ద్యు) లోకమునందుండును. (గ్రహముగా ఉండు రూపము అంతరిక్షమునందలిది.) చతుర్థీ తిథియందు (మంగళ-అంగారక-వారమునాడు) నిన్ను పూజించువారు అనంత రూపారోగ్యైశ్వర్యవంతులగుదురు. శివుడిట్లనగనే ఆ వీరభద్రుడు శాంతించి కామరూపుడు కావున తత్క్షణముననే గ్రహమై యంతరిక్షమున నిలిచెను.

స కదాచి ద్భవాం స్తస్య పూజార్చాదిక ముత్తమమ్. 20
దృష్టవా న్క్రియమాణంచ శూద్రత్వేన వ్యవస్థితః । తేన త్వం రూపవా న్జాత స్సురశత్రుకులోద్వహ. 21
వివిధాచ రుచిర్జాతా యస్మా త్తవ విదూరగా । విరోచన ఇతి ప్రాహు స్తస్మా త్త్వాం దేవమానవాః. 22
శూద్రేణ క్రియమాణస్య వ్రతస్య తవ దర్శనాత్ । ఈదృశం రూపసమ్పత్తిం దృష్ట్వా విస్మితవా నహమ్.
సాదుసాధ్వితి తేనోక్త మహో మాహాత్మ్య ముత్తమమ్ ।
పశ్యతోఽపి భవే ద్రూప మైశ్వర్యం కిము కుర్వతః. 24
యస్మాచ్చ భక్త్యా ధరణీసుతస్య విబుధ్యమానేన గవాదిదానమ్ ।
ఆలోకితం తేన సురారిగర్భసమ్భూతి రేషా తవ దైత్యజాత. 25
పిప్పలాదః : అథ తద్వచనం శ్రుత్వా భార్గవస్య మహాత్మనః । ప్రహ్లాదనన్దనో ధీరః పునః పప్రచ్ఛ విస్మితః.
విరోచనః : భగవం స్తద్వ్రతం సమ్య క్ఛ్రోతు మిచ్ఛామి తత్త్వతః ।
దీయమానంతు తద్దానం మయా దృష్టం భవాన్తరే. 27
మాహాత్మ్యంచ విధానంచ యథావ ద్వక్తు మర్హసి । ఇతి తద్వచనం శ్రుత్వా విప్రః ప్రోవాచ విస్తరాత్. 28

ఇది ఇట్లుండ నీవు పూర్వ జన్మమున నొకప్పుడు శూద్రుడవై ఉండి(ఎవరో)చేయుచుండిన అంగారక పూజను అతని అర్చామూర్తిని చూచుట తటస్థించెను. సురశత్రుకుల శ్రేష్ఠా! దానిచే నీవు రూపవంతుడ వయితివి. నీకుగల-వివిధ-రుచి(కాంతి) చాలదూరమువరకు పోవుచున్నందున నీకు విరోచనుడు(వి-రుచ్)అను పేరు ఏర్పడినది. శూద్రుడు చేయుచుండిన వ్రతమును చూచినందువలన (అప్పుడు శూద్రుడుగా నుండిన) నీకు కలిగిన ఈ రూపసంపత్తి చూచి విస్మితుడనయి స్మితము చేసితిని. ఈ వ్రత మాహాత్మ్య ముత్తమమని 'సాధు-సాధు' 'బాగు-బాగు' అంటిని. వ్రతమును చూచినవానికి కూడ రూపైశ్వర్యములు కలుగునే! చేసినవానికి (కలుగునని) వేరుగా చెప్పనేల! ఏలయన-రాక్షసకుమారా! నీవు వివేకవంతు

దవై ధరణీ పుత్త్రుని పూజాదికమును గోదానాదికమును చూచినందుననే నీవు ఇట్లు రాక్షసరాజ గర్భసంజాతుడ వయితివి కదా:

(పిప్పలాదు డనెను:) మహాత్ముడగు భార్గవుని (శుక్రుని) ఆ మాటవిని దీరుడు ప్రహ్లాదనందనుడు నగు విరోచనుడు విస్మితుడై మరల ఇట్లడిగెను: భగవన్! ఆ వ్రతమును జన్మాంతరమున నేను చూచిన ఆ వ్రతదానాదికమును లెస్సగా వినగోరుచున్నాను. ఆ వ్రత మాహాత్మ్య విధానములను యథావత్‌గా చెప్ప వేడెదను.

శుక్రః చతుర్థ్యఙ్గారకదినం యదా భవతి దానవ । మృదా స్నానం తదా కుర్యా త్పద్మరాగవిభూషితః. 29
అగ్ని ర్మూర్ధాదివో మన్త్రం జపం స్త్రావ దుదఙ్ముఖః ।
శూద్రస్తూష్ణీం స్మర న్సౌమ మాస్తే భోగవివర్జితః. 30
అథా స్తమిత ఆదిత్యే గోమయే నానులేపయేత్ । ప్రాఙ్గణం పుష్పమాలాద్యై రక్షతాభి స్సమ న్తతః. 31
అభ్యర్చ్యాభిలిఖే త్పద్మం కుఙ్కుమే నాష్టపత్రకమ్ । కుఙ్కుమస్యా వ్యభావేతు ర క్తచన్దన మిష్యతే. 32
చత్వారః కరకాః కార్యాః భక్ష్యభోజ్య సమన్వితాః । తణ్డులై ర క్తశాలీయైః పద్మరాగైశ్చ సంయుతాః. 33
చతుష్కోణేషు తా న్కృత్వా ఫలాని వివిధానిచ । గన్ధమాల్యాదికం సర్వం తథైవ వినివేదయేత్. 34
సువర్ణశృఙ్గీం కపిలా మథార్చ్య రూప్యైః ఖురైః కాంస్య దోహాం సవత్సామ్ ।
ధురన్ధరాం రత్నవతీంచ సౌమ్యాం దాస్యామి దీప్తామ్బరసంయుతాం చ. 35
అఙ్గుష్ఠమాత్రం పురుషం సురూపం సౌవర్ణ మప్యాయతబాహుదణ్డమ్ ।
చతుర్భుజం హేమమయం సుతామ్రపాత్రే గుడస్యోపరి ధాన్యయు క్తే. 36
సామస్వరజ్ఞాయ జితేన్ద్రియాయ పాత్రాయ శీలాన్వయసంయుతాయ ।
దాతవ్య మేత త్సకలం ద్విజాయ కుటుమ్బినే కించి దదామ్బికాయ 37

చవితి మంగళవారమునాడు పద్మరాగమణి ధరించి ఉత్తరాముఖుడై "అగిర్మూర్ధాదివః" అను మంత్రమును జపించుచు మృత్తికతో స్నానము చేయవలెను. శూద్రుడైనచో మంత్రము జపించకయే చేయవలెను. భోగము లేవియు అనుభవించకుండ నిరాడంబరుడై యుండవలెను. (పగలంతయు ఇట్లుండి) సూర్యు డస్తమించగనే ముంగిటిని గోమయముతో అలికి పుష్పమాలలతో అక్షతములతో అభ్యర్చనము చేసి ఆ చోట కుంకుమముతో అష్టదళపద్మము వేయవలెను. రక్తచందనముతోనైన వేయవచ్చును. నాలుగు గరిగ(ఒక విధమగు మట్టిపాత్ర)లను భక్ష్యభోజ్య(పదార్థ)ములతో ఎఱ్ఱవడ్ల బియ్యముతో పద్మరాగములతో నింపవలెను. (ఈ అలికినచోట) నాలుగు మూలలందు వాటిని వివిధ ఫలములను గంధమాల్యాది ద్రవ్యములను ఉంచి (అంగారకునకు) నివేదించవలెను. బంగారు కొమ్ములు వెండి గిట్టలు పిదుకుటకు కంచుపాత్ర దూడ కలదియు మెరయు వస్త్రములతో కప్పబడినది శ్రేష్ఠమయినది రత్నములు కలది సాదు స్వభావ అగు పాడి కపిలగోవును దానము చేయుదునని సంకల్పించి దానిని సిద్ధపరచవలెను. పొడవయిన చతుర్బాహువులుకల సురూపుడగు పురుషుని విగ్రహమును బంగారముతో బొటనవ్రేలియంత పరిమాణముతో చేయించి ధాన్యముతో నింపిన తామ్రపాత్రము పైభాగమున బెల్లముంచి దానిపై ఈ ప్రతిమను నిలుపవలెను. ఇదంతయును స్వరముగ సామవేదమును నేర్చినవాడు జితేంద్రియుడు దానయోగ్యుడు మంచి శీలము వంశము కలవాడు కుటుంబి దంభములేనివాడు నగు విప్రునకు దానమీయవలెను.

భూమిపుత్త్ర మహాభాగ స్వేదోద్భవ పినాకినః । రూపార్థీ త్వాం ప్రపన్నోఽస్మి గృహాణార్ఘ్యం నమోస్తు తే.
మన్త్రేణానేన దత్వార్ఘ్యం ర క్తచన్దనవారిణా । తతోఽర్చయే ద్విప్రవరం రత్నమాల్యామ్బరాదిభిః. 39
దద్యా న్మన్త్రేణ తేనైవ భౌమం గోమిథునాన్వితమ్ ।
శయ్యాం చ భక్తితో దద్యా త్సర్వోపస్కరసంయుతామ్. 40

యద్య ద్దిష్టతమం లోకే యచ్చాస్య ద్దయితం గృహే । తత్ర ద్గుణవతే దేయం తదే వాక్షయ మిచ్ఛతా. 41
ప్రదక్షిణం తతః కృత్వా విసృజే ద్ద్విజపుఙ్గవమ్ । నక్త మక్షారలవణ మశ్నీయా ద్ఘృతసంయుతమ్. 42
భక్త్యా యస్తు పుమా న్కుర్యా దేవ మఙ్గారకాష్టకమ్ । చతురో వాఽథవా తస్య యత్పుణ్యం తద్వదామి తే.
రూపసౌభాగ్యసమ్పన్నో పున ర్జన్మని జన్మని । విష్ణౌ వాఽపి శివే భక్త స్సప్తద్వీపాధిపో భవేత్. 44
సప్తకల్పసహస్రాణి రుద్రలోకే మహీయతే । తస్మా త్త్వమపి దైత్యేన్ద్ర వ్రత మేత త్సమాచర. 45
పిప్పలాదః : ఇత్యేవ ముక్త్వా భృగునన్దనోఽపి జగామ దైత్యశ్చ చకార సర్వమ్ ।
త్వంచాపి రాజ న్కురు సర్వ మేత ద్యతోఽక్షయం వేదవిదో వదన్తి. 46
ఈశ్వరః : తథేతి సమ్పూజ్య స పిప్పలాదం వాక్యం చకా రాద్భుతవీర్యకర్మా ।
శృణోతి యశ్చైన మనన్యచేతా స్తస్యాపి సిద్ధిం భగవా న్విదధ్తే. 47

ఇతి శ్రీమత్స్యమహాపురాణే పిప్పలాదయుధిష్ఠిరసంవాదే అఙ్గారకవ్రతకథనం
నామ ద్విసప్తతితమోఽధ్యాయః.

అర్ఘ్యదాన మంత్రము: "భూమిపుత్త్ర! మహాభాగా! శంకర స్వేదసంజాతా! సురూపముకోరి నిన్ను శరణు చొచ్చి నాను. నీకు వందనము. ఈ అర్ఘ్య మందుకొనుము." అను అర్థము నిచ్చు మంత్రముతో చందనోదకముతో అర్ఘ్యమునిచ్చి రత్నమాల్యవస్త్రాదులతో బ్రాహ్మణు నర్చించి ఇదే మంత్రముతో గోమిథునముతో కూడ (ఆవును కోడెదూడను) నర్వోప కరణములతోడి శయ్యను లోకమున జనుల కిష్టమగునదియు తన ఇంటిలో తన కిష్ట మనిపించినదియు(లభ్యమగునంతలో) సద్గుణవంతుడగు ఆ విప్రవర్యునకు ఇది అక్షయఫలదము కావలెననుచు దాన మీయవలెను. పిమ్మట ప్రదక్షిణపూర్వకముగా బ్రాహ్మణుని వీడ్కొనవలెను. (పగ లుపవసించి) నక్తమున (రాత్రియందు) ఉప్పు కారము పులుపు లేకుండ నేతితో భుజించవలెను. ఎనిమిది కాని నాలుగు కాని చవితితోడి మంగళవారములందు వ్రత మాచరించినవాడు జన్మజన్మము లందును రూపసౌభాగ్యసంపదయు విష్ణుశివులందు భక్తియు సప్తద్వీపాధిపత్యమును (ఇహలోకమున) అనుభవించి (పర మున) డెబ్బదివేల కల్పములపాటు రుద్రలోకమున పూజితుడై సుఖించును. కావున దైత్యేంద్రా! నీవు ఈ వ్రత మాచ రించుము.

(పిప్పలాదుడు) ఇ ట్లుపదేశించి శుక్రుడు వెళ్లగా విరోచను డదియంతయు నట్లే చేసెను. కావున రాజా(యుధి ష్ఠిరా!) నీవును అక్షయఫలదమని వేదవేత్తలు చెప్పెడి ఈ వ్రతము నాచరించుము. అని పిప్పలాదుడు యుధిష్ఠిరునకు తెలిపెను.

(ఈశ్వరుడు): అద్భుతశక్తియు అద్భుత కర్మాచరణమునుకల యుధిష్ఠిరుడును పిప్పలాదుని వచనము నాదరించి ఆ వ్రత మట్లే యాచరించెను. అనన్యచిత్తముతో దీనిని వినినవానికి భగవంతు డదే ఫలము నొసంగును.

ఇది శ్రీమత్స్య మహాపురాణమున అంగారకవ్రత కథనమను డెబ్బదిరెండవ అధ్యాయము.

## త్రిసప్తతితమోఽధ్యాయః.
## శుక్రపూజావిధిః.

పిప్పలాదః : అథాత శ్శృణు భూపాల వ్రతిశుక్రప్రశాన్తయే ।
యాత్రారమ్భేఽవసానే చ తథా శుక్రోదయే ష్విహ. 1
రాజతే వాపి సౌవర్ణే కాంస్యపాత్రేఽథవా పునః । శుక్లపుష్పామ్బరయుతే సితతణ్డులపూరితే. 2
విధాయ రాజతం శుక్రం శుచిముక్తాఫలాన్వితమ్ । మన్త్రేణానేన తత్సర్వం సామగాయ నివేదయేత్. 3
నమస్తే సర్వలోకేశ నమస్తే భృగునన్దన । కవే సర్వార్థసిద్ధ్యర్థం గృహాణార్ఘ్యం నమోస్తుతే. 4

ఏవ మస్యోదయే కుర్యా ద్యాత్రాదిషు చ భారత । సర్వకామా నవాప్నోతి విష్ణులోకే మహీయతే. 5
యావ చ్ఛుక్రస్య న కృతా పూజా సోమాలికై శ్శుభైః । వటుకైః పూరికాభిశ్చ అపూపై శ్చణకై రపి. 6
తావ న్నవాన్నం నాశ్నీయా త్స్త్రీభిః కామార్థసిద్ధయే। తద్వ ద్బృహస్పతేః పూజాం ప్రవక్ష్యామి యుధిష్ఠిర.7
సువర్ణపాత్రే సౌవర్ణ మమరేశపురోహితమ్ । పీతవస్త్రామ్బరయుతం కృత్వా స్నానం సుసర్షపైః. 8
పలాశాశ్వత్థభఙ్గేన పఞ్చగవ్యజలేన చ । పీతామ్బరాజ్యవసనో ఘృతహోమంతు కారయేత్. 9
ప్రణమ్య చ గవా సార్ధం బ్రాహ్మణాయ నివేదయేత్ । నమస్తే వచసాం నాథ వాక్పతేఽథ బృహస్పతే. 10
క్రూరగ్రహైః పీడితానా మవనాయ నమో నమః। సఙ్క్రాన్తా వస్య కౌన్తేయ యాత్రా స్వభ్యుదయేషు చ.11
కుర్వ న్బృహస్పతేః పూజాం సర్వా న్కామా న్సమశ్నుతే. 11½

ఇతి శ్రీమత్స్యమహాపురాణే పిప్పలాదయుధిష్ఠిరసంవాదే శుక్రగురుపూజావిధి ర్నామ త్రినవతితమోఽధ్యాయః.

## తొంబది మూడవ అధ్యాయము
## శుక్రగురు పూజా విధానము

పిప్పలాదుడు యుధిష్ఠిరునితో ఇట్లు చెప్పెను: భూపాలా! ఇక ఇప్పుడు యాత్రారంభావసానములందు ప్రతి శుక్ర (చుక్క ఎదురు) (దోష) ప్రశాంతికై శుక్రోదయ సమయమందు చేయవలసినది చెప్పెదను. బంగారుతో కాని వెండితో కాని కంచుతో కాని చేసిన పాత్ర(పళ్లెర)మందు తెల్లని వస్త్రము పరచి తెల్లని ఓయ్యము నింపి శుక్రుని రజత ప్రతిమను పులు కడిగిన ముత్తెములను దానియందుంచి ఈ అర్థము నిచ్చు మంత్రముతో అవి అన్నియు సామవేదియగు బ్రాహ్మణునకు దాన మీయవలెను. "సర్వలోకేశా! భృగునందనా! కవీ! నీకు నమస్కారము. అర్ఘ్య మందుకొని మాకు సర్వార్థసిద్ధి కలిగించుము." ఇట్లు చేసినచో అన్ని కోరికలును(ఇహమున)తీరి విష్ణులోకమున పూజితుడై సుఖించును.

ఇట్లు సోమాలికములు వటుకములు పూరికలు అపూపములు శనగలు వీనితో శుక్రుని పూజించు నంతవరకును ఇంటిలో స్త్రీలును క్రొత్త పంట ధాన్యపు అన్నమును తినరాదు. ఇట్లు నియమమును పాటించినచో సర్వార్థసిద్ధి కలుగును.

యుధిష్ఠిరా! ఇట్టిదే బృహస్పతి పూజయు కలదు. అది చెప్పెదను. బంగారు పాత్ర(పళ్లెర)మందు గురుని స్వర్ణ ప్రతిమను పచ్చని పట్టు వస్త్రము చుట్టి నిలువవలెను. యజమానుడు ఆవలతో (ఆవపిండి-ఆవనూనెలతో) మోదుగ-రావి-చిగుళ్ల ముక్కలతో కూడిన పంచగవ్య మిశ్రితజలముతో స్నాన మాడి పీతాంబరములు ధరించి నేతితో (బృహస్పతి నుద్దేశించి)హోమము చేయవలెను. బ్రాహ్మణునికి నమస్కరించి గోవును ఈ చెప్పిన సామగ్రిని దాన మీయవలెను. (మంత్రార్థము)-"వచస్సులకు నాథా! వాక్పతీ! బృహస్పతీ! క్రూరగ్రహపీడితులను రక్షించువాడా! నమస్కారము."

సంక్రాంతి (బృహస్పతికాని రవికాని రాశియందు ప్రవేశించు) సమయమందును యాత్రాకాలమునందును అభ్యుదయ (శుభ) కర్మారంభములందును బృహస్పతి పూజ చేయువారికి సర్వకామములును సిద్ధించును. (యాత్ర-రాజులు యుద్ధములకై కాని రాచరికపు పనులకై కాని బయలుదేరుట; లేదా స్త్రీలు పుట్టి నింటికో అత్తవారి ఇంటికో బయలుదేరుట; లేదా వ్యాపారమునకో వ్యవహారమునకో తీర్థక్షేత్రాది సేవకో బయలుదేరుట)

ఇది శ్రీమత్స్య మహాపురాణమున శుక్రగురు పూజా విధానమను తొంబది మూడవ అధ్యాయము.

## చతుర్నవతితమోఽధ్యాయః.
## కల్యాణసప్తమీవ్రతమ్.

బ్రహ్మా : భగవన్ దుఃఖసంసార సాగరోద్ధారకారకమ్। కిఞ్చిద్వ్రతం సమాచక్ష్వ స్వర్గారోగ్యఫలప్రదమ్.1
ఈశ్వరః : సౌరధర్మా న్ప్రవక్ష్యామి నామ్నా కల్యాణసప్తమీ। మన్దారసప్తమీ తద్వ త్ఫలాఢ్యా పాపనాశనీ.

శర్కరాసప్తమీ పుణ్యా తథా కమలసప్తమి । మన్దారసప్తమీ తద్వ త్సప్తమీ శుభసప్తమీ. 3
సర్వాఽనన్తఫలాః ప్రోక్తా స్సర్వా దేవర్షిపూజితాః । విధాన మాసాం వక్ష్యామి యథావ దనుపూర్వశః. 4
యదాతు శుక్లసప్తమ్యా మాదిత్యస్య దినం భవేత్ । సాతు కల్యాణినీ నామ విజయా భువి కథ్యతే. 5
ప్రాత ర్గవ్యేన పయసా స్నాన మస్యాం సమాచరేత్ । తత శ్శుక్లామ్బరః పద్మ మక్షతాభిః ప్రకల్పయేత్.6
ప్రాఙ్ముఖోఽష్టదళే మధ్యే తద్వ ద్వృత్తాంచ కర్ణికామ్ । పుష్పాక్షతాభి ర్దేవేశం విన్యసే త్సర్వతః క్రమాత్.

## డెబ్బది నాలుగవ అధ్యాయము

## కల్యాణ సప్తమీ వ్రతము

బ్రహ్మ ఈశ్వరుని ఇట్లడిగెను. 'భగవన్! సంసార సాగర దుఃఖమునుండి ఉద్ధరించు సాధనమగుచు స్వర్గారోగ్య ఫలప్రదమగు వ్రతమేదయిన తెలుపుము.' ఈశ్వరు డిట్లు చెప్పెను: సౌర(సూర్యోపాసన ప్రధానములగు) ధర్మములను చెప్పెదను. వాటి పేరులు-కల్యాణ సప్తమి-విశోక సప్తమి-ఫల సప్తమి-శర్కరా సప్తమి-కమల సప్తమి-మందార సప్తమి-శుభ సప్తమి. ఇవియన్నియు అనంతఫలదములును దేవర్షులచే కూడ పూజితములును. వీటి విధానమును కల్పోక్త ప్రకార మున నామక్రమమున చెప్పెదను.

ఆదిత్య వారముతో కూడిన శుక్ల సప్తమికి కల్యాణ సప్తమియని లోకప్రసిద్ధి. ఈనాడి ఉదయమున గోక్షీర స్నానము చేయవలెను. పిమ్మట తెల్లని స్వచ్ఛ వస్త్రములు ధరించి అక్షతలతో అష్టదళ పద్మము వేయవలెను. దాని నడుమ గుండ్రని కర్ణికను వేయవలెను. ఈ పద్మమునందంతట నిండునట్లు పుష్పములతో అక్షతలతో నారాయణుని ఆకృతి వేయవలెను.

పూర్వేణ తపనాయేతి మార్తాణ్డాయేతి వై తతః । యామ్యే దివాకరాయేతి విధాత్రేతిచ నైరృతే. 8
పశ్చిమే వరుణాయేతి భాస్కరాయేతి చానిలే । సౌమ్యే వికర్తనాయేతి రవయే చాష్టమే దళే. 9
ఆదావన్తేచ మధ్యేచ నమోస్తు పరమాత్మనే । మన్త్రై రేభి స్సమభ్యర్చ్య నమస్కారా న్తదీపితైః. 10
శుక్లవస్త్రైః ఫలై ర్భక్ష్యై ర్ధూపమాల్యానులేపనైః । స్థండిలే పూజయే ద్భక్త్యా గుడేన లవణేన చ. 11
తతో వ్యాహృతిమన్త్రేణ విసృజ్య ద్విజపుఙ్గవాన్ । శక్త్యా తం పూజయే ద్భక్త్యా గుడక్షీరఘృతాదిభిః. 12
తిలపాత్రం హిరణ్యంచ బ్రాహ్మణాయ నివేదయేత్ । ఏవం నియమకృ త్సుప్త్వా ప్రాత రుత్థాయ మానవః.
కృతస్నానజపో విప్రై స్సహైవ ఘృతపాయసమ్ । భుక్త్వాచ వేదవిదుషే బిడాలవ్రతవర్జితమ్. 14
ఘృతపాత్రం సకనకం సోదకుమ్భం నివేదయేత్ । ప్రీయతా మత్ర భగవా న్పరమాత్మా దివాకరః. 15
అనేన విధినా సర్వం మాసి మాసి సమాచరేత్ । తత స్త్రయోదశే మాసి గాశ్చ దద్యా త్త్రయోదశ. 16
వస్త్రాలఙ్కారసంయుక్తా స్సువర్ణాస్యాః పయస్వినీః । ఏకామపి ప్రదద్యాద్వా విత్తహీనో విమత్సరః. 17
న విత్తశాఠ్యం కుర్వీత విత్తమోహా త్ప్రతత్యథః । అనేన విధినా యస్తు కుర్యా త్కల్యాణసప్తమీమ్. 18
సర్వపాపవినిర్ముక్త స్సూర్యలోకే మహీయతే । ఆయురారోగ్య మైశ్వర్య మనన్త మిహ జాయతే. 19
సర్వపాపహరా నిత్యం సర్వదైవతపూజితా । సర్వదుష్టోపశమనీ సదాకల్యాణసప్తమీ. 20
ఇమా మనన్తఫలదాం యస్తు కల్యాణసప్తమీమ్ । శృణోతి పఠతే చేహ సోపి పాపైః ప్రముచ్యతే. 21

ఇతి శ్రీమత్స్యమహాపురాణే కల్యాణసప్తమీవ్రతకథనంనామ
చతుస్సప్తతితమోఽధ్యాయః.

పూర్వస్యాం దిశి తపనాయనమః-ఆగ్నేయతః మార్తాండాయనమః-దక్షిణస్యాం దిశి దివాకరాయనమః-నైరృత్యాం విధాత్రేనమః-పశ్చిమాయాం వరుణాయనమః-వాయవ్యాం భాస్కరాయనమః-ఉత్తరస్యాం వికర్తనాయనమః-ఐశాన్యాం

రవయేనమః-ఆదౌ పరమాత్మనేనమః-మధ్యే పరమాత్మనేనమః-అంతే పరమాత్మనేనమః-ఈ మంత్రములతోను శుక్లవస్త్ర ఫల భక్ష్య ధూపమాల్యానులేపనములతో గుడ లవణములతో పరమాత్ముని పూజించవలెను.

పిమ్మట భూః-భువః-సువః-అను వ్యాహృతి మంత్రములతో బ్రాహ్మణులను యథాశక్తిగా భక్తి పూర్వకముగా గుడక్షీర ఘృతాదికముతో పూజించవలెను. తిలపాత్రమును హిరణ్యమును బ్రాహ్మణునకర్పించవలెను. ఈ నియమముల పాటించి వ్రతము జరిపి నిద్రించి ఉదయమున మేలుకని స్నాన జపములాచరించి బ్రాహ్మణులతో కూడ ఘృతపాయనము భుజించవలయును. దంభమునకు కాక నిష్కపట భావముతో వేదవేత్తయగు విప్రునకు ఘృతపాత్రమును ఉదకుంభమును బంగారమును 'దీనిచే పరమాత్ముడగు దివాకర భగవానుడు ప్రీతి చెందుగాకః' అను మంత్రముతో సమర్పించవలయును. ఈ విధముగా ప్రతి మాసమునందును చేయవలయును. పదుమూడవ మాసమున మొగమునందు బంగారు పట్టె వస్త్రా లంకారములు కలిగిన పాడియావులను పదుమూడింటిని దానమీయవలయును. ధనము లేనివాడు ఇతరులతో పోటీపడక ఒక పాడి ఆవునైన ఈయవలయును. ధనము కలవాడు మాత్రము తనకు శక్తియుండియు ధనలోభముచే తక్కువ ఈయరాదు. విత్త మోహము చూపుటచే అధఃపతితుడగును. ఈ విధానమున కల్యాణ సప్తమీ వ్రతము చేయువాడు సర్వ పాప వినిర్ముక్తుడై ఇహమున అనంతములగు ఆయురారోగ్యైశ్వర్యములను పొంది పరమున సూర్యలోకమున పూజితు డగును. ఈ కల్యాణ సప్తమి సదా సర్వపాప హరయును సర్వదేవతా పూజితయును సర్వ దోషోపశమనియునునైనది.

అనంత ఫలప్రదయగు ఈ కల్యాణ సప్తమీ విషయమును వినినను చదివినను పాపముక్తుడగును.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున కల్యాణ సప్తమీ వ్రతకథనమను
డెబ్బది నాలుగవ అధ్యాయము.

## పంచసప్తతితమోఽధ్యాయః.
## విశోకసప్తమీవ్రతమ్.

ఈశ్వరః : విశోకసప్తమీం తద్వ ద్వక్ష్యామి మునిపుఙ్గవ ।
యా ముపోష్య నరశ్శోకం న కదాచి దిహాశ్నుతే. 1
మాఘే శుక్లతిలై స్స్నాత్వా షష్ఠ్యాం శుక్లపక్షతః । కృతాహారః కృసరయా దన్తధావనపూర్వకమ్. 2
ఉపవాసవ్రతం కృత్వా బ్రహ్మచారీ భవే న్నిశి । తతః ప్రభాతే చోత్థాయ కృతస్నానజప శ్శుచిః. 3
కృత్వా తు కాఞ్చనం పద్మ మర్కాయేతి చ పూజయేత్ । కరవీరేణ రక్తేన రక్తవస్త్రయుగేన చ. 4
యథా విశోకం భువనం త్వయి చాదిత్య సర్వదా । తథా విశోకతా మే స్యాత్త్వద్భక్తిః ప్రతిజన్మని. 5
ఏవం సమ్పూజ్య షష్ఠ్యాం తు శక్త్యా సమ్పూజయే ద్ద్విజాన్ ।
సుప్త్వా సమ్ప్రాశ్య గోమూత్ర ముత్థాయ కృతనైత్యకః. 6
సమ్పూజ్య విప్రా నన్నేన గుడపాత్రసమన్వితమ్ । తద్వస్త్రయుగ్మం పద్మం చ బ్రాహ్మణాయ నివేదయేత్.
అతైలలవణం భుక్త్వా సప్తమ్యాం మౌనసంయుతః । తతః పురాణశ్రవణం కర్తవ్యం భూతిమిచ్ఛతా. 8
అనేన విధినా సర్వ ముభయో రపి పక్షయోః । కుర్యా ద్యావ త్పున ర్మాఘే శుక్లపక్షస్య సప్తమీమ్. 9
వ్రతాన్తే కలశం దద్యా త్సువర్ణకమలాన్వితమ్ ।
శయ్యాం సోపస్కరాం దద్యా త్కపిలాం చ పయస్వినీమ్. 10
అనేన విధినా యస్తు విత్తశాఠ్యవివర్జితః । విశోకసప్తమీం కుర్యా త్స యాతి పరమాం గతిమ్. 11
యావజ్జన్మసహస్రాణాం స్వాగం కోటిశతం భవేత్ ।
తావ న్న శోకమభ్యేతి సుఖం ప్రాప్నోతి మానవః. 12

యం యం ప్రార్థయతే కామం తం తం ప్రాప్నోతి పుష్కలమ్ ।
నిష్కామః కురుతే యస్తు స పరం బ్రహ్మ గచ్ఛతి. 13
యః పఠే చ్ఛృణుయాద్వాపి విశోకాఖ్యాంచ చ సప్తమీమ్ ।
సోఽపీన్ద్రలోక మాప్నోతి న దుఃఖీ జాయతే క్వచిత్. 14

ఇతి శ్రీమత్స్యమహాపురాణే విశోకసప్తమీవ్రతకథనం నామ
పఞ్చసప్తతితమోఽధ్యాయః.

## డెబ్బదియైదవ అధ్యాయము.
## విశోక సప్తమీ వ్రతము.

ఈశ్వరుడిట్లనెను: మునిపుంగవా! ఇట్టిదేయగు విశోక సప్తమి విషయము చెప్పెదను: ఈ సప్తమినాడువవాన మున ఎప్పుడును శోకమునందదు. మాఘశుక్ల పంచమినాడు దంతధావన పూర్వకముగా తిల (చూర్ణము-తైలము)లతో స్నానముచేసి పులగము మాత్రము తిని ఉపవసించి రాత్రియందు బ్రహ్మచర్యము పాటించవలయును. తెల్లవారి లేచి స్నాన జపములు చేసి శుచియై 'అర్కాయ నమః' అను మంత్రముతో ఎర్రని కరవీర పుష్పములతో రవిని పూజించి ఆయనకు ఎర్రని వస్త్ర ద్వయమునర్పించవలెను. "మూడు లోకములకు విశోకత్వము (శోకము లేకపోవుట) కలిగించు ఆదిత్యా! నాకును విశోకత్వమును జన్మజన్మములందును నీయందు భక్తిని ప్రసాదింపుము." అను మంత్రముతో ప్రార్థించుచు షష్ఠినాడు రవిని పూజించి బ్రాహ్మణులను కూడ పూజించవలెను. ఆనాడు గోమూత్రము మాత్రము ఆహా రముగా గడపి రాత్రి నిద్రించిలేచి సప్తమినాడుదయము నిత్యానుష్ఠానము ముగించుకొని విప్రుల నన్నదానపూర్వకముగా ఆరాధించి ఆ వస్త్రద్వయమును బంగారు పద్మమును బ్రాహ్మణున కీయవలయును. మౌనవ్రతముతో తైలలవణ రహి తముగా భుజించి పురాణ శ్రవణముతో ఆనాడు గడుపవలయును. ఇట్లు చేయుటచే సుఖమును ఐశ్వర్యమును కలుగును.

ఈ విధానమును అది మొదలు ప్రతి మాసమున పక్షద్వయమునను మరల మాఘశుక్ల సప్తమి వచ్చువరకు చేయ వలయును. వ్రతాంతమున సువర్ణకమలముంచిన కలశమును అన్ని పరికరములతోడి మంచమును పాన్పును పాడి కపిల గోవును దానము చేయవలెను.

ఈ విధమున విత్త శాఠ్యము (ధనలోభముతో కొంచెతనము) చేయక ఈ విశోక సప్తమీ వ్రతమును చేయు వాడు ఉత్తమ గతి చెందును. వేయినూరుకోట్ల (కోటి×1000×100) జన్మముల కాలము శోకరహితుడై అమృతత్వా నందమును పొందును. కోరికతో చేసినవానికి కోరినదెల్ల సిద్ధించును. నిష్కాముడై చేసినవానికి పరబ్రహ్మ పదము లభించును. దీనిని చదివినను వినినను ఇంద్రలోకమునందును. విశోకుడగును.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున విశోక సప్తమీ వ్రతకథనమను
డెబ్బదియైదవ యధ్యాయము.

## షట్సప్తతితమోఽధ్యాయః.
## ఫలసప్తమీవ్రతమ్.

ఈశ్వరః : అన్యా మపి ప్రవక్ష్యామి నామ్నా తు ఫలసప్తమీమ్ ।
యా ముపోష్య నరః పాపా ద్విముక్త స్స్వర్గభా గ్భవేత్. 1
మార్గశీర్షే మాసి శుభే పఞ్చమ్యాం నియతవ్రతః ।
షష్ఠీ ముపోష్య కమలం కారయిత్వా తు కాఞ్చనమ్. 2

శర్కరాసంయుతం దద్యా ద్బ్రాహ్మణాయ కుటుమ్బినే ।
హైమం చ కాఞ్చనం కృత్వా ఫలస్యైకస్య ధర్మవిత్. 3
దద్యా ద్ద్వికాలవేళాయాం భాను ర్మే ప్రీయతా మితి ।
శక్త్యా చ విప్రా న్సమ్పూజ్య సప్తమ్యాం క్షీరభోజనమ్. 4
కృత్వా కుర్యా త్ఫలత్యాగం యావతా కృష్ణసప్తమీ । తామప్యుపోష్య విధివ దనేనైవ క్రమేణతు. 5
తద్వ ద్ధేమఫలం దత్వా సువర్ణకమలాన్వితమ్ । శర్కరాపాత్రసంయుక్తం వస్త్రమాల్యసమన్వితమ్. 6
సంవత్సర మనేనైవ విధినోభయసప్తమీం । ఉపోష్య దద్యా త్క్రమశ స్సూర్య మన్త్రా నుదీరయేత్. 7
భాను రర్కో రవి ర్బ్రహ్మా సూర్య శ్శక్రో హరి శ్శివః ।
శ్రీమా న్విభావసు స్త్వష్టా అరుణః ప్రీయతా మితి. 8
ప్రతిమాసంచ సప్తమ్యా మేకైకం నామ కీర్తయేత్ । ప్రతిపక్షం ఫలత్యాగ మేతత్సర్వం సమాచరేత్. 9
వ్రతాన్తే విప్రమిథునం పూజయే ద్వస్త్రభూషణైః । శర్కరాకలశం దద్యా ద్ధేమపద్మఫలాన్వితమ్. 10
యథా న విఫలాః కామా స్త్వద్భక్తానాం సదా రవే । తథాఽనన్తఫలావాప్తి ర్భవే జ్జన్మని జన్మని. 11
ఇమా మనన్త ఫలదాం కుర్యా ద్యః ఫలసప్తమీమ్ । సర్వపాపవిశుద్ధాత్మా సూర్యలోకే మహీయతే. 12
సురాపానాదికం కించి ద్యదత్రాముత్ర వా కృతమ్ । తత్సర్వం నాశమాయాతి యః కుర్యా త్ఫలసప్తమీమ్.
కుర్వాణ స్సప్తమీ మేతాం సతతం సఙ్గవర్జితః । భూతభవ్యాంశ్చ పురుషాం స్తారయే దేకవింశతిమ్. 14
యశ్శృణోతి పఠేద్వాపి సోపి కల్యాణభా గ్భవేత్. 14½

ఇతి శ్రీమత్స్యమహాపురాణే ఫలసప్తమీవ్రత కథనం నామ
షట్సప్తతితమోఽధ్యాయః.

## డెబ్బది యారవ యధ్యాయము.
## ఫల సప్తమీ వ్రతము.

ఈశ్వరుడు బ్రహ్మకిట్లు చెప్పెను: ఫల సప్తమియను సప్తమి విషయము తెలిపెదను. ఈనాడుపవసించినవాడు పాపముక్తుడై స్వర్గమందును.

మార్గశిర శుక్ల పంచమినాడు వ్రత నియమములు పాటించి గడపి షష్ఠినాడు ఉపవసించవలెను. (విశోక సప్తమివలెనే) సప్తమినాడు బంగారు పద్మమును శర్కరను బంగారుతో ఫలపు బొమ్మను కుటుంబియగు బ్రాహ్మణునకు రెండు పూటలందును ధర్మతత్త్వము నెరిగి 'భానుర్మే ప్రీయతాం' 'భానుడు నాయందు ప్రీతుడగుగాక!' అనుచు దానమీయవలెను. యథాశక్తిగా విప్రులను పరమాన్నముతో భుజింపజేసి తానునట్లే భుజించి ఫలత్యాగము చేయవలెను. ఇట్లు కృష్ణపక్ష సప్తమివరకు చేయుచు మరల ఆ కృష్ణ (మార్గశిర) సప్తమినాడును ఉపవసించి హేమఫలమును సువర్ణపద్మమును శర్కరా పాత్రమును వస్త్ర మాల్యములను దానమీయవలెను. ఈ విధముగ సంవత్సరకాలము ఉభయ సప్తములందును (శుక్ల సప్తమితో ఆరంభించి కృష్ణ సప్తమివరకు) ఉపవాస పూర్వకముగా (రెండు సప్తములందును దానములు-నడుమ దినములలో నియమమును పాటించుట) క్రమముగా సూర్య దేవతాక మంత్రముల పఠించుచు చేయుచుండవలెను. ఫలత్యాగము చేయునపుడు మార్గశిరము మొదలు కార్తికమువరకు ప్రతి మాసమునందును వరుసగా-భానుః-ప్రీయతాం-ఇట్లే-అర్కః-రవిః-బ్రహ్మా-సూర్యః-శక్రః-హరిః-శివః-శ్రీమాన్-విభావసుః-త్వష్టా-అరుణః-అను నామములను 'ప్రీయతాం' అను పదముతో చేర్చి పలుకవలయును. ప్రతిపక్షమునను-సప్తమినాడు ఇట్లు దానమును ఫలత్యాగమును చేయవలయును.

వ్రతాంతమునందు విప్ర దంపతులను వస్త్రభూషణములతో పూజించి శర్కరాపూర్ణ కలశమును సువర్ణఫల ప్రతిమను వారికి దానము ఈయవలెను. "రవీ! భక్తుల కోరికల నఫలము చేయు నీ దయచేత నాకును జన్మజన్మమునందును అనంతఫలములు లభించుగాక!" అని ప్రార్థించుచు దాన మీయవలయును.

అనంత ఫలప్రదయగు ఈ ఫల సప్తమీ వ్రతము చేసినవాడు సర్వపాపముక్తుడై పవిత్రతనొంది సూర్యలోకమున పూజితు డగును. వానికి సురాపానాది పాపము లేవైన ఎప్పటివైన ఉన్నను అవియు నశించును. అతని వెనుకముందు ఇరువదియొక తరముల వారును తరింతురు. దీనిని చదివిన-వినిన-వారికి కూడ ఈ ఫలము లభించును.

ఇది శ్రీమత్స్య మహాపురాణమున ఫలసప్తమీ వ్రత కథనమను డెబ్బదియారవ అధ్యాయము.

## సప్తసప్తతితమోఽధ్యాయః.

## శర్కరాఫలసప్తమీవ్రతమ్.

ఈశ్వరః : శర్కరాసప్తమీం వక్ష్యే తద్వత్కల్మషనాశనీమ్ ।
ఆయురారోగ్య మైశ్వర్యం యథాఽనన్తం ప్రజాయతే. 1
మాఘస్య సితపక్షే తు సప్తమ్యాం నియతవ్రతః । ప్రాత స్స్నాత్వా తిలై శ్శుక్లై శ్శుక్లమాల్యానులేపనైః. 2
స్థణ్డిలే పద్మ మాలిఖ్య కుఙ్కుమేన సకర్ణికమ్ । తస్మి న్నమస్సవిత్రేతి గన్ధం పుష్పం నివేదయేత్. 3
స్థాపయేదుదకుమ్భంచ శర్కరాపాత్రసంయుతమ్ । శుక్లై ర్వస్త్రై రలఙ్కృత్య శుక్ల మాల్యానులేపనైః. 4
సువర్ణాశ్వసమాయుక్తం మన్త్రేణానేన పూజయేత్ । విశ్వదేవమయో యస్మా త్త్వం వేదేషు చ పఠ్యసే. 5
త్వమేవ సర్వం దేవేశ జగ దేత-చ్చరాచరమ్ । పఞ్చగవ్యం తతః పీత్వా స్వపే త్తత్పార్శ్వతః క్షితౌ. 6
సౌరం సూక్తం స్మర న్నాస్తే పురాణశ్రవణేన తు । అహోరాత్రే గతే పశ్చా దష్టమ్యాం కృతనైత్యకః. 7
తత్సర్వం వేదవిదుషే బ్రాహ్మణాయ నివేదయేత్ । భోజయే చ్ఛక్తితోవిప్రా ఞ్ఛర్కరాఘృతపాయసైః. 8
భుఞ్జీతాతైలలవణం స్వయమప్యథ వాగ్యతః । అనేన విధినా సర్వం మాసిమాసి సమాచరేత్- 9
సంవత్సరాన్తే శయనం శర్కరాకలశాన్వితమ్ । సర్వోపస్కరసంయుక్తం తథైకాం గాం పయస్వినీమ్.10
గృహం చ శక్తిమా న్దద్యా త్సమస్తోపస్కరాన్వితమ్ । సహస్రేణాథనిష్కాణాం కృత్వా దద్యా చ్ఛతేనవా.
దశభిర్వా త్రిభిర్వాపి నిష్కేణై కేన శక్తితః । సువర్ణాశ్వః ప్రదాతవ్యః పూర్వవ ద్విప్రవాచనమ్. 12
న విత్తశాఠ్యం కుర్వీత కుర్వ న్దోషా న్సమశ్నుతే । అమృతం పిబతో వక్త్రా త్సూర్యస్యామృతబిన్దవః.
నిపేతు ర్యే భరాభూమౌ వై శాలిముద్గేక్షవ స్స్మృతాః. 13
శర్కరా పరత స్తస్మా దిక్షుసారోఽమృతాత్మవాన్ । ఇష్టా రవే రతః పుణ్యా శర్కరా హవ్యకవ్యయోః.
శర్కరాసప్తమీ చేయం వాజిమేధ ఫలప్రదా । సర్వదుఃఖప్రశమనీ పుత్రపౌత్రప్రవర్ధినీ. 15
యః కుర్యా త్పరయా భక్త్యా స పరం బ్రహ్మ గచ్ఛతి । కల్ప మేకం వసే త్స్వర్గే తతో యాతి పరాం గతిమ్.
ఇద మనఘ శృణోతి య స్స్మరేద్వా పరిపఠతీహ సురేశ్వరస్య లోకే ।
మతిమపిచ దదాతి సోపి దేవై రమరవధూజనమాలయాఽభిపూజ్యః. 17

ఇతి శ్రీమత్స్యమహాపురాణే శర్కరాసప్తమీవ్రతకథనం నామ
సప్తసప్తతితమోఽధ్యాయః.

## డెబ్బదియేడవ అధ్యాయము

## శర్కరాఫల సప్తమీ వ్రతము

ఈశ్వరుడు బ్రహ్మతో ఇంకను ఇట్లు చెప్పెను: ఇట్టిదే యగు శర్కరా సప్తమీ వ్రతమును తెలిపెదను. అది కలుషనాశకమును-అనంతాయురారోగ్యైశ్వర్యప్రదమును.

మాఘ శుక్ల సప్తమినాడుదయమున తెల్లని నూవుల పొడితో-నూనెతో స్నానము చేసి తెల్లని వస్త్రమాల్యముల ధరించవలెను. అరుగు అలికి దానిపై కుంకుమతో పద్మమును దాని నడుమ కర్ణికను వేయవలెను. 'నమః సవిత్రే' అను మంత్రముతో దానిపై గంధపుష్పము లుంచవలెను. దాని నడుమ నీటి కలశముంచి దానిపై శర్కరాపాత్ర నుంచవలెను. బంగారు గుఱ్ఱపు ప్రతిమను దానియందుంచి తెల్లని వస్త్రములతో మాల్యములతో గంధములతో ప్రతిమ నలంకరించవలయును. రవి నీ మంత్రముతో పూజించవలెను. (అర్థము): "దేవేశా! సర్వదేవమయుడవుగా నీవు వేదములందు పఠింపబడుచున్నావు. కనుక ఈ చరాచర జగత్తంతయు నీవే." తరువాత పంచగవ్యము త్రావి (ఉపవాసముతో) ఆ అరుగునకు దగ్గరగా నేలపయి శయనించవలెను. సౌరసూక్తములనో పురాణములనో చదువుచు కాని వినుచు కాని ఆ పగలును రాత్రియు గడుపవలెను. అష్టమినాడు నిత్యానుష్ఠానము నెరవేర్చికొని అదియంతయు బ్రాహ్మణునకు దానము ఈయవలయును. తన శక్తికొలదిగా బ్రాహ్మణులకు నేతితో శర్కరా పాయసములతో భోజనము పెట్టవలెను. తానును మౌనముతో నుండి తైల లవణరహితముగా భుజించవలెను.

ఇట్లు ప్రతి మాసమునను సంవత్సరకాలము చేసి పిమ్మట శర్కరా పూర్ణకలశముతో సర్వోపస్కర (సర్వ సామగ్రీ) సహితమగు మంచమును పడకను పాడియావును శక్తి యున్నచో గృహమును కూడ సర్వోపకరణములతో ఈయవలయును. వేయి-లేదా నూరు-లేదా మూడు లేదా ఒక నిష్కము (పూర్వపు ఒక బంగారు నాణెము) తూకముతో బంగారు గుఱ్ఱములను (యథాశక్తి) చేయించి విప్రులచే సౌరసూక్తపాఠము పురాణ పఠనము చేయించి వారి కిది దానమీయవలయును. ధనమునకు లోభించి లోపము చేయుట దోషకరము.

సూర్యు డమృతము త్రావునపుడు అతని నోటినుండి పడిన అమృతపు బొట్టులే వడ్లు పెసలు చెరకు ఐనవి. ఇక్షుసారము శర్కర; అది అందుచే ఈ మూటిలో గొప్పది. అమృత స్వరూపము అయినది. హవ్యకవ్యములందు అందుచే శర్కర రవికి ప్రీతికరము.

ఈ శర్కరా సప్తమీ వ్రతానుష్ఠానము అశ్వమేధయాగ ఫలమును ఇచ్చును. సర్వదుఃఖశాంతిని పుత్త్రపౌత్త్ర వృద్ధిని పరబ్రహ్మత్వమును కూడ కలిగించును. అట్టివా డొక కల్పము కాలము స్వర్గమందుండి పిదప ముక్తి నందును.

దీనిని చదివినను వినినను తలచినను ఉత్తమ జ్ఞానవంతుడై స్వర్గలోకమున అప్సరః సమూహముచే పూజింపబడును.

ఇది శ్రీమత్స్య మహాపురాణమున శర్కరా సప్తమీ వ్రత కథనమను డెబ్బది యేడవ అధ్యాయము.

## అష్టసప్తతితమోఽధ్యాయః.
## కమలసప్తమీవ్రతమ్.

ఈశ్వరః : అతఃపరం ప్రవక్ష్యామి తద్వత్కమలసప్తమీమ్ ।
యస్యాః సంకీర్తనాదేవ తుష్యతీహ దివాకరః. 1
వసన్తామలసప్తమ్యాం స్నాతః సన్గౌరసర్షపైః । తిలపాత్రేచ సౌవర్ణం నిధాయ కమలం శుభమ్. 2
వస్త్రయుగ్మయుతం కృత్వా గన్ధపుష్పైః సమర్చయేత్ । నమః కమలహస్తాయ నమస్తే విశ్వధారిణే. 3
దివాకర నమస్తుభ్యం ప్రభాకర నమోస్తు తే । తతో ఘటం వేశాయా ముదకుమ్భసమన్వితమ్. 4
విప్రాయ దద్యాత్సమ్పూజ్య వస్త్రమాల్యవిభూషణైః । శక్తిశ్చే త్కపిలాం దద్యా దలఙ్కృత్య విధానతః.
అహోరాత్రే గతే పశ్చా దష్టమ్యాం భోజయే ద్ద్విజాన్ । యథాశక్త్యాఽథ భుఞ్జీత సప్తమ్యాం తైలవర్జితమ్.
అనేన విధినా శుక్లసప్తమ్యాం మాసిమాసి చ । సర్వం సమాచరే ద్భక్త్యా విత్తశాఠ్యవివర్జితః. 7
వ్రతాన్తే శయనం దద్యా త్సువర్ణకమలాన్వితమ్ । గాంచ దద్యా త్స్వశక్త్యాచ సువర్ణాంచ పయస్వినీమ్. 8

భాజనాసనదీపాదీ న్దద్యా దిష్టా నుపస్కరా న్ । అనేన విధినా యస్తు కుర్యా త్కమలసప్తమీమ్. 9
లక్ష్మి మనన్తా మభ్యేతి సూర్యలోకేచ మోదతే । కల్పేకల్పే తథా లోకా న్సప్త గత్వా పృథక్పృథక్. 10
అప్సరోభిః పరివృత స్తతో యాతి పరాం గతిమ్ ।
ఏతద్వ్రతం యశ్శృణుయా త్సమగ్రం పఠేచ్చ భక్త్యాఽథ మతిం దదాతి. 11
సోఽపత్ర లక్ష్మి మచలా మవాప్య గన్ధర్వ విద్యాధరలోకభా క్స్యాత్. 11u

ఇతి శ్రీమత్స్యమహాపురాణే కమలసప్తమీవ్రతకథనంనామాష్ట సప్తతితమోఽధ్యాయః.

## డెబ్బది ఎనిమిదవ అధ్యాయము

## కమల సప్తమీ వ్రతము

ఈశ్వరుడు బ్రహ్మతో ఇట్లు చెప్పెను: ఇపు డిక ఇట్టిదే యగు కమల సప్తమీ వ్రతమును తెలిపెదను. దానిని కీర్తించినంతనే ఆదిత్యుడు సంతసించును. వసంత (చైత్ర వైశాఖములలో నేదైన) శుక్ల సప్తమినాడు తెల్లని ఆవల (పిండితో-నూనె)తో స్నానము చేసి నూవుల పళ్లెరమునందు నూతన వస్త్రయుగ్మమునుంచి దానిపై బంగారు కమలముంచి గంధపుష్పాదికముతో సమర్చించవలెను. కమలహస్తుడు-విశ్వధారి-దివాకరుడు-ప్రభాకరుడు (పగటిని-ప్రకాశమును కలిగించువాడు) అగు రవీ! నీకు వందనము. అని నమస్కరించవలెను. పిమ్మట వికాల(సంధ్యా)సమయమున విప్రుని వస్త్రమాల్య విభూషణములతో సంపూజించి ఈ సామగ్రితో సువర్ణ కమలమును ఉదకుంభమును శక్తి యున్నచో సాలంకారముగ కపిలగోవును విధానానుసారము దాన మీయవలెను. సప్తమినా డుపవసించి అష్టమినాడు యథాశక్తిగ భుజింపజేసి తానును భుజింపవలెను. సప్తమినాడు మాత్రము తైలము లేని ఉపాహారము తినవలెను.

ఇట్లు ప్రతిమాసమున ధనముండియు లోభి చక శుక్ల సప్తమినాడు సంవత్సరము పొడవున చేయుచు పోవలయును. వ్రతాంతమున (ఉద్యాపనముగా) బంగారు కమలముతోపాటు సర్వోపస్కరములతో శయనము (మంచము పరకలు) బంగారు కొమ్ములు అలంకరించిన పాడి కపిల గోవును పాత్రలు పీఠములు ఆసనములు దీపములు మొదలగు ఇష్ట సామగ్రిని కూడ ఈయవలెను.

ఇట్లు కమల సప్తమీ వ్రత మాచరించినవాడు అనంతమగు లక్ష్మిని పొందుటయే కాక సూర్యలోకమున సుఖించును. కల్పమునకు ఒకటి చొప్పున ఏడు ఊర్ధ్వలోకములకు క్రమశః పోయి అచ్చట నెల్ల అప్సరసలతో పూజలందుకొని సుఖించి తుదకు ముక్తి నందును.

దీనిని సమగ్రముగా భక్తితో వినినను తెలిపినను ఇహమున స్థిరమగు ఐశ్వర్యము ననుభవించి పరమున విద్యాధర లోకమున సుఖించును.

ఇది శ్రీమత్స్య మహాపురాణమున కమల సప్తమీ వ్రతమను డెబ్బది ఎనిమిదవ అధ్యాయము.

## ఏకోనాశీతితమోఽధ్యాయః.

## మన్దారసప్తమీవ్రతమ్.

ఈశ్వరః : అథాత స్సమ్ప్రవక్ష్యామి సర్వపాపవినాశనీమ్ ।
సర్వకామప్రదాం పుణ్యాం నామ్నా మన్దారసప్తమీమ్. 1
మాఘస్యామలపక్షేతు పఞ్చమ్యాం లఘుభు గ్నరః । దన్తకాష్ఠం తతః కృత్వా షష్ఠ్యా ముపవసే న్నరః. 2
విప్రా న్సమ్పూజయిత్వాతు మన్దారం ప్రాశయే న్నిశి । తతః ప్రభాత ఉత్థాయ కృతస్నానః పున ర్ద్విజాన్.
భోజయే చ్ఛక్తితః కృత్వా మన్దారకుసుమాష్టకమ్ । సౌవర్ణం పురుషం తద్వ త్పద్మహస్తం సుశోభనమ్. 4

పద్మం కృష్ణతిలైః కృత్వా తామ్రపాత్రేఽష్టపత్రకమ్ । హేమమన్దారకుసుమై ర్భాస్కరాయేతి పూర్వతః. 5
నమస్కారేణ తద్వచ్చ సూర్యాయే త్యనలే దళే । దక్షిణే తద్వదర్కాయ తథార్యమ్ణేతి నైరృతే. 6
పశ్చిమే వేదధామ్నేతి వాయవ్యాం చణ్డభానవే । పూష్ణేత్యుత్తరతః పూజ్య మానన్దాయేత్యతఃపరమ్. 7
కర్ణికాయాంచ పురుషం స్థాప్య సర్వాత్మనేతి చ । శుక్లవస్త్రై స్సమావేష్ట్య భక్ష్యమాల్యఫలాదిభిః. 8
ఏవ మభ్యర్చ్య తత్సర్వం దద్యా ద్వేదవిదే పునః । భుఞ్జీతాతైలలవణం వాగ్యతః ప్రాఙ్ముఖో గృహీ. 9
అనేన విధినా సర్వం సప్తమ్యాం మాసిమాసిచ । కుర్యా త్సంవత్సరం యావ ద్విత్తశాఠ్యవివర్జితః. 10
ఏవ మేత ద్వ్రతాన్తేతు విధాయ కలశోపరి । గోభి ర్విభవతస్సార్ధం దాతవ్యం భూతి మిచ్ఛతా. 11
నమో మన్దారనాథాయ మన్దారభవనాయ చ । త్వం రవే తారయస్వాస్మా నస్మా త్సంసారసాగరాత్. 12
అనేన విధినా యస్తు కుర్యా న్మన్దారసప్తమీమ్ । విపాప్మా స సుఖీ మర్త్య శ్శక్రేణ దివి మోదతే. 13
ఇమా మఘౌఘపటలభీషణధ్వాన్తదీపికామ్ । గచ్ఛ న్ప్రగృహ్య సంసారశర్వర్యాం న స్ఖలే న్నరః. 14

ఇతి శ్రీమత్స్యమహాపురాణే మన్దారసప్తమీవ్రత కథనం

నామైకోనాశీతితమోఽధ్యాయః.

## డెబ్బది తొమ్మిదవ అధ్యాయము

## మందార సప్తమీ వ్రతము

ఈశ్వరుడు బ్రహ్మతో ఇట్లు చెప్పెను: ఇక ఇప్పుడు సర్వపాపనాశకము సర్వకామప్రదము పుణ్యాదము నగు మందార సప్తమీ వ్రతమును తెలిపెదను. మాఘ శుక్ల పంచమినాడు లఘువుగా భుజించవలెను. షష్ఠినాడు పలుదోము కొని స్నానాదికమును చేసికొని పగలంతయు ఉపవసించి రాత్రి మందార కుసుమమును ఆహారముగా తీసికొనవలెను. సప్తమినాడు బ్రాహ్మణ భోజనము జరుపవలెను. ఆనాడు ఎనిమిది బంగరు మందార పుష్పములను-పద్మహస్తుడగు మనోహరుడగు పురుషుని బంగారు ప్రతిమను అష్టదళ సువర్ణ కమలమును రాగి పళ్లెరములో నూవులు పోసి వానిపై నుంచవలెను. పిమ్మట ఆ అష్టదళ పద్మమునందలి దళములలో తూర్పునుండి ఈశాన్యము వరకు గల ప్రతియొక దళమును ఈ ఎనిమిది బంగారు మందార కుసుమములతో వరుసగా- 1. భాస్కరాయ నమః-ప్రాగ్దళం పూజయామి; 2. సూర్యాయ నమః-ఆగ్నేయ దళం పూజయామి; 3. అర్కాయ నమః-దక్షిణ దళం పూజయామి; 4. అర్యమ్ణే నమః-నైరృత దళం పూజయామి; 5. వేదధామ్నే నమః పశ్చిమ దళం పూజయామి; 6. చండభానవే నమః వాయవ్య దళం పూజయామి; 7. పూష్ణే నమః ఉత్తర దళం పూజయామి; 8. ఆనందాయ నమః ఈశాన్య దళం పూజయామి; అని పూజించవలెను. స్వర్ణ పురుష ప్రతిమను పద్మకర్ణికయందుంచి 'సర్వాత్మనే నమః' అని పూజించి నూతన శ్వేతవస్త్రము చుట్టి భక్ష్యమాల్య ఫలాదులతో అర్చించి అవి అన్నియు వేదవేత్తయగు విప్రునకు దాన మీయవలయును. ఆ రాత్రి తైల లవణములు (కారము పులుపు) లేకుండ ప్రాఙ్ముఖుడై భుజించి మౌనము పాటించవలెను.

ధనమునకై లోభించక యథాశక్తిగ ఇట్లు ప్రతిమానము సంవత్సరకాలము చేయవలెను. వ్రతాంతమున ఈ సామగ్రులను కలశముతోను గోవుతోను కూడ విప్రునకు దానము ఈయవలెను. దీనిచే సకల సంపదలు కలుగును. "మందారనాథుడు మందార కుసుమము భవనముగా కలవాడు నగు రవీ! మమ్ము సంసార సాగరమునుండి తరింపజేయుము." అని ప్రార్థించుచు ఇట్లు మందార సప్తమీ వ్రతము చేయు నరులు పాపముక్తులై స్వర్గమున ఇంద్రునితో కూడి ఆనందింతురు. పాపము అనెడు చీకటితో నిండిన సంసార మనెడు రాత్రియందు దీపము వంటి ఈ వ్రతమును ఆధారముగా తీసికొనినచో జారి పడరు. ఈప్సితార్థ ఫలప్రదమగు దీనిని వినినను చదివినను తెలిపినను అట్టివాడును పాపముక్తుడగును.

ఇది శ్రీమత్స్య మహాపురాణమున మందార సప్తమీ వ్రతమను డెబ్బది తొమ్మిదవ అధ్యాయము.

భాజనాసనదీపాదీన్ దద్యా దిష్టా నుపస్కరాన్ । అనేన విధినా యస్తు కుర్యా త్కమలసప్తమీమ్. 9
లక్ష్మీ మనన్తా మభ్యేతి సూర్యలోకేచ మోదతే । కల్పేకల్పే తథా లోకా న్సప్త గత్వా పృథక్పృథక్. 10
అప్సరోభిః పరివృత స్తతో యాతి పరాం గతిమ్ ।
ఏతద్వ్రతం యశ్శృణుయా త్సమగ్రం పఠేచ్చ భక్త్యాఽథ మతిం దదాతి. 11
సోఽప్యత్ర లక్ష్మీ మచలా మవాప్య గన్ధర్వ విద్యాధరలోకభా క్స్యాత్. 11॥

ఇతి శ్రీమత్స్యమహాపురాణే కమలసప్తమీవ్రతకథనంనామాష్ట
సప్తతితమోఽధ్యాయః.

## డెబ్బది ఎనిమిదవ అధ్యాయము
## కమల సప్తమీ వ్రతము

ఈశ్వరుడు బ్రహ్మతో ఇట్లు చెప్పెను: ఇపు డిక ఇట్టిదే యగు కమల సప్తమీ వ్రతమును తెలిపెదను. దానిని కీర్తించినంతనే ఆదిత్యుడు సంతసించును. వసంత (చైత్ర వైశాఖములలో నేదైన) శుక్ల సప్తమినాడు తెల్లని ఆవల (పిండితో-నూనె)తో స్నానము చేసి నూవుల పళ్లెరమునందు నూతన వస్త్రయుగ్మమునుంచి దానిపై బంగారు కమలముంచి గంధపుష్పాదికముతో సమర్చించవలెను. కమలహస్తుడు-విశ్వధారి-దివాకరుడు-ప్రభాకరుడు (పగటిని-ప్రకాశమును కలిగించువాడు) అగు రవీ! నీకు వందనము. అని నమస్కరించవలెను. పిమ్మట వికాల(సంధ్యా)సమయమున విప్రుని వస్త్రమాల్య విభూషణములతో సంపూజించి ఈ సామగ్రితో సువర్ణ కమలమును ఉదకుంభమును శక్తి యున్నచో సాలంకారముగ కపిలగోవును విధానానుసారము దాన మీయవలెను. సప్తమినా డుపవసించి అష్టమినాడు యథాశక్తిగ భుజింపజేసి తానును భుజింపవలెను. సప్తమినాడు మాత్రము తైలము లేని ఉపాహారము తినవలెను.

ఇట్లు ప్రతిమాసమున ధనముండియు లోభి చక శుక్ల సప్తమినాడు సంవత్సరము పొడవున చేయుచు పోవల యును. వ్రతాంతమున (ఉద్యాపనముగా) బంగారు కమలముతోపాటు సర్వోపస్కరములతో శయనము (మంచము పడకలు) బంగారు కొమ్ములు అలంకరించిన పాడి కపిల గోవును పాత్రలు పీఠములు ఆసనములు దీపములు మొదలగు ఇష్ట సామగ్రిని కూడ ఈయవలెను.

ఇట్లు కమల సప్తమీ వ్రత మాచరించినవాడు అనంతమగు లక్ష్మిని పొందుటయే కాక సూర్యలోకమున సుఖించును. కల్పమునకు ఒకటి చొప్పున ఏడు ఊర్ధ్వలోకములకు క్రమశః పోయి అచ్చట నెల్ల అప్సరసలతో పూజలందుకొని సుఖించి తుదకు ముక్తి నందును.

దీనిని సమగ్రముగా భక్తితో వినినను తెలిపినను ఇహమున స్థిరమగు ఐశ్వర్యము ననుభవించి పరమున విద్యాధర లోకమున సుఖించును.

ఇది శ్రీమత్స్య మహాపురాణమున కమల సప్తమీ వ్రతమను డెబ్బది ఎనిమిదవ అధ్యాయము.

## ఏకోనాశీతితమోఽధ్యాయః.
## మన్దారసప్తమీవ్రతమ్.

ఈశ్వరః : అథాత స్సమ్ప్రవక్ష్యామి సర్వపాపవినాశనీమ్ ।
సర్వకామప్రదాం పుణ్యాం నామ్నా మన్దారసప్తమీమ్. 1
మాఘస్యామలపక్షేతు పఞ్చమ్యాం లఘుభుङ్నరః । దన్తకాష్ఠం తతః కృత్వా షష్ఠ్యా ముపవసే న్నరః.2
విప్రా న్సమ్పూజయిత్వాతు మన్దారం ప్రాశయే న్నిశి । తతః ప్రభాత ఉత్థాయ కృతస్నానః పున ర్ద్విజాన్.
భోజయే చ్ఛక్తితః కృత్వా మన్దారకుసుమాష్టకమ్ । సౌవర్ణం పురుషం తద్వ త్పద్మహస్తం సుశోభనమ్. 4

(సర్వ పరికములతోను) పాత్రలను ఆసనములను వేదవిదుడగు విప్రునకు 'వివస్వాన్ ప్రీయతామ్' 'రవి ప్రీతి నందుగాక:' అనెడు మంత్రముతో దానము ఈయవలెను.

ఇట్లు చేయువాడు జన్మజన్మమునందును ఇహమున నిర్మలైశ్వర్య కీర్తులను పొంది పరమున స్వర్గమునందు అప్సరోగణ గంధర్వ గణములచే పూజలందుకొనుచు సుఖించి చివరకు దేవగణాధిపుడై కల్పాంతమువరకు ఉండి మరల కల్పాదియందు సప్త ద్వీపాధిపతియై జన్మించును. ఈ వ్రతకల్పమును చదివినందున కలిగిన పుణ్యము వేయి బ్రహ్మ హత్యలను నూరు భ్రూణ హత్యలను నశింపజేయును. (భ్రూణుడు-షడంగములతో వేదముల నధ్యయనము చేసిన విప్రుడు) దీనిని చదివినను విన్నను ఇతరులకు తెలిపినను ముహూర్తకాలము ఈ వ్రతాచరణము చూచినను అట్టివాడు సర్వ పాప విముక్తుడై విద్యాధర నాయకుడగును.

దీనిని ఏడేండ్లు ఏడు వేరువేరు విధానములతో ఆచరించిన వాడు క్రమముగా సప్తలోకములకు అధిపతియై తుదకు ముక్తినందును.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున శుభ సప్తమీ వ్రత కథనమను
ఎనుబదవ అధ్యాయము

## ఏకాశీతితమోఽధ్యాయః.
## విశోకద్వాదశీవ్రతమ్.

మనుః : కి మభీష్టవియోగశోకసజ్ఘా దలముద్ధర్తు ముపోషణవ్రతం చ ।
విభవోద్భవకారి భూతలేఽస్మి న్భవభూతేరపి సూదనంచ పుంసః. 1
శ్రీమత్స్యః : పరిపృష్టమిదం జగత్ప్రియం య ద్విబుధానామపి దుర్లభం † మహచ్చ ।
తవ భక్తిమత స్తథాపి వక్ష్యే వ్రత మిన్ద్రాసురమానవేషు గుహ్యమ్. 2
పుణ్య మాశ్వయుజే మాసి విశోక ద్వాదశీవ్రతమ్ । దశమ్యాం లఘుభు గ్విద్వా నారభే న్నియమేన తు. 3
ఉదఙ్ముఖః ప్రాఙ్ముఖోవా దన్తధావనపూర్వకమ్ । ఏకాదశ్యాం నిరాహార స్సమభ్యర్చ్యచ కేశవమ్. 4
శ్రియం చాభ్యర్చ్య విధివ ద్భోక్ష్యామేవ పరేఽహని । ఏవం నియమకృత్సుప్త్వా ప్రాతరుత్థాయ మానవః. 5
స్నానం సర్వౌషధైః కుర్యా త్పఞ్చగవ్యజలేన చ । శుక్లమాల్యామ్బర స్తద్వ త్పూజయే చ్ఛ్రీశ ముత్పలైః.
విశోకాయ నమః పాదౌ జఙ్ఘేచ వరదాయవై । శ్రీశాయ జానునీ తద్వ దూరూచ జలశాయినే. 7
కన్దర్పాయ నమో గుహ్యం మాధవాయ నమః కటిమ్ । దామోదరాయే త్యుదరం పార్శ్వేతు విపులాయవై.8
నాభించ పద్మనాభాయ హృదయం మన్మథాయ వై । శ్రీధరాయ నమో వక్షః కరౌ మధుభిదే నమః. 9
చక్రిణే వామబాహుంచ దక్షిణం గదినే నమః । వైకుణ్ఠాయనమః కణ్ఠ మాస్యం యజ్ఞముఖాయవై. 10
నాసా మశోకనిధయే వాసుదేవాయ చాక్షిణీ । లలాటం వామనాయేతి హరయేతి పునర్భ్రువౌ. 11
అలకాన్మాధవాయేతి కిరీటం విశ్వరూపిణే । నమస్సర్వాత్మనే తద్వ చ్ఛిర ఇత్యభిపూజయేత్. 12
ఏవం సమ్పూజ్య గోవిన్దం ధూపమాల్యానులేపనైః । తతస్తు మణ్డపంకృత్వా స్థణ్డిలంకారయేన్ముదా. 13
చతురశ్రం సమన్తాచ్చారత్నిమాత్రముదక్ప్లవమ్ । సూక్ష్మం హృద్యంచ పరితో వప్రత్రయసమావృతమ్. 14
త్ర్యఙ్గుళోచ్ఛ్రితవిస్తార స్తద్వప్రారే ద్వ్యరఙ్గుళమ్ । స్థణ్డిలస్యోపరిష్టాత్తు భిత్తి రష్టాంగుళాభవేత్. 15
నదీవాలుకయా శూర్పే లక్ష్మ్యాః ప్రతికృతిం న్యసేత్ । స్థణ్డిలే శూర్పమారోప్య లక్ష్మీమిత్యర్చయేద్బుధః.16

## ఎనుబది ఒకటవ అధ్యాయము.
## విశోక ద్వాదశీ వ్రతము-గుడ ధేన్వాదిదానములును.

మనువు మత్స్యనారాయణుని ఇట్లడిగెను: ఇష్టవియోగమువలన శోకము కలుగకుండ చేయునదియు కలిగిన అట్టి శోకమునుండి ప్రాణులనుద్ధరించునదియు విభవములను కలిగించునదియు సంసార నాశకమునునగు ఉపవాస పూర్వకమగు వ్రతమేది? అనగా మత్స్యుడిట్లు చెప్పసాగెను. నీవడిగిన ఈ ప్రశ్నము జగత్ప్రియము; దేవతలకును దుర్లభము; గొప్పది; దేవ దానవ మానవులకును గుహ్యమగునది. ఐనను నీవు భక్తుడవు అడిగితివి కావున చెప్పెదను. ఆశ్వయుజ మాసమున చేయు విశోక ద్వాదశీ వ్రతము ఇట్టి పుణ్యకరము.

దశమినాడు లఘు భోజనము చేసి సంప్రదాయమెరిగి నియమముతో వ్రతమారంభించవలెను. ఏకాదశినాడు పలుదోముకొని స్నానాదికము నెరవేర్చి నిరాహారుడై ఉత్తరాముఖుడో ప్రాఙ్ముఖుడో అయి కేశవుని లక్ష్మిని యథావిధిగ అర్చించి ద్వాదశినాడు పారణ చేయవలయును. ఎట్లన-ద్వాదశినాడు ఉదయమున లేచి సర్వౌషధులతోను పంచగవ్య సహిత జలముతోను స్నానమాడి తెల్లని పుష్పములను వస్త్రములను ధరించి కలువపూలతో విష్ణునర్చించవలయును.

(పూజా మంత్రము:) 1. విశోకాయనమః-పాదౌ పూజయామి; 1. వరదాయనమః-జంఘే పూజయామి; 3. శ్రీశాయనమః-జానునీ పూజయామి; 4. జలశాయినేనమః-ఊరూ పూజయామి; 5. కందర్పాయనమః-గుహ్యం పూజయామి; 6. మాధవాయనమః-కటిం పూజయామి; 7. దామోదరాయనమః-ఉదరం పూజయామి; 8. విపులాయనమః-పార్శ్వే పూజయామి; 9. పద్మనాభాయనమః-నాభిం పూజయామి; 10. మన్మథాయనమః-హృదయం పూజయామి; 11. శ్రీధరాయనమః-వక్షః పూజయామి; 12. మధుభిదేనమః-కరౌ పూజయామి; 13. చక్రిణేనమః-వామబాహుం పూజయామి; 14. గదినేనమః-దక్షిణ బాహుం పూజయామి; 15. వైకుంఠాయనమః-కంఠం పూజయామి; 16. యజ్ఞముఖాయ నమః-ఆస్యం పూజయామి; 17. అశోకనిధయేనమః-నాసాం పూజయామి; 18. వాసుదేవాయనమః-అక్షిణీ పూజయామి; 19. వామనాయ నమః-లలాటం పూజయామి; 20. హరయేనమః-భ్రువౌ పూజయామి; 2 . మాధవాయనమః-అలకాన్ పూజయామి; 22. విశ్వరూపిణేనమః-కిరీటం పూజయామి; 23. సర్వాత్మనేనమః-శిరః పూజయామి; ఇట్లు అంగపూజ జరిపి పిమ్మట గంధ ధూపమాల్యములతో విష్ణుని పూజించవలెను.

మండపము ఏర్పరచి దానియందు పిడిమూర కొలత భుజముతో చతురస్రము మనోహరమగు సన్నని అరుగు ఉత్తరపు వాలుదలతో చేసి దానిచుట్టును మూడు ప్రాకారములు చేయవలెను. వానిలో బయటిది మూడంగుళముల ఎత్తు నడుమది రెండంగుళముల ఎత్తు లోపలిది ఎనిమిదంగుళముల ఎత్తు ఉండవలెను. ఏటి ఇసుకతో లక్ష్మి ప్రతిమచేసి చేటలో ఉంచవలెను. ఆ చేట నరుగుమీద ఉంచి లక్ష్మిని పూజించవలయును.

నమో దేవ్యై నమశ్శాన్త్యై నమో లక్ష్మ్యై నమశ్శ్రియై । నమః పుష్ట్యై నమస్తుష్ట్యై వృష్ట్యైహృష్ట్యై నమో నమః.

విశోకదుఃఖనాశాయై విశోకా వరదాఽస్తు మే । విశోకాచాస్తు సన్తత్యై విశోకా సర్వసిద్ధయే. 18

తతశ్శుక్లామ్బరైశ్శూర్పం వేష్ట్య సమ్పూజయేత్ఫలైః । వస్త్రైర్నానావిధై స్తద్వత్సువర్ణకలశేనచ. 19

రజనీషుచసర్వాసు పిబేద్దర్భోదకం పునః । తతస్తు గీతనృత్యాది కారయేత్సకలాం నిశామ్. 20

యామత్రయే వ్యతీతేతు తత ఉత్థాయ మానవః । అభిగమ్యచ విప్రాణాం మిథునాని సమర్చయేత్. 21

శక్తితస్త్రీణి చైకం చ వస్త్రమాల్యానులేపనైః । శయనాసిచ పూజ్యాని నమోఽస్తు జలశాయినే. 22

తతస్తు గీతవాద్యాన్తే రాత్రౌ జాగరణే కృతే । ప్రభాతేచ జలస్నానం కృత్వా దమ్పత్య మర్చయేత్. 23

భోజనంచ యథాశక్త్యా విత్తశాఠ్యవివర్జితః । భుక్త్వా శ్రుత్వా పురాణాని తద్దినం చాతివాహయేత్. 24

అనేన విధినా సర్వం మాసిమాసి సమాచరేత్ । వ్రతాన్తే శయనం దద్యా ద్గుడధేనుసమన్వితమ్. 25

సోపధానకవిశ్రామ స్వాస్తరావరణం శుభమ్ । యథా న లక్ష్మీ ర్దేవేశ త్వాం పరిత్యజ్య గచ్ఛతి. 26
తథా సురూప మారోగ్య మశోకశ్చాస్తు మే సదా । యథా దేవేన రహితా న లక్ష్మీ ర్జాయతే క్వచిత్. 27
తథా విశోకతా మేఽస్తు భక్తిరగ్ర్యాచ కేశవే । మన్త్రేణానేన శయనం గుడధేనుసమన్వితమ్. 28
శూర్పంచ లక్ష్మ్యాసహితం దాతవ్యం భూతి మిచ్ఛతా । ఉత్పలం కరవీరంచ బాణ మమ్లానకుఙ్కుమమ్.
కేతకీ సిన్దువారంచ మల్లికాగన్ధపాటలమ్ । కదమ్బం మాలతీ (కుఙ్కుమం) చాపి శస్తాన్యేతాని సర్వదా. 30

(లక్ష్మీ పూజా మంత్రములు:) 1. దేవ్యై నమః-2. శాంత్యై నమః-3. లక్ష్మ్యై నమః-4. శ్రియై నమః-5. పుష్ట్యై నమః-6. తుష్ట్యై నమః-7 వృష్ట్యై నమః-8. హృష్ట్యై నమః-9. విశోకాయై నమః-10. దుఃఖనాశాయై నమః అను నవి లక్ష్మీ పూజా మంత్రములు. వీనిలో ఆమెను పూజించి ఈ అర్ఘ్యము నిచ్చు మంత్రములతో ప్రార్థించవలెను. శోకములు లేకుండ జేయు లక్ష్మీదేవి నాకు వరముల నిచ్చునది యగుగాక! విశోకయగు లక్ష్మి సంతానము కలిగించుగాక! ఉన్న సంతతికి యోగ క్షేమముల నిచ్చుగాక! పిమ్మట ఆ చేటను తెల్లని క్రొత్త వస్త్రములతో చుట్టవలెను. దానిని నానా విధ భక్ష్యములతో ఫలములతో పూజించి దేవికి సువర్ణ కలశము నర్పించవలెను. రాత్రులయందు దర్భలు వేసి ఉంచిన ఉదకమును త్రాగి ఉండవలయును. రాత్రియంతయు నృత్యగీతాదికముతో గడుపవలెను.

అందునను రాత్రి మూడవ జాము గడచిన వెంటనే ఆరంభించి-యథాశక్తిగా ముగ్గురనుగాని ఒకరినికాని విప్ర దంపతులను స్వయముగా వారి కడకు పోయి పిలుచుకొనివచ్చి వారిని-వారికి దాన మీయ సిద్ధపరచిన శయనాది సామగ్రిని క్రమముగా వస్త్రమాల్యాదికముతో అర్చించవలెను. పూజయందు 'జలశాయినే నమః' అను మంత్రమును వినియోగించ వలెను.

ఇట్లు గీత వాద్యాదులతో రాత్రి ముగియు వరకు గడపి జాగరణము ముగించి ఉదయము స్నానమాడి దంప తుల నర్చించి వారికి శయనాదిక మీయవలెను. యథాశక్తిగా ధనశాఠ్యము లేక బ్రాహ్మణ సంతర్పణము చేసి తాను భుజించి పురాణ శ్రవణముతో ఆనాడు గడుపవలెను.

ఇట్లు ప్రతి మాసమునను (సంవత్సరము ముగియు వరకు) జరిపి వ్రతాంతమున గుడధేనువు-దిండ్లు-పరుపులు మొదలగు పరికరములు-దుప్పటి మొదలగునవి. వీనితో కూడ మంచము(ల)ను చేటతో కూడ లక్ష్మీదేవిని విప్రున(ల)కు దాన మీయవలెను. దీనిచే సర్వ శుభములును కలుగును.

పూజకై 1. కలువ(తెలుపు-ఎరుపు-నీలము-ఏదైనను) 2. కరవీరము (ఎర్రగన్నేరు-దానివంటి ఆకులుగల చెట్టు నకే పూచెడి తెల్లని పూవులును కరవీరమే.) 3. తెల్లుపూవు-4. వాడ(ని)గన్నేరు- 5. కుంకుమపూవు- 6. మొగలి 8. ప్రేంకణము-8. మల్లె-9. సంపెంగ-10. మంకెన-11. కడిమి-12. మాలతీ పుష్పములు వరుసగా పన్రెండు మాసములందును ప్రశస్తములు లేదా ఇవి ఎప్పుడును పూజకై మంచివి.

## గుడధేన్వాదిదానాని

మనుః : గుడధేనువిధానం చ సమాచక్ష్వ జగత్పతే । కింరూపం కేనమన్త్రేణ దాతవ్యం తదిహోచ్యతామ్.
శ్రీమత్స్యః : గుడధేనువిధానస్య యద్రూప మిహ యత్ఫలమ్ । తదిదానీం ప్రవక్ష్యామి సర్వపాపవినాశనమ్.
కృష్ణాజినం చతుర్హస్తం ప్రాగ్గ్రీవం విన్యసే ద్భువి । గోమయేనానులిప్తాయాం దర్భానాస్తీర్య సర్వతః.
లఘ్వైణకాజినం తద్వ ద్వత్సస్య పరికల్పయేత్ । ప్రాఙ్ముఖీం కల్పయేద్ధేను ముదగాస్యస్వవత్సకామ్. 34
ఉత్తమా గుడధేనుః స్యాత్ సదా భారచతుష్టయమ్ । వత్సం భారేణ కుర్వీత భారాభ్యాం మధ్యమా స్మృతా.
అర్ధభారేణ వత్సస్స్యాత్ కనిష్ఠా భారకేణతు । చతుర్థాంశేన వత్సస్స్యాద్ గృహీ విత్తానుసారతః. 36
ధేనువత్సౌ ఘృతేనైవం సితమాల్యామ్బరావృతౌ । శుక్తికర్ణౌ విక్షుపాదౌ సితముక్తాఫలేక్షణౌ. 37

సితసూత్రసిరాజాతౌ సితకమ్బళకమ్బళౌ । తామ్రమస్తకపృష్ఠౌ తౌ సితచామరరోమకౌ. 38
విద్రుమభ్రూయుగోపేతౌ నవనీతస్తనాన్వితౌ । క్షౌమపుచ్ఛౌ కాంస్యదోహౌ విన్ద్రనీలకతారకౌ. 39
సువర్ణశృఙ్గాభరణౌ రాజతాఖురసంయుతౌ । నానాఫలసమాయుక్తౌ ఘ్రాణగన్ధకరణ్డకౌ. 40
ఇత్యేవం రచయిత్వా తౌ ధూపదీపై రథార్చయేత్ । యాలక్ష్మీ స్సర్వభూతానాం యాచ దేవే ష్వవస్థితా. 41
ధేనురూపేణ సా దేవీ మమ* పాపం వ్యపోహతు । దేహస్థా యాచ రుద్రాణీ శఙ్కరస్య చ యా ప్రియా. 42
ధేనురూపేణ సాదేవీ మమపాపం వ్యపోహతు । విష్ణోర్వక్షసి యా లక్ష్మీ స్స్వాహా యాచ విభావసోః. 43
చన్ద్రార్కఋక్షతారాణా మనురూపాచ యారమా । చతుర్ముఖస్య యాలక్ష్మీ ర్యాలక్ష్మీ ర్ధనదస్యచ. 44
యాలక్ష్మీ ర్లోకపాలానాం సాధేను ర్వరదాఽస్తు మే । స్వధా యా పితృముఖ్యానాం స్వాహా యజ్ఞభుజాం తథా. 45
ధేనురూపేణ సాదేవీ మమ పాపం వ్యపోహతు । సర్వపాపహరే దేవి తత్త్వం శాన్తిం ప్రయచ్ఛమే. 46
ఏవమామన్త్ర్య తాం ధేనుం బ్రాహ్మణాయ నివేదయేత్।

## గుడధేన్వాది దానములు.

విశోక ద్వాదశీ కల్పమున ప్రాసంగికముగా పేర్కొనిన గుడధేనుదానము అనునది ఏమి? దాని స్వరూపమును విధానమును దానమున వినియోగించు మంత్రమును తెలుపుమని మను వడుగగా మత్స్య నారాయణు డిట్లు చెప్పెను: సర్వ పాప వినాశనమగు గుడధేను స్వరూపమును దాన విధానఫల వినియోజ్య మంత్రములను తెలిపెదను; వినుము.

నాలుగు మూరల పొడవుగల కృష్ణాజినము(నల్లని మచ్చలుగల ఇఱ్ఱిచర్మము)ను గోమయముతో అలికి నాలుగు వైపుల దర్భలను పరచిన ప్రదేశమున తూర్పు మొగము అగునట్లు పరచవలెను. అట్టి ప్రదేశముననే ఉత్తరమునకు మొగ మగునట్లు చిన్న కృష్ణాజినము కూడ దానికి దగ్గరగా పరచవలెను. (మొదటిది ఆవుకొరకును-రెండవది దూడ కొరకును.)

గుడముతో ఆవును దూడను చేసి తూర్పు మొగముగా ఆవును ఉత్తరపు మొగముగా దూడను నిలువవలెను. యథాశక్తిగా ఆవును నాలుగు 'బారువ'లు దూడను ఒక బారువ-ఇదే వంతున ఆవును రెండు బారువలు-దూడను అర బారువ-ఆవును ఒక బారువ దూడను పావు బారువ తూకముగల బెల్లముతో చేయవలెను. వీనికి ముత్తెపు చిప్పలతో చెవులు-చెరకుగడతో కాళ్లు-ముత్తెములతో కండ్లు తెల్లని దారములతో నాడులు-తెల్ల కంబళితో గంగడోలు-వలుచని రాగి రేకుతో మొగము-వీపు-తెల్లని చామరముతో తోక కుచ్చు-వగడములతో కనుబొమలు-వెన్నతో చన్నులు - పట్టుదారముతో తోకకాడ - కంచుపాత్రతో పొదుగు - ఇంద్రనీలముతో కన్నుగుడ్లు - బంగారు కొమ్ములు వెండి గిట్టలు నంపెగ పూలతో ముక్కులు అమర్చవలెను. వానిముందు నానా ఫలములుంచవలెను. ఇట్లు సిద్ధపరచిన ఆ ఆవును దూడను గంధ ధూప దీపాదికముతో నైవేద్యముతో అర్చించవలెను.

పిమ్మట ఈ అర్థమునిచ్చు మంత్రముతో వానిని ప్రార్థించవలెను. (మంత్రార్థము:) సర్వ భూతములందును సర్వదేవతలయందును సర్వదేహములందును ఉన్నదియై శంకరుని ప్రియురాలగు రుద్రాణిగా విష్ణుని వక్షస్సునందు లక్ష్మిగా అగ్నియందు స్వాహాగా చంద్ర రవి నక్షత్ర తారలయందు కాంతిరూపయగు లక్ష్మిగా చతుర్ముఖునందు వాణిగా కుబేరునందు ధనముగా లోకపాలురయందు ఆయా రూపములతో లక్ష్మిగా పితృదేవతలయందు స్వధారూపగా నున్న లక్ష్మియే ధేను రూపముననుండి నాపాపమును పోగొట్టుగాక! సర్వపాపహరయగు దేవీ: లక్ష్మీ: ఇట్టి నీవు నాకు శాంతిని ఇమ్ము.

ఇట్లు ఆగుడ ధేనువు నామంత్రించి దానిని బ్రాహ్మణునకీయవలయును.

---

* శాన్తిం ప్రయచ్ఛతు

పెధానమేవం ధేనూనాం సర్వాసా మిహ వక్ష్యతే. 47
యాస్తు పాపవినాశిన్యః వక్ష్యన్తే ౦దశ ధేనవః । తాసాం స్వరూపం వక్ష్యామి నామానిచ నరాధిప. 48
ప్రథమా గుడధేను స్స్యాద్ఘృతధేను స్తథాఽపరా । తిలధేను స్తృతీయాతు చతుర్థీ జలసంజ్ఞితా. 49
పఞ్చమీ రసధేనుస్స్యాత్ షష్ఠీ ధాన్యాహ్వయా తథా । సప్తమీ శర్కరాధేను రష్టమీ లవణస్యచ. 50
రత్నధేనుశ్చ నవమీ దశమీ స్యా త్స్వరూపతః । కుమ్భాః స్యుర్ద్రవధేనూనా మితరాసాంతు రాశయః. 51
సువర్ణధేనుం చాప్యత్ర కేచిదిచ్ఛన్తి మానవాః । నవనీతేన తైలేన తథాఽన్యేపి మహర్షయః. 52
ఏతదేవ విధానంస్యా త్తఏవోపస్కరా స్స్మృతాః । మన్త్రావాహనసంయుక్తాస్సదా పర్వణిపర్వణి. 53
యథాశ్రద్ధం ప్రదాతవ్యా భుక్తిముక్తిఫలప్రదాః । గుడధేనుప్రసఙ్గేన సర్వా స్తావన్మయోదితాః. 54
అనేకయజ్ఞఫలదా స్సర్వపాపహరా శ్శుభాః । వ్రతానా ముత్తమం యస్మా ద్విశోకద్వాదశీవ్రతమ్ 55
తదఙ్గత్వేన చైవాత్ర గుడధేనుః ప్రశస్యతే । అయనే విషువే పుణ్యే వ్యతీపాతేఽథవా పునః. 56
గుడధేన్వాదయో దేయా స్సోపరాగాదిపర్వసు । విశోకద్వాదశీ పుణ్యా సర్వపాపహరా శుభా. 57
యాముపోష్య నరో యాతి త ద్విష్ణోః పరమం పదమ్ । ఇహలోకేచ సౌభాగ్య మాయు రారోగ్యమేవచ. 58
వైష్ణవం పద మాప్నోతి మరణే స్మరణా ద్ధరేః । నవార్బుదసహస్రాణి దశచాష్టౌచ ధర్మవిత్. 59
నచోగ్రదుఃఖదౌర్గత్యం తస్య సఞ్జాయతే నృప । నారీవా కురుతే యాతు విశోకద్వాదశీవ్రతమ్. 60
నృత్తగీతపరా నిత్యం సాఽపి తత్ఫలమాప్నుయాత్ । తస్మా దగ్రే హరే ర్నిత్య మనన్తం గీతవాదనమ్. 61
కర్తవ్యం భూతికామేన భక్త్యాతు పరయా ముదా ।
ఇతి పఠతి యఇత్థం సర్వదా యస్తు సమ్య ఙ్మధుముర నరకారే రర్చనం సాధు పశ్యేత్. 62
మతిమపిచ నరాణాం యో దదాతీన్ద్రలోకే । వసతి స విబుధౌఘైః పూజ్యతే కల్పమేకమ్. 63

ఇతి శ్రీమత్స్యమహాపురాణే మత్స్యమనుసంవాదే విశోకద్వాదశీవ్రత గుడధేన్వాదిదానకథనం నామైకాశీతితమోఽధ్యాయః.

పాపహరములగు ధేనువులు ఇట్టివి గుడ-ఘృత-తిల-జల-రస-ధాన్య-శర్కరా-లవణ-రత్న-స్వరూప (గోరూప) ధేనువు లనునవి పది కలవు. సువర్ణ-నవనీత తైల ధేనువులను కూడ కొందరు మహర్షులు చెప్పినారు. వీటిలో ద్రవ ధేనువులను అవి నింపిన మట్టి కడవలతో (చిన్న పాత్రలతోకాని) అమర్చవలెను. గట్టి ద్రవ్యములైనచో రాసులుగా అమర్చవలయును. అన్నిటి విషయమునను ఇదే విధానము; ఇవే మంత్రములు. ఆవాహనాది పూజలతో ఆయా పర్వము లందివి ఈయవలయును. గుడ ధేను ప్రసంగమున ఇవి చెప్పబడినది. ఇవి అన్నియు సర్వపాపహరములు; అనేక యజ్ఞ ఫలప్రదములు.

విశోక ద్వాదశీ వ్రతము వ్రతములలో నెల్ల ఉత్తమమయినది. దానికి అంగభూతము ఈ గుడధేను దానము.

ఈ ధేను దానములు ప్రత్యేకముగా ఈయవలెనని (ఉత్తర-దక్షిణ) అయనములు-విషువ (రాత్రింబవళ్ళు సమముగా ఉండు) కాలము వ్యతీపాత యోగమున్న దినము-ఇట్టివి తగిన కాలములు.

ఈ విశోక ద్వాదశి పుణ్యప్రదము-సర్వపాపహరము-శుభకరము; ఈ దినమున ఉపవాసము ముక్తిప్రదము. దీనిచే ఇహమున ఆయురారోగ్య సౌభాగ్యములు-మరణ కాలమున (ఇది చేసినవారికి) హరిస్మరణ మాత్రమున విష్ణులోక ప్రాప్తి కలుగును. ఇరువది ఏడువేల అర్బుదముల సంవత్సరములపాటు దారిద్ర్యమును తీవ్ర దుఃఖములును లేక సుఖింతురు. నృత్తగీతాది పూర్వకముగా నియమముతో ఈ వ్రతము చేసిన స్త్రీకిని ఈ ఫలము కలుగును. కనుక హరి

ఎదుట నృత్తగీతములు భక్తితో చేయుట కర్తవ్యము. దానిచే సకల సంపదలును ముక్తియు లభించును.

ఈ వ్రతమును వినినను చదివినను ఇతరులకు తెలిపినను చూచినను కల్పకాలము ఇంద్రలోకమున దేవ పూజితుడై సుఖించును.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున విశోక ద్వాదశీవ్రత-గుడ ధేన్వాది దాన కథనమను
ఎనుబది యొకటవ అధ్యాయము.

## ద్వ్యశీతితమోఽధ్యాయః.
## ధాన్యాదిపర్వతదానాని.

నారదః : భగవ౯ ఛ్రోతు మిచ్ఛామి దానమాహాత్మ్యముత్తమమ్ ।
యదక్షయం పరే లోకే దేవర్షిగణసేవితమ్. 1
ఈశ్వరః : మేరోః ప్రదానం వక్ష్యామి దశధా మునిసత్తమ ।
యత్ప్రదానా న్నరో లోకా నాప్నోతి సురపూజితాన్. 2
పురాణేషుచ వేదేషు యజ్ఞే ష్వాయతనేషు చ । న తత్ఫల మధీతేషు కృతేష్విహ యదశ్నుతే. 3
తస్మా ద్విధానం వక్ష్యామి పర్వతానా మనుక్రమాత్ । ప్రథమోధాన్యశైల స్స్యా ద్ద్వితీయో లవణాచలః. 4
గుడాచల స్తృతీయస్తు చతుర్థో హేమపర్వతః । పఞ్చమ స్తిలశైల స్స్యా త్షష్ఠః కార్పాసపర్వతః. 5
సప్తమో ఘృతశైలశ్చ రత్నశైల స్తథాఽష్టమః । రాజతో నవమ స్తద్వ ద్దశమ శ్శర్కరాచలః. 6
వక్ష్యే విధాన మేతేషాం యథావ దనుపూర్వశః । అయనే విషువే పుణ్యే వ్యతీపాతే దినక్షయే. 7
శుక్లపక్షతృతీయాయా ముపరాగే శశిక్షయే । వివాహోత్సవయజ్ఞేషు ద్వాదశ్యా మథవా పునః. 8
శుక్లాయాం పఞ్చదశ్యాంవా పుణ్యర్క్షేవా విధానతః । తీర్థేవాఽఽయతనేవాపి గోష్ఠేవా ప్రాఙ్గణే వనే. 9
ధాన్యశైలాదయో దేయా యథాశాస్త్రం విజానతా । మణ్డపం కారయే ద్భక్త్యా చతురశ్ర ముదఙ్ముఖమ్. 10
ప్రాగుదక్ప్రవణే దేశే ప్రాఙ్ముఖం వా విధానతః । గోమయే నానులిప్తాయాం భూమౌ వాస్తీర్య వై కుశా౯.
తన్మధ్యే పర్వతం కుర్యా ద్విష్కమ్భపర్వతాన్వితమ్ ।

## ఎనుబది రెండవ అధ్యాయము.
## ధాన్యాది పర్వత దానములు.

నారదుడు ఈశ్వరుని ఇట్లడిగెను: పరలోకమున అక్షయ ఫలదమైనదియు దేవతలును దేవర్షులును ప్రశంసించునదియు మహా మహిమము కలదియు నగు ఉత్తమ దానమును తెలుప వేడుచున్నాను. అనగా ఈశ్వరుడిట్లు చెప్పెను: పది విధములగు మేరు (పర్వత) దానము అనునది కలదు. దానిని చేసిన నరుడు సుర పూజితములగు ఉత్తమ లోకములందు సుఖించును. ఇవి చేయుటచే కలుగునంత ఫలము పురాణములను వేదములను అధ్యయనము చేయుటచే కాని వాని యందు చెప్పబడిన ఆయా యాగాది పుణ్య కార్యములను చేయుటచే కాని లభింపదు. అవి వరుసగా ధాన్య లవణ గుడ సువర్ణ తిల కార్పాస (దూది) ఘృత రత్న రజత- శర్కరా మేరు (పర్వత) దానములు. క్రమముగా వీని విధానము తెలిపెదను. (ఉత్తర-దక్షిణ) అయనములు-విషువము (దివారాత్ర పరిమాణము సమమగు దినములు రెండు) వ్యతీపాత యోగము అవమ-త్రిద్యుస్పృక్ దినములు-(ప్రతిమాస) శుక్లపక్ష తృతీయ-(చంద్ర-సూర్య) గ్రహణములు-అమావాస్య-వివాహములు-ఉత్సవములు-యజ్ఞములు-ద్వాదశి-పూర్ణిమ-పుణ్య (శుభ) నక్షత్రమున్న దినము-ఈ కాలములందును పుణ్య తీర్థక్షేత్రములు-గోవులు నిలుచు ప్రదేశము-ఇంటి ముంగిలి-వనము-ఇట్టి దేశములందును వీటిని యథా విధానముగ నీయవలెను.

తూర్పునకో ఉత్తరమునకో వాలుగా ఉండు ప్రదేశమున భక్తితో ఉత్తరమో తూర్పో మొగముండునట్లు చతురస్ర మండపము (పందిరి) ఏర్పరచవలయును. దానియందు గోమయముతో అలికిన ప్రదేశమున దర్భలను పరచవలయును. ఆచోటి నడుమ శాఖా పర్వతములతో కూడిన ప్రధాన పర్వతమును (మేరువును) నిర్మించవలెను.

ధాన్యద్రోణసహస్రేణ భవే ద్గిరి రిహోత్తమః. 12
పఞ్చశతై ర్మధ్యమ స్స్యా త్కనిష్ఠ స్స్యాత్త్రిభి శ్శతైః ।
మేరు ర్మహావ్రీహిమయశ్చ మధ్యే సువర్ణశృఙ్గ త్రయసంయుత స్స్యాత్. 13
పూర్వేణ ముక్తాఫలవజ్రయుక్తో యామ్యేన గోమేధికపుష్పరాగైః ।
పశ్చాచ్చ గారుత్మతనీలరత్నై స్సౌమ్యేన వైడూర్యసరోజరాగైః. 14
శ్రీఖణ్డఖణ్డైరభితః ప్రవాళై ర్లతాన్విత శ్శుక్తిశిలాతల స్స్యాత్ ।
బ్రహ్మాచ విష్ణు ర్భగవా న్పురారి ర్దివాకరోఽప్యత్ర హిరణ్మయ స్స్యాత్. 15
మూర్ధన్యవస్థాన మమత్సరేణ *కార్యం త్వనేకైస్సురసిద్ధసఙ్ఘైః ।
చత్వారి శృఙ్గాణిచ రాజతాని నితమ్బభాగేష్వపి రాజత స్స్యాత్. 16
తథేక్షుదణ్డావృతకన్దరస్తు ఘృతోదక ప్రస్రవణశ్చ దిక్షు ।
శుక్లామ్బరా ణ్యమ్బుధరావళి స్స్యా త్పూర్వేణ పీతానిచ దక్షిణేన. 17
వాసాంసి పశ్చాదథ కర్బురాణి రక్తానిచైవోత్తరతోయదాళిః ।
రౌప్యా న్మహేన్ద్ర ప్రముఖా నథాష్టౌ సంస్థాప్య లోకాధిపతీన్క్రమేణ. 18
నానాఫలాళిశ్చ సమన్తతస్స్యా న్మనోహరం మాల్యవిలేపనంచ ।
వితాన మస్యోపరి పఞ్చవర్ణమమ్లానపుష్పాభరణాన్వితం చ. 19
ఇత్థం నివేశ్యామర శైల మగ్ర్యం మేరో స్సువిష్కమ్భగిరీ న్క్రమేణ ।
తురీయభాగేన చతుర్దిశంవై సంస్థాపయే త్పుష్పవిలేపనాఢ్యమ్. 20
పూర్వేణ మన్దర మనేకఫలైశ్చ యుక్తం యుక్తం గణైః కనకభద్రకదమ్బచిహ్నమ్ ।
కామేన కాఞ్చనమయేన విరాజమాన మాకారయే త్కుసుమవస్త్రవిలేపనాఢ్యమ్. 21
క్షీరారుణోదసరసాచ వనేన చైవం రౌప్యేణ శక్తిఘటితేన విరాజమానమ్ ।
యామ్యేచ గన్ధమదనోఽత్ర నివేశనీయో గోధూమసఞ్చయమయః కలధౌతజమ్బ్వా. 22
హైమేన యక్షపతినా ఘృతమానసేన వస్త్రైశ్చ రాజతవనేన సుసంయుత స్స్యాత్.
పశ్చా త్తిలాచల మనేకసుగన్ధపుష్పై స్సౌవర్ణపిప్పలహిరణ్మయహంసయుక్తమ్. 23
ఆకారయే ద్రజతపుష్పవనేన తద్వ ద్వస్త్రాన్వితం దధిసితోదసర స్తథాగ్రే ।
సంస్థాప్య తం విపులశైల మథోత్తరేణ శైలం సుపార్శ్వ మపి ●కాంస్యమయం సువప్రమ్. 24
పుష్పైశ్చ హేమవటపాదప శేఖరాన్త మాకారయే త్కనకధేనువిరాజమానమ్ ।
మాక్షీకభద్ర సరసాచ వనేన తద్వ ద్రౌప్యేణ భాస్వరవతాచ వనం విధాయ. 25
హోమ శ్చతుర్భి రథ వేదపురాణవిద్భి ర్దాన్తై రనిన్ద్యచరితాకృతిభి ర్ద్విజేన్ద్రైః ।
పూర్వేణ హస్తమిత మత్ర విధాయ కుణ్డం కార్య స్తిలై ర్యవఘృతేన సమిత్కుశైశ్చ. 26

* కార్యంత్వనేకైశ్చపునర్ద్విజాద్యైః   ● మాష

(పర్వత నిర్మాణము:) 1. ధాన్య పర్వతము: దీనికై కావలసిన ధాన్య పరిమాణము-వేయి ★తూములు-గాని ఐదు వందల తూములు కాని మూడు వందల తూములు కాని ఉండవలెను. నట్టనడుమ మూడు బంగారు శిఖరములు తూర్పున ముత్తెముల వజ్రముల శిఖరము-దక్షిణమున గోమేదక పుష్యరాగ శిఖరము పడమర గరుడ పచ్చల ఇంద్ర నీలముల శిఖరము ఉత్తరమున వైడూర్య పద్మరాగముల శిఖరము ఉండవలెను. మంచి గంధపు కర్రలతోను పగడములతోను చేసిన తీగలు ముత్తెపు చిప్పలతో అమర్చిన రాతినేలలు ఉండవలెను. బంగారుతో చేసిన బ్రహ్మ విష్ణు రుద్ర శివుల ప్రతిమలును సురసిద్ధ ప్రముఖ దేవతల ప్రతిమలును ఈ పర్వతపు పైభాగమున అమర్చవలెను. నాలుగు శిఖరములను నెత్తములును వెండితో చేయవలెను. నానా దిక్కులందును చెరకుగడలతో మూయబడిన గుహలును నేతితో నీటితో అమర్చిన సెలయేరులును కొండ ఊటలును ఉండవలెను. తూర్పున తెల్లని వస్త్రములు దక్షిణమున పచ్చని వస్త్రములు పడమర కలగలుపు వన్నెల వస్త్రములు ఉత్తరమున ఎర్రని వస్త్రములు మేఘములుగా అమర్చవలెను. వెండితో చేసిన దిక్పాలకుల ప్రతిమలను ఎనిమిది దిక్కులందును నిలుపవలెను. కొండపై అంతటను వివిధ ఫలపుష్ప మాల్యములు అమర్చవలెను. దీనికి పైభాగమున ఐదు వన్నెల వస్త్రములతో వాడని పూవులతో ఆభరణములతో అమర్చిన చాందినీని అమర్చవలెను. (నిర్ణయించుకొనిన ధాన్య పరిమాణముతో నాలుగింట మూడు వంతుల ధాన్యముతో మేరు పర్వతము అమర్చగా మిగిలిన) నాలుగవవంతు ధాన్యముతో గంధమాల్యా యుక్తముగా ఆయా సెల (శాఖా) పర్వతములను అమర్చవలెను. ఎట్లనగా-తూర్పున బంగారుతో చేసిన రుద్రుని ప్రతిమయు ప్రమథుల ప్రతిమలును అనేక ఫల పుష్ప గంధ విలేపనములును బంగారు మన్మథ ప్రతిమయును వీటికందరకును వస్త్రమాల్యా గంధ విలేపనములును మందర పర్వతముపై అమర్చవలెను.

దక్షిణమున గోధుమల రాశితో గంధమాదన పర్వతమును దానిపై బంగారుతో నేరేడు చెట్టు-బంగారుతో కుబేర ప్రతిమ నేతితో మానస సరస్సు చక్కని వస్త్రములు వెండితో చేసిన చెట్ల అడవులు ఉండవలెను. పడమట తిలలతో చేసిన విపుల పర్వతము దానిపై అనేక సుగంధ పుష్పములు బంగారుతో అశ్వత్థ వృక్షము బంగారు హంసలు వెండితో తెల్లని పూలవనము తెల్లని వస్త్రములతో దధి (పెరుగు) సరస్సు అమర్చవలయును. ఉత్తరమున కంచుతో సుపార్శ్వ పర్వతమును దానిపై శిఖరములు బంగారుతో పూల మొక్కలు మర్రిచెట్టు బంగారు గోవు వెండిచెట్ల అడవి తేనెతో భద్రమను సరస్సు ఏర్పరచవలయును.

ఈ మండపమునకు తూర్పున హస్త ఘన పరిమాణము కల కుండమునందు వేద పురాణ వేత్తలును పవిత్ర చరిత్రులు సమర్థులునగు నలుగురు బ్రాహ్మణులచే తిలలతో యవలతో ఘృతముతో సమిధలతో కుశలతో హోమము చేయించవలెను.

రాత్రౌచ జాగర మనుద్ధతతూర్యనాదై రావాహనంచ కథయామి శిలోచ్చయానామ్ ।
త్వం సర్వదేవగణధామనిధే విరుద్ధ మస్మద్గృహే ష్వమర పర్వత నాశయాశు. 27
క్షేమం విధత్స్వ కురు శాన్తి మనుత్తమాం న స్సమ్పూజితః పరమభక్తిమతా మయాహి ।
త్వమేవ భగవా నీశో బ్రహ్మా విష్ణు ర్దివాకరః. 28
మూర్తామూర్తం పరం బీజ మతః పాహి సనాతన ।
యస్మాత్త్వం లోకపాలానాం విశ్వమూర్తేశ్చ మన్దిరమ్. 29
రుద్రాదిత్యవసూనాంచ తస్మా చ్ఛాన్తిం ప్రయచ్ఛమే । యస్మా దశూన్య మమరై ర్నారీభిశ్చ శిర స్తవ. 30

★ తూము-32 మానికలు-64 కొలతసేరులు. అని గుంటూరు మండలమునందును రాయలసీమలోను వాడుక; తూము = కడవ (రాయలసీమలో)

తూర్పునకో ఉత్తరమునకో వాలుగా ఉండు ప్రదేశమున శక్తితో ఉత్తరమో తూర్పో మొగముండునట్లు చతురస్ర మండపము (పందిరి) ఏర్పరచవలయును. దానియందు గోమయముతో అలికిన ప్రదేశమున దర్భలను పరచవలయును. ఆచోటి నడుమ శాఖా పర్వతములతో కూడిన ప్రధాన పర్వతమును (మేరువును) నిర్మించవలెను.

ధాన్యద్రోణసహస్రేణ భవే ద్గిరి రిహోత్తమః. 12
పఞ్చశతై ర్మధ్యమ స్స్యా త్కనిష్ఠ స్స్యాత్త్రిభి శ్శతైః ।
మేరు ర్మహావ్రీహిమయశ్చ మధ్యే సువర్ణశృఙ్గ త్రయసంయుత స్స్యాత్. 13
పూర్వేణ ముక్తాఫలవజ్రయుక్తో యామ్యేన గోమేధికపుష్యరాగైః ।
పశ్చాచ్చ గారుత్మతనీలరత్నైః సౌమ్యేన వైడూర్యసరోజరాగైః. 14
శ్రీఖణ్డఖణ్డైరభితః ప్రవాళై ర్లతాన్విత శ్శుక్తిశిలాతల స్స్యాత్ ।
బ్రహ్మాచ విష్ణు ర్భగవా న్పురారి ర్దివాకరోఽప్యత్ర హిరణ్మయ స్స్యాత్. 15
మూర్ధన్యవస్థాన మమత్సరేణ *కార్యం త్వనేకై స్సురసిద్ధసఙ్ఘైః ।
చత్వారి శృఙ్గాణిచ రాజతాని నితమ్బభాగేష్వపి రాజత స్స్యాత్. 16
తథేక్షుదణ్డావృతకన్దరస్తు ఘృతోదక ప్రస్రవణశ్చ దిక్షు ।
శుక్లామ్బరా ణ్యమ్బుధరావళి స్స్యా త్పూర్వేణ పీతానిచ దక్షిణేన. 17
వాసాంసి పశ్చాదథ కర్బురాణి రక్తానిచైవోత్తరతోయదాళిః ।
రౌప్యా న్మహేన్ద్రప్రముఖా స్తథాష్టౌ సంస్థాప్య లోకాధిపతీన్క్రమేణ. 18
నానాఫలాళిశ్చ సమన్తత స్స్యా న్మనోహరం మాల్యవిలేపనంచ ।
వితాన మస్యోపరి పఞ్చవర్ణమమ్లానపుష్పాభరణాన్వితం చ. 19
ఇత్థం నివేశ్యామర శైల మగ్ర్యం మేరో స్సువిష్కమ్భగిరీ న్క్రమేణ ।
తురీయభాగేన చతుర్దిశంవై సంస్థాపయే త్పుష్పవిలేపనాఢ్యమ్. 20
పూర్వేణ మన్దర మనేకఫలైశ్చ యుక్తం యుక్తం గణైః కనకరుద్రకదమ్బచిహ్నమ్ ।
కామేన కాఞ్చనమయేన విరాజమాన మాకారయే త్కుసుమవస్త్రవిలేపనాఢ్యమ్. 21
క్షీరారుణోదసరసాచ వనేన చైవం రౌప్యేన శుక్తిఘటితేన విరాజమానమ్ ।
యామ్యేచ గన్ధమదనోత్ర నివేశనీయో గోధూమసఞ్చయమయః కలధౌతజమ్బ్వా. 22
హైమేన యక్షపతినా ఘృతమానసేన వస్త్రైశ్చ రాజతవనేన సుసంయుత స్స్యాత్.
పశ్చాత్తిలాచల మనేకసుగన్ధపుష్పై స్సౌవర్ణపిప్పలహిరణ్మయహంసయుక్తమ్. 23
ఆకారయే ద్రజతపుష్పవనేన తద్వ ద్వస్త్రాన్వితం దధిసితోదసర స్తథాగ్రే ।
సంస్థాప్య తం విపులశైల మథోత్తరేణ శైలం సుపార్శ్వ మపి ●కాంస్యమయం సువస్త్రమ్. 24
పుష్పైశ్చ హేమవటపాదప శేఖరాన్త మాకారయే త్కనకధేనువిరాజమానమ్ ।
మాక్షీకభద్ర సరసాచ వనేన తద్వ ద్రౌప్యేన భాస్వరవతాచ వనం విధాయ. 25
హోమ శ్చతుర్భి రథ వేదపురాణవిద్భి ర్దాన్తై రనిన్ద్యచరితాకృతిభి ర్ద్విజేన్ద్రైః ।
పూర్వేణ హస్తమిత మత్ర విధాయ కుణ్డం కార్య స్తిలై ర్యవఘృ తేన సమిత్కుశైశ్చ. 26

---

* కార్యాంత్వనేకైశ్చపునర్ద్విజాద్యైః ● మాష

(పర్వత నిర్మాణము:) 1. ధాన్య పర్వతము: దీనికై కావలసిన ధాన్య పరిమాణము-వేయి ★తూములు-గాని ఐదు వందల తూములు కాని మూడు వందల తూములు కాని ఉండవలెను. నట్టనడుమ మూడు బంగారు శిఖరములు తూర్పున ముత్తెముల వజ్రముల శిఖరము-దక్షిణమున గోమేదక పుష్యరాగ శిఖరము పడమర గరుడ పచ్చల ఇంద్ర నీలముల శిఖరము ఉత్తరమున వైడూర్య పద్మరాగముల శిఖరము ఉండవలెను. మంచి గంధపు కర్రలతోను పగడముల తోను చేసిన తీగలు ముత్తెపు చిప్పలతో అమర్చిన రాతినేలలు ఉండవలెను. బంగారుతో చేసిన బ్రహ్మ విష్ణు రుద్ర శివుల ప్రతిమలును సురసిద్ధ ప్రముఖ దేవతల ప్రతిమలును ఈ పర్వతపు పైభాగమున అమర్చవలెను. నాలుగు శిఖర ములను నెత్తములను వెండితో చేయవలెను. నానా దిక్కులందును చెరకుగడలతో మూయబడిన గుహలును నేతితో నీటితో అమర్చిన సెలఏరులును కొండ ఊటలును ఉండవలెను. తూర్పున తెల్లని వస్త్రములు దక్షిణమున పచ్చని వస్త్రములు పడమర కలగలుపు వన్నెల వస్త్రములు ఉత్తరమున ఎర్రని వస్త్రములు మేఘములుగా అమర్చవలెను. వెండితో చేసిన దిక్పాలకుల ప్రతిమలను ఎనిమిది దిక్కులందును నిలువవలెను. కొండపై అంతటను వివిధ ఫలపుష్ప మాల్యములు అమర్చవలెను. దీనికి పైభాగమున ఐదు వన్నెల వస్త్రములతో వాడని పూవులతో ఆభరణములతో అమర్చిన చాందినీని అమర్చవలెను. (నిర్ణయించుకొనిన ధాన్య పరిమాణముతో నాలుగింట మూడు వంతుల ధాన్యముతో మేరు పర్వతము అమర్చగా మిగిలిన) నాలుగవవంతు ధాన్యముతో గంధమాల్య యుక్తముగా ఆయా సల (శాఖా) పర్వత ములను అమర్చవలెను. ఎట్లనగా-తూర్పున బంగారుతో చేసిన రుద్రుని ప్రతిమయు ప్రపథుల ప్రతిమలును అనేక ఫల పుష్ప గంధ విలేపనములును బంగారు మన్మథ ప్రతిమయును వీరికందరకును వస్త్రమాల్య గంధ విలేపనములును మందర పర్వతముపై అమర్చవలెను.

దక్షిణమున గోధుమల రాశితో గంధమాదన పర్వతమును దానిపై బంగారుతో నేరేడు చెట్టు-బంగారుతో కుబేర ప్రతిమ నేతితో మానస సరస్సు చక్కని వస్త్రములు వెండితో చేసిన చెట్ల అడవులు ఉండవలెను. పడమట తిలలతో చేసిన విపుల పర్వతము దానిపై అనేక సుగంధ పుష్పములు బంగారుతో అశ్వత్థ వృక్షము బంగారు హంసలు వెండితో తెల్లని పూలవనము తెల్లని వస్త్రములతో దధి (పెరుగు) సరస్సు అమర్చవలయును. ఉత్తరమున కంచుతో సుపార్శ్వ పర్వతమును దానిపై శిఖరములు బంగారుతో పూల మొక్కలు మర్రిచెట్టు బంగారు గోవు వెండిచెట్ల అడవి తేనెతో భద్రమను సరస్సు ఏర్పరచవలయును.

ఈ మండపమునకు తూర్పున హస్త ఘన పరిమాణము కల కుండమునందు వేద పురాణ వేత్తలును పవిత్ర చరిత్రులు సమర్థులునగు నలుగుర బ్రాహ్మణులచే తిలలతో యవలతో ఘృతముతో సమిధలతో కుశలతో హోమము చేయించవలెను.

రాత్రౌచ జాగర మనుద్ధతతూర్యనాదై రావాహనంచ కథయామి శిలోచ్చయానామ్ ।
త్వం సర్వదేవగణధామనిధే విరుద్ధ మస్మద్గృహే ష్వమర పర్వత నాశయాశు. 27
క్షేమం విధత్స్వ కురు శాన్తి మనుత్తమాం న స్సమ్పూజితః పరమభక్తిమతా మయాహి ।
త్వమేవ భగవా నీశో బ్రహ్మా విష్ణు ర్దివాకరః. 28
మూర్తామూర్తం పరం బీజ మతః పాహి సనాతన ।
యస్మాత్త్వం లోకపాలానాం విశ్వమూర్తేశ్చ మన్దిరమ్. 29
రుద్రాదిత్యవసూనాంచ తస్మా చ్ఛాన్తిం ప్రయచ్ఛమే । యస్మా దశూన్య మమరై ర్నారీభిశ్చ శిర స్తవ. 30

★ తూము-32 మానికలు-64 కొలత సేరులు. అని గుంటూరు మండలమునందును రాయలసీమలోను వాడుక;
[illegible]

తస్మా న్మా ముద్ధరాశేషదుఃఖసంసారసాగరాత్ । ఏవ మభ్యర్చ్య తం మేరుం మన్దరంచాపి పూజయేత్.31
యస్మాచ్చైత్రరథేన త్వం భద్రాశ్వేవరషేణచ । శోభసే మన్దర క్షిప్ర మత స్తుష్టికరో భవ. 32
యథా చూడామణి ర్జమ్బుద్వీపే త్వం గన్ధమాదన । గన్ధర్వవనశోభావా నతః కీర్తి ర్దృఢాఽస్తు మే. 33
యస్మా త్త్వం కేతుమాలేన వైభ్రాజేన వనేన చ । హిరణ్మయాశ్వత్థశిరా స్తస్మా త్పుష్టి ర్దృఢాఽస్తు మే.34
ఉత్తరైః కురుభి ర్యస్మా త్సావిత్రేణ వనేన చ । సుపార్శ్వ రాజసే నిత్య మత శ్శ్రీరక్షయాఽస్తుమే. 35

ఈ దానవ్రత దినమున రాత్రియంతయు జాగరణము చేయవలెను. తీవ్రతలేని నరస మధురములగు తూర్య నాదములతో పర్వతముల నావాహనము చేయవలెను. (ఆవాహన మంత్రార్థము): సర్వ దేవ గణముల తేజస్సులకు నివాస స్థానము (నిధి) వగు దేవపర్వతమా! మాగృహములందలి అశుభమును శీఘ్రముగా నశింపజేయుము. పరమ భక్తితో చేసిన నాపూజలనందుకొని అత్యుత్తమమగు శాంతిని క్షేమమును కలిగించుము. నీవే భగవానుడవగు ఈశుడవు బ్రహ్మయు విష్ణువును రవియును మూర్తికలదియు లేనిదియు అగు వ్యక్తా వ్యక్త తత్త్వమును జగద్బీజమును; కావున సనాతన పర్వతమా! మమ్ములను రక్షించుము. నీవు లోకపాలురకును విశ్వమూర్తియగు విష్ణునకును రుద్రాదిత్య వసువులకును నివాస స్థానమవు; కావున అట్టి నీవు నాకు శాంతిని కలిగించుము. నీశిరము దేవ-దేవనారీ జనముతో నిండియుండును. కావున ఇట్టి నీవు నన్ను అశేష దుఃఖ సంసార సాగరమునుండి ఉద్ధరించుము. ఇట్లు మేరు పర్వతమునర్చించి పిమ్మట మందర పర్వతమునర్చించవలెను. (మంత్రార్థము:) నీవు చైత్రరథ (వన) ముతోను భద్రాశ్వ వర్షముతోను శోభించుచుందువు. కావున ఇట్టి నీవు శీఘ్రమే నాకు తుష్టి కలిగించుము. (గంధమాదనార్చనము) : గంధమాదనమా! నీవు జంబూ ద్వీపమున చూడామణివి; గంధర్వ వనపు శోభతో కూడినదానవు. ఇట్టి నీచే నాకు దృఢమగు కీర్తి కలుగుగాక! (విపుల పర్వతార్చనము) : విపుల పర్వతమా! కేతుమాల వర్షముతోను వైభ్రాజవనముతోను శిరస్సునందు బంగారు రావిచెట్టుతోను ప్రకాశించుదానవు. ఇట్టి నీదయచే నాకు దృఢమగు పుష్టి కలుగుగాక! (సుపార్శ్వ పర్వతార్చనము) : సుపార్శ్వ పర్వతమా! ఉత్తర కురు వర్షముతోను సావిత్రమనెడు వనముతోను నిరంతరమును ప్రకాశింతువు. ఇట్టి నీదయచే నాకు అక్షయ శ్రీ కలుగుగాక!

ఏవ మామన్త్ర్య తా న్సర్వా న్ప్రభాతే విమలే పునః
స్నాత్వాతు గురవే దద్యా న్మధ్యమం పర్వతోత్తమమ్. 36
విష్కమ్భపర్వతా న్దద్యా దృత్విగ్భ్యః క్రమశో మునే। గావో దేయాశ్చతుర్వింశ దథవా దశ నారద.37
శక్తిత స్సప్త చాష్టౌవా పఞ్చ దద్యా దశక్తిమా న్ । ఏకాంచ గురవే దద్యా త్కపిలాంచ పయస్వినీమ్. 38
పర్వతానాంచ సర్వేషా మేష ఏవ విధి స్స్మృతః । తఏవ పూజనే మన్త్రా స్తఏవోపస్కరా స్స్మృతాః. 39
గ్రహాణాం లోకపాలానాం బ్రహ్మాదీనాంచ నాకినామ్ । స్వమన్త్రైరేవ సర్వేషు హోమ శ్శైలేషు పఠ్యతే.
ఉపవాసీ భవే న్నిత్య మశక్తౌ నక్త మిష్యతే । విధానం సర్వశైలానాం క్రమశ శ్శృణు నారద. 41
దానకాలేషు యే మన్త్రాః పర్వతేషుచ య త్ఫలమ్ ।
అన్నం బ్రహ్మ యతః ప్రోక్త మన్నం ప్రాణాః ప్రకీర్తితాః. 42
అన్నా ద్భవన్తి భూతాని జగ దన్నేన వర్తతే । అన్నమేవ యతో లక్ష్మీ రన్నమేవ జనార్దనః. 43
ధాన్యపర్వతరూపేణ పాహి తస్మా న్నగోత్తమ । అనేన విధినా యస్తు దద్యా ద్ధాన్యమయం గిరిమ్. 44
మన్వన్తరశతం సాగ్రం దేవలోకే మహీయతే । అప్సరోగణగన్ధర్వై రాకీర్ణైశ్చ విరాజితమ్. 45
విమానేన దివః పృష్ఠ మాయాతి ఋషిసేవితమ్ । కర్మక్షయే రాజరాజ్య మాప్నోతీహ న సంశయః. 46

ఇతి శ్రీమత్స్యమహాపురాణే ఈశ్వరనారదసంవాదే ధాన్యపర్వతదాన
మాహాత్మ్యకథనం నామ ద్వ్యశీతితమోఽధ్యాయః.

ఇట్లు వాటిని అన్నిటిని ఆవాహనము చేసి అర్చించి నిర్మలమగు ప్రభాతము కాగానే మధ్యమ (మేరు) పర్వతమును గురు (పురోహితు)నకును మిగిలిన నాలుగింటిని నలుగుర ఋత్విక్కులకును ఈయవలెను. శక్తిననుసరించి ఇరువది నాలుగు-పది-ఎనిమిది-ఏడు-ఐదు-ఐన పాడి కపిల గోవులను దానమీయవలయును. గురునకొకటి తప్పక ఈయవలయును.

అన్ని పర్వతముల విషయమునను ఇదే విధానము-మంత్రము-ఉపస్కరములును. సర్వదేవతలకును హోమము కూడ పైవలెనే.

వ్రత దినమున ఉపవాసముండ వలయును. శక్తిలేనిచో నక్తమున భుజించ వచ్చును.

అన్ని పర్వతదానములందును ప్రధానముగా చెప్పవలసిన మంత్రము. "అన్నమే బ్రహ్మమును ప్రాణములును భూతోత్పత్తి స్థితి హేతువులును లక్ష్మియు జనార్దనుడును కావున (అన్నమునకు మూలమగు) ధాన్యపర్వత రూపమున ఉన్న పర్వత రాజమా: మమ్ము కాపాడుము."

ఈ విధానముతో ధాన్య పర్వతమును (కాని ఇతర పర్వతములను కాని) దానమిచ్చినవారు సమగ్రమగు మన్వంతర శతము దేవలోకమున సుఖింతురు. సర్వత్ర వ్యాపించియున్న అప్సరో గంధర్వ గణములతో వ్యాప్తమైయున్న స్వర్గమును దివ్య విమానములో చేరుదురు. కర్మక్షయముకాగానే మరల కల్పాదియందు రాజరాజై జన్మింతురు.

ఇది శ్రీమత్స్య మహాపురాణమున ధాన్య పర్వత దాన మాహాత్మ్య కథనమను ఎనుబది రెండవ అధ్యాయము.

## త్ర్యశీతితమోఽధ్యాయః.

## లవణపర్వతదానమ్.

ఈశ్వరః : అథాత స్సంప్రవక్ష్యామి లవణాచల ముత్తమమ్ ।
యత్ప్రసాదాన్నరో లోకా నాప్నోతి శివసంయుతాన్. 1
ఉత్తమ షోడశద్రోణైః కర్తవ్యో లవణాచలః । మధ్యమస్స్యా త్తదర్ధేన చతుర్భి రధమ స్స్మృతః. 2
విత్తహీనో యథాశక్త్యా ద్రోణాదూర్ధ్వంతు కారయేత్ । చతుర్థాంశేన విష్కమ్భ పర్వతా న్కారయే త్పృథక్.
విధానం పూర్వవ త్కుర్యా ద్బ్రహ్మాదీనాంచ సర్వదా ।
*తద్వ ద్ధేమతరూ న్సర్వా న్లోకపాలా న్నివేశయేత్. 4
సరాంసి వనవృక్షాదీం స్తద్వ దత్రాపి కారయేత్ । కుర్యాజ్జాగరణం రాత్రౌ దాన మన్త్రా న్నిబోధమే. 5
సౌభాగ్యరససమ్భూతో యతోఽయం లవణో రసః । తదాత్మకత్వేన చ మాం పాహి త్వం పర్వతోత్తమ. 6
యస్మా దన్యరసా స్సర్వే నోత్కటా లవణం వినా । ప్రియంచ శివయో ర్నిత్యం తస్మాచ్ఛాన్తిప్రదో భవ. 7
విష్ణుదేహసముద్భూతం యస్మా దారోగ్యవర్ధనమ్ । తస్మా త్పర్వతరూపేణ పాహి సంసారసాగరాత్. 8
అనేన విధినా యస్తు దద్యా ల్లవణపర్వతమ్ । ఉమాలోకే వసే త్కల్పం తతో యాతి పరాం గతిమ్. 9

ఇతి శ్రీమత్స్యమహాపురాణే లవణపర్వతదానమాహాత్మ్య
కథనం నామ త్ర్యశీతితమోఽధ్యాయః.

## ఎనుబది మూడవ అధ్యాయము

## లవణ పర్వత దానము

ఈశ్వరుడు ఇట్లు చెప్పెను: ఇప్పుడు ఇక లవణ పర్వత దాన విషయము చెప్పెదను. అది ఉత్తమమయినది. దాని దానానుగ్రహమున మానవుడు శివునకాశ్రయమగు లోకములను పొందును. పదునారుగాని ఎనిమిదికాని నాలుగు కాని

---

* తద్వ ద్ధేమమయా న్సర్వాన్

ద్రోణముల పరిమితికల లవణము దీనికై కావలయును. అందులకును ధనశక్తిలేనివాడు ద్రోణ పరిమితికి తక్కువ కాకుండ ఎంతతోనైన చేయవచ్చును. మొత్తము పరిమాణములో నాలుగవవంతు లవణముతో విష్కంభ పర్వతముల నేర్పరచ వలెను. బ్రహ్మాది దేవతలను బంగారు వృక్షములను లోకపాలురను సరస్సులను వృక్షములను పైవలెనే చేయవలెను. రాత్రి జాగరణమును చేయవలెను- [దాన మంత్రము.] లవణ రసము (రుచి) సౌభాగ్య రసముతో నిండినది. దానితో ఏర్పడిన పర్వతోత్తమా! నన్ను రక్షించుము. ఈ లవణ రసము లేనిదే మిగిలిన రుచులు స్ఫుటములు కావు; గొప్పవి కావు. ఈ లవణ రసము పార్వతీ పరమేశ్వరులకు ప్రియమయినది కూడను. ఇట్టి నీవు ఓ రసమా! నాకు శాంతినిమ్ము. విష్ణు దేహమునుండి ఉద్భవించిన దానవు ఆరోగ్య వర్ధనమవు అగు లవణ పర్వతమా! సంసార సాగరమునుండి నన్ను కాపాడుము. ఈ విధానముతో లవణ పర్వత దానము చేయువాడు కల్పకాలముపాటు ఉమాలోకమునందు వసించి ఉత్తమ గతినొందును.

ఇది శ్రీ మత్స్య మహా పురాణమున లవణ పర్వత దానమాహాత్మ్య కథనమను ఎనుబది మూడవ ఆధ్యాయము.

## చతురశీతితమోఽధ్యాయః.

## గుడపర్వతదానమ్.

ఈశ్వరః : అతఃపరం ప్రవక్ష్యామి గుడపర్వత ముత్తమమ్ ।
యత్ప్రదానాన్నర స్స్వర్గ మాప్నోతి సురపూజితమ్. 1
ఉత్తమో దశభి ర్భారై ర్మధ్యమః పఞ్చభి ర్మతః । త్రిభి ర్భారైః కనిష్ఠ స్స్యా త్తదర్ధే నాల్పవిత్తవాన్. 2
తద్వ దావాహనం పూజా హేమవృక్షసురార్చనమ్ । విష్కమ్భపర్వతాం స్తద్వ త్సరాంసి వనదేవతాః. 3
హోమం జాగరణం చైవ లోకపాలాధివాసనమ్ । ధాన్యపర్వతవ త్కుర్యా దిమం మన్త్రముదీరయేత్. 4
యథా దేవేషు విశ్వాత్మా ప్రవరోఽయం జనార్దనః । సామవేదస్తు వేదానాం మహాదేవస్తు యోగినామ్. 5
ప్రణవ స్సర్వమన్త్రాణాం నారీణాం పార్వతీ యథా । తథా రసానాం ప్రవర స్సదైవేక్షురసో మతః. 6
మమ తస్మా త్పరాం లక్ష్మీం ప్రయచ్ఛ గుడపర్వత ।
యస్మా త్సౌభాగ్యదాయీ త్వం †భ్రాతా త్వం గుడపర్వత. 7
నివాసశ్చాపి ○ పార్వత్యా స్తస్మా త్త్వం పాహి సర్వదా ।
అనేన విధినా యస్తు దద్యా ద్గుడమయం గిరిమ్. 8
పూజ్యమాన స్స గన్ధర్వై ర్గౌరీలోకే మహీయతే । తతః కల్పశతాన్తేతు సప్తద్వీపాధిపో భవేత్. 9
ఆయురారోగ్యసమ్పన్న శ్శత్రుభి శ్చాపరాజితః. 9½

ఇతి శ్రీమత్స్యమహాపురాణే గుడపర్వతదానమాహాత్మ్య కథనం
నామ చతురశీతితమోఽధ్యాయః.

## ఎనుబది నాలుగవ అధ్యాయము

## గుడపర్వత దానము

**ఈశ్వరుడు నారదునకిట్లు చెప్పెను :** ఇపుడిక మీదట గుడ పర్వత దానవ్రతమును తెలిపెదను. అది ఉత్తమ మయినది. దానినాచరించినవారు సురల పూజలనందుకొనుచు స్వర్గమున సుఖింతురు. దీనికై పది *బారువలు కాని ఐదు బారువలు కాని మూడు బారువలు కాని తగినంత ధనములేని వారు ఒకటిన్నర బారువలుకాని బెల్లమును వినియోగించ

† భ్రాంతాత్మా ○ పార్వత్యా స్తస్మా చ్ఛాన్తిం ప్రయచ్ఛ మే

* 24 తులములు = 1 సేరు; 5 సేరులు; = 1 వీసె; 8 వీసెలు = 1 మణుగు; 20 మణుగులు = 1 బారువ.

వలెను. ధాన్య పర్వత దానమందువలెనే ఆవాహనమును పూజయు హేమ వృక్షముల అమరికయు విష్కంభ పర్వతము లను సరస్సులను వనములను దేవతలను విన్యాసము చేయవలెను. హోమమును జాగరణమును లోకపాలాది వాసనమును (అమరికను) కూడ ధాన్య పర్వత దానమందువలెనే. దాన మంత్రము:) దేవతలయందు విశ్వాత్ముడగు జనార్దనుడును వేదములయందు ప్రణవమును స్త్రీలయందు పార్వతియును శ్రేష్ఠమయినట్లు రసములలో ఇక్షు (చెరకు) రసము శ్రేష్ఠము. కావున గుడ పర్వతమా! నాకుమేలగు లక్ష్మిని ఇమ్ము. నీవు పార్వతికి నివాసమవు; కావున నీవు నన్నెల్లప్పుడును కాపాడుము. ఈ విధానమున గుడ పర్వత దానముచేసిన వారు గంధర్వులచే కీర్తిగానము చేయబడుచు గౌరీ లోకమున సుఖింతురు. ఇట్లు నూరు కల్పములయిన తరువాత సప్తద్వీపాధి పతియై జన్మించి ఆయురారోగ్య సంపన్నుడై శత్రువులకు అజేయుడై వర్ధిల్లును.

ఇది శ్రీ మత్స్య మహా పురాణమున గుడ పర్వత దానమాహాత్మ్య కథనమను ఎనుబది నాలుగవ అధ్యాయము.

## పంచాశీతితమోఽధ్యాయః.
## సువర్ణపర్వతదానమ్.

ఈశ్వరః : అథ పాపహరం వక్ష్యే సువర్ణాచల ముత్తమమ్ ।
యస్య ప్రసాదా ద్భవనం వైరిఞ్చం యాతి మానవః. 1
ఉత్తమః పలసాహస్రం మధ్యమః పఞ్చభి శ్శతైః । తదర్ధేనాధమ స్తద్వ దల్పవిత్తోఽపి శక్తితః. 2
దద్యా దేకపలా దూర్ధ్వం యథాశక్త్యా విమత్సరః । ధాన్యపర్వతవ త్సర్వం విదధ్యా న్మునిపుఙ్గవ. 3
విష్కమ్భశైలాం స్తద్వచ్చ ఋత్విగ్భ్యః ప్రతిపాదయేత్ ।
నమస్తే బ్రహ్మవిద్యాయ ●బ్రహ్మగర్భాయ తే నమః. 4
యస్మా దనన్తఫలద స్తస్మా త్పాహి శిలోచ్చయ ।
యస్మా దగ్నేరపత్యం త్వం యస్మా త్పల్వం జగత్పతేః. 5
హేమపర్వతరూపేణ తస్మా త్పాహి నగోత్తమ । అనేన విధినా యస్తు దద్యా త్కనకపర్వతమ్. 6
స యాతి పరమం బ్రహ్మలోక మానన్దకారకమ్ । తత్ర కల్పశతం తిష్ఠే త్తతో యాతి పరాం గతిమ్. 7

ఇతి శ్రీమత్స్యమహాపురాణే కనకపర్వతదానమాహాత్మ్య కథనం నామ పఞ్చాశీతితమోఽధ్యాయః.

## ఎనుబది ఐదవ అధ్యాయము
## సువర్ణ పర్వత దానము.

ఈశ్వరుడు నారదునకిట్లు చెప్పెను:- ఇప్పుడిక సువర్ణ పర్వత దానమును తెలుపుదును. అది పాపహరమును ఉత్తమమును. దానిని చేసిన పుణ్యప్రభావమున మానవులు బ్రహ్మలోకమున సుఖింతురు. దీని కై బంగారు వేయి పలములు కాని ఐదు వందల పలములు కాని దానిలో సగముకాని మరియు శక్తిలేనివాడు యథాశక్తిగ బంగారు వినియోగించవచ్చును. ఒక పలమునకు తక్కువ కాకుండవలెను. కాని ఈ విషయమున ఇతరులతో పోటీపడరాదు. ప్రతి అంశము నందును ధాన్య పర్వతమునందువలెనే చేయవలెను. అట్లే విష్కంభ శైలములను ఋత్విక్కులకు దానమీయవలెను. సువర్ణ పర్వతమా! బ్రహ్మ విద్యా స్వరూపమవు; బ్రహ్మదేవుని గర్భమవు; (బీజమవు;) అనంత ఫలమునిచ్చు దానవు; అగ్నికి సంతానమవు; పరమాత్ముని అల్పాంశ రూపమవు; కావున స్వర్ణ పర్వత రూపమున నీవు నన్ను రక్షింపుము. ఈ విధాన

● బ్రహ్మబీజాయ

మున సువర్ణ పర్వత దానము చేయువాడు పరమానంద ప్రదమగు బ్రహ్మలోకమునుచేరి అచట నూరుకల్పములపాటు సుఖించి చివరకు మోక్షమునందును.

ఇది శ్రీ మత్స్య మహా పురాణమున కనక పర్వత దాన మాహాత్మ్య కథనమను ఎనుబది ఐదవ అధ్యాయము.

## షడశీతితమోఽధ్యాయః.

## తిలపర్వతదానమ్.

ఈశ్వరః : అతఃపరం ప్రవక్ష్యామి తిలశైలం విధానతః । యత్ప్రదానపరో యాతి విష్ణులోక మనుత్తమమ్.1
ఉత్తమో దశభి ర్ద్రోణై ర్మధ్యమః పఞ్చభి ర్మతః । త్రిభిః కనిష్ఠో విప్రేన్ద్ర తిలశైలః ప్రకీర్తితః. 2
పూర్వవ చ్చాపరా న్సర్వా న్విష్కమ్భా నభితో గిరీన్ । దానమన్త్రం ప్రవక్ష్యామి యథావ న్మునిపుఙ్గవ.3
యస్మా న్మధువధే విష్ణో ర్దేహాదథ సముద్భవాః । తిలాః కుశాశ్చ మాషాశ్చ తస్మా చ్ఛ న్నో భవ త్విహ.4
హవ్యకవ్యేషు యస్మాచ్చ తిలా ఏవాభిరక్షణమ్ । భవా దుద్ధర శైలేన్ద్ర తిలాచల నమోఽస్తు తే. 5
ఇత్యామన్త్ర్యచ యో దద్యా త్తిలాచల మనుత్తమమ్ । స వైష్ణవపదం యాతి పునరావృత్తిదుర్లభమ్. 6
దీర్ఘ మాయు రవాప్నోతి పుత్త్రపౌత్త్రంచ మానవః । పితృభి ర్దేవగన్ధర్వైః పూజ్యమానో దివం వ్రజేత్. 7

ఇతి శ్రీమత్స్యమహాపురాణే తిలపర్వతదానమాహాత్మ్యకథనం
నామ షడశీతితమోఽధ్యాయః.

## ఎనుబది ఆరవ అధ్యాయము.

## తిలపర్వత దానము

ఈశ్వరుడు నారదునకు ఇట్లు చెప్పెను ఇక మీదట తిలపర్వత దాన విధానమును తెలిపెదను. దీనినాచరించిన వారు సర్వోత్తమమగు విష్ణులోకమును పొందుదురు. దీనికై పదికాని ఐదుకాని మూడుకాని ద్రోణముల తిలలు కావలెను. దీనియందు అన్ని యంశములును ధాన్య పర్వత దానమందువలెనే. (దానమంత్రము.) శ్రీ మహా విష్ణువు మధు దానవుని వధించునపుడు ఆతని దేహమునుండి తిలలును కుశలును మినుములును జనించినవి. అట్టి తిలలు నాకు శాంతికలిగించు గాక; హవ్యకవ్య (దేవతా-పితృ దేవతా) కర్మములందు తిలలే అభిరక్షించునవి: అట్టి తిలల పర్వతమా! నన్ను సంసారమునుండి తరింపజేయుము. ఇట్లు ఆమంత్రించి (ఆ వాహనముచేసి) తిల పర్వత దానము చేయువాడు పునరావృత్తి రహితమగు విష్ణులోకమునుచేరి సుఖించును. ఇహలోకమునందును దీర్ఘాయువును పుత్త్ర పౌత్త్రలను పొందును. పితరులును దేవతలును గంధర్వులును పూజించుచుండ స్వర్గమున సుఖించును.

ఇది శ్రీమత్స్య మహా పురాణమున తిల పర్వత దానమాహాత్మ్యకథనమను ఎనుబది ఆరవ అధ్యాయము.

## సప్తాశీతితమోఽధ్యాయః.

## కార్పాసపర్వతదానమ్.

ఈశ్వరః : కార్పాసపర్వత స్తద్వ ద్వింశ ద్భారై రిహోత్తమః ।
దశభి ర్మధ్యమః ప్రోక్తః కనిష్ఠః పఞ్చభి స్స్మృతః. 1
భారేణాల్పధనో దద్యా ద్విత్తశాఠ్య వివర్జితః । ధాన్యపర్వతవ త్సర్వ మాసాద్య మునిపుఙ్గవ. 2
ప్రభాతాయాంతు శర్వర్యాం దద్యాదిద ముదీరయేత్ । త్వమేవావరణం యస్మా ల్లోకానా మిహ సర్వదా. 3
కార్పాసాద్రే నమస్తుభ్యం మమాఘం త్వ మతో నుద ।
ఇతి కార్పాసశైలేన్ద్రం యో దద్యా చ్ఛర్వ సంనిధౌ. 4
రుద్రలోకే వసేత్కల్పం తతో రాజా భవే దిహ. 4½

ఇతి శ్రీమత్స్యమహాపురాణే కార్పాసాద్రిదానమాహాత్మ్య కథనం
నామ సప్తాశీతితమోఽధ్యాయః.

## ఎనుబది ఏడవ అధ్యాయము.
## కార్పాస (దూది) పర్వత దానము.

ఈశ్వరుడు నారదునితో ఇట్లు చెప్పెను : ఇదే విధముగ కార్పాసపర్వత దానమును గలదు. దానికై వదికాని ఐదుకాని శక్తిలేకున్నచో ఒకటికాని బారువల దూదితో శక్తియుండియు వంచన చేయక పర్వతము నిర్మించవలెను. అన్ని యంశము లందును ధాన్యపర్వతమువిషయమునవలెనే చేయవలయును. దాన దినపు ఉదయమున (దానకాలమున) ఈ మంత్రము చెప్పవలయును: కార్పాస పర్వతమా! లోకములకు ఎల్లప్పుడును ఆచ్ఛాదనము చేయు (కప్పెడి) సాధనము నీవేకదా! (వస్త్ర రూపమున దూది ప్రాణుల శరీరమును కప్పుచున్నది.) నీకు నమస్కారము; ఇట్టి నీవు నా పాపములను పోగొట్టుము. ఇట్లు చెప్పుచు శివ సన్నిధియందు కార్పాస పర్వత దానము చేయువాడు కల్పమంత కాలము రుద్రలోకమున వసించి మరల కల్పాది సృష్టియందు రాజైపుట్టును.

ఇది శ్రీమత్స్య మహా పురాణమున కార్పాస పర్వత దానమాహాత్మ్య కథనమను ఎనుబది ఏడవ అధ్యాయము.

## అష్టాశీతితమోఽధ్యాయః.
## ఘృతపర్వతదానమ్.

ఈశ్వరః : అథాత స్సంప్రవక్ష్యామి ఘృతాచల మనుత్తమమ్ ।
తేజోమయం ఘృతం దివ్యం మహాపాతకనాశనమ్. 1
వింశత్యా ఘృతకుమ్భానా ముత్తమ స్స్యాద్ఘృతాచలః ।
దశభి ర్మధ్యమః ప్రోక్త స్త్వధమః పఞ్చభి స్స్మృతః. 2
అల్పవిత్తోఽపి కుర్వీత ద్వాభ్యా మిహ విధానతః । విష్కమ్భపర్వతాం స్తద్వ చ్చతుర్భాగేన కల్పయేత్. 3
శాలితణ్డులపాత్రాణి కుమ్భోపరి నివేదయేత్ । కారయే త్సంహతా నుచ్చా న్యథాశోభం విధానతః. 4
వేష్టయే చ్ఛుక్లవాసోభి రిక్షుదండఫలాదిభిః । ధాన్యపర్వతవ త్సర్వం విధాన మిహ వర్త్యతే. 5
అధివాసనపూర్వంతు తద్వ ద్ధోమం సురార్చనమ్ । ప్రభాతాయాంతు శర్వర్యాం గురవే తన్నివేదయేత్. 6
విష్కమ్భపర్వతా స్తద్వ దృత్విగ్భ్య శ్శాన్తమానసః ।
సంయోగా ద్ఘృత ముత్పన్నం యస్మా దమృతతేజసః. 7
తస్మాద్ఘృతార్చి ర్విశ్వాత్మా ప్రీయతా మత్ర శఙ్కరః ।
యస్మా త్తేజోమయం బ్రహ్మ ఘృతే తద్వ ద్వ్యవస్థితమ్. 8
ఘృతరూపేణ తస్మా త్త్వం పాహి నః పర్వతాఽనిశమ్ ।
అనేన విధినా యస్తు దద్యా ద్ఘృతమయం గిరిమ్. 9
మహాపాతకయుక్తోపి లోక మాప్నోతి శాఙ్కరమ్ । హంససారసయుక్తేన కిఙ్కిణీజాలమాలినా. 10
విమానే నాప్సరోభిశ్చ సిద్ధవిద్యాధరై ర్వృతః । విహరే త్పితృభి స్సార్ధం యావదాభూతసమ్ప్లవమ్. 11

ఇతి శ్రీమత్స్యమహాపురాణే ఘృతాచలదానమాహాత్మ్య కథనం
నామాష్టాశీతితమోఽధ్యాయః.

## ఎనుబది ఎనిమిదవ అధ్యాయము.

## ఘృత పర్వత దానము.

ఈశ్వరుడు నారదునకు ఇట్లు చెప్పెను: ఇక మీదట ఘృతాచల దాన విషయము తెలిపెదను. ఇది సర్వోత్తమము. ఘృతము (నేయి) దివ్యమయిన పదార్థము; తేజోమయము; మహాపాతక నాశనము. దీని కై శక్తిననుసరించి ఇరువదికాని పదికాని ఐదుకాని కడవలనేయి కావలెను. శక్తి హీనులు రెండు కడవల నేతితోనైన చేయవచ్చును. మొత్తము నేతిలో నాలుగవ వంతుతో విష్కంభ పర్వతములను చేయవలెను. కుంభములపై మంచి తెల్లని బియ్యపుకడవల నుంచవలెను. వాటిని దగ్గరగా చేర్చి ఎత్తుగా నుండునట్లు చక్కగా అందముగా యథా విధానముగా అమర్చి తెల్లని వస్త్రములతో చెరకు గడలతో పండ్లతో కప్పుటయు చుట్టుటయు చేయవలెను. ధాన్య పర్వత విషయమునందువలెనే అధివాసమును దేవతా పూజను జరిపి ఉదయమున ఆచార్యునకు (పురోహితునకు) అవి నమర్పించవలెను. పైవలెనే విష్కంభ పర్వతములను ఋత్విక్కులకీయవలెను. (మంత్రము:) "అమృతపు తేజపు సంయోగముచే ఘృతము (నేయి) ఉత్పన్నమయినది. కావున అమృత రూపుడును ఘృతతేజస్సే కిరణములుగా గలవాడును విశ్వరూపుడునగు శంకరుడు ఈ వ్రతముచే ప్రీతుడగుగాక! తేజోమయమగు బ్రహ్మతత్త్వము ఘృతమునందే నిలిచి యున్నది. అట్టి ఘృతపు పర్వతమా! నన్ను నీవెల్లప్పుడును రక్షించుము." అని ఈ విధానముతో ఘృత పర్వత దానముచేసినవారెంతటి మహాపాతకులైనను పాపములు నశించి శంకరలోకము నందుదురు. హంసలు బెగ్గురులు (తెల్లని కొంగ జాతి నీటి పక్షులు) మ్రోయుచుండ చిరు గజ్జెల గుంపుల మాలలతో శోభించు విమానముపై అప్సరలు సిద్ధులు విద్యాధరులు తను కొలుచుచుండ పితృదేవతలతోకూడి కల్పాంతము వరకు విహరింతురు.

ఇది శ్రీమత్స్య మహాపురాణమున ఘృత పర్వత దానమాహాత్మ్య కథనమను ఎనుబది ఎనిమిదవ అధ్యాయము.

## ఏకోననవతితమోఽధ్యాయః.

## రత్నపర్వతదానమ్.

ఈశ్వరః : అతఃపరం ప్రవక్ష్యామి రత్నాచల మనుత్తమమ్ ।
యత్ప్రదానా న్నరో యాతి విష్ణులోక మనుత్తమమ్. 1
ముక్తాఫలసహస్రేణ పర్వత స్స్యా దనుత్తమః । మధ్యమః పఞ్చశతిక స్త్రిశతే నాధమ స్స్మృతః. 2
చతుర్థాంశేన విష్కమ్భపర్వతా స్స్యు స్సమన్తతః । పూర్వేణ వజ్రగోమేదై ర్దక్షిణేనేన్ద్రనీలకైః. 3
పుష్యరాగయుతః కార్యో విద్వద్భి ర్గన్ధమాదనః । వైడూర్యవిద్రుమైః పశ్చా త్సమ్మిశ్రో విపులాచలః. 4
పద్మరాగై స్ససౌవర్ణై రుత్తరేణాపి విన్యసేత్ । ధాన్యపర్వతవ త్సర్వం మన్త్రార్చనవిధి స్స్మృతః. 5
తద్వదావాహనం కుర్యా ద్వృక్షా న్దేవాంశ్చ కాఞ్చనాన్ ।
పూజయే త్పుష్పధూపాద్యైః ప్రభాతే గతమత్సరః. 6
పూర్వవ ద్గురుఋత్విగ్భ్య ఇమం మన్త్ర ముదీరయేత్ । యథా దేవగణా స్సర్వే సర్వరత్నే ష్వవస్థితాః. 7
నచ రత్నమయో నిత్య మతః పాహి మహాచల । యస్మాదన్నప్రదానేన వృష్టిం ప్రకురుతే హరిః. 8
సదా రత్నప్రదానేన తస్మా న్నః పాహి పర్వత । అనేన విధినా యస్తు దద్యా ద్రత్నమయం గిరిమ్. 9
స యాతి వైష్ణవం లోక మమరేశ్వరపూజితమ్ । యావత్కల్పశతం సాగ్రం వసే త్త్విహ నరాధిప. 10
రూపారోగ్యగుణోపేత స్సప్తద్వీపాధిపో భవేత్ । బ్రహ్మహత్యాదికం కించి ద్యదత్రాముత్ర వా కృతమ్. 11
తత్సర్వం నాశ మాయాతి గిరి ర్వజ్రహతో యథా. 11॥

ఇతి శ్రీమత్స్యమహాపురాణే రత్నాచలదానమాహాత్మ్య కథనం
నామైకోన నవతితమోఽధ్యాయః.

## ఎనుబది తొమ్మిదవ అధ్యాయము.
## రత్న పర్వతదానము.

ఈశ్వరుడు నారదునకు ఇట్లు తెలిపెను: ఇకమీదట రత్న పర్వత దాన విషయమును తెలిపెదను. ఇది అత్యుత్తమ మయినది. దీని నాచరించినవారు సర్వోత్తమమగు విష్ణులోకమేగుదురు. వేయికాని ఐదువందలుకాని మూడు వందలుకాని పలముల ముత్తెములు దీనికై వినియోగించవలెను. మొత్తము తూకములో నాలుగవ వంతుతో విష్కంభ పర్వతముల నాలుగు దిక్కులందు చేయవలెను. తూర్పున వజ్రములతో గోమేదములతో మందరమును దక్షిణమున ఇంద్ర నీలములతో పద్మరాగములతో గంధమాదనమును పశ్చిమమున వైదూర్యములతో పగడములతో విపుల పర్వతమును ఉత్తరమున పద్మరాగములతో గరుడ పచ్చలతో సుపార్శ్వ పర్వతమును నిర్మించవలెను. మంత్రములు అర్చన విధానము బంగారుతో వృక్షములు దేవతలు వారినావాహనము చేయుట అన్నియు ధాన్య పర్వతమునందువలెనే. దాన దినపు ఉదయమున మత్సరము లేక లోగడ చెప్పినట్లే గురునకును ఋత్విక్కులకును మేరువును విష్కంభ పర్వతములను దానమీయవలెను. (దానమంత్రము:) దేవతలందరు అన్ని రత్నములయందు వసింతురు. అట్టి రతనముల పర్వతమా! నన్నెల్లప్పుడు కాపాడుము. అన్న (హవిః) ప్రదానముచే ఇంద్రుడు సంతసించి వర్షమును కురిపించునట్లే నేను చేసిన ఈ రత్న ప్రదానముచే హరి సంతసించి నాకు కోరికలు కురియునట్లు అనుగ్రహించుము. ఈ విధానమున రత్న పర్వతదానము చేసినవారు దేవేంద్రునిచే కూడ పూజితమగు విష్ణులోకమున కేగి పూర్ణముగ నూరు కల్పములపా టచటనుండి మరల కల్పాది సృష్టియందు రూపారోగ్య సద్గుణ సంపన్నుడైన సప్త ద్వీపాధిపతిగా జన్మించును. ఇహముననో పరముననో చేసిన బ్రహ్మ హత్యాది పాపములన్నియు వజ్రపు దెబ్బ తినిన పర్వతమువలె నశించును.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున రత్న పర్వతదాన మాహాత్మ్య కథనమను
ఎనుబది తొమ్మిదవ అధ్యాయము.

## నవతితమోఽధ్యాయః.
## రౌప్యపర్వతదానమ్.

ఈశ్వరః : అతఃపరం ప్రవక్ష్యామి రౌప్యశైల మనుత్తమమ్ ।
యత్ప్రదానా న్నరో యాతి సోమలోకం ద్విజోత్తమ. 1
దశభిః పలసాహస్రై రుత్తమో రజతాచలః । పఞ్చభి ర్మధ్యమః ప్రోక్త స్తదర్ధేనాధమ స్స్మృతః. 2
అశక్తో వింశతే రూర్ధ్వం కారయే ద్భక్తిత స్సదా । విష్కమ్భపర్వతాం స్తద్వ త్తురీయాంశేన కల్పయేత్. 3
పూర్వవ ద్రాజతా న్కుర్యా న్మన్దరాదీ న్విధానతః । కలధౌతమయాం స్తద్వ ల్లోకేశా న్కారయే ద్బుధః.4
బ్రహ్మవిష్ణ్వర్కవ త్కార్యో నితమ్బోఽత్ర హిరణ్మయః ।
రాజత స్స్యా దతోఽన్యేషాం సర్వస్మిన్నిహ కాఞ్చనమ్. 5
శేషంచ పూర్వవత్కుర్యా ద్ధోమజాగరణాదికమ్ । దద్యా త్తతః ప్రభాతేతు గురవే రజతాచలమ్. 6
విష్కమ్భశైలా నృత్విగ్భ్యః పూజ్య వస్త్రవిభూషణైః । ఇమం మన్త్రం పఠే ద్దద్యా ద్దర్భపాణి ర్విమత్సరః.
పితౄణాం వల్లభం యస్మా ద్విష్ణోర్వా శఙ్కరస్యచ । పాహి రాజత తస్మా త్త్వం శోకసంసారసాగరాత్.
ఇత్థం నివేద్య యో దద్యా ద్రజతాచల ముత్తమమ్ । గవా మయుతసాహస్రఫల మాప్నోతి మానవః. 9
సోమలోకే సగన్ధర్వైః కిన్నరాప్సరసాం గణైః । పూజ్యమానో వసే ద్విద్వా న్యావదాభూతసమ్ప్లవమ్. 10

ఇతి శ్రీమత్స్యమహాపురాణే రజతాచల దానమాహాత్మ్య కథనం
నామ నవతితమోఽధ్యాయః.

## తొంబది యవ అధ్యాయము.

## రౌప్య పర్వత దానము.

ఈశ్వరుడు నారదునకిట్లు చెప్పెను: ఇకమీదట రౌప్య పర్వత (వెండికొండ) దాన విషయము తెలిపెదను. ఇది సర్వోత్తమము. దీని నాచరించినవారు సోమలోక ప్రాప్తులగుదురు. దీనికై పదివేల పలములుకాని ఐదువేల పలములు కాని రెండున్నర వందల పలములు కాని తూకముకల వెండి కావలయును. శక్తిలేనివారు భక్తితో ఇరువది పలములకు తక్కువ కాని వెండితోనైన చేయవచ్చును. పైవలెనే చతుర్థాంశముతో విష్కంభ పర్వతములను వెండితోనే మందరాది పర్వతముల నాయా దిశలందును బంగారుతో లోకపాలురను బంగారుతో నేత్రము చేయించి దానిపై బ్రహ్మ విష్ణు రవి రుద్రుల స్వర్ణ ప్రతిమలను చేయించవలెను. మిగిలిన పర్వతముల విషయమున వెండినుపయోగించిన వానికి ఈ రౌప్య పర్వత దానములో బంగారు ఉపయోగించవలెను. హోమ జాగరణాదికము పైవలెనే చేయవలెను. తెల్లవారిన పిదప ఈ రజతా చలములోని నడుమ భాగమును ఆచార్యునకును విష్కంభ పర్వతములను ఋత్విక్కులకును నీయవలెను. (దాన కాలమున) వారినందరను వస్త్రాభరణములతో పూజించవలయును. దర్భపాణియై విమత్సరుడై ఈ అర్థమునిచ్చు మంత్రమును పఠించవలయును: "రజతమా! నీవు పితరులకును విష్ణు శంకరులకును ప్రియమైన దానవు. ఇట్టి నీవు సంసార సాగరమునుండి నన్ను దాటించుము." ఇట్లు ఆవాహనము చేసి ప్రార్థించి రజతాచల దానము నొసరించువారు వేయి పదివేల (1000×10000) గోవుల దానమిచ్చినంత ఫలము నందుదురు. గంధర్వ కిన్నరాప్సరో గణముల పూజలనందుకొనుచు కల్పాంతమువరకును సోమలోకమునందు వసింతురు.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున రజతాచల దాన మాహాత్మ్య కథనమను
తొంబదియవ అధ్యాయము.

## ఏకనవతితమోఽధ్యాయః.

## శర్కరాపర్వతదానమ్.

ఈశ్వరః : అథాత స్సమ్ప్రవక్ష్యామి శార్కరాచల ముత్తమమ్ ।
యస్య ప్రదానా ద్విష్ణ్వర్కరుద్రా స్తుష్యన్తి సర్వదా. 1
అష్టభి శ్శర్కరాభారై రుత్తమ స్స్యా న్మహాచలః । చతుర్భి ర్మధ్యమః ప్రోక్తో భారాభ్యా మధమ స్స్మృతః.
భారేణ చార్ధభారేణ కుర్యా ద్య స్స్వల్పవిత్తవాన్ । విష్కమ్భపర్వతా న్కుర్యా త్తురీయాంశేన మానవః. 3
ధాన్యపర్వతవత్సర్వ మాపాద్యామరసంయుతమ్ । మేరోరుపరి తద్వచ్చ స్థాప్యం హేమతరుత్రయమ్. 4
మన్దారః పారిజాతశ్చ తృతీయః కల్పపాదపః । ఏవం వృక్షత్రయం మూర్ధ్ని సర్వేష్వపి నివేశయేత్. 5
హరిచన్దనమన్దారౌ పూర్వపశ్చిమభాగయోః । నివేశ్యౌ సర్వశైలేషు విశేషాచ్ఛర్కరాచలే. 6
మన్దరే కామదేవస్తు ప్రత్యగ్వక్త్రస్సదా భవేత్ । గన్ధమాదనమధ్యేతు ధనద స్స్యా దుదఙ్ముఖః. 7
ప్రాఙ్ముఖో హేమ మూర్తిస్తు హంసస్స్యా ద్విపులాచలే । హైమీ సుపార్శ్వే సురభి ర్దక్షిణాభిముఖీ భవేత్. 8
ధాన్యపర్వతవత్సర్వ మావాహనమఖాదికమ్ । కృత్వాఽథ గురవే దద్యా న్మధ్యమం పర్వతోత్తమమ్. 9
ఋత్విగ్భ్య శ్చతుర శ్శైలా నిమా న్మన్త్రా నుదీరయేత్ ।
సౌభాగ్యామృతసారోఽయం పరమ శ్శర్కరాచలః. 10
తస్మా దానన్దకారీ త్వం భవ శైలేన్ద్ర సర్వదా । అమృతం పిబతాం యేతు నిపేతు ర్భువి శీకరాః. 11
దేవానాం తత్సముత్థోఽయం పాహి న శ్శర్కరాచల । మనోభవధనుర్మధ్యా దుద్భూత శ్శర్కరాచలః. 12

## తొంబది యొకటవ అధ్యాయము.

## శర్కరా పర్వత దానము-ధర్మమూర్త్యుపాఖ్యానము.

ఈశ్వరుడు నారదునకు ఇట్లు చెప్పెను: ఇకమీదట శర్కరా పర్వతదాన విషయము తెలిపెదను. అది ఉత్తమము. దాని దానమున విష్ణు రవి రుద్రులు శాశ్వత తృప్తి నందుదురు. దీనికై ఎనిమిదికాని నాలుగుకాని రెండుకాని బారువల చక్కెర కావలెను. శక్తిలేనివారు ఒక బారువతోనో అరబారువతోనైన చేయవచ్చును. మొత్తము చక్కెర తూకములో నాలుగవ వంతుతో విష్కంభ పర్వతముల చేయవలెను. ధాన్య పర్వతమునందువలెనే ఆయా పర్వతములను వానిపై దేవతలను నిలుపవలయును. అందునను మేరు పర్వతముపైని మిగిలిన వానిమీదను మందార పారిజాత-కల్ప వృక్షములనెడు మూడు (జాతుల కల్ప) వృక్షములను బంగారుతో చేయించి అమర్చవలెను. వాని శిరోభాగములందు హరి చందనము-మందారము (అను కల్ప వృక్షజాతు)లను ఆ పర్వతముల తూర్పు పడమరలందమర్చవలెను. ఇవి (లోగడ చెప్పిన) అన్ని పర్వతములందును విశేషించి శర్కరాచలమునందును చేయవలెను. విష్కంభ పర్వతము లందును- మందరమున పడమటి మొగముగా మన్మథుడుండవలెను. గంధమాదనమున కుబేరుడు ఉత్తరపు మొగమై ఉండవలెను. విపుల పర్వతమున హంస ప్రతిమ తూర్పు మొగమై ఉండవలెను. సుపార్శ్వమున కామధేనువు దక్షిణపు మొగమై ఉండవలెను. ఆవాహన హోమాదికమంతయు ధాన్య పర్వతమునందువలెనే. పైవలెనే నడిమి పర్వతమును ఆచార్యునకును విష్కంభ పర్వతములను ఋత్విక్కులకును ఈయవలెను. దానమంత్రము: శర్కరాచలము ఉత్తమమును సౌభాగ్యామృతసారమును; ఇట్టి నీవు మాకు సదా ఆనందము కలుగజేయుము. దేవతలు అమృతము త్రావునపుడు నేలపై చిందిపడిన అమృత బిందువులే చక్కెర అయ్యెను. దానితో ఏర్పడిన శర్కరాచలమా! నన్ను రక్షించుము. మన్మథుని ధనువునడుమనుండి ఉత్పన్న మీ శర్కరాచలము. అట్టి నీవు శర్కరాచలమా! మమ్ము సంసార సాగరమునుండి రక్షించుము.

తన్మయోఽసి మహాశైల పాహి సంసారసాగరాత్ । యో దద్యా చ్ఛర్కరాశైల మనేన విధినా నరః. 13
సర్వపాపవినిర్ముక్త స్స యాతి శివమన్దిరమ్ । చన్ద్రతారార్కసఙ్కాశ మధిరుహ్యానుజీవిభిః. 14
సహైవ యాన మాత్మీషే త్సతు విష్ణుప్రభో దివి । తతః కల్పశతాన్తేతు సప్తద్వీపాధిపో భవేత్. 15
ఆయురారోగ్యసమ్పన్నో యావజ్జన్మాయుతత్రయమ్ । భోజనం శక్తితో దద్యా త్సర్వశైలే ష్వమత్సరః. 16
సర్వత్రాక్షారలవణ మశ్నీయా త్తదనుజ్ఞయా । పర్వతోపస్కరా న్సర్వా న్ప్రాపయే ద్బ్రాహ్మణాలయమ్.

ధర్మమూర్త్యుపాఖ్యానమ్.

ఆసీత్పురా బృహత్కల్పే ధర్మమూర్తి ర్నరాధిపః । సుహృచ్ఛక్రస్య నిహతా యేన దైత్యా స్సహస్రశః. 18
సోమసూర్యాదయో యస్య తేజసా విగతప్రభాః । భవన్తి శతశో యేన శత్రవశ్చ పరాజితాః. 19
యదృచ్ఛారూపధారీచ మనుష్యే ష్వపరాజితః । తస్య భానుమతీ నామ భార్యా త్రైలోక్యసున్దరీ. 20
లక్ష్మీరివ స్వరూపేణ నిర్జితామరసున్దరీ । రాజ్ఞ స్తస్యాగ్రమహిషీ ప్రాణేభ్యోపి గరీయసీ. 21
నారీదశసహస్రాణాం మధ్యే శ్రీరివ జాయతే । నృపకోటి సహస్రేణ కదాచి న్న ప్రముచ్యతే. 22
కదాచి దాస్థానగతః పప్రచ్ఛ స్వపురోధసమ్ । విస్మయేనాన్వితో రాజా వసిష్ఠ మృషిసత్తమమ్. 23
భగవ న్కర్మణా కేన మమ లక్ష్మీ రనుత్తమా । కస్మాచ్చ విపులం తేజో మచ్ఛరీరే సదోత్తమమ్. 24

ఈ విధానముతో శర్కరా శైలదానము చేసినవారు వెంటనే విష్ణుని కాంతివంటి కాంతి కలవారై తనఅనుజీవులతో కూడ చంద్రతారా సూర్యులవలె ప్రకాశించు విమానము నెక్కి సర్వపాప వినిర్ముక్తులై శివ భవనమున కేగుదురు. ఇట్లు

నూరు కల్పములచట సుఖించి మరల కల్పాది సృష్టియందు వచనగా ముప్పదివేల జన్మముల వరకు ఆయురారోగ్య సంపన్నుడగు సప్త ద్వీపాధిపతిగా జన్మింపుచుండును.

అన్ని పర్వత దానములందును ఇతరులతో పోటీపడక తన శక్తి కొలది భోజన దానము చేయవలెను. అన్ని వ్రతములయందును ఆ పెద్దల యనుమతితో ఉప్పు కారము (పులుపు) లేని ఆహారము తినవలెను.

పిమ్మట పర్వతోపస్కరములగు సామగ్రులన్నియు ఆయా బ్రాహ్మణుల యిండ్లకు పంపవలయును.

## ధర్మ మూర్త్యుపాఖ్యానము.

పూర్వము బృహత్కల్పమునందు ధర్మమూర్తి యను రాజుండెడివాడు. అతడు ఇంద్రునకు మిత్రుడు; వేల కొలదిగా రాక్షసుల జంపినవాడు; సోమ సూర్యాది జ్యోతిస్సులకంటెను తేజశ్శాలి. వందలకొలది శత్రువుల నోడించిన వాడు; ఎవరిచేతను ఓటమి నెరుగనివాడు; కామరూపము ధరించగలవాడు. అతని పట్టపురాణి భానుమతియనునామె త్రైలోక్య సుందరి; అమర సుందరులను కూడ అందమున జయించినదియును లక్ష్మి దేవివలె రూపము కలదియును; ఆమె ఆ రాజునకు ప్రాణముల కంటెను మిన్నగా ప్రీతిపాత్రురాలు కూడను; రాజునకు గల పదివేల మంది స్త్రీజనములో ఆమె సాక్షాత్ లక్ష్మివలె శోభించుచుండెడిది. వారిని వారి అధీనస్థులగు వేల కోటుల రాజులును ఎప్పుడును విడిచియుండెడి వారుకారు.

ఒకనా డా రాజు తన సభలోనున్న తన పురోహితుడగు వసిష్ఠుని జూచి మిగుల ఆశ్చర్యముతో నిట్లు ప్రశ్నించెను: "భగవన్! ఏ (సత్) కర్మకు ఫలముగా నాకు ఇంత ఉత్తమమగు లక్ష్మియు నాశరీరమున సదా ఇంత ఉత్తమమగు విపుల తేజమును సిద్ధించినది?"

వసిష్ఠః : పురా లీలావతీనామ వేశ్యా శివపరాయణా । తయా దత్త శ్చతుర్దశ్యాం గురవే లవణాచలః. 25
హేమవృక్షామరైస్సార్ధం యథావ ద్విధిపూర్వకమ్ । శూద్ర స్సువర్ణకారశ్చ నామ్నా సాణ్డోఽభవ త్తదా.
భృత్యో లీలావతీగేహే తేన హైమా వినిర్మితాః । తరవోఽమరముఖ్యాశ్చ శ్రద్ధాయుక్తేన పార్థివ. 27
అతిరూపేణ సమ్పన్నా ఘటయిత్వా వినా భృతిమ్ । ధర్మకార్య మితి జ్ఞాత్వా న గృహ్ణాతి కథంచన. 28
†ఉల్లాసితాశ్చ తత్పత్న్యా సౌవర్ణామరపాదపాః । లీలావతీ గిరేః పార్శ్వే పరిచర్యాచ పార్థివ. 29
కృతా తాభ్యా మశాఠ్యేన ద్విజశుశ్రూషణాదినా । సాచ లీలావతీ వేశ్యా కాలేన మహతా తథా. 30
సర్వపాపవినిర్ముక్తా జగామ శివమన్దిరమ్ । యోఽసౌ సువర్ణకారోపి దరిద్రోఽప్యతిసత్యవాన్. 31
న మూల్య మాదా ద్వేశ్యాత స్స భవానిహ సామ్ప్రతమ్ । సప్తద్వీపపతి ర్జాత స్సూర్యాయుతసమప్రభః.
భార్యా సువర్ణకారస్య తరవో హేమనిర్మితాః । సమ్యగుల్లాసితా భక్త్యా సేయం భానుమతీ తవ. 33
ఉల్లాసనా దుత్కటరూప మస్యా స్సఞ్జాత మస్మి న్నృపమదాధిపత్యమ్ ।
యస్మాత్కృతం తత్పరిచారకర్మ అనుద్ధతాభ్యాం లవణాచలస్య. 34
తస్మాచ్చ లోకేష్వపరాజితత్వ మారోగ్యసౌభాగ్యయుతాచ లక్ష్మీః ।
తస్మాత్త్వమప్యత్ర విధానపూర్వం ధాన్యాచలాదీ న్దశధా కురుష్వ. 35
తథేతి సమ్పూజ్య స ధర్మమూర్తిః పాదౌ వసిష్ఠస్య దదౌచ సర్వాన్ ।
ధాన్యాచలాదీ న్విధివత్పురారే ర్లోకంగతోఽసౌ సురపూజ్యమానః. 36
పశ్యేత్తు భక్త్యా యది దీయమానం స్సృ్ణోతివాథో యః పురుషో దరిద్రః ।
శృణోతి భక్త్యాథ మతిం దదాతి వికల్మష స్సోపి దివం ప్రయాతి. 37

---

†ఉజ్జ్వాలితాశ్చ

దుఃఖస్య ప్రశమముపైతి *పూజ్యమానై శ్శైలేన్ద్రై ర్భవభయభేదనై ర్మనుష్యః ।
య ఃకుర్యాదితి మునిపుఙ్గవేహ భక్త్యా శాన్తాత్మా సకలగిరీన్ద్ర సమ్ప్రదానమ్. 38

ఇతి శ్రీమత్స్యమహాపురాణే ఈశ్వరనారదసంవాదే శర్కరాచల
దానమాహాత్మ్య కథనం నామైకనవతితమోఽధ్యాయః.

వసిష్ఠుడు రాజునకిట్లు సమాధానము ఇచ్చెను: పూర్వము శివుడే తనకు పరమాశ్రయముగా భావించు లీలావతి యను వేశ్య యుండెను ఆమె (ఒక) చతుర్దశినాడు తన ఆచార్యునకు లవణ పర్వతమును యథావత్‌గా విధానానుసారము సువర్ణ వృక్షదేవతా ప్రతిమలతో కూడ దానమిచ్చెను. ఆ లీలావతియింట భృత్యుడుగా ఆశ్రితుడుగా 'సౌండుడు' అను పేరుగల శూద్రుడు సువర్ణకారుడుండెను. అతడు (ఈవ్రతమునకై) శ్రద్ధాయుక్తుడై బంగారు చెట్లను దేవతా ప్రతిమలను చేసి ఇచ్చెను. ఇది దేవ కార్యము గదాయను మంచి తలంపుతో వాటిని మిగుల రూప సంపన్నములుగా నిర్మించియు వేతనము ఏమియు తీసికొనలేదు. అతని భార్యయును ఆ వృక్ష ప్రతిమలకును దేవతా ప్రతిమలకును మెరుగు పెట్టెను. ఇంతేకాక ఆ శూద్ర దంపతులిద్దరును లీలావతి దానము చేయ సిద్ధపరచిన లవణ పర్వత సమీపమున బ్రాహ్మణ సేవాది రూపమున ఏమాత్రమును కపటము లేని సేవ ఎంతయో చేసిరి. ఆ లీలావతి యను వేశ్యయును చాల కాలము (అట్లు జీవించిన) తరువాత సర్వపాప వినిర్ముక్తురాలయి శివలోకము చేరెను. తాను దరిద్రుడగు బంగారు పని వాడై యుండియు అతి సత్యవంతుడై (ఈ పనికై) భృతి తీసికొనని అతడే నీవు (ధర్మమూర్తియను రాజు) గా ఇపు డున్నావు. సప్త ద్వీపాధిపతివి-పదివేల సూర్యుల తేజస్సువంటి తేజస్సు కలవాడవు అయినావు. తన భర్త చేసిన బంగారు చెట్లకు భక్తితో మెరుగుపెట్టిన అలనాటి సువర్ణకారుని భార్య నీయా భానుమతి; ఆ మెరుగుపెట్టిన పుణ్యముననే ఈమెకు నేడీ మేరమీరిన రూపమును ఇంతులందరలో మేలిదనము కలుగుటయునైనది. ఏమియు పొగరులేక లవణాచలదాన వ్రతకాలమున బ్రాహ్మణాదుల పరిచర్యలు చేసినందున అపరాజితుడవై ఆరోగ్య లక్ష్మీ సౌభాగ్యములనందగలిగితివి.

కావున నీవు ఇపుడును విధాన పూర్వకముగా ధాన్యాచలాది దశవిధ పర్వత దానములను ఆచరించుము.

అనిన వసిష్ఠుని పాదములను ధర్మమూర్తి సంపూజించి ధాన్యా చలాదికములు అన్నియు అట్లే దానమిచ్చెను. తత్ఫలముగా సుర పూజ్యమానుడగుచు శివలోక ప్రాప్తుడయ్యెను.

ఇంతేకాదు. దరిద్రులేయైనను ఈ పర్వతదాన వ్రతములు జరుగుచుండగా చూచినను వాటిని తాకినను ఈ విషయములు వినినను ఇతరులకు తెలిపినను అట్టివాడును పాపవిముక్తుడై స్వర్గము చేరును. ఈ పర్వత దానములన్నియు సంసారభయ నాశకములు; దేవ పూజ్యమానములు. వీని ప్రభావమున మానవుడు దుఃఖశాంతి నొందును. వీని నన్నిటిని భక్తితో నాచరించినవాడు ఆత్మశాంతి నందుననుటలో సంశయమేలేదు.

ఇట్లని ఈశ్వరుడు నారదునకు తెలిపెను.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున ఈశ్వర నారద సంవాదమున శర్కరా చలదాన
మాహాత్మ్య కథనమను తొంబదియొకటవ అధ్యాయము.

## ద్వినవతితమోఽధ్యాయః.

## గ్రహయజ్ఞవిధానయుతహోమవిధిః.

సూతః : వైశమ్పాయన మాసీన మపృచ్ఛ చ్ఛౌనకః పురా ।
సర్వకామా ప్తయే నిత్యం కథం శాన్తికపౌష్టికమ్. 1

వైశమ్పాయనః: శ్రీకామ శ్శాన్తికామోవా గ్రహయజ్ఞం సమాచరేత్ ।
వృష్ట్యాయుఃపుష్టికామో వా తథైవాభిచర న్పునః. 2

*వక్ష్యమానై శ్శైలేన్ద్రైర్భవ.

షేన గ్రహవిధానేన తస్మే నిగదత శ్శృణు । సర్వశాస్త్రాణ్యనుక్రమ్య *సంక్షిప్తం(వ్య) గ్రన్థవిస్తరమ్. 3
గ్రహశాన్తిం ప్రవక్ష్యామి పురాణశ్రుతిచోదితామ్ । పుణ్యేఽహ్ని విప్రకథితే కృత్వా బ్రాహ్మణవాచనమ్. 4
గ్రహా న్గ్రహాధిదేవాంశ్చ స్థాప్య హోమం సమాచరేత్ ।
గ్రహయజ్ఞ స్త్రిధా ప్రోక్తః పురాణశ్రుతికోవిదైః. 5
ప్రథమోఽయుతహోమ స్స్యా ల్లక్షహోమ స్తతఃపరమ్ ।
తృతీయః కోటిహోమ స్స్యా త్సర్వకామఫలప్రదః. 6
అయుతేనాహుతీనాంచ నవగ్రహవిధి స్స్మృతః । తావ త్తస్య విధిం వక్ష్యే పురాణశ్రుతిభాషితమ్. 7
గృహస్యోత్తరపూర్వేణ మణ్డపం కారయేద్బుధః । ●రుద్రాయతనభూమౌవా చతురస్ర ముదక్ప్లవమ్. 8
దశహస్త మథాష్టౌ వా హస్తం కుర్యా ద్విధానతః । తస్య ద్వారాణి చత్వారి కర్తవ్యాని చ దక్షిణే. 9
గర్తం చోత్తరపూర్వేణ వితస్తిద్వయవిస్తృతామ్ ।
వప్రద్వయయుతాం వేదిం వితస్త్యుచ్ఛ్రయసమ్మితామ్. 10
సంస్థాపనాయ దేవానాం చతురగ్రా ముదక్ప్లవామ్ ।
అగ్నిప్రణయనం కృత్వా తస్యా మావాహయేత్సురాన్. 11
దేవతానాం తతస్సాప్యో వింశతిర్ద్వాదశాధికః ।

## తొంబది రెండవ అధ్యాయము.
## గ్రహయజ్ఞ విధానము-హోమవిధానము-ఇతరములగు వశ్యాభిచారప్రక్రియలును.

సూతుడు ఋషులకు ఇట్లు చెప్పెను: పూర్వము శౌనకుడు ప్రశాంతుడై కూర్చుండియున్న వైశంపాయనుని సర్వకామములు పూర్ణములగుటకు ఉపకరించు శాంతికపౌష్టిక కర్మముల నెట్లాచరించవలెనని యడిగెను. వైశంపాయనుడు శౌనకునకిట్లు చెప్పనారంభించెను: శ్రీ-శాంతి-వృష్టి-ఆయువు-పుష్టి-అను అభ్యుదయములను పొందుటకుగాని (తనకు ద్వేష్యులగు) ఇతరులకు అపకారము కలిగించు తంత్రాచరణమును చేయుటకుగాని కోరువారు ఆచరించవలసిన గ్రహ (ముల ఆరాధన) విధానమును తెలిపెదను; వినుము. సర్వ శాస్త్రములను పరిశీలించియు పురాణముల చేతను శ్రుతుల చేతను చెప్పబడిన వానిని గ్రహించియు క్రోడీకరించిన గ్రంథ విస్తరముతో గ్రహశాంతి విధానమును ప్రతిపాదింతును.

విజ్ఞులగు దైవజ్ఞ విప్రులు నిర్ణయించిన శుభదినమున బ్రాహ్మణులచేత పుణ్యాహవాచనమును జరిపించవలెను. గ్రహములను వాటి ★అధిదేవతలను మండపమున ప్రతిష్ఠించి వారినుద్దేశించి హోమము చేయవలెను. (ఇది గ్రహ శాంతి విధాన సంక్షేపము.)

(ఇకమీదట దీని విస్తరణము చెప్పబడును:) పురాణములను శ్రుతులను బాగుగ ఎరిగిన మహనీయులు గ్రహ యజ్ఞము అయుత (పదివేల) హోమము-లక్షహోమము-కోటి హోమము-అని మూడు విధములని చెప్పుచున్నారు. ఇవి

---

† గ్రహయజ్ఞం సమాచరేత్ ● రుద్రహస్తమితంవా స్యాత్

★ గ్రహములు ఆకాశమున-అంతరిక్ష లోకమున మనకు కనబడు జ్యోతిర్గోళ రూపములు; వీనికి సరిగా ద్యులోకమున నున్న దేవతా తత్త్వములే ఈ గ్రహముల అధిదేవతలును వారి అంగ దేవతలు ప్రత్యధిదేవతలును; వారి అనుగ్రహము సంపాదించనిదే ఈ గ్రహశాంతి కర్మము ఫలప్రదము కాదు. కావున గ్రహములతోపాటు వాని అధిదేవతా తత్త్వములను ప్రతిష్ఠ చేసి ఆరాధించవలయును.

అన్నియు ఆయా విషయములలో సర్వ కామ ఫలములను ఇచ్చు శక్తి కలవి. మొదట వీనిలోని మొదటిదగు అయుత హోమ రూపమగు నవగ్రహయజ్ఞ విధానము తెలిపెదను.

యజమానుడు తన ఇంటికి ఉత్తర పూర్వదిశ (ఈశాన్య దిశ)యందుకాని శివాలయ ప్రదేశమునకాని చతురగ్ర(స్ర)ము ఉదక్ప్లవము (ఉత్తరమునకు వాలుగనుండునదియు)ను పదికాని ఎనిమిది కాని హస్తముల భుజము కలదియు నగు మండపమును విదానానుసారముగ నిర్మించవలయును. దానికి దక్షిణమున నాలుగు ద్వారములును-అదే మండపమునకు ఈశాన్యమున రెండు జేనల పొడవు-అంతే వెడలుపు-అంతే లోతు కలిగిన గుంటను (హోమమునకు) దాని సమీపమున ఈశాన్యమునందే జేనెడు ఎత్తుగా నుండు వేదికను నిర్మించవలెను. ఈ వేదిక చతురస్రాకారముగ నుండవలెను. (దీని భుజముల కొలత ఈయబడలేదు.) ఇది గ్రహములయు-వాటి అధిదేవతా ప్రత్యధి దేవతలయు ఆవాహనము కొరకు; ఈ వేదికకు చుట్టును నాలుగు వైపుల రెండు ప్రాకారములు (కొలది ఎత్తు కల గోడలవంటి కట్టలు) ఉండవలెను. ఇదియు ఉత్తరమునకు వాలుగా ఉండవలయును.

ఈ చెప్పిన గుంటయందు (హోమకుండమునందు) అగ్ని ప్రణయనము (అగ్నిని ప్రతిష్ఠించుటకు ముందు చేయవలసిన పరిస్తరణాది పూర్వకముగ అగ్ని ప్రతిష్ఠాపనము ప్రజ్వాలనము మొదలగునవి) చేసిన పిదప ముప్పది ఇద్దరు దేవతలకు ఆ వేదికయందు ఆవాహన ప్రతిష్ఠాపనములు జరుపవలెను. గ్రహములు 9+అధిదేవతలు 9+ప్రత్యధి దేవతలు 9+వినాయక దుర్గా వాయ్వాకాశాశ్వినులు అను 5=32; ఇచట అశ్వి దేవతలు జంట దేవతలు కావున ఇద్దరను ఒకటిగానే గణించవలెను.)

నవగ్రహావాహనాదిః.

సూర్య స్సోమో భూమిసుతో బుధో జీవ స్సితోఽర్క-జః. 12
రాహుః కేతురితి ప్రోక్తా గ్రహా లోకహితావహాః। మధ్యేతు భాస్కరం విన్ద్యా చ్ఛశినం పూర్వదక్షిణే. 13
దక్షిణే లోహితం విన్ద్యా ద్బుధం పూర్వోత్తరేణతు। ఉత్తరేణ గురుం విన్ద్యా త్పూర్వేణైవతు భార్గవమ్. 14
పశ్చిమేతు శనిం విన్ద్యా ద్రాహుం పశ్చిమదక్షిణే। పశ్చిమోత్తరతః కేతుం స్థాపయే చ్ఛుక్లతణ్డులైః. 15
భాస్కర స్యేశ్వరం విన్ద్యా దుమాంచ శశిన స్తథా। స్కన్ద మఙ్గారకస్యాపి బుధస్యాపి తథా హరమ్. 16
బ్రహ్మాణం చ గురో ర్విన్ద్యా చ్ఛుక్రస్యాపి శచీపతిమ్। శనైశ్చరస్యతు యమం రాహోః కాలం తథైవచ.
కేతూనాం చిత్రగుప్తంతు సర్వేషా మధిదేవతాః। అగ్ని రాపః క్షితి ర్విష్ణు రిన్ద్రి ఐన్ద్రీచ దేవతా. 18
ప్రజాపతిశ్చ సర్పాశ్చ బ్రహ్మ ప్రత్య-దేవతాః। వినాయకం తథా దుర్గాం వాయు మాకాశమేవచ. 19
ఆవాహయే ద్వ్యాహృతిభి స్తథైవాశ్వికుమారకౌ। స్థాపయే ద్రక్త మాదిత్య మఙ్గారకసమన్వితమ్. 20
సోమశుక్రౌ తథా శ్వేతౌ బుధజీవౌచ పిఙ్గళౌ। మన్దరాహూ తథా కృష్ణౌ ధూమ్రం కేతుగణం విదుః. 21
గ్రహవర్ణాని దేయాని వాసాంసి కుసుమానిచ। ధూపమాత్రోఽత్ర సురభి రుపయుజ్యశ్చ నిర్మలః. 22
ప్రత్యేకం ప్రాపయే త్ప్రాజ్ఞః ఫలం పుష్పసమన్వితమ్।
గుడౌదనం రవే ర్దద్యా త్సోమాయ ఘృతపాయసమ్. 23
అఙ్గారకాయ సంయావం బుధాయ క్షీరషష్టకమ్। దధ్యన్నం గురవే దద్యా చ్ఛుక్రాయతు ఘృతౌదనమ్. 24
శనైశ్చరాయ కృసరం మాషం మాంసంచ రాహవే।
చిత్రౌదనంచ కేతుభ్య స్సర్వా న్భక్ష్యై స్తథాఽర్చయేత్. 25

ఎట్లనగా-1. సూర్యుడు 2. చంద్రుడు 3. అంగారకుడు 4. బుధుడు 5. గురుడు 6. శుక్రుడు 7. శని 8. రాహువు 9. కేతువు అను లోకహిత సంపాదకులగు గ్రహములు తొమ్మిది. (వీరి స్థానములు): 1. నడుమ 2. ఆగ్నే

యము 3. దక్షిణము 4. ఈశాన్యము 5. ఉత్తరము 6. తూర్పు 7. పశ్చిమము 8. నైరృతము 9. వాయవ్యము. వీరినందరను తెల్లని ఓియ్యముతో ప్రతిష్ఠించవలెను. వీరి అధిదేవతలు: 1. రుద్రుడు 2. ఉమ 3. స్కందుడు 4. విష్ణువు 5. బ్రహ్మ 6. ఇంద్రుడు 7. యముడు 8. కాలుడు 9. చిత్రగుప్తుడు. ఇక ప్రత్యధిదేవతలు: 1. అగ్ని 2. జలము 3. పృథివి 4. విష్ణువు 5. ఇంద్రుడు 6. ఐంద్రి (ఇంద్రాణి-శచి) 7. ప్రజాపతి 8. సర్పములు 9. బ్రహ్మ. వీరినేకాక వ్యాహృతిత్రయముతో ప్రత్యేకముగా వినాయక దుర్గా వాయ్వాకాశాశ్వినుల కైదుగురకు ఆవాహన ప్రతిష్ఠాపనములు జరుపవలెను. నవగ్రహ వర్ణములు: 1. రక్తవర్ణము 2. శ్వేతము 3. రక్తము 4. పింగళ (ఎరుపు పసుపుల మిశ్రణము) 5. పింగళము 6. శ్వేతము 7. కృష్ణము 8. కృష్ణము 9. ధూమము (పొగరంగు) వీరి పూజయందు వస్త్రములును పుష్పములును వారి వారి రంగులు కలవి. ధూపము మాత్రము నిర్మలము సుగంధము కలది ఏదైనను సరియే. పూవులతో పాటు ఫలముల గూడ అర్పించవలెను. వీరి నైవేద్యమునకు-1. బెల్లపు అన్నము 2. నేతిపాయసము 3. సంయావము (గోధుమ రవ్వను పాలతో వండినది.) 4. పాలతో ఉడికించిన పిండి 5. పెరుగన్నము 6. నేతి అన్నము 7. పులగము 8. మినుప వంట 9. చిత్రాన్నము (పులి యోగిరము); ఈ తొమ్మిది గ్రహములకును ఇతర దేవతా ప్రత్యధి దేవతలకును వినాయకాదులకును భక్ష్యములేవైనను నివేదించవచ్చును.

## కలశస్థాపనాదిః

ప్రాగుత్తరేణ తస్మాత్తు దధ్యక్షతవిభూషితమ్ । చూతపల్లవసఞ్ఛన్నం ఫలవస్త్రయుగాన్వితమ్. 26
పఞ్చరత్నసమాయుక్తం పఞ్చపూగయుతం తథా । స్థాపయే దవ్రణం కుంభం వరుణం తత్ర విన్యసేత్.
గఙ్గాద్యా స్సరిత స్సర్వా స్సముద్రాశ్చ సరాంసిచ । గజాశ్వరథవల్మీక సఙ్గమహ్రదగోకులాత్. 28
మృద మానీయ విప్రేన్ద్ర సర్వౌషధిసమన్వితమ్ । స్నానార్థం విన్యసే త్తత్ర యజమానస్య ధర్మవిత్. 29
సర్వే సముద్రా స్సరిత స్తీర్థాని జలదా నదాః । ఆయాన్తు యజమానస్య దురితక్షయకారకాః. 30
ఏవ మావాహయే దేతా నమరా న్మునిసత్తమ । హోమం సమారభే త్సర్పి ర్యవవ్రీహితిలాదినా. 31
అర్కః పలాశః ఖదిరః అపామార్గోఽథ పిప్పలః । ఉదుమ్బర శ్శమీ దూర్వా కుశాశ్చ సమిధఃక్రమాత్. 32
ఏకైకస్యా ష్ట్వ ష్టశత మష్టావింశతి రేవవా । హోతవ్యా మధుసర్పిర్భ్యాం దధ్నాచైవ సమన్వితాః. 33
ప్రాదేశమాత్రా అశిఖా అశాఖా అపలాశినీః । సమిధః కల్పయే త్ప్రాజ్ఞ స్సర్వకర్మసు సర్వదా. 34
దేవానామపి సర్వేషా ముపాంశు పరమార్థవిత్ । స్వేన స్వేనైవ మన్త్రేణ హోతవ్యా స్సమిధః పృథక్. 35
హోతవ్యంచ ఘృతం త్వత్ర చరుభక్ష్యాదికం పునః ।
మన్త్రై ర్దశాహుతీ ర్హుత్వా హోమో వ్యాహృతిభి స్స్మృతః. 36
ఉదఙ్ముఖాః ప్రాఙ్ముఖ వా కుర్యు ర్బ్రాహ్మణపుఙ్గవాః । మన్త్రవన్తస్తు కర్తవ్యా శ్చరవః ప్రతిదైవతమ్. 37
హుత్వా పశ్చా చ్చరుం సమ్య క్తతో హోమం సమాచరేత్ ।

(కలశ స్థాపనము): ఈ గ్రహావాహన వేదికకు ఈశాన్యమున పెరుగు అక్షతలు పంచరత్నములు పంచ పూగములు (పోకకాయలు) వేసి మామిడి చిగురాకులతో పండ్లతో నూతన వస్త్రద్వయముతో కప్పిన అరంధ్ర కలశమును ప్రతిష్ఠించి దానియందు వరుణునావాహితునిగా జేయవలెను. దానియందు గంగాది నదులనుండి సముద్రములనుండి తెచ్చిన నీటిని పోయవలెను. ఆ నీటియందు గజాశ్వరథములుండు తావులనుండి గోవులు నిలుచుచోటి నుండి పుట్టనుండి నదీసంగమములనుండి హ్రదములనుండి (మడుగుల నుండి) సేకరించి తెచ్చిన మట్టినికూడ వేయవలెను. ఈ నీరు యజమానుని స్నానార్థము వినియుక్తమగును. అన్ని సముద్రములును నదులును తీర్థములును మేఘములును నదములును యజమానుని దురితములను క్షయింపజేయుటకై దీనియందు సన్నిహితములగుగాక! అను అర్థమిచ్చు మంత్రముతో వీటినన్నిటినం దావాహనము చేయవలెను.

పిమ్మట నేయి యవలు వడ్లు తిలలు మొదలగు వానితో హోమమారంభించవలెను. ఆ యాగ్రహములకు విహితము లగు సమిధలు. 1. (తెల్ల) జిల్లేడు 2. మోదుగు 3. చండ్ర 4. ఉమ్మెత్త 5. రావి 6. మేడి 7. జమ్మి 8. గరిక 9. దర్భలు. ఈ సమిధలు ప్రాదేశ మాత్ర దైర్ఘ్యము (ప్రాదేశము-లుడితి అని తెలుగులో వాడుక-కుడిచేతి బొటన వ్రేలు చూపుడు వ్రేలు వీటిని రెండు వైపులకును చాచగా ఏర్పడు పొడవు) కలిగి కొనలుగాని కొమ్మలు (చిల్లలు) గాని ఆకులు గాని లేక సూటిగా ఉండవలెను. ప్రతియొక ఆవాహిత దేవతకును ఈ సమిధలను తేనెతో-నేతితో-పెరుగుతో వేరువేరుగా తడిపి వేరువేరుగా నూట ఎనిమిది మారులుగాని నూట ఇరువది ఎనిమిది మారులుగాని వేల్చవలయును. (కనుక ఈ సంఖ్యకు సరిపోవునన్ని సమిధలు ఉండవలయును.)

కొనలు-కొమ్మలు (చిల్లలు) ఆకులు లేకుండు సమిధలు సేకరించుట ఈ గ్రహయజ్ఞమునందే కాదు-ప్రతి హవన కార్యమునందును ఇంతే.

(హవన విధానము): ప్రతి దేవతకును ప్రతి ఆహుతియందును ఋత్విక్కులు మంత్ర-దేవతా తత్త్వముల వర మార్థము (తాత్త్వికార్థము) నెరిగి దానికి దానికి విహితమయిన వేరువేరు మంత్రములను ఉపాంశువుగా (దగ్గరనున్న వారికి మాత్రము వినబడునట్లును- ఐనను స్పష్టముగా) ఉచ్చరించుచు సమిధలను వేల్చవలయును. ప్రతి ఆహుతితోను నేతిని చరుద్రవ్యమును భక్ష్యములు మొదలగు వానినికూడ చేర్చవలయును. ఆయా గ్రహములకును దేవతలకును విహితము లగు మంత్రములతో పది ఆహుతులను వ్యాహృతులతో మిగిలిన ఆహుతులను వేల్చవలెను. హోమము జరుపువిప్రులు ప్రాఙ్ముఖులుగానో ఉదఙ్ముఖులుగానో కూర్చుండవలెను. మొదట ప్రతి దేవతకును సిద్ధపరచిన చరుద్రవ్యమును ఆయా గ్రహములకును దేవతలకును విహితములగు మంత్రములతో అభిమంత్రించవలెను. పిమ్మట ఆ చరువుతో వేరువేరు దేవ తలకు హోమము జరిపి పిమ్మటనే హోమమునారంభించవలెను.

నవగ్రహాదీనాం హోమమన్త్రాః.

ఆకృష్ణేనేతి సూర్యాయ హోమః కార్యో ద్విజన్మనా. 38
ఆప్యాయస్వేతి సోమాయ మన్త్రేణ జుహుయా త్పునః ।
అగ్నిర్మూర్ధేతి భౌమాయ మన్త్రేణ జుహుయా త్తతః. 39
† ఉద్బుధ్యస్వేతిమన్త్రోఽయ ముక్త స్సోమసుతాయ వై ।
బృహస్పతే †అతియదర్యమన్త్రేణేతి గురోర్మతమ్. 40
⊙కయానశ్చిత్రఆభువదితి రాహో రుదాహృతమ్ । కేతుంకృణ్వన్నితి బ్రూయా త్కేతూనామపి శాన్తయే.
ఆవోరాజేతి రుద్రస్య బలిం హోమం సమారభేత్ । ఆపోహిష్ఠేత్యుమాయాస్తు స్యోనేతి స్వామిన స్తథా 43
విష్ణోరిదం విష్ణురితి త్వామిచ్ఛేతి స్వయమ్భువః । ఇన్ద్రమిద్ధరీవహత ఇతీన్ద్రాయ పరికీర్తితమ్. 44
తథా యమస్య చాయంగౌరితి హోమః ప్రకీర్తితః । కాలస్య బ్రహ్మజజ్ఞానమితిమన్త్రః ప్రశస్యతే. 45
చిత్రగుప్తస్య రాజానమితి వేదవిదో విదుః । అగ్నిం దూతం వృణీమహ ఇతి వహ్నే రుదాహృతః. 46
ఉదుత్తమంవరుణమిత్యపాం మన్త్రః ప్రశస్యతే । భూమేః పృథివ్యన్తరిక్షమితి వేదేషు వర్ణ్యతే. 47
సహస్రశీర్షా పురుష ఇతి విష్ణో రుదాహృతమ్ । ఇన్ద్రాయేన్ద్రమరుత్వ ఇతి శక్రస్య శస్యతే. 48
ఉత్తానపర్ణే సుభగ ఇతి శచ్యా స్సమాచరేత్ । ప్రజాపతేః పున ర్హోమః ప్రజాపత ఇతి స్మృతః. 49
*నమో అస్తు సర్పేభ్య ఇతి సర్పాణాం మన్త్ర ఉచ్యతే ।
ఏష బ్రహ్మా య ఋత్విజ ఇతి బ్రహ్మణ్యుదాహృతః. 50

† 'అగ్నే వివస్వదుషస' ఇతిసోమ † పరిదీయారథేనేతి ⊙ ఆన్నాత్పరిస్రుతేతి
*నమోఅస్తునాగేభ్యఇతినాగానాంమన్త్రఉచ్యతే

వినాయకస్య చానూన మితి మన్త్రో బుధై స్స్మృతః ।
జాతవేదసే సునవామ ఇతి దుర్గాయా మన్త్ర ఉచ్యతే. 51
ప్రాణానాం గ్రన్థిరసీతి ప్రాణస్య పరికీర్తితః । ఆదిత్ ప్రత్నస్య రేతస ఆకాశస్య ఉదాహృతః. 52
ఏషా ఉషా అపూర్వ్యా ఇతి అశ్వినో ర్మన్త్రఉచ్యతే। పూర్ణాహుతించ మూర్ధానం దివ ఇత్యభిపాతయేత్. 53

యజమానాభిషేకమన్త్రాః.

అథాభిషేకమన్త్రేణ వాద్యమఙ్గళగీతకైః । పూర్ణకుమ్భేన తేనైవ హోమాన్తే ప్రాగుదఙ్ముఖైః. 54
అవ్యఙ్గావయవైర్బ్రహ్మా హేమస్రగ్దామభూషితైః । యజమానస్య కర్తవ్యం చతుర్భి స్స్నపనం ద్విజైః. 55
సురా స్త్వా మభిషిఞ్చన్తు బ్రహ్మవిష్ణుమహేశ్వరాః । వాసుదేవో జగన్నాథ స్తథా సఙ్కర్షణో విభుః. 56
ప్రద్యుమ్న శ్చానిరుద్ధశ్చభవన్తు విజయాయ తే । ఆఖణ్డలోఽగ్ని ర్భగవా న్యమోవై నిరృతిస్తథా. 57
వరుణః పవనశ్చైవ ధనాధ్యక్ష స్తథా శివః । బ్రహ్మణా సహితా స్సర్వే దిక్పాలాః పాన్తు తే సదా. 58
కీర్తి ర్లక్ష్మీ ర్ధృతి ర్మేధా పుష్టి శ్శ్రద్ధా క్రియా మతిః । బుద్ధి ర్లజ్జా వపు శ్శాన్తి స్తుష్టిః కాన్తిశ్చ మాతరః. 59
ఏతా స్త్వా మభిషిఞ్చన్తు ధర్మపత్న్య స్సమాగతాః । ఆదిత్య శ్చన్ద్రమా భౌమ బుధజీవసితార్కజాః. 60
గ్రహా స్త్వా మభిషిఞ్చన్తు రాహుః కేతుశ్చ తర్పితాః । దేవదానవగన్ధర్వా యక్షరాక్షసపన్నగాః. 61
ఋషయో మునయో గావో దేవమాతర ఏవ చ । దేవపత్న్యో ద్రుమా నాగా దైత్యా శ్చాప్సరసాం గణాః.
అస్త్రాణి సర్వశస్త్రాణి రాజానో వాహనాని చ । ఔషధానిచ రత్నాని కాలస్యావయవాశ్చయే. 63
సరిత స్సాగరా స్సర్వే తీర్థాని జలదా నదాః । ఏతా స్త్వా మభిషిఞ్చన్తు సర్వకామార్థసిద్ధయే. 64

ఆయా గ్రహాదికమునకు హోమమంత్రములు : 1. సూర్యునకు-'ఆకృష్ణేన రజసా' 2. చంద్రునకు-'ఆప్యాయస్వ' 3. అంగారకునకు 'అగ్నిర్మూర్ధా' 4. బుధునకు-'ఉద్బుధ్యస్వ 5. గురునకు-"బృహస్పతే అతియదర్యా" 6. శుక్రునకు-'శుక్రంతే అన్యత్' 7. శనికి-'శంనోదేవీ'; 'శమగ్నిరగ్నిభిస్కరత్' అనునది వాడుకలో నున్నది. 8. రాహువునకు-'కయానశ్చిత్ర ఆభువత్' 9. కేతువునకు-'కేతుంకృణ్వన్'

అధి దేవతల హోమ మంత్రములు : 1. రుద్రునకు-'ఆవోరాజా' 2. ఉమకు-'ఆపోహిష్ఠా' 3. స్కందునకు-'స్యోనా పృథివీ' 4. విష్ణువునకు-'ఇదం విష్ణుః' 5. బ్రహ్మకు-'త్వామిచ్ఛా' 6. ఇంద్రునకు-'ఇంద్రమిద్దరీ' 7. యమునకు-'ఆయంగౌః' 8. కాలునకు-'బ్రహ్మజజ్ఞానం' 9. చిత్రగుప్తునకు-'రాజానమ్'

ప్రత్యధి దేవతలకు హోమ మంత్రములు: 1. అగ్నికి-'అగ్నిం దూతం వృణీమహే.' 2. జలములకు-'ఉదుత్తమంవరుణ' 3. భూమికి-'పృథివ్యంతరిక్షమ్' 4. విష్ణునకు-'సహస్రశీర్షా' 5. ఇంద్రునకు 'ఇంద్రమరుత్వ' 6. శచికి-'ఉత్తానపర్ణేసుభగే' 7. ప్రజాపతికి-'ప్రజాపతే' 8. సర్పములకు-'నమో అస్తు సర్పేభ్యః' 9. బ్రహ్మకు-'ఏష బ్రహ్మాయ ఋత్విజః'

వినాయకుడు మొదలగు ఐదుగురకు హోమ మంత్రములు: 1. వినాయకునకు-'అనూనమ్' 2. దుర్గకు 'జాతవేదసే సునవామ' 3. వాయువునకు-'ప్రాణానాం గ్రంథిరసి' 4. ఆకాశమునకు 'ఆదిత్ ప్రత్నస్యరేతసః' 5. అశ్వినులకు-'ఏషా ఉషా అపూర్వ్యా.'

పూర్ణాహుతికి మంత్రము-'మూర్ధానం దివః'
(ఈ చెప్పినవి అన్నియు ఆయా మంత్రముల ఆరంభములు)

## యజమానునకు అభిషేకము (స్నానము) జరుపు ప్రక్రియ:

హోమము ముగిసిన తరువాత అంగవైకల్యము లేకుండ బంగారు [illegible]

రించబడియున్న నలుగురు బ్రాహ్మణులు తూర్పునకో ఉత్తరమునకో మొగమై అభిషేక మంత్రములు పఠించుచు మంగళ వాద్యముల మ్రోతల నడుమ లోగడ చెప్పిన పూర్ణ కుంభమందలి జలముతో యజమానునకు స్నానము చేయింతురు. (అభిషేక మంత్రముల అర్థము:) బ్రహ్మ విష్ణు మహేశ్వరులు జగన్నాథుడగు వాసుదేవుడు సంకర్షణుడు ప్రద్యుమ్నుడు అనిరుద్ధుడు ఇంద్రాగ్నియమ నిరృతి వరుణ వాయు కుబేరేశ్వరులు బ్రహ్మ కీర్తి లక్ష్మీధృతి మేధాపుష్టి శ్రద్ధా క్రియా మతి బుద్ధి లజ్జా వపుః శాంతి తుష్టి కాంతులు సప్తమాతృకలు ఆదిత్య సోమాంగారక బుధగురు శుక్రశని రాహు కేతువులు దేవదానవ గంధర్వ యక్ష రాక్షస పన్నగులు ఋషిముని గోదేవమాతలు దేవపత్నులు వృక్షనాగ దైత్యాప్సరసలు అస్త్రములు శస్త్రములు రాజులు వాహనములు ఔషధములు రత్నములు కాలావయవములు నదీ సాగర పుణ్యతీర్థములు మేఘములు నదములు-ఇవి యన్నియు నిన్నభిషేకించి జయమును సర్వ కామార్థ సిద్ధులును కలిగించుగాక!

తత శ్శుక్లామ్బరధర శ్శుక్లమాల్యానులేపనః । సర్వౌషధై స్సర్వగన్ధై స్స్నాపితో ద్విజపుఙ్గవైః. 65
యజమాన స్సపత్నీక ఋత్విజస్తు సమాహితః । దక్షిణాభిః ప్రయత్నేన పూజయే ద్గతవిస్మయః. 66
సూర్యాయ కపిలాం ధేనుం శఙ్ఖం సోమాయ దాపయేత్ ।
భౌమాయ రక్తవృషభం సోమపుత్రాయ కాఞ్చనమ్. 67
గురవే పీతవాసాంసి శుక్రాయాశ్వంతు దాపయేత్ । కృష్ణాయ కృష్ణగౌ ర్దేయా శుభలక్షణసంయుతా. 68
ఆయసం రాహవే దద్యా త్కేతుభ్య శ్ఛాగ ముత్తమమ్ । సువర్ణేన సమాః కార్యా యజమానేన దక్షిణాః. 69
సర్వేషా మథవా గావో దాతవ్యా హేమభూషితాః । సువర్ణ మథవా దద్యా ద్గురుర్వా యేన తుష్యతి. 70

కపిలాదిధేనుదానమన్త్రాః.

స్వమన్త్రైణైవ దాతవ్యా స్సర్వాస్సర్వత్ర దక్షిణాః । కపిలే సర్వధేనూనాం పూజనీయాఽసిరోహిణీ. 71
సర్వతీర్థమయీ యస్మా దత శ్శాన్తిం ప్రయచ్ఛమే। పుణ్యస్త్వం శఙ్ఖ పుణ్యానాం మఙ్గళానాంచ మఙ్గళః. 72
విష్ణునా విధృతో నిత్యమత శ్శాన్తిం ప్రయచ్ఛ మే । ధర్మ త్వం వృషరూపేణ జగదానన్దకారక. 73
అష్టమూర్తే రధిష్ఠాన మత శ్శాన్తిం ప్రయచ్ఛ మే । హిరణ్య గర్భగర్భస్త్వం హేమ బీజం విభావసోః. 74
అనన్తపుణ్యఫలద మత శ్శాన్తిం ప్రయచ్ఛ మే । పీతవస్త్రయుగం యస్మా ద్వాసుదేవస్య వల్లభమ్ 75
ప్రదానా త్తస్య మే విష్ణో రత శ్శాన్తిం ప్రయచ్ఛ మే । విష్ణో త్వ మశ్వరూపేణ యస్మా దమృతసమ్భవః.
ఇన్ద్రార్కవాహనం నిత్య మత శ్శాన్తిం ప్రయచ్ఛ మే। యస్మా త్త్వం పృథివీ సర్వా ధేనుః కేశవసన్నిభా.
సర్వపాపహరా నిత్య మత శ్శాన్తిం ప్రయచ్ఛ మే । గవా మఙ్గేషు తిష్ఠన్తి భువనాని చతుర్దశ. 78
యస్మా త్తస్మా చ్ఛివం మే స్యా దత శ్శాన్తిం ప్రయచ్ఛమే। యస్మా దాయస కర్మాణి తవాధీనాని సర్వదా.
లాఙ్గలా న్యాయుధాదీని తస్మా చ్ఛాన్తిం ప్రయచ్ఛమే । యస్మా త్త్వం సర్వయజ్ఞానా మఙ్గత్వేన వ్యవస్థితః.
యానం విభావసో ర్నిత్య మత శ్శాన్తిం ప్రయచ్ఛ మే । యస్మా దశూన్యం శయనం కేశవస్య శివస్యచ. 80
తస్మా న్మమాప్యశూన్యం స్యా ద్దానా జ్జన్మని జన్మని । యథా సర్వేషు రత్నేషు సర్వే దేవా వ్యవస్థితాః. 82
తథా శాన్తిం ప్రయచ్ఛన్తు రత్నదానేన మే సురాః । యథా భూమిప్రదానస్య కళాం నార్హన్తి షోడశీమ్. 83
దానా న్యన్యాని యే శాన్తి ర్భూమిదానా ద్భవత్విహ। ○ఏవం సమ్పూజయిత్వాతు విప్రా న్మాత్సర్యవర్జితః.
వస్త్రాలఙ్కారరత్నాద్యై ర్మాల్యగన్ధానులేపనైః । అనేన విధినా యస్తు గ్రహయజ్ఞం సమాచరేత్. 85
సర్వా న్కామా నవాప్నోతి ప్రేత్య స్వర్గే మహీయతే। యస్తు పీడాకరో నిత్య మల్పవిత్తస్య వా గ్రహః. 86

---

○ఏవం సమ్పూజయేద్భక్త్యా విత్తశాఠ్య వివర్జితః.

తంచ యత్నేన సమ్పూజ్య శేషా న వ్యర్చయే ద్గ్రహాన్ ।
గ్రహా గావో నరేన్ద్రాశ్చ బ్రాహ్మణాశ్చ విశేషతః. 87
పూజితాః పూజయన్త్యేతే నిర్దహ న్త్యవమానితాః ।
తస్మా న్న దక్షిణాహీనం కర్తవ్యం భూతి మిచ్ఛతా. 88
సమ్పూర్ణయా దక్షిణయా యస్మాదేకోఽపి తృప్యతి । సదైవాయుతహోమోఽయం నవగ్రహమఖే స్థితః.
వివాహోత్సవయజ్ఞేషు ప్రతిష్ఠాదిషు కర్మసు । నిర్విఘ్నార్థం మునిశ్రేష్ఠ తథోద్వేగాద్భుతేషు చ. 90

యజమానుడు ఇట్లు నర్వ గంధ యుక్తములును నర్వౌషధీ నంస్కృతములునునగు జలములతో విప్రులు తను స్నానము చేయించగా శుక్ల వస్త్రములును శుక్ల మాల్యాను లేపనములను ధరించి తన భార్యతో కూడి శ్రద్ధా యుక్తుడై ఋత్విజులను ప్రయత్న పూర్వకముగాను అభిమాన రహితముగాను దక్షిణలతో గౌరవించవలెను. సూర్యునకు కపిల ధేనువును (ధేనువు అనగా పాడియావు) చంద్రునకు శంఖమును కుజునకు ఎర్రని వృషభమును బుధునకు బంగారును గురునకు పసుపు పచ్చని వస్త్రములను శుక్రునకు అశ్వమును శనికి శుభ లక్షణములు కల నల్లని యావును రాహువునకు ఇనుమును కేతువునకు మంచి మేకపోతును ఈయవలెను. ఇదికాక ద్రవ్య రూపమున దక్షిణగా ఋత్విజుల కందరకు నమాన పరిమాణములో బంగారమును కాని బంగారు (కొమ్ముల)తో అలంకరించబడిన గోవును (ఒక్కొక్కరికి ఒక్కొక్కటి) కాని ఈయవలెను. గురునకు బంగారుగాని ఆవులనుగాని అతనికి నంతోషకరమైనది మరేదైన దక్షిణ కాని ఈయవలెను.

ఏ దక్షిణనైనను వాటికి వేరువేరుగా విహితమయిన మంత్రముతో ఈయవలెను. 1. కపిల గోవునకు: కపిల గోవా! నీవు నర్వధేనువులలో పూజనీయవు; రోహిణివి (ఎర్రని వన్నెగల దానవు;) నర్వ తీర్థమయురాలవు; ఇట్టి నీవు మాకు శాంతి నిమ్ము; 2. శంఖమునకు: శంఖమా! పుణ్యకరములైన వానిలో పుణ్యకరమయిన దానవు; శుభకరమయిన వానిలో శుభకరమయినదానవు; నిరతమును విష్ణునిచే ధరించబడుదానవు; ఇట్టి నీవు నాకు శాంతినిమ్ము. 3. వృషభము నకు: వృషభ రూపముననుండి జగదానంద కారకుడవగు ధర్మదేవా! నీవు అష్టమూర్తి యగు శివునకు అధిష్ఠాన (వాహన) మవు; ఇట్టి నీవు మాకు శాంతి కలిగింపుము. 4. స్వర్ణమునకు: సువర్ణము బ్రహ్మదేవుని గర్భమునందుండునది; అగ్నికి బీజరూపమయినది; అనంతమగు పుణ్యఫలమునిచ్చునది; ఇట్టి నీవు నాకు శాంతినిమ్ము. 5. పీతాంబరములకు: పీతాం బరముల జత వాసుదేవునకు ప్రియమైనది; విష్ణుదేవుని దానవగు నిన్ను ఇచ్చుటవలన నీవు నాకు శాంతినిమ్ము. 6. అశ్వము నకు: అమృతముతోపాటు జన్మించిన అశ్వరూపమగు విష్ణూ! నీవు నదా ఇంద్రునకును రవికిని వాహనమవు; ఇట్టి నీవు మాకు శాన్తినిమ్ము. 7. శనికి దానము చేయు కృష్ణగోవునకు: నీవే భూమి యంతయు నయియున్నావు; ధేను రూపమవు; విష్ణు నమానురాలవు; నర్వపాపహరవు; ఇట్టి నీవు మాకు శాంతినిమ్ము; చతుర్దశ భువనములును గోవుల అవయవముల యందే ఉండును. నీవలననే శుభము కలుగును; ఇట్టి నీవు మాకు శాంతినిమ్ము. 8. ఇనుమునకు: ఆయసమా! అన్ని పనులును నాగళ్ళు ఆయుధములు మొదలగున వన్నియును నీయధీనములై యున్నవి. ఇట్టి నీవు మాకు శాంతినిమ్ము; 9. ఛాగమునకు: నీవు అన్ని యజ్ఞములకును అంగమయి యున్నావు; అగ్నికి వాహనమవు; ఇట్టి నీవు మాకు శాంతి నిమ్ము; 10. శయ్యాదానమునకు: శివకేశవుల శయనము ఎన్నడును అశూన్యమై యుండును. కావున వారి దయచే అట్లే జన్మజన్మముల నా శయనము కూడ అశూన్యమయి యుండుగాక! 11. రత్న దానమునకు: నర్వ రత్నములయందును నర్వదేవతలును సన్నిహితులై యుందురు; కావున వారందరును నేచేయు రత్న దానముచే నాకు శాంతినిత్తురుగాక! 12. భూదానమునకు: ఇతర దానము లేవియు భూదానములోని పదునారవవంతునకు నరిపోలవు; కావున భూదానముచే నాకు శాంతి లభించుగాక!

యజమానుడు మాత్సర్యము (పోటీభావము) లేక భక్తితో విప్రులను వస్త్రాలంకార రత్న గంధ మాల్యాను లేపనములతో నంపూజించవలయును.

ఈ విధానమున గ్రహ యజ్ఞము నాచరించువాడు ఇహమున సర్వకామములను పూర్ణములనొనర్చుకొని పర మున స్వర్గమున పూజితుడై సుఖించును.

ఎంత అల్పధనుడైనను తను ఎడతెగక పీడించుచుండు గ్రహమును యథాశక్తిగ పూజించి ఇతర గ్రహము లను కూడ అర్చించవలయును.

గ్రహములును గోవులును ప్రభువులును విశేషించి బ్రాహ్మణులును పూజితులయినచో తమ్ము పూజించినవారిని తామును పూజింతురు. (ప్రీతితో చూచెదరు.) అవమానింపబడినపుడు తమ్మవమానించిన వానిని తామును అవమానింతురు. (సుఖింపజేయవలెనని తలచరు.) కావున (ఏ కర్మమునగాని) క్షేమము కలుగవలెననుకొనినవాడెవ్వడు దక్షిణాహీనముగ కార్యము నాచరించరాదు. ఏలయన సంపూర్ణమగు దక్షిణతో ఒక్కడైనను తృప్తినొందినను దానిచే యజమానునకు క్షేమము కలుగును.

నవగ్రహ మఖమను పేరుతో ప్రసిద్ధమయియున్న ఈ ★అయుత హోమము వివాహములు ఉత్సవములు యజ్ఞములు ప్రతిష్ఠలు విఘ్నములు ఉద్వేగము అద్భుత దర్శనములు మొదలగు సందర్భములందు క్షేమమును శుభమును కలిగించును.

లక్షహోమవిధిః

కథితోఽయుత హోమోఽయం లక్షహోమ మత శ్శృణు ।
వైశమ్పాయనః : సర్వకామాప్తయే యస్మా ల్లక్షహోమం విదు ర్బుధాః. 91
పితౄణాం వల్లభం సాక్షా ద్భుక్తిముక్తిఫలప్రదమ్। గ్రహతారాబలం లబ్ధ్వా కృత్వా బ్రాహ్మణవాచనమ్.92
గృహస్యోత్తరపూర్వేణ మణ్డపం కారయేద్బుధః । రుద్రాయతన భూమౌవా చతురస్ర ముదఙ్ముఖమ్. 93
దశ హస్త మథాష్టౌవా హస్తా న్కుర్యా ద్విధానతః ।
ప్రాగుదక్ప్రవణాం భూమిం కారయే ద్యత్నతో నరః. 94
పాగుత్తరం సమాసాద్య ప్రదేశం మణ్డపస్యతు । శోభనం కారయే త్కుణ్డం యథావ ల్లక్షణాన్వితమ్. 95
నవగ్రహమఖే కుణ్డం హస్తమాత్రం ప్రశస్యతే । చతురస్రం సమం కుర్యా ద్యోనివక్త్రం సమేఖలమ్. 96
చతురఙ్గుళవిస్తారా మేఖలా తద్వ దుచ్ఛ్రితా । ప్రాగుదక్ప్రవణా కార్యా సర్వత స్సమవిస్తృతా. 97
శాన్త్యర్థం సర్వలోకానాం నవగ్రహమఖ స్స్మృతః । మానహీనాధికం కుణ్డమనేకభయదం భవేత్. 98
యస్మాత్తస్మా త్సుసమ్పూర్ణం శాన్తికుణ్డం విధీయతే । అస్మా ద్దశగుణః ప్రోక్తో లక్షహోమ స్స్వయమ్భువా.
ఆహుతీభిః ప్రయత్నేన దక్షిణాభి స్తథైవచ । ద్విహస్తవిస్తృతం తద్వ చ్చతుర్హస్తాయతం పునః. 100
లక్షహోమే భవే త్కుణ్డం యోనివక్త్రం సమేఖలమ్ । తస్యైవోత్తరపూర్వేణ వితస్తిత్రయసమ్మితమ్. 102
ప్రాగుదక్ప్రవణం తద్వ చ్చతురస్రం సమన్తతః । విష్కమ్భస్యోచ్ఛ్రితం ప్రోక్తం స్థణ్డిలం విశ్వకర్మణా.
సంస్థాపనాయ దేవానాం వప్రత్రయసమావృతమ్ । ద్వ్యఙ్గుళోచ్ఛ్రితో వప్రః ప్రథమ స్సముదాహృతః. 103
అఙ్గుళోచ్ఛ్రయసంయుక్తం వప్రద్వయ మథోపరి । త్ర్యఙ్గుళ స్తస్య విస్తార స్సర్వేషాం కథ్యతే బుధైః. 104
దశాఙ్గుళోచ్ఛ్రితా భిత్తి స్స్థణ్డిలస్య తథోపరి ।

★ ఈ యాగ ప్రక్రియయందు ఆవాహన ప్రతిష్ఠాపన పూజనములందుకొను గ్రహ దేవతాదికము ముప్పది రెండు మంది. వీరికి దధి-మధు-సర్పిస్సులలో వేరువేరుగ ముంచిన సమిధలతో నూట ఎనిమిదికాని నూట ఇరువది ఎనిమిదికాని ఆహుతులను వేల్చవలెను. $32 \times 3 \times 108 = 10368$; లేదా $32 \times 3 \times 128 = 12288$ అగును; ఇది కొంచెమెక్కువగా ఆయుతము $= 10000$ అగుచున్నది. కనుక ఈ హోమమునకు అయుత హోమమను వ్యవహారము ఏర్పడినది.

## లక్షహోమమను గ్రహయజ్ఞము.

ఇంతవరకును అయుత హోమ గ్రహయజ్ఞ విధానము తెలిపితిని. ఇకమీదట లక్ష హోమ విధానమును తెలిపెదను. ఇది సర్వ కామముల నెరవేర్చునది. పితృదేవతలకు ప్రీతికరమయినది. సాక్షాత్‌గా (మరియొక కర్మ సాధనముతో పనిలేక) భుక్తిముక్తిఫలము నిచ్చునది.

శుభ దినమున తారాబల గ్రహబలములు కల శుభ సమయమున బ్రాహ్మణులచేత పుణ్యాహవాచనము జరిపించి ఈ కార్యమారంభించవలయును. యజమానుడు తన ఇంటికి ఈశాన్యమున గాని శివాలయ ప్రదేశమున గాని చతురస్రముగ ఉదఙ్ముఖముగా (ఉదక్ప్లవముగా-ఉత్తరపు వైపునకు వాలుగా) ఉండు మండపమును నిర్మించవలయును. ఆ మండపపు భుజము పది హస్తములుగాని ఎనిమిది హస్తములు కాని ఉండవలయును. వీలునుబట్టి మండపపు నేల ఉత్తరమునకో తూర్పునకో వాలుగా ఉండునట్లు చూడవలయును. ఈ మండపమునకు ఈశాన్యమున లక్షణ యుక్తమును హస్త మాత్రము పొడుగు వెడల్పు లోతులుకల కుండమును యోని రూపమగు ముఖముతో (యోని = త్రిభుజము-Triangle)తో నిర్మించవలయును. ఈ కుండమునకు నాలుగు వైపులను మేఖల (అంచుకట్ట) నాలుగు భారతీయాంగుళముల వెడల్పు ఎత్తులతో ఏర్పరచవలయును. (1 భారతీయాంగుళము = 8 యవోదరములు-యవలు అడ్డముగా ఒకదాని ప్రక్కను మరియొకటి ఉంచగా ఏర్పడు దూరము.) ఈ మేఖలయును ఉత్తరమునకుగాని తూర్పునకు గాని వాలుగాను అంతట ఒకే కొలతతో ఉండవలయును. (అనగా ఆ మేఖల వెంట వెలుపలకు గాని లోపలికి గాని నడుమ నడుమ పెంపుదల దిబ్బలవంటివి ఉండరాదు.) ఇంత చెప్పుట ఏలయన నవగ్రహ మఖము సర్వలోక శాంతికై చేయునది కావున అది కొలతలలో ఎక్కువగాని తక్కువగాని యున్నచో శాంతి కలిగించకపోగా భయము కలిగించును. కనుక శాంతి ప్రక్రియకై నిర్మించు కుండము మిక్కిలి సంపూర్ణముగను శాస్త్రీయముగను నుండవలయును. (దీనియందలి కొలతలు మాత్రము అయుత హోమ విధానమునకు సంబంధించినవి.)

అయుతహోమగ్రహయజ్ఞమునందలి ఆహుతులకు పదిరెట్లు ఆహుతులు కలది లక్ష హోమ గ్రహయజ్ఞము. ఋత్విక్సంఖ్య కూడ పదింతలు ఉండును కావున యథాశక్తిగ దక్షిణలును అయుతహోమమునందుకంటె పదింతలుగా ఉండవలయును. ఈ లక్ష హోమ గ్రహ యజ్ఞమునకై మండపమునకు ఈశాన్యమున రెండు హస్తముల వెడలుపు నాలుగు హస్తముల పొడవుగల దీర్ఘ చతురస్రాకారపు కుండము (లోతు చెప్పబడలేదు.) త్రవ్వవలెను. దానికి ముందు యోని రూపమయిన ముఖమును కుండము చుట్టు పైని చెప్పినట్లు మేఖలయు ఉండవలయును. ఈ కుండమునకు ఈశాన్యమున మూడు జేనల కొలతతో చతురస్రాకారపు అరుగును ఉత్తరమునకుగాని తూర్పునకుగాని వాలుగా దేవతాఽఽవాహన ప్రతిష్ఠాపనములకై ఏర్పరచవలయును. దీనికి చుట్టును మూడు ప్రాకారములుండవలెను. అన్నిటిలో మొదటిది స్థండిలమునకు వెలుపల రెండు అంగుళములు దానికి వెలుపలిది (నడుమది)యు-దానికి వెలుపలిది (అన్నిటిలో బయటిది)యు ఒక్కొక్క అంగుళము ఎత్తున ఉండవలెను. స్థండిలముపై దాని బయటి అంచుమీద పది అంగుళముల ఎత్తున ప్రాకారము ఉండవలెను. వెడల్పు మాత్రము అన్నిటికిని మూడంగుళములే.

తస్మిన్నావాహయే ద్దేవా న్పూర్వవ త్పుష్పతణ్డులైః. 105
ఆదిత్యాభిముఖా న్సర్వా న్సాధిప్రత్యధిదేవతాః । స్థాపనీయా మునిశ్రేష్ఠ నాన్తరేణ వరాఙ్ముఖాః. 106
గరుత్మా నధిక స్తత్ర సమ్పూజ్య శ్శ్రియ మిచ్ఛతా । సామధ్వనిశరీర స్త్వం వాహనం వరమేష్ఠినః. 107
విషపాపహరో నిత్య మతశ్శాన్తిం ప్రయచ్ఛమే ।
పూర్వవత్కుమ్భ మామన్త్ర్య తద్వ ద్ధోమం సమాచరేత్. 108
సహస్రాణాం శతం హుత్వా సమిత్సఙ్ఖ్యాదికం పునః । ఘృతకుమ్భం వసోర్ధారాం పాతయే దనలోపరి.109

ఔదుమ్బరీ మథార్ద్రాంచ ఋజ్వీం కోటరవర్జితామ్ ।

బాహుమాత్రాం స్రుచం కృత్వా న్యసే త్స్తమ్భద్వయోపరి. 110

ఘృతధారాం తత స్సమ్య గగ్నే రుపరి పాతయేత్ । శ్రావయేత్సూక్తమాగ్నేయం వైష్ణవం రుద్రమైన్దవమ్.

మహావైశ్వానరం సామ జ్యేష్ఠసామచ పాఠయేత్ । స్నానంచ యజమానస్య పూర్వవ త్స్వస్తివాచనమ్.

దాతవ్యా యజమానేన పూర్వవ ద్దక్షిణా పృథక్ । కామక్రోధవిహీనేన ఋత్విగ్భ్య శ్శాన్తచేతసా. 113

నవగ్రహమఖే విప్రా శ్చత్వారో వేదవాదినః । అథవా ఋత్విజౌ శాన్తౌ ద్వావేవ శ్రుతికోవిదౌ. 114

కార్యా వయుతహోమేచ న ప్రసజ్యేత విస్తరమ్(రే) । తద్వ ద్ద్వాదశ వాష్టౌ వా లక్షహోమే తు ఋత్విజః.

కర్తవ్యా శ్శక్తిత స్తద్వ చ్చతురో వా విమత్సరాః ।

ఈ స్థండిలమునందు వెనుకటివలె పూవులతో తండులములతో గ్రహతదధిదేవతా ప్రత్యధి దేవతలు ఆవాహితులై వీరెల్లరును ఆదిత్యునకుఅభిముఖులై యుండవలయును. అంతేకాని రవికి వీరిలో నెవరును పెడమొగమయి యుండరాదు. ఈ లక్ష హోమ విధానమునందు గరుత్మంతు నధికముగా నావాహనము చేయుటవలన అధిక క్షేమము కలుగును. (గరుడా వాహన మంత్రార్థము:) "నీవు సామవేద శరీరుడవు; పరమేష్ఠి (విష్ణునకు) వాహనమవు; సదా విషహరుడవు; పాపహరుడవు: కావున ఇట్టి నీవు మాకు శాంతిని కలిగింపుము." వెనుకటివలెనే యజమానుని స్నానము నకై జలకుంభమును సిద్ధపరచి ఆమంత్రించవలెను. పిమ్మట హోమమాచరించవలెను. లక్ష సమిధలను లెక్కించి ఆహుతులవేల్చి ఘృత కుంభమును వసు ధారను (ఆయా నాణెములు కాని వెండి బంగారు రత్నములు కాని ధారగా) అగ్నిపై పడవేయవలెను. వంకరలేనిదియు తొర్రలు లేనిదియు భుజ మాత్రము పొడవు కలదియునగు పచ్చి మేడి కర్రను స్రుక్‌గా చేసి (మండపపు) రెండు స్తంభముల మీదకు వచ్చునట్లు ఉంచవలెను. అట్లే హోమ సమయమునందు చక్కగా నేతిధారను కూడ అగ్నిపై వదలవలెను. అగ్ని విష్ణు రుద్ర సూక్తములను మహా వైశ్వానర సామ జ్యేష్ఠ సామములను పఠించవలయును. వెనుకటివలెనే యజమానున కభిషేకమును స్వస్తి వాచనమును జరుపవలెను. వెనుకటి వలెనే యజమానుడు కామక్రోధ రహితమగు శాంత చిత్తముతో ఋత్విక్కులకు వేరువేరుగా దక్షిణల నీయవలెను.

అయుత హోమము అనెడు నవగ్రహ మఖ (యజ్ఞ) మునందు వేదవాదులు శాంతులగు నలుగురుగాని ఇద్దరే కాని ఋత్విక్కులు చాలును. అంతకంటె విస్తరమక్కరలేదు. అట్లే లక్ష హోమ విధానమునందు పండ్రెండు మందికాని ఎనిమిది మందికాని నలుగురేకాని చాలును.

నవగ్రహమఖే సర్వం లక్షహోమే దశోత్తరమ్. 116

భక్త్యా దద్యా న్మునిశ్రేష్ఠ భూషణాన్యపి శక్తితః । సువస్త్రాణిచ హైమాని కటకానిచ శక్తితః. 117

కర్ణాఙ్గుళీయచిత్రాణి కణ్ఠసూత్రాణి శక్తిమాన్ । న కుర్యా ద్దక్షిణాహీనం విత్తశాఠ్యేన మానవః. 118

అదద ల్లోభమోహాత్తు కులక్షయ మవాప్నుయాత్ । అన్నదానం యథాశక్త్యా దాతవ్యం భూతి మిచ్ఛతా.

అన్నహీనః కృతో యస్మా ద్దుర్భిక్షఫలదో భవేత్ । అన్నహీనో దహే ద్రాష్ట్రం మన్త్రహీనస్తు ఋత్విజః.

యజమాన మదాక్షిణ్యో నాస్తి యజ్ఞసమో రిపుః । అతో నాల్ప ధనః కుర్యా ల్లక్షహోమం నరః క్వచిత్.

తస్మా త్పీడాకరో నిత్యం య ఏవ భవతి గ్రహః । తమేవ పూజయే ద్భక్త్యా ద్వౌ వా త్రీన్వా యథావిధి.

ఏక మభ్యర్చయే ద్భక్త్యా బ్రాహ్మణం వేదపారగమ్ । దక్షిణాభిః ప్రయత్నేన బహూనప్యల్పవిత్తవాన్.

లక్షహోమస్తు కర్తవ్యో యథా (దా) విత్తం భవే ద్గృహే ।

యత స్సర్వా నవాప్నోతి సర్వా న్కామా న్విధానతః. 124

పూజ్యతే శివలోకేచ వస్వాదిత్యమరుద్గణైః । యావత్కల్పశతా న్యష్టౌ తత మోక్ష మవాప్నుయాత్. 125

సకామో యస్త్విమం కుర్యా ల్లక్షహోమం యథావిధి ।
సర్వా న్కామా నవాప్నోతి పద మానన్త్య మశ్నుతే. 126
పుత్త్రార్థీ లభతే పుత్త్రాన్ ధనార్థీ లభతే ధనమ్ । భార్యార్థీ శోభనాం భార్యాం కుమారీ శోభనం పతిమ్. 127
భ్రష్టరాజ్య స్తథా రాజ్యం శ్రీకామ శ్శ్రియ మాప్నుయాత్ ।
యం యం కామయతే కామం సవై భవతి పుష్కలః. 128
నిష్కామః కురుతే యస్తు స పరం బ్రహ్మ గచ్ఛతి ।

మిగిలిన అంశములన్నియు లక్ష హోమ విధానమునందు అయుత హోమ విధానమునందుకంటె పది రెట్లుండవలయును. భక్తితో మంచి వస్త్రములను బంగారు సొమ్ములను కడియములను చెవి పోగులను ఉంగరములను కంఠసూత్రములను కూడ శక్తియున్నచో ఈయవలయును. శక్తి ఉండియు కొంచెతనముతోను లోభముతోను దక్షిణల విషయమున కొరత చేయరాదు. లోభ మోహములచే సరిగా దక్షిణలనీయనిచో కులక్షయమగును.

తనకు క్షేమము కలుగవలెనని కోరువాడు యథాశక్తిగా అన్నదానమును చేయవలెను. ఏలయన అన్నదాన హీనముగా చేసిన కార్యము వలన దుర్భిక్షము కలుగును. అన్నహీనముగా జరిపిన యజ్ఞము రాష్ట్రమును మంత్రహీన యజ్ఞము ఋత్విక్కులను దక్షిణలు కొరతగా జరిగిన యజ్ఞము యజమానుని దహించును. కొరతలతో జరిగిన యజ్ఞము వంటి శత్రువు (అపకారకము) మరియొకటిలేదు.

(అశక్తుని విషయము:) ఈ కారణములచేత తగినంత ధనము లేనివాడు ఎప్పుడు ఎట్టి స్థితియందును లక్ష హోమగ్రహ యజ్ఞము చేయరాదు. తనకు పీడాకరములుగా నున్న ఒకటి రెండు మూడు గ్రహములను మాత్రమే (తనకు గల శక్తిని బట్టి) యథావిధిగ పూజించవలెను. వేద పారంగతుడగు ఒకే బ్రాహ్మణునైన (ఎక్కువమందికి మారుగా) దక్షిణలతో అర్చించవలెను.

లక్ష హోమగ్రహ యజ్ఞపు విశిష్టత: యజమానుడు తనకు ఇంటియందుగల ధనావకాశమును బట్టి లక్షహోమ గ్రహ యజ్ఞమును యథావిధిగా చేయవలెను. దీనిని సరిగా నాచరించినచో ఇహమున సర్వకామ ప్రాప్తియగును. పరమునను ఎనిమిది వందల కల్పముల కాలము వస్వాదిత్య మరుద్గణములచే పూజింపబడుచు శివలోకమున సుఖించును. పిమ్మట ముక్తిని పొందును. సకామముగా (అనగా-కోరికలు తీరవలెనని సంకల్పించి) ఈ లక్ష హోమ గ్రహయజ్ఞమును యథావిధిగా జరిపించుకొనినచో సర్వ కామములును నెరవేరి అనంతమగు (మోక్ష) స్థానమును పొందును. పుత్త్రార్థి పుత్త్రులను ధనార్థి ధనమును భార్యార్థి శోభనయగు భార్యను కుమారి శోభనుడగు పతిని భ్రష్టరాజ్యుడు మరల రాజ్యమును శ్రీకాముడు (కీర్తి-ఆయువు-ఆరోగ్యము మొదలగువానిచే ప్రకాశము కోరువాడు) అట్టి శ్రీని పొందును. ఇట్లు ఏ ఏ కోరిక కోరినచో అది ఎల్ల పుష్కలముగ నెరవేరును. నిష్కాముడై ఆచరించువాడు పరబ్రహ్మ సాయుజ్యమును పొందును.

### కోటిహోమవిధిః

తస్మా చ్ఛతగుణః ప్రోక్తః కోటిహోమ స్స్వయమ్భువా. 129
ఆహుతిభిః ప్రయత్నేన దక్షిణాభిః ఫలేనచ । పూర్వవ ద్గ్రహదేవానా మావాహనవిసర్జనమ్. 130
హోమమన్త్రా స్త ఏవోక్తా స్స్నానే దానే తథైవచ । కుణ్డమణ్డపవేదీనాం విశేషోఽయం నిబోధ మే. 131
కోటిహోమే చతుర్హస్తం చతురశ్రం సమన్తతః । యోనిచక్రద్వయోపేతం తద ప్యాహు స్త్రిమేఖలమ్. 132
ద్వ్యఙ్గులాభ్యు చ్ఛ్రితా కార్యా ప్రథమా మేఖలా బుధైః ।
త్ర్యఙ్గులాభ్యుచ్ఛ్రితా తద్వ ద్ద్వితీయా పరికీర్తితా. 133
ఉచ్ఛ్రయే విస్తరే చైవ తృతీయా చతురఙ్గులా । ద్వ్యఙ్గుళశ్చైవ విస్తారః పూర్వమేవ ప్రశస్యతే. 134

వితస్తిమాత్రా యోని స్స్యా త్తత్సప్తాఙ్గుల విస్తృతా ।
కూర్మ పృష్ఠోన్నతా మధ్యే పార్శ్వయో శ్చాఙ్గులోచ్ఛ్రితా. 135
గజాస్యసదృశీ తద్వ దాయతా చ్ఛిద్రసంయుతా । ఏతత్సర్వేషు కుణ్డేషు యోనిలక్షణ ముచ్యతే. 136
మేఖలోపరి సర్వత్ర అశ్వత్థదళసన్నిభమ్ । వేదిశ్చ కోటిహోమే స్స్యా ద్వితస్తీనాం చతుష్టయమ్. 137
చతురశ్రం సమన్తాత్తు త్రిభి ర్వప్రై స్సమానతః । వప్రమానం చ పూర్వోక్తం వేదీనాంచ తథోచ్ఛ్రయాః.
తథా షోడశ హస్త స్స్యాన్మణ్డపశ్చ చతుర్ముఖః ।

## కోటి హోమగ్రహ యజ్ఞము

ఈ చెప్పిన లక్ష హోమగ్రహ యజ్ఞమునకు నూరింతలగునది కోటి హోమగ్రహ యజ్ఞమని స్వయంభూబ్రహ్మ చెప్పెను. ఆహుతులు-దక్షిణలు-కలుగు ఫలము-అన్ని విషయములందును ఇది దానికి నూరింతలుగానుండును.

దీనియందును గ్రహములు-తదధిదేవతా ప్రత్యధిదేవతలు-వీరి ఆవాహన విసర్జనములందు హోమమునందు స్నాన దానములందు వినియోగించవలసిన మంత్రములును జరుపవలసిన ప్రక్రియయు లక్ష హోమమునందువలెనే యుండును. కుండము మండపము-వేదికలు-వీని విషయమున మాత్రము భేదము కలదు; అది తెలిపెదను.

కోటిహోమమునందు కుండము చతురస్రముగా నాలుగు హస్తములు పొడవు వెడలుపు లోతులు కలిగి ఉండ వలెను. దానికి అంగములుగా యోని చక్రములు రెండుండవలెను. కుండమునకు చుట్టును మేఖలలు (వప్రములు-కుండ మునకు నలువైపులనుండు అంచు కట్టలవంటి చిరుగోడలు) మూడుండవలెను. వీనిలో (లోపలినుండి) మొదటిది రెండంగు ళములు రెండవది మూడంగుళములు మూడవది నాలుగంగుళములు ఎత్తు కలిగియుండవలెను. వెడల్పు వరుసగా రెండు-రెండు-నాలుగు-అంగుళములుండవలెను. యోని లక్షణము: ఏనుగు ముఖమువలె త్రిభుజాకారము కలిగి తాబేటి వీపు వలె నడుమ ఎత్తుగను రెండు ప్రక్కలందును తక్కువ ఎత్తుతో నుండవలెను. దీని ఎత్తు (నడుమ భాగమున) వితస్తి (జేనెడు-పంద్రెండంగుళములు) ఒక్కొక్క భుజపు కొలత ఆరు కాని ఏడు కాని అంగుళములుండవలెను. రంధ్రములు నుండవలెను. ఇది అన్ని కుండముల విషయమునను కుండమునకు ముందుండవలసిన యోనుల లక్షణము. ప్రతియొక మేఖలమీదను అచటనచట రావి ఆకు ఆకృతిని ఏర్పరచవలెను. కోటి హోమగ్రహ యజ్ఞమునందు వేది నాలుగు వితస్తుల (వితస్తి = 12 భారతీయాంగుళములు) కొలతకల భుజములతో చతురస్రముగా ఉండవలెను. వప్రముల (మేఖలల) ఎత్తును వేదికల ఎత్తును లోగడనే చెప్పబడినది. మండపము పదునారు హస్తముల భుజములతో చతురస్రముగా ఉండవలెను.

పూర్వద్వారేచ సంస్థాప్య బహ్వృచం వేదపారగమ్. 139
యజుర్విదం తథా యామ్యే పశ్చిమే సామవేదినమ్ । అథర్వవేదినం తద్వ దుత్తరే స్థాపయే ద్బుధః. 140
అష్టౌచ హోమికాః కార్యా వేదవేదాఙ్గవేదినః । ఏవం ద్వాదశ తా న్విప్రా న్వస్త్రమాల్యానులేపనైః. 141
పూర్వవ త్పూజయేద్భక్త్యా సర్వాభరణభూషణైః । రాత్రిసూక్తంచ రౌద్రంచ పావమానం సుమఙ్గళమ్.142
పూర్వతో బహ్వృచ శ్శాన్తిం పఠ న్నాస్త ఉదఙ్ముఖః।
శాక్తం రౌద్రంచ సౌమ్యంచ కూశ్మాణ్డం శాన్తి మేవచ. 143
పాఠయే ద్దక్షిణద్వారి యజుర్వేదిన ముత్తమమ్ । సౌపర్ణమథ వైరాజ మాగ్నేయం రౌద్రసంహితామ్. 144
జ్యేష్ఠసామ తథా శాన్తిం చన్దోగః పశ్చిమే పఠేత్ । శాన్తిసూక్తంచ సౌరంచ తథా సంవరణం శుభమ్.145
పౌష్టికం సమహారాజ ముత్తరేణా ప్యథర్వవిత్ ।
పఞ్చభి స్సప్తభి ర్వాఽపి హోమః కార్యోఽథ పూర్వవత్. 146
స్నానే దానేచ మన్త్రా స్స్యు స్త ఏవ మునిసత్తమ । వసోర్ధారా విధానంచ లక్షహోమవదిష్యతే. 147

అనేన విధినా యస్తు కోటిహోమం సమాచరేత్। సర్వాన్కామా నవాప్నోతి తతో విష్ణుపదం వ్రజేత్. 148
యః పఠే చ్ఛృణుయాద్వాపి గ్రహయజ్ఞత్రయం నరః । సర్వపాపవిశుద్ధాత్మాపదమిన్ద్రస్య గచ్ఛతి. 149
అశ్వమేధసహస్రాణి దశ చాష్టౌచ ధర్మవిత్ । కృత్వా యత్ఫల మాప్నోతి కోటిహోమా త్తదశ్నుతే. 150
బ్రహ్మహత్యాసహస్రాణి భ్రూణహత్యార్బుదాన్యపి । కోటిహోమేన నశ్యన్తి యథావ చ్ఛివభాషితమ్. 151

(ఋత్విక్కుల స్థానములు): ఈ మండపమున ఋగ్వేద పారంగతుని తూర్పు ద్వారమునను యజుర్వేదిని దక్షిణ ద్వారమునను సామవేదిని పశ్చిమ ద్వారమునను అథర్వవేదిని ఉత్తర ద్వారమునను నిలుపవలెను. హోమమునకు ఎనిమిది మంది వేద వేదాంగ వేత్తలగు విప్రులను నియమించవలెను. ఈ పండ్రెండు మందిని వస్త్రమాల్యగంధాను లేపనములతో సర్వాభరణములతో పూజించవలెను. (మండపమునందలి ఋత్విక్కులలో) ఋగ్వేది తూర్పుద్వారమునందు ఉత్తరపు మొగమై ఉండి రాత్రి సూక్త-రుద్రసూక్త-పవమానసూక్తములను శుభకరములగు శాంతి సూక్తములను పఠించు చుండును. దక్షిణ ద్వారమునందలి యజుర్వేది శక్తి సూక్త రుద్ర సూక్త సౌమ్య సూక్తములను శాంతి సూక్తములను పఠించుచుండును. పశ్చిమ ద్వారమునందలి సామవేది సౌపర్ణ వైరాజాగ్నేయ రౌద్ర జ్యేష్ఠ సామములను శాంతి మంత్రము లను పఠించుచుండును. ఉత్తర ద్వారమునందు అథర్వ వేది శాంతి-సౌర-సంవరణ-పౌష్టిక-మహారాజ-సూక్తములను పఠించుచుండును. వెనుకటివలెనే ఏడు మంది కాని ఐదుమంది కాని హోమము జరుపుదురు. స్నాన దాన మంత్రములును (పూర్ణాహుతియందు) ఘృత కుంభ వసు ధారా విధానములును లక్ష హోమమునందు వలెనే యుండును.

ఈ విధానమున కోటి హోమము నాచరించినవాడు ఇహమున సర్వకామపూర్తినొంది పరమున ముక్తి నొందును. ఈ చెప్పిన మూడు విధములగు గ్రహ యజ్ఞముల విషయమును పఠించినను వినినను సర్వపాప విముక్తుడు శుద్ధాత్ముడునై ఇంద్ర పదమునందును. పదునెనిమిది వేల అశ్వ మేధములను చేసినందువలన పొందునంత ఫలములను ఈ కోటి హోమము నాచరించుటవలననే పొందును. వేల కొలది బ్రహ్మ హత్యలును అర్బుదముల భ్రూణ (సాంగముగ వేదాధ్యయనము చేసిన విప్రుని) హత్యలును చేసినందున కలిగిన పాపములును ఈ కోటి హోమగ్రహ యజ్ఞమునాచరించుటచే నశించునని శివుడే చెప్పెను.

వశ్యాభిచారాదిహోమః.

వశ్యకర్మాభిచారాది తథైవోచ్చాటనాదికమ్ । నవగ్రహమఖం కృత్వా తతః కామ్యం సమాచరేత్. 152
అన్యథా ఫలదం పుంసాం న కామ్యం జాయతే క్వచిత్ ।
తస్మా దయుతహోమస్య విధానం పూర్వవ చ్చరేత్. 153
వృత్తం చోచ్చాటనే చాపి తథాచ వశ్యకర్మణి । త్రిమేఖలం చైకవక్త్రం త్ర్యరత్నిం విస్తరేణతు. 154
పలాశసమిధ శ్శస్తా మధుగోరోచనాన్వితాః । చన్దనాగరుణా తద్వ త్కుఙ్కుమే నాభిషేచితాః. 155
హోమ యే న్మధుసర్పిర్భ్యాం బిల్వాని కమలాని చ । సహస్రాణి దశైవోక్తా స్వర్వథైవ స్వయమ్భువా 156
వశ్యకర్మణి బిల్వానాం పద్మానాం చైవ ధర్మవిత్ । సుమిత్రియా న ఆపఓషధయ ఇతి హావయేత్. 157
నచాత్ర స్థాపనం కార్యం నచ కుమ్భాభిషేచనమ్ ।
స్నానం సర్వౌషధైః కృత్వా శుక్లపుష్పామ్బరో గృహీ. 158
కణ్ఠసూత్రై స్సకటకై రంగుళీయైః పవిత్రకైః । సూక్ష్మవస్త్రాణి దేయాని శుక్లా గావ స్సకాఞ్చనాః. 159

## వశ్యాభిచారాది హోమములు.

[వశ్యకర్మ-ఇతరులను లోబరుచుకొనుట; అభిచారము-ద్వేష్యులగువారికి అపకారము చేయుట; ఉచ్చాటనము-పిశాచములు మొదలగువానినుండి విడిపించుట] వశ్య కర్మము అభిచార కర్మము ఉచ్చాటన కర్మము నవగ్రహమఖము

మొదట జరిపిన తరువాతనే కామ్య కర్మముల నాచరించవలెను. లేనిచో కామ్య కర్మముల నాచరించినను ఫలితము సిద్ధింపదు. కనుక కామ్యములగు లక్షహోమ కోటిహోమ గ్రహయజ్ఞముల నాచరించుటకు ముందు వెనుక చెప్పినట్లు ఆయుత హోమమును ఆవశ్యకతను బట్టి వశ్యమునకు అభిచారమునకు ఉచ్చాటనమునకు జరుపవలెను. ఉచ్చాట నాభిచార వశ్య కర్మములయందు ఒకే ముఖమును మూడు పిడి మూరల వ్యాసమును మూడు మేఖలలును కల కుండమును నిర్మించవలెను. ఈ కర్మములకై సమిధలు పలాశ(మోదుగు) సమిధలు-తేనె గోరోచనము చందనము అగురు కుంకుమము-వీనితో తడిపినవియును తేనెతోను నేతితోను తడిపిన బిల్వ ఫలములును కమలములును ప్రశస్తములు. ఇట్టివి పదివేల సమిధలు వేల్చవలయును. వశ్య కర్మాదికమునందు దాని సంప్రదాయమునెరిగి బిల్వ ఫలములను పద్మములను'సుమిత్రియా న ఆప ఓషధయః' అను మంత్ర ముతో హోమము చేయవలయును. వశ్యాది కర్మత్రయమునందును గ్రహ ప్రతిష్ఠచేయు యజమానుడు కుంభ జలముతో స్నానముచేసి శుక్ల పుష్పములను శుక్ల వస్త్రములను ధరించవలయును. ఋత్విక్కులకు బ్రాహ్మణులకు బంగారుతో చేసిన కంఠసూత్రములు కడియములు మురుగులు ఉంగరములు పవిత్రములు సన్నని నూతన వస్త్రములు బంగారుతో అలంక రించిన తెల్లని యావులు దానమీయవలెను.

అవశ్యాని వశం కుర్యా త్సర్వశత్రుబలాన్యపి । అమిత్రాణ్యపి మిత్రాణి హోమా దేవం భవన్తి హి. 160
విద్వేషేణాభిచారే చ త్రికోణం కుణ్డ మిష్యతే । ద్విమేఖలం ద్రోణముఖం హస్తమాత్రంతు సర్వతః. 161
హోమం కుర్యు స్తతో విప్రా రక్తమాల్యానులేపనాః । నివీతా లోహితోష్ణీషా లోహితామ్బరధారిణః. 162
నరవాహనయుక్తా స్స్యు ర్జపాకుసుమసన్నిభాః । సమిధో వామహస్తేన శ్యేనాస్థిలవసంయుతాః. 163
హోతవ్యా ముక్తకేశైస్తు ధ్యాయద్భి రశివం రిపోః । దుర్మిత్ర్యా స్తస్మై సన్తు తథా హుంఫడితిచ. 164
శ్యేనాభిచారమన్త్రేణ క్షురం సప్తాభిమన్త్రితమ్ । ప్రతిరూపం రిపోః కృత్వా క్షురేణ పరికర్తయేత్. 165
ద్వేష్యరూపస్య శకలాం స్తథైవాగ్నౌ వినిక్షిపేత్ । గ్రహయజ్ఞ విధానంతు సహైవాభిచర న్నరః. 166
విద్వేషిణం తథాకుర్వ న్నైత దేవం సమాచరేత్ । ఇహైవ ఫలదం పుంసా మేత న్నాముత్ర శోభనమ్.
తస్మా చ్ఛాన్తికమేవాత్ర కర్తవ్యం భూతి మిచ్ఛతా । గ్రహయజ్ఞత్రయం కుర్వా ద్విత్తశాఠ్యేన వర్జితః. 168
స విష్ణోః పద మాప్నోతి పునరావృత్తిదుర్లభమ్ ।
యఇదం శృణుయా న్నిత్యం ●శ్రావయేద్వా సమాహితః. 169
న తస్య గ్రహపీడా స్యా న్నచ బన్ధుజనక్షయః । గ్రహయజ్ఞత్రయం గేహే లిఖితం యస్య తిష్ఠతి. 170
పీడా నచైవ బాలానాం న రోగో న చ బన్ధనమ్ । అశేషయజ్ఞఫలద మశేషాఘవినాశనమ్. 171
కోటిహోమం విదుః ప్రాజ్ఞాః భుక్తిముక్తి ఫలప్రదమ్ । అశ్వమేధఫలం ప్రాహు ర్లక్షహోమం ద్విజోత్తమాః.
ద్వాదశాహసమ స్తద్వ న్నవగ్రహ మఖ స్స్మృతః ।
ఇతి కథిత మిదానీ ముత్సవానన్దహేతు స్సకలకలుషహారీ దేవయజ్ఞాభిషేకః. 173
పరిపఠతి య ఇత్థం య శ్శృణోతి ప్రసఙ్గా దభిభవతి స శత్రూ నాయురారోగ్యయుక్తః. 173½

ఇతి శ్రీమత్స్యమహాపురాణే వైశమ్పాయనశౌనక సంవాదే గ్రహయజ్ఞ
శాన్తివిధా వయుతహోమాదికథనం నామ ద్వినవతితమోఽధ్యాయః.

ఇట్లాచరించుటచే వశులుకాని వారిని వశుల చేసికొనవచ్చును. సర్వశత్రు బలములును లొంగిపోవును: అమిత్రులును మిత్రులగుదురు. విద్వేషముతోచేయు ఆభిచారిక కర్మములందు అన్నియు (మూడును) హస్తమాత్ర భుజములుకలిగి ద్రోణము

---

● పఠేద్వాపి

(ఒక విధమగు జలపాత్రము) వంటి ముఖము కలిగి రెండు మేఖలలు కలిగిన త్రిభుజాకృతి కుండము కావలయును. విప్రులు ఎఱ్ఱని వస్త్రములు మాల్యములు గంధానులేపనములు తలపాగలు ధరించి జపాపుష్పములవలె వెలుగుచు నరవాహనునకై హోమము చేయవలయును. వారు యజ్ఞోపవీతము నివీతముగా ధరించి జుట్టు విరియబోసికొని 'దుర్మిత్రాస్తస్మైసన్తు' ఇత్యాది మంత్రములను 'హుం ఫట్' ఇత్యాది శబ్దములతో ముగియునట్లు ఉచ్చరించుచు యజమానుని శత్రువునకు అశుభము కలుగవలెనని తలంపుకలిగి డేగ ఎముక ముక్కలతో జతపరచిన సమిధలను ఎడమచేతిలో పట్టుకొని వేల్చవలయును. యజమాన శత్రు ప్రతి రూపము (బొమ్మ)ను చేసి యుంచుకొని 'శ్యేనాభిచార' మంత్రముతో ఏడుమారులు మంత్రించిన క్షురము (చురకత్తి)తో ఆ ప్రతిరూపమును కత్తిరించి ఆ ముక్కలనుకూడ ఆభిచారిక మంత్రములతో వేల్చవలయును. కాని ఈ విధమగు ఆభిచారిక గ్రహ హోమమును శాంతిక పౌష్టికాది కామనలతో చేయు గ్రహ యజ్ఞముతో సమాన కాలమున చేయరాదు. (దానికి ముందుగా వేరుగా చేయవలయును.) ఒకవేళ దానినట్లు వేరుగానే చేసినను ఇవి శత్రు నాశము మొదలగు దుష్టము క్రూరమునైన ఐహిక ఫలములనిచ్చునేకాని పారలౌకికముగ శుభము కలిగించక పోగా అశుభమును కలిగించును. కావున ఇహమునను పరమునను వాస్తవమగు శుభమును కోరువారు శాన్తిక పౌష్టిక గ్రహ యజ్ఞమునే ఆచరించవలయును.

ధనము విషయములో శాఠ్యము (ఉండియు లోభముచే లేనట్లు నటించి వ్యయము తగినట్లు చేయక కొరత చేయుట) చూపక యథాశక్తిగా అయుత హోమ-లక్షహోమ-కోటి హోమములనెడు మూడు విధములగు గ్రహ యజ్ఞములను చేయవలయును. అట్లాచరించినవాడు పునరావృత్తి రహితమును దుర్లభమునునగు విష్ణుస్థానమును పొందును. సమాహితుడై దీనిని వినినను ఇతరులకు వినిపించినను అట్టి వారికి గ్రహపీడకాని బంధు జనులకు అరిష్టముకాని కలుగదు. ఈ గ్రహ యజ్ఞత్రయ విధానమును లిఖించి ఇంటిలో ఉంచుకొనినచో అట్టి వారికి బాలుర కనారోగ్యముకాని పీడకాని ఆ కుటుంబము వారికి రోగముకాని బంధనముకాని కలుగదు. అందునను కోటిహోమ యజ్ఞము భుక్తి ముక్తి ఫలదము; లక్ష హోమ గ్రహ యజ్ఞము అశ్వమేధయాగ ఫలదము. అయుత హోమ నవగ్రహ మఖము ద్వాదశాహమను శ్రౌతయజ్ఞమునంత ఫలము నిచ్చును.

ఈ చెప్పిన గ్రహయజ్ఞ విధానమంతయు ఉత్సవము చేసిన ఆనందమును కలిగించును; సకల కలుషముల హరించును; ప్రాసంగికముగ దీనిని చదివిన వారును వినిన వారును ఆయురారోగ్య యుక్తులగుదురు; శత్రువులనణగ ద్రొక్కుదురు.

ఇది శ్రీమత్స్య మహాపురాణమున అయుత హోమాది గ్రహయజ్ఞ త్రయకథనమను తొంబది రెండవ ఆధ్యాయము.

## త్రినవతితమోఽధ్యాయః.

## నవగ్రహస్వరూపకథనమ్.

ఈశ్వరః : పద్మాసనః పద్మకరః పద్మగర్భసమద్యుతిః। సప్తాశ్వ స్సప్తరజ్జుశ్చ ద్విభుజ స్సవితా రవిః. 1
శ్వేత శ్శ్వేతామ్బరధర శ్శ్వేతాశ్వ శ్శ్వేతభూషణః । గదాపాణి ర్ద్విబాహుశ్చ కర్తవ్యో వరద శ్శశీ. 2
రక్తమాల్యామ్బరధర శ్శక్తిశూలసమన్వితః । చతుర్భుజో మేషగమో వరద స్స్యా ద్ధరాసుతః. 3
పీతమాల్యామ్బరధరః కర్ణికారదళద్యుతిః । ఖడ్గచర్మగదాపాణి స్సింహస్థో వరదో బుధః. 4
దేవదైత్య గురూ తద్వ త్పీతశ్వేతౌ చతుర్భుజౌ । దణ్డినౌ వరదౌ కార్యౌ సాక్షసూత్రకమణ్డలూ. 5
ఇన్ద్రనీలద్యుతి శ్శూలీ వరదో గృధ్రవాహనః । ప్రాసబాణాసనధరః కర్తవ్యోఽర్కసుతస్సదా. 6
సదా కరాళః ఖడ్గీచ చర్మశూలధర స్తథా । నీల స్సింహాసనస్థశ్చ రాహురత్ర ప్రశస్యతే. 7
ధూమ్రా ద్విబాహవ స్సర్వే గదినో వికృతాననాః । గృధ్రాసనగతా నిత్యం కేతవో నృవరప్రదాః. 8
సర్వే కిరీటినః కార్యా గ్రహా లోకహితావహాః । ద్వ్యఙ్గుళేనోచ్ఛ్రితా స్సర్వే శతమష్టోత్తరా శ్శుభాః. 9

ఇతి శ్రీమత్స్యమహాపురాణే నవగ్రహస్వరూపకథనం నామ

త్రినవతితమోఽధ్యాయః.

## తొంబది మూడవ అధ్యాయము.

## నవగ్రహ స్వరూప కథనము.

ఈశ్వరుడు నారదునకు నవగ్రహ స్వరూపము ఇట్లు తెలిపెను: రవి పద్మము ఆసనము (పీఠము)గా గలవాడు; చేతులయందు పద్మమునుండును. పద్మపు లోపలి భాగపు కాంతివంటి దేహకాంతికలవాడు. ఏడు గుఱ్ఱములు వాహనము అయి వాటి ఏడు త్రాళ్లను చేతులధరించి రెండు భుజములతో ఒప్పారును. చంద్రుడు తెల్లని దేహము వస్త్రములు గుఱ్ఱములు భూషణములు కలిగి గదాపాణియై ద్విభుజుడై ఉండును. అంగారకుడు రక్త మాల్యాంబరధరుడు మేష వాహనుడు చతుర్భుజుడు శక్తి శూల హస్తుడునై యుండును. బుధుడు పీత (పసపు పచ్చని) మాల్యాంబర ధరుడు పచ్చగన్నేరు పూరేకుల కాంతివంటి కాంతి కలవాడు ఖడ్గచర్మ(డాలు)గదాపాణి-సింహవాహనుడునై యుండును. గురుశుక్రు లిరువురును చతుర్భుజులు దండాక్ష మాలాకమండలు ధరులు; బృహస్పతి పసపు పచ్చని-శుక్రుడు తెల్లని- దేహకాంతి కలవారు. శని ఇంద్రనీల సమానకాంతి-శూలాయుధము-గృధ్రవాహనము కలిగి-ప్రాసధనువులు ధరించినవాడు. రాహువు భయంకరుడు. ఖడ్గము-డాలు-శూలము ధరించినవాడు-నల్లనివాడు-సింహాసనస్థుడు; కేతువులు ధూమ్ర వర్ణులు-ద్విబాహువులు-గదలు దాల్చినవారు వికృతముఖులు-గృధ్రవాహనులు నయియుందురు. (ఇచట కేతువు ఒకడుగా మాత్రముకాక ధూమ కేతువులు మొదలగు అనేక గ్రహములుగా భావనచేసి చెప్పబడినది.) అన్ని గ్రహములును కిరీటములు గలవిగాను రెండు భారతీయాంగుళముల ఎత్తుకలవిగాను నిర్మింప జేయవలెను. 'ఇచట శతమష్టోత్తరాః శుభాః' అనునది సరిగా అవగతముచేసికొనుట కవకాశము లేకున్నది. ప్రతియొక గ్రహమునకు సంబంధించిన మంత్రమును కనిష్ఠ సంఖ్యగా నూట ఎనిమిది మార్లైన జపించిన యెడల శుభము కలిగింతురు అని అర్థము కావచ్చును.

ఇది శ్రీమత్స్య మహా పురాణమున నవగ్రహ స్వరూప కథనమను తొంబది మూడవ అధ్యాయము.

## చతుర్నవతితమోఽధ్యాయః.

## శివచతుర్దశీవ్రతమ్.

నారదః : భగవ న్భూతభవ్యేశ తథాన్యదపి యద్వ్రతమ్ ।
భుక్తిముక్తిఫలాయాలం తత్పున ర్వక్తు మర్హసి. 1
ఈశ్వరః : ఏవముక్తోఽబ్రవీ చ్ఛమ్భు రయం వాఙ్మయపారగః ।
మత్స్యమ స్తపసా బ్రహ్మ న్పురాణశ్రుతి విస్తరే 2
ధర్మోఽయం వృషరూపేణ నన్దిర్నామ గణాగ్రణీః । ధర్మాన్మాహేశ్వరా న్వక్ష్య త్యతః ప్రభృతి నారద.
శ్రీమత్స్యః : ఇత్యుక్త్వా దేవదేవేశ స్తత్రైవా న్తరధీయత । నారదోపిచ శుశ్రూష రపృచ్ఛ న్నన్దికేశ్వరమ్. 4
ఆదిష్ట స్త్వం శివేనేహ వద మాహేశ్వర వ్రతమ్ ।
నన్దికేశ్వరః: శృణుష్వావహితో బ్రహ్మన్వక్ష్యే మాహేశ్వరం వ్రతమ్. 5
త్రిషు లోకేషు విఖ్యాతం నామ్నా శివచతుర్దశీమ్ । మార్గశీర్షే త్రయోదశ్యాం సితాయా మేకభోజనః. 6
ప్రార్థయే ద్దేవదేవేశం త్వామహం శరణం గతః । చతుర్దశ్యాం నిరాహార స్సమభ్యర్చ్య మహేశ్వరమ్. 8
సౌవర్ణం వృషభం దత్వా భోక్ష్యామీతి పరేఽహని ఏవం నియమకృత్సుప్త్వా ప్రాత రుత్థాయ మానవః.
కృతస్నానజపః పశ్చా దుమయా సహితం శివమ్ । పూజయే త్కమలై శ్శుక్లై ర్గన్ధమాల్యానులేపనైః. 9
పాదౌ నమ శ్శివాయేతి శిర స్సర్వాత్మనే నమః । లలాటంతు త్రినేత్రాయ నేత్రాణి హరయే నమః. 10
ముఖ మిన్దుముఖాయేతి శ్రీకణ్ఠాయేతి కన్ధరామ్ । సద్యోజాతాయ కర్ణౌతు వామదేవాయ వై భుజౌ. 11
అఘోరహృదయాయేతి హృదయం పరిపూజయేత్ । స్తనౌ తత్పురుషాయేతి తథేశానాయ చోదరమ్. 12

పార్శ్వే చానన్తధర్మాయ జ్ఞానరూపాయ వై కటిమ్ । ఊరూ చానన్తవైరాగ్యసింహాయేతి ప్రపూజయేత్. 13
అనన్తైశ్వర్యనాథాయ జానునీ త్వర్చయే ద్బుధః । ప్రధానాయ నమో జఙ్ఘే గుల్ఫౌ వ్యోమాత్మనే నమః.14
నమః పరమరూపాయ వృష్ఠ మభ్యర్చయే న్నరః । వ్యోమకేశాత్మరూపాయ కేశా న్పృష్టిం పినాకధృత్.15
పుష్ట్యై నమ స్తథా తుష్ట్యై పార్వతీం చాపి పూజయేత్ ।

## తొంబది నాలుగవ అధ్యాయము.

## శివ చతుర్దశీవ్రతము.

నారదు డీశ్వరునిట్లడిగెను: భగవన్; భూత-భవ్య-ప్రభూ! ఇంతవరకును మీరు చెప్పిన వానివంటిదే భుక్తి ముక్తి ఫలముల నీయగలిగినది ఇంకనునేదైన వ్రతమున్నచో దానిని నాకు తెలుపుము. అనగా ఈశ్వరుడతనితోనిట్లు చెప్పనారంభించెను. నారదా: ఇడుగో! ఈతడు వాఙ్మయమంతయు కడముట్ట చదివి దాని తత్త్వమునెరిగినవాడు. పురాణములు వేదములు అను రెండు విధములగు వాఙ్మయ విస్తారము నెరుగుటలోను తపశ్చర్యలోను నాతో సమానుడు. ఇతడు వృషభ రూపములో కనబడుచున్న ధర్మమేకాని వేరుకాదు. ప్రమథగణమువారిలో శ్రేష్ఠుడు. ఈతని పేరు నంది. ఇక మీదట ఈతడే నీకు మహేశ్వర ధర్మములను చెప్పగలడు. అని పలికి ఈశ్వరుడచటనే అప్పుడే అంతర్ధానము నందెను. నారదుడు (ఆయా విషయముల) వినగోరినవాడు (శుశ్రూషువు) అగుచు నందికేశ్వరునిట్లడిగెను: అయ్యా! శివుడు నిన్ను తనకు ప్రతినిధిగా నిలిపెను గదా: కావున నాకు మాహేశ్వరమగు (మహేశ్వరునకు సంబంధించిన) వ్రతమును ప్రతిపాదింపుము. అనగా నందికేశ్వరు డతనికిట్లు చెప్పెను :

బ్రాహ్మణా! వినుము; మాహేశ్వరమగు వ్రతమును తెలిపెదను, అది శివచతుర్దశీ వ్రతమను పేరున త్రిలోకములయందును ప్రసిద్ధము. మార్గశీర్ష శుక్ల త్రయోదశినాడు దేవదేవేశుడగు ఈశ్వరుని "నేను నిన్ను శరణుచొచ్చినాను. చతుర్దశినాడు నిరాహారుడనైయుండి మహేశ్వరుని సమభ్యర్చించి సువర్ణ వృషభమును దానముచేసి భుజింతును." అని సంకల్పించి ఆనాడు (త్రయోదశినాడు) ఒక పూట మాత్రమే భుజించి యుండవలెను. ఇట్లు నియమము నేర్పరచుకొని ఆ రాత్రి నిద్రించి చతుర్దశినాటి ఉదయమున మేలుకొని స్నాన జపాదికము చేసికొని తెల్లకమలములతో గంధ మాల్యానులేపనములతో సహితుడగు శివుని పూజించవలెను.

(పూజా మంత్రములు) : 1. శివాయనమః-పాదౌ పూజయామి; 2. వ్యోమాత్మనే నమః-గుల్ఫౌ పూజయామి; 3. ప్రధానాయ నమః జంఘే పూజయామి; 4. అనంతైశ్వర్య నాథాయనమః జానునీ పూజయామి; 6. జ్ఞాన రూపాయ నమః కటిం పూజయామి; 7. అనంత ధర్మాయ నమః-పార్శ్వే పూజయామి; 8. ఈశానాయ నమః-ఉదరం పూజయామి; 9. తత్పురుషాయ నమః-స్తనౌ పూజయామి; 10. అఘోర హృదయాయ నమః-హృదయం పూజయామి; 11. వామదేవాయ నమః-భుజౌ పూజయామి; 12. సద్యోజాతాయ నమః- కర్ణౌ పూజయామి; 13. శ్రీకంఠాయ నమః-కంధరాం పూజయామి; 14. ఇందు ముఖాయనమః-ముఖం పూజయామి; 15. హరయే నమః-నేత్రాణి పూజయామి; 16. త్రినేత్రాయ నమః-లలాటం పూజయామి; 17, సర్వాత్మనే నమః-శిరః పూజయామి; 18. వ్యోమకేశాయ నమః-కేశాన్ పూజయామి; 19. పరమ రూపాయ నమః-పృష్ఠం పూజయామి; 20. ఆత్మరూపాయ నమః-పుష్టిం పూజయామి; (పుష్టిం. అనగా ఈ చెప్పినవి కాక తెలిసియో తెలియకయో చెప్పక మిగిలిన అంగములు అని అర్థము,

తరువాత-పుష్ట్యై నమః-తుష్ట్యై నమః-ఇత్యాది మంత్రములతో పార్వతిని పూజించవలయును.

తతస్తు వృషభం హైమం హేమకుమ్భసమన్వితమ్.
శుక్లమాల్యామ్బరయుతం పఞ్చరత్నసమన్వితం । భక్ష్యై ర్నానావిధైర్యుక్తం గురవే వినివేదయేత్. 17
ప్రీయతాం దేవదేవోఽత్ర సద్యోజాతః పినాకభృత్ । బ్రాహ్మణా న్భక్ష్యభోజ్యైశ్చ తర్పయే ద్భక్తిత శ్శుచిః.

వృషదాజ్యంచ సమ్ప్రాశ్య స్వపే ద్భూమా వుదఙ్ముఖః ।
పఞ్చదశ్యాం తతః పూజ్య విప్రా న్భుఞ్జీత వాగ్యతః. 19
తద్వ త్కృష్ణచతుర్దశ్యా మేత త్సర్వం సమాచరేత్। చతుర్దశీషు సర్వాసు కుర్యా త్పూర్వవ దర్చనమ్.20
యే తు మాసా విశేషాస్తు తా న్నిబోధ క్రమా దిహ । మార్గశీర్షాదిమాసేషు క్రమా దేవ ముదీరయేత్. 21
శఙ్కరాయ నమస్తేఽస్తు నమస్తే గరకన్ధర । త్ర్యమ్బకాయ నమస్తేఽస్తు మహేశ్వర తతః పరమ్. 22
నమస్తే స్తు మహాదేవ స్థాణవేచ తతః పరమ్ । నమః పశుపతే నాథ నమస్తే శమ్భవే పునః. 23
నమస్తే పరమానన్ద నమ స్సోమార్ధధారిణే । నమో భవాయ భీమాయ త్వా మహం శరణం గతః. 24
గోమూత్రం గోమయం క్షీరం దధి సర్పిః కుశోదకమ్ ।
పఞ్చగవ్యం తథా బిల్వం కర్పూరంవాఽగురుం యవాః. 25
తిలాశ్చ కృష్ణా విధివ త్ప్రాశనం క్రమశ స్స్మృతమ్ ।
ప్రతిమాసం చతుర్దశ్యా మేకైకం ప్రాశనం స్మృతమ్. 26
మన్దారై ర్మాలతీభిశ్చ తథా బన్ధూకకైరవైః । సిన్దువారై రశోకైశ్చ మల్లికాభిశ్చ పాటలైః. 27
అర్కపుష్పైః కదమ్బైశ్చ శతపత్రై స్తథోత్పలైః । ఏకైకేన చతుర్దశ్యా మర్చయే త్పార్వతీపతిమ్. 28

తరువాత బంగారు వృషభమును బంగారు కుంభము (జలపాత్ర)ను శుక్ల మాల్యాంబరములు నానావిధ భక్ష్యములు "సద్యోజాతుడు దేవదేవుడు పినాకధనుర్ధారియగు పరమేశుడు ఈ వ్రతముచే ప్రీతుడగుగాక!" అను అర్థము నిచ్చు మంత్రముతో గురు (ఆచార్య-పురోహితు)నకు సమర్పించవలయును. శుచిత్వమును భక్తియు కలవాడయి భక్ష్య భోజనములతో బ్రాహ్మణులను సంతృప్తుల జేయవలయును. వృ*షదాజ్యము ఆహారముగా తీసికొని ఉత్తరపు మొగమై నేలపై పడుకొన వలయును. పిమ్మట పూర్ణిమ నాడు బ్రాహ్మణులను (భోజనాదికముతో) పూజించి తానును భుజించి మౌనియై గడువవలెను. ఇట్లే మరల కృష్ణ చతుర్దశియందును ఇదియంతయు చేయవలయును. ఇట్లు మార్గశీర్షము మొదలుగ అన్ని మాసములందును రెండుచతుర్దశులందును చేయుచు పోవలెను. ఈ విషయమున ఆయా మాసములందు వేరుగనుండు అంశములను తెలిపెదను; వినుము. మార్గశిరము మొదలుగ ప్రతి మాసమునందును ధ్యాన పూజాదులయందు వరుసగా-1. శంకరాయ తే నమః; 2. గరకంధరాయ తే నమః; 3. త్ర్యంబకాయ తే నమః; 4. మహేశ్వరాయ తే నమః; 5. మహాదేవాయ తే నమః; 6. స్థాణవే తే నమ; 7. పశుపతయే నాథాయ తే నమః; 8. శంభవే తే నమః; 9. పరమానందాయ తే నమః; 10. సోమార్ధధారిణే తే నమః; 11. భవాయ తే నమః; 12. భీమాయ తే నమః; అను మంత్రములను ప్రతి మంత్రముతోను త్వామహం శరణం గతః, అను వాక్యమును పలుకవలయును. అట్లే (యజమానుని) ఆహారము వరుసగా 1. గోమూత్రము 2. గోమయము 3. క్షీరము 4. పెరుగు 5. నేయి 6. కుశోదకము 7. పంచగవ్యము 8. బిల్వ (ఫల)ము; 9. కర్పూరము 10. సాంబ్రాణి 11. యవలు 12. నల్లనూవులు; పూజకై పుష్పములు మార్గ శీర్షాది మాసములందు వరుసగా-1. మందార 2. మాలతీ 3. ఇప్ప 4. తెల్ల కలువ 5. ప్రేంకణము 6. అశోకములు 7. మల్లె 8. పాటలము-దాసాని అనెడు ఎర్రని పూవు; 9. జిల్లేడు 10. కడిమి 11. నూరు రేకుల పద్మము 12. కలువ;

పునశ్చ కార్తికే మాసే సమ్ప్రాప్తే ప్రార్థయే ద్ద్విజాన్ ।
అన్నై ర్నానావిధై ర్భక్ష్యై ర్వస్త్రమాల్యవిభూషణైః. 29
కృత్వా నీలవృషోత్సర్గం శ్రుత్యుక్తవిధినా నరః । ఉమామహేశ్వరం హైమం వృషభించ గవా సహ. 30

* వృష దాజ్యము అనగా గడ్డకట్టించిన-గట్టి పరచిన పాలు-నేయి కలిపిన మిశ్రమము; దూధ్‌ఖోవా-దూధ్‌బడా అను

ముక్తాఫలాష్టకయుతాం సితనేత్రపటావృతామ్ । సర్వోపస్కరసంయుక్తాం శయ్యాం దద్యాత్సుశోభనామ్. 31
తామ్రపాత్రోపరి పున శ్శాలితణ్డులసంయుతామ్ । స్థాప్య విప్రాయ శాన్తాయ వేదవ్రతధరాయ చ. 32
అవ్యఙ్గాయ చ సౌమ్యాయ సదా కల్యాణకారిణే । జ్యేష్ఠసామవిదే దేయం నచ కువ్రతినే క్వచిత్. 33
సపత్నీకాయ సమ్పూజ్య వస్త్రమాల్యవిభూషణైః । గుణజ్ఞే శ్రోత్రియే దద్యా దాచార్యే తత్త్వవేదిని. 34
గురౌ సతి గురో ర్దేయం తదభావే ద్విజాతయే । న విత్తశాఠ్యం కుర్వీత కుర్వ న్దోష మవాప్నుయాత్. 35
అనేన విధినా యస్తు కుర్యా చ్ఛివచతుర్దశీమ్ । సోఽశ్వమేధసహస్రస్య ఫల మాప్నోతి మానవః. 36
బ్రహ్మహత్యాదికం కించి ద్యదత్రాముత్ర వా కృతమ్ ।
పితృభి ర్భ్రాతృభిర్వాపి తత్సర్వం నాశ మాప్నుయాత్. 37
దీర్ఘాయురారోగ్యకులాభివృద్ధి రత్రాక్షయాఽముత్ర చతుర్భుజత్వమ్ ।
గణాధిపత్యం దివి కల్పకోటిశతా న్యుషిత్వా పద మేతి శమ్భోః. 38
న బృహస్పతిర ప్యనన్త మస్యాః ఫలమిన్ద్రోఽపి పితామహోపి వక్తుమ్ ।
నచ సిద్ధగణాఽప్యలం న చాహం యది జిహ్వాయుతకోటయోఽపి వక్త్రే. 39
భువ త్యమరవల్లభ స్స్మరతి యః పఠేద్వా లిఖ ఇచ్ఛృణోత్యపి విమత్సర స్సకలపాపనిర్మోచనీమ్.
ఇమాం శివ చతుర్దశీ మమరకామినీకోటయ స్స్తువన్తి తమనిన్దితం కిము సమాచరే ద్య స్సదా. 40
యా వాఽథ నారీ కురుతేఽతిభక్త్యా భర్తార మాపృచ్ఛ్య సుతా న్గురూన్వా ।
సాఽపి ప్రసాదా త్పరమేశ్వరస్య పరం పదం యాతి పినాకపాణేః. 41

ఇతి శ్రీమత్స్యమహాపురాణే నన్దికేశ్వర నారదసంవాదే శివచతుర్దశీ
వ్రతకథనం నామ చతుర్నవతితమోఽధ్యాయః.

మరల కార్తిక మాసము రాగానే బ్రాహ్మణులను ప్రార్థించి పిలిచికొనివచ్చి నానావిధ భక్ష్యములు మొదలగు వానితో పూజించి వస్త్రములు మాల్యములు భూషణములు బంగారుతో చేసిన ఉమా మహేశ్వరుల ప్రతిమ గోప్రతిమ వృషభ ప్రతిమ గోవృషభ ప్రతిమలకు ఎనిమిదేసి ముత్యములు తెల్లని నేత్ర వస్త్రములు సర్వోపస్కారములతోకూడిన చక్కని శయ్య రాగి పళ్లెరములో (పాత్రలోకాని) తెల్లని బియ్యము అంగవైకల్యము లేనివారు శాంతులు వేదవ్రతములను ఆచరించినవారు సౌమ్యులు శుభమును ఆచరించువారు జ్యేష్ఠసామ (అను సామవేద భాగ)ము ఎరిగినవారు దురాచరణములు లేనివారు సపత్నీకులు అగు వారికిని-గుణజ్ఞుడు (ఉత్తమ గుణములు ఎరిగినవాడు-కలిగినవాడు) శ్రోత్రియుడు (సాంగముగ వేదాధ్యయనము చేసినవాడు) తత్త్వవేత్తయు నగు గురువు ఉన్నచో గురునకును లేని ఎడల అట్టి బ్రాహ్మణునకును దానమీయవలెను. వేదోక్త విధానమున నీల వృషోత్సర్జనమను చేయవలెను. విత్తశాఠ్యము చేయరాదు. చేసినచో దోషము పొందును.

ఈ విధానమున శివ చతుర్దశీ వ్రతము చేసినవారు అశ్వమేధ సహస్ర ఫలము పొందుదురు. వారి తండ్రులో సోదరులో తానో చేసినదైనను బ్రహ్మహత్యాదిదోషము లేవయిన ఉన్నచో వానివలన కలుగు ఇహలోక పరలోక పాప ఫలము లేవేవియున్నను అవి యన్నియు నశించును. ఇహమున దీర్ఘాయురారోగ్యమును కులాభివృద్ధియు పరమున విష్ణు సారూప్యమును సిద్ధించును. ద్యులోకమున ప్రమథ గణములకు అధిపతియై నూరుకోట్ల కల్పముల కాలము ఉండి తుదకు శివ స్థానమును చేరుదురు.

ఈ శివ చతుర్దశీ వ్రతఫలమును చెప్పుటకు బృహస్పతికిని బ్రహ్మకును సిద్ధులకును నాకు (నందికేశ్వరునకు)ను నోటియందు పదివేల కోటుల నాలుకలున్నను శక్తి చాలదు. ఏలయన ఆ ఫలము అనంతమయినది.

ఈ శివ చతుర్దశీ వ్రత విధానము సకల పాప విమోచనమును కలిగించునది; దీనిని స్మరించినను పఠించినను విమత్సరుడై వినినను వినిపించినను ఇంద్రత్వము సిద్ధించును. దీనిని అమర యువతి కోటులు స్తుతించుచుందురు. సదా ఇట్టి ప్రశస్తమగు దాని నాచరించినచో కలుగు ఫలము ఇంతయని చెప్పనేల? స్త్రీయైనను తన భర్తను కాని కుమారులను తన ఇంటి పెద్దలను కాని అడిగి వారి అనుమతి పొంది ఆచరించినను ఆమెయును పరమేశ్వరుని అనుగ్రహమునకు పాత్రురాలై పినాక పాణియగు ఆ మహానుభావుని పరమపదమును పొందును.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున శివ చతుర్దశీ వ్రతవిధాన కథనమను
తొంబది నాలుగవ అధ్యాయము.

## పంచనవతితమోఽధ్యాయః.

## ఫలత్యాగవ్రతమ్.

నన్దికేశ్వరః : తథా సర్వఫలత్యాగమాహాత్మ్యం శృణు నారద ।
య దక్షయం పరం లోకే సర్వకామఫలప్రదమ్. 1
మార్గశీర్షే శుభే మాసే తృతీయాయాం మునే వ్రతమ్। ద్వాదశ్యామథవాఽష్టమ్యాం చతుర్దశ్యా మథాపి వా. 2
ఆరభే చ్ఛుక్లపక్షస్య కృత్వా బ్రాహ్మణవాచనమ్ । అన్యేష్వపిచ మాసేషు పుణ్యేషు మునిసత్తమ. 3
సదక్షిణం పాయసేన భక్తితః పూజయే ద్ద్విజాన్ । అష్టాదశానాం ధాన్యానా మన్యచ్చ ఫలమూలకమ్. 4
వర్జయే దేకవర్షంతు వినౌషధకారణమ్ । సవృషం కాంచనం రుద్రం ధర్మరాజంచ కారయేత్. 5
కూశ్మాణ్డం మాతులుఙ్గంచ వార్తాకం పనసం తథా । ఆమ్రాతకకపిత్థాని కలిఙ్గ మథ వారుకమ్. 6
శ్రీఫలాశ్వత్థబదరం జమ్బీరం కదళీఫలమ్ । కాశ్మరం దాడిమం శక్త్యా కలధౌతాని షోడశ. 7
మూలకామలకం జమ్బ్వతి న్త్రిణీ కరమర్దకమ్ । తక్కోలైలాక జమ్బీర కరీర కుటజం శమీ. 8
ఉదుమ్బరం నాళికేరం ద్రాక్షాఽథ బృహతీద్వయమ్ । రౌప్యాని కారయే ద్భక్త్యా ఫలానీమాని షోడశ. 9
తామ్రం తాళఫలం కుర్యా దగస్తిఫలమేవచ । పిణ్డీతకాశ్మర్యఫలం తథా సూరణకన్దకమ్. 10
రక్తాలుకాకన్దకంచ కేతకామ్రాకచిర్భటమ్ । చిత్రవల్లీఫలం తద్వ త్కూటశాల్మలికాఫలమ్. 11
యామ్య నిష్పావ మధుక వటేఙ్గుద పటోలకమ్ । తామ్రాని షోడశైతాని కారయే చ్ఛక్తితో నరః. 12

## తొంబది యైదవ అధ్యాయము.

## ఫలత్యాగ (పండ్లను తినక మానెడు) వ్రతము.

నందికేశ్వరుడు నారదునకు ఇంకను ఇట్లు చెప్పెను. నారదా! ఇట్టిదేయగు సర్వఫలత్యాగ వ్రత మాహాత్మ్యము విసుము. ఇది (ఇహపర) లోకములందు అక్షయమును-సర్వకామ ఫలప్రదమును శుభమునగునది. మార్గశీర్షమాసము నందుకాని పుణ్యములగు ఇతర మాసములలో వేనియందుకాని శుక్లపక్షమున తదియ-అష్టమి-ద్వాదశి-చతుర్దశి-వీనిలో నేదైన తిథినాడు బ్రాహ్మణులచే స్వస్తివాచనము జరిపించి ఈవ్రతము నారంభించవలెను. ఆనాడు బ్రాహ్మణులకు పాయస సహితముగా భోజనము పెట్టించి దక్షిణనీయవలెను. ఔషధ (ఆరోగ్య) కారణము లేకుండగనే సంవత్సరము పాటు పదునెనిమిది విధములగు ధాన్యములు తప్ప మిగిలిన ఫలములు (కూరగాయలు కూడ) దుంపలు వేళ్ళు ఏవియు తినక వదలవలయును.

పిమ్మట (వ్రత పూర్తికై) బంగారుతో ఎద్దును రుద్రుని ధర్మరాజును చేయించవలయును. బూడిద గుమ్మడి కాయ మాదీఫలము వంకాయ పనస మామిడిపండ్లు ఆమ్రాతపు ఫలము (అంబాళము-దీని రసము మామిడిపండు రసమువలె నుండును. అని నిఘంటువు) వెలగపండు కళింగము అనెడు (విష్ణు ప్రీతికరమగు) పండు ఖర్బూజా దోస

పండు మారేడుపండు రావికాయ రేగుపండు నిమ్మపండు అరటిపండు గుమ్మడు దుంప దానిమ్మపండు ఇవి పదునారును తన శక్తికి తగినట్లు బంగారుతో చేయించవలెను. ముల్లంగి ఉసిరిగ నేరేడు చింతకాయ కలివెపండు తక్కోల ఫలము ఏలకికాయ నిమ్మపండు వెదురు మొలక కొడిసెకాయ జమ్మికాయ మేడికాయ టెంకాయ ద్రాక్షపండు చిన్న పందిలి వంగకాయ వాకుడుకాయ ఈ పదునారును వెండితో చేయించవలెను. తాటిపండు అవిసికాయ పొగడపండు కపిల ద్రాక్షపండు కందదుంప చిలగడదుంప మొగలిపూవు (కాయ) చిద్భటము (ఒకకాయ) మంజిష్ఠ (తీగకు కాచిన) కాయ కొండ బూరుగుకాయ గంధపు కాయ బొబ్బరకాయ ఇప్పకాయ మర్రికాయ గారకాయ పొట్లకాయ-ఇవి పదునారును రాగితో చేయించవలెను.

ఉదకుమ్భద్వయం కృత్వా ధాన్యోపరి సవస్త్రకమ్ । తతశ్చ కారయే చ్ఛయ్యాం శయ్యోపరి సవాసనమ్. 13
తామ్రపాత్రద్వయోపేతం యమరుద్రవృషాన్వితమ్ । ధేన్వా సహైవ శాన్తాయ విప్రాయాథ కుటుమ్బినే.
సపత్నీకాయ సమ్పూజ్య పుణ్యేఽహ్ని వినివేదయేత్ । యథా ఫలేషు సర్వేషు వస న్త్యమరకోటయః. 15
తథా సర్వఫలత్యాగవ్రతా ద్భక్తి శ్శివేఽస్తు మే । యథా శివశ్చ ధర్మశ్చ సదాఽనన్తఫలప్రదౌ. 16
తద్యుక్తఫలదానేన తౌ స్యాతాం ఫలదౌ సదా । యథా ఫలాన్యనన్తాని శివభక్తేషు సర్వదా. 17
తథాఽనన్తఫలావాప్తి రస్తు మే జన్మజన్మని । యథా భేదం నపశ్యామి శివవిష్ణ్వర్కపద్మజాన్. 18
తథా మమా స్తు విశ్వాత్మా శఙ్కర శ్శఙ్కర స్సదా । ఇతి దత్త్వాతు తత్సర్వ మలఙ్కృత్యవిభూషణైః.
శక్తశ్చే చ్ఛయనం దద్యా త్సర్వోపస్కరసంయుతమ్ । అశక్తస్తు ఫలాన్యేవ యథోక్తాని విధానతః. 20
తథోదకుమ్భసంయుక్తం శివధర్మౌ సకాఞ్చనౌ । విప్రాయ దత్త్వా భుఞ్జీత వాగ్యతః ఫలవర్జితమ్. 21
అన్యానపి యథాశక్త్యా భోజయే ద్ద్విజపుఙ్గవాన్ । ఏత ద్భాగవతానాంచ శైవవైష్ణవయోగినామ్. 22
శుభం సర్వఫలత్యాగవ్రతం వేదవిదో విదుః । నారీభిశ్చ యథాశక్త్యా కర్తవ్యం మునిపుఙ్గవ. 23
ఏతస్మా న్న పరం కించి దిహలోకే పరత్రచ । వ్రతమస్తి మునిశ్రేష్ఠ యదనన్తఫలప్రదమ్. 24
సువర్ణ రూప్య తామ్రేషు యావన్తః పరమాణవః । భవన్తి పూజ్యమానేషు ఫలేషు మునిసత్తమ. 25
తావద్యుగసహస్రాణి రుద్రలోకే మహీయతే ।
ఏత త్సమస్తకలుషాపహరం నరాణాం సఞ్జీవనాయ మనుజేషుచ సర్వదా స్యాత్. 26
జన్మాన్తరేష్వపి న పుత్త్రవియోగదుఃఖ మాప్నోతి ధామచ పురన్దరదేవజుష్టమ్ ।
యోవా శృణోతి పురుషోఽల్పధనీ పఠేద్వా దేవాలయేషు భవనేష్వపి ధార్మికాణామ్. 27
పాపై ర్విముక్తవపు రత్ర పదం మురారే రానన్దకృత్పద ముపైతి శివస్య సోఽపి. 28

ఇతి శ్రీమత్స్యమహాపురాణే ఫలత్యాగవ్రతమాహాత్మ్యకథనం నామ
షణ్ణవతితమోఽధ్యాయః.

రెండు నీటి పాత్రలు చేయించవలెను. వీటిని ధాన్యముపై పరచిన నూతన వస్త్రముపై ఉంచవలెను. మంచము-దానిపైకి పరుపులు మొదలగునవియు దుప్పటియు రెండు రాగిపాత్రలు (పళ్లెరములు) యమ రుద్ర వృషభముల ప్రతిమలు ధేను ప్రతిమ ఇవి అన్నియు శాంతుడు కుటుంబి సపత్నీకుడు అగు బ్రాహ్మణునకు శుభ దినమున అతనిని (దంపతులను) పూజించి ఈయవలెను.

సర్వఫలముల యందును దేవతలు అందరును నివసింతురు. కావున ఈ సర్వఫల త్యాగ వ్రత మాహాత్మ్యమున నాకు శివునియందు భక్తి సిద్ధించుగాక; శివుడును ధర్మదేవుడును సదా అనంత ఫలప్రదులు. కావున వారి (ప్రతిమల)తో

కూడ చేసెడి ఫలదానము వలన వారును అనంత ఫలప్రదులగుదురుగాక! శివ భక్తులయందు (వలన) సదా అనంతఫలములు నిలిచి (కలుగుచు) ఉండును. కావున నాకును జన్మజన్మమునందును అనంత ఫలసిద్ధి యగుగాక! శివునికి - విష్ణు రవి బ్రహ్మలకు-నడుమ నేను భేదమును భావన చేయను. కావున విశ్వాత్ముడగు శంకరుడు సదా నాకు శంకరు (శుభము కలిగించు వా) డగుగాక!" అను అర్థమునిచ్చు మంత్రముతో వారిని అలంకరించి ఆ విప్ర దంపతులకు ఇవి అన్నియు దానమీయవలెను. శక్తి ఉన్నచో సర్వోపస్కరములతో కూడ మంచమును ఈయవలెను. శక్తిలేనిచో ఈ చెప్పిన ఫలములను మాత్రము యథా విధానముగ ఈయవలెను. ఉద కుంభములను రెంటిని శివుని ధర్ముని ప్రతిమలను తప్పక ఈయువలెను. పిమ్మట ఆ బ్రాహ్మణుని-శక్తియున్నచో ఇంకను చాలమంది బ్రాహ్మణులను కూడ భుజింపజేసి తానును పండ్లు ఏవియు లేకుండ భుజించవలెను.

వేదతత్త్వ వేత్తలును ప్రశంసించెడు ఈ సర్వఫల త్యాగ వ్రతము శివ విష్ణు భక్తులగు వారికిని యోగులకును స్త్రీలకును గూడ కర్తవ్యము. ఇహపరముల రెంటియందును అనంతఫలముల నీయగల వ్రతము దీనిని మించినది మరియొకటిలేదు. ఈ వ్రతమున పూజింపబడు ఫల ప్రతిమల కుపయోగించిన సువర్ణ రజత తామ్రములందు ఎన్ని పరమాణువులు కలవో అన్నివేల యుగములపాటు రుద్ర లోకమునందు ఈ వ్రతకర్త పూజితుడయి సుఖించును.

ఈ వ్రతము దాని నాచరించిన నరుల సమస్త కలుషములను హరించును. ఇహలోకమున సంజీవనమయి సర్వదా సుఖింపజేయును. జన్మాంతరముల యందును అట్టివారికి పుత్త్రవియోగ దుఃఖము కలుగదు; ఇంద్రాది దేవతలనుభవించెడి స్వర్గసుఖములు లభించును.

దీని నాచరించుటకు శక్తి లేనివారు పుణ్యకరమగు ఈ వ్రతవిధానమును ధార్మికులెవరైన దేవాలయములందో భవనములందో చెప్పుచుండగ వినినను తామే చదివినను పాప విముక్తులై ఇహలోకమున సుఖించి పరమున విష్ణు స్థానమును పిమ్మట ఆనందప్రదమగు శివ స్థానమును పొందుదురు.

ఇది శ్రీమత్స్య మహాపురాణమున ఫలత్యాగ వ్రత మాహాత్మ్య కథనమను
తొంబదియైదవ అధ్యాయము.

## షణ్ణవతితమోఽధ్యాయః.

## ఆదిత్యవారనక్తవ్రతమ్.

నారదః : య దారోగ్యకరం పుంసాం యదనన్తఫలప్రదమ్ ।
య చ్ఛాన్తయే చ మర్త్యానాం వద నన్దీశ తద్వ్రతమ్. 1
నన్దికేశ్వరః : య త్త ద్విశ్వాత్మనో ధామ పరం బ్రహ్మ సనాతనమ్ ।
సూర్యాగ్నిచన్ద్రరూపేణ త త్త్రిధా జగతి స్థితమ్. 2
తదారాధ్య పుమా న్విప్రః ప్రాప్నోతి కుశలం సదా । తస్మా దాదిత్యవారేషు సదా నక్తాశనో భవేత్. 3
యది హస్తేన సంయుక్త మాదిత్యస్య దినం భవేత్ । తదా శనిదినే కుర్యా దేకభుక్తం విమత్సరః. 4
నక్త మాదిత్యవారేణ భోజయిత్వా ద్విజోత్తమాన్ । పత్త్రై ర్ద్వాదశభి ర్వ్యక్తం రక్తచన్దనపఙ్కజమ్. 5
విలిఖ్య విన్యసే త్సూర్యం నమస్కారేణ పూర్వతః । దివాకరం తథాగ్నేయ్యాం వివస్వన్తం తతఃపరమ్. 6
భగంతు నైరృతే దేవం వరుణం పశ్చిమేదశే । మాహేన్ద్ర మనిలే తద్వ దాదిత్యంచ తథోత్తరే. 7
శాన్త మీశానభాగేతు నమస్కారేణ విన్యసేత్ । కర్ణికాపూర్వపత్రేతు సూర్యస్యతురగా న్న్యసేత్. 8
దక్షిణే యమనామానం మార్తాణ్డం పశ్చిమే దళే । ఉత్తరేణ రవిం దేవం కర్ణికాయాంతు భాస్కరమ్. 9

## తొంబది ఆరవ అధ్యాయము.
## ఆదిత్యవార నక్తవ్రతము.

నందికేశ్వరా: మానవులకు ఆరోగ్య ప్రదమును అనంత ఫలప్రదమును శాంతి ప్రదమును నగు వ్రతమును తెలుపుమనిన నారదున కతడిట్లు వచించెను: విశ్వాత్మకమును సనాతనమునునగు పరబ్రహ్మ తత్త్వపు తేజము జగమున సూర్య చంద్రాగ్నులను మూడు రూపములతో ప్రకాశించుచున్నది. దాని నారాధించినవారు సదా క్షేమమునందుదురు. అందులకయి ఆదిత్య వారములందు నియతముగ పగలుపవసించి నక్తమున (రాత్రియందు) భుజించవలెను. ఎట్లన-ఆదిత్య వారముతో హస్త నక్షత్రము వచ్చినప్పుడు దానికి ముందటినాడు-శనివారమున పగటి మాత్రపు భోజనముతో ఏక భుక్తముచేసి విమత్సరుడై యుండి ఆదిత్యవారమునాడు బ్రాహ్మణులకు భోజనము పెట్టి తానును భుజించవలెను.

(దానికి ముందు) రక్తచందనముతో ద్వాదశ దళ పద్మము వ్రాసి దానియందు తూర్పున 'సూర్యాయనమః' ఆగ్నేయమున 'దివాకరాయనమః' దక్షిణమున 'వివస్వతేనమః' నైరృతమున 'భగాయనమః' పడమర 'వరుణాయనమః' వాయవ్యమున 'మహేంద్రాయనమః' ఉత్తరమున 'ఆదిత్యాయనమః' ఈశాన్యమున 'శాంతాయనమః' అని వ్రాయవలెను. అట్లే కర్ణికలో తూర్పున 'రవితురగేభ్యోనమః' దక్షిణమున 'యమాయనమః' పశ్చిమమున 'మార్తాండాయనమః' ఉత్తరమున 'రవయేనమః' కర్ణికనడుమ 'భాస్కరాయనమః' అని వ్రాయవలెను.

రక్తపుష్పోదకేనార్ఘ్యం సతిలారుణచన్దనమ్ । తస్మి న్పద్మే తతో దద్యా దిమం మన్త్ర ముదీరయేత్. 10
కాలాత్మా సర్వభూతాత్మా వేదాత్మా సర్వతోముఖః । యస్మా దగ్నీన్ద్రరూప స్త్వం నమస్తే ప్రాగ్దివాకర.
అగ్నిమీళే నమస్తుభ్య మిషేత్వోర్జేతి భాస్కరమ్ । అగ్నఆయాహి వరద నమస్తే జ్యోతిషాం పతే. 12
అర్ఘ్యం దత్త్వా విసృజ్యాథ నిశి తైలవివర్జితం । భుఞ్జీత వత్సరాన్తేతు కాఞ్చనం కమలోత్తమమ్. 13
పురుషంచ యథా శక్త్యా కుర్వీత ద్విభుజం తథా ।
సువర్ణశృఙ్గీం కపిలా మనర్ఘ్యాం రౌప్యాం ఖురైః కాంస్య దోహాం సవత్సామ్. 14
పూర్ణే గుడస్యోపరి తామ్రపాత్రే నిధాయ పద్మం పురుషంచ దద్యాత్ ।
సమ్పూజ్య శయ్యామ్బరధూపమాల్యై ర్ద్విజంచ రక్తై రథవా పిశఙ్గైః. 15
ప్రక్షాళయిత్వా పురుషంచ పద్మం దద్యా దనేక వ్రతదానకాయ ।
అవ్యఙ్గరూపాయ జితేన్ద్రియాయ కుటుమ్బినే దేయ మసుద్ధతాయ. 16
నమో నమః పాపవినాశనాయ విశ్వాత్మనే సప్తతురఙ్గమాయ ।
సామర్గ్యజుర్ధామనిధే విధాత్రే భవాబ్ధిపోతాయ జగత్పవిత్ర. 17
ఇత్యనేన విధినా సమాచరే దబ్ద మేక మిహ యస్తు మానవః ।
సోఽధిరోహతి వినష్టకల్మష స్సూర్యధామ సకలామరావృతః. 17
కర్మసంక్షయ మవాప్య భూపతి శ్శోకదుఃఖభయ రోగవర్జితః ।
సో భవే ద్భువనసప్తసంయుతో ధర్మమూర్తి రమితాయురాత్మవాన్. 19
యాచ భర్తృగురుదేవతత్పరా వేదకర్తు రిహ నక్త మాచరేత్ ।
సాఽపి లోక మమరౌఘపూజితం యాతి నారద పదం న సంశయః. 20
యః పఠే దథ నర శ్శృణోతి వా పఠ్యమాన మథవాఽనుమోదతే ।
సోపి శక్రభవనే దివౌకసైః పూజ్యతేఽబ్దశతకోటివిస్తరమ్. 21

ఇతి శ్రీమత్స్యమహాపురాణే ఆదిత్యవారనక్తవ్రతమాహాత్మ్యకథనం
నామ షణ్ణవతితమోఽధ్యాయః.

పిమ్మట ఆ పద్మమున నూవులును రక్తచందనమును కలిసిన రక్త పుష్పోదకముతో రవికి అర్ఘ్యమీయవలెను. (మంత్రార్థము): దివాకరా! నీవు కాలాత్ముడవు; సర్వభూతాత్ముడవు; వేదాత్ముడవు; సర్వతోముఖుడవు; అగ్నిరూపుడవు; ఇట్టి నీకు తూర్పుదిశయందు నమస్కారము. 'అగ్నిమీళే' ఇత్యాది ఋక్కుతో నీకు నమస్కారము. 'ఇషే త్వోర్జేత్వా' ఇత్యాది మంత్రముతోను 'అగ్న ఆయాహి' ఇత్యాది మంత్రముతోను భాస్కరా! వరదా! జ్యోతిషాంపతీ! నీకునమస్సు. అనుచు రవి కర్ఘ్యము ఇచ్చి అతనికి ఉద్వాసనము చెప్పవలెను. ఆ రాత్రి తైలము లేకుండ భుజింపవలెను. ఇట్లు సంవత్సరము గడచిన తరువాత అనేక వ్రతములను దానములను ఆచరించినవాడు అంగవైకల్యము లేనివాడు జితేంద్రియుడు కుటుంబి పొగరులేనివాడు అగు బ్రాహ్మణుని ఎఱ్ఱనివికాని ఎరుపు పసుపు కలిసిన రంగువికాని అగు వస్త్ర మాల్య ధూపములతో అర్చించి అతనికి యథాశక్తిగ బంగారుతో చేసిన పద్మమును ద్విభుజుడగు పురుషుని బంగారు కొమ్ములతో వెండిగిట్టలతో అలంకరించినదియు దూడ కలదియు పాలు పిదుకుటకు కంచుపాత్ర కలదియు అగు పాడి యావును దానమీయవలెను. (దానమంత్రము): "పాపవినాశనుడు విశ్వాత్ముడు సప్తాశ్వుడు ఋగ్యజుస్సామ వేదములకు తేజస్సులకు నిధియు విధాతృడును సంసార సాగర నౌకయు జగత్పవిత్రుడునగు రవికి నమస్కారము."

ఈ విధానమున సంవత్సరకాలమాచరించు మానవుడు పాపముక్తుడై సకల దేవతలు తను సేవింప సూర్య పదమునందును. అతడు కర్మ నాశమును పొంది భూనాథుడై దుఃఖభయ రోగ రహితుడై ధర్మమూర్తియు అమితాయువునై ఊర్ధ్వ సప్తలోకములను చేరి సుఖించును.

స్త్రీయైనను భర్తృ గురుదేవభక్తి కలిగి ఆదిత్యవార నక్తవ్రతమును ఇట్లాచరించెనేని ఆమెయు దేవ గణ పూజితమగు ఉత్తమలోకమునందును. సందియము లేదు.

ఈ విధానమును వినినను చదివినను ఇతరులు చదువుట విని అనుమోదిం (ప్రశంసిం)చినను అట్టివాడును నూర్ల కోట్ల సంవత్సరములపాటు దేవపూజితుడై ఇంద్రభవనమున సుఖించును.

ఇది శ్రీమత్స్య మహాపురాణమున ఆదిత్యవార నక్త వ్రతమాహాత్మ్య కథనమను
తొంబది ఆరవ అధ్యాయము

## సప్తనవతితమోఽధ్యాయః.
## సఙ్క్రాన్త్యుద్యాపనవ్రతమ్.

నన్దికేశ్వరః : అథాత స్సమ్ప్రవక్ష్యామి సఙ్క్రాన్త్యుద్యాపనంపరమ్ ।
యదక్షయం పరే లోకే సర్వకామఫలప్రదమ్. 1
విషువే వాఽయనేచాపి సఙ్క్రాన్తివ్రత మాచరేత్ । పూర్వేద్యు రేకభుక్తేన దన్తధావనపూర్వకమ్. 2
సఙ్క్రాన్తివాసరే ప్రాప్తే తిలై స్స్నాన సమాచరేత్ ।
రవిసఙ్క్రమణే భూమౌ చన్దనేనాష్టపత్రకమ్. 3
పద్మం సకర్ణికం కుర్యా త్తస్మి న్నావాహయే ద్రవిమ్ ।
కర్ణికాయాం న్యసే త్సూర్య మాదిత్యం పూర్వత స్తతః. 4
నమ స్సప్తార్చిషే యామ్యేఽర్యమ్ణ మృఙ్మణ్డలాయచ । తత స్సవిత్రే వారుణ్యే మారుతే తపనాయ వై. 5
మార్తాణ్డ ముత్తరే విష్ణుమైశాన్యాం విన్యసే త్తతః । గన్ధమాల్యఫలై ర్భక్ష్యై స్స్థణ్డిలే పూజయే త్తతః. 6
ద్విజాయ సోదకుమ్భంతు ఘృతపాత్రం హిరణ్మయమ్ । కమలంచ యథాశక్త్యా కారయిత్వా నివేదయేత్. 7
చన్దనోదకపుష్పైశ్చ దేవాయార్ఘ్యం న్యసే ద్భువి । విశ్వాయ విశ్వరూపాయ విశ్వధామ్నే స్వయమ్భువే. 8
నమోఽనన్తాయ ధాత్రేచ యజుషాం పతయే నమః । అనేన విధినా సర్వం మాసి మాసి సమాచరేత్. 9

సంవత్సరాన్తే ఘృతపాయసేన సన్తర్ప్య వహ్నిం ద్విజపుఙ్గవాంశ్చ ।
కుమ్భాన్పునర్ద్వాదశధేనుయుక్తాన్సరత్నహైరణ్మయపద్మయుక్తాన్. 10

పయస్వినీః శీలవతీశ్చ దద్యా ద్ధేమాగ్రశృఙ్గాశ్చ ఖురైశ్చ రౌప్యైః ।
గా స్సప్త పఞ్చాథ సకాంస్యదోహ మాల్యామ్బరా వా చతురోఽప్యశక్తః. 11

దౌర్గత్యయుక్తః కపిలా మథైకాం నివేదయే ద్బ్రాహ్మణపుఙ్గవాయ ।
హైమీంచ దద్యా త్పృథివీ మశేషా మాకార్య రౌప్యా మథవాపి తామ్రామ్. 12

పైష్టీ మశక్తస్తు తిలై ర్విధాయ సౌవర్ణ ○సూర్యేణ సమం ప్రదద్యాత్ ।
న విత్తశాఠ్యం పురుషోఽత్ర కుర్యా త్కుర్వ న్నధో యాతి న సంశయోఽత్ర. 13

యావ న్మహేన్ద్ర ప్రముఖాచలేన్ద్రాః పృథ్వీచ సప్తాబ్ధియుతాచ యావత్ ।
తావ త్స గన్ధర్వగణై రశేషై స్సమ్పూజ్యతే నారద నాకపృష్ఠే. 14

తతస్తు కర్మక్షయ మాప్య సప్తద్వీపాధిప స్స్యాత్కులశీలయుక్తః ।
స్పష్టేర్మఖేఽప్యఙ్గవపు స్సభార్యః ప్రభూతపుత్రాన్వయ ● వన్దితాఙ్ఘ్రిః. 15

ఇతి పఠతి శృణోతి వాఽథ భక్త్యా విధిమఖిలం రవిసఙ్క్రమేషు పుణ్యమ్ ।
మతిమపిచ దదాతి సోఽపి దేవై రమరపతే ర్భవనేఽభిపూజ్యతే చ. 16

ఇతి శ్రీమత్స్యమహాపురాణే సఙ్క్రాన్త్యుద్యాపనవ్రతకథనం నామ
సప్తనవతితమోఽధ్యాయః.

## తొంబది ఏడవ అధ్యాయము.

## సంక్రాంత్యుద్యాపన వ్రతము.

ఇక ఇప్పుడు సంక్రాంత్యుద్యాపన వ్రతమును తెలిపెదను. అది మేలయినది. ఇహమున సర్వకామ ఫలప్రదము; పరలోకమున అక్షయ ఫలదము. విషువము (రాత్రింబగళ్ళు సమముగనుండు దినము) నందుకాని అయన పుణ్యకాలము లందుగాని దీని నాచరించవలెను. ముందటి దినమున ఏక భుక్తముచేసి గడపి వ్రత దినమున దంత ధావనమయిన పిమ్మట తిలలతో (తిలలపిండి నూనెలతో) స్నానమాడ వలెను. తదుపరి (గోమయముతో అలికిన) భూమిపై-చందనముతో అష్ట దళ పద్మమును కర్ణికతోకూడ లిఖించి దానియందు రవినావాహనము చేయవలెను. కర్ణికయందు 'సూర్యాయ నమః' తూర్పున 'ఆదిత్యాయ నమః' ఆగ్నేయమున 'సప్తార్చిషే నమః' దక్షిణమున 'అర్యమ్ణే నమః' నైరృతమున 'ఋఙ్మండ లాయ నమః' పడమర 'సవిత్రే నమః' వాయవ్యమున 'తపనాయ నమః' ఉత్తరమున 'మార్తాండాయ నమః' ఈశాన్య మున 'విష్ణవే నమః' అని వ్రాయవలెను. తరువాత ఆ స్థండిలమునందు గంధమాల్యఫల భక్ష్యములతో రవినర్చించవలెను బ్రాహ్మణునకు ఉదకుంభమును ఘృత పాత్రమును సువర్ణకమలమును యథాశక్తిగ దానమీయవలెను. చందనోదక కుసుమములతో నేలపై రవి కర్ఘ్యము విడువవలెను. (అర్ఘ్య మంత్రార్థము); "విశ్వుడు విశ్వరూపుడు విశ్వధాముడు స్వయం భువు అనంతుడు ధాత యజుస్సులకు అధిపతి అగు రవికి నమస్కారము." (సర్వము తానైనవాడును అన్నిటియందును తాను ప్రవేశించి యున్నవాడును విశ్వుడు; ప్రతియొకదాని రూపమును ప్రపంచ రూపమును తానైయున్నవాడు విశ్వ రూపుడు; ప్రతియొక తేజోరూప తత్త్వమును తానైయున్నవాడు విశ్వధాముడు; తనకుతానై జనించినవాడును తనకుతానై మరియొకరితో పనిలేకయే నిలిచియున్నవాడు స్వయంభువు; అంతము లేనివాడు అనంతుడు; సర్వమును నిర్మించువాడు ధాత; యజ్ఞములను ఆచరించుటకుపయోగించు మంత్రములు యజుస్సులు; యజ్ఞములనాచరించుటవలని ఫలితము హిరణ్య గర్భోపాసనా ఫలితము అగు సూర్యలోకప్రాప్తియే; కావున రవి యజుస్సులకు అధిపతి.)

---

○ శూర్పేణ. ●వన్దితాఙ్ఘ్రిః.

ఈ విధానమున ప్రతి మాసమునందును ప్రత్యంశమును ఆచరించవలయును. సంవత్సరాంతమున నేతి పాయసముతో (హోమముతో) అగ్నిని (భోజనములతో) ద్విజపుంగవులను సంతృప్తుల జేయవలెను. పండ్రెండు కడవలను పండ్రెండు రత్న(ఖండ)ములతో కూడ పండ్రెండు బంగారు పద్మములను బంగరు కొమ్ముల కొనలు వెండి గిట్టలు పాలు పిదుకుటకు కంచు పాత్రలు మంచి శీలము కలిగి పూలతో వస్త్రములతో అలంకరించియున్న పండ్రెండు పాడి ఆవులను శక్తి లేనిచో నాలుగు కాని ఒకటికాని ఇట్టి ఆవులను బ్రాహ్మణులకు వేరు వేరుగా దాన మీయవలెను. శక్తి ననుసరించి బంగారుతోనో వెండితోనో రాగితోనో నూవుల పిండితోనో చేసిన భూ ప్రతిమను కూడ బంగారు రవి ప్రతిమతోపాటు ఈయవలెను. ధనము విషయమున శాఠ్యము (కొంటె తనము) చేయరాదు; చేసినచో అధోగతి చెందును.

ఇది ఇట్లు చేసినవాడు నారదా! మహేంద్రాది పర్వతములును సప్తద్వీప సప్త సముద్రాన్విత పృథివియు ఉన్నంతవరకు స్వర్గమున అశేష గంధర్వ గణముల పూజలనందుకొనుచు సుఖించును. పిమ్మట పుణ్యక్షయము కాగా భూమిపై కులశీలయుక్తుడగు సప్తద్వీపాధిపతిగా జన్మించును. మరల సృష్టికి ఆదియందును అవికలాంగుడు యోగ్యులగు దారపుత్త్రిలు మంచి వంశము కలిగి జన్మించి ఎల్లరు తన పాదములకు నమస్కరించుచుండ సుఖించును.

ఈ పుణ్యకరమగు రవి సంక్రాంత్యుద్యాపన వ్రతమును చదివినను వినినను ఇతరులకు వినిపించి తెలిపినను అట్టి వారును ఇంద్ర భవనమున దేవతల పూజలనందుకొనుచు ఆనందింతురు.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున సంక్రాంత్యుద్యాపన వ్రతమాహాత్మ్య కథనమను
తొంబది ఏడవ అధ్యాయము.

## అష్టనవతితమోఽధ్యాయః.
## విభూతిద్వాదశీవ్రతమ్.

నన్దికేశ్వరః : అథాన్యదపి వక్ష్యామి విష్ణో ర్వ్రత మనుత్తమమ్ ।
విభూతిద్వాదశీ నామ సర్వామరనమస్కృతా. 1
కార్తికే చైత్రవైశాఖే మార్గశీర్షేఽథ ఫాల్గునే । ఆషాఢేచ దశమ్యాంతు శుక్లాయాం లఘుభు జ్నరః. 2
కృత్వా సాయన్తనీం సన్ధ్యాం గృహ్ణీయా న్నియమం నరః ।
ఏకాదశ్యాం నిరాహార స్సమభ్యర్చ్య జనార్దనమ్. 3
ద్వాదశ్యాం ద్విజసంయుక్తః కరిష్యే భోజనం విభో । తదవిఘ్నం మమైవాస్తు సఫలం మధుసూదన. 4
నమో నారాయణాయేతి వాచ్యంచ స్వపతా నిశి । తతః ప్రభాత ఉత్థాయ ♦ కృతస్నానజప శ్శుచిః. 5
పూజయే త్పుణ్డరీకాక్షం గన్ధమాల్యానులేపనైః । విభూతయే నమః పాదౌ విశోకాయచ జానునీ. 6
నమ శ్శివాయేత్యూరూచ విశ్వమూర్తే నమః కటిమ్ । కన్దర్పాయ నమో మేఢ్రి మాదిత్యాయ నమః కరౌ. 7
దామోదరాయేత్యుదర మాదిదేవాయచ స్తనౌ । మాధవాయే త్యురో విష్ణోః కణ్ఠం వైకుణ్ఠినే నమః. 8
శ్రీధరాయ ముఖం కేశా న్కేశవాయేతి నారద । పృష్ఠం శార్ఙ్గధరాయేతి శ్రవణే ధనదాయ వై. 9
స్వనామ్నా శఙ్ఖచక్రాసిగదాజలజపాణయే । శిర స్సర్వాత్మనే బ్రహ్మ న్నమ ఇత్యభిపూజయేత్. 10
మత్స్య ముత్పలసంయుక్తం హైమం కృత్వాతు శక్తితః ।
ఉదకుమ్భసమాయుక్త మగ్రత స్థాపయే ద్విభోః. 11
గుడపాత్రం తిలై ర్యుక్తం పీతవస్త్రాభివేష్టితమ్ । కృత్వా జాగరణం కుర్యా దితిహాసకథాదినా. 12
ప్రభాతాయాంతు శర్వర్యాం బ్రాహ్మణాయ కుటుమ్బినే । సకాఞ్చనోత్పలం దేవం సోదకుమ్భం నివేదయేత్.

♦ గాయత్ర్యష్టశతం జపేత్

యథా న ముచ్యసే విష్ణో సదా సర్వవిభూతిభిః । తథా మాముద్ధరాశేషదుఃఖసంసారకర్దమాత్. 14
దశావతారరూపాణి ప్రతిమాసం క్రమా న్మునే । దత్తాత్రేయం తథా వ్యాస ముత్పలేన సమన్వితమ్. 15
దద్యా ద్దేవం సమా యావ త్పాషణ్డా నభివర్జయేత్ ।

## తొంబది ఎనిమిదవ అధ్యాయము.

## విభూతి ద్వాదశీ వ్రతము.

నందికేశ్వరుడు నారదునకు ఇట్లు చెప్పసాగెను: సర్వోత్తమమగు విష్ణుదేవతాక వ్రతమును మఱియొక దానిని చెప్పెదను. విభూతి ద్వాదశీ వ్రతమనునది సర్వామరుల ప్రశంసలనందుకొనునది. చైత్ర వైశాఖాషాఢ కార్తిక మార్గశీర్ష ఫాల్గున మాసములలో దేనియందైన శుక్ల దశమినాడు లఘు భోజనముచేసి ఆనాటి సాయం సంధ్యావందనమయిన తరువాత "నేను రేపు ఏకాదశినాడు నిరాహారుడనై జనార్దనుని అభ్యర్చించి ద్వాదశినాడు ద్విజులతో కూడి భుజింతును. నా ఈ వ్రతము నిర్విఘ్నమును సఫలమును అగుగాక! మధుసూదనా!" అని సంకల్పించి నియమము పూనవలెను. రాత్రి నిద్రించునపుడును 'నమో నారాయణాయ' అని ధ్యానించుచుండవలెను.

ఏకాదశినాటి ఉదయమున మేల్కాంచి స్నాన జపములు చేసి శుచియై గంధమాల్యాను లేపనములతో పుండరీకాక్షుని పూజించవలెను.

పూజా మంత్రములు: 1. విభూతయేనమః-పాదౌ పూజయామి; 2. విశోకాయనమః-జానునీ పూజయామి; 3. శివాయనమః-ఊరూ పూజయామి; 4. విశ్వమూర్తయేనమః-కటిం పూజయామి; 5. కందర్పాయనమః-మేఢ్రం పూజయామి; 6. ఆదిత్యాయనమః-కరౌ పూజయామి; 7. దామోదరాయనమః-ఉదరం పూజయామి; 8. ఆదిదేవాయనమః స్తనౌ పూజయామి: 9. మాధవాయ నమః-ఉరః పూజయామి; 10. వైకుంఠినే నమః-కంఠం పూజయామి; 11. శ్రీధరాయ నమ-ముఖం పూజయామి; 12. ధనదాయ నమః-శ్రవణే పూజయామి; 13. సర్వాత్మనే నమః-శిరః పూజయామి; 14. కేశవాయ నమః-కేశాన్ పూజయామి; 15. శార్ఙ్గధరాయ నమః - పృష్ఠం పూజయామి; 16. శంఖచక్రాసిగదా జలజపాణయే బ్రహ్మణే నమః అని పూజించవలయును.

బంగారుతో కలువపూవును మత్స్యమును చేయించి అవియును-వానితోపాటు ఉదకుంభమును-పాత్రయందు నూవులును బెల్లమును నింపి పచ్చని వస్త్రముతో దానిని కప్పి అదియు స్వామి ముందు చవలెను. ఇతిహాస కథాది శ్రవణముతో జాగరణము చేసి ఆ రాత్రి గడుపవలెను. ద్వాదశినాటి ఉదయమున కుటుంబియగు బ్రాహ్మణునకు కలువపూవును మత్స్యమును ఉదకుంభమును గుడతిలపాత్రమును దానము చేయవలెను. దాన ప్రార్థనామంత్రము : "విష్ణో! సర్వ విభూతియుక్తుడవగు నీవు అశేష దుఃఖ సంసార పంకమునుండి న న్నుద్ధరించుము." ఇట్లే సంవత్సరముపాటు మత్స్యాది దశావతార ప్రతిమలను దత్తాత్రేయ వ్యాసాదుల ప్రతిమలను కలువపూవును బంగారుతో చేయించి ఇచ్చుచుండవలెను. ఈ కాలమునందు పాషండుల(వేద నిందకుల)తో సంబంధమును ఏ మాత్రము పెట్టుకొనరాదు.

సమాప్యైవం యథాశక్త్యా ద్వాదశ ద్వాదశీ ర్నరః. 16
సంవత్సరాన్తే లవణపర్వతేన సమన్వితామ్ । శయ్యాం దద్యా న్మునిశ్రేష్ఠ గురవే ధేనుసంయుతామ్. 17
గ్రామంచ శక్తిమా న్దద్యా త్క్షేత్రంచ భవనాన్వితమ్ । గురుం సమ్పూజ్య విధివ ద్వస్త్రాలఙ్కారభూషణైః.
అన్యానపి యథాశక్త్యా భోజయిత్వా ద్విజోత్తమాన్ । తర్పయే ద్వస్త్రగోదానై రత్నాదిధన సఞ్చయైః. 18
అల్పవిత్తో యథాశక్త్యా స్తోకం స్తోకం సమాచరేత్ । యశ్చా ప్యతీవ నిస్స్వ స్స్యా ద్భక్తిమా న్మాధవంప్రతి.
పుష్పార్చనవిధానేన స కుర్యా ద్వత్సరత్రయమ్ । అనేన విధినా యస్తు విభూతిద్వాదశీవ్రతమ్. 21
కుర్యా త్పాపవినిర్ముక్తః పితౄణాం తారయే చ్ఛతమ్ । జన్మనాం శతసాహస్రం నశోక ఫలభా గ్భవేత్. 22

న వా వ్యాధి ర్భవే త్తస్య న దారిద్ర్యం న బన్ధనమ్ । వైష్ణవో వాఽథ శైవో వా భవే జ్జన్మని జన్మని. 23
యావ ద్యుగసహస్రాణాం శత మష్టోత్తరం భవేత్ ।
తావ త్స్వర్గే వసే ద్బ్రహ్మ న్భూపతిశ్చ పున ర్భవేత్. 24

ఇట్లు యథాశక్తిగా పండ్రెండు ద్వాదశులను గడపి సంవత్సరాంతమున గురుని వస్త్రాలంకార భూషణములతో పూజించి లవణ పర్వతమును శయ్యను పాడియావును గ్రామమును పొలమును భవనమును (శక్తిని బట్టి) ఈయవలెను. ఇతర బ్రాహ్మణులను కూడ యథాశక్తి భుజింపజేసి వస్త్ర గోరత్నధనాదిక దానములచే సంతోషపరచవలెను. శక్తిలేని వాడు అల్పముగను ఈయవచ్చును. మరియు అల్పధనుడు పుష్పార్చన విధానముతో మూడు సంవత్సరములు మాధవుని ఇట్లర్చించవచ్చును.

దీని నాచరించుటచే తాను తరించి పాపనిర్ముక్తుడై నూర్గురను పితరులను కూడ తరింపజేయును. ఈ ఫలము అతనికి నూర్ల-వేల జన్మములవరకు వెంట నుండును. అతనికి వ్యాధులు దారిద్ర్యము బంధనము కలుగవు. అతడు శైవుడైనను వైష్ణవుడైనను దీని ఫలముగ నూట ఎనిమిది వేల యుగములపాటు స్వర్గమున వసించి కల్పాంతానంతర సృష్టిలో భూపతిగా జన్మించును.

## పుష్పవాహనోపాఖ్యానమ్.

పురా రాథన్తరే కల్పే రాజాఽఽసీ త్పుష్పవాహనః । నామ్నా లోకేషు విఖ్యాత స్తేజసా సూర్యసన్నిభః. 25
తపసా తస్య తుష్టేన చతుర్వక్త్రేణ నారద । కమలం కాఞ్చనం దత్తం యథాకామగమం మునే. 26
లోకై స్సమస్తై ర్నగరవాసిభి స్సహితో నృపః । ద్వీపాని సురలోకాంశ్చ యథేష్టం వ్యచర త్సదా. 27
కల్పాదౌ సప్తమే ద్వీపే తస్య పుష్కరవాసినా । లోకేన పూజితం యస్మా త్పుష్కర ద్వీప ముచ్యతే. 28
తదేవ బ్రహ్మణా దత్తం యాన మస్య యతోఽమ్బుజమ్ ।
పుష్పవాహన మిత్యాహు స్తస్మా త్తం దేవదానవాః. 29
న సాధ్య మస్యాస్తి జగత్త్రయేఽపి బ్రహ్మామ్బుజస్థస్యతు తస్య రాజ్ఞః ।
తపోనుభావా దథ తస్య పత్నీ నారీసహస్రైరభివన్ద్యమానా. 30
నామ్నా చ లావణ్యవతీ బభూవ సా పార్వతీవేష్టతమా భవస్య ।
తస్యా స్సుతానా మయుతం బభూవ ధర్మాత్మనా మగ్ర్యధనుర్ధరాణామ్. 31
తథాఽఽత్మజాం స్తానథ వీక్ష్య రాజా ముహుర్ముహు ర్విస్మయ మాససాద ।
సోఽభ్యాగతం వీక్ష్య మునిప్రవీరం ప్రచేతసం వాక్య మిదం బభాషే. 32
పుష్పవాహనః: కస్మా ద్విభూతి రచలాఽమరమర్త్యపూజ్యా జాయాచ రూపవిజితామరసున్దరీయమ్ ।
భార్యా మమాల్పతపసా పరితోషితేన దత్తా తథాఽమ్బుజగృహం మునివర్యదత్తమ్. 33
యస్మాత్ప్రవిష్టమపి కోటిశతం నృపాణాం సామాత్యకుఞ్జరరథౌఘ జనావృతానామ్ ।
నో లక్ష్యతే క్వ గత మమ్బరమధ్య ఇన్దు స్తారాగణై రివ వృతః పరిత స్స్ఫురద్భిః. 34
తస్మా త్కిమన్యజననీజఠరోద్భవేన ధర్మాదికం కృత మశేషఫలాప్తిహేతు ।
స్వామి న్మయాఽథ తనయై రథవాఽనయాపి మద్భార్యయా తదఖిలం కథయ ప్రచేతః. 35

## పుష్పవాహనోపాఖ్యానము

పూర్వము రాథంతర కల్పమున రవితేజస్కుడగు పుష్పవాహనుడను రాజుండెను. అతడు తపముచే బ్రహ్మను

మెప్పించి కామగమనముగల కాంచన కమలమును సంపాదించి తన నగరవాసి జనముతోకూడ సమస్త ద్వీపములందును సురలోకమునందును సంచరించుచుండెను. అతడు కల్పాదియందు ద్వీపములలో ఏడవదియగు పుష్కర ద్వీపమున వసించుచుండెడివాడు. బ్రహ్మ అతని కిచ్చిన పుష్కరము(పద్మము)అదియే. దీనిచే అతని దేవదానవాదులు పుష్పవాహను డనిరి. నా డా రాజునకు సాటి ఎవరును లేరు. అతని తపోనుభావ మట్టిది. ఆతని పత్ని నారీసహస్రముచే వంద్యమానయు లావణ్యవతియునై భవునకు పార్వతివలె ఆ రాజునకు ప్రియయై యుండెను. ఆమెకు ధర్మాత్ములు ధనుష్కశ్రేష్ఠులు నగు పదివేల మంది తనయులు కలిగిరి. ఇదియంతయు చూచికొని రాజు తరచు వెరగొందుచుండి యొకనాడు తన కడ కభ్యాగతుడై వచ్చిన ప్రచేతసు నిట్లడిగెను: "నాకు దేవమానవ పూజ్యమగు ఈ యచల సంపద అమరసుందరులకంటె మిన్నయగు ఈ పత్ని అల్పతపముతోనే తుష్టుడై బ్రహ్మ ఇచ్చిన ఈ పుష్పయానము చంద్రుని పరివేష్టించిన తారాగణమువలె నా ముందు కాంతిహీనులై నన్ను పరివేష్టించి యుండు చతురంగ బలసమేతులగు ఈ శతకోటి నృపులు - ఇదంతయును కలుగుటకు గత జన్మమున నేనో నా పత్నియో నా తనయులో అశేష ఫలాప్తిహేతువగు పుణ్యమేమి చేసియుంటిమో దయార్ద్రచేతస్కుడవై తెలుపుము."

### ప్రచేతఃకథిత పుష్పవాహన పూర్వచరితమ్.

ప్రచేతాః : ప్రభవాన్తరితం సమీక్ష్య పుణ్యం పృథివీపతేః ప్రసభవిభూతిహేతువృత్తమ్ ।
జన్మాఽభవ త్తవతు లుబ్ధకులేపి రాజ౯ జాతో భవా ననుదినం కిల పాపకారీ. 36
వపుర వ్యభూ త్తవ పురా పరుషాఙ్గసన్ధి దుర్గన్ధి సత్త్వభయతాపకరం ప్రజానామ్ ।
న చ తే సుహృజ్జనగణ స్సుతబన్ధువర్గో న చ తే పితా నజననీ చ తదా. 37
అభిసమ్మతా పర మభీష్టతమా చ పత్నీ విముఖాతు పర్వతచరాఽప్యభవత్ ।
ఆసీ దనావృష్టి రతీవ రౌద్రా కదాచి దాహారనిమిత్త మస్మి౯. 38
క్షుత్పీడితేన భవతా తు యదా న కించి దాసాదితం ధాన్యఫలాదికంచ ।
తదా తు దృష్టం మహదమ్బుజాఢ్యం సరోవరం పఙ్కపరీతరోధః. 39
పద్మా న్యథాదాయ తతో బహూని గతః పురం వైదిశనామధేయమ్ ।
తన్మూల్యలాభాయ పురం సమస్తం భ్రాన్తం త్వయాఽశేష మహ స్తదాసీత్. 40
క్రేతా న కశ్చి త్కమలేషు జాతః క్లాన్తః పరం క్షుత్పరిపీడితశ్చ ।
ఉపవిష్ట స్త్వ మేకస్మి న్సభార్యో భవనాఙ్గణే. 41
అథ మఙ్గళశబ్దశ్చ త్వయా రాత్రౌ మహా ఞ్ఛ్రుతః । సభార్య స్తత్ర గతవా న్యత్రాసీ న్మఙ్గళధ్వనిః. 42
తత్ర మణ్డపమధ్యస్థా విష్ణో రర్చాఽవలోకితా । వేశ్యానఙ్గవతీ నామ విభూతిద్వాదశీవ్రతమ్. 43
సమాప్య మాఘమాసస్య ద్వాదశ్యాం లవణాచలమ్ । నివేదయన్తీ గురవే శయ్యాం చోపస్కరాన్వితామ్.
అలఙ్కృత్య హృషీకేశం సౌవర్ణామరపాదపా౯ । తాంచ దృష్ట్వా తతస్తాభ్యా మిదంచ పరిచిన్తితమ్. 45
కిమేభిః కమలైః కార్యం వరం విష్ణు రలఙ్కృతః । ఇతి భక్తి స్తదా జాతా దమ్పత్యస్య నరేశ్వర. 46
తత్ర సఙ్గా త్సమభ్యర్చ్య కేశవం లవణాచలే । శయ్యాం చ పుష్పప్రకరైః పూజయిత్వాచ సర్వశః. 47
అథానఙ్గవతీ తుష్టా తాభ్యాం దేను శతత్రయమ్ । దీయతా మాదిదేశాథ కలధౌతపలత్రయమ్. 48
న గృహీతం తతస్తాభ్యాం మహత్సత్త్వావలమ్బనాత్ ।

అనగా ప్రచేతు డిట్లు పలికెను: రాజా! నీ కీ సర్వసంపదలకును హేతువగు నీ పూర్వ జన్మవృత్తమును చూచితిని. గత జన్మమున నీవు అనుదినము పాపకారియగు లుబ్ధకుడవు. నీ శరీరమును పరుషాంగసంధులు దుర్గంధము కలిగి ప్రాణులకు భయతాపకరమయియుండెను. పర్వతచరురాలయినను నీయందు విముఖయైనను నీకు అత్యంత ప్రియతమయగు భార్య తప్ప జననీ సుత సుహృద్బంధుజన మెవ్వరును నీకు లేకుండిరి.

ఇట్లుండ ఒకప్పుడు రౌద్రమగు అనావృష్టిచే ఆహారము లేకపోగా నీవు క్షుత్పీడితుడవై ధాన్య ఫలాదికము కూడ దొరుకని తరి నీకు పంకావృత తటము కలిగి అనేక పద్మయుతమగు కొలను కనబడెను. నీవు దానినుండి అనేక పద్మములు కోసి వాని నమ్మి లాభ మార్జించుటకై విదిశయను నగరమేగి అట పగలంతయు తిరిగితివి. వానిని కొనువా రెవ్వరును దొరుకక నీవు నీ పత్నితో అలసి క్షుత్పీడితుడవై యొక భవనాంగణమున కూర్చుంటివి. అంత రాత్రి కాగా వినవచ్చిన మంగళవాద్య ధ్వని జాడబట్టి అది వినవచ్చు చోటికి భార్యతో ఏగితివి. అచట అనంగవతియను వేశ్య చేయుచుండిన విష్ణుపూజను చూచితివి. ఆమె అపుడు తన విభూతి ద్వాదశీ వ్రత సమాప్తికై మాఘ శుక్ల ద్వాదశినాడు గురునకు లవణాచలమును సర్వోపస్కారయుక్త శయ్యను దాన మిచ్చుచుండెను. అది చూచి మీ రిరువురును భక్తి కలిగి 'ఈ కమలములతో పని యేమి?' అని వానితో విష్ణుని అలంకరించి అర్చించితిరి.

అది చూచి తుష్టయై అనంగవతి వారికి మూడు వందల పాడియావులను మూడు పలముల సువర్ణమును నిమ్మని తన వారి నాదేశించెను. కాని మీరు అధిక సత్త్వము నవలంబించి అవి తీసికొనకుంటిరి.

అనఙ్గవత్యాచ పున స్తాభ్యా మన్నం చతుర్విధమ్. 49
ఆనీయ వ్యాహృతం చాత్ర భుజ్యతామితి భూపతే । తాభ్యాం తదా తథేత్యుక్తం భోక్ష్యావ శ్వో వరాననే.50
ప్రసఙ్గా దుపవాసేన ○గతా రాత్రి శ్శుభావహా । జన్మప్రభృతి పాపిష్ఠా వావాం దేవి శుభవ్రతే. 51
త్వత్ప్రసఙ్గా త్తయోర్మధ్యే ధర్మలేశ స్తతోఽనఘః । ఇతి జాగరణం తాభ్యాం తత్ప్రసఙ్గా దనుష్ఠితమ్. 52
ప్రభాతేతు తయా దత్తా శయ్యా సలవణాచలా । గ్రామాశ్చ గురవే భక్త్యా విప్రేభ్యో ద్వాదశైవతు. 53
వస్త్రాలఙ్కారసంయుక్తా గావశ్చ కనకాన్వితాః । భోజనంచ సుహృన్మిత్రదీనాన్ధకృపణై స్సమమ్. 54
తద్వ ల్లుబ్ధకదమ్పత్యం పూజయిత్వా విసర్జితమ్ । స భవా న్లుబ్ధకో జాత స్సపత్నీకో జనేశ్వర. 55
పుష్కరప్రభవా త్తస్మా త్కేశవస్యచ పూజనాత్ । వినష్టాఽశేషపాపస్య తవ పుష్కరమన్దిరమ్. 56
తస్య వ్రతస్య మాహాత్మ్య దల్పేన తపసా నృప। అదా త్కామగమ్యం యానం లోకనాథ శ్చతుర్ముఖః.57
సన్తుష్ట స్తవ రాజేన్ద్ర బ్రహ్మరూపీ జనార్దనః । సాఽప్యనఙ్గవతీ వేశ్యా కామదేవస్య సామ్ప్రతమ్. 58
పత్నీ సపత్నీ సఞ్జాతా సా స్యాత్ప్రీతిరితి శ్రుతా । లోకే ష్వానన్దజననీ సకలామరపూజితా. 59
తస్మా దుత్సృజ్య రాజేన్ద్ర పుష్కరం త్వం మహీతలే । గఙ్గాతటం సమాసాద్య విభూతిద్వాదశీవ్రతమ్.60
కురు రాజేన్ద్ర నిర్వాణ మవశ్యం సమవాప్స్యసి ।
నన్దికేశ్వరః : ఇత్యుక్త్వా స ముని ర్బ్రహ్మ తత్రైవాన్తరధీయత. 61
రాజా యథోక్తంచ పున రకరో త్పుష్పవాహనః । ఇమా మాచరతో బ్రహ్మ న్నఖణ్డఫలతా గ్భవేత్. 62
యథాకథంచి త్కాలేన ద్వాదశ ద్వాదశీ ర్మునే । కర్తవ్యా భక్తితో దేయా విప్రేభ్యో దక్షిణా అపి. 63
విత్తశాఠ్యం న కుర్వీత భక్త్యా తుష్యతి కేశవః ।
ఇతి కలుషవిదారణం నరాణా మపి పఠతీహ శృణోతి వాఽథ భక్త్యా. 64
మతిమపిచ దదాతి దేవలోకే వసతి* స రోమసమాని వత్సరాణి. 64ఉ

ఇతి శ్రీమత్స్యమహాపురాణే విభూతిద్వాదశీవ్రత మాహాత్మ్య
కథనం నామాష్ట నవతితమోఽధ్యాయః.

అంతట అనంగవతి భక్ష్యభోజ్య లేహ్యచోష్య రూప చతుర్విధాన్నములు తెప్పించి మిమ్ము తినుడన మీరును 'అమ్మా! ప్రసంగవశమున అనుకొనకుండగనే ఉపవాసముతో శుభావహమయి రాత్రి గడచినది. కావున రేపు భుజింతుము.

○గతారాత్రి స్తదావయోః

*నకోటిశతానివత్సరాణి.

మేము జన్మప్రభృతిగా ఓ శుభవ్రతా! దేవీ! పాపిష్ఠులము. అంటిరి. ఇట్లు ఈ ప్రసంగమున మీ ఇరువురకును ధర్మలేశమును జాగరణానుష్ఠానఫలమును అబ్బినవి.

ఉదయమున ఆ అనంగవతి శయ్యయు లవణపర్వతమును గ్రామములును గురువునకును వస్త్రాలంకారకనక యుతములైన పండ్రెండు పాడియావులు బ్రాహ్మణులకును దానము చేసెను. సుహృన్మిత్ర దీనాంధకృపణులతోపాటు ఆమె ఈ లుబ్ధక దంపతులకును భోజనము పెట్టి వీడ్కొనెను. రాజా! ఆ లుబ్ధక దంపతులుగా నుండిన మీరు వ్రతమున చేసిన పూజా మాహాత్మ్యమున మీ పాపములన్నియు నశించి ఈ పద్మ గృహమును కామగమనమును ఈ సంపదాదికమంతయును బ్రహ్మరూపుడగు నారాయణునిచే మీకు ఈయబడినవి. ఆ అనంగవతియను వేశ్యయు ఇపుడు మన్మథుని రెండవ భార్యయై ప్రీతియను పేర రతీదేవికి సవతిగా నున్నదై లోకానందజననియు సకలామర పూజితయునై యున్నది.

కావున నో రాజేంద్రా! నీవును ఈ పద్మ గృహయానమును భూతలమున విడిచి గంగాతీరమున విభూతి ద్వాదశీ వ్రతము నాచరింపుము. మోక్షము నందెదవు.

ఇట్లు ప్రచేతుడు పలికి యంతర్హితుడు కాగా ఆ రాజును నాతడు చెప్పినది యెల్ల అట్లే ఆచరించెను. ఆ ఫలమును కూడ పొందెను.

కావున నారదా! దీని నాచరించిన యాతడు అఖండఫలము నందును. శక్తి యున్నంతలో పండ్రెండు ద్వాదశులయందు దువవాన పూజా దక్షిణాదానాదికమును విత్తశాఠ్యము చేయక భక్తితో నాచరించుటచే కేశవుడు తుష్టుడగును.

కలుషనాశకమగు దీనిని భక్తితో వినినను చదివినను నితరులకు తెలిపినను కోటి శత వత్సరములపాటు దేవలోకమున వసించును.

ఇది శ్రీమత్స్య మహాపురాణమున విభూతి ద్వాదశీవ్రత మాహాత్మ్య కథనము తొంబది ఎనిమిదవ అధ్యాయము.

## ఏకోనశతతమోఽధ్యాయః.

## దేవవ్రతాది వ్రతషష్టికథనమ్.

నన్దికేశ్వరః: అథాత స్సమ్ప్రవక్ష్యామి వ్రతషష్టి మనుత్తమామ్ ।
రుద్రేణాభిహితాం దివ్యాం మహాపాపప్రణాశనీమ్. 1
నక్త మబ్దం చరిత్వాతు గవా సార్ధం కుటుమ్బినే । హైమచక్రం త్రిశూలంచ దద్యా ద్విప్రాయ వాససీ. 2
శివో రుద్రోఽహ మస్మీతి శివలోకే మహీయతే । ఏత ద్దేవవ్రతం నామ మహాపాతకనాశనమ్. 3
యస్త్వేకం త్వేకభక్తేన సంక్షిపేద్ధి వృషాన్వితామ్ ।
దేనుం తిలమయీం దద్యా త్స పదం యాతి శాఙ్కరమ్. 4
ఏత ద్రుద్రవ్రతం నామ పాపశోకవినాశనమ్ । యస్తు నీలోత్పలం హైమం శర్కరాపాత్రసంయుతమ్. 5
ఏకాన్తరితనక్తాశీ సమాప్తే వృషసంయుతమ్ । స వైష్ణవపదం యాతి లీలావ్రత మిదం స్మృతమ్. 6
ఆషాఢాది చతుర్మాస మభ్యఙ్గం వర్జయే న్నరః । భోజనోపస్కరం దద్యా త్స యాతి భవనం హరేః. 7
జనప్రీతికరం నృణాం ప్రీతివ్రత మిహోచ్యతే । వర్జయిత్వా మధౌ యస్తు దధిక్షీరఘృతైక్షవమ్. 8
దద్యా ద్వస్త్రాణి సూక్ష్మాణి రసపాత్రేణ సంయుతమ్ । సమ్పూజ్య విప్రమిథునం గౌరీ మే ప్రీయతామితి. 9
ఏత ద్గౌరీవ్రతం నామ *సదా మోహవినాశనమ్ । పుష్యాదౌచ త్రయోదశ్యాం కృత్వా నక్త మథోపునః. 10
ఆశోకం కాఞ్చనం కృత్వా ఇక్షుయుక్తం దశాఙ్గుళమ్ ।
విప్రాయ వస్త్రసంయుక్తం ప్రద్యుమ్నః ప్రీయతా మితి

*భవానీలోకదాయకమ్.

కల్పం విష్ణుపదే స్థిత్వా విశోక స్స్యా త్పున ర్నరః । ఏత త్కామవ్రతం నామ సదా శోకవినాశనమ్. 12
ఆషాఢాదౌ వ్రతాద్యేతు వర్జయే న్నఖకృన్తనమ్ । వార్తాకంచ చతుర్మాసం మధుసర్పిర్గుడాన్వితమ్. 13
కార్తిక్యాం తత్పున ర్హైమం బ్రాహ్మణాయ నివేదయేత్, స రుద్రలోకమాప్నోతి శివవ్రత మిదం స్మృతమ్.-14
వర్జయే ద్యస్తు పుష్పాణి హేమ న్తశిశిరా వృతూ। పుష్పత్రయంతు ఫాల్గున్యాం కృత్వా శక్త్యాథ కాఞ్చనమ్.15
దద్యా త్త్రికాలవేళాయాం ప్రీయేతాం శివకేశవౌ । దత్వా పరంపదం యాతి సౌమ్యవ్రత మిదం స్మృతమ్.

## తొంబది తొమ్మిదవ అధ్యాయము

## దేవవ్రతాది వ్రతషష్టి (అరువది వ్రతముల) కథనము.

నందికేశ్వరుడు నారదునితో ఇట్లు చెప్పనారంభించెను: ఇక మీదట సర్వోత్తమములగు అరువది వ్రతములను నీకు తెలిపెదను. ఇవి సాక్షాత్ రుద్రుడు చెప్పినవి. సర్వపాప ప్రణాశనములు.

1. ఏడాదిపాటు నక్తవ్రతము జరిపి కుటుంబియగు విప్రునకు పాడి గోవును బంగరు త్రిశూల చక్రములను వస్త్రములను 'శివోఽహమస్మి' 'రుద్రోహమస్మి' అను భావనతో దానమీయవలెను. దీని ఫలమున శివలోకమున పూజితుడై సుఖించును. ఇది మహాపాతక నాశనమగు దేవవ్రతము.

2. దినము విడిచి దినము సంవత్సరకాలము నక్తవ్రతము జరిపి సంవత్సరాంతమున బంగారుకలువ పూవు శర్కరా పాత్రను బంగరు వృషభ ప్రతిమను విప్రునకు ఈయవలయును. ఇట్టివారు విష్ణు స్థానమందుదురు. ఇది లీలావ్రతము.

3. ఆషాఢాది మాస చతుష్టయమున అభ్యంగముచేయక బ్రాహ్మణునకు కాని పాత్రునకు ఎవనికైన కాని భోజన సామగ్రి నిచ్చుచుండవలెను. ఇట్టివాడు విష్ణుభవనము చేరును. ఇది జనప్రీతికరమగు ప్రీతి వ్రతము.

4. చైత్ర మాసము పొడవున పాలు పెరుగు నేయి చెరకు రసము వదలి విప్రదంపతులను పూజించి 'గౌరీ మేప్రీయతామ్' అను రసపాత్రను (ఈ వదలిన నాలుగిటిలో దేనితో నిండినదైనను) నన్నని వస్త్రములను దానమీయ వలెను. ఇది అజ్ఞాన నాశమగు గౌరీవ్రతము.

5. వసంత ఋత్వారంభమున (చైత్ర శుక్ల) త్రయోదశినాడు నక్తముండి బంగరు అశోక పుష్పమును పది (భారతీయ) అంగుళముల చెరకుగడను నూతన వస్త్ర (ద్వయ)మును బ్రాహ్మణునకు 'ప్రద్యుమ్నః ప్రీయతామ్' అను మంత్రముతో దానమీయ వలెను. సదా శోక వినాశనమగు కామవ్రతము ఇది. దీని నాచరించినవారు ఒకకల్పమంత కాలము విష్ణు లోకమున సుఖింతురు. ఇహమున శోకరహితులౌదురు.

6. ఆషాఢాది తిథియందీ వ్రతమును పూని నాటినుండి వరుసగ నాలుగు మాసములు గోళ్లు కత్తిరించుకొనకుండ వలెను. అంతకాలమును వార్తాకము (వంకాయ) తేనె నేయి బెల్లము తినకుండవలెను. కార్తికమాసారంభమున బంగారు వార్తాకమును బ్రాహ్మణునకు దానమీయవలెను. ఇది యాచరించినవాడు రుద్ర లోకమందును. దీని పేరు శివ వ్రతము.

7. హేమంతశిశిర ఋతువులయందు ఏ పుష్పములను (తనకై) ఉపయోగించకుండ వలెను-ఫాల్గున మాసమున (కడపట) బంగారుతో (ఆ రెండు ఋతువులలో పూచెడి) మూడు పూవులు చేయించి మూడు వేళలందు మూడిటిని వేరు వేరుగా 'శివకేశవౌ ప్రీయేతామ్' అనుచు విప్రునకు దానమీయవలెను. ఇతడు పరమపద మందును. దీనిని సౌమ్య వ్రత మందురు.

ఫాల్గునాదితృతీయాయాం లవణం యస్తు వర్జయేత్ । సమాప్తౌశ యనం దద్యా ద్గృహం చోపస్కరాన్వితమ్.
సమ్పూజ్య విప్రమిథునం భవానీ ప్రీయతామితి । గౌరీలోకే వసేత్కల్పం సౌభాగ్యవ్రతముచ్యతే. 18
సన్ధ్యామౌనం నరః కృత్వా సమాప్తే ఘృతకుమ్భకమ్ ।
వస్త్రయుగ్మం తిలాన్ఘణ్టాం బ్రాహ్మణాయ నివేదయేత్. 19

లోకం సారస్వతం యాతి పునరావృత్తిదుర్లభమ్ । ఏత త్సారస్వతంనామ రూపవిద్యాప్రదాయకమ్. 20
లక్ష్మీమభ్యర్చ్య పఞ్చమ్యా ముపవాసీ భవేన్నరః । సమాప్తే హేమకలశం దద్యా ద్ధేమసమన్వితమ్. 21
స పదం వైష్ణవం యాతి లక్ష్మీవా న్జన్మజన్మని । †ఏతత్సంపద్వ్రతం నామ దుఃఖశోకవినాశనమ్. 22
కృత్వోపలేపనం శమ్భో రగ్రతః కేశవస్యవా । యావదబ్దం పునర్దద్యా ద్ధేనుం జలఘటాన్వితామ్. 23
జన్మాయుతం స రాజా స్యా త్తత శ్శివపురం వ్రజేత్ । ఏత చ్ఛుద్ధివ్రతంనామ సదా పాపవినాశనమ్. 24
అశ్వత్థం భాస్కరం గఙ్గాం ప్రణమ్యైక త్ర వాగ్యతః । ఏకభక్తం నరః కుర్యా దబ్దమేకం విమత్సరః. 25
వ్రతాన్తే విప్రమిథునం పూజ్యం ధేనుత్రయాన్వితమ్। వృషం హిరణ్మయం దద్యా త్సోఽశ్వమేధఫలం లభేత్.
ఏత త్కీర్తివ్రతంనామ భూతికీర్తిఫలప్రదమ్ । ఘృతేన స్నపనం కృత్వా శమ్భోర్వా కేశవస్యవా. 27
అక్షతాభి స్సపుష్పాభిః కృత్వా గోమయమణ్డలమ్ । సమాప్తే హేమకమలం తిలధేనుసమన్వితమ్. 28
శుద్ధ మష్టాఙ్గుళం దద్యా చ్ఛివలోకే మహీయతే । సామగాయ యత శ్చైత త్సామవ్రత ముచ్యతే. 29
నవమ్యా మేకభక్తంతు కృత్వా కన్యాంచ శక్తితః । భోజయిత్వా సమం దద్యా ద్ధేమకఞ్చుకవాససీ. 30
●హేమ విప్రాయచ పున ర్దద్యా చ్ఛివపురం వ్రజేత్। జన్మార్బుదం సురూపీ స్యా చ్ఛత్రుభి శ్చాపరాజితః.
ఏత ద్వీరవ్రతం నామ నారీణాంచ సుఖప్రదమ్ । ఏత త్సమాచరే ద్యస్తు పఞ్చదశ్యాం పయోవ్రతమ్. 32
సమాప్తే శ్రాద్ధకృ ద్దద్యా ద్గాశ్చ పఞ్చ పయస్వినీః । వాసాంసిచ పిశఙ్గాని జలకుమ్భయుతానిచ. 33
స యాతి వైష్ణవం లోకం పితౄణాం తారయేచ్ఛతమ్ ।
కల్పాన్తే రాజరాజ స్స్యా త్పితృవ్రత మిదం స్మృతమ్. 34

8. ఫాల్గున శుక్ల తృతీయ మొదలు మాసాంతమువరకు లవణము విడువవలెను. కడపట విప్రదంపతులను పూజించి వారికి సర్వోపస్కరములతో ఇంటిని మంచమును 'భవానీ ప్రీయతామ్' అనుచు దానమీయవలెను. దీనిచే కల్ప కాలము గౌరీ లోకవానము లభించును. ఇది సౌభాగ్య వ్రతము.

9. సంధ్యా కాలములందు (కొంత కాలము) మౌనము పాటించి వ్రతాంతమున నేతిపాత్రను వస్త్రముల జతను నూవులను ఘంటను బ్రాహ్మణునకు దానమీయవలెను. దీనిచే ఇహమున రూప విద్యాలాభమును పరమున పునరావృత్తి రహితమగు సారస్వత లోకమును సిద్ధించును. దీనిని సారస్వత వ్రతమందురు.

10. పంచమినాడుపవసించి ఉపవాసాంతమున షష్ఠినాడు బంగారు పాత్రయందు బంగారముంచి విప్రునకు దానమీయవలెను. అతడు జన్మ జన్మమందును సంపద్యుక్తుడై విష్ణు లోకమందును. దీనిని సంపద్వ్రతమందురు. ఇది దుఃఖ శోక వినాశకము.

11. సంవత్సర కాలము శివసన్నిధిలోకాని విష్ణు సన్నిధియందుకాని నిలిచి గంధాను లేపనములు (బొట్టుకాని) ధరించి కడపట పాడియావును ఉదకుంభమును (విప్రునకు) దానమీయవలెను. దీనిచే పదివేల జన్మములందు రాజుగా జన్మించుచుండి కడపట శివలోక ప్రాప్తుడగును. సదా పాప వినాశనమగు ఇది శుద్ధి వ్రతము.

12. సంవత్సరముపాటు విమత్సరుడై (అకలుష చిత్తముతో) ఒకే స్థానమునందు అశ్వత్థమునకు భాస్కరునకు గంగకు ప్రణమిల్లి మౌనవ్రతుడై ఏక భుక్తముతో ఉండవలెను. వ్రతాంతమున విప్రదంపతుల నర్చించి మూడు పాడి యావులను వృషభమును బంగరుతో చేయించి దానమీయవలెను. దీనిచే అశ్వమేధ మాచరించిన ఫలము లభించును. కీర్త్యై శ్వర్యములు సిద్ధింపజేయు దీనిని కీర్తి వ్రతమందురు.

13. గోమయముతో మండలము నేర్పరచి అచట శివునకుగాని కేశవునకుగాని నేతితో అభిషేకము జరిపి పిమ్మట ఆ దేవునికి అక్షతలతో పుష్పములతో పూజను జరిపి అది ముగిసిన తరువాత సామగానమున నిపుణుడగు విప్రు

† ఏతత్సమ్పద్వ్రతంనామ.

● హైమంసింహంచవిప్రాయదత్వాశివ

నకు తిలలను పాడి ఆవును ఎనిమిది (భారతీయ) అంగుళముల పొడవు కల స్వర్ణకమలమును దానమీయవలెను. దీనిచే శివలోక ప్రాప్తియగును. ఇది కామధుగ్వ్రతము.

14. నవమినాడు ఏకభుక్తముండి యథాశక్తిగ కన్యనుకూడ భుజింపజేసి ఆమెకు బంగరు జరీగల రవికను చీరను ఈయవలెను. బ్రాహ్మణునకు బంగారు దానమీవలెను. దీనిచే ఇహమున అర్బుద జన్మములందు చక్కని రూపము శత్రువులచే అపరాజితత్వము పరమున శివలోక ప్రాప్తియగును. ఇది వీరవ్రతమనబడును. ఇది స్త్రీలకు పుణ్యమును ఆనందమును ఇచ్చునది.

15. పూర్ణిమ నాడు పాలు మాత్రము త్రాగి ఉపవాసముండి అది ముగియగానే పాడ్యమినాడు పితరులనుద్దేశించి శ్రాద్ధము జరిపి బ్రాహ్మణులకు ఐదు పాడియావులను పిశంగ (ఎరుపు పసుపు వన్నెలు కలిసిన రంగుగల) వస్త్రములనైదింటిని ఉదకుంభములనైదింటిని దానము ఈయవలెను. దీనిచే తానును తన పితరులును తరింతురు. విష్ణులోకమునందుదురు. కల్పాంతా (ప్రళయా) నంతరమున కల్పాదియందు సృష్ట్యారంభమున చక్రవర్తియై జన్మించును. ఇది పితృవ్రతము.

చైత్రాది చతురో మాసా న్జలం దద్యా దయాచితమ్ । వ్రతాన్తే మణికం దద్యా దన్నవస్త్రసమన్వితమ్. 35
తిలపాత్రం హిరణ్యంచ బ్రహ్మలోకే మహీయతే । కల్పాన్తే నృపతిర్భూన మానన్దవ్రత ముచ్యతే. 36
పఞ్చామృతేన స్నపనం కృత్వా సంవత్సరం విభోః ।
వ్రతాన్తేతు పునర్దద్యా ద్ధేనుం పఞ్చామృతై ర్యుతామ్. 37
విప్రాయ దద్యాచ్ఛంఖంచ స పదం యాతి శాఙ్కరమ్। రాజా భవతి కల్పాన్తే*రాజ్యవ్రత మిదం స్మృతమ్.
వర్జయిత్వా పుమాన్మాంస మబ్దాన్తే గోప్రదో భవేత్। తద్వ ద్ధేమమృగం దద్యా త్సోశ్వమేధఫలం లభేత్.39
అహింసావ్రత మిత్యుక్తం కల్పాన్తే నృపతి ర్భవేత్ । బ్రహ్మలోక మవాప్నోతి పునరావృత్తిదుర్లభమ్. 40
మాఘమాస్యుషసి స్నానం కృత్వా దమ్పత్య మర్చయేత్। భోజయిత్వా యథాశక్తి మాల్యవస్త్రవిభూషణైః.41
సూర్యలోకే వసేత్కల్పం సూర్యవ్రత మిదంస్మృతమ్ ।
ఆషాఢాదిచతుర్మాస్యాం ప్రాతస్స్నాయీ భవేన్నరః. 42
విప్రేషు భోజనం దద్యా త్కార్తిక్యాం గోప్రదో భవేత్ । స వైష్ణవపదం యాతి విష్ణువ్రత మిదం స్మృతమ్.
నిత్యమేవార్చనం విష్ణోః కల్పాన్తే రాజరాడ్భవేత్ । అయనా దయనం యావ ద్వర్జయే త్పుష్పసర్పిషీ. 44
తదన్తే పుష్పదామాని ఘృతధేన్వా సహైవతు । దత్వా శివపదం యాతి విప్రాయ ఘృతపాయసమ్. 45
ఏతచ్ఛీలవ్రతం నామ శీలారోగ్యఫలప్రదమ్ । సన్ధ్యాదీపప్రదో యస్తు సమాం తైలం వివర్జయేత్. 46
సమాన్తేవాపి దద్యాచ్చ చక్రశూలేచ కాఞ్చనే । వస్త్రయుగ్మంచ విప్రాయ తేజస్వీ స భవేదిహ. 47
రుద్రలోక మవాప్నోతి దీపవ్రత మిదం స్మృతమ్ । కార్తికే కృత్తికాదౌ యః ప్రాశ్య గోమూత్రయావకమ్.
నక్తం చరే చ్చబ్దమేక మబ్దాన్తే గోప్రదో భవేత్ । గౌరీలోకే వసేత్కల్పం తతో రాజా భవేదిహ. 49
ఏత ద్గౌరీవ్రతం నామ సదా కల్యాణకారకం । వర్జయే చ్చైత్రమాసేతు యస్తు గన్ధానులేపనమ్. 50
శుక్తిం గన్ధభృతం దత్వా విప్రాయ శ్వేతవాససీ । వారుణం పద మాప్నోతి దీవ్యవ్రత మిదం స్మృతమ్.51

16. చైత్రము మొదలుగ నాలుగు మాసములపాటు అయాచితముగ జలదానము చేయవలెను. వ్రతాంతమున మణికమును (దుత్త అనెడి మట్టిపాత్ర) అన్న వస్త్రములను తిల పాత్రమును బంగారును ఈయవలెను. దీనిచే బ్రహ్మలోక ప్రాప్తియగును. కల్పాంతము (అయిన తరువాతను సృష్ట్యాదియందు) రాజై జన్మించును. ఇది ఆనంద వ్రతము.

17. ఏడాదిపాటు శివునకు పంచామృత స్నానము జరిపించి వ్రతాంతమున దేనువును పంచా మృతములను శంఖమును బ్రాహ్మణునకు దానమీయవలెను. దీనిచే శివలోక ప్రాప్తియగును. కల్పాంతమున (మరల సృష్ట్యాదియందు) రాజై జన్మించును. దీనిని రాజ్య వ్రతమందురు.

18. ఏడాదిపాటు (మాంసాహారులగు వారు) మాంసము తినకుండి కడపట పాడియావును బంగారు లేడి ప్రతిమను దానమీయవలెను. దీని నహింసావ్రతమందురు. దీనిచే అశ్వ మేధఫలమంది పునరావృత్తి రహిత బ్రహ్మలోక ప్రాప్తుడై కల్పాంతమున (మరల సృష్ట్యాదియందు) నృపతియై జన్మించును.

19. మాఘ మాసమున ఉషస్సున స్నానముచేసి (మాసాంతమున) వస్త్రమాల్యభూషణములతో దంపతులనర్చించి భుజింప జేయవలెను. దీనిచే కల్పకాలము రవిలోకవాసి యగును. దీనిని సూర్యవ్రత మందురు.

20. ఆషాఢాది మాస చతుష్టయమున వరుసగా ప్రాతః స్నానముచేసి కార్తికారంభమున బ్రాహ్మణులకు భోజనము చేయించి ధేను దానము చేయవలెను. దీనిచే విష్ణులోక ప్రాప్తుడగును. ఇది విష్ణు వ్రతము.

21. ఒక అయనమున పూవులను మరియొక అయనమున నేతిని విడువవలయును ఇట్లు సంవత్సరమయిన తరువాత పూలదండలను (లోగడ చెప్పిన) ఘృత ధేనువును దానము చేయవలెను. విప్రునకు నేతిపాయసముతో భోజనము పెట్టవలెను. దీనిచే శివలోక ప్రాప్తుడగును. ఇది ఇహమున శీలారోగ్య ఫలప్రదము. దీనిని శీలవ్రతమందురు.

22. సంవత్సర కాలము తైలమును (ఆహారమున గ్రహింపక) విడువవలెను. (ఇంత కాలము) సంధ్యా కాలమున (దేవునికడ) దీపము వెలిగించవలెను. సంవత్సరాంతమున బ్రాహ్మణునకు బంగారు చక్రశూలములను వస్త్ర యుగ్మమును దానమీయవలెను. దీనిచే తేజస్వియగును. రుద్రలోక ప్రాప్తుడగును. ఇది దీప వ్రతము.

23. కార్తికమున కృత్తికానక్షత్ర దినము మొదలు (సంవత్సరము వరకు) గోమూత్రమును గోధుమ రవ్వను పాలతో వండిన అన్నమును తినుచు ఏడాదిపాటు నక్తము ఆచరించవలెను. కడపట గోదానము చేయవలెను. కల్పకాలము గౌరీలోకవాసియై పిమ్మట సృష్టియందు రాజై పుట్టును. ఇది కల్యాణకరమగు గౌరీ వ్రతము.

24. చైత్ర మాసమంతయు గంధానులేపనములు విడిచి మాసాంతమున విప్రునకు గంధముతో నిండిన ముత్తెపు చిప్పను తెల్లని వస్త్రములను దానమీయవలెను. దీనిచే వరుణలోక ప్రాప్తుడగును. దీనిని దివ్య వ్రతమందురు.

వైశాఖే పుష్పలవణం ★వర్జయే ద్ఘటగోప్రదః । భుక్త్వా విష్ణుపదే కల్పం స్థిత్వా రాజా భవేదిహ. 52
○ ఏత త్కీర్తి వ్రతంనామ కాన్తికీర్తి ఫలప్రదమ్ । బ్రహ్మాణ్డం కాఞ్చనం కృత్వా తిలరాశి సమన్వితమ్.
త్ర్యహం తిలప్రదో భూత్వా వహ్నిం సన్తర్ప్యచ ద్విజాన్ ।
సమ్పూజ్య విప్రమిథునం మాల్యవస్త్రవిభూషణైః. 54
శక్తిత స్త్రిపలాదూర్ధ్వం విశ్వాత్మా ప్రీయతామితి । పుణ్యేఽహ్ని దద్యాత్స పరం బ్రహ్మ యాత్యపునర్భవమ్.
ఏతద్బ్రహ్మవ్రతం నామ నిర్వాణపదదాయకమ్ । యశ్చోభయముఖీం దద్యా త్ప్రభూతకనకాన్వితామ్. 56
దినం పయోవ్రతే తిష్ఠేత్సయాతి పరమం పదమ్ । ఏతద్వై స్వవ్రతంనామ పునరావృత్తిదుర్లభమ్. 57
త్ర్యహం పయోవ్రతే స్థిత్వా కాఞ్చనం కల్పపాదపమ్ । పలాదూర్ధ్వం యథాశక్త్యా తణ్డులై శ్చోపసంయుతమ్.
దత్వా బ్రహ్మపదం యాతి కల్పవ్రత మిదం స్మృతమ్। మాసోపవాసీ యో దద్యా ద్ధేనుం విప్రాయ శోభనామ్.
స వైష్ణవం పదం యాతి భీమవ్రత మిదం స్మృతమ్।
*దద్యా ద్వింశత్పలా దూర్ధ్వం మహీం కృత్వాఽథ కాఞ్చనీమ్. 60
దినం పయోవ్రత స్తిష్ఠే ద్రుద్రలోకే మహీయతే । †ధరావ్రత మిదం ప్రోక్తం సప్తకల్పశతానుగమ్. 61

★ వర్జయిత్వాతుగోప్రదః ○ ఏతత్కాన్తి
* దత్వాద్వింశత్పలాదూర్ధ్వమగ్నింకృత్వాథకాఞ్చనమ్ † అగ్నివ్రతమిదం

మాఘమాస్యథ చైత్రేవా గుడధేనుప్రదో భవేత్ । గుడవ్రత స్తృతీయాయాం గౌరీలోకే మహీయతే. 62
మహావ్రత మిదంనామ నరసానన్దకారకమ్ । పక్షోపవాసీ యో దద్యా ద్విప్రాయ కపిలాద్వయమ్. 63
స బ్రహ్మలోకమాప్నోతి దేవాసురసుపూజితః । కల్పాన్తే సచ రాజా స్యా త్ప్రభావ్రత మిదంస్మృతమ్.64
వత్సరం త్వేకభక్తాశీ సభక్ష్యజలకుమ్భదః । శివలోకే వసేత్కల్పం ప్రాప్తివ్రత మిదంస్మృతమ్. 65
నక్తాశీ త్వష్టమీషు స్యా ద్వత్సరాన్తేషు ధేనుదః । పౌరన్దరపదం యాతి సుగతివ్రత ముచ్యతే. 66
విప్రాయేన్ధనదో యస్తు వర్షాది చతురః పుమాన్ । ఘృతధేను ప్రదోఽన్తేచ స పరం బ్రహ్మ గచ్ఛతి. 67
వైశ్వానరవ్రతం నామ సర్వపాపప్రణాశనమ్ । ఏకాదశ్యాంతు నక్తాశీ యశ్చక్రం వినివేదయేత్. 68
సమాన్తే వైష్ణవం హైమం స విష్ణోః పద మాప్నుయాత్ ।
ఏత త్కృష్ణవ్రతం నామ కల్పాన్తే రాజ్యలాభకృత్. 69

25. వైశాఖ మాసమంతయు పూవులను ఉప్పును విడువవలెను. మాసాంతమున లవణ ఘటములనుగాని లవణ ధేనువునుగాని దానమీయవలెను. దీనిచే ఇహమున కాంతికీర్తులు పొందును. పరమున కల్పకాలము విష్ణులోకమనుభవించును. కల్పాంతము తరువాత సృష్టిలో రాజై పుట్టును. ఇది కీర్తివ్రతము.

26. మూడు పలములకు తక్కువకాని తూకపు బంగారుతో బ్రహ్మాండమును చేయించవలెను. తిలరాశిపేర్పరచ వలెను. మూడు దినములు ఆతిలలతో వహ్నియందు హోమము చేసి కడపట విప్రులకు భోజనముతో సంతర్పణముచేసి ఒక పుణ్య దినమున విప్రదంపతులను వస్త్రమాల్యభూషణములతో పూజించి 'విశ్వాత్మా ప్రీయతామ్' అనుచు ఆ బ్రహ్మాండమును వారికి దానమీయవలెను. దీనిచే పునర్జన్మ మేలేక పరబ్రహ్మమును పొందును. ఇది మోక్షప్రదమగు బ్రహ్మ వ్రతము.

27. చాల బంగారుతోకూడ ఉభయముఖీగోదానము (అప్పుడే ఈనుచున్న గోదానము) చేసిన ఆదినమంతయు పాలు ఆహారముగా నుండవలెను. దీనిచే పునరావృత్తి రహిత పరమపదము లభించును. ఇది సువ్రతమను వ్రతము.

28. మూడు దినములు పాలుఆహారముగా(పయోవ్రతముతో)ఉండి నాల్గవనాడు పలమునకు తక్కువకాని బంగా రుతో కల్పవృక్షము చేయించి దానిని బియ్యముతో కూడ దానము చేయవలెను. దీనిచే బ్రహ్మలోకము ప్రాప్తించును. ఇది కల్పవ్రతము.

29. నెలపాటు (ఏకభుక్తముతోకాని నక్తవ్రతముతోకాని) ఉపవసించి మాసాంతమున విప్రునకు పాడియావు నీవలెను. దీనిచే విష్ణులోకప్రాప్తి యగును. ఇది భీమవ్రతము.

30. ఇరువది పలములకు తక్కువకాని బంగారుతో చేయించిన భూప్రతిమ విప్రునకు దాన మిచ్చి ఒక దిన మంతయు పయోవ్రతముతో (పాలు ఆహారముగా) ఉండవలెను. దీనిచే రుద్రలోకప్రాప్తి యగును. దీనివలని పుణ్యము సప్తకల్పములపాటు వెంటవచ్చును: ఇది ధరావ్రతము.

31. మాఘమునకాని చైత్రమునకాని శుక్ల తృతీయనాడు గుడాన్న మాహారముగా ఉండి గుడధేనుదానము చేయ వలెను. దీనిచే గౌరీలోకప్రాప్తి యగును. ఇది నరసమును ఆనందప్రదమునగు మహావ్రతము.

32. పక్షము దినములు (ఏకభుక్తముతోనో నక్తముతోనో) ఉపవసించి కడపట రెండు కపిల గోవులను దాన మీయవలెను. దీనిచే దేవాసుర పూజితుడగుచు బ్రహ్మలోకమున సుఖించును. కల్పాంతము తరువాత సృష్టిలో రాజై పుట్టును. ఇది ప్రభావ్రతము.

33. ఏడాదిపాటు ఏకభ(భు)క్తము చేయుచు ఉపవసించి కడపట భక్ష్యములతోను జలముతోను నిండిన కడవ లను దాన మీవలెను. దీనిచే కల్పకాలము శివలోకప్రాప్తి యగును. ఇది ప్రాప్తి వ్రతము.

34. ఏడాదిపాటు అష్టములయందు నక్తవ్రతము చేయుచు కడపట గోదానము చేసినచో ఇంద్రపదవి నందును.

35. వర్షాకాలపు నాలుగు నెలలు విప్రునకు వంటకట్టెల నిచ్చుచు కడపట ఘృతధేను దానము చేయవలెను. ఇది సర్వపాప ప్రణాశనమగు వైశ్వానరవ్రతము. దీనిచే పరబ్రహ్మప్రాప్తి యగును.

36. ఏడాదిపాటు ఏకాదశులందు నక్తవ్రతము చేసి కడపట బంగారు విష్ణుచక్రము దాన మీవలెను. దీనిచే విష్ణులోకప్రాప్తి యగును. కల్పాంతము తరువాత సృష్టిలో రాజై పుట్టును. ఇది కృష్ణవ్రతము.

పాయసాశీ సమాన్తేతు దత్వా విప్రాయ గోయుగమ్ । లక్ష్మీలోకే వసేత్కల్ప మేతద్దేవీవ్రతం స్మృతమ్.70
సప్తమ్యాం నక్తభు గ్దద్యాత్సమాన్తే గాం పయస్వినీమ్ ।
సూర్యలోక మవాప్నోతి భానువ్రత మిదంస్మృతమ్. 71
చతుర్థ్యాం నక్తభు గ్దద్యా త్సమాన్తే హేమవారణమ్ । వ్రతం వైనాయకం నామ శివలోక ఫలప్రదమ్. 72
మహాఫలాని యస్త్యక్త్వా చతుర్మాసం ద్విజాతయే । హైమాని కార్తికే దద్యా ద్గోయుగేన సమం నరః. 73
ఏత త్కాలవ్రతం నామ విష్ణులోకఫలప్రదమ్ । యశ్చోభవవాసీ సప్తమ్యాం హేమన్తే హేమపంకజమ్. 74
గాంచైవ శక్తితో దద్యాత్సమాన్తే ఘటసంయుతామ్ । ఏత త్సౌరవ్రతంనామ సూర్యలోకఫలప్రదమ్. 75
ద్వాదశ ద్వాదశీర్యస్తు సమాప్యోపోషణం ద్విజః । గోవస్త్రకాఞ్చనై ర్విప్రా న్పూజయే చ్ఛక్తితోనరః. 76
పరంపద మవాప్నోతి విష్ణువ్రత మిదం స్మృతమ్ ।
కార్తిక్యాం యో వృషోత్సర్గం కృత్వా నక్తం సమాచరేత్. 76
శైవం పద మవాప్నోతి వృషవ్రత మిదం స్మృతమ్ ।
కృచ్ఛ్రాన్తే గోప్రదః కుర్యా ద్భోజనం శక్తితః పదమ్. 78
విప్రాణాం శాఙ్కరం యాతి ప్రాజాపత్య మిదం వ్రతమ్ । చతుర్దశ్యాంతు నక్తాశీ సమాన్తే గోధనప్రదః.79
శైవంపద మవాప్నోతి త్ర్యమ్బక మిదం వ్రతమ్। సప్తరాత్రోషితో దద్యా ద్ఘృతకుమ్భం ద్విజాతయే.80
ఘృతవ్రతమిదం ప్రాహు ర్బ్రహ్మలోకఫలప్రదమ్। కుశశాయీ సమాం దద్యా ద్ధేనుమన్తే పయస్వినీమ్.81
శక్రలోకే వసేత్కల్ప మిద మిన్ద్రవ్రతం స్మృతమ్ । అనగ్నిపక్వ మశ్నాతి తృతీయాయాంతు యో నరః.
గాం దత్వా శివమభ్యేతి పునరావృత్తిదుర్లభమ్ । బృహదానన్దకృత్పుంసాం శివవ్రత మిదం స్మృతమ్. 83
హైమం పలద్వయా దూర్ధ్వం రథ మశ్వయుగాన్వితమ్। దత్వా కృతోపవాస స్స్వ ద్దివి కల్పశతం వసేత్.
తదన్తే రాజరాజస్స్యా దశ్వవ్రత మిదం స్మృతమ్ । తద్వ ద్ధేమరథం దద్యా త్కరిభ్యాం సంయుతం నరః.
సత్యలోకే వసేత్కల్పసహస్ర మథ భూపతిః । భవే దుపోషితో భూత్వా కరివ్రత మిదం స్మృతమ్. 86

37. ఏడాదిపాటు పాలఅన్నము మాత్రమే తిని కడపట విప్రునకు రెండు పాడి ఆవుల నీవలెను. కల్పకాలము లక్ష్మీలోకప్రాప్తి నిచ్చు ఇది దేవీవ్రతము.

38. ఏడాదిపాటు సప్తములయందు నక్తముండి కడపట పాడియావును దాన మీవలెను. దీనిచే రవిలోకప్రాప్తి యగును. ఇది భానువ్రతము.

39. ఏడాదిపాటు చవితులయందు నక్తముండి కడపట బంగారు ఏనుగు ప్రతిమ దాన మీవలెను. ఇది శివలోక ఫలదమగు వైనాయకవ్రతము.

40. ఆషాఢాది మాస చతుష్టయమునందు మహా (ఆ ఋతువునందు లభించు) ఫలములను విడిచి కార్తికమున ఆ ఫలముల బంగారు ప్రతిమలు చేయించి వాటిని రెండు పాడి ఆవులను విప్రులకు దాన మీయవలెను. ఇది విష్ణులోకఫలప్రదమగు కాలవ్రతము.

41. హేమంతఋతువు మొదలుగ సంవత్సరకాలము సప్తములందు ఉపవసించుచు సంవత్సరాంతమున

హేమంతమునందు యథాశక్తిగ బంగారు కమలమును గోవును ఉదకుంభమును దాన మీవలెను. ఇది సూర్యలోకఫల ప్రదమగు సౌరవ్రతము.

42. పన్నెండు ద్వాదశులయం దుపవసించి కడపట గోవస్త్ర కాంచనములతో విప్రుల నర్చించవలెను. ఇది పరమపదప్రదమగు విష్ణువ్రతము.

43. కార్తిక మాసమున వృషోత్సర్గము చేసి నక్తవ్రతము పాటించవలెను. దీనిచే శివస్థానప్రాప్తి యగును. ఇది వృషవ్రతము.

44. చాంద్రాయణమువంటి కృచ్ఛ్రవ్రతము పాటించి కడపట గోదానము చేసి యథాశక్తిగా విప్రులకు భోజనము పెట్టించి తానును భుజించవలయును. ఇది ప్రాజాపత్యవ్రతము.

45. చతుర్దశులందు ఏడాదిపాటు నక్తవ్రతము పాటించి కడపట గోవులను ధనమును దాన మిచ్చినచో శివ పదప్రాప్తి యగును. ఇది త్ర్యంబక వ్రతము.

46. ఏడు దినములపాటు ఉపవాసముండి కడపట విప్రునకు ఘృతకుంభమును దాన మీయవలెను. ఇది బ్రహ్మలోక ఫలప్రదమగు ఘృతవ్రతము.

47. ఏడాదిపాటు దర్భలపై శయనించుచు కడపట సువర్ణమును పాడియావును దాన మీయవలెను. దీనిచే కల్పకాలము ఇంద్రలోకమున సుఖించును. ఇది ఇంద్రవ్రతము.

48. (ఏడాదిపాటు) తదియలందు అగ్నిపై ఉడుకని ఆహారము తినుచు కడపట గోదానము చేసినచో పునరావృత్తి రహిత శివలోకప్రాప్తి యగును. ఇది మహానందకరమగు శివవ్రతము.

49. రెండు పలములకు తగ్గని బంగారుతో రథమును రెండు గుర్రములను చేయించి దాన మిచ్చి ఆనా డుపవసించినచో నూరు కల్పములు స్వర్గమున వసించి కల్పాంతమున సృష్ట్యాదియందు చక్రవర్తియై పుట్టును. ఇది అశ్వ వ్రతము.

50. బంగారు రథమును రెండు ఏనుగులను రెండు పలములకు తక్కువ కాని బంగారముతో చేయించి దాన మిచ్చి ఆనాడు ఉపవాస ముండవలెను. దీనిచే సత్యలోకప్రాప్తుడై కల్పాంతము తరువాత సృష్టికి మొదట రాజై పుట్టును. ఇది కరివ్రతము.

*మలమాసం పరిత్యక్త్వా సమాప్తే గోప్రదో భవేత్ । యక్షాధిపత్య మాప్నోతి నిర్దుఃఖవ్రత ముచ్యతే. 87
నిశి కృత్వా జలే వాసం ప్రభాతే గోప్రదో భవేత్ । వారుణం లోక మాప్నోతి వరుణవ్రత ముచ్యతే. 88
చాన్ద్రాయణంచ యః కుర్యా ద్ధేమచన్ద్రం నివేదయేత్। చన్ద్రవ్రతమిదం ప్రోక్తం చన్ద్రలోక ఫలప్రదమ్. 89
జ్యేష్ఠే పఞ్చతపా స్సాయం హేమధేనుప్రదో దివమ్ । యాత్యష్టమీచతుర్దశ్యో రుద్రవ్రత మిదం స్మృతమ్.
†సకృద్వితానకం కుర్యా త్తృతీయాయాం శివాలయే । సమాప్తే ధేనుదో యాతి భవానీ వ్రత ముచ్యతే. 91
మాఘే నిశ్యార్ద్రవాసా స్స్యా త్సప్తమ్యాం గోప్రదో భవేత్ ।
దివి కల్పముషిత్వేహ రాజాస్స్యా త్పావకవ్రతమ్. 92
త్రిరాత్రోపోషితో దద్యా త్ఫాల్గున్యాం భవనం శుభమ్। ఆదిత్యలోక మాప్నోతి ధామవ్రత మిదం స్మృతమ్.
త్రిసన్ధ్యం పూజ్య దమ్పత్య ముపవాసీ విభూషణైః । అన్తేచ సమవాప్నోతి మోక్షమిన్ద్రవ్రతా దిహ. 94
దత్వా సితద్వితీయాయా మిన్దో ర్లవణభాజనమ్ । సమాప్తే గోప్రదో యాతి విప్రాయ శివమన్దిరమ్. 95
కల్పాన్తే రాజ్యలాభ స్స్యా త్సోమవ్రత మిదం స్మృతమ్ । ప్రతిపత్స్వేకభక్తాశీ సమాప్తే కపిలాప్రదః. 96

---

* ఉపవాసం. † నక్షత్రహారకకం

వైశ్వానరపదం యాతి శిఖివ్రత మిదం స్మృతమ్ । దశమ్యా మేకభక్తాశీ సమాప్తే దశధేనుదః. 97
దిశశ్చ కాఞ్చనీ ర్దద్యా ద్బ్రహ్మాణ్డాధిపతి ర్భవేత్ ।
బ్రహ్మాణ మచ్యుతం శమ్భుం సమభ్యర్చ్య ద్విజోత్తమః. 98
ఏత ద్విప్రవ్రతం నామ మహా పాతకనాశనమ్ । యః పఠే చ్ఛృణుయాద్వాపి వ్రతషష్టి మనుత్తమామ్.99
మన్వ న్తరశతం సోపి గన్ధర్వాధిపతి ర్భవేత్ ।
షష్టివ్రతం నారద పుణ్య మేత త్తవోదితం విశ్వజనీనవన్ద్యమ్. 100
శ్రోతుం యదీచ్ఛా తదుదీరయస్వ విప్రేషు; కింవా కథనీయ మస్తి. 100ι

ఇతి శ్రీమత్స్యమహాపురాణే నన్దికేశ్వర నారదసంవాదే షష్టివ్రత
కథనం నామైకోన శతతమోఽధ్యాయః.

51. సంవత్సరముపాటు (ఏక భక్తముతోగాని నక్తముతో కాని) ఉపవసించి సంవత్సరాంతమున గోదానము చేయవలెను. దీనిచే యక్షాధిపతిత్వము లభించును. ఇది నిర్దుఃఖ వ్రతము. సంవత్సరముపాటు చేయు వ్రతముల విషయమున ఆ ఏడాది నడుమ అధిక మాసము వచ్చినచో దానిని పండ్రెండు మాసములలోని దానినిగా లెక్కించరాదు.

52. ఒక రేయియంతయు నీటియందు గడపి ఆ రాత్రి గడచిన తరువాత ఉదయమున గోదానము చేయవలెను. దీనిచే వరుణలోక ప్రాప్తుడగును. ఇది వరుణ వ్రతము.

53. (నెలపాటు) చాంద్రాయణ వ్రతము జరిపి వ్రతాంతమున బంగారు చంద్రుని దానమీయవలెను. చంద్రలోక ప్రాప్తిఫలమునిచ్చు ఇది చంద్రవ్రతము.

54. జ్యేష్ఠ శుక్లమున అష్టమీ చతుర్దశులందు పగలు పంచతపస్సుకడె (నాలుగు వైపుల అగ్నియు పైని రవియు వెలుగుచుండ నడుమ నిలిచి) సాయంకాలమున గోదానము చేయవలెను. ఇది రుద్రవ్రతము; దీనిచే స్వర్గప్రాప్తియగును.

55. ఏడాదిపాటు ప్రతి తదియనాడు చాందినీ నిర్మింపజేసి వ్రతాంతమున గోదానము చేయవలెను. భవానీ లోక ప్రాప్తి కలిగించు ఇది భవానీ వ్రతము.

56. మాఘ శుక్ల సప్తమి రాత్రి అంతయు తడిబట్టలతో ఉండి గడపి మరునాడు గోదానము చేయవలెను. స్వర్గమున కల్పముపాటుండి కల్పాంతము తరువాత సృష్టికి మొదట రాజై పుట్టును. ఇది స్నాపక వ్రతము.

57. ఒకనాడు ఉపవసించి ఆనాటి మూడు సంధ్యలయందును భూషణములతో దంపతులనర్చించవలెను. దీనిచే ముక్తి లభించును. ఇది ఇంద్రవ్రతము.

58. ప్రతి శుక్ల ద్వితీయనాడు చంద్రునుద్దేశించి ఏడాదిపాటు లవణ పాత్రను దానమిచ్చుచు కడపట విప్రునకు గోదానము చేసినచో శివలోక ప్రాప్తుడగును. కల్పాంతము తరువాత సృష్టికి మొదట రాజై పుట్టును. ఇది సోమవ్రతము.

59. ఏడాదిపాటు పాడ్యములయందు ఏకభక్తము చేయుచు కడపట కపిల గోదానము చేసినచో అగ్నిలోక ప్రాప్తుడగును. ఇది వైశ్వానర వ్రతము.

60. ఏడాదిపాటు ప్రతి దశమినాడును ఏకభక్తము చేయుచు కడపట పది గోవులను బంగారుతో చేసిన దశదిశలను దానము చేయవలెను. బ్రహ్మ విష్ణు రుద్రులను ద్విజోత్తములను అర్చించవలెను. ఇది మహా పాతకనాశనమగు విప్ర వ్రతము.

సర్వోత్తమమగు ఈ షష్టి వ్రతకల్పమును వినినను చదివినను నూరు మన్వంతరముల కాలము గంధర్వాధిపతియగును. నారదా! ఇది పుణ్యకరము; విశ్వజన వంద్యము; వినగోరిన బ్రాహ్మణులకు (ను ఇతరులకును కూడ) దీనిని వినిపింపుము. నీకు ఈ విషయము చెప్పవలసిన పని ఏమున్నది?

ఇది శ్రీమత్స్య మహాపురాణమున షష్టివ్రత మాహాత్మ్య కథనమను తొంబది తొమ్మిదవ అధ్యాయము.

## శతతమోఽధ్యాయః.

## స్నానవిధిః.

నన్దికేశ్వరః: నైర్మల్యం భావశుద్ధిశ్చ వినా స్నానం న విద్యతే ।
తస్మా న్మనోవిశుద్ధ్యర్థం స్నానమాదౌ విధీయతే. 1
అనుద్ధృతై రుద్ధృతైర్వా జలై స్స్నానం విధీయతే। తీర్థం ప్రకల్పయే ద్విద్వా న్మూలమన్త్రేణ మన్త్రవిత్.2
నమో నారాయణాయేతి మూలమన్త్ర ముదాహృతమ్ । దర్భపాణిస్తు విధినా త్వాచాన్తః ప్రయతశ్శుచిః. 3
చతుర్హస్తసమాయుక్తం చతురశ్రం సమన్తతః । ప్రకల్ప్యావాహయే ద్గఙ్గా మేభిర్మన్త్రైః పృథక్పృథక్. 4
విష్ణుపాదప్రసూతాఽసి వైష్ణవీ విష్ణుదేవతా। పాపినస్త్వేనన స్తస్మా దాజన్మమరణాన్తికాత్. 5
తిస్రఃకోట్యోర్ధకోటీచ తీర్థానాం వాయురబ్రవీత్ । దివి భూమ్యన్తరిక్షేచ తాని తే సన్తి జాహ్నవి. 6
నన్దినీ త్యేవ తన్నామా దేవేషు నళినీతిచ। దక్షా పృథ్వీచ విహగా విశ్వకామా శివప్రదా. 7
విద్యాధరా సుప్రసన్నా తథా విశ్వప్రసాదినీ । క్షేమ్యాచ జాహ్నవీ చాథ తథా శాన్తిప్రదాయినీ. 8
ఏతాని పుణ్యనామాని స్నానకాలే ప్రకీర్తయేత్ । భవే త్సన్నిహితా తత్ర గఙ్గా త్రిపథగామినీ. 9
సప్తవారాభిజప్తేన కరసమ్పుటయోజితమ్ । మూర్ధ్నికుర్యా జ్జలం భూయ స్త్రిచతుఃపఞ్చసప్తవా. 10
స్నానం కుర్యా న్మృదా తద్వ దామన్త్ర్యానువిధానతః । అశ్వక్రాన్తే రథక్రాంతే విష్ణుక్రాన్తే వసున్ధరే. 11
మృత్తికే హన మే పాపం యన్మయా దుష్కృతం కృతమ్ । ఉద్ధృతాసి వరాహేణ కృష్ణేన శతబాహునా.
నమస్తే సర్వలోకానాం ప్రభవారణి సువ్రతే । ఏవం స్నాత్వా తతః పశ్చాదాచమ్యాథ విధానతః. 13
ఉత్థాయ వాససీ శుక్లే శుద్ధేచ పరిధాయవై । తతస్తు తర్పణం కుర్యా త్త్రైలోక్యాప్యాయనాయ వై. 14

## నూరవ అధ్యాయము.

## స్నాన విధి.

మనో నిర్మలత్వమును మనఃశుద్ధియు స్నానము లేనిదే కలుగవు. కావుననే పెద్దలు స్నానమును మొదటి దానిగా విధించిరి. పైకి తీయని(నదుల)నీటితోగాని తీసిన (బావుల) నీటితోగాని స్నానము చేయవచ్చును. మొదట సంప్రదాయము నెరిగి 'నమో నారాయణాయ' అను మూలమంత్రముతో తీర్థకల్పనము చేసికొనవలెను. ఎట్లన నాలుగు మూరం కొలతతో చతురస్రముగ తన చుట్టును తీర్థప్రకల్పనము చేసికొని ఈ మంత్రములతో దానియందు గంగ నావాహనము చేయవలెను; 'నీవు విష్ణుపాదమునుండి పుట్టితివి; విష్ణు సంబంధినివి; విష్ణువే నీ కధిష్ఠానదేవత; కావున అట్టి నీవు ఆజన్మ మరణముగా మమ్ములను పాపములనుండి రక్షింపుము. వాయుదేవుడు పేర్కొన్న భూమ్యంతరిక్షద్యులోకములందలి మూడున్నర కోట్ల తీర్థములును నీయం దున్నవి. భూలోకమున నందిని-ద్యులోకమున నళిని అని నీ పేరులు. ఇవికాక దక్షా-పృథ్వీ-విహగా-విశ్వకామా-శివప్రదా-విద్యాధరా-సుప్రసన్నా-లోకప్రసాదినీ-క్షేమ్యా-జాహ్నవీ-శాంతిప్రదాయినీ (ఆనందము కలిగించునది-పద్మములు కలది-సమర్థురాలు-విశాలమయినది-ఆకాశమున సంచరించునది-అన్ని కోరికలు తీర్చునది-శుభము ఇచ్చునది-విద్యలను ధరించునది-మిగుల తేటయైనది-లోకములకు ప్రసన్నత-తేటదనము కలిగించునది - క్షేమము కలిగించునది-జహ్నుమునినుండి వెలికి వచ్చినది-జహ్నుముని కూతురు-శాంతి నిచ్చునది) స్నాన కాలమున ఈ పుణ్య నామములను కీర్తించుటచేత త్రిపథగా (తూర్పునకు-పడమరకు-పాతాళమునకు-పోవు మూడు త్రోవలు కలది) అగు గంగ సన్నిహితయగును; ఇట్లు స్నానీయ జలమును ఏడుమార్లభిమంత్రించి దోసిట నింపుకొన్న ఆ నీటిని మూడు కాని నాలుగుకాని ఐదుకాని సారులు తలపై పోసికొనవలెను.

అశ్వే మృత్తికను అభిమంత్రించి అది రాచికొని కూడ స్నానము చేయవలెను. (మంత్రార్థము): అశ్వములచే రథములచే విష్ణునిచే పాదము లుంచబడినదియు ధనమును ధరించునదియు అగు మృత్తికా! నేను చేసిన దుష్కృత సిద్ధ పాపములను పోగొట్టుము. వరాహరూపుడు నల్లనివాడు శతబాహుడు నగు విష్ణునిచే ఎత్తబడినావు; సర్వలోకముల(నెడు అగ్ని)పుట్టుకకు కారణమవు; నీకు నమస్కారము; ఇట్లు స్నానమాడి యథావిధానముగ ఆచమించి తెల్లని శుద్ధ వస్త్రముల ధరించి త్రిలోక(స్థితదేవతాదుల)తృప్తికై తర్పణము (తృప్తి కలిగించునది) ఈయవలెను.

దేవా యక్షా స్తథా నాగా గన్ధ ర్వాప్సరస స్సురాః । క్రూరా స్సర్పా స్సుపర్ణాశ్చ తరవో జఙ్గమాః ఖగాః. 15
విద్యాధరా జలధరా స్తథై వాకాశగామినః । నిరాధారాశ్చ యే జీవా యేచ ధర్మరతా స్తథా. 16
తేషా మాప్యాయనాయైత త్క్రియతే జలతర్పణమ్। కృత్వోపవీతం దేవేషు నివీతీతు భవే త్తతః. 17
మనుష్యాం స్తర్పయేద్భక్త్యా బ్రహ్మపుత్రా నృషీం స్తథా । సనకశ్చ సనన్దశ్చ తృతీయశ్చ సనాతనః. 18
కపిల శ్చాసురిశ్చైవ వోఢుః పఞ్చశిఖా స్తథా । సర్వే తే తృప్తిమాయాన్తు మద్దత్తేనామ్బునా సదా. 19
మరీచి మత్ర్యఙ్గిరసం పులస్త్యం పులహం క్రతుమ్ । ప్రచేతసం వసిష్ఠంచ భృగుం నారదమేవచ. 20
దేవా న్బ్రహ్మఋషీ న్సర్వాం స్తర్పయే దక్షతోదకైః।అపసవ్యం తతః కృత్వా సవ్యం జాన్వాచ్య భూతలే.
అగ్నిష్వాత్తా స్తథా సౌమ్యా హవిష్మంత స్తథోష్మపాః సుకాలినో బర్హిషద స్తథాన్యే వాజ్యపాః పునః. 22
సంతర్ప్య పితరో భక్త్యా సతిలోదకచందనైః । యమాయ ధర్మరాజాయ మృత్యవే చాంతకాయచ. 23
వైవస్వతాయ కాలాయ సర్వభూతక్షయాయచ । ఔదుంబరాయ దధ్నాయ నీలాయ పరమేష్ఠినే. 24
వృకోదరాయ చిత్రాయ చిత్రగుప్తాయ వై నమః । దర్భపాణిస్తు విధినా పితౄ న్సంతర్పయే ద్బుధః. 25
పిత్రాదీ న్నామగోత్రేణ తథా మాతామహానపి । సంతర్ప్య విధినా భక్త్యా ఇమం మంత్ర ముదీరయేత్. 26
యే బాంధవా బాంధవేయా యేఽన్యజన్మని బాంధవాః ।
తే తృప్తి మఖిలా యాంతు యశ్చాస్మత్తోఽభివాంఛతి. 27
తతశ్చాచమ్య విధివ చాలిఖే త్పద్మమగ్రతః । అక్షతాభిః సపుష్పాభిః సజలారుణచందనమ్. 28

(మంత్రార్థము): దేవ యక్ష నాగ గంధర్వాప్సరః సుర క్రూర సర్పసుపర్ణ(గరుడ) తరు (చెట్టు) జంగమ(సంచరించు ప్రాణులు) ఖగ (పక్షులు) విద్యాధర జలధరా (మేఘములు) కాశగామి ప్రాణులు-ఇవి అన్నియును నిరాధార జీవులును ధర్మరతులగువారును తృప్తి నొందుట కీ తర్పణ మిచ్చుచున్నాను. అనుచు ఉపవీతముగా (జందెము సవ్యముగా) దేవతర్పణముచేసి పిమ్మట నివీతము జందెము తావళమువలె వేసికొనుట)గా నుండి భక్తితో మనుష్యులకును సనకసనందన సనాతన కపిలాసురివోఢు పంచశిఖులనెడు బ్రహ్మపుత్త్రులగు ఋషులకు మరీచ్యత్ర్యంగిరః పులస్త్య పులహక్రతు ప్రచేతో వసిష్ఠ భృగునారదులను దేవర్షి బ్రహ్మర్షులకు అక్షతోదకములతో తర్పణము నీయవలెను. తరువాత అపసవ్యముతో ఎడమ మోకాలిని నేలపై తాకించి అగ్నిష్వాత్త సౌమ్య హవిష్మత్ ఊష్మపసుకాలిన్ బర్హిషద్-ఆజ్యపులు అనెడు పితృ దేవతా వర్గములకు తన పితరులకు భక్తితో తిలచందనోదకములతో తర్పణ మీయవలెను. ప్రాణుల నియమించువాడు ధర్మముతో రంజింపజేయువాడు మృత్యురూపుడు అంతమొందించువాడు సూర్యపుత్త్రుడు నల్లనివాడు సర్వభూతనాశకుడు ఔదుంబరదధ్న నీల-పరమేష్ఠి వృకోదర చిత్రచిత్రగుప్త నామములతో వ్యవహరింపబడు నీకు తర్పణమనుచు యమునకు ఆయా నామగోత్రములతో పితృ పితామహ మాతామహాదులకు తర్పణ మిచ్చి "ఈ జన్మమందో పూర్వజన్మములందో నాకు బంధువులో బంధు బంధువులో అగువారు నా నుండి తృప్తి కోరు పితరు లెవ్వరైనను తృప్తి చెందుదురు గాక!" యని దర్భపాణియై అందరకు తర్పణ మీయవలెను.

అర్ఘ్యం దద్యా త్ప్రియత్నేన సూర్యనామాని కీర్తయేత్। నమస్తే విష్ణురూపాయ నమో విష్ణుముఖాయ వై. 29
సహస్రరశ్మయే నిత్యం నమస్తే సర్వతేజసే । నమస్తే శివః సర్వేశః నమస్తే సర్వవత్సలః. 30
జగత్స్వామి న్నమస్తేఽస్తు దివ్యచందనభూషిత : పద్మాసనః నమస్తేఽస్తు దివ్యచందనభూషితః 31
నమస్తే సర్వలోకేశః జగత్సర్వం విబోధసేః సుకృతం దుష్కృతంచైవ సర్వం పశ్యసి సర్వగ. 32
సత్యదేవః నమస్తేఽస్తు ప్రసీద మమ భాస్కర : దివాకరః నమస్తేఽస్తు ప్రభాకరః నమోఽస్తు తే. 33
ఏవం సూర్యం నమస్కృత్య త్రిః కృత్వాచ ప్రదక్షిణమ్ ।
ద్విజం గాం కాంచనం స్పృష్ట్వా తతో విష్ణుగృహం వ్రజేత్. 34

ఇతి శ్రీమత్స్యమహాపురాణే స్నానాది-తర్పణ-సూర్యార్ఘ్య
నిరూపణం నామ శతతమోఽధ్యాయః.

తరువాత యథావిధిగా ఆచమించి తన ముందు పద్మమును లిఖించి దానిపై సూర్యనామకీర్తన పూర్వకముగా పుష్పాక్షతరక్తచందన సహితముగా సూర్యునకు అర్ఘ్యము నీయవలెను. (నామార్థములు): విష్ణురూపుడు విష్ణుముఖుడు సహస్రకిరణుడు సర్వతేజోరూపుడు శుభకరుడు సర్వేశుడు అందరయందు వాత్సల్యము కలవాడు లోకప్రభువు దివ్య చందనభూషితుడు పద్మాసనుడు-కుండలములతో భుజకీర్తులతో భూషితుడు సర్వలోకేశుడు సర్వజగముల మేల్కొలుపు వాడు సర్వసుకృతదుష్కృత సాక్షి సర్వవ్యాపి సత్యదేవుడు తేజోనిర్మాతయగు రవీః నీకు నమస్సులు-అనుచు రవి కర్ఘ్యము ఇచ్చి ముమ్మారు ప్రదక్షిణించి నమస్కరించి బ్రాహ్మణుని గోవును బంగారమును తాకి తరువాత విష్ణ్వాలయము నకు పోవలెను.

ఇది శ్రీమత్స్య మహాపురాణమున స్నాన విధియను నూరవ అధ్యాయము.

## ఏకశతతమోఽధ్యాయః.

## ప్రయాగమాహాత్మ్యవర్ణనమ్.

అతఃపరం ప్రవక్ష్యామి ప్రయాగ స్యోపవర్ణనమ్ । మార్కండేయేన కథితం యత్పురా పాండుసూనవే. 1
భారతేతు యదా వృత్తే ప్రాప్తరాజ్యే పృథాసుతే । ఏతస్మిన్నంతరే రాజా కుంతీపుత్రో యుధిష్ఠిరః. 2
భ్రాతృశోకేన సంతప్త శ్చింతయన్ స పునఃపునః । ఆసీ త్సుయోధనో రాజా ఏకాదశచమూపతిః. 3
అస్మాన్ సంతాప్య బహుశః సర్వే తే నిధనం గతాః । వాసుదేవం సమాశ్రిత్య పంచశేషాస్తు పాండవాః. 4
హత్వా భీష్మంచ ద్రోణంచ కర్ణంచైవ మహాబలమ్ । దుర్యోధనంచ రాజానం పుత్రభ్రాతృసమన్వితమ్. 5
రాజానో నిహతాః సర్వే యే చాన్యే శూరమానినః । కిం నో రాజ్యేన గోవిందః కిం భోగై ర్జీవితేన వా. 6
ధిక్కష్టమితి సంచింత్య రాజా వైక్లబ్య మాగతః ; నిర్విచేష్టో నిరుత్సాహః కించి త్తిష్ఠ త్యధోముఖః. 7
లబ్ధసంజ్ఞో యదా రాజా చింతయన్ స పునఃపునః ; కతరో వినియోగో వా నియమం తీర్థమేవచ. 8
యేనాహం శీఘ్ర మాముచ్యే మహాపాతకకిల్బిషాత్ । యత్ర స్నాత్వా నరో యాతి విష్ణులోక మనుత్తమమ్. 9
కథం పృచ్ఛామి వై కృష్ణం యేనేదం కారితోఽన్మ్యహమ్ ।
ధృతరాష్ట్రం కథం పృచ్ఛే యస్య పుత్రశతం హతమ్. 10
ఏవం వైక్లబ్య మాపన్నో ధర్మరాజో యుధిష్ఠిరః । రుదంతి పాండవాః సర్వే భ్రాతృశోకపరిప్లుతాః. 11
యేచ తత్ర మహాత్మానః సమేతాః పాండవాః స్మృతాః । కుంతీచ ద్రౌపదీచైవ యేచ తత్ర సమాగతాః. 12
భూమౌ నిపతితాః సర్వే రుదంతస్తు సమంతతః ।

# నూట ఒకటవ అధ్యాయము

## ప్రయాగ మాహాత్మ్యము

నందికేశ్వరుడు నారదునకు ఇట్లు చెప్పెను: (స్నాన ప్రసంగమున) పూర్వము పాండుపుత్త్రుడగు ధర్మరాజునకు మార్కండేయుడు చెప్పిన ప్రయాగ తీర్థ క్షేత్రోపవర్ణనమును తెలిపెదను.

మహాభారత యుద్ధానంతరము యుధిష్ఠిరుడు రాజ్యమును పొందియు భ్రాతృశోక సంతప్తుడయ్యెను.

మా భ్రాత దుర్యోధనుడు ఏకాదశాక్షౌహిణీ సేనా నాథుడుగా చక్రవర్తిగా నుండెనుగదా! అతడును అతనివారును మమ్ములను చాల విధముల బాధించిరేకాని తుదకు వారును మరణించిరికదా! వాసుదేవుని ఆశ్రయించియు పాండవులము మేము ఐదుగురమే మిగిలితిమి. భీష్మ ద్రోణ కర్ణులను పుత్త్ర భ్రాతృ సహితుడగు దుర్యోధనుని చంపి తాము శూరులమనుకొను మావీరులందరును తామును మరణించిరి. గోవిందా! మాకు రాజ్యముతోగాని భోగములతోగాని జీవితముతోగాని ఏమిపని? ఛీ! ఎంత దుఃఖకరమిది! అని యుధిష్ఠిరుడేమియు తోచక నిర్విచేష్టుడు నిరుత్సాహుడునునై అధోముఖుడై ఊరకుండెను. మరల తెప్పరిల్లెను. కాని చింత అతనిని వదలలేదు. ఏ విధానమును అనుష్ఠించి నియమమవలంబించి తీర్థము సేవించి ఈ మహాపాతక దోషమునుండి విముక్తుడను కాగలుగుదును? ఏక్షేత్రవాసము చేసినచో నర్వోత్తమ విష్ణులోక ప్రాప్తియగును? ఇవి అన్నియు నాచే జరిపించిన కృష్ణునేమని అడుగుదును? ధృతరాష్ట్రుని నూర్గుర కొడుకులను చంపి అతనినేమడుగుదును? అని ఇట్లు ధర్మరాజు ఏమియు తోచని వాడయ్యెను. పాండవులందరును కుంతీ ద్రౌపదులును మరియు నచట చేరిన ఇతరులగు పెద్దలును భూమిపై పడి దొరలుచు ఏడువసాగిరి.

వారాణస్యాం మార్కండేయ స్తేన జ్ఞాతో యుధిష్ఠిరః. 13
యథా వైక్లబ్య మాపన్నో రుదమానస్తు దుఃఖితః । అచిరేణైవ కాలేన మార్కండేయో మహాతపాః. 14
సంప్రాప్తో హాస్తినపురం రాజద్వారే హ్యతిష్ఠత । ద్వారపాలోఽపి తం దృష్ట్వా రాజ్ఞః కథితవాన్ ద్రుతమ్.
త్వాం ద్రష్టుకామో మార్కండో ద్వారి తిష్ఠత్యసౌ మునిః ।
త్వరితో ధర్మపుత్త్రస్తు ద్వార మాగా దతఃపరమ్. 16
యుధిష్ఠిర ఉవాచ : స్వాగతం తే మహాభాగ స్వాగతం తే మహామునే ।
అద్య మే సఫలం జన్మ అద్య మే తారితం కులమ్. 17
అద్య మే పితర స్తుష్టా స్త్వయి దృష్టే మహామునే ।
అద్యాఽహం పూతదేహోఽస్మి య త్త్వయా సహ దర్శనమ్. 18
నందికేశ్వర ఉవాచ : సింహాసనే సమాస్థాప్యపాదశౌచార్చనాదిభిః ।
యుధిష్ఠిరో మహాత్మా వై పూజయామాస తం మునిమ్. 19
తతః స తుష్టో మార్కండః పూజిత శ్చాహ తం నృపమ్ ।
ఆఖ్యాహి త్వరితం రాజన్ కిమర్థం రుదితం త్వయా. 20
కేన వా విక్లబీభూతః కా బాధా తే కిమప్రియమ్ ।
యుధిష్ఠిర ఉవాచ : అస్మాకం చైవ యద్వృత్తం రాజ్యస్యార్థే మహామునే. 21
ఏతత్సర్వం విదిత్వాతు చింతావశ ముపాగతః ।
మార్కండేయ ఉవాచ : శృణు రాజన్ మహాబాహో క్షత్త్రధర్మవ్యవస్థితమ్. 22
నైవ దృష్టం రణే పాపం యుధ్యమానస్య ధీమతః । కింపునా రాజధర్మేణ క్షత్త్రియస్య విశేషతః. 23

తదేవం హృదయం కృత్వా తస్మా త్పాపం న చింతయేత్ ।
తతో యుధిష్ఠిరో రాజా ప్రణమ్య శిరసా మునిమ్. 24
పప్రచ్ఛ వినయోపేతః సర్వపాతకనాశనమ్ ।
యుధిష్ఠిర ఉవాచ : పృచ్ఛామి వినయోపేతః సర్వపాతకనాశనమ్. 25
కథయ త్వం సమాసేన యేన ముచ్యేత కిల్బిషాత్ ।
మార్కండేయ ఉవాచ : శృణు రాజన్ మహాబాహో సర్వపాతకనాశనమ్. 26
ప్రయాగగమనం శ్రేష్ఠం నరాణాం పుణ్యకర్మణామ్. 27

ఇతి శ్రీమత్స్యమహాపురాణే ప్రయాగమాహాత్మ్యవర్ణనం నామ
ఏకోత్తరశతతమోఽధ్యాయః.

ఆ సమయమున వారాణసియందుండిన మహాతపస్వి మార్కండేయుడు యుధిష్ఠిరుని ఈ స్థితిని ఎరిగి శీఘ్రమే హస్తినాపురమునకేతెంచి రాజ ద్వారమున నిలువ ద్వారపాలుడు రాజు కడకువచ్చి యానమాచారము తెలిపినంత ధర్మజుడును త్వరితమే ద్వారము కడకు పోయెను.

అతడు ఆ మునితో మహాభాగా! స్వాగతము. మహామునీ! స్వాగతము. మీ దర్శనమున ఇపుడు నా జన్మము సఫలమయినది. నా కులమువారు తరించిరి. నా పితరులు సంతుష్టులయిరి. నేను పవిత్ర శరీరుడనయితిని. అని పలికి లోనికి కొనిపోయి సింహాసనమున మునిని కూర్చుండజేసి పాద ప్రక్షాళనార్చనాదులతో మహాత్ముడు యుధిష్ఠిరుడా మునిని పూజించెను.

మార్కండేయుడు సంతుష్టుడై యుధిష్ఠిరునితో "రాజా! నీవేల ఏడిచితివి; నీవేల ఏమియు తోచని వాడ వయితివి? నీ బాధ ఏమి? నీకు కలిగిన అప్రియము ఏమి?" అని యడిగెను. అతడును "మునీ! మాకు రాజ్యము విష యమున జరిగినదంతయు తలచి తలచి చింతావశుడనయితిని." అనగా మార్కండేయుడనెను: "రాజా! క్షత్త్రి ధర్మమున యుద్ధము చేయునపుడు ఇది పాపము అనుటదిలేదు. విశేషించి రాజధర్మమునననుసరించి యుద్ధము చేయుటలో పాపము లేదని చెప్పవలసిన పనియేలేదు. క్షత్త్రియుడు సైనికుడై యుండి జీవనమునకే కాని దీనజన రక్షణమునకేకాని యుద్ధము చేయుట క్షత్త్రి ధర్మము. రాజైనయతడు తన రాజ్యమును రక్షించుకొనుటకో దానిని శత్రువులనుండి సంపాదించుటకో దీనజన రక్షణమునకో యుద్ధము చేయుట రాజధర్మము. ఇది ఎరిగి వివేకమునంది నీవు నీకు పాపము కలుగునని ఆలో చింపకుము." అనెను.

అంతట యుధిష్ఠిరుడు మునిని శిరసా నమస్కరించి వినయోపేతుడై "అయ్యా! తాము త్రైలోక్య (ధర్మ) ద్రష్టలు; మహాప్రాజ్ఞులరు; పాప మోచనమగు ఉపాయమును సంక్షేపమున చెప్ప మిమ్ము వేడుచున్నాను." అనెను. ఆ మునియు "రాజా! వినుము; పుణ్య కర్మాచరణమున పాప మోచనము కోరువారికి ప్రయాగ గమనము శ్రేష్ఠమయినది." అని పలికెను.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున ప్రయాగ మాహాత్మ్య వర్ణనము
నూట ఒకటవ అధ్యాయము.

## ద్వ్యధికశతతమోఽధ్యాయః.
## ప్రయాగమాహాత్మ్యమ్.

యుధిష్ఠిర ఉవాచ : భగవన్ శ్రోతుమిచ్ఛామి పురాకల్పే యథా స్థితమ్ ।
బ్రహ్మణా దేవముఖ్యేన యథావ త్కథితం మునే. 1

కథం ప్రయాగే గమనం నరాణాం తత్ర కీదృశమ్ ।
మృతానాం కా గతి స్తత్ర స్నాతానాం తత్ర కిం ఫలమ్. 2
యే వసంతి ప్రయాగేతు బ్రూహి తేషాంచ కిం ఫలమ్ ।
మార్కండేయ ఉవాచ : కథయిష్యామి తే వత్స యచ్ఛ్రేష్ఠం తత్ర యత్ఫలమ్. 3
పురా హి సర్వవిప్రాణాం కథ్యమానం యథా శ్రుతమ్ । ఆప్రయాగప్రతిష్ఠానా దాపురా ద్వాసుకే ర్హ్రదాత్.
కంబళాశ్వతరౌ నాగౌ·నాగశ్చ బహుమూలకః । ఏత త్ప్రజాపతేః క్షేత్రం త్రిషు లోకేషు విశ్రుతమ్. 5
తత్ర స్నాతా దివం యాంతి యే మృతా స్తేఽపునర్భవాః ।
తతోబ్రహ్మాదయో దేవా రక్షాం కుర్వంతి సంగతాః. 6
అన్యేచ బహవ స్తీర్థాః సర్వపాపహరాః శుభాః । న శక్యాః కథితుం రాజన్ బహువర్ష శతై రపి. 7
సంక్షేపేణ ప్రవక్ష్యామి ప్రయాగస్యతు కీర్తనమ్ । షష్టి ర్ధనుఃసహస్రాణి యాని రక్షంతి జాహ్నవీమ్. 8
యమునాం రక్షతి సదా సవితా సప్తవాహనః । ప్రయాగంతు విశేషేణ సదా రక్షతి వాసవః. 9
మండలం రక్షతి హరి ర్దైవతైః సహ సంగతః । తం వటం రక్షతి సదా శూలపాణి ర్మహేశ్వరః. 10
స్థానం రక్షంతి వై దేవాః సర్వపాపహరం శుభమ్ । అధర్మేణావృతో లోకే నైవ గచ్ఛతి తత్పదమ్. 11
స్వల్ప మల్పతరం పాపం యదా తే స్యా న్నరాధిప ।
ప్రయాగం స్మరమాణస్య సర్వ మాయాతి సంక్షయమ్. 12

## నూట రెండవ అధ్యాయము.

## ప్రయాగ మాహాత్మ్య వర్ణనము.

యుధిష్ఠిరుడు మార్కండేయునితో ఇట్లు పలికెను: భగవన్! ప్రయాగ యాత్ర ఎట్లు చేయవలెను? అచట మరణించినచో కలుగు ఫలము ఏమి? స్నానముచే కలుగు ఫలమెట్టిది? అచట నివసించు వారికి కలుగు పుణ్యమేమి? ఈ విషయమున దేవ ముఖ్యుడగు బ్రహ్మ ఏమని చెప్పెనని పురా కల్పమునందు చెప్పబడినది? తెలుపుము.

మార్కండేయుడు: నాయనా! ప్రయాగ క్షేత్రమువలన కలుగు ఫలమేమో దాని శ్రేష్ఠత ఏమో అదంతయు పూర్వము బ్రాహ్మణులు చెప్పుకొనుచుండ నేను వినిన దానిని తెలిపెద; వినుము ప్రయాగ (పుర)ము-ప్రతిష్ఠాన నగరము (ఇది నేటి పైఠాను మాత్రమేకాదు; నేటి అలహాబాదు స్థానమున నొక ప్రతిష్ఠాన నగరముండెడిది. అది ఒకప్పుడు-దుష్యంతాదుల కాలమున పూరు వంశీయుల రాజధానిగా నుండెను.) వాసుకిహ్రదపురము-కంబలాశ్వతరులను నాగుల స్థానములు-బహుమూలకుడను నాగుని స్థానము-అను ఈ నాలుగు అవధుల లోపలనున్నది ప్రజాపతి క్షేత్రము అని లోకత్రయ ప్రసిద్ధము; అచట స్నానము చేసినచో స్వర్గప్రాప్తి; అట మరణించిన వారికి పునర్జన్మము లేదు; అందుననే బ్రహ్మాది దేవతలు అందరును కూడి దీనిని రక్షించుచుందురు. ఇంకను ఇచటగల బహుతీర్థముల సంఖ్య ఇంతయని వందల ఏండ్లకును చెప్పనలవికాదు. ఐనను ప్రయాగ క్షేత్ర కీర్తనమును సంక్షేపమున చేయుదును. అచటి గంగను ఆరువేల ధనువులు (అందరు ధానుష్కులు) రక్షించుచుండును (దురు.) యమునను సప్తాశ్వుడగు రవి కాపాడుచుండును. ప్రయాగమును ఇంద్రుడు విశేషించి రక్షించుచుండును. ఈ ప్రయాగ మండలమునంతటిని హరి సకల దేవసహాయుడై రక్షించుచుండును. అచటి వటవృక్షమును శూలపాణియగు మహేశ్వరుడు రక్షించును; సర్వపాపహరమగు ఆ పుణ్య స్థానమును దేవతలు రక్షింతురు. లోకమునందలి మానవుడు అధర్మావృతుడైనంతవరకును అచటికి పోజాలడు; అల్పాల్పమగు పాపమున్న వానికి మాత్రము ప్రయాగను తలంచినంతనే అదియు నశించును; ఆ తీర్థమును దర్శించినను పేర్కొన్నను అచటి మృత్తికను స్పృశించినను నరుడు పాపముక్తుడగును.

దర్శనా త్తస్య తీర్థస్య నామసంకీర్తనాదపి । మృత్తికాఽఽలంభనాద్వాపి నరః పాపా త్ప్రముచ్యతే. 13
పంచకుండాని రాజేంద్ర తేషాం మధ్యేతు జాహ్నవీ । ప్రయాగస్య ప్రవేశే తు పాపం నశ్యతి తత్క్షణాత్.
యోజనానాం సహస్రేషు గంగాయాః స్మరణా న్నరః। అపి దుష్కృతకర్మాతు లభతే పరమాం గతిమ్.15
కీర్తనా న్ముచ్యతే పాపాత్ దృష్ట్వా భద్రాణి పశ్యతి । అవగాహ్యాచ పీత్వా తు పునాత్యాసప్తమం కులమ్.16
సత్యవాదీ జితక్రోధీ అహింసాయాం వ్యవస్థితః । ధర్మానుసారీ తత్త్వజ్ఞో గోబ్రాహ్మణహితే రతః. 17
గంగాయమునయో ర్మధ్యే స్నాతో ముచ్యేత కిల్బిషాత్ ।
మనసా చింతయన్ కామా నవాప్నోతి సుపుష్కలాన్. 18
తతో గత్వా ప్రయాగంతు సర్వదేవాభిరక్షితమ్ । బ్రహ్మచారీ వసే న్మాసం పితౄన్ దేవాంశ్చ తర్పయేత్.
ఈప్సితాన్ లభతే కామాన్ యత్ర యత్రాభిజాయతే । తపనస్య సుతా దేవీ త్రిషు లోకేషు విశ్రుతా. 20
సమాగతా మహాభాగా యమునా తత్ర నిమ్నగా । తత్ర సంనిహితో నిత్యం సాక్షాద్దేవో మహేశ్వరః. 21
దుష్ప్రాప్యం మానుషైః పుణ్యం ప్రయాగంతు యుధిష్ఠిర । దేవదానవగంధర్వా ఋషయః సిద్ధచారణాః.22
తదుపస్పృశ్య రాజేంద్ర స్వర్గలోక ముపాసతే. 23

ఇతి శ్రీమత్స్యమహాపురాణే ప్రయాగమాహాత్మ్యే ద్వ్యధికశతతమోఽధ్యాయః.

రాజా! అచట పంచకుండములు (తీర్థములు) కలవు. వానిలోనిదే జాహ్నవి (గంగ)యును; ప్రయాగములో ప్రవేశించిన తత్క్షణమే పాపనాశమగును; యోజన సహస్రములనుండియైనను ఆమెను స్మరించినంతనే ఎట్టి దుష్కృత కర్ముడును పాపముక్తుడై పరమగతినందును. దర్శించినంతనే శుభములు పొందును. స్నానమాడినను ఆ నీటిని త్రావినను ఏడు తరములవారిని పవిత్రులనొనరించిన వాడగును. ఇక సత్యవాదియు జితక్రోధుడును అహింసకుడును ధర్మానుసారియు తత్త్వజ్ఞుడును గోబ్రాహ్మణ హితరతుడుననగు సజ్జనుడు గంగా యమునా మధ్యమున స్నానమాడినంత పాపముక్తుడగును; మనసా నిరంతరము దానినే ధ్యానించుచుండువాడు సుపుష్కలమగు కామములన్నియు నెరవేరును.

అందువలన సర్వదేవాభిరక్షితమగు ప్రయాగమున కేగి బ్రహ్మచర్యముతో మాసముండి పితృ దేవతలకు దేవతలకు తర్పణ మీయవలెను. తత్పుణ్యమున అత డెచట జన్మించినను సర్వ కామపూర్తి నందును.

రవిపుత్త్రిగా త్రిలోక విశ్రుతయగు మహాభాగ యమున అచట గంగతో కలియును. అచట సాక్షాన్మహేశ్వరుడు సదా సన్నిహితుడు; ప్రయాగక్షేత్రోపాసనమున మానవులకు దుష్ప్రాపమగు పుణ్యము లభించును. ఏలయన దేవదానవ గంధర్వ సిద్ధచారణులును ఋషులును ఆ క్షేత్రమున ఆచమించినంతమాత్రముననే స్వర్గ సుఖముల నందగలుగుచున్నారు.

ఇది శ్రీమత్స్య మహాపురాణమున ప్రయాగ మాహాత్మ్యమను నూట రెం వ అధ్యాయము.

## త్ర్యుత్తరశతతమోఽధ్యాయః.

## ప్రయాగమాహాత్మ్యానువర్ణనమ్.

మార్కండేయ ఉవాచ : శృణు రాజన్ః ప్రయాగస్య మాహాత్మ్యం పునరేవతు ।
యచ్ఛ్రుత్వా సర్వపాపేభ్యో ముచ్యతే నాత్ర సంశయః. 1
ఆర్తానాం హి దరిద్రాణాంః నిశ్చితవ్యవసాయినామ్ ; స్థానముక్తం ప్రయాగంతు నాఖ్యేయంతు కదాచన. 2
వ్యాధితో యదివా దీనో వృద్ధోవాఽపి భవేన్నరః । గంగాయమునయో ర్మధ్యే యస్తు ప్రాణా న్పరిత్యజేత్.3
దీప్తకాంచనవర్ణాభై ర్విమానైః సూర్యసంనిభైః । గంధర్వాప్సరసాం మధ్యే స్వర్గే క్రీడతి మానవః. 4
ఈప్సితా ల్లభతే కామాన్ వదంతి ఋషిపుంగవాః । సర్వరత్నమయై ర్దివ్యై ర్నానాధ్వజసమాకులైః. 5
వరాంగనాసమాకీర్ణై ర్మోదతే శుభలక్షణైః । గీతవాద్యవినిర్ఘోషైః ప్రసుప్తః ప్రతిబుధ్యతే. 6

యావ న్న స్మరతే జన్మ తావత్ స్వర్గే మహీయతే । తతః స్వర్గా త్పరిభ్రష్టః క్షీణకర్మా దివ శ్చ్యుతః. 7
హిరణ్యరత్నసంపూర్ణ సమృద్ధే జాయతే కులే । తదేవ స్మరతే తీర్థం స్మరణా త్తత్ర గచ్ఛతి. 8
దేశస్థో యదివాఽరణ్యే విదేశస్థోఽథవా గృహే। ప్రయాగం స్మరమాణోఽపి యస్తు ప్రాణా న్పరిత్యజేత్. 9
బ్రహ్మలోక మవాప్నోతి వదంతి ఋషిపుంగవాః । సర్వకామఫలా వృక్షా మహీ యత్ర హిరణ్మయీ. 10
ఋషయో మునయః సిద్ధా స్తత్ర లోకే స గచ్ఛతి । స్త్రీసహస్రవృతే రమ్యే మందాకిన్యా స్తటే శుభే. 11
మోదతే ఋషిభిః సార్ధం సుకృతేనేహ కర్మణా । సిద్ధచారణగంధర్వైః పూజ్యతే దివి దైవతైః. 12

## నూట మూడవ అధ్యాయము

మార్కండేయుడు యుధిష్ఠిరునకు ఇట్లు చెప్పెను: రాజా! ప్రయాగ మాహాత్మ్యము నింకను చెప్పెదను వినుము; దానిని విన్నచో నిస్సంశయముగ సర్వపాప వినిర్ముక్తు డగును. ఆ తీర్థక్షేత్రము ఆర్తులు దరిద్రులు కార్యసిద్ధికై నిశ్చిత మగు సంకల్పము కలవారు మాత్రమే సేవింపదగునదియని చెప్పరాదు. వ్యాధితుడును దీనుడును వృద్ధుడును నైనను గంగాయమునల నడుమ ప్రయాగమందు ప్రాణత్యాగ మొనర్చినచో అట్టివాడు దీపించు కాంచనమువలె ప్రకాశించుచు సర్వ రత్నమయములును నానా విధములగు జెండాలతో నిండినవియు ఉత్తమ స్త్రీ పరివారితములు శుభలక్షణ యుక్తములు నగు సూర్య సదృశ తేజస్సంపన్న విమానములపై సంచరించుచు స్వర్గమునగల గంధర్వాప్సరోజనము నడుమ క్రీడించుచుండును. అనియు ఇహమున సకలేప్సితములను పొందుననియు ఋషిపుంగవులు చెప్పుచున్నారు. అట్టివాడు గీతవాద్య మధుర ధ్వనులు వినుచు నిద్ర మేల్కాంచును. మరల జన్మించవలయునను స్మృతి రానంతవరకు (తన మహాపుణ్య మున్నంత వరకు) స్వర్గమున దేవపూజితుడై సుఖించును. ఆ పుణ్యము క్షీణించగనే స్వర్గమునుండి పరిభ్రష్టుడై సువర్ణ రత్న సమృద్ధమగు వంశమున జన్మించి అపుడును ఆ ప్రయాగ క్షేత్రమును స్మరించుచునే యుండును. దానిచే మరల నద్దానిని సేవించును. స్వదేశమందో విదేశమందో అడవియందో గృహమందో ఎచట నున్నను ప్రయాగ స్మరణముతో మృతినందు వాడు బ్రహ్మలోకప్రాప్తుడగునని ఋషిపుంగవుల వచనము; సర్వకామములు పండువృక్షములును సువర్ణమయభూమియు కలిగి ఋషులునుమునులును సిద్ధులును నుండు లోకమున వసించును. స్త్రీ సహస్ర పరివారితమయి రమ్యమగు (స్వర్గమండలి) శుభ మందాకినీ తటమున ఋషులతో కూడ నానందించును. సిద్ధచారణ గంధర్వాది దేవతలచే పూజితు డగును. అనంత రము పుణ్యక్షయమున స్వర్గ పరిభ్రష్టుడయ్యును జంబూద్వీపాధిపతి యగును. తరువాతను మరల మరల పుణ్యకర్మము లనే స్మరించుచు ఆచరించుచు గుణవంతుడును విత్త సంపన్నుడును నగును; ఇది నిస్సంశయము.

తతః స్వర్గా త్పరిభ్రష్టో జంబూద్వీపపతి ర్భవేత్ । తతః శుభాని కర్మాణి చింతయానః పునః పునః. 13
గుణవాన్ విత్తసంపన్నో భవతీహ న సంశయః । కర్మణా మనసా వాచా ధర్మసత్యప్రతిష్ఠితః. 14
గంగాయమునయో ర్మధ్యే యస్తు గాం సంప్రయచ్ఛతి । సువర్ణమణిముక్తాశ్చ యది చాన్య త్పరిగ్రహమ్. 15
స్వకార్యే పితృకార్యే వా దేవతాఽభ్యర్చనేఽపివా । సఫలం తస్య తత్తీర్థం యథావ త్పుణ్య మాప్నుయాత్.
ఏవం తీర్థేన గృహ్ణీయాత్ పుణ్యే ష్వాయతనేషు చ । నిమిత్తేషు చ సర్వేషు హ్యప్రమత్తో భవే ద్ద్విజః. 17
కపిలాం పాటలావర్ణాం యస్తు ధేనుం ప్రయచ్ఛతి ।
స్వర్ణశృంగీం రౌప్యఖురాం కాంస్యదోహాం పయస్వినీమ్. 18
ప్రయాగే శ్రోత్రియం సంతం గ్రాహయిత్వా యథావిధి । శుక్లాంబరధరం శాంతం ధర్మజ్ఞం వేదపారగమ్.
సా గౌ స్తస్మై ప్రదాతవ్యా గంగాయమునసంగమే । వాసాంసిచ మహార్హాణి రత్నాని వివిధానిచ. 20
యావద్రోమాణి తస్యా గో స్సన్తి గాత్రేషు సత్తమ । తావద్వర్ష సహస్రాణి స్వర్గలోకే మహీయతే. 21

యత్రాసౌ లభతే జన్మ సా గౌ స్తత్రాభిజాయతే । నచ పశ్యతి తం ఘోరం నరకం తేన కర్మణా. 22
ఉత్తరా న్స కురూ న్ప్రాప్య మోదతే కాల మక్షయమ్ । గవాం శతసహస్రేభ్యో దద్యా దేకాం పయస్వినీమ్.
పుత్రాన్దారాం స్తథా భృత్యా న్గౌరేకా ప్రతితారయేత్। తస్మా త్సర్వేషు దానేషు గోదానం తు విశిష్యతే.24
దుర్గమే విషమే ఘోరే మహాపాతకసఙ్కులే । గౌరేవ రక్షాం కురుతే తస్మాద్దేయా ద్విజాతయే. 25

ఇతి శ్రీమత్స్యమహాపురాణే మార్కణ్డేయయుధిష్ఠిరసంవాదే ప్రయాగ
మాహాత్మ్యే త్ర్యుత్తరశతతమోఽధ్యాయః.

మనోవాక్కాయ కర్మములను ధర్మమునందే నిలిపి గంగా యమునా నదీ ద్వయ మధ్యమున గోదానమొనర్చిన వాడును స్వ(కామ్య)కర్మలందో దేవ పితృకార్యములందో ప్రయాగ స్మరణముతో స్వర్ణమో మణులో ముత్తెములో ఇచ్చు వాడును ఆ తీర్థ ప్రభావమున తత్కర్మ సాఫల్యము నంది పుణ్యము నందును.

కావున ద్విజుడు దానములను ప్రతిగ్రహించుటలోను ఏమరుపాటు లేకుండవలెను. ప్రతియొక తీర్థమునందును పుణ్యక్షేత్రమునందును సర్వ నిమిత్తములందును ప్రతిగ్రహించరాదు. ప్రతిగ్రహించినను దానిని ప్రయాగ క్షేత్రమని భావించవలయును.

ప్రయాగలో శ్రోత్రియుడగు శుక్లవస్త్రధరుడును శాంతుడును ధర్మజ్ఞుడును వేదపారంగతుడును నగు బ్రాహ్మణునకు బంగారు కొమ్ములు వెండి గిట్టలు పాలు పిదుకుటకు కంచుపాత్ర కలిగి సంధ్యాకాంతిగల పాడి కపిల గోవును బహు మూల్యములగు వస్త్రములను వివిధ రత్నములను యథావిధిగ దాన మొనర్చినవాడు ఆ గో శరీరమున నున్న రోమములన్ని వేల సంవత్సరములు స్వర్గమున పూజితుడయి సుఖించును. అతడు మరల జన్మించిన చోటనే ఆ గోవును జన్మించును. తత్పుణ్యవశమున నాతడు ఎన్నడును నరకమును చూడనైన చూడడు. ఉత్తర కురుదేశములందు అనంత కాలముండి మోదము నందును.

సాధారణములగు వేలకొలది గోవులను ఇచ్చుటకంటె పాడియావు నొకదానిని ప్రయాగలో ఇచ్చుట మేలు. అదియొకటియే పుత్రదార భృత్యుల నందరను తరింపజేయును. కావున సర్వదానములలోను పయస్విని (పాడి)గోదానము ఉత్తమము. దుర్గమములును విషమములును ఘోరములును నగు మహాపాతకములు సంభవించినపుడును పాడియావే రక్షించును. కావున ద్విజోత్తమునకు పాడి కపిల గోవును (ప్రయాగలో) దాన మీయవలెను.

ఇది శ్రీమత్స్య మహాపురాణమున ప్రయాగ మాహాత్మ్య వర్ణనమను నూట మూడవ అధ్యాయము.

## చతురుత్తరశతతమోఽధ్యాయః.

## ప్రయాగమాహాత్మ్యమ్.

యుధిష్ఠిరః : యథా యథా ప్రయాగస్య మాహాత్మ్యం కథితం త్వయా ।
తథాతథా ప్రముచ్యేఽహం సర్వపాపై ర్న సంశయః. 1
భగవ న్కేన విధినా కర్తవ్యో ధర్మ నిశ్చయః । ప్రయాగే యో విధిః ప్రోక్త స్తన్మే బ్రూహి మహామునే. 2
మార్కణ్డేయః : కథయిష్యామి తే వత్స తీర్థయాత్రావిధిక్రమమ్ ।
ఆర్షేణ చైవ విధినా యథా దృష్టో యథా శ్రుతః. 3
ప్రయాగతీర్థయాత్రార్థీ యః ప్రయాతి నరః క్వచిత్ । బలీవర్దం సమారూఢ శ్శృణు తస్యాపి యత్ఫలమ్. 4
నరకే వసతే ఘోరే గవాం క్రోశోహి దారుణః । సలిలంచ న గృహ్ణన్తి పితర స్తస్య దేహినః. 5
యస్తు పుత్రం స్నుషాం భార్యాం లాలయే త్పాలయేత్తథా ।
యథాత్మానం తథా సర్వం దానం విప్రేషు దాపయేత్. 6

ఐశ్వర్యలోభమోహాద్వా గచ్ఛేద్యానేన యో నరః । నిష్ఫలం తస్య తత్తీర్థం తస్మాద్యానం వివర్జయేత్. 7
గఙ్గాయమునయోర్మధ్యే యస్తు కన్యాం ప్రయచ్ఛతి । ఆర్షేణైవ విధానేన యథావిభవసమ్భవమ్. 8
న స పశ్యతి తం ఘోరం నరకం తేన కర్మణా । ఉత్తరాన్స కురూన్గత్వా మోదతే కాలమక్షయమ్. 9
పుత్త్రాన్దారాంశ్చ లభతే ధార్మికా న్రూపసంయుతాన్ । తత్ర దానం ప్రదాతవ్యం యథావిభవసమ్భవమ్. 10
తేన తీర్థఫలంచైవ వర్ధతే నాత్ర సంశయః । స్వర్గే తిష్ఠతి రాజేన్ద్ర యావదాభూతసమ్ప్లవమ్. 11
వటమూలం సమాసాద్య యస్తు ప్రాణా న్విముఞ్చతి । సర్వలోకానతిక్రమ్య శివలోకం స గచ్ఛతి. 12
తత్ర తే ద్వాదశాదిత్యా స్తపన్తే రుద్ర మాశ్రితాః । నిర్దహన్తి జగత్సర్వం వటమూలం న దహ్యతే. 13
నష్టే చన్ద్రార్కపవనే యదా చైకార్ణవం జగత్ । స్వపతే తత్ర వై విష్ణుఃపరమాత్మా పునఃపునః. 14
దేవదానవగన్ధర్వా ఋషయస్సిద్ధచారణాః । సదా సేవన్తి తత్తీర్థం గఙ్గాయమునసఙ్గమే. 15

## నూట నాలుగవ అధ్యాయము

## ప్రయాగ మాహాత్మ్యము

యుధిష్ఠిరుడు మార్కండేయునితో ఇట్లనెను: భగవన్! తాము నాకు ప్రయాగ మాహాత్మ్యమును చెప్పుచున్న కొలదిని నేను సర్వపాపముక్తుడ నగుచున్నట్లు భావించుచున్నాను. ఆ క్షేత్రమున ధర్మ సంపాదనము చేయు విధానమును తెలుప వేడెదను. అనగా మార్కండేయు డతని కిట్లు చెప్పసాగెను: ఆర్ష పరంపరలో నేను వినినట్లును కనినట్లును ప్రయాగ తీర్థయాత్రా విధిక్రమమును తెలిపెదను.

ప్రయాగ తీర్థయాత్ర ఎద్దుపై చేసినచో గోవులకు కలుగు దారుణ క్రోధఫలముగా ఆతడు ఘోర నరకమున వసించును. అత డిచ్చిన సలిలమును కూడ పితరులు గ్రహింపరు. ఐశ్వర్యమదలోభ మోహాదులచే అట్లు పోయినను వాని యాత్ర నిష్ఫలము. కావున యానముపై తీర్థయాత్ర చేయనేరాదు. తన పత్నీపుత్త్రస్నుషాదులను తను కాపాడు కొనునంత శ్రద్ధతోనే తీర్థయాత్రను చేసి అచట స్నానమాడి విప్రులకు దానమును చేయవలెను. గంగా యమునా మధ్య మున (ప్రయాగయందు) ఆర్ష విధానమున తన విభవము కొలది కన్యాదాన మొనర్చువాడు తత్పుణ్యమున నరకమును చూడనైన చూడడు. (ముందు జన్మములలో) ఉత్తర కురువర్షము లందనంతకాలము సుఖించును. ధార్మికులు రూప వంతులు నగు దారపుత్త్రు లతనికి లభింతురు. ప్రళయకాలము వరకు స్వర్గమున వసించి సుఖించును. కావున అచట తన విభవ విస్తరానుసారము దానములు చేయవలెను. దానిచే ఆతని పుణ్యము వృద్ధి నందును.

అచటి వటమూలమున ప్రాణముల వదలినయాతడు సర్వలోకముల నతిక్రమించి శివలోకము చేరును. అచట తపమాచరించిన పుణ్యమున ద్వాదశాదిత్యులును రుద్రుని చేరగలిగిరి. కావుననే (ప్రళయమునను) వారును సర్వజగమును దహింతురు కాని వటమూలమును దహించరు. చంద్రార్క పవనులును నశించి జగ మేకార్ణవమయినపుడును ప్రతి కల్పాంతమందును పరమాత్ముడు విష్ణువచటనే నిదురించును. దేవదానవ గంధర్వ ఋషి సిద్ధచారణాదులు సదా ఆ తీర్థమును సేవించుచుందురు. కావున రాజేంద్రా! పవిత్రమగు ఆ తీర్థయాత్ర చేయవలెను.

తతో గచ్ఛేత్తు రాజేన్ద్ర ప్రయాగం సంశితంచ తత్ । యత్ర బ్రహ్మాదయో దేవా దిశశ్చ సదిగీశ్వరాః. 16
లోకపాలాశ్చ సాధ్యాశ్చ పితరో లోకసమ్మతాః । సనత్కుమారసహితా స్తథావై పరమర్షయః. 17
అంగిరఃప్రముఖా శ్చైవ తథా బ్రహ్మర్షయోఽపరే । యక్షా నాగా స్సువర్ణాశ్చ సిద్ధా శ్చక్రచరాశ్చ యే. 18
సరితః సాగరాః శైలా స్తథా విద్యాధరాశ్చ యే । హరిశ్చ భగవా నాస్తే ప్రజాపతిపురస్సరః. 19
గంగాయమునయోర్మధ్యం పృథివ్యా జఘనం స్మృతమ్ ।
ప్రయాగం రాజశార్దూల త్రిషు లోకేషు విశ్రుతమ్. 20

తతః పుణ్యతరం నాస్తి త్రిషు లోకేషు భారత । శ్రవణాత్తస్య తీర్థస్య నామసంకీర్తనా దపి. 21
మృత్తికాలంభనాద్వాపి నరః పాపా త్ప్రముచ్యతే । తత్రాభిషేకం యః కుర్యా న్మకరస్థే దివాకరే. 22
న తుల్యఫలమాప్నోతి రాజసూయాశ్వమేధయోః । న వేదవచనాతీతం న లోకవచనా త్తథా. 23
మతి రుత్క్రమణే యాతి ప్రయాగగమనం ప్రతి । కోటితీర్థసహస్రాణి షష్టికోట్య స్తథాఽపరాః. 24
తేషాం సాన్నిధ్య మత్రైవ సతతం కురునందన । యా గతి ర్యోగయుక్తస్య సత్త్వస్థస్య మనీషిణః. 25
సా గతి స్త్యజతః ప్రాణా న్గంగాయమునసంగమే । న తే జీవన్తి లోకేఽస్మి న్యత్ర యత్ర యుధిష్ఠిర. 26
యే ప్రయాగం న సమ్ప్రాప్తా స్త్రిషు లోకేషు విశ్రుతమ్ ।
ఏవం దృష్ట్వా తు తత్తీర్థం ప్రయాగం పరమం పదమ్. 27
ముచ్యతే సర్వపాపేభ్యః శశాంక ఇవ రాహుణా । కంబళాశ్వతరౌ నాగౌ యమునాదక్షిణే తటే. 28
తత్ర స్నాత్వాచ దత్వాచ ముచ్యతే సర్వపాతకైః । తత్ర గత్వాచ సంస్థానం మహాదేవస్య ధీమతః. 29
నర స్తారయతే పూర్వా న్దశాతీతా న్దశాపరాన్ । కృత్వాఽభిషేకంతు పున స్సోఽశ్వమేధఫలం లభేత్. 30
స్వర్గలోక మవాప్నోతి యావదాభూతసంప్లవమ్ ।

బ్రహ్మాది దేవతలు దిశలు దిగధిపతులు లోకపాలురు సాధ్యులు లోకపూజ్య పితరులు సనత్కుమారాది మహర్షుల అంగిరః ప్రముఖ బ్రహ్మర్షులు యక్షనాగ గరుడ సిద్ధచారణులు నదీ సాగర శైలములు విద్యాధరులు ప్రజాపతియు హరియు సదా అచటనుందురు.

గంగా యమునా మధ్యము (ప్రయాగ) పృథివీ జఘన స్థానము. అని లోకత్రయ ప్రసిద్ధము. లోకత్రయమునను అంతకంటె పుణ్యకర ప్రదేశము మరిలేదు. ఆ తీర్థపు నామమును వినినను కీర్తించినను మృత్తికను సంపాదించినను తాకినను నరుడు పాపముక్తుడగును. రవి మకర సంక్రాంతియందచట స్నానము చేసినచో రాజసూయాశ్వమేధ తుల్య ఫలము లభించును. వేదవచన లోకవచములబట్టి ఇట్లు చెప్పుట మాత్రముకాదు; (ఇది ప్రత్యక్ష సిద్ధము.) ప్రాణోత్క్రమణ సమయమందైన ప్రయాగకు పోవలెనని సంకల్పము కలుగుట మేలు. వేయికోట్ల తీర్థములును మరి అరువది కోట్ల తీర్థములును సతతమచటనేయుండును. కావున సత్త్వగుణ ప్రధానుడై యోగమనుష్ఠించినవానికి కలుగు సుగతి ప్రయాగలో మరణించినంత మాత్రమున కలుగను. త్రిలోకప్రసిద్ధమగు ప్రయాగతీర్థమునకు పోవని వారెచ్చటెచ్చట జీవించినను జీవించనట్లే. యమునా దక్షిణ తీరమున కంబళుడు అశ్వతరుడు ననునాగులుందురు. అచటి నీరు స్నానమాడినను త్రావినను సర్వపాపము క్షియగును. అచటనే శివక్షేత్రమొకటి కలదు. అచటికేగినను అతని వెనుకముందు పదితరముల వారు తరింతురు. అచట స్నానమాడినచో అశ్వమేధ ఫలము కలిగి ప్రళయకాలము వరకు స్వర్గమున సుఖించును.

పూర్వభాగేతు గంగాయా స్త్రిషు లోకేషు భారత. 31
కూపం చైవతు సాముద్రం ప్రతిష్ఠానం (నే)తు విశ్రుతమ్ ।
బ్రహ్మచారీ జితక్రోధ స్త్రిరాత్రం యది తిష్ఠతి. 32
సర్వపాపవిశుద్ధాత్మా సోఽశ్వమేధఫలం లభేత్ । ఉత్తరేణ ప్రతిష్ఠానా ద్భాగీరథ్యాస్తు పూర్వతః. 33
హంసప్రపతనం నామ తీర్థం త్రైలోక్య విశ్రుతమ్ । అశ్వమేధఫలం తత్ర స్నానమాత్రేణ భారత. 34
యావచ్చంద్రశ్చ సూర్యశ్చ తావత్స్వర్గే మహీయతే । ఊర్వశీపులినే రమ్యే విపులే హంసపాండురే. 35
పరిత్యజతి యః ప్రాణాం చ్ఛృణు తస్యాపి య త్ఫలమ్ । షష్టిర్వర్షసహస్రాణి షష్టి ర్వర్షశతాని చ. 36
వసతే పితృభిః సార్ధం సూర్యలోకే నరాధిప । ఊర్వశీం తు సదా పశ్యే ద్దేవలోకే నరాధిప. 37
పూజ్యతే సతతం తత్ర ఋషిగంధర్వకిన్నరైః । తతః స్వర్గపరిభ్రష్టః క్షీణకర్మా దివి చ్యుతః. 38

ఊర్వశీసదృశేనాంతు కన్యానాం లభతే శతమ్ । గవాం శతసహస్రాణాం మహాభోగవతి ర్భవేత్. 40
మధ్యే నారీసహస్రాణాం బహ్వీనాం వసతి ర్భవేత్ । దశగ్రామసహస్రాణాం భోక్తా భవతి నిత్యశః. 41
కాంచీనూపురశబ్దైశ్చ సుప్తోఽసౌ ప్రతిబుధ్యతే ।
భుక్త్వాతు భోగా న్విపులాం స్తత్తీర్థం లభతే పునః. 42
శుక్లామ్బరధరో నిత్యం నియత స్సంయతేన్ద్రియః । ఏకకాలం తు భుఞ్జానో మాసం శమ్భో ర్గతిర్భవేత్. 43
సువర్ణాలఙ్కృతానాంతు నారీణాం లభతే శతమ్ । స భుక్త్వా విపులా న్భోగాం స్తత్తీర్థం లభతే పునః. 44
అథ సన్ధ్యావటే రమ్యే బ్రహ్మచారీ జితేన్ద్రియః । ఉపాసీత శుచిస్సన్ధ్యాం బ్రహ్మలోక మవాప్నుయాత్. 45

అచటనే గంగకు తూర్పున సాముద్ర కూపము అనియు ప్రతిష్ఠాన నగరమున నొక ప్రదేశము కలదు. జితక్రోధుడై బ్రహ్మచర్యమున త్రిరాత్రమట గడపినచో సర్వపాప విశుద్ధాత్ముడై అశ్వమేధ ఫలమందును. భాగీరథీ గంగకు తూర్పున ప్రతిష్ఠానమునకు ఉత్తరమున ★హంసప్రపతనమను త్రైలోక్య విశ్రుతమగు తీర్థము కలదు. అచట స్నాన మాత్రమున అశ్వమేధ ఫలము లభించును. ఆ చంద్ర సూర్యముగ స్వర్గమున సుఖించును. మనోహరమై విశాలమై హంసవలె తెల్లనిదగు ఊర్వశీపులినము (పులినము-ఇసుకతిన్నె) అనుచోట ప్రాణత్యాగమున అరువది ఆరువేల సంవత్సరములు తన పితరులతో కూడ సదా ఊర్వశీ దర్శనముతో రవి లోకమున వసించును. (ఊర్వశి-అగ్ని తత్త్వాత్మికయగు శక్తి) అచట ఋషి గంధర్వ కిన్నరుల సతత పూజలందుకొనుచు పుణ్యాంతమున స్వర్గ పరిభ్రష్టుడైనను ఊర్వశిని పోలు నూర్గురు కన్యలను కనును: ఆసముద్ర పర్యంత పృథివికి పతియగును. ధనధాన్యయుతుడు బహు సహస్ర గవాశ్వాధిపతియునగును. బహు సహస్ర నారీపతియు దశ సహస్ర గ్రామాధిపుడు నగును. అందెల యొడ్డాణముల సవ్వడి వినుచు నిద్ర మేల్కాంచువాడగును. ఇట్లు భోగములన్ని యనుభవించియు మరల ఈ తీర్థమునకే వచ్చును.

ఈ తీర్థమున శుక్లాంబరధరుడు నియతేంద్రియుడునై ఏకభుక్తము చేయుచుండునతడు శివ సాంనిధ్యమందును. మరల భూమిపై జన్మించియు స్వర్ణ భూషణాలంకృతలగు నారీశతమునకు పతియగును. విపుల భోగముల ననుభవించి మరల ఆ తీర్థమునకేగి దాని సేవించును. అచటి సంధ్యావటమను రమ్య ప్రదేశమున శుచియు బ్రహ్మచారియు జితేంద్రియుడునై సంధ్యోపాసన చెయువాడు బ్రహ్మలోక ప్రాప్తుడగును.

కోటితీర్థం సమాసాద్య యస్తు ప్రాణా న్పరిత్యజేత్ । కోటిర్వర్షసహస్రాణాం స్వర్గలోకే మహీయతే. 46
తతస్స్వర్గా త్పరిభ్రష్టః క్షీణకర్మా దివశ్చ్యుతః । సువర్ణమణిముక్తాఢ్యే కులే జాయేత రూపవాన్. 47
తతో భోగవతీం గత్వా వాసుకే రుత్తరేణతు । దశాశ్వమేధికం నామ తీర్థం తత్రాపరంభవేత్. 48
కృతాభిషేకస్తు నర స్సోఽశ్వమేధఫలం లభేత్ । ధనాఢ్యో రూపవాన్ దక్షో దాతా భవతి ధార్మికః. 49
చతుర్వేదేషు యత్పుణ్యం సత్యవాదిషు యత్ఫలమ్ । అహింసాయాంతు యో ధర్మో గమనాదేవ తత్ఫలమ్.
కురుక్షేత్రసమా గఙ్గా యత్రకుత్రావగాహితా । తస్మా ద్దశగుణా సా హి కాశిన్ద్యా యత్ర సఙ్గతా. 51
యత్ర గఙ్గా మహాభాగా బహుతీర్థ తపోధనా । సిద్ధక్షేత్రం తదుభయం నాత్ర కార్యా విచారణా. 52
క్షితౌ తారయతే మర్త్యా న్నాగాం స్తారయతే హ్యధః । దివి తారయతే దేవాం స్తేన త్రిపథగా స్మృతా. 53

★ హంసలు వాలెడిచోటు అని అర్థము. హంసలు క్రౌంచములు మొదలగు వలస జాతి జలపక్షులు వర్షాకాలమున మన దేశమును విడిచి ఉత్తరమందలి ఇతర దేశములకు పోవునపుడును అచటినుండి మరల శరత్కాలమున మన దేశములోనికి వచ్చునపుడును నడుమ అవి ఈ ప్రదేశమున వాలి కొలదికాలము గడపి పోవుచుండును. అనగా ఇది ఉభయ ప్రకృతులకు అనుకూల ప్రదేశమయి పవిత్రమయి యుండునది. అందుచేతనే దీనికా పేరు వచ్చెను.

యావదస్థీని గఙ్గాయాం తిష్ఠన్తే యస్య దేహినః । తావద్వర్షసహస్రాణి స్వర్గలోకే మహీయతే. 54
తీర్థానాం తు వరం తీర్థం నదీనాముత్తమా నదీ । మోక్షదా సర్వభూతానాం మహాపాతకినామపి. 55
సర్వత్ర సులభాగఙ్గా త్రిషు స్థానేషు దుర్లభా । గఙ్గాద్వారే ప్రయాగేచ గఙ్గాసాగరసఙ్గమే. 56
తత్ర స్నాత్వా దివం యాన్తి యే మృతా స్తేఽపునర్భవాః। సర్వేషామేవ భూతానాం పాపోపహతచేతసామ్.
గతి మన్వేషమాణానాం నాస్తి గఙ్గాసమా గతిః । పవిత్రాణాం పవిత్రంచ మఙ్గళానాంచ మఙ్గళమ్. 58
మహేశ్వరశిరోభ్రష్టా సర్వపాపహరా శుభా. 59

ఇతి శ్రీమత్స్యమహాపురాణే మార్కణ్డేయయుధిష్ఠిరసంవాదే ప్రయాగ
మాహాత్మ్యే చతురుత్తర శతతమోఽధ్యాయః.

అచటి కోటి తీర్థమున ప్రాణత్యాగముచే సహస్రకోటి సంవత్సరములు స్వర్గసుఖమబ్బును. పుణ్యావసానమున స్వర్గభ్రష్టుడయ్యు సువర్ణ మణిముక్తా సంపన్నమగు వంశమున రూపవంతుడై జనించును. వాసుకి ప్రదేశమునకు ఉత్తరమునగల దశాశ్వమేధిక తీర్థమున స్నానమాడినచో అశ్వమేధ ఫలమందును. స్వర్గ వాసానంతరము ధనాఢ్యుడు రూపవంతుడు సమర్థుడు దాతయు ధార్మికుడునై జన్మించును. చతుర్వేదాధ్యయనము సత్యవచనము అహింస పాటించుటచే గలుగు ఫలమంతయు ఆ తీర్థగమనముచే గలుగును. గంగయందెచ్చట స్నానమాడినను కురుక్షేత్ర వాస సమాన పుణ్యము లభించును. అనది యమునతో కలిసిన ఈ ప్రయాగమంతకంటె పది మడుగులు పుణ్యప్రదము. బహు తీర్థములు తపోధనులు నిండియున్న ఈ గంగా యమునా సంగమ స్థానము సిద్ధక్షేత్రమే; ఇందు సంశయమే లేదు. గంగ మూడు త్రోవల ప్రవహించి పాతాళమున నాగులను భూలోకమున నరులను స్వర్గమున దేవతలను తరింప జేయునది కావుననే ఆమెకు త్రిపథగయను నామము కలిగినది. ఏ ప్రాణికిగల ఎన్ని అస్థి ఖండములు గంగయందు నిలుచునో అతడన్ని వేలయేండ్లు స్వర్గసుఖమందును. గంగ తీర్థములలో ఉత్తమతీర్థము; నదులలో ఉత్తమనది; మహాపాతకులగు ప్రాణులకును మోక్షమొసగునది; గంగ సర్వత్ర సులభముగ లభించును; మూడు స్థానముందు ఆమె దుర్లభ; (చాల పుణ్యప్రదాయిని); అవి ఏవనిన-గంగా ద్వారము (హరిద్వారము) ప్రయాగ-గంగా సాగర సంగమము: ఈ మూడు తావులయందును స్నానమాడువారు పునరావృత్తిలేని లోకములందుదురు; పాప కలుషిత చిత్తులై గడపి పుణ్య గతి కోరు ఆర్తులకు గంగవంటి శరణ్యముమరిలేదు. ఆమె పవిత్రమగు వానిలోనెల్ల పవిత్రయైనది; శుభమగు వానిలోకెల్ల శుభకరి; మహేశ్వర శిరమునుండి జారిపడి సర్వుల సర్వపాపముల పోగొట్టు శుభరూపురాలు గంగ.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున ప్రయాగ మాహాత్మ్య వర్ణనము
నూట నాలుగవ అధ్యాయము.

## పఞ్చోత్తరశతతమోఽధ్యాయః.
## ప్రయాగమాహాత్మ్యమ్.

మార్కణ్డేయః : శృణు రాజ న్ప్రయాగస్య మాహాత్మ్యం పునరేవచ ।
యచ్ఛ్రుత్వా సర్వపాపేభ్యో ముచ్యతే నాత్రసంశయః. 1
మానసంనామ తీర్థంతు గఙ్గాయా ఉత్తరేతటే । త్రిరాత్రోపోషిత స్స్నాత్వా సర్వాన్కామా నవాప్నుయాత్.
ఏతత్ఫల మవాప్నోతి తత్తీర్థం లభతే పునః । అకామోవా సకామోవా గఙ్గాంప్రాప్య విముచ్యతే. 3
మృతస్తు లభతే స్వర్గం నరకంచ నపశ్యతి । అప్సరోగణసఙ్గీతై స్సుప్తోఽసౌ ప్రతిబుధ్యతే. 4
హంససారసయుక్తేన విమానేన స గచ్ఛతి । బహువర్షసహస్రాణాం రాజేన్ద్ర దివి భుఞ్జతే. 5
తత స్స్వర్గా త్పరిభ్రష్టః క్షీణకర్మా దివశ్చ్యుతః । సువర్ణమణిముక్తాఢ్యే జాయతే మహితే కులే. 6

షష్టితీర్థసహస్రాణి షష్టికోటిశతానిచ । మాఘమాసే గమిష్యన్తి గఙ్గాయమునసఙ్గమే. 7
గవాం శతసహస్రస్య సమ్యగ్దత్తస్య యత్ఫలమ్ । ప్రయాగే మాఘమాసేతు త్ర్యహస్నాతస్య తత్ఫలమ్. 8
గఙ్గాయమునయో ర్మధ్యే కాష్ఠాగ్నిం యస్తు సాధయేత్ । అహ్యఙ్గాంగో హ్యరోగస్తు పఞ్చేన్ద్రియసమన్వితః. 9
యావన్తి రోమకూపాణి తస్య గాత్రేషు దేహినః । తావద్వర్షసహస్రాణి స్వర్గలోకే మహీయతే. 10
తతస్స్వర్గా త్పరిభ్రష్టో జమ్బూద్వీపపతి ర్భవేత్ । సభుక్త్వా విపులా న్భోగాం స్తత్తీర్థం లభతే పునః. 11

## నూట అయిదవ అధ్యాయము.

## ప్రయాగ మాహాత్మ్యము.

రాజా! ప్రయాగ మాహాత్మ్యము నింకను వినుము. దానిని వినినంతనే సర్వపాప విముక్తి యగుట నిస్సంశయము. ఇట్లు గంగోత్తరతటమందలి మానసమను తీర్థమున త్రిరాత్రముపవాన పూర్వకముగ స్నానమాడుటచే సర్వకామ పూర్తియగును. ఈ ఫలానుభవానంతర మనంతర జన్మమున నాతడీ తీర్థమునే సేవింపవచ్చును. తెలిసి కోరియేకాని కోరకయే కాని ఇట గంగను సేవించుట పాపముక్తికరము. ఇట వాడు మరణించినను స్వర్గప్రాప్తుడగును. నరకము చూడడు; అప్సరోగణ సేవితుడగుచు నిదుర మేలుకాంచును. హంస సారసములు మోయు విమానముపై స్వర్గమేగి అటను దానిపై సంచరించుచు బహు సహస్ర వర్షములచట సుఖించి పుణ్యావసానమున స్వర్గ భ్రష్టుడయ్యు సువర్ణ మణిముక్తాది ధన సంపన్న వంశమున అట్టి కుటుంబమున జనించును. మాఘమాసమునందు అరువది యారువేల తీర్థములు ప్రయాగమందలి గంగా యమునా సంగమమున కలియును. కావుననే లెస్సగా లక్ష గోదానములచే అబ్బునంత ఫలము మాఘమున గంగలో ఇట స్నానముచే కలుగును. ఈ గంగా యమునా మధ్యమున కాష్ఠాగ్నిని (అరణి మథనముచే) సాగించి వేల్చినచో ఏరోగములులేక పంచేంద్రియ సహితముగ సశరీరముగ ఇహ జీవితమును గడపి మృతికి తరువాత తన దేహమందలి రోమ కూపములెన్ని కలవన్ని ఏండ్లు స్వర్గమున పూజితుడై సుఖించును. పిదప స్వర్గ పరిభ్రష్టుడయ్యు జంబూ ద్వీపాధిపతియై జనించి సుఖించుచు అదే తీర్థమును మరల సేవించును.

జలప్రవేశం యః కుర్యా త్సఙ్గమే లోక విశ్రుతే । రాహుగ్రస్తో యథా సోమో విముక్త స్సర్వపాతకైః. 12
సోమలోక మవాప్నోతి సోమేన సహ మోదతే । షష్టివర్షసహస్రాణి షష్టివర్షశతానిచ. 13
స్వర్గేచ శక్రలోకేఽస్మి న్నృషిగన్ధర్వసేవితే । పరిభ్రష్టస్తు రాజేన్ద్ర సమృద్ధే జాయతే కులే. 14
అధశ్శిరాస్తు యో జ్వాలా మూర్ధ్వపాదః పిబే న్నరః । శతవర్షసహస్రాణి స్వర్గలోకే మహీయతే. 15
పరిభ్రష్టస్తు రాజేన్ద్ర చాగ్నిహోత్రీ భవేన్నరః । భుక్త్వాతు భోగా న్విపులాం స్తత్తీర్థం లభతే పునః. 16
యస్స్వదేహం ద్విధా కృత్వా శకునేభ్యః ప్రయచ్ఛతి। విహగై రుపభుక్తస్య శృణు తస్యాపి యత్ఫలమ్. 17
శతవర్షసహస్రాణి సోమలోకే మహీయతే । తతస్స్వర్గా త్పరిభ్రష్టో రాజా భవతి ధార్మికః. 18
గుణవా న్రూపసమ్పన్నో భవతి ప్రియదర్శనః । భుక్త్వాతు భోగాన్విపులాం స్తత్తీర్థం లభతే పునః. 19
యామునే చోత్తరే కూలే ప్రయాగస్యతు దక్షిణే । ఋణప్రమోచనం నామ తీర్థంతు పరమం స్మృతమ్. 20
ఏకరాత్రోషితస్స్నాత్వా ఋణై స్సర్వైః ప్రముచ్యతే । సూర్యలోక మవాప్నోతి హ్యనృణీచ సదా భవేత్.

ఇతి శ్రీమత్స్యమహాపురాణే మార్కణ్డేయయుధిష్ఠిర సంవాదే ప్రయాగ మాహాత్మ్యే పఞ్చోత్తరశతతమోఽధ్యాయః.

ప్ర లోకవిశ్రుతమగు ఈ గంగా యమునా సంగమమున జలప్రవేశము (స్నానము) చేసినచో రాహు

గ్రహణమునుండి చంద్రుడువలె సర్వ పాపవిముక్తుడై సోమలోకము చేరి సోమునితో కూడి స్వర్గలోకమునందు శక్రసన్నిధినంది ఋషి గంధర్వ సేవితములగు ఆ లోకములందు అరువదియారు వేలేండ్లు ఆనందించును. పుణ్యావసానమున స్వర్గ పరిభ్రష్టుడయ్యు సర్వ సంపత్సుఖ సమృద్ధమగు కుటుంబమున జనించును. ఇచట అధఃశిరస్కుడై అగ్నిజ్వాలాపానము చేసినవాడు లక్ష వత్సరములు స్వర్గసుఖములంది స్వర్గ పరిభ్రంశము నందిన తరువాతను ఆహితాగ్నియై జనించి విపుల భోగములనుభవించి మరల ఆ తీర్థమునే సేవించును. ఈ ప్రయాగయందు తన దేహమును ఖండించి పక్షుల కెరగానిచ్చుటచే లక్ష వత్సరములు సోమలోకమున సుఖప్రాప్తుడై పుణ్యావసానమున స్వర్గ పరిభ్రష్టుడయ్యు ధార్మికుడు రూపవంతుడు గుణవంతుడు ప్రియదర్శనుడునగు రాజై జనించి విపుల సుఖానుభవములనంది మరల ఆ తీర్థమునే సేవించును. ప్రయాగకు దక్షిణమున యమునా దక్షిణతీరమున మేలగు ఋణ ప్రమోచనమను తీర్థము కలదు. అచట నొకదిన ముపవసించి స్నానమాడినచో సర్వ ఋణ ముక్తుడై సూర్యలోక ప్రాప్తుడగును. మరల నెన్నడును ఋణగ్రస్తుడుకాడు.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున ప్రయాగ మాహాత్మ్య వర్ణనమను
నూట యైదవ అధ్యాయము.

## షడుత్తరశతతమోఽధ్యాయః.
## ప్రయాగమాహాత్మ్యమ్.

యుధిష్ఠిరః : ఏతచ్ఛ్రుత్వా ప్రయాగస్య యత్త్వయా పరికీర్తితమ్ ।
విశుద్ధం మేఽద్య హృదయం ప్రయాగస్యతు కీర్తనాత్. 1
అనాశకఫలం బ్రూహి భగవం స్తత్ర కీదృశమ్ । కంచ లోక మవాప్నోతి విశుద్ధ స్సర్వకిల్బిషైః. 2
మార్కండేయః : శృణు రాజ న్ప్రయాగస్య త్వనాశకఫలం విభో ।
ప్రాప్నోతి పురుషో ధీమాఞ్ఛ్రద్దధానో జితేన్ద్రియః. 3
అహీనాఙ్గో హ్యరోగశ్చ పఞ్చేన్ద్రియసమన్వితః । అశ్వమేధఫలం తస్య గచ్ఛతస్తు పదేపదే. 4
కులాని తారయేద్రాజన్ దశపూర్వాన్ దశాపరాన్ । ముచ్యతే సర్వపాపేభ్య స్సగచ్ఛే త్పరమంపదమ్. 5
యుధిష్ఠిరః : మహాభాగ్యం హి ధర్మస్య యత్త్వం వదసి మేప్రభో ।
అల్పేనైవ ప్రయత్నేన బహూన్ ధర్మా నవాప్నుయాత్. 6
అశ్వమేధైస్తు బహుభిః ప్రాప్యతే ప్రాకృతైరపి। ఇమం త్వం సంశయం బ్రూహి పరం కౌతూహలంహి మే.
మార్కండేయః: శృణు రాజన్మహద్గుహ్యం మహాపాపప్రణాశనమ్ ।
పద్మగర్భేణ యత్ప్రోక్త మృషీణాం సన్నిధౌ పురా. 8
పఞ్చయోజనవిస్తీర్ణం ప్రయాగస్యతు మణ్డలమ్ । ప్రవేశో యస్య తద్భూమౌ సోఽశ్వమేధః పదేపదే. 9
వ్యతీతా న్పురుషా న్సప్త భవిష్యాంశ్చ చతుర్దశ । నర స్తారయతే సర్వా న్యస్తు ప్రాణా న్పరిత్యజేత్. 10
ఏవం జ్ఞాత్వాతు రాజేన్ద్ర సదా శ్రద్ధాపరో భవ । అశ్రద్దధానాః పురుషాః పాపోపహతచేతసః. 11
న ప్రాప్నువన్తి తం స్థానం ప్రయాగం దేవరక్షితమ్ ।
యుధిష్ఠిరః : స్నేహాద్వా ద్రవ్యలోభాద్వా యేతు కామవశం గతాః. 12
కథం తీర్థఫలం తేషాం కథం పుణ్య మవాప్నుయుః । విక్రయ స్సర్వభాణ్డానాం కార్యాకార్య మజానతః. 13
ప్రయాగే కా గతి స్తస్య తన్మే బ్రూహి మహామతే ।
మార్కండేయః : శృణు రాజ న్మహద్గుహ్యం సద్యః పాపప్రణాశనమ్. 14

మాసమేకం నర స్స్నాయా త్ప్రయాగే నియతేన్ద్రియః।
ముచ్యతే సర్వపాపేభ్యో యథాఽఽదిష్టం స్వయమ్భువా. 15

## నూట ఆరవ అధ్యాయము
## ప్రయాగ మాహాత్మ్యము

యుధిష్ఠిరుడు మార్కండేయు నిట్లడిగెను: అయ్యా! తాము కీర్తించిన ప్రయాగ మాహాత్మ్యమును విని నా హృదయము విశుద్ధమయినది. భగవన్! అచట నెట్టి యాచరణమున అనాశక (ఎన్నటికిని నశించని) ఫలము కలుగునది తెలుపుము. దానిచే నరుడు సర్వపాపముక్తుడై యే లోకములనందును? అన మార్కండేయు డతని కిట్లు వచించెను: రాజా! ప్రయాగ తీర్థయాత్రచే అనాశక ఫలమునందు విధము వినుము. వివేకవంతుడును శ్రద్ధాళువును జితేంద్రియుడు నగు పురుషుడు ఆ యాత్రచే అనాశకఫలమునంది అంగవికలుడును రోగియు కాక పంచేంద్రియ సుఖము లనుభవించుచు; అడుగడుగున అశ్వమేధఫలము నందును; తనకు ముందు వెనుకల పది తరముల వారిని తరింపజేయును; సర్వపాప వినిర్ముక్తుడై పరమపద మందును.

అనిన మార్కండేయుని పలుకులు వినిన యుధిష్ఠిరు డిట్లనెను: ప్రభూ! తాము చెప్పుదానిని బట్టి నరుడు అల్ప ప్రయత్నముతోనే బహు ధర్మాచరణఫలములనందు మహాభాగ్యము కలుగునని తెలియుచున్నది. కాని ప్రాకృత జనులును ఇంత సుకరముగ అనేకాశ్వమేధఫల మెట్లందు కలుగుదురని సంశయించుచున్నాను. ఇది తీర్ప వేడుచున్న నా కుతూహలము తీర్పు డనెను. అతనికి మార్కండేయు డిట్లు తెలిపెను: రాజా! మహాపాప ప్రణాశకమును మహాగుహ్యము నగు విషయము చెప్పెదను. ఇది పూర్వము ఋషుల సన్నిధియందు చతుర్ముఖుడు చెప్పెను. ప్రయాగ మండలము ఐదు యోజనముల విస్తృతి కలది. అట ప్రవేశించి (పై జెప్పిన గుణములతో కూడి యాత్ర సేవించి)న యాతని కడుగడుగున నశ్వమేధ ఫల మబ్బును. గడచిన-గడువనున్న-ఏడేసి తరములవారి నతడు తరింపజేయును. అట ప్రాణత్యాగముచే కూడ ఈ ఫల మబ్బును. ఇది యెరిగి రాజేంద్రా! సదా శ్రద్ధాపరుడవు గమ్ము. పాపోపహతచిత్తులును అశ్రద్ధధానులు నగు వారు దేవరక్షితమగు ఆ ప్రయాగ స్థానమును చేరి దాని సేవింపజాలరు.

అన విని యుధిష్ఠిరు డిట్లనెను: ద్రవ్యమునందు ప్రీతి లోభములకు వశులై కామవశులై ఈ యాత్ర చేసినవారికి కలుగు తీర్థయాత్రాఫలము ఎట్టిది? వారికే గతి కలుగును? ఇది చేయదగు నిది చేయరాదనునది లేక యచట ధనాశతో కామబుద్ధితో సర్వ ద్రవ్యముల నమ్ముకొను వ్యాపారి కే ఫలము కలుగునో తెలుపుము. అన మార్కండేయు డతని కిట్లు చెప్పెను: రాజా! మహాగుహ్యమును వినినంతనే పాపనాశకమునగు నది చెప్పెద వినుము. ప్రయాగయందు నరుడు నియతేంద్రియుడై మాసకాలము స్నాన మాడినచో సర్వపాపముక్తు డగునని స్వయంభూ బ్రహ్మ చెప్పెను.

శుచిస్తు ప్రయతో భూత్వాఽహింసక శ్శ్రద్ధయాఽన్వితః। ముచ్యతే సర్వపాపేభ్య స్సగచ్ఛే త్పరమంపదమ్.
విస్రమ్భఘాతకానాంతు ప్రయాగే శృణు యత్ఫలమ్। త్రికాలమేవ స్నాయీత ఆహారం భైక్ష మాచరేత్-17
త్రిభిర్మాసైః ప్రముచ్యేత ప్రయాగే నాత్రసంశయః। అజ్ఞానేనతు తత్సర్వం తీర్థయాత్రాదికం భవేత్. 18
సర్వకామసమృద్ధస్తు స్వర్గలోకే మహీయతే। స్థానంచ లభతే నిత్యం ధనధాన్యసమాకులమ్. 19
ఏవం జ్ఞానేన సమ్పూర్ణ స్సదా భవతు భోగవాన్। తారితాః పితరస్తేన నరకా త్ప్రపితామహాః. 20
ధర్మానుసారీ ధర్మజ్ఞ త్వయాపృష్టః పునఃపునః। త్వత్ప్రియార్థం మయాప్రోక్తం గుహ్యమేత త్సనాతనమ్.

అచట శరీరమున చిత్తమున శుచియు ప్రయతుడును అహింసకుడును శ్రద్ధావంతుడునగు వానికే పాపముక్తియు పరమపదప్రాప్తియు నగును; (పైకి పుణ్యము చేయువారుగా కనబడుచు) రహస్యముగ పాపములే యచట చేయువారికి కలుగు ఫలము దీనితోనే నీవు తెలిసికొనుము. అట్టివారు అచట మూడు పూటల స్నానము చేయుచు భిక్షాటనముచే జీవించుచు మూడు మాసములు గడపినచో అజ్ఞానకృతమగు పాపము నశించును. తీర్థయాత్రాఫల మబ్బును. సర్వకామపూర్తి

నందును. స్వర్గసుఖముల నందును. పిదప ధనధాన్య సమృద్ధి కలవారి యింట జనించును. లోభవంతుడే యగుగాక! అత డిది ఎరిగి జ్ఞానవంతుడై ప్రయాగతీర్థ సేవ చేసినచో అతని పితృ పితామహాదులును నరకమునుండి తరింతురు. ధర్మానుసారినగు నన్ను ధర్మము నెరుగ గోరి నీవు మరి మరి యడిగినది గుహ్యము సనాతనమునగు విషయము నీ ప్రీతికై చెప్పితిని.

యుధిష్ఠిరః : అద్యమే సఫలంజన్మ హ్యద్యమే తారితం కులమ్ ।
ప్రీతో స్మ్యనుగృహీతోస్మి దర్శనాదేవ తే మునే. 22
త్వద్దర్శనాత్తు ధర్మాత్మ న్ముక్తోఽహం సర్వకిల్బిషైః । ఇదానీం వేద చాత్మానం భగవన్ హతకిల్బిషమ్.23
మార్కణ్డేయః : దిష్ట్యా తే సఫలం జన్మ దిష్ట్యా తే తారితం కులమ్ ।
కీర్తనా ద్వర్ధతే పుణ్యం శ్రుత్వా పాపం ప్రణశ్యతి. 24

## యమునాస్నానమాహాత్మ్యమ్.

యుధిష్ఠిరః : స్నానేన యమునాయాం తు కింఫలంవై మహామునే ।
ఏతన్మే సర్వమాఖ్యాహి యథాదృష్టం యథాశ్రుతమ్. 25
మార్కణ్డేయః : తపనస్య సుతా దేవీ త్రిషు లోకేషు విశ్రుతా ।
సమాఖ్యాతా మహాపుణ్యా యమునా తత్ర నిమ్నగా. 26
యేనైవ నిస్సృతా గఙ్గా తేనైవ యమునా గతా । యోజనానాం సహస్రేణ కీర్తనా త్పాపనాశనీ. 27
తత్ర స్నాత్వా చ పీత్వాచ యమునాయాం యుధిష్ఠిర । కీర్తనా ల్లభతే పుణ్యం దృష్ట్వా భద్రాణి పశ్యతి.28
అవగాహ్యచ పీత్వావా పునాత్యాసప్తమం కులమ్ । తస్యాం స్నానఫలాదేవ స యాతి పరమాం గతిమ్.29
అగ్నితీర్థమితి ఖ్యాతం యమునాదక్షిణేతటే । పశ్చిమే ధర్మరాజస్య తీర్థంచ నరకం స్మృతమ్. 30
తత్ర స్నాత్వా దివం యాన్తి యేమృతా స్తేఽపునర్భవాః । ఏవం తీర్థాని సర్వాణి యమునాదక్షిణేతటే. 31
ఉత్తరేణ ప్రవక్ష్యామి ఆదిత్యస్య మహాత్మనః । తీర్థం నిరఞ్జనంనామ యత్రదేవా స్సవాసవాః. 32
ఉపాసతే సదా సన్ధ్యాం నిత్యం కాలే యుధిష్ఠిర । దేవా స్సేవన్తి తత్తీర్థం యే చాన్యే విబుధా జనాః. 33
సదా దానపరో భూత్వా కురు తీర్థాభిషేచనమ్ । అన్యేచ బహవస్తీర్థా స్సర్వపాపహరా స్మృతాః. 34
తేషు స్నాత్వా దివం యాన్తి యే మృతా స్తేఽపునర్భవమ్ । గఙ్గాచ యమునాచైవ ఉభే తుల్యఫలే స్మృతే.
కేవలం జ్యేష్ఠభావేన గఙ్గా సర్వత్ర పూజ్యతే । ఏవం కురుష్వ కౌన్తేయ సర్వతీర్థాభిషేచనమ్. 36
యావజ్జీవకృతం పాపం తత్క్షణాదేవ నశ్యతి । య ఇదం కల్యఉత్థాయ పఠతేచ శృణోతిచ. 37
ముచ్యతే సర్వపాపేభ్య స్స్వర్గలోకం సగచ్ఛతి.

ఇతి శ్రీమత్స్యమహాపురాణే మార్కణ్డేయ యుధిష్ఠిరసంవాదే ప్రయాగ మాహాత్మ్యే షడుత్తరశతతమోఽధ్యాయః

అని యుధిష్ఠిరు డిట్లనెను: ఇపుడు నా జన్మము సఫలమైనది. నా వంశ పూర్వులు తరించిరి. మునీ! నీ దర్శనమున ప్రీతి చెందితిని. అనుగ్రహము నందితిని. సర్వపాపముక్తుడ నయితిని. అని మార్కండేయు డిట్లనెను: నీ జన్మము సఫలమగుటయు నీ వంశము తరించుటయు నీ యదృష్టమే. ప్రయాగ క్షేత్రమును గూర్చి వినుటచే దానిని కీర్తించుటచే పాపనాశ పుణ్యవృద్ధులు కలుగును. అని యుధిష్ఠిరు డిట్లనెను. మహామునీ! యమునా స్నాన ఫలమును నీవు కనివిని ఎరిగినంత తెలుపుము. అని ముని యిట్లనెను: రవిసుతయని త్రిలోక విఖ్యాతయగు యమున యను నామె మహాపుణ్యద యగు నదిగా ప్రసిద్ధయయి అట ప్రవహించుచున్నది. ఏ హేతువున గంగ ఉత్పన్నయైనదో ఆ హేతువుననే యమునయు

ఆమెతో కలిసినది. (అనగా ఆ రెండు నదులు నట ప్రయాగ తీర్థమున సంగమించుట ప్రాణుల పాపనాశమునకేయని యర్థము.) వేల యోజనములయందుండి యామెను కీర్తించినను పాపనాశకమగు యమునయం దచట స్నాన మాడినను జలము ఆచమించినను సమీపమందుండి ఆమెను కొనియాడినను భక్తితో దర్శించినను శుభములు కలుగుటలో సందేహమే లేదు. అట యమునా స్నానముచే జలపానముచే తానును తన ఏడు తరముల వారును పరమగతి నందుదురు. యమునా దక్షిణతటమున అగ్నితీర్థమును దానికి పశ్చిమమున నరకమను ధర్మరాజ తీర్థమును కలవు. అట స్నానముచే పునరావృత్తి రహితలోకప్రాప్త దగును. యమునోత్తర తటమున ఆదిత్య దేవతాకమగు నిరంజనతీర్థ మున్నది. ఇంద్రాది దేవతలును తదితర విద్వాంసులును సంధ్యాదేవి నట ఉపాసింతురు. నీ వచట సదా తీర్థ స్నాన మాడుచు దానము చేయు చుండుము. అచట యమునా తీరమున పాపహరములు మరి యెన్నియో తీర్థములు కలవు. వానియందు స్నానముచే పునరావృత్తి రహితలోకప్రాప్తి యగును. గంగకు పెద్దరిక మిచ్చి పూజింతురే కాని వాస్తవమున గంగా యమునలు రెండును తుల్యఫలప్రదములే. కావున కౌంతేయా! నీవు నే జెప్పిన తీరున సర్వ తీర్థ స్నాన మచట చేసినచో తత్క్షణమే యావజ్జీవము నీవు చేసిన పాపము లన్నియు నశించును.

వేకువనే లేచి ఇది చదివినను వినినను సర్వపాపముక్తుడై స్వర్గప్రాప్త దగును.

ఇది శ్రీమత్స్య మహాపురాణమున ప్రయాగ మాహాత్మ్యమను నూట ఆరవ అధ్యాయము.

## సప్తోత్తరశతతమోఽధ్యాయః.
## ప్రయాగమాహాత్మ్యమ్.

యుధిష్ఠిరః : శ్రుతంహి బ్రహ్మణా ప్రోక్తం పురాణం పుణ్యకీర్తనమ్ ।
తీర్థానాం తు సహస్రాణి శతాని నియుతానిచ. 1
సర్వే పుణ్యాః పవిత్రాశ్చ గతిశ్చ పరమా స్మృతా। పృథివ్యాం నైమిశం పుణ్య మన్తరిక్షేచ పుష్కరమ్.2
త్రయాణామపి లోకానాం కురుక్షేత్రం విశిష్యతే । సర్వాణి తాని సన్త్యజ్య కథమేకం ప్రశంససి. 3
ప్రయాగేతు త్వయాప్రోక్త మశ్రద్ధేయ మనుత్తమమ్ । గతించ పరమాం దివ్యభోగాంశ్చైవ యథేప్సితాన్.4
కిమర్థ మల్పయోగేన బహుధర్మా న్ప్రశంససి । ఏతన్మే సంశయం బ్రూహి యథాదృష్టం యథాశ్రుతమ్. 5
మార్కణ్డేయః : అశ్రద్ధేయం నవక్తవ్యం ప్రత్యక్షమపి యద్భవేత్ ।
నరస్యాశ్రద్దధానస్య పాపోపహతచేతసః. 6
అశ్రద్దధానో హ్యశుచి ర్దుర్మతి స్త్యక్తమఙ్గళః । ఏతే పాతకిన స్సర్వే తేనేదం భాషితం మయా. 7
శృణు ప్రయాగమాహాత్మ్యం యథాదృష్టం యథాశ్రుతమ్ । ప్రత్యక్షంచ పరోక్షంచయథాతథ్యంభవిష్యతి 8
నచైవాన్యదదృష్టంచ యథాదృష్టం యథాశ్రుతమ్ । శాస్త్రం కృత్వా ప్రమాణంచ యుజ్యతే యోగమాత్మనా.
క్లిశ్యతే చావర స్తత్ర నైవయోగ మవాప్నుయాత్ । జన్మాన్తర సహస్రేభ్యో యోగం లప్స్యతి మానవః. 10
యథా యోగసహస్రేణ యోగో లభ్యేత మానవైః । యస్తు సర్వాణి రత్నాని బ్రాహ్మణేభ్యః ప్రయచ్ఛతి.11
తేన దానేన దత్తేన యోగో లభ్యేత మానవైః । ప్రయాగేతు మృతస్యేదం సర్వం భవతి నాన్యథా. 12
ప్రయాగహేతుం వక్ష్యామి శ్రద్దధానస్య భారత । యథా సర్వేషు భూతేషు సర్వత్రైవచ దృశ్యతే. 13
బ్రహ్మ నైవాస్తి యత్కించి ద్బ్రాహ్మ మితి బోధ్యతే । ఏవం సర్వేషు లోకేషు బ్రహ్మ సర్వత్ర పూజ్యతే.
తథా సర్వేషు తీర్థేషు ప్రయాగః పూజ్యతే బుధైః । పూజ్యతే తీర్థరాజశ్చ సత్యమేవ యుధిష్ఠిర. 15
బ్రహ్మాపి స్మరతే నిత్యం ప్రయాగం తీర్థముత్తమమ్ । తీర్థరాజ మనుప్రాప్య నచాన్య త్కించిదర్హతి. 16
కోహి దేవత్వ మాసాద్య మానుషత్వం చికీర్షతి । అనేనైవ ప్రమాణేన విజ్ఞాస్యసి యుధిష్ఠిర. 17
యథా పుణ్యతమం నాస్తి తథైవ కథితం మయా ।

# నూట ఏడవ అధ్యాయము

## ప్రయాగ మాహాత్మ్యము

యుధిష్ఠిరుడు మార్కండేయునితో నిట్లనెను: కీర్తించినంతన పుణ్యకరమును తీర్థక్షేత్ర విషయకమునగు బ్రహ్మప్రోక్త పురాణమును విని ఉంటిని. దానియందు నూరుల వేల లక్షల కొలదిగ తీర్థములు పేర్కొనబడినవి. అవన్నియు పుణ్యములును పవిత్రములును పరమగతి నిచ్చునవియును; అందునను పృథివిపై నైమిశమును అంతరిక్షమున పుష్కరమును లోకత్రయమునను కురుక్షేత్రమును విశిష్టములు. అవన్నియు విడిచి ఈ ప్రయాగమును ఇంతగ ప్రశంసింతువేమి? ఇది నాకు విశ్వసనీయముగా తోచుట లేదు. అల్పయత్నముచే ఇహ భోగప్రాప్తియు పరమగతియు నెట్లు లభించును? ఇది నాకు సంశయకరముగ ఉన్నది. కావున మీరు వినినంత కనినంత తెలిపి నా సంశయము దీర్ప వేడెదను. అన మార్కండేయు డిట్లు చెప్పెను. పాపోపహతచిత్తుడై పెద్దలను శాస్త్రములను విశ్వసించని వానికి ప్రత్యక్షముగ కనబడు విషయము కూడ నమ్మరానిదిగా తోచును. అతనికి ఏదియు చెప్పరాదు. అశ్రద్ధధానుడు (ఆస్తిక్యముతో విశ్వాసము పెట్టుకొననివాడు) అశుచియు దుర్మతియు అశుభ రూపవచన చిత్తకార్యములు కలవాడును వీరందరును పాతకులు; కావుననే వీరి కేదియు చెప్పరాదంటిని. ప్రయాగ మాహాత్మ్యము పెద్దలనుండి వినబడునదియు ప్రత్యక్షముగ కనబడునదియు చెప్పెదను; వినుము. శాస్త్రమును ప్రమాణముగా చేసికొని చిత్తమును యోగమున నిలిపినవానికి పరోక్ష విషయము కూడ యథాతథముగ ప్రత్యక్షమగును. శాస్త్రములందు వినబడునదియు లోకమున కనబడునదియు మాత్రమే కాదు; అంతయు నతనికి గోచరమగును. యోగికి అదృష్టము (కనబడనిది) ఏదియు లేదు. ఇతరుడు ఆయా విషయముల నెరుగుటకు ఎంతయో శ్రమ పడును. కాని యోగమును పొందజాలడు. (కావున వాడు అతీంద్రియ విషయముల నెరుగజాలకుండును.) ఏలయన జన్మాంతర సహస్రముల పుణ్యమున కాని మానవుడు యోగమును పొందజాలడు. వేలకొలది పుణ్యముల యోగము(కూడిక)చే మానవుడు యోగమును పొందగలుగును. సర్వ రత్నములను (తనకున్న ఉత్తమ పదార్థములన్నియు) బ్రాహ్మణులకు దానము చేసినవానికి ఆ పుణ్యమున యోగము లభించును. కాని ప్రయాగలో మరణించిన వానికంతమాత్రనే యోగసిద్ధి కలుగును. విశ్వసించువానికి ప్రయాగ శ్రేష్ఠత్వమును నిరూపించు యుక్తి చెప్పెదను వినుము. సర్వభూతములయందును బ్రహ్మతత్త్వము చైతన్యరూపమున కనబడుచునే యున్నది. ఐనను బ్రహ్మము లేనే లేదు. అది కనబడుటలేదు. అని నాస్తికుడు తలచుచున్నాడు. ఐనను సర్వలోకములందును బ్రహ్మ(ము)ను విశ్వసించుచునే యున్నారు. పూజించుచునే యున్నారు. అట్లే వివేకులందరును సర్వ తీర్థములందును మిన్నయని ప్రయాగను పూజింతురు. కావుననే యది తీర్థరాజము; బ్రహ్మయు నిత్యమును ప్రయాగను స్మరించుచుండును. ఈ తీర్థరాజమును పొందగలిగినవాడు మరేదియు పొంద నక్కరలేదు. దేవత్వమును పొందినవాడు మానవత్వమును కోరడు గదా! ఈ యుక్తితోనే నీవు ప్రయాగ శ్రేష్ఠత్వము నాలోచింపుము. ఇట్లింతకంటె పుణ్యతర తీర్థక్షేత్రము మరేదియు లేదని నీకు తెలిపితిని.

యుధిష్ఠిరః : శ్రుతంహి యత్త్వయా ప్రోక్తం [illegible] 19
కథం యోగేన తత్ప్రాప్తం స్వర్గవాసంతు కర్మణా । దాతా వై లభతే భోగా న్కథంవై కర్మణః ఫలమ్.
తాని కర్మాణి పృచ్ఛామి పునర్యైః ప్రాప్యతే మహీ ।
మార్కండేయః : శృణు రాజ న్ప్రవక్ష్యామి యథోక్తకరణీం మహీమ్. 20
గామగ్నిం బ్రాహ్మణం శాస్త్రం కాఞ్చనం సలిలం స్త్రియః । మాతరం పితరంచైవ యే నిన్దన్తి నరాధమాః.
న తేషా మూర్ధ్వగమన మిత్రిప్రాహ ప్రజాపతిః ఏవం యోగస్య సంప్రాప్తి స్థానం పరమదుర్లభమ్. 22
పతన్తి నరకే ఘోరే యే నరాః పాపకర్మిణః । హస్త్యశ్వం గామనడ్వాహం మణిముక్తాది కాఞ్చనమ్. 23

పరోక్షం హరతే యస్తు దానం నైవ ప్రయచ్ఛతి । న తే గచ్ఛన్తివై స్వర్గం దాతారో యత్ర భోగినః. 24
అనేకకర్మణా యుక్తః పచ్యతే నరకేఽధమః ।
మార్కణ్డేయః : శృణు రాజ న్మహాప్రాజ్ఞ యథోక్తాచారలక్షణమ్. 25
వివిధానిచ రత్నాని గావో ముక్తాశ్చ కాఞ్చనమ్ । పరోపకారతో యస్తు ప్రమా న్దానం ప్రయచ్ఛతి. 26
నవై గచ్ఛతిచ స్వర్గం స సుఖం పరమాం గతిమ్ । తస్మా త్సర్వప్రయత్నేన దేయం న్యాయార్జితంధనమ్.
ఏవం స్వర్గాపవర్గౌవా శుభాని లభతే నరః । అన్యాయార్జితవిత్తేన నరకం యాతి దారుణమ్. 28
యోఽన్యస్య హృత్వా రత్నాని ప్రయచ్ఛతి నరోయది ।
రత్నాధిపస్య తత్పుణ్యం హృత్వా చౌర్యఫలం లభేత్. 29
ఏతత్సర్వం సమాసేన కథితం రాజసత్తమ । పృచ్ఛ మాం యచ్చ వక్తవ్యం తత్సర్వం కథయామి తే. 30
యుధిష్ఠిరః : అథ తీర్థం హ్యనుసర న్కేనవా కర్మణా మునే ।
తీర్థయాత్రాఫలం మర్త్యో లభతే తద్వదస్వ మే. 31
మార్కణ్డేయః : శృణు రాజన్ప్రవక్ష్యామి తీర్థయాత్రావిధిక్రమమ్ ।
ప్రతిగ్రహా దుపావృత్త స్సన్తుష్టో యేనకేనచిత్. 32
అహఙ్కారవిముక్తాత్మా స తీర్థఫలమశ్నుతే । అకోపనశ్చ రాజేన్ద్ర సత్యవాదీ దృఢవ్రతః. 33
ఆత్మోపమశ్చ భూతేషు స తీర్థఫలమశ్నుతే । ఏవం యోగం చ ధర్మంచ దాతారంచ యుధిష్ఠిర. 34
యచ్చ సత్య మసత్యంవా అస్తి నాస్తీతి యత్ఫలమ్ । నిరుక్తంతు ప్రవక్ష్యామి యథాహ స్వయ మబ్జజః. 35

ఇతి శ్రీమత్స్యమహాపురాణే మార్కణ్డేయయుధిష్ఠిరసంవాదే ప్రయాగ
మాహాత్మ్యే సప్తోత్తరశతతమోఽధ్యాయః.

మీరు చెప్పినది విని నాకు మరి మరి ఆశ్చర్యము కలుగుచున్నది. స్వర్గవాసము ఎట్టి యోగముచే ఎట్టి కర్మాచరణముచే లభించును? ఏ కర్మముల ఫలము ఎట్టిది? ఏ భోగములను ఏ కర్మములచే స్వర్గమం దనుభవించి మరల భూలోకమునకు ఎట్లు ఎట్టి చోటికి చేరును? ఆ కర్మముల స్వరూపమును తెలుప వేడుచున్నాను. అన మార్కండేయు డిట్లు చెప్పెను: రాజా! కర్మ ఫలక్రమమును చెప్పెదను వినుము. భూమిని గోవును అగ్నిని విప్రుని శాస్త్రమును బంగారమును నీటిని స్త్రీలను తల్లిదండ్రులను నిందించు నరాధముల కూర్ధ్వలోకగతులు లేవని ప్రజాపతి వచనము. ఇట్లే యోగసిద్ధి ప్రదమగు స్థానము కూడ దుర్లభము. ఇట్టి పాపకర్ములగు నరులు ఘోర నరకమున పడుదురు. ఏనుగును గుర్రమును గోవును ఎద్దును మణిముక్తా కాంచనములను దాన మీయక పోగా పరోక్షముగా హరించువారు దాతలు పోవు లోకముల కేగి భోగముల భుజించరు. అట్టి యధములు అనేక పాపకర్మముల ఫలముగా నరకమున ఉడికించబడుదురు.

మహాప్రాజ్ఞా! యుధిష్ఠిరా! యథా శాస్త్రోక్తాచార లక్షణమును తెలిపెద వినుము; వివిధములగు రత్నములు గోవులు ముత్తెములు బంగారము పరోపకారమునకై దానము చేయువాడు స్వర్గసుఖమును పరమపదమును కూడ పొందును. కావున సర్వ యత్నములతో తన న్యాయార్జిత ధనమును దానము చేయుటచే సకల శుభములను స్వర్గమును మోక్షమును లభించును. విత్తము నన్యాయముగ నార్జించుటచే దారుణ నరకము నందును. ఇతరుల ధనమును హరించి దానము చేసినచో ఆ పుణ్యము ధనపు సొంతదారునకు చెందును. ఈ దాతకు దొంగతనము చేసిన పాపము చెందును. నీ వడిగినది సంక్షేపమున చెప్పితిని. మరేదైన నడుగు మదియంతయు చెప్పెదను. అన యుధిష్ఠిరుడు మార్కండేయు నిట్లడిగెను: తీర్థయాత్ర కేగినవా డెచట నేయే కర్మల నాచరించినచో యాత్రాఫలము లభించునో తెలుపుము. అన మార్కండేయు డిట్లనెను: రాజా! తీర్థయాత్రా విధాన క్రమములు తెలిపెద; వినుము. ప్రతిగ్రహమున కాసింపక ఏది

లభించిన-దానితో తృప్తి నందుచు అహంకార రహితుడై అకోపనుడై సత్యవాదియై చిత్తశుద్ధితో కర్మల నాచరించువాడై సర్వభూతములయందు తనయందువలె భావము కలిగియుండు నాతనికి తీర్థయాత్రాఫలము లభించును. ఇట్లే యోగము ధర్మము దాతృత్వము సత్యము అసత్యము ఆస్తికత్వము నాస్తికత్వము మొదలగు పదముల నిర్వచనమును (అర్థవిశదీకరణమును) కూడ నీకు తెలిపెదను.

ఇది శ్రీమత్స్య మహాపురాణమున ప్రయాగ మాహాత్మ్యమను నూట ఏడవ అధ్యాయము.

## అష్టోత్తరశతతమోఽధ్యాయః.

## ప్రయాగమాహాత్మ్యమ్.

మార్కణ్డేయః : శృణు రాజ న్ప్రయాగస్య మాహాత్మ్యం పునరేవతు ।
నైమిశం పుష్కరంచైవ గోతీర్థం సిన్ధుసాగరమ్. 1
గయా చైత్రథనూకంచ గఙ్గాసాగరమేవ చ । ఏతే చాన్యేచ బహవో యేచ పుణ్యా శ్శిలోచ్చయాః. 2
దశ తీర్థసహస్రాణి త్రింశత్కోట్య స్తథాపరే । ప్రయాగే సంస్థితా నిత్య మేకమాహు ర్మనీషిణః. 3
త్రీణి చాథాగ్నికుణ్డాని యేషాం మధ్యేచ జాహ్నవీ । ప్రయాగా దభినిష్క్రాన్తా సర్వదేవనమస్కృతా. 4
తపనస్య సుతా దేవీ త్రిషు లోకేషు విశ్రుతా । యమునా గఙ్గయా సార్ధం సఙ్గతా లోకపావనీ. ౫
గఙ్గాయమునయో ర్మధ్యే పృథివ్యా జఘనం స్మృతమ్ । ప్రయాగం రాజశార్దూల కళాం నార్హన్తి షోడశీమ్.
తిస్రః కోట్యర్ధకోటీచ తీర్థానాం వసు రబ్రవీత్ । దివి భువ్య న్తరిక్షేచ తత్సర్వం జాహ్నవీగతమ్. 7
ప్రయాగసమధిష్ఠానౌ కమ్బళాశ్వతరౌ ప్రభూ । భోగితల్పగతస్యైషా వేదిరేషా ప్రజాపతేః. 8
తత్ర వేదాశ్చయజ్ఞాశ్చ మూర్తిమన్తో యుధిష్ఠిర । ప్రజాపతి ముపాసన్తే ఋషయశ్చ తపోధనాః. 9
యజన్తే క్రతుభి ర్దేవా స్తథా చక్రధరా నృపాః । తతః పుణ్యతమం నాస్తి త్రిషులోకేషు భారత. 10
ప్రభావ స్సర్వతీర్థేభ్యః ప్రభవ త్యధికం విభో । యత్ర గఙ్గా మహాభాగా స దేశ స్తత్ర పావనః. 11

## నూటయెనిమిదవ అధ్యాయము.

## ప్రయాగ మాహాత్మ్యము.

మార్కండేయుడింకను ఇట్లు చెప్పెను: యుధిష్ఠిరా: ప్రయాగ మాహాత్మ్యమువింకను చెప్పెద; వినుము. నైమిశము పుష్కరము గోతీర్థము సింధు సాగరము గయ చైత్ర(ధనూక)ము గంగా సాగర (సంగమ)ము మొదలగు ముప్పదికోట్ల పదివేల తీర్థములును పుణ్య పర్వతములును సదా ప్రయాగ యందుండునని విద్వాంసులు చెప్పెదరు. ప్రయాగ సమీపమున సర్వదేవ నమస్కృతయగు గంగ మూడగ్ని కుండముల నడుమగా ముందునకు సాగివచ్చును. లోకత్రయ ప్రసిద్ధయు సూర్యపుత్త్రియు నగు యమునయు ఈ గంగయు అచట సంగమించును. ఈ గంగా యమునా మధ్యదేశము పృథివీ జఘనమని ప్రసిద్ధము. లోకత్రయమందలి మూడున్నర కోట్ల తీర్థములన్నియు కూడియు ప్రయాగ తీర్థ షోడశాంశముతో సరిపోలవు. ఏలయన భూర్భువః స్వర్లోకములందలి తీర్థములన్నియు నచట గలవు. అని సాక్షాత్ వసువు చెప్పెను. నాగ ప్రభువులగు కంబళాశ్వతరులును ఇచట నుందురు. శేషతల్ప శయనుడగు ప్రజాపతికి విష్ణువకు ఇది వడక యరుగు. తపోధనులగు మునులును ఋషులును మూర్తిమంతములగుచు వేదములును యజ్ఞములును నచట ప్రజాపతిని ఉపాసించుచుండును. దేవతలును చక్రవర్తులును నచట క్రతువులతో విష్ణు ప్రజాపతిని ఆరాధింతురు. త్రిలోకములందును ఈ ప్రయాగముకంటె పుణ్యతమమగు తీర్థక్షేత్రము లేదు. మహాభాగయగు గంగ యుండుటచే ఆచోటు సర్వ తీర్థములకంటె అధిక ప్రభావ సంపన్నము; పావనము.

సిద్ధక్షేత్రంచ విజ్ఞేయం గఙ్గాతీరసమన్వితమ్ । ఇదం సత్యం విజానీయా త్సాధూనా మాత్మజస్యచ. 12
సుహృదశ్చ విశేషేణ శిష్యస్యానుమతస్యచ । ఇదంధన్య మిదంస్వర్గ్య మిదంసేవ్యమిదంసుఖమ్. 13
ఇదంపుణ్య మిదంకీర్త్యం పావనం ధర్మముత్తమమ్ । మహర్షీణా మిదంగుహ్యం సర్వపాప ప్రణాశనమ్. 14
అధీత్యచ ద్విజో ప్యేత న్నిర్మలంస్వర్గమాప్నుయాత్ ।
యస్త్విమం శృణుయాన్నిత్యం తీర్థంపుణ్యం సదాశుచిః. 15
జాతిస్మరత్వం లభతే నాకపృష్ఠేచ మోదతే । ప్రాప్యన్తే తాని తీర్థాని సద్భి శ్శిష్టానుదర్శిభిః. 16
స్నాహి తీర్థేషు కౌరవ్య నచ వక్రగతి ర్భవేత్ । త్వయాచ సమ్యక్ప్రష్టేన కథితాని మయావిభో. 17
తారితాః పితరస్సర్వే తథైవచ పితామహాః । ప్రయాగస్యతు సర్వే తే కళాం నార్హన్తి షోడశీమ్. 18
ఏవం జ్ఞానంచ యోగంచ తీర్థంచైవ యుధిష్ఠిర । బహుక్లేశేన యుజ్యన్తే న తేషా మితరా గతిః. 19
త్రికాలంచ జపఞ్జ్ఞానం స్వర్గలోకం గమిష్యతి. 19½

ఇతి శ్రీమత్స్యమహాపురాణే మార్కణ్డేయయుధిష్ఠిరసంవాదే ప్రయాగమాహాత్మ్యే అష్టోత్తరశతతమోఽధ్యాయః.

గంగా తీరముతో కూడిన యాతీర్థము సిద్ధక్షేత్రమని ఎరుగవలయును. ఈ సర్వ విషయమును సజ్జనులకును తన కుమారునకును తన మిత్రునకును తనకు ప్రీతిపాత్రుడగు శిష్యునకును తెలుపవలయును. ఈ తీర్థక్షేత్రము ధన్యము; స్వర్గప్రదము; సేవింపదగినది; సుఖకరమయినది; పుణ్యప్రదము; కీర్తనీయము; పావనము; ఉత్తమ ధర్మరూపము; ఇది మహర్షులకును ఎరుగరాని గుహ్యతత్త్వము; సర్వపాపనాశకము. నిర్మలమగు ఈ తీర్థ మాహాత్మ్యమును అధ్యయనము చేసినను విప్రులు స్వర్గప్రాప్తులగుదురు. శుచియై ఈ పుణ్యతీర్థ మాహాత్మ్యమును వినునతడు స్వర్గ సుఖములందుటేకాక తరువాతి జన్మములందును పూర్వజన్మ స్మృతి కలవాడగును. కావున యుధిష్ఠిరా! శిష్యులై సంప్రదాయము నెరిగిన వృద్ధులతో కూడి నీవును ఈ తీర్థములకేగి వానియందు స్నానమాడుము. నీకిక దుర్గతి యుండదు. రాజా! నీవు చక్కగా అడిగిన విషయమంతయు నీకు నేజెప్పితిని. నీ పితృ పితామహులందరును తరించినారు. లోకములందలి ఆ తీర్థములన్నియు కలిసియు ప్రయాగలో పదునారవ వంతునకు చాలవు; ఏలయన తీర్థము జ్ఞానము యోగము ఈ మూడును ఒకచోట లభించుట దుస్సాధ్యము. ఇతర తీర్థములకు ఇట్టి యోగ్యతలేదు. దీని మహిమను త్రికాలమును జపించుచుండుటచే స్వర్గ ప్రాప్తియగును.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున ప్రయాగ మాహాత్మ్యమను నూట ఎనిమిదవ అధ్యాయము.

## నవోత్తరశతతమోఽధ్యాయః.

## ప్రయాగమాహాత్మ్యమ్.

యుధిష్ఠిరః కథం స్వర్గమిదం ప్రోక్తం ప్రయాగస్య మహామునే ।
ఏతన్మే సర్వమాఖ్యాహి యథాహి మమ తారయేత్. 1
మార్కణ్డేయః శృణు రాజ న్మహాబాహో ప్రోక్తం సర్వమిదం జగత్ ।
బ్రహ్మా విష్ణు స్తథా సోమో దేవతాః ప్రభు రవ్యయః. 2
బ్రహ్మా సృజతి భూతాని స్థావరం జఙ్గమం చ యత్ । తాన్యేతాని పరే లోకే విష్ణు స్సంవర్ధతే ప్రజాః. 3
కల్పాన్తే తత్సమగ్రంహి రుద్రస్సంహరతే జగత్ । తదా హరతి చాప్యేత న్న కదాచి ద్వినశ్యతి. 4
ఈశ్వర స్సర్వభూతానాం యః పశ్యతి స పశ్యతి । అత్ర యే త్వవతిష్ఠన్తి తే యాన్తి పరమాం గతిమ్. 5

యుధిష్ఠిరః । ఆఖ్యాహి మే యథాతత్త్వం యథైవాతిష్ఠతే ప్రభుః । కేనవా కారణేనైవ తిష్ఠన్తే లోకసత్తమాః. 6
మార్కణ్డేయః : ప్రయాగే యేన వసతి బ్రహ్మా విష్ణు ర్మహేశ్వరః ।
కారణం త త్ప్రవక్ష్యామి శృణు త్వం త ద్యుధిష్ఠిర. 7
పఞ్చయోజనవిస్తీర్ణం ప్రయాగస్యతు మణ్డలమ్ । తిష్ఠన్తి రక్షణార్థాయ పాపకర్మనివారణాత్. 8
యస్మి న్నహ్యే త్స్వకం పాపం నరకంచ న పశ్యతి । ఏవం బ్రహ్మాచ విష్ణుశ్చ ప్రయాగే నిత్య మీశ్వరః. 9
ఉత్తరేణ ప్రతిష్ఠానా చ్ఛద్మనా బ్రహ్మతిష్ఠతి । మహేశ్వరో వటో భూత్వా యావదాభూతసమ్ప్లవమ్. 10
యే చాన్యే బహవశ్చైవ తిష్ఠన్తిచ యుధిష్ఠిర । స్వరాజ్యం కురు రాజేన్ద్ర భ్రాతృభి స్సహితోఽనఘ. 11

ఇతి శ్రీమత్స్యమహాపురాణే మార్కణ్డేయయుధిష్ఠిరసంవాదే ప్రయాగ
మాహాత్మ్యే నవోత్తరశతతమోఽధ్యాయః.

## నూట తొమ్మిదవ యధ్యాయము.

## ప్రయాగ మాహాత్మ్యము.

యుధిష్ఠిరుడు మార్కండేయుని ఇట్లడిగెను: మహామునీ! ప్రయాగ తీర్థప్రభావము స్వర్గప్రదమెట్లగును? అది నా పూర్వులను ఎట్లు తరింపజేయగలదు? తెలుపుమన మార్కండేయుడిట్లు చెప్పెను: ఈ లోకములన్నియును దాని యందలి స్థిరచర ప్రాణులును పదార్థములును బ్రహ్మ విష్ణు శివులును దేవతలును అన్నియు అవ్యయుడగు ప్రభువగు ఆ పరమాత్మయే. అందునను బ్రహ్మ సృజింపగా విష్ణువా లోకములను వర్ధిల్లజేయును. కల్పాంతమందదియంతయు రుద్రుడు సంహరించును (మూల తత్త్వమునందు లయమందజేయును.). ఐనను ఇది (ఈ ప్రయాగ) ఎన్నడును నశించునదికాదు. కావున ఇచట నివసించువారు పరమపదము నందుదురు. అన యుధిష్ఠిరుడిట్లడిగెను: ప్రయాగయేల ఎన్నడును నశించదు? ఈ లోక సత్తములగు త్రిమూర్తులచట సదా ఏల నివసింతురు? తెలుప వేడెదను. అన మార్కండేయు డిట్లనెను: పంచయోజన విస్తీర్ణమగు ప్రయాగ మండలమునందు తీర్థ సేవకుల పాప మోచనము చేయుటకే వారు ముువ్వురును మారు రూపములో ఉందురు. వారచట వట రూపమున నున్నారు. ప్రళయము వరకును ఉందురు కూడను. వారి మారు రూపములగునవి ఇంకను అచట అనేకములు గలవు. కావున అనఘా! (నామాట విశ్వసించి ప్రయాగ తీర్థ సేవచేసి) నీ సహోదరులతో కూడి రాజ్యపాలనము చేయుచుండుము.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున ప్రయాగ మాహాత్మ్యమను
నూట తొమ్మిదవ అధ్యాయము.

## దశోత్తరశతతమోఽధ్యాయః.

## ప్రయాగమాహాత్మ్యమ్.

నన్దికేశ్వరః : భ్రాతృభి స్సహిత స్సర్వై ర్ద్రౌపద్యా సహ భార్యయా ।
ప్రయాగం సమను ప్రాప్య స్నాత్వా స కృతనైత్యకః. 1
బ్రాహ్మణేభ్యో నమస్కృత్వా గురుదేవా స్ప్రితర్ప్య చ । వాసుదేవోపి తత్రైవ క్షణేనాభ్యగమ త్తదా. 2
పాణ్డవై స్సహితై స్సర్వైః పూజ్యమాన స్సమాధవః । కృష్ణేన సహితై స్సర్వై రభ్యషిఞ్చద్యుధిష్ఠిరమ్. 3
ఏతస్మి న్నన్తరేచైవ మార్కణ్డేయో మహామునిః । తత స్స్వస్తీతి చోక్త్వాచ క్షణా దాశ్రమ మభ్యగాత్. 4
యుధిష్ఠిరోపి ధర్మాత్మా భ్రాతృభి స్సహ సోఽవసత్ । మహాదానం తతో దత్వా ధర్మసూను ర్యుధిష్ఠిరః. 5
య స్త్విదం కల్య ఉత్థాయ మాహాత్మ్యం పఠతే నరః । ముచ్యతే సర్వపాపేభ్యో రుద్రలోకం స గచ్ఛతి. 6

## నూట పదవ అధ్యాయము.
## ప్రయాగ మాహాత్మ్యము.

నందికేశ్వరుడు నారదునకు ఇట్లు చెప్పెను: అంతట యుధిష్ఠిరుడు మార్కండేయ వచనమున సోదరులతోను పత్నియగు ద్రౌపదితోను కూడి ప్రయాగకేగి స్నానమాడి నిత్యానుష్ఠానముదీర్చి బ్రాహ్మణుల నమస్కరించి గురువులకు (పూర్వులగు పెద్దలకు) దేవతలకు తర్పణము ఇచ్చెను. క్షణములో వాసుదేవుడును అక్కడ కేతెంచెను. మాధవుడును వారలందరచే పూజింపబడి పిమ్మట యుధిష్ఠిరు నభిషేకించెను. అంతలోనే మార్కండేయ మహా మునియు నతనికి స్వస్తి వచనము పలికి క్షణములో తన యాశ్రమమేతెంచెను. యుధిష్ఠిరుడు మాత్రము భ్రాత్రాదులతో కూడి యటనేయుండి మహా దానము లాచరించెను. ప్రాతఃకాలమున మేల్కాంచి ఈ మాహాత్మ్యమును పఠించు నరుడు సర్వపాప వినిర్ముక్తుడై రుద్రలోక ప్రాప్తుడగును.

వాసుదేవః : మమ వాక్యంచ కర్తవ్యం త్వయా స్నేహా ద్యుధిష్ఠిర ।
నిత్యం యజస్వ జుహ్వస్వ ప్రయాగే విగత జ్వరః. 7
ప్రయాగం స్మరవై నిత్యం తస్మా త్కురు యుధిష్ఠిర ।
స్వయం ప్రాప్స్యసి రాజేన్ద్ర స్వర్గలోకం న సంశయః. 8
ప్రయాగ మనుగచ్ఛేద్వా వసతే వాఽపి యో నరః । సర్వపాపవిముక్తాత్మా రుద్రలోకే మహీయతే. 9
ఋషిభిః క్రతవః ప్రోక్తా దేవైశ్చాపి యథాక్రమమ్ । న హి శక్యా దరిద్రేణ యజ్ఞాః కర్తుం మహీపతే. 10
బహూపకరణా యజ్ఞా నానాసమ్భారవిస్తరాః । ప్రాప్యన్తే పార్థివైరేవ సమృద్ధైర్వా నరైః క్వచిత్. 11
యో దరిద్రైరపి విధి శ్శక్యః ప్రాప్తుం యుధిష్ఠిర । తుల్యో యజ్ఞఫలైః పుణ్యై స్తన్నిబోధ వదామితే. 12
ఋషీణాం పరమం గుహ్య మిదం రాజర్షిసత్తమ । తీర్థానుగమనం పుణ్యం యజ్ఞేభ్యోఽపి విశిష్యతే. 13
దశతీర్థసహస్రాణి త్రింశత్కోట్య స్తథాపరాః । మాఘమాసే గమిష్యన్తి గఙ్గాయాం భరతర్షభ. 14
స్వస్థో భవ మహారాజ భుఙ్క్ష్వ రాజ్య మకణ్టకమ్ । పునర్ద్రక్ష్యసి రాజేన్ద్ర యజమానో విశేషతః. 15
నన్దికేశ్వరః : ఇత్యుక్త్వా స మహాభాగో మార్కణ్డేయో మహాతపాః ।
యుధిష్ఠిరస్య నృపతే స్తత్రైవాన్తరధీయత. 16
పునస్తత్ర సమాప్లావ్య గాత్రాణి సగణో నృపః । యథోక్తేన విధానేన పరాం నిర్వృతి మాగతః. 17
తదా త్వమపి దేవర్షే ప్రయాగాభిముఖో భవ । అభిషేకంతు కుర్యాద్యః కృతకృత్యో భవిష్యతి. 18
సూతః : ఏవముక్త్వాఽథ నన్దీశ స్తత్రైవాన్తరధీయత । నారదోపై జగామాథ ప్రయాగాభిముఖ స్తథా. 19

ఇతి శ్రీమత్స్యమహాపురాణే నన్దికేశ్వరనారదసంవాదే ప్రయాగ
మాహాత్మ్యపరిసమాప్తిర్నామ దశోత్తరశతతమోఽధ్యాయః.

*ఇతి ప్రయాగ మాహాత్మ్యమ్.*

అనంతరము శ్రీకృష్ణుడు యుధిష్ఠిరునితో ఇట్లనెను: యుధిష్ఠిరా! నాయందలి స్నేహముతో నావాక్యమిది ఆచరించవలయును. నిత్యమును సంతాపరహితచిత్తముతో ఈ ప్రయాగయందు దేవతల యజించుచు హోమములు జరుపుచుండుము. మరల మార్కండేయుడు యుధిష్ఠిరునితో ఇట్లనెను. రాజా! తరువాత కూడ నిత్యమును ప్రయాగను స్మరించుచుండుము. నిస్సంశయముగా దాన నీవు స్వర్గ సుఖములనందగలవు. ఏలయన నరుడెవ్వడేని ప్రయాగకేగినను నట వసించినను సర్వపాప విముక్తుడై రుద్రలోకమున పూజితుడై సుఖించును. మహీపతీ! ఋషులును దేవతలునెన్నియో

యజ్ఞ క్రతువులు ప్రవచించిరి. దరిద్రుడసి చేయజాలడుకదా! యజ్ఞములకు ఉపకరణములును నానా సంభార విస్తరములును కావలయును. అట్టివి భూపతులకు మాత్రముగాని ధనవంతులకుగాని లభ్యములగును. కాని దరిద్రులకును పొంద సులభమగు విధానము యజ్ఞఫలతుల్య ఫలప్రదమై పుణ్యప్రదమగునది కలదు; తెలిపెదను. ఇది ఋషులకును తత్త్వమెరుగరాని గుహ్య విషయము. తీర్థయాత్రా గమనము యజ్ఞములకంటె విశిష్టతర పుణ్యప్రదము. మువ్వది కోట్ల పదివేల తీర్థములు మాఘమాసమున గంగయందు చేరియుండును. (ఇది ఎరిగి) నీవు స్వస్థతనందుము. అకంటకముగ రాజ్యము ననుభవించుము. నీవు యజమానుడవయి (యజ్ఞముల నాచరించుచు) నన్ను మరల చూతువుగాని; అని యిట్లు పలికి మార్కండేయుడు యుధిష్ఠిరుని ఎట్ట యెదుటనే అంతర్ధానమందెను. యుధిష్ఠిరుడును మరల యథావిధానముగ సపరివారముగ ప్రయాగయందలి గంగా యమునా సంగమమున స్నానమాడి పరమానందము నందెను. కావున నోదేవర్షీ! నారదా! నీవును బయలుదేరి ప్రయాగకేగుము. అని నారదునితో పలికి నందికేశ్వరుడు అంతర్ధానమందెను. నారదుడును ప్రయాగాభిముఖుడై బయలుదేరెను.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున ప్రయాగ మాహాత్మ్య
పరిసమాప్తియను నూట పదియవ అధ్యాయము.

క్రియా యోగ ప్రకరణము ముగిసినది.

[ఈ క్రియా యోగము 52వ అధ్యాయము నారంభమునుండి 110 అధ్యాయాంతము వరకు ఇచట ఈయబడినది. మరల 257వ అధ్యాయారంభమునుండి 288వ అధ్యాయాంతము వరకు ఇది ప్రతిపాదింపబడును.

—అనువాదకుడు]

## ఏకాదశోత్తర శతతమోఽధ్యాయః.

## భూగోళ వర్ణన ప్రారమ్భః.

ఋషయః : కథం మత్స్యేన కథితో భువనస్యతు విస్తరః। మనవే త త్సమాచక్ష్వ యాథాతథ్యేన సూతజ. 1
సూతః : కథితం మత్స్యరూపేణ విష్ణునా మణ్డలం భువః । సాబ్ధిద్వీపాదిభూగోళం మనవే భానుసూనవే. 2
తత్సర్వ మిహ వక్ష్యామి శృణుధ్వం మునిపుఙ్గవాః । దేవేశ్వరంచ విశ్వేశం విష్ణుంవై కారణాత్మకమ్. 3
వక్తుకామోఽథ భూగోళం ప్రాహ ప్రాఞ్జలి రగ్రతః ।
మనుః : భగవ ఞ్ఛ్రోతుమిచ్ఛామి విస్తరా న్మణ్డలం భువః. 4
విస్తారతః కియత్ప్రోక్తం కతి ద్వీపా స్ససాగరాః । కథం మేరు స్స్థిత స్తత్ర ఏతన్మే బ్రూహి కేశవః. 5
శ్రీమత్స్యః : శృణు సర్వం ప్రవక్ష్యామి విస్తరా న్మణ్డలం భువః ।
సప్తద్వీపా న్సముద్రాంశ్చ యాథాతథ్యేన తే మనో. 6
పఞ్చాశత్కోటివిస్తారం యోజనానాం ధరాతలమ్ । తచ్చసప్తసముద్రైశ్చ సప్తద్వీపై స్సమావృతమ్. 7
లవణేక్షుసురాసర్పి ర్దధిక్షీర జలార్ణవైః । జమ్బూః ప్లక్ష శ్శాల్మలిశ్చ కుశః క్రౌఞ్చస్తు పఞ్చమః. 8
శాక పుష్కరనామానౌ ద్విగుణైః పరివేష్టితః(తౌ). 8½

ఇతి శ్రీమత్స్యమహాపురాణే మత్స్యమనుసంవాదే భూగోళే
ఏకాదశోత్తరశతతమోఽధ్యాయః.

## నూట పదునొకండవ అధ్యాయము.

## భూగోళ వర్ణనారంభము.

[భగవత్తత్త్వమును అంతర్యామిగా-కాలరూపునిగా - దేశరూపునిగా - దేశకాలోభయరూపునిగా ఉపాసించవలయును. వీనినే ఆధునికులు కేవలము ప్రకృతియందలి అంశములుగా Time, Space and Time-Space అనుచున్నారు. కాల పరిమాణ వ్యవస్థయు-యుగ-మహాయుగ-కల్పాది రూపములును ఆయా యుగములందుండెడి ధర్మాధర్మ ప్రవృత్తియును భగవంతుని కాలరూపునిగా ఉపాసించుటకు తోడుపడును.

భూగోళ వ్యవస్థా విజ్ఞానము-భగవానుని దేశరూపునిగా ఉపాసించుటకు ఉపకరించును. జ్యోతిర్గోళ వ్యవస్థా విజ్ఞానము భగవానుని దేశకాలోభయరూపునిగా ఉపాసించుటకు సాయపడును. ఇది ఎరిగి పురాణములను చదువుట సార్థకమగు నని.

—అనువాదకుడు]

ఋషులు సూతు నిట్లడిగిరి: మత్స్య నారాయణుడు మనువునకు భువన విస్తారము ఎట్లు చెప్పెనో అది ఉన్నది ఉన్నట్లు (ఏ మాత్రమును విడువక) మాకు తెలుపుము. అని అడుగ వారికి సూతు డిట్లు చెప్పెను: మత్స్యరూపుడగు విష్ణువు భానుపుత్త్రుడగు వైవస్వత మనువునకు భూమండల(స్వరూప)మును సముద్రములతో ద్వీపములతో కూడిన భూగోళ స్వరూపమును (దాని వివరణమును) తెలిపెను. ముని పుంగవులారా! ఆదియంతయు చెప్పెదను; వినుడు. నేను భూగోళ (విషయ)మును మీకు చెప్పగోరి మొదట దేవేశ్వరుడును విశ్వేశ్వరుడును కారణరూపుడును నగు విష్ణుని దోసిలియొగ్గి నమస్కరించి చెప్ప నారంభింతును.

మనువు మత్స్యు నిట్లడిగెను: భగవన్! భూమండలమును(గూర్చి)విస్తరముగా వినగోరుచున్నాను. దాని విస్తారము (వైశాల్యము)ఎంత? ద్వీపములు ఎన్ని? సముద్రములు ఎన్ని? దానియందు మేరువు ఎట్లున్నది? కేశవా! ఇది యంతయు నాకు తెలుపుము. అన శ్రీమత్స్యు డిట్లు చెప్పెను. భూమండల(స్వరూప)మును (దానియందుగల) సప్త ద్వీపముల(విషయ)మును సప్త సముద్రముల(విషయ)మును యథాతథముగా చెప్పెదను. ధరాతలము ఏబదికోట్ల యోజనముల

విస్తారము కలది. అది సప్త సముద్రములతో సప్త ద్వీపములతో ఆవరింపబడియున్నది. లవణేక్షు సురాసర్పిర్దధి క్షీర జల సముద్రములు ఏడు. జంబూ ప్లక్షశాల్మలి కుశ క్రౌంచ శాక పుష్కర ద్వీపములు ఏడు.

ఏబదికోట్ల చదరపు యోజనములు = 3200000000000000 చదరపు (బ్రిటిషు) గజములు.

ఇది శ్రీమత్స్య మహాపురాణమున భూగోళ వర్ణనారంభమను నూట పదునొకండవ అధ్యాయము.

## ద్వాదశోత్తరశతతమోఽధ్యాయః.

## ద్వీపాది పరిమాణ కథనమ్.

ఋషయః : కతి ద్వీపా స్సముద్రాశ్చ పర్వతాః కతిచ ప్రభో ।
కియన్తి చైవ వర్షాణి తేషు నద్యశ్చ కాస్స్మృతాః. 1
మహాభూతప్రమాణంచ లోకాలోక స్తథైవచ । పర్యయః పరిమాణంచ గతిశ్చన్ద్రార్కయో స్తథా. 2
ఏతద్బ్రూహిచ నస్సర్వం విస్తరేణ యథార్థతః । త్వద్వక్త్రాదేవ సకలం శ్రోతు మిచ్ఛామహే వయమ్. 3
సూతః : ద్వీపభేదసహస్రాణి తథా ఖణ్డశతానిచ । నశక్యతే క్రమేణైవ వక్తుంవై సకలం జగత్. 4
సప్తైవ సమ్ప్రవక్ష్యామి చన్ద్రాదిత్యగ్రహై స్సహ । తేషాం మనుష్యా స్తర్కేణ ప్రమాణాని ప్రచక్షతే. 5
అచిన్త్యాః ఖలు యే భావా స్తాంస్తు తర్కేణ సాధయేత్ । ప్రకృతిభ్యః పరం యచ్చ తదచిన్త్యస్య కారణమ్.

## నూట పండ్రెండవ అధ్యాయము.

## ద్వీపాది పరిమాణ కథనము.

[భారతీయులు భూగోళ స్వరూప ప్రతిపాదనమున పురాణములందు మూడు భావనలను దృష్టియందుంచుకొనినా రని తోచును. మొదటిది దేశ చతుష్టయ భావన. రెండవది సప్తద్వీప భావన. మూడవది నవవర్షవిభాగభావన. వీనిని భావించుటలో నాటి వారి దృష్టి ఏమనునది విచారింపవలసియున్నది. మిగిలిన రెండు భావనల మాట ఎట్లున్నను మొదటి భావన మాత్రము చాల విశిష్టమయినది. దీనియందు మన ఋషులు మేరువు (పామీరు పీఠభూమి) మధ్యస్థానముగా గ్రహించి ఏర్పడు ఒక చతురస్రాకృతిగల ప్రదేశమును యజ్ఞవేదికనుగా భావనచేసిరి. ఇదియొక విలక్షణమగు భావన. ఇది మనవారి హృదయ పవిత్రతను వైదిక దృష్టిని తెలుపుచున్నది. దీనితోబాటు వారు సకల భూమండలమును అందలి నదీ పర్వత సముద్రాదికమును వానిచే ఏర్పడు ఆకృతి విశేషములను ప్రకృతియందు ఆయా పర్వత నద్యాదికము ప్రాణి సమూహము నకు కలుగజేయు ఆయా ఉపకారములను ఎంతగా ఎరిగియుండిరో కూడ దీనిచే అవగతమగుచున్నది.

ఇక సప్త ద్వీపభావనలో యావద్భూమండలమును చేరియున్నది. నవవర్ష భావన జంబూద్వీప భావనలోని ఒక ఉపాంశము మాత్రమే అని తోచును. దీనిని ఈ అధ్యాయములందు ఎరుగగలము.]

ఋషులు సూతు నిట్లడిగిరి: ద్వీపములు సముద్రములు పర్వతములు వర్షములు నదులు ఎన్ని? మహాభూత ప్రమాణము లోకాలోక(పర్వత)ము సూర్యచంద్రుల భ్రమణ క్రమము వారి పరిమాణము ఇదియంతయు యథాతథముగను సవిస్తరముగను తెలుపుము. మే మిదియంతయును మీ నోటినుండి వినగోరుచున్నాము- అన సూతు డిట్లు చెప్పసాగెను. భూమండలమున వేలకొలది ద్వీపములును నూరుల కొలది ఖండములును గలవు. సకల జగత్తును క్రమము తప్పక చెప్పుట శక్యమే కాదు. (అనను) ఈ భూమిని సప్త ద్వీపాత్మకముగా విభజించి చంద్రాదిత్య ప్రభృతి గ్రహముల వ్యవస్థ తోను ఖగోళ వ్యవస్థతోను తెలిపెదను. మనుష్యులు తర్కముతో వాని ప్రమాణమును తెలిసికొని చెప్పుచున్నారు. ఏలయన అచింత్యములు (సామాన్యబుద్ధితో ఆలోచించి ఎరుగ శక్యముకానివి) అను భావములు (పదార్థ వ్యవస్థలు-Systems) ఏవి లోకమున కలవో అవి అచింత్యములు. కావున అవి తర్కముతోనే ఎరుగవలయును.

[ఇచ్చటినుండి మొత్తము భూమండలమును 1. జంబూ 2. శాక 3. కుశ 4. క్రౌంచ 5. శాల్మల 6. గోమేద 7. పుష్కర ద్వీపములను పేర సప్త ద్వీపములుగా విభజించి వానిలో మొదట జంబూ ద్వీపమును గ్రహించి దానియందు చతుర్దేశ విభాగమును సప్తవర్ష విభాగమును దృష్టియందుంచుకొని భారతదేశము ప్రధానముగా వర్ణనము ఈయబడును. ఈ సప్తవర్ష విభాగమునందే ఆర్ష వాఙ్మయమున అత్యంత ప్రసిద్ధముగా నున్నదియు శ్రీమద్భాగవతాదులందు వర్ణింపబడి నదియు నగు నవవర్ష విభాగము కూడ ఇమిడి యున్నది. ఈ భూమండల విభాగ భావనా పరంపర అత్యంత ప్రాచీనము-పురాణ రచయితృ ఋషులకు వైదిక ఋషులనుండి అనుశ్రుతముగా అను స్యూతముగా వచ్చిన భావనా పరంపర ఇది-యనుట యందెట్టి సందియమును లేదు. వైదిక స్మార్త పౌరాణిక కర్మానుష్ఠానము లన్నిటియందును ఆయా ప్రసంగము లందు ఇదియే గ్రాహ్యము. నేడు మనకు వాడుకలోనికి వచ్చిన దేశఖండ ద్వీప విభాగములు దీనియం దెట్లు చేరియున్నవో పరిశీలించిన గమనించవచ్చును.

వీని గమనికకై మొదట ఆయా విభాగముల స్థూలరూప ప్రతిపాదనము ఇట్లుండును.

దేశ చతుష్టయ విభాగము: నట్టనడుమ మేరువు దీని సమీపమున ఇలావృతవర్షము (నేటి పామీరుముడి అను పీఠభూమి) దీనికి దక్షిణమున- 1. భారత వర్షము 2. కైలాస హిమవత్పర్వతములు 3. అలకనందానది (గంధమాదన మందు) 4. నందనవనము 5. మానస సరస్ 6. కచ్ఛప భగవానుడు 7. జంబూవృక్షము; పశ్చిమమున- 1. కేతుమాల వర్షము 2. ఋషభ పారియాత్ర పర్వతములు 3. స్వరక్షునదీ 4. వైభ్రాజవనము 5. శీతోద సరస్ - 6. వరాహ భగవానుడు 7. అశ్వత్థ వృక్షము; ఉత్తరమున-1. ఉత్తర కురువర్షము 2. శృంగవత్-జారుధి(దేవ)పర్వతములు 3. సోమానది 4. సావిత్రవనము 5. మహాభద్ర సరస్ 6. మత్స్య భగవానుడు 7. వటవృక్షము; తూర్పున- 1. భద్రాశ్వవర్షము 2. దేవ పర్వతము-3. సీతానది 4. చైత్రరథవనము 5. అరుణోద సరస్-6. హయగ్రీవ భగవానుడు 7. భద్రకదంబవృక్షము.

సప్త ద్వీపములు: 1. జంబూ 2. శాక 3. ప్లక్ష(గోమేదము అని మత్స్య పురాణమున) 4. శాల్మల 5. పుష్కర 6. కుశ 7. క్రౌంచ ద్వీపములు.

నవవర్షములు: భారత కింపురుష హరిలావృత రమ్యక హైరణ్యక కురు భద్రాశ్వ కేతుమాల వర్షములు. (వర్షము=స్థానము)

వీనిలో దేశ చతుష్టయ విభాగమున ఇలావృత భారత కేతుమాల కురు భద్రాశ్వ వర్షములు చేరియున్నవి.

భరతవర్షమందలి నవ భాగములు (ఖండములు) మత్స్య పురాణానుసారమున- 1. ఇంద్రద్వీపము 2. కశేరు ద్వీపము 3. తామ్రవర్ణ ద్వీపము 4. గభస్తిమాన్-5. నాగద్వీపము 6. సౌమ్యద్వీపము 7. గంధర్వ ద్వీపము 8. వారుణ ద్వీపము 9. భరతద్వీపము (ఖండము).

సప్తవర్షం ప్రవక్ష్యామి జమ్బూద్వీపం యథావిధమ్ । విస్తారం మణ్డలం యచ్చ యోజనైస్తన్నిబోధత. 7
యోజనానాం సహస్రాణి శతం ద్వీపస్య విస్తరమ్ । నానాజనపదాకీర్ణం పురైశ్చ వివిధైశ్శుభైః. 8
సిద్ధచారణసఙ్కీర్ణం పర్వతై రుపశోభితమ్ । సర్వధాతుపినద్ధైస్తై శ్శిలాజాల సముద్గతైః. 9
పర్వతప్రభవాభిశ్చ నదీభిస్తు సమన్తతః । ప్రాగాయతా మహాపార్శ్వాష్షడిమే వర్షపర్వతాః. 10
అవగాహ్యో హ్యుభయత స్సముద్రౌ పూర్వపశ్చిమౌ ।
హిమప్రాయశ్చ హిమవాన్ హేమకూటశ్చ హేమవాన్. 11
పర్వత స్సుముఖశ్చాపి నిషధః పర్వతో మహాన్ । చాతుర్వర్ణ స్స సౌవర్ణో మేరుశ్శుల్బమయ స్స్మృతః. 12
చతుర్వింశత్సహస్రాణి విస్తీర్ణ స్స చతుర్దిశమ్ । వృత్తాకృతిప్రమాణశ్చ చతురశ్రసమాహితః. 13
నానావర్ణ స్సమః పార్శ్వే ప్రజాపతి గుణాన్వితః । నాభిబన్ధనసమ్భూతో బ్రహ్మణోఽవ్యక్తజన్మనః. 14

పూర్వత శ్శ్వేతవర్ణ స్త్వ్యా ద్బ్రాహ్మణ స్తస్య తేన తత్ । పార్శ్వ ముత్తరత స్తస్య రక్త వర్ణం స్వభావతః.
తేనాస్య క్షత్త్రిభావస్తు మేరో ర్నానార్థకార ణాత్ । పీతశ్చ దక్షిణేనాసౌ తేన వైశ్యత్వ మిష్యతే. 16
భృంగపత్రనిభశ్చాపి పశ్చిమేన సమాచితః । తేనాస్య శూద్రభావః స్యా దితి వర్ణాః ప్రకీర్తితాః. 17
నీలశ్చ వైదూర్యమయ శ్శ్వేతః పీతో హిరణ్మయః । మయూరబర్హ వర్ణస్తు శాతకుమ్భమయ స్తథా.
ఏతే పర్వతరాజాన స్సిద్ధచారణసేవితాః. 18
తేషా మన్తేచ విష్కమ్భో నవసాహస్ర ఉచ్యతే । మధ్యే ఇళావృతం నామ మహామేరో స్సమన్తతః. 19
చతుర్వింశత్సహస్రాణి విస్తీర్ణం యోజ నై స్సమమ్ । మధ్యే తస్య మహామేరు ర్విధూమ ఇవ పావకః. 20
వేద్యర్ధం దక్షిణే మేరు రుత్తరార్ధ స్తథోత్తరే । వర్షాణి యాని సప్తాత్ర తేషాంవై సప్త పర్వతాః. 21

ఇలావృత భారత భద్రాశ్వ కేతుమాల కురు రమ్యక హిరణ్మయము లనెడి నవ వర్షములను జంబూ ద్వీపమును యథాస్థితముగ వివరింతును. ఈ ద్వీపముల-వర్షముల-మండలపు విస్తారమును యోజనముల లెక్కలో చెప్పెదను. జంబూ ద్వీప వైశాల్యము లక్ష(చదరపు)యోజనములు. ఇది అనేక జనపద(గ్రామ)ములతో వ్యాప్తము; అనేకులగు సిద్ధులు చారణులు దేవతలు ఇందు వ్యాపించియున్నారు. శిలా సమూహములందు మెరయుచు నుండెడి గైరిక (కొండలయందు ఏర్పడెడి) ధాతువులతో కప్పవడిన పర్వతము లనేకములును ఆ పర్వతములందు ప్రభవించిన నదులును దీనియందంతటను గలవు. మిగుల గొప్ప సమీప ప్రదేశములును ప్రక్క ప్రదేశములును కల ఆరు వర్ష పర్వతములు పూర్వ పశ్చిమ సముద్రములందు చొచ్చుకొని తూర్పు పడమరలుగా వ్యాపించియున్నవి. అవి 1. చాల భాగము మంచుతో కప్పబడియుండు హిమవంతము 2. బంగారుతో వ్యాప్తమగు హేమకూటము.3. చక్కని ముఖము కలిగినదియు గొప్పదియునగు నిషధ పర్వతము అనునవి మూడు. (ఇచట వర్ష పర్వతములు ఆరనిచెప్పియు మూడు మాత్రమే ఈయబడినవి. ఈ మూడును మూడు జతలను తెలుపును. వానిలో ఒక జత నీల నిషధములు; రెండవజత శ్వేత హేమకూటములు; మూడవజత హేమకూట హిమవంతములు. పైని చెప్పిన మూడును ఈ మూడు జతలలో ముఖ్యమైనవిగా నున్నవి. వర్ష పర్వతములు అనగా ఒక వర్షమును మరియొక వర్షమునుండి వేరుపరచు అవధులు.) దేశ (వర్ష) చతుష్టయ విభాగములో కేంద్ర స్థానీయమగు మేరు పర్వతము ఉల్బమయము (ఉపలమయము-ప్రచురముగా రాళ్ళు కలది. అనగా ఇది శిలా ప్రచురమగు ఉన్నత ప్రదేశమేకాని అన్ని పర్వతములవంటి రూపము కలది కాదని తెలియదగినది. సువర్ణమయమని ప్రసిద్ధమైనను అది చాతుర్వర్ణము (నాలుగు వర్ణములు కలది.) ఇదియుగాక పరమ పురుషుడు తన అనంతశక్తిచే అవ్యక్తతా వ్యక్తతా దశలనొందు క్రమములో అతని నుండి ప్రజాపతి హిరణ్యగర్భుడు జనించెను. ఆ జనించిన ప్రజాపతి నామక శిశువు నాభిస్థానమీ మేరువు. దానిపై ఆవరించిన మావి-ఉల్బవు-పొరవంటిది ఈపామీరు శిలామయ ప్రదేశము. ఇది ఇరువది నాలుగువేల చదరపు యోజనముల వైశాల్యము గలదై నాలుగు దిక్కులందును విస్తరిల్లినది. ఇది వృత్తాకృతియు చతురస్ర రూపమును కలది. ఎట్లన-తూర్పు-పడమర-భుజా రేఖా రూపమునను దక్షిణోత్తరములందు గుండ్రదనముతోను ఉన్నందున ఈ వృత్తాకృతిలోనే చతురస్రాకృతి ఏర్పడును. ఈ మహామేరువు తూర్పున శ్వేతవర్ణము దక్షిణమున పీత వర్ణము పడమర కృష్ణవర్ణము ఉత్తరమున రక్త వర్ణము కలిగి వరుసగా బ్రాహ్మణ వైశ్య శూద్ర క్షత్త్రియ వర్ణముల రూపమున పిరాట్పురుషుడుండుటను తెలుపుచున్నది. ఈ మహామేరు శిలామయ ప్రదేశమునకు (పామీరు పీఠభూమికి) ఆయా దిశలందు నీలవర్ణము-వైదూర్య రత్నకాంతి-శ్వేతవర్ణము-పీతవర్ణము-హిరణ్య వర్ణము-నెమలిపింఛెపుకాంతి-బంగారు కాంతి-కలిగిన ఏడు పర్వతములు వెలుగొందుచుండ వీని నడుమ ఈ మహామేరువు పొగలేక జ్వలించు అగ్నివలె ప్రకాశించుచుండును. ఈ ఏడు పర్వతములందును సిద్ధులును చారణులును సదా సంచరించుచుందురు. (అష్ట సిద్ధులు-మహామంత్ర సిద్ధులు పొందియును పొందుటకు ఆయా సాధనలు చేయుచును సాత్త్విక ప్రవృత్తితో సంచరించుచుండు దేవజాతివారు సిద్ధులు-తమ దివ్య శక్తులతో అంతరిక్ష ద్యులోక సంచారము చేయుచు విమానములు

లేకయు ఆయా లోకములందు సంచరించుచు వింతల చూచుచు ఆనందించుచు అవి మెచ్చుచు తిరుగు దేవతలు చారణులు) ఈ పర్వతములలో ఒకదానికిని మరియొక దానికిని నడుమగల అంతరములన్నియు కొలిచి కూడగా అగు అంతరముల మొత్తము తొమ్మిదివేల యోజనములు (ఇది వైశాల్యముకాదు.) ఈ నడుమ నున్న మహామేరువునకు చుట్టుప్రక్కల దీనినంటియున్న వర్షమునకు ఇలావృత వర్షమని వ్యవహారము. దీని వైశాల్యము ఇరువది నాలుగువేల చదరపు యోజనములు.

సృష్ట్యాదియందు భగవత్సంకల్పానుగుణముగా దేవతలు వితతమొనర్చిన ఆది యజ్ఞమునందు ఈ ప్రజాపతి నాభిస్థానము వేదియై ఆ వేదికకు నలుమూలలందున్న నాలుగు పర్వతములును విష్కంభములు-వేదికకు అవధిని తెలుపు గుంజలు-కాగా నడుమనున్న అగ్ని స్థానమీ మహామేరువని ఋషుల భావన. ఈ మహామేరువు (పామీరు శిలామయ ప్రదేశము) అను దేవయజ్ఞ వేదికలో దక్షిణార్ధము-ఉత్తరార్ధము అను రెండు అర్ధభాగములు ఉన్నవి. అని భావన.

ఇది భౌగోళిక సంగ్రహ ప్రతిపాదనము-ఇకమీదట సప్తద్వీప-నవవర్ష-నవఖండ-భావనలలో దీని వివరణము చూడనగును.

ద్వే ద్వే సహస్రే విస్తీర్ణా యోజనై ర్దక్షిణోత్తరమ్ । జమ్బూద్వీపస్య విస్తార స్తేషా మాయామ ఉచ్యతే.22
నీలశ్చ నిషధశ్చైవ తాభ్యాం హీనాశ్చ యే పరే । శ్వేతశ్చ హేమకూటశ్చ హిమవా ఇ్ఛృఙ్గవాంశ్చయః.23
జమ్బూద్వీపప్రమాణేన ఋషభః పరికీర్తితః । తస్మా ద్ద్వాదశభాగేన హేమకూటోఽపి హీయతే. 24
హిమః పశ్చిమభాగేన తస్మాదేవ ప్రహీయతే । అష్టాశీతిసహస్రాణి హేమకూటోమహాగిరిః. 25
అశీతి ర్హిమవాఞ్చైల ఆయతః పూర్వపశ్చిమే । ద్వీపస్య మణ్డలీభావా ద్ధ్రాసవృద్ధీ ప్రకీర్తితే. 26
వర్షాణాం పర్వతానాంచ యథాభేదం తథోత్తరమ్ । తేషాం మధ్యే జనపదా స్తాని వర్షాణి సప్తవై. 27
ప్రపాతవిషమై స్తైస్తు పర్వతై రావృతాని తు । సప్త తాని నదీ భేదై రగమ్యాని పరస్పరమ్. 28
వసన్తి తేషు సత్త్వాని భూతజాతాని సర్వతః ।

ఈ మహామేరువు ఒక గుర్తుగా చేసికొని చేయు ఈ భూగోళ సప్తవర్ష విభాగమునందు ఒక వర్షమును మరియొక వర్షమునుండి వేరుపరచు పర్వతములు వర్ష పర్వతములు. ప్రతి వర్షమునకును ఉత్తర దక్షిణములందు రెండేసి వర్ష పర్వతములు పొలిమేర గీతలై తూర్పు పడమరలుగా వ్యాపించిన ఈ పర్వతములలో ఒక్కొక్కదాని పొడవు ఇంచుమించుగ రెండేసి వేల యోజనములు.

## 1. జంబూద్వీప వర్ణనము.

ఇక జంబూద్వీప విస్తారమును దానియందలి ఆయా వర్షముల సీమా రేఖలను ఆయా వర్ష పర్వతముల పొడవును తత్సంబంధులగు అంశములను తెలిపెదను. వీనిలో నీల నిషధ పర్వతములు అను జత మొదటిది. మిగిలిన శ్వేత-హేమకూట-హిమవత్-శృంగవత్‌లను నాలుగును వీనికంటె తక్కువ పొడవు గలవి. ఏడవదగు ఋషభ పర్వతము పొడవు జంబూద్వీపపు వైశాల్యమెన్ని యోజనములో అన్నియే యోజనములు. హేమకూటపు పొడవు దానిలో పంద్రెండవ వంతు తక్కువ; హిమాలయపు పశ్చిమ భాగమున (పర్వతము లేక లోయగా ఏర్పడియున్న నేటి ఖైబరు బోలన్ కనుమల భాగమువంటివి) ఈ పంద్రెండవ వంతులో పంద్రెండవ వంతు తగ్గియున్నది. హేమకూట మహాగిరి పొడవు ఎనుబది ఎనిమిదివేల యోజనములు; హిమవంతము ఎనుబదివేల యోజనముల పొడవున తూర్పు పడమరలుగ ఉన్నది. ఈ జంబూద్వీపపు మండలీభావము (గుండ్రని రూపము)ను బట్టి ఈ అవధి పర్వతముల పొడవులో ఎక్కువ

తక్కువలు కనబడుచున్నవి. (అనగా దీనినిబట్టి పీసి పొడవును కొలుచు పద్ధతిని ఎరుగవలెను.) ఈ రెండేసి వర్ష-అవధి-పర్వతముల నడుమ ఎన్నియో జనపదములు గలవు. (జనపదములు-గ్రామములును-మహా గ్రామములును) వాని సముదాయములే వర్షములు. అవి మొత్తము ఏడు. (మరి రెండు ముందు చెప్పబడును.) ప్రపాతముల (నిట్టనిలువుగానున్న ఉన్నత శిలామయ ప్రదేశముల) తోను అంతకుమించిన పల్లములతోను నిండిన అనేక పర్వతములు ఈ వర్షములందును వానియందలి జనపదములందును ఆవరించియున్నవి. ఈ పర్వతముల మూలమునను అనేక నదుల మూలమునను ఇవి పరస్పరము-ఒక దానినుండి మరియొక దానికి-పోవుటకు వీలు కాకున్నవి. వానియందంతటను ఎన్నియో ప్రాణులును మూర్తములును అమూర్తములును అగు పదార్థములును వ్యాపించియున్నవి.

తేషు హైమవతం వర్షం భారతం నామ విశ్రుతమ్ । 29
హేమకూటం పరం తస్మా న్నామ్నా కింపురుషం స్మృతమ్। హేమకూటాచ్చ నిషధం హరివర్షం తదుచ్యతే.
హరివర్షా త్పరం చాపి మేరోస్తు తదిలావృతమ్ । ఇలావృతా త్పరం నీలం రమ్యకం నామ విశ్రుతమ్. 31
రమ్యకా దపరం శ్వేతం విశ్రుతం త ద్ధిరణ్యకమ్ । హిరణ్యకా త్పరం వర్షం శృఙ్గవన్తం కురు స్మృతమ్.

వానిలో మొదటిదగు భారతవర్షమునకు హైమవత వర్షమని పర్వతమును బట్టియు పేరు. ఇద్దే దాని కావల నున్న హేమకూట పర్వతము అవధిగాగల వర్షము కింపురుష వర్షము. దాని కావల నున్న నిషధ పర్వతము అవధిగా నున్నది హరివర్షము. దాని కావల మేరువు నాశ్రయించియున్నది ఇలావృతవర్షము. దీని కావల నీలపర్వతము అవధిగా గలది రమ్యకవర్షము. దానికి అవల శ్వేతపర్వతము అవధిగా గలది హిరణ్యక వర్షము. దాని కావల శృంగవత్ పర్వతము అవధిగా గలది ఉత్తర కురువర్షము. (ఇవి తమకు అవధిగా గల ఆయా పర్వతములను బట్టి నిషధవర్షము నీల వర్షము ఈ మొదలగు పేరులతో కూడ వ్యవహరింపబడవచ్చును.)

తథా న్వం స్వేతి విజ్ఞేయే ద్వే వర్షే దక్షిణోత్తరే । దీర్ఘాణి తస్య చత్వారి మధ్యమం తదిళావృతమ్. 33
పూర్వతో నిషధస్యేదం వేద్యర్ధం దక్షిణం స్మృతమ్ ।
వరం చేలావృతం పశ్చా ద్వేద్యరంతు తదుత్తరమ్. 34
ఉదగాయతో మహాశ్శైలో మాల్యవాన్నామ పర్వతః । ద్వాత్రింశతా సహస్రేణ ప్రతీచ్యాం స మహాగిరిః.
మాల్యవాన్వై సహస్రైక ఆనీలనిషధావధి । ద్వాత్రింశత్యేవమప్యుక్తః పూర్వతో గన్ధమాదనః. 36
విపులశ్చ సుపార్శ్వశ్చ సర్వరత్నవిభూషితా । పరిమణ్డలతో మధ్యే మేరుః కనకపర్వతః. 37
చాతుర్వర్ణ స్స సౌవర్ణ శ్చతురశ్రసమన్వితః । నానావర్ణః సమ స్తేషు పూర్వాన్తే శ్వేత ఉచ్యతే. 38
పీతంతు దక్షిణేపశ్చాత్ భృంగపత్రాభయా పరమ్ । తస్య చోత్తరతో రక్త శ్చతుర్ వర్ణసమన్వితః. 39
భూమే ర్మధ్యస్థితో మేరు శ్చతురాశీతి రుచ్ఛ్రితః । యోజనానాంసహస్రాణి సౌవర్ణో రత్నసానుమాన్. 40
తద్వచ్చ షోడశాధస్తా దష్టావింశతి రుచ్ఛ్రితః । విస్తరా త్రిగుణశ్చాస్య పరిణాహ స్సమన్తతః. 41
సపర్వతో మహాదివ్యో దివ్యౌషధిసమన్వితః । భువనై రావృత స్సర్వై ర్జాతరూపపరిష్కృతైః. 42
తత్ర దేవగణా స్సర్వే గన్ధర్వాసురరాక్షసాః । శైలరాజే ప్రమోదన్తే సర్వతో ఽప్సరసస్తథా. 43
స తు మేరుః పరివృతో భువనై ర్భూతభావనైః ।

మేరువర్ణనము: మహామేరువునకు చుట్టును ఇలావృతవర్షము కలదు. ఇది ఉత్త రేలావృతవర్షము దక్షిణేలావృతవర్షము అని రెండుగా ఉన్నది. మేరువునకు దక్షిణమున నిషధ పర్వతము-ఉత్తరమున నీలపర్వతము-ఈ రెండును తూర్పున గంధ మాదనము పడమర మాల్యవంతము అను రెండు పర్వతములును ఉత్తర దక్షిణములుగా వ్యాపించి దక్షిణమున నిషధమును

మ పు 50)

ఉత్తరమున నీలమును తాకుచున్నవి. కాని నిషధ-నీల పర్వతములు రెండును మహా మేరువునకు నడుమ భాగమునకు సరి సాటిగా నున్న భాగములో నిషధము మరికొంత దక్షిణమునకును నీలము మరికొంత ఉత్తరమునకును వంపు తిరిగి ధనురాకారముగ ఉన్నవి. ఇట్లున్న ఈ నీల గంధమాదన నిషధ మాల్యవత్పర్వతముల నడుమ ఇలావృతవర్షము ఉన్నది. ఈ నడుమ భాగము కొంత యజ్ఞవేదికయందలి దక్షిణోత్తరార్ధభాగములుగాను దీనియందే జనావాసభాగము ఉత్తర దక్షిణెలావృత భాగములుగాను ఉన్నది. ఈ చెప్పిన విధమున ఈ ఇలావృతవర్షపు (వేదిరూప ప్రదేశమందలి) రూపము తూర్పు పడమరలందు ఋజు రేఖారూపముగాను ఉత్తర దక్షిణములందు (వృత్తఖండపు) వక్ర రేఖారూపమునను ఉన్నది. ఈ మాల్యవద్గంధమాదన పర్వతములు రెండును ఒక్కొక్కటి ముప్పదిరెండు వేల యోజనముల పొడవు కలిగి ఉన్నవి. ఈ నాలుగు అవధుల నడుమగా మహా మేరువునకు చుట్టును కొంత కొంతమేర వ్యాపించి సర్వరత్న విభూషితములగు విపుల సుపార్శ్వము లనెడు రెండు పర్వతములు ఉన్నవి. ఈ రెంటి నడుమను పైని తెలిపిన నీల మాల్యవత్ నిషధ గంధ మాదనములకు నడుమను ఉన్న మేరువు కనక పర్వతము అను ప్రసిద్ధితో ప్రకాశించుచున్నది. ఇది నాలుగు అస్రములందును (అస్రము=కోణము-అంచు) నాలుగు వర్ణములు కలిగి ఉన్నది. ఎట్లన-తూర్పున తెలుపు-దక్షిణమున పీతము-పశ్చిమమున నలుపు ఉత్తరమున ఎరుపునై యున్నది. ఇట్లాయావరిమండల పర్వతాంశముల కాంతులను బట్టి దూరమునుండి చూచువారికి బంగారు కొండగాను రత్నమయ శాఖా పర్వతములతో కూడి రత్నమయముగాను నై కనక పర్వతము రత్న సానువు (రత్నమయములగు సానువులు-నెత్తములు కలది) అని కీర్తింపబడుచు భూమికి నడుమ నున్న ఈ మేరువు (పామీరు శిలామయతలము) ఎనుబది వేల యోజనముల ఎత్తు కలిగియున్నది. దీనికి గల పాతు(భూమిలోనికి గల లోతు నలువది నాలుగు యోజనములు. వెడల్పునకు *మూడింతలు దీని చుట్టు కొలత. ఇట్టి ఈ మేరు పర్వతము చాల గొప్పది; దివ్యమయినది; (మన కీనాడు కానరాకున్నను విశ్వసించదగిన అతీంద్రియ విశిష్టత కలది; దివ్యౌషధులు కలది; (తన కాంతుల వ్యాప్తిచే బంగారుతో అలంకరించబడినవియో అనునట్లు తోచెడి సర్వ భువనములును దీనిచుట్టు నున్నవి. ఈశైలరాజమునందేఅంతటను గంధర్వాపరస్సోఽసురరాక్షసులును అప్సరోగణాదికముతోనర్వదేవగణములును ఆనందించుచు విహరించుచుందురు. ఇట్టి మేరువు సర్వ భూతముల సృష్టి స్థితులకు హేతువులగు భువనములతో చుట్టబడి యున్నది.

యస్యేమే చతురో దేశా నానాపార్శ్వేషు సంస్థితాః. 44
భద్రాశ్వో భారతశ్చైవ కేతుమాలశ్చ పశ్చిమే । ఉత్తరాశ్చైవ కురవః కృతపుణ్యప్రతిశ్రయాః. 45
విష్కమ్భపర్వతా స్తద్వన్మన్దరో గన్ధమాదనః । విపులశ్చ సుపార్శ్వశ్చ సర్వరత్నవిభూషితాః. 46
అరుణో మానసంచైవ సితోదం భద్రసంజ్ఞితమ్ । తేషాం చోపరి చత్వారి సరాంసిచ వనానిచ. 47
తథా భద్రకదమ్బస్తు మన్దరే గన్ధమానవే । జమ్బ్వాప్లక్షౌ తథాఽశ్వత్థో విపులేవా వటః పరమ్. 48

---

* ఇక్కడ చెప్పిన కొలతలు అన్నియు ఈనాడు మనకు తెలిసిన కొలతలతో పోల్చినచో అభూతకల్పనలుగా తోచును. కాని మన ప్రాచీనుల అతీంద్రియ విజ్ఞానమును బట్టి వాని కొలత లేమైయుండునో జాగ్రత్తతో యోజించవలయును. వ్యక్తి తానొకచో నిలిచి నడుమ నున్న అవరోధ పదార్థము మీదుగా ఒక కోణములో ఊర్ధ్వ దిశగా చూచినపుడు ఈ అవరోధము తన కావల నున్న అంతరిక్షములో ఎంత ఎత్తును చూడ నిచ్చుచున్నదో అది ఇచ్చట ఎనుబది నాలుగు వేల యోజనములు కావచ్చును. పామీరుముడియే ప్రపంచమునందలి నర్వ ప్రధానాప్రధాన పర్వత శాఖలకును కేంద్ర స్థానీయ మని నేటి భూతత్త్వవేత్తలు (Geologists) చెప్పు విషయమును గమనించి ఈ విషయముల నాలోచించిచో ఈ కొలతల యాథార్థ్యము మరికొంత తెలియగలదు. ఏమైనను మన పూర్వులు యావద్భూమండల స్వరూపమును సూక్ష్మాతి సూక్ష్మము పవిత్ర భావనాపూర్ణము భావుకతాయుతమునగు దృష్టితో చూచి మనకు అందించిన తీరు ప్రశంసనీయము గదా!

తత్ర తే శుభకర్మాణః కేతుమాలా ఇతి శ్రుతాః । తత్రా ాలా నరాః స్సర్వే మహాసత్త్వా మహాబలాః. 49
గన్ధమాదనపార్శ్వేతు పశ్చిమే వరమణ్డపః ।
ద్వావింశత్తు సహస్రాణి యోజనై స్సర్వతః సమః. 50
స్త్రియ శ్చోత్పలవర్ణాభా స్సర్వాస్తాః ప్రియదర్శనాః । తత్ర దివ్యో మహావృక్షః పనసః పత్రభాసురః. 51
తస్య పీత్వా ఫలరసం జీవన్తిహి సమాఽయుతమ్ । మాల్యవతశ్చ పార్శ్వేతు పూర్వే పౌర్వాపరాన్తికాః. 52
ద్వాత్రింశత్త్రిసహస్రాణి యోజనానాం తదుచ్యతే । భద్రాశ్వ స్తత్ర విజ్ఞేయో నిత్యం ముదితమానసః. 53
భద్రసాలవనం తత్ర కాలామ్రశ్చ మహాద్రుమః । తత్ర తే పురుషా శ్శ్వేతా మహోత్సాహా మహాబల ..
స్త్రియః కుముదవర్ణాభా స్సున్దర్యః ప్రియదర్శనాః । చన్ద్రప్రభా శ్చన్ద్రవర్ణాః పూర్ణచన్ద్రనిభాననాః. 55
చన్ద్రశీతలగాత్రాశ్చ స్త్రియ శ్చోత్పలగన్ధికాః । దశవర్షసహస్రాణి తేషామాయు రనామయమ్. 56
కాలామ్రరసపానాత్తు సర్వేచ స్థిరజీవనాః । సూతః : ఇత్యుక్త్వా స్సృష్టి స్సృష్టాహ్మ వర్షాణితు నిసర్గతః. 57
సర్వం మయానుగ్రహకం భూయః కిం వర్ణయామి వః ।
ఏత చ్ఛ్రుత్వా వచ స్తైరు ఋషయ స్సంశితవ్రతాః. 58
జాతకౌతూహలా స్సర్వే ప్రత్యూచు స్తం ముదాన్వితాః ।
ఋషయః : పూర్వాపరౌ సమాఖ్యాతౌ ద్వౌ తు దేశౌ మహామతే. 59
ఉత్తరాణాంచ వర్షాణాం పర్వతానాంచ సంస్థితిమ్ । ఆఖ్యాహి నో యథాతత్త్వం యేచ పర్వతవాసినః. 60
ఏవముక్తస్తు ఋషిభి స్తేభ్య స్త్వాఖ్యాతవా న్మునిః ।

నాలుగు వర్షములు: దీని నానా పార్శ్వములయందు (తూర్పున) భద్రాశ్వ వర్ష(మహాదేశ)ము (దక్షిణమున) భారతవర్ష(మహాదేశ)ము (పడమట) కేతుమాల వర్ష(మహాదేశ)ము (ఉత్తరమున) ఉత్తర కురువర్ష(మహాదేశ)ము ఉన్నవి. ఈ ఉత్తర కురువులు పుణ్యము చేసికొన్న వారికి నివాసభూములు. ఈ మేరువునకు నలుమూలల ఈ వర్షములందు విష్కంభ (అవష్టంభ) పర్వతములు సర్వ రత్న విభూషితములు మందర గంధమాదన విపుల సుపార్శ్వములను నవి కలవు. అరుణోదము మానసము సితోదము భద్రము అను సరస్సులు ఈ వర్షములందు(ఈ పర్వతములపై)వరుసగా గలవు. ఇట్లే వరుసగ భద్రకదంబవృక్షము జంబూ ప్లక్ష(జువ్వి)వృక్షములు-అశ్వత్థ వృక్షము-వటవృక్షము కలవు.

కేతుమాల వర్షము: గంధమాదన పర్వత పార్శ్వమున పశ్చిమదిశగా మేలగు మండపము (పందిరి క్రిందవలె చల్లనిదై జనావాసయోగ్య ప్రదేశము) కలదు. శుభకర్మకారులగు కేతుమాలులు అను జను లచట ఉందురు. వారు నల్లని దేహచ్ఛాయయు మహాసత్త్వమును మహాబలమును గలవారు. స్త్రీ లచట నల్లకలువవంటి దేహచ్ఛాయ కలిగిన ప్రియదర్శనలు (వారిని దర్శించుట కన్నులకు ప్రీతి కలిగించును.) అచట చక్కని ఆకులతో ప్రకాశించు దివ్య పనసవృక్షము గలదు. అచటివా రా వృక్షపు పండ్లరసమును త్రావుచు పదివేల ఏండ్లు జీవింతురు. (దీని సంకేతితార్థము ఏమయినను ఇది నేటి ఆసియా పశ్చిమభాగము); ఇక భద్రాశ్వవర్షము: మాల్యవత్ పర్వత పార్శ్వమున పౌర్వాపరాంతికులు (తూర్పు కడపటి మేరయందలి జనులు) నివసింతురు. ఇచట సదా ముదిత మానసముకల భద్రాశ్వము (మేలుజాతి గుర్రము) కలదు. ఈ చోటి వైశాల్యము ముప్పదిరెండు చదరపు యోజనములు; ఈ భద్రాశ్వ వర్షమున భద్రసాలమను వనము కలదు; కాలామ్ర (నల్లని మామిడి) మహావృక్షము గలదు. అచటి జనులు తెల్లనివారు- మహోత్సాహ మహాబలములు గలవారు; అచటి స్త్రీలు తెల్ల కలువలకాంతివంటి-చంద్రునికాంతి వంటి - దేహకాంతి చంద్రుని ప్రకాశమువంటి లావణ్యము పూర్ణచంద్రునివంటి మొగము కలిగిన ప్రియదర్శనలగు సుందరులు; ఆ స్త్రీల శరీరములు చంద్రునివలె చల్లనివి; కలువపూలవలె కమ్మని సువాసనలు కలవి; అచట జనులు ఏ వ్యాధులును లేక పదివేల సంవత్సరములు జీవింతురు. ఈ కాలామ్రరసపానముచే వారందరును స్థిరజీవనులై యుందురు. (ఈ భద్రాశ్వవర్షము నేటి చీనాదిదేశములు); అని ఇట్లు స్వయంభూ బ్రహ్మ ఈ

వర్షముల స్వాభావికస్థితిని ఋషులతో చెప్పెను. ఇది వారి అనుగ్రహమున నాకు తెలిసినందున నాచే తెలుపబడినది; మరి ఇంకేమి వినగోరెదరు; ఏమి చెప్పమందురు? అని సూతు డనగా విని సంశితవ్రతులు (పవిత్ర కర్మానుష్ఠానము కలవారు) అగు ఆ నైమిశారణ్య ఋషులు ముదన్వితులును కుతూహలులునై జిజ్ఞాసతో ఇట్లు పలికిరి: మహామేరువునకు తూర్పు పడమరలందుగల రెండు మహాదేశముల విషయము మాకు తెలిపితిరి; మహామతీ! ఉత్తర దిశయందలి వర్షములను అచటి పర్వతముల ఉనికియు ఆ పర్వతములందు వసించు జనులును ఏవి-ఎట్టివి-ఎవరు-ఎట్టివారు-అను విషయముయథాతత్త్వముగా మాకు దెలుప వేడుచున్నాము. అని ఋషు లడుగ సూతు డిట్లు చెప్ప నారంభించెను:

సూతః : శృణుధ్వం *మునయ స్సర్వే పూర్వం నోక్తాని వై మయా. 61
దక్షిణేనతు నీలస్య నిషధస్యోత్తరేణతు । వర్షంచ రమ్యకం నామ యత్ర జీవన్తివై ప్రజాః. 62
జాతిప్రధానా విమలా జాయన్తే తత్ర మానవాః । శుక్లాభిజనసమ్పన్నా స్సర్వే తే ప్రియదర్శనాః. 63
తత్రాపిచ మహాన్వృక్షో న్యగ్రోధో రాజతే మహాన్ । తస్య పీత్వా ఫలరసం పిబన్తో వర్తయన్తివై. 64
దశవర్షసహస్రాణి దశవర్షతానిచ । జీవన్తి తే మహాభాగాః సదా హృష్టా నరోత్తమాః. 65
ఉత్తరేణతు శ్వేతస్య శృఙ్గపార్శ్వస్య దక్షిణే । వర్షం హిరణ్యకం నామ తత్ర హైరణ్యకా నదీ. 66
మహాబలా మహాసత్త్వా నిత్యం ముదితమానసాః । శుక్లాభిజనసమ్పన్నా స్సర్వే తే ప్రియదర్శనాః. 67
ఏకాదశసహస్రాణి వర్షాణాంచ నరోత్తమాః । ఆయుఃప్రమాణం జీవన్తి శతాని దశ పఞ్చతు. 68
తస్మిన్వర్షే మహావృక్షో †హ్యశ్వత్థః పత్రశాఖవాన్ । తస్య పీత్వా ఫలరసం జీవన్తే తత్ర మానవాః. 69
శృఙ్గసాహ్వస్య శృఙ్గాణి రమ్యాణిచ మహాన్తి వై । ఏకం మణిమయం తత్ర ద్వితీయం తత్ర కాఞ్చనమ్.
సర్వరత్నమయం త్వేకం భవనై రుపశోభితమ్ ।

మునులారా! మీరందరును వినుడు; నే నిదివరకు చెప్పనివాని నిపుడు తెలిపెదను. రమ్యకవర్షము: నీల పర్వతమునకు దక్షిణమున నిషధపర్వతమునకు ఉత్తరమున 'రమ్యకము' అను వర్షము కలదు. అదియు ఉత్తమ ప్రజావానము; అచటి జనులందరు జాతి ప్రధానులు (జన్మసిద్ధముగా శ్రేష్ఠతాలక్షణములు కలవారు.) నిర్మలులు; పాపరహితమగు వంశమున పుట్టినవారు-తెల్లని అనువంశికమగు దేహచ్ఛాయ కలవారు; ప్రియదర్శనులు (చూడముచ్చటగొలుపువారు); అచట గొప్పదియు పూజ్యమును నగు మఱ్ఱిచెట్టు కలదు; అచటి మహాభాగులు అగు నరోత్తములు ఆ పండ్లరసమును త్రావుచు హృష్టు(సంతోషయుక్తు)లై పదునొకండు వేల సంవత్సరములు జీవింతురు.

హిరణ్మక వర్షము: శ్వేత పర్వతమునకు ఉత్తరమున శృంగవత్పర్వతమునకు దక్షిణమున హిరణ్మక వర్షము కలదు. అచట హైరణ్మక నది కలదు. అచటి మానవులందరును మహాబలులు మహాసత్త్వులు (సత్త్వము అనగా నిబ్బరము-శ్రమను ఓర్చెడి యోగ్యత) సదా సంతుష్టమానసులు; తెల్లని దేహచ్ఛాయ కలవారు; ప్రియదర్శనులు; పదునొకండువేల ఐదువందల ఏండ్లు జీవింతురు. అచట మనోహరములగు ఆకులు కొమ్మలు రెమ్మలు గల మహాశ్వత్థ వృక్షము కలదు. అచటివారు దాని పండ్లరసము త్రావి జీవింతురు. అచటి శృంగవత్పర్వతపు రమ్య మహా శిఖరములనేకములలో ఒకటి మణిమయమును మరియొకటి స్వర్ణమయమును మూడవది సర్వరత్నమయమును భవనోపశోభితమును.

ఉత్తరే చాస్య శృఙ్గస్య సముద్రం తస్య దక్షిణే. 71
కురవ స్తత్ర తద్వర్షం పుణ్యం సిద్ధనిషేవితమ్ । తత్ర వృక్షా మధురసా దివ్యామృతజలావగాః. 72
వృక్షాశ్చతే ప్రసూయ_ ఫలాన్యాభరణానిచ । సర్వకామప్రదాతారః కేచిద్వృక్షా మనోరమాః. 73
వస్త్రాణిచ ప్రసూయన్తే సర్వభక్ష్యాంశ్చ షడ్రసాన్ । అపరే క్షీరిణో నామ వృక్షా స్తత్ర మనోరమాః. 74

* యాని వర్షాణి పూర్వోక్తాని చవై మయా. † లకుచః.

భోజనం తే వర్షియచ్ఛన్తి షడ్రసం చామృతోపమమ్। సర్వా మణిమయా భూమి స్సూక్ష్మకాఞ్చనవాలుకా.75
సర్వత్ర శుభసంస్పర్శా నిష్పఙ్కా నీరుజా శుభా । దేవలోకా చ్చ్యుతా స్తత్ర శుభా జాయన్తి మానవాః.76
శుక్లాభిజనసమ్పన్నా స్సర్వేచ స్థిరయౌవనాః । మిథునాని ప్రసూయన్తే స్త్రియశ్చాప్సరసోపమాః. 77
తేషాం తే క్షీరిణాం క్షీరం పిబన్తి హ్యమృతోపమమ్ । సమంచ జాయతే యుగ్మం సమం చైవాభివర్ధతే.78
సమేవై శీలరూపేచ సమంచైవ మ్రియన్తితే । ఏకైక మనురక్తాశ్చ చక్రవాకాఇవ ద్విపమ్. 79
అనామయా విశోకాశ్చ నిత్యం ముదితమానసాః । దశవర్షసహస్రాణి శతాని దశవష్చాచ. 80
జీవన్తి తే మహాసత్త్వా నచాన్యా స్త్రీ ప్రవర్తతే । సూతః : ఏవమేవ నిసర్గోవై వర్షాణాం భారతాదినామ్. 81
దృష్టః పరమతత్త్వజ్ఞై ర్భూయః కిం కథయామి వః । వ్యాకృతే త్వేవమృషయ స్సూతపుత్త్రేణ ధీమతా.82
ఉత్తరశ్రవణే భూయః పప్రచ్ఛు స్సూతనన్దనమ్. 82u

ఇతి శ్రీమత్స్యమహాపురాణే భూగోళే ద్వీపాది వర్ణనం నామ
ద్వాదశోత్తర శతతమోఽధ్యాయః.

ఉత్తరకురు వర్షము: శృంగవత్పర్వతపు మూడు శిఖరములలో కడపటిదగు సర్వరత్నమయ శిఖరమునకు ఉత్తరపు అంచును తాకుచు (క్షారజల) సముద్రమును దక్షిణపు అంచును తాకుచు ఉత్తర కురు వర్షమును ఉన్నవి. ఈ వర్షము సిద్ధ జనులకు ఆశ్రయము. అచటి వృక్షములు మధు (తేనెయే-లేదా తేనెవంటి) రసములు కలవి. దివ్యమగు అమృత తుల్యమగు జలములు కల నదులచట కలవు. అచటి వృక్షములు పండ్లతోపాటు ఆభరణములను కూడ ఫలించును. అచటి కొన్ని వృక్షములు మనోరమములును సర్వకామ ప్రదములునయి వస్త్రములను షడ్రసోపేత భక్ష్యము లను ఫలించును. క్షీరి వృక్షములు (పాలుగల చెట్లు) అను అచటి కొన్నిచెట్లు అమృత తుల్యమగు షడ్రస భోజనము నిచ్చును. అచటి భూమియంతయు మణిమయమును సన్నని బంగారు ఇసుక కలదియు అంతటను సుఖకరమగు స్పర్శము కలదియు బురద లేనిదియు శుభకరమును బాధ కలిగించనిదియునై యుండును. తమ పుణ్యానుభవానంతరము దేవలోకమునుండి భువికి జారిపడిన శుభ మానవులు అచట జన్మింతురు. వారందరును తెల్లని అను వంశికమగు దేహచ్ఛాయయు స్థిర యౌవనమును కలవారు. అప్సరసల వంటి అచ్చటి స్త్రీలకు కవల పిల్లలు (దంపతులే) పుట్టుదురు. ఆ కవ శిశువులు అమృతోపమమగు అచటి క్షీరి వృక్షముల క్షీరమును త్రాగుదురు. కవలు సమముగా (సమరూప గుణ లక్షణములతో) పుట్టుదురు-పెరుగుదురు-సమశీల రూపములు కలిగి జీవించి సమముగా సమకాలమున మరణింతురు. వారు పరస్పరము అనురక్తులై చక్రవాకములవలె జీవింతురు. వారు రోగరహితులు-శోకరహితులు-నిత్యము ముదిత మానసులు-మహాసత్త్వులు; వారును పదునొకండువేల ఏండ్లు జీవింతురు; ఏ స్త్రీయు ఆ దంపతుల జీవితముల నడుమ ప్రవర్తించదు.

భారత వర్షము మొదలగు వర్షముల స్వభావము ఇట్టిదియేయని పరమ తత్త్వజ్ఞులు దర్శించి తెలిపిరి. మీకు మరి ఇంకేమి చెప్పవలయును. అని సూతుడు ఋషులతో పలికెను.

బుద్ధిశాలియగు సూతపుత్త్రుడు ఇట్లు వ్యాకరించి (విడుమరచి) చెప్పగా మరియు తరువాతి విషయము విను కుతూహలముతో ఋషులు అతని నింకను ప్రశ్నించిరి.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున భూగోళవర్ణనమున ద్వీపాది వర్ణనమను
నూట పండ్రెండవ అధ్యాయము.

## త్రయోదశోత్తర శతతమోఽధ్యాయః.

## భారతవర్షవర్ణనమ్.

ఋషయః : యదిదం భారతం వర్షం యస్మి న్స్వాయమ్భువాదయః ।
చతుర్దశైతే మనవః ప్రజా స్సత్ర సన్సృజిరే. 1

ఏత ద్వేదితు మిచ్ఛామ స్త్వత్తో నిగదసత్తమ । ఏతచ్ఛ్రుత్వా ఋషీణాంతు ప్రాబ్రవీద్రోమహర్షణః. 2
పౌరాణిక స్తథా సూతో ఋషీణాం భావితాత్మనామ్ । బుద్ధ్యా విచార్య బహుధా విమృశ్యచ పునః పునః. 3
తద్వ్యాహృతేతు సమ్యాగ్యు స్స ఉవాచ ముదాన్వితః । అథ వః కథయిష్యామి వర్షేఽస్మిన్భారతే ప్రజాః.4
ఇదంతు మధ్యమం వర్షం శుభాశుభఫలోదయమ్ ।
దక్షిణంతు హిమాహ్వాస్య సముద్రస్యాపిచోత్తరమ్. 5
వర్షం తద్భారతం నామ యత్రేమా భారతాః ప్రజాః । భరణాత్తు ప్రజానాం వై నసు భారత ముచ్యతే. 6
నిరుక్తవచనాచ్చైవ వర్షం తద్భారతం స్మృతం । తత్రస్వర్గశ్చమోక్షశ్చ మధ్యమశ్చ ఇతి స్మృతః. 7
నఖల్వన్యత్ర మర్త్యానాం భూమిః కర్మవిధౌ స్మృతా । భారతస్యాస్య వర్షస్య నవ భేదాన్నిబోధత. 8
ఇన్ద్రద్వీపః కశేరుశ్చ తామ్రపర్ణో గభస్తిమాన్ । నాగద్వీప స్తథా సౌమ్యో గన్ధర్వ స్త్వథ వారణః. 9

## నూట పదుమూడవ అధ్యాయము.

## భారత వర్షవర్ణనము.

ఋషులు సూతునిట్లడిగిరి: పరమాత్మనుండి జనించిన స్వాయంభువాది చతుర్దశ మనువులును ప్రజలను సృజించుటకు ఆశ్రయమగు భారతవర్ష స్వరూపము తాము ప్రతిపాదించగా వినవలెనని మాకు కుతూహలమున్నది. అన రౌమ హర్షణుడగు సూత పౌరాణికుడు భావితాత్ములగు ఋషుల వచనము విని తన బుద్ధితో బహు విధముల విచారణము చేసి మరల మరల విమర్శము చేసికొని వారందరును కూడి అడిగిన విషయమునందు సంతోషము కలిగి ఇట్లు పలికెను: మీకు ఇకమీదట భారత వర్షమునందలి ప్రజల విషయమును తెలిపెదను; స్వర్గ పాతాళములకు నడుమ నుండుటచే మధ్యమ మనబడుచున్న ఈ భూలోకమందును ఈ భారత వర్షము మానవులు చేసిన కర్మలననుసరించి శుభాశుభ ఫలోదయమునకు హేతువయినది. దక్షిణ మహా సముద్రమునకు ఉత్తరమునను హిమాలయమునకు దక్షిణమునను కల ఈ దేశమే భారత వర్షమునది. దీనియందలి ప్రజలకు భారతులని వ్యవహారము. ప్రజలను భరించు-పోషించు-నది కావుననే దీనికి భారతము అని పేరు. ఈ దేశమునందలివారికి మాత్రమే తాము చేసిన కర్మల ఫలానుసారము స్వర్గము కలుగును. సాధనానుసారము మోక్షము కలుగును. దీనికే మధ్యమ (లోక) మను వ్యవహారము సార్థకము. ఈ భూమియందు కాక మరి ఎచ్చటివారికిని (వైదిక స్మార్త పౌరాణిక) కర్మ విధులు ఇచట వలె విధింపబడియుండలేదు. ఈ భారత వర్షము మరల నవద్వీప (ఖండ)ములుగా విభక్తమయి ఉన్నది. అవి తెలిపెదను వినుడు. 1. ఇంద్రద్వీపము- 2. కశేరు ద్వీపము-3. తామ్రవర్ణ ద్వీపము 4. గభస్తి (మాన్) మత్ ద్వీపము 5. నాగద్వీపము 6. సౌమ్యద్వీపము 7. గంధర్వ ద్వీపము 8. వారుణ ద్వీపము 9. భారత ద్వీపము (వీనినే ఆయా ఖండములనియు ననవచ్చును. దీనిలో భరత ఖండము సమగ్ర భారతదేశమనియు మిగిలిన ఎనిమిదియు సింహళము బర్మా తూర్పు ఇండియా దీవులు మలయా అనియు గ్రహింపవలయును.)

*అయంతు నవమ స్తేషాం ద్వీప స్సాగరసంవృతః । యోజనానాం సహస్రంతు ద్వీపోఽయం దక్షిణోత్తరః.
ఆయత స్త్వాకుమారీభ్యో గఙ్గాయాః ప్రభవోఽవధిః । తిర్యగూర్ధ్వంతు విస్తీర్ణో సహస్రాణి నవైవతు. 11
ద్వీపో హ్యుపనివిష్టోఽయం మ్లేచ్ఛై రన్తేషు సర్వశః । యవనాశ్చ కిరాతాశ్చ తథాన్తే పూర్వపశ్చిమే. 12
బ్రాహ్మణాః క్షత్త్రియా వైశ్యా మధ్యే శూద్రాశ్చ భాగశః । ఇజ్యాయుధవణిజ్యాభి ర్వర్తయన్తో వ్యవస్థితాః.
తేషాం సంవ్యవహారోఽయం వర్తతేచ పరస్పరమ్ । ధర్మార్థకామసంయుక్తో వర్ణానాంచ స్వకర్మసు. 14
సఙ్కల్పపచ్యమానాత్తు ఆశ్రమాణాం యథావిధి । ఇహస్వర్గాపవర్గార్థం ప్రవృత్తిరితి మానుషీ. 15

* భారతో

యస్త్వయం నవమోద్వీప స్తిర్యగ్గ్రామః ప్రకీర్తితః । యఏనం జనయేత్కృత్స్నం ససమ్రాడితి కీర్త్యతే.16
అయంలోకస్తు వైసమ్రా డన్తరిక్షం విరాట్స్మృతః । స్వరాడసౌ స్మృతోలోకః పునర్వక్ష్యామి విస్తరమ్. 17

ఈ భారతవర్షము మూడు వైపులందు సముద్రముచే చుట్టబడియున్నది. దీని దక్షిణోత్తర దైర్ఘ్యము వేయి యోజనములు; ఈ వర్షపు దక్షిణావధి కుమారీ స్థానము-ఉత్తరావధి-గంగా నది జన్మస్థానము. పొడవు వెడల్పులు పరస్పరము గుణించగా అగు వైశాల్యము తొమ్మిదివేల చదరపు యోజనములు. దేశపు పూర్వ పశ్చిమోత్తర దిశల అంతములయందు అంతటను మ్లేచ్ఛులను యవనులను కిరాతులను ఉపనివేశముల నేర్పరచుకొని వసించుచున్నారు. ఇక నడుమయందు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర వర్ణములవారు ఆయా తావులయందు యజనము ఆయుధవృత్తి వాణిజ్యము జీవనోపాధులుగా వర్తిల్లుచు వ్యవహరించుచు నివసించుచున్నారు. వారియందు పరస్పర భేదముండని ఏకరూప సమాన వ్యవహారమును కలదు. ఆయా వర్ణములకును ఆశ్రమములకును విహితములగు కర్మలననుష్ఠించుచు ధర్మార్థ కామ మోక్షములపై సంకల్ప పూర్వకముగా యత్నము చేయుటలో నిరంతర వ్యవహారమును సమముగా నుండును. ఇచటి మానవుల ప్రవృత్తియంతయు ఇహలోక జీవనము విషయముననే గాక పరమున స్వర్గమునో అపవర్గము (మోక్షము)నో సాధించుటకు అభిముఖమైయుండును. ఈ చెప్పిన తొమ్మిదింటిలో తొమ్మిదవదియగు భారత ద్వీప (భరతఖండ)మునకు తిర్యగ్గ్రామమని (తూర్పు పడమరలుగా వ్యాపించిన వీథి నిర్మాణముగల గ్రామములు గలదియని) వ్యవహారము కలదు. ఈ లోకమునంతటిని సృష్టించు సృష్టికర్తకు 'సమ్రాట్' అని వ్యవహారము; ఇంతియకాక-భూర్-భువర్-సువర్ అను మూడు వ్యాహృతులలో మొదటిదానికి అర్థమగు ఈ మధ్యమ లోకమునకు సమ్రాట్ అనియు భువర్ అను వ్యాహృతికర్థమగు అంతరిక్ష లోకమునకు విరాట్ అనియు సువర్ అను వ్యాహృతి కర్థమగు ద్యులోకమునకు స్వరాట్ అనియు వ్యవహారము. వీనిలో మొదటిదియు సమ్రాట్ అనబడునదియునగు ఈ లోకపు-భరత వర్షపు- విస్తరమును ఇంకను చెప్పెదను.

సప్త(నవ)మేస్మి న్మహావర్షే విస్తృతాః కులపర్వతాః। మహేన్ద్రో మలయస్సహ్య శ్శుక్తిమా నృక్షవానపి-18
విన్ధ్యశ్చ పారియాత్రశ్చ సప్తైతే కులపర్వతాః । తేషాం సహస్రశశ్చాన్యే పర్వతాస్తు సమీపతః. 19
అభిజ్ఞాతాః పర్వవన్తో విపులా శ్చిత్రసానవః । అన్యే తేభ్యః ప్రతిజ్ఞాతా హ్రస్వా స్స్వల్పోపజీవినః. 20
తైర్విమిశ్రా జనపదా ఆర్యా మ్లేచ్ఛాశ్చ సర్వతః । పిబన్తి బహులా నద్యో గఙ్గాం సిన్ధుం సరస్వతీమ్. 21

గఙ్గాదినదీవర్ణనమ్

శతద్రూం చన్ద్రభాగాంచ యమునాం సరయూమపి। శరావతీం వితస్తాంచ విపాపాం దేవికాంకుహూమ్.22
గోమతీం ధూతపాపాంచ బాహుదాంచ దృషద్వతీమ్ । కౌశికీంచ తృతీయాంతు నిశ్చారీం గణ్డకీంతథా. 23
బహులోహిత్య ఇత్యేతా హిమవత్పాద నిస్సృతాః । వేదస్మృతిం వేత్రవతీం వితస్తాం సిన్ధుమేవచ. 24
పర్ణాసాం నర్మదాంచైవ కావేరీం మహతీంతథా । పారాం చన్ద్రవతీం యూపాం విదుషాం వేణుజీవికామ్.25
శిప్రామవన్తీం కౌన్తీంచ పారియాత్రాన్త నిస్సృతాః। శోణం మహానదంచైవ నన్దినీం సుకృశాం కృశామ్.26
మన్దాకినీం దేవవర్ణాం చిత్రకూటాం తథైవచ । తమసాం పిప్పలాం శోణాం కరతోయాం తథామ్బికామ్. 27
చిత్రోపలాం విశాలాంచ మధురాం బహువాహినీమ్ । ముక్తిం మన్దాకినీం లజ్జాం మకుటోద్భేదికామపి. 28
ఋక్షవతః ప్రసూతాస్తా నద్యోఽమలజలాశ్శుభాః। తాపీంపయోష్ణీం నిర్విన్ధ్యాం శి(క్షి)ప్రాంచ వృషభాం నదీమ్.
వేణీం వైతరణీంచైవ విశ్వమాలాం కుముద్వతీమ్ । తోయాంచైవ మహాగౌరీం దుర్గమాంతు శిలాంతథా.30
విన్ధ్యపాదప్రసూతాస్తా స్సర్వా శ్శీతజలా శ్శుభాః । గోదావరీ భీమరథీ కృష్ణవేణీచ వఞ్జులా. 31
తుఙ్గభద్రా సుప్రయోగా బాహ్యా కావేరిరేవచ । దక్షిణాపథనద్యస్తా స్సహ్యపాదా ద్వినిస్సృతాః. 32

కృతమాలా తామ్రవర్ణీ పుష్పజా హ్యుత్పలాఅపి । మలయ(త్ప్ర)వసృతా నద్యః స్సర్వా శ్శీతజలాశ్శుభాః. 33
విషమా సర్పకుల్యాచ ఇక్షుజా త్రిదివాచలా । తామ్రవర్ణీ తథామూలీ శరారీ విమలాతథా. 34
మహేన్ద్రతనయా స్సర్వాః ప్రఖ్యాతా శ్శుభగామినీః । కౌశికా సుకుమారీచ మన్దగా మన్దవాహినీ. 35
కృపా పలాశినీచైవ శుక్తిమత్పర్వతోద్భవాః । సర్వాః పుణ్యజలాః పుణ్యాః స్సమగ్రాశ్చ సముద్రగాః. 36
ఏతాః పుణ్యజలా నద్యో మహాద్రి తనయా శ్శుభాః । విశ్వస్య మాతర స్సర్వా స్సర్వపాపహరా శ్శుభాః. 37
తాసాం నద్యుపనద్యశ్చ శతశోథ సహస్రశః ।

ఏడ (తొమ్మిద)వదగు ఈ మహావర్షమునందు ఏడు విశాల కులపర్వతములు-మహేంద్రము-మలయము-సహ్యము-శుక్తిమాన్-ఋక్షవాన్-వింధ్యము-పారియాత్రము-అనునవి కలవు. వీటికి . సమీపములందు ఈ కులపర్వతములకు సంబంధించినవి ఇవి అని గుర్తింప వీలగు లక్షణములు కలవి-పర్వములు (ఒుడిపెలు-ఉబ్బు-ఎత్తులు) కలవి విశాలములై చిత్రములై వివిధ లక్షణములు కలిగి అచ్చెరువు గొల్పు నెత్తములు (ఉన్నత సమతలములు) కలవి అగు శాఖా పర్వతములు వేలకొలదిగ కలవు. ఈ శాఖా పర్వతములకు అనుబద్ధములై వీనికి పిలకలవలె పుట్టినవి-పొట్టివి-స్వల్పమగు ఉపజీవనము (వృద్ధియు శిలాదార్ఢ్యమును) కలవియగు చిన్న గుట్టలు మరి వేలకొలది గలవు. ఈ పర్వతములతో శాఖోపశాఖా పర్వతములతో విమిశ్రములగు (వీనికి చుట్టు పట్టులనో వీని నడుమనో ఉన్న) జనపదములు (పల్లెలు) న్నవి. వానియందు ఆర్యులును మ్లేచ్ఛులును అంతట నివసించుచున్నారు. వారు ఆయా ప్రదేశములందు గంగా సింధు సరస్వతీ శతద్రూ చంద్రభాగా యమునా సరయూ శరావతీ వితస్తా విపా పా(శా) దేవికా కుహూ గోమతీ ధూతపాపా బాహుదా దృషద్వతీ కౌశికీ తృతీయా నిశ్చారీ గండకీ ఇక్షు లోహితా నదులనెడుహిమవత్పాదములనుండి జనించిన నదుల (జలము)ను వేదస్మృతి వేత్రవతీ వితస్తా సింధు పర్ణాసా నర్మదా కావేరీ మహతీ పారా చంద్రవతీ యూపా విదుషా వేణు జీవికా శిప్రా-అవంతీ కౌంతీ నదులనెడు పారియాత్రగిరి పరిసరములనుండి జనించిన నదుల (జలము)ను శోణ మహానద నందినీ సుకృశా కృశా మందాకినీ (ఇది గంగానది కాదు.) దేవ పర్ణా చిత్రకూటా తమసా పిప్పలా శోణా కర తోయా-పిశాచికా చిత్రోపలా విశాలా మధురా బహు వాహినీ ముక్తి మందాకినీ (ఇది మరియొకటి) లజ్జా మకుటోన్వేదికా నదులనెడు అమల జలయుతములగు ఋక్షవత్పర్వత సంజాత నదుల (జలము)ను తాపీపయోష్ణీ నిర్వింధ్యా శిప్రాపావృషభా వేణీ వైతరణీ విశ్వమాలా కుముద్వతీ తోయా మహాగౌరీ దుర్గమా శిలానదులనెడు వింధ్య పాదమునుండి ప్రభవించిన మరి కొన్ని నదుల (జలము)ను శుభ శీతజలములగు గోదావరి భీమరథీ కృష్ణవేణి వంజులా తుంగభద్రా సుప్రయోగా బాహ్య కావేరీ నదులనెడు సహ్య పర్వత పాద సంజాత దక్షిణాపథ నదుల (జలము)ను కృతమాలా తామ్రవర్ణీ పుష్ప జోత్పలా నదులనెడు శుభ శీత జలములగు మలయ పర్వత పాద సంజాత నదుల (జలము)ను విషమా సర్పకుల్యేక్షుజ-త్రిదివాచలా తామ్రవర్ణీ మూలీ శరారీ విమలా నదులనెడు శుభ ప్రవాహ యుతములగు మహేంద్ర పర్వత సంజాత నదుల (జలము)ను కౌశికా సుకుమారీ మందగా మందవాహినీ కృపా పలాశినీ నదులనెడు శుక్తిమత్పర్వత సంజాతములను పుణ్య జలయుతములును పుణ్యకరములును సమగ్రములును సముద్రము గామినులును నగు నదుల (జలము)ను త్రావుచు జీవించుచుందురు. ఈ చెప్పిన నదులన్నియును పుణ్య జలవంతములు-మహాద్రి సంజాతములు-విశ్వమునకు తల్లులవంటివి-సర్వ పాపహరములు-శుభకరములునైనవి. ఈ నదులలో కలిసెడి చిన్న నదులును ఉపనదులును నూరుల కొలదిగా వేలకొలదిగా గలవు.

## కురుపాంచాలాదిదేశాః

తాస్విమే కురుపాంచాలా స్సాల్వాశ్చైవ సజాఙ్గలాః. 38
శూరసేనాఽథ కామ్భోజా అన్ధ్రాశ్చైవ సబర్బరాః । మత్స్యాః కిరాతాః కుల్యాశ్చ కాశీకున్తలకోసలాః. 39

అవన్తా శ్చానులిఙ్గాశ్చ మూకాశ్చైవాన్ధకైస్సహ । మధ్యదేశ్యా జనపదాః ప్రాయశః పరికీర్తితాః. 40
ధన్యస్స దేశో మన్తవ్యో యత్రగోదావరీనదీ । పృథివ్యామపి కృత్స్నాయాం న ప్రదేశో మనోరమః. 41
యత్ర గోవర్ధనా నామ నగరీచ వినిర్మితా । రామప్రియార్థం సుగ్రీవఋక్షై ర్దివ్యా స్తథౌషధీః. 42
భరద్వాజేన మునినా యత్ప్రియార్థేఽవతారితాః । తస్మాత్స ప్రవరో దేశ స్తేన జజ్ఞే మనోరమః. 43
బాహ్లీకా రాజధాన్యాశ్చ ఆభీరాఃకాలతోయకాః । పరాన్ధ్రాశ్చైవ శూద్రాశ్చ పహ్లవా శ్చోపఖణ్డితాః. 44
గాన్ధారా యవనాశ్చైవ సిన్ధుసౌవీరమద్రకాః । శకా(కా) హూణాః కళిఙ్గాశ్చ పారదా హారమూర్తికాః. 45
రామఠాః కర్ణికారాశ్చ కేకయా దశనాసికాః । క్షత్రియోపనివేశాశ్చ వైశ్యాశ్శూద్రజనాఅపి. 46
ఆత్రేయాశ్చ భరద్వాజాః ప్రస్థలా స్సరమేరకాః । లమ్బకా స్థలబాణాశ్చ సైనికా స్సహజాఙ్గలైః. 47
ఏతే దేశా ఉదీచ్యాస్తు ప్రాచ్యాన్దేశా న్నిబోధత । అఙ్గా వఙ్గా మణ్డవకా అన్తర్గిరబహిర్గిరాః. 48
తతః ప్లవఙ్గమాతఙ్గ యమకామలవర్ణకాః । సహోత్తరాః ప్రవిజయా భార్గవా గేయమాళవాః. 49
ప్రాగ్జ్యోతిషాశ్చ పుణ్డ్రాశ్చ విదేహా స్తామ్రలిప్తగాః । సాళ్వా మాగధగోనర్దాః ప్రాచ్యాం జనపదాః స్మృతాః.

ఆ నదుల నడుమ ఈ చెప్పబోవు దేశము లనేకములు గలవు. (అవి మధ్యదేశములు - ఉదీచ్య దేశములు-ప్రాచ్య దేశములు-దక్షిణాపథ దేశములు-అపరాంత దేశములు-వింధ్య పృష్ఠస్థ దేశములు-పార్వతీయ దేశములు అని ఆరు విధములుగా విభజింపబడినవి. వానిలో మొదట ★మధ్య దేశ జనపదములు:) కురువులు పాంచాలములు సాళ్వములు జాంగలములు (పంటకు అంతగా పనికిరాని భూములు కల జనపదములు) శూరసేనములు, కాంభోజములు ఆంధ్రములు బర్బరములు మత్స్యములు కిరాతములు కుల్యములు కాశిజనపదములు కుంతలములు కోసలములు అవంతములు అనులింగములు మూకములు అంధకములు- ఇవి మధ్యదేశ్య జనపదములలో చాలవరకు అయినవి. (మధ్యదేశము అనగా హిమాలయపు దక్షిణపు అంచునకును వింధ్యపు ఉత్తరపు అంచునకును నడుమ కురుక్షేత్రమునకు తూర్పున ప్రయాగకు పడమటగల దేశము.)

గోదావరినది ప్రవహించు దేశము ధన్యము; పృథివియంతటిలోను అది మనోరమము. ఈ నదీతీరమునందే శ్రీరామ ప్రీతికై సుగ్రీవాది వానరులును ఋక్షులు (జాంబవజ్జాతీయులు)ను 'గోవర్ధన' అను నగరిని నిర్మించిరి. భరద్వాజ మునియు ఆ శ్రీరామ ప్రీతికే దివ్యౌషధులను భూమి కవతరింపజేసెను. కావుననే ఆ దేశశ్రేష్ఠము మనోరమమయ్యెను.

ఇక ఉదీచ్య దేశములు: బాహ్లీకములు - రాజధాన్యములు ఆభీరములు అకాలములు తోయకములు పరాంధములు శూద్రములు (దేశనామము) పహ్లవములు ఉపఖండితములు గాంధారములు యవనములు సింధువులు సౌవీరములు మద్రకములు శక(క)ములు హూణములు కళింగములు పారదములు హారములు మూర్తికములు రామఠములు కర్ణికారములు కేకయములు దశనములు ఆసికములు క్షత్రియ వైశ్య శూద్రుల ఉపనివేశములు ఆత్రేయములు భరద్వాజములు ప్రస్థలములు రమేరకములు లంబకములు స్థల బాణములు సైనికములు జాంగలములు అను ఈ జనపదములు ఉదీచ్యములు.

---

★ శరావతీనది సీమారేఖగా దానికి పశ్చిమోత్తరమునం(లం)దు ఉండిన ఉత్తర భారత దేశమునకు ఉదీచ్యదేశము అనియు ఆనదికే ప్రాగ్దక్షిణములందు ఉన్న ఉత్తర భారతదేశమునకు ప్రాచ్యదేశము అనియు పూర్వుల వ్యవహారము. ఇట్లుత్తర భారతదేశమునందలి దేశములన్నియు ఉదీచ్యములు ప్రాచ్యములు అని రెండు విధములే అగుచున్నవి. దేశములకు పూర్వము జనపదములనియే ఎక్కువ వాడుక. జనపదములే (గ్రామములే) అధికముగా ఉండుటచే వాని సముదాయమునే ఒక పాలనా విభాగముగా గ్రహించుటచే ఈ వాడుక ఏర్పడియుండును. కనుకనే కురువులు ఇత్యాదిదేశనామములు బహువచనములు.

ఇక ప్రాచ్యజనపదములు: అంగములు వంగములు మండుకములు అంతర్గిరములు బహిర్గిరములు (పర్వతములకు లోపల-వెలుపల ఉండునవియని అర్థము) ప్లవంగములు మాతంగములు యమకములు అమలవర్ణకములు సహ్యోత్తరములు ప్రవిజయములు భార్గవములు గేయములు మాళవములు ప్రాగ్జ్యోతిషములు పుండ్రములు విదేహములు తామ్రలిప్తకములు సాళ్వములు మాగధములు గోనర్దములు అనునవి ప్రాచ్యజనపదములు.

తేషాంపరే జనవదా దక్షిణాపథవాసినః । పాణ్ద్యాశ్చ కేరళాశ్చైవ చోళాః కుల్యాస్తథైవచ. 51
సేతుకా మూషికాశ్చైవ కుపథాశ్చారవాసికాః । నవరాష్ట్రా మాహిషకాః కళిఙ్గాశ్చైవ సర్వశః. 52
కావేర్యాశ్చ మహాశ్రీకాః కేరాఖ్యా స్సృవరాస్తథా । పుళిన్దా విన్ధ్యభూతాశ్చ మూషకా దణ్డకైస్సహ. 53
కులపాశ్చ నిరాభాశ్చ రూపసా స్తారసైస్సహ । నదనాస్తథా తరుణికా యేచ సర్వాకరాస్తథా. 54
వాసిక్యాశ్చైవ యేచాన్యే యేచైవాన్తర నర్మదాః । భారుకచ్ఛాః సమాహేయా స్సహసారస్వతైస్సహ. 55
కాశ్మీరాశ్చైవ సౌరాష్ట్రా అనన్దా హ్యర్బుదైస్సహ । ఇత్యేతే అపరాన్తాస్తు శృణు తే విన్ధ్యవాసినః. 56
మలకా(దా)శ్చ కరూషాశ్చ మేలకాశ్చేలకైస్సహ । ఆర్ద్రాశ్చ షోడశార్ణాశ్చ భోజాః కిష్కిన్ధకైస్సహ. 57
గోనహ్యాః కోసలాశ్చైవ త్రైపురా వైదికాస్తథా । తుసురాస్ తుమ్బురాశ్చైవ వడుమా నైరథైస్సహ. 58
ఉత్తరాశ్చ దశాశ్చైవ కామ్బోజా మాగధైస్సహ । కౌసలాః కోసలాశ్చైవ త్రైపురా వేదికాస్తథా. 59
మర్మరా ఘూర్జరాశ్చైవ తావద్గృహబలైస్సహ । అన్తపా స్తుణ్డికారాశ్చ వీతిహోత్రా హ్యవన్తయః. 60
ఏతే జనవదాః ఖ్యాతా విన్ధ్యపృష్ఠనివాసినః । అతో దేశా న్ప్రవక్ష్యామి పర్వతాశ్రయిణశ్చ యే. 61
నీహారా హిమవర్గాశ్చ కున్తోదాః కుశలావహాః । కర్ణప్రావరణాశ్చాపి ఊర్ణా దర్వాః సమద్రకాః. 62
త్రిగర్తా మండలాశ్చైవ కిరాతాశ్చామరైః సహ ।

ఇక దక్షిణాపథ జనవదములు: పాండ్యములు కేరళములు చోళములు కుల్యములు సేతుకములు మూషికములు కుపథములు చారవాసికములు నవరాష్ట్రములు మాహిషకములు కళింగములు కావేర్యములు మహాశ్రీకములు కేరములు నృవరములు- ఇవి దక్షిణాపథమునందలి జనవదములు.

ఇక అపరాంత (పశ్చిమ దిశయందలి) జనపదములు: పుళిందములు (నేటి బుందేల్ ఖండ్) వింధ్యభూతములు మూషకములు దండకములు కులపములు నిరాభములు రూపసములు తారసములు నదనములు తరుణికములు సర్వాకరములు నాసిక్యములు ఆంతర నర్మదములు భరుకచ్ఛములు మాహేయములు సారస్వతములు కాశ్మీరములు సౌరాష్ట్రములు అర్బుదములు- ఇవి అపరాంత జనవదములు (భారతదేశపు పడమటి దిశలో పశ్చిమ సముద్రవరకు వ్యాపించిన ప్రదేశమందలి జనవదములు.)

ఇక వింధ్య పర్వతముతో సంబంధముగల జనపదములు: మలదములు కరూశములు మేలకములు చేలకములు ఆర్ద్రములు షోడశార్ణములు భోజములు కిష్కింధకములు గోనహ్యములు కోసలములు త్రైపురములు వైదికములు తుసురములు తుంబురములు వడుమములు నైరథములు ఉత్తరములు దశములు కాంభోజములు మాగధములు కౌసలములు కోసలములు కైపురములు వేదికములు మర్మరములు ఘూర్జరములు గృహ బలములు అంతపములు తుండికా క్రేరములు వీతిహోత్రములు అవంతులు-ఇవి వింధ్యమును ఆశ్రయించియుండు జనవదములు.

ఇక ఇతర పర్వత ప్రాంతములందును పర్వతములందును ఉండు జనవదములు: నీహారములు హిమవర్గములు కుంతోదములు కుశలావహములు కర్ణప్రావరణములు ఊర్ణములు దార్వములు మద్రకములు త్రిగర్తములు (తిర్ హూత్) మండలములు కిరాతములు చామరములు (చమరీపశువు లుండు జనవదములు)- ఇవి పర్వతాశ్రయి జనవదములు.

[ఈ చెప్పిన జనవదముల పేరులలో కొన్ని ఆయా స్థానములందలి గుణలక్షణములను బట్టి ఏర్పడినవి. కొన్ని అచట నివసించు జనులను బట్టి ఏర్పడినవి. కొన్ని మన కీనాడు తెలియని ఏ భాషకో చెందినవి.

ఈ జనపదములు కూడ మనకు తెలిసిన కొన్ని ఈనాడు మన మనుకొనుచోట కాక మఱియొక ప్రాంతమున నున్నట్లు ఇచట కనబడుచున్నది. మరికొన్ని దేశనామములు రెండుచోట్ల వచ్చుచున్నవి. ఇందులకు హేతువులను జాగ్రత్తతో పరిశీలించుకొన నగునే కాని అవి తోచినట్లు వ్రాసిన పుక్కిటి పురాణము మాత్రము కాదు. ఉదాహరణమునకు 'ఆంధ్ర'జనపదము మధ్యదేశ జనపదములలో నున్నది. నేడీ ఆంధ్రదేశము దక్షిణాపథమునం దున్నది. నేడును మధ్యదేశమున ఆంధ్రులు చాలమంది యుండుట ప్రసిద్ధము. దీనిని బట్టి చూడగా ఈ ఆంధ్రులు పూర్వము మధ్యదేశీయులేయై యుండి వారిలో కొందరు దక్షిణాపథమున కూడ వ్యాపించిరేమో యనియు ఆలోచింపవలయును. ఇట్లే మఱికొన్ని జనపదముల విషయమును.]

సూతః : చత్వారి భారతే వర్షే యుగాని మునయోఽబ్రువన్. 63
కృతం త్రేతా ద్వాపరం చ కలిశ్చేతి చతుర్యుగమ్। తేషాం స్వరూపం వక్ష్యామి హ్యుపరిష్టాత్తు కృత్స్నశః.
ఏతచ్ఛ్రుత్వాతు ఋషయ ఉత్తరం పునరేవతే । శుశ్రూషవో ముదా యుక్తా హ్యబ్రువ న్రోమహర్షణిమ్. 64
ఋషయః : జమ్బూద్వీపస్య విస్తారం తథాఽన్యేషాం ద్విజోత్తమ ।
ద్వీపానాం వాసినాం తేషాం వృక్షాణాం ప్రబ్రవీహి నః. 66
యచ్చ కిమ్పురుషం వర్షం హరివర్షంతథైవచ । ఆచక్ష్వవై యథాతత్త్వం కీర్తితం భారతం త్వయా. 67
పృష్టశ్చైవ తథా విప్రై ర్యథాపృష్టం విశేషతః। ఉవాచర్షిః పురాణాని యథాచైవ నరోత్తమ. 68

కిమ్పురుషాదివర్షవర్ణనమ్.

సూతః: శుశ్రూషా యది వో విప్రా స్తచ్ఛృణుధ్వ మతన్ద్రితాః ।
జమ్బూషణ్డః కిమ్పురుషో సుమహా న్నన్దనోపమః. 69
దశవర్షసహస్రాణి స్థితిః కిమ్పురుషే స్మృతా । జాయన్తే మానవా స్తత్ర* నిష్టప్తకనకప్రభాః. 70
వర్షేకిమ్పురుషేపుణ్యే ప్లక్షో మధువహస్స్మృతః । తస్య కిమ్పురుషాస్సర్వే పిబన్తో రసముత్తమమ్. 71
అనామయా హ్యశోకాశ్చ నిత్యం ముదిత మానసాః । సువర్ణవర్ణాశ్చ నరా స్త్రియ శ్చాప్సరసోపమాః. 72
పరం కిమ్పురుషాద్వర్షం హరివర్షం ప్రచక్షతే । నరా రాజతసఙ్కాశా జాయన్తే తత్రమానవాః. 73
దేవలోకచ్యుతా స్సర్వే దేవరూపాశ్చ సర్వశః । హరివర్షే నరాస్సర్వే ఇక్షు ప్రీత్యురసం శుభమ్. 74
న జరా బాధతే తత్ర ఏతే జీవన్తివై చిరమ్ । † ఏకాదశసహస్రాణి తేషామాయుః ప్రకీర్తితమ్. 75

ఈ భారతవర్షమునందు కృత త్రేతా ద్వాపరకలులు అను నాలుగు యుగములు వ్యవహారమునం దుండునని మునులు వచించిరి. ఈ చతుర్యుగ స్వరూప లక్షణములను ఇకమీదట ఏమియు విడువక అంతయు చెప్పెదను. అనగా ఋషులు ఇంతవరకు అతడు చెప్పినదే మరికొంత విననోరి సంతోషముతో కూడిన కుతూహలముతో నిట్లనిరి: ద్విజోత్తమా! జంబూద్వీప తదితర ద్వీప విస్తరమును వానియందు వసించు మానవులయు ఉండు వృక్షములయు వివరణమును మాకు తెలుపుడు. మీరు భారతవర్షమును యథాతత్త్వముగ మాకు తెలిపితిరి. హరి కింపురుష వర్షములను కూడ తెలుప వేడెదము. అనగా సూతు డిట్లనెను: విప్రులారా! మీకు వినగోరికకలదేని సావధానులై వినుడు. కింపురుష వర్షమున నందనవనమువంటి జంబూ(నేరెడు)వనము కలదు. అచట వారి ఆయువు పదివేలేండ్లు. వారి దేహకాంతి మెరుగుపెట్టిన బంగారుకాంతి. ఆ ద్వీపమున తేనెలు ప్రవహించు జువ్విచెట్టు కలదు. అచటి వారు దాని ఉత్తమ రసము త్రావి రోగ శోక రహితులై సదా ముదిత మానసులై ఉందురు. అచటి స్త్రీ లప్సరసలవంటి సుందరులు. దాని కవతలిది హరివర్షము. అచటి జనులు వెండి కాంతిబోలు దేహచ్ఛాయ కలవారు. దేవలోక పరిభ్రష్టులు అచట జనింతురు. వారు దేవతలను పోలి యుందురు. వారు చెరకు రసమును త్రావి జరాబాధలు లేక పదునొకండు వేలేండ్లు జీవింతురు.

* సుతప్త

† త్రయోదశ

మధ్యమం యన్మయా ప్రోక్తం నామ్నా వర్ష మిళావృతమ్। న తత్ర సూర్యస్తపతి తే న జీర్యన్తి మానవాః.
న చన్ద్రసూర్యౌ నక్షత్రం న తత్ర పవనానలౌ । పద్మప్రభాః పద్మవర్ణాః పద్మపత్రనిభేక్షణాః. 77
పద్మగన్ధానువర్ణాశ్చ జాయన్తే తత్ర మానవాః । జమ్బూఫలరసాహార మశ్నన్త స్తే సుగన్ధినః. 78
దశవర్షసహస్రాణి వర్షాణాం తే నరోత్తమాః । ఆయుఃప్రమాణం జీవన్తి వర్షే యే తు ఇళావృతే. 79
తస్య జమ్బూఫలరసో నదీ భూత్వా ప్రసర్పతి। మేరుం ప్రదక్షిణం కృత్వా జమ్బూమూలం గతా పునః.80
తం పిబన్తి సదాతుష్టా జమ్బూరస మిలావృతే । జమ్బూఫలరసం పీత్వా న జరా బాధతే చ తాన్. 81
న క్షుధా న క్లమశ్చాపి న మృత్యుర్నచ వై జరా । తత్ర జామ్బూనదంనామ కనకం దేవభూషణమ్. 82
ఇన్ద్రగోపప్రతీకాశం జాయతేవా స్వయంచ యత్ । సర్వేషాం వర్ష వృక్షాణాం శుభః ఫలరసస్తు సః. 83
స్కన్నంతు కాఞ్చనం శుభ్రం జాయతే దేవభూషణమ్। తేషాం మూత్రం పురీషంవా దిక్ష్వష్టాసు చ సర్వదా.
ఈశ్వరానుగ్రహాద్ భూమి స్తేషాంతు గ్రసతే మృతాన్ । రక్షఃపిశాచయక్షాశ్చ సర్వే హేమయుతాస్తు తే. 85
హేమకూటేతు గన్ధర్వా విజ్ఞేయా స్సాప్సరోగణాః సర్వేనాగా నిషేవన్తే శేషవాసుకితక్షకాః. 86
మహామేరౌ త్రయస్త్రింశ త్క్రీడన్తే చాజ్ఞయా సురాః ।
నీలవైదూర్యయుక్తేఽస్మి న్సదా బ్రహ్మర్షయోఽవసన్. 87
దైత్యానాం దానవానాంచ శ్వేతఃపర్వత ఉచ్యతే । శృఙ్గవా న్పర్వతశ్రేష్ఠః పితౄణాం ప్రతిసఞ్చరః. 88
ఇత్యేతాని మయోక్తాని నవవర్షాణి భారతే । భూతైరపి నివిష్టాని గతిమన్తి ధ్రువాణిచ. 89
తేషాంవృద్ధి ర్బహువిధా దృశ్యతే దేవమానుషైః । అశక్యా పరిసఙ్ఖ్యాతుం శ్రద్ధేయావై మయోదితాః. 90

ఇతి శ్రీమత్స్యమహాపురాణే భూగోళే భారతాదివర్షవర్ణనం నామ
త్రయోదశోత్తరశతతమోఽధ్యాయః.

భారత కేతుమాల భద్రాశ్వ కురువర్షముల నడుమ నున్నదని నేను లోగా చెప్పిన ఇలావృత వర్షమున సూర్యుడు తపింపడు. అచటి వారికి శైథిల్యము కాని వార్ధకము గాని లేదు. అచట చంద్ర రవి నక్షత్ర పవనాగ్నులతో పని లేదు. అచటివారు పద్మకాంతి పద్మవర్ణము పద్మపత్ర నేత్రములు పద్మ గంధ సదృశగంధము కలిగి అచటి జంబూ ఫల రసపానముచే పదునైదు వేల ఏండ్లు జీవింతురు. వారికి వార్ధకము ఆకలిబడలికలు మృత్యువు లేవు. ఇదంతయు వారు త్రావు జంబూ ఫలరస మహిమమే. ఆ రసము నదియై మేరువును ప్రదక్షిణించి మరల జంబూవృక్ష మూలమును చేరును. అచటి దేవులకును మానవులకును సహజ కనకమయ భూషణములే. అవి ఇంద్రగోప కీటముల(ఆర్ద్రపురుగుల)వన్నెతో నుండును. ఏలయన అన్ని వర్షములందలి ఆయా ఫలరసములును ప్రవహించి నిర్మలమగు బంగారయి దేవభూషణ మగును. అచటి వారి మూత్ర పురీషములును అష్టదిశలందును సువర్ణమై సదా ప్రకాశించును. ఈశ్వర సంకల్ప రూపాను గ్రహమున వారిలో కొందరిని అచటి భూమి మింగివేయును. అదియే వారికి మృతి. అచట వసించు రక్షః పిశాచయక్షులును సువర్ణవంతులే.

హేమకూట పర్వతమున గంధర్వాప్సరసలు శేషవాసుకి తక్షకాది మహానాగులు వసింతురు. మహామేరు పర్వత మున ముప్పది ముగ్గురు దేవతలును (ఏకాదశ రుద్రులు-ద్వాదశాదిత్యులు - అష్టవసువులు-ఇద్దరు అశ్వినులు) సదా వసిం తురు. నీల వైదూర్యమణియుతమగు దీనియందు సదా బ్రహ్మర్షులు నివసింతురు. శ్వేత పర్వతమునందు దైత్యులు దాన వులు నివసింతురు. శృంగవత్పర్వతము శ్రేష్ఠమయినదియు పితృ దేవతలకు లయాత్మకమయినదియు; (పితృ దేవతలు దీనియందు లయమునొంది అదృశ్యరూపులై యుందురు.)

ఈ విధముగ నేను మీకు భరతవర్షము మొదలుగా నవవర్షముల విషయము తెలిపితిని. వీనియందు ఆయా స్థిర చర భూతములు నివసించుచున్నవి. దేవమాన మానుషమానముల ననుసరించి వాని పరిమాణాదికమును జనన వృద్ధులు ఆయువు మొదలగు పరిమాణములును బహు విధములుగా పెద్దలు చెప్పుచున్నారు. దానిని స్పష్ట రూపమున ఇది ఇట్లని చెప్పుట శక్యము కాదు. కావున నేను చెప్పిన ఈ విషయము లన్నియు ఆస్తికతా ప్రామాణికతా భావములతో విశ్వసింప వలసినది.

ఇది శ్రీమత్స్య మహాపురాణమున భూగోళ వర్ణనమున సప్తద్వీప వర్ణనమున జంబూద్వీప వర్ణనమున భారతాది వర్ష వర్ణనమను నూట పదుమూడవ అధ్యాయము.

## చతుర్దశో త్తరశతతమోఽధ్యాయః.
## పురూరవః పూర్వచరితమ్.

మనుః : చరితం బుధపుత్త్రస్య జనార్దన మయా శ్రుతమ్। శ్రిధా శ్రాద్ధవిధిః పుణ్య స్సర్వపాపప్రణాశనః. 1
విమలం చైవ సర్వేషాం ఫలముచ్చై స్తథా శ్రుతమ్ । కృష్ణాజినప్రదానంచ వృషోత్సర్గం తథైవచ. 2
శ్రుత్వారూపం నరేన్ద్రస్య బుధపుత్త్రస్య మాధవ। కౌతూహలం సముత్పన్నం తన్మమాచక్ష్వ పృచ్ఛతః. 3
కేన కర్మవిపాకేన సతు రాజా పురూరవాః ।అవాప తాదృశం రూపం గతించ పరమోత్తమామ్. 4
దేవాం స్త్రిభువనశ్రేష్ఠా న్గన్ధర్వాంశ్చ మనోరమాణ । ఊర్వశీ సజ్జతా త్యక్త్వా సర్వభావేన తం స్పవమ్. 5
శ్రీమత్స్యః : శృణు కర్మవిపాకేన యేన రాజా పురూరవాః ।
అవాప తాదృశంరూపం సౌభాగ్యమపి చోత్తమమ్. 6
అతీతే జన్మని పురా యోయం రాజా పురూరవాః । మద్రదేశే మహేష్వాసో భూమివ్యశ్చాభు షేఽన్తరే. 7
పూర్వం సర్వైర్నృపగుణై ర్యుక్తః పరపురఞ్జయః । నృపోసౌ ధనవాణ జాతః కేవలంరూపవర్జితః. 8
ఋషయః : పురూరవా మద్రపతిః కర్మణా కేన పార్థివః । బభూవ కర్మణాకేన రూపవాంశ్చైవ భూతలే. 9

## నూట పదునాలుగవ అధ్యాయము
## భారతవర్ష వర్ణన విస్తరరూపమయిన పురూరవసుని పూర్వ జన్మ వృత్తాంతము

[ఆలోచింపగా ఇచట పురూరవసుని వృత్తాంతమును తెలుపుమని ఋషులు నూతు నడుగవలసిన ప్రసక్తి లేదు. కాని దీనిని ఒక విధముగ సమర్థింపవచ్చును. ఇచట నవవర్ష వర్ణనమున ఇలావృత వర్షము పేర్కొని వివరింపబడినది. దీని కి పేరు పురూరవసుని తల్లియగు ఇల(పుంస్త్వమున ఇలుడు)ను బట్టి వచ్చినదని లోగడ తెలుపబడి నది. కావున ఆ పేరు వినగానే ఋషులకు ఇలాపుత్త్రుడగు పురూరవసుని విషయము విన కుతూహలము కలిగియుండెనని భావింపవచ్చును. మరియు దీని మూలమున భారతవర్షమందలి నదీపర్వతవనాది వర్ణన విస్తరమున కవకాశమును గలదు. పురాణములయందు ఇట్టివి సహజమే ]

మనువు మత్స్య నారాయణు నిట్లడిగెను: జనార్దనా! నేను బుధపుత్త్రుడగు పురూరవసుని చరితమును మూడు విధములగు శ్రాద్ధముల విధానమును సర్వపాప ప్రణాశకములగు ఆశ్రాద్ధములన్నింటి అనుష్ఠానమున కలుగు సమున్నత ఫలములను కృష్ణాజిన ప్రదాన వృషోత్సర్గాది ప్రకారమును వింటిని. బుధపుత్త్రుడును నరేంద్రుడునగు పురూరవసుని రూప విషయమును విని నందున నాకు కుతూహలము కలిగి అడుగుచున్నాను. అది నాకు తెలుపుడు. ఏ కర్మఫలముగా ఆ పురూరవసుడను రాజు అట్టి పరమోత్తమరూపమును పరమోత్తమగతిని పొందెను? త్రిభువనశ్రేష్ఠులగు దేవతలతోను మనో రములగు గంధర్వులతోను కలయికను విడిచి ఊర్వశి ఏలసర్వభావముతో ఆ నృపుని పొందెను? అనగా మత్స్య జనార్దనుడు మనువుతో ఇట్లు చెప్పెను: ఈ పురూరవోరాజు ఏ కర్మ విపాకమున అట్టి ఉత్తమ రూప సుభగత్వములను (కామినులకు

(ప్రీతిపాత్రుడగుట సుభగత్వము) పొందెనో వినుము. ఈ పురూరవుడు అంతకు ముందటి జన్మమున చాక్షుష మన్వంతరమున మహా ధానుష్కుడు సర్వ సృపలక్షణ యుక్తుడు శత్రుపుర (ధనరాశి) విజేత ధనవంతుడు అయియును రూపము మాత్రము లేని మద్రదేశ రాజై యుండెను. అనవిని ఋషులు పురూరవుడు తత్పూర్వ జన్మమున మద్రపతిగా నుండి నపుడు అతడు అపుడు రాజగుటకును రూప రహితుడగుటకును పరల రూపవంతుడగుటకును హేతువులగు కర్మ విపాకములేవియని సూతునడిగిరి.

సూతః : ద్విజగ్రామే ద్విజశ్రేష్ఠో నామ్నైవాసీ త్పురూరవాః ।

సద్యాః కూలే మహారాజ పూర్వజన్మని పార్థివః. 10

సతు మద్రపతీ రాజా యస్తునామ్నా పురూరవాః । తస్మిన్జన్మ న్యసౌ విప్రో ద్వాదశీషు సదానఘ. 11

ఉపోష్య పూజయామాస రాజ్యకామో జనార్దనమ్ । ద్వాదశీషు చకారాసౌ స్నాన మభ్యఙ్గపూర్వకమ్. 12

ఉపవాసఫలా త్ప్రాప్తం రాజ్యం మద్రే ష్వకణ్టకమ్ । ఉపోషిత స్సదాఽభ్యఙ్గా ద్రూపహీనో వ్యజాయత. 13

ఉపోషితై ర్నరై స్తస్మా త్స్నాన మభ్యఙ్గపూర్వకమ్। వర్జనీయం ప్రయత్నేన రూపఘ్నం తత్పరం నృప. 14

ఏత త్తే కథితం తస్య యద్వృత్తం పూర్వజన్మని । మద్రేశ్వరత్వే చరితం శృణు తస్య మహీపతేః. 15

తస్య రాజగుణై స్సర్వై స్సముపేతస్య భూపతేః । జనానురాగో నైవాసీ ద్రూపహీనస్య తస్యవై. 16

రూపకామ స్స మద్రేశ స్తపసే కృతనిశ్చయః । రాజ్యం మన్త్రిగతం కృత్వా జగామ హిమపర్వతమ్. 17

వ్యవసాయద్వితీయస్తు పద్భ్యామేవ మహాయశాః । ద్రష్టుం స తీర్థసదనం పర్వతస్యాస్య మస్తకే. 18

ఉగ్రం తప స్తప్తుమిచ్ఛు రాజావై స పురూరవాః । ఇరావతీతి విఖ్యాతా మపశ్య త్సుమనోహరామ్. 19

తుహినగిరిభవాం మహోగ్రవేగాం తుహినగభ స్తిసమానశీతలామ్ ।

తుహినసదృశరమ్యవర్ణకాన్తాం తుహినయశా స్సరితం దదర్శ రాజా. 20

ఇతి శ్రీమత్స్యమహాపురాణే భూగోళే పురూరవసో హిమవద్గమనం

నామ చతుర్దశోత్తరశతతమోఽధ్యాయః.

సూతుడు ఋషులకిట్లు చెప్పసాగెను: ఈ బుధపుత్రి పురూరవసునకు మద్రపతిగా నున్నపుడును పురూరవసుడనియే నామము. అతడంతకు ముందటి జన్మమున ఒకనదీ తీరమందలి ఒక బ్రాహ్మణ గ్రామమున పురూరవసుడను పేరుగల ద్విజ శ్రేష్ఠుడయి యుండెను. ఆ జన్మమునందా విప్రుడు రాజత్వమును కోరి నిరంతరము ద్వాదశుల యందుపవసించుచు జనార్దను నారాధించెడివాడు. కాని ఆ ఉపవాస దినములందు అభ్యంగ (తల యంటు) స్నానమాడెడివాడు. ఆ వ్రత పుణ్యమున రెండవ జన్మమున మద్రరాజై జన్మించెను. కాని ఉపవాస దినాభ్యంగ దోషమున రూపహీనుడయ్యెను. కావున ఉపవాస దినమున అభ్యంగ స్నానమాడరాదు. ఇది ఈ బుధపుత్రి పురూరవసుడు మద్రపతియగు పురూరవసుడుగా నగుటకు పూర్వ జన్మమందలి విప్ర పురూరవసుని వృత్తాంతము. ఇక మద్రపతిగానున్న యతని వృత్తాంతము వినుడు. అతడు సర్వ రాజగుణ యుక్తుడైనను రూపహీనుడగుటచే నతని విషయమున రాజ్య జనులకు అనురాగము లేకుండెను. అందున అతడు రూపప్రాప్తియై తపమాచరింపగోరి రాజ్యమును మంత్రుల కప్పగించి హిమాలయమునకు ఏగెను ఉగ్ర తపమాచరింపగోరి నిర్మల కీర్తియగు ఆ రాజు తన దృఢ సంకల్ప మాత్రము తోడుగా పాదచారియై ఆ పర్వత శిఖరమునందు తపమున కనుకూలమగు తీర్థ స్థానము వెదుకగోరి పోగాపోగా సుమనోహరమై హిమవంతమున పుట్టిన ఇరావతి (ఐరావతి-రావినది) అనునది అతనికి కనబడెను. అనది మహోగ్రవేగయు చంద్ర సమాన శీతలయు హిమ సమాన కాంతియుక్తయునై యుండెను.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున భూగోళ వర్ణనమున జంబూద్వీపాంతర్గత భారతవర్ష వర్ణనమున పురూరవః పూర్వచరితమను నూట పదునాలుగవ అధ్యాయము.

## పఞ్చదశోత్తరశతతమోఽధ్యాయః.
## ఇరావతీవర్ణనమ్.

సూతః : స దదర్శ నదీం రమ్యాం పుణ్యాం హైమవతీం శుభామ్ ।

గన్ధర్వగణసఙ్కీర్ణాం నిత్యం శక్రనిషేవితామ్. 1
సురేభమదసంసిక్తపరగన్ధసమన్వితామ్ । మధ్యేన శక్రచాపాభాం తస్మిన్స్వహతి సర్వదా. 2
తపస్విశరణోపేతాం మహాబ్రాహ్మణసేవితామ్ । దదర్శ తపనీయాభాం మహారాజః పురూరవాః. 3
అచ్ఛాచ్ఛసితపానీయాం యయౌ రాజా పురూరవాః । పాణ్డుహంసావళిచ్ఛత్రాం కాశచామరవీజితామ్. 4
స్వాభిషేకార్థ మిచ్ఛన్తీం పశ్యన్ప్రీతిం పరాం యయౌ ।పుణ్యాం సుశీతలాం హృద్యాం మనసః ప్రీతివర్ధనీమ్.
క్షయవృద్ధియుతాం సౌమ్యాం సోమమూర్తిమివాపరామ్ । సుశీతశీఘ్రపానీయాం ద్విజసఙ్ఘనిషేవితామ్. 6
సుతాం హిమవతః శ్రేష్ఠాం చఞ్చద్వీచివిరాజితామ్ । అమృతస్వాదుసలిలాం సారసై రుపశోభితామ్. 7
స్వర్గారోహణనిశ్శ్రేణీం సర్వకల్మషనాశినీమ్ । అగాధాం సముద్రమహిషీం మహర్షిగణసేవితామ్. 8
సర్వలోకస్య చౌత్సుక్యకారిణీం సుమనోహరామ్ । గోకులాకులతీరాంచ రమ్యాం శైవాలవర్జితామ్. 9
హంససారససఙ్ఘుష్టాం జలజై రుపశోభితామ్ । ఆవర్తనాభిగమ్భీరాం ద్వీపోరుజఘనస్థలీమ్. 10
నీలనీరజనేత్రాన్తా ముత్ఫుల్లకమలాననామ్ । హిమాభఫేనవసనాం చక్రవాకస్తనీం శుభామ్. 11
బలాకపఙ్క్తిదశనాం చలన్మత్స్యావళిభ్రువమ్ । స్వజలోద్భవమాతఙ్గరమ్యకుమ్భపయోధరామ్. 12
హంసనూపురసంయుక్తాం మృణాళవలయావళిమ్ ।

## నూట పదునైదవ అధ్యాయము.
## ఐరావతీనదీ(రావీనది)వర్ణనము.

సూతుడు ఋషులకు ఇంకను ఇట్లు చెప్పెను: ఆ మద్ర దేశాధిపతియగు పురూరవసుడు చూచిన ఇరావతీ నది చూచుటకు మనోరమముగ నుండునది మాత్రమే కాక పుణ్యదము కూడ అయియుండెను. హైమవతి-హిమవంతము నుండి పుట్టినది-పార్వతి-కావున శుభ స్వరూప. జలక్రీడాది విహారములకై చేరిన గంధర్వులు అందెల్లపుడు నిండి యుందురు. ఇంద్రుడందు విహరించుచు ఆనందించుచు ఆనదిని నిషేవించుచుండును. దేవరాజ గజమగు ఐరావతమందు క్రీడించుచుండుటచే నీట కలిసిన మదముతో పరసైసవాసనలు కలిగియుండుటయే కాక ఆమదము నీట కలిసి ప్రవహించు ఆనదీప్రవాహ మధ్యము ఇంద్ర ధనుర్వర్ణము లీనుచుండును. దాని తీర పరిసరములందు తపసులు ఆశ్రమములు నిర్మించుకొని తపమాచరించుచుందురు. మహా బ్రాహ్మణులు తమ స్నానానుష్ఠానాదికములకై ఆనదిని సేవించుచుందురు. ఇట్టి ఆనది బంగారు కాన్తులు వెదజల్లుచుండును. మహారాజా పురూరవుడానదినిట్లు దూరమునుండి చూచుచు సమీపించిన కొలది ఆనది నీరు మిగుల తేటయై కానవచ్చెను. అతడానదిని చేరెను. తెల్లని హంసాపఙ్క్తులను శ్వేతచ్ఛత్రము పట్టుచు తన తీరములందలి తెల్లు అనెడి వింజామరలు కదల్చుచుండుటచే ఆనది తనయందు రాజును రాజలాంఛనముల-మర్యాదలతో స్నానమాడింపగోరుచున్నదో యనునట్లుండుట చూచి యాతడు మిగుల ప్రీతిననుభవించెను. ఏలయన ఆనది (తన రాజ్ఞివలె) పుణ్యమును సంపాదించి ఇచ్చునది-సుశీలవతి-హృదయమునకు హాయి గొల్పునది-మనస్సునకు ప్రీతిని వర్ధిల్ల జేయునది. రెండవ చంద్రమూర్తియో యనునట్లు (ఆయా ఋతువులందు) క్షయవృద్ధులు కలదియైనను సౌమ్యరూప స్వభావములతో నొప్పారుచుండును. మిగుల చల్లనై వేగముగ ప్రవహించు ఆనది నీటిని ద్విజ (పక్షి-బ్రాహ్మణాది త్రైవర్ణికుల) సంఘములు నిషేవించు (వినియోగించుకొని ఆనందించు)చుండును. ఆమె హిమవంతుని మేలయిన బిడ్డ; చక్కగా ఒప్పారు అలలతోను అమృతమువలె రుచిగల నీటితోను బెగ్గురు లనెడు జలపక్షులలోను ఆనది ఉపశోభిల్లుచు

నర్వకల్మష నాశనియై స్వర్గము నారోహించువారికి నిచ్చెనయో యనదగియుండెను. ఆమె సముద్రుని భార్యలలో అగ్ర గణ్య; ఆమెను ఎల్లపుడును మహర్షి గణమాశ్రయించి యుండును. మిగుల మనోహర యగుటచే ఆనదిని సమీపించి సేవించి యుపయోగించుకొని ఇహపర సుఖానందముల నెపుడందుదుమాయని ఎల్లజనులు ఉత్సుకులగుచుందురు. రమ్యమగు ఆ నదిలో నాచు ఉండదు. ఆనది తీరమున గోవులమందలు తరచైయుండును. ఆమెయందెపుడును హంస సారసములు ధ్వని చేయుచుండును; ప్రవాహము జలజములతో ఉపశోభిల్లుచుండును. సుడులే గంభీర నాభియు ద్వీపములే విశాలజఘనస్థలియు నీలోత్పలములును పద్మములును సుందర నేత్రములును వికసిత కమలములే మొగమును మంచువలె మెరయు నురుగే సూక్ష్మవస్త్రమును శోభిల్లు చక్రవాకపక్షులే స్తనములును కొంగల బారులు దంతపంక్తులును చలన్మత్స్యావళులే కనుబొమలును స్వజలమున క్రీడించి లేచుచుండు గజముల రమ్య కుంభస్థలములే స్తనములును హంసలే కాలియందెలును తామరకాడలే కరకంకణములును కాగా ఆ ఇరావతీ (రావీ) నది సుందరియగు యువతిగా తోచుచుండెను.

తస్యాం రూపమదోన్మత్తా గన్ధర్వానుగతా స్తథా. 13
మధ్యాహ్నసమయే రాజ న్క్రీడ న్త్యప్సరసాం గణాః । తామప్సరోవినిర్ముక్తాం వహన్తీం కుసుమావళిమ్.14
స్వతీరద్రుమసమ్భూతనానాగన్ధసుగన్ధినీమ్ । తరఙ్గశతసఙ్క్రాన్తసూర్యమణ్డలదుర్దృశామ్. 15
సురేభజనితాఘాతవప్రద్వయవిభూషితామ్ । శక్రేణ జుష్టసలిలాం దేవస్త్రీకుచచన్దనైః. 16
సంయుతం సలిలం యస్యాం షట్పదై రుపసేవితమ్ । తస్యా స్తీరభవా వృక్షా స్సుగన్ధికుసుమాన్వితాః. 17
మరన్దాకృష్టసంభ్రాన్త భ్రమర స్వనితాకులాః । తస్యాస్తీరే రతిం యాన్తి సదా కామవశం గతాః. 18
తపోధనా స్సమునయ స్సహదేవా స్సహాప్సరాః । రతిం లభన్తే(యత్ర)సిక్తాఙ్గా దేవేభ్యః ప్రీతమానసాః.19
స్త్రియ ఆనాకిబహుశాః పద్మేన్దుప్రతిమాననాః । యా బిభర్తి సదా తోయం దేవసఙ్ఘై ర్నిషేవితమ్. 20
* విలీనం మృగబృన్దైశ్చ వ్యాధసఙ్ఘై రపీడితమ్ । సతామరసపానీయం సతారగగనామలమ్. 21
తదా పశ్య న్నయౌ రాజా సతా మీప్సితకర్మదామ్ । యాచ తీరభవైః కాశైః పుల్లై శ్చన్ద్రాంశుసన్నిభైః.22
రాజతే విధృతాకాశై రన్యై స్తీరమహాద్రుమైః । యా సదా వివిధై ర్విప్రై ర్దేవైశ్చాపి నిషేవ్యతే. 23
యాచ సదా సకలాఘవినాశం భక్తజనస్య కరోత్యచిరేణ ।
యాఽనుగతా సరితాం హి కదమ్బై ర్యాఽనుగతా సతతం హిమనీరైః. 24
యాచ సుతానివ పాతి మనుష్యా న్యాచ యుతా సతతం హి మృగౌఘైః ।
యాచ సురాసురసిద్ధమహర్షీ న్పాతి సదా మిహికోదకమిశ్రా. 25
యుక్తాచ కేసరిగణైః కరిబృన్దయానా సన్తానయుక్తసలిలాఽపి సువర్ణవర్ణా ।
సూర్యాంశుతాపపరివృద్ధజలా హిమాంశుతుల్యామ్బుకాచ సహసా దదృశే నృపేణ. 26

ఇతి శ్రీమత్స్యమహాపురాణే భూగోళే పురూరవశ్చరితే ఇరావతీనదీవర్ణనం నామ
పఞ్చదశోత్తరశతతమోఽధ్యాయః.

అప్సరసలు ధరించి జలక్రీడా కాలమున విడిచిన పూలమాలలును రాసులును నదియందు నీటివెంట కొట్టుకొని పోవుచుండును. తన యొద్దున మొలచిన వృక్షముల సుగంధములతో ఆనది గుబాళించుచుండును. నూరుల కొలది అలల యందు ప్రతిఫలనముచే సంక్రమించిన రవి బింబములు-కన్నుల నుపహతమొనర్చుచుండ ఆనది తేరిపార చూడరా కుండును. దేవగజములు తమ దంతములతో ఒడ్డులయందు దెబ్బలు వ్రేసిన గుర్తు లలంకారములయి యుండెను. దేవేంద్రుడా నది నీటిని ననుభవించుచుండును; రూపమదోన్మత్తలగు అప్సరసలు గుంపులై రూపమదోన్మత్తులగు గంధర్వులు తమ్మనుసరింప మధ్యాహ్న సమయములందా నదియందు జలవిహారము లొనర్చుచుందురు. ఇట్టి జలక్రీడా సక్తలగు

* పుళిన్దైర్మృగసఙ్ఘైశ్చవ్యాఘ్రబృన్దై

దేవస్త్రీల హృదయములందలి చందనములతో మిశ్రితములగు ఆ ఏటి నీటిని తేటులు ఉపసేవించుచుండును. సుగంధి కుసుమాన్వితములగు తత్తీర సంజాత వృక్షములు ఆ పుష్పముల మకరందపు ఆకర్షణమునకు వశవర్తులై సంబరమున గుమియై తిరుగు తుమ్మెదల రొదలతో నిండియుండును. తపోధనులే కాదు-మునులే కాదు-దేవతలే కాదు-అచ్చరలే కాదు-ఎల్లవారును ఆనది యొడ్డున శృంగార భావవర్తులై ఆనందమందుచుందురు. స్వర్గవాసులగు దేవతలు మొదలగువారితో దట్టమైయుండి పద్మములను చంద్రుని పోలు మోములుకల దేవస్త్రీలు తన్నదీజలమున తడిసిన శరీరములు కలవారును దేవతల (తోడి క్రీడల) వలన ప్రీతినొందిన మానసములు కలవారునై ఆనందమనుభవించుచుందురు. ఆ నదీజలమును సదా దేవతలనుభవింతురు; మృగబృందములందు వ్యాధ సంఘముల పీడలనుండి తప్పించుకొనవచ్చి మునుకలతో దాగియుండును. తామరలతో నొప్పారు ఆ ఏటి నీరు తారలతోడి అమలాకాశమువలె అందగించుచుండును. ఆనది తన తీరమున పూచి వెలయు చంద్రకిరణములపోలు తెల్లు పూలతోను గగనమునే తమ శాఖాగ్రములతో నిలిపి పట్టుకొను మహాద్రుమములతోను రాజిల్లుచుండును. వివిధ దేవ భూదేవు లా నది నెల్లవేళల నిషేవించుచుందురు. భక్తజనుల కచిర కాలముననే సకల కలుష నాశము సేయునది యానది. ఎన్నియో ఏఱులును హిమజలములును ఆ ఏట కలిసిపోవు చుండును. మంచుతో చల్లనైన ఆనది మానవులను మృగ సంఘములను సురాసుర సిద్ధ మహర్షి సంఘములను కూడ ఆయా ప్రకారముల రక్షించుచుండును.

ఆ రావీనది సింహగజ యుక్తము-అయియును కరి బృందయాన (ఏనుగుల మందలచే అనుసరింపబడునది ఏనుగువలె ఠీవిగా నడచునది;)ఆనది నీరు సంతాన సహితము అయియు సువర్ణ ప్రకాశము కలది. (ఎడతెగని ప్రవాహముతో కూడినది యనియు పచ్చని కల్పవృక్షములతో కూడినది యనియు రెండర్థములు) సూర్యకిరణ తాపముచే మిగుల వృద్ధి నొందుచుండియు ఆనది నీరు చంద్రునివలె చల్లనిది. ఇట్టి ఇరావతీ నదిని ఆ మద్ర దేశాధిపతి పురూరవసుడు కాంచెను.

[ఈ చివరి శ్లోకమున విరోధాభాసాలంకారము: ఎట్లన ఒకేచోట సింహములు గజములు ఉండుట విరుద్ధము-సింహములు జలము త్రాగుటకు వచ్చును-నది నడక ఏనుగునడకవలె నుండును. అని విరోధ పరిహారము. పచ్చని ఆకులు కల చెట్ల కాంతితో కూడియు బంగారు కాంతితో నుండుట విరుద్ధము. బంగారు కాంతిగల నిరంతర ప్రవాహముండెననుటతో విరోధ పరిహారము. సూర్యకిరణములతో క్రాగిన నీరు చంద్రునివలె చల్లగా నుండుట విరుద్ధము-సూర్యుని వేడిమికి కరగినను మంచునీరు నదియందు చంద్రునివలె చల్లనై ప్రవహించుననుటతో విరోధ పరిహారము.]

ఇది శ్రీమత్స్యమహాపురాణమున సప్త ద్వీపాంతర్గత జంబూ ద్వీపాంతర్గత
భరత వర్షాంతర్గత భరతఖండ వర్ణనమున బుధపుత్ర పురూరవశ్చరితమున మద్రరాజా పురూరవుడు
ఇరావతిని చూచుటయను నూట పదునైదవ అధ్యాయము.

# షోడశోత్తరశతతమోఽధ్యాయః.
# హిమవత్పర్వతవర్ణనమ్.

సూతః : ఆలోకయ న్నదీం రమ్యాం తత్సమీరగతక్లమః ।
స గచ్ఛన్నేవ దదృశే హిమవన్తం మహాగిరిమ్. 1
ఖముల్లిఖద్భి ర్బహుభి ర్వృతం శృఙ్గైస్తు పాణ్డరైః । పక్షిణామథ సఙ్ఘాచరై ఋషీణాం సిద్ధిదం శుభమ్. 2
నదీప్రపాతసఞ్జాతమహాశబ్దం సమన్తతః । అసంశ్రితాన్యశబ్దం తు శీతతోయమనోహరమ్. 3
దేవదారువనైర్నీలైః కృతకృత్య స్స మద్రరాట్ । మేఘోత్తరీయకం శైలం దదర్శ స నరాధిపః. 4
శ్వేతమేఘకృతోష్ణీషం చన్ద్రార్కమకుటం క్వచిత్ । హిమానులిప్తసర్వాఙ్గం క్వచిద్ధాతువిచిత్రితమ్. 5

చన్దనేనానులిప్తాఙ్గం చ త్రపక్షాఙ్గకం యథా । క్వచిద్రవదం సిదాఘేపి శిలావిషమసఙ్కటమ్. 6
సాలక్తకై రప్సరసాం ముద్రితం చరణైః క్వచిత్ । ఆపానభూమిగశితై ర్గన్ధర్వాప్సరసాం క్వచిత్. 7
స్పృష్టం సూర్యాంశుభిః క్వాపి క్వచి ఛ్ఛీతసమావృతమ్ ।
దరీముఖైః క్వచి ద్భీమైః పిబన్తం సలిలం మహత్. 8
క్వచి ద్విద్యాధరగణైః క్రీడద్భి రుపశోభితమ్ । ఉపగీతం తథాముఖ్యైః కిన్నరాణాం గణైఃక్వచిత్. 9
షట్పదై స్సన్తానకాదీనాం దివ్యై స్తముపశోభితమ్ । ముక్తోజ్ఝితాభి ర్మాలాభిః కుసుమానాం తథాక్వచిత్. 10
మృదితాభి స్సమాకీర్ణం గన్ధర్వాణాం మనోరమమ్ ।

## నూట పదునారవ అధ్యాయము.

## హిమవత్పర్వత వర్ణనము.

సూతుడు ఋషులకు ఇట్లు చెప్పెను: మద్రరాజగు పురూరవుడు రమ్యమగు ఆ ఇరావతీ నదిని చూచుచున్నంత లోనే నదీవాయు స్పర్శచే నాతని బడలిక అంతయు తీరెను. ఆనదివెంట ఎగువకు మరికొంత దూరము పోగా మహాగిరి హిమవంతము కానవచ్చెను. దాని తెల్లని బహు శృంగము లాకాశమును ఒరయుచుండెను. వానిపై పక్షులనేకములు సంచరించుచు చూడముచ్చటయై ఉండెను. ఋషులకు తపోజ్ఞాన సిద్ధిప్రద మాకొండ. మరి వేరుశబ్దముల వినరాయని చప్పుడులతో పడు శీతల జలనదీ ప్రపాతములతో ఆకొండ మనోహరముగ నుండెను. (మహాబాహువులో యనదగు) నీలములగు దేవదారు వనములతో ఒప్పు ఆ కొండపై కనవచ్చు మేఘములుత్తరీయములుగా ఉండెను. ఆయా తావులందు తెల్లని మేఘములు తలపాగలై చంద్రార్కులు మకుటములై మంచు పొరలును గైరిక ధాతువులును గంధానులేపనములై వలువన్నెల వెలయుచు ఐదు వ్రేళ్ళతో రాచికొనిన చందనరేఖలో యన కనవచ్చుచుండెను. వేసగియందు చలువల ఇచ్చు శిలలతో విషమమును ఇరుకునునైన ఆ కొండపయి అప్సరల పాదముల లత్తుక పారాణి ముద్రలును ఆనవ పాన ప్రసంగమున జారిపడిన గంధర్వుల అప్సరసల కాలి గుర్తులును కనబడుచుండెను. దాని కొన్ని తావులు రవి కిరణ తప్తము కాగా మరికొన్ని కడుచల్లనై ఉండెను. కొన్నియెడల నా పర్వతము తన భయంకర గుహలను నోళ్ళతో మహాపరిమాణ జలముల త్రావుచుండెను. కొన్ని తావులు క్రీడించు విద్యాధరగణములతోను కిన్నర గణ ముఖ్యుల ఉపగానములతోను ఒప్పుచుండెను. కొన్ని తావులందు సన్తానకాది దివ్య (కల్ప) వృక్ష విశేషములు పూచిన పూలును మరికొన్నిట గంధర్వులనుభవించి విడువగా నలిగిపడిన కుసుమ మాలలును మనోరమములై యుండెను.

నిరుద్ధనవనై ర్మేఘై ర్నీలశాద్వలమణ్డితైః. 11
క్వచిచ్చ కుసుమైర్యుక్త మత్యన్తరుచిరం శుభమ్ । మృగై స్తథానుచరితం దన్తిభిశ్చ మహాద్భుతమ్. 12
యత్ర సింహనినాదేన త్రస్తానాం భైరవం రవమ్। దృశ్యతే న చ సంక్రాన్తం గజానా మాకులంకులమ్. 13
తపద్భి స్తాపసైర్యస్య కుఞ్జదేశోఽప్యలఙ్కృతః ।
రత్నైర్యస్య సముత్పన్నై స్త్రైలోక్యం చాప్యలఙ్కృతమ్. 14
అహీనశరణం నిత్య మహీన జనసేవితమ్ । అహీనః పశ్యతి గిరి మహీన మథ సమ్పదా. 15
అల్పేన తపసా యత్ర సిద్ధిం ప్రాప్స్యన్తి తాపసాః । యస్య దర్శనమాత్రేణ సర్వకల్మషనాశనమ్. 16
మహాప్రపాతసమ్పాతనదీభి ర్వేగితామ్బుభిః । వాయుసీతై స్పదాత్పృష్ఠీకృతదేశం క్వచిత్క్వచిత్. 17
అనమ్బుజలదై శ్శృఙ్గైః క్వచి ద్ధసిత ముచ్ఛ్రితైః । నిత్యార్కతాపవిషమై రగమ్యై ర్మనసా వృతమ్. 18
దేవదారుమహావృక్షప్లక్షశాఖినిర న్తరైః । వంశైశ్చ స్తమ్బసాకారపాదపై రుపశోభితమ్. 19
సింహానునాదితగుహం మహాశృఙ్గాగ్రనిర్ఝరమ్ । శబ్దలభ్యామ్బువిషమం హిమసంరుద్ధకన్దరమ్. 20

దృష్ట్వాతు తాం చారుసితప్రభూమిం మహానుభావ స్స తు మద్రరాజః ।
బభ్రామ తత్రైవ స్వయః ప్రదేశం స్వావాసయోగ్యం చ సమాససాద. 21

ఇతి శ్రీమత్స్యమహాపురాణే భూగోళే పురూరవశ్చరితే హిమవత్పర్వత వర్ణనం
నామ షోడశోత్తరశతతమోఽధ్యాయః.

ఆ కొండ మరియు ఆయా తావులయందు వాయువునే ముందునకు పోనీయని ఎత్తయిన నల్లని పచ్చికల బయళ్ళతోను వివిధ కుసుములతోను అత్యంత మనోహరమయి వివిధ మృగములయు కరులయు సంచారములతో అద్భుతమయి సింహములనాదములతోను అవి విని భయమందిన మృగముల భైరవ రవములతోను భయానకమయి యొప్పుచుండెను. ఐనను అచటి గజములు మాత్రము అలయక కలతపడకుండును. ఇంతయేల? ఆ హిమవంతమందలి పొదరిండ్లును అట తపమొనర్చు తాపసులతో అంకృతములు కాగా ఆ కొండనుండి ఉత్పన్నములగు రత్న విశేషములతో త్రైలోక్యమును అలంకృతమగుచుండును. ఆ కొండ సదా అహీన (అహి+ఇన-సర్పశ్రేష్ఠములకు) శరణము (వాసస్థానము); అహీన (హీనులుకాని గొప్ప) జనులిద్దాని సేవింతురు. సంపదలతో అహీన (యుక్త) మగు ఆగిరిని అహీనుడు మాత్రమే దర్శించును. తాపసులచట అల్ప తపమొనర్చియు సిద్ధినందుదురు. దాని దర్శన మాత్రమున సర్వకల్మష నాశమగును. తద్గిరి ప్రదేశములు కొన్ని నదీ ప్రపాత సంపాతవశమున వేగముగ పారు జలములనుండి రేగిన వాయువుచే అటకటకు కొని రాబడిన జలముల (బిందువుల)తో సంతృప్తములయి యుండెను. జలరహిత మేఘములతో వెలయు ఉన్నత శృంగములతో ఆగిరి నవ్వుచున్నదో యనునట్లుండెను. దాని శిఖరములు కొన్ని నిరంతర రవికిరణ తప్తములును విషమములును నగుటచే మనస్సుతోనైన చేరనలవి కాకుండెను. దట్టములై నిండిన ప్లక్ష (జువ్వి) దేవదారు మహావృక్షములతోను స్తంభములవలె కననగు వెదుళ్ళతోను వృక్షములతోను ఆగిరి ఉపశోభిల్లుచుండెను. ఆగిరి గుహలు సింహనాదానునాదితములు; శిఖరాగ్రములందలి వగుళ్ళతోను శబ్దము మాత్రమె లభించు జల ప్రదేశములతోను హిమముతో మూతపడిన గుహలతోను ఆగిరి కొన్ని తావుల భయానకమును విషమమును అగమ్యమునునై యుండెను. మనోహరమగు నితంబ (పర్వతమందలి చదునైన ఉన్నత) ప్రదేశములతో ఒప్పు ఆ హిమవంతమును చూచుచు పోవుచు మహానుభావుడగు ఆ మద్రరాజు పురూరవసుడు తాను వసించి తపము సేయ యోగ్యమగు తావునకై వెదకివెదకి తుదకట్టిది చేరెను.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున భూగోళ వర్ణనమున భరత వర్షాంతర్గత భరతఖండ వర్ణనమున
పురూరవశ్చరితమున మద్రరాజ పురూరవో వృత్తాంతమను నూట పదునారవ అధ్యాయము.

## సప్తదశోత్తరశతతమోఽధ్యాయః.

## హిమవత్పర్వతవృక్షాదివర్ణనమ్.

సూతః : తస్యైవ పర్వతేన్ద్రస్య ప్రదేశం సుమనోహరమ్
అగమ్యం మానుషైరన్యై ర్దైవయోగా దుపాగతః. 1

ఇరావతీ సరిచ్ఛ్రేష్ఠా యస్మాద్దేశా ద్వినిర్గతా । మేఘశ్యామంచ తం దేశం ప్రమమర్ష్టై రసేకశః. 2

సాలైస్తాలై స్తమాలైశ్చ కర్ణికారై స్సశాల్మలైః । న్యగ్రోధైశ్చ తథాఽశ్వత్థై శ్శిరీషై శ్శింశపాద్రుమైః. 3

శ్లేష్మాతకై రామలకై ర్హరీతకవిభీతకైః । భూర్జై స్సముజ్ఞాకై ర్భాణై ర్వృత్తై స్సత్వచ్ఛదైరపి. 4

మహానిమ్బై స్తథానిమ్బై ర్నిర్గుణ్డీభి ర్హరిద్రుమైః । దేవదారుమహావృక్షై స్తథా కాలేయకద్రుమైః. 5

పద్మకై శ్చన్దనై ర్బిల్వైః కపిత్థై రక్తచన్దనైః । వాతామరిష్టకాక్షీరై రశ్వకర్ణై స్తథార్జునైః. 6

హస్తికర్ణై స్సుమనసైః కోవిదారై స్సుపుష్పితైః । ప్రాచీనామలకైశ్చాపి మధూకైస్సవరాటకైః. 7

ఖర్జూరై ర్నారికేళైశ్చ ప్రియాళ్వామ్రాతకద్రుమైః । తన్తుమాలై ర్ధవైశ్చైవ కాశ్మర్యైః వర్ణిభిస్తథా. 8

జాతీఫలైః పూగఫలైః కట్ఫలై స్నల్లకీఫలైః । మన్దారైః కోవిదారైశ్చ కింశుకైః కుసుమాంశుకైః. 9
పలాశై శ్శాల్మలీభేదై ర్వేతసై ర్జలవేతసైః। రక్తారంగైశ్చ సారఙ్గైర్హిఙ్గుభి స్సప్రియఙ్గుభిః. 110
● రక్తాశోకై స్తథాశోకైః కురుకై ర్భువిరూఢకైః । ముచుకున్దై స్తథాకున్దైః కోటరూషనరూషకైః.
కిఙ్కరాతైః కిరాతైశ్చ కేతకై ర్వనకేతకైః । శోభాఞ్జనై రఞ్జనైశ్చ శుకలిఙ్గనిచోళకైః. 121
నవర్ణాకైశ్చ శయనై ర్ద్రుమశ్రేష్ఠై స్తథానసైః ।

## నూట పదునేడవ అధ్యాయము.
## హిమవత్పర్వత వృక్షాది వర్ణనము.

(ఈ అధ్యాయమున వృక్షాది వర్ణనమున కొంత పరస్పర సమ్మిశ్రణము ఉన్నను చాలభాగము ఆయా వర్గములకు చెందిన వృక్షలతాదికమును మహాముని క్రమముగా వర్ణించుట జరిగినది.)

సూతుడు ఋషులకు ఇంకను ఇట్లు చెప్పెను: ఈ హిమవత్పర్వతమునందే అతి మనోహరమగు ప్రదేశము ఒకటి కలదు. అది సామాన్య మానవులకు చేరనలవికానిదేయైనను అదృష్టవశమున మద్రరాజగు పురూరవుడు చేరెను. అచటి నుండియే నదీ శ్రేష్ఠయగు ఇరావతి ప్రభవించి బయలు వెడలును. అనేకములగు వృక్షముల సముదాయములతో ఆ ప్రదేశము మేఘములవలె నల్లనై కానవచ్చుచుండును.

(అచటి వృక్షములలో కొన్ని కలపను లక్క మొదలగు పదార్థములను అగురు మొదలగు సుగంధ ధూప ద్రవ్యములను అలంకరణ సామగ్రిని ఓషధులను ఉత్పన్నము చేయు మహావృక్షములు. అవి ఏవన): సాలతాల (తాటి) తమాల-కర్ణికార-శాల్మల (బూరుగు) న్యగ్రోధా (మర్రి) శ్వత్థ (రావి) శిరీష (దిరిసెన) శింశుపా (అగురు) శ్లేష్మాతకామలక (ఉసిరిక) హరీతక (కరక) విభీతక (తాడి) భూర్జముంజక బాణ (ఈ రెండును ఏళ్ళయొడ్డున మొలచు ముంజగడ్డి జెల్లి) సప్తచ్ఛద (ప్రతి రెమ్మయందును ఎప్పుడును ఏడాకులే ఉండెడి ఆరణ్య వృక్షము) మహానింబ (పెద్దవేప) నింబ నిర్గుండీ హరిద్రుమ దేవదారు కాలేయక పద్మక చందన బిల్వ కపిత్థ (వెలగ) రక్తచందన వాతామ రిష్టకా-క్షీరా-శ్వకర్ణార్జున (మద్ది) హస్తికర్ణ-సుమనసకోవిదార ప్రాచీనామలక మధూక (ఇప్ప) వరాటక ఖర్జూర నాళికేరప్రియా-శ్యామాతక తంతు మాలధవ భవ్య కాశ్మీర-వర్ణజాతీఫల (జాజికాయ) పూగఫల (పోక) కట్ఫల నల్లకీఫల మందార కింశుక కుసుమాంశుక పలాశ (మరియొక విధమగు మోదుగు) శాల్మలీభేద (మరొక విధమగు బూరుగు) వేతస (మెట్ట ప్రబ్బలి) జలవేతస (నీటి ప్రబ్బలి) రక్తాంగ సారంగహింగు (ఇంగువ) ప్రియంగు రక్తాశోకాశోక కురుక భువి రూఢకముచుకుంద కుంద కోట రూషక-రూషక కింకరాత కిరాతకేతక (నీటి మొగలి) వనకేతక (అడవి మొగలి) శోభాంజనాంజన శుకలింగ నిచోళక వర్ణాక శయనాఽసన వృక్షములును.

మన్మథస్య శరాకారై స్సహకారైర్మనోరమైః. 13
పీతయూథికవల్మీకై శ్శ్వేతయూథికయా తథా । జాత్యా చమ్పకజాత్యాచ తుమ్బకైశ్చ సతుమ్బకైః. 14
మోచై శ్చోచైశ్చ లికుచై స్తిలబిల్వకుసుమ్భకైః । తథాచ శుష్మచరణై ర్వరుణైః కామవల్లభైః. 15
పుష్పాఙ్కుశైశ్చవకుళైః పారిభద్రహరిద్రకైః । ధారాకదమ్బైః కుటజైః కదమ్బై ర్గిరికూటజైః. 16
ఆక్రాన్తమూర్ధకకుభైః కకుభైః కమనీయకైః । కర్కన్ధుబదరై ర్నీపై ర్ద్వీపైరివ మదోద్ధతైః. 17
రక్తైః పాలీవనైర్వృక్షై ర్దాడిమై శ్చమ్పకద్రుమైః । బన్ధూకైశ్చ సబన్ధూకైః కుఞ్జకానాంతు జాతిభిః. 18
కుసుమైః పాటలాభిశ్చ మల్లికాకరవీరకైః । కురువకై ర్హిమవజ్జీరై ర్జమ్బుభి ర్మృదుజమ్బుభిః. 19
బీజపూరై స్సకర్పూరై ర్గురుభి శ్చాగురుద్రుమైః । బిమ్బైశ్చాప్రతిబిమ్బైశ్చ సన్తానకవితానకైః. 20
తథా○తు ఫలవృక్షైశ్చ హిన్తాలఫలదన్వికైః । తృణశూన్యైః కరీషైశ్చ శాకైశ్చ మదనై స్తథా. 21

● రక్తాశోకై స్తథాశోకై రావకై

○ గుగులువృక్షైశ్చ

పీలుభి ర్ధాతకీభిశ్చ చిరిబిల్వసవాలుకైః । తిన్త్రిణీకై స్తథా లోధ్రై ర్విడఙ్గైః క్షీరికాద్రుమైః. 22
అశ్మాతకై స్తథాఙ్కోలై స్తథా చ మధుకద్రుమైః । భల్లాతకై రిన్ద్రవనై ర్వల్మీకై స్సిన్దువారకైః. 23
నాగకేసరవృక్షైశ్చ సుకేసరమనోరమైః । కరమర్దైః కానమర్దై రరిష్టకవరిష్టకైః. 24
రుద్రాక్షై ర్ద్రాక్షసమ్భూతై స్సనిమ్బైః పుత్రజీవకైః । తక్కోలై ర్లావకైశ్చాపి త్వగ్ద్రుమైః పారివేతసైః. 25

(మరికొన్ని అందమగు పూలను ఔషధములుగా పనికివచ్చు ఫలములను ఇచ్చునవి-అవి ఏవన): అనన మన్మథ శరాకార మనోరమ సహకార (రసాలమను మామిడి) పీతయూథికా-వల్మీక-శ్వేతయూథికా-జాతీ (జాజి) చంపక తీగ (సంపెగ) తుంబక మోచచోచలికుచ తిల-బిల్వ-కుసుంభక (నూనెనిచ్చు కుసుమవంట) శుష్మచరణ వరుణ కామ వల్లభ పుష్పాంకుశ వకుళపారి భద్రహరిద్రక ధారా కదంబ (ఒక కడిమి) కుటజ (కొడిసె) కదంబ (వాటుకడిమి) గిరి కుటజ సమాక్రాంత దిగంత కమనీయ కకుభ (మద్ది) కర్కంధుబదరీ మదగజ సమాన సీవరక్త (ఎఱ్ఱని) పాలీవన దాడిమద్రుమ చంపక (చెట్టు సంపెంగ) బంధూక సబంధూక కుంజకజాతిభేద (వేరువేరు జాతుల కుంజక వృక్షములు) పాటల కరవీర (ఎఱ్ఱ గన్నేరు-అదేవిధమగు తెల్లని పూలచెట్టును) కురువక (వచ్చనిములుగోరింట) హిమ వంజీరములును.

(మరికొన్ని ఓషధులుగావే విశేషముగా పనికివచ్చు చెట్లు. అవి ఏవన): జంబూ (నేరెడు) మృదు జంబూ బీజపూర కర్పూరాగురు బింబ (దొండ) సంతానక వితానక (పందిళ్ళ)ములును-ఔషధజాతి (మరికొన్ని పండ్ల చెట్లు: అవి ఏవన): హింతాల ధన్విక తృణశూన్య కరీషశాక (చాగ) మదన (ఉమ్మెత్త) పీలు ధాతకీ (ఆరె) చిరిబిల్వ వాలుక తింత్రిణీ (చింత) లోధ్ర విడంగ క్షీరికా-అశ్మాతకా-అంకోల (ఊడుగ) మధుక భల్లాతకేంద్రవన వల్మీక సిందువార సుకేసర (మనోరమ) నాగకేసర కరమర్దకానమర్దారిష్టక వరిష్టక రుద్రాక్ష ద్రాక్ష నింబ పుత్రజీవక (గారకాయ) తక్కోలలావకత్వక్ద్రుమ పారివేతసములును-

ప్రతానైః పిప్పలీనాంచ నాగవల్లీభి రుత్తమైః । మరీచానాం తథాగుల్మైః పద్మైశ్చ వనమాలికైః. 26
మృద్వీకామణ్డలై ర్మఞ్జ్యై రతిముక్తకమణ్డలైః । వకులై ర్వక్రకీనాంచ ప్రతానై స్సఫలైశ్శుభైః. 27
కూశ్మాణ్డానాం ప్రతానైశ్చ పటోలాలాబువల్లికైః । చిరణ్టస్య ప్రతానైశ్చ పటలైః కరవేల్లకైః. 28
కార్కోటకవితానైశ్చ వార్తాకై ర్బృహతీఫలైః । రాజమాషాతసీషణ్డైశ్శాకైశ్చ వివిధై స్తథా. 29
కన్దైర్విదార్యాచ తథా కరోటై స్స్వాదుసంయుతైః । సబిడారీ విష్ణుసారా జతువత్త్వగ్వివర్ధితైః. 30
సునిష్పావక వృక్షైశ్చ గవిక్షువక వాస్తుకైః । సువర్చలాభి స్సర్వాభి స్సర్షపాభి స్తథైవచ. 31
కాకోలీ క్షీరకాకోలీ వృక్షైశ్చ సుమనోహరైః । కాసుమర్దై స్తథా సాలై స్తథాకట్ఫలచక్రకైః. 32
తథా క్షీరికశాకైశ్చ కాలశాకేన వై తథా । శిమ్బిధాన్యై స్తథాధాన్యై స్సర్వై ర్నిరవశేషతః. 33
ఓషధీభి ర్విచిత్రాభి ర్దీప్యమానాభి రేవచ । ఆయుష్మద్భి స్ససస్యాభి ర్వన్యాభిశ్చ నరాధిప. 34
జరామృత్యు భయఘ్నాభిః క్షుద్భయఘ్నాభి రేవచ । సౌభాగ్యజననీభిశ్చ లతాభి శ్చాప్యనేకశః. 35
తత్ర వేణులతాభిశ్చ తథా కీచకవేణుభిః । కాశై శ్శశాఙ్కకాశైశ్చ కాశగుల్మై స్తథైవచ. 36
కుశగుల్మై స్తథారమ్యై ర్గుల్మై శ్చేక్షో ర్మనోరమైః । కార్పాసద్రుమ సఞ్జేన దుర్లభేన శుభేనచ. 37
తథాచ కదలీషణ్డై ర్మనోహారిభి రుత్తమైః । తథా మరకతప్రస్థ ప్రదేశైశ్శాద్వలాన్వితైః. 38
హరిత్పుష్ప సమాయుక్తైః కుఙ్కుమస్యచ భాగశః । భృఙ్గరాజ జటామాంసీ గ్రన్థికై స్తుమురాఙ్గదైః. 39
స్వర్ణపుష్పా యథాభూమి ర్నానాపుష్పై స్తథావరైః । జమ్బీరికా భూతృణకై స్సరసైః కకుభై స్తథా. 40
శృఙ్గిబేరాజమోదాభిః కుహకైశ్చ ప్రియాళుకైః । జలజైశ్చ తథావర్ణై ర్నానావర్ణై స్సుగన్ధిభిః. 41

ఉదయాదిత్య సఙ్కాశైః పూర్ణచన్ద్ర నిభై స్తథా । తపనీయసవర్ణైశ్చ అతసీపుష్ప సన్నిభైః. 42
శుకపత్ర నిభైశ్చాన్యై స్సలపాలైశ్చ భాగశః । పఞ్చవర్ణైస్సమాకీర్ణై ర్బహువర్ణై స్తథైవచ. 43
ద్రష్టృదృష్ట్యాహితముదైః కుసుమై శ్చన్ద్రసన్నిభైః । తథా వహ్నిశిఖాకారై ర్గజవక్త్రోత్పలై శ్శుభైః. 44
నీలోత్పలై స్సకర్పూరై ర్గుఞ్జాతక కశేరుకైః । శృఙ్గాటకస్సృగాలైశ్చ భరటైశ్చ స్థలోత్పలైః. 45
జలజై స్థ్సలజై ర్మూలైః ఫలైః పుష్పై ర్విశేషతః । వివిధైశ్చైవ నీవారై ర్మునిభోజ్యై ర్నరాధిప. 46
న తద్ధాన్యం న తత్స్వల్పం న తచ్ఛాకం న తత్ఫలమ్ ।
న తన్మూలం న తత్కన్దం న తత్పుష్పం నరాధిపః. 47
నాకలోకోద్భవం నిత్యం నరలోకోద్భవంచ యత్ । అనూపోత్థం వనోత్థంచ యత్రతత్రాస్తి పార్థివః. 48
సదాపుష్పఫలం సర్వ మజర్యమృతుయోగతః । మద్రేశ్వర స్స దదృశే తపసోర్థోపయోగతః. 49

(మరికొన్ని వివిధోప యోగములుకల తీగల గుబురు పొదల జాతులు. అవి ఏవన): పిప్పలీ నాగవల్లీ (తమలపాకు) మరీచ (మిరియపు) పద్మ-వనమాలికా మృద్వీకా (ద్రాక్ష)ఒతిముక్తక వకుల (పొగడ) నఫల (పండ్లుగల) వక్రకీ కూశ్మాండ (బూడిద గుమ్మడి) పటో (పొట్ల) లాఒలాబు (సొర) చిరంట కారవేల్ల (కాకర) కార్కోటక వార్తాక (వందిలి వంగ) బృహతీ ఫల రాజమాషాతసీ (బొబ్బర-అవిసె) త్యాది వివిధ శాకలతా ప్రతానములును రుచిమంతములును కంద విదారీ కరోట బిడారీ విష్ణుసారాజతువత్ త్వగ్వివర్ధిత నిష్పావక గవిశువక వాస్తుక సువర్చలా సర్షవములును (ఆవాలు) కాకోలీక్షీరకాకోలికానమర్దసాల కట్ఫల చక్రక వృక్షములును క్షీరక శాక కాలశాకములును శింబి ధాన్య ప్రభృతి సర్వ ధాన్యములను విచిత్రములును ప్రకాశించునవియు దీర్ఘాయువు కలవియు సస్యయుతములును నగు వన్యములగు ఓషధులును జరామృత్యు క్షుద్భయ నాశకములును సౌభాగ్య వర్ధనములునునగు అనేక లతలును తీగ వెదుళ్ళు బొంగు వెదుళ్ళను చంద్రునివలె మెరయు పూలుగల రెల్లు పొదలును రమ్యములగు దర్భల చెరకుల గుబురులును దుర్లభములును శుభకరములునగు తెగకు చెందిన ప్రత్తిచెట్లును మనోహరములును నుత్తమములునగు అరటి గుబురులును పచ్చిక బయళ్ళతో నిండిన గరుడ పచ్చమణుల నెత్తములును పచ్చని పూవులతో వెలయు కుంకుమ పొదలును భృంగరాజ జటామాంసీ గ్రంథికతుమురాఒంగదములను ఓషధి వృక్షకము (మొక్క)లును భూమి బంగారు పూవులు దాల్చెనేమో యని తోపజేయు మరి ఇతరములగు పూవులును సరసములగు జంబీరికా భూతృణక కకుభ వృక్షములును శృంగిబేరాజమోదా (వాము) కుహక ప్రియాళుక వృక్షలతాదికమును ఏ వన్నెయు లేనివి పలువన్నెలు కలవియగు సుగంధవంతములు నగు తామరలును ఉదయ సూర్యునివలె పూర్ణచంద్రునివలె కాచిన బంగారువలె అవిసె పూలవలె చిలుక తెక్కలవలె మెరయు మెట్టయందు పూచు పూలును ఐదు వన్నెలు ఇంకను ఎక్కువ వన్నెలు కలిగి చూపఱ కంటికింపు కలిగించు మరి ఇతర పుష్పములును చంద్రునివలె వహ్ని జ్వాలలవలె మెరయు శుభములగు గజ వక్త్రోత్పలములును (కలువ) నీలోత్పలములును కర్పూర పుష్పములును గుంజాతకములును కశేరుకములును శృంగాటకములును సృగాలములును భరటములును స్థలోత్పలములును (మెట్ట కలువలు) మరికొన్ని నీటియందు మెట్టయందు మొలచి పెరుగు కందమూలఫల పుష్ప విశేషములను మునుల కాహారములగు వివిధ నీవార ధాన్యములును ఆ ప్రదేశమునందు ఆ రాజునకు కనవచ్చెను.

స్వర్గమందో నరలోకమందో జలప్రాయ ప్రదేశములందు గాని మెట్టపైగాని వనములందుగాని లభించు ఆయా జాతులలో అచట లేని ధాన్యము కాని పుష్పముకాని శాకము కాని ఫలముకాని కందముకాని మూలము కాని ఏదియు నుండదు. అవి అన్నియు ఎల్లప్పుడు ఫల పుష్పములను కందమూలాదికమును ఇచ్చునదే కాని ఋతు లక్షణ వశమున నశించునవి కావు. తపశ్శక్తికివి యన్నియు ఉపయుక్తములును అనుకూలములును అగుననుకొనుచు రాజవి యన్నియు చూచుచుండెను.

దదృశేచ తథాతత్ర నానారూపపతత్రిణః । మయూరా శ్చిత్రపక్షాంశ్చ కాకకజ్ఞాంశ్చ కోకిలాన్. 50
బకా న్కాదమ్బకాన్ హంసా న్కోయష్టీన్ ఖఞ్జరీటకాన్ ।
కుక్కుటా న్కాష్ఠకూటాంశ్చ ఖట్వాఙ్గా ల్లుబ్ధకీం స్తథా. 51
గౌక్షేడకాం స్తథాకుమ్భాన్ ధార్తరాష్ట్రా ఞ్ఛుకాన్బకాన్ ।
ధాతుకాం శ్చక్రవాకాంశ్చ కటుకా న్టిట్టిభాన్ దృఖాన్. 52
పుత్త్రప్రియా న్లోహపృష్ఠా న్గోచర్మగిరివర్తకాన్ । పారావతాంశ్చకమలా శ్శారికా జీవజీవకాన్. 53
లావవర్తకవర్తాంశ్చ రక్తవత్సప్రభద్రకాన్ । తామ్రచూడా న్స్వర్ణచూడా న్కుక్కుటా న్కాష్ఠకుబ్జకాన్.
కపిఞ్జలా న్కలవికాం స్తథా కుఙ్కుమచూడకాన్ । భృఙ్గరాజాన్ సారపాదాన్ భుల్లిఙ్గాన్ పిణ్డమానవాన్.
మంజులీతక దాత్యూహాన్వ్యా ఘ్రాన్యాత్రా న్స పక్షకాన్ । భారద్వాజాం స్తథా చాషా న్సువర్ణానంజలీయకాన్.
భౌమపుత్త్రా న్సదాజ్వాలాన్సువర్ణాన్భాజనా న్తికాన్ । ఏతాంశ్చాన్యాంశ్చ బహుశః పక్షిసఙ్ఘా న్మనోహరాన్. 57
శ్వాపదా న్వివిధాకారా న్మృగాంశ్చైవ మహామృగాన్ ।
వ్యాఘ్రాన్కేసరిణ స్సింహాన్ ద్వీపిన శ్శరభా న్వృకాన్. 58
ఋక్షాం స్తరక్షాంశ్చ మృగా న్గోలాఙ్గూలాంశ్చ వానరాన్ । శశకా న్మశకా న్దంశా న్మార్జారా న్వాయువేగినః.
మూషికా న్నకులా న్కాంశ్చి చ్ఛివనోదవకాలకాన్ । తథా మత్తాంశ్చ మాతఙ్గా న్గోమహిష్యశనా న్వృకాన్.
చామరా న్సృమరాంశ్చైవ తథా గౌరముఖాం స్తథా ।
ఉరభ్రాంశ్చ తథా మేషాం శ్శారఙ్గా నథ కుక్కుటాన్. 61
తరక్షూ నృక్షకానృక్షాన్ షపక్వాన్కుకురాన్మృగాన్ ।
నీలాన్మృగా న్మర్కటకా న్మహానీలాంశ్చ రావకాన్. 62
శ్వదంష్ట్రా న్రామశరభాన్ కోరకారకసఞ్చరాన్ ।

ఇవికాక యారాజు చూడ ఇంపుగొలుపు వివిధ పక్షులను-పలువన్నెల వెలయు తెక్కలీకలుకల నెమళ్ళు కాక కంక కోకిల బక కాదంబక హంసకోయష్టిఖంజరీట కుక్కుట కాష్ఠకూట ఖట్వాంగ లుబ్ధక గౌక్షేడక కుంభ ధార్తరాష్ట్ర శుక ధాతుక చక్రవాక కటుక టిట్టిభ పుత్త్రప్రియలోహపృష్ఠ గోచర్మ గిరివర్తక పారావత కమల శారికా జీవంజీవకలావ-వర్తక-వర్త రక్తవత్స ప్రభద్రక తామ్రచూడకుక్కుట స్వర్ణ చూడకుక్కుట కాష్ఠకుబ్జక కపింజల కల వింక కుంకుమ చూడక భృంగరాజ సారపాద భుల్లింగ పిండమానవ మంజులీతక దాత్యూహ వ్యాఘనపక్షక యాత్ర భారద్వాజచాష సువర్ణాఽంజలీయక భౌమ పుత్త్ర సదాజ్వాల భాజనాంతికములు అనెడి వానిని చూచెను. మనోహరములగు వేరువేరు పక్షులమందలను ఆ మద్రరాజ పురూరవసునకు అట కనఁబడ్యెను.

మరియు వివిధాకారములగు వన్య క్రూర మృగములు మహామృగములు వ్యాఘ్రములు కేసరయుత సింహములు ద్వీపి శరభ వృక ఋక్షతరక్షు మృగగోలాంగూల వానర శశకమశక దంశ (వాయువేగి) మార్జాల మూషికనకుల శివనోదవకాలక మత్తగజ గోమహిష్యశన వృక చమర సృమర గౌరముఖోరభ్రమేష మేష సారంగ కుక్కుట (ఇది ఒక మృగము-కోడికాదు) తరక్షు ఋక్షక ఋక్షక్షపక్వకుకుర మృగ మర్కటక (చిరుకోతులు) మహానీలరావకశ్వ దంష్ట్ర రామశరభ కోరకారక సంచర కరాళకృతమాలకాలపుచ్ఛతోరణోష్ట్ర ఖడ్గవరాహ తురగ గర్దభములును ఆ రాజున కచట కాననయ్యెను.

కరాళాన్కృతమాలాంశ్చ కాలపుచ్ఛా న్స్తతో రణాన్. 63
ఉష్ట్రా న్ఖడ్గా న్వరాహాంశ్చ తురఙ్గవర గర్దభాన్ । ఏతా నస్వీక్ష్య మద్రేశో విరుద్ధాంశ్చ పరస్పరమ్. 64

అవిరుద్ధాం శ్చ తే తస్మి న్నిర్వృతిం పరమాం యయౌ ।
తదాశ్రమం పరంపుణ్యాం సతు మద్రేశ్వరో నృపః. 65
తత్ప్రభావా త్ప్రభాయుక్తం స్థావరై ర్జఙ్గమై స్తథా । హింస న్తిహి నచాన్యోన్యం హింసకాస్తు పరస్పరమ్. 66
క్రవ్యాదాః ప్రాణిన స్తత్ర సర్వే క్షీరఫలాశినః । నిర్మితం తచ్చ తద్వద్వై చాత్రిణాతు మహాత్మనా. 67
శిలాయాం నిమ్నదేశే చావసత్తత్ర స్వయంనృపః । పయఃక్షర న్తి తే దివ్య మమృతస్వాదుసన్నిభమ్. 68
క్వచిద్గ్రామ్య మహిష్యశ్చ క్వచిద్గావశ్చ సర్వశః । గోక్షీరేణచ సమ్పూర్ణా దదృ్శా చాన్యత్రవా బహూ. 69
సోఽపశ్య త్పరమాం ప్రీతి మవాప వసుధాధిపః । సరాంసి తత్ర దివ్యాని నద్యశ్చ విమలోదకాః. 70
ప్రణాళికా న్యశోష్యాణి శీతలానిచ భాగశః । కన్దరాణిచ శైలస్య సుసేవ్యాని పదేపదే. 71
హిమపాతో న తత్రాస్తే సమన్తా త్పఞ్చయోజనమ్ । ఉపత్యకాసు శైలస్య శిఖరేషు న విద్యతే. 72
తత్రాస్తి రాజచ్ఛిఖరం పర్వతేన్ద్రస్య పాణ్డరమ్ । హిమపానం సమాదాయ ఘనాః కుర్వ న్తి సంహతాః. 73
తత్రాస్తి చాపరంశృఙ్గం సదాతోయఘనావృతమ్ । నిత్యమేవాభివర్ష న్తి శిలాభి శ్శిఖరంపరమ్. 74
తత్పరం సుమనోహారి యత్ర కామహరో హరః । సురముఖ్యోపయోగిత్వా చ్ఛాఖిన స్సఫలాస్సదా. 75
సదోపగీతభ్రమరా స్సురస్త్రీసేవి తాస్సురాః । సర్వపాపక్షయకరం శైలస్యైవం మనోహరమ్. 76
వానరైః క్రీడమానాశ్చ దేశేదేశే నరాధిప । హిమపుఞ్జకృతా స్తత్ర పూర్ణబిమ్బసమప్రభాః. 77
తమాశ్రమం సమన్తాచ్చ హిమసంరుద్ధకన్దరైః । శైలవాటైః పరివృత మగమ్యం మనుజై స్సదా. 78
పూర్వారాధితభాగ్యోసౌ మహారాజః పురూరవాః । తమాశ్రమ మనుప్రాప్తో దేవదేవప్రసాదతః. 79
తమాశ్రమం శ్రమహరం సుగన్ధంచ మనోరమమ్ ।
సుపుష్పితైః కుసుమశతై రలఙ్కృతంకృతంస్వయం రుచిర మథాత్రిణా శుభమ్. 80
సుయోగదం మునివరసేవితం మహ చ్ఛుభావహం సతు దదృశేఽథ మద్రరాట్. 80½

ఇతి శ్రీమత్స్యమహాపురాణే భూగోళే పురూరవశ్చరితే హిమవద్ వృక్షాదివర్ణనం నామ సప్తదశోత్తర శతతమోఽధ్యాయః.

మద్రరాజునకు కనబడిన ఈ మృగములలో పరస్పర సహజ విరోధము కలవియు కలవు. ఐనను నవి విరోధము లేక మెలగుటచూచి ఆతడు మిగుల ఆనందము చెందెను. ఈ ఆశ్రమము మిగుల పుణ్యకరము. ఆది ఎవరిదో ఆ మహా వీయుని ప్రభావమున అచటి స్థిర (వృక్షాది) చర (పక్షిమృగాది) ప్రాణులన్నియు కాంతిమంతములయి వెలుగొందు చుండెను. అచటి పక్షి మృగములలో పరస్పర హింసకములును ఆ లక్షణము లేక శాంతితో నుండెను. అచట మాంసా హారి ప్రాణులన్నియు పాలు పండ్లు త్రాగి తిని జీవించును. మహాత్ముడగు అత్రిముని దానినిట్టి దానినిగా నొనర్చెను. (అచటి ఈ ప్రశాంతతకు ఆ మహాత్ముని ప్రభావము హేతువు.)

ఆరాజు తానచట ఒక పల్లమున శిలపై కూర్చుండెను. అచటి గ్రామ్య (అరణ్యములుకాని) గేదెలును ఆవులు అమృతమువంటి రుచికల పాలు స్రవించుచుండెను. అచటి తావులన్నియు ఆలపాలతో పెరుగుతో మిక్కిలిగ నిండి ఉండుటచూచి యారాజు మిగుల ఆనందమందెను. అచటి సరస్సులు దివ్యములు-నదులు నిర్మలోదకములు-ఊటలన్నియు ఎండనివి చల్లనివి; అడుగడుగున గుహలు తమ్ము చేరిన వారికానందప్రదములు. ఆ చుట్టుపట్టుల ఐదు యోజనముల మేర పర్వత సమీప భూములందుకాని పర్వత శిఖరములందు కాని హిమపాతము లేదు.

అచట మంచును త్రావి ఘనీభవించి తెల్లనై వెలుగొందు మేఘములతో నిండి ప్రకాశించు హిమాలయపు శిఖరము ఒకటి కలదు. అచటి పతినరములందే ఎల్లవేళల నజలములగు జలదములతో నిండి కనులపండువు సేయు

శిఖరమింకొకటి కలదు. ఆ మేఘములా శిఖరమును తమ వాన నీటితో నెల్లవేళల తడుపుచుండును. కామిహృదయ హరులైన కోటి సదా అట నివసించునన ఆ ప్రదేశము మిగుల మనోహరమని మరి చెప్పవలెనా?

దేవ ముఖ్యులు అచట నెల్లవేళల సుఖము ననుభవించుచు ఆనందించుచుందురు. అందులకు అనుకూలముగానే ఆ శిఖరమందలి ఫల వృక్షములన్నియు నిరంతరము సఫలములు; అచటి పూల-పండ్ల సుగంధములచే నాకర్షింపబడు తుమ్మెదలు సదా రొద సేయుచుండును. అచట తమ అంగనల సేవలందుకొనుచు దేవతలానంద విహారములు సేయుచుందురు. ఆ పర్వత శిఖరము ఇట్లు సుమనోహరమగుటతోపాటు సర్వపాప క్షయకరమయి యుండెను. ఆయా ప్రదేశము లందు క్రీడించుచుండు వానరములు చూపఱకు కుతూహల వినోదములు కలిగించుచుండును, అచటనచట కనవచ్చు హిమ రాశి ఘనములు పూర్ణ చంద్ర బింబమువలె ప్రకాశించుచుండును.

ఇట్టి ఆ ఆశ్రమమునకు అన్నివైపులను మంచుతో మూతపడిన గుహలును చిరుకొండల వరుసలును ఉండి మనుజులకు ఎన్నడును అగమ్యములయి యుండెను. అయినను పూర్వ పుణ్య కర్మానుష్ఠానమున అదృష్టమును సంపాదించినవాడగుటచేతను దేవదేవుడగు శివుని యనుగ్రహమునను మద్రమహారాజా పురూరవుడు అటకు చేరి ఆ అత్రిమున్యాశ్రమమును చేరగలిగెను. అత్రి మహాముని తనకై మీర్పరచుకొనినదియు ఆ మహనీయుని తపోబలముచే వర్ధితమహిమమును శ్రమ హరమును సుగంధయుతమును మనోహరమును చక్కగా పూచి వికసించిన నూరులకొలది పూలతో అలంకృతమును యోగసిద్ధి ప్రదమగుటచే మునిశ్రేష్ఠులకును ఆశ్రయమును శుభావహమును అగు ఆ ఆశ్రమమును మద్ర భూపాలుడు నమ్రతతో కాంచెను.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున భూగోళ వర్ణనమున జంబూ ద్వీపాంతర్గత భరతవర్ష భరతఖండ వర్ణనమున పురూరవశ్చరితమున హిమవత్పర్వత వృక్షాది వర్ణనమున అత్రి మున్యాశ్రమ వర్ణనమను నూట పదునేడవ అధ్యాయము.

## అష్టాదశో త్తరశతతమోఽధ్యాయః.

### పురూరవసోఽత్ర్యాశ్రమగమనమ్-తత్తపశ్చర్యా చ.

సూతః తత్రాయతే మహాశృఙ్గే మహావర్షే మహాహిమే ।
తృతీయం తు తయోర్మధ్యే శృఙ్గం మత్యన్తముచ్ఛ్రితమ్ ॥ 1
నిత్యాతపో త్తమశిలం తదపి శ్రమవర్జితమ్ । తస్యాధస్తాద్వృక్షషణ్డే దేశే నాగేతువక్షమే ॥ 2
జాతీలతాపరిక్షిప్తం వివరం చారుదర్శనమ్ । దృష్ట్వైవ కౌతుకావిష్టస్తత్ర వివేశ మహీపతిః ॥ 3
తమసా చాభినిర్వ్యష్టం నల్పమాత్రం మహీపతిః । నల్పమాత్ర మతిక్రమ్య సుప్రభాకరజోజ్జ్వలమ్ ॥ 4
సముచ్ఛ్రితమహాత్మ్యత్ర గమ్భీరవరివర్తులమ్ । న తత్ర సూర్యస్తపతి న విరాజతి చన్ద్రమాః ॥ 5
తథాపి దివసాకార ప్రకాశం తమహర్నిశమ్ । క్రోశాధికపరీణాహసరసా చ విరాజితమ్ ॥ 6

## నూట పదునెనిమిదవ అధ్యాయము.

### పురూరవసు అత్ర్యాశ్రమమున కేగుట-తపమాచరించుట.

హిమాలయమునందలి ఇట్టి ప్రదేశములో చాల ఎత్తయిన రెండు శిఖరములు కలవు. వానియందు అధికముగా వర్షము కురియుచు మంచుపడుచు ఉండును. ఈ రెంటి నడుమ మిక్కిలి చాల ఎత్తయిన మూడవ శిఖరము కలదు. దాని శిలలు ఎడతెగక ఎండతో కాలుచుండును; అయినను అచట శ్రమతోచదు. ఆ శిఖరమునకు దిగువలో పడమటగా చెట్ల గుబురులో జాజి తీగలు క్రమ్మియున్నదై చూడముచ్చటగా నున్న గొంది ఒకటి కనబడగా కుతూహలము కలిగి పురూరవో రాజందు ప్రవేశించెను. చీకట్లు దట్టముగా క్రమ్మియున్న ఆ ప్రదేశము నల్పమాత్రము (నాలుగు పు. 53)

వందల ధనువులు; ధనువు = నాలుగు మూరలు) పొడవుండెను. అది దాటిన తరువాత చక్కని కాంతులే ఆభరణములుగా ప్రకాశించునది చాల ఎత్తైనది చాల లోతుకలది లోపలికి వ్యాపించినది; గుండ్రనిది ఒకచోటు కలదు. అచట సూర్యుడు తన ఎండను చంద్రుడు తన వెన్నెలను ప్రసరింపజేయుదు. ఐనను అది అహర్నిశములు పగలువలె ప్రకాశించుచుండును. దానియందు క్రోశముకంటె ఎక్కువ వ్యాసముగల (క్రోశము = 1000 ధనువులు) సరస్సు అందగించుచుండెను.

సమన్తా త్సరసస్తస్య శైలలగ్నాతు వేదికా । సౌవర్ణైరాజతైర్వ్యక్తై ర్విద్రుమైశ్చైవశోభితా. 7
నానామాణిక్యకుసుమై స్స్వప్రభాభరణోజ్జ్వలైః । తస్మి న్సరసి పద్మాని పద్మరాగచ్ఛదానిచ. 8
వజ్రకేసరయుక్తాని సుగన్ధీని తథావ్యతి । పత్త్రై ర్మరకతై ర్నీలై ర్వైడూర్యైశ్చ మహీపతే. 9
కర్ణికాశ్చ తథా తేషాం జాతరూపాశ్చ పార్థివ । తస్మిన్సరసి భూమిర్యా న సాపఙ్కసమాకులా. 10
నానారత్నై రుపచితా జలజానాం సమాశ్రయా । కపర్దకానాం శుక్తీనాం శఙ్ఖానాంచ మహీపతే. 11
మకరాణాంచ మత్స్యానాం జలజానాంచ కచ్ఛపైః । తత్ర మరకతఖణ్డాని వజ్రాణిచ సహస్రశః. 12
పద్మరాగేన్ద్రనీలాని మహానీలాని పార్థివ । పుష్యరాగాణి రమ్యాణి తథా కార్కోటకానిచ. 13
తుత్థకస్యచ ఖణ్డాని తథా విష్ణుమణేరపి । రాజావర్తకముఖ్యాని రుధిరాక్షస్య చాప్యథ. 14
సూర్యేన్దుకాన్తయో శ్చైవ నీలో ర్వైరాతలస్యచ । జ్యోతీరసస్య రమ్యస్య సమకస్యచ భాగశః. 15
పురోరగబలాక్షాణాం స్ఫాటికస్య తథైవచ । గోమేదవిత్తకానాం చ ధూళీమరకతస్యచ. 16
వైడూర్యసౌగన్ధికయో స్తథా రాజమణే ర్నృప । ఖఞ్జస్యచైవ ముక్తస్య తథా బ్రహ్మమణేరపి. 17
ముక్తాఫలానాం శుద్ధానాం తారావిగ్రహధారిణామ్ । సుఖోష్ణంచైవ తత్తోయం స్నానా చ్ఛీతవినాశనమ్. 18

ఈ సరస్సునకు అన్ని వైపులను వ్యాపించి కొండను అంటుకొని వేదిక (పొదరిండ్లతో నిండిన ప్రదేశము) ఒకటి కలదు. కన్నులకింపగు కాంతులే ఆభరణములై ప్రకాశించు మణి కుసుమములుకల బంగారు వెండి పగడపు చెట్లటనుండెను. ఆ సరస్సునందలి తామర పూవుల దళములు పద్మరాగములతో కేసరములు వజ్రములతో ఆకులు మరకతములతో వైడూర్యములతో దుద్దులు బంగారుతో ఏర్పడి సుగంధ యుతములై యుండెను. ఆ సరస్సునందును పరిసరములందును ప్రదేశము బురద లేక అది నానావిధ రత్నములతో పద్మములతో గవ్వలతో శంఖములతో ముత్తెపు చిప్పలతో మకరమత్స్య కూర్మాదులతో వెలయుచుండెను.

పద్మరాగేంద్ర నీలమహేంద్ర నీలకార్కోటక తుత్థక-విష్ణుమణి-రాజావర్తక-రుధిరాక్ష-సూర్యకాంత చంద్ర కాంత-నీలు-వైరాతల-జ్యోతీరస-సమక పురోరగ-బలాక్ష-స్ఫటిక-గోమేద-విత్తక-మరకత-వైడూర్య-సౌగంధిక-రాజమణి-ఖంజ-ముక్త-బ్రహ్మమణి-తారాసదృశముక్తాఫల-రత్న ఖండములట నుండెను. ఆ కొలని నీరు స్నానమాడినంతనే చలి పోగొట్టి హాయిగొల్పునంత వేడిగా నుండును.

వైడూర్యసుశిలా మధ్యే సరస శ్చోపశోభితా । ప్రమాణేచతథాభూతా ద్వేచ రాజన్ధనుశ్శతే. 19
చతురశ్రా తథారమ్యా నిర్మితాచ తథాత్రిణా । బిలద్వారసమోద్దేశ స్తత్రచాపి హిరణ్మయః. 20
ప్రదేశస్సతు రాజేన్ద్ర ద్వీపే తస్మి న్మనోహరే । తథా పుష్కరిణీ రమ్యా తస్మి న్రాజచ్ఛిలాతలే. 21
సుశీతామలపానీయా జలజైశ్చ విరాజితా । ఆకాశప్రతిమా రాజం శ్చతురశ్రా మనోహరా. 22
తస్యా స్తదుదకం స్వాదు లఘు శీతం సుగన్ధిచ । న క్షిణోతి తథాకణ్ఠం కుక్షిం నాపూరయత్యపి. 23
తృప్తిం విధత్తే పరమాం శరీరేచ మహత్సుఖమ్ ।

ఆ సరస్సు నడుమ వైదూర్య శిల ఉపశోభిల్లుచుండెను. దాని (ఒక్కొక్క భుజము) ప్రమాణము రెండు వందల ధనుపులు; అది చతురస్రమును రమ్యమునునై యుండునట్లు అత్రి మహాముని నిర్మించెను. (ఇచ్చటి ఈ రమ్య పవిత్ర ప్రదేశములన్నియు అత్రి తపో నిర్మితములే.) అచట సరస్సు నడుమ పర్వత బిలద్వార సన్నికములగు ఉద్దేశములు (చిన్న చిన్న ప్రదేశములు) గల హిరణ్మయ ప్రదేశపు ద్వీపమొకటి ఉండెను. ఆ మనోహర ద్వీపము నడుమ మిగుల ప్రకాశించు వైదూర్య శిలా తలము నడుమ కంటికింపగు చతురస్ర పుష్కరిణి కలదు. దానియందును పద్మములు కలవు. దాని నీరు మిగుల చల్లనిది స్వచ్ఛమయినది మధురమయినది తేలికయైనది సుగంధయుతము. అది త్రాపినచో కంఠము బాధ నొందదు; కడుపు నిండి బరువెక్కదు; కాని ఆనీరు పరమ తృప్తిని శరీరమునకు మహా సుఖమును కలిగించును.

మధ్యేచ తస్యాశ్చ కృతః ప్రాసాద స్తవసాత్రిణా. 24
రుక్మసేతుప్రదేశశ్చ సర్వరత్నమయ శ్శుభః । శశాఙ్కరశ్మిసఙ్కాశః ప్రాసాదో రాజతోహి సః. 25
రత్నవైడూర్యసోపానో విద్రుమామలసాలకః । ఇన్ద్రనీలమహాచక్రో జాతరూపవిభూషితః. 26
పద్మరాగమహా స్తమ్భ స్తథామరకతవేదికః । రత్నాంశుజాలస్ఫురితో రమ్యో దృష్టిమనోహరః. 27
ప్రాసాదే తత్ర భగవాన్ దేవదేవో జనార్దనః । *భోగిభోగావళీసుప్త స్సర్వాలఙ్కారభూషితః. 28
జాను రాకుఞ్చితశ్చైవ దేవదేవస్య చక్రిణః । ఫణీన్ద్రసన్నివిష్టోంఘ్రి ర్ద్వితీయశ్చ నరాధిప. 29
లక్ష్మ్యామాసక్తదృష్టేస్తు శేషభోగప్రశాయినః । ఫణీన్ద్రభోగవిన్యస్త బాహుదణ్డోపశోభితః. 30
అఙ్గుష్ఠపృష్ఠవిన్యస్త దేవశీర్షోదరం శుభమ్ । ఏకస్తు దేవదేవస్య ద్వితీయ స్సుప్రసారితః. 31
సమాకుఞ్చితజానుస్థ మణిబన్ధ సుశోభితః । కిఞ్చిదాకుఞ్చితశ్చైవ నాభిదేశే తథాస్థితః. 32
తృతీయస్తు కర స్తస్య చతుర్థంతు తథా శృణు । ఆత్తసన్తానకుసుమ ఘ్రాణదేశానువర్తనమ్. 33
లక్ష్మ్యా సంవాహ్యమానాఙ్ఘ్రిః పద్మపత్రనిభైః కరైః । సన్తానమాల్యమకుట హారకేయూరభూషితమ్. 34
భూషితంచ తథా దేవ మఙ్గదై రఙ్గుళీయకైః । ఫణీన్ద్రఫణవిన్యస్త చారురత్నశిఖోజ్జ్వలమ్. 35
జ్ఞానినామప్యగమ్యం తం ప్రతిష్ఠిత మథాత్రిణా । సిద్ధాభిపూజ్యం సతతం సతతం కుసుమాన్వితమ్. 36
దివ్యగన్ధానులిప్తాఙ్గం దివ్యధూపేన ధూపితమ్ । సరసైస్సుఫలై ర్హృద్యైశ్ స్సిద్ధై రుపహృతై స్సదా. 37
శోభితోత్తమపార్శ్వం తం దేవ ముత్పలశీర్షకమ్ । తత స్సమ్ముఖ ముద్వీక్ష్య వవన్దే స నరాధిపః. 38

ఆ పుష్కరిణి నడుమ అత్రి మహాముని తన తపముచే నిర్మించిన ప్రాసాదము (దేవాలయము) ఒకటి కలదు. దాని నిర్మాణమునకై అమర్చిన చోటిని పుష్కరిణి నీటినుండి వేరుపరచుటకు నలువైపుల చతురస్రాకారమున నిర్మించిన అడ్డుకట్ట (సేతువు) నానా రత్నములు పొదిగిన బంగారుతో నిర్మితమై శోభిల్లుచుండెను. ఆలయము. చంద్ర కిరణములవలె వెలయు వెండితో దాని మెట్లు వైదూర్యములతో ప్రాకారము పగడములతో లోపలి కప్పుపైనుండు మహాచక్రము బంగారు పొదిగిన ఇంద్రనీలములతో మహా స్తంభములు పద్మరాగములతో వేదికలు మరకతములతో నిర్మితములు; ఇట్లు అది రత్న కిరణరాశితో తళతళలాడుచు దృష్టిమనోహరము రమ్యమునై యుండెను.

ఇట్టి ఆలయమున దేవదేవుడు భగవానుడు నగు జనార్దనుడు (నారాయణుడు) అర్చామూర్తియై ఉండెను. ఆ దేవుడు అనంతుని పడగల గమిపై పండుకొన్నవాడు-సర్వాలంకార భూషితుడు; ఆ దేవదేవుడగు చక్రి కుడి మోకాలు కొంచెముగ ముడుచుకొని రెండవ పాదము అనంతుని యందు ఉంచబడియుండెను. ఆశేషశాయి దృష్టి లక్ష్మిపై ఆసక్తమై యుండెను. ఆ దేవదేవుని ఎడమ పైభుజము ఫణీంద్రుడగు ఆదిశేషుని పడగలపై దిండుగా నుంచబడెను. కుడిపైభుజము

* భోగిభోగసమాసీనస్సర్వాలఙ్కార

పూర్తిగా చాచబడి దాని మణికట్టు దేవదేవుని ముడుచుకొనిన మోకాలిపై ప్రకాశించుచుండెను. ఎడమ దిగువ భుజమును కొంచెముగ ముడిచి ఆదేవుడు నాభిదేశమునకు ఉదరమునకు సూటిగా పొన్నుపై ఉంచుకొనెను. కుడి దిగువ చేతితో పారిజాత (కల్పవృక్ష) కుసుమమును వాసన చూచుటకై ముక్కునకు దగ్గరగా ఉంచుకొనెను. ఆ దేవదేవుని పాదములను లక్ష్మీదేవి పద్మపత్రములను బోలు కరములతో సంవాహనము చేయుచుండెను.

ఆ భగవానుడు కల్పవృక్షపు పూలతో మకుటముతో హారములతో అందెలతో భుజకీర్తులతో అంగుళీయకములతో శోభించుచుండెను. ఫణీంద్రుని పడగలయందలంకారముగా ఉంచబడిన మనోహర రత్న శిఖలతో స్వామి ప్రకాశించు చుండెను. జ్ఞానులకును అగమ్యుడు అత్రి మహామునిచే ప్రతిష్ఠితుడు సిద్ధులకును సతతము అతిపూజ్యుడు సతతము పూజా కుసుమాన్వితుడు దివ్య గంధానులిప్తాంగుడు దివ్య ధూప ధూపితుడు సిద్ధులు సదా తెచ్చి కానుకలిచ్చిన సరసములును హృదయమున కింపుగొల్పునవియునగు మంచి ఫలములతో ప్రకాశించుచుండు ఉత్తమ పార్శ్వము కలవాడు కలువలు అలంకారముగానున్న శీర్షము కలవాడునగు ఆ నారాయణుని తన సమక్షమున గాంచి ఆ మద్రరాజగు పురూరవసుడు నిలువబడి ఉండియే నమస్కరించెను.

జానుభ్యాం శిరసా చైవ గత్వా భూమితలం తదా । నామ్నాం సహస్రేణ తథా తుష్టావ మధుసూదనమ్. 39
ప్రదక్షిణ మథో చక్రే స తస్మాత్తు పునః పునః । రమ్యమాయతనం దృష్ట్వా తత్రోవాసాశ్రమే పునః. 40
జలాద్బహిర్గుహాం కాంచి ద్వాశిత్య సుమనోహరామ్ । తథశ్చకార తత్రైవ పూజయ న్మధుసూదనమ్. 41
నానావిధైస్తథా పుష్పైః ఫలమూలైస్తథోత్తమైః । నిత్యం త్రిషవణస్నాయీ వహ్నిపూజా పరాయణః. 42
దైవవాపీజలైః కుర్వ న్సతతం ప్రాణధారణమ్ । సర్వాహారపరిత్యాగం కృత్వాస మనుజేశ్వరః. 43
అనాశ్రితగుహాశాయీ కాలం నయతి పార్థివః । త్యక్తాహారక్రియశ్చాపి కేవలం నియతో నృపః. 44
న తస్య గ్లానిమాయాతి శరీరంచ తదద్భుతమ్ ।
ధ్రువం స రాజా తపసి ప్రసక్త స్సమ్పూజయ న్దేవవరం సదైవ. 45
తత్రాశ్రమే కాలమువాస కించి త్స్వర్గోపమే దుఃఖమవిన్దమానః. 45

ఇతి శ్రీమత్స్యమహాపురాణే భూగోళే పురూరవశ్చరితే పురూరవసోఽత్ర్యాశ్రమ గమనాదికథనం నామాష్టాదశోత్తరశతతమోఽధ్యాయః.

అంతట అతడు మోకాళ్ళను శిరస్సును నేలకానించి నారాయణుని నమస్కరించి సహస్ర నామములతో మధుసూదనుని స్తుతించెను. అనంతరమతడు లేచి ప్రదక్షిణమును నమస్కారమును మరల మరల చేసెను. ఆ ఆలయము అతి రమ్యముగానుండుట చూచి ఆ ఆశ్రమమునందే తన నివాసము నేర్పరచుకొనెను. పుష్కరిణీ జలమునకు వెలుపల అతి మనోహరమగు ఒకానొక గుహను ఆశ్రయముగా ఏర్పరచుకొని దానియందే నానావిధ పుష్ప ఫలమూలములతో గోరసముల (ఆవుపాలు పెరుగు నెయ్యి మొదలగు వాని)తో మధుసూదన పూజా పూర్వకముగా తపమాచరించెను. అతడు అను దినమును త్రిషవణములందు స్నానము చేయును. అగ్నిని హోమముతో పూజించును. దైవనిర్మితములగు (మనుష్యులు త్రవ్వియుండని) బావుల నీటితో ప్రాణధారణము చేయును. మరి ఆహారమును తీసికొనడు. ఇతరులు ఎవ్వరును ఆశ్రయించి ఉపయోగించుకొనుచుండని గుహలయందు నిద్రించును. కేవలము నియమపరుడై ఆహారగ్రహణము విడిచియున్నను అతని శరీరము శ్రమ చెందెడిది కాదు. ఇది ఆశ్చర్యము గొలుపు విషయముగదా! ఇట్లారాజు ధ్రువ నిశ్చయుడై దేవదేవుని విడువక సదా పూజించుచు తపమాచరించుచు స్వర్గతుల్యమగు ఆ ఆశ్రమమున ఏ దుఃఖమును ఎరుగక కొంతకాలము గడపెను.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున భూగోళ వర్ణనమున జంబూ ద్వీపాంతర్గత భారత వర్షాంతర్గత భరతఖండ వర్ణనమున మద్రరాజగు పురూరవుడత్ర్యాశ్రమమేగి తపమాచరించుటయను నూట పదునెనిమిదవ అధ్యాయము.

# ఏకోనవింశత్యుత్తరశతతమోఽధ్యాయః.

## గన్ధర్వైస్సహాప్సరసాం నానావిధక్రీడావిహారవర్ణనమ్.

సూతః: తత్రాశ్రమపదే రమ్యే త్యక్తాహార పరిచ్ఛదః ।
క్రీడావిహారం గన్ధర్వైః పశ్య న్నప్సరసాం సహ. 1
కృత్వా పుష్పోచ్చయం గుర్వీం గ్రథయిత్వా తథా స్రజమ్। అగ్రం నివేద్య దేవాయ గన్ధర్వేభ్య స్తథాదదౌ.
పుష్పోచ్చయప్రసక్తానాం క్రీడ న్తీనాం యథాసుఖమ్ । వేశ్యానాం వివిధాకారా న్పశ్యన్నపి నపశ్యతి. 3
కాచిత్పుష్పోచ్చయే సక్తా లతాజాలేన వేష్టితా । సా స్వీయజనసన్త్యక్తా కాన్తేనాపి సముజ్ఝితా. 4
కాచి త్కమలగన్ధాఢ్యా నిశ్వాసపవనాహతైః । మధుపై రాకులముఖీ కాన్తేన పరిమోచితా. 5
మకరన్దసమాక్రాన్త నయనా కాచిదఙ్గనా । కాన్తనిశ్వాసవాతేన నిరజస్కీకృతేక్షణా. 6
కాచి దుచ్చిత్య పుష్పాణి దదౌ కాన్తస్య భామినీ । కాన్తసఙ్గ్రథితైః పుష్పై రరాజ కృతశేఖరా. 7
ఉచ్చిత్య స్వయముద్గ్రథ్య రమణ్యాహితశేఖరమ్ । కృతకృత్య మివాత్మానం మేనే మన్మథవర్ధనమ్. 8
అన్యస్మి న్గహనే కుఞ్జే విశేషకుసుమాలతాః । కాచిదేవం రహోనీత్వా రమణేన రిరంసునా. 9
కాన్తసన్దానితలతా కుసుమాని విచిన్వతీ । సర్వాభ్యః కాచి దాత్మానం మేనే సర్వగుణాధికామ్. 10

# నూటపందొమ్మిదవ అధ్యాయము.

## మద్రరాజ పురూరవస్తపశ్చర్య-గంధర్వాప్సరసల నానావిధ విహారముల వర్ణనము.

రమ్యమగు ఆ ఆశ్రమమున మద్రరాజు పురూరవసుడు ఏ పరివారమును ఏ సాధనములును లేక ఒంటరియై ఆహారమును కూడ విడిచి తపమాచరించుచుండ ఆ తావులందే అప్సరసలు గంధర్వులతో క్రీడించుచుండెడివారు. అతడది చూచుచునే ఉండియు వాటియందాసక్తి లేక పూవుల సేకరించి పెద్ద మాలను కూర్చి దానియందలి మొదటి అంశమును దేవదేవునకర్పించి మిగిలిన అల్ప ఖండమును గంధర్వులకు (దేవజాతివారు కదా అను ఆదరముతో) ఇచ్చెడివాడు.

దేవవేశ్యలు (అప్సరసలు) కూడ పుష్పోచ్చయము చేయుచు యథా సుఖముగా వివిధములుగ క్రీడించుచుండ అతడు అది చూచుచుండియు చూడనివాడుగనే ఉండెను.

## క్రీడా వర్ణనము.

ఒకతె పూవులు కోయుచు ఏరుచునుండ ఆమెను తీగలు చుట్టుకొనెను. ఆమెను పాపము! సఖులును ప్రియుడును విడిచిపోయిరి. ఒకతె ముఖము కమల గంధము కలదగుటచే శ్వాసవాయువులచే ఆకర్షింపబడిన తుమ్మెదలు మొగముపై గుంపుగా క్రమ్మి కలవరపరచగా ప్రియుడుమ ఆమెను విడిచి దూరముగా పోయెను. ఒకతె కంటిలో మకరందము పడెను. ప్రియుడు తన శ్వాసవాయువులతో కంటియందలి దూళిని పోగొట్టి బాధ పోగొట్టెను. ఒకతె పూవులు కోసి ఏరితెచ్చి ప్రియునకీయ అతడు వానితో కూర్చిన మాల తన శిరమున నలంకరించుకొని ప్రకాశించెను. ఒకతె తానై పూవులు కోసి ఏరి వానిని మాలగా కూర్చి ప్రియుని శిరమున నలంకరించగా నాతడు తను ధన్యునిగాను మన్మథోద్దీపనము చేయగల సుభగునిగాను భావించెను. ఒకతె తన ప్రియుడు తనతో ఏకాంతమున విహరింపగోరి ఆదిగో! ఆ దట్టమైన పూబొదయందు ఎక్కువ పూలుగల తీగలున్నవని ఆటకుపోయి పూలు సేకరించసాగెను. అపుడు ప్రియుడామెను విలాసముగా తీగలతో కట్టివేయగా ఆమె తాను మిగిలిన తన చెలులందరకంటె సర్వాధిక గుణములుగల సౌభాగ్యవతియని భావించి తృప్తియయ్యెను.

కాచి త్పశ్యతి భూపాలం నళినీమ వృథక్పృథక్ । క్రీడమానాపి గన్ధర్వై రనమా నామ కామినీ. 11
కాచి చ్చాతాడయత్కాన్త ముదకేన శుచిస్మితా । తాడ్యమానాఽథ కాన్తేన ప్రీతిం కాచి దుపాయయౌ 19

కాన్తేన తాడయామాస జాతస్వేదా వరాఙ్గనా । అదృశ్యత వరారోహా శ్వాసనృత్య త్పయోధరా. 13
కాన్తానుతాడితోద్ధ్వస్త కేశపాశనిబన్ధనా । కేశాకులముఖీ భాతి మధువైరివ పద్మినీ. 14
స్వచక్షుస్సదృశైః పుష్పైః స్వచ్ఛన్నే నళినీవనే । భర్త్రా కాచిచ్చిరాత్ప్రాప్తా కాన్తేనాన్విష్య యత్నతః. 15
స్నాతా శీతాపదేశేన కాచిత్ప్రౌఢాఙ్గనా భృశమ్ । రమణాలిఙ్గనం చక్రే మనోభిలషితం చిరమ్. 16
జలార్ద్రవసనం సూక్ష్మ మఙ్గలీనం శుచిస్మితా । ధారయన్తీ జనం చక్రే కాచిత్తత్ర సమన్మథమ్. 17
కంఠమాల్యగుణైః కాచి త్కాన్తేనాకృష్యతామ్భసి । త్రుట్యత్ప్రస్గ్దామపతితం రమణం ప్రాహస చ్చిరమ్. 18
కాచి ల్లగ్న సఖీద త్తజానుదేశే నఖాన్తరే । సమ్ప్రాప్తా కాన్తరమణా కాచిద్దృష్టా హతం చిరమ్. 19
కాచి ద్దృష్టీకృతాదిత్యా కేశనిస్తోయకారిణీ । శిలాతలగతా తత్ర దృష్టా కామార్తచక్షుషా. 20
కృతమాల్యం విలులితం సఙ్క్రాన్తం కుచకుఙ్కుమమ్ । రత్నకాఞ్చనకాన్తాభ మభవ త్తత్సరోదకమ్. 21
సుస్నాతదేవగన్ధర్వ దేవరామాగణేనచ । పూజ్యమానంచ దదృశే తత్ర దేవం జనార్దనమ్. 22

సాటిలేని కాముకియగు ఒకతె గంధర్వులతో తాను క్రీడించుచుండియు ఆ సరస్సులయందు వేరువేరుగ ప్రతి ఫలించుచున్న ఆరాజును చూచుచుండెను. నిర్మలమయిన చిరునవ్వు నిర్మల హృదయము కల ఒకతె నీటితో ప్రియుని కొట్టి మరల నాతడు తన నీటితో కొట్టగా సంతోషించెను. ఒకతె ప్రియుడు తను కొట్టుచుండ పోనిమ్మని ఊర కుండెను. అందుచే ఆమెకు ఒడలు చెమట పట్టుటయు నిట్టూర్పు వాయువులచే ఆమె వక్షోజములు నృత్యము చేయుటయు కానవచ్చెను. ప్రియుడు తను వెంటాడి కొట్టుటచే ఒకతెకు కొప్పు శిథిలమైనందున మొగమంతయు వెంట్రుకలు క్రమ్మగా తుమ్మెదలు క్రమ్మిన పద్మలతవలె కానవచ్చెను. ఒకతె తన కన్నులను పోలు తామరలు కొలనునిండ ఉండుటచే తన ప్రియుడు వెదకి వెదకి చాల సేపటికామెను గుర్తించి దగ్గరకు వచ్చెను. ఒకానొక ప్రౌఢాంగన (సుఖానుభవములో నేర్పు మీరిన స్త్రీ) స్నానము చేయుటచే చలి వేయుచున్నదను నెపమున తనకు చిరాభిలషితమగు తన ప్రియుని ఆలింగనమును పొందగలిగెను. స్నానమాడినందున తాను ధరించిన సన్నని వలువ తన ఒడలికంటుకొనిపోయిన ఒకతె చూపరుకు కామభావమును ఉద్దీపింప జేసెను. ఒకతెను ప్రియుడు ఆమె కంఠమందలి హారములు పట్టిలాగెను. లాగుచుండగా ఆ దారమును తెగినందున ఆ ప్రియుడు ముందునకు మ్రొగ్గిపడగా ఆమె నవ్వెను. ఒకతె మోకాళ్ళపై ఆమెకు చేరువగానున్న చెలి తన గోళ్ళతో క్షతము చేయగా ఆమె తడబాటుతో పోయి తన ప్రియునిపై పడి అతనితో చాల సేపు మాటలాడుచు కనబడెను. ఒకతె సూర్యునికి ఎదురుగా నిలిచి వెంట్రుకలారబెట్టుకొనుచుండియు కామార్తములగు నేత్రములతో తన ప్రియుని చూచుచు శిలాతలముపై కూర్చుండియుండుట కానవచ్చెను. ఇట్లా సరస్సు నీరంతయు మాల్యములతో నిండెను. కెలికి వేయబడెను. స్తన కుంకుమముతో కలిసెను. ఇట్లది రత్నములు పొదిగిన బంగారు సొమ్ములవలె నయ్యెను.

ఇట్టి స్థితియందు కూడ చక్కగా స్నానమాడిన దేవస్త్రీలును దేవగంధర్వ స్త్రీలును దేవదేవుడగు జనార్దనుని పూజించుచుండుటను ఆరాజు చూచెను.

క్వచిచ్చ దదృశే రాజా లతాగృహగతా స్త్రియః । మణ్డయన్త్య స్స్వగాత్రాణి కాన్తసంన్యస్తమానసాః. 23
కాచిదాదర్శనవ్యగ్రకరా దూతీముఖోద్గతమ్ । శృణ్వతీ కాన్తవచన మధికాన్త మథాబభౌ. 24
కాచి త్సత్వరితా దూత్యా భూషణానాం విపర్యయమ్ । కుర్వాణా నైవ బుబుధే మన్మథావిష్టచేతసా. 25
వాయునున్నాతిసురభి కుసుమాకరమణ్డితే । క్వచిత్ప్రియస్త్యో (స్త్రీ) దదృశే ప్రదేశే నీలశాద్వలే. 26
పాయయామాస రమణం పయః కాచిద్వరాఙ్గనా । కాచిత్పపౌ వరారోహా కాన్తపాణిసమర్పితమ్. 27
కాచిత్స్వనేత్రచపల నీలోత్పలయుతం పయః । పీత్వా ప్రపచ్ఛ రమణం క్వగతే తే మమోత్పలే. 28

త్వయైవ పీతౌ నూనంవై ఇత్యుక్తా రమణేన సా। తథా విదిత్వా ముగ్ధత్వా ద్వభూవ వ్రీడితా చిరమ్. 29
కాచిత్కాన్తార్పితం సుభ్రూః కాన్తపీతావశేషితమ్ । సవిశేషరసాపానం పపౌ మన్మథవర్ధనమ్. 30
ఆపానగోష్ఠీషు తథా తాసాం స నరపుఙ్గవః । శుశ్రావ వివిధం గీతం తన్త్రీస్వరవిమిశ్రితమ్. 31
ప్రదోషసమయే తాశ్చ దేవదేవం జనార్దనమ్ । రాజ న్నుదోవన్నృత్యన్త్యో నానావాద్య పురస్సరాః. 32
యామమాత్రే గతే రాత్రౌ వినిర్గత్య గుహాముఖాత్ । ఆవసన్తి యుతాః కాన్తై స్తత్తద్విరచితాం గుహామ్. 33
నానాగన్ధాన్వితతలాం నానాగన్ధసుగన్ధినీమ్ । నానావిచిత్రశయనాం కుసుమోత్కరమణ్డితామ్. 34
ఏవ మప్సరసాం పశ్య న్క్రీడితాని స పర్వతే । తప స్తేపే మహారాజః కేశవార్పితమానసః. 35

ఒకానొకచోట కొందరు (దేవ) స్త్రీలు తమ ప్రియులయందు తమ మనస్సులు లెస్సగా నిలిపి లతాగృహ గతలయి తమ గాత్రముల నలంకరించుకొనుచుండుట రాజు కాంచెను. ఒకతె చేత అద్దముంచుకొని చూచుకొనుచు తన దూతి వచించు తన ప్రియుని వచనములు వినుచు మిగుల ఆందముతో ఒప్పెను. కామ భావ పరవశయగు ఒకతె తను దూతి త్వరపెట్టుచుండ అందుచే జరుపుచున్న తన అలంకరణములో భూషణముల తారుమారును గురుతింపక పోయెను. ఒకానొకచోట వాయు ప్రేరణచే కదలు అతి సుగంధి పుష్పయుతమగు నల్లని వచ్చికబయట ఆయా పాత్రయముల త్రావు స్త్రీలాతనిని కనవచ్చిరి. ఒక ఉత్తమాంగన తన ప్రియునిచే పాలు త్రావించుచుండెను. మరియొక తన ప్రియుడందించు పాలు త్రావుచుండెను. ఒకతె తన కన్నులవలె చంచలములగు నల్ల కలువ రెక్కలతో కూడి ఉన్న పాలు త్రావి నా ఆ కలువపూలెక్కడకు పోయెనని యడిగెను. నీవే అవి త్రావియుండవచ్చునని ప్రియుడనగా అపుడది గుర్తించి తానంతటి అమాయికురాలయినందులకు చాలసేపు సిగ్గుపడియుండెను. విశిష్టములగు రుచులు గల రసములతో మిశ్రితమగు కామవర్ధక పానీయమును తన ప్రియుడు త్రావి పిదప తనకందీయగా ఒకతె తానది త్రావెను. ఇట్లే జరుగుచుండిన ఆపానగోష్ఠులందు తంత్రీవాద్యముల స్వరముతో విమిశ్రితమగు వివిధ గీతముల నాదేవస్త్రీలు పాడుచుండ రాజది వినెను వారు అనుదినమును ప్రదోష సమయమునందు అట్లే దేవదేవుడగు జనార్దనుని సన్నిధియందు నానావాద్య సహితముగా నృత్యము చేయుచుందురు. జాముర్రాత్రి గడచిన తరువాత గుహా ముఖము నుండి వెలికివచ్చి తమకు తమకు ఏర్పరచబడిన ఆయా గుహలను తమ ప్రియులతో కూడి ఆవాసముగా చేసికొందురు. ఆ గుహలు నానాగంధాన్వితతలములయి సుగంధముల నీనుచుండును. నానావిధములగు పడకలు కుసుమాలంకరణములు వానియందుండును. ఈ విధముగ ఆ పర్వతమున అప్సరసలు చేయు ఆయా విహారణములను చూచుచుండి (యు వానియందానక్తుడు కాక) మహారాజు కేశవార్పితమానసుడై తపమాచరించెను.

త మూచు ర్నృపతిం గత్వా గన్ధర్వాప్సరసాం గణాః ।
రాజ న్స్వర్గోపమం దేశ మిమం ప్రాప్తోఽస్యరిన్దమ. 36
వయంహి తే ప్రదాస్యామో మనసః కాంక్షితా న్వరాన్। తానాదాయ గృహం గచ్ఛ తిష్ఠేహ యదివా పునః.
పురూరవాః : అమోఘదర్శనా స్సర్వే భవన్త శ్చామితౌజసః ।
వరం వితరతా చేత త్ప్రసాదం మధుసూదనః. 38
ఏవమస్త్వి త్యథోక్తస్తై స్సతు రాజా పురూరవాః । తత్రోవాస సుఖీ మాసం పూజయానో జనార్దనమ్. 39
ప్రియఏవ సదైవాసీ ద్గన్ధర్వాప్సరసాం నృపః । తుతుష స్సజ్జనా రాజ్ఞ స్తస్యాలౌల్యేన కర్మణా. 40
మాఘస్య మధ్యే స నృపః ప్రవిష్ట స్తమాశ్రమం రత్నసహస్రచిత్రమ్ ।
ఉవాస మాసం ప్రియకృత్సమగ్రం శీతోష్ణభేదై ర్నృప ఫాల్గునస్య. 41
ఫాల్గునామలపక్షాన్తే రాజా స్వప్నే పురూరవాః । తస్యైవ దేవదేవస్య శుశ్రావ గదితం శుభమ్. 42

రాత్ర్యా మస్యా మతీతాయా మత్రిణా త్వం సమేష్యసి। తేన రాజ న్త్సమాగమ్య కృతకృత్యో భవిష్యసి.43
స్వప్న మేవం స రాజర్షి ర్దృష్ట్వా దేవేన్ద్రవిక్రమః । ప్రత్యూషకాలే విధివ త్స్నాతః ప్రాయో జితేన్ద్రియః.44
కృతకృత్యోఽవసత్కామ మర్చయిత్వా జనార్దనమ్। తత్రా న్తరేఽత్రిరాగత్య తస్థౌ చాత్ర శ్రియా జ్వలన్.
స్వప్నంతు దేవస్య తథా న్యవేదయత ధార్మికః । తత శ్శుశ్రావ వచనం దేవతానాం సమీరితమ్. 46
ఏవమేవ మహీపాల నాత్ర కార్యా విచారణా । ఏవం ప్రసాదం సమ్ప్రాప్తో దేవదేవా జ్జనార్దనాత్. 47
కృతదేవార్చనో రాజా తథా హుతహుతాశనః । సర్వా న్కామా నవాపాశు వరదానేన కేశవాత్. 48

ఇతి శ్రీమత్స్యమహాపురాణే భూగోళే పురూరవసో వరలాభో నామైకోన
వింశత్యుత్తర శతతమోఽధ్యాయః.

ఒకప్పుడు ఆ గంధర్వాప్సరోగణములు రాజుకడకు పోయి 'అరిందమా! నీవు వచ్చిన ఇది స్వర్గతుల్య దేశము. మేము నీకు మనఃకాంక్షిత వరముల నిత్తుము. అది గ్రహించిన తరువాత నీవిటనే యున్ననునరే-ఇంటికి వెడలిననునరే; అనిరి. మద్రరాజు పురూరవసుడును "అమితమగు ఓజస్సుగల మీ దర్శనము వ్యర్థముకాదు. మధుసూదనుడు నన్ననుగ్రహించునట్లు వరమిందు." అనగా వారు 'తథాఽస్తు' అనిరి. అతడును ఒక మాసము కాలము జనార్దనుని పూజించుచు అటనే యుండెను. ఆతనికి లోలత్వము లేనందులకు ఆ గంధర్వాప్సరసలు సంతసించిరి. వారికతడు ప్రీతిపాత్రుడయ్యెను. రత్న సహస్ర చిత్రమగు ఆయాశ్రమమును ఆరాజు మాఘమాస మధ్యమున ప్రవేశించెను. ఫాల్గున మాసవు శీతోష్ణ భేదములతో ప్రీతిననుభవించుచు ఒక మాసము గడపెను. ఫాల్గున కృష్ణపక్షాంతమున రాజగు పురూరవునకు స్వప్నమున దేవదేవుని శుభవచనము "రాజా! ఈరాత్రి గడువగనే నీకు అత్రిమునితో సమాగమమగుమ. అందుచే నీవు కృతకృత్యుడవగుదువు." అనుచు వినబడెను. ఇంద్ర విక్రముడగు ఆ రాజర్షి ఇట్లు స్వప్నము కాంచి పిదప ప్రత్యూష కాలమున స్నానము చేసి నియతేంద్రియుడై కృతకృత్యుడనై తినను భావముతో జనార్దను నర్చించియుండెను. అంతలోనే కాంతితో జ్వలించుచు అత్రిముని అటకు వచ్చెను. ధార్మికుడగు ఆరాజు తన స్వప్న దర్శనము నామునికి తెలిపెను. రాజా! ఇది ఇట్లేయగును. ఇందు సంశయింపవలసిన పనిలేదు. అని అత్రియు దేవతలును పలికిన పలుకులు అత .కి వినవచ్చెను. ఇట్లు దేవదేవుడగు జనార్దనుని వలన అనుగ్రహమంది రాజు దేవతార్చనమును అగ్నిహోత్రమును జరిపి సర్వకామ పూ ర్తినొందెను.

(ఉత్తర భారతమున కృష్ణపక్షముతో మాసారంభము లెక్కింతురు. రాజు మాఘ మధ్యమున అనగా కృష్ణ పక్షము ముగియగానే శుక్లపక్షారంభమున ఆశ్రమమునకు పోయెను. ఆ పక్షమంతయును ఫాల్గున కృష్ణపక్షమంతయును కిలిసి సమగ్రమగు ఒక మాసమగును.)

ఇది శ్రీమత్స్యమహాపురాణమున భూగోళ వర్ణనమున జంబూ ద్వీపాంతర్గత భరత వర్షాంతర్గత భరతఖండ వర్ణనమున మద్రరాజ పురూరవసుని వరప్రాప్తియను నూట పందొమ్మిదవ యధ్యాయము.

## వింశత్యుత్తరశతతమోఽధ్యాయః.

## కైలాసాదిపర్వతవర్ణనమ్.

సూతః తస్యాశ్రమస్యోత్తరతస్త్రిపురారినిషేవితః । నానారత్నమయై శ్శృంగైః కల్పద్రుమవిభూషితైః. 1
మధ్యే హిమవతః పృష్ఠే కైలాసోనామ పర్వతః । తస్మి న్నివసతి శ్రీమాన్కుబేర స్సహగుహ్యకైః. 2
అప్సరోనుగతో రాజా మోదతే హ్యలకాధిపః । కైలాసపాదసమ్భూతం పుణ్యం శీతజలం శుభమ్. 3
మన్దారకుసుమరజః పూరితం దేవసంయుతమ్ । తస్మా త్ప్రభవతే దివ్యా నదీ మన్దాకినీ శుభా. 4
దివ్యంచ చన్దనవనం తస్యాస్తీరే మహచ్ఛుభమ్ । ప్రాగుత్తరేణ కైలాసం దివ్యసౌగన్ధికం గిరిమ్. 5
సర్వధాతుమయం దివ్యం సువేల పర్వతంప్రతి । చన్ద్రప్రభో నామ గిరి స్సాముద్రోదక సన్నిభః. 6

తత్సమీపే సరోదివ్య మచ్ఛోదంనామ విశ్రుతమ్ । తస్మాత్ప్రవహతే దివ్యా నదీ త్వచ్ఛోదకా శుభా. 7
తస్యాస్తీరే వనం దివ్యం మహచ్చైత్రరథం శుభమ్ । తస్మిన్గిరౌ నివసతి మాణిభద్ర స్సహానుగః. ౮
యక్షసేనాపతిః క్రూరై ర్గుహ్యకైః పరివారితః । పుణ్యా మన్దాకినీ నామ నదీ త్వచ్ఛోదకా శుభా. 9
మహీమణ్డలమధ్యేతు ప్రవిష్టాచ మహోదధిమ్ । కైలాసదక్షిణాప్రాచ్యాం శివం సర్వౌషధిం గిరిమ్. 10
మనశ్శిలామయం దివ్యం శబలం పర్వతంప్రతి । లోహితో హేమశృఙ్గస్తు గిరి స్సూర్యప్రభో మహాన్. 11
తస్య పాదే మహద్దివ్యం లోహితం సుమహ త్సరః । తస్మాత్ప్రవహతే లోకే లౌహిత్యశ్చ నదో మహాన్.
దేవారణ్య మశోకంచ తస్య తీరే మహద్వనమ్ । తస్మిన్గిరౌ నివసతి యక్షో మాణివరో వశీ. 13
సౌమ్యై స్సుధార్మికైశ్చైవ గుహ్యకైః పరివారితః ।

## నూట ఇరువదవ అధ్యాయము.

## కైలాసాది పర్వత వర్ణనము.

[ఈ అధ్యాయమున హిమవత్పర్వతాంశములగు కైలాస పర్వతము మొదలగు పర్వతములును వానినుండి జనించు సరోనదీ సన్నివేశమును మిగుల రమ్యముగను స్పష్టముగను వర్ణింపబడియున్నది. ఇది ఈనాడును ఇట్లే కనబడుచున్నది.]

సూతుడు ఋషులకు ఇంకను ఇట్లు చెప్పెను: ఆ అత్ర్యాశ్రమమునకు ఉత్తరమున హిమవత్ పృష్ఠమున త్రిపుర సంహర్త యగు పరమశివుడు అనుభవించి ఆనందించుచుండు కైలాస పర్వతము ఉన్నది. అది కల్పద్రుమ విభూషితములగు నానా రత్నమయ శృంగములతో అలంకృతము దానియందే శ్రీమంతుడగు కుబేరుడు గుహ్యకులతో కూడ నివసించుచుండును. అలకాధిపతియగు రాజరాజు కుబేరుడు అప్సరసలు తన వెంటనుండగా ఆ కైలాసపర్వత పాదమునుండి ప్రభవించు శుభమును పుణ్యమును (పవిత్రమును) మందార (కల్పవృక్ష) పుష్పపరాగ పూర్ణమును దేవ సమాదర పాత్రమునునగు శీతల జలమును అనుభవించి ఆనందించుచుండును. ఆ కైలాసమునుండియే శుభయగు మందాకినీ (దేవగంగా) నది ప్రభవించును. ఆ నదీతీరమునందే గొప్పదియును శుభమునునగు నందనవనమున్నది.

కైలాసమునకు ఈశాన్యమున దివ్యమగు సౌగంధిక గిరికిని సర్వ గైరిక ధాతుమయమును దివ్యమునగు సువేల పర్వతమునకును చేరువగా సముద్రజలపు కాంతిగల చంద్ర ప్రభమను గిరి కలదు. దాని సమీపమందుకల అచ్ఛోదమను సరస్సునుండి శుభయగు అచ్ఛోదకయను దివ్యనది ప్రవహించును దాని తీరమున గొప్పదియై దివ్యమును శుభమునునగు చైత్రరథవన మున్నది. దానియందు క్రూ(శూ)రులగు గుహ్యకులు తన పరివారముగా యక్షసేనాపతి మణిభద్రుడు తనయనుయాయులతో కలిసి నివసించును. ఈ అచ్ఛోదకానదినే మందాకిని యనియు (కొందరు) వ్యవహరింతురు. అది మహీమండల మధ్యమున ప్రవహించి మహోదధిని ప్రవేశించును. (మహోదధితో కలియును.)

(దీని తరువాత రావలసిన క్రమములో తూర్పు దెసయం దేమున్నదియు చెప్పలేదు.

కైలాసా త్పశ్చిమావాచ్యాం కకుద్మా నుదితో గిరిః. 14
కకుద్మతిచ రుద్రస్య హ్యుత్పత్తి స్త్రికకుద్మతః । తదఞ్జనం త్రైకకుదం శైలం త్రికకుదంప్రతి. 15
తస్యపాదే మహద్దివ్యం మానసం సిద్ధసేవితమ్ । తస్మాత్ప్రభవతే పుణ్యా సరయూర్లోకపావనీ. 16
తస్యాస్తీరే వనందివ్యం వైభ్రాజంనామ విశ్రుతమ్ । కుబేరానుచర స్తస్మి న్ప్రహేతితనయో వశీ. 17
●బ్రహ్మయోని ర్నివసతి రాక్షసోఽన న్తవిక్రమః । కైలాసా త్పశ్చిమాశాయాం దివ్య స్సర్వౌషధిర్గిరిః. 18
అరుణః పర్వతశ్రేష్ఠో రుక్మధాతువిభూషితః । భవస్య దయిత శ్శ్రీమా న్పర్వతో హేమసన్నిభః. 19

● బ్రహ్మదానో

౧. పు. 54)

శాతకుమ్భమయై ర్దివ్యైః శిలాజాలై స్సమాచితః । శతసఙ్ఖ్యై స్తాపనీయై శ్శృఙ్గై ర్దివమివోల్లిఖన్. 20
ముఞ్జవా న్సుమహద్దివ్యో దుర్గశైలో మహోచ్ఛ్రితః । తస్మిన్గిరౌ నివసతి గిరిశో ధూమ్రలోహితః. 21
తస్యపాదా త్ప్రభవతి శైలోదంనామ వైసరః । తస్మా త్ప్రభవతే పుణ్యానదీ శైలోదకా శుభా. 22
సా దక్షశీతయోర్మధ్యే ప్రవిష్టా పశ్చిమోదధిమ్ । అస్త్యుత్తరేణ కైలాసం శివ స్సర్వౌషధిర్గిరిః. 23
గౌరస్తు పర్వతశ్రేష్ఠో హరిసాలవనంప్రతి । హిరణ్యశృఙ్గ స్సుమహాన్ దివ్యౌషధిమయోగిరిః. 24

గఙ్గోత్పత్తిః

తస్యపాదే మహద్దివ్యం సరః కాఞ్చనవాలుకమ్ । రమ్యం బిన్దుసరోనామ యత్ర రాజా భగీరథః. 25
గఙ్గార్థే సతు రాజర్షి రువాస బహులా స్సమాః । దివం యాస్యన్తి మేపూర్వే గఙ్గాతోయాప్లుతాస్థికాః 26

కైలాసమునకు ఆగ్నేయమున శుభకరమగు సర్వౌషధి గిరికిని మనశ్శిలా (మణిశిల) మయమును దివ్యమును నగు శిలల పర్వతమునకును చేరువగా హేమ శిఖరములతో సూర్యునివలె తేజరిల్లు లోహిత మహాపర్వతమున్నది. దాని పాదమున మహాదివ్యమగు లోహితమను మహాసరస్సు కలదు. దానినుండి లోహిత మహానదము ప్రభవించి లోకమున ప్రవహించును. ఆ సరస్తీరమున అశోకమను దేవ మహావనము కలదు. ఆగిరియందావనమున సౌమ్యులు సుధార్మికులునగు గుహ్యకులు తన పరివారముగా జితేంద్రియుడగు మణిధరుడను యక్షుడు నివసించును.

(దీని తరువాత రావలసిన క్రమములో దక్షిణ దిశయందు ఏమున్నదో చెప్పలేదు.)

కైలాసమునకు నైరృత దిశయందు కకుద్మత్పర్వతము గలదు. త్రికకుద్మంతము (మూడు శిఖరములు కలది) అగు ఆ త్రికకుద్మత్పర్వతపు త్రైకకుదాంజనమను శిఖరమున రుద్రుని ఉత్పత్తి జరిగెను. ఆ పర్వతపు పాదమునందు మహాదివ్యము సిద్ధసేవితమునగు మానసమను సరస్సు కలదు. దానినుండి పుణ్యయు లోకపావనియునగు సరయూ నది (ఇది హరయూ అని అవెస్తాలో పేర్కొనబడినది. ఇపుడిది పడమటి ఆఫ్ఘన్‌స్తానులో హీరట్‌కు దగ్గరగా హరి-రుద్ అను పేరుతోనున్నది.) దాని తీరమునందు వైభ్రాజమను ప్రసిద్ధవనము కలదు. దానియందు కుబేరానుచరుడు జితేంద్రియుడు ప్రహేతి అను వాని కుమారుడు అనంత విక్రముడు నగు బ్రహ్మయోని (బ్రహ్మధానుడు) అను రాక్షసుడుండును.

కైలాసమునకు పశ్చిమమున సర్వౌషధియను దివ్యగిరి కలదు. అచటనే స్వర్ణమయ గైరిక ధాతువులతో విభూషితము అందుచేతనే బంగారువలె కనబడునది శివుని ప్రీతికి పాత్రమయినది దివ్య సువర్ణ శిలా సమూహములతో వ్యాప్తము వందలకొలది బంగారు (వలె ప్రకాశించు) శిఖరములతో ఆకాశమును ఒరయుచున్నదో అనునట్లు తోచు అరుణమను పర్వతశ్రేష్ఠము కలదు. దాని దాపుననే సుమహాదివ్యమగు ముంజవత్పర్వతమును మహోన్నతమగు దుర్గశైలము కూడ కలవు. ఈ అరుణ పర్వతమందు ధూమ్రలోహిత రూపుడగు శివుడు సన్నిధానము చేసియుండును. ఈ అరుణ పర్వత పాదమునుండి శైలోదమను సరస్సును దానినుండియే శైలోదయనునదియు ప్రభవించును. ఆనది [ఇదియే నేటి ఆక్సస్-(ఇం) చక్షుష్-వక్షు (సం) ఆమూదరియా (పార్శి) నది] దక్ష-శీత-పర్వతముల నడుమగా పశ్చిమ సముద్రమున కలియును.

(ఈ వరుసలో రావలసిన వాయవ్య దిశయందు ఏమున్నదియు చెప్పలేదు.)

కైలాసమునకు ఉత్తరమున ఉన్న సర్వౌషధి గిరికిని హరి సాలమను వనమునకును చేరువగా దివ్యౌషధిమయమై గౌర వర్ణముగల హిరణ్య శృంగమను పర్వతశ్రేష్ఠము కలదు. దాని పాదమునందు మహాదివ్యమును కాంచన వాలుకము (బంగరు ఇసుకగలది) రమ్యముఅగు బిందుసరమను సరస్సు గలదు. అచ్చటనే భగీరథుడను రాజర్షి తన పూర్వులు గంగా జలముతో తమ అస్థ్యాదికము తడిసినచో స్వర్గమునకేగుదురను ఆశతో అనేక వత్సరములు తపమాచరించుచుండెను.

తత్ర త్రిపథగాదేవీ ప్రథమం తు ప్రతిష్ఠితా । సోమపాదాత్ప్రసూతా సా సప్తధా ప్రవిభజ్యతే. 27
యూపా మణిమయాస్తత్ర చితయశ్చ హిరణ్మయాః । తత్రేష్ట్వా క్రతుభిస్సిద్ధాశ్శక్రస్సురగణైస్సహ. 28
దివ్యచ్ఛాయాపథస్తత్ర నక్షత్రాణ్యసుమణ్డలమ్ । దృశ్యన్తే దాసురా రాత్రౌ దేవీ త్రిపథగాతు సా. 29
అన్తరిక్షం దివంచైవ ప్లావయిత్వా భువంగతా । భవోత్తమాఙ్గే పతితా సంరుద్ధా యోగమాయయా. 30
తస్యా ధో బిన్దవః కేచి త్క్రుద్ధాయాః పతితా భువి । కృతం తు తైర్బిన్దుసర స్తతో బిన్దుసరస్స్మృతమ్. 31
తత స్తస్యా నిరుద్ధాయా భవేన సహసా రుషా । జ్ఞాత్వా తు తస్యా అభిప్రాయం క్రూరం దేవ్యాశ్చికీర్షితమ్. 32
భిత్త్వా విశామి పాతాళం స్రోతసా గృహ్య శఙ్కరమ్ ।
అథావలేపం స జ్ఞాత్వా తస్యాః క్రూరం తు శఙ్కరః. 33
తిరోభావయితుం బుద్ధి రాసీదఙ్గేషు తాం నదీమ్ । ఏతస్మిన్నేవ కాలే తు దృష్ట్వా రాజాన మగ్రతః. 34
ధమనీసన్తతం క్షీణం క్షుధావ్యాకులితేన్ద్రియమ్ । అనేన తోషితశ్చాహం నద్యర్థం పూర్వమేవ తు. 35
బుద్ధ్వాస్య వరదానం తు తతః కోపం న్యయచ్ఛత । బ్రహ్మణో వచనం స్మృత్వా యదుక్తం ధారయన్నదీమ్.
తతో విసర్జయామాస సంరుద్ధాం స్వేన తేజసా । నదీ భగీరథస్యార్థే తపసోగ్రేణ తోషితా. 37
తతో విసర్జయామాస సప్త స్రోతాంసి గఙ్గయా । త్రీణి ప్రాచీ మభిముఖం ప్రతీచీం త్రీణ్యథైవ తు. 38
స్రోతాంసి త్రిపథాయాస్తు ప్రత్యపద్యన్త సప్తధా । నళినీ హ్లాదినీ చైవ ప్లావనీ చైవ ప్రాగ్గతాః. 39
సీతా చక్షుశ్చ సిన్ధుశ్చ తిస్రశ్చైవ ప్రతీచిగాః । సప్తమ్యనుగతా తాసాం దక్షిణేతు భగీరథమ్. 40
తస్మా ద్భాగీరథీ సా వై ప్రవిష్టా దక్షిణోదధిమ్ । సప్త చైతాః పావయన్తి వర్షం తు హిమసాహ్వయమ్. 41

త్రిపథగి (మూడు మార్గముల పోవునది) ఐన గంగ మొదట అక్కడనే ఉండెడిది. ఆమె సోముని (శివ శిరఃస్థిత చంద్రుని) పాదమునుండి వెలువడెను. తరువాత ఆమె ఏడుగా విభాగమందెను. అక్కడ ఇప్పటికిని మణి నిర్మితములగు యూప (యజ్ఞ పశువును బంధించు) స్తంభములును హిరణ్మయచితులు (చితి = యజ్ఞ వేదికా విశేషము)ను కలవు. అచ్చట ఇంద్రుడు సురగణములతో కూడి క్రతువులతో యజనము (దేవతారాధనము) చేసి కామితఫల సిద్ధిపొందెను. ఈ విషయమువందే సంప్రదాయము ఇట్లున్నది. నక్షత్రమండలమును ఆశ్రయించి దివ్యచ్ఛాయా మార్గము కలదు. (దీనికే స్వాతీపథమని పేరని శ్రీమద్రామాయణమున కలదు.) ఈ త్రిపథగ రాత్రులందు అంతరిక్షమున కనబడుచునే యున్నది. ఆమె (తన ప్రకాశమను జలముతో) అంతరిక్ష ద్యులోకములను ప్లావనము (ముంచెత్తి తడుపుట) చేసి భూలోకమునకు వచ్చెను. (ఇందుచేతనే ఆమెకు త్రిపథగ = భూపథాంతరిక్ష పథ ద్యుపథములందు మూడిటియందును నడచునది.) అని వ్యవహారము- అని సంప్రదాయ వచనము.

(భగీరథుని తపః ప్రభావమున) ఆమె మొదట భవుని ఉత్తమాంగమున పడెను. శివుడు తన యోగమాయా శక్తిచే ఆమెనట నంరోధిం (ఆటంకపర)చెను. అందులకై క్రోధము చెందిన ఆమెనుండి కొన్ని బిందువులు క్రిందకు జారి భూమిపై పడెను. వానితో ఏర్పడినందున ఆ సరస్సునకు బిందు సరస్సని నామము.

శివుడు గంగను తన శిరమున నిరోధించగా ఆమె రోషించి క్రూర భావమునంది 'నేని నిరోధమును ఛేదించి ప్రవాహవేగమున శివునిగూడ తీసికొని పాతాళమున ప్రవేశింతును.' అని తలచెను. ఆమె అభిప్రాయమునెరిగి శంకరుడానదిని తన శరీరమునందే మరుగు పరచదలచెను. అంతలోనే శివునకు తన ఎదుటనున్న భగీరథుడు కనబడెను. ఆతడు చిక్కి ఒడలంతయు ధమనులు మాత్రము వ్యాపించి కనబడుచుండెను. అతని ఇంద్రియములు ఆకటితో వ్యాకులములై యుండెను. ఈనది విషయమున ఇతడు తపముచే నన్నిదివరకే మెప్పించెను. నేనతనికి వరమిచ్చితిని. అని స్మరించి ఆదేవుడు తన కోపమును నిగ్రహించుకొని బ్రహ్మవచనమును కూడ జ్ఞప్తికి తెచ్చుకొని నదిని అట్లే నిలిపి

పట్టి తన తేజముచే సంరోధింపబడియున్న గంగను వదలివేసెను. ఆమె నదివరకే భగీరథుడు ఉగ్రతపముచే మెప్పించియుండెను. కావున అట్టి ఆమెను గంగ అనుపేరనే సప్తస్రోతస్సులు (ఏడు ప్రవాహములు)గా శివుడు వదలెను.

నళి(ంది)ని-హ్లాదిని-ప్లావని అను మూడు స్రోతస్సులు తూర్పునకును సీత-చక్షుస్-సింధు-అను మూడును పడమరకును మరియొకటి భగీరథు ననుసరించి దక్షిణమునకును ప్రవహించెను. ఈ హేతువుననే దక్షిణ సముద్రమున కలిసిన ఈ సప్తమ స్రోతస్సు భాగీరథియైనది. మిగిలిన ఆరింటితోకూడ ఈ ఏడును హైమవత వర్షమునునామాంతరము గల భరత వర్షమును పావితమును ప్లావితమును (పవిత్రము చేయబడినది-తడిపి ముంచెత్తబడినది)గా చేయుచున్నవి.

సీతా చక్షుశ్చ సిన్ధుశ్చ తిస్రశ్చైవ సుశోభనాః । తాన్ దేశా న్ప్లావయ న్తిస్మ మ్లేచ్ఛప్రాయాంశ్చ సర్వశః. 42
సశైలా న్కుకురా న్రౌద్రా న్బర్బరా న్యవనా న్తికాన్ । పుల్కసాశ్చకులుత్థాశ్చ అఙ్గలోక్యాధరాశ్చ యే. 43
హిమవన్తం ద్విధాకృత్వా ప్రవిష్టాః పశ్చిమోదధిమ్ । అప్లాక్షాంశ్చ మరూంశ్చైవ కాలకాంశ్చైవ శూలికాన్.
ఖరా నావర్తకా ఞ్ఛాఖా న్పల్లవాన్ దరదా ఞ్ఛకాన్ । ఏతాన్ జనపదాంశ్చైవ ప్లావయ న్త్యుదధిం గతాః
దరదా న్కుక్కుటాం శ్చైవ గాన్ధారా నౌరసా న్కురూన్ ।
శివపౌరా నిన్ద్రమరూన్ శాలీయాంశ్చైవ తేజసా. 46
సైన్ధవారట్టకామ్బోజా న్కుపథా న్భీమగౌరికాన్ । శునోముఖా నుష్ట్రముఖా న్సిన్ధురేతా న్నిషేవతే. 47
గన్ధర్వా న్కిన్నరా న్యక్షాం స్తథా విద్యాధరోత్తమాన్ । కలాపాన్గ్రామకాంశ్చైవ తథా కిమ్పురుషార్షపాన్ 48
కిరాతాంశ్చ పుళిన్దాంశ్చ కురూన్వై భారతానపి । పాఞ్చాలా న్కాశికా న్మత్స్యా న్మాగధాఙ్గాం స్తథైవచ. 49
బ్రహ్మోత్తరాంశ్చ వఙ్గాంశ్చ తామ్రలిప్తాంస్తథైవచ । ఏతా న్జనపదా న్ప్రాప్య గంగా పావయతే శుభా. 50
తతస్తు ప్లావనీ విన్ధ్యే ప్రవిష్టా దక్షిణోదధిమ్ । తతస్తుహ్లాదినీ పుణ్యా ప్రాచీమభిముఖా యయౌ. 51
ప్లావయ న్త్యవకాంశ్చైవ నిషాదానపి సర్వశః । నీవరా న్మూషికాంశ్చైవ తథా నీలముఖానపి. 52
కళిఙ్గదాతికాంశ్చైవ కుశికాన్ స్స్వర్గభూమికాన్ । సామఙ్గాలై స్సము ద్ర(ద్ర)స్య పాదోద్భూతాంశ్చ సర్వశః. 53
తతస్తు నన్దినీచాపి ప్రాచీమేవ దిశం యయౌ । కుపథా న్ప్లావయన్తీ సా ఇన్ద్రద్యుమ్నసరఃప్రతి. 54
యథాత్వేష యథాదేశాం శ్చిత్రశఙ్కువదానపి । మద్యేనర్షానకతరా నోష్ణప్రావరణానపి. 55
ఇన్ద్రద్వీపసముద్రాన్తే ప్రవిష్టా లవణోదధిమ్ ।

పడమరగా ప్రవహించు సీత-చక్షుస్ - (ఇదియే నేటి వక్షు-OXUS-ఆమూదరియా-అనుపేరుగల నది-లోగడ కైలోదానదియే 'వక్షు' అని చెప్పబడినది. అనగా ఇవి ప్రవహించిన ప్రదేశ స్థితిని బట్టి అవి రెండును ఒకటిగా కలిసి పోవుటయో ఒకటి అంతర్వాహినిగా నగుటయో జరిగియుండును.) సింధు-అను మూడు గంగా స్రోతస్సులును మ్లేచ్ఛ ప్రాయములును పర్వత బహుళములునునగు కుకురారౌద్రబర్బర యవనాంతిక పుల్కసకులుత్థాంగలోక్యాధరా ప్లాక్ష మరుకాలక శూలిక ఖరావర్తక శఖ పల్లవదరదశక జనపదములను పవిత్రమొనరించుచు ప్రవహించి తుదకు హిమ వంతమున రెండుగా చీలి పోయిపోయి పశ్చిమ సముద్రములో కలియుచున్నవి. ఈమూడు ప్రవాహములును మిగిలినవి కూడ మొత్తముమీద దరద కుక్కుట గాంధారౌరస కురు శివపౌరేంద్ర మరుశాలీయ సైంధవారట్టక కాంభోజకుపథ భీమ గౌరిక శునోముఖోష్ట్రముఖ సింధురేత గంధర్వ కింనర యక్ష విద్యాధర కలాపగ్రామక కింపురుషార్షవ కిరాత పుళింద భారత కురు పాంచాల కాశిక మత్స్య మగధాంగ బ్రహ్మోత్తరవంగ తామ్ర లిప్త జనపదములను పవిత్ర మొనర్చుచున్నవి.

హ్లాదినియను గంగా ప్రవాహము తూర్పుగ ప్రవహించి యవక నిషాదనీవర మూషిక నీలముఖ కళింగ దాతికకుశిక స్వర్గభూమిక సముద్ర పాద సంజాత జనపదముల వారిని పవిత్రమొనర్చుచున్నది.

నందినియు తూర్పుగనే ప్రవహించి ఇంద్రద్యుమ్న సరఃపరిసరములందలి కుపథములను (ఇరుకు త్రోవలుగల ప్రాంతములను) చైత్ర శంకుపద ఋష కశరోష్ఠ ప్రావరణ దేశముల నడుమగా ప్రవహించిపోయి ఇంద్రద్వీప (ఖండ) సమీపమున (ఇంద్రద్వీప-అండమాన్ నికోబారు దీవులు కావచ్చును.) సముద్రమున కలియుచున్నది.

తతస్తు ప్లావనీ ప్రాయా త్ప్రాచీ మాశాం జవేన తు. 56
తోమరా న్పావయన్తీస్మ హంసమార్గా న్సమూహకాన్ ।
పూర్వాన్ దేశాంశ్చ సేవన్తీ భిత్త్వా సా బహుధా గిరిమ్. 57
కర్ణప్రావరణా న్ప్రాప్య గతా సాశ్వముఖానపి । సిక్త్వా సపర్వతమరూ న్గత్వా విద్యాధరా న్యయౌ. 58
శమీమణ్డలగోష్ఠంతు సా ప్రవిష్టా మహత్సరః । తాసాం నద్యుపనద్యశ్చ శతశోథ సహస్రశః. 59
ఉపగచ్ఛన్తి తాం నద్యో యతో వర్షతి వాసవః । తీరే వస్వోకసారాయా వనం సురభినామ తత్. 60
హిరణ్యశృఙ్గే వసతి విద్వా న్కౌబేరకో వశీ । యజ్ఞా దపేత స్సుమహా నమితౌజా స్సువిక్రమః. 61
తత్ర చాన్యైః పరివృతో విద్వద్భి ర్బ్రహ్మరాక్షసైః । కుబేరానుచరా హ్యేతే చత్వార స్తత్సమాశ్రితాః. 62
ఏవమేవతు విజ్ఞేయా సిద్ధిః పర్వతవాసినామ్ । పరస్పరేణాపి గుణాః ధర్మతః కామతోర్థతః. 63
హేమకూటస్య పృష్ఠేతు సర్పాణాంతు సరస్స్మృతమ్। సరస్వతీ ప్రభవతి తస్మా జ్జ్యోతిష్మతీ(తో)హ్రదాత్.
అపగాడే హ్యుభయత స్సముద్రౌ పూర్వపశ్చిమౌ । సరో విష్ణుపదంనామ నిషధే పర్వతోత్తమే. 65
తస్మా ద్ద్వయం ప్రభవతి గాన్ధారీచ కులాచ తే । మేరోః పార్శ్వా త్ప్రభవతి హ్రద శ్చన్ద్రప్రభో మహాన్.
జమ్బూశ్చైవ నదీ పుణ్యా తస్మా జ్జామ్బూనదం స్మృతమ్। పయోదస్తు హ్రదో నీల స్సుశుభః పుణ్డరీకవాన్.
పుణ్డరీకా పయోదా చ తస్మాద్ద్వే స్సమ్ప్రసూయతే । సరంతు శీతశైలస్య స్మృత ముత్తరమానసమ్. 68
జ్యోత్స్నా చామృతకాన్తాచ తస్మాద్ద్వే సమ్ప్రసూయతే । హ్రదాః కురుషు విఖ్యాతాః పద్మమీనకులాకులాః.
నామ్నాతు వైజయానామ ద్వాదశోదధిసన్నిభాః । తేభ్య శ్శాన్తిశ్చ సన్ధ్యాచ ద్వే నద్యౌ సమ్ప్రసూయతః.70

ప్లావనియను గంగాశాఖ వేగముతో తూర్పుదెసగా ప్రవహించుచు తోమర-హంసమార్గ-సమూహక-ములను పవిత్రమొనర్చుచు ఇంకను కొన్ని ప్రాగ్దేశములను సేవించుచు పలుతావుల పర్వతమును భేదించుచు పోయి కర్ణ ప్రావరణ (అ)శ్వముఖ జనుల జనపదములను తడుపుచు పర్వతమరు-ప్రదేశముల మీదుగా విద్యాధర ప్రదేశములచేరి శమీమండల గోష్ఠము అను మహా సరస్సున కలియుచున్నది. ఇంద్రుడు వర్షించు దేశములందుత్పన్నములగు నదు లుపనదులెన్నియో త్రోవలో ఈ గంగా శాఖలయందు కలియును.

వస్వోకసార (అమరావతీ?) సమీపమున సురభియను వనము కలదు. హిరణ్యశృంగుడు అను పేరుగల విద్వాంసుడు జితేంద్రియుడు నగు హిరణ్య శృంగుడను కౌబేరకుడు (బేతాళుడు) యజ్ఞాపేతుడు సుమహాన్-అమితౌజస్-సువిక్రమ నామములుగల కుబేరానుచరులగు విద్వద్బ్రహ్మ రాక్షసులు నలుగురును ఇట్టివారు మరికొందరును తన పరి వారముగా వసించును.

పర్వతవాసులగు జనులు ఇట్టివారితోనే తమ పురుషార్థముల సిద్ధింపజేసికొందురు. ధర్మార్థ కామ ప్రవృత్తులలో వారందరు పరస్పరము రెట్టింపై యుందురు.

హేమకూట పర్వత పృష్ఠమున సర్పముల సరస్సు ఒకటి కలదు. ఆహ్రదమునుండి సరస్వతీ-జ్యోతిష్మతీ అను రెండునదులు ప్రభవిల్లి పరుసగా తూర్పు-పడమటి సముద్రములందు కలియుచున్నవి.

నిషధమను పర్వతోత్తమమున విష్ణుపదమను సరస్సు కలదు. దానినుండి గాంధారీ-కులా అను రెండు నదులు ప్రభవించును.

మేరు పార్శ్వమునుండి చంద్రప్రభమను సరస్సును పుణ్యయగు జంబూనదియు ప్రభవించును. జంబూనదినుండి లభించునది కావుననే బంగారునకు జాంబూనదమని వ్యవహారము. పయోదమను నీలహ్రదమును అతి శుభకరమగు పుండరీకహ్రదమును ఆమేరు పార్శ్వమునందే ప్రభవించును. వానినుండి వరుసగా పుండరీకా-పయోదా అను నదులును ప్రభవించును. హిమవంతమునకు ఆవలివైపున ఉత్తరమానసమను సరస్సొకటి మేరు పార్శ్వమునుండి ప్రభవించును. దానినుండి జ్యోత్స్నా అమృతకాంతా అనునదులు రెండు ప్రభవించుచున్నవి.

ఇవికాక మేరు పార్శ్వమునుండియే ప్రభవించినవి సముద్రమువలె విశాలములైనవి పంద్రెండు హ్రదములు వైజయములను నామము కలవి కలవు. అవి ఉత్తరకురు వర్షమునందు ప్రసిద్ధములు. అవి ఎప్పుడును పద్మములతో మీనాది జలచరములతో ఆకులములయి యుండును. వీటినుండి శాంతి-సంధ్యా-అను రెండునదులు ప్రభవించును.

కిమ్పురుషాద్యాని యాన్యష్టౌ తేషు దేవో న వర్షతి । ఉద్భిజ్జా న్యుదకాన్యత్ర ప్రభవన్తి సరిద్వరాః. 71
వినివిష్టాః ప్రతిదిశం నిమ్నగా లవణామ్బసి । ఋషభో బాలకశ్చైవ వజ్రో మైనాక ఏవచ. 72
చన్ద్రకాన్త స్తథా ద్రోణః సుమహాంశ్చ శిలోచ్చయః । ఉదగాయతా ఉదీచ్యంతే హ్యవగాఢా మహోదధిమ్.
చక్రో రుధికరశ్చైవ తథా నారదపర్వతః । ప్రతీచ్య మాగతాస్తేవై ప్రవిష్టా లవణోదధిమ్. 74
జీమూతో ద్రావణశ్చైవ మైనాకశ్చైవ పర్వతః । ఆయతాస్తే మహాశైలా స్సముద్రం దక్షిణం ప్రతి. 75
వజ్రమైనాకయో ర్మధ్యే విదిశం దక్షిణాపథే । తత్ర సంవర్తకోనామ సోగ్నిః పిబతి తజ్జలమ్. 76
అగ్నిస్సముద్రావాసస్తు ఔర్వ స్స బడబాముఖః । ఇత్యేతే పర్వతావిష్టా శ్చత్వారో లవణోదధిమ్. 77
ఛిద్యమానేషు పక్షేషు పురా శక్రస్యవై భయాత్ । తేషాంతు దృశ్యతే చన్ద్ర శ్శుక్లే కృష్ణే సమాకృతిః. 78
తే భారతస్య వర్షస్య సహాయేన ప్రకీర్తితాః । మహాంసి తత్ర దృశ్యన్తే చన్ద్రో నాన్యత్ర చోదితః. 79
ఉత్తరోత్తరమేతేషాం వర్షముద్రిచ్యతే గుణైః । ఆరోగ్యాయుః ప్రమాణానాం ధర్మతః కామతోఽర్థతః. 80
సమర్చితాని భూతాని తేషు ధర్మేణ భాగశః । వసన్తి నానాజాతీని తేషు వర్షేషు తానివై. 81
ఇత్యేవం ధారయద్విశ్వం పృథ్వీం జగదిదం స్థితాః. 81½

ఇతి శ్రీమత్స్యమహాపురాణే భూగోళే కైలాసాదిపర్వతకథనం నామ
వింశత్యుత్తరశతతమోఽధ్యాయః.

ఈ భరతవర్షము కాక మిగిలిన కింపురుషాది వర్షములయందెనిమిదింటను ఇంద్రుడు వర్షించడు. అచట ఉద్భిజ్జమగు-నేలను చీల్చుకొని పైకి వచ్చు నీటి(underground water) తోనే నదులు ప్రభవించి అవి ఆయా దిక్కులందలి సముద్రములందు కలియును.

ఆయా వర్షములందు—

ఋషభ-బాలక-వజ్ర-మైనాక-చంద్రకాంత-ద్రోణ-పర్వతములు దక్షిణమునుండి ఉత్తరమునకు వ్యాపించి ఉత్తర దిగంతమున ఉత్తర సముద్రములోనికి చొచ్చుకొనియున్నవి. చక్ర రుధికర-నారద పర్వతములు పడమటగా సాగి పశ్చిమ సముద్రములోనికి ప్రవేశించినవి. జీమూత ద్రావణ మైనాక పర్వతములు దక్షిణ సముద్రము వైపునకు సాగియున్నవి. వజ్రము మైనాకము అను రెండు పర్వతముల నడిమికి తిన్నగా అగు విదిక్కు (మూల) నందు దక్షిణాపథ పరిసరములలో సంవర్తకుడను సముద్రవాసియగు అగ్ని సముద్రపు నీటిని త్రాగుచుండును. అతనికే ఔర్వుడు-బడబాముఖుడు అనియు వ్యవహారములు.

పూర్వము ఇంద్రుడు తమ రెక్కలు భేదించరాగా ఆభయము వలన ఈ పర్వతములు (పర్వతములలో) నాలుగు లవణోదధియందు ప్రవేశించెను. ఈ పర్వత ప్రదేశములందు చంద్రుడు మాసపు శుక్ల కృష్ణపక్షముల

రెంటను సమాకృతియై కనబడును. ఈ పర్వతములు నాలుగును భారత వర్షమునకు సహాయకములని (ఉపకారకములని) పెద్దలు చెప్పుచున్నారు. (అది ఎట్లో సంప్రదాయజ్ఞులవలన తెలియదగినది.) వేరు ప్రదేశములందు అతడు ఉద యించకపోయినప్పటికిని ఇచ్చట చంద్రుని అన్ని కాంతులును (ఎల్లప్పుడు) కనబడుచుండును.

ఈ ఎనిమిది వర్షములందును జనులు ఆరోగ్యము ఆయుఃప్రమాణము ధర్మార్థకామ ప్రవృత్తులు తత్సిద్ధులు-ఈ విషయములందు ఒకదానికంటెను మరియొకటి రెట్టింపు చొప్పున ఆధిక్యము కలిగియుండును. ఆ వర్షములన్నిటి యందును ప్రాణులు ధర్మము విషయమున ఆయా సందర్భములలో మేలు తరములయి యుండును. ఆయా వర్షములందు నానాజాతుల భూతములు నివసించుచున్నవి. నానా జాతుల జనులు నివసించుచున్నారు.

ఈ విధమగు ఈ విశ్వమును తనయందు ధరించుచు ఈ భూమి ఇట్టి వర్షాది విభాగములతో ఉన్నది.

(గమనిక: ఈ అధ్యాయము చివర చంద్రుని విషయమును చెప్పెడి శ్లోకములలో కొన్ని ప్రతులయందు పాఠములు అర్థమును పూర్ణముగా భేదింపజేయుచున్నవి. అనువాదకుడు తాననుసరించిన ప్రతియందలి పాఠమునను సరించి అనువదించుటయైనది- అనువాదకుడు.)

ఇది శ్రీమత్స్యమహాపురాణమున భూగోళ వర్ణనమున జంబూ ద్వీపాంతర్గత భరత వర్షాంతర్గత భరతఖండ వర్ణనమున కైలాసాది పర్వత సంస్థాన వర్ణనము కింపురుషాది వర్షవిశేషవర్ణనమునను నూట ఇరువదవ యధ్యాయము.

## ఏకవింశతితమోఽధ్యాయః.
## శాకద్వీపవర్ణనమ్.

సూతః : శాకద్వీపస్య వక్ష్యామి యథావదిహ నిశ్చయమ్ ।
కథ్యమానం నిబోధధ్వం శాకద్వీపం ద్విజోత్తమాః. 1
జమ్బూద్వీపస్య విస్తారా ద్విగుణ స్తస్య విస్తరః । విస్తారా త్త్రిగుణశ్చాపి పరిణాహ స్సమన్తతః. 2
క్షీరోదధిపరిక్షిప్తో ద్వీపోయం ద్విగుణేనతు । తత్రపుణ్యా జనపదా శ్చిరాచ్చ మ్రియ(ం)తే జనాః. 3
కుతఏవతు దుర్భిక్షం క్షమా తేజో యుతేష్విహ । తత్రాపి పర్వతాశ్శుభ్రా స్సప్తైవ మణిభూషితాః. 4
శాకద్వీపాదిషు జ్ఞేయం సప్త సప్త సమాశ్రితాః । ఋజ్వాయతాః ప్రతిదిశం నివిష్టా వర్షపర్వతాః. 5
రత్నాకరా ద్వినామాన స్సారవన్తో మహాబలాః । సమోదితాః ప్రతిదిశం ద్వీపవిస్తరమానతః. 6
ఉభయత్రావగాఢాశ్చ లవణక్షీరసాగరౌ । శాకద్వీపేతు వక్ష్యామి సప్త దివ్యా న్మహాచలాన్. 7
దేవర్షిగన్ధర్వయుతాన్ ప్రథమో మేరు రుచ్యతే । ప్రాగాయతస్తు సౌవర్ణ ఉదయోనామ పర్వతః. 8
తత్ర మేఘాస్తు వృష్ట్యర్థం ప్రభవన్తి సహస్రశః । తస్యాపరేణ సుమహా న్జలధారో మహాగిరిః. 9
సైవ చన్ద్రి స్సమాఖ్యాత స్సర్వౌషధిసమన్వితః । తస్మా న్నిత్య ముపాదత్తే వాసవః పరమం జలమ్. 10
నారదోనామ స ప్రోక్తో దుర్గ శ్శైలో మహాచలః । తత్రాపిచ సముత్పన్నౌ పూర్వం నారదపర్వతౌ. 11
తస్యాపరేణ సుమహా ఞ్శ్యామోనామ మహాగిరిః । అత శ్శ్యామత్వమాపన్నాః ప్రజాః పూర్వ మిమాః కిల.
సఏవ దున్దుభిర్నామ శ్యామః పర్వతసత్తమః । శబ్దమృత్యుః పురాతస్మిన్ దున్దుభి స్తాడిత స్సురైః. 13
రత్నమాలాన్తరమయ శ్శాల్మల శ్చాన్తరాళకృత్ । తస్యాపరేణ రజతో మహా నస్తగిరి స్స్మృతః. 14
సఏవామృత ఇత్యుక్తో దేవైర్యత్రామృతం పురా । సమ్భృతంచ హృతంచైవ మాతురర్థే గరుత్మతా. 15
అస్యాపరే చామ్బికేయ స్సుమనా శ్చైవ స స్మృతః । హిరణ్యాక్షో వరాహేణ తస్మి న్శైలే నిషూదితః. 16
అమ్బికేయా త్పరే(రో)రమ్య స్సర్వౌషధినిషేవితః । విభ్రాజస్తు సమాఖ్యాత స్స్ఫాటికైస్తు సమాచితః. 17
యస్మా ద్విభ్రాజతే త్విడ్భి ర్విభ్రాజ స్త్వేషవై స్మృతః । సఏవ కేశవేత్యుక్తో యతో వాయుః ప్రవాతి తే.18

## నూట ఇరువది యొకటవ అధ్యాయము.

## శాక-కుశ-క్రౌంచ శాల్మల ద్వీపముల వర్ణనము.

[వాయు పురాణము మొదలగు వానియందు 1. జంబూద్వీపము-దానిచుట్టు క్షార సముద్రము 2. ప్లక్ష (గోమేదక) ద్వీపము-దానిచుట్టు ఇక్షు సముద్రము 3. శాల్మల ద్వీపము-దానిచుట్టు సురా సముద్రము 4. కుశద్వీపము-దానిచుట్టు ఘృత సముద్రము 5. క్రౌంచ ద్వీపము-దానిచుట్టు దధి సముద్రము 6. శాక ద్వీపము-దానిచుట్టు క్షీర సముద్రము 7. పుష్కర ద్వీపము-దానిచుట్టు స్వాదుజల (తీయని నీటి) సముద్రము-అని యున్నది. ఈ మత్స్య పురాణము నందు వరుస వేరు విధముగా నున్నది.]

### శాకద్వీప వర్ణనము

సూతుడు ఋషులతో ఇట్లు చెప్పనారంభించెను: శాకద్వీపమునకు సంబంధించిన ఆయా విషయముల నిశ్చయమును సంప్రదాయమందున్న విధమున చెప్పెదను. నేను చెప్పుచుండ-ద్విజోత్తములారా! శాకద్వీప (విషయ)మును సమగ్రముగా తెలిసికొనుడు. జంబూద్వీపపు వ్యాసమునకు ద్విగుణము శాకద్వీప వ్యాసము. వ్యాసమునకు మూడింతలు దాని చుట్టుకొలత. దీనికి రెట్టింపు పరిమాణము కల క్షీర సముద్రము దీని చుట్టు నున్నది. అచటి జనపదములు పుణ్యవంతములు. అచటి జనులు దీర్ఘాయువులు; క్షమా తేజోవంతులును; అచట కరవులు ఉండనే ఉండవు.

ఆ శాక ద్వీపమునందును మణి భూషితములును శుభములు నగు ఏడేసి పర్వతములు కలవు. దీనియందే కాదు; శాక ద్వీపాది సర్వ ద్వీపములందును ఏడు ఏడుగానే పర్వతాదికము కలదని తెలియవలెను. ఇవి ప్రతి దిక్కునందును ఋజువులై (వంకరలు లేక) ఆయతములై (దీర్ఘ చతురస్రాకారమున) అమరి ఒక వర్షమును మరియొక వర్షమునుండి వేరుపరచు వర్ష పర్వతములుగా ఉన్నవి. ఇవి రత్నములకు ఆకరములు (గనులవంటివి.) ప్రతి దానికిని రెండేసి పేరులు కలవు. ఇవి సారవంతములు; మహాబలములు. ద్వీపపు నిడివికి తగినట్లు అనుపాతములో ప్రతి దిక్కునందును సమముగా పుట్టియున్నవి. ఇవి ప్రతియొక్కటియు లోపలివైపు (జంబూ ద్వీపపు చుట్టునున్న) లవణ సముద్రమునను వెలుపలివైపు క్షీర సముద్రమునందును చొచ్చుకొనియున్నవి. శాక ద్వీపమందలి దేవర్షి గంధర్వయుత దివ్య మహాచలముల నేడింటిని చెప్పెద; వినుడు.

1. మేరువు-ఉదయము. ఇది బంగారుకొండ; తూర్పునకు పొడవుగా సాగినది. అచట వేలకొలది మేఘములు బాగుగ వానలు కురియుచుండును; 2. జలధారము-చంద్రము; ఇది మహాపర్వతము; సర్వౌషధియుతము; ఇంద్రుడు దీనినుండి ఉత్తమ జలమును (తన మేఘములకై) గ్రహించుచుండును. 3. నారదము-దుర్గము; ఇదియు మహా పర్వతము; పూర్వము నారద పర్వతులను గంధర్వులు దీనియందు జన్మించిరి. 4. శ్యామము-దుందుభి; ఇదియు మహాపర్వతము; నల్లనిది; దీని మూలముననే ఆ ప్రాంతపు జనులు పూర్వము నల్లని వారయిరి. దేవతలిచట దుందుభి రాక్షసుని కొట్టి-శబ్దము వానినుండి ఉత్పన్నమగుటయే మరణముగాగల ఆ దానవుని చంపిరి. ఈ కొండ నడుమ రత్న వంకులును శాల్మల వృక్షమును కలవు; 5. అస్తగిరి-అమృతము; తన తల్లి దాస్యము విడిపించుటకై గరుడుడు దేవతలనుండి హరించి తెచ్చిన అమృతమును ఇచ్చటనే పాత్రయందు నింపి భద్రపరచెను. 6. ఆంబికేయము-సుమనస్; దీనియందే వరాహ విష్ణువు హిరణ్యాక్షుని సంహరించెను. 7. విభ్రాజము-కేశవము; ఇది స్ఫటిక మణులతో వ్యాప్తము. దీనినుండియే వాయువు వీచుట ఆరంభమగును. విభ్రాజతే-మిగుల ప్రకాశించునది-కావున దీనికే పేరు.

తేషాం వర్షాణి వక్ష్యామి పర్వతానాం ద్విజోత్తమాః । శృణుధ్వం నామతస్తాని యథావదనుపూర్వశః. 19
ద్వినామాన్యేవ వర్షాణి యథైవ గిరయ స్తథా । ఉదయస్యోదయంవర్షం జలధారేతి విశ్రుతమ్. 20
నామ్నా గతభయంనామ వర్షంత త్ప్రథమం స్మృతమ్ । ద్వితీయం జలధారస్య సుకుమారమితి స్మృతమ్.

తదేవ శైశిరంనామ వర్షం సమ్పరికీర్తితమ్ । నారదస్య చ కౌమారం తదేవచ సుఖోదయమ్. 22
శ్యామపర్వతవర్షం త దసీచక మిదం స్మృతమ్ । ఆనన్దకమితి ప్రోక్తం తదేవ మునిభి శ్శుభమ్. 23
అస్తస్యాపి శుభం వర్షం విజ్ఞేయం కుసుమోత్తరమ్ । తదేవ శివ మిత్యుక్తం వర్షం సోమక సంజ్ఞితమ్. 24
ఆమ్బికేయస్య మైనాకం క్షేమకంచైవ తత్స్మృతమ్। క్రౌరవపర్వతస్యాపి మహాద్రుమ మితి స్మృతమ్. 25
తదేవ ధ్రువమిత్యుక్తం వర్షం విభ్రాజసంజ్ఞికమ్ । ద్వీపస్య పరిణాహశ్చ హ్రస్వదీర్ఘత్వ మేవచ. 26
జమ్బూద్వీ పేన సఙ్ఖ్యాత; స్తస్య మద్యే వనస్పతిః । శాకోనామ మహావృక్షః ప్రజా స్తస్య సహానుగాః. 27
ఏతేషు దేవగన్ధర్వా స్సిద్ధాశ్చ సహచారణైః । విహరన్తి సమత్వేన దృశ్యమానాశ్చ తై స్సహ. 28
తత్ర పుణ్యా జనపదా శ్చాతుర్వర్ణ్య సమన్వితాః । తేషు నద్యశ్చవై సప్త ప్రతివర్షం సముద్రగాః. 29
ద్వినామ్న్యశ్చైవ తాస్సర్వా గఙ్గా సప్తవిధా స్మృతా । ప్రథమా సుకుమారీతి గఙ్గా శివజలా శుభా. 30
తపస్తప్తాచ నామ్నైషా నదీ సమ్పరికీర్తితా । సుకుమారీ తపస్సిద్ధా ద్వితీయా నామత స్సతీ. 31
నన్దాచ పావనీచైవ తృతీయా పరికీర్తితా । శిబికాచ చతుర్థీస్యా త్త్రివిధాచ పునస్స్మృతా. 32
ఇక్షుశ్చ పఞ్చమీ జ్ఞేయా తథైవచ పునః కుహూః । రేణుకా చామృతాచైవ షష్ఠీ సమ్పరికీర్తితా. 33
సుకృతాచగభస్తిశ్చ సప్తమీ పరికీర్తితా । ఏతా స్సప్త మహాభాగాః ప్రతివర్షం శివోదకాః. 34
పావయన్తి జనం సర్వం శాకద్వీపనివాసినమ్ । అభిగచ్ఛన్తి తాశ్చాన్యా నదా నద్య స్సరాంసిచ. 35
బహూదకపరిస్రావా ద్యతో వర్షతి వాసవః । తాసాంతు నామధేయాని పరిమాణం తథైవచ. 36
నశక్యం పరిసఙ్ఖ్యాతుం పుణ్యాస్తా స్సరిదుత్తమాః । తాః పిబన్తి మహాహృష్టా నదీ ర్జనపదాస్తు తే. 37
ఏతేషాం తనయాః ప్రోక్తాః ప్రమోదాశ్చాపి వై శివా. । ఆనన్దాశ్చ సుఖాశ్చైవ క్షేమకాశ్చ నదై స్సహ. 38
వర్ణాశ్రమాచారయుతా దేశాస్తే సప్త విశ్రుతాః । ఆరోగ్యా బలినశ్చైవ సర్వే మరణవర్జితాః. 39
అవసర్పిణీ నతేష్వస్తి తథైవోత్సర్పిణీ పునః । న తత్రాస్తి యుగావస్థా చతుర్యుగకృతా క్వచిత్. 40
త్రేతాయుగసమః కాల స్తథా తత్ర ప్రవర్తతే । శాకద్వీపాదిషు జ్ఞేయం పఞ్చస్వేతేషు సర్వశః. 41
దేశస్యతు విభాగేన కాల స్స్వాభావికః స్మృతః । న తేషు సఙ్కరః కశ్చి ద్వర్ణాశ్రమకృతః క్వచిత్. 42
ధర్మస్య చాన్యథాచారా దేకా న్తసుఖినః ప్రజాః। న తేషు మాయా లోభోవా ఈర్ష్యానూయా భయం కుతః. 43
విపర్యయో న తేష్వస్తి న దణ్డోనచ దాణ్డికాః । స్వధర్మేణచ ధర్మజ్ఞా స్తే రక్షన్తి పరస్పరమ్. 44

వీనితో ఏర్పడిన వర్షములను ద్విజోత్తములారా! ఇదే వరుసలో చెప్పెదను; వినుడు; గిరులకువలెనే వర్షములకును రెండేసి పేరులు గలవు.

1. ఉదయవర్షము-జలధార వర్షము; ఇది పేరునకు తగినట్లు జలధారలతో నిండినదగుటచే అనావృష్టి భయము లేనిది. 2. సుకుమారము-శైశిరము; 3. కౌమారము-సుఖోదయము. 4. అసీచకము - ఆనందకము; 5. కుసుమోత్త(త్క-)రము -సోమకము; 6. మైనాకము-క్షేమకము; 7. మహాద్రుమము-ధ్రువము.

ఈ ద్వీపపు వైశాల్యము పొడవు వెడల్పులు జంబూద్వీపపు వైశాల్యము పొడవు వెడల్పుల నిష్పత్తి ననుసరించి అనుపాతములో గణనచేసి తెలిసికొనవలెను. ఈ ద్వీపపు నడుమ శాకము (చాగచెట్టు) అను వనస్పతి (పూవులు పూయకయే కాయలనిచ్చు) జాతి మహావృక్షము కలదు. ఇచటి ప్రజలు దీని ననుజీవింతురు. ఈ ప్రజలతో సమముగా ఇచట దేవగంధర్వ-సిద్ధ-చారణులు జీవించుచు సంచరించుచుందురు. చాతుర్వర్ణ్యులు కల పుణ్యజనపదము లిచ్చట గలవు.

ం. పు. 55)

ఇదే వర్ష పర్వతముల-వర్షముల - వరుసలో ఇచట రెండేసి నామములు గల నదులు గలవు. గంగయే ఏడుగా అయి ఈ సప్తనదులుగా నున్నది. ఇవి అన్నియు హాయిగొల్పు నీరు కలిగినవి; సముద్రములో కలియునవి; 1. సుకుమారి-తపస్త (అనుత)ప్త; 2. కుమారి-తపస్సిద్ధ; 3. న(మ)ంద-పావని; 4. శిబిక-త్రి(ద్వి)విధ; 5. ఇక్షు-కుహూ; 6. వేణు (వైశ్య)క-అమృత; 7. సుకృత-గభస్తి.

శుభకర జలము గలిగిన మహాభాగలగు ఈనదులు శాకద్వీప నివాసియగు సర్వజనుని పవిత్రుని చేయుచున్నవి. ఎన్నో నదీనద సరస్సులు వీనితో చేరుచుండును. ఇంద్రుడు బహూదకమును స్రవించుచు వర్షించుచుండుటచే ప్రభవించి ప్రవహించు ఆ నదీనదుల నామములను పరిమాణమును చెప్పశక్యము కాదు. అవి పుణ్యకరములు - శ్రేష్ఠములు; వానిని (వాని జలమును) త్రావుచు అచటి జనపదజనులు హర్షముతో నుందురు. అచటి నదములకును - వానితోపాటే అచటి జనుల వంశము వారికిని - ప్రమోద-శివ-ఆనంద-సుఖ-క్షేమక-ప్రభృతి నామములు ప్రసిద్ధములు; ఆ ఏడు దేశ (వర్ష)ముల జనులును వర్ణాశ్రమాచారములు ఆరోగ్యము బలము కలిగి అనుచిత మరణములు లేకయుందురు. అచటి జనులయందు అవసర్పిణీ ప్రవృత్తి (ఉన్నదానికంటె దిగజారి పతనావస్థకు పోవుట) కాని ఉత్సర్పిణీ ప్రవృత్తి (సన్మార్గ ప్రవృత్తికి ఎదురు నడచుట-త్రోవ తప్పుట) కాని లేవు. చతుర్యుగ వ్యవస్థలేదు; శాకద్వీపాది షట్ ద్వీపములందును సదా త్రేతాయుగమునందువలె ధర్మ వ్యవస్థ ఉండును. స్వాభావికముగ మనము మన అలవాటు ననుసరించి కాల విభాగమును ఆదేశ విభాగములందును అన్వయించవలసినదేకాని వాస్తవమున అచట ఇవి లేవు. అచట వర్ణాశ్రమ సంకరము మాయ లోభము ఈర్ష్య అసూయ విపర్యయము ఇతరులు తమ కపకారము సేయుదురను భయము దండము దండ్యులు దండించువారు లేరు. స్వధర్మ వర్తనముతో ఎల్లరు ధర్మజ్ఞులై పరస్పర రక్షణము చేయుచు ధర్మమును అన్యథా (విలక్షణ మగు ఏకైక విధమున) పాటించువారగుటచే అచటి జనులు ఏకాంత సుఖులు. (సుఖము తప్ప దుఃఖమును ఎరుగరు) (ఇది Scithya ప్రాంతమని గుర్తింపవచ్చును

పరిమణ్డలస్తు సుమహాన్ ద్వీపశ్చ కుశసంజ్ఞితః। నదీజలైః ప్రతిచ్ఛన్నః పర్వతై శ్చాభ్రిసన్నిభైః. 45
సర్వధాతువిచిత్రైశ్చ మణివిద్రుమవిభూషితైః। అన్యైశ్చ వివిధాకారై రమ్యై ర్జనపదై స్తథా. 46
వృక్షైః పుష్పఫలోపేతై స్సర్వతో ధనధాన్యవాన్। నిత్యం పుష్ప సమాయుక్త స్సర్వరత్నసమన్వితః. 47

కుశద్వీపవర్ణనమ్.

ఆవృతః పశుభిస్సర్వై ర్గ్రామ్యారణ్యైశ్చ సర్వశః। అనుపూర్వ్యా త్సమాసేన కుశద్వీపం నిబోధత. 48
అథ తృతీయం వక్ష్యామి కుశద్వీపస్య కృత్స్నశః। కుశద్వీపే సురామ్భోధి స్సర్వతః పరివారితః. 49
శాకద్వీపస్య విస్తారా ద్ద్విగుణేన సమన్వితః। తత్రాపి పర్వతాస్సప్త విజ్ఞేయా రత్నయోనయః. 50
రత్నాకరా స్తథానద్య స్తేషాం నామాని మే శృణు। ద్వినామానశ్చ తేసర్వే శాకద్వీపే యథా తథా. 51
ప్రథమః సూర్యసఙ్కాశః కామదోనామపర్వతః। విద్రుమోచ్ఛ్రయ ఇత్యుక్త స్సఏవచ మహీధరః. 52
సర్వధాతుమయై శ్శృఙ్గై శ్శిలాజాలై స్సమన్వితః। ద్వితీయః పర్వత స్తత్ర ఉన్నతోనామ విశ్రుతః. 53
హేమపర్వతఇత్యుక్త స్సఏవచ మహీధరః। హరితాళమయై శ్శృఙ్గై ర్ద్వీపమావృత్య సర్వశః. 54
బలాహక స్తృతీయస్తు కాలాఞ్జనమయో గిరిః। ద్యుతిమా న్నామతః ప్రోక్త స్సఏవచ మహీధరః. 55
చతుర్థఃపర్వతో ద్రోణో యత్రౌషధ్యో మహాగిరౌ। విశల్యకరణీచైవ మృతసఞ్జీవనీ తథా. 56
పుష్పవాన్నామ స ప్రోక్తః పర్వత స్సుమహాన్వితః। కఙ్కస్తు పఞ్చమ స్తేషాం పర్వతోనామ సారవాన్. 57
కుశేశయ ఇతిప్రోక్త స్సచ పృథ్వీధర స్స్మృతః। దివ్యపుష్పఫలోపేతో దివ్యవీరుత్సమన్వితః. 58

షష్ఠస్తు పర్వతస్తత్ర మహిషో మేఘసన్నిభః । సఏవతు పునఃప్రోక్తో హరిరిత్యభివిశ్రుతః. 59
తస్మిన్సోఽగ్ని ర్నివసతి మహిషోనామ యోఽప్సుజః ।
కకుద్మా న్పర్వత (స్సప్తమ) స్తత్ర తన్నామ్నా సహ భావ్యతే. 60
సఏవ మన్దరో జ్ఞేయ స్సర్వధాతుసమన్వితః । మన్ద(న)ఇత్యేవ యో ధాతు రపామర్థే ప్రకాశతే. 61
అపాం విదారణాచ్చైవ మన్దర స్స నిగద్యతే । తత్ర రత్నాన్యనేకాని స్వయం రక్షతి వాసవః. 62
ప్రజాపతి రుపాదాయ ప్రజాభ్యో హ్యదదా త్స్వయమ్ । తేషా మన్తరవిష్కమ్భో ద్విగుణ స్సవిభాగశః. 63
ఇత్యేతాః పర్వతాస్తత్ర కుశద్వీపే ప్రభాషితాః । తేషాం వర్షాణి వక్ష్యామి సప్తైవచ విభాగశః. 64
కామస్య కామదంవర్ష మున్నతంచైవ తత్స్మృతమ్ । ఉన్నతస్య పరిజ్ఞేయం వర్షం లోహితసంజ్ఞితమ్. 65
వేణుమణ్డలకం చేతి తదేవ పరిశబ్ద్యతే । బలాహకస్య జీమూతం తద్రథాకార మిత్యపి. 66
ద్రోణస్య హారికం నామ లిమ్పకంచ తదేవహి । కఙ్కస్యాపి కురున్నామ మతిమచ్చైవ తత్స్మృతమ్. 67
మాహిషం మహిషస్యాపి పునశ్చాపి ప్రభాకరమ్ । కకుద్మతస్తు తద్వర్షం కపిలంనామ విశ్రుతమ్. 68
ఏతా న్యుపనివిష్టాని సప్తసప్త పృథక్పృథక్ । వర్షాణి పర్వతాశ్చైవ నదీస్తేషు నిబోధత. 69
తత్రాపి నద్య స్సప్తైవ ప్రతివర్షం హి తాః స్మృతాః । ద్వినామవత్య స్తా స్సర్వాః సర్వాః పుణ్యజలాః స్మృతాః.
ధూతపాపా నదీ సా హి యోనిశ్చైవ పునఃస్మృతా । సీతా ద్వితీయా చైవేహ సాచైవహి నిశాస్మృతా. 71
తృతీయాతు వితృష్ణాహ్వా పవిత్రా సైవచ స్మృతా । చతుర్థీ హ్లాదినీత్యుక్తా చన్ద్రిమాఇతిచ స్మృతా. 72
విద్యుచ్చ పఞ్చమిప్రోక్తా శుక్లాచైవ నిగద్యతే । షష్ఠా షష్ఠీతు విజ్ఞేయా పునస్సైవ విభావరీ. 73
మహతీ సప్తమి ప్రోక్తా పునస్సైవ ధృతిస్స్మృతా । అన్యా స్తాభ్యః పరిజ్ఞాతా శ్శతశోథ సహస్రశః. 74
అనుగచ్ఛన్తి తా నద్యోయతో వర్షతి వాసవః । ఇత్యేష సన్నివేశోయం కుశద్వీపస్య వర్ణితః. 75
శాకద్వీపస్య విస్తారః ప్రోక్తశ్చైవ సనాతనః । శాకద్వీప స్సముద్రేణ వృతః క్షీరోదకేన తు. 76
సర్వతస్తు మహాన్ ద్వీప శ్చన్ద్రవ త్పరివేష్టితః । విస్తారా న్మణ్డలాచ్చైవ క్షీరోదా ద్విగుణ స్స్మృతః. 77

## కుశద్వీప వర్ణనము.

మూడవదగు కుశద్వీపము శాకద్వీపము చుట్టును గుండ్రనై నదీజలములతో సర్వవిధ గైరిక ధాతువులతో వివిధ వర్ణములు కలవై మణులతో వృక్షములతో అలంకృతములయి ఇంకను వివిధ రూపములు కలవై మేఘములవలె కనబడు పర్వతములతో వ్యాప్తము. జనపదములతోను పుష్పఫలోపేతములగు వృక్షములతోను రమ్యము; అంతటను ధనధాన్య సహితము. ఎడతెగక ఎప్పుడు ఎల్లయెడల సకల పుష్పములతో సర్వరత్నములతో గ్రామ్యములు అరణ్యములునగు పశువులతో కూడియుండునది. ఇది ద్వీపముల నామక్రమానుసారముగ సంగ్రహముగా చెప్పదగిన విషయము. ఇక ఈ ద్వీప విషయము అంతయు విస్తరముగ చెప్పెదను; వినుడు; కుశద్వీపమునకు చుట్టును సురా సముద్రమున్నది; వైశాల్యములో ఇది శాక ద్వీపమునకు ద్విగుణము; దీనియందు రత్నములకు జన్మస్థానములగు పర్వతములును అట్టివే నదులును కలవు. ఈ వర్ష పర్వతములు కల వర్షములును ఏడేసి చొప్పున రెండేసి పేరులు కలవిగా ఉన్నవి.

పర్వతములు: 1. సూర్యునితో సమమగు-కామదము-విద్రుమోచ్చయము; 2. సర్వధాతుమయ శృంగములతోను శిలాజాలములతోను కూడిన-ఉన్నతము-హేమము; 3. హరితాళ(అరిదళము)మయశృంగములతో ఆ ద్వీపము నన్ని వైపులను క్రమ్మిన కాలాంజనమయమగు-వలాహకము-ద్యుతి; 4. విశల్యకరణి మృతసంజీవని అను ఓషధులు కల-ద్రోణము-పుష్పవాన్; 5. సారవంతమయి దివ్య పుష్పఫలములతో దివ్యలతలతో కూడినది అగు-కంకము-కుశేశయము; 6. మేఘ

నద్యశమము-నీటినుండి జనించిన మహిషుడను అగ్నికి వాసస్థానము (చూ. 51 అ.) అగు మహిషము-హరి; 7. సర్వ గైరికక ధాతు యుక్తమగు-కకుద్మాన్-మందరము; మన్-అనగా జలమును-దర-చీల్చునది కావున దీనికి ఈపేరు; ప్రజాపతి ప్రజల నిమిత్తమై స్వయముగా ఇంద్రునకు ఇచ్చిన అనేక రత్నములను అతడు ఈ పర్వతమునందుంచి కాపాడుచున్నాడు. ఈ పర్వతముల నడిమి వ్యాసము శాకద్వీప పర్వతముల అంతర విష్కంభము (నడిమి వ్యాసము)నకు ద్విగుణము.

వర్షములు: 1. కామదమ-ఉన్నతము; 2. లోహితము-వేణు మండలకము 3. జీమూతము-రథాకారము; 4. హరికము-లింపకము; 5. కురు-మతిమత్; 6. మహిషము-ప్రభాకరము; 7. కకుద్మత్-కపిలము.

నదులు: ఇవి అన్నియు పుణ్యజలవంతములు: 1. ధూతపాప-యోని; 2. సీత-నిశ; 3. తృష్ణ-పవిత్ర; 4. హ్లాదిని-చంద్రభాస్; 5. విద్యుత్-శుక్ల; 6. షండా-విభావరి; 7. మహతీ-ధృతి; వీటియందు అచట ఇంద్రుడు తరచుగా కురియించెడి వర్షముల వలన ఏర్పడెడి వందల-వేల-కొలది నదులు కలియుచుందును.

[శాశ్వత సంప్రదాయాగతమగు శాకద్వీప విస్తారాదికము చెప్పబడినదికదా: క్షీర సముద్రము శాకద్వీపమును చంద్రుడువలె చుట్టియున్నది. అంజిని:]

## క్రౌఞ్చద్వీపవర్ణనమ్.

అతఃపరం ప్రవక్ష్యామి క్రౌఞ్చద్వీపం యథాతథమ్ । కుశద్వీపస్య విస్తారా ద్ద్విగుణ స్తస్య విస్తరః. 78
ఘృతోదకసము ద్రోసౌ క్రౌఞ్చద్వీపే సుసంవృతః । చక్రనేమిక్రమేణైవ వృతో వృత్తేన సర్వశః. 79
తస్మిన్ ద్వీపే నరాశ్శ్రేష్ఠాః కౌఞ్చస్తు ప్రథమోగిరిః । క్రౌఞ్చాత్పరః పావకాఖ్యః పావకా దణ్డకారకః. 80
అణ్డకారా త్పరశ్చాపి దేవవాన్నామ పర్వతః । దేవావ్రస్య పరేచాపి దేవకోటి స్తథోచ్యతే. 81
దేవవత్పర్వతాచ్చాపి గోవిన్దోనామ పర్వతః । గోవిన్దాత్పరతశ్చాపి పుణ్డరీకో మహాగిరిః. 82
ఏవం రత్నమయాస్సప్త క్రౌఞ్చద్వీపేతు పర్వతాః । పరస్పరస్య ద్విగుణం విష్కమ్భా వర్షపర్వతాః. 83
వర్షాణి తస్య వక్ష్యామి నామతస్తా న్నిబోధత । క్రౌఞ్చస్య కుశలోదేశః పావకస్యతు చానుగః. 84
తతోనుగా త్పరశ్చోష్ణ స్తృతీయోదేశ ఉచ్యతే । ఉష్ణాత్పరః పావనకః పావనా దణ్డకారకః. 85
అణ్డకారకదేశాత్తు మునిదేశ స్తతఃపరమ్ । మునిదేశా త్పరోవాపి ప్రోచ్యతే చన్ద్రనిస్వనః. 86
రక్తా నరజనారణ్యై ర్బృహంభి స్సప్రియజ్జుభిః । సిద్ధచారణసఙ్కీర్ణో దేవప్రాయశ్శుచిస్స్మృతః. 87
స్మృతా స్తత్రైవ నద్యస్తు ప్రతివర్షం గతా శ్శుభాః । గౌరీ కుముద్వతీచైవ సన్ధ్యా రాత్రిర్మనో †రమా. 88
ఖ్యాతిశ్చ పుణ్డరీకాచ గఙ్గా సప్తవిధా స్మృతా । తాసాం సహస్రశశ్చాన్యా నద్యోయా స్తత్సమీపగాః. 89
అభిగచ్ఛన్తి తా నద్యో బహులా స్సబహూదకాః । తేషాం నిసర్గో దేశానా మానుపూర్వ్యేణ సర్వశః. 90
న శక్యోవిస్తరా ద్వక్తు మాసాం వర్షశతైరపి । నోపసర్గః ప్రజానాంతు సంహారో యశ్చతేషు వై. 91

## శాల్మలద్వీపవర్ణనమ్.

అతఊర్ధ్వంతు వక్ష్యామి శాల్మలస్య నిబోధత । శాల్మలో ద్విగుణో ద్వీపః క్రౌఞ్చద్వీపస్య విస్తరాత్. 92
పరివార్య సముద్రశ్చదధిమణ్డోదకః స్థితః । తత్ర పుణ్యా జనపదా శ్చిరాచ్చ మ్రియతే జనః. 93
కుతఏవహి దుర్భిక్షం క్షమాతేజోయుతా హి తే । ప్రథమ స్సూర్యసఙ్కాశ స్సుమనానామ పర్వతః. 94
పీతస్తు మధ్యమ స్తత్ర శాతకుమ్భమయో గిరిః । నామ్నా సర్వసుఖోనామ సర్వౌషధిసమన్వితః. 95
తృతీయశ్చైవ సౌవర్ణో శృఙ్గనస్త్రాజిరో గిరిః । స నామ్నా లోహితో నామ దివ్యో గిరివరో మహాన్. 96

ప్రత్యగ్గలాన్సమ్భృతాః † జవా

సుమనాః కుశలో దేశ స్సుఖోదర్కా స్సుఖోదయః । రోహితాఖ్యా స్తృతీయస్తు రోహిణోనామ విశ్రుతః. 97
తత్ర రత్నా న్యనేకాని స్వయం రక్షతి వాసవః । ప్రజాపతి రుపాదాయ ప్రసన్నో వ్యదద త్స్వయమ్. 98
న తత్ర నద్యో వర్షంవా శీతోష్ణంవాఽన్య దప్రియమ్ । వర్ణాశ్రమాణాం వార్తావా త్రిషుద్వీపేషు విద్యతే. 99
న దీక్షా న చ దణ్డోస్తి నేర్ష్యాసూయాభయం తథా । ఉద్భిదా న్యుదకాన్యత్ర గిరి ప్రస్రవణానిచ. 100
భోజనం షడ్రసం తత్ర తేషాం స్వయ ముపస్థితమ్ । అధమోత్తమో న తేష్వస్తి న లోభో న పరిగ్రహః.
అశోకా బలవన్తశ్చ ఏకాన్తసుఖినః ప్రజాః । త్రింశద్వర్షసహస్రాణి మానసీం సిద్ధి మాశ్రితాః. 102
సుఖమాయుశ్చ రూపంచ ధర్మైశ్వర్యం తథైవచ । శాల్మలాదిషు విజ్ఞేయం ద్వీపేషు త్రిషు సర్వశః. 103
వ్యాఖ్యాతం శాల్మలాదీనాం ద్వీపానాంతు విధి స్తథా. 103½

ఇతి శ్రీమత్స్యమహాపురాణే భూగోళే శాకద్వీపాదివర్ణనం
నామైకవింశత్యుత్తరశతతమోఽధ్యాయః.

## క్రౌంచ-శాల్మల ద్వీపవర్ణనము.

### క్రౌంచ ద్వీప వర్ణనము.

ఇకమీదట క్రౌంచ ద్వీపపు యథాస్థితిని వివరింతును. కుశద్వీపపు వైశాల్యము కంటె క్రౌంచ ద్వీప వైశాల్యము ద్విగుణము. దీనిచుట్టు చక్రము చుట్టు నేమి (బండి పట్టాయును దానికి లోపల నుండునదియు చక్రపు ఆకులను అమర్చిన పూటీలు అనబడు దారు ఖండముల అమరికతో ఏర్పడినదియు అగు వృత్తాకృతియును) వలె వృత్తాకృతి గల ఘృతోదక సముద్రము చుట్టియున్నది. ఈ సముద్రము ★విస్తారము (మండలము) నందు క్షీరోదక సముద్రమునకు ద్విగుణము. దీనియందలి నరులు శ్రేష్ఠులు.

దీనియందు వర్ష పర్వతములు: 1. క్రౌంచము 2. పావకము 3. అంధకారము 4. దేవవాన్ 5. దేవకోటి 6. గోవిందము 7. పుండరీకము. ఇవన్నియు రత్నమయములును ఒకదాని నడిమి వ్యాసము కంటె ద్విగుణమగు వ్యాసము (విష్కంభము) కలవియు.

దీనియందలి వర్షములు: 1. కుశలము 2. అనుగము 3. ఉష్ణము 4. పావనకము 5. అంధకారము 6. ముని దేశము 7. చంద్రనిఃస్వనము.

ఈద్వీపము రక్తాంత-రంగ (**Apple**)-నారంగ (**Orange**)-ప్రియంగు-వృక్షములతో వ్యాప్తము. సిద్ధులు చారణులు దేవతలు తరచుగా కలిగిన శుచియగు దేశ మిది.

ఈ ద్వీపమున ప్రతి వర్షమునందును వ్యాపించి ప్రవహించు నదు లేడు గలవు. 1. గౌరి 2. కుముద 3.సంధ్య 4. రాత్రి 5. మనోరమ 6. ఖ్యాతి 7. పుండరీక; ఇవి అన్నియు గంగా భేదములే; వీని సమీపముగా ప్రవహించుచు ఈ ప్రధాన నదులలో కలియు చిన్న నదులు నదములు వేలకొలది అట గలవు. ఇవన్నియు బహూదకములు; అచటి దేశ భేదములు-వాని స్వభావము మొదలగునవి సవిస్తారముగా చెప్పవలెననిన నూర్ల ఏండ్లయినను చాలవు. అచటి ప్రజలకు ఉపద్రవములు కాని అచటివారు ప్రళయమునకులోగా నశించుట కాని యుండదు: (ఈ క్రౌంచద్వీపమునే మధ్యధరా సముద్ర (**Meditarranean Sea**) ప్రాంతమని గుర్తి పవచ్చును.)

### శాల్మల ద్వీపవర్ణనము

ఇక మీదట శాల్మల ద్వీప విషయము తెలిపెదను; తెలిసికొనుడు. శాల్మల ద్వీప విస్తరము క్రౌంచ ద్వీప విస్తరమునకు ద్విగుణము; దీని చుట్టును దధిసముద్ర మున్నది. అచటి జనపదములు పుణ్యవంతములు; జనులు చాల

★ ఆర్ష సంప్రదాయానుసారము ఇచట శ్లోకమున విస్తార-మండల శబ్దములు పర్యాయపదములు.

కాలము జీవింతురు. వారు క్షమా తేజోవంతులు. వారు కరవులే ఎరుగరు.

దీనియందు మూడు పర్వతములు గలవు. మొదటిది సుమనస్ అనునది. ఇది సూర్యకాంతితో ప్రకాశించు చుండును. నడిమిది-రెండవది-బంగారుతో ఏర్పడి వచ్చని వన్నెతో ప్రకాశించునది; దీని పేరు సర్వసుఖము; దీనియందు సర్వౌషధులును గలవు; మూడవది రో(లో)హితమను పర్వతము; ఇదియు బంగారుతో ఏర్పడినదే; కాని తుమ్మెదరెక్కల సంధివలె ప్రసిమివన్నెతో, ప్రకాశించుచుండును. ఇది మహాదివ్యమగు గిరివరము; ఈ పేరులతోనే మూడు దేశము లా ద్వీపమున గలవు; మొదటిదగు సుమనసమను దేశము కుశలములతో కూడినది; సర్వసుఖమను దేశము సుఖములతో ఉదర్కము (అన్నింటిలో గొప్పది) సుఖముల వృద్ధి కలదియును; మూడవ దేశము పర్వతపు పేరుతో రోహితము అని మాత్రమే కాక రోహిణము అనియు ప్రసిద్ధ నామము కలది.

స్వయముగా ప్రజాపతి ప్రజలయందు ప్రసన్నుడై ఇచ్చిన నవజాతులకు చెందిన రత్నము లనేకములను ఇంద్రు డిచ్చుట నుంచి కాపాడుచుండును. వర్షము కాని శీతము ఉష్ణము కాని ప్రాణులకు అప్రీతికరమగు మరి ఏది కాని వర్ణాశ్రమముల మాట కాని శాల్మల గోమేద పుష్కరము లనెడు మూడు ద్వీపములందును ఉండదు. (కర్మ) దీక్ష-దండము ఈర్ష్యాసూయాభయములు అట లేవు. కొండవాగులు సెలయేళ్లు ఇచ్చు జలమును భూగర్భము చీల్చుకొనివచ్చు ఉద్భిదజలమును ప్రాణుల కుపయోగపడును. స్వయముగ (అప్రయత్నముగ) అచటి జనులకు షడ్రసభోజనము ఎదుటికి వచ్చి లభించును. అచట అధమోత్తమభేద వ్యవస్థలు లోభము పరిగ్రహము (కలవారు ఇచ్చుట-లేనివారు పుచ్చుకొనుట)అచట లేవు. (కలవారు లేనివారు అను భేదములే అచట లేవు.) అచటి జనులు శోకరహితులు బలవంతులు సుఖము తప్ప ఎరుగనివారు. మానసయోగసిద్ధి నంది వారు ముప్పదివేల సంవత్సరములు జీవింతురు. శాల్మల గోమేద పుష్కర ద్వీపముల మూడిటియందును ఇదే విధముండును.

ఇది శ్రీమత్స్య మహాపురాణమున భూగోళ వర్ణనమున శాక కుశక్రౌంచ శాల్మల ద్వీప వర్ణనమను
నూట ఇరువది యొకటవ అధ్యాయము.

## ద్వావింశత్యుత్తర శతతమోఽధ్యాయః.
## గోమేదద్వీపవర్ణనమ్.

సూతః : పరిమణ్డలేన స ద్వీప శ్చక్రవ త్పరివేష్టితః । స్వాదూదేన సముద్రేణ ద్విగుణేన సమన్వితః. 1
* గోమేదకంతు వక్ష్యామి షష్ఠద్వీపం ద్విజోత్తమాః ।
శాల్మలస్యతు విస్తారా ద్విగుణ స్తస్యవిస్తరః । తస్మిన్ ద్వీపేతు విజ్ఞేయౌ పర్వతౌ ద్వౌ సమాహితౌ. 3
ప్రథమ స్సోమకో నామ జాత్యఞ్జనమయో గిరిః । ద్వితీయః కుముదోనామ సర్వౌషధిసమన్వితః. 4
శాతకుమ్భమయ శ్శ్రీమా న్విజ్ఞేయ స్స మహోచ్ఛ్రితః । ●(సముద్రేక్షురసోదేన వృతోగోమేదక స్మృతః. 5
షష్ఠేనతు సముద్రేణ సురోదా ద్విగుణేనతు) । ధాతకిః కుముదశ్చైవ హవ్యపుత్త్రౌ సువిశ్రుతౌ. 6
సౌమకం ప్రథమం తేషాం ధాతకీఖణ్డ ముచ్యతే । ధాతకేస్తు స్మృతం తద్వై ప్రథమం ప్రథమస్యతు. 7
గోమేదం యత్స్మృతం వర్షం నామ్నా సర్వసుఖంతు తత్ ।
కుముదస్య ద్వితీయస్య ద్వితీయం కుముదంతు తత్. 8
ఏతౌ ద్వౌ పర్వతౌ జ్ఞేయౌ వృత్తౌ సర్వసముచ్ఛ్రితౌ । పూర్వద్వీపస్య తస్యైవ సోమకః పర్వత స్స్థితః. 9
ప్రాగాయతౌ స్మహాదైస్తు ఆసముద్రా దితిస్థితిః । పశ్చాద్వై కుముదశ్చాపి ఏవమేవ స్థితస్తు తైః. 10

* గోమేదకం ● ఇవి ప్రక్షిప్త పంక్తులు.

ఏతైః పర్వతపాదైస్తు స దేశో వైద్విధా కృతః । ద్వీపస్య దక్షిణార్ధేతు ధాతకీఖణ్డ ముచ్యతే. 11
కుముదం తూత్తరే తస్య ద్వితీయం వర్షముత్తమమ్ । ఏతౌ జనపదౌ ద్వౌతు గోమేదస్యతు విశ్రుతౌ. 12

## నూట ఇరువది రెండవ అధ్యాయము.

## గోమేద-పుష్కర-ద్వీప వర్ణనము-శాకాది ద్వీప సామాన్య లక్షణము-బ్రహ్మాండమున మహాభూతముల వ్యవస్థ-అందు-గోమేద ద్వీప వర్ణనము.

ఇది దధిసముద్రమునకు ద్విగుణపరిమాణముగల స్వాదూదక(తీయనీటి) సముద్రముచే చుట్టబడినది. ఈ ద్వీపపు విస్తరము శాల్మల ద్వీప విస్తరమునకు ద్విగుణము. దీనియందు జాత్యంజనమయమగు (స్వాభావికమగు కాటుకతో ఏర్పడిన) 1. సోమకము - సర్వౌషధి సమన్వితము మహోన్నతము సువర్ణమయమునగు 2. కుముదము అను రెండు పర్వతము లున్నవి. హవ్యుడను మను పుత్త్రునకు ధాతకి-కుముదుడు అను కుమారులు ఇద్దరు కలరు. సోమక పర్వతముగల ప్రథమ ఖండము ధాతకిచే పాలితమై ధాతకీఖండము-కుముదపర్వతము గలదియు గోమేద వర్షమని ద్వీపనామముతోనే ప్రసిద్ధమును సర్వసుఖమయమునగు రెండవ ఖండము కుముదునిచే పాలితమయి కుముదఖండము-అని ప్రసిద్ధములు.

ఈ సోమక కుముద పర్వతములు రెండును వృత్తాకృతులును మహోన్నతములును; సోమకము ద్వీప పూర్వార్ధ మందున్నది. దీని పాదములు(ప్రత్యంత పర్వతములు) తూర్పునకు సముద్రము వరకు సాగియున్నవి. కుముదము ఇట్లే ద్వీప పశ్చిమభాగమున నున్నది. దీని ప్రత్యంత పర్వతములు పడమటగా సముద్రము వరకు సాగి ఉన్నవి. ఈ పర్వత పాదములు ద్వీపమును రెండుగా విభజించుచున్నవి. దక్షిణార్ధము ధాతకీఖండము; ఉత్తరార్ధము కుముద ఖండము. గోమేద ద్వీపము నందు దేశములనినను వర్షములనినను ఈరెండే. (ఈ ద్వీపము ఆస్ట్రేలియా అని భావింపవచ్చును.)

### పుష్కరద్వీపవర్ణనమ్.

ద్వీపేన పుష్కరేణాసౌ వృత శ్చేక్షురసోదక- । సముద్రేణ మహాభాగో గోమేద ద్విగుణేనతు. 13
పుష్కరే పర్వత శ్శ్రీమాం శ్చిత్రసాను ర్మహాగిరిః । కూటై శ్చిత్రై ర్మణిమయై శ్శిలాజాల సముద్గతైః. 14
ద్వీపస్య తస్య పూర్వార్ధే చిత్రసాను స్స్థితో మహాన్ । పరిమణ్డలసాహస్రో విస్తీర్ణః పఞ్చవింశతిః. 15
ఊర్ధ్వంచైవ చతుర్వింశ ద్యోజనానాం మహాచలః । ద్వీపస్యార్ధే పరిక్షిప్తః పశ్చిమే మానసో గిరిః. 16
స్మృతో వేలాసమీపేతు నవశ్చన్ద్ర ఇవోదితః । యోజనానాం సహస్రాణి హ్యూర్ధ్వం పఞ్చాశ దుచ్ఛ్రితః. 17
తస్యపుత్త్రో మహావీరః పశ్చిమార్ధేతు రక్షితా । పూర్వార్ధే పర్వత స్యాపి ద్విధా దేశస్తు స స్స్మృత. 18
○స్వాదూదకే నోదధినా పుష్కరః పరివారితః । విస్తరా న్మణ్డలాచ్చైవ గోమేదద్విగుణేనతు. 19
దశవర్షసహస్రాణి తేషు జీవన్తివై ప్రజాః । విపర్యయో న తేష్వస్తి ఏతత్స్వాభావికం స్మృతమ్. 20
ఆరోగ్యం సుఖబాహుళ్యం మానసీం సిద్ధి మాశ్రితాః । సుఖమాయుశ్చ రూపంచ త్రిషు ద్వీపేషు సర్వశః. 21
అధమోత్తమౌ న తేష్వాసాం తుల్యాస్తే రూపశీలతః । న తత్ర వధ్యవధకా నేర్ష్యాసూయా భయం న చ. 22
న లోభో న చదణ్డోవా న లౌల్యం న చ విగ్రహః । సత్యానృతే న తేష్వాసాం ధర్మాధర్మౌ తథైవచ. 23
వర్ణాశ్రమాణాం వార్తా వా పాశుపాల్యం వణిక్కృషిః । త్రయీ విద్యా దణ్డనీతి శ్శుశ్రూషాదణ్డ ఏవచ. 24
న తత్ర వర్షం నద్యోవా శీతోష్ణం నైవ విద్యతే । ఉద్భిజ్జా న్యుదకాని స్యు ర్గిరిప్రస్రవణానిచ. 25

---

○ 19 ఈ శ్లోకము ప్రకరణముతో అన్వయింపదు.

తుల్యోత్తరకురూణాంతు కాలస్తత్రతు సర్వదా । సర్వత్ర స్సుఖకాలోఽసౌ జరాక్లేశవివర్జితః. 26
సర్గస్తు ధాతకీఖణ్డే మహావీరే తథైవచ ।

## పుష్కర ద్వీప వర్ణనము.

గోమేద ద్వీపమునకు ఆవల పుష్కర ద్వీపమున్నది. ఇది ఇక్షురస సముద్రముచే చుట్టబడినది. దీని విస్తరము గోమేదద్వీప విస్తరమునకు ద్విగుణము. పుష్కర ద్వీపమున ద్వీప పూర్వార్ధమున శిలాజాలములతో ఉత్పన్నములై మణిమయములగు శిఖరములు గలదియు వేలకొలది గుహలు గలదియు అగు చిత్రసాను మహాపర్వతము గలదు. దీని విస్తరము ఇరువదియైదు యోజనములు. ఇరువది నాలుగు యోజనములు దీని ఎత్తు. ద్వీపపు పశ్చిమార్ధమున సముద్ర వేలా (చెలియలి కట్టకు) సమీపమున అపుడే ఉదయించిన చంద్రునివలె (వక్రరేఖా రూపములో) మానసమను పర్వతమున్నది. దీని ఎత్తు ఏబదివేల యోజనములు. ప్రియవ్రత పుత్రుని పుత్రుడు మహావీరుడు ద్వీప పూర్వార్ధ పశ్చిమార్ధములందు రక్షకుడు.

ఈ శాల్మల గోమేద పుష్కర ద్వీపములయందు జనులు పదివేల యేండ్లు జీవింతురు. అచట విపర్యయములేవి యునులేవు. ఆరోగ్యము సుఖ బాహుళ్యము-ఇది అచటి స్వాభావిక స్థితి. వారు మానససిద్ధిని పొందిన వారగుటచే వారిలో సుఖము ఆయువు రూపము-వీనికి కొరతలేదు. రూపశీలములందు అచట అందరును సమానులు; అధమోత్తమత్వములు లేవు వధ్యులు-వధకులు ఈర్ష్యాసూయాభయ లోభదండ లౌల్యనిగ్రహములు సత్యానృత ధర్మాధర్మభేదములు వర్ణాశ్రమములు పశుపాలన వాణిజ్య కృషిత్రయీ విద్యాదండనీతి శుశ్రూషాదండములు లేవు. వానలు నదులు శీతోష్ణభేదము లచట లేవు. గిరిప్రస్రవణముల జలమును ఉద్భిజ్జజలమును అచటివారి కుపయోగపడును.

అచటి కాలప్రవృత్తి సదా ఉత్తర మేరువులందువలె నుండును. అంతటను కాలము సుఖప్రదమయి జరాక్లేశ ములు లేకయుండును.

ఈ చెప్పినవానిలో గోమేదమునందలి ధాతకీ ఖండమందును పుష్కర ద్వీపమునందలి మహావీరుని ఖండమునం దును సృష్టి ప్రవృత్తి కలదు.

గమనిక: స్వాయంభువమను పుత్రుడగు ప్రియవ్రతునకు పదిమంది కుమారులు కలిగిరి; వారి నామము లన్నియు అగ్నివాచకములు. వారిలో ముగ్గురు విరక్తులై తపమునకు ఏగిరి. మిగిలిన ఏడుమందికిని ప్రియవ్రతు డేడు ద్వీపములను ఇచ్చెను. వారికిని కుమారులు కలిగిరి. ఈ ప్రియవ్రత పౌత్రుల నామములకును ఈ సప్త ద్వీపములందలి వర్షముల నామములకును సంబంధమున్నట్లు కనబడును. ఈ మత్స్య పురాణమున నామములు పాఠభ్రంశము వలననేమో సరిగా గుర్తింపరాకున్నవి. —అనువాదకుడు.

ఏతే ద్వీపా స్సముద్రైస్తు సప్త సప్తభి రావృతాః. 27
ద్వీపస్యానన్తరో యస్తు సముద్ర స్తత్సమస్తు వై । ఏవం ద్వీపసముద్రాణాం వృద్ధిర్జ్ఞేయా పరస్పరమ్. 28
అపాంచైవ సముద్రేకా త్సముద్ర ఇతివిశ్రుతః । సరిద్వినన్ద్యో వర్షేషు ప్రజా యత్ర చతుర్విధాః. 29
ఋ(వృ)షిరిత్యేవ రమణోవర్షితం తేనతేషుచ । ఉదయతీన్దౌచ పూర్ణేచ సముద్రః పూర్యతే సదా. 30
ప్రక్షీయమాణే బహుళే క్షీయతే తనుతాచవై । ఆపూర్యమాణే హ్యుదధి రాత్మనైవాభిపూర్యతే. 31
తతోవై క్షీయమాణస్య స్వాత్మనైవచ తత్క్షయః । ఉదయా త్పక్షసంయోగా త్పుష్టాత్యాపో యథా స్వయమ్.
తథా సతి సముద్రోఽపి వర్ధతే హ్యుదయే విధోః । అన్యోన్యస్యాతిరిక్తాస్తా వర్ధన్త్యాపో హ్రసన్తిచ. 33
ఉదయాస్తమయే ష్విన్దోః పక్షయో శ్శుక్లకృష్ణయోః । క్షయో వృద్ధి స్సముద్రస్య సోమవృద్ధిక్షయౌ తథా. 34
దశోత్తరాణి పఞ్చాహు రఙ్గుళానాం శతానితు । ఆపాం వృద్ధిక్షయో దృష్ట స్సముద్రాణాంచ పర్వసు. 35

ద్విరాపత్వా త్స్మృతో ద్వీపః ఉదధాదుదధిః స్మృతః । ఉద్గీర్ణత్వాచ్చ గిరయః పర్వవత్త్వాచ్చ పర్వతాః. 36

## ద్వీప సామాన్య విషయములు

ఈ చెప్పిన సప్త ద్వీపములకు చుట్టును సప్త సముద్రములు కలవు; ఏ ద్వీపమునకు సంబంధించిన సముద్రమయినను దానితో సమానమయినది. అనగా ద్వీప పరిమాణమెంత పెరుగునో ఆ సముద్ర పరిమాణమునుఅంతె పెరుగును.

## సముద్ర శబ్ద నిర్వచనము-దానికి సంబంధించిన రహస్యములు

జలములు దీనియందు సముద్రేకించును గావున సముద్రమునకు సముద్రము అని పేరు. *జరాయుజాండజ స్వేదజోద్భిజ్జములను నాల్గు విధములగు ప్రజ లెచ్చట నివసింతురో ఆనందింతురో ఇట్లు వృష్టి-వర్షితము వాన) వారి ఆనందపూర్వకస్థితి వర్షితమును ఎచ్చట జరుగునో అది వర్షము అనబడును.

ప్రతిదినమునను చంద్రు డుదయించునపుడును చంద్రుడు పూర్ణుడై నపుడు (పూర్ణి మాతిథియందు)ను సముద్రము పూర్ణమగును. బహుళ పక్షమున చంద్రుడు ప్రక్షీణుడగుచుండ సముద్రమును క్రమముగ క్షీణించి నన్నదనమును పొందును. ఆపూర్యమాణ(శుక్ల)పక్షమున సముద్రము క్రమముగ స్వయముగనే వృద్ధి పొందును. కనుక ఇట్లు చంద్ర క్షయముతోపాటు సముద్రక్షయమును చంద్రవృద్ధితోపాటు సముద్రవృద్ధియు నుండును. ఏలయన జలవృద్ధిక్షయములు చంద్రవృద్ధిక్షయానుసారులు. అందుచేతనే చంద్రుని ఉదయమున వృద్ధినొంది చంద్రజలముల పరస్పరాతిరేకానుసారము సముద్రజలముకూడ హ్రసించును. (తగ్గును.) ఇదే విధముగ శుక్ల కృష్ణపక్షములందు చంద్రవృద్ధి క్షయముల నను సరించి సముద్రవృద్ధి క్షయములును జరుగును. ఈ వృద్ధి పరిమాణము పదునైదు వందల అంగుళములుండును.

రెండు వైపులను నీరుండుటచే ద్వీపము (ద్వి+ఆప = ద్వీప) అనియు నీటిని నిలుపుకొనునది కావున సముద్రమునకు ఉదధి (ఉద+ధా-నీటిని ధరించు) అనియు వ్యవహారము కలిగినది. భూమిచేత వెళ్ళగ్రక్కబడినవి కావున కొండలకు గిరులు(ఉద్+గౄ-వెళ్ళగ్రక్కుట) అనియు పర్వములు కలవి కావున పర్వతములు అనియు (పర్వ = కణుపులు; ఉబ్బెత్తులు) వ్యవహారములు.

శాకద్వీపేతు వై శాకః పర్వతస్తేన చోచ్యతే । కుశద్వీపే కుశస్తమ్బో మధ్యే జనపదస్యతు. 37
క్రౌఞ్చద్వీపే గిరిః క్రౌఞ్చ స్తస్య నామ్నా స ఉచ్యతే। శాల్మల శ్శాల్మలద్వీపే పూజ్యతే స మహాద్రుమః. 38
గోమేదకేతుగోమేదఃపర్వతస్తేన చోచ్యతే । న్యగ్రోధఃపుష్కరద్వీపేపుష్కరస్తేనసస్మృతః. 39
పూజ్యతేఽత్రమహాదేవో బ్రహ్మణోఽవ్యక్తజన్మనః । అస్మి న్స వసతి త్వష్టా సాధ్యై స్సిద్ధైః ప్రజాపతిః. 40
అత్ర దేవా ఉపాస్యన్తే తయస్త్రింశ త్సహర్షిభిః । సచాత్ర పూజ్యతే దేవో దేవదేవోత్తమశ్చ సః. 41
జమ్బూద్వీపే ప్రవర్తన్తే రత్నాని సుబహూన్యపి । ద్వీపేషు తేషు సర్వేషు ప్రజానాం క్రమశస్తువై. 42
ఆర్జవా ద్బ్రహ్మచర్యేణ సత్యేనచ దమేనచ । ఆరోగ్యాయుఃప్రమాణాభ్యాం ద్విగుణం ద్విగుణంతతః. 43
ద్వీపేషు శాల్మలాద్యేషు యదుక్తం వర్షకేతు తత్ । గోపాయన్తే ప్రజాస్తత్ర న జరామృత్యుపీడితాః. 44
భోజనం చాప్రయత్నేన సదా స్వయ ముపస్థితమ్ । షడ్రసంతు మహావీర్యం తత్ర తే భుఞ్జతే జనాః. 45
పరేణ పుష్కరస్యాథ ఆవృత్యావస్థితో మహీమ్ । స్వాదూదక స్సముద్రస్తు సమన్తా త్పరివేష్టితః. 46
స్వాదూదకస్య పరతః శైలోస్తి పరిమణ్డలః । ప్రకాశశ్చాప్రకాశశ్చ లోకాలోక స్స ఉచ్యతే. 47

* ఈ శ్లోకమున పాఠభ్రంశము కనబడుచున్నది.

ఆలోక స్తస్య చార్వాక్ప నిరాలోక స్తత స్తతః । లోకవిస్తారమాత్రంతు పృథ్వ్యర్థ ముదకావృతమ్. 48
ప్రతిచ్ఛన్నం సమన్తాత్తు ఉపకేనావృతం మహత్। 48½

శాక పర్వత(వృక్ష)ముండుటచే శాకద్వీపము-దేశము నడుమ కుశ స్తంబము (దర్భదుబ్బు) ఉండుటచే కుశ ద్వీపము-క్రౌంచపర్వత ముండుటచే క్రౌంచద్వీపము-శాల్మలవృక్షము (బూరుగుచెట్టు) ఉండుటచే శాల్మల ద్వీపము-గోమేద రత్న పర్వత ముండుటచే గోమేదద్వీపము-న్యగ్రోధవృక్షము (మఱిచెట్టు) ఉండుటచే పుష్కర(పుష్కర =మఱ్ఱి?)ద్వీపము-అని ఆయా ద్వీపములకు వ్యవహారము కలిగినది.

ఈ జంబూద్వీపమునందు అవ్యక్తము(మాయాశబలము)నకు కూడ మూలకారణమగు బ్రహ్మతత్త్వము కంటె అభిన్నమగు మహాదేవుడు పూజింపబడును. దీనియందే సాధ్యులతో సిద్ధులతో కూడ ప్రజాపతియగు త్వష్ట(చతుర్ముఖుడు-హిరణ్యగర్భుడు)నివసించును. ఇచటనే ముప్పది ముగ్గురు దేవతలును ఋషులును ఆరాధింపబడుచున్నారు. దేవదేవోత్తము డగు ఆ దేవుడు (నారాయణుడు)కూడ ఇచట పూజింపబడుచున్నాడు ఈ ద్వీపమునందు అనేకములగు రత్నములును వాడుకలో ఉన్నవి. ఈ చెప్పిన ద్వీపములన్నిటను అచటి ప్రజల ఆర్జవము (వక్రతలేని నడువడి) బ్రహ్మచర్యము సత్యము దమము మొదలగువానిని బట్టి వారి వారి ఆరోగ్యాయుః ప్రమాణాదికము ఒకదాని యందు కంటె మరియొక దానియందు రెట్టింపు చొప్పున అధికమగుచున్నది. ప్రజలును వారి సద్గుణములచే రక్షింపబడుచున్నారు. జరామృత్యు పీడితులు కాకున్నారు. అచటి జనులు అప్రయత్నసిద్ధమగు షడ్రసాహారమును తిని సుఖముగ జీవింతురు.

పుష్కర ద్వీపమున కావల స్వాదూదక (మంచినీటి) సముద్ర మున్నది. దాని కావల చుట్టును లోవలివైపు ప్రకాశము (వెలుగు కలది) వెలుపలి వైపు అప్రకాశము (వెలుగు లేనిది) అగు పర్వతము గుండ్రముగ ఆవరించి ఉన్నది. దీనియందలి ఆలోక విస్తార మాత్రాంశము (ప్రకాశించు భాగము) పృథివీ సంబంధియై దృఢాంశముగా ఉన్నది. మిగిలిన అలోకభాగము (అప్రకాశాంశము) ఉదకముతో ఆవరింపబడియున్నది. ఇట్లీ భూమండలమునకు చుట్టును ఉదకము క్రమ్మి యుండుటతో ఇదియంతయు ఉదకముతో ప్రతిచ్ఛన్నము (పూర్ణముగా కప్పివేయబడియున్నది) అని చెప్పవలసియున్నది.

## పృథివ్యాదిమహాభూతవివరణమ్.

భూమే ర్దశగుణా హ్యాప స్సమన్తా త్ప్లావయ న్మహీమ్. 49
అద్భ్యో దశగుణశ్చాగ్నిః సర్వతో ధారయ న్నపః । అగ్నే ర్దశగుణో వాయు ర్ధారయ న్జ్యోతిరావృతః. 50
తిర్యక్చ మణ్డలో వాయు ర్భూతా న్యావేష్ట్య ధారయన్। తతోపీదం దశాకాశం వాతోద్ధూతాని ధారయన్. 51
సమరో గుళికాకారో బర్హే ర్దశగుణో నభః । భూతానీకం దశగుణో మహాభూతాని ధారయన్. 52
మహాంస్తతో హ్యస త్త్వేన అవ్యక్తేనతు ధార్యతే । ఏవం పరమ్పరోత్పన్నా ధార్యతేచ పరస్పరమ్. 53
ఆధారాధేయభావేన వికారాస్తే వికారిణా । పృథ్వ్యాదయో వికారాస్తే పరిచ్ఛిన్నాః పరస్పరమ్. 54
పరస్పరాధికాశ్చైవ పరివిష్టాః పరస్పరమ్ । యస్మా త్ప్రవిష్టా స్తేన్యోన్యం తస్మా త్స్థిరతరం గతాః. 55
ఆధత్తే హ్యవశిష్టాస్తు విశేషాన్యోన్యవేశనాత్ । పృథ్వ్యాదయస్తు వాయ్వన్తాః పరిచ్ఛిన్నాస్తు తత్రవై. 56
భూతేభ్యః పరత స్తేభ్యో అలోక స్సర్వత స్సమః । తథా హ్యలోక ఆకాశే పరిచ్ఛిన్నాని సర్వశః. 57
పాత్రే మహతి పాత్రాణాం యథైవా న్తర్గతానిచ । భవన్త్యన్యోన్యహీ(ధీ)నాని పరస్పరసమాశ్రయాత్. 58
యథా హ్యలోక ఆకాశే తథా త్వన్తర్గతా మతా । కృత్స్నా న్యన్యాని సత్త్వాని అన్యోన్యస్యాధికానితు. 59
యావదేతాని భూతాని తావ దుత్పత్తి రుచ్యతే । జన్తూనామిహ సంస్కారో భూతే ష్వన్తర్గతస్తువై. 60
ప్రత్యాఖ్యాయేహ భూతాని తావ దుత్పత్తి రుచ్యతే । తస్మా త్పరిమితే ర్భేదా స్స్మృతాః కార్యాత్మకాస్తు వై.
తే కారణాత్మకాశ్చైవ తథైవ మహదాదయః । ఇత్యేష సన్నివేశోవై పృథివ్యాక్రాన్తభాగశః. 62

సప్తద్వీపసముద్రాయాయాథాతథ్యేనవై మయా । విస్తారా జ్జగతశ్చైవ యథామానేన చైవహి. 63
విశ్వరూపం ప్రధానస్య పరిణామైకదేశికమ్ । ఏతావ త్సన్నివేశోయం మయా సమ్యక్ప్రకాశితః. 64
ఏతావదేవ శ్రోతవ్యం సన్నివేశస్తు పార్థివ । అతఊర్ధ్వం ప్రవక్ష్యామిసూర్యాచన్ద్రమసోర్గతిమ్. 65

ఇతి శ్రీమత్స్యమహాపురాణే భూగోళే గోమేదాదిద్వీపవర్ణనం నామ
ద్వావింశత్యుత్తర శతతమోఽధ్యాయః.
ఇతి భూగోళమ్.

భూమికి చుట్టును ఉన్న జలము భూమికి పదిరెట్లుండి భూమిని తడుపుచున్నది. దానికి పదిరెట్ల పరిమాణముతో అగ్ని ఈ జలములను నిలిపియున్నది. దానికి పదిరెట్ల పరిమాణముతోనున్న వాయువు అగ్నిని నిలిపి పట్టియున్నది. కాని వాయు మండలము తిర్యక్ (అడ్డముగా-Horizontally) ప్రసారము కలది-మిగిలిన పృథివ్యప్తేజ ఆకాశములు గోళాకృతి వ్యాప్తి ప్రసారములు కలవి. వాయువునకు పదిరెట్ల పరిమాణము గల ఆకాశము ఇతర భూతములు గాలిచే చెదరిపోకుండ నిలిపి పట్టుచున్నది. దానికంటె అధికమగు పరిమాణముగల నదనదాత్మకమగు మహత్తు ఈ పృథివ్యాది పంచకమును దానికంటె అధిక పరిమాణముగల అవ్యక్తము ఈ పృథివ్యాది మహదంత షట్కమును ధరించు (నిలిపి పట్టు) చున్నది. ఇట్లవి వికారములు (ఉత్పన్నములు) వికారిచే (తమ మూలకారణముచే) నిలుపబడుచు పరస్పరాధారాధేయ భావములోనున్నవి. పృథివి మొదలగునవి అన్నియు వికారములు-ఒకదానికంటె మరియొకటి పరిమాణములో పెద్దవి-ఒకదానినింకొకటి నిలిపి పట్టినవి. అవి పరస్పరాను ప్రవేశము చేసియున్నందుననే స్థిరతరత్వము పొంది కదలకయున్నవి. వీనిలో పృథివి-నీరు-అగ్ని-వాయువు-ఇవి పరిచ్ఛిన్నములు-ఇది ఇంతవరకున్నవి అని చెప్ప శక్యమగును. ఈ నాలుగు భూతములకు ఆవలగానున్న వెలుగుకూడ అన్నివైపుల నమముగా నుండును కావున ఆకాశమందా వెలుగు వ్యాపించి వానిని దీనియందిది యున్నదని చెప్పగలుగుచున్నాము. అవి ఇట్లు పెద్ద పాత్ర యందున్న చిన్న పాత్రలవలె నుండి పరస్పర మాశ్రయాశ్రయి భావముతో నుంటచే ఒకదానికంటె ఒకటి చిన్నవన వీలగుచున్నది. అట్లే ఈ ప్రాణులును ఒక విధమగు వాటికంటె మరియొక విధమైనవి అధికమైనవి అనదగియున్నవి. ఈ భూతముల వ్యాప్తియున్నంతమేర ప్రాణుల-భూతముల-ఉత్పత్తియు కలదు. ఈ ప్రాణులు సంస్కార రూపమున భూతములయందంతర్గతములై యున్నవి. ఈ సంస్కారము జడ భూతములను త్రొక్కిపట్టి తమకు లోబరచుకొని వానితోనే ప్రాణుల ఉత్పత్తిని సాగించుచున్నవి. కాని ఆచటి భూతముల పాళ్ళ పరిమితిని బట్టి 'కార్యవశమున కారణ నిర్ణయ'మను యుక్తిచే ఈ ప్రాణులు ఈ భూతము ప్రధానముగాగల ప్రాణులని నిర్ణయించవలెను. (మానవుల శరీరము పార్థివము-మత్స్యముల శరీరము జలప్రధానము అన్నట్లు.)

ఇట్లు పృథివ్యాదికము మహదంతము కార్యము ఏదియో కారణము ఏదియో నిర్ణయించవలెను.

ఇట్లు నేను (మత్స్యుడు) పృథివి ప్రధానముగా ఆక్రమించిన సప్తద్వీపాత్మక భూమండల స్థితిని పరిమాణ విస్తరమును యాథాతథ్యముతో తెలిపితిని. ఇది భూసన్నివేశ ప్రకారము.

ఏది ఏమైనను ఈ కనబడు విశ్వమంతయు ప్రకృతి పరిణామమునందలి ఏకదేశము (అల్పాంశము) మాత్రమే. నేను చెప్పిన ఇంతమాత్రమే వినుటకును చెప్పుటకును శక్యము.

ఇకమీదట సూర్యా చంద్రమసుల గమన ప్రకారము ప్రతిపాదింతును.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున గోమేదాది ద్వీప వర్ణనము-విశ్వమున పృథివ్యాది
భూత సన్నివేశ వర్ణనమునను నూట ఇరువది రెండవ అధ్యాయము.
భూగోళ విషయము ముగిసినది.

## త్రయోవింశత్యుత్తర శతతమోఽధ్యాయః.
## ఖగోళ ప్రారమ్భః.

సూతః : సూర్యాచన్ద్రమసా వేతౌ భ్రమన్తౌ యావదేవ తు। సప్తద్వీపసముద్రాణాం భూతానాం భూతివిస్తరః. 1
విస్తరార్థం పృథివ్యాస్తు భవే దన్యత్ర బాహ్యతః । పర్యాసపరిమాణాచ్చ చన్ద్రాదిత్యౌచ భాగశః. 2
పర్యాసపరిమాణాభ్యాం భూమేస్తుల్యం దివం స్మృతమ్। అవతి మాతి యోలోకా న్యస్మా త్సూర్యః పరిక్రమన్. 3
అయనాత్తు ప్రకాశేన అవనా త్స రవి స్స్మృతః। భూయోభూయః ప్రవక్ష్యామి ప్రమాణం చన్ద్రసూర్యయోః. 4
సప్తద్వీపసముద్రాయాం భ్రమణం చన్ద్రసూర్యయోః । మహత్త్వా న్మహాశ్శబ్దో హ్యస్మిన్నర్థే నిపాత్యతే. 5
అస్య భారతవర్షస్య విష్కమ్భస్తుల్యతస్స్మృతః । మణ్డలం భాస్కరస్యాథ యోజనై స్త న్నిబోధత. 6
నవయోజనసాహస్రవిస్తారో మణ్డలస్యతు । విస్తారా త్త్రిగుణశ్చాపి పరిణాహోఽర్కమణ్డలే. 7
విష్కమ్భా న్మణ్డలాచ్చైవ భాస్కరా ద్ద్విగుణ శ్శశీ। అతః పృథివ్యా వక్ష్యామి ప్రమాణం యోజనైః పునః. 8
సప్తద్వీపసముద్రాయా విస్తారో మణ్డలస్యతు । ఇత్యేత దిహ సఙ్ఖ్యాతం పురాణే పరిమాణతః. 9
తద్వక్ష్యామి ప్రసఙ్ఖ్యాతం యావద్భి రభిమానిభిః। అభిమానినో హ్యతీతా యే తుల్యాస్తే సామ్ప్రతేష్విహ. 10
దేవాదేవై రతీతాస్తు రూపై ర్నామభి రేవచ । తస్మాద్ధి సామ్ప్రతై ర్దేవై ర్వక్ష్యామి వసుధాతలమ్. 11
దివ్యశ్చ సన్నివేశోవై సామ్ప్రతై రేవ కృత్స్నశః । శతార్ధకోటివిస్తారా పృథివీ కృత్స్నశ స్స్మృతా. 12

### భూపరిమాణమ్.

తస్యాశ్చార్ధప్రమాణేన మేరోశ్చైవోత్తరోత్తరమ్ । పృథివ్యాఅపి విస్తారా ద్యోజనానాంతు వై పునః. 13
భూమేర్మధ్యం ప్రతిదిశం కోటిరేకాతు సా స్స్మృతా । తథా శతసహస్రాణా మేకోననవతిం పునః. 14
పఞ్చాశచ్చ సహస్రాణి పృథివ్యార్ధస్య విస్తరః । పృథివ్యా విస్తరం కృత్స్నం యోజనై స్తన్నిబోధత. 15
తిస్రః కోట్యస్తు విస్తారా త్సఙ్ఖ్యాతా సా చతుర్దిశమ్ । తథా శతసహస్రాణా మేకోనాశీతి రుచ్యతే. 16
సప్తద్వీపసముద్రాయాః పృథివ్యా స్సతువిస్తరః । విస్తరా త్త్రిగుణంచైవ పృథివ్యా స్తస్య మణ్డలమ్. 17
గణితం యోజనానాంతు కోట్య స్త్వేకాదశ స్మృతాః । తథా శతసహస్రాణి సప్తత్రింశాధికానితు. 18
ఇత్యేతద్వై ప్రసఙ్ఖ్యాతం పృథివ్యన్తరమణ్డలమ్ ।

## నూట ఇరువది మూడవ అధ్యాయము.
## ఖగోళ విషయము

సప్త ద్వీపములును సప్త సముద్రములును ఆయా భూతములును వాని సంభవ విస్తరమును ఎంతవరకు కలదో అంతవరకును (అంత మేరలో) ఈ సూర్యచంద్రులు తిరుగుచునేయుందురు. పృథివీ విస్తారము ఎంతయని విచారణ చేయవలసివచ్చినచో ఈ చంద్రాదిత్యులు మొదలగువారు పృథివీ వ్యాప్తికి వెలుపల కూడ సంచరించుచునేయున్నారు. వారి పరిమాణము కూడ పృథివీ పరిమాణము కంటె భిన్నమై ఎక్కువదిగానో తక్కువదిగానో యున్నది. కాని వ్యవహారార్థమై మాత్రము భూమి ఉన్నంతమేర మాత్రమే సూర్యచంద్రుల వ్యాప్తియున్నదని భావించి భూమికిగల పరిమాణమునకు తగినట్లే అంతరిక్షపు పరిమాణము కలదని ఎంచవలెను. 'అవ' ధాతువునకును 'ఋ' ధాతువునకును గల అర్థముల ననుసరించి-రవి 'రాశినుండి రాశికి సంచరించును లోకముల నిర్మించును రక్షించును ప్రకాశింపజేయును గావున రవి (ఋ+అవ్+ఇ=రవి-ఇయర్తి-అవతి ఇతి రవిః)' అనబడును.

ఇకమీదట సప్తద్వీప సప్త సముద్ర సహిత భూమండలమున సూర్యచంద్రులగతి ప్రకారమును వారి పరిమాణమును ఈ మొదలగునవి చెప్పెదను. ఈ 'చంద్ర సూర్యులు' అను సర్గమునందే 'మహః' అను శబ్దము కూడ

నిష్పన్నమగుచున్నది. 'మహ్యతే అయం' 'ఇతడు పూజింపబడును.' 'గొప్పవాడై యుండును.' 'మహీయంతే అనేన జ్యోతీంషి' 'ఇతని చేతనే ఇతర జ్యోతిస్సులు పూజితములగును.' అని 'మహః' అను శబ్దము వ్యుత్పన్నమగుచున్నది.

లోగడ చెప్పిన భూమండల వైశాల్యమంతయే రవి మండల వ్యాసమని చెప్పెదరు. రవి మండల వ్యాసము తొమ్మిదివేల యోజనములు; దాని చుట్టుకొలత వ్యాసమునకు మూడింతలు; చంద్రుని వ్యాసము రవి వ్యాసమునకు రెండింతలు; భూవ్యాసము (సరాసరి) ఏబది లక్షల యోజనములు. మహామేరు ప్రాంతమున భూవృత్తము తక్కువగా నుండును. అచ్చట భూవ్యాసము ఈ సగటు వ్యాసములో సగము మాత్రమే-అనగా ఇరువది ఐదు లక్షల యోజనము లుండును. భూగోళపు మధ్య భాగమున వ్యాసము అత్యధికముగా నుండును. అది ఒకకోటి ఎనుబది తొమ్మిది లక్షల ఏబదివేల యోజనములుండును. భూమికి దక్షిణోత్తరాగ్రముల మధ్య దూరము మూడుకోట్ల డెబ్బది తొమ్మిది లక్షల యోజనములు; దీని (ఉత్తర దక్షిణములుగా ఏర్పడెడి భూవృత్తపు) చుట్టుకొలత పదునొకండు కోట్ల ముప్పది ఏడు లక్షల యోజనములుండును. ఇది భూమికి సంబంధించిన అన్ని విధముల మండలముల వ్యాసమును చుట్టుకొలతలును.

తారకాసన్నివేశస్య దివి యావత్తు మణ్డలమ్ 19
పర్యాససన్నివేశస్య భూమేర్యావత్తు మణ్డలమ్ । పర్యాయపరిమాణాభ్యాం భూమే స్తుల్యం దివం స్మృతమ్.
మేరోః ప్రాచ్యాం దిశాయాంతు మానసోత్తరమూర్ధని । వస్వోకసారా మహేంద్రపురీ హేమపరిష్కృతా. 21
దక్షిణేన పునర్మేరో ర్మానసస్యైవ పృష్ఠతః । వైవస్వతో నివసతి యమ స్సంయమనీపురే. 22
ప్రతీచ్యాంచ పునర్మేరో ర్మానసస్యైవ మూర్ధని । సుఖానామ పురీరమ్యా వరుణస్యాపి ధీమతః. 23
దిశ్యుత్తరాయాం మేరోస్తు మానసస్యైవ మూర్ధని । తుల్యామహేన్ద్రపుర్యాస్తు సోమస్యాపి విభాపురీ. 24
మానసస్యోత్తరే పృష్ఠే లోకపాలా శ్చతుర్దిశమ్ । స్థితా ధర్మవ్యవస్థార్థం ధర్మసంరక్షణాయచ. 25

సూర్యసఞ్చారకథనమ్.

లోకపాలోపరిష్టాత్తు సర్వతో దక్షిణాయనే । కాష్ఠాగతస్య సూర్యస్య గతింతస్య నిబోధత. 26
దక్షిణో(ణా)పక్రమే సూర్యః క్షిప్తేషురివ గచ్ఛతి । జ్యోతిషాం చక్ర మాదాయ సతతం పరిగచ్ఛతి. 27
మధ్యత శ్చామరావత్యాం యదాభవతి భాస్కరః । వైవస్వతే సంయమనే ఉద్యంస్తత్ర ప్రదృశ్యతే. 28
సుఖాయా మర్ధరాత్ర్యాంతు విభాయా మస్తమేతిచ । వైవస్వతే సంయమనే మధ్యాహ్నేతు రవి ర్యదా. 29
సుఖాయా మథ వారుణ్యా ముత్తిష్ఠ న్సతు దృశ్యతే । విభాయా మర్ధరాత్రంతు మాహేన్ద్ర్యా మస్తమేతిచ.
సుఖాయా మథ వారుణ్యాం మధ్యాహ్నే చార్యమా యదా । విభాయాం సోమపుర్యాంతు ఉత్తిష్ఠతి విభావసుః.
రాత్ర్యర్ధ మమరావత్యా మస్తమేతి యమస్య చ । సోమపుర్యాం విభాయాంతు మధ్యాహ్నే చార్యమా యదా.
మాహేన్ద్ర్యా మమరావత్యా ముద్గచ్ఛతి దివాకరః । అర్ధరాత్రం సంయమనే వారుణ్యా మస్తమేతిచ. 33

తారకల (నక్షత్ర గ్రహాదుల) సన్నివేశమున (అమరిక) కై ద్యులోకమున ఎంత మండలము కలదో పర్యాసపు (భూమి చుట్టును గ్రహాదికము తిరుగుటకు సంబంధించిన) అమరికకై భూలోక సమీపమున ఎంత మండలము కలదో అవి రెండును ఒకదానికి మరియొకటి సరిపోవునవిగానే ఉన్నవి. మహామేరువునకు తూర్పున మానసోత్తరమును శిఖరమునకు పైభాగమున 'వస్వోకసారా' అను ఇంద్రుని నగరము బంగారు అలంకరింపబడినది కలదు. మహా మేరువు నకు దక్షిణముగా మానసోత్తరమునకు పైభాగముననే కల యముని నివాసమగు 'సంయమనీ'పురము కలదు. మేరువునకు పడమటగా మానసోత్తరమునకు పైభాగమున 'సుఖా' (ప్రాచీన పారసీక నగరమునకు 'సుషా' అని పేరు.) అను నగరము కలదు. ఇట్లే మానసోత్తరపు పైభాగమున మేరువునకు ఉత్తరమున సోముని 'విభా' నగరము ఉన్నది. ఇట్లు లోకపాలురు నలుగురును లోక వ్యవస్థార్థము (సూర్య సంచార గణనకై) నాలుగు దిక్కులందును ఆయా నగరము

లందు ఉన్నారు. (అని భావించవలెను.) లోకపాలుర కందరకును పైగా దక్షిణాయనమున సూర్యుడు చివరి దశలో (ఉత్తరాయనము ఆరంభము కాబోవునప్పుడు) అప మండలమున (సూర్యుడు పయనించెడు అశ్విన్యాది నక్షత్ర మార్గమునకు అప మండలమని పేరు) ధనుస్సును వదలిన బాణమువలె మహావేగమున జ్యోతిశ్చక్ర మార్గమున పోవును. అమరావతిలో మధ్యాహ్నమయినపుడు సంయమనమున ఉదయము సుఖా నగరమున అర్ధరాత్రము విభా నగరమందు అస్తమయము జరుగును. ఇట్లే సంయమనమున మధ్యాహ్నమయినపుడు సుఖా నగరమున ఉదయము విభా నగరమున అర్ధరాత్రము అమరావతియందస్తమయము. ఇట్లే సుఖా నగరమున మధ్యాహ్నమయినపుడు విభా నగరమున ఉదయము అమరావతియందు అర్ధరాత్రి-సంయమని యందస్తమయము; విభా నగరమున మధ్యాహ్నమయినపుడు అమరావతియందుదయము సంయమని యందర్ధరాత్రి సుఖా నగరమందస్తమయము జరుగును.

స శీఘ్రమేవ పర్యేతి భాస్కరోఽలాతచక్రవత్ । భ్రమత్వే భ్రమమాణాని ఋక్షాణి చలతే రవిః 34
ఏవం చతుర్షు పార్శ్వేషు దక్షిణాన్తేషు సర్పతి । ఉదయేస్తమయేచాసౌ పుత్తిష్ఠతి పునః పునః. 35
పూర్వాహ్ణే చాపరాహ్ణేచ ద్వౌతు దేవాలయౌతు సః । తపత్యేకంచ మధ్యాహ్నే మధ్యాహ్నే తాభిరేవచ. 36
ఉదితో వర్ధమానాభి ర్మధ్యాహ్నే తపతే రవిః । అతః పరం హ్రసన్తీభి ర్గోభి రస్తం స గచ్ఛతి. 37
ఉదయాస్తమయాభ్యాంతు స్మృతే పూర్వాపరేతు వై । యద్వత్పురస్తా త్తపతి తద్వత్పృష్ఠే తు పార్శ్వయోః.
యత్రోదయస్తు దృశ్యేత తేషాం స ఉదయ స్స్మృతః । ప్రణాశం గచ్ఛతే యత్ర తేషామస్త స్సఉచ్యతే. 39
సర్వేషాం తూత్తరే మేరు ర్లోకాలోకస్తు దక్షిణే । విదూరభావా దర్కస్య భూమే ర్లోకాఽగతస్యచ. 40
హ్రియన్తే రశ్మయో యస్మా త్తేన రాత్రౌ న దృశ్యతే । ఊర్ధ్వం శతసహస్రాంశుః స్థితస్తత్ర ప్రదృశ్యతే. 41
ఏవం పుష్కరమధ్యేన యదా భవతి భాస్కరః ।
అంశాంశకంచ మేదిన్యాం ముహూర్తేన స గచ్ఛతి. 42
యోజనానాం సహస్రస్య ఇమాం సఙ్ఖ్యాం నిబోధత । ఊర్ధ్వం శతసహస్రాణా మేకత్రింశచ్చ సా స్మృతా. 43
పఞ్చాశచ్చ సహస్రాణి తథాన్యా న్యధికాని చ । మౌహూర్తికీ గతిర్హ్యేషా సూర్యస్యతు విధీయతే. 44
ఏతేన క్రమయోగేన యదా కాష్ఠాంతు దక్షిణామ్ । పరిగచ్ఛతి సూర్యోసౌ మాసం కాష్ఠాంతమేవహి. 45
మధ్యేన పుష్కరస్యాథ భ్రమతే దక్షిణాయనే । మానసోత్తరమేరోస్తు అన్తరం త్రిగుణంతు తత్. 46
సర్వతో దక్షిణాయాంతు కాష్ఠాయాం తన్నిబోధత । నవకోట్యః ప్రసఙ్ఖ్యాతా యోజనైః పరిమణ్డలమ్. 47
తథా శతసహస్రాణి చత్వారింశచ్చ పఞ్చచ । అహోరాత్రా త్పతఙ్గస్య గతిరేషా విధీయతే. 48

ఇట్లు సూర్యుడు నిరంతరమును అలాత చక్రమువలె (కొరవి గిరగిర త్రిప్పుటచే ఏర్పడు చక్రమువలె) తిరుగుచునేయుండును. దక్షిణము వరకు గల దిక్కులందును ఈ చెప్పిన క్రమమున తిరుగుచు సారెవలె తిరుగు (గుండ్రముగానున్న) నక్షత్ర చక్రమున అతడు నడచుచుండును. పూర్వాహ్న మధ్యాహ్న పరాహ్ణ కాలములందు వేరు వేరు స్థితులలో ఉండు కిరణములతో భూమిని తపింపజేయును. ఎట్లన ఉదయమునుండి అతని కిరణముల తాపము అధికమగుచు మధ్యాహ్నమునకు అత్యధికమగును. అప్పటినుండి క్రమముగా తగ్గుచు పోవును.

సూర్యోదయాస్తమయముల బట్టియే తూర్పు మొదలగు దిక్కుల వ్యవస్థ జరుగును. సూర్యుడుదయించుచున్నట్లు కనబడు దిశ ఉదయదిశ (అక్కడి వారికది తూర్పు). అస్తమించుచున్నట్లు కనబడు దిశ అస్తదిశ (అక్కడి వారికది పడమర.) అన్నిటికంటె ఉత్తరమున మేరువు-అన్నిటికంటె దక్షిణమునందు లోకాలోకము (పర్వతము) ఉన్నట్లు భావన చేయవలయును; భూమియందలి ఒక భాగమును పూర్తిగా వదలి మరియొక విదూర భాగమునకు పోవుట వలన సూర్యుడు అక్కడివారికి రాత్రులందు కనబడడు. ఏ భూభాగమునకు అతడు పోవునో అక్కడ నూరు వేల కిరణములు కలవాడై ఆకాశపు ఉచ్చ స్థానమున అక్కడి వారికి కనబడును. అది వారికి పట్టపగలు.

సూర్యుడు ఒక ముహూర్త కాలములో కొన్ని 'అంశ' (12) భాగలదూరమాకాశమున పయనించును. ఇది ముప్పది యొక లక్షల ఏబదివేల యోజనములగును. ఇది ముహూర్త-(రెండు గడియలు = 48 నిమిషములు) కాలములో రవి గమన వేగము. ఈ గతిలో పయనించుచు రవి దక్షిణ దిశకుపోయి మాఘమాసమున దక్షిణాయన గతిని వదలి పుష్కరద్వీప మధ్య భాగమున సంచరించుచు మేరుపర్వతమున మానసోత్తరశిఖరప్రాంతమునకు వచ్చునపికి అచ్చటి క్రాంతిమండల పరిమాణము విషువ మండలమునందు ఉండుదానికి మూడింతలగును. రవి ఒక అహోరాత్రములో పయనించు దూరము తొమ్మిదికోట్ల నలువది లక్షల యోజనములగును. (3150000×30 = 94500000)

దక్షిణా ద్వినివృత్తోఽసౌ విషువస్థో యదా రవిః । క్షీరోదస్య సముద్రస్యోత్తరతోపి దిశశ్చరన్. 49
మణ్డలం విషువేచాపి యోజనై స్తన్నిబోధత । త్రిస్రఃకోట్యస్తు సమ్పూర్ణం విషువస్యాపి మణ్డలమ్. 50
తథా శతసహస్రాణి వింశత్యేకాధికాపునః । శ్రావణే చోత్తరే కాష్ఠాం చిత్రభాను ర్యదా భవేత్. 51
గోమేదకస్య ద్వీపస్య ఉత్తరాం చ దిశం చరన్ । ఉత్తరాయాః ప్రమాణేతు కాష్ఠాయా మణ్డలస్యతు. 52
యోజనానాం ప్రసంఖ్యాతా కోటిరేకాతు సా ద్విజాః । అశీతి ర్నియుతానీహ యోజనానాం తథైవచ ।
అష్ట పంచాశతంచైవ యోజనా న్యధికానితు.
దక్షిణోత్తరమధ్యాని తాని విన్ద్యా ద్యథాక్రమమ్ । స్థానం జరద్గవం మధ్యే తథైరావతముత్తరమ్. 53
వైశ్వానరం దక్షిణతో నిర్దిష్టమిహ తత్త్వతః । నాగవీథ్యుత్తరావీథి రజవీథిస్తు దక్షిణే. 54
అశ్వినీ కృత్తికా యామ్యా నాగవీథి స్త్రయ స్స్మృతాః । రోహిణ్యార్ద్రా మృగశిరా గజవీథిరితి స్మృతా. 56
పుష్యాశ్లేషా పునర్వస్వో ర్వీథిశ్చైరావతీ స్మృతా । త్రిస్రస్తు వీథయో హ్యేతా ఉత్తరో మార్గ ఉచ్యతే. 57
పూర్వఉత్తరఫల్గున్యో మఖాచైవార్షభాభవేత్ । పూర్వోత్తరా ప్రోష్ఠపదే గోవీథీ రేవతీ స్మృతా. 58
శ్రవణంచ శ్రవిష్ఠాచ వారుణం వా జరద్గవమ్ । ఏతాస్తు వీథయ స్తత్ర మధ్యమో మార్గ ఉచ్యతే. 59
హస్తా చిత్రా తథా స్వాతీ అజ వీథిరితి స్మృతా । విశాఖా మైత్రమైన్ద్రంచ మృగవీథి రిహోచ్యతే. 60
మూలపూర్వోత్తరాషాఢా వీథి ర్వైశ్వానరీ స్మృతా । స్మృతా స్తిస్రస్తు వీథ్యస్తా మార్గేవై దక్షిణే పునః. 61
కాష్ఠయో ర న్తరం త్వేత ద్వక్ష్యతే యోజనైః పునః ఏత చ్ఛత *సహస్రాణా మేకవింశత్తు వైస్మృతమ్. 62
శతాని త్రీణి చాన్యాని త్రయస్త్రింశచ్చ యోజనైః । కాష్ఠయో ర న్తరం చైత ద్యోజనానాం ప్రకీర్తితమ్. 63

దక్షిణదిశనుండి మరలి సూర్యుడు విషువ మండలము (రాత్రింబవళ్ళు సమముగానుండు కాలమును ఏర్పరచు క్రాంతి వృత్త భాగము) లోనికి వచ్చియుండి అచటినుండి క్షీరోద సముద్రమునకు ఉత్తర దిశగా సంచరించనారంభించునపుడు ఆ విషువ మండలపు యోజన పరిమాణము మూడుకోట్ల ఇరువదియొక లక్షలు; శ్రావణమాసమున రవి క్రాంతిమండలమునకు ఉత్తరమున గోమేద ద్వీపమునకు ఉత్తరమున పయనించునపుడు అచ్చట మండలపు పరిమాణము ఒకకోటి ఎనుబది లక్షల ఏబది ఎనిమిది యోజనములు.

అప మండలము అనబడు నక్షత్రచక్రము దక్షిణభాగము ఉత్తరభాగము మధ్యభాగము అని మూడు భాగము లగును. మధ్యభాగమునకు జరద్గవస్థానము-ఉత్తర భాగమునకు ఐరావతస్థానము-దక్షిణ భాగమునకు-వైశ్వానర స్థానము అని పేరులు. స్థానమును పథము అని కూడ వ్యవహరింతురు. ఒక్కొక్క భాగములో మరల మూడేసి ఉపభాగములు (వీథులు) కలవు. వానిలో నాగవీథి ఉత్తరభాగమందును అజవీథి దక్షిణ భాగమునందును వచ్చును. అశ్వని-కృత్తిక-భరణి-నాగవీథి; రోహిణి-ఆర్ద్ర-మృగశిర-గజవీథి; పుష్యమి ఆశ్లేష-పునర్వసు-ఐరావతవీథి; ఈ మూడు వీథులను కలిసి ఉత్తరమార్గము; పుబ్బ-ఉత్తర-మఖ-ఋషభవీథి; పూర్వాభాద్ర-ఉత్తరాభాద్ర-రేవతి-గోవీథి; శ్రవణము-ధనిష్ఠ-శతభిషము-

* సహస్రాణా మేకత్రింశత్తు.

జరద్గవవీథి; ఈ మూడును కలిసి మధ్యమమార్గము; హస్త-చిత్ర-స్వాతి-అజవీథి; విశాఖ-అనూరాధ-జ్యేష్ఠ - మృగవీథి; మూల-పూర్వాషాఢ-ఉత్తరాషాఢ-వైశ్వానరవీథి; ఈ మూడును కలిసి-దక్షిణమార్గము. [ఇచట ఇతర పురాణములలో వేరు విధముగా నున్నది-ఎట్లన-మఖ-పుబ్బ-ఉత్తర-ఋషభవీథి; హస్త-చిత్ర-స్వాతి-గోవీధి; విశాఖ-అనూరాధ-జ్యేష్ఠ-జరద్గవవీథి; ఇది మధ్యమమార్గము; మూల-పూర్వాషాఢ-ఉత్తరాషాఢ-అజవీథి; శ్రవణము-ధనిష్ఠ-శతభిషము-మృగవీథి; పూర్వాభాద్ర-ఉత్తరాభాద్ర-రేవతి-ఈ మూడును కలిసి వైశ్వానరవీథి అని యున్నది. —అనువాదకుడు]

విశేషము: నాగవీథి మొదలగు జ్యోతిర్వ్యవస్థ విషయమున శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు ఇట్లు చెప్పి యున్నారు.

'వ్యాసవాణి' (ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ వారి ప్రచురణ) యందలి 'ఆర్ష విజ్ఞానము' అను వ్యాసము నుండి :

## జ్యోతీరూపము

"ముమ్మొదట విష్ణువాయు మత్స్య పురాణములు ఈ దేవయానమునకు రూపకల్పన మొనరించెను. పిదప భాగవతాదులు దీని ననుసరించెను.

'ఉత్తరం యదగస్త్యస్య అజవీథ్యాశ్చ దక్షిణమ్ ।
పితృయాణం సవై పంథా వైశ్వానర పథా ద్బహిః.

విష్ణు-2-8-87; వాయు-50-208.

'నాగవీథ్యుత్తరం యశ్చ సప్తర్షి భ్యశ్చ దక్షిణమ్ ।
ఉత్తరః సవితుః పంథాః దేవయానశ్చ సన్మృతః.'

విష్ణు—2-8-92; వాయు-50-216.

పథ మన నేమి? వీథి యన నేమి? ఒక్కొక్క గ్రహమునకు మూడేసి స్థానము లున్నవి. ఉత్తరమున ఐరావతము-దక్షిణమున వైశ్వానరము-నడుమ జారద్గవము; ఇవి మూడును పథములు; లేక మార్గములు; ఈ మూడిటికిని మరల మూడేసి వీథులు కలవు; ఒక్కొక్క వీథిలో మూడేసి నక్షత్రము లున్నవి.

వాయు విష్ణు పురాణము లీ యెడ సమానములు; మత్స్య పురాణము 124 అధ్యాయమున 52 నుండి 60 వరకు శ్లోకములు చూచునది; అందు కొంచెము మార్పు కలదు; నక్షత్రవీథి మార్గములు: - అశ్విని-భరణి - కృత్తిక-నాగవీథి; 2. రోహిణి-మృగశిర-ఆర్ద్ర-గజవీథి; పునర్వసు-పుష్యమి-ఆశ్లేష-ఐరావతవీథి; ఈ మూడును ఐరావతపథము; 1. మఖ-పుబ్బ-ఉత్తర వృషభవీథి; 2. హస్త-చిత్ర-స్వాతి-గోవీథి; 3. విశాఖ-అనూరాధ-జ్యేష్ఠ-జారద్గవవీథి; ఈ మూడును జరద్గవ పథము; 1. మూల-పూర్వాషాఢ-ఉత్తరాషాఢ-అజవీథి; 2. శ్రవణము-ధనిష్ఠ-శతభిషము-మృగవీథి; 3. పూర్వాభాద్ర-ఉత్తరాభాద్ర-రేవతి-వైశ్వానరవీథి; ఈ మూడును వైశ్వానరపథము; ఇవి వరుసగా ఉత్తర-మధ్యమ-దక్షిణ-పథములు;

గర్గమతానుసారము భరణి - కృత్తిక-స్వాతి-నాగ; రోహిణి-మృగశిర-ఆర్ద్ర-గజ; పున-పుష్య-ఆశ్లే-ఐరావత; (ఉ-మా.) మఖ-పుబ్బ-ఉత్తర-వృషభ; అశ్వ-రేవ-పూ-భా; ఉభా-గోవీథి; శ్ర-ధ-శత-జరద్గవ; (మధ్యమమార్గ); అనూ-జ్యే-మూల-మృగ; హస్త-విశా-చిత్ర-అజ; పూషా-ఉషా-వైశ్వానర; (దక్షిణ మార్గ); భరణ్యాది మఖాంతము ఉత్తర మార్గము-పూర్వఫల్గున్యాది మూలాంతము మధ్యమమార్గము; పూర్వాషాఢాదిగ ఆశ్విన్యంతము దక్షిణమార్గము - అని వరాహమిహిరుడు." అని.

అపమండలపు రెండు అంచుల నడుమ దూరము-లేదా అపమండల వృత్తవ్యాసము-ఇరువదియొక లక్షల మూడు వందల మువ్వది యోజనములు;

కాష్ఠయో ర్లేఖయోశ్చైవ అయనే దక్షిణోత్తరే । తద్వక్ష్యామి ప్రసఙ్ఖ్యాయ యోజనై స్తన్నిబోధత. 64
ఏకైక మన్తరం తద్వ దుక్తాన్యేతాని సప్తభిః । సహస్రై రవియుక్తాని తతోఽన్యైః పఞ్చవింశతిః. 65
లేఖయోః కాష్ఠయోశ్చైవ బాహ్యాభ్యన్తరయో శ్చరన్ । అభ్యన్తరం స పర్యేతి మణ్డలా న్యుత్తరాయణే. 66
బాహ్యతో దక్షిణేచైవ సతతం సూర్యమణ్డలమ్ । చర న్నశ్చాదుదీచ్యాంతు అశీతిం మణ్డలం శతమ్. 67
తరణిర్దక్షిణే తావ ద్భ్రమతే మణ్డలానితు । ప్రమాణం మణ్డలస్యాపి యోజనానాం నిబోధత. 68
యోజనానాం సహస్రాణి దశచాష్టౌ తత స్స్మృతః । అధికా న్యష్టపఞ్చాశ ద్యోజనానితు వైపుసః. 69
విష్కమ్భో మణ్డలస్యైవ తిర్యక్సతు విధీయతే । అహస్తు చరతో నాభౌ సూర్యోవై మణ్డలక్రమాత్. 70
కులాలచక్రపర్యన్తో యథా చక్రీ రవి స్తథా । దక్షిణే చక్రవత్సూర్య స్తథా శీఘ్రం నివర్తతే. 71
తస్మా త్ప్రకృష్టాం భూమింతు కాలేనాల్పేన గచ్ఛతి । సూర్యో ద్వాదశభిశ్శీఘ్రం ముహూర్తై ర్దక్షిణాయనే. 72
త్రయోదశార్ధ మృక్షాణాం మద్యేచాంతరమణ్డలమ్ । ముహూర్తైస్తాని ఋక్షాణి తావదష్టాదశై శ్చరన్. 73
కులాలచక్రమధ్యస్థో యథా మన్దం ప్రసర్పతి । ఉదగ్యానే తథా సూర్య స్సర్పతే మన్దవిక్రమః. 74
తస్మా ద్దీర్ఘేణకాలేన భూమిం సోల్పాం ప్రసర్పతి । సూర్యో ద్వాదశభి శ్శీఘ్రం ముహూర్తై ర్దక్షిణాయనే. 75
సూర్యోష్టాదశభి రహ్నో ముహూర్తై రుదగాయనే । త్రయోదశార్ధం మధ్యేతు కాష్ఠానాం చరతే రవిః. 76
ముహూర్తై స్తాని ఋక్షాణి రాత్రౌ ద్వాదశభి శ్చరన్ । తతో మన్దతరం తాభ్యాం చక్రంతు భ్రమతే తతః. 77

ఉత్తరాయన దక్షిణాయన రేఖల నడుమ అపమండలపు బయటి అంచులకు సమాంతరముగా ఉండుచోట ఏడు వేల ఇరువది యైదు యోజనము లుండును. రవి అపమండలపు అంచులను దాటక ఉత్తరాయన దక్షిణాయన రేఖల నడుమ సంచరించుటతో ఉత్తరాయనమున ఈ మండలమునకు లోపలివైపుగాను దక్షిణాయనమందు ఈ మండలమునకు వెలుపలగాను సంచరించును. అతడు చేయు మండల వ్యాస పరిమాణము (180భా.) పదునెనిమిది వేల ఏబది ఎనిమిది యోజనములు. సూర్యుడు పగళ్లయందు ధ్రువుని చక్రనాభిగా చేసికొని కులాలచక్రము (కుమ్మరి సారె) తిరుగునపుడు ఆ చక్రపు అంచు ఆ చక్రపు నాభిపై ఆధారపడియు ఒకవైపు క్రిందికి వాలుచు మరియొక వైపు పైకి లేచుచు తిరుగునట్లు తిరుగుచుండును. దానిచే రవి దక్షిణాయనమున ఎక్కువ దూరమును తక్కువ కాలములోనే అతిక్రమించును. అనగా పదుమూడున్నర నక్షత్రము లంత దూరమును (180 డిగ్రీలు) పండ్రెండు ముహూర్తముల కాలములోనే సంచరించును. ఉత్తరాయనమునందు గమనవేగము తగ్గి రవి ఇదే పదుమూడున్నర నక్షత్రముల దూరమును దాటుటకు పదునెనిమిది ముహూర్తముల కాలము పట్టును. ఉత్తరాయనమునగాని దక్షిణాయనమునగాని పగటి గతికి పోగా మిగిలిన కాలము రాత్రి గతికి పట్టును. మొత్తము మీద అహోరాత్ర పరిమాణము ముప్పది ముహూర్తములు సరిపోవును. (30 ముహూర్తములు = 24 గంటలు)

మృత్పిణ్డఇవ మధ్యస్థో భ్రమతేఽసౌ ధ్రువ స్తథా ।
ముహూర్తై స్త్రింశతా తావ దహోరాత్రం ధ్రువో భ్రమన్. 78
ఉభయోః కాష్ఠయోర్మధ్యే భ్రమతే మణ్డలానితు । ఉత్తరక్రమణా త్తస్య దివా మన్దగతి స్తతః. 79
తస్యైవతు పునర్నక్తం శీఘ్రా సూర్యస్య వైగతిః । దక్షిణక్రమణేచాపి దివా శీఘ్రం విధీయతే. 80
గతిస్సూర్యస్య వై నక్తం మన్దాచాపి పునస్స్మృతా । ఏవం గతివిశేషేణ విభజ న్రాత్ర్యహానితు. 81
అథ(జ)వీథ్యార దక్షిణాయాం లోకాలోకస్య చోత్తరే । లోకసన్తానతో హ్యేష వైశ్వానరపథా ద్బహిః. 82
పృష్ఠే యాతు ప్రభా సౌరీ పురస్తాత్సమ్ప్రవర్తతే । పార్శ్వేభ్యో బాహ్యతస్తావ ల్లోకాలోక స్సవర్త్యతః. 83
వు. 57)

యోజనానాం సహస్రాణి దశోర్ధ్వం చోచ్ఛ్రితో గిరిః । ప్రకాశ శ్చాప్రకాశశ్చ సర్వతః పరిమణ్డలమ్. 84
నక్షత్రచన్ద్రసూర్యాశ్చ గ్రహా స్తారాగణై స్సహ । ఆభ్యన్తరే ప్రకాశన్తే లోకాలోకస్య వై గిరేః. 85
ఏతావానేవ లోకస్తు నిరాలోక స్తతఃపరమ్ । లోక ఆలోకనే ధాతు ర్నిరాలోక స్త్వలోకతః. 86

కాలభాగాదికథనమ్

లోకాలోకౌతు సన్ధత్తే యస్మా త్సూర్యః పరిభ్రమన్ ।
తస్మా త్సన్ధ్యేతి తామాహు రుషా వ్యుష్ట్యో రథాన్తరమ్. 87
ఉషా రాత్రిః స్మృతా విప్రై ర్వ్యుష్టాచాపి దినం స్మృతమ్ ।
త్రింశత్కలా ముహూర్తస్తు అహస్తే దశ పఞ్చ చ. 88
హ్రాసో వృద్ధి రహర్భాగై ర్దివసానా మథో భువి । సన్ధ్యా ముహూర్తమాత్రాయా హ్రాసవృద్ధీతు తే స్మృతే.
లేఖాప్రభృత్యథాదిత్యం త్రిముహూర్తం విదుర్బుధాః । ప్రాతఃకాల మథో విప్రా భాగశ్చాహ్న స్స పఞ్చమః.
తస్మాత్సఙ్గవకాలోహి ముహూర్తా స్సఙ్గతా స్త్రయః॥ మధ్యాహ్నే త్రిముహూర్తాశ్చ తస్మాత్కాలా దనన్తరమ్.
తస్మా న్మధ్యన్దినా త్కాలా దపరాహ్ణ ఇతి స్మృతః । త్రయఏవ ముహూర్తాస్తు సన్ధ్యాకాలః స్మృతో బుధైః.
అపరాహ్ణే వ్యతీతేతు కాల స్సాయం తదుచ్యతే। దశ పఞ్చ ముహూర్తాఽహ్నో ముహూర్తా స్త్రయ ఏవచ. 93
దశపఞ్చముహూర్తావై అహస్తు విషువం స్మృతమ్ । వర్ధత్యహో రాత్రభూతో అయనే దక్షిణోత్తరే. 94
అహస్తు గ్రసతే రాత్రిం రాత్రిస్తు గ్రసతే త్వహః । శరద్వసన్తయోర్మధ్యే విషువంతు విధీయతే. 95
ఆలోకత స్స్మృతో లోక ఆలోకోఽలోక ఉచ్యతే । లోకపాలా స్థితా స్తస్య లోకాలోకస్య మధ్యతః. 96

రవి ఇట్లు కుమ్మరి చక్రపు అంచువలె క్రిందికి మీదకు వాలుచు లేచుచు తిరుగుచుండినను ఈ జ్యోతిర్మండలమునకు కేంద్ర స్థానమున చక్రపు నాభివలె నున్న ధ్రువుడు మాత్రము కుమ్మరి సారె నడుమ నాభిపై కుండ చేయుటకై ఉంచిన మట్టి ముద్దవలె వాలుట లేచుటలు అంతగా లేక గమనింప సాధ్యముకాని తక్కువ వేగమున తిరుగుచుండును. ఐనను అతడును ఆపమండలపు రెండు అంచులకు నడుమ మండలాకృతి నేర్పరచు భాగల గతితో కొలదిగ వాలుచు లేచుచు తిరుగుచుండును. అతని ఈగతి భేదము వలననే అతనితో బంధింపబడి చక్రపుటంచువలె తిరుగు సూర్యుని గతి ఉత్తరాయనమున పగలు మందముగను రాత్రి చురుకుగను దక్షిణాయనమున పగలు చురుకుగను రాత్రులందు మందముగను సాగును.

ఇట్లు రాత్రింబవళ్ళను తన గతి విశేష వశమున విభజించుచు రవి దక్షిణమందలి అజ వీథియందు లోకాలోక పర్వతమునకు ఉత్తరమున లోకశ్రేణికి వెలుపలను వైశ్వానరవీథికి వెలుపలను కూడ సంచరించుచుండును. సూర్యుడు లోకాలోక పర్వతమునకు వెనుకవైపున నున్నపుడు అతని కాంతి ముందు వైపున ప్రసరించును. ఈ చెప్పిన అజవీథి మొదలగు వానికి ప్రక్క అంచుల కవతలగా లోకాలోక పర్వతము ఉన్నది. దాని ఎత్తు పదివేల యోజనములు. నక్షత్రములు చంద్రసూర్యులు గ్రహములు మొదలగు జ్యోతిర్గోళములన్నియు ఈ లోకాలోక పర్వతమునకు లోపలివైపున మాత్రమే సంచరించగలవు; తమ వెలుగును ప్రసరింపజేయగలవు. ఈ పర్వతమునకు అవతలివైపు ఆలోకము (వెలుతురు) లేదు. ఇట్లు దీనికి ఒకవైపున ఆలోకము (చూపు-చూచుటకు అవకాశము-(ప్రకాశము) ఉండుట చేతను మరియొక వైపున అది లేకపోవుట చేతను ఈ పర్వతమునకు లోకాలోకమని పేరు ఏర్పడెను. లోకము-వెలుతురు; అలోకము-చీకటి; రవి సంచారము ఈ రెంటికిని సంధానము కలిగించును. కనుక అతనిచే వెలుగు చీకటులకు సంధానము కలిగించబడు సమయమును 'సంధ్యా' కాలము అందురు. ఉషా-వ్యుషా (వ్యుష్టి) అను సమయముల అంతరమునకు

(మధ్యకాలమునకు) 'సంధ్యా' అని పేరు. ఏలయన-'ఉషా' అనగా రాత్రి; వ్యుషా అనగా పగలు; ఈ రెంటి సంధి కాలము 'సంధ్యా' కాలము; (ఇది వైదిక సంప్రదాయానుగతమగు వ్యుత్పత్తియును అర్థమును.)

ముప్పది 'కల'ల కాల పరిమాణమును ముహూర్తమందురు. పదునైదు ముహూర్తములు దివస పరిమాణము; (ఇది విషువ దినమున); కాని పగటి పరిమాణమునందు పెరుగు తరుగులు వచ్చుటచే ఈ పరిమాణములో మార్పులు ఉండును. సాధారణముగా సంధ్యాకాలము (ఇంచుమించు) ముహూర్తకాలముగను. దాని పరిమాణమునందును కాల భేదమును దేశ భేదమును రవి గతి భేదమును బట్టి మార్పులు కలుగవచ్చును.

సూర్యుడు రేఖమీదకు (క్షితిజము = రేఖ = Horizon) వచ్చినది మొదలు మూడు ముహూర్తముల కాలము ప్రాతఃకాలము; తరువాత మూడును సంగవ(మ) కాలము; తరువాత మూడును మధ్యాహ్నము; తరువాత మూడును అపరాహ్ణము; తరువాత మూడును సాయంకాలము; పగటి పరిమాణమునందును రాత్రి పరిమాణమునందును పెరుగు తరుగులు వచ్చినను సాధారణ (విషువ) దిన పరిమాణము ఈ పదునైదు ముహూర్తములే; ఉత్తరాయన దక్షిణాయన క్రమములో దీని మార్పులు లోగడ చెప్పబడినవి. ఆ అయన భేదములను బట్టి పగలు రాత్రిని తనలోనికి తీసికొనుటయు-రాత్రి పగటిని తనలోనికి తీసికొనుటయు జరుగును. శరద్వసంత ఋతువుల నడుమను వసంత శరద్ ఋతువుల నడుమను మొత్తము రెండు మారులు విషువ దినములు వచ్చును.

చత్వారస్తే మహాత్మాన స్తిష్ఠన్త్యాభూతసమ్ప్లవమ్ । సుధామశ్చైవ వైరాజః కర్దమశ్చ ప్రజాపతిః. 97
హిరణ్యరోమా పర్జన్యః కేతుమాన్ రాజసత్తమః । నిర్ద్వన్ద్వా నిరభిమానీ నిర్మమో నిష్పరిగ్రహః. 98
లోకస్యమధ్యే తేపాలా స్తిష్ఠన్తి ప్రతేతే చతుర్దిశమ్ । ఉత్తరం యదగస్త్యస్య శృఙ్గం దేవనిషేవితమ్. 99
పితృయాన స్స్మృతః పన్థా వైశ్వానరపథా ద్బహిః ।
తత్రాసతే ప్రజాకామా ఋషయో హ్యగ్నిహోత్రిణః. 100
లోకస్య సన్తానకరాః పితృయానే పథి స్థితాః । భూతారమ్భకృతం కర్మ హ్యాశిషశ్చ విశామ్పతే. 101
ఆరభన్తే లోకకామా స్తేషాం పన్థా స్సదక్షిణః । చరన్తి తే వరం ధర్మం స్థాపయన్తి యుగేయుగే. 102
* సతతం తపసా చైవ చోదనాభిశ్రితేన చ । ఇచ్ఛాద్వేషకృతశ్చైవ మైథునోపగతాశ్చ వై. 103
తథా కామకృతేనైవ సేవనా ద్విషయస్యచ । జాయమానాస్తు పూర్వేచ పశ్చిమానాం గృహేషుతే. 104
పశ్చిమాశ్చైవ పూర్వేషాం జాయన్తే నిధనేష్విహ । ఏవ మావర్తమానాస్తే వర్తన్త్యాభూతసమ్ప్లవమ్. 105

ఆలోకము-వెలుగు-కలది-లోకము అనబడును; ప్రకాశములేని దానిని ప్రకాశముకాని దానిని అలోకమందురు. ఇట్టి రెండు స్థితులును కలది లోకాలోక పర్వతము. దీని నడుమ (లోకాలోకమనెడు చక్రవాళ పర్వతమునకు నడుమ) లోకపాలురు నలువురున్నారు. వీరు భూత సంప్లవ-ప్రాకృతిక ప్రళయ-కాలము వరకు ఉండి లోక ప్రవృత్తికి ప్రవర్తకులుగా నుందురు. వీరి వివరనగా 1. వైరాజుడు-విరాట్తత్త్వమునుండి జనించిన-సుధాముడు 2. కర్దమ ప్రజాపతి-3. హిరణ్యరోముడనెడు పర్జన్యుడు 4. కేతుమాన్-అను రాజశ్రేష్ఠుడు అనువారు; వీరిలో ప్రతియొకరును ద్వంద్వము లకు సంబంధించిన చిత్తవృత్తులును వానివలని బాధలును లేని ద్వంద్వాతీతులు; అహంకార మమకారాద్యభిమానములు లేనివారు; పరిగ్రహము-తమకు ఇదిలేదని ఏ వస్తువునైన ఒకరినుండి అడిగి కాని అడుగకయేకాని తీసికొనుట-లేనివారు; వీరు ఈలోక మధ్యమందు చతుర్దిశలయందుండి లోక ప్రవృత్తి నిర్వర్తించుచుందురు.

ఉత్తర దిశయందు దేవతల కాశ్రయమగు అగస్త్య శృంగముకలదు. అది పితృకాశ్రయము. వీరందరును ప్రవృత్తి మార్గ ప్రవర్తకులై పితృయాన పథ ప్రవృత్తులై యుందురు. ఆ ప్రవృత్తికి మూలమయినదే ఈ కాలవ్యవస్థ

* సన్తత్యా తపసా చైవ మర్యాదాభిస్మృతేన చ

యను కాలనియమము నాశ్రయించిన కర్మ వ్యవస్థయును. ఈ ఖగోళ వ్యవస్థను తెలియుట వలన ఒక ప్రయోజనము ఈ కర్మ మార్గ ప్రవృత్తి.

ఈ యంశమును సంప్రదాయము ఇట్లు ప్రతిపాదించుచున్నది.

వైశ్వానర పథమునకు వెలుపల పితృయాణమను మార్గము కలదు. ప్రజాకాములు (తమకు పుత్త్రపౌత్త్రాది సంతతి కావలయునని కోరువారు) అగు అగ్నిహోత్రోపాసకులు (శ్రౌత కర్మానుష్ఠాతలు) అగు ఋషులు ఆ మార్గమునందు ఉందురు. వీరు లోక సంతానకరులు (సంతానము-ఎడతెగక కొనసాగుచుండుట) గా నుందురు. వీరు పితృయాణ మార్గమందుండి భూతారంభకారులు (పరమేశ్వర మాయాశక్తి వశమున ఆయా జీవుల కామ కర్మానుసారము భూత భౌతిక సృష్టిని కలిగించునది) అగు కర్మలను ఆచరించుచు తమతమ ఆశిషములను (కామనలను) ఆశ్రయించి తమకు ఆయా ఇహపరలోక సుఖములు కావలెనని కర్మల ననుష్ఠించుచుందురు. వీరు అనుసరించు ఈ ప్రవృత్తి మార్గము దక్షిణ మార్గము. వీరు యుగయుగమున ఉత్కృష్టమగు వైదిక ధర్మమును ఆచరింతురు. దానిని లోకమున ప్రతిష్ఠింతురు. ఈ ధర్మ ప్రవర్తనమునకై తపస్సును (దీనినే జ్ఞానమని శ్రీశంకరభగవత్పాదాదులనిరి.) చోదనాభిశ్రితమయిన కర్మానుష్ఠాన మార్గమును పాటింతురు. ('స్వర్గము కోరువారు జ్యోతిష్టోమయాగముతో దేవతల నారాధించవలెను.' ఈ మొదలగు రూపములతో నుండు కర్మాచరణ ప్రేరణమును చోదన అందురు. ఈ చోదన నాశ్రయించిన మార్గము చోదనాఽభిశ్రిత మార్గము). వీరి చిత్తములందు ఇచ్ఛా ద్వేషములు-మైథున ప్రవృత్తి-కలవు. వీరు కామమునకు-కర్మానుష్ఠానమునకు వశులై విషయ సుఖములు సేవించుచు ఉత్తమ జీవులు కూడ అధమ జీవుల గృహము (దేహము) లందును జనింతురు; అధమ జీవులును ఉత్తమ జీవుల గృహము (దేహము) లందు జనింతురు; ఈ విధముగ వీరు ప్రాకృతిక ప్రళయము జరుగు వరకు జన్మ మరణ పరంపరలో ఆవృత్తి నొందుచుందురు.

అష్టాశీతిసహస్రాణి ఋషీణాం గృహమేధినామ్। సవితు ర్దక్షిణం మార్గ మాశ్రిత్యాభూతసమ్ప్లవమ్. 106
క్రియావతాం ప్రసంఖ్యైషా యే శ్మశానాని భేజిరే । లోకసంవ్యవహారార్థం భూతానాం ప్రకృతేనచ. 107
ఇచ్ఛాద్వేషకృతాచ్చైవ మైథునోపక్రమాచ్చవై । తథా కామకృతేనేహ సేవనా ద్విషయస్యచ. 108
ఇత్యేతైః కారణై స్సిద్ధా శ్మశానానీహ భేజిరే । ప్రజైషిణ స్సప్తర్షయో ద్వాపరేష్విహ జజ్ఞిరే. 109
సన్తతిం యే జుగుప్సన్తే తస్మా న్మృత్యు ర్జితస్తు తైః । అష్టాశీతిసహస్రాణి తేషా మప్యూర్ధ్వరేతసామ్. 110
ఉదక్పంథాన మత్యర్థ మాశ్రిత్యాభూతసమ్ప్లవాత్ । అసంప్రయోగా ల్లోకస్య మైథునస్యచ వర్జనాత్. 111
ఇచ్ఛాద్వేష నివృత్త్యాచ భూతారమ్భవిసర్జనాత్ । ఇత్యేతైః కారణై శ్శుద్ధై స్తేఽమృతత్వంచ భేజిరే. 112
ఆభూతసమ్ప్లవస్థాన మమృతత్వం విభావ్యతే । త్రైలోక్యస్థితకాలోహి నపునర్మార్గగామినామ్. 113
భ్రూణహత్యాశ్వమేధాభ్యాం పాపపుణ్యనిభౌ పరమ్ । ఆభూతసమ్ప్లవాన్తేతు సంక్షయే చోర్ధ్వరేతసామ్. 114
ఊర్ధ్వోత్తరమృషిభిస్తు ధ్రువో యత్రతు సంస్థితః ।
ఏత ద్విష్ణుపదం దివ్యం తృతీయం వ్యోమ్ని భాస్కరమ్. 115
యత్ర గత్వా న శోచన్తి తద్విష్ణోః పరమం పదమ్ । ధర్మే ధ్రువస్య తిష్ఠన్తి యేతు లోకస్య కాఙ్క్షిణః. 116

ఇతి శ్రీమత్స్యమహాపురాణే ఖగోళే సూర్యసఞ్చారాదికథనం నామ
త్రయోవింశత్యుత్తరశతతమోఽధ్యాయః.

కామనతో హిరణ్య గర్భోపాసన చేసినందున సూర్యుని దక్షిణాంశమగు చంద్రలోకమువరకు మాత్రమే పోగలుగు దక్షిణ మార్గాశ్రితులు అగు ఋషులు గృహస్థులగు వారు ఎనుబది ఎనిమిది వేలమంది యనియు వీరు ప్రాకృతిక ప్రళయ కాలమువరకు ఇట్లు సంసారమున ప్రవృత్తులగుచుందురనియు గణన చేయబడినది. వీరందరును శ్రౌత కర్మానుష్ఠాన పరులయి శ్మశానములను ఆశ్రయించిరి. అది ఎట్లనగా-లోక వ్యవహారమును ప్రవర్తింపజేసి జనులను

ఉద్ధరించుటకును భూతముల ప్రకృతి ధర్మములగు త్రిగుణములకును వశులై ఇచ్ఛాద్వేషములకు వశీభూతులయి మైథున ప్రవృత్తియందు ప్రవర్తిల్లి ఆయా ఇంద్రియ ప్రవృత్తులవలన కలిగిన కోరికలకు వశులయి విషయ సుఖముల ననుభవించి వీరందరును కర్మానుష్ఠానము వలన కలుగు సిద్ధిని మాత్రము పొంది శ్మశానములను (జన్మ మరణ ప్రవాహరూప సంసార గతిని మాత్రము) పొందగలిగిరి. అమృతత్వమును పొందజాలక పోయిరి. ఇట్టి ప్రజాకాములగు మరీచ్యాది సప్త ఋషులు (ప్రజాపతులు) ఇట్టి లోకమున 'ద్వాపరములయందు' (అపవర్గము కలుగు నిశ్చయము లేని మార్గమునందు) జన్మించిరి.

ఎవరు లోకమునందు తమ పుత్త్ర పౌత్త్రాది రూపమగు సంతానము కొనసాగవలెనను కోరిక లేక సంతతి యనిన అసహ్యపడిరో వారు మృత్యువును జయించి అమృతత్వమును పొందిరి. ఇట్టి ఊర్ధ్వరేతస్కులు (తమ రేతస్సును అధోమార్గమున మైథునమునకై వినియోగించనివారు) కూడ ఎనుబది ఎనిమిదివేలమంది కలరు. వీరందరును లోక ప్రవృత్తి హేతువులగు శ్రౌత కర్మానుష్ఠానములను ఆచరించకపోవుట-మైథున ప్రవృత్తిని విడుచుట-ఇచ్ఛాద్వేషములను విడుచుట-భూతారంభమునకు హేతువులగు ప్రవృత్తులను (ఇష్టా పూర్త కర్మాచరణమును) వదలుట-మొదల విధానముల ననుసరించి శుద్ధులై ఉత్తరాయణ మార్గమున హిరణ్య గర్భలోకమును చేరి అచ్చట ప్రాకృతిక ప్రళయకాలము వరకు నిలిచియుండి హిరణ్యగర్భునితోపాటు (క్రమశః) ముక్తులై అమృతత్వమును పొందుదురు. భూతసంప్లవకాలము (ప్రాకృతిక ప్రళయము) వరకు హిరణ్యగర్భునియందుండి తరువాత ముక్తి పొందు అమృతత్వమునకు ఆభూతసంప్లవస్థానమగు అమృతత్వమని వ్యవహారము. ఈ ఊర్ధ్వ రేతస్కులగు నిష్కామ కర్మానుష్ఠాతలకు కలుగు ముక్తి ఈ విధమయినది. వీరును నపునర్మార్గగాములే-పునరావృత్తిలేని మార్గమునకు-ముక్తి మార్గమునకు పోవువారే. వీరికిని త్రైలోక్య స్థితి హేతు భూతమగు కాల స్వరూప జ్ఞానము కావలసినదే. ఇట్టివారు చేసిన భ్రూణహత్య (సాంగ వేదాధ్యయనము-తద్విహిత కర్మానుష్ఠానము చేసిన ఉత్తమ బ్రాహ్మణుని చంపుట) వలన కలుగు పాపముకాని అశ్వమేధాదుల వలన సంపాదించిన పుణ్యముకాని ప్రాకృతిక ప్రళయము వరకు ఉన్నను ఆ సమయావధితో వీరికవి నశించును. ఊర్ధ్వ లోకముల నడుమ ధ్రువుని లోకమున ఋషులతోపాటు వీరు శాశ్వత స్థితి నొందుదురు. ఇదియే అంతరిక్ష లోకమును (దానికి పైగా సువర్లోకమున) ధ్రువునితో సంబద్ధుడైన భాస్కరుని రూపమున నున్న స్థానము. ఇదియే విష్ణుని తృతీయపాదస్థానము. ఈ విష్ణుని పరమపదమును చేరినవారు జన్మ మరణ జనితమగు శోకమును మరిపొందరు. కాని లోక (సుఖ) కాంక్షు లగువారు ధ్రువుని ధర్మప్రవృత్తికి-లోక ప్రవృత్తికి-హేతువగు స్థానమును మాత్రము చేరి సుఖింతురు. ఈ తత్త్వమును ఎరుగుటకును ఈ జ్యోతిర్వ్యవస్థా జ్ఞానముపయోగించును.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున ఖగోళ వర్ణనమున సూర్య సంచారాది కథనమను
నూట ఇరువది మూడవ అధ్యాయము.

## చతుర్వింశత్యుత్తరశతతమోఽధ్యాయః.
## ధ్రువసఞ్చారకథనమ్.

ఏతాం శ్రుత్వా కథాం దివ్యా మబ్రువన్ రోమహర్షణిమ్ ।
సూర్యాచన్ద్రమసో శ్చారం గ్రహాణాంచైవ సర్వశః. 1
ఋషయః : భ్రమన్తి కథమేతాని జ్యోతీంషి రవిమణ్డలే । అవ్యూహేనైవ సర్వాణి తథైవాసఙ్కరాణితు. 2
కశ్చ భ్రామయతే తాని భ్రమన్తి యదివా కథమ్ । ఏతద్వేదితు మిచ్ఛామ స్తన్నో నిగదసత్తమ. 3
భూతసమ్మోహనం హ్యేత ద్బ్రూహి నో వదతాం వర ।
సూతః : భూతసమ్మోహనం హ్యేత ద్బ్రువతో మే నిబోధత. 4

ప్రత్యక్షమపి దృశ్యన్తే సమ్మోహయతి వై ప్రజాః । యోసౌ చతుర్దశర్క్షేషు శింశుమారో వ్యవస్థితః. 5
ఉత్తానపాదపుత్రోఽసౌ మేఢీభూతో ధ్రువో దివి । సైష భ్రమ న్భ్రమయతి చన్ద్రాదిత్యౌ గ్రహైస్సహ. 6
భ్రమన్త మనుపరియన్తి నక్షత్రాణితు చక్రవత్ । ధ్రువస్య మనసా యోసౌ భ్రమతే జ్యోతిషాంగణః. 7
వాతానీకమయైః పాశై ర్ధ్రువస్య పరిసర్పతి । తేషాం భేదశ్చ యోగశ్చ కాలాచారా స్తథైవచ. 8
అస్తోదయా స్తథోత్పాతా అయనే దక్షిణోత్తరే । విషువద్గ్రహవర్ణాశ్చ సర్వమేత ద్ధ్రువేరితమ్. 9

## నూట ఇరువది నాలుగవ అధ్యాయము.

## జ్యోతిర్మండల వ్యవస్థ.

## ధ్రువస్థితి - తత్సంచార ప్రతిపాదనము.

ఈ విధముగా రౌమహర్షణి చెప్పిన దివ్యకథను సూర్యాచంద్రమసుల-సర్వగ్రహముల సంచారమును వేరు వేరుగ విని ఋషులతనితో ఇటనిరి: ఈ జ్యోతిస్సులు అన్నియు రవి మండలమునందు ఏ వ్యూహమును (అమరికయు) లేకయే ఒకదానితో మరియొకటి సంకరము (వ్యవస్థలేని కలయిక) నొందక సంచరించుచున్నవి? ఎవరైన వీనిని త్రిప్పుచున్నారో-స్వయముగ అవియే తిరుగుచున్నవో-ఎట్లు తిరుగుచున్నవో-ఇదియంతయు తెలియగోరుచున్నాము. పండితోత్తమా! మాకు అది తెలుపుము. ఈ విషయము భూతములకే సంమోహమును కలిగించునది. కాని నీవు విషయమును తెలుపగల వారందరలో శ్రేష్ఠుడవు. కావున మాకది తెలుపవలయును. అనగా సూతుడు వారికి ఇట్లు చెప్పనారంభించెను.

అవును; ఇది మీరనినట్లు భూత సంమోహనమే. ప్రత్యక్షముగ కనబడుచుండియు ఇది భూతములను సంమోహింపజేయుచున్నది.

★ఇదుగో: ఈ శింశుమారము (శిశుమారము) వేదములందు చెప్పబడినట్లు పదునాలుగు ఋక్షములపై (జ్యోతీరూపములపై) వ్యవస్థ చేయబడి కనబడుచున్నదే: ఈ శిశుమార చక్రమునకు మేఢము*గా ద్యులోకమున ఉత్తానపాద పుత్రుడుగా పురాణములందు పేర్కొనబడిన ధ్రువుడున్నాడు. (అతడు పేరునకు తగినట్లు కదలడనుకొనవలదు.) అతడు తాను (తన చుట్టు) తిరుగుచునే చంద్రాదిత్యులను ఇతర గ్రహములను త్రిప్పుచున్నాడు. ఇతర నక్షత్రములును తిరుగుచున్న ఆ ధ్రువుని చుట్టు తాము భ్రమించుచు చక్రమును చుట్టుచు భ్రమించు ఇతర చక్రములవలె తిరుగుచున్నవి. ధ్రువుని మనస్సంకల్పానుసారము ఇట్లు తిరుగుచున్న ఈ జ్యోతిర్గణము వాత సమూహమయములగు పాశములతో (కట్టబడి) ధ్రువము (కదలనిది) ఐ అతని వెంట తిరుగుచున్నది. వాని భేదము (వేరగుట) యోగము (కలయిక) కాల ప్రమాణానుసారము వాని సంచారము ఉదయాస్తమయములు ఉత్పాతములు దక్షిణోత్తరాయనములు విషువములు గ్రహ వర్ణములు ఇవి అన్నియు ధ్రువుని మూలముననే కలుగుచుండును. (భేదము యోగము మొదలగునవి సూర్య సిద్ధాంతాది జ్యోతిశ్శాస్త్ర గ్రంథములందు ప్రసిద్ధములు.)

జీమూతా నామ తే మేఘా యదేభ్యో జీవసమ్భవః । ద్వితీయ ఆవహోవాయు ర్మేఘా స్తేష్వభిసంశ్రితాః. 10

మేఘమణ్డలకథనమ్

ఇతో యోజనమాత్రేచ అధ్యర్ధార్ధ కృతా అపి । వృష్టిసర్గ స్సదా తేషాం ధారాసారాః ప్రకీర్తితాః. 11

★ ఇటువంటి వచనములనుబట్టి ఈ జ్యోతిర్మండల వ్యవస్థా విషయమంతయు ఋషులు నిర్మలాకాశమున కనబడు వెలుగు ముద్దల వెలుగులను చూచినపుడు కలుగుచుండిన కుతూహలముతో ప్రశ్నించుచుండిరనియు వానికి సమాధానములను రౌమహర్షణుడదే సమయమున ఇచ్చుచుండెననియు స్పష్టమగుచున్నది.

* ధాన్యపు కళ్ళములో గడ్డిని నలుగద్రొక్కుటకై బంతిత్రిప్పు ఎద్దులు ఒకేవిధముగ తిరుగుటకై కళ్ళము నడుమ పాతిన స్తంభమునకు మేటి-మేఢి-మేథము మొదలగునవి పేరు.

పుష్కరావర్త కానామ యే మేఘాః పక్షసమ్భవాః । శక్రేణ పక్షా శ్ఛిన్నా వై పర్వతానాం మహౌజసామ్. 12
కామగానాం సమృద్ధానాం భూతానాం హితమిచ్ఛతామ్ ।
పుష్కరానామ తేమేఘా బృంహన్త స్తోయదారిణః. 13
పుష్కరావర్తకానామ కారణేనేహ శబ్దితాః । నానారూపధరాశ్చైవమహాఘోరస్వనాశ్చతే. 14
కల్పాన్తే వృష్టికర్తారః కల్పాన్తాగ్నినియామకాః । వాయ్వాధారా వహన్తిస్మ సంయుక్తాః కల్పసాధకాః. 15
యాన్యస్యాణ్డస్య భిన్నస్య ప్రాకృతస్యాభవన్తథా ।
యస్మిన్బ్రహ్మా సముత్పన్నశ్చతుర్వక్త్రి స్స్వయం ప్రభుః. 16
తాన్యేవాణ్డకపాలాని సర్వే మేఘాః ప్రకీర్తితాః । తేషా మాప్యాయనం ధూమ స్సర్వేషా మవిశేషతః. 17
తేషాం శ్రేష్ఠశ్చ పర్జన్య శ్చత్వారశ్చైవ దిగ్గజాః । గజానాం పర్వతానాంచ మేఘానాం భోగిభిస్సహ. 18
కులమేకం ద్విధాభూతం యోనిరేకా జలంస్మృతమ్ । పర్జన్యశ్చైవ వర్షాసు హేమన్తే శీతసమ్భవః. 19
తుషారవర్షం వర్షన్తి వృద్ధ్యాహ్యత్ర వివృద్ధయే । షష్ఠః పరివహోనామ వాయుస్తేషాం పరాయణమ్. 20
యోసౌ బిభర్తి భగవా న్గఙ్గా మాకాశగోచరామ్ । దివ్యామృతజలాం పుణ్యాం త్రిపథస్యోపరి స్రుతామ్. 21
తస్య నిష్యన్దితం తోయం దిగ్గజాః పృథుభిః కరైః । శీకరాన్సమ్ప్రముఞ్చన్తి నీహారఇతి స స్మృతః. 22
దక్షిణేన గిరిర్యోసౌ హేమకూట ఇతిస్మృతః । ఉదగ్ఘిమవతశ్చైవ ముత్తరః ప్రాచ్యదక్షిణే 23
పుర్ధ్రానామ్నా సమాఖ్యాతం నగరం తత్రవై స్మృతమ్। తస్మి న్నివర్తతే వర్షం తత్తుషారసముద్భవమ్.24
తతో హిమవతో వాయు ర్హిమపాత సముద్భవః । ఆనయత్యాత్మవేగేన సిఞ్చమానో మహాగిరిమ్. 25
హిమవన్త మతిక్రమ్య వృష్టిశేషం తతఃపరమ్ । ఇహాభ్యేతి తతః పశ్చాదపరాతు వివృద్ధయే. 26
మేఘా శ్చాప్యాయసం చైవ సర్వమేత త్ప్రకీర్తితమ్ ।

మేఘములనుండియే జీవులు ఉత్పన్నములగును కావున వానికి 'జీ(వ)మూతములు' అని పేరు. సప్త వాయువులలో రెండవదగు ఆవహ వాయువు నాశ్రయించి మేఘములుండును. ఇక్కడి (మన భూమి) నుండి ఒకటియు ముప్పావు యోజనము దూరమున అవి నిలిచి వానను భూమిపయి వదలుచుండును. దానికే ధారా-ఆసారము-ఈ మొదలగు నామములు.

ఇవికాక పక్షములు మొలచియున్న పుష్కరా వర్తకములను మేఘములు కలవు. మహా సామర్థ్యము కలవగు పర్వతముల పక్షములను ఇంద్రుడు-అవి కామ సంచారములును సమృద్ధి కలవియును నగుట చూచి - భూతహితమునకై నరకెను. (కాని ఈ పుష్కరా వర్తకముల రెక్కలనతడు నరుకలేదు.) పుష్కరము అనగా నీరు; అవి తోయ(జల) ధారులై బృంహణము (ప్రాణి పోషణము) చేయును కావున వానికి పుష్కరా వర్తకములని వ్యవహారము (ఆవర్తకములు-సంపూర్ణముగా వర్తనమును-జీవనమును-కలిగించునవి.) ఇవి నానారూప ధరములును మహాఘోర ధ్వనియుతములును: అవి కల్పాంతమున వానలు కురిసి ప్రళయాగ్ని నుపశమింపజేయును. కాని ఇవి సృష్టి స్థితి కాలములందు వాయు వశమున కొట్టుకొనిపోవుచు వానలనీయక కల్ప ప్రవృత్తిని సాగించుచుండును. లోకమున సాధారణముగా అంతము వగులగా ఏర్పడిన కుండ పెంకులను కపాలములందురుగదా: అట్లే ఏ అండమునందు ప్రభువు (సృష్టి వ్యాపార సమర్థుడు) చతుర్ముఖుడునగు బ్రహ్మ గర్భస్థ శిశువుగా నుండి చివరకు దానిని చీల్చుకొని ఉత్పన్నుడయ్యెనో- ఆ అండపు కపాలములే మేఘములయ్యెను. అట్టి మేఘములెన్నియున్నను అన్నిటికిని సమానముగా ఆప్యాయనము కలిగించునది ధూమము. మేఘములన్నిటిలో శ్రేష్ఠములు పర్జన్యుడును నాలుగు దిగ్గజములును; (మేఘములును దిగ్గజములును వేరుగవా యనిన) గజములు మేఘములు భోగులు (సర్పములు) వీని కన్నిటికిని మూలతః కుల మొక్కటియే:

తరువాత ఈ కులము రెండయినది. (నాగములు అనునది ఆ రెండవ కులము-కావుననే గజములకును సర్పములకును నాగమని వ్యవహారము) వీని కన్నిటికిని జన్మకారణము నీరు ఒక్కటియే. ఈ పర్జన్యుడు వర్షర్తువునందు నీరు ఇచ్చుచు మేఘుడుగా నుండును. హేమంతర్తువులో ఇతడే శీతము కలిగించును. ఇవి మరింత వృద్ధినొందినచో మంచువానను కురియించును. ఇట్టి పుష్కరావర్తక పర్జన్యాదికమునకు వాయువులలో ఆరవది యగు పరివహవాయువు ఆశ్రయము.

ఆ పరివహ వాయు భగవానుడే 'త్రిపథగా' 'ఆకాశమున పోవునది' అని ప్రసిద్ధయు దివ్యామృత జలపూర్ణయు త్రిపథమునకు (అంతరిక్షమునకు) ఉపరిస్థాన మున ప్రసరించుచు ఇదిగో: ఈ ఆకాశమున కానబడుచున్న గంగను ధరించు (క్రిందకు పడకుండ నిలిపి పట్టు)చున్నాడు. అతడు స్రవింపజేసిన జలమును దిగ్గజములు తమ లావగు తొండములతో తుంపురులనుగా వదలుచుండును. ఆ తుంపురుల సముదాయపు రూపమునే నీహారమనుచున్నాము.

హేమకూట పర్వతమునకు దక్షిణమునను హిమవంతమునకు ఉత్తరమునను కల ప్రదేశమునందు-ఆగ్నేయమున-పుర్ద్రాి అను నగరము ఉన్నది (ఇది పూర్వముండెడిది.) ఈ చెప్పిన తుషారవర్షము ఆ నగరము వరకు వ్యాపించి నిలిచిపోవును. అక్కడినుండి హిమపాతమునకు మూలహేతువగు ఈ వాయువు హిమముతో హిమవన్మహాగిరిని తడుపుచు ఆ నీహారమును దక్షిణమునకు తెచ్చును. హిమవత్పర్వతమును దాటి దక్షిణమునకు వచ్చిన ఈ వాయువు వర్షము తన శేషాంశముగా కలదగును. ఈ వృష్టి తక్కువదయియు వృద్ధికరము; (వానలను కురియించును.) అంతరిక్షమున మేఘముల ఉనికి తీరును వానివలన ప్రాణులకు కలుగు ఆప్యాయన (సంతృప్తి) ప్రకారమును మీకు తెలిపితిని.

సూర్యఏవతు వృష్టీనాం స్రష్టా సముపదిశ్యతే. 27
వర్షం ఘర్మం హిమం రాత్రిసన్ధ్యే చైవ తథా దినమ్ । శుభాశుభఫలానీహ ధ్రువా త్సర్వం ప్రవర్తతే. 28
ధ్రువేణాధిష్ఠితశ్చైవ సూర్యోయం సమ్ప్రవర్షతి । సర్వభూతశరీరేషు ఆపోహ్యానుసమాశ్రయాః. 29
దహ్యమానేషు తేష్వేపం జఙ్గమస్థావరేషుచ । ధూమభూతాస్తు తాహ్యాపో నిష్క్రామన్తీహ సర్వశః. 30
తేన స్రాస్రాణి జాయన్తే స్థానభ్రంశమపాం స్మృతమ్ । తేజోభి స్సర్వభూతేభ్యో హ్యాదత్తే రశ్మిభిర్జలమ్.
సముద్రా ద్వాయునా యోగాద్వహన్త్యాపో గభస్తయః తత స్త్వతివశా త్కాలే పరివర్తం దివాకరః. 32
నయత్యపోథ మేఘేభ్యో శుక్లాశుక్లైస్తు రశ్మిభిః । అభ్రస్థాః ప్రపతన్త్యాపో వాయునా సముదీరితాః. 33
తతో వర్షతి షణ్మాసా న్సర్వభూతవివృద్ధయే । వాయవ్యం స్తనితంచైవ విద్యుత స్త్వగ్నిజా స్స్మృతాః. 34
మేహనాచ్చ మిహేర్ధాతో ర్మేఘత్వం వ్యంజయన్తిచ । న భ్రశ్యన్తే తతోహ్యాప స్తస్మా దభ్రాణివై స్థితిః. 35
స్రష్టాసౌ వృష్టిసర్గస్య ధ్రువేణాధిష్ఠితో రవిః । ధ్రువేణాధిష్ఠితో వాయు ర్వృష్టిం సంహరతే పునః. 36
తేన విస్సృతసూర్యేణ చరన్తే ఋక్షమణ్డలమ్ । చారస్యాన్తే విశన్త్యర్కం ధ్రువేణ సమధిష్ఠితాః. 37

వాన కురియుటకు సూర్యుడే మూలము అని పెద్దలు సముపదేశించుచున్నారు. కాని వస్తుతః వర్షము-వేడిమి-హిమము-రాత్రింబవళ్ళు-సంధ్యాకాలములు-ఇవన్నియు ధ్రువునినుండియే ప్రవర్తిల్లుచున్నవి. ధ్రువుడు అధిష్ఠాతగా ఉన్ననే రవియు వాన కురియించుచున్నాడు. సర్వభూత శరీరములందును ప్రాణములకు కూడ నీరే ఆశ్రయము. స్థిర చర ప్రాణులన్నిటియందును ఆనీరు (అదృష్టమగు అగ్నిచే) దహింపబడగా అది ఆవిరిగా అయి బయటికి పోవును. (ఇదియే మరల నీరుగామారినపుడు) ఆయా ప్రాణులు స్రానములు (స-అస్ర-కన్నీటితో కూడినవి) అయినవనుచున్నాము. ఇది నీటియొక్క స్థానభ్రంశము (ఒక స్థితిని విడిచి మరియొక స్థితిని పొందుట) మాత్రమే. రవి సర్వభూతముల నుండియు తేజోమయములగు తన కిరణములతోను సముద్రమునుండి మాత్రము వాయు సహకృతములయిన తన కిరణములతోను ఈ జలమును గ్రహించుచున్నాడు. తరువాత అతడు తన తెల్లని కిరణములతో తెల్లని జలములనుగా ఆ నీటి యావిరిని పరివర్తించి మేఘములకందించుచున్నాడు. తరువాత వాయు ప్రేరణచే మేఘములయందంత

వరకున్న నీరు క్రిందపడును. ఇట్లు ఆరు మాసములపాటు రవి సర్వభూత వృద్ధికరముగా అంతయో ఇంతయో వానలు కురియించుచుండును. వాయువు మూలమున ఉరుములును అగ్నివలన మెరుపులును కలుగును. మిహ్-అను ధాతువునకు తడుపుట-నీరు చిందించుట అని అర్థము. నీరు చిందించి తడుపునది కావున (మేహ>మేఘ) మేఘము అన బడును. (వాయు శక్తిచే నిలువబడి) క్రిందికి జారిపడదు కావున అభ్రము అని ఈ మేఘములకు పేరు (న+భ్ర> (భ్రంశ్)-అభ్ర-(కాని వాస్తవమున-అప్-భ్ర>అబ్-భ్ర> అ[బ్] భ్ర>అభ్ర-నీటిని మోయునది).

ఇట్లు ధ్రువుడు తనపై అధిష్ఠాతగా ఉండుట చేతనే (ధ్రువుని శక్తి రవియందు నిలిచి యుండుటచే) సూర్యుడు వృష్టికి స్రష్ట-వాన కలిగించువాడు-అగుచున్నాడు. ధ్రువుడు తనకు అధిష్ఠాతగా ఉండుటచేతనే వాయువు వర్షమును ఉపసంహరించగలుగుచున్నది. ధ్రువుడు అధిష్ఠాతగా ఉండుట చేతనే నక్షత్రమండలము (కుజ బుధ గురు శుక్ర శనులకు తారాగ్రహములని శాస్త్ర వ్యవహారము) నిరంతరముగా రవి సంచరించెడి త్రోవలో రవితోపాటు అతనికి పిరేయులవలె సంచరించుచుండును. ధ్రువాధిష్ఠానము చేతనే అవి తమతమ నియతరాశి సంచారానంతరము రవియందు ప్రవేశించు చున్నవి.

## సూర్యరథపరిమాణాదికథనమ్.

తత స్సూర్యరథస్యాపి సన్నివేశం ప్రచక్షతే । స్థితేనైకేన చక్రేణ పఞ్చారేణ త్రినాభినా. 38
హిరణ్మయేనాణ్వణినా అష్టచక్రైకనేమినా । చక్రేణ భాస్వతా సూర్య స్స్యన్దనేన ప్రసర్పతా. 39
దశయోజనసాహస్రో విస్తారాయామ ఉచ్యతే । ద్విగుణశ్చ రథోపస్థా దీషాదణ్డః ప్రమాణతః. 40
స తస్య బ్రహ్మణా సృష్టో రథో హ్యర్థవశేనతు । అసఙ్గః కాఞ్చనో దివ్యో య్యుక్తస్స్వ శీఘ్రగైర్హయైః. 41
ఛన్దోభి ర్వాజిరూపైస్తై ర్యథాచక్ర మవస్థితమ్ । వారుణస్య రథస్యేహ లక్షణై స్సదృశంతు తత్. 42
తేనాసౌసర్పతేవ్యోమ్ని భాస్కరోఽనుదినందివి । రథాఙ్గానితు సూర్యస్య ప్రత్యఙ్గాని రథస్యతు. 43
సంవత్సరస్యావయవైః కల్పితాని యథాక్రమమ్ । అరా నేమ్యస్తు సూర్యస్య ఏకచక్రంతు వైస్మృతమ్. 44
అరాః సంవత్సరాఃపఞ్చ నేమయ స్త్వృతవ స్స్మృతాః ।
రాత్రి ర్వరూథా దర్మశ్చ ధ్వజ ఊర్ధ్వం సముచ్ఛ్రితః. 45
యుగాక్షకోటీ తేతస్య అర్థకామా వుభౌ స్మృతౌ । తస్య కాష్ఠాః స్స్మృతా ఘోణా దన్తపఙ్క్తిః క్షణా లవః. 46
నిమేషా శ్చానుకర్షోస్య ఈషాచాస్య కలాస్మృతా । సప్తాశ్వరూపా శ్ఛన్దాంసి వహన్తే వాయురంహసః. 47
గాయత్రీచైవ త్రిష్టుప్చ జగత్యనుష్టుబేవచ । పఙ్క్తిశ్చ బృహతీచైవ ఉష్ణిగేవతు సప్తమః. 48

అనంతరము పెద్దలు సూర్యరథ సన్నివేశమును ఈవిధముగ చెప్పుచున్నారు. నిలువుగా నిలిచియున్న (ఒక్కటియేయైనను పడిపోకయున్న) ఒకే చక్రము-ఆచక్రమునకు ఐదు అరలు-(ఆకులు)-పృథివ్యంతరిక్ష ద్యులోకములు అనెడు మూడు నాభులు-(చక్రపు మధ్యస్థానములు-కుండలు) బంగారుతో చేసిన మిగుల సూక్ష్మమగు అణి(చక్రపుచీల) ఎనిమిది చక్రములతో ఏర్పడిన ఒకేఒక నేమి (చక్రపు వట్టా) కలిగిన ఇట్టి ఏకచక్రమగుచు శీఘ్రముగా ప్రసరించగల ప్రకాశమాన రథముతో సూర్యుడు సంచరించుచుండును. ఆ రథపు నడిమి విస్తారము పదివేల యోజనములు. రథపు ఉపస్థ ప్రదేశము (నడిమి విస్తారము)నకు రెట్టింపు కాడి పొడవు; ప్రయోజనవశ దృష్టితో ఈ రథమును బ్రహ్మ (వేదము) సృష్టించెను. (సృష్టియందలి ఆయా తత్త్వములను ఆయా రథాంగ ప్రత్యంగములనుగా వేదము రూపించుచున్నది.) ఈ రథము దేనికిని అంటకయే నడుచు బంగారు రథము. ఛందస్సులు అనెడి శీఘ్రగాములగు అశ్వములు ఈ రథమున పూంచియున్నవి. ఈ స్యందనము దాని చక్రమునకు అనుగుణముగ (నిట్టనిలువుగా) నున్నది. దీని లక్షణములు వరుణ రథ లక్షణములతో సమానములు. ఈ రథముతో భాస్కరుడు అనుదినమును ద్యులోకమున సంచరించుచుండును.

వాస్తవ స్థితిని ఆలోచించగా రవి రథపు అంగ ప్రత్యంగములన్నియు సంవత్సరావయవములతో కల్పింపబడినవే. (ఇచ్చట సంవత్సరమునకు అవయవములుగా లోక వ్యవహార ప్రసిద్ధములగు అవయవములు మాత్రమేకాక వేదములందు సంవత్సరాత్మక ప్రజాపతికిని ఆ ప్రజాపతిని ఆరాధించు విధానమునకును అంగములుగా చెప్పిన వానిని గూడ గ్రహించవలయును.) అది ఎట్లనగా—సంవత్సరము చక్రము; పంచ సంవత్సరాత్మక యుగమున ఉండెడి సంవత్సరము-పరివత్సరము-ఇదావత్సరము ఇద్వత్సరము వత్సరము అను ఐదు భేదములును ఐదు ఆకులు; వసంత గ్రీష్మ వర్షా శరచ్ఛిశిరములనెడు ఐదు ఋతువులును ఐదునేములు-ఐదు పూటీలు-రాత్రి వరూథము (రథమును కాపాడుటకు అమర్చిన దారుమయమైన పంజరము) ధర్మము (యజ్ఞము) నిట్టనిలువుగా ఎగురుచున్న ధ్వజము; అర్థ కామములు రెండును కాడికొనలు; 'కాష్ఠా' అను కాలావయవ విశేషములు ఆ రథమును లాగెడి ఏకైకాశ్వపు ముక్కు; క్షణమను కాలావయవ విశేషములు ఆ అశ్వపు దంతపంక్తి; నిమేషములనెడు కాలావయవ విశేషములు అనుకర్షము అను రథావయవము; కలా అనెడు కాలావయవ విశేషములు ఈషా (ఏడి) అనెడు రథావయవము. కాడి కట్టుటకుపయోగించు నిలువు దూలమువంటిది. ఇట 'ఏకో అశ్వో వహతి సప్తనామా' అను శ్రుతి ననుసరించి అశ్వము ఒకటియే అయినను అది ఏడు పేరులతో ఏడు గుఱ్ఱములుగా నున్నది; గాయత్రి-త్రిష్టుప్-జగతీ-అనుష్టుప్-పంక్తి-బృహతీ-ఉష్ణిక్ అను ఏడు ఛందస్సులే వాయువేగము గల ఏడు గుఱ్ఱములు.

చక్రమక్షే నిబద్ధన్తు ధ్రువేచాక్ష స్సమర్పితః । సహచక్రో భ్రమత్యక్ష స్సహాక్షో భ్రమతిర్ధ్రువః. 49
అక్ష స్సహైవచక్రేచ భ్రమతేఽసౌ ధ్రువేరితః । ఏవ మర్థవశాత్తస్య సన్నివేశో రథస్యతు. 50
తథాసంయోగభావేన సిద్ధోసౌ భాస్కరో రథః । తేనాసౌ తరణి ర్దేవో నభస స్సర్పతే దివమ్. 51
యుగాక్షకోటీ తే తస్య దక్షిణే స్యన్దనస్యతు । ధ్రువేణచ గృహీతోసౌ రశ్మినా భ్రమతే రవిః. 52
మణ్డలాని భ్రమన్తిస్యుః ఖేచరస్య రథస్యతు । కులాలచక్రవ ద్భానుమణ్డలం సర్వతో దిశి. 53
యుగాక్షకోటీ తే తస్యవాతోర్మీ స్యన్దనస్య తు । సఙ్క్రామేతే క్రమవతో మణ్డలే సర్వతోదిశమ్. 54
భ్రమత స్తస్య రశ్మీతే హ్రసేతే మణ్డలే ఘ్నోత్తరాయణే । వర్ధేతే దక్షిణే త్వస్య భ్రమతో మణ్డలానితు. 55
యుగాక్షకోటి సమ్బద్ధే ద్వేరశ్మీ స్యన్దనస్యతు । ధ్రువేణ ప్రగృహీతౌ తౌ తపన్తావిథ తే రవిమ్. 56
ఆకృష్యేతే సమాయాతౌ ధ్రువేణ సమధిష్ఠితౌ । తథా సోఽభ్యన్తరే సూర్యో భ్రమతే మణ్డలానితు. 57
*అశీతిమణ్డలశతం కాష్ఠయో రుభయోఽన్తరమ్ । ధ్రువేణ ముచ్యమానేన పురా రశ్మియుగేనతు. 58
తథైవ బాహ్యత స్సూర్యో భ్రమతే మణ్డలానితు । ఉద్వేష్టయన్వై వేగేన మణ్డలానితు గచ్ఛతి. 59

ఇతి శ్రీమత్స్యమహాపురాణే ఖగోళే ధ్రువసఞ్చారాది కథనం నామ
చతుర్వింశత్యుత్తరశతతమోఽధ్యాయః.

సూర్యుని రథపు చక్రము అక్షమునందు బిగింపబడియున్నది; అక్షము ధ్రువునియందిమిడియున్నది. ఈ మాటలో చక్రముతోపాటు అక్షము అక్షముతోపాటు ధ్రువుడును తిరుగుచున్నారు. వాస్తవమున ధ్రువుని ప్రేరణతో అక్షము చక్రముతోపాటు తిరుగుచున్నది.

విషయ ప్రతిపాదనమును ప్రయోజనముగా దృష్టియందుంచుకొని రవి రథ సన్నివేశమంతయు రూపింపబడి ప్రతిపాదింపబడినది. ఆ విధముగ కాలావయవముల సంయోగభావముతో భాస్కరరథ (రూప)ము సిద్ధించుచున్నది. ఆ రథముతో సూర్యదేవుడు అంతరిక్ష లోకమునుండి ద్యులోకమునకు సంచరించుచుండును. (అనగా-రవి మండలము భౌతికముగా అంతరిక్షమందే కనబడుచున్నను ఆదేవుని ఆధిదైవతరూపము ద్యులోకస్థాయి అని తెలియవలెను.)

---

*అసీత్తన్మణ్డలశతం.

రవి రథపు కాడికిని అక్షమునకును గల దక్షిణపు కొనలు ఏవి కలవో-వానికిగల పగ్గములు పట్టి ధ్రువుడు తన రథమును త్రిప్పుటను బట్టి రవి సంచరించుచుండును. ఆకాశమున ఇట్లు మండలాకార భ్రమణములతో తిరుగు రవి రథమున భానుమండలము అన్ని దిక్కులకును గిరగిర తిరుగు కుమ్మరి సారెవలె కనబడుచుండును.

ఎప్పుడును క్రమించు ముందునకు సాగుచునేయుండు రవి రథపు కాడి-అక్షముల కొనలు వాయుతరంగ ప్రేరితములగుచు మండల రూపమున అన్ని దిక్కులందును సంక్రమించు వ్యాపించుచుండును.

ఈ సూర్య రథపు యుగ కోట్యక్షకోటులయందు బిగించియున్న రశ్మిద్వయము (రెండు పగ్గములు)ను మండల [భాగల-లేదా డిగ్రీల] గణనమున చుట్టుకొనుచు మరల విప్పుకొనుచు ఉత్తరాయనమున పొట్టివగును. దక్షిణాయనమున పెద్దవగును. ఇవి ధ్రువునిచే బిగించి పట్టుకొనబడుచు వదలబడుచు తద్వశమున రవి రథమును వేదెక్కించుచుండుటే ఇందులకు హేతువు. ఈరెండు రశ్మి (పగ్గము)లును ధ్రువునిచే అధిష్ఠితములయి సమస్థితికి వచ్చునట్లును లాగబడును. ఉత్తర దక్షిణ దిశల అర్ధవృత్తములు నూట ఎనుబది మండలములు (భాగలు-డిగ్రీలు) అగును. రవి యుగ కోట్యక్షకోటులయందలి పగ్గములను ధ్రువుడు సడలించివదలగా రవి వెలుపలగా సంచరించును; లాగిపట్టి చుట్టివేసి నపుడు లోపలగా సంచరించును. దానిని బట్టి రవి వేగమునందు శీఘ్రత్వమందత్వ భేదములు ఏర్పడును. దానిని బట్టి ఉత్తరాయన దక్షిణాయనము లేర్పడును. అని సారాంశము.

[గమనిక: ఇచ్చట మండలము అను పదము భాగలు (డిగ్రీలు) అను అర్థమున ప్రయోగింపబడినది. మరియును రవిని బట్టి రాత్రింబవళ్లు మొదలగు వ్యవస్థ ఏర్పడునని భారతీయ జ్యోతిశ్శాస్త్రముగాని ఆధునిక పాశ్చాత్య శాస్త్రములు కాని చెప్పుచున్నను కాలాత్మక ప్రజాపతి వ్యవస్థిత రూపమగు సంవత్సరమునకధీనుడై తదధిష్ఠాతృ తత్త్వము లలో నొకటియగు ధ్రువుని వశమున రవి నడచుచున్నాడను సంప్రదాయమొకటి భారతదేశమున కలదని సాయన వచ నములబట్టి తెలియుచున్నది. పురాణములందు ఈ సంప్రదాయమునననుసరించియే ధ్రువుడు సూర్యునిమీదను అధికారము వహించినట్లు చెప్పుట జరుగుచున్నదని గ్రహింపనగును. —అనువాదకుడు.]

ఇది శ్రీమత్స్యమహాపురాణమున ఖగోళ వర్ణనమున జ్యోతిర్మండల వ్యవస్థా ప్రతిపాదనమున
ధ్రువాధీన రవి సంచార కథనమను నూట ఇరువది నాలుగవ అధ్యాయము.

## పంచవింశత్యుత్తరశతతమోఽధ్యాయః.

## వసన్తాదిష్వృతుషు సూర్యగణభేదకథనమ్.

సూతః : స రథోఽధిష్ఠితో దేవై ర్మాసేమాసే యథాక్రమమ్ । తతో వహత్యథాదిత్యో బహుభి ర్ఋషిభిస్సహ.
గన్ధర్వై రప్సరోభిశ్చ సర్పగ్రామణి రాక్షసైః । ఏతే వసన్తివై సూర్యే మాసౌ ద్వౌద్వౌ క్రమేణతు. 2
ధాతార్యమా పులస్త్యశ్చ పులహశ్చ ప్రజాపతిః । ఉరగా వాసుకిశ్చైవ సకణాదశ్చ తావుభౌ. 3
తుమ్బురుర్నారదశ్చైవ గన్ధర్వౌ గాయకేశ్వరౌ । కృతస్థలాప్సరాశ్చైవ యామకా పుఞ్జికస్థలా. 4
గ్రామణీరథగృత్సశ్చ రథౌజాశ్చైవ తావుభౌ । రక్షోహేతిః ప్రహేతిశ్చ యాతుధానా పుభౌ స్మృతౌ. 5
మధుమాధవయోర్ హ్యేష గణో వసతి భాస్కరే । వసేద్గ్రీష్మేతు ద్వౌమాసౌ మిత్రశ్చ వరుణశ్చ వై. 6
ఋషి రత్రిర్వసిష్ఠశ్చ నాగౌ తక్షకరమ్భకౌ । మేనకా సహజన్యాచ గన్ధర్వౌచ హాహాహూహూః. 7
రథన్తరశ్చ గ్రామణ్యౌ రథకృచ్చైవ తావుభౌ । పౌరుషో యోఽపనశ్చైవ యాతుధానౌచ తౌస్మృతౌ. 8
ఏతే వసన్తివై సూర్యే మాసయో శ్శుచిశుక్రయోః । ఏతే వసన్తి సూర్యేచ నివసన్తిస్మ దేవతాః. 9
ఇన్ద్రశ్చైవ వివస్వాంశ్చ అఙ్గిరా భృగురేవచ । ఏలాపత్త్ర స్తథా సర్ప శ్శఙ్ఖపాలశ్చ పన్నగః. 10

విశ్వావసూగ్రసేనౌచ ప్రాతశ్చైవ రథస్యహ । ప్రమ్లోచాచా*ప్సరాశ్చైవానుమ్లోచా చైవ తే ఉభే. 11
యాతుధానా స్తథా హేతి ర్వ్యాఘ్రశ్చైవతు తావుభౌ । నభో నభస్యయోరేతే వసన్తితు దివాకరే. 12
మాసౌ ద్వౌ దేవతా స్సూర్యే వసన్తిచ శరదృతౌ । పర్జన్యశ్చైవ పూషాచ భారద్వాజశ్చ గౌతమః. 13
చిత్రసేనశ్చ గన్ధర్వ స్తథాచ సురుచిశ్చయః । విశ్వాచీచ ఘృతాచీచ ఉభే తే పుణ్యలక్షణే. 14
నాగశ్చైరావతశ్చాపి విశ్రుతశ్చ ధనఞ్జయః । సేనజిచ్చ సుషేణశ్చ సేనానిగ్రామణీ స్తథా. 15
పౌరావారౌచ ద్వావేతౌ యాతుధానా వుభౌ స్మృతౌ । వసన్త్యేతే చ వై సూర్యే మాసయో స్త్విషఊర్జయోః.
హైమన్తికౌ చ ద్వౌమాసౌ నివసన్తి దివాకరే । హంసో భగశ్చ ద్వావేతౌ కశ్యపశ్చక్రతుశ్చవై. 17
భుజఙ్గశ్చ మహాపద్మ స్సర్పః కర్కోటక స్తథా । చిత్రసేనశ్చ గన్ధర్వో ఘూర్ణాయుశ్చైవ మానినౌ. 18
అప్సరాః పూర్వచిత్తిశ్చ గాన్ధర్వీ చోర్వశీతథా । తార్క్ష్యశ్చారిష్టనేమిశ్చ సేనానిగ్రామణీ చతౌ. 19
సహేచైవ సహస్యేచ వసన్త్యేతే దివాకరే । విద్యుత్స్ఫూర్జశ్చ తావుగ్రౌ యాతుధానా వుభౌ స్మృతౌ. 20
తత శ్శిశిరయోశ్చాపి మాసయో ర్నివసన్తి తే । త్వష్టా చైవ తథా విష్ణు ర్జమదగ్ని స్సకౌశికః. 21
కాద్రవేయౌ తథా నాగౌ కమ్బళాశ్వతరా వుభౌ । గన్ధర్వో ధృతరాష్ట్రశ్చ సూర్యవర్చాశ్చ తావుభౌ. 22
తిలోత్తమాప్సరాశ్చైవ దేవీ రమ్భా మనోరమా । గ్రామణీ రృతజిచ్చైవ సత్యజిచ్చ మహాయశాః. 23
బ్రహ్మోపేతశ్చ వై రక్షో యజ్ఞోపేతశ్చ వై తథా । ఇత్యేతే నివసన్తిస్మ ద్వౌద్వౌ మాసౌ దివాకరే. 24

## నూట ఇరువదియైదవ అధ్యాయము.

## సూర్యరథస్థ దేవతాభేద కథనము-చంద్రాది గ్రహమండల స్వరూప-తద్రథాది స్వరూప ప్రతిపాదనము.

## అందు వసంతాది ఋతువులందు సూర్యరథస్థ దేవతా గణభేద ప్రతిపాదనము.

సూతుడు ఋషులకు ఇంకను ఇట్లు చెప్పెను: ఆ సూర్యరథమును ఆయా మాసములందు యథాక్రమమున ఆయా దేవతలు అధిష్ఠించియుందురు. అందుచేతనే రవి ఆయా మాసములందును ఆయా ఋతువులందును ఆయా ఋషులతో గంధర్వులతో అప్సరసలతో సర్పగ్రామణు (శ్రేష్ఠు)లతో రాక్షసులతో కూడి తన రథమును నడుపుకొనుచుపోవు చుండునని వేదశాస్త్రములందు చెప్పబడుచున్నది.

సూర్యరథమున 1. వసంత ఋతువునందు-మధు-మాధవ-మాసములు; ధాత-అర్యమన్-ఆదిత్య దేవతాభేదములు; పులస్త్యపులహులు-ఋషులు-వాసుకి కణాదులు నాగులు-నారద తుంబురులు గంధర్వులు-కృతస్థలాపుంజికస్థలలు అప్సరసలు-రథగృత్స రథౌజసులు గ్రామణులు- హేతిప్రహేతులు రాక్షసులు. 2. గ్రీష్మర్తువునందు-శుచి-శుక్రమాసములు; మిత్రుడు-వరుణుడు-ఆదిత్య దేవతాభేదములు-అత్రి వసిష్ఠులు ఋషులు-తక్షకరంభకులు నాగులు-హాహాహూహూలు గంధర్వులు-మేనకాసహజన్యలుఅప్సరసలు-రథంతర రథకృత్‌లు గ్రామణులు-పౌరుషయోధములు రాక్షసులు; 3. వర్షర్తువునందు-నభస్-నభస్య-మాసములు-ఇంద్ర-వివస్వాన్-లు ఆదిత్య దేవతాభేదములు-అంగిరుడు భృగువు ఋషులు-ఏలాపుత్త్రి శంఖపాలులు నాగులు-విశ్వావసూగ్రసేనులు గంధర్వులు-ప్రమ్లోచాఽనుమ్లోచలు అప్సరసలు- హేతి-వ్యాఘ్రులు రాక్షసులు; 4. శరదృతువునందు ఇషము ఊర్జము మాసములు-పర్జన్యుడు-పూషన్-ఆదిత్య దేవతాభేదములు-భారద్వాజుడు-గౌతముడు ఋషులు-ఐరావతుడు-ధనంజయుడు-నాగులు-చిత్రసేనుడు-సురుచి-గంధర్వులు-విశ్వాచీ-ఘృతాచీ-అప్సరసలు- సేనజిత్-సుషేణుడు-గ్రామణులు-పౌరుడు-ఆవారుడు రాక్షసులు; 5. హేమంతమున సహస్-సహస్య-మాసములు-హంసుడు-భగుడు-ఆదిత్య దేవతాభేదములు-కశ్యపుడు-క్రతువు-ఋషులు-మహాపద్ముడు-కర్కోటకుడు-నాగులు-చిత్రసేనుడు-ఘూర్ణాయువు-గంధర్వులు-

---

* ప్రమ్లోచ స్త్వప్సరాశ్చానుమ్లోచ స్తిథథైవచ

పూర్వచిత్తి-ఊర్వశి-అప్సరసలు-తార్క్ష్యుడు-అరిష్టనేమి-గ్రామణులు-విద్యుత్-స్ఫూర్జుడు-రాక్షసులు; 6. శిశిర ఋతువునందు తపస్-తపస్య మాసములు-త్వష్ట-విష్ణువు ఆదిత్య దేవతాభేదములు-జమదగ్ని-కౌశికుడు-ఋషులు-కంబళుడు-అశ్వతరుడు-నాగులు - ధృతరాష్ట్రుడు-సూర్యవర్చస్-గంధర్వులు-తిలోత్తమ-రంభ-అప్సరసలు-ఋతజిత్-సత్యజిత్-గ్రామణులు-బ్రహ్మోపేతుడు-యజ్ఞోపేతుడు-రాక్షసులు.

స్థానాభిమానినో హ్యేతే గణా ద్వాదశసత్తమాః । సూర్య మాప్యాయయన్త్యేతే తేజసా తేజ ఉత్తమమ్.
గ్రథితైస్తై ర్వచోభిశ్చ స్తువన్తి ఋషయో రవిమ్ । గన్ధర్వాప్సరసశ్చైవ గీతనృత్తై రుపాసతే. 26
విద్యాగ్రామణినో యక్షాః కుర్వన్తి స్మేశసఙ్గ్రహమ్ । సర్పా స్సర్పన్తి వై సూర్యం యాతుధానగణా అపి. 27
వాలఖిల్యాస్తు యాన్తిస్మ పరివార్యోదయా ద్రవిమ్ । ఏతేషామేవ దేవానాం యథావీర్యం యథా వయః. 28
యథాయోగం యథాధర్మం యథాతత్త్వం యథాబలమ్ ।
తథా తపత్యసౌ సూర్య స్తేషాం వృద్ధిస్తు తేజసామ్. 29
భూతానా మశుభం సర్వం వ్యపోహయతి తేజసా । మానవానాం శుభం హ్యేత ద్ధ్రియతే దురితంతు యత్.
దురితం శుభచారాణా మపహన్తి క్వచిత్కృతమ్ । ఏతే భ్రమన్తి సూర్యేణ సహైతే సామగా దివి. 31
తపన్తశ్చ జయన్తశ్చ హ్లాదయన్తశ్చ వై ప్రజాః । గోపయన్తిస్మ భూతాని ఇహ తేహ్యానుకమ్పయా. 32
స్థానాభిమానినా మేత త్స్థానం మన్వన్తరేషు వై । అతీతానాగతానాంచ వర్తన్తే సాంప్రతంచ యే. 33
ఏవం వసన్తివై సూర్యే సప్తకాస్తు చతుర్దశ । చతుర్దశసు వర్తన్తే గణా మన్వన్తరేష్విహ. 34
గ్రీష్మే హిమేచ వర్షాసు ముఞ్చమానా యథాక్రమమ్ । ఘర్మంచ హిమతోయంచ యథాక్రమ మహర్నిశమ్.

[ఈ చెప్పిన దేవాది గణములు సూర్యరథమును ఆయా మాసములం దధిష్ఠించియుండుటలోని తాత్త్వికార్థమును పురాణమే ఇట్లు చెప్పుచున్నది:] 1. ఈ ద్వాదశ సత్తములు (సత్-తమ-దేవశ్రేష్ఠులు)ను ఆయా మాసస్థానాభిమాని దేవతలు; మాసభేదమున భిన్నదశలనొందు తమ తేజో విశేషముచె ఉత్తమ తేజోమూర్తియగు రవిలోని సూర్య ప్రధాన తత్త్వమును ఆప్యాయన మొందింతురు; (ప్రీతునొసరించి అధిక శక్తి సంపన్నుని చేయుదురు.) ఋషులు తాము గ్రథనము (కూర్పు) చేసిన వచస్సులతో రవిని స్తుతింతురు. (ఋషులు వాగాత్మక తత్త్వరూపులు); గంధర్వులు నృత్త గీతములతో రవి నుపాసింతురు. గ్రామణులనగా-ఊరిపెద్దలు-వీరు విద్యాగ్రామణులు-త్రయీ విద్యలకును తదంగ విద్యలకును తద్గ్రామ (సమూహ)-మునకును ముఖ్యముగా దేవతాస్తావక గానప్రధానమగు స్వరముల-గ్రామమునకును అధిష్ఠాతలు; కనుకనే వీరు ఈశసంగ్రహము (రవి యందన్నిహితమగు పరమేశ తత్త్వమును ప్రసన్నమొనర్చు పనిని) నెరవేర్తురు; సర్పగణములు రవిని సర్పణమొనరింతురు-రవి రథమును ముందునకు ప్రసరించు ప్రవృత్తికి సహాయకులుగా నుందురు; రక్షోగణము కూడ ఇదేపనిని (రథరక్షా రూపమున) నిర్వర్తింతురు. వీరుకాక పైగణములలో చెప్పకయు శ్రుతి పురాణములందు ఉదయము మొదలు అస్తమయమువరకు రవి రథము వెంటనుందురని చెప్పిన వాలఖిల్య ఋషులు రవిని పరివారించి వెంటనుందురు. వీరు సౌరశక్తి సర్వస్వ రూపులగు ఋషులు.

ఇంతయేల? ఈ చెప్పిన దేవతాది గణముల వీర్యమును వయస్సును యోగమును అమరికను; ధర్మమును తత్త్వమును బలమును (ఇవి అన్నియు శ్రుతులయందును శాస్త్రములందును కలవు. ఇచట చెప్పబడలేదు.) అనుసరించి సూర్యుని తేజమాయా దేశకాలములందు వృద్ధినొందుచు పరిణమించుచు నుండును. వాని ననుసరించి రవి తపించుచుండును. ఆ దేవుడు ఆశక్తితో తన తేజస్సుతో భూతముల యశుభము పోగొట్టి దురితమును హరించి వానికి శుభమును కలిగించును. శుభాచారులును ఒకొనొకచో (తెలిసియో తెలియకయో) చేసిన దురితమునుకూడ ఆరవి నశింపజేయును. ఈ విషయమున సూర్యునకు సహకారులై ఈ దేవాది గణములవారు తమతమ పరివారముతో కూడ సంచరించుచు భూతములపై దయతో వానికి వేడిమి వెలుగులనిచ్చుచు జయము కలిగించుచు సంతోషపెట్టుచు వానిని కాపాడుచుందురు.

ఈ సప్తకము (ఆదిత్య-ఋషి-సర్ప-గంధర్వాప్సరో గ్రామణీ రక్షోగణములు ఏడు) ఇంతవరకును గడచిన-ఇపుడు జరుగుచున్న-ఇకముందు రానున్న-మన్వంతరములందు వరుసాక్రిజియందును ఇదే విధముగా స్థానాభిమానులుగా ఉండి హిమవర్షాది ఋతువులయందు యథాక్రమముగ ఉష్ణ హిమ వృష్ట్యాదికమును విశ్వమునందు అహర్నిశములను ప్రవర్తిల్ల జేయుచుందురు.

గచ్ఛత్యసౌ వ్రతవశాత్ పరివృత్తరశ్మి ర్దేవాన్పితౄంశ్చ మనుజాంశ్చ స తర్పయన్వై ।
శుక్లేచ పూర్ణన్తమనుక్రమేణ కళాక్షయే నైవ పునః పిబన్తి. 36
సోమేన యచ్చామృత మస్య సృష్టం కృష్ణక్షయే రశ్మిషు రక్షితం తత్ ।
సర్వేఽమృతం తత్పితరః పిబన్తి దేవాశ్చ సౌమ్యాశ్చ తథైవ కావ్యాః. 37
సూర్యేణ గోభి ర్హి వివర్ధితాభిః పునశ్చ తై రేవ సముచ్ఛ్రితాభిః ।
పుష్ణంతి వృష్ట్యాభి రివౌషధీభి ర్మర్త్యాం స్తథాన్నేన సమేధయన్తి. 38
అమృతేన తృప్తి రర్ధమాసం సురాణాం మాసం తు స్వాహాభిః స్వధయాపితౄణామ్ ।
అన్నేన జీవన్త్యనిశం మనుష్యా స్సూర్యః స్వయం తద్ది బిభర్తి గోభిః. 39
ఇత్యేష ఏకచక్రేణ సూర్య స్తూర్ణం ప్రవర్తతే । తత్ర తైరక్రమై రశ్వై స్సర్పతేసౌ దినక్షయే. 40
హరిర్హరిద్భి ర్హ్రియతే తురఙ్గమైః పిబన్త్యపో గో-హరి-భి స్సహస్రధా ।
పున ప్రయచ్ఛ త్యథ తాశ్చ యోహరి స్సమూహ్యమానో హరిభి స్తురఙ్గమైః. 41
అహోరాత్రం రథేనాసౌ వేకచక్రేణ వై భ్రమన్ । సప్తద్వీప సముద్రాంతు సప్తభిస్సప్తిభి ర్వృతమ్. 42
ఛన్దోరూపైస్తు తైరశ్వై ర్యతశ్చక్రం దివస్పతిః । కామరూపై స్సకృద్యుక్తైః కామగై స్తై ర్మనోజవైః. 43
హరితై రవ్యయైః పింగైరీశ్వరై ర్బ్రహ్మవాదిభిః । వాహ్యతేఽనన్తరం చైవ మణ్డలం దివస క్రమాత్. 44
కల్పాదౌ సంప్రయుక్తాశ్చ వహన్త్యాభూతసమ్ప్లవమ్ । ఆవృతో వాలఖిల్యైశ్చ భ్రమతే రాత్ర్యహానితు. 45
గ్రథితై స్స్వవచోభిశ్చ స్తూయమానో మహర్షిభిః। సేవ్యతే గీతనృత్యైశ్చ గన్ధర్వాప్సరసాం గణైః. 46
పతంగైః పతగై రశ్వై ర్భ్రామ్యమాణో దివస్పతిః ।

ఈ రవి తన వ్రతములు (క్రియాశక్తి ప్రవృత్తి) వశమున (చంద్రకిరణములుగా) మారుచుండెడి తన కిరణములతో దేవతలను పితరులను మనుజులను తృప్తి నొందించుచుండును. అది ఎట్లనిన-సోముడు శుక్లపక్షమున రవియందలి అమృతమును తనయందలి యమృతముగా సృష్టించుకొని తనయందు రక్షించుకొనును. అతనిని (అతనియందలి యమృతమును) సౌమ్యులు (సోమార్హులై యజ్ఞములం దారాధ్యులు)-కామ్యులు (యజనముచే తృప్తులై యజమానులకు కామముల నొసగువారు) అగు దేవతలును పితృ దేవతలును అనుక్రమమున త్రావుదురు. అదియే చంద్రునియందు కళాక్షయరూపమున కనబడుచున్నది. ఈ దేవతలును పితరులును తా మట్లు తృప్తి నొంది వృష్ట్యౌషధములతోవలె మనుజులను ఆయా అన్నములతో పోషించి ఉత్తేజింపజేయుచున్నారు. దీని రహస్య మేమన-అమృతము త్రావుటచే దేవతలకు కలుగు తృప్తి అర్ధమాసము వరకు మాత్రమే యుండును. కాని స్వాహాకారములతో దేవతలను స్వధాకారములతో పితరులను యజించుటచే వారికి కలుగు తృప్తి మాసము పాటుండును. కాని మనుజులు అన్నముతోనే జీవింతురు. రవి ఆ మానవాహారమగు అన్నమును తన కిరణముల రూపమున తనయందు నిలుపుకొని యుండును. (అదియే చంద్రుని ద్వారమున సోమాది హవిరాది రూపమున దేవతలకును కవ్యాది రూపమున పితరులకును అంది తదనుగ్రహమువ అన్న రూపమున మనుజులకు చేరును.) ఇట్లు రవి తన కిరణములయందు నిలుపుకొనిన దేవ పితృ మనుజాహార జన్యతృప్తియే రవి రథపు ఏకచక్రము. ఇట్టి ఏకచక్ర రథముతో రవి వేగముగా ప్రవర్తిల్లుచుండును. అక్కడనే (అంతరిక్ష ద్యులోకములందే) అక్రమములు (క్రమము = పాదవిన్యాసము; పాద విన్యాసము చేయనివి అక్రమములు) అయిన అశ్వములతో సాయంకాలమున ముందు

నకు ప్రసరించును. (అందుచే సూర్యుడు అస్తమించుట జరుగును.) సూర్యుడు ఇట్లు పచ్చని గుర్రములచే కొనిపోబడును. కిరణము లనెడు గుర్రములతో నీటిని వేయి విధములుగా త్రాగును. మరల పచ్చని గుర్రములతో రథముపై కొనిపోబడుచు మరల ఆ జలములను భూతములకు అందజేయును.

ఈ దివస్పతియగు రవి అహోరాత్రములును ఏడు గుర్రములచే లాగబడు ఏకచక్రయుతమగు రథముతో సప్త ద్వీప సప్త సముద్ర ఘటితమగు ఈ పృథివీ చక్రము నంతను భ్రమించుచుండును. ఆ అశ్వములు సప్తచ్ఛందోరూపములు; కామరూపములు; కామగమనములు (భగవంతుని-లేదా సూర్యుని - సంకల్పానుసారము పోవునవి); మనోవేగయుతములు; సకృద్యుక్తములు (ఒకమారు పూన్చినంతనే మరల పూంచుచు విప్పుచుండవలసిన పని లేనివి); హరితవర్ణము కలవి; పింగవర్ణమును కలవి; ఎన్నటికిని ఏ మార్పును లేకయుండునవి; అవి ఈశ్వరములు (సర్వసమర్థములు); బ్రహ్మవాదులు (వేద విజ్ఞానవంతములు); అట్టి అశ్వములతో మోయబడు రథమున రవి దివసక్రమమున మండల రూపమున నిరంతరముగా సాగిపోవుచుండును.

ఈ ఛందోమయాశ్వములను కల్పాదియందు ఒకసారి రథమున పూన్చినంతనే భూత సంప్లవ (ప్రళయ) పర్యంతము ఆ రథమును అవి మోసికొనిపోవుచునే యుండును.

దివస్పతి(ద్యులోకాధిపతి)యగు రవి తన కిరణముల శక్తికి మారు రూపములగు వాలఖిల్య ఋషులు పరివారమయి తనవెంట నుండగా మహర్షు లందరు తాము కూర్చిన వచస్సులతో స్తుతించుచుండగా గంధర్వాప్సరోగణములు గీత నృత్యములతో సేవించుచుండగా పక్షములు కలవియు పక్షివలె ఆకాశమున పోవునవియు నగు అశ్వములు తన రథమును మోయుచు త్రిప్పుచుండగా రాత్రింబవళ్లు అంతరిక్ష ద్యులోకములందు సంచరించుచుండును.

## చన్ద్రమణ్డలపరిమాణాదికథనమ్.

వీథ్యాఽశ్రయాణి చరతే నక్షత్రాణి తథా శశీ. 47
హ్రాసవృద్ధీ తథైవాస్య రశ్మయః సూర్యవత్స్మృతాః । త్రిచక్రోభయతోఽశ్వశ్చ విజ్ఞేయః శశినో రథః. 48
అపాంగర్భాత్సముత్పన్నో రథస్సాశ్వస్ససారథిః ।
సుతారైః స్తైస్త్రిభిశ్చక్రైర్యుక్తః శుక్లైర్హయోత్తమైః. 49
దశభిస్తురగైర్దివ్యైరసంగైస్తైర్మనోజవైః । సకృద్యుక్తరథే తస్మిన్ వహన్తస్త్వాయుగక్షయాత్. 50
సమ్ప్రస్థితే రథే తస్మిఞ్శ్వేతచక్రాశ్వవాంశ్చ వై । అశ్వాస్తమేకవర్ణాశ్చ వహన్తే శఙ్ఖవర్చసః. 51
అజశ్శతమఖశ్చైవ వృషో వాజీ నరో హయః । అశ్మశ్చ సప్తధాతుశ్చ హంసో వామో మృగస్తథా. 52
ఇత్యేతే నామభిస్సర్వే దశ చన్ద్రహయోత్తమాః । ఏతే చన్ద్రమసం దేవం వహన్త్యాకల్పఽయుగక్షయమ్.
దేవైః పరివృతస్సోమః పితృభిశ్చైవ గచ్ఛతి । సోమశ్చ శుక్లపక్షాదౌ భాస్కరే పరతః స్థితే. 54
ఆపూర్యతే పరో భాగస్సోమస్య తు అహఃక్రమాత్ । తతః పితృక్షయం సోమం యుగపద్వ్యావృతే రవిః.
పీతం పఞ్చదశాహం తు రశ్మినైకేన భాస్కరః । ఆపూరయం స్తదేవేమం భాగం భాగ మహః క్రమాత్.56
సుషుమ్నా పూర్యమాణస్య శుక్లే వర్ధన్తి తాః కలాః । తస్మాద్ధ్రసన్తి వై కృష్ణే శుక్లే హ్యాప్యాయయన్తి చ.57
ఇత్యేవం సూర్యవీర్యేణ చన్ద్రస్యాప్యాయితం వపుః । పౌర్ణమాస్యాం ప్రదృశ్యేత శుక్లే సమ్పూర్ణమణ్డలః.58
ఏవమాప్యాయితస్సోమః శుక్లపక్షే హ్యహఃక్రమాత్ । తతో ద్వితీయాప్రభృతి బహుళస్య చతుర్దశీమ్. 59
అపాం సారమయస్యేన్దో రసమృతాత్మకస్య తు ।
త్రయమ్బుమయం దేవా మధు సౌమ్యం తథాఽమృతమ్. 60

## చంద్రమండల-తద్రథాది-ప్రతిపాదనము

చంద్రుడును నక్షత్రమయమగు వ్యోమవీథియందే సూర్యుని వలెనే సంచరించును. ఇతని హ్రాస(క్షయ)వృద్ధులను కిరణముల విషయమును సూర్యుని విషయమునందే చెప్పబడినవి. అవి అట్లే గ్రహింపవలెను. ఇచట వేరుగా చెప్పవలసి లేదు. చంద్రరథమునకు చక్కని తారలతో ఏర్పడిన మూడు చక్రములును కాడికి రెండు వైపులను తెల్లని మేలగు గుర్రములును ఉండును. ఇతని రథమును అశ్వములును సారథియును జలగర్భమునుండి ఉత్పన్నమయినవి. అజ-శంఖ-వృష-వాజి-నరా-ఒశ్మ-నక్షత్రము - హంస-వామ - మృగ-నామములు గల మనోజవములగు ఆ పది అశ్వములును శంఖము వంటి తెల్లని ఒకే వన్నె కలవి. తెల్లని రథమున ఒకసారి పూన్చిన ఆ అశ్వములు ప్రళయ పర్యంతము చంద్ర భగవానుని మోయుచుండును.

చంద్రుని పరివారముగా అతని వెంట దేవతలును పితృ దేవతలు నుందురు. శుక్ల పక్షారంభమునుండి సూర్యుడు చంద్రునకు ఆవలగా నుండి సుషుమ్నా మార్గమున తన యొక్కొక్క కిరణముతో నింపుచు పోవును. పితరులును దేవతలును కృష్ణపక్షమున చంద్రుని యందలి అమృతము త్రావుటచే క్షీణించిన యంశము ఇట్లు పూరింపబడును. అందచేతనే శుక్లపక్షమున చంద్రకలలు వృద్ధి చెందును; కృష్ణమున క్షీణించును. ఇట్లు సూర్యునిచే కలిగిన అప్యాయనము చంద్రకలావృద్ధికి హేతువై అతడు పూర్ణిమనాడు సంపూర్ణ మండలుడై కనబడును. కృష్ణపక్ష ద్వితీయ మొదలు కృష్ణ చతుర్దశి వరకు దేవతలును పితరులును జలసారమయుడును అమృతమయుడు నగు చంద్రుని చాంద్ర మధువును-అమృతమును-త్రావుదురు.

సమ్భృతం వర్ధమానేచ అమృతం సూర్యతేజసా । భక్ష్యార్థ మాగతం సోమం పౌర్ణమాస్యా ముపాసతే. 61
ఏకరాత్రం సురైస్సార్ధం పితృభి రృషిభిశ్చవై । సోమస్య శుక్లపక్షాదౌ భాస్కరాభిముఖస్యతు. 62
ప్రక్షీయతే పరోభాగః పీయమానః కలాక్రమాత్ । త్రయస్త్రింశచ్ఛతైస్సార్ధం త్రయస్త్రింశ త్తథైవచ. 63
త్రయస్త్రింశత్సహస్రాణి దేవాస్సోమం పిబన్తివై । ఇత్యేవం పీయమానస్య కృష్ణే వర్ధన్తి తాఃకలాః. 64
క్షీయన్తేచ తతఃకృష్ణే శుక్లే హ్యాప్యాయయన్తిచ । ఏవం దినక్రమాత్పీతే దేవైరపి నిశాకరే. 65
పీత్వార్ధమాసం గచ్ఛన్తి అమావాస్యాం సురాశ్చ తే । పితరశ్చాపి తిష్ఠన్తి ఉమావాస్యాం నిశాకరమ్. 66
తతః పఞ్చదశే భాగే కిఞ్చిచ్ఛేషే నిశాకరే । తతోపరాహ్ణే పితరో జఘన్యే దివసే పునః. 67
పిబన్తి ద్వి *కలంకాలం శిష్టాస్తస్య కలాస్తుయాః ।విన్స్రుతష్టం త్వమావాస్యాం గభస్తిభ్య స్తథామృతమ్. 68
అర్ధమాససమాప్తౌతు పీత్వా గచ్ఛన్తి తేఽమృతమ్ । సౌమ్యా బర్హిషదశ్చైవ అగ్నిష్వాత్తాశ్చ యే స్మృతాః. 69
కావ్యాశ్చైవ తు యేప్రోక్తాః పితర స్సర్వఏవతే। సంవత్సరాస్తు వై కావ్యాః పఞ్చాబ్దా యే ద్విజాః స్మృతాః. 70
సౌమ్యాస్త్వృతవో జ్ఞేయా మాసా బర్హిషద స్తథా ।
అగ్నిష్వాత్తా ఋతవశ్చైవ పితృసర్గోహ్యయం ద్విజాః. 71
పితృభిః పీయమానాయాం పఞ్చదశ్యాంతు వైకలా । యావ న్నక్షీయతే తస్య భాగః పఞ్చదశస్తు సః. 72
అమావాస్యాం తథా తస్య అన్తరా పూర్యతే పరః । వృద్ధిక్షయౌ వై పక్షాదౌ షోడశ్యాం శశినః స్మృతౌ. 73
†ఏవం సూర్యనముద్దేశా త్క్షయవృద్ధీ నిశాకరే ।

ఇట్లు వర్ధమాన-శుక్ల-పక్షమున సూర్యతేజస్సుచే చంద్రునియం దమృతము నింపబడును. దేవతలును పితరులును తమకు భక్ష్యమై వచ్చిన సోముని పూర్ణిమనాడు పరివారించి యుందురు. ఇది ఒక రాత్రి మాత్రమే. శుక్లపక్షాది తిథి నుండి భాస్కరాభిముఖుడై యున్నందున నింపబడిన చంద్రుని పరభాగము కలాక్రమమున ఆనాటినుండి దేవతలచే పిత

* లవం † ఏవం సూర్యనిమిత్తైషా క్షయవృద్ధి ర్నిశాకరే.

రులచే ఋషులచే (ఉపాసకులచే) త్రావబడి క్షయించును. చంద్రామృతపానము చేయు దేవతల సంఖ్య ముప్పది మూడు వేలును ముప్పది మూడు వందలును ముప్పది మూడు = 36333 అగును. ఈ ప్రమాణముపాటు చంద్రామృతపానము చే దేవతలు వెడలిపోవుదురు. (కావ్యులు బర్హిషదులు అగ్నిష్వాత్తులు అను) పితరులు నిలిచియుండి అమావాస్యనాడు ఆ రాత్రిపు కడపటి భాగమున రెండు కలల కాలమున చంద్రుని పంచదశ భాగమున మిగిలి జారిపడిన కలాశేషమున గ్రహించి దానియం దింకను మిగిలియున్న అమృతమును త్రావి వెడలిపోవుదురు. పితృ దేవతల కందరకును కావ్యుల అని సాధారణముగా వ్యవహారము. కాని వారి విషయ భేదానుసారము నామభేదములు ఉండును. ఈ శ్లోకములందలి విషయ విశదీకరణము ముందు 140 అ. లో చూచునది.

ఇట్లు పితరులు పదునైదవ కలను అమావాస్యనాడు త్రావుటతో అది అంతయు నిశ్శేషముగ క్షయించుటకు లోపలనే ఆ చంద్ర మండలములో రవి కిరణవశమున మరియొక కల పూరింపబడును. ఇట్లు శుక్లపక్షారంభమునుండి చంద్రకలావృద్ధియు కృష్ణపక్షారంభమునుండి చంద్రకలాక్షయమును ఆరంభమగును. వృద్ధి పదునారు కలల వరకు జరుగును. ఇట్లు చంద్రుని యందు కలుగు కలావృద్ధి క్షయములు సూర్యవశముననే జరుగును.

తారాగ్రహాణాం వక్ష్యామి స్వర్భానోస్తు రథం పునః. 74
యః ప్రయాతి సుశుభ్రస్తు సోమపుత్రస్య వై రథః। యుక్తో హయైః పిశఙ్గైస్తు అష్టభి ర్వాతరంహసైః. 75
శ్వేతః పిశఙ్గ స్సారఙ్గో నీల శ్శ్యామాపి లోహితః। శ్వేతశ్చ హరితశ్చైవ చిత్రవర్ణా స్తథైవచ. 76
అష్టభిస్తై ర్మహాభాగై రుత్తమై ర్వాతరంహసైః। తతో భౌమరథశ్చాపి అష్టాఙ్గః కాఞ్చన స్స్మృతః. 77
అష్టభి ర్లోహితై రశ్వై స్సధ్వజై రగ్నిసమ్భవైః। సర్పతే వై కుమారోసౌ ఋజువక్రాతివక్రగః. 78
తతస్త్వాఙ్గిరసో విద్వాన్ దేవాచార్యో బృహస్పతిః। గౌరాశ్వేనతు రౌక్మ్యేణ స్యన్దనేన విసర్పతి. 79
యుక్తే నాష్టాభి రశ్వైశ్చ ధ్వజై రగ్నిసముద్భవైః। అబ్దం వసతి యో రాశౌ స్వాం దిశం తేన గచ్ఛతి. 80
యుక్తేనాష్టాభిరశ్వైశ్చ సధ్వజై రగ్ని సమ్భవైః। రథేన క్షిప్రవేగేన భార్గవ స్తేన గచ్ఛతి. 81
తత శ్శనైశ్చరోప్యశ్వై శ్శబలై ర్వాతరంహసైః। కార్ష్ణాయసం సమారుహ్య స్యన్దనం యాత్యసౌ శనైః. 82
స్వర్భానోస్తు తతోష్టాశ్వాః కృష్ణావై వాతరంహసః। రథం తమోమయం తస్య వహన్త స్సముదశ్చితాః. 83
ఆదిత్యమేతి సోమంచ తమస్సర్వేషు పర్వసు। తతః కేతుమత శ్చాశ్వా అష్టాఙ్గా వాతరంహసః. 84
పలాలధూమవర్ణాభాః కేతోరశ్వా స్సుదారుణాః। ఏతే వాహా గ్రహాణాంవై మయా ప్రోక్తా రథైస్సహ. 85

కుజ బుధ గురు శుక్ర శనులకు తారాగ్రహములని జ్యోతిశ్శాస్త్ర వ్యవహారము. వీరి రథముల విషయమును రాహుకేతు రథ విషయమును ఇక తెలిపెదను. బుధ రథము-తెల్లనిది. దానికి శ్వేత పిశంగ సారంగ నీలశ్యామలోహిత హరిత చిత్రవర్ణములు గలిగి వాయువేగము గల ఎనిమిది యశ్వములు పూన్చియుండును. కుజుని రథమును సధ్వజములు సలక్షణములగు అష్టాంగములు కలిగినవై అగ్నినుండి పుట్టిన ఎనిమిది ఎఱ్ఱని గుఱ్ఱములు లాగుచుండ అతడు దానిపై ఋజు-వక్రాతివక్రగతిత్రయముతో సంచరించుచుండును. బృహస్పతి రథము బంగారుతో చేసినది. దానికి అగ్నిసంభవములగు గౌరాశ్వము లెనిమిది పూన్చియుండును. అతడు ప్రతి రాశియందును సంవత్సరముండుచు తన గతి

క్రమమున సంచరించును. శుక్రుని రథమును ధ్వజమును అగ్నిసంభవములను పదిమిది గుఱ్ఱములును కలిగి మహావేగవంత మయి యుండును. శనియు శబల మిశ్రిత వర్ణము వాయువేగము కలిగిన గుఱ్ఱములు పూన్చిన ఇనుపరథ మెక్కి నెమ్మదిగా పోవును. రాహురథము తమోమయము; దానికి వాయు వేగములగు నల్లని గుఱ్ఱము లెనిమిది యుండును. కేతురథాశ్వములు సలక్షణాష్టాంగయుతములై పలాల ధూమవర్ణములై దారుణములైనవి. వాయువేగములు. ఇవి ఆయా గ్రహముల రథముల-అశ్వముల-విషయము.

సర్వే ధ్రువనిబద్ధాస్తే నిబద్ధా వాతరశ్మిభిః । ఏతేవై భ్రమమాణాస్తే యథాయోగం వహన్తితే. 86
వాయవ్యాభి రదృశ్యాభిః ప్రబద్ధా వాతరశ్మిభిః । పరిభ్రమన్తి తద్బద్ధా శ్చన్ద్రసూర్యగ్రహా దివి. 87
యావన్త మనుపరియంతి ధ్రువం తే జ్యోతిషాంగణాః । యథా నద్యుదకే నౌస్తు ఉదకేన సమూహ్యతే. 88
తథా దేవగృహాణి స్యు రూహ్యన్తే వాతరంహసా । తస్మా ద్యచత్ర దృశ్యన్తే వ్యోమ్ని దేవగృహా దివి. 89
యావత్యశ్చైవ తారాస్స్యు స్తావత్యశ్చ మరీచయః । సర్వా ధ్రువనిబద్ధాస్తా భ్రమన్త్యో భ్రామయన్తి తమ్. 90
తథా భ్రమన్తి జ్యోతీంషి వాతావిద్ధాని సర్వశః । అలాతచక్రవద్యాన్తి వాతచక్రేరితాని తు. 91
యస్మా త్ప్రవహతే తాని ప్రవహ స్తేన స స్మృతః । ఏవం ధ్రువే నియుక్తోసౌ భ్రమతి జ్యోతిషాం గణః. 92
ఏష తారామయో జ్ఞేయ శ్శింశుమారో ధ్రువో దివి । యదహ్నా త్కురుతే పాపం దృష్ట్వా తాని విముచ్యతే.
శింశుమారశరీరస్థా యావన్త్య స్తారకా మతాః । వర్షాణి దృష్ట్వా జీవన్తి తావదేవాధికానితు. 94
శింశుమారాకృతిం జ్ఞాత్వా ప్రవిభాగేన సర్వశః । ఉత్తానపాద స్తస్యాథ విజ్ఞేయ శ్చోత్తరేహనౌ. 95
యజ్ఞోఽధరేతు విజ్ఞేయో ధర్మో మూర్ధాన మాశ్రితః । హృది నారాయణ స్సాధ్యా హ్యశ్వినౌ పూర్వపాదయోః.
వరుణ శ్చార్యమాచైవ పశ్చిమే తస్య సక్థిని । శిశ్నే సంవత్సరో జ్ఞేయో మిత్ర శ్చాపాన మాశ్రితః. 97
పుచ్ఛేఽగ్నిశ్చ మహేన్ద్రశ్చ మారీచః కాశ్యపో ధ్రువః । ఏష తారామయః స్తమ్భో నాస్తమేతి నచోదయమ్.
నక్షత్రచన్ద్రసూర్యాశ్చ గ్రహా స్తారాగణై స్సహ । తన్ముఖాభిముఖాస్సర్వే చక్రభూతా దివి స్థితాః. 99
ధ్రువేణాధిష్ఠితాశ్చైవ ధ్రువమేవ ప్రదక్షిణమ్ । పరియన్తిచ సురశ్రేష్ఠం మేఢీభూతం ధ్రువం దివి. 100
అగ్నీధ్రకాశ్యపానాంతు తేషాం స పరమో ధ్రువః । ఏకఏవ భ్రమత్యేష మేరో రన్తరమూర్ధని. 101
జ్యోతిషాం చక్రమాదాయ ఆకర్షం స్తమధోముఖః । మేరు మాలోకయన్నేవ ప్రతియాతి ప్రదక్షిణమ్. 102

ఇతి శ్రీమత్స్యమహాపురాణే ఖగోళే సూర్యమణ్డలాదికథనం నామ
పఞ్చవింశత్యుత్తరశతతమోఽధ్యాయః.

ఈ సూర్యచంద్రాది గ్రహములును జ్యోతిర్గణములును అన్నియు వాతమయములగు పగ్గములతో ఆయా ఆమరికలతో ధ్రువునితో బిగింపబడి కంటికి కానరాని ఆ వాయవ్య పాశముల బలమున ఆ ధ్రువుడు ఉన్నంత కాలమును ఆతనిని ప్రదక్షిణించుచు అంతరిక్షమున సంచరించుచుండును. నదీ ప్రవాహజలమందలి నౌకను ఆ జల మెట్లు వహించునో అట్లే ఈ వాయుశక్తి ఈ దేవ గృహముల (జ్యోతిర్గణముల)ను అంతరిక్షమున వహించుచుండును. ఇవియే కాదు. తారలన్నియు-మరీచులు-(కిరణములును - కిరణయుతములగు జ్యోతిస్సులును) అవియు ధ్రువునితో నిబద్ధములై తామతని చుట్టు తిరుగుచు ధ్రువుడును తిరుగుట కవకాశము నిచ్చుచున్నవి. (ధ్రువుడు తన చుట్టు తాను తిరుగుచు జ్యోతిర్గణములను కూడ తన చుట్టు త్రిప్పుచున్నాడు;) ఇవన్నియు వాయుమయ చక్రముచే ప్రేరితములయి కొరవిని గిరగిర త్రిప్పుటచే ఏర్పడు చక్రమువలె తిరుగుచుండును. ఇట్లు జ్యోతిర్గణములు అంతరిక్షమున తిరుగుటకు హేతువు అగు వాయువునకు ఈ హేతువుతోనే ప్రవహము (ప్ర = మిక్కిలిగా; వహ = వహించునది;) అని నామము ఏర్పడినది.

ఇట్లు ధ్రువుని కేంద్రముగా చేసికొనియున్న తారామయమగు అమరికకు 'శింశుమార చక్రము' (శిశుమారమనగ జలచరపు రూపమున నున్నది) అని సంప్రదాయాగత నామము. ఈ శింశుమారపు అమరికను ప్రవిభాగ పూర్వకముగ ఎరిగి తత్త్వమెరిగి దీనిని దర్శించినచో ఏనాటి పాపమైనాదే విముక్తమగును. ఏతద్దర్శనముచే ఈ శింశుమార శరీరమున చిన్నచిన్న జ్యోతిస్సులు (తారకలు) ఎన్నికలవో అన్నియు-అంతకంటె ఎక్కువగను కూడ-సంవత్సరముల పాటు జీవించును.

ఈ శింశుమారపు అమరిక ఇది: పైదౌద-ఉత్తానపాదుడు యజ్ఞుడు క్రిందిదౌద- మూర్ధము (శిరస్సు) ధర్ముడు-హృదయము నారాయణుడు-ముందరి పాదములు సాధ్యులు-అశ్వినులు వెనుకనక్తులు (తొడలు అని అర్థము. కాని ఇచ్చట నక్తి అనగా పాదములనియే గ్రహించవలెను.) వరుణుడు అర్యమన్ అను ఇద్దరు దేవతలు-శిశ్నము సంవత్సరము-అపానము మిత్రుడు-పుచ్ఛము అగ్ని మహేంద్ర మారీచకాశ్యప ధ్రువులు అను వరుసనాలుగు దేవతాత్మక తారాగణముతో ఈ శింశుమారము ఏర్పడినది. (యజురారణ్యకమునందు 'ధర్మో మూర్ధానం-బ్రహ్మోత్తరాహనుః-యజ్ఞోఽధరా-విష్ణుర్హృదయం-సంవత్సరః ప్రజననం-అశ్వినౌ పూర్వపాదౌ-అత్రిర్మధ్యం-మిత్రావరుణావవరపాదౌ-అగ్నిః పుచ్ఛస్య ప్రథమం కాండం-తత ఇంద్ర స్తతః ప్రజాపతి రభయం చతుర్థం నవా ఏష దివ్యః శాక్వర శ్శిశుకుమారః' అని యున్నది.) ఇట్టి ఈ తారామయ స్తంబము (దుబ్బువంటి అమరిక) అస్తమించక ఉదయించక సర్వదా ప్రకాశించుచుండును. నక్షత్రములు చంద్రుడు సూర్యుడు గ్రహములు తారాగణములు ఈ శిశుమార చక్రమున కభిముఖములయి చక్రాకృతితో ద్యులోకమున (అంతరిక్షోన్నత స్థానమునందు) ఉన్నవి. ఇవి తమకు ధ్రువుడు అధిష్ఠాతగా సుశ్రేష్ఠుడగు ఆ ధ్రువుని మేఢిగా చేసికొని అతనిని ప్రదక్షిణించుచుండును. ఈ ధ్రువుడు అగ్నీంధ్రకాశ్యప వంశీయులలో పరమ (శ్రేష్ఠు)డు; ఈ జ్యోతి రూపుడు తానొక్కడే (ప్రధానభూతుడై) మేరుపర్వత శిరోమధ్యమున (మ తిన్నగా అంతరిక్షాగ్రమున) ఈ జ్యోతిశ్చక్రమును తన యధీనమున పట్టుకొని లాగికొనుచు అధోముఖుడై మేరువును చూచుచు ప్రదక్షిణ ప్రతియానము (ఆత్మ ప్రదక్షిణము) చేయుచు ఉండును. (మారీచుడు = మరీచికి కుమారుడు)

(ఇది ధ్రువుడు కేంద్రముగాను సూర్యుడు దిక్కాలాత్మక ప్రజాపతి కశ్యపుడుగాను నుండుననెడు సంప్రదాయము ననుసరించి జ్యోతీరాశి వ్యవస్థా విషయక భావనతో ప్రతిపాదింపబడినది. —అనువాదకుడు)

ఇది శ్రీమత్స్యమహాపురాణమున ఖగోళ వ్యవస్థయందు సూర్యాది గ్రహ రథాది స్వరూప శిశుమార స్వరూప ప్రతిపాదనమను నూట ఇరువదియైదవ అధ్యాయము.

## షడ్వింశత్యుత్తరశతతమోఽధ్యాయః.

## అగ్నిసూర్యయోః పరస్పరతేజోఽనుప్రవేశకథనమ్.

ఋషయః : యదేత ద్భవతా ప్రోక్తం శ్రుతం సర్వ మశేషతః ।
కథం దేవగృహాణి స్యుః పునర్జ్యోతీంషి వర్ణయ. 1

సూతః : ఏతత్సర్వం ప్రవక్ష్యామి సూర్యాచన్ద్రమసో ర్గతిమ్ ।
యథా దేవగృహాణి స్యు స్సూర్యచన్ద్రౌ గ్రహాస్తథా. 2

అగ్రే వ్యుష్టౌ రజన్యాంవై బ్రహ్మణోఽవ్యక్తయోనినః । అవ్యాకృత మిదం త్వాసీ న్నైశేన తమసా వృతమ్. 3
చతుర్భూతావశిష్టేస్మి న్స్వబ్రహ్మణా సమధిష్ఠితే । స్వయమ్భూ ర్భగవాంస్తత్ర లోకకర్తార్థసాధకః. 4
ఖద్యోతరూపో విచర న్నావిర్భావం విచిన్తయన్ । జ్ఞాత్వాఽగ్నిం నతు కాలేవై జలవృత్వీసమాశ్రయమ్. 5
సంహృత్య సమ్ప్రకాశార్థం త్రిధాతు వ్యభజత్పునః । పవనోయస్తు లోకేఽస్మి న్పార్థివ స్సోఽగ్ని రుచ్యతే. 6

యశ్చాసౌ తపతే సూర్యః శుచిరగ్నిస్తు సస్మృతః । వైద్యుతో జాఠర స్సౌమ్యో వైద్యుతశ్చా ప్యనిన్ధనః. 7
తేజోభి శ్శామ్యతే కశ్చి త్కశ్చిదేవాప్యనిన్ధనః । కాష్ఠేనాన్యస్తు నిర్మన్థస్సోఽద్భిశ్శామ్యతి పావకః. 8
అర్చిష్మా న్పవమానోఽగ్ని ర్నిష్ప్రభ స్సౌమ్యవీక్షణః । యశ్చాసౌ మణ్డలే శుక్లే నిరుష్ణ స్సంప్రకాశతే. 9
● ప్రభా సౌరీ త్రిభాగేన అస్తంయాతి దివాకరే । అగ్ని మావిశతే రాత్రౌ తస్మా త్సూర్యా త్ప్రకాశతే. 10
ఉత్తిష్ఠతి పునస్సూర్యే ఽన్తమగ్ని స్సమావిశేత్ । పాదేన తేజస శ్చాగ్ని స్తస్మా త్స తపతే దివా. 11
ప్రకాశంచ తథోష్ణంచ సౌర్యాగ్నీ యౌ తు తేజసా । పరస్పరానుప్రవేశా దాప్యాయ్యేతే దివానిశమ్. 12

## నూట ఇరుపది ఆరవ అధ్యాయము.
## అగ్ని సూర్యుల పరస్పర తేజోఽనుప్రవేశము-
## జ్యోతిర్గోళముల దేవగృహత్వ నిరూపణము.

ఋషులు సూతునిట్లడిగిరి: నీవు ప్రతిపాదించిన ఖగోళ విషయము అంతయు వింటిమి. జ్యోతిర్గోళములు దేవ గృహములు అంటివి. అది ఎట్లో వర్ణించుము. అన సూతుడిట్లనెను: సూర్యచంద్రుల గతి విధానమును సూర్య చంద్రాది గ్రహములు దేవగృహములగు విధమును తెలిపెదను. అవ్యక్త తత్త్వము (మాయాశబలము) నుండి జన్మించిన బ్రహ్మకు ఒకరాత్రి ముగిసి మరల తెల్లవారునరికి ఈదృశ్య ప్రపంచమంతయు ఈ వస్తువునకు ఇది రూపము- ఇది పేరు అను విభాగములేక రాత్రి సంబంధియగు చీకటితోనిండి (చీకటిలో ఏ వస్తువునకుగాని ఇది రూపము-ఇది పేరు అని తెలియనట్లే) యుండెను. ఈ నాలుగు వేదములును ఇది ఈ వేదమని అనుశాసించుటయు అప్పటికి జరుగ లేదు. అట్టి సమయమున లోకసృష్టి రూపమగు అర్థమును (పనిని) సాధింపదలచి భగవానుడగు స్వయంభూబ్రహ్మ మిణుగురు పురుగువలె మినుకు మినుకుమని ప్రకాశించుచు జగదావిర్భావము ఎట్లు జరుపవలెనాయని ఆలోచింపసాగెను. అట్టి సమయమున అతనికి అగ్ని జలమును పృథివిని ఆశ్రయించి యున్నట్లు కనబడెను. స్వయంభూబ్రహ్మ జల పృథివులనుండి ఆ అగ్నిభూతమును ఒకచోటికి చేర్చి దానినంతయు మూడుగా విభజించెను. పవ(మా)నుడుగా వాయువునందు కనబడుచున్న నిర్మథనముతో ఏర్పడెడి అగ్ని పార్థివమగు (పృథివీ సంబంధియగు) అగ్ని; ఈ రవియే శుచియను అగ్ని; జఠరమునందుండి జీర్ణాది ప్రక్రియల చేయుచు నిర్మథనముతో కాక ఇంధనములతో పనిలేక వెలిగెడి అగ్ని వైద్యుతాగ్ని; అదియే పావకాగ్ని.

వీనిలోనొక యగ్ని (సౌరాగ్ని) తేజస్సులతోనే శాంతించును. (తన ప్రకాశమును కోల్పోవును.) మరి యొకటి (వైద్యుతాగ్ని) ఇంధనములతో పనిలేకయే వెలుగును. (అది నీటితో చల్లారదు.) నిర్మథ్యాగ్ని మాత్రము కాష్ఠములతో వెలుగును. నీటితో శమించును. పవమానాగ్ని యనబడెడి నిర్మథ్యాగ్ని (పార్థివాగ్ని) జ్వాలలుండియు ప్రభలు తక్కువయగుటచే సౌమ్యుడుగా కనబడుచుండును. రవి మండలమునందు వేరొక యుష్ణముతో పనిలేకయే ప్రకాశించు అగ్నికి సంబంధించి సౌర ప్రభయందలి మూడు పాదములు అగ్నియందు ప్రవేశించును. అందువలన అగ్ని రాత్రులందు రవికంటె అధికముగా నున్నట్లు ప్రకాశించును. మరల రవి ఉదయించునపుడు ముందటి దినమున అస్తమయకాలమున రవినుండి ప్రకాశము పొందిన అగ్ని మరల రవిని ప్రవేశించును. అందుచే అగ్ని పగటివేళల నాలుగవవంతు తేజస్సుతో మాత్రమే వెలుగును. ఇట్లు ఆగ్నేయ సౌర ప్రకాశములు రాత్రింబవళ్ళలో పరస్పరాను ప్రవేశమున పరస్పర పూరణము చేసికొనుచుండును.

ఉత్తరేచైవ భూమ్యర్ధే తథాహ్యగ్నిశ్చ దక్షిణే । ఉత్తిష్ఠతి పునస్సూర్యే రాత్రా వావిశతే హ్యపః. 13
తస్మా త్తామ్రా భవన్త్యాపో దివా రాత్రిప్రవేశనాత్ । అస్తంగతే పునస్సూర్యే అహోవై ప్రవిశత్యపః. 14

---

● ప్రభా సౌరీతు పాదేన

తస్మా న్నక్తం పున శ్శుక్లా హ్యాపో దృశ్యన్తి భాసురాః । ఏతేన క్రమయోగేన భూమ్యర్ధే దక్షిణోత్తరే. 15
ఉదయాస్తమయేహ్యత్ర అహోరాత్రం విశత్యపః । యశ్చాసౌ తపతే సూర్యః సోఽపః పిబతి రశ్మిభిః. 16
సహస్రపాద స్త్వేషోఽగ్ని ర్వృతః కుమ్భనిభస్తు సః । ఆదత్తే సతు నాడీనాం సహస్రేణ సమన్తతః. 17
అపో నదీసముద్రేభ్యో హ్రదకూపేభ్య ఏవచ । తస్య రశ్మిసహస్రంతు శరద్వర్షా ఏవానిశమ్. 18
తాసాం చతుశ్శతం నాడ్యో వర్షన్తే చిత్రమూర్తయః । చన్దనాశ్చైవ మేధ్యాశ్చ కాన్తకా శ్చేతనా స్తథా. 19
అమృతానామ తాస్సర్వా రశ్మయో వృష్టిసర్జనాః । హిమద్రవాశ్చ తేన్యోన్యం రశ్మయ స్త్రిశతం స్మృతాః. 20
చన్ద్రాగ్రాస్తా నామత స్సర్వా శ్శీతా భానో ర్గభస్తయః । ఏతా మేధ్యా స్తథాన్యాశ్చ హ్లాదిన్యో హిమసర్జనాః. 21
శుక్లాశ్చ కకుభశ్చైవ గావో విశ్వభృతశ్చ యాః । శుక్లాస్తా నామతస్సర్వా స్త్రిశతం ఘర్మసర్జనాః. 22
సమం బిభర్తి తాస్సర్వా న్మనుష్యా న్దేవతాః పితౄన్ । మనుష్యానోషధీభిశ్చ స్వధయాచ పితౄనపి. 23
అమృతేన సురా న్సర్వా న్సతతం పరివర్తయన్ । వసన్తేచైవ గ్రీష్మేచ శతైస్స తపతే త్రిభిః. 24
వర్షాసుచైవ శరది చతుర్భి స్సమ్ప్రవర్షతి । హేమన్తేశిశిరేచైవ హిమోత్సర్గం త్రిభిఃపునః. 25
ఓషధీషు బలం ధత్తే స్వధాచ సుధయా పునః । భూయోఽమరత్వ మమృతే త్రయస్త్రిషు నియచ్ఛతి. 26
ఏవం రశ్మిసహస్రంతు సౌరం లోకార్థసాధనమ్ । భిద్యతే ఋతుసూర్యమాసాద్య సహస్రం బహుధా పునః.
ఇత్యేత న్మణ్డలంశుక్లం భాస్వరం లోకసంజ్ఞితమ్ । నక్షత్రగ్రహసోమానాం ప్రతిష్ఠా యోని రేవచ. 28

ఇట్లు అగ్ని భూమికి ఉత్తరార్ధ దక్షిణార్ధములందు స్థాన పరివర్తనమున తన తేజమును పరివర్తనము చేసికొనుచు ప్రకాశాధిక్యమును పొందుచు కోల్పోవుచు నుండును. ఇట్లే సూర్యుడుదయించగానే రాత్రి (కాల ప్రభావము) నీటియందు ప్రవేశించును. అందుచే పగటి వేళలందు నీరు అగ్నివలెనే ఎఱ్ఱగా కనబడును. మరల రవి అస్తమించగనే పగలు (పగటికాలపు ప్రభావము) నీటియందు ప్రవేశించును. అందుచేతనే నీరు రాత్రులందు రవివలె తెల్లగా కనబడును. ఈ క్రమమున భూమి దక్షిణోత్తరార్ధములందు రవ్యగ్ని ప్రకాశముల పరస్పర ప్రకాశ పరివర్తనముచే ఉదయాస్తమయ ప్రభావానుసారము రవియు అగ్నియు జలములందు ప్రవేశించుచు వాటి వర్ణమును కూడ మార్చును.

ఈ సౌరాగ్ని (రవి మండలము) వేయి కిరణములతో పరివారితమై ఒక కడవవలె నున్నది. అతడు తన వేయి నాడులతో నదీ సముద్రహ్రద కూపాదులనుండి నీరు పీల్చి తనయందు నింపుకొనును.

సూర్యుని వేయి కిరణములలో నాలుగు వందల కిరణములు శరద్వర్షా కాలములందు వాన కురియును. ఆ కిరణములు చల్లనివి పవిత్రములు తక్కువ వేడిమి నిచ్చునవి. వాటికి అమృత కిరణములని నామము. ఇవికాక మూడు వందల కిరణములు హేమంత శిశిర ఋతువులందు రవియందు సేకరింపబడియున్న జలమును హిమ రూపమున లోకమున కందించును. ఈ కిరణ సముదాయమునకు చంద్రములు అని పేరు. ఇవియన్నియు పవిత్రములును ఆనందము కలిగించునవియును. మరి మూడువందల కిరణములు వసంత గ్రీష్మములందు ఘర్మమును ఆవిరిని వదలును. వానికి శుక్ల కిరణములని వ్యవహారము.

ఇట్లు రవి తన సహస్రకిరణప్రవృత్తిద్వారమున ఓషధులతో మానవులను స్వధా(ద్రవ్య(కవ్య)ముతో పితరులను అమృతముతో దేవతలను సమముగా పోషించుచున్నాడు.

ఈ సహస్ర కిరణములు కూడ ఋతుభేదమున మరియు అనేక విధముల మార్పును పొందుచుండును.

ఇట్లు శుక్లవర్ణమై ప్రకాశశీలమైన 'లోక'మను సంప్రదాయసిద్ధ వ్యవహార నామముగల రవియే నక్షత్రములకు గ్రహములకు సోమునకు గూడ జన్మహేతువును స్థితికారణమునై యున్నాడు.

## చన్ద్రాదీనాం సూర్యకిరణాప్యాయన కథనమ్.

చన్ద్రర్‌క్షగ్రహాస్సర్వే విజ్ఞేయా రశ్మిసమ్భవాః । సుషుమ్నా సూర్యరశ్మిర్యా క్షీణం శశిన మేధతే. 29
హరికేశః పురస్తస్మిన్యోవై నక్షత్రయోనికృత్ । దక్షిణే విశ్వకర్మాతు రశ్మి రాప్యాయతే బుధమ్. 30
విశ్వావసుస్తు యః పశ్చా చ్ఛుక్రయోనిస్తు స స్మృతః । సంవర్ధనస్తు యోరశ్మి స్సయోని ర్లోహితస్యతు. 31
షష్ఠ స్త్వర్వావసూ రశ్మిర్యోనిస్సతు బృహస్పతేః । శనైశ్చరం పునశ్చాపి రశ్మి రాప్యాయయే త్స్వరాట్. 32
న క్షీయన్తే యతస్తాని తస్మా న్నక్షత్రతా స్మృతా । క్షేత్రాణ్యేతాని వై సూర్య మాపతంతి గభస్తిభిః. 33
తేషా మనస్తక్షేత్రాణాం సూర్యో నక్షత్రతాం గతః । అస్మాల్లోకా దముం లోకం తీర్ణానాం సుకృతాత్మనామ్.
తారణా త్తారకాణ్యేతే శుక్లత్వాచ్చైవ తారకాః । దివ్యానాం పార్థివానాంచ వంశానాంచైవ సర్వశః. 35
తపసా తేజ సాऽऽదానా దాదిత్య స్తేన చోచ్యతే । భవతి స్యన్దనార్థేతు ధాతు రేష నిగద్యతే. 36
సవనా త్తేజసశ్చైవ తేనాసౌ సవితాస్మృతః । బహ్వర్థ శ్చదిరిత్యేష ప్రధానో ధాతురుచ్యతే. 37
శుక్లత్వే హ్యమృతత్వేచ శీతత్వే హ్లాదనేపిచ । సూర్యాచన్ద్రమసో ర్దివ్యే మణ్డలే భాస్వరే ఖగే. 38
జలతేజోమయే శుక్లే వృత్తకుమ్భనిభే శుభే । విశన్తి కర్మదేవాస్తు స్థానాన్యేతాని సర్వశః. 39
మన్వన్తరేషు సర్వేషు ఋక్షా స్సూర్యగ్రహాశ్రయాః । తాని దేవగృహాణి స్యు స్థానాఖ్యాని భవన్తిహి. 40
సౌరం సూర్యో విశత్స్థానం సౌమ్యం సోమ స్తథైవచ । శౌక్రం శుక్రో విశత్స్థానం షోడశార్చప్రభాస్వరమ్. 41
బృహస్పతిర్ బృహన్తంచ లౌహితంచాపి లోహితః । శనైశ్చరో విశత్స్థాన మేవం శానైశ్చరం తథా. 42
బుధోపి వై బుధస్థానం స్వర్భాను ర్భానుమేవచ । నక్షత్రాణితు సర్వాణి నక్షత్రాణ్యావిశన్తివై. 43

చంద్రుడు నక్షత్రములు గ్రహములు ఇవి యన్నియును సూర్యుని రశ్ములు-అనెడి నాడుల నుండియే జనించి తృప్తిని పుష్టిని పొందునని తెలియవలయును. ఎట్లన-సుషుమ్నా అనెడి నాడి (రశ్మి) క్షీణుడగు చంద్రుని పరిపోషించును. హరికేశము అను రశ్మి నక్షత్రములను దక్షిణమునం దుండెడి విశ్వకర్మయను నాడి బుధుని వెనుక నుండెడి విశ్వావసునాడి శుక్రుని సంవర్ధన నాడి అంగారకుని అర్వావసువను ఆరవనాడి బృహస్పతిని స్వరాట్ అను నాడి శనైశ్చరుని ఆప్యాయన మొందించును. క్షయము నొందవు కావున నక్షత్రములు (న-క్ష-త్ర) ఇవి సూర్యుని క్షేత్ర(స్థాన)ములుగా నుండి తమ కిరణములతో సూర్యుని తపింపజేయును. సూర్యుడు అనంతక్షేత్ర రూపములగు ఆ నక్షత్రములలో తానును నక్షత్రత్వము పొందియున్నాడు. ఈ లోకమునుండి పై లోకములకు దాటిపోయిన సుకృతాత్ములను దాటించునవి కావునను తెల్లనివి కావునను తారకలు (తరింప-దాటునట్లు-చేయునవి) అని వీనికి పేరు. పృథివిగతులగు వారిలో దివ్యవంశముల వారిని వారి తపోబలమును తన తేజోబలమును ఆశ్రయించి తనలోనికి గ్రహించును కావున సూర్యునకు ఆదిత్యుడు (ఆదత్తే-తనలోనికి తీసికొనును) అని పేరు. స్యన్దనము-స్రవింపజేయుట అను అర్థము నిచ్చు 'సూ' అను ధాతువునుండి 'సవితా' అను పద మేర్పడినది. తేజస్సును ప్రసరింపజేయువాడు కావున సూర్యుడు 'సవిత' అనబడును. 'చది' అను ధాతువునుండి 'చంద్ర' అనెడు శబ్దము ఏర్పడినది. తెల్లగాఅమృతరూపుడై-చల్లనై-ఆనందింపజేయువాడై- ఉండును అని అర్థము. ఇట్టి సూర్య చంద్రుల మండలములు ప్రకాశవంతములు దివ్యములు ఆకాశగాములు తెల్లనివి గుండ్రని కుండలవంటివి. వీరిలో రవి తేజోమయుడు-చంద్రుడు జలమయుడు. తమ సుకృతములచే దేవత్వ మందిన కర్మదేవులు ఆయా మన్వంతరములం దెల్ల ఈ రవి నక్షత్ర చంద్రగ్రహ లోకములందు తమ పుణ్యానుసారము ప్రవేశింతురు. ఇవి వారికి స్థానము లగును. కావున వీనికి 'దేవ గృహములు' 'కర్మదేవులకు ఇండ్లు' అని పేరు ఏర్పడినది. ఇంతే కాదు. సూర్య శుక్ర బృహస్పత్యంగారక శనైశ్చర బుధ రాహువులు ఇతర నక్షత్రములు కూడ వాస్తవమున దేవతాతత్త్వములే. వీరును తమ సుకృతమున కర్మదేవులై ఆయా జ్యోతిర్గోళములను తమ తమ ఇండ్లుగా పొందిరి. ఈ కనబడు జ్యోతిర్గోళములు కేవలము జడ పదార్థములు కావు. వానికి అధిష్ఠాతలుగా రవ్యాది దేవతలున్నారు.

జ్యోతీంషి సుకృతా మేతే జ్ఞేయా దేవగృహాస్తువై । స్థానాన్యేతాని తిష్ఠన్తి యావదాభూతసంప్లవమ్. 44

సూర్యాద్యుత్పత్తికథనమ్.

మన్వన్తరేషు సర్వేషు దేవస్థానాని యానివై । అభిమానినోఽనుతిష్ఠన్తి తాని దేవాః పునః పునః. 45
అతీతాంశ్చ సహాతీతై ర్భావ్యా భావ్యైః స్వకైః స్సహ । వర్తన్తే వర్తమానైస్తు సురైః స్సార్ధంతు స్థానినః. 46
సూర్యో దేవో వివస్వాంశ్చ అష్టమ స్త్వదితే స్సుతః ।
ద్యుతిమాన్ ధర్మయుక్తస్తు సోమో దేవో వసు స్స్మృతః. 47
శుక్రో దైత్యస్తు విజ్ఞేయో భార్గవోఽసురయాజకః । బృహస్పతి ర్వేదసశ్చ దేవాచార్యోఽఙ్గిరస్సుతః. 48
బుధో మనోహరశ్చైవత్విషిపుత్రస్తు స స్స్మృతః । శనైశ్చరో విరూపశ్చ సంజ్ఞాపుత్రో వివస్వతః. 49
అగ్నే ర్వికేశ్యాంజజ్ఞిరే యువానః కేతవోస్పవ । నక్షత్రనామ్నా ఋక్షాణి దాక్షాయణ్యస్తు తా స్స్మృతాః. 50
స్వర్భాను స్సింహికాపుత్రో భూతసమ్మోహనోఽసురః । చన్ద్రార్క గ్రహనక్షత్రే ష్వభిమానీ ప్రకీర్తితః. 51
స్థానాన్యేతాని చోక్తాని స్థానిన్యశ్చైవ దేవతాః । శుక్ల మగ్నిమయం దివ్యం సహస్రాంశో ర్వివస్వతః. 52
సహస్రాంశ స్త్విషిస్థాన మమ్మయం తైజసం తథా । ఆప్యం స్థానం మనోజ్ఞస్య పఞ్చరశ్మి ర్బృహస్పతిః. 53
శుక్రష్షోడశరశ్మిస్తు యశ్చ దేవో హ్యపాం స్వయమ్ । లోహితో నవరశ్మిస్తు స్థానమాప్యంతు రస్యతత్. 54
బుధో ద్వాదశరశ్మిస్తు హరితాభంతు తద్గృహం । అష్టరశ్మి గృహం ప్రోక్తం కృష్ణం మందస్య చ స్వయమ్.
స్వర్భానో ర్ధామ సంస్థానం భూతసన్తాపనాలయమ్ । శుక్లా నామ్నాతు సూర్యస్య రశ్మయస్తు హిరణ్మయాః.
తారాణాం తాపకా హ్యేతా శ్శుక్లత్వాచ్చైవ తారకాః॥ 56

ఈ చెప్పిన కారణములచే ఈ జ్యోతిర్గోళములన్నియు సుకృతము చేసికొనిన కర్మదేవుల ఇండ్లయినందున దేవగృహము లయ్యెను. ఇవి ప్రళయకాలము వరకు ఇట్లే యుండును. ప్రతి మన్వంతరమునందును ఆయా స్థానములకు అభిమానులగు దేవతలు ఇట్లే వానిని మరల మరల తమ ఇండ్లుగా చేసికొందురు. అతీత మన్వంతరములందు అతీత దేవతలును వర్తమానమన్వంతరములందు వర్తమానదేవతలును భావి మన్వంతరములందు భావి కర్మదేవులును ఇట్టే ఉండిరి-ఉన్నారు-ఉందురు.

ఇక వీరి దేవతాత్వములు ఇట్లుండును: అదితి కుమారులలో ఎనిమిదవవాడగు 'వివస్వాన్' అను నతడే సూర్యదేవుడు; ద్యుతి (కాంతి) కలవాడు ధర్మయుక్తుడు నగు సోమ(చంద్ర)దేవుడు వసువులలో నొకడు; శుక్రుడు అసురుల యాజకుడు (యజ్ఞాదులు చేయించు పురోహితుడు) అగను దేవతాకోటిలోని వాడు; దేవాచార్యుడగు బృహస్పతి అంగిరుని కుమారుడు; బ్రహ్మాంశ సంభూతుడు; బుధుడు మనోహరరూపుడు త్విషి(చంద్ర)పుత్రుడు; శనైశ్చరుడు విరూపుడు-రవికి సంజ్ఞాదేవియందు కలిగినవాడు; కేతువులు అనువారు అగ్నిదేవునకు వికేశి అను భార్యయందు జనించినవారు; దాక్షాయణులు (దక్షపుత్రికలు) నక్షత్రములు; భూతము(ప్రాణు)లకు సమ్మోహము కలిగించు స్వర్భానుడు (రాహువు) సింహికా పుత్రుడగు అసురుడే యైనను చంద్రార్క గ్రహనక్షత్రములందు ఒకడుగా అభిమానుడై ఆరాధింపబడుచున్నాడు.

ఇట్లు జ్యోతిః స్థాన తత్త్వమును ఆ స్థానముల కభిమానులగు దేవతలను తెలిపితిని. ఆ జ్యోతిః స్థానముల భౌతిక సంస్థానమును తెలిపెదను. సహస్రాంశుడగు వివస్వంతు(సూర్యు)ని స్థానము అగ్నిమయ జ్యోతిర్గోళము. చంద్ర స్థానము కూడ వేయి కిరణములు గల జలమయగోళము. మనోజ్ఞుని గోళము కూడ జలమయమే; బృహస్పతి గోళము ఐదు నాడులు కలది; శుక్రగోళము పదునారు నాడులు కల జలమయగోళము; అంగారకునిది తొమ్మిది నాడులుగల జలమయగోళము; బుధునిది పండ్రెండు నాడులుగల పచ్చని ప్రకాశముగల గోళము; రాహు స్థానమగు గోళము భూత సంతాపము కలిగించునది; ఇతని కిరణములు హిరణ్మయములు శుక్ల నామకములయి తెల్లని వగుటచే తారకములని కూడ పేరు గల సూర్య కిరణములే; ఇవి తారలకు కూడ తాపము కలిగించును.

సూర్యాదిమణ్డలపరిమాణకథనమ్.

నవయోజనసాహస్రో విష్కమ్భ స్సవితు స్స్మృతః. 57
మణ్డలం త్రిగుణంచాస్య విస్తారో భాస్కరస్యతు । ద్విగుణ స్సూర్యవిస్తారా ద్విస్తార శ్శశినస్స్మృతః. 58
విస్తారంమణ్డలం చాస్య వైపుల్యా చ్ఛశిన స్స్మృతమ్ । సర్వోపరి నిసృష్టాని మణ్డలానితు తారకాః. 59
యోజనార్ధప్రమాణాని తాభ్యోన్యాని గుణానితు । తుల్యోభూత్వాతు స్వర్భాను స్తదధస్తా త్ప్రసర్పతి. 60
ఉద్ధృత్య పార్థివీం ఛాయాం నిర్మితాం మణ్డలాకృతిమ్ ।
స్వర్భానోశ్చ బృహత్స్థానం తృతీయంతు తమోమయమ్. 61
ఆదిత్యా త్సచ నిష్క్రమ్య సోమం గచ్ఛతి పర్వసు । ఆదిత్యమేతి సోమాచ్చ పునస్సౌరేషు పర్వసు. 62
స్వభాసా నుదతే యస్మా త్స్వర్భానురితి స స్మృతః । చన్ద్రతః షోడశో భాగో భార్గవస్య విధీయతే. 63
విష్కమ్భా న్మణ్డలాచ్చైవ యోజనానాంతు సస్మృతః । భార్గవా త్పాదహీనస్తు విజ్ఞేయో వై బృహస్పతిః. 64
బృహస్పతేః పాదహీనౌ వక్రసౌరా వుభౌ స్మృతౌ । విస్తారా న్మణ్డలాచ్చైవ పాదహీన స్తయోర్బుధః. 65
తారానక్షత్రరూపాణి వపుష్మన్తీహ యానివై । బుధేన సమరూపాణి విస్తారా న్మణ్డలాచ్చవై. 66
తారానక్షత్రరూపాణి హీనానితు పరస్పరమ్ । *శతాని పఞ్చచత్వారి త్రీణి ద్వాదశ చైవచ. 67
తతోపరి నివిష్టాని మణ్డలానితు తారకాః । యోజనార్ధప్రమాణాని తేభ్యో హ్రస్వం న విద్యతే. 68
ఉపరిష్టా త్త్రయస్తేషాం గ్రహాయే క్రూరసర్పిణః । సౌరి శ్చాఙ్గిరసో వక్రో విజ్ఞేయా మన్దచారిణః. 69
తేభ్యోఽధస్తా ద్రాహుకేతూ పునశ్చాన్యే మహాగ్రహాః । సోమ శ్శుక్రో బుధశ్చైవ భార్గవశ్చేతి శీఘ్రగాః. 70

రవి మండల వ్యాసము తొమ్మిది వేల యోజనములు. చుట్టు కొలత దానికి మూడింతలు; చంద్రుని వ్యాసము సూర్యుని వ్యాసమునకు ద్విగుణము; తారకలు వీటికి పైగా నున్నవి. వాని వ్యాసము అర్ధ యోజనము మాత్రమే. అదే వ్యాసముతో రాహువు నక్షత్రములకంటె క్రిందుగా సంచరించును. ఇతడు పృథివీ ఛాయను మండలాకారమున చేసికొని యుండును. రాహు స్థానము పెద్దదే కాని తమోమయము; అతడు చంద్రపర్వములందు (పూర్ణిమలందు) సూర్యుని నుండి చంద్రుని కడకును రవిపర్వములందు (అమావాస్యలందు) చంద్రునినుండి సూర్యుని కడకును పోవుచుండును. తన భాసములతో (కిరణములతో) భానుని బాధించును కావున అతనికి స్వర్భానుడని పేరు. చంద్రునిలో పదునారవవంతు శుక్ర మండలము; శుక్ర మండలములో నాల్గవవంతు తగ్గించినచో బృహస్పతి మండల మగును. బృహస్పతి మండలములో నాల్గవవంతు తగ్గించినచో అంగారక మండల మగును; శని మండలము అంగారక మండలముతో సమానము. అంగారకుని మండలములో నాల్గవవంతు తగ్గించినచో బుధ మండల మగును. తారా నక్షత్రము లన్నియు బుధ మండలముతో సమాన మండలము కలవి. ఇవి ఒకదానికంటె మరియొకటి తక్కువ తక్కువ పరిమాణము కలవి. ఇవి వందలుగా ఐదులుగా నాల్గులుగా మూడులుగా పండ్రెండులుగా నున్నవి. ఈ తారానక్షత్ర మండలములకు పైగా నక్షత్రము లున్నవి. లోగడ చెప్పినట్లు వీనిలో ఒక్కొక్కదాని మండలము అర్ధ యోజనము; ఇంతకంటె చిన్న మండలము కల జ్యోతిస్సులు లేవు; వాటికి పైగా నున్న గ్రహములగు శని బృహస్పత్యంగారకులు మందసంచారులు; నక్షత్రములకు క్రిందుగా రాహు కేతువులున్నవి. సోమ శుక్ర బుధులు శీఘ్ర సంచారులు; వీరును నక్షత్ర మండలమునకు క్రిందుగానే యున్నారు.

యావన్తి దేవఋక్షాణి కోట్య స్తావచ్చతారకాః । సర్వేషాంతు గ్రహాణాంవై సూర్యోఽధస్తా త్ప్రసర్పతి. 71
విస్తీర్ణం మణ్డలంకృత్వా తస్యోర్ధ్వం చరతే శశీ । నక్షత్రమణ్డలంచాపి సోమాదూర్ధ్వం ప్రసర్పతి. 72
నక్షత్రేభ్యో బుధశ్చోర్ధ్వం బుధాదూర్ధ్వంతు భార్గవః । వక్రస్తు భార్గవాదూర్ధ్వం వక్రాదూర్ధ్వం బృహస్పతిః. 73

* సార్ధషట్పఞ్చచత్వారిత్రీణిద్వేఏకఏవచ.

తస్మా చ్ఛనైశ్చరశ్చోర్ధ్వం దేవాచార్యా త్పర స్స్మృతః । శనైశ్చరా దతశ్చోర్ధ్వం జ్ఞేయం సప్తర్షిమణ్డలమ్.
సప్తర్షిభ్యో ధ్రువశ్చోర్ధ్వ మాసక్తం త్రిదివం ధ్రువే । ద్విగుణేషు సహస్రేషు యోజనానాం శతేషుచ. 75
గ్రహాన్తర మథైకైక మూర్ధ్వం నక్షత్రమణ్డలాత్ । తారాగ్రహాన్తరాణిస్యు రుపర్యుపరి తే స్మృతాః. 76
గ్రహాశ్చ చన్ద్రసూర్యౌచ దివి దివ్యేన తేజసా । నక్షత్రేషుచ యుజ్యన్తే గచ్ఛన్తో నియతక్రమాత్. 77
చన్ద్రార్కగ్రహనక్షత్రా నీచోచ్చమృదుసంస్థితాః । సమాగమేతు భేదేన పశ్యన్తి యుగప త్ప్రజాః. 78
పరస్పరా స్థితా హ్యేవం యుజ్యన్తేచ పరస్పరమ్ । అసఙ్కరేణ చక్రేణ తేషాం యోగాస్తు వై బుధైః. 79
ఇత్యేష సన్నివేశో వః పృథివ్యా జ్యోతిషామపి । ద్వీపానా ముదధీనాంచ పర్వతానాం తథైవచ. 80
వర్షాణాంచ నదీనాంచ యేచ దేవేషు సన్తివై । ఇత్యేషోఽర్కవశేనైవ సన్నివేశస్తు జ్యోతిషామ్ 81
ఆద్యన్తప్రాన్తతో మధ్యం నక్షేపస్తు ధ్రువాశ్రితః । సర్వత స్తేషు విస్తీర్ణో వృత్తాగార ఇవోచ్ఛ్రితః. 82
లోకసంవ్యవహారార్థ మీశ్వరేణ వినిర్మితః । కల్పాదౌ బుద్ధిపూర్వంతు స్థాపితోఽయం స్వయమ్భువా. 83
ఇత్యేష సన్నివేశోవ స్సర్వస్తు జ్యోతిషాత్మకః । వైశ్వరూపం ప్రధానస్య పరిణామోఽస్య యస్స్మృతః. 84
నైష శక్యః ప్రసఙ్ఖ్యాతుం యాథాతథ్యేన కేనచిత్ । గతాగతం మనుష్యేణ జ్యోతిషాం మాంసచక్షుషా. 85

ఇతి శ్రీమత్స్యమహాపురాణే ఖగోళపరిసమాప్తి కథనం నామ
షడ్వింశత్యుత్తర శతతమోఽధ్యాయః.
ఇతి ఖగోళసంస్థానవర్ణనమ్.

దేవత్వమును పొందిన నక్షత్రాత్ము లెందరు కలరో అన్ని కోట్ల తారక లంతరిక్షమందున్నవి. (కావున అవి ఇన్నియని లెక్కింపజాలము.)

అన్నిటికంటెను దిగువగా సూర్యు డున్నాడు. అతని మీదుగా చంద్రుడు-అతనికి పైగా బుధుడు అతనిపై శుక్రుడు అతనిపై కుజుడు అతనిపై బృహస్పతి అతనిపై శనైశ్చరుడు అతనికి పైగా సప్తర్షి మండలము దానిలో ఊర్ధ్వమున ధ్రువుడు ఉన్నారు. ఇట్లీ ద్యులోకమంతయు ధ్రువునియందు నిబద్ధమయి యున్నది.

ఈ గ్రహాదులన్నియు ఒకదానికి మరియొకటి రెండు (వేల ఒక వంద) లక్షల యోజనముల ఎడముతో పైపైగా ఉన్నవి. ఈ తారాగ్రహములును చంద్రసూర్యులును ద్యులోకమున దివ్యతేజస్సుతో ప్రకాశించుచు అశ్విన్యాది నక్షత్రములందు నియమానుసారము సంచరించుచుండును. ఇవి నీచోచ్చమృదు గతులతో సంచరింతును. వీనికి సమాగమము భేదము అను స్థితులును కలుగుట కనబడుచుండును. ఈ సమాగమ భేదములు గణనవశమున పండితులు తెలిసికొందురు. వాస్తవమున అవి కలియుట జరుగదు. ఏలయన అవి ఒక దానిని మరియొకటి తాకని చక్రమున (కక్ష్యలలో) నియతముగా తిరుగుచుండును. కాని వాని కన్నింటికి దిగువగా నున్న మనకు అవి అట్లు కనబడును.

ఇట్లు పృథివీ సన్నివేశము జ్యోతిః సన్నివేశము ద్వీప సముద్ర పర్వత నదీ వర్ష సంనివేశము-జ్యోతిరాత్మక దేవగృహ సంనివేశము సూర్యాశ్రిత జ్యోతిర్వ్యవస్థ ధ్రువాశ్రితమగు ఆద్యన్త ప్రాంత మధ్య ప్రదేశములందలి అంతరిక్ష జ్యోతిర్గోళ వ్యవస్థ మీకు తెలిపితిని. గుండ్రని భవనములవలె కనబడు ఈ ఉన్నత జ్యోతిర్గోళముల స్థానములు మొదలగు కొలతలు లోక సంవ్యవహారార్థము ఈశ్వరుడు సంకల్పించిన విధమున కల్పాదియందు స్వయంభూ బ్రహ్మ బుద్ధి (ఆలోచన) పూర్వకముగా ఏర్పరచెను. మీకు నేను తెలిపిన జ్యోతిర్వ్యవస్థ దాని ననుసరించినదే; ప్రధాన (ప్రకృతి) పరిణామమే ఈ విశ్వరూపము (విరాట్స్వరూపము.) దీనిని ఉన్నదున్నట్లు గణన చేయుట కాని జ్యోతిర్గోళముల గతాగత రూప సంచారము కాని మాంసచక్షువుతో నుండు మానవునకు సాధ్యము కాదు.

[ఈ చెప్పిన వానిలో - (అధ్యా-123-124-125-126-) కొన్ని ఆధునిక సిద్ధాంతములతో సరిపోవు. మరికొన్ని ప్రాచీన భారతీయ సిద్ధాంతములతో కూడ సరిపోవు. మరికొన్ని తత్త్వపరము లయినవి. వీనిని తాత్త్విక దృష్టితో విచరించి ఎరుగవలెను.
—అనువాదకుడు]

ఇది శ్రీమత్స్య మహాపురాణమున ఖగోళ వర్ణన పరిసమాప్తి యను
నూట ఇరువది ఆరవ అధ్యాయము.

## సప్తవింశత్యుత్తరశతతమోఽధ్యాయః.

### త్రిపురాసురోపాఖ్యానప్రారమ్భః.

ఋషయః : కథం జగామ భగవా న్పురారిత్వం మహేశ్వరః। దదాహ స కథం దేవ స్తన్నో విస్తరతో వద.
పృచ్ఛామ స్త్వాం వయం సర్వే బహుమానా త్పునః పునః ।
త్రైపురంచ యథా దుర్గం మయమాయా వినిర్మితమ్. 2
దేవేనై కేషుణా దగ్ధం తథా త్వం వద మానద
సూతః : శృణుధ్వం త్రైపురం దేవో యథా దాహితవా న్భవః. 3
మయోనామ మహామాయీ మాయానాం జనకోఽసురః। నిర్జిత స్సతు సఙ్గ్రామే తతాప పరమం తపః. 4
తపస్యన్తంతు తం విప్రా దైత్యేన్ద్రోపర్యనుగ్రహాత్ । తస్యైవ కృతముద్దిశ్య తేపతుః పరమం తపః. 5
విద్యున్మాలీచ బలవాం స్తారకాక్షస్తు వీర్యవాన్ । మయతేజ స్సమాక్రాన్తౌ తేపతు ర్మయపార్శ్వగౌ. 6
లోకా దేవా యథా మూర్తా స్త్రయ స్త్రయ ఇవాగ్నయః। లోకత్రయం తాపయన్త స్తే తేపు ర్దానవా స్తపః 7
హేమన్తే జలశయ్యాసు గ్రీష్మే పఞ్చతపా స్తథా। వర్షాసుచ తథాఽఽకాశే క్షపయన్త స్తపఃప్రియాః. 8
స(తే)వనా త్ఫలమూలాని స్వాదూనిచ మృదూనిచ । అన్యథా రచితాహారాః పఙ్కేనావృతవల్కలాః. 9
మగ్నా శ్శైవాలపఙ్కేషు సమలే ష్వమలేషుచ । నిర్మాంసాశ్చ తథా జాతాః కృశా ధమనిసన్తతాః. 10
తేషాం తపఃప్రభావేన నాబభౌ విద్రుమం తథా । నిష్ప్రభంచ జగత్సర్వం మన్దతేజా విభావసుః. 11
దహ్యమానేషు లోకేషు త్రైస్త్రిభి ర్దానవాగ్నిభిః। తేషాంమధ్యే జగద్బన్ధుః ప్రాదుర్భూతః పితామహః. 12

మయాదీనాం వరప్రదానార్థం బ్రహ్మావిర్భావః.

తతస్తే లోకకర్తారం తందృష్ట్వా సహసాఽఽగతమ్। స్వయం పైతామహం దైత్యా నేము స్తుష్టువురేవచ. 13
అథ తాన్ దానవా న్బ్రహ్మా తపసా తపసప్రభాన్ । ఉవాచ హర్షపూర్ణాఙ్గాన్ హర్షపూర్ణముఖేక్షణః. 14
వరదోఽహం హి వో వత్సా స్తపస్తోషిత ఆగతః। భవతా మీప్సితం యద్వా సవిచారం తదుచ్యతామ్. 15

## నూట ఇరువది ఏడవ అధ్యాయము.

### త్రిపురాసురోపాఖ్యానము-మయాదులకు బ్రహ్మవర ప్రాప్తి.

[విశేషము: దేవాసుర యుద్ధములు మొత్తము పన్నెండు అని లోగడ నలువది ఏడవ అధ్యాయమున చెప్పబడినది. వానిలో ఈ త్రైపుర యుద్ధము ఏడవది. మిగిలిన వానిలో వృత్రవధము మాత్రము (పురాణములలో) భాగవతమునందును భారతము నందును (ఇతిహాసమున) వర్ణింపబడినది. మిగిలిన వానిలో పన్నెండవది లోగడ నలువది ఏడవ అధ్యాయములో చెప్పబడినది. నారసింహ వామనవారాహామృతమంథన తారకామయాడీవధాంధకారములును ఈ మత్స్య పురాణమునందేయున్నవి. ఈ దేవాసుర సంగ్రామములన్నియు శాస్త్రీయాశాస్త్రీయ చిత్తవృత్తులకును జ్ఞానాజ్ఞానములకును వివేకా వివేకములకును నడుమ జరిగిన పోరాటములు. వీనిలో చివరకు శాస్త్రీయ చిత్తవృత్తికే గెలుపు

కలిగి భగవదుపాసనముతో ప్రాణులు తరించు మార్గమే పైచేయిగా మిగులుట ఈ దేవాసుర యుద్ధముల పరమ తాత్పర్యము. వీనియందు వైదిక సంప్రదాయ తత్త్వములు రహస్యాత్మకములుగ అంతర్నిహితములై యున్నవి. వానిని సంప్రదాయజ్ఞులవలన తెలిసికొనదగును. ప్రకృతమీ త్రైపురవధమను దేవాసుర సంగ్రామమున ఉపాసన విధానముల సంకేతము గూఢముగను శాస్త్రీయాశాస్త్రీయ చిత్తవృత్తులపోరు బాహ్యముగను ప్రతిపాదింపబడినది.

ఋషులు సూతునిట్లడిగిరి: భగవానుడగు మహేశ్వరుడు పురారి యెట్లయ్యెను? (పుర-అరి = పురములకు శత్రువు.) ఆదేవుడు పురములనెట్లు దహించెను? మాకది విస్తరించి చెప్పుము. ఆ కథయందును అది చెప్పగల వాడవని నీయందును గల ఆదరముతో మేము నిన్ను మరలమరల (ప్రతిమాలి) అడుగుచున్నాము. మయమాయా వినిర్మితమగు త్రైపుర దుర్గమును మహాదేవుడొకే బాణముతో నెట్లు దహించెను? ఆ విధము ఆదరణీయుడవగు సూతా! మాకు తెలుపుము. అనగా సూతుడు ఇట్లు చెప్పనారంభించెను: దేవుడగు శివుడు త్రైపుర దుర్గములనెట్లు దహించెనో తెలిపెద; వినుడు. మహామాయాశాలియు మాయలకు జనకుడునగు మయుడను అసురుడుండెను. వాడు దేవతలతో సంగ్రామమున ఓడి పరమ తపమాచరించెను. ఆతడు తపమాచరించుచుండగా ఆ మయ తేజస్సునకు లోబడినవారు-బలవంతుడగు విద్యున్మాలి వీర్యశాలియగు తారకాక్షుడునను అసురులును మయుని యందలి అనుగ్రహబుద్ధితో అతని సంకల్పమునే తామును ఉద్దేశించి మయుని సమీపముననే ఉండి పరమతప మాచరించిరి. రూపొందిన లోకత్రయము వలె (బ్రహ్మ విష్ణు రుద్రులను) దేవత్రయమువలె అగ్నిత్రయమువలె కనబడుచు లోకత్రయమును సంతాపింపజేయుచు ఆ దానవులుతపమాచరించుచుండిరి. వారు తపఃప్రియులై హేమంతమున జలశయ్యలపైనుండి గ్రీష్మమున పంచాగ్ని మధ్యమందుండి వర్షర్తువునందు నిరావరణమగు ఆకాశము క్రింద నిలిచి గడపుచుండిరి. వారు క్రమముగా వనమునుండి సంపాదించుకొనిన రుచ్యములు మృదువులునగు ఫలములు మూలములు పిమ్మట మరియొక విధమగు (కఠినమగు) ఆహారములు తీసికొనుచుండిరి. సమలములును అమలములును నగు జలములందు నాచు త్రాళ్ళయందు నిలిచియు తమ వల్కలములు బురదతో కప్పబడియు ఉండుచు శరీరములు చిక్కిపోయి ధమనులతో వ్యాప్తముకాగా మాంసమే లేక తపమాచరించసాగిరి. వారి తపోగ్ని ప్రభావమున జగదమేదియో గుర్తింపరాక పోయెను. సర్వజగత్తును కాంతిహీన మయ్యెను. అగ్ని సూర్యులు మందతేజస్కులయిరి. దానవులనెడు అమూడు అగ్నులచే ఇట్లు లోకములు దహింప బడుచుండ జగద్బంధుడగు బ్రహ్మ వారి నడుమ సాక్షాత్కరించెను. అంతట ఆకస్మికముగ స్వయముగ వచ్చిన లోక కర్తయగు పితామహుని చూచి దైత్యులు నమస్కరించి స్తుతించిరి. తపస్సుచే రవివలె వెలుగుచు తనుగాంచి హర్ష పూర్ణముఖ నేత్రులగు ఆ దానవులతో హర్ష పూర్ణముఖ నేత్రుడగుచు బ్రహ్మ ఇట్లు పలికెను: నాయనలారా! నేను మీ తపమునకు తుష్టుడనై వరమీయవచ్చితిని. మీకోరిక ఏమియో సంకోచింపక తెలుపుడు.

ఇత్యేవముచ్యమానస్తు ప్రసన్నం ప్రపితామహమ్ । విశ్వకర్మా మయః ప్రాహ ప్రహర్షోత్ఫుల్లలోచనః. 16
దేవైః దైత్యాః పురా దేవై స్సజ్గ్రామే తారకాహ్వయే । నిర్జితాశ్చ హతాశ్చైవ నిస్త్రింశై రాయుధైరపి. 17
దేవై స్సదాతివిద్ధాఙ్గా బాధితా భయవేపితాః । శరణం నైవ జానీము స్సర్వేహ్యా శరణార్థినః. 18
సోఽహం తపఃప్రభావేన భవద్భక్త్యా తథైవచ । ఇచ్ఛామి దుర్గం తత్కర్తుం యద్దేవైరపి దుర్గమమ్. 19
తస్మింశ్చ త్రిపురే దివ్యే మత్కృతే కృతినాంవర । కృత్యానాం జలజానాంచ దోషాణాం వహ్నితేజసామ్.
దేవప్రహరణానాంచ దేవానాంచ ప్రజాపతే । అలఙ్ఘనీయం భవతు త్రిపురం యది తే ప్రియమ్. 21
విశ్వకర్మా ఇతీవోక్త స్సతదా విశ్వకర్మణా । ఉవాచ ప్రహసన్వాక్యం మయదైత్యగణాధిప. 22
సర్వామరత్వం నైవాస్తి ససద్వృత్తస్య దానవ । తస్మాద్దుర్గవిధానంహి క్షణాదపి విధీయతామ్. 23
పితామహవచ శ్శ్రుత్వా ఇత్యేవం దానవో మయః । ప్రాఞ్జలిః పునరప్యాహ బ్రహ్మాణం పద్మసమ్భవమ్. 24

యత్ర దేకేషుణా దుర్గం సకృన్ముక్తేన నిర్దహేత్ । సచ సస్సంయుగే హన్యా దవధ్య శ్శేషతో భవేత్. 25

ప్రసన్నుడయి ఇట్లు పలికిన బ్రహ్మతో విశ్వకర్మయగు మయుడు ప్రహర్షమున కనులు విప్పార ఇట్లనెను దేవా: పూర్వము తారకయుద్ధమున దైత్యులు దేవతల చేతిలో ఓడిరి. ఖడ్గములతో ఆయుధములతో కొట్టి చంపబడిరి ఎడతెగక మావారి దేహములు దెబ్బతినెను. వారు బాధితులు భయకంపితులునైరి. వారు శరణార్థులైరికాని తమకు శరణమేదియో వారెరుగరైరి. ఇట్టి స్థితిలో నేను తపఃప్రభావము చేతను నీసేవకు ఫలముగాను దేవతలకును చొరరాని దుర్గము నిర్మింపదలచుచున్నాను. నిర్మాతలలో శ్రేష్ఠుడవగు ప్రజాపతీ! నేను నిర్మించు ఆ త్రిపురమను దివ్యదుర్గము ఎట్టి కృత్యములకును కృత్యా అనెడు ఆభిచారిక శక్తులకును జలదోషములకును అగ్ని తేజస్సులకును దేవతల ఆయుధములకును దేవతలకును కూడ చేరరానిది కావలయును.

ఈ మాట విని విశ్వ సృష్టికర్తయగు బ్రహ్మ నవ్వుచు విశ్వకర్మయగు మయునితో ఇట్లు పలికెను: 'దైత్యగణాధిపా! మయా! సద్వర్తనములేని వాని కెవ్వనికిని సర్వామరత్వము లభింపదు. కనుక (అమరత్వము కోరక) క్షణకాలములో దుర్గ నిర్మాణమే చేసికొనుము. బ్రహ్మ మాట విని మయుడు ప్రాంజలియై పద్మసంభవుడగు బ్రహ్మతో మరల ఇట్లనెను: "ఒకేసారి విడిచిన ఒకే బాణముతో మాత్రమే నేను నిర్మించు దుర్గమును కాలవలయును; మేమును చావవలయును. మరియొక విధమున మాకు వధ్యత్వ ముండరాదు.'

ఏవమస్త్వితి చాప్యుక్త్వా మయం దేవః పితామహః । స్వప్నేలబ్ధో యథార్థాను స్తత్రైవాదర్శనం యయౌ. 26
గతే పితామహే దైత్యా గత్వా వహ్నిరవిప్రభాః । వరదృప్తా బభూవుస్తే తపసాచ మహాబలాః. 27
మయస్త్వథ మహాబుద్ధి ర్దానవో ఋషిసత్తమాః । దుర్గం వ్యవసితః కర్తుమితి చిన్తయతే తదా. 28
కథంనామ భవేద్దుర్గం తన్మయా త్రిపురం కృతమ్ ।
వత్స్యతే తత్పురం దివ్యం మత్తః కోఽన్యో న సంశయః. 29
యథా చైకేషుపాతేన తత్పురం న విహన్యతే । దేవైస్తథా విధాతవ్యం మయా మతివిచారణాత్. 30
విస్తరో యోజనశత మేకైకస్య పురస్యతు । కార్యం తేషాంచ విష్కమ్భ మేకైకం శతయోజనమ్. 31
పుష్యయోగేచ నిర్మాణం పురాణాంచ భవిష్యతి । పుష్యయోగేనచ దివి సమేష్యన్తి పరస్పరమ్. 32
పురాణ్యేకప్రహారేణ స తానిచ హనిష్యతి । ఆయసంతు క్షితితలే రాజతంతు నభస్తలే. 33
రాజతస్యోపరిష్టాచ్చ సౌవర్ణం భవితా పురమ్ । ఏవం త్రిభిః పురై ర్యుక్తం త్రిపురం తద్భవిష్యతి. 34
శతయోజన ●విష్కమ్భైరన్తరై స్తద్దురాసదమ్ ।
అట్టాలకై ర్యన్త్రశతఘ్నిభిశ్చ సశక్తిశూలోపలకమ్పనైశ్చ. 35
ద్వారై ర్మహామన్దరమేరుకల్పైః ప్రాకారశృఙ్గైశ్చ విరాజమానమ్ ।
సతారకాక్షేణ మయేన గుప్తం ఖస్థంచ గుప్తం తటిన్మాలినాచ. 36
కోనామ హన్తుం త్రిపురం సమర్థో ముక్త్వా త్రినేత్రం భగవన్త మేకమ్. 36

ఇతి శ్రీమత్స్యమహాపురాణే త్రిపురోపాఖ్యానే మయాదీనాం బ్రహ్మదత్తవరాది కథనం నామ సప్తవింశత్యుత్తరశతతమోఽధ్యాయః.

'అట్లే యగుగాక!' అని మయునితో పలికి బ్రహ్మదేవుడు స్వప్నమందు లభించిన ధనమువలె అదృశ్యుడయ్యెను. పితామహుడు ఏగిన తరువాత అగ్నిభాస్కరతేజులగు ఆ రాక్షసులును అటనుండి వెడలిరి. నాటినుండి వారు తపముచే మహాబలులగుటతోపాటు వరముచే మదించిరి.

---

● విస్తారైరన్తరై

ఋషి సత్తములారా! పిమ్మట మహాబుద్ధిశాలియగు ఆ మయుడు దుర్గము నిర్మింప సంకల్పించి ఇటు లాలోచింప సాగెను: నేను తప్ప మరి ఎవరును నివసింప అలవి కాని త్రిపుర దుర్గమును నేను ఎట్లు నిర్మింతును? నేను నా మతి విచారణశక్తి నుపయోగించి దేవతలు ఏక బాణపాతముతో దానిని విహతము చేయజాలకుండునట్లు ఆ దుర్గమును నిర్మింపవలయును. ప్రతియొక పురమునకు పొడవు వెడల్పులు ఏకశత యోజనము లుండునట్లు నిర్మింతును. పుష్యయోగమునందు ఆ పురముల నిర్మించి పుష్యయోగముననే అవి పరస్పరము కలియునట్లు చేయుదును. పుష్యయోగమున వానిని సమీపించి చేరినవాడు మాత్రమే వానిని ఏకశర ప్రహారముతో కొట్టివేయగలుగును. వానిలో అయోదుర్గము క్షితితలమున రజత దుర్గ మంతరిక్షమున సౌవర్ణదుర్గ మంతకును మీద ఉండునట్లు ఆ త్రిపుర దుర్గము నిర్మితమగును. శతయోజన విస్తరము గల అంతరములతో అట్టాలకములతో యంత్ర శతఘ్నులతో శక్తులు శూలములు ఉపలకంపనములు (రాలను కదలించు యంత్రములు) మహాద్వారములతో మేరు మంధర సదృశ మహాప్రాకారములతో విరాజమానమగుచు ఏరికిని చేరరానిదయి తారకాక్ష మయ విద్యున్మాలులు కాపాడుచుండు ఆ త్రిపుర దుర్గమును భగవానుడగు త్రినేత్రుడు కాక అన్యు డెవ్వడు నశింపజేయగలుగును?

ఇది శ్రీమత్స్య మహాపురాణమున త్రిపురోపాఖ్యానమున మయాదులకు బ్రహ్మవరప్రాప్తియను
నూట ఇరువది ఏడవ అధ్యాయము.

## అష్టావింశత్యుత్తరశతతమోఽధ్యాయః.
## త్రిపురనిర్మాణకథనమ్.

సూతః : ఇతి సఞ్చిన్త్య దైత్యేన్ద్రో దివ్యోపాయప్రభావజమ్ ।
చకార త్రిపురం దివ్యం మనస్సఙ్కల్పచారితమ్. 1
ప్రాకారాన్తరమార్గేణ ఇహచాత్రచ గోపురమ్ । రాజమార్గ ఇతశ్చాపి విపులం భవనాదిభిః. 2
ఇహచాట్టాలకద్వార మిహచాట్టాలగోపురమ్ । రథ్యోపరథ్యాశ్చ ఇత ఇహచాత్రచ చత్వరమ్. 3
ఇదమన్తఃపురస్థానం రుద్రాయతన మత్రచ । అవటాని *తటాకాశ్చ అత్ర వాప్య స్సరాంసిచ. 4
ఆరామాశ్చ శుభాశ్చాత్ర ఉద్యానా న్యత్రచాత్రచ । విసర్గమో వాసవానాం భవత్యత్ర మనోహరః. 5
ఇత్యేవం మానసం †దుర్గం కల్పయిత్వా సురారిణా। మయేన తత్పురం సృష్టం త్రిపురం త్వితి విశ్రుతమ్. 6
కార్ష్ణాయసమయం యత్త న్మయేన విహితం పురమ్ । తారకాక్షోఽధిప స్తత్ర కృతస్థానాధిపోఽభవత్. 7
యచ్చ పూర్ణేన్దుసఙ్కాశం రాజతం నిర్మితం పురమ్ । విద్యున్మాలీ పతిస్తత్ర విద్యుద్ఘన ఇవామ్బరే. 8
సువర్ణవికృతం యత్తన్మయేన విహితం పురమ్ । స్వయంచాప న్మయ స్తత్ర గత స్తదధిపః ప్రభుః. 9
తారకస్య పురం తత్తు శతయోజనమన్తరమ్ । విద్యున్మాలిపురం చాపి శతయోజన మన్తరమ్. 10
మేరుపర్వతసఙ్కాశం మయస్యాపి పురంమహత్ । పుష్యసంయోగమాత్రేణ కాలేన స మయః పురా. 11
కృతవాం స్త్రిపురం ○దైత్య స్త్రినేత్రస్యేవ పుష్పకమ్।యేనయేన మయో యాతి ప్రకుర్వాణః పురాత్పురాత్.
వతస్థే తత్ర తత్రైవ ప్రచక్రే మాయయా స్వయమ్ ।

## నూట ఇరువది ఎనిమిదవ అధ్యాయము.
## త్రిపుర నిర్మాణ కథనము.

దైత్యేంద్రుడగు మయుడు ఇట్లాలోచించి దివ్యోపాయ ప్రభావ ఫలముగా దివ్యమగు త్రిపుర దుర్గమును నిర్మించెను. అది దాని అధిపుని మనఃసంకల్పమునను సరించి సంచరించునది. రెండేసి ప్రాకారముల నడుమ అక్కడక్కడ గోపు

* తడాగాని † తత్రాకల్పయత్పురకర్మవిత్ ○ దైత్యస్త్రినేత్రః పుష్పకంయథా.

రములు భవనాదికముతో కూడిన విశాలరాజమార్గము అట్టాలక (మహాభవన) ద్వారములు అట్టాలక గోపురములు రథ్యలు (పెక్కుబాటలు కలియుచోటు) ఉపరథ్యలు చత్వరములు అంతఃపురస్థానములు శివాలయములు గుంటలు చెరువులు దిగుడు బావులు సరస్సులు ఆరామములు (విశ్రాంతికనువగు బయళ్ళు) ఉద్యానములు దానవులు వాహ్యాళికి పోవు మనోహర ప్రదేశములు కల త్రిపురమను దుర్గమును తాను మనస్సున అనుకొనినట్లే మయాసురుడు నిర్మించెను. నల్లని ఉక్కుతో నిర్మించినదానికి తారకాక్షుడును వెండితో చేయగా చంద్రునివలె ప్రకాశించు రజత దుర్గమునకు ఆకాశము నందలి మెరపుల రాశివంటి బలి విద్యున్మాలియు సువర్ణమయ దుర్గమునకు మయుడును అధిపతులయిరి.

తారకాక్షుని పురమునకును విద్యున్మాలి పురమునకును నడుమ శతయోజనములును విద్యున్మాలి పురమునకును మయుని పురమునకును నడుమ శతయోజనములును అంతరముండునట్లు మయుడు ఒక పురమునుండి మరియొక పురమును వెలికితీయుచు పుష్యయోగ సమయమున త్రినేత్రుని పుష్పకముతో సదృశమగు త్రిపుర దుర్గము నిర్మించుచు పోవుచుండ ఆపోయిన మార్గమున అతని మాయచే ఆదుర్గము అట్లే ఏర్పడెను.

కామరూపమయాస్తత్ర శతశోథ సహస్రశః. 13
రత్నాన్వితాని శోభన్తే భవనాని సురద్రుహామ్ । ప్రాసాదశతజుష్టాని కూటాగారోత్కటానిచ. 14
సర్వాణి కామగాని స్యు స్సర్వలోకమయానిచ । సోద్యానవాపీకూపాని సపద్మసరవన్తిచ. 15
అశోకవనరమ్యాణి కోకిలారుతవన్తిచ । చిత్రశాలావిశాలాని చన్ద్రశాలోత్తమానిచ. 16
సప్తాష్టాదశభౌమాని సుకృతాని మయేనచ । బహుస్వర్ణపతాకాని స్రగ్దామాలఙ్కృతానిచ. 17
కిఙ్కిణీజాలశబ్దాని గన్ధవన్తి మహాన్తిచ । సుసంయుక్తోపలిప్తాని పుష్పనైవేద్యవన్తిచ. 18
సాజ్యధూమాన్ధకారాణి సపూర్ణకలశానిచ । గగనావరణే భాన్తి హంసపఙ్క్తినిభానిచ. 19
పఙ్క్తీకృతాని రాజన్తే గృహాణి త్రిపురేపురే । ముక్తాకలాపై ర్లమ్బద్భి ర్హసన్తీభి శ్శశిశ్రియమ్. 20
మల్లికాజాతిపుష్పాఢ్యై ర్ధూపగన్ధాధివాసితైః । పఞ్చేన్ద్రియసుఖై ర్నిత్యం సమై స్సత్పురుషైరివ. 21
హేమరాజతలోహాశ్చ మణిరత్నాఞ్జనాన్వితాః । ప్రాకారా స్త్రిపురే తస్మి న్గిరిప్రకరసన్నిభాః. 22
ఏకైకస్మి న్పురే తస్మి న్గోపురాణాం శతంశతమ్ । సపతాకధ్వజపటం దృశ్యతే గిరిశృఙ్గవత్. 23
నూపురారావరమ్యాణి త్రిపురేన్తఃపురాణ్యపి । స్వర్గాతిరిక్తశ్రీర్భాతి తత్రకన్యాపురేషుచ. 24
ఆరామైశ్చ విహారైశ్చ తడాకాఽవటపల్వలైః । సరోభిశ్చ సరిద్భిశ్చ వనై శ్చోపవనైరపి. 25
*దివ్యభోజ్యోపభోగ్యాని నానారత్నయుతానిచ । పుష్పోత్కరైశ్చ సుభగా స్త్రిపురే చోపనిర్గమాః. 26
పరిమాతశతగమ్భీరా కృతా మాయావినా పురా ।
నిశమ్య తద్దుర్గవిధాన ముత్తమం కృతం మయే నాద్భుతకర్మణా చ. 27
దితేస్సుతా దైత్యవరాఽజవైరిణ స్సహస్రశః ప్రాపు రనన్తవిక్రమాః ।
తదాసురై ర్గర్వితవైరిమర్దనైః కరీన్ద్రశైలేన్ద్రమృగేన్ద్రసన్నిభైః. 28
బభూవ పూర్ణం త్రిపురం భటైర్యథా యథామ్బరం భూరిజలై ర్ఘనవ్రజైః. 28½

ఇతి శ్రీమత్స్యమహాపురాణే త్రిపురోపాఖ్యానే త్రిపుర నిర్మాణకథనం నామ అష్టావింశత్యుత్తర శతతమోఽధ్యాయః.

వానియందు నూరులకొలది వేలకొలదిగా అసురుల భవనములు శోభించసాగెను. అవియన్నియు కామరూపములు-రత్నవంతములు వందలకొలది ప్రాసాదములు కూటాగారములు ఉద్యానములు దిగుడు బావులు తామర

* దివ్యోపభోగభోగ్యాని.

కొలకులు అశోకవనములు కోకిలారావములు విశాలములగు చిత్రశాలలు ఉత్తమములగు చంద్రశాలలు పెక్కు బంగరు పతాకలు పూలమాలలు చిరుగంటల మువ్వల గుంపులు సుగంధములు చక్కగ కలియంపి చల్లి అలికిన అలుకులు పుష్పోపహారములు నేతితో వేసిన పొగల చీకట్లు పూర్ణకలశములు కలిగి సర్వలోకమయములై గామ గమనములై ఏడెనిమిదంతస్తులు కలవిగా మయుడా అసుర భవనముల నిర్మించెను. అవి ఆకాశావరణమున హంస పంక్తులవలె త్రిపుర దుర్గాంతర్గత పురములందు బారులు తీరి రాజిల్లుచుండెను. మల్లె జాజిపూలతో అలంకృతములయి ధూపగంధములతో వాసన వేయబడి సత్పురుషులవలె త్రోవను పోవు వారికి ఇంద్రియ సుఖము కలిగించుచు చంద్రుని శోభను పరిహసించు ముత్తెపు జాలరులతో ఆ భవనములు శోభిల్లుచుండెను.

ఆ త్రిపుర దుర్గమందలి ప్రతియొక పురమునను బంగారుతో వెండితో ఇనుముతోచేసి మణులతో రత్నములతో కూర్పుకలవై కొండల గములవంటి ప్రాకారములు వందలకొలదిగ నుండెను. అవి పతాకాధ్వజ వస్త్రములతో కూడి కొండ కొమ్ములవలె కానవచ్చుచుండెను. దానియందలి అంతఃపురములు అందెల రవళులతో రమ్యములు. కన్యాపురములు శోభ స్వర్గ శోభను మించియుండెను. ఆరామములు విహార ప్రదేశములు చెరువులు గుంటలు చెలమలు సరస్సులు నదులు వనములు ఉపవనములు అటనుండెను. దివ్యములగు భోజ్య పదార్థములు నానారత్నము (శ్రేష్ఠపదార్థము)లతో కూడిన ఉపభోగ సాధనములు కలిగి పుష్పరాసులతో హాయి గొల్పుచుండు వాహ్యాళి ప్రదేశములతో ఒప్పుచుండునట్లు మాయావియగు మయుడు వందలకొలది లోతైన అగడ్తలతో సురక్షితమగు ఆ త్రిపుర దుర్గమును నిర్మించెను.

అద్భుత కార్యనిపుణుడగు మయుడు ఇట్టి యుత్తమ దుర్గ నిర్మాణము నొనరించిన సమాచారమును విని అనంత విక్రమ సంపన్నులగు దైత్యవరులు వేలకొలదిగ అటకు చేరిరి. గర్వితవైరి నాశకులును తరక్షీంద్ర మృగేంద్ర సమానులునగు అసురులతో ఆత్రిపుర దుర్గము-ఆకాశము మేఘ సమూహములతో నిండినట్లు స్కంధావారము వీరభటులతో నిండినట్లు నిండిపోయెను.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున త్రిపురోపాఖ్యానమున త్రిపుర నిర్మాణ కథనమను
నూట ఇరువది ఎనిమిదవ అధ్యాయము.

## ఏకోనత్రింశదుత్తరశతతమోఽధ్యాయః.

## మయకృతత్రిపురే దైత్యదానవాదిప్రవేశః.

సూతః : నిర్మితే †త్రిపురే దుర్గే పూర్ణే త్వసురపుఙ్గవైః । తద్దుర్గం దుర్గతాం ప్రాప బద్ధవైరై స్సురాసురైః. 1
సకళత్రా స్సపుత్రాశ్చ శస్త్రవన్తోఽన్తకోపమాః । మా(మ)యాదిష్టా నివివిశుర్గృహాణి హృషితాశ్చ తే. 2
సింహైర్వన మివానేకై ర్మకరై రివ మహార్ణవః । వీరా శ్చైవాతిపౌరుష్యై శ్శరీరమివ రోగిణః. 3
తద్వద్బలిభిరధ్యస్తం తత్పురం దేవతారిభిః । త్రిపురం సఙ్కులం జాతం దైత్యకోటిశతాకులమ్. 4
సుతలాదపి నిష్పన్నం పాతాళా ద్దానవాలయాత్ । ఉపతస్థు ర్నభోమర్గం యేచ గిర్యుపజీవినః. 5
యో యం ప్రార్థయతే కామం సమ్ప్రాప్త స్త్రిపురాలయాత్ ।
తస్యతస్య మయస్తత్ర మాయయా విదధాతి సః. 6
సచన్ద్రేషు ప్రదోషేషు సామ్బుజేషు సరస్సుచ । ఆరామేషు సభాతేషు తపోవనవనేషుచ. 7
వ్యఙ్గా శ్చన్దనదిగ్ధాఙ్గా మతఙ్గా స్సమదా ఇవ । మృష్టాభరణవస్త్రాశ్చ మృష్టస్రగనులేపనాః. 8
ప్రియాభిః ప్రియకామీభిర్భావభావప్రసూతిభిః । నారీభి స్సంతతం రేము ర్ముదితాశ్చైవ దానవాః. 9
మయేన నిర్మితే స్థానే మోదమానా మహాబలాః । అర్థేధర్మేచ కామేచ నిదధు స్తే మతిం స్వయమ్. 10
తేషాం త్రితయయుక్తానాం త్రిపురేఽమరవైరిణామ్ । జగామ సుమహాన్కాల స్స్వర్గస్థానాం యథాతథా. 11

† త్వాసురే దుర్గే మయేనాసురశిల్పినా.

శుశ్రూషన్తే పితౄన్పుత్త్రాః పతీన్పత్న్యశ్చ యత్నతః । విముక్తకలహాశ్చాపి సానురాగాః పరస్పరమ్. 12
నాధర్మం త్రిపురస్థానాం లభతేఽనృతవాగపి । అర్చయన్తి దితేః పుత్త్రా స్త్రిపురాయతనే హరమ్. 13
○పుణ్యాహశబ్దా విప్రాణాం ఆశీర్వాదాశ్చ సర్వశః ।
● సిఞ్జన్మఞ్జుళమఞ్జీర వేణువీణారవా మృదు. 14
హాసశ్చ వరనారీణాం చిత్తవ్యాకులకారకః । త్రిపురే దానవేన్ద్రాణాం శ్రూయతే రమతాం సదా. 15

## నూట ఇరువది తొమ్మిదవ అధ్యాయము.

## త్రిపుర దుర్గమున దైత్యదానవులు ప్రవేశించుట.

అసుర శిల్పియగు మయుడు నిర్మించిన త్రిపురదుర్గపు నిర్మాణము పూర్ణమయ్యెను. అది పరస్పరము బద్ధ వైరులగు సురలకును అసురులకును దుర్గత్వమును పొందెను. సురలకు అది దుర్గమము-చొరరానిది - అయ్యెను. అసురులకు అది దుర్గము-రక్షణ స్థానము - ఆశ్రయము అయ్యెను. యమునివంటి అసురులెందరో తమ కళత్రములతో పుత్త్రులతో శస్త్రములతో మా(మ)యావిష్టములగు ఆయా గృహములందు ప్రవేశించిరి. వనమనేక సింహములతోవలెను మహా సముద్రమనేక నక్రములతో వలెను వీరులు అతి పౌరుషములతో వలెను శరీరము రోమములతో వలెను త్రిపుర దుర్గము బలశాలురగు దేవాసురులతో అధిష్ఠితమయి వ్యాప్తమయ్యెను. అది నూరులకోట్ల దైత్యులతో దట్టమయి కల్లోలిత మయి కనబడెను. ఆయా పర్వతములందుండు వారును దానవాలయమగు పాతాళభేదమయిన సుతలమందుండువారును అగు దానవులందరును ఈ అంతరిక్ష దుర్గము నాశ్రయించిరి.

ఈ త్రిపుర దుర్గమును చేరిన వారిలో ఎవరు ఏదికోరిన-వారికి అదెల్ల ఆ మయుడచట మాయతో అమర్చు చుండెను. చంద్రుడు వెలుగుచుండు ప్రదోషములందును పద్మములు వికసించిన సరస్సులందును మామిళ్ళు అందగించు ఆరామములందును తపోవన సదృశవనములందును అసురులు చందనములు పూసికొన్న ఒడళులతో నలుపు తెలుపు మచ్చలు కనబడు మదపుటేనుగులవలె కానవచ్చుచు శుద్ధములగు ఆభరణములు వస్త్రములు మాలలు మెయి పూతలు దాల్చి కామసమేతలై ప్రియుల వాంఛించుచు హావభావముల ప్రకటించు ప్రియురాండ్రగు స్త్రీలతో కూడి ముదితులగుచు దానవులందు సతతము ఆనందించుచుండిరి. మహాబలులగు ఆ అసురులు మయ నిర్మితమగు ఆ స్థానమున మోదించుచు తమ మతులను ధర్మార్థ కామములందు నిలిపి ప్రవర్తిల్లుచుండిరి. ఇట్లు పురుషార్థత్రితయమున ప్రవర్తిల్లుచుండు అమర వైరులకు ఆత్రిపుర దుర్గమున చాలకాలము స్వర్గమందువలె గడచెను. పుత్త్రులు తండ్రులను పత్నులు పతులను యత్న పూర్వకముగా శుశ్రూష చేయుచు కలహములు లేక పరస్పరము సానురాగులై యుండిరి. ఆత్రిపుర దుర్గవాసులలో అధర్మము కాని అనృతముకాని లేకుండెను. వారు ఆలయములందు హరునర్చించుచుండిరి. ఎల్లయెడల ఎల్లవేళల విప్రుల పుణ్యాహ ధ్వనులును ఆశీర్వాద శబ్దములును వినబడుచుండెను. మంజుల మంజీర రవములును వీణావేణు స్వనములును విహరించు వరనారీ జనులయు-దానవేంద్రులయు-హాసధ్వనులును వినవచ్చుచుండెను.

తేషా మర్చయతాం దేవా న్బ్రాహ్మణాంశ్చ నమస్యతామ్ ।
ధర్మకామార్థతన్త్రాణాం మహాన్కాలో వ్యజాయత. 16

లోభాదీనాం త్రిపురప్రవేశః.

* కదాచిదత్ర లోభశ్చ క్రోధ శ్చైవ తథైవచ । కలిశ్చ కలహశ్చైవ వివిశు స్త్రిపురం సహ. 17
సన్ధ్యాకాలే ప్రవిష్టాస్తే త్రిపురం చాసురాలయమ్ । బాధన్తే తే జనా న్ఘోరా శ్శరీరాణి యథాఽఽమయాః. 18

---

● స్వనశ్చ శఙ్ఖభేరీణాం వీణావేణురవా అపి. ○ పురాణగానశబ్దాశ్చ.

* మిథ్యాఽలక్ష్మీరసూయాచ బుభుక్షాచతథైవచ

సర్వఏవ నిశాన్తేతు సమయే త్రిపురేఽసురాః । † తానుత్పాతాం స్తథా దృష్ట్వా విమృశన్తిస్మ దానవాః. 19
ఉదితేతు సహస్రాంశౌ తేజ శ్శుభకరే రవౌ । మయ స్సభా మావివేశ భాస్కరాభా మివామ్బుజమ్. 20
మేరుకూటనిభే రమ్యే ఆసనే స్వర్ణమణ్డితే । ○ నివేశిత స్సభామధ్యే స్థిత స్తోయదరో యథా. 21

దానవానాం మయజ్ఞాపితయామినీదృష్టదుష్టస్వప్నాః.

పార్శ్వయో స్తారకాక్షశ్చ విద్యున్మాలీచ దానవౌ । ఉపవిష్టౌ మయస్యాన్తే హస్తినః కలభావివ. 22
తతోఽమరారయ శ్శిష్టా విశిష్టా స్సమరాఙ్గణే । ఉపవిష్టా దృఢం దృష్టా దేవానాం దేవరాడివ. 23
సర్వేషు దానవేన్ద్రేషు సుఖాసనగతేషుచ । మయో మాయాభిజనక ఇత్యువాచ స దానవాన్. 24
ఖేచరా దైత్యరాజానో భోభో దానవసత్తమాః । అసురా రాక్షసాశ్చైవ సర్వే దాక్షాయణీసుతాః. 25
నిశామయధ్వం యస్స్వప్నో మయా దృష్టో భయావహః ।
● త్రయశ్చ త్రిస్రః పురుషాః ప్రమదాశ్చ మహాబలాః. 26
మహాక్రోధా హ్యుగ్రముఖాః ప్రవిష్టా స్త్రిపురం దివా । ప్రవిశ్య రుషితా స్తేచ పురం చాతులవిక్రమాః. 27
ప్రవిష్టాశ్చ శరీరాణి భూత్వా బహుశరీరిణః । నగరం త్రిపురంచైవ తమసా సముపస్థితమ్. 28
సగృహం సహ ★యుష్మాభి స్సవాజిరథకుఞ్జరమ్ । ఉలూకచక్షుచ్చికా నారీ నగ్నాఽఽరూఢా ఖరాసనమ్.
సహస్త్రీభి ర్హసన్తీ సా చుమ్బతే ప్రమదా యథా । పురుషశ్చేన్దుతిలక శ్చతురక్షి స్త్రిలోచనః. 30
యేన సా ప్రమదా నూనం దృష్టా చాహం విబోధితః । ఈదృశీ ప్రమదా దృష్టా మయా చాతిభయావహా.

ఇట్లు త్రిపుర దానవులు దేవతల నర్చించుచు బ్రాహ్మణుల నమస్కరించుచు ధర్మ కామార్థాసక్తులై ప్రవర్తించుచుండ చాలకాలము గడచెను. ఇట్లుండ ఒకానొక సమయమున ఒకేమారు లోభము క్రోధము కలహము అనెడు కలి లక్షణములు త్రిపుర దుర్గమును ప్రవేశించెను. వారు అసురావాసమగు ఆ త్రిపురదుర్గమును సంధ్యాకాలమున ప్రవేశించి అది మొదలు వ్యాధులు శరీరమును వలె ఘోరరూపులయి జనుల బాధింపసాగిరి.

వేకువ సమయమున త్రిపుర దుర్గమందలి అసురులకును దానవులకును ఎల్లరకును ఉత్పాతములు కనసయ్యెను. వారవి తమలోతాము చెప్పుకొని విమర్శించుకొనసాగిరి. అంతలో సూర్యోదయమయ్యెను. రవి తన శుభకర తేజస్సులతో వెలుగుచుండెను. పద్మము రవి తేజస్సును వలె మయుడు సభను ప్రవేశించెను. అతడు మేరుపర్వత శృంగము వంటి సువర్ణ భూషిత పీఠమున సజలమగు మేఘమువలె కూర్చుండెను. మదపుటేనుగునకు రెండువైపుల రెండు గున్న ఏనుగులువలె అతనికి రెండువైపుల సమీపమునందు తారకాక్షుడును విద్యున్మాలియు కూర్చుండిరి. అంతంతలలో అమరారులును శిష్టులును సమరాంగణమున విశిష్టులనగువారు కీపిగ ఉపవిష్టులయిరి. వారినడుమ ఆ మయుడు దేవతల నడుమ దేవరాజువలెనుండెను.

దానవేంద్రు లందరును సుఖాసన గతులయిన యనంతరము మాయాజనకుడగు మయుడు వారితో నిట్లనెను. ఖేచరులగు దైత్యరాజులారా! దానవ సత్తములారా! అసురులారా! రాక్షసులారా! దాక్షాయణీ(దితి)సుతులారా! నేను గాంచిన భయావహస్వప్నము వినుడు. మహాబలము మహాక్రోధము ఉగ్రముఖము కల ముగ్గురు పురుషులును ముగ్గురు స్త్రీలును పగలే త్రిపురదుర్గమున ప్రవేశించిరి. అతులవిక్రములగు వారు రోషావిష్టులై బహుశరీరములు దాల్చి ఇచటి వారి శరీరములందు ప్రవేశించిరి. త్రిపుర నగరమంతయు మీరే కాదు-ఇండ్లే కాదు-రథాశ్వగజములే కాదు-అంతయు చీకటితో నిండిపోయెను. (గుడ్లగూబ

† స్వప్నే భయావహాన్ దృష్ట్వా విమృశన్తిస్మ దానవాః ○ ఆసీనః కాఞ్చనగిరేశ్శృఙ్గే తోయదరో యథా
● చతస్రః ప్రమదా స్తత్ర త్రయోమర్త్యాభయావహాః. ★ యుష్మాభిస్సాగరామ్బునిమజ్జితమ్.

ముక్కుకల దిసమొల స్త్రీ గాడిద నెక్కి కొందర స్త్రీలతో కూడి నవ్వుచు (అందరను) ముద్దు పెట్టుకొనుచుండెను. చంద్రుని తిలకముగా ధరించిన త్రిలోచనుడు-చతుష్పాదుడు నగు పురుష డొకడు స్త్రీని పోలినవాడు కనబడెను. వాడు బహుశః ఆ స్త్రీని చూచియుండును. అతడే నన్ను మేలుకొలిపెను. నా కిట్టి మహా భయంకరియగు స్త్రీ కనబడినది.

మయా చైవంవిధ స్స్వప్నో నిశాయాం దితిసన్దనాః। దృష్టః కథన్ను కష్టోఽయ మసుఖం నో భవిష్యతి. 32
యది వోఽహం క్షమో రాజా యదిదం వేత్థ నో హితమ్। నిబోధధ్వం సుమనసో నచానూయితు మర్హథ.
కామంచేర్ష్యాంచ రోషంచ త్యక్త్వా నియతమానసాః। సత్యే శమే దమే చాథ మునివాదేఽవతిష్ఠత. 34
శాన్తయశ్చ ప్రయుజ్యన్తాం పూజ్యతాంచ మహేశ్వరః।
యదినామాస్య స్వప్నస్య నైవం హ్యుపశమో భవేత్. 35
కుప్యతే నో ధ్రువం దేవో దేవదేవ స్త్రిలోచనః। యతోత్పాతాశ్చ దృశ్యన్తే సదాచ త్రిపురేఽసురాః. 36
కలహం వర్జయన్తశ్చ ఆర్జయన్త స్తథార్జవమ్। స్వప్నశాన్తిం ప్రతీక్షధ్వం కాలోదయ మథాపివా. 37

త్రైపురజనానామధర్మప్రవృత్తిః.

శ్రుత్వా దాక్షాయణీపుత్రా ఇత్యేవం మయభాషితమ్। క్రోధవ్యాకులనేత్రాశ్చ శిష్టాచారవినాశకాః. 38
*వినాశ ముపవశ్యన్తి అలక్ష్మ్యా వ్యాపితాఽసురాః। తత్రైవ దృష్ట్వా తేఽన్యోన్యం సక్రోధం లోహితేక్షణాః.
సద్యో దైవపరిధ్వస్తా దానవా స్త్రిపురాలయాః। హిత్వా సత్యంచధర్మంచ అకార్యా ణ్యుపచక్రముః. 40

నా కిట్టి కల రాత్రివేళ వచ్చుటకు ఫలముగా ఎట్టి సీచమగు అసుఖము మనకు సంభవించునో ఎరుగజాలను. మీకు నేను తగిన రాజననియు నేను చెప్పు ఈ మాట మీకు హితకరమనియు భావించినచో మీరు మంచి మనస్సులతో నా వచనమును గ్రహించుడు. దానియందు దోషములు పట్టుకొనవలదు. మీరు అందరును మనస్సులను నియమములందు నిలిపి కామమును రోషమును ఈర్ష్యను వదలి సత్య శమ దమములందును ముని వచనములందును మనస్సు లుంచుడు. శాంతు లాచరించుడు. మహేశ్వరు నర్చించుడు. నేను ఇట్లు చెప్పుచున్నానే కాని ఈ స్వప్నమునకు ఇట్లు కూడ ఉపశాంతి జరుగ దేమోః అసురులారాః ఈ త్రిపుర దుర్గమున నిరంతరముగా ఇట్టి ఉత్పాతములే కనబడుచుండుట బట్టి చూడగా దేవదేవు డగు త్రిలోచనుడే మనపై అలిగినట్లున్నది. ఏమయినను మీరు కలహము విడిచి ఋజుప్రవర్తన మవలంబించి స్వప్న శాంతి జరిపి ఆ శాంతి ఫలమును కాని అభ్యుదయకరకాలమును గాని ఎదురు చూచుచుండుడు.

దైత్యులు మయుని ఈ మాటలు విని క్రోధవ్యాకులిత నేత్రులును శిష్టాచార వినాశకులు నయిరి. అలక్ష్మీకాలము చేరువయైనందునను నాశము దాపురించినందునను వారందరును మయుని మాటలు సహించక క్రోధముతో కను లెఱ్ఱజేసి పరస్పరము చూచుకొనిరి. తత్క్షణము వారికి దైవము ప్రతికూలించెను; త్రిపుర దానవు లెల్లరును సత్యధర్మములను విడిచి అకార్యములు చేయ నంకల్పించి వాని నారంభించిరి.

ద్విషన్తి బ్రాహ్మణా న్పూజ్యా న్నార్చయన్తి స్మ దేవతాః।
గురూంశ్చైవావమన్యన్తే అన్యోన్యం చాపి చుక్రుధుః. 41
కలహేషు చ సజ్జన్తే అధర్మేషు రమన్తి చ। పరస్పరంచ నిన్దన్తి సదాచాప్రియవాదినః. 42
ఉచ్చైర్గురూ న్ప్రభాషన్తే నాభిభాషన్తి పూజితాన్। అకస్మాత్స్రస్తనయనా జాయన్తేచ సముత్సుకాః. 43
దధిసక్తూ న్పయశ్చైవ కపిత్థానిచ రాత్రిషు। భక్షన్తే శేరతేచాపి ఉచ్ఛిష్టా స్సంవృతా స్తథా. 44
మూత్రంకృత్వా న స్పృశన్తి అకృత్వా పాదశౌచనమ్। నిర్విశన్తిస్మ శయ్యాసు శౌచాచారవివర్జితాః. 45
సఙ్కుచన్తి భయాచ్చైవ మార్జారాణాం యథా ఖగాః। †భార్యాః పతీ న్వినిన్దన్తి తేఽపి పత్నీశ్చ నిర్ఘృణాః.

* అలక్ష్మీర్హ్రీః కలిః క్రోధానూయాప్రాప్తా స్తథాఽసురాః. † భార్యాంగత్వానశుద్ధ్య న్తిరహోవృత్తిమ.

పురా సుశీలా భూత్వాచ దుశ్శీలత్వ ముపాగతాః । దేవాం స్తపోధనాంశ్చైవ బాధన్తే త్రిపురాలయాః. 47
మహానాం బ్రాహ్మణానాంచ తే వినాశాయ రక్షసామ్ । విప్రియాణ్యేవ విప్రాణాం కుర్వాణాః కలహైషిణః.
వైభ్రాజకం వనంచైవ తథా చైత్రరథం వనమ్ । అశోకం చావరాశోకం సర్వర్తుకమథాపిచ. 49
స్వర్గంచ దేవతావాసం పూర్వదేవా బలాన్వితాః । ధ్వంసయన్తి స్వయం క్రుద్ధా స్తపోధనవనానిచ. 50
విధ్వస్తదేవాయతనాశ్రమాశ్చ సంభగ్నదేవధ్వజయూపకాశ్చ ।
జగద్బభూవామరరాజజుష్ట మక్షేమతం సర్వమపారిజ్యస్తైః. 51

ఇతి శ్రీమత్స్యమహాపురాణే త్రిపురోపాఖ్యానే త్రిపురవాసిభ్యో
మయోక్తదుస్స్వప్నదర్శనాది కథనం నామైకోన
త్రింశదుత్తరశతతమోఽధ్యాయః.

నాటినుండి త్రిపుర దానవులు బ్రాహ్మణుల ద్వేషించసాగిరి. దేవతల నర్చించుట మానిరి. పెద్దల నవమానింప సాగిరి. పరస్పరము క్రుద్ధులగుచుండిరి. కలహాసక్తులగుచుండిరి. అధర్మము లాచరించి ఆనందించుచుండిరి. పరస్పరము నిందించుకొనుచుండిరి. సదా అప్రియములు పలుకుచుండిరి. గురువులతో బిగ్గరగా మాటలాడుచుండిరి. పూజ్యులతో (ఆదరముతో కాదు-మొదలే) మాటలాడకుండిరి. అకస్మికముగా తహతహపాటు చెంది కన్నీరు కార్చుచుండిరి. రాత్రు లందు పెరుగుతో సక్తువును (పేలపిండిని) త్రావుచు వెలగవండు తినుచు నుండిరి. (ఇవి రాత్రులందు తినుటయు త్రాగు టయు నిషిద్ధము) ఎంగిలిగా ఉండియే ఆహారము తినుచు నిండు మునుగుతో పండుకొని నిద్రించుచు ఉండిరి. మూత్ర విసర్జనమయిన తరువాత ఉదకోపస్పర్శనము చేయకయే కాళ్లయిన కడుగుకొనకయే శౌచము కాని సదాచారము కాని పాటించకయే శయ్యలవయి నిద్రించుచుండిరి. పిల్లులనిన పశులు ముడుచుకొని పోవునట్లు ఏ కొంచెము భయకారణమున కును ముడుచుకొని పోవుచుండిరి. పత్నులు పతుల నిందించుచుండిరి. పతులు పత్నులయందు నిర్దయులయిరి. త్రిపుర వాసి దానవు లొకప్పుడు సుశీలురుగా నున్నవారే ఇపు డిట్లు దుశ్శీలు రయిరి. దేవతలను తపోధనులను బాధించుచుండిరి. రాక్షసులకు వినాశము దాపురించినందున వారు యజ్ఞములకు విఘాతములను బ్రాహ్మణులకు విప్రియములను ఆచరించుచు విప్రులతో కలహించుచుండిరి. వైభ్రాజక చైత్రరథాశోక వరాశోక సర్వర్తుక వనములను తపోధన వనములను బలాన్విత లగు దానవులు క్రుద్ధులగుచు ధ్వంసము చేయుచుండిరి.

వా రిట్లు దేవాలయములను ఆశ్రమములను ధ్వంసము చెయగా దేవాలయ ధ్వజములను యూపస్తంభములను విరుగగొట్టగా జగత్తు అంతయును-అమర రాజావాసమగు స్వర్గము కూడ-దేవ శత్రువులచె ఉపద్రవముల పాలయ్యెను.

ఇది శ్రీమత్స్య మహాపురాణమున త్రిపురోపాఖ్యానమున దానవుల త్రిపుర దుర్గ ప్రవేశము-దుఃస్వప్న దర్శనము-
దానవుల దుర్వర్తనమునను నూట ఇరువది తొమ్మిదవ అధ్యాయము.

## త్రింశదుత్తరశతతమోఽధ్యాయః.

## దేవకృతమహేశ్వరస్తవః.

సూతః : సుశీలేషు ప్రదుష్టేషు దానవేషు దురాత్మసు । లోకేషూత్సాద్యమానేషు తపోధనవనేషుచ. 1
సింహనాదేన దైత్యానాం భయభీతేషు జన్తుషు । త్రైలోక్యే భయసమ్మూఢే తమోఽన్ధత్వ ముపాగతే. 2
ఆదిత్యా వసవ స్సాధ్యాః పితరో మరుతాం గణాః । భీతాశ్చ శరణం జగ్ముర్బ్రహ్మాణం ప్రపితామహమ్. 3

బ్రహ్మదర్శనార్థం అదిత్యాదిదేవతానాం సత్యలోకగమనమ్.

తేతు స్వర్ణామ్బుజాసీనం దదృశు స్సముపాగతాః । తే తమూచుశ్చ సహితాః ప్రణమ్య ప్రపితామహమ్. 4
దేవాః: వరదృప్తా స్తవైతే చ దానవా త్రిపురాలయాః । బాధన్తేఽస్మా న్యథాదేవ ప్రేష్యాన్వై స్వామినోఽనఘ.

చరామః పృథివీం సర్వాం మృగా స్సింహభయా దివ ।
దానవానాం భయా త్తద్వ ద్బ్రహ్మామాః ప్రపితామహ. 6
పుత్త్రాణాం నామధేయాని కళత్రాణ్యమరాధిప। దానవై ర్భామ్యమాణానాం విస్మృతానిహ నోఽనఘ. 7
దేవవేశ్మప్రభఙ్గాశ్చ ఆశ్రమభ్రంశనానిచ । దానవై ర్లోభమోహాన్ధైః క్రియన్తే పాపబుద్ధిభిః. 8
యది న త్రాయసే లోకాన్ దానవేభ్యశ్చ విద్రుతాన్ । ప్రేక్ష్యస్యకాలే నిర్దేవం నిర్మానుష మిదం జగత్. 9
ఇత్యేవం త్రిదశైరుక్తః పద్మయోనిః పితామహః । ప్రత్యాహ త్రిదశా న్సేంద్రా న్నిన్దుతుల్యాననప్రభాన్. 10
దానవానాం వినాశాయ తథా మతిమతాంవరాః । తస్మా ద్ద్వారశ్చ సమ్ప్రాప్తో యః పురోక్తో మయాఽమరాః.
తచ్చ తేషా మధిష్ఠానం త్రిపురే త్రిదశర్షభాః । ఏకేషుపాతమోక్షేణ హన్తవ్యం తత్పురం యతః. 12
భవతాంచ న పశ్యామి ఏకమ వ్యమరర్షభాః । యస్త్వేక ప్రహారేణ పురం హన్యా త్సదానవమ్. 13
త్రిపురా ణ్యాత్మవీర్యేణ శక్తం హన్తుం శరేణతు । ఏకం ముక్త్వా మహేశానం మహాదేవం జగత్పతిమ్. 14

## నూట ముప్పదవ అధ్యాయము.
## దానవులచే బాధితులగు దేవతలు మహేశుని స్తుతించుట.

అంతవరకును సుశీలురుగా నుండిన త్రిపుర దుర్గస్థులగు దైత్యులు దానవులు ఇట్లు దుష్టులును దురాత్ములు నయిరి. వారు లోకములను నాశము చేయసాగిరి. తపోధనుల తపోవనములను పెకలింపసాగిరి. దైత్యుల సింహనాదముతో ప్రాణులు భయభీతములు కాసాగెను. త్రైలోక్యమును భయముతో సమ్మోహితమై చీకటిలో కన్నులు కనబడ నట్లయ్యెను. అంతట ఆదిత్యులు వసువులు సాధ్యులు పితరులు మరుద్గణములు భీతులయి లోకప్రపితామహుడగు బ్రహ్మను శరణు వేడబోయిరి. వారు సువర్ణ కమల పీఠమున ఆసీనుడయి యున్న ప్రపితామహుని సమీపించి దర్శించి అందరు నొక్కటిగ నమస్కరించి ఇట్లు పలికిరి: దేవా! నీ వరములచే దర్పించి ఈ త్రిపుర దుర్గావాసులగు దానవులు ప్రభువులు తమ సేవకులను బాధించినట్లు మమ్ముల బాధించుచున్నారు. వారి భయమున మేము సింహములకు భయపడు మృగముల వలె పృథివి యందంతట తిరుగుచున్నాము. వారి భయముతో తిరుగు మాకు మా పత్నీ పుత్త్రుల పేరులు కూడ జ్ఞప్తిలో లేకుండ పోయినవి. లోభమోహాంధులు పాపబుద్ధులు నయి వారు దేవాలయములను దేవతా భవనములను ఆశ్రమములను నాశము చేయుచున్నారు. దానవుల ఉపద్రవముల నుండి నీవు మమ్ము కాపాడనిచో త్వరలోనే జగమున దేవతలు కాని మానవులు కాని ఒక్కడును లేకపోవుట నీవే చూడగలవు.

ఇట్లు పలికిన చంద్రుని వంటి ముఖకాంతులుగల దేవతల వచనములు విని పద్మ భవుడగు బ్రహ్మ వారితో ఇట్లనెను: దేవతలారా! మీరును గొప్ప బుద్ధిమంతులు కదా! ఆలోచింపుడు. నేను వారితో వరప్రదాన సమయమున పలికి నట్లు వారి నాశమునకు ద్వారభూతమగు సమయము దగ్గరకు వచ్చినది. కాని నే ననినట్లు వారి త్రిపుర దుర్గమును ఒకే బాణముతో కొట్టగలవారు పరమేశ్వరుడు తప్ప మీలో నొక్కరును నున్నట్లు నాకు కనబడుట లేదు. జగత్పతియు మహేశ్వరుడు మహాదేవుడు నగు శివునను తప్ప ఇతరులకు ఈ త్రిపుర దుర్గమును ఒకే బాణముతో ఒకే మారు ఆత్మవీర్యముతో వధగొట్టుట శక్యమా?

తే యూయం యది మన్యధ్వం క్రతు విధ్వంసకం హరమ్ ।
యాచామ స్సహితా దేవం త్రిపురం స హనిష్యతి. 15
కృతః పురాణాం విష్కమ్భో యోజనానాం శతం శతమ్ ।
యథా చైకప్రహారేణ హన్యాదేవం మయం న తు. 16
పుష్యయోగేన యుక్తాని క్షణమేకస్థితానితు । పురాణ్యేకప్రహారేణ ధక్ష్యతీతి త్రిలోచనః. 17

తతో దేవేశ్వరః ప్రోక్తో యాస్యామ ఇతి దుఃఖితైః । పితామహ స్సురై స్సార్ధం భవనం సద మాగతః. 18

ఈశ్వరదర్శనార్థం బ్రహ్మాదిదేవతానాం కైలాసగమనమ్.

తే భవం భూతభవ్యేశం ○జగత్సంహారకం ప్రభుమ్। పశ్యన్తి స్మోమయా సార్ధం నన్దినాచ మహాత్మనా.19

అగ్నివర్ణమయం దేవ మగ్నిపుఞ్జనిభేక్షణమ్ । అగ్న్యాదిత్యసహస్రాభ మగ్నివర్ణవిభూషణమ్. 20

చన్ద్రావయవలక్ష్మాణం చన్ద్రసౌమ్యతరాననమ్ । అగమ్యం త మజం దేవం మదనారిం త్రిలోచనమ్. 21

బ్రహ్మాదిదేవకృతమహాదేవస్తుతిః.

సర్వేషాం సర్వదం శమ్భుం గోపతిం పార్వతీపతిమ్ ।

దేవాః : నమో భవాయ శర్వాయ రుద్రాయ వరదాయ చ. 22

పశూనాం పతయే నిత్య ముగ్రాయచ కపర్దినే । మహాదేవాయ భీమాయ త్ర్యమ్బకాయ విశామ్పతే. 23

ఈశ్వరాయ భగఘ్నాయ నమ స్త్వన్ధకఘాతినే । నీలగ్రీవాయ భీమాయ వేధసే వేధసాం పతే. 24

కుమారశత్రువిఘ్నాయ కుమారజననాయచ । విలోహితాయ ధూమ్రాయ ధరాయ క్రథనాయచ. 25

నిత్యం నీలశిఖణ్డాయ శూలినే దివ్యశాయినే । ఉరగాయ సునేత్రాయ హిరణ్యవసురేతసే. 26

అచిన్త్యా యామ్బికాభర్త్రే సర్వదేవస్తుతాయ చ । వృషధ్వజాయ * చణ్డాయ జటినే బ్రహ్మచారిణే. 27

తప్యమానాయ సలిలే బ్రహ్మణ్యాయాజితాయచ । విశ్వాత్మనే విశ్వసృజే విశ్వమావృత్య తిష్ఠతే. 28

నమోఽస్తు దివ్యసేవ్యాయ ప్రభవే సర్వసమ్పదామ్। అభిగమ్యాయ కామ్యాయ †నవ్యాహారాయ సర్వదా.29

భక్తానుకమ్పినే తుభ్యం దిశతే జన్మనో గతిమ్. 29u

ఇతి శ్రీమత్స్యమహాపురాణే త్రిపురోపాఖ్యానే దేవకృత మహేశ్వర స్తవాది

కథనం నామ త్రింశదుత్తర శతతమోఽధ్యాయః.

కనుక మీరందరు నరే అనినచో మనమందరమును పోయి క్రతు విధ్వంసియగు హరుని వేడుకొందము. అతడు త్రిపుర దుర్గమును నశింపజేయును. ఆ మయుడు త్రిపురములను తను ఒకే ప్రహారముతో కొట్టుట శక్యము కాకుండునట్లు ఒక్కొక్క పురపు విష్కంభముగాని ఒక పురమునకు మరియొక పురమునకు అంతరముకాని నూరేసి యోజనములుండునట్లు వానిని నిర్మించినాడు. వాడు వానిని పుష్యయోగమున నిర్మించెను. త్రిలోచనుడగు శివుడైనచో ఒకే బాణమున పుష్యయోగమునందే అన్నిటి నొకేమారు క్షణమున దహించగలడు. (విష్కంభము = నడిమి కొలత)

దైత్యభయ దుఃఖితులగు దేవతలును 'అట్లే పోదము' అనగా బ్రహ్మయు వారితో కలిసి శివుని కొలువునకు పోయెను. వారచట శివుని దర్శించిరి. ఆదేవుడు భూతభవ్యేశుడు; జగత్సంహారకర్త; ఉమతో నందితో కూడి అగ్ని వర్ణమయ దేహముతో అగ్నిరాశి సమాననయనములతో అగ్నివర్ణ విభూషణములతో వేలకొలది అగ్నులవలె సూర్యులవలె ప్రకాశించుచు చంద్రుని అవయవ లక్షణములు చంద్రునివలె సౌమ్యమగు ముఖము కలిగియుండెను. ఆతడు అగమ్యుడు అజుడు ప్రకాశమానుడు మదన శత్రువు త్రినేత్రుడు ఎల్లరకు ఎల్ల కోరికల తీర్చువాడు సుఖకరుడు సర్వలోక పతి పార్వతీపతి.

ఇట్టి శివుని దర్శించి దేవత లా దేవు నిట్లు స్తుతించిరి. (ఇది మాతృకా సంఖ్యతో ఏకపంచాశన్మాతృక మగు స్తోత్రము) భక్తులకు శుభకరుడు పాపులకు హింసకుడు బాధల తొలగించువాడు వరమొసగువాడు జీవుల కధిపతి భయంకరుడు జటాజూటధారి మహాదేవుడు దుష్టులకు భయంకరుడు త్రినేత్రుడు ప్రజాధిపతి ఈశ్వరుడు భగుడను

○ గిరిశంశూలపాణినమ్

* ముణ్డాయ.

† స్తుత్యాయార్యాయె.

ఆదిత్యుని కొట్టినవాడు అంధకుని చంపినవాడు నీలకంఠుడు సూర్యాదులచే కూడ భయముతో పనులు చేయించువాడు లోకకర్తలకును కర్తలకును అధిపతి కుమారస్వామికి శత్రువులగువారి నశింపజేయువాడు కుమారస్వామికితండ్రి విశేషముగా జటాజూటమును ఎర్రనివాడు ధూమ్రవర్ణుడు లోకముల ధరించువాడు పాపుల నరకువాడు నీలకేశుడు శూలధారి దివ్య శయనుడు ఉరగభూషణుడు సునేత్రుడు హిరణ్యము వసువు రేతస్సుగాగల అగ్నిస్వరూపుడు అచింత్యుడు అంబికా భర్త సర్వదేవస్తుతుడు వృషభధ్వజుడు దుష్టుల విషయమున కోపి జటాధారి బ్రహ్మచారి జలములందుండి తపమాచరించు చుండువాడు బ్రహ్మతత్త్వవేత్త అజితుడు విశ్వస్వరూపుడు విశ్వస్రష్ట విశ్వమందావరించియుండువాడు దివ్యుల సేవలందు కొనువాడు సర్వసంపదలకు ప్రభువు ఆశ్రయింపదగినవాడు కోరికలు వేడదగినవాడు ఎల్లపుడు పనిలో మునిగియుండు వాడు భక్తానుకంపి జన్మమునకు తగిన ఉత్తమగతి నిచ్చువాడునగు దేవా నీకు నమస్కారము.

ఇందు దేవతాకృతశివస్తుతి మాతృకా (ఏకపంచాశత్) సంఖ్యాకముగానున్నది. ఇందలి మూల భూత భావనను ఇట్లు ఊహించవచ్చును : వాఙ్మయమంతయు ఏకపంచాశన్మాతృకా (వర్ణసమామ్నాయ) మయము. అ-నుండి అః-వరకు పదునారు; క-నుండి-మ-వరకు ఇరువదియైదు; య-ర-ల-వ-శ-ష-స-హ-ళ-క్ష-పది; మొత్తము ఏబదియొకటి. కావుననే శబ్దబ్రహ్మరూపయగు శ్రీదేవిని మాతృకారూపనుగా ఉపాసింతురు. కావున ఇట్లు మాతృకా సంఖ్యాకనామములతో స్తుతించుట సమస్త వాఙ్మయముతో స్తుతించు టయు శబ్ద రూపయగు పరమేశ్వరికిని పరమేశ్వరునకును అర్థ (సమస్త జగద్) రూపుడగు అభేదమును భావనచేసి సకల బ్రహ్మతత్త్వమునుపాసించుటయునగును. ఇది సాధకులకు సకలార్థ సాధకము.

**ఆ నామావళి ఈ విధముగ నున్నది :**

ఓం భవాయనమః
శర్వాయ
రుద్రాయ
వరదాయ
పశూనాంపతయే
ఉగ్రాయ
కపర్దినే
మహాదేవాయ
భీమాయ
త్ర్యంబకాయ 10
విశాంపతయే
ఈశ్వరాయ
భగఘ్నాయ
అంధకఘాతినే
నీలగ్రీవాయ
భీమాయ
వేదసే
వేదసాం పతయే
కుమారశత్రునిఘ్నాయ
కుమారజననాయ 20
విలోహితాయ
ధూమ్రాయ
ధరాయ
క్రథనాయ
నీలశిఖండాయ
శూలినే
దివ్యశాయినే
ఉరగాయ
సునేత్రాయ
హిరణ్యరేతసే 30
వసురేతసే
అచింత్యాయ
అంబికాభర్త్రే
సర్వదేవస్తుతాయ
వృషధ్వజాయ
చండాయ
జటినే
బ్రహ్మచారిణే
సలిలే తప్యమానాయ
బ్రహ్మణ్యాయ 40
అజితాయ
విశ్వాత్మనే
విశ్వసృజే
విశ్వం ఆవృత్య తిష్ఠతే
దివ్యసేవ్యాయ
సర్వసంపదాం ప్రభవే
అభిగమ్యాయ
కామ్యాయ
సర్వదా సవ్యాహారాయ
భక్తానుకంపినే
జన్మనః-గతిం-దిశతే-
తుభ్యం నమః.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున త్రిపురోపాఖ్యానమున బ్రహ్మాదిదేవతలు మహేశుని స్తుతించుటయను నూట ముప్పదియవ అధ్యాయము.

## ఏకత్రింశదుత్తరశతతమోఽధ్యాయః.

## ఈశ్వరస్య త్రిపురవిజయాయ ప్రస్థానమ్.

సూతః : బ్రహ్మాద్యై స్తూయమానస్తు దేవదేవో మహేశ్వరః ।
వాచస్పతి మువాచేదం దేవానాం క్వ భయం మహత్. 1
మహేశ్వరః : భోభో దేవా స్స్వాగతం వో బ్రూత యద్ధి మనోగతమ్ ।
యద్దేయం వాఽప్యదేయం వా నాదేయంచ మయా హి తత్. 2
యదభీష్టం భవత్కామం తద్దదామి సురర్షభాః । యుష్మాకమిహ ముఖ్యానాం కృతేఽహం విబుధర్షభాః. 3
చరామి మహదత్యుగ్రం యచ్చాపి పరమం తపః । యుష్మద్ద్వేష్యామమద్వేష్యాః కష్టాః కష్టతరా మమ. 4
తథా మద్భవ మాపన్నో యుష్మాకం భవ ఏవచ । తఏవ ముక్తా దేవేన ప్రేమ్ణా సబ్రహ్మకా స్సురాః. 5
రుద్రమాహు ర్మహాభాగా భాగార్హా స్సర్వఏవతు ।
దేవాః : భగవన్ దానవై స్తప్తం రౌద్రం రౌద్రపరాక్రమైః. 6
లోకేషూత్పాట్యమానేషు త్వాం వయం శరణం గతాః । మయోనామ దితేఃపుత్ర స్త్రినేత్రః కలహప్రియః. 7
త్రిపురం యేనత ద్దుర్గం కృతం పాణ్డురగోపురమ్ । తదాశ్రిత్య పరందుర్గం దానవా వరనిర్భయాః. 8
బాధన్తేఽస్మా న్మహాదేవ ప్రేష్యాన్వై స్వామినో యథా । ఉద్యానానిచ భగ్నాని నన్దనాదీని యానిచ. 9
వరా శ్చాప్సరస స్సర్వా రమ్భాద్యా దనుజైర్హృతాః । ఇన్ద్రౌపవాహ్యాశ్చ గజాః కుముదాఞ్జనవామనాః 10
ఐరావణో యథావాహ్యం దేవానాంచ మహేశ్వర । యే చన్ద్రమూహు ర్హి హయా స్తేపి సర్వే హృతాస్తు తైః.
జాతాస్తు దానవానాం తే రథయోగ్యా స్తురఙ్గమాః ।
యే రథా యే గజా యేఽశ్వా యా స్స్త్రియో యచ్చ నో వసు. 12
తచ్చాప్యపహృతం దైత్యై స్సంశయో జీవితే పునః । త్రినేత్ర ఏవముక్తస్తు దేవై శ్శక్రపురోగమైః. 13
ఉవాచ దేవాన్ దేవేశో వరదో వృషవాహనః ।

## నూట ముప్పది ఒకటవ అధ్యాయము.

## ఈశ్వరుడు త్రిపుర విజయమునకై సన్నాహముతో బయలు వెడలుట.

సూతు డిట్లు చెప్పనారంభించెను: బ్రహ్మాదులు తన్నిట్లు స్తుతించుచుండ దేవదేవుడు అగు మహేశ్వరుడు బ్రహ్మనుద్దేశించి 'దేవతలకు మహాభయ మెచటి వలన?' అనియడిగి ఇంకను ఇట్లు పలికెను: దేవతలారా! మీకు స్వాగతమా! మీమనోగతమేమో చెప్పుడు. అది ఈయదగినదగుగాక-ఈయరానిదగుగాక: నాకు మాత్రమది ఈయ రానిదికాదు. సురశ్రేష్ఠులారా! మీరు కోరు అభీష్టమేదైనను అది తప్పక ఇత్తును. నేను ఆచరించు మహోగ్ర తపము కూడ మీకొరకే. మీకు ద్వేష్యులు నాకును ద్వేష్యులే; వారు నాకు నీచులు నీచతరులు కూడ: అట్లే మీకు శుభమగు విషయము నాకును శుభమయినదే.

ప్రీతితో శివుడిట్లు పలుకగా యజ్ఞమున భాగార్హులగు బ్రహ్మాది దేవతలందరును రుద్రునితో ఇట్లనిరి: భగవన్! రౌద్ర (భయంకర) పరాక్రములగు దానవులు రౌద్రముగు తపమాచరించి తద్బలమున లోకములనే నిర్మూలించుచుండ భయమంది నిన్ను శరణు చొచ్చితిమి. త్రినేత్రా! మయుడను కలహప్రియుడగు దైత్యుడు దాజార్హములగు శ్వేత గోపురములుగల త్రిపుర దుర్గము నిర్మించెను. శ్రేష్ఠమగు ఆ దుర్గమాశ్రయించి దానవులు వర ప్రభావమున నిర్భయులై ప్రభువులు తమ సేవకులనువలె మమ్ము బాధించుచున్నారు. వారు నందనాది వనములు భగ్నమొనర్చినారు. శ్రేష్ఠులగు రంభాద్యప్సరసలనెల్ల హరించినారు. ఇంద్రుని వాహనములగు ఐరావత కుముదాంజన వామనములను చంద్రుడు

చతుర్వర్ణా స్సలీలాశ్చ బభూవు ర్వర కుణ్డలాః। తద్యుగం యుగసఙ్కాశం రథశీర్షే ప్రతిష్ఠితమ్. 30
ధృతరాష్ట్రేన నాగేన బద్ధం విషవతా మహత్ । ఋగ్వేదా స్సామవేదాశ్చ యజుర్వేదా హ్యథర్వణాః. 31
వేదా శ్చత్వారఏవైతే చత్వారశ్చ తురఙ్గమాః। అన్నదానపురోగాణి యాని దానాని కానిచిత్. 32
తా న్యాస న్వాజినాం తేషాం భూషణాని సహస్రశః। పద్మద్వయం తక్షకశ్చ కార్కోటకధనంజయౌ.33
నాగా బభూవు రేవైతే హయానాం దృఢబన్ధనాః। ఓఙ్కారప్రభవా స్సోమా స్సర్వాశ్చైవ క్రతుప్రియాః. 34
ఉపద్రవాః ప్రతీహారాః పశుబన్ధే ష్వవస్థితాః। యజ్ఞోపవాహ్యా న్యేతాని తస్మి న్లోకరథే శుభే. 35
మణిముక్తాప్రవాళాని భూత్వాచైవ సహస్రశః। ప్రతోదం ప్రణవశ్చాసీ త్తదగ్రేచ వషట్కృతమ్. 36
సినీవాలీ కుహూ రాకా తథా భానుమతీ శుభా। యోక్త్రాణ్యాసం స్తురఙ్గాణా మపసర్పణవిగ్రహాః. 37
కృష్ణాన్యపిచ పీతాని నీలమాఞ్జిష్ఠకానిచ। వ్యజనాని పతాకాస్స్వైర్బభూవుః పవనేరితాః. 38
చతుర్భి శ్చిత్రితం షడ్భి ర్ధను స్సంవత్సరోఽభవత్। అజరా జ్యాఽభవచ్చాపి సా త్త్వికి ధనుషో దృఢా. 39
కాలోహి భగవా న్రుద్ర స్తంచ సంవత్సరం విదుః। తస్మా దుమా కాళరాత్రీ ధనుషో జ్యాఽజరాఽభవత్.
సమర్థ స్త్రిపురం దగ్ధుం భగవా న్నీలలోహితః। స ఇషు ర్విష్ణుసోమాగ్ని త్రిదైవతమయోఽభవత్. 41
ఆననం హ్యగ్ని రభవ చ్ఛల్య స్సోమః శిఖా హరిః। తేజసో స్తేజయామాన ఇషో స్తేజో యథాఽభవత్. 42
తస్మి న్ఛరాగ్రే సఙ్క్రుద్ధో వాసుకి ర్నాగపార్థివః। తేన సంహరణార్థాయ ముమోచాశీవిషం జ్వలత్. 43

సురస-సరమ-కద్రువ-వినత-శుచి-తృష్ణ-బుభుక్షా- ఉగ్రవేదన-చిత్రసంభవ-బ్రహ్మహత్య- గోహత్య-అశ్వహత్య మొదలగు భయానకతత్త్వములు గదలుగా శక్త్యాయుధములుగా నయి రథమున నిలిచెను. కృతయుగము కాడి-చాతుర్హోత్ర యజ్ఞము సారథికూర్చుండుస్థానము-చతుర్వర్ణములు విలాసవంతములగు వన్నెల కుండలములు అయ్యెను. కృతయుగము వలె ధర్మయుతమై ప్రకాశించు ఆ గొప్పకాడిని రథశీర్షమున (అగ్రభాగమున) నిలిపి విషవంతుడగు ధృతరాష్ట్ర నాగునితో బంధించిరి. ఋక్సామయజు రాథర్వణవేదములు నాలుగు గుర్రము లయ్యెను. అన్నదానాది దానములు అశ్వములకు వేల కొలది భూషణము లయ్యెను. పద్మమహాపద్మలు తక్షకుడు కర్కోటకుడు ధనంజయుడు అను నాగులు గుర్రములను కట్టి వేయు పగ్గము లయ్యెను. ఓంకారమునుండి జనించిన క్రతుప్రియములగు సర్వస్తోమములును పశుబంధ యజ్ఞములందు వినియుక్తమగు ఉపద్రవ ప్రతీహారాదికముల ఉపవాహ్యములు ఇవన్నియు వేలకొలది మణులు ముత్తెములు పగడములు మొదలగునవి అయ్యెను. ప్రణవము కొరడా వషట్కారము ఆకారడాకొన-సినీవాలీ (చంద్రదర్శనము కల అమావాస్య కుహూ (చంద్రదర్శనములేని అమావాస్య) రాకా (నిండు పున్నమ) భానుమతి (సూర్యు డస్తమించుటకు ముందే చంద్రో దయమగు పూర్ణిమ-ఇట్టి పర్వతిథులన్నియు గుర్రములను కాడితో కట్టు యోక్త్రము లయ్యెను. నల్లనివి పచ్చనివి నీలవర్ణము కలవి మాంజిష్ఠ(ఎర్రని) వర్ణముకలవియగు వ్యజన(పవిత్ర)ములు (యజ్ఞములందుపయోగించు విసన కర్రలు) గాలిలో రెపరెపలాడు జెండా లయ్యెను. నాలుగు ఋతువులలో (వసంత గ్రీష్మము లొకటిగా హేమంత శిశిరము లొకటిగా లెక్కించగా) (ఆరు ఋతువులతో) చిత్రించబడిన సంవత్సరము ధను వయ్యెను. కాలాంశము లన్నియు గట్టి అంబక (బాణ)ముల మొనలు అయ్యెను. భగవానుడగు రుద్రుడు సాక్షాత్కాలమూర్తియగు సంవత్సరమే. అందుననే సత్త్వ రూపఉమ కాళరాత్రిరూప కావున ఆమె వింటి నారి యయ్యెను. భగవానుడగు నీలలోహితమూర్తి త్రిపురముల దహించ సమర్థుడగు వీరు డయ్యెను. విష్ణు సోమాగ్ని దేవతాత్రయము ఒకటయి ప్రధాన బాణ మయ్యెను. అగ్ని రథికూర్చుండు ఆసనము-సోముడు పీఠమును రథముతో బిగించు చీల(శల్యము) విష్ణువు; ఆ ఆసనపు శిఖాభాగము బాణమునకు ఆయా తేజస్సులతో పదును పెట్టిరి. బాణపు మొనయందు నాగరాజగు వాసుకి శత్రు సంహార సమర్థమగు తన కోరలయందలి జ్వలించు విషమును విడిచెను.

కృత్వా భూమిం రథశ్రేష్ఠం దివ్యం దివ్యప్రభావతః। లోకాధిపతి మభ్యేత్య ఇదంవచన మబ్రువన్. 44
సుకృతోఽయం రథోఽస్మాభి స్తవ గీర్వాణశత్రుహన్। ఇమ మాస్థాయ త్రిపురం దహ ప్రదహాతాం వర.45

తం మేరుశిఖరాకారం త్రైలోక్యం రథరూపిణమ్ । ప్రశస్య దేవతాస్తాశ్చ రథం పశ్యతు శఙ్కరః. 46
ముహూర్తదృష్ట్వా రథం సాధు హృష్టో విషమలోచనః । ఉవాచ సేన్ద్రాన్ సమరా నమరాధిపతి స్స్వచః. 47
సుకృతోఽయం రథః క్లుప్తో యుష్మాభి ర్మమ దేవతాః । ఈదృశే రథసమ్పత్తి ర్యన్తా శీఘ్రం విధీయతామ్.
ఇత్యుక్తా దేవదేవేన దేవా విద్ధా ఇవేషుభిః । అవాపు ర్మహతీం చిన్తాం కథం కార్యం భవేదితి. 49
మహాదేవస్య దేవోఽన్యః కో నామ సదృశో భవేత్ । ముక్త్వా చక్రాయుధం దేవం సోఽప్యస్య ఇషుమాశ్రితః.
ధురి యుక్తాఽవశీద్యన్తో ఘటన్తఇవ పర్వతైః । సారథి స్త్వత్ర కశ్చస్యా దితిచాన్యోన్య మబ్రువన్. 51
వేదాశ్చ దృశ్యతే దేవై ర్లోకనాథస్య ధూర్జటేః । అహం సారథిరిత్యుక్త్వా జగ్రాహాశ్వాం స్తతో హ్యజః. 52
తతో దేవైశ్చ గన్ధర్వై స్సింహనాదో మహాన్కృతః । ప్రతోదహస్తం తం దృష్ట్వా ఆరురోహ రథం హరః. 53

త్రిపురసంహారార్థమీశ్వరప్రస్థానమ్.

ఆరోహతి రథం దేవే అశ్వా హరభరాతురాః । జానుభిః పతితా భూమౌ రజో జగృహు రేవచ. 54
వేదాన్ దృష్ట్వాఽథ దేవశ్చ న భీమా స్స్వర్వసంస్థితాన్ । ఉజ్జహార పితౄన్ సర్వాన్ సుపుత్రఇవ దుఃఖితాన్.
తత స్సింహరవో భూయో బభూవ రణభైరవః । జయశబ్దశ్చ దేవానాం సమ్బభూవాద్భుతోపమః. 56

ఇట్లు దేవతలు తమ దివ్య ప్రభావముతో భూమిని రథశ్రేష్ఠమునుగా చేసి లోకాధిపతియగు శివుని కడకు వచ్చి ఇట్లు పలికిరి: దేవ శత్రువుల సంహరించ సంకల్పించిన దేవా! ఇదిగో! ఈ రథమును చక్కగా నిర్మించినాము. దహన మొనర్చుటలో నేర్పరివగు నీవు దీని నారోహించి త్రిపుర దుర్గమును దగ్ధ మొనర్చుము. ఈ రథమును శంకరుడు చూడ వలయునను కోరికతో మేరుశిఖరాకారమును త్రైలోక్యాత్మకమును నగు రథమును ఇట్లు వారు ప్రశంసించగా విషమలోచను డగు ఆ శివుడు ఆ రథమును మాటిమాటికి చూచి చూచి మిగుల హర్షము నెందెను. దేవాధిపతియగు ఆ శివుడు ఇంద్రాది దేవతలతో ఇట్లు పలికెను. దేవతలారా! నాకై మీ రీ రథమును బాగుగా నిర్మించితిరి. ఇంత యోగ్యత కలిగిన రథము నకు యోగ్యుడవు సారథిని త్వరగా ఏర్పాటు చేయుడు. ఈ మాట వినిన దేవతలు బాణముల దెబ్బలు తిని నట్లయిరి. ఇప్పు డేమి చేయవలయునని వారు చింతిల్ల సాగిరి. మహాదేవునకు సాటియగు వాడు సారథిగా నుండదగినవాడు విష్ణువు తప్ప మరెవ్వరును లేరు. అతడో-బాణము నాశ్రయించియున్నాడు. అని ఆలోచించుచు వారు బరువున పూన్చిన ఎద్దుల వలె కొండతో డీకొనిన వృషభములవలె నిట్టూర్పులు విడువసాగిరి. అంతలో వారు బ్రహ్మదేవుని చూచిరి. లోకనాథు డగు ధూర్జటికి నేనే సారథి నయ్యెదనని బ్రహ్మ గుర్రముల పగ్గములను పట్టుకొనెను. వెంటనే దేవతలును గంధర్వు లును బిగ్గరగా సింహనాద మొనరించిరి. బ్రహ్మ సారథియై కొరడా పట్టుకొనుట చూచి హరుడు రథ మారోహించెను. మహాదేవుడు రథ మారోహించుచుండ హరుని బరువునకు తట్టుకొనలేక గుర్రములు పీడితములై మోకాళ్లపై వంగి నేలపై పడి మట్టికరచినవి. వేదాశ్వము లట్లు పేద పడి ముడిగియుండుట చూచి మహాదేవుడు ఆర్తులగు తండ్రులను సుపుత్రుడు లేవనెత్తినట్లు లేవనెత్తెను. తరువాత మరల యుద్ధ ప్రేరకమగు భయంకరమగు సింహనాదమును సాటిలేని జయధ్వనిని దేవత లాశ్చర్యకరముగ నొనరించిరి.

తదోంకారమయం గృహ్య ప్రతోదం వరదః ప్రభుః ।
స్వయమ్భూ ర్భగవా న్వాహ్యా ననుమన్త్ర్య యథాతథమ్. 57
గ్రసమానా ఇవాకాశం ధున్వన్తఇవ మేదినీమ్ । ముఖేభ్య స్సంసృతిం వేదా ఉద్గిరన్త ఇవాశుగాః. 58
స్వయమ్భువా చోద్యమానా శ్చోదితేన కపర్దినా । వ్రజన్త్యశ్వాశ్చ జవనాః క్షయకాల ఇవానిలాః. 59
అభ్యుచ్ఛ్రియవినిర్మాణాం ధ్వజయష్టి మనుత్తమామ్ । ఆక్రమ్య నన్దీ వృషభ ఆస్తే తత్ర యథేచ్ఛయా. 60
అథర్వాఙ్గిరసౌ దేవౌ దణ్డహస్తౌ రవిప్రభౌ । రథచక్రౌ చ రక్షేతాం రుద్రస్య ప్రియకారకౌ. 61

శేషశ్చ భగవాన్నాగో హ్యనన్తోఽన్తకరో నృణామ్ । విషహస్తో రథంయాతి దిదక్షన్నివ దానవాన్. 62
యమో మహిషమాస్థాయ మకరం వరుణస్తథా । ద్రవిణాధిపతి ర్యానం సురాణా మధిపో ద్విపమ్. 63
మయూరం శతచన్ద్రంచ కూజన్తం కిన్నరం యథా। స్కన్దోహ్యారుహ్య వరదో జుగోప స్వరథం పితుః. 64
నన్దీశ్వరశ్చ భగవాఞ్ఛూలమాదాయ వీర్యవాన్ । పృష్ఠతః పార్శ్వతశ్చాపి లోకస్య క్షయకృద్యథా. 65
ప్రమథా శ్చాగ్నివర్మాణ స్సాగ్నిజ్వాలా ఇవాచలాః । అనుజగ్ము రథం సర్వే నక్రా ఇవ మహార్ణవమ్. 66
*భృగు ర్భరద్వాజవసిష్ఠగౌతమాః క్రతుః పులస్త్యః పులహ స్తపోధనాః ।
మరీచి రత్రి ర్భగవా నథాఙ్గిరాః ○ప్రాచేతసాద్యాః ప్రయయు ర్మహర్షయః. 67
హర మజిత మజం ప్రతుష్టువుస్తే వచనవిశేష విచిత్రభూషణైః ।
రథవర మధిరుహ్య కాఞ్చనంచ వ్రజతి సపక్షమివాపరేఽమ్బరే. 68
కరివరవృష మేఘసన్నిభాస్తే సజలపయోదనినాదనాదినః ।
ప్రమథగణాః పరివార్య దేవదేవం రథమభితః ప్రయయు స్స్వదర్పయుక్తాః. 69
మకరతిమితిమిఙ్గిలాదినక్రాః ప్రళయ ఇవార్ణవ మావ్రజన్తి తూర్ణమ్ ।
త్రిపురరథవరోఽతిభాసురో హ్యశనినిపాతపయోదనిస్స్వనః. 70

ఇతి శ్రీమత్స్యమహాపురాణే త్రిపురోపాఖ్యానే ఈశ్వరస్య త్రిపురవిజయ
ప్రస్థానకథనం నామైకత్రింశదుత్తర శతతమోఽధ్యాయః.

ఓంకారమయమగు ప్రతోదమును(కొరడాను)పట్టుకొని వరదుడు ప్రభుడు (మహా సమర్థుడు) నగు స్వయంభూ బ్రహ్మ భగవానుడు అశ్వములను తగిన విధమున అను మంత్రణము చేసెను. (మంచి మాటలతో నడచుటకు ప్రేరించెను.) అశ్వములు ఆకాశమును మ్రింగుచున్నవో-భూమిని విదలించి ఎగురగొట్టుచున్నవో అన్నట్లు పరుగు అందుకొనెను. శివునిచే ప్రేరితుడైన బ్రహ్మచే ప్రేరింపబడుచు ఆ వేదరూపాశ్వములు తమ వాక్కులతో సంసారగతిని పలుకుచు ప్రళయ కాల వాయువులో అనునట్లు ధనుర్ముక్తములగు బాణములో అనునట్లు మహావేగవంతములై పోవుచుండెను. నంది అచట పరమేశ్వరేచ్ఛానుగుణముగా అత్యున్నత వినిర్మాణముకల ధ్వజదండపు కొన నాక్రమించి వృషభపు రూపము ధరించి కూర్చుండెను. రవితేజస్కులు అభరాంగిరోముఖులు రుద్రునకు ప్రీతిజనకులై దండములు చేత ధరించి రథచక్రరక్షకు లయిరి. ప్రళయకాలాత్మదైన జనులకు అంతకరుడును భగవానుడు నగు శేషనాగుడు దానవులను దహింప గోరుచున్నాడో యను నట్లు రథము ననుసరించి పోవుచుండెను. యముడు మహిషమును వరుణుడు మకరమును కుబేరుడు అశ్వమును ఇంద్రుడు గజమును ఆరోహించగా వరదుడగు స్కందుడు వందల కొలది పించెములు కలిగి కిన్నరుడువలె కూయుచున్న మయూర మారోహించి వానితోపాటు తనతండ్రిరథమును రక్షించుచుండెను. వీర్యశాలియగు నందీశ్వరభగవానుడును శూలమును చేత ధరించి లోకక్షయకరుడేమో యనునట్లు రథమునకు పార్శ్వములందును పశ్చాద్భాగమునను తానై యుండెను. అగ్ని కవచులై ప్రమథులు అందరు రథము వెంట అగ్నిజ్వాలలు క్రక్కెడి పర్వతములో యనునట్లు నక్రములు మహార్ణవము వెంట పోయినట్లు పోవసాగిరి. భృగు భరద్వాజ వసిష్ఠ గౌతమ క్రతు పులస్త్య పులహ మరీచ్యత్ర్యంగిరః ప్రాచేతసాది మహర్షులు వెంట పోవుచుండిరి వారు వచన విశేషములే విచిత్రాలంకారములయియున్న వాక్కులతో అజితుడు అజుడు(ఓటమి నెరుగనివాడు పుట్టుకలేనివాడు)నగు హరుని స్తుతించుచుండిరి. ఇతరులును రెక్కలుకలదో యనునట్లున్న కాంచనరథశ్రేష్ఠ మారోహించి ఆకాశమున శివరథము ననుసరించి పోవుచుండిరి. ఏనుగులతో వృషభములతో మేఘములతో సదృశులగు

* భృగుర్వసిష్ఠశ్చ్యవనః పర్వతో నారద స్తథా । అనుజగ్మూ రథంశార్వమన్యేచ పరమర్షయః॥
○ పరాశరాగస్త్యముఖామహర్షయః

ప్రమథులు అందరును సజల మేఘములవలె ధ్వని చేయుచు తమ తమ దర్పములతో కూడి దేవదేవుని పరివారించి రథమునకు అన్ని వైపులను క్రమ్మి పోవుచుండిరి. ప్రళయమహార్ణవమువెంట మకరతిమి తిమింగిలాది జల జంతు సముదాయమువలె వారు వెంట పోవుచుండ ఆ త్రిపుర దాహియగు రథశ్రేష్ఠము పిడుగుపాటుతో కూడిన మేఘమువలె ధ్వని చేయుచు ముందునకు సాగుచుండెను.

ఇది శ్రీమత్స్య మహాపురాణమున త్రిపురోపాఖ్యానమున ఈశ్వరుడు త్రిపుర విజయమునకై బయలు వెడలుట యను నూట ముప్పది యొకటవ అధ్యాయము.

## ద్వాత్రింశదుత్తరశతతమోఽధ్యాయః.
## నారదస్య త్రిపురగమనమ్.

సూతః : పూజ్యమానే రథే తస్మి న్యాతే దేవవరైస్సహ । దేవేషుచ నదత్స్వాగ్రం ప్రమథేషుచ సాధ్వితి. 1
ఐశ్వరే స్వర ఘోషేణ నర్దమానే మహావృషే । జపత్సు విప్రేషు తదా గచ్ఛత్సు తురగేషుచ. 2
వ్యోమాఙ్గణా త్సముత్ప్లుత్య మహర్షి ర్నారదః ప్రభుః ।
కాన్త్యా చన్ద్రోపమ స్తూర్ణం త్రిపురం పుర మాగతః. 3
ఉత్పాతకంచ దైత్యానాం త్రిపురే వర్తతే ధ్రువమ్ । నారదశ్చాత్ర భగవా న్ప్రాదుర్భూత స్తపోధనః. 4
ఆగతం జ్వలనాభాసం సమేతా దైత్యదానవాః । ఉత్తస్థు ర్నారదం దృష్ట్వా అభివాదనవాదినః. 5
తమర్ఘ్యేణచ పాద్యేన మధుపర్కేణ చేశ్వరాః । నారదం పూజయామాసు ర్బ్రహ్మాణమివ వాసవః. 6
స తస్య పూజాం పూజార్హః ప్రతిగృహ్య తపోధనః । నారద స్సుఖమాసీనస్మ కాఞ్చనే వరమాసనే. 7
తతోహి దానవై స్సార్ధ మాసీనో దానవేశ్వరః । ఆసీనం నారదం ప్రేక్ష్య మయ స్త్వథ మహాసురః. 8

నారదం ప్రతి మయకృతోత్పాతనిమిత్తప్రశ్నః.

అబ్రవీ ద్వచనం తుష్టో హృష్టరోమాననేక్షణః । ఔత్పాతికం పురేఽస్మాకం యథా నాన్యత్ర కుత్రచిత్. 9
వర్తతే వర్తమానంచ జ్ఞాతుం శక్నోసి నారద । దృశ్యన్తే భయదా స్స్వప్నా భజ్యన్తేచ ధ్వజాః పురే. 10
వినాచ వాయునా కేతుః పతతేచ తథా భువి । అట్టాలకాశ్చ భజ్యన్తే సపతాకా స్సగోపురాః. 11
హింసహింసేతి శ్రూయనే గిరశ్చ భయదాః పురే । నాహం బిభేమి దేవానాం సేన్ద్రాణామపి నారద. 12
ముక్త్వైకం వరదం స్థాణుం భక్తాభయకరం హరమ్ । భగవన్ నాస్త్యవిదిత ముత్పాతేషు తవానఘ. 13
అనాగత మతీతంచ భవాన్ జానాసి తత్త్వతః । తదేతన్నో భయస్థాన ముత్పాతాభినివేదితమ్. 14
కథయస్వ మునిశ్రేష్ఠ ప్రయత్నేనతు నారద । ఇత్యుక్తో నారదస్తేన మయేనామయవర్జితః. 15

## నూట ముప్పది రెండవ అధ్యాయము.
## నారదుడు త్రిపురముల కేగుట.

సూతు డిట్లు చెప్పసాగెను: త్రిపుర విజయార్థమైన రథము సాగిపోవుచుండెను. దానిని దేవవరులు అభినందించుచు వెంట పోవుచుండిరి. దేవవరులును ప్రమథులును సాధువాదములు చేయుచు ధ్వనులు చేయుచుండిరి. ఈశ్వరు మహా వృషభము వేద స్వర ఘోషముతో అంకెలు వేయుచుండెను. విప్రులు వేదాధ్యయనము చేయుచుండిరి. అశ్వములును వేదముల పఠించుచు పోవుచుండెను. అట్టి సమయమున ప్రభుడగు నారద మహర్షి గగనాంగణమునుండి చంద్ర సదృ దేహకాంతితో దుమికి శీఘ్రముగా త్రిపుర దుర్గమునకు పోయెను. అప్పుడును అచట ఉత్పాతములు అధిముగ జరుగుచునే యుండెను. అదే సమయమున తపోధనుడు నారద భగవాను డట సాక్షాత్కరించుటచే అగ్ని ప్రకా డగు ఆయన రాకను చూచి దైత్య దానవులు అభివాదనములు పలుకుచు లేచి నిలువబడిరి. అసురేశ్వరుడు నారదు

అర్ఘ్యపాద్య మధుపర్కములతో ఇంద్రుడు బ్రహ్మ నర్చించి నట్లర్చించెను. తపోధనుడు పూజార్హుడగు నారదుడు మయుడు ఇచ్చిన పూజను స్వీకరించి మేలగు బంగరు పీఠముపై కూర్చుండెను. అనంతరము దానవేశ్వరుడగు మయమహాసురుడు తుష్టుడును హర్షసహిత రోమముఖనయనములు కలవాడునై తన దానవులతో కూడ తానును కూర్చుండి నారదుని చూచి ఇట్లు పలికెను: నారదా! నీవు వర్తమానము నెరిగినవాడవు. మా పురమునం దిపుడు మరెప్పుడు నెక్కడను లేనంతగా ఉత్పాతములు కనబడుచున్నవి. ఏమనగా-భయంకర స్వప్నములు కలుగుచున్నవి. ధ్వజములు విరుగుచున్నవి. వాయువు వీచకయే జెండాలు క్రింద పడుచున్నవి. పతాకలతో గోపురములతో కూడ అట్టాలకములు (మేడలపై అంతస్తులు) విరిగి పడుచున్నవి. 'బాధించుడు బాధించుడు.' అను భయంకర ధ్వనులు వినబడుచున్నవి. నారదా! స్థాణు(శాశ్వత)రూపుడు భక్తాభయకరుడు వరదుడు నగు హరునకుతప్ప నే నింద్రాది దేవతల కెవ్వరికిని భయపడను. అనఘా! భగవన్! ఉత్పాత విషయమున నీకు తెలియని దేదియు లేదు. భూత భవిష్యముల వాస్తవ రూపము నీ వెరుగుదువు. కావున మునిశ్రేష్ఠా! నారదా! ఈ ఉత్పాతములు మాకు రానున్న ఏ భయ హేతువును సూచించుచున్నవో నీకు తెలిసినంత తెలుపుము. అనగా ఏ చిత్త దోషములును లేని నారదుడు మయునితో ఇట్లు పలికెను.

నారదః : శృణు దానవ! తత్త్వేన భవతౌత్పాతికం యథా । ధర్మేతి ధారణే ధాతు ర్మహాతేజోపపద్యతే. 16
ధారణేచాపధరణే ధర్మఏష నిరూప్యతే । న దృష్టప్రాపకో ధర్మ ఆచార్యై రుపదిశ్యతే. 17
ఇతశ్చైవానిష్టఫల మాచార్యై రుపదిశ్యతే। దుర్మార్గం గచ్ఛతో మార్గే మార్గే సతి విమారతః. 18
వినాశ స్తస్య నిర్దేశ్య ఇతి ధర్మవిదో విదుః । త్వమధర్మం యథా మూఢ స్సహైభి ర్దైత్యదానవైః. 19
అవాచీనాని దేవానాం కురుషే కుసహాయవాన్ । తదేతాన్యేవ మాద్యాని ఉత్పాతవిదితానిచ. 20
వైనాశికాని దృశ్యన్తే దానవానాం తథైవచ । ఏష రుద్ర స్సమాస్థాయ రౌద్రం లోకమయం రథమ్. 21
ఆయాతి త్రిపురం దగ్ధుం మయ! త్వా మసురాధిప। స త్వం మహౌజసం నిత్యం ప్రపద్యస్వ మహేశ్వరమ్.
యాస్యసే సహపుత్త్రైణ దానవైస్సహ మానద । ఇత్యేవ మావేద్య భయం నారదః ప్రస్తుతం వచః. 23
దానవానాం పునర్దీమాన్ దేవేశపుర మాగతః । నారదేతు మునౌ యాతే మయో దానవనాయకః 24
శూరా నుద్భోధయన్నేవ మువాచ సహి దానవః । శూరాశ్చ జాతపుత్త్రాశ్చ కృతకృత్యాశ్చ దానవాః. 25
యుధ్యధ్వం దైవతైస్సార్ధం కర్తవ్యంహి న వో భయమ్ ।
హతా వయం భవిష్యామ స్సర్వే సురసభాసదః. 26
దేవాన్వా సేన్ద్రికాన్ హత్వా లోకాన్ భోక్ష్యామహే వయమ్। అట్టాలకేషు తిష్ఠధ్వం సన్నద్ధా శ్శస్త్రపాణయః.
దంశితాయుధసజ్జాశ్చ తిష్ఠధ్వం ప్రోద్యతాయుధాః । పురాణి త్రీణి చైతాని యథాస్థానేషు దానవాః. 27
తిష్ఠన్త్వలఙ్ఘనీయాని భవిష్యన్తి పురాణిచ । నభోగాః ప్రమథాశ్శూరా దేవాశ్చ విదితాహి వః. 29
తే ప్రయత్నేన వార్యాశ్చ విదార్యాశ్చైవ సాయకైః ।
ఇతి దనుతనయా న్మయ స్తథోక్త్వా సురరణకారణవారణే వచాంసి. 30
యుధి నిజమనసా విషక్తమానో గగనపురం సహసా వివేశ రాజా ।
అథ విరజవిశుద్ధభావభావో భవమభిపూజ్య దిగమ్బరంచ వాగ్భిః. 31
శరణ మథ జగామ దేవదేవం యమమదనాన్తకయజ్ఞదేవఘాతమ్ ।
మయ మభయవదైషిణం ప్రపన్నం న ఖలు బుబోధ తృతీయనేత్రదీప్తః. 32
తదభిమత మదా చ్ఛశాఙ్కమౌళి స్సచ కిల నిర్భయదేవదానవేన్ద్రః. 324

ఇతి శ్రీమత్స్యమహాపురాణే త్రిపురాఖ్యానే నారదమయసంవాదాది
కథనం నామ ద్వాత్రింశదుత్తరశతతమోఽధ్యాయః.

మయదానవా! ఈ ఉత్పాతము లేమి సూచించునో తెలిపెదను; వినుము: మహాతేజా! ధర్మ శబ్దమునందలి 'ధా' ధాతువునకు గల అర్థమును బట్టి 'తను ఆశ్రయించినవానిని నిలుపునది' 'కంటికి కానరాని ఫలితములను తన యందు గట్టిగా నిలుపుకొనునది' అని ధర్మశబ్దమునకు అర్థము. ఈ కారణమున ఈ ఉత్పాతములు మీకు అనిష్ట ఫలమునే సూచించుచున్నవి. విమార్గమును విడిచి సన్మార్గమున నడువ వీలుండియు దుర్మార్గము ననుసరించువానికి నాశము తప్పదని ధర్మతత్త్వ వేత్తలందురు. నీవు మూఢుడవై ఈ దైత్య దానవులతో కూడి ఈ దుష్టుల తోడ్పాటుతో దేవతలకు ప్రతికూలము నాచరించుచున్నావు. ఈ దోషమునకు ఫలముగా మీకు నాశము కలుగుననియే ఈ ఉత్పాతములు తెలుపుచున్నవి. ఇదిగో! రుద్రుడు లోకమయరథ మారోహించి మయా! త్రిపుర దుర్గమును నిన్ను అసురులను దహించుటకై వచ్చుచున్నాడు. కావున ఇట్టి స్థితిలో నీవు నీవాదానవులతో కూడ మహేశ్వరుని శరణు చొచ్చుట మేలు. లేనిచో నీకుమారులతో నీదానవులతోను కూడ నశించిపోయెదవు. అని నారదుడు మయాదులగు దానవులకు రానున్న భయమును ప్రస్తుత వచనములతో తెలిపి ఆ ధీమంతుడు మరల దేవేశుని పురమునకు (స్వర్గమునకు) వచ్చెను.

నారదుడు వెడలిన తరువాత దానవ నాయకుడగు మయుడు తన శూరుల నుద్బోధించుచు ఇట్లు పలికెను: శూరులగు దానవులారా! మనమందరము పుత్త్రివంతులమయితిమి. (వారును మనంతటి వారయినారు.) మనము కుటుంబములకు చేయవలసిన కృత్యములను చేసితిమి. మనము ఎవరికిని ఎందులకును భయపడవలసిన పనిలేదు. దేవతలతో యుద్ధము చేయుదము. మనము చచ్చితిమా ఇంద్రుని సభానదులమై స్వర్గసుఖము లనుభవింతము. ఇంద్రాదులను చంపగలిగితిమా-మనమే సర్వలోకముల ననుభవింతము. కావున మీరెల్లరు శస్త్రపాణులై సన్నద్ధులై అట్టాలకములపై (బురుజులపై-భవనాగ్రములపై) నిలువుడు. కవచములు ఆయుధములు ధరించి నిలువుడు. ఈ త్రిపురములను వీనికి అనుబద్ధములగు పురములును శత్రువులకు చేరనలవి కాకుండునట్లు మీమీ స్థానములందు నిలువుడు. దేవతలును ప్రమథులును ఆకాశమున సంచరింపగలవారును శూరులును అని మీకు తెలియును. వారిని మీశక్తికొలది అడ్డగించుడు. బాణములతో చీల్చుడు.

అని ఇట్లు మయుడు దానవులకు వారు దేవతలతో పోరవలసిన హేతువును వీరు వారినడ్డగించవలసిన విధమును తెలిపి తన మనస్సును యుద్ధాసక్తమొనర్చి గగన సంచారియగు త్రిపుర దుర్గమును ప్రవేశించెను. అనంతరమతడు రజోగుణ రహిత విశుద్ధ భావమును అట్టి రూపమును కలవాడయి దిగంబరుడు దేవదేవుడు యముని మదనుని అంధకుని దక్షయజ్ఞమును అంతమొందించినవాడు అగు పరమేశ్వరుని (లౌకిక)వాక్కులతో స్తుతించి శరణువేడెను. ప్రకాశమాన తృతీయ నేత్రముగల చంద్రమౌళియు మయుడు అభయమగు ముక్తిపదమును కోరి తను శరణువేడెనని గురుతించి అతని కభయ మభిమతముగా నిచ్చెను. దానవేంద్రుడగు మయుడును నిర్భయుడై యుండెను.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున త్రిపురోపాఖ్యానమున మయనారద
సంవాదాది కథనమను నూట ముప్పది రెండవ అధ్యాయము.

## త్రయస్త్రింశదుత్తరశతతమోఽధ్యాయః.

## నారదస్య త్రిపురాదీశ్వరంప్రతి ప్రత్యాగమనమ్.

సూతః : తతో రణే దేవబలం నారదోఽభ్యాగమత్పునః ।
త్రిపురా త్త్రత చాగత్య సభాయా మాస్థితస్స్వయమ్.
ఇళావృత మితిఖ్యాతం తద్వర్షం విస్మితం యతః । యత్ర యజ్ఞో బలేర్వృత్తో బలిర్యత్రైవ సంస్థితః
దేవానాం యజ్ఞభూమిర్యా త్రిషు లోకేషు విశ్రుతా । వివాహః క్రతవశ్చైవ జాతకర్మాదికాః క్రియాః.
దేవానాం యత్రవృత్తాని కన్యాదానాని యానిచ । రేమే నిత్యం భవస్తత్ర సహాయైః పార్షదైర్గణైః

లోకపాలా స్తథా యత్ర తస్థు ర్మేరుగిరౌ యథా । మధుపిఙ్గళనేత్రస్తు చన్ద్రావయవభూషితః. 5
దేవానా మధిపః ప్రాహ భగవాంశ్చ మహేశ్వరః । గగనే చరన్తి (త్)త్రిపురం దానవానాం ప్రదృశ్యతే. 6
విమానైశ్చ పతాకాభి ర్ధ్వజైశ్చ సమలఙ్కృతమ్ । ఇదంవిత్త మిదంఖ్యాతం పశ్యైవ ద్విషమోపమమ్. 7
ఏతేఽఞ్జనగిరిప్రఖ్యాః సకుణ్డలకిరీటినః । ప్రాకారగోపురాగ్రేషు లక్ష్యన్తే దానవాస్స్థితాః. 8
ఇమేచ తోయదాభాసా దనుజా వికృతాననాః । నిర్గచ్ఛన్తి పురాద్దైత్యా దానవా విజయైషిణః. 9
సత్వం సురశతై స్సార్ధం సవాహనవరాయుధైః । సహైవ మామకై ర్భృత్యైః ర్వ్యాపాదయ మహాసురాన్.
అహంతు రథమాస్థాయ నిశ్చలో బలమాస్థితః । పురః పురస్య రన్ధ్రార్థీ తస్యాస్య విజయాయ వః. 11
యదాతు పుష్యయోగేన ఏకత్వం యాస్యతే పురమ్ । తదైత న్నిర్దహిష్యామి శరేణై కేన వాసవ. 12
ఏవముక్తో భగవతా రుద్రేణేన్ద్ర స్సురేశ్వరః । యయౌచ త్రిపురం జేతుం తేన సైన్యేన సంవృతః. 13
*ఆక్రాన్తరథపాదాతై ర్మేఘగిర్యోఘసన్నిభైః । కృతసింహరవోపేతై రుద్వమద్భి రివామ్బుదైః. 14

## నూట ముప్పది మూడవ అధ్యాయము.

## నారదుడు త్రిపుర దుర్గమునుండి శివుని కడకు వచ్చుట-దేవదానవ యుద్ధము.

సూతుడు ఋషులకు ఇట్లు చెప్పసాగెను: అనంతరము నారదుడు త్రిపుర దుర్గమునుండి దేవబలముకడకు వచ్చి సభయందు కూర్చుండెను. ఆ దేవసేనాస్థానము అద్భుతమగు ఇలావృత వర్షము. అచ్చటనే బలి యజ్ఞ మాచరించెను. అచ్చటనే అతడు వసించెడువాడు. అది దేవతల (ప్రాచీనార్యుల) యజ్ఞభూమిగా త్రిలోకప్రసిద్ధము. దేవతలు వివాహములు క్రతువులు జాత కర్మాది క్రియలు కన్యాదానములు ఇచ్చటనే జరుపుకొనిరి. శివుడిచ్చటనే తన సహాయులగు పార్షదులతో కూడ సతతము ఆనందించెను. లోకపాలురును అచ్చటనే మేరుపర్వతమందువలె కొలువు తీరెడివారు. ఇపుడు అచ్చట కూర్చుండి తేనెవలె పింగళ నేత్రములుకల దేవాధిపుడు మహేశ్వరుడు దేవతలతో ఇట్లు పలికెను: ఇదిగో! గగన సంచారియగు దానవుల త్రిపుర దుర్గము కనబడుచున్నదే! అది విమానములతో పతాకలతో ధ్వజములతో అలంకరింపబడియున్నది. ఇది అందరు ఎరిగినది-ప్రసిద్ధమైనది-అగ్నివంటిది-నిరుపమానమైనది. వీరుగో! కాటుక కొండలవంటి దానవులు కుండలములు కిరీటములు ధరించి ప్రాకార గోపురాగ్రములయందు నిలిచి కనబడుచున్నారు. వీరుగో! మేఘములవలె ప్రకాశించు వికృతముఖులగు దైత్యులును దానవులును విజయాభిలాషులై త్రిపుర దుర్గమునుండి వెలికి వచ్చుచున్నారు. ఇంద్రా! ఇట్టి స్థితిలో నీవును వాహనముల నెక్కి వరాయుధధారులైన దేవశతములతోను నా భృత్యులగు ప్రమథులతోను కూడి మహాసురుల చంపుము. మరి నేనో! రథ మారోహించి సైన్యమును వెంటగొని నిశ్చలుడనై ఈ దుర్గమును గెలిచి మీకు విజయము కలిగింప అనుకూలమగు అవకాశమునకై నిరీక్షించుచుందును. పుష్య యోగమున ఈ త్రిపురదుర్గము ఒకటిగా ఐనపుడు నేను ఈ పురమును ఏకశరముతో నిర్దహించును.

రుద్ర భగవాను డిట్లు చెప్పగా సురేంద్రుడు ఆ సైన్యముతో కూడి త్రిపుర విజయమునకై వెడలెను. అతని సైనికు లెల్ల కొందరు రథారోహులు మరికొందరు పదాతులు; అందరును మేఘములను కొండలను పోలినవారు; సింహ ధ్వనులు చేయుచున్నవారు; పిడుగులు క్రక్కుచు ఉరుముచున్న మేఘములవంటి వారు.

దేవదానవయోర్యుద్ధమ్.

తేన నాదేన త్రిపురదానవా యుద్ధలాలసాః । చేరు స్సమ్ర దుద్రమవుశ్చాపి యయుధుః షే గజేశ్వరైః. 15
అన్యే పయోధరాకారాః పయోధరనిభా బభుః । ససింహనాదవాదిత్రాన్ తాదయామాసు రుత్థితాః. 16
దేవానాం సింహనాదశ్చ సర్వతూర్యరవో మహాన్ । గ్రస్తం దైత్యపురం దేవై శ్చన్ద్రస్తోయధరైరివ. 17

---

* ప్రకీర్ణరథభీమైస్తై స్సదైవైః పార్షదాం గణైః.

చన్ద్రోదయసముద్భూతః పూర్యమాణ ఇవార్ణవః । త్రిపురం ప్రబభౌ తద్వ ద్భీమరూపై స్సురాసురైః. 18
ప్రాకారేషు తథా తత్ర గోపురేషు తథాఽపరే । అట్టాలకా న్సమారుహ్య కేచిత్తస్థు ర్విలాసినః. 19
స్వర్ణమాలాధరా శ్శూరాః ప్రభాసిత †కృపాణికాః । కేచి న్నదన్తి దనుజా స్తోయపూర్ణా ఇవామ్బుదాః. 20
ఇతశ్చేతశ్చ ధావన్తః కేచిదుద్ధూతవాససః । కిమేతదితి పప్రచ్ఛు రన్యోన్యం గృహనిస్సృతాః. 21
కిమేత న్న విజానామి జ్ఞాన మన్తర్హితం హి మే ।
జానామి మాతః కస్యేతి కాలోఽత్ర పరమో మహాన్. 22
కోహ్యసౌ పృథివీపాల స్సింహస్య రథమాస్థితః । వర్తతే త్రిపురం పీడ్య దేహం వ్యాధిరివోత్థితః. 23
య ఏషోఽస్తు న ఏషోఽస్తు కాపృచ్ఛా సమ్భ్రమేసతి । ఏహ్యాయుధ మ థాదాయ; భవితవ్యం భవిష్యతి. 24
ఇతి తేఽన్యోన్య మావిగ్నా ఉత్తరోత్తరభాషిణః । ఆసాద్యాసాద్య పృచ్ఛన్తి దానవా స్త్రిపురాలయాః. 25
తారకాక్షపురే దైత్యా స్తారకాక్షపురేఽ సురాః । నిర్యాతాః కుపితా స్తూర్ణం బిలాదివ మహోరగాః. 26
ప్రధావన్తస్తు తే దైత్యాః ప్రమథాధిపయూథపైః । నిరుద్ధా గజరాజానో యథా కేసరియూథపైః ।
గర్వితానాం తతస్తేషాం దర్పితానాంచ సమ్పదా. 27
రూపాణి జజ్వలుః కోపా దగ్నీనామివ ధమ్యతామ్ । తతో బృహన్తి చాపాని భీమనాదాని సర్వశః. 28
నికృష్య జఘ్ను రన్యోన్య మిషుభిః ప్రాణభోజనైః । మార్జారమృగభీమాస్యా న్పార్షదా న్వికృతాననాన్.29
దృష్ట్వాదృష్ట్వా హసన్త్యుచ్చై ర్దానవా రూపసమ్పదః। బహుభిః పరిఘాకారైః కృష్యన్తాం ధనుషాం శరాః.30
అస్మాభి ర్వః ప్రవేక్ష్యన్తే తటాకానీవ పక్షిభిః । మృతాశ్చ ప్రతియుధ్యధ్వం హనిష్యామో నివర్తతామ్. 31

ఆ నాదము విని రెచ్చిపోయి త్రిపుర దానవులు యుద్ధ లాలసులయి సంచరింపసాగిరి; అంతేకాదు; యుద్ధము నకై దేవతల కభిముఖులై పరుగెత్తిరి. ఆకాశమండలి గణేశ్వరులతో తలపడి యుద్ధము చేసిరి. వారిలో కొందరు మేఘములవంటి ఆకారములు కలవారు; మేఘములవలె ధ్వనులు చేయువారు నయిరి; సింహనాదములను కూడ చేసిరి; లేచి నిలిచి వాద్యములను కూడ ప్రయోగించిరి. దేవతల సింహనాదమును సర్వ వాద్యముల ధ్వనియును గొప్పదిగా నయ్యెను. ఇట్టి విధములను దేవతల చేత త్రిపురదుర్గము మేఘముల చేత చంద్రబింబమువలె క్రమ్మి వేయబడెను. చంద్రోదయమున ఉద్రేకింపజేయబడి నింపబడిన సముద్రమువలె భయంకరరూపులగు సురాసురులచేత త్రిపురదుర్గము నిండిపోయి ప్రకాశించెను. వారిలో కొందరు విలాసవంతులు ప్రాకారములపై మరికొందరు గోపురములపై ఇంకను కొందరు అట్టాలకములపై (బురుజులపై-మేడల పైఅంతస్తులపై) నిలువబడిరి. ఆ విలాసవంతు లందరును సువర్ణహారములను దాల్చిన వారును పదును పెట్టి మెరుగులు తీర్చగా తళతళ మెరయు కృపాణికలను ధరించిన శూరులును కాని సామాన్యులు కారు. వారిలో కొందరు జలపూర్ణ మేఘములవలె గర్జించుచుండిరి. మరికొందరు వస్త్రముల నెగురవేయుచు ఇటు నటు పరుగెత్తుచుండిరి. ఇంకను కొందరు ఇండ్లలోనుండి బయటికి వచ్చి-ఇది యేమి జరుగుచున్నదని పరస్పర మడుగుచుండిరి. ఇది యేమో నాకు తెలియుట లేదు. నా తెలివియంతయు మరుగుపడి పోయినది. అమ్మా! నేను ఎవరివాడనో నాకు తెలియుట లేదు. ఇదుగో! ఇక్కడ చాల గొప్ప వ్యక్తి ఎవరో కనబడుచున్నాడు. ఇతడు కాలు(యము)డేమో! సింహములు లాగు రథము నారోహించి కనబడుచున్న ఈ రాజెవ్వరో! దేహమును పీడించు వ్యాధివలె త్రిపురదుర్గమును పీడించుచు పైకి విజృంభించుచున్నా డీత డెవరు? ఇతడు ఎవరైన నగును గాక! తందరలాడు ఈ తడబాటు సమయములో ఈ ప్రశ్నములతో పని యేమి? ఇక ఆయుధములు ధరించి రండు; జరుగవలసినది జరుగును. అని ఇట్లు త్రిపుర దుర్గవాసులగు వారందరు భయాక్రాంతులయి పరస్పరమనుచు మాటలపై మాట లాడుచుండిరి. మరికొందరు ఒకరింకొకరి దగ్గరకు పోయి పోయి ఏమేమో అడుగుచుండిరి.

† కరామ్బరాః.

అంతలో తారకాక్షపురమునందలి అసురులును దైత్యులును కుపితులై బిలమునుండి మహాసర్పములవలె బయటకు వచ్చిరి. వారందరును ప్రమథనాయక సేనాపతులతో తలపడుటకై పరుగెత్తుచు సింహములచే అడ్డగించబడిన గజయూథనాయకులవలె వారిచే అడ్డగించబడిరి. సంపదలచే గర్వితులును దర్పితులును నగు ఆ అసురుల రూపములు తిత్తితో గాలి ఊదుటచే మండెడు అగ్నుల రూపములవలె ప్రజ్వలింపసాగెను. అంతటవారు భయంకరనాదములు చేయు పెద్ద చాపములను ఆకర్షించి ప్రాణము లాహారముగా గొను బాణములతో పరస్పరము కొట్టుకొనుచుండిరి. రూప సంపదలు గలిగి గర్వితులగు దానవు లందరును పిల్లులవలె మృగములవలె భయంకర వికృత ముఖములుగల ప్రమథులను చూచి బిగ్గరగా నవ్వుచుండిరి. మే మాకర్షించెడు ధనుస్సులనుండి వెలువడు పరిఘలను పోలు శరములు పక్షులు తటాకములలో ప్రవేశించునట్లు ప్రవేశించును. మీరు మాకు ఎదురు నిలిచి యుద్ధము చేసితిరా-చచ్చితి రన్నమాటయే; మేము మిమ్ము చంపుదుము; వెనుకకు మరలుడు.

భీమరూపాశ్చ తాన్సర్వా న్దానవా యుద్ధదుర్మదాః । ఇత్యేవం పరుషాణ్యుక్త్వా పార్షదాన్ దానవర్షభాః. 32
బిభిదు స్సాయకై ర్ఘోరై స్సూర్యః పాదై రివామ్బుదాన్ । ప్రమథా అపి సింహాస్యా స్సింహవిక్రాన్త విక్రమాః.
గణ్డశైలశిలావర్షైర్బిభిదు ర్దైత్యదానవాన్ । అమ్బుదై రాకులమివ హంసాకుల మివామ్బరమ్. 34
దానవాకులమత్యర్థం తద్బలం సఙ్కులంబభౌ । వికృష్టచాపా దైత్యేన్ద్రాః సృజన్తి శరదుర్దినమ్. 35
ఇన్ద్రచాపాన్వితోరస్కా జలదా ఇవ దుర్దినమ్ । ఇషుభిస్తాడ్యమానాస్తు భూయోభూయో గణేశ్వరాః. 36
చక్రతు ర్దేహనిర్యాసం స్వర్ణధాతు మివాచలాః । తథా వృక్షశిలాశైలవజ్రశూలపరశ్వథైః. 37
చూర్ణ్యన్తేఽభిహతా దైత్యై రుత్స్వనద్భిర్మృతా ఇతి । తారకాక్షో జయత్యేష ఇతి దైత్యా హ్యఘోషయన్. 38
జయతీన్ద్రశ్చ రుద్రశ్చ ఏవమూచు ర్గణేశ్వరాః । దారితా వారితా బాణై ర్యోధా స్తస్మి న్బలార్ణవే. 39
నిస్వనన్త్యమ్బుసమయే జలగర్భా ఇవామ్బుదాః । కరైశ్ఛిన్నై శ్శిరోభిశ్చ ధ్వజైశ్ఛత్త్రైశ్చ కుణ్డలైః. 40
యుద్ధభూమి ర్భయవతీ మాంసశోణితపూరితా । వ్యోమ్ని చాప్లుత్య చాప్లుత్య తాళమాత్రం వరాయుధైః. 41
దృఢాహతాః పతన్త్యూర్ధ్వం దానవాః ప్రమథా స్తథా । సిద్ధా హ్యప్సరసశ్చైవ చారణాశ్చ నభోగతాః. 42
దృఢప్రహారహృషితా స్సాధుసాధ్వితి చుక్రుశుః । అనాహతాశ్చ వియతి దేవదున్దుభయ స్తథా. 43
నదన్తో మేఘశబ్దేన * వృషభా ఇవ రోషితాః । మయూఖా ఇవ చాదిత్యం నద్యస్సిన్ధుపతిం యథా. 44
విశన్తి క్రుద్ధవదనా వల్మీకమివ పన్నగాః । తారకాక్షపురే తద్వ దసురాస్సురతాడితాః. 45
సశస్త్రా నిపతన్తిస్మ యుగాన్త ఇవ భూధరాః । యోధయన్తి త్రిభాగేన త్రిపురే తు గణేశ్వరాః. 46

భయంకరరూపులు యుద్ధ దుర్మదులు నగు దానవులు-దానవశ్రేష్ఠులు-శివపార్షదుల నిట్లు పరుషములు పలికి సూర్యుడు తన కిరణములతో మేఘములను చీల్చినట్లు శరములతో చీల్చిరి. సింహముల మొగములవంటి మొగములు కలవారును సింహములవలె విక్రమించువారు నగు ప్రమథులును దైత్య దానవులను గండశైలముల శిలల వానతో నలుగగొట్టిరి; చీల్చిరి; ఆకాశము మేఘములతోను హంసలతోను కలత చెందునట్లు ఆ సేనా సముదాయము దైత్య దానవులతో సంకులమయి ప్రకాశించెను. ఇంద్ర ధనువులతో మెరయు హృదయములుకల మేఘములు దుర్దినమును (మేఘచ్ఛాదితమయిన ఆకాశముకల దినము దుర్దిన మనబడును.) సృష్టించినట్లు దైత్య దానవులును ధనువులు లాగి విడిచిన శరములతో దుర్దినమును సృష్టించిరి. బాణపు దెబ్బలు తగిలిన ప్రమథుల దేహములనుండి స్రవించు రక్తధారలు పర్వతములనుండి వెలువడు సువర్ణ ధాతువులవలె కనబడుచుండెను. దైత్యులు వృక్షములతో శిలలతో శైలములతో గంద్రగొడ్డండ్రతో హలములతో ప్రమథులను కొట్టి చూర్ణము చేయుచు-చచ్చితిరి-చచ్చితిరి-అని కేకలు వేయుచుండిరి. ఇదుగో! తారకాక్షుడే

* శరభా ఇవ రోషితాః

జయించినాడు. అని దైత్య దానవు లుద్ఘోషించగా ఇంద్రరుద్రులకే జయము కలిగినదని ప్రమథులు అరచుచుండిరి. ఆ జల సముద్రమునందలి ఇరుపక్షముల యోధులును పరస్పర బాణములతో చీల్చబడి వారింపబడి వర్షాకాలమందలి సజల జలదములవలె ధ్వనులు చేయుచుండిరి. ఆ యుద్ధభూమి తెగిపడిన చేతులతో శిరములతో ధ్వజములతో కుండలములతో మాంస శోణితములతో భయంకరమయి కనబడుచుండెను. దానవులును ప్రమథులును తాటి చెట్టంత ఎత్తున ఎగిరి ఎగిరి మేలగు ఆయుధములతో పరస్పరము కొట్టుకొని నిలువున లేచిపడుచుండిరి. ఇరు పక్షములవారికి తగులుచున్న గట్టి దెబ్బలు చూచి ఆకాశగతులగు సిద్ధులును అప్సరసలును హర్షముచెంది 'బాగుబాగు!' అని పలుకుచుండిరి. అంతరిక్షమున నిరంతరముగా మ్రోగించబడుచున్న దేవదుందుభుల ధ్వనులు మేఘ శబ్దములు విని రోషించి ఱంకెలువేయు వృషభధ్వనులవలె వినబడుచుండెను. కిరణములు సూర్యునియందువలె- నదులు సముద్రము నందువలె- సర్పములు వల్మీకములందువలె- ప్రమథుల చేతిలో దెబ్బలు తినిన దానవులు క్రుద్ధవదనులై తమ పురమున ప్రవేశించుచుండిరి. ప్రళయ కాలమందు పర్వతములు ఱెక్కలతో ఎగిరివచ్చి ప్రజలపై పడునట్లు సశస్త్రులై వచ్చి దేవతలపై పడుచుండిరి. ప్రమథగణ నాథులు మూడవవంతుదానవ సేనతో తలపడి ఇట్లు పోరు సాగించుచుండిరి.

విద్యున్మాలీ మయశ్చైవ తత్రాయాతౌ సహానుగౌ। తాభ్యాం నిపతమానాభ్యాం దానవాభ్యాం గణేశ్వరాః. 47
త్రాసితా నిహతాశ్చైవ భగ్నాశ్చ ద్రుమవద్రణే । విద్యున్మాలీచ దైత్యేన్ద్రో గిరీన్ద్రసదృశో బలీ. 48
ఆదాయ పరిఘం నన్దిం తాడయామాస దానవః । స నన్దీ దానవేన్ద్రేణ పరిఘేణ దృఢాహతః. 49
భ్రమతే మధునా భగ్నః పురా నారాయణోయథా । నన్దీశ్వరే హతే తత్ర గణపాః ఖ్యాతవిక్రమాః. 50
దుద్రువు ర్జాతసంరమ్భా విద్యున్మాలిం మహాసురమ్ । ఘణ్టాకర్ణ శ్శఙ్కుకర్ణో మహాకాళశ్చ పార్షదః. 51
తత స్స సాయకైస్సర్వా న్గణాంశ్చ గణపాకృతిమ్। భూయోభూయః పునశ్చాపి గణేశ్వర మహత్తరాన్. 52
భిత్త్వాభిత్త్వా ననాదోచ్చై ర్నభస్యమ్బుధరో యథా । తస్య రావితశబ్దేన స నన్దీ దినకృత్ప్రభః. 53
సంజ్ఞాం లబ్ధ్వా తతస్సోపి విద్యున్మాలిన మాద్రవత్ । రుద్రదత్తం తతోదీప్తం దీప్తానలసమప్రభమ్. 54
వజ్రం వజ్రనిభాఙ్గస్య తస్య నన్దీ ససర్జహ । నన్దినో భుజనిర్ముక్తం ముక్తాఫలవిభూషితమ్. 55
పపాత వక్షసి తదా వజ్రం దైత్యస్య భీషణమ్ । స తత్రాభిహతో దైత్యో వజ్రసంహననోపమః. 56
పపాత వజ్రేణ హత శ్శక్రేణాద్రిరివార్దితః । దైత్యేశ్వరే వినిహతే నన్దినా కులనన్దినా. 57
*చుక్రుశు ర్గణపాన్ప్రేక్ష్య దుద్రువుశ్చైవ దానవాః । దుఃఖామర్ష పరీతాస్తే విద్యున్మాలిని పాతితే. 58
భూమౌ శైలమహావృష్టిం ససృజు ర్దానవోత్తమాః । † ప్రపాత్యమానా గిరిభిస్తరుభి శ్చ గణేశ్వరాః. 59
కర్తవ్యం న విదుః కించి ద్వధ్యమానా హ్యధార్మికైః ।

అంతలో విద్యున్మాలియు మయుడును తమ అనుయాయులతో కూడ అక్కడకు వచ్చిరి. వారు వచ్చి తమ మీద పడుచుండగనే ప్రమథ గణాధినాథులు వారినిచూచి భయపడిరి; వారి చేతిలో కొందరు చంపబడిరి; మరికొందరు రణరంగమున వృక్షములవలె విరిగిరి; (పారిపోయిరి.) పర్వతేంద్రమువంటి పెద్ద దేహము కలవాడును బలశాలియునగు విద్యున్మాలి దానవుడు పరిఘను తీసికొని నందీశ్వరుని కొట్టెను. నందియును ఆ దెబ్బతిని పూర్వము మధురాక్షసుని చేతి దెబ్బతినిన నారాయణుడువలె గిరగిర తిరిగి భంగమందెను. ఆ మహాయుద్ధమున నందీశ్వరుడే దెబ్బ తినగానే ప్రసిద్ధ విక్రమశాలురగు ఘంటాకర్ణుడు శంకుకర్ణుడు మహాకాళుడను ప్రమథులందరును తడబాటునందుచు పారిపోసాగిరి. అంతట వదలక విద్యున్మాలి ప్రమథగణములను గణాధిపతిని గణాధిపతికంటె గొప్పవారగు పారిషద శ్రేష్ఠులను చీల్చి చెండాడి అంతరిక్షమున మేఘమువలె గర్జించెను. వాని గర్జన ధ్వని వినబడగానే సూర్యతేజస్కుడగు నందీశ్వరుడు

*చుక్రుశుర్దానవాన్ప్రేక్ష్యదుద్రువుశ్చగణాధిపమ్. † తేపీడ్యమానాగురుభిర్గిరిభిశ్చగణేశ్వరా

మరల తెలివినొంది విద్యున్మాలిమీదకు పరువెత్తెను. అతడు వజ్ర సదృశదేహుడగు ఆ దానవుని మీదకు రుద్రుడు తనకిచ్చినది దీప్తానల సమప్రభమయి ప్రజ్వలించుచున్నది అగు వజ్రమును విసరెను. ముక్తాఫల విభూషితమగు ఆ వజ్రమను భీషణాయుధము నందీశ్వరుని బాహులచే విడువబడివచ్చి ఆ దానవుని వక్షముపై పడెను. వాడు వజ్రమువలె దృఢశరీరుడే అయినను ఆ వజ్రపుదెబ్బ తిని ఇంద్రుని వజ్రపుదెబ్బ తినిన పర్వతేంద్రమువలె పడిపోయెను. ప్రమథకుల మునకు ఆనందప్రదుడగు నందిచేతిలో దైత్యేశ్వరుడగు విద్యున్మాలి దెబ్బతినగానే దానవులు ప్రమథ గణాధిపతులను చూచి అరచుచు మీదకు పరువెత్తుకొని వచ్చిరి. విద్యున్మాలి పడిపోయెనే యను దుఃఖముచే కలిగిన క్రోధముతో నిండి పోయి ఆ దానవోత్తములు భూమి మీదకు పర్వత వర్షము కురిపించ నారంభించిరి. అధార్మికులగు దానవశ్రేష్ఠులు అట్లు కొండలతో వృక్షములతో చావగొట్టుచుండ ఆదెబ్బలు తినుచు ప్రమథులు ఏమి చేయుటకును తోచనివారైరి.

తతోఽసురవరః శ్రీమాం స్తారకాక్షః ప్రతాపవాన్. 60

స తరూణాం గిరీణాంవై తుల్యరూపధరో బభౌ । భిన్నోత్తమాఙ్గా గణపా భగ్నపాదాననా స్తథా. 61

విరెజు ర్భుజగా మన్త్రై ర్వార్యమాణా యథా తథా । మయేన మాయావీర్యేణ వధ్యమానా గణేశ్వరాః. 62

భ్రమన్తి బహుశబ్దాలాః పఞ్జరే మఞ్జువాగ్యథా । స చాసురవర శ్శ్రీమాం స్తారకాక్షః ప్రతాపవాన్. 63

దదాహ తద్బలం సర్వం శుష్కం వనమివానలైః । తారకాక్షేణ వార్యన్తే శరవర్షై స్తథాగణాః. 64

భ్రమన్తే క్రమశస్సర్వే పఞ్జరేషు శకునా యథా । మయేన మాయానిహతా స్తారకాక్షేణ చేషుభిః. 65

గణేశా విధురా జాతా జీర్ణమూలా ఇవద్రుమాః। భూయశ్చ సాగరం హ్యగ్నిం సింహాగ్రాహ భుజఙ్గమాన్. 66

గిరీన్ద్రాంశ్చ హరీన్వ్యాఘ్రా న్వృక్షా న్భైరుణ్డపక్షిణః । శరభా నష్టపాదాంశ్చ అపః పవనమేవచ. 67

మయో మాయాబలేనైవ పాతయామాస శత్రుషు ।

స తారకాక్షేణ మయేన మాయయా సమ్మోహ్యమానా వివశా గణేశ్వరాః. 68

నాశక్నువంస్తే మనసా విచేష్టితుం యథేన్ద్రియార్థం మునినాభిసంవృతాః ।

మహాజలాగ్నిర్గిరికుఞ్జరోరగై ర్హరీన్ద్రవ్యాఘ్రర్క్షతరక్షురాక్షసైః. 69

తే వధ్యమానా స్తమసా విమోహితా స్సముద్రమధ్యేష్వివ జీవకాఙ్క్షిణః ।

సమ్బాధ్యమానేషు గణేశ్వరేషు ప్రమథ్యమానేషు సురేషు తేషు. 70

తతస్సురాణాం ప్రవరాస్తు రక్షితుం రిపోర్బలం సంవివిశు స్సహాయుధైః ।

యమో ధనేశో వరుణశ్చ భాస్కర స్తథా కుమారోఽమరకోటిసంయుతః. 71

స్వయంచ వజ్రీ వరనాగవాహన స్స్వవజ్రపాణి స్సురలోకపూజితః ।

స చోడునాథ స్సమరే నిశాకర స్సుచారువక్షో ద్యుతిమా న్మహాద్యుతిః. 72

బలం రిపూణాం ప్రమథాశ్చ వీక్షితుం రిపోర్బలం సంవివిశు ర్మదోద్ధతాః ।

అంతలో శోభావంతుడును ప్రతాపవంతుడునగు తారకాక్షుడు యుద్ధరంగమునకు వచ్చి పర్వతములతో వృక్షములతో సమానమగు శరీరము కలిగి భయంకరుడై కనబడెను. అతని చేతిలో తలలు పగిలి మొగములు పగిలి కాళ్ళు విరిగి ప్రమథ గణాధిపతులు మంత్రములతో స్తంభితములయిన సర్పములవలె కనబడుచుండిరి. మాయాశక్తి శాలియగు మయుని చేతిలో దెబ్బలుతిని మిగుల కేకలు వేయుచు పంజరములలోని చిలుకలవలె రొద చేయుచుండిరి. ప్రతాపవంతుడును శ్రీమంతుడు నగు తారకాక్షుడు ప్రమథగణ బలమంతయు ఎండుటడవిని అగ్నులతో కాల్చినట్లు కాల్చివేసెను. తారకాక్షునిచే వారింపబడుచున్న ప్రమథ గణనాథులు బురదలో చిక్కుకొని తిరుగుడు పడుచున్న పక్షులవలె తిరుగుడు పడుచుండిరి. మయుడు మాయతో దెబ్బలు కొట్టుచుండగా దెబ్బలు తినిన ప్రమథ గణనాథులు

వేళ్ళు శిథిలమయిన వృక్షములవలె నిలువచేతకాని వారైరి. అంతలో మయుడు తన మాయా బలముతో మరల మరల సముద్రమును అగ్నిని సింహములను మొసళ్ళను సర్పములను గిరీంద్రములను వ్యాఘ్రములను వృక్షములను భేరుండ పక్షులను శరభములనెడి అష్టపాద మృగములను జలములను వాయువులను సృష్టించి తన శత్రువుల నడుమ విడువ సాగెను. తారకాక్షుడును మయుడును మాయతో ప్రమథ గణేశ్వరులను సంమోహనపరచుచుండ మునిచే తననిగ్రహ శక్తిచే అదుపులో నుంచబడిన ఇంద్రియములు ఆయా విషయములయందు ప్రవర్తిల్లలేనట్లు వారును మనస్సుతో ఏమియు ఆలోచించనైన లేనివారైరి. మహాజలము అగ్నులు గిరులు ఏనుగులు సర్పములు సింహశ్రేష్ఠములు వ్యాఘ్రములు భల్లూకములు చిరుతపులులు రాక్షసులు దెబ్బలుకొట్టి బాధించుచుండ ప్రమథ గణాధిపతులెల్లరును సముద్ర మధ్యమందు చిక్కుకొని బ్రదికి బయటపడుటెట్లా యని కలతపడువారివలె అజ్ఞానముతో మోహితులయిరి. ఇట్లు ప్రమథ గణేశ్వరులు మిగుల బాధింపబడుచుండ సురలు నలుగకొట్టబడుచుండ కొందరు సురశ్రేష్ఠులు వారిని రక్షణ సేయదలచి ఆయుధముల ధరించి శత్రుబలమునందు ప్రవేశించిరి. వజ్రము ఆయుధముగా గలవాడును సురలోక పూజితుడునగు ఇంద్రుడు వజ్రమును చేతధరించి ఐరావత గజమారోహించెను. నక్షత్రాధిపతియు రాత్రుల నేర్పరచువాడును మిగుల మనోహరమగు పక్షము (తన పక్షమందలిసేన - శుక్ల కృష్ణ పక్షములు) కలవాడు ప్రకాశ శీలుడునగు చంద్రుడు మహాప్రకాశము కలవాడయ్యెను. ఇట్లా ఇంద్రచంద్రులిరువురు సన్నద్ధులై శత్రుబలమున ప్రవేశించిరి. మదోద్ధతులగు ప్రమథ గణాధిపతులును శత్రు బలమును చూడదలచి దానియందు ప్రవేశించిరి.

యథా వనం గర్వితకుఞ్జరాధిపై ర్యథా నభ స్సామ్బుధరం సమీరణైః. 73
యథైవ సింహై ర్విజనేషు గోకులం తథా బలంచ త్రిదశై రభిద్రుతమ్ ।
కృతప్రహారాతురదీనమానసం బలం సమేత్యాథ మయ స్తమోఽసృజత్. 74
తముల్బణం ధ్వాన్తముదగ్రరోచిషా విద్యోతనాస్త్రేణ తథైవ దేవరాట్ ।
వికాసయామాస యథాచ చంద్రమా దివాకరో వాఽహని శార్వరం తమః. 75
స్వజ్యోతిషాం జ్యోతిరివోష్మవాఙ్ హరి ర్విపాతయామాస శరేణ సాదరమ్ ।
తజ్జ్యోతిషా తేన తమః ప్రణష్టం ననాశ తూర్ణం త్రిదశాధిపేన. 76
తతోపకృష్టే తమసి ప్రభావా దస్త్రప్రభావేచ వివర్ధమానే ।
దిగ్లోకపాలై ర్గణనాయకైశ్చ కృతో మహా న్సింహరవో ముహూర్తమ్. 77
కోటీరభగ్నా స్త్వసురోత్తమా స్తే చ్ఛిన్నోత్తమాఙ్గా శ్శరపూరితాఙ్గాః ।
దేవేతరా దేవవరాభిభూతా స్సీదన్తి పఙ్కేషు యథా గజేన్ద్రాః. 78
వజ్రేణ భీమేనచ వజ్రపాణిః శక్త్యాసశక్త్యాచ మయూరకేతు ।
ర్దణ్డేన చోగ్రేణచ ధర్మరాజః పాశేన చోగ్రేణ వనేశ్వరోపి. 79
గణేశ్వరాస్తేఽమరసన్నికాశాః పూర్ణాహుతిస్నిగ్ధశిఖిప్రకాశాః ।
ఉత్సాదయన్తో దనుపుత్త్రవృక్షాన్ వృక్షాన్యథేన్ద్రాశనయః పతన్తః. 80
మయస్తుదేవానభిరక్షితారమ్ తారాత్మజం దేవవరం కుమారం ।
శరేణ భిత్త్వా ముహురారసిత్వా సతారకాక్ష స్త్విద మాబభాషే. 81
కృత్వా ప్రహారం ప్రవిశామ ధీరాః పురాణి దైత్యేన్ద్రబలేనయుక్తాః ।
విశ్రామ మూర్జస్కర మవ్యవాప్య పునః కరిష్యామ రణం సమేతాః. 82
వయం హి శస్త్ర క్షతజోక్షితాంగా విశీర్ణశస్త్రధ్వజచర్మవాహాః ।

జయైషిణస్తే జితకాశినశ్చ గణేశ్వరా లోకనరాధిపాశ్చ. 83
మయస్య శ్రుత్వా దివి తారకాక్షః వచోతికాలఃక్షతజోపమాక్షః ।
వివేశ తూర్ణం త్రిపురం సహైవ దితేస్సుతై ర్యుద్ధవివృద్ధదర్పైః. 84
తతస్సశఙ్ఖానకభేరిభీమం ససింహనాదం హరసైన్యమాబభౌ ।
మహాబలం ఘోరసుభీమగహ్వరం యథా మహాద్రే ర్వరసింహనాదితమ్. 85

ఇతి శ్రీమత్స్యమహాపురాణే త్రిపురోపాఖ్యానే దేవదానవయో ర్యుద్ధకథనం
నామ త్రయస్త్రింశదుత్తర శతతమోఽధ్యాయః.

మదపుటేనుగు వనమును వలె పెనుగాలులు జలద సహితమయిన అంతరిక్షమును వలె సింహములు విజన ప్రదేశములందలి గోవులమందను వలె దేవసేనలు రాక్షసుల బలమును కలవరపరచెను. తన బలమంతయు దేవతల చేతిలో దెబ్బలు తిని ఆతురమగుట చూచి మయుడు మాయతో అంధకారమును సృజించెను. గాఢమగు ఆ అంధకారమును ఇంద్రుడు అతితీవ్రమగు ప్రకాశముగల విద్యోతనాస్త్రముతో నశింపజేసెను. రాత్రులందు చంద్రుడును పగళ్లయందు సూర్యుడును వలె తమ సేనను ఇంద్రుడు ఆ విద్యోతనాస్త్రముతో ప్రకాశింపజేసెను. త్రిదశాధిపతిచేత ప్రకాశింపజేయబడిన ఆ జ్యోతిస్సుచే మయుడు కల్పించిన చీకటి ప్రణష్టమై శీఘ్రమే అతని మాయ నశించెను. ఇట్లు చీకటి తగ్గుచు ఇంద్ర ప్రభావమున అతని అస్త్ర ప్రభావము వృద్ధి పొందుచుండ ఒక ముహూర్తకాలము దిక్పాలురును లోకపాలురును ప్రమథగణ నాయకులును గొప్ప సింహనాదము చేసిరి. రాక్షసశ్రేష్ఠులు కిరీటములు పగిలి విరిగి శిరస్సులు పగిలి తెగి అవయవములందంతట శరములు గ్రుచ్చుకొని ఇట్లు దేవతాశ్రేష్ఠుల చేతిలో పరాభవమునంది బురదలో చిక్కుకొనిన గజేంద్రముల వలె చిక్కులలో పడిరి. ఇంద్రుడు భయంకర వజ్రముతోను మయూరధ్వజుడగు కుమారస్వామి శక్తియను ఆయుధముతోను తన శక్తి(బలము)తోను ధర్మరాజు భయంకర దండాయుధముతోను వరుణుడు పాశముతోను అమరుల వలెనే సుందరరూపములతో ప్రకాశించు ప్రమథ గణేశ్వరులును పూర్ణాహుతి సమయమున ఆజ్యబలముతో వెలుగు అగ్నివలె ప్రకాశించుచును దానవులు అనెడి వృక్షములను పిడుగులు వృక్షములపై పడి నశింపజేయునట్లు నశింపజేయసాగిరి. ఆ సమయములో మయుడును దేవతలను కాపాడుచున్నవాడును కృత్తికా నక్షత్ర కుమారుడగు దేవశ్రేష్ఠుడును నగు కుమారస్వామిని శరముతో భేదించి మాటిమాటికిని గర్జించెను. అంతలో మయుడు తారకాక్షునితోను రాక్షసులతోను ఇట్లనెను: "ధీరులారా! దానవశ్రేష్ఠులారా! దేవతలను దెబ్బతీసి మనము దానవ బలమును వెంట తీసికొని పురములందు ప్రవేశింతము. అట్లు విశ్రాంతి తీసికొనుటచే మనకు బలము వృద్ధి నందును. మరల మన మందరమును కూడి వచ్చి యుద్ధము చేయుదము. మన మందరమును దెబ్బలు తిని గాయములనుండి కారు నెత్తుటితో తడిసియున్నాము. మన ఆయుధములును ధ్వజములును డాలులును విరిగినవి పగిలినవి తెగినవి. శివసేనాపక్షము వారు జయము పొంది ప్రకాశించుచున్నారు. ఇంకను గెలువ ఉత్సాహపడుచున్నారు. మయుని మాటవిని కాలయముని మించి భయంకరరూపుడును రక్తమువలె ఎర్రని కన్నులు కలవాడును అగు తారకాక్షుడు యుద్ధము చేయవలెనను ఉత్సాహమదములతో నిండిన దైత్యులను వెంటగొని శీఘ్రమే త్రిపురదుర్గమును ప్రవేశించెను. అంతట శివుని సేనలో ఆనక శంఖభేరీ వాద్యములు ధ్వనులు సింహనాదములు చెలరేగెను. మహాబలశాలియగు ఆ సేన మహా సింహనాదములతో నిండినదియు భయంకరమును లోతైనదియు నగు మహా పర్వత గుహవలె ప్రకాశించెను.

ఇది శ్రీమత్స్య మహాపురాణమున త్రిపురోపాఖ్యానమున దేవదానవ యుద్ధ కథనమను
నూట ముప్పది మూడవ అధ్యాయము.

## చతుస్త్రింశదుత్తరశతతమోఽధ్యాయః.

## దేవవినిర్జితమయస్య త్రిపురప్రవేశః.

సూతః : మయో మహారణం కృత్వా మాయావీ దానవేశ్వరః ।
వివేశ తూర్ణం త్రిపుర మభ్రో నీలమివామ్బరమ్. 1
స దీర్ఘముష్ణం నిఃశ్వస్య దానవాన్వీక్ష్య మధ్యగః । దధ్యౌ లోకక్షయే ప్రాప్తే తథా కాల ఇవాపరః. 2
ఇన్ద్రోఽపి కమ్పతే యస్య స్థితో యుద్ధే సురాగ్రతః । నచాపి నిధనం ప్రాప్తో విద్యున్మాలీ మహాయశాః. 3
దుర్గం తత్ త్రిపురం యస్య న సమం విద్యతే పరమ్ ।
తస్యాఽప్యేషో లయః ప్రాప్తో న దుర్గం కారణం క్వచిత్. 4
కాలస్య వశగం సర్వం దుర్గం దుర్గాన్తరంచ యత్ । కాలే క్రుద్ధే కథం తస్మా త్ప్రాణాన్తోద్య భవిష్యతి. 5
లోకేషు త్రిషు యత్కించి ద్దృశ్యతే నిర్భయాత్మకమ్ । కాలస్య తద్వశః పూర్వ మితి పైతామహో విధిః. 6
అస్మిన్కః ప్రభవేద్యోగా దనన్తార్యేఽమితాత్మని । లఙ్ఘనే కస్సమర్థస్స్యా దృతే దేవా న్మహేశ్వరాత్. 7
నాస్థా మమేన్ద్రే న యమే వరుణే న చ విత్తపే । స్వామీ యఏష దేవానాం దుర్జయ స్సమరే క్వచిత్. 8
ఐశ్వర్యస్య ఫలంయత్ర ప్రభుత్వస్యచ యత్ఫలమ్ । తదహం దర్శయిష్యామి యావద్విధి మహం గతః. 9
వాపీ మమృతతోయేన పూర్ణాం స్రక్ష్యామి తామహమ్ । ఉపజీవన్తి యాం దైత్యా స్సంజీవన మివౌషధమ్. 10

## నూట ముప్పది నాలుగవ అధ్యాయము.

## మయుడు దేవతల చేతిలో ఓడి త్రిపుర దుర్గమున ప్రవేశించుట.

సూతుడు ఋషులకు ఇట్లు చెప్పసాగెను: మాయావియు దానవేశ్వరుడునగు మయుడు మహాయుద్ధము చేసిన అనంతరము మేఘము నీలాకాశమున ప్రవేశించినట్లు త్రిపురమున శీఘ్రముగా ప్రవేశించెను. అతడు దానవులనడుమ కూర్చుండి దీర్ఘముగ వేడి ఊర్పులు వదలుచు రెండవ ప్రళయకాల యముడువలె చింతింపసాగెను. సురల కగ్రగామి యగు ఇంద్రుడును యుద్ధమున ఎవని ఎదుట నిలువజాలక గడగడలాడుచుండెడివాడో అట్టి మహా యశశ్శాలియగు విద్యున్మాలియు మరణించెనుగదా! దేనికి సాటియగు మరియొక దుర్గము ఏదియు లేదో-అట్టిదానికి గూడ ఇదుగో! ఇపుడు నాశము ప్రాప్తించినట్లు కనబడుచున్నది; ఎక్కడను గెలుపు ఓటములకు దుర్గము హేతువుకాదు. దుర్గము కాని మరియేదికాని ప్రతియొకటియు కాలమునకు వశమయి నడుచుచుండును. అందువలన కాలుడు క్రుద్ధుడైనను కాలము రానపుడు ఇప్పుడే ప్రాణాంతము ఎట్లు జరుగును? 'మూడు లోకముల యందును ఇది నిర్భయమయినదని చెప్పదగినదేదేది కలదో-అది ఎల్ల మొట్టమొదలే కాలమునకు వశగమయి యుండెను.' అని బ్రహ్మ చెప్పిన వచనము. నంధారణము చేయుటకు సాధ్యము కానిదియు అమిత స్వరూపము కలదియు అగు కాలము విషయమున మహేశ్వరుడు దేవుడునగు శివుడు ఒక్కడు తప్ప మరి ఎవ్వడు తన సాధనముల అమరికతో తన శక్తి చూపగలడు? ఇంద్రుడు యముడు వరుణుడు కుబేరుడు-ఈ ఎవ్వరిని నేను లెక్కపెట్టను. దేవతలకు ప్రభువగు ఈ పరమేశ్వరుడు మాత్రమే యుద్ధమున ఎక్కడను దుర్జయుడు. ఐశ్వర్యమునకు ఫలము ఏదో-ప్రభుత్వమునకు ఫలము ఏదో - దానిని నా విధానమునననుసరించినంతలో నేను చూపెదను. దైత్యులకందరకును నంజీవనౌషధమువలె జీవనాధారమగు అమృత జలపూర్ణముగు వాపిని (దిగుడు బావిని) సృష్టింతును.

### మయకృతమాయాఽమృతవాపీనిర్మాణమ్.

ఇతి సఞ్చిన్త్య మనసా మయో మాయావినాం వరః । అసాక్షీ న్మాయయా వాపీం రమ్యామివ పితామహః.
ద్వియోజనాయతాం దీర్ఘాం పూర్ణయోజనవిస్తృతామ్ । మాధుర్యరసవీచీభి శ్చిత్రరూపాం కథామివ. 12

చన్ద్రనిర్యాసకల్పస్య పుష్టస్యామృతగన్ధినః । పూర్ణాం పరమతోయస్య గుణపూర్ణా మివాఙ్గనామ్. 13
ఉత్పలైః కుముదైః పద్మై ర్వృతాం కాదమ్బకై స్తథా। చన్ద్రభాస్కరసఙ్కాశై ర్భ్రమరాభరణై ర్వృతామ్.
హంసై ర్మధురవాచాలై శ్చారుచామీకరప్రభైః । కామేషుభి రివాకీర్ణాం దీవ్యతే రమణీమివ. 15
సృష్ట్వా మయ స్స తాం వాపీం గఙ్గామివ మహేశ్వరః। అస్యాం ప్రక్షేపయామాస విద్యున్మాలిన మాదృతః.
స వాప్యాం మజ్జితో దైత్యో దేవశత్రు ర్మహాబలః । ఉత్తస్థౌ విన్ధనై రిద్ధ స్సంవర్ధిత ఇవానలః. 17
మయస్య చాఞ్జలిం కృత్వా తారకాక్షోఽభివాదితః । విద్యున్మాలీతి వచనం మయమేవ మభాషత. 18
క్వ నన్దీ సహరుద్రేణ వృతః ప్రమథజమ్బుకైః । యుధ్యమానశ్చ నిష్పిష్య మయా దేహేషు మోహితః. 19
ప్రసాదాదేవ రుద్రస్య భవామః ప్రభవిష్ణవః । తైర్వా వినిహతే యుద్ధే భవిష్యామో యమాననమ్. 20
విద్యున్మాలివచస్త్వేవం నిశమ్యాత్యన్త మూర్జితమ్ । సమ్పరిష్వజ్య సాన్ద్రాక్ష ఏవమాహ మహాసురః. 21
విద్యున్మాలి న్నమే రాజ్య మభిప్రేతం న జీవితమ్ । త్వయా వినా మహాబాహో త్వదర్థేన మహాసుర. 22
మయాఽమృతమయీ వాపీ చైషా మాయాబలేనతు । సృష్ట్వా దానవదైత్యానాం హతానాం జీవవర్ధనీ. 23
దిష్ట్యా త్వాం దైత్య! పశ్యామి యమలోకా దిహాగతమ్। నిర్గతం నిర్ధనస్యేహ భాగ్యాదివ మహానిధిమ్. 24
దృష్ట్వా దృష్ట్వా తు తాంవాపీం మాయయా తు వినిర్మితామ్ ।
హృష్టాస్తాం వీక్ష్య దైత్యేన్ద్రా ఇదం వచన మబ్రువన్. 25

మాయావులలో మొనగాడగు మయుడు తన మనస్సులో ఇట్లాలోచించి బ్రహ్మదేవుడు రంభను సృజించినట్లు తన మాయతో వాపిని సృష్టించెను. దాని పొడవు రెండు యోజనములు; వెడల్పు ఒక యోజనము; అది 'కత'యను కావ్య విశేషమువలె మాధుర్య రసముతో నిండిన అలలతో నిండియుండెను; చందనపు బంకవలె నుండినదియు పుష్టి కలిగించునదియు అమృతమువలె రుచి కలుగుటతోపాటు కమ్మని వాసనలు వెదజల్లు ఉత్తమ జలముతో నిండి సద్గుణపూర్ణ యగు యువతివలె కనబడుచుండెను. నల్లని తెల్లని కలువపూలతోను పద్మములతోను కాదంబములనెడు హంసలతోను చుట్టుకొనబడి చంద్ర సూర్యులతో క్రమ్మబడినట్లు ఆ వాపి కనబడుచుండెను. తుమ్మెదలనెడు ఆభరణములతో అలంకరించబడియుండెను. కమ్మని ధ్వనులు చేయుచు మనోహరమగు బంగారు కాంతులు గల హంసలతో కూడి అది మన్మథ బాణములతో వ్యాప్తయైన రమణివలె కనవచ్చుచుండెను. మహేశ్వరుడు గంగనువలె మయుడు ఆ వాపిని సృష్టించి విద్యున్మాలిని ఆదరముతో దానిలో పడవేయించెను. దేవ శత్రువును మహాబలుడునగు ఆ విద్యున్మాలిని దానియందు ముంచగానే కట్టెలతో చక్కగా వృద్ధి చేయబడి ప్రజ్వలించుచు ప్రకాశించు అగ్నివలె అతడు ప్రకాశించుచు లేచి నిలువబడెను. మయుని నమస్కరించెను. తారకాక్షుడు విద్యున్మాలికి నమస్కరించెను. అంతట విద్యున్మాలి మయునితో ఇట్లు పలికెను: ప్రమథులు అనెడు జంబుకములు తను కొలుచుచుండగా రుద్రుని వెంటనుండు నంది ఎక్కడ? నేను బాణములతో అతని దేహమును పీడించి మోహపరచితిని. మనము ఇప్పుడయినను రుద్రుని అనుగ్రహమువలననే సమర్థులము అయ్యెదము. అప్పుడు శత్రువులను గెలిచెదము. లేక వారే మనలను చంపిరా-యమునకు ఆననముగా అయ్యెదము. ఇట్లు పలికిన విద్యున్మాలి మాటలు విని మహాసురుడును మిగుల బలశాలియునగు మయుడు ఇట్లు పలికెను: విద్యున్మాలీ! మహాబాహూ! నాకు ఈ రాజ్యముకూడ ఇష్టముకాదు. మహాసురా! నీకొరకే నేను మరణించిన దైత్యులకును దానవులకును జీవన వర్ధనము కలిగించు ఈ అమృతమయియగు వాపిని నా మాయాబలముతో సృష్టించితిని. దైత్యుడా! నేను అదృష్టవంతుడను గనుక తనంతట తాను వెలికివచ్చి నిర్ధనునకు కనబడిన మహానిధివలె నాకు నీవు కనబడుచున్నావు. మయుడు తన మాయతో నిర్మించిన ఆ మాయామయమగు అమృతవాపిని చూచి చూచి దైత్యపుంగవులు హర్షము చెంది ఇట్లు పలుకనారంభించిరి:

దానవా యుధ్యతేదానీం ప్రమథై స్సహ నిర్భయాః । మయేన నిర్మితా వాపీ హతా న్సఞ్జీవయిష్యతి. 26
తతః క్షుబ్ధామ్బుధిరివ భేరీ సాతు భయంకరీ । వాద్యమానా రవైరుచ్చై రౌరవీతి పునఃపునః. 27
శ్రుత్వా భేరీరవం ఘోరం మేఘసన్నాదసన్నిభమ్ । నిష్పతన్తి సురాస్తూర్ణం త్రిపురా యుద్ధలాలసాః. 28
లోహరాజతసౌవర్ణైః కటకై ర్మణిభూషితైః । ఆముక్తా మణ్డలై ర్హారై ర్మకుటైరపి చోత్కటైః. 29
ధూమాయన్తే హ్యవిరతం లలన్తఇవ పావకాః । ఆయుధాని సమాదాయ కోటిశో దృఢవిక్రమాః. 30
నృత్యమానా ఇవ నటా గర్జన్తఇవ తోయదాః । కరోచ్ఛ్రితా ఇవ గజా స్సింహా ఇవచ నిర్దయాః. 31
హ్రదాఇవచ గమ్భీరా స్సూర్యా ఇవచ తాపినః । యమాఇవచ దైత్యేన్ద్రా స్త్వరయన్తో బలంమహత్. 32
ప్రమథాహ్యపి శోత్సాహా గరుడోత్పాతపాతినః । యుయుత్సవో విధావన్తి దానవాన్ దానవారయః. 33
నన్దీశ్వరేణ ప్రమథా స్తారకాక్షేణ దానవాః । చక్రు స్సదైత్యా స్సఙ్గ్రామం చోద్యమానా బలేన తే. 34
తోమరై శ్చన్ద్రసఙ్కాశై శ్శూలై శ్చానలసన్నిభైః । బాణైశ్చ దృఢనిర్ముక్తై రభిజఘ్నుః పరస్పరమ్. 35
శరాణాం సృజ్యమానానా మసీనాం చ నిపాత్యతామ్ ।
రూపాణ్యాస న్మహోల్కానాం పతన్తీనా మివామ్బరాత్. 36
శక్తిభిర్భిన్నహృదయా నిర్దయాహతపాతితాః । నిరయేష్వివ నిర్మగ్నాః కూజన్తే ప్రమథా స్సురాః. 37
హేమకుణ్డలజుష్టాని కిరీటమకుటానిచ । శిరాంసి వ్యాపతన్తిస్మ గిరికూటనిభానిచ. 38

దానవులారా! ఇపుడు నిర్భయులై ప్రమథులతో తలపడి యుద్ధము చేయుడు. యుద్ధమున రాక్షసులు మరణించినను వారిని మయుడు నిర్మించిన 'వాపి' బ్రతికించగలదు. అని దైత్యులు పరస్పరము అన నారంభించిరి. అంతట దానవులు మ్రోగించు భయంకర భేరి క్షోభిల్లు సముద్రమువలె మాటిమాటికి బిగ్గరగా మ్రోగనారంభించెను. మేఘ ధ్వనులబోలు భేరీనాదమును విని యుద్ధము చేయు కుతూహలముతో త్రిపుర దానవులు పురమునుండియు-దేవతలు తమతమ సేనాని వేశములనుండియు బయటకు వచ్చిరి. త్రైపురదానవులు ఇనుముతోను వెండితోను బంగారుతోను చేసి మణులతో అలంకరించబడిన గుండ్రని హారములును ఉత్కటములగు మకుటములును ధరించియుండిరి. దృఢ విక్రములగు ఆదానవులు కోట్లకొలదిగా ఆయుధములు ధరించి ఎడతెగక జ్వలించుచు నాలుకలు కోయు అగ్నులవలె పొగలు గ్రక్కుచుండిరి. వారు నృత్యము చేయు నటుల వలెను గర్జించు మేఘములవలెను తొండము పైకెత్తిన ఏనుగుల వలెను నిర్దయములగు సింహములవలెను కనబడుచుండిరి. గంభీరములగు హ్రదములవలెను అధికముగ తపించు సూర్యులవలెను యములవలెను దైత్యేంద్రులు తమ దైత్య మహా సేనను త్వర పెట్టుచుండిరి.

ప్రమథులును ఉత్సాహవంతులయి గరుడుడు ఎగిరిపడునట్లు ఎగిరిపడు పాదములతో తాము దానవులకు శత్రువులు కావున దానవులతో యుద్ధము చేయగోరి దానవుల మీదకు పరుగెత్తుచుండిరి. నందీశ్వరునితో కూడి ప్రమథు లును తారకాక్షునితో కూడి దానవులును దైత్యులును తమతమ బలముల ప్రేరణతో సంగ్రామము చేయనారంభించిరి. చంద్రులవంటి తోమరములతోను అగ్నులవంటి శూలములతోను దృఢముగా విడువబడిన శరములతోను వారు పరస్పరము కొట్టుకొనసాగిరి. ప్రయోగించబడు శరములును విసరివడవేయబడు ఖడ్గములును అంతరిక్షమునుండి రాలిపడు ఉల్కల వలె కానవచ్చుచుండెను. శక్తుల దెబ్బలతో హృదయములు చీలగా నిర్దయముగా తగిలి దెబ్బలతో పడిపోవుచున్న ప్రమథులును దేవతలును నరక కూపములలో మునిగిపోవుచున్న వారువలె కనబడుచుండిరి. బంగారు కుండలములు అలంకారములుగా గలిగి కిరీటములును మకుటములును ధరించియున్న ప్రమథుల-దేవతల-శిరస్సులు పర్వతశృంగముల వలె అంతరిక్షమునుండి క్రింద పడుచుండెను.

శిలీముఖైః పట్టసైశ్చ ఖడ్గైః పరశుభిస్తథా । ఛిన్నాః కరికరాకారా భుజాః పేతు ర్ధరాతలే. 39
గర్జన్తి సహసమ్మృష్టాః ప్రమథా భీమతర్జనాః । సాదయన్తి పరే సిద్ధా యుద్ధగాన్ధర్వమద్భుతమ్. 40
ప్రమథాభాసిబలవద్దానవాభాసిదర్పితః । ఇతి చోచ్చారయ న్వాచం చారణా రణభూగతాః. 41
పరిఘైరాహతాః కేచిద్దానవైః శ్శఙ్కరానుగాః । వమన్తో రుధిరం వక్త్రై స్స్వర్ణధాతు మివాచలాః. 42
ప్రమథైరపి గీర్వాణై ర్దారితా స్సురశత్రవః । ద్రుమైశ్చ గిరిశృఙ్గైశ్చ బహవో పహతా రణే. 43
సూదితాఞ్ సూదితాన్ దైత్యా నన్యే దానవపుఙ్గవాః । ఉత్క్షిప్య చిక్షిపు ర్వాప్యాం మయదానవచోదితాః. 44
తే చాపి భాస్వరై ర్దేహై స్స్వర్గలోకా దివాగతాః । ఉత్తస్థు స్స్నాయమానాఖ్యా స్తద్రూపాభరణామ్బరాః. 45
అథైకే దానవాః ప్రాప్య వాపీ ప్రక్షేపణా దసూఞ్।ఆస్ఫోట్య సింహనాదైశ్చ కృత్వాఽధావం స్తథాఽసురాన్.
దానవాః ప్రమథా నేతా న్స్వసర్వథ కిమాస్యతే । హతానపిహి నోవాపీ పున స్సఞ్జీవయిష్యతి. 47
ఏవంశ్రుత్వా శఙ్కుకర్ణ స్తథా హ్యశనిసన్నిభః । సమాగత్యతు దేవేశ మిదం వచన మబ్రవీత్. 48
సూదితాస్సూదితా దేవ ప్రమథై రసురాహ్యమీ । ఉత్తిష్ఠన్తే పునర్భీమా స్సస్యాఇవ జలోక్షితాః. 49
అస్మిన్కిల పురేవాపీ *పూర్ణామృతరసాహ్వయా । నిహతా నిహతా యత్ర క్షిప్తా జీవన్తి దానవాః. 50
ఇతి వ్యజ్ఞాపయద్దేవం శఙ్కుకర్ణో మహేశ్వరమ్ । దానవానాం బలే మూర్చా కోపశ్చాసీ త్సుదారుణః. 51
తారకాక్షస్తు భీమాక్షస్తారకాక్ష ఇవామ్బుదః । అభ్యధావ త్సుసఙ్క్రుద్ధో మహాదేవరథం ప్రతి. 52
త్రిపురేషు తదోత్కృష్టభేరీశఙ్ఖరవోఽభవత్ । దానవా నుద్ధతాఞ్ దృష్ట్వా దేవదేవరథం ప్రతి. 53

బాణములతో పట్టిసములతో ఖడ్గములతో గండ్రగొడ్డండ్రతో నరుకబడిన ప్రమథుల భుజములు ఏనుగు తొండములవలె క్రింద పడుచుండెను. చక్కగా అలంకరించుకొని యుద్ధము చేయుచున్న ప్రమథులు కొందరు భయంకరముగా గర్జించుచుండిరి. ఇది అంతయు చూచుచు అంతరిక్షమున సిద్ధులు కొందరు అద్భుతమగు యుద్ధ సంగీతమును సాధనచేయుచు ఆనందించుచుండిరి. (ఈ యుద్ధమును వర్ణించుచు గేయములు రచించి పాడుచుండిరి.) రణభూమికి తిన్నగా అంతరిక్షమున నిలిచిన చారణులనెడు దేవ జాతులవారు 'ప్రమథుడా! నీవు దానవునికంటె బలవంతుడవుగా కానిపించుచున్నావు. దానవా! నీవే ప్రమథునికంటె దర్పితుడవుగా భాసించుచున్నావు.' అని ఇట్లు యుద్ధములో పైచేయిగా నున్నవారిని పొగడుచుండిరి.

ప్రమథులు కొందరు దానవుల పరిఘల దెబ్బలు తిని నోట నెత్తురు క్రక్కుచు స్వర్ణధాతువుల క్రక్కు కొండల వలె నుండిరి. ప్రమథులును దేవతలును చీల్చివేయగా వృక్షములతో పర్వత శిఖరములతో కొట్టగా దానవులు చచ్చుచుండిరి. అట్టివారిని మయుడు తన వారిచేత వాపియందు పడవేయించుచుండెను. వారు మరల బ్రదికి ప్రకాశించు దేహములతో స్వర్గమునుండి వచ్చు దేవతలవలె వచ్చుచుండిరి: వారి ఆభరణములును వస్త్రములును దేవతలకువలె నుండుటచే పొగడ్తలందుకొనుచుండిరి. అట్లు తిరిగి బ్రదికిన కొందరు దానవులు భుజములు చరచి సింహనాదము చేయగా భయపడి ప్రమథులును దేవతలును పారిపోవుచుండిరి. దానవులు కొందరు ప్రమథులను దేవతలను చూచి 'ఇంకను పారిపోక నిలిచెదరేల? మీరు మమ్ము చంపినను 'వాపి' మమ్ము మరల బ్రదికించును.' అనుచుండిరి. అది విని వజ్ర సమానుడగు శంకుకర్ణుడనునాతడు శివునికడకు పోయి ఇట్లనెను: దేవా! ఈ దానవులను మన ప్రమథులు చంపివేసినను నీటితో తడిపిన పైరులవలె లేచి భయంకరులై వచ్చుచున్నారు. ఈ త్రిపురదుర్గమునందు అమృత రసముతో నిండిన 'అమృతరసా' అను 'వాపి' (దిగుడు బావి) కలదట. చచ్చిన దానవులను దానియందు వేయగా వారందరు మరల బ్రదికి వచ్చుచున్నారు.

---

* పూర్ణాఽమృతరసామ్భసా.

అంతలో దానవులు దారుణమగు కోపోద్రేకము చెందిరి. తారకాక్షుడు భయంకర నేత్రములతో తారకాక్షమను మేఘమువలె మహా క్రోధముతో మహాదేవుని రథము వైపునకు పరుగెత్తుకొని వచ్చెను. దేవదేవుని రథము వైపునకు దానవులుద్ధతులయి పోవుట తెలిసి త్రిపురదుర్గవాసులు అధిక భయంకరముగా భేరీ శంఖధ్వనులు చేసిరి.

తే తత్ర నిస్సృతా దేవా స్తారకాక్షేణ సంయుగే । జ్ఞాత్వా క్షోభ మగాద్రుద్ర స్స్వయమ్భూశ్చ పితామహః.
తాభ్యాం దేవవరిష్ఠాభ్యా మన్విత స్స రథోత్తమః । †అనాధవన్త మాసాద్య సీదతే గుణవానివ. 55
ధాతుక్షయా ద్దేహమివ గ్రీష్మే నద్యామివోదకమ్ । శైథిల్యం యాతి సరథ స్స్నేహో విప్రకృతో యథా.
శరాదేక బలాద్దేవ స్సీదన్తం సరథోత్తమమ్ । ఉజ్జహార మహాప్రాణ స్త్రైలోక్యం రథరూపిణమ్. 57
శరాదపిచ నిష్క్రుత్య పీతవాసా జనార్దనః । వృషరూపం మహత్కృత్వా రథం జగ్రాహ దుర్ధరమ్. 58
విషాణాభ్యాంచ త్రైలోక్యం రథమేవ మహారథః । ప్రగృహ్యోద్వహతే విష్ణుః కులం కులమహాన్యథా. 59
తారకాక్షోపి దైత్యేన్ద్రో గిరీన్ద్రఇవ వక్షవాన్ । ●పరిఘేన స తా నశ్వా న్బ్రహ్మాణం హతవాంశ్చ సః.60
స తారకాక్షాభిహతః ప్రతోదం న్యస్య కూబరే । విజజ్వాల ముహుర్బ్రహ్మా పునశ్చాసనం సముద్గిరన్. 61
తత్ర దైత్యై ర్మహా న్నాదో దానవైశ్చాపి భైరవః । ○తతో వృషమయో విష్ణు స్తత్పురం ప్రవివేశహ.62
వృషరూపివిష్ణుకృతమాయామృతవాపీపానమ్.
తత్రామృతరసాం వాపీం గత్వా జలజమన్దిరామ్ । శతపత్రవనాఢ్యాంచ కర్పూరక్షోదగన్ధినీమ్. 63
పపౌ సమ్మోహ్య దైత్యేన్ద్రా న్వృషరూపధరో హరిః । వాపీం పీత్వా సురేన్ద్రాణాం పీతవాసాజనార్దనః. 64
నర్దమానో మహాబాహుః ప్రవివేశ శరం తతః ।
తతోఽసురా భీమగణై శ్శరార్దితాః ప్రహారసంవర్ధితశోణితాపగాః. 65
పరాఙ్ముఖాః భీమగణైః కృతా రణే యథా మృగాః కేసరిణా మహావనే ।
స తారకాక్ష స్తటిమాలిరేవచ మయేనసార్ధం ప్రమథై రభిద్రుతాః. 66
పురం పరావృత్య గతాశ్శరాతురా యథా శరీరం పవనాదయో గతాః ।
గణేశ్వరా హ్యుత్కటగర్వశాలినో మహేన్ద్రనన్దీశ్వరషణ్ముఖా యుధి. 67
వినేదురుచ్చై ర్జహసుశ్చ దుర్మదా జయేమ చన్ద్రశ్చ దిగీశ్వరై స్సహ. 67½

ఇతి శ్రీమత్స్యమహాపురాణే త్రిపురోపాఖ్యానే దేవదానవయోర్యుద్ధే
దేవగణపరాజితమయాదీనాం త్రిపురప్రవేశ కథనం నామ
చతుస్త్రింశదుత్తరశతతమోఽధ్యాయః.

ఆ సమయమున తారకాక్షునితో జరుగనున్న ఆయుద్ధమునకై దేవతలును వెలుపలికి వచ్చి రంగమున నిలిచిరి. ఇది తెలిసి రుద్రుడును స్వయంభూబ్రహ్మయు కలతచెందిరి. ఆ దేవశ్రేష్ఠులిద్దరు నారోహించియున్న ఆ

† అనాయతనమాసాద్య.

● అభ్యద్రవ త్తదాదేవం బ్రహ్మాణం ప్రభుమీశ్వరమ్.

○ రథచరణకరోఽప్యపావ యుద్ధే వృషభవపు ర్వృషభేన్ద్రపత్రపూతః । దితితనయబలం విమథ్య సర్వం త్రిపురపురం ప్రవివేశ కేశవః. సజలజలజరాజితాం సమస్తాం కుముదవరోత్పలపుల్లపఙ్క జాఢ్యామ్ । సురగురు రపి తత్పపౌ జలాన్తా మఖిలమివార్ణవ (మగ్నిరివౌ) (మౌ)ర్వసమ్భవః॥

రథోత్తమము అనాథుడు వచ్చి తన్నాశ్రయించగా వానినెట్లు రక్షింతునాయని దిగులుచెందు గుణవంతుడు పీడుడువలెను ధాతు క్షయవ్యాధి గ్రస్తమయిన దేహమువలెను గ్రీష్మ నదీజలము వలెను తిరస్కరింపబడిన స్నేహమువలెను (తాను చూపిన స్నేహమును అవతలివారు తిరస్కరించినచోవలె) శిథిలము కాసాగెను. ఆరథము సామాన్యమయినదికాదు-త్రైలోక్యరూపమయినది. అట్టి శంకర రథమును (త్రైలోక్యమును) తాను శరీరమునందు ఉండియే మహా (ముఖ్య) ప్రాణతత్త్వరూపుడుగా ఆ బాణమునందున్న విష్ణువు పైకి లేవనెత్తెను. ఐనను అది నిలువబడుటలేదు. అందుచే పీతాంబరుడగు జనార్దనుడు వెంటనే శరమునుండియు ఎగిరి దుమికి మహావృషభ (ధర్మ) రూపమును ధరించి వచ్చి మరెవ్వరికి ధరించుటకు (పడకుండ నిలిపి పట్టుటకు) సాధ్యముకాని ఆ రథమును తన కొమ్ములతో ఎత్తి పట్టి నిలిపెను. అది కేవల రథముకాదు. త్రైలోక్యరూపము అయినది. దేవోత్తముడగు ఆ విష్ణువు దానినట్లు నిలిపి పట్టుట ఒక కులమందలి మహాపురుషుడు తన కులమును ఉన్నతికి తెచ్చుటవలె కనబడుచుండెను.

దైత్యేంద్రుడగు తారకాక్షుడు రెక్కలుగల గిరివలె ఎగిరివచ్చి పరిఘతో అశ్వములను సారథిని చావమోదెను. బ్రహ్మయు తారకాక్షుని దెబ్బతిని ప్రతోదము (కశా-కొరడా)ను కూబరమున పడవేసి మాటిమాటికి శ్వాస వదలుచు ఉష్ణమును క్రక్కుచు కూలబడెను. అది చూచి దైత్య దానవులు మాటిమాటికిని భయంకరమగు నాదము చేయసాగిరి.

అంతట విష్ణువు వృషభరూపమున త్రిపురదుర్గమును ప్రవేశించెను. అచ్చట ఆదేవుడు 'అమృతరస'యను 'వాపి'ని చూచెను. దానియందు సాధారణ జాతి పద్మములును నూరు దళముల పద్మములు నుండెను. కర్పూరపు పొడివాసన దానినుండి వచ్చుచుండెను. వృషరూపధారియగు హరి దానవులను సమ్మోహపరచి వారికి తెలియకుండ ఆ వాపి (యందలి నీటిని)ని త్రాగివేసెను. పీతాంబరుడగు జనార్దనుడు అసురేంద్రుల ఆవాపిని త్రావి ఆ మహాబాహుడు గర్జన సేయుచు మరల శరమును ప్రవేశించెను. తరువాత అసురులను భయంకరులగు ప్రమథులు బాణపు దెబ్బలతో బాధించిరి. ఆ శరప్రహారములతో రక్తనదులు అధికమయ్యెను. ఇట్లు వారు సింహములు మృగములను తరిమినట్లు దానవులను రణమునుండి పరాఙ్ముఖులనుగా చేసి తరిమిరి. తారకాక్షుడును విద్యున్మాలియు మయుడును పారిపోయిరి. శరీరమునుండి ప్రాణవాయువులు మొదలగు జీవాశ్రిత ధర్మములు వెడలిపోయినట్లు వారెల్లరును రణరంగమునుండి త్రిపురదుర్గమునకు వెడలిపోయిరి.

మహేంద్ర నందీశ్వర షణ్ముఖులును చంద్రుడును దిక్పాలురును ప్రమథ గణాధిపతులును అత్యధిక గర్వశాలురై యుద్ధమున మనము జయించెదమను విశ్వాసముతో దుర్మదులయి గర్జించిరి; బిగ్గరగా నవ్విరి.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున త్రిపురోపాఖ్యానమున మయాదుల పరాజితులయి
త్రిపురమున ప్రవేశించుటయను నూట ముప్పది నాలుగవ అధ్యాయము.

## పంచత్రింశదుత్తరశతతమోఽధ్యాయః.
## దేవపరాజితమయదానవానాం దైన్యకథనమ్.

సూతః : ప్రమథైస్సమరే భగ్నా స్త్రైపురాస్తే మయాదయః ।
వివిశుస్త్రిపురం భీతాః ప్రమథై ర్భగ్నగోపురమ్. 1
శీర్ణదంష్ట్రా యథా నాగా భగ్నశృఙ్గా యథా వృషాః । యథా విపక్షా శ్శకునా మేఘాః క్షీణోదకా యథా. 2
మృతప్రాయా స్తథాదైత్యా దైన్యేన వికృతాననాః । బభూవుస్తే విమనసః కథం కార్యం భవేదితి. 3
అథ తాన్మ్లానమనస స్తదా తామరసాననః । ఉవాచ దైత్యాన్ దైత్యానాం పరమోఽధిపతి ర్మయః. 4
కృత్వా ఘోరాణి యుద్ధాని ప్రమథైస్సహ సామరైః । త్రాసయిత్వా సురాన్యుద్ధే ప్రమథా నమరైస్సహ. 5
శివిజితప్రథమం దైత్యాః పశ్చాత్తైరపి తాడితాః । ప్రవిష్టా నగరం త్రస్తాః ప్రమథై ర్భృశదుఃఖితాః. 6

*అప్రియంవో మహత్ప్రాప్తం దేవైర్నాస్త్యత్ర సంశయః । వృషాణామివ నో భగ్న శృఙ్గభఙ్గసమోఽభవత్.
అహో కాలస్యహి బల మహో కాలోఽతిదుర్జయః । యత్రేదృశస్య దుర్గస్య ఉపరోధోఽయ మాగతః. 8
ఏవంవదతి దైత్యేన్ద్రే మయే బుద్ధిమతాంవరే। బభూవు ర్నిష్ప్రభా దైత్యా గ్రహా స్సూర్యోదయే యథా. 9
వాపీపాలా స్తతోఽభ్యేత్య సభఃకాల ఇవామ్బుదాః । మయమాహు ర్యమప్రఖ్యం ప్రాఞ్జలి ప్రశ్రయాన్వితాః.

## నూట ముప్పదియైదవ అధ్యాయము.

## దేవపరాజితులగు మయాది దానవుల దీనస్థితి.

సూతుడు ఋషులతో ఇట్లు చెప్ప నారంభించెను: ప్రమథుల చేతిలో యుద్ధమున భంగము నందిన మయాది త్రిపురదుర్గ దానవులు భయమంది ప్రమథుల చేతిలో విరిగిన గోపురాదులు గల త్రిపురమును ప్రవేశించిరి. వారెల్లరును కోరలు చిదికిన సర్పములవలెను కొమ్ములు విరిగిన వృషభములవలెను ఱెక్కలు పోయిన పక్షులవలెను నీరు లేకుండ పోయిన మేఘములవలెను అయిరి. దైన్యముతో వారి ముఖములు వికృతము లయ్యెను. వారు మృతప్రాయు లయిరి. ఇకమీదట తాము ఏమి చేయవలయునో తోచని వారయిరి. ఇట్లు వాడిన మనస్సులతో నున్న దానవులను చూచి పద్మము వలె వికసితమగు ముఖముగలవాడయి దైన్యములేక దైత్యోత్తముడగు మయుడు ఇట్లు పలికెను: దైత్య దానవులారా! మీరు ప్రమథులతోను దేవతలతోను ఘోర యుద్ధములు చేసితిరి. వానియందు దేవతలను ప్రమథులను భయపెట్టితిరి. మొదట మీరే వారిని గెలిచితిరి. కాని తరువాత వారి చేతిలో ఓడిపోతిరి. ఇపుడు ప్రమథుల చేతిలోనే దెబ్బలు తిని మిగుల దుఃఖ మంది భయపడుచు నగరమును ప్రవేశించితిరి. దేవతల చేతిలో మీకు ఎంతయో దుఃఖము ప్రాప్తించినది. ఇందు ఏ మాత్ర మును సందేహము లేదు. మనకు కలిగిన ఈ అవమానము వృషభములకు జరిగిన శృంగభంగము వంటిది. ఈనాడు ఇటువంటి త్రిపురదుర్గమునకే ఇటువంటి ముట్టడి తటస్థించిన దనిన అహో! కాలమహిమ ఎంత యాశ్చర్యకరమయినది! కాలము ఎట్టి(మనవంటి)వారికిని జయింపరానిదనుట ఆశ్చర్యకరమే కదా!

మహాబుద్ధిశాలియగు మయుడు ఇట్లు పలుకుచుండ అది వినుచున్న దైత్యదానవశ్రేష్ఠులు సూర్యోదయము కాగానే గ్రహములవలె కాంతిహీను లయిరి. అదే సమయమున వర్షాకాల మేఘములవంటి నీలకాయులైన వాపీపాలురు వచ్చి విన యము కలవారై దోసిలి యొగ్గి యమునివంటి మయునితో ఇట్లు పలికిరి:

యా సాఽమృతరసా గూఢా వాపీ వై నిర్మితాత్వయా । నదేవాసురశార్దూల పీతా కేనాపి సంవృతా. 11
సమాకులోత్పలవనా సమీనాణ్డజపఙ్కజా । వాపీయాఽద్య త్వయా సృష్టా మృతసఞ్జీవనాత్మికా. 12
పీతా నో వృషరూపేణ కేనచి ద్దైత్యనాయక । వాపీపాలవచ శ్శ్రుత్వా మయోఽసురవరః ప్రభుః. 13
కష్ట మేత త్సకృత్ప్రోచ్య దితిజా నిద మబ్రవీత్ ।మయా మాయాబలకృతా వాపీ పీతాఽసురా యది. 14
వినష్టాఽస్మ వసన్దేహ త్రిపురం దానవాగతమ్ । నిహతాన్నిహతాణ్ దైత్యా నాజీవయతి దైవతైః. 15
వాపీ;యదిహి సావాపీ పీతాసాపీతవాససా । కోఽన్యో మన్మాయయా గుప్తాం వాపీ మమృతదాయినీమ్. 16
పాస్యతే విష్ణుమజరం వర్జయిత్వా గదాధరమ్ । సుగుహ్యామపి దైత్యానాం నాన్యస్య విదితం యతః. 17
యతో మత్కౌశలం జ్ఞాతం విబుధై స్సర్వతోముఖైః । సమోయం రుచిరోదేశో విద్రుమో విగతాచలః. 18
తే వయం విరథా స్తస్మా ద్బాధ న్తేఽస్మా న్గణాస్సురాః । తే యూయం యది మన్యధ్వం సాగరోపర్యధిష్ఠితాః.
ప్రమథానాం మహావేగం నహామ హ మనోజవమ్ । ఏతేషాం న సమారమ్భా స్తస్మి న్సాగరసమ్ప్లవే. 20

* అప్రియంక్రియతేవ్యక్తం.

నిరుత్సాహా భవిష్యన్తి దుర్గే మార్గం వినాఽమరాః।యుధ్యతాం నిఘ్నతాం శత్రూ సహితానాం ద్రవిష్యతామ్.
సాగరోఽమ్బరసఙ్కాశ శ్శరణం నో భవిష్యతి ।

ఎవరికిని ఎరుగరానట్లు అమృతరసపూర్ణమయిన 'అమృతరసా' అను వాపిని నీవు నిర్మించితివి గదా: దేవ దానవు లెల్లరలో ఉత్తముడవగు మయా! దాని నెవరో రహస్యముగా త్రావి వేసిరి. అనగా మరికొందరు దానవులు వచ్చి ఇట్లనిరి. మృత సంజీవనశక్తిగల వాపిని నీవు సృజించితివి గదా: దైత్యనాయకా! దాని నెవరో వృషభ రూపమున వచ్చి త్రావెను. ఎడములేక కలువలగుంపులతో మత్స్యములతో పక్షులతో పద్మములతో కూడియుండు దానియందేమియు నీరే లేకుండ పోయినది.

అనగా వాపీపాలురు పలికిన మాటలు విని దైత్యవరుడును ప్రభువును నగు మయుడు 'ఇది ఎంత జరుగరాని బాధాకరమగు విషయము జరిగినది!' అని ఒకమారు పలికి దానవులతో ఇట్లు పలికెను: అసురులారా! నేను నా మాయా బలముతో నిర్మించిన 'అమృతరస' వాపినే ఎవరోత్రావిపోయినారనిన-దానవులారా! మన త్రిపురదుర్గము కూడ లేకుండ పోయినదవియే నిస్సందేహముగా చెప్పవచ్చును. దేవతల చేతిలో ఎన్నిమారులు చచ్చినవారినైనను దైత్య దానవులను మరల మరల ఆజీవింపజేయుచుండిన అమృతరస వాపిని ఎవరో త్రావిరనిన అది ఎవరో కాదు పీతాంబరుడగు విష్ణువే త్రావియుండును. నేను నా మాయతో గుప్తపరచి నిర్మించిన అమృతజలదాయినియగు 'వాపి'ని అజరుడును గదాధరుడును నగు విష్ణువు తప్ప మరి ఎవ్వరు పానము చేయగలరు? ఏలయన మిగుల గూఢముగా నుంచినదైనను దైత్యుల ప్రతియొక విషయమును మరి ఎవ్వరికిని తెలియకున్నను అతనికి తప్పక తెలియును. దేవతలు సహజముగా సర్వతోముఖులు కారు; ఐనను వారు సర్వతోముఖులయి ఇది ఎరిగి రనిన అది విష్ణువ వనియే.

ఇదిగో! మన దుర్గము ఇపుడున్న ప్రదేశము చూడుడు-చదునైన బయలు; దీనియందు వృక్షములు లేవు; పర్వతములు లేవు. అందుచేత మనము రథాది చతురంగ బలముండియు లేనివారమయితిమి. అందుచేతనే మనలను ప్రమథులును దేవతలును బాధించగలుగుచున్నారు. కనుక ఇది ఎరిగి మీరు ఇష్టపడినచో మనము సముద్రోపరితలమును మన ఆశ్రయముగా ఏర్పరచుకొందము. అట్లయినచో ప్రమథులు ఎంతగా మనోవేగము గలవారే అయినను వారి వేగమును మనము ఓర్చుకొనగలము. వారు చేయు సంరంభములును ప్రయత్నములును అన్నియు సాగర జల మధ్యమున శక్తిహీనములగును. అమరులును అచటికి వచ్చుటకు మార్గముండదు. కావున వారును నిరుత్సాహులగు దురు. ఏలయన సాగరము ఆకాశమువంటిదే. మనము శత్రువులతో యుద్ధము చేసినను వారిని కొట్టినను తరిమినను సాగరము మనకు ఆశ్రయముగా నుండగా వారు మనలను ఏమియు చేయజాలరు.

త్రిపురైస్సహ దానవానాం సాగరప్రవేశః.

ఇత్యుక్త్వా స మయో దైత్యాన్ దైత్యానా మధిప స్తదా. 22
త్రిపురేణ యయౌ తూర్ణం సాగరం సిన్ధువల్లభమ్ । సాగరేశ్వరసఙ్కాశ ముత్పపాత పురంవరమ్. 23
అవతస్థుః పురాణ్యేవ గోపురాభరణేనతు । అవక్రాన్తేఽథ త్రిపురే త్రిపురారి స్త్రిలోచనః. 24
పితామహ మువాచేదం వేదవాదవిశారదమ్ । పితామహః దృఢం భీతా దానవా భగవన్ హి తే. 25
విపులం సాగరంసర్వే దానవాస్త్రైపురా గతాః । యతఏవహి తే యాతా స్త్రిపురేణతు దానవాః. 26
తతఏవహి తాంస్తూర్ణం ప్రాపయస్వ పితామహ । సింహనాదం తతఃకృత్వా దేవా దేవరథంతదా. 27
పరివార్య యయుర్హృష్టా స్సాయుధాః పశ్చిమోదధిమ్। తతోఽమరాఽమరగురుం పరివార్య శివం హరమ్. 28
అనుయాన్తో యయుస్తూర్ణం సాగరం దానవాలయమ్ ।
అథ చారుపతాకభూషితంవా పటహాడమ్బరశఙ్ఖనాదితమ్. 29

త్రిపుర మభిసమీక్ష్య దేవతా విబుధబలాః ప్రణదు ర్యథాఘనాః ।
అసురవరపురేపి దారుణే జలధర ఇవ మృదఙ్గగహ్వరః. 30
దనుతనయనినాదమిశ్రితః ప్రతినిధినఙ్క్షుభితార్ణవోపమమ్ ।
అథ భువనపతి ర్గతిస్సురాణామరిమృగయాం ప్రతి లబ్ధలుబ్ధబుద్ధిః. 31
త్రిదశగుణపతిం హ్యువాచ శక్రం త్రిపురగతం సహసా నిరీక్ష్య శత్రుమ్ ।
త్రిదశగణపతేః నిశామయైతత్ త్రిపురనికేతన ముత్తమం సురేంద్ర ।
యమవరుణకుబేరషణ్ముఖై స్సైన్యసహ గణైరపి హన్మి తావదేవ. 32
విహితపరబలాభిఘాతభూతం యద్యుదధిమధ్యగతాః పురాణితస్థుః ।
ససురగణవృత స్సమర్థ ఈశో హ్యుదధి మగా త్త్రిపురం నిహన్తు మేకః. 33
ఇతివరిగణయత్ దితే స్తనూజా హ్యవతస్థు ర్లవణార్ణవోపరిష్టాత్ ।
(అ)భిభవతి త్రిపురం సదానవేన్ద్రం శరవర్షై ర్ముసలైశ్చ వజ్రకల్పైః. 34
అహమపి రథవర్య మాశ్రిత స్సురగణవర్య భవామి పృష్ఠతః ।
అసురవరవధార్థముద్యతానాం ప్రతివిదధామి సుఖాయవోఽనఘ. 35
ఇతిభవవచనప్రచోదితో దశశతనయనవపు స్సముద్యతః ।
త్రిపురపురజిఘాంసయా హరిః ప్రవికసితామ్బుజలోచనో యయౌ. 36

ఇతి శ్రీమత్స్యమహాపురాణే త్రిపురోపాఖ్యానే త్రిపురసహితదానవానాం సాగర
ప్రవేశాదికథనం నామ షట్త్రింశదుత్తరశతతమోఽధ్యాయః.

దైత్యాధిపుడగు మయుడు దానవులతో ఈ విధముగా పలికి త్రిపురదుర్గముతో కూడ సర్వనదీనాదుడగు సముద్రునికడకు పోయెను. సాగరేశ్వర సమీపమునకు ఆ త్రిపురము ఎగిరిపోయెను. త్రిపురములును వాని ఆయా గోపురములును ఇతరాలంకారములును ఆ దుర్గమెగురుటలో ఏమియు చెదరక అట్లే ఉండెను. త్రిపురదుర్గమట్లు తన స్థానమునుండి తొలగిపోవుటచూచి త్రిపురారియు త్రిలోచనుడునగు శివుడు వేదవాదమునందు నిపుణుడగు బ్రహ్మదేవునితో నిట్లు పలికెను. భగవన్‌! పితామహా! దానవులందరును చాల ఎక్కువగా భయమందిరి. అందుచే త్రిపురవాసులగు దానవులెల్లరు విపులమగు మహాసముద్రములోనికి వెళ్ళినారు. కావున నీవు శీఘ్రమే మనరథమునక్కడకు చేర్చుము. అనగా వెంటనే మహాదేవ రథమును చుట్టుముట్టి దేవతలందరును సాయుధులై హర్షముతో పశ్చిమ సముద్రమునకు పోయిరి. (దీనినిబట్టి దానవులు తమ త్రిపురదుర్గముతో కూడ పశ్చిమ సముద్రములోనికి పోయిరని తెలియును. ఇది ఈనాటి అరేబియా సముద్రమే.) అంతట అసురులందరును అమరులకు గురుడు (తండ్రి-రక్షకుడు) అగు శుభకరుడగు హరుని పరివారించి అతనిని అనుసరించి త్వరితముగా దానవులకు ఆశ్రయమగు సాగర ప్రదేశమునకు పోయిరి. మనోహరములగు పతాకలతో అలంకృతములయి పటహముల ఆడంబరములతో నిండినదియు శంఖముల ధ్వనులతో పూరితమునునగు త్రిపురదుర్గము కనబడగానే దేవతలును దేవతా సైనికజనులును మేఘములవలె గర్జన ధ్వనులు చేయసాగిరి. వెలుపల దేవతల విషయము ఇట్లుండ త్రిపురదుర్గమునందును దారుణములగు మృదంగధ్వనులు గంభీరమయి మేఘధ్వనులవలె వినబడుచుండ అవి దానవుల ధ్వనులతో మిశ్రితమయి సముద్రధ్వనితో సమానమయి వినబడుచు ఆ త్రిపురదుర్గము సముద్రమునకు ప్రతినిధియేమో యనిపించుచుండెను.

అంతట సకల భువనాధిపతియు సురలకు గతియునగు హరుడు శత్రువులనెడు మృగములను వేటాడ వలయునను లోభముగల లుబ్ధకుని (వేటగాని) వంటి బుద్ధి కలిగినవాడై దేవశత్రువులగు త్రైపుర దానవులు బలవంతులయి జల మధ్యగతమయిన త్రిపుర దుర్గమునందుండుట చూచి దేవగణాధిపతియగు ఇంద్రునితో ఇట్లు పలికెను: దేవేంద్రా! ఇటు చూడుము; త్రిపురదుర్గమను ఈ దానవపురమెంత ఉత్తమముగా నున్నదో చూడుము. ఏమయిన

నాకేమి లెక్క? యమ వరుణ కుబేర షణ్ముఖులును ప్రమథగణాధిపతులును నాకు తోడు వడగా అంతటి దానిని గూడ నాశము చేయుదును. పరబలముల నభిహతము చేయు ఏప్రదేశమున ఈ త్రిపురదుర్గమున్నదో అట్టి సముద్రదేశము నకు పోవుదము పదండు-'భవుడగు శివుడు త్రైలోక్యమను రథమును ఆరోహించి తాను కడు సమర్థుడు గావున త్రిపుర దుర్గమును మరల ముట్టడించదలచి సముద్రముకడకు వచ్చును'.

అని ఇట్లు జరుగునని ఊహించి దైత్యులు లవణ సముద్రపు పైభాగమునందు దుర్గమును నిలుపుకొని యున్నారు. కనుక మీరు వారిని లెక్కపెట్టక దానవేంద్ర సహితముగా త్రిపుర దుర్గమును శరవర్షములతో మూసల వజ్రాఘాతములతో ముట్టడిచేయుడు. నేనును నారథవరమునారోహించి సురేంద్రాః మీ వెనుకనే వచ్చుచుందును. అసురవరులను వధించుటకు ఉద్యమించిన వారికి ఏమేమి చేయవలయునో ఆ సహాయమంతయు చేయుదును.

ఇట్లు అనిన శివుని మాటలప్రేరణతో ఇంద్రుడు సన్నద్ధుడై త్రిపురదుర్గమును నాశ మొందించు తలంపుతో కడు వికసించిన లోచన పద్మములతో ముందునకు సాగిపోయెను.

ఇది శ్రీమత్స్య మహాపురాణమున త్రిపురోపాఖ్యానమున హరి అమృతవాపీపానము చేయుట-త్రిపుర దానవులు సముద్రము ప్రవేశించుట-హరుడు ఆటకు పోవుట-అను నూట ముప్పది యైదవ అధ్యాయము.

## షట్త్రింశదుత్తరశతతమోఽధ్యాయః.

## త్రిపురదాహే తారకాక్షవధః.

సూతః : తాన్నిహన్తుం సమఘవా నసురా నమరేశ్వరః । లోకపాలా యయుస్సర్వే తథైవ గణపాశ్చయే. 1
ఈశ్వరేణోదితా స్సర్వే ఉత్పేతుశ్చామ్బరేతదా । ఖగతాశ్చ విరేజుస్తే పక్షవన్త ఇవాచలాః. 2
ప్రయయు స్తత్పురం హన్తుం శరీరం వ్యాధయో యథా । శస్త్రైః పటహనిర్ఘోషై ర్మృదఙ్గైః పణవైరపి। 3
నాదయన్తః పురే దేవా దృష్ట్వా త్రిపురవాసిభిః । హరః ప్రాప్త ఇతీవోక్తా బలినస్తే మహాసురాః. 4
ఆజగ్ముః పరమం క్షోభ మత్యయేష్వివ సాగరాః । సురతూర్యరవం శ్రుత్వా దానవా భీమవిక్రమాః. 5
వినేదు ర్నదయన్తోహి నానావాద్యా న్యనేకశః । తూర్యాపూరితవీర్యాస్తే పరస్పరకృతాగసః. 6
పూర్వదేవాశ్చ దేవాశ్చ సూదయన్తః పరస్పరమ్ । ఆకాశేపి సమ్ప్రవృత్యే తేషాం దేహనికృన్తనమ్. 7
ప్రవృద్ధం యుద్ధమతులం ప్రహారకృతనిస్వనమ్ । ప్రపతన్త ఇవాదిత్యాః ప్రజ్వలన్త ఇవాగ్నయః. 8
శ్వసన్తఇవ నాగేన్ద్రాః భ్రమన్తఇవ పక్షిణః । జృమ్భన్తఇవ శార్దూలా గర్జన్తఇవ తోయదాః. 9
గిరీన్ద్రాఇవ కమ్పన్తో దానవాశ్చ మహాబలాః । వివృద్ధోర్మితరఙ్గౌఘక్షుభ్యన్త ఇవ సాగరాః. 10
ప్రమథాశ్చ మహాశూరా దానవాశ్చ మహాబలాః । యుయుధు ర్నిశ్చలా భూత్వా వజ్రాఇవ మహాజలాః. 11
కార్ముకానాం వికృష్టానాం బభూవు ర్దారుణారవాః । కల్పానుగానాం మేఘానాం యథా వియతి వాయునా. 12
*అయంమే శరణంయాతః కుప్యసిత్వం మృతోహ్యసి । ప్రహరాశు స్థిరోభూత్వా ఏహి దర్శయ పౌరుషమ్.
గృహాణ ఛిన్ధిభిన్ధీతి ఖాద మారయ దారయ । ఇత్యూచురుచ్చై రన్యోన్యం ప్రయయు ర్యమసాదనమ్. 14

## నూట ముప్పది యారవ అధ్యాయము.

## తారకాక్షవధము.

సూతుడు ఋషులకు ఇంకను ఇట్లు చెప్పెను: ఆ అసురులను చంపుటకై శివుని ఆదేశమున అమరేశ్వరుడగు

---

* ఆహూశ్చాభయ మాభైషీః క్షయోస్య నిభృతోహ్యసి.

ఇంద్రుడును లోకపాలురును ప్రమథ గణాధిపతులును బయలుదేరి వెళ్ళిరి. ఈశ్వరాజ్ఞానుసారముగా వారందరును ఆకాశమునకు ఎగిరి అచట సంచరించుచు రెక్కలుగల పర్వతముల వలె ప్రకాశించుచుండిరి. శరీరమును నశింపజేయ బోవుచున్న వ్యాధులవలె త్రిపుర దుర్గమును నశింపజేయదలచిపోవుచు వారు శంఖములను పటహము (తప్పెట)లను మృదంగములను పణవములను మ్రోగించసాగిరి. ఇట్లు వాద్యములు మ్రోగించుచు దుర్గమున కనబడిన ఆ దేవసేనను చూచి త్రిపురవాసులు బలశాలురగు మయాది మహాసురులతో హరుడే దుర్గమునకు వచ్చెనని తోచుచున్నదని చెప్పిరి. దానవులు తామెంత భీమ విక్రములయ్యును దేవతల వాద్య ధ్వనులను విని ప్రళయ కాలమునందలి మహా సాగరములవలె కలవరమందసాగిరి. వారును నానా వాద్యములను అనేక విధములయిన వాటిని మ్రోగింపసాగిరి. ఇరుపక్షముల వారును తమతమ వాద్యములను మ్రోయించుటతోపాటు తమతమ వీర్యములను ప్రశంసించుకొనుచు ఒకరికి మరియొకరు శస్త్రాస్త్ర ప్రయోగములతో అపకారములు చేసికొనసాగిరి. దేవదానవులు వీరిని వారును వారిని వీరును చంపుకొనుచుండిరి. నమతలమయి ప్రకాశించుచు నిరాలంబమగు ఆకాశమునందును వారి పరస్పర ప్రహారముల ధ్వనులతో పరస్పర దేహావయవ-దేహ-ఖండనములతో సాటిలేని యుద్ధము సాగుచుండెను. ఇరుపక్షములవారును యుద్ధ విజృంభణావేశ వశమున మిగుల వేడిమితో వెలుగు సూర్యులవలె ప్రజ్వరిల్లు అగ్నులవలె బుసకొట్టు నాగములవలె ఆకాశమున భ్రమించు పక్షులవలె విజృంభించు వ్యాఘ్రములవలె ఉరిమెడి మేఘములవలె కంపిల్లు గిరీంద్రములవలె క్షణక్షణమును వృద్ధినందు చున్న తరంగశ్రేణులతో కూడి క్షోభిల్లు సాగరములవలె మహాబల (దార్ఢ్య) సంపన్నములగు వజ్రములవలె నిశ్చలు లగుచు మహాశూరులగు ప్రమథులును మహాబలులగు దానవులును నిశ్చలులయి యుద్ధము చేయసాగిరి. గాఢముగా వారాకర్షించుచుండిన ధనువుల టంకారములు ప్రళయ కాలానుసారి మేఘములు ప్రళయ వాయుప్రేరితములగుచు చేయు దారుణ రవములను పోలియుండెను. 'వీడు నన్ను శరణు చొచ్చినాడు.' 'నాపై నీవు కోపించువాడవా?' 'ఇదిగో! చచ్చితివిరా!' 'స్థిరముగా నిలువుము.' 'నన్ను కొట్టగలిగినచో శీఘ్రముగా కొట్టుము.' 'రమ్ము; నీ పౌరుషమును చూపుము.' 'పట్టుకొనుము.' 'నరకుము.' 'చీల్చుము.' 'తినుము.' 'చంపుము.' 'బద్దలు చేయుము.' ఇట్లు పరస్పరము బిగ్గరగా అనుకొనుచు పోరుచు యమలోకమునకు పోవుచుండిరి.

ఖడ్గాపవర్జితాః కేచి త్కేచిచ్ఛిన్నాః పరశ్వథైః । కేచి న్ముద్గరభిన్నాఙ్గాః కేచి ద్బాహుహతాశ్చతే. 15
పట్టసై ర్నోదితాః కేచి త్కేచి చ్ఛూలవిదారితాః । దానవా శ్శరపుష్పాభా స్సబాణాః పర్వతాఇవ. 16
నిపత న్త్యర్ణవజలే భీమనక్రతిమిఙ్గిలే । వ్యసుభి శ్శరవిద్ధాఙ్గైః పతమానై స్సురేతరైః. 17
సమ్బభూవార్ణవే శబ్ద స్సజలామ్బుదనిస్వనః । తేనశబ్దేన చోద్విగ్నా నక్రా స్తిమితిమిఙ్గిలాః. 18
మత్తా లోహితగన్ధేన క్షోభయన్తో మహార్ణవమ్ । పరస్పరేణ కలహం కుర్వాణా భీమమూర్తయః. 19
వమన్తో భక్షయ న్తశ్చ దానవానాంచ లోహితమ్ । సరథా న్సాయుధా న్సాశ్వా న్సపస్త్రాభరణామ్బరాన్. 20
అగ్రసం స్తిమయో దైత్యాన్ ద్రావయన్తో జలేచరాః । యుద్ధం యథాసురాణాంచ ప్రమథానాంచ వర్తతే.21
అమ్బరేచ తథాయుద్ధం యోధయన్తో జలేచరాః ।
యథా భ్రమన్తి ప్రమథా స్సదైత్యా స్తథాభ్రమన్తే తిమయ స్సనక్రాః. 22
తథైవ ఛిన్దన్తి పరస్పరన్తు తథైవక్రన్దన్తిచభిన్నదేహాః ।
వ్రణాననై రజ్గరసం స్రవద్భి స్సురాసురై ర్నక్రతిమిఙ్గిలైశ్చ. 23
కృతోమహా_ర్తేన సముద్రదేశ స్సరక్తతోయై స్సముదీర్ణతోయః ।
సితం మహామ్బోధరపర్వతాభం ద్వారం మహాన్తం త్రిపురస్యశక్రః. 24
నిపీడ్యతస్థౌ మహతా బలేన యుక్తస్సురేశో మహతా జవేన ।
తద న్తరేపై తనుజో హరస్య బాలార్కజామ్బూనదతుల్యవర్ణః. 25

స్కన్దః పురద్వార మథో రురోధ బాలోఽస్తశృఙ్గం ప్రపతన్నివార్కః ।
యమశ్చ విత్తాధిపతి స్సదేవై స్సోఽపామ్పతిః పాశవరాయుధశ్చ. 26
దేవారిణ స్తస్య పురస్య ద్వార మాపశ్చిమం పశ్చిమతో నిరుద్ధమ్ ।
తస్యాపి రుద్ర స్తవనాయుతాభ స్సహానుగై ర్దేవరథేన దేవః. 27
తన్మన్దిరద్వార మరేః పురస్య రుద్ధ్వాఽవతస్థే భగవాం స్త్రినేత్రః ।
తుఙ్గాని వేశ్మాని సగోపురాణి సువర్ణకైలాసశశిప్రభాణి. 28
ప్రహ్లాదరూపాః ప్రమథావరుద్ధా జ్యోతీంషి మేఘాఇవ సాశ్మవర్షాః ।
ఉత్పాట్య చోత్పాట్య గృహాణి తేషాం సశైలమూలానసవేదికాని. 29
ప్రక్షిప్యచోత్క్షిప్య సముద్రమధ్యే కాలామ్బుదాభాః ప్రమథా వినేదుః ।
రక్తాని చాశేషవనై ర్యుతాని సాశోకఖణ్డాని సకోకిలాని. 30
* గృహాణ హేనాథ పితస్సుతేతి భ్రాతేతి కాన్తేతి ప్రియేతి చాపి ।
ఉత్పాట్యమానేషు గృహేషు నార్యోహ్యనార్యశబ్దా బహుధా ప్రచుక్రుశుః. 31

కొందరు ఖడ్గములతో ముక్కలయిరి. మరికొందరు గంధ్రగొడ్డండ్రతో తెగిరి. కొందరు ముద్గరములతో ఖండితులయిరి. మరికొందరు భుజ ప్రహారములతోనే నలిగిచచ్చిరి. కొందరు పట్టిసములతో నొచ్చిరి. కొందరు శూలములతో చీలికలయిరి. దానవులు శరములనెడు పూలతో ప్రకాశించుచు బాణములు గ్రుచ్చుకొనిన కొండలవలె నయి భయంకరములగు నక్రములతో తిమింగిలములతో నిండిన సముద్ర జలమున పడుచుండిరి. బాణముల దెబ్బ లతిని ప్రాణములుపోయి పడుచుండిన రాక్షసులతో సముద్రమునుండి సజల మేఘముల ఉరుములవంటి ధ్వనులు ఉప్పతిల్లెను. నక్రములు(ఒక విధమగు సముద్ర జంతువులు)ను తిమింగిలములును ఆ ధ్వనులకు భయపడియు ఆ రాక్షసుల రక్తపు వానకు మత్తెక్కియు సముద్రజలమును క్షోభింపజేయుచుండెను. అవి భయంకర రూపములయి పరస్పరము కలహించుచు రాక్షస రక్తమును భక్షించు(త్రావు)చు క్రక్కుచునుండెను. సముద్రమునందలి తిమింగిలములు సముద్రమున పడిన దానవులను వారి రథములను ఆయుధములను అశ్వములను ఆభరణములను వస్త్రములను కూడ మ్రింగివేయుచు తమకు ఆవనిలో అడ్డము తగిలిన వేరు తిమి తిమింగిలములను తరిమివేయుచుండెను. అంబరము (ఆకాశము)నందు ప్రమథులును దానవులును పోరుచున్నట్లే అంబరము (జలము)నందు జలచర జంతువులును పోరుచుండెను. యుద్ధ క్రమమున ప్రమథులును దైత్యులును గిరగిర తిరుగుచున్నట్లే సముద్రమున జలచరములును తిరుగుచుండెను. అట్లే పరస్పరము నరకుకొనుచుండెను. అట్లే దేహములు నరకుకొని చీల్చుకొని అరచుచుండెను. తమ గాయపు నోళ్ళ నుండి రక్తమును స్రవించుచుండిన నక్ర తిమింగిలాది మహాజల జంతువులతోను సురాసురులతోను ఒక ముహూర్త కాలములోనే రక్తము కలిసిన నీటితో సముద్రమంతయు వృద్ధి పొందినదయ్యెను.

ఇది ఇట్లుండ సురేశ్వరుడగు శక్రుడు (ఇంద్రుడు) మహా సైన్యమును తీసికొనిపోయి తెల్లనిదై మహామేఘము వలెను మహాపర్వతమువలెను ఉన్నతమయి కాంతివంతమయిన త్రిపురదుర్గ మహాద్వారమును మహావేగముతో ముట్టడి చేసి అడ్డగించి నిలువబడెను. ఆ సమయమునందే బాల సూర్యునివలెను కాచిన బంగారువలెను ప్రకాశించు న హర పుత్త్రుడగు స్కందుడు (కుమారస్వామి) బాలుడయ్యును మహాతేజశ్శాలియగు సూర్యుడు అస్తపర్వత శిఖరమును ముట్టడించినట్లు మరియొక వైపునుండి ముట్టడించెను. యముడును కుబేరుడును పాశశ్రేష్ఠము ఆయుధముగా ధరించిన వరుణుడును దేవశ్రేష్ఠులననేకులను వెంటగొని త్రిపురదుర్గపు పశ్చిమ ద్వారమును ముట్టడించిరి. భగవానుడు త్రినేత్రుడు

* గృహాణ హేతాత

పు 65)

మహాదేవుడునగు రుద్రుడును దేవనిర్మితమగు దివ్యరథముపైనెక్కి తన యనుచరులతో కూడ పదివేలమంది సూర్యుల తేజమువంటి తేజముతో వెలుగుచు పోయి శత్రుమందిరమగు త్రిపురదుర్గపు ద్వారమును ముట్టడించి నిలిచెను.

ఆనందముతో నిండిన రూపములతో ప్రమథులును గోపురములతో కూడినవయి బంగారు కొండలవలె కైలాసమువలె చంద్రునివలె వెలుగొందుచున్న ఉన్నతములగు దానవ గృహములను - రాలను వర్షించుచు మేఘములు అంతరిక్షమందలి జ్యోతిర్గణములను అడ్డగించినట్లు అడ్డగించి - క్రమ్మివేసిరి. ప్రమథులు కృత్రిమములగు క్రీడా పర్వతముల మాలలతో ఆసనములతో వేదికలతో కూడిన దానవ గృహములను పెల్లగించి పెల్లగించి పైకెత్తి సముద్ర మధ్యమునకు ఎత్తివడవేసి ప్రళయకాల మేఘములవలె గర్జించుచుండిరి. ఎర్రనై అశేషవనములును తమ చుట్టు నుండగా అశోకవనముల నడుమనున్నవై కోకిల ధ్వనులతో మనోహరమయియున్న తమ గృహములన్నియు ఇట్లు ప్రమథులు పెల్లగించుచుండ దానవ స్త్రీలు-నాథాః తండ్రీః కొడుకాః అన్నాః కాంతాః ప్రియాః వీరిని పట్టు కొనుడుః అని అరచుచు అనేక విధములగు మొరటు అరపులతో ఏడ్చుచుండిరి.

కళత్రపుత్త్రక్షయజీవనాశే తస్మిన్పురే రుద్రబలే ప్రవృత్తే ।
మహాసురా మారుతతుల్యవేగా గణేశ్వరాః కోపయుతా స్సమేయుః. 32
పరశ్వథై స్తత్ర శిలోపమైశ్చ త్రిశూలవజ్రోత్తమకమ్పనైశ్చ ।
శరీరసద్మక్షపణం సుఘోరం యుద్ధం ప్రవృద్ధం దృఢవైరబద్ధమ్. 33
అన్యోన్యముద్దిశ్య నినర్దతాం చ ప్రధావతాం చైవ వినిఘ్నతాంచ ।
శబ్దో బభూవాఽమరదానవానాం యుగాన్తకాలేష్వివ సాగరాణామ్. 34
ప్రవైరజస్రం క్షతజం వమన్తః కోపోపరక్తా బహుధా నదన్తః ।
గణేశ్వరాస్తే సురపుఙ్గవాశ్చ యుద్ధాయ శబ్దం మహ దుద్గిరన్తః. 35
మార్గాస్తథా లోహితకర్దమాశ్చ స్వర్ణేష్టకా స్స్ఫాటికభిన్నచిత్రాః ।
కృతా ముహూర్తేన సుఖేన గన్తుం ఛిన్నోత్తమాఙ్గాంఘ్రికరాః కరాళాః. 36
కోపావృతాక్ష స్సతు తారకాక్ష స్సాక్షాత్సదృక్షో గిరిజాచ వీరః ।
తస్మిన్క్షణే ద్వారవరం రరక్ష రుద్ధం హరేణాచ్యుతవిక్రమేణ. 37
న తత్ర ప్రాకారగతాంశ్చ భూతా న్నాగా న్సురా న్భూతపతీంశ్చ తద్వత్ ।
ప్రకాలయ న్స ప్రియదర్పయుక్తః పురాద్వినిష్క్రమ్య ససాన ఘోరమ్. 38
తతస్సదైత్యోన్నతపర్వతాభో యథాంజసా నాగవరోఽభిమత్తః ।
స వారితో రుద్రరథం జిఘృక్షు ర్యథార్ణవం పర్వణి చాతిభీమమ్. 39
నష్టాస్సురాస్తే గిరిశస్తు దేవ శ్చతుర్ముఖోఽగ్నిశ్చ త్రిలోచనశ్చ ।
తే తారకాక్షాభిగతా గతాజౌ క్షోభం యథా వాయువశా త్సముద్రాః. 40
తతో గిరీశశ్చ పితామహశ్చ క్షోభ్యమాణా స్సరథోఽమ్బరస్థః ।
త్రిభేదనస్థీష బలాభిపన్నః కూజన్నినాదంచ కరోతి ఘోరమ్. 41
ఏకంతు ఋగ్వేదతురఙ్గమస్య పృష్ఠే పదం న్యస్య వృషస్య చైకమ్ ।
తస్థౌ భవస్సోద్యతచాపబాణః పురస్య తత్సఙ్గమ మీక్షమాణః. 42
తదా భవపదన్యాసా ద్వేదస్య వృషభస్యచ । పేతుః స్తనాశ్చ దన్తాశ్చ పీడితస్య త్రిశూలినా. 43
తతః ప్రభృతి చాశ్వానాం స్తనా దన్తా గవాంతథా । గూఢా స్సమభవంస్తేన అదృశ్యత్వ ముపాగతాః. 44

భార్యాపుత్త్రులను గృహములను కొందర జీవితములను కూడ నశించగా ఆ త్రైపురదుర్గము రుద్రుని ప్రమథ బలము తన ప్రవృత్తిని చూపగా (అంతట సంచరించుచుండగా) వాయు సమానవేగులై ప్రమథ గణాధిపతులును మహాసురులును పరస్పరము యుద్ధమునకు తలపడిరి. వారు దృఢవైర బంధపూర్వకముగా శిలా సమానములగు గండ్ర గొడ్డండ్రను త్రిశూలములను ఉత్తమ వజ్రాయుధములను ప్రయోగించుచు శరీరములను గృహములను నాశము చేసికొనుచు యుద్ధము సాగించిరి. వారు పరస్పరముద్దేశించి గర్జించుచుండిరి. పరుగెత్తుచుండిరి. కొట్టుకొనుచుండిరి. ఇట్లు ఆ అమరులును దానవులును చేయుచుండిన యుద్ధముచే ఉత్పన్నమయిన శబ్దము యుగాంతకాల సముద్రఘోషము వలె భయంకరమయి వినబడుచుండెను. వారి గాయములనుండి ఎడతెగక రక్తము స్రవించుచుండెను. వారు కోప గ్రస్తులయి బహు విధముల గర్జించుచుండిరి. యుద్ధోత్సాహవృద్ధి సూచకముగా పెద్దపెద్ద కేకలు వేయుచు గర్జనలు చేయుచుండిరి. ఒక ముహూర్త కాలములో పురమందలి మార్గములన్నియు నెత్తుటి బురదతో నిండిపోయెను. బంగారు ఇటికలతో కట్టి స్ఫటికమణులు తాపటము చేసిన గోడలును అట్లే ఆయ్యెను. దేవదానవుల కాళ్ళును చేతులును శిరములును తెగిపడిన మార్గములన్నియు భయంకరములయి కనబడుచుండెను. ఆ సమయములో తారకాక్షుడు శివుడు ముట్టడించిన ద్వారమును రక్షించుచుండెను. వాని కన్నులు కోపముతో ఆవరించబడి ఉండెను. వాని దేహము సాక్షాత్తుగ పర్వతమువలె నుండెను. ఆ వీరుని విక్రమము అందరకు ఆశ్చర్యము గొలుపుచుండెను. వాడప్పుడు ప్రాకారముపైనున్న ప్రమథులను నాగులను ప్రమథనాథులను తరిమివేయుచు దర్పము ప్రకటించుచు వారివెంట పురము వెలుపలివరకు తరుముచుపోయి భయంకరముగా ధ్వని చేసెను. మదపుటేనుగువంటివాడును పర్వతమువలె భయంకరోన్నత శరీరుడునగు ఆ తారకాక్షుడు రుద్రుని రథమును స్వాధీనము చేసికొనగోరి పర్వకాలమునందు భయంకరముగా పొంగియున్న సముద్రమును పట్టబోయినవాడువలె అయి శివునిచే వారించబడెను. ఆ తారకాక్షుని విజృంభణమునకు దేవతలు అందరును భయపడి పారిపోయిరి. మహాదేవుడగు శివుడును చతుర్ముఖుడును అగ్నియును ఆ తారకాక్షుడు తమపై చేసిన ముట్టడితో ఝంఝా మారుతముతో కల్లోలపడిన సముద్రమువలె కలవరపడిరి. ఇట్లు పరమేశ్వరుడును బ్రహ్మయును మిగుల క్షోభమందుచుండగా ఆ రథము ఆకాశములోనికి పోయి నిలిచెను. దానికి త్రిభేదమను రథాంగము లందు బలమగు దెబ్బలు తగిలినందున అది కీచు మోతలతో భయంకరముగా ధ్వని చేయసాగెను. ఇట్టి స్థితియందు పరమేశ్వరుడు తన పాదములలో నొకటి ఋగ్వేదమను అశ్వపు వీపుమీదను మరియొక పాదమును వృషభపు వీపుమీదను ఉంచి ధనువును బాణములను సిద్ధపరచుకొని పుష్యయోగము ఎపుడు వచ్చునాయని ఎదురు చూచుచుండెను. శివుని పాదముల బరువుతో ఋగ్వేదాశ్వమునకు స్తనములును వృషభమునకు (పై) దంతములును పడిపోయెను. అది మొదలుకొని అశ్వములకు స్తనములును వృషభములకు (పై) దంతములును గూఢములయి అదృశ్యములయి యుండుట జరిగినది.

## నన్దికేశ్వరతారకాక్షయుద్ధమ్.

తారకాక్షస్తు భీమాక్షో రోషా ద్రక్తాననేక్షణః । రుద్రాన్తికే సుసఙ్క్రుద్ధో నన్దినం కులనన్దినమ్. 45
పరశ్వధేన తీక్ష్ణేన నన్దినం దానవేశ్వరః । తక్షయామాస వై తక్షా చన్దనం సరసం యథా. 46
పరశ్వథహత శ్శూరః శైలాది శ్శరభో యథా । దుద్రావ ఖడ్గం నిష్కృష్య తారకాక్షజిఘాంసయా. 47
స తేన సితధారేణ తారకాక్షం గణేశ్వరః । యజ్ఞోపవీతమార్గేణ చిచ్ఛేదచ ననాదచ. 48
తత స్తస్మి న్విపహతే శఙ్ఖశబ్ద స్సభైరవః । గణేశ్వరైః కృత స్తత్ర తారకాక్షే నిషూదితే. 49
ప్రమథారసితం శ్రుత్వా వాదిత్రస్వనమేవచ । మయశ్చ స్వస్య పార్శ్వస్థం విద్యున్మాలిన మబ్రవీత్. 50

బహువదనవతాం కిమేష శబ్దో నదతాం శ్రూయతి భిన్నసాగరాభః ।
వద వచ తటిమాలి కిం కిమేత ద్గజపాలా రురుధు ర్గజాను కింవా. 51

ఇతి మయవచనాంకుశార్దితస్స న్విద్యున్మాలి రవిరివ సోంశుమాలి ।
రణశిరసి సమాగతాన్ సురాంస్తాన్ నిజగాదేద మరిన్దమోఽతిహర్షాత్. 52

యమవరుణమహేన్ద్రరుద్రవీర్య స్తవశయనే నిధిరేష తారకాక్షః ।
సకలసమరశీర్షః పర్వతేన్ద్రాయుధో య స్తవతిహి ససిర స్త స్తారకాక్షో గణేన్ద్రైః. 53

మృదిత ముపనిశమ్య తారకాక్షం అతిదీప్తానలభీషణాయతాక్షమ్ ।
హృషితసకలలోకనేత్రసక్తాః ప్రమథా స్తోయముచో యథా నదన్తి. 54

ఇతి సుహృది వచో నిశమ్య త త్త్వం తటిమాలే స్సమయ స్సువర్ణమాలీ ।
రణశిరసి సితాఞ్జనాచలాభో నిజగాదైనమిదం మయో వచోఽన్యత్. 55

విద్యున్మాలి న్యథాయుక్తం తత్కరిష్యామి విక్రమాత్। యథా పురంచ నిర్ముక్తం భవే త్వరభయార్దితమ్. 56

విద్యున్మాలీ తతః క్రుద్ధో మయశ్చ త్రిపురేశ్వరః ।
ప్రమథా న్జఘ్ను రాదిష్టా స్సహితా స్తైర్మహాసురైః. 57

యేనయేన గత స్తంతం విద్యున్మాలీ మయశ్చసః । తేనతేన పరంశూన్యం ప్రమథైః ప్రకృతైః కృతమ్. 58

అథ యమవరుణమృదఙ్గశఙ్ఖఘోషైః పటహాడిండిమవాద్యకప్రఘోషైః ।
సకలతలవపుశ్చ సింహనాదైః పరమభిపూజ్య తథాఽసురా వితస్థుః. 59

సమ్పూజ్యమానో దితిజైర్మహాత్మభి స్సహస్రరశ్మి ప్రతిమో మయో బభౌ ।
అభిష్టుత స్సత్త్వరతై స్తపోధనై ర్యథాభ్రశృఙ్గాభిగతో దివాకరః. 60

ఇతి శ్రీమత్స్యమహాపురాణే త్రిపురోపాఖ్యానే త్రిపురదాహే దేవాసురయుద్ధే
తారకాక్షవధో నామ షట్త్రింశదుత్తరశతతమోఽధ్యాయః.

సహజముగనే భయంకర నేత్రుడును దానవేశ్వరుడు నగు తారకాక్షుడు రోషముతో మరింతగా మొగమును కన్నులును ఎర్రగానయి రుద్రుడు చూచుచుండగా అతని సమీపమందే ప్రమథ కుల పరమానందకరుడగు నందీశ్వరుని వడ్లంగివాడు సరసమగు (మెత్తని) చందనపు కొయ్యను చెక్కినట్లు తీక్ష్ణమగు గండ్రగొడ్డలితో చెక్కెను. శిలాదపుత్త్రుడగు నంది తన్నట్లు తారకాక్షుడు గండ్రగొడ్డలితో గాయపరచగా తన ఖడ్గమును ఒరనుండి పెరికి ఆ తారకాక్షుని చంపదలచి శరభమృగమువలె వాని పైకి దుమికెను. ప్రమథ గణాధిపతియగు నంది వాడియగు వాదరగల ఆ ఖడ్గముతో యజ్ఞోపవీతము ఉండు క్రమములో (ఎడమ భుజముపై నుండి కుడి డొక్క క్రిందివరకు ఏటవాలుగా) తారకాక్షుని నరకి వేసి సింహనాదము చేసెను. తారకాక్షు డిట్లు నంది చేతిలో మరణించగా ప్రమథగణ సైనికులు మహా భయంకర శంఖధ్వనులు చేసిరి. ప్రమథుల శంఖధ్వనులను దేవతల వాద్యధ్వనులను విని విద్యున్మాలితో మయుడు 'విద్యున్మాలీ! ఈ ధ్వని ఏమి? అనేక కంఠములనుండి ఒకేమారు వచ్చిన ధ్వనియా ఇది-కలత చెందుచున్న సముద్రముల ధ్వనియా-గజపాలురు అడ్డగించగా కోపించి ఘీంకరించుచున్న ఏనుగుల ఘీంకార ధ్వనియా? అని అడిగెను. మయుని ఈ మాట విద్యున్మాలికి అంకుశపు పోటువలె బాధాకరమయ్యెను. యమ వరుణ మహేంద్ర రుద్రులతో సమానుడగు వీరుడును నీకు శయనమున దాచుకొన్న నిధివంటి వాడును సకల యుద్ధములందు అగ్రగామియు వజ్రాయుధము వంటివాడు నగు తారకాక్షుడు ప్రమథ గణము చేతిలో చంపబడి రణరంగమున పడినాడు. ఆ ఉత్సాహమున ఒకచోట చేరి నినాదములు చేయుచున్న దేవతల కోలాహల మిది. ప్రజ్వలించు అగ్నివలె భయంకర నేత్రు డా తారకాక్షుడు రణమున మర్దితు డయ్యెనని వినగానే దేవతలును ప్రమథులును ఎల్లరును ఇందులకై సంతోషించిన సకల లోకజనుల సంతోషమునకు ప్రోత్సాహకముగా చేయుచున్న నాదములు ఇవి. అని పలికెను. ఆ మాటలు విని మయుడు 'విద్యున్మాలీ! ఇపు డేవి చేయవలెనో అది చేయు

దును. మన త్రిపుర దుర్గమునకు పరబల భయము లేకుండ చేయుదును.' అని పలికెను. తరువాత మయుడును విద్యున్మాలియు క్రుద్ధులయి తమ ఆదేశానుసారము తమకు సహాయులై యున్న అసురులతో కూడి ప్రమథులను చావగొట్టనారంభించిరి. వారు ఇద్దరును ఏ ఏ త్రోవలో పోయిరో ఆ చోట నెల్ల ప్రమథులు వారి నడ్డగించి అచట రాక్షసు లెవ్వరును లేకుండునట్లు చంపివేయుచుండిరి. ఇది చూచి సంతోషముతో యమ వరుణాదులు మృదంగ పటహడిండిమాది వాద్యములు ప్రయోగించుచుండిరి. భుజాస్ఫాలనములతోను సింహనాదములతోను తమ సంతోష ప్రకటనము చేయుచుండిరి. సూర్య సమానతేజుడగు మయుని మహాత్ములగు దైత్యు లందరును - సత్త్వగుణాభిరతులగు తపోధనులు ఆకాశోన్నత భాగము నలంకరించిన మధ్యాహ్న సూర్యుని అభిష్టవము చేసినట్లు-స్తుతించుచుండిరి.

ఇది శ్రీమత్స్య మహాపురాణమున త్రిపురోపాఖ్యానమున తారకాక్ష వధమను
నూట ముప్పది యారవ అధ్యాయము.

## సప్తత్రింశదుత్తరశతతమోఽధ్యాయః.
## త్రిపురదాహే చంద్రోదయాదివర్ణనమ్.

సూతః : తారకాక్షే హతే యుద్ధే ఉత్సార్య ప్రమథాన్మయః ।
ఉవాచ దానవా న్భూయో భూయ స్సతు భయావృతాన్. 1
అసురేన్ద్రాఽధునా సర్వే శృణుధ్వం మత్ప్రభాషితమ్ ।
యత్కర్తవ్యం మయాచైవ యుష్మాభిశ్చ మహాబలైః. 2
పుష్యం సమేష్యతే కాలే చన్ద్ర శ్చన్ద్రనిభాననాః । యత్రైకం త్రిపురం సర్వం క్షణమేకం భవిష్యతి. 3
సజన్తో ర్నిహితః కాలో నో జరా గ్రసతేఽనఘాః । ముహూర్తం యదయం కాలః కోకిలాశంసితేనవై. 4
స కాలః పుష్యయోగస్య పురస్యచ మయా కృతః । కాలే తస్మి న్పురేయస్తు సమ్భావయతి సంహతామ్. 5
సఏవ దాహయేత్తూర్ణం బలి నైకేషుణా సురః । యావత్ప్రాణా బలం యచ్చ యోధయధ్వం మహాసురాః. 6
తంకృత్వా హృదయేచైవ పాలయధ్వ మిదంపురమ్ । మాహేశ్వరరథం హ్యేకం సర్వప్రాణివిభీషణమ్. 7
విముఖీకుర్వతాఽత్యర్థం యథా నోత్సృజతే శరమ్ । తత ఏవం కృతేఽ స్మాభి స్త్రిపురస్యాభిరక్షణే. 8
ప్రతీక్షిష్యన్తి వివశాః పుష్యయోగం దివౌకసః । నిశమ్యతు మయస్యైవం దానవా స్త్రిపురాలయాః. 9
ముహు స్సింహరవం కృత్వా మయమూచు ర్యమోపమాః ।
ప్రయత్నేన వయం సర్వేయత్త్వయా మయ భాషితమ్. 10
తథా కుర్మో యథా రుద్రో నమోక్ష్యతి పురే శరమ్ ।
అద్య చాస్యామ సఙ్గ్రామం రుద్రస్యతు జిఘాంసవః. 11
కథయన్తి దితేః పుత్త్రాః హృష్టా భిన్నతనూరుహాః । కల్పంస్థాస్యతివా స్వస్థం త్రిపురం శాశ్వతం ధ్రువమ్.
అదానవం వా భవితా నారాయణపదాలయమ్ । హాస్యామో న వయం ధర్మం యస్మాన్మోక్ష్యతి నో భవాన్.
అదైవత మదైత్యంవా లోకం ద్రక్ష్యన్తి మానవాః । ఇతి సంశ్రుత్య సంహృష్టా స్త్రిపురా స్త్రిదశారయః. 14

## నూట ముప్పది ఏడవ అధ్యాయము.
## చంద్రోదయాది వర్ణనము.

తారకాక్షుడు మరణించిన తరువాత మయుడు ప్రమథులను తరిమి భయావృతులయి యున్న దానవులతో ఇట్లనెను. దానవేంద్రులారా! ఇపుడు నేనును మీరును ఏమి చేయవలెనో చెప్పెదను వినుడు. చంద్రుడు పుష్యనక్షత్రముతో కలియు పుష్యయోగము వచ్చినపుడు క్షణకాలము త్రిపురములు ఒకటి యగును. ఇది కోకిల'కుహూ'ధ్వనికి పట్టునంతకాలము.

ఆ సమయమున మనలను వార్ధకము మ్రింగి వేయును. ఇది పుష్యయోగ సమయమని నేను వ్యవస్థ చేసినాను. ఆ ముహూర్తమున ఈ మూడు పురముల ఏకత్వమును గుర్తించిన దేవతలలో ఎవడయినను ఒకే బాణముతో త్రిపురదుర్గమును చూర్ణము చేయును. కావున ప్రాణములును బలమును ఉన్నంత వరకును దానవు లందరు యుద్ధముచేసి పురరక్షణ చేయుడు.

మహేశ్వరుని రథ మొక్కటి సర్వప్రాణి భయంకరమైనది. దానిని మీ రెట్లయిన అడ్డగించి అతడు బాణ ప్రయోగము చేయకుండునట్లు చూడుడు. ఏలయన దేవతలు అదే పనిగా పుష్యయోగమున కెదురు చూచుచుందురు. మీ రది గమనించుడు.

మయుని మాటలు విని యమునివంటి త్రిపుర దానవులు మాటిమాటికి సింహనాదములు చేసి మయునితో ఇట్లనిరి: మయా! మే మందరమును నీవు చెప్పినట్లు చేసెదము. శివుడు త్రిపురదుర్గముపై బాణము ప్రయోగించకుండ వారించెదము. రుద్రుని సంహరించుటకై యుద్ధము చేసెదము. ఈ త్రిపురదుర్గము కల్పాంతము వరకు స్థిరముగ ఉండనైన వలయును; లేదా-ఈ ఆకాశ సంచారియగు త్రిపురమున దానవు డొక్కడును లేకుండనైన పోవలయును. నీవు మమ్ములను విడువ నంతవరకును మేమును మా ధర్మమును విడువము. లోకమున దేవతలుగాని దానవులుగాని లేకుండ పోవుటను మానవులు చూడగలరు. అని దానవులు పలికిరి.

## చన్ద్రోదయాదివర్ణనమ్.

ప్రదోషే ముదితా భూత్వా చేరుర్మన్మథచారతామ్ । ఏవ ముక్తోదయాద్రిస్థ ఉదయాద్రౌ మహారుణః. 15
తమ ఉత్సార్య భగవాం శ్చన్ద్రోజ్జృమ్భత సోమ్పరే । కుముదాలజ్కృతే హంసో యథామ్బుని విజృమ్భతే.
సింహో యథా చోపవిష్టో వైడూర్యశిఖరే మహాన్ । విష్ణోర్యథాచ విస్తీర్ణో హారశ్చోరసి సజ్జితః. 17
తథాచ గాఢే తమసి చన్ద్రోఽత్రినయనోద్భవః । భ్రాజతే భ్రాజయన్లోకా న్భూజన్ జ్యోత్స్నావసేచనమ్. 18
శీతాంశా వుదితే చన్ద్రే జ్యోత్స్నాపూర్ణే పురే సురాః । చన్ద్రాంశుభి ర్దీపితే తదను దీపై స్సుదీపితైః. 19
ప్రదోషే తాన్యలంచక్రుర్గృహా ణ్యాత్మానమేవచ । రథ్యాసు రాజమార్గేషు ప్రాసాదేషు గృహేషుచ. 20
దీపా శ్చమ్పకపుష్పాభా యే దీవ్యన్తే ప్రదీపితాః । గృహేష్వభ్రేషు తే దీపా స్స్నేహపూర్ణాః ప్రదీపితాః. 21
గృహాణి వసుమన్త్యేషాం నవరత్నమయానిచ । జ్వలన్తోఽదీపయన్దీప్తా శ్చన్ద్రోదయ ఇవ గ్రహాః. 22
చన్ద్రాంశుభి ర్బాహ్యతమ స్తనుదీపై స్తు దీపితే । దుష్టపుత్రైః కులమివ పీడ్యతే త్రిపురే తమః. 23
తస్మిన్పురేవై తరుణ ప్రదోషే చన్ద్రాట్టహాసే తరుణప్రదోషే ।
రత్యర్థినో వైదనుజాః పురే ముహు స్సహాఙ్గనాభిశ్చ తతో విరేజుః. 24

ఇంతలో ప్రదోష మయ్యెను. త్రైపుర దానవు లెల్లరు శృంగార భావపూర్ణులై మన్మథుని సందేశహరులవలె నయిరి. క్రమముగ భగవానుడగు చంద్రుడు ఉదయ పర్వతముపై మిగుల ఎర్రనై ఉదయించుచు చీకటులను పోద్రోలుచు ఆకాశమున విజృంభింపసాగెను. అతడు సరోజలములో కలువపూల నడుమ విహరించు హంసవలెను వైడూర్య శిఖరముపై కూర్చున్న సింహమువలెను విష్ణువక్షమునందలి హారమువలెను ఆకాశమున కనబడుచుండెను.

లోకమంతయు గాఢాంధకారములో మునిగియుండగా ఉదయించిన చంద్రుడు తాను అత్రి మహాముని నేత్రము నుండి ఉద్భవించినవాడు అగుటను సార్థకము చేయుచు లోకములను వెన్నెలతో తడుపుచు తాను ప్రకాశించుచు లోకములను ప్రకాశింపజేయుచు లోకములకు కన్నులను ఇచ్చెను. ఇట్లు చంద్రోదయ మయ్యెను. త్రిపురము వెన్నెలతో నిండెను. భవనములందును దీపములు వెలిగింపబడెను. ఇట్లు పురమున బయట వెన్నెలతో లోపల దీపములతో ప్రకాశ మయ్యెను. అసురులును తమ తమ ఇండ్లను దేహములను కూడ అలంకరించుకొనసాగిరి. రచ్చలలో రాజమార్గములలో

ప్రాసాదములందును గృహములందును నూనెతో నింపిన దీపములు వెలిగింపబడి సంపెగ పూలవలె ప్రకాశించుచుండెను. ధనముతో నిండిన వగు దానవుల నవరత్నమయ గృహములలో దీప ప్రకాశములో ఆయా వస్తువులు ధనములు రత్నములు-చంద్రోదయవశమున ప్రకాశించు గ్రహములవలె ప్రకాశము నందెను. దుష్టపుత్త్రుల వలన కులమునకు కలిగినట్లు బయటి వైపున వెన్నెలతోను ఇండ్లయందు దీపములతోను చీకటికి పీడ కలిగెను. ఇట్టి ప్రదోష కాలారంభమున చంద్రుని అట్టహాసము (అధిక ప్రకాశము) యౌవనమునంది రాత్రికి ప్రకాశమునందించుచుండ దానవులు శృంగార సుఖమును కోరి స్త్రీ జనములతో కూడి అలంకరించుకొనుచు ప్రకాశించుచు నుండిరి.

వినోదితాయే వృషభధ్వజస్య పఞ్చేషవస్తే మకరధ్వజస్య ।
తత్రాసురేష్వాసురపుఙ్గవేషు సర్వాంగ నాస్వాద యుతా బభూవుః. 25

కలప్రలాపేషు చ దానవీనాం వీణాప్రలాపేషుచ మూర్ఛితేషు ।
మత్తప్రలాపేషుచ దానవానాం సచాపబాణో మదనో మమన్థ. 26

తమాంసి నైశాని ద్రుతం నిహత్య జ్యోత్స్నావిధానేన జగద్ధితాయ ।
ఖే రోహిణీం తాం దయితా మవాప్య చన్ద్రః ప్రభాభిః కురుతేహి రాజ్యమ్. 27

స్థిత్వైవ కామస్యతు పాదమూలే కాచిద్వరస్త్రీ స్వకపోలమూలే ।
విశేషకం చారుదతీ కరోతి తేనాననం స్వం సమలంకరోతి. 28

దృష్ట్వాననం మణ్డలదర్పణస్థం మహాప్రభా మే ముఖజేతి జప్త్వా ।
పరం నతాఙ్గీ రమణేరితాని తేనైవ భావేన రతీవ చాన. 29

రోమాంచితైర్గాత్రవరై ర్యువత్యా రతానురాగా ద్రమణేషు చాన్యా ।
స్వలఙ్కృతా యాన్తి మదాభిభూతా ద్విపా యథా ఘర్మదినావసానే. 30

పేపీయతే చాతిరసానువిద్ధా విమార్గతేఽన్యాచ ప్రియం ప్రసన్నా ।
కాచిత్ప్రియస్యాతిచిరా త్ప్రసన్నా ఆసీత్ప్రలాపేషుచ సుప్రసన్నా. 31

గోశీర్షపద్మై ర్హరిచన్దనైశ్చ పఙ్కాఙ్కితాః క్షీరధరాఽసురీణాం ।
మనోజ్ఞరూపా రుచిరా బభూవుః పూర్ణాఽమృతస్యేవ సువర్ణకుమ్భాః. 32

క్షతాధరోష్ఠ ద్రుతరోషరక్తం రమన్తి దైత్యా దయితానురక్తాః ।
తస్త్రీప్రలాపేషు పున స్సరక్తాః స్త్రీణాం ప్రలాపేషు పునర్విరక్తాః. 33

క్వచిత్ప్రలాపం మధురాభిధానం కామస్య బాణేషు కృతం విధానమ్ ।
ఆపానభూమీషు సుఖప్రదేశో దితేస్సుతానాం సమవాప్య గేయమ్. 34

గేయం ప్రవృత్తం త్వథ వాదయన్తి ప్రియోపగూఢాంగరుహాపి నారీ. 35
కేచిత్ప్రియాస్తత్రచ సాధయన్తి కేచిత్ప్రియా న్సమ్ప్రతిబోధయన్తి ।
మారప్రసూనప్రభవాంశ్చ గన్ధా న్ప్రినూయతేవై త్రిపురేషు గన్ధః. 36

పూర్వము శివునిపై ప్రయోగింపబడి వినోదము ననుభవించిన ఐదు బాణములును ఇపుడు త్రిపుర దానవులపై ప్రయోగింపబడి అచటి స్త్రీ పురుషులకు తమ రుచిని చూపెను. మన్మథుడు అచటి దానవ స్త్రీల అవ్యక్త మధుర వచనములలో వీణాలాపనలలో సంగీత మూర్ఛనలలో దానవులు చేయు శృంగార మత్తప్రలాపములలో విజృంభించి వారి మనస్సులను కలవరపరచెను. చంద్రుడాకాశమున తన పత్నియగు రోహిణీదేవితో కూడి వెన్నెల కురియుచు రాజ్యము చేయుచుండ ఆతని వెన్నెల అచటి రాత్రి చీకటులను పారద్రోలుచు జగమునకు హితము చేయుచుండెను. ఆ దానవాంగనలలో

ఒకతె మన్మథుని పాదములకడ నిలిచి తన చెక్కిళ్ళయందు విశేషకము అను రంగు పూతతో అలంకరణము చేసికొనుచు దానితో తన ముఖమునకు శోభ నమకూర్చుకొనుచుండెను. తరువాత ఆమె తన ముఖమును గుండ్రని అద్దములో చూచుకొని 'నా ముఖమునకు ఎంతయో శోభ కలిగెను కదా'యని మురియుచు తన ప్రియుడు కూడ తను ఇట్లు ప్రశంసించునను భావముతో చాల ఆనందించుచుండెను. కొందరు యువతులు గగుర్పాటు చెందిన శరీరములతోను తన ప్రియునితోకూడి రమించవలెనను ఆసక్తితోను చక్కగా అలంకరించుకొని మదపుటేనుగులవలె ఆనందముతో మత్తిల్లియుండిరి. ఒకతె శృంగార భావముతో నిండిన మనస్సుతో మద్యము త్రావుచుండెను. మరియొకతె ప్రసన్న హృదయముతో ప్రియుని వెదకుకొనుచుండెను. మరియొకతె చాలసేపు తన ప్రియుని విషయములో ప్రసన్నురాలయియుండెను. ఇంకొక దానవస్త్రీ తన ప్రియుడు చేయు ప్రలాపములకే ఆనందపడుచుండెను. గోశీర్ష పద్మములు హరి చందనము మొదలగు అలంకరణములతో సుగంధ ద్రవ్యపు పూతలతో చన్నులు బురదతో పులిమినట్లు కనబడుచుండ పెదవులు మెరయుచుండ వారి రూపములు మనోహరములయి ఆసక్తి గొల్పునవై ప్రకాశించెను. అమృతముతో నిండిన బంగారు కుంభములవలె వారి రూపము లుండెను. కొందరు దానవులు ప్రియురాండ్రయం దనురక్తులయి వారి పెదవులను గాయపరచి వారు శీఘ్రముగా కోపింపగా మరల వారిని బ్రతిమాలి వినోదపెట్టి ఆనందపరచుచు ఆనందపడుచునుండిరి. కాని వారు తమ ప్రియురాండ్ర మాటలయందుకంటె వీణావాద్య ధ్వనులయందు ఎక్కువ ఆసక్తులై అవి వినగోరిరి. కొందరు దానవులు తమ ప్రియురాండ్ర మధుర వచనములు విన్నంత మాత్రాన కామబాణ వశీభూతులగుచుండిరి; కొందరు దానవస్త్రీలు మద్యపానశాలా ప్రదేశములందు పానముచేసి తను ప్రియుడు కౌగిలించుకొనగా అతడు పాడుచుండ తాను వాద్యము వాదించుచుండెను. కొందరు దానవులు తమ ప్రియురాండ్రను బ్రతిమాలుచుండిరి. కొందరు తమ ప్రియురాండ్రు అలుగగా వారికి నచ్చచెప్పుచుండిరి. ఆ సమయమున త్రిపురములయందలి సుగంధము మన్మథుని బాణపు పూవుల వాసనలను వెదజల్లుచుండెను. (దానవులలో స్త్రీలును పురుషులును శృంగారభావ పరవశులగుచుండిరని భావము.) ఒకానొక దానవాంగన శయ్యపై సుఖముగా పండుకొని ప్రియుడు కౌగిలించుకొనగా పులకించి చెమర్చి లేత గడ్డిమొక్కల చిగురాకులతో అందగించుచున్న భూమి ఆ తృణాంకురములపై సన్నని మంచు చినుకులు క్రొత్తగా పడినపుడు ప్రకాశించునట్లు ఒప్పారెను.

ప్రియోపగూఢా శయనోపగూఢా కాచిత్ప్రరూఢాంగరుహాఙ్గనాపి ।
సబాలశష్పాఙ్కురపల్లవాన్తా నవామ్బుయుక్తాఇవ భూమిరాసీత్. 37

శశాఙ్కపాదై రుపశోభితేషు ప్రాసాదవర్యేషు వరాఙ్గనానామ్ ।
మాధుర్యధూతాభరణా మహాన్తః స్వనా బభూవు ర్మదనేషుతుల్యాః. 38

పానేన భేదం దయితాఽతివేలం కపోల మాజిఘ్రతి కిం మమేదమ్ ।
ఆరోహచ శ్రోణి మిమాం విశాలాం పీనోన్నతాం కాఞ్చనమేఖలాఢ్యామ్. 39

రథ్యాసు చన్ద్రోదయభాసితాసు నరేన్ద్రమార్గేషుచ విస్తృతేషు ।
దైత్యా మహాయూథగతా విభాన్తి తారా యథా చన్ద్రమసా దినాన్తే. 40

సుధాట్టహాసేషు సురాలయేషు ప్రేక్షాసు చాస్యా మదలోలభావాః ।
సన్దోలయన్తే కిల సమ్ప్రహాసం వృథ్వాని(?) కాఞ్చీగుణకృష్టనాదాః. 41

ఆమ్లానమాలాఞ్చితి చాఙ్గనానాం సముత్సుకానా మతిహర్షితానామ్ ।
శ్రూయన్తి వాచః కలధౌతకల్పా వాపీషు చాన్యే కలహంసశబ్దాః 42

కాఞ్చీకలాపాశ్చ సహాఙ్గహారాః ప్రేక్ష్యాస్సదా హాసకృతశ్చబాలాః ।
దృశ్యన్త ఏతే హ్యసురాఙ్గనానాం ప్రియాలయా మన్మథ మార్గణానామ్. 43

చిత్రామ్బరై శ్చోద్ధృతకేశపాశై స్సన్దోలమానా శుశుభేఽసురాణామ్ ।
సుచారువేషాభరణై రుపేతా తారాగణై ర్ద్యౌరివ సా సచన్ద్రా. 44
సన్దోళనాధ్వానితభిన్నసూత్రా కాఞ్చీకలాపాఞ్చితరత్నకీర్ణా ।
శయ్యాభూమి శ్చిత్రితా తైర్విభాతి చన్ద్రస్య పార్శ్వోపగతేవ ఛిత్రా. 45
సచన్ద్రికే చోపవనప్రదేశే రుతేషు కాన్తేషుచ కోకిలానామ్ ।
శరవ్యయం ప్రాప్య పురే సురాణాం ప్రక్షీణబాణో మదన శ్చచార. 46
ఇతి త్రిపురపురేఽమరద్విషాణాం సపది హ పశ్చిమ కౌముదీ తదాఽఽసీత్ ।
రణశిరసి తదా భవిష్యతాంవై భవతురగైః కృతసజ్ఞయోఽవ్యరీణామ్. 47
చన్ద్రోఽద్య కున్దకుముదాకరహారవర్ణో భాగ్యక్షయే ధనపతీవ నరో వివర్ణః ।
ఛాయావ్యయం మహదుపేత్య స భాతి తద్వ జ్జ్యోత్స్నావితానరహితోఽభ్రసమానవర్ణః. 48
చన్ద్రప్రభా మరుణసారథినాఽభిభూయ నిష్టప్తకాఞ్చనరథాఙ్గసమానబిమ్బః ।
భిత్త్వోదయాద్రిశిఖరే ముహురేష సూర్యో భాత్యమ్బరే తిమిరతోయవహ స్సరస్యాః. 49

ఇతి శ్రీమత్స్య మహాపురాణే త్రిపురోపాఖ్యానే చంద్రోదయాదివర్ణనం నామ
సప్తత్రింశదుత్తరశతతమోఽధ్యాయః.

చంద్రుని వెన్నెలలతో శోభించుచున్న త్రిపుర సౌధాగ్రములందు మాధుర్య భావ ప్రకటనవశమున కదలుచున్న ఆభరణములును ఒడ్డాణపు గజ్జెలును మొలనూలు లందలి చిరుగజ్జెలును చేయు ధ్వనులు మన్మథుడు ప్రయోగించిన బాణములు వచ్చి పడునపుడు అయ్యెడు ధ్వనులవలె మనోహరములయి వినబడుచుండెను. ఒక దానవ స్త్రీ తన ప్రియునితో "నీవు ఆసవపానముచే అలసితివి. అమితముగా నాచెక్కిలి ముద్దాడి యాడి ఇంకను అలసితివి. నా పిరుదులు విశాలమయినవి. అవి బంగారు మొలనూలితో మనోహరమయి మనోహర ధ్వని చేయుచున్నవి. పుష్టితో విశాలమై యున్నవి. నీవు వానిపై కూర్చుండి శ్రమ దీర్చుకొనుము." అనుచుండెను.

ఇట్లా రాత్రియందు త్రిపురములందలి రథ్యలు (విశాల రాజవీథులును నాలుగు వీథులు కలిసిన కూడలులును) వెన్నెలతో నిండి ఒప్పుచుండెను. రాజమార్గముల మాటయే అందరును మరచిపోయినట్లు అచట ఎవరును సంచరించక తమ తమ భవనములందును సౌధములందును సుఖించుచుండిరి. కాని కొందరు దైత్యులు పెద్ద గుంపులుగా కూడి సాయం కాలానంతరము చంద్రునితో కూడిన నక్షత్రముల వలె ప్రకాశించుచుండిరి. దానవులు తమ తమ భవనములయందు వెన్నెల అట్టహాసముల నడుమ ఊయెలలయందు మదలోలభావములతో ఊగుచు ఆనందించుచుండిరి. వారి మనస్సులు తమ ప్రియురాండ్ర మొలనూలులందలి చిరుగజ్జెల మ్రోతలచే ఆకర్షింపబడుచుండెను. దానవాంగనలు ఆ సమయమున వాడని పూలమాలలు ధరించి మిగుల ఉత్సుకభావముతో అతిహర్షముతో నిండియుండిరి. భవనములందు ఈ దానవ స్త్రీల మధుర వచనములును దిగుడు బావులందలి కలహంసముల ధ్వనులును ఒకే విధముగా మధురములై వినవచ్చుచుండెను. ఆ పురమందెల్ల చోటులందును-ఒడ్డాణముల అందములు-దానవస్త్రీల మధురాంగ విన్యాసముల శోభలు-ఎప్పుడును నవ్వులు చిందెడి బాలురు-మన్మథ బాణములకు ప్రియ నివాసములగు దానవాంగనల సౌందర్యములు-ఇవి ఆ పురమునందంతట కనబడుచుండెను.

వన్నెవన్నెల వస్త్రములు పైకెత్తి కట్టిన కేశపాశములు ధరించిన స్త్రీ పురుషులతో తరంగితమయి మనోహరమగు వస్త్రములు ఆభరణములు ధరించిన జనముతో కూడిన ఆ త్రిపురపురి ఆ రాత్రివేళ చంద్రునితో తారలతో కూడి వెలుగు ఆకాశము వలెనే ప్రకాశించెను. కదలికచే ధ్వనించుచు తెగిపడిన మొలనూలులతో ఒడ్డాణములందుండి చెదరి రాలి పడిన రత్నములతో చిత్రకాంతులతో విరాజిల్లుచు త్రిపుర భవనములందలి శయ్యాభూమి చంద్రుని సమీపమున ప్రకా

శించు చిత్రా నక్షత్రమువలె ప్రకాశించుచుండెను. వెన్నెలలతో తళతళలాడు ఉద్యానములందు కోకిలల మనోహర ధ్వనుల నడుమ ఆ దానవుల త్రిపుర భవనములందు మన్మథుడు తన బాణములను ప్రయోగించి ప్రయోగించి ఆ శరములన్నియు వ్యయమయి పోగా అతడు ఏమియు తోచక తిరుగుచుండెను.

అంతలోనే దానవ పుంగవుల ఆ త్రిపురములందు రాత్రి ముగియగా వెన్నెలలు తగ్గుచు చంద్రుడు పడపట వాలెను. కొలది సేపటిలో యుద్ధరంగమున నిలువబోవు శివుని తురగములే దేవ శత్రువులగు దానవులకును చంద్రునకును ఒకేసారి ఒకే విధముగా క్షీణదశను కలిగించినట్లయ్యెను. అస్తమించుచున్న చంద్రుడు తరిగిన వెన్నెలలతో వెలవెలపోవుచు మొల్లపూవులను కలువపూలను కర్పూరమును పోలిన కాంతితో కూడి భాగ్యక్షయము కలిగిన ధనవంతుని వలె వివర్ణుడై కనబడుచుండెను. అతని ఛాయ అంతయు వ్యయమయ్యెను. వెన్నెల రాసులన్నియు కరగిపోయెను. చివరకు అతని వర్ణము ఆకాశ వర్ణముతో సమానమయ్యెను.

అంతలో సూర్యు డుదయించెను. అతడు తన సారథియగు అరుణునితో చంద్రుని కాంతిని అణగద్రొక్కెను. అతని బింబము మిగుల కాచిన మేలిమి బంగారు వన్నెతో మెరయుచుండెను. ఇట్లతడు లోకమందలి చీకటులను మేఘముల పారదోలుచు ఉదయాద్రి శిఖరమును చీల్చుకొని వెలికి వచ్చి ప్రకాశించసాగినా డిడుగో! అని ఆనందించిరి.

ఇది శ్రీమత్స్య మహాపురాణమున త్రిపురోపాఖ్యానమున చంద్రోదయాది వర్ణనమను
నూట ముప్పది ఏడవ అధ్యాయము.

## అష్టత్రింశదుత్తరశతతమోఽధ్యాయః.

## త్రిపురదాహే విద్యున్మాలివధః.

సూతః : ఉదితేతు సహస్రాంశౌ మేరుభాసాఙ్కురే రవౌ ।
ననర్దచ బలం కృత్స్నం యుగాన్తఇవ సాగరః. 1
సహస్రనయనో దేవ స్తత శ్శక్రః పురన్దరః । సమహేన్ద్రి స్సవరుణ స్త్రిపురం ప్రయయౌ హరః. 2
తే నానావిధరూపాశ్చ ప్రమథాఽతిప్రమాథినః । యయు స్సింహరవై ర్ఘోరై ర్వాదిత్రనినదై రపి. 3
తతో వాదితవాదిత్రై స్సాతపత్రై స్సహధ్వజైః । బభూవ తద్బలం దివ్యం వనం ప్రచలితం యథా. 4
తదాపతన్తం సమ్ప్రేక్ష్య రౌద్రం రుద్రబలం మహత్ ।
సఙ్క్షోభో దానవేన్ద్రాణాం సముద్రప్రతిమోఽభవత్. 5
తేషాం ప్రాసాసిపట్టాకశక్తిశూలవరశ్వథాః । శరాసిచాపవజ్రాణి గురూణి ముసలానిచ. 6
ప్రగృహ్య కోపరక్తాక్షా స్సపక్షాఇవ పర్వతాః । నిర్జగ్ముర్దానవఘటా ఘనాఇవ ఘనాగమే. 7
విద్యున్మాలి స్సమస్తైస్తై సమయే దితినన్దనాః । వన్దమానా స్సమానేదు ర్దేవా దేవై స్సురారయః. 8
మర్తవ్యే కృతబుద్ధీనాం జయేవా నిశ్చితాత్మనామ్ । అచలానా మివాత్రాసం స్తత్ఫలానాం యథాపురా. 9
విగర్జన్త ఇవామ్భోదా హ్యమ్భోదసదృశత్విషః । ప్రబుద్ధా యుద్ధకుశలాః పరస్పరకృతాగసః. 10
ధూమాయన్తి జ్వలన్తిశ్చ ఆయుధై శ్చన్ద్రిఖాస్వరైః ।
కోపాద్వా యుద్ధలోభాద్వా చూర్ణయన్తః పరస్పరమ్. 11
వజ్రాహతాః పతన్త్యన్యే అన్యే చక్రవిదారితాః । బాణై ర్విదారితాశ్చాన్యే పతన్తి హ్యుదధేర్జలే. 12
భిన్నస్రగ్దామహారాశ్చ ప్రభ్రిష్టామ్బరభూషణాః । తిమినక్రముఖేష్వేవ పతన్తి ప్రమథా స్సురాః. 13

## నూట ముప్పది ఎనిమిదవ అధ్యాయము.
## విద్యున్మాలి వధాది కథ.

మేరు పర్వతపు కాంతులవంటి కాంతుల మొలకలతో సహస్ర కిరణుడు రవి ఉదయించెను. దేవ దానవుల బలములు రెండును ప్రళయకాల సాగరములవలె ధ్వనింపసాగెను. అంతట సహస్ర నేత్రుడును శత్రుపురముల భేదించిన వాడును మహాశక్తిశాలియు నగు ఇంద్ర దేవుడును త్రిపుర దాహమునకు సన్నద్ధుడయ్యెను. హరుడును మహేంద్రునితో వరుణునితో కూడి త్రిపురదుర్గమునకు బయలుదేరెను. శత్రువులను మిగుల మథించగల వారును నానా విధ రూపులు నగు ప్రమథులు భయంకర సింహనాదములతో వాద్య ధ్వనులతో యుద్ధమునకు బయలు వెడలిరి. మ్రోగుచున్న వాద్యములతో ఛత్త్రిములతో ధ్వజములతో ఒప్పు ఆ దివ్యదేవతా సేన వనమే కదలిపోవుచున్నట్లు కనబడెను. భయంకరమగు ఆ రుద్ర సేన వచ్చి పడుచుండుట చూచి దానవశ్రేష్ఠులును సముద్రమువలె సంక్షోభిల్లసాగిరి. వారెల్లరును ప్రాసములు ఖడ్గములు పట్టసములు శక్త్యాయుధములు శూలములు గండ్రగొడ్డండ్రు బాణములు ఖడ్గ విశేషములు ధనువులు వజ్రములు బరువైన ఇనుప రోకళ్లు తీసికొని కోపముతో కండ్లెఱ్ర చేసి రెక్కలుగల కొండలవలె కనబడుచుండిరి. ఆ దానవులు ఏనుగులవలె వర్షాకాల మేఘములవలె బయలుదేరి విద్యున్మాలి కడకు వచ్చి తగిన సమయమున అతని నమస్కరించి 'నమస్తే' అని పలికి సింహగర్జనలు చేసిరి. దేవతల నుద్దేశించి అరచిరి. వారందరును పూర్వము ఇంద్రుని ఎదుర్కొన సిద్ధపడిన పర్వతముల వలె మరణించుటకైన జయించుటకైన సిద్ధపడి దృఢ నిశ్చయముతో నుండిరి. వారు భయంకరముగ గర్జిల్లు మేఘముల వలె నుండిరి. వారెల్లరు మేఘముల కాంతులవంటి కాంతికలవారు; బుద్ధిశాలురు; యుద్ధమున నేర్పరులు. ఇంతలో దేవ దానవుల నడుమ యుద్ధ మారంభ మాయెను. వారొకరి కొకరు ఆయుధములతో అపకారము చేసికొనసాగిరి. చంద్రుని వలె ప్రకాశించుచు ప్రజ్వలించుచున్న ఆయుధములు చేతుల దాల్చి పొగలు గ్రక్కుచున్న అగ్నులవలె నుండిరి. కోపము తోను యుద్ధమునందలి పేరాసతోను ఒకరి నింకొకరు చూర్ణము చేసికొనుచుండిరి. వారు వజ్రపు దెబ్బలతో చక్రాయుధాఘాత ములతో బాణ ప్రయోగములతో ముక్కలయి చీలికలయి సముద్ర జలమున పడిపోవుచుండిరి. ప్రమథులును దేవతలును కూడ మాలికలు దండలు హారములు తెగి వస్త్ర భూషణములు జారిపడి సముద్రములో తిమితిమింగిల నక్రాది జల జంతు వుల నోళ్లలో పడుచుండిరి.

గదానాం ముసలానాంచ తోమరప్రాసవాజినామ్ । వజ్రశూలర్ష్టిపాతానాం పతితానాం చ సర్వశః. 14
గిరిశృఙ్గోపలానాంచ ప్రేరితానాం ప్రవత్తిభిః । దేవానాం దానవానాంచ సధూమానాం రవిత్విషామ్. 15
ఆయుధానాం మహానోఘ స్సాగరౌఘే పతత్యపి । క్షీణవేగైస్తు తైస్తత్ర సురాసురకరేరితైః. 16
ఆయుధౌఘైస్తు నక్రాణాం క్రియతే సఙ్క్షయో మహాన్ । క్షుద్రాణాం గజయోర్యుద్ధే యథా భవతి సఙ్క్షయః. 17
దేవాసురగణే తద్వత్తిమినక్రక్షయోఽభవత్ ।

నన్దికేశ్వరవిద్యున్మాలినోర్యుద్ధమ్.

విద్యున్మాలీచ వేగేన విద్యున్మాల ఇవాम्बుదః. 18
విద్యున్మాలిఘనాకారం నన్దీశ్వర మభిద్రుతః । స్వకం నామాతిపదతేఽ ప్యువాచ వదతాం వరః. 19
నన్దినం యుధి శైలాదిం దానవో యుధి నిశ్చితః । యుద్ధాకాఙ్క్షీవ బలవాన్ త్వయాహం యోద్ధుమాగతః. 20
యుధి త్విదానీం మా జీవన్ ముచ్యసే నన్దికేశ్వర । తమేవం వాదినం దైత్యం నన్దీశ స్తవతాం వరః. 21
ఉవాచ ప్రహసం స్తత్ర వాక్యాలఙ్కారభూషితః । దానవా దమకామానాం నైషోఽవసర ఇత్యుత. 22
శక్తో హన్తుం కిమాత్మానం జాతిదోషా ద్వికత్థసే । యుధి తావ న్మయా పూర్వం నిహతా దితిజా యదా. 23
ఇదానీంతు కథం త్వాహం న హింస్యే కులదూషణమ్ ।

*ఆకాశం ధారయేద్దోర్భ్యాం పాతయేద్వా దివాకరమ్. 24
సోఽపి మాం శక్నుయాన్నైవ చక్షుర్భ్యామపి వీక్షితుమ్ । ఇత్యేవం మన్త్రయంస్తత్ర నన్దినాఽప్రతిమో బలే.
బిభేదైకేషుణా దైత్యః కరేణార్క ఇవామ్బుదమ్ । విక్షతస్య శరస్తస్య వపౌ రుధిరముత్తమమ్. 26
సూర్యస్యాత్మప్రభావేన యథార్ణవజలం తథా । సతు తేన ప్రహారేణ ప్రమథో జాతరోషితః. 27
హస్తేన వృక్షముత్పాట్య చిక్షేప గజరాడివ ।

గదలు ముసలములు తోమరములు ప్రాసములు గుద్రములు వజ్రములు శూలములు ఋష్టులు (చిన్న ఖడ్గములు) కొండరాళ్లు దేవతలచె దానవులచే ప్రయోగింపబడి రవి సమాన కాంతులను పొగలను క్రక్కుచు మహారాసులై సముద్రములో పడుచుండెను. అవి పడునపుడు వేగము తగ్గుచు పోయి జల జంతువులపై పడి వాటిని నశింపజేయుచుండెను. ఇది ఏనుగుల పోరిలో వాటి నడుమ అల్ప జంతువులు నలిగి చచ్చినట్లుండెను.

అంతలో మెరపులతో మెరయు మేఘము అదే విధమగు మేఘము నెదుర్కొన్నట్లు విద్యున్మాలి నందిని ఎదుర్కొనుటకై అతనివైపునకు పరుగున పోయెను. యుద్ధమున నిశ్చితాభిప్రాయముకల ఆదానవుడు తన పేరు తెలుపుచు శిలాద పుత్త్రుడగు నందీశ్వరునితో 'ఓయీ! నాకు యుద్ధమనిన మక్కువ ఎక్కువ; బలవంతుడనగు నేను యుద్ధాకాంక్షినై నీతో పోరవచ్చితిని. నీవు ఇపుడిక ప్రాణాలతో పోజాలవు.' అనెను. అతని ఈ పలుకులు విని మహా తపస్వియగు నందీశ్వరుడు నవ్వుచు వాక్యాలంకార భూషితమగు వాక్యమిట్లు పలికెను: 'ఓయీ! మీరు దానవులు కదా! మావంటివారు దమము (ఇంద్రియశాంతి) కోరువారమయినను అట్టి దానికిది సమయము కాదు. నీజాతి సహజ స్వభావముతో బడాయి మాటలు పలుకుచున్నావేకాని నీవు నన్ను చంపగలవాడవా? ఇదివరకే యుద్ధములో ఎందరనో దానవుల చంపిన నేను నీవంశమునే నాశము చేయ పుట్టిన నిన్ను చంపక ఎట్లు విడువగలను?' అనగా విద్యున్మాలి నందితో 'ఓయీ! ఆకాశమును భుజములతో పట్టగలవాడును సూర్యునిక్రింద పడగొట్టగలవాడును గూడ నన్ను కన్నులతో చూడనైన జాలడు.' అనుచునే-నందితో బలమున సాటికాని ఆ దానవుడు-ఏనుగు తన తొండముతో మేఘమును చీల్చినట్లు ఒక బాణముతో నందిని గ్రుచ్చెను. ఆ బాణము-రవి తన కిరణములతో సముద్ర జలమును త్రావినట్లు-నంది రక్తమును త్రావెను. ఆ దెబ్బతో రోషించిన నంది గజేంద్రుడువలె వృక్షమొకటి పెకలించి విద్యున్మాలిపై విసరెను.

విద్ధోఽభివన్న స్తతరు శ్శీర్ణపుష్పో మహాజవః. 28
విద్యున్మాలికరైశ్ఛిన్నః పపాత పతగేశవత్ । వృక్షసాలోఽపి సంఛిన్నో దానవేన వరేషుభిః. 29
రోష మాహారయం స్తీవ్రం నన్దీశ్వరః సువిగ్రహః । సోద్యమ్య కరమారావీ రవేస్సదృక్కరప్రభమ్. 30
దుద్రావ హన్తుం సక్రూరం మహిషం గజరాడివ । తమాపతన్తం వేగేన వేగే వాయుసమో బలీ. 31
విద్యున్మాలీ శరశతైః పూరయామాస నన్దినమ్ । శరకణ్టకితై ర్గాత్రై శ్శైలాదిశ్చాపివిక్షతః. 32
అరేర్గృహ్య రథం తస్య మహతః ప్రయయౌ జవాత్ । విలమ్బితాశ్వో విశిరా భ్రామితశ్చ రణే రథః. 33
పపాత మునిశాపేన సాదిత్యోఽర్కరథో యథా । అన్తరాన్నిర్గతశ్చైవ మయయా స దితేస్సుతః. 34
ఆజఘాన తదాశక్త్యా శైలాదిం సమవస్థితమ్ । తామేవతు వినిష్కృష్య శక్తిం శోణితభూషితామ్. 35
విద్యున్మాలిన ముద్దిశ్య చిక్షేప ప్రమథాగ్రణీః । తయా భిన్నతనుత్రాణో విభిన్నహృదయ స్తదా. 36
విద్యున్మాల్యపతద్భూమౌ వజ్రాహత ఇవాచలః । విద్యున్మాలౌ వినిహతే సిద్ధచారణకిన్నరాః. 37
సాధుసాధ్వితి చోక్త్వా తే యయు ర్దేవ ముమాపతిమ్ । నన్దినా సాదితే దైత్యే విద్యున్మాలౌ హతే మయః. 38
దదాహ ప్రమథానీకం వల మగ్నిరివోత్థితః । శూలనిర్దారితోరస్కా గదామూర్ణితమస్తకాః 39

* సాగరంలఙ్ఘయేద్దోర్భ్యాం

ఇషుభి ర్గాఢవిద్ధాశ్చ ప్రపతన్తి మహార్ణవే। అథ వజ్రధరో యమోర్థద స్సహానన్ది స్సహషణ్ముఖో గుహః.40
మయ మాసురవీరసంమతం ప్రహర ఇచ్ఛస్త్రగణై ర్ఘతారయః ।
నాగస్తు నాగాధిపతిర్వ తార్క్ష్యం మయో విదార్యేషువరైశ్చ తూర్ణమ్. 41
యమంచ విత్తాధిపతిం చభిత్త్వా రరాజ మన్దార్క్ముద్రవ త్తదానీమ్।
తతస్సురైః ప్రమథగణైశ్చ దానవా దృఢాహతా స్త్రైత్తమదర్పవిక్రమాః. 42
భృశానువిద్ధా త్త్రిపురం ప్రపేదిరే యథాసురా శ్చక్రధరేణ సంయుగే ।
తతశ్చ శఙ్ఖానకభేరిసఙ్కులా స్ససింహనాదా దనుపుత్త్రభేదకాః. 43
కపర్దిసైన్యే ప్రహృతా స్సమంతతో నివత్యమానాఽశనివజ్రసన్నిభాః. 43½

ఇతి శ్రీమత్స్యమహాపురాణే త్రిపురోపాఖ్యానే త్రిపురదాహే విద్యున్మాలి
వధాదికథనం నామ అష్టత్రింశదుత్తర శతతమోఽధ్యాయః.

ఆ వృక్షము నంది హస్తమునుండి విద్యున్మాలి దగ్గరకు వచ్చులోపుగనే వాడు ప్రయోగించిన బాణపు దెబ్బలతో దాని పూవులన్నియు రాలిపోయెను. వాని బాణముతో ఛిన్నమయి అది మహావేగమున గరుడునివలె క్రింద పడెను. అది చూచి ఉత్తమ మూర్తిగల నందీశ్వరుడు మిగుల కోపించి రవికర సదృశమగు తన కరమెత్తి మహిషముమీదికి పరుగెత్తు గజేంద్రునివలె విద్యున్మాలి మీదకు పరుగెత్తెను. వేగమున వాయు సమానుడును బలశాలియునగు ఆ విద్యున్మాలి మహావేగమున తనపైకి వచ్చు నందీశ్వరుని పండలకొలది శరములతో నింపెను. అట్టి గాయపడి నంది తన శరీరమంతయు ఆ బాణములతో గగుర్పాటు చెందినదివలె కనబడుచుండ మహావేగమున వచ్చి విద్యున్మాలి రథమును తీసికొని మహావేగమున అటనుండి పోయి గిరగిర త్రిప్పివేసెను. దానిచే ఆ రథము ముని శాపమున సూర్యునితో కూడ పడిపోయిన రవి రథము వలె పడిపోయెను. విద్యున్మాలియును పడిపోవుచున్న ఆ రథమునుండి తన మాయా బలమున తప్పించుకొని బయటపడి అచ్చటనే నిలిచియున్న నందీశ్వరుని శక్త్యాయుధముతో కొట్టి గాయపరచెను. ప్రమథ శ్రేష్ఠుడగు ఆనందియును తన గాయపు నెత్తుటితో తడిసిన ఆశక్తినే లాగి ఆ దానవునిపై విసరగా వాని కవచమును హృదయమును బ్రద్దలయి వాడు వజ్రపుదెబ్బ తినిన పర్వతమువలె క్రింద పడిపోయెను. అది చూచి సిద్ధులును చారణులును కిన్నరులును 'సాధు-సాధు' 'బాగు-బాగు' అని పలికి శివునికడకు పోయిరి. విద్యున్మాలి మృతి విని కోపించి మయుడు ప్రజ్వలించు అగ్ని ఎండుగడ్డిని వలె ప్రమథ సేనను కాల్చెను. శూలముతో బొమ్మలు చీలికలయి గదలతో తలలు వగిలి గాఢముగా బాణపు దెబ్బలుతిని ప్రమథులు సముద్రమున పడుచుండిరి. అది చూచి ఇంద్రయమ కుబేర నంది షణ్ముఖులు దానవ వరశ్రేష్ఠుడగు మయుని వివిధ శస్త్ర గణముల ప్రయోగించి కొట్టిరి. నాగాధిపతి గరుత్మంతుని చీల్చినట్లు మయుడు శ్రేష్ఠ బాణములతో యముని కుబేరుని చీల్చి గంభీర మేఘమువలె ప్రకాశించెను. అంతట ప్రమథులును దేవతలును ఏకమై దానవులను కొట్టగా వారు తామెంత ఉత్తమ దర్పము విక్రమము కలవారయినను ఆయుధపు దెబ్బల వ్యథ అధికము కాగా పూర్వము విష్ణుని చేతిలో దెబ్బలు తినిన అసురులవలెనే యుద్ధము వదలి త్రిపురమధ్యమున ప్రవేశించిరి. అంతట దేవసేనలోనుండి శంఖములు తప్పెటలు నగారాలు ఢంకలు సింహనాదములు ఆకసమునుండి పడుచున్న పిడుగుల మ్రోతలు వెలువడి దానవుల గుండెలు బ్రద్దలు చేయసాగెను.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున త్రిపురోపాఖ్యానమున విద్యున్మాలి వధ వృత్తాంతమను
నూట ముప్పది ఎనిమిదవ అధ్యాయము.

## ఏకోనచత్వారింశదుత్తరశతతమోఽధ్యాయః.
## త్రిపురసంహార కథాసమాప్తిః.

సూతః : అథ దైత్యపురాభావే పుష్యయోగో బభూవ హ ।
బభూవ తత్ర సంయుక్తం తద్యోగేన పురత్రయమ్. 1
*తత్ర త్రిణయనో దేవో భ్రామయన్నిశితం శరమ్ । ముమోచ త్రిపురే తూర్ణం త్రినేత్రస్త్రిపురాధిపః. 2
తేన ముక్తేన బాణేన బాణపుష్పసమప్రభమ్ । ఆకాశం స్వర్ణసఙ్కాశం కృతం తస్య విరాజితమ్. 3
ఈశ్వరేణైకేషుణా త్రిపురదాహః.
ముక్త్వా త్రిదైవతమయం త్రిపురే తం శరోత్తమమ్ । ధిగ్ధిగ్మామితిచక్రన్ద కష్టంకష్ట మితిబ్రువన్. 4
వైధుర్యం దైవతం దృష్ట్వా శైలాది ర్గజవద్గతః । కిమిదం త్వితి పప్రచ్ఛ శూలపాణిం త్రిలోచనమ్. 5
తత శ్శశాఙ్కతిలకః కపర్దీ పరమార్తవత్ । ఉవాచ నన్దినం భక్తం స మయోఽద్య వినఙ్క్ష్యతి. 6
అథ నన్దీశ్వరస్తూర్ణ మగా న్మారుతవద్బలీ । శరే త్రిపురమాయాతే త్రిపురన్తు వివేశ సః. 7
స మయం వీక్ష్య గణపః ప్రాహ కాఞ్చనసన్నిభః । వినాశస్త్రిపురస్యాస్య ప్రాప్తో మయః సుదారుణః. 8
అనేనైవ గృహేణత్వం మయాఽపక్రమ శీఘ్రతః । తచ్ఛ్రుత్వా నన్దివచనం దృఢభక్తో మయ స్తదా. 9
తేనైవ గృహముఖ్యేన త్రిపురా దపసర్పితః । సోఽపిమః పత్రపుటవ ద్భిత్త్వా చైవ పురత్రయమ్. 10
త్రిధాఽభవ ద్ధుతాశశ్చ సోమో నారాయణ స్తదా । శరతేజః పరీతాని పురాణి ద్విజపుఙ్గవాః. 11
దుష్పుత్త్రదోషా ద్దహ్యన్తే కులాన్యేతా న్యథాతథా । మేరుమన్దరకల్పాని మన్దిరాణి గృహాణిచ. 12
సకవాటగవాక్షాణి వలభీశోభితానిచ । ప్రాసాదాద్యాని రమ్యాణి కూటాగారోత్కటానిచ. 13
ప్రమదాశతపుష్టాని ధనధాన్యయుతానిచ । బద్ధధ్వజపతాకాని స్వర్ణరౌప్యమయానిచ. 14
గృహాణి తస్మిం స్త్రిపురే దానవానా ముపద్రవే । దహ్యన్తే దహనాభాని దహనేన సహస్రశః. 15

## నూట ముప్పది తొమ్మిదవ అధ్యాయము.
## త్రిపుర సంహార కథా సమాప్తి.

సూతుడు ఇంకను ఇట్లు చెప్పనారంభించెను. ఇంతలో త్రిపుర దుర్గ నాశమునకు హేతువగు పుష్యయోగము రానేవచ్చెను. దానితో ఆమూడు పురములును ఒకటిగా నయ్యెను. త్రినేత్రుడు త్రినయనుడు త్రిపురాధిపుడునగు దేవుడు (త్రినయనుడు-మూడు లోకములందలి జీవులను తన ఉత్తమ గతికి చేర్చువాడు; వాస్తవముగ త్రిపురములకు అధిపతి పరమేశ్వరుడే.) శివుడు ఆ పుష్యయోగ సమయమున నిశితమగు శరమును గిరగిర త్రిప్పి వేగముగా త్రిపుర దుర్గముపై ప్రయోగించెను. ఆ విడిచిన బాణపు తేజస్సుచే ఆకాశము మొదట రెల్లు పూవువలెను పిమ్మట బంగారువలెను నయి ప్రకాశించెను. శివుడు త్రిపురములపై బాణ ప్రయోగము చేయుచునే 'నేను నిందింపదగిన పని చేసితినే!'యనుచు 'అయ్యో! అయ్యో!' అనుచు దుఃఖముతో అరచెను. శివుడట్లు ఆర్తి చెందుట చూచి నందీశ్వరుడు గజమువలెపోయి ఇదేమి-మీరేల దుఃఖపడుచున్నారని శివునడిగెను. చంద్రభూషణుడు ఆ శివుడు-తన భక్తుడగు నందితో 'ఇక ఇప్పుడు మయుడు నశించును. అందులకై పరమార్తుడనై దుఃఖించుచున్నాను. 'అనెను. అంతట నంది వాయువువలె మహావేగమున పయనించి శివుని శరము త్రిపురములను చేరులోపలనే తాను చొచ్చుకొనిపోయెను. స్వర్ణకాంతిగల ఆ నందియను ప్రమథ నాయకుడు మయునితో 'మయా! ఈ త్రిపుర దుర్గమునకు మిగుల దారుణమగు నాశము సమీపించినది. కావున నీవు ఇదే గృహముతో నావెంట బయలుదేరి పురమునుండి తప్పించుకొని పొమ్ము.' అని పలికెను. నంది పలికిన

---

* తతోబాణంత్రిధాదే(దై)వస్త్రిదే(దై)వతమయంహరః

వచనమును విని దృఢ భక్తుడగు మయుడు అతడు తెలిపినట్లు మహాగృహము ఆధారముగా త్రిపుర దుర్గమును విడిచి తప్పించుకొనిపోయెను. వెంటనే శివుడు విడిచిన శరము అగ్ని చంద్రనారాయణ రూపముగ మూడుగా అయి త్రిపుర దుర్గమును ఆకు దొన్నెను చీల్చినట్లు చీల్చి కాల్చసాగెను. దుష్పుత్త్రుడు జనించి తన దోషములచే కులనాశము చేసినట్లు శర తేజస్సులు ఆ దుర్గమును చుట్టుకొని దహింపసాగెను. మేరు మందర పర్వతములవంటి మందిరములను గృహములను వాటి కవాటములు గవాక్షములు వలభి గృహములు (మేడలపై నుండు శిఖరాకార గృహములు) ప్రాసాదములు రమ్యములగు కూట గృహములు వానియందు వందల కొలదిగా నున్న స్త్రీలు ధనధాన్యములు ధ్వజములు పతాకలు కాలసాగెను. వెండితో బంగారుతో నిర్మించిన ఆ త్రిపురములందలి ఇండ్లన్నియు ఆంతవరకు అగ్నివలె ప్రకాశించుచుండియు ఇపుడీ శివుని శరాగ్నిచే దగ్ధమగుచు దానవులకు ఉపద్రవము కలిగింపసాగెను.

ప్రాసాదాగ్రేషు హర్మ్యేషు హ్యశోకోపవనేషుచ । వాతాయనస్థితాశ్చాన్యా హ్యాకాశేషు తలేషుచ. 16
రమణై రుపగూఢాశ్చ రమణ్యో రమణైస్సహ । దహ్యన్తే దానవేన్ద్రాణా మగ్నినా దయితాః స్త్రియః. 17
కాచిత్ప్రియం సమాలిఙ్గ్య అశక్తా గన్తుమన్యతః । పురః ప్రియస్య పఞ్చత్వం గతాఽగ్నే ర్వదనే క్షయమ్. 18
ఉపసర్పంత మేకాతు విసృజ్యచ హుతాశనమ్ । ఉవాచ శతపత్రాక్షీ సాస్రాక్షీ సా కృతాఞ్జలిః. 19
హవ్యవాహనః భార్యాఽహం వరస్య వరతాపనః ధర్మసాక్షీ త్రిలోకస్య న మాం త్వం స్ప్రష్టుమర్హసి. 20
సహిత స్స్వాహయా దేవః స్వధయా చాపి సువ్రత ।
వరేణాపైహి ముక్త్వేదం గృహం చర హితం హి మే. 21
ఏకా పుత్త్ర ముపాదాయ బాలకం దానవాఙ్గనా । హుతాశనసమీపస్థా ఇత్యువాచ హుతాశనమ్. 22
బాలోఽయం దుఃఖలబ్ధశ్చ మయా పావక పుత్త్రకః । నార్హ స్యేన ముపాహాతుం యది తే షణ్ముఖః ప్రియః.
భూయః ప్రియం పరిష్వజ్య పీడితా దానవాంగనా । నిపత త్యర్ణవజలే సింజమానవిభూషణా. 24
హా మాతః పుత్త్ర తాతేతి మాతులేతి చ విహ్వలాః । చుక్రుశుస్త్రిపురే నార్యః పావకజ్వాలవేష్టితాః. 25
యథా దహతి శీతాగ్ని స్సాముబుజం జలజాకరమ్ । తథా స్త్రీచక్రపద్మాని దహతి త్రిపురేఽనలః. 26
తుషారరాశిః కమలాకరాణాం యథా దహత్యమ్బుజకం నిశాన్తే ।
తథైవ సోఽగ్ని స్త్రిపురాఙ్గనానాం దదాహ వక్త్రేక్షణ పఙ్కజాని. 27

ప్రాసాదాగ్రములందు హర్మ్యతలములందు అశోకోద్యానములందు గవాక్షములలో ఆకాశ ప్రదేశములలో తమ ప్రియుల కౌగిలింతలలో సుఖించుచునో ప్రియులతో కూడి విహరించుచునో తమ ప్రియులకు ప్రీతి కలిగించుచు వారికి ప్రీతిపాత్రములుగా నున్న దానవ స్త్రీలెందరో అమంటలలో కాలిపోవుచుండిరి. ఒకతె ప్రియుని కౌగిలింతలోనుండి మరెక్కడకును పోలేక అట్లే కాలెను. మరియొకతె తన ప్రియుని ఎదుటనే అగ్ని నోటపడి మరణించెను. ఒకతె అగ్ని తనవైపునకు వచ్చుచుండగా తానే ఇంకను అగ్ని సమీపమునకు పోయి తామరలవంటి తన కన్నుల నీరు కార్చుచు దోసిలిపట్టి హవ్యవాహనా! నీవు వరులను తపింపజేయువాడవు అనుట నిజమే; కాని నేను వరుని భార్యను; నీవు త్రిలోక ధర్మమునకు సాక్షివి; నీవు సత్కర్మలనాచరించు మహనీయుడవు; స్వాహా స్వధాదేవులు నీకు ధర్మపత్నులుగదా! ఇట్టి నీవు నన్ను తాకుట తగదని వేడుకొనుచున్నాను. నన్ను కాపాడుటకును ఇంట ఎవరును లేరు; నేను ఒంటరిదానను; ఈ ఇల్లు విడిచి దూరముగా పొమ్ము. అని ప్రార్థించెను. మరియొక దానవాంగన తన కుమారుని తీసికొని అగ్నికడకు పోయి హుతాశనునిట్లు ప్రార్థించెను: పావకా! నేనెంతో దుఃఖముతో ఈ బాలుని కని పెంచితిని; వీడు పసివాడు; నీకు కుమారస్వామి ఎట్లు ప్రీతి పాత్రుడో వీడు నాకును అట్లే; వీనిని తీసికొనిపోవలదు. అని ప్రార్థించెను. ఇంకొక దానవ స్త్రీ ప్రియుని కౌగిలించుకొనియుండి అతనిని విడువలేక బాధపడుచునే తన ఆభరణములు ధ్వని చేయుచుండ సముద్ర

జలములలో పడిపోయెను. అగ్ని చుట్టుకొనగా ఏమియు చేయలేక దాసపత్రీలు అమ్మా! కొడుకా! నాయనా! మామా! అని ఏడ్చుచుండిరి. కొండలపై మండెడు అగ్ని అచటనున్న తామరకొలకులను కాల్చినట్లు త్రిపురముక్రమ్మిన శివశరాగ్ని స్త్రీ పద్మాకరమును కాల్చివేసెను. ప్రభాత సమయమున మంచు బిందువుల రాసుల సరస్సులందలి పద్మములను దహించి (పాడుచేసి)నట్లు ఆ అగ్నియు స్త్రీజనపు ముఖనేత్ర పద్మములను దహించెను.

శరాగ్నితాపా త్సమభిద్రుతానాం సర్వాఙ్గనానా మతికోమలానామ్ ।
బభూవ కాఞ్చీగుణనూపురాణా మాక్రన్ద ఆసాంచ తదాతిమిశ్రమ్. 28
దగ్ధార్ధచన్ద్రాణి సతోరణాని విస్తీర్ణహర్మ్యాణి సవేదికాని ।
దగ్ధానిదగ్ధాని గృహాణి తత్ర పతన్తి త్రాణార్థమివార్ణవౌఘే. 29
గృహైః పతద్భి ర్జ్వలనావలీఢై రసౌ సముద్రే సలిలం ప్రతప్తమ్ ।
కుపుత్రదోషైః ప్రవతన్విరుద్ధం యథా కులం యాతి ధనాన్వితస్య. 30
గృహైః ప్రతప్తైః క్వథితం సమన్తా త్తదార్ణవే తోయ ముదీర్ణవేగే ।
విత్రాసయామాస తిమీ న్ససక్రాం స్తిమిఙ్గిలాం స్తత్క్వథితం తథాన్యాన్. 31
దగ్ధః పురో మన్దరపాదకల్పః ప్రాకారవర్గ స్త్రిపురే పపాత ।
తైరేవసార్ధం భవనైః పపాత శబ్దం మహాన్తం జనయ త్సముద్రే. 32
సహస్రశృఙ్గై ర్భవనై ర్యదాసీ త్సహస్రశృఙ్గైస్సఇవాచలేన్ద్రః ।
నామావశేషం త్రిపురం ప్రజజ్ఞే హుతాశనాహారబలిప్రయుక్తః. 33
ప్రదహ్యమానేన పురేణ తేన దహ త్సపాతాళదివం ప్రతప్తమ్ ।
దుఃఖం మహత్ప్రాప్య జలావమగ్నం యస్మిన్గృహే సంగతవా న్మయోఽసౌ. 34
శ్రుత్వా తతశ్చ దేవేశో ఇన్ద్రోవజ్రధర స్తథా । శశాప తం గృహం చైవ మయంచ దితినన్దనమ్. 35
అసేవ్య మప్రతిష్ఠంచ భయేనచ సమావృతమ్ । భవిష్యతే మయగృహం నిత్యమేవ యథాఽనలః. 36
యస్యయస్యచ దేశస్య భవిష్యతి పరాభవః । ద్రక్ష్యన్తి త్రైపురం ఖణ్డం తత్త్రైకం నాశగా జనాః. 37

శరాగ్ని తాపమునకు తట్టుకొనలేక అటునిటు పరుగెత్తుచున్న అతి కోమలలగు త్రిపుర నగర స్త్రీల ఒడ్డాణములు అందెలు మొదలగు ఆభరణముల ధ్వనులును ఏడుపుల ధ్వనులును సమ్మిశ్రితమై వినబడుచుండెను. అర్ధ చంద్ర నిర్మాణములతో తోరణ (మహాద్వార)ములతో వేదికలతో కూడి విస్తీర్ణహర్మ్యములు నిరంతరముగ దగ్ధమగుచు అగ్నినుండి రక్షణ కొరకేమో అనునట్లు సముద్ర జలములో పడిపోవుచుండెను. అగ్ని జ్వాలలు చుట్టుకొనగా మండుచు పడుచున్న గృహములతో సముద్రజలము దుష్పుత్రుని దోషములచే సంతాపించి లోక విరోధమును పొందు వంశమువలె ఉడికిపోవుచుండెను. అట్లు ఉడికిపోవు సముద్రజలము తనయందలి తిమి తిమింగిల నక్రాది జల జంతువులకును చాల బాధ కలిగించుచు వాటిని ఉడికించుచుండెను. చూచుచు చూచుచుండగనే ఆ త్రిపుర ప్రాకారవర్గము మందర పర్వత పాదమువలె దగ్ధమయి పోగా భవనములును దగ్ధములయి సముద్రమున కూలగా వాటితోపాటే తానును మహాధ్వని చేయుచు సముద్రమున పడిపోయెను. సహస్ర శిఖరములుకల పర్వతమువలెనే సహస్ర గోపురములుగల భవనములు దగ్ధములు కాగా హుతాశనునకు బలిగా అర్పించిన హవిస్సువలె త్రిపురము నామావ శేషమయ్యెను. ఆ త్రిపురదుర్గమట్లు ప్రదహ్యమానమయి నశించుచుండగా భూలోకమేకాక పాతాళ ద్యులోకములు కూడ ప్రతప్తమయ్యెను. అంతలో మయుడు దాగియున్న గృహము మహాదుఃఖమునందుచున్న మయునితో కూడ సముద్రజలములలో (కాలకయే) పడిపోయెను.

ఈ విషయము విని వజ్రధరుడగు ఇంద్రుడు ఆ మయ గృహమును మయుని కూడ ఇట్లు శపించెను: "ఇక మీదట ఈ మయ గృహము నిరంతరమును నిలుకడ లేనిదియు ఎవరును ఆశ్రయించరానిదియు అగ్నివలె భయముతో నిండినదియు అగును. ఏఏ దేశమునకు ఎచ్చటెచ్చట పరాభవము (ఓటమి కాని కరవు మొదలగు ఉపద్రవములు కాని) సంభవించునో అచ్చట నెల్ల ఆ ఉపద్రవము వలన నాశము పొలగుచు జనులు ఈ త్రిపురదుర్గ ఖండమును మయ గృహమును చూడగలరు (అనగా ఈ ఉపద్రవముల పాలయిన దేశభాగమే మయగృహము.)

తదేత దద్యాపి గృహం మయస్యామయవర్జితమ్ ।
సౌఖ్యం సమాప్నుతే భూయో మయోఽసౌ స్వగృహే పరమ్. 38
ఋషయః : భగవన్స మయో యేన గృహేణ ప్రవలాయితః ।
తస్య నో గతి మాఖ్యాహి మయస్య తపసోద్భవమ్. 39
సూతః : దృశ్యతే దృశ్యతే యత్ర ధ్రువ స్తత్ర మయో మహాన్ ।
దేవద్విట్తు మయశ్చాతః స తదోద్విగ్నమానసః. 40
తతోఽన్యత్ర శిలావేశ్మ త్రాణార్థం వై చకార సః । తత్రాపి దేవా యాన్యన్తి మయ మాసురముత్తమమ్.41
తదాఽశక్త స్తతో గంతుం తచ్చైకం పుర ముత్తమమ్ ।
శివః సృష్ట్వా గృహం ప్రాదా న్మయాయాచ గృహార్థినే.42
విరరామ సహస్రాక్షః పూజితశ్చ వ్రతావహాన్ । పూజయన్తశ్చ భూతేశం సర్వే తుష్టుపురీశ్వరమ్. 43
సంపూజ్యమాన స్త్రిదశై స్స దేవ స్సమీక్షమాణై ర్గణనాయకైశ్చ. 43a
హర్షా ద్ద్వవల్గు ర్జగృహుశ్చ దేవా జగుశ్చ గీతం త్రిపురావదానమ్ ।
ననర్తు రుచ్చైశ్చ విభక్తహస్తాః పితామహోఽవన్దత తం మహేశ్వరమ్. 44
ప్రగృహ్య చాపం విససర్జ భూత్యా రథా త్సముత్ప్లుత్య సురాం స్త్రిలోచనః. 44a
ఏవం తత్త్రిపురం దుర్గం దైవతై స్సుదురాసదమ్ । హరేషైకేషుణా దగ్ధం విక్షిప్తం మకరాలయే. 45
యఇదం రుద్రవిజయం పఠతే విజయావహమ్ । విజయం తస్య సఙ్గ్రామే దిశతే స వృషధ్వజః. 46
పితౄణాంచ నివాపేతు యఇదం శ్రావయిష్యతి । ఇదం స్వస్త్యయనం పుణ్యం ఇదం పుంసవనం మహత్.
ఇదం శ్రుత్వా పఠిత్వాతు రుద్రలోకే మహీయతే । అనంతం తస్య పుణ్యం స్యా త్సర్వయజ్ఞఫలప్రదమ్.47

ఇతి శ్రీమత్స్యమహాపురాణే త్రిపురోపాఖ్యానే త్రిపురదాహే
త్రిపురసంహారసమాప్తికథనం నామ
ఏకోనచత్వారింశదుత్తర శతతమోఽధ్యాయః.

ఇట్లు జనులకు భయహేతువగు ఈ మయగృహము మాత్రము ఈ నాటికిని ఏ కీడును పొందక యున్నది. దానియందు ఆ స్వగృహమందు మయుడు కూడ సుఖము ననుభవించుచునే యున్నాడు.

అన విని ఋషులు సూతునితో ఇట్లనిరి: సూత భగవన్! మయుడు ఏ గృహముతో పారిపోయెనో ఆమయ గృహము గతి ఏమయినది? అది తపశ్శక్తిచే సిద్ధించినది కదా! అనగా సూతు డిట్లనెను: ధ్రువు డెచ్చట ఎంతవరకు కన బడుచుండునో అంతవరకును అచ్చట నెల్ల మయుడు కనబడుచునే యుండును. ఇది ఎట్లు జరిగె ననగా చెప్పెద వినుడు:

దేవ శత్రువగు మయుడు ఆనాటి త్రిపుర దాహము చూచి భయోద్వేగములతో నిండిన మనస్సుతో కూడి దాని నుండి ఎక్కడకును పోలేకయుండగా శివుడు అతనికి నిర్భయమగు ఇల్లొకటియే ఒక పురముగా సృష్టించుకొనునట్లు (మ. పు. 67).

స్పృహార్హ్మియగు మయునకు వరముగా ఇచ్చెను. దాని ప్రభావమున వాడు వేరొకచోట శిలామయమగు గృహము నిర్మించుకొనెను. అచ్చటకు కూడ దేవతలు అసురోత్తముడగు మయాసురుని చూడ పోవుచుండురు.

ఇట్లు శివుడు మయుని విషయమున అనుగ్రహము చూపుట చూచి ఇంద్రుడును తానెంత ప్రతాపవంతుడయ్యు మయునిపై పగ చూపుట మానెను. అందులకు మెచ్చి ఎల్లరును ఇంద్రుని ప్రశంసించిరి. దేవత లందరును భూతనాథుడగు ఈశ్వరుని స్తుతించిరి. ఇది చూచుచున్న దేవత లందరును ప్రమథ గణాధిపతులును ఈశ్వరుని సంపూజించిరి. సంతోషముతో దేవతలు గంతులు వైచిరి. ఒకరినొకరు పట్టుకొనిరి. త్రిపురావదానమును (వీరకృత్యమును) గీతములుగా రచించి గానము చేసిరి. చేతులు నృత్య సంబంధి ముద్రలుగా విభజించి (ముద్రా ప్రదర్శన పూర్వకముగా) గొప్పగా నృత్యములు చేసిరి. బ్రహ్మదేవుడును పరమేశ్వరుని నమస్కరించెను. పరమేశ్వరుడును రథమునుండి తన ధనువును తీసికొని దానినుండి క్రిందికి దుమికి దేవతలకు వీడ్కొలిచ్చి పంపెను.

ఈ విధముగా ఎవరికిని చేరుటకైన అలవి కాని త్రిపురదుర్గమును హరుడు ఒకే ఒక బాణముతో దగ్ధ మొనర్చి సముద్రములో పడవేసెను.

ఈ రుద్ర విజయమును పఠించిన-వినిన-వారికి వృషభ ధ్వజుడగు శివుడు యుద్ధ విజయము కలిగించును.

దీనిని పితృశ్రాద్ధ తర్పణాదికృత్యముల సమయమున వినిపించిన ఎడల సర్వ యజ్ఞము లాచరించినంతగా అనంతపుణ్యము లభించును. ఇది స్వస్త్యయన(శుభమును కలిగించు)కర్మలలో ఉత్తమము; పుణ్యకరమయినది; పుంసవన కర్మముతో సమాన మయినది; దీనిని విన్నను చదివినను రుద్రలోకప్రాప్తి యగును.

ఇది శ్రీమత్స్య మహాపురాణమున త్రిపురోపాఖ్యాన సమాప్తి యను నూట ముప్పది తొమ్మిదవ అధ్యాయము.

## చత్వారింశదుత్తరశతతమోఽధ్యాయః.

## అమావాస్యాకాలనిర్ణయ-ఐలకృతపితృతృప్త్యాదినిర్ణయశ్చ.

ఋషయః : కథం గచ్ఛత్యమావాస్యాం మాసిమాసి దివం నృపః ।
ఐళః పురూరవా స్సూత తర్పయేచ్ఛ కథం పితౄన్. 1
ఏత దిచ్ఛామహే శ్రోతుం ప్రభావం తస్య ధీమతః । సూతః : ఏతదేవతుపప్రచ్ఛమనుస్సమధుసూదనమ్. 2
సూర్యపుత్రాయ చోవాచ యథా తన్మే నిబోధత ।
శ్రీమత్స్యః : తస్య చాహం ప్రవక్ష్యామి ప్రభావం విస్తరేణతు. 3
ఐళస్య దివి సంయోగం సోమేన సహ ధీమతా। సోమాచ్చైవామృతప్రాప్తిః పితౄణాం తర్పణం తథా.
సో(సౌ)మ్యా బర్హిషదః కావ్యా అగ్నిష్వాత్తా స్తథైవచ । యదా చన్ద్రశ్చ సూర్యశ్చ నక్షత్రేణ సమాగతౌ. 5
అమావాస్యా న్నివసత ఏకరాత్రైకమణ్డలే । తదా స గచ్ఛతి ద్రష్టుం దివాకరనిశాకరౌ. 6
అమావాస్యాంచ దివసే మాతామహపితామహౌ । అభివాద్యతు తౌ తత్ర కాలాపేక్షః స తిష్ఠతి. 7
అస్కన్దమాన స్సోమాద్యం పిత్రర్థే స పరిశ్రమాత్ । ఐళః పురూరవా విద్వానమాశ్రాద్ధచికీర్షయా. 8
తత స్స దివి సోమంవై హ్యుపతస్థే పితౄనపి । ద్విలవంచ కుహూమాత్రం తావుభౌచ నిధాయ సః. 9
సినీవ్రమాణా స్వల్పాతు కుహూమాత్ర ముపాసతే । కుహూమాత్రబలో(లవో)ద్దేశం జ్ఞాత్వా కుహూ ముపాసతే.
తముపాస్య సదా సోమకాలాపేక్షీ ప్రతీక్షతే।సుధాఽమృతంతు సోమాద్వై పస(స్రవ)న్తం తస్య తృప్తయే. 11
దశభిః పఞ్చభిశ్చైవ సుధామృతపరిస్రవైః । కృష్ణపక్షభుజాం ప్రీతి రుహ్యతే పరమాంశుభిః. 12
సద్యోఽభిక్షరతా తేన సౌమ్యేన మధునాచ సా । నివాపేష్వథ దత్తేషు పిత్ర్యేణ విధినాతు వై. 13
సుధామృతేన సౌమ్యేన తర్పయామాసవై పితౄన్ । సౌమ్యా బర్హిషదః కావ్యా అగ్నిష్వాత్తా స్తథైవచ. 14

## నూట నలువదవ అధ్యాయము.

## అమావాస్యాకాల నిర్ణయము-ఐలుడు పితరులను తృప్తుల జేయుట.

ఇలా పుత్త్రిడగు పురూరవసుడు ప్రతి మాసమున అమావాస్యనాడు స్వర్గమునకేగి తన పితరులకు తృప్తి చేయు విధము తెలుపుమని ఋషులు సూతునడిగిరి. పూర్వము మనువు ఇదే ప్రశ్న మడుగగా పిత్స్వారాయణుపతనికి ఈ విషయమును పురూరవసుని ప్రభావమును చెప్పెను. అదియే నేనిపుడు మీకు తెలిపెదనని సూతుడు ఋషులకిట్లు చెప్పనారంభించెను. పురూరవసుడు ప్రతి మాసమున స్వర్గమునకేగి సోమునితో కూడి అతని నుండి అమృతమును సంపాదించి తన పితరులకు తృప్తి కలిగించును. అతనిచే తృప్తినందు పితరులు (సౌమ్యులు) బర్హిషదులు కావ్యులు అగ్నిష్వాత్తులునను వర్గములవారు. అమావాస్యనాడు స్వర్గమున సూర్యచంద్రులిద్దరు ఒకేరాత్రి ఒకే నక్షత్రమున ఒకటిగా ఏకమండలము(భాగ)లో కూడియుండు సమయమున పురూరవసుడుపోయి సూర్యచంద్రులను దర్శించును. అట్టి అమావాస్యనాడతడు స్వర్గమునకేగి తన మాతామహులు పితామహులు నగు రవి చంద్రులను దర్శించి నమస్కరించి తగిన సమయమున కెదురు చూచుచుండును. అతడు సోమునినుండి క్షణముకూడ ఎటు కదలక తన పితరుల తృప్తివరచుటకై పరిశ్రమము చేయుచుండును. అతడు శాస్త్రమును సంప్రదాయమును ఎరిగిన విద్వాంసుడు కావున అమావాస్యనాడు తన పితరులకు శ్రాద్ధము చేయగోరి తన పితరులను సోమునికూడ ఇట్లు సేవించును. అమావాస్యనాడు చంద్రరేఖ కొంచెమైన కనబడుచో అది 'సినీవాలీ'-కనబడనిచో అది 'కుహూ'-అనబడును. పురూరవసుడు 'సినీవాలి'ని విడిచి 'కుహూ' యందలి బలముకల ద్విలవ పరిమాణ పర్వసంధి కాలమునకై కనిపెట్టుకొనియుండును. ఆ సమయమున సోమునినుండి లభించు సుధ పితరులకు తృప్తి కలిగించునుకదా! ఏలయన కృష్ణపక్షమున చంద్రునినుండి లభించు పదునైదు పరిస్రవముల (ప్రవాహ భేదముల)తో కూడిన చంద్రుని ఉత్తమ కిరణములతో పితరులకు తృప్తి కలుగును. అది ఎరిగిన పురూరవసుడు సోమునినుండి అమావాస్యనాడు కుహూ క్షణములందు లభించు అమృతము స్రవించుచుండగనే దానిని తానందుకొని తన పితరులకందించి తృప్తిపొందించుచుండును. దీనిచే తృప్తి నొందుదురని తెలిపిన సౌమ్యులు అగు బర్హిషదులు కావ్యులు అగ్నిష్వాత్తులునను పితృవర్గముల విషయము తెలిపెదను.

(వివరణము: 1. ఇచట 'ఐలః పురూరవాః' అని చెప్పబడినది. అనగా 'ఇలా పుత్త్రిడగు పురూరవసుడు' అని అర్థము. తరువాత 'అతడు మాతామహ పితామహులను అమావాస్యనాడు దర్శించును.' అనియు చెప్పబడినది. ఆ తిథి సూర్యచంద్రులు సంగమించు ఒకే భాగ (Degree) యందు ఉండు తిథి. ఆనాడు అతడు వారికడకు పోవును. తన మాతామహ పితామహులను దర్శించును. అనగా సూర్యచంద్ర వంశీయులగు తన పెద్దలను సూర్యచంద్రుల తాత్త్విక మగు దేవతాత్మక రూపమును కూడ దర్శించును. వారందరును పురూరవసునకు మాతామహులును-పితామహులును; ఎట్లన——పురూరవసుని తల్లియగు ఇల-తాను స్త్రీత్వమును పొందుటకు ముందు ఇలుడు-అను సూర్యవంశ్య రాజు కదా! కావున అంతకు పైతరముల సూర్యవంశ్యులును సూర్యుడును అతనికి మాతామహ పక్షములోనివారు. తన తండ్రియగు బుధుడును అతని తండ్రియగు చంద్రుడును ఇతనికి పితృపితామహులు.

2. పితరులు 'సౌమ్యులు' అనబడుదురు. ఎట్లన సోముని (చంద్రుని) నుండి లభించు అమృత పరిస్రవముతో వారు ఆప్యాయితులు- రసపానముచే తృప్తినందినవారు- అగుచున్నారు. కనుక సోముడు పితరులకు 'ఆప్యాయయితా.' 'సంతృప్తినందించువాడు.' కావున-'సోమః ఆప్యాయయితా ఏషాం-ఇతి-సౌమ్యాః.' 'సోముడు వీరికి ఆప్యాయనము కలిగించువాడుగా నున్నాడు కావున 'సౌమ్యులు' అని పితృదేవతలకు వ్యవహారము సముచితమగును.

3. పితరులు అగ్నిష్వాత్తులు-బర్హిషదులు-కావ్యులు-అని మూడు వర్గముల వారుగా ఈ అధ్యాయమున చెప్పబడినారు. కాని-లోగడ 13-14-15 అధ్యాయములలో పితరులు-అమూర్తిమంతులు 1. వైరాజులు 2. అగ్నిష్వాత్తులు

3. బర్హిషదులు అను మూడు వర్గములవారు; మూర్తిమంతులు-1. సుకాలినులు 2. హవిష్మంతులు 3. ఆజ్యపులు 4. సోమపులు అను నాలుగు వర్గములవారు; ఇట్లు వారు మొత్తము ఏడు వర్గములవారు. అని చెప్పబడినది. దీని సమన్వయమును ఆలోచించవలయును.

అమూర్తిమంతులలో 1. వైరాజులును 2. అగ్నిష్వాత్తులును దేవతలకు ఆరాధ్యులగు పితరులు. కావున వీరిని ఇద్దరను అగ్నిష్వాత్తులు అను ఒకే వర్గముగా ఈ అధ్యాయమున గ్రహించినారు. 3. బర్హిషదులు అను వర్గపు పితరులు దానవాదులకు ఆరాధ్యులు. కావున వీరినికూడ ఇచట వేరుగ గ్రహించినారు. మిగిలిన నాలుగు మూర్తి మద్వర్గములవారును మానవులలో నాలుగు వర్ణములవారిచే ఆరాధింపబడుచు వారిచే కవ్యములను-పితరులకు అందించు ఆహారాదికమును-అందుకొందురు. కావున-కావ్యులు అనబడుదురు. ఇట్లు లోగడ తెలిపిన ఏడు వర్గముల పితరులును ఇచట మూడు వర్గములలోనికి వచ్చినారు.)

ఋతురగ్ని స్స్మృతో విప్రై ర్ఋతు స్సంవత్సరం విదుః । జజ్ఞిరే ఋతవ స్తస్మాత్పితరోహ్యార్తవాఽభవన్.
పితరోఽర్ధమాసా జజ్ఞే(జ్ఞిరే)వై యేచతే ఋతుసూనవః। పితామహాశ్చ సు(ఋ)తవో మాసాయేహ్యష్టసూనవః.
ప్రపితామహా స్స్మృతా దేవాః పఞ్చాబ్దా బ్రహ్మణస్సుతాః ।
(కావ్యా)సౌమ్యా బర్హిషదశ్చైవ అగ్నిష్వాత్తాశ్చ తేత్రిధా. 17
గృహస్థా యేతు యజ్వానో హవిర్యజ్ఞార్తవాశ్చ యే । స్మృతా బర్హిషద స్తేవై పురాణే నిశ్చయంగతాః 18
గృహమేధినశ్చ యజ్వానో అగ్నిష్వాత్తా ర్తవా స్మృతాః। అష్టకాపతయః కావ్యాః పఞ్చహ్యబ్దాని చోచ్చ(ఋ)త.
తేషు సంవత్సరో హ్యగ్ని స్సూర్యస్తు పరివత్సరః । సోమ స్త్విద్వత్సరశ్చైవ వాయుశ్చైవానువత్సరః. 20
రుద్రస్తు వత్సరస్తేషాంపఞ్చాబ్దా యే యుగాత్మకాః । కాలేనాధిష్ఠిత స్తేషాం చన్ద్రమాః స్రవతే సుధామ్. 21
ఏతే స్మృతా దేవకృత్యా స్సోమపాశ్చోష్మపాశ్చయే । తాంస్తేన తర్పయామాస యావదాసీ త్పురూరవాః.22
యస్మా త్ప్రసూయతే సోమో మాసిమాసి విశేషతః ।
తత స్సుధామృతం తద్వై పితౄణాం సోమపాయినామ్. 23
ఏత త్తదమృతం సోమ స్సుధాచ మధు చైవహి । తతః పీతసుధం సోమం సూర్యోఽసౌ వేకరశ్మినా. 24
యుగాన్తరోదితే చైవ చన్ద్రరేఖోపరి స్థితే । ఆప్యాయయతి ససుధం సోమంతు సోమపాయినమ్. 25
నిశ్శేషావై కలాః పూర్వా యుగపద్ వ్యాప్యతే పురా । సుషుమ్నాప్యాయమానస్య భాగంభాగ మహఃక్రమాత్.
దేవైః పీతసుధం సోమం పురా పశ్చా త్పిబే ద్రవిః । పీతం పఞ్చదశాహంతు రశ్మినైకేన భాస్కరః. 27
ఆప్యాయ్య ససుషుమ్నేన భాగంభాగ మహఃక్రమాత్। సుషుమ్నాఽఽప్యాయమానస్య శుక్లే వర్ధన్తి వై కలాః.
తస్మాద్ధ్రసన్తివై కృష్ణా శ్శుక్లా హ్యాప్యాయయన్తిచ । ఏవం సా సూర్యవీర్యేణ చన్ద్రస్యాప్యాయితా తనుః.
పౌర్ణమాస్యాం స దృశ్యేత శుక్ల స్సమ్పూర్ణమణ్డలః । ఏవ మాప్యాయిత స్సోమః క్షీయతేచ పునఃపునః. 30
సమృద్ధిరేవ సోమస్య పక్షయో శ్శుక్లకృష్ణయోః । ఇత్యేష పితృమాన్సోమ స్స్మృత స్తద్వ త్సుధాత్మకః.31
కాన్తః పఞ్చదశై స్సార్ధం సుధామృతపరిస్రవైః ।

విప్రులు-వేదములచే ప్రతిపాదింపబడిన సకల విషయములను తాత్త్వికముగా ఎరిగినవారు-అగ్నిని 'ఋతువు' అని వ్యవహరింతురు. వారే సంవత్సరమును కూడ ఋతువు అనియే తలంచుచున్నారు. (కావున సంవత్సరావయవము లగు పక్షములు-మాసములు-రెండేసి మాసములతో ఏర్పడు కాలపరిమాణము-అయనములు-కూడ 'ఋతువు' అనదగి యున్నవి.) పితరులు ఋతువులనుండి జనించినవారు కావున వారికి 'ఆర్తవులు' అనియు సంప్రదాయమునందు వ్యవహారము. పితృ-పితామహ-ప్రపితామహులు అను మూడు తరములకు చెందిన పితరులకు అభిమాని దేవతలగు పితృ

దేవతలలో-పితృశ్రేణికి చెందినవారు సంవత్సరావయవములగు పక్షములనుండి జనించినారు. పితామహ శ్రేణికి చెందిన పితృదేవతలు 'అష్టకలు' అనబడు పర్వకాలముతో కూడిన మాసము అనెడు సంవత్సరావయవములనుండి జన్మించినవారు. ప్రపితామహ శ్రేణికి చెందిన పితృదేవతలు పంచాబ్ద (పంచ సంవత్సరా)త్మకుడగు బ్రహ్మాపు ప్రజాపతికి కుమారులు.

సౌమ్యులు అను సామాన్య నామముకల 1. కావ్యులు 2. బర్హిషదులు 3. అగ్నిష్వాత్తులు అను మూడు వర్గముల పితరులు పైని పేర్కొనబడినారుగదా: వారి స్వరూపము చెప్పబడుచున్నది.

'గృహస్థులుగానుండి హవిర్యజ్ఞములతో ఋతురూప (సంవత్సరాత్మక) ప్రజాపతిని యజించిన యజ్వలగు మహాత్ములు 'బర్హిషదులు' అను వర్గమునకు చెంది అమూర్త పితృదేవతలు అని శాస్త్రములందు స్మరింపబడుచున్నారు.' అని ఈపురాణమునందు గడచిన అధ్యాయములందు ఈ శబ్దపు నిర్వచనముతో కూడ నిశ్చయింపబడియున్నది. ఇదే విధముగ యజ్వలుగా నుండిన గృహమేధులే అగ్నిష్వాత్తులనబడు అమూర్త పితృదేవతా వర్గమువారు కూడను. 'అష్టకలు' మొదలగు పర్వదినములందు మానవులలో చతుర్వర్ణులచే జరుపబడు శ్రాద్ధములను అనుభవించుచు వాటికి పతులుగా-అధిష్ఠాతలుగా-ఉండు మూర్త పితృదేవతా వర్గముల సమష్టియగు వారు కావ్యులు.

ఇక ఇపుడు ప్రపితామహ శ్రేణికి చెందిన పితరులకు జన్మహేతువగు ప్రజాపతి రూప పంచాబ్ద (పంచ సంవత్సర) స్వరూపమును తెలిపెదను; వినుడు. ★పంచ సంవత్సరాత్మకమగు యుగమునకు అవయవములగు ఐదు అబ్దములను వివరింతును. వానిలో మొదటిదగు 1. 'సంవత్సరము' అగ్నిదేవతాత్మకము. 2. రెండవదియగు 'పరివత్సరము' సూర్యదేవతా రూపము 3. మూడవదియగు 'ఇద్వత్సరము' సోమాత్మకము 4. నాలుగవదియగు 'అను వత్సరము' వాయుదేవతాత్మకము 5. ఐదవదియగు 'వత్సరము' రుద్ర దేవతాత్మకము. ఈ ఐదింటితో ఏర్పడినదగు పంచ సంవత్సరమయ 'యుగము' సాక్షాత్ కాలాత్మక ప్రజాపతియే.

ఇట్లు సోముడు ప్రతి మాసమునందును చంద్రుడు విశేష రూపమున స్రవించు అమృతము సోముని నుండి లభించు స్వధామృతమును మాత్రమే అనుభవించుటచే తృప్తినందు పితరులకు ఆహారమగుచున్నది. దానిచేతనే వారికి సోమపులనియు వ్యవహారము. ఈ సోమామృతమునకు అమృతమనియు సోమమనియు మధువనియు పేరులు కలవు. పితరులు సోమపానము చేసిన తరువాత అమృత శూన్యుడై పోయిన చంద్రుని సూర్యుడు తన సుషుమ్నయను కిరణముతో మరల పూరించును. ఇట్లు దినదిన క్రమమున చంద్రుని 'కల'లన్నియు శుక్లపక్షమున పూర్ణములగుచు పోషించుండును. కృష్ణపక్షమున క్షీణములగుచు పోవును. ఈ చెప్పిన విధమున చంద్రుని శరీరము సూర్యుని తేజముతో నింపబడుచుండును. క్రమవృద్ధితో పూర్ణిమాతిథినాడు చంద్ర మండలము షోడశ కళలతో నిండి అతడు సంపూర్ణమండలుడై యుండును. ఇచట ఇదియొక చమత్కారము: ఏమన-కృష్ణపక్షమున పితరులు చంద్రుని పానము చేయు క్రమముగా శుక్లపక్షమున ప్రతిపదాదిగా రవియు చంద్ర మండలమును పానము చేయును. వ్యాపించును; పానము అనగా ఇచట ఈ రెండర్థములు సంప్రదాయమున వచ్చినవి.) ఇదే విధముగా శుక్లపక్షమునందును కృష్ణపక్షమునందును చంద్రుడు వృద్ధినొందుచునే యుండును. ఇచట వృద్ధియను మాటకు గూడ రెండర్థములు - శరీరము పెరియుట ఒక విధమగు వృద్ధి-తాను అమృతము నిచ్చి పితరులకు శరీరపుష్టి కలిగించుట మరియొక విధమగు వృద్ధి. వృద్ధి = శుభము. ఈ కారణములతోనే సోమునకు 'పితృమాన్-పితరులు కలవాడు (పితరులను పోషించువాడు)' అనియు 'సుధాత్మకుడు (అమృతము తన ఆత్మ-దేహము-గా కలవాడు)' అనియు పేరులు కలిగినవి. అతడిట్లు తననుండి స్రవించు అమృత ప్రవాహముతో పంచదశ తిథులందును కాంతుడు-

---

★ సంవత్సరారంభ దినమున (చైత్ర శుక్ల పాడ్యమినాడు) సూర్యుడు ఏదేని రాశిలో (లేదా మేషరాశిలో) ప్రవేశించిన ఏడు-1. సంవత్సరము-దాని తరువాత వచ్చు నాలుగు ఏడులను వరుసగా పరివత్సరము ఇద్వత్సరము అనువత్సరము వత్సరము అందురు. ఇట్టి ఐదేండ్లు కలిసి యుగమనబడును. ఈ ఐదేండ్లకును వ్యష్టిగా దేవతలు ఇచట చెప్పబడినారు. యుగమునకు అంతటికిని సమష్టిగా ప్రజాపతి అధిపతి అని 'పంచ సంవత్సరమయయు గాధ్యక్షం ప్రజాపతిమ్' అని వేదాంగ జ్యోతిషమున చెప్పబడినది.

చూచువారికి ఇంపు కలిగించువాడు-గానే యుండును. (శుక్లపక్షమున ముందలము పూర్ణమగుచుండుటచేత మానవులకును-తమకు ఇతని నుండి అమృతము లభించును గదాయని పితరులకును-చంద్రుడు ఇంపు గొలుపును. అట్లే కృష్ణపక్షమున పితరులకు అతడు చేసిన ఉపకారమును బట్టి మానవులకును పితరులకును చంద్రుని చూడగానే ఆనందము కలుగును.)

అతఃపరం ప్రవక్ష్యామి పర్వణాం సంధయశ్చ యే. 32
యథా గ్రన్థిభిః పర్వాణి ఆవృతానీక్షువేణునామ్ । తథార్ధమాసా స్తస్యర్తుశుక్లకృష్ణాస్తు వై స్మృతాః. 33
పూర్ణమాసస్య యో భేదే గ్రన్థయ స్సన్ధయ స్తథా । అర్ధమాసస్య పర్వాణి ద్వితీయాప్రభృతీనిచ. 34
అగ్న్యాధాన క్రియా స్తస్మా త్క్రియన్తే పర్వసన్ధిషు । తస్మాత్తు పర్వణోహ్యాదౌ ప్రతిపద్యాదిసన్ధిషు. 35
సాయాహ్నే హ్యనుమత్యా యద్ద్వౌలవౌ కాల ఉచ్యతే । లవౌ ద్వావేవ కాలో యః కాలో జ్ఞేయోఽపరాహ్ణికః.
ప్రకృతిః కృష్ణపక్షస్య కాలేఽఽపన్నేఽపరాహ్ణికే । సాయాహ్నే ప్రతిపత్తశ్చ సకాలః పౌర్ణమాసకః. 37
వ్యతీపాతే స్థితే సూర్యే లేఖామూర్ధ్వం యుగాన్తరే । యుగాన్తరోదితే చైవ చన్ద్రేలేఖోపరిస్థితే. 38
పూర్ణమాసావ్యతీపాతౌ యదా పశ్యే త్పరస్పరమ్ । యావన్తౌతు వ్యతీపాతే యస్మిన్కాలే వ్యవస్థితౌ. 39
తత్రైవ సూర్యముద్దిశ్య దృష్ట్వా సఙ్ఖ్యాతు మర్హసి । సవై వషట్క్రియాకాల ష్షష్ఠః కాలోఽభిధీయతే. 40
పూర్ణేన్దుః పూర్ణపక్షేతు రాత్రిసన్ధిషు పూర్ణిమా । తస్మా దాప్యాయతే సక్తం పూర్ణిమాస్యాం నిశాకరః ।
యథాఽన్యోన్యం వ్యతీపాతే పూర్ణిమాం ప్రేక్షతే దివా. 41
చన్ద్రాదిత్యోఽపరాహ్ణేతు పూర్ణత్వా త్పూర్ణిమా స్మృతా । యస్మాత్తా మనుమన్యన్తే పితరో దైవతైస్సహ.42
తస్మా దనుమతిర్నామ పూర్ణిమాఽప్రతిమా స్మృతా । అత్యర్థం రాజతే యస్మా త్పౌర్ణమాస్యాం నిశాకరః.
రఞ్జనాచ్చైవ చన్ద్రస్య రాకేతి కవయో విదుః । అమా-వసేతా- మృక్షేతు యదా చంద్రదివాకరౌ ।
ఏకా పంచదశీ రాత్రి రమావాస్యా తతః స్మృతా-
ఉద్దిశ్య తామమావాస్యాం యదా దర్శం సమాగతౌ । అన్యోన్యం చంద్రసూర్యౌతు దర్శనా ద్దర్శ ఉచ్యతే.
ద్వౌద్వౌ లవా వమావాస్యాం సకాలః పర్వసన్ధిషు । ద్వ్యక్షరః కుహూమాత్రశ్చ పర్వకాలస్తు న స్మృతః.45

ఇకమీదట పర్వ సంధుల విషయము తెలిపెదను. చెరకు గడలకును వెదురుగడలకును కలకణుపులకు ముడులు ఉన్నట్లే సంవత్సరమునకును అయనములు ఋతువులు మాసములు అర్ధ మాసములు తిథులు మొదలగునవియు కణుపులుగాను అ (పర్వముల) కణుపుల నడుమ వాటిని కలుపుచు నుండు సంధికాలము ఆ కణుపుల ముడులుగాను అమరి యున్నవి. పూర్ణ (శుక్ల) కృష్ణపక్షాత్మకమగు మాసమునకు శుక్ల కృష్ణ పక్షములు కణుపులును వాటి సంధి కాలములు(పూర్ణిమాఽమావాస్యలు) ముడులునైనట్లే పక్షములకును ప్రతిపత్ మొదలు పూర్ణిమామావాస్యల వరకుగల (విదియ మొదలగు) కాలము కణుపులును పూర్ణిమకును కృష్ణ ప్రతిపత్కును-అమావాస్యకును శుక్ల ప్రతిపత్కును నడుమగల కాలము గ్రంథులు (ముడులు)ను అగుచున్నవి. (వెదురు-చెరకు-మొదలగువాని యందు ముడులవలె నుండు కఠిన భాగము గ్రంథి-ఆ గ్రంథులకు రెంటికి నడుమ నుండు భాగము పర్వము[కణుపు]అని తెలియవలెను.) ఇట్టి పర్వముల సంధి కాలములందు అగ్న్యాధానము మొదలగు కర్మముల నాచరించవలయును. పూర్ణిమనాటి సాయాహ్నకాలమందలి రెండు లవముల కాలము 'అనుమతి' అదే నాటి అపరాహ్ణపు రెండు లవముల కాలము 'రాకా' అనబడును. కృష్ణ ప్రతిపత్‌నాటి అపరాహ్ణము గడచి సాయాహ్నము ఆరంభమగు సమయము పౌర్ణమాసేష్టికి సముచిత సమయము. ఏ పూర్ణిమనాడు రవి క్రాంతివృత్తమున సంపాతస్థానమందుండగా చంద్రుడు రవినుండి ఆరు రాసుల (180 భా.),దూరములో విషువద్వృత్త సంధిస్థానమునందుండి అతనిని చూచుచుండునో ఆ కాలమున కృష్ణ ప్రతిపత్ ఆరంభము కాకుండునంతలో సూర్యుని గతిని అనుసరించి గణన చేసి తెలిసికొనవలెను. సరిగా ఆ సమయము వషట్కార సహితమగు శ్రౌతస్మార్త సత్కర్మానుష్ఠానమునకు తగిన సమయము

దీనినే షష్ఠకాలము అనియు పిలుతురు, రవి కిరణములలో నొకటగు సుషుమ్నా కిరణముతో పూరింపబడుచుండు అమృతము కల చంద్రుడు పూర్ణిమనాటి అర్ధరాత్ర సమయమున నిండుగా అమృతము కలిగియుండును. అందుచే ఆ తిథికి 'పూర్ణిమా' 'నిండుదనము గలది' అని పేరు. ఆ అమృతముతోనే ఆనాడు చంద్రుడు ప్రాణులకును ఆప్యాయనము (పరితృప్తి) కలిగించును. ఆనాడు చంద్రుడును రవియును పగలు అపరాహ్ణ సమయమున క్రాంతి వృత్త విషువ వృత్తముల సంపాత ప్రదేశమందుండి పరస్పరము నిండు చూపుతో (పూర్ణ దృష్టితో) చూచుకొందురు అందుచే గూడ ఈ తిథికి పూర్ణిమా యని పేరు. ఇట్టి పూర్ణిమా తిథిని పితరులును దేవతలును అనుమతింతురు కావున దీనికి అనుమతి యనియు వ్యవహారము. ఈనాడు చంద్రుడు మిక్కిలిగా (మేర మీరి) రాజిల్లును కావునను ప్రాణులను అతడు రంజిల్ల (ఆనందింప) జేయును గావునను ఈ విధమగు పూర్ణిమకు 'రాకా' అనియు నామము. చంద్రసూర్యులు కలిసి (అమా-కలిసి) ఉండు తిథికి అమావాస్య (అమా-కూడి ఒకటిగా; వసతః-వసింతురు) అని వ్యవహారము. ఈ అమావాస్యనాడు చంద్రసూర్యులు ఒకేచోట కూడి దర్శనము ఇత్తురు. కావున ఈ తిథికి 'దర్శ' అనియు పేరు కలిగినది. పూర్ణిమా-కృష్ణ ప్రతిపత్‌లకు నడుమ కాని అమావాస్యా- శుక్ల ప్రతిపత్‌లకు నడుమ కాని ఉండు సంధికాలము రెండు లవముల పరిమాణముతో నుండును. ఇది కోకిల 'కుహూ' అని రెండక్షరములు పలికినంత కాలమే; కనుక అమావాస్యనాటి ఇట్టి పర్వ సంధికాలమును 'కుహూ' అందురు. (ఇది వింతగా కనబడు అర్థము. వాస్తవమున ఈ 'కుహూ' పదము 'గుహూ' పదమునుండి మారినది; అనగా చంద్రకళ పూర్తిగా మరుగుపడి కొంచెము కూడ ఆనాడు కనబడదని అర్థము.) ఇది శ్రౌత కర్మలకు తగిన పర్వకాలము.

దృష్టచన్ద్రా త్వమావాస్యా మధ్యాహ్నప్రభృతీహవై ।
దివా తదూర్ధ్వం రాత్ర్యాంతు సూర్యే ప్రాప్తేతు చన్ద్రమాః. 46
సూర్యేణ సహసోద్గచ్ఛే త్ప్రాతస్స్నానాత్తు వై తతః। సమాగమ్య లవౌ ద్వౌతు మధ్యాహ్నే న్నిపతద్రవిః.47
ప్రతిపచ్ఛుక్లపక్షస్య చన్ద్రమా స్సూర్యమణ్డలాత్ । నిర్ముచ్యమానయో ర్మధ్యే తయోర్మణ్డలయోస్తు వై. 48
తస్మా ద్దివాహ్యమావాస్యే గృహ్యతే యో దివాకరః। కుహేతి కోకిలే నోక్తం యస్మా త్కాల స్సమాప్యతే.49
తత్కాలసమ్మితా హ్యేషా అమావాస్యా కుహూ స్మృతా । సినీవాలీప్రమాణంతు క్షీణఏవ నిశాకరః. 50
అమావాస్యా విశత్యర్కం సినీవాలీ తదా స్మృతా । అనుమతిశ్చ రాకాచ సినీవాలీ కుహూ స్తథా. 51
ఏతాసాం ద్విలవః కాలః కుహూమాత్రా కుహూః స్మృతా । ఇత్యేష పర్వసన్ధీనాం కాలోవై ద్విలవ స్స్మృతః.
పర్వణాం తుల్యః కాలస్తు తుల్యాహుతివషట్క్రియా । చన్ద్రసూర్యవ్యతీపాతే సామవై పూర్ణిమే ఉభే. 53
ప్రతిపత్ప్రతిపన్నస్తు పర్వకాలో ద్విమాత్రకః । కాలః కుహూసినీవాల్యో సముద్రౌ ద్విలవ స్స్మృతః. 54
అర్కాగ్ని మణ్డలే సోమే సర్వకాల కలా స్సమాః । యస్మా దాపూర్యతే సోమః పఞ్చదశ్యాం తు పూర్ణిమా.
దశభిః పఞ్చభిశ్చైవ కలాభి ర్దివస క్రమాత్ । తస్మా త్పఞ్చదశే సోమకలా వై నాస్తి షోడశీ. 56
తస్మా త్సోమస్య విప్రోక్తా పఞ్చదశ్యాం మహాఃక్షయః । ఇత్యేతే పితరో దేవా స్సోమపా స్సోమవర్ధనాః. 57
ఆర్తవా ఋతవోఽబ్దా దేవాస్తాన్ భావయ న్తిహి । అతఃపరం ప్రవక్ష్యామి పితౄన్ శ్రాద్ధభుజస్తుచే. 58
శ్రాద్ధభో క్తృపితృనిర్ణయ- స్తద్గతినిర్ణయశ్చ.
తేషాం గతించ సత్త్వంవా ప్రాప్తిం శ్రాద్ధస్య చైవహి। న మృతానాం గతిశ్శక్యా జ్ఞాతుంవా పునరాగతిః.59

అమావాస్యనాడు వలెనే ఇతర తిథులందును పర్వ సంధికాలము రెండు లవముల పాటే యుండును. ఇదియు 'కుహూ' అను కోకిల కూతయంత కాలమే యగును. ఏనాడు మధ్యాహ్న సమయమున అమావాస్య ఆరంభమగునో ఆనాడు చంద్రునిలో మిగిలిన చంద్రు డుదయించవలసిన వేళకే అతనితో పాటు కలిసి సూర్యుడును ఉదయించుచుండును; కనుక చంద్రునిలో మిగిలిన ఒక కళ కూడ కనబడదు. కావున ఆ అమావాస్యను 'నష్టచంద్రా' 'చంద్రుడు కనబడనిది' అందురు. ఇదియే వాస్తవ

మయిన 'కుహూ' అగును. ఆ మరునాడు మధ్యాహ్న సమయము మీరక చంద్రుడు రవినుండి వేరుపడుట ఆరంభము అగును. అట్టి పర్వ సంధికాలము (అమావాస్య ముగిసి ప్రతిపత్ ఆరంభమగు సమయము) 'అన్వాహుతులు' అను శ్రౌత కర్మలకును 'దర్శ'యందు చేయదగిన వషట్కార (శ్రౌత)కర్మలకును సముచిత సమయము. ఇట్టి అమావాస్య నాటి పర్వ సమయమునకు 'ఋతుముఖ'మని వ్యవహారము. ఇట్లు ఆనాడు చంద్రుడు ఒక్క కళ కూడ బొత్తుగా కనబడకుండ పోవు ఆ అమావాస్య శుక్ల పక్షారంభమగు మధ్యాహ్న కాలము వరకు ఉండి ఆ సమయపు రవి అమావాస్యకు చెందిన రవిగా గ్రహింపబడును. కావున అది శ్రౌత కర్మానుష్ఠానమునకు ప్రశస్తకాలము. పర్వ (అమావాస్యా) శుక్ల ప్రతిపత్ సంధి కాలములో సరిగా రెండు లవముల (కోకిల 'కుహూ' అని పలుకునంత) కాలము సరియగు కుహూ అని గ్రహించవల యును. క్షీణించినంత క్షీణించినను మిగిలిన చంద్రకళ ఎంత సేపు కనబడునో అంతకాలము ఆ అమావాస్య 'సినీవాలీ' అనబడును. అట్టి అమావాస్యతో రవికి సంబంధ ముండుటచే ఆ తిథికి ఈ పేరు వచ్చినది. ('సిని' అనగా చంద్రుడు; అతనితో సంబంధము గల తిథి 'సినీవాలీ') ఈ విధముగా 'కుహూ' అను రెండక్షరముల ఉచ్చారణ కాలము అగు ద్వి లవముల కాలమే అనుమతి-రాకా-సినీవాలీ-కుహూ-అను నాలుగు పర్వ సంధులకును కాల పరిమితి అని తెలియవలెను. పర్వకాలముల పరిమితి వలెనే వాటిని ఆశ్రయించి చేయవలసిన ఆహుతి-వషట్కార పూర్వక శ్రౌతకర్మల-కాల పరి మితియు సమానముగా నుండును. చంద్ర సూర్యులకు వ్యతీపాతము సంభవించుట (క్రాంతివృత్త విషువవృత్త సంపాతము లందు ఇద్దరును 180 భాగల దూరమందుండి పరస్పరము చూచుకొనుట) చేతనే రాకా-అనుమతి- అను రెండు విధములగు పూర్ణిమలును ఏర్పడుచున్నవి. అట్లే పూర్ణిమా కృష్ణ ప్రతిపత్‌ల పర్వ సంధికాలము కూడ ద్వి లవ పరిమితమే. కుహూ-సినీవాలీ-అను రెండు పర్వముల కాల పరిమితియు ద్వి లవములే. చంద్ర సూర్యాదుల తేజః కళల సంబంధము చేతనే పర్వ సమయములు ఏర్పడును. కావున సూర్యాగ్ని తేజః కళా సంబంధము గల చంద్రుని కళలును పర్వ కాలములందు అందులకు అనుగుణముగా అగ్ని సూర్యుల సంబంధానుసార ముండును. (అందుచేతనే చంద్ర సంబంధముపై ఆధార పడి ఏర్పడు పర్వదినములు శ్రౌత కర్మలకు ప్రశస్తము లనబడును.) సోముడు దినమున కొక కలవంతున కలా పూర్తి నొందుచు పూర్ణిమనాడు పదునైదు కళలు కలవాడగును. (ఇదికాక అతనియందు ఎప్పుడును (సదా) తరుగక పెరుగక యుండుపదునారవ కళయొకటి[సాదా]కలదు. అది వృద్ధిక్షయములలో పాలుపంచుకొనదు.) కావున నేను పంచదశ కళల తోనే చంద్రుడు వృద్ధి క్షయములకు పాలుపడునని చెప్పితిని. సోమపులు (సోముని అమృతమును త్రావువారు) 'సోమవర్ధనాః' (సోమునిచే వృద్ధి నొందుచు సోముని కూడ వృద్ధి నొందించువారు) అనబడు పితరు లనబడు దేవతల విషయము ఇట్లుం డును. వీరికి ఋతువులు-ఆర్తవులు అనియు వ్యవహారము కలదనియు వీరిని (ఆజాన-కర్మ) దేవతలు కూడ కర్మాను ష్ఠానమున భావన చేయుచుందురనియు ఎరుగవలయును. ఇకమీదట శ్రాద్ధములను అనుభవించు పితృ దేవతలు ఎవరో-వారి గతులు (వారి ఆశ్రయ స్థానములును ప్రవృత్తులును) ఎట్టివో లోకమందలి ఆయా వర్ణములవారు ఇచ్చు శ్రాద్ధములు వారి కెట్లు అందునో తెలిపెదను; వినుము. ఏలయన ప్రాణులు మృతులైన తరువాత ఆ జీవుల గతి - లోకములందు వా రెచ్చట సంచరించుచుందురో-మరల వా రెట్లు ఈ లోకములో ఎక్కడకు వత్తురో తెలియుట (శాస్త్ర ప్రమాణ ముతోనే తప్ప) శక్యము కాదు.

తపసా(ఽపి)హి ప్రసిద్ధేన; కింపునర్మాంసచక్షుషా । అత్ర దేవా న్పితౄంశ్చైవ పితరో లౌకికా శ్శ్రితాః. 60
తేషాం తే ధర్మసామర్థ్యాత్ స్మృతాః సాయుజ్యగా ద్విజైః । యది చాశ్రమధర్మేణ సమ్ప్రాప్తాసై ర్వ్యవస్థితాః.
అన్యే చాత్ర ప్రసీదన్తి శ్రద్ధాయుక్తేషు కర్మసు । బ్రహ్మచర్యేణ తపసా యజ్ఞేన ప్రజయా భువి. 62
శ్రాద్ధేన విద్యయా చైవాన్నదానేనచ సప్తధా । కర్మస్వేతేషు యే సక్తా వర్తన్త్యాదేహపాతనాత్. 63
దేవై స్తైపితృభిస్సార్ధమూష్మపై స్సోమపై స్తథా । స్వర్గతా దివి మోదన్తే పితృమన్త ముపాసతే. 64
ప్రజావతాం ప్రసిద్ధైషా ఉక్తా శ్రాద్ధకృతాంచ వై । తేషాం నివాపే దత్తాని తత్కులీనైస్తు బాన్ధవైః. 65
మాన శ్రాద్ధంహి భుఞ్జానా స్తృప్యన్తే సోమలోకకైః । ఏతే మనుష్యాః పితరో మానశ్రాద్ధభుజస్తు వై. 66

తేభ్యః పరేతు యేత్వన్యే సఙ్కీర్ణాః కర్మయోనిషు । భ్రష్టాశ్చాశ్రమధర్మేషు స్వధాస్వాహావివర్జితాః. 67
భిన్నే దేహే దురావస్థాః ప్రేతభూతా యమక్షయే । స్వకర్మాణ్యనుశోచన్తో యాతనాస్థాన మాగతాః. 68
దీర్ఘాశ్చైవాతిశుష్కాశ్చ శ్మశ్రులాశ్చ వివాససః । క్షుత్పిపాసాభిభూతాస్తే విద్రవన్తి తతస్తతః. 69
సరిత్సరస్తడాగాని పుష్కరిణ్యశ్చ సర్వశః । పరాన్నా న్యభికాఙ్క్షన్తః కాల్యమానా స్తతస్తతః. 70
స్థానేషు పాత్యమానా యే యాతనా స్తేషు తేషువై। శాల్మల్యాం వైతరణ్యాంతు కుమ్భ్యాం కారమ్భవాలుకే.71
అసిపత్రవనేచైవ పాత్యమానా స్స్వకర్మభిః । తత్రస్థానాంతు తేషాంవై దుఃఖితానా మశాయినామ్. 72

మృతులైన జీవులు ఏ గతి కేగుదురను విషయమును ప్రసిద్ధమగు మహా తపస్సుతో కూడ తెలియుట సాధ్యము కాదనిన మాంస నిర్మితమగు కంటితో చూచి ప్రత్యక్ష ప్రమాణముతో తెలియుట ఎట్లు సాధ్యమగును?

లౌకికులగు పితరులు (శ్రాద్ధము చేయు యజమానుని మృత పితృ పితామహ ప్రపితామహాదులు) ద్యులోకవాసులగు పితృదేవతలను ఆశ్రయించి (వారి ద్వారమున) సద్గతిని పొందుదురు. వారు వా రాచరించిన ధర్మపు సామర్థ్యముచే ద్యులోకవాసి దేవతలును పితృ దేవతలును ఈ లౌకిక పితృ పితామహ ప్రపితామహాది పితరులకు తమతోడి సాయుజ్యమునో తమ లోకమందు వీరి నివాసమునో అనుగ్రహించి సుఖింపజేయుదురు. ఈ లౌకిక పితరులు గాని వారి పుత్ర పౌత్రాది సంతతి కాని తమ తమ ఆశ్రమ ధర్మములను ఆయా కర్మానుష్ఠాన సంప్రదాయములను చక్కగా పాటించుచు వ్యవస్థానుసారము జీవించుటచే వీరికి పరలోకమున సద్గతి కలుగును. ఈ లౌకిక పితృ పితామహాదుల పుత్ర పౌత్రాదులు వీరి నుద్దేశించి శ్రద్ధాయుక్తులయి కర్మల నాచరించుటచే గూడ ఈ లౌకిక పితరులకు సద్గతి కలుగును. బ్రహ్మచర్యము-తపస్సు-యజ్ఞము ఆచరించుట- సత్సంతానమును కనుట- శ్రాద్ధకర్మలను శ్రద్ధతో ఆచరించుట- విద్యాధ్యయనము చేయుట- అన్నదానము చేయుట- ఇవి ఏడును లౌకిక పితరుల సద్గతికి హేతువులు. కావున దేహము పడిపోవు వరకును ఇవి విడువక ఆచరించుచుండవలయును. పితరులయందు శ్రద్ధాభక్తులు గల తమ పుత్ర పౌత్రాదులను ఉపాసించి (ఆధారముగా చేసికొని) ఈ లౌకిక పితరులు లోగడ చెప్పిన సోమపులు-ఊష్మపులు అను పితృ దేవతలతోను దేవతలతోను కూడి స్వర్గలోకమున మోదముతో నుందురు. సంతానవంతులగు ఈ లౌకిక పితరులు తమ పుత్ర పౌత్రాదులు చేయు శ్రాద్ధాది కర్మలతోను వారి వంశమునందలి జ్ఞాతిజనులు గాని బాంధవులుగాని ఇచ్చు తర్పణోదకము మొదలగు వానితోను వీరు జరుపు మాస శ్రాద్ధము మొదలగు వానితోను తృప్తి చెంది సోముని అమృతము అందెడి లోకములలో ఆనందించుచుందురు. మాస శ్రాద్ధముల ననుభవించు అదృష్టము పట్టు మానవ(లౌకిక)పితరుల విషయము ఇది.

ఈ చెప్పిన విధమగు ఆచరణములతో తమ జీవితము గడుపక ఆయా పుణ్యాపుణ్య సంమిశ్రమగు సంకీర్ణ కర్మములను (శాస్త్రవిధి నిషేధములను పట్టించుకొనక తమకు తోచినట్లు చేయు కర్మలు సంకీర్ణ కర్మములు) ఆచరించుచు దానిచే లభించు ఆయా వివిధ జన్మములందును తమ వర్ణాశ్రమ ధర్మములను శాస్త్రానుసారము పాటించక భ్రష్టులై స్వాహా-స్వధాకారములతో దేవపితృ కర్మములు ఏవియు ఆచరించక జీవించినవారు తమ దేహము పోయిన తరువాత ప్రేతభూతులయి యముని లోకమునకు పోయి దురవస్థల పాలయి యాతనానుభవ స్థానమున కేగి తాము ఈ లోకమున చేసిన ఆయా కర్మములను తలచుకొని పశ్చాత్తాపపడుచు శోకించుచు ఉందురు. అచ్చట వీరు పొడవగు దేహములతో రక్త మాంసములు లేక శుష్కించి గడ్డములు మీసములు తెగ పెరిగి వస్త్రములు లేక ఆకలి దప్పులతో బాధ పడుచు యాతనా లోకములో అటుఇటు పరుగెత్తుచుందురు. ఆయా యాతనాస్థానములందు పడవేయబడుచు వారు యాతనల ననుభవింతురు. ఇతరు లెవరైన అన్నము పెట్టుదురాయని పరాన్నములు కోరుచు నదులు సరస్సులు చెరువులు కోనేరులు (నీటికై) వెదకుచు పోయి పోయినచోటినుండి (యమదూతలచే) తరిమివేయబడుచు తిరుగుచుందురు. అచట వీరిని ఆ దూతలు శాల్మలి (ముండ్ల బూరుగు) వైతరణి (నెత్తురు-చీము మొదలగు కశ్మలముతో నిండిన నది) కుంభి-కారంభ వాలుకము - అసిపత్ర
మ.పు. 68).

వనము మొదలగు యాతనా స్థానములందు తమ తమ కర్మానుసారము పడ ద్రోయబడుదురు. వా రచట ఎంతో దుఃఖ మనుభవించుచు వండుకొనుటకు తావు దొరకక బాధ పడుచుందురు.

తేషాం లోకా న్తరస్థానాం బాన్ధవై ర్నామగోత్రతః । భూమా వాస్తృతదర్భేషు దత్తాః పిణ్డా స్త్రయస్తు వై. 73
ప్రాప్తాస్తు తర్పయన్త్యేవ ప్రేతస్థానే ష్వధిష్ఠితాన్ । అప్రాప్తా యాతనాస్థానం ప్రభ్రష్టా యేచ పఞ్చధా. 74
పశ్చాద్యే స్థావరాంతేవై భూతానీకే ప్రయత్నతః । యేచాన్యే స్థావరాస్తేవై భూతదీప్తై స్స్వకర్మభిః. 75
నానారూపాసు జాతేషు తిర్యగ్యోనిషు మూర్తిషు । యదాహారా భవన్త్యేతే తాసుతాస్వితి యోనిషు. 76
తస్మిం స్తస్మిం స్తదాహారే శ్రాద్ధందత్తంతు ప్రీణయేత్ । కాలే న్యాయాగతం పాత్రే విధినా ప్రతిపాదితమ్. 77
ప్రాప్నువన్త్యమరా దత్తం యత్రయత్రచ తిష్ఠతి । యథా గోషు ప్రతిష్ఠాసు వత్సో విన్దతి మాతరమ్. 78
తద్వచ్చాస్త్రేషు దృష్టాన్తో మన్త్రైః ప్రాపయతే పురమ్ ।
ఏవం హ్యావికలం శ్రాద్ధం శ్రద్ధాదత్తం మను ర్బ్రవీత్. 79
సనత్కుమారః ప్రోవాచ పశ్యన్దివ్యేన చక్షుషా । గతాగతజ్ఞః ప్రేతానాం ప్రాప్తిం శ్రాద్ధస్య చైవహి. 80
కృష్ణ పక్ష స్త్వహస్తేషాం శుక్లే స్వప్నాయ శర్వరీ । ఇత్యేతే పితరో దేవా దేవాశ్చ పితరస్తు యే. 81
అన్యోన్యపితరో హ్యేతే దేవాశ్చ పితరో దివి । ఏతేతు పితరో దేవా మనుష్యాః పితరస్తు వై. 82
పితా పితామహ శ్చైవ తథైవ ప్రపితామహః । ఇత్యేష విషయః ప్రోక్తో పిత్రూణాం సోమపాయినామ్. 83
ఏతత్పితృమహత్త్వంహి పురాణే నిశ్చయం గతమ్। ఇత్యేష సోమసూర్యాభ్యా మైళస్య చ సమాగమః.
అవాప్తిః శ్రద్ధయాచైవ పిత్రూణాం చైవ తర్పణమ్ । పర్వణాం చైవ యః కాలో యాతనాస్థాన మేవచ. 85
సమాసా త్కీర్తిత స్తుభ్యం సర్గ ఏష సనాతనః । వైరుష్యాయ న తత్సర్వం కథితం త్వేకదేశకమ్. 86
అశక్యం పరిసఙ్ఖ్యాతుం శ్రద్ధేయం భూతి మిచ్ఛతా । స్వాయమ్భువస్య దేవస్య ఏష సర్గో మయేరితః. 87
విస్తరేణానుపూర్వ్యాచ్చ భూయః కిం కథయామి వః. 87

ఇతి శ్రీమత్స్యమహాపురాణే మన్వన్తరానుకీర్తనే అమావాస్యాకాలనిర్ణయాది
కథనం నామ చత్వారింశదుత్తర శతతమోఽధ్యాయః.

ఇట్టివారు లోకాంతరములందు యాతనా స్థానములందు ఉన్నను వారి బాంధవులు ఈ లోకమందు ఈ ప్రేతః నామ గోత్రముల నుచ్చరించుచు భూమిపయి దర్భలను పరచి మూడు పిండములను ఉంచగా అవి ఈ శ్రాద్ధకర్త యజ మానుని పితృ పితామహ ప్రపితామహులకు అంది వారికి తృప్తికలిగించును. ఒకవేళ ఈ శ్రాద్ధకర్త యజమానుని మృతలౌకిక పితరులు లోకాంతరములందు యాతనా స్థానములందుండక అచటినుండి ఈవలకు వడి దేవాసుర మానవ తిర్యక్ స్థావర జన్మములు అను ఐదింటిలో దేనియందైన నున్నను స్వకర్మానుసారము స్థావర జన్మములందు భూతత్ మాత్రమును సూచించు ఎంత క్షుద్ర జన్మమునందు ఉన్నను తిర్యక్ (పశుపక్షి మృగ) జన్మములందలి నానా రూపముల గల యోనుల (జన్మముల)లో ఏయోనియందు ఏ మూర్తితో నున్నను అందు ఆ ప్రాణి ఏఆహారమును తినునదియైనచో ఈ శ్రాద్ధకర్త యజమానుడిచ్చిన శ్రాద్ధీయాహారము ఆ ఆహారముగా మారి ఆప్రాణిని తృప్తినొందించును. అంతేకాక ఈ ప్రేతప్రాణి తన జీవితకాలమందు తానుకాని అతని పుత్త్ర పౌత్త్రాదులు ఇప్పుడు కాని తమ న్యాయార్జిత ధనమ నుండి సత్పాత్రమునందు శాస్త్ర విధిననుసరించి ఇచ్చిన దానపుఫలముకూడ దేవతలచే గ్రహింప (అందుకొన)బడి అది వారిచే ఈ మృతప్రేత ప్రాణికి-ఆ ప్రాణి ఏ జన్మమునందున్నను-అందజేయబడును. గోవులు తప్పిపోయి ఎచ్చట ఏవిధముగా నున్నను దూడ పోయి తన తల్లిని గుర్తింపగలదు. అట్లే మంత్రము శ్రాద్ధ దానాది ఫలమును ఆ ప్రేత ప్రాణికి అందజేయును. అను ఈ లౌకిక దృష్టాంతముతో ఇది శాస్త్రములందు చెప్పబడియున్నది. ఇట్లు శ్రద్ధతో

జరిపిన శ్రాద్ధము అవికలము-సంపూర్ణము-సమగ్రము-అగునని మనువు చెప్పెను. అని సనత్కుమారుడు తన దివ్య తపోమయ నేత్రముతో చూచి ప్రేతల గతాగతములను వారికి శ్రాద్ధఫలములు అందు విధమును ఎరిగి చెప్పెను. ఈ పితృలోకస్థ పితరులకు (పితృదేవతలకు; లౌకిక పితరులకు కాదు) మానవుల కృష్ణపక్షము పగలుగా- శుక్లపక్షము రాత్రిగా అగును. ఇట్లు పితృదేవతలు-దేవతలు- (లౌకిక) పితరులు అను మూడు విధములగు వారి విషయమును చెప్పబడినది. పితృదేవతలును దేవతలును ద్యులోకమున వీరికి వారును వారికి వీరును పరస్పరము పితరులుగా ఆరాధన లందుకొందురు. మనుష్య పితరులు-లేదా లౌకిక పితరులు అనగా మానవలోకమునందలి శ్రాద్ధకర్తృ యజమానుల పితృపితామహ ప్రపితామహులు అని తెలియవలయును. సోమ పాయులగు (సోమునినుండి లభించు అమృతమును త్రావు) పితరుల విషయము ఇది; అన్ని శాస్త్రములందును ప్రవచింపబడిన దానిని నీకు చెప్పితిని. ఇదియంతయు ★పురాణమునందు పితృ మహత్త్వము (పితరుల గొప్పదనము) అను పేరుగల ప్రకరణమునందు చెప్పబడియున్నది.

ఇట్లు నీకు ఇచట ఇలాపుత్త్రుడగు పురూరవసుడు తన మాతామహుడగు సూర్యుని-పితామహుడగు చంద్రుని కలియుటయు శ్రద్ధాయుక్తుడై అతడచట శ్రాద్ధకాలమెరిగి ఆకాలమునకు వేచియుండుటయు పితరుల నతడు తృప్తి నొందించుటయు పర్వకాల పరిమాణ స్వరూపమును మృతప్రేత ప్రాణుల యాతనాస్థాన స్థితిని నీకు సంక్షేపముగ తెలిపితిని. ఇది సనాతనము (నిత్యమును అతి ప్రాచీనమును) అగు సృష్టి వ్యవస్థా ప్రకారము. నీకు దీనియందు వైదుష్యము (సంపూర్ణ పాండిత్యము) కలుగునంత విస్తరముగకాక ఏకదేశము-అల్పాంశము-మాత్రము తెలిపితిని. ఇదియంతయు పరిసంఖ్యానము చేయుట (పరితః-సమగ్రముగా; సంఖ్యాయ-లెక్కగా ఎరిగి-ప్రతిపాదించుట) ఎట్టివారికిని శక్యముకాదు. దీనిని మానవులు వ్యవస్థ చేసిన ప్రత్యక్షానుమానాది ప్రమాణములతో నిరూపించ అలవికాదు. నిరూపించరాదు. తనకు (ఇహమునను పరమునను) క్షేమము కలుగవలెనని కోరువాడు దీనిని శ్రద్ధతో (సర్వ సాధారణ) దృష్టికందనిదియు కలదను నమ్మికతో) ఆచరించవలయును. స్వాయంభువమనుని సృష్టి వ్యవస్థా ప్రకారమిది నీకు విస్తరించి ఆను పూర్విలో (దేని తరువాత ఏది చెప్పవలెనో అదే క్రమమున) చెప్పితిని. మీకు ఇంకేమి చెప్పవలయు నందురో అడుగుడు.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున మన్వంతరాను కీర్తనమున అమావాస్యా కాలనిర్ణయాది ప్రతిపాదనమును నూట నలుబదియవ అధ్యాయము.

## ఏకచత్వారింశదుత్తరశతతమోఽధ్యాయః.

## నిమేషాదిదివ్యసంవత్సరాన్తకాలనిర్ణయః.

ఋషయః : చతుర్యుగాని యాని స్యుః పూర్వే స్వాయమ్భువేఽన్తరే ।
ఏషాం నిసర్గం సఙ్ఖ్యాంచ శ్రోతుమిచ్ఛామ విస్తరాత్. 1

సూతః : పృథివీద్యుప్రసఙ్గేన న మయా ప్రాగుదాహృతమ్ ।
తేషాం చతుర్యుగం త్వేవం తద్వక్ష్యామి నిబోధత. 2

తత్ప్రమాణం ప్రసఙ్ఖ్యాయ విస్తరాచ్చైవ కృత్స్నశః । లౌకికేన ప్రమాణేన నిష్పద్యాబ్దంతు మానుషమ్. 3

---

★ ఇచట పురాణము అనగా మనకు ఈనాడు లభించుచున్న పదునెనిమిది పురాణములలో ఏదో ఒకటి అనికాదు. వేదమునందలి ఒక యంశముగా పురాణము అను వాఙ్మయాంశము కలదు. అది వాస్తవమున వేదమునకు పూరణము; ఈ విధమగు 'పురాణము'నందలి కొన్ని వచనములను ఆపస్తంబాది మునులు తమ ధర్మసూత్రము లందు ఇచ్చియున్నారు. మరికొన్ని ఈనాడు మనకు లభించు స్మృతులలో వైదిక రూపమును కోల్పోయి లౌకిక మగు సంస్కృతపు రూపమునకు మారి కనబడుచున్నవి. (అనువాదకుడు)

తేనాపీహ ప్రసఙ్ఖ్యాయ వక్ష్యామీహ చతుర్యుగమ్ । నిమేషతుల్యకాలాని మాత్రా లఘ్వక్షరాణిచ. 4
కాష్ఠానిమేషా దశపఞ్చచైవ త్రింశచ్చ కాష్ఠా గణయేత్కలాంతు ।
త్రింశత్కలాశ్చైవ భవేన్ముహూర్త స్తైస్త్రింశతా రాత్ర్యహనీ సమేతే. 5
అహోరాత్రే విభజతే సూర్యో మానుషలౌకికః । రాత్రి స్స్వప్నాయ భూతానాం చేష్టాయై కర్మణా మహః. 6
పిత్ర్యే రాత్ర్యహనీ మాసః ప్రవిభాగ స్తయోఃపునః । కృష్ణపక్ష స్త్వహ స్తేషాం శుక్ల స్స్వప్నాయ శర్వరీ. 7
త్రింశద్యే మానుషా మాసాః పిత్ర్యమాస స్స ఉచ్యతే । శతాని త్రీణి మాసానాం షష్ట్యాచాభ్యధికానితు. 8
పిత్ర్య స్సంవత్సరోహ్యేష మానుషేణ విభావ్యతే । మానుషేణైవ మానేన వర్షాణాం యచ్ఛతం భవేత్. 9
పిత్ర్యాణాం తాని వర్షాణి సఙ్ఖ్యాతానితు త్రీణివై । దశచైకా (చత్వారశ్చా)ధికామాసాఃపిత్ర్యసఙ్ఖ్యేహ కీర్తితాః.
లౌకికేన ప్రమాణేన అబ్దో యో మానుష స్స్మృతః । ఏత ద్దివ్యమహోరాత్ర మిత్యేషా వైదికీ శ్రుతిః. 11
దివ్యే రాత్ర్యహనీ వర్షం ప్రవిభాగ స్తయోఃపునః । అహస్తు యదుదక్చైవ రాత్రిర్యాదక్షిణాయనమ్. 12
ఏతే రాత్ర్యహనీ దివ్యే ప్రసఙ్ఖ్యాతం తయోః పునః । త్రింశ ద్యానితు వర్షాణి దైవో మాసస్తు స స్మృతః. 13
మానుషాణాం శతం యచ్చ దివ్యమాసాస్త్రయస్తుతే । దశచైకా తథాఽహాని దివ్యఏష విధి స్స్మృతః. 14
త్రీణి వర్షశతాన్యేవ షష్టివర్షా స్తథైవచ । దివ్యసంవత్సరో హ్యేష మానుషేణ ప్రకీర్తితః. 15

## నూటు నలువది యొకటవ అధ్యాయము.

## నిమేషాది దివ్య వత్సరాంతకాల నిర్ణయము.

ఋషులు సూతుని 'పూర్వము స్వాయంభువ మన్వంతరమున వ్యవస్థ చేయబడిన చతుర్యుగముల వ్యవస్థను స్వరూపమును సంఖ్యా పరిమాణమును సవిస్తరముగ వినగోరుచున్నాము.' అని అడిగిరి. సూతు డిట్లు చెప్పసాగెను. పృథివీలోక ద్యులోక (భూగోళ ఖగోళ వ్యవస్థాకథన) ప్రసంగమున నేను ఇదివరకు మీకు అది చెప్పి యుండలేదు. ఇపు డది మీకు తెలిపెదను. ఎరుగుడు. మొదట మీకు మానుష ప్రమాణముతో సంవత్సర పరిమాణమును నిష్పన్నము చేసి దాని ఆధారమున చతుర్యుగ పరిమాణమును తెలిపెదను. పదునైదు నిమేషములు (తెప్పపాటు కాలములు) కాష్ఠ; ముప్పదికాష్ఠలు కల; ముప్పది కలలు ముహూర్తము; ముప్పది ముహూర్తములు ఒక రేయింబగలు; రవి రేయింబవళ్లుగా మానవ లౌకిక కాలమును విభజించుచున్నాడు. మానవులు పనులు చేసికొనుటకు పగలు-నిద్రించుటకు రాత్రి-ఉపయోగపడుచున్నవి. ఒక మానవమాసము పితరులకు ఒక రేయింబవలు; అందునను కృష్ణపక్షము పగలు; శుక్ల పక్షమురాత్రి; మానవ మాసములు ముప్పది కలిసి పితరుల కొక మాసము; మానవ మాసములు మున్నూటరువదికలిసి పిత్ర్య సంవత్సరము; మానవ మానముచే నూరు సంవత్సరము లైనచో పితరులకు-మూడు సంవత్సరముల నాలుగు మాసము లగును. మానవ లౌకిక ప్రమాణమున సంవత్సరము దేవతలకు రేయింబగలు. అని వేదము తెలుపుచున్నది. అందును-మానవుల ఉత్తరాయనము దేవతలకు పగలు-దక్షిణాయనము రాత్రి; మానవ లౌకిక వత్సరములు ముప్పది దేవమాన మాసము; మానవ వత్సరములు నూరైనచో దేవతలకు మూడు మాసములు (మరి పది దినములు) అగును; మానవ లౌకిక వత్సరములు మూడువందలఅరువది యైనచో ఒక దేవవత్సరము. (మాత్రా-లఘూచ్చారణ కాలము: నిమేషము)

త్రీణి వర్షసహస్రాణి మానుషేణ ప్రకీర్తితః । త్రింశదన్యాని వర్షాణి స్మృత స్సప్తర్షివత్సరః. 16
నవ యాని సహస్రాణి వర్షాణాం మానుషాణిచ । వర్షాణి నవతిశ్చైవ ధ్రువసంవత్సర స్స్మృతః. 17
షట్త్రింశత్తు సహస్రాణి వర్షాణి మానుషాణితు । వర్షాణాం తచ్ఛతం జ్ఞేయం దివ్యో హ్యేష విధి స్స్మృతః.
త్రీణ్యేవనియుతాన్యాహుర్వర్షాణాం మానుషాణిచ షష్టిశ్చైవ సహస్రాణి సఙ్ఖ్యాతానితు సఙ్ఖ్యయా. 19
దివ్యం వర్షసహస్రంతు ప్రాహు స్సఙ్ఖ్యావిదోజనాః । ఇత్యేత దృషిభిర్గీతం దివ్యయా సఙ్ఖ్యయా ద్విజాః. 20

## కృతయుగాదిపరిమాణమ్

దివ్యేనైవం ప్రమాణేన యుగసఙ్ఖ్యా ప్రకల్పితా । చత్వారి భారతేవర్షే యుగాని ఋషయోఽబ్రువన్. 21
కృతం త్రేతా ద్వాపరంచ కలించైవ చతుర్యుగమ్ । పూర్వం కృతయుగం నామ తతస్త్రేతాఽభిధీయతే. 22
ద్వాపరంచ కలించైవ యుగాని పరికల్పయేత్ । చత్వార్యాహుః సహస్రాణి వర్షాణాంతు కృతం యుగమ్. 23
తస్య తావచ్ఛతీ సన్ధ్యా సన్ధ్యాంశశ్చ తథావిధః । ఇతరేషు ససన్ధ్యేషు ససన్ధ్యాంశేషు చ త్రిషు. 24
ఏకపాదేన వర్తన్తే సహస్రాణి శతానిచ । త్రేతా త్రీణిసహస్రాణి యుగసఙ్ఖ్యావిదో విదుః. 25
తస్యాపి త్రిశతీ సన్ధ్యా సన్ధ్యాంశ స్సన్ధ్యయా సమః । ద్వేసహస్రే ద్వాపరంచ సన్ధ్యా సన్ధ్యాంశతశ్చ తే. 26
సహస్ర మేకం వర్షాణాం కలిరేవ ప్రకీర్తితః । ద్వేశతేచ తథాన్యేచ సన్ధ్యాసన్ధ్యాంశయో స్స్మృతే. 27
ఏషా ద్వాదశసాహస్రీ యుగ సంఖ్యాతు సంజ్ఞితా । కృతం త్రేతా ద్వాపరంచ కలిశ్చేతి చతుష్టయమ్. 28

మూడువేల మువ్వది మానవ లౌకిక సంవత్సరములు ఒక సప్తర్షి వత్సరము. దీనికి మూడింతలు-అనగా తొమ్మిది వేల తొంబది మానవ లౌకిక సంవత్సరములు ఒక ధ్రువ సంవత్సరము. మువ్వది ఆరు వేల మానవ లౌకిక సంవత్సరములు నూరు దివ్య సంవత్సరములు; మూడు లక్షల అరువది వేల మానవ లౌకిక సంవత్సరములు వేయి దివ్య సంవత్సరములు; ఇట్లు దివ్య (దేవ సంబంధి) ప్రమాణానుసారము చతుర్యుగవ్యవస్థ పెద్దలచే చేయబడినది; ఋషి వచనాను సారము భారత వర్షమున కృత త్రేతా ద్వాపర కలియుగములు నాలుగు వ్యవహార మందున్నవి. నాలుగువేల దివ్య వర్షములు కృతయుగము; అన్ని వందల దివ్య వర్షములు కృత త్రేతా సంధికాలము; అవే నాలుగు వందల దివ్య వర్షములు సంధ్యాంశకాలము; ఇట్లే మూడు వేల దివ్య వర్షములు త్రేతాయుగ పరిమాణము; మూడు వందల దివ్య వర్షములు దాని సంధ్యాకాలము; మరి మూడు వందల దివ్య వర్షములు దాని సంధ్యాంశకాలము; రెండువేల దివ్య వర్షములు ద్వాపరయుగ ప్రమాణము; రెండు వందల దివ్య వర్షములు దాని సంధ్యాకాలము; రెండు వందల దివ్య వర్షములు దాని సంధ్యాంశ కాలము; వేయి దివ్య వర్షములు కలియుగ ప్రమాణము; నూరు దివ్య వర్షములు దాని సంధ్యాకాలము; నూరు దివ్య వర్షములు దాని సంధ్యాంశకాలము.

తత్ర సంవత్సరా స్సృష్టా మానుషా స్తాన్నిబోధత । చత్వారింశ త్తథా త్రీణినియుతానా మిహోచ్యతే. 29
వింశతిశ్చ సహస్రాణి కాలోహ్యేష చతుర్యుగః । పృథక్త్వేనేహ వక్ష్యామి యుగానితు నిబోధత. 30
యుగాని దశ ద్వేచాష్టౌ షట్చచైవాత్రసఙ్ఖ్యయా । అష్టావింశత్సహస్రాణి కృతంయుగ మిహోచ్యతే. 31
ప్రయుతంతుతథాపూర్ణేద్వేచాన్యేనియుతేపునః । షణ్ణవతి సహస్రాణి సఙ్ఖ్యాతానితు సఙ్ఖ్యయా. 32
త్రేతాయుగస్య సఙ్ఖ్యైవ మానుషేణతు కీర్తితా । అష్టౌ శత సహస్రాణి వర్షాణాం మానుషాణి తు. 33
చతుష్షష్టిసహస్రాణి వర్షాణాం ద్వాపరం యుగమ్ చత్వారి నియుతాని స్యు ర్వర్షాణి తు కలిర్యుగమ్. 34
ద్వాత్రింశచ్చ తథాన్యాని సహస్రాణితు సఙ్ఖ్యయా । ఏత త్కలియుగం ప్రోక్తం మానుషేణ ప్రమాణతః.
ఏషా చతుర్యుగావస్థా మానుషేణ ప్రకీర్తితా । చతుర్యుగస్య సఙ్ఖ్యాతా సన్ధ్యాసన్ధ్యాంశకై స్సహ. 36

## మన్వన్తరపరిమాణనిర్ణయః

ఏషా చతుర్యుగాఖ్యాతు సాధికా హ్యేకసప్తతిః । కృతత్రేతాదియుక్తా సా మనో రన్తర ముచ్యతే. 37
మన్వన్తరస్య సఙ్ఖ్యాతు మానుషేణ నిబోధత । ఏకత్రింశ త్తథాకోట్య స్సఙ్ఖ్యాతా సఙ్ఖ్యయా ద్విజైః. 38
తథాశతసహస్రాణి దశచాన్యాని భాగశః । సహస్రాణిచ ద్వాత్రింశ చ్ఛతాన్యష్టాధికాని చ. 39
అశీతిశ్చైవవర్షాశ్చ మాసాశ్చైవాధికాస్తు షట్ । మన్వన్తరస్య సఙ్ఖ్యైషా మానుషేణ ప్రకీర్తితా. 40
దివ్యేనచ ప్రమాణేన ప్రవక్ష్యామ్యన్తరం మనోః । సహస్రాణాం శతాన్యాహు ర్నవచైవతు సఙ్ఖ్యయా. 41
చత్వారింశత్సహస్రాణి మనో రన్తర ముచ్యతే । మన్వన్తరస్య కాలస్తు యుగైస్సహ ప్రకీర్తితః. 42

ఏషాచతుర్యుగాఖ్యాతు సాధికా హ్యేకసప్తతిః । క్రమేణపరివృత్తాస్తా మనోరన్తర ముచ్యతే. 43
ఏతచ్చతుర్దశగుణం కల్పమాహుస్తు తద్విదః । కల్పప్రమాణా ద్విగుణోయథా భవతి సఙ్ఖ్యయా. 44
తతస్తు ప్రళయః కృత్స్నః స్మృతు సమ్ప్రళయో మహాన్ । చతుర్యుగం సమాఖ్యాతా ద్వాపరం కలిమేవచ.
యుగవ త్సమవేతౌ ద్వౌ ద్విధా వక్తుం న శక్యతే ।
ప్రమాగతం మయాఽ ప్యేత త్తుభ్యం నోక్తంయుగద్వయమ్. 46
ఋషివంశప్రసఙ్గేన వ్యాకులత్వా త్తథా క్రమాత్ । నోక్తం త్రేతాయుగం శేషం తద్వక్ష్యామి నిబోధత. 47

దివ్యమానముచే యుగ ప్రమాణము సంవత్సరములలో

| యుగము | యుగపు మానము | యుగ సంధ్య | యుగ సంధ్యాంశము | మొత్తము |
|---|---|---|---|---|
| కృత | 4000 + | 400 | + 400 | = 4800 |
| త్రేతా | 3000 + | 300 | + 300 | = 3600 |
| ద్వాపర | 2000 + | 200 | + 200 | = 2400 |
| కలి | 1000 + | 100 | + 100 | = 1200 |
| చతుర్యుగము | 10000 + | 1000 | + 1000 | =12000 |

మానవ మానముచే యుగ ప్రమాణము సంవత్సరములలో

| యుగము | యుగ ప్రమాణము | యుగ సంధ్యాం | యుగ సంధ్యాంశము | మొత్తము |
|---|---|---|---|---|
| కృత | 1440000 + | 144000 + | 144000 = | 1728000 |
| త్రేతా | 1080000 + | 108000 + | 108000 = | 1296000 |
| ద్వాపర | 720000 + | 72000 + | 72000 = | 864000 |
| కలి | 360000 + | 36000 + | 36000 = | 432000 |
| | 3600000 + | 360000 + | 360000 = | 4320000 |

ఈ విధమగు చతుర్యుగమునకు దివ్యయుగమని వ్యవహారము. ఇటువంటి దివ్యయుగములు డెబ్బదియొకటి పై చిల్లర యైనచో ఒక మన్వంతరమగును. ఇది మనుష్య లౌకిక మానానుసారము ముప్పదియొక్క కోట్ల పదిలక్షల ముప్పది రెండువేల ఎనిమిది వందల ఎనుబది సంవత్సరముల ఆరు మానములగును. ఇదే మన్వంతర పరిమాణము దివ్య మానము ననుసరించి తొమ్మిది లక్షల నలువదివేల సంవత్సరములగును.

విశేషాంశము : వాస్తవమున వేయి దివ్యయుగములు-అనగా వేయి మానవ మహాయుగములు- అయినచో బ్రహ్మకు ఒక పగలు; బ్రహ్మదేవుని రాత్రికి కూడ ఇదే పరిమాణము; అనగా 12000000 దివ్య సంవత్సరములు = 12000000×360=4320000000 మానవ సంవత్సరములు బ్రహ్మకు ఒక పగలు; అనగా సృష్టికాలము; ఇంతయే బ్రహ్మకు రాత్రి-అనగా ప్రళయకాలము; ఒక సృష్టికాలములో 14గురు మనువులు జీవించి తమతమ ప్రవృత్తులను లోకమున ప్రవర్తిల్లజేయుదురు; కావున 1 మన్వంతరము = 12000000 ÷ 14 = సుమారుగా 857143 దివ్య సంవత్సరములు = 432000000 ÷ 14 = 308571428-సంవత్సరములమీద 7 మానములు కావలయును; కాని ఇచ్చట పురాణములో ఇచ్చిన మన్వంతర పరిమాణములో దేవమానముచేకాని మానవ మానముచేకాని సరిపోవుటలేదు. ఇంతే కాదు; పైని దివ్యమానానుసారము ఇచ్చిన మన్వంతర పరిమాణమగు 940000 దివ్య వర్షములను 360తో గుణించగా మానవమాన సంవత్సరములు 338400000 మానవ వర్షములు కావలయును. కాని పైని మానవ మానానుసారము ఇచ్చిన మన్వంతర పరిమాణ సంఖ్య వేరుగా నున్నది.

ఇది సరిపోవుట ఎట్లు? ఆలోచించవలెను.

యుగ పరిమాణములకు నాలుగింటికిని దివ్యమానములోగాని మానవ మానములోకాని సంధ్యా సంధ్యాంశములు ఉన్నట్లే సృష్టికాలము (బ్రహ్మదినము)నకు కూడ సంధ్యా సంధ్యాంశలు కలవు. కాని యుగముల విషయములో దివ్య మానమున యుగ పరిమాణము ఎన్నివేల దివ్య సంవత్సరములో అన్ని వందల దివ్య సంవత్సరములే ఆయుగపు సంధ్యయు- అంతయే ఆయుగపు సంధ్యాంశమును; కాని ఈ సృష్టికాలమునకు కల సంధ్యా-సంధ్యాంశ పరిమాణము అట్టు కాదు-ఈచెప్పిన 12000000 దివ్యమాన సంవత్సరములు = 4320000000 మానవ సంవత్సరములలో 14 వంతును మరియు ఆ 14వ వంతులో 3వ వంతును కలిసి యగునంత కాలము మొత్తము సంధ్యా సంధ్యాంశము లగునని తోచు చున్నది. అట్లు చూడగా 12000000లో 14వ వంతు 857143 దివ్య వత్సరములును దీనిలో 3వ వంతు 285714 దివ్య వర్షములును కలిసి 1142857 దివ్య వర్షము లగును. ఈ సంఖ్యను సహస్ర దివ్య యుగముల కగు సంవత్సరము లతో కలిపి 14తో భాగించగా అవి ఇక్కడ ఇచ్చిన దివ్యమాన మన్వంతర పరిమాణము ఇంచుమించుగా అగును. దానిని 360తో గుణించగా మానవ మానములో ఇంచుమించుగా 338032885 సంవత్సరములపై ఆరు మాసము లగును. దీనిని బట్టి మూల ప్రతులలో ఒకానొక కాలమున పాఠభ్రంశము జరిగెననియు పై మూల శ్లోకపు పంక్తులు:

"త్రయస్త్రింశత్తథా కోట్యః సంఖ్యాతా సంఖ్యయా ద్విజైః ।
తథాఽ శీతి సహస్రాణి దశచాన్యాని భాగశః.
సహస్రాణి చ ద్వాత్రింశద్వృతా న్యష్టాధికానిచ ।
అశీతిశ్చైవ వర్షాశ్చ మాసాశ్చ వాది కాస్తు షట్. "

అని యుండవలెననియు తోచుచున్నది,

అపుడు ముప్పది మూడు కోట్లును-అశీతి సహస్రాణి-దశ-అన్యానిచ భాగశః-అనగా $80000 \times 10 \times 10 = 8000000$ అగును. మిగిలిన 32 వేలు 8 వందలు 85 అను సంఖ్యలు సమానమే. కాగా పైని చెప్పిన 338032885 అగును. (ఇది ఇంకను లోతుగా ఆలోచించవలసిన విషయము.)

మన్వంతరమునకు పదునాలుగు రెట్లు కల్ప ప్రమాణము; ఇదే బ్రహ్మకు పగలు.

దీనికి రెండింతలు సంపూర్ణ ప్రళయకాలము; దీనికి మహాప్రళయకాల మనియు పేరు; ద్వాపర కలియుగములు రెండును పరస్పరము విడదీయరానివై కలిసియుండుటచే వాని లక్షణము వేరువేరుగా వివరించ వీలుగాక నేను మీకు వివరించలేదు. అట్లే త్రేతాయుగ లక్షణములను గూడ ఋషివంశ ప్రసంగమున నాకు కలిగిన వ్యగ్రతచే చెప్పియుండలేదు. శేషాంశమగు ఆత్రేతాయుగ విషయము ఇపుడు చెప్పెద వినుడు.

## త్రేతాయుగధర్మాః.

అథ త్రేతాయుగస్యాదౌ మను స్సప్తర్షయశ్చ యే ।
శ్రౌతస్మార్తం ధ్రువం ధర్మం బ్రహ్మణాతు ప్రచోదితాః. 48
దారాగ్నిహోత్రసమ్బన్ధం ఋగ్యజుస్సామసంహితమ్ ।
ఇత్యాది బహులం శ్రౌతం ధర్మం సప్తర్షయోఽబ్రువన్. 49
పరమ్పరాగతం ధర్మం స్మార్తం త్వాచారలక్షణమ్ ।
వర్ణాశ్రమాచారయుక్తం మనుస్స్వాయమ్భువోఽబ్రవీత్. 50
సత్యేన బ్రహ్మచర్యేణ శ్రుతేన తపసా తథా । తేషాం సుతప్తతపసా మార్షేణానుక్రమేణ హ. 51

సప్తర్షీణాం మనోశ్చైవ ఆదౌ త్రేతాయుగే తతః । అబుద్ధిపూర్వకం తేన సకృత్పూర్వక మేవచ. 52
అభివృత్తాస్తు తే మన్త్రా దర్శనైస్తారకాదిభిః । ఆధికల్పేహి దేవానాం ప్రాదుర్భూతాస్తు తే స్వయమ్. 53
ప్రమాణేష్వథ సిద్ధానా మన్యేషాంచ ప్రవర్తతే । మన్త్రయోగో వ్యతీతేషు కల్పేష్విహ సహస్రశః. 54
తే మన్త్రావై పునస్తేషాం ప్రతిభాయా ముపస్థితాః । ఋచోయజూంషి సామాని మన్త్రాశ్చాథర్వణాశ్చయే.
సప్తర్షిభిస్తు తే ప్రోక్తా స్మార్తంతు మనురబ్రవీత్ । త్రేతాదౌ సంహతా వేదాః కేవలం ధర్మసేతవః. 56
సంరోధా దాయుషశ్చైవ వ్యస్యంతే ద్వాపరేతు తే । ఋషయ స్తపసా వేదా నహోరాత్రమధీయతే. 57
అనాదినిధనా దివ్యాః పూర్వే ప్రోక్తాః స్వయమ్భువా । స్వ ధర్మసంస్కృతా స్సాఙ్గా స్యథాధర్మం యుగేయుగే.
విక్రియన్తే స్వధర్మాత్తు వేదా వేదా ద్యథాయుగమ్ । ఆరమ్భయజ్ఞాః క్షత్రస్య హవిర్యజ్ఞా విశ స్స్మృతాః.
పరిచారయజ్ఞా శ్శూద్రాశ్చ జపయజ్ఞాశ్చ బ్రాహ్మణాః। తత స్సముదితా వర్ణా స్త్రేతాయాం ధర్మశాలినః.60
క్రియావన్తః ప్రజావన్త స్సమృద్ధా స్సుఖినశ్చ వై । బ్రాహ్మణైశ్చ విధీయన్తే క్షత్రియాః క్షత్రియై ర్విశః.
వైశ్యా శ్శూద్రాఽనువర్తన్తే తతఃపర మనుగ్రహాత్ । శుభాః ప్రకృతయ స్తేషాం ధర్మా వర్ణాశ్రమాశ్రయాః.

శుభకరములగు త్రేతాయుగ ధర్మములను వినుడు. త్రేతాయుగారంభమున స్వయంభూ బ్రహ్మ స్వాయంభువ మనువునకును (మరీచ్యాది సప్త ప్రజాపతులగు) సప్త ఋషులకును శాశ్వతమగు శ్రౌత స్మార్తమగు ధర్మమును విధి రూపమున బోధించెను. దారాగ్నిహోత్ర సంబంధము గల అగ్నిహోత్ర విధాన సంబంధులగు శ్రౌత కర్మముల నను ష్ఠించు విధానము ఋగ్యజుః సామాత్మకమగు వేదసంహితలు తత్సంబంధి ధర్మములు తదంగములు తత్సంబంధి విద్యలు ఈ మొదలగు విస్తృత శ్రౌత ధర్మమును సప్త ఋషులును తమ తరువాతి తరముల వారికి ప్రతిపాదించి లోకమున ఆ ధర్మములను ప్రవర్తిల్ల చేసిరి. సామయాచారికధర్మమను ప్రసిద్ధిగల వర్ణాశ్రమాచార ధర్మములను తనకు బ్రహ్మనుండి గురు పరంపరగా లభించిన వానిని స్వాయంభువ మనువు ఈ లోకమున ప్రవర్తిల్ల జేసెను. ఇవి స్మార్త (స్మృతిప్రోక్త) ధర్మములు.

ఈ సప్తర్షులును స్వాయంభువ మనువును కల్పాది త్రేతాయుగాదియందు సత్యము బ్రహ్మచర్యము శ్రుతము (శాస్త్రములను సంప్రదాయ శుద్ధితో అధ్యయనము చేయుట) తపస్సు (నియమ పాలనముతో శరీరమును శ్రమకు పాల్పరచుట)- అనెడు ఈ ప్రక్రియలతో అతి తీవ్రమగు తపస్సు ఆచరించిరి. (ఇచ్చట తపస్సు అనగా చిత్తమునకు అత్యుత్తమ సంస్కారమును సంపాదించుట); తత్ఫలముగా వారికి తమ సంకల్ప మేమియు లేకయే వారికి మరెవ్వరి నుండియు ఉపదేశము లేకయే అదియే ఈ కల్పమున ప్రథమ పర్యాయముగా వేదమంత్రములు అన్నియు అభివృత్తము లయ్యెను (వారి దగ్గరకు అవి తమంతట తామే వచ్చెను.) వైదిక మంత్రములు వీరికి సాక్షాత్కరించుట దర్శనమున (మంత్రములందు ప్రతిపాదింపబడు విషయము శబ్దరూపమున చిత్తమునకు మాత్రమే కాక చెవికి గూడ గోచరించుట) 'తారక'రూపమున (నక్షత్రములందు అంతరిక్షముననే ఈ మంత్రరూపములును వానియందు ప్రతిపాదింపబడు దేవతా తత్త్వములును వానితో ఆచరింపవలసిన యాగాది ప్రక్రియలును గోచరించుట-దత్తాత్రేయాది యోగులు ఎరిగిన తారక యోగసిద్ధిచే ఈ విషయములు వారి చిత్త శ్రవణములకు గోచరించుట) ఇట్టి అద్భుత విధానములతో జరిగెను. ఈ వేద మంత్రములు దేవతలకు అందరకును శబ్దాత్మకములగు ఆశ్రయములు. మరి ఈ వేదమంత్రములు సప్తర్షులకు ఎట్లు మొదటిసారిగా ఈ కల్పమున ప్రతిభాతములు (స్ఫురించినవి) అయ్యెను? అనిన- ఇతః పూర్వపు కల్పములందును ఆయా ప్రమాణ జ్ఞానమునందు సిద్ధి నందిన ఆయా మహానుభావులకు అంతకు ముందటి కల్పములందు వలెనే స్ఫురించగా వారు వానిని ఆ కల్పములందు లోకములందు ప్రవర్తిల్ల జేసిరి. ఇవి వేలకొలది మంత్ర ద్రష్టలకు వేలకొలదిగా ప్రతిభాతములై యుండెను. అవియే ఈ కల్పమునందు మరల ఈ సప్తర్షులకును స్వాయంభువ మనువునకును వారి వారి ప్రతిభ (స్వయం

సిద్ధమగు బుద్ధి స్పందనయందు గోచరించెను. అని సమాధానము. ఇవి ఋగ్యజుః సామాథర్వణ రూపములగు నాలుగు వేదములు. వీనినే సప్తర్షులు తాము దర్శించి లోకమున ప్రవచించిరి. (ఇచట సప్తర్షులనగా వారును వారి వంశజులగు మరి ఇతరులగు ఋషులును) స్మార్త ధర్మమును స్వాయంభువ మనువు లోకమున ప్రవర్తిల్లజేసెను. ఇట్లు కల్పాది యందలి త్రేతాయుగాదియందు సంహతములయిన (వ్యవస్థా పూర్వకముగా అమర్చబడిన) వేదములు ధర్మసేతువులుగా (ధర్మాతిక్రమణము జరుగకుండ కాపాడు అడ్డుకట్టలుగా) అయ్యెను. ఆయుః పరిమాణము మొదలగు శక్తులు తగ్గుటచే ఈ ద్వాపరయుగము నాటికి అవి మొదటివలె నుండక వ్యత్యాస మందినవి. ఈ వేదములను ఋషులు తమ తపోబలా ధిక్యముచే అహోరాత్రములు అధ్యయనము చేయుచుందురు. వీనికి ఆదియు అంతమును లేదు. (ఇవి నిత్యశబ్దములు) వీటిని స్వయంభూ బ్రహ్మ తాను స్వయముగా- అవి ప్రతిపాదించు ధర్మము వాటియందు చక్కగా నలంకరింపబడిన రూపములో నిలిపి ఆయా యుగ ధర్మములకు అనుగుణముగా ఉండు రూపములో వాటి అంగములతో కూడ- ప్రతియుగము (కల్పభేదము)నందును ప్రవచించును. కాని ఆయా యుగములలో ధర్మ వ్యవస్థయందలి మార్పుల ననుసరించి ఒక వేదముకంటె మరియొక వేదము మార్పు నొంది కనబడును. ఈ శ్రుతులను అనుసరించి తెలియు తత్త్వము ఏమనిన లోకక్షేమకరమగు కర్మలను ఉత్సాహముతో తమ విక్రమముతో ఆచరించుటయే క్షత్త్రియులకును- హవిస్సులు (ప్రజల నిత్య జీవనములకు సాధనములగు ఆహారాది పవిత్ర వస్తువులు) జనులకు సమకూర్చుటయే వైశ్యులకును- తమ శారీరక శ్రమతో జనులకు ఉపయోగించు పరిచర్యలు (కృత్యములు) [సేవ అని అర్థము కాదు.] చేయుటయే శూద్రుల కును యజ్ఞములు; బ్రాహ్మణులకు జపమే [జనులకు క్షేమము కూర్చవలెనను దృష్టి చేయు వేదాధ్యయనమే అని అర్థము; మంత్రజపమని అర్థము కాదు;] వాస్తవమగు యజ్ఞము. దీనిని ఇట్లే అందరును ఆచరించెడు వారు కావునను నాటి జనులు స్వధర్మాచరణశాలురు కావునను వారు కార్యపరులు సత్సంతానవంతులు సమృద్ధి కలిగి సుఖించువారునై యుండిరి. బ్రాహ్మణులు ఉపదేశించినట్లు క్షత్త్రియులు క్షత్త్రియు లుపదేశించినట్లు వైశ్యులు వైశ్య లుపదేశించినట్లు శూద్రులు ఆచరించుచు అనుగ్రహము (జనానుకూల ప్రవర్తనము)తో నడచెడివారు. నాటి జనుల ప్రకృతులు (స్వభావ ములు) శుభకరములయి వర్ణాశ్రమానుకూల ధర్మరూపములయి యుండెడివి.

సఙ్కల్పితేన మనసా వాచా వా హస్తకర్మణా । త్రేతాయుగే హ్యవికలే కర్మారమ్భః ప్రసిధ్యతే. 63
ఆయూ రూపం బలం మేధా ఆరోగ్యం ధర్మశీలతా । సర్వసాధారణం హ్యేత దాసీ త్త్రేతాయుగేతు వై. 64
వర్ణాశ్రమవ్యవస్థానం తేషాం బ్రహ్మా తథాఽకరోత్ ।
సంహితాశ్చ తథా మన్త్రా ఋషిభి ర్బ్రహ్మణ స్సుతైః. 65
యజ్ఞాః ప్రవర్తితాశ్చైవ తదా హ్యేవతు దైవతైః । యామై శ్శుక్లై ర్జయైశ్చైవ సర్వ సాధనసమ్భృతైః. 66
సార్ధం విశ్వసృజా చైవ దేవేన్ద్రేణ మహౌజసా। స్వాయమ్భువేఽన్తరే దేవై స్తైర్యజ్ఞాః ప్రాక్ప్రవర్తితాః. 67
సత్యం జప స్తపో దానం పూర్వధర్మోయ ఉచ్యతే । యథా ధర్మస్య హ్రసతో శాఖాఽధర్మస్య వర్ధతే. 68
జాయంతే చ తదా శూరా ఆయుష్మన్తో మహాబలాః । న్యస్తదణ్డా మహాయోగా యజ్వానో బ్రహ్మవాదినః. 69
పద్మపత్త్రాయతాక్షాశ్చ పృథువక్త్రా స్సుసంహతాః । సింహోరస్కా మహాసత్త్వా మత్తమాతఙ్గగామినః. 70
మహాధనుర్ధరాశ్చైవ త్రేతాయాం చక్రవర్తినః । సర్వలక్షణసమ్పూర్ణా న్యగ్రోధపరిమణ్డలాః 71
న్యగ్రోధౌతు స్మృతౌ బాహూ వ్యామో న్యగ్రోధ ఉచ్యతే ।
వ్యామేన తూచ్ఛ్రయో యస్య త్వధ ఊర్ధ్వంచ దేహినామ్. 72
సముచ్ఛ్రయః పరీణాహో న్యగ్రోధపరిమణ్డలః । చక్రం రథో మణి ర్భార్యా నిధి రశ్వో గజ స్తథా. 73
ప్రోక్తాని సప్తరత్నాని పూర్వే స్వాయమ్భువేఽన్తరే । విష్ణో రంశేన జాయన్తే పృథివ్యాం చక్రవర్తినః. 74

మన్వన్తరేషు సర్వేషు అతీతానాగతేషు వై । భూతభవ్యాని యానీహ వర్తమానాని యానిచ. 75
త్రేతాయుగాని తేష్వత్ర జాయన్తే చక్రవర్తినః । భద్రాణీమాని నైతేషాం విభావ్యన్తే మహీభృతామ్. 76

త్రేతాయుగమున ధర్మము సమగ్రముగా నడుచుచుండ మనస్సుతో చేయు సంకల్పము నోటితో చెప్పెడి మాట చేతితో చేయు పని-ఈ మనోవాక్కాయిక కర్మములు మూడును ఏకరూపములు కాగా జనుల కర్మాచరణములు సఫలములయి యుండెను. జనుల ఆయువు రూపము బలము మేధా ఆరోగ్యము ధర్మశీలము ఇవి జనులలో త్రేతాయుగమున సర్వ సాధారణమయి యుండెను. బ్రహ్మ ఆనాటి వారికి వర్ణాశ్రమ వ్యవస్థను అట్లే చేసెను. వేద సంహితలను వేదమంత్రములను బ్రహ్మమానస పుత్త్రులగు ఋషులు అంత బాగుగా ప్రవర్తిల్లజేసిరి. వారు యజ్ఞముల నంత తిన్నగా ఆనాడు ప్రవర్తిల్లజేసిరి. స్వాయంభువ మన్వంతరమునందు యాములు శుక్లులు జయులు అను దేవ వర్గములును విశ్వస్రష్టయగు స్వయంభూబ్రహ్మయును సర్వ సంభారములతో సమృద్ధిగా నుండు యజ్ఞములను ప్రవర్తిల్లజేసిరి. సత్య జప తపోదానములు పూర్వ యుగములందలి ధర్మములయి యుండెను. కాని క్రమముగ ధర్మశాఖ తగ్గిన కొలది అధర్మ మధికము కాసాగెను. ఆ యుగములందు జనులు శూరులు ఆయుష్మంతులు మహాబలులు క్షమావంతులు (ఎవరిని దండించనివారు) న్యస్తదండులు మహాయోగులు యజ్ఞానుష్ఠాతలు వేదాధ్యయన తత్త్వజ్ఞానపరులు పద్మపత్త్రనేత్రులు విశాలముఖులు చక్కని దేహపు అమరిక కలవారు సింహవక్షముకంటె దృఢ విశాలవక్షము కలవారు మహాసత్త్వులు మదపు టేనుగువలె నడుచువారు మహాధానుష్కులు న్యగ్రోధ పరిమండలులు సర్వ లక్షణ సంపూర్ణులునై నాటి చక్రవర్తు లుండెడివారు. న్యగ్రోధము అనగా 'బార' అని అర్థము; బారకొలతకు వచ్చుటచే బాహువులకును న్యగ్రోధములు అని నామము; నిలువునగాని అడ్డమునగాని బారలతో కొలువదగినంత పొడవు లావు(చుట్టు కొలత)కల వారిని న్యగ్రోధ పరిమండలులు అందురు. ఆ స్వాయంభువ మన్వంతరమున-చక్రవర్తులు విష్ణు సంశమున చక్రము రథము మణులు భార్య నిధి(ధనరాశి) అశ్వములు గజములు అనెడు సప్త రత్నములు కలిగియుండెడువారు. గడిచిన గడచుచున్న గడువనున్న త్రేతాయుగములందెల్ల చక్రవర్తులు ఇట్టివారే; ఈ చెప్పిన సప్త రత్నములును ముందు చెప్పబోవు లక్షణములును వారికి శుభకర లక్షణములుగా నుండును.

అత్యద్భుతాని చత్వారి బలం ధర్మ స్సుఖం ధనమ్ । అన్యోన్యస్యావిరోధేన ప్రాప్యన్తేత్రై ర్నృపైస్సమమ్. 77
అర్థో ధర్మశ్చ కామశ్చ యశో విజయ ఏవచ । ఐశ్వర్యేణాణిమాద్యేన ప్రభుశక్తిబలాన్వితాః. 78
శ్రుతేన తపసాచైవ ఋషీంస్తేభిభవన్తి హి । బలేనాభిభవం త్యేతే తేన దానవమానవాన్. 79
లక్షణైశ్చైవ జాయన్తే శరీరస్థై రమానుషైః । కేశాః స్థితా లలాటేన జిహ్వాచ పరిమార్జనీ. 80
శ్యామప్రభా శ్చతుర్దంష్ట్రాస్సుసంశాశ్చోర్ధ్వరేతసః । ఆజానుబాహవశ్చైవ తాలహస్తా వృషాకృతీః. 81
పరిణాహప్రమాణాభ్యాం సింహస్కన్ధాశ్చ మేధినః । పాదయో శ్చక్రమత్స్యౌతు శఙ్ఖపద్మౌచ హస్తయోః. 82
పఞ్చాశీతిసహస్రాణి జీవన్తే హ్యజరామయాః । అసఙ్గా గతయ స్తేషాం చతస్ర శ్చక్రవర్తినామ్. 83
అన్తరిక్షే సముద్రేషు పాతాళే పర్వతేషుచ । ఇజ్యా దానం తప స్సత్యం త్రేతాధర్మాస్తు వై స్మృతాః. 84
తదా ప్రవర్తతే ధర్మో వర్ణాశ్రమవిభాగశః । మర్యాదాస్థాపనార్థంచ దణ్డనీతిః ప్రవర్తతే. 85
హృష్టపుష్టా జనాస్సర్వే అరోగ్యాపూర్ణమానసాః । ఏకో వేద శ్చతుష్పాద స్త్రేతాయాం త్రివిధ స్స్మృతః. 86
త్రీణి వర్షసహస్రాణి జీవన్తే తత్ర తాః ప్రజాః । పుత్త్రపౌత్త్రసమాకీర్ణా మ్రియన్తేచ క్రమేణ తాః. 87
ఏష భావస్త్రేతాయుగే త్రేతాసన్ధ్యాం నిబోధత । త్రేతాయుగస్య భావానాం సన్ధ్యా పాదేన వర్తతే. 88
సన్ధ్యాపాదే స్వభావాచ్చ యోఽంశః పాదేన తిష్ఠతి. 89

ఇతి శ్రీమత్స్యమహాపురాణే మన్వన్తరానుకీర్తనే నిమేషాదికాలనిర్ణయాది
కథనం నామ ఏకచత్వారింశదుత్తరశతతమోఽధ్యాయః.

బలము ధర్మము సుఖము ధనము ఇవి అత్యద్భుతములగు లక్షణములు; వీటిని పరస్పర విరోధము లేకుండ ఆ త్రేతాయుగ రాజులు సమముగా నిర్వహింతురు. ధర్మార్థ కామ యశో విజయైశ్వర్యాణిమాది ప్రభుశక్తి శాస్త్ర తపో లక్షణములందు వారు (నాటి చక్రవర్తులు) ఋషులను మానవులను దానవులనుకూడ తిరస్కరించగలిగియుందురు. మానవ సహజ శరీర లక్షణములు కూడ వారికున్నతములుగా నుండును. ఎట్లన—వారి జుట్టు నుదటి వైశాల్యమును క్రమ్మివేయునంతగా మీదికివచ్చి పడుచుండును. నాలుక నోటినంతటిని ఒరయునంతగా పొడవుగా నుండును. చామన చాయ-నాలుగు కోర దంతములు కలిగి ఉన్నత వంశమున పుట్టి జితేంద్రియులు ఆజాను బాహువులు తామరకాంతమువంటి చేతులు వృషభములవంటి కీవికల ఆకృతితో వృషభములకువలె దేహనిర్మాణము పెద్దకొలత కలిగి సింహపు మూపు వంటి మూపులతో మేధావంతులయియుందురు. వారి పాదములందు శంఖచక్ర రేఖలు హస్తములందు శంఖపద్మ రేఖలు కలిగి ఎనుబది ఐదువేల సంవత్సరములు ఏరోగమును వార్ధకమును లేక జీవింతురు. ఆ చక్రవర్తులు అంతరిక్షమున సముద్రములందు పాతాళమున పర్వతములందు ఈ నాలుగు చోట్లకూడ వీరు అడ్డులేక సంచరింతురు.

మొత్తముమీద త్రేతాయుగమున యజ్ఞదాన తపస్సత్యములు ప్రధాన ధర్మములు; వర్ణాశ్రమ ధర్మములు సరిగా నడచును; ఐనను ఎవరి మేరలో వారిని నిలుపుటకై దండనీతియు నామమాత్రముగా ప్రవర్తిల్లును. జనులు ఎల్లరు హర్షముతో పుష్టితో మానస శారీరారోగ్యములతో నుందురు. త్రివిధ వేదములును (కర్మపరములు ఉపాసనాపరములు జ్ఞానపరములు) ఋగ్-యజుః-సామాథర్వణములను నాలుగు పాదములతో ఏకవస్తువుగా అఖండ రూపమున నుండును. ప్రజలు మూడు వేలేండ్లు జీవింతురు. వారు పుత్త్ర పౌత్త్రాది పరివారము నడుమ క్రమముగా నెప్పుడో మరణింతురు. ఇది త్రేతాయుగ ధర్మము; త్రేతా సంధ్యాకాలములో ఈ ధర్మములన్నియు ఇందు నాల్గవపంతున నడుచును. సంధ్యాంశ కాలమునందు సంధ్యాకాల ధర్మములో నాల్గవవంతు మాత్రము నడుచును.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున మన్వంతరాను కీర్తన కాల పరిమాణ కథన
త్రేతాయుగధర్మ ప్రతిపాదనమను నూట నలువది ఒకటవ అధ్యాయము.

## ద్విచత్వారింశదుత్తరశతతమోఽధ్యాయః.

## త్రేతాయుగే యజ్ఞప్రవృత్తికథనమ్.

ఋషయః : కథం త్రేతాయుగముఖే యజ్ఞస్యాసీ త్ప్రవర్తనమ్ ।
పూర్వే స్వాయమ్భువే సర్గే యథాచ ప్రబ్రవీహి నః. 1
సూతః : అన్తర్హితాయాం సన్ధ్యాయాం సార్ధం కృతయుగేన తు ।
కాలాఖ్యాయాం ప్రవృత్తాయాం ప్రాప్తే త్రేతాయుగే తథా. 2
ఓషధీషు చ లీనాసు ప్రవృత్తే వృష్టిసర్జనే । ప్రతిష్ఠితాయాం వార్తాయాం గ్రామేషుచ పురేషుచ. 3
వర్ణాశ్రమసమస్థానం కృత్వా మన్త్రాశ్చ సః పునః । సంహితా స్తాస్తు సంహృత్య కథం యజ్ఞం ప్రవర్తయేత్.
దైవతైస్సహ సంహృత్య సర్వసాధన సంభృతః । తస్యాశ్వమేధే వితతే సమాజగ్ము ర్మహర్షయః. 5
యజన్తం పశుభి ర్మేధ్యై రూచు స్సర్వే మహర్షయః । యజ్ఞకర్మణ్యపి తతే కర్మణ్యగ్రే తథా ర్త్విజః. 6
హూయమానే దేవహోత్రే అగ్నౌ బహువిధః క్రతుః । సమ్ప్రతీతేషు దేవేషు సామగేషుచ సుస్వనమ్. 7
పరిక్రాన్తేషు లఘుషు అధ్వర్యుపురుషేషు చ । ఆలబ్ధేషుచ ముఖ్యేషు తదా పశుగణేషు వై. 8
ఆహూతేషుచ దేవేషు యజ్ఞ భుక్షు తదా తతః । య ఇన్ద్రియాత్మకా దేవా యజ్ఞభాగభుజస్తు తే. 9
తా న్యజన్తి తదా దేవాః కల్పాదిషు భవన్తియే । అధ్వర్యుప్రైషకాలేతు వ్యుత్థాయ ఋషయ స్త్వథ. 10

ఋషీణా మిన్ద్రస్యచ యజ్ఞవిషయకవివాదః.

మహర్షయశ్చ తాన్దృష్ట్వా దీనా న్దేవ(న్పశు)గణాం స్తతా। విశ్వాంచ భుఙ్జతే కోఽత్ర కోయంయజ్ఞవిధి స్తథా.
అధర్మో బలవానేష హింసా ధర్మేప్సయా తవ । పశుబన్ధవధ స్త్విష్ట స్తవ యజ్ఞే సురోత్తమ. 12
అధర్మో ధర్మఘాతాయ ప్రారబ్ధః పశుభి స్త్వయా ।
నాయం ధర్మో హ్యధర్మోఽయం న హింసా ధర్మ ఉచ్యతే. 13
ఆగమేన భవా న్ధర్మం ప్రకరోతు యదీచ్ఛసి । విధిదృష్టేన యజ్ఞేన ధర్మేణాత్యయసేతునా. 14
యజ్ఞబీజై స్సురశ్రేష్ఠ త్రివర్గపరిమోషితైః । ఏష యజ్ఞో మహానిన్ద్రః స్వయమ్భువిహితః పురా. 15
ఏవం విశ్వభుగిన్ద్రస్తు ఋషిభి స్తత్త్వదర్శిభిః । ఉక్తో న ప్రతిజగ్రాహ మానమోహసమన్వితః. 16

## నూట నలువది రెండవ అధ్యాయము.

## త్రేతాయుగమున యజ్ఞ ప్రవృత్తి స్వరూపము.

## యజ్ఞములకంటె లోకోపకారకమగు తపస్సే గొప్పదియనుట.

పూర్వము స్వాయంభువ మన్వంతరమున త్రేతా యుగారంభమున యజ్ఞ ప్రవృత్తి ఎట్లుండెను? ఎట్లు జరిగెను? కృతయుగమును దాని సంధ్యా సంధ్యాంశములును ముగిసి కాలనామము ననుసరించిన ప్రవృత్తులతో త్రేతాయుగమారంభమయ్యెను. తద్ యుగానుసారము ఓషధులు మొలచెను. వానలు కురియసాగెను. గ్రామములందును పురములందును జనుల జీవన ప్రవృత్తికి వలసిన వృత్తిధర్మపు నడక ఆరంభమయ్యెను. ఇట్టి దశలో పరమేశ్వరుడు వర్ణాశ్రమ ధర్మ వ్యవస్థను లోకమున ఎట్లు నిలిపెను? మంత్రములను ఎట్లు ఏకత్ర కూర్చెను? వాటితో వేద సంహితలనెట్లు కూర్చెను? వాటితో యజ్ఞములను ఎట్లు ప్రవర్తిల్లజేసెను? ఇదియంతయు మాకు తెలుపుమని ఋషులడుగ సూతుడిట్లు వారికి చెప్పసాగెను. ఋషులారా! మీరడిగిన ప్రశ్నకు సమాధానమును తెలిపెదను; వినుడు; సమర్థుడగు వాడును విశ్వమందలి ప్రాణులను తమ ఆహారమును భుజించునట్లు అనుగ్రహించి వారిచ్చిన హవిరాదులను అనుభవించువాడునునగు ఇంద్రుడు ఐహ లౌకిక పారలౌకిక (స్వర్గపద) కర్మానుష్ఠానమునకు ఉపయుక్తములగు మంత్రములను సమకూర్చి వాటితో లోకమున యజ్ఞములను ప్రవర్తిల్లజేసెను. అందులకై ఇంద్రుడు తానే యజమానుడై సర్వ సాధనములను సమకూర్చుకొని దేవతలందరతో కూడి అశ్వమేధయాగ మాచరించ పూనెను. యజ్ఞమును వితతము చేయు సమయమునకు మహర్షులును వచ్చిరి. ఆ యజ్ఞ కర్మమునందలి ఆరంభ కర్మము ననుష్ఠించుటకై ప్రవర్తిల్లసాగిరి. దేవతలనుద్దేశించి హవనము చేయుటకై ప్రణయనము చేయబడిన అగ్నియందు బహువిధములగు హవిస్సుల హోమము చేయబడుచుండెను. దేవతలందరును సంతుష్టులయిరి. సుస్వరముతో సామ వేదము గానము చేయబడుచుండెను. అధ్వర్యు పురుషులు మిగుల వేగముగా అటునిటు తిరుగుచుండిరి. యజ్ఞ పశువులను ఆలంభము (మంత్రపూర్వకముగ ప్రాణములు తీయబడుట) చేయబడెను. యజ్ఞభాగముల ననుభవించవలసిన దేవతలును ఆహ్వానించబడిరి. ఇంద్రియాభిమానులగు దేవులు ఎవరెవరో వారువారు మాత్రము యజ్ఞ భాగములను అనుభవించు వారయిరి. మిగిలిన దేవతలందరును ఆ ఇంద్రియాధిష్ఠాన దేవతల నారాధించిరి. ప్రతి కల్పాదులయందును యజ్ఞ భాగ భోక్తలగు దేవతలు ఈ ఇంద్రియాభిమాని దేవతలే. (కాని ఈ యజ్ఞమున విశేషము ఒకటి జరిగెను.) అధ్వర్యులు 'ప్రైష' మంత్రములతో ఆయా దేవతలను ఆహ్వానించిన సమయమున ఋషులును మహర్షులును లేచి నిలువబడిరి. యజ్ఞమున ఆలంభము చేయబడిన (చేయబడుచున్న) దీనములగు పశు (దేవ) గణములను చూచిరి. విశ్వభుక్‌గా నున్న ఇంద్రుని వారు ఇట్లు ప్రశ్నించిరి: "నీ ఈ యజ్ఞ విధానము ఎటువంటిది? (ఇది ఏమి యజ్ఞ ప్రక్రియ?) దీనియందు విశ్వభుక్ ఎవరు? సహజముగా ఇతరులు చేయు యజ్ఞమున విశ్వభుక్‌గా నున్న నీవే యజమానుడవై యుండగా దీనియందు ఎవరు 'విశ్వభుక్' స్థానమునందుండును? ధర్మ (ఫల)

మును పొందగోరి నీవు చేయు ఈ (పశు) హింస మిగుల బలవత్తరమగు అధర్మము; సురోత్తమా! నీ ఈ యజ్ఞమునందు పశు బంధమును వాని వధయును నీకు ఇష్టమయినట్లున్నది. పశువులు ఉపకరణములుగా నీవు ఆచరించు ఈ అధర్మము నీ ధర్మమును నశింపజేయును. ఇది ధర్మముగాదు; ఇది అధర్మము; హింస ధర్మము అని ఏవరును అనరు. నీకు ఇట్టి యజ్ఞము నాచరించుటయే ఇష్టమైనచో ఇది తగునని ఆగమ (శాస్త్రవిధి) ప్రమాణమును చూపి ఇది ధర్మమని నిశ్చయించుము. సురశ్రేష్ఠా! ఇంద్రా! ప్రజలను ధర్మమునుండి నివారించు సేతువుఅగు ధర్మమును అవలంబించినదియు శాస్త్రవిధియందు కనబడుచున్నదియు అగు యజ్ఞ ప్రక్రియతోను ధర్మార్థకామములచే ఆకర్షింపబడిన (వాటిని సాధించగల) యజ్ఞ బీజముల (వేదమంత్రముల)తోను స్వయంభూబ్రహ్మ పురాతన కాలమునందే ఈ యజ్ఞమును వేదములందు విధించెను. అనిరి. విశ్వభుక్ (ప్రతియొక విధమగు దేవతారాధనములందును ప్రజలర్పించిన దానియందలి భాగమును తప్పక అనుభవించువాడు) అగు ఇంద్రునితో తత్త్వద్రష్టలగు ఋషులిట్లు పలుకగా మానమునకును మోహము (అజ్ఞానము) నకును వశీభూతుడయియున్న ఇంద్రుడు వారి మాటలను అంగీకరించలేదు.

తేషాం వివాద స్సుమహా న్యజ్ఞే ఇన్ద్రమహర్షిణామ్ । జఙ్గమైః స్థావరైః కేన యష్టవ్యమితి చోచ్యతే. 17
తే తు ఖిన్నా వివాదేన శక్త్యా యుక్తా మహర్షయః । సన్ధాయ సమమిన్ద్రేణ పప్రచ్ఛుః ఖచరం వసుమ్. 18
ఋషయః : మహాప్రాజ్ఞ కథం దృష్ట స్తవ యజ్ఞవిధి ర్నృప ।
ఔత్తానపాదేః ప్రబ్రూహి సంశయన్నో నుద ప్రభో. 19
సూతః : శ్రుత్వా వాక్యం వసుస్తేషా మవిచార్య బలాబలమ్ । వేదశాస్త్ర మనుస్మృత్య యజ్ఞే విధిమువాచహ.
యథోపనీతై ర్యష్టవ్య మితి హోవాచ పార్థివః । యష్టవ్యం పశుభి ర్మేధ్యై రథ మూలఫలైరపి. 21
హింసా స్వభావో యజ్ఞస్య ఇతి మే దర్శనాగమః । యథేమే భాషితా మన్త్రా హింసాలిఙ్గా మహర్షిభిః. 22
దీర్ఘేణ తపసా యుక్తా స్తారకాదినిదర్శనైః । తత్ప్రమాణం మయా చోక్తం తస్మాత్క్షమితు మర్హథ. 23
యది ప్రమాణంస్వాన్యేవ మన్త్రవాక్యాని వో ద్విజాః। తదా ప్రవర్తతాం యజ్ఞో అన్యథా మాఽనృతం వచః.
ఏవంకృతోత్తరా స్తేతు యుజ్యాఽఽత్మానం తతో ధియా। అశవ న్భావినం దృష్ట్వా తమర్థ మృషయ స్తథా.
ఇత్యుక్తమాత్రో నృపతిః ప్రవివేశ రసాతలమ్ । ఊర్ధ్వచారీ నృపో భూత్వా రసాతలచరోఽభవత్. 26
వసుధాతలచారీ తు తేన వాక్యేన సోఽభవత్ ।
ధర్మాణాం సంశయచ్ఛేత్తా రాజా వసు రధో గతః. 27
తస్మాన్న వాచ్యో హ్యేకేన బహుజ్ఞేనాపి సంశయః । బహుద్వారస్య ధర్మస్య సూక్ష్మా దురనుగా గతిః. 28
తస్మా న్న నిశ్చయాద్వక్తుం ధర్మః శక్యోహి కేనచిత్ ।
దేవానృషీ నుపాదాయ స్వాయమ్భువమృతే మనుమ్. 29

యజ్ఞము నాచరించవలసినది జంగమ ప్రాణులగు పశువులతోనా-స్థావర ప్రాణులగు వృక్షాదులనుండి లభించు కందమూల ఫలాదులతోనా? అను విషయమున ఇంద్రునకును మహర్షులకును గొప్ప వాదము నడచెను. మహర్షులు ఈ వాదముతో శక్తిహీనులై మిగుల ఖేదము (అలసట) చెందిరి. చివరకు వారు ఇంద్రునితో (వసుని మధ్యవర్తిగా గ్రహించి అతడు చెప్పిన మాట ఇరుపక్షములవారును అంగీకరింతమని) ఒప్పందమునకు వచ్చి అంతరిక్ష సంచారియగు వసుని ఇట్లడిగిరి. ఉత్తానపాదుని పుత్రుడవును మహాప్రాజ్ఞుడవును అగు వసురాజా! ఈ రెండు విధములలో ఏ యజ్ఞము విధివిహితమని నీవు తలంచుచున్నావో తెలిపి మాసంశయమును పోగొట్టుము. అనిరి. అది వినిన వసురాజు ఈరెండు పక్షముల బలాబలములను విచారించకయే (తనకు స్ఫురించిన) వేదశాస్త్రము ననుసరించి యజ్ఞ తత్త్వమునిట్లు చెప్పెను: యజమానుడు తన శక్తిననుసరించి ఏవి సమకూర్చుకొన్నచో వానితోనే యజ్ఞము చేయుట సమంజసము;

పవిత్రములగు పశువులతోనైననునరే-కందమూల ఫలాదులతోనైననరే. యజ్ఞము సహజముగనే హింసా స్వభావము కలది; అని శాస్త్రములనుండి నాకు తెలిసిన విషయము. అదికాక మహర్షులు కూడ మంత్రములు హింసారూపము లగు అర్థములనే ప్రతిపాదించునని వివరించుచున్నారు. ఆ ప్రమాణమునే నేను చెప్పితిని. కావున మీరు శాంతింప వేడుచున్నాను. విప్రులారా! మీరు అంగీకరించుచున్న మంత్రవాక్యములు మీకు ప్రమాణములయినచో యజ్ఞమును జరుగనిండు; కాదందురా; కాదనుట తగదు; ఏలయన-నేను చెప్పినది అసృతము కాదు. వసురాజిట్లు తమకు సమాధానము చెప్పగా ఆ మహర్షులు తమ బుద్ధిని హృదయమును సంయోజనముచేసి (యోగ దృష్టితో ఆలోచించి) రాబోవు విషయము ఇదియని ఎరిగి అది సత్యమగునట్లు వారు ఆవసుని శపించిరి. వారు శాపవచనమును పలుకగనే రాజు రసాతలమును ప్రవేశించెను. అంతవరకును ఆకాశచరుడుగా నుండిన ఆతడిప్పుడు రసాతలచరు డయ్యెను. ఈ శాప వాక్యముతో ఆతడు వసుధాతలమున చరించువాడు కూడ నయ్యెనుకాని ఖేచరత్వము లేకపోయెను. ఇట్లు ఆతడు ధర్మ విషయక సంశయమును ఛేదింప యత్నించి అధోగతి నందెను. కావున తానెంతగా బహు విషయముల నెఱిగిన వాడైనను ఒక్కడే (ఇతరులతో సంప్రతించక) సంశయమును నిర్ణయించరాదు. ఏలయన ధర్మ నిశ్చయమును చేరుటకు వాకిండ్లు ఎన్నోయున్నవి. వానిలో ఏ ద్వారమునుండి పోయినచో ధర్మమును సరిగా చేరవచ్చునో నిర్ణయించి సరియగు మార్గమున నడుచుట సుకరముకాదు. కావున దేవతలును ఋషులును స్వాయంభువ మనువు అంతటివారు తప్ప మఱి ఎవ్వరును సంశయాస్పద విషయమున నిశ్చయముచేసి చెప్పజాలరు.

తస్మా న్న హింసా యజ్ఞే స్యాద్యదుక్త మృషిభి స్స్వయమ్ ।
ఋషికోటిసహస్రాణి స్వై స్తపోభి ర్దివం గతాః. 30
తస్మా న్న దానయజ్ఞంచ ప్రశంసన్తి మహర్షయః । అంభో మూలం ఫలం శాకముదపాత్రం తపోధనాః. 31
ఏతద్దత్వా విభవత స్స్వర్గలోకే ప్రతిష్ఠితాః । అద్రోహశ్చా ప్యలోభశ్చ దమో భూతదయా తపః. 32
బ్రహ్మచర్యం తప స్సత్య మనుక్రోశః క్షమా ధృతిః । సనాతనస్య ధర్మస్య మూల మేత దిదం నవ. 33
ద్రవ్యమన్త్రాత్మకో యజ్ఞ స్తపశ్చ సమతాత్మకమ్ । యజ్ఞైశ్చ దేవా నాప్నోతి వైరాజం తపసా పునః. 35
ఏవం వివాద స్సుమహా న్యజ్ఞస్యాసీ త్ప్రివర్తనమ్। ఋషీణాం దేవతానాంచ పూర్వంస్వాయమ్భువేఽన్తరే. 36
తత స్తే ఋషయో దృష్ట్వా హృతం ధర్మం బలేన తు। వసోర్వాక్య మనాదృత్య జగ్ము స్తే వై యథాగమమ్.
గతేషుఋషిసజ్ఘేషు దేవాయజ్ఞమవాప్నుయుః । శ్రూయ న్తేహి తపస్సిద్ధా బ్రహ్మక్షత్రాదయో నృప. 38
ఏతే చాన్యేచ బహవ స్తే తపోభి ర్దివం గతాః । రాజర్షయో మహాత్మానో యేషాం కీర్తిః ప్రతిష్ఠితా. 39
తస్మాద్విశిష్యతే యజ్ఞా త్తపస్సర్వైస్తుకారణైః । బ్రహ్మణా తపసా సృష్టం జగద్విశ్వమిదం పురా. 40
తస్మాన్నాప్నోతి తద్యజ్ఞ స్తపోమూలమిదంస్మృతమ్ । యజ్ఞప్రవర్తనం హ్యేవమాసీత్స్వాయమ్భువేన్తరే. 41
తదాప్రభృతి యజ్ఞోఽయం యుగైస్సార్ధం ప్రవర్తితః. 41।

ఇతి శ్రీమత్స్యమహాపురాణే మన్వన్తరానువర్ణనే చతుర్యుగకల్పానుకీర్తనే యజ్ఞవిషయక దేవర్షిసంవాద కథనం నామ ద్విచత్వారింశదుత్తరశతతమోఽధ్యాయః.

ఈ చెప్పిన దానిని బట్టి ఋషుల అభిప్రాయానుసారము యజ్ఞమున హింస యుక్తము కాదు. హింస లేకుండగనే పూర్వము వేలకోట్ల ఋషులు (మరి వేరు సాధనములతో) స్వర్గము చేరిరి. పై చెప్పిన కారణముననే మహర్షు లెల్లరును యజ్ఞమే కాదు-దానము కూడ- హింసా సాధ్యమయినచో తగనిదని తలచిరి. దానిని వారు మెచ్చరు. నీరు మూలములు-(దుంపలు-వేళ్లు) ఫలములు శాకములు జలపాత్రము ఇట్టివి తమ శక్త్యనుసారము దానము చేసి స్వర్గమును సంపాదించి అచట స్థిరముగా నిలిచిరి. ద్రోహము (అపకారము) చేయకుండుట లోభము లేకుండుట బహిరింద్రియ

నిగ్రహము భూతదయ అనెడు తపము బ్రహ్మచర్యమను తపము సత్యము జాలి ఓర్పు నిబ్బరము ఈ తొమ్మిదియు సనాతన (సనా = సదా; సనాతన = ఎల్లప్పుడు ఉండునది; శాశ్వత మయినది) ధర్మమునకు మూలమగు అంశములు; ఋషుల అభిప్రాయానుసారము 1. (హింసాయుక్తము కాకుండ) కేవలము యజ్ఞ విహిత ద్రవ్యములను మంత్రములను యజ్ఞపు వాస్తవరూపము; అట్లే 2. సర్వభూతములందును సమతాదృష్టితో నుండుట వాస్తవమగు తపస్సు; ఇట్టి యజ్ఞముల నాచరించుటచే దేవత్వప్రాప్తియు తపస్సుచేత విరాడ్రూపతాప్రాప్తియు సిద్ధించును. 3. కర్మల ననుష్ఠించుచుండియు తత్ఫలములు తాను పొందవలెనను నభినంధి లేకుండ కర్మఫల సంన్యాసము చేయుటచే బ్రహ్మలోక (హిరణ్యగర్భస్థాన) ప్రాప్తియు 4. వైరాగ్యముతో జీవించుట వలన ప్రకృతి లయమును 5. జ్ఞానము వలన కైవల్యమును పొందును. ఇట్లు ఉత్తమగతి ప్రాప్తికి ఈ ఐదును మార్గములు అని ఋషులు సిద్ధాంతీకరించిరి.

ఈ విధముగా స్వాయంభువ మన్వంతరమునందే (హింసా సహితమగు) యజ్ఞమును ప్రవర్తిల్లజేయుట విషయమున ఋషులకును దేవతలకును మహా వివాదము జరిగెను.

తరువాత ఋషులు బలముతో ధర్మము నెట్టివేయబడుట చూచి వసురాజు చెప్పిన వాక్యమును లెక్కపెట్టకయే (ఆ దేవ ప్రవర్తిత యజ్ఞమును విడిచి) తమ ఇచ్చ వచ్చిన చోటికి వెళ్లిరి.

ఋషి సంఘములు ఇట్లు శాలనుండి వెళ్లిపోయిన తరువాత దేవతలు యజ్ఞమును జరిపిరి. కాని బ్రాహ్మణులు కాని క్షత్త్రియులు కాని రాజులు కాని చాలమంది (హింసాత్మక యజ్ఞములతో పని లేకయే తపస్సుతోనే సిద్ధి పొందిరి. అట్టి వారిలో ప్రియవ్రతుడు ఉత్తానపాదుడు ధ్రువుడు మేధాతిథి వసువు (ఋషులతో హింసాత్మక యజ్ఞము తగునని చెప్పిన యాతడు) సుధామన్ విరజస్ శంఖపాత్-రాజసుడు ప్రాచీనబర్హి-పర్జన్యుడు హవిర్ధానుడు మొదలగు రాజులును ఇంకను ఇట్టివారే మరికొందరును తపశ్చర్యతోనే స్వర్గమునకు పోగలిగిరి. వీరందరును లోకమున ప్రతిష్ఠిత కీర్తిశాలురును మహాత్ములు నగు రాజర్షులే.

కావున సర్వ హేతువులచేతను హింసాయుత యజ్ఞము కంటెను తపస్సే విశిష్టతర మయినది. పూర్వము బ్రహ్మ ఈ విశ్వమును తపస్సుతోనే సృష్టించెను. కావున తపస్సుతో సృష్టింపబడిన ఈ విశ్వస్థితికిని తపస్సే మూలము. కావున తపస్సుచే కలుగు సిద్ధి యజ్ఞము వలన కలుగదు. అని సిద్ధాంతము.

స్వాయంభువ మన్వంతరమున యజ్ఞము మొదటిసారిగా ఇట్లు ప్రవర్తిల్లెను. అది మొదలు కొని ఈ విధమగు యజ్ఞము యుగముల క్రమమున ప్రవర్తిల్లుచు కొనసాగుచున్నది.

ఇది శ్రీమత్స్య మహాపురాణమున మన్వంతరాను కీర్తనమున యజ్ఞ విషయమున దేవ ఋషి సంవాదమను
నూట నలువది రెండవ అధ్యాయము.

## త్రిచత్వారింశదుత్తరశతతమోఽధ్యాయః.

## ద్వాపరయుగధర్మాః.

సూతః : అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి ద్వాపరస్య విధిం పునః। తత్ర త్రేతాయుగే క్షీణే ద్వాపరం ప్రతిపద్యతే.
ద్వాపరాదౌ ప్రజానాంతు సిద్ధి స్త్రేతాయుగేతు యా : పరివృత్తే యుగే తస్మిం స్తత స్తా వై ప్రజాశ్చ చ. 2
తతః ప్రవర్తతే తాసాం ప్రజానాం ద్వాపరే పునః । లోభో ధృతి ర్వణి గ్యుద్ధం తత్త్వానా మవినిశ్చయమ్.
ప్రధ్వంసాశ్చైవ వర్ణానాం కర్మణాంతు విపర్యయః। యజ్ఞో వధః పరో దణ్డో మానో దర్పః క్షమా బలమ్.
తథా రజ స్తమో భూయః ప్రవృత్తే ద్వాపరే పునః । ఆద్యే కృతే నాధర్మోఽస్తి స త్రేతాయాం ప్రవర్తితః.
ద్వాపరే వ్యాకులో భూత్వా ప్రణశ్యతి కలౌ పునః । వర్ణానాం ద్వాపరే ధర్మా స్సంకీర్యన్తే తథాఽశ్రమాః. 6
ద్వైధ ముత్పద్యతే చైవ యుగే తస్మి న్ఛ్రుతి స్మృతౌ। ద్వివా శ్రుతి స్స్మృతిశ్చైవ నిశ్చయో నాధిగమ్యతే
అనిశ్చయోవగమనా ద్ధర్మతత్త్వం న విద్యతే । ధర్మతత్త్వే హ్యవిజ్ఞాతే మతిభేదస్తు జాయతే. 8

పరస్పరం విభిన్నైస్తై ర్దృష్టీనాం విభ్రమేణతు । అథో దృష్టివిభిన్నైస్తైః కృత మత్యాకులం త్విదమ్. 9
ఏకో వేద శ్చతుష్పాద స్సంహత్యతు పునః పునః । సజ్షిపా దాయుషశ్చైవ వ్యతీతే ద్వాపరే తథా. 10
వేదశ్చైక శ్చతుర్ధాతు వ్యస్యతే ద్వాపరాదిషు । ఋషిభిశ్చ పునర్వేదా భిద్యన్తే దృష్టివిభ్రమైః. 11
సతు బ్రాహ్మణవిన్యాసై స్స్వరక్రమవిపర్యయైః । సంహృత్య ఋగ్యజుస్సామ్నాం సంహితాస్తై శ్రుతర్షిభిః.
సామాన్యా ద్వైకృతాచ్చైవ దృష్టిభిన్నైః క్వచిత్క్వచిత్ । బ్రాహ్మణం కల్పసూత్రాణి భాష్యవిద్యా స్తథైవచ.
అన్యేతు ప్రస్థితా స్తాన్వై కేచిత్తాన్ ప్రత్యవస్థితాః । ద్వాపరేషు ప్రవర్తన్తో భిన్నార్థై స్తైః స్వదర్శనైః. 14
ఏకమాధ్వర్యవం పూర్వ మాసీ చ్చైవతు తత్పునః । సామాన్యవిపరీతార్థైః కృతం శాస్త్రాకులం త్విదమ్.15

## నూట నలువది మూడవ అధ్యాయము.

## ద్వాపర-కలి-యుగధర్మములు.

## అందు ద్వాపర యుగధర్మము.

సూతుడు ఋషులకు ఇట్లు చెప్పసాగెను. ఇక మీదట ద్వాపర యుగధర్మ స్వరూపమును తెలిపెదను. త్రేతా యుగము ముగిసిన మీదట ద్వాపరయుగ మారంభమగును. త్రేతాయుగమున ప్రజలకు ఏఏ విధములగు లౌకిక ప్రవృత్తులును వాటి ఫలములును ఉండెనో అవియే ద్వాపర యుగాదియం దుండును. ఆ యుగము మారిపోగానే క్రమముగా తత్పూర్వయుగ కార్యఫలసిద్ధులు నశించును. తరువాత ద్వాపర యుగమున ప్రజలలో లోభము భృతి (వేతనముతో పని చేయుట) వాణిజ్యము యుద్ధము తత్త్వ నిశ్చయము చేయలేకపోవుట వర్ణవ్యవస్థ ధ్వంసమగుట కర్మ విపర్యయము (విహిత కర్మములు చెయకపోవుట-నిషిద్ధ కర్మములను ఆచరించుట) బాటసారులను చంపుట తీవ్రమగు దండనము (దురభి)మానము దర్పము ఓర్పు లేకుండుట బలమునకు ప్రాముఖ్యము-అధిక మగును. ద్వాపరయుగ మారంభము కాగానే రజస్తమోగుణ ప్రవృత్తు లధిక మగును. మొట్టమొదటిదగు కృతయుగమున అధర్మము ఏ మాత్రమును లేకుండెను. త్రేతాయుగమునందు అది ప్రవర్తింపజేయబడెను. ద్వాపరమున వ్యాకులత నొందును. కలియుగమున ధర్మము పూర్తిగా నశించును. ఈ ద్వాపరయుగమున వర్ణధర్మములును బ్రహ్మచర్యాద్యాశ్రమ ధర్మములును సంకీర్ణములు (ఒక దాని ధర్మమునందు మరియొకటి కలిసినవి-విహితమును చేయుటతోపాటు అవిహితమును కూడ చేయుట అవిహితమును విహితమని వాదించుట ఆచరించుట మొదలగు పాండిత్య దుర్విలసితములును ) అగును. శ్రుతి స్మృతుల అర్థ నిర్ణయము విషయమున ద్వైధము (భిన్నాభిప్రాయ చిత్తవృత్తి) ఏర్పడును. శ్రుతి స్మృతులును తామై రెండు అభిప్రాయముల నిచ్చుచుండును. దాని మూలమున ధర్మతత్త్వము ఇది యని తెలియకపోవును. దానివలన ప్రజలలో అభిప్రాయభేదములు పెరుగును. దృష్టి భేదముచే ఐకమత్యము లోపించును. దానిచే లోకము ఆకులత నందును. త్రేతాయుగమున నాలుగు పాదములతో ఒకటిగానే యున్న వేదము మరల మరల సమకూర్చబడుటచేతను ఆయువు తక్కువ యగుటచేతను ద్వాపరయుగమున అది ఋషి పుత్త్రులచే నాలుగుగా విభజింపబడును. ఐనను అపుడు కూడ దృష్టి విభ్రాంతి చేత వేదములు ఏవి ఏవి అను విషయమునను అర్థముల విషయమునను భేదము ఏర్పడును. ఆనాటి మహర్షులు వేదములను బ్రాహ్మణ (వేదములకు ఆర్ష వ్యాఖ్యానములు బ్రాహ్మణములు) విన్యాసము (అమరిక) స్వరక్రమ విపర్యయములతోను ఋగ్యజుః సామ సంహితలుగా వ్యస్తములు(విభక్తములు)గా చేయబడును. వాటిలో ఆయా శాఖలయందు కొంత సమానత యున్నను వాటిలో కొంత వైకృతము(ఆకృతి భేదము)కలిగి అచ్చటచ్చట దృష్టిభేదమును కలుగును. బ్రాహ్మణములు కల్ప సూత్రములు వాటిపై భాష్యములనెడు విద్యాస్థాన భేదములు వానిలో ప్రస్థానభేదములు (మార్గ-సంప్రదాయ-విచారణా పద్ధతి భేదములు) ఏర్పడును. కొంద రొక విషయమున ఒక ప్రస్థానము ననుసరించుచుండ మరికొందరు వారితో ప్రత్యవస్థితులు (ఎదురు వాదము చేయువారు) అగుదురు. ఇట్లు ద్వాపరయుగమున ఋషులు స్వస్వదర్శన(దృష్టి భేద)ముల ననుసరించి వేద తత్సంప్రదాయముల విషయమున భిన్నార్థ ప్రకాశనము చేయుదురు. ఆధ్వర్యవ(యజుర్వేద)శాఖయు అతః

పూర్వము ఒకే రూపమున నుండినది ద్వాపరమున ద్విధాభావమును (రెండుగా అగుటను) పొంది కొన్ని అర్థములు సమానాకారముతో ఉండియు కొన్నిటికి విపరీత(శాస్త్ర సంప్రదాయ విరుద్ధ)ములగు అర్థములు ప్రతిపాదింపబడుటచే శాస్త్రములు ఆకులములగును.

అధ్వర్యవంచ ప్రస్థానై ర్బహుధా వ్యాకులీకృతమ్ । తథైవాథర్వణాం సామ్నాం వికల్పై స్స్వస్య సంక్షయైః. 16
వ్యాకులో ద్వాపరే ష్వర్థః క్రియతే భిన్నదర్శనైః । ద్వాపరే సన్నివృత్తాస్తే వేదా నశ్యన్తివైకలౌ. 17
అదృష్టిర్మరణం చైవ తథైవ వ్యాధ్యుపద్రవాః । వాఙ్మనః కర్మభి ర్దుఃఖై ర్నిర్వేదో జాయతే తతః. 18
నిర్వేదా జ్జాయతే తేషాం దుఃఖమోక్షవిచారణా । విచారణాయాం వైరాగ్యం వైరాగ్యా ద్దోషదర్శనమ్. 19
దోషాణాం దర్శనాచ్చైవ జ్ఞానోత్పత్తిస్తు జాయతే ।
తేషాం మేధావినాం పూర్వం మర్త్యే స్వాయమ్భువేఽన్తరే. 20
ఉత్పత్స్యన్తీహ శాస్త్రాణాం ద్వాపరే పరిపన్థినః । ఆయుర్వేదవికల్పశ్చ అఙ్గానాం జ్యోతిషస్యచ. 21
అర్థశాస్త్రవికల్పాశ్చ హేతుశాస్త్రవికల్పనమ్ । ప్రక్రియా కల్పసూత్రాణాం భాష్యవిద్యావికల్పనమ్. 22
స్మృతిశాస్త్రప్రభేదాశ్చ ప్రస్థానాని పృథక్పృథక్ । ద్వాపరే ష్వభివర్తన్తే మతిభేదా స్తథా నృణామ్. 23
మనసా కర్మణా వాచా కృచ్ఛ్రా ద్వార్తా ప్రసిధ్యతి । ద్వాపరస్సర్వభూతానాం కాయక్లేశపర స్స్మృతః. 24
లాభో భృతి ర్వణిగ్యుద్ధం తత్త్వానా మవినిశ్చయః । వేదశాస్త్రప్రణయనం ధర్మాణాం సఙ్కర స్తథా. 25
వర్ణాశ్రమపరిధ్వంసః కామద్వేషౌ తథైవచ । పూర్ణే వర్షసహస్రే ద్వే పరమాయు స్తథా నృణామ్. 26
నిశ్శేషే ద్వాపరే తస్మిం స్తస్యసంధ్యాతు పాదతః । గుణహీనాస్తు తిష్ఠన్తి ధర్మస్య ద్వాపరస్య తు. 27
తథైవ సన్ధ్యా పాదేన అంశ స్తస్యాం ప్రతిష్ఠితః । ద్వాపరస్య తు పర్యాయే తిష్యస్యతు నిబోధత. 28

కలియుగధర్మాః.

ద్వాపరస్యాంశశేషేతు ప్రతిపత్తిః కలే రథ । హింసాస్తేయానృతం మాయా వధశ్చైవ తపస్వినామ్. 29
ఏతే స్వభావా స్తిష్యస్య సాధయన్తిచ తాః ప్రజాః । ఏష ధర్మ స్స్మృతః కృత్స్నో ధర్మశ్చ పరిహీయతే.

అధ్వర్యవ(యజుర్)వేదము కూడ వేరు వేరు ప్రస్థాన(మార్గ-సంప్రదాయ)ములతో బహు భేదముల నొంది వ్యాకుల మగును. వాటి అర్థములకు ఆయా ఋషులును మునులును భిన్న దర్శనులయి సాంకర్యము కలిగింతురు. (ఉచితానుచితార్థ సంమిశ్రణము కలిగింతురు.) ద్వాపరయుగమున ఇట్లు నడచి నడచి వ్యాకులత నొందిన ఆ వేదవేదార్థములును కలియుగమున నాశమునందును; దీనిచే ద్వాపరమున అజ్ఞానము(అకాల)మరణము వ్యాధ్యుపద్రవములు కలుగును. వాఙ్మనః కాయికములగు దుఃఖము ననుభవించుట కలుగును. దానిచే నిర్వేదము (ప్రాపంచిక జీవనముపై విసుగు) కలుగును. తత్ఫలముగా ప్రజలలో ఈ దుఃఖములనుండి ముక్తి ఎట్లను విచారణ కలుగును. విచారణచే వైరాగ్యమును దానిచే సంసార దోష దర్శనమును దానిచే జ్ఞానోత్పత్తియు కలుగును.

ఈ ద్వాపరమున స్వాయంభువ మన్వంతరము నాటి మేధావులకు శత్రువులు (అలనాటి మేధావుల ఉదారాభిప్రాయములను కాదనువారు) జన్మింతురు. ఈ ద్వాపరమున ఆయుర్వేదము జ్యోతిషము ఇతర వేదాంగములు-వీని విషయమునను శాస్త్ర విరోధులు జన్మింతురు. ఈ శాస్త్రములలో వికల్పములును (సంప్రదాయ-తదభిప్రాయ - భేదములును) ఏర్పడును. అర్థశాస్త్రమున హేతు (న్యాయ వైశేషిక) శాస్త్రమునందు కల్పసూత్రములందు భాష్యరూపమగువిద్యాస్థానములందు స్మృతి శాస్త్రములందు ప్రస్థానములందు వికల్పములేర్పడి దానిచే ప్రజలందును మతి భేదములు ఏర్పడును. మనో వాక్కాయిక కర్మములతో ఎంతో శ్రమపడిన మీదటగాని లోకయాత్ర జరుగకపోవును. ఇట్లు ద్వాపరయుగము సర్వభూతములకును కాయక్లేశము కలిగించునదియని పెద్దలు తలచుచున్నారు. లాభము-భృతి-వాణిజ్యము-యుద్ధము-

శాస్త్రతత్త్వ నిశ్చయము లేకపోవుట-వేదశాస్త్రములను (ఎభిన్నరీతుల) నిర్మించుట ధర్మ సంకరము వర్ణాశ్రమ ధర్మ పరిధ్వంసము కామము ద్వేషము రెండువేల సంవత్సరముల పరమాయువు ఇవి ద్వాపరయుగ లక్షణములు. ద్వాపర సంధ్యా కాలమున యుగ కాలధర్మములో చతుర్థాంశమును సంధ్యాంశకాలమున దానిలో చతుర్థాంశమును ధర్మము ప్రవర్తిల్లును. ఇట్లు ద్వాపరము గడచిన తరువాత వచ్చు కలియుగ స్వరూపమును తెలిపెదను; వినుడు:

కలియుగ ధర్మములు-ఈయుగమున విప్రుల ప్రవృత్తియందలి దోషములు ప్రజల క్షేమహానికి హేతువులనుట.

ద్వాపరయుగ సంధ్యా-సంధ్యాంశముల ప్రవృత్తి ముగియగానే తిష్య (కలి)యుగము ఆరంభమగును. హింస-చౌర్యము-అనృతము-మాయ- తపస్వుల వధ-ఇవి కలియుగ ధర్మములు; ఆనాటి ప్రజలు ఈ ప్రవృత్తులను సాధింతురు. ఇదియే వారికి ధర్మము; వాస్తవమగు ధర్మమంతయు పరిహీణమగును. (పూర్తిగా నశించును.)

మనసా కర్మణా వాచా వార్తా సిధ్యతివా నవా । కలిఃప్రమారకో రోగ స్సతతం చాపి క్షుద్భయమ్. 31
అనావృష్టిభయంచైవ దేశానాంచ విపర్యయః । న ప్రమాణస్థితి ర్హ్యస్తి తిష్యే ఘోరే యుగే కలౌ. 32
గర్భస్థో మ్రియతే కశ్చి ద్యౌవనస్థ స్తథా పరః । స్థావిరే వాఽథ కౌమారే మ్రియన్తేచ కలౌ ప్రజాః. 33
అల్పతేజోబలాః పాపా మహాకోపా హ్యధార్మికాః । అనృతవ్రతలుబ్ధాశ్చ తిష్యే చైవ ప్రజా స్స్థితాః. 34
దురిష్టై ర్దురధీతైశ్చ దురాచారై ర్దురాగమైః । విప్రాణాం కర్మదోషైస్తైః ప్రజానాం జాయతే భయమ్. 35
హింసా మాన స్తథేర్ష్యాచ క్రోధో మాయాఽక్షమాఽధృతిః । తిష్యే భవతి జన్తూనాం లోభో మోహశ్చ సర్వశః.
సఙ్క్షోభో జాయతేఽత్యర్థం కలి మాసాద్య వై యుగమ్।నాధీయన్తే కలౌ వేదాన్న యజన్తే ద్విజాతయః. 37
ఉత్సీదన్తి తదా చైవ వైశ్యై స్సార్ధంతు క్షత్త్రియాః।శూద్రాణాం మన్త్రయోనీషు సమ్బన్ధో బ్రాహ్మణైస్సహ.
భవన్తీహ కలౌ తస్మి ఞ్ఛయనాసనభోజనైః । రాజాన శ్శూద్రభూయిష్ఠాః పాషణ్డానాం ప్రవృత్తయః. 39
కాషాయిణశ్చ నిర్గ్రన్థా(నిష్కచ్ఛా) స్తథా కాపాలినశ్చ హ ।
పైశున్యే దేవవ్రతిన స్తేషాం యే ధర్మదూషకాః. 40
దివావ్రతాశ్చ యే కేచి ద్వృత్త్యర్థం శ్రుతిలిఙ్గినః । ఏవంవిధాశ్చ యే కేచి ద్భవన్తీహ కలౌ యుగే. 41
అధీయన్తే తథా శూద్రా శ్శూద్రా ధర్మార్థకోవిదాః । యజన్తే హ్యశ్వమేధైశ్చ రాజాన శ్శూద్రయోనయః. 42
స్త్రీబాలగోవధం కృత్వా హత్వాచైవ పరస్పరమ్। ఉపకృత్య తథా న్యోఽన్యంసాధయన్తి తథా ప్రజాః.43
దుఃఖప్రచురతాఽల్పాయు ర్దేశోత్సాద స్సరోగతా । అధర్మాభినివేశత్వా త్తమోవృత్తం కలౌయుగే. 44
భ్రూణహత్యా ప్రజానాంచ తథాహ్యేవం ప్రవర్తతే ।
తస్మా దాయు ర్బలం రూపం ప్రహీయన్తే కలౌ యుగే. 45
దుఃఖేనాభిప్లుతానాంచ పరమాయు శ్శతం నృణామ్ । భూత్వాచ నభవన్తీహ వేదాః కలియుగేఽఖిలాః. 46
ఉత్సీదన్తే తథా యజ్ఞాః కేవలా ధర్మసేతవః । ఏషా కలియుగావస్థా సన్ధ్యాంశౌ తు నిబోధత. 47

కలియుగమున మనోవాక్కాయ కర్మములతో వార్త (లోకయాత్ర) నెరవేరునో జరుగునో లేదో కూడ చెప్పజాలము. కలియుగము ప్రాణులకు అధికముగా మరణప్రదము; ఎల్లప్పుడును రోగము ఆకలివలని భయము అనావృష్టి భయము దేశోపద్రవము ఉండును. ప్రజలు దేనినిగాని ప్రమాణముగా గ్రహించరు. ఇట్టి ఘోర కలియుగమున గర్భస్థులుగా యౌవనస్థులుగా కౌమారమున వార్ధకమున ఇట్లనేక వయో దశలలో జనులు మరణింతురు. ప్రజలకు తేజోబలములల్పములు; వారు పాపులు- మహాకోపులు- అధార్మికులు-గా నుందురు. అనృతమాడుటయే వారి వ్రతము. వారు లోభపరులు; వారు అనుష్ఠించు యజనములు అధ్యయనములు ఆచారములు (ప్రమాణముగా గ్రహించు) ఆగమములు సరియైనవికావు. (ముఖ్యముగా సమాజమునకు క్షేమము కలిగింప యత్నించవలసిన) బ్రాహ్మణులు

ఆచరించు కర్మములందలి దోషముల ప్రభావమున ప్రజలు భయముల పాలగుదురు. ఈ యుగమున ప్రజలలో హింసా (దురభి)మానము ఈర్ష్య క్రోధము మాయ అక్షమ (ఓర్పు లేకుండుట) అధృతి (నిబ్బరము లేకపోవుట) లోభము మోహము అన్ని విధముల వ్యాప్తమగును. సర్వవిధములగు సంక్షోభములును మిక్కిలిగా కలుగును. బ్రాహ్మణులు వేదాధ్యయనము చేయరు; (సరియగు) యాగములనుష్ఠించరు. ఇట్లు విప్రులే కాదు-క్షత్రియులును వైశ్యులును ఉత్సాదము (మానసికముగు నాశస్థితి) నందుదురు-శూద్రులకు బ్రాహ్మణులతో (వానప్రస్థమున బ్రాహ్మణులకు శూద్రులతో) మంత్రము-(వేదము) యోని (కామ ప్రవృత్తి) పడక-భోజనము కలిసి-కూర్చుండుట మొదలగు విషయము లలో సంబంధము ఏర్పడును. చాలవరకు శూద్రులు రాజు (పాలకు లగుదురు. పాషండ (వేద శాస్త్రములందు ప్రామాణ్య బుద్ధిలేని) ప్రవృత్తులధికమగును-ప్రజలు కాషాయ వస్త్రధారులు నిర్గ్రంథులు (కర్మానుష్ఠానములను వదలిన వారు) నిష్కచ్ఛులు (లోపల గోచీవంటి దానిని ధరించకయే వస్త్రధారణ చేయువారు) కపాలాది ధారణము తమ ధర్మ లక్షణముగా ధరించు కాపాలికులు-దేశభక్తుల వేషములు ధరించిన లోకవంచకులు లోకనాశకులు ధర్మమును పాడుచేయువారు కొందరు దివావ్రతులు (పగలు మాత్రము జనులకు తాము సదాచారాది లక్షణ సంపన్నులని చూపుటకు వేషముతో నటన చేయుచు పరోక్షమునను మనస్సులోను దుష్ప్రవృత్తులతో ఉండువారు) వృత్తినిమిత్తము (పొట్టకూటికై) వేదాధ్యయనాదికము చేసినట్లు నటించువారు అగుదురు. శూద్రులు వేదాధ్యేతలుగా ధర్మార్థకోవిదులుగా అగుదురు. స్త్రీబాల గోవధ పరస్పర వధలు స్వార్థమునకై పరస్పరోపకారము చేయువారు అగుదురు. దుఃఖప్రాచుర్యము అల్పాయువు-ప్రజలు దేశములు వదలిపోవుట రోగములు చెందుట అధర్మమునందభినివేశము (గాఢాసక్తి) తమోగుణ ప్రవృత్తి భ్రూణ (సాంగ వేదాధ్యయనము వేద ధర్మానుష్ఠానము కల బ్రాహ్మణుల-గర్భస్థ శిశువుల - హత్య) ఆయుర్బల రూపహాని అధికమగును. (ప్రజలెలరు దుఃఖములతో అభిప్లుతులు (మునుకలెత్తినవారు) అగుదురు. వీరి పరమాయువు (ఎక్కువకు ఎక్కువయును) నూరు సంవత్సరములు. అదివరకు ఉన్నంత మంచిస్థితిలో కాదు పరేగదా ఏమాత్రమును మంచిస్థితిలో ఈయుగమున వేదములుండవు. కేవలము ధర్మ వ్యవస్థాపరిరక్షణలో అడ్డుకట్టలవలెనుండు యజ్ఞములు నడువక నశించును. ఇది కలియుగధర్మ ప్రవృత్తి స్వరూపము. ఇక కలి సంధ్యా సంధ్యాంశముల ధర్మస్వరూపమును తెలిపెదను.

## కలిసన్ధి-తదంశ-ధర్మాః.

యుగే యుగే తు హీయన్తే త్రీంస్త్రీన్పాదాంశ్చసిద్ధయః । యుగస్వభావా త్సన్ధ్యాస్తు అవతిష్ఠన్తి పాదతః. 48
సన్ధ్యాస్వభావా స్స్వాంశేషు పాదేనైవావతస్థిరే । ఏవం సన్ధ్యాంశకే కాలే సమ్ప్రాప్తేతు యుగాన్తికే. 49
తేషాం రాజ్ఞా మసాధూనాం శాస్తా భృగుకులోత్థితః । గోత్రేణవై చన్ద్రమసో నామ్నా ప్రమతి రుచ్యతే- 50
కలిసన్ధ్యాంశభావేషు మనో స్స్వాయమ్భువేఽన్తరే । సమాత్రింశత్తు సమ్పూర్ణాః పర్యటన్వై వసున్ధరామ్. 51
అస్త్రకర్మా సవై సేనాం హస్త్యశ్వరథసఙ్కులామ్ । ప్రగృహీతాయుధై ర్విప్రై శ్శతశోఽథ సహస్రశః. 52
స తదా తైః పరివృతో మ్లేచ్ఛా న్సర్వా న్నిజఘ్నివాన్ ।
స హత్వా సర్వశ శ్చైవ రాజాన శ్శూద్రయోనయః. 53
పాషణ్డాం స్స తదా సర్వా న్నిశ్శేషా నకరో త్ప్రభుః । అధార్మికాశ్చ యే కేచి త్తాన్సర్వాన్ హన్తి సర్వశః.
ఉదీచ్యా న్మధ్యదేశ్యాంశ్చ పార్వతీయాం స్తథైవచ । ప్రాచ్యా న్ప్రతీచ్యాంశ్చ తథా విన్ధ్యపృష్ఠాపరాన్తికాన్-
తథైవ దాక్షిణాత్యాంశ్చ ద్రవిడా న్సింహలై స్సహ । గాన్ధారా న్పరదాంశ్చైవ పహ్లవా న్యవనా న్ఛకాన్.56
తుషారాన్ బర్బరాం చ్ఛ్వేతాన్ పుళిన్దా న్దరదా న్ఖసాన్ ।
లమ్పకా నన్ధ్రకాం శ్చోలాం శ్చైవ జాతయః. 57

ప్రవృత్తచక్రో బలవా న్మ్లేచ్ఛానా మన్తకృద్విభుః । విద్రావ్య సర్వభూతాని చచార వసుధా మిమామ్. 58
మానవస్యతు వంశేతు నృదేవస్యేహ జజ్ఞివాన్ । పూర్వే జన్మని విష్ణుశ్చ ప్రమతిర్నామ వీర్యవాన్. 59
సుతస్సవై చన్ద్రమసః పూర్వే కలియుగే ప్రభుః । ద్వాత్రింశేఽభ్యుదితే వర్షే ప్రకాన్తస్త్రింశతః సమాః. 60
నిజఘ్నే సర్వభూతాని మానుషాణ్యేవ సర్వశః । కృత్వా బీజావశిష్టాన్తాంపృథ్వీం క్రూరేణ కర్మణా. 61

ప్రతి యుగమునందును ఆయా యుగపు సద్ ధర్మములు దాని సంధ్యాకాలమునందు మూడు వంతులు నశించి ఒక నాలవవంతు మాత్రము శేషించును. సంధ్యాకాల ధర్మములలో నాలవవంతు మాత్రమే ఆయుగపు సంధ్యాంశ కాలమున మిగులును. ఇట్టి కలియుగ సంధ్యాకాలము కూడ గడచి సంధ్యాంశకాలము వచ్చిన యుగావసాన సమయమున ఆనాటి అసాధు వర్తనులను రాజులను దండించుటకై భృగు వంశమున జన్మించిన చంద్రుడను వాని గోత్రమున (మీదటి తరములలో) ప్రమతియను నాతడు జన్మించును. అతిడా స్వాయంభువ మన్వంతరపు కలియుగ సంధ్యాంశకాలమున నిండుగ ముప్పదిఏండ్లు పృథివియంతయు సంచరించుచు అస్త్ర ప్రయోగముతో యుద్ధములు చేయుచు చతురంగ బలము వెంటరాగా ఆయుధములుపట్టి నూర్లకొలది వేలకొలది విప్రులు తను పరివారించి వచ్చుచుండగా సర్వ మ్లేచ్ఛులను సంహరించును. శూద్రులగు రాజులను పాషణ్డులను నిఃశేషులనుగా చేసెను. అధార్మికులనందరను- ఉదీచ్య మధ్యదేశ్య పార్వతీయ ప్రాచ్య ప్రతీచ్య వింధ్య పృష్ఠవాసులను అపరాంతికులను (భారతదేశపు పడమటి అంచులందలివారిని) దాక్షిణాత్య ద్రవిడ సింహళ జనులను గాంధార దరద పహ్లవ యవన శకతుషార బర్బర పుళింద పుల్కస లింబకార్ధకరక చౌర జాతులను-సంహరించును. తన చక్రము (సేన)ను ప్రవర్తిల్ల (సంచరింప) జేసి శూద్ర రాజులను అంతమొందించును. (ధర్మవిరోధి) సర్వప్రాణులను తరుముచు ఈ భూమియందంతటను అతడు సంచరించును. ఇతడు మను వంశమున జన్మించిన నృదేవునికి (రాజునకు) కుమారుడు; ఈ జన్మమునకు ముందు అతడు సాక్షాద్విష్ణువే. అతడు ప్రమతియను పేర చంద్రముడను రాజునకు వీర్యశాలియగు కుమారుడుగా పుట్టును. అతడు తన ముప్పది రెండవఏట బయలుదేరి ఇరువది సంవత్సరములపాటు ఇట్లు మానవులలో సర్వ ప్రాణులను చంపిచంపి క్రూరకర్మమునాచరించి ఈ పృథివిని మానవ బీజావశేషమునుగా (ఏకొలదిమందియో మాత్రము మిగులునట్లు) చేసెను.

పరస్పరనిమిత్తేన కాలేనాకస్మికేన చ । సంస్థితా సహసా యాతు సేనాప్రమతినా సహ. 62
గఙ్గాయమునయోర్మధ్యే సిద్ధిం ప్రాప్తా సమాధినా । తతస్తేషు ప్రణష్టేషు సన్ధ్యాంశే క్రూరకర్మసు. 63
ఉత్సాద్య పార్థివా న్సర్వా న్తేష్వతీతేషు వై తదా । తత స్సన్ధ్యాంశకే కాలే సమ్ప్రాప్తేచ యుగాన్తికే. 64
స్థితాఃస్వల్పావశిష్టాస్తు ప్రజా స్త్విహ క్వచిత్క్వచిత్ । స్వప్రధానా స్తదా తేవై లోభావిష్టాస్తుసర్వశః. 65
ఉపహింసన్తి చాన్యోన్యం ప్రలుమ్పన్తి పరస్పరమ్ । అరాజకే యుగాంశేతు సంశయే సముపస్థితే. 66
ప్రజాస్తావై తదాసర్వాః పరస్పరభయార్దితాః । వ్యాకులాస్తాః పరావృత్తా స్త్యజ్య దేహం గృహాణి తు. 67
స్వాన్ప్రాణా న్సమవేక్షన్తో నిష్కారుణ్యాత్ సుదుఃఖితాః ।
నష్టే శ్రౌతస్మృతౌ ధర్మే కామక్రోధవశానుగాః. 68
నిర్మర్యాదా నిరానన్దా నిస్స్నేహా నిరపత్రపాః । నష్టే ధర్మే ప్రతిహతా హ్రస్వకాః పఞ్చవింశకాః. 69
హిత్వా దారాంశ్చ పుత్రాంశ్చ విషాదవ్యాకులాః ప్రజాః ।
అనావృష్టిహతా స్తేవై వార్తాముత్సృజ్య దుఃఖితాః. 70
సదా కృష్ణాజినధరా నిష్క్రియా నిష్పరిగ్రహాః । వర్ణాశ్రమపరిభ్రష్టా స్సఙ్కరం ఘోర మాస్థితాః. 71
ఏతాం కాష్ఠా మనుప్రాప్తా హ్యల్పశేషాః ప్రజా స్తతః। జన్తవశ్చ క్షుధాఽఽవిష్టా దుఃఖా న్నిర్వేద మాగమన్.
సంశ్రయన్తి విదేశాంస్తాం శ్చక్రవ త్పరివర్తనాః । తతః ప్రజాస్తు తాస్సర్వా మాంసాహారా భవన్తి తాః. 73

మృగా స్వరాహా స్వృషభా స్యేచాన్యే వనచారిణః । భక్ష్యాంశ్చైవాప్యభక్ష్యాంశ్చ సర్వాంస్తా స్భక్షయన్తి తాః.
సముద్రం సంశ్రితా యాస్తు నదీశ్చైవ ప్రజా స్తథా। తేపి మత్స్యైః హరన్తీహ ఆహారార్థం చ సర్వశః. 75
అభక్ష్యాహారదోషేణ ఏకవర్ణా గతాః ప్రజాః । యథా కృతయుగే పూర్వ మేకవర్ణ మభూత్కిల. 76
తథా కలియుగస్యాన్తే శూద్రీభూతాః ప్రజా స్తథా । ఏవం వర్షశతం పూర్ణం దివ్యం తేషాం ప్రవర్తతే. 77
*షట్త్రింశత్తు సహస్రాణి మానుషాణితు తానివై ।

ఇట్టి స్థితిలో పరస్పర హేతువుల చేతను కాలవశమునను ఆకస్మికముగను (ఏ కారణమును లేకయును) ఒకటిగా ప్రమతివెంట కూడియున్న సేన ఈ చెప్పిన పని పూర్తికాగానే శీఘ్రకాలముననే గంగా యమునల నడుమ (ప్రయాగ క్షేత్రములో) సమాధి నవలంబించి ప్రమతితోకూడ దేహత్యాగమొనరించెను. ఇట్లు స్వాయంభువ మన్వంతర మందలి సంధ్యాంశమున క్రూరకర్ములగు జనులు పూర్తిగా నశించగా నాటి రాజులనందరను నశింపజేసి ప్రమతి మొదలగువారును గతించిపోగా సంధ్యాంశమందలి కడపటి కాలమానన్నముకాగా స్వల్పావశిష్టులుగా మిగిలిన కొలదిమంది ప్రజలును అచ్చటచ్చట మిగిలియుందురు. వారును తమ క్షేమమే తాము చూచుకొనుచు స్వప్రధాన దృష్టి కలవారై సర్వ విధముల లోభావిష్టులయి పరస్పరము హింసించుకొనుచు దోచుకొనుచు నుండిరి. లోకమరాజకమై ప్రజల జీవితము సంశయగ్రస్తమయ్యెను. ప్రజలు పరస్పర భయపీడితులై వ్యాకులతనొంది ఒకరికొకరికి పొత్తు పొంతనలు లేక కొందరు గృహములు విడిచిపోయిరి. మరికొందరు దేహములనే విడిచిరి. తమ్ము దయచూచువారు లేకపోగా తమతమ ప్రాణముల కాపాడుకొనుచు మిగుల దుఃఖపీడితులైరి. శ్రౌతస్మార్త ధర్మములు నశించెను. ప్రజలు కామక్రోధ వశులు మర్యాద తప్పినవారు ఆనందరహితులు స్నేహబుద్ధి సిగ్గు బిడియములు లేని వారునయిరి. ధర్మనాశమయ్యెను. వారాపదలపాలైరి. పొట్టివారును ఇరువదియైదేండ్లకంటె జీవించని వారునయిరి. ప్రజలు విషాదముతో వ్యాకులురై దారపుత్త్రుల విడిచి వానలు లేక ఇబ్బందులపాలయి జీవనోపాధులు విడిచి (లేక) దుఃఖితులై జింకచర్మములే ధరించుచు ఏ పనులును చేయక ఇచ్చువారును పుచ్చుకొనువారును లేక వర్ణాశ్రమ పరిభ్రష్టులయి ఘోరమగు ధర్మ సంకరము నొందిరి. మిగిలిన కొలదిమంది ప్రజలును ఈ స్థితినొందిరి. ఇతర ప్రాణులును ఆకలి పీడనందుచు జీవితముపై విసుగు చెందెను. చక్రములవలె నిలుకడలేక సంచరించుచు తమ దేశముల విడిచి విదేశముల నాశ్రయించిరి. వారు మాంసాహారులయి లేళ్ళు మొదలగు వానిని పందులను ఎద్దులను మరి ఇతర వనచారి ప్రాణులను తినసాగిరి. సముద్ర నదీ తీరముల నాశ్రయించిన ప్రజలును మత్స్యములు మొదలగువానిని (వారు బ్రాహ్మణులైనను) తినిరి. భక్ష్యాభక్ష్య విచారణను వారు విడిచిరి. అభక్ష్యాహార దోషముచే జగత్తున ఒకే వర్ణమయ్యెను. ఇది కృతయుగపు స్థితివలె నుండెను. (కృతమున అందరను ధర్మపరులై ఒకే వర్ణము వారుగానయిరి. ఈ కలియుగమున అధర్మవశులై ఏక వర్ణమువారైరి.) ఇట్లు కలియుగాంతమున ఎల్ల ప్రజలును శూద్రీభూతులయిరి. ఇట్లు నూరు దివ్య వర్షముల కాలము గడచెను. ఇది మానవ మానమున ముప్పది ఆరువేల సంవత్సరములు.

అథ దీర్ఘేణ కాలేన పక్షిణః పశవ స్తథా. 78
మత్స్యైశ్చైవ హతాస్సర్వే క్షుధావిష్టైశ్చ సర్వశః । నిశ్శేషేష్వథ సర్వేషు మత్స్యపక్షిపశుష్వథ. 79
సన్ధ్యాంశే ప్రతిపన్నేషు నిశ్శేషాస్తు తదాకృతాః । తతః ప్రజాస్తు సమ్భూయ కన్దమూల మథాఖనత్. 80
ఫలమూలాశినస్సర్వే అనికేతా స్తథైవచ । వల్కలా న్యథ వాసాంసి అధశ్శయ్యాశ్చ సర్వశః. 81
పరిగ్రహో న తేష్వస్తి న చ శుద్ధి మవాప్నుయుః । ఏవం క్షయం గమిష్యన్తి హ్యల్పశిష్టాః ప్రజా స్తదా. 82
తాసా మల్పావశిష్టానా మాహారా ద్వృద్ధిరిష్యతే । ఏవం వర్షశతం దివ్యం సన్ధ్యాంశ స్తస్య వర్తతే. 83
తతో వర్షసహస్రాన్తే అల్పశిష్టాః స్త్రియస్తు తాః । మిథునానితు తాస్సర్వా హ్యన్యోన్యం సమ్ప్రజజ్ఞిరే. 84
తతస్తాస్తు ప్రియంతేవై పూర్వోత్పన్నాః ప్రజాస్తు యాః । జాతమాత్రే ష్వపత్యేషు తతః కృత మవర్తత. 85

* షట్త్రింశను.

యథా స్వర్గే శరీరాణి నరకేచైవ దేహినామ్ । ఉపభోగసమర్థాని ఏవం కృతయుగాదిషు. 86
ఏవం కృతస్య సన్తానః కలేశ్చైవ క్షయ స్తథా । విచారణాత్తు నిర్వేద స్సామ్యావస్థాత్మతా తథా. 87
తతశ్చైవాత్మసమ్బోధః సమ్బోధా ద్ధర్మశీలతా । కలిశిష్టేషు తేష్వేవ జాయన్తే పూర్వవ త్ప్రజాః. 88
భావినోఽర్థస్యచ బలా త్తతః కృత మవర్తత । అతీతానాగతాని స్యు ర్యాని మన్వన్తరే ష్విహ. 89
ఏతే యుగస్వభావాశ్చ మయోక్తాస్తు సమాసతః । విస్తరేణానుపూర్వ్యాచ్చ నమస్కృత్వా స్వయమ్భువే. 90

ఇట్లు చాలకాలము గడచిన మీదట ఆకటి బాధతో ప్రజలు పశుపక్షులను మత్స్యములను దొరకినచోట దొరకిన వెల్ల తిని వేయగా అవి ఏమాత్రమును మిగులకపోయెను. నాటి కలి సంధ్యాంశస్థితి ఇది. అంతట ప్రజలు నేల త్రవ్వి కొని కందమూలములను-చెట్లనుండి ఫలములను-తినసాగిరి. వారుండుట కిండ్లు లేకుండెను. వారికి చెట్లబెరడులే వస్త్రములు. నేలయే పడకలు. దాన పరిగ్రహములు వారిలో లేకుండెను. శుద్ధి లేకుండెను. ఇంకను మిగిలిస కొలది మంది కూడ ఇట్లు క్రమముగ నశించిరి. ఇంకను అల్పావశిష్టులుగా మిగిలినవారు ఆహారమునుఉన్నదానిని తిని వృద్ధి నొందిరి. ఇట్లు కలిసంధ్యాంశము నూరేండ్లును గడచెను. ఇట్లు వేల మానవ సంవత్సరముల తరువాత మిగిలిన కొలది మంది ప్రజలును వారి కుమారులును మిగిలియున్న స్త్రీలతో దాంపత్య సంబంధమును వ్యవస్థ చేసికొనిరి. సంతానమును కనిరి. వారికి సంతానము కలిగిన కొలదికాలములోనే వారికి ముందటి తరముల జనులు (ఈ పుట్టిన సంతానపు తల్లిదండ్రుల తరపు జనులు) మరణించిరి. (కలియుగపు జను లెవ్వరును మిగులలేదు.) ఇట్లంతట కృతయుగ మారంభమయ్యెను. జీవులు ఈ భూలోకపు దేహమును విడిచిన తరువాత వారి పుణ్య పాపముల ననుసరించి స్వర్గనరక సుఖదుఃఖానుభవార్థము మరి యొక దేహము ఆ జీవులకు లభించునట్లే కలియుగపు జనులనుండి కృతయుగమునకు సంబంధించిన జనులకు దేహప్రాప్తి యయ్యెను. ఇది కలియుగము ముగిసి కృతయుగ మారంభమయిన విధము. కలియుగమునుండి మిగిలినవా రెవ్వరైన నున్నచో వారియందును ఈ కృతయుగ ప్రజలయందును విచారణా ప్రవృత్తి కలిగెను. దానిచే ప్రాపంచిక జీవితముపై విసుగు సత్త్వరజస్తమోగుణముల సమతాస్థితి దానిచే ఆత్మజ్ఞానము దానిచే ధర్మశీలము కలిగి మొదటి కృతయుగమందు వలె సజ్జనులగు ప్రజలు పుట్టిరి. దీని కంతటికిని భవితవ్యమగు అర్థము (జరుగవలసిన విషయము-జీవుల పూర్వ కర్మాను గుణమగు అదృష్టమను ధర్మాధర్మ ఫలములును) హేతువు. దీని కంతటికిని మూలతత్త్వమగు స్వయంభూ బ్రహ్మకు నమస్క రించి మీకు ఈ యుగధర్మ ప్రవృత్తులన్నియు తెలిపితిని. యుగప్రవృత్తులు ప్రతి ఆ వృత్తియందును ఇట్లే యుండును. ఇది యుగ ప్రవృత్తుల సమాస-వ్యాస-కథనము. (మొదట ఒక విషయమును సంగ్రహముగ చెప్పి పిదప దానియందలి ప్రత్యేకాంశముల గ్రహించి విస్తరించి చెప్పుట సమాస-వ్యాస-కథనము.)

ప్రవృత్తేతు తత స్తస్మి న్పునః కృతయుగే తు వై । ఉత్పన్నాః కలిశేషేషు ప్రజాః కార్తయుగా స్తథా.
తిష్ఠన్తి చేహ సిద్ధా యే అదృష్టా విహరన్తి చ । సహ సప్తర్షిభి ర్యేతు తత్ర యేచ వ్యవస్థితాః. 92
బ్రహ్మక్షత్రవిశ శ్శూద్రా బీజార్థే యే ఇహ స్మృతాః ।
కార్తే యుగభవై స్సార్ధం నిర్విశేషా స్తదాఽభవన్. 93
తేషాం సప్తర్షయో ధర్మం కథయన్తీహ తేషు చ । వర్ణాశ్రమాచారయుక్తం శ్రౌతస్మార్తోదితం తదా. 94
శ్రౌతస్మార్తస్థితానాంతు ధర్మే సప్తర్షిదేశితే । తేతు ధర్మవ్యవస్థార్థం తిష్ఠన్తే హ యుగే యుగే. 95
మన్వన్తరాధికారేతు తిష్ఠన్తి ఋషయస్తు తే । యథా దావప్రదగ్ధేషు తృణేష్వేవాపరం తృణమ్ 96
వనానాం ప్రథమం వృష్ట్యా తేషాం మూలేషు సమ్భవః । ఏవం యుగయుగానాంవై సన్తానస్తు పరస్పరః.
వర్తతే హ్యనవచ్ఛేదా ద్యావ న్మన్వన్తరక్షయః । సుఖ మాయు ర్బలం రూపం ధర్మోఽర్థః కామ ఏవ చ. 98
యుగే ష్వేతాని హీయన్తే త్రీన్పాదాంశ్చ క్రమేణ తు । ఇత్యేష ప్రతిసన్ధిర్వః కీర్తితస్తు మయా ద్విజాః. 99

చతుర్యుగానాం సర్వేషా మేతదేవ ప్రసాధనమ్ । ఏషాం చతుర్యుగానాంతు గణితా హ్యేకసప్తతిః. 100
క్రమేణ పరివృత్తాస్తా మనోరన్తర ముచ్యతే । యుగాఖ్యాసుతు సర్వాసు భవతీహ యథాచ యత్. 101
తదేవ చ తదన్యాసు పురస్తాద్వై యథాక్రమమ్ । సర్గేసర్గే యథా భేదా హ్యుత్పద్యన్తే తథైవచ. 102
చతుర్దశసు జాయన్తో జ్ఞేయా మన్వన్తరే ష్విహ । ఆసురీ యాతుధానీచ పైశాచీ యక్షరాక్షసీ. 103
యస్మి న్యుగే తదాకాలం ప్రజా జాయన్తి తా శ్శృణు । తథా కల్పయుగై స్సార్ధం భవన్తే తుల్యలక్షణాః.
ఇత్యేత ల్లక్షణం ప్రోక్తం యుగానాం వై యథాక్రమమ్ ।
మన్వన్తరాణాం పరివర్తనాని చిరప్రవృత్తాని యుగస్వభావాత్. 105
క్షణం న సంతిష్ఠతి జీవలోకః క్షయోదయాభ్యాం పరివర్తమానః ।
ఏతే యుగస్వభావాశ్చ పరిక్రాన్తా యథాక్రమమ్. 106
మన్వన్తరాణి యాన్యస్మి న్కల్పే వక్ష్యామి తాని చ. 106½

ఇతి శ్రీమత్స్యమహాపురాణే మన్వన్తరానువర్ణనే ద్వాపరకలియుగ యుగధర్మాది
కథనం నామ త్రిచత్వారింశదుత్తరశతతమోఽధ్యాయః.

ఇట్లు ప్రవర్తిల్లిన కృతయుగమునందు ఆది కలియుగమునుండి మిగిలిన వారికి జనించినవారే ఆది ప్రజ లగుదురు. ఈ లోకమున ఎవరికిని కనబడక అదృష్టులై తిరుగుచుండు సిద్ధులును సప్త ఋషులతోను కూడ ద్యులోకమందుండు మహాపురుషులును లోకమున ఈ కృతయుగ ప్రజల ఉత్పత్తికి బీజరూపమున నిలిచియున్న బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్ర శేష ప్రజలును ఈ కృతయుగారంభపు ఆది ప్రజలతో కలిసిమెలసి తత్సములయి యుండి వీరికి ధర్మము నుపదేశింతురు. వర్ణాశ్రమాచార ధర్మములను శ్రౌత స్మార్త కర్మ మూల ధర్మప్రవృత్తులును సప్తర్షులు వీరి కుపదేశింతురు. ఏలయన ధర్మవ్యవస్థా ప్రతిష్ఠార్థమై సప్తర్షులు ఈ లోకపు ప్రజల నడుమ ప్రతియుగమునను నిలుతురు. వారి యుపదేశముచే ప్రజలును ధర్మకర్మాచరణములందు ప్రతిష్ఠితులు (దృఢాభి నివేశముతో నిలిచినవారు) అగుదురు. ఈ ఋషు లిట్లు మన్వంతర ప్రవర్తనాధికారమునందు నిలిచియుండి లోకమున ధర్మప్రతిష్ఠా ప్రవృత్తులకు హేతుభూతు లగుదురు. వనములలో దావాగ్ని (దవమనగా అడవి) వలన తృణములు కాలిపోయినను దానిని చల్లార్చుటకై కురిసిన వాననీటిబొట్టు వడినందున ఆ దావాగ్ని పాలయిన తృణపు మొదటినుండియే ఈ దావాగ్నిలో దగ్ధము కాక మిగిలిన ఈ తృణ బీజ శేషము నుండి క్రొత్త తృణము మొలచును గదా: అట్లే యుగము తరువాత మరియొక యుగపు ఆరంభమున ప్రజా సంతానము (సంతానము=నైరంతర్యమున కొనసాగుట) జరుగును. ఇట్లు రెండేసి యుగముల పరస్పర సహకారముతో యుగానంతర యుగప్రవృత్తి మన్వంతరము ముగియు వరకు అవిచ్ఛిన్నమయి సాగుచునే యుండును. కృతము మొదలు కలివరకు యుగములలో ఆయుర్బల ధర్మార్థ కామములు క్రమమున నాల్గవవంతు చొప్పున తగ్గుచు వచ్చును. ఇది ప్రతిసంధి(సంధ్యా సంధ్యాంశ)దశాప్రవృత్తి ప్రకారము (ప్రకారము=రీతి); ప్రతి చతుర్యుగము (చతుర్యుగము=మహాయుగము=కృత త్రేతా ద్వాపర కలియుగముల సముదాయము) సందున యుగ పరివర్తన క్రమ మిట్లే యుండును.

ఇటువంటి మహాయుగములు డెబ్బది యొకటి జవగో ఒక మన్వంతర మగును.

ప్రతి యుగమునందును కృతాదియుగ చతుష్టయమునందుచు ఏ యుగమునందు ఒకసారి ఏది ఎపుడు ఎట్లు జరుగునో అదియే అట్టి ప్రతియొక ఆవృత్తియందును జరుగును. ప్రతియొకి యుగ సృష్టియందును కొన్ని విశేషాంశము లందు వీటికి పరస్పర భేదమును ఉండవచ్చును. ఇవియు అట్లే ప్రతియుగ మహాయుగా వృత్తియందును జరుగుచుండును. ఈ విషయము పదునాలుగు మన్వంతరములందును ఇట్లే ఆవృత్త మగును. మానవులు మాత్రమేకాక అసురులు యాతుధానులు పిశాచులు యక్షులు రాక్షసులు మొదలగు జాతులవారు కూడ ఆయా యుగ మహాయుగ మన్వంతరములయందు సమాన లక్షణములతో నుందురు.

ఇట్లు మీకు యుగముల లక్షణము యథాక్రమముగ తెలిపితిని. ఇట్లే కల్పావసానము వరకు మన్వంతరములును పరివర్తనమునందుచు పోవును. ఇవి ఇప్పటికి ఎంతయో చిరకాలమునుండి ప్రవర్తిల్లుచు వచ్చుచున్నవి. ఇక ముందును కొనసాగుచుండును. యుగ స్వభావమే ఇందులకు హేతువు. ఈ జీవలోకము క్షణకాలము కూడ ముందునకు సాగక మార్పు నొందక యుండదు. ఈ జీవలోకమునకు నాశము ఉత్పత్తి ఈ రెండును స్వాభావికములు.

ఇట్లు యథాక్రమమున మీకు యుగ స్వభావములను తెలిపితిని. ఈ కల్పమునందు గడచిన-గడుచుచున్న-గడువనున్న-మన్వంతరముల విషయమును కూడ తెలిపెదను.

ఇది శ్రీమత్స్యమహాపురాణమున మన్వంతరాను కీర్తనమున యుగ లక్షణాను కీర్తనమను నూట నలువది మూడవ అధ్యాయము.

## చతుశ్చత్వారింశదుత్తరశతతమోఽధ్యాయః.
## దేవాసురయక్షగన్ధర్వ మనుష్యాదిపరిమాణోత్సేధకథనమ్.

సూతః : మన్వన్తరాణి యాని స్యుః కల్పే కల్పే చతుర్దశ ।
వ్యతీతానాగతాని స్యు ర్యాని మన్వన్తరే ష్విహ. 1
విస్తరేణానుపూర్వ్యాచ్చ స్థితం వక్ష్యే యుగే యుగే । తస్మిన్యుగేచ సమ్భూతి ర్యాసాం యావచ్చ జీవితమ్.
యుగమాత్రంతు జీవంతి న్యూనం తత్స్యా ద్ద్వయేనతు । చతుర్దశసు తావంతో జ్ఞేయా మన్వంతరేష్విహ. 3
మనుష్యాణాం పశూనాంచ పక్షిణాం స్థావరైః సహ । తేషా మాయు రుపక్రాంతం యుగధర్మేషు సర్వశః. 4
తథైవాయుః పరిక్రాంతం యుగధర్మేషు సర్వశః. 4u
ఉస్థితించ కలౌ దృష్ట్వా భూతానా మాయుష స్తథా ।
పర మాయుశ్శతం త్వేత న్మనుష్యాణాం కలౌ స్మృతమ్. 5
దేవాసురమనుష్యాశ్చ యక్షగన్ధర్వరాక్షసాః । పరిణాహోచ్ఛ్రయై స్తుల్యా జాయన్తే హ కృతే యుగే. 6
షణ్ణవత్యఙ్గుళోత్సేధో అష్టానాం దేవయోనినామ్ । నవాఙ్గుళప్రమాణేన నిష్పన్నేన తథాష్టకమ్. 7
ఏతత్స్వాభావికం తేషాం ప్రమాణ మధికుర్వతామ్ । మనుష్యా వర్తమానాశ్చ యుగసంధ్యాంశకే ష్విహ. 8
దేవాసురప్రమాణంతు సప్తసప్త్యాఙ్గుళం క్రమాత్ । చతురాశీతికైశ్చైవ కలిజై రఙ్గులై స్స్మృతమ్. 9
ఆపాదతలమస్తక్యే నవతాలో భవేత్తు యః । సంహత్యా యా తు బాహుశ్చ దైవతైరపి పూజ్యతే. 10
గజాశ్వహస్తినాం చైవ మహిషస్థావరాత్మనామ్ । క్రమేణైతేన విజ్ఞేయా హ్రాసవృద్ధి ర్యుగేయుగే. 11
షట్సప్తత్యఙ్గుళోత్సేధః పశు రాకకుదో భవేత్ । అఙ్గుళానా మష్టశత ముత్సేధో హస్తినాం స్మృతః. 12
అఙ్గుళీ(శా)నాం సహస్రంతు ద్విచత్వారింశదఙ్గుళమ్ । శతార్ధ మఙ్గుళానాంతు ఉత్సేధ శ్శాఖినాంపరః. 13

## నూట నలువది నాలుగవ అధ్యాయము.
## దేవాసుర యక్ష గంధర్వ మనుష్య పశుపక్షి-
## వృక్షాదుల యుగానుగత పరిమాణాదికము.

సూతుడు ఋషులకు ఇట్లు చెప్పసాగెను. ప్రతి కల్పమునందును వచ్చు పదునాలుగు మన్వంతరములందును ఆయా యుగములందు దేవాది జాతుల జన్మము వారి శరీర ప్రమాణము వారి జీవితకాలము అనుపూర్విగా విస్తరముగ చెప్పెదను.

పదునాలుగు మన్వంతరములందును కృతాదియుగములందు ఆ యుగ ప్రమాణము-సంధ్యా సంధ్యాంశములు కాక-దివ్యమానమున ఎన్ని సంవత్సరములో ఆ యుగపు మానవులు మానవ మానమున అన్ని సంవత్సరములు జీవిం

తురు (సంధ్యా సంధ్యాంశములు కాక కృతయుగ ప్రమాణము నాలుగు వేల దివ్య వర్షములు కావున ఆ యుగపు మానవులు మానవ మానమున నాలుగు వేల ఏండ్లు జీవింతురు. అని ఇట్లు అన్ని యుగముల విషయము గ్రహించవలెను. యుగధర్మము ననుసరించియే ఆయా యుగములందలి మానవ పశుపక్షి వృక్షాదుల ఆయుః పరిమాణాదికము ఏర్పడినది. వాటి శరీర పరిమాణము ఎత్తునరి కూడ అంతే. కాని కలియుగమున మాత్రము ప్రాణుల దౌర్బల్యము అస్థిరత చూచి మానవుల పరమాయువు నూరు సంవత్సరములేయని స్వయంభూ బ్రహ్మ నిర్ణయించెను. (పైని చెప్పిన విధముగ నైనచో యుగానుసారము కలి మానవుల పరమాయువు ఒక వేయి ఏండ్లు ఉండవలయును.)

ఇక కృతాది యుగములలో దేవతాది ప్రాణుల శరీరపు ఎత్తునరి మొదలగునవి: కృతయుగమున దేవాసుర మానవ యక్ష గంధర్వ రాక్షసులు దేహపు చుట్టు కొలతలో కాని ఎత్తునరిలో కాని సమానులై యుందురు. విద్యాధరాదులగు ఎనిమిది దేవజాతుల వారును మానవులును కూడ కృతయుగమున తొంబది యారు(కృతయుగపు)అంగుళముల ఎత్తు కలిగియుందురు. ఆ యుగ సంధ్యాంశములయందు వీరి శరీరముల ఎత్తునరి డెబ్బదిరెండంగుళములే ఉండును. కలియుగమున దేవతల ఎత్తునరి నలువది తొమ్మిది-రాక్షసుల శరీరపు ఎత్తు ఎనుబది నాలుగు- కలియుగపు అంగుళములు ఉండును. [కలియుగమున మానవుల శరీరపు ఎత్తు తొంబది యారంగుళములే-కాని ఇవి కలియుగపు మానవుల ప్రమాణము ననుసరించియని తెలియవలెను. ఇట్లన్ని యుగములందును మానవదేహ ప్రమాణము తొంబది యారంగుళములేయైనను యుగానుసారము దాని పరిమాణము తగ్గును. మానవుని కుడిచేతి బొటనవ్రేలి నడిమి కణుపునొద్ద అరచేతివైపు తెల్లని వన్నెగల భాగపు కొలతను అంగుళముగా గ్రహించుట యొకపద్ధతి. అడ్డముగా ఉంచిన ఎనిమిది యవలు ఆక్రమించు పొడవును అంగుళమనుట శాస్త్ర వ్యవహారము.] కలియుగమున కాలి దిగువనుండి మస్తకాంతము వరకు తొమ్మిది తాలముల ఎత్తుకలిగి మోకాళ్ళవరకు బాహువులుగల మానవులను దేవతలును ప్రశంసింతురు-(తాలము = కుడిచేతి బొటనవ్రేలిని ఎడమకు- చూపుడు వ్రేలిని కుడికి- బాగుగా చావగా ఈ రెంటినడుమ అగు పొడవు; దీనిని తెలుగులో 'ఉడితి' అందురు.)

ఈ చెప్పిన కొలతల ననుసరించియే ఆయా యుగములందలి గోవుల గజముల మహిషముల తదితర పశు మృగాదుల వృక్షజాతుల పరిమాణము కూడ తగ్గుచు పెరుగుచు నుండునని ఎరుగవలెను. పశువు (బహుశః వృషభము) కాలి కొననుండి మూపురము పైవరకు డెబ్బది ఆరంగుళముల ఎత్తుండును. ఏనుగులు ఎనిమిదివందల అంగుళముల ఎత్తుండును. వృక్షముల ఎత్తు ఒక వేయి తొంబదిరెండు అంగుళములుండును. ఆయా యుగములయందు మానవుల దేహపు ఎత్తునరియే దేవతలకును ఉండును. కాని బుద్ధి శక్తి విషయములో మానవులకంటె దేవతలు గొప్పవారు.

మానుష స్సన్నివేశస్తు యాదృశః పరిదృశ్యతే । తల్లక్షణంతు దేవానాం దృశ్యతేఽ స్వయదర్శనాత్. 14
బుద్ధ్యాతిశయసంయుక్తం దేవానాం కార్య ముచ్యతే । తథా నాతిశయంచైవ మానుషం కార్య ముచ్యతే. 15
ఇత్యేవంహి పరిక్రాన్తా భావా యే దివ్యమానుషాః । పశూనాం పక్షిణాం చైవ స్థావరాణాంచ సర్వశః. 16
గవాజాశ్వా శ్చ విజ్ఞేయా హస్తినః పక్షిణో మృగాః । ఉపయుక్తాః క్రియాస్వేతే విజ్ఞేయాస్త్విహ సర్వశః. 17
యథాక్రమోపభోగశ్చ దేవానాం పశుమూర్తయః । తేషాం రూపాను రూపైశ్చ ప్రమాణై స్స్థిరజఙ్గమాః. 18
మనోజ్ఞై స్తత్ర తే భావై స్సుఖినో హ్యుపపేదిరే । అథ శిష్టా న్ప్రవక్ష్యామి సాధూనథ సతశ్చ వై. 19

సాధ్వాచారధర్మాః.

బ్రాహ్మణాః శ్రుతిశబ్దాశ్చ దేవానాం పశుమూర్తయః । సారూప్యం బ్రహ్మణో హ్యన్తే తేన సన్తః ప్రచక్షతే.
సామాన్యేషుచ ధర్మేషు తథా వైశేషికేషు చ । బ్రహ్మక్షత్త్రవిశో హ్యుక్తా శ్చాన్తే వై హేతుకర్మణా. 21
వర్ణాశ్రమేషు యుక్తస్య సుఖోదర్కస్య స్స్వర్గతౌ । శ్రౌతస్మార్తస్య మార్గస్థో జ్ఞానధర్మ స్స ఉచ్యతే. 22

విద్యానాంచ సుసాధూనాం బ్రహ్మచారీ గురో స్థితః । కారణా త్సవనా చ్చైవ గృహస్థ స్సాధు రుచ్యతే.23
తపసశ్చ తథాఽరణ్యే సాధు ర్వైఖానస స్స్మృతః ।
యతమానో యతి స్సాధు స్స్మృతో యోగస్య సాధనాత్. 24
ధర్మే ధర్మగతిః ప్రోక్త శ్శబ్దో హ్యేషక్రియాత్మకః । కుశలే కుశలం ధర్మాధర్మాం స్తమబ్రవీ త్ప్రభుః. 25

ధర్మాదిలక్షణమ్.

అథ దేవాశ్చ పితరో ఋషయోఽథ చ మానుషాః । అయం ధర్మో హ్యయంనేతి బ్రువతే మౌనమూర్తినా.26
ధర్మేతి ధారణే ధాతు ర్మహ త్త్వేచైవ ఉచ్యతే । ఆధారణే మహ త్త్వేవా ధర్మ స్సతు నిరుచ్యతే. 27
తత్రేష్టప్రాపకో ధర్మ ఆచార్యై రుపదిశ్యతే । అధర్మశ్చానిష్టఫల ఆచార్యై ర్నోపదిశ్యతే. 28
వృద్ధా హ్యలోలుపాశ్చైవ ఆత్మవన్తో హ్యదామ్భికాః । సమ్యగ్వినీతా గురుభి స్తానాచార్యా న్ప్రచక్షతే. 29

ఆయా యుగములందలి దేవతలయు-మానవులయు పరిమాణాదికము ఇట్లుండునని తెలుపుటయైనది. పశు పక్షి వృక్షాదుల పరిమాణమును తెలిపితిని. గోవులు గొర్రెలు మేకలు గుర్రములు ఏనుగులు పక్షులు మృగములు వృక్షాదికము ఆయా ప్రాణులకును మానవులకు ఆయా పనులయందును ఉపయుక్తములగుచున్నవి. దేవతలనుద్దేశించి చేయు యాగములందు వీనిలో కొన్ని యాగ పశువులయి దేవతలకువభోగ సాధనములగుచున్నవి. కాగా ఇవి ఇట్లు యాగాదులయందు దేవతలకై ఉపయోగపడిన పుణ్య విశేషమున అవి తమ దేహమును వదలిన తరువాత పరలోకమున స్వర్గముచేరి సుఖమును పొందును.

ఇకమీదట శిష్టులు-సాధులు-'సత్' శబ్దముతో చెప్పబడువారు ఎవరో తెలిపెదను. 'సత్' అనునది పర బ్రహ్మమునకు పేరు. బ్రాహ్మణులును వేద వచనములును యాగ పశువులును యజ్ఞాదులకై దేవతలకుపయోగపడి తుదకు బ్రహ్మత్వమును పొందును. ఈ సామ్యముతో ఈ మూడిటిని 'సత్' అందురు.

ఆయా వర్ణముల వారియందును ఆయా బ్రహ్మచర్యాద్యాశ్రమములందును (ఉప) యుక్తము అయి స్వర్గమునకు పోయిన తరువాత అధిక సుఖము కలిగించు శ్రౌతస్మార్త ధర్మమును జ్ఞాన ధర్మము అందురు. ఇవి బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులాచరించదగినవారు. ఇవి సామాన్య ధర్మములు-విశేష ధర్మములు- అని రెండు విధములు; 'ఇవి ఆచరించవలెను.' అని ఈ త్రైవర్ణికులును (ని) యుక్తులు-నియోగింప-శాసింప-బడినవారు. శాసింపబడుటచే వీరు శిష్టులు; (వాటిని ఆచరించువారు.)

బ్రహ్మచారి గృహస్థవానప్రస్థ సంన్యాసులు నలుగురును సాధువులని చెప్పబడుదురు. ఎట్లనగా—బ్రహ్మచారి తన గురువునకు హితకరుడై విద్యలను సాధించుకొనును. గృహస్థుడు ప్రజాభివృద్ధికి సమాజపు సుఖవృద్ధికి కారణ భూతుడై తనకును లోకమునకును దేవతలకును సుఖమును సాధించును. అరణ్యమందు నివసించుచు వానప్రస్థుడు తపస్సును సాధించును. పరతత్త్వ ప్రాప్తికై యత్నించుచు(ప్రయత్నము చేయుచు యతియగు సంన్యాసి యోగమును సాధించును. ఇట్లు సాధనము చేయు వీరందరును సాధువులగుచున్నారు.

ఇక ధర్మాధర్మ విషయము : ధర్మము అనునది ఒక వస్తువు అనుకొనరాదు. ధర్మగతిని(ధర్మపు నడకను-ధర్మమును ఆచరించుటను) ధర్మమని ఇచ్చట భగవానుడు చెప్పెను. కావున ఈ విధముగ ధర్మశబ్దము క్రియారూపము కాని వస్తురూపము కాదు. సర్వలోకముల క్షేమమునకు ఉపయోగించు కర్మమును ధర్మమని స్వయంభూ బ్రహ్మ నిర్ణయించెను.

ఇక-దేవతలును పితరులును ఋషులును మానవులును ఇది ధర్మము అని వ్యవహరించుచుందురు కదా; అద్దాని నిర్ణయించుట మౌన మూర్తితో మాత్రమే-మునియై తపోబలమున విషయ తత్త్వ విచారణము చేసినవారికి మాత్రమే-శక్య

మగును. 'ధర్మ' శబ్దమునకు మూలమగు 'ధృ(ఞ్)' ధాతువునకు ధారణము (తన యందు ఇతరములను నిలుపుకొనుట-తాను ఇతరములకు ఆశ్రయమగుట) అనియు గొప్పదనము అనియు అర్థములు. కావున ధర్మము అనగా లోకస్థితికి ఆధారము-అన్నిటికి మహత్త్వమును కలిగించుచు తాను గొప్పదై యుండునది- అని అర్థములు. ఇష్టములను పొందునట్లు చేయునది ధర్మము; కావున అది ఆచరించుడని ఆచార్యులు ఉపదేశింతురు. అనిష్ట ఫలప్రదము అధర్మము; కావునసే దాని నాచరించుడని ఆచార్యు లుపదేశింపరు. మరి ఆచార్యులనగా ఎవరు ? అనిన-విద్యావయోఽనుభవములందు వృద్ధులు (పెరిగిన వారు)- ధన సుఖాదులందు ఆసలేనివారు- హృదయదార్ఢ్యము కలవారు-దంభము లేనివారు-పెద్దలవలన చాల తిన్నగా శిక్షణము నొందినవారు ఎవరో వారిని ఆచార్యులు అందురు.

## శ్రౌతస్మార్తధర్మవిభాగః-శిష్టాచార లక్షణమ్.

ధర్మజ్ఞై ర్విహితో ధర్మ శ్శ్రౌత స్స్మార్తో ద్విధా ద్విజైః ।
దారాగ్నిహోత్రసమ్బన్ధ ఇజ్యా శ్రౌతస్య లక్షణమ్. 30

స్మార్తో వర్ణాశ్రమాచారో యమైశ్చ నియమైశ్చ నః ।
పూర్వేభ్యో వేదయిత్వేహ శ్రౌతం సప్తర్షయోఽబ్రువన్. 31

ఋచో యజూంషి సామాని బ్రహ్మణోఽఙ్గాని సాధుభిః ।
మన్వంతరస్యాతీతస్య స్మృత్వా తం మను రబ్రవీత్. 32

తస్మా త్స్మార్తః స్మృతో ధర్మో వర్ణాశ్రమవిభాగశః । ఏవం వై ద్వివిధో ధర్మ శ్శిష్టాచార స్స ఉచ్యతే. 33
శిషేర్ధాతోశ్చ నిష్ఠాన్తా చ్ఛిష్టశబ్దః ప్రవక్ష్యతే । మన్వన్తరేషు యే శిష్టా ఇహ తిష్ఠన్తి ధార్మికాః. 34
మను స్సప్తర్షయశ్చైవ లోకసన్తానకారిణః । తిష్ఠన్తీహచ ధర్మార్థా స్తాఞ్ఛిష్టా న్సమ్ప్రచక్షతే. 35
తై శ్శిష్టై శ్చరితో ధర్మ స్సామ్యతే వై యుగే యుగే । వార్తావై దణ్డనీతిశ్చ ప్రజావర్ణాశ్రమేష్వయా. 36
శిష్టై రాచార్యతే యస్మా త్పునశ్చైవ మనుక్షయే । పూర్వైః పూర్వై ర్మతత్వాచ్చ శిష్టాచార స్స శాశ్వతః.
దానం సత్యం తపో లోకో విద్యేజ్యా పూజనం దమః । అష్టౌ తాని చరిత్రాణి శిష్టాచారస్య లక్షణమ్. 38
శిష్టా యస్మా చ్చరన్త్యేనం మను స్సప్తర్షయ స్తథా । మన్వన్తరేషు సర్వేషు శిష్టాచార స్తత స్స్మృతః. 39
విజ్ఞేయ శ్శ్రవణా చ్ఛ్రౌతః స్మరణా త్స్మార్త ఉచ్యతే । ఇజ్యా వేదాత్మక శ్శ్రౌత స్స్మార్తో వర్ణాశ్రమాత్మకః.
ప్రత్యఙ్గాని ప్రవక్ష్యామి ధర్మస్యాహేతులక్షణమ్ । దృష్టానుభూత మర్థం యః పృష్టోఽ నిష్ఠ న్న గూహతే.
యథాభూతప్రవాదస్తు ఇత్యేత త్సత్య లక్షణమ్ ।

ధర్మజ్ఞులగు ద్విజులు ధర్మమును శ్రౌత ధర్మము స్మార్త ధర్మము అని రెండుగా విభజించిరి. దారలతో కూడినవారు (గృహస్థులు) అనుష్ఠించు అగ్నిహోత్రాది కర్మలును యజ్ఞ ప్రభేదములును శ్రౌతధర్మము. యమ నియమ సహితమగు వర్ణాశ్రమాచారము స్మార్త ధర్మము; పూర్వులనుండి రామెరిగిన శ్రౌతధర్మమును సప్తర్షులు లోకమున ప్రవచించిరి. గడచిన మన్వంతరము నందలి ఋగ్యజుః సామములను వేదాంగములను సాధు(సముచితము యథాతథము నగు)రూపములతో స్మరించి(తాము పూర్వమన్వంతరములలో ఎరిగి యున్నందున చిత్తమున నిలిచిన సంస్కార బలమున వానినే యథార్థ రూపములో ఇపుడు చిత్తమున గోచరింపజేసికొని) మనువు ప్రవచించినది కావున దీనికి స్మార్త(స్మృతిచే లభించిన) ధర్మమని వ్యవహారము. ఇది వర్ణాశ్రమ విభాగమున విభక్తమై యున్నది.

ఈ రెండు విధములగు ధర్మమునకును శిష్టాచారమని వ్యవహారము. 'శిషి'ధాతువు(శాసు-అనుశిష్టౌ)నుండి పర మయి 'క్త' అను 'నిష్ఠా' ప్రత్యయము చేరగా శిష్టశబ్దము (ఏర్పడును) సిద్ధించును-ఆయా మన్వంతరములయందు ఈ రెండు

విధములగు ధర్మములను ఎరిగి ఆచరించుటచే శిష్టులనబడు ధర్మానుష్ఠాతలును లోక సంతానకారులగు (లోక వ్యవస్థా ప్రవృత్తులను నిరంతరముగా కొనసాగించుటయే పరమ ప్రయోజనమని భావించు) మను సప్తర్షి ప్రభృతులును ఇహలోకమందిప్పుడు ధర్మానుష్ఠానము పరమ ప్రయోజనముగా నెంచి దానినెరిగి అనుష్ఠించు ధార్మికులును శిష్టులు అనబడుదురు.

ఇట్టి శిష్టులు ప్రజలయందు వర్ణాశ్రమ ధర్మములను నిలువగోరి తాము శ్రౌతస్మార్త ధర్మములను అనుష్ఠించి యుగయుగమునందును వార్త (జీవన మార్గములు) దండనీతి మొదలగువానిని లోకమునందు నిలుపుదురు. పునఃపునః మనువుల తరువాత మనువులుగా నడచు మన్వంతరములందు శిష్టులచే ఆచరింపబడుటచేతను అంతకంటె పూర్వులును పూర్వతరులునునగు శిష్టులకు సమ్మతమగుటచేతను ఈవిధమగు ఆచరణీయ ధర్మమునకు శిష్టాచారమని పేరు. ఇది శాశ్వతము (సార్వకాలికము సార్వదైశికము) అయినది.

దానము సత్యము తపస్సు లోకము (లోక వ్యవస్థాకర్తలగు పెద్దల నడువడి) విద్య ఇజ్యా (యాగాది దేవతా-లోకోపకారక-కర్మలు) పూజనము దమము (ఇంద్రియనిగ్రహము) అను ఈ ఎనిమిది విధములగు చరిత్రములు (నడువడులు) శిష్టాచార సమగ్ర స్వరూపము. సర్వ మన్వంతరములందును మను సప్తర్షి ప్రభృతులగు శిష్టులు ఆచరించునది కావున దీనికి శిష్టాచారమని వ్యవహారము. శ్రవణమువలన (వేదశాస్త్రములనుండి గ్రహించగా) సిద్ధించినది శ్రౌతము; స్మృతివలన సిద్ధించినది స్మార్తము. యజనము-వేదములు-అను రూపముతో నున్నది శ్రౌతము-వర్ణాశ్రమాత్మకమయినది స్మార్తము-అని వీనిస్వరూపకథనము. అహేతు లక్షణమగు (హేతువాదము చేయక శ్రద్ధతో ఆస్తిక్య భావముతో-గ్రహించవలసిన) ధర్మ ప్రత్యంగములను (ధర్మమునకు పుష్టి కలిగించు ప్రవృత్తులను) తెలిపెదను వినుడు. 1. మీరు చూచియు అనుభవించియు ఎరిగిన విషయమును మాకు తెలుపుడని ఎవరైనఅడిగినపుడు అనిష్టము చూపక దాచుకొనక యథార్థ వస్తు తత్త్వమును తెలుపుట సత్యము.

## తపఃప్రభృతీనాం లక్షణమ్.

బ్రహ్మచర్యం తపో మౌనం నిరాహారత్వ మేవచ. 41
ఇత్యేత త్తపసో రూపం సుఘోరంతు దురాసదమ్ । పశూనాం ద్రవ్యహవిషా మృక్సామయజుషాం తథా. 42
ఋత్విజాం దక్షిణాయాశ్చసంయోగో యజ్ఞ ఉచ్యతే । ఆత్మవ త్సర్వభూతేషు యో హితాయ శుభాయ చ.
వర్తతే సతతం హృష్టః క్రియా యా సా దయా స్మృతా । ఆక్రుష్టోఽభిహతో యస్తు నాక్రోశే త్ప్రహరేదపి.
అదుష్టో వాఙ్మనఃకాయై స్తితిక్షు స్సా క్షమా స్మృతా । స్వామినా రక్ష్యమాణానాం విసృష్టానాంచ సమ్ప్రమే.
పరస్వానా మనాదాన మలోభఇతి సంజ్ఞితః । మైథునస్యాసమాచారో జల్పనా చ్చిన్తనా త్తథా. 46
నివృత్తిర్బ్రహ్మచర్యస్య తదచ్ఛిద్రస్యలక్షణమ్ । ఆత్మార్థేవా పరార్థేవా ఇన్ద్రియాణీహ యస్య వై. 47
విషయే న ప్రవర్తన్తే దమస్యైవతు లక్షణమ్ । పంచాత్మకే యో విషయే కారణే వాఽష్టలక్షణే. 48
న క్రుధ్యేత ప్రతిహతో జితాత్మేతి స మన్యతే । యద్య దిష్టతమం ద్రవ్యం న్యాయేనైవాగతంచ యత్. 49
తత్త ద్గుణవతే దేయ మిత్యేత ద్దానలక్షణమ్ । శ్రుతిస్మృతిభ్యాం విహితో ధర్మో వర్ణాశ్రమాత్మకః. 50
శిష్టాచారవిరుద్ధశ్చ ధర్మోఽయంసాధుసమ్మతః । అప్రద్వేషో హ్యనిష్టేషు ఇష్టంవై నాభినన్దతి. 51
ప్రీతితాపవిషాదానాం వినివృత్తి ర్విరక్తతా । సన్న్యాసః కర్మణాం న్యాసః కృతానా మకృతైస్సహ. 52
కుశలాకుశలాభ్యాంతు ప్రహాణం న్యాస ఉచ్యతే । అవ్యక్తాదివిశేషాన్తే వికారేఽస్మి న్నివర్తతే. 53
చేతనాచేతనం జ్ఞాత్వా జ్ఞానే జ్ఞానీ స ఉచ్యతే । ప్రత్యఙ్గానాంతు ధర్మస్య ఇత్యేత ల్లక్షణం స్మృతమ్. 54
ఋషిభి ర్మతతత్త్వజ్ఞైః పూర్వైః స్వాయమ్భువేఽన్తరే ।

2. బ్రహ్మచర్యము తపస్సు (శరీరమును కఠిన నియమములకు పాలువరచి శ్రమపెట్టుట) మౌనము (విషయ తత్త్వ విచారణ చేయుట) నిరాహారత్వము అను ఇవి తపస్స్వరూపములు. ఇది ఘోరమును సామాన్యులకు చేరరానిదియు 3. యజ్ఞీయములగు పశువులు ద్రవ్యములు హవిస్సులు ఋక్సామ యజుర్మంత్రములు ఋత్విజులు

దక్షిణలు-వీని కూడికయే యజ్ఞము (ఇజ్యా) అనబడును. 4. ఏ చిత్తవృత్తి విశేషము ఉండుటచేత సర్వ భూతముల విషయమునను పురుషుడు తన విషయమునందువలెనే చూపుకలిగి హృష్టుడై వానికి శుభమును హితమును కలిగింప గోరునో-అది దయ యనబడును. 5. ఇతరులు తిట్టినను తిట్టక కొట్టినను కొట్టక మనోవాక్కాయములందు ప్రతీకార దోషములేక ఓర్పుతో నుండుట క్షమయనబడును. 6. ధనపు సొంతదారుడు కాపాడుకొనుచున్న దానినేకాని తొందరలలో విడిచిన దానినేకాని పరధనమును తీసికొనన (దలచ)కుండుట అలోభమనబడును. 7. శారీరకముగా మైథునము చేయకుండుట నోటితో ఆ మాటలాడుకుండుట మనస్సుతో అది తలచకుండుట అచ్ఛిద్ర (ఏదోషమును లేని) బ్రహ్మచర్యమనబడును. 8. తనకై కాని ఇతరులకై కాని విషయానుభవములందు ఇంద్రియములు ప్రవర్తిల్లకుండుట దమమనబడును. (బహిరింద్రియ నిగ్రహము) 9. ఐదు విధములగు (శబ్ద స్పర్శరూప రస గంధములను) విషయముల విషయమునను ధనకనక వస్తు వాహనాది (సుఖ) కారణ (సాధన)ములెనిమిదింటి విషయమునను ఎవరైన తన కడ్డము వచ్చినను కోపించకుండుట జితాత్మత్వము (శమము) అనబడును. 10. తాను న్యాయమున ఆర్జించినదియు తనకు మిగుల ఇష్టమును అగు వస్తువునుకూడ గుణవంతులగువారికి (ఇష్టముతో) ఇచ్చుట దానమనబడును. శ్రుతి స్మృతులు విధించిన వర్ణాశ్రమాత్మక ధర్మమును-శిష్టాచారబలముచే వృద్ధిపొందిన ధర్మమును- సాధుజనులగు పెద్దలకు సమ్మతమగు ధర్మము. 11. ఇష్టములగు వానిని మెచ్చక-అనిష్టములగు వానిపై అధిక ద్వేషము చూపక ప్రీతి తాప విషాదములను పొందకుండుటయే వైరాగ్యమనబడును. 12. ఇదివరకు చేసిన-ఇకముందు చేయనున్న-కర్మల ఫల సంగమును విడుచుట సంన్యాసమనబడును. 13. తనకు ఇహమునసైన క్షేమము కలిగించు కర్మములను కీడు కలిగించు కర్మములను సమభావముతో విడుచుట న్యాసమనబడును. 14. అవ్యక్త (నామ రూప విభాగము లేని జగదాది స్థితి) దశ మొదలుగా ఆయా-సకల నామరూప విశేషములవరకుగల వికారజాతమునుండి బుద్ధిని మరలించి చేతనమునకును అచేతన తత్త్వమునకునుగల భేదమును తెలిసికొని ఆవిజ్ఞానమందే యుండువాడు జ్ఞాని యనబడును. పూర్వపు స్వాయంభువ మన్వంతరమునందు ధర్మతత్త్వజ్ఞులగు ఋషులు ధర్మ ప్రత్యంగముల స్వరూపము ఇదియని తెలిపియుండిరి.

అత వో వర్తయిష్యామి విధిం మన్వన్తరస్య తు. 55

తథైవ చాతుర్హోత్రస్య చాతుర్వర్ణ్యస్య చైవహి । ప్రతిమన్వన్తరంచైవ శ్రుతి రన్యా విధీయతే. 56
ఋచో యజూంషి సామాని యథావ త్ప్రతిదైవతమ్ । విధిస్తోత్రం తథాహౌత్రం పూర్వవ త్సంప్రవర్తతే.
ద్రవ్యస్తోత్రం గుణస్తోత్రం కర్మస్తోత్రం తథైవచ । తథైవాభిజనస్తోత్రం స్తోత్ర మేవం చతుర్వి(షడ్వి)ధమ్.
మన్వన్తరేషు సర్వేషు యథా వేదా భవన్తి హి । ప్రవర్తయతి తేషాంవై బ్రహ్మా స్తోత్రం పునఃపునః. 59
ఏవం సర్వగుణానాంతు సముత్పత్తి శ్చతుర్విధా । అథర్వ ఋగ్యజుస్సామ్నాం వేదేష్విహ పృథక్పృథక్.
ఋషీణాం తప్యతాం తేషాం తపః పరమదుశ్చరమ్ । మన్త్రాః ప్రాదుర్భవన్త్యాదౌ పూర్వమన్వన్తరస్య హ.
అసన్తోషా ద్భయా ద్దుఃఖాన్మోహాచ్ఛోకాచ్చ పఞ్చధా । ఋషీణాం తారకాఖ్యేన లక్షణేన యదృచ్ఛయా. 63
ఋషీణాం యదృషిత్వంహి తద్వక్ష్యామీహ లక్షణమ్ । అతీతానాగతానాంతు పఞ్చధా హ్యార్షకం స్మృతమ్.
తథా ఋషీణాం వక్ష్యామి ఆర్షస్యైత త్సముద్భవమ్ । గుణాః సామ్యేన వర్తన్తే సర్వే సంప్రలయే తదా. 65

మహదాదినివృత్తిః.

అవిభాగేన వేదానా మనిర్దేశ్యత మోమయే । అబుద్ధిపూర్వకం తద్వై చేతనార్థం ప్రవర్తతే. 66
తేనార్షంబుద్ధిపూర్వంతు చేతనేనావ్యధిష్ఠితమ్ । ప్రవర్తేతే తథా తౌతు యథా మత్స్యోదకా వుభౌ. 67
చేతనాధికృతం సర్వం ప్రవర్తేత గుణాత్మకమ్ । కార్యకారణభావేన తదా తస్య ప్రవర్తతే. 68
విషయో విషయిత్వం చ తథా హ్యర్థపదాత్మకమ్ । కాలేన ప్రాపణీయేన భేదావై కారణాత్మకాః. 69
సాంసిద్ధికా స్తథా వ్యక్తాః క్రమేణ మహదాదయః । మహత స్త్వహఙ్కార స్తస్మా ద్భూతేన్ద్రియాణి చ.

షట్త్రింశచ్ఛ్లోకములలో ఇక్కడ మీకు ప్రతి మన్వంతరమునందును సమానరూపములో నడుచు ధర్మపు నడకను చాతుర్హోత్ర (బ్రహ్మ అధ్వర్యుడు కాక హోతతో కూడ నలుగురు ఋత్విక్కులతో నిర్వర్తించు) యాగమును దాని విధానమును చాతుర్వర్ణ్య ధర్మవ్యవస్థను వర్ణింతును.

ప్రతి మన్వంతరమునందును శ్రుతి వేరువేరుగా నుండును. (ఏ మన్వంతరమునకు ఆ మన్వంతరమునందు శ్రుతి మారును.) అప్పుడును ఋగ్ యజుః సామవేదములు నుండును. ప్రతి దేవతను ఉద్దేశించిన మంత్రములు నుండును. విధి స్తోత్రము హోత్రస్తోత్రము ద్రవ్యస్తోత్రము గుణస్తోత్రము కర్మస్తోత్రము అభిజనస్తోత్రము అనునవియును ఉండును. కాని అవియును ప్రతి మన్వంతరమునందును వేరువేరుగా నుండును. బ్రహ్మ ఆయా వేదములకు సంబంధించిన స్తోత్రములను ప్రతి మన్వంతరమునందును వేరువేరుగా మరల మరల ప్రవర్తిల్ల చేయుచుండును. ఇది ఒక వేదమునకే కాదు; ఋగ్ యజుః సామాథర్వణ వేదములకు నాలుగిటికి సంబంధించిన స్తోత్రముల విషయమునందును మన్వంతర భేదమును బట్టి భేదము ఏర్పడును.

ఆయా మన్వంతరములందు మిగుల దుశ్చరమగు తపస్సాచరించిన ఋషులకు అతః పూర్వపు మన్వంతరమునందు వలెనే వేదమంత్రములు ప్రాదుర్భవించును. (వేదములును తదంశములును వెనుకటి మన్వంతరములందు వలెనే యున్నను వాటి రూపములందు భేదముండునని దీనిని బట్టి ఎరుగవలెను.)

ఆయా ఋషులకు ఆయా వేద-వేదాంశ ('వేదాంగ'అనికాదు.) మంత్రములు ప్రాదుర్భవించుటకు (వారికి తమ యుగపు ప్రాపంచిక స్థితుల విషయమున కలిగిన) అసంతోషము (వాటివలన కలిగిన) భయము దుఃఖము (ఈ పరిస్థితుల నుండి జనుల కెట్లు విడుదల కలిగించవలెనో తెలియని స్థితి అనెడు) మోహము (ప్రజల క్లేశములు చూచి కలిగిన) శోకము అను ఈ ఐదు స్థితులును హేతువులగును.

ఋషులకు ఈ వేదవేదాంశములు సాక్షాత్కరించుట యాదృచ్ఛికముగ (అదృష్టవిశేషమున)ను తారకము అను (యోగ) లక్షణముచేతను సిద్ధించును.

ఋషులకు (మంత్రద్రష్టలకు) ఋషిత్వమును కలిగించు లక్షణము తెలిపెదను. ఇదివరకు గడచిన మన్వంతరములందు కాని రాబోవు వానియందు కాని ఆర్షకము (ఋషిత్వమునందలి ప్రభేదములు) ఐదు విధములుగా నుండును. ఋషులకు ఈ ఋషిత్వము ఏర్పడు విధముతోపాటు ఆ ఐదు ఋషిత్వ ప్రభేదములను మీకు తెలిపెదను.

ప్రళయకాలమునందు సర్వ(త్రి)గుణములును సమతావస్థతో నుండును. వేదములును శబ్దార్థ ప్రవిభాగములేక వాని అవాంతర ప్రవిభాగములును లేక ఏకైకాఖండ శబ్దరూపము కూడ అవ్యక్త తత్త్వమున లయమంది యుండును. సర్వమును తమోమయమయి యుండును. (ఈ దృశ్య ప్రపంచపు స్థూల రూపాంశములే కాదు సరియే కదా దీనికి మూలములగు సూక్ష్మతత్త్వములును అవ్యక్త దశయందుండును.) ఇది మూలప్రకృతి జడతావస్థ. అది కొంతకాలమునకు తరువాత మరల అబుద్ధి పూర్వకముగానే (తన సంకల్పము లేకయే - తాను జడము కావున తనకు సంకల్పించు శక్తియే లేదు-పరమాత్ముని చితిరూపశక్తి ప్రేరణచే తనయందు చైతన్యమును వ్యాప్త మొనరించుకొనుటకును తాను చైతన్యమునకు ఆశ్రయమగుటకును ఉన్ముఖమయి) ప్రవర్తిల్లును.

ఇదియే ఆర్షతాస్థితి. అందుచేతనే ఆర్షత్వము అనునది చిదాత్మక (విశుద్ధ జ్ఞానాత్మక) తత్త్వపు శక్తిచే ప్రేరితము కావున బుద్ధిపూర్వకము అనియు చేతనతత్త్వముచేత అధిష్ఠించబడినది (అనగా ఈ ఆర్షత్వమునందు చిదాత్మక లక్షణము వ్యాపించియున్నది) అనియు చెప్పబడుచున్నది. ఇట్లు చేతనాచేతనములు-చిదాత్మక పరమాత్ముడును మూలప్రకృతియు - మత్స్యమును ఉదకమునువలె పరస్పరము విడదీయరాక ప్రవృత్తి నందుచుండును. ఇట్లీ ప్రకృతి (జడ) పురుష (చేతన)తత్త్వములు రెండును పరస్పరము కార్యకారణ భావమును పొంది చేతనవ్యాప్తితో (తనయందు చేతనతత్త్వము వ్యాపించగా) త్రిగుణమయ జడ ప్రకృతి సృష్టికి ప్రవర్తిల్లును.

ఈ విధముగ ప్రవర్తిల్లు సృష్టిలో శబ్దార్థ సృష్టియు వ్యక్తరూపము నందసాగెను. అందు అర్థము విషయము-పదము (శబ్దము) విషయి-యగును. శబ్దమును వినగా తత్ప్రభావమున చిత్తమున ఆ శబ్దముచే ఉద్దేశింపబడిన అర్థము (వస్తువుల సన్నివేశము) గోచరమగును. ఇదియే శబ్దార్థముల విషయి విషయభావసంబంధము.

ఇట్లు అస్పష్ట రూపముననైన శబ్దార్థవ్యక్తి (సృష్టిభావము ప్రవర్తిల్లుట) ఆరంభము కాగా కాలక్రమమున ప్రపంచసృష్టికి మూల కారణతత్త్వములగు మహదాది తత్త్వములు అవ్యక్త తత్త్వమునుండి వికాస క్రమమున వ్యక్తము కానారంభించును. మహత్తత్త్వమునుండి అహంకారతత్త్వము దానినుండి సూక్ష్మభూతములు ఇంద్రియ తత్త్వములు వ్యక్తము లగును.

['నేను' అను సామాన్యాకారపు 'అహం' తత్త్వ స్ఫురణచే ఈశ్వరుని యందు కలుగు బుద్ధ్యాత్మకదశ 'మహత్తత్త్వము' అనబడును. 'నేను ఇట్టివాడను ఈ పేరుగల వాని కుమారుడను.' ఈ మొదలగు విశేష జ్ఞానముతో కూడిన 'అహం' స్ఫురణను అహంకారము అందురు. ఈశ్వరుని యందు జగత్సృష్టి ప్రవృత్తి కాలమున కలుగు ఇట్టి బుద్ధిదశ అహంకారతత్త్వము.]

భూతభేదాశ్చ భూతేభ్యో జజ్ఞిరేతు పరస్పరమ్ । సంసిద్ధిః కారణం కార్యం సద్య ఏవ నివర్తతే. 71
యథోల్ముకా ద్విరుచయో ఏకకాలా ద్భవన్తిహి । తథాప్రవృత్తాః క్షేత్రజ్ఞాః కాలేనైకేన కారణాత్. 72
యథాఽన్ధకారే ఖద్యోత స్సహసా సమ్ప్రదృశ్యతే । తథా వివృత్తో హ్యవ్యక్తః ఖద్యోత ఇవ సజ్జ్వలన్. 73
స మహాత్మా శరీరస్థ స్తత్రైవ పరివర్తతే । మహత స్తమసః పారే వైలక్షణ్యా ద్విభావ్యతే. 74
తత్రైవ సంస్థితో విద్వాన్ తమసోఽన్త ఇతి శ్రుతమ్ । బుద్ధి ర్వివర్తత స్తస్య ప్రాదుర్భూతా చతుర్విధా.
జ్ఞానం వైరాగ్య మైశ్వర్యం ధర్మశ్చేతి చతుష్టయమ్ । సాంసిద్ధికా న్యథైతాని అప్రతీతాని తస్య వై. 76
మహాత్మనః శరీరస్య చైతన్యా త్సిద్ధి రుచ్యతే ।
పురే శేతే యతః పూర్వం క్షేత్రజ్ఞానం తథాపిచ. 77
పురేష శయనా త్పురుషః క్షేత్రజ్ఞానాద్జ్ఞ ఉచ్యతే । యస్మాద్ధర్మాత్ప్రసూతేహి తస్మాద్వై ధార్మికస్తుసః. 78
సాంసిద్ధికే శరీరేచ బుద్ధ్యా వ్యక్తంతు చేతనమ్ । ఏవం వివృత్తం క్షేత్రం జ్ఞః క్షేత్రం హ్యాసభినన్దితః. 79
వివృత్తిసమకాలేతు పురాణం తదచేతనమ్ । క్షేత్రజ్ఞేన పరిజ్ఞాతం భోగ్యోఽయం విషయో మమ. 80

భూతతన్మాత్రలు అనెడు సూక్ష్మభూతములనుండి భూతభేదములు (స్థూల భూతములు) మొదలగునవి ఒకదాని నుండి మరియొకటి అనుక్రమమున ఉత్పన్నము లగును. స్వాభావికముగా స్వయంసిద్ధమగు కారణతత్త్వమగు దానినుండి ఏర్పడిన కార్యతత్త్వము మరియొకదానికి కారణమగుచు ఈ క్రమమున వెంట వెంటనే సృష్టిక్రమములో పరమాత్ముడు ఈ ప్రపంచ రూపమున రూపొందును. ఒక కొరవినుండి ఒకే సమయమున అనేకములగు చిన్న చిన్న నిప్పురవ్వలు చెదరి బయటికి వచ్చినట్లు ఒకే చైతన్యమునుండి ఒకే క్షణమున జీవు లనేకులు పరమాత్మనుండి వివృత్తమైన భూతములతో ఏర్పడిన దేహములందు నానా దేహధారులుగా కనబడుదురు. ఇందరు క్షేత్రజ్ఞులకును (జీవులకును) కారణమగు చేతనముల తత్త్వము ఒక్కటియే.

చీకటిలో అకస్మాత్తుగా మెరపు తళుక్కున మెరసినట్లు అవ్యక్త తత్త్వమునుండి వివృత్తమయిన జీవ సమూహము కూడ దేహధారులయి ప్రకాశించుచు కనబడును. మహాత్మ తత్త్వముకూడ అంతర్యామియై ప్రతి శరీరమునందు నుండును. మహాతమస్సునకు ఆవల పరమాత్ముడు ఈ సమస్తసృష్టికిని అతీతమయి త్రిపాత్తత్త్వముగా అంతర్యామి కంటె విలక్షణమయి ప్రకాశించుచుండును.

ఇట్లా పరమాత్ముడు'అక్కడనే-ఆయా దేహధారుల దేహములనెడు క్షేత్రములందే-ఉండును-అదే సమయమున-తమస్సునకు అవలనుండును-అని శ్రుతుల యందు వినబడుచున్నది. ఇట్లతడు ప్రకృతికి అధిష్ఠాతయై వివర్తము పొందు చుండ (రూపవంతుడై భాసించుచున్న - కొలదిని) అతని బుద్ధిలో 1. జ్ఞానము- 2. వైరాగ్యము- 3. ఐశ్వర్యము- 4. ధర్మము అనునవి కలిగెను. (2. ఇది మనవంటి వారి విరక్తి వంటిదికాదు; నేను పొందవలసిన దేదియు లేదు; నేను అవాప్త సకల కాముడను; నావారు అనదగు వారెవ్వరును లేరు; మమకారముతో నాకు పనిలేదు-అను బుద్ధి; 3. నేను సర్వేశ్వరుడను; నేనే ఎల్ల జగములకును దిక్కు; అనుబుద్ధి; 4. లోకప్రవృత్తికి మూలమగు సత్కర్మానుష్ఠానము నేనే అను భావన.) ఇవి అతనికి స్వతస్సిద్ధములే కాని కావలెనని సంపాదించుకొన్నవి కావు. ఆ మహాత్మునికి మాయా శక్తి కృతమగు శరీరప్రాప్తివలన ఇవి సిద్ధించినవి.

ఇతడు'పూర్'అనబడు ఆయాప్రాణుల శరీరముల యందు సాక్షి రూపుడై యుండును; 'పురి-శ>పురుష'-అని వ్యవహరింపబడును. ఆయా దేహములందు (క్షేత్రములందు) ఉండి వాని తత్త్వమును ఎరుగును కావున క్షేత్రజ్ఞుడు-జ్ఞుడు-అనబడును. ధర్మమును అవలంబించి లోకములను సృజించి పాలించును కావున అతడు ధార్మికుడనబడును.

ఇట్లు తనకు అనపాయిని అగు(ఎన్నడును విడిపోని)మాయాశక్తిచే సిద్ధించినదై స్వాభావికముగ లభించిన శరీరము నందు ఈ చెప్పిన బుద్ధి లక్షణముచే చేతనుడయి పరమాత్ముడు మూల ప్రకృతికి కలిగిన సృష్ట్యభిముఖ ప్రవృత్తిని సఫలము చేయును.

ఇట్లు పరమాత్మ క్షేత్రజ్ఞుడుగా వివర్తము పొందియు క్షేత్రము విషయమునను అందలి జీవుని ప్రవృత్తుల విషయమునను వాటివలన కలుగు ఫలముల విషయమునను ఎట్టి అభినంధియు (అహంకార మమకారములు)ను లేకుండును.

ఈ పరమాత్ముడిట్లు వివర్తము పొందుటకు సమకాలముననే పురాణము (అనాది) అగు ఆ అచేతన(జడ) ప్రకృతి క్షేత్రరూపమునను భోగ్యవస్తు జాత రూపమునను రూపొంది ఆ క్షేత్రజ్ఞుని చేత 'ఇదినాకు ఆశ్రయము' అనియు 'ఇదినాకు భోగ్యము' అనియు ఎంచబడుచున్నది.

## ఋష్యాదిలక్షణమ్.

ఋషి ర్హింసాగత్యోర్ధాతుర్విద్యా సత్యం తప శ్రుతమ్ ।
ఏష సన్నిచయో యస్మాద్ బ్రహ్మణస్తు తత స్త్వృషిః. 81
వివృత్తిసమకాలాచ్చ బుద్ధ్యా వ్యక్త మృషి స్స్వయమ్ । ఋషతే పరమం యస్మా త్పరమర్షి స్తతః పునః.
గత్యర్థా దృషతే ర్ధాతో ర్నామనిర్వృత్తికారణమ్ ।
యస్మా దేష స్వయమ్భూత స్తస్మాచ్చ ఋషితా మతా. 83
ఈశ్వరా స్స్వయముద్భూతా బ్రహ్మణో మానసా స్సుతాః। వివర్తమానై స్తై ర్బుద్ధ్యా మహా న్పరగతః పరః.
యస్మా దృషి ర్మహత్త్వేన సహ తస్మా న్మహర్షయః ।
ఈశ్వరాణాం సుతా స్తేషాం మానసా శ్చౌరసాశ్చ వై. 85
ఋషి స్తస్మా త్పరత్వేన భూతాది రృషయ స్తతః । ఋషిపుత్త్రా ఋషీకాస్తు మైథునా ద్గర్భసమ్భవాః. 86
పరత్వేన ఋషంతేవై భూతాదీ నృషికా స్తతః । ఋషికాణాం సుతా యేతు విజ్ఞేయా ఋషిపుత్త్రికాః. 87
శ్రుత్వా ఋషం పరత్వేన స్మృతా స్తస్మా చ్ఛ్రుతర్షయః ।
అవ్యక్తాత్మా మహానాత్మాఽహఙ్కారాత్మా తథైవచ. 88

భూతాత్మా చేన్ద్రియాత్మాచ తేషాం తజ్జ్ఞాన ముచ్యతే । ఇత్యేవ మృషిజాత్యస్తు పఞ్చధా నామ విశ్రుతాః. ౮౯
భృగు ర్మరీచి రత్రిశ్చ అఙ్గిరాః పులహః క్రతుః । మను ర్దక్షో వసిష్ఠశ్చ పులస్త్యశ్చాపి తే దశ. 90
బ్రహ్మణో మానసా హ్యేతే ఉత్పన్నా స్స్వయ మీశ్వరాః ।
పరత్వేన ర్షయో యస్మా న్మతా స్తస్మా న్మహర్షయః 91

మన్త్రద్రష్టృఋషివరిగణనమ్.

ఈశ్వరాణాం సుతా స్త్వేషా మృషయ స్తా న్నిబోధత । కావ్యో బృహస్పతిశ్చైవ కాశ్యప శ్చ్యవన స్తథా. 92
వత్సరో నగ్నహూశ్చైవ భరద్వాజశ్చ వీర్యవాన్ । ఋషిర్దీర్ఘతమాశ్చైవ బృహదుక్థాః శరద్వతః. 93
వాజిశ్రవాః సుచింతశ్చ శావశ్చ సపరాశరః । శృంగీచ శంఖపాచ్చైవ రాజావైశ్రవణ స్తథా 94
ఇత్యేతే ఋషికాః సర్వే సత్యేన ఋషితాం గతాః । ఈశ్వరా ఋషయశ్చైవ ఋషికా యేచ విశ్రుతాః. 95

## జగత్సృష్టి పరమాత్మచైతన్య ఋషిత్వముల సంబంధము.

ఋషీ- ★హింసాగత్యోః; అను ధాతువునుండి ఋషి అను శబ్దము సిద్ధించును. బ్రహ్మ (చతుర్ముఖబ్రహ్మ యను పరబ్రహ్మయను) విద్యా సత్యతపః శాస్త్ర జ్ఞానముల రాశి స్వరూపుడు కావున అతనికి ఋషి అని వ్యవహారము; పరమాత్ముడు తాను వివృత్తి (సృష్టిగా రూపొందుట) పొందిన సమయమునందే బుద్ధి రూపమున వ్యక్తుడై (స్పష్టరూపము నందినవాడై) నందున అతడు ఋషి; పరమము (సర్వోత్తమము) అగుదానిని 'ఋషతే' తెలిసికొనెను; కావున అతడు పరమఋషి; ఇట్లే 'గతి' 'గమనము - జ్ఞానము' అను అర్థమును ఇచ్చు 'ఋష' ధాతువునుండి ఈ ఋషి శబ్దము ఏర్పడినది కావుననే - స్వయముగా తానే జ్ఞానము పరమాత్మగా స్వయం సముద్భూతమయినది కావున జ్ఞానమునకును ఋషి అని వ్యవహారము; ఇట్లే 1. బ్రహ్మ మానసపుత్రులగు మరీచి మొదలగువారు మైథున ప్రవృత్తితో పనిలేక స్వయముగా ఉత్పన్నులయిరి. వారును ఋషులు; వీరును వివర్తము పొందుచునే న్యాయముగా బుద్ధి (జ్ఞానము) తో వ్యాపింపబడిరి; కావున వీరు ఈశ్వర ఋషులు; (జ్ఞానమునకు అధీశ్వరులు); 2. ఈ ఈశ్వర ఋషులకు మానస పుత్రులుగాను-ఔరస (మైథునముతో జనించిన) పుత్రులుగాను కలిగినవారు కొందరు తాము పుట్టుచునే మహాజ్ఞానముతో (ఋషితో) వ్యాప్త లయిరి; కావున వీరు మహర్షులు; ౩ భూతాది సృష్టికాలమున ఔరస సంతానముగా (మైథునముతో) జనించినవారు కేవల ఋషులు; 4. ఇట్లే మైథునముతో ఋషుల గర్భమునుండి జనించినవారు ఋషికులు; వీరు ఉత్కృష్టమగు విధమున భూతాది సృష్టి విషయములను తెలిసినవారు. ౫. ఋషికుల ఔరస పుత్రులు ఋషి పుత్రులు; వీరు తమ పూర్వులనుండి శ్రుతులను శ్రుతము (వినబడినవి)గా చేసికొని లోకమున ప్రచారము చేయువారు; శ్రుతి తత్త్వము నెరిగినవారు; కావున వీరు శ్రుతర్షులు అనబడుదురు.

ఇక సృష్టిక్రమ దశల ననుసరించి పరతత్త్వము - 1. అవ్యక్తాత్మా 2. మహానాత్మా ౩. అహంకారాత్మా; 4. (సూక్ష్మ) భూతాత్మా ౫ ఇంద్రియాత్మా అని ఐదు విధములగును; ఈ చెప్పినవారిలో 1. ఈశ్వర ఋషులు అవ్యక్తాత్మను 2. మహర్షులు మహానాత్మను ౩. ఋషులు అహంకారాత్మను 4. ఋషికులు భూతాత్మను ౫. ఋషిపుత్రులు ఇంద్రియాత్మను స్వయముగా జ్ఞాన విజ్ఞానములతో ఎరిగినవారు. ఇట్లు ఈ ఐదు తెగల ఋషులును పరతత్త్వమును ఏదో రూపమున తాము ఎరిగియుండి ప్రజలకును ఎరుకపరచ గలిగినవారు.

---

★ పాణినీయ ధాతు పాఠమున 'ఋషీ-గతౌ' అని మాత్రమున్నది. కాని ఇచట ఇచ్చిన హింసార్థము పాణినీయము కాని-ఇతర వైయాకరణుల ధాతు పాఠమున నుండి యుండును. ఋషిత్వములో తపస్సు కూడ చేరి యున్నది. ఇది శరీర హింసా రూపమయినది. అందులకై ఈ ధాతువునకు ఈ యర్థము తగుననితోచును.

ఏవం మంత్రకృతః సర్వే కృత్స్నశశ్చ నిబోధత ।
ఉచథ్యో వామదేవశ్చ అగస్త్యఃకౌశిక స్తథా । కర్దమో వాలఖిల్యాశ్చ విశ్రవా శ్శక్తివర్ధనః. 96
ఇత్యేతా(తే)ఋషయః ప్రోక్తా స్తపసా ఋషితాం గతాః ।
తేషాం పుత్రా నృషీకాంస్తు గర్భోత్పన్నా న్నిబోధత. 97
భృగుః కాశ్యపః ప్రాచేతా దధీచో హ్యాత్మవానపి । ఊర్వోఽథ జమదగ్నిశ్చ వేదసార స్తత స్తథా. 98
ఆర్ష్టిషేణశ్చ శ్యావాశ్వో వీతహవ్య స్సవేదసః । వైన్యః వృథు ర్దివోదాసో బ్రహ్మస్వా గృత్సశౌనకాః. 99
ఏకోనవింశతి హ్యేతే భృగవో మన్త్రకృత్తమాః । అఙ్గిరా బృహస్పతిశ్చ భరద్వాజో (భలక్ష్మణః) భవాత్మక
తథా మృగభరోగర్గ శ్శితిభాకృతి రేవచ । *తురవీతశ్చ మాన్ధాతా అమ్బరీష స్తథైవచ. 101
యువనాశ్వః పురుకుత్స స్స్వశ్రవశ్చ తమస్యవాన్ । అజమీఢోస్వహార్థ్యశ్చ హ్యాకలః కవిరేవచ. 102
పృషదశ్వో విరూపశ్చ కణ్వశ్చైవాథ ముద్గలః ।
ఉచథ్యశ్చ శరద్వాం(ఋషిజోబృహచ్ఛుక్ల) శ్చతథా వాజిశ్రవా అపి. 103
అవస్యోప స్సుచిత్తిశ్చ వామదేవ స్తథైవచ । ఉబిల్లో బృహసిక్యశ్చ ఋషి ర్దీర్ఘతమా అపి. 104
కక్షీవాం శ్చ త్రయస్త్రింశత్స్మృతా హ్యఙ్గిరసాం వరాః । ఏతే మన్త్రకృత స్సర్వే కశ్యపాంస్తు నిబోధత.
కాశ్యప స్సహ వత్సారో నైధ్రువో నిత్య ఏవచ । అసితో దేవలశ్చైవ షడేతే బ్రహ్మవాదినః. 106
అత్రిరర్ధస్వనాశ్చైవ శ్యావాశ్వోఽథ గవిష్ఠిరః । కర్ణికశ్చ ఋషి స్సిద్ధ స్తథా పూర్వాతిథిశ్చయః. 107
ఇత్యేతే త్వత్రయః ప్రోక్తా మన్త్రకృతో మహర్షయః । వసిష్ఠశ్చైవ శక్తిశ్చ తృతీయశ్చ పరాశరః. 108
తతస్తు ఇన్ద్రప్రమితిః పఞ్చమస్తు భరద్వసుః । షష్ఠస్తు మిత్రావరుణ స్సప్తమః కుణ్డిన స్తథా. 109
ఇత్యేతే సప్త విజ్ఞేయా వాసిష్ఠా బ్రహ్మవాదినః । విశ్వామిత్రశ్చ గాధేయో దేవరాత స్తథాబలః. 110
తథా విద్వాన్మధుచ్ఛన్దా ఋషిశ్చాన్యోఽఘమర్షణః । అష్టకో లోహిత శ్చైవ భృతకీలశ్చ తా వుభౌ. 111
దేవశ్రవా దేవరాతః పురాణశ్చ ధనఞ్జయః । శిశిరశ్చమహాతేజాశ్శాలఙ్కాయన ఏవచ. 112
త్రయోదశైతే విజ్ఞేయా బ్రహ్మిష్ఠాః కౌశికా వరాః । అగస్త్యోఽథ దృఢాశ్వశ్చ ఇన్ద్రబాహు స్తథైవచ. 113
బ్రహ్మిష్ఠాఽగస్తయో హ్యేతే త్రయః పరమకీర్తయః । మను ర్వైవస్వతశ్చైవ ఐళో రాజా పురూరవాః.114
క్షత్రియాణాం వరా హ్యేతే విజ్ఞేయా మన్త్రవాదినః । బలన్దశ్చ నవత్సశ్చ నఙ్కీలశ్చైవ తే త్రయః. 115
ఏతే మన్త్రకృతో జ్ఞేయా వైశ్యానాం ప్రవరా ఇమే । ఇత్యేకనవతిః ప్రోక్తా మన్త్రాయైశ్చ బహిఃకృతాః. 116
బ్రాహ్మణాఃక్షత్రియావైశ్యాఋషిపుత్రాన్నిబోధత ।
ఋషికాణాం సుతా హ్యేతే ఋషిపుత్రాస్సు(శ్రు)తర్షయః. 117

ఇతి శ్రీమత్స్యమహాపురాణే మన్వన్తరానువర్ణనే దేవాసురయక్షగన్ధర్వమనుష్యాది
పరిమాణోత్సేధాదికథనం నామ చతుశ్చత్వారింశదుత్తరశతతమోఽధ్యాయః.

## మంత్రద్రష్టలగు ఋషులు; త్రైవర్ణికులందును ఋషులు కలరు.

భృగువు మరీచి అత్రి అంగిరుడు పులహుడు క్రతువు మనువు దక్షుడు వసిష్ఠుడు పులస్త్యుడు అను పదిమందియు బ్రహ్మకు మానసపుత్త్రులు. వీరు ఈశ్వరులు; సర్వసమర్థులు; తమకు స్వయంభూబ్రహ్మ అప్పగించిన ఆయా

*కృతవాచ స్తథా గర్గః కృతిస్సంకృతి రేవచ. (పాఠాం.)

స్పష్ట్యంశములపై సంపూర్ణాధికారము కలవారు. పైని తెలిపిన ఐదు విధములగు ఆత్మల తత్త్వమును ఎరిగినవారు అగుటచే వీరు ఋషులనబడుదురు; ఋషులలో అందరలో మొట్టమొదటివారును గొప్పవారును అగుటతో వారు మహర్షులు అనబడిరి. (పర = పరస్ = మహత్.)

ఇట్టి ఈశ్వరులగు మహర్షుల కుమారులు ఋషులు; వీరిని తెలిపెదను వినుడు; కావ్యుడు బృహస్పతి కశ్యపుడు చ్యవనుడు ఉతథ్యుడు వామదేవుడు అగస్త్యుడు కౌశికుడు కర్దముడు వాలఖిల్యులు విశ్రవసుడు శక్తివర్ధనుడు అనువారు ఋషులు. ఈ చెప్పబడిన ఋషులందరును తమ తపశ్శక్తిచే ఋషిత్వమును పొందిరి. వారి గర్భములనుండి ఉత్పన్నులయిన 'ఋషికు'లనబడు 'ఋషులు' మైథునముచే జనించినవారు. (వీరు 'ఋషు'లను తెగకు చెందిన ఋషుల ఔరస పుత్త్రులు.) వీరిపేరులు: వత్సరుడు (వత్సారుడు) నగ్నహూ భరద్వాజుడు వీర్యవాన్ దీర్ఘతమసుడు బృహ ద్వక్షసుడు శరద్వాన్ వాజశ్రవస్ సుచింతుడు పరాశరుడు శృంగిన్ శంఖపాత్ వైశ్రవణుడు-వీరందరును ఋషికులు అనబడు ఋషులు; వీరెల్లరును సత్యమునందు సిద్ధినొంది ఋషిత్వమును పొందిరి.

ఈ చెప్పిన వారిలో ఈశ్వరులు (మహర్షులు) ఋషులు ఋషికులు వీరెల్లరును మంత్రకృత్‌లు (మంత్రములను దర్శించినవారు. వారి పేరులన్నియు తెలిపెదను; తెలిసికొనుడు.

భృగువు కాశ్యపుడు ప్రచేతస్ దధీచుడు ఆత్మవాన్ ఊర్వుడు జమదగ్ని వేదుడు సారస్వతుడు ఆర్ష్టిషేణుడు చ్యవనుడు వీతహవ్యుడు వేధసుడు వైన్యుడు పృథువు దివోదాసుడు బ్రహ్మస్వాన్ గృత్సుడు శౌనకుడు ఈ పందొమ్మిది మందియు భృగువంశమునందు జన్మించిన మంత్రకృత్(మంత్రకర్త-మంత్రద్రష్ట)లగు ఉత్తములు.

అంగిరస్ వేధసుడు భరద్వాజుడు లక్ష్మణుడు (భవాత్మకుడు) కృతవాచుడు గర్గుడు స్మృతి సంకృతి (ప్రాగ ధరుడు గర్గుడు శితిభా-కృతి) తురవితుడు మాంధాత అంబరీషుడు యువనాశ్వుడు పురుకుత్సుడు స్వశ్రవుడు సదస్యవాన్ (తమస్యవాన్) అజమీఢుడు అస్వహార్యుడు ఉత్కలుడు కవి పృషదశ్వుడు విరూపుడు కావ్యుడు ముద్గలుడు ఉత(చ)థ్యుడు శరద్వాన్ వాజిశ్రవస్ అపస్యోముడు సుచిత్తి వామదేవుడు ఋషిజుడు బృహచ్ఛుక్లుడు (ఉబిల్లుడు బృహసిక్యుడు) దీర్ఘత మస్ కక్షీవాన్-ఈ ముప్పది ముగ్గురును అంగిరో వంశమునందు జన్మించిన మంత్రద్రష్టలు.

ఇకమీదట కశ్యప వంశమునందలి మంత్రద్రష్టలు; వీరిని విని తెలిసికొనుడు; కాశ్యపుడు వత్సారుడు నైధ్రువుడు నిత్యుడు అసితుడు దేవలుడు అనువారు వీ రారుగురు.

అత్రి అర్ధస్యనుడు శ్యావాశ్వుడు గవిష్ఠిరుడు కర్ణకుడు తపస్స్వద్ధుడగు పూర్వాతిథి ఈ ఆరుగురును అత్రివంశము నందలి మంత్రద్రష్టలు.

వసిష్ఠుడు శక్తి పరాశరుడు ఇంద్రప్రమితి భరద్వసువు మిత్రావరుణుడు కుండినుడు ఈ ఏడుగురు వసిష్ఠ వంశ మందలి మంత్రద్రష్టలు. వీరందరు బ్రహ్మవాదులు (వేదతత్త్వము నెరిగినవారు.)

గాధిపుత్త్రుడగు విశ్వామిత్రుడు దేవరాతుడు బలుడు విద్వాంసుడగు మధుచ్ఛందుడు అఘమర్షణుడు అష్టకుడు లోహితుడు భృతకీలుడు మాంబుధి దేవశ్రవస్-ధనంజయుడు శిశిరుడు శాలంకాయనుడు - ఈ పదుముగ్గురును బ్రహ్మిష్ఠులు(బ్రహ్మతత్త్వవేత్తలలో ఉత్తములు)ను కౌశిక వంశోత్పన్నులునగు మంత్రద్రష్టలు.

అగస్త్యుడు దృఢద్యుమ్నుడు ఇంద్రబాహువు - ఈ ముగ్గురును బ్రహ్మిష్ఠులును అగస్త్య గోత్రజాతులునగు మంత్ర ద్రష్టలు; వీరు ఉత్తమ కీర్తిశాలురు.

వైవస్వత మనువు-ఇలాపుత్త్రుడును రాజు నగు పురూరవుడు క్షత్త్రియులలో శ్రేష్ఠులై మంత్రవాదులగు మంత్ర ద్రష్టలు. (మంత్రవాదులు = మంత్రతత్త్వవేత్తలు)

భలందకుడు వాసాశ్వుడు సంకీలుడు ఈ ముగ్గురును వైశ్యులలో ప్రవరు (శ్రేష్ఠు)లగు మంత్రద్రష్టలు.

[ఇచట చెప్పిన భృగ్వంగిరః కశ్యపాత్రి వసిష్ఠ విశ్వామిత్రాగస్త్యుల గోత్ర ప్రవరములే ముందటి (195-200) అధ్యాయములందు వివరింపబడును.]

ఇట్లు మంత్రములను దర్శించి బయల్పరచిన మంత్రద్రష్టలలో తొంబది రెండు మంది నామములు ఇచట

చెప్పబడినవి. వీరిలో బ్రాహ్మణులును క్షత్రియులును వైశ్యులును అను మూడు వర్ణములవారును కలరు. వీరిని ఋ పుత్రు లందురు. 'ఋషీకు'ల కుమారులకు ఋషిపుత్రులనియు శ్రుత(సుత ఋషులనియు కూడ వ్యవహారము కలదు

ఇది శ్రీమత్స్య మహాపురాణమున మన్వంతరాను వర్ణనమున-దేవాది పరిమాణ కథనము-శిష్ట సాధు ధర్మ తపోదానాది లక్షణ-ఋష్యాది లక్షణ-మంత్రద్రష్ట ఋషి పరిగణన-మను నూట నలువది నాలుగవ అధ్యాయము.

## తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 28 | స్వధా | స్వథా |
| 3 | 28 | పరస్య | చరస్య |
| 4 | 6 | రెండు యోజనములంత (1600 మూరలు) | యోజనమంత (16000 మూరలు) |
| 47 | 1 | శతత | శత |
| 52 | 9 | సమృద్ధేషు | సమృద్దేషు |
| 53 | 22 | బర్హిష్మంతు | హవిష్మంతు |
| 57 | 3 | (అర్ధము) | (అనర్థము) |
| 66 | 19 | బలి | బలిం |
| 79 | 16 | సల్లాపః | సంల్లాపః |
| 80 | 21 | ప్రపాత | పపాత |
| 84 | 34 | శార్జ్ఞధర | శార్ఙ్గధర |
| 131 | 1 | వృత్తాంతములు | వృత్తాంతము |
| 144 | 23 | మార్య | మాచార్య |
| 162 | 22 | కథనము | కథనమ్ |
| 173 | 15 | ప్రతం | వ్రతం |
| 220 | 12 | చత్వాలే | చాత్వాలే |
| 220 | 21 | చత్వాల | చాత్వాల |
| 222 | 13 | ప్రకృచ్ఛ | ప్రతికృచ్ఛ |
| 233 | 12 | సితపక్షే | సితిపక్షే |
| 233 | 25 | శుక్లపక్ష | కృష్ణపక్ష |
| 277 | 4 | బ్రహ్మణా | భగవాన్ |
| 315 | 1 | | గుడ-సువర్ణపర్వతదానములు-84-85అ. |
| 369 | 1 | ప్రయోగ | ప్రయాగ |
| 453 | 1 | విభగ | విభాగ |
| 465 | 1 | 155అ. | 125అ. |
| 480 | 6 | హానశ్చ | హేనశ్చ |
| 483 | 1 | స్తులించుట | స్తుతించుట |
| 486 | 22 | నలిలె | నలిలే |
| 489 | 1 | త్రివుర | త్రిపుర |
| 491 | 5 | భగవాఞ్ఛాల | భగవాఞ్ఛాల |
| 525 | 1 | కథనము | వధాదికథనము |

గమనిక : 220 పుట-21 పంక్తిలో-యజ్ఞ పరికరములలో 'ధ్రువా-స్థాలీ' అను పేరుగల దారుపయస్థాలి ఒకటి.